VOL III.

శ్రీరస్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము.

యుద్ధ, ఉత్తర కాండములు.

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుండగు
అభినవాంధ్రవాల్మీకి
కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మకృతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1924.

# విషయసూచిక.

## యుద్ధకాండము.

# విషయసూచిక.

## ఉత్తరకాండము.

శ్రీరస్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము

## యుద్ధకాండము - ౧-వ సర్గము.

క. శ్రీకలితవిపులవక్షా!, పాకారిప్రహితకార్య♦బద్ధాదర! నా
నాకర్బురవనదహనా!, శ్రీకంఠహితైకనామ! ♦ శ్రీరఘురామా!.

తే. అవధరింపు కకుత్స్థభూ♦పాన్వయాబ్ధి,శీతకిరణా! మహాత్మ! సం♦శ్రితసమస్త
దేవతానీక! యవ్వలి♦దివ్యకథను, భక్తి వినిపింతు వాల్మీకి♦సూక్తిరీతి.

### రాముఁడు హనుమంతుని బ్రశంసించుట.

క. [1]అని హను[2]మంతుఁడు తత్త్వం, బును దెల్పిన నాలకించి ♦ భూపతి ప్రీతిన్
గని దానికిఁ జెప్పఁగఁ దగు, ననువున నిట్లనియెఁ దపను♦నాత్మజుతోడన్. ౧ 1

చ. హనుమ యొనర్చినట్టి పని ♦ యారయ గొప్పది యంతకన్న మే
దిని గురుకార్యముండదు మ♦దిం దలపోయఁగ నేరికైనఁ జే
యను దగియుండ దూహకును♦నైన నశక్యము [3]పన్నగాశనుం
డనిలుఁడు గూడి యిద్దఱును ♦ నబ్ధిని దాఁటుదు రెంతొ పూన్కితోన్. ౨౪ 2

క. మరుదాత్మజుఁ డొక్కఁడె సా,గరమున్ దాఁటు నటుగాన ♦ గరుడుఁ డనిలుఁ డీ
మరుదాత్మజుండు దక్కఁగ, నొరుఁడు మహార్ణవము దాఁట ♦ నోపఁడు ధరణిన్.

క. సురదానవగంధర్వుల, కురగులకున్ యక్షులకును ♦ నుగ్రతనులుగా
ధరఁ బరఁగినరాక్షసులకుఁ, బుర మయ్యది దుర్లభంబు♦పో యెదిరింపన్. ౫ 4

చ. దనుజవిభుండు రక్షణము ♦ తప్పక చేయఁగ నొప్పుచుండు నీ
హనుమయు [నేరిచేతఁ బుర♦మందు నడెట్టిదిగాని విఘ్నముం
గనక] బలంబుపెంపునఁ ద♦గన్ వెసఁజొచ్చి స్వకీయకార్యముం
బొనరిచివచ్చె నింకెవఁడు ♦ పోయి సజీవుఁడుగాఁగ వచ్చునే. ౫౪ 5

సీ. ఎదిరింపరాకయ ♦ యెల్లప్పు డసురులచేత రక్షితయయి ♦ చెలఁగులంక
నెవ్వఁడు చొరఁగలఁ ♦ డీవాయుజున కిల బలవిక్రమంబులఁ ♦ బరఁగి యుపమ
గాంచువాఁ డెవ్వఁడు♦గలఁడు! విక్రమమునకును బలంబునకుఁ ద♦గినవిధమున
నీతఁడు లంకలో ♦ నెంతయు వనభంగముఖకార్యములఁ జేసి ♦ మోదమలర

---

1 యథావ దభిభాషితమ్-అనిమూ. 2 ఇట "మ" అనునది గాయత్రియందుఁ బదునేనవ యక్షరమని తెలియునది. 3 అన్యత్ర గరుడాద్వాయోః-అనిమూ. గరుడవాయూ మిళిత్వాత రేతాం అయం త్వేక ఏవాతరదిత్యర్థః-అనివ్యాఖ్య.

తే. భృత్యకార్యం బొనర్చెను ♦ [1]విభునియాజ్ఞఁ
బొందకయె న్యాయమే యిది ♦ పోలినట్టి
పనిని గొప్పదిగాఁ జేసెఁ; ♦ దనవిభుఁ డతి
దుష్కరక్రియఁ జేయ భృ♦త్యునిని బనుప. ౭ 6

క. పని దానిఁ జక్కనొనరిచి, తనవిభునందున్నప్రీతిఁ ♦ దత్ప్రియకృత్యం
బును నింకఁ జేయు నెవ్వఁ డ,తని [2]నుత్తమభృత్యుఁడంచుఁ ♦ దజ్ఞు లనిరి నూ!.

తే. ఎవ్వఁ డుత్సాహశక్తుల ♦ నెసఁగి విభుని
యాజ్ఞ యైనట్టికార్యంబు ♦ నాచరించి
దాని కనుకూలమయి తన♦తేని కెంతొ
ప్రియమయిన వేఱుపనిఁ జేయ♦కయ మరలునో. ౮ 8

క. అతనిన్ మధ్యమభృత్యుని, మతియందును నట్టిఁడుగనె ♦ మాన్యులు మును స
న్నుతిఁ జేసి; రెట్టిభృత్యుఁడు, నితరములగు కృత్యవితతి ♦ నెన్నక మదిలోన్.

ఆ. తా సమర్థుఁడయ్యు ♦ ధరణీశుకార్యంబ,తనిమహాజ్ఞనొంది♦యును నొనరుప
కుండు నధమభృత్యుఁ ♦ డుర్వి నాతండని, యార్యులంద్రు;పవను♦నాత్మజుండు.

క. తనకానతి యిచ్చినయా, పనినంతయుఁ జేసి పతికిఁ ♦ బరమప్రియమౌ
వనభంగాదికకృత్యం,బును జేసెను సాధుసుగుణ♦ముల నలరుటచేన్. ౧౦ 11

క. [3]అని నపజయమును గని బల,మునకున్ లాఘవము గల్గు♦పోలిక కృత్యం
బును జేయక సుగ్రీవున, కనుపమసంతోష మొదవు♦నట్లుగఁ జేసెన్. ౧౦౪

క. మరుదాత్మజుఁ డిటు లంకం, దగుణిం గని వచ్చుటను ని♦తాంతము నేనున్
[4]బరమబలుం డగునాసో,దరుఁడున్ మద్వంశభవులు ♦ దారుణభంగిన్. ౧౧

తే. [5]అవమతికి నోర్వఁజాలక ♦ యాత్మహత్య
చేసికొనకుండ ధర్మసం♦స్థితిని గాంచు
వారమైతిమి; ప్రియతమ♦వార్త లిట్లు
పలుకుచున్నట్టి యీగాలి♦పట్టి కిపుడు. ౧౨ 14

క. అనురూపమౌ ప్రియంబును, నొనరుపకున్నాఁడ ననెడు♦నురుతాపము నా
మనమును దీనత్వంబును, గనఁ జేయుచునున్న; దిట్లు♦గా నీతండున్. ౧౨౪ 15

క. మాయసువుల నిలిపెను; దమి, నీయార్యునకితని కిప్పు ♦ డేను బ్రతికృతిం
జేయందగు కాలం బిది,గో యరుదుగ వచ్చె నీఁద♦గును నేమైనన్. ౧౩ 16

1 అనియుక్తప్రకృతకార్యానుకూలకార్యాంతరకరణేనాపి మహత్కార్యమ్ సంపాదితమ్-అని వ్యాఖ్య. దీనిభావమే యిట సూచితము. 2 తమాహుః పురుషోత్తమమ్-అనిమూ. 3 న చాత్మా లఘుతాం నీతః-అనిమూ. రాక్షసైర పరాజితత్వాత్-అనివ్యాఖ్య. 4 లక్ష్మణశ్చ మహాబలః - అనిమూ, 5 ఇందువ్యాఖ్యాభిప్రాయ మున్నది.

ఆ. [1]ఏమి యొసఁగువాఁడ ♦ నెల్లయర్థంబుల, నిడినఁ దావమాఱు♦నే యొసంగ
నరయుచున్నయట్టి♦యాలింగనం బిదె, యఖిల మొసఁగినట్టి ♦ దగునుగాక.

క. అనిపలికి రాఘవుఁడు తమిఁ, దనయంగములెల్ల సమ్మ♦దంబున నిక్కన్
జనకజఁ గని పనిసాధించినయుష్మహితాత్ము హనుమఁ ♦ జేర్చెఁ గవుఁగిటన్.

క. మనమున రవంతధ్యానం, బును జేసి రఘూత్తముండు ♦ పూనికఁ దగునా
వనచరపతి సుగ్రీవుఁడు, వినుచుండఁగ నిట్టులనియె ♦ వే పవనజుతోన్. ౧౫

క. వనరాశి దాఁటి లంకం, గని యందుం జొచ్చి సీతఁ ♦ గాంచితి విటు లి
ప్పని చక్కఁగ నెఱవేఱెను, వనరాశిం దలఁచుకొనిన ♦ వాయుతనూజా!. ౧౬

క. మన మెంతొ విషాదంబును, గనుచున్నది మరలఁ; దగ న♦గాధజలములన్
దనరుచు దుష్పారంబై, వనరాశి చెలంగుదాని ♦ వనచరు లెల్లన్. ౧౭ 21

తే. ఒక్కటిగఁ జేరి చక్కఁగ ♦ నుదధిదక్షి
ణతట మేలాగుపొందనో; ♦ నాకశత్రు
మునకు సంద్రముదాఁటి వ♦చ్చునటు లిచటి
వార్త తెల్పఁగఁబడియె, నీ♦వనచరులకు. ౧౮ 22

క. సరిదధిపతి నేలాగునఁ, దరియింతురు? దానికెట్టి♦తంత్రము గలుగున్
బరికింపఁ దోఁపదే; యని, యరిసూదనుఁ డతులబాహుఁ♦డగు రాఘవుఁడున్.

క. హనుమంతుఁ గాంచి పల్కుచు, వనటం గుందుచును జాల♦భ్రాంతుండగుచున్
మనమునఁ జింతించుచు నుం,డెను గృత్యం బే దటంచు ♦ నేర్పు చెలంగన్.

ఒకటవ సర్గము సంపూర్ణము.

---

౨ - వ సర్గము.

సుగ్రీవుఁడు రామచంద్రు నాశ్వాసించుట.

క. అంతట దశరథనరపతి,కాంతునితనయుండు మోద♦కలితుండగుచున్
గాంతావిషయశ్రవణా,త్యంతవిషాదమును బొంద ♦ నగచరవిభుఁడున్. ౪

క. లలితగుణాకరుఁ డొంటన్, బలికెన్ రాఘవునితోడఁ ♦ బటుశోకంబుం
దొలఁగింపఁజేయువాక్యం,బులతో; వీరాధివీర! ♦ భూపలలామా!. ౧ 23

ఆ. ప్రాకృతుండువోలెఁ ♦ బరితాపమొందెద, వేమి! నీవు మాను♦మింక దీని
ధరఁ గృతఘ్నుఁడైన ♦నరుఁడు సౌహృదమును, వదలునట్లు దీని♦వదలు మనఘ.

సీ. జనకజవృత్తాంత♦మును శత్రునిలయంబుఁ దెలిసినపిదప నీ♦తీరున వగ
నొందఁ గారణమ దే♦మో రాఘవా! నాకుఁ దోఁపకయున్నది; ♦ భూపతిలక!

---

1 ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః-అనియూ. ఇట వాఖ్యాభిప్రాయము సంక్లిష్టమని తెలియఁదగు.

[1]యాగామిగోచరం♦బగుమతి యలరంగ నీతిశాస్త్రంబును ♦ నేర్చి ప్రాజ్ఞుఁ
డవయియుఁబండితుఁ♦డవయియుఁదగుదువుగనుకశోకముమాను♦మనఘ! యోగి
తే. పరమపురుషార్థదూషణ♦పరతఁ గాంచు
బుద్ధివిడనాడునట్లు నీ♦భూరిపౌరు
షమును దూలించుపాపాత్మ♦కమగునిట్టి
బుద్ధి విడనాడవయ్య యో♦పురుషవర్య!. ౮ 28
చ. వననిధి నెట్లుదాఁటనగు ♦ వాసవశత్రుని కేతనంబు నే
యనువునఁ గాంచనౌననెడు♦నట్టితలంపును మానవయ్య! న
క్రనికరసంకులంబయిన♦కంధిని దాఁటుదు మేము పూన్కిమైఁ
జని యలలంకకోటలను ♦ జయ్యన నెక్కుదు మంత రావణున్. ౯ 29
క. అనిమొన వధియింతుము; కావునఁ దాపము మానవలయు ♦ బొదలెడుశోకం
బున మది వ్యాకులమై దా,నిన యుత్సాహంబు చెడును ♦ నృపశార్దూలా!.
తే. దాన దైన్యంబు గలుగు న♦ద్దానివలన
నర్థములు చెడు నన్నియు ♦ నంతెకాక
వ్యసనమును సంభవించు; స♦హాయ మేమి
యున్నదని చింతఁబూనకు ♦ మో! మహాత్మ!. ౬ 31
క. శూరులు సమర్థులగుహరి, వీరులు యోధాధిపతులు ♦ వేవురు గల రా
వీరులు త్వత్ప్రియమునకై, ఘోరాగ్నిం జొరఁగ నూలు♦కొనుచుంద్రు విభూ!.
క. ఇది యెటు తెలిసె నన్న సమ్మద మొందుచు నున్నవీరి♦మాటలవలనన్
విదితంబే; దృఢతర్కం, బునయించెదు నామనమున ♦ నోరఘురామా!. ౭
ఉ. పౌరుషమూని నేను దృఢ♦పాపమొనర్చినరావణాసురున్
నీరిపుఁ జంపి జానకిని ♦ నీకడకున్ గొనివచ్చునట్టు లో
భూరమణా! మనోదృఢము ♦ పూని ననుం బురికొల్పఁగాఁ దగున్
వారిధియందు సేతువును ♦ బాగుగఁ గట్టెదునట్టు లాదటన్. ౯ 34
మ. దనుజాధీశ్వరుపత్తనంబుఁ గనుచం♦దం బెట్లు సిద్ధించునో
యనఘా! యాగతి నుత్సహింపుము త్రికూ♦టాఖ్యాద్రిశృంగంబునన్
గననై చెల్వగులంకఁ గాంచఁగనె యా♦క్రవ్యాదవర్యుండు చ
చ్చినయట్లే మది నిశ్చయింపఁదగు నో♦శ్రీజానకీనాయకా!. ౧౦ 35
క. వరుణాలయమాచు భయం, కరమై తనరారునట్టి♦ఘనవారిధిలో
గురుతరసేతువు గట్టక, తరమే సేంద్రామరాళి ♦ తత్పురిఁ జూడన్. ౧౧ 36
ఆ. [2]దనుజపత్తనంబు♦దాఁక సేతువు గట్టి, నట్టితటిని వనచ♦రాళి యిద్ది

1 మతిమాం చ్ఛాస్త్రవి త్ప్రాజ్ఞః పండిత శ్చాసి రాఘవ-అనిమూ. మతిప్రాజ్ఞముఖ్యశబ్దములకు వ్యాఖ్యకర్తలు వ్రాసినయర్థ మిట వివృతము. 2 జిత మిత్యుపధారయ-అనిమూ.

జలధి దాఁటిపోయి ♦ జయము గాంచినదని తలఁపవలయు వేయి♦పలుకులేల.

క. వనచరులు వీరు స్వేచ్ఛం, గొనఁగల రేతనువునైనఁ ♦ గొంకరు యుద్ధం
బున శూరులౌట [లంకన్, దనుజులతోఁ బెఱికి తేఁగఁ♦దగుదురు శక్తిన్.]

క. మనుజేశ! దుఃఖనిరతిన్, గనుచున్ సర్వార్థనాశ♦కంబయి తగు బు
ద్ధిని దీని వదలుమా! జగ,మునఁ బురుషునివిక్రమంబు ♦ పోవు వగవఁగన్.౧౪

తే. ఓమహాప్రాజ్ఞ! పౌరుష ♦ మూనియుండు
పురుషుఁ డీకాలమున దేనిఁ ♦ బూనియుండ
వలయునో యట్టిధైర్యంబుఁ ♦ బౌరుషంబు
నాశ్రయింపుము మనకార్య ♦ మగు ధ్రువంబు. ౧౫ 40

సీ. శూరులు త్వద్విధుల్ ♦ పూరుషులు మహాత్ము లగపడువిషయమం♦దైన నాశ
మొందినవిషయంబు♦నందైన దుఃఖంబు నొందఁగాఁ దగ దట్టు ♦ లొంద నద్ది
సర్వార్థములకు నా♦శకమగు; నీవన్న మతిమంతులందును ♦ మాన్యతముఁడ
వఖిలశాస్త్రార్థంబు♦లందుఁ బండితుఁడవు నాయట్టిసచివుల♦సాయ మూని

తే. పగతునిం జంపు మిప్పుడు ♦ పార్థివేంద్ర!
యనిని విలుదాల్చి నీవుండు♦నపుడు మ్రోల
నిలువఁ జాలినవాఁడును ♦ గలఁడె ముజ్జ
గముల దీపము చేఁబూని ♦ కలయ వెదుక. ౧౬ 41

క. వనచరులెల్లరు చేయం,గను దగునీపని రవంత♦గాని వినాశం
బును బొందలేదు; దుస్తర,వననిధిఁ దరియించి వేగ ♦ వారిజనేత్రన్. ౧౭ 42

క. కనఁగలవు రాఘవా! నీ,మనమున నీవఱకుఁ గలయ♦మంగళకరమా
పెనువగ నిఁక విడువుము క్రుధఁ, గొనఁదగు నిశ్చేష్టులైన♦క్షోణీశు లిలన్.౧౮ 43

తే. విగతభాగ్యులై యగుదురు ♦ వినుము కోప
మూనువానిని గని భీతిఁ ♦ బూనుచుందు
రెల్లవారును మముఁ గూడి ♦ యెంతో భీతి
కరుఁడు నదులకుఁ బతియునౌ♦కడలిఁ దాఁట ౨౦౪ 44

తే. ఏయుపాయము తోఁచునో ♦ యింక దాని
సూక్ష్మబుద్ధి విచారింపు; ♦ చొరఁగరాని
కడలి నాసైన్య మెల్ల నొ♦క్కటిగఁ గూడి
దాఁటె జయ మొందెనని మదిఁ ♦ దలఁపవయ్య.౨౧౪ 45

చ. విను మిఁకఁ గామరూపులయి ♦ విక్రమసంపద సంగరంబునం
గని తనరారునీకపు ల♦ఖండశిలాతరువృష్టిచేత నా
దనుజులఁ జంపువారు సుము!♦ దప్పక యెట్టటులో యపారమౌ
వనధిని దాఁటువార మని ♦ వైరియుఁ జచ్చెనటంచు నెన్నుమా!. ౨౩౪ 46

క. పలుమాటలేల విజయము, గలుగును దప్పక యె శుభము ♦ గల్పింపంగాఁ
గలిగిననిమిత్తములు తోఁచె లలిఁ హర్షంబు మదిని ♦ జెందెదునాకున్. ౨౮

రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - వ సర్గము.

రాముఁడు లంకానగరదుర్గాదులరీతి నడుగ హనుమ వివరించుట.

క. కాకుత్థ్సుం డగురాఘవుఁ, డాకపినాయకుఁడు మిగుల ♦ ననువునఁ బలుకన్
బ్రాకటసారజ్ఞుండగు, టాకర్ణించుచు గ్రహించి ♦ హనుమకు ననియెన్. ౧

ఆ. తపముచేతఁగాని ♦ తగ సేతుబంధంబు,వలనఁగాని కడలి ♦ జలవిహీన
ముగ నొనర్చిగాని ♦ మొనసి సంద్రము దాఁటఁ, జాలువాఁడ నెట్టి♦సరణినైన.

క. హనుమంతా! దుర్గముగఁ, గనఁబడులంకాపురికిని ♦ గలదుర్గాళుల్
వినిపింపు మెన్నియుండునొ, ఘనసేనాపరిమితియును ♦ గణుతింపఁ దగున్. ౩

తే. ద్వారరక్షణకృత్యమే♦భంగిఁ జేయఁ,బడుచునుండునొ పురమును ♦ భద్రరీతిఁ
గాఁగ నెన్నిన్నిరీతులు♦గా నదెట్టి, పరిఖలాదిగ సాధన♦పటలి తగునొ. ౪ 51

చ. దనుజులగేహముల్ తెలియఁ ♦ దప్పక చెప్పుము వింటి ముందె; నై
నను గనినట్లు దానిని వి♦నంగను గోరెద; లంకలోనఁ గ
ల్గినయవి యెల్లఁ గాంచితివి ♦ లీలఁగ నున్నవి యున్నయట్లె గా
వున నటు లే వచింపు [1]మిఁక ♦ బుద్ధివిలాసము నొంది యుండుటన్. ౫ 52

క. అనియడిగిన రాఘవుని వ,చనమును విని [2]వాక్యవిదులఁ ♦ జతురుండగు నా
యనిలకుమారుఁడు రాముస, కనియెను; శ్రీరామ! లంక♦యందలిగుఱుతుల్.

సీ. ప్రాకారపరిఖాది♦పరికరనిర్మితి, దానిచే రక్షింపఁ♦దగు విధమును,
బలములు దానిఁ గా♦పాడురీతియు, రాక్షసులకు రావణునిపైఁ ♦ గలుగుభక్తి
యును, రావణాసురు♦ఘనతేజమున లంకకొదవినభాగ్యంబు; ♦ నుదధిఘోర
తరళక్తియును, బుర♦వర మగులంకలో బలసముదాయవి♦భాగ, మట్లె

తే. వాహనాదులసంఖ్యయు, ♦ వరుస విన్న
వింతునని కపికులముఖ్యుఁ ♦ డెంతొ యాదృ
తిని వచించెను నీరీతి; ♦ దనుజులందు
సంతసంబున నుందు రే♦చింతలేక. ౬ 54

క. మత్తిల్లినకరిఘటలా,పత్తనమున నిండియుండు ♦ బహువిస్తృతిచే
నుత్తమమై కన్పట్టు ను,హత్తరముగ రథవరములు ♦ నలరుచునుండున్. ౧౦

చ. దనుజులు గుంపులై యలర ♦ దారుణరీతిగ నుండుగుఱ్ఱముల్
వినుతికి నెక్కనుండురిపు♦వీరుల కయ్యది దుర్గమంబుగాఁ

---

1 సర్వదా కుశలో హ్యసి-అనిమూ. 2 వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠః-అనిమూ.

గనఁబడుద్వారముల్ దృఢతఁ ♦ గాంచుచు నాలుగు చూడఁగాఁబడున్
ఘనములుగాఁ గవాటములు ♦ గ్రాలును నాయసకీల లొప్పఁగన్. ౧౧ 56

[1]తే. గడియ మ్రాఁకులు వానికిఁ ♦ గడువిశాల
ములుగ నమరుపఁబడియుండుఁ ♦ జెలఁగునవ్వి
విపులములుగాఁగ నందును ♦ విశిఖశిలల
వైచుయంత్రము లొప్పు దు♦ర్వారములయి. ౧౨ 57

క. పరబలము లొక్కయెత్తున, నరుదెంచిన వాని వైచి ♦ యందుఁ జొరఁగనీ
కరుల మరల్చును నయ్యవి;, సురవైరులు పెక్కుమంది ♦ శుంభచ్ఛ్రితిన్. ౧౩

సీ. ద్వారంబులందొక్క♦సారి నూర్వురఁ జంపఁజాలి భయంకర♦సరణిఁ బొలిచి
నిశితాగ్రములు గ్రాల ♦ నిర్భరంబులునయి తగుపరిఘంబులు ♦ దారుణగతి
శతసంఖ్యలుగ శత్రు♦జాలంబు నడఁపంగనునిచియున్నారు; మ♦హోగ్రరీతి
నలరునాపురిచుట్టు ♦ హాటకప్రాకార మున్నతమై యొప్పు♦చుండు దుష్ప్ర
ఆ. ధర్షణముగ నం దు♦దారవైదూర్యవి,ద్రుమము లమలమౌక్తి♦కములు పద్మ
రాగములును బొదుగ ♦ రంజిల్లుభాగముల్,గలవు; దానిచుట్టు♦గడు బెడఁగయి.

క. సంతతశీతలసలిలా,క్రాంతములయి భీమములుగఁ ♦ గానంబడి యిం
తింతని చెప్పంగను రా,నంతటిలోఁతునఁ జెలంగు♦నట్టిపరిఖలున్. ౧౫ 60

క. మీనంబులు నక్రంబులు, గానంబడ వెలయుచుండు ♦ క్ష్మాపాలక! పెం
పూనినద్వారస్థలముల, దానిఁ జొరన్ మార్గములు ని♦తాంతము పృథుతన్.

సీ. పరిఖాళిమీఁదుగా ♦ సురుచిరతరఫలకముల నిర్మింపఁగఁ ♦ గ్రాలునాల్గు;
వానిని నవ్వల♦వైచుటకును మఱి వలసినతఱి నమ♦ర్పను దగునటు
లున్నతయంత్రంబు ♦ లొగి నమరుపఁబడి యున్నవి రక్షించు♦నుగ్రదనుజు
లకు గృహంబులు విశా♦లములయి చాలుగావిరచింపఁబడినవి ♦ పరులబలము
ఆ. లెపుడు వచ్చునప్పు♦డెల్ల నాయంత్రంబు, లందుఁ గలుగుదారు♦బృందములను
జిమ్మివైచుఁగానఁ ♦ జేరలే రద్దాని,యంత్రము లవి కాచు ♦ నాపురమును. ౧౭

[2]క. విను మందుత్తరమార్గం,బున దారువినిర్మితమయి ♦ పొలుచునదియె చ
క్కనిరీతి దృఢ మకంప్యం,బునునయి కనుపట్టుదానిఁ ♦ బోల వితరముల్. ౧౮

క. కనకస్తంభంబులు పెక్కు నిలుపఁగాఁబడియె నవ్వి ♦ కుందఁగ నీకే
యనవరతము నామార్గం,బును గాచునగద్దలోనఁ ♦ బొలుచుచు మిగులన్.

క. దానిని గాపాడెడునా,దానవులకు నూతగాఁగఁ ♦ దగువేదిక లె
న్నోనిర్మింపంబడియెన్;, భూనాథా! రావణుండు ♦ భూతభయదుఁడై. ౧౯

క. ద్యూతాదికములఁ గలఁగని, చేతం బలరారఁ దనదు♦సేనలఁ గనఁగా

1 తత్రే షూపలయంత్రాణి-అనిమూ. శరశిలాక్షేపకయంత్రాణి-అనివ్యాఖ్య. 2 ఏకస్త్వ
కంప్యో బలవాన్ సంక్రమ స్సుమహాదృఢః-అనిమూ.

నేతఱి ప్రమాదమొందక, యే తా నని చేయఁగోరి♦యే యుద్యతుఁడౌ. ౧౯౪
క. గిరిశృంగంబున నుంట న,గర మయ్యది యెక్కి పోవఁ♦గా సాధ్యం బె
త్తరుణమునఁ గాకయలరును, సురలకుఁ బో నలవిగాదు ♦ శూరప్రవరా. ౨౦
[1]చ. కనుఁగొన భీతిదం బగుచుఁ ♦ గాననపర్వతవారిదుర్గముల్
కనకవిశాలసాలపరి♦ఖామయమౌచును గృత్రిమంబుగాఁ
దనరెడుదుర్గ మిప్పగిది ♦ దానికి దుర్గచతుష్టయంబు పెం
పునఁ దగియుండు; దూరతట♦భూరిసముద్రపుయామ్యభూస్థలిన్. ౨౧ 68
క. పుర మయ్యది యున్నది సా,గరమును దాఁటుటకు నొక♦గలమార్గంబే
యరయంగ లేదు వార్తలఁ, బరికింప నుపాయము కను♦పట్టదు రామా!. ౨౧౪
క. జలమార్గము లంకకు ని,మ్ముల వెలసెడు; దేవనగర♦ముం బోలినని
స్తులపుర మది హయనాగం,బులచేతన్ నిబిడమగుచుఁ ♦ బోరఁ దగనిద్రై.
క. కనుపట్టు దుర్జయమునై, ఘనగిరిశృంగమున దుర్గ♦కలితంబయి వా
రినిబిడపరిఘావృతమై, కనఁదగియుండును శతఘ్ని♦కలు యంత్రాళుల్. ౨౩ 71
ఆ. కుమతియైనదనుజ♦కుంజరుపురమును, గరము నలరఁజేయు; ♦ క్ష్మాపతీంద్ర!
తూర్పుద్వారమందు ♦ దుష్టరాక్షసవీరు, లయుతసంఖ్యలుందు ♦ రమితబలులు.
[2]సీ. శూలహస్తులుగాఁగ ♦ శోభిల్లువారు, దురాధర్షులయి సంగ♦రాంగణమున
ఖడ్గంబులను బోరఁ♦గలవారు; దక్షిణద్వార మం, దిభ వాజి♦వరరథములఁ
గాల్బలంబులఁ గూడి ♦ కఱకురాక్షసు లొక్క, లక్షయున్నా రతు♦ల ప్రతాపు
లందలియోధు లో♦యవనీశ! పశ్చిమద్వారభాగంబున ♦ భటులసంఖ్య
తే. లక్షదశకంబు వార లె♦ల్లరును జర్మ
ఖడ్గధరులయి శస్త్రాస్త్ర♦గణము నెఱిఁగి
యుందు రయ్యుత్తరద్వార♦మందు న్యర్బు
దముగ లెక్కింపఁ దగినట్టి♦దనుజు లుంద్రు. ౨౭ 73
క. అందుం గొందఱు రథికులు, కొందఱు తురగాధిరోహ♦కులు నగుదు రిఁకం
గొందఱు నాగారూఢులు,గం దగి కులముఖ్యులగుచుఁ ♦ గడుఁ బూజితులై.
తే. అలరుచుంద్రు; దురాధర్షు♦లైనయసురు
లందు మధ్యమభాగంబు♦నందుఁ బెక్కు
వేలకొలఁదిగ నున్నారు ♦ వినుము వార
లెల్ల నొకకోటి యుందు ర♦హీనశౌర్య!. ౨౮౪ 75
క. సంచారమార్గముల నే, మించినశౌర్యమున వేడ్క♦మిగులన్ రామా!
త్రుంచితిఁ బరిఘంబుల మా,యించితిఁ గాల్చితిని లంక♦నెల్లఁ దిరుగుచున్.

1 స్థితాపారే సముద్రస్య దూరపారస్య రాఘవ - అనిమూలము. 2 సర్వే ఖడ్గాగ్రయోధినః - అనిమూలము.

సీ. *సాలంబులం బూన్కిఁ ♦ గూలఁగాఁ ద్రోచితి నాల్గవపాలు దా♦నవభటులను
విక్రమాఢ్యుల యము♦వీటికిఁ బంపితి నేయుపాయంబున♦నేనిఁ గడలిఁ
దరియింత; మీావన♦చరులెల్ల నాలంక హాతమొనర్చిరయని ♦ యవధరింపు
మంగదద్వివిదులు ♦ నాజాంబవంతుఁడు నల పనసులును సే♦నాపతియగు
తే. నీలుఁడును, మైందుఁడును గంధి ♦ లీల దాఁటి
పోయి పర్వతవనరాజి♦భూరిఖాత
వప్రతోరణయుతముగ ♦ భవనయుతము
గాఁగ లంకను నిటకుఁ దేఁ♦గలరు రామ!. ౩౩ 77

క. కావున మిగిలినకోఁతుల,తోనే పనిగలదు నీకుఁ ♦ దొందరగా నీ
సేనలలో ముఖ్యులకును, నానతి యిడి యరులఁ గెలువ♦నగు కాలంబున్.

క. పరికించి యంగదాదులఁ, బురికొల్పుచు లంక కరుగఁ♦బోలినరీతిన్
ద్వరపడి పయనము చేయుము, ధరణీశ! విచారమేల ♦ ధైర్యము గొనుమా!.

మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪ - వ సర్గము.

రామాదులు కపిసేనలతోఁ బయన మగుట.

ఆ. సత్యవిక్రముం డ♦సదృశతేజుఁడునగు, రాముఁ డనిలతనయుఁ ♦ డేమి చెప్పె
దానినంతయు విని ♦ తగ నిట్టులనియెను;, భయదదనుజనగర♦వరముఁ గూర్చి.

క. తెలిసితివి గాదె దానిని, గలవిలపాటొందఁ జేసి ♦ కడురయమున నే
విలయంబు నొందఁ జేసెదఁ, దలఁపుము సత్యమని దీని ♦ దర్పసమగ్రా!. ౨

క. అని సుగ్రీవునితో ని, ట్లనియెను నీలగ్నమందె ♦ యరుగం దగునం
చని తలఁచెద నాకాశం,బున నడుమన్ భాస్కరుండు ♦ పొలిచెం గంటే!. ౨౫

క. ఈయభిజిల్లగ్నంబున, నే యరుగం దగును విజయ♦మే సిద్ధించున్
బాయక మధ్యాభ్రంబున, నీయర్కుం డుండ జయము♦నే గల్గించున్. ౩౫

ఆ. ఈముహూర్తమందె ♦ యేఁ జనుదునయేని
సీత నపహరించి ♦ చెలఁగుదనుజుఁ
డెచటి కేగఁజాలు ♦ నత్తఱి నైనను;
నొక్కయాతురుఁడు మ♦హోగ్రవిషము. ౪ 81

క. తానుగఁ గ్రోలి తదీయా,నూనజ్వాలలకుఁ జిక్కి ♦ నూఱువిధములన్
దా నలఁ జడిఁబడి యమృతము, గానంబడ దాఁకి ♦ గతసాధ్వసుఁడై. ౪౫

క. జీవించునట్లు సీతయు, నావచ్చుట యాలకించి ♦ నన్ బ్రదుకంగాఁ

---

* బలైకదేశః క్షపితః-అనిమూలము. బలైకదేశః=సేనాచతుర్థాంశ ఇత్యర్థః- అనివ్యాఖ్య.

దా వేడ్కనొందు; నుత్తర, నా వఱలెడు తార యాదినంబునఁ జెలఁగెన్.
క. తారాబల మీదినమున, నారయ బాగున్న దెల్లి ♦ హస్త గదా! యీ
యారంభమునకు శుభదం, బౌ రయమున నేఁడె సేన ♦ లన్నియుఁ బూన్కన్.
ఆ. బయలు వెడలునట్లు ♦ పాటింపుమీ యాజ్ఞ, శకునవితతి నాకు ♦ సాధురీతి
గానఁబడెడు దనుజ♦కాంతుని వధియించి, జనకుకన్యఁ దేఁగ♦లను నిజంబు. ౭
క. [1]నాదగునేత్రం బిదుగో, మీఁదుగఁ జలియింపఁ జొచ్చె ♦ మేలుగ దీనన్
నాదగుకోర్కి ఫలించును, గా దిఁక వ్యర్థమని తెల్పు♦కరణి హరివరా!. ౮
ఆ. కార్యకోవిదుండు ♦ కడుధర్మమతి రాముఁ, డాత్మవాక్యములను ♦ నావనచర
పతియు లక్ష్మణుండు ♦ బళిబళి యనుచుండ, మరల నినజుతోడ ♦ నుందలించె.
క. చనుఁగాక ముందు నీలుఁడు, వనచరులోకలక్షసంఖ్య ♦ బలవంతులు వెం
టను రాఁగ మార్గదర్శన, మునకై; మనసీలుఁడు తన♦ముందటఁ దోఁపన్.
చ. ఫలములు మూలముల్ గలిగి ♦ పావనశీతలవారి కాననం
బులఁ దగి తేనెయుం దొరకు ♦ భూతలమార్గమునందు వేగ యి
బ్బలములతోడ నేగు; మిఁకఁ ♦ బాపమతుల్ [2]దనుజుల్ విషాదులం
గలిపి ఫలాళిమూలములఁ ♦ గమ్రజలంబులఁ గ్రొర్వ మొప్పఁగన్. ౧౧ 92
ఆ. పాడుచేయుచుంద్రు ♦ ప్రాల్మాల కీవును, వార లట్లు చేసి ♦ బాధకలుగఁ
జేయకుండునట్లు ♦ చేసి కాపాడుమీ!;, దనుజ లోక్కవేళ ♦ దారుణగతి. ౧౨
క. వనదుర్గంబుల నిమ్నా,వనితలములఁ గాననముల ♦ బలముల మనలం
గని తలపడ నునుతురు గా,వున వానరు లంబరమునఁ ♦ బోయి నలుదెసల్.
క. పరికించి రిపులు కలరో, పరుగెత్తిరో యుండ లేదో ♦ పరికింపఁ దగున్;
గరమున సారంబగు వా,నరబల మున్నయెడ నిల్వ ♦ న్యాయము సుమ్మీ
క. మనపూన్కి భయంకరమై, కనఁబడు నందఱును శౌర్య♦కలితులెయయి యి
ప్పని సాగింపందగుఁ గద;, వనచరసింహులు లోగి వేలు ♦ వందలు గాఁగన్. ౧౫
తే. కలిసికొని భూరివారిధి♦కరణి నొప్పు
భయదసేనాగ్రభాగంబు ♦ బలము మెఱయ
నట్లు నడిపించుకొని పోవ♦నగును జుమ్ము;
పర్వతాకృతి గజుఁడను♦భవ్యయశుఁడు. ౧౬ 97
క. బలమున నెంతయు నుర్విం, జెలఁగెడు గవయుండు శక్తి♦చేత గవాక్షుం
డలఘుతరదృప్తవృషభం, బులక్రియ సేనలకు ముందుఁ ♦ బోఁదగుఁ జుమ్మీ.
సీ. [3]ఎగిరెడువారియం ♦ దెల్లఁ దాఁ బెద్దయై తగుఋషభుండు స♦త్తాంతవిక్ర
మమునఁ జెల్వారుచు ♦ మనసైన్యదక్షిణభాగంబుఁ గాచుచు ♦ వచ్చుఁగాక;

---

1 ఉపరిష్టాద్ధి నయనం స్ఫురమాణ మిదం మమ-అనిమూ. 2 దూషయేయు ర్దురాత్మానః పథి మూలఫలోదకమ్-అనిమూ. దూషయేయుః, విషాది నేతిశేషః-అనివ్యాఖ్య. 3 యాతు వానరవాహిన్యా వానరః ప్లవతాంవరః-అనిమూ.

గంధగజంబట్లు♦గా దురాధర్షుఁడై జవమున నుతికెని ♦ జాలియున్న
గంధమాదనుఁడును ♦ గపిబలవాహుపార్శ్వంబును గాచుచు ♦ వచ్చుఁగాక;

తే. నేను నైరావతము నెక్కి ♦ నిర్జరపతి
యేగునట్లుగ హనుమంతు ♦ నెక్కిబలము
లకు మహోత్సాహ మట్టి క♦ల్గఁగను నడుమ
నరుగుదెంచెద మీకెల్ల ♦ నార్త్మ లలర. ౧౯ 99

చ. *ధనపతి సార్వభౌమ మను♦దంతిశిరంబును నెక్కి పోవురీ
తిని యముఁ బోలులక్ష్మణుఁడు ♦ తీవ్రబలంబుల నొప్పునంగదుఁ
వినుతబలాభిరాముఁ బృథి♦వీస్థలి నున్నతశౌర్యు నెక్కియే
చనియెడుఁ గాక; యీబలము ♦ శౌర్యమునం బరికింపుచుం దగన్. ౨౦ 100

సీ. భల్లూకపతి జాంబ♦వంతుఁడును సుషేణుఁడును, వేగదర్శియు ♦ ననెడు వీరు
మువ్వురునుఁ బలం♦బున నొప్పు ధూమ్రుండు బలముల వెనుకటి♦భాగమరసి
వచ్చుచుందురుగాక; ♦ వరశక్తి ననిపల్కి శ్రీరామువాక్యంబుఁ ♦ జిత్త మలర
వాహినీపతియయి ♦ వనచరపతియయి యలరెడు సుగ్రీవుఁ ♦ డాలకించి

తే. యాజ్ఞ నిడెఁ బయనంబు చే♦యంగ వారి;
కంత నని చేయునుత్సాహ ♦ మతిశయింప
వనచరుల్ కందరంబులఁ ♦ బర్వతశిఖ
రముల విడనాడి యెగిరిరి ♦ ప్రమద మలర. ౨౩ 101

క. వనచరపతియా సుగ్రీ, వునిచే లక్ష్మణునిచేతఁ ♦ బూజితుఁ డగుచున్
జనియెను దక్షిణదిక్కున, కనుపమధర్మమతియైన♦యారాఘవుఁడున్. ౨౪

క. వనచరులు శతము లక్షలు, గను గోటులు గాఁగ నొక్క♦గతి నయుతంబుల్
గను గూడి మత్తగజముల, యనువునఁ దన వెంట రాఁగ ♦ నరిగె నతండున్.

క. చనుచున్నరాము వెనుకొని, వనచరవాహినులు చనియె; ♦ వానరులు మదం
బున ముదముఁ బట్టఁజాలక, యినతనయునిప్రాపుగల్గి ♦ యెగురుచు మిగులన్.

ఆ. గంతు లట్టి వైచి ♦ గర్జిల్లుచున్ సింహ,నాదములను జేసి ♦ యావరమునఁ
బరుగు లట్టి వాటి ♦ సురుచిరఫలములఁ, దినుచు మధువులాని♦తృప్తిఁ గనుచు.

చ. సురుచిరమంజరీనికర♦శోభితవృక్షము లట్టి పెంపునన్
గరములఁ బట్టి యేగి రల♦కాలునిదిక్కున; కొందఱు గొందఱో
హరులు మదించి యన్యులను ♦ నార్భటిమీఱఁగఁ బైకినెత్తి రిం
కొరులను గొంద ఱుర్విఁబడ ♦ నుద్ధతిఁ ద్రోసిరి స్వేచ్ఛమీఱఁగన్. ౨౮

---

* అంగదే నైష సంయాతు లక్ష్మణ శ్చాంతకోపమః, సార్వభౌమేన భూతేశో ద్రవిణాధిపతి ర్యథా - అనిమా.

తే. త్రోయఁగాఁ బడి కొందఱు ♦ త్రోసినట్టి
వారి నాక్షేపణము చేసి ♦ రీరసమున
శక్తిగలవారలుం దమ ♦ క్షమఁ బడంగఁ
ద్రోసినకపుల మరలను ♦ ద్రోసి రట్టె. ౨౯ 107

క. వనచరులు రాఘవుని చెం,తను మన మారావణుని మ♦దంబున స్వేచ్ఛం
గనువానిఁ జంపి యందలి, దనుజులఁ జంపఁదగు నంచుఁ ♦ దమి గర్జిలుచున్.

క. చనుచుండి రంత వీరుఁడు, ఘనబలుఁడౌ ఋషభుఁడు, కపి♦కాంతుఁడు నీలుం
డును, గుముదుఁడు, పెక్కంద్రను, వనచరులంగూడిముందు♦వాహిని కెలమిన్.

క. అరుగుచు మార్గము నెల్లం, బరిశోధించుచుఁ జెలంగఁ ♦ బగవారికి భీ
కరులౌ రవిసుతలక్ష్మణు, లురుబలుఁడౌ రాఘవుండు ♦ నుగ్రకపివరుల్. ౩౧౫

క. పరివేష్టించుచు రాఁగా, హరిమధ్యమభాగమందు ♦ నరిగిరి; వీరుం
డురుబలుఁడునైన శతబలి, హరివరదశకోటియుక్తుఁ♦డై బలిమిమెయిన్. ౩౨౫

క. *హరివాహినులను నొక్కఁడె, పరికించుచుఁ గాచుచుండె;♦బలముమెఱయు కే
సరిపనసగజులు నర్కుఁడు, హరిబలములు నూఱుకోటు ♦ లరుదేరంగన్.

తే. బలమునంతయు నొక్కపా♦ర్శ్వమునఁ గాచు
చుండి; రంతట నాసుషే♦ణుండు జాంబ
వంతుఁడును బెక్కుభల్లూక♦వరులు గొలువ
నినజు ముందిడుకొని వెన్క ♦ నేగుచుండి. ౩౪౫ 113

క. సేనాపశ్చిమభాగముఁ, బూనిక రక్షించుకొనుచుఁ ♦ బోయిరి; మఱి యా
వానరసేనాధీశుం, డై నిఖిలోత్పతనశాలు♦రం దాధుర్యుండై. ౩౫౫ 114

క. వీరుఁడునై తగునీలుం, డారయుచున్ నాల్గుదెసల ♦ హరిబలములఁ దాఁ
గారవమున రక్షించుచు, భూరిజవం బొప్పుచుండఁ ♦ బోవుచు నుండెన్. ౩౬

సీ. ప్రజఘుదరీముఖుల్ ♦ రభసరంభులు ననువీరవానరవరుల్ ♦ వీరు నాల్గు
ప్రక్కలఁ దిరుగుచు ♦ నక్కడికపులను ద్వరపెట్టుచుం బోయి ♦ రురుగతులను
వానరవరు లట్లు ♦ బలములు వెలయంగఁ జనుచును దరులతా♦సముదయముల
నొప్పెడు సహ్యాద్రి ♦ నుర్వీధ్రవరమును వికసత్సుమంబుల ♦ వెలయునట్టి
తే. కొలఁకులఁ దటాకముల వనం♦బులను గనిరి
భీమశాసనుఁడౌ రఘు♦వీరునాజ్ఞ
కట్టె భయపడి భూరిసై♦న్య మది నగర
ముఖములను గొల్లఁగొట్టక ♦ మోదమలర. ౪౦ 116

క. ధ్వని మీఱఁగఁ బెనునాదం,బునఁ దగుగురుసాగరంబుఁ ♦ బోలి చనియె; తా

* అర్కశ్చాతి బలః పార్శ్వమ్-అనిమూ.

మున కుల్లాసము గల్పిం, పను దత్పార్శ్వమున బాహు♦బలసంపన్నుల్. ౪౧

తే. వీరులై యొప్పు వనచరుల్ ♦ సారఘోట
కములు చోదితములయి వే♦గముగఁ బోవు
కరణిఁ బోయిరి; పురుషకుం♦జరులు రామ
లక్ష్మణానిలజాంగదుల్ ♦ లలితరీతి. ౪౨ 118

క. తము మోయ నొప్పునక్ష,త్రములను గురుశుక్రులఁ గూడు♦రవిచంద్రులు నా
నమలతనుప్రభలను నా, నుయంబున వెలసి; రంత ♦ ఋక్షపతివరుఁడై. ౪౩

క. నిరతంబు ధర్మమతియై, పరఁగెడు రాముండు సహజ♦భానుసుతులుఁ త
న్నురుముదమునఁ బూజింపఁగ, నరిగెఁ దక్షిణముఁగూర్చి♦యాబలములతోఁ.

సీ. అంగదుపై నున్న♦యాలక్ష్మణుఁడు పరిపూర్ణ కాంతుండునయి♦పొలిచి స్మృతియుఁ
బ్రతిభయుఁ గలవాఁడు ♦ సతతధర్మాత్ముండుఁ గావున హనుమపైఁ♦గ్రాలు రాముఁ
గని పల్కె శుభవాక్కు♦లను నీవు వేగంబ రావణుఁ బొలియించి ♦ రావణాప
హృతయైన సీతను ♦ నేపునఁ గైకొని సఫలితార్థుఁడవయి ♦ సకలరత్న

ఆ. యుక్తయౌ నయోధ్య ♦ కొప్పుమీఱఁగఁ బోవఁ
గలవు; భూతలాభ్ర♦తలములందుఁ
గలుగు శుభనిమిత్త♦ములు నీదుకార్యసి
ద్ధులను జూపుచున్న ♦ వొలసి రామ!. ౪౬ 121

క. అనిలుఁడు మృదువుగ హితముగ, ననుపమసుఖమును శుభము♦నగపఱచుచు మె
ల్లన సేనవెంట వీచెడుఁ, గను మివిగో మృగపతత్త్రి♦గణములు కూర్మిఁ. ౪౭

తే. మధురనాదంబు లొప్ప ని♦ర్మలమనముల
నలరి శబ్దించుచున్న వీ ♦ యఖిలదిక్కు
లమలములుగాఁ జెలంగెడు ♦ నబ్జమిత్రుఁ
డమలకాంతుల వెలసెడు ♦ నార్య! యిపుడు. ౪౮ 123

క. శ్రుతినిలయుఁడైన శుక్రుం, డితరక్రూర*ఖగయోగ ♦ మినుమంతయు లే
కతినిర్మలతేజంబున, హితఫలదుం డగుచు వెనుక ♦ నెనఁగెడు రామా. ౪౯

సీ. పరిశుద్ధులైన స♦ప్తమునులు కాంతుల నలరి దక్షిణదిశ ♦ కెలమిఁ బోయి
మరలుచు ధ్రువునకు ♦ సరిగఁ బ్రదక్షిణ మానట్లు తిరుగుచు ♦ నలరువార
లిక్ష్వాకువంశ్యుల ♦ కెల్ల కూటస్థుఁడై తనరి రాజర్షియై ♦ ఘనుఁడు నా త్రి
శంకుండు మమత వి♦శ్వామిత్రనిర్మితసప్తర్షులం దున్న♦సాధుచిత్తుఁ

తే. డా వసిష్ఠునితోఁ గూడి ♦ యమలతేజ
మునఁ బ్రకాశించుచున్నాఁడు ♦ మనకు మేటి

---

* ఖగము=గ్రహము.

తారయైన విశాఖయుఁ ♦ గ్రూరఖచర
సంయుతయ గాక వెలిలెడుఁ ♦ జారుకాంతి. ౧౨౫ 125

ఆ. నైరృతంబు దనుజ♦నక్షత్రమునగుమూ,లాఖ్యతారచెంత ♦ నలరుధూమ
కేతు వట్టి తాఁక ♦ నాతతత ప్తమై, వీడనొందుచున్న ♦ దోడి రామ!. ౧౨౬

చ. దనుజవినాశనంబునకె ♦ తప్పక యాయది యిట్టులయ్యెఁ జా
వునకును సిద్ధమై తగిన♦భూతవితానపుఁదార యట్టివే
ళను నొకక్రూరఖేచరవి♦లాసమునం బరిపీడితం బెయా
వనములు సత్ఫలావళుల ♦ భాసిలుచున్నవి చూడ విందుగన్. ౧౨౭ 127

క. జలములు రుచిదగ స్వచ్ఛం, బులునై యున్నయవి భూరి♦భూజవితానం
బులు కాలపుమర్యాదను, సులలితసుమగంధములను ♦ సొంపుగ నలరున్.

తే. [1]తారకామయసంగ్రామ♦ధరణియందు
నమరసేనలభంగి వ్యూ♦హములు గాఁగ
నున్న యీకపిసైన్యమ్ము ♦ లొప్పుచున్న
యవి మహీనాథ! శుభశకు♦నాళి యిట్లు. ౧౨౯ 129

క. కనఁబడుచున్నవి వీనిం, గని సంతస మొందియుండఁ♦గా నగు నని రా
మునితమ్ముఁ డన్న యూఱడఁ,గను బల్కెను; బిదప గొప్ప♦కపిబల మెల్లన్.

క. ఘననఖదంతాయుధములు, గనుఁగొనభీతిదములౌచుఁ ♦ గ్రాలంగా మే
దిని నావరించి పెలుచం, జనియెను; [2]వానరులహస్త♦చరణాగ్రములన్. ౧౩౧

క. జనియించినట్టిరజ మా, వనజాప్తునికాంతిఁ గప్పి ♦ భయదంబుగఁ గ్ర
మ్మెను లోకమునం దంతట;, వనచరసైన్య మది మిగుల ♦ భయదాకృతిగన్.

తే. జలదపటము లంబర♦తలముఁ గప్పు
నట్టు వనపర్వతాభ్రయు♦క్తాయతయును
దిశను గలభూమినంతయు ♦ దివిరి యావ
రించుచుం బోయెఁ గనువారు ♦ సంచలింప. ౧౩౩ 133

చ. హరిపతిసేన లొక్కమొగి ♦ నందలియేఱుల దాఁటుచుండ ని
ర్భరగతి నీరు స్వేచ్ఛగను ♦ బాఱఁగఁ జాలక వ్యత్యయంబుగాఁ
దిరుగుచుఁ జాలయామడలు ♦ తీవ్రగతిం బ్రవహించె; నక్కపీ
శ్వరుభటు లందు స్వచ్ఛముగు♦వారిఁ జెలంగు సరోవరంబులన్. ౧౩౪ 134

క. [3]కని వానినడుమ దిగియే, చని రవ్వలి కఖిలభూమి♦జప్రతతుల నిం

---

1 దేవానా మివ సైన్యాని సంగ్రామే తారకామయే-అనిమూ తారకామయే = తారకుఁడను రాక్షసునియొక్క వధసమయమందు, బృహస్పతిపత్నియగుతారను జంద్రుఁడుకొనిపోయినప్పటియుద్ధమునందు అనియర్థము. 2 కరాగ్రైశ్చరణాగ్రైశ్చ వానరై రుద్ధితం రజః-అనిమూ. 3 మధ్యేన చ ముంతాచ్ఛ తిర్యక్చా ధశ్చ సా విశత్-అనిమూ.

డినకొండలు ప్రాప్తింపం,గ నష్టముగఁ జుట్టు దిరిగి ♦ కడచిరి వానిన్. ౧౫

క. సమతలములైన భూములు, తమకుం దోఁచినవు డెల్ల♦తావుల వ్యాపిం
చి మమత దాఁటిరి ఫలవం,తములగు వనములును దోఁపఁ ♦ దరువుల క్రిందన్.

క. ఫలములఁ దినంగఁ గోరుచు, మెలమెల్లనఁ బోయి రటన♦మీరజవమునం
జెలువారు నక్కపులు భూ,పలలాముని కార్యమునకుఁ ♦ బౌరుష మలరన్.

క. మనముల సంతస మొప్పం, గను నొకరికి నొకరు శౌర్య♦ఘనబలములరీ
తిని ముదముఁ జెప్పుకొనుచున్, జని రభియోవనవిలాస♦జములగు చేష్టల్. ౧౮

తే. కానఁబఱచుచుఁ బోయిరి ♦ కాననచరు
లైన కపులొక్కకొందఱు ♦ పూని పఱచి
రొక్కకొందఱు పై కేగి ♦ రుక్కుమిగులఁ
గొంద ఱెంతయుఁ గిలకిలఁ ♦ గూసి రొకట. ౧౯ 189

ఉ. వానరు లొక్కకొంద ఱిల ♦ వాలములన్ వడిఁగొట్టి రంఘ్రులం
బూనికఁ గొంద ఱుర్విపయిఁ ♦ బోరునఁ గొట్టిరి కొంద ఱందు భూ
జానివిఱుందఁ బోవుచును ♦ త్క్మారుహపర్వతరాజిఁ జేతులం
జానుగఁ జాఁచి నుగ్గుగను ♦ శౌర్యముమీఱఁ బగుల్చి రార్చుచున్. ౨౦

క. గిరిగోచరులగు వనచరు, లురుతరధరశృంగవితతి ♦ నుక్కు మెఱయఁగాఁ
బరికించి యెక్కి యార్చిరి, హరినాదము లొప్పఁ జేసి ♦ రందు మిగులఁగన్.

సీ. ఊరువేగంబుల ♦ నొక్కకొందఱు తీఁగజొంపంబులం గూల్చి♦రింపుమిగుల
మిఱికొంద ఱెగురుచు♦మలయుచు శిలలను దరువులఁ గైకొని ♦ సురుచిరముగ
నాడిరి భీతిదు♦లైనవానరభటు లందును శతసహ♦స్రాయుతములు
గాఁగఁ గోటులుగాఁగఁ ♦ గవిసి భూమిని సిరి యలరవ్యాపించిరు♦జ్జ్వలనికామ

తే. తేజ మలరంగ నాసేన♦దేవసేన, భంగి గొప్పదిగాఁ దగి ♦ ప్రభునిఁ గూడి
పట్టరానట్టిప్రీతిచే ♦ భాస్కరాత్మ, జాభిపాలితయయి యేగె ♦ ననవరతము.

చ. అనిపయిఁ గల్గునాసలను ♦ నంఱు వేగము వోయి రెప్డు సీ
తను జెఱనుండి ముక్తిఁగనఁ ♦ దా రొనరింతుమె యన్న యాతురం
బున నొకయించుకైన మదిఁ ♦ బూనరు నిల్వఁగ; నిట్టు లేగుచున్
వనచరు లెల్ల వృక్షమృగ♦వారసమన్వితసహ్యభూధరం
బును మలయాద్రిఁ జేరి రొగి ♦ భూపలలాముఁడు రాముఁ డంతటన్. ౨౨

తే. మలయసహ్యాద్రులందును ♦ జెలఁగునదుల
నిర్ఝరంబుల వనముల ♦ నెమ్మిఁ గనుచుఁ
గడచిపోయెను; గపులు మా♦ర్గమునఁ గల్గు
వకుళతిలకద్రుమములను ♦ భవ్యములను. ౨౩ 144

సీ. సింధువారాశోక♦చిత్రచూతంబులఁ గరవీరతిమిశవృ♦క్షములఁ బాడు
చేయుచుఁ బోయిరి ♦ వాయువేగంబుల నూడుగుచెట్లను ♦ నుగ్రరీతి

నలరు క్రానుగువృక్ష♦ముల జువ్విచెట్లను వటతిందుకంబుల ♦ వరుస మీఱ
జంబూకతరువుల ♦ సాగతరంబులొ కడిముల నామల♦కములఁ ద్రుంచు

తే. చు వెనఁ బోయిరి; రమణీయ♦శుభ్రశిలల
యందు నలరారుబహువిధా♦యతవనతరు
వులు తదూరుజవంబునఁ ♦ జలన మొంది
వారిపైఁ బూలఁ గురిపించె ♦ గౌరవమున. ౭౬॥ 145

చ పరిమళముల్ చెలంగుతగు♦పాళిని మందసమీరుఁ డట్టి ని
ర్భరకుతుకంబు మీఱ భ్రమరంబులు పాడుచు వెంటరాఁగ సుం
దరసుఖ మిచ్చునట్లుగ ని♦తాంతముఁ దాఁకుచుఁ *జందనక్రియం
బరఁగుచు వీచె; ధాతుగణ♦భవ్యముగాఁ దగుసహ్య మయ్యెడన్. ౭౭ 146

తే. ధాతునిర్గత రేణుసం♦తానములను
వాయుజవఘట్టితంబయి♦వనచరగురు
వాహినిం గప్పె నెల్లెడ; ♦ భవ్యశిఖరి
యందుఁ దగుచున్న నెత్తము♦లందు మిగుల ౭౮॥ 147

సీ. పుష్పించినమొగలి♦పొదలును దెల్లవావిలిచెట్లు మిక్కిలి♦వేడ్కనించు
చు వసంతమునను బూ♦చుగురివెంకలుపూచిగంధపూర్ణములయి♦క్రాలుమొల్ల
పొదలును, జిరిబిల్వ♦సదమలతరువులు గంధపూర్ణాఖ్యవృ♦క్షములు కాన్గ
తనువు లిప్పలు మఱి♦వరమధూకంబులు స్ఫూర్జకప్రియకాఖ్య♦భూరుహములు
తిలకముల్ నాగముల్ ♦ దివ్యచూతంబులు ముచుకుంద పాటల♦ములును గోవి
దారార్జున, కుటజ♦తరువులు శింశుపా తరువులు శాల్మల♦ధవమహీరు
హంబులు మఱియును ♦ నరుణకురవకముల్ హింతాళతిమిశంబు♦లెంతొవింత
గా నొప్పునుసిరికల్ ♦ కడిమిచెట్లును నీలపుష్పగణాశోక♦భూరుహములు

తే. వరుణవృక్షంబు లంకోల♦తరువులు క్షితి
పద్మముల్ పూచియున్నయీ♦పరమతరువు
లెగురుచున్ దాఁటుచుం బోవు♦నెల్లకపుల
వలనఁ జీకాకుఁ గనియెను ♦ గలఁగి విఱిగి. ౮౦॥ 148

చ. సరసులు వాపికల్ మిగులఁ ♦ జల్లనినీరము నిండనుండ భూ
ధరమున నందు నొప్పి నత♦తంబును జక్కవపక్షు లెల్ల సుం
దరముగ నాడఁగా జలప♦తత్రిసమూహము క్రౌంచముల్ మనో
హరముగఁ గేళి సల్పఁగ మృ♦గావళు లెప్పుడుఁ గొల్చుచుండఁగన్. ౮౧ 149

తే. భల్లుకంబులు సింగముల్ ♦ వ్యాఘ్రములును
సింహములు దుష్టగజములు ♦ చెలఁగుచుండ

* వాతి చందనశీతలః-అనిమూ.

భయదములుగా నెసంగుచుఁ ♦ బద్మకుముద
ములును సౌగంధికోత్పలం♦బులు వెలయఁగ. ౮౭½

క. జలములఁ బుట్టెడుపుష్పం,బులు పెక్కులుమెఱయుచుండఁ♦బొలుచుచునుండెన్
గలఁచిరి కోఁతులు వానిని, బలుతావుల నందుఁ బెక్కు♦పక్షులు భీతిన్. ౮౮½

క. వనచరులం గని కూయిడెఁ;, ననంతరము కీశవీరు ♦ లందఱు నాకొం
దను గలసరసుల స్నానం,బును సల్పి జలంబు లాని ♦ మోదము చెలఁగన్.

తే. కేళి సల్పి కొండొరులపై ♦ లీల నీళ్లు
చల్లుకొనుచును వానర♦వల్లభు లటఁ
బర్వతము నెక్కి మదమునఁ ♦ బ్రబలి యమృత
గంధములగు ఫలంబులఁ ♦ గందములను. ౮౯½

క. మూలమ్ములఁ గుసుమమ్ముల, నోలిన్ వృక్షములనుండి ♦ యొక్కటఁ గొనుచుం
జాలం బ్రీతి భుజించిరి; గ్రోలిరి తేనెలను మిగులఁ ♦ గుతుకం బలరన్. ౯౦

[1]క. సురుచిరమధుపింగళితను, ధరులగు నాకవులు మిగులఁ ♦ దత్పరులయి ని
ర్భరరీతి ద్రోణమాత్రము, పరమంబగు మధువుగల్గు♦పట్టుల నెల్లన్. ౯౦½

క. వ్రేలాడుచుండువానిన్, జాలఁగ బలములరఁ బట్టి ♦ సంతృప్తిగ భూ
పాలుండు గనం ద్రాగుచు, నాలంకకు నడిచిపోయి ♦ రంతటఁ ద్రోవన్. ౯౧½

క. తరువుల విఱచుచుఁ దీఁగలఁ, గరముల లాగుచును గొప్ప♦క్ష్మాధరతతులన్
జరణములఁ బగులఁగొట్టుచు, నరిగిరి; కొందఱు మనోజ్ఞ♦మగు తేనియలన్.

తే. త్రావి మత్తిల్లి యఱచుచుఁ ♦ దగువిరహిత
ధరణిమీఁదను జనిరి కొం♦దఱు మహోగ్ర
తరువు లెక్కిరి కొందఱు ♦ తరువులపయి
నుండి దిగి; రిట్లు వానర♦యూథవరులు. ౯౩½

క. అంతర మేమాత్రము లే, కంతటఁ జెలువారుచుండ ♦ నవని యుదియు సం
క్రాంతపరిపక్వసస్య,నంతవలెన్ వెలసె; నవ్వ♦నచరులతోడన్. ౯౪½

క. సరసిజలోచనుఁడగు రఘు,వరుఁ డంత మహేంద్రశిఖరి♦వల్లభుఁ జేరెన్
దరువరభూషితమా న,గ్గిరిశృంగము నెక్కి విమల♦కీర్తి నృపుఁడు తాన్.

తే. దాశరథి యిట్టు లామహేం♦ద్రగిరిశృంగ
మెక్కి ఝషకూర్మనిబిడమై ♦ యుక్కు మిగిలి
యలరునంబుధిఁ గాంచె; నా♦హారివరు లోగి
సహ్యమలయాద్రివరముల ♦ సరగ దాఁటి. ౯౭

[2]క. క్రమమున నత్యంతభయం,బమరుల కైనను నొసంగు♦నట్టి ధ్వనుల మ్రో

1 ద్రోణమాత్రప్రమాణాని లంబమానాని వానరాః - అనిమూలము. 2 రామో రమయతాం శ్రేష్ఠః-అనిమూలము.

గుమహాబ్ధిచెంతఁ జేరిరి;, తమఁ బరరంజకులమేటి♦గాఁ దగునృపుఁడున్. ౯౮

క. అనుజన్మునిని, సుగ్రీవుని, వనచరులం గూడి యద్రి♦వర్యము దిగి య
బ్ధిని జూచు వేడ్కనతులము,గను జెలఁగు తదీయతటముఁ♦ గడువడిఁ జేరెన్.

క. అనిశము సమాసోద్ధితభం,గనికరధాతోపలతల♦కలితం బగుచున్
బెనురూప మలరఁ దగునా,వననిధితీరమును జేరి ♦ వనచరపతితోన్. ౯౯౪

క. పలికెను రాముం డిటు లో,జలజాప్తతనూజ! మనము ♦ సంద్రముదరికిన్
మెలమెల్లనఁ జేరితి మిదె, తలఁ పెయ్యది మున్ను తోఁచెఁ ♦ దగ నిట దానిన్.

తే. మరల నాలోచనము చేయు♦తరుణ మిదియె
నవలితీరంబు గానరా ♦ దరయ నింక
జలమయముగ నదీపతి ♦ సాగరంబె
కానఁబడియెడు, నుపమ లే♦క యిఁక దీని. ౧౦౧ 166

చ. అలవియె కాదు దాఁట బల♦మంతయునున్ మననున్ వసింపనౌ
జలనిధిచెంత నిందె, మన♦సైన్యము వారిధి దాఁటి యెట్లొ య
వ్వలిదరిఁ జేరుమంత్రమును ♦ వైళము చేయుట యుక్తమంచు నా
[1]యిలసుత దొంగిలింపఁబడి ♦ యేగుట విహ్వలచిత్తుఁడై తగన్. ౧౦౨౪ 167

సీ. ఆనందమే లేని ♦ యామహాబాహుండు రాముండు పలికి సం♦ద్రమును జేరి
యట సైన్యములు విడి♦యంగనౌ సమువార్తవిషయమై వనచర♦విభునిఁగాంచి
పలికె నిట్లని సైన్య♦ములు వేగ నీయబ్ధితటమున విడియంగఁ ♦ దగినరీతి
నాజ్ఞ చేయుము దీని♦యవ్వలిదరిఁ జూడనగు నెట్టు లట్టి యూ♦హల నొనర్ప

ఆ. నవసరంబు గల్గి♦నది యెవ్వఁడే గాని, తనబలంబు విడిచి ♦ చనఁగరా దె
చటికినైనఁ బౌరు♦షంబునఁ దగువన,చరులు తిరుగవలయు ♦ సరభసమున.

కవిరాజవిరాజితము:—

అరులు నిరంతర ♦ మంతరముం గన ♦ నయ్యయితావుల నుంద్రు కపీ
శ్వరులు జవంబున ♦ వారలరోయుచు ♦ వారలకృత్యము లెన్నఁదగున్;
నిరత మటంచును ♦ నీరజనేత్రుఁడు ♦ నెమ్మి వచించిన సూర్యజుఁడున్
వరతరుసంయుత♦వార్ధితటంబున ♦ వానరసేనల విడియించెన్. ౧౦౬౪ 169

[2] తే. జలధిచెంత వసించిన♦బల మది మధు
పాండుజలమయి సిరిగుల్కు♦రెండవజల
నిధివలెన్ భాసిలెఁ; గపి♦నిచయ మబ్ధి
తటవనంబులఁ బొంది యు♦న్నమ మలరఁగ. ౧౦౮ 170

---

1 సీతాహరణకర్శితః - అనిమూలము. 2 మధుపాండుజలశ్శ్రీమాన్ ద్వితీయ ఇవ సాగరః- అనిమూలము.

క. వననిధియువ్వలితీరం,బును జేరం గోరుచు నట♦మోదమ్మున నుం
డెను; నావానరు లట దిగు,చునుండుయత్నములఁ బుట్టు♦శుంభద్ధ్వనియున్.

చ. వననిధిభూరినిస్వనము ♦ వారక మించి మహాత్తరంబుగా
వినఁబడె; భాస్కరాత్మజుఁడు ♦ వీరుఁడు కావఁగఁ బొల్పుమీఱునా
వనచరసేనయున్ ద్రివిధ♦భంగులుగా దిగి రాముకార్యమె
య్యన నెఱవేఱునట్టి ఘన♦యత్నము నేయఁగ నుండె నంతటన్. ౧౧౦

ఉ. వానరసైన్య మయ్యెడఁ, బ్ర♦భంజనధూతతరంగయుక్తమై
గానఁబడంగఁ గాంచుచు ని♦కామముదంబును బొందె; నంతటన్
దానవసేవితం బవలి♦తట్టది యింతటిదూర ముందు నం
చేనరుఁ డైననుం దలఁప ♦ నెప్పటి కర్హము గాక యొప్పుచున్. ౧౧౨ 173

క. వరుణావాసంబయి దు,స్తరమయి యక్షోభ్యమగుచుఁ ♦ జండగ్రాహో
త్కరమయి సంధ్యల వృద్ధిం,బరఁగుట భీతికరమగుచు ♦ వార్ధియుఁ జెలఁగెన్.

సీ. ఫేనౌఘముల నవ్వు♦విధమున నలరుచు నలలపొంగున నాడు♦నట్లు మెఱసి
చంద్రోదయమున వి♦శాలతలంబును నావరించుచు, ననే♦కాబ్జబింబ
ములు ప్రతిబింబితం♦బులు గాఁగఁ జెన్నారి [భంగాగ్రములచేత ♦ భవ్యఫేన
చందనంబును దీయు♦చందంబుసం బొల్చి శశి తనకరములఁ ♦ జందనమును
తే. దిక్సీతంబినులకుఁ బూయు♦తీరునఁ దగఁ], జండపవమాన వేగసం♦సక్తఘోర
నక్రతిమితిమింగిలసుగ♦ణంబు నగుచు, మణివిభాసురవిషధర♦గణయుతమయి.

చ. తనరుచు శింశువారముఖ♦దారుణసత్వసమన్వితంబునై
కనఁబడుచుం జొరం దగక ♦ త్క్ష్మాధరసంఘయుతంబునై పథం
బనునది లేక యాసురుల ♦ కాకరమై చెలువారుచుండె; న
వ్వనచరు లాగభీరతర♦వార్ధిని జూచి విషాద మొందుచున్. ౧౧౬ 176

*క. తరియింప నెట్టులో యని, పరికింపుచు నుండి రంతఁ ♦ బవనచలితదు
ర్భరభంగవితతి, నాగ,మ,కరయుతముగఁ బొంగి క్రిందు♦గాఁ బడుచుండెన్.

తే. రాత్రివేళను శీతక♦రప్రభాన్వి
తమయి భాస్వరజలమయి ♦ దహనకణము
లెల్ల వ్యాపించియున్నట్టు ♦ లెనఁగి కానఁ
బడుచు నుండును; మఱియు నం♦బరము నట్లె. ౧౧౮ 178

క. సురుచిరహిమజలయుతమై, పరఁగుచు నగ్నికణతుల్య♦భాసురతారో
త్కరకీర్ణంబై మెఱయును;, సరిద్విభునియందు నాగ♦సంతతు లొప్పున్. ౧౧౯

తే. ఆకసంబు మహోహిగ♦ణాయుతంబు
వనధిసురపథముల సుర♦వైరు లుంద్రు

---

* మకరైర్నాగభోగైశ్చ విగాఢా వాతలోళితాః-అనిమా.

భయదములు గాఁగ రెండును ♦ బరఁగుచుండు
నతిభయంకరములు రెండు ♦ నరసిచూడ ౧౧౮ 180

*క. కనుఁగొన నంద్రము సురపథ,మును నన్యోన్యము సమత్వ♦మును బొందుచునుం
డెను గాన వానిభేదము, కనఁబడకయె యుండు; నంతఁ ♦ గడలిజలంబుల్.

చ. కనఁబడె నాకసంబువలెఁ ♦ గంధివలెం గననయ్యె నాకసం
బును గడలిన్ సురత్నములు ♦ పోల్పఁగ నుండును దారకాళియుం
గనఁబడునంబరంబునను ♦ గావున నయ్యవి రెండు భేదముం
గనకయె పోల్చె నివ్విధిని ♦ గాంచిన భేదము గానరాదు నూ!. ౧౨౦ 182

సీ. నీరదాళిక్రాంత♦నిర్మలాభ్రమునకు భంగమాలాక్రాంత♦వననిధికిని
భేదమే గనరాక ♦ వెలసెఁ; బరస్పరాహతములై యలలు భ♦యంకరముగ
భేరీనినాదంబు♦విధమున మ్రోఁగుచుండెను; రత్నములు జలం♦బును వెలయఁగఁ
బటునాద మడరంగఁ ♦ బవనాభిహతమయి యేకమౌ నట్లును ♦ నాకసమున
కుద్గమించెడునట్లు ♦ నుగ్రకోపంబునుగొనియున్నయట్లులు ♦ కనుఁగొనఁబడి
తే. సలిలసత్వయుతంబయి ♦ శ్వసనజవస
ముత్థితతరంగముల దివి ♦ కొగిని బ్రాఁకు
నట్లు జల మెల్లఁ గలవిల♦మై చెలంగ
నతిశయోత్సాహమునఁ గని ♦ రబ్ధిఁ గపులు. ౧౨౮ 183

క. వనచరు లూర్మిధ్వనులన్, ఘనముగఁ జేయుచుఁ జలించు♦గతి నున్నమహా
వనధిని దానిం జిత్రం,బునఁ గాంచిరి దాఁటువిషయ♦ములను దలఁచుచున్.

నాల్గవ సర్గము సంపూర్ణము.

---

౫ - వ సర్గము.

లక్ష్మణుఁడు శ్రీరాము నూఱడించుట.

క. సేనాపతి నీలుఁండును, బూనిక రక్షకులు వెలయ ♦ భూరిమహాబ్ధిన్
గాననగు సౌమ్యతటమున, సేనల విడియించె నీతిఁ ♦ జెలువారంగన్. ౧ 185

క. అంతట మైందద్వివిదులు, పంతంబున నాల్గుదెసలఁ ♦ బరికించుచుఁ గా
నంతయు భయమును సేనా,సంతతి పొందనటు తారు ♦ చరియించి తగన్. ౨

క. కాపాడుచుండి; రంబుధి,దాపున నాసైన్య మెల్లఁ ♦ దమిఁ బొదలంగన్
భూపతితిలకుఁడు రాముఁడు, దాపునఁ బార్శ్వమునఁ గొల్చు♦తమ్మునకనియెన్.

క. జనులాడుచుంద్రు కాలము, చనఁగా శోకంబు గూడఁ ♦ జనునంచు; మహీ
తనయను గానని నాదగు, ఘనశోకం బట్లు గాక ♦ కడువృద్ధిఁ గనున్. ౪ 188

---

* సాగరం చాంబరం చేతి నిర్విశేష మదృశ్యత-అవిమా,

చ. జనకజఁ దెచ్చునట్టి ఘన♦శక్తిని గూడియు దుఃఖ మొంద నే
లనియెదవేమొ? దూరమున ♦ నాజనకాత్మజ యున్నదంచు నేఁ
గనుటయె లేదు శోకమును ♦ గాంతను రాక్షసుఁడే హరించె నం
చును వగ నొందలేదు విను! ♦ శూరత నాతనిఁ జంపఁ జాలుదున్. ౩,౪ 189

*క. వనితను దేనేత్రును నో, యనుజా! యాసాధ్వి దా వ♦య స్సనుభవమో
గనిరూఢి నొందకుండఁగఁ, జనుచున్నది వ్యర్థ మనుచుఁ ♦ జాలిఁ గనియెదన్. ౫

చ. అని పవమానుఁ గాంచి జన♦కాత్మజ నాప్రియురా లదెచ్చటం
గనునో నివాస మచ్చటికిఁ ♦ గ్రక్కునఁ బోయియె వీవు మంత నా
వనిత స్పృశించి నన్నును బ్ర♦భంజన! తాఁకుము దాన మేలు గ
ల్గును; సతి చంద్రుఁ జూడఁగను ♦ గోరిక నేనును జంద్రుఁ గాంచ దా
న నెలఁతఁ గాంచి నట్లగును; ♦ నాకొఱకై యటు సేయుమీ దయన్. ౬

సీ. విపులభోగంబుల ♦ విడనాడి నా వెంట నడవికి వచ్చిన ♦ యట్టిసాధ్వి
తను రావణుండు బ♦ల్మిని గొనిపోవంగ వానిని గాల్ప ని♦ర్భరసుశక్తి
గలదియే యయ్యు న♦న్నెలమిని గతిగాఁగ నమ్మి హా ప్రాణేశ! ♦ నన్నుఁ గావు
మని యేడ్చినట్టివా♦క్యము నామనంబునఁ, బలువుగ నాటి ని♦ర్భరవిషంబు
తే. ద్రావినట్లు మదంగసం♦తతిని గాల్చు
చున్నయది; మన్మథాగ్ని వి♦యోగదారు
వులుగఁ దచ్చింతయే జ్వాల♦వలెఁ జెలంగి
కాల్చుచున్నది రేయుఁబ♦గలు తనువును. ౭ 192

చ. నిను విడనాడి సంద్రమున ♦ నేను బరుండెద నట్లు చేయఁగా
ఘనముగ మండునీస్మరుఁడు ♦ కష్టముమీఁద దహించుఁగాని యిం
తని దహియింపలేఁడు; జన♦కాత్మజ నేనును నొక్కభూమినే
యనుజ! సమాశ్రయించినటు ♦ లౌఁగద, యిత్తఱి నిట్లొనర్చినన్. ౮,౯ 193

ఆ. వగలఁ బొగులుచున్న♦వాఁడను గాన నా
ప్రాణములను గావఁ ♦ బటుతరమగు
సాధనంబె యగును; ♦ శక్యమా బ్రదుకంగ
విరహ మొందు నాకు ♦ వేయునేల ?. ౧౦ 194

క. జనకజ జీవించియె యా,దనుజపురంబందు నుంటఁ ♦ దమి వింటిని గా
వున నీళ్లులేనిభూమియుఁ, దనచెంతను సోదకముగ ♦ ధరణి చెలఁగినన్. 195

తే. దాని సాయంబునన్ రవం♦తయు బ్రదుకును
గాంచినట్లుగ నేను జీ♦వించియున్న

---

* ఏత దేవానుశోచామి వయోఽస్యా హ్యతివర్తతే-అనిమా.

వాఁడ; సుశ్రోణి నుత్ఫుల్ల♦వారిజేక్ష
ణను మహీసుత నాశ్రేయ♦సిని దగంగ. ౧౧౪ 196

చ. అరుల జయించి యుజ్జ్వలమ♦హామహిమంబున నొప్పులక్ష్మి న
వ్వరునను జూడ సంతసము ♦ వర్ధిలునో యటు లెవ్డు చూతునో
సురుచిరబింబతుల్యమగు♦శుభ్రతరోష్ఠము గల్గి పద్మము
ట్లరుదుగ నొప్పుభూతనయ♦యాస్య మొకించుక పైకి నెత్తుచున్. ౧౨౪ 197

తే. ఆతురుండు రసాయన ♦ మానుభంగి
నేను నధరామృతం బెప్పు ♦ డానువాఁడ;
నాతలోదరి గౌఁగిట ♦ నదుమ నన్నుఁ
బటువులై తాళఫలరీతి ♦ బలసి మఱియు. ౧౩౪ 198

క. ఒండొంటిఁ గలిసి ప్రీతిని, మెండుగఁ గల్పించు చనులు ♦ మిక్కిలి వగచే
నుండెడునాతనువును దమి, నిండంగా సోఁకునొక్కొ ♦ నే నెఱుఁగఁ జుమీ!.

క. నల్లనియపాంగములచే, నుల్లసిలెడు భూమితనయ ♦ యుగ్రదనుజులు
ద్యల్లీలఁ జుట్టుకొనఁగాఁ, దల్లడిలుచుఁ బతిగ నేను ♦ దనకుండంగన్. ౧౪౪

ఆ. నాథహీనమాడ్కి ♦ నవయుచున్నది గదా, కాచుదిక్కు లేక; ♦ కంజనేత్ర
జనకరాజపుత్రి ♦ సాధ్వి నాకును దశ,రథునికోడలునయి ♦ రక్కసు లోఁగి.

క. తనుఁ జుట్టుకొనఁగ వారల,కును జిక్కి కృశించెడుఁ గద; ♦ కువలయహితు రే
ఖనియతిని శరత్కాలం,బున నీలాభ్రములఁ ద్రోసి ♦ పొంగెడు కాంతిన్.

క. వెలువడుగతి నాసీతయుఁ, గలఁపఁగరానట్టి దనుజ♦గణముల నెల్లన్
బలువిడిని ద్రోసివుచ్చుచు, నిలుచునొ నాయెదుట నెపుడు ♦ నెమ్మి చెలంగన్.

*క. జనకజ స్వభావమున నే, తనుదేహయె దేశకాల♦తత్త్వమ్ములు మా
ఱినతఱి నుపవాసమునను, ఘనశోకమునను గృశించి ♦ కడుఁ బడలుఁ జుమీ!.

క దనుజేంద్రుఁడైన రావణు,ఘనవక్షంబున శిలీము♦ఖము నాటి మహీ
తనయ నదెప్పుడు నేఁ దో,డ్కొని రాఁగలనో యదెప్పు♦డు వగ లడఁగునో.

క. సురకన్యఁ బోలుసతి యా, ధరణిజ సోత్కంఠ యెప్డు ♦ దగ నామెడ నా
దరమునఁ గౌఁగిటఁ జేర్చుచుఁ, బరమానందాశ్రువులను ♦ ద్వరగ విడుచునో.

క. తరుణీవిరహజమై భీ,కరమగు నీవగను నల్ల♦గా మాసినయం
బరమును విడుచువిధంబునఁ, ద్వరపడి విడువంగఁ దగిన♦తరుణ మది యెదో.

చ. అని సతిఁ గూర్చి సూక్ష్మమతి ♦ యయ్యిను దా విలపించుచుండఁగా
వనజహితుం డహస్సు చన ♦ భాసురకాంతులు చల్లనౌట నొ
య్యనఁ జనె నస్తశైలమున; ♦ కంతట లక్ష్మణుఁ డూఱడింప నా

---

* స్వభావతనుకా నూనం శోకే నానశనేన చ, భూయస్తనుతరా సీతా దేశకాలవిపర్యయాత్ -అనిమా.

వనరుహపత్త్రనేత్ర బహు♦భంగుల నెంచుచు దుఃఖితుండ
య్యును దగ సంధ్యవార్చెను ర♦ఘూత్తముఁ డెంతయు భక్తిమీఱఁగన్. ౨౩

ఐదవ సర్గము సంపూర్ణము.

---

## ౬ - వ సర్గము.

లంకయందు రావణుఁడు మంత్రులతో నాలోచించుట.

చ. సురపతితుల్యవిక్రముఁడు ♦ శూరవరేణ్యుఁడునై మహోత్ముఁడా
మరుదధినాథనందనుఁ డ♦మానుషభీతిదకార్య మాత్మపూ
ర్వరమునఁ జేసిపోవఁ గని ♦ రావణుఁ డెంతయు సిగ్గు నొందుచున్
శిరమును సుంత వంచి యటఁ ♦ జేరినమంత్రులతోడ నిట్లనున్. ౧౪ 209

క. వనచరమాత్రుండగు నా, హనుమంతుఁడు దుష్ప్రధర్ష♦మై తగు నాప
త్తనమును లక్ష్యము చేయక, తనధైర్యముమీఱఁ జొచ్చి ♦ తాఁ గనె సీతన్.

సీ. చైత్యంబునాఁబడు♦సమధికప్రాసాద మవనిపైఁ బడియెను; ♦ నాసురవరు
లెందఱో హతులైరి♦యీలంక యంతయుఁ గలఁపంగఁబడియె నొ♦క్కకపిచేత;
నిఁకమీఁదఁ జేయంగ♦నేది యుక్తంబగు? మనకెల్ల శుభ మేది? ♦ యొనరుపంగఁ
జక్కఁగా ఫలియించు♦నత్కార్య మెయ్యది? పలుకుఁడీ! చేసెద ♦ భద్రమెల్లఁ

తే. గలుగుఁ గావుత మీకును, ♦ బలయుతుండ
నైన నీకేల మంత్రమం ♦ చనెద రేమొ?
*చిత్తబలమునఁ దగుయోగ♦సిద్ధు లంద్రు
విజయమూలము మంత్రమె ♦ వెలయు ననుచు. ౫ 211

క. కనుకనె బలయుతులారా!, మనుజేంద్రునివిషయముననె ♦ మంత్రము చేయం
గను గోరుచున్నవాఁడను;, వినుఁడీ లోకమునఁ గనఁ ద్రి♦విధముగఁ బురుషుల్.

తే. ఉత్తములు మధ్య,మాధము ♦ లొప్పుచుంద్రు
వార లందఱుఁ గలిసియె ♦ వఱలుచుంటఁ
దెలియసాధ్యముగాదు వా♦రలగుణముల
దోషములఁ గాన నేఁ దెల్పు♦దును గ్రమముగ. ౬౪ 213

సీ. మంత్రనిర్ణయమున ♦ మంత్రుల నిపుణులస్వహితకాంక్షులఁ గాని♦స్వసుఖదుఃఖ
సమభాగులై నట్టి♦సఖులను గాని హితమును గోరెడి స్వబాం♦ధవులఁ గాని
కూడి యాలోచించి ♦ కోరి చేయందగు కార్యము నడపుచుఁ ♦ గడఁగి దైవ
మును నమ్మియుండునో♦యనుదురుత్తముఁడని యాతని; నొకఁడె తా♦నగుచుఁ గార్య

తే. మును దలంచుచు నొక్కఁడె ♦ మనసుకోలఁది
దైవమును నాశ్రయించుచుఁ ♦ దగినకార్య

---

* మంత్రమూలం హి విజయం ప్రాహు రార్యా మనీషిణః-అనియా.

మును నొనర్చునొ యెవ్వఁ డా♦తనిని మధ్య
ముఁడని పలుకుదు రార్యులౌ ♦ మునులు తెలిసి. ౯ 214

చ. పురుషుఁ డెవండు దోషముల ♦ భూరిగుణంబుల నిశ్చయింప కా
పరముని నాశ్రయింపకయె ♦ పట్టినకార్యముఁ జేయువాఁడ నం
చరయక పల్కి కార్యమును ♦ నంతయుఁ దీర్ప నుపేక్ష చేయునో
ధర నధముం డటం డ్రతనిఁ ♦ దత్వ మెఱింగినపెద్ద లందఱున్. ౧౦ 215

క. పురుషు లిటు మూఁడువిధములఁ, బరిగణితులె యైనయట్లు ♦ పరిగణితములౌ
ధర మంత్రములు నటంచని, యరయందగుఁ జెప్పువాఁడ ♦ నవ్వానిగతుల్.

తే. మంత్రు లందఱుఁ గడు నైక♦మత్య మొంది
శాస్త్రమనుదృష్టిఁ గూడి యా♦సక్తితోడ
మంత్రమును దేని నెంతు రా♦మంత్ర ముత్త
మంబని తలంపఁబడు మహా♦మహులచేత. ౧౨ 217

తే. కార్యనిర్ణయవిషయమై ♦ కడఁగి మొదట
మంత్రు లన్యోన్యభేదముల్ ♦ మతములందుఁ
గలిగి తుద కైకమత్యంబు ♦ పొలయఁగూర్తు
రట్టిమంత్రము మధ్యమ ♦ మనఁగఁబడును. ౧౩ 218

తే. సచివు లందఱు తమభావ ♦ మచల మనుచు
దాని సాధింపఁ బూని వా♦దమును జేయు
చుందురో యైకమత్యంబు ♦ నొందుకోర్కి
యైన లేకుండునో యది ♦ యధమ మంత్రము. ౧౪ 219

క. మతిమంతులైన మీరు ని,యతిమీఱఁగఁ జక్క నెంచి ♦ యత్యుత్తమమై
హితమగుకార్య మిదంచని, గతసంశయులై యెఱింగి ♦ కడుఁ బూనికతోన్.

తే. నిశ్చయింపుఁడు తద్రీతి ♦ నేను జేయఁ
దగినవాఁడను; మనకు మం♦త్ర మిఁక నేల
మునిఁగిపోయిన దేమున్న ♦ దనెద రేమొ?
వేలకొలఁదిని వనచర♦వీరు లుండ. ౧౬ 221

క. మనపురముఁ జుట్టుముట్టఁగఁ, జను దేరంగలఁడు రామ♦చంద్రుఁ డిటకు; ని
వ్వనధిని దాఁటి యదెట్టులు, చను దేఁగలఁ డందు రేమొ? ♦ సహాయయుతుండై.

*క. వనచరులును సుగ్రీవుఁడు, తనవెంటన్ రాఁగ సహజ♦ధైర్యము మెఱయన్
వనధిని నెండించియొ యిం,క నితరపథములనొ సుఖము♦గాఁ దరియించున్.

క. అని నాకుఁ దోఁచుచున్నది, పని యిది నేఁ జెప్పినట్లె ♦ ఫలియింపఁగఁ బ
త్తనమును వానరవీరులు, చనుదెంచియొ యుద్ధపెట్టు♦చందము గలుగన్. ౧౮

* సముద్ర ముచ్ఛోషయతి వీర్యేణాన్య త్కరోతివా-అనిమూ. అన్య త్సేతుబంధాదికం వా కరోతీతి-అనివ్యాఖ్య.

క. పురమును సైన్యంబుల నెక్కరణిని గీడొందకుండఁ ♦ గాపాడఁ దగున్
బరికింపుఁ డట్టియూహల, నరగున మీరెల్ల యుక్తి♦చతురులు గారే. ౧౯

ఆఱవ సర్గము సంపూర్ణము.

---

౭ - వ సర్గము.

మంత్రులు రావణాసురునిఁ బొగడుట.

చ. దనుజవిభుండు రావణుఁ డు♦దగ్రబలుం డిటు పల్కఁగా బలం
బునఁ దగు నాసురుల్ సుమతి♦పూర్ణులు గామిని నీతిబాహ్యులై
దనుజవరేణ్యుఁ గాంచి రిపు♦దర్ప మెఱుంగక యంజలుల్ తగం
బొనరిచి యాత్మపక్షమును ♦ బూని వచించిరి పొంగు నేడ్కలన్. ౧½ 226

తే. రాజ! పట్టసశూలముల్ ♦ భ్రాజమాన,పరిఘయష్టులు శక్తులు ♦ పరఁగుచుండఁ
జాలసైన్యము మన కుండ ♦ నేల యీవి,షాద మొందఁగ నీకిట ♦ శత్రుహరణ!.

ఉ. సేనలు నీకు నేల? యని ♦ సేయఁగ నొక్కఁడ వీవు చాలవే?
దానవనాథ! భోగవతి♦దాపున యుద్ధము సల్పి సర్పసం
తానము గెల్చి తీవు మును ♦ దర్పగవైరినివాసభూమియౌ
యాగవర్యశృంగమున ♦ యక్షసమూహము లెల్లఁ గొల్వఁగన్. ౩½ 228

క. అలరారు కుబేరునితోఁ, గలహం బొనరించి దేవ♦కాండము మెచ్చన్
బలమున లోఁబడునటు లు,జ్జ్వలశౌర్యా! చేసికొంటి ♦ క్షణమాత్రమునన్.

చ. ధనపతి యాతఁడీశునకుఁ ♦ దద్దయు మిత్రుఁ డటంచు నెన్నికం
గనుచును లోకపాలుఁడయి ♦ గాఢబలుండయి యొప్పుచుండ నా
తనిఁ గడురోష మూని ప్రవి♦దారణ మందు జయించి తీవు; య
క్షనికరమున్ వధించి కడ♦కం గొని కొందఱఁ బట్టి యేఁచుచున్. ౪½ 230

క. కారాబద్ధులఁ జేయుచు, నీరసమునఁ గలఁచి పుచ్చి ♦ యీపుష్పకమున్
గోరిక శివగిరినుండి వి,హారార్థము తెచ్చి తీ వ♦హార్యబలమునన్. ౬ 231

క. దనుజేంద్రుఁడైన మయుఁ డే,పునఁ బొల్చెడు నిన్నుఁ గాంచి ♦ భూరిభయంబుం
గని మైత్రిఁ గోరి భార్యగఁ, దనతనయ నొసంగె నీకు ♦ దానవనాథా!. ౭

సీ. వీర్యంబునన్ విఱ్ఱ♦వీఁగుచు నెవ్వరికైన జయింపంగ ♦ నలవిగాక
తనరారుమధువను♦దనుజుండు నీసహజాతయౌ కుంభీన♦సకు సుఖంబుఁ
గల్పించువాఁడు సం♦గరమున నీకును వశుఁడయ్యెఁ, బాతాళ♦వాసులైన
శంఖవాసుకులఁ ద♦క్షకునిని జటినిని గెలిచి వారల స్వవ♦శులనుఁ జేసి

తే. కొంటి; వో దీర్ఘబాహూ! య♦కుంఠశౌర్య!
యరినిషూదన! చూర్ణికృ♦తాంగు లయ్యు

మరల లేవంగ బ్రహ్మచే ♦ మహితవరము
లంది యక్షయులయి బలా♦హార్య లగుచు. ౯ 233

క. అతిశౌర్యంబున నిర్జర,వితతిని భయమునందఁ జేయు♦వీరులు నగు ను
ద్ధతకాలకేయదనుజు ల,హితులయి తమబలము నెఱపి ♦ *యేకాబ్ద మొగిన్.

క. అని చేసి నీకు వశులై,రన నీ కేటి కిఁక భీతి; ♦ యసురేశ్వర! యొం
దును జూడరాని మాయలఁ, బనివడి నేర్చితివి పెక్కు♦భంగులు గాఁగన్. ౧౧

క. [బలయుతుల లోకపాలురఁ, గలహంబునఁ గ్రోధ మొప్పఁ♦గా నోడింపం
గలిగితివి; శక్రుఁ గూడం, గలన జయించితివి పొల్పు♦గా స్వర్గమునన్]. 236

క. కరితురగరథపదాతులఁ, బరఁగెడుశూరులను భీమ♦బలసంయుతులన్
వరుణునితనయుల సంగర,ధరణిన్ గెల్చితివి నీ వు♦దారభుజాఢ్యా!. ౧౨ 237

సీ. కాలదండమె భయం♦కరమగు మొసలిగ శాల్మలిప్రముఖశ♦స్త్రములె వృక్ష
ములుగాఁగఁ గాలుని♦బలుపాశమే మహా త్తరతరంగాళిగాఁ ♦ దపనతనయు
భటులెనాగములుగఁ♦బరఁగు నాయమసైన్యసాగరమును జొచ్చి♦సంగరమున
యముఁ బాఱఁదోలి జ♦యంబును గొంటి; వాకదనంబునను లోక♦గణము లెల్ల

ఆ. వడఁకెఁ గాదె? యింద్రు♦వంటి విక్రమశాలు,రగుచు వీరులైన ♦ యవనిపతులు
ధరణి నెల్ల భూరి♦తరువుల మాడ్కి-ని, నిండియుండి రమల♦నీతివిదులు. ౧౪

తే. శౌర్యమున, సద్గుణమున, ను♦త్సాహమందు
ననిని రాముఁడు వారిలో♦న నెవరికిని
సముఁడు కాఁడు; మహీపాల! ♦ క్ష్మాపతులను
బరమదుర్జయులను నీవు ♦ బవరమందు. ౧౬ 239

క. ధరణికి బలియిచ్చితి విఁక, ధరణీశుం డీతఁ డెంత? ♦ తత్తఱపడ కో
సురవైరినాథ! యుండుము, పరిశ్రమము నీకు నేల? ♦ ప్లవగావళులన్. ౧౭

ఆ. అతులబాహుఁడైన ♦ యాయింద్రజి త్తొక్కఁ,డడరి చంపఁగల్గు; ♦ నాతఁ డీశు
గుఱిచి యజ్ఞ మొండు ♦ కోరిక నత్యుత్త,మము నొనర్చి దుర్ల♦భమగు వరము.

సీ. పరశివుకరుణచేఁ ♦ బడసెను గద? మఱిశక్తి,తోమర,మీన♦సంకులమయి
కీర్ణాంత్రశైవాల♦కీర్ణమై మదగజకచ్ఛపనిబిడమై ♦ క్రమ్రతురగ
మండూకసంతతి ♦ నిండి రుద్రాదిత్యభీకరగ్రాహని♦బిడము నగుచు
మఱియు మరుద్వసు♦మహితోరగంబయి హ స్త్యశ్వరథజలం♦బయి పదాతి

తే. పులినతలసంకులంబయి ♦ భూరిజలధి
వలె భయంకరమయి యున్న ♦ వాసవుబల
మునఁ బ్రవేశించి యింద్రుఁ గై♦కొని సురలను
గలవిలంపడఁ జేసి లం♦కకును దెచ్చె. ౨౧ 242

* త్వయా సంవత్సరం యుద్ధ్వా-అనిమూ.

క. పరమేష్ఠియానతికిఁ గం, బరవృత్రులఁ జంపినట్టి♦వాసవు నీవుం
గరుణించి విడువ దేవో, త్కరవందితుఁ డగుచుఁ జొచ్చెఁ ♦ గాదె? దివంబుల్.

చ తనయుని నట్టి శూరవరు ♦ దర్పసమగ్రునిఁ బోరి కంపుమా
వనచరసేనతోడ రఘు♦వర్యుని రూపడగించు శుద్రుఁడా
వనచరుఁ డొక్కరుం డిటకు ♦ వచ్చి తటాలున నిట్టియాపదం
బొనరఁగఁ జేసె దాన వగఁ ♦ బూనఁగ నేల సురారిపూజితా! ౨౪ 244

[1]తే. దాని నీమది నెంతమా♦త్రంబు నునుప
వలదు రాముని జంపంగఁ ♦ గలవు నీవు
శౌర్యమున బాహుబలమున ♦ సాటికాఁడు
నీకు రాముఁడు తలఁపుమా! ♦ నీమనమున. ౨౫ 245

ఏడవ సర్గము సంపూర్ణము.

---

## ౮ - వ సర్గము.

ప్రహస్తాదులు తమతమపరాక్రమముల రావణునితోఁ జెప్పుట.

క. అని రంత నీలజలదం, బననొప్పెడు రూపమలర ♦ నాహవశూరుం
డును సేనాధీశుఁడునయి, తనరుప్రహస్తుండు పలికెఁ ♦ దగ నంజలితోన్. ౧

క. సురదానవగంధర్వులు, నురగపిశాచములు పక్షు ♦ లొక్కరు నిను సం
గరమున మార్కొనఁ జాలరు, హరులన నిఁక నెంత? దాన♦వాధిప! నీకున్.

క. మన మెల్లఁ బ్రమత్తులమై, మన కేమిఁక భయ మటంచు ♦ మది నమ్మిక నుం
డినతఱి హనుమంతుం డిటఁ, జనుదెంచి పరాక్రమంబు ♦ సలిపి కపటియై. ౩౫

తే. మనల వంచించి పోయె నో♦దనుజనాథ!
యట్లు లేకున్న నేను బ్రా♦ణాళిఁ దాల్చి
యుండ నావానరుం డిట ♦ నుండి బ్రదికి
యెట్లు పోనేర్చు? నాశక్తి ♦ యెఱుఁగుదు గద!. 3 249

క. [2]వననిధిపర్యంతంబుగఁ, గనుపట్టెడు భూమిఁ గల్గు♦క్ష్మాధరములయుం
దును వనములందుఁ గల యా, వనచరులం జంపువాఁడ ♦ భవదాజ్ఞయయేన్.

చ. పురమును గాచుచుండెదను ♦ బూనిక నే నిఁకమీఁద, నీకు నా
తరుణిని దెచ్చినందులకు ♦ దాపరమైనమహాపరాధ మె
వ్వరుసను వానరోత్తముల♦వంక భయం బిడఁ జాలకుండెదున్
గరము ప్రమోదముం గనుచుఁ ♦ గాలము పుచ్చుము దానవేశ్వరా!. ౫ 251

---

1 హ్రాది నైవ త్వయా కార్యా త్వం వధిష్యసి రాఘవమ్-అనిమూ. ఇటఁ దృతీయచతుర్థచరణముల నధికముగా రావణునన్నమము చేర్పఁబడుట ప్రకృతార్థపోషకమని యూహింపఁదగు 2 కరో మ్యవానరాం భూమి మాజ్ఞాపయతు మా భవాన్-అనిమూ.

చ. అన విని దుర్ముఖుం డనెఁ♦నట్టి సురారి మహాగ్రహంబునన్
వనచరుఁ డొక్కరుం డిటకు ♦ వచ్చి తిరస్కరణంబు నిట్లుగా
మనకును గల్గఁ జేసె నిది♦మాత్రము సైఁపఁగరాదు లంకనున్
దనుజవరేంద్రసౌధమును ♦ దా నవమానము నొందఁ జేసెఁగా. ౬౫ 252

తే. అంతఁ బోవక శ్రీమంతుఁ♦డైన విభుని
నవమతింగనఁ బల్కె నీ♦యది క్షమింపఁ
దగదు సుంతయుఁ గాన ని♦త్తఱిని నేనొ
కఁడనె చని వానరావళి ♦ గడుభయమున. ౭౫ 253

చ. వననిధిఁ జొచ్చినన్ నభము ♦ వారక దూఱిన నాగభూమికిం
జని యట దాఁగినన్ బ్రబల♦శౌర్యము పూని వధించి వత్తునం
చనియె; మహాబలుండగుచు ♦ నద్భుతశక్తిని వెల్గుచున్న యా
దనుజుఁడు వజ్రదంష్ట్రుఁడు ని♦తాంతము కోపరసంబు పొంగఁగన్. ౮౫ 254

తే. ఘోరమై మాంసశోణిత♦సారభూషి
తనుగుపరిఘంబుఁ గైకొని ♦ తా వచించె;
ననుజసుగ్రీవయుతుఁడయి ♦ యా దశరథ
తనయుఁ డుండంగ నానిశా♦తరుణమందు. ౯ 255

క. *మనపురికి భీతితో వచ్చినదీనుండైన హనుమ♦చేత నయిన దే
మని యుగ్గడింపఁదగు నా,తనితో మన కేమిఫలము ♦ దయ కర్హుఁ డగున్.

చ. కనుక నె నే నొకండనె ని♦శామజవంబునఁ బోయి లక్ష్మణున్
వనచరనాథుఁ గూడి తగు♦వానిని రాముని నీమహాయుధం
బున వధియించి వానరులఁ ♦ బొంకము మాపియె వచ్చెదం జుమీ!
దనుజవిభూ! మఱొక్కనుడి ♦ తప్పక చెప్పెద నాలకింపుమా!. ౧౧ 257

సీ. నాపల్కు నుచితమై♦నన్ గ్రహియింపు ముపాయకుశలుఁడె తాఁ♦బగఱ నెల్ల
నప్రమత్తుండయి♦యనియందు నుజయించుఁ గామరూపులు భయం♦కరతనులును
శూరులు భీమదృ♦ష్టులు నగు రాక్షసుల్ నిశ్చితస్వాంతులై ♦ నిర్భయముగ;
వేలకొలందిగా ♦ విమలమానవరూపములఁ దాల్చి యారామ♦మూర్తికడకు

ఆ. సంభ్రమంబు లేక ♦ సరగునఁ జని; రాముఁ
గని సహోదరుండు ♦ క్ష్మాపతియును
నైన భరతుఁ డనుపఁ♦గా నిటకే మొల్ల
వచ్చితిమి; మహాత్మ! ♦ సచ్చరిత్ర!. ౧౮౫ 258

క. [మరలి పురంబును జేరెదు, తరుణం బిది వచ్చె వేగ ♦ దయచేయఁ దగున్
బరమాదృతి] ననఁదగు; భూ,వరుఁ డంతట సేన విడిచి ♦ వైళమ పోవున్.

*కిం వో హనుమతా కార్యం కృపణేన తపస్వినా-అనియూ.

చ. మన మిటనుండి శూలముల ♦ మర్దనశక్తిని మించుశక్తులన్
ఘనగదలన్ శరావళిని ♦ గార్ముకఖడ్గములన్ ధరించి వే
చనుదము; వ్యోమమార్గమున ♦ సంఘముగా నిలుచుండి భీమశ
స్త్రనిచయవృష్టిఁ బ్రస్తరవి♦తానవృష్టి నిగుడ్చి శూరతన్. ౧౬౹ 260

క. వనచరుల వారి నంద ఱిఁ, జనఁజేయుద మల్లధర్మ♦సదనంబునకున్;
మనపన్నినకృత్రిమమును, గనఁజాలక నమ్మినంత ♦ క్ష్మాపాలసుతుల్. ౧౭౹

ఆ. నీతిమాలి వార ♦ లాతఁడె దప్పక, ప్రాణములను విడువ♦రాక తప్పు;
దనిరొకఁ గుంభకర్ణు♦నాత్మజుండును వీరుఁ, డానికుంభుఁ డాగ్ర♦హమ్ము పొంగ.

క. తనవీర్యము గన్పడ ని, ట్లనియెను రావణుని గాంచి; ♦ యందఱు మీరిం
దు నిలిచి రావణుతో నే, పనిచేయక యుండ్రు గాక ♦ పనిపూని యిఁకన్.

క. చని నే నొక్కఁడనే రా,ముని లక్ష్మణు వనచరాళి♦ముఖ్యుని సుగ్రీ
వుని హనుమంతునిఁ దక్కిన, వనచరుల వధించి వేగ ♦ వత్తుం జుండీ!. ౨౦౹

క. *అని పలికె; నంతఁ బర్వత,తనుఁడై తగు వజ్రహనుఁడు ♦ తా నాలుకచే
తను నోరు నాఁకికొనుచున్, దనుజేంద్రాదులను జూచి ♦ త్వర నిట్లనియెన్.

క. మీ రెల్ల విగతసంభ్రము, లై రహిఁ స్వేచ్ఛఁగొని పనుల ♦ నాత్మహితములం
గోరి యొనరించుచుండుం, డే రయమున నొకఁడ నేగి ♦ యెల్లరఁ గపులన్.

క. తినివైచెద నిశ్చింతలఁ, గనుమనముల మీర లెల్లఁ ♦ గని మధుపానం
బున నలరుమద్యమును నే,పునఁ ద్రావుచు స్వస్థులగుచుఁ ♦ బొంగెదు వేడ్కన్.

తే. ఆడుచుందురు గాక స♦హాయతఁ జని
వనచరాధిపు లక్ష్మణు ♦ హనుమ నంగ
దునిని రణదుర్జయుని రాఘు♦వునిని జంపి
వచ్చెదను జూడుఁడీ! యనె ♦ బరవసమున. ౨౪ 268

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౯ - వ సర్గము.

మంత్రు లందఱు యుద్ధమును గోర విభీషణుఁడు వలదని నీతి చెప్పుట

సీ. అంత నికుంభుఁ డ♦త్యంతబలుండగు సూర్యశత్రుఁడు రభ♦సుండు యజ్ఞ
హుండును,సుప్తఘ్న♦కుండు మహాపార్శ్వుఁ డునుమహోదరుఁడను♦దనుజవరుఁడు
దుర్ధర్షుఁ డగ్నికే♦తుండును రశ్మికేతుఁడు మహాబలశాలి ♦ కడిఁది తేజ
మునఁగ్రాలురావణు♦తనయుఁ డయ్యింద్రజిత్తును బ్రహస్తుండును♦ఘనబలుఁడగు
వజ్రదంష్ట్రుఁడు నట్టి♦ వాఁడువిరూపాక్షుఁ డట్టి ధూమ్రాక్షుండు♦నతిబలులగు

తే. నట్టి యతికాయదుర్ముఖు ♦ లనెడివీర
దనుజు లందఱు పరిఘంబు♦లను మహోగ్ర

---

* క్రుద్ధః పరిలిహ న్వక్త్రం జిహ్వయా వాక్య మబ్రవీత్ -అనియూ.

పట్టనంబుల శక్తులఁ ♦ బ్రాసశూల
ములఁ బరశ్వథములఁ బూని ♦ బలము మెఱయ. ౩౹ 269

చ. శరములఁ జాపవర్యముల ♦ శాతనుహాత్తరఖడ్గసంతతిం
గరములఁ దాల్చి తేజములు ♦ గ్రాలఁగ రావణుఁ గాంచి కోపసం
భరితమనంబు లొప్ప నిటు ♦ పల్కిరి రాముని లక్ష్మణున్ గపీ
శ్వరుఁ బురి నేఁచినట్టి వన♦చారిని నీచుని వాయునందనున్. ౬ 270

క. చని యిపుడె చంపివత్తము;, అని పలుకుచు నాయుధాళి ♦ నందుకొనుచు నుం
డిన యలదనుజుల నిల్పుచు, వినయమునం గూరుచుండఁ ♦ బెట్టి నయమునన్.

చ. కరములు దోయిలించి దశ♦కంఠునిఁ గాంచి వచించె; [1]నాయనా!
నిరుపమసామదానములు ♦ నేర్పగుభేదమునాఁ జెలంగు ము
వ్వురుసల నీయుపాయముల♦భంగి లభింప నశక్యమౌపనిన్
బరుషతఁ బూని చేయుటకుఁ ♦ బాత్రములౌ సమయంబులన్ మహా
పురుషులు చెప్పినార లవి ♦ పోలునటంచు వచించి రార్యులున్. ౮ 272

సీసమాలిక:—

[2]మన మింక సామాదు♦లను బ్రయోగింపమి దండనంబున కిది♦తఱియె గాదు
పగవాఁడు దండ్యుఁ డె♦ప్పగిదిని గాఁడు రాక్షసనాథ! విషయసం♦సక్తులగుచు
బ్రజ్ఞయె లేకున్న♦వారియందును విరక్తులయందు సామంత♦బలసమాప
హృతులయందును లక్ష్మి ♦ యెల్లదైవప్రాతికూల్యమునం బోవఁ ♦ గొంకుచున్న
వారియందును మఱి ♦ బాలునియందు వృద్ధునియందు దీర్ఘరో♦గునిపయిఁ దన
దాయచే బలిమిమైఁ ♦ దఱుమంగఁ బడినట్టివానియందును భీరుఁ♦డైనవాని
యందును భీరుకుఁ♦డౌజనునందును లుబ్ధకునందును ♦ లుబ్ధజనని
యందు విరక్తుని♦యందుఁ బ్రాకృతునందు విషయాభిలాషల ♦ వెలయువాని
యందు దేవబ్రాహ్మ♦ణాళినిందకునందు బహుచిత్తమంత్రుఁడై ♦ పరఁగువాని
యందును దైవోప♦హతకునియందును దైవచింతకుఁడయి ♦ తనరువాని
యందు దుర్భిక్షముల్ ♦ వ్యసనముల్ బాధింప నడలెడునబలుని♦యందునొకని
యాదేశముననున్న♦యాత్మద్రునందును బహుశత్రుయుతుఁడగు♦వానియందు

1 అప్యుపాయై స్త్రిభి స్తాత-అనిమూ. 2 ప్రమత్తే ష్వభియుక్తేషు దైవేన ప్రహృతేషుచ, విక్రమా స్తాత సిధ్యంతి పరీక్ష్య విధినా కృతా-అనిమూ. ఈశ్లోకమునఁ బ్రతిపదమున కర్థము తెనుఁగునఁ జేర్పకున్నఁ దేటగ బోధపడదను నూహచే వ్యాఖ్యాతలు వ్రాసినయర్థ మెల్ల నీసీసమాలికయందు ననువదింపఁబడినది. ఎట్లన: ప్రమత్తేషు అనవధా నేషువిషయాసక్తేష్విత్యర్థః-అనివ్యాఖ్య. ఈయర్థమును దెనిఁగింపక ప్రమత్తునియందన్న నేమిబోధపడును. కాఁబట్టి యీయర్థమంతయుఁ దెనుఁగున నిమిడియున్నదని యెఱుంగవలయు.

సత్యధర్మంబుల♦సంగతి విడచిన యాదుష్టునందు న♦వైర్యవిధముల
నీతిశాస్త్రక్రమం ♦ బేతజీనై నను దప్పకుండఁగ సత్ప♦థమున వెలయు
నట్టిమంత్రులతోడ ♦ నాలోచనము సేసి తనవిక్రమము చూపఁ♦దగుననదియె
ఫలియించుఁ బూర్వోక్త♦పద్ధతుల్ గలవారితోడ సంధియె చేయఁ♦గూడదితర

ఆ. రిపులతోడ దండ♦రీతులు నుపయోగ,పఱుపఁ గూడ దవ్వి ♦ ఫలము నొందఁ
జాలవనుచుఁ బల్కి ♦ సచివులఁ గాంచి యి,ట్లనియె నీతిశాస్త్ర♦మును దలఁచుచు.

క. వినుఁ డప్రమత్తు విజిగీ,షుని, సుస్థిరబలుని, విజిత♦శూరుని జితరో
షుని నప్రధర్షు రాముని, నని మార్కొనఁ గోరెదరొకొ ♦ యాత్మల మీరల్.

క. [1]హనుమయును నదనదీనా,థుని ఘోరాకృతిని భూరి♦తోయధి నవలీ
లను దాఁటి దుష్కరంబగు,పనినొనరిచెఁ దలఁచునట్టి♦పనియే యిదియున్.

చ. దనుజవరేణ్యులార! బల♦దర్పము లత్యధికంబులై తగం
గనఁబడువైరులందు, నని ♦ గన్గొన కయ్యవి యల్పముల్ గదా
యనుచుఁ దటాలునం బలుక ♦ నర్హమె మీకు యశస్వియైన రా
మునిసతి రావణుండు మును♦ముందుగ బల్మిని దెచ్చినాఁడుగా. ౧౭ 276

తే. ఆజనస్థానముననుండి ♦ యుపహరించి, యతని కపకృతిఁ జేసె నీ♦యసురపతియె
కాని రాముఁ డొనర్చిన♦కార్యమెద్ది, [2]ఖరముఖులఁ జంప లేదనె♦దరొకొ మీరు.

మ. ఖరుఁడే ముందుగ శాస్త్రమార్గమును దాఁ ♦ గానంగలే కాతనిన్
మరణం బొందఁగఁ జేయఁ గోర నవనిలో ♦ మార్కొన్న వైరిన్ వధిం
చె తయంబొప్ప రఘూద్వహుండు కదా దే ♦ చింతింప దోషం బిదె
వ్వరునన్ బ్రాణులు ప్రాణరక్షణ మొన♦ర్పం బాడియౌనే కదా!. ౧౮ 278

క. అపకారం బొనరించిన,నృపతికళత్రాపహరణ♦మే యనుచిత మ
ట్లు పరస్త్రీసంస్పర్శన, మపకీర్తిం గల్గఁజేయు ♦ నాయువు నణఁచున్. ౧౯ 279

క. ధనమును క్షయింపఁజేయును, ఘనపాపపరావతార♦కల్ప మ్మగు దీ
నిని బట్టి చూడ మనకున్, జనకజవలనన్ భయంబు ♦ సమకుడు మిగులన్.

క. తరుణిం బల్మిన్ దెచ్చుట, పరికింపఁగ ముగిసె నిఁక ♦ ద్వరపడి యామెన్
మరలన్ విడువన్ వలయును, బరమపదార్థంబు విడువఁ ♦ బాడియె? యన్నన్.

---

1 కృతం హనుమతా కర్మ దుష్కరం తర్క్యతే వా-అనిమహా 2 ఖరవధ ఏవ ప్రథమాపరాధ ఇత్యాశంక్యాహ-అనివ్యాఖ్య. దీనినిటఁ దెనుఁగునఁజేర్పక పోయినచో సంబంధము చెడును. ఖరుని జంపుట రాక్షసాపకారము కాదా యను ప్రశ్న మేలేనపుడు ''ఖరో యద్యతివృత్తస్తు రామేణనిహతో రణే'' అనునది యసందర్భముగాఁ దోఁచును. కాన వ్యాఖ్యాకర్తలు సంబంధమును గల్పించుట వాల్మీకిభావవిరుద్ధముకాదు. వాల్మీకిహృదయము వారికిఁ దెలిసిన ట్లితరులకుఁ దెలియదు. మూలము పైన నీయర్థముచేసికొని తోఁచినట్లు తెనిఁగించినచో నది వాల్మీకిభావము కాదని యెవ్వరైన నాక్షేపించినపు డాకాశమును జూడవలసివచ్చును.

క. కలహము గల్పించెదు నే, బలవద్యత్నమును జేసి ♦ ఫలము గనఁగ నె
ట్టులగుర; విక్రమధర్మం,బులఁ దగు శ్రీరాముఁ డట్టి♦భూపాలకుతోన్. ౧౭॥

తే. నిష్ఫలంబగు వైరంబు ♦ నిర్నిమిత్త
మిట్లు కల్పించుకొనుటయె ♦ యెన్న యుక్త
మెంతమాత్రము గాదు వే ♦ యింతి నతని
*కిచ్చివేయుము నీతికి ♦ హిత మిది యగు. ౧౮ 285

క. కరిహయబహురత్నంబుల, నెరసిన లంకాపుర మిది ♦ నృపతియు బాణో
త్కరముల విదళింపక యుం,డ రమణి నాతని కొసంగు ♦ న్యాయము మీఱన్.

ఆ. అప్రధర్షమైన ♦ యాకపివాహిని, ఘోరభంగిమీఱఁ ♦ గూడి వచ్చి
మనపురంబుఁ జుట్టు♦కొనక పూర్వమె సీత, రామునకు నొసంగు ♦ రాక్షసేశ!.

క. రామునిప్రియపత్నిని నా, భూమిజఁ గొనిపోయి మనమె ♦ పోల నొసఁగమే
నీమనలంక నశించును, రామునిచేఁ బడుదు రుగ్ర♦రాక్షసు లెల్లన్. ౨౦ 286

[1] తే. తోడఁబుట్టినవాఁడవు ♦ గూడ దిట్టి
పని యటంచుఁ బ్రసన్నత ♦ గనుట కేను
బ్రార్థనము చేయువాఁడ నా♦పలుకొనర్పు
హితము పథ్యమునగుమాట ♦ నేఁ బలికెద. ౨౧ 287

[2] సీ. వనిత నాతని కిమ్ము; ♦ బాహుజతనయుండు శరదుగ్రభానుని♦కిరణనిభము
లై దృఢంబులునన♦వాగ్రపుంఖంబులు నయి యశనిఘనములగు♦నాశుగముల
నీమీఁద వైచుచు ♦ నినుఁ జంపఁబూనుచు గాన రామున కిమ్ము ♦ కాంత నీవు
ధర్మసుఖంబులఁ ♦ దా నాశనముచేయు నాగ్రహంబును వీడి ♦ యతులసుఖము

ఆ. యశము వృద్ధిఁజేయు ♦ నట్టిధర్మమ్ముఁ గొను
సుప్రసన్నుఁడవయి ♦ సొరిది నేన
బల్కినట్లు సేయ ♦ బంధుపుత్త్రాన్వితు
లమయి బ్రదికియుందు♦ము సుహి మనము. ౨౩ 288

క. కనుకన్ జానకి నిమ్మా!, యనుచు విభీషణుఁడు పల్కి ♦ నాదనుజేశుం
డనుజోక్తిని విని యందఱ, ననిపి నిజావాసమునకు ♦ నరిగెం దానున్. ౨౪

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

* దీయతా మస్య మైథిలీ-అనిమూ. లోపల రాక్షసులం గూర్చి చెప్పునట్లున్నది. ఇట రావణునిం గూర్చి చెప్పిన ట్లర్థమగును, అనఁగా వారిని సంబోధించి చెప్పుచు రావణునిం గూర్చియుఁ జెప్పఁబడెనని తెలియునది. 1 ప్రసాదయే త్వాం బంధుత్వాత్-అనిమూలమే పైయర్థమును దృఢపఱుచుచున్నది 2 పురా శరత్సూర్యమరీచి సన్నిభాన్-అనిమూ ఇట శరత్కాలసూర్యునిం జేర్కొనుటకు హేతు వేమనఁగా? శరత్కాలమున సూర్యుఁడు భూమికి సమీపముగనుండును. తులారాశి నీచరాశి యనుట కిదియే హేతువు. కాని నాకాలమున సూర్యకిరణములు తీక్ష్ణములయి సోఁకును అని యెఱుంగునది.

## ౧౦ - వ సర్గము.

విభీషణుఁడన్న యింటికిం బోయి దుశ్శకునములఁ దెల్పి సీతను రామున కిమ్మనుట

చ. తెలతెలవాఱినంత సుము♦తిం జెలువారు విభీషణుండు ని
స్తులతరధర్మమార్గములఁ ♦ దోఁచెడునర్థము నిశ్చయించి కొం
చలస్తుతరంబుగాఁ దగిన♦యట్టి హితంబును స్వాగ్రజన్ముఁడౌ
ఖలునకుఁ జెప్పఁబూనుభయ♦కార్యము చేయఁగఁ బూని యంతటన్. ౧

క. దనుజేంద్రుగృహంబునకుం, జనియెను; నాగృహవరంబు ♦ శైలశిఖరరీ
తిని నున్నతమై, పర్వత, ఘనశిఖరము లట్టిపెనుశి♦ఖరములు వెలయన్. ౧½

క. సువిభక్తమహాకక్ష్యము, ప్రవిమల,మతివిభవసూరి♦రాజనివాసా
ర్హావరమహావేదికమును, బ్రవరులు ననురక్తు లెల్ల ♦ పనులను నిపుణుల్. ౨½

క. మతిమంతులునగు సచివులు, సతతముఁ గాపాడుచుండఁ ♦ జంచద్రీతిన్
స్తుతిపాత్రంబై మకరి,వితతోచ్ఛ్వాసాళిమలిన♦విపులానిలమై. ౩½ 293

తే. శంఖఘోషమహానాద♦సహిత మగుచు
దివ్యవాద్యస్వనానునా♦దితదిగోఘ
మగుచుఁ బ్రమదాళిసంకులం♦బై, ప్రజల్పి
తజనసంకీర్ణఘంటాపథ♦ంబు నగుచు. ౪½ 294

సీ. నిర్మలహాటక♦నిర్వ్యూహనిబద్ధమై భూమణోత్తమగణ♦భూషితమయి
గానరత్నములఁ ♦ దానలరారుట గంధర్వవాసంబు♦కరణి, విభవ
సంయుక్తమగుట నిర్జరులస్థానమురీతి రత్నసమూహవి♦రాజమాన
మగుట భోగవతియ ♦ట్లలరుచు నుండెను నట్టిరావణుసౌధ ♦ మావిభీష

తే. ణుండు వీరుండు కాంతిమం♦తుండు స్వీయ
మైన తేజస్సు కిరణము♦లట్లు గాఁగ
భాస్కరుండు మహామేఘ♦పథముఁ జొచ్చు
కరణిఁ దాఁ జొచ్చె నుత్సాహ♦కలితుఁ డగుచు. ౫ 295

క. నిరుపమతేజుం డాతఁ డ,సురారిపతి కెంతొవిజయ♦శుభ మలరుటకై
సురరిపులు వేదవేత్తలు, వరుసం బఠియించుమంత్ర♦వరముల విని యోన్. ౬

*ఆ. మంత్రవేదవిదులు ♦ బ్రాహ్మణుల్ దధిపాత్ర
ములను మఱి ఘృతాక్ష♦తలను బూజి
తులయి యుండఁ గాంచె ♦ బలశాలి యవ్విభీ
షణుఁడు దనుజనాథు♦సద్మమందు. ౭ 297

తే. ఆమహాబాహుఁ డసురసం♦ఘాభిపూజ్యుఁ
డగుచు నిజతేజమున నొప్పి ♦ యంతరమున

---

* పూజితాన్ దధిపాత్రైశ్చ సర్పిర్భి స్సుమనోక్షతైః-అనిమూ.

కరిగి సింహాసనస్థుండై ♦ [1]యర్థనాథ
సహాజుఁడగు రావణునకుఁ దా ♦ సల్పె నతులు. ౧౧ 298

తే. సాంప్రదాయకములగు నాచారములను
జక్క నెఱిఁగినవాఁడౌట ♦ జయజయాభి
పూర్వకంబగు నాచార♦పూజ్యమైన
కృత్యమును సల్పె నన్నకు ♦ హితము మెఱయ. ౧౦౫ 299

క. దనుజేంద్రదృష్టిసూచిత,మును గాంచనమణివిలిప్త♦మును నగుపీఠం
బునఁ గూరుచుండె; నంత వి,జనమయి సచివైకయుక్త♦సంస్థానంబై. ౧౧౫

క. అలరారుచున్న యా పెను,కొలువున సుహితాత్ముఁ డగుచుఁ ♦ గొలువుండినయా
బలశాలి రావణుం గని, యులఘుసుహేతువుల నిశ్చి♦తార్థంబగుచున్.౧౨ 301

క. అతిశయహితమై తగువా,గ్విశతిం బలుకంగఁ బూనె; ♦ విధివిమాఱఁగ భూ
పతియెదుటఁ బల్కఁదగుపద్ధతి నెఱిఁగినవాఁడు కాల♦ధర్మముఁ దెలియున్.

ఆ. [2]దేశ మెఱిఁగి యెట్టి ♦ తీరునఁ గార్యంబు, ననుసరింపఁ దగునో ♦ యవ్విధంబు
నెఱుఁగు లోకమందు♦నిదిసుంచిదిది చెడు, గనుచు నెఱుఁగువాఁడు♦గాననతఁడు.

క. తనసోదరు స్తుతివచనము,లను జక్కఁ బ్రసన్నుఁ జేసి ♦ లలిఁగోకుల నా
తని కిట్లనియెన్; సీతయు, మనపురి నెత్తఱిని జేరె ♦ మానితశీలా! ౧౩౫ 304

క. అదిమొదలిప్పురి నశుభ,ప్రదములుగాఁ గనునిమిత్త♦రాజి కలిగెడున్
గద! యగ్నిహోత్రమున సమ్యుదమొప్ప హవిస్సు మేలి♦మంత్రయుతమగన్.

క. హోమము చేయఁగ నగ్నిక,ణాయుఁడితమగుచు ధూమ ♦ మంతటఁ గప్పం
గా మఱిమఱి చల్లారుచు,నే యుండును గాని మంప ♦ దెప్పటిరీతిన్. ౧౫ 306

ఆ. వంటప్రోయ్యలందు ♦ వైశ్వానరగృహంబు,లందు వేదపఠన ♦ ములవరించు
నట్టితావులందు ♦ [3]నాశీవిషంబులు, గనఁబడియెడు భీతి♦కరము లగుచు. ౧౬

క. హోమద్రవ్యంబులకుం, జీమలు పట్టెడిని; బాలు ♦ సేకురవు గదా!
భూమీశ! ధేనువుల న,శ్వాముగజంబులు గన విమ♦నములై కననౌ. ౧౬౫ 308

తే. స్వనము దీనము గాఁగ న♦శ్వమ్ము లార్చు
చును గడుం దృప్తి నాహార♦మును గ్రహింప
కున్న వివె యశ్వతరములు ♦ నుష్ట్రములును
ఖరములును రోమతతు లూడఁ♦గా వెతలను. ౧౭ 309

క. అనయము నశ్రుజలంబుల, గనఁబడుచుఁ జికిత్స లెన్ని ♦ గావించిన నై
నను ముందఱివలె నునకుం, గనఁబడకున్నయవి చూడఁ♦గాఁ గాకములున్.

1 పపందే ధనదానుజమ్-అనిమూ. 2 దృష్టలోకపరావరః-అనిమూ. 3 సరీసృపాణి దృశ్యం తే-అనిమూ. నపుంసకత్వ మార్ష మని వ్యాఖ్యాతలే వ్రాసిరి.

సీ. ఎచ్చటఁ గాంచిన ♦ దన్ని యోరీతుల గుంపులుగాఁ గూడి ♦ క్రూరములయి[గఁ
చెవులుచిల్లులుపోవఁ♦జెలఁగికూయుచు విమానాగ్రంబులందునో ♦యున్ననొకటి
గనుపట్టుచున్నవి; ♦ గ్రద్దలు పురమునఁ బ్రతిసద్మమునయుందుఁ ♦ బైనఁ బిండు
గట్టియున్నవి; వంచ♦కంబులు సంధ్యాద్వయంబునఁ బురిచెంత ♦ కరుగుదెంచి
తే. యశుభరవములఁ గూసెడు ♦ నల్లిమాంస
ము దిను క్రూరమృగంబులు♦ను దినదినము
పట్టణద్వారములఁ గ[illegible]ం♦బముగఁ జేరి
పిడుగువలెఁ గూయుచున్నవి ♦ పెనురవముల. ౨౧ 311
క. దనుజేంద్ర! వీనిఁ బట్టియు, ననయంబివి తెల్పు నపజ♦యము పురదహావం
బున మనకు స్పష్టమైనది, కనుకనె యీయశుభములకుఁ♦గాఁ బ్రాచితముల్.
క. పరికింప నిష్టపడి రఘు,వరుతరుణిని సురల నీయ ♦ వాంఛించుటయే;
సురవైరినాథ! కార్యపు,వరుసల నెఱుఁగకయె, బ్రదుకు♦వాంఛనో నేనుల్.
క. పలికినను గాని తప్పుగఁ, బలికితి నని యెన్నఁదగదు ♦ బహుభంగుల ని
మ్ముల నిరతము దుశ్శకునం,బులు గానంబడియె వీనఁ ♦ బొందెదు ఫలముల్.
చ. ఒకరికె కాదు రాక్షసుల♦యోషలకుల్ దనుజాళి కెల్ల లం
కకుఁ గడుభీషణాకృతిగఁ ♦ గ్రాలెడు వారికి దివ్యసౌధవా
సకలితరాక్షసాంగనల♦సంతతికిం విదితంబె మంత్రముం
దకలుషబుద్ధిశాలురు ప్ర♦హస్తముఖుల్ గలుగంగ నీ విటల్. ౨౪ 315
ఆ. పలుకనేల యన్నఁ? ♦ బరమమంత్రులు నీదు
మనసు నరసి దానిఁ ♦ గనుచు నడచు
కొనెడువారు తెలుపఁ♦గను జాలకుందురు
నీకు మాత్ర మేల ♦ యీకృతియన ౨౫ 316
క. అనుజుఁడను గాన విన్నది, కనినదియుం దప్పకుండఁ♦గాఁ జెప్పఁదగుల్
దనుజేంద్ర! నీవు న్యాయం,బును బూని మనస్సునందె ♦ పోలఁ దలఁచుచుల్.
ఆ. నిశ్చయించి దాని ♦ నెఱవేర్పఁదగు; నని,యువిభీషణుఁ డట ♦ నగ్రజునకు
*మంత్రితతులనడుమ♦మహితముహితమునౌ,వచనమిట్లుపలికె♦వాంఛమీఱ.
సీ. దనుజేశ్వరుం డిట్లు ♦ తద్దయు హితమయి మహితార్థమై వర్త♦మానభూత
భావికాలంబులఁ ♦ బరమశుభప్రదమయి సాంత్వపూర్వమై ♦ యరయ యుక్తి
యుక్తమై తగినస♦హోదరాలాపాళి విని మహోగ్రాగ్రహ♦మునను మండి
పడుచును దనదగు♦పట్టును వదలక యాతని కిట్లను ♦ ననుజ! నాకు
ఆ. నెవనివలనఁ గాని ♦ యేభీతి గనరాదు, సీత రామునకును ♦ జిక్కఁబోదు
మరల నెట్టులైన; ♦ మఘవుని దేవాళిఁ, గలిసి రాముఁ డిటకుఁ ♦ గడుజవమున.
క. చనుదెంచిన నామ్రోలను, నని నిల్వఁగఁ జాలఁ డింక ♦ నని యెటు సేయుల్

* ఇతి స్మమంత్రిణాం మధ్యే-అనిమా.

జనకజ నవ్విధిఁ గైకొను,ననియెను [1]సురసైన్యనాశ♦కాతిబలంబున్. ౨౮ 320

ఆ. చండవిక్రమంబు ♦ మెండుగాఁ గల్గిన, రావణుండు నిట్లు♦రవడిఁ బలికి
యాప్తవాదియైన ♦ యనుజు విభీషణు, నింటి కనిపె బథ్య ♦ మెఱుఁగలేక. ౨

పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧ - వ సర్గము.

మరల మంత్రాలోచనము చేయ రావణుండు కొలువున కేతెంచుట.

చ. దనుజవరుండు రావణుఁడు ♦ తా సహజంబుగఁ బాపచిత్తుఁడౌ
జనకజయందుఁ బ్రేమము నె♦సంగెడుమోహము దన్నుఁ దద్వశం
బున ననుపంగ మిత్రు లోగిఁ ♦ బొందుగఁ జెప్పిన నీతివాక్యముల్
వినమిని వా రనాదరము ♦ వేయివిధంబులఁ జూప సీతఁ దె
చ్చిన యఘకార్యయోగమునఁ ♦ జింతను బొంది తపించె నయ్యెడన్. ౧ 322

ఆ. మంత్రయోగ్యమౌ స♦మయము దాఁటినమీఁద
ననికిఁ దగినకాల ♦ మంత రాఁగ
సచివమిత్రవర్య♦సహితుఁడై యోజింప
నదియె యుక్తకాల ♦ మని తలంచె. ౨ 323

క. దనుజేంద్రుఁ డమ్మహారథుఁ, డనూనవరహేమజాల♦మై విద్రుమపం
క్తిని మణిగణమున భూషిత,మును శిక్షితవాజియుక్త♦మును నగురథమున్. 3

క. వలగొని యారోహించెను, వెలసెడు ఘనమేఘరవము♦విధమున బహుభం
గుల మ్రోయురథము నెక్కుచుఁ, బలాధిపతి వేగ చనె స♦భకు యోజింపన్.

క. వాలును బలుకయుఁ గొందఱు, దాలిచి సర్వాయుధములఁ♦దగఁ గొందఱొగిన్
దాలిచి రావణుముందటఁ, జాలఁగఁ గ్రవ్యాదవీర♦సత్తములు చనన్. ౫

చ. దనుజులు కొంద ఱంత వివి♦ధంబులుగాఁ గనుపట్టుసొమ్ములం
దనువుల నిండఁ దాల్చి వికృ♦తంబులుగా బహువేషముల్ తగన్
దనుజమహేంద్రుపృష్ఠమును ♦ దారుణరీతిని బార్శ్వసీమలన్
జనిరి; మదేభజాలముల ♦ శౌర్యములం దగ నెక్కి దానవుల్. ౬ 327

క. అరదంబులు నతిరథులును, దురగంబులఁ గొంద ఱెక్కి ♦ తోఁచినరీతిన్
సురుచిరరీతులఁ దేలుచు, నరిగిరి రావణునివెంట ♦ నానభ కెలమిన్. ౭ 328

క. పరిఘంబులు గదలును దో,మర,శక్తి,పరశ్వథములు ♦ మఱియును బెక్కౌ
పరికరములఁ దాల్చి మహా,సురు లెందఱొ చనిరి దనుజ♦శూరునివెంటన్. ౮

క. రావణుఁ డాసభ కరుగం, గా వేగమ వేలకొలఁది♦గా శంఖమహా
రావము లాదిగ వాద్యపు,రావము లొక్కటఁ జెలంగె ♦ రమ్యతమములై. ౯

---

1 ఇతీద ముక్త్వా సురసైన్యనాశనః-అనిమూ.

ఆ. అమ్మహారథంబు ♦ హరినేమిధ్వాన
మఖిలదిక్కులందు ♦ నావరింప
సిరులు గులుకుచున్న ♦ వరరాజమార్గంబుఁ
బొందె, నపుడు దనుజ♦పుంగవుఁడయి. ౧౦ 331

క. అలరువిమలాతపత్త్రము, వెలయుచు నుండె నటఁ బూర్ణ♦విధుచందమునన్
గలితహిరణ్మయమంజరు, లలరెడుగర్భములు గల్గి ♦ యండము లగుచున్.

ఆ. మంచిస్ఫటికమట్టు ♦ లంచితాకృతు లొప్ప
వెలయుచామరములు ♦ లలి వెలుంగు
చుండెఁ బార్శ్వములను ♦ నుగ్రరాక్షసు లెల్ల
ధరణినుండి భక్తి♦తనరుచుండ. ౧౨½ 333

చ. కరములు మోడ్చి యాదనుజ♦కాంతు రథస్థుని రావణుం దగన్
శిరములు వాల్చి మ్రొక్కి రటఁ ♦ జేరి పరాక్రమవంతుఁడై రిపూ
త్కరములఁ జెండురావణుఁడు ♦ కర్బురు లెల్ల జయస్వనంబులం
బరఁగెడు దీవనల్ వెలయు♦భంగి నుతింపుచు నుండ వేడుకన్. ౧౩½ 334

క. సురుచిరవిధినిర్మితమై, యరుదగునానభను జేరె; ♦ నయ్యదియు హిర
ణ్యరజతవిపులస్థూణో,త్కరమున నలరారుచుండెఁ ♦ దన్మధ్యధరన్. ౧౪½

సీ. పరిశుద్ధతరములౌ ♦ స్ఫటికముల్ పఱచిన తావులు కనువిందు♦గా వఱలుచుఁ
గనుపట్టుచుండె; బం♦గరురంగుపూసిన పట్టువస్త్రము క్రిందఁ♦బఱువఁబడఁగ
నలరారుచుండెను; ♦ *నాఱునూర్లపిశాచములు దానిరక్షణ♦మున నెసంగు
చుండె; నాగురు తేజుఁ ♦ డొయ్యన విశ్వకర్మరచితతత్సభా♦మందిరమును

తే. జొచ్చె; వైడూర్యమయమయి ♦ సురుచిరమయి
తనరుసింహాసనం బొండు ♦ దానిమీఁదఁ
బ్రియకమృగచర్మ మొక్కండు ♦ వెలయ దిండొ
కటియుఁ బొలుపార నాసభ ♦ కడు వెలయఁగ. ౧౬ 336

క. దనుజేంద్రుఁడు తద్భవనం,బును జొచ్చి మహాసనమునఁ ♦ బొందుగఁ గూర్చుం
డెను; నంత నతఁడు శీఘ్రము,గను బోవం గలుగుభటులఁ ♦ గని మీ రిపుడే.

చ. చని పురమందుఁ గల్గు దను♦జప్రకరంబును దోడితెండు శ
త్రునికరమారణంబు నిఁకఁ ♦ దోడనె చేయఁగ నర్హమైన య
ప్పని యిపుడుద్భవించినది ♦ బాగుగ నిశ్చయ మొప్పఁ జేయఁగా
మనదనుజుల్ సమర్థు లను♦మానము లేదిఁకఁ బొందు మీరనన్. ౧౭½ 338

తే. రాజధర్మార్హమగుభంగి ♦ రావణుండు
తమకు నాజ్ఞ యొసంగ నా♦దనుజు లెల్ల

* తాం పిశాచశతై ష్షడ్భి రభిగుప్తాం సదాశుభాం.-అనిమూ.

చని విహారస్థలంబుల ♦ శయనగృహము
లందు నుద్యానములయందు ♦ నలరువారి. ౧౯ 339

చ. దనుజుల నిర్భయంబుగను ♦ దా రొగిఁ దోడ్కొని రాఁగ లంకలోఁ
గనఁబడు గేహరాజికిని ♦ గ్రన్ననఁ బోయిరి; వారిచేత నా
దనుజమహేంద్రునాజ్ఞ విని ♦ దానవవర్యులు కొంద ఱప్డు స్వం
దనవరరాజిఁ గొందఱు ని♦తాంతము ద్రొవ్వినఘోటకంబులన్
ఘనగజరాజిఁ గొందఱును ♦ గ్రాలుచుఁ బోయిరి తత్సభం గనన్. ౨౧ 340

తే. కాలినడకను గొందఱు ♦ కడురయమునఁ, జనిరి; రథవాజికుంజర♦సరసగతుల
నప్పురం బప్డు కూడి వి♦హంగసంఘ,యుక్తపుష్కర మట్టుల ♦ నొప్పియుండె.

క. దనుజేంద్రు లంతఁ దమవా,హనములఁ బలుయానములను ♦ నంద నిలిపి కా
లినడకల సభను జొచ్చిరి, ఘనగిరిగుహఁ జొచ్చుసింహ♦కాండము వోలెన్.

ఉ. దానవనాథుపాదములఁ ♦ దా రొగిఁ దాఁకుచు మ్రొక్కి వారలన్
మానితరీతి సత్కృతుల ♦ మన్ననఁ దన్పి పురోహితాదులన్
జానగుస్వర్ణపీఠముల ♦ సంతతవేదపురాణచింతన
శ్రీనిధులన్ గుశాజినవి♦చిత్రతరాసనరాజి భక్తితోన్. ౨౪ 343

తే. అన్యులను రత్నకంబళీ♦మాన్యధరణిఁ
గూరుచుండ నియోగించె; ♦ క్షోణినాథు
శాసనంబున నాతని♦సరసఁ గూరు
చుండి; రంతట నాసభా♦మండపమున. ౨౫ 344

సీ. కార్యనిశ్చయమునఁ♦గడుఁబండితులుముఖ్యులగుమంత్రులును,సద్గు♦ణాళిమిగుల
నలరారి సర్వజ్ఞు♦లై బుద్ధిచక్షుస్సులైన యమాత్యులు ♦ నందఱు శత
సంఖ్యలు గూడిరి; ♦ శౌర్యధనాఢ్యులు పదుగురు కార్యంపుఁ♦బద్ధతులను
దెలిసి వానికి క్షేమ♦ములఁ గూర్పు హాటకమయమైన తత్సభా♦మందిరమునఁ

తే. జేరి [యారాక్షసశ్రేష్ఠుఁ ♦ జిత్తమలరఁ
గొలుచుచుండిరి] చక్కని♦ఘోటకములఁ
బూన్పఁ జెలఁగుచు నవయవం♦బులు సువర్ణ
చిత్రితములుగఁ దగురథ♦శ్రేష్ఠ మెక్కి. ౨౬ 345

చ. నిరుపమకీర్తి నొప్పి యతి♦నిర్మలచిత్తము సాధువర్తనా
దరమును బూనియుండ నల♦దానవనాథునిసోదరుండు సా
ధురతి విభీషణుండు తన♦తో దనుజేంద్రులు రాఁగఁ బోయె మం
దిరమున, కంత నాతఁడు మ♦దిన్ భయభక్తులు గూడి యొప్పఁగన్. ౨౭

క. తనపేరు చెప్పి తమి నం,దన మొనరిచె నన్న కప్డు ♦ తారు ప్రహస్తుం
డును శుకుఁడు వందనము లిడి;, రనుజాదుల కాసనముల ♦ నర్హములఁ దగన్.

క. దనుజేంద్రుఁ డొసఁగె; నక్కాలు,వున నానావిధసురత్న♦భూషణములఁ జ
క్కనియంబరములఁ దాలిచి, దనుజు లగరుముఖ్యవస్తు♦తతగంధంబుల్. ౩౦

*చ. తనువులనిండఁ బూసికొని ♦ దానుములం గడుఁ దాల్చియుండఁ జ
క్కనిదగు తత్సువాసనల ♦ గాఢముగా సభ నిండియుండె; నం
త నచట నెవ్వఁడైన నన్పృ♦తంబును బల్కఁగ లేదు నద్దుసే
యను బరికింపలేదు తమ♦యాశయముల్ తెలియంగ నన్ననొ
ధ్వనులఁ బరస్పరం బొకటఁ ♦ బల్కఁగ నూల్కొనలేదు సుంతయున్. ౩౧

తే. ఎల్లవారును సిద్ధార్థు♦లే యయి తమ
వీర్య మలరఁగ నుండిరి ♦ విభునివంక
దృష్టిఁ బఱపిరి, పిదప బు♦ద్ధిబల మొప్పఁ
బౌరుషము మీఱ నలరురా♦వణుఁడు పూన్కి. ౩౨ 350

తే. శస్త్రములఁ దాల్చి ధీరత ♦ సాప్వంతములు ద
గంగ బలవంతులయి యున్న ♦ గర్బురేంద్రు
లలరునభ వారినడుమ దే♦వాధిపతివి
ధమునఁ దనకాంతిచేఁ బొల్చె ♦ నమలరీతి. ౩౩ 351

పదునొకండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨ - వ సర్గము.

రావణుఁడు మంతనము సల్పఁ గుంభకర్ణుఁడు తన శక్తిని దెల్పుట.

చ. అని జయమొందు రావణుఁ డ♦హార్యబలుం డొగి నామహాసభం
గని యట నున్నసైన్యపతిఁ ♦ గాంచి భటాధిప! చాపవిద్యయం
దనుపమశక్తిగల్గిన భ♦టావళి నాశ్వికహస్తిపవ్రజం
బును రథికాళిఁ బట్టణముఁ ♦ బూనికఁ గావఁగ నాజ్ఞ సేయుమీ. ౨ 352

క. అని యానతి యియ్యఁగ నా,తనిప్రీతికిఁ బాత్రుఁడైన ♦ తద్భటనాథుం
డును బుద్ధినిశ్చయంబునఁ, దనవిభునానతి యొనర్పఁ ♦ దాఁ గోరి తగన్. ౩

క. దనుజేంద్రునిసౌధమునకు, మునుకొని లోపలను బాహ్య♦మునఁ గాపుంచెన్
ఘనయోధుల; నంతఃపుర,మును గావఁగ సేనఁ గొంత ♦ ముందుగ నిలిపెన్.

చ. బలముల నిట్లు నిల్పి భట♦వారవిభుండగు నాప్రహస్తుఁడు
జ్జ్వలబలశాలి యాదనుజ♦వర్యునిసన్నిధి కేగుదెంచి యి
మ్ముల నిటు పల్కె; సేనలను ♦ ముందుగ సౌధము గావ లోపలన్
వెలుపలఁ గాపువెట్టితిని ♦ విక్రమ మొప్ప స్థిరత్వబుద్ధితోన్. ౫ 355

---

* న చక్రుశు ర్హ్యానృత మాహ కశ్చిత్-అనియూ.

చ. ఒనరుప యోగ్యమైన పని ♦ నొయ్యనఁ జేయుము; కార్యసిద్ధి నీ
కొనరెడుఁ గాత; మంచనెడు♦యోధవిభూత్తముపల్కు రావణుం
డనయము రాజ్యసమ్మదము ♦ నారయుచుండెడువాఁడు గావునన్
విని సుఖలాభకాంక్షను ♦ వేడుకఁ గోరి సుహృద్వచంబుతోన్. ౯౯ 356

సీ. [1]ఈరీతి వచియించె; ♦ నెప్పుడు ధర్మార్థకామంబులం దెద్ది ♦ కాంక్షనీయ
మనుసంశయము మనం♦బునఁ గల్గునప్పుడు వానిసేవించుట♦వలనఁ గలుగు
నట్టిప్రియం బప్రి♦యంబును సుఖదుఃఖములను లాభాలాభ♦ముల హితాహి
తముల నెఱుంగ న♦త్యంతసమర్థులు గావున మీరిట్టి♦కష్టవిషయ
ఆ. సంశయములఁ దీర్పఁ♦జాలుదు; రెల్లవిధములఁ జక్క నెంచి ♦ తగినరీతి
మొదలుపెట్టినట్టి ♦ ముఖ్యకార్యంబులు, విఫలమగుట లేదు ♦ వినుఁ డెపుడును.

క. సురపతి రవిచంద్రాదిఖచరతారలతోడ దేవ♦సంతతితోడన్
గర మరుదుగఁ గూడి జయేందిరఁ గనుగతి విమ్ముఁ గూడి ♦ నేఁగనుదు సిరిన్.

క. మునుపే యీవిషయము మీకును జెప్పఁ గడంగినాఁడ ♦ [2]కుంభశ్రవుఁ డీ
ఘనబలుఁ డప్పుడు నిద్రం గనుచుంటఁ జెప్పలేదు ♦ గతవృత్తములన్.

చ. ఘనబలశాలి శస్త్రధర♦కాండపురోగతుఁ డీతఁ డౌను నా
యనుజుఁ డితండు నిద్రగనె ♦ నాఱ్నెల లిప్పుడె లేచినాఁడు; కా
వునఁ దెలుపంగ నత్తఱిని ♦ బూనిన శక్యము గాకపోయె; సం
చని యలకుంభకర్ణుఁ గని ♦ యాజనకాత్మజ రాముపత్నినిన్. ౧౧౪ 360

సీ. [3]ఈసీత మనవార ♦ లెల్లరుఁ జరియించు దండకాటవినుండి ♦ తరుణమునకు
వేచి తెచ్చినవాఁడ ♦ వినవయ్య యమ్మందగామిని నేనెంత ♦ కరుణ వేఁడి
నను నన్నుఁ దేల్ప శ♦య్యను జేరకున్నది యంగీకరింపదే ♦ నామె విడువ
నగుఁ గదా యనెదవో?♦యామెకుముల్లోకములయందు సాటియౌ♦వెలఁది లేదు
తే. నాదునాశయు మిదియె యా♦నారి సూక్ష్మ
మధ్య, సుశ్రోణి, శారద♦మహితచంద్ర
బింబవక్త్రయు, హాటక♦బింబతుల్య
యునయి శుభలక్షణాళిచే ♦ నొప్పుచుండు. ౧౩౪ 361

క. తనశక్తిఁ జూపఁగా మయ, దనుజుఁడు చిత్రముగఁ జేయఁ♦దగు మాయవలెన్
గనుపట్టుచుండు నెట్టఁగఁ, దనయడుగులు వెలయ నామె ♦ తనరెడుఁ జుమ్మీ.

క. మెత్తనిసమతలపదముల, నత్తరుణి వెలుఁగ నామె ♦ నరుణాంఘ్రుల నేఁ
జిత్తం బలరఁగఁ గాంచిన, నుత్తలపాటొందు ప్రేమ ♦ మొక్కవిధమునన్.

---

2 ధర్మకామార్థకృచ్ఛ్రేషు యూయ మర్హాతి వేదితుమ్-అనిమూ. 2 కుంభశ్రవుఁడు=కుంభకర్ణుఁడు. 3 సా మే న శయ్యా మారోఢు మిచ్ఛత్యలసగామినీ-అనిమూ. ఇట మహేశ్వరతీర్థుల విశేషార్థము సంక్షిప్తము.

చ. అనలునియందు వేల్వఁ గడు ♦ నద్భుతరీతి జనించుజ్వాలరీ
తిని, శతపత్త్రమిత్త్రగురు♦దీప్తివలెన్ గనుపట్టుచున్న యా
జనకజఁ గాంచి నే మనసి♦జప్రియసేవకు లొంగినాఁడ; ని
క్కనఁ జెలువారునాసికయుఁ ♦ గోమలదీర్ఘఘనోజనేత్రముల్
గనదురువక్త్రమున్ వెలయుఁ♦గాఁ దగు సీతను జూచి నేఁ దమిన్. ౧౬ 364

[1]క. స్మరువశము నొందినాఁడనె, నిరతం బవశుండ నగుచు; ♦ నిక్కము మదనుం
డరయఁగ నెవ్వని నైనను, ధరఁ [2]క్రోధానందసమతఁ ♦ దా బాధించున్.

సీ. అంతరాత్మను గల్గి♦నట్టి తాపంబున బడలినవానిని ♦ బట్టి శోక
సంతాపములు లేని♦స్వాంతముగలవాఁడు గాన నేఁ చుచునుండు ♦ నేను నతని
బాధలఁ జిక్కితి; ♦ భామినిపైఁ బ్రేమ యనివార్యమేని నె♦క్లైన దానిఁ
బట్టి సుఖింపుమా ♦ పలుపల్కు లేలయం చనియెదవేమొ యా♦యసితనయన

తే. [3]భర్తరాకను గోరి సం♦వత్సరంబు
గడువు నను వేఁడె నవల నా♦కాంక్షఁ దీర్పఁ
గలదటంచును నమ్మితిఁ ♦ గాన నేను
నాసరోరుహనేత్రయం ♦ దాదరమున. ౧౮ 366

క. పరవశుఁడనె కావున నా, తరుణీమణిశుభవచఃక♦దంబము విని య
క్కరణినె కాని మ్మంటిని, బరికింపఁగ దూర మరిగి ♦ బడలుహాయమువాన్.

క. మారునివ్రేటులబడలితి; నా రాముఁడు లక్ష్మణుండు ♦ నాత్మబలయుతిన్
వే రానుండఁగ నీకెటు, లీరమణియుఁ దక్కు ననెద♦వేమో వినుమా !.

క. జలనిధియక్షోభ్యమె యౌఁ, గలవందుఁ దిమింగిలాది♦కంబులు సత్వం
బులు పెక్కు దాని నీకోఁతులు రాఘవు లెట్లు దాఁటు♦దురో తెలియఁజుమీ.

చ. వనచరుఁ డొక్కఁడే యిటకు ♦ వచ్చి మహాద్భుతయుద్ధకృత్యమున్
దనుజులతో నొనర్చెను గ♦దా మఱి కార్యము లెట్లు సాగునో
యనుట యెఱుంగరానిదగు ♦ నంతయునుం గుమిఁగూడి చెప్పఁడీ
మనములఁ దోఁచినట్లు లను♦మానము నొందక నాకు నిత్తఱిన్. ౨౧ 370

చ. దనుజవరేణ్యులార! మీముఁ ♦ వత్సనుయంబున సాయమే నొగిం
గొని సురదైత్యయుద్ధమున♦కుం జని గెల్పునె పొందినాఁడ నా
కు నిపుడు మీరు సట్టులె యు♦కుంఠితశౌర్యముతో సహాయులే

1 కామస్య వశ మీయివాన్-అనిమూ. కామవశంగతుఁడ నైతినా యని కాకువు. ఈయర్థ మిట గుప్తము. 2 క్రోధహార్ష సమా నేన-అనిమూ 3 సాతు సంవత్సరం కాలం మా మయాచత భామినీ-అనిమూ. ఇదం చాలోష్యోక్తం వస్తుతో రావణేనైవ తథాప్రతిజ్ఞానాత్-అనివ్యాఖ్య. ఇచటఁ గుంభకర్ణుఁడు తనమాట కేమి యుత్తరము చెప్పునో యని సంశయించి సీత యొకసంవత్సరకాలము గడు డిగినదని యసత్యము చెప్పుచు రావణుఁడు తనపాపబుద్ధిని వ్యక్తీకరించుట యిట గ్రాహ్యము.

గనుక సురేశుపొంగడిచి ♦ త్రాలెడునాకు మనుష్యభీతి లే
దనుటయె నిక్కువం బయిన ♦ నందఱు నెంచి విమర్శచేయుఁడీ!. ౨౨౪ 371

క. వననిధియవ్వలితీరం,బున రాఘవులు కపిసైన్య♦ముల సుగ్రీవా
దినిఖిలకపివర్యులఁ దో,డ్కొని సీతవసించునచ్చో♦టును దెలియుటచేన్. ౨౩

ఆ. విడిసియున్నవారు; ♦ విడియుటచేతనే, మనకు భీతియేల? ♦ దనుజులార!
మిమ్ముఁ జెప్పఁ డన్న ♦ మేలివార్త వినుండు, సీత నొసఁగకుండ ♦ నీతటి నని.

[1]క. మనుజేంద్రుల నాయిరువుర, ఘనశౌర్యము మీఱఁ జంపఁ♦గా నెబ్బంగిన్
గనఁబడునుపాయ మది మీ, మనములలో నెంచి చెప్పుఁడ ♦ మంచిది నాకున్.

చ. వననిధి దాఁటుశక్తి రఘు♦వర్యుల కిచ్చటిశూరులన్ జయిం
పను భుజశక్తి లేదనినఁ ♦ బార్థివమిత్రున కేనికైన నుం
డిన నటులుండవచ్చును న♦నిన్ గడు నంచు వచింతురేమొ యా
వనచరసంతతిం గలిసి ♦ వార్ధిఁ దరించుచు లంకఁ జేరఁగన్. ౨౫ 375

[2]తే. రామునకె కాదు మఱి జగ♦త్త్రయమునందు
నెవ్వనికి సాధ్యమే కాదు ♦ హితమనీషు
లార! కావున విజయంబ ♦ సారభుజుఁడ
నైన నాకుఁ జెలంగు నం♦చనియె నంత. ౨౬ 376

[3]క. స్మరవికృతిపరీతాత్ముం,డు రహితబుద్ధియగు నతఁ డి♦టుల్ పల్కిన నా
పరిదేవనంబు విని ని,ర్భరకోపము నొంది మిగులఁ ♦ బంతము మీఱన్. ౨౭

తే. కుంభకర్ణుండు పలికె; నీ♦కోర్కిరీతి
నీవె లోలోన నెంచి యా♦నృపతనయుల
సాయముగనున్న సీతను ♦ సరభసమున
బల్మిఁ గొనితెచ్చితివి గాదె ♦ పౌరుషమున. ౨౮ 378

సీ. అప్డు మాతోడ ని♦ట్లని చెప్పియుండిన యమున యామునమను♦నద్రి నొందు
నట్లు నిశ్చింతగ ♦ నాత్మ యుండును గదా యపుడె యోజించిన ♦ నగు ఫలంబ
దేమని యందువా ♦ యోమహారాజేంద్ర! యీమంతనం బెల్ల ♦ నింతిఁ బట్టి
తెచ్చుటకును ముందె ♦ యిచ్చటమాతోడఁ జేసియే యుండినఁ ♦ జిక్కు లేక

తే. చక్క నెఱవేఱియుండు; ద♦శవదనా! యె
వండు మునుముందె యోజించి ♦ పరఁగ న్యాయ

1 అదేయా చ యథా సీతా నశ్యా దశరథాత్మజౌ-అనిమూ. వాస్తవార్థే అవధ్యా వితి ఛేదః=-అని తీర్థులు. ఈయర్థము పద్యమున "చంపఁగా నెబ్బంగిన్ గనఁబడునుపాయము? అని కాకుస్వరముగా నన్వయించుకొనవలయు. అపు డాయర్థము స్ఫురించును. అనఁగా రామలక్ష్మణులఁ జంపఁదగునుపాయము కనఁబడదే, అని రావణునిభావము. 2 నిశ్చయేన జయో మమ-అనిమూ. న జయో మమ-అని మహేశ్వరతీర్థులయర్థము. అది యిట విగతజయ మనియు, అసారభుజుఁడనైన అనియు నర్థముగ్రహించినఁ దోఁచునని గ్రహింపవలయును. 3 నిశమ్య పరిదేవితమ్-అనిమూ.

మును గనుంగొని యారీతి♦గను నరపతి
కార్యములఁ జేయునో యట్టి♦ క్ష్మావిభుండు. ౨౯½ 379

క. తనమనసు కార్యనిశ్చయ,మును బొందుటఁ జింత లేక ♦ మోదము వెలయం
గను దాప మొందకుండును;, విను మనుపాయమునఁ గార్య♦విధుల నొనరుపన్.

క. విపరీతముగ నొనర్చిన, నపవిత్రుల కిడఁగఁబడెడు♦హవిసువిధముగా
నపగతఫలములె యగు మఱి, నపాపఫలదంబులగును ♦ సత్యము సుమ్మీ. ౩౧

*క. మును జేయఁదగినమంత్రం,బును గార్యాంతమున, మంత్ర♦మునకుం దరువా
తను, జేయఁదగినకృత్యం, బును ముందుగఁ జేయఁ గోరు♦పురుషుఁడు జగతిన్.

తే. న్యాయ మన్యాయ మిదియని ♦ యాత్మ నెఱుఁగు
వాఁడు గాఁడు సుమీ; బల♦వంతుఁడైన
యరిని మార్కొని గెలవరా ♦ దని యెఱింగి
యతఁడు చపలుండె యైనచో ♦ నతనిరిపులు. ౩౨½ 383

ఆ. అవసరంబుఁ గాంచి ♦ యాతనిపైఁ బడి, క్రిందుపఱతు రట్టి ♦ క్షితిధ రేంద్ర
మయి యలంఘ్యమైన ♦ యాక్రౌంచగిరి రంధ్ర,మయినవెనుక హంస♦లరిగినట్లు.

[1]చ జనకజఁ దెచ్చినట్టిపని ♦ చాల నపాయకరంబె దానిని
మును మది నెన్నకే త్వరను ♦ బూని యొనర్చితి విట్టిరంధ్రముం
డిన నినుఁ దా నెఱింగియును ♦ నీదగుభాగ్యముచేతఁ జంప కా
మనుజవరుండు పోవిడిచె ♦ మాంసమునన్ విషయుక్తమున్ వలెన్. ౩౪ 385

చ. జరిగినకార్యముం గుఱిచి ♦ చాలఁగఁ జింత యొనర్ప నేమి యు
త్తరుణమునందుఁ జేయఁదగు♦దానిని నెంచు మటందువేమొ యి
క్కరణి నసర్హ కార్యమును ♦ గావనకే యొనరించినావుగా
యరయఁగ నాకుఁ దక్క నొరు ♦ లర్హులె దానిని జక్కఁ జేయఁగన్. ౩౪½

చ. అనఘ! భవద్రిపువ్రజము ♦ నారసి చంపి విచార మీవు పొం
దనియటు చేయువాఁడ; విను ♦ త్వద్రిపులం బరిమార్చి నీమనం
బునఁ గల చింతమాన్పదను ♦ భూతభయంకరులైనవారి నీ
వని మొనఁ గెల్వఁజాలుదువె ♦ యందువొ యేమొ మహీశపుంగవా!. ౩౫½

చ. పరులగువారు దేవపతి,♦భాను,ధనంజయ,యక్షరా,ణ్మరు,
ద్వరుణుల నెవ్వరైన నని ♦ వారలతో నొనరింతు నేను, భూ
ధరసమకాయు మొప్పఁగ ను♦దాత్తమహాపరిఘంబుఁ బూని, భీ
కరతరదంష్ట్రలం బెలుచ ♦ గర్జిలుచున్ బవరంబు సేయ నన్
సురపతిగూడఁ గాంచి తన♦శూరతఁ దక్కి భయంబు నొందుఁగా. ౩౬½ 388

---

* యః పశ్చాత్పూర్వకార్యాణి కర్మాణ్యభిచికీర్షతి, పూర్వం చాపరకార్యాణి న స వేద నయానయౌ-అనియు. 1 దిష్ట్యా త్వాం నావధీద్రామో విషమిశ్ర మివామిషం-అనియు.

చ. మనుజవిభుండు రాముఁ డొక♦మార్గణముం బరఁగించి యింక నొ
క్కనిశితబాణ మేయఁగను ♦ గాక్కక మొయ్యనఁ దీడునంతలో
వినుము తదీయులౌ ప్లవగ♦వీరుల వారిఁ బట్టి రక్త మొ
య్యనఁ దమిఁ ద్రాగు నాఁడ నిఁక♦నైన మనంబున నూఱడిల్లుమా! ౩౮౪ 389

సీ. [1]అరివధంబున ననా♦యాసంబుగా నీకు జయముఁ గూర్పఁగ నేను♦జాలువాఁడ
నే, రాము మార్కొని ♦ యెలమి లక్ష్మణునిని వనచరవర్యులఁ ♦ బట్టి తినఁగ
వాంఛింతు, నట్టు లీ♦వరుసఁ గార్యంబును జేయఁజాలుదు నిఁకఁ ♦ జింత యేల?
నాచేత నెట్టు లా♦నరపతి చచ్చును నీకజయంబు న♦ట్లే కలుగును

ఆ. నవల సీత యశని ♦ కవశయా నీవింక, పంచిసురను ద్రాగి ♦ మించు వేడ్కఁ
గేళి సల్పు మెలమిఁ ♦ గృత్యంబు లెన్నేని, చేసికొనుము చాల♦శీఘ్రముగను.

పంద్రెండవ సర్గము సంపూర్ణము.

---

౧౩ - వ సర్గము.

రావణుఁడు మహాపార్శ్వునితోఁ దనకుఁ గలిగిన శాపమును జెప్పుట.

క. అనినం గ్రుద్ధుండగు నా,దనుజేంద్రుని శాంతచిత్తుఁ ♦ దాఁ జేయంగా
ఘనబలుఁడు మహాపార్శ్వుం, డనూనముగ లోఁ దలంచి ♦ యను నంజలితోన్.

ఉ. తేనియఁ ద్రాగఁ గోరి యతి♦దృప్తమృగాహిసమాకులోగ్రమా
కాననసీమ కేగి యటఁ ♦ గష్టముఁ బొందఁ లభించుఁ దేనెఁ దా
నానక యుండు నెవ్వఁ డతఁ♦డొఁ గడు మూర్ఖుఁడు సీత నట్లె నీ
వూనిన ప్రీతిఁ బట్టి సుఖ♦ మొందక యుండుట నర్హమౌఁ జుమీ. ౨ 392

ఆ. అరులు గలిగియుండ ♦ నవ్వారి గెలువక, యానుకృత్య మెట్టు ♦ లగును జేయ
నను దువే మొరివుల ♦ నణఁచువాఁడవు నీకు,నీశ్వరునకు నీశుఁ ♦ డెవఁడు గలఁడు?.

చ. [2]కనుకనె నీవు వైరితలఁ ♦ గాలిడి సీతను గూడి ప్రీతినిం
గనఁదగు, 'సీత నాపయిని ♦ గాంక్షను బూన దటంచుఁ బల్కెదో'

---

1 వధేన వై దాశరథే స్సుఖావహం జయం తవాహర్తు మహం యతిష్యే, హత్వా చ రామం సహ లక్ష్మణేన ఖాదామి సర్వాన్ హరియూథముఖ్యాన్ -అనిమూ. దీనికి మహేశ్వరతీర్థులు వ్రాసినవిశేషార్థ మీపద్యమునఁ దోఁచునని యెఱుంగునది ఎట్లన. చాలువాఁడనే=చేయఁగలనా? (చేయలేను) ఎట్టు లానరపతి చచ్చును? (చావఁడనుట) నీకున్ అజయము=అపజయము. ఇంక నీవు సకలసుఖంబు లనుభవింపుము. త్వరలోఁ జావఁగలవు అనిభావము. 2 బలాత్ కుక్కుటవృత్తేన వర్తస్వ సుమహాబల, ఆక్రమ్యాక్రమ్య సీతాం వై తథా భుంక్ష్వ రమస్వ చ-అనిమూ. మునిహృదయం తు కుక్కుటవృత్తే నాన్యత్ర వర్తస్వ. సీతాం బలాత్ భుంక్ష్వ రమస్వ - అని గోవిందరాజులు. ఇచట గోవిందరాజులు కూడ సీతను గాసాడుమా యని రావణునకు హితము మహాపార్శ్వుఁడు చెప్పిన ట్లర్థము వ్రాసిరని గ్రహింపవలయు.

ఘనబలశాలి వీవు జన♦కప్రియపుత్రిక యొల్లకున్న నా
మెను గడుఁ గుక్కుటం బెటుల ♦ మించిన వేడుకఁ బెంటి నాక్రమిం
చునో యటు పెక్కువారములు ♦ శూరతఁ బైకొని కాంక్ష నొందుమీ!. ౪

క. మనసునఁ జింతింపఁ బాధకము, ననితం గొనఁ బిదప భయము ♦ వాటిల్లిన నె
ట్లనియొక వేమో కాముం,బును బొందినపిదప నుభయ♦ము పరఁగునె పల్కెన్. ౪½

ఆ. బాధ యేమి?, నిగ్రంద ♦ వచ్చిన రానిమ్ము, నీకు నరకుఁగాదు ♦ నిలువవచ్చుఁ
గాదె దానిఁ' గుంభ♦కర్ణుండు బలశాలి, యైన యింద్రజి త్తు♦హార్యగతిని. ౫½

క. మముఁ గూడి వజ్రధరుఁడై, యసురేశ్వరుఁ డగుగదేర ♦ నని యోర్తుగ యు
ద్ధము సేయు లేకయే సామము దానము భేదము నను♦మార్గములఁ దగన్. ౬½

క. పురుషులు జడతను నేర్పఱ,చిరి తమ్ముఁడు నీకు మున్న ♦ చెప్పినవీనిన్
బరిపాటింపక దండమె, పరమోపాయం బటంచుఁ ♦ బరికించి తగన్. ౭ 398

క. పనులను సాధింపుము దీ,నినె మదిలోఁ గృప్తిగాఁగ ♦ నిల్పు; నికుంభుం
డనినట్టు లచటి కేగుట, యనర్హమగు రావణా! మ♦హాబలసారా'. ౭½ 399

చ. అరిజను లీమహాపురము ♦ నంతికసీమకుఁ జేరరాఁగ ని
ర్భరతరపౌరుషంబుఁ గొని ♦ వారల నెల్లర నస్త్రశస్త్రవి
స్ఫురదురువీర్యయోగమునఁ ♦ బోం గడగంగను జేసి నీవశం
బరుదుగ నొందఁజేయఁ గల ♦ మాసురరాజ' యసంశయంబుగన్. ౮ 400

క. అని యిట్లు మహాపార్శ్వం, డన రాక్షసరాజు వాని♦యభిహితవాక్యం
బును విని [1]పొగడుచు వానిం, గని యిట్లని పల్కె మది వి♦కాసము పొదలన్.

తే. ఓమహాపార్శ్వ! నీమాట ♦ కుల్లసిల్లెఁ
గలగ దొక్క రహస్యంబు ♦ తెలియు మీవు
[2]చాలకాలంబ యయ్యె నా♦చంద మరయ
నాపురావృత్తమును దెల్ప ♦ నాత్మ నెంతు. ౧౦ 402

సీ. పూర్వ మంబరమునఁ ♦ బుంజికస్థలయను నచ్చర యోర్తు భ♦యంబు గదురఁ
గనఁబడకుండ నో♦య్యన దాఁగి హుతవహుజ్వాలవలెం దగి ♦ బ్రహ్మసదన
మునకేగుచుండంగఁ ♦ గని నాఁడ నేనంత నాయంగనను [3]బల్మి ♦ నచట నిలిపి
వివసనఁ గావించి ♦ యుపలీల భోగించితిని నంత నద్ది వా♦డినసరోజ

ఆ. కమ్రనాళ మట్లు ♦ కలఁగి పద్మాసను
పరిసరమున కేగె; ♦ బ్రహ్మ కావి
షయము దెలిసె నను ♦ స్వాంతమునం దంతు
నతఁడు సుహితచిత్తుఁ ♦ డౌటవలన. ౧౧½ 403

---

1 తస్య సంపూజయన్ వాక్యమ్-అనిమూ. 2 చిరవృత్తం తదాఖ్యాస్యే-అనిమూ. 3 కృతా వివసనా తతః—అనిమూ.

*చ. వనరుహసూతి కోపమునఁ ♦ బల్కెను నన్నును గూర్చి యిట్టు లో
దనుజవరా! యిదే మొదలు ♦ దానుగ నొప్పని యన్యకాంత బ
ల్మిని గొను దేని నీశిరము ♦ మించిననాదువచస్సుచేత నో
య్యన శతధా విభిన్నమయి ♦ యప్పుడె కూలెడు శంక లేకయే. ౧౪ 404

క. అని యిటు బలవంతంబుగ, ననుఁ గూరిచి శాప మొసఁగి♦నన్ భీతిలి రా
మునిభార్య సీత బల్మి శ,యనమును జేర్పంగఁ బూన ♦ నైతిని సుమతీ!. ౧౫

క. వనరాశి కున్న వేగం,బును మారుతగతియు నాకుఁ ♦ బొదలెడు నీవా
ర్తను రాముఁ డెఱుఁగఁ డోటను,ఘనబలములఁ గూడి రాఁగఁ♦ గాంక్షించెఁ జుమీ!.

క. గిరిగుహ నిద్రించెడు భీ,కరసింహము నిద్ర లేపు♦కరణిని నిద్రా
దరమునఁ బరుండుమృత్యువు, ద్వరపడి లేపునటు నన్ను ♦ దర్పసమగ్రున్.

తే. ఊర కూరక రేఁచుచు ♦ నున్నవాఁడె;
తెలివిమాలినవాఁడొట ♦ దివ్యపౌరు
షంబు నాదని యెఱుఁగంగఁ ♦ జాలకున్న
వాఁడు కావున రామున్న♦వాఁ డిచటికి. ౧౮ 408

క. అని మున్ను రెండునాల్కలఁ, గనుపట్టెడు క్రూరభుజగ♦కల్పనిశితబా
ణనికరము నస్మదీయం,బని యెంచ నెఱుంగఁ డాతఁ ♦ డతిమందుండౌ. ౧౯ 409

సీ. ఇంక వేగంబుగ ♦ నేనుంగు నుల్కలచేతను భీతిల్లఁ ♦ జేయునట్లు
శతసంఖ్యలుగ నాని♦శాతకార్ముకవిముక్తాంబకమ్ముల వజ్ర♦మట్టివాని
నిగిడించి భయపెట్టి ♦ నిలువక పరుగెత్తు నట్లు చేసెద రాము ♦ నతనిబలము
నుద్యదర్కుఁడు తార♦కోరుకాంతులఁ జెండుగతి గొప్పసేనతోఁ♦గదలి నేను

తే. నణఁచివైచెద; నవిని స♦హస్రనయనుఁ
డగుశతక్రతువున కైన ♦ నవ్వరుణున
కైన నను గెల్వఁ దరముగా ♦ దయ్యె బాహు
బలమునన్ విత్తనాథుని ♦ గెలిచి నేను. ౨౦ 410

తే. అతఁడు పాలించునీలంక ♦ నధికశక్తిఁ
గైకొనినవాఁడ నిట్టి య♦ఖండబాహు

---

* శతధా మూర్ధా భవిష్యతి న సంశయః-అనిమూ. అనేన రావణవిషయే రంభానిబంధనవళ కూబరశాపే విద్యమానేపి తస్య ప్రాకృతదేవత్వా చ్చ తచ్ఛాప మనాదృత్య పుంజికస్థలాయా మపి ప్రవృత్తం రావణం పశ్చాత్పితామహ శ్శప్తవాన్ అతఏవ రావణో ప్యనుల్లంఘనీయం పితామహ వాక్య మే వోక్త్వా నిత్యవగమ్యతే-అని గోవిందరాజులు ఇది తెనిఁగింపఁబడలేదని శంకింప నవసరము. ఇది యుపగాథను దెలుపునూహ. కానఁ దెనిఁగింపలేదు.

బలసమగ్రుఁడనౌ నాకు ♦ నిల నరులన
నెంతమాత్రము [1]రాముఁ డే♦మెఱుఁగు నన్ను. ౭౧ 411

పదునూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౮ - వ సర్గము.

విభీషణుఁడు మరల రావణునకు హిత ముపదేశించుట.

చ. అనిన విభీషణుండు దను♦జాధిపుఁ డాడినవాక్యజాలముల్
ఘనతరకుంభకర్ణకృత♦గర్జనముల్ విని మేలుఁ గూర్పనై
యనుపమ మర్థయుక్తమును ♦ నైన సుభాషను రాక్షసేంద్రునిఁ
గని యిటు పల్కె సీత యనఁ ♦ గాలభుజంగమ మౌను రావణా!. ౧ 412

తే. వక్షమే భోగ మగు నతి♦భయదచింత
యే విషం బగు సుస్మిత♦మే సుతీక్ష్ణ
దంష్ట్రలగుఁ జింతఁ దలవాల్పఁ ♦ దగుకరాంగు
ళు లయిదును నై దుశిరములై ♦ వెలయు మఱియు. ౧౫ 413

క. తను వతిదీర్ఘం బిట్టిది, జనకసుతాసర్ప మిట్టి♦సర్పము నీవే
మని గోరితివో నేనెఱుఁగను; నీ కొక్కనికె కీడు ♦ గాదిది వినుమా!. ౨ 414

చ. ధరణిధరేంద్రకూటసమ♦తం గనుదేహము లొప్పఁగా నఖో
త్కరములు దంష్ట్రలాయుధని♦కాయముగాఁ దగుకోఁతు లెల్ల ని
ష్ఠురమును గూల్ప రాకమును ♦ భూసుత రాముని కప్పగింపు; దా
శరథియు వజ్రతుల్యములు ♦ స్పర్శనసన్నిభవేగముల్ మహా
త్తరములునైన బాణముల ♦ దారుణభంగిని వైచి దైత్యులన్. ౩ 415

క. దురమున మార్కొని వారల, శిరములఁ జెండుటకు మునుపె ♦ సీతను నాథా
వరునకు నర్పింపుము; కా,వరమున నీపల్కు లేల ♦ పల్కెదు దుడుగుమా!. ౪

చ. అనుచుఁ బ్రహస్తుఁ గన్గొని భ♦టాధిప! ప్రాణము తీయఁజాలి వ
జ్రనిశితవేగముల్ పొదల ♦ వ్రాలెడు రామునితీక్ష్ణబాణముల్
చెనటి! భవచ్ఛరీరమును ♦ జీల్చుచుఁ జైకొని పోవకున్న విం
తను గనుకన్ వికత్థనము♦గా వచియించెదు దుర్నయుంబునన్. ౫ 417

తే. కుంభకర్ణేంద్రజిత్తులు ♦ జంభభేది
వైరియగురావణుఁడు మహా♦పార్శ్వుఁ డామ
హోదరుం డతికాయుఁడు ♦ నుగ్రదర్పు
లైన కుంభనికుంభులు ♦ పూని యనిని. ౬ 418

---

1 రాముఁ డేమెఱుఁగు నన్ను-అనునది యధికముగాఁ జేర్చుట యర్థపోషణ మొనరించు ననియే యని తెలియునది.

క. శ్రీరాము నెదుట నిల్వఁగు;, సారసమిత్త్రుండు దేవ♦సత్తములు నినుఁ
గారవమున రక్షింపం, దా రరుదెంచినను దేవ♦శల్లజుతోడపై. ౯ 419

ఆ. నీవు కూరుచున్న ♦ నెమ్మి మృత్యువు నంక, భాగమందు నున్న♦భోగిలోక
నంబరంబు సంశ్ర♦యముగాఁగ నొప్పినఁ, జంపితీఱు రామ♦చంద్రుఁడు నిను.

సీ. అనినఁ బ్రహస్తుఁ డి♦ట్లనియె విభీషణ! సురదానవాళిచే ♦ నరయ నితరు
లైనవారలచేత; ♦ యక్షగంధర్వమహోరగేంద్రులచేత ♦ నుగ్రగరుడ
తతిచేత నించుక♦యతిదారుణరణంబునందు భీతియె మాకుఁ ♦ బొందరాదు
మనుజుఁడౌ రాముచం♦ద్రునివలనుండి యుద్ధమున భీతియ దెట్లు♦తగఁగలుగునొ

ఆ. యనియె; రాజహితము ♦ నారయుమహితాత్ముఁ
డౌ విభీషణుఁడు ధ♦రాధినాథు
ధర్మకామములను ♦ దగునర్థమును వీనిఁ
జక్క నెంచువాఁడు ♦ సాధుమతియు. ౧౦ 421

క. కనుకఁ బ్రహస్తుం డహితం,బును విభునకుఁ గల్గఁజేయుఁ ♦ బూని పలికినన్
విని మాఱు పలికె నిట్లని;, వినవయ్య! ప్రహస్త! దైత్య♦విభుఁడును నీవున్.

తే. కుంభకర్ణమహోదరుల్ ♦ కువలయేశు
విషయమై చెప్పినట్టి యా♦విపులభాష
ణములు నిష్ఫలములు సశ♦క్యము లధర్మ
మతికి స్వర్గలోకగమనంబు♦మాడ్కి నిజము ౧౧ 423

చ. అనుపమకార్యదక్షుఁడగు♦నారఘురాము వధింప నాకు నీ
కు నిఖిలదైత్యవల్లభుల♦కున్ వనరాశిని దెప్పనాయముం
గననియతెండు దాఁటుటకుఁ ♦ గానివిధంబున శక్య మెట్లగున్;
మనుజులు వారు వధ్యు లను♦మాటను మానుము చాలు నింతటన్. ౧౨

సీ. ధర్మప్రధానకృ♦త్యంబు లొనర్చుచుఁ దా మహారథుఁడయి ♦ ధరణినాథుఁ
డగుచు నిక్ష్వాకుస♦దన్వయజనితుఁడై విఖ్యాతకర్ముఁడై ♦ వెలసికార్య
దక్షుఁడై తగునట్టి ♦ దర్పసముగ్రుని సంగరకృత్యముల్ ♦ చక్క నెఱుఁగ
నమరులైనను జాల ♦ రన నిఁక నీవెంత; వాడులై సతసుప♦ర్వములు నగుచుఁ

తే. గంకపత్త్రాంకములునయి ♦ కడుదురాస
దములునయి పొల్చి రాముండు ♦ తగ విడువఁగ
జటులగతి వచ్చునతితీక్ష్ణ♦శరము లెల్ల
గాఁడి నీతనువును జంపఁ♦గలవు సుమ్ము ౧౩ 425

క. కనుక నె నీవే యీగతి, వినుతిని జేసికొనె దిప్డు ♦ విక్రమయుతుఁడౌ
దనుజేంద్రుఁ డింద్రజిత్తును, ఘనబలుఁడు త్రిశీర్షుఁడైనఁ ♦ గాని రణమునన్.

ఆ. కుంభకర్ణుఁ డతని♦కొడుకొ నికుంభుఁడు, నీవు గాని రాము ♦ నిర్జరేంద్ర
సముని దాఁకి నిల్వఁ♦జాలరు; దేవాంత,కుండు మఱి నరాంత♦కుండు ఘనుఁడు.

క. [1]అతిరథుఁడు బుద్ధిఘనుఁ డా,యతికాయుఁడు, పర్వతాభుఁ♦డయి దితితనయ
ప్రతతిని మేటి యగుచు, హితకృత్యుఁ డకంపనుండు ♦ నిఁక నెవ్వరైనన్.

క. అని నిల్వఁజాల రారా,మునిముందట; నితఁడు దైత్య♦ముఖ్యుఁడు కార్యం
బును బరికింపక చేయును, మనమున వ్యసనములు తోఁప ♦ మందత నొందెన్.

చ. అని తలపోసి మేలుగను♦నట్టిపథంబును జూపి చెప్ప కీ
తనికిని శత్రుభూతలయి ♦ తన్మతి తీక్ష్ణము గాన దానినే
మనమున నెంచి మిత్రతను ♦ మాటలఁ జూపుచు నాతఁ డేగుత్రో
వనె యిటు మీర లేగెదరు ♦ వారక దైత్యవినాశనార్థమై. ౧౬ 430

చ. దనుజవరేణ్యు రావణు ను♦దాత్తతరంబగు దేహమొప్ప భీ
తిని గలిగింపఁ జాలుచు న♦తిస్థిరసత్త్వము వేయి శీర్షముల్
తనరఁగ నున్న రామవిభు♦తల్లజవైరమహాహి యావరిం
చినయది దానిఁ దోలి యతి♦శీఘ్రము మీరు విముక్తుఁ జేయుఁడీ!. ౧౭ 431

ఆ. ఏమి చేయవచ్చు ♦ నిపుడు కాలము మించి
పోయె ననెద రేమొ ♦ పుడమివిభుఁడు
చేయరానిపనులఁ ♦ జేయుంగఁ బూనిన
నతని వలన మేలు ♦ నందు సఖులు. ౧౮ 432

చ. మనములఁ బ్రేమఁ బూని యొక♦మాటకు వచ్చి బలాత్కరించియై
నను దలవెంట్రుకల్ దిగిచి ♦ నాథుఁ డటంచుఁ దలంపఁ బూన కా
తనిరిపు లెల్ల వెంట్రుకలఁ ♦ దాఁకి జవంబున నీడ్వకుండఁగా
మునుపె బిరాన లాగి పెను♦భూతము లూనినవానిఁ బోలెఁ గా
వను దగు మంచిత్రోవకును ♦ వారక తేఁగగు న్యాయ మిద్దియా. ౧౯ 433

[2]సీ. దనుజేంద్రుఁ డీతఁ డి♦త్తఱి నశియింపఁగఁ గాలమృత్యువుఁబోలి ♦ క్రాలులక్ష్మ
ణుఁడను మృత్యుక♦మంతగు కడలిచేఁ బ్రచ్ఛాద్యమానుఁడై ♦ రాముఁ డనెడు
బడబాగ్నిముఖమునఁ ♦ బడసిద్ధముగ నున్నవాఁడు కావున మీరు♦వైళమొకటి
గాఁ గూడి కాపాడఁ♦గాఁ దగు; నీరాజు సీతను రాముని ♦ జేరఁ బనుప
కుండిన నుండ నీ♦యుఁడు, నాదుపలు కిది యీపురికిని మఱి ♦ యీనృపునకు

---

1 తథాఽతికాయోఽతిరథో మహాత్మా-అనియూ. 2 సంహారిణా రాఘవసాగరేణ ప్రచ్ఛాద్యమాన స్తరసా భవద్భిః యుక్త స్త్వయం తారయితుం సమేత్య కాకుత్స్థపాతాళముఖే పతన్ సః-అనిమూలము. రాఘవసాగరేణ లక్ష్మణసముద్రేణ, కాకుత్స్థపాతాళముఖే రామబడబాగ్నిముఖే-అనివ్యాఖ్య.

ఆ. నితనిమిత్త్రులకును ♦ నెల్లరాక్షసులకు
హితము గాన నాదు♦మతము వినుఁడు
మనమె సీతఁ గొనుచు ♦ మహీపుని కడకేగి
యప్పగింత మంత ♦ నతఁడు కాచు. ౨౧ 434

క. అరిఁ జంపవలయుసని మే, మరసియె వసియింతు మనిన ♦ న్యాయము వినుఁడీ
త్వరపడక మంత్రియగు నా, పురుషుఁడు రిపుబలము స్వీయ♦భూపుని బలముర్.

తే. చక్కఁ బరిశీలన మొనర్చి ♦ శత్త్రుసిరిని
సామ్యవృద్ధిక్షయంబుల ♦ స్వన్నృపుసిరిని
నన్నె నూత్మ్యంపుదృష్టిని ♦ నాత్మ నెంచి
యుక్తము హితంబునగుకార్య ♦ మొనరుపఁ దగు. ౨౨ 436

పదునాల్గవ సర్గము సంపూర్ణము.

---

౧౫ - వ సర్గము.

ఇంద్రజిత్తు తనమతమును దూషింప విభీషణుం డాతనికి బుద్ధి సెప్పుట.

క. అన నచటి దనుజయోధుల,కును ముఖ్యుఁడు బలయుతుండు♦క్రూరుఁడునగు నా
దనుజేంద్రసుతుఁడు శక్రుని, నని నోంచిన యింద్రజిత్తు ♦ హర్షము పొంగర్.

క. సురదేశికువలె బుద్ధి,స్ఫురణంబునఁ దగినదనుజ♦శూరుఁడు న్యాయై
కరతుండు విభీషణుఁ డ,త్తఱుణమున వచించినట్టి ♦ తథ్యోక్తులనుర్. ౫ 438

క. విని యతనితోడఁ దా ని, ట్లనియెను; బినతండ్రి! తుదిని ♦ నాడినవాక్యం
బును నెవ్వ రాదరింపరు, గనుక నిరర్థకము భీతిఁ ♦ గని పల్కినదా. ౧౫ 439

తే. కటకటా! యేమి పలుకి ది♦క్కరణి నీవు
లస్త్యకులమునం బుట్ట కి♦లర్ మఱియొక
కులమునం బుట్టినాతఁడు ♦ కూడ నిట్టి
[1]పలుకు వచియింపఁడే యిట్టి♦పనికిఁ జొరఁడె. ౨ 440

క. అని తనతండ్రిం గని యి, ట్లనియెను నీకులమునందు ♦ నరయ నొకఁడె నా
పినతండ్రి యీవిభీషణుఁ, డనుపమవీర్యంబు బలము ♦ నతిధైర్యంబుర్ ౨౫

[2] తే. శౌర్యము పరాక్రమంబుఁ దే♦జంబుఁ దూలి
యున్నవాఁ డంచు, మరల నా♦పిన్నతండ్రి
కనియె; రాక్షస! భీతాత్మ! ♦ యానృపసుతు
లబలు లవ్వార లెంత ల♦క్ష్యంబె మాకు ౩౫ 442

క. దనుజుం డెవఁడైనను నిటుఁ, గనఁబడువారల నొకండు ♦ కడువడి వారిర్

1 సోఽపీదృశం నైవ వదేన్న కుర్యాత్-అనిమూలము. 2 సత్త్వేన వీర్యేణ పరాక్రమేణ శౌర్యేణ ధైర్యేణ చ తేజసా చ-అనిమూలము,

గొనఁజాలు బలిగ, మము భీతిని గాంచఁగఁ జేయనేల! ♦ తెలియనినుడులన్.

చ. వినుము జగత్త్రయాధిపతి♦వీరుని నిర్జరరాజు శక్రు నే
ననిమొన భూమిపైఁ బడెడు♦నట్లుగఁ ద్రోసితి దేవవర్యులన్
గని నను భీతినొంది గుమి♦గాఁ బరువెత్తిరి దిక్కు లెన్నికొం
చును మఱి నాల్గుదంతముల ♦ శోభిలునభ్రము వేను ద్రోయఁగన్. ౫ 441

క. వికృతస్వరమునఁ దానే,లకు నోరఁగెను దద్దశనములన్ రెంటిని నే
న కడఁకఁ బెఱికితి దానన్, జకితమునంబూను దేవ ♦ సత్తము లార్తిన్. ౬ 445

క. నలుదెసలకుఁ బరుగెత్తిరి;, బలమారఁగ సురలదర్ప ♦ బలములఁ గూడన్
వెలితి గనం జేసితి దైత్యులు నన్నుం దాఁకి వగల ♦ నొంది రనిమొనన్. ౬½

చ. అనుపమవీర్యముం గలిగి♦నట్టి భటాగ్రణి నేను కేవలం
బును నరులైన ప్రాకృతుల ♦ భూపకుమారుల నెట్లు గెల్వలే
నని వచియించె దీ వనియె; ♦ నంత విభీషణుఁ [1]డాయుధాళిఁ దా
ల్చినభటులందుఁ దానె కడు♦ శ్రేష్ఠుఁడుగాఁ దగువాఁడు కావునన్. ౭½ 447

కవిరాజవిరాజితము:—

సురపతితుల్యుఁడు ♦ గౌరవతంనుఁడు ♦ శుభ్రను తేజుఁడు దుర్జయుఁడున్
బరబలకాలుఁ డ♦భంగభుజాబల♦భాసురుఁడై తగురావణి యీ
కరణి వచింపఁ ద♦గన్ విని యర్థము ♦ గాఢముగాఁ గలవాక్యము లీ
వను వచించెను; ♦ బాలుఁడ వౌటను ♦ బాగుగ మంత్ర మెఱుంగవు నూ!. ౮

క. ఇదిసాధువగు నసాధువె, యిది యగునని నీవు నిశ్చ♦యింపఁగఁ దగుశ
క్తిఁ దగినవాఁడవు గా వీ,యనునకు [2]నపక్వబుద్ధి♦ వైతివి తనయా!. ౮½ 449

క. కనుకనె యాత్మవినాశన,మును గూర్చుచు నర్థహీన♦ములు నగు పలుకుల్
వినిపించితి వారయకయె, దనుజేశున కితని కల్ల ♦ ధరణిపునలనన్. ౯ 450

[3]చ. తనయ! సఖాదియు క్రమముగఁ ♦ దప్పక నాశన మింకఁ గల్గునం
చని యిపు డేను బల్క విని ♦ యజ్ఞత దానికి సమ్మతించెదే
కనుకనె పుత్రనామమునఁ ♦ గన్పడుమిత్త్రుఁడవయ్యు వాస్తవం
బునకును వైరివే; జనకు♦పోకడ కొప్పినదుష్టబుద్ధివం
చని నిను శిక్షచేయుటకు ♦ నర్హ మదెట్లగు బుద్ధి నెంచినన్. ౧౦½ 451

సీ. బాలుని దృఢబల♦వంతుని సాహసికుని గాఁగ నెమ్మన♦మునఁ దెలిసియు
నీసభ కాలోచ♦నేచ్ఛ నే తెంచినవారిచెంతకు నిన్ను ♦ వచ్చునట్లు
చేసినవానికే ♦ చేయంగ దగు శిక్ష; యింద్రజిత్తూ! విను ♦ మీవు మూఢుఁ
డవు బ్రగల్భంబులు ♦ వివరించువాఁడవు వినయశూన్యుండవు ♦ విపులబుద్ధి

1 విభీషణ శ్శస్త్రభృతాం వరిష్ఠః-అనిమా. 2 అద్యాప్యవిపక్వబుద్ధిః - అనిమా. 3 యస్యేదృశం రాఘవతో వినాశం నిశమ్య మోహా దనుమన్యసే త్వమ్-అనిమా.

ఆ. విరహితుఁడవు ప్రకృతి ♦ యరయఁ గ్రూరంబుగ
నుండు నీకు, దుర్జ♦నుండ వీవు,
కార్య మేదియైనఁ ♦ గడు నెంచి చేయవు
మిగుల దుర్మతి వనఁ ♦ దగుదు వెపుడు. ౧౩ 452

క. బాలుండ వౌటఁ దెలియక, ప్రేలుచు నున్నావు మిగులఁ ♦ బెద్దని యగుచున్
జ్వాలలను బ్రహ్మదండము, వోలె వెలుంగుచును గాలుఁ ♦ బోలి బెడగులై.

సీ. యమదండతుల్యంబు♦లై యున్న బాణమ్ములను రాఘవుండు వై♦వ నెవఁ డనిని
నిలిచి సహింపఁగా ♦ నేర్చు?; నంచని పల్కి యన్నను గన్గొని ♦ యసురనాథ!
ధనరత్నభూషణ♦తతుల వస్త్రంబుల బహువిధగుణులను ♦ బరమభక్తిఁ
గొని సీతతోఁగూడఁ♦జని రాముని కొసంగియపరాధమును సైప♦నగునటంచుఁ

తే. బ్రార్థనము చేసి దుఃఖంబు ♦ నదలి యిచట
సుఖముగా నుండ మిందలి ♦ శూరులెల్లఁ
బలుకుమాటల వినకుము ♦ నిలువ విప్వ
యసిని రామునిముందు నా ♦ మనవి వినుము. ౧౪ 454

పదునైదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౬ - వ సర్గము.

రావణుఁడు విభీషణు నవమానించుట.
విభీషణుఁడు మంత్రులతో నరుగుచు రావణునకు మరల హితము చెప్పుట.

చ. [1]అనుచు విభీషణుండు హిత♦మై మది కెంతయు నెక్కునట్లు చ
క్కనిగతిఁ బల్కువాక్యమును ♦ గాదన కాకృతి సంగ్రహించి యా
పని నొనరింపఁగాఁ దగియుఁ ♦ బాపపుఁగల్మిని గాలచోదితుం
డు నగుట రావణుండును గ♦డుం బరుషోక్తుల వాని కిట్లనున్. ౧ 455

క. వెలుపటిశత్రువుతోడ మి,గులఁ గోపమునొందియున్న ♦ క్రూరభుజగితో
గలఁగక సహవాసం బి, మ్ములఁ జేయఁగ వచ్చుఁ గుతలమున నెవఁడైనన్. ౧౫

ఉ. అంతియె కాని మిత్రువలె ♦ నారయఁ దోఁచుచు శత్రుపక్షము
త్యంతము పూనియున్నకుటి♦లాత్మునితో సహజన్ముతోడ నొ
క్కింతయుఁ గూడి యుండఁ జన ♦ దియ్యది సత్యము; రాక్షసాధమా!
సంతత మే నెఱుంగుదును ♦ జ్ఞాతులశీలము నెల్లవారలోన్. ౨౫ 457

సీ. వీరలు జ్ఞాతులౌ ♦ వారలకుం గల్గువ్యసనంబులం దమి ♦ నందుచుంద్రు,
తనుకులశ్రేష్ఠుని ♦ ధర్మశీలుని గార్యసాధకు విద్వాంసు ♦ శౌర్యయుతుని

---

1 సునివిష్టం హితం వాక్య ముక్తవంతం విభీషణమ్, అబ్రవీ త్పరుషం వాక్యం రావణః కాల చోదితః - అనియూ. దీనికి విశేషార్థము తనిశ్లోకియందు వ్రాయఁబడినది. కాని యది యాకాశపంచాంగమునంటిది. కానఁ దెనుఁగునఁ జేర్పఁబడలేదు. అది కేవలము మతిప్రధానమైనదనియు గ్రహించి మన్నింపవలయు.

జ్ఞాతులు గొప్పగా ♦ నేతటి నెన్నరు పరిభవింతురు, జ్ఞాతు ♦ లుదుతరముగ
వ్యసనంబు నొందిన ♦ వారు సంతోషంబు నందుచుఁ దమవార ♦ లధికవృద్ధి
నందిననోర్వక ♦ యుందురు మతియును దమభావములను బా ♦ హ్యమునఁ దెలియ
తే. కుండఁగాఁ జేసి యన్యోన్య ♦ మొక్కరీతి
మైత్రిఁ జూపుచుఁ గ్రూరులై ♦ మంచియదను
గలిగినప్పుడు తా రెల్లఁ ♦ గడఁగి కీడు
చేయుచుందురు భయదు లే ♦ యే యెడలను. ౫ 458
క. మును పద్మవనంబున ద్విరదనికరములు తమ్ముఁ బట్టఁ ♦ దగుపాశములన్
గొనివచ్చిన తమజ్ఞాతుల,కును రక్షకులైన నరులఁ ♦ గొంకఱఁ గనుచున్. 459
తే. కొన్ని శ్లోకమ్ములం జెప్పె ♦ నన్నమాట
వినినవాఁడను వానిని ♦ వినుము; నాకు
నగ్నివలనను నితరాయు ♦ ధాళివలనఁ
బాశనికరంబువలనను ♦ భయము లేదు. ౬౧ 460
చ. కరుణయె లేక స్వీయులగు ♦ కార్యముఁ నే గనుఁగొంచు నెప్పుడో
తరుణము చూచి వే మనల ♦ దారుణరీతిని బట్ట నెంచుని
ప్పురుషులయొద్దనున్న కరి ♦ పుంగవు లీమనజ్ఞాతులే భయం
కరములు; చూడ నివ్విధయె ని ♦ కాను ముపాయముఁ జెప్పు వారికిన్. ౭ 461
క. దానిఁ గొని మనలఁ బట్టఁగ, నానరులు ప్రయత్నపడుదు ♦ రారయ శంకన్
గానము సకలభయంబుల, మానంగాఁ జేయు జ్ఞాతి ♦ మండలభయముల్. ౭౧
తే. [1]వీని భరియించు టే కష్ట ♦ మౌ ననయముఁ
దీక్షమియ్యది మనకును ♦ దెలిసి యున్న;
దరయ గోవులయందును ♦ సిరియు విప్రు
లందు నింద్రియనిగ్రహ ♦ మలరుచుండు. ౮౧ 463
చ. వనితలయందుఁ జాపలము ♦ వర్ధిలుచుండును జ్ఞాతులందుఁ ద
ప్పని భయ మున్నదంచు నిటు ♦ పద్యములం బఠియించె నంట; నో
యనుజ! తలంప సౌమ్యుఁడవె ♦ యాదువుగా మఱి జ్ఞాతి వౌదు కా
వున నిటు లోకసత్కృతులఁ ♦ బొందుచు సంపద విఱ్ఱవీగి జ్ఞా
తినికరమందు మిన్ననయి ♦ తేజమునం దగు నన్ను నీశ్వరున్. ౯౧ 464
క. కని యోర్వఁజాల వీగతి, ననుపమభోగములఁ బొంది ♦ యలరుట నీకున్
మనమున నిష్టము గాదో, దనుజేశ్వర! యిట్టు లనుటఁ ♦ దగునా యనదో?.
చ. సరసిజపత్రమందుఁ దగు ♦ [2]శంబరబిందువు లొక్కరీతి న
క్కరణిని జేరకుండు నటు ♦ కాపురుషుల్ చిరకాలసంగతిం

1 విద్యతే గోషు సంపన్నం విద్యతే బ్రాహ్మణే దమః-అనిమా. 2 శంబరబిందువులు=నీటి బొట్టులు.

బరఁగిన మైత్రి నిల్పు; రిటు♦వంటి మహాత్ముని నిన్నుఁ గొల్చి నే
[1]చిరసమలుండ నా కెటుల ♦ స్నేహము నిల్వదటంచుఁ బల్కుదో. ౧౧ 466

తే. సుమగతంబగు మకరంద ♦ మమరఁ ద్రావి
భ్రమర మా పువ్వుమునను ని♦ల్వకయె పోవు
నట్లు నీవును సుఖముల ♦ ననుభవించి
నాదు క్షేమంబుఁ గోర కు♦న్నావు నిజము. ౧౨ 467

చ. జను లతిదుష్టులైనఁ దము ♦ సంతత మోమెడువారలందు స
న్మనను చెలంగ; దట్లయిన ♦ మైత్రిని జేసియు దాని మాను టె
ట్లనియెదవేమొ హస్తి జల♦మందును స్నానము ముందుఁ జేసి యం
త నిజకరంబుచే రజము ♦ దానయి మేనునఁ జల్లుకొంచొగిన్. ౧౨౺ 468

క. తనతనువుఁ జెఱుపుకొనునటు, లనార్యుఁడగువాఁడు మొదట ♦ నతిమైత్రిని జే
సినను బిమ్మటఁ దానే, తనమైత్రిని బాడుసేయుఁ ♦ దలఁచును సహజా!. ౧౩

క. వినుము శరత్కాలంబున, ఘనములు జలశీకరముల ♦ గర్జిల్లుచు భూ
మిని గురిసిన వానిన మే,దిని చక్కఁగఁ దడియకుండు♦తీరునఁ గుజనుల్.

తే. మైత్రి యొనరించినను వారి♦మాట నమ్మి
యుండఁగా రాదు మేలును ♦ నొందరాదు;
దానవా! మతిరొక్కఁ డి♦త్తఱిని నిట్లు
పలికియుండిన క్షణమునఁ ♦ బాయుఁ దనువు. ౧౪ 471

క. [2]కులపాంసనుఁడవు చీచీ, తలఁగుము నా యెదుట నుండఁ ♦ దగ వికఁ బో పో
పలుమాట లేల యనియెను;, గులపాంసనుఁ డనెడునుడుల♦కుఁ రోసి మదిన్.

క. న్యాయమును దాను జెప్పిన, నాయసురుఁడు దానిఁ గొనక ♦ యతిపరుషోక్తుల్
వేయివిధంబుల నాడిన, నాయన్నాస్థానమున నిల్వ ♦ నాత్మ యలరమిన్. ౧౫

క. ఘనగదఁ జేతం దాలిచి, దనుజుల నల్వురను గూడి ♦ తా నాకాశం
బున కెగిరె; నంతఁ గోపం,బున నచ్చట నిల్చి యతఁడు ♦ బుద్ధివిభవతన్.

చ. [3]సిరి యలరార నన్నుఁ గని ♦ చిత్తమునం దిపుడైన మంచి సె
బ్బర లోగిఁ దోఁపవో యనుచుఁ ♦ బల్కెను రాక్షసరాజ! భ్రాతవై
పరఁగుదు కాన నన్గుఱిచి ♦ పల్కఁగ నెంచిన వెల్లఁ బల్కుమీ
తరుణమునందె యన్నవు గ♦దా! పిత యట్లుగ నిన్ దలంపనో. ౧౬ 475

సీ. మానసీయుఁడవు సు♦మా! మైన ధర్మమార్గంబున నిల్వక ♦ కదలి తీవు
హితము పల్కిన నాప♦యిని దోషముం బెట్టి పరుషవాక్యంబులు ♦ వల్కితీవు
దీనిని మాత్రమే ♦ యేను సైపఁగఁ జాల నోదశానన! నీకు ♦ నేది మేలో
దానినిఁ జక్కఁగాఁ♦దలపోసి హితవాక్యమును జెప్పితిని; గత♦బుద్ధు లెల్లఁ

1 చిరసమలు=అనేకసంవత్సరములు. 2 అస్మిన్ ముహూర్తేన భవేత్త్వాం తు ధిక్కులపాంసనం-అనిమూ. 3 గత శ్రీర్మామ్-అనిమూ.

తే. గాలవశమునఁ జిక్కిన♦కారణమున
[1]హితము గైకొన; రెప్పుడు ♦ హితము పల్కు
చుండువారును దమి విను♦చుండువారు
సులభముగఁ జిక్కుచుందురు ♦ క్షోణియందు. ౨౦ 476

క. ఎది యప్రియమై యుండునొ, యది హితమే యగునయేని ♦ యమ్మాటను జె
ప్పఁ దలంచినవాఁడును న,య్యది హితమని వినెడువాఁడు ♦ నరిది జగమునన్.

తే. సకలభూతసంహారక ♦ మకరుణమ్ము
నయిన యాకాలపాశంబు♦నందుఁ గట్టు
పడి వినాశముఁ గను నిన్నుఁ ♦ గడు దహింపఁ
బడెడుగృహమును బలెఁ జూచి ♦ తడయ కేను. ౨౧ 478

క. మన కేల యనుచు నుండక, నినుఁ గావఁ దలంచి హితము ♦ నెఱిఁ దెల్పితి; మం
డినయగ్నివోలె మెఱయుచు, సునిశితములు స్వర్ణరత్న♦శోభితములునై.

క. వెలుఁగొందుతీవ్రబాణం,బుల రాముఁడు నిన్ను నొంపఁ ♦ బూనెడుతఱిఁ గ
న్నులఁ జూడ నెంచకే నిటు, పలికితి, యుద్ధాంగణమునఁ ♦ బ్రకటబలాఢ్యుల్.

క. శూరులు నస్త్రవిదుత్తము, లారయఁ గాలాభిపన్ను♦లై చెడుదురు సూ
క్ష్మోర్మిక సికతానిర్మిత,భూరిలసచ్ఛేతువులను ♦ బోలి దశాస్యా!. ౨౩౪ 481

[2]క. గురుబుద్ధి నీకు హితమును, బరికించి యదేమి పల్కఁ ♦ బాల్పడితినొ యా
సురవర! దాని సహింపుము, నిరతము రక్షించుకొనుము ♦ నినుఁ బలువిధులన్.

చ. దనుజశరణ్యమై యలరి ♦ దానవరాజ్యవతంసమైన ప
త్తనమును దీనిఁ గాచుకొను; ♦ తద్దయు నీకు శుభంబు గల్గెడున్
నిను విడనాడి పోయెదను ♦ నేఁ జనినంత సుఖంబుఁ గాంచుమా
[దనుజవరేణ్య! యిందఱిట ♦ దానవు లుండియు వీరిలోపలన్. ౨౫ 483

ఆ. హితముఁ దెల్పి మంచి♦దే యగు మంత్రంబుఁ, జెప్పి పాపమందుఁ ♦ జేరకుండ
దానెపూని నిన్నుఁ♦దమి నుద్ధరించును,హృదుఁడు సఖుఁడునీకు♦నెవఁడు లేఁడు.]

చ. అనయము మేలుఁ గోరి నల ♦ దంచు వచించుచునున్న నాదుప
ల్కును గొనకున్నదే మనసు ♦ గొంచెమె యైనను, మృత్యు వల్లనన్
గనఁదగువారు చచ్చి రని ♦ గాదె తలంపఁగ నౌను మిత్రవా
క్యనిచయ మట్టివారు విన ♦ రారయ నద్ది హితంబు గావునన్. ౨౬ 485

పదునాఱవ సర్గము సంపూర్ణము

---

1 సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః, అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః-అనిమూ. 2 తన్నష్ట యతు య చ్చోక్తం గురుత్వా ద్ధిత మిచ్ఛతా-అనిమూ.

## ౧౭ - వ సర్గము.

### విభీషణుఁడు రామునొద్దకుఁ బోవుట

క. [1]అని యిట్లు రావణానుజుఁ, డనఘుండగు నావిభీషణాఖ్యుఁడు తనయ
న్నను రావణుఁ గని హితమును వినిపించుచు నతఁడు దాని ♦ వినమి వగపునన్.

చ. పరుషము లాడి యైనఁ దన ♦ భ్రాతను సత్పథమందుఁ ద్రిప్పగాఁ
బరమహితంబు గాదె యని ♦ వైరిబలాదులఁ దెల్పి భీతిలన్
బరుషము లాడి సుంతయును ♦ వానిని గైకొనకుంట నింక నీ
పురుషుఁడు కీడు నొందు నని ♦ బుద్ధిఁ దలంచి తదీయసంగతిన్. 437

ఆ. విడిచి యపుడె రాఘ ♦ వుఁడు లక్ష్మణుం డున్న, ధరణి కరిగె; నంత ♦ దహానునుండి
తొలఁగి చల్లనైన ♦ కొలఁకులోఁ బడఁబోవు, నట్లు సత్వరముగ ♦ నరుగుదెంచి.

సీ. [2]వరరత్నకాంచనా ♦ భరణధారణమున నున్నతిఁ బొడవున ♦ నొప్పి యుంట
స్వర్ణాద్రిశిఖరంబు ♦ భంగిని దగువాని నసులకాంతిని గూడి ♦ యంబరమున
వనచరు లారామ ♦ భద్రుని చెంతకు నరుగనిత్తురొ? లేదొ? ♦ యనుభయమున
సంచరించుచు నటఁ ♦ జంచలాకృతి నున్నవాని విభీషణు ♦ వానరు లొగి

ఆ. ధరణినున్నవారు ♦ తప్పక చూచిరి;, [మేఘపర్వతముల ♦ మించి యతఁడు
కాన నగుచు దివిజ ♦ కాంతువిక్రమమునఁ, బరఁగి యాయుధాళిఁ ♦ బట్టి మిగుల.

చ. సురుచిరభూషణావళుల ♦ శోభిలుచున్ ఘనశౌర్య మొప్పఁగాఁ
బరఁగుచునుండె, భీతికర ♦ పౌరుషముల్ దగ వానిమంత్రులున్
నిరుపమశస్త్రజాలముల ♦ నెమ్మి ధరించి మహావిభూషణో
త్కరమున నొప్పి నల్వురును ♦ గ్రాలుచునుండిరి పుష్కరంబునన్.] 490

క. అరిజనదుర్ధర్షుండగు, హరిపతి సుగ్రీవుఁ డట్టు ♦ లభ్రంబున న
ల్వురుమంత్రులు తానొకఁడును, నరుదెంచుటఁ గాంచి సురుచి ♦ రాత్మకుఁ డొటన్.

సీ. [3]అనలుండు శరభుండు ♦ నట్లు సంపాతియుఁ బ్రఘసుండు నాఁబడు ♦ వారితోడ
వచ్చుచున్నట్టి య ♦ భ్రగుఁడైన యాతని రాక యేలొకొ యని ♦ ప్రాకటమతి

---

1 ఈయధ్యాయమున నభయప్రదానపద్ధతి వర్ణింపఁబడుచున్నది ఈఘట్టమున గోవిందరాజ ప్రభృతులు ప్రపత్తిమార్గ మాశ్రయించి యీయధ్యాయమునఁ గొన్నిశ్లోకములకు విశేషార్థములు వ్రాసిరి. అవి యన్నియుఁ దెనుఁగునఁ జేర్చినశ్లైన వీథిపురాణము చెప్పినట్లగు ఇంతియకాక యీ యర్థములు కేవల మూహాలచే నిర్మింపఁబడినవి. ఒక్కదృష్టాంతము చూపి విరమించెద శ్లో ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః-అనియూ అనేన శ్లోకేన భగవద్విముఖానాం దేశస్య త్యాజ్యత్వం తత్సంబంధిదేశస్య పరమప్రాప్యత్వం చోక్తమ్-అనివ్యాఖ్య. ఇట్లే యర్థములు కల్పితములు. కానఁ దత్సార మిట గ్రహింపఁబడి కథాసంవిధానభంగకరము గాకుండునట్లు తెనిఁగింపఁబడిన దని గ్రహించుటయే సరసము. 2 తం మేరుశిఖరాకారం దీప్తా మివ శతహ్రదాం, గగనస్థం మహీస్థా స్తే దదృశు ర్వానరాధిపాః - అనియూ. 3 త మాత్మపంచమం దృష్ట్వా-అనియూ. నల్వురు మంత్రులపేరులు వ్యాఖ్యనుండియే గ్రహింపఁబడినవి

విభవులై తగు కపి♦వీరులతోఁ గూడి మంతనం బొనరించె; ♦ నంత నొకము
హూర్తమాలోచించి♦యుగ్రబలాఢ్యులౌ హనుమదాదులఁ జూచి♦న్యాయరీతి
తే. నుత్తమంబయి హితమయి ♦ యొప్పుచున్న
వాక్యమును బల్కె; నాయుధ♦వారధారి
యగుచు నల్వురు రాక్షసు ♦ లనుచరులయి
రాఁగ నెదురుగ వచ్చెడు♦రాక్షసుండు. ౪ 492

క. కనుఁగొనుఁ డాతండే యిట, మనలం బరిమార్పఁ బూని ♦ మహితజవమునన్
జనుదెంచుచున్నవాఁ డిదె, వినుఁ డింతయు శంక లేదు ♦ వీఁ డట్టిండౌ. ౫ 493

చ. అని వచియింప నవ్వనచ♦రాధిపుమాటలు నాలకించి యా
వనచరవర్యు లందఱును ♦ వైళమ వృక్షములన్ గిరివ్రజం
బును గ్రహియించి పల్కిరి; వి♦భూ! యతివేగమ యాజ్ఞ యిమ్ము నీ
యనుమతి లేక చేయఁదగ ♦ దారయ నేపనినైనఁ గావునన్. ౬ 494

తే. ఈదురాత్ముల వనియింప♦నే యనుజ్ఞ
యిమ్ము సంశయ మేల వీ ♦ రెన్న నల్ప
తేజు లౌటను హతులయి ♦ త్రెళ్లువారు
ధరణిపై; నని వారి ట్లు♦దాత్తభంగి. ౭ 495

చ. పలుకుచునుండ నెవ్వ రెటు ♦ పల్కిన సర్వవిదుండు రాముఁ డి
మ్ములు ననుఁ గాచునన్నహిత♦ముం గడు నమ్మి విభీషణుండు న
ప్పలుకుల నెన్న కత్తఱిని ♦ వారిధియుత్తరతీరమొంది యే
చలనము లేని చిత్తమునఁ ♦ జక్కఁగ నిల్చెను నభ్రమందు నే. ౮ 496

చ. అనుపమబుద్ధివైభవము ♦ నందినయట్టి విభీషణుండు చ
క్కని సదుపాయముం దెలియుఁ ♦ గావున నంబరసీమనుండి యే
వనచరపుంగవుల్ ప్లవగ♦వారవిభుండును నాలకింప ని
ట్లనియె మహాధ్వనుల్ తనరు♦నట్లుగ స్వార్తియుఁ దెల్లమౌఁగతిన్. ౯ 497

సీసమాలిక: —

*ఆహారనిద్రాభ♦యగ్రామ్యధర్మంబులందు నేనియతి లే ♦ కరయదుష్ట
మైన మార్గంబున ♦ నాదృతిఁ జరియించి సార్థకాహ్వయుఁడయి♦యఖలరాక్ష
సాధీశుఁడై తగు ♦ నసురుఁ డొక్కఁడు గలఁ డతనికి సహజుఁడ ♦ నతనిభ్రాత
నగు నన్ను నను విభీష♦ణాహ్వయంబునఁ బిల్తు రలదురాత్ముఁడు రాక్ష♦సాధిపుండు
గర్భవాసాదిదుః♦ఖంబుల నెఱుఁగక పరమపవిత్రయౌ ♦ పడఁతి సీతఁ
బుష్పాపచయముఖ♦భోగంబులకు నెల్ల నేకాంతభాగమై ♦ యొనఁగి యాయు

1 రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః-అనిమూ. ఈ మొదలగు శ్లోకములకు నుచితరీతిని వ్యాఖ్యానాభిప్రాయము గ్రహింపఁబడినదని తెలియుందగు.

యోధ్యకం బెను జూడ ♦ నుత్కృష్టమై మునిసమ్మతంబగు జన♦స్థాన మనెడు
తావున నుండి య♦త్యంతభక్తుం డగు నట్టి జటాయువుఁ ♦ బట్టి చంపి
బలిమిని గైకొని ♦ వచ్చి కారాగారమం దుంచినాఁడు; సీ♦తాంగనయును
వివశయై దీనయై ♦ వికృతవేషంబులఁ దగు రాక్షసాంగనల్ ♦ తన్నుఁ గావ
వారియధీనమం ♦ దీరీతి నున్నది; లోకాభిపూజ్యయై ♦ లోకజనని
యనఁదగు సీతకు ♦ నపకృతిఁ జేసిన యట్టిపాపాత్ము మా♦యన్నఁ గూర్చి
సామభేదాదులౌ ♦ సరణులఁ జూపెడు వివిధవాక్యంబుల ♦ విపులభావ
ములు గల్గు పల్కుల ♦ మును రాముఁ డొనరించి నట్టి ఖరాదివ♦ధాదిచిహ్న
ములచేత సీత రా♦మునకుఁ జక్కని భక్తి మరల నొప్పింపు మీ♦మాటవినుమ
యని యొత్తి చెప్పితి; ♦ వినఁడయ్యె నాపల్కుఁ గాలసంప్రేరితుఁ♦డై లయంబు
గాంచఁ దలంచెను ♦ గావున దుష్టాత్ముఁ డైన రావణుఁడు నే ♦ నరసి హితముఁ
బలుకుచునుండఁ జా♦వను గోరువాఁడు వైద్యోక్తి నాలించి య♦త్యుత్తమమగు
నౌషధంబును గొన♦నట్లు నాపల్కును నవలీలఁ దృణముగా ♦ నాత్మ నెంచెఁ;
గాని గ్రహింపఁ దాఁ♦బూనఁడయ్యెను; హితమును జెప్పుచున్న నే♦నునుగఠోర
భాషలఁ గ్రూరరా♦వణుచేత ధిక్కృతిఁ జేయఁగాఁబడి నీచ♦సేవకుగతి
నవమానితుఁడనయి ♦ [1]యంతట నుత్తమపురుషార్థరూపస♦త్పుణ్యలభ్య
రామసంప్రాప్తికై ♦ రయమున నపవర్గబాధకరూపాత్మ♦భవకళత్ర
ముల విసర్జించి రా♦మునిఁ గరుణాబ్ధిని శరణుఁ జొచ్చితి; వన♦చరగణేంద్ర!
[2]యధికారభేదమే ♦ యాత్మఁదలంపక సురనరకానన♦చరముఖవివి
ధప్రాణులకు నితాం♦తము సమాశ్రయణీయుఁడయి రఘుకులమున ♦ నవతరించి
పరమాత్ముఁడయి నిరం♦తరసమాశ్రయణీయుఁడగు రామునకు వేగ♦ముగ సమస్త
విధములఁ దన్నె సే♦వింప నెంచిన నన్నుఁ దెలుపుమా చెంతకే♦తెంచియున్న
నను విభీషణనామ♦కుని బ్రియదాసుని శరణాగతుని నీవు ♦ జవమునఁ జని
తెలుపుమా! యని రాక్ష♦సులలోన సన్మతి యైన విభీషణుఁ ♦ డేను శరణుఁ
జొచ్చితినని పల్కు ♦ శుభవాక్యముల విని సుగ్రీవుఁ డెంతయుఁ ♦ జోద్య మంది
జవమునఁ బోయి[3]ల♦క్ష్మణుమ్రోల శ్రీరాముఁ గాంచి ప్రియమునన♦క్షరము లెల్లఁ

తే. దొట్రిలంపడ రావణు♦తోడఁబుట్టు
వగు విభీషణుఁ డనెడు వాఁ♦డాత్మసచివు
లైన నల్వురు రాక్షసు ♦ లరుగు దేర
శరణుఁ జొచ్చినవాఁ డిట ♦ కరుగుదెంచె. ౧౨ 493

1 త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః-అనిమూ. 2 సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే, నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్-అనిమూ. 3 లక్ష్మణ స్యాగ్రతో రామం సంరబ్ధమిద మబ్రవీత్-అనిమూ. సంరబ్ధం ప్రేమభరా త్త్వరితోదితాక్షరమ్-అనివ్యాఖ్య.

చ. పరజనకాల! చేయఁదగు♦పద్ధతి యిద్ది యకార్య మిద్ది యం
చరయఁగనైన మంత్రమున♦యందును సేనలఁ దీర్చువ్యూహమం
దురుతరబుద్ధినిశ్చయము ♦ నొందిి యొనర్పఁగనొ నయంబునన్
బరులరహస్యము ల్దెలియఁ ♦ బంపెడుచారమునందుఁ బూని యొ
చ్చరికఁ మెలంగనొఁ గపుల♦సంతతియందును శత్రులందునన్. ౧౮ 499

తే. ఇట్టు లున్న శుభంబు నీ♦కెపుడు గల్గు;
దానవులు వీరు కోర్కెఁ జం♦దమున నూప
ములు గొనంగలవా రౌట ♦ మోసని యొరుల
కగపడక యే చరింతు ర ♦ ట్లౌటవలన. ౧౯ 500

క. [1]కనఁబడక యే యనేకులు, దనుజులు మనచెంత కిపుడు ♦ తా రరుదేరన్
గనిపెట్ట రనుచుఁదలఁచుచుఁ,జనుదెంచి యెయుందు; రెపుడు♦శత్రువు లగుచున్.

తే. కైతవోపాయముల నేర్చి ♦ కడుఁ బరాక్ర
మమున నలరుచు నుందురు ♦ మనము వారి
యందు విశ్వాస ముసుపరా; ♦ దనుచుఁ డిట్టి
వాఁడు కృత్యము దేనిని ♦ వీఁ డొనరుగు. ౧౯ 502

క. అనియెద వేమో? యీతఁడు, దనుజేంద్రునిచాడుఁడౌను ♦ దాఁ గావున నే
మన కితఁ డనుకూలుండుగఁ, గనఁబడి యిటఁజొచ్చితఁటని♦గాంచియుపమచేన్.

క. మన కెల్ల భేదముం గల్గను జేయు ననంశయంబు ♦ కడఁగి యితని క
పుని చేయ సాధ్య మగునా, యనియెదవో యట్లు చేయ ♦ ననువుపడనిచోన్.

[2]క. మన మితనియందు సమ్మక,మును జూపెడు దనుక నుండి ♦ బుద్ధిబలమునం
దనరును గావున ఛిద్రం,బును దగఁ గనిపెట్టి తానె ♦ పూనిక మెఱయన్. ౨౦౫

తే. కొట్టినను గొట్టవచ్చును ♦ నిట్టియెడల, నరులఁ గూల్పంగ వచ్చితి ♦ మతనివంక
నుండి వచ్చిన యాతని ♦ నుజ్జగింప, ధర్మమా! దానబలవృద్ధి ♦ తనరుఁ గాదె?.

[3]చ. అనుదువో యేమొ? మిత్రులకు ♦ నైన బలంబును, గాక నుండు నా
జనులబలంబు వేతనముఁ ♦ జాలగ్రహించెడు భృత్యసద్బలం
బును దగియున్నమూలబల♦మున్ గ్రహియింపఁగ వచ్చుఁ గాని శ
త్రున కనుబంధమౌ బలముఁ ♦ దోఁచినరీతిఁ గొనంగరాదు నూ!. ౨౨ 507

చ. అరిజనులందు నీతఁ డొకఁ ♦ డౌటను వీడఁగ నష్టుఁడే యగున్
బరజనసంగతిం గొనక ♦ వచ్చినవాని గ్రహింపఁ గూడదా!
యరయఁగ ధర్మ మిట్టిదగు ♦ నంచు వచింతువో యేమొ? యోవిభూ!
పరుఁడును జాతిరాక్షసుఁడు ♦ భ్రాత భవద్రిపుడైన వానికిన్. ౨౨౫ 508

---

1 అంతర్ధానగతా హ్యేతే-అనిమూ. 2 ఛిద్ర మాసాద్య బుద్ధిమాన్-అనిమూ. 3 మిత్రాట
వీబలం చైవ మౌలం భృత్యబలం తథా, సర్వ మేత ద్బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలమ్-
అనిమూ.

క. విను మీవు సోదరునిఁ జయ్యన విడిచియె నాదు చెంత ♦ కరుదెంచితివే
యనియెదవేమో?; వీఁడన, మనరిపుపక్షమునను౦డి ♦ మంత్రులతోడన్. ౨౩

తే. వచ్చియున్నాఁడు గావున ♦ నిచ్చమీఁటి
నితనిమీఁదను విశ్వాస ♦ మెట్టు లునుప
వచ్చు?; 'శరణాగతుని వీడ ♦ వచ్చునె యని
యందువో?' రావణాసురుం ♦ డనుప వీఁడు. ౨౪ 510

క. చారునికృత్యము చేయఁగ, నో రామా! యిటకు వచ్చి ♦ యుండం జను నీ
వారయ న్యాయవిదగ్ర్యుఁడ, వే రహి నీవెఱుఁగనట్టి ♦ వే ముందు నిలన్.

క. ఈలాటిమాయకానిని, నేలాగు గ్రహింపఁ దగునొ ♦ యెన్నఁగ వీనిన్
బాలిశువలె నిగ్రహమున, దేలీలగనైనఁ జేయ ♦ నిట యుక్త మగున్. ౨౫

క. అని నాకుఁ దోఁచుచున్నది;, విను! చారునిఁ జంపు టరయ♦విహితమెయనుదో
జనవర! చారునికృత్యం,బును జేయఁగ నితఁడు రాఁడు ♦ పో తలపోయన్. 513

ఆ. కుటిలబుద్ధిచేతఁ ♦ గ్రూరరావణుఁ డంప, నిట్టి వేష మూని ♦ యితఁడు వచ్చి
మాయఁ బూనె; నీవు ♦ మనలక్ష్మణుండును, నమ్మకంబుఁ జూపి♦నం దఱిఁ గని.

క. మనలఁ బ్రహరింపఁ జెంతకుఁ, జనుదెంచినవాఁడు; మనకు ♦ ధర్మ మితనియం
దును గనఁబడఁ జంపుద మీ,తని నందువొ యేమొ,రిపు వ♦తర్కితుఁడగుచున్.

సీ. ప్రాజ్ఞుఁ డౌటను దన♦పరులసైన్యముఁజొచ్చియంతరమును గాంచి♦యడరిచంపు
వారి నెల్లర, వీఁడు♦బహుసంఖ్య నేలాగు వధియింపఁగలఁడంచు♦బలుకుదేమొ,
యొకగుడ్లగూబ తా♦నొక్కట నవకాశమును గాంచి వాయస♦ములను జంపు
నట్లు చంపును గాన ♦ నాతని కపటంబు గనఁబడకయె యుండుఁ♦గనుక నిప్పు

[1] తే. డేమి చేయంగనొ నందు♦వేమొ, వీనిఁ
బట్టి వధియింపనే తగు ♦ వదలిపెట్ట
నితఁడు మారీచువలె హాని♦నే యొనరుచుఁ
గనుకఁ దీవ్రపుదండనం♦బున నితనిని. ౨౬ 516

క. వీని చతుర్మంత్రుల నిటుఁ, బూనిక వధియింపవలయుఁ ♦ బో యేలన? నా
దానవభర్త నృశంసుం,డై నెగడెడు రావణునకు ♦ ననుజుండు గదా. ౨౭

[2] చ. అనియిటు రామభక్తులగు ♦ నాకపివీరుల కెల్ల నాథుఁడౌ
వనచరరాజు వాక్యములఁ ♦ బల్కి నెఱింగినప్రౌఢ యుక్తముం
గని వచియించు నేర్పెఱియుఁ ♦ గావున దానయి యొత్తి చెప్పి రా
మునివగు పల్కులన్ వినఁగఁ♦బూనెను మౌనము దక్షుఁ డౌటచేన్. ౨౮

---

1 వధ్యతా మేష దండేన తీవ్రేణ సచివైః సహ-అనిమూ. కేవలనిరసనే కృతే మారీచవ దన ర్థకారీ స్యాత్-అనివ్యాఖ్య. 2 వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌన ముపాగమత్-అనిమూ.

చ. హరిపతివాక్యముల్ విని మ♦హాయశుఁ డౌటను దాను జెప్ప ను
త్తరమును బ్రేమ గల్గుటను ♦ దా వినఁ డీతఁ డటంచు నెంచి య
త్తరుణమునందుఁ జెంతఁ గల♦తత్త్వవిదుత్తము లౌకసీంద్రులన్
వరమతులన్ దగం గనుచు ♦ వాయుజముఖ్యుల నిట్లనెం దమిన్. ౨౯ 519

చ. వనచరరాజితం డసుర♦వర్యునిసోదరుఁ డౌ విభీషణుం
డనుదనుజున్ గుఱించి బహు♦శార్థము హేతుసమన్వితంబుగాఁ
గనఁబడఁ బల్కు వాక్యము ద♦గన్ వినినారు గదా యసంశయం
బున నిట మీకుఁ దోఁచినది ♦ పొల్పుగఁ జెప్పనగున్ ముదంబునన్. ౩౦ 520

సీ. సన్మతి యొకఁడొక♦సందర్భమునఁ జెప్పఁబలుకును విని తాను ♦ బదులు చెప్ప
కూరకుండం దగ ♦ దురుతరసంశయములఁ దీర్చి యుక్తంబు ♦ నిలుపఁ జాలు
బుద్ధిసంపత్తిచేఁ ♦ బొలిచి సమర్థుఁడై శాశ్వతశ్రేయంబు ♦ స్వాంతమందు
వాంఛించుసుహృదుండు♦బహుశార్థసంశయమొనఁగూడుతఱినిన♦న్యుండెయైన
నుపదేశమును చేయు ♦ టుచితమే కాన మీరును జెప్పుఁడీమన♦మునకుఁ దోఁచి

తే. నంత మాత్రమె యని వారి ♦ ననునయించు
నట్లుగాఁ బ్రశ్న మొనరింప ♦ హరు లతంద్రి
తులు తదీయహితంబు మ♦దులను గోరు
వారు గావునఁ బొగడుచు ♦ శ్రీరఘుపతి!. ౩౧ 521

క. తమతమభావంబుల రా,మమూర్తితోఁ జెప్పఁదలఁచి ♦ మానితచిత్తా!
గమనింపఁ ద్రిజగముల నీ,దుమదికిఁ దెలియనిది గలుగ♦దు తలఁప నెదియున్.

క. తెలిసియును వానరులకు, జ్జ్వలబుద్ధియుఁ గలదటంచు ♦ వసుధాస్థలిలోఁ
దెలియఁగ నడిగితి విట్లని, కలుషహరా! దీను నరసి ♦ కాచువ్రతంబున్. ౩౩

క. నిరతంబుఁ బూనినాఁడవు, పరమదృఢంబౌను నీదు♦పట్టుదలయు నీ
వరయఁగ శూరవతంసుఁడ, వురుధర్మాత్ముఁడవు చూచి ♦ యొనరుతు వెపుడున్.

క. తనభక్తులదగు నాదర,మును స్మరియించెదవు సాధు♦బుద్ధులయందుం
చినయంతఃకరణంబునఁ, దనరుదు విజ్ఞానసుగుణ♦తతు లలరారన్. ౩౫

సీ. ఆశ్రితవాత్సల్య ♦ మలరంగ నీ వుంట నీదుమంత్రులు కార్య♦నిర్ణయమున
మతివిభవంబు సా♦మర్థ్యంబు గలవారు గావుననే యొకొ♦క్కఁడుగఁ దోఁచి
నది సకారణముగ ♦ ననువదింతురు గాక యాదృతి మెఱయంగ♦ననిరిమంత్రు
లలరి పల్కఁగ వాన♦రాళికి యువరాజు గనుక సంగదుఁడు ని♦కామబుద్ధి

తే. విభవుఁ డౌటను నపుడు వి♦భీషణువిష
యమున సుగ్రీవరాముల♦యాశయముల

* విభీషణపరీక్షార్థ మువాచ వచనం హరిః-అనిమా,

నెఱిఁగి తాను బరీక్షార్థ ♦ మిట్టు లనియె;
నితఁడు శరణాగతుండె యా ♦ నెన్న నైన. ౩౬ 526

క. అరిచెంతనుండి వచ్చిన, పురుషుని నేరీతినైనఁ ♦ బూనికతోడన్
బరికింపఁ దగును సంశయ,పరతను గావున నె వీనిఁ ♦ బటుమతిరీతిన్. ౩౬½

క. మనము పరీక్షింపకయే, చనుదెంచెను గావు మనుచు ♦ సంరక్షింపం
జనునని త్వరపడి నమ్మక,మున కర్హునిఁ జేయఁ గీడు ♦ మూడును దానన్. ౩౭

క. దురితాత్ములు తమభావ మి,తరులకుఁ దెలియనివిధమున ♦ దాఁచుచుఁ దగునం
తరమును గాంచఁగ నెల్లెడఁ, జరియించుచు నుంద్రు వారు♦సమయ మొదవినన్.

తే. నీతిమాలియె కొట్టుదు ♦ రాతతాయు
లగుటఁ గావున దానమ♦హాపద లగు;
నర్థము లనర్థము లివి యం ♦ చాదిభాగ
మందె తగ నిశ్చయించి యం♦త్యమున వాని. ౩౮ 530

క. కైకొనుటా త్రోసివేయుటా, యేకరణిని జేయ హితమొ♦యెఱుఁగనగును నో
లోకేశ! యరయకయె పరు, వే కరుణ గ్రహింపరాదు ♦ విపరీత మగున్. ౩౮½

క. పరునందైనను గుణములు, పరికింపఁగనైనఁ గొనఁగ♦వచ్చును నట్లే
పరునందు దోషముండినఁ, బరిత్యజింపనగుఁ దఱిని ♦ బట్టి హితముగన్. ౩౯

చ. తలఁపఁగఁ జాలదోషము లు♦దారగుణమ్ములు పెక్కులున్నవా
రిలఁ గనరారుగాఁ దఱుచు ♦ నెట్లు గొనందగుఁ ద్రోసివేయనోఁ
దెలువు మటందువేమొ? విను ♦ దేవర! యీతనియందు దోషముల్
కలిగిన శంకలేక విడఁ♦గాఁ దగు సద్గుణముల్ చెలంగినన్. ౩౯½ 533

క. మనమునఁ దగ నెంచి గ్రహిం,పను దగు నని యంగదుండు ♦ పలికిన నమ్మా
టను గొని కార్యము చేయఁగ, ననువుపడనియట్టి సంశ♦యము లుండుటచేన్.

చ. శరభుఁడు చేయఁగా నపుడు ♦ శక్యముగాఁ దగునట్టు లెంచి దా
శరథిని గాంచి యిట్లనియె ♦ క్ష్మాపతిసింహ! విభీషణాఖ్యు ని
త్తరుణమునందె గైకొనక ♦ తత్త్వ మెఱుంగుటకై జవంబునన్
గరము చమత్కృతిం గనిన ♦ కాననచారుని దూత నంపనౌ. ౪౧ 535

ఆ. పనిపి సూక్ష్మబుద్ధిఁ ♦ గను వానిచే నీతి, శాస్త్రహితముగాఁగ ♦ సాధ్వసాధు
వృత్తులను నెఱింగి ♦ చిత్తమునకుఁ దోఁచు, న్యాయరీతి నవల♦నౌ నొనరుప.

సీ. జాంబవంతుఁ డంత ♦ శాస్త్రబుద్ధిని విమర్శించి గుణంబునఁ ♦ జెలఁగి దోష
రహితమై తగినట్లు ♦ రమణీయవాక్యంబు విన్నవింపఁ దలంచి ♦ యన్నరేంద్రుఁ
గాంచి యిట్లనియె; నే♦కడల విరోధంబు మనపయిం గలిగి వం♦చనయె సహజ
వృత్తిగాఁ దగు పాప♦చిత్తుఁడు రావణుఁ డఖిలరాక్షసపతి ♦ యగును గాదె?

ఆ. యతనియొద్దనుండి ♦ యరుదెంచె నీతఁడు
వానిఁ బోలి యీతఁ ♦ డౌను దుష్టుఁ

డనిన? నితఁడు వచ్చి♦నట్టిదేశము కాల
మును దలంప యుక్త♦ములుగ లేవు. ౪౪ 537

క. కనుకనె సర్వవిధంబుల, దనుజుని శంకింప నిపుడు ♦ తగు ననియెను; నం
త నచట మైందుఁడు చెంతకుఁ, జనుదెంచిన వాని విడువఁ ♦ జన దెటులైనన్.

ఆ. ఉపమచేతఁ బరుని ♦ నొగిఁ బరీక్షింపంగ
వచ్చు ననుమతంబు ♦ వఱలుచుండ
సనయమును నయము ద♦నంత నిశ్చయమును
జేయఁ జాలుశక్తిఁ ♦ జెలఁగుటఁ గదు. ౪౫ 539

క. పలికినదానిని జక్కఁగ, నిలుపుకొనం దగినశక్తి ♦ నేర్పునఁ గనుటన్
బలికె సహేతుకముగ నిస్తుల నంపతికంటె యుక్త♦ముగ రామునితోన్. ౪౬

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ తా మనమాటల నేమి చెప్పెనో
యని యిపుడే గపిం బనిపి ♦ యాతఁ డెఱుంగని యీవిభీషణున్
మనమున శంకపుట్టనటు ♦ మాటలనేర్పునఁ బ్రశ్నచేయనొఁ
జని మధురంబు గూఢములు ♦ సారముఁగల్గినయట్లు మెల్లఁగాన్. ౪౭ 541

చ. పురుషవరేణ్య! యీదనుజ♦పుంగవుఁ డెన్నఁగ దుష్టచిత్తుఁడో
పరమహితుండొ యం చరసి ♦ భావమునం దొగి నిశ్చయించి యె
క్కరణి భవన్మనంబునకుఁ ♦ గన్పడునో యట చేయు మంచనన్;
గరము శ్రుతిస్మృతుల్ చదివి ♦ కాంచినజ్ఞానము చెన్నుమీఱఁగన్. ౪౮ 542

ఆ. మంత్రివర్యుఁడగుచు ♦ మహదాత్ముఁడునగు, హనుమ యర్థవంత♦మై మనోజ్ఞ
మై వినీతమైన ♦ యట్టి హితోక్తిని, బలికె రామునితోడఁ ♦ బంతమూని. ౪౯

మ. మతిమద్వర్యుని నెల్లకార్యముల సా♦మర్థ్యంబు మీఱంగ వా
క్పతి భాషించెడు నేర్పుపొంగఁ దగు నిన్ ♦ దా దేవతాదేశికుం
డతిశక్త్యుద్ధతి మాటలాడినను నే♦మైనన్ దగన్ మీఱు నే
యితరుల్ శక్తులె; తర్కకౌశలముచే♦నే స్పర్ధచే బుద్ధిశ
క్తి తగుంగా యను నూహ స్వేచ్ఛఁగనురీ♦తిం గాక సత్యంబుగన్. ౪౯

తే. పలుకుమా నీమతం బని ♦ పరమకరుణ
మీరు నాయందుఁ జూపిన ♦ గౌరవమును
బట్టియే యిప్డు పలికెద; ♦ బార్థివేంద్ర!
యర్థము ననర్థమును హిత ♦ మ ట్లహితము. ౫౦ 545

క. కనుఁగొని నీసచివుఁడు కీశనిచయవరుఁ డంగదుండు ♦ చక్కఁ బలికె వా
క్కును దానియందు దోషము, కనఁబడుచున్నయది నాకు ♦ క్ష్మాపతితిలకా!.

క. మును ముందు పరీక్షించియె, యొనరుపఁగాఁ దగినకార్య ♦ మొక్కండును మే
దిని బొనఁగియుండ దెట్లన?, మనుజేంద్రుని కార్యములకు ♦ మనుజుని నొకనిన్.

క. మును నిశ్చయింపకున్నను, గనఁబడ దాపురుషువలనఁ ♦ గార్యఫలం బా
తనిగుణము, వానిఁ దెలియక, మును వినియోగించుటయును ♦ బోలదు గాదే.

*క. వినియోగించి గుణంబుల, గనుఁగొనుట పరీక్ష చేసి ♦ క్రమ్మఱఁ గార్యం
బున వినియోగించుటయును, గను నన్యోన్యాశ్రయాఖ్యఁ ♦ గానఁ దగనిదా.

చ. తెలియక యుండ నొక్క ప్రణిధిన్ మన మిచ్చట నుండి పంపి యి
మ్ముల నటఁ గల్గువార్తలను ♦ బోడిమిగా నెఱుఁగంగ నొ నటం
చలరుచు నీదుమంత్రి శర♦భాఖ్యుఁడు వల్కెను గాదె, యద్ది ని
ష్ఫలము సుమీ! సుదూరగత♦శత్రువునొద్దకు గూఢరీతిగన్. ౫౨౪ 550

ఆ. చారుఁ డేగి పొంచి ♦ శత్రువర్తనముల, నెఱుఁగవచ్చు మనకు ♦ నెదుట బట్ట
బయల నున్నవాని ♦ పరిసరమున కేల, పనుపవలయు దాన ♦ ఫలము లేదు.

చ. దనుజుఁ డితం డయుక్తమనఁ ♦ దప్పని దేశమునం దకాలమం
దునఁ జనుదెంచె నం చిటకుఁ ♦ దోఁచినరీతి వచించిరే కదా
మనమున నాకు సత్యముగ ♦ మంచి దిదే తఱి యర్హ దేశమే
కన నిదియంచుఁ దోఁచె నటు ♦ గావునఁ దోఁచినయంత తెల్పువాం
ఛను గనినాఁడ దాని విన ♦ స్వాంతమునం దలపోయుఁడీ తగన్. ౫౮౪ 552

¹సీ. ఈవిభీషణుఁడు నెం♦తే దురాత్ముం డధముఁడు నగు రావణుఁ,♦గడు సుగుణము
లలర నుత్తముఁడవై ♦ తలఁప మహాత్ముఁడవైన నిన్నును, మన♦మందు నెన్ని
మీయిరువురందును ♦ మిక్కిలి గల్గిన దోషగుణంబులఁ ♦ దోఁచినంత
వట్టు విచారించి ♦ వానియం దున్నట్టి సీతాపహరణాది♦కాతతాప

ఆ. రాధములను మీర ♦ రరణ్యమునం దప్పు, ఖరముఖులను జంపి ♦ ధరణి వెలయఁ
జేసినట్టి శౌర్య♦సిద్ధిని గనుఁగొని, వాని వదలి యిటకు ♦ వచ్చె టరయ. ౫౫౪

క. అతనికిఁ దగియే యున్నది, మఱి నతనికి నెవరిరూప♦మానితవృత్తుల్
గతులును దెలియక యుండునొ, హితులగు నాకపులఁ బంపి♦యే యాతనికిన్.

ఆ. అనుగవలయు ననుచు♦ననువదించిరిగదా, యావిషయమునను♦దభిమతంబు
నీతిరహితమనుచు ♦ నే నిరూపింపఁగఁ, దలఁప యుక్తి దోఁచె ♦ లలితరీతి. ౫౭

క. మన మతని స్వీకరింపక,మునుపే రావణునివిషయ♦ముల సందేహం
బును బొందక యడిగినచో, మనస్వియగు నతఁడు నిట్టి♦మాట లడుగుటన్.

క. శరణము చొరవచ్చిన ననుఁ, బరునిగఁ దలఁచిరొకో వీరు ♦ పాడియె యని యా
తురమున సందియ మొందిన, వరమతిఁ బోఁగొట్టుకొనఁగ ♦ వలసియె వచ్చున్.

---

* ఋతే నియోగాత్సామర్థ్య మవబోద్ధుం న శక్యతే, సహసా వినియోగో హి దోషవా
న్ప్రతిభాతి మా-అనిమూ నియోగే సతి గుణదోషపరీక్షణ మిత్యన్యోన్యాశ్రయః-అనివ్యాఖ్య.

1 పురుషాత్పురుషం ప్రాప్య తథా దోషగుణా వపి, దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమం చ తథా
త్వయి-అనిమూ. దీనివ్యాఖ్యలోనిభావమే యిట సంక్షిప్తము.

చ. ధరణిప! దుస్స్వభావుఁడగు ♦ దస్యువు స్వాభిమతంబుఁ దాఁచు న
క్కరణిని నైన నైపుణము♦గాఁ గనుకం దదభీప్సితంబు వే
యరయుట శక్యమే పరిచ♦యంబు చిరంబుగఁ జేసి చక్కఁగాఁ
బరమహితోక్తులం దెలియ♦వచ్చును వేఱొకభంగి గాదు నూ!. ౫౮ 558

చ. పరిపరి మాటలాడినను ♦ భావమునం దగు దౌష్ట్యముల్ దురా
చరణప్రవృత్తినిం దెలుపు♦జాడలు సుంతయు లేవు చూడఁగా
వరమతియే యితం డనఁగ ♦ భాసురవక్త్రమె సుప్రసన్నమై
పరఁగెడుఁ గాన సందియము ♦ పర్వదు నాకును వీనియందునన్. ౬౦ 559

చ. మనమున శంక లేక తన♦మాటలు దుష్టత నొందకుండఁ జ
క్కనిగతి వచ్చినాఁడు కను♦కన్ శఠుఁ డంచుఁ దలంపరాదు దు
ర్మనమున నొప్పువాఁ డిటులు ♦ రాఁడు విశంకితుఁడై నృపేంద్ర! యీ
దనుజుఁడు వంచకుం డగుచుఁ ♦ దాఁ జనుదెంచిన నట్టు లందువో?. ౬౧ 560

తే. ముఖవికారము నెవ్విధ♦మునను దాఁచి
నను బయల్పడు దాఁగి యుం♦డ నది చాల
దట్లు గాన మనోభావ ♦ మావికార
మును బలాత్కారమున బయ♦లునకుఁ దీయు. ౬౨ 561

క. విను నిశ్చయ మిది రామా!, ఘనుఁడవు కార్యజ్ఞులందుఁ ♦ గర్తవ్యము నీ
కును దెలియరాని దుండునె?, పని యెది కర్తవ్య మగునొ ♦ బాగుగ దానిన్.

ఆ. తగిన దేశమునను ♦ దగిన కాలంబునఁ, దగినపురుషులం దు♦దాత్తరీతి
నుచితముగఁ బ్రయోగ ♦ మొయ్యనఁ జేసినఁ, దగినఫలము నిచ్చుఁ♦దత్క్షణంబ.

సీ. లంకకుఁ బోవ ని♦శ్శంక వచ్చిన నీమహోద్యమంబును దుష్ట♦సోదరుఁడగు
నట్టి రావణుని దు♦ర్వ్యాపారమును జూచి ప్రబలుఁడౌ వాలిని ♦ బాణమొకటఁ
జంపినవార్తను ♦ జక్కఁ దా విని వానిపదమున సుగ్రీవుఁ ♦ బట్టభద్రు
నిగఁ జేయుటయు విని ♦ నెమ్మి సుగ్రీవునిచందమ్ముగాఁగ రా♦జ్యంబునందుఁ
దన్నభిషేకింతు ♦ దనుజేంద్రుఁ జంపుద వను తలం పూనియె ♦ యాత్మబుద్ధి

తే. పూర్వకంబుగ నిట వచ్చె; ♦ బుద్ధిఁ దమకు
శంక గల్గిన రాజ్యకాం♦క్ష నిట వచ్చె
నన్న యీవార్త నైనను ♦ మున్నిడుకొని
యితని గ్రహియింపవచ్చు నో♦యినకులేంద్ర!. ౬౪ 564

క. దనుజుని మంచితనంబును, మనమున నాకెంత దోఁచె ♦ మనుజేంద్రా! దా
నిని జెప్పినాఁడ శేషిం,చినపని నీయందె కలదు ♦ చేయఁగ నింకన్. ౬౫

క. విను మితఁడు గ్రాహ్యుఁ డగునో, దనుజుం డనివిడువ నగునొ ♦ తలపోయుము నీ
వన బుద్ధిమద్వరుండవు, గనుకఁ బ్రమాణంబు నీవె ♦ కార్యగతులకున్. ౬౬

పదునేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౮ - వ సర్గము.

{ శ్రీరాముఁడు శరణాగతరక్షణమే తన వ్రతమని దాని కుదాహరణములగు గాథలఁ జెప్పి విభీషణుం దోడ్కొని రమ్మనుట. }

చ. [1]అని యిటు వాయుజుండు హృదయంబునఁ దోఁచినయంత పల్కఁగా
విని రఘురాముఁ డంతఁ గపివీరుఁడు భానుసుతుండు పల్కువా
క్కునకుఁ గలంత నొందుమది కొంకక యష్టు ప్రసన్న మాట మా
నినిచయసంగతిన్ దగి యనేకకథల్ వినినాఁడు గావునన్. ౪ 567

చ. ఒరు లొనరించుప్రశ్నముల కొయ్యనఁ జిత్తము మాఱకుండఁగా
నిరతము నిల్వఁగాఁ దగిననీతిఁ జెలంగెడువాఁడు గాన నా
హరివరసాధువాక్కులను నారసి స్వాశయ మెల్లఁ జెప్పునా
దరమున నిట్లు పల్కె; నిఁక దానవు నీతనిఁ గూర్చి సుంతగన్. ౫ 568

తే. [2]చెప్పఁ గోరిక యున్నది చెప్పుదాని
నంతయున్ నాదుశ్రేయంబు నభిలషించు
వారు గావున వినఁదగు మీర లనుచుఁ
గోరుచున్నాఁడ; శరణును గోరి యొసఁడు. ౬ 569

క. చనుదెంచు నాదుచెంత క్రతనియం దెంతేని దోషతతియుండిననై
నను విడువ నిట్టిపని సజ్జనభూష్యమె యౌను నెన్నిసరణులఁ గనినన్. ౭ 570

చ. అనఁ గపినాయకుండు మనుజాధిపువాక్యము దాని నెమ్మనం
బునఁ బరియించి సాధుగతిఁ బూని విమర్శము చేసి యంత న
త్యనుపమనీతిమూలమయి యాదృతి రామునియందు నుంటఁ జ
క్కనిగతిగాఁ బ్రయుక్తమయి క్రాలుశుభోక్తిని జేని కిట్లనున్. ౮ 571

తే. మిగుల దుష్టుఁడుగాని దోషగణరహితుఁ డేయయినఁ గాని వీనితో నేలమనకు
దుస్తరంబగు నాపద దోఁప వెతలఁ బడెడు నన్న న దెవ్వండు వదలి చనునో.

క. అతఁ డెవ్వనిని ద్యజింపక, హితముం గనునట్టివాని కెవఁ డత్యాజ్యుం
డతఁ డౌను కృతఘ్నుం డీక్షితి ననఁ గపినాథుపలుకు చెవులం బడఁగన్. ౧౦

ఉ. నూన్నృతవిక్రముం డగుచు శోభిలునట్టి కకుత్థ్సవంశరా
ట్సూనుఁడు రాముఁ డందఱిని జూచి మదీయదృఢవ్రతంబు నీ
భానుసుతుం డెఱుంగకయ పల్కఁగఁ బూనెనె యంచు సుస్మితం
బాననసీమఁ దోఁపఁగ నృపార్హముగాఁ బలుకంగ నెంచుచున్. ౧౧ 574

చ. అనుజుని బుణ్యలక్షణుని నాదృతిఁ గాంచి వచించె నిట్టు లీ
వనచరరాజు పల్కిన సువాక్యము శాస్త్రములం బఠింప ను

---

1 ప్రత్యభాషత దుర్ధర్ష శ్రుతవా నాత్మని స్థితమ్-అనియూ దీనికి వాస్తవముగాఁ జెప్పఁదగిన యర్థమే పద్యమునఁ గనఁబడు. 2 ఈపద్యమునకు మూలమైన 'మిత్రభావేన' యను శ్లోకమునకు గోవిందరాజాదివ్యాఖ్యానాభిప్రాయము కేవలకథాసంబంధము కలదికాదు. మతధర్మములు శిష్యున కుపదేశించుగురువు చెప్పునట్టివి. కాన నిట వదలవలసివచ్చిన దని యొఱంగి క్షమింపవలయు.

న్నను గురుసేవసేయని మ♦నంబున నున్నను జెప్పరాదు సూ;
తనదుసహోదరుఁ విడిచి ♦ తా నిట వచ్చుట లోఁ దలంచినన్. ౮ 575

ఆ. మిగుల సూక్ష్మ మగుచు ♦ మించెడురాద్ధర్మ
మొకటి యున్న దద్ది♦యును జనులకు
వరుసఁ గానఁబడుచుఁ ♦ బ్రత్యక్షముగ మఱి
లౌకికముగ సుజన♦లాలిత మగు. ౯ 576

క. ధరణీశులయందఱియం,దరసిన నది గల్గినదియె ♦ యది తోఁచెడు నీ
తరుణమున నామనంబునఁ;, బరికించుచు నికటదేశ♦పార్థివు లెల్లన్. ౯౹ 577

[1] తే. జ్ఞాతులును గష్టదశ లోగి ♦ సంభవించు
నపుడు ప్రహరింతు రజ్ఞాట ♦ నరులు గాన
పరిగణింపఁగఁబడుదు, ర♦సురుఁడు వీఁడు
సోదరుని గొట్టు జ్ఞాతియై ♦ యుంట నిపుడు. ౯౹ 578

తే. వెతలఁ జిక్కినరావణు ♦ వెదకి కొట్ట
నిచటి కేతెంచినాఁడు లే ♦ కిట్టివ్యసన
కాలమున వాఁడు తనుఁ గొట్టఁ♦గలఁడ టన్న
భయమునను వచ్చియుండును ♦ బలుకు లేల?. ౧౦ 579

క. అనఘులు జ్ఞాతికులంబున, జనియించినవారునైన ♦ క్ష్మాపతులు హితం
బొనరించు జ్ఞాతులను దా,మును మన్ననచేయుచుంద్రు ♦ ముదము దలిర్పన్.
[2] క. అనఘులగునట్టి రాజుల,కును గూడన్ జగము పాప♦గుంభిత మగుటన్
ఘనగుణులగు జ్ఞాతులనున్, మనమున శంకింపఁదగు స♦మయమొనఁగూడున్.

చ. దనుజుని వీఁడు పాయుట కు♦దంతము నట్లనె యుండనిమ్ము వీ
నిని నిట నేను వీడుటకు ♦ నేరనిదానికిఁ గారణంబునన్
వినుము! వచింతు వీనిని వి♦భీషణు శత్రుబలంబు గానఁ జే
కొనఁ దగదంచు దోషమును ♦ గొప్పగఁ జెప్పితి నే నయోక్తులన్. ౧౧౹ 582

ఆ. దానియందె నీతి♦ధర్మంబుచొప్పున
వాని నే గ్రహింప ♦ నైన హేతు
వొకటి గలదు దాని ♦ నుద్యమమున నీకుఁ
దెలియఁ బలుకువాఁడ ♦ లలితభణితి. ౧౨ 583

[3] సీ. మనము వీనికులంబు♦నను జనియింపము గనుక నీతనిరాజ్య♦మునకు నర్హు
లము గాము దానిచే♦త మనకు రావణునందు వలెన్ వీని♦యందు వైర

1 వ్యసనేషు ప్రహర్తార స్తస్మా దయ మిహాగతః - అనిమూ. 2 ఏష ప్రాయో నరేంద్రాణాం శంకనీయ స్తు శోభనః-అనిమూలము లోకే పాపభూయిష్ఠతయా శోభనోపి ప్రాయేణ శంకనీయః - అనివ్యాఖ్య. 3 న వయం తత్కులీనా శ్చ రాజ్యకాంక్షీ చ రాక్షసః, పండితా హి భవిష్యంతి తస్మాద్గ్రాహ్యో విభీషణః-అనిమూ. యిట సమగ్రముగాఁ జెప్పఁబడినది.

భావము లే దాట ♦ వదలఁడు వీఁడును మనల వీనికి నిరు♦గునను బోరుగు
నను గలదేశాధి♦నాథులమును గాము గాన వీఁడును దఱిఁ ♦ గాంచి మనలఁ
బ్రహరింపఁ డితఁడును♦ రాక్షసుఁ డయ్యును మనచేతఁ దనయగ్ర♦జుని వధింపఁ

తే. జేయు నున్నాఁడు కీడును ♦ జేయఁ డట్టి
పనికి బాధక మాట; దు♦ష్టున కితనికి
నింత యూహా యదెక్కడి ♦ దెట్లు వచ్చు
నందువా? పండితుల్ గల ♦ రసురులందు. ౧౩ 584

క. కనుక విభీషణునిం గ్రై,కొనఁగాఁ దగు; నట్టిజ్ఞాతి♦కూటము సతతం
బును ననోన్యన్యము వ్యగ్రతఁ, గన కతిహర్షమున నుంద్రు ♦ గాని యొకటిగా.

ఆ. కలిసి మాత్రముండఁ♦గాఁ దలపోయరు, సమయమునఁ బరస్ప♦రము విభిన్ను
లగుదు రితనికంత♦మందలి ధ్వని బెడిదముగ వినఁగఁబడెడు ♦ దానివలన. ౧౪

క. దనుజేంద్రువలన నీతని, కనూనభయ మువ్పతిల్లె ♦ నని యెఱుఁగ నగుꣳ
గనుక నితండు స్వరక్షణ,మును గోరియె వచ్చెఁ గొనుట ♦ ముఖ్యము వీనిꣳ.

*తే. దుష్టుఁడైనను నగ్రజుఁ ♦ దొలఁగకుంట
ధర్మమగుఁ గద యందువా? ♦ ధరణియందు
సహజు లందఱు భరతుని♦సాటి గారు
నాయనా! తండ్రికిం బుత్రు ♦ లేయెడలను. ౧౫ 588

క. ననుఁ బోలియుండఁ జాలరు, నినుఁ బోలినసుహృదు లెచట♦నెఱి వెదకిననుꣳ
గనఁబడరు ధర్మమతు లి,ట్టి నరోత్తము లుంటయే గ♦డిఁది జగమందుꣳ. ౧౫

చ. అని యిటు రాముఁ డాడిన మ♦హామతి ప్రాజ్ఞుఁడు నైన సూర్యనం
దనుఁడు సలక్ష్మణుం డగుచుఁ ♦ దా నటు లేచి నమస్కరించి స
ద్వినయముతోడ నిట్లను వి♦భీషణు నాతని రావణప్రయు
క్తునిగ నెఱుంగుమా! దనుజ♦కూటము క్రూరము సుమ్ము! రాఘవా!. ౧౬

క. ఉచితజ్ఞులలో మేటివి, విచపలచిత్తుఁడవు నీకు ♦ విదితమె సర్వం
బిచటికి వచ్చిన యీతని, నెచటికిఁ జనకుండ నిగ్ర♦హించుటయె తగుꣳ.

క. అని నాకుఁ దోఁచుచున్నది;, యనఘాత్మా! కుటిలబుద్ధి ♦ నా రావణుఁ డీ
తనిఁ బంపంగ స్వవృత్తం,బును దాఁ దాఁచుకొని ప్రీతి ♦ పుట్టించి తగꣳ. ౧౭

---

* న సర్వే భ్రాతర స్తాత! భవంతి భరతోపమాః, మద్విధా వా పితుః పుత్రా స్సుహృదో వా భవద్విధాః-అనియూ. దీనివలన భరతునివంటి సోదరుఁడు, నావంటి పుత్రుఁడు, నీవంటి మిత్రుఁడు లోకమునఁ గలుగు టరిది యని యర్థము తేలును. కాఁబట్టి రాముఁడు స్వోత్కృష్టతను బొగడు కొనియె నని కొందఱూహింతురు. అట్టి భావము గలుగరాదు. సుగ్రీవునకుఁ గలిగిన శంకను బోఁ గొట్టఁ దలంచి రాముఁ డీవాక్యమును చెప్పెను. యథార్థోక్తియందు స్వప్రశంసారూపదోషమును లేదనుట స్మృతిసమ్మత మని గ్రహించి యీలాటిశంకల విడువఁదగు.

తే. మనల నమ్మించి దాన నే♦మఱిన నిన్నొ
నన్నొ లక్ష్మణునో కొట్ట ♦ నున్నవాఁడు
కాన మంత్రులతో మృతిఁ ♦ గాంచవలసి
వచ్చు మనకును; గ్రూరరా♦వణున కితఁడు. ౧౯ 593

[1]క. అనుజుండె కదా?; నమ్మక,మును నె ట్లునుపంగవచ్చు; ♦ భూపాలక! యం
చని మాటలపొందెఱిఁగిన, వనచరపతి రాఘవునకు ♦ వాక్యవిదునకున్. ౨౦

క. తెలియంగఁ బలికి యూరక, నిలువంబడె; రాఘవుండు ♦ నెమ్మి తనరఁగాఁ
బలికిన యాసుగ్రీవుని,పలుకుల నాత్మను దలంచి ♦ పరిహారంబున్. ౨౧ 595

తే. మది విమర్శించి యత్యంత♦మంగళకర
వాక్యమును బల్కె నినజుతో; ♦ వనచరేంద్ర!
విను మితం డెంతదుష్టుఁ డై♦నను నదుష్టుఁ
డైన నితఁ డేమి కీడు చే♦యంగఁ గలుగు. ౨౨ 596

క. నాకును నాయాశ్రితులకు, నేకీడు నితండు చేయ ♦ నెటులైనఁ దగం
డోకీశనాథ! క్రూరతఁ, గైకొని యెదు దనుజయక్ష♦గణమును మఱియున్.

క. [2]ధరణిం గల రాక్షసులను, బరికరములఁ గొనక నాకు ♦ స్వాంతంబున భీ
కరులం జంపు నభీష్టము, పరఁగిన నొకవ్రేలికొనను ♦ బడలుపఱుపనే. ౨౩½

సీ. ధర్మాధికారము ♦ తన కెన్న లేనట్టి పావురం బొక్కటి ♦ పగతుఁడైన
వ్యాధుఁ డొక్కండు స్వ♦వాసంబు చేరరా శీతాపనోదనా♦ద్యాతతోప
చారములను శాస్త్ర♦సరణిగా నొనరించి యాఁకలినిం దీర్ప ♦ నాత్మదేహ
మాంసంబుల నొసంగి♦మమత భుజింపుమీ యని నియోగించెని♦దందఱకును

తే. వినఁగఁబడినదియే గదా! ♦ వీరవర్య!
యాకపోతమువంటి తి♦ర్యక్కు గూడ
దనకళత్రము హరియించి ♦ తనవసతికి
వచ్చినట్టి వ్యాధునిఁ గొనెఁ ♦ బరమకరుణ. ౨౪ 599

క. ననుఁబోటివాఁ డిఁ కేమిఁగ, నొనరింపఁగవలెనొ మదిని ♦ నూహింపుము నే
ననవలెనే యిట్లని; యిం,కను వినుమా! కణ్వమునికి ♦ గాదిలిసుతుఁడై. ౨౪½

చ. మునిపతియైన కండుఁడును ♦ మున్ను మహాత్తరధర్మరూపమై
తనరుచు సత్యముం దెలుపు♦దాని నొకానొకగాథఁ జెప్పె దా
నిని వచియించెదన్ వినుము ♦ నీవు! హరీశ్వర! శత్రుసూదనా!
తనకరయుగ్మమున్ ముడిచి ♦ తన్నును గావు మటంచు వేఁడుచున్. ౨౬½ 601

క. శరణము చొచ్చిన వానిని, బరమక్రూరుఁ డని తనకుఁ ♦ బాటిల్లెడు దు

1 వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌన ముపాగమత్-అని మూ. 2 అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర-అని మూ.

స్తరమగు నపవాదంబును, హరింప శత్రువునునైన ♦ నగు గ్రహియింపన్.

తే. అంతియే గాని నొంపరా ♦ దతని నెపుడు;
భయముపడిగాని భీతిచేఁ ♦ బడలినట్టు
లభినయించుచుఁ గాని యా♦యహితవితతి
నుండి యొక్కండు వైరియే ♦ యుండ లేక. ౨౮ 603

చ. తనమది నెంతయుం బగను ♦ దార్కొనుదానిని లోనడంచుకొం
చును శరణాగతుండయిన♦చో గురుశిక్షితుఁ డౌచు నీతి యం
దును గడు నమ్మకంబుగల♦దోషవిదుండు స్వకీయజీవితం
బును విడనాడియైనఁ బని♦పూని రిపుం దమిఁ గావఁగాఁ దగున్. ౨౮౹ 604

చ. శరణము చొచ్చువానిఁ దన♦శత్రువుఁ గాచిన నెట్టిభీతి యొ
క్కరణిని వచ్చునో యను ని♦కామభయంబునఁ గాని, శాస్త్రవి
స్ఫురదురుభావముం దెలివిఁ ♦ బొందనిహేతువుచేతఁ గాని, యా
యరివలనన్ స్వలాభమును ♦ నాత్మను గోరియొ కాని, స్వేచ్ఛచేఁ
గరఁగుమనంబుచే నయినఁ ♦ గాని, స్వశక్తికి నర్హమాగతిన్. ౨౯ 605

తే. న్యాయరీతిని వానిని ♦ నరసి కావ
కుండుటయొ పాపహేతువౌ ♦ నుర్వి నెల్ల
వారు నిందింతు; రొక్కఁడు ♦ వైరి యొకని
పరిసరముఁ జేరి వానిని ♦ శరణు చొరఁగ. ౨౯౹ 606

తే. [1]వాఁడు రక్షింపఁదగుశక్తి ♦ వఱలి కావ
కూరకుండిన శరణార్థి ♦ యుగ్రశత్రు
హతుఁడై యైన నరక్షకుఁ ♦ డాదినుండి
చేసి యున్నట్టి సుకృతంబుఁ ♦ దీసికొనుచు. ౩౦ 607

క. దానికి ఫలముగ నాతఁడు, పోనర్హమునైనపదముఁ ♦ బొందును దానే;
గానన్ శరణాగతుఁడగు,వానిన్ రక్షింపకున్న ♦ వచ్చు నఘము నూ!. ౩౧

ఆ. [2]అట్టు కావకుంట ♦ నమరపదంబునఁ, బొందఁజేయ దఘము♦నొందఁ జేసి
నరకమునకుఁ ద్రోయు ♦ నైజయశస్సును, బాడుసేయు వీర్య♦బలము లడఁచు.

క. అని కండుమునీంద్రుఁడు చెప్పినయుత్తమసూనృతోక్తిఁ ♦ బ్రియమున నేనుం
బనిపూని యొనర్చెద; న, మ్మునివాక్యము పాపహరణ♦మును ధర్మంబున్. ౩౨

క. అనుపమయశము నొసంగం,గను దగునది ఫలము నిచ్చు♦కాలంబున దే
వనికాయసేవితంబగు, ఘనపదము నొసంగునదియుఁ ♦ గావునఁ గొనుదున్.

---

1 ఆదాయ సుకృతం తస్య సర్వం గచ్ఛే దరక్షితః-అనియూ. 2 అస్వర్గ్యం చాయశస్యం చ బలవీర్యవినాశనమ్-అనియూ.

ఆ. [1]ఒక్కమాఱు కావు ♦ మో యయ్య నీవాఁడ
నార్తిబాధితుండ ♦ ననుచు నన్ను
గోరునేని భూత♦వారంబువలన నే
భయము గల్గకుండు♦పద్ధతిగను. ౩౩ 612

క. వానికి నభయ మొసంగుదు, నా నిశ్చయ మిద్ది వ్రత మ♦నంగా నిదియే;
వానరనాథా! విన్నే, జానుగ వరియించినట్టి ♦ శరణాగతునిన్. ౩౩½ 613

తే. ఈవిభీషణుఁ దోడ్కొని ♦ యిటకు రమ్ము
శరణుచొచ్చితి నన్నపై ♦ సంతసమున
నభయ మొసఁగితి, నప్పని♦యైన దితఁడు
శరణుసొచ్చిన యవ్విభీ♦షణుఁడు కాని. ౩౪ 614

క. అనుజునివేషంబును గైకొని వచ్చిన దుష్టమతియుఁ ♦ గ్రూరుఁడు నగు నా
దనుజేంద్రుఁడు గానీ వే, చని తోడ్కొని రమ్ము యెట్టి♦శత్రుని నైనన్. ౩౪½

చ. అని యిటు రాముఁ డాడఁ బ్లవ♦గాధిపుఁ డల్లన నాలకించి య
ద్దనుజవరేణ్యుఁడైనఁ దమిఁ ♦ దాలిచి తోడ్కొని రమ్ము నీవె యం
చని తనసమ్మతిం గొనఁగ ♦ నాత్మఁ దలంచుచుఁ జూపినట్టి మై
త్రి నెఱిఁగి లోనఁ బొంగి కుల♦దీపకు రామునిఁ గాంచి యిట్లనున్. ౩౫½

సీ. ధర్మజ్ఞుఁడవు లోక♦తతినాయకుండవు పరులకు సుఖముఁ గూ♦ర్పంగ నున్న
వాఁడవు సన్మార్గ♦వర్తివి, సర్వశక్త్యన్వితుండవు నీవు ♦ హర్షదముగఁ
బలుకుట చిత్రమే♦భంగిఁ గానగు నీకు సహజమే యిది; నన్ను♦ స్తవమొనర్చి
ఫలమేమి నీకు ని♦మ్ములఁ గృపగల్గిన నే కదా ఫలమని ♦ యెంతువేమొ?

తే. [2]నీమనంబునకే కాక ♦ నీదు నితనిఁ
జంపు మన్న నాయాత్మకు ♦ నైత మితఁడు
శుద్ధుఁడే యని తోఁచెడుఁ ♦ జుమ్ము నీవు
హనుమయును జెప్పినట్టివా♦క్యములఁ బట్టి. ౩౬ 617

తే. ముఖవికాసాదిలక్షణ♦ములను బట్టి
చక్కఁగా ననుమానించి ♦ రక్కసుగళ
నిసదమునఁ దోఁచుసద్భావ♦మును గ్రహించి
మఱియు నెన్నో విధంబుల ♦ గుఱుతు లెఱిఁగి. ౩౬½ 618

క. చక్కఁగఁ బరీక్ష చేసితి, నిక్కమ మిది రామచంద్ర! ♦ నెఱిఁ బ్రాజ్ఞుండై
యిక్కడకు వచ్చి శరణని, మిక్కిలి నిను వేఁడుచున్న ♦ మేటిదనుజునిన్. ౩౭

క. మాతోఁ సమునిగఁ దలఁతుము, చేతంబున నింక మైత్రి ♦ సిద్ధించెను గా

---

1 సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ-అనియూ. 2 మమ చాప్యంతరాత్మాయం శుద్ధం వేత్తి విభీషణం-అనియూ.

నీతనితో మాకును, నా, బ్రీతుండై వానరేంద్రు ♦ విమలోక్తులకున్. ౩౮॥
క. శ్రీరాముఁడు వనచరపతి, యారాక్షసుఁ దోడితేర ♦ నాగరుడునితో
స్వారాట్టువు వలెఁ దానే, యారక్కసుఁ గలసికొనియె ♦ నాదృతి చెలఁగన్.

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౯ - వ సర్గము.

రాముఁడు విభీషణుని లంకారాజ్యమున కభిషిక్తునిఁ జేయుట.

క. రావణుననుజుఁడు ప్రాజ్ఞుం,డై వఱలు విభీషణుఁ డభ ♦ యమ్మును రాముం
డీవిధి నొసఁగఁగ హృష్టుం,డై విభుచెంతకును రాఁగ ♦ నాతుర మొప్పన్.
క. తనయందు భక్తులగు నా,యనుచరులను గూడి భూమి ♦ నటుచూచుచుఁ బ్రా
క్తనువును వినయంబున వం,చి నృపాలుని మ్రోల వ్రాలె ♦ శీఘ్రగతి తగన్.
తే. ధర్మమతియైన యాసుర ♦ తల్లజుండు
శరణుఁ గోరుచు నల్వురు ♦ సురరిపులును
దాను దివముననుండి భూ ♦ జానిచరణ
పంకజంబులపై భక్తిఁ ♦ బడియె నంత. ౨॥ 624
చ. సురరిపుతల్లజుండు కపి ♦ శూరులు కూడి యొకేమనంబుతో
నిరుపమరీతి నుండు సభ ♦ నింగిని నుండియె వచ్చి రాఘవుం
బరునిఁ బురాణపూరుషుని ♦ భవ్యమతిం గని ధర్మయుక్తమై
హారిగణహర్షదంబుఁ దగు ♦ నట్టిదియౌ పలుకొప్ప నిట్లనున్. ౩॥ 625
క నేరావణునకుఁ దమ్ముఁడ, నారావణుఁ డచట నన్ను ♦ నవమానింపం
గోరి సమస్తప్రాణుల, కారయ రక్షకుఁడవౌచు ♦ నలరెడు నిన్నున్. ౪॥ 626
చ. శరణని వచ్చినాఁడ; ఘన ♦ సంపదలన్ సఖులన్ బురంబునున్
వరుసఁ బరిత్యజించి తగు ♦ భంగిని నీవె శరణ్య మంచు నా
తురమున వచ్చినాఁడఁ గృప ♦ తో ననుఁ గావు, మదీయరాజ్యమున్
నిరుపమజీవితంబు మఱి ♦ నిశ్చలమౌ సుఖమున్ దలంపఁగన్. ౫॥ 627
తే. నీయధీనంబు; లిఁక నాకు ♦ నీదు సేవ
పరమగతి యంచుఁ బలికిన ♦ పలుకులు విని
పరమవాక్కుల నూఱటఁ ♦ బడఁగఁ బలికి
యాదరంబున *దృష్టిచే ♦ నతనిఁ గాంచి. ౬ 628
చ. కరుణ వచించె నిట్లు నినుఁ ♦ గాచితి భీతి యిఁకేల? రాక్షసో
త్కరము బలాబలంబులను ♦ దథ్యముగా వచియింపు నాకు నం
చు రహితకష్టకర్ముఁడగు ♦ క్షోణివిభుం డిటు తన్నుఁ గూర్చి యా
దరమునఁ బ్రశ్నసేయ విని ♦ దానవనాథుబలంబుఁ జెప్పఁగన్. ౭॥ 629

---

* లోచనాభ్యాం పిబన్నివ-అనిమూ.

[1]క. దనుజేంద్రుఁడు మొదలిడి యిట్లనియెన్; రాజేంద్రతనయ! ♦ యా రావణుఁ డా
వనజజుఁ డిచ్చిన వరమున, దనుజాసురతతికి భూత ♦ తతికిన్ మఱియున్. ౧౦

క. అనిమొన గంధర్వులకును, దనుమాడఁ దరంబుగాఁడు; ♦ [2]ధూర్తుండగు నా
తనితమ్ముఁడు నాకన్నయు, ఘనవీర్యుఁడునైన కుంభ ♦ కర్ణుం డలరున్. ౧౧ 631

చ. అనుపమతేజుఁ డాతఁడు ర ♦ ణావని నింద్రసమానమౌ బలం
బునఁ బోలుచున్; ప్రహస్తుఁడు; వి ♦ భుప్రవరా! భటనాయకుండు శం
భునిగిరియందు యుద్ధమున ♦ మున్ను బలంబున మాణిభద్రు నో
య్యనఁ బరుగెత్తఁ జేసెఁ; బవ ♦ నాత్మజుఁ డీతనిఁ జెప్పియుండుఁ జూ!. ౧౨ 632

సీ. రావణుసూనుఁ డ ♦ రాతిభయంకరుఁ డింద్రజిత్తనువీరుఁ ♦ డెల్లవేళ
లను శరసంధాన ♦ మును జేయువాఁడౌట నంగుళులకు దెబ్బ ♦ లంటకుండ
నల్లెము దొడిగి వీ ♦ ర్యమునఁ బొల్చి యభేద్యకవచంబు ధరియించి ♦ కార్ముకంబు
దాల్చి యుద్ధంబునఁ ♦ దానిల్చియునదృశ్యుఁడై; యుండు; నదియెట్లు ♦ లందు వేమొ

ఆ. యాతఁ డగ్నిహోత్రు ♦ నతిహోమములఁ దృప్తి
నందఁజేసి యుద్ధ ♦ మందు నలరు
వ్యూహములకు నగ్ని ♦ హోత్రునిమహిమచేఁ
గానరాక వైరి ♦ గణముఁ జంపు;. ౧౩ 633

క. ఆతనికి మహాపార్శ్వుం, డాతతబలుఁడౌ మహోద ♦ రాఖ్యుఁడు క్రూరుం
డై తగు నకంపనుఁడు వీ, రే తఱి సుసహాయులును భ ♦ టేశ్వరులు సుమీ! ౧౪

తే. కామరూపులు దిక్పాల ♦ కప్రతిములు
మాంసశోణితభక్షకుల్ ♦ మఱి యుదగ్రు
లగుచుఁ బదికోట్లు లంకాపు ♦ రాంతరమునఁ
గాపురంబున్నవారు రా ♦ క్షసులు రామ!. ౧౫ 635

క. వీరలతోఁ గూడియె సుర, వైరివిభుం డతఁడు లోక ♦ వర్యులతోడన్
బోరెను ధీరుండయి సుర, వీరులతో దిక్పతులను ♦ వెస భజించెన్;. ౧౬

చ. అనిన విభీషణోక్తి విని ♦ యాదృఢవిక్రముఁడైన రాముఁ డా
త్మను సకలంబు నెంచి బహు ♦ మానము మీఱ వచించె నిట్టు లో
యనఘ! విభీషణా! యిట ను ♦ హాస్త్రశౌర్యముచేత రావణుం
డొనరిచినట్టి కార్యముల ♦ నొక్కటి నేఁ దలపోయ లెక్కఁగన్. ౧౭ 637

క. దనుజేంద్రు దశాస్యుఁ బ్రహ,స్తుని రావణుబంధుజనుల ♦ దురమున వధియిం
చి నినుం బతిగాఁ జేయుదు, విను మిది సత్యంబు సుంత ♦ వృథగా దెపుడున్.

క. దనుజుఁడు ధరణికిఁ జెంతను, గనుపట్టు రసాతలంబు ♦ గానీ బలియుం

---

1 గంధర్వాసురరక్షసామ్ - అనిమూ. 2 రావణానంతరో భ్రాతా మమ జ్యేష్ఠశ్చ వీర్య
వాన్-అనిమూ.

డిన పాతాళము గానీ, తనగురువగు బ్రహ్మయుండు ♦ త్రైలోకంబుల్. ౧౯
క. శరణం బని చొచ్చిన నా, శరములఁ దప్పించుకొనఁగఁ ♦ జాలఁడు ప్రాణో
త్కరయుక్తుఁడైనఁ బెనుసం,గరమున రావణునిబంధు♦గణపుత్రులతోన్.
క. పౌరిపుచ్చ కయోధ్యను నేఁ, జొర నిట్లని నాకు మిగుల ♦ శూరులుగా నీ
ధరఁ దగు భ్రాతృత్రితయము, బరికించుచు నొట్టిడుదును ♦ వారలపైనన్. ౨౦
చ. అనుటయు నెట్టికార్యమును ♦ నైనను లీలఁగఁ జేయఁ జాలురా
మునినృదువాక్యముల్ దనుజ♦ముఖ్యుఁడు ధర్మహితాత్ముఁ డాదృతిన్
విని తలవాంచి మ్రొక్కి యిటు ♦ విన్నపముం దమిఁ జేయఁబూనె నీ
వని దనుజాళిఁ జంపునను♦యంబున సాయమొనర్తు నేనుఁ జూ!. ౨౨ 642
క. లంకాపురి నెదిరించెద, జంకక నాశక్తిరీతి ♦ శత్రుబలము నా
బింకముకొలఁదినిఁ జంపెద, నింకను నేమాన తన్న ♦ నెంతయుఁ బ్రేమన్. ౨౩
క. ఈరీతి మాటలాడెడు, వీరుని నాతనిని రాజ♦వీరుఁడు కరుణా
పూరిత దృష్టిం గని తమిఁ, జేరం దీసికొని కరముఁ ♦ జేర్చెఁ గవుఁగిటన్.
క. తనపిన్నతమ్ముఁ నంతటఁ, గని తుష్టుం డౌచు వేగ ♦ కడలిజలంబున్
గొనిరమ్ము మహాప్రాజ్ఞు ని,తని నాజలమునను దనుజ♦తతినాథునిగన్. ౨౪ 645
ఆ. ఇతఁడు కోరకున్న ♦ నిట్లు చేయఁగ నేనుఁ, దలచినాఁడఁ గానఁ ♦ దక్షణంబ
యసురవిభునిఁ బ్రీతి ♦ నభిషేక మొనరింపు, మిట్టి పనికిఁ దగుదు♦వీవె సుమ్ము.
క. అని రాఘవుండు పల్కం,గనె లక్ష్మణుఁడు పతియాజ్ఞఁ ♦ గపిగణముఖ్యుల్
గనుచుండ వారినిధమును, ననువుగ దనుజేంద్రుగాఁగ ♦ నభిషేకించెన్. ౨౬
ఆ. వేగ రాముఁ డవ్వి♦భీషణుపై నిట్లు, చూపినట్టి కృపను ♦ జూచి కపులు
హర్ష మలర నెఱిచి♦యామహాత్ముని రాము, బాగు బాగటంచుఁ♦బలికి రంత.
క. మంతనమున నొకతఱి హను,మంతుఁడు సుగ్రీవుఁడు గుణ♦సహితుని గీర్త్యా
క్రాంతదిగంతు విభీషణు, నంతసమునఁ బలికి రిట్లు; ♦ సాగర మెపుడున్. ౨౮
తే. దుస్తరంబగుఁ దలపోయఁ ♦ దోఁప దనధి
వరుణునకు నాటపట్టు, తీ♦వ్ర ప్రతాపు
లైన యీకపివర్యుల♦తోను మనము
దాఁటఁ గలమెట్టు లీనము♦ద్రమును జెపుము. ౨౯ 650
క. మన మీబలములతోడ న,దనదీపతియైన వరుణ♦ధాముమును జవం
బున నెట్లు దాఁటఁగలమో, యనెడునుపాయంబు తోఁప ♦ దరసిన మాకున్.
చ. అన విని ధర్మవేత్తయగు♦నాదనుజేంద్రుఁడు వారితోడ ని
ట్లనియెను; రాఘవుండు వరు♦ణాలయమున్ శరణంబు పొందనౌ
వననిధి యిద్ది రాఘవుని♦వంశమునన్ గురుకీర్తిఁ గాంచి యు
ర్విని జెలువారు నానగర♦విశ్వవిభూత్తము నాత్మజాళిచేన్. ౩౦ 652

క. మును త్రవ్వంబడి యుంటిం,దని చెప్పఁగ రాని కొలఁది ♦ నలరెడు మతిమ
ఘ్నుఁడైన సముద్రుండును, మనమున నాయుపకృతిని స♦మస్తమెఱుఁగుఁజూ!.

చ. శరణముఁ జొచ్చినంత నృప♦సత్తము కార్యము రీతి నెంచి యా
దరమున మేలు చేయుఁ దఱిఁ ♦ దప్పక యంచు విభీషణుండు సా
గరుని యుపాంతమునం దెలియుఁ ♦ గల్గిన పండితుఁ డౌటఁ దోఁచిన
ట్లరసి వచింపఁగా వినుచు ♦ నాహనుమంతుఁడు వానరేంద్రుఁడున్. ౩౨ 654

* తే. రామలక్ష్మణు లున్న యా♦భూమిఁ జేరి;
రంత విపులతరంబగు ♦ నట్టి గళము
తనరు సుగ్రీవుఁ డాదృతి ♦ దనుజనాయ
కుని శుభోక్తినిఁ జెప్పఁ బూ♦నె నిటు లెంచి. ౩౩ 655

క. తనయంత ధర్మశీలుఁడు, గనుకన్ శ్రీరాముఁ డట్లు ♦ కపిపతి యొఱఁగిం
చిన యూహ పాసనమునకు,నను మోదముఁ జూపె; రాముఁ♦డంతము దముఁ డన్.

చ. తనగురుతేజ మొల్లఁ దగ ♦ దక్షుఁడు తా నగుఁ గార్యముల్ పొస
ర్పుచు నటులయ్యు న్యాయమును ♦ బట్టి హరీశ్వరు పల్కు గారవిం
చు నటులఁ బ్రీతిమై స్వసహ♦జుం గని సుస్మితపూర్వకంబుగా
ననియె విభీషణోక్తి మది ♦ నారయ నాకును సమ్మతంబు సూ!. ౩౬ 657

క. నీకును సుగ్రీవునకును, నాకరణిని సమ్మతంబె ♦ యైనఁ బలుకుమా!
యాకపిపతి పండితుఁ డగు, నీకున్ దగు మంత్రమందు ♦ నేర్పు మిగులఁగన్.

తే. ఏది మీ కిద్దఱకు మది ♦ కిష్ట మగునొ
దానిఁ దగ నిశ్చయించి నా♦తోను జెపుఁడ;
యనిన వీరులు వారిద్దఱు ♦ రంజలులను
బట్టి రాముని కిట్లని ♦ పల్కి రపుడు. ౩౮ 659

తే. ఏయుపాయంబు తోఁపని ♦ యిత్తఱి సుఖ
ముగను గార్యంబు సాధింపఁ ♦ దగినరీతి
నివ్విభీషణుఁ డాడిన♦యీపలుకులు
మాకు నిష్టము లేల కా♦వో కృపాత్మ!. ౩౯ 660

క. ఘోరంబయి గురుతరమా, వారిధి నిద్దాని సేతు♦బంధనమున దు
ర్వార ప్రతాపమున నీఁక, వారింపక లంక కరుగ♦వచ్చునె? తలఁపన్. ౩౯

క. సురలసురులు దివిజగణే,శ్వరుఁడును నీత్రోవ విడిచి ♦ సాధింపఁగ లే

* తత స్త్వాఖ్యాతు మారేభే విభీషణోఽథ వ్యూహమ్, సుగ్రీవో విపులగ్రీవ స్సాగర స్యోపవేశనమ్-అనిమూల ఇచటఁ జెప్ప నారంభించె నని తోఁచును. అవల రాముఁ డందులకు సమ్మతించె నని యున్నది చెప్పినవిధము లేదని శంకింపరాదు. ప్రాయికముగాఁ గవులశైలి యిట్టిది. చెప్పినట్లే గ్రహింపవలయు.

రురుబలమున లంకను; నో,ధరణీశా! మంత్రశక్తిఁ ♦ దగు నీతఁడు నూ!. ౭౦౫

క. కనుక విభీషణుఁ డాడువ,చనము యథార్థంబె కాన ♦ సరగున నశ్లే
యొనరింపుఁ డింకఁ గాలం,బును నూరక పుచ్చవలదు ♦ భూపలలామా!. ౭౧

తే. చాలు నాలస్య మిత్తఱి ♦ సైన్యములను
గలిసి రావణుఁ డేలులం♦కకును బోయి
చేరునట్లు ప్రార్థింపుఁ డీ♦సింధువు నని
పల్క శ్రీరాముఁ డంతట ♦ భద్రమతిని. ౭౧ 664

*తే. నదనదీపతియా వార్ధి♦నాథుతీర
మందు దర్భలు పఱచి తా ♦ నందు వేది
యందు హుతవహుఁడుం బోలె ♦ నలరుమదిని
బవ్వళించెను గార్యంబు♦భంగి నెఱిఁగి. ౭౨౫ 665

పందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౨౦ - వ సర్గము.

{ రామాదులు లంకపైకి వచ్చుట విని శుకుఁడనువానిని రావణుఁడు పంప వానరులు వానిం బట్టుకొనుట. }

క. తరువాత లంకనుండియొ, యరుదెంచి పరాక్రమాఢ్యుఁ♦డా శార్దూలుం
డురువార్ధితీరమునఁ గపి,వరపాలితకీశబలము ♦ వచ్చి విడిసినన్. ౧ 666

క. కనుఁగొనియె నేర్పునన్; దు,ర్మనమునఁ దగి రాక్షసులకు ♦ రాజయి బలిమై
తనరెడు రావణునకు నా,దనుజుఁడు చారుండు వాఁడు ♦ తగినయుపనుతోన్.

చ. వనచరసేన నెల్లఁ గని ♦ వైళమ లంకకుఁ బోయి రావణుం
గని యిటు వల్కె; నల్లదె య♦గాధముగాఁ దగి యప్రమేయమై
వనధిద్వితీయ మిద్ది యని ♦ పల్కఁగనై కపిభల్లుకాళి లం
కను గబళింప వచ్చెడిని; ♦ గార్ముకముల్ శరవర్యములన్ దగన్. ౩౫ 668

సీ. దశరథభూపేంద్ర♦తనయు లిద్దఱు రామలక్ష్మణుల్ సోదరుల్ ♦ లలనయున్న
స్థలమునకున్ రాఁగఁ♦దలఁచియున్నా రటనతులకాంతులఁ గ్రాలు♦నాయిరువురు
సంద్రముం జేరి య♦చ్చట నిల్చియున్నారు;కపిసైన్య మది నలుఁ♦గడల నెట్లు
గాంచిన దశయోజ♦నాంచితస్థలమును నావరించి చెలంగె ♦ నతిజవమున

తే. దాని తత్వ మెఱుంగఁగాఁ ♦ దగు నృపేంద్ర!
నీదుపంపున దూతలు ♦ నేర్పు మీఱయ
నిప్పుడే చని వారల ♦ నెఱిఁగి రాఁగ
వలయు; దానము సామము ♦ వలసినట్లు ౬౫ 669

---

* సంనివేశ తదా రామో వేద్యా మివ హుతాశనః-అనిమూ.

క. ఈవిషయంబున భేదం, బేవిధమున నెద్ది తగునొ ♦ యెఱిఁగి యొనగుపం
గా వలయు దండమున కట, నేవడువున వీలు లే ద♦హీనబలము నూ!. ౮

మ. దనుజేంద్రుండగు రావణుండు తదుదం♦తం బెల్ల నాలించి చ
య్యన సవ్యగ్రమతిన్ స్వకృత్యమును జే♦యం జాలఁగా నెంచి; యే
పనినేఁ జేయఁగఁ జాలువారలను దాఁ ♦ బ్రాజ్ఞుండుగా నొప్పు నా
దనుజున్ వీరు శుకాఖ్యుఁ గాంచి పలికెన్ ♦ దాత్పర్య మేపారఁగన్. ౯ 671

క. చని నీవు వానరేంద్రుని, ఘను నాసుగ్రీవుఁ గాంచి ♦ కఠినంబే గా
క నితాంతము మృదువయుయుం,పునుగులెక్కుడు వాక్కులలరఁ♦బూనికమీఱన్.

క. నామాటలుగా నించుకయే, మీఱక యిట్టులను; హ♦రీశ్వర! వినుమా!
భూమిం బేరొందిన కుల,మౌ మర్కటములను నీది ♦ యశమునఁ బొలుచున్.

చ. కనుక నకారణంబుగఁ బ♦గం గొనకుండు, మహాబలుండవౌ
టను నిల నల్పమానవుల ♦ డాంభికులన్ గొలువంగ రాదు; పా
వనమగు బ్రహ్మవంశజని ♦ భాసిలు ఋక్షరజుండు వానికిం
దనయుఁడ వీవు కావుననె ♦ తప్పక బంధుఁడ వౌదు నాకు నూ!. ౧౦ 674

ఆ. రాము నాశ్రయించు ♦ టేమి లాభము నీకు, నాశ్రయింపకున్న ♦ హానియేమి
కనుక నిష్ఫలంబు♦గాఁ దగువైరంబు, తగదు నాకు వాలి♦తగు సఖుండు. 675

క. దానిం బట్టి సహోదరుఁ,డౌ ననఁదగు నిన్ను వాన♦రాధిప! నాతోఁ
బూనుము సఖ్యము సేయఁగ, జానకిఁ గొనితెచ్చి తప్పు ♦ సల్పితి వనెదో?.

క. మతిమంతుఁడైన నృపసుతు,సతి దొంగిలి తెచ్చినను బో♦సంగదు దానన్
మతిమంతా! కపినాయక!, క్షితి నేమియు హాని నీకుఁ ♦ జేరుము పురినిన్.

శా. ఆరంభించినకార్య మెట్లుడుగనౌ ♦ నం చాడెదో? లంకనాఁ
బా రావారసమావృతం బగుటచే ♦ వారాశినిం దాఁటి రా
నేరీతిన్ నరకీశసంతతికిఁ గా ♦ దెన్నంగ గంధర్వదై
త్యాదుల్ చేరఁగరాదు వానరులు మ♦ర్త్యాళుల్ తగన్ జాలునే. ౧౨ 678

చ. అని వచియించినాఁడ నని ♦ యాతని కెంతయుఁ జెప్పు మన్న నా
దనుజవరేణ్యునాజ్ఞఁ గొని ♦ తత్క్షణ మాశుకుఁ డొక్కపక్షియై
చనఁదగు నంచుఁ దత్తనువు ♦ జానుగఁ గ్రాలఁగ నభ్రవీథి కొ
య్యనఁ జని వానరాళిగల♦యచ్చటికిన్ నడిఁ బోయెఁ బూన్కితోన్. ౧౩

క. వననిధిమీఁదను వినువీ,థిని బహుదూరమ్ము పోయి ♦ తీరంబున ను
న్ననిఖిలసైన్యము గని యా,వినువీథిన యుండి యతఁడు ♦ వేడుక మీఱన్.

*క. తనతోఁ దురాత్ముండగు, దనుజేంద్రుఁడు పల్కినట్లు ♦ తప్పక వినిపిం
చెను సుగ్రీవుని గని; యా,వనచగు లమ్మాటలు విని ♦ వానిన్ బలిమిన్. ౧౪

* సర్వ ముక్తం యథావిష్టం రావణేన దురాత్మనా-అనిమూ.

తే. పట్టుకొని పిడికిళ్లను ♦ గొట్టి పక్ష
ములను విఱుగంగఁ జేయఁగ ♦ నెలమి మింటి
కెగసి ముట్టడి సల్పి ర ♦ క్లేశమిాఱ
బలిమి నాతనిఁ గైకొని ♦ వార లంత. ౧౯ 682

క. పడఁద్రోయఁగ నటనుండియు, పుడమిని వేగముగఁ బడియు ♦ భూరికపీంద్రుల్
కడువడిఁ బీడింపంగ శుకుఁడు రామునిఁ బేరుకొనుచుఁ ♦ గొంకక పలికెన్.

క. దూతల వధింప రెవ్వరు, చేతస్సులఁ గరుణ లేక ♦ చేరి వధింపన్
బ్రీతులయిరి వానరు లిట, నీతతి వల దనుచు నిలుపు ♦ మికఁ జక్కంగన్.

సీ. ప్రభువు వచించిన ♦ పల్కును జెప్పక యెవ్వఁడు స్వమతంబు ♦ నితరులకును
బలుకునో తనకుఁ జె♦ప్పినమాట చెప్పిన యాదూత వధకర్హుఁ ♦ డగునుజుమ్ము;
శుకుఁ డిట్లు చాల నే♦డ్చుచుఁ బల్కినట్టి యావచనంబు విని రఘు♦వర్యుఁ డతనిఁ
గరుణించి తాడన♦కర్మము నొనరించువనచరేంద్రులఁ గని ♦ యనియె వీనిఁ

[1]ఆ. జంపఁ బూనకుఁ డికఁ ♦ జాలు నంచని పల్క
నతఁడు విడువఁబడుచు ♦ నాకపికృత
పీడనమున దృఢత ♦ వీడి తేలిక గని
నట్టిపక్షములను ♦ నభ్రమునకు. ౨౧ 685

క. చనఁ జాలి వనచరేంద్రున, కనియెన్ మరలను; హరీశ! ♦ యతిశయబలమున్
గని శక్తియలర విక్రమ,ముసఁ బొల్చినవాఁడవు కపి♦ముఖ్యుఁడవు సుమా!.

క. దనుజుండు లోకరావణుఁ, డనఁబడు వాఁడొను గాదె ♦ యట్లగుటను నే
నును నీవలనం బ్రతిభా,షను గొనకయె పోయినంతఁ ♦ జంపును నన్నున్. ౨౨

ఉ. కావున నేమి చెప్పఁదగుఁ ♦ గార్యము దాని వచింపు మన్న; నా
రావణుదూతవాక్కుఁ గపి♦రాజు మహాబలశాలి వించు నా
రావణుదూతతో ననియె ♦ రాముని మైత్రి [2]నదీనసత్త్వుఁడై
నీవిభుచెంత కేగి యవి♦నీతుని నాతనిఁ గాంచి యీగతిన్. ౨౩ 688

క. నామాటలుగాఁ జెప్పుము, నామిత్త్రుఁడ వీవు గావు ♦ నాకుఁ గరుణ నీ
పై మరలింపన్ హేతువ,దేమాడ్కిం గనినఁ దోఁప ♦ దించుకయైనన్. ౨౪

సీ. [3]ఉపకారమును నాకు ♦ నొక్కఁపు డేనియుఁ జేయలే దటుగాన ♦ నేయెడలను
బ్రియుఁడవు గావు నా♦ప్రియమిత్త్రుఁడౌ రాఘవున కీవు నీబంధు♦జనులు వైరు
లగుటచే నాకును ♦ బగవాఁడవే యౌదు; వుపకార ముంశని♦మ్మసబలుఁడను
వాలిమిత్త్రుఁడ నౌట♦భ్రాతృతుల్యుండవు గద! యుంచుఁ బల్కు దో♦కడువిరోధి
ఆ. యైన వాలివోలె ♦ నంతంబు నొందింప, నర్హుఁడ వగు దీవు ♦ హరియునైన

1 న చ పత్త్రలఘు ర్భూత్వా-అనిమా. 2 తూర్ణ మదీనసత్త్వః-అనిమా. 3 న చోపకర్తా
౭సి న మే ప్రియోఽసి, అరి శ్చ రామస్య సహానుబంధః-అనిమా.

నాపురంబుఁ జొరఁగ ♦ నోపునే యంటివే, నిన్ను నీదుసుతుల ♦ నీబలముల.
క. నీదాయాదుల బంధుల, నే దయయే లేక పూన్కి ♦ నీఱొనరింతుఁ;
నాదగు భూరిబలంబును, గాదనక ఘనత్పురంబుఁ ♦ గని భస్మముగన్. ౨౩
తే. చేయఁ జాలును; మఱియొక ♦ మాయఁ బూని
వేఱు స్థలమునకుం బోవు♦విషయమందు
నేమి యొనరింతు వంటివా! ♦ యింక మూఢ!
సురలు సురపతియును వచ్చి ♦ యరసి నిన్ను. ౨౪॥ 692
తే. కాచినను, నీవు నెక్కడఁ ♦ గానఁబడక
పోయినను సూర్యద్వారంబు ♦ పొంతనున్న
నల్లె పాతాళమున కేగి ♦ యందు నున్న
రాముచేఁ జానకుండంగ ♦ రాదు సుమ్ము. ౨౫ 693
చ. జనపతి వైచు బాణములు ♦ సత్వరమే నినుఁ జుట్టుముట్టి లో
కనిచయమందు రాక్షసులు ♦ గాని పిశాచములైనఁ గాని గా
వను దగునట్టి యామసుర♦వర్యులు గాయకులైనఁ గాని నా
మనమునఁ జూడ లేరు కృప♦మైకొనఁ గావవలంతు రెవ్వరున్. ౨౬ 694
తే వృద్ధుఁడై యసమర్థుఁడై ♦ వెలయు నాజ
టాయువును జంపినందున ♦ నే యశంబు
వీర్యవిషయంబునన్ నీకు ♦ వెలయఁ గలదో;
యతివఁ దెచ్చెదుతఱిఁ జేయు♦సనువు గాక. ౨౭॥ 695
క. ఊరకయుండెను గద మా, శ్రీరాముం డిప్పు డేమి ♦ చేయు ననెదవో
యారమణి విశాలాక్షిని, భూరగుణుఁడు రాముఁ డున్న♦పుడు కాకున్నన్.
క. ఆతనితమ్ముఁడు లక్ష్మణుఁ, డాతరుణికిఁ గాంతనున్న ♦ యపుడే నీవి
ఖ్యాతబలంబు గనంబడె, నాతఱిఁ దెచ్చితివె? వార ♦ లట లేనియెడన్. ౨౮॥
క. కొనివచ్చినావు దానన్, గనఁబోవునసర్థ మెన్నఁ♦గా లేవిసిరో;
ఘనబలుని మహాత్ముని దేవనికరదుర్ధర్షు రాము ♦ నతివిక్రమునిన్. ౨౯ 698
ఆ. నీకు నంతకుం డ♦ని యిపుడును నెఱుంగ
వనుచుఁ జెప్పు మనియె; ♦ నంత వాలి
తనయుఁ డఖిలకీశ♦తల్లజుఁ డంగదుఁ
డర్కతనయుఁ గాంచి ♦ యనియె నిట్లు ౩౦ 699
చ. హరివర! వీఁడు దూతయగు ♦ నయ్య! దురాత్మునిచారుఁడంచు నా
కరయఁగఁ దోఁచుచున్న దితఁ ♦ డందఱిముందటనుండి యాత్మలో
వరుసఁగ నస్మదీయభట♦వారము రీతి నెఱింగినాఁడు క
ర్బురునిఁ దగంగఁ గట్టఁదగుఁ ♦ బోవఁగనీయఁగ రాదు లంకకున్. ౩౧॥ 700

తే. ఇద్దియే నాకు నిష్టమై ♦ యిప్పు డున్న
యది యనఁగ నంత సుగ్రీవు♦నాజ్ఞ నొంది
హరులు వినువీథి కెగసి యే♦యుండ లేని
పగిది నేడ్చెడు శుకునిని ♦ బట్టి కట్టి. ౩౨ 701

క. చనకుండఁ జేసి రాగ్రహ,మున మిక్కిలి చెలఁగు కీశ♦ముఖ్యులు తన్నున్
గనికరము లేక పీడిం,చిన శుకుఁడు మహాత్ముఁడైన ♦ శ్రీరాఘవునిన్. ౩౩

తే. పేరుకొని యార్చుచుం బల్కెఁ ♦ బృథివినాథ!
నాదు ఱెక్కలు విఱుచుచు♦న్నారు బలిమిఁ
గరుణ యిసుమంతయును లేక ♦ కపులు నాదు
నయనముల లాగుచున్నారు ♦ నన్నుఁ గావు ౩౪ 703

తే. [1]నిరపరాధిని నే నౌట ♦ మరణ మొందు
వాఁడ నే నిందు జననాది♦పరమపదము
నొందుదాఁక నే నెట్టి యు♦త్కృష్ట పాప
ములను జేసితినో యివ్వి ♦ తొలఁగి నన్ను. ౩౫ 704

క. నినుఁ బొందుఁ జిమ్మి యనియే,డ్చెను: రాముం డపుడు శుకుని♦చింతను విని వా
నిని జంపనీక దూత ని,తని వదలుం డంచుఁ గీశ♦తతి కాజ్ఞ యిడెన్. ౩౬ 705

ఇరువదియవ సర్గము సంపూర్ణము.

---

౨౧ - వ సర్గము.

{ రామునఁడు సముద్రునిఁ బ్రార్థించి విసికి బాణప్రయోగము సేయఁ బూన లక్ష్మణుఁడు నడ్డనుట. }

చ. [2]వననిధి వేలయందు రఘు♦వర్యుఁడు శత్రునిషూదనుండు ప్రా
ర్థనమును జేయఁగాఁ గఠిన♦దర్భలు వైచి మహాసముద్రునిం
గని కరయుగ్మముల్ మొగిచి ♦ కమ్రతరంబయి భోగిదేహ మ
ట్లనుపమమార్దవంబు గల ♦ యాత్మభుజంబును దిండుగాఁగఁ గై
కొని తమిఁ బ్రాఙ్ముఖుం డగుచుఁ ♦ గోరిక మీఱఁ బరుండెఁ బూన్కితోన్.

సీ. [3]శ్రీరామచంద్రుడ♦క్షీణబాహువు మునుపు కనకరత్నాభర♦ణనికరాంచి
తమయి యొప్పారెడుఁ♦దరుణులు సైరంధ్రులతిగభీరాశయు ♦ లాదరమునఁ

1 ఏతస్మిన్నంతరే కాలే యన్మయా హ్యాశుభం కృతం, సర్వం తదుపపద్యేథా జహ్యాం చేద్యది జీవితమ్-అనిమూ 2 దర్భాణా స్తీర్య రాఘవః-అనిమూ. దర్భాన్ శితాగ్రకుశాన్-అని వ్యాఖ్య. 3 భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకధా-అనిమూ. భుజైః పరమనారీణా మభిమృష్టమితి. రామ స్యైకదారత్వా త్పరమనారీశబ్దేన శ్రేష్ఠపరిచారికా వివక్షితాః-అని వ్యాఖ్య. దీనిచేఁ బెక్కుమంది భార్యలు కలరను దుర్వాదము పటాపంచలు కాక మానదు.

గనకకేయూరముల్ ♦ గ్రాల ముక్తారత్నభూషణంబులతోడఁ ♦ బొలుచు హస్త
ములతోడ బహువారముల చందనాగురుముఖవస్తుసముదయములనునలుగు

తే. విడియుఁ బూతలు పూసియు ♦ నింక నెన్నొ
విధములం గయిచేయఁగ ♦ వెలయుచుండు
నద్ది పరిమళయుక్తమై ♦ యలరుచుండు
నరుణచందనచర్చల ♦ నందియుంట. ౩ 707

క. బాలారుణరుచు లట్లుగ, వాలాయము చెన్నుమీఱ ♦ వఱలును; మఱియున్
మేలైన హంసతూలము,చే లలితంబైనపాన్పుఁ ♦ జేరినవేళన్. ౪ 708

క. గంగాజలగతతక్షకు,నంగమువలె లలితమగుచు ♦ నవనితనయదా
మంగళమగుశిరముపయిఁ జెలంగుచుఁ జెలువారుచుండె ♦ లలితతమంబై. ౫

చ. అని యుగతుల్యమై రిపుల ♦ కార్తిని గూర్చుచు, సజ్జనాళికిన్
ఘనతమమోదముం గలుగఁ♦గా నొనరించుచు దీర్ఘమైచు, నా
వననిధి దాఁకఁ బెంపలర ♦ నర్థులు భూమికి నాశ్రయంబుగాఁ
దనరుచుఁ జూడఁజూడ విత♦తంబయి సొంపుల కాశ్రయంబునై. ౬ 710

సీ. అప్రదక్షిణముగా ♦ నంబుల విడిచెడుతఱిని జ్యాఘాతముల్ ♦ దాల్చియుండు
నదియయి, పరిఘము ♦ ట్లతిదీర్ఘమయి గోసహస్రములన్ బ్రహ్మ♦ణాళి కొసఁగి
నదియుంచు, విఖ్యాతి ♦ నందినదై యున్న యాదక్షిణభుజము ♦ నతిసమర్థుఁ
డైన రాముఁడు దిండు ♦ నట్లొనరుచుకొని; మదిలోన నాకిప్పు ♦ మరణ మేని

ఆ. వనధితరణ మేని ♦ యొనరుఁగా కని పూన్కి
యొప్పఁ జేసికొనుచు ♦ నొగి నియతుఁడుఁ
గాయశుద్ధిఁ దాను ♦ గావించుకొని ప్రయ
తుఁడయి మౌన మూని ♦ తోయనిధికి. ౭ 711

తే. ఎదురుగా శయనించె, ని ♦ శ్లైనఁగునియమ
మునను దర్భాసనముగల ♦ మొఱకునేల
రమణ శయనించియుండఁ ద్రి♦రాత్రము లెటొ
గడచె; నయవిదుఁడై ధర్మ♦కలితుఁ డగుచు. ౧౦ 712

క. తనరారురాముఁ డీగతి, దినత్రయము నొక్కరీతిఁ ♦ దెంపున శయనం
బును గని సరిద్విభుండగు, వనరాశి నుపాసనంబు ♦ భక్తిని సల్పెన్. ౧౧ 713

*క. అతిమందమతి సముద్రుఁడు, క్షితిపతి రాముండు నియతి ♦ చెలఁగ విధిని ద
న్నతిభక్తిఁ బూజసేసిన, నతనికిఁ గన్పడక యుండె ♦ నజ్ఞతవలనన్. ౧౨ 714

క. వననిధిపయి రాముం డం,త నించు కాగ్రహముఁ బూని ♦ తనకనుఁగొనలం
దును రక్తిమమ్ము తోఁపఁగఁ, దనచెంగట నున్న చిన్న♦తమ్ముని ఘనునిన్. ౧౩

* యథార్హ మభిపూజితః-అనిమా.

క. అనుపమలక్షణుఁ గని యిట్లనియెను; సాగరుఁడు నాకు ♦ నగపడకున్నాఁ
డనుజా! యీతనిగర్వముఁ, గనఁబడెఁ గద! లోకమందు ♦ క్షమ శాంతంబుల్.
తే. తప్పు సైచుట ప్రియవాది♦తల్ మెలఁగుట
మొదలుగా సాధుసద్గుణం♦బులు దురాత్ము
లందుఁ జూపిన నసమర్థుఁ ♦ డందు రతని;
నట్టివారికిని సమర్థుఁ ♦ డెట్టిఁ డనెదో?. ౧౬½ 717
చ. వినుతులఁ దన్నుఁ దానె కడు ♦ నింతగ సంస్తుతిఁ జేసికొంచు నె
మ్మనమున నిర్దయుం జొనిపి ♦ మాటికి మాటికి వంచకుండవై
జనులను బాఱఁదోలుచును ♦ సజ్జనదుర్జనభేదహీనుఁడై
యనయము దండనంబు తగు ♦ నంచు నొనర్చుచు నున్న దుర్జనుల్. ౧౭½
క. తెలివి యన లేని జనములు, తలఁతురు శక్తునిగ; ననుజ! ♦ ధరణిని నిందుల్
దలపోయ *సామమున నే, బలవంతుం డెడుకీర్తిఁ ♦ బడయం డెవఁడుల్. ౧౮
సీ. సామముచేతనే ♦ శౌర్యవంతుండను యశమును బడయఁ డే♦యర్థుఁడయిన
ననిమొన సామంబు♦నను విజయంబును బొంద శక్యము గాదు ♦ పూని దండ
నమె వీనికిల్ సాధ♦నము సుమ్ము లక్ష్మణా! మకరాలయం బిద♦స్వచ్ఛరాళి
నిర్భిన్నమకరమై ♦ నిరతనిరుద్ధతోయంబయి యుండనౌ ♦ నరయ మకర
తే. శవము లెల్లను దేలాడ ♦ సత్వహీన
మగుచు నుండును జూడు; మ♦హాశరీర
ములఁ జెలంగెడు పాముల ♦ బలుతనువుల
[1]హాస్తిమత్స్యకరంబుల ♦ నడరి నేను. ౧౮½ 720
చ. శరములఁ ద్రుంచివైచెదను ♦ సత్వరమే కనుచుండు లక్ష్మణా!
గురుశరపంక్తి వైచి యిట ♦ గొప్పరణం బొనరించి శంఖముల్
పరఁగెడు శుక్తికావితతి ♦ పర్వెడు చేఁపలు గ్రాహముల్ నిరం
తరము భయంబునం బొదలఁ ♦ దాను బయోధియు నార్తినొందఁగల్. ౧౯½
క. ఒనరింతు; నోర్పుబలముగఁ, దనరారెడు మాకు నిద్ది ♦ తగునే యనెదో
కనుమా! లక్ష్మణ! క్షమనే, యనిశము గల దక్షు నన్ను ♦ నసమర్థునిగల్. ౨౦
క. వనరాశి వీఁడు తలఁచెను, దనమనమున నీ! క్షమయును ♦ దగునా యిఁక నీ
తనియందు; నాకు నింకను, దనరూపముఁ జూపలేదు ♦ తగు సామమునల్. ౨౧
క. అనుజా! చాపము దెమ్మా! యనిలాశనతుల్యములయి ♦ యతిభీతిని గొ
ల్పను దగు శరములఁ దెమ్మా!, వనధిని శోషిల్లఁ జేయ ♦వాఁడను నిపుడే. ౨౧½
చ. శరముల నీజడాత్మకుల ♦ సాధుహితంబును జేయనెంచ కీ
శరణి గభీరతం దనరు♦గంధిని శోషిల నేను జేయఁగా

* న సామ్నా శక్యతే కీర్తిః-అనిమూ. 1 మహాభోగాని మత్స్యానాం కరిణాం చ కరా
నిహ-అనిమూ, కరిణాం మత్స్యానాం-గజాకారమత్స్యానామ్-అనివ్యాఖ్య.

హరిగణ మెల్లఁ గాల్నడల ♦ నంబునిధిం దరియించుఁ గాక; సా
గర మిది క్షోభ మొందక ని♦కామము భీకరమై చెలంగియుఁ. ౨౨ 725

క. అతికోపంబునఁ దగు నా,వితతాంబకశక్తిచేత ♦ వెతలం గను; ను
ద్ధతిమీఱఁ గలఁచివుచ్చెద, హితముగఁ గనుఁగొనుము; నేను♦నింకక్షణమునన్.

సీ. సతతభీకరభంగ♦సంతతిఁ జెలఁగియు నన్నిప్రక్కలనున్న ♦ యట్టివేల
లను మీఱకుండు నీ♦వనరాశి బాణముల్ వైచి వేలల మీఱి ♦ వసుధపైని
బ్రవహింపఁ జేసెద; ♦ వనధిరక్షితులైన దనుజులు కావరా! ♦ యనెద వేమొ
యిపుడె, మహార్ణవం ♦ బెల్లరాక్షసులతో క్షోభిల్లఁ జేసెదఁ ♦ జూడు మీవె

తే. యనుచుఁ బల్కుచుఁ జాపంబు ♦ నవధరించి
కోపవిస్ఫారితేక్షణుండై పరఁగుచుఁ
బ్రళయకాలాగ్నివలె మండి♦పడుచు రాముఁ
డతిదురాధర్షుఁడై యుండె; ♦ నంత మఱియు. ౨౪ 727

చ. అరిభయదంబుగాఁ దనరు♦నాధనువున్ గ్రహియించి లాగి భీ
కరశరసంక్తికిన్ జగము ♦ కంపము నొంద శతక్రతుండు దు
స్తరకులిశంబులన్ విడుచు♦చందమునన్ భయదాంబకౌఘమున్
బరఁగఁగఁ జేసెఁ దేజమున ♦ భాసిలి వేగమునం జెలంగుచున్. ౨౫ 728

తే. ఆశరంబులు సర్పంబు ♦ లార్తినొందు
నట్లు వనరాశిజలముల♦యందుఁ జొచ్చె;
నవుడు విస్తృతభంగాళి ♦ యనిలఘట్ట
నమునఁ బుట్టిన భూరిర♦వముఁ గూడి. ౨౬ 729

తే. నక్రమకరసమూహమై ♦ నైజముగనె
భయదమగుఁ గావున మఱింత ♦ భయము దోఁపఁ
జేయుచుండెను; దీరంబుఁ ♦ జేరి పెద్ద
యలలు కొట్టుచునుండె వే♦లలను వరుస. ౨౭ 730

క. అలలు కలంగిన శంఖం,బులు ముత్తెపుఁజిప్ప లొకటఁ ♦ బొంగి పయికి రాఁ
బెలుచన్ బాణజ్వాలలు, గలియుటఁ బొగ లెగయ నూర్మి♦గణములతోడన్.

క. సుడివడుచుండెను బాణము, లడరుచు లోఁ జొరఁగ నందు ♦ నలరుఫణులు చ
ప్పుడు చేయుచు వక్త్రంబులు, కడు వెలుఁగన్గన్నులందుఁ♦గాంతులుపొంగన్.

క. కలవిలపాటొందెను, ను,జ్జ్వలబలముల వీర్యములను ♦ భాసిలుదనుజుల్
పలువీడల నొందిరి లో,పలనుండియుఁ దీవ్రబాణ♦పాతమువలనన్. ౩౦ 733

తే. మకరనక్రాన్వితములయి ♦ సకలజంతు
భయదములుగాఁ జెలంగు నా♦వనధిభూరి
వీచులత్యున్నతములయి ♦ వింధ్యశైల
మందరములట్లు వేలకొ♦లంది పరఁగె. ౩౧ 734

క. తిరుగుడువడెడుతరంగో,త్కరములు సంభ్రాంతసర్ప♦కర్బురతతులా
తురమునఁ దలక్రిందుగఁ బడు,గురునక్రము లొప్పుజలధి ♦ కొందలపడియెన్.

చ. అనుపమభీమవేగమున ♦ నప్రతిమానధనుస్సు లాగుచున్
ఘనశరపంక్తినిం దొడిగి ♦ కంధినిఁ గూల్పఁ దలంచుచున్ గ్రుధం
గనఁబడు నూర్పుపిందు వడిఁ♦గాఁ బ్రసరింపఁగఁ జేయుచున్ భయం
బునొసఁగఁ జాలియున్న రఘు♦భూపలలామునిఁ గాంచి యాత్మలోన్. ౩౨

తే. ఇంక నాలస్యమును జేయ ♦ నెల్లజగము
లంతమును బొందు నని సుమి♦త్రాత్మజుండు
బాణమోచన మిఁకఁ జాలు ♦ వలదు వలదు
నిలుపుమా యంచు బట్టుకొ♦నియె ధనువును. ౩౩ 737

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౨౨ - వ సర్గము.

రాముఁడు బ్రహ్మాస్త్రమును వైవఁ బూన సముద్రుఁడు ప్రత్యక్షమగుట.

క. అంతట రఘుభూకాంతుం, డెంతయు నాగ్రహము దోఁప ♦ నీవననిధి రాఁ
డింతటికి ననుచు వనధిని, బంతంబునఁ గాంచి పల్కె ♦ భయదోక్తులతోన్.

క. వనధీ! కనుమా! యిప్పుడె, నినుఁ బాతాళంబువఱకు ♦ నే శోషిల్లం
గను జేయువాఁడ; మద్విశి,ఖనికరనిర్దగ్ధసలిల♦కాండం బొప్పన్. ౧ 739

క. పరిశుష్కాకృతితో సా,గర! శోషితసలిలసత్వ♦గణము తగఁగ ని
ష్కరణిని దగు నినుఁ జేసెద, నిరతము గురుపాంసుయుక్త♦నిగఁ గను మింకన్.

చ. సలిలము లింకఁజేయ బలి♦సద్మము దాఁకను శుష్కమానుగా
యలఘుబలంబు లన్దు చన♦నౌను మహాశ్రను మొప్ప నింగినిన్
బలువిడిఁ బోవనొఁ గద? న♦భంబున నిప్పుడె పొమ్మటందువో
జలనిధి! చాపవిచ్యుతని♦శాతశరామితవృష్టి పర్వఁగన్. ౨ 741

తే. అద్దియే సేతు వగుఁ గాన ♦ నఖిలకపులు
పాదగతులను నిను దాఁటి ♦ పరతటంబుఁ
బొందఁ గలవారు; దనుజస♦మూహములకు
నాకరంబును నీ వౌట ♦ నాత్మలోన. ౩ 742

క. నాపౌరుషమును బలమును, నేపగిదిగ నుండఁ జాలు ♦ నెన్నఁగ గనుచున్
వే పరికింపక యున్నా, వీపట్టున; నాభయంబు ♦ నెఱుఁగవు సుమ్మీ. ౪ 743

క. అనుచు మహాబలుఁ డాతఁడు, వనజాసనదండసమత ♦ వర్ధిలి భీమం
బును నగు శరమును జేకొని, ఘనకార్ముకమందుఁ గూర్చి ♦ కడు నిష్ఠమెయిన్.

తే. మంత్రసంయోగమున దాని ♦ మఱియుఁ దీవ్ర
తరముగ నొనర్చి లాగె నెం♦తయును బూన్కి;
నట్లు జ్యావల్లికను లాగ ♦ నవని దివము
బ్రద్దలైనట్టు లుండె భూ♦ధ్రములు వడఁకె. ౬ 745

క. తమములు గ్రమ్మెను గడు లో,కమునం దెల్లెడల దెసలు ♦ కాంతిం బాసెన్
సమముగ నెల్లెడల నదీ, సముదయములు కొలఁకు లట్టి ♦ చంచలతఁ గనెన్.

క. వనజారిభాస్కరులు భీ,తిని దారలతోఁ గుటిలగ♦తిన్ వ్యోమమునం
దునఁ దిరిగి, రప్పు డాకస,మునఁ దమములు గ్రమ్ముకొనఁగ♦మునుకొని దానన్.

చ. ఖరకరుకాంతి మందముగఁ ♦ గన్పడ నంబర మప్పు డొప్పె భీ
కరముగఁ బెక్కు లుల్కలు ని♦కామము వెల్గుచునుండఁ గాంతిచేఁ
బరఁగినయట్లు; భీకరర♦వంబుల నభ్రమునుండి భూమిపైఁ
బరిపరి రాలెఁ బిడ్గు లొగి; ♦ వాయువు లున్నతరీతి నొప్పుచున్. ౯ 748

ఆ. [1]పొగడఁ దగినయట్లు ♦ పొరిపొరి వ్యాపించె
దాన మేఘములును ♦ దనరె నందు;
వాయువులును భూజ♦వారంబు విఱుచుచు
శిఖరములను బీడఁ ♦ జెందఁ జేసె. ౧౦ 749

క. మఱియును వాయువు చెలఁగుచుఁ, జఱుపర్వతములఁ గదల్చెఁ ♦ జిత్రముదోఁపన్
నెఱి ఘనజలదము లట న, త్తఱిసిం గూడుకొని భీతి♦దధ్వను లలరెన్. ౧౧

తే. వైద్యుతాగ్నులఁ గ్రక్క న♦వ్వడువున నవి
యే యశనులయి ధరఁ బడి♦యెను మఱియును
దృశ్యభూతగణంబు ల♦దృశ్యములగు
నాపిశాచాదిభూతంబు ♦ లతిభయమున. ౧౨ 751

సీ. కంపంబు గదుర ని♦కామభీకరముగ నశనులవలెఁ గడు ♦ నార్చుచు నేలఁ
బడి నిద్ర చెందిన♦పగిదిగ నుండియుఁ జింతాకులంబులై ♦ యింతయైనఁ
గదలలేకుండెను; ♦ గడఁగి రాఘవుఁడు బ్రహ్మాస్త్రమ్ము సంధించి♦నంత వనధి
భూత,రాక్షస,సర్ప♦పూగంబుతో మహోర్ములతోడ మిక్కిలి ♦ చెలఁగు వడిని
తే. [2]సలిలపూరంబు నెంతయుఁ ♦ గలఁగ నుండె;
నంత వనధిప్రవాహంబు ♦ వింతవేగ
మలరఁ జెలియలికట్ట నొ♦య్యన గడచుచు
నొక్క యామడ పోయె న♦త్యుగ్రభంగి. ౧౩ 752

చ. అరిజనకాలుఁడౌ రఘుకు♦లాగ్రణి రాముఁడు వేల దాఁటి స
త్వరముగఁ బాఱుచున్న యల♦వార్ధిపయిం గ్రుధఁ బూని బ్రాహ్మమా

---

1 ప్రస్ఫురశ్చ ఘనా దివ్యా దివి మారుతపఙ్క్తయః-అనిమూ. 2 యోజనం వ్యతిచక్రామ వేలా మన్యత్ర సంప్లవాత్-అనిమూ. వేలా మన్యత్ర=వేలాం వినేత్యర్థః-అనివ్యాఖ్య.

శరమును వైవఁడయ్యె; నిటు ♦ చాలఁగ లేచిన యాపయస్సునం
తరమునసుండి లేచి సుర♦ధామముగాఁ దగు స్వర్ణభూధ్రమం
దరుణుఁడు తోఁచునట్లు చెలు♦వారె సముద్రుఁడు తేజ మొప్పఁగన్. ౧౭

క. వననిధి దీప్తాస్యములగు, ఘనభుజగవ్రజముతోడఁ ♦ గట్టెదుటను దోఁ
చెను వైదూర్యమణీనిర, మన నొప్పెడు కాంతిగలిగి ♦ యందము మిగులన్.

చ. కనకవిభూషణంబులను ♦ గ్రాలుచు రత్నమయస్రజంబులున్
గనఁబడ రక్తమాల్యములు ♦ కమ్రతరారుణవస్త్రముల్ తగన్
వనరుహపత్రనేత్రములు ♦ భాసిల సర్వసుమాభిరామమై
తన రెడు దివ్యహారమును ♦ దాల్చి శిరంబున నొప్పుచుండెఁ దాన్. ౧౯ 755

సీ. [1]ఖనిజంబుగాఁ దగు ♦ కనకంబుచేఁ జేయఁబడినసొమ్ములను, ద♦ప్తగురుహాట
కాభరణంబుల ♦ నలరుచుఁ దనయందుఁ గల్గినవరరత్న♦కల్పితాభ
రణములు చెలువార♦రంజిల్లుబహుధాతువులఁ జెలంగుచుహిమ♦భూధ్రమువలెఁ
దగియుండె విపులమై♦తగు వక్షమునఁ దాల్చి యున్నముక్తాహార♦మురుకళలను
దాల్చి యుండఁగ దదం♦తరమున దివ్యమై నాయకరత్న మం♦ద నది కౌస్తు

తే. భమునకుం దోడఁబుట్టువై ♦ పాటలమయి
వెలయుచుండెను; వనరాశి ♦ విపులభంగ
సంతతులు ఘూర్ణిలం దన♦సహచరంబు
లైన ఘనములు వాయువుల్ ♦ గానఁబడఁగ. ౨౨ 756

క. తనయందలిగ్రాహంబులు, మనములఁ దగు భీతిఁ దిరుగ ♦ మఱియును దనుజుల్
వనరాశితోడఁ గలఁగఁగ, [వినుతంబగు రూప మలర ♦ వెలయుజలములన్.

ఆ. చెలఁగుచున్న గంగ ♦ సింధువు మొదలగు, హ్రాదినీదివిజులు ♦ నరుగుదేర]
నెదుటఁ దోఁచె సమ్మ♦హీశున కయ్యబ్ధి; వీర్య మలర రామ♦విభునిఁ గాంచి.

క. [2]మునుముందె తాను శ్రీరా,మునిఁ బిల్చుచు దోసిలొగ్గి ♦ ముగ్ధోక్తుల ని
ట్లనియెను శరపాణిని రా,ముని గాంచుచు, సౌమ్య! రామ♦మూర్తీ! నన్నున్.

తే. లోఁతు గాకుండు మనెదవా! ♦ వాత,భూ,జ
లాం,బరానిలము లను,భూ♦తాళి యిద్ది
పంచకము శాశ్వతంబయి ♦ పరఁగు మార్గ
మూని స్వీయస్వభావంబు ♦ మానకుండు. ౨౪ 760

చ. [3]కనుకనె నేను లోఁతుగ ని♦కామము దాఁట నశక్యమైన రీ
తిని దగియుంట నైజమగు ♦ దీనికి వేఱుగ లోఁతు లేక లం

---

1 జాతరూపమయైశ్చైవ తపనీయవిభూషితైః-అనిమూ. జాతరూపమయైః=ఆకరజసువర్ణప్రచురైః-అనివ్యాఖ్య. 2 పూర్వ మామంత్ర్య వీర్యవాన్-అనిమూ. 3 తత్స్వభావో మమాప్యేష య దగాధోహ మప్లవః, వికార స్తు భవే ద్గాధ ఏత త్తే ప్రవదా మ్యహమ్-అనిమూ.

ఘనమున కర్హమైనగతి♦గాఁ దగియుండుటయే వికారమా
మనవి యొనర్చినాఁడఁ గల♦మాటను నున్నది యున్నరీతిగన్. ౨౫½ 761

క. [1]దీనిం బట్టియె నీకడ, కేనున్ రానైతి నట్టు♦లే యుండుము నీ
వీనీరును స్తంభింపం,గా నొనరిచి మార్గ మీయఁ♦గడఁగు మనెదవో. ౨౫½

చ. ధరణివరాత్మజన్ముఁడ, వు♦దారమనీషివి ధర్మమార్గ మె
క్కరణిని గాచువాఁడవయి♦ క్రాలుదు, వేను ధనాశగాని, వ
స్తురతిని గాని, దండనము♦ తోడనె కల్గెడు నేమొ యన్న భీ
కరభయయుక్తిఁ గాని, పలు♦ గ్రాహము లాదిగఁ గల్గుజంతువుల్
పరఁగెడు నాజలంబులను♦ బాగుగ నిశ్చలరీతి నిల్పినన్. ౨౬ 763

క. వానికి బాధయె కల్గును, గానన్ స్తంభింపఁ జేయఁ♦గాఁ జాలను; నో
భూనాయక! విను నాచే,నైన సహాయంబు చేయ♦ నాదృతిఁ గనుదున్. ౨౬½

చ. బలములు నన్ను దాఁటుతఱి♦ వారిని బోయెడివారి నెల్ల నా
జలములనున్న గ్రాహముఖ♦సర్వభయంకరజంతుజాలముల్
కలుగఁగఁ జేయుబాధలను♦ గల్గఁగఁ జేయక యుండఁ జేయుదున్
బలువిడి వానరుల్ చనెడు♦పట్టున సేతువు గట్టఁ బూనినన్. ౨౭½ 765

తే. మార్గ మొనఁగూడునట్లు సా♦ముగ్రులెల్లఁ
జెదరిపోకుండులాగునఁ♦ జేయువాఁడ;
ననిన రాముఁడు వనరాశి♦ నట్టె చూచి
పలికె నట్లగునేని నా♦బాణ మిద్ది. ౨౮½ 766

క. వినవయ్య! యమోఘం బగు, ధనుస్సుపం గూర్చినాఁడఁ♦ దప్పక విడువం
జను నెందు విడుతుఁ జెప్పుమ, యనుటయు వనరాశి రాముఁ♦డాడినపలుకుల్.

[2]చ. విని యలతీవ్రబాణమును♦ వింతగఁ జూచి స్వకీయవాంఛితం
బొనరుతు నన్నవాక్కులకుఁ♦ బొంగుటఁ దేజము పొంగుచుండ రా
ముని కిటు వల్కెఁ; జారుతమ♦ముల్ ద్రుమకుల్య మనంగ నీవలెన్
ఘనయశముల్ జగంబులను♦ గాంచిన యొక్కప్రదేశ మోవిభూ!. ౩౦½ 768

క. నాయందు నలరు నయ్యది, నీయెడకు నుదీచ్య మగును♦ నిందుకదూరం
బై యున్న దందుఁ బాపులు, నేయెడలన్ దుష్టకర్మ♦మే కృత్యముగన్. ౩౧

చ. ఒనరుచువారు చూచుటకు♦ నుగ్రముగాఁ గనుపట్టువారు నే
ర్పునను మదీయదివ్యజల♦పూరము త్రావుచు నుండువార లో
మనుజవిభూ! యరాతులయి♦ మా రిల లేక చెలంగుచుంద్రు వా
రొనరుచు ఘోరకృత్యముల♦ నొక్కవిధంబునఁ బొందుచుండుదుర్.౩౨ 770

1 ఇది పూర్వశ్లోకార్థమే యగుట శ్లోకసంఖ్య అదియే వేయఁబడినది. 2 ద్రుమకుల్య ఇతి ఖ్యాతో యథా భవాన్-అనిమూ.

తే. అట్టి యాభీరముఖ్యుల♦యామహోఘ
కరములో కృత్యముల సైఁపఁ♦గాఁ దగఁ దిఁక
వారిసంస్పర్శనముగూడ ♦ వలదు నాకు
నీయమోఘాంబకము వారి ♦ నెల్లఁ జంపి. ౩౨ 771

క. తనపేరు సార్థకంబుగఁ, గనఁ జాలెదువట్లు చేయఁ♦గాఁ దగు నీకున్
మనుజోత్తము! యని వననిధి, తనతోఁ బల్కఁ విని వీర♦తల్లజుఁ డంతన్. ౩౩

క. వననిధి చూపినమార్గం,బును బట్టి వెలుంగుచున్న♦భూరిశరము వై
చెను దానిపైన; నశనిస,మనిశాతశరంబు భూప♦మండనుఁడు తగన్. ౩౪

సీ. వైచినస్థల మది ♦ వసుధయందును మరుకాంతారమను ఖ్యాతిఁ♦గాంచె నపుడు
బాణాగ్ర మాభూమిఁ ♦ బడి చీల్చుకొని పోవఁ దన్మూలమున రసా♦తలమునుండి
వారి పైకెగసె నా♦వారిచేతనె మహాధ్వనియందుఁ గల్గె నా♦బాణపాత
మునసైనయాకూప♦ము ధరిత్రి వ్రణకూప మని ప్రసిద్ధిని గాంచె♦నందుఁ బైకి

ఆ. నెగసినట్టి సలిల ♦ మెప్పుడువచ్చుచు
వనధిజలముపోల్కిఁ ♦ గనఁబడుచును
వెలయుచుండు, బాణ ♦ మిలఁ బగిల్చెడుతఱి
భయదరవ మొకండు ♦ పర్వె మిగుల. ౩౭ 774

క. ఘోరాంబకపాతముచే, నారాముం డచటఁ బూర్వ ♦ మాభీరముఖుల్
దారుణరూపులు తాఁకిన,నీరమ్ముల నింకఁజేసె ♦ నేర్పు మెఱయఁగన్. ౩౮

క. నీరము లింకుట మరుకాం,తారం బని ముజ్జగములఁ ♦ దద్భాగము తాఁ
బేరొందును; విద్వాంసుం,డా రాముఁడు త్రిదశనిభమ♦హావిక్రముఁడై. ౩౯

చ. వననిధిమధ్యభాగమును ♦ బాణశుచిన్ దహియించి యాస్థలం
బునకు వరం బొసంగె; రఘు♦భూపలలాముని డా వరంబునన్
ఘనతను గాంచుచున్ బశుని♦కాయహితాఖిలవస్తువృద్ధినిం
గని యలతావు రోగములఁ ♦ గానక మూలఫలాన్వితంబునై. ౪౦ 777

సీ. మధుయుతంబయి తగి ♦ మంచి యాజ్యము పాలు
కలిగి వాసనల మి♦క్కిలియు నెసఁగు
వివిధమూలికలచే ♦ వెలయుచు నీలాటి
భోగ్యపదార్థముల్ ♦ పొదల సతము
శుభకరస్థలమయి ♦ శోభిల్లెః నాగర
మధ్యభాగం బిట్లు ♦ మహితరామ
బాణదగ్ధంబైన ♦ వారిధి *సర్వశా
స్త్రజ్ఞుఁడౌ శ్రీరామ♦చంద్రుఁ గాంచి

* రాఘవం సర్వశాస్త్రజ్ఞమ్-అనిమూ.

ఆ. యిట్లు పలికెః సౌమ్య! ♦ యీనలుం డనువాఁడు
విశ్వకర్మసుతుఁడు ♦ వీనితండ్రి
మత్సమానుఁడౌ కు♦మారుఁడు పుట్టు నీ
కని వరంబు పత్ని♦కిని నొసంగు ౭౩ 778

క. జనియించె నీతఁ డామెకు; వనచరుఁ డీతండు సిరుల ♦ భాసిలుచుఁగా దం
డ్రిని బోలి శిల్పవిద్యల, ఘనుఁడై తగు; సేతు వితఁడు ♦ కడుఁ బూన్కి మెయిన్.

క. నాయందుఁ గట్టుఁగా కితఁ, డేయెడలం గట్టు నద్ది ♦ యించుక యైనన్
నాయుందు మునుఁగ కుండఁగఁ, జేయుచు ధరియించువాఁడ ♦ సిద్ధము రామా!.

క. తనతండ్రియంతవాఁ డయి, కనఁబడు నీతఁ డని చెప్పి ♦ కడలి యపుడె వే
చనియెను గనఁబడకుండఁగ; వనచరుఁడు మహాబలుండు ♦ వార్ధిపలుకులన్.

చ. విని తగుభక్తి లేచి రఘు♦వీరునిఁ గాంచి వచించె, నేను నా
జనకనగాగతంబయిన ♦ శక్తిని బూని విశాలసాగరం
బున రచియింతు సేతువును ♦ బోలఁగ సత్త్వమె చెప్పెఁ గంధి యుం;
చని కపికోటిఁ గాంచి జగ♦నుందుఁ దలంపఁగ దండ మొక్కలేఁ. ౭౬ 782

చ. పురుషునియందుఁ జేయఁగఁ ♦ బో యదియే సదుపాయ మందు నే
నరసెద నాదుభావ మిది ♦ యాను గృతఘ్నులయందు నోర్పు, న
క్కరణిన సామదానములు ♦ గావు కనంబఱుపంగ నిస్సిరో!
సరిదధినాయకుం డితఁడు ♦ చాల భయంకరరూపుఁడౌఁ గదా. ౭౭ 783

సీ. సగరతనూజాత♦సంవర్ధితాంగుఁడౌ నైన నాయుపకృతి ♦ నాదరింప
కీరాఘవుఁడు చంపు ♦ నిఁక నూరకుండిన నను భయంబున సేతు♦వును నొనర్పఁ
గాఁ జూచువాంఛతోఁ ♦ గట్ట స్థలం బిచ్చె; మందరపర్వత♦మందు నాదు
తల్లికి వరమిచ్చెఁ ♦ దమి విశ్వకర్మయుఁ దద్వరంబున నేను ♦ దండ్రితోడ

తే. సమముగా నున్నశక్తితో ♦ సంభవించి
నాఁడ; నీశక్తిఁ జెప్ప కిం♦తవఱ కేల?
యూరకుంటి నటందురో;♦యుదధి నాకు
స్మృతివిషయముగఁ జేసె నా♦చేవ నిజము. ౭౦ 784

క ఒరులు వచింపక నేనే, పరమాకృతి నాదుశక్తిఁ ♦ బలుకఁ బలికినన్
బరులకు విశ్వాసం బిటు, కరణి గొనర్పంగఁ దగిన♦కార్యములందున్. ౭౧

క. మనముల నిల్పదు; తథ్యము, వినుఁడీ! శక్తుండ సేతు♦విరచనయం దీ
వనచరులు కోర్కియుండినఁ, జని వెన్నుగ గాక వలయు♦సాధనరాశిన్. ౭౨

చ. అన విని యంత రాఘవుని♦యానతి నాహరియూథపుల్ ముదం
బున నొకచో శతంబులుగఁ ♦ బొంగుచు వేలకొలందిగాఁగఁ జెం

* న చాప్యహ మనుక్తో వై ప్రబ్రూయా మాత్మనో గుణాన్-అనిమా. అనుక్తః-అన్యే నానుక్తః-అనివ్యాఖ్య.

తను గల కాననంబులకుఁ ♦ దా రొగిఁ బోయిరి; పర్వతాభులౌ
వనచరవీరు లంతఁ దరు♦వారములన్ బెకలించి పూన్కిమై. ౫౩ 787

ఆ. ఈడ్చుకొనుచు వచ్చి ♦ యేపున నలుఁడున్న, యాసముద్రభాగ♦మందుఁ జేర్చి;
రట్లు వారు మద్ది♦చెట్లను నినుమద్ది, చెట్ల నేఱుమద్ది♦చెట్ల మఱియు ౫౪ 788

సీ. చంద్రవృక్షముల వం♦శములను గిరిమల్లికాద్రుమంబులఁ దాల♦గణము దిలక
తిమిశ,బిల్వంబుల ♦ *దివ్యసుమాన్వితకర్ణికారాఖ్యవృ♦క్షముల సప్త
పర్ణద్రుమాంబుల ♦ బహువిధామ్రంబుల నల్లె యశోకావహ్వ♦యములఁ దీసి
కొని వచ్చి యావారి♦ధిని నిండఁ జేసిరి వ్రేళ్లతోఁ గొన్నింటి ♦ వ్రేళ్లు విడిచి

తే. కొన్నిఁటిని నింద్రకేతువుఁ ♦ గొమరుమిగులఁ
బయికి నెత్తెడుతీరునఁ ♦ బైకి నెత్తి
తెచ్చి వైచి రట్లవ్వన♦ధిని దరువుల;
వార లింకను బూన్కిచేఁ ♦ బరుగులిడుచు. ౫౬ 789

[1] తే దాడిమములు, విభీతక♦తరుగణములఁ
దాలములు నారికేళాఖ్య♦ధరణిజముల
వకుళఖదిరంబులను నింబ♦వసుగుతీరు
హములఁ దెచ్చి మహాంబుధి♦యందు వైచి. ౫౭ 790

[2] క. తరువులు ముగియఁగ నవ్వన,చరులు మహాకాయు, లతులి♦సత్త్వులు చని భూ
ధరములఁ బాషాణంబులఁ, గరినిభములఁ బెఱికి యంత్ర♦గతులం గొనుచున్.

చ. చని వనరాశి వైచి; రిటు ♦ శైలములం బడవైవ దానలే
చెను బయికిన్ జలంబు; లిటు ♦ చివ్వున లేచిన యాజలంబు చ
య్యన నభమందునం దగిలె ♦ నచ్చట నచ్చట; వారిరాశి నా
వనచరు లెల్లెడం గలఁతఁ♦బాఱఁగఁ జేసిరి కొంక ఱంకటన్. ౬౦ 792

[3] తే. సరిగ నుండంగ నూఱుయో♦జనముల పరి
మితికి సూత్రంబుఁ బట్టి రీ♦గతి నలుండు
వారు తెచ్చినవానితో ♦ వరుసఁ గట్టె
వనధియందును సేతు వ♦వార్యనియతి. ౬౧ 793

* కర్ణికారైశ్చ పుష్పితైః-అనిమూ. 1 తాలాన్ దాడిమగుల్మాం శ్చ-అనిమూ. లోపలఁ గూడఁ దాలవృక్షములు చెప్పఁబడినవి. మూలమున రెండువోట్ల "పుటజై రర్జునై స్తాలైః" అనియు, తాలాన్ దాడిమగుల్మాం శ్చ-అనియుఁ జెప్పఁబడినది కాన నీరెండుశబ్దములకు చిఱుతాటిచెట్లు, తాటిచెట్లు అని యర్థము చేసికొనవలెను. తాలాన్=క్షుద్రతాలాన్-అనివ్యాఖ్యాకర్తలు వ్రాసియున్నారు. 2 పర్వతాం శ్చ సముత్పాట్య యంత్రైః పరివహంతి చ-అనిమూ యంత్రైః శకటాదిభిః-అనివ్యాఖ్య. 3 సూత్రాణ్యన్యే ప్రగృహ్ణంతి వ్యాయతం శతయోజనమ్-అనిమూ.

చ. అనయము ఘోరకర్ములగు♦నాకపివర్యులు విశ్వకర్మనం
దనునకుఁ దోడు సేతువును ♦ దారును గట్టుచునుండి రంత న
వ్వనచరులందుఁ గొంద ఱల♦వారిధిఁ గట్టఁగఁబట్టియున్నసూ
త్రనికరయుక్తదండములఁ ♦ దారును బూనిరి వేడ్కమీఱఁగన్. ౬౨ 794

సీ. కొందఱు శిలలపైఁ ♦ గూర్చుండి యుండిరి కొందఱు నీడలఁ ♦ గూరుచుండి
యుండిరి, రాముని♦యుత్తరవు బూని నలునకు సాయంబు ♦ కలిగినంత
దనుకఁ జేయంగ వం♦కలకొలందిని మేఘసమపర్వతాగ్రసం♦చయము చేతఁ
దృణకాష్ఠములచేతఁ ♦ దిట్టంబుగా సేతువును గట్టి; రంత న♦వ్వనచరులటఁ
తే. పైన మెత్తగనుండఁ బు♦ష్పములు కొనల
వెలయువృక్షంబులం దెచ్చి♦వేసి కట్టి;
రేనుఁగుల బోలువానరు ♦ లేచి గిరుల
వంటి పాషాణముల లీలఁ ♦ బట్టుకొనుచు. ౬౩ 795

క. పరుగెత్తుచుండఁ గొందఱు, గిరిశిఖరంబులను వేగ♦కేలం గొనుచుం
బరుగిడుచుండిరి చూడఁగ, నరుదుగ; నప్పుడు సుమహాబ్ధి♦యం దుపలములన్.
ఆ. విసరివేయుచుండఁ ♦ బెనుపర్వతంబులఁ
బడఁగఁ ద్రోయుచుండఁ ♦ బటురవంబు
గలిగె, నేన్గులట్టి ♦ కపులు హర్షంబునఁ
ద్వరను బూని తొలిది♦వసమునందు. ౬౬ 797

క. జలధిఁ బదునాల్గుయోజనములు సేతువుఁ గట్టి రంత ♦ మునుకొని భీతిం
గలిగించుతనుబలంబుల, వెలయుకపీశ్వరులు రాము♦విభు నానతిచేన్. ౬౭
క. ఇరువదియోజనములు సత్వరగతి రెండవదినంబు ♦ దాఁటక యుండన్
గరము రచించిరి సేతువు; గురుకాయులు వార లంతఁ ♦ గోరిక మీఱన్.
చ. ఇరువదియొక్కయోజనము ♦ లేపున మూఁడవనాఁడు గట్టి ర
వ్వరుస మహాజవంబుగల♦వానరకూటం ద్వరఁ బూని చక్కఁగా
నిరువదిరెండుయోజనము ♦ లేచి చతుర్థదినంబునన్ రచిం
చిరి; యిటు పంచమాహ్నమున ♦ శీఘ్రముగాఁ బనిచేసి యబ్ధిలోన్. ౬౮
తే. ఆసువేలాద్రిపర్యంత ♦ మమరఁ గట్టి, రట్లు యిరువదిమూఁడగు♦నామడలను
విశ్వకర్మకుమారుఁడు ♦ విపులతేజుఁ, డధికబలుఁడు నలుండు కీ♦శాళిఘనుఁడు.
చ. జనకుని బోలి సర్వవిధ♦శక్తులతోఁ జెలువారుఁ గాన స
వ్వనధిని గట్టె సేతువును ♦ వైళము పూర్ణముగాఁగ; సంతతా
ఘనమకరాలయంబునను ♦ గట్టినసేతువు సుందరంబుగాఁ
దనరుచు శ్రీయుతంబగుచుఁ ♦ దా వినువీధిని జూడఁ జోద్యమై. ౭౨ 802
క. ఛాయాపథంబుపోలిక, నాయెడఁ జూపట్టె; నప్పు♦డలగంధర్వుల్

పాయక సురసిద్ధులసము,దాయము వానరేంద్రగణము ♦ తచ్చిత్రంబుల్. ౨౩

క. కన వచ్చియుండె నంబర,మున; శతయోజనవిశాల♦మును వెడలుపు నూ
డను దశయోజనమితముగ, గనంబడుసేతువును సురలు ♦ గంధర్వు లొగిన్.

క. నలనిర్మితమై యొగులకు, నలవియె గాకుండఁ జేయ♦నై యొప్పెడు దా
ని లలిన్ గాంచిరి; వనచరు, లలరుచు నిటు గట్టి దాని♦యందముఁ గనుచున్.

క. ఒండొరుల కభిముఖంబుగ, నిండిన వేడుకలఁ గూడి ♦ నింగి దనుకఁ దా
రొండొరులతోడ నెగురుచు, జండధ్వను లలర సంత♦సంబునఁ బొదలన్.

[1]ఆ. చెలఁగుచుండి రొరులు ♦ చేయ నశక్యమై, యచ్చెరువును గల్గు ♦ నట్లు చేసి
గగురుపాటు గల్గఁ♦గాఁ జేయు నా సేతు,బంధనమును భూత♦వార మపుడు. 807

క. కనుఁగొనె; వానరకోటులు, ఘనకాయము లొప్పఁ గాంతి ♦ గ్రాలఁగ వారిన్
గనుపట్టు సేతుమార్గం,బున దక్షిణతీరభూమిఁ ♦ బొందిరి పెలుచన్ ౨౨ 808

[2]తే. కడువిశాలము దృఢతర♦కల్పితంబు
సమతలం బకుటిలమును ♦ సాధుతమము
నా మహాసేతు వది సంద్ర♦మందు సరిగఁ
బాపటవలెఁ బ్రకాశించె ♦ భద్రమముగ ౨౮ 809

క. కరమున భీకరమౌ గద, ధరియించి విభీషణుండు ♦ తనమంత్రులతోఁ
బరులవలన నేభయములు, పఱఁగకయుండంగ శక్తి ♦ భాసిలుచుండన్ ౨౯

క. వననిధిదక్షిణతీరం,బున వానరసేనఁ గావఁ ♦ బూని నిలిచె; నా
వనచరపతి యంతట ని,ట్లని పల్కెను సత్యశౌర్యుఁ♦డౌ రామునితోన్. ౨౯

క. హనుమంతు నెక్కుమా నీ,యనుజుఁడు లక్ష్మణుఁడు ప్రీతి ♦ నంగదు నెక్కున్
వననిధి యిది మకరాలయ, మనూనమగుఁ జుమ్ము దాఁట ♦ నతికష్టమౌ.

క. కనుకన్ వీరల నెక్కిన, వనచరు లీయిర్వురు మిము ♦ వైళను వ్యోమం
బున దాఁటింపం గల రన, విని ధర్మాత్ముండు రాము♦విభుఁ డానుజులన్. ౩౧

చ. ఘనతర తేజ మొప్పఁగను ♦ గార్ముకమున్ ధరియించి లక్ష్మణున్
వనచరనాథుఁ గూడి సుర♦వర్త్మమునం గపిసేనకన్న ముం
దనుపమరీతిఁ బోయెఁ బ్లవ♦గాళిని గొందఱు సేతుమధ్యభూ
మిని జని రింకఁ గొంద ఱట ♦ మించినవేడుకఁ బార్శ్వసీమలన్. ౩౩ 814

[3]తే. చనిరి కొందఱు స్థలము చా♦లనికతమున
జలములం బడి లేచిరి ♦ స్థలము లేక

1 త దచింత్య మసహ్యం చ అద్భుతం రోమహర్షణమ్ - అనిమా అసహ్యం = కస్యాపి యత్నావిషయం-అనివ్యాఖ్యా. 2 అశోభత మహాసేతు స్సీమంత ఇవ సాగరే - అనిమూ. 3 సలిలే ప్రపతం త్యన్యే మార్గ మన్యే న లేభిరే-అనిమూ.

కొంద ఱయ్యెడ నిల్చిరి ♦ కోఁతు, లవల
జనిరి కొందఱు గరుడుల♦చంద మొప్ప. ౮౩౪ 815

క. వినువీథిం జని సాగర,మును దాఁటిరి; భయదరూప♦ములఁ గ్రాలెడునా
వనచరసేనలు సేతువు, ఘనగతిఁ దరియించుచుండఁ♦గా బెట్టిదమై. ౮౪ 816

క. నినదం బొందు సరిత్పతి,జనితమహారవము మీఱి ♦ చాల నెసఁగె; నం
త నిఖిలవానరవీరులు, వనజాప్తసుతుండు నొకట ♦ వారిధియందుఁ. ౮౫

తే. నలుఁడు కట్టిన సేతువు ♦ నెలమి దాఁటి
యవలితటమున మూలఫ♦లాంబునిబిడ
మైన తావున విడిసిరి; ♦ మానివరులు
సిద్ధచారణ, నిర్జరుల్ ♦ చిత్రమగుచు ౮౬ 8.8

క. ఇతరులకు దుష్కరంబై, క్షితిఁ దగు శ్రీరామచంద్రు♦కృత్యముఁ గని భూ
పతిచెంతఁ జేరి యట శు,భ్రతరాంబువులఁ ముదంబు ♦ భాసిలు చుండఁ.౮౭

తే. [1]వేఱువేఱుగ నభిషేక♦విధిని బూని
యొనరిచిరి; భూమిపాల! శ♦త్రునికరముల
గెలువు మంబుధిపర్యంత ♦ మిలను జాల
వర్షములు చక్క నేలుమా! ♦ వైభవమున. ౮౮ 820

క. అని యిట్లు నరసురార్చితుఁ, డనఘుఁడునగు రామచంద్రు ♦ నాతని శుభవా
క్యనికరములఁ బూజించిరి;, రఘువంశవిభూషణుండు ♦ క్ష్మాపతి యంతఁ.

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

౨౩ - వ సర్గము.

రాముఁడు లక్ష్మణునకు మహాసమరసూచకనిమిత్తంబులం గాంచి చెప్పుట.

తే. [2]తా నిమిత్తజ్ఞుఁడౌఁ గానఁ ♦ దదవసరము
నందుఁ గొన్ని నిమిత్తంబు♦లం దగఁ గని
వాంఛ నెఱవేఱునను ప్రీతిఁ ♦ బట్టలేక
యనుజునిం గౌఁగిటం జేర్చి ♦ యనియె నిట్లు. ౧ 822

సీ. విమలశీతలజల♦వినుతమై ఫలముల నలరువనంబుల ♦ వెలయుచోట
మనకు వాసస్థాన ♦ మని యేర్పఱచుకొని బలములఁ బ్లవగంబు♦లెలుఁగుబంట్లు
కొండముచ్చులు నని ♦ కోర్కి విభాగించి తగ గరుడవ్యూహ♦ముగను నిల్పి
నిలుతము; క్షుద్రజ♦నుల క్షయింపఁగఁ జేసి వనచరభల్లూక♦వరుల కసుర

1 జయస్వ శత్రూన్ నరదేవ! మేదినీం ససాగరాం పాలయ శాశ్వతీః సమాః-అనిమూ.
2 నిమిత్తాని నిమిత్తజ్ఞో దృష్ట్వా లక్ష్మణపూర్వజః, సౌమిత్రిం సంపరిష్వజ్య ఇదంవచన మబ్రవీత్-అనిమూ. చిరప్రార్థితసమర స్యాసన్నత్వాత్-అనివ్యాఖ్య.

ఆ. వీరులకును భయద♦విషయమై యున్న యు
ద్ధంబు శీఘ్రముగనె ♦ సిద్ధమౌను
ననుచుఁ దోఁచుచున్న ♦ దనుజా! [1]కలుషములు
గాఁగ వీవఁ జొచ్చె ♦ గాలు లిపుడు. ౩ 823

క. ధరణి వడంకెడుఁ జుమ్ము భూ,ధరములయగ్రములు నావి♦ధమునఁ గదలెడున్
దరువులు భూమిని బడియెడు;, నరయఁగఁ దోడేలు వన్నె♦యాకృతులందగన్.

క. పరుషములై పరుషధ్వను, లురుభయదాకృతులు మిగుల ♦ నొప్పు జలదముల్
పరువడిని రక్తబిందూ,త్కరయుక్తిజలంబు గురియఁ♦గాఁ జొచ్చెఁ జుమీ!. ౫

చ. [2]కను మదె రక్తచందనముఁ♦గాఁ గనుపట్టుచు సంధ్య మేఘపం
క్తిని గడుఁ గూడి బెట్టిదపుఁ♦దీరునఁ గన్పడుచున్న దబ్జమి
త్రునిఘనమండలంబు గన ♦ సూక్ష్మముగా వెలుఁగొందుచుండఁగా
ననలునిజ్వాల లెల్ల నిల♦యందుఁ బడెన్ ఖరరశ్మినుండియే. ౬ 826

క. దీనాకృతు లొప్పం గడు, దీనరవంబులును జెలఁగఁ ♦ దిక్కుల నెల్లన్
భానునిఁ గని మృగపక్షులు, మానసభయదంబులగుచు ♦ మఱి క్రూరములై.

క. వాపోవుచున్న; విందుఁడు, తాపంబును గూర్చెడున్ ని♦తాంతము కాంతిన్
మాపులఁ దూలుచుఁ గంటివె?;, ఈపగిదిని సూర్యమండ♦లాంతిక మందున్.

సీ. కృష్ణరక్తాంతమై ♦ యెసఁగి లోపల నతిర క్తవర్ణంబయి ♦ హ్రస్వ మగుచు
నతిభయదంబయి ♦ యప్రశస్తంబయి ప్రళయకాలోద్భవ♦పరిధి భంగిఁ
పరివేష మొప్పెడు; ♦ భానుమండల మతినిర్మలమౌ నందు ♦ నీలచిహ్న
మొక్కండు గనఁబడు♦చున్నది; లక్ష్మణా! పెనురజమ్మునఁ దోఁగి ♦ యనుపమాన
తే. కాంతు లెల్లఁ దొలంగ న♦క్షత్రరాజి
మలినమయి లోకవిలయంబు ♦ గలుగు ననెడు
నూహ సూచించుచున్న; దో ♦ యురుగుణాఢ్య
కాంచుమా! చక్క యోజింపఁ♦గలవు గాన. ౧౦ 829

తే. కాకులును డేగలును మఱి ♦ గ్రద్దలాది
యైన పక్షుల నీచఖ♦గాళి క్రిందు
పఱచ నున్నవి; నక్కలు ♦ భయదములయి
యశుభములునగు రవముల ♦ దిశల నించె. ౧౧ 830

క. హరివర,రాక్షసవీరులు, పరస్పరము వైచుకొనెడు ♦ పర్వతశాలో
త్కరఖడ్గపిహితమయి యీ,ధరణి యసృఙ్మాంసపంక♦శత మగుఁ జుమ్మీ!. ౧౨

క. ఆలస్య మింకఁ జేయఁగ, నేల? జవం బమర వనచ♦రేశులు మనకుం

---

1 వాతాశ్చకలుషాశ్శాంతి-అనిమూ. 2 జ్వలతః ప్రపతత్యేత దాదిత్యా దగ్నిమండలమ్-అనిమూ.

జాలసహాయులునై రాఁగా లంకను జేరరాక ♦ క్రాలెడుదానిన్. ౧౩ 832

తే. ముట్టడింపఁగఁ బోవుద ♦ము మన మనియె;
ధర్మమతి భూరిసంగ్రామ ♦ తత్పరమున
జానకీజాని విలు దాల్చి ♦ దానవేంద్రు
పురికి నభిముఖుఁడై ముందు ♦ పోయె నెలమి ౧౪ 833

క. వనచరపతియు విభీషణుఁ, డనూనబలులైన కీశ ♦ హర్యక్షులు శ
త్రునికరముఁ జంపునిశ్చయమున గర్జిల్లుచును వెంటఁ ♦ బోయిరి గడఁకన్. ౧౫

*చ. అనుపమధైర్యవీర్యము ♦ లందు యశంబును గన్నయట్టి య
వ్వనచరవీరు లాధరణీ ♦ వల్లభు మోదము నందఁ జేయఁగా
మనముల నెంచి వాలముల ♦ మానక త్రిప్పుటలోనుగా రణం
బునఁ దమిఁ దెల్పుచేష్టలను ♦ బూనఁగ రాముఁడు సంతసిల్లెఁ దాన్. ౧౬

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౨౪ - వ సర్గము.

రాముఁడు సేనను బన్నఁగా శుకుఁడు దానిం జూచి రావణునకు విన్నవించుట.

క. హరివీరసంఘ మది భూవరుచే వ్యూహంబుగాఁగ ♦ వార్ధితటమునన్
వరుస నమర్పంబడి యుత్తరగుణమున వెలింగెఁ గాంతి ♦ దళుకొత్తంగన్. ౧

సీ. శుభతారకలఁ జోడ ♦ శోభిల్లునట్టి యభ్రము రిచే నిర్మితం ♦ బై రహిఁ దగు
శారదపూర్ణిమా ♦ శారంబుగాఁ గపిసంఘ మొప్పెను; భూరి ♦ సాగరంబు
వలె ననంతంబయి ♦ వెలయునా కపిగణపీడితంబయి యిల ♦ బెడఁదఁ గాంచి
చలియించె; నవ్వేల ♦ బలములయ్యావి లంకయం దున్న సేనల ♦ యార్భటులును

తే. యుద్ధవాద్యమృదంగాదు ♦ లోకరీతి
మ్రోగ నారవ మత్యంత ♦ మును జెలంగి
గగురుపాటు నొందించుచుఁ ♦ గ్రమ్మ వినియె;
నంత హరియూథనాథు లా ♦ యతులరవము. ౩ 837

చ. విని ముద మొంది రాఘవునికి ♦ వేడుక నొందుచు దాని మించు న
ట్లొనరిచి రెంతొ పట్టుదల ♦ లొప్పుచు నుండఁగ సింహనాదముల్;
దనుజులు గూడ వానరులు ♦ దారుణరీతిని నార్చి యాకసం
బున ఘనముల్ ధ్వనించునటు ♦ పొంగుచు నుండుట నాలకించుచున్. ౪ 838

క. హరిసేన వచ్చె నని యెంచిరి; రాముం డంత నచటఁ ♦ జిత్రధ్వజభీ
కరమౌచుఁ బతాకౌఘము, లరుదుగఁ గప్పడఁగ నొప్పు ♦ నాలంకఁ గనెన్.

---

* హరీణాం కర్మచేష్టాభి స్తుతోష రఘునందనః-అనిమూ. కర్మచేష్టాభి ర్యుద్ధకర్మాదివిషయచేష్టాభి ర్లాంగూలోత్థాపనాదిభిః-అనివ్యాఖ్య.

క. కని మనసు విన్నదనముం, గన సీతం గూర్చి యిట్లు♦గాఁ దలపోసెన్
వనితామణి సాకేతం,బున భోగము లొంది ముదముఁ ♦ బొందుచు నుండెన్.

[1]తే. అట్టి యాసీత హరిణశా♦బాక్షి యిందుఁ
జేరి యంగారకుఁడు తన♦చెంతఁ జేరి
బాధ కల్గింప రోహిణి♦వలెను రాన
ఱుఁడు చెఱంబెట్టఁ జింతఁ బొం♦దెడును గాదె. ౭ 841

[2]చ. అని స్మరియించి వీరవరుఁ ♦ డాతజేఁ జింతిలుచే యునర్హామం
చును మదిఁ దోఁప నూర్పులను ♦ సొక్కఁగఁ జేయఁగఁ జాలి వేఁడిగాఁ
దనరెడు వానిఁ బుచ్చుచును ♦ దమ్ముని లక్ష్మణుఁ జూచి యుత్తతిన్
బొనరుపఁగా హితంబయిన♦పోలిక నిట్లని పల్కె ధీరుఁడై. ౮ 842

మ. కనుమా! లక్ష్మణ! విశ్వకర్మయు నగా♦గ్రంబందు నభ్రంబు నొ
య్యన సంస్పర్శము చేయు నట్లురుతరం♦బై యొప్పఁ జిత్తంబుచే
తను బోలెన్ రచియింప లంక యిదియున్ ♦ దాఁ గ్రాలెడున్; దీనిలోఁ
ఘనసౌధంబులు వేనవేలు వెలయం♦గాఁ జూడఁగాఁ జిత్రమై. ౯౫ 843

క. తెల్లనిమేఘంబులు కడు, నుల్లసిలం గప్పుకొనఁగ ♦ నొప్పు ఖతల మ
ట్లల్లదె చెలువారెడుఁ; బుర,తల్లజ మది చైత్రరథము♦తగుచందమునన్. ౧౦

క. అనవరతము పుష్పంబులఁ, గనుపట్టువనాళిచేతఁ ♦ గలకలమనుచున్
ధ్వనిసేయుపక్షితతిచే,తను ఫలముల మెక్కుపరభృ♦తంబులచేతన్. ౧౦౫

తే. ఫలములందలి పూఁదేనె ♦ నెలమిఁ ద్రావి
యున్న భ్రమరాళిచేతను ♦ నొప్పుచున్న
యది; మదించిన కోయిలల్ ♦ కొదమతుమ్మె
దలును వెలయంగ నున్నవ♦నులను వీని. ౧౧ 846

క. చలియింపఁ జేయుచున్నాఁ, డలరుచు శుభవాయుమూర్తి ♦ యని తమ్మునితోఁ
బలికి రఘువీరుఁ డంతట, నలఘుతరజ్ఞానమున మ♦హామహుఁ డగుటన్. ౧౨౫

క. సేనాసన్నాహంబునఁ, దా నెంతయు నేర్పుగలిగి ♦ తగియుండుటచే

1 అత్ర సా వ్యాగ్రశాఖాక్షీ-అనియూ. 2 ఆలిఖంతీ మివా కాశ ముత్థితాం పశ్య లక్ష్మణ, మన
సేవ కృతాం లంకాం నగాగ్రే విశ్వకర్మణా-అనియూ రాముఁ డింతవ మునుపే సీతం దలంచుకొని
వగచెను. మరల ధైర్య మూని యిది శోకమునకుఁ దరుణము కాదని యుద్ధోన్ముఖుం డయ్యెను.
ఇట్లుండి శత్రుపురమును, దానిచుట్టునున్న పూఁదోఁటలు మొదలగువానిని వర్ణించెనా? ఇది ప్రకృ
తోపయుక్తముగ నున్నదియా? యని కొంద ఱూహింతురు కాని యాయూహ సరిగాదు ధీరోదా
త్తులగుపురుషులు చక్కనిపదార్థములను జూచినపుడు దానిని గనులారఁ గాంతురు. దానివైచిత్రమును
గొనియాడుదురు ఇది వారినైజము. శ్రీరాముఁడో శ్రీమహావిష్ణువు మానుషాచారమును బాటిం
చునేగాని స్వానుభూతిని మఱువఁడు. కాన నిది యసంగతము కానేకాదని యెఱుంగందగు.

సేనల నొద్దుగఁ దీర్పం,గా నెంచి విధించె నిట్లు ♦ కపిసేనలకున్. ౧౮ 848
క. అరిదుర్జయుండు వీరుఁడు, హరిగణతల్లజుఁడునైన ♦ యంగదుఁ డిపుడే
హరివరుఁడగు నీలునితో, నరిగి బలాన్వితముగాఁగ ♦ ననువుపడంగన్. ౧౮౫
క. సేనావక్షస్థలమునఁ, దా నిల్వఁగవలయుఁ; గిశ♦తల్లజుఁ డగుచున్
జానుగఁ బొల్చెడు ఋషభుఁడు, వానరసైన్యమును గూడి ♦ బలములకెల్లన్.
ఆ. యామ్యపార్శ్వమందు ♦ నరిభీతి లేకుండఁ
గాచుఁ గాక; గంధ♦గజమురీతి
దుష్ప్రధర్షుఁ డగుచుఁ ♦ దోరంపుబల మొప్ప
నుండు గంధమాద♦నుండు కడిమి. ౧౫౫ 851
చ. తనబలముల్ చెలంగఁ బటు♦తన్ మనసేనకు సవ్యభాగమం
దు నిలిచియుండుఁ గాక; యిఁక ♦ దుష్టరిపూత్కరబాధ మాన్ప నా
యనుజునిఁ గూడి మూర్ధమున♦యందు వసించెద నేను; వేగద
ర్శిని ఘను నాసుషేణుఁ గొని ♦ శీఘ్రము కుక్షితలంబుఁ గాచుచున్. ౧౬౫
తే. *జాంబవంతుఁడు నిల్వంగఁ♦జనును; వీరు
బుద్ధిమద్వర్యులై తగి ♦ యుద్ధచరితు
లైనవారు మహావీరు ♦ లైనవారు
భల్లుకప్లవగేశులై ♦ పరఁగువారు. ౧౭౫ 853
క. గురుతేజంబున మించెడు, వరుణుఁడు పశ్చిమముఁ గాచు♦భంగిని ప్లవగే
శ్వరుఁడగు సుగ్రీవుం డీ, హరిసేనాపుచ్ఛభాగ ♦ మరయుఁ దగు నన్నన్. ౧౮౫
క. గరుడవ్యూహముగాఁగ నొ,వరుపంబడి వీరలా వ♦నచరవరుల చేఁ
బరిరక్షితమై మేఘా,త్కరసంచారమునఁ దగు గ♦గనము పగిదిగాన్. ౧౯
క. హరిసైన్య మద్ది రాజిలెఁ; ధరణీధరశృంగముల ను♦దారతరువులం
గరములఁ దాలిచి వానర, వరు లారక్కసులఁ జంపు♦వాంఛలు పొంగన్.
క. పురవరమగు లంకకుఁ జనఁ, బరమాహ్లాదమును గనిరి; ♦ వానరవరు లా
ధరశిఖరంబుల వైచియొ, యురుముష్టిప్రహతులనొ, మ♦హోద్యమ మొప్పన్.
ఆ. లంకఁ బాడుచేయ ♦ నింకఁ జెల్లునటంచు
మనములందు నెంచి; ♦ రనుపమ మగు
తేజ మలర వెలసి ♦ రాజేంద్రుఁ డగురాముఁ
డర్కసూనుఁ గాంచి ♦ యనియె నంత. ౨౨ 858
క. బలముల నెల్లను నొద్దుగ, నిలిపెడుపనియైన దింక ♦ నీ వీశుకునిన్
గలఁతంబడువానిని ని,ష్ఠుల విడువుమ యనిన రామ♦మూర్తి నుడువులన్.

* ఋక్షముఖ్యా మహాత్మానః కుక్షిం రక్షంతు తే త్రయః--అనిమూ ఋక్షముఖ్యపదం వాన రాణా మప్యుపలక్షణమ్-అనివ్యాఖ్య.

క. [1]విని సుగ్రీవుం డాతని, యనుమతిఁ గొని శుకుని దాన♦వాధిపుదూతన్
జనుమని విడిచె; మహాబలుఁ, డనుపమ తేజుఁడగు సూర్య♦నాత్మజుఁడుదయన్.

క. హనుమన్నఁ గీశతతిచే,తను నిడుమలఁబడిన భయము♦నగుల శుకుఁడు రా
మునియాజ్ఞ విమోచనమును, గని యప్పుడ రాక్షసేంద్రు♦కడకుం జనియెన్.

క. దనుజేంద్రుఁడు నవ్వుచునే, తనచారుని శుకునిఁ జూచి ♦ దానవ! నీవా
ఘనపక్షంబులు ఛేదిం, పనుబడి నట్లిపుడు తోఁచెఁ ♦ బరులెవరైనన్. ౨౫

సీ. బంధించిరాయేమి?♦వనచరుల్ చపలాత్ములగుటఁ జిక్కి నవారి♦నరయకుండఁ
గట్టుచు విడుచుచు ♦ నిట్టులుందురుగాన వారిచేతం జిక్కు♦వడఁగ లేదు
గద? యని యడిగి య♦క్కపిరాజునావార్త కేమియుత్తరము నీ♦కిచ్చె ననిన
శుకుఁడు భయంబున ♦ సొక్కుచు రాక్షసవిభుఁ గనియిటుపల్కె♦విన్ననగుచు;

ఆ. నిచటనుండి కదలి ♦ యేను సాగరమున
నవలిగట్టుచేరి ♦ యర్కతనయుఁ
గాంచి మధురవాక్య♦గణముల ననునయిం
చుచును నీవు చెప్పు♦వచనములను. ౨౭ 863

క. ఒకదాని వదలకుండఁగ, సకలంబును జెప్పినాఁడ; ♦ సరగున ననుఁ గాం
చి కపులు మిగులం గ్రుద్ధఁ బూని కడఁగి పైకెగసి వేగ ♦ నింగిని నన్నున్.

ఆ. పట్టుకొనుటె కాక ♦ బాగుగా ముష్టిఘాతముల నొవ్వఁజేసి ♦ యమునివీటి
కనుపఁబూని, రధిప! ♦ [2]యూవానరులతోడఁ, బలుకనైన వీలు♦కలుగదయ్యె.

ఆ. ఉత్తరంబు వారి♦నుండి కైకొనుట యెక్కరణి నగును? వార ♦ లురుతరమగు
కోపయుక్తులు కడుఁ♦గ్రూరులు ప్రకృతిచే, నచట సూర్యపుత్రు♦నాదరమున.

క. [3]నిరతంబు గూడి ఖరునిన్, విరాధు నుగ్రుం గబంధు ♦ వెసఁ జంపినభీ
కరశౌర్యుఁడు శ్రీరాముఁడు, పరఁగెడు భార్యనుగొనంగ ♦ బరవస ములరన్.

క. ఇక్కడకు వచ్చియున్నాఁ, డక్కడిఁదిధనుర్ధరుం డ♦హార్యబలుఁడు దా
నొక్కట సేతువు గట్టియె, యక్కపిబలములను గూడి ♦ యబ్ధిం గడఁచెన్. 868

క. తరియించి తృణమురీతిగ, సురవైరుల ధిక్కరించి ♦ శోభిలుచున్నాఁ
డు రహిన్ మనచెంతనె; వా,నరభల్లూకములు గిరిఘ♦నసమాకృతులన్. 869

తే. కనఁబడుచు వేనవేలుగఁ ♦ దనను గొలువ
నలరుచున్నాఁడు వానరు ♦ లఖిలధరణి
నావరించియె యున్నవా; ♦ రసురసైన్య
ములకు నావానరులబలం♦బులకు నెపుడు. ౩౩౫ 870

1 వానరేంద్రో మహాబలః-అనిమూ. 2 నైవసంభాషితుం శక్యాః-అనిమూ. 3 సుగ్రీవసహితో రామ స్సీతాయాః పద మాగతః-అనిమూ.

క. సురదానవులకుఁ బోలెన్, బరికింపఁగ సంధియనెడు♦పలుకు పొసఁగ; దో
సురవైరినాథ! లంకా,పురసాలము దాఁటి వారు ♦ పొంగెడు కాంక్షన్. ౩౪

తే. వచ్చుటకుఁ బూనియున్నవా ♦ రిచ్చతనర
సీతనైన నొసంగుమా! ♦ శీఘ్రముగను
రామునకు లేకయున్న సం♦గ్రామమైన
నిమ్ము యీరెంటిలో నేది♦యేని నీవు. ౩౫ 872

చ. అను శుకువాక్యముల్ విని సు♦రారివిభుండగు రావణుండు చ
య్యనఁ గ్రుధ లోచనంబు లట ♦ నగ్నికణంబులఁ గ్రుమ్మరింపఁ గా
ల్చునటులు చూచుచున్ బలికె ♦ శూరతమీఱఁగ; నిర్జరోత్తముల్
దనుజులు దేవగాయకులు ♦ దారొగి నందఱు గూడి నాపయిన్. ౩౬ 873

[1]క. అనిశ్చయంగను జనుదెం,చినలోకంబులను నాకుఁ ♦ జేటొదవు భయం
బును గల్గించిననే సీ,తను మాత్ర మొసంగ నూన్ృ♦తంబిది వినుమా!. ౩౭

తే. చక్కఁగాఁ బూచియున్నవృ♦క్షంబుకడకు
మత్తషట్పదములు వోవు♦మాడ్కి నాదు
శితశరంబు లదెప్పుడు ♦ చేరఁగలవొ
రాముచెంతకు నతని శీ♦ఘ్రంబె చంప. ౩౮ 875

క. అనిలేమి నూఱకుండిన, ఘనతీక్ష్ణశరంబులెల్లఁ ♦ గార్ముకమం దొ
య్యనఁ గూర్చి కొఱవులన్ గజ,మునువలె బాధింతునెపుడు♦భూమీశ్వరునిన్.

చ ధరణిపుఁ డావిరాధముఖ♦దానవులన్ వధియించె నంచు భీ
కరముగఁ దద్బలంబు సరి♦గా వచియించితివే మహాభటో
త్కరమును గూడి తద్బలము ♦ గండడగించెద నుద్యదర్కుఁ డె
క్కరణిని జంద్రతారకల♦కాంతి నడంచునొ పెంపుమీఱఁగన్. ౪౦ 877

క వననిధికిం గలవేగం, బనిలునికమనంబు నాకు ♦ నలవడియె నటం
చును రాముఁ డెఱుఁగఁ డేమియుఁ,గనుక నెనాతోడఁ బోరఁ♦గానూల్కొనియెన్.

[2]క. గరళయుతాహులన భయం,కరతూణీశయము లగుచుఁ ♦ గ్రాలెడు పస్మ
చ్ఛరములఁ గని యెఱుఁగడు రఘు,నకుఁ డల్లాటనె తలంచె♦బవరము చేయన్.

క. అతఁడింతకు మును నాయ,ద్భుతవీర్యము భీమయుద్ధ♦మున నెఱుఁగఁడు నూ;
నతతము మచ్చాపమె యా,తతవీణియ బాణకోణ♦తతి వాయింతున్. ౪౩ 880

సీ. జ్యాశబ్దతుములమ్ము ♦ లార్తభీతమహారవంబులు, నతితీవ్ర♦బాణ,తల,మ
హానినాదము లీత్ర♦యంబును మంద్రమధ్యమతార లనఁబడు♦నట్టిస్వరము

---

1 నైవసీతాం ప్రయచ్ఛామి సర్వలోకభయా దపి - అనిమూలము 2 నమే తూణీశయాన్ బాణాన్ సవిషా నివ పన్నగాన్ - అనిమూలము.

లరిసైన్యమే మహా♦యుతనృత్తరంగ మాసైన్యరంగము చొచ్చి ♦ చారువీణ
నరిజనంబులు విను♦నట్లు వాయించెన;, వేయికన్నులు గల♦విబుధపతియుఁ

తే. గాని వరుణుండు తానుగఁ ♦ గాని యముఁడు
గాని ధనపతిగాని సం♦గరమునందు
బాణవహ్నిఁ బ్రయోగించి ♦ పరమవీరు
నన్నుఁ జెనకంగఁ జాల ర♦ దెన్నిగతుల. ౨౪॥ 881

ఇరువదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౨౫ - వ సర్గము.

శుకసారణులు కపిసైన్యమును జూచి యావార్త రావణునకుం జెప్పుట

క. దనుజవరేణ్యుఁడు దశరథ,తనయులు కపిబలముతో, ను♦దధి దాఁటుటయున్
విని సిరులలరన్ మంత్రులఁ, గని శుకసారణు లసంగఁ ♦ గ్రాలెడువారిన్. ౧

తే. పలికె నిట్లని; వానర♦బలము దుస్త
రాంబునిధి దాఁటివచ్చెఁ బూ♦ర్వమ్ము వినియుఁ
గనియు నెఱుఁగని సేతువుఁ ♦ గంధి రాముఁ
డిపుడు బంధించినాఁడు; నా ♦ కిపుడు తెలిసె. ౨ 883

చ. వనధిని సేతుబంధనము ♦ వర్ణ్యమె గట్టినమాట నింక నా
మనము గ్రహింపలేదు పలు♦మాఱుతలంచిననైన నిశ్చయం
బని, కపిసేన యుండువిధ ♦ మంతయు నేనెఱుఁగం దగున్ జవం
బునఁ జని యెవ్వరుం గనఁగఁ♦బోలనియట్లు రహస్యరీతిగన్. ౩॥ 884

చ. వనచరసేనఁ జొచ్చి కపి♦వర్యులసంఖ్యయు వారివీర్యముం
గనుఁగొని యందు ముఖ్యులయి ♦ క్రాలెడు వా రెవరో యటంచుఁ జ
క్కనివిధిచే నెఱింగి నృప♦కాంతునిమంత్రుల సూర్యపుత్రమం
త్రినికరముం దగం దెలిసి ♦ తీవ్రరణంబున ముందునిల్చువా
రిని బరికించి వారిదగు♦రీతిఁ గనుంగొని మీరు రాఁదగున్. ౪ 885

చ. నిరతము భీకరంబయిన ♦ నీరధినిం దగుభంగి సేతు వె
క్కరణిని గట్టిరో ప్లవగ♦కాంతులవాసగృహంబు లెట్టివై
పరఁగెడునో రఘుప్రవరు♦పౌరుషయత్నము లాయుధంబు లె
వ్వరుసఁ జెలంగునో సుతని♦భ్రాతపరాక్రము మెట్టులుండునో. ౬॥ 886

* అమాత్యౌ రాఘవ శ్శ్రీమా నబ్రవీ చ్ఛుకసారణౌ - అనిమూ. అత్ర శుకోప్యన్య ఇత్యవగమ్యతే- ఇట శుకసారణు లనువారు మంత్రులు ఇంతకుం బూర్వము పోయివచ్చినశుకుఁడు గాఁడని తెలియఁదగు.

ఉ. ఉన్నది యున్నయట్లుగ మ♦హోద్యమ మొప్ప నెఱింగి రండు; మీ
రున్నత తేజులౌ కపుల♦వ్యూహమునందున ధీరు లెవ్వఁడో
యెన్నికమీఱఁగా సకల ♦ మేర్పడ నాకెఱిఁగింప రాఁదగుఁ
గ్రన్నన నంచు నాజ్ఞనిడఁ♦గా శుకసారణు లట్టి పొంగుచున్. ౮ 887

తే. వీరులును గిరిరూపులు♦నై రయమున
వానరబలంబులం జొరఁ♦బడిరి; పిదప
గగురుఁబుట్టించుచు నచింత్య♦ముగఁ జెలంగు
వనచరబలంబు గాంచుచు ♦ వారు మిగుల. ౯౪ 888

సీ. అచ్చెరువొంది సై♦న్యంబును దానిని గణియింపఁ దెలియక ♦ కలఁగి రంతఁ;
బర్వతాగ్రములందుఁ; ♦ బర్వతభాగంబులందును గుహాలయం; ♦ దబ్ధితీర [టు
ములయందు నుపవన♦ములయందు వనులందుఁ జెలఁగుచుఁగొందఱు♦జలధిదాఁ
చునుగొందఱంబురా♦శినిదాఁటినుఱికొందఱబ్ధిదాఁటఁదలంచి♦యుండుఁగొంద

తే. అవల విడిసియు, విడియుచు ♦ నతులభీమ
రవముల నొనర్చుచుండుట ♦ రాక్షసులకు
సైన్య మద్ది యక్షోభ్యమై ♦ సాగరంబు
కరణిఁ జూపట్టె నచట భీ♦కరముగాఁగ. ౧౨౪ 889

క. ఈరీతిం బ్రచ్ఛన్నా,కారంబుల వెలయ నున్న♦క్రవ్యాదుల నా
సారణు, శుకు, గుహ తేజుం. డౌ రాక్షస రాజు తమ్ముఁ ♦ డటఁ గనుఁగొనియెన్.

తే. ఇరువురను వారిఁ బట్టి భూ♦వరున కవ్వి
భీషణుఁడు చూపి యిట్లను; ♦ వీరిఁ జూడు
మరిపురంజయ! శ్రీరామ! ♦ యసురనాథు
సచివు లిద్దఱు శుకుఁడన ♦ సారణుఁడన. ౧౮ 891

క. ధరణిం దగుదురు లంకా,పురినుండి తదాజ్ఞఁ దలఁ ♦ బూని యిటకు వ
చ్చిరి మనకొలఁదులఁ దెలియఁగఁ, బరికింపుము చారుల నని ♦ పలుకఁగ నంతన్.

చ. ఇరువురు వారు దుఃఖమున ♦ నింక మృతిం గననైతి మంచు భూ
వరుఁ గని దోసిలొగ్గి తగు♦భంగి వచించిరి భీతిఁ దూలుచున్;
సురరిపునాథునాజ్ఞ రణ♦శూర! మహాత్మ! సుశాంతచిత్త! మే
మిరువుర మిందునున్న ప్లవ♦గేంద్రుల నెల్లరఁ గాంచి యెల్లెడన్. ౧౬ 893

క. బలములకొలఁది యెఱుంగఁగ, నెలమిని వచ్చితిమి; నాఁగ ♦ నెప్పుడు భూతం
బులకు హితం బొనరించుచు, నిలేశుఁడయి శత్రువునకు♦నే హితుఁడగుటన్.

*క. శ్రీరాముం డంతట శుక,సారణులను వాక్యములను ♦ సంతస మొప్పన్

* అబ్రవీ త్ప్రహసన్ వాక్యం సర్వభూతహితే రతః-అనిమూ. ప్రహసన్=రావణబుద్ధిమాం
ద్యస్మరణాత్ ప్రహాసః-అని వ్యాఖ్య.

గారవముగ విని రావణు, సారవిహీనమగుబుద్ధి♦సత్వంబులకున్. ౧౭ 895

తే. పరిహాసించుచు వారితోఁ ♦ బలికె నిట్లు;
బలమునంతయుఁ జూచి మ♦మ్ములను జక్కఁ
గాఁ బరీక్షించి పతియాజ్ఞఁ ♦ గార్య మెల్ల
జేయుటయెయైనచోఁ గోర్కి ♦ సిద్ధిఁ గనుట. ౧౮ 896

క. చనుఁడు యథేచ్ఛముగాఁ బుర,మున కింకను జూడ మదికిఁ ♦ బోలినయదియుం
డిన దానిఁ గాంచవచ్చును, వనచరులను జూడ మరల♦వాంఛ గలిగినన్. ౧౯

తే. ఈవిభీషణుఁడే మీకు ♦ నెల్లఁ జూపఁ
గలఁడు చిక్కితిమే యిట్లు ♦ కలదె? యింక
బ్రదుకు మాకని సుంతయు ♦ భయము నొంద
వలదు; దూతల నస్త్రశ♦స్త్రులగువారి. ౨౦ 898

క. మనుజేంద్రులు చంపరు మీ,రనఁగ నిరాయుధులు గాన ♦ నంతమునొందిం
పను దగరు గాదె?; యని యా,దనుజేంద్రువిభీషణుఁ గని ♦ దయ నిట్లనియెన్.

సీ. చారులు వీరలు ♦ శత్రుపక్షమువారిసామాద్యుపాయైక♦సరణిఁ దమకు
ననుకూలమగునట్టు ♦ లనయము చేయుదు రైనను నభయమ్ము ♦ నడుగుచున్న
వారు స్వపక్షంబుఁ ♦ బాలింప వైరుల బాధించువారలే ♦ పలుమఱు నను
నభయంబుఁ గోరి ర♦క్లాటను వీరిని విడువుమా!; యని చెప్పి ♦ వింతవేష

తే. ములను దాల్చినవారల ♦ నెలమిఁ గాంచి
పురికి మీ రేగి దానవ♦పుంగవుఁడయి
ధనదునకుఁ దమ్ముఁడౌ రావ♦ణునిని గాంచి
పలుకఁదగు నేను జెప్పిన♦భంగినెల్ల. ౨౨ 900

క. ఓరావణ! యేబలమును, గోరిక నీమదిని నమ్ము♦కొని నాసీతన్
బేరడవి నపహరించితొ, యీరణమున బంధుజనులు ♦ నెల్లబలములున్. ౨౩

క. నీవును స్వేచ్ఛఁగఁ జూపం,గావచ్చును; రేపునే స♦కాలంబున లం
కావరనగరంబును బెం,పావహిలన్ సారతోర♦ణాన్వితముగ నే. ౨౪ 902

క. శరవహ్నిం గాల్చెద భీ,కరరాక్షసబలము జముని♦కడ కనిపెద నీ
వరయుము; రేపుదయంబున, హరిహాయుఁ డసురాళిపయిని ♦ నావజ్రంబున్.

క. గురుకోపంబున వైచెడు,కరణి న్నీపైని సుభట♦కాండముపయి భీ
కరమగు నాక్రోధంబును, బరఁగం జేసెద నటంచుఁ ♦ బలుకుఁడు మీరల్. ౨౬

చ. అని పచియింపఁగా దనుజ ♦ లాశుకసారణు లెంతయేని ధ
ర్మనియతిఁ బెంపుమీఱు రఘు♦రాముని నే జయశబ్దపూర్వకం
బున నుతియించి లంకకును ♦ బోయి సురారివిభూత్తముం గనుం
గొని వచియించి రిట్లు కపి♦కుంజరులం బరికించుచుండఁగన్. ౨౭ 905

క. దనుజేంద్ర! విభీషణుఁ, డల్లన మముఁ బట్టుకొని వధకు ♦ లక్ష్యముగా రా
మునియొద్దకుఁ జేరిచె నా,యన ధర్మాత్ముండు విక్ర♦మాఢ్యుఁడు గానన్. ౨౭½
క. దూతలఁ జంపఁగ నిచ్చం, జేతస్సునఁ బొందఁడయ్యెఁ ♦ జేరి రిపుగణం
బేతీరున నపకృతిఁ దమ, కాతఁడేఁ గల్గించు రనుభ♦యంబు గనఁడునృపా!. ౨౮
ఆ. మమ్ము విడిచిపుచ్చె ♦ నమ్మహీనాథుండు, రనుకు నాటపట్టు ♦ రాముఁ డతని
యనుజుఁడైన లక్ష్మ♦ణాఖ్యుఁడు సీతమ్ముఁ, డినసుతుండు తేజ ♦ మొసఁగువాఁడు.
క. సురపతిసముండు నగు వా,సరపతి యను వీరు లోక♦నాథులతో న
లువ్వగుతుల్యులు శస్త్రాస్త్రము, లరయం దనరారు వార ♦ లతిలోకులునృపా!.
క. [1]శూరులు దృఢవిక్రములును, బూరుషసింహులును నొక్క♦పోలిక లంకం
జేరి వినాశముసేయఁగఁ, దారొక్కమహీతలమునఁ ♦ దత్పరులగుచున్. 30
ఆ. కూరుచున్నవారు ♦ కోఁతులమాటయే, యవలనుండనిమ్ము ♦ హరిహయనము
లైనవీరు నల్వ ♦ రీనిశాచరపురి, సాలతోరణాది♦సహిత నిపుడె. 30½ 911
క. పెకలించి మఱొకతావున,నె కడింది మగంటిమిఁ గొని ♦ యేర్పడఁ బెట్టన్
సకలవిధంబులశక్తులు, ప్రకటితమా రాముగూర్పు♦బలుసాధనముల్. 3౧½
క. [2]పరికించి చూడ నాము, గ్గురిమాట యటుండ నొకఁడె ♦ కొంకక లంకా
పురము నశింపంజేయును, బరాక్రమోపేతుఁ డగుట ♦ బలయుతుఁ డగుటన్.
క. [3]అని మాకుఁ దోఁచె; రాముం, డనూనబలశాలియైన♦నాతనిసైన్యం
బును జంప నిరుత్సాహం, బును గనునటుసేయు మీరు ♦ పూనుఁ డనేదవో?.
సీ. అంగదసూర్యపు♦త్రాదియుక్తంబగు కపిబలంబును రఘు♦కాంతుదక్షి
ణంపుబాహువితండ♦నందగియున్నయా లక్ష్మణగుప్తంబు ♦ లలితరీతిఁ
దీరుపఁగాఁబడి ♦ భూరితరంబయి తగుదాని నిర్జర♦దానవులకుఁ
గాని యింద్రాదుల♦కేని జయింప నశక్యమే యినుమంత♦సంశయంబు
[కానఁగాఁబడ; దిట్లు♦గా దశయోజనముల విస్తృతంబుగ ♦ నలరి నూఱు
తే. యోజనంబుల పొడువుగ ♦ నుదధిసేతు
వలవరించుట వ్యక్తమే ♦ బలము లవ్వి
కడలి దాఁటెను; శ్రీరాఘు♦వుఁడును గంధి
దక్షిణతటంబునం బ్రీతి ♦ తనర విడిసె. 33 915
క. వనచరులు కొందఱేంకను, వనధిం దరియించుచున్న♦వారలు దాఁటం
గను బూనినారు కొందఱు, కన వారికిఁ దుదియొ మదికిఁ♦గనఁబడదు విభూ!.

---

1 ఏకస్థానగతా యత్ర-అనిమూ. ఏకప్రదేశం నా గతాః-అనివ్యాఖ్య. 2 సధిష్యతి పురీం లంకా మేక స్తిష్ఠంతు తే త్రయః-అనిమూ 3 నన్వసహాయశూరోపి రామసేనాహననా దనుత్సాహస్సి త్తత్క్రియతా మిత్యాహ-అనునవతారిక కీపద్యము వ్రాయఁబడియెనని యెఱుంగఁదగు, ఈభావము వదలినచోఁ బైపద్య మసందర్భముగఁ దోఁచును.

చ. [1]అనియొనరించువూన్కి దృఢ♦మై తగ నున్నది సైన్యమెల్ల, నా
వనచరవీరులందఱును ♦ వారని మోదమునం జెలంగువా
రని యిఁకఁ జాలునయ్య! పగ♦నాత్మను బూనకు మోవిభూత్తమా!
జనకజ నింకనైన నృప♦చంద్రునకుం బ్రథమాని యీఁదగున్. 917

ఇరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

౨౬ - వ సర్గము.

{ రావణుఁడు వానరసేనను జూడ నున్నతప్రాసాదము నెక్కుట. సారణుఁడు సేనం జూపి చెప్పుట. }

చ. అని యిటు సారణుండు హిత♦మై కుశలంబును గూర్పనైన ప
ల్కును భయ మింత లేకనినఁ ♦ గ్రూరనిశాచరరాజు దానినిన్
విని బదు లిట్లు పల్కెఁ; గడు♦వింతగ దూరుచు వానితోడ; దే
వనికరమేని దానవుల♦వారము గాని చెలంగి యెక్కుచో. ౧౪ 918

క. చనుదెంచిన గంధర్వులు, నని సేయఁగ వచ్చినను భ♦యంబును జగముల్
గన ననుఁ జేసిన నీయను, జనకజ నామాట లేల? ♦ సారణ! నీకున్. ౨ 919

తే. సౌమ్యుఁడవు నీవు కానఁ గీ♦శతతిచేతఁ
గొట్టఁగాఁబడి భీతిని ♦ గుందినాఁడ
వందుచే నిప్పుడే సీత♦నాతని కొసఁ
గంగఁ దలఁచుచునున్నా వ♦సంగతముగ. 3 920

క. దురమున నను గెల్వంగల, యరి యెవ్వఁడు గలఁడు; భూమి♦నని రావణుఁ డా
శరపతి యీచందముగాఁ, బరుషోక్తులు పల్కి [2]సిరులు ♦ భాసిలు చుండన్.

చ. [3]వనచరసేనఁ జూచుటకు ♦ వాంఛను బూని హిమంబురీతిఁ దె
ల్లనిదయి భూరితాళముల♦లాగున నెత్తయి యున్న సౌధ మొ
య్యనఁ దమి నెక్కెఁ; జారులగు♦నాశుకసారణు లప్డు వెంటరా
ఘనతరకోప మూని మదిఁ ♦ గాంతసుసౌధమునుండి యంబుధిన్. ౫౪ 922

క. గిరులను వనములఁ గాంచెను, నరుదైన త్రికూటపర్వ♦తాంతికభూమిన్
దరుచరు లెల్లను నిండుటఁ, గర మాశ్చర్యమునఁ జూచెఁ ♦ గళవళపడుచున్.

చ. దనుజవిభుండపారమగు ♦ తద్బలమున్ గణియింపరామి నిం
తని యెఱుఁగంగఁ జాలక య♦హో యిది యేమి చమూసమూహమో
యని యల సారణుం గనుచు ♦ నల్లన నిట్లని ప్రశ్నచేసె; నీ
వనచరముఖ్యులందు బల♦వంతు లనం దగు వార లెవ్వరో. ౮ 924

---

1 అలం విరోధేన శమోవిధీయతాం ప్రదీయతాం దాశరథాయ మైథిలీ-అనిమూ. 2 అరు శోహ తత శ్శ్రీమాన్-అనిమూ. 3 బహుతాళసముత్సేధం రావణోఽథ దిదృక్షయా-అనిమూ.

తే. శూరు లెవ్వరో? యుత్సాహ♦శోభితులయి
యెల్లతావుల నని ముందు ♦ నెవరు నిల్చు
వారలో? వీరిలోన నె♦వ్వరిపలుకుల
వినునొ? సుగ్రీవుఁ డట యూథ♦విభువరులయి. ౯ 925

క. తనరాకువార లెవరో, వనచరబలనాథు లనఁగఁ♦బడువా రెవరో
వినుపింపు సారణా! చక్కనివిధమున నున్నయట్లు♦గా వినవలతుఁన్. ౯౫ 926

చ అని యిటు రావణుం డడుగ ♦ నప్పలుకుల్ విని సారణుండు కీ
శనిచయమునందు ముఖ్యులను ♦ స్వాంతమునందు నెఱింగి యుంట నా
వనచరవర్యులం దెలుపు♦వాఁడయి యిట్లనియెన్; మహాప్రభూ!
విను మీకుఁ దెల్పువాఁడఁ గడు ♦ వీరుల నల్లదిగో చెలంగుచున్. ౧౦౫ 927

*సీ. ఈవానరుఁడు లంక ♦ నేవేళఁ గాంచుచు సింహనాదంబును ♦ జేయుచు వన
చరయూథపాలకుల్ ♦ శతసహస్రంబులు తనుఁ బరివేష్టింపఁ♦గను బరాక్ర
మమున నున్నాఁడు చూ♦డుము; వీనిధ్వనికి నగర మెల్ల భూధర♦కాననముల
తోడ వనంబుల♦తోడఁ బ్రాకారతోరణములతోడను ♦ వణఁకుచున్న

తే. యది; సమస్తకపీశ్వరుం♦డై మహాత్ముఁ
డైన సుగ్రీవుసేనకు ♦ నగ్రభాగ
మందు నున్న వీరుండగు ♦ నతఁడు నీలుఁ
డనెడు యూథవిభుండు సు♦మ్మసురనాథ!. ౧౩౫ 928

క. వనచరుఁ డల్లదె కనుమా;, తనబాహువు లెట్టి యెత్తి ♦ ధరణి నిలుచుచుం
డినవాఁడు వీర్యవంతుఁడు, మనపురికభిముఖుఁడునగుచు♦మసలుచుఁ గ్రుధచేన్.

క. కరము విజృంభించెడుభూ,ధరశృంగసమాంగుఁడగుచుఁ ♦ దనరెడు గంటే
సరసిజకింజల్కచ్ఛవి, పరఁగం దర్పపడుచుఁ దోఁకఁ ♦ బలుమా ఱిలపై. ౧౪

క. తాడించుచుఁ దచ్ఛబ్దము, పోడిమిగా దెసల నెల్ల ♦ బోరుకొలుపఁగా
వాఁడె చెలంగెడు రాజా!, వీఁడే యువరాజనంగ ♦ వెలయున్ మిగులన్.

ఆ. అంగదుండు వీఁడె ♦ యనికి నిల్చిబిలుచుచు
నున్నవాఁడు వాలి♦కన్నకొడుకు
తండ్రి కరయ సముఁడు ♦ తఁ పినతండ్రికి
నిరతహితుఁడు శూర♦వరుఁడు సుమ్ము ౧౭౫ 932

[1]క. వరుణుం డింద్రునికొఱకై,క్కరణిఁ బరాక్రమముఁ జూపు ♦ త్ర్యాపతికొఱకై
పరవిక్రమంబుఁ జూపఁగ, నిరతము దలపోయుచుండు ♦ నిశ్చలుఁ డగుచున్.

చ. విను మనురేంద్ర! యంగదుఁడు ♦ వీర్యము పెంపెసలార నామరు
త్తనయుని కెల్లరీతులను ♦ దానుగ నేర్పెను వీనిబుద్ధినిం

* లంకా ప్రవేపతే సర్వా సశైలవనకాననా-అనిమూ. 1 రాఘవార్థే పరాక్రాంత శ్శక్రార్థే వరుణో యథా-అనిమూ పరాక్రాంతః పరాక్రమితు ముద్యతః-అనివ్యాఖ్య.

గొనియోఁ గదా జవం బలరఁ ♦ గొంకక లంకకు వచ్చి జానకిం
గని చనియెన్; నృపోత్తముని♦కార్యపరత్వముఁ బూని యత్తఱిన్. ౧౯ 934

క. ఘనవీర్య మలర నీతఁడు, వనచరవరయూథపతులఁ ♦ బలువురఁ గొని యే
రును దన్ను జయింపంజా,లనియింతటి భీతికరబ♦లమున నలరుచున్. ౧౯½

క. నినుఁ గూర్చి వచ్చుచున్నాఁ, డనయము నవాలిసుతుని♦యంతికమున నా
తనివెనుక మహాబలములు, తనవెంటన్ రాఁగ నళుఁడు ♦ తద్దయు నొప్పన్.

చ. అనియొనరింపఁగా నతఁడు ♦ హర్షము గాంచుచు నున్నవాఁడు నీ
రనిధి నితండె సేతువును ♦ రామునకై రచియించినాఁడు; స్వాం
గనిచయ మట్టె నిక్కనటు♦గా నొనరించుచు సింహనాదముల్
పొనరుచు వేచెలంగుచును ♦ భూరిరవంబులు చేయుచుం దమిన్. ౨౦½ 937

సీ. ఉన్నతావులనుండి ♦ యుద్ధతిమై లేచి యధికతరామర్ష ♦ మనుదినంబు
తమ్మును బురికొల్పఁ ♦ దగ విజృంభించుచు నున్నవా రల్లదె ♦ యురుశపు లట;
వీ రనిమొనయందు ♦ నేరి కసాధ్యులు భయకృదాకారులు ♦ పౌరుషమున
నుద్ధతుల్ వీరలు ♦ నొక్కెడ లెక్కింపఁ బదినూఱుకోటు లా♦పై నెనిమిది

తే. లక్ష లున్నారు, మఱియు ని♦లావతంస
మనఁగఁ దగు చందనవనంబు♦నందు నున్న
వీరవానరు లెల్లరు ♦ వెంబడించి
నలుని యానతి నుందురు ♦ లలితగతుల. ౨౩½ 938

క. నలుఁ డొకఁడె లంక నెల్లను, బలములతోఁ గూడి చెఱుప ♦ స్వాంతమ్మున ని
మ్ములఁ గోరుచున్నవాఁ డిఁక, బలాశనేంద్రా ప్రచండ♦పౌరుష మొప్పన్.

*తే. రజతసంకాశదేహంబు ♦ రాజిలంగ
యుద్ధచపలత మితిమీఱు ♦ చుండ శ్వేతుఁ
డనెడు వానరుఁ డల్లదె ♦ యశమున జగ
ములను మూఁడింట విశ్రుతుఁ ♦ డలఘుబలుఁడు. ౨౭ 940

క. మతిమంతుఁడు వీరుఁడునై, నతఁడు రణంబందుఁ గలుగు♦నాతురమున భా
నుతనూజునొద్ద కత్యు,ద్ధతి లంకను బాడుసేయుఁ ♦ దగు నిపు డనుచున్. ౨౭

క. అరుదెంచి యాతఁ డియ్యది, తరుణము గాదనుచుఁ బలుకఁ ♦ దనబలమున ని
ర్భరపౌరుషంబుఁ బూనఁగఁ, దరుణ మిదే యనుచు మిగుల♦ధైర్యము గలుగన్.

తే. పలుకుచుం బోవుచున్నాఁడు ♦ బాహుబలము
వెలయఁ దనచోటి; కల్లదె ♦ వీరుఁడైన
కుముదుఁ డున్నాఁడు వితతసై♦న్యముల కతఁడు
పాలకుం డీతఁడే పూర్వ♦కాలమందు ౨౯½ 943

* బుద్ధిమాన్ వానరో వీర స్త్రిషు లోకేషు విశ్రుతః-అనియూ.

సీ. బహువృక్షనిబిడమై ♦ పరఁగి రమ్యంబయి గోమతీతీరస్థ♦భూమిఁ దనరి
యలరారు సంకోచ♦నాఖ్యపర్వతమున నంతటఁ దిరుగుచు ♦ నచట రాజ్య
మును నేలుచుండెను; ♦ వనచరవీరుఁ డీతఁడు వేయిలక్షలఁ ♦ గడిఁదిబలుల
వనచరులం గూడి ♦ వచ్చియున్నాఁ డిట విని వాలంబునఁ ♦ గానఁబడెడు
రోమముల్ పొడవులై ♦ సూఢి కెక్కుచుఁ బెక్కుబారలకొలఁదిని ♦ బరిఘవిల్లు
ననఁ దగి యెఱ్ఱన♦య్యును గొన్ని పీతంబులయ్యును గొన్ని శ్వే♦తాభములయి
కొన్నియు, మఱియును♦గొన్ని యత్యంత సితంబులై చక్కఁగఁ ♦ దనరుఁజుమ్ము
భయదకార్యచణుండు ♦ వనచరుఁ డీతండు దీనత నొందక ♦ దేసి నైనఁ

ఆ. జేయఁ బూనువాఁడు ♦ సిద్ధము సంగ్రామ
మెపుడు గోరుచుండు ♦ నిప్పురమును
దనబలంబుఁ గూడి ♦ తానె మర్దింపఁగఁ
దలఁచుచుండువాఁడు ♦ దనుజనాథ. ౩౦ 944

[1]చ. కను మిదె సింహతుల్యుఁడయి ♦ కన్పడుచుర్ గపిలచ్ఛవిర్ దగం
దనువు వెలుంగ నేత్రములు ♦ తద్దయు దీర్ఘములై చెలంగ లం
కను దహియించునట్లుగను ♦ గన్నులు ఱెప్పలు మూయకుండఁ జూ
డ్కని నిగుడించుచుం దనరు ♦ కేశవిభుండగు రంభుఁ డోవిభూ!. ౩౧ 945

క. వనచరపతి యితం డో,దనుజవిభూ! వింధ్య మనెడు ♦ ధరణీధరముం
దును గృష్ణగిరిని సహ్యం,బునను సుదర్శనమహీధ్ర♦మున నెపు డుండుర్. ౩౨

[2]ఆ. చండవిక్రములును ♦ జండులు శూరులు, నైన వనచరేంద్రు ♦ లనయ మితని
ముదము మీఱ నూట♦ముప్పదిలక్షలు, దివ్యతేజములను ♦ దేజరిలుచు. ౩౩

క. పురమును దీనిని గూల్పర్, నిరతము మదులందుఁ గోరి ♦ నెమ్మి తనర వ
చ్చిరి వెంబడించి; దానవ,వర! యెవ్వఁడు చెవులు నిక్క♦బలము మెఱయఁగర్.

[3]తే. ఆవలించుచునున్నవాఁ ♦ డతఁడు శరభుఁ
డనఁగఁబడువాఁడు సేనల ♦ కధిపుఁ డగును
భీతిలఁడు మృత్యువున కేని ♦ పృథులకలహ
మందుఁ బాఱఁడు ధీరుఁడై ♦ యలరుచుండు. ౩౫ 949

క. తనువు మహారోమంబున, ఘనముగఁ గంపింపుచుండఁ♦గా నష్టముగాఁ
గనుఁగొనుచు [4]స్వీయవాలం,బును జూచుచు సింహనాద♦మును జేసెడుఁజూ.

[5]క. బల మలరఁగ వేగము నుజ్జ్వలముగ వెలయంగ సాధ్వ♦సం బనునదియే
కలుగని మది సాల్వేయాఖ్య లలిం జెలువారు శైల ♦ మందెపు డుండుర్.

---

1 నిభృతః ప్రేక్షతే లంకాం దిధక్ష న్నివ చక్షుషా - అనిమూ. 2 చండాశ్చండపరాక్రమాః-అనిమూ. 3 న చ సంవిజతే మృత్యో ర్న చ యుద్ధా ద్విధావతి-అనిమూ. 4 పశ్యన్ లాంగూల మపి చ-అనిమూ. 5 రమ్యం సాల్వేయపర్వతమ్-అనిమూ.

[1]ఆ. బలము మిగుల వెలయు♦నలువదిలక్షల, వనచరేంద్రు లితని♦వశమునందు
నలరుచుందురు వి♦హారులన్ వారలు, వారిశౌర్య మెన్న ♦ వశము గాదు.

సీ. ఘనమేఘములు పోలెఁ ♦ గడిఁది శౌర్యంబున నాకాశతల మెల్ల ♦ నావరించి
హరినిచయాంతర♦మందు నిర్జరులలో నింద్రునివిధమున ♦ నెసఁగుచున్న
యీతండు పనసవి♦ఖ్యాతయూథేశుండు; సంగరంబును గోరు♦సకలకీశ
ములయంతరంబునఁ ♦ గలుగునీతనిమహాధ్వని పెక్కుభేరుల♦ధ్వనియుఁ బోలె

తే. వినఁబడుచునున్నయది యదె; ♦ ఘనుని నితని
సంగరంబున మార్కొనఁ ♦ జాల రెవ్వ
రుత్తమంబగు పారియా♦త్రోరుగిరిని
నాశ్రయించియె యుండు నీ♦యనఘుఁ డెపుడు. ౪౦½ 953

క. విను మేఁబదిలక్షల కీ,శనృపతు లీయూథనాథ♦సత్తము నిరతం
బును గొల్చుచుంద్రు వారిని, వనచరు లోగి వేఱు వేఱు♦బలసి కొలుతుఁజూ.

క. వననిధితటమున రెండవ,వననిధియుం బోలె వెలసి ♦ భయదం బగుచున్
గనఁబడుచు నుత్సవంబులఁ, దనరెడు బలములను నలరఁ♦దాఁగనుఁగొనుచున్

[2]చ. కనఁబడువాని యూథపతిఁ♦గా వినతాఖ్యునిగా నెఱుంగు మో
దనుజవిభూత్తమా! యితఁడు ♦ దర్దరపర్వతతుల్యగాత్రుఁడై
వనచరషష్టిలక్షలను ♦ బాహుబలాఢ్యులఁ గూడి సంతతం
బును గలహంబుఁ గోరుచును ♦ బొంగెడు వేడ్క నెసంగుఁ జూడుమా! ౪౩½

[3]తే. నదులలో నుత్తమంబు ప♦ర్ణాస, దాని
జలము లతిమధురంబు లా♦జలములఁ దమిఁ
ద్రావి తత్తీరసంస్థుఁడు♦దారబలుఁడు
తరమె యీతనివర్ణింప ♦ దైత్యనాథ!. ౪౪ 957

చ. అనికిని నిన్నుఁ బిల్చుచును ♦ నల్లదె క్రోధనుఁ డున్నవాఁడు కీ
శనిచయనాయకుం డతుల♦సత్వపరాక్రమ మొప్పువానరుల్
తను వరుసన్ భజింపఁగ ని♦తాంతముదంబున నున్నవాఁడు నూ
వనచరయూథముల్ తగ వి♦భక్తములై తగు పీనిచెంగటన్. ౪౫ 958

క. గైరికవర్ణంబగు తను, వారూఢిగ వెలయ సంగ♦రామోదమునన్
భూరిబలదర్పవనచర,వీరులను దృఢీకరించి ♦ వెలసెడు నదిగో. ౪౬ 959

క. అతఁడే గవయుఁడు వనచర,వతంసుఁ డురుతేజ మొప్ప ♦ భాసిలి నీపై
కతిశయకోపంబున రా, సతతము దలపోయుచుండు ♦ సత్వము పొంగన్. ౪౬½

1 ఏతస్య బలిన స్సర్వే విహారా నామ యూథపాః-అనిమూ. 2 ఏష దర్దరసంకాశో వినతో నామ యూథపః-అనిమూ. దర్దరో నామ గంగాసమీపస్థః పర్వతః-అనివ్యాఖ్య. 3 పిబం శ్చరతి పర్ణాసాం నదీనా ముత్తమాం నదీమ్-అనిమూ.

తే. ఇతని డెబ్బదిలక్షల ♦ నెన్నఁదగిన
వనచరులు గొల్చుచున్నారు ♦ తనబలములఁ
గలిసి తా నొక్కఁడే లంక ♦ వింయు మొంగు
నట్లుచేయఁగ నున్నవాఁ ♦ డసురనాథ!. ౪౭ 961

ఆ. యూథపతుల వీరి♦యూథపశ్రేష్ఠుల, మారుతానఁగ నిల్వ ♦ నేరికైన
నలవిగాదు భీతి♦దులు గావుహూపులు, వీరిక్రింద భటులు ♦ వేలు గలరు. ౪౮

ఇరువదియాఱవ సర్గము సంపూర్ణము

---

౨౭ - వ సర్గము.

సారణుఁడు రావణునకు సేనాధీశముఖ్యుల నిరూపించుట

క. వనచరు లెవ్వరు శ్రీరా,మునికొఱకై విక్రమములఁ ♦ బొంగుచుఁ బ్రాణా
శిని దాఁపకుందురో నే, వినిపించెదఁ జూచుచుండు♦వీరుల వారిన్. ౧ 963

సీ. ఎవనివాలాగ్రమం ♦ దెప్పుడు పెక్కు బారలపొడవులుగఁ దా♦మ్రంబు లగుచు
సితపీతములు నతి♦శ్వేతంబులునునయి వెంద్రుకల్ మిక్కిలి ♦ వెలసి నిక్కి
జలదంబులందును ♦ శక్రచాపాకృతి బహువిధవర్ణముల్ ♦ పరఁగ సూర్య
కాంతులు విలసిల్లు♦గతిఁ బ్రకాశించుచు నుండునో భయద♦కర్ముండు హరుఁడు

తే. వాఁడె యూథపముఖ్యుండు ♦ వీఁడు వొవు
చుండఁగాఁ దోఁక జీరాడు♦చుండు నేల;
వనచరులు నూర్లు వేలుగ ♦ ఘనతరువుల
నెత్తికొని లంక నెక్కఁగ ♦ నెసఁగు వేక్క. ౩ 964

క. హరువెంట వచ్చుచుందురు;, [గురు తేజం డితఁడు వేయి♦కోట్లకపులతోఁ
బరనగరజయుని నిను సం,గరమున గెలువంగ నుదిని ♦ గాంక్షించు విభూ!.] ౪

క. వనచరపతియా సుగ్రీ,వునకున్ హరుసేన లెల్లఁ ♦ బోడిమిగాఁ జ
క్కని సేవకులౌటను నా,తనిపంపును దలల భక్తిఁ ♦ దాల్తురు రాజా!. ౫

చ. దనుజవరేణ్య! నీలజల♦దంబుల పోలిక, నల్లనైన యం
జనమువిధంబునన్ నిలిచి ♦ చాలుగ నొప్పెడు భల్లుకంబులన్
గనియెదు గాదె యవ్వి తమ♦కంబున లెక్కిడఁ బూనినన్ దలం
చినను నశక్యమే యనుచుఁ ♦ జిత్తమునందునఁ దోఁపఁ జేసెదున్. ౬ 967

ఆ. సత్యశౌర్య మలర ♦ సాగరాపరతీర
మట్టు గానఁబడెడు ♦ నవ్వి పర్వ
తములయందుఁ దమి వి♦షమ దేశములయందు
నదులయందునుండు ♦ ముదము మీఱ. ౭ 968

క. దనుజేంద్రా! భయదముగాఁ, గనఁబడుభల్లూకము లివి ♦ కడఁగుచు నీపై

కని వచ్చుచున్నయవి; భీతిని గొలిపెడు నేత్రములను ♦ దీపించి తగన్. ౯

సీ. భయదమై తగినవిహా♦రంబున నొప్పుచు; నదె వీనియంతర♦మందు మేఘ
జాలముల్ పర్జన్యుఁ ♦ బోలె నయ్యవి తన్ను నెల్లెడఁ గొల్చుచు ♦ నేగుదేర
నల రారునితఁడు ధూ♦మ్రాక్షుఁడన్ యూథేశుఁ; డఖిలభల్లూకనా♦యకుఁడు నర్మ
దానదీజలములఁ ♦ దమిఁ దీఱఁ ద్రాగుచు ఋక్షవంతంబన ♦ నెసఁగు నద్రి
ఆ. వరమునందు నుండు; ♦ గిరినిభాకారుని
నితనిఁ జూడు మదిగొ ♦ యితఁడు ధూమ్ర
నయనుసహజుఁ డగు వి♦నయసమన్వితుఁ డన్న
వంటి రూప మలరు♦వాఁడు సుమ్ము. ౧౦ 970

క. బలమున విక్రమమున నీ,యలఘుఁడు తనయన్న మించు ♦ నసురేశ్వర! యీ
బలశాలి జాంబవంతుఁడు, బలనాయకులందు మేటి♦బలనాథుండో. ౧౧ 971

క. గురుశుశ్రూషానిరతుఁడు, పరాక్రమోపేతుఁ డనిని ♦ బాహుబలము ని
ర్భరగతిఁ జూపకయుండఁడు;, వరమతి యీతండు మున్ను ♦ వజ్రికి మిగులన్.

క. సురదానవయుద్ధంబునఁ, బరమసహాయంబు చేసె; ♦ వజ్రియు దానన్
గరుణించి యొసఁగె బహువిధ,వరముల నీతనికి; నితని♦భటు లవి జేయుల్. ౧౨

ఆ. లెక్కపెట్టరాక ♦ మిక్కిలి పెద్దయా,కారములును రోమ♦గణము వెలయ
నగ్నితేజమునను ♦ నలరుచు దనుజపి,శాచసదృశులగుచు ♦ సంతసంబు ౧౩

క. ధరణీధరముల పెద్దశి,ఖరములపై కెక్కి భూరి♦ఘనములవలెనే
పరఁగెడు పృథుశిలలను వే, ధరణిం బడఁద్రోయు భీతిఁ ♦ దాల్పవు మృతికిన్.

క. అనిశం బెగురుచు నున్నటు, గనఁబడుచుం దర్వరను బూని ♦ క్రాలునితఁడు కీ
శనిచయపతి దంభుం డనఁ,గ నొప్పు భటనాథులందుఁ ♦ గడు బల్లిదుఁడో. ౧౪

చ. వనచరు లెల్ల నీతనిని ♦ వారక చూచుచు నున్నవారలో
దనుజవిభూ! యితండు బల♦దర్పసమగ్రుఁడు గాన శౌర్యముం
గనఁబడఁ జేసి వాసవు ని♦కామముదంబును బొందఁ జేయుచున్
దనరుచు నున్నవాఁడు; విను ♦ దానవనాయక! యొల్లతావులన్. ౧౭ 977

సీ. కపిపితామహుఁడయి♦క్రాలు సన్నాదనుండనుయూథపతి కలఁ♦డతఁడు నడుచు
నవు డొకయడుగిడు ♦ నంతలో యోజన దూరమం దున్నట్టి ♦ ధారణీధ్ర
పార్శ్వముం జేరి య♦ప్పట్టున నిల్చునుగాన నంతటివెడ♦లైన తనువు
గలవాఁడు నిలుచున్నఁ ♦ గాయంబు యోజనమంత యెత్తున కేగు♦నట్టు లౌట
ఆ. నిలను నాల్గుపాద♦ములుఁ గల జంతువు,లందు నింతపెద్ద ♦ దరయ నెద్ది
తలఁప, లేదు; వజ్రి ♦ దనుజులతోఁ జేయు,సంగరమున బుద్ధి♦శాలి యితఁడు

చ. దనుజులతోడ మార్కొనుచుఁ ♦ దా నని సేసెఁ బరాజయంబు నీ
ఘనునకుఁ గల్గలేదు; సుర♦కాంతుని బోలును విక్రమించు వే

తను సురగాయకాంగన కి♦లన్ దనయుండయి యగ్నిదేవునం
కను జనియించె, నత్తఱిని ♦ గల్గిన ఘోరరణాంగణంబునన్. ౨౦ 979

క. సురలకు సాయ మొనర్పంగఁ, బరమకృపాళుండు వహ్ని ♦ పరికించి మహా
సురహంత నితని బడసెను, వరగంధర్వాంగన మది ♦ వాంఛించి తమిన్.

చ. దనుజవిభూ! యితండు కపి♦తల్లజుఁడై క్రథనుండునాఁగ నొ
ప్పును, ధనదాభిపాలితము ♦ భూధరవర్యము కిన్నరేంద్రసం
ఘనిబిడ మాకుబేరునకుఁ ♦ గమ్రవిహారసుఖప్రదంబునై
తనరుచు జంబువన్ తరువు ♦ తద్దయు నొప్పఁగ నున్న యాహిమా
ద్రిని వసియించుచుండుఁ జుమ♦ తేజము శ్రీయును బొంగుచుండఁగన్. ౨౨½

క. అనిమొన నీతఁడు తనుఁ దా, వినుతిం జేసికొనఁ డెప్డు ♦ వింతవనచరుల్
తను వేయికోట్లు గొల్వం,గను వచ్చినవాఁడు తా నొ♦కండే లంకన్. ౨౩½

క. పరిమార్పఁ గోరుచున్నాఁ, డు కపిబలములను గూడి ♦ యుద్ధతి; నదిగో
పరికింపు మచట యూథేశ్వరుఁ డొక్కఁడున్నవాఁడు ♦ సత్త్వము పొంగన్.

[1]సీ. శంబసాదనుఁడు రా♦క్షసుఁ డేన్గురూపంబుఁ గైకొని బాధలఁ ♦ గల్గఁజేయ
మునులు కేసరియను ♦ వనచరుఁ గని వానివధియింపఁ బురికొల్ప♦ వానినతఁడు
వధియించె దానికిఁ ♦ బరమమునుల్ మెచ్చి శౌర్యశాలిసుతుండు♦ జననమొందు
నట్లు వరం బిచ్చి ♦ రదిమొదలుగఁ గోఁతులకు నేనుఁగులకుఁ గ♦లహము వైర
మేర్పడెఁ గావున ♦ నీప్రమాథి యనంగఁ దనరుయూథేశుండు ♦ దానిఁ దలఁచు
[2]కొనుచు గంగాతీర♦మున నుండు గజయూథముల బెదరించుచుఁ♦ గలయఁదిరుగు
చుండును శ్రమమొంద ♦ కూరక లీలఁగాఁ బోవుచు వైరులఁ ♦ బొంగడంచు
గిరిగుహాలం దుండి ♦ కరులను జేఁబట్టి గిరులను గిరులచేఁ ♦ గరుల మఱియు

తే. దరువులం గొని గజములఁ ♦ గరులచేత
దరువులను గొట్టుచుండు; యూ♦థపతి యితఁడు
గంగచెంతను; మందర♦స్కాధరోప
మ మగునట్టి యుశీరబీ♦జ మను గిరిని. ౨౭ 984

క. సురలోకంబున శక్రుని, కరణిన్ విహరించుచుండుఁ ♦ గపివీరులు వా
నరవరు నీతనిఁ బదికోట్లు రహిన్ సేవింపువార♦లు దనుజనాథా!. ౨౮ 985

చ. ఉరుతరవిక్రమాఢ్యులయి ♦ యొప్పుచుఁ బూన్కి తగంగఁ దృప్తులై
నిరతము సింహనాదముల ♦ నింగిని నింపుచు సత్త్వబలాఢ్యులై
వరమతులై చెలంగు గుణ♦వానరవీరుల కెల్ల మేటియై
పరఁగు నితండు సంతతము ♦ బాహుబలాఢ్యుఁడు సుమ్ము రావణా!. ౨౯ 986

---

1 ఇందలికథ వ్యాఖ్యయం దున్నది మూలమున సంగ్రహముగ నున్నయిందలి యుపాఖ్యానము వ్యాఖ్య ననుసరించి వ్రాయఁబడిన దని యెఱుంగఁదగు. 2 గజాన్ యోధయతే వన్యాన్ గిరీం శ్చైవ మహీరుహాన్-గజై ర్వృక్షాన్ వృక్షై ర్గజాం శ్చ హంతీ త్యర్థః-అనివ్యాఖ్య.

[1]క. అనిమొన నీతని గెల్వం,గను సాధ్యముగాదు ♦ వాత♦కంపితమేఘం
బును బోలి చెంగుసీతని, గనుఁగొనుచున్నావు గాదె ♦ కర్బురనాథా!. ౩౦

చ. వనచరవీరవాహినిని ♦ వాతసముద్ధతరేణుజాల మొ
య్యన నరుణాభమై పరఁగి ♦ యంతట నొక్కట నావరించి మిం
చినయది వేగ మొప్ప నిటఁ ♦ జేరఁగవచ్చుటఁ జేసి యీయనీ
కిని గన భీతిదం బగును ♦ గేవలశక్తియుతంబునై తగున్. ౩౧ 988

సీ. అసితముఖంబుల ♦ నతిభయదంబులై ఘనబలంబులఁ గూడి ♦ క్రాలుచున్న
లలితగోలాంగూల♦ములు సేతుబంధనమును గాంచి సంతోష♦మునను గోటి
సంఖ్యలుగాఁ గూడి ♦ నత్వరంబుగ నేగఁజాలి గోలాంగూల♦సత్తముఁడగు
నట్టి గవాక్షు యూథాధిపునిం జుట్టుకొని విక్రమమున లంక♦ను హరింప
తే. వచ్చుచున్నవి చూడుమా ♦ వసుమతీధ
రమున నద్దానియందుఁ గా♦మముల నొసఁగఁ
జాలి, పుష్పోత్తమట్పద♦సమితిఁ గూడి
యున్న ఫలవృక్షములు మించు♦చున్నయవియొ. ౩౨ 989

చ. సరసిజబంధు వేశిఖరి♦సన్నిధిఁ దత్సమహేమవర్ణుఁడై
దిరుగుచు నుండునో, నుతియు ♦ దివ్యమృగాళి శకుంతరాజి యే
ధరణిధరాంతికంబునను ♦ దాని రుచిం గని యట్టికాంతిచేఁ
దిరుగుచునుండునో తమిని; ♦ దివ్యమునీంద్రులు యోగసక్తులై. ౩౩ 990

ఆ. దేవసానువులను ♦ దేజరిల్లుచు నుండి
దాని విడువ మదినిఁ ♦ దలఁపకుండు
వారో, ఫలయుతంబు♦లై రహిఁ గామాళి
నీయఁ జాలు ఫలము ♦ లెపుడు తనర. ౩౪ 991

క. తరువులు తేనియ లొప్పఁగ, ధరాధరమునందు నెందుఁ ♦ దద్దయుఁ గలవో
సురలకు నావాసంబై, పరఁగెడు నామేరు వనెడు ♦ పర్వతమందున్. ౩౫ 992

[2]క. హరిపతిముఖ్యుండగు కేసరి యాతఁడు తిరుగుచుండు ♦ సంతతమును నం
దరసిన నఱువదివేలు శిఖరు లున్నవి రమ్యములును ♦ గనకమయములున్.

[3]క. అనఘా! రాక్షసులందీ, వనుపమఁశవుగాఁ జెలంగు♦నప్పడిదిని వా
నినడుమ ముఖ్యతమంబౌ, ఘనగిరి మేరువు చెలంగుఁ ♦ గాంచనమయమై.

సీ. అందుఁ బింగళవర్ణ♦లఘువారు శ్వేతాంగములఁ దగువారును ♦ లలితతామ్ర
వర్ణాస్యముల్ గల♦వారును, మధుపింగళచ్ఛాయలఁ దగి చెలంగువారు

1 వాతేనేవోద్ధతం మేఘం యమేన మనుపశ్యసి-అనిమూలము. 2 షష్టి ర్గిరిసహస్రాణాం రమ్యాః కాంచనపర్వతాః-అనిమూ. 3 తేషాం మధ్యేగిరివర స్త్వమివానఘ రక్షసామ్-అనిమూ.

వాఁడికోఱలుగల♦వారును, నఖరాయుధులునైన యీకపు♦లెలమిమిగుల
నాపర్వతవరంబు♦నందు వసింతురు దంష్ట్రిచతుష్కములఁ♦ దగఁ జెలంగు

తే. సింహములరీతి, దగ్గఱఁ♦ జేరరాని
వ్యాఘ్రములభంగి, వీరలు♦ వఱలుచుంద్రు
వహ్నివలెఁ జాల నుగ్రులై♦ భయదగరళ
యుక్తఫణులట్లు క్రోధంబు♦ లొప్పుచుండ. ౮౦ 995

క. ఘనదీర్ఘవాలములఁ దగ, ననుపమమదదంతినికర♦ మట్టు లలరుచున్
ఘనపర్వతాంగు లగుచున్, బెనుజలదములట్లు ధ్వనులు♦ వెలయుచు నుండన్.

తే. వృత్తపింగళరక్తాక్ష♦భీషణులయి, భీతికరదేహులయి యతి♦భీషణగతు
లొప్పఁ గంఠరవంబు న♦త్యుగ్రమగుచు, వినఁబడంగఁ జెలంగెడు♦వీరలిపుడు.

క. *మనలంకాపురి మర్దింప నున్నయట్లున్నవారు; ♦ పరమభుజబలం
బున వీరినడుమ నదిగో, వనచరపతి శతవలి యను♦వాఁడు చెలంగున్. ౮౩

క. బలశాలి వీర్యశాలియు!, నిలాతలమునందుఁ గీర్తి♦యొనఁగు నితనిపై
రఘునుతి యితఁడు విజయము, గలుగం దలపోయుచుండుఁ♦గలకాలంబున్.

క. అనిశము రవి సర్పించును;, వనసేనలతోడ నొకఁడె♦ తా నీలంకన్
వనధిం గలుపన్ జూచును, దనుజేంద్రా! యితఁడు శూర♦తల్లజుఁడు సుమీ.

తే. పౌరుషంబును మాత్ర మే♦పట్టున విడు
వకయె తగువాఁడు బలశాలి♦ ప్రకటవిక్ర
మాఢ్యుఁ డగు, రామునకు హిత♦ మాచరించు
పట్టునం బ్రాణముల లెక్క♦పెట్టఁ డితఁడు. ౮౫ 1001

తే. నలుఁడు నీలుండు గజగవా♦క్షులు గవయుఁడు
దనుజనాయక! యూథేశు♦లనఁగ నొప్పు
వార లొక్కొక్కనికి నిందు♦ ధీరులైన
భటులు పదికోట్లు చుట్టును♦ బలసియుంద్రు. ౮౬ 1002

క. దనుజేశ! వింధ్యపర్వతమున నుండిన తీవ్రవేగ♦ముల నొప్పిన యీ
వనచరు లనేకు లగుటన్, వినుతించుచు లెక్కపెట్ట♦ వీలుపడదు సూ!. ౮౭

చ. దనుజవరేంద్ర! వానరులు♦ ధాత్రి క్షణంబునఁ బర్వతాళితోఁ
గనుఁగొనుచుండఁ బూర్ణముగఁ♦ గాల్ప సమర్థులు సుప్రభావులై
ఘనగిరితుల్యదేహులయి♦ క్రాలుచు నుందురు పర్వతంబులం
గొని యవలీల నవ్వలికిఁ♦ గొంకక వైవ వలంతులే సుమా!. ౮౮ 1004

ఇరువదియేడవ సర్గము సంపూర్ణము.

---

* నామ్నాం పృథివ్యాం విఖ్యాతో నామ్నా శతవలీతి యః-అనిమూ.

### ౨౮ - వ సర్గము.

–ఃః రావణునకు శుకుండు మఱికొందఱు వానరుల వర్ణించి చెప్పుట. ఃః–

క. సారణుఁ డీరీతినిగా, నారావణునకు వచింప ♦ నంతయు విని యా
వీరకపీశ్వరచరితం, బాహూఢిగ నెల్లఁ జెప్ప ♦ నాత్మఁ దలఁచుచున్. ౧ 1005

క. దనుజేంద్రునితో శుకుఁ డి, ట్లనియెను బలములను జూపి; ♦ యల్లవిగో భీ
తిని గొల్పు కపిబలంబులు, ఘనను ల్తద్వీపములట్లు ♦ గాఁ జూడఁగనై. ౧½

ఆ. [1]గాంగతటమునందుఁ ♦ గలమఱ్ఱివృక్షంబు, లట్లు, తుహినశిఖరి ♦ యందు మద్ది
తరువు లున్నయట్లు ♦ గురుతరకాయంబు, లమరఁ జెలఁగుచున్న ♦ వరసితి గద!.

క. వనచరులన్ వీరిని మార్కొని నిల్వఁ దరంబుగాదు ♦ కోరినచందం
బున రూపములం దాల్తురు, వినుతింపం దగినబలము ♦ వీరికి నుండున్. ౨½

క. [2]దనుజేంద్ర దైత్యతుల్యులు, ననిమొన నిర్జరులఁ బోలి ♦ యద్భుతశౌర్యం
బునఁ బొల్తురు; కడు వేగం, బును గాంచినవారు దనుజ ♦ పుంగవ! కంటే. 3

సీ. విను! వీరు తొమ్మిది ♦ వేలకోట్లుగ నైదు వేలకోట్లుగ; నేడు ♦ వేలకోట్లు
గను, తెక్కు వేలశం ♦ ఖములుగ బృందశతములుగ నున్నారు; ♦ దనుజనాథ!
సుగ్రీవునకు మేలు ♦ సొంపుగఁ జేయంగఁ దలఁచుచుఁ గిష్కింధ ♦ నెలమినతని
తోఁగూడి సతత ముం ♦ దురు; దేవగంధర్వజనితులు మఱియును ♦ దస్యమునను

తే. కామరూపులు నగుదురు; ♦ క్రమ్రరూప
వయసులం దసమానులౌ ♦ వారి నిరువు
రను దమిం జూచుచున్నావె! ♦ రాక్షసేంద్ర!
వారు మైందుఁడు ద్వివిదుఁడన్ ♦ వారు సుమ్ము. ౫½ 1010

క. [3]అని వీరిసాటిసేయం, గను దగువాఁ డెవఁడు లేఁడు; ♦ కపు లిద్దఱు వీ
రనఘులు వనరుహజనిపం,పున నమృతముఁ ద్రావినారు ♦ పొంగెడు కాంక్షన్.

క. పెనుతేజంబున నీలం, కను దారే పాడు సేయుఁ ♦ గాఁ గోరుచు నో
దనుజేంద్ర! యున్నవా రీ, వనచరవీరులకుఁ బార్శ్వ ♦ భాగమునందున్. ౭½

ఆ. అద్రితుల్యదేహు ♦ లగు పదికోట్లసద్భటులు బలిసియున్న ♦ వారు నీరు
పర్వతములభంగిఁ ♦ బటుదేహములు తగఁ, గనుచునున్నవారు ♦ మనపురమును.

ఆ. [4]సుముఖదుర్ముఖు లను ♦ జోక్కువీరులు
మృత్యుసుతులు తండ్రి ♦ మించువారు;
మదగజంబుభాతిఁ ♦ బొదలుచు నిలుచున్న
వనచరేంద్రు నతని ♦ గనుదు గాదె?. ౮½ 1014

---

1 న్యగ్రోధా నివ గాంగేయాన్ సాలాన్ హైమవతా నివ-అనిమూ. ఇచట సాలశబ్దమునకు మద్దిచెట్టని యర్థము చెప్పవలెను. "సాలేతు సర్జకార్శ్యాశ్వ కర్ణకా స్సస్యసంవరః" అని యమరము 2 దైత్యదానవసంకాశాః - అనిమూ. 3 బ్రహ్మణా సమనుజ్ఞాతా వమృతప్రాశినావుభౌ-అనిమూ. 4 మృత్యుపుత్రౌ పితు స్సమౌ-అనిమూ.

క. వనచరుఁ డీతఁడు కోపిం, చిన సంద్రమునైనఁ గలఁగఁ ♦ జేయు నితండే
మనపురికి వచ్చి సీతను, గని సీతో మాటలాడి ♦ గదలి చనియె నూ!. ౯౪

క. [1]మును చూచినావు మరలం, జనుదెంచిన యితనిఁ గనుము ♦ సారభుజుండై
తన రెడు కేసరి యనఁజను, వనచరునకు క్షేత్రజుఁ డనఁ ♦ బరఁగు సుతుండా.

క. తొలికొడు కీతఁడు వాయువు, వలనన్ జనియించె నన్న ♦ వార్తగలదు నూ!
యిలలో హనుమంతుం డని, పిలుతురు సజ్జనులు వీనిఁ ♦ బృథుబలమహితున్.

క. [2]వననిధి దాఁటిన దితఁడే, తనయిచ్ఛకుఁ దగినయట్టి ♦ తనువు ధరించున్
వనచరవర్యుండై బల,మున మిక్కిలి వెలసి రూప♦మున సన్నుతుఁడై. ౧౧౪

ఆ. ఎల్లతావులందు ♦ నేగంగఁ జాలిన, జనకుఁడైన యనిలు♦చందమునను
నడ్డగింపరాని♦దా గతి గల్గియె, సకలకార్యములను ♦ జక్కఁ జేయు. ౧౨౪

క. మును బాల్యంబున నీతఁడు, చనుబాలకు నాసఁగొనుచు ♦ సమధికమా క్షు
త్తున బాధితుఁడై యుదయిం,చునర్కునిం జూచి మ*హిత♦సూరత్వమునన్.

క. ఆఁకలి యుడుగక యున్నది, నా కిత్తఱిఁ గాన ఖచర♦నాయకు భానున్
జేకొని భక్షించెద నిఁక, నాఁకలి దీరంగ ననుచు♦నాత్మఁ దలఁచుచున్. ౧౮

క. [3]త్రిసహస్రయోజనంబులు, వెస మేరువునుండి డిగ్గి ♦ విబుధర్షుల క
ట్లసురులకు ననాధృష్యం, డసమాకారుండు నైన ♦ యర్కునికడకున్. ౧౮౹

ఆ. చనుచు నతని తేజ♦మున కోర్చి చెంతకు
నరుగఁజాల కుదయ♦గిరిపయిఁ బడె
దృఢహనువులు నెలయఁ ♦ దేజరిల్లెడు నీతఁ
డచటి యశ్మతలము♦నందుఁ బడఁగ. ౧౯ 1023

క. హను వొకటి సుంత చెదఱెను, హనుమంతుం డనెడు నామ♦మలరె నితని కం
దున; నాప్తవాక్యమున నీ,తని వార్త నెఱింగినాఁడఁ ♦ దథ్యం బిదినూ!. ౧౬౪

క. బలరూపసుప్రభావం, బులు వీనికి నిట్టి వనుచుఁ ♦ బొగడంగా నా
కలవియె గా దొకఁడే యితఁ, డరయక తేజమున లంక ♦ యంతయు నిపుడే.

క. పరిమార్పఁ గోరుచున్నాఁ, డరయుము వనుజేంద్ర! హను♦మయంతికమున భీ
కరమూర్తి సౌరవర్యుఁడు, పరఁగుఁ గదా యతనిఁ జూడు ♦ పద్మనిభాక్షున్.

సీ. ఇక్ష్వాకువంశ్యుల ♦ కెల్లరకును మేటి యతిరథవర్యుఁడై ♦ యలరుఁ జుమ్ము
విఖ్యాతమే గద! ♦ విక్రమ మితనిది ఖరవధాదులచేత ♦ క్ష్మాతలమున

1 జ్యేష్ఠః కేసరిణః పుత్రో వాతాత్మజ ఇతి శ్రుతః-అనిమూ. కేసరిణః పుత్రః తస్య క్షేత్రజః పుత్రః-అనివ్యాఖ్య. 2 బలరూపసమన్వితః-అనిమూ. *"హి" యనునది గాయత్రిపదునాఱవయక్షరము. 3 త్రియోజనసహస్రం తు-అనిమూ. త్రియోజనసహస్రమి త్యనేకయోజనసహస్రోపలక్షణం-అనివ్యాఖ్య. భూమికిఁ బైని లక్షయోజనదూరముం దుండఁగా మూఁడువేలయోజనములని చెప్పుట యసంగతము కాదా యనునాక్షేపమునకిదిసమాధానము కాఁబట్టి తెనుఁగున నిది చేర్పఁబడలేదని యెఱుఁగునది.

ధర్మ మీతనియందు ♦ నిర్మలస్థితిఁ గాంచుఁ గాని చలింప దెం♦క్కారణనైన
నెవ రెంతచెప్పిన ♦ నితఁడు ధర్మంబును దాఁటి వర్తింపఁడు ♦ దానవేంద్ర!
తే. వేదములను బ్రహ్మాస్త్రంబు ♦ వీరుఁ డీతఁ
డెఱుఁగు వేదజ్ఞులం దీతఁ♦డే యధికుఁడు
బాణములచేత నంబర♦వస్తువులను
గూల్పఁగలఁ డద్రులను గూడఁ ♦ జీల్పఁగలఁడు. ౨౦౹ 1027
క. వినవయ్యా! పెనుక్రోధము, గనుపట్టునొ మృత్యువున ని♦కాము మితనియం
దును జూడఁబడెడునట్టులె, ఘనపౌరుష మింద్రురీతిఁ ♦ గనఁబడు మిగులన్.
క. భూనాయకవర్యుండనఁ, గా నెగడిన యితనిసాధ్వి ♦ క్ష్మాపుత్రి జన
స్థానముననుండి తెచ్చితి, వానృపుఁడే యితఁడు రాముఁ ♦ డసురాధీశా!. ౨౨
క. [1]అని సేయఁగ నీమీఁదికిఁ, జనుదెంచుచు నున్నవాఁడు; ♦ [2]జాంబూనద ను
గ్నిని గాల్పు నున్న తెఱఁగునఁ, దనుకాంతి చెలంగ రాము♦దక్షిణదిశలోన్.
ఆ. [3]అతివిశాలవక్ష♦మమరఁ దామ్రాక్షుఁడై, యుంగరములుగాఁగ♦నొప్పి నల్ల
నైన కురులు తనర♦నలరువానిం జూడు, మితఁడె లక్ష్మణుం డ♦హీనబలుఁడు.
క. శ్రీరామునకుం దమ్ముం, డారయఁగాఁ బ్రాణమట్టు♦లన్నకుఁ బ్రియుఁడై
కోరిచరించును నాతని, చేరువ నయయుద్ధములను ♦ జెందునిపుణతన్. ౨౫
ఆ. సకలశాస్త్రములను ♦ జక్క నెఱుంగును
బగఱఁగాంచి యోర్పు♦ఁబట్టఁ జాలఁ
డనిని దుర్జయుఁడు జ♦యమును గాంచును బరా
క్రమము వెలయఁ బోలుచు ♦ సుమతి గలిగి. ౨౬౹ 1033
క. రామునకుం గుడిభుజ ము, ద్దామబలాఢ్యుండు బయటఁ♦బగు ప్రాణము నా
రామునకుఁ దగును నసువుల, నేమాడ్కిన్ దాఁపఁడనిని ♦ నీతఁ డతనికై.
క. దనుజుల నందఱ నొక్కఁడె, యనిమొన వధియింపనలయు♦నని యున్నాఁడో
దనుజేంద్ర! యితఁడు శ్రీరాముని సవ్యక్షితిని దనుజ♦ముఖ్యులు గొలువన్.
క. [4]నిలుచున్నవాఁడె తేజము, వెలయంగ విభీషణుండు ♦ వితతభవద్రా
జ్యలలితలక్ష్మికి నాథుఁడు, తలఁపన్ శ్రీమంతుఁ డగుచు ♦ ధరణి నసముఁడై.
ఆ. సార్వభౌముఁ డగుచు ♦ జననుతిఁ గాంచిన
రాముఁడే త్వదీయ♦రాజ్యమునకు
మనవిభీషణునిని ♦ మమత రాజును జేసెఁ
గాన నతఁడు శౌర్య ♦ మూని కడఁక. ౨౯౹ 1037

---

1 స ఏష రామ స్త్వాం యోద్ధుం రాజన్ సమభివర్తతే-అనిమూలము. ఇటమూలమున వర్తమానకాల ముపయోగింపఁబడినది గానఁ దెనుఁగున నట్లే యుపయోగింపఁబడినదని తెలియందగు.
2 శుద్ధజాంబూనదప్రభః-అనిమూ. 3 నీలకుంచితమూర్ధజః-అనిమూ. 4 రక్షోగణపరిక్షిప్తో రాజా హ్యేషవిభీషణః-అనిమూ.

క. అని సేయు నిన్ను మార్గా-నఁ, జను దెంచుచు నున్నవాఁడు; ♦ త్స్మాపతికిని నీ
యనుజునకు నడుమఁ బర్వత, మన నిశ్చలుఁడగుచు నున్న ♦ యతనిం గంటే!.
క. వనచరముఖ్యాధ్యక్షుం, డనఁబడు సుగ్రీవుఁ డీతఁ ♦ డని నపజయముల్
గనఁ డెప్పుడు తుహినాచల,ము నిఖిలగిరులందుఁ దాన ♦ ముఖ్య మగుగతిన్.
తే. యశమునను దేశమునను జ్ఞా♦నాభిజాత్య
ములను బుద్ధిని నెల్లకో♦తులను మించి
వెలుఁగుచున్నాఁడు; ప్రాకార♦వితతిదుర్గ
మద్రిదుర్గమునై యల♦రారి మఱియు. ౩౦ 1040
క. వనవృక్షపరివృతంబై, ఘనశైలగుహాకృతిగను ♦ గన్పడు కిష్కిం
ధను మంత్రియూధపులతో,ననిశము పాలించు చుండు ♦ నందు వసించున్.౩౧
క ఇతనిగళంబునఁ గనుమా, శతపత్రశతాన్వితమగు ♦ చారుకనకమా
లతగున్ సురనరులకు న,ద్భుతముగఁ గనవచ్చు నదియుఁ♦బొలుచున్ మిగులన్.
ఆ. విజయలక్ష్మి యందు ♦ విలసిల్లు గావున-
దీని దాల్చునట్టి ♦ వాని కెందు
నపజయంబు గలుగ ♦ దనిని రాముఁడు వాలిఁ
జంపి కనకమాలఁ ♦ జారుతరము. ౩౨ 1043
క. కనకాంగిఁ దార, శాశ్వత, వనచరరాజ్యంబు నొసఁగె ♦ భానుసుతున కీ
యనఘునకు; దానవేంద్రా', విను శతలక్ష లగుఁగోటి ♦ విద్వన్నుతమై ౩౩౪
క. శతకోటిసహస్రంబులు, క్షితి శంఖ మనంగ రూఢిఁ ♦ జెల్లు నవియునున్
మఱియుతులు శతసహస్రము,లు తగు మహాశంఖ మని ప♦లుకుదురు రాజా!.

సీసమాలిక:—

అవి నూఱువేలైన ♦ నగు బృందసంజ్ఞకం బవి నూఱువేలైన ♦ నగును జమ్ము
పృథివియందును మహా♦బృందమునా నవ్వి శతసహస్రములైన♦సంజ్ఞఁ బద్మ
బద్మము,నా నవ్వి ♦ పరిగణింప సహస్రశతములై నయెనచో ♦ సాధువినుతిఁ
గాంచు మహాపద్మ♦కంబను సంజ్ఞను, నవి నూఱువేలైన ♦ నగును ఖర్వ
మవి నూఱువేలైన ♦ నగును మహాఖర్వ మవి నూఱువేలైన ♦ నగు సముద్ర
మవియునన్నియెనైన♦నగునోఘమనుసంజ్ఞయవి నూఱువేలైన♦నగు మహౌఘ
మీరీతి దనుజేంద్ర! ♦ యెల్లనైన్యేశులకడ వేఱువేఱుగాఁ ♦ గడిఁదిబలము
లలరును నూఱుకో♦టులు నూఱుశంఖముల్ శతదశమితమహా♦శంఖములును

తే.బృందశతములు మఱిమహా♦బృందదశశ
తములు, శతపద్మములు, సహా♦స్రముగ నలరు
నమ్మహాపద్మములు విను ♦ మట్లె నూఱు
ఖర్వములును సముద్రముల్ ♦ గలవు నూఱు. ౪౧ 1046

తే. అల్లె నూటు మహౌఘంబు ♦ లవ్విధముగ
నొక్క కోటిమహౌఘంబు ♦ లురునముద్ర
మట్లుగ నపారమై చూడ ♦ నలవిగాక
వెలయు సేనలఁ గూడి వి♦భీషణుండు. ౪౭ 1047

క. తనసచివులతో సేనల, వినుతిం గను రీతి నడప ♦ భీషణబలముల్
తనుఁ గొలువ విక్రమంబున, ననుపముఁడై వనచరేశుఁ ♦ డదె నినుఁ దాఁకెన్.

క. చనుదెంచుచున్నవాఁ; డో, దనుజేంద్రా! మండుచున్న ♦ దారుణఖచరం
బన, వచ్చుచున్న యీబల, మును గాంచుచు మనకు విజయ♦ము గలుగురీతిన్.

క. అరిజనులచేత నపజయ, మురుసంగ్రామమునఁ గలుగ♦కుండునటులుగాఁ
బరమప్రయత్నమును ని, త్తరుణంబునఁ జేయఁబంపుఁ ♦ దగువారి విభూ!. 1050

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౨౯ వ సర్గము.

{ రావణుఁడు శార్దూలాదిచారులను బంపుట. వారు పట్టుపడి విడిపింపఁబడి మరల లంకకు వచ్చుట. }

క. హరియూథపతుల నంతటఁ, బరికించుచు రామభద్రు♦పార్శ్వంబున సో
దరుఁడైన విభీషణుఁ డా, దరమునఁ జెలువారుచుండ ♦ దనుజేంద్రుఁ డొగిన్.

క. కని రామునికుడిబుజమై, యనివారితవీర్యశాలి ♦ యగు లక్ష్మణు, భీ
తిని గల్గఁ జేయువిక్రమ,మున నొప్పుచు సర్వకపివి♦భుండగు నినజున్. ౨ 1052

[ఆ. గజుని, మైందు, ద్వివిదు, ♦ గవయు, గవాక్షుని
వాలిసుతుని, వీర ♦ వంతు, హనుమ,
దుర్జయుఁడుగ ననిని ♦ దోఁచెడు జాంబవం
తుని, సుషేణుఁ, గుముదు♦ని, నలు నీలు.] 1053

. కనుఁగొని సుంత భీతి మదిఁ ♦ గాంచియు వైరుల మించి యున్నవా
దనుజుల సారణున్ శుకుని ♦ దద్దయుఁ గోపము నొంది వార్తచె
ప్పిన తరువాత వీరు లని ♦ ప్రీతిని బొందక క్రూరవాక్కులన్
గనుఁగొనుచున్ వచించి వ్యథఁ ♦ గాంచఁగఁ జేసెను వారి నంతయున్. 3

ఆ. *తనకు మ్రొక్కి భక్తిఁ ♦ దల వాంచి యున్నయా
శుకుని సారణునిని ♦ జూచి క్రుధను
బలుకుఁ దొట్రిలంగఁ ♦ బడఁ గ్రూరవాక్కుల
నిట్లు పలికె దాన♦వేశ్వరుండు. ౪ 1055

* ఈపద్యార్థము పైపద్యార్థమునే పోషించును. మూలమం దిట్లే యున్నది కాన వ్రాయఁబడియె నని యెఱుంగఁదగు.

తే. నిగ్రహానుగ్రహములను ♦ నేర్పు మెఱయఁ
జేయఁగ సమర్థుఁడై యున్న ♦ క్షితిపునకును
నతని చెంతను జీవించు ♦ నట్టి సచివు
లిట్టు లప్రియములఁ జెప్పు ♦ టెపుడు తగదు. ౫ 1056

*క. మనకుం బ్రతికూలురైరి, యని సేయఁగ నెత్తివచ్చు ♦ నరులను మీరి
ట్లనవసరముగా సంగరమున కాదిని వినుతి సేయఁ ♦ బోలునె? తగునే?. ౬

తే. రాజనీతిని దెల్పుశా♦స్త్రంబునందు
సారభూతంబుగా నుండఁ ♦ జాలు భృత్య
కృత్యముల మీర లించుకే ♦ నెఱుఁగ లేక
యున్నవార లిట్లుండుట ♦ నెన్నిచూడ. ౬౪ 1058

తే. పెద్దలయి శాస్త్రనీతులఁ ♦ దద్దయుఁ దమిఁ
దెలుపు గురువుల మీరలు ♦ గొలుచునదియు!
వ్యర్థమే, చాలకాలంబు ♦ నమలగురువుఁ
గొలిచియున్న నజ్ఞాన మె♦ట్టు లగు ననిన. ౭ 1059

చ. నిరుపమనీతిశాస్త్రముల ♦ నేర్చిన నందలియర్థభంగులం
గరమెఱుఁగంగ లేదు; కల♦కాలము జ్ఞానమహాభరంబునుం
శిరసున మోయువారలకుఁ ♦ జేకురు దానిప్రయోజనంబు క
ర్బురవర! వట్టివారలకు ♦ బుద్ధిఁ గనంబడకుండు నద్దియుం. ౮ 1060

ఆ. ఇట్టి మూర్ఖసచివు ♦ లేవేళఁ గొల్చుచు,నుండ నున్న నేను ♦ నుగ్రరిపుల
చేత నెపుడొ మృతిని ♦ జెందఁగఁ దగువాఁడ,నైన బ్రదికినాఁడ ♦ నావిధికృప.

క. అనుశాసించితి నని జిహ్వను వాక్యము దాఁటినం శు♦భంబు సుభముం
నెనువెంటఁ గలుగుఁ గద మీ,రనూనపరుషోక్తు లాడి♦నందుల కిఁ)డే. ౯

తే. చావు దప్పదు మన కను ♦ సాధ్వసంబు
గలుగలే దేలొకో మీకుఁ ♦ గాననమున
దావవహ్నిని జిక్కిన ♦ తరువులైన
నిలువఁగా వచ్చు నృపదోష♦ముల నొనర్చి. ౯౪ 1063

క. ఈతఁడు శిక్షార్హుం డని, యేతఱి నిర్ణయము తగునొ ♦ యే త్తెఱ నపుడే
యాతఁ డపరాధిమృత్యువు,వాఁతం బడుఁ గాని క్షితిని ♦ బ్రదుకఁడు సుండీ!.

చ. అరిజనపక్షముం బొగడు♦నట్టి దురాత్ముల వీరిఁ జంపుదుం
ద్వరపడియైనఁ బూర్వము హిం♦తం బొనరించిరి వీరు నాకు ని
త్తరుణమునందు నయ్యది క్రు♦ధం మృదుతం గనఁ జేసె నెమ్మదిం
బరఁగుటఁ గానఁ గాచితిని ♦ బ్రాణము లిచ్చితి వీరికిం గృపం. ౧౧ 1065

* ఉభాభ్యాం సదృశం నామ నక్తు మప్రస్తవే స్తవమ్=అనిమూ. అప్రస్తవే=అనవసరే-
అనివ్యాఖ్య.

క. స్థానభ్రష్టులు గండో,దానవులారా! చనుండు ♦ తటుకున నిచటన్
గానఁబడఁ గూడ దిఁక మీ, రానాఁ డొనరించినట్టి ♦ యాయుపకృతికిన్.

క. మనసు దయం గనుటన్ మిము, సునిశితఖడ్గాభిహతిని ♦ స్రుక్కింపక పో
మ్మనితిని; గృతఘ్నులగు మీ, రని శము నాయెడల మైత్రి ♦ నందనికతనన్.

[1] తే. విడిచిపెట్టుటయే మీకు ♦ బెడిదపుమృతి
వంటిదే యగు, నన విని ♦ వారు లజ్జ
నొంది జయ జయ శబ్దంబు ♦ లొప్ప నతనిఁ
బొగడి యటనుండ కేగిరి ♦ తగుజవమున. ౧౩॥ 1068

క. అంతట నాదనుజేంద్రుఁడు, చెంత మహోదరుని గాంచి ♦ శీఘ్రమె యిట క
త్యంతనృపనీతివేత్తల, నెంతయు మతిమంతులగుచు ♦ నెసఁగెడువారిన్. ౧౪

క. చారుల రప్పింపుము నాఁ,గా రావణునాజ్ఞను గొని ♦ కడువడి నతఁడా
చారులఁ బిల్వఁగఁ బంపెను, వారును రాజాజ్ఞఁ బూని ♦ వచ్చిరి వడిగన్. ౧౫

చ. కరముల దోసిలించి రిపు♦కాలుని వాని జయాశిషంబులన్
బరినుతి సేసి కొల్వునకు ♦ వచ్చితి మే మని విన్నవించి; రా
సురరిపు వం భక్తులును ♦ శూరులు మైత్రికిఁ బాత్రులున్ రిపూ
త్కరమునకున్ భయంపడని♦ధైర్యసమగ్రులునైన చారులన్. ౧౬॥ 1071

చ. కనుఁగొని పల్కె; మీరిపుడె ♦ క్ష్మాపతియొద్దకుఁ బోయి యందు నా
తనివ్యవసాయ మెట్టిదొ ని♦తాంతము తెల్పఁ బరీక్షసేయుఁ డా
తనితగు నిశ్చయంబు గనఁ ♦ దద్దయు నల్పమెయైన భీతి నొం
దునటులు సేయఁగాఁదగును ♦ దోడనె, యాతనిసమ్ముఖంబునన్. ౧౭॥ 1072

[2] సీ. సచివులెవ్వరొ యుందు♦సతతంబు నంతరంగులుగాఁగఁ బ్రీతితోఁ♦గలిసితిరుగు
వారుగా నున్నట్టి ♦ వారలెవ్వరొ చక్కఁ బరికింపుఁడీ! యట్టి ♦ వారలందు
భేదంబు గన్పడ ♦ భేదింత మెల్లిన; రాముఁ డేరీతి ని♦ద్రను దగంగ
ననుభవించునొ యొంటి ♦ నతఁడు నిద్రించునా జాగరూకుండయి ♦ సకలపరిజ
తే. నావృతుండయి యుండునా; ♦ యాతఁ డొంటి
నిదురఁ గనునేని యనిని చే♦యఁ దగుఁ జింత
గనుచు మేల్కొని యుండినఁ ♦ గడువడిఁ బయిఁ
బడి వధింపఁగ వచ్చును ♦ బ్రతిభ మెఱయ. ౧౮॥ 1078

1 రావణం జయశబ్దేన ప్రతినంద్యాభినిస్సృతౌ-అనియా. 2 మంత్రిష్వభ్యంతరా యేఽస్య ప్రీత్యా తేన సమాగతాః, కథం స్వపితి జాగర్తి కి మన్యచ్చ కరిష్యతి-అనియా. దీనికి వ్యాఖ్యానమున నున్నయర్థ మంతయు నిట వ్రాయఁబడినదిగాని సొంతకల్పన మినుమంతయుఁ జేయఁబడలేదని యెఱుంగనగు.

ఆ. ఇంక నేమి చేయ ♦ నెంచుచు నున్నాఁడొ
పట్టణమును నిపుడె ♦ ముట్టడించు
నొక్కొ? జాగుసేయ ♦ నూహించుచున్నాఁడొ
మాఱువేషములను ♦ మహితగతుల. ౧౯ 1074

క. చని మీరు నేను జెప్పిన,పను లన్నియు నేర్పుమీఱ ♦ బాఁగుగ నొనరిం
చి నిజము గనుఁగొని రావల,యును; బండితులైన రాజ ♦ లోక్క విధమునన్.

క. చారులమూలంబునఁ దమ,వైరులవిధముల నెఱింగి ♦ బవరంబున స్వ
ల్పారంభములను జేసియొ, వారల నోడింతు రనుచుఁ ♦ బలికిన నంతన్. ౨౦

సీ. అట్లె చేసెద మని ♦ యావిభుతోఁ బల్కి చారులు హృష్టులై ♦ స్వాంతములను
శార్దూలుతోఁ గూడి ♦ సప్రదక్షిణముగ దనుజేంద్రునకు మ్రొక్కి ♦ ఘనజవమున
రామలక్ష్మణులున్న ♦ యామహికిం బోయి; రంత, వారలు నరూ ♦ పాంతరములఁ
గైకొనుచు సువేల ♦ కమ్రగిరీంద్రముచెంత సుగ్రీవుఁడు ♦ వింతగా వి

తే. భీషణుండును గొల్వంగ ♦ వెలయు రాము
నతనితమ్ముని జూచిరి ♦ వితతబలము
రామముఖులను జూడంగ ♦ నే మనముల
భయము నొందిరి వారి గెల్వ నెటులనుచు. ౨౩½ 1077

క. బలముల వా రిటు లెల్లెడఁ, గలయం దిరుగంగ దనుజ ♦ కాంతుఁడు ధర్మం
బుల నెఱుఁగు నవ్విభీషణుఁ, డలవారలు దానవులని ♦ యాత్మ నెఱింగెన్.

క. సురరిపులు వారు బలములఁ, జరియింప యదృచ్ఛచేత ♦ సమధికధర్మా
దరుఁడగు విభీషణుఁడు గని, పరిపరిఁ దర్జించె నందుఁ ♦ బాపమనీషున్. ౨౪½

క. దనుజుని శార్దూలుని న,వ్వనచరులకుఁ బట్టి యిచ్చె ♦ వారలు వానిన్
గొనిపోయి చావఁగొట్టన్, గని రాముఁడు విడిచిపుచ్చెఁ ♦ గరుణ దలిర్పన్.

*క. కరుణాంతరంగుఁడై రఘు,వరుఁ డితరుల రాక్షసులను ♦ వానరు లతిభీ
కరరీతిఁ గొట్టుచుండఁగ, సరిగాదని విడిచిపుచ్చెఁ ♦ జనుఁ డీక ననుచున్. ౨౬

చ. వనచరు లిట్లు వేగమును ♦ బౌరుష ముట్టిపడంగఁ గొట్టఁగా
దనుజులు వార లూర్పులను ♦ దారుణరీతిని బుచ్చుచున్ మనం
బునఁ గల ధీరతన్ వదలి ♦ పోయిరి లంకకు, నెల్ల దేశముల్
గనఁ జరియించి వార్తలను ♦ గైకొని వచ్చుమహానిశాచరుల్. ౨౬ 1082

క. బలవంతులు చారులునై, చెలఁగియు ధైర్యమును బాసి ♦ చేరి విభుని ని
ట్టులు వల్కిరి భీకరమగు, బలతతితో రాఘవుండు ♦ వచ్చి కడఁకతోన్. ౨౭½

తే. మనసు నేలాచలంబుచెం ♦ తను వసించి
యున్నవాఁడు బలంబు ల ♦ త్యున్నతములు

* మోచితా రాక్షసాః పరే-అనియూ.

వానిఁ బరికించి వచ్చితి ♦ మో నిశాచ
రేంద్ర! యని పల్కి రాచారు ♦ లింపు గులుక. ౨౮ 1084

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

శార్దూలుఁడు రావణునితో రామునివృత్తాంతమును జెప్పుట

క. దనుజేంద్ర! సువేలాచల,మునకు సమీపమున సైన్య ♦ మును సక్షోభ్యం
బును గూడి రాముఁ డుండుట, వినిపింపఁగ వారివలన ♦ విహితులరాకఁగ. ౧

క. విని యతఁడు సుంతభయముం, గని శార్దూలాఖ్యుఁ జూచి ♦ కడువడిఁ బలికెఁగ
దనుజా! నీముఖతేజం, బనుదిన మున్నట్టు లుండ ♦ దది యేలయొకో?. ౨౹

క. దీనుఁడవై యున్నాఁడవు, దానికిఁ గలహేతు వేమొ ♦ దారుణకోపం
బూనిన శత్రువులకు నో,దానవవర! చిక్కవు గద ♦ దగనివిధమునఁగ. ౩ 1087

క. అరులకుఁ జిక్కినకతమునఁ, బరసేనాతత్త్వ మెఱుఁగఁ ♦ బడకుండిన దా?
త్వరగాఁ జెప్పుమ యని క,ర్బుర శార్దూలుండు పలుకఁ ♦ బొంగెడుభీతిఁగ. ౩౹

చ. మనసు చలింప భీతిమెయి ♦ మాటలు తొట్రిల నాను రారి యి
ట్లనియెను మెల్లఁగా; వనచ ♦ రావళిగుట్టుల నెల్ల జక్కఁగాఁ
గనుఁగొన వేగువారలకుఁ ♦ గాదు తరంబు; బరాక్రమంబునఁగ
వనచరు లెల్లఁ గ్రాలుదురు ♦ వారిబలం బసమానమై తగుఁగ. ౪ 1089

ఉ. అంతియ గాదు వారలను ♦ నారసి రాముఁడు కాచుచుండుఁ దా
నెంతయు జాగరూకుఁడయి ♦ యిట్టివిధంబున నున్నవారితో
నింతయు మాటలాడుటక ♦ దెవ్వరికేని దరంబుగాదు నాఁ
బంతమునం బరీక్షకయి ♦ పాటుపడం జనునయ్య! దేవరా!. ౪౹ 1090

ఉ. వానరు లెల్ల తావులను ♦ బర్వతసన్నిభగాత్రు లున్నవా
రూనినశక్తి మార్గముల ♦ నొక్కవిధంబునఁ గాచుచున్నవా
రే నలసేనఁ జొచ్చితి ని ♦ దింతియె యప్పుడె నన్నుఁ జూచి రా
వానరసేనలోఁ దిరిగి ♦ వారితరం బెఱుఁగంగ రాదు నూ!. ౬౹ 1091

సీ. మనవిభీషణమంత్రు ♦ లనునయమును వీడి బలవంతముగ నన్నుఁ ♦ బట్టుకొనిరి
బహువిధంబుల భూమి ♦ పైఁ బొరలించిరి మీఁదుమిక్కిలి శక్తి ♦ మించు కపుల
కప్పగించిరి వార ♦ లతిబలవంతులై యుండుట ననుఁ గాంచి ♦ యోర్వలేక
పిడికిళ్ల గ్రుద్దియు ♦ బెడిదమ్ముగా జానువులను నొప్పించియుఁ ♦ బొలుచుదంత
ములచేతఁ గొఱికియుఁ ♦ దలములఁ జఱచియు నివ్విధం బీడించి ♦ యెల్లసేన

తే. చుట్టు నను ద్రిప్పి యంగముల్ ♦ సొలసి రక్త
మునను దోఁగఁగ మూర్ఛను ♦ మునిఁగియున్న

నను విచలితేంద్రియుని బట్టు♦కొని యితండు
చారుఁ డీతఁడు వైరుల♦చారుఁ డనుచు ౮ 1092

క. పలుకుచుఁ గొట్టుచు వేగమె, బలములయం దెల్లఁ ద్రిప్పి ♦ పార్థివమణి యే
స్థలమునఁ జెలఁగునొ యచ్చటి,కలరుచుఁ గొనిపోయి, రేను♦హస్తయుగంబున్.

తే. భక్తి జోడించి రక్షింప♦వలయు ననుచు
నచటఁ జేరితి; శ్రీరాముఁ ♦ డాదరించి
కాంచె నంత నదృష్టము ♦ గలిగియుంట
బ్రదికి వచ్చితి దానవ♦రాజ! నిజము. ౧౦ 1094

క. కను మిదిగో రాముఁడు తా,లను గొండలచేత గురుజ♦లనిధిని బంధిం
చినవాఁడు సాయుధుండై, చను దెంచినవాఁడు మిగుల ♦ సాహస మలరన్.

క. ఇఁక వే లంకాద్వారము,నకు రాఁగలఁ డామహీశ♦నందనుఁ డచటన్
సకలబలంబుల నేర్పున, బ్రకటించుచు వ్యూహమును సు♦పర్ణనికరణిన్.

తే. పన్నియున్నాఁడు చూడ సు♦పర్ణతనువు
వలె నెసంగెడు నయ్యది ♦ బలము లెల్లఁ
దన్నుఁ గొలువంగ దయమెయి ♦ నన్నుఁ బుచ్చి
లంక కరుదెంచుచున్నాఁడు ♦ బింక మలర. ౧౩ 1097

క. మును ప్రాకారము వేగమ, తనవశముం జేసికొనుచు ♦ దరుణీమణి సీ
తను రాముని కొసఁగుము లే,క నిలిచి యుద్ధం బొనర్పు♦కడఁక మిగులుచున్.

క. ఒనరింపు మీాద్వయుంబున, మనమునకుం దోఁచినగతి ♦ మసలవలదు; నా
దనుజోక్తుల విని తనమన, మున నెంచుచు దనుజవరవి♦భుండును నియతిన్.

క. దనుజున కిట్లను బృధువా,క్కున; సీత నొసంగు మనెదొ? ♦ కోరిక గంధ
ర్వనికరము సురలు దానవు, లని నాతోఁ జేసినట్టు♦లైనఁ గడంకన్. ౧౬

ఆ. లోకవితతివలన ♦ నాకు భయంబులు, గలిగినను నొసంగ ♦ వెఱఁది రాఘ
వునకు; నంచు బలికి ♦ భూరితేజశ్శాలి, దనుజవరుఁడు మరల ♦ ననియె నిట్లు.

చ. దనుజవరేణ్య! సౌమ్య! కపి♦తల్లజసైన్యము నెల్లఁ గంటివే?
వనచరులందు శూరులగు ♦ వానరు లెవ్వరు? తత్ప్రభావముల్
కనుఁగొన నెట్టి వేరు చెన♦కం దగ కుందురు? వారియాకృతుల్
తనరు నవెట్టు లెవ్వరికిఁ ♦ దక్కుపు లాత్మజు లేరిపౌత్రకుల్. ౧౮ 1102

క. ఉన్నది యున్నట్లుగ నీ, వన్నియుఁ దలపోసి పలుకు ♦ మువ్వల నేనా
యున్నతులబలాబలముల, నన్నుతి విని చేయఁదగిన♦చంద మెఱిఁగెదన్. ౧౯

క. అని సేయఁ గోరువారల, కును వైరిబలాదికముల♦కొలఁది తెలియఁగాఁ
జనుఁగాదె; యనిన నంతయు, విని *యుత్తసుచారుఁడతఁడు♦విభునన్నిధిలోన్.

* రావణో నోత్తమ శ్చరః-అనియూ.

క. వినిపింపఁ బూని యీవిధ, మున; సుగ్రీవుండు బవర♦మున దుర్జయుఁడై
తనరును ఋక్షరజుండను, వనచరునకుఁ బుత్త్రుఁ డతఁడు ♦ బలవంతుఁడు సూ!.

ఆ. [1]గద్గదునకు సుతుఁడు ♦ కడుఁబోరుఁ డాజాంబ
వంతుఁ డితనితండ్రి ♦ నెంతొ బలవి
భవము లొప్ప నలరు♦వాఁడు ధూమ్రుండను
తనయుఁ డొక్కఁడు గలఁ ♦ డనుపముండు. ౨౦౹ 1106

చ. అనిమొన నక్షముఖ్యదను♦జావళి నొక్కఁడె చంపినట్టి యా
హనుమయు నేమహాత్మునకు ♦ నాత్మజుఁడో యలవానరుండు నిం
ద్రునిగురువౌ బృహస్పతిసు♦తుం డగు కేసరి యందు రాతనిన్;
ఘనబలుఁడౌ సుషేణుఁ డధి♦కంబగు దర్పముగల్గువాఁడు సూ!. ౨౧ 1107

ఆ. ధర్మమతియు నౌను ♦ ధర్మదేవతసుతుఁ
డౌ నతండు; సౌమ్యుఁ♦డైన యట్టి
దధిముఖుండు చంద్రు♦తనయుండు; సుముఖదు
ర్ముఖులు వేగదర్శి♦యాత్మబలులు. ౨౨౹ 1108

క. వనచరరూపంబున న, వ్వనజజుచే సృష్టిచేయఁ♦బడి మృత్యువె నాఁ
గనుపట్టుచుందురు; నిజ, మనఘా! భటవారనాథుఁ♦డగు నీలుండున్. ౨౩౹

చ. అనలున కాత్మజుం డగును ♦ నాహనుమంతుఁడు వాయునందనుం
డనఁబడుఁ జుమ్ము కేసరికి ♦ నాత్మజుఁ డాతఁడె; యింద్రపౌత్త్రుఁడౌ
ననిఁ జెనకంగరాని బల ♦ మంది కుమారత నొప్పు నంగదుం
డనితరసాధ్యపౌరుషము ♦ నందినవాఁడు సుమీ! మహాప్రభూ!. ౨౪౹ 1110

సీ. అశ్వితనూజాతు ♦ లతిబలవంతులు మైందద్వివిదులు స♦మ్మాన్యు లిర్వు
రాబలంబులను గ♦వాక్షుండు గజగవయులు గంధమాదనా♦హ్వయుండు శరభుఁ
డను నైదుమంది కా♦లాంతకతుల్యులు యమునకుఁ దనుజాతు ♦ లౌదు; రిట్లు
శ్రీమంతులై దేవ♦తామండలభవులై యుద్ధకాంక్షల నెప్పు ♦ డొప్పుచూరు
తే. లైన కీశులు పదికోటు ♦ లలరుచున్న
వారు; వీరలపుట్టుక♦పౌరుషాదు
లెల్ల వచియింప నలవిగా ♦ దెన్న నాకు;
ఖరుని దూషణుఁ ద్రిశిరుని ♦ కలనఁ జంపి. ౨౫ 1111

క. తనరెడు రాముఁడు దశరథు, తనయుఁడు రమ్యావయవుఁడు♦తద్దయుఁ బ్రాయం

1 గద్గద స్స్వర్థ పుత్త్రోఽత్ర జాంబవా నితి విశ్రుతః-అనియా పాంచాలీన్యాయేన గద్గదేనపోషితత్వాత్తత్పుత్త్రో జాంబవాన్ తస్య బ్రహ్మణోజృంభారంభసంభూతత్వాత్-అనివ్యాఖ్య. జాంబవంతుఁడు బ్రహ్మయావులింపఁగాఁ బుట్టినవాఁడు, గద్గదుఁడు పోషించినందునఁ దత్పుత్త్రుఁడని చెప్పఁబడినదని తెలియవది.

బున మించువాఁడు లోకం, బున నతనికి సాటి శౌర్య♦మున లేఁ డిలలోన్.

చ. అనిమొన నవ్విరాధుని మ♦హాంతకతుల్యుని నాకబంధునిన్
దునిమినవాని కిజ్జగతిఁ ♦ దోఁచునె సాటి యొకండు చెప్పుమా!
విను మిఁక దండకాటవిని ♦ వెల్గు మహాసురపంక్తి నొక్కఁడే
యనిపెను కాలువీటికి మ♦హాద్భుతశౌర్యము విస్తరిల్లఁగన్. ౨౯ 1113

తే. అట్టి శ్రీరాముగుణముల ♦ నభినుతింప
నెవ్వనికినైనఁ దరముగా; ♦ దితనినహజుఁ
డైన సౌమిత్రి ధర్మాత్ముఁ ♦ డనుపముండు
మత్తకరివరమును బోలు ♦ మాన్యుఁ డతఁడు. ౩౦ 1114

క. సురనాయకుఁడైనను భీ,కరలక్ష్మణబాణమార్గ♦కలితుండైనన్
మరణించుఁ గాని బ్రదుకం, దరమే యిఁక నొరులమాటఁ ♦ దలఁపఁగవలెనే?.

క. శ్వేతుఁడు జ్యోతిర్ముఖుఁడును, నీశరుణాకారు లిద్ద ♦ ఱినునికుమారుల్
చేతశ్శక్తిఁ జెలంగుదు, రాతతయుద్ధముల నింతు ♦ రసురులను విభూ!. ౩౧

క. వరుణున కింకొకతనయుం, డరయంగా హేమకూటుఁ ♦ డనువాఁడు తగున్
హరిసత్తముఁడౌ నళుఁ డా, సురవర! యావిశ్వకర్మ♦సుతుఁడు బలియు నౌ.

క. వసుపుత్రుండు సుదుర్ధరుఁ, డసమానపరాక్రమాఢ్యుఁ ♦ డతిబలవంతుం
డెసఁగెడు నదిగో చూడుము, వెస లంకారాజ్యము రఘు♦వీరునివలనన్. ౩౩

క. హితముగ గ్రహించి యతనికి, హిత మొనరింపంగఁ బూని ♦ యెల్లదనుజులం
దితఁడే మేటియనం దగు, నతఁడె విభీషణుఁడు నీస♦హజుఁడు మహాత్మా!. ౩౪

తే. *అను వేలాద్రిచెంతను♦న్నట్టి వనచ,రులబలం బెల్ల నీకు నేఁ ♦ దెలిపినాఁడ
నింకఁ జేయఁగఁ దగువాని♦కెల్లఁ దారె, కర్తలని తెల్పె దానవ♦భర్త కతఁడు

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౩౧ - వ సర్గము

విద్యుజ్జిహ్వుఁడు మాయాకల్పితరామశిరస్సును ఛేదించి సీతకుఁ జూపుట.

క. అని యిటు చారులు నొంపం, జనరాని మహాబలంబు♦సాయము రాఁగా
జనపతి సువేలతీరం, బున విడిసినవాఁ డటంచుఁ ♦ బొందుగ జెప్పన్. ౧ 1121

చ. ఘనబలశాలి రాఘవుఁడు ♦ కంధిని దాఁటియె వచ్చియుంటఁ జా
రనికరవాక్కులన్ వినుచు ♦ రావణుఁ డించుక భీతినొందె చెం
తను దగుమంత్రులం గనుచుఁ ♦ దా నిటు పల్కెను; మంత్రులార! మం
తన మొనరింపఁగాఁ దగిన♦తత్సమయం బరుదెంచెఁ గావునన్. ౨ 1122

* శేషకార్య భవాన్ గతిః - అనిమూ.

తే. మంత్రులగు మీరు నీతుల♦మార్గ మెఱుఁగు
దానవులు వేగ రాఁదగుఁ ♦ దడయ కనుచు
నాజ్ఞ సేయంగ వేగమే♦యరుగుదెంచి
రంత నాలోచనము చేయ ♦ నతఁడు పూనె. ౮ 1123

తే. అంత దుర్ధర్షుఁడైన యా♦యసురనేత
యరిసమీపించి వచ్చిన♦యవలికృత్య
మేదియో యని తగనెంచి ♦ హితులఁ బంపి
తనగృహమునకుఁ బోయె నం♦తయుఁ గలంగి. ౯ 1124

సీ. అమ్మహామాయుఁడా♦నమరవిరోధి మాయల నాఱితేఱి మ♦హాబలుఁడగు
నట్టి విద్యుజ్జిహ్వు♦నప్పుడె రప్పించి యశనితోఁ బోలె న♦య్యన్నుమిన్న
సీత యున్నట్టి భూ♦జాతంబుకడ కట దనుజేశ్వరుఁడు మాయ♦లను నెఱుంగు
నాతనిఁ జూచి యి♦ట్లనియె మాయలచేతఁ దరుణిని మోసపు♦త్తము జవమున

తే. మాయచేత శ్రీరాముని♦మస్తకంబు
జేసి దానిని, భూరివి♦చిత్రధనువు
సాయకముతోడఁ గూడిన♦సరణిఁ దీసి
కొనుచు నాచెంత కరుదెమ్ము ♦ చనదు మసల. ౧౦ 1125

క. అన విని విద్యుజ్జిహ్వుం, డొనరించెద నట్లె యనిన ♦ నురుమోదంబుం
గని రావణుఁ డొకభూషణ, మును వాని కొసంగి దనుజ♦ముఖ్యుం డచటన్.

క. బలమలర నశోకవనం, బెలమినిఁ దాఁ జొచ్చి రాము♦నింతిం గనువే
డ్కల నొప్పి, ధనదసోదరుఁ, డలవనమున దీనయగుచు♦నార్తిఁ బొగులుచున్.

తే. వగల కేమాత్రమైనను ♦ దగక ముఖము
వాంచి శోకముచేఁ గుంది ♦ వసుధమీఁదఁ
గూరుచుండి మనోనాయ♦కునినె తలఁచు
చును భయంకరదానవ♦వనిత లెపుడు. ౧౧ 1128

క. నలుఁగడలఁ గాచుచుండఁగఁ, బలువెతలం గుడుచుచున్న♦పావనశీలన్
వెలఁదుల మిన్నను జానకి, నలరారు నశోకమందు ♦ నాతఁడు గనియెన్. ౧౨

సీ. * పూర్ణచంద్రాస్యయై♦భూతభయంకరలగు రాక్షసాంగన ♦ లన్వహంబు
తనుఁ జుట్టుకొని యుండఁ♦గను లయకాలమేఘసమావృతాబ్జరే♦ఖయును బోలి
గనుపట్టుచును సుమం♦గళము నిమిత్తమై దాల్చిన కొన్నియు♦త్తమవిభూష
ణము లలంకృతిఁ జూప ♦ సుమనోలతయు మారుతోద్ధూతయై తగ♦కున్నరీతిఁ
దిరుగుచు శ్రీరాము♦పరిసరంబును బొందినట్లు లూహించి హా♦ర్దాబ్ధి మునిఁగి

* భూషణైరుత్తమైః కైశ్చిన్మంగళార్థమలంకృతామ్-అని మూ.

తే. యతనిఁ బాసితినని యెంచి ♦ యార్తిఁ గనుచు
[1]వగకు వేఱు తెఱంగయి ♦ తగి గభీర
మాట నిశ్చలమై యున్న ♦ యట్టి గంగ
వలెనె యేమియుఁ దోఁపమి ♦ వెలఁది యుండె | 1130

క. దనుజవరుం డంతట సీ,తను జెంతను గానఁబోయి ♦ తా హర్షోక్తిన్
వినిపించునట్లు గనఁబడి, జనకజఁ గని ధృష్టమావ♦చనము వచించెన్. ౧౩ 1131

[2]ఆ. పూని యిట్టులనియెఁ ♦ బూఁబోఁడి! కళ్యాణి !
సాధువచనములను ♦ జాల నేను
నెంత వేఁడుకొనిన ♦ నవనిప్రాపును నమ్మి
పరుషవాక్యములను ♦ బల్కినావొ. ౧౩౪ 1132

క. ఖరుని వధించిన యారఘు,వరుఁ డింతీ! నీదుభర్త ♦ బవరంబున ని
త్తరుణమున హతుండయ్యెను, దరుణీ యిఁకనైన నాదు♦తత్త్వమెఱుఁగుమా!.

క. నీకుండిన యాధారము, సోకార్చితి మొదలుముట్టఁ ♦ బోఁతీ! యిపుడే
నీకావరము నడంచితి, నీకుం గల వ్యసనమునను ♦ నేవేఁడకయే ౧౮౪ 1134

తే. నాకు భార్యవు కాఁగల ♦ వేకరణిని
నైన నీయంత నీవె; మూ♦ఢాత్మురాల!
యిట్టి శ్రీరామువిషయమై ♦ యిపుడు నీకుఁ
గలుగుబుద్ధిని వదలుమా ♦ ఫలము లేమి ౧౫౪ 1135

క. మృతినొందిన యారఘుకుల,పతితో నిఁక నీకు నేమి ♦ పనియున్నది నా
సతులకు నాకును గల్యాణి! తమిని నీశ్వరివి గమ్ము ♦ నీ విఁకనైనన్. ౧౬ 1136

సీ. అల్పపుణ్యముగల ♦ యట్టిదానవు గాన నింతపర్యంత మి ♦ ట్లీవు పొంద
నగు పురుషార్థము ♦ నందక యున్నావు పండితమానినీ! ♦ పడఁతిమిన్న
మున్ను వృత్రాసురుం ♦ డన్నగభేదిచేఁ బొలిసినట్లుగ ఘోర♦ముగ భవత్ప
తియుఁ జచ్చె నాపద్ధ♦తియుఁ దెల్పఁగాఁ దగు వినుమింక రాముండు♦నను వధింప

తే. వానరేంద్రుఁడు తెచ్చిన ♦ వరబలములఁ
గలిసి వననిధిదరికిని ♦ బలము మెఱయ
వచ్చినాఁడఁట; యంత నీ♦భర్త కడలి
యుత్తరతటంబునను జేరి ♦ యురుతరగతి. ౧౭౪ 1137

క. పెనుసైన్యంబులు తనతోఁ, జనుకేరం దత్తటమును ♦ సరఁగున బాధిం
పను బూని సూర్యుఁ డస్తా,ద్రిని బొందెడుతఱిని విడిసె♦దివిజులు పొగడన్. ౧౮

1 విషాదస్య విలక్షణామ్-అనియూ 2 ఇటనుండి సర్గాంతముపఱకు నందందు మహేశ్వరతీర్థులవారి విశేషార్థమిం దిమిడింపఁబడినది. ఈవిశేషార్థము సుందరకాండమునఁ జెప్పఁబడినట్టిదియే. అనఁగా భార్యాదిశబ్దములకుఁ బూర్వోక్తార్థమే గ్రహింపవలయుననుటయే యిచ్చటంగల సారము.

చ. బలములు మార్గఖేదమున ♦ బల్విడిఁ దోఁచినచోటఁ జేరి యి
మ్ముల సుఖనిద్రఁ జెందుటయుఁ ♦ బొంగుచు నానదిరేయి మేము చా
రుల నటఁ బంపి వార్తలను ♦ గూఢి నెఱింగితి; మంత రాఘవుల్
విలసిలుచున్న యాబిలము ♦ వేగ ప్రహస్తుఁడు భూరిసేనతోన్. ౨౦ 1139

క. చని నిశిని జంపి వైచెను, దనుజులు పరిఘములఁ జక్ర♦తతిఁ బట్టి నఖ
డ్గనికరము నయోదండము,లను శరముల, శూలవితతు♦లన్ బెనుగదలన్. ౨౧

సీ. యష్టులఁ బృథుతోమ♦రాళిని, శక్తులఁ, బెనుచక్రముసలంబు♦లను గ్రహించి
వనచరులపయిని ♦ వైచిరి పలుభంగులను బూని యుద్ధంబు♦లన్ విరోధు
లను జెండఁ జాలుచు♦ఘనుఁడయికృతహస్తుఁ డయి తగునట్టి ప్ర♦హస్తుఁ డపుడె
పెనుఖడ్గమును గరం♦బునఁ బూని నిదురించు రామునిశీర్ష ము♦ద్దామరీతిఁ

తే. ద్రుంచివైచె; విభీషణుఁ ♦ డెంచి యింకఁ
నిలువఁ జనదని భీతిని ♦ నింగి కెగరి
పోవఁ బూనఁగ రాక్షసుల్ ♦ పోయి దైవి
కముగ బంధించి రతని, ల♦క్ష్మణుఁడు కపులు ౨౨ 1141

క. నలుదెసలకుఁ బాఱిరి యిఁక, నలసుగ్రీవుండు వనచ♦రాధిపుఁ డిపుడా
యిలఁ గంఠహీనుఁడై యి,మ్ములఁ బడియే యున్నవాఁడు ♦ ముగ్ధా! వింటే?.

క. హనుమానుఁడు, హతహనుఁడై, దనుజులచేఁ జంపఁబడియె; ♦ ధరణీతనయా!
యనిచేయఁ జాంబవంతుఁడు,మునుకొన మాదనుజు లతని♦మోకాళ్లు తెగన్.

తే. విఱుగఁ గొట్టిరి, భీతికృ♦ద్ద్వివిధపట్ట
సములఁ దెగవేయ హతమహీ♦ధ్రము విధమున
ధరణిఁ బడియున్నవాఁడు, మైం♦దద్వివిదులు
పృథులకాయులు పరజన ♦ భీతికరులు. ౨౫ 1144

చ. వనచరవీరు లిద్దఱును ♦ బ్రల్లదమున్ పలుకంగ వీరులా
దనుజులు తత్కటిద్వయము ♦ దారుణఖడ్గముచేతఁ ద్రుంపఁ జ
య్యన రుధిరప్లుతాంగులయి ♦ యంతట నూర్పులు పుచ్చుచున్ మృతిం
గని; రతివా! మహత్తరము ♦ గా విలపించుచు నేమి చెప్పుదున్. ౨౬ 1145

క. పనసుండు పనసఫలమటు, లని ఛేదింపంగఁబడియె♦నని బహుబాణా
ళినికృత్తుఁడై దరీముఖుఁ, డను వనచరుఁ డద్రిగుహను ♦ నార్చుచుఁ జచ్చెన్.

క. గురుతేజుండగు కుముదుఁడు, శరవిచ్ఛిన్నాంగుఁ డగుచు ♦ శబ్దము లేకే
ధరఁ బడియె; రాక్షసుల్ భీ,కరగతిగా మారుకొనుచుఁ ♦ గడిఁదిశరములన్.

క. తను ఛేదింపఁగ రుధిరం,బును గ్రక్కుచు నంగదములు ♦ పోవఁగ నేలం
గన దిక్కులేక యంగదుఁ,డనఘుఁడు పడియున్నవాఁడు ♦ హతభాగ్యుఁడనూ!.

సీ. నిదురించువనచరుల్ ♦ మదగజంబులచేతఁ ద్రొక్కింపఁబడి కొంద♦ఱుక్కడంగి;
రథదంబులును మీఁద ♦ నరుగంగఁ గొందఱు వాయుసమాహతా♦బ్దములరీతి;

ఘోటకంబులు ద్రొక్క ♦ గొందఱు నలఁగియు హతులైరి; మఱికొంద ♦ ఱసురు లెల్ల
దముఁ జేరి కొట్టంగఁ ♦ దాళఁజాలక భయంబున నాల్గుదెసలకుఁ ♦ బోవ దనుజు

ఆ. లేనుఁగులను దఱుము ♦ సిద్ధసింహములట్లు
వారివెనుకఁ దగిలి ♦ ఘోరసమునఁ
గొట్ట వార లెల్లఁ ♦ గూలిరి, కొందఱు
వనధిఁ బడిరి, నింగిఁ ♦ జనిరి, కపులు ౩౩ 1149

క. వనితా! భల్లూకంబులు, వనచరనైజమగువృత్తి ♦ భావించి ద్రుమా
ళిని జక్క నాశ్రయించిన,వనిమొనఁ జెక్కండ్రు దనుజ ♦ లబ్ధికటములన్. ౩౪

క. వనముల గిరులను వెదకుచు, వనచరులను బట్టి మృత్యు♦వదనంబున నో
య్యనఁ ద్రోసిరి పెక్కండ్రను;,వనితా వినుమిట్లు నాసు♦భటు లుద్ధతిచేన్. ౩౫

తే. నీదుభర్తను దత్సైన్య ♦ నిచయములను
జంపి, రిదె నెత్తుటం దోఁగి ♦ సాంద్రరజము
నందు మునిఁగిన నీభర్త ♦ సుందరశిర
మును దగం దెచ్చినారు మా♦దనుజు లనుచు. ౩౬ 1152

క. వినిపించుచు దుర్ధర్షుఁడు, దనుజేంద్రుం డతఁడు దనుజ♦తరుణిం గని యి
ట్లని సీత వినుచునుండం,గను; రణరంగమునుండి ♦ కడుఁ బ్రీతిమెయిన్. 1153

ఆ. రాముశిరముఁ దానె ♦ రయముసఁ గొనివచ్చి
భయదకృత్య మొనరు♦పంగఁ బూని
వినుతు లడఁగఁ జేసి ♦ వెలయు విద్యుజ్జిహ్వు
నిటకుఁ దోడి తెమ్ము ♦ యింతి యనిన ౩౭ 1154

క. దనుజాంగన చని చెప్పిన, విని విద్యుజ్జిహ్వుఁడు రఘు♦వీరుశిరస్సున్
ధనువును గొనివచ్చి శిరం,బును వంచి నమస్కరించి ♦ భూపతి యెదుటన్. ౩౯

క. నిలుచుండె; నొప్పనాలుక, గలిగి సమీపమున నున్న ♦ క్రవ్యాదుని ను
జ్జ్వలమూర్తిఁ గాంచి రావణుఁ, డలరుచు నిట్లనియె; సీత ♦ యంతికసీమన్. ౪౦

తే. రాముశీర్షము నునుపుమీ ♦ రమణి నిహత
భాగ్య తనభర్త యంతిమా♦వస్థఁ జక్కఁ
గాంచుఁ గాకని చెప్ప ర♦క్కసుఁడు వాఁడు
గనఁగ నింపైన తన్మస్త♦కమ్ము నపుడు. ౪౧ 1157

క. జనకజముందఱఁ బెట్టెను, దనుజుఁ డదృశ్యుఁడయి చనియె♦దనుజేంద్రుఁడు తాఁ
గొని త్రిజగద్విఖ్యాతిని, గని తేజం బలరఁ గ్రాలు ♦ కార్ముకవరమున్. ౪౨

ఆ. సీతఁ జూచి పలికె ♦ సీతఱి నారితోఁ
గూడియున్న ధనువుఁ ♦ జూడు మిద్ది
నీదుపతిది యిదిగో ♦ నెలఁతరో! మస్యుఁడా
రాముని వధించి ♦ రాత్రియందు. ౪౩ 1159

తే. మా ప్రహస్తుఁడు తెచ్చె నీ ♦ మస్తకంబు
ధనువు ననుచు విద్యుజ్జిహ్వుఁ♦డును నితాంత
మోదమునఁ దాను వాని న♦మ్మేదిని నిడి
జనకరాజతనూభవ ♦ సాధ్వీమణిని. ౪౪ 1160

క. కనుఁగొని యాశీర్షంబును, ధనువును గని యామె బుద్ధి ♦ తథ్యంబని న
మ్మ ననుచు నిఁక నావశమును, వనితా! కమ్మా! యటంచుఁ ♦ బలికెఁ గుబుద్ధిన్.

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౩౨ - వ సర్గము.

సీత రాముని మాయాశిరస్సును జూచి విలపించుట.

క. తరువాత సీత శ్రీరఘు, వరుశీర్షంబుత్తమమయి ♦ భాసిలు ధనువున్
బరికించి పవనతనయో, క్త రమణసుగ్రీవమిత్ర ♦ ధర్మంబు తగన్. ౧ 1162

క. తనవిభుఁడగు శ్రీరఘుభూ, పునినేత్రము లతనికిఁ దగి ♦ పోలిచెడు నాస్యం
బును ముఖవర్ణముఁ గురులను, వినుతశిరోజాంత మట్టె ♦ వెసఁగని యంతన్.

క. సురుచిరచూడారత్నముఁ, బరమా ర్తింగనుచుఁ గాంచి; ♦ పడఁతియు నిట్లే
పరమాద్భుతచిహ్నంబులఁ, బరికించిన నదియె తనదు ♦ పతితలయె యగున్. ౨౪

క. అని యెఱిఁగి మిగులదుఃఖం,బును బొందుచుఁ గురరిచంద♦మున నేడ్చుచు రా
మునిఁ గూర్చి కైకనిందిం,పను బోడఁగెన్ దీనవచన♦పంక్తుల మిగులన్. ౩

క. ఓకైకేయీ! కోరిక, నీకీడేరినదిగాదె? ♦ నెమ్మిం గనుమా!
యాకాకుత్థ్సకులోద్భవ, భూకాంతుల కెల్ల మోద♦మును గూర్పఁగనై. ౩౪

క. వినుతిం గాంచిన రాముం, దనఘాత్ముం డిదిగో యంత♦మందెం; గలహం
బె నిజస్వభావముగ నీ,కును దగుట ఫలించెఁ గులము ♦ కూలుట గాఁగన్. ౪

సీ. వినుము కైకా! నాదు♦విభు నారచీరలు కట్టించి నాతోడఁ ♦ గలిసి యడవి
కంపితివి గద! నీ♦కార్యంబు శ్రీరాముఁ డంత విప్రియ మేమి ♦ యలవరించె;
నని పల్కి దీనయై ♦ యాసీత వడఁకుచు ఛిన్నరంభావర♦క్షితిరుహంబు
వలె నేలఁ బడియె; నా♦వెలఁదియవ్వలముహూర్తమునకుఁ దెప్పిరి♦ప్రాణనొంది

తే. రామశీర్షము మూర్కొని ♦ రమ్యనయన
ములను పత్రువులను గ్రమ్మి ♦ వెలికిఁ బాఱ
నిట్లు పలవించె; నక్కటా! ♦ మృత్యువక్త్ర
బిలముఁ జొచ్చితి నోరఘు♦వీర! నీవు. ౭ 1168

క. అరి వధియింపక పురికిన్, మరలను నేననుచుఁ బల్కు♦మాట యిచట ని
ష్కారణి ఫలించెనె రామా!, పరమాత్మా! విపులబాహు♦భాసురమూర్తీ!. ౭౪

క. మరణావస్థను బొందఁగఁ, బరికించితిగాదె నేనుఁ ♦ బాపాత్మను భూ
వరచంద్ర! విధవనైతిని;, దరుణికి ముందుగనె భర్త ♦ తా మృతుఁడైనన్. ౮

క. సతియందు గుణము లేమియొ, మృతికిం గారణమటంచు ♦ నెన్నుదు రార్యుల్
హితగుణ! రామా! నేనున్, మృతి నంద కయుండ నీవు ♦ మృతినొందితి గా.

ఆ. దీని కైన హేతు ♦ వో నరపాలకా!, నేను సుగుణలేశ ♦ హీననౌట
యె యగుఁ గాని సాధు ♦ వృత్తినిగను నీదు, దోష మేమి గాదు ♦ ధూర్తహరణ!

తే. ఒక్క దుఃఖమునుండి వే ♦ ఱొక్క దుఃఖ
మును సదా పొందుచుంటి నై ♦ న నిపు డిట్లు
శోకకంధి మునింగితిఁ ♦ బ్రాకటకృప
నేవఁడు నను గాచు? నట్టినీ ♦ విట్టు లైతె. ౧౦ 1173

సీ. నాయత్తకౌసల్య ♦ యీ యెడ నిర్భాగ్య యేయయి దూడయం ♦ దెలమిఁ గాంచు
నావు వివత్సయై ♦ యార్తి నొందెడురీతిఁ బ్రియతనూజుని నిన్ను ♦ విధివశమునఁ
బోఁగొట్టుకొనియుంకఁ ♦ బూర్ణదుఃఖము నొందఁగల; నచింత్యో(గ్ర)రూపవి ♦ క్రమ! మహా
భవదాయు వభివృద్ధిఁ ♦ బడయును దీర్ఘమైయన్న దైవజ్ఞోక్తు ♦ లన్నియుప్పు [త్మ!
తే. డనృతములె యాయె నల్పాయు ♦ వైతి వీవు;
వార నననేల యనృతంబుఁ ♦ బలికి రనుచు
భూతతతి కాదికారణ ♦ భూతమైన
కాలమే తావకీనదు ♦ ష్కర్మములకు. ౧౨ 1174

క. పరిపక్వ మొనరుపఁగ నె, క్కరణిని దగుదాని కనువు ♦ గా భావిఫలో
త్కరముల నెఱుంగు ప్రాజ్ఞుని, వరమతి నీవిషయమున న ♦ భవ్యంబగుఁ జూ!.

క. వెతలం దొలఁగించు నుపా, యతతుల నీవెఱుఁగుదువు; న ♦ యాగమమునఁ బం
డితుఁడవు కన్గొనరాకయె, సతతము దగు మృతిని గనితె ♦ స్వాంతభ్రమతన్.

తే. కమలలోచన! నినుఁ దమిఁ ♦ గాంచి క్రూర
మతిభయంకరమునునయి ♦ యలరు కాళ
రాత్రి కౌఁగిటఁ జేర్చి ని ♦ ర్భాగ్యురాల
నైన నన్నుండి యెడఁబాపె ♦ నక్కటకట!. ౧౫ 1177

[1]క. పురుషవరేణ్యా! యతిపృథు, తరబాహూ! దిక్కులేక ♦ తపియించెదు నీ
తరుణిని నను విడిచి యటన్, ధరఁ గౌఁగిటఁ జేర్చుకొంటిఁ ♦ దమిఁ బ్రియనుబలెన్.

క. కనకాంచితమై నీవొగి, [2]ననుఁ గూడి సుగంధమాల ♦ నానాభూషా
ళిని బూజింపఁగఁ దగునీ, ధను వస్మత్ప్రియకర మిటు ♦ ధరఁ బడియెఁ గటా!.

ఆ. నాకు మామగారు ♦ నీకుఁ దండ్రియు నగు, దశరథక్షితీశ ♦ తల్లజుండు
స్వర్గమందుఁ బితృవి ♦ సరములతో నుండ, నతనిఁ జేరితి విది ♦ యనఘ! నిజము.

---

1 ప్రియామివ సమాశ్లిష్య పృథివీం-అనియూ. 2 గంధమాల్యైశ్చ యాత్వం-అనియూ.

సీ. గురుతరకర్మముల్ ♦ గోరిక నొనరించువారికిఁ బ్రియమయి ♦ వఱలు పదము
నందుండి సుకృతులై ♦ యలరు నీవంశమువారి రాజర్షులఁ ♦ బరమపూజ్యు
లను విమానంబునఁ ♦ దనరుచుఁ గనుచుందు; వనఘాత్మ! [1]బాలనై ♦ నట్టినన్నుఁ
జెలుతప్రాయమున నిఁక ♦ జేరిన దాని నీవేభరింపం దగు ♦ నిట్టి యబల
తే. సహచరిని జూడ వేలొకో? ♦ సరసవచన
ములను బలుకవ దేలొకో? ♦ యలవివాహ
సమయమున మత్కరంబును ♦ సంగ్రహించు
తఱిని నాతోఁ జరింప వ్రతంబుఁ గొనవె?. ౨౦౪ 1181

క. స్మరియింపు మింక నీతోఁ, బరమూర్తిని బొందియున్న ♦ భార్యను నన్ని
త్తరుణమునఁ దోడుకొనియే, యరుగుము; గతిమద్వరిష్ఠ ♦ యర్థిసురతరూ!.

చ. నిను నిడనాడి దుఃఖముల ♦ నిత్యము పొందెడునన్నుఁ బాసి నీ
వనుపమరాజ్యభోగముల ♦ నన్నిటఁ బాయుచు నీజగంబుఁ జ
య్యన విడి యూర్ధ్వలోకమున ♦ కర్మిలిఁ బోయితివేల? మున్ను చం
దనముఖుసుంగళప్రదప ♦ దార్థములన్ గయిసేయ నొప్పుచున్. ౨౨౪ 1183

క. నేనొక్కతినే గాఁగిట, మానితగతిఁ జేర్ప నలరు ♦ మంచిశరీరం
బోనాథ! యిద్ది గ్రద్దల,చే నీడ్వంబడెడుగాదె ♦ సీ! విధియింకన్. ౨౩ 1184

ఆ. పూర్ణదక్షిణలను ♦ బొల్చు యాగములను, దేవపూజ సల్పి ♦ దివ్యమైన
యాగవహ్నిచేత ♦ నార్య! సంస్కారమ్ము, నేల పొందవైతి ♦ వింక రామ!. ౨౪

క. వనమున కరిగిన మనలో, ఘనుఁడగు లక్ష్మణుఁ డొకండె ♦ కడునార్తిఁ బురం
బున కరుగం గౌసల్యయు, వనటంగని పుత్త్రుఁడతని ♦ భార్య యొచటనో. ౨౫

క. అని యడుగఁ గలదు; లక్ష్మణుఁడు నిశాకాలమున రాముఁ ♦ డున్ సైన్యములున్
వననిధితటమున నుండఁగ, దనుజులు వధియించి చనిరి ♦ తల్లీ! యనుచున్. ౨౬

ఆ. చెప్పఁగలఁడు; పిదప ♦ నప్పుడఁతియు సుపు
నిన్నుఁ జంపుటయును ♦ నన్నుఁ బట్టి
తోడుకొనుచుఁ బోయి ♦ ధూర్తరావణునింట
నునుచుటయును నీడు ♦ జనని విన్న. ౨౬౪ 1188

క. హృదయము పగులఁగ నట న,య్యదనునవే విడుచు నిశ్చ ♦ యముగ సువులన్
మదవదరిసూదనుండయి, నిదురను జావఁ దగనట్టి ♦ నెఱమగఁటిమిచేన్. ౨౭

[2]క. తనరారు రాజతనయుం, డనూనబలుఁడైన రాముఁ ♦ డబ్ధిని నవలీ
లను దాఁటి ఖరముఖులయిన, దనుజుల వధియించి తుదకు ♦ దైవవశమునన్.

ఆ. దుష్టశీలయైన ♦ తొయ్యలి హేతువు,నను వధింపఁబడియె ♦ దనుజులందు

1 బాలాం బాల్యేన సంప్రాప్తాం భార్యాం మాం సహచారిణీమ్-అనియూ 2 రామస్సాగర ముత్తీర్య సత్త్వవాన్ గోష్పదేహరః-అనియూ.

హీనుఁడౌ ప్రహస్తు♦చే నేమి చెప్పుదు, గోష్పదంబువంటి ♦ కుమతి చంపె. ౨౮
క. తనకులమును జెఱుపంగా, జనియించిన నన్నుఁ గుమతి ♦ సంతసమునఁ జే
కొని విధిని మోహమునఁగా,వున నార్యసుతుఁడగుచుఁ♦బొలుచునృపునకున్.
క. దారయె మృత్యువుగాఁ దగె;, నారయ నేఁ బూర్వజన్మ ♦ మం దెవ్వరికో
కోరికఁ గన్యాదానము, నాఁగూఢిగఁ జేయుచుండు ♦ నప్పుడమర్షన్. ౨౯
సీ. అంతరాయము చేసి ♦ యార్తిఁ గల్పించియెయుందును గాన నీ ♦ యుర్వి సర్వ
సంరక్షకుండయి ♦ సర్వాతిథులకుఁ బూజకుఁడైన శ్రీరామ♦చంద్రునకును
దారనై యీరాజని ♦ భూరిభోగంబుల ననుభవించెడు కాల♦మందు దుఃఖ
మందుచున్నాను సు♦రారిపాలక! రావణాసుర! ననువేగ ♦ యారఘూత్త
తే. ముఁడగు రాముని పైననే ♦ పడఁగ వైవు
మిద్ది మంచిది, భర్తను ♦ నింతితోడఁ
గూర్పుమా! యుత్తమశుభంబు ♦ క్షోణి నిద్ది
గాన నీపని సేయుమా ♦ మానకింక. ౩౦ 1194

క. దనుజా! భర్తృశిరస్సును, దనువును నాశిరముతోడఁ ♦ దనులతతోడన్
గొనకొని చేర్పుము పెనిమిటి, ఘనమతినే ననుసరించి ♦ కడఁగి చనియెదన్.
ఆ. [ఒకముహూర్తమైన ♦ నుండనోప ననాథ
నగుచుఁ గుత్సితముగ ♦ నవని నింకఁ
దండ్రియింట నుండు ♦ తఱి వేద విదులైన
బ్రాహ్మణోత్తము లిటు ♦ పల్కి రొకట. 1196
క. వనితామణు లెవ్వరు భర్తను బ్రీతిని గాంచువారో ♦ తగ వారికిఁ జ
క్కనికీర్తి నొసఁగు లోకము, లనూనగతి గల్గు ననుచు ♦ నాడఁగ వింటిన్.
ఆ. క్షమయు, దమము, దాన,♦సత్య, ధర్మ, కృతజ్ఞ
తలును, భూతహింస ♦ తలఁప కునికి
యెవనియందుఁ గలవొ ♦ హితమతి నట్టిప్రా
ణేశుఁ బాయ గతి యిఁ♦కేమి గలదు?.] 1198

చ. అనియిటు లాయతాక్షి జన♦కాత్మజ దుఃఖనిమగ్నయౌచు నే
డ్చెను బతిశీర్ష చాపములు ♦ చేరువఁ బల్మఱుఁ గాంచుచున్; గడున్
వనటను నిట్లు పొందఁగను ♦ ద్వారముఁగాచు భటుండొకండు వ
చ్చి నిలిచి హస్తముల్ మొగిచి ♦ చెచ్చెఱ రావణుఁ గాంచి భక్తితోన్. ౩౪
సీ. తాఁ బ్రసన్నునిఁ జేయ♦దానవేశ్వర! యార్యపుత్ర! జయింపుమా!♦పూనిరిపుల
నని పల్కి వందన ♦ మొనరించి వాహినీపతి ప్రహస్తుఁడు వచ్చెఁ ♦ బరమమోద
మున నని వచియించి ♦ దనుజోత్తమా! మంత్రియుతుఁడయి సేనాధి♦పతిభవత్సు
దర్శనార్థము వచ్చి ♦ ద్వారసీమను నిల్చి విన్నపింపఁగఁ బంపి ♦ యున్నవాఁడు

ఆ. నన్ను; నసమయమున ♦ విన్నవింపఁగ నెట్లు
వచ్చినాఁడ వనెదో? ♦ సచ్చరిత్ర !
గొప్పకార్య మొకటి ♦ యిప్పు డున్నది చేయ
భర్తృనాజ్ఞఁ గొనఁగ ♦ వలయుఁ గాదె?. ౩౬॥ 1200

క. పని యిది ప్రయాససాధ్యం, బని చెప్పందగును గాన ♦ నాదరమున ద
ర్శన మిమ్ము వారి కనఁగా;, దనుజునిపలు కాలకించి ♦ దానవపతియున్. ౩౭॥

క. వనము, నశోకాహ్వయమును, బనివడి విడనాడి మంత్రి♦వరులం గనఁగాఁ
జని యంత రాము విక్రమ,మును జక్కనెఱింగి సభను ♦ మోదం బలరన్.

తే. తాఁ బ్రవేశించి చేయంగఁ ♦ దగినకార్య
మంత మంత్రులతోఁ గూడి ♦ యనువదించు
కొనుచు నిశ్చయమును జేసి♦కొని యొనరుపఁ
దగినవట్టును జేసె న♦త్తరుణమునను. ౩౯ 1203

క. దనుజేంద్రుఁడు చనినంతన, ధనువును శీర్షంబు దృక్ప♦థమునం బడకే
చనియె; నట రావణుఁడు చ,క్కనిగతి గురువిక్రములయి ♦ క్రాలు సచివులన్.

క. కలిసికొని యప్డు చేయఁగ, వలసినకార్యంబులెల్ల ♦ బహుభంగులు గాఁ
దలపోసి నిశ్చయించెను;, విలయాంతకతుల్యుఁడౌచు ♦ వెలయు నతండున్. ౪౧

చ. తనకుశలంబె కోరుచు ని♦తాంతబలంబులఁ బొల్చి చెంతనే
కనఁబడువాహినీపతులఁ ♦ గాంచి వచించెను; భూరిభేరులన్
ఘనరవ మీయఁ జాలునటు ♦ గట్టిగఁ [1]గోణము లూని కొట్టి సై
న్యనికరముం ద్వరం బిలువుఁ ♦ [2]డందులహేతువుఁ దెల్పకుండుఁడీ. ౪౩ 1206

చ. బలవిభు లెల్ల నట్లెయని ♦ పల్కి సురారి మహీశునాజ్ఞచే
బలముల నాత్మవశ్యులను ♦ వైళము యచ్చటఁ జేర్చి వచ్చె నం
చలరుచు యుద్ధకాంక్షియగు ♦ నాతని కెంతయు వేడ్క పుట్టఁగాఁ
దెలిపిరి రావణాసురుఁడు ♦ తేజము పొంగఁగఁ గాంచె వారలన్. ౪౪ 1207

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 33 - వ సర్గము.

విభీషణుభార్య సరమ జానకి నూఱడించుట.

తే. అట విభీషణుభార్య గు♦ణాఢ్య సరమ,జానకిని మోహపరవశఁ ♦ జాలఁ జింత
సేయుదానిని [3]బ్రియసఖి♦జేరఁ బోయె, నామె విపరీతబుద్ధియై ♦ యప్పుడుంట.

1 స్ఫుటకోణా హతేనమే-అనిమూ. కోణమనఁగా వాద్యదండము. 2 వక్తవ్యం చ నకార
ణమ్-అనిమూ. 3 ఆససాదాథ వైదేహీం ప్రియాం ప్రణయినీర సఖీం-అనిమూ.

చ. దనుజవిభుండు మోసమునఁ ♦ దన్నట వంచనసేయఁ జాలఁగా
వనటఁ గృశించుచున్న రఘు♦వర్యునిభార్యను సీతఁ గాంచి చ
క్కని మృదువాక్కులన్ సరమ ♦ గాదిలిప్రేమను నూఱడింపఁగాఁ
దనమది నెంచె; నాసరమ ♦ దానవనాయకునాజ్ఞ నచ్చటన్. ౩ 1209

క. జనకునిపుత్త్రిక రక్షిం,చునిమిత్తం బుండె నందుఁ ♦ జొచ్చిన దనుజాం
గనలందుఁ గరుణ గలదియె, గనుకన్ జానకియు నామెఁ ♦ గైకొనె సఖిగన్.

చ. [1]సరమయు గట్టిపట్టుదల ♦ శాంతము గల్గిన యింతిమిన్నయై
పరఁగుట రామునిం గుఱిచి ♦ పల్కఱు వేఱుగఁ దా భ్రమించుచున్
గురుతరదుఃఖ మొందు నతి♦కోమలగాత్రిని జూచె భూమిలోఁ
బొరలుచు ధూళి గ్రమ్ముకొనఁ ♦ బోలనిరీతిని లేచియున్న యా
తురగవధూవిధంబునను ♦ ధూళి శరీరము నిండి యుండఁగన్. ౪ 1211

తే. దీనయై యుండె సీతయు ♦ మాననీయ
చరితయా సరమయు నామెఁ ♦ గరతలములఁ
దాఁకి యూఱడిలం జేసి ♦ తాఁ జెలిమిని
దనుజవృత్తాంతమును జెప్పఁ ♦ దలఁచి యంత. ౫ 1212

సీ. ఇఁక నూఱడిల్లుమా! ♦ యింతీ! మనోవ్యథవదలుముభయమునొం♦దఁదగుమనసు
గలదానవౌట ని♦క్కరణి భీతిల్లెదు దనుజేంద్రుఁ డిచట నా♦డిన పలుకుల
నీదుపల్కుల నెల్ల ♦ నే సఖీస్నేహంబునను వింటినమ్మ; [2]నీ♦వు నట నాదు
చెంతనుండవు గదా ♦ యింత యెట్టులు వింటివనెదవో యాకస♦మందునొక్క
తే. తరువు వివరంబునందు నే ♦ దాఁగి వింటి;
నతఁడు దుష్టాత్ముఁడే యెట్టు ♦ లాలకించి
తి వని సందియపడెదొ ప్రీ♦తిని నసువుల
పైని నుంపను నీకొఱ ♦ కోనెలంత. ౬ 1213

క. కనుకన్ రావణువిషయం,బున భయమును మాని వింటె ♦ బూఁబోఁడీ! యా
దనుజేంద్రుఁ డెందుకొఱకై, చనియెనొ త్వరపడుచు నతని♦శంకకుఁ గతమున్.

ఆ. ఇచటనుండి పోయి ♦ యే నెఱింగితిఁ జూమి;
మాకుఁ దెలియకున్న ♦ మానెఁ గాని
యురుబలాఢ్యుఁ జంప ♦ నుపపత్తియును లేదు
సువిదితాత్ముఁ డగును ♦ క్షోణివిభుఁడు. ౭ 1215

చ. విను మతఁ డంతకోపముఁడు ♦ వెఱ్ఱివిధంబునఁ దాఁ బ్రమత్తుఁడై
వననిధిచెంత సుప్తిఁ గను♦వాఁడె తటాలునఁ జంప శక్యమే?

---

1 బడబా మిన పాంసులాం-అనిమూ బడబాం అశ్వస్త్రియమ్-అనివ్యాఖ్య. 2 ఇందవతారికఁ
దెనుఁగునఁ దెల్పకున్న నసంగతముగానుండును గానఁ దెనిఁగింపఁబడియె నని తెలియునది.

మనుజనృగేంద్రుఁడైన కుల♦మందను నాతని నెట్టులున్నఁ జం
పను దరమానె? వానరుల ♦ బాహుబలాఢ్యులఁ జంపరాదనూ!. ౯ 1216

చ. తరువుల సంగ్రహించుకొని ♦ దారుణరీతిని బోరువారలా
హరులన నింద్రుచేతను సు♦రావళి యట్టులు రామమూర్తిచేఁ
బరబలబాధ లేని గతి ♦ భద్రముగాఁ బరిరక్షితుల్ గదా
యరసినవారిఁ జంపుటయు ♦ నద్భుతమే యిది వట్టిమాటనూ!. ౧౦ 1217

సీ. వెలఁదిరో! నిడుదలై ♦ వృత్తములుగ నొప్పు భుజములు వెలయంగ♦భూరి తేజ
ములరంగ నాయతం ♦ బగువక్ష మొప్పంగ విక్రమంబున ధర ♦ వెలసి ధన్వి
యై సుందరాంగుఁడై ♦ యతులధర్మాత్ముఁడై విఖ్యాతినిం గాంచి♦విబుధనుతులఁ
జెలఁగుచుఁ దనను బ♦ంధులను రక్షింపఁగఁ జాలి తమ్ముని గూడి ♦ సంతతంబు

తే. కుశలియై నీతివిద్యలఁ ♦ గోవిదుఁడయి
పరబలౌఘాంతకుండయి ♦ గురుతరబల
పౌరుషంబుల నెసఁగుచుఁ ♦ బరమవిజయ
రమను వెలసినవాఁడు శ్రీ♦రాఘవుండు. ౧౨½ 1218

క. అరిబలకాలాంతకుఁ డా, పురుషవరేణ్యుండు దనుజ♦పుంగవసేనో
త్కరనిహతుఁడు కాలే దో, తరుణీ! యిదినిజముగాదు ♦ తలఁపుముమదిలోన్.

క. శిరమును జూప మదెవ్విధి, దొరకెనొ యని యందువేమొ ♦ దుష్టమతిసుమా
సురరిపు వనర్హకృత్యుం, డరయఁగ భూతౌఘవైరి ♦ యై జీవించున్. ౧౩½

తే. సకలమాయల నెఱిఁగిన ♦ జాణ రౌద్ర
కర్ముఁ డట్లాట నిను మోహ♦కలితఁ జేయఁ
దలఁచి యీమాయఁ గావించెఁ; ♦ దొలఁగె నీదు
వంత, పొందఁగనుండు శు♦భములు నిన్ను. ౧౪½ 1221

క. నిను లక్ష్మి పొందఁ గలదో, వనితారత్నంబ! యిది ధ్రు♦వంబగు మోదం
బును గలుగఁ జేయు ప్రియవా, ర్తను జెప్పెద నాలకింపు ♦ రామువిషయమై.

చ. వనచరసేనతోడ రఘు♦వర్యుఁడు సంద్రము దాఁటి దక్షిణం
బునఁ దగు భూమిపై విడిసెఁ ♦ బూర్ణమనోరథుఁడైన *రాఘవుం
డనుజునిఁ గూడి యుండఁగను♦లారను గాంచితి నబ్ధిచెంత నా
వనచరరక్షితుం డగుచు ♦ భాసిలువాఁడు సుమీ తలోదరీ!. ౧౬ 1223

చ. కరము జవంబునం జనఁగఁ ♦ గల్గినచారులఁ బంపి రాక్షసే
శ్వరుఁ డటఁ గల్గు వార్తలను ♦ జక్కఁ గ్రహించియె రండటంచుఁ బం
ప రయముమీఱ రాఘవుఁడు ♦ పంచిన శక్తిని నబ్ధి దాఁటె నా
హరిచయయుక్తుఁడై యనుచు ♦ నచ్చటివార్తను జెప్పి రాభటుల్. ౧౭ 1224

* దృష్టో మే పరిపూర్ణార్థః కాకుత్స్థ స్సహలక్ష్మణః-అనిమా.

క. ఆవార్త వినియె భామిని;, రావణుఁ డిపుడాత్మమంత్రి ♦ రమణులతోడన్
దా వివిధగతుల మంత్రం, బావిలమతిఁ జేయువాఁ డ♦టంచుఁ బలుకఁగన్.

క. బలముల సర్వోద్యోగం, బులవలనం గలిగి భీమ♦ముగ నొప్పు రవం
బలరఁగఁ దానును సీతయుఁ, గలయన్ విని; రంత సరమ ♦ కడు నాసక్తిన్.

ఆ. దండఘాతమున ని♦తాంతము మ్రోగు నా,భయదభేరిగురుర♦వంబు వినుచు
మధురభాషణముల ♦ మానిని సీతను, గాంచి యిట్టులనియెఁ ♦ గడు నలరుచు.

సీ. భయశీలవు గద యో♦పడఁతి మిన్నా! సైన్య సన్నాహమునకు నీ♦సరణి భేరి
భయదమారీతిగా ♦ వాయింపఁబడుచున్నయది సుమా మేఘస♦మారవంబు
విధముగాఁ దనరి గ♦భీరమై యున్నయా భేరీనినాదంబు ♦ వినుము; మత్త
కరులఁ గైసేయుచు ♦ నరదంబులకు గుఱ్ఱములఁ గట్టుచున్నారు♦పలువిధములఁ

తే. బ్రాసములఁ దాల్చి రౌతులు ♦ పరమకౌతు
కమున వేలకువేలుగఁ ♦ గ్రాలుచున్న
వారు మోదంబు గనుచుఁ గా♦ల్బలము లచట
నచట సన్నద్ధమగుచున్న ♦ వవిగో సీత!. ౨౩౪ 1228

క. *చతురంగబలంబులు చిత్రతరంబులుగాఁగఁ జెలఁగి ♦ త్వరఁబాఱుచు ను
న్నతముగ నార్చుచు ధ్వనినం,గత జలపూర్ణాబ్ధిఁబోలి ♦ కడు నందడిగన్.

క. నరపతిమార్గంబుల నిం,డి రహిం జెలువారె; మిగుల ♦ నిర్మలశస్త్రో
త్కరములయుఁ జర్మములయున్, వరవర్మ్ములయు ద్విరద♦వాజితతులయున్.

ఆ. అరదములయు భూషి♦తాంగులౌ దనుజుల
వితతులయును గాంతు ♦ లతిశయముగఁ
బెక్కువర్ణములుగ ♦ వెలసి గ్రీష్మర్తువు
నందు నడవిఁ గాల్చు ♦ నగ్నియట్లు. ౨౬ 1231

క. వలుదెసలన్ వ్యాపించెను, విలాసముగ మత్తహస్తి♦వితతికిఁ గట్టన్
వెలసినఘంటల మ్రోఁతయుఁ, బలురథముల నిస్వనములు♦భయదములగుచున్.

ఆ. వాద్యనిస్వనముల ♦ భంగి నుండెడు తురం
గాళిహేష లట్టె ♦ యావరించె
వినుము; రాక్షసేంద్రు ♦ ననుసరించు భటాళి
యాయుధములఁ గేల ♦ నందుకొనుచు. ౨౮ 1233

క. కనుఁగొనువారికి గగ్గురు, జనియించెడు నట్లుగాఁగ ♦ సాంద్రంబగు న
ట్లనువుగ సన్నాహంబుల, నొనరించెడువారు విను మ♦హోగ్రముగాఁగన్.

తే. వంతలెల్లను దొలఁగు న♦నంతవిజయ
లక్ష్మి నీపాలవెలయు ని♦లాతలమున

* తోయాఘై రివ సాగరః-అనియూ

దనుజులకు భీతిగల్గెడు ♦ తఱియు నిదియె
వచ్చె; రాముఁడు జగదభి♦వంద్యుఁ డగుచు ౨౯ 1235

చ. సరసిజపత్రనేత్రుఁడయి ♦ క్ష్మాస్థలి వెల్గుట రాజ్యలక్ష్మి యా
దరమునఁ బొందుఁ జుమ్ము; సుర♦తల్లజులందు శతక్రతుండు నాఁ
బరఁగి యచింత్యవిక్రమము ♦ భాసిలఁగా మరుకాననస్థత
స్కరహననం బొనర్చి క్షితిఁ ♦ గ్రాలెడువాఁడు సరోజలోచనా!. ౩౦ 1236

తే. *ఏల జాగొనరించెనో ♦ యిట్టులన్న
రావణుఁడు కానఁబడమిఁ గ్రో♦ధావిలమతి
యగుచునున్నాఁడు రణమందు ♦ నరివధించి
నిర్జితక్రోధుఁడై పొందు ♦ నిన్ను నిజము. ౩౧ 1237

చ అరుల వధించువజ్రి సహ♦జాన్వితుఁడై తనవిక్రమంబు సం
గరమున శత్రుసంతతికిఁ ♦ గన్పఁ జేసెడురీతి లక్ష్మణుం
డురుబలశాలి సన్నిధిని ♦ నుండఁగ రాముఁడు రాక్షసాళిపై
నిరుపమపౌరుషంబు గడు ♦ నేర్పునఁ జూపును నమ్ము మింతిరో!. ౩౨ 1238

చ. పలికెద విట్టులైన ఫల♦భంగి యదెట్టులో నీకు నన్నచో
వెలఁదిరో! వైరికూలఁగనె ♦ వేగమె నీపతి నిన్నుఁ జూడ ని
మ్ముల నిటరాఁ గృతార్థవయి ♦ మోదమునం బతియంకపీఠమం
దలరెడునిన్నుఁ జూడఁగల ♦ నాదరమొప్పఁగ వేగమే సతీ!. ౩౩ 1239

సీ. కళ్యాణి! భర్త నీ ♦ కడ కరుదెంచి నిర్ గౌఁగిలింపఁగ మనర♦కాంతు నాయ
తోరస్కుఁ గనుచు వి♦భూరస్థలంబున నానందబాష్పంబు ♦ లట్టెవిడువఁ
గలవు; నీపతిఁ బాసి ♦ కడునిడుమలఁ బడి పెక్కుమాసములుగ ♦ నొక్కరీతి
విప్పకయుండుట ♦ వేణి యేకంబుగాఁ బెనఁగొని జఘనంబు♦నను దగంగ
వ్రేలాడు నీజడ ♦ వినుతబలుండగు క్ష్మాపతి విడువంగఁ ♦ గలఁడు వేగ;

ఆ. యుదితపూర్ణచంద్రు ♦ నొప్పున మెఱయు రా
మునిమొగంబు చూడఁ ♦ గనె భుజగియుఁ
గుబుసమును వదలెడు ♦ సొబగున శోకజ
సలిలము దిగవిడువఁ ♦ గలవు నీవు. ౩౪ 1240

క. సీతా! సుఖార్హుఁడగు నా, భూతలపతి రామమూర్తి ♦ పొంగుచు ననిలో
దైతేయపతిని రావణు, శాతశరంబులను ద్రుంచి ♦ సఫలార్థుండై ౩౫

* తర్హి తాదృశః కిమిదానీం విలంబ ఇత్యత్రాహ-అనుదాని కీపద్యపాదము తెనుఁగు. ఈ యవతారికార్థము తెనుఁగునఁ జేర్పకున్నచోఁ బూర్వోత్తరసందర్భమే చెడు ఇది తెలియక వ్యాఖ్యానాభిప్రాయము తెనుఁగునఁ జేర్పరాదన్న దేవానాంప్రియులభావము సత్కవిసమాదృతము కాదని గ్రహించునది.

క. నిను బ్రాణప్రియ వేగం,బునఁ బ్రీతింగూడి సుఖము ♦ పొందఁ గలఁడు; మే
దినిసస్యయుక్తసర్వ ప్రాప్తిని విలసిలురీతి మహిత♦చిత్తుని రాముఁ డ్. ౩౭ 1242
ఆ సంతతంబుఁ గూడి ♦ చక్కనిపతివిక్ర
మమునఁ బొంగఁగలవు; ♦ శ్లాఘరపర
మైన మేరువునకు ♦ నంతటఁ దిరుగుచు
మండలగతిహాయము ♦ మాడ్కి వేగ. ౩౮ 1243
[1]క. ఒనరించుచు భాస్కరుఁడై, తనరెడు సూర్యునికృపానిధాను శరణముం
గను మతఁడు ప్రజాతతికిన్, ఘనకారణభూతుఁ డగుటఁ♦గలుములనొసఁగున్.

ముప్పదియేఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౮ - వ సర్గము.

సరమ సీతకు రావణుని యభిప్రాయమును జక్కఁగా నెఱింగి చెప్పుట.

చ దనుజవరోక్తి సత్యమని ♦ తాఁ గడుమోహిత యౌచు సీత రా
మునికయి తాపమందుచును ♦ మోము వికాసముఁ బాసియుండఁ ద
న్మనసు కలంకఁ దేర్చి యను♦మానము వాపె [2]దినంబు నీటిచే
తను ధరఁ జల్లఁజేసెడువి♦ధంబున నాసురవైరికాంతయున్. ౧ 1245
సీ. ఏకాలమందు నే♦యేపని చేయంగఁదగునో దానినెఱుంగఁ ♦ దగినదాట
సరమయుఁ దనప్రియ♦సఖియై సీతకు హిత మొనర్పఁగఁగోరి♦యెలమి స్మితము
తోఁగూడుపలుకుల♦తో నిట్లనును వసి తేక్షణా! విను మెవ్వ ♦ రెఱుఁగకుండ
నట్లుగా రాముని♦యంతికంబున కేగి త్వద్వాక్యమును జక్కఁ ♦ బలికి మరల
తే. వేగ రాఁగోరెదను దూర♦భాగ మెట్లు
చనఁగ గలవని యందువా ♦ చాన' నేను
వడి [3]నిరాధారమైన య♦భ్రమునఁ బోవఁ
బవనగరుడులు నావెంటఁ ♦ బాఱ లేరు. ౪ 1246
చ. అనిపలుకంగ సీతయు మ♦హార్తిని బొందుచుఁ బల్కుచుండి చ
క్కనిసరసోక్తి కెంతయును ♦ గ్రమ్మఱ సంతసమంది తీయనై
తనరెడు పల్కులం బలికెఁ; ♦ దప్పక వ్యోమరసాతలంబులన్
జనగల వీవు నాకొఱకు ♦ శ్లాఘ్యమతి నన్యులకే నశక్యమౌ
పని నొనరింపఁగాఁ గలవు ♦ బాగుగ నంచని యే నెఱుంగుదున్. ౬ 1247
క. వనితా! నాకుఁ బ్రియంబును, నొనరింపఁగ నీకుఁ గోర్కి ♦ యుండునయే నీ

---

1 తమిమం శరణ మభ్యుపైహి దేవం దివసకరం ప్రభవో హ్యయం ప్రజానామ్ - అనిమూ.
2 పృథివీం ద్యౌ రివాంభసా-అనిమూ 3 నిరాలంబే విహాయసి, సమర్థో గతి మన్వేతుం పవనో గరుడోపి వా - అనిమూ.

మనను స్థిరంబయితగునేఁ, జని రావణుచెంత కీవు ♦ సరగున నచటన్. ౬౺ 1248

ఆ. ఏమి చేయువాఁడొ ♦ యెఱిఁగిరమ్మా; దాన
ఫల మదేమి యన్న ♦ ఖలుఁ డతండు
వైరిరావణుండు ♦ క్రూరుండు దుష్టాత్ముఁ
డాటఁ దెలివిలేక ♦ యనుదినంబు. ౭౺ 1249

క. సుర యపుడు త్రావినట్టులు, పరిపరి నను మోసపుచ్చు; ♦ భయదాకృతులన్
నిరతము గావలిఁ గాచెదు, తరుణులఁ గొని యనుదినంబు ♦ దయ యెఱుఁగకయే.

[1]క. నను దర్జింపం జేయును, వనితా! బెదరింపఁ జేయు; ♦ భయంపడి నేనో
యనుమాన మొంది యున్నా, ననూనమగు నాదుచిత్త ♦ మస్వస్థము సూ!.

ఆ. వానిభయమువలన ♦ స్వాంతంబు చెదఱ దుః
ఖమున నీయశోక ♦ కాననమున
సంశయంబు గదుర ♦ సంతాపమునఁ గుందు
చున్న దాన; దనుజుఁ ♦ డుద్యమమున. ౧౦ 1252

క. పనియే మొనరింపఁగ నే, మనిమోసము నన్నుఁ జేయ ♦ నాత్మఁదలఁచెనో
వనితా యతనిప్రవర్తన, మన నేమో? యెఱిఁగి చెప్పు ♦ మది యుపకృతియా.

చ. అని యిటుపల్కు సీతఁగని ♦ యామృదుభాషిణి బాష్పవారిచే
తనె వెతఁ గుందు తన్ముఖముఁ ♦ దద్దయుఁ బ్రీతి [2]స్పృశించుచున్ వచిం
చె నిటులు; నీకు నివ్విధిని ♦ జిత్తమునందునఁ దోఁచు నేని నేఁ
జనియెద నిప్పుడే యచట ♦ శత్రువువార్త నెఱింగి వచ్చెదన్. ౧౩ 1254

క. కనుమా! సీతా! యని యా, దనుజాంగన సరమ యిట్లు ♦ దమిఁ జెప్పి జవం
బున రావణుచెంతకుఁ జని, తనమంత్రులఁ గూడి దనుజ ♦ తల్లజుఁ డొకటన్ ౧౩౺

తే. పలుకుకొనుమాట లెల్ల నా ♦ పడఁతి వినియె;
నింగితజ్ఞయె యామాటచే ♦ నెంతొ దుష్ట
బుద్ధియగు రావణుఁడు చేయుఁ ♦ బూని నిశ్చ
యించుకొన్నట్టి విషయాళి ♦ నెఱిఁగి యంత. ౧౪౺ 1256

క. చనుదెంచె నశోకవనం, బున; కీగతి మరలివచ్చి ♦ పోయినపని యే
మని తనరాకను గోరెడు, జనకజ [3]గతపద్మపీఠ ♦ సాగరజవలెన్. ౧౫౺ 1257

క. కనుపట్టు రామపత్నిని, గనియెన్; మృదుభాషిణియగు ♦ కాంతామణి నా
దనుజాంగన సరమను నా, జనకజ గని కౌఁగిలించి ♦ సంతస మొదవన్. ౧౬౺

చ. అలరెడుపేర్మిఁ దానె తగు ♦ నాసన మామె కొసంగి సాధుభా
వల నిటుపల్కె; నిచ్చటను ♦ జానరొ! నీ వుపవిష్ట వౌచు నా

---

1 తర్జాపయతి చాజస్రం భర్త్సయతి చాసకృత్ - అనిమూ. 2 స్పృశంతీ బాష్పవిక్లబమ్- అనిమూ. 3 భ్రష్టపద్మా మివ శ్రియమ్-అనిమూ. భ్రష్టపద్మామ్ = పద్మాసనహీనా మిత్యర్థః. అని వ్యాఖ్య కమలాసనము లేని లక్ష్మియని యర్థము.

ఖలమతి యోచు క్రూరుఁడగు ♦ కర్బురనాథుఁడు తా మనంబునం
దలఁచినకార్యనిశ్చయము ♦ తత్త్వముగా నెఱిఁగింపు నాకిఁకన్. ౧౭

చ. అని తన కేమిచెప్పునొకొ ♦ యాతరుణీరుణి యంచు భీతిచే
తను దనువెంతయున్ వణఁకఁ ♦ దన్గని ప్రశ్నముచేయు జానకిం
గని సచివాన్వితుండయిన ♦ కర్బురనాథునుదంత మెల్లఁ జె
ప్పను మది నెంచి యిట్లనియె; ♦ భామిని! యచ్చటివార్త లే మనన్. ౧౯

తే. జననియైన కేకేసియు ♦ సచివవృద్ధుఁ
డగు నవిద్ధుండు నిను రాము♦నంతికమున
కనుపఁ జక్కఁగఁ దెల్పి రి♦ట్లనుచు; నోయి
దనుజనాయక! నీవు రా♦మునకు సీత. ౨౦ 1261

క. కొనిపోయి సత్కృతిం దగఁ, గొనుమని యి; ట్లుసేయఁ ♦ గోరవయేనిన్
మనుజేంద్రుచిత్తవిక్రము,మునకు జనస్థానకృత్య♦ము నిదర్శనమా ౨౧ 1262

చ. జనపతిమాట యేటి కిఁక ♦ సాగర ముద్ధతి దాఁటి జానకిం
గని దనుజావళిం దునిమి ♦ కార్యము లీగతి రాముభృత్యుఁడా
హనుమ యొకండు చేసెఁ గద? ♦ నారయ మానవుఁ డెవ్వఁడైన ని
ష్పనుల నొనర్చునే ధరణి ♦ బాగుగ నెన్నుమటంచుఁ దెల్పి; రో
వనితరో! రావణాసురుఁడు ♦ వారలపల్కుల నెన్నఁ డింతయున్. ౨౨౪

క. ధనకాముఁ దర్థమును బా,యను దలఁపనియట్లు నిన్ను ♦ న్యాయంబున నీ
యను బూనఁడయ్యె; మంత్రులు, దనుజేంద్రుం డిట్లు మదిని♦దలఁచిరి కానన్.

క. అనిమొనఁ జావక నిన్నున్, మనుజేశున కప్పగింప ♦ మైకొనఁ; డిటు బు
ద్ధిని నిశ్చయించుకొను టా,తనిమృతికే హేతు వగును ♦ దథ్యము సుమ్మీ. ౨౪

క. సురవైరులతోఁ దా సం,గరమున మృతినొందినంతఁ ♦ గాని భయమునన్
దరుణి నిను వీడఁ జాలఁడు;, వరసితసాయకము లెల్ల ♦ వైచి రణమునన్.

క. ఇందీవరనయనా! విను, సందియమున్ బూనవలదు ♦ శత్రువు రాముం
డొందినక్రుధఁ బరిమార్చియు, సుందరగతి నిన్నుఁ గూడి ♦ శోభిలుపురికిన్.

క. చనఁగలఁ డనియెను; నిటులా, జనకజతోఁ బల్కుచుండు♦సమయంబుననే
వినఁబడియె శంఖభేరీ,నినదయుతంబగుచుఁ గీశ♦నికరారవముల్. ౨౭ 1268

క. ధరణి వడఁకించునట్టులు, కరమురుదుగ వీనులఁ బడఁ♦గా లంకం గా
పురమున్న రాజభృత్యులు, హరిసైన్యారావముల న♦హార్యములఁ గడున్.

క. విని మనపతిదగు దోషం,బున మనకున్ మేలు లేదు ♦ పో యని దైన్యం
బున నష్టౌజసులయి భీ,తిని గాంచిరి తప్ప దిఁక మృ♦తి యనుచు మిగులన్.

ముప్పదినాలుగవ సర్గము సంపూర్ణము.

## ౩౫ - వ సర్గము.

—మాల్యవంతుఁడు సీత నిమ్మని రావణునకు నీతిఁ దెల్పుట.—

క. అరినగరవిజయుఁడగు భూ,వరుఁ డా రాఘవుఁడు దీర్ఘ♦బాహాం డట భీ
కరభేరీశంఖారవ, పరికరములతోడ లంక♦పై గదిసెంచెన్. ౧ 1271

క. దనుజేశ్వరుఁ డంతట నా,ధ్వని విని క్షణమాత్ర మెంచి ♦ తనలో సచివా
ళిని జూడఁ జూడ్కిఁ బరపెను, ఘనబలమున జగము నేఁచఁ♦గలరావణుఁడున్.

తే. క్రూరుఁ డౌట మంత్రులనెల్లఁ ♦ గూర్చి యోల
గంబు ప్రతినాద మీయఁగ ♦ గర్వమూని
కరము దుర్బుద్ధినే వూని ♦ గర్హ్యభావ
ణముల వారల కిట్లను; ♦ నాకు మీరు. ౩ 1273

చ. వననిధి దాఁటి రాముఁ డిట ♦ వచ్చుట తద్బలవిక్రమంబులున్
ఘనము లటంచుఁ బల్కితిరి; ♦ కర్ణము లూరఁగ వింటి సంగరం
బునఁ జెడనట్టివిక్రమము ♦ పొంగుచు నుండఁగ నున్నమీర లా
తనిదగు విక్రమంబు విని ♦ ధైర్యము మాని పరస్పరంబు దృ
ష్టిని నిగుడింపఁ జేయుచును ♦ జేయఁగ నేరక మీర లుంటయున్. ౪ 1274

తే. నే నెఱుంగుదు సనియె; నా♦దానవేంద్రు
తల్లి కిం బినతండ్రియు ♦ ధరణిఁ బ్రాజ్ఞ
వర్యుఁడును నయి తగు మాల్య♦వంతుఁ డతని
పలుకులన్ విని యిట్లని ♦ పలికె నీతి. ౫ 1275

సీ. ఆన్వీక్షికిని, త్రయి, ♦ నల్లె వార్తాదండనీతుల శిక్షితుం♦డై తనర్చి
నీత్యనుసారియై ♦ నిత్యము భూపతి యెవ్వఁ డుండునో యాతఁ♦డే ధరణిని
జాలకాలము తాను ♦ బాలించు, నాతఁడే వైరుల నోడించు, ♦ స్వబల మెట్లొ
క్షీణించినన్ సంధి ♦ చేసికొనును, వైరివితతితో స్వబలము ♦ వృద్ధియైన

తే. నరులతోడను ద్వేషించు♦నట్లు కాల
గతులకొలఁది స్వపక్షంబు ♦ గ్రాలునట్లు
చేసికొనుచుండుఁ, గావున ♦ స్థిరతరమగు
భాగ్యమును బొందు దానవ♦వరమహేంద్ర!. ౬ 1276

క. తనకంటె నధికబలముం, గనుపట్టినవైరితోడఁ ♦ గావించుకొనం
గనువలయు సంధి సముఁడై ,నను బగతుఁడు సంధియే యొ♦నర్చుకొనఁదగున్.

క. బలమున నధికుఁడు తానుగఁ, జెలఁగిన శత్రువు నుపేక్ష♦సేయ కతనితోఁ
గలహంబు సేయఁదగు ని,ప్పలు కిపుడన నేల? యన్నఁ ♦ బలికెద వినుమా!.

చ. దనుజవరేణ్య! శాస్త్రముల ♦ తత్వ మిటుల్ తగుఁ గావునన్ బలం
బున నభివృద్ధినొంది నృప♦పుంగవుతోడను నీవు సంధియే

యొనరుచుకొంట నాపదికి ♦ యుక్తముగాఁ గనుపట్టు; దాన మి
య్యని గతి సంధిగాదు గద ♦ యారయఁగా బలవద్విరోధితోన్. ౧౦ 1279

ఆ. ఎవతెకొఱకు నమ్మ♦హీశునకున్ నీకుఁ, బగయొసంగె నట్టి ♦ పడఁతి సీత
నతని కిమ్ము; రాముఁ ♦ డధికుఁ డెట్లగుననిన, యున్న దేవతలు మ♦హర్షు లెలమి.

క. అనిశము గంధర్వులు రా,మునకున్ విజయంబు యుద్ధ♦మునఁ గల్గఁగ నె
మ్మనములఁ గోరుచు నున్నా, రనూనబలశాలి యాతఁ ♦ డగు నటుగానన్. ౧౧

ఉ. ఆతనితో విరోధమును ♦ నాసురరాజ! పరిగ్రహింప క
త్యాతతవైరిశక్తి మన♦మందుఁ దలంచుచు సంధిచేసికొ
మ్మాతఁడె నైన; దేవతతు ♦ లీగతి రాముజయంబు గోరఁగా
హేతు వదేమొ యన్న సక♦లేశుఁడు బ్రహ్మ సురాసురాళికిన్. ౧౨ 1282

సీ. అవలంబములుగ ధ♦ర్మాధర్మముల రెంటి సృజియించినాఁడు న♦ర్లే యవియును
నవలంబభూతంబు ♦ లయ్యెను; సత్స్వభావులగు నిర్జరులకు ♦ వెలయు ధర్మ
మాశ్రయభూతంబె ♦ యయ్యె నటంచును వినఁబడుగద; నీచ♦విషయనిరతు
లసురులు రాక్షసు ♦ లనుదినమాశ్రయించునది యధర్మమూఁ ♦ గనుక దేవ

ఆ. తలది ధర్మపక్ష♦మల రామునిది యది
యగును గానఁ బ్రబలుఁ♦డౌను జుమ్ము
ధర్మ మెట్టితఱి న♦ధర్మము నడఁగించు
నపుడు కృతయుగంబె ♦ యగును జగతి. ౧౩ 1283

క. తరుణమున నెం నధర్మం, బుగువయి ధర్మమును ద్రొక్కు♦నో కలియుగ మా
తరుణమునఁ బ్రవర్తిల్లును, బరికింపఁగ దాన నేమి ♦ ఫలమని యన్నన్. ౧౪

చ. దనుజమహేంద్ర! దిగ్విజయ♦తత్పరచిత్తముతోడ లోకముల్
గనుచుఁ జరించునప్డు పర♦కాంతలఁ గైకొనురీతి ధర్మమొ
య్యన నడఁగించి యెంతయును ♦ నాదృతిఁ గొంటి వధర్మ మట్లుగా
వున మనకంటె శత్రువులు ♦ భూరిబలాఢ్యులె ధర్మ ముండుటన్. ౧౫

తే. ధర్మనాశన మేను న♦ధర్మమూని
చేసినాఁడను గాన న♦శించియున్న
ధర్మమూనినసురుల కు♦దాత్తబలము
గల్గు నెట్టులో యందువా ♦ సర్వరేంద్ర!. ౧౬ 1286

క. *వెనుకన్ ముందును జూడక, యనుదినము నధర్మమూని ♦ యద్దానిని వృ
ద్ధిని బొందఁజేసితి నదియు, నునలం దిగమ్రింగెడున్ న♦ను స్తవిధములన్.

క. అనుకూలమై సురౌఘం, బునకుం దత్పక్షవృద్ధిఁ ♦ బొనరించుచుఁ జ
క్కనిదిగ నున్నది దానన్, మనకే హానియగుఁ గా ద♦నుజులకు వినుమా!.

* సప్రమాదాద్వివృద్ధస్తే ధర్మోఽభిగ్రసతే హి నః-అనిమా.

క. నేనొనరించు నధర్మం, బానిర్జరులకు నదెట్టు ♦ లభివృద్ధిని బెం
పూని యొనరించు నన్నున్, దానవవర! విషయలోల ♦ త స్వేచ్ఛనెయిన్.

క. సురకన్యల మునిపత్నులఁ, బరమాదృతిఁ బట్టుకొనుచుఁ ♦ బలుభంగుల నె
క్కరణిని దోఁచిన నట్టులె, చరియించితి వందువలన ♦ జ్వలనప్రతిముల్. ౧౯

క. మునులు మనస్తాపంబును, గని రెంతయు వారిమహిమ ♦ కడుఁ బ్రబలంబౌ
విను పూతాత్ములు ధర్మం, బును వృద్ధిని జేయ మిగులఁ ♦ బూనినవారల్.

క. జ్వలనునివలెఁ దమ్మహిమం, బులు దుర్ధర్షంబులగుటఁ ♦ బూని క్ర దపంబుల్
పొలుపుగఁ జేయుచు శ్రేష్ఠం, బులుగాఁ దగు సత్తతంతు ♦ వుల నియమమునన్.

చ. ఒనరిచి యజ్ఞులందుఁ దమి ♦ హోమము సేయుచు వేదపాఠముల్
మనములనున్న కోర్కికి స ♦ మానముగాఁ బఠియించుచుందు రీ
దనుజుల లెక్కసేయకయె ♦ దమ్మహిమంబులు పోవునట్లు చ
క్కనిగతి వేదనాదములు ♦ క్రందుగఁ జేయుచు నుందు రెప్పుడున్. ౨౦

చ. మును లిటుచేయ రాక్షస స ♦ మూహము లెల్లను గ్రీష్మమందునన్
ఘనములు పోలె దిక్కులకుఁ ♦ గ్రందుగ నెప్పుడు పాఱిపోయెదుర్
మును లన నగ్నికల్పులు స ♦ ముద్రగభీరులు వారు వేల్చునా
యనలునినుండి లేచిన మ ♦ హత్తరధూమము నాల్గుదిక్కులన్. ౨౧½ 1294

క. చెలరేఁగి రాక్షసుల యుజ్జ్వలతేజము క్రింగెదుర్; వి ♦ శాలము లయి ని
స్తులపుణ్యగాసులగు సుస్థలముల దృఢనియమముల నె ♦ సంగెదు వారల్.

క. ఒనరించు తీవ్రతపమున, దనుజులు దపియించువారు ♦ దానవవర! ని
న్నును సురదానవయక్షా, దినిఖిలగురుమూర్తు లని వ ♦ ధింపకయుండర్. ౨౩

క. వరమును గొంటివి విధిచే, గురుబలవిక్రమము లొప్పఁ ♦ గొంకువడని భీ
కరశౌర్య మలరు నరవా, నరభల్లూకములు పటుని ♦ నాదములు తగన్. ౨౩½

తే. కొండముచ్చులు సేనలఁ ♦ గూడి యిచటి
కరుగుదెంచి చెలంగెడు ♦ నకట! వీరి
వలనఁ జావకయుండంగ ♦ వరము లేదు;
వైరు లిచటికి వచ్చిన ♦ భంగిఁ గాక. ౨౪ 1298

క. *దివ్యాంతరిక్షభౌమము, లై వ్యాధులఁ గల్గఁజేయు ♦ నవియై మతిఘో
రవ్యాప్తములై పెక్కులు, క్రవ్యాదవినాశసూచ ♦ కంబులు నగుచున్. ౨౪½

తే. వివిధరీతుల నుత్పాత ♦ వితతు లట్టి
కానఁబడియెడు వానిని ♦ గాంచి దనుజ

---

* ఉత్పాతాన్ వివిధాన్ దృష్ట్వా ఘోరాన్ బహువిధాం స్తథా-అనిమూ. వివిధాన్ దివ్యాంతరిక్షభౌమభేదభిన్నాన్-అనివ్యాఖ్య.

తతికి నాశనమగు నని ♦ తలఁచువాఁడ;
వినుము మఱియు విరూపముల్ ♦ విస్తృతములు. ౨౫ 1300

క. ఉరుభయదములును నగుజల,ధరములు పరుషస్వనములు ♦ తగ వినఁబడఁగాఁ
బురి నంతట వేఁడిగ నె,త్తురులం గురిసెడిని బూన్కి ♦ తో నేమియొకో?. ౨౬

క. తురగాదివాహనంబులు, నిరతం బేడ్చుచును గనుల ♦ నీరువిడిచెడుఁ
బరమధ్వజములు రజమునఁ, బరఁగుచుఁ దమవన్నెఁ బాసి ♦ భాసిల వేమో.

సీ. దారుణంబులు శుభే ♦ తరనాదములునగు నక్కలు గ్రద్దలు ♦ నగరమందు
ననిశముఁ జొచ్చుచు ♦ నతిభయంకరముగ నఱచుచుఁగుమిఁగూడె ♦ నసురరాజ!
పూతనాప్రముఖముల్ ♦ భూతముల్ శ్వేతదంష్ట్రిలః పర్వఁ జేయుచు ♦ సతతము ప్రతి
కూలవాక్కులు పలు ♦ కుచు నింట్లఁ గలవస్తువులదొంగిలించుచు ♦ నెలమిమిగులఁ
తే. బ్రహసనంబులు సేయుచు ♦ స్వప్నములను
గానఁబడియెడు నెదుటను; ♦ మానితగృహ
ముల నొనర్చెడు బలికర్మ ♦ ములకుఁ జేయు
హావిసులను బట్టి తినెడు శ్వా ♦ నాళులకట. ౨౯ 1303

క. [1]గోవులయందు ఖరంబులు, వావిరి పుట్టెడిని; నకుల ♦ వారముతోడన్
వేవేగ మూషికంబు ల, దేవేళం దిరుగుచుండు ♦ నేమి గతంబో!. ౩౦

క. పిల్లులు పులులం జేరెడు, నల్లెడ [2]శ్వానములఁ గూడి ♦ యే గ్రామ్యములై
యుల్లసిలెడు సూకరములు, తల్లడ మందెడిని వీని ♦ తత్వము తలఁపన్. ౩౧

క. దనుజులతో నుత్పాతం, బునఁ గలిగిన నరులతోడఁ ♦ బొందుగఁ గూడన్
జనుదెంతురు కిన్నరులో, దనుజాధిప! హేతు వేమొ ♦ తలఁపుము మదిలోన్.

క. సితరక్తపాదముల నుద్ధతి మించెడు పావురముల ♦ తతి దైవప్రే
రితమయి దనుజాంతకమా,గతిఁ దెలుపుచుఁ దిరుగుచుండుఁ ♦ గాగృహములలోన్.

క. సరసోక్తులు పల్కఁగ నుం,దిరములఁ బెంపంగఁ బడిన ♦ దృప్తములు మనో
హరములునగు శారికలును, సరసాలాపములు మాని ♦ నంతత మధిపా!.

ఆ. [3]వీచి కూచి యనెడు ♦ విషమవాక్కులు పల్కు
చుండుఁ బక్షిమృగము ♦ లొక్కరీతిఁ
బోరి యోడిపోయి ♦ యూరసమునఁ గల
హమును మరలఁ గోరి ♦ సముదయముగ. ౩౩ 1309

క. పసుగెత్తుచున్న వెంతయు, నరులపయిన్ సూర్యుఁ గనుచు ♦ నధికంబుగ భీ

1 ఖరా గోషు ప్రసూయంతే-అనిమూ. 2 సూకరా శ్శునకైః స్సహ-అనిమూ. కుక్కలతోఁ గూడి పందులు తిరుగుచున్న వనుటచే నూరఁబందులే యనియర్థము చెప్పవలయుఁ గాన "గ్రామ్యములై" అని ప్రయోగింపఁబడినదని యెఱుంగవలయు. 3 వీచీ కూచీతి వాశ్యంత్య శ్శారికా వేశ్మసుస్థితాః-అనిమూ. వీచీకూచీతి క్రూరం వాశ్యం తీత్యర్థః-అనివ్యాఖ్య.

కరముగ నేడ్చుచునున్నవి;, [1]పరుషుండై ముండుఁడునయి ♦ ప్రగతాంగుండై.
సీ. కృష్ణపింగళుఁడునై ♦ కెరలు మృత్యువు రాక్షసుల గేహములఁ ♦ గాలములనుదప్ప
కుండఁ జూచెడుగతి ♦ నొగిఁ గనంబడుచున్నవాఁడు; దానవనాథ! ♦ వరుసనివియె
గాక యీలాటివి ♦ కడుదుర్నిమిత్తముల్ పలుభంగులం గానఁ ♦ బడెడు సుమ్ము
విష్ణువే మానవ ♦ వేషంబు దాల్చెను రామనామంబున ♦ నీమహీత
ఆ. లమున ననితలంతు ♦ సుమితవిక్రమమున, వనధిఁ గట్టెఁ జిత్ర ♦ భంగిఁ గాన
మనుజమాత్రుఁ డనుచు ♦ మన మెన్నరాదు రా,మునిని గాన నీవ ♦ తనినిగాంచి.
క. ఒనరించుకొనుము సంధిని, గనుకఁ బ్రధానంబుగాఁగఁ ♦ గనఁబడుకార్యం
బును గాంచి యింకఁ జేయం, గను దగుకార్యముల నెంచి ♦ కర్తవ్యంబుల్.
క. మనమునఁ దలంచుకొమ్మా, యొనరుపుమా! యట్లె; యనుచు ♦ నుత్తములందుల్
ఘనుఁడయి పౌరుషమునఁదగు, ననుపముఁ డమ్మాల్యవంతుఁ ♦ డప్పలుకులకుల్.
క. దనుజేంద్రునిచిత్తము మృదు, తను బొందకయుంట యింగి ♦ తంబులఁ దానే
కనుఁగొని యంద తెలుంగఁగ, వినిపించియె యూరకుండె ♦ విధిగతియనుచుల్.

ముప్పదియైదవ సర్గము సంపూర్ణము.

---

3౬ - వ సర్గము.

రావణాసురుఁడు పురరక్షణము నేర్పఱచుట.

క. దనుజేశ్వరుండు దుర్మతి, యును మృత్యువశంగతుండు ♦ నుద్ధతుఁడును నో
టను మాల్యవంతుఁ డాడిన, యనునయవచనములకోర్వఁ ♦ డయ్యెల్ సభలోల్.
తే. క్రోధవశగతుఁడై యతి ♦ రూక్షభంగి
బొమలు ముడిచి ముఖంబున ♦ నములవాక్య
ములను సైరింపఁ జాలక ♦ మొనసి వృత్త
నయనుఁడై మాల్యవంతు వి ♦ నయయుతుఁ గని. ౨ 1316
క. పరపక్ష మాశ్రయించియె, పరుషంబుగఁ దదనుకూల ♦ భంగిగ హిత మ
ట్లరయక యహితము పల్కితి, చోరదయ్యది శ్రోత్రములను ♦ శుభగతిమీఱల్.
క. మనుజుఁడు గావున జాతిం, గనినల్ దుర్బలుఁడు మఱియు ♦ గతబలుఁ డొకఁడై
వనచరుల నాశ్రయించిన, మనుజేశునిరాము మది స ♦ మర్థుఁ డటంచుల్. 3
క. తలఁచెదవే; తండ్రియె యా, యలసుని వెడలంగఁ గొట్ట ♦ నడవులనుండుల్
బలములు రాజ్యము లేవి,మ్ముల నాతని శ్రేష్ఠుఁ డనఁగఁ ♦ బోలును చెపుమా.
ఉ. [2]కారణ మేమొ యీతలఁవు ♦ గల్గఁగ నే నన రాక్షసేంద్రుఁడల్
భూరిభయంకరుండ సుర ♦ పుంగవసంతతి కప్రమేయుగం

---
1 కరాళో వికటో ముండః పరుషః కృష్ణపింగళః-అనిమూ. ప్రగతాంగుండు=వికలాంగుఁడని యర్థము. 2 హీనం మాం మన్యసే కేన హ్యహీనం సర్వవిక్రమైః-అనిమూ.

ధీరపరాక్రముండఁ గద ♦ వీరుని నీవనుహీనుఁగాఁగ నే
కారణ మెంచి చెప్పితివొ ♦ గాని యెఱుంగను దానిహేతువుల్. ౬ 1320

సీ. త్వత్సజాతులలోనఁ ♦ దలఁపవీరుండొక్కఁడున్నాఁడెయను ద్వేష ♦ మూనియొక్క
పరులయం దలరారు ♦ పక్షపాతముననో, శత్రువు లట్టి ప్రో ♦ త్సాహపఱుప
దానికిఁ జిక్కియో ♦ తగనిరీతిని బరుషోక్తులాడితి వని ♦ యొక్కశంక
గలుగుచున్నది నాకుఁ ♦ నిలఁ బరప్రోత్సాహమే లేకయుండిన ♦ నిట్లు శాస్త్ర
తత్త్వ మెఱింగి వి ♦ ద్వాంసుఁడు ప్రాజ్ఞుండు నయి తగువాఁ డెవ్వఁ ♦ డైనసాధు

తే. మతిఁ బ్రభావసమన్వితు ♦ మాన్యతమునిఁ
బరుషములు పల్కు? నీవన్న ♦ పలుకు సత్య
మే యగుంగాక సరసిజ ♦ హీన లక్ష్మి
వలెఁ జెలంగెడు సీత న ♦ వ్వనమునుండి. ౭ 1321

క. కొనివచ్చి మరల నారా,మునకున్ భయమంది యీయఁ ♦ బూనుదునే? చి
క్కనివస్తువు లభియించినఁ, గొనక యొసంగుదురె మరలఁ ♦ గుమతులెయైనన్.

చ వనచరకోటిసంవృతుని ♦ వానరనాయక లక్ష్మణాన్వితున్
గనఁగల వింక లంకఁ గొనఁ ♦ గాఁ జనుదెంచినవాని రామునిన్
దనుజవరేణ్య! మన్నిహతుఁ ♦ దద్దయుఁ బ్రీతిని గొన్నినాళ్లలో
ననిమొన నెవ్వనిం దొడరి ♦ యాత్రిదశావలి గూడ నిల్వదో?. ౯ 1323

తే. అట్టిశూరుఁడు ద్వంద్వయు ♦ ద్ధాభిరతుఁడు
రావణుఁడు రామభూపతి ♦ రణమునందు
నేల భయమందు?; నని యంత ♦ హితపరుఁ గని
యేల పరుషములాడితి ♦ నిట్లు లనుచు. ౧౦ 1324

*క. అనుతాపంబున మఱియి,ట్లనియెన్ శ్రీరాఘవుఁడు భ ♦ యంబును బొందం
గను జేసిన రెండుగఁ దుని,మిననే నెవ్వరికి లొంగి ♦ మెలఁగఁ దలఁపఁ జూ.

క. వినుమిద్ది నాస్వభావం,బునఁ బుట్టినదోష మిద్ది ♦ పో విడువంజా
లనియది దురతిక్రమ మని, యనఘా! తెలియంగవలయు ♦ నాత్మ దృఢముగన్.

చ. వననిధిసేతుబంధన మ ♦ వార్యపరాక్రమ మొప్ప రాముఁడే
యొనరిచినాఁడటంచు భయ ♦ మొప్పెఁ గదా! మదినీకు నల్పమీ
వననిధి దీనిఁ గట్టుటయుఁ ♦ బౌరుషచిహ్నము గాద దెట్టులో
యొనరిచె దీన భీతిఁ గను ♦ టొప్పదు సుంతయు నిశ్చయంబుగన్. ౧౨ 1327

చ. వనచరసేనతోడ రఘు ♦ వర్యుఁడు సంద్రముదాఁటి వచ్చి వ
చ్చినయటు ప్రాణయుక్తుఁడయి ♦ చేరునె స్వస్థల మింకమీఁద సం
చును శపథంబు చేసెదను ♦ సూనృతవాక్య మిదాను రాముఁ డే
పునఁ జనువాఁడె యంచుఁ బలు ♦ పోకలఁ బల్కెడు గర్వితాత్మునిన్. ౧౩ 1328

* ద్విధా భజ్యేయ మప్యేవం ననమేయంతు కస్యచిత్-అనిమూ.

[1]క. దనుజేంద్రుని గుపితునిగా, మనమునఁ దగ నెఱిఁగి తనదు ♦ మంచినుడులు వే చనియెను నిష్ఫలములుగా, నని లజ్జను బొంది యేమి ♦ యనఁ దోఁపమిచేన్.

తే. మాల్యవంతుఁడు సంశయ♦మానసమున
నుండి జయ మబ్బునంచు య♦థోచితముగ
నాశిషము లిడి సెలవంది ♦ యాత్మవసతి
కరిగె; రావణుఁ డంత జ♦యంబుఁ గోరి. ౧౫ 1330

క. తనమంత్రులతోఁ గృత్యం,బును జక్కఁదలంచి చేయఁ ♦ బూనినపని యీ దనుజు లిటు చేయనోఁ గద, యని నిశ్చయమొప్పఁ జేసి ♦ యప్పురమునకున్.

క. అనుపమమగు సంరక్షణ,మును జేసి యతండు ద్వార♦మునఁ దూర్పునఁ జక్కనిరీతి నాప్రహస్తుని, గనుచుండఁగ నాజ్ఞచేసెఁ ♦ గడునేర్పుమెయిన్. ౧౭

సీ. దక్షిణంబున నున్న♦ద్వారంబునన్ మహావిక్రమాఢ్యులుగాఁగ ♦ వెలయుచున్న
యమ్మహోదరుని మ♦హాపార్శ్వునిం గావ నాజ్ఞ చేసెను పడు♦మటఁ గల్గు
ద్వారంబునం గావఁ ♦ దనయుని నింద్రజిత్తును రాక్షసౌఘయు♦క్తుని ఘనబలు
నామహామాయుని ♦ నంతట నియమించె; నుత్తరద్వారమం ♦ దుత్తమబలు

తే. లైన శుకసారణులఁ గావ ♦ నాజ్ఞసేసి
తాను నట నుండ నెంచి యా♦తలఁపు మంత్రి
గణమునకుఁ దెల్పె మఱియు న♦గరమునందు
[2]మధ్యమస్థానమును గావ ♦ మహితబలుని. ౧౯ 1333

క. నిరుపమమగు పౌరుషమునఁ, బరఁగు విరూపాక్షు దనుజ♦బలయుక్తుని నా కరణి నియమించెఁ గావఁగ;, నరసి నిశాచరవరేణ్యుఁ ♦ డంతఁ బురి కొగిన్.

[3]క. ఈవిధమున రక్షణమును, గావించి తనుం గృతార్థుఁ♦గాఁ దలపోసెన్ వావిరి మృత్యుప్రేరితుఁ,డై వాఁ డంతటను బురిని ♦ ననువగురీతిన్. ౨౧ 1335

తే. కావ నియమించి మంత్రులఁ ♦ గాంచి పోవ
నాజ్ఞ చేయంగ వారు జ♦యాశిషముల
నలరఁ జేయుచు గృహముల ♦ కరుగ నతఁడు
సిరులఁ బెంపొందు సౌధంబుఁ ♦ జేరె నెలమి. ౨౨ 1336

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## 37 - వ సర్గము.

### రాముఁడు వానరసేనారక్షణమును గావించుట.

క. మనుజేంద్రులు రాఘవు లట, వనచరనాయకుఁడు మఱియు♦వాయుతనయుఁ డౌ హనుమయు భల్లూకేంద్రుం, డనుపముఁడగు జాంబవంతుఁ ♦ డంగదశరభుల్.

---

1 ప్రీడితో మాల్యవాన్ వాక్యమ్-అనిమూ. 2 మధ్యమే స్థాపయే ద్గుల్మే-అనిమూ. 3 కృత కృత్య మి వాత్మానం మన్యతే కాలచోదితః-అనిమూ.

చ. ఘనమతి యావిభీషణుఁ; డ♦ఖండబలుండు సుషేణుఁ డల్లి యా
తనిపరివారముల్, మఱియు ♦ దారుణవిక్రముఁడైన మైందుఁ డ
ట్లనుపములౌ గజద్వివిదు ♦ లాకుముదుండు, గవాక్షుఁ డానలుం
డనితరసాధ్యశక్తియుతుఁ ♦ డౌ పనసుండును దక్కువానరుల్. ౭॥ 1338

చ. అరిపరిపాలితంబయిన ♦ యాపృథివీస్థలిఁ జేరి యందఱుఁ
వరుసగఁ గూడి లంక యిదె ♦ వాయుజుఁ డప్పుడు చెప్పినట్టి దీ
కరణిని గాన నయోధ్యడిని ♦ గహ్వర,నిర్ఝర,పన్నగాళికిఁ
దరమె జయింప దీనిఁ గనఁ ♦ దద్దయు భీతియె గల్గఁ జేసెడుఁ. ౮ 1339

తే. మఱియు గంధర్వనాయకుల్ ♦ నెఱి జయింపఁ
గల్గఁ జాలరు రాక్షస♦కాంతుఁ డెపుడు
పురమునం దిందు నసముఁడై ♦ పొలిచియుండుఁ
గాన మనకింక జయసిద్ధి ♦ గల్గునట్లు. ౯॥ 1340

క. చక్కఁగ నాలోచింపుం, డిక్కడ గుమిఁగూడి యున్న ♦ యెల్లరు నని వా
రొక్కట నాడుకొనఁ విని, యక్కజముగ నవ్విభీష♦ణాఖ్యుం డంతఁ. ౧౦॥

[1]ఉ. వారలఁ గాంచి స్పష్టముగ ♦ భావము వారికిఁ దోఁచునట్లుగాఁ
జారుతరంబుగాఁ దనరి ♦ సంస్కృతభాషను గ్రామ్యభాషయే
చేరని సత్పదంబులను ♦ జెల్వమరఁ వచియించె నిట్లు; లో
సారమనీషులార! వినఁ ♦ జాలుదురే యుదుదీరితం బిఁకఁ. ౧ 1342

క. అనలుఁడు, శరభుఁడు, సంపా,తినామకుఁడు, ప్రఘసుఁడన ♦ క్షితిం బేర్వాసిం
గను నామంత్రులు నల్వురు, చని లంకకు వచ్చినారు ♦ సరగున మరలఁ. ౨

క. పతగాకృతులం దాల్చి య,హితసైన్యముఁ జొచ్చి నగర♦మేలాగు సుర
క్షితమగునో దానికి నా, దితిజులు చేసిన మహావి♦ధివ్రజ మెల్లఁ. ౩ 1344

[2]చ. కనుఁగొని వచ్చినారు నృప♦కాంత! దురాత్ముఁడు రావణుండు ప
త్తనమును గావఁ జేసిన వి♦ధానము లన్నియుఁ దెల్పినారు మీ

---

1 వాక్య మగ్రామ్యపదవ త్పుష్కలార్థం విభీషణః - అనిమూ. అగ్రామ్యపదవత్ సంస్కృతపదవత్ సర్వేషాం స్ఫుటప్రతిపత్తియే స్వదేశభాషాపదరహిత ముక్త్వా నిత్యర్థః - అనివ్యాఖ్య. దీనిచే సంస్కృతభాష దేశభాషగనుండి ఆయాదేశములలోఁ బ్రాకృతాదిగ్రామ్యపదములు కలిసియుం డెనని స్పష్టమగుచున్నది. గ్రామ్యభాష నుపయోగించినచో వానరులునుం దెలియకపోవచ్చునేమో యని విభీషణుఁడు కేవలసంస్కృతభాషనే యుపయోగించె ననుట నిర్వివాదాంశము. సంస్కృత మే కాలమునను దేశభాషగాదను గుర్వాదము దీనఁ దొలఁగవచ్చును. సంస్కృతము దేశభాషగా నుం డఁబట్టియే మనవారు సకలదేశములయందుండు వారలకు స్పష్టముగాఁ దెలియుటకై సంస్కృతభాషనే గ్రంథములవ్రాసి రనికూడఁ దేలక మానదని గ్రహింపవలయు. 2 లోఁగా వానరులందఱుంగాంచి విభీషణుఁడు చెప్పినట్లు చెప్పఁబడినది. ఇందు నృపకాంత-అనిరామునిసంబోధించి చెప్పఁబడినట్లు

యనుమతియైనఁ దద్విధుల ♦ నన్నిటి నున్నటు లేను జెప్పెదన్
వినఁదగు; నాప్రహస్తుఁ డతి♦విస్తృతసైన్యముతోడఁ బొంగుచున్. ౧౧॥ 1345

సీ. ప్రాగ్ద్వారమున; వీర్య♦బలముల సములై తనరారు నమ్మహో♦దరుఁడు మఱియు
నమ్మహాపార్శ్వుండు ♦ యామ్యదిగ్ద్వారంబునందును, రావణు ♦ నాత్మజుఁడగు
నింద్రజిత్తును దైత్యుఁ ♦ డేవునఁ బట్టసఖడ్గముద్గరశూల♦కార్ముకాంచి
తకరులు శూరులౌ ♦ దైత్యప్రధానులు పెక్కండ్రు తనుఁగొల్వ ♦ నుక్కు మిగిలి
తే. పశ్చిమద్వారమందును ♦ బరమనియత
బుద్ధియై యాయుధంబులఁ ♦ బూని దనుజ
సద్భటవ్రజములు తన్ను ♦ సరగఁ గొలువ
రావణుఁడు తానె లంకాపు♦రమునఁ జెలఁగి. ౧౨॥ 1346

తే. ఉత్తరద్వారమందును ♦ నున్నవారు
పరులబాధలు పురికి నె♦క్కరణి నైనఁ
గలుగకుండఁగఁ జేయంగఁ ♦ గర్బురగణ
తల్లజుండు విరూపాక్షుఁ ♦ డుల్ల మలర. ౧౩॥ 1347

చ. ధనువులు శూలఖడ్గములు ♦ దాల్చిన రాక్షససేనతోడ, నిం
కను బలశాలురౌ దనుజ♦కాంతులతోడను, గుల్మమందుఁ గా
వను నిలుచున్నవాఁడు; పుర♦వర్యమునం దిటు సంవిధాన మొం
దిసురవైరిసేనలను ♦ దెల్లముగాఁ గని మంత్రు లిప్పుడే. ౧౪॥ 1348

క. చనుదెంచినార లిచ్చటి, కనఘాత్మా! రామచంద్ర! ♦ హస్తిసికర మొ
య్యన నెక్కి వేయిమందియు, ఘనరథికులు నయుతసంఖ్య♦గాఁ దగువారల్.

క. ఇరువదిసహస్రములుగాఁ, బరఁగెడు నాశ్వికులు మఱియు ♦ భటముఖ్యులు భీ
కరమూర్తులౌ కోటియు,నిరతము రావణునిఁగొల్వ ♦ నేర్పఱులగుచున్.౧౬

క. బలమునఁ బరాక్రమంబున, నిలఁ బేరుం గాంచి క్రూరు♦లై యయి యుద్ధం
బుల నేర్పుగలుగు రాక్షసు, లలరుచు రావణుని గొల్తు ♦ రనుచరు లగుచున్.

క. అనిసేయఁగఁ బదిలక్షలు, దనుజులు పూర్వోక్తవీర♦తతులం దొక్కొ
క్కనికిన్, సాయమ్ముగ వే, చనుదెంతురు మనములందు ♦ సమ్మద మలరన్.౧౭

క. అనుచు మహాబాహుండగు, ఘనబుద్ధి విభీషణుండు ♦ గాదిలిమంత్రుల్
తనకుం జెప్పినవార్తల, వినిపించుచు మంత్రుల నట ♦ విభునకుఁ జూపెన్.౧౮

క. వారును బురివార్తల నా, శ్రీరామున కెల్లఁ దెలియఁ ♦ జేసిరి, పిదపన్

---

న్నది. విరుద్ధము కాదా యని ప్రశ్నింపరాదు. తథా తేషు బ్రువాణేషు రావణావరజోఽబ్రవీత్- అనియు లంకాయాం సచివై స్సర్వాం రామాయ ప్రత్యవేదయత్-అనియుఁ జెప్పఁబడినది. కాఁ బట్టి శ్రీరామమూర్తి వినుచుండ వారలంగూర్చి కొంతచెప్పి రామునిం గూర్చియుం బల్కెనని యర్థము చేసికొనవలయును.

సారసపత్త్రాక్షుండగు, భూరమణునకుఁ హితంబు ♦ బుద్ధిఁ దలఁచుచుఁ. ౨౦

క. సిరివెలయు రావణానుజుఁ, డురుముదమున రాముఁ గాంచి ♦ యోరఘురామా!
సురవైరి రావణుఁడు సం,గరమున యత్నేశు నొంపఁ ♦ గాఁ దగుకోర్కిఁ.

క. మును వెడలిన సమయంబున, ననుపమవీర్యమున శక్తి ♦ ననిఁ గుందక యొ
ప్పిన విక్రమమున ధైర్యం, బున బలమున నాదు జ్యేష్ఠుఁ ♦ బోలిన సుభటుల్.

క. [1]చని రక్షవది లక్షలమం,ది నియతి యొప్పారుచుండ ♦ దితిజేంద్రుని వెం
టను; నిట్లు వైరిబలములఁ, గొని యూడితి నంచు మీరు ♦ క్రుధనొందకుఁడీ!.

క. పరులను నిరసించుటకై, యురురోషముఁ బుట్టఁజేయు ♦ చున్నాఁడను గా
ని రిపుల వర్ణించుచు మీ, కురుభయమును గల్గఁ జేయ ♦ నోరఘురామా!.

క. ఫల మేమి రోషమును ని,మ్ములఁ బుట్టింపంగ ననెదొ ♦ మునుకొని యూది
త్యుల నీవు నిగ్రహింపం, గలవాఁడవు వీర్యమున ని ♦ కామము రామా!.

క. చతురంగబలంబులతో, వృతుఁడవు రావణునియట్లు ♦ వీరులుగా ను
న్నతబలములఁ దగు కపులను, జతురంగములుగ విభాగ ♦ సరణి మెఱయఁగఁ.

ఆ. [2]ఏర్పఱించి దాన ♦ వేంద్రుని మథియింపు
మనుచు; రావణుని స ♦ హాజుఁడు పలుకఁ
బరులవిక్రమంబు ♦ భంగింప రాఘవుం
డతనితోడ నిట్టు ♦ లనియె నపుడు. ౨౭ 1361

చ. నిరతిశయప్రతాపుఁడగు ♦ నీలుఁడు వానరపుంగవుండు కీ
శరమణసంవృతుండగుచుఁ ♦ జయ్యనఁ దూరుపుద్వారమందు భీ
కరగతి నిల్చి దైత్యబల ♦ కాంతుఁడుగాఁ దగు నాప్రహస్తుతో
దుర మొనరించు; వాలికి సు ♦ తుండగు నంగదుఁ డాత్మసేనతోఁ. ౨౮

తే. దక్షిణద్వారమున నిల్చి ♦ దర్ప మలర
నమ్మహాపార్శ్వబలయుతు ♦ నమ్మహోద
రుని రణంబున నోర్చుఁ గా ♦ ననిలతనయుఁ
[3]డప్రమేయబలోన్నతుఁ ♦ డగుటవలన. ౨౯ 1363

క. దనుజేంద్రు నింద్రజిత్తును, నని నోర్వంగలఁడు గాన ♦ నగచరవరులఁ
గొని పడమటిద్వారంబున, ననిహతపౌరుషముఁ జూప ♦ నరుగఁ వలయుఁ.

చ. దనుజుల దానవాళుల ను ♦ దారమునీషుల బ్రహ్మమానులఁ
గని యపకార మెప్పుడును ♦ గాదనకే యొనరించి దానఁ బ్రీ
తిని గని క్షుద్రబుద్ధియయి ♦ దివ్యవరంబుల బ్రహ్మనుండి కై
కొని పెనుగర్వమూని ప్రజ ♦ కుఁ బెనుతాపముఁ గల్గఁ జేయుచుఁ

1 అత్ర మన్యు ర్నక ర్తవ్యో రోషయే త్వాం నభీషయే-అనిమూ. 2 నిర్మథిష్యసి రావణమ్-అనిమూ. 3 ప్రవిశ త్వప్రమేయాత్మా-అనిమూ.

దనమదిఁ దోఁచినట్లు సత♦తంబు జగంబుల సంచరించు నా
దనుజవరేణ్యు రావణుని ♦ దర్పము పొంగ వధింప నెంచితిన్
గనుక ససైన్యుఁడౌ దనుజ♦కాంతుఁడు కావలిఁగాంచు నుత్తరం
బునఁ దగు ద్వారమున్ జొరఁగఁ ♦ బూనెద లక్ష్మణుతోడ నేనిఁకన్. ౩౧

క. అని చేసెన నాతనితో;, వనచరనాయకుఁడు జాంబ♦వంతుఁడు దనుజే
శునితమ్ముఁ డావిభీషణుఁ, డను ముువ్వురు వీరు శౌర్య ♦ మలరుచు నుండన్.

తే. *పశ్చిమోత్తరమధ్యమ♦భాగమందు
నిలిచియుందురు గాక; కో♦తు లిపు డుండు
నట్లు మానుషరూపంబు ♦ నాశ్రయించి
యుండరా దిఁకమీఁదట ♦ యుద్ధమందు. ౩౩ 1367

క. మనవానరసేనల నిం, కను నాచేసెడు సుచిహ్న♦కంబులు గ్రహియిం
పనుదగు నే వవి యనఁగా, వనచరు లివ్వార లనుచు ♦ బవరములందున్. ౩౪

క. మనకుం దెలియుటకై వా, రనయము వానరులుగానె ♦ యలరారుటయే
ఘనచిహ్నము; లిదిగో వినుఁ, డనూన తేజుండు నాస♦హాజుఁడును నేనున్.

ఆ. ఈవిభీషణుండు ♦ నీతనిమంత్రులు, నలువు రిట్లు దురము♦నం దలంప
సత్తసంఖ్య నలరు ♦ జనులము మేమె న,రాకృతులను బరుల ♦ నని వధింప.

క. తలఁపఁడు వారము నుఁడి యని, పలికెన్; మతిమంతుఁడైన♦భాస్కరకులుఁ డి
మ్ములఁ గార్యసిద్ధికై యిటు, పలికె విభీషణునితోడ ♦ బరవన మలరన్. ౩౬

ఆ. ఇట్లు పలికి రాముఁ ♦ డెంతయు నింపుగాఁ, దగు సువేలధరణి♦ధరతటంబుఁ
గాంచి దాని నెక్కఁ♦గాఁ దలపోసె నె,మ్మదిని వేఱుతలఁపు ♦ మానియుండె.

చ. ఘనమతియుం బరాక్రమము ♦ గల్గినవారలలోనఁ బెద్దయై
తనరు రఘూత్తముండు ప్రమ♦దంబునఁ బెన్దదిగాఁ జెలంగు నా
వనచరసేన యాత్మతిని ♦ బర్వుచు వెంబడిరాఁగ వైరులన్
దునుము తలంపునన్ జనియెఁ ♦ దోడనె లంకకుఁ జెంతనున్నయా
ఘనగిరిపైకిఁ బత్తనముఁ ♦ గాంచెడువేడుక తత్తఱింపఁగన్. ౩౭ 1373

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

---

౩౮ - వ సర్గము.

రాముఁడు లంక దరించుటకై సువేలాద్రి నెక్కుట.

చ. మనమున నానువేలమహి♦ధంబును గాంచుచు దానినెక్కువే
డ్కను సహజుండు తోసడువఁ ♦ గా ననురక్తుల ధర్మవేత్తలన్

---

* న చైవ మానుషం రూపం కార్యం హరిభి రాహవే-అనియూ అనఁగా నింతకుముందు వానరులు మనుష్యరూపములఁ దాల్చియుండిరనియు నిఁకమీఁదట నిట్లుండరాదని శ్రీరాముఁ డాజ్ఞ సేయ యథారూపముగ నుండిరనియుఁ దేటపడును.

వనచరరాక్షసాధిపుల ♦ భాస్కరసూను విభీషణాఖ్యులన్
ఘనతరమంత్రవేత్తలను ♦ గార్యగతిజ్ఞులఁ గాంచి ప్రీతితోన్. ౧౪ 1374

తే. మధురములు నుత్తమములునౌ ♦ మాట లొప్పఁ
బల్కె నిట్లని; మనమెల్లఁ ♦ బలువిధంబు
లైన ధాతుగణంబుల ♦ నలరు నీసు
వేలాద్రివర్యముపై నెక్కి ♦ యీనిశ నొగి. ౨౪ 1375

క. మన మరఁ గడవుదము; దుర్మనమునఁ దనచావుకొఱకు ♦ మాయకసాధ్విన్
జనకజ హరించి ధర్మంబును దెలియక స్వకులవృత్త♦ముల నెంచకయే ౩౪

క. కులగౌరవంబు సుంతయుఁ, దెలియకయుండెడు మదాంధ♦దితిజేంద్రపురిం
గలయం జూతము; రావణుఁ, డీ రాక్షసనీచబుద్ధి ♦ నవలంబించెన్. ౪ 1377

చ. కనుకనె గర్హితంబయిన ♦ కార్యమొనర్చెను; రాక్షసాధముల్
వినుతి నొనర్చినన్ మదిని ♦ వేగను రోషము ప్రజ్వరిల్లెడున్
దనుజుని జంపఁ బూనకొనఁ ♦ దత్కృతమంతువుచేత నెల్లరన్
దనుజులఁ జంపఁగానలయుఁ ♦ దప్పదు నీచుని నేమనందగున్. ౬ 1378

తే. ఒక్కఁ డపరాధ మొనరింప ♦ నొరునిజంప
నేలయన్నను వినుఁ డింక ♦ మృత్యుపాశ
వశగతుండయి యొక్కఁడు ♦ బహుళపాప
కార్యములఁ జేయు నానీచు ♦ కారణమున. ౬౪ 1379

క. కుల మెల్లను నశియింపం, గలదని; రావణునిపైని ♦ గల కోపమునం
బలుకుచు నీగతిఁ జిత్రంబుగఁ దగు సానువుల నొప్పు ♦ భూమిధరంబున్. ౭౪

క. ఆరేయిన్ వసియింపం, గా రయమున నెక్కెఁ; దోడఁ ♦ గార్ముకశరముల్
పౌరుషము నెఱపఁ దాలిచి, శ్రీరాముని వెంటఁ జిత్ర♦శిఖరిని వేడ్కన్. ౮౪

తే. లక్ష్మణుండును నియతుఁడై ♦ లలితగతుల
నెక్కె; సుగ్రీవుఁడును మంత్రు ♦ లెల్ల రాఁగ
నతని వెంబడి నెక్కె నా♦యసురవర్యుఁ
డా విభీషణుఁడును నెక్కె ♦ నతనితోడ. ౯౪ 1382

సీ. అనిలతనూభవుం ♦ డంగద, నీల, మైం
ద, ద్వివిదాహ్వయుల్ ♦ తగ గజుఁడును,
గవయు, గవాక్షులు, ♦ గంధమాదనుఁడును,
శరభుండు, పనసుండు, ♦ హర, కుముదులు,
యూధపుండగు రంభుఁ ♦ డురుబలుండగు జాంబ
వంతుండును, సుషేణుఁ, ♦ డెంతో బుద్ధి,

* యస్యాపరాధా న్నీచస్య-అనియూ. మంతువు=అపరాధము.

బలమున నసముఁడై ♦ పరఁగెడు ఋషభుండు,
గురుతేజుఁడౌ దుర్ము♦ఖుండు, మఱియు
తే. శతవలియు, లోనుగాఁ గల్గు♦శౌర్యఘనులు
శీఘ్రగతులగు నితరులు ♦ శిఖరిగాము
లైన కోఁతులు శతసంఖ్య ♦ లారఘుపతి
యుండు గిరినెక్కి రెంతయు ♦ నుబ్బుమీఱ. ౧౩౫ 1383

*చ. వనచరవార మిట్లు రఘు♦వర్యునివెంటను గొండ నెక్క నా
యినగురువంశరత్నము మ♦హీధరశృంగమునందుఁ జాలఁ జ
క్కనిసమభూములందుఁ దిర♦గం దొడఁగెన్ ముది వేడ్క దోఁప నా
వనచరు లెల్లఁ గొండపయి ♦ వర్ధిలి యోజనయుగ్మ మొయ్యనన్. 1384

క. చెలరేఁగి దక్షిణాశను, గలయం గనుఁగొనుచు నెగురఁ♦గా నాగిరి కోఁ
తులఁ గూడి వేగ రాముం, డిలాధరము నెక్కి తిరిగె ♦ నెల్లెడలఁ దాన్.

సీ. అంతఁ ద్రికూటాచ♦లాయతశిఖరంబునందు నాకాశంబు♦నందు వ్రేలు
చున్నట్లు గనుపట్టు♦చున్న లంకాపురంబును గాంచి రెల్లరు; ♦ ఘనపురమది
యత్యంతరమణీయ ♦ మై మనోజ్ఞద్వారమై మహాసాలమై ♦ యసురనిబిడ
మై యుండె; నల్లని♦ముసురులు ప్రాకారచయముల యందుండి ♦ సాంద్రసాల
తే. మొక్కఁ డభినవముగఁ గట్టి ♦ రొక్కొ యనఁగ
నగపడఁగఁ గాంచి రాప్లవ♦గాధిపతులు
మఱియు వానరు లాసుర♦మండలిఁ గని
యసియొనర్చితమిన్ రాముఁ ♦ డావృతిఁ గన. ౧౭ 1386

క. పెనునాదంబు లొనర్చిరి;, వనజాప్తుఁడు సాంధ్యరాగ♦భాసురుఁ డగుచున్
జనియె నపరాశ కంతటఁ, గననయ్యెన్ రాత్రి చంద్ర♦కళ లొగి నిండన్.

చ. వనచరవాహినీశుఁడగు ♦ భానుకులాభరణంబు దానవేం
ద్రునిసహజుండు సన్నుతులఁ ♦ దోరపువేడ్కను బూజసేయఁగాఁ
దనయనుజన్మునిం గలిసి ♦ తద్దయు వానరయూథనాయకుల్
తనుఁ గొలువంగ నాగిరివ♦తంసముపైని వసించె హాయిగన్. ౧౯౫ 1388

ముప్పదియొనిమిదవ సర్గము సంపూర్ణము

---

* తే త్వదీర్ఘేణ కాలేన గిరి మారుహ్య సర్వతః-అనిమూ. పద్యమున యోజనయుగ్మమని చెప్పఁబడినది మూలమునలేదు అని శంకింపఁ బనిలేదు ౪౦ సర్గమునఁ బ్రథమశ్లోకమున "తతో రామ స్సువేలాగ్రం యోజనద్వయమండలమ్" అని యున్నదిగాన నావిషయమే యిటఁ జేర్పఁబడిన దని తెలియఁదగు.

## ౩౯ - వ సర్గము.

-శ్రీరాముఁడు లంకం గాంచుట.-

[1]క. హరివీరులు తన్నిశ నా, ధరణీధరమందునుండి ♦ తమిఁ గాంచుచు రా
తిరి పోవ లంకయందలి, పరమవనారామములను ♦ బరికించి రొగిన్. ౧ 1389

తే. సహములై సుందరములు వి♦శాలములును
నాయతంబులు రమ్యంబు ♦ [2]లక్ష్మిసుంద
రములునై యొప్పుచున్న యా♦రామములను
గాంచి యానంద మొంది ర♦క్కపులు మిగుల. ౨ 1390

సీ. చంపకాశోకముల్ ♦ సాలతాలంబులు పున్నాగములు చాలఁ ♦ బొలిచియుండఁ
గాఁ దమాలవనముల్ ♦ కడు నిండియుండంగ నాగకేసరపంక్తి ♦ బాగుమీఱ
నొప్ప హింతాలార్జు♦నోర్వీరుహంబులు నీపముల్ సుమభర♦నిబిడసప్త
పర్ణద్రుమంబులు ♦ కర్ణికారంబులు తిలకముల్ రమ్యపా♦టలము లోలయఁ
బుష్పితాగ్రంబులై ♦ పొలుచుఁదీఁగలు సమ్ముఁ గౌఁగిలింపఁగఁ జిత్ర♦కుసుమపుష్ప

తే. యుతములై రక్తపల్లవ♦యుక్తములయి
తనరు మందారముఖదివ్య♦తరుయుతమయి
యలరు నమరావతిం బోలి ♦ యాపురంబు
వెలయుచుండెను వర్ణ్యమై ♦ విపులరీతి. ౩-౭ 1391

చ. పురమది నీలశాద్వలవి♦భూతి నెసంగుచుఁ జిత్రరీతిగాఁ
బరఁగు వనంబులన్ వెలసి ♦ వర్ణనయోగ్యమునై చెలంగె; న
త్తరువులు భూషణాదుల ని♦తాంతము మానవులొప్పునట్లుగా
సురుచిరగంధముల్ వెలయ ♦ సుందరపుష్పఫలంబులన్ మనో
హరముగఁ దాల్చి చూచుటకు ♦ నందముగాఁ దగియుండె నెల్లెడన్. ౮ 1392

తే. ఎల్లఋతుధర్మములతోడ ♦ నెంతొ రమ్య
మగుచుఁ దుమ్మెద లింపుగా ♦ నార్వ నచటి
వనము చైత్రరథంబు నం♦దనము నాఁగ
నలరెఁ గన్నులకింపుగాఁ ♦ జెలఁగి మిగుల. ౯ 1393

క. వనములఁ దగు నిర్ఝరములఁ, గనుపట్టెడు నీరుకోళ్ల♦గములును గోయ
ష్టికరములును నర్తన,మును సల్పుమయూరములును♦ మోదము నొసఁగన్.

క. ధ్వనిచేయుపరభృతంబుల, నినాదముల వినిరి కీశ♦నివహాధ్యక్షుల్;
వనముల నుపవనముల యం, దనిశము పతగములు క్రొవ్వి ♦ యార్చుచునుండున్.

క. నిరతము షట్పదపంక్తులు, తిరుగుచునుండును, బికాళి ♦ దివ్యతరువరో
త్కరములను నిండియుండును, నిరంతరము పతగవిసర♦నినదమ్ము లొగిన్. ౧౦

---

1 వనా న్యుపవనానిచ-అనిమూ. 2 దృష్టిరమ్యాణి తే దృష్ట్వా-అనిమూ.

తే. షట్పదంబులఝుంకృతి ♦ సముదయములు
వినఁబడుచునుండు నల్లడ♦లను; మనోజ్ఞ
షట్పదంబులు సేవింపఁ ♦ జాలియుండు
బెగ్గురులు మందపిచ్ఛకల్ ♦ బిగ్గ నార్వ. ౧౦౫ 1397

క. వనములు తనరారంగా, వనచరు లారామణీయ♦వైభవములకున్
దనువు లొగిఁ బులకరింపం, గనుమిక్కిలి హృష్టులగుచుఁ♦గడఁగి చెలఁగుచున్.

తే. వీరులును గామరూపులై ♦ వెలయుచుంటఁ
దగినరూపంబులం గొని ♦ తద్వనములఁ
జొచ్చి రిట్లుగ ననమ తే♦జులగు వార
లందుఁ జొరఁబడుచుండు న♦య్యదనునందు. ౧౭౫ 1399

క. అనిలుఁడు సుమనఃపరిమళ,మున మున్గుచు ఘ్రాణరంధ్ర♦ములకు సుఖంబుం
గనఁ జేయుచు వీచెను; నొ,య్యనఁ గొందఱు యూథనాథు ♦ లగుహరివీరుల్.

చ. వనచరనాథునాజ్ఞఁ గొని ♦ వైళము భీకరనాదమొప్పఁగా
వనగతపక్షివారముల ♦ వారక భీతిలఁ జేయుచున్ సుదం
బునఁ దగునేన్గులన్ మృగస♦మూహము భీతిలి పాఱఁజేయుచున్
దనుజపురంబు కంపము ని♦తాంతము నొందఁగఁ జేయుచున్ జవం
బునఁ జనునప్డు పాదముల ♦ భూమిని దత్తఱిలంగఁ జేయుచున్
జని తల లంకకున్ గడుధ్వ♦జంబులఁ జెన్నగుచోటికిన్ దమిన్
వనచరపాదసంహతులఁ ♦ బర్విసధూళి జనంబునన్ దివం
బును గడు నావరించె, బహు♦భూతభయంకరరీతి నయ్యెడన్. ౧౬ 1101

చ. వనములయందునున్న ఘన♦భల్లమృగేంద్రవరాహముల్ మదం
బునఁదగు నేనుఁగుల్ మహిష♦ముల్ మృగముల్ కపివీరు లట్టిచే
సిన భయదారవంబులకుఁ ♦ జెచ్చెఱ భీతిలి పాఱె నార్తమా
నినదముచేత దిక్కులను ♦ నిండఁగఁ జేయుచు నొక్కపెట్టునన్. ౧౭ 1102

సీ. ఆత్రికూటాద్రిమ♦ధ్యమశృంగ మత్యున్నతంబయి సుప్రసి♦ద్ధంబు నగుచు
నంబరంబును దాఁకు♦నట్లు గానంబడి యద్వితీయంబయి ♦ యఖిలభాగ
ములఁ బుష్పనికురుంబ♦ముల సమాచ్ఛాదితంబయి స్వర్ణవర్ణమై♦యలరినూఱు
యోజనంబుల పొడ ♦ వొప్పఁగా విమలమై చారుదర్శనమయి ♦ శ్లక్ష్ణమగుచు

తే. సిరులఁ దనరుచుఁ బెద్దదై ♦ పరఁగి *పతగ
ములకునుం జేరరానిదై ♦ చెలఁగి మనసు
చేతనైన నెక్కఁగరాక ♦ చిత్రరీతి
నుండ నన మర్త్యు లెక్కంగ ♦ నోపువారె ౧౯౫ 1403

క. ఆపర్వతశిఖరంబునఁ, జూపట్టును లంక దనుజ♦శూరాగ్రణి యం

* దుష్ప్రాపం శకునైరపి-అనిమూ.

దేవారి పాలకుఁడుగా, శ్రీపాలితుఁ డగుచుఁ జాలఁ ♦ జెలఁగుచు నుండున్.౨౦

క. పుర మయ్యది శతయోజన,పరిమితమగు పొడవుగల్గి ♦ భాసిలి మిగులన్
సిరులన్ ద్రింశద్యోజన,పరిమితమగు వెడలుపు దగఁ ♦ బరినుత మగుచున్.౨౦౪

క. తెల్లని మేఘంబులవలె, నుల్లసిల్లెడు గోపురములు ♦ నొప్పుచుఁ గడు భా
సిల్లెడు సువర్ణవరణము, లెల్లెడలన్ రాజతంబు ♦ లెసఁగం బరఁగున్. ౨౧౪

తే వానకాలంబురాఁగ నా♦కాశమును ఘన
మధ్యమునఁ దంబునాఁ దగు ♦ మహితపుష్క
రంబు మేఘగణంబుల ♦ రాజిలునటు
లదియుఁ బ్రాసాదతతివిమా♦నాళి వెలయు. ౨౨౪ 1407

సీ. అందు మధ్యమభాగ♦మందుఁ బ్రాసాద మొక్కం డు కాంతులమీఱి♦క్రాలుచుండు
వేయి స్తంభంబులు ♦ వెలయును దానికి గైలాసశిఖరంబు ♦ కరణి నాక
సంబున వ్యాపించి ♦ చైత్యంబునకు నది భూషణప్రాయమై ♦ పొల్చుచుండు
దానవబలములు ♦ దానిఁ గాచుచునుండు ననిశము, రమ్యమై ♦ యమలకాన

తే. నములచే భూధ్రముల చేత ♦ నములవివిధ
ధాతువుల చేత నతివిచి♦త్రంబు నగుచు
నుపవనంబులు వెలయుంగ ♦ నురుపతత్రి
గణము కలనాదములు చేయఁ♦గాఁ బరఁగుచు. ౨౩ 1408

క. పలువిధములైన మృగగణ,ములు తిరుగుచు నుండఁగ వన♦ములు పెక్కులు భా
సిల రాక్షసగణములు ను,జ్జ్వలభూషణయుక్తిఁ గావ ♦ భాసిలుచుండున్.౨౬౪

చ అనిశము సంపదల్ పొదల ♦ నత్యధికోన్నతి నొప్పియుండు ప
త్తనమును దాని రావణుని ♦ ధామముగాఁ దగు దాని లక్ష్మణుం
డనుజుఁడు గాఁ జెలంగు మహి♦మాఢ్యుఁడు రాముఁడు వేడ్కఁ గాంచె నా
వనచరయుక్తుఁడై మదిని ♦ వర్ణనముల్ దమి సేయుచున్ గడున్. ౨౭౪ 1410

క. సురనిభుఁడు వీర్యవంతుఁడు, ధరణీపతిచంద్రుఁడగుచుఁ ♦ దగు రాముఁడు సుం
దరసౌధనిబిడమా పుర,వరమును గని యద్భుతార్ణ♦వంబున మునిఁగెన్. ౨౮౪

చ. సురుచిరవస్తుసంతతుల ♦ శోభిలి రత్నకయత్నపూర్ణమై
నిరుపమసౌధవారముల ♦ నిండి కవాటవరంబులున్ మహా
త్తరవరయంత్రముల్ వెలయఁ ♦ దద్దయుఁ బొల్చెడు నట్టి లంక నా
హరిగణయుక్తుఁడై కనియె ♦ నారఘురాముఁడు వేడ్క మీఱఁగన్. 1412

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౦ - వ సర్గము.

### రావణ సుగ్రీవుల ద్వంద్వయుద్ధము.

క. జనకసుతాపతి యంతట, వనచరయూథపులు తన్నుఁ ♦ బరివేష్టింపం
గను సుగ్రీవునితో, యోజనయుగ్మవిశాలమైన ♦ స్థలయుక్తంబై. ౧ 1413

క. తనరారు శైలశిఖరం,బును నెక్కెను; రాముఁ డద్రి ♦ ముఖ్యశిఖరమం
దున నొక్కముహూర్తము ని,ల్చి నిఖిలదిక్కులను గాంచి ♦ చేరువ నొకచోన్.

ఆ. అతివిచిత్రమగుచు ♦ నా త్రికూటాద్రిశృం
గమునయందు విశ్వ ♦ కర్మచేత
నిర్మితమయి మిగుల ♦ నిర్మలమగువన
ములను వెలయు లంకఁ ♦ గలయఁ జూచె. ౨½ 1415

క. పురగోపురశిఖరంబున, దురాసదుండగుచు మిగుల ♦ ధూర్తుండగు క
ర్బురనాథుఁ డుండ శ్రీరఘు,వరుఁ డప్పుడు గాంచెఁ బ్లవగ ♦ వర్యులతోడన్. 3

*క. ఇరుభాగంబుల సితచా,మరములు, విజయంబు దెలుపు ♦ మానితశుభ్రాం
బరలసితమైన ఛత్రము, పరసుప్రసూనంబు నింప ♦ భాసిలు వానిన్. 3½ 1417

తే. అరుణచందనలిప్తాంగు ♦ నమలరత్న
భూషణాలంకృతుని హేమ ♦ భూషితాంబ
రుని వినీలాంబుదశ్యామ ♦ తనుని, దేవ
పతిని మార్కొనఁ జాలిన ♦ పౌరుషాఢ్యు. ౪½ 1418

క. మును నైరావత మొక్కట, ననిమొన దంతములఁ బొడువ ♦ నా దెబ్బలచే
తను గల్గినకాయలు ఱొ,మ్మునఁ జూపట్టంగ వెలయు ♦ భూతభయదునిన్. ౫

తే. మఱియుఁ గుందేటినెత్తురు ♦ మాడ్కి వెలయు
నుత్తరీయంబు చెలువార ♦ వ్యోమమందు
సాంధ్యరాగంబు వ్యాపించి ♦ జలదరాశి
పగిదిఁ జూపట్టు దానవ ♦ పతిని భయదు. ౬ 1420

చ. వనచరులున్ రఘూత్తముఁడు ♦ వానిని గన్గొనుచుండఁగా నె యా
దనుజవరేణ్యుఁ గాంచి యిటు ♦ ధారుణినాథుఁడు రామమూర్తి ని
ల్చినతఱి రాజచిహ్నములఁ ♦ జే వెలుఁగొందుచు నీచుఁ డీతఁ డుం
డ నగునె యున్నకోపము గ ♦ డంగఁగఁ జేయఁగ సూర్యసూనుఁ డొ
య్యనఁ దను చిత్తసత్త్వముల ♦ నగ్గిరిశృంగమునుండి చివ్వనన్. ౭½ 1421

క. దనుజేంద్రుఁ డున్నగోపుర,మునకున్ వడి నెగిరెఁ; జిత్త ♦ మున నించుకయై
నను భీతిలేక యాతనిఁ, గనుచున్ సుగ్రీవుఁ డొక్క ♦ క్షణముండి తగన్. ౮½

* విజయచ్ఛత్రశోభితమ్-అనిమూ.

[1]ఉ. దానవనాయకుం గొనక ♦ తద్దయుఁ గ్రూరతరోక్తులన్ గ్రుధం
బూని వచించె; నోరి రఘు♦భూపతి కేను సఖుండ దుర్మతీ!
యానిఖిలప్రపంచవిభు ♦ నంప్రిసరోరుహదాసుఁడన్ మహా
మానవనాథుసత్వబలు♦మంజులశక్తిసహాయసంపదన్
నే నిను వీడఁ జాల నిఁక ♦ నిర్భరపౌరుషమూని తన్నెదన్. ౧౦ 1423

చ. అని వచియించి వేగముగ ♦ నాతనిమీఁదికి దాఁటి చిత్రమా
దనుజవరేణ్యుమస్తకని♦తాంతవిభాసురసత్కిరీటపం
క్తిని గడులాగి యుద్ధతిని ♦ గ్రిందఁ బడంగను ద్రోసి తాను నో
య్యన ధరవ్రాలె; నిట్లు తన♦యంతికముం గడుఁ జేరు నాకపిన్. ౧౧½ 1424

[2]క. కని రావణుండు తా ని, ట్లనియెఁ బరోక్షమునయందు ♦ నైతివి నీవో
వనచరసుగ్రీవుండవు, చనుదెంచితి విపుడు నాదు♦సమ్ముఖమునకున్. ౧౨ 1425

క. కనుకన్ హీనగళుండవు,గను గాఁగల వింకమీఁదఁ; ♦ గడువడి నని యా
దనుజేంద్రుఁ డాడి శీఘ్రం,బున లేచి సరోజమిత్ర♦పుత్రునిఁ బెలుచన్. ౧౩½ 1426

క. కరములను బట్టి యప్పుడె, ధరణిం బడఁద్రోసె హరివ♦రుంసుఁడు శూరుం
డరుదుగఁ జెందువిధంబున, నురుగతిఁ దా లేచి బాహు♦యుగళిని నతనిన్.

సీ. ధరణిని బడఁద్రోసె. ♦ నిరువురు వారిట్టులొకరి నొక్కరు బిగు♦వొప్పఁ గౌఁగి
లించుకొనుటచేత ♦ మించి దేహంబునఁ జెమటలు గాఱ న♦ఖముల జీఱు
కొనుటచే సంగము♦లను రక్తమును గాఱఁ గదలనీయక పట్టు♦వదలకుండఁ
బెనచుకొనుటఁ జేష్ట♦లను మాని పట్టును విడువఁగాఁ బుష్పిత♦విమలకింశు

తే. కాఖ్యభూరుహశాల్మలి♦కావనీజ
ముల విధమ్మున నుండిరి ♦ పెలుచ వారు
కరతలారత్నిముష్టిసం♦ఘాతములను
ఖరనఖరములఁ జీఱుటఁ ♦ గడఁగి చేసి. ౧౪½ 1428

క. భరియింపరానివిధమున, నురుబాహులగువారు మిగిలి ♦ యుద్ధంబును జే
సిరి; వారు భీమజవమునఁ, బురగోపురమునకు నడుమఁ ♦ బొంగెడుకాంక్షన్.

తే. మల్లయుద్ధంబు గావించి ♦ యెల్లరుఁ గనఁ
బైకిఁ జిమ్ముచు మరలను ♦ బట్టి లాగు
చును బరస్పరమున్ వంచు♦కొనుచు నడుగు
లిడుచు నడుమకుఁ బోవుచు ♦ దుడుకుమీఱ. ౧౬ 1430

తే. ఒకరిపై నొక్క రుగ్రత ♦ నూని హస్త
ములను వైచి శిరం బట్టి ♦ మూర్ధ్నుల దృఢ

---

1 లోకనాథస్య రామస్య సఖాదాసోఽస్మి రాక్షస-అనియు. 2 సుగ్రీవస్త్వంపరోక్షంమే హీనగ్రీవో భవిష్యసి-అనియు. అనఁగా నాకంటఁబడనప్పుడు సుగ్రీవుండవు. (మంచికంఠముగలవాఁడవు) ఇంకఁ గంఠహీనుఁడ వగుదువని భావము.

ముగను గొంగిటఁ జేర్చియు ♦ దిగిరి సాల
పరిఖముల యంతరమునకు ♦ సరిగ నిలకు. ౧౬ 1431

చ. సులువుగ లాఘవంబునను ♦ క్షోణిని ముట్టక పైకి దాఁటి యా
యలఘుబలాఢ్యు లొక్కక్షణ ♦ మందునె నిల్చి పరిశ్రమంబునన్
గలిగిన నూర్పులన్ విడిచి ♦ క్రమ్మఱఁ గొంగిటఁ జేర్చుకొంచు ని
మ్ములఁ బయికేగి భూరికర♦ముల్ ఘనపాశములై చెలంగఁగాన్. 1432

క. తనువుల బంధించిరి యుద్ధనిపుణతన్; బట్టుదలను ♦ దారుణవిక్రాం
తిని నభ్యాసబలంబులఁ, బెనుగర్వముచేత విఱ్ఱ♦వీఁగుచు వారల్. ౧౮ 1433

క. పులులవిధంబునఁ గలభం,బులరీతిని నొకరినొకరుఁ ♦ బూనిక బంధిం
పలలితగతులొప్పఁగఁ ద్రో,వలఁ దిరుగుచుఁ బెనఁగి రెంతొ ♦ వాంఛలు మీఱన్.

సీ. ఇతరేతరము వార ♦ లేపునఁ గదిసి వక్షంబుల మోఁదుచు ♦ గాఢతరము
గాఁ గొంగిటం జేర్చు ♦ కరణిగా నదుముకొనుచుఁ దటాలునఁ బడి ♦ రచటినేల
నంతలోపనె వా ♦ రట్టె లేచి పరస్పరముఁ బట్టి పైకెత్తి ♦ క్షమఁ బడంగఁ
ద్రోయుచు బహుళరీ♦తులగు సంగరమార్గములఁ బెనంగిరిమహోం♦బులఁ జెలంగు
కరులఁ బోలెడు వీర♦వరులు వారిద్దఱు వ్యాయామశిక్షలు ♦ బలముకలిమి

తే. గల్గువారలు గావునఁ ♦ గట్టుగంబ
ములకు సరియగు తమబాహా♦వుల నడంచు
కొనుచునుండియు నలజడి ♦ గనక యుండి
రాహవంబునఁ బొంగునూ♦హాలు చెలంగ. ౨౦ 1435

క. ఈరీతి చాలకాలము, వారాహవ మొప్పఁ జేసి ♦ వడి మీఱంగా
బోరన మండలగతులన్, జేరి పరాక్రమము చూపఁ ♦ జెలఁగిరి కినుకన్. ౨౧

[1]క. వా రొకరి నొకరు చేరుచు, నేరీతిని నెనఁ జంప ♦ నెంచుచుఁ గడు నా
హారమునకుఁ బొంచిన మా,ర్జారంబులభంగి నొంప ♦ నంతనపడుచున్. ౨౨

క. చలియింప కించుకంతయు, నిలువంబడి మండలాది ♦ నియతపథములన్
గలన మొనరింప సాగిరి, బలశాలురు యుద్ధమార్గ♦పటుతరశక్తుల్. ౨౩ 1438

[2]సీసమాలిక:—

వనచరనాయక ♦ దనుజేంద్రు లొయ్యన నవ్యాపసవ్యాది ♦ నకలమార్గ
ములను, వ్యాఘ్రమృగేంద్ర♦ములవలె నిలుఁ వంగవైశాఖ,సమపాద♦వైష్ణవమ్ము
లాలీఢ మట్లె ప్ర♦త్యాలీఢమండలము లనఁగఁ దగుస్థాన♦ములను మఱియు
గోమూత్రగతివంటి ♦ కుటిలమార్గంబుల నట్టులె యుపసర్ప♦ణాపసర్ప
ణములఁ, దివ్యగ్గమ♦నముల నవ్యాపసవ్యక్రమంబులఁ; దన్ను ♦ నరి చెలంగి
నొప్పింపఁ బూనఁ దా♦నును దానివ్యర్థంబుగను జేయ పరిమోక్ష♦మును, జెలంగి

1 మార్జారా విన భక్షార్థే-అనియు. 2 వ్యాఖ్యానాభిప్రాయ మిందుఁ జేర్పంబడినది.

బదులు నొప్పించుచు ♦ వైరితాడనములఁ బరిహరించెడు నట్టి ♦ వర్జనమును
బగవాఁడు నిలుపంగఁ♦బడ వానిచుట్టునుదగఁ జరించెడు పరి♦ధావనమును
నెదిరించి శత్రువు♦ను దలపడు నభిద్రవణమును, దేహంబు ♦ వంచి యొక్క
యంగంబు నిక్కించి♦యుడఁగి మండూకంబుభంగిఁబైఁబోవు నా♦ప్లావనమును, ద
గంగ ధైర్యంబున ♦ గాఢంబుగాఁ దాఁకి కేవలానసమును ♦ జేవఁగొనుచు
నిర్భయంబుగ నందు ♦ నిల్చియుండుటయునాస్థానమును, ముఖ ♦ మట్టిత్రిప్పి
వెనఁజను టను పరా♦వృత్తంబు, నిలుచున్నయట్లెవెన్కకుఁ బోవు♦నట్టిదగు న
పావృత్తమును, వైరిఁ♦బట్టుకొనంగోరి తనువెల్ల నంచి యా♦తనిపయికిని
జవము మీఱెడునట్లు♦చనుటనాఁదగు నవద్రుతమును, దనదుశ♦త్రువునుగాలఁ
దన్న నాస్యమువంచి ♦ త్వర నెగురుట యనఁజను నవప్లుతమును ♦ శత్రుబంధ
నార్థమై తనకర ♦ మట్టి చాఁచుటయనునట్టి యుపన్యస్త ♦ మరియుఁ దనను
బట్ట యత్నింపంగఁ ♦ బట్టుతప్పించుకొనఁగఁ గేలు చిమ్ముట♦నంగఁ బరఁగు
నట్టి యపన్యస్త ♦ మాదియాంపథముల మెలఁగుచుండిరి; పోరు ♦ నలుపుచుండ
దనుజనాథుఁడు సోలి ♦ వనచరేంద్రునకు మాయాబలంబునఁ దన♦యట్టివారు

ఆ. పెక్కుమంది తోఁచు♦విధమున మాయను, జూప మొదలుపెట్టి ♦ నాపగిదిని
దానెఱింగి జయము ♦ తగఁగాంచుశీలంబు, వెలయ భానుపుత్రుఁ♦డలయకవడి.

క. ఆకస్మికముగ నెగిరెను, నాకాశంబునకు దాన♦వాధీశుఁడు తా
నాకపి మరలఁ బచ్చుని,దేకరణిని నను చు నచట♦నే నిలుచుండెన్. ౨౭

క. ఈరీతి నంచితుండై, యారావణుఁడుండ వాన♦రాధీశుఁడు తా
నే రావణుతో సంగర, మాకీతి నొనర్చె ననెడు ♦ యశముం గనుచున్. ౨౮

చ. దనుజపతిన్ జయించి రణ♦ధర్మము తప్పక వానిఁ గష్టముల్
గవ నొనరించి యున్నతము♦గాఁ దగు నభ్రపథంబు జొచ్చి రా
మునిఁ గని యంతఁ బార్శ్వమున ♦ మోదము భక్తియు మీఱుచుండ న
వ్వనచరముఖ్యసంస్థుఁడయి ♦ భాసిలుచుండె జయోత్సవంబునన్. ౨౯ 1442

చ. తరణిసుతుండు వీరుఁడయి ♦ తత్కృతి నవ్విధిగా నొనర్చి హ
ర్ష రతిని గాంచి యారఘువ♦రప్రియసూతికి యుద్ధహర్షమున్
బరఁగ నొనర్చి వానరుల♦వారము తన్నును బూజసేయ నా
హరిగణమందుఁ జొచ్చెను మ♦హాబలవేగము మీఱఁ జక్కఁగన్. ౩౦ 1443

నలువదియువ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

### అంగద రాయబారము.

చ. వనచరనాథునం దవుడు ♦ భాస్కరవంశసుమార్తికంబు చ
క్కనిరణచిహ్నజాలములఁ ♦ గాంచుచుఁ గౌఁగిటఁ జేర్చి ప్రీతిని

ట్లనియెను; నాదుసమ్మతిని ♦ సంధన యీగతి సాహసంబుచే
యను జను నే మహీశులిటు ♦ లద్భుతసాహసకృత్యముల్ తమం
తన యొనరింపఁ బూనరు ని♦తాంతము ధైర్యమునూని వేగమే. ౨ 1444

తే. సాహసప్రియుఁడవు నీవు ♦ శౌర్యఘనుఁడ
వందుననె సవిభీషణు ♦ సఖలవనచ
రేంద్రబలమును సంశయ ♦ మిట్టులొందఁ
జేసి యీగొప్పతెగువను ♦ జేసితి విటు. ౩ 1445

*క. నీవిట్లు సాహసంబును, జేవం జేయంగఁ బూన ♦ క్షితి మాకొంట్లె
జీవించుట దుర్లభమగు;, నోవీరా! యింకనైన ♦ నుద్ధతి మీఱకు. ౪ 1446

తే. ముందువెన్కలు తలఁప కీ♦చందమునను
సాహసంపుఁబనుల్ సేయఁ ♦ జనదు సుమ్ము
బాహుబలమున దుర్భర♦వైరిగణము
నడఁచు నీకును నేదైన ♦ హాని గలుగ. ౫ 1447

క. జనకజతో భరతునితోఁ, బినతమ్ములతోడఁ దుదకు ♦ విమలంబగు నీ
తనువర్యముతో నాకే,పనియుండును? జక్కఁ జెపుమ ♦ భాస్కరతనయా!.

క. సురపతివరుణసమానుఁడ, వురుబాహుబలంబ విట్టు ♦ లుగ్రరణముచే
యురతిని జని రాకుండెదు, తరుణంబున నీదుశౌర్య♦ధర్మ మెఱిఁగియుఁగ. ౭

సీ. ఏదేని నీకప♦కృతియె గల్గునో యని సందియమంది నా♦శపథ మెట్టు
లైనఁ దీర్పకయుండ ♦ నౌనె యందున నేనునాత్మజబంధువా♦హనయుతముగ
రావణు ననిఁ జంపి ♦ రాజ్యంబునకు విభీషణుని బట్టముగట్టి ♦ సత్వరముగ
నాయయోధ్యకుఁ బోయి♦యఖిలరాజ్యమ్మును భరతునకొసఁగి త♦ర్వాతఁ జక్క

తే. దనువు వదలంగ నిశ్చయ♦మును నొనర్చు
కొంటినని పల్కె; శ్రీరఘు♦కుంజరుఁ డిటు
పలుక సుగ్రీవుఁ డతనితోఁ ♦ బలికె నిట్లు
రఘుకులాభరణంబ శ్రీ♦రామ నేను. ౮ 1450

క. నీపౌరుషముల నెఱిఁగియు, నీపత్ని హరించినట్టి ♦ నీచుదురాత్ముఁ
బాపిని గని యెటుసైతును, భూపవరేణ్యా! యటంచుఁ♦బొంగుచుఁ బలుకఁగ.

క. వీరుండగు సుగ్రీవుని, చారుతరోక్తులను విని యొ♦సంగెడుకాంతి
స్ఫారుని లక్ష్మణుఁగని యా,శ్రీరాముం డిట్లు పలికెఁ ♦ జిత్త మలరఁగ. ౧౦

క. మన మీసేనల శీతల,వనముల ఫలరాజిఁ దగిన ♦ వనములకుం గై
కొనిచని యూథపులకు నొ,య్యన వేడుగఁ బంచియిచ్చి♦యరిభయదముగ.

---

* త్వత్సాహసేఽస్మదాదీనాం జీవనం దుర్లభమితి - అనువ్యాఖ్యాభిప్రాయ మిటఁ జేర్పఁ
బడినదని తెలియందగు.

క. గరుడాదిరూపములుగాఁ, బరఁగంగాఁ జేసి సిద్ధపడియుండదము భీ
కరమై లోకక్షయకర, ముగుతరమును నౌ భయంబు నూహింపంగన్.౧౧౫

క. కలుగం గలుగని తోఁచెడుఁ, దలఁపఁగ నది భల్లుక,హరిదానవవీరా
వళికి వినాశనమును ని,మ్ములఁ దెలిపెడు వీచెఁ బరుషముగఁ బవనుండున్.౧౨

చ. ధరణి వడంకుచున్నయది ధాత్రిధరాగ్రము లల్లలాడెడున్
దరువులు భూమిపైఁ బడెడుఁ దర్దయు భీకరనాద మొప్పఁగాఁ
బరుషతరాకృతుల్ గలిగి వారిధరంబులు శ్యేనముఖ్యభీ
కరతనువుల్ ధరించుచు జగత్ప్రళయంబును దెల్పఁజాలి నె
త్తురుచినుకుల్ గలట్టి గురుతోయముల్ గురియున్ నితాంతమున్. ౧౪

ఆ. సంధ్య యద్ది రక్తచందన మట్లుగాఁ
గాన నగుచు భీతికరముగాఁగఁ
జూడఁబడెడు నదిగో సూర్యమండలినుండి
పడెడు మండుశుచికబలము లట్టి. ౧౫ 1457

క. హీనములగు మృగపక్షులు, దీనాకృతు లొప్ప మిగుల దీనరవముల్
వీనుల కతిభయదమ్ములు, గా నొనరుచు చున్ సరోజకాంతుని కెదురై. ౧౬

తే. అఱచుచున్నవి; లయకాల మందువలెనె
చంద్రుఁడు నిశను తన ప్రకాశంబు మాని
యనుము నలుపును రక్తవర్ణంబు చివర
లందుఁ దగఁ గల్గఁ జేయుఁ దాపాతిశయము. ౧౭ 1459

క. పరివేషము హ్రస్వంబై, పరుషం బశుభ ప్రదంబు పరికింపంగా
నరుణతరాంతరమునునై, కరముం జూపట్టుఁ బ్రళయకాలవిధమునన్. ౧౮

క. కను సూర్యమండలంబున, దనుజా! నీలాంక మొక్కఁ డగపడియెడుఁ జ
క్కనితారలు మలినములై, మునుపటివలెఁ గాక నూత్నముగఁ గనఁబడెడున్.

క. ఈదుర్నిమిత్తములు గన, నేదో ప్రళయంబు జగతి కేతెంచెడు నాఁ
గాఁ దగియున్నవి చూడుము;, వేదికలను శ్యేనకాకవితతులు గ్రద్దల్. ౧౯*

తే క్రిందుగాఁ జేరుచున్న వీరీతి నక్క
లశుభనాదంబులను సాధ్వసావహంబు
లైన యొలుఁగులఁ జేసెడు దనుజ! యింక
వనచరుల్ పరివేష్టించి వచ్చుచుండ. ౨౦ 1463

చ. మన మిదె రావణుండును నమానుషశక్తిని నేలుటన్ జగం
బున నెదిరింపరాకయె యపూర్వమునై తనరారు లంకకుం

* కృష్ణరక్తాంశుపర్యంతో యథాలోకస్య సంక్షయే-అనియు.

జనుదము వేగ; యంచు గురు♦సత్త్వుఁడు వీరుఁడునై నరాముఁ డా
యనుజునితోడఁ బల్కుచు మ♦హాచలశృంగమునుండి యుప్పుడే. ౨౧½ 1464

క. ధరణికి దిగి ధర్మాత్ముఁడు, ధరణీశలలాముఁ డంతఁ ♦ దనసేనను నె
వ్వరికి నెదిరింపరాకయె, యసదుగఁ దగుదానిఁ జూచె ♦ నాగిరిక్రిందన్. ౨౩

క. కాలోచితకృత్యంబులఁ, జాల నెఱింగిన ఘనుండు ♦ క్ష్మాపతి తానున్
బోలఁగ సుగ్రీవుండును, నోలి మహాప్లవగసేన ♦ నుత్సాహమునన్. ౨౩½ 1466

క. తనరారఁ జేసి యుద్ధం,బునకున్ సమయంబువచ్చె ♦ భూరిబలమునన్
జనవలయునంచుఁ దానా,జ్ఞను జేసెను; దెల్లవాఱు♦జాము చనంగన్. ౨౪

క. ఘనబాహుండగు రాముఁడు, ధనువును ధరియించి ప్లవగ♦తల్లజు లెల్లం
దనచుట్టు బలసిరాఁగాఁ, జనె లంకాపురముఁ గూర్చి ♦ సరభసగతితోన్. ౨౫

క. దనుజేంద్రుఁడు సుగ్రీవుఁడు, హనుమంతుఁడు జాంబవంతుఁ ♦ డానీలుఁడు రా
మునివెంబడించి పోయిరి, వనచరవీరుండు నలుఁడు ♦ భల్లుకవిభుఁడున్. ౨౫½

తే. లక్ష్మణుండును బ్లవగబ♦లంబుతోడ
నరుగుదేరంగఁ జనియె; నా♦తరుణమందు
భల్లుకప్లవగంబుల ♦ బలము మిగుల
గొప్పదిగ మీఱి పెద్దదా ♦ క్షోణి నెల్ల. ౨౬½ 1470

తే. ఆవరించియె రాముని ♦ ననుసరించి
చనియెఁ; గుంజరదేహులై ♦ శత్రువార
ణమున నేర్పఱులైనవా♦నరవరు లొగి
శైలశృంగంబులను దరు♦జాలములను. ౨౭½ 1471

చ. కరములఁ దాల్చి రామనృప♦కాంతుని వెంబడిపోయి;రట్లు సో
దరులగు రామలక్ష్మణులు ♦ తద్బలముంగొని చాలసేపు త
ద్ధరమును డిగ్గి పోవుచును ♦ దానవనాథుపురంబుఁ జేరి రా
యరిబలసూదనుల్; నగర ♦ మయ్యెదియున్ ధ్వజపంక్తి గ్రాలఁగాన్. ౨౮

*క. కరము మనోహరమై సుం,దరముగఁ గనుపట్టు నుపవ♦నంబులతోడన్
బరఁగుచు నద్భుతతరమగు, వరణము ప్రాకారవరము ♦ భాసురరీతిన్. ౨౮½

సీ. పరఁగుచుండఁగ బహి♦ర్ద్వారంబు లొప్పంగనర్యభేద్యంబయి ♦ యమరులకును
దుర్ధర్షమై యుండెఁ ♦ దొలఁగక వానరుల్ రామునాజ్ఞనుబూని ♦ భీమరూపు
లయి తమచోటుల ♦ నరయుచు ముట్టడి సల్పిరి; గురుతర♦శైలకూట
మట్టు లున్నతమగు ♦ నాయుత్తరద్వారమును రాఘవుఁడు సోద♦రునినిగూడి

తే. ధనువుఁ దాలిచి సైన్యంబు♦లను దగంగఁ
గాచుచున్ ముట్టడించె; ని♦ష్కారణి వీరుఁ

---

* చిత్రవప్రాం సుదుష్ప్రాపా ముచ్చైః ప్రాకారతోరణామ్-అనియూ.

డైన రాముఁడు లక్ష్మణుఁ ♦ డనుచరుఁడయి
యుండ రావణుఁడున్నట్టి♦యుత్తరదిశ. ౩౩ 1474

క. కనుఁగొని లంకాపురమహి,మను జూచుచు ముట్టడించె; ♦ మఱి యాసురవీ
రుని కాపుదలను మించిన, ఘనమగునాద్వారమచటఁ ♦ గడుభయదంబై.

క. వరుణాధిష్ఠితమగు సా,గరమునవలెన్ వెలసి శస్త్ర♦కలితులును భయం
కరరూపులునగు రాక్షస, వరులెల్లం జుట్టుముట్టి ♦ పరిరక్షింపన్. ౩౪½ 1476

క. ఘనమై యుండుట నితరుల,కు నెవ్వరికి ముట్టడింపఁ ♦ గూడక భీతిం
గనఁజేయు చల్పబలులకు, దనుజాన్వితభుజగలోక♦తల్లజము వలెన్. ౩౫

క. కనన య్యె రాఘవున కొ,క్కనికిం దక్కంగ ధరణిఁ ♦ గన నితరులకున్
దనుజేంద్రపురిని దోర్బల, మున నిల్వఁ దరంబుగాదు ♦ ముందు నిలువఁగన్.

తే. రాముఁ డాద్వారసీమల ♦ రాక్షసభటు
లునిచి యున్నట్టి బహువిధా♦యుధసమూహ
ములను బహువిధకవచావ♦ళులను గాంచె;
నంత వీరుఁడు నీలుఁడు ♦ హరివిభుండు. ౩౭ 1479

క. తూరుపుద్వారంబునఁ దా, శ్రీరాముని నాజ్ఞను నిలి♦చియె యుండెను దు
ర్వారులు మైందద్వివిదులు, చేరి తనుం గొల్వఁ బ్లవగ♦సేనలతోడన్. ౩౭½

క. ఘనబలుఁ డంగదుఁ డంతట, వనచరవీరులగు గజగ♦వయులు గవాక్షుం
డును ఋషభుఁడు తనుఁ జేరం, గను యామ్యద్వారమందుఁ♦గావలియుండెన్.

క. బలవంతుఁడైన హనుమయు, నలఘుండు ప్రమాథి,ప్రఘసుఁ; డట్టిమహావీ
రులు పెక్కుమంది ప్లవగే,శులు తనుఁ గొల్వంగ మింటఁ ♦ జూపరు లలరన్. ౩౯½

తే. *పశ్చిమద్వారసీమను ♦ బలసియుండె;
నంతసుగ్రీవుఁ డాగరు♦డానిలసము
లైనహరివీరులం గూడి ♦ యతులరీతి
నడిమిగుల్మంబునం దుండెఁ ♦ గడఁగి యుంత. ౪౦½ 1483

క. హరియూథపతులవశమున, గురుబలులగు ముప్పదాఱు♦కోట్ల వనచరుల్
పురి ముట్టడించి వనచర, వరుఁ డున్నయెడన్ వసించి ♦ వఱలిరి ప్రాన్కన్.

క. రాముని యానతిఁ గైకొని, సౌమిత్రివిభీషణులు వె♦సన్ ద్వారములన్
దా మునిచిరి కోటినిగా, భీమకపీంద్రులను వేఱు♦వేఱుగఁ గడిమిన్. ౪౨½

క. ఉనిచిరి ముట్టడికై; రా,మునకుం బడమట సమీప♦మున సుగ్రీవుం
డును జాంబవంతుఁ బెక్కు,ర, వనచరసైనికులఁ గూడి ♦ బల ములరారన్.

తే. నడిమి గుల్మమునందుండెఁ; ♦ గడుబలాఢ్యు
లైన యువానరోత్తము ♦ లపుడు వంప్ర

* మధ్యమేచ స్వయంగుల్మే సుగ్రీవ స్సమతిష్ఠత-అనిమూ.

లోలయు వెలసెడు పెద్దపు♦లులను బోలి
తనుగిరీంద్రాగ్రములఁ గొని ♦ తలపడంగ. ౮౮ 1487
క. కనిపెట్టియుండి; రంతట, వనచరు లెల్లరును స్వీయ♦వాలంబులఁ బై
కిని జూపి నఖరదంష్ట్రలు, ఘనదివ్యాయుధము లట్లు ♦ గ్రాలుచునుండన్.
తే. ఆననంబులు వికృతంబు ♦ లై చెలంగఁ
గన్ను లతికోపమున నెఱ్ఱఁ♦గా వెలుంగ
నవయవంబులు బహుళవ♦ర్ణాంచితంబు
లై కనంబడ నుండి రా♦హవముఁ గోరి. ౮౯ 1489
క. కరిదశకబలులు కొందఱు, కరిశతబలయుతులు, వేయి♦గజములబలముల్
పరఁగం గొందఱు వనచర, వరులుండిరి; మఱియుఁ బ్లవగ♦బలమునయందున్.
సీ. ఓఘసంఖ్యకుఁ దగు ♦ నుగ్రద్వీపంబుల బలములు గల్గుకోఁ♦తులును, నోఘ
శతసంఖ్య కుపమయౌ ♦ శౌర్యంబుగల వనచరులు నింతింతని ♦ పరిగణింపఁ
దగ నంతబలముచేఁ ♦ దగువారు కొందఱున్నై యుండి; రాలంక♦యందు వారు
వరుస గుంపులుగూడ♦శరభముల్ శలభముల్ గుంపుగా నొక్కటఁ♦గూడునట్లు
గా భయంకరముగాఁ ♦ గను జిత్రముగనుండె వనచరభల్లూక♦వరులు చేరి
తే. యుండుటను; లంకచుట్టును ♦ నొప్పియున్న
వారిచే నిల కప్పంగఁ ♦ బడినయట్లు
పైఁబయింబడు వనచర♦పంక్తిచేత
నంబరము నిండినట్లుగ ♦ నగపడె నట. ౯౦ 1491
క. వనచరభల్లుకవరులట, మును పుంచినవారు గాక ♦ మునుకొని కినుకన్
జనుదెంచి కోటిసంఖ్యగ, ననికై ద్వారముల నెల్ల ♦ నలరిరి మఱియున్.
క. హరివరులు వేఱుగాఁ బెక్కురు వారికిఁ దోడ్పడంగ ♦ గోరి యచటికిన్
బరమముదంబున వచ్చిరి;, ధరణీధరం బద్ది ప్లవగ♦తతినిబిడంబై. ౯౧ 1493
చ. కనఁబడుచుండె; ద్వారములఁ ♦ గాంచి చెలంగినమీఁద ఖ్యాతిఁ గాం
చిన యొకకోటి వానరులు ♦ చేరి పురంబును నావరించి; రా
వనచరవీరు లిట్లు తరు♦వారము హస్తములందుఁ దాల్చి లం
కను దగ నావరింపఁ బురి ♦ గాలికినైనఁ జొరంగరానిదై. ౯౨ 1494
చ. తనరుచునుండె; భూరిజల♦దప్రతిమానతనూవిలాసులై
కనఁబడి శక్రవిక్రమము ♦ గ్రాలఁగ నొప్పుహరీశ్వరుల్ పురం
బును వడి నావరింపఁ గని ♦ పూర్వసురుల్ వెఱగంది; రప్పుడా
వనచరసేన రాఁగ గురు♦వార్ధిని దాఁటి జలంబురాఁగ నొ
ప్పునినద మట్లు గొప్పధ్వని ♦ పుట్టెను భూతభయంకరంబుగన్. ౯౩ 1495
తే. వరుణతోరణసంయుత♦పురవర మది, ధరణిధరకాననములతోఁ ♦ దత్తఱిల్లె
నామహాధ్వని; కంతఁ గీ♦శాధినాథ, రామలక్ష్మణపాలిత ♦ భీమబలము. ౯౪

క. సురలకు నసురులకైన నెదిరింపఁగా రాకయుండెఁ; ♦ ధీమంతుండా
ధరణీశ్వరుండు శ్రీరఘువరుఁ డిటు విడియించి ప్లవగ♦బలముల నెల్లన్. ౫౬

చ. దనుజులఁ జంపఁ బూని యిఁకఁ♦దా నొనరింపఁగ నర్హమైన య
ప్పని విషయంబు చక్కఁగను ♦ బండితమంత్రులతోడ దూఁతనుం
బనుపఁగ నర్హమం చరసి ♦ వాలికుమారుని దూతగాఁగఁ బం
పను వగ నిశ్చయించి బహు♦వారము లాత్మఁ దలంచి యంతటన్. ౫౭

క. జనకసుతాపతి సామా,దినిఖిలతత్త్వజ్ఞుఁ డౌట ♦ దివ్యనృపతిధ
ర్మనిచయమును స్మరియించుచుఁ,దనకుఁదిఁగృపపొడము వాలి♦తనయునిఁబంపెన్.

క. తనయట్టు లవ్విభీషణుఁ, డనుమోదము నొందఁ బిలిచి ♦ యంగదుతో ని
ట్లనియెన్; సౌమ్య! యంగద!, వనచరుఁడవుగాన నగర♦వరమున్ దీనిన్.

తే. శ్రమము లేకయె లంఘించి ♦ చనఁగఁగలవు
గాన భయ మించుకంత లే♦క దశవదను
పాలికిం బోయి నేను జె♦ప్పంగఁ బూను
నట్లు నాపల్కులుగఁ బల్కు ♦ మతనితోడ ౬౦ 1501

[1]శా. ఓరీ! రాక్షస! నీదుసంపదయు నీ♦యుర్వీశభావంబు నీ
ధీరత్వంబును నంతమొందె నిపు డే♦తెంచెన్ వినాశంబు నీ
భూరిస్వాంతబలంబు గూడఁ జెడియెన్ ♦ బో నీవు గర్వించి దై
త్యారిక్ష్మాసురమానివర్యులను య♦క్షాహీంద్రసంఘంబులన్. ౬౧ 1502

తే. అచ్చరల భూమిపతుల నె♦య్యెవిధముల
బాధలం బొందఁ జేసితో ♦ వాని కంత
కును ఫలంబుగ బ్రహ్మయి♦చ్చిన వరంబు
వలనఁ గల్గిన దర్పంబు ♦ విలయ మొందె. ౬౨ 1503

క. బుత మిది విను మిఁక భార్యా,హృతికైనేఁ గోపమొంది ♦ యిప్పుడు నిన్నున్
జతనంబున దండింపన్, మతినియతిం బూని శౌర్య♦మహిమం బలరన్. ౬౩

తే. ఈపురద్వారమున నిల్చి ♦ యిట్టులున్న
వాఁడనే; [2]నన్ను దండింప ♦ వచ్చుఫలము
నీకు నేమని యన్నచో ♦ నిన్ను నేనుఁ
జంపఁగా దాన నీపాప♦సమితి యడఁగు. ౬౪ 1505

క. సురమానివర్యధరణీ,శ్వరమును లేపదముఁ బొందఁ ♦ జాలుదు రీ వా
వరపదము నొందఁ గల విఁకఁ, త్వరితంబుగ రమ్ము పాప♦తతిఁ దొలఁగింతున్.

క. దనుజాధమ! యామారీ,చుని మాయను నన్ను మఱొక ♦ చోటికిఁ దొలఁగం
గను జేసియే మహాబల,మును నమ్మి మహీతనూజ♦మును దొంగిలితో. ౬౫

1 భ్రష్టశ్రీకగతైశ్వర్యమమూర్థోనష్టచేతన-అనిమూ. 2 ఏవంవిధస్య మమ నియమనేన తవ
కిం భవిష్యతీ త్యత్రాహ-అనివ్యాఖ్య.

క. కనఁబఱపుము మాయాబల,మును దానిన్ నేఁడు నాదు♦ముందఱ; నీవా
జనకజ నర్పించి ననుం, గని శరణముఁ జొరవయేని ♦ ఘనవిశిఖములన్. ౬౬
క. దనుజుం డీలోకంబునఁ, గన నొక్కఁడు లేకయుండఁ♦గాఁ గావింతున్
విను ధర్మబుద్ధి యీతఁడు, దనుజేశవిభీషణుండు ♦ తగున్యాయమునన్. ౬౭
చ. శరణముఁ జొచ్చినాఁడు గద ♦ శాశ్వతమౌచు నకంటకంబునై
పరఁగు సురారిరాజ్యమును ♦ భాస్వదనూనమదీయసంగతిన్
ద్వరితముగానె పొందు నిది ♦ తథ్యము మూర్ఖుఁడవై దురాత్ములౌ
సురరిపులే సహాయులయి ♦ ఘోరత నిన్గాలువంగఁ బాపివై. ౬౭½ 1510
చ. మనము వశంబుగాక యను♦మానసమున్నతమై తగంగ నొ
ప్పిన దనుజుండ వీ విఁకను ♦ బ్రీతిని నొక్కముహూర్తమైన నీ
ఘనతరరాజ్యసంపదలఁ ♦ గాదు దురాత్మక! పొంద శక్యమో
దనుజ! మదీయవాక్యమును ♦ దప్పకచేసిన నిన్నుఁ గాచెదన్. ౬౮½ 1511
క. హిత మిద్ది కాకయున్నన్, ధృతిమీఱఁగ శౌర్యమూని ♦ తెగి సంగరము
న్నతిఁ జేయుము నాశరముల,మృతిఁ గని పరిశుద్ధమతివి♦యే యగుదుఁసుమీ!.
క. దురితంబు లెల్లఁ దొలఁగును;, దురాత్మకా! యట్లుగాక ♦ తోఁచినరీతిన్
జరియింపఁ బక్షివై నీ, వరయ మనోవేగ మూని ♦ యఖిలజగములన్. ౭౦
తే. సంచరించిన నాదువీ♦క్షణపథమునఁ
బడి యనంతర మనువుల ♦ వదలకుండ
నుండఁ జాలవు; హితమగు ♦ నొక్కమాట
నీకుఁ జెప్పెద విను రజ♦నీచర! యిఁక. ౭౦½ 1514
చ. ధరణిని నొక్కరాక్షసుఁడు ♦ దక్కఁడు గావున నీకు నీవె యి
త్తరుణమునందె చేయఁదగు ♦ ధర్మములట్లపరక్రియావళుల్
జరపుకొనందగున్ మఱియు ♦ శ్మాస్థలిఁ జూడఁగఁ బోవుసద్ది యె
క్కరణిని లేదుగాన సరి♦గాఁ బురమంతయుఁ జూచుకొమ్మికన్. ౭౧ 1515
తే. నాకరంబున నున్నవి ♦ నీకుఁ బ్రియము
లైన ప్రాణము లిఁకనంచు ♦ నాడుమ వట
ననుచు నక్లిష్టకర్ముఁ డ♦య్యవనినాథుఁ
డనినఁ దారాతనూభవుఁ ♦ డంగదుండు. ౭౨ 1516
క. తనువు ధరించిన హుతవహుఁ, డన నాకాశమున కెగసె ♦ నా శ్రీమంతుం,
డనఘుఁడు తేజం బలరఁగఁ, జని క్షణమున దనుజనాథు♦సద్మము నొందెన్.
చ. దనుజవరేణ్యు మంత్రియుతుఁ ♦ దర్భవనంబునఁ గాంచె నంతఁ జ
క్కనిగతిఁ; గాంచనాంగదుఁడు ♦ కర్బురనాయకుముందు వ్రాలి యొ
య్యన జ్వలితాగ్నిరీతిఁ గన ♦ నై నిలుచుండెను స్వీయనామ మా
తని కెఱిఁగించి తానె యల♦దైత్యకులేశుఁడు వానిమంత్రులున్. ౭౪½ 1518

క. వినుచుండఁగ శ్రీరాముని, యనువాదము నెల్లఁ జెప్పి♦నట్టులె వినిపిం
పను బూని యిట్టులనియెన్;, దనుజేంద్రా! కోనలేశ♦తల్లజుఁ డగుచున్. ౨౬
సీ. అక్లిష్టకర్ముఁడై ♦ యలరు రాముని దూత నావాలిపుత్త్రుండ ♦ నంగదాఖ్యుఁ
డను నన్ను వినితివా; ♦ ఘనరఘుకులభూషణమ్ము కౌసల్యయా♦నందవర్ధ
నుఁడు నగు శ్రీరాఘ♦వుఁడు నీకుఁ జెప్పంగ దగుపల్కులం జెప్పఁ♦దలఁచె వాని
వినవయ్య! క్రూర! ప♦త్తనమును వెడలి నాయెదుటికి వచ్చి నీ♦వింక ననిని
తే. జేయుమీ? శూరుఁడవు కమ్ము ♦ న్యాయరీతి
నిన్నుఁ గొడుకుల జ్ఞాతుల ♦ నీదుబంధు
వులను మంత్త్రుల నేఁ జంపఁ ♦ దలఁచినాఁడ
మీకు నేనంతకుండఁ జు♦మ్మీ! దురాత్మ!. ౨౭ 1520
క. అనిమొన నీ విలఁ బడఁగా, విను ముల్లోకములు ప్రీతి ♦ వెలయ సుఖం బుం
దును; యక్షులు గంధర్వులు, దనుజులు త్రిదశులును మౌని♦తల్లజు లెపుడున్.
క. ఉరగులు సుఖముండుదు రె, త్తరుణంబుననైన వారి♦దారుణరీతిం
బరికించి యేఁచు నిను ని, త్తరుణంబునఁ జంపువాఁడఁ ♦ దథ్యము సుమ్మీ!.
క. నను సత్కరించి నాభా,ర్యను సీతను నప్పగించి ♦ యడుగులఁ బడవే
ని నిన్ను జంపి విభీషణు, దనుజమహారాజ్యవిభవ♦ధాము నొనరుతున్.
చ. అని వచియింపుమా! యనుచు ♦ నారఘురాముఁడు నన్నుఁ బంచె నం
చని యలయంగదుండు ప్లవ♦గాధిపుఁ డాడిన రాక్షసేశుఁ డా
య్యన ఘనకోప మందె నసు♦రాధిపుఁ డుగ్రరుడావిలాక్షుఁడై
దనుజుల మంత్త్రివర్యులను ♦ దాఁ గని వీని దురాత్ము దూతనున్. ౩౧ 1524
ఆ. పట్టుకొనుఁడు వీనిఁ ♦ గొట్టుఁడు చంపుఁడు, విడువ వల దటంచు ♦ విపులకోప
మడరఁ బెక్కుసారు ♦ లానతియిచ్చెను;, దాని నాలకించి ♦ తడయ కపుడు.
క. జ్వలితాగ్నితేజసులు దై,త్యులు భీకరతనులు నల్వు ♦ రొక్కట నాకోఁ
తులరాయనితనయుని ని, మ్ములఁ బట్టుకొనంగఁ; గూట♦మున నచ్చోటన్.
క. *వీరుండగు నంగదుఁ డతి, ధీరుఁడు గావునను యరిత♦తికిఁ దనబలమున్
నేరుపును జూపుటకుఁ దా, వారలు తనుఁ బట్టుకొనెడు ♦ భంగి నొనరిచెన్.
చ. దనుజుల హస్తయుగ్మమునఁ ♦ దాఁ బతగంబులరీతి నుంచుకొం
చు నపుడు పర్వతాకృతిని ♦ శోభిలు తద్భవనంబుమీఁదికిన్
దనవడి క్రాలఁగా నెగసె; ♦ దానవవీరులు వారు తజ్జవం
బున విదళింపఁగాఁ బడుచు ♦ బోరన నభ్రమునుండి యార్చుచున్. ౩౫
తే. [1]రావణుఁడు చూచుచుండఁగ♦నే వడిఁబడి;
రంత విక్రమశాలి యా♦యంగదుండు

* గ్రాహయామాస తారేయ స్వయమాత్మాన మాత్మవాన్-అనిమూ. 1 తతః ప్రాసాదశిఖరం శైలశృంగ మివోన్నతమ్-అనిమూ.

గిరిశిఖరమున వెలసి మి♦క్కిలిపొడవుగఁ
గ్రాలు ప్రాసాదశిఖరంబుఁ ♦ గాంచె మించి. ౭౭½ 1529

చ. వనచరుపాదఘాతమున ♦ వారక రావణుఁ డట్టె చూడఁగా
నని మును వజ్రభేదితము♦హాతుహినాచలశృంగమట్లు లో
య్యస నది బ్రద్దలయ్యె నిటు ♦ లాతఁడు దానిఁ బగుల్చి చక్కఁగాఁ
దనదగునామ మెల్లరకుఁ ♦ దా వినిపించి ధ్వనుల్ చెలంగఁగాఁ. ౭౯ 1530

క. ఉరవడి నింగికి నెగసెన్;, సురవైరుల కార్తిఁ బ్లవగ♦శూరులకు ముదం
బు రహిం గూర్చుచు శ్రీరఘు, వరపార్శ్వమునందు వ్రాలెఁ♦బ్లవగులనడుమన్.

క. దనుజేంద్రుఁడు ప్రాసాదం, బును భగ్నంబగుటఁ గాంచి ♦ భూరిక్రోధం
బును బొంది వీఁడొకం డ,య్యును నాబలమెల్ల శక్తి ♦ నోడించి వడిన్. ౮౧

చ. అరుగుచునున్నవాఁడు గద! ♦ యారయ నిట్టి బలాధికుల్ హరీ
శ్వరు లొకకొంద ఱట్లు తమ♦శౌర్యముఁ జూపఁగఁ బ్రాణయుక్తినేఁ
బరఁగుట యెట్లొ యంచుఁ దన♦భావిఫలంబును గూర్చి యూరుపుల్
వరుసగఁ బుచ్చె, నంత నిట ♦ వాలితనూజుఁడు రాఁగ రాముఁడున్. ౮౧½

ఆ. మోద మొంది సింహ♦నాదముల్ చేయువా
నరులు పెక్కుమంది ♦ వరుసఁ గొలువ
నరులఁ జంపఁ గోరి ♦ యనిఁ జేయఁగా నుండె
నచట నాసుషేణుఁ ♦ డధికబలుఁడు. ౮౨½ 1534

క. గిరిశిఖరాకారుండై, హరివీరులు కామరూపు ♦ లాదృతిఁ దన్నుం
బరివేష్టింపఁగ నుండెను;, బరజనదుర్ధర్షుఁ డతఁడు ♦ పతియానతిచేన్. ౮౩½

తే. తారకారాజిలో శశి♦ధరుఁడు తిరుగు
చుండునట్లుగఁ దిరుగుచు ♦ నుండె నాల్గు
ద్వారములఁ గాచుచున్; సము♦ద్రంబు చెంతఁ
బురమునుం జుట్టుకొని కపి♦వరులు పూన్కి. ౮౪ 1536

క. సరిగా నక్షౌహిణిశత, మరయఁగ నుండంగఁ జూచి ♦ యతిశయబలులై
పరఁగెడు దనుజేశ్వరు ల,చ్చెరువును గొందఱు భయంబుఁ♦జెంది రధీరుల్.

క. శూరులు కొందఱు సమరం, బేరీతిని నైనఁ జూడ♦నేయగు నంచున్
భూరిముద మంది రటఁ బ్రా,కారమునకుఁ బరిఖకుఁ గల ♦ త్ర్యౌస్థల మెల్లన్.

తే. వనచరావృతమై యుండ ♦ వానరమయ
మైన మఱియొకసాలము ♦ ట్లసురులకును
గానఁబడె; దీనులై యుంటఁ ♦ గర్బురు లవు
డతిభయంబున విస్మృతు ♦ లై తడఁబడి. ౮౭ 1539

క. పెలుచన హాహాకారం,బులు గావింపంగ భయముఁ ♦ బుట్టించురవం
బులు చెలఁగుచుండ లంకకు, గల శూరవరేణ్యులై న♦కర్బురు లంతన్. ౯౮॥

క. అనిసేయఁగఁ దగు పెనుసా,ధనముల ధరియించి ప్రళయ♦తరుణంబున నా
యనిలువిధంబునఁ దిరిగిరి; వనచరులకు భీతినొంది ♦ పౌరుష ములరన్. ౯౯

నలువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

### యుద్ధారంభము.

చ. దనుజులు రావణాసురుని ♦ ధామము చేరఁగఁ బోయి; రంత నా
వనచరయుక్తుఁ డౌచు రఘు♦వర్యుఁడు లంకను ముట్టడించె నం
చును దెలుపంగ; నాదితిజ♦శూరుఁడు లంకను ముట్టడించినా
రన విని క్రుద్ధుఁడై పురము ♦ నారయుకృత్యము లెల్ల నూటిగన్. ౧॥ 1542

తే. ద్విగుణముగఁ జేయఁగాఁ బంచి ♦ వినుతబలము
నరయఁ బ్రాసాద మెక్కి; యు♦ద్ధాభిలాషు
లగుచు లెక్కింప రాక యా♦హరివరు లొగిఁ
బురము నెల్లను గానన♦గిరివనముల. ౨॥ 1543

చ. అరుదుగ నిండియుంట నతఁ ♦ డంతటఁ గాంచె; మహీతలంబు నా
హరివరు లెల్ల మ్రింగునటు ♦ లత్తరుణంబున నుంటఁ గాంచి యొ
క్కరణిని పిరిమృత్యువును ♦ గాంచఁగఁ జేయఁగ నౌనటంచు నా
తుడుఁ డయి యెంచె; నిక్కరణి ♦ ధూర్తనిశాచరుఁ డాత్మలోపలన్. ౪ 1544

[1]క. చిరకాలము చింతించుచుఁ, బరుషత్వం బూని బుద్ధి♦పాటవమునఁ దా
నరుదుగ నతులుల విప్పుచు, హరియూథములన్ నరేంద్రు ♦ నచ్చటఁ గనియెన్.

చ. వనచరసేనలన్ గొనుచుఁ ♦ బార్థివవర్యుఁడు తాను బూర్వ ము
న్న నెలవువీడి యాదితిజ♦నాయకుప త్తనసాలసన్నిధిం
గనఁ జని సాధుగుప్తమయి ♦ కర్బురసంవృతమై చెలంగు లం
కను గొనియెన్; విచిత్రతర ♦ కమ్రపతాకమహాధ్వజాళిచే
తను సములంకృతంబయిన ♦ తత్పురముం గని [2]యార్తచిత్తుఁడై. ౬॥ 1546

చ. జనకజ నాత్మలోఁ గలఁచి ♦ నత్వరమే యిటులెంచె నక్కటా
జనకతనూజ యాహరిణ♦శాబవిలోచన నానిమిత్తమై
దనుజులు తన్నునొంపఁగ వె♦తం గడుఁగుందుచుఁ బస్తులుండి చి
క్కి నిరతమున్ బరుండి ధరఁ ♦ గేవల మార్తిని బొందు చున్నదే. ౮ 1547

1 స చింతయిత్వా సుచిరం-అనిమూ. 2 దూయమానేన చేతసా - అనిమూ.

చ. అని యిటు ధర్మచిత్తుఁడగు ♦ నారఘురాముఁడు పీడ్యమానయా
జనకజ నాత్మలోఁ దలఁచి ♦ చయ్యనఁ గ్రోధమహాగ్నినుండ నా
వనచరులన్ గనుంగొని జ♦వంబున శత్రువులన్ వధింపుఁడీ
యని యపుడాజ్ఞసేసె; నిటు ♦ లారఘురాముఁడు భీకరాత్ముఁడై. ౯ 1548

తే. ఆశ్రమంబున నేపని ♦ నైనఁ జేయఁ
జాలువాఁడౌటఁ దమకు నా♦జ్ఞనిడ వార
లొక్కరొక్కరి మీఱుచు ♦ నుగ్రరవము
లడర ననిసేయఁ బూని ర♦త్యంతనియతి. ౧౦ 1549

సీ. హరియూథపతులు శై♦లాగ్రంబులను వైచి కాని ముష్టుల గ్రుద్ది ♦ కాని రావ
ణాసురుఁ డేలు నీ♦భాసురపురమును బాదుసేయుదమని ♦ స్వాంతములను
దలపోసి రంత; వా♦రలు గొప్పశైలాగ్రముల శిఖరంబులఁ ♦ బెలుచ నెత్తి
కొనుచును బహుతరు♦కూటముల్ పెకలించిధరియించియును బ్రవి♦దారణంబు

తే. నొనరుపన్ సిద్ధపడి; రంత ♦ దనుజనాథుఁ
డట్టె చూచుచునుండ నా♦హరిబలములు
భాగములు పెక్కుగాఁ జీలి ♦ పార్థివునకుఁ
బ్రియముఁ గూర్ప సాలంబును ♦ వేగ యెక్కె. ౧౧ 1550

క. కనకచ్ఛాయల వక్త్రము, లనూనచిత్రంబుఁ గూర్ప ♦ నరుణచ్ఛాయల్
గనఁబడ వారలు శ్రీరామునికై ప్రాణముల వీడఁ ♦ బూని కరములన్. ౧౨

క. శిలలను సాలమహీజం, బులఁ దాళంబులను శస్త్ర♦ములుగాఁ గొని యు
జ్జ్వలశక్తి లంకపయికిం, బెలుచన చని, రాప్లవంగ ♦ వీరులు పూన్కిన్. ౧౩

చ. తరువులఁ బర్వతాగ్రముల ♦ దారుణముష్టుల నొంచుచున్ గడున్
బురవరసాలకూటముల ♦ భూరివనంబులఁ దోరణంబులన్
బరిపరి నుగ్గుచేసి; రల ♦ భల్లుకవానరు లంత మృత్తుచేఁ
బరిఖల నట్టె రమ్యతర♦వారిమయంబులఁ బూన్పఁ బూనుచున్. ౧౪ 1553

తే. దారుతృణములనున్ వైచి ♦ దారుణగతు
లొప్పఁగా వానిఁ బూడ్చి; ర♦త్యుగ్రశౌర్యు
లైన కొందఱు వానరుల్ ♦ పూని వేయి
మందితోఁ గోటితోఁ గొంత♦మంది కపులు. ౧౫ 1554

క. హరు లొకకొందఱు గడుభీ,కరశతకోటిప్లవంగ♦కాంతులతో నా
వరణము నారోహించిరి, కరివరసమకాయులైన ♦ కపివరు లవలన్. ౧౬ 1555

క. కనకమయతోరణంబుల, ఘనతరకైలాసశిఖర♦కల్పములయి చె
న్నునఁ దగుగోపురముల నొ,య్యనఁ జెందుచు సంతసమున♦నాడుచు మిగులన్.

తే. ఎగిరి గంతులు వైచుచు ♦ నిటునటు చరి
యించుచున్ బొబ్బలిడుచు నొ♦క్కించుకైన

భయములేకయె యాలంక♦పైకిఁ బోయి
రాకపులు కామరూపంబు ♦ లలరు చుండ. ౧౯ 1557

*క. వినుఁడీ సర్వోత్కృష్టులు,గను రాఘవులున్నవారు ♦ కపినాథుఁడు రా
మునికడ నుత్కృష్టుండై, తనరుచునున్నాఁడు భూమి♦ధవపాలితుఁడై. ౨౦

క. అని యిట్లు రవము లొప్పంగను లంకావరణమునకుఁ ♦ గడువడిఁ జని; ౪౦
దును వీరబాహులనలులను, వనచరయూథాధిపులు సు♦బాహువు కడఁకన్.

క. లంకాప్రాకారంబును, బింకం బలరంగఁ గూల్చ ♦ వెడలి సురారుల్
సంకటపడఁగా నిల్చిరి, యంకుశముగ రావణావ్వ♦యదిక్షమునకున్. ౨౨

తే. అంతియే గాక సేనల ♦ కర్థ్వ ములగు
వసతు లేర్పాటు గావించి ♦ వారి వ్యూహ
ములుగ నిల్పిరి; కుముదుఁడు ♦ బలముపొంగ
విజయశీలురుగాఁ దగు ♦ వీరకపులు. ౨౪ 1561

సీ. పదికోట్లు గొలువంగ ♦ భవుదిక్కునుండి ప్రాగ్ద్వారంబు గాపాడు♦తలఁపుఁబూని
నిలిచెను; బ్రఘసుండు ♦ నిర్భరశౌర్యుఁ డాపనసుండు వానర♦బలముతోడ
నాకుముదునకు స♦హాయంబు చేయంగ నందె యుండిరి; వీరుఁ ♦ డతిబలుండు
నగు శతవలి యప్పు ♦ డాగ్నేయముననుండి దక్షిణద్వారమ్ముఁ ♦ దాను గావ
నిరువదికోట్ల క♦పీంద్రులతోఁ గూడి యావరించి చెలంగె; ♦ నాసుషేణుఁ

ఆ. డధికబలుఁడు పితయు ♦ నాతార కాతఁడు, షష్టికోటికీశ♦సత్తములను
గొనుచు నసురకోణ♦మునుండి పశ్చిమ,ద్వార మావరించి ♦ తాను నిలిచె.

క. బలవంతుఁడైన రాఘవుఁ, డలఘుబలోపేతుఁడైన ♦ యాసౌమిత్రిం
గలిసి యుదీచీద్వారము, బలిమిని దా నావరించి ♦ వఱలెన్ మిగులన్. ౨౭

క. వనచరపతి సుగ్రీవుం, డనిలునికోణంబునుండి ♦ యారాఘవుతో
డను నిల్చె; భీమదర్శనుఁ, డనూనకాయుండు నౌ గ♦వాక్షుం డంతన్. ౨౮

తే. ఒక్కకోటి గోలాంగూలు ♦ లొప్పుచుండ
వీర్య మొప్పంగ నారఘు♦వీరుపార్శ్వ
భాగమున నిల్చె; శత్రుని♦బర్హణుండు
బలయుతుఁడు ధూమ్రుఁ డొకకోటి♦భల్లుకములు ౨౯ 1565

క. తనుఁ గొల్వ రాముపార్శ్వం,బున నుండెను; వీర్యము బల♦మును బొంగఁగఁ జ
క్కని కవచంబును దాలిచి, ఘనుఁడైన విభీషణుండు ♦ గదఁ గైకొన్. ౩౦

తే. అనికి నాయత్తుఁడై సచి♦వాళిఁ గూడి
రామచంద్రునికడనుండె; ♦ భీమబలులు

* జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః - అనిమూ. ఈశ్లోకము సుందరకాండమునఁ గొన్నిపర్యాయములు ప్రయోగింపఁబడినది ఇందును జెప్పఁబడియె. కాన నిది వాల్మీకిమహర్షికవిచంద్రునకుఁ బ్రీతిపాత్రమని తోఁచును. ఇంతకన్న రామవిషయకకీర్తన మేమిగలదు ?

గజగవాక్షులు గవయుండు ♦ గంధమాద
నుండు శరభుండు కపిసేన ♦ లుండుచోట్ల. ౩౧ 1567

క. నిరతము తిరుగుచు వారలఁ, బరికించుచుఁ గాచుచుండ; ♦ వానరవీరో
త్కరములు విడియుటఁ జూచి య,సురరాజగు రావణుండు♦శూరతమెఱయన్.

క. దారుణకోపంబున భట,వారములం గాంచి వేగ ♦ బవరము సేయన్
మీరలు వెడలం దగునని, వారికి నాజ్ఞనిడె; విభుని♦వాక్యము వినుచున్. ౩౨

ఆ. ఆనిమేషముననె ♦ యతిభయంకరసింహ,నాదముల నొనర్చి ♦ నైజకోప
ములను జూపి రంత ♦ లలితశశాంకబిం,బంబుపగిది శుభ్ర♦వక్త్ర మలర. ౩౩

సీ. భయదనాదమ్ములఁ ♦ బర్వఁగాఁ జేయుచు వెలయు భేరుల నల్గ♦శల దనుజులు
మునుముందు గొంపోయి♦కనకకోణంబులవాయింప మ్రోగెను;♦భయదరూపు
లగుదానవులులక్ష♦లుగఁ గూడి ముఖవాయువులను బూరింప ను♦జ్జ్వలరవముల
శంఖముల్ మ్రోసె; రా♦క్షసులెల్ల నాభరణాళికాంతులు గల♦యంగఁ బర్వ

తే. నసితతనువులతో శంఖ♦విసరములను
దాల్చి యుండుట విద్యుద్వి♦తతులతోడఁ
*గొంగపిండులతోడను ♦ గూడియున్న
జలదములరీతిఁ గ్రాలిరి ♦ సైన్యమందు. ౩౬ 1571

చ. దనుజవిభూత్తముండు భట♦శల్లజవారము సంగరంబు సే
యను బురికొల్ప సంతసము ♦ నందుచు నాలయకాలమందుఁ బెం
పునఁ జెలరేగు నాభయద♦భూరిసముద్రపయఃప్రవాహ మ
ట్లనుపమశక్తిధైర్యముల ♦ నప్పుడె పోయె మహోర్భటుల్ తగన్. ౩౭ 1572

చ. వనచరు లంత నామలయ♦భవ్యతటంబులు సానువుల్ గుహల్
స్వనముల నిండునట్లు పలు♦సాగులు భీకరనాదముల్ కడున్
దనర నిగుడ్చి; రాపిదప ♦ దానవవీరులశంఖసింహని
స్వనముల దుందుభిధ్వనులఁ ♦ బ్రద్దలువాఱె ధరాంతరిక్షముల్. ౩౮ 1573

క. కరిఘీంకారంబులతోఁ, దురగమహాహేషితముల♦తోడ శతాంగో
త్కరనేమిఘోషములతో, సురరిపునాదములతోడ ♦ క్షోణియు దివియున్.

క. వననిధులును ఘోషిల్లఁగఁ, దనరెఁ బ్రపంచంబు మిగుల♦ధ్వనిమయముగుచున్
దనుజామరులకుఁ బోలెన్, వనచరదానవుల కంతఁ ♦ బవరం బయ్యెన్. ౪౧

చ. దనుజులు భీకరాంగములఁ ♦ దద్దయుఁ బొల్చుచు శౌర్యసారమున్
వనచరపంక్తికిం దెలియఁ ♦ బ్రల్లదముల్ కడు నాడుచున్ ద్యుతుల్
గనఁబడ నొప్పు పెన్గదల ♦ వానరులం బ్రహరించి రుగ్రశ
క్తి నికరశూలజాలములఁ ♦ దీవ్రపరశ్వధసంహతిం దగన్. ౪౨ 1576

* సబలాకా ఇవాంబుదాః - అనిమూ.

క. [హరివీరు లుగ్రశౌర్యము, పరులకుఁ గనఁబడఁగ నంత ♦ బవరంబునఁ గ
ర్బురులం గొట్టుచు శ్రీరఘు, వరుఁ డతిబలశాలి దుష్ట♦వైరులయెడఁదుఁడున్.

క. బలవంతుఁడైన లక్ష్మణుఁ, డిల సర్వోత్కృష్టు లగుచు ♦ నెనఁగుచునున్నా]
రల కపిపతిసుగ్రీవుం, డలఘుబలుం డున్నవాఁ ♦ డహార్యవిభవుఁడై. ౪౩

క. అని గట్టిగ నార్చుచు నా, దనుజులపైఁ బడిరి; ఘోర♦తనులౌ కపు లో
ఘునకీర్తిరాజా! యుర్విని జయజయ యనుచు రాము♦వినుతించు చనిన్.

క. తమనామవిక్రమాదుల, నమరారులయెదుటఁ బొగడి ♦ యతివేగముగా
ద్రుమముల గిర్యగ్రంబుల, సమధికబల మలరఁ గొట్టి ♦ శాతనఖములన్.

ఆ. దంతములను వారిఁ ♦ దక్షిణ మలయించి, రంత భయదరూపు♦లౌ దనుజులు
ప్రబల గర్వమలరఁ ♦ బ్రాకారగతులయి, శూలఖడ్గభిండి♦వాలములను. ౪౫

క. ధరణి గతులైన యన్యన, చరులం బరిమార్చి; రంత ♦ త్వాష్ట్రలిఁ దగునా
హరివరులు గోపముం గొని, త్వరపడి వరణాగ్రములకుఁ ♦ దా మెగిరి తగన్.

చ. దనుజులు నందు నిల్చి శమము ♦ దారుణరీతిని గొట్టువారి మే
దినిఁ బడఁద్రోసి; రత్తఱిని ♦ హృష్టమహాసురకీశవీరజా
లనియతసంగరంబు తుము♦లంబయి శోణితమాంసపంకమై
కనుఁగొన నద్భుతంబగుచుఁ ♦ గ్రాలెను సాటియె లేక యుగ్రమై. ౪౭ 1583

నలుబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౪౩ - వ సర్గము.

కపిరాక్షసులకు ద్వంద్వయుద్ధము.

చ. అనుపమధైర్యసారులగు ♦ నాహరివీరులు ఘోరసంగరం
బును నొనరించుచుండఁ గని ♦ పూర్వసుపర్వులు దారుణాగ్రహం
బును గని; రంత సాధ్వసముఁ ♦ బుట్టెడు కార్యము లెల్లఁ జేయునా
దనుజులు రాక్షసోత్తము లు♦దారజయంబును గోరి చేసిరిన్. ౧ 1584

సీ. కనకశేఖరములఁ ♦ గ్రాలునశ్వంబులు వహ్నిశిఖోపమ♦ధ్వజవితతులు
దపనసంకాశర♦థవ్రజంబును జారు కవచాళి భాసిల్లఁ♦గా దెసలను
ధ్వనులచే నింపుచు ♦ ననిఁ జేయవెడలిరి భూరివానరసేన ♦ భూమిపతికి
విజయమ్ముఁ గోరుచు ♦ వేగమ కామరూపులగు నా రాక్షస♦బలములఁ గని

తే. తలపడియె; రెండుబలములు ♦ కలహకాంక్ష
నొండొరులమీఁదికిం జను♦చుండ నడుమ
ద్వంద్వయుద్ధంబు చెల్లెఁ; ద♦ద్దయును దేజ
మలరు నాయింద్రజిత్తు దో♦ర్బలము మెఱయ. ౨ 1585

క. వాలితనూజుని నంగదుఁ, శూలిన్ మార్కొనినయముని♦చొప్పున శక్తిం
గ్రాలుచు మార్కొని సంగర, మోలిం గావించె నద్భు♦తోత్సాహమునన్.

క. అని నెవ్వరికిని నోర్వం, గనుజాలని విక్రమంబు ♦ గల్గి మెఱయుచున్
దనుజేంద్రుఁడౌ విభీషణు,మనమునకుం బ్రియముసేయు♦మాన్యుఁడుఘనుఁడున్.

తే. ఐన సంపాతి యా ప్రజం♦ఘాఖ్యుఁ డనెడు
దనుజు మార్కొనె; మారుత♦తనయుఁ డప్డు
జంబుమాలిని బొలియింప ♦ సాగి మారు
కొనియె; నంత విభీషణుం♦డును జవమున. ౭ 1583

క. అతిశయమగు కోపంబున, నతిదారుణ వేగుఁడైన ♦ యామిత్రఘ్నున్
జతనంబున మార్కొనియెన్, బ్రతిలేనిబలంబు మిగుల ♦ భాసిలు గజుఁడున్.

క. అని చేసెఁ దపనుఁడను నొక, దనుజునితో; భూరిశక్తి♦ధాముఁడు నీలుం
డను ప్లవగుండు నికుంభునిఁ, గని తలపడియెన్ బ్లవంగ♦కాంతుం డంతన్. ౯

సీ. ప్రఘసుఁడన్ దనుజేంద్రు ♦ పైకి లంఘించెను; సిరిగల్గులక్ష్మణుఁ ♦ డరినిషూద
నుండు విరూపాక్షు ♦ ఖండింపఁగాఁ బోరె; దుర్ధర్షుఁ డగ్నికే♦తుండు రశ్మి
కేతుఁడు సుప్తఘ్నుఁ ♦ డాతతబలశాలి యగు యజ్ఞకోపుండు ♦ నను నలువురు
దనుజులు కలియ నా♦జనకజానాథుండు వారిమార్కొని నిల్చె; ♦ వజ్రముష్టి

తే. యనెడు దానవుఁ డలమైందు ♦ నాద్వివిదుని
నంత నశనిప్రభుండును ♦ నసురవరుఁడు
మారుకొని రాకపీంద్రులు ♦ వారిఁ జంపఁ
బూని తలఁపడి రాహవ♦మునఁ జెలంగి. ౧౨ 1591

క. వీరుఁడు రణదుర్ధరుఁడును, ఘోరాకారుండు నైన ♦ కుమతిప్రతపనుం
డారసి దారుణవేగుం, డై రంజిలు నీలుతోడ ♦ ననిఁ గావించెన్. ౧౩ 1592

క. ఘనబలుఁడు ధర్మపుత్త్రుఁడు, ననఘుండును నొ సుషేణుఁ ♦ డావిద్యున్మా
లిని గదిసి సంగరంబును, నొనరిచెఁ భయదాంగులగుచు ♦ నొప్పువనచరుల్.

క. తక్కిన దనుపుత్త్రులతోఁ, బెక్కు తెఱంగులను బాహు♦విక్రమ మలరన్
జక్కఁగ రణ మొనరించిరి, మిక్కిలి జయకాంక్ష లెదల♦మిగులఁబయిపయిన్.

తే. అప్పు డచ్చట వీరులౌ ♦ హరిదనుజుల
కరయఁగా రోమహర్షణ ♦ మైన తుముల
సంగరంబయ్యె; నాఘోర♦సంగరమున
దనుజనివహాంగములనుండి ♦ దారుణగతి. ౧౬ 1595

తే. *కచములే పచ్చికలుగాఁగ ♦ గాత్రసమితి
కాష్ఠసంచయములుగాఁగఁ ♦ గడఁగి రక్త

---

* హరిరాక్షసదేహేభ్యః ప్రభూతాః కేశశాద్వలాః-అనిమూ.

నదులు విస్తారముగఁ బాఱెఁ ♦ బొదలుకోప
మున మనం బుగ్రమై తగ ♦ ననిని వేడ్క. ౧౭ 1596

క. సురపతి వజ్రంబును గొను,కరణి గదంబూని శత్రు♦కాండమ్ముల ని
ర్భరశక్తిఁ జెండు సంగదు, హరివరుఁ గని యింద్రజిత్తు ♦ హర్షోత్సవంబునగన్.

క. అని సేయుదువే యిఁక నిట, ననుచుం బ్రహరించె; వేగ ♦ మరల సిరిదగన్
దనుజేంద్రనందనుని నిం,ద్రునినునుమఁడు కాంచి చాల♦ధూర్తుండగుచున్.

ఆ. కనకచిత్రితాంగ♦కలితమగు రథమును
హరులతోడ గడపు ♦ నతనితోడఁ
జూర్ణముగ నొనర్చె; ♦ శోభిల్లు నాప్రజం
ఘుఁడు శరత్రయంబుఁ ♦ గూర్చి మించి. ౧౯ 1599

క. వనచరపతి సంపాతినిఁ, గని నొప్పింపంగ నతఁడు ♦ కవిసి యతనిపై
నినుమద్దివృక్షపాతం,బునఁ గూల్చెను ఖేచరాళి ♦ పొగడుచు నుండన్. ౨౦

సీ. అధికబలోపేతుఁ ♦ డాజంబుమాలియు నరదంబుపై నుండి ♦ యాగ్రహంబుఁ
గొని రథగతశక్తిఁ ♦ గొని హనుమంతుని వక్షంబు భేదించె; ♦ వాయుతనయుఁ
డాజంబుమాలిపై ♦ నాగ్రహంబున వేగ యరదంబు మీఁదికి ♦ నట్టె దాఁటి
యఱచేత నవ్వాని♦యరదంబునుం గొట్టి భయదమగుచుండగు♦ప్రతపనుండు

ఆ. భయదగర్జనములఁ ♦ బాఱెను నలుమీఁది
కట్లు పోయి యతఁడు ♦ హస్తలాఘ
వమున మించి తీక్ష్ణ♦బాణత్రయంబున
గాత్రములను జెండఁ ♦ గాఁ జెలంగి. ౨౩ 1601

క. దనుజుని నేత్రంబుల నొ,య్యన నలుఁడుం బెఱికివైచె; ♦ నాసుగ్రీవుం
డును సేన నెల్ల మ్రింగ వ,దనముల్ విస్తృతి నొనర్చి ♦ తనరెడు వానిన్.

తే. ప్రఘసుఁడనువాని సప్తప♦ర్ణద్రుమమునఁ
గొట్టి పరిమార్చె; నితరుల♦కున్ వధింప
రాని యాయగ్నికేతువు ♦ రశ్మికేతు
వలరు సుప్తఘ్న యజ్ఞకో♦పులు గడంగి. ౨౫ 1603

క. మనుజేంద్రు రామచంద్రునిఁ, గని శరములనొంచి; రతఁడు ♦ కనలి నలువురన్
దనుజుల నగ్నిశిఖోపమ,సునిశితశరములను బూని ♦ సొంపుదలిర్పన్. ౨౬

ఆ. ఒక్కసాయకమున ♦ నొక్కనిశీర్షంబుఁ
గొనియె నిట్లు దనుజ♦కూట మడఁచి
చెలఁగె; మైందుఁ డట్టె ♦ కలన నావజ్రము
ష్టిని స్వముష్టిఁ బొడువ ♦ దనుజుఁ డతఁడు. ౨౭ 1605

క. అరదముతో వాజులతోఁ, బురమున నలరారు కోట♦బురుజుపగిది నా

ధరణిం గూలెను; సూర్యుఁడు, కిరణంబుల మేఘపంక్తి ♦ గెలఁకువిధమునన్.

క. అనిని నికుంభుఁడు నీలాంజనచయసంకాశుఁ బ్లవగ ♦ సత్తము నీలున్
సునిశితమార్గణముల నొంచెను; కరలాఘవము చాలఁ ♦ జెలఁగన్ మఱియున్.

క. శరశతము నీలుపైనన్, బరఁగించుచుఁ జూచి నవ్వి, ♦ బవరంబున నా
హరివరుఁడు విష్ణుమూర్తికి, సరియగువాఁడౌట దనుజ♦శౌర్యముఁ గనుచున్.

తే. ఆనికుంభునిరథచక్ర ♦ మట్టికొనుచు, నతనిసారథితలఁ ద్రుంచెఁ ♦ నంతనతని
వజ్రసన్నిభ దేహసం♦స్పర్శముగల, ద్వివిదుఁడను వానరేంద్రుండు ♦ తీవ్రశక్తి.

చ. దనుజులు చూచుచుండఁగనె ♦ దాఁ గ్రుధ నాయశనిప్రభున్ గనుం
గొని గిరిశృంగ మూని యనిఁ ♦ గొట్టెను; వాఁడును బర్వతంబులన్
జెనఁగెడు నాకపీంద్రుఁ గని ♦ వింతగ వజ్రసమానబాణముల్
ధనువునఁ బూని వైచి తదు♦దాత్తశరీరముఁ జించె నేర్పునన్. ౩౨॥ 1610

చ. శరములు మేను నొంప హరి♦సత్తముఁ డెంతయు నొచ్చి యాగ్రహ
స్ఫురణమునన్ దపించి యొక♦క్షోణిరుహంబును సాలనామమున్
గరమునఁ బూని యశ్వరథ♦సంయుతుగా వడిఁ జంపె నాతనిన్;
వరరథసంస్థుఁడై దనుజ♦వర్గము తన్గని సంతసింపఁగన్. ౩౩॥ 1611

క. కనకాంచితమార్గణములఁ, గొని విద్యున్మాలి ప్లవగ♦కులేంద్రు సుషే
ణుని నొంచి మాటిమాటికి, ఘనసింహనినాద మట్టి ♦ కావించె ననిన్. ౩౪॥

సీ. అంత వానరనాథుఁ ♦ డాసుషేణుఁడు రథమందునుండిన యల♦యసురుఁగాంచి
తాఁగ్రిందనుండుటఁ ♦ దలపోసి పెనుగొండ శిఖరంబువైచి వి♦చిత్రమైన
తద్రథంబును జెండెఁ; ♦ దనుజుఁ డాతఁడు లాఘవముగలవాఁడౌట♦వైళమఁ గద
గరమున ధరియించి ♦ యరదంబుపైనుండి ధరణికి లంఘించి ♦ తాను నిలిచెఁ;

తే. కపివరుండౌ సుషేణుండు ♦ కనలి మదిని
పెనుశిలంగొని వెసవెస ♦ దనుజుపైకిఁ
జనియె; నిటువచ్చు వనచర♦సత్తముఁ గని
యతనివక్షము నొంచె గ♦దాభిహతిని. ౩౫॥ 1613

చ. దనుజగదాప్రహారమును ♦ దా మది నెన్నక యాసుషేణుఁ డా
యనిమొన వానివక్షమున ♦ నాశిల వైచె; మహోపలంబుతాఁ
కునఁ గడు నుగ్గునూచమయి ♦ కుండఁగ వక్షము ప్రాణపంచకం
బును విడనాడి నేలఁబడెఁ; ♦ బోరున శూరకపీశ్వరాళిచేన్. ౪౦॥ 1614

క. దనుజులు విక్రమములఁ బొల్చినవారయి ద్వంద్వయుద్ధ♦జృంభణమున నా
యనిమిషులచేత దైత్యుల, యనువునఁ జంపంగఁ బడి ర♦హార్యబలమునన్.

సీ. ఖడ్గముల్ తోమర♦గదలును శక్తులు పట్టసములు గడు♦భగ్నములయి
యరదముల్ విఱిగి యు♦ద్ధార్హఘోటకములుహతములై మదకరు♦లంతమొంది

వనచరాక్షసుల్ ♦ పడిపడి నిలఁ గూలి చక్రాక్షయుగదండ♦సమితి నేలఁ
బడి, నక్క లెల్లెడం ♦ గడఁగి నిండియుండ నాయోధనంబది ♦ యతిభయావ
తే. హంబుగానుండె; దేవాసు♦రాహవోప,మానమగు నారణంబున ♦ దానవకపి
తతుల మొండెములం దెల్ల♦తావులందు,నెగిరిపడుచుండెనదిఘోర♦ముగఁగనఁబడె.

చ. వనచరు లందు దమ్ము నిటు ♦ వారక చంపుచునుండ దానవుల్
తనువుల రక్తపూరములు ♦ దారుణరీతిని బాఱుచుండఁ జ
క్కనిబలమిచ్చు సంధ్యకయి ♦ గాఢరయంబున నిక్కచూచుచుఁ
బెనుబవరంబు నొక్కగతి ♦ విక్రమమేది యొనర్చుచుండఁగాఁ. ౪౬ 1617

నలువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౪౪ - వ సర్గము.

వానరదానవులరాత్రియుద్ధము.

క. ఖరకరుఁ డస్తాచలమున, కరిగెను నంతటను వనచ♦రావళిప్రాణో
త్కరములఁ దీయఁగఁ దగురా,త్రి వచ్చెను; వనచరేంద్ర♦దితిజులు పెలుచన్.

ఆ. ఒకరి నొకరి నొంచు ♦ నుత్సాహముల బద్ధ
వైరు లగుచు మిగుల ♦ ఘోరరూపు
లగుచు జయముఁ గోరి ♦ యప్పుడు పోరాడు
చుండ నద్ది రాత్రి ♦ యుద్ధమయ్యె. ౨ 1619

క. వనచరులు రాక్షసుండని, వనచరునిన్, రాక్షసులును ♦ వనచరుఁడని యా
దనుజుని నాఘోరతమ,స్సునఁ దెలియక కొట్టుకొనిరి ♦ శూరత్వమునన్. 3 1620

తే. చంపు మాతనిఁ జీల్చు మి♦చ్చటికి రమ్ము
పాఱఁగా నేల యని యిట్లు ♦ భయదరీతిఁ
గ్రాలు నాచీఁకటిని నొక్క♦గతిని దుముల
మైన పెనురవమే విన ♦ నయ్యె మిగుల. ౪ 1621

క. తనువులు నల్లనివై తగఁ, గనకాంచితకవచములను ♦ గ్రాలు దనుజు లె
ల్ల నిశన్ మండెడుగతి నొ,ప్పిన *నోషధివనయుతాద్రి♦బృందములవలెన్. ౫

క. కనుపట్టి; రంత దానవు, లనంతమగు నాతమస్సు ♦ నందుఁ బెనుక్రుధం
గొని మనములు పరవశములు,గ నొప్పఁగా సత్వరముగఁ ♦ గపిజాలములన్.

ఆ. తనివి దీఱఁ దినుచుఁ ♦ దత్సమరాంగణం
బునఁ జెలంగుచుండ; ♦ భూరికోప
మొంది కోఁతు లంత ♦ నురవడి నెగయుచుఁ
దీక్ష్ణదశనములను ♦ దీటుకొలిపి. ౬ 1624

---

* శైలేంద్రా దీప్తౌషధివనా ఇవ-అనిమూ.

క. కనకశిరోభూషణములఁ, గనుపట్టు మహాతురంగ♦కాండంబుల నా
యనలజ్వాలలగతి నొ,ప్పిన కేతనములను జీల్చి ♦ పృథివిన్ వైవన్. ౭ 1625

క. కనఁబడియెన్ ఘోరంబుగ;, వనచరు లతిబలులు క్రుధను ♦ బరవశు లగుచున్
ఘనకుంజరముల వానిప,యిని నెక్కినవారిఁ గొట్టికి ♦ యీడ్చి ధరఁబడన్. ౮

తే. ధ్వజపతాకాంచితరథవి♦తతిని గూల్చి
సంగరంబున రాక్షస♦సైన్యములను
గలఁచి పుచ్చిరి; రామభూ♦కాంత లక్ష్మ
ణులును దద్యుద్ధమున బలం♦బులు మెఱయఁగ. ౯ 1627

తే. చీఁకటిని జక్కఁగాఁ గాన♦రాక యున్న
దనుజవర్యులఁ బెక్కండ్ర ♦ దారుణాహి
సమశరంబులు వైచుచుఁ ♦ జంపి; రంత
హయఖురవ్యూహవిధ్వస్త ♦ మగురజంబు. ౧౦ 1628

క. గురురథనేమివిఘట్టన,జరజంబు కపీంద్రదనుజ♦సమితిశ్రవణాం
తరనయనంబుల నిండెను;, బరికించెడువారి కిట్లు ♦ భయదం బగుచున్. ౧౧

తే. గగురుపాటు పుట్టించుచుఁ ♦ గలన సాగు
చుండఁ గడుభయదంబులై ♦ యొప్పురక్త
నదులు ప్రవహించె నచ్చోటఁ ♦ బిదప భేరి
కామృదంగాళిపణవభీ♦కరరవములు. ౧౨ 1630

క. ఘనశంఖవేణుముఖని,స్వనములు తోడ్తోనఁ గలిసి ♦ సాంద్రంబుగ నొ
ప్పెను వింతగాఁగ; నంతట,వనచరహతులొచు దనుజ♦భటు లార్వంగన్. ౧౩

క. దానవహింసితులై యా,వానరు లార్వంగ వారి♦ధ్వనులు చెలంగెన్
మానసభయదములగుచున్, దానవభటశక్తిశూల♦తతులన్ బెలుచన్. ౧౪

ఆ. మఱి పరశ్వధముల ♦ నఱిమిఱి హతులయి
యిలను గూలు వనచ♦రులును, వనచ
రేంద్రు లట్టి వైచు ♦ నిద్ధభూభృచ్ఛృంగ
సంహతాంగులగుచు ♦ సమరభూమి. ౧౫ 1633

తే. పొదలుచున్నట్టి కామరూ♦పులగు దనుజు
లుండఁగా బహువిధముల ♦ నొప్పు నాయు
ధములు పూవులు చల్లిన ♦ ట్లమర నద్ది
తెలియఁగా రాక భయదమై ♦ వెలసె నపుడు. ౧౬ 1634

క. అరుదుగ నెత్తుటఁ దోఁగుచు, బురుదగనుండుటను జొరఁగఁ ♦ బోలకయుండెన్
బరితో ఘోరంబయి యా, హరిదానవహారిణియగు ♦ నారాత్రి కడున్. ౧౭

క. అలకాళరాత్రివడువున, బలువిధముల సకలజీవ♦వారంబులకున్

విలయకరంబై యొట్లిది, మెలమెల్లన గడుచునో యను ♦ మిక్కిలిభీతిన్. ౧౬॥
క. కలిగించె; దారుణంబుగ, వెలసిన యాతమసునందు ♦ విడువక బాణం
బుల వర్షము కురియించుచు, బలువిడి యారాముచంద్రుపైఁ ♦ బడి రసురుల్.
చ. దనుజులు క్రోధవేగమునఁ ♦ దద్దయు నార్చుచు రామమూర్తిపైఁ
జనునపు డాస్వనంబు లయ♦సంగతిఁ బొంగెడు సప్తవార్ధిని
స్వనమువలెన్ వినంబడియె ♦ సాధ్వసదంబయి; రామచంద్రుఁ డా
దనుజులలోన నార్వురను ♦ దారుణవహ్నిశిఖోపమంబులౌ
ఘనశరముల్ నిగుడ్చి వెఱఁ♦గందఁగఁ జేసె క్షణంబులోపలన్. ౧౯॥ 1638
సీ. అని దురాధర్షుఁడౌ ♦ యమశత్రు, వామహాపార్శ్వమహోదరుల్ ♦ ప్రబలుఁడైన
వజ్రదంష్ట్రుండను♦వాఁడు మహాకాయుఁ డాశుకసారణు ♦ లట్టి మున్ను
పలికిన యార్వురు ♦ పార్థివసత్తముఁ డలఘుబాణముల మ♦ర్మాళి మిగుల
నొప్పింపఁగా వార ♦ లప్పు డారణభూమి నిలువంగ నోపక ♦ తొలఁగి ప్రాణ
తే. ములను దక్కించుకొని; రంత ♦ నలఘుబలుఁడు
రాముఁ డాచీఁకటిని విచి♦త్రముగఁ గనక
ఖచితములు నగ్నిశిఖలనఁ ♦ గ్రాలుబాణ
ములను వెలిగించె దిగ్విది♦క్కులను మిగుల. ౨౦॥ 1639
క. [అనియందు రామనామం,బునఁ జిహ్నితములగు బాణ♦ములు నిండెను] భీ
తిని గల్గఁజేయఁ జాలిన,దనుజులు మఱి యెవ్వరెవరు ♦ ధరణిపుమ్రోలన్.
తే. నిలిచిరో వారలందఱు ♦ జ్వలనునందుఁ
బడెడు మిడుతలవిధమునఁ ♦ దడయ కంత
కుని గనంబోయి; రానృప♦కుంజరుండు
కనకపుంఖసహస్రమా♦ర్గణవరముల. ౨౨ 1641
క. పరఁగించుచుండ నానిశ, యురుదుగ ఖద్యోతయుక్త♦మై భాసిలు నా
వరశారదనిశవలె నా,తఱుణంబునఁ జూడనయ్యె ♦ దానవులంతన్. ౨౪॥ 1642
క. ధ్వనిసేయుఁగఁ గోఁతులు ని,స్వనము లొనర్పంగ మఱియు ♦ సాధ్వస మెసఁగం
గను జాలియుండె గురుని,స్వనమది వర్ధిల్లి దిశల ♦ వగునగనిండన్. ౨౫॥ 1643
క. పెనుకందరములఁ గూడిన, ఘనమైన త్రికూటభూధ్ర♦కాంతుఁడు ప్రతిని
స్వన మిచ్చు నట్టులుండెను;, బెనుకాయము లొప్పుమిగిలి♦వెలయుచునుండన్.
ఆ. అంధకార మట్టు ♦ లంగకాంతులుగల, కొండముచ్చు లెల్లఁ ♦ గ్రూరదనుజ
వితతి నట్టె పట్టి ♦ వెనరెండుకరములఁ, దినఁగ సాగి; రింద్రు♦మనుమఁ డంత.
చ. తనరిపు వైన రావణిని ♦ దర్పముపొంగ నధింపఁబూని యా
తని వడిఁగొట్టి సారథిని ♦ దద్రథఘోటకపంక్తిఁ ద్రుంచె; న
య్యనువున ఘోరథంగిని భ♦యంకరరీతిని సాగుచుండు నా
యనిమొన నశ్వసారథియు♦తాత్మ్యరథంబు వినాశ మొందుటన్. ౨౮॥ 1646

క. కని యింద్రజిత్తు వేగం,బున రథముఁ విడిచి వాలి♦పుత్త్రుని మ్రోలన్
గనియె నదృశ్యత నంగదుఁ, డొనరిచిన స్వార్థమైన ♦ యురుకార్యంబున్.

క. దానిం గని దేవతలును, మానులు రాఘవులు దిశలు ♦ మార్వలుకఁగ న
వ్వానరవర్యునిఁ బొగడిరి;, దానవవర్యుని ప్రభావ♦దర్పబలములన్. ౩౧ 1648

క. భూతవ్రాత మెఱుంగును;, [నాతఁడె నాయింద్రజిత్తు ♦ నని నెవ్వరికే
నేతీఱున దుర్జయుఁడై, భూతాదృశ్యుండు నగుచుఁ ♦ బొంగుచునుండెన్.]

క. కనుకని యాశూరుని నొం,చిన యంగదుఁగాంచి తుష్టిఁ ♦ జెందిరి; పిదపన్
వనచరపతి సుగ్రీవుఁడు, వనచరులు విభీషణుండు ♦ వాలితనూజున్. ౩౨

క. పరు నింద్రజిత్తు నొంచుట, కరుదంది నుతించి; రిట్టు ♦ లా కృత్యము ని
ర్జరనుత్యము మేత్తేలని, కరము నినాదము లొనర్చి ♦ కాంచిరి ముదమున్. ౩౩

ఆ. భీమకర్ముఁడైన ♦ యాామాన్యుచే నిట్టు, లింద్రజిత్తు దనుజు ♦ లెల్లఁ జూడఁ
బరిభవంబునొంది♦భయదకోపము నొందె;, నిట్టి సమయమందు♦నినకులుండు.

కవిరాజవిరాజితము:—

వనచరులం గని ♦ వల్కెను నిట్లని ♦ వానరరాజును ♦ భవ్యగతుల్
దనరఁగఁ గూడుఁడు ♦ తత్పరచిత్తతఁ ♦ దప్పక యుండుఁడు ♦ దానవరా
ట్తనయుఁడు బ్రహ్మ ను♦దారతపంబునఁ ♦ దాముదితాత్ముని ♦ దైవవిధిన్
బొనరిచి కాంతులఁ ♦ బొందెను గావున ♦ ముజ్జగముల్ వగఁ ♦ బొందుగతిన్.

తే. చేయుచుండును మీాకార్య ♦ సిద్ధిగొఱకుఁ
దగినకాలమునన్ వచ్చెఁ ♦ దాన్మృతిఁగన
గాన నాకయి యోర్చి యి♦క్కాలమందు
నుండఁదగు మీార లందఱు ♦ నుద్యమమున. ౩౬ 1654

క. మనముల విగతజ్వరులై, యనిమొన నుండుఁడని పల్కె; ♦ నంతర్ధానం
బును గనినపాపమతి యా,దనుజేంద్రుం డింద్రజిత్తు ♦ తచ్ఛక్తిమెయిన్. ౩౭

క. సునిశితశరముల విడిచె న,శనితుల్యములన్; మనంబు ♦ సమధికరోషం
బును బొంద నింద్రజిత్తా,యనిమొన శ్రీరామచంద్రు♦నాతనియనుజున్. ౩౮

క. కాకోదరరూపములౌ, భీకరశరముల నిగుడ్చి ♦ వెస నంగములన్
జీకాకుపఱచె; మఱియును, నాకర్బురవరుఁడు మిగుల ♦ వ్యాజరణంబున్.

చ. ఒనరుపఁబూని మాయఁగొని ♦ యెప్పెడు భూతములెల్లఁ జూడ నొ
ప్పనిగతి యుద్ధమందు నర♦పాలకుమారులు మోహాయుక్తులై
యనిని వితాకునొందునటు ♦ లద్భుతరీతిగఁ జేయుచున్ మహా
*సునిశితసర్పబంధముల ♦ సోలఁగఁ జేయుచుఁ గట్టివైచెఁ దాన్. ౪౦ 1658

* బబంధ శరబంధేన భ్రాతరౌ రామలక్ష్మణౌ-అనిమూలము. శరబంధేన వేష్టనదంశనాదినా నాగమయత్వమ్-అనివ్యాఖ్య.

క. దనుజుఁడు క్రుద్ధుండై వై,చిన ఫణిబాణములు పురుష♦సింహుల బంధిం
చినఁ బరవశులై సోలిన, మనుజేంద్రులఁ గనిరి కీశ♦ముఖ్యు లపు డనిన్.

*చ. దనుజవిభూత్తనూత్త్మజుఁడు ♦ తా రఘువర్యుల మ్రోల నిల్చి బా
ధను గనఁ జేయలేక మహి♦తంబగు స్వాంతము గల్గువాఁడు గా
వున నట మాయఁబూని యిల♦భూపకుమారులఁ గట్టివైచె నా
సునిశితసర్పబాణముల ♦ క్షోణిపయింబడి యుండునట్లుగన్. ౪౨ 1660

నలువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౪౫ - వ సర్గము.

—నాగపాశబంధము.—

చ. బలము ప్రతాపముం గలుగు ♦ పార్థివపుత్త్రుఁడు వైరితావుఁ దాఁ
దెలియఁగఁ గోరి వానరుల ♦ ధీరుల యూధపతీంద్రులన్ బలో
జ్జ్వలులను గాంచి స్వాశయముఁ ♦ జక్కఁగఁ దెల్పె సుషేణపుత్త్రులై
బలముల నొప్పు నిద్దఱిని ♦ వానరవర్యుని నీలు నంగదున్. ౧౫ 1661

క. ఘనబలు సానుప్రస్థుని, వినతుని నా జాంబవంతు ♦ విక్రమమున నొ
ప్పిన ఋషభుని ఋషభస్కం,ధుని శరభుని నీపదుగురిఁ ♦ దోడనె యరయన్.

క. అరిజనకాలాంతకుఁ డా, ధరణీపతి యాజ్ఞ సేయఁ; ♦ దద్దయు మోదం
బురహిం గాంచుచు భీకర, తరువులఁ గొని యింద్రజిత్తు♦తావుఁ గనుఁగొనన్.

తే. దెసల నంతట వెదుకంగ ♦ వెస నభమున
కుద్గమించిరి; జవముల ♦ నొప్పు వార
లైన వానరులన్ వారి ♦ నరసి దనుజ
వరతనయుఁ డస్త్రవేత్తయై ♦ పరఁగుఁ గాన. ౪౫ 1664

క. పరమజవంబును గల ని,ర్భరశస్త్రము లేచి వైచి ♦ వారిజనములన్
బరిపరి వారించెను; భీ,కరవేగము లొప్ప వెలయు ♦ కపు లాయడనన్. ౫౫

చ. దనుజమహాస్త్రజాలముల ♦ దద్దయు భిన్నశరీరులౌచు నా
ఘనముల యంతరంబునను ♦ గ్రాలు దివాకరుభంగి నాతమ
స్సునఁ దగు నింద్రజిత్తుఁ గను ♦ చొప్పు నెఱుంగఁగఁ జాలరైరి; చ
య్యన సమితింజయుం డయిన ♦ యా దనుజోత్తముఁ డంత నీసునన్. ౬౫

సీ. సకలాంగకంబులఁ ♦ జక్కడఁ జాలిన శరముల రామల♦క్ష్మణుల మిగుల
నొప్పించె; నిట్లు ద♦నుజుఁడు క్రుద్ధుండయి విక్రమవంతులై ♦ వెలయువారి

---

* బబంధ తౌ రాజసుతౌ మహాత్మా - అనిమూ. మూలమున నిట నింద్రజిత్తు విషయమున మహాత్మా యను విశేషణముకలదు కావుననే తెలుఁగున "మహితంబగు స్వాంతముగల్గువాఁడు" అని ప్రయోగింపఁబడియె నని యెఱుంగునది.

బాణరూపములగు ♦ ఫణులఁ బ్రయోగింప వారిదేహములు దు♦ర్భరముగాఁగ
నంతరమే లేని ♦ యట్లుండె వారల క్షతజమార్గంబుల ♦ సాంద్రరుధిర

ఆ. మొక్కరీతిఁ గాత్రె; ♦ నుర్వీశతనయులు, వ్రణితదేహులగుచు ♦ వఱలి రప్డు
కుసుమయుతపలాశ♦[1]కురుహంబు చాడ్పున, నంత నింద్రజిత్తు ♦ హర్ష మలర.

క. విరిసిన కాటుకప్రోవనఁ, బరఁగెడు తనుకాంతి వెలయ ♦ భ్రాతల నాయి
ద్దర కిట్లనియెన్ గనుఁగొనఁ, దరముం గానట్టి స్వీయ♦తనువున మిగులన్.

క. వినుఁ డేను నదృశ్యుఁడనై, యనిచేయుచునుండ నిర్జ♦రాలయపతియై
తనరెడు సురనాయకుఁడున్, ననుఁ జూడఁగఁ జేరలేఁ డ♦నన్ మీ రనఁగన్.

తే. ఎంతవారలు ? కోపాగ్ని ♦ నెసఁగు నేను
గంకపత్రాంచితంబులౌ ♦ కఱకుటమ్ము
లను బ్రయోగించి యిప్పుడే ♦ పనుపువాఁడ
యమునిసదనంబునకు మిమ్ము ♦ హర్షమలర. ౧౨ 1670

క. అని ధర్మవేత్తలగు నా, జనపతిపుత్త్రులకుఁ జెప్పి ♦ చయ్యనఁ దీక్ష్ణా
శనితుల్యశరవరంబులు, తనువులఁ జొప్పించి యతిము♦దంబున నార్చెన్. ౧౩

క. విరిసినకాటుకరాశిని, బురుడించి వినీలవర్ణ♦మున నొప్పిన యా
శరగణవిభుఁ డాసంగర, ధరణిం గోదండ మొంతొ♦దర్పము వెలయన్. ౧౪

క. పలుమఱు సారించుచు ను, జ్జ్వలభీమమహాంబకములఁ ♦ బరఁగించెను వా
రలపైన; మఱియు మర్మం,బుల నెఱిఁగిన యింద్రజిత్తు ♦ పూనిక మెఱయన్.

క. ధరణీంద్రకుమారుల దు,ర్భరమర్మస్థలములందు ♦ వాడిశరములన్
గరము క్రుధన్ నాటుచు సిం,హారవం బొనరించె మరల; ♦ నానృపతనయుల్.

క. శరబంధబద్ధులై సం,గరమూర్ధమునందు నొక్క♦క్షణమాత్రమునన్
బరికింపఁ జాలరై; రా, తరుణంబున భూరిచాప♦ధరులును వీరుల్. ౧౬ 1675

క. మనుజేంద్రునితనయులు నా, ఘను లారాఘవులు బాణ♦కాండాగ్రములో
య్యన నాటి యంగజాల, మ్మును నొవ్వఁగఁజేయ మర్మ♦ములు శరపంక్తిన్.

క. విరియఁగ సోలి చలించుచు, నరుదుగ రజ్జువులు నూడ్చ ♦ నవనింబడు ని
ర్జరనాథకేతనంబుల, కరణిన్ ధరఁబడిరి కీశ♦గణ మార్తిఁ గనన్. ౧౭ 1677

ఉ. వీరులు రామలక్ష్మణులు ♦ వింతగ బాణమయాహిపంక్తిచే
బోరన బద్ధగాత్రులయి ♦ సొక్కుచు నెత్తురుకాఱుచుండఁగా
వీరులు పవ్వళించు స్థలి ♦ వేగమ చక్కఁగఁ బవ్వళించి గం
భీర మనంబులం బొగిలి ♦ పీడితులై పడియుండి రెంతయున్. ౧౮ 1678

1 కురుహంబు=వృక్షము.

క. ధరణీశుల గాత్రంబులఁ, గరతలములకొనలవఱకుఁ ♦ గాండంబులచేఁ
బరిపరి నవిద్ధమైనది, పరికంపము గాంచ నదియుఁ ♦ బరికింపంగన్. ౧౯

తే. మఱియు భిన్నముగానిది ♦ నెఱి నొకటగు
సంగుళంబైన లేదయ్యెఁ; ♦ నంతఁ గామ
రూపియును గ్రూరుఁడును మఱి ♦ పాపియునగు
దానవుఁడు బాణములు వైవ ♦ ధరణిపతులు. ౨౦ 1680

క. పరితప్తులైరి వారల, వరతనువులనుండి ప్రస్ర♦వణమువలననుం
డి రయమున జలము గాఱెడు, కరణిని రక్తంబు మిగులఁ ♦ గాఱె భయదమై.

క. [1]మును పింద్రునిని జయించిన, దనుజుం డాయింద్రజిత్తు ♦ దారుణకోపం
బున వైచిన మార్గణములు, తనువున నాటంగఁ దొలుతఁ♦దా రాఘవుఁడున్.

క. అనిఁబడియె; మర్మములు నొ,చ్చిన; నంతట దనుజవరుఁడు ♦ చెలఁగి ఫణిశరా
ళిని వైచి పిదపఁ జక్కని, మొనలు దగన్ రుక్మపుంఖ♦ములు నగు తూపుల్.

సీ. మఱి వేగముగఁ బోవు♦మార్గణంబులు నర్ధశరములు గొడ్డలి♦కరణి మొనలు
గల భల్లబాణముల్ ♦ వెలయు నంజలివంటి మొనలు గల్గినబాణ♦ములునువత్స
దంతతుల్యాంబక♦తతులు సింహాస్యముల్ గలబాణములుక్షురం♦బులునుదనుజ
చాపముక్తములయి ♦ క్ష్మాపాలమౌళిగాత్రమును నొప్పించె నం♦తట నతండు

తే. శిథిలముష్టిబంధంబును ♦ జిత్రరత్న
భూషితముఁ బార్శ్వమధ్యమ♦ముల నతంబు
నైన కార్ముకమును మాని ♦ యూరణాంగ
ణమున శయనించెఁ జేయ నై♦నదియె లేమి. ౨౪ 1684

క. [2]శరతల్పమునఁ బరుండిన, పురుషర్షభు రామచంద్రుఁ ♦ బొడఁగని జాలిన్
దురపిల్లి లక్ష్మణుం డిఁక, ధరణిం జీవింప మనెడు ♦ తలఁపును గాంచెన్. ౨౫

చ. సరసిజపత్రనేత్రు రఘు♦చంద్రుని నన్నును నాగబద్ధునిన్
ధరణిఁ బరుండఁ గాంచి పయి ♦ దారుణబాణము లేఁచుచుండ దు
స్తరతరశోకముం గనియె; ♦ ధాత్రిఁ బరుండిన రాముఁ గాంచి యా
హరివరు లెల్లఁ జిత్తముల ♦ నందిరి తాపము నిర్భరంబుగాన్. ౨౬ 1686

చ. అనిలసుతాదికీశవరు ♦ లందఱు నొక్కటఁ గూడి నాగబం
ధనమునఁ జిక్కియున్న వర♦దర్పుల రాఘవులన్ మహార్తులన్
గనుఁగొని చుట్టుఁ జేరి వెతఁ ♦ గాంచుచు నిల్చిరి చేయఁ దోఁపమిన్
మనములు దుఃఖవార్ధిపరి♦మగ్నములై తగ నుండి రెంతయున్. ౨౭ 1687

నలువదియైదవ సర్గము సంపూర్ణము.

---

1 క్రోధా దింద్రజితా యేన పురా శక్రో వినిర్జితః-అనిమూ. 2 స తత్ర లక్ష్మణో దృష్ట్వా నిరాశో జీవితే భవత్-అనిమూ.

౪౬-వ సర్గము.

—నాగపాశబద్ధులం జూచి సుగ్రీవాదులు శోకించుట.—

చ. వనచరు లంతరిక్షమును ♦ వారకభూమిని గాంచుచుండ్ గలం
బనిచయవిద్ధగాత్రులయి ♦ పర్విన బాధc బరుండియున్న యా
మనుజవరేణ్యులన్ సుగుణ♦మండనులన్ సహజన్ములన్ గనుం
గొని రట రామలక్ష్మణులc ♦ గూర్మికి నాకరమైన వారలన్. ౧ 1689

ఆ. వృష్టి గురిసి నిలిచి ♦ వెలయు మేఘమురీతి, నిశితబాణవృష్టి ♦ నిగుడc జేసి
యింద్రజిత్తు దివిని ♦ నెక్కడనో యూరకుండ నచటి కెంతొ♦యుగ్యమమున.

క. చనుదెంచె విభీషణుc డా,వనచరనాయకునితోడ; ♦ వారల కెంతో
మునుపే మైందద్వివిదులు, హనుమత్కుముదులు సుషేణుc ♦ డానీలుండున్.

తే. అంగదుండును జేరి యా♦ర్యావతంసు
లైన రాఘవులం గాంచి ♦ యార్తిc గుందు
చుండి; రారాఘవులు చేష్ట ♦ లుడిగి మంద
ములగు నూర్పులు పుచ్చుచు ♦ నిలc బరుండి. ౩౹ 1691

క. తనువులు శోణితపూరం,బున బ్రుంగcగ బాణసర్ప♦ములు పర్వంగా
వనటం గుందుచు నొకపరి,ఘనఫణు లట్లూగ్రుగములc ♦ గడcగి విడుచుచున్.

సీ. మందవిక్రములయి ♦ మఱియొక్కపరి చేష్ట లుడిగి యంగములెల్ల ♦ నొక్కరీతి
రక్తంబునన్ మున్గ ♦ రంగారు కనకధ్వజంబులవలె నొప్పి ♦ శరమయములు
గా నొప్పుశయ్యల♦పైనc బరుండి రావీరులొక్కొక్కయప్డు ♦ భార మూని
నట్లు కరాంఘ్రుల ♦ నల్లనc గదలించుచును శరజాలముల్ ♦ తనువులందు

తే. గాడి యుండంగ యూథప♦గణము తమ్ముc
జేరి కన్నీళ్లు వఱదలై ♦ క్షితిని బాఱc
జుట్టునన్ నిల్చియుండ నా♦క్షోణిమీదc
బవ్వళించియె యుంట నా♦ప్లవగవరులు. ౬౹ 1693

క. కనిరి విభీషణముఖ్యులు, మనముల వెతc గుంది; రాస♦మరభూమిని నుం
డి నభంబు దిక్కులను నా,వనచరు లారసియు నెన్ని♦భంగుల నైనన్. ౭౹

క. దనుజేంద్రు రావణిని మా,యను దాల్చి కనంగరాక ♦ యులరు నతనిc గ
న్గొనc జాలకుండి;రటమా,యను దాల్చిన యన్నకొడుకు ♦ నారావణినిన్. ౮౹

క. *ఘనబుద్ధి విభీషణుc డా,తని నల్లడలం గనంగc ♦ దాc బూనుచు మా
యను దాల్చి యదృశ్యుండై, తనరcగ నమ్మాయcగొని యు♦తని నొకచోటన్.

క. నిలుచున్నవానిc గనియెన్;, బలమున వీర్యమునc గార్య♦భంగి ననమునc డై
కలన నొరుc డీడులేకయె, చెలcగుచు వరదానమహిమ♦చే నితరులకున్. ౯౹

* తం తు మాయాప్రతిచ్ఛన్నం మాయయైవ విభీషణః-అనిఘా.

చ. కనఁబడకుండ నభ్రమునఁ ♦ గ్రాలుచుఁ దేజమునన్ యశంబునన్
ఘనతరవిక్రమంబున ని♦కామము నొప్పుచు నున్న యింద్రజి
త్తును గనె నవ్విభీషణుఁడు; ♦ ఘోరపుశౌర్యము మీఱఁగా దశా
స్యుని తనయుండు రాఘవులు ♦ క్షోణిఁ బరుంటయు నాగపాశముల్
తనదగుశక్తి వారలను ♦ నద్దయుఁ గట్టియె వైచుటల్ గనెన్. ౧౧ 1698

చ. కని మది నెంతయున్ ముదముఁ ♦ గాంచి సురారులఁ బొంగఁజేసి యి
ట్లని వచియించె; దూషణు ఖ♦రాసురుఁ జంపిన యిమ్మహాబలుల్
మనుజవిభుల్ సహోదరులు ♦ మామకబాణము లంట సోలినా
రనువుగఁ జూడుఁడీ; యిచటి ♦ రాత్రిచరుల్ దనుజుల్ మహాత్ములున్. ౧౨

తే. ఒకటిగాఁ జేరి వచ్చిన ♦ నురుఫణిమయ
బంధముల వీని వదలింప ♦ వశముగాదు;
వినుఁ డదెవ్వరిపౌరుష♦మునకు నులికి
పాటు గని నాదుజనకుండు ♦ వగలఁ గుంది. ౧౩ 1700

సీ. రాత్రియామంబుల ♦ త్రయమునం దొకయామమైనను నిదురను♦గానమి శయ
నమున్స్పృశింపకయెకా♦లము పుచ్చుచుండునో యెవనినిమిత్తమై♦ యీపురమున
గలవార లెల్ల ని♦మ్ముల వృష్టికాలంబులందు జలంబు ల♦త్యాకులంబు
లైన చందమున దుః♦ఖార్తులై యుండిరో యట్టి రాముని దను♦జాళినెల్లఁ

తే. జంపివైవ నుద్దేశించి ♦ తెంపుమీఱి
యున్న వానిని నేనిదె ♦ యుద్ధమందుఁ
జంపినాఁడను; రాముల♦క్ష్మణులు కపులు
సేతుబంధాదు లొనరించి ♦ క్షితితలమున. ౧౪ 1701

క. కనఁబఱచిన విక్రమములు, చనియెను నిష్ఫలములగుచుఁ ♦ జంచద్రీతిన్
గనఁబడు ఘనములు శరదృతువున నిష్ఫలములగుభంగిఁ ♦ బొంగణఁగుటచేన్.

చ. అని వచియించి పార్శ్వములఁ ♦ హర్షమునం దగు రాక్షసాళిఁ జ
క్కనిగతి మోదమున్ మిగులఁ ♦ గాంచఁగఁ జేసి కపీంద్రులన్ గడున్
వనచరసైన్యనాయకుల ♦ భాస్కరసూను విభీషణాదులన్
సునిశితబాణజాలముల ♦ సోలఁగఁ జేసె నతండు శక్తిచేన్ ౧౬ 1703

సీ. అరిజనకాలుఁడై ♦ యలరు నారావణి నవశరంబుల నీలు ♦ జవముమీఱ
నొప్పించి యవల మైం♦దుని నల్లి ద్వివిదుని మూఁడేసి శరవర♦మ్ములను నొంచి
యామేటి విలుకాఁడు ♦ భీమరూపుండగు జాంబవంతుని యుర♦స్థలమునందు
శర మొండునాటి ని♦ర్భరవేగమున నొప్పహనుమపై జ్యారవ ♦ మలరఁ దీవ్ర

తే. దశశరంబులు వైచె; యు♦ద్ధమున నతిజ
వంబుగల రావణియును దే♦జంబు మిగుల

వెలయుచున్న శరభగవా♦క్షులను నొవ్వఁ
జేసె రెండేసి శరముల ♦ నేసి కడఁక. ౨౦౪ 1704

క. త్వరపడి గోలాంగూలే,శ్వరుఁడైన గవాక్షు, మఱియు ♦ వాలితనూజుల్
శరములఁ బెక్కింటిని నా,శరవరుఁ డార్చుచును వైచె ♦ శౌర్యము పొంగన్.

క. బలధైర్యముల నెసంగెడు, నలరావణి యుద్ధరంగ ♦ మందందుఁ గపీం
ద్రుల నగ్నిశిఖాభములగు, బలుశరముల నొంచి యార్చెఁ ♦ బటురవ మలరన్.

క. గురుబాహుం డారావణి, హరులన్ శరసంచయముల ♦ నార్తిం బొందిం
చి రయంబున భయపడఁగా, గరువంబునఁ జేసి నవ్వె ♦ కడుమూఁద మలరన్.

చ. దనుజులఁ గాంచి యిట్లనియె; ♦ దానవులార! చమూముఖంబునన్
ఘనభయదాహిబంధములఁ ♦ గట్టగ వానికిఁ జిక్కి యిద్ద ఱా
య్యన నదె రామలక్ష్మణు ల♦హార్యమహాపదఁ బొందినారు మే
దిని బడియున్నచందమును ♦ దృష్టిగఁ గాంచుఁ డటంచుఁ బల్కఁగన్. ౨౮౪

తే. కపటయుద్ధంబు సేయు రా♦క్షసులు రావ
ణాత్మజుం డొనరించిన ♦ యప్పనికిని
జాల ముద మంది యాశ్చర్య ♦ మొంది గనిరి;
జలదములఁ బోలుచున్న రా♦క్షసులు పిదప. ౨౯౪ 1709

క. మనుజేశ్వరుండు మృత్యువుఁ, గనె నంచుఁ దలంచి గొప్ప♦గా నార్చి దశా
ననతనయుని వినుతించిరి;, దనుజేంద్రుం డతఁడు మిగుల ♦ దర్పము పొంగన్.

*క. ధర నిట్టటు గదలకయే, పరుండి యూర్పులను నైన ♦ బయలుపఱుప కా
తరుణమున నున్న యారఘు,వరులం గని చచ్చి రనెడు♦స్వాంతము గనియెన్.

క. అని జయశీలుండగు నా,దనుజోత్తముఁ డంతటన్ ము♦దంబున దనుజా
ళిని నలరం జేయుచుఁ దాఁ, జనియెను లంకకును దనదు♦జయముం దెలుపన్.

క. ధరణీశులతనువులు ని,ర్భరబాణమయంబులైన ♦ బాహ్వాదికముల్
పరికింపరాక యంగుళు,లరయంగా రక్తమయము ♦ లౌట రణధరన్. ౨౯ 1713

క. కని సుగ్రీవుఁడు భీతిలె;, వనటం గుందుచును దుఃఖ♦భారంబుననే
కనులను నశ్రువు లురల వ,దనమున దైన్యంబు దోఁపఁ♦దనయ ట్లుచటన్. ౩౦

క. వనచరపతి యుండుటఁ దాఁ, గనుచు విభీషణుఁడు పలికెఁ; ♦ గపివర! భయముం
గనుట యిఁకం జాలును నా,ర్తిని బాష్పము లిట్లు విడుచు♦రీతి వదలుమా!.

క. కలహము లన్నియుఁ దలఁచుగ, నిల నిట్టివియే జయంబె ♦ యెప్పుడు గలుగన్
వలయుననం దగు నియతులు, కలుగవు; వీరాధివీర! ♦ కపికులతిలకా. ౩౧౪

క. మనకు నదృష్టము కలదే, ననుపమబలులై మహాత్ము♦లౌ వీరలు మూ
ర్ఛను మాని లేవఁగల; రీ,వును ధైర్యము మానియుండఁ ♦ బోలునె చెపుమా!.

---

* హతా విత్యన్వమన్యత-అనిమూ.

క. నను వేఱు దిక్కు లేకయు, చనుదెంచినవాని ధైర్యసహితునిగ నొన
ర్పను జను సత్యము ధర్మం,బును నమ్మిచరించునట్టి పురుషుల కెల్లన్. 33

*క. కలుగ దపమృత్యుభయమని;, పలికి విభీషణుఁడు వేగ పాణితలమునన్
జలములు గైకొని యాతని,సులలితశుభ నేత్రములను సొంపుగఁ దుడిచెన్.

తే. ధర్మమతి యావిభీషణుం డర్మిలి నరి
మాయఁ గన్గానఁ జేసి సను స్తగతుల
ధైర్యమును గల్గఁజేయ నుదకములఁ గొని
దనుజమాయాతిమోహాని స్తరణమునకు. 3౫ 1720

క. అనువగు విద్య జపించుచు, వనచరపతి కనులఁ దుడిచె భవ్యజలములన్
దనుజేజ్యుఁ డావిభీషణుఁ, డనుకంపన్ బుద్ధిమంతుఁ డౌసుగ్రీవున్. 3౬ 1721

తే. అలరఁజేయఁగఁ దన్ముఖ మట్టె తుడిచి
యప్పటికిఁ దగినట్టిచా చొప్పు మెఱసి
పలికె సుగ్రీవుతోడఁ దాఁ ట్రిలక యిట్లు;
వనచరేశ్వర! తఱిగాదు భయపడ నిది. 3౭ 1722

తే. విను మతిస్నేహదోషంబునను నిటు పురి
కొలుపఁగా నేమిసేయుదుఁ బలుకు మనెదొ
దాని కిది తఱిగా దిట్టి తరుణమందు
నదియు మరణంబునకు హేతు వగును జుమ్ము. 3౮ 1723

చ. కనుక నధైర్య మిద్ధఖిలకార్యవినాశనహేతువౌట దీ
నిని విడనాడి రామవిభునిన్ శరణంబుగ నమ్మియున్న యీ
వనచరసంచయంబునకు భవ్యహితంబును గూర్ప నెంచుమీ;
యొనరుపఁ జాలవే నటు నరోత్తముఁ డెత్తఱి మూర్ఛఁ దేఱునో. 3౯

ఆ. అంతవఱకు రాము నరసి రక్షింపుమా
మూర్ఛఁ దేఱినంత మోహ మంది
యున్న మనల నెల్ల నన్నదమ్ములు వీరు
గావఁగలరు భీతిఁ బోవునట్లు. 3౯ 1725

క. ధర నిటు శయనించిన రఘు,వరులకు నెప్పుగిదిఁ దెల్పి వచ్చు మరల నం
చురుసంశయ మొందెదవో,హరివర యీనాగబంధ మారయ రాముల్. ౪౦

క. ఏమియుఁ జేయం జాలదు, బ్రామండనుఁ డంతమొందెఁ గా యనుశంకన్
నీమానసమునఁ బూనకు, రామునిఁ దేజస్సు విడువ రామిఁ జెలంగెన్. ౪౧

క. గతజీవితులకు నీగతి, నతిశయతేజస్సు గలుగు టరుదుగదా; నే
మతి నెన్ని చేయఁదగు కృ,త్యతతులఁ జక్కఁగ నొనర్చు దనుక హరిపతీ!. ౪౨

* జలక్లిన్నేన పాణినా, సుగ్రీవస్య శుభే నేత్రే ప్రమమార్జ విభీషణః-అనిమూ.

చ. మనమున ధైర్యమూని వగ ♦ మానుము నీబల మెల్లఁ బూన్కిసిం
గనునటు లూఱడింపు మిఁకఁ ♦ గల్గును కార్యఫలం బటందువో
వనచరనాథ! యీప్లవగ♦వర్యులు న న్గను లెల్ల విప్పి క
న్గొని యలయింద్రజి త్తనుచుఁ ♦ గొంకుచు *నాగతభీతులై కదు౯.౪౨ 1729

సీ. భయచిహ్నములు చాలఁ♦బ్రబలుట నొక్కరిచెవిలోన నొక్కరు♦చెప్పుకొనుచుఁ
బరుగెత్తఁగాఁ దగు♦భంగి రహస్యోక్తులను నాడుకొనుచుంటఁ♦గనఁగఁ బడెడు
నిట్టి సేనలకున్న ♦ యట్టిభయంబును బాపఁగాఁ జనుచున్న♦వాఁడ నేను;
వనచరు లందఱు ♦ మునుదాల్చి యవ్వలఁ బూలహారంబును ♦ లీలమెఱయఁ

ఆ. బాఱవైచునట్లు ♦ భయముఁ ద్యజింతురు
గాక యనుచు దనుజ♦కాంతుఁ డతఁడు
భానుతనయుతోడఁ ♦ బల్కి యాశ్వాసించి
పఱుగువాఱఁ జూచు ♦ వనచరాళి. ౪౪ 1730

క. కని నేను రావణాసురు,తనయుఁడఁ గా ననుచుఁ బల్కి ♦ తగ నూఱడిలం
గను జేసె; మహామాయుం, డనఁదగు నాయింద్రజిత్తు ♦ హర్షము పొదలన్.

క. సేనావ్రజపరివృతుఁడై , తా నవు డాలంకఁ జొచ్చి ♦ తండ్రికడకుఁ బెం
పూని చని యోలగంబున, దానవనివహాంతరమునఁ ♦ దగు జనకునకున్. ౪౬

క. వలగొని మ్రొక్కుచును గృతాం,జలియై లక్ష్మణుని రామ♦చంద్రునిఁ బూన్కిన్
గలన వధించితి నని ప్రియ,ము లరంగాఁ బలికె రావ♦ణాసురుఁ డంతన్. ౪౭

చ. దనుజులమధ్యభాగమునఁ ♦ దా విని వైరులు రామలక్ష్మణుల్
గనిరి వినాశనం బనుచుఁ ♦ గ్రన్నన హర్షము పొంగుచుండ ది
గ్గన నటనుండి లేచి తన♦గాదిలిపుత్రునిఁ గౌఁగిలించి యా
తనితల మూరుకొంచుఁ బ్రము♦దంబున నావిధ మెల్లఁ జెప్పుమా!. ౪౮ 1734

క. అని ప్రశ్నసేయుజనకునిఁ, గని రావణి నాగపాశ♦గణమునఁ దా నా
మనుజేంద్రకుమారుల నొ,య్యన బంధించుటయుఁ జేష్ట ♦ లాపినవిధమున్.

క. తనుకాంతులు మాయం జే,సినరీతిని జరగినట్లు ♦ చెప్పెను; దరువా
త నతండు మహారథుఁడై, తనతనయునిమాటలు విని ♦ శ్రద్ధయు ముదమున్.

క. కని ముదము పొంద శ్రీరా,మునివలనన్ గలుగనున్న ♦ భూరిభయంబున్
మనమున దిగనాడి తనూ,జునిఁ బొగడెం గౌతుకమున ♦ శుభవాక్కులచేన్.

నలువదియాఱవ సర్గము సంపూర్ణము

---

* త్రాసా దాగతసాధ్వసాః-అనిమూ.

## ౪౭ - వ సర్గము.

సీతకు రాక్షసస్త్రీలు నాగపాశబద్ధులౌ రామలక్ష్మణులఁ జూపుట.

చ. దనుజవరేణ్యునాత్మజుఁడు ♦ తాఁ జరితార్థుఁడు నౌచు లంకకుం
జనిన యనంతరంబ రఘు♦సత్తమ, నీల,సుషేణు లార్తులై
హనుమయు నంగదుండు కుము♦దాహ్వయుఁడుల్ నలుఁడుల్ గవాక్షుఁడుల్
వనచరవర్యుఁడౌ గజుఁ ద♦వార్యుఁడు సర్గవయుండు గంధమా
దనశరభాఖ్యు లద్భుతని♦తాంతబలుండగు జాంబవంతుఁడుల్. ౨ 1738

క. ఘనుఁడౌ ఋషభస్కంధుఁడు, వనచరపూజ్యుండు సత్వ♦వంతుఁడు నయి త్రా
లినశతవలియును రంభుం,డనువాఁడును బృథువు పూన్కి♦నరయుచు నుండన్.

క. తక్కిన వనచరులందఱు, నొక్కట వ్యూహములరీతి ♦ నొప్పి ప్రబలులై
దిక్కుల నెల్లను గాంచుచు, మిక్కిలి యత్నములు చెలఁగ ♦ మించెడు వగలన్.

క. తరువులు కరములఁ దాలిచి, పరిపరి నడ్డమును నూర్ధ్వ♦భాగంబును నా
తురతం జూచుచు నొక్కెడ, ధరఁ దృణములు కదల దైత్య♦తతి వచ్చునటుల్.

క. తలపోయుచు మెలఁకువతో, మెలఁగుచు నుండంగ, నచట ♦ మిక్కిలిప్రమదం
బొలయన్ రావణుఁ డాత్మజు, నెలవునకున్ వీడుకొలిపి ♦ నెమ్మది దోఁపన్. ౪½

క. జనకజఁ గాపాడెడు నా,దనుజాంగనలన్ స్వసన్ని♦ధానమునకు రాఁ
గను బిలిపించెను; దనుజాం,గనలుం ద్రిజటయుఁ బదాజ్ఞఁ ♦ గదలి రచటికిన్.

క. చనుదెంచినవారలనుం, గని రాక్షసరాజు హర్ష♦కలితాత్ముండై
యనియెన్ వారలతో నా,తనయుం డారాము నతని♦తమ్మునిఁ ద్రుంచెన్. ౬½

క. అను నీవార్తను సీతకు, వినుపింపుం డామె మీరు ♦ వేగమ నాదా
ఘనపుష్పకమునఁ జేరిచి, చని హతులై యున్న మనుజ♦సత్తమయుగమున్. ౭

ఆ. చూపుఁ; డెవనిదైన ♦ ప్రాపున గర్వించి
నాకు వశ్యురాలు ♦ గాక వనిత
యుండెనో యతండు ♦ ఖండింపఁ బడె నని
దీనిమగఁడు సమాజ♦తో నిపుణత. ౮ 1746

క. కనుక నిఁక సీత సంశయ,మును మాని వెతం దొలంగి ♦ మునుపటివలె రా
మునియాశ మాని తనమ్రుదు,తనువును సర్వాభరణవి♦తానంబులచేన్. ౯

తే. తగ నలంకృతయగునట్లు ♦ తా నొసర్చి
కొనుచు ననుఁ బొందఁగలదు; వా♦ల్గనులు గలుగు
జనకసుత యుద్ధమున మృతిఁ ♦ గనిన రామ
లక్ష్మణులఁ గాంచి తనయాశ♦లను వదలుచు. ౯½ 1748

సీ. నాకంటె గతివేఱు ♦ లేకుండుటను మది వెనుకకు మరలించు♦కొనుచుఁ దాన
ననుఁ బొందఁగల దింక;♦ననిన దురాత్ముఁడౌ దనుజేంద్రువచనముల్ ♦ వినుచునట్లు

చేయుదు మేమని ♦ చెప్పి పుష్పకవిమానము కడ కేగి రం♦తటను దనుజ
కాంతలు రావణా♦జ్ఞను బుష్పకముఁ గొని యాయశోకవనంబు♦నందు నున్న

ఆ. సీతకడకుఁ బోయి ♦ రాతఱి భర్తృదుః
ఖార్తయగుచు స్రుక్కి ♦ యవనిమీఁదఁ
బొరలుచున్నసీతఁ ♦ బుష్పక మెక్కించి
రవల దనుజలలన ♦ లామెతోడ. ౧౫ 1749

క. అల త్రిజటను నెక్కించి ర,వల రాముని సతనిసహాజు ♦ బవరంబునయం
దిలఁ జచ్చిపరుండఁగ నా,వెలఁదికిఁ జూపుటకుఁ జనిరి ♦ వే తోడ్కొనుచున్.

తే. రావణాసురుఁ డంత హ♦ర్షమున లంక
యందు నెల్లెడ ధ్వజపతా♦కాళిఁ గట్టఁ
గా ననుజ్ఞను జేసి ని♦కామవిభవ
మలరుచుండఁగఁ గైసేయ ♦ నట్లు చేసె. ౧౬ 1751

క. పురమున నెల్లెడలను రఘు,వరుఁ డాలక్ష్మణుఁడు కడఁగి ♦ బవరంబున నా
వరతనయుతోడఁ బోరుచు, గురుతర బాణములచేతఁ ♦ గూలిరి సుండీ!. ౧౭

క. అని చాటించెను; ద్రిజటయు,జనకజయును బుష్పకమునఁ♦జని యిలఁబడి యు
న్ననిఖిలవనచరబలములఁ, గనియోర్ మఱి యందు దనుజ♦కాంతు లలరుచున్.

చ. మనముల సంతసంబు దగ ♦ మానితరీతుల నుంటయున్ వగల్
గని హరివీరు లెల్ల రఘు♦కాంతులపార్శ్వములం గలంగుచున్
గనులను బాష్పపూరములు ♦ గాఱఁగ నుండుటయుం గనుంగొనెన్;
జనకజ యంత భూమిపయి ♦ శాత్రవభీకరులౌ రఘూత్తముల్. ౧౮ 1754

మ. శరపీడం గని కత్తళంబులు చనన్ ♦ జాపంబులున్ జాఱి యా
ధరణిం దూలఁగ సాయకావళుల గా♦త్రంబుల్ మహార్తింగనన్
శరజాలాంతరమందు బాణమయమా ♦ శయ్యం దగం బవ్వళిం
చి రహిం బొల్పకయుండఁ జూచె వగలం ♦ జిత్తంబు భీతిం గనన్. ౨౦ 1755

చ. జనకజ యందు వీరులయి ♦ సారసపత్రవిశాలనేత్రులై
మనుజమహేంద్రులై తనరు ♦ మాన్యుల భార్గవుల నగ్నిపుత్రులై
తనరు విశాఖుస్కంధు సరి♦తప్పక పోలుచు బాణతల్పమం
దును శయనించి పల్లటిలి ♦ ధూళిని బ్రుంగిన వారిఁ గాంచెఁదాన్. ౨౧ 1756

క. కని యానరవర్యుల నా,ర్తిని బొందుచు దుఃఖపడుచుఁ ♦ దీవ్రనినాదం
బున నేడ్చెఁ జాలసే పా,జనకజ; యనవద్యదేహ ♦ సతి యావేళన్. ౨౨

ఆ. అసితనేత్రములను ♦ నారఘురాముని
నానుమిత్రతనయు ♦ నవనిఁ బొఱలు
చున్న వారిఁ గాంచి ♦ క్రన్నన విలపించె;
నంత శోకబాష్ప♦హతయు నగుచు. ౨౩ 1758

చ. సురలవలెం బ్రభావమున ♦ శోభిలు నారఘువర్యులన్ సహో
దరులను గాంచి వచ్చిరని ♦ తా మదినెంచుచు దుఃఖవార్ధిలో
నిరతము మున్గుచున్ వికచ♦నీరజనేత్రము లాకులంబులై
పరఁగఁగ నిట్లుపల్కెఁ దన♦భాగ్యవిహీనత కాత్మఁ గుందుచున్. ౨౪ 1759

నలువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౮ - వ సర్గము.

సీత దుఃఖించుట.

చ. తనపతి రామచంద్రుఁడు ని♦తాంతబలుండగు లక్ష్మణుండు నా
యని మృతి నొందుటం గనుచు ♦ నా జనకాత్మజ! శోకయుక్తమై
మనము తపింప జాలిగను♦మాటల నిట్లని యేడ్చె; నక్కటా
మును నను గాంచియే సుగుణ♦ముఖ్యులు భావివిదుల్ మహాత్మకుల్. ౧

క. *సాముద్రికలక్షణముల, నేమంబున నెఱిఁగినట్టి ♦ నిశ్చితమతు లీ
భామిని బుత్రిణి, పతియుత, యీ,మానిని యీమె యనుచు♦నాడిరొ పూర్వుల్.

తే. అట్టి జ్ఞానులు నీరాముఁ ♦ డంతమొందు
టను నసత్యము చెప్పిరి; ♦ మునుప దెవ్వ
రీమహాత్ముని నాభర్త ♦ నింపుమీఱఁ
గనుచు హయమేధముఖ్యయా♦గముల నిలఁడు. ౨౫ 1762

క. ఒనరించుననియు సత్రము,లను గావించునని తగువి♦లాసంబునఁ జ
క్కని పల్కులు వల్కిరొ యీ, యనఘులు సుజ్ఞాను లితఁ ♦ డంతంబొందన్.

క. అనృతము చెప్పినవారే, యనఁగుదురు; దైవవేత్త♦లౌ బ్రాహ్మణు లొ
య్యన నేను వినుచునుండం, గను నాసమ్ముఖమునందుఁ ♦ గలకాలంబున్. ౩౫

తే. నిత్యమంగళవతియగు ♦ నెలఁత యీమె
యనుచుఁ బల్కిరొ యాజ్ఞాను ♦ లనృతవాదు
లైరి రాముఁడు హతుఁడౌట; ♦ నేను నన్నుఁ
గాంచుచున్ వీరభూపతి♦కాంత వగుదు ౪ 1765

తే. ధన్యురాలవు నీవని ♦ తగఁబలికిరొ
జ్ఞాను లవ్వార లీరఘు♦సత్తముండు
హతుఁ డిచటనౌట నన్ృతంబు ♦ ననువదించి
నట్టివారైరి గా; యన్య♦సంఘములందు ౫ 1766

క. సరసిజరేఖ లివే యి,క్కరణిన్ గన్పట్టెడున్ ని♦కామం బిలనీ
సురుచిర రేఖలు గలసుం,దరులు మహారాజునకును ♦ దారలె యగుచున్. ౫౫

---

* ఊచు ర్లక్షణినో యే మాం పుత్రి ణ్యవిధవేతిచ-అనిమూ.

సీ. వారితోఁగూడి య♦పారలక్ష్మింగూర్చు సామ్రాజ్యమునయందుఁ ♦ జారురీతి
నభిషిక్తలే యౌదు రట♦యవ్వినాయందు నేలనిష్ఫలముల♦య్యెనో యెఱుంగ;
దౌర్భాగ్యవతులగు ♦ తరుణు లేలక్షణములఁ గూడి వైధవ్య♦ఫలము నొందు
దురో యట్టి విధములౌ ♦ దుర్లక్షణము లెంత పరికించినను గనఁ♦బడక యున్న

తే. వకట! నాయందుఁ గల్గిన ♦ యఖిలభద్ర
లక్షణమ్ములు గన నిష్ఫ♦లంబు లయ్యె;
ధ్వజముఖేతరబహుచిహ్న♦వారయుక్త
ములగు నీపద్మరేఖలు ♦ తలఁచి చూడ. ౭౪ 1768

తే. పద్మగలవను నీయర్థ♦వరము సార్థ
ముగనె చెల్లించునని శాస్త్ర♦ములఁ గనఁబడు
నిచట రాముఁడు హతుఁ డౌట ♦ నివ్వి నాకు
మాత్రమే నిష్ఫలము లయ్యె ♦ నూట లేల. ౮ 1769

సీ. కురులు సూక్ష్మంబులు♦సురుచిరములు సమంబులునయి నల్లఁగాఁ♦బొల్పువిూఱు
చున్నవి, కనుబొమల్♦పొందొంటితోఁగూడ కున్నవి నా జంఘ♦లొప్పు మిగుల
వృత్తంబులై తగి ♦ వెంట్రుకలే లేక వఱలెడు నిదె పలు♦వరుస మిగుల
దట్టముగాఁ గూడి ♦ తనరారుచున్నది [1]శంఖములనఁగను ♦ జను నయనయు
గప్రాంత[2]భాలభా♦గంబులు నయనముల్ పదకరోరువులు గు♦ల్ఫములు నుపచి
తంబులై యున్నవి; ♦ తగినట్లు గుండ్రనై పరఁగునఖంబులు ♦ పరమరుచిర
ములునయి నాచేతి♦కొలఁదికిఁ దగినట్లు సమములై యున్న వీ♦ స్తనములు నవి
రళములై ప్రభువులై ♦ లలితనిమగ్నచూచుకములై యున్నవి ♦ సొంపుగల్గు
నాభిచుట్టును సము♦న్నతిఁ గాంచి యంతరమందు నిమ్నంబయి♦యలరుచున్న
దురము పార్శ్వంబులు ♦ పరఁగుచున్నవి కంఠబలువున నామేని♦వర్ణ మమల
మణివలె స్వచ్ఛమై ♦ గణనకు నెక్కుచుఁ గనఁబడుచున్న దీ♦తనురుహములు
మెత్తగానున్నవి ♦ మించుశాస్త్రజ్ఞు లీపాదాంగుళంబులు ♦ పదియుఁ బొద

తే. తలములును జక్కఁగా నేలఁ ♦ దాఁకి యుంట
నన్ను శుభలక్షణాఢ్యగా ♦ సన్నుతించి;
రట్టి పృథులయవాఖ్యరే♦ఖాన్వితములు
కరపదంబులు నడుమ యం♦తరము లేక. ౧౩౪ 1770

క. తనరుచు సమధికకాంతిం, గనియున్నవి; విప్రవరులు ♦ కన్యాచిహ్న

1 శంఖే నేత్రే కరౌ పాదౌ-అనియు. శంఖే=నేత్రప్రాంత్యభూతలలాటపార్శ్వే, అని వ్యాఖ్య. 2 భాలశబ్దమునకు ఫాలమని దాక్షిణాత్యపాఠము. ఈశబ్దము మేదినీకోశమున భాదివర్గమున నున్నది ఫాదివర్గమున నెందును జేర్పఁబడలేదు. భాం లాతీతి అనివ్యుత్పత్తిచే నిది భాలమే కాని ఫాలముకాదని తోఁచెడు. ఫాలమనుట దాక్షిణాత్యపాఠ మెట్లుసాధువో వెదకవలయు.

లిని దెలిసినవారలు ననుఁ, గని మందస్మితనుగాఁగ ♦ గణుతించి రొగిన్.

క. పెనిమిటితో హర్షం జెలఁగుచు, ననుపనురాజ్యపదమందు ♦ నభిషేకం బీ
వనిత గనునంచు దైవ, జ్ఞనికర మపు డనియె నది య♦సత్యం బయ్యెన్. ౧౪

తే. సహజులతో వీర లాజన♦స్థానమందు
నంతటను నన్ను వెదకుచు ♦ నవల నాదు
స్థానము నెఱింగి నాకయి ♦ దాఁటరాని
జలనిధిని దాఁటి తుదకు నీ♦స్థలమునందు. ౧౪౹ 1773

క. తలపోయ గోష్పదాకృతి, వెలసిన యాదనుజమాయ ♦ విధి ప్రతిహతియుం
గలిగినకతమునఁ బడి రీ, యులయులు రాఘవులు వారు♦ణాస్త్రవరంబున్. ౧౫

క. అనలాస్త్రము నైంద్రాస్త్రము, ననిలాస్త్రము బ్రహ్మశీర్ష♦మనునస్త్రముఁ బొం
దినవారుగాదె; యయ్యవి, చనియె నదెచ్చటికి విగత♦సారము లగుచున్. ౧౬

క. మాయఁగొని యింద్రజిత్తని, నేయొడలం గానరాక ♦ యింద్రోపములై
నాయాధారములై తగు, నీయునఘులఁ జంపె నాకు ♦ నెది దిక్కనికన్. ౧౭

క. అని శ్రీరాఘవు నృకప్పథ, మునఁబడిన విరోధి యెంత ♦ మొనగాఁడైనన్
గనువాఁడైన మనోజవ, మును బ్రాణములుంక మరలి ♦ ముందటిస్థలికిన్. ౧౮

*చ. అరుగఁగఁ జాలునే మతియు ♦ నద్భుతబాహుబలాఢ్యుఁడైన భూ
వరుఁ డనుజాన్వితుండయి య♦భవ్యగతిన్ హతుఁడై దురంబునన్
ధరణిఁ బరుండినాఁడు గద ♦ దానని కాల మొనర్పరానిదై
బరువగుకార్య మేదియును ♦ బాగుగ నెంచినఁ గానరాదిలన్. ౧౯ 1778

తే. దైవమును గెల్వ నెంతయుఁ ♦ దరము గాదు;
జాలిఁ బుట్టించు స్థితిఁ జూడఁ ♦ జాలియున్న
యత్తగారిని గౌసల్య ♦ నాత్మలోనఁ
దలఁచుకొనునప్డు నామహో♦దారు రాము. ౧౯౹ 1779

క. ఘనబలశాలిని లక్ష్మణు, నను నాజనయిత్రి నాను♦నంబునఁ దలపో
సి ననున్ దుఃఖం బంతగఁ, గనఁబడ; దాసాధుశీల ♦ కౌసల్య మదిన్. ౨౦

క. వనవాసవ్రతమును జక్కనిగతిఁ బదునాలుగేండ్లు ♦ గావించి ధరా
తనయయు లక్ష్మణరాములు, చనుదే నే నెపుడు చూడఁ ♦ జాలదునో కదా.

క. అని నిరతము చింతించుచుఁ, గనుచుండును మార్గమును చుఁ ♦ గామిని యేడ్చెన్
జనకజ యిటు పలవింపం, గని త్రిజట యపంగ నొప్పు ♦ కర్బురసతి తాన్.

తే. పలికె నిట్లని; దుఃఖింప♦వలదు దేవి, నేఁడు నీపతి బ్రదికి యు♦న్నాఁడు సుమ్ము
తల్లి! యాయన్నదమ్ము లీ♦ధారుణీశు, లైన శ్రీరామలక్ష్మణు ♦ లరసిచూడ. ౨౧౹

క. జీవించి యున్నవారని, భావంబున నమ్మఁ జేయు ♦ స్పష్టములగుచున్

* నకాల స్యాతిభారో స్తి-అనిమూ.

వేవిధముల ననుభూతము,లై వఱలెడు కారణములు ♦ నగపడునాకున్. ౨౩
క. వానిం జెప్పెద వినుమా!, నీనాథుఁడు నిహతుఁడగుట ♦ నిక్కమెయైనన్
మానిని! యోధులముఖములు, గానంబడ విట్లు క్రోధ♦కలితము లగుచున్.

తే. హర్ష పర్యుత్సుకములుగా ♦ నగపడవిటు;
జానకీ! యీరఘూత్తముల్ ♦ చచ్చియున్నఁ
బుష్పకం బనుపేర నొ♦ప్పుచును దివ్య
మైన యీవ్యోమయాన మ♦నూనరీతి. ౨౪ 1786

క. నిను నిట్లు దాల్చియుండదు;, వినుము ప్రధానుఁ డగునట్టి ♦ వీరుఁడు హతుఁడ
య్యెనయేని యట్టిసేనలు,మనముల నుత్సాహ మెడల♦మ్రాన్పడుచుఁ గడున్.

తే. యత్నముల వీడి జలముల♦యందు నోడ
నడపుమానిసి లేనట్టి ♦ నౌకరీతి
యుద్ధములలోనఁ దబ్బిబ్బు ♦ లొందుచుండుఁ
దమకు నాధారభూతుండు ♦ ధరణిఁ బడుట. ౨౬ 1788

చ. వనచరసైన్య మిద్ది బల♦వంతముగాఁ దగి తొట్రుపాటునుం
గనక భయంబు నొందక ని♦కామముదంబున రామలక్ష్మణుల్
గనరు వినాశనంబని త♦గన్ వచియించితిగాదె నీకు నా
ఘనులను గాచుచున్నది; సు♦ఖంబుగ జ్ఞేయములైన గుర్తులన్
వనరుహమిత్రవంశజులు ♦ వర్ణితకీర్తులు ప్రాణయుక్తులే
యని మదినమ్మకంబు గన♦వమ్మ! రఘుప్రవరుల్ సజీవులే
కనుఁగొనవమ్మ! మైత్రిమెయిఁ ♦ గాంతరొ! యింతగ నొక్కిచెప్పుదా
న; *ననృత మింతదాఁకను మ♦నంబుననైన వచింపలేదు సూ!. ౨౭ 1789

క. నే నిఁకముం దెప్పటికిం,గాని యబద్ధమును జెప్పఁ♦గాఁబూనను నో
జానకి! పాతివ్రత్యము,చే నుల్లాసమును గూర్చు ♦ శీలవతివినూ!. ౨౮ 1790
క. కనుకన నీయం దెంతయు, ఘన మలరెడు నాకుఁ ద్రిదశ♦మాన్యుని తోడ్పా
టును గని దేవాసురు లే,వున వచ్చిన వీరి గెలువఁ ♦ బోల దనిమొనన్. ౨౯

తే. బ్రదికియుంటకు గుర్తులౌ ♦ బలముఖప్ర
సాదముఖలక్షణములను ♦ జక్కఁగాంచి
యట్టికల నప్డు నేఁగాంచి ♦ యరసి నీకుఁ
జెప్పితిని మైథిలీ! నే వ♦చించినట్లు. ౩౦ 1792

క. అనుపమసుమహాచ్చిహ్నము,లను వీనిని మెల్లఁగా సి♦లాతనయా! నీ
వును జూడు మూర్ఛమున్గిన, ఘనమతులన్ వీరిపదన♦కాంతి విషదుసూ!. ౩౧

* అనృతం నోక్తపూర్వం మే నచవక్ష్యే కదాచన-అనిమూ.

క. ఆయుష్షు చెల్లి యసువుల, దాయములను బాసియున్న ♦ తనుధారులకే
యేయెడలఁ బ్రాయికంబుగఁ, బాయును ముఖకాంతివిక్రృతిఁ♦బరఁగుం జుమ్మీ.
సీ. జానకీ! రామల♦క్ష్మణవిషయంబున నిట్లు శోకంబున ♦ నిందు ముఖివి
కారంబునొందకు♦వారు చచ్చిరటంచు భ్రమను బూనకు మింక♦స్వాంతమందుఁ
గుందుఁ బొందకుము యీ♦క్షోణీశపుత్త్రులుజీవించియుంటకుఁ ♦ జెల్లఁగాని
యది యశక్యమ్ము గా♦దనియు; నింతట సురకన్యకవంటి యా♦క్షమతనూజ
తే. త్రిజట చెప్పినమాటలు♦తేటు వినుచు, నంజలింబట్టి నీవన్న♦యట్లె వీరు
బ్రదికియుందురు గాకని ♦ పలికె; నంత,టను మనోజవపుష్పకం♦బును మరల్చి.
క. దీనాననయై తగునా, జానకినిం ద్రిజటతోడ ♦ సరగునఁ బురికిన్
దానవకాంతలు గొనిచని, యానెలఁతను ద్రిజటతోడ ♦ నందుండి తగన్.
క. అవరోహింపం జేయుచు, జవమున నావనముఁ జేర్చి ♦ సమధికమగు పూ
న్కి వఱల రక్షించిరి; ది,వ్యవనం బది వివిధవృక్ష♦బహుళం బగుచున్. ౩౬
చ దనుజమహేంద్రు కేళికి ని♦తాంతము యోగ్యము నొచు నొప్పె నా
వనము నశోకనామకము ♦ వారిజనేత్రయుఁ జేరి సంగరం
బున నల రామలక్ష్మణులఁ ♦ బోలఁగఁ జూచినరీతినిన్ మనం
బునఁ బరిచింతసేయుచును ♦ *భూరివిషాదము నొందె నచ్చటన్. ౩౭ 1798

నలుబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౪౯ - వ సర్గము.

రాముఁడు కొంత తెప్పతేల్లి లక్ష్మణునిం గాంచి దుఃఖించుట.

క. వనచరతిలకులు సుగ్రీ,వునితోడం గూడి బలము ♦ పొంగఁగఁ దగియుం
డినవారయ్యును సంగర,మున ఘోరభుజంగబంధ♦ముల బద్ధులైయై. ౧
క. ఉరగంబులవలె నూర్పులు, పరిపరి వెలిఁబుచ్చుచున్ వి♦భంగముగా నె
త్తురుగాఱ రామలక్ష్మణు, లురుచిత్తులు భూమిఁబండి ♦ యుండఁగ వారిన్.
క. పరివేష్టించుట వగలం, బరిపూర్ణులు నగుచునుండ; ♦ వరవిక్రముఁడై
పరఁగెడు రాముండు తదవ,సరమున సహిపాశరూప♦శరబద్ధుండై. ౩ 1801
క. బలవంతుఁడు ధీరుఁడునై, చెలఁగుటచే మూర్ఛఁ దేఱె; ♦ క్షితిఁబడి బాణం
బులు మిగులఁ గ్రుచ్చుకొన ని,మ్ముల రక్తముగాఱ దుఃఖ♦మును బైకొనఁగన్.
తే. దీనవదనంబునం దగి ♦ మానసీయుఁ
డైన తమ్ముని లక్ష్మణు ♦ నపుడు గాంచి
యాతురుండయి విలపించె; ♦ నార్తి నాదు
తమ్ముఁ డని నిర్జితుండయి ♦ ధరఁ బరుండె. ౫ 1803

* పరం విషాదం సముపాజగామ-అనిమూ.

క. కనుఁగొనుచున్నాఁడవె యిఁక, జనకజతో నేమిపని? యొ♦నంగెడు ప్రాణం
బును గూడ నింక నేటికి, నని వెఱకిన యెడల సీత♦నంటి పడఁతుకన్. ౫½

క. సంపాదింపఁగవచ్చును, దెంపున సచివుండు యుద్ధ♦ధీరుఁడునగు నీ
తెంపరి లక్ష్మణువంటి ని,లింపసముఁ భ్రాతఁ బొంద♦లే నెటులైనన్. ౬

తే. అలసుమిత్రను నానంద♦కలితఁ జేయు
నీతఁడే మృత్యువును బొందె♦నేని నేను
వానరులు వీరు చూడంగఁ ♦ బ్రాణములను
వదలువాఁడ; నయోధ్యకుఁ ♦ దర్లఁగఁ బోయి. ౭ 1806

క. జననికిఁ గౌసల్యకు నే, మని చెప్పుదుఁ? గైకఁ గాంచి ♦ యనుజు గుఱిచి యే
మనిపల్కుదు? నేనొకఁడనె, చనుదునయేఁ గన్నసుతుని ♦ జూడఁ దెలియుఁగన్.

చ. *మనమున సంతసంపడును ♦ మానితచిత్త సుమిత్ర యాత్మజుం
గనుఁగొనలేక తద్విధముఁ ♦ గన్నన నే వచియింపఁగా వగన్
విని గతవత్సయై వణఁకి ♦ వే తపియించెడు నావుపోల్కిగాఁ
గను, గురరీవిధంబునఁ ద♦గన్ రొదసేయుచు నుండ నయ్యెడన్. ౮½ 1808

క. ఏమనుచు నూఱడింతును, నేనని శత్రుఘ్నుఁ గీర్తి ♦ నెసఁగు భరతు నే
నేమాటలఁ బలుకుదు; స, న్నేమఱక యె కాననమున ♦ కేతెంచి తమిన్.

క. పరిచర్యసేయు నాసో,దరు లక్ష్మణు విడిచి యొంటిఁ ♦ దరలి పురికి నే
నరిగిన సుమిత్ర నీసో,దరుఁ డెక్కడ వచ్చెఁ గాదె ♦ తా మును నీతోన్. ౧౦

క. అనుచు నిటు లుపాలంభిం,చిన నెట్లు సహించి యుందుఁ ♦ జిత్తమున నయో;
మనియుండ నిష్టపడ నిఁకఁ, దను విచ్చుటనే త్యజింతుఁ ♦ దర్లరపడి కడఁకన్.

క. వనమునకున్ లక్ష్మణుఁ దో,డ్కొనివచ్చెడు దుష్కృతంబుఁ ♦ గూర్పంగల యీ
పని నొనరించితినే చీ, యనార్యుఁడను బెక్కుమాట ♦ లననేల యిఁకన్.

క. నాకొఱకుఁ గాదె లక్ష్మణుఁ, డీకరణిన్ ధరఁ బరుండి ♦ యిప్పు గతాయు
శ్రీకుండై యున్నాఁడని, భూకాంతుం డేడ్చి తమ్ముఁ ♦ బొడఁగని యనియెన్.

తే. నేను దుఃఖంచుచుండఁగ ♦ నీవనిశము
చక్కఁగా నూఱడింతువు ♦ శమనుపురికి
నీవు చన నింక వగపాలు ♦ నేను గాఁగఁ
బలుకఁ జాలవుగద గుణ♦వారిరాశి. ౧౩ 1814

క. దురమున నెవఁ డిత్తఱిఁ గ,ర్బురులను వధియించి వారి ♦ భూమిని బడని
ర్భరశక్తిఁ జేసెనో యా, వరవిరుం డీధరిత్రి ♦ వైర హతుండై. ౧౩½ 1815

క. పడియున్నవాఁ డయో; యీ,తఁ డిప్పు డిటు రక్తసిక్త♦తనుఁడై శరముల్
గడునాటియుండ నిచ్చటఁ, బడి యీశరతల్పమందు ♦ వైరులు నవ్వన్. ౧౪

* విపత్సాం వేపమానాం చ క్రోశంతీం కురరీ మివ-అనిమా.

తే. అస్తమయ మొందు భాస్కరు♦నట్లు వెలయు
చున్నవాఁడు; శరవ్రజ ♦ మొగిని మర్మ
ములను నెల్లెడ నాటుటఁ ♦ బలుకనేర
కున్నవాఁ డక్కటా! చెప్ప♦కున్న నేమి. ౧౫ 1817

*క. ఈతనిదృగ్రాగంబున, నేతనువున నితనికున్న ♦ యీబాధలు నా
చేతస్సునకుం దెల్పెడు, నీతఁడె, గురుకాంతిగల్గు ♦ నీతం డెలమిన్. ౧౬ 1818

చ. వనమున కేను వచ్చుతఱి ♦ వారక నన్నటువెంబడించి వ
చ్చెనొ యటు లేను నంతకుని ♦ జేరఁగ నీతఁడు పోవునప్పు డీ
తనివెను వెంటఁ బోయెదను; ♦ దత్పురిఁ డీతఁడు బంధుజాలముం
దనిశము నేను మూని నను ♦ నాదృతిమీఱఁగ వెంబడించుఁ జూ!. ౧౭

సీ. ఈలాటిమహనీయుఁ ♦ డిపు డనార్యుఁడనగు నాదుర్ణయములచే ♦ మేదిని నిట
దురవస్థ నిట్లు పొం♦దుచున్నవాఁడయో; విక్రమాఢ్యులలోన♦ వీరుఁడితఁడు
తా నెంతదోషంబు ♦ మానసంబున నొందెనేని నాతోఁ బ్రీతి♦లేని యట్టి
పలుకులనుంగాని ♦ పరుషోక్తులంగాని పలుక నే విన లేదు ♦ పంతమూని
తే. యొక్కతఱినైన; నీవీరుఁ ♦ డుక్కు మిగిలి
కరయుగంబున నొప్పియుం ♦ గరసహస్ర
మునఁ జెలంగెడుకార్తవీ♦ర్యునిని మించుఁ
బంచశతబాణములు గూర్చి ♦ వైచు నపుడు. ౧౮ 1820

క. ధనువునఁ బంచశతేషువు,లనుగూర్చి యతండు కరవి♦లాసము మీఱం
గను వైచు నంతలో నీ,యనూనవిక్రముఁడు శరము ♦ లన్ని విడుచుఁజూ!. ౨౦

క. కనుకనె బాణాస్త్రములం, దనూనమగుశక్తి నధికుఁ ♦ డాతనికంటెన్;
ఘనమతియా శతమఖు విధి, ఖనికరములఁ గూడఁ గొట్టఁ♦గలవాఁ డెవఁడో.

తే. అట్టి లక్ష్మణుఁ డతిమృదు ♦ వైనశయ్య
పయిని శయనింపఁ దగినవాఁ♦డయియు నిపుడు
వైరిహతుఁడయి ధరణిపైఁ ♦ బండియున్న
వాఁడు; నే నవ్విభీషణు♦తోడ నపుడు. ౨౧ 1823

క. నినుఁ బతిసేసెద దనుజుల, కని పల్కితి నట్లుచేయ ♦ నైతిఁ గనుకఁ జె
ప్పిన బొంకుమాట తప్పక, ననుఁ గాల్పం గలదటంచు ♦ నానాగతులన్. ౨౨

{ రాముఁడు సుగ్రీవుని గిష్కింధకుఁ బొమ్మనఁగా విభీషణుఁడు వానరుల నాపి రామునొద్దకు వచ్చుట. }

ఆ. పలికి పలికి; ప్లవగ♦పతిని సుగ్రీవునిఁ, గని వచించె నిట్లు ♦ వనచరేశ
యీక్షణంబ తరలి ♦ యిటనుండి కిష్కింధ, కరుగఁ దగును నట్టు ♦ లరుగ వేని.

* దృష్టిరాగేణ సూచ్యతే-అనిమూ.

క. నే నిట లేకుండుటయుం, దా నెఱిఁగి దశాననుండు ♦ దర్పబలయుతుం
డై నిన్నుఁ దరిమి కొట్టును;, నూనుని నంగదుని సఖుల ♦ శూరవితతులన్.

తే. నలుఁడు నీలుఁడు లోనగు ♦ ఖలజనాంత
కరులుగాఁ దగు కపులతో ♦ సరిదధీశు
దాఁటుమా; హనుమయును యు♦ద్ధమున నొరులు
చేయలేనట్టి కార్యముల్ ♦ చేసినాఁడు. ౨౮౪ 1827

సీ. జాంబవంతుండు ఋ♦క్షస్వామి, యాగవాక్షుండు గోలాంగూల♦కూటవిభుఁడు
సమరంబొనర్చిరి ♦ సంతసించితి నేను; నంగదుండును మైందుఁ♦డాద్వివిదుఁడు
నని యొనర్చిరి, యుద్ధ♦మును ఘోరరీతిఁ గేసరియు సంపాతియు ♦ సల్పినారు;
గవయు, గవాక్షులు ♦ గజశరభులు మఱియితరవానరవీరు ♦ లెల్ల నాడు

తే. విషయమై ప్రాణములనైన ♦ విడువఁబూని, సంగరం బొనరించిరి ♦ సకలకీశ
పాలకా! యేమొనర్చిన♦నేల? కడకు,*దైవమును మీఱమర్త్యుల♦తరముగాదు.

చ. అరిజనసూదనా! వనచ♦రాధిప! నెచ్చెలి యెంతమాత్రమె
క్కరణి నొనర్పఁగాఁ దగునొ ♦ కాదస కంతటికార్య మీవు ధ
ర్మరతిని గాంచు శీలమున ♦ రాజిలువాఁడవు గాన ధర్మమే
వరుస నశించెనో యనుచు ♦ స్వాంతమునన్ భయమంది చేసి తీ
వరసియె ధర్మమూలముల ♦ నంచు వచించి కపీశ్వరాళితోన్. ౨౯౪ 1829

చ. వనచరవీరులార! యెటు♦వంటి యవస్థలకైన నోర్చి మి
త్రునిపనిఁ జేసినార లిఁకఁ ♦ దోఁచినయట్లు చనుండు నేను మీ
కనుమతి నిచ్చినాఁడ; నన ♦ నాప్లవగేంద్రులు రాముఁ డేడ్వఁగా
విని వగ నక్షు లెత్తువడ ♦ వీడిరి నేత్రజలంబు లార్తులై. ౩౦౪ 1830

క. కరమున గదఁ దాలిచి యా,తరుణమున విభీషణుండు ♦ తద్బలముల ని
ర్భరశక్తి నిలువరించుచుఁ, ద్వరపడి శ్రీరాముఁ డున్న♦స్థలముం జేరెన్. ౩౧౪

క. నీలాంజనచయసుట్టులు, గ్రాలెడుతనువునను వచ్చు ♦ క్రవ్యాదవరున్
శీలయుతు నవ్విభీషణు, నోలిం గని ప్లవగవర్యు ♦ లురుబలులయ్యున్. ౩౨

తే. పరుగులెత్తిరి రావణి ♦ మరఁలవచ్చె
నేమొ యనుభీతి; [చేష్టల ♦ నెల్లమాని
యుపగతజ్ఞానులై సమ♦రాంగణరజ
ములను బొరలుచు శరతల్ప♦ములఁ బరుండి. ౩౨౪ 1833

క. కనుఁగొనరానట్టి యవ,స్థను బొందిన రాఘవులను ♦ దాఁ గన వచ్చెన్
దనుజేంద్రుఁ, డంత రాఘవు, లని నిలఁబడి యుండుటయును ♦ నాతనిరాకన్.

* న చాతిక్రమితుం శక్యం దైవమ్-అనిమా.

ఆ. గాంచి యింద్రజిత్తు ♦ కడఁగి వచ్చెనో యేమొ
యనెడు శంకనొంది ♦ యనిలహతము
లైన ఘనములట్లు ♦ లతిశయవ్యథనొంది
రట్టి యవసరమున ♦ నార్తులగుచు.] 1835

నలువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౫౦ - వ సర్గము.

{ విభీషణుని సుగ్రీవుఁ డాశ్వాసించుట.
గరుడుండు రాఁగా నాగపాశములు వదలిపోవుట. }

క. అంత మహాతేజుఁడు బల,వంతుఁడు కపిరాజు ప్లవగ♦వాహినులు భయ
స్వాంతముల నపుడు పాఱుట, కెంతయుఁ దగుకారణంబు♦నెఱుఁగక త్వరతోన్.

క. వనచరులం గని తా ని,ట్లనియెన్ మనసేన యిద్ది ♦ యంబువులం దో
య్యనఁ బ్రతికూలమహానిల,మున హతమగు నౌకరీతి ♦ మోహములయందున్. ౧

తే. దైన్యముం దోఁప వ్యాకుల♦త్వమును గనియె
నేలొకో యని ప్రశ్నింప ♦ నెదుటనున్న
వాలితనుజాతుఁ డంగదుఁ ♦ డాలకించి
పలికె నిట్లని సుగ్రీవు♦కలఁత దీర్ప. ౧౫ 1838

సీ. దశరథభూపునా♦త్మజులు మహాత్ములునగు రాఘవుండు మ♦హాబలుఁడగు
నాలక్ష్మణుండు దే♦హముల బాణంబులు కడు నాట రక్తసి♦క్తతనులగుచు
శరతల్పములయందు ♦ శయనించి యుండుట గనలేదె నీవిప్డు ♦ కారణ మిది
తప్ప వేఱొకటి యి♦త్తఱి లేదు నాన్ వనచరపతి పుత్రువ♦చనములు విని

తే. రఘుకుమారకు లిట్లు ధ♦రంబరుండు
టందులకుఁ గాదు హేతువం ♦ చరయ లేదు
భయనిమిత్తము వేఱొండు ♦ పరఁగియుండ
వలయు దీనికి నేలన ♦ వరుసవినుము. ౪ 1839

క. వనచరులు వీరు వదనము, లనూనదుఃఖమును జూప ♦ నతిభయము తగం
గను లట్టె విప్పి చూచుచు, ననికిం దగుతరుశిలాది♦కాయుధతతులన్. ౪౫ 1840

ఆ. పాఱవైచి యొటకొ ♦ పరువెత్తుచున్నారు
కనుము వీర లొకనిఁ ♦ గాంచిరైన
సిగ్గుపడక వెనుక ♦ స్థితిని జూడక వేగ
చనుట కుద్యమించి ♦ సాధ్వసమున. ౫౫ 1841

క. ధరఁ బడియుండిన వనచర,వరులను దాఁటుచును బోవు♦వార లదిగో యొం

డారులను నీడుచుకొనుచున్, గరమరు దిది యనుచు నుండఁ ♦ గా నంతటిలోన్.

క. కరమున భీకరమౌ గద, ధరియించి విభీషణుండు ♦ తపనజు నాశీః
పరివర్ధితుఁ జేయుచు రఘువరుఁ గాంచెన్ గపివరుండు ♦ బరవస మలరన్. ౭

తే. అవ్విభీషణుఁ గాంచి యా ♦ హరిబలములు
భయము నొందుట నెఱిఁగి యు ♦ పగిదిఁ బలికెఁ
జెంత నిలుచున్న యాజాంబ ♦ వంతుఁ జూచి
యలవిభీషణుఁ డిదె యిట ♦ కరుగుదెంచె; ౮ 1844

క. హరివరు లీతనిఁ గనియే, పరుగెత్తుచునున్నవారు ♦ భయమున దశకం
ధరపుత్త్రుఁ డింద్రజిత్తను, పరిశంకను మిగులభీతి ♦ బడలెడు వీరల్. ౯ 1845

క. నానాదిక్కులఁ బాఱుచు, దీనులునై యున్నవారు ♦ తేకువ నీవీ
వానరుల నివ్వరించుచు, దానవుఁడు విభీషణుండు ♦ ధైర్యము మెఱయన్.

తే. అరుగుదెంచినవాఁ డిదె ♦ యంతెకాని
యింద్రజిత్తని మీరెన్న ♦ నేలయనుచుఁ
బలుకుమా; యని సుగ్రీవుఁ ♦ డెలమిఁ జెప్ప
భల్లుకేశ్వరుఁ డాజాంబ ♦ వంతుఁ డపుడు. ౧౦ 1847

క. పరుగెత్తుచున్న యావన, చరులకు నడ్డముయి నిల్చి ♦ సరసోక్తుల నె
ల్లర నూఱడించె; భల్లూ, కరమణు సూక్తులను వినుచుఁ ♦ గపివరు లెల్లన్. ౧౧

క. చనుదెంచిన యాతనిఁ గన్గొనుచు విభీషణునిఁ గాఁగ ♦ గుఱుతించి భయం
బును మాని యంత సంభ్రమ, మును విడి చనుదెంచి రటకు ♦ మునుపటిరీతిన్.

ఆ. ధర్మచిత్తుఁడైన ♦ దానవపతి యల్ల
దాశరథులదివ్య ♦ తనువులందు
శరము లంటియుండు ♦ చందముఁ గని వ్యాకు
లేంద్రియుఁడయి మదిని ♦ నెట్లొ కలఁగె. ౧౩ 1850

క. కరమున జలములు గొని రఘు, వరులకనుల్ దుడిచి మిగుల ♦ వగ మనసెల్లన్
దురటిల్ల నేడ్చి గట్టిగఁ, బరమార్తుండగుచు నిట్లు ♦ పలికెఁ గలంతన్. ౧౪ 1851

చ. ఇరువురు వీరు సత్వయుతు ♦ లెంతయు విక్రమధుర్యులున్నతుల్
దుర మొనరింప సంతసము ♦ తోఁ దగియుండినవార లౌదురీ
వరుసఁ జెలంగియుండు దుర ♦ వస్థను నీగతిఁ బొందినారు క
ర్బురు లిటుఁ గూటయుద్ధమును ♦ బూని యొనర్చినకారణంబునన్. ౧౫ 1852

క. వీర, లకృత్రిమసంగర, శూరులు గావునను వీరి ♦ చొప్పెఱిఁగి మహా
క్రూరుఁడు నాభ్రాతృసుతుం, డీరసమునఁ గపటయుద్ధ ♦ మే యొనరించెన్. ౧౬

క. జనకునికడుపుం జెఱుపఁగ, జనియించిన దుష్టబుద్ధి ♦ శక్రుని నోడిం
చినరావణి కృత్రిమబుద్ధిని వంచించెను మహామ ♦ తిస్థిరులఁ గటా. ౧౭ 1854

చ. [1]శరములు దేహావయవముల ♦ సాంద్రముగా వడిఁ జొచ్చియుండ నె
త్తురు లోఁగఁ గాఱుచుండ నిలఁ ♦ దొర్లుచునుండుట ముండ్లపందుల
ట్లరుదుగనున్నవారు గన; ♦ నక్కట! యెవ్వరివిక్రమంబు నే
శరణమునొంది సంస్థితిని ♦ జక్కఁగఁ గాంచఁగఁ గోరి యుంటినో. ౧౭ 1855

క. పురుషవరేణ్యులు వారిరువురు దేహమువీడ నిద్రఁ ♦ బోయినవారి
త్తరుణమున నామనోరథ, మురురాజ్యప్రాప్తిఁ గోరు♦చున్నది చెడియెన్. ౧౮

తే. ఇంక జీవించియున్న నా♦కేవిపత్తు
గలుగు నావైరి రావణుఁ ♦ డెలమిఁ దనప్ర
తిజ్ఞనుం దీర్చికొనియెను ♦ దీఱెనతని
కాంక్షితంబెల్ల నిప్పటి ♦ కారణమున. ౧౯ 1857

చ. అని విలపించుచుండఁ బ్లవ♦గాధిపుఁడై ఘనసత్త్వయుక్తుఁడౌ
వనచరపాలకుం డతని ♦ బాగుగఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనెన్
విను మనురేంద్ర! ధర్మముల ♦ వృత్త మెఱుంగుదు వీవు రాజ్యమొ
య్యనఁ దమిఁ బొందఁగాఁ గల మ♦హార్యవిభూతి నసంశయంబుగన్. ౨౦

క దనుజేంద్రునకున్ దత్తను,జనకున్ వాంఛితము తీరు♦చొప్పు కలుగ; దీ
ఘనరుజచే రాఘవులకు, నినకులులకు వీరి కంత ♦ మెట్టులు గలుగున్. 1859

క. తెలియందగు నిది మూర్ఛగఁ, బలుపలుకులిఁకేల మూర్ఛఁ♦బాసి యనిని వీ
రలు రాక్షసగణములతో, ఖలు రావణునిన్ వధింపఁ ♦ గలరు నిజముగన్.

క. అని శీతలవచనంబుల, దనుజేంద్రుని నూఱడించి ♦ తనప్రక్కఁ జెలం
గినవాని సుషేణుని మా,మను గని యిట్లనియె; నీవు ♦ మనబలములలోన్.

సీ. [2]శూరులౌ వానరుల్ ♦ వైరినిషూదనులగు రామలక్ష్మణు ♦ లన్నదమ్ము
లును మూర్ఛఁదేలిన♦వెనుకఁగొందఱఁగపివరులఁ జేకొనిరఘు♦వరులఁగొనుచుఁ
గిష్కింధకరుగుము; ♦ కృత్రిమసంగరమును జేయురావణుఁ ♦ దనయబంధు
సంయుతునిన్ నేను ♦ సమయించి నశియించినట్టి స్వరాజ్యర♦మావతంస

తే. మును మహేంద్రుఁడు తెచ్చిన ♦ యనువు తోఁప
జనకజను దీసికొని వచ్చె♦దను; నటన్న
వనచరేంద్రునిమాటలు ♦ విని సుషేణుఁ
డిట్టులనియెను; బ్లవగసం♦ఘేంద్ర! వినుము. ౨౪॥ 1862

క. సురలకు నసురులకును మును, జరగిన ఘోరతరమైన ♦ సంగరమును నే
నరసితిని; నందు బాణో,త్కరమోక్షణచతురు లగుచు ♦ దారుణబలులై.

---

1 దృశ్యేతే శల్యకా ఇవ-అనిమూ. 2 గచ్ఛ త్వం భ్రాతరౌ గృహ్య కిష్కింధాం రామలక్ష్మణౌ-అనిమూ. హరిగణైస్సహ లబ్ధసంజ్ఞౌ భ్రాతరౌ గృహ్య గచ్ఛేతి సంబంధః-అని మహేశ్వరతీర్థులు.

క. శరవిద్యాపండితులగు, సురవైరులు దేవతలను ♦ శుంభన్మాయా
పరిగతులై పలుమాఱు ప్రహరించి; రంతటను గొంద ♦ ఱసురుల బలులై.

తే. ఆర్తులై రంతఁ గొంద ఱ♦హార్యబాణ
తతుల మూర్ఛల మున్గి రం♦తటను గొంద
ఱంత మొందిరి పిదప బృ♦హస్పతి గని
వారి బ్రదికింపఁదగు బుద్ధి♦వైభవమున. ౨౮ 1865

సీ. *మంత్రప్రధానముల్ ♦ మహితంబులునునగు నట్టివిద్యలచేత ♦ నమలమూలి
కలచేత వారల ♦ కెలమిఁ జికిత్సల నొనరించె; నాముందు♦లను జవమునఁ
దెచ్చుటకై వీరు ♦ లిచ్చటనుండి సంపాతియుఁ బనసుండు ♦ ప్రభృతులైన
వనచరు లాక్షీర♦వారిరాశికిఁ బోవుదురుగాక వనచర♦వరుల కట్టి

తే. పర్వతస్థౌషధంబులు ♦ బహుళకష్ట
సాధ్యములు దెలియంగనౌ ♦ జనులకితరు
లకును దెలియంగరాకుండు ♦ సకలదేవ
కల్పితములగు సంజీవ♦కరణి మఱియు. ౨౯ 1866

క. అరుదగు విశల్యకరణియుఁ, బరమములగు వీని దేర ♦ వానరులే పో
దురుగాక; క్షీరవారిధి, సరిదధిపోత్తమముగాఁ గఁ ♦ జను విఖ్యాతిన్. ౩౦

క. మును నందుం బీయూషం, బును జిల్కినవారు దేవ♦ముఖ్యు, లచట నొ
ప్పును జంద్రద్రోణము లనఁ, జను గిరు లట నోషధులవి ♦ సతతం బుండున్.

క. సుర లాయౌషధముల నా, ధరణీధ్రయుగంబునందుఁ ♦ దారుంచిరి; కీ
శరమణ! వాయుకుమారుం, డరుగుంగాక చటి కిపుడె ♦ యను నంతటిలోన్.

సీ. పక్షమహానిల♦స్పర్శంబునన్ మెఱుపులతోడఁ గూడంగ ♦ జలదములను
నెగురంగఁ గొట్టుచు ♦ సిద్ధమహార్ణవజలమును జల్లుచు ♦ నిలను గంప
మొందంగఁ జేసెడు♦నొప్పునఁ జనుదెంచె గరుడుఁ డాతని ఱెక్క♦లరుదుగాఁగఁ
జలియింపఁ బుట్టిన ♦ శ్వసనుతాఁకున నట లంకామహాద్వీప♦లలితభూరి

తే. తరువు లన్నియు మూలసం♦తతులతోడ
సకలశాఖలతోడను ♦ సంద్రమందు
విఱిగి పడియెను; నంతట ♦ విపులకాయ
ములను బొల్చుచు నాలంకఁ ♦ గల ఫణితతి. ౩౪ 1870

క. పెనుభయముం బొందెను నా, వననిధిలోఁ జొచ్చె నపుడు ♦ వారిఁ గలుగుజం
తుసికరములు వేగంబుగ, వనచరు లాపిదప భూరి♦బలసంయుతునిన్. ౩౫

క. జ్వలియించు హవ్యవాహను, వలె వెలయుచు నొప్పుచున్న♦వాని గరుడుని
మ్ములఁ గాంచిరి; పిదప మహా, బలులయి పురుషోత్తములగు♦భాస్కరకులులన్.

---

* సంపాతిపనసాదయః, హరయస్తు విజానంతి పార్వతీ స్తా మహౌషధీః-అనిమా

క. ఆరామలక్ష్మణులనున్, భూరిమహాబాణరూప♦మునఁ బొల్చెడు గం
భీరఫణుల్ బంధించుట, వారక విడనాడి యతఁడు ♦ వచ్చె లెఱుఁగుచున్.
క. పరుగిడె భయమున; నంతట, గరుడుఁడు కాకుత్స్థులను ద♦గంగని వారి
ర్వురు పూజింపఁగఁ దనయురు,కరముల శశిబింబసమము♦ఖముల వెలయుచున్.
క. కనఁదగియుండినవారల, ననుమోములఁ జక్కఁ దడవె♦ను; గరుడుఁ డెలమిన్
దనకరములఁ దడవఁగఁ ద,త్తనువుల వ్రణము లొగి మానెఁ ♦ దత్క్షణముననే.
క. వారలు తనువర్ణములు య,థారీతిగ స్నిగ్ధకాంతి♦ధామములయి చె
ల్వారుచునుండెను; నంతట, వారిరువురకున్ బరాభి♦భవకృచ్ఛక్తుల్. ౩౯
క. బలవీర్యకాంతు లుత్సా,హాలలితసుగుణములు సూక్ష్మ♦మగు నర్థంబుం
దెలిసికొనునట్టి జ్ఞానం, బలఘుతరంబైన బు[1]ద్ధి ♦ యట్లే స్మృతియున్. ౩౯॥
క. మునుపటికంటెన్ ద్విగుణము, లనువుగ నయ్యెను; సుపర్ణుఁ♦ డంతట వారిన్
ఘనవీర్యుల నింద్రోపము,లను లేవఁగ నెత్తి యిమ్ము♦లన్ హృష్టులునై. ౪౦॥
క. పరిపూర్ణమనోరథులై, వరబలులై యున్న భూప♦వర్యుల నాయి
ర్వురఁ గౌఁగిలించుకొనియెన్,, గర మనురాగమున నంత♦గరుడునిఁ గనుచున్.
తే. పలికె నిట్లని శ్రీరామ♦భద్రుఁ డెలమి;
మీప్రసాదంబునన్ నేఁడు ♦ మే మిరువుర
మింద్రజిత్సంభవంబగు ♦ నీమహార్తిఁ
దొలఁగితిమి ముందువలెనె మా♦బలము లలరె. ౪౨ 1880
[2]క. నినుఁ గనఁ దశరథుఁడను నా,జనకునిఁ దాత నజభూప♦సత్తముఁ గనురీ
తిని నాచిత్తము సంతస,మునఁ దేలెడు; నిట్టిరూప♦మునఁ గనఁబడుచున్. ౪౩
క. సురుచిరసుమమాలావళి, ధరించి యనులేపనంబు ♦ దాలిచి దివ్యాం
బరభూషణసమలంకృత,శరీరమున నున్న నీదు♦చందముఁ గనినన్. ౪౩॥ 1882
తే. సంతసంబయ్యె సుగుణభూ♦షణ యెవఁడవొ
తెలుపుమా యంచుఁ బ్రశ్నించె ♦ దివ్యతేజుఁ
డై మహాబలశాలియు ♦ నైనయతఁడు
మనమునన్ సంతసం బంది ♦ మహితరీతి. ౪౪ 1883
సీ. హర్షంబునం గను♦లందు బాష్పంబులు ప్రవహింప నిట్లని ♦ పలికె; నోమ
హాత్మ! కాకుత్స్థ! నే ♦ నన నీకు సఖుఁడను మిక్కిలి ప్రియుఁడను ♦ నిక్కముగను
వెలుపలి ప్రాణము ♦ విధమున నొప్పెడువాఁడను గరుడాఖ్యుఁ ♦ బరఁగువాఁడ
నే మీకు సాయంబు♦ నెఱఁ జేయఁగా వచ్చితిని; క్రూరకర్ముఁడౌ♦దనుజవరుఁడు
తే. తనదుమాయాబలంబున ♦ ఘనభయమును
గలుగఁజేయ నిర్మించు నీ♦ఖరశరవర

1 ద్ధియనునక్షరము గాయత్రీసప్తదశాక్షరము. 2 యథా తాతం దశరథం యథాఽజం చ పితామహమ్-అనియూ.

పాశబంధము విడిపింప ♦ బలసమగ్రు
లైన యసురులు, శూరులౌ ♦ దానవులును ౪౭ 1884

క. సురపతితోఁ గూడిన నిర్జరులును గంధర్వు లెన్న ♦ శక్తులుగా రీ
శరరూపనాగములు భీకరదంష్ట్రలు గలిగి విషముఁ ♦ గ్రక్కుచు మిగులన్.

తే. కాద్రవేయములయి పొల్చుఁ ♦ గర్బురేంద్ర
తనయమాయాప్రభావంబు ♦ ననుశరాకృ
తిని జెలంగుచు నిన్నుఁ బొం♦దెను రఘువర!
ధర్మవేత్తవు నిత్యస♦త్యవ్రతుఁడవు. ౪౯ 1886

చ. నిరతము సత్యశౌర్యుఁడవు ♦ నీవు రణంబున శత్రుసూదనుం
డురుభుజవిక్రముండునయి ♦ యెప్పుడు లక్ష్మణుఁ డిట్టులౌట మీ
యిరువు రదృష్టవంతుల రిఁ♦ కేమియు మీకు భయంబు లేదు; భీ
కరఫణిపాశబద్ధులయి ♦ క్ష్మాస్థలి మీరు పరుండియుండుటల్. ౫౦½ 1887

క. వినినంత మిత్రధర్మంబును బాలించుచును నెయ్య♦మున నిచ్చటికిం
జనుదెంచితి శీఘ్రంబున;, వినుఁడీ మిముఁ దీక్ష్ణబాణ♦విషధరము లిటుల్. ౫౧

ఆ. పాశములుగ నగుచు ♦ బంధింప విడిపించితిని; సతంబు మీరు ♦ మనసులందు
నేప్రమాదమొంద ♦ కేయస్త్రములకుఁ బ్రత్యస్త్రములను వైవ ♦ నర్హరీతి.

క. ఆలోచింపుచునుండుం, డాలంబునఁ గృత్రిమముగ ♦ నసురులు పోరం
జాలుదు రది నైజంబా, బాలిశులకు మీ రనంగ ♦ భవ్యహృదయులై. ౫౨½

క. ఘనశౌర్యంబున మించుచు, మనములఁ గపటంబె లేక ♦ మహిఁ బొల్తురు మీ
రనుపమబల మియ్యదియౌఁ;, గనుక నె నమ్మంగరాదు ♦ కర్బురుల ననిన్. ౫౩½

క. ఈదృష్టాంతముచేత నె, యీదనుజులు కుటిలులౌట ♦ నేమియు నమ్మం
గాఁ దగదని తెలియఁగ నగు;, మేదినిపతులార! యనుచు ♦ మిక్కిలి ప్రీతిన్.

[1]క. బలవంతుఁడు గరుడుండిటు, పలికి మహాస్నేహమూని ♦ బాగుగ నారా
ము లలితముగ నాలింగనములఁ దన్పుచు సెలవుఁగొనఁగఁ♦బూనియిటుల నెన్.

క. చెలికాఁడా! శ్రీరామా!, పలుధర్మమ్ముల నెఱింగి ♦ పగతురదోషం
బులఁగూడం బాటింపక, యెలమిం జూతు గద వారి ♦ నినకులతిలకా!. ౫౬

తే. సెలవొసంగఁగ నిన్ను వాం♦ఛించువాఁడ
వచ్చినట్లుగ నేను బో♦వలయు; వీర!
నాకు నీకును మైత్రి యు♦న్నవిధ మరయ
[2]నిపుడు కుతుకంబు నొందఁగా ♦ నేల? వలదు. ౫౬½ 1895

1 ఏవ ముక్త్వా తతో రామం సువర్ణ స్సుమహాబలః-అనిమూ. 2 నచ కౌతూహలం కార్యం సఖిత్వంప్రతి రాఘవ-అనిమూ.

క. అనిఁ గృతకృత్యుఁడవై నీ, వనుపమమైత్రి రయొనఁగూడి ♦ నట్టివిధ మెఱుం
గను గలవు లంకపై నీ,వు నిశితబాణోర్మిఁ బఱపఁ ♦ బూనుము దానన్. ౫౭½

తే. బాలవృద్ధులు తప్ప న♦ప్పట్టణమునఁ
గలుగుదనుజుల రావణుఁ ♦ గర్బురేంద్రుఁ
బగతునిం జంపి సీతను ♦ బడయఁగలవు;
రాఘవా! యని భూరివీ♦ర్యయుతుఁ డగుచు ౫౮ 1897

సీ. శీఘ్రవిక్రముఁడునై ♦ చెలఁగు గరుత్మంతుఁడిట్లు వచించి భూ♦మీశసుతుల
కష్టములం బాపి ♦ కపులెల్లఁ జూడంగ వారి కిద్దఱకును ♦ వలగొని తమిఁ
గాఁగిలించుకొని యా♦గంధవాహుని బోలి యాకాశపథమున ♦ నరిగెనంత
వనచరయూథపుల్ ♦ ఘనులగు రామలక్ష్మణులు విచ్యుతబంధ♦కలితులగుచు

తే. నుండుటం గాంచి సంతోష♦ముప్పతిల్ల, సింహనాదంబులను బూని♦చేసి వాల
ములను ద్రిప్పిరి; ముందటి♦వలె నెహర్ష,ములను భేరులు వాయించి♦రలఘుగతుల.

క. సురుచిరమృదంగముల స,త్వరముగ వాయించి రల్లి ♦ వనచరు లతిభీ
కరముగ శంఖము లొత్తిరి, పరభయకృచ్ఛింహనాద♦పటలము పర్వన్. ౬౨½

*క. ఒనరిచి; రానగయోధులు, వనచరులు పరాక్రమంబు ♦ వైరుల కెల్లన్
గనఁబడగ భుజాస్ఫాలన, మనేకవారము లొనర్చి ♦ యంతఁ దరువులన్. ౬౩

తే. వరుసఁ బెకలించి వానిని♦కరములఁ గొని, శతసహస్రంబులుగఁ జేరి♦సమరమునకు
నాయితులగుచు నిల్చిర♦య్యవసరమున, వనచరులు గొప్పనిసనంబు♦వఱలునట్లు.

క. అనిశం బార్చుచు దనుజుల,కును భీతిం గల్గఁజేయు ♦ కుతుకము యుద్ధం
బొనరించువాంఛితంబులు, గనఁబడ ద్వారములను నరి♦కట్టిరి పెలుచన్. ౬౪

చ. వనచరు లర్ధరాత్రమున ♦ వారక సింహరవంబు లొప్ప నా
ర్చినఁ దుములస్వనం బదియుఁ ♦ జెచ్చెఱ మీఱుచు వృష్టికాలమం
దనుపమమేఘగర్జనము ♦ లట్టులు చాలభయంకరంబుగా
దనుజపురంబునందుఁ దగెఁ ♦ దద్దయు వారిలయంబుఁ దెల్పుచున్. ౬౫ 1903

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౫౧ - వ సర్గము.

ధూమ్రాక్షుఁడు యుద్ధమునకు వచ్చుట.

క. వనచరు లతిబలవంతులు, ఘనసింహరవంబు లట్లు ♦ కావింపఁగ నా
ధ్వని మిక్కిలి తుములంబుగఁ, దనరన్ రాక్షసులు దనుజ♦తల్లజుఁ డొకటన్.

క. విని రంత రావణుఁడు చ,క్కనిదియు గంభీరమునగు ♦ కపినాదంబున్

* వానరా నగయోధినః-అనిమూ.

విని యామంత్రులయంతర,మున నిట్లని పల్కె సచివ♦ముఖ్యులఁ గనుచున్. ౨

చ. వనచరవార మొక్కటను ♦ వారిదముల్ తగ గర్జనంబు సే
యునటులు హర్షపూర్ణమయి ♦ యుద్ధతి మీఱఁగ నార్చుచున్న దం
దునఁ బెనుహర్ష ముప్పతిలెఁ ♦ దోడనె యంచును దోఁచె స్పష్టమే
యనఁదగు లేదు సంశయ ము♦నట్టిదియే కద యెన్నిచూచినన్. ౩ 1906

క. అనినదంబులచేతనె, యీనత్రైవలినిపతియు ♦ నెంతయుఁ గలఁతం
దానొందె, నన్నదమ్ములు ,మానవపతిసుతులు తీక్ష్ణ♦మార్గణములచేన్. ౪

తే. బద్ధులై యున్నవా రిట్టి♦పట్టున నిటు
గొప్పునినదంబు మనకిది♦గో వినంగ
నయ్యె నిక్లాటఁ గ్రూరశ♦రాభిబంధ
నము వదలెనేమొ యనుశంక ♦ నా కొదవెడు. ౫ 1908

చ. అని దనుజేంద్రుఁ డాత్మసచి♦వాళికిఁ దెల్పి సమీపవర్తులౌ
దనుజులఁ గాంచి యిట్లనియెఁ ♦ దప్పక యిప్పుడు వానరాళికిన్
వనటఁ గృశించుకాల మిటు ♦ వచ్చి చెలంగఁగ వారు సంతసం
బునఁ దగియుండ హేతు వెది♦పోలునొ దాని నెఱింగి రండొగిన్. ౬ 1909

క. అని యాజ్ఞాపించిన నా,తనియానతిఁ గొనుచు యాతు♦ధానులు సంభ్రాం
తిని గని ప్రాకారంబుల,కును నెగఁబ్రాకుచును బ్లవగ♦కుంజరుల నటన్. ౭ 1910

క. కనిరి మహాత్ముండగు నా, వనచరపతి కాచుచుండ ♦ వర్ధిలువారిన్;
దనుజులు మఱియున్ భీతిక,రనాగపాశములు వీడ ♦ రాఘవు లెలమిన్. ౮

క. వడి లేచి భాగ్య మలరఁగఁ, బుడమిపయి న్నిల్చి సుఖము ♦ పొంగఁగ నుండం
గడఁగి కని ఖేదమొందం, గడఁగిరి; వారంత గుండె♦కాయ లదరఁగన్. ౯

తే. వడిగఁ బ్రాకారమును దిగి ♦ భయమున ముఖ
ములును వెలవెలఁ బోవఁగ ♦ నలఘుగతుల
రావణుని జేరి; రంత నా♦రాక్షసవరు
లెల్ల వాక్యవిశారదు♦లే యగుటను. ౧౦ 1913

క. దీనముఖులౌచు రాఘవు, లానిశితశరాళి వీడ ♦ హాయిగనున్నా
రానిన ప్రియమున నని తగఁ,గా నెఱిఁగింపంగ వాసెఁ ♦ గా యప్రియమున్.

చ. అని తలపోసి యీవిధము ♦ నంతయు నున్నది యున్నయట్లు తె
ల్పను సమకట్టి; నీసుతుఁడు ♦ పాకనిషూదన జేత సంగరం
బున ఫణిబాణపాశములఁ ♦ బోలఁగఁ గట్టి కరంబు లించుకై
నను గదలింపరానిగతి ♦ నైజమహోద్భుతశక్తిఁ జేయఁగన్. ౧౧ 1955

ఆ. అట్లు బాధపడెడు ♦ నాయన్నదమ్ములు, హస్తిపతిసమాన ♦ మహాపరాక్ర
మమున నాగబంధ♦నములు పోవఁగఁ బాశ,ములను ద్రెంచుకొన్న♦యలకరివలె.

క. కనుపట్టుచున్నవా; రో, దనుజాధిప! యన నితాంత♦దర్పసమగ్రుం
డనుపముఁడు నైన రావణుఁ, డని మొన నున్నట్టివిధము ♦ నసురులు పలుకన్.

క. విని చింతాశోకంబులు, మనమునఁ బెనఁగొనఁగ మోము ♦ మాడినరీతిం
గనఁబడ నిట్లనియెన్; నా, తనయుండగు నింద్రజిత్తు ♦ తా వరములచేన్.

సీ. కడఁగి సంపాదింపఁ♦గడుభయదము లుగ్రములునగుక్రూరఫ♦ణులనఁ బొల్చు
నట్టి యమోఘంబు ♦ లర్కసమానంబులగు బాణములఁ గొని♦యాజి బలిమి
బంధించె వారి; నా♦పగవార లిద్దఱు బద్ధులయ్యుండియు ♦ బంధముక్తు
లైనపక్షమున నీ ♦ దానవసేనకు నాశనమే యంచు ♦ నాకుఁ దోఁచు

తే. చున్న దెన్నియొ మాఱులు ♦ యుద్ధమందు
నాదుపగవారి ప్రాణమా♦నములఁ గొనిన
వాసుకిసమాన తేజంబు ♦ భాసిలంగ
నలరుబాణము లయ్యె ని♦ష్ఫలము లకట. ౧౭ 1919

క. అని పల్కి భూరికోపం, బున నహివలె నూర్పుగములఁ ♦ బుచ్చుచు నవ్వా
రినడుమ ధూమ్రాక్షుండను, దనుజవరుం గాంచి పల్కె ♦ దర్పసమగ్రా!.

క. పెనురాక్షససైన్యంబును, గొని నీవారాఘవులను ♦ గోఁతులఁ జంపం
గను వెడలుము త్వరగ నటం,చు నాజ్ఞ నిడి బుద్ధిబలము ♦ శోభిలుచుండన్.

క. పురికొలుపఁగ ధూమ్రాక్షుం, డురుసంతోషమున నతని ♦ కొదవినభక్తిన్
ధరణిఁబడి మ్రొక్కి వెడలెను, ధరణిపుసౌధంబునుండి ♦ దర్పము పొంగన్.

తే. ఆగృహద్వారమునుండి ♦ యతఁడు వెడలి
యచ్చటి బలాధిపుం గాంచి ♦ యనినొనర్పఁ
దలఁపుఁ గొన్నాఁడ నేను నా♦బలము నెల్ల
నాయితము సేయుమా తడ♦యుంగ నేల ?. ౨౧ 1923

క. అని రావణుననుమతి నా, దనుజేంద్రుఁడు పలుక వినుచు ♦ దానవబలమున్
వెనుకొని కాచుబలేశుఁడు, తనబలముల సిద్ధపఱచెఁ ♦ దదనుజ్ఞ మెయిన్. ౨౨

చ. దనుజులు భీకరాకృతులు ♦ దారుణదర్పులు నొంచు విక్రమం
బునకును గుర్తుగాఁ గటులఁ ♦ బొందుగఁ దాల్చినఘంట లొప్పఁ జ
క్కని వివిధాయుధంబులును ♦ గ్రాలు మహాపరిఘాళిముద్గరా
ఘనిబిడహస్తులై తమిని ♦ గర్జిలుచున్ ద్వర ధూమ్రనేత్రునిన్. ౨౩ 1925

సీ. పరిఘముల్ గదలును ♦ బట్టసముసలమ్ము లినుపదండములు కై♦కొనుచు శౌర్య
మలరుచునుండంగ ♦ ననుసరించిరి; మఱియును భూరిభిండివా♦లోగ్రభల్ల
ములును బరశ్వధం♦బులు ప్రాసములుఁ గరంబులఁగ్రాలవారిదం♦బులతెఱఁగున
గర్జించుచున్ గపి♦గణముల నొంపంగ నాల్గుదిక్కులనుండి ♦ నామములను

తే. జెప్పుకొనుచును వెడలిరి; ♦ చిత్రకవచ
ములను దాలిచి ధ్వజముల ♦ నెలసి బహువి

ధానసంబుల నొప్పు ఖ♦రాళిఁ బూన్చి
కనకజాలములఁ దగుస్యం♦దనము లెక్కి. ౨౬ 1926

క. దనుజులు కొందఱు వెడలిరి;, దనుజులు మఱికొంద రల్లె ♦ దర్పంబున వ్యా
ఘ్రనికరమువలె దురాసదు, లనూనవేగమునఁ బోవు ♦ నశ్వములపయిన్.

క. ఆరోహించియె వెడలిరి;, ఘోరమదాకులములైన ♦ కుంజరములపైఁ
జేరి మఱికొంద తేగిరి;, గారవ మేపారుచుండఁ ♦ గా నయ్యదనన్. ౨౭

క. పరుషరవం బొప్పెడు భీ,కరరూపుఁడు దేవనాథ♦కల్పుఁడునగు ని
ర్జరరిపుఁ డాధూమ్రాక్షుం, డరదము హేమాభరణము ♦ లలరుచునుండన్.

క. హరివృకముఖముల నొప్పెడు, ఖరములచే నీడ్వఁబడుచుఁ ♦ గ్రమ్మతరంబై
పరఁగన్ దా నెక్కెను; గురు,తరవీర్యుఁ డతండు బెట్టి♦దముగ నఱచుచున్.

క. ఖరవాహనంబుఁ గడుభీ,కరశబ్దము నగుచు దివ్య♦కాంతులఁ దగు నా
యరదముపై నెక్కి మహా, సురులెల్లను బలసి రాఁగ ♦ సొంపు గులుకుచున్.

సీ. పకపక నవ్వుచుఁ ♦ బావని యూథాధిపతియయి యేదిశఁ ♦ బరఁగునట్టి
పడమటిద్వారంబు ♦ వడిఁ జేరె, భీతికృద్విక్రముం డతిఘోర♦వికృతరూపుఁ
డైన యాధూమ్రాక్షుఁ ♦ డట్లుగా నపుగంగనాకాశమునయందు♦నతిభయంక
రములైన యట్టి కా♦రణములఁ దెల్పెడు పక్షు లడ్డం బయ్యె; ♦ భవ్యరథము
తే. శీర్షమునఁ బెనుభీతినిఁ ♦ జెందఁజేయఁ
జాలు గృద్ధ్రయొకండు తా♦వ్రాలె శవము
లను దినంజాలు పక్షులె♦ల్లను ధ్వజంబు
మొనపయిని వ్రాలె గుంపులు♦గను జెలంగి. ౩౧ 1932

క. తనువెల్ల రక్తపూరం, బునఁ దడియఁగఁ దెల్లనగుచు ♦ భూరితరముగా
గనఁబడు మొండెము వికృత, ధ్వని నేడ్చుచు నతనిచెంత ♦ ధరణిం బడియెన్.

క. జలదము రక్తము గురిసెను, నిల గంపము నొందెఁ బిడుగు♦లిలఁబడురీతిన్
బలురవమునఁ బ్రతికూలా, నిలుఁ డప్పుడు వీచె; నంత ♦ నిఖిలదిశలనున్. ౩౩

తే. అంధకారంబు గ్రమ్ముట ♦ నపుడు దెసలు
విగతకాంతులు గానుండె ♦ విహగములును
దనుజభయదంబు లెంతయు ♦ దారుణములు
నైన యుత్పాతములు పుట్ట ♦ నసుఁడు చూచి. ౩౪ 1935

క. మనమునఁ జింతించెను; నా, దనుజేశునిముందుఁ జనెడు ♦ దానవు లార్తిన్
గని యేమియుఁ దోఁపమిచేఁ, గనుచుండిరి వాని; నంతఁ ♦ గర్బురవిభుఁడున్.

ఆ. అతిభయంకరుండు ♦ నతిబలశాలియు, నై చెలంగుచుంట ♦ నానిమిత్త
ములను లెక్కఁగొనక♦బలయుతుల్ దనుజులు, తన్ను బలసికొలువ♦దర్పమలర.

క. అని సేయుకోర్కి వెలువడి, పనివడి శ్రీరాముబాహు♦పాలిత మగుచున్
వనచరనికరమయంబై, వననిధివలె నున్న ప్లవగ♦వాహినిఁ గనియెన్. ౩౬

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౫౨ - వ సర్గము.

ధూమ్రాక్షుఁడు హనుమచేఁ దెగుట.

క. వనచరు లెల్లను యుద్ధం,బును జేయఁగఁ గోరుచుంటి ♦ భూరిభయదశౌ
ర్యుని ధూమ్రాక్షుని, నాలం,కనుండి యట వచ్చువానిఁ♦గాంచి ముదమునన్.

క. హరినాదంబు లొనర్చిరి, తరువులఁ గొని ప్లవగవరులు ♦ దానవపతు లా
తురులయి శూలంబులు ము,ద్గరములు గొని యొకరినొకరు ♦ దారుణభంగిన్.

తే. అట్టి ప్రహరించుకొనుచుండ ♦ నాయిరుదెగ
లకును సంకులసమరంబు ♦ సకలభూత
భయదముగఁ జెల్లె రాక్షస♦వగ్య లోకటి
గాఁగఁ గూడి చిత్రములు భీ♦కరములునయి. ౨ 1941

క. పలువిధములైన పరిఘం,బులును ద్రిశూలములు గొనుచుఁ♦బొంగుచు నాకోఁ
తుల నెల్లయెడలఁ జెండిరి;, యిల శకలములై పడంగ ♦ నెల్లతనువులున్. ౩

చ. వనచరవీరు లంతఁ దరు♦వారముఁ గైకొని త్స్థానముంబుగా
దనుజులఁ గూలనేసి; రల ♦ దానవు లందుల కాగ్రహించుచున్
సునిశితఘోరబాణముల ♦ సుక్కఁగ నేయుచుఁ గాలహవ్యవా
హనసమకంకపత్రనిక♦రాభియుతాకుటిలాంబకంబులన్. ౪ 1943

క. వనచరులన్ నొప్పించిరి;, దనుజులు మాటి భీమగదలు ♦ దగుపట్టసముల్
ఘనకూటముద్గరంబులు, గొని కీశులఁ దెంపుమీఱఁ ♦ గొట్టుచునుండన్. ౫

క. గురుబలయుతు లాటను వన,చరు లుత్సాహంబు రోష♦సంగతిఁ బొంగన్
దుర మొనరించి రభీతుల,గరణిన్; దరువాతఁ బ్లవగ♦కాంతు లనిమొనన్. ౬

చ. దనుజుల శూలసాయకవి♦దారితగాత్రులునయ్యు జంకకొ
య్యన శిలలం దరువ్రజము ♦ నందిరి; వానరవీరు లంత న
ద్దనుజులపైకి వేగముగఁ ♦ దారు చెలంగుచుఁ బోవుచున్ భయం
బును గలిగింప సింహముల ♦ పోలిక నార్చుచుఁ బేర్లఁ దెల్పుచున్
గన భయదాకృతుల్ వెలయు ♦ కర్బురులన్ బ్రహరించి రెంతయున్. ౭

క. తరుశిలలఁ గొనుచు సవ్వన,చరులును వివిధాయుధవ్ర♦జంబును గొని క
ర్బురులును దలఁపడఁగా నం,గర మాశ్చర్యమును భీతి♦కరమును నయ్యెన్. ౮

ఆ. విజయశాలురైన ♦ వీరవానరులచేఁ, గొట్టఁబడిన దనుజ♦కుంజరు లొక
కొంతమందిచచ్చి ♦ రంతటఁ గొందఱు, క్రక్కుకొనిరి నల్లఁ ♦ గళవళించి.

సీ. వనచరుల్ కొందఱ ♦ దనుజుల గ్రహియించి ప్రక్కలఁ జీల్చిరి ♦ పాదపముల
నలియఁగాఁ గొట్టి కొం♦దఱఁ గుప్పఁ జేసిరి, కొందఱ శిలలచేఁ ♦ గొట్టి పిండి
పిండిగాఁ జేసిరి ♦ పెనుదంతములను గొందఱను జంచిరి; తద♦నంతరంబ
వనచరుల్ వైచిన ♦ ఘనగిరిశిఖరాళి విఱిగినధ్వజములు ♦ విఫులఁ గూలి
తే నట్టిఖరములు చూర్ణంబు ♦ లైన యరద
ములు ధరంబడియున్న క♦ర్బురులగాత్ర
ములును గిరితుల్యతనువులై ♦ వెలయు కరులు
హాయములును వాని రౌతులు ♦ నంత మొంది. ౧౩ 1949

క. ధరఁబడియుండంగ భయం,కరముగఁ జూపట్టె; శౌర్య♦కలితులు ప్లవగే
శ్వరు లతివేగంబున భీ,కరముగఁ బైకెగసి యెగసి ♦ ఖరనఖరములన్. ౧౩౹
క. దనుజులముఖములఁ జీల్పం,గను మోములు గాంతిఁ దప్పఁ♦గా వెండ్రుకలో
య్యన విరిసి క్రింద జారం,గను శోణితగంధములఁ ద♦గన్ మూర్ఛితులై.
క. ధరణీతలమునఁ బడియుం,డిరి; కొందఱు రాక్షసు లొగి ♦ నిర్భరకోప
స్ఫురణమున భీమరవములు, పరఁగంగా నట్టె యడరి ♦ ప్లవగేంద్రులపై. ౧౪౹
తే. వజ్రములరీతిఁ గఠినసం♦స్పర్శము లగు
కరతలంబులె సాధన♦కాండములుగఁ
దలఁపఁ దగఁ బోయి; రట్టు లా♦దనుజు లధిక
జవమునం బయిఁబడ రాఁగ ♦ వివిధగతుల. ౧౫ 1953

క. వనచరులు వారికంటెను, ఘనజవమునఁ జనెడువారు ♦ గావున వారిం
గని పిడికిళ్లం బొడిచి ద,శనములచేఁ గొఱికి తన్ని ♦ చరణాగ్రములన్. ౧౬
క. తరువుల మోఁదియు బాధిం,చిరి; వానరు లట్లు తన్ని ♦ చెలఁగంగా నా
సురు లొర్వం జాలరయే, పరుగెత్తిరి; పిదప దనుజ♦పాలకుఁ డనిలోన్. ౧౬౹
క. తనబలము లెల్లఁ బాఱం, గని కుపితుం డగుచు మిగిలి ♦ కదనము సేయం
గను గోరియున్న వానరు,లను హింసింపంగ మదిఁ ద♦లంచి కడఁకమై. ౧౭౹
క. అని సేయంగను బూనఁగ, దనుజులు చెలరేఁగి ప్రాస♦తతిఁ గొట్టంగా
వనచరులు కొంద ఱార్తిని, గని నెత్తురు గాఱఁ బడిరి ♦ క్ష్మాస్థలియందున్. ౧౮
సీ. కొందఱువానరుల్ ♦ క్రూరముద్గరతాడితులయి ధరంబడి ♦ రలసి కొంద
ఱురుపరిఘంబుల ♦ నుద్ధతి మోఁదంగఁ గాసి నొందిరి; మఱి ♦ కపులు కొంద
ఱొగి భిండివాలంబు ♦ లూని వైరులు కొట్ట నంగముల్ చీలంగ ♦ నవనిఁ బడిరి;
పట్టనంబులఁ గొని ♦ కొట్టంగఁ గొందఱు పరవశులై వ్రాలి ♦ ప్రాణరహితు
తే. లైరి, కొందఱు శూలసం♦హతుల రక్త
సిక్తులై యుండి; రెంతయుఁ ♦ జిత్రగతుల
నరులు కొట్టంగ బలయుక్తు ♦ లైనవారి
నొర్వఁ జాలక పాఱి రో♦హో యనంగ. ౧౯౹ 1958

క. దనుజులు పార్శ్వంబులఁ జిం,చిన గుండెలు వగులఁ గపుల♦క్షితిని బడిరి; శూ
లనికరహతులై ప్రేఁగులు, దనువుల వెలుపలికి రాఁగ ♦ ధరణిం బడుచున్. ౨౨౧

క. మరణించిరి కొందఱు న,ట్లిరువురు మూర్కొనుచు శిలల ♦ వృక్షంబుల, భీ
కరశరముల వైచుచు సం,గరమును జేయంగ నద్ది ♦ గాఢరవములన్. ౨3

క. ఘనభయదముగాఁ జెలఁగెను, ధనువులకుం దగిన యల్లె♦త్రాళ్లధ్వనులు చ
క్కనివీణాస్వనములుగాఁ, దనరఁగ *నెక్కిళ్లు మిగులఁ ♦ దాళంబులుగాన్. ౨౪

తే. అలసియుండుటచే మంద♦గిలిన పలుకు
లతులగానంబుగా నొప్ప ♦ నాజిగాన
మెంతయుం జక్కఁగా నొప్పు; ♦ నేచియంత
ననిని ధూమ్రాక్షుఁ డురుచాప♦మును గ్రహించి. ౨౫ 1962

క. తనశౌర్య మూని నవ్వుచు, సునిశితనారాచములను ♦ సోన గురియుచున్
వనచరులఁ దఱిమె దెసలకుఁ;, దనుజేశ్వరబాధితమయి ♦ తక్కుల మెల్లన్. ౨౬

క. కలగుండువడుట మారుతి, పలువిధములఁ జూచి కోప♦భరమునఁ బెలుచన్
జెలరేఁగి గొప్పశిల నిం,మ్ములఁ గరమునఁ బట్టి దనుజ♦ముఖ్యునిపైకిన్. ౨౬౧

క. అరిగెన్ యుద్ధమొనర్పఁగ;, మరుదాత్మజుఁ డంతఁ బిత్సన♦మంబగు శౌర్యం
బు రహిం గన్పడఁ గ్రుధచే, నరుణిమ కనులందు ద్విగుణ♦మై తోఁపంగన్.

ఆ. ఊఁచి యూచి దాని ♦ నుగ్రుఁడై ధూమ్రాక్షు
నరదమందుఁ బడెడు♦నట్లు వైచె,
నంత ధూమ్రనయనుఁ ♦ డాశిల తనపైకి
వచ్చుచున్నయట్టి ♦ వరుసఁ జూచి. ౨౮ 1966

క. కరమున గద దాలిచి యు,య్యరదము విడనాడి వేగ ♦ యవనికి దిగి యా
ధరణి నిలుచుండె; నాతని,యరదముఁ దచ్చక్రకూబ♦రాశ్వయుతముగన్. ౨౯

క. సధ్వజశరాసనంబుగ, విధ్వంసముగా నొనర్చెఁ ♦ బృథుశిల యది; యా
ప్రధ్వాంతమిహిరసమ మిటు, ప్రధ్వంసము చేసి ధరణిఁ ♦ బడియె విరుచిగన్.

చ. అనిలకుమారుఁ డాహనుమ ♦ యట్లసురేంద్రురథంబు నుగ్గుగా
నొనరిచి స్కంధశాఖలను ♦ నొప్పు మహీరుహముల్ కరంబునన్
దనరఁగ నిర్జరారులను ♦ దార్కొని యుద్ధముచేసె; నంత న
ద్దనుజులలోనఁ గొంద ఱటు ♦ ధాత్రిరుహాంబుల మోఁదు నొందుచున్. 30౧

క. శిరములు పగులఁగ నెత్తురు, నిరతమ్ము స్రవింప మేది♦నింబడి; రిట్లా
మరుదాత్మజుండు దనుజో,త్కరమును బాఱంగఁ దోలి ♦ కదురభసమునన్. 3౨

క. గిరిశృంగ మొకఁడు గొని యా,శరవరుపై కడరె; వీర్య♦శాలియయిన ని
ర్జరవైరి యతఁడు తనపై, కరుదెంచెడు హనుమఁ గాంచి ♦ యతివేగమునన్ 33

*హిక్కాశాకసమన్వితమ-అనియు.

క. కరమున గదఁ దాలిచి భీ,కరసింహధ్వని చెలంగ ♦ గాలికొడుకుపైఁ
   గరిగెఁ; ధూమ్రాక్షుఁడు క్రో,ధరతిన్ బహుకంటకాన్వి♦తంబగుదానిన్. ౩౪

క. తడయక హనుమశిరంబునఁ, బడవైచెన్; భయదరూప♦భాస్వద్గద పైఁ
   బడ హనుమంతుఁడు ఘాతముఁ,బడసెన్;మారుతసమాన♦బలుఁ డతఁ డంతన్.

క. దానిన్ లెక్కఁగొనక కా,దానవుమస్తాంతరమునఁ ♦ దద్గిరిశృంగం
   బూని పడవైచె; నతఁడ,ద్దానిసమాహతిని సంగ♦తతి క్షోభింపన్. ౩౫ 1974

క. ధరఁబడియె వికీర్ణంబై, ధరణీధర మట్లు వే య♦తం డిటు పడఁ గ
   ర్బులులంతట హతశేషులు, సురరిపుపతిమృతిని గనుటఁ ♦ జూచి వగవునన్. ౩౬

క. వనచరులు వెంటఁబడి చం,ప నితాంతత్వరను నధిక♦భయమున నాలం
   కను జొరఁగఁ బాఱి; రటఁ బా,వనియు మహోత్సుండు తనదు♦వైరి బలమునన్.

చ. అని వధియించి రక్తనదు ♦ లయ్యెడఁ బాఱఁగఁ జేసి వైరిఁ జం
   పినశ్రమ మొందియున్ దనుఁ గ♦పిప్రవరుల్ కొనియాడి పూజలన్
   మనములఁ బొంగుమోదమున ♦ మాటికి మాటికిఁ జేయ నెమ్మనం
   బునఁ దమిఁ గాంచె రక్కసుఁడు ♦ పోవుట లెల్లఁ దలంచుచుం గడున్. ౩౭

ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౫౩ - వ సర్గము.

~ వజ్రదంష్ట్రుఁడు యుద్ధమునకు వచ్చుట. ~

క. దనుజేంద్రుఁడు రావణుఁ డా,యనిమొన ధూమ్రాక్షుఁడట్టు♦లంతముఁగనుటన్
   విని నిట్టూర్పులు ఫణివలెఁ, దనముఖముల వెడలఁ బెనుక్రు♦ధం బొందె మదిన్.

సీ. అతఁడు కోపంబున ♦ నాత్మ కలంగఁగ వేఁడినిట్టూర్పులు ♦ విడుచుచుఁ గడు
   బలశాలి శూరుఁడౌ ♦ వజ్రదంష్ట్రునిఁ గాంచి పలికె; వీరా! పొమ్ము ♦ పట్టణంబు
   వెలువడి దానవ♦బలపరివృతుఁడవై చని దాశరథి రాము ♦ సకలకపుల
   నట్లు సుగ్రీవుని ♦ ననిఁ జంపి రమ్మనిపనిచిన మాయావి♦దనుజవరుఁడు
తే. వజ్రదంష్ట్రుండు రాక్షసే♦శ్వరునిఁ గాంచి
   యట్లె సేసెదనని పల్కి ♦ యఖిలబలము
   లను దగఁగూడి బలనాథు♦లును దనుఁగొలు
   చుచును రాఁబోయె దివినున్న ♦ సురలు కలఁగ. ౪ 1979

చ. కరులును ఘోటకంబులును ♦ గాడిదె లొంటెలు కేతనధ్వజో
   త్కరవిలసన్మహారథని♦కాయము వెంటను రాఁగ దేహమున్
   సురుచిరగంధపుష్పములు ♦ శోభిలఁజేయఁగ నంగదంబులున్
   వరమకుటంబులున్ గరము ♦ భాసిలుచుండ విచిత్రరీతిగాఁ
   బరఁగుచుఁ గత్తిశంబలరఁ ♦ గార్ముక మంది సమాహితాత్ముఁడై. ౫ 1980

క. వెలువడి పురమును వేగమ, కల నొనరుపఁ బోయె; సైన్య♦కాంతుఁ డతం డు
జ్జ్వల కేతనసములంకృత,ము లలితహేమాభిరామ♦ము నగురదముర్. ౭౫

తే. వలగొనుచు నెక్కె; నాతని♦భటులు బహువి
ధాయుధంబులఁ దాలిచి ♦ యష్టితోమ
రములు శూలంబులును, ముస♦లములు భిండి
వాలములు పాశశక్తులు ♦ పట్టిసములు. ౮ 1982

తే. ఖడ్గ, చక్ర, పరశ్వధ♦గదలు మొదలు
గాఁ గలుగు తీక్ష్ణసాధన♦గణము కరము
లందు వెలుఁగంగ వెడలి రా♦హవమొనర్పఁ
జిత్రవస్త్రాభిరాములై ♦ చెలఁగి కడఁక. ౯౫ 1983

క. అనిసేయ సమర్థులుగాఁ, దనరెడు నాదనుజవరులు ♦ తమిఁ దోమరరా
జిని సంకులంబులం గొని, ఘనమదవిక్రమము లొప్పఁ♦గాఁ దగుకరులన్. ౧౦

క. చలియించుపర్వతమ్ముల,నలె నొప్పెడువాని నెక్కి ♦ బయలువెడలి; రం
త లలితలక్షణయుక్తం,బులు గురుబలయుతము లగుచుఁ♦బొలుచు జవములన్.

క. దనుజులు కొంద ఱధిష్ఠిం,చి నితాంతము శౌర్యములరఁ ♦ జెచ్చెఱఁ జని; రా
దనుజబలంబులు సింహ,ధ్వను లలర వినీలదేహ♦వరభూషణముల్. ౧౧౫

క. కనఁబడఁగ ఘోరతరముగఁ, జన వర్షాకాలమందు ♦ సమధికవిద్యు
ద్ఘనములు నల్లఁగ నార్పుచుఁ,గనఁబడున ట్లొప్పుచుండెఁ♦గడుభయదముగన్.

క. సురవైరు లంత యూధే,శ్వరుఁ డంగదుఁ డున్ననగర♦వరయామ్యమునం
బరఁగెడు ద్వారమునన్ వెడ,లిరి వారలు వెడలఁగాఁ గ♦లిగె నశుభములున్.

చ. ఘనములు లేని యభ్రమున ♦ గాఢతరోల్కలు తోఁచి వారికిం
గనఁబడఁ గ్రిందుగాఁ బడియెఁ ♦ గ్రన్నన నక్కలు నిప్పుమంట లో
య్యన వడిఁ గ్రక్కుచున్ భయద♦మాగతి నార్చెను; క్రూరసత్త్వముల్
దనుజున కెల్ల మృత్యువును ♦ దా రటఁ దెల్పెను స్పష్టమాగతిన్. ౧౪ 1984

క. సురవైరియోధు లాసం,గరమునకుం బోవునపుడు ♦ కడు భయమున నా
తురులయి తొట్రిలఁబడ సా,గిరి; గురుతేజుఁడయి సుభట♦కీర్తితుఁ డగుచున్.

సీ. బలశాలియునునగు ♦ వజ్రదంష్ట్రుం డట్టియుత్పాతములఁ జూచి♦యురుతరమగు
ధైర్య మూతఁగఁగొని♦తోరణోత్సాహముగల్గి ముందున కేగెఁ;♦గర్బురేంద్రు
లట్టు వచ్చుటఁ గాంచి ♦ యావానరేంద్రులు జయశీలురౌట ద♦శదిశలందు
నిండినట్లుగ భూరి♦నిస్వనం బలర సింహధ్వనుల్ చేసి; ర♦య్యవసరమున

ఆ. భయదరూపయుతులు ♦ భయహేతువులునైన, వానరులకు నట్టి♦దానవులకు
నొకరి నొకరు చంప ♦ నుద్యమించెడువారి, కయ్యెఁ దుములయుద్ధ♦మట్టితఱిని.

క. ఇరుతెగలవార లీర్ష్యల, గురుసాహసములను మిగులఁ ♦ గోర్కెలతో సం

గర మొనరిచి ఛిన్నవపుశ్శిరముల నతితీవ్రరుధిర♦సిక్తాంగములన్. ౧౯ 1992

క. ధరణిం బడి; రొక్కొండ ఱసురు లతిశూరులయి యుంటఁ♦జొక్కపుఁబరిఘో
త్కరములఁ గరములఁ గొని వానరులపయిన్ దుముకనవ్వ♦నచరులుగవియన్.

క. నానావిధాయుధంబుల, మేనుల నొప్పించుచుండ ♦ మిగిలెడు ప్రాన్కన్
వానరులు తరుశిలాదుల, దానవు లాయుధగణంబుఁ ♦ దమరిపులపయిన్.

తే. వైచుచుండంగఁ బుట్టిన♦ధ్వనియుఁ బెద్ద
దతిభయంకరమును నయి ♦ యంతరంగ
ములను భేదించునట్లు మి♦క్కిలియు వినఁగఁ
బడియె; నప్పుడు రథనేమి♦పటురవంబు. ౨౧ 1995

క. ధనువుల నిస్వనము మృదంగనినాదము శంఖభేరి♦గాఢరవము నొ
య్యనఁ గూడి తుముల మయ్యెన్; దనుజులలోఁగొందఱాయు♦ధంబులనెల్లన్.

తే. కపులపై వైచి యన్యమా♦ర్గణము లెవ్వి
యును దమకులేమిఁ గరముల ♦ యుద్ధమంత
జేయఁదొడఁగిరి; వానరు ♦ లాయసురులఁ
గరతలంబులఁ జఱచియుఁ ♦ గాళ్లఁదన్ని. ౨౩ 1997

సీ. ముష్టిఘాతంబుల ♦ మోకాళ్ల దెబ్బలఁ దనుఘాతముల నొంప ♦ దనుజు లంత
భిన్నాంగులగుచును ♦ బృథ్విపైఁ ద్రెళ్లిరి; యుద్ధదుర్మదులయి ♦ యొప్పుకపులు
దనుజులఁ గొందఱఁ ♦ బెనుశిలావృష్టిని జూర్ణ మొనర్చిరి; ♦ సురవిరోధి
పతి వజ్రదంష్ట్రుండు ♦ బవరంబునన్ వానరులబాణనికురంబ♦ములను నొంచి

తే. భయపడఁగఁ జేయుచున్ దాను ♦ బ్రళయమందుఁ
బాశహస్తుండు యముఁడు ని♦ర్భరగతులను
దిరుగునట్లుగ భయదాకృ♦తిని జరించు
చుండె; బలశాలురై శస్త్ర♦పండితులయి. ౨౪ 1998

క. అంరెడు రాక్షసు లెల్లరు, నలఘుతరంబైన క్రోధ♦మంది శరీరం
బులు తెలియక నానాయుధములఁ గపిసేనన్ వధింప ♦ మొదలిడి రంతన్.

క. హరులవధించెడు దనుజోత్కరములఁ గని యాసురేంద్ర♦తనయతనయుఁడై
పరఁగెడునంగదుఁ డాగ్రహ, మురుతరముగ ద్విగుణముగుచు♦నొప్పఁగదానన్.

క. కను లెఱ్ఱవాఱఁ బ్రళయంబున నగ్నియుఁబోలె వీర్య♦మునఁ బొల్చెడుఁ గా
వునఁ దరువొక్కఁడు గొని యాదనుజులనున్ క్షుద్రమృగవి♦తతిని హరివలెన్.

క. నొప్పించె మఱియు నంగదుఁ, డప్పుడు సురనాథుపోల్కి ♦ ననుపమశౌర్యం
బొప్పఁగ దారుణసంగర, మిప్పగిదిగ నుండు ననఁగ ♦ నెంతయుఁ జేసెన్. ౨౮

తే. అంగదునకును నెదురైన ♦ యసురు లెల్ల
భీమవిక్రములయ్యు నా♦వృక్షఘాత

ములకుఁ దలలొఁగిఁ బగులంగ ♦ నిలనుబడిరి
మూలములువోవఁ దరువులు ♦ గూలునట్లు. ౨౯౪ 2006

*క. శకలములైన రథంబుల, వికలాంగములైన యశ్వ♦వివిధపతాక
ప్రకరంబుల హరిదనుజాం,గకముల నల్ల నిల భీతి♦కరముగ నయ్యెన్. ౩౦౪

తే. హారకేయూరముఖభూష♦ణాళివస్త్ర,శస్త్రభూషితమై ధరా♦స్థల మది యట
నబ్జతారాభియుక్తచే ♦ నలరుచున్న, యాశరద్రాత్రివలెఁ గన♦నయ్యె విరుచి.

క. వెనురాక్షసబల మది యా,తనిజవమున నిల్వలేక ♦ తాఁ జలియించెన్
ఘనవాయువేగమునకున్, ఘనములు చలియించుచున్న ♦ కరణిగ నంతన్.

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౫౪ - వ సర్గము.

అంగదుఁడు వజ్రదంష్ట్రునిఁ బొలియించుట.

చ. అనుపమవిక్రమాఢ్యుఁడు బ♦లాధికుఁడై తగువజ్రదంష్ట్రుఁడ
వ్వనచరుఁ డాత్మసైన్యమును ♦ వారిరిఁ గొట్టఁగఁ బాఱుచుంటయున్
వనచరుఁ డట్లుగా విజయ♦వర్ధితుఁడై విలసిల్లుచుండుటల్
కని కమఁగోపమంది గురు♦కార్ముకముం బటుఘోరరూపమున్. ౧౪ 2007

చ. కరమునఁ బట్టి వజ్రసమ♦గాఢనినాదముగల్గ లాగి వా
నరులబలంబుపైఁ గడు వి♦నాశనముం దెలుపంగఁ జాలు నా
శరముల వృష్టిగాఁ బరపె ♦ శౌర్యముపొంగఁగఁ గర్బురేంద్రు ల
ట్లరదము లెక్కుచున్ బహువి♦ధాయుధముల్ గొని పోరి రయ్యెడన్. ౩

చ. వనచరులందు శూరులగు ♦ వారగు కరంబులఁ బ్రస్తరంబులన్
గొని నలువైపులం జెలఁగి ♦ కోర్కెరణంబొనరించి; రంత నా
యనిమొన రాక్షసుల్ హరివ♦రాళిపయిం జెలరేఁగి వేలసం
ఖ్యనిశితమార్గణాళి నవు♦డార్చురు వైచిరి దర్ప మొప్పఁగన్. ౫ 2009

చ. వనచరవీరు లంత మద♦వారణతుల్యులుగానఁ గొండలన్
ఘనశిలలం దరువ్రజముఁ ♦ గర్బురసంతతిపైని వైచి; రి
ట్లని వెనుదీయ కెంతయు స♦హార్యపరాక్రమయుక్తులై రణం
బొనరుచుచున్న కోఁతులకు ♦ నుద్ధతరాక్షసకోటి కత్తటిన్. ౭ 2010

క. సమర మ్మధిక మ్మగుచుం, దుములంబుగ సాగె; హరిత♦తులఁ గొందఱు క
ట్లనురాయులఁ గొందఱకున్, సమరంబున శీర్షహస్త♦చరణము లెల్లన్. ౭౪

ఆ. పగిలి విఱిగియుండ ♦ బాణము లంగాళిఁ
గ్రుచ్చుకొనఁగ దీవ్ర♦రుధిర మంగ

---

* రుధిరేణచసంఛన్నా-అనిమూ.

ములను దమపఁ గంక♦ములు గ్రద్దలుం గాకు
లట్టె మూఁగఁ గొండ♦ జాత్రిఁ గుంది. ౯ 2012

క. గోమాయువు లెల్లెడలను, నామాడ్కిం బెరసియుండ ♦ నతిభయదముగా
భూమిపయింబడియుండిరి;, భీమాహవమునఁ గబంధ♦వితతులు పెలుచన్.

క. భీరుజనంబుల కతిభయ, మారీతిగఁ బుట్టఁజేయు♦ నవిద్యౌ దివిఁకిన్
బోరన నెగసెన్; సంగర, ధారణి నత్తఱిని గీశ♦దనుజులు కడఁకన్. 2014

క. శరములు భూరిభుజంబులు, శిరములు తెగి యర్ధములుగ ♦ ఛిన్నములు కళే
బరములయి యుండ నుండిరి, ధరణి గతప్రాణులగుచుఁ ♦ దగ భయదముగన్.

క. వనచరు లెల్లను మాఱ్కొని, దనుజుల వధియించుచుండఁ ♦ దద్బలమువిధం
బును జక్క వజ్రదంష్ట్రుఁడు, గనుచుండఁగ భంగపాటుఁ♦గాంచెన్ మిగులన్.

సీ. గురువిక్రమంబునఁ ♦ బరఁగునావజ్రదంష్ట్రుఁడు ప్లవంగములు క♦ర్బురులఁజంపు
చుండఁగా వార ల♦త్యుగ్రభయంబునుగాంచి యుంటను జూచి ♦ మించురోష
మునఁ దామ్రనేత్రుఁడై ♦ ధనువును గరమునఁ దాలిచి వానర♦తతుల భీతిఁ
గనఁగఁజేయుచు రణం♦బునఁ బ్రవేశించియుంతటఁగంకపత్రయు♦తంబులగుచు
తే. నకుటిలములగు శరముల ♦ నట్టెవైచి, వారి ఛేదించె; విక్రమ♦వంతుఁ డతఁడు
వనచరుల నొక్కయేటునఁ♦బంచసప్త,నవవిధాత్మసంఖ్యల నొంచె♦నెసనమర్ష.

*చ. దనుజవిభుండు వానరుల ♦ దారుణబాణములన్ వికంపులన్
గనలుచుఁ జేయఁ దక్కుకపి♦కాండము భీతిలి యాప్రజావిభున్
మనుజులు చేరఁబోవునటు ♦ మానుగ నంగదు నాశ్రయించె; నం
త నపుడు వాలిపుత్రుఁడు ని♦తాంతభయంబును సేన లొందుటన్. ౧౫ 2018

క. పరికించి కోపవశమున, సురవైరియుఁ దనను జక్కఁ ♦ జూడఁగ వానిన్
బరిపరిఁ జూచుచు మాఱ్కొనె, హరివరసురవైరినాథు ♦ లంతటఁ గడఁకన్.

క. హరిమత్తగజంబులు భీ,కరముగఁ బోరాడుభంగిఁ ♦ గా ననిలో న
య్యిరువురు విహరించిరి; యా,తరుణంబున గురుబలుండు ♦ దానవపతియున్.

క. కరిఁ దోమరముల నొంచెడు, కరణిగ నవ్వాలితనయుఁ ♦ గని మర్మములన్
శరముల వేయింటను ని,ర్భరగతిచే నొంచె దర్ప♦భాసురుఁ డగుచున్. ౧౯

చ. ఘనబలుఁ డుగ్రవీర్యుఁడు ని♦కామజవుండును నైన యంగదుం
డు నిశితశస్త్రజాలముల ♦ నొచ్చి శరీరము రక్తసిక్తమై
కనఁబడ వజ్రదంష్ట్రుపయి ♦ క్ష్మారుహ మొక్కఁడు వీచివైచె; నా
దనుజుఁడు వచ్చుచున్న యల♦ధాత్రిరుహంబును గాంచి యాత్మలోన్. ౨౦

ఆ. ఆతురుండు గాక ♦ యద్దాని శరములఁ, బెక్కుతునియలుగను ♦ నక్కజముగఁ
ద్రుంచె; నాద్రుమంబు♦తునియలై యిలఁబడె;,నంతనసురశౌర్య♦మాత్మనెంచి.

* అంగదం సంప్రధావంతి ప్రజాపతి మివ ప్రజాః-అనిమా.

క. వనచరవర్యుఁడు పెనుగొం,డను గొని యుద్ధానఁ దద్వి♦నాశనమగు నం
చనుకొని వైచి మహారవ,మును జేసెను; భయదశౌర్య♦మునఁగల యతఁడున్.

క. పెనుగిరి తనపై కరుదేఁ, గని సంభ్రాంతుండు గాక ♦ గదఁ జేఁగొని స్యం
దనముననుండి ధరిత్రికి, ఘనజవమున దుమికి నిలిచెఁ ♦ గపివరుఁ డంతన్.

క. తనరిపుని వజ్రదంష్ట్రుని, ననిమొనఁ దాఁ జేరఁబోయి ♦ యాతనిగదఁ జేఁ
గొనియెను బలవంతంబుగఁ, మును పంగదుఁ డతనిమూర్ధ♦మున నెదివైచెన్.

క. గిరి యద్ది వజ్రదంష్ట్రుని, యురదంబు సచక్రకూబ♦రాశ్వంబుగ ను
ర్వరఁ గూల్చె నుగ్గుగా; స,త్వరముగ నాయంగదుండు ♦ బల మలరారన్. ౩౪

క. తరుయుక్తము విపులమునగు, ధరణీధ్రము నెత్తి వజ్ర♦దంష్ట్రునితలపై
నురుగతి వైచెను దానన్, సురవైరియు నల్లఁ గ్రుక్కు♦చున్ మూర్ఛితుఁడై.

*క. ఉరగమువలె నిట్టూర్పులు, పరిపరిఁ బుచ్చుచు మఱొక్క♦భయదగదను నా
తురుఁడయి కైఁగొని సంజ్ఞా,విరహితుఁడై క్షణముసేపు ♦ వెళ్లగఁ బుచ్చెన్.

చ. దనుజుఁడు మూర్ఛఁబాసి తన♦దాపున నున్నకపీంద్రుఁ గాంచి యిం
తని యనరానికోపమున ♦ నాతనివక్షము నొవ్వఁజేసె నా
పెనుగదవ్రేటునన్; మఱియు ♦ బీరముపొంగ గదం ద్యజించి వాఁ
డనినొనరించె ముష్టిహతి ♦ నంగదు నొంచుచు నంత నయ్యెడన్. ౩౬ 2030

క. వనచరరాక్షసు లేచి యొ,కని నొక్కఁడు తన్నుకొనిరి ♦ గాఢంబుగ నా
పెనువ్రేటుల నెత్తుటిలో, మునుఁగుచు నలజడిని మిగులఁ♦బొందుచు మఱియున్.

ఆ. అతులవిక్రమమున ♦ నంగారకబుధుల, వలెను బోల్చుచుండి; ♦ రలఘుతేజుఁ
డగుచుఁ గీశతిలకుఁ♦డగు నంగదుం డంత,సుమఫలాళియుతకు♦జము నొకండు.

క. బలమొప్పఁ బెఱికి యనిమొన, నిలిచెను సురవైరి యల్లె ♦ నిలిచెను మఱియా
యలఘుబలశాలి యంగదుఁ, డలరుచు నృషచర్మపిహిత ♦ మగు ఫలకంబున్.

సీ. విపులమై, కింకిణీ♦వితతిఁ జెన్నగుచుఁ జర్మమొక్కటి సమా♦చ్ఛాదనముగఁ
గలిగియున్నట్టి ఖ♦డ్గంబును బూనంగ నసురయు నట్లె చే♦నందె వాని;
నిర్వురు వారు జ♦యించెడు నిచ్ఛలఁ గుపితులై మించెడు ♦ కోరికలను
బహుచిత్రమార్గముల్ ♦పరఁగ యుద్ధము సేయుచును బరస్పరము భీ♦తినిజనింపఁ

తే. జేయునట్లుగ బవరంబుఁ♦జేసి రట్లు, కడఁకమైఁ గొట్టుకొనుచుండఁ♦గా స్రవించె
రక్తమిద్దఱివా శరీ♦రములనుండి, పుష్పితపలాశతరువుల♦పోల్కి వారు. ౩౭

క. పొలిచిరి మఱియును సంగర,మలఘుబలంబులను జేసి ♦ యలయుచు ధాత్రీ
స్థలి జానువులపయి జయే,చ్ఛలఁ గూర్చుండిరి; క్షణంగ♦స త్తముఁ డంతన్.

తే. ఒకనిమేషములోపల ♦ నుగ్రనయనుఁ, డగుచు దండాహతభుజంగ♦మట్లు లేచి

* ముహూర్త మభవ న్మూర్ఛో గదా మాలింగ్య నిశ్వసన్ - అనిమూ. గదాంఅన్యాం - అని
వ్యాఖ్య.

యుకుతరంబగుబలమున♦నొప్పిస్వచ్ఛ, మగుచుసానలదీటిచ♦క్కఁగ మెఱయుచు.

[1]క. తనరారుఖడ్గమున నా, దనుజోత్తముసుందరమగు ♦ తలను నఱికె; నా
యున్న రక్తసిక్తగాత్రం, బునఁ దగునావజ్రదంష్ట్రు♦భూశిర నుటన్. ౩౫

తే. కోపపరివృత్తనయనమై ♦ గొట్టువడుచు
రెండుగాఁ దున్ని నేలను ♦ బండియుండె;
నట్టు లావజ్రదంష్ట్రుఁడు ♦ హతుఁడగుటను
గాంచి భయమోహితులయి రా♦క్షసులు వనట ౩౬ 2038

క. వనచరులు తమ్ము వెనుకొని, ఘనతరుశిలలన్ గ్రహించి ♦ కావరమునఁ జం
ప నితాంతము దీనాస్యము,లను దుఃఖించుచును మిగుల ♦ లజ్జను దలలన్.

ఆ. నంత వాంచి లంకఁ ♦ జొచ్చిరి; వజ్రము,హత్త్వబలము లలరు ♦ నంగదుండు
వైరిఁ జంప దేవ♦వారాంతరస్థేంద్రు,వలెను గపులనడుమ ♦ వఱలెఁ దమిని. ౩౭

ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

౫౫ - వ సర్గము.

అకంపనుఁడు హనుమతో యుద్ధ మొనర్చుట

ఉ. అంతట రాక్షసేంద్రుఁ డని ♦ నంగదు చేతను వజ్రదంష్ట్రుఁ డ
ట్లంతము నొందుటల్ విని కృ♦తాంజలియై తనమ్రోల నిల్చి కా
లాంతకురీతిగాఁ దగుబ్ర♦హస్తు బలాధిపుఁ గాంచి వేగదు
ర్దాంతపరాక్రముల్ ఘనత♦రంబగు లావును గల్గువారలన్. ౧ 2041

క. అని దుర్ధర్షులునై తగు, దనుజులు సకలాస్త్రశస్త్ర♦ధర్మ మెఱుఁగు ధీరు
రు నకంపను మున్నిడుకొని, చనుదురుగా కతిజవమున ♦ శత్రులఁ జంపన్. ౨

[2]చ. ఇతఁడు పరంతపుండు బల♦మెల్లను గాచెడివాఁడు సేనకుం
బతి; సమరప్రసిద్ధుఁడగు ♦ వారక యెప్పుడు కోరుచుండు నా
హితమును, సంగరప్రియు డ♦దెప్పుడు నీతనిఁ బొందియుండు సం
తతమును శత్రుకాననసు♦దారుణహవ్యవహుండునై తగున్. ౩ 2048

క. దనుజుం డీతఁడు రాఘవు,లను, భూరిబలాఢ్యుఁ గపిబ♦లప్రభు సుగ్రీ
వుని జయించి భయంకర,వనచరులను దక్కువారి ♦ వధియించు ననిన్. ౪

క. ఘనబలుఁడు శీఘ్రశౌర్యం,డునగు ప్రహస్తుండు రావ♦ణుని యానతిగై
కొని సన్నాహము గావిం,చెను సేనను సత్వరముగ ♦ జృంభచ్ఛక్తిన్. ౫

చ. దనుజవరేణ్యు లంతఁ గముఁ ♦ దద్బలనాథుఁడు దొందఱింప సా
ధననికురుంబముల్ బహువి♦ధంబులుగాఁ జెలువార వానిఁ గై

---

1 తృతీయాతిథియందు వజ్రదంష్ట్రుఁడు చచ్చెనని తీర్థులయభిప్రాయము 2 ఏష శాస్తాచ గోప్తాచ నేతాచ యుధిసమ్మతః, భూతికామశ్చ మే నిత్యం నిత్యంచ సమరప్రియః-అనియూ దీని యర్థమే యిటఁ దోఁచును. పద్యమందలి విశేషణములు కల్పితములు కావని యెఱుంగునది.

కొని భయదాక్షము ల్వ్రాయఁ ♦ గ్రూరతరంబుగఁ జూడనొప్పి యా
యనికిఁ బ్రయాణ మైరి; తగ ♦ నంత నకంపనుఁ డెంతొ వేడుకన్. ౬ 2046

చ. పెనురథ మెక్కి నీరదము ♦ పెంపునఁ గాయము పెద్దదాచు నొ
ప్పు నినద మబ్బమట్లు తగ ♦ భాసురహాటకకుండలంబులున్
దనర ఘనద్యుతిన్ వపుప్ర ♦ తిద్దయు నీటును గుల్కుచుండ భీ
తిని గలిగించు రాక్షసులు ♦ తెంపునఁ జుట్టును గొల్చి రాఁగ వే
చనియెఁ; గదల్ప లేరు సుర♦సత్తములే నతనిన్ రణంబునన్. ౭ 2047

క. *కనుకనె యకంపనుండని, దనుజేంద్రున కతని కాఖ్య ♦ ధరవర్థిల్లెన్
వనజాప్తుని భంగిఁగ నా, దనుజుఁ డయ్యంతరమునందుఁ ♦ దా భాసిల్లెన్. ౮౯

చ. అతఁ డని సేయఁ గోరి జన ♦ మారఁగ నందఱుఁ గూడిపోవఁగా
నతనిరథంబు లాగెడు స♦హాశ్వము లప్డు తటాలునన్ గనెన్
వితతముగాఁగ దైన్యమును ♦ విక్రమసంపద సంగరంబునన్
స్తుతిఁ గను నాయకంపనుని ♦ సుందరవామమహాక్షి యత్తఱిన్. ౧౦ 2049

తే. అదరసాగె; వివర్ణమై ♦ యాననంబు
కనఁబడియెఁ; గంఠరవము గ♦ద్గదముగాఁగ
నయ్యె; నంతకుమున్ను స్వ♦చ్ఛాకృతిఁ దగు
పగ లపుడు రూక్షవాతసం♦భరిత మయ్యె. ౧౧ 2050

క. మృగములు పక్షులు క్రూరగం, బుగను భయంకరముగాఁగ ♦ ఘోరనఁ గూసెన్
మృగరాజునకుం బలె గొ,ప్పగఁ దగు మూఁపులును వ్యాఘ్ర♦పౌరుషములరన్.

చ. విలసిలు నాయకంపనుఁడు ♦ భీతముతై నగు నానిమిత్తముల్
పొలయుట కాత్మ భీతిలక ♦ పోయె రణస్థలి; కట్లు రాక్షసా
వలి గొలువంగ యుద్ధమున ♦ వాంఛను బూని చెలంగి పోవ వా
రల పెనునాద మట్టి వన♦రాశిఁ గలంచున టొప్పె నెంతయున్. ౧౩౪ 2052

క. వనచరుల పెనుబలం బా, ధ్వనికిన్ మిక్కిలియు భీతి ♦ వడి వృక్షములన్
ఘనగిరుల నాయుధములుగఁ, గొని నిల్చెను ననినొనర్చు ♦ కోరిక నంతన్.

సీ. రామునిమిత్తము ♦ రావణుకొఱకును దమప్రాణముల వీడఁ ♦ దలఁచియున్న
వనచరదనుజుల♦కును మహారౌద్రమౌ సంగరం బప్పుడు ♦ జరగె; నంత
వారలెల్లను భూరి♦బలవంతులును శూరు లద్రిసంకాశులు ♦ నై చెలంగు
చుగుగాన వార లొం♦డొరులఁ జంపఁదలంచి; రతిబలవంతులై ♦ యలరునట్టి
తే. యిరుదగలవారు రణమందు ♦ నేపుమీఱఁ, జేయుసింహాస్వనావళి♦చేతఁ గోప
మునఁ బరస్పరదర్శన♦మున నొనర్చు, గర్జనంబులఁ గల్గిన ♦ గాఢరవము. ౧౬౪

క. వినఁబడియెన్ భయదంబుగఁ, గన నెట్టఁగ నున్నయట్టి ♦ త్సారజము సురా

* అకంపన స్తతి స్తేపా మాదిత్య ఇవ తేజసా-అనిమూ.

రినికరకీశపదాహతి, జనితంబయి పర్వి దిగ్వి♦జమునందుఁ గడున్. ౧౮॥

తే. భీసుముగ నిండెఁ; గొండొక ♦ భూమి ధూళి
తమగు కౌశేయమట్లు సి♦తప్రభఁదగు
రజము వ్యాపించి యుండుటఁ ♦ బ్రథనమందు
వార లొండొరుఁ గనఁజాల ♦ రైరి మఱియు. ౧౯॥ 2056

క. అని దుమ్ముఁ గ్రమ్మఁగా వర్మనికరము పతాకలు ధ్వజ♦రాజితురగముల్
గనఁబడకుండెను శస్త్రము, లనూనరీతిం బెనంగు ♦ నాభటతతికిన్. ౨౦॥

క. ఆసంకులసమరంబున, నీసున నార్చుచును నొరుల ♦ నేపునఁ జంపం
గా సత్వర మభిముఖముగఁ, బో సమకట్టుచును వేగ ♦ పోవుచు మఱియున్.

ఆ. మారుకొనుచునుండు ♦ మానవపతిబల
దనుజవరునిబలవి♦తానమందు
భటుల నిస్వనంబె ♦ చటులంబుగా వినఁ
బడియెఁ దోఁప దందు ♦ వస్తు వెదియు. ౨౧॥ 2059

చ. కనఁబడకుండఁ జీఁకటులు ♦ గ్రమ్మటచేఁ దమవారొ యన్యులో
యని తెలియంగ నేరకయె ♦ యాకపిరాక్షసు లట్టె క్రుద్ధులై
వనచరరాక్షసావళినె ♦ బాహుబలంబులఁ గొట్టసాగి; రా
దనుజులు వానరుల్ మఱియుఁ ♦ దార్కొని చీఁకటియందుఁ బెల్లుగన్. ౨౨॥

క. పరులను దమవారలనుం, బరిమార్చుచు నాధరిత్రిఁ ♦ బలుసారులు నె
త్తురుకాలువలం దడుపుచుఁ, జరణక్షోభములచే ర♦జంబుగఁ జేయన్. ౨౩॥

క. కనఁబడియె భయంకరముగ;, ఘనగతి రక్తంబు పాఱఁ♦గా రజమెల్లన్
గనియె నదృశ్యత; నంతట, నని జరగెడి ధాత్రి శవస♦మాకుల యయ్యెన్.

సీ. హరులును దానవుల్ ♦ తరువుల శక్తుల శిలలఁ బ్రాసముల గ♦దలను బరిఘ
ములఁ దోమరంబులఁ ♦ జెలఁగువిక్రమముల నన్యోన్యమును గెల్చు♦నాసలూని
ప్రహరించుకొనుచు బ♦వరము నొనర్చిరి పర్వతాకారులు ♦ భయదకర్ము
లగువానరులు పరి♦ఘాకారములగు బాహువులతోఁ బెనఁగుచు♦నొగిదనుజుల

తే. యమునిప్రోలికిఁ బంపి; రా♦యసురు లట్టె
క్రుద్ధులై ప్రాసతోమర♦కూటపాణు
లగుచు దారుణశస్త్రప్ర♦హారములను
గపులఁ జంపిరి కడఁక న♦క్కదనమందు. ౨౫॥ 2063

చ. దనుజచమూవిభుండగుచు ♦ దారుణవిక్రము మెప్పు నాయకం
పనుఁడు మహాగ్రహంబున సు♦పర్వభయంకరవిక్రమంబులన్
దనుజులు వానరావళిని ♦ దార్కొని చంపఁగఁ జూచి గారవిం
చెను; నవుడాకపీశ్వరులు ♦ చెచ్చెఱవైరులడాసి పూన్కితోన్. ౨౬ 2064

చ. దనుజులచేతియాయుధవి♦తానము వీర్యము పొంగ లాగికొం
చును ఘనవృక్షముల్ వయిచి ♦ చూర్ణము సేయుచు బాలరువ్వుచుఁ
దనువులు ముద్దసేయుచును ♦ దారుణయుద్ధ మొనర్చి; రింతలో
వనచరవీరులై ప్రకట♦బాహుబలంబుల నొప్పువారలై. ౩౦ 2065

ఆ. అలరుచున్న కుముద♦నలులు మైందద్వివిదులును గోప మడర ♦ ధూర్తదనుజ
వితతిపైకిఁ బొంగు♦వేడ్కలఁ బోయిరి; జవము లొప్పు ప్లవగ♦సైన్యపు లిటు.

క. సురరిపుసేనాముఖమున, కరిగి విలాసములతో మ♦హావృక్షములన్
దుర మొనరించుచు నానలువ్వురు దనుజుల గుంపులుగను ♦ బొరిపుచ్చి రటన్.

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౬ - వ సర్గము.

హనుమంతుఁ డకంపనుని జంపుట

తే. ఆయకంపనుఁ డావాన♦రాధినాథు, లట్లుచేసిన గొప్పకా♦ర్యమును గాంచి
యుద్ధమునఁదీవ్రకోపంబు♦నొందెనతఁడు, వైరికృతకార్యజనితతీ♦వ్రతరరుషను.

క. తనమేను దెలియకవుడే, ధనుస్సుఁ బలుమాఱు మీటి ♦ తనసారథికి
ట్లనియెను; బెక్కుకపీంద్రులు, మనదనుజులఁ బెక్కుమంది♦మార్కొనియనిలోన్.

క. పరలోకంబున కిప్పుడె, యరుగంగాఁ జేయుచుండ ♦ నగపడెడుఁగదా
త్వరగా నాస్థలి కేమన, యరదము పోనిమ్ము త్వరగ ♦ నల్లదె కంటే. ౩ 2070

క. నాయెదుట సారథీ! గురు, కాయులు బలయుతులు కపులు ♦ క్ష్మారుహగిరులే
యాయుధములుగాఁ గైకొని, యే యలరుచునున్నవార ♦ లెంతయుఁగడఁకన్.

క. అని వినుతిం గాంచిన యా, వనచరుల వధింపఁగోరు♦వాఁడను వారే
దనుజబలంబుల నంతంబును బొందం జేయువారు ♦ పో తలపోయన్. ౫

చ. అని రథికోత్తముం డయిన♦యట్టి యకంపనుఁ డప్డు వేగమొ
ప్ప నరుగుఘోటకంబులను ♦ బాగుగఁ బూన్చిన యారథంబు న
వ్వనచరు లున్నతావునకు ♦ వైళమ తోలఁగఁ బంచి క్రుద్ధుఁడై
సునిశితబాణజాలములఁ ♦ బ్రుక్కఁగఁ జేసె బలంబు పొంగఁగన్. ౬ 2073

క. *దనుజోత్తము కట్టెదుటన్, వనచరులు రణంబున నిలు♦వఁగఁ జాలరనం
గ నికన్ మార్కొనరని చెప్పనేల? తద్బాణవితతి ♦ భగ్నబలులునై. ౬౺

క. పరుగెత్తి రంద అంతట;, మరుదాత్మజుఁ డురుబలుండు ♦ మానుగ వారిన్
బరునికిఁ జిక్కి మృతింగను, తరుణంబున నున్నవారిఁ ♦ దనబంధువులన్. ౮

క. కని వానిచెంత కేగెను;, వనచరయూథపులు వీర్య♦వంతులు ననికిన్

* ౩౦ పున ర్యోద్ధు మాహవే-అనిమూ.

జనుపెంచిన యాకపివరుఁ, గని హర్షము మనములందుఁ ♦ గని యావేళన్.

క. పరివేష్టించిరి మారుతి;, హరియూథపు లతులవిక్ర♦మాఢ్యులు నపుడా
మరుదాత్మజుఁ డేతేరం, బరమముదంబలర నతని♦ప్రాపునఁ దామున్. ౧౦

తే. నిలిచి; రంత నకంపనుఁ ♦ డెలమిఁ బర్వ, తాకృతిం బొల్చి నిల్చిన♦హనుమపైని
వజ్రతుల్యాధరముపయుని ♦ శర్షధార, లట్టి గురియువిధంబున ♦ నంత వెల్లి.

క. కురియించె; నంత బలవి,స్ఫురణంబునఁ బొలుచు పవన♦పుత్రుం డట భీ
కరవైరినిశితబాణో,త్కర మాత్మశరీరముపయిఁ ♦ గడునడిఁ బడఁగన్. ౧౨

క. మనమున లక్ష్యముసేయక, దనుజునివధియింప మదిని ♦ దలఁచెను; దేజం
బున మిగులఁ బొలుచు నాపా,వనిబలిమిని భూమి నెల్ల ♦ నడఁకించుగతిన్.

క చరణము లిడుచున్ దానవ, వరునిం దలపడియె; నిట్లు ♦ వర తేజమునన్
నిరుపముఁడై సింహధ్వని, పరఁగం జేయుచును వెలయు ♦ పావని యంతన్.

క. రూపంబున దుర్ధర్షుం, డై పగటిదివాకరాభుఁ♦డై వెలుగొందెన్;
గోపమున నంత హరికుల, దీపకుఁ డాహనుమ చెంత ♦ దీపించురిపున్. ౧౫

క. కనుఁగొని యాయుధ మేదియుఁ, దనకరమున లేకయుంటఁ ♦ దలపోసి జవం
బునఁ గొండ నొకఁడు పెల్లిం,చెను; వీర్యముపొంగ నొక్క ♦చేతన్ బలిమిన్.

క. గురుశైలం బద్దానిన్, ధరియించి మహారవంబు ♦ దగునట్లుగ నా
ర్చి రయమునఁ ద్రిప్పె; మునుసం,గరమునసముచిన్ వధింపఁ♦గాఁ గ్రోధమునన్.

చ. కరమున వజ్రముం గొని య♦ఖండపరాక్రమమొప్ప నిర్జరే
శ్వరుఁడు రయంబునం జనెడు♦చాడ్పునఁ జేత గిరిన్ ధరించి యా
తురమున నయ్యకంపనుని♦తోఁ రణముం దగఁ జేయఁబోయె భూ
ధరశిఖరంబు నెత్తుకొని ♦ తన్నువధింపఁగ వచ్చుపావనిన్. ౧౮ 2085

చ. కనుఁగొని యాయకంపనుఁడు ♦ కార్ముకనాదము భీతిదంబుగాఁ
దనరఁగ దూరమందె గురు♦ధాత్రిధరాగ్రము నర్ధచంద్రబా
ణనికరముం గదున్ వయిచి ♦ నాశన మొందఁగఁ జేసె; నంబరం
బుననె మహీధరాగ్రము రి♦పుప్రహితాంబకచూర్ణితాంగమై. ౧౯ 2086

క. ధరఁ బడుటం గని పావని, గురుకోపావేశమొందెఁ; ♦ గ్రోధము దర్పం
బురుగతిఁ బెనఁగొన గురుగిరి, కరణిం బొడవైన *యశ్వ♦కర్ణద్రుమమున్.

క. అనిలాత్మజుండు పెకలిం,చెను; నిట్లాతండు మద్ది♦చెట్టును గొనుచున్
బెనుస్కంధమ్ములు గల దా,నినిబట్టిన సంతసమున ♦ నిక్కి ముదమునన్.

తే. పక్కనన్ నవ్వుచున్ ద్రిప్పె ♦ బవరమందు;
హనుమ యంతటఁ గ్రుద్ధుఁడై ♦ యరుగుచుఁ దన

* అశ్వకర్ణద్రుమము=మద్దిచెట్టు.

యూరువుల వేగమున కట ♦ నున్న ద్రుమము
లవనిఁ బడఁ గాళ్లఁద్రొక్కుచు ♦ నవనిఁ బగుల. ౨౨ 2089

చ. అరులను జేరి ధీవిభవ ♦ మల్లు బలంబును గల్గునాతఁ డా
తరువున హస్తిసంతతిని ♦ దానిపయిందగువారి, స్యందనో
త్కరమును నందుఁ గ్రాలు రథి♦కవ్రజముఁ మఱియుఁ బదాతులన్
బోరిఁగొనెఁ; గ్రుద్ధసంయమని ♦ పోలిక నాతఁడు రాక్షసావళిన్. ౨౩౪ 2090

క. అనిమొనఁ జంపుచునుండం, గని యాతనిఁ జూచి యసుర♦కాండము పెనుభీ
తిని బాఱె; వీరుఁడగునా,దనుజుఁ డకంపనుఁడు పవన♦తనయుఁ జేరున్.

క. దనుజభయావహుఁ గ్రోధం,బునఁ బైఁబడవచ్చువానిఁ ♦ బోలంగని సిం
హనినాదముఁ గావించెను, బెనుకోపం బడర; నంత ♦ వీర్యము పొంగన్. ౨౫

క. సునిశితతనుభేదనచణ, ఘనబాణచతుర్దశకముఁ ♦ గైకొనుచు నకం
పనుఁ డాగురువీర్యునిఁ బా,వని నొప్పించెను ధనుర్వి♦భవ మలరారన్. ౨౬

సీ. వీరుఁడౌ పావని ♦ వివిధబాణంబులు వర్షంబు తెఱఁగున ♦ వపువునందు
నాటఁగా వృక్షసం♦తతు లట్టె మొలిచినఁ గనఁబడు శిఖరీంద్రు♦కరణిఁ గానఁ
బడియెను; దీర్ఘకా♦యుఁడు మహావీర్యుండు ధైర్యశాలియునగు ♦ తపననూను
సచివుండు హనుమ యా♦శరములఁ దాఁకునఁ బూచినట్టి యశోక♦భూజ మట్టు

తే. లరుణవర్ణుండు పొగలేని ♦ యగ్నికరణి, విమలతేజుండునై యుప్పు ♦ వెల్గి; వేగ
మఱొకవృక్షంబుఁ బెకలించి ♦ నెఱిదనుజుని,శిరముపగులంగ మోఁదెను♦జిత్రరీతి.

చ. దనుజవరుం డకంపనుఁడు ♦ దారుణకోపము నొంది యామరు
త్తనయుఁడు దివ్యచిత్తుఁ డిటు ♦ ధాత్రిరుహంబునఁ దన్నుఁ గొట్ట ను
ర్వినిబడి యప్పుడే యముని ♦ వీటికిఁ బోయెను; నిట్టు లాతఁ డా
యనిఁబడఁ గాంచి దానవులు ♦ నార్తిని దానవనాథు నెంచుచున్. ౩౦౪

క. క్షితి కంపంబున ద్రుమసం,తతులెల్లం గదలునటు వ్య♦థం బొందిరి; దు
ర్మతు లారాక్షసులు పరా,జితులై వనచరులు తఱుమఁ ♦ జెందినభీతిన్. ౩౧౪

ఆ. ఆయుధములఁ నెల్ల ♦ నందందె పడవైచి, పరుగువాఱి రాత్మ♦పత్తనమున;
కట్లు దనుజులపజ♦యమునొందితలవెంద్రు,కలఁగి విరియఁబాఱఁ♦గఁదడఁబడుచు.

క. తనువులు స్వేదమయమ్ములు, గను జూపట్టంగ స్వీయ♦గౌరవ మెటకో
చన నూర్పులు విడుచుచుజవ,మునఁ బాఱిరి;మఱియువిజయ♦మునుబొందమికిన్.

తే. వగలఁ బొగులుచు మూఢులై ♦ తగఁ బరస్ప
రంబు బ్రహరించుకొనుచు భ♦యంబునఁ బలు
మాఱు వెనుకటిదిక్కును ♦ దేఱిచూచు
చును బురంబును జొచ్చిరి; ♦ దనుజు లట్లు. ౩౮ 2099

క. పురమున కరిగిన పిమ్మట, హరివీరులు ప్రబలులెల్ల ♦ నందొకచోటన్

సరిగాఁ జేరి మరుత్సుతుఁ, బరమవిధిన్ బూజసల్పి ♦ వఱలిరి పిదపన్. ౩౫

క. బలశాలి హనుమ చిత్తం, బలరఁగ మీసాయమున జ♦యం బది నాకుం
గలిగె నది వేఱుగా దను, పలుకులఁ దగినట్లు బదులు ♦ పలుకుచు వారిన్.

ఆ. గారవించె విజయ♦కలితు లావానరుల్, తమబలంబుకొలఁది ♦ ననురవైరి
చావు కేటపడఁగ ♦ సమధికనాదముల్, చేసి రాధ్వనులకు ♦ గాసిఁ జెందె. ౩౬

క. బలవంతులైన యాదనుజులు గూడఁ దిపించి, రనిల♦సూనుఁ డసురులం
దలపడి చంపి భయంకరు, నలఘుపరాక్రముని రిపుగ♦ణాంతకు దనుజున్. ౩౭

క. అనిఁ జంపిన శ్రీవిష్ణువు, ననువున సేనాముఖంబు♦నందు సమదవై
రిని జంపి వీరశోభం, గని యొంతయు వెలయుచుండెఁ ♦ గడుఁ దేజమునన్. ౩౮

చ. అనిలతనూజు నంబరము♦నందు వసించిన దేవతల్ ముదం
బునఁ గొనియాడి; రంత రఘు♦పుంగవుఁ డాబలశాలి లక్ష్మణుం
డనఘుఁడు నావిభీషణుఁడు ♦ నర్కసుతుండును లోనుగాఁగ న
వ్వనచరు లందఱుం బొగడి ♦ వర్ధిలఁ జేసిరి గౌరవంబునన్. ౩౯ 2105

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౫౭ - వ సర్గము.

ప్రహస్తునియుద్ధము.

చ. అమరవిరోధినాథుఁడగు ♦ నాదశకంఠుఁ డకంపనుండు యు
ద్ధమున వధింపఁగాఁ బడుటఁ ♦ దా విని క్రోధము నొంది మోముదై
న్యము నిసుమంతఁ గాంచఁ దన♦యందలి ప్రీతి చెలంగ నున్న బు
ద్ధిమహితులైన మంత్రులను ♦ దెప్పునఁ జూచెను జింతనొందుచున్. ౧ 2106

క. దనుజేంద్రుఁ డంత నెమ్మన,మును క్షణకాలము విచార♦మున మగ్నముగాఁ
గను సచివులతో నాలో,చన సేసిన పిదప మంత్రి♦సంయుతుఁ డగుచున్. ౨

తే. పగటిపూర్వార్ధమున లేచి ♦ బలముల నెటు
వ్యూహములుగా నమర్చితో ♦ యొప్పుమీఱ
నావిధముఁ జూచుటకుఁ బురి♦యందుఁ గలయఁ
దిరిగె, నాతఁడు రక్షోవి♦సరము లెల్ల. ౩ 2108

క. తనురక్షింపఁగ నొప్పుచు, ఘనసేనావ్యూహనివహ♦కలితం బగుచున్
గనదురుపతాకలును ధ్వజ,వినిచయముల మిగులఁ గాంతి♦ వెలయు నగరమున్.

మ. కని రక్షోవిభుఁ డంత వానరులు లం♦కాపత్తనం బెల్లఁ జ
క్కనిరీతుల్ దగ నావరించుటను బిం♦కం బొప్పఁగాఁ జూచి య
ప్పని కావంతయు నోర్వ కియ్యది టులో♦ప్పం జేయఁగా నౌనటం
చును సిద్ధాంతము సేయు వేళను బ్రహ♦స్తున్ యుద్ధవిద్యావిదున్. ౫ 2110

క. కని యిట్లను సంగరవిధ,మునఁ బండితుఁ డనఁగ నీవె ♦ ముఖ్యుఁడు లగుచుఁ
మనపగఱసేన లీపుర,మును నాకస్మికముగాఁగ ♦ ముట్టడినలుపర్. ౫ 2111
క. దానిఁ విడిపింపఁగ రిపు,సేనలు పీడింపుచుండఁ ♦ జెచ్చెఱ దానిఁ
మానుసటుసేయ యుద్ధము, మానిన నన్యగతి నాదు ♦ మదిఁ దోఁపదుసూ!.
క. నిను విడిచిన వేఱొకఁడి,పని దీర్చునటంచుఁ జెప్ప ♦ బాగానే; యీ
యనుపమకార్యభరంబున,కు నేను నాతమ్ముఁడైన ♦ కుంభశ్రవుఁడుఁ. ౭
తే. నాదు సేనాధిపతి వీవు ♦ నాతనూజుఁ
డైన యీయింద్రజిత్తు, మ♦హాబలుఁడగు
నానికుంభుఁడు తగుదుము ♦ గాని యొరులు
మోయఁగాఁ జాల రీభార♦మును దలంప. ౮౪ 2114
చ. కనుకనె నీవు సైన్యములఁ ♦ గ్రన్ననఁ జేకొని నీదునాపతిం
గాని తిరుగంగ నాజ్ఞ యిడి ♦ కోఁతులు పెంపుననుండుచోటికిం
జని గెలుపొంది రాఁదగును; ♦ సంగర మీవటఁ జేయనేల? చ
య్యన పనిసేయఁగా వెడలి♦నంతన చాలును గార్యసిద్ధియా. ౮ 2115
క. వనచరు లెంతయుఁ జపలులు, దనుజుల సింహధ్వనులనుఁ ♦ దారు వినినయం
తనె భీతిఁ బాఱి పోఁగల, రని సేయఁగ శిక్షనొంద ♦ నట్టివనచరుల్. ౮౪ 2116
క. అనయంబుఁ జంచలాత్ములు, కనుకఁ హరినాదము విని ♦ కరులు నిలువఁజా
లనియట్లు నీదు సింహ,ధ్వనివిని సైరింప వారు ♦ తగ రించుకయుఁ.౯౪ 2117
క. దనుజోత్తమా! ప్రహస్తా, వనచరబలు లిట్లు భీతిఁ ♦ బరుగిడ రాముం
డును లక్ష్మణుతోడం బ్రభు, తను మానుచుఁ దవ్వదవ్వళంబు♦తాఁనొందుఁజుమీ.
[1]క. అనిమొన మనకుం గూడం, గనఁ గూడును హాని యట్లు♦గావున సద్దా
నిని జేయకుండుటే మే,లని పల్కెఁదవేమొ బవర ♦ మాపితి మేనిఁ. ౧౦౪
[2]. సీ. మనశత్రువులు యుద్ధ♦మును మాన రటుగాన మనకు నవార్యమ♦లన మరణము
కలుగుట నిజము, సం♦గర మొనరించినఁ బంచత గల్గునో ♦ మించువిజయ
మే కల్గునో నిశ్చ♦యింప సాధ్యముగాదు కావున మరణంబు ♦ కల్గుట యన
సందేహమే, యిట్లు ♦ జన్య మొనర్పక మానినరిపులచే ♦ మనకు విగత
తే. సంశయంబుగఁ గల్గెడు ♦ చావుకంటె
నని నొనర్చినచో సంశ♦యముగఁ గల్గు
మృతియె శ్రేయము కాన న♦ల్లేని మాని
యుంటకన్న శ్రేయంబగు ♦ యుద్ధ మిపుడు. ౧౧ 2120

1 నను యుద్ధే ఇత్యాది వ్యాఖ్య కిదిపద్యమని తెలియఁదగు 2 ఆపన్నంశయిత్వా శ్రేయో నతు నిస్సంశయాకృత్వా-అనిమా. ఈశ్లోకార్థభాగమునను వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థమిట్లు నీసీసపద్యమునఁ జేర్పఁబడినదని గ్రహింపఁదగు.

క. ఈ నాయాశయమునకున్, దానవ! యనుకూలముగనొ ♦ తగఁ బ్రతికూలం
బై నెగడురీతిగనొ యొ,ద్దానిన్ మాకు హితమనుచుఁ ♦ దలఁచెదొ దానిన్.
ఆ. చెప్పు మదియె మాకు ♦ నెప్పుడు హితమగు,ననుచు రాక్షసేంద్రుఁ ♦ డలరిపలుకు
నాలకించి సుభట♦పాలకుఁ డా ప్రహ,స్తుండు చాల వేడ్క ♦ తోడ నవుడు. ౧౨
క. మును శుక్రుఁ డసురపతితోఁ, జనువొప్పం బల్కినట్టి ♦ సరణి దనుజవ
ర్యునిఁ గాంచి పలికె నిట్లని;, విను మో రాజేంద్ర మును వి♦భీషణముఖ్యుల్.
ఆ. న్యాయశాస్త్రనిపుణు ♦ లై యుంటవారితో మనముకొల్వుకూట♦ముననెయ్యావి
షయముఁ గూర్చి మిగులఁ ♦ జతురిమ నెంచినవారమాటనిది న♦వంబు గాదు.
తే. అంద లోకభంగిఁ గాక య♦న్యోన్యమతివి
రుద్ధముగఁ బల్కుచుండ న♦రుంతుదమగు
భావమును జూపి నీతిమ్ముఁ ♦ డావిభీష
ణుఁడు వెడలి పోవునంత జ♦గడము గలిగె. ౧౩ 2125
చ. జనకజ నిచ్చుటే శుభము ♦ చాన నొసంగక యున్న సంగరం
బును గలుగంగఁ బోవునని ♦ మున్న మనంబున నిశ్చయించితిన్
దనుజవిభూ! యదెట్లు మదిఁ ♦ దప్పదటంచును నెంచియుంటినో
మన మిట దానిఁ జూచితిమి; ♦ మన్మత మిప్పు డటుండనీ ప్రభూ!. ౧౪ 2126
చ. సతతము భూషణాదుల నొ♦సంగుచు నిర్భరగౌరవైకసం
యుతమగు ప్రీతి సాంత్వనయు♦క్తిని బల్కుచు గారవింతు వీ
వతులితభంగి నన్ను; నిటు ♦ లాదృతిఁ గాంచిన నేను నీప్రియం
బు తఱిని దేనినేఁ దమిని ♦ బొందుగఁ జేయక యుందువాఁడనే. ౧౫ 2127
చ. ధనమును నాదుజీవితము ♦ దారసుతాదులఁ బ్రీతిఁ గాచు న
ప్పనియును నాకు లేదది య♦భవ్యము దానవనాథ! చూడుమా
యనియును నగ్నికుండమున ♦ నస్మదసువ్రజమున్ హవిస్సు నీ
కును నయి వేల్చువాఁడ నిది♦గో ముదమొప్పఁగఁ బూన్కిమీఱఁగన్. ౧౬
చ. అని దనుజేంద్రుతోఁ బలికి ♦ యాభటనాయకుఁ డంత మ్రోలను
న్న నిఖిలసైన్యనాయకుల ♦ నాదృతిఁ గాంచి వచించె; నిట్టు;లో
దనుజవరేణ్యులార! గురు♦దానవసైన్యముఁ బిల్వ నంపుఁడీ
యని మొన నిప్డు వజ్రసదృ♦శాస్మదనూనశిలీముఖంబులన్. ౧౭ 2129
*చ. వనచరులెల్లఁ జావఁ గపి♦వర్యుల మాంసమునెల్ల మాంసమే
తినుపతగంబు లాదృతిని ♦ దృప్తిగ మ్రింగి ముదంబుఁ బొందుగా;
కనెదు ప్రహస్తుపల్కులను ♦ నాభటనాయకు లాలకించి యిం
తని యోచియింపరాని త్వర ♦ నాపురమున్ వెలరారు వారలన్. ౧౮ 2130

* అద్యతృప్యంతు మాంసాదాః పక్షిణః కాకనాకసామ్-అనిమూ. మాంసమే తినుపతగంబు లనునది మాంసాదాః పక్షిణః అనుదానికిఁ దెనుఁగని గ్రహింపఁదగు.

క. దనుజులలో మేటులఁ జక్కనివిధమునఁ గూర్చి యుద్ధ♦కర్మంబున కొ
యన సంసిద్ధ మొనర్చిరి; గన నవు డానగరమెల్లఁ ♦ గజయుతమువలెన్.

క. ఖరతరనానాయుధముల, ధరియించిన దనుజవీర♦తతిచే నిండెన్
దరుణమునం దప్పుడు కగ్బురు లెల్లను వహ్నియందుఁ ♦ బూనిక మెఱయన్.

సీ. శాంతిహోమంబులఁ ♦ జక్కఁగాఁ జేయుటవలనను బ్రాహ్మణ♦వరుల గంధ
పుష్పాళిచే భక్తిఁ ♦ బూజించుటవలన నచ్చటిపవమానుఁ ♦ డాజ్యగంధ
సంయుక్తుఁడై పుష్ప♦సౌరభయుతుఁడయి వీచె నప్పుడు చాల♦విజయమంత్ర
వరముల మంత్రింపఁ♦బడిన నానావిధపుష్పహారముల నుం♦బ్బున రణంబు

తే. సేయ నుద్ధతులయియున్న ♦ జృంభ దసుర
వరులు కైకొని దాల్చిరి ♦ సురవిరోధు
లంతఁ గత్తళములఁ దాల్చి ♦ యతులచాప
ములను గరములఁబట్టి యు♦జ్జ్వలగతులను ౨౩½ 2133

చ. జవమున వచ్చి రావణుని ♦ సన్నిధిఁ జేరి నమస్కరించి సై
న్యవిభుసి నాప్రహస్తుని మ♦నంబుల నొప్పెను భక్తిఁగొల్చి; దం
త విభునియాజ్ఞఁ గొంచు భట♦నాయకుఁ డప్పుడె భీమభేరికా
రవము నిగుడ్పఁజేసి రుచి♦రాజితశస్త్రము లొప్పుచుండఁగన్. ౨౪ 2134

తే. అతిమనోహరమై యొప్పు ♦ నరదమెక్కె
స్యందనం బది జవనాశ్వ♦సహితమగుచు
శక్తియుతుఁడైన సారథి ♦ చక్కఁదోల
జలదగర్జనతుల్యని♦స్వనము పొలయు. ౨౫½ 2135

చ. సరసిజవైరిమాడ్కిఁ గడు♦సంతస మిచ్చుచు నార్యరీతిఁ దే
జరిలుచు, నేమియుం జెనక♦సాధ్యముకాని ఫణిధ్వజంబుచేఁ
బరఁగుచు మంచికప్పునను ♦ భాసిలుచున్ వరచక్రముల్ తగన్
నిరుపమభర్మజాలక వి♦నిర్మితిఁ గప్రమునై స్వకాంతులన్
ధరఁగలనన్యవస్తువులఁ ♦ దాఁ బరిహాసము సేయునట్టులై. ౨౬ 2136

క. తనరఁగ నారథవర్యం,బును నెక్కుచుఁ దమిని దనుజ♦భూపతి యాజ్ఞం
గొని పెనుసేనలు వెంటం, జనుదేరఁ బురంబునుండి ♦ సరగ వెడలెఁ దాన్.

క. భటనాథుఁ డిట్లు వెడలఁగఁ, బటుభేరీధ్వనులు వివిధ♦వాద్యధ్వనులుం
జటులతరశంఖరవములు, తటుకున ఘనగర్జనము వి♦ధంబునఁ బెలుచన్. ౨౭

*క. వననిధిఁ బొంగంజేసెను, ననువున వినఁబడియె; భీక♦రాకారులు భీ
తిని నిచ్చురూపములు తగు,దనుజులు భయదారవముల ♦ దర్పముపొంగన్.

---

* పూరయ న్నివసాగరమ్-అనియు.

తే. ఆప్రహస్తుఁడు ముందేగ ♦ నతనిఁగూడి
యరిగి; రాకుంభహనుఁడు న♦రాంతకుండు
నవ్విధమున మహానాదుఁ ♦ డానమున్న
తుఁడు నను ప్రహస్తుముఖ్యసుం♦త్రులు నలువురు. ౩౧½ 2140

క. అతనిం బరివేష్టించుచు, జతనంబున నరిగి; రంత ♦ సద్భటనాథుం
డతిజవమున వ్యూహంబుగఁ, గృతిసేయంబడిన బల ము♦కించిన్నతమై. ౩౨

క. కరియూథనికాశంబై, యరిభయదం బగుచు నుండ ♦ నాసైన్యముతోఁ
బరమముదంబునఁ దూరువు,నరణిన్ వెడలెను; భటౌఘ♦స త్తముఁ డంతన్.

చ. జలనిధిపూర మట్టుగ నె♦సంగెడు తద్బలమెల్ల వెంటరాఁ
బ్రళయమునందుఁ దీవ్రగతి ♦ భాసిలు నాయమురీతిఁ జయ్యనన్
వెలలెను; నాప్రహస్తుఁడును ♦ వీరనిశాచరు లేగుచుండి యి
మ్ముల నొనరించునాధ్వనికి ♦ భూతము లప్పురినున్న వన్నియున్. ౩౩½ 2143

తే. వికృతరవమున నఱచెను; ♦ వితతర క్త, పలలభోజనములయిన ♦ పక్షులెల్ల
నపగతాభ్రనభోమార్గ ♦ ముందుఁ జేరి, స్యందనమునకు నపసవ్య♦నరణిఁదిరిగె.

క. అనలజ్వాలల నుమియుచు, వినఁగ భయంకరముగాఁగ ♦ వితతంబుగఁ గూ
సెను నక్కలు మఱివ్యోమం,బునుండియుల్కాసమూహ♦ములువడిఁబడియెన్.

క. పరుషముగ వీచె వాయువు, పరస్పరము ఖేటము లొగి ♦ బవరముచేయం
ద్వరపడుచు వెలుఁగకుండెను, ఖరగర్జనములను మేఘ♦గణములు మిగులన్.

క. ఒనరుచుచు నతనిదౌ స్యం,దనముపయిన్ నల్ల గురిసి ♦ తత్సైన్యముముం
దు నరుగువారిం దడిపెను, గనుచుండఁగ గ్రద్ధయొకఁడు ♦ కడుఁ బూనికమై.

తే. అతనిధ్వజమూర్ధమున దక్షి♦ణాభిముఖము
గాఁగ వ్రాలుచు, రెండుప♦క్షముల వదన
మునఁ దగం గీఱుకొనుచు ని♦ల్చెను బ్రహస్తు
వదనకాంతులు మాసెను ♦ బక్షిఁ గనుట. ౩౮ 2148

క. తురగములం దోలుటలోఁ, గరము చమత్కృతిని ధరణిఁ ♦ గనుసారథి యా
యరదముఁ దోలుచు సంగర,ధరిత్రిఁ బలుసార్లు చొచ్చి ♦ తగినవిధమునన్.

ఆ. రథము గడువునేర్పు ♦ రంజిల్లువాఁడయ్యు, నపుడు పోవుచుండ ♦ నతనిహస్త
తలమునుండి పడియెఁ♦దటుకున మునికోలః, బయలువెడలుతఱిని♦భటవిభునకు.

సీ. వసువులకును దుర్ల♦భమయి భాసురమగుముఖకాంతి యొకక్షణం♦బున నశింప
నాప్రహస్తుఁడు వివ♦ర్ణాంగుఁడై సర్గతోత్సాహుఁడయ్యెను, సమ♦స్థలమునందె
యతనిఘోటకములు ♦ గతితప్పి తొట్రిలఁబడియె వి స్తృతబల♦పౌరుషములఁ
బఖ్యాతిఁగాంచిన♦భటనాయకుఁడు ప్రహస్తుఁడుయుద్ధమొనరింప♦వెడలిరాఁగఁ

తే. గాంచి నానాయుధముల ధ♦రించి ప్లవగ
బలము లనిసేయసిద్ధమై ♦ నిలిచె; నంత
వనచరులు సాల్వయుధములకై ♦ ఘనతరువులఁ
బెనుశిలలఁబట్టి లాగుట ♦ వితతరీతి. ౪౨ 2151

క. గురుతరమై తుములధ్వని, పరఁగెఁ; రాక్షసులు మిగుల ♦ భయదంబుగ నం
గరరంగమునం దార్వఁగ, హరివీరులు బొబ్బలిడఁగ ♦ నాయుధు దెగలున్. ౪౩

క. ప్రమదమ్ముగ నుండెను; వేగము గల్గి సముద్ధులగుచుఁ ♦ గలహమునఁ బరుల్
సమయము దొరకినఁ జంపంగ నుదిఁబరస్పరముమిగులఁ♦గాంక్షఁజెలఁగుచున్.

క. ఒండొరులను బిలుచుచు నుద్దండభుజావిక్రమముల ♦ దైవారెడు నా
చండాసురవానరుల యఖండధ్వని మిగుల రేఁగి ♦ కడువ్యాపించెన్. ౪౫

చ. కుమతి ప్రహస్తుఁడంతఁ దన♦కోర్కి జయింపఁగ నుండ వానరేం
ద్రసహితసేనఁ గూర్చి చని ♦ తాన్మృతి నొందఁగఁ గోరి యగ్నిహో
త్రము శలభంబు చొచ్చెడువి♦ధంబునఁ బైపయి వేగ మొప్ప యు
ద్ధమునకు వచ్చునాభటవి♦తానముఁ జొచ్చె నదృష్టహీనతన్. ౪౬ 2155

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము

---

## ౫౮ - వ సర్గము.

నీలుఁడు ప్రహస్తునిఁ బొలియించుట

క. [1]తరువాత నరిందముఁడగు, సరసిజబాంధవకులుండు ♦ జన్యములకు భీ
కరవిక్రముఁడు ప్రహస్తుం, దరుదెంచుట హితులవలన ♦ నాత్మఁ దెలియుటన్.

మ. బలవంతుండగు వైరిసింగ నుటచేఁ ♦ బల్గాఊ వక్త్రంబునం
దెల నవ్వొప్ప విభీషణుం గనుచు ని♦ట్లోరీతి దీర్ఘాకృతిన్
బలవీర్యంబులఁ బొల్చువాఁడనుచుఁ దోఁ♦పఁగఁ జేయు వీఁడెవ్వఁడో
తెలియం జెప్పు మహాబలాన్వితుని నో♦ధీమద్వరా! [2]దోర్వరా!. ౨ 2157

చ. అనఁగ విభీషణుండు మను♦జాధిపువాక్కుల నాలకించి యి
ట్లనియెను; రాక్షసుం డితఁ డ♦హార్యబలుండగు రాక్షసేంద్రుసై
న్యనిచయనాయకుండగు ప్ర♦హస్తుఁడు లంకఁ జెలంగుసేనయం

---

1 తతః ప్రహస్తం నిర్యాంతం దృష్ట్వా భీమపరాక్రమమ్. ఉవాచ సస్మితం రామో విభీషణ మరిందమః-అనియూ. ప్రహస్తః పూర్వద్వారా న్నిర్గతః, రామ స్తూత్తరద్వారి తిష్ఠతిస్మ, కథ మస్యానేకయోజనస్థసాక్షాత్కారః ఉచ్యతే,అ స్తునచనేన ప్రత్యక్షతుల్యేన-అనివ్యాఖ్యా. దీనినను సరించియే హితులవలన నాత్మఁదెలియుటన్-అనిచెప్పఁబడినదని యెఱింగి మన్నింపవలయు. 2 దోర్వరా=మహాభుజుఁడా యని యర్థము.

దు నితనిచెంతనుండుఁ జుము ♦ తోరపువేడ్కఁ ద్వితీయభాగ మీ
దనుజుఁడు దోర్బలాఢ్యుఁడు ని♦శాంతము నస్త్రవిదుండు శూరుఁడున్. ౩౪

సీ. విక్రమంబునఁ జాల♦విఖ్యాతిఁ గనినవాఁ డనియెను; మిగుల బ♦లాఢ్యమగుచు
నధికరోషము మదు♦లందు మిక్కిలిగాఁగ నా ప్రహస్తునిఁ గాంచి♦యార్చుచున్న
యా వానరబలంబు ♦ లతిభయంకరరూపుఁ డతిభీమవిక్రముఁ ♦ డతితరాంగుఁ
డునగు నాభటనాథుఁ♦డు పెనుసైన్యముఁగూడియార్చుచు రాఁగ నె;♦నంతజయ
గాంక్షించి వానర♦గణములపైఁబడుచున్న రాక్షసు లప్పు ♦ డొప్పుమీఱ [ముఁ

తే. *దాల్చియున్న ఖడ్గంబు లు♦దారశక్తు
లష్టిబాణశూలంబులు ♦ నష్టి ముసల
గదలుఁ బరిఘంబులుం బ్రాస♦గణము బహువి
ధంబులైన పరశ్వథ♦ధనువులెల్ల. ౨౪ 2159

క. తనరారుచుండె నెంతయు;, వనచరవర్యులను యుద్ధ♦వాంఛలఁ బుష్పిం
చినతరువుల దీర్ఘములగు, పెనుశిలలను జుట్టుకొనుచుఁ ♦ బ్రీతిచెలంగన్. ౮౪

క. అని నిల్చిరట్లు వానర, దనుజులు పెక్కండ్రు పృథుల♦దర్పంబున మై
కొనువాంఛఁ బరస్పరమును, ఘనశరపాషాణవృష్టిఁ ♦ గల్పించు చొగిన్. ౯౪

క. పెనఁగుచునుండంగా న, య్యని ఘోరతరంబుగాఁగ ♦ నటఁ జూపట్టెన్;
దనుజులు పెక్కుగు యుద్ధం, బున వానరయూథపతులఁ ♦ బొలియించిరొగిన్.

క. వనచరులను బౌరుషమున, దనుజులఁ బెక్కండ్ర యముని♦దర్శనమునకున్
బనిచిరి; రాక్షసులంతట, వనచరులం దాఁకి బలము ♦ వర్ధిలుచుండన్. ౧౧

సీ. శూలంబులం గ్రుమ్మి ♦ సొరిదిఁ గొందఱఁ జంపి రింకను గొందఱ♦నేచి చక్ర
ముల వధించిరి కీశ♦ముఖ్యులఁ గొందఱఁ బరిఘంబులం బూని♦మరణమొందఁ
జేసిరి కొందఱ ♦ ఛేదించిరి పరశ్వథంబులఁ గొంద ఱు♦ద్దామశూల
ముఖసాధనంబుల ♦ మోములు పగులంగ నసువులఁ బాసిరి ♦ వెస ధరణిని
గొందఱు వనచరుల్ ♦ గూలిరి; కొందఱు శరముల రశ్ముల♦చంద మొప్పఁ

ఆ. దనువులందుఁ బెనఁగ ♦ దారుణరీతిగ, ఛిన్నహృదయులగుచుఁ ♦ జెన్నుమాని
చచ్చి రింకఁగొంద ♦ ఱుచ్చఖడ్గముల ద్వి,ధాకృతాంగులగుచు♦ధరణిఁ బడిరి.

క. వనచరు లింకంగొందఱు, దనుజులు పార్శ్వముల రెంట ♦ దారుణశూలా
ళిని జీల్ప మరణమొందిరి;, వనచరు లతికోపులగుచు ♦ బాహుబలములన్.

క. నలుఁగడలం దిరుగుచు దను,జులఁ బ్రోగుగఁజేసి యార్చి ♦ క్షోణీజతతిన్
బలుకొండశిఖరములచే, నిలఁ గూల్చిరి మోఁదిమోఁది ♦ యేచినపూన్కిన్.

తే. వజ్రములరీతిఁ దాఁకు ని♦ర్భరకరములఁ
గరతలంబులఁ బిడికిళ్లఁ ♦ గడఁగి పొడువఁ

---

* ఖడ్గశక్త్యృష్టిబాణాశ్చ-అనిమూ. అష్టియనునది యొకానొక యాయుధము.

బలితదశనేత్రులయి యు♦ద్ధతదనుజులు
నోట నల్లను గ్రక్కుచు ♦ నొచ్చినొచ్చి. ౧౬ 2167

క. ధరణిం బడి; రంత నాసం,గరమునఁ గపిదనుజులెల్లఁ ♦ గడునొచ్చిన యా
తరుణమున నార్తరవములఁ, గరము జయంబంర సింహ♦గర్జనములనున్. ౧౭

క. ఒనరించుచుండి రయ్యా, ధ్వనులెల్లం దుములములుగ♦ధరణిం బరఁగె; నా
దనుజులు కపులును గోపం,బున నిక్కుచు ఘోరసమర♦మున నేర్పుతగన్.

క. కనులం ద్రిప్పుచు భయమును, గన కతికోపులయి యుద్ధ♦కార్యంబులఁ దా
రొనరిచి; రంత నరాంతక, దనుజుండును గుంభహనుఁడు ♦ దర్పము పొంగన్.

తే. నైజదర్పముగల మహా♦నాదుఁ డాన
మున్నతుండు ననందగు ♦ చున్నవీరు
లాప్రహస్తునిమంత్రు, లా ♦ హరిబలములఁ
జంపి రెంతయుఁ బూన్కి ని♦ష్కరుణులగుచు. ౧౯ 2171

చ. నలువురు వారు వేగము ఘ♦నంబగు దర్పముపొంగఁ దాఁకచున్
విలయము వానరావళికి ♦ వే సమకూర్చుచు నొప్పియుంట ని
మ్ముల ద్వివిదుండు గాంచి బల♦మున్ గరువంబును భూషణంబుగా
వెలయ నరాంతకాఖ్యుఁ డగు ♦ వీరుని నొక్కని దాఁకి యుద్ధతిన్. ౨౦ 2172

క. ధరశిఖరంబున మోఁదుచు, మరణము బొందించె; రిపువి♦మర్దనచణుఁడై
కరలాఘవమున మెఱసెడు, హరిపతి దుర్ముఖుఁడు గొప్ప ♦ యవనీరుహమున్.

క. కరముల బెకల్చి మార్కొని, సురవైరిసమున్నతుఁడును ♦ శూరుని జముమం
దిరమున కనిపెను; దేజ,స్స్ఫురితుఁడు వేగమున నలరు ♦ శూరుఁడుఘనుఁడున్.

క. వనచరతల్లజుఁడునునౌ, వనధిగభీరుండు జాంబ♦వంతుఁడు కోపం
బున రేఁగి మహానాదుని, ఘనవక్షముఁ బెద్దశిలను ♦ గరము పగుల్చెన్. ౨౨

క. తారుం డంతట గురుధర,ణీరుహమునఁ గుంభహనుల ♦ నిర్భరబలు దు
ర్వారబలున్ మార్కొని శిర, మారసి మోఁదంగ నని గ♦తాసుం డయ్యెన్.

చ. అరదముమీఁదనుండిన ప్ర♦హస్తుఁడు తద్విధమెల్లఁ గాంచి స
త్వరముగఁ జాపవర్యమును ♦ దాల్చి యసూయను వానరాళితోఁ
గరము దురం బొనర్చె నతి♦గాఢముగా; బలయుగ్మమందు నొ
క్కరిపయి నొక్కరుండు వడి♦గాఁబడి మార్కొని పోరుచుండఁగన్. ౨౪ 2177

క. ఆవర్తమువలెఁ గన్పడు, నావరయుద్ధంబునందు ♦ నారయ నిది యిం
తౌ వర్ణింపఁగ ననఁగా, నేవిధమునఁ దగని కడలి ♦ యేపుమెఱయఁగన్. ౨౫

క. ఉప్పొంగునపుడు కల్గెడు, చప్పుడువలె సిస్వనంబు ♦ సైన్యయుగమునం
దప్పుడు గల్గెఁ బ్రహస్తుం, డుప్పతిలెడు కౌతుకమున ♦ నొప్పుచు నంతన్. ౨౬

చ. అనిమొనఁ బంక్షితుండగుట ♦ నాకదనంబునఁ గ్రోధమూర్తియై
వనచరులం గఠోరశర♦వర్షమునన్ వడిముంచి నొంచె; నా
దనుజకపీంద్ర దేహములు ♦ దారుణరీతిని సంగరాంగణం
బునఁ బడియుండఁ గొండలస♦మూహము గూలినయట్లు లొప్పె మే
దిని యది భీతి నియ్యఁదగి ♦ తీవ్రగతిన్ రుధిరంబు గ్రమ్మఁగాన్. ౨౭ 2180

తే. కన వసంతమునందుఁ బూ♦చినపలాశ
తరుసమాక్రాంతధరణినాఁ ♦ దనరె నద్ది;
మఱియు నాయుద్ధభూమియుఁ ♦ మహితనదివి
ధమునఁ గానంగనయ్యె న♦త్తరుణమందు. ౨౮ 2181

సీ. హతవీరవరశరీ♦రాళులు తీరముల్ భగ్నాయుధములు తీ♦వ్రగతి విఱిగి
పడినవృక్షంబులు; ♦ పాఱెడురక్తంబుకలుషతోయము యక్కృ♦త్తులును బ్లీహ
ములు మహాపంకముల్ ♦ పలువిధంబులుగ నందందునుబడియున్న♦యట్టి ప్రేఁగు
లరయ శైవలములు ♦ హతములై పైకినిఁ దేలెడునంగమ్ము ♦ లిటునటు చలి
తే. యించుశిరములు మత్స్యమ్ము ♦ లెల్ల వ్రేళ్లు
శాద్వలంబులు, గృధ్ర లం♦చగమి, కంక
పక్షులే సారసవిహంగ♦పటలి, మేద
సు ఘనఫేనంబు గననది ♦ చోద్యమయ్యె. ౩౦ 2182

క. అనిమొనఁ దాడితులై నిస్వనముల నొనరించువారి ♦ చప్పుడులే భీ
తిని బుట్టఁజేయు ధ్వనులా, పెనునది యనుజలధి కేగుఁ ♦ బెంపెసలారన్. ౩౧

క. కాపురుషదుస్తరంబుగఁ, జూపట్టెడు నదిని సుభట♦సూరులపు డటన్
వ్యాపింపఁజేసి; రసురులు, నేపునఁదగు కపులు వృష్టి ♦ యేసినపగఁన్. ౩౧౪
తే. హంససారససేవిత ♦ మైన యేటి, నతిజవంబున దాఁటెడు ♦ నట్లు దుస్త
రసుగు యుద్ధమహానది ♦ సుమతిదాఁటి;, రంత నాథటవీరు ల♦త్యాగ్రహమున.
క. సరసీరుహరజములచే, నరుణంబగు కొలను దాఁటి ♦ యరుణతనువులం
గరులు గనసైన చొద్పున, హరిదనుజులు యుద్ధభూమి ♦ యనుశైవలినిన్ ౩౨౪
క. తరియించి యరుణదేహో,త్కరముల రాజిల్లి; రంతఁ ♦ గనలి ప్రహస్తుం
డరదమునసుండి బాణో,త్కరమును విడుచుచును వేగ ♦ కపులను బూన్కిన్.

తే. కసి మసంగుచునుండంగఁ ♦ గాంచె నీలుఁ;
డాభ లేశ్వరుఁడైన ప్ర♦హస్తుఁ డంతఁ
జెలఁగుచున్నట్టి వాయు వి♦మ్ముల ఘనాభ్ర
పటలిపైఁ బల్మిమీఱఁగఁ ♦ బదువిధమున. ౩౮౪ 2183

క. తనపైకిపచ్చు నీలుం, గని; సూర్యప్రభల వెల్గు ♦ కమ్రరథముతోఁ
జనియెను నాతనిమార్గ్గ్గిని, యనిసేయఁగ నతిజవమున ♦ నతిశౌర్యమునన్.

క. విలుకాండ్ర మేటియై తగు, బలాధిపతి యంతఁ గడిఁది♦బవరంబున నా
బలువింటి లాగు పటుశర,ముల ముంచెను నీలు; బాణ♦ములవి బుజువులై.

క. చాలఁగఁ గోపించిన పెను, వ్యాళంబులఁ బోలి పటుజ♦వంబున నరిగా
నీలుని దాఁకి మహోద్ధతి, నేలం దగఁ జొచ్చె మేన ♦ నిల్వక యంతన్. ౩౮

చ. ఘనతరవీర్యశాలి కపి♦కాంతుఁడు నీలుఁడు వీతిహోత్రుఁడో
యనునటు మండుచున్నవిశి♦ఖావళి తాఁకిన నాగ్రహించి చ
య్యన నొకవృక్షముం బెఱికి ♦ యట్టి తనున్ వధియింపవచ్చు నా
దనుజుని దుష్ప్రధర్షుని ని♦తాంతబలంబునఁ గొట్టె నుద్ధతిన్. ౩౯ 2192

క. దనుజేంద్రుఁ డాప్రహస్తుఁడు, వనచరపతిసంప్రయుక్త♦వరతరుహతుఁడై
మనమునఁ గోపంబందుచు, నినదం బెసఁగంగఁ బ్లవగ♦నికరేశ్వరుపై. ౪౦ 2193

క. శరవర్షము గురియించెను;, నరుచరవీరుండు ప్రబల♦దర్పుఁడు నీలుం
డరివైచు ఘోరబాణో,త్కరమును వారింప శక్తి♦గల్గమి నంతన్. ౪౧ 2194

క. కనుయుగము మూసికొని యో,ర్చునునుండెను; వృషభరాజు♦పూనిక వేగం
బున వచ్చి తగ్గు శరకృతు,వున నొప్పెడు వృష్టినోర్చు ♦ పోలికమెఱయన్.

క. దనుజప్రహితదురాసద, ఘనశరభయకృత్సువృష్టిఁ ♦ గనులఁ దెఱవకొ
య్యన నోర్చియుండె; నీలుం, డనుపముబలుఁ డోట నోర్వ ♦ కాశరహతికిన్.

చ. మనమునఁ గోపమూని యొక♦త్సారుహావర్యముచే మనోజవం
బునఁ బరుగెత్తు నా దనుజ♦పుంగవుగుఱ్ఱములన్ వధించె; నం
త నతఁడు భూరిబాహుబల♦దర్పసమగ్రుఁడు గాన వేగమా
దనుజునిచాప ముద్ధతిని ♦ దాఁగొని రెండుగఁ ద్రుంచివైచుచున్. ౪౪ 2197

తే. సింహనాదంబుఁ బల్కఱు ♦ సేసె; నంత
దనుజసేనాధిపతి తన♦ధనువు విఱుగ
దారుణంబగు ముసలాయు♦ధమును దాల్చి
యరదముననుండి దుమికె న♦త్యాగ్రహమున. ౪౫ 2198

*సీ. వేగంబునం దగి ♦ విపులబలంబున సింహశార్దూలముల్ ♦ చెలఁగునట్లు
సింహశార్దూలవి♦చేష్టితంబుల నొప్పి విక్రాంతసంతత♦విజయులగుచు
నని వెనుదీయక ♦ యమరేంద్రవృత్రాసురాభులై వీరులై ♦ యలరుచున్న
బలపతు లిర్వురుఁ ♦ బలువిధంబుల జాతవైరులై రక్తము♦వ్వారిగాఁగ

తే. నవయవంబులఁ దడుపంగ ♦ నట్టిసుత్త
కరుల పోలిక మార్కొని ♦ కఠినదంష్ట్ర
లను గడుం గాయములుపడఁ♦గను బలుమఱు
నొరయుచుం గీర్తిఁ బొందెడు ♦ నూహలొప్ప. ౪౬ 2199

* సింహశార్దూలసదృశౌ సింహశార్దూలచేష్టితౌ-అనిమూ.

క. తలపడి పోరుచునుండిరి;, బలమున నుద్యుక్తుఁ డగుచు ♦ బవరమ్మున ని
మ్ముల నాదనుజోత్తముఁడు ఘు,సలమును గొని కపిలలాట♦సరణి నడంచెన్.
క. దానన్ స్రవించె రక్తము, వానరవరుఁ డంత రక్త♦పరిప్లుతమై
మేను తగంగాఁ గోపముఁ, బూని మహాతరువుఁ గైని♦బూని బలమునన్. ౪౦
క. అరిపక్షంబున వైచెను;, సురవైరియు నరకుగొనక ♦ శూరత నాభీ
కరమునలంబునుగొని యా, హరివీరునిపైకిఁ బాఱె ♦ నధికబలమునన్. ౪౧
*క. తరువాత మహావేగుఁడు, హరివీరుఁడు నీలుఁ డుగ్ర♦మగు వేగమునన్
బరుగెత్తివచ్చి వధియిం,చురతిం దగునా ప్రహస్తు ♦ శూరునిఁ గనుచున్. ౪౨
క. పెనుశిల నొకదానిం గొని,యెను;మఱియును యుద్ధకాంక్ష♦యెంతయుఁ దగ నే
పున ముసలంబును గైకొని, యనిచేయుచుఁ దన్నుఁ జంప ♦ సరుదెంచు నరిన్.
క. కని వేగము యాపెనుశిల, దనుజుని తలపైనవైచె; ♦ దర్పసముగ్రుం
డును భటపతియా నీలుం, డనూనగతి వైవఁ బరుష ♦ మా శిలయదియున్.
క. తలపైనఁ బడఁగ దానం, దల యప్పుడు శకలములుగ ♦ దారుణరీతిన్
గలిగించుచుఁ బగిలెను; నా,బలనాయకుఁ డంతఁ గాంతి♦బలములు చెలఁగన్.
తే. ఇంద్రియంబులు నశియింప ♦ నిల గతాసు
వగుచు విచ్ఛిన్నమూలము♦హా ద్రుమంబు
పగిది వేగము గూలెను; ♦ భగ్నమయిన
యాప్రహస్తునితలనుండి ♦ యత్తఱిఁ గడు. ౪౪ 2207
క. తనువుననుండియుఁ బర్వత,మునుండి నిర్ఝరము తీవ్ర♦ముగఁ బాఱెడుభం
గిని రక్తము పాఱెను; నా,వనచరపతి యాప్రహస్తు ♦ నధియింపంగన్. ౪౬
క. వనచరులు చూచుచుండిరి, దనుజవిభూత్తమునిసేన ♦ శతూర్వము చూ
డను రాక యప్రకంప్యం, బునునయి యుండియును మోద♦మును వీడి కడున్.
[1]క. పురమునకుం జనఁ దిరిగెను;, సురరిపువీరోత్తముఁడు ♦ క్షోణింబడఁగాఁ
ద్వరగా నీ రనకట్టకు, నరిగి తగం దాఁకి నిల్వ ♦ కపుడె కలఁగుచున్. ౪౮
క. వెనుకకు మరలువిధంబున, దనుజులు వారెల్ల నిల్వఁ♦దగు శక్తియె లే
మిని బాఱి;రిట్టు లావా,హినిపతి హతుఁ డౌట సుభటు ♦ లెంతయు నార్తిన్.
తే. ఉద్యమంబులఁ బాసి మ♦హోగ్రశక్తి
సలరుదానవపతిచెంత ♦ కరిగి పలుకఁ
జాల కప్పుడు మూఁగల♦చంద మొప్ప
నుండి [2]తీవ్రశుగబ్ధిని ♦ నొగి మునింగి. ౪౯ 2212

* త ముగ్రవేగం సంరబ్ధ మాపతంతం మహాకపిః, తత స్సంప్రేక్ష్య జగ్రాహ మహావేగో మహాశిలామ్-అనిమూ. 1 సేతుబంధం సమాసాద్య విశీర్ణం సలిలం యథా-అనిమూ. 2 తీవ్రశుగబ్ధిని= శుక్ + అబ్ధి-శోకసాగర మనియర్థము.

క. విరహితసంజ్ఞులవలె నుం,డిరి; యంతట కపివిభుండు ♦ నీలుఁడు జయముం
గరముం గొన్నమహాబలుఁ, డరాతివిధ్వంసనంబు ♦ నవ్విధిఁ జేయున్. ౭౦౪

క. వనచరవర్యులు తమి న,ప్పనికయి వినుతింప మిగులఁ ♦ బ్రమదంబున నా
మనుజవిభూత్తములం గనఁ, జని వారలచెంతనుండె ♦ సఫలాత్ముండై.

ఏఁబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

### రావణుని ప్రథమయుద్ధము.

చ. [1]వనచరసైన్యనాయకుఁడు ♦ బాహుబలంబుమెయిం బ్రహస్తునిన్
దనుజభటాధిపుం గలనఁ ♦ దాఁ బొలియించి చెలంగ భీమసా
ధనములఁ దాల్చి యంబుధివి♦ధంబున వేగమునం జెలంగు నా
దనుజమహేంద్రుసైన్యము వి♦తాకున లంకకుఁ బాఱె నార్తమై. ౧ 2215

సీ. దనుజవీరులు చని ♦ తమపతికిం బ్రహస్తుఁడు వాహినీపతి♦క్షోణిఁ బడుట
నీలునిచే నని ♦ సోలుగుఁ జెప్పంగ వారలపల్కులు ♦ వరుసవినుచు
[2]బలవంతులౌ శత్రు♦వుల నాశ్రయించుట విధియయ్యెఁ గాలుని♦వీటికరుగఁ
దగుతఱి గావున ♦ దారుణకోపంబుఁ బూనె; నారావణుఁ ♦ డానిలింప

తే. పతిసమానుఁడు సేనాధి♦పతి హతుఁడగు
టను గదున్ విని శోకంబు♦నను మునింగి
యంతఁ గోపాన్వితస్వాంత ♦ మమరఁ జెంత
నలరు రాక్షసభటనాయ♦కులను గాంచి. ౨౪ 2216

క. సురపతి సురభటవీరులఁ, బరికించి వచించుమాడ్కిఁ ♦ బలికెన్; మనకుం
బరుఁడగు రామునిపట్లను, దవ్వరపకక యుపేక్షఁ బూన♦వచ్చునె చెపుఁడీ. ౩౪

క. శతమఖుబలముం గూడిన, జతనంబునఁ జెండఁజాలు ♦ శౌర్యమహితు నా
దితిజచమూపుఁ బ్రహస్తుని, మతంగజభటాన్వితముగ ♦ మ్రందించి రనిన్.

క. కనుకన్ వనచరులని తక్కినవారి నుపేక్షచేతఁ ♦ గ్రిందుపఱుపకుం
డనుగూడ, దింక నేనో, మనమున నోర్వంగఁజాల ♦ మాత్సురకడిమిన్. ౪

క. వెనుకన్ముందుం జూడక, చని వైరులఁ జంపుచున్ వి♦జయముం గొనఁగా
ననికిం బోయెద నల్పులు, ఘనబలులుం జంపుచుంద్రు ♦ గానఁ దలంపన్. ౫

---

1 గతసర్గాంతమునఁ జెప్పఁబడిన విషయమే మరల నిటఁ జెప్పఁబడినది. ఇదిప్రాచీనులగు మహాకవుల యాచార మని యెఱుంగవలయు ఇట్లు చెప్పుట నిరర్థకము మాత్రము గాదు. ప్రకృత కథాబీజభూతము గాన నిది పునరుక్తి గాదని గ్రహించుట సహజము 2 ఇది వ్యాఖ్యాభిప్రాయమునకుఁ దెనుఁగు

తే. సంగరక్షోణి యెంతో యా♦శ్చర్యకరము
గాఁ గనంబడుచున్న; ది♦క్కాలమందె
దావదహనుండు జ్వాలల ♦ తతి వనంబుఁ
గాల్చురీతిని నాబాణ♦గణముచేత. ౫౪ 2221

క. రాముని లక్ష్మణుఁ గీశ, స్తోమంబును గాల్చువాఁడ ♦ [క్షోణికి నిపుడే
భీమంబగుకపిరక్తము, చే మానుగఁ దృప్తిఁ గూర్తుఁ ♦ జిత్త మలరఁగన్.]

క. అని పలికి యింద్రరిపు వా, దనుజేశుఁడు దహనుమాడ్కిఁ♦దద్దయుఁ గాంతిన్
గననై హయరాజాన్విత, మునునయి భూషణవితాన♦ములను మెఱయుచున్.

క. తనయంతనె గ్రాలెడుస్యం,దన మారోహించి యిట్లు ♦ దానవనాథుం
డనుచరయుతుఁడై చనుచుం,డినతఱి ఘనశంఖభేరి♦నినదమ్ము లొగిన్. ౭౪

ఆ. పణవముఖములైన ♦ పటువాద్యరవములు
భుజము లప్పళింపఁ ♦ బుట్టుధ్వనులు
సింహనాదములును ♦ జెలఁగుపుణ్యస్తుతు
లలరఁ జేయఁ జనియె ♦ ననికి నపుడు. ౮ 2225

చ. దనుజవిభూత్తముండు గిరి♦తల్లజముల్ వలె గట్టివొచు మే
ఘనిచయమట్లు నీలములు♦గాఁ దగురూపములొప్ప, నిప్పులో
యునఁదగు నేత్రము ల్వెలయ ♦ నార్చుచు నొప్పెడు రాక్షసోత్తముల్
తనుగొలువంగ భూతపవి♦తానయుతేశ్వరురీతి రాజిలెన్. ౯ 2226

మ. గురుతేజుండగు రావణాసురుఁడు కో♦ర్కుల్ మీఱ శీఘ్రంబుగాఁ
బురము న్వెల్వడి యుగ్రసింధుజలద♦వ్యూహంబునుం బోలె సు
ద్ధురనిస్వనము గల్గి *వృక్షగిరులం ♦ దోరంబుగాఁ జేతులం
బరమాహ్లాదము మీఱఁ దాల్చి యనికిం ♦ బైకొన్నచిత్తంబులం
గరముం బొల్చెడు నాకపీంద్రబలముం ♦ గాంచెన్ మహోగ్రంబుగన్. ౧౦

చ. అని నొనరించునుత్సుకము ♦ నంది ఫణీంద్రసమానబాహువై
తనరురఘూత్తముండు సిరి ♦ తద్దయునొప్పఁగ సంగరక్షపై
న్యనికరవేష్టితుండగుచు ♦ నారయఁగా నతిరూక్షమౌచు వ
చ్చునిఖిలదేవతారిపుల♦స్తోమముఁ గాంచి యొసంగువేడుకన్. ౧౦౪ 2228

తే. శస్త్రధారులమేటియై ♦ సకలవీర, తారతమ్యవిదుండయి ♦ తనరుసప్వ
భీషణుని గాంచి యిట్లనె; ♦ వివిధచిత్ర, తరపతాకాధ్వజాయుధ♦తతులతోడ.

సీ. ప్రాసశూలాసిశ♦స్త్రవ్రాతములతోడ నై రావతసమాన♦హస్తిగణము
లొప్ప నక్షోభ్యమై ♦ యుగుశూరజుష్టమై యలరునీసైన్య మి ♦ దరయ నెవరి

* సముద్యతం పాదపశైలహస్తమ్-అనిమూ.

దగునో నా రాముని ♦ త్రహవాక్యమును [1]శక్రసదృశవిక్రముఁడై న ♦ సరసమతి వి
భీషణుం డాదృతి ♦ విని మహాత్ములను రక్షఃపుంగవులునయి ♦ క్రాలువారి

తే. బలములకొలంది చెప్పంగఁ ♦ దలఁచి యనియె;
నల్లదిగో భూపవర్య! బా ♦ లార్కుఁ బోలి
యరుణవక్త్రంబుచే నొప్పి ♦ హస్తిమూఁపు
నందుఁ గూర్చుండి తచ్చిరం ♦ బదరునట్లు ౧౩½ 2230

క. తనుభారంబున నొప్పెడు, దనుజు నకంపనునిగాఁగఁ ♦ దలఁపు; మదిగో న్యం
దనమెక్కి మృగపతిధ్వజ,ముచు శక్రధనుస్సమాన ♦ మునగుధనువునుర్. ౧౪½

క. అలరఁగ గుణమును లాగుచు, వెలసెడు నుగ్రంపు వంత ♦ వితతిఁ గరివలెఁ
వెలుఁగుచునున్న యతం డి,మ్ముల విధివరములనుగన్న ♦ ముఖ్యుఁడు సుమ్మీ!. ౧౫

ఆ. ఇంద్రజిత్తనంగ ♦ నిలఁ బ్రసిద్ధుండగు;, వింధ్యశిఖరివోలె ♦ విస్తృతదేహుఁ
డస్తగిరివిధమున ♦ నన్యుల తేజంబుఁ, దగ్గునట్లు సేయు ♦ ధైర్యమలర. ౧౫

క. అలరు మహేంద్రగిరీంద్రము,వలె నిశ్చలుఁ డతిరథుండుఁ ♦ బలశాలి యొకం
డలఘురథ మెక్కి చాపం, బలరుచుఁ గైఁదాల్చి విస్తృ ♦ తాకృతి దానిన్. ౧౫½

క. సారించుచు నున్నాఁడే, శ్రీరామా! విపులతనువుఁ ♦ జెందిన యతఁడే
భూరిబలుం డతికాయుఁడు, చేరువ నల్లదిగో ప్రబల ♦ సేనాన్వితుఁడై. ౧౬ 2235

క తరుణార్కునిచందంబున, నరుణాక్షుండగుచు గంట ♦ లధికంబుగ ని
ష్ఠురనాదము సేయఁగ నా, కరినెక్కి ఖరధ్వనుల్ త ♦ గంగ నఱచుచున్. ౧౬½

క. అరుదెంచుచున్నవాఁడే, ధరణీశ! మహాత్ముఁ డతుల ♦ దర్పుండు మహో
దరుఁ డితఁడు సుమ్మీ! బం,గరుసొమ్ములు చిత్రములుగఁ ♦ గ్రాలుచునుండన్.

తే. సంధ్యయం గలి యంబుద ♦ సహితశిఖరి
వలెఁ బ్రకాశించు ఘోటక ♦ వరము నెక్కి
కాంతులొప్పెడు ప్రాసంబు ♦ కరమునందు
నలరు వీఁడు [2]పిశాచాఖ్యుఁ ♦ డశనిజవుడు. ౧౭ 2238

సీ. విద్యుత్ప్రభంబయి ♦ వెలయుచుఁ [3]గింకరవజ్ర వేగంబున ♦ వఱలువాఁడి
శూలంబు గరమునఁ ♦ దాలిచి గిరితుల్యవృషభంబుపై నెక్కి ♦ వేగవచ్చు
నీతండు కీర్తిచే ♦ నెనఁగెడు త్రిశిరుండు, జలదతుల్యాంగుఁడై ♦ బలువుగలిగి
యతివిశాలంబయి ♦ యందమై వక్షంబు వెలయఁగా ఫణిరాజ ♦ లలితకేత

తే నము చెలంగ సన్నద్ధుఁడై ♦ నారినట్టి, కర్ణములదాఁక లాగి, ని ♦ కామలీల
మరల నద్దాని విడుచుచు ♦ మనలఁగ నెడు,వీఁడు కుంభుఁ డు భూపాల ♦ విబుధరాజ!.

1 విభీషణ శ్శక్రసమానవీర్యః-అనిమూ. 2 ఏషోఽశనితుల్యవేగః-అనిమూ. 3 విద్యుత్ప్రభం కింకరవజ్రవేగం-అనిమూ. కింకరవజ్రవేగమ్-వజ్రవేగా దప్యధిక మిత్యర్థః-అనివ్యాఖ్య.

చ. కనకము వజ్రముల్ పొదుగఁ♦గా విలసిల్లుచు ధూమయుక్తమో
యనునటు లొప్పు సత్పరిఘ ♦ మట్టి కరంబునఁ బూని ఘోరక
ర్మనిచయ మద్భుతంబుగ న♦మానుషశౌర్యముచే నొనర్చు నీ
దనుజబలప్రధానుఁడగు ♦ దానవుఁ డౌను నికుంభుఁ డోవిభూ!. ౨౧ 2240

చ. ధనువు శరాళి ఖడ్గములు ♦ దారుణరీతివెలుంగ డెక్కె మొ
య్యన వెలయంగ నొప్పు రథ♦మందు ముదంబునఁ గూరుచుండి స్వం
దన మది యగ్నిరీతిఁ దగ ♦ దారుణరూపమునం జెలంగునీ
ఘనుఁడు నరాంతకుండగును ♦ క్ష్మాపతివర్య! మహేంద్రవిక్రమా!. ౨౧½ 2241

తే. అరులు కనఁబడమిని భూధ♦రాగ్రములను
శత్రువులుగాఁ దలంచి భు♦జప్రతాప
మలరఁ బోరాడుచుండు న♦రాంతకుండు;
చూడు మల్లదిగో కను♦చూపునందు. ౨౨ 2242

సీ. పలువిధములు ఘోర♦ములునై నరూపముల్ గల్గు శార్దూలోష్ట్ర♦కరిహయమృగ
ముఖములుతగనేత్ర♦ములువివృత్తంబులైవెలయుభూతములుత♦న్నలమిఁగొలువ
నలరునీతఁడె దేవ♦తలదర్పహంతయారావణుండు హిమక♦రప్రతిమము
నూత్నశలాకము ♦ శుభకరంబుననగు తెలిగొడు గీతని♦దివ్యరథము

తే. నందు వెలయుచునున్నదీ♦యమరవైరి,గురుతరస్వాంతుఁ డెల్లర♦ఋషివరు లొగిఁ
గొలువ భూతాళితోడను ♦ గూడియున్న, యట్టిరుద్రుని పగిదిగ ♦ నలరువాఁడు.

చ. ఘనమకుటంబుఁ దాల్చి రుచిఁ ♦ గ్రాలెడుకుండలముల్ శ్రవస్సులం
దు నటన మట్టిచేయ రుచి♦తో ముఖమెంతయు నొప్పుమీఱఁ జ
క్కనితుహినాద్రి వింధ్యగిరి♦కాంతులపోలిక భీమరూపముఁ
దనరఁ జెలంగువాఁ డితఁడు; ♦ దానవవీరుఁడు సుమ్ము భూవరా!. ౨౪½ 2244

క. శతమఖసమవర్తులయు,ద్ధతినొంచినవాఁడు తీక్ష్ణ♦ధాముని పగిదిన్
క్షితిఁగ్రాలువాఁడు కనుమా, క్షితిపాలమహేంద్ర యనిన ♦ శ్రీరాఘవుఁడున్.

క. అరిహంత నవ్విభీషణుఁ, బరికించి వచించె నిట్లు ♦ బళిరే! దనుజే
శ్వరుఁ డీతం డురుతేజ,స్స్ఫురితుండు ప్రతాపశాలి ♦ శోభిలుఁ గాంతిన్. ౨౬

చ. ఖరకరునట్లు కాంతుల ని♦కాయము వెల్గుచుఁ దేఱిచూడరా
కరుదుగ నొప్పుఁ దేజమున ♦ నావృతమై తగు పిసిరూప మీ
తరుణమునందుఁ గన్పడు ని♦తాంతము స్పష్టముగాఁగ; రాక్షసే
శ్వరుఁడగు వీనిదేహము వి♦భాసిలునట్లుగ దేవదానవో
త్కరమున నేరి దేహమును ♦ గ్రాలదు కాంతిసమగ్రమై తగన్. ౨౭ 2247

క. ఈతనిభటవరులెల్ల సు,హాతేజులు పర్వతముల ♦ యాకృతిగలవా
రాతతగిరులం గొనియే, యీతఱి యుద్ధంబుసేయ ♦ నెంచినమేటుల్. ౨౭½

ఆ. దీప్తములగు బాణ♦దీధితు ల్వెలయంగ, వానిఁ దాల్చియున్న♦వారు; భీమ
తేజుఁడైన యతఁడు ♦ దీప్యమానభయంక,రప్రతాపదనుజ♦రాజి గొలువ.

క. అతితీక్ష్ణదేహభూత, ప్రతతియుతుండైన యముని♦భంగి విలసిల్లెన్
శతధృతివశమున నీడు,ర్మతి నాదృక్పథమునందు ♦ మానుగఁ బడియెన్.

క. కనుఁగొను మిదిగో భూజా,తను దొంగిలి నాకుఁ గల్గఁ ♦ దాఁ జేసిన యి
ప్పెనుక్రోధమ్మును నేసి, తనిపై వెడలించువాఁడ ♦ దారుణభంగిన్. ౩౦

చ. అనియిటు వీర్యవంతుఁడగు ♦ నారఘురాముఁడు పల్కి లక్ష్మణుం
డనుచరుఁడై చెలంగఁగ మ♦హావిశిఖంబును లాగి యెత్తి ని
ల్చెను సమరాంగణంబునను ♦ జెందిన వేడుక; నంతరావణుం
డనుపమవిక్రమాఢ్యులగు ♦ నాసురవర్యులఁ గాంచి యిట్లనున్. ౩౧ 2252

సీ. జంకునొందక మీరు ♦ చక్కఁగా నగరంపు ద్వారంబులందు, నం♦తర్గతమ్ము
లగుపురద్వారమ్ము♦లందుఁ దత్పూర్వ్యంబులందు సుభటులుండు ♦ నట్లు గట్టి
నట్టి చర్యాభవ♦నాళియందును నిల్చి చక్కఁగాఁ గాపాడఁ ♦ జాలియుండుఁ;
డిప్పుడు ననుఁగూడి ♦ యీరీతి మీరెల్ల వచ్చియుంటను జూచి ♦ వనచరేంద్రు
లిప్పట్టణంబున ♦ నెవ్వరు లేకున్న చిత్ర మిద్దానిని ♦ జిత్తములను

ఆ. నెఱిఁగి దుష్ప్రసహమ♦యో యయ్య జనశూన్య
మైన లంకఁ జొచ్చి ♦ యతిజవమునఁ
బాడు సేసి పాఱ♦వైతురు కంధిలో
ననుచుఁ బరిజనులకు ♦ నాజ్ఞయొసఁగి. ౩౨ 2253

చ. తను నిటుగూడి వచ్చిన సు♦రద్విల వారల వీడుకొల్ప నా
దనుజులు స్వాజ్ఞనొందలఁ ♦ దాల్చి చనన్ మఱి రావణుండు చ
య్యనఁ బెనుచేప పూర్ణమగు ♦ నబ్ధిజలంబు గలంచుభంగి న
వ్వనచరసాగరౌఘము, న♦వారితరీతి నలంపఁజొచ్చెఁ దాన్. ౩౩ 2254

సుగ్రీవుఁడు రావణుమార్కొని మూర్ఛిల్లుట.

మ. దనుజేంద్రుం డిటు తీక్ష్ణబాణధను వు♦ద్యచ్ఛక్తిమైఁ దాల్చి చ
య్యన యుద్ధంబును జేయఁ బైఁబడుచు రా ♦ నత్యంతకోపంబునం
గని సుగ్రీవుఁడు భూరిభూమిధరశృం♦గం బొందుఁ జేలాగి యా
తనిపై కిం జని మార్కొనెన్; మఱియునున్ ♦ దర్పంబుమై నాతఁడున్. ౩౪

క. తరువితతియుక్తసానూ, త్కరములఁ దగునాశిఖరముఁ ♦ గ్రవ్యాదునిపై
బరవసము మీఱవైచె వి,సరి జవమున; రావణుండు ♦ చక్కఁగదానిన్.

క. తనపైఁ గడరఁ దటాలునఁ, గని హాటకపుంఖశరని♦కరమున్ భేదిం
చెను దాని; నిట్లు తరువిత,తినిగూడిన సానువులను ♦ దీప్తమ్మగుచున్. ౩౫

క. అలరారుశైలశిఖరం, బిలఁ దుత్తుమురై పడంగ ♦ యేచి యమునితోఁ
దురితంబయి పెనుసర్పము, వలెఁ దగు నొకశరము వింట ♦ వజ్రరిపుండున్.

క. ఒనఁగూర్చి కోపచిత్తం,బున వాయుసమానవేగ♦మునఁ దగి విద్యు
త్తును బోల మండుచున్ జి,ష్ణునివజ్రముఁబోలి మెఱయు ♦ సునిశితశరమున్.

క. కొని సుగ్రీవువధార్థం, బనూనమగుశక్తి వైచె; ♦ నమరేంద్రు మహా
శనివంటి యాకృతిం దగి, సునిశితమగు నగ్రమునను ♦ శోభిలునదియున్.

క. దనుజేంద్రబాహుముక్తిం, గని జవమున షణ్ముఖుండు ♦ కడఁగి ప్రయోగిం
చినశక్తి క్రౌంచభూధర,మును జెందినరీతిఁ బ్లవగ♦భూపతిఁ దాఁకెన్. ౪౦

క. దారుణశక్తియదిట్టులు, గా రయమునఁ దాఁకి చించెఁ ♦ గపివక్షము; నా
వీరుఁడు తచ్ఛరపీడితుఁ, డై రావంబడరఁ జిత్త ♦ ముట్టె కలఁగఁగన్. ౪౧

క. ధరఁబడియెఁ మూర్ఛితుండై, హరివీరుం డిట్లు పడఁగ ♦ ననుగులు గని యు
ద్ధురరావమడరఁగా నా,ర్చిరి; జ్యోతిర్ముఖుఁడు నభుఁడు♦ చెలఁగు బుషభుఁడున్.

క. [1]పెనుదంష్ట్రిలఁ దగుగవయుఁడు, ఘనుఁడుగవాక్షుండుశక్తిఁ♦గాయములుకడుం
బెనుపొంద భూధరంబులఁ, గొని నడచిరి సకలదనుజ♦కుంజరుపైకిన్. ౪౨

చ. అమరవిరోధి యట్లు ప్లవ♦గాధిపులేసిన పర్వతంబులన్
సమముగ దృష్టినిల్పి కని ♦ శాతశరాగ్రశిరాళిఁ ద్రుంచి వ్య
ర్థములుగఁ జేసి వారలను ♦ దద్దయు హేమవిచిత్రపుంఖబా
ణములను నొంచె; నాప్లవగ♦నాథులు భీమశరీరు లత్తఱిన్. ౪౩ 2265

క. దనుజారిబాణభేదిత, తనులై ధరఁబడిరి; పిదప ♦ దనుజమహేంద్రుం
డనుపమభయకృత్కపిబల,మును బాణావళులచేత ♦ ముంచెం గడఁకన్. ౪౪

సీ. [2]వీరోత్తములుగాఁగ ♦ వెలయు నా వానరుల్ హింసితులయి యట్లు ♦ యిలను ద్రెళ్లి
భయము వాపుచుఁ గాచు♦ వారు లేనందునఁ బటువుగాఁ గూయుచు♦ భయము శల్య
మట్లు మదిన్ నాటి ♦ బిట్టుబాధింపఁగ దనుజనాథాంబక♦తతికి డస్సి
యార్తశరణ్యుఁడై ♦ యలరు శ్రీరాముని శరణుసొచ్చిరి; ధను♦ష్మంతుఁ డసుల

ఆ. చిత్తుఁడైనయట్టి ♦ శ్రీరాముఁ డంతటఁ, జాపముఁ గొని కీశ♦సమితిఁ గావఁ
జనియె వేగ యపుడు ♦ సౌమిత్రి రాముని, పరిసరమున కేగి ♦ పరమభక్తి.

క. కరములు మోడిచి యెంతయుఁ, బరమార్థయుతంబుగాఁగఁ♦బరఁగుపలుకులన్
బరికించి పలికెఁ; బ్రభువర, పరదారహరించినట్టి ♦ పాపిని నితనిన్. ౪౬ 2268

క. అనిఁ జంపఁ బూజ్యులగుమీ, రనూనమగుశక్తిచేత ♦ నలరుచునున్నా;

---

1 గవయస్సుదంష్ట్రిః-అనిమూ. 2 తతో మహాత్మా సధను ర్ధనుష్మా నాదాయ రామస్సహసా జగామ-అనిమూలము. శరణాగతకృత్య ముక్త్వా శరణ్యకృత్య మాహ-అని గోవిందరాజులు కొంత వ్యాఖ్యవ్రాసిరి. అది కథకు ననుకూలించినది కాదు. ఐనను అపదములే యిందుపయోగింపఁబడుటచే నాసార మిందుఁ గనఁబడునని తెలియుంగునది.

రనయుని నీచుని నీదను,జుని నేనే చంపువాఁడఁ ♦ జుము శ్రీరామా!. ౪౭
క. అనుమతి నిమ్మా! నీదగు, ననుజ్ఞ లేకుండఁ బోవ ♦ నర్హంబుగాదం
చని వినయంబునఁ బల్కిన, యనుజుని వాక్యములవిని మ♦హామతిగానన్.
*క. గురుకాంతి సత్యశౌర్యము, పరఁగంగా నొప్పురామ♦భద్రుండను సో
దర! పొమ్ము నీవుఁడని నీ, యరి నెంచక యత్నపరుఁడ♦వై పోవఁదగున్. ౪౮
క. శరమొండు గూర్చునట్లుగ, నరికిం గన్పడుచు మఱొక♦యస్త్రముఁ గూర్చన్
గురుపీర్యం డగుటన్ సం,గరమునఁ జిత్రప్రతాప♦కలితుండగుఁ జూ!. ౪౯
[1]ఆ. ఈతఁ డలిగెనేని ♦ యెల్లలోకంబు లొ,క్కటిగఁ జేరి యితని ♦ కడిమికోర్వఁ
జాల వించుకయును ♦ సందియం బేలేదు, గానఁ బొరపడక యె ♦ దానవపతి.
క. దనుజునియందలి లోపము,లను మఱి నీలోపగణము♦లను నరయుము; నీ
కును గల్గువానిఁ బరునకుఁ, గనఁబఱుపక హెచ్చరికను ♦ గల్గి సతతమున్. ౫౦
క. ధనువున నిమ్మున్ జాగ్ర,త్తను గాచికొనుము; యటంచు ♦ దాశరథి వచిం
చిన [2]లక్ష్మణుఁ డారాముని, గని కౌఁగిటఁ జేర్చుకొని త♦గన్ వలగొనియెన్.
క. తనివార మ్రొక్కి యుద్ధం,బునకుం జనె; నేన్నుతుంస♦ములకు సమములౌ
ఘనబాహువులందగు రా,ముని తమ్ముఁడు దీప్తచాప♦ముల భీమముగన్. ౫౧
క. కరముల ధరించి బాణో,త్కరముల వర్షంబుగాఁగ ♦ త్క్ష్మాస్థలముపయిం
గరఘుడలి భిన్నులై పడు, హరివీరులపైని గురిసి ♦ యూర్చుదశముఖున్. ౫౨
క. కనుఁగొనియె; మహాతేజం,బునఁ దగుహనుమంతుఁ డనిల♦పుత్రుం డట్ల
య్యనికిన్ లక్ష్మణురాకను, గని నేనుంశంగనేల ♦ కష్ట మితనికిన్. ౫౩ 2278
క. అనియెంచి రావణునిబా,ణనికరమును నిలిపి, దనుజ♦నాథునిపైకిం
జనియెన్ త్వరగా; సన్మతి, యనిలాత్మజుఁ డతనిరథము ♦ నటఁ జేరి తగన్.
చ. తనయుపసవ్యబాహువు ని♦తాంతము పైకినిగుడ్చి దానవేం
ద్రుని నదలించుచుం బలికె ♦ రూక్షముగా; సురదైత్యసంతతిన్
ఘనతరయక్షరాక్షసని♦కాయముచే సురగాయకాళిచే
తను నని జావకుండను వి♦ధాతృవరంబును గాంచినావుగా. ౫౪ 2280
[3]క. వనచరులవలన సాధ్వస,ము నీకు నిటఁగల్గు; హస్త♦మును నిదిగో వ్రే
ళ్లను నైదిటఁదగుదానిన్, నినుఁ జంపఁగ నెత్తినాఁడ ♦ నేనిపు డదియున్.
క. నినుఁ జంపి నీశరీరం,బునఁ జిరకాలముగ వాస♦మును జేసెడు జీ

* తమబ్రవీన్మహాతేజా రామస్సత్యపరాక్రమః-అనిమూ. 1 త్రైలోక్యేనాపి సంక్రుద్ధో దుష్ప్రసహ్యో న సంశయః-అనిమూ. ఇచట రాముని నోట రావణుని బొగడించి మహాకవి వాల్మీకి తన చాతుర్యమును వెల్లడించెను మహాపురుషులు శత్రువునుగూడ గుణమున్నఁ బొగడుదురనుట యిట గ్రహింపఁ దగినది. 2 రాఘవస్య చ సుప్రీతా పరిష్వజ్యాభిపూజ్య చ-అనిమూ. 3 ఏష మే దక్షిణో బాహుః పంచశాఖ స్సముత్థితః-అనిమూ.

వునిఁ బైకిఁ బంపఁగల దన, దనుజేంద్రుం డంత భీమ♦దర్పుఁడు పూన్కిన్.
చ. అనిలజువాక్యములన్ వినుచు ♦ నాగ్రహయుక్తి సురక్తనేత్రుఁడై
యనియె మరుత్తనూజుఁగని ♦ యోరి! కపీ! యిఁక శంకలేక వే
గ నను గరప్రహారమున ♦ గాసిలఁ జేయుము శాశ్వతంపుఁగీ
ర్తిని గపికోట్లు రావణు న♦తిస్థిరశౌర్యముఁ బూని యంచు మే
దిని గడియింపు మంతట మ♦దిం దలపోయుచు నీదుదర్పమున్. ౫౭౧ 2283
క. నిను నశియింపఁ జేసెద;, నన వాయుకుమారుఁడైన ♦ హనుమయు దనుజే
శునిపల్కుల విని రావణ, విను మును నేఁ గొట్టినాఁడ ♦ విక్రమములరన్. ౫౮
క. నాపౌరుషంబు నెఱుఁగఁగ, నీపట్టిని నక్షుఁ దలఁపు ♦ మిపుడని మదికిం
జూపట్టునట్లు పలికిన, నాపావనిపలుకులకు మ♦హాతేజుండౌ. ౫౯ 2285
క. దనుజేశ్వరుండు కోపం,బును దాల్చి పరాక్రమంబు ♦ పొంగఁ గరతలం
బునఁ జఱచె; దానఁబలుమఱు,నునమునఁజలనంబునొంది♦మరుదాత్మజుఁడున్.
క. మతివిభవంబును నెంతయు, నతులితతేజంబువెలయు♦నట్టిఁడు గానన్
స్థితి నట్లొక్కముహూర్తం,బు తగంగని స్థైర్యమూని ♦ పొంగెడుక్రుధచేన్.
చ. కరతలసంప్రహారమునఁ ♦ గర్బురనాథుని నొంచె; నంత నా
సురరిపుపాలకుండు కడు♦శూరుఁడు భూరిబలుండునైన య
మ్మరుదధిపాత్మజుండును న♦మానుషశక్తిని దన్నుఁ గొట్టఁగా
ధరణి చలింపఁగా గిరివి♦ధంబునఁ దద్దయుఁ జంచలించెఁ దాన్. ౬౨౧ 2288
చ. అనిమొన నిట్టు లాదనుజుఁ ♦ డాహనుమంతునిహస్తతాడనం
బునఁ జలియించుటం గని క♦పుల్ మునిసిద్ధసురాసురుల్ ముదం
బున రొదసేసి; రాపిదప ♦ భూరితరంబగు తేజమొప్పునా
దనుజవరుండు తెప్పిఱిలి ♦ తత్పవనాత్మజుఁ గాంచి యిట్లనున్. ౬౪ 2289
*క. వనచరవర! నీవీర్యం,బును మెచ్చఁగవచ్చు శత్రు♦వుగనుండితివై
నను మెచ్చువాఁడ బళిరే, యన; హనుమయు నిట్లుపలికె ♦ నాతనితోడన్.
తే. ఇస్సిరో! నాదువీర్యమిం ♦ కేమి పలుక
నిద్ది యుండిన లేకున్న ♦ నేమి యిఁకను
బ్రదికియున్నాఁడవే యేల ♦ పలుకు మిప్పు;
డొక్కమాఱు దురాత్మ! నీ♦వుద్యమమున. ౬౫౧ 2291
క. ననుఁ బ్రహరింపుము నీవే, నిను వినుతించుకొనెదేల ♦ నే నంతట ము
ష్టిని నిన్నుఁ బొడిచి యమపుర,మున కనిపెద; ననిన దనుజ♦ముఖ్యుం డంతన్.
చ. హనుమవచించుమాటలకు ♦ నాగ్రహ మూనుచునుండెఁ బౌరుషం
బునఁ దగు రావణుండు క్రుధఁ ♦ బొంగుచు నేత్రము లెఱ్ఱవాఱఁగాఁ

* సాధు వానరవీర్యేణ శ్లాఘనీయోఽసి మే రిపుః-అనిమూ.

దనకుడిచేతిముష్టిని ని♦తాంతజవంబున వైరిఱొమ్ము నా
య్యనఁ బొడిచెన్; బృథూరమున ♦ నాతనిఁ ద్రెళ్ళుపడం గపీంద్రుఁడున్. ౯౨
క. పలుమఱుఁ జలియించె; మహా,బలుఁ డాపవనాత్మజుండు ♦ బడలికచే మూ
ర్ఛిలుటంగని యతిరథుఁడా,పలాశనేశుండు పవను♦పట్టిని ననిలోన్. ౯౩ 2294
తే. చంపరాని నెఱింగి యా♦శత్రువింక
మూర్ఛఁ దేఱిన బహుకష్ట♦ములు గలుగును
గాన వేగంబ చనుటమే♦లౌనటంచు
నరద మెక్కి నీలునిపైకి ♦ నరిగెనంత. ౯౪ 2295

మహాస్రగ్ధర:—

దనుజేంద్రుం డుగ్రరూపా♦తతబలయుతుఁడై ♦ దర్పముప్పొంగుచుండం
గను భీమవ్యాళరీతిం ♦ గనఁబడి రుచుఁ ♦ గ్రాలుచున్ వైరిమర్త్యా
ఘునికృంతస్ఫారశక్తిం ♦ గననగుశరముల్ ♦ గాడఁగానేసి నీలున్
ఘనదర్పున్ వాహినీశున్ ♦ గనలనొనరిచెన్ ♦ గాఢదీప్తుల్ చెలంగన్. ౯౫

సీ. హరిచమూపతి నీలుఁ ♦ డట్లు బాణాళిచే శ్రమమొంది యొకచేత ♦ శత్రుబాణ
ములను హరించుచుఁ♦జెలఁగి వేఱొకచేతఁ బర్వతాగ్రముఁ గొని♦బరవసమున
దానవుపై వైచె; ♦ మానితతేజుఁడై మతిమదగ్రుండగు ♦ మరుదధిపతి
తనయుండు సంజ్ఞను ♦ దాఁగని యనిచేయుకాంక్షతో నంతటఁ♦గాంచియొకట
తే. నీలుతోడఁ బోరాడెడు ♦ నిఖిలదనుజ
పతినిగని తప్పిపోయెనే ♦ యితఁ డనుక్రుధ
వెలయ నాతనితోడ నో♦రులపయిఁ జని
నట్టివానిపై కడరుట ♦ యహితమనుచు. ౯౬ 2297
క. నిను మార్కొనమానిసి నని,యనియెన్; గురుతేజుఁడైన♦యసురేంద్రుఁడు నీ
లునిచే వైవంబడు నా,ఘనశృంగముఁ దీక్ష్ణసప్త♦కాండమ్ములచేన్. ౯౭ 2298
క. తునియలుగాఁ జేసెను మే,దిని బడియెను నదియు; భటప♦తియుఁ బరవీరా
ళిని జంపువాఁడునుం గా,వున నీలుఁడు తచ్ఛిఖరము ♦ భూరిశరములన్. ౯౮
క. ధరపై శకలములై పడ, నురుతరకోపమునఁ గాంచి ♦ యుగ్రులయమునం
బరఁగు ధనంజయువలె నా,తరుణంబునఁ జూడనగుచుఁ ♦ దద్దయుఁ గడఁకన్.
క. ఇనుమద్దులఁ జంద్రలఁ బూ,చినమామిడిచెట్ల వివిధ♦చిత్రతరమహీ
జనికరముల రావణుపైఁ, దనశక్తియు వెలయ వైచెఁ ♦ దద్యుద్ధమునన్. ౯౯
చ. తరువుల వానినెల్లఁ దన♦దర్పము పొంగఁగ రావణుండు భీ
కరశరవృష్టిచే బదులు♦గా నడిఁ ద్రుంచి హుతాశనాత్మజున్
గరము భయంకరమ్ములగు ♦ కాండములం బరఁగించి నొంచె; న

క్కురణిని నీరదంబు లోగి ♦ క్ష్మాధరవర్యముపైని వృష్టినిఁ
బరఁగఁగఁ జేయునట్లు తను ♦ బాణములన్ సురవైరి గప్పెఁగన్. ౨౮౪ 2302

క. అనలాత్మజుండు తనదగు, తనువును సూక్ష్మముగఁ జేసి ♦ దానవవరుకే
తనమున వ్రాలె; ధ్వజాగ్రం,బున వ్రాలిన నీలు ననల ♦ పుత్త్రుని నంతన్.

చ. కనుఁగొని రావణాసురుఁ డ ♦ ఖండమహోగ్రహమూని మండెఁ; నా
వనచరసైన్యనాథుఁ డట ♦ వర్ధిలి సింహారవంబుచేసె; నా
దనుజునిబాణలక్ష్యమును ♦ దాఁగనకుండ ధ్వజాగ్రమందునన్
ధనువుమొనం గిరీటమున ♦ దర్పమునం జరియించునీలునిన్. ౩౦౪ 2304

క. కని లక్ష్మణుండు రాముఁడు, హనుమయు నాశ్చర్యమొంది; ♦ రంతటఁ దేజం
బునఁ బరఁగు రావణుం డా,వనచరులాఘవము గాంచి ♦ బాపురె యనుచున్.

క. మనమున నాశ్చర్యంబును, గని యద్భుతమైన యగ్ని ♦ కాండంబును గై
కొనియెం; గోఁతులు రావణుఁ, డనిఁ గపిలాఘవసువిస్మి ♦ తాత్ముఁ డగుటకున్.

ఆ. మనములందు హర్ష ♦ మును గని యార్చిరి, కపులనాదములకుఁ ♦ గళవళించి
యేమిచేయు మదిని ♦ నించుక తోఁపమి, నూరకుండె నీలు ♦ నుద్ధతికిని. ౩౮ 2307

సీ. దనుజేంద్రుఁ డంతట ♦ దహనుశరంబును జ్వలనుమంత్రంబున ♦ సంస్కరించి
కేతనాగ్రంబె ని ♦ కేతనముగనున్న యానీలుసింగాంచె; ♦ నట్లుచూచి
యామహాతేజుఁ డ ♦ య్యసురేశ్వరుఁడు పల్కె నతనితో; నోకపీ! ♦ యడవినుండు
జంతువా పెనుమాయ ♦ సరగున నిద్దాని గని సాధులాఘవం ♦ బును గనితిని

తే. శక్తిగలవాఁడవేని ర ♦ క్షణముచేసి,కొనుము నీప్రాణములను బె ♦ క్కువిధములగు
నీదురూపంబులం గడు ♦ నేర్పునసృజి,యించుచున్నాఁడవైన నే ♦ నిపుడు కడఁగి.

క. శరమిది మంత్రయుతం బీ, తరుణంబున నిన్నుఁ జంప ♦ దగు నిది నీవి
క్కురణి నసురక్షణంబును, బరమాదృతిఁ జేసికొనినఁ ♦ బటుతరశక్తిన్. ౩౨౪

క. నినుఁ జంపఁగలద టంచున్, దనుజేంద్రుఁడు పల్కి దీర్ఘ ♦ తరబాహువులన్
గనఁబడ మంత్రసమన్విత,మును దీక్ష్ణమునైన బాణ ♦ మును సంధించెన్. ౩౩౪

చ. ధనువున నిట్లుగూర్చి కపి ♦ తల్లజుపైఁ బరఁగించె నగ్నిమం
త్రనియతమైన యస్త్రమది ♦ దారుణరీతి నురంబు గాఁడఁగా
వనచరసైన్యనాయకుఁడు ♦ వహ్నిశరార్చులఁ దగ్ధుఁడౌచుఁ గే
తనముననుండి నేలఁబడెఁ; ♦ దండ్రిమహాత్మునుఁ డౌటఁ దత్కృపన్. ౯౦ 2311

క. తనతేజోవైభవమున, వనచరభటనాయకుండు ♦ బలము వదలి యు
ర్విని జానువు లూదుకొనుచుఁ, దనశక్తియడంగఁ బడియెఁ; ♦ దాళఁగలేమిన్.

ఆ. ప్రాణపంచకంబు ♦ పాయ దాతనినుండి
వశగళుండు పిదపఁ ♦ దత్కపి యట

గడఁకతోఁ మెఱయుచు విధి మును, కడుఁగూరిమిఁ దనకునీయఁ♦గాఁ దనచెంతన్.

క. తనరారుశక్తిఁ గైకొని, యెను; రాక్షసలోకపతి య♦హీనగతుల నొ
ప్పినదాని విగతధూమం,బునఁ దగు హుతవహునిరీతిఁ ♦ బొలిచెడుదానిన్.

చ. వనచరవాహినీతతికి ♦ వారకభీతిని గొల్పుదాని నా
ఘనతరశక్తి శీఘ్రముగఁ ♦ గైకొని లక్ష్మణుపైన వైచె; నా
యనుపమశక్తియుం దనను ♦ నంతము నొందఁగఁ జేయవచ్చుటం
గని హుతవీతిహోత్రసను♦కాంతిని గ్రాలుచు భీతిదంబులై
కనఁబడు బాణముల్ వయిచి ♦ గాఢబలంబునఁ గొట్టెఁ గొట్టినన్. ౧౦౯

సీ. వదలక యాశక్తి ♦ వచ్చి లక్ష్మణువిశాలంబైన వక్షస్స్థ♦లంబుఁ జొచ్చె
నంత మహాశక్తి♦యుంతుఁడై రఘువీరుఁ డగు లక్ష్మణుండు మ♦హాత్తరమగు
నాసాధనంబుచే ♦ హతినొంది మఱిమఱి ప్రజ్వలించెను; నంత♦రాక్షసేంద్రుఁ
డట్లు విహ్వలుఁడైన ♦ యాలక్ష్మణుంగని జవమున వచ్చి హ♦స్తముల బల్మి

ఆ. నతనిఁ బట్టుకొనియె; ♦ నారావణుఁడు ధైర్య
మున మహాత్తరుఁడయి ♦ తనగుతుహిన
శిఖరినైన నెత్తఁ ♦ జెల్లిన బలశాలి
యైన నగును మును ప♦మానుషగతి. ౧౧౦ 2336

సీ. *అందేక దేశమై ♦ యలరుకైలాసంబుఁ గదలించియున్నాఁడు ♦ గానసల్లె
సాగరాఘూవతం♦సంబయి గంభీరమైన పాల్కడలిని ♦ నాత్మశక్తిఁ
గలఁచిన మందర♦త్మాధరంబును దాను మును జయించిన దేవ♦ముఖ్యులెల్ల
బట్టితెచ్చిరి గాన ♦ బాహువులను బూని యెత్తంగఁ జాలును ♦ నెల్లకులశి
ఖరులలో మేటియై ♦ క్రాలుమేరువునైన నెత్తంగఁ జాలు న♦దెట్టు లనిన
వాయువే యాగిరి♦వరశిఖరమ్మును గదలిదా కుక్షి లం♦కనుగ వైచెఁ
గనుక నాతనిజయిం♦చినవాఁడు గావున నవలీల నెత్తనౌ ♦ ననుపమాన
పరిమాణమై మహా♦త్తరమయి పొల్చెడు నాజగత్త్రయమును ♦ నైన నెత్తఁ
జాలు హిరణ్యాక్షుఁ♦డోలిఁ దద్భాగమా పుడమిని జంకలో ♦ నిడుకొనియెను
గనుక నీతం డెత్తఁ♦గను జాలునురలతోఁ గలిసియే యున్నను ♦ గాని రాము
తమ్ముఁడౌ లక్ష్మణుఁ ♦ దగురామునందు నాల్గవభాగమై పొల్చు♦ఘనుని నెత్తఁ
జాలఁడు భుజముల♦సమరాంగణమునందు నపుడు లక్ష్మణుఁడు బ్ర♦హ్మాదయవలన

ఆ దనుజు నొందినట్టి ♦ తచ్ఛక్తి ఱొమ్మున, గాడఁగాఁ దలంపఁ♦గను దరంబు

* హిమవాన్మందరో మేరు స్త్రైలోక్యం వా సహామరైః, శక్యం భుజాభ్యా ముద్ధర్తుం నసంఖ్యే భరతానుజం. శక్త్యా బ్రాహ్మ్యాపి సౌమిత్రి స్తాడితస్తు స్తనాంతరే, విష్ణో రచింత్యం స్వం భాగ మాత్మానం ప్రత్యనుస్మరత్ -అనియూ. ఈశ్లోకద్వయమునకు వ్యాఖ్యాతలు నిర్వచించిన యర్థ మిటసీసమాలికయంగుఁ జేర్పఁబడినదని గ్రహింపవలయు.

గాని విష్ణునంశ ♦ మైనట్టి స్వస్వరూపము స్మరించుకొనియె ♦ నమలబుద్ధి.

క. సురకంటకుఁ డా రావణుఁ, డురుతరమై మర్త్యతనుత ♦ నొప్పుమెఱయఁగా
ధరియించి దనుజదర్పముల రూపుమాపుచును గడుఁ జె♦లంగి యనమమై.

ఆ. వైష్ణవాంశమగుచు ♦ వఱలు లక్ష్మణుశరీరంబు స్వీయదోర్య♦గంబు నూని
పట్టి లేవనెత్త ♦ బలహీనుఁ డయ్యె; నంతటఁ బవనజుఁ డుగ్ర♦తరముగు క్రుధ.

క. దనుజేశునిపై కడరుచుఁ, దనవజ్రసమానముష్టి♦దారుణఘాతం
బున ఱొమ్మున నడఁచెను; దాన నతఁడు మోకాళ్లమోపు♦నన్ ధరఁబడియెన్.

ఆ. [1]చంచలించి మఱియుఁ ♦ జాపుగాఁ బడియెను;
నతని కర్ణదృఙ్ము♦ఖాళినుండి
నల్ల మిగులఁ గాఱెఁ ♦ దల్లడమందుచుఁ
బొరలుచున్ విసంజ్ఞఁ ♦ బూని యపుడు. ౧౧౬ 2311

క. అరదమునడుమునంబడి కర్బురపతి మూర్ఛిల్లి స్వాస్థ్య♦ముం బూనక యా
కరణిని దపించుచుండె; సమరమున భయకృత్పరాక్ర♦మము గలయతఁడున్.

ఆ. విగతసంజ్ఞుఁ డగుచు ♦ విశ్వంభరంబడఁ, గాంచి యసురనాథ♦కలితులయిన
సురలు మునులు విపిన♦చరులు సంతుష్టులై, యార్చిరట్టె యసురు♦లదరిపడఁగ.

క. గురుతేజుండగు పావని, సురవైరి శరార్దితుఁడయి ♦ క్షోణిఁబడిన యా
నిరుపమబలు లక్ష్మణునిం, గరముల నెత్తుకొని రాము♦కడకుం దెచ్చెన్. ౧౧౯

[2]సీ. రావణాదికశత్రు♦రాజికిఁ గదలింప నలవిగానట్టివాఁ♦డైన నొక్క
కపిమాత్రుఁడైన జ♦గత్ప్రాణనందనుఁ డనుకూలహృదయుఁడై ♦యధికభక్తుఁ
డగుటను నాతని♦కతిలఘుత్వము నొందె నాలక్ష్మణుం; డంత ♦ ననిని దుర్జ
యుఁడగు నాలక్ష్మణు ♦ నొయ్యన నాశక్తి వదలి రావణురథ♦వరమునందు

తే. బూర్వమట్టులు జవమునఁ ♦ బోయిచేరె;
నరినిషూదనుఁ డా రాము ♦ ననుజుఁ డంతఁ
బరులకుం బ్రత్యనీకస్వ♦భావుఁడైన
విష్ణుభాగం బచింత్యంబు ♦ విమలతరము. ౧౨౦ 2345

క. అనుపమమును నయి వెలసెడు, తనదుస్వరూపంబు మదిని ♦ దలఁచుటచే మూ
ర్ఛను దేఱి విశల్యుండై, కనఁబడె; గురుతేజుఁడైన ♦ కర్బురపతియున్. ౧౨౧

ఆ. ప్రాప్తసంజ్ఞుఁడగుచుఁ ♦ బటుతరనిశితాగ్రములగు విశిఖవర్య♦ములను భూరి

1 జానుభ్యా మపతద్భూమౌ చచాలచ పపాతచ-అనిమూ. 2 వాయుసూనో స్సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః, శత్రూణా మప్రకంప్యోఽపి లఘుత్వ మగమ త్కపేః తం సముత్సృజ్య సాశక్తి స్సౌమిత్రిం యుధిదుర్జయమ్, రావణస్య రథే తస్మిన్ స్థానం పునరుపాగతా-అనిమూ. ఈశ్లోకద్వయమునకు వాస్తవార్థ మిదియని వ్యాఖ్యాతలు వ్రాసిరో దాని నీపద్యమునఁ జేర్చితిఁ గాని సొంత మిందేదియు లేదని గ్రహింపఁదగు.

ధనువు సంగ్రహించెఁ ♦ దాశరథియు నంతఁ, బలితవీరవర్య♦పటల మగుట.

క. మనముల భీతిలి యుద్ధం,బున నిల్వక కపులు పాఱి♦పోవుచునుండం
గని తాను రావణునిపై,కిని నడరెను; నంత హనుమ♦కృతకృత్యుండై. ౧౨౪

క. శ్రీరామునిపరిసరమును, జేరి వచించెన్ దురంబు ♦ సేయఁగ నాపైఁ
బారోహించి విరోధిని, మారుకొనం దగునటన్న ♦ క్ష్మాపతి యంతన్. ౧౨౫

చ. హనుమ వచించినట్టి పలు ♦ కాదృతిమై వినుచున్ బలాఢ్యుఁడై
తనరెడువైనతేయుని ము♦దంబున మాధవుఁ డెక్కినట్లు చ
క్కనిగతి భూరివిక్రమము ♦ గ్రాలఁగఁ బొల్చెడు రాఘవుండు త
ద్వనచరవర్యు నెక్కి రథ♦వర్యమునందగు వైరిఁ గాంచెఁ దాన్. ౧౨౬ 2350

చ. నిరుపమతేజుఁడైన ధర♦ణీపతి రావణుఁ గాంచి క్రుద్ధుఁడై
శరతతిఁ గార్ముకంబుఁగొని ♦ చయ్యన విష్ణువు పూన్కిమై బలిన్
దురమున మార్కొనం దలఁచి ♦ తోరపువేడుకఁ బోవునట్లు భీ
కరతరవజ్రనాదసమ♦గాఢగుణధ్వని పెల్లుమీఱఁగన్. ౧౨౭ 2351

క. దనుజుని మార్కొన నడరెను;, మనుజేంద్రుండంత దనుజ♦మండను గని యి
ట్లనియెన్ గభీరవాక్యం,బున; నిలునిలు మోనిశాట♦పుంగవ; యింకన్. ౧౨౮

క. విను మింతటియప్రియ మీ,వు నాకు నొనరించి యెటకుఁ ♦ బోయి విముక్తిం
గనఁగలవు? శక్ర, యమ, రవి, వనజాసనవహ్నికృత్తి♦వాసులకడకున్. ౧౩౦౪

క. చనినన్ దశదిశలకుఁ బో,యిన నైన ను నిపుడు నాదు♦దృష్టిఁబడితి కా
వున నింక నెచటికైనం, జనఁ జాలవు మృతియెదక్కి ♦ శరణము గలదే ౧౩౧

చ. దనుజగణేశ! యేనిపుడు ♦ దారుణశక్తిని గొట్టినాఁడవో
యనుపమశౌర్యుఁ డిట్టినయ♦యంబున నీతఁడె నీకుఁజాలఁ జిం
తను గలిగింపఁ గోరి కడు♦దర్పము పొంగఁగ నీకు నీసుతాం
గనలకు మృత్యువై యిదె త♦గం జనుదేఁగలఁ డాజిసేయఁగన్. ౧౩౨ 2355

క. నేనన నతఁడే సుమ్మీ, [దానవ! లక్ష్మణుని మిగుల ♦ దర్పంబున నేఁ
బూని ప్రహరించితి ననుచుఁ,బూనకుమీ గర్వ, మతని ♦ పొంగడఁచితిజుమీ.

క. అని నీచేఁ బ్రహరింపం, గనుబడుదునొ? యనెదవేమొ] ♦ కర్బుర నీచెం
తను గన్పడు నేనే సు,మ్ముని నద్భుతదర్శనులయి ♦ యతులంబలులునై. ౧౩౨౪

తే. మఱి జనస్థానవాసులై ♦ మహిమ వెలసి
యుత్తమాయుధములఁ దాల్చి ♦ యొప్పునా చ
తుర్దశసహస్రకర్బుర♦ధూర్తుల నొగి
బాణముల రూపుమాపిన ♦ వాఁడఁ జేర్మి. ౧౩౩ 2358

చ. అనియెడు రామువాక్కులు సు♦రారివిభుం డవు డాలకించి ము
న్ననిఁ దనుఁ గొట్టి వే మరల ♦ నాతని మ్రోయుచునున్న భూరివీ

ర్యుని బవనాత్మజన్ముఁ గని ♦ యోర్వక క్రోధము మీఱఁగా లయాం
బునఁ దగువహ్నిఁబోలు శర♦ముల్ కడుఁదీక్ష్ణము లేసి నొంచెఁ దాఁ. ౧౩౪

క. దనుజాంబకతాడితుఁ డ,య్యనుబావని నైజతేజ ♦ మొక్కటి తెఱఁగునం
గనువాఁడుగాన నింకను, ననూనతేజమున వెలిఁగె ♦ నద్భుతరీతిన్. ౧౩౫

చ. గురుతర తేజుఁడైన నృప♦కుంజరుఁ డారఘురాముఁ డప్పు డా
సురశరతాడితాంగుఁడయి ♦ సుక్కకయుండిన నాంజనేయు నా
దరమునఁ గాంచి రావణుని♦దర్పము నోర్వక యాగ్రహించె; భూ
వరుఁ డరివీరుస్యందనము ♦ బాగుగ డగ్గఱి ఘోటకంబులన్. ౧౩౬ 2361

ఆ. చక్రములను ధ్వజము ♦ ఛత్రంబు గురుపతా
కలను సారథిని ద♦గంగ మెఱయు
వజ్రశూలఖడ్గ♦బాణముఖ్యాయుధ
ములను జక్కఁగాంచి ♦ వెలయుశక్తి. ౧౩౭ 2362

క. శితపుంఖసాయకంబుల, గతిదైవఖరి యలరునట్లు♦గా వైచి మహో
న్నతిశక్తిఁ ద్రుంచె వానిని;, శతముఖుఁ డతివీర్య మలర ♦ [1]శతకోటిఁ దగన్.

క. మేరునగోత్తమపక్షము, లాఘూఢిగఁ ద్రుంచునట్టు; ♦ లారాముఁడు దు
ర్వారమహావజ్రాశని, సారలసచ్ఛరముచే వి♦శాలంబగుచున్. ౧౩౮ 2364

ఆ. బలముగలిగి చక్క ♦ నలరు రావణుభుజాం
తరమునొంచె బలము ♦ నరుదుచూప;
నెవఁడు తనతలపయిఁ ♦ బవిఁగాని యశనియోఁ
గాని పడినభయము ♦ గనఁడో సుంత. ౧౩౯ 2365

[2]సీ. చలియింపఁడో యట్టి♦సాంద్రమహీపతిభావంబు గల్గురా♦వణుఁడు రామ
బాణతాడితుఁడయి ♦ బాధలకోర్వకయార్తుఁడై చలియించె; ♦ నతులవీర్య
మున నొప్పియుండియు♦ధనువుకరంబుననుండి వేవిడిచె,న♦త్యుత్తమమతిఁ ముగఁ
యగు రామచంద్రుఁడ♦ట్లారావణుఁడు మూర్ఛనందుచుండుటఁ గాంచి ♦ యద్భుత

ఆ. ప్రబలునర్ధచంద్ర♦బాణముఁ గొని దాన, నర్కవర్ణమైన ♦ యసురసంఘ
పతికిరీట మట్టి ♦ పలుశకలములుగాఁ, బడఁగ నేసి గౌర♦వము నడంచె. ౧౪౦

చ. ధనువును జాఱగా విడిచి ♦ ధామయుతంబగు సత్కిరీటముల్
గనుఁగొనుచుండ భూమిఁబడఁ♦గా విషహీనమహాహిపోల్కి శాం
తనిఖిలహేతియా శుచివి♦ధంబున నప్రభుఁడైన సూర్యరీ
తిని దనకాంతివీడి గత♦ధీవిభవుండగు రావణాసురున్. ౧౪౧ 2367

చ. కనుఁగొని దిక్కు లేని యల♦కర్బురనాథునిఁ దానె గావ నొ
ప్పును గద యన్నబుద్ధిఁ గొని ♦ పోలవచించెను; రావణా! భయం

1 శతకోటి=అనఁగా వజ్రము. 2 నాపి చచాల రాజా-అనియూ. రాజా అన్యూనరాజభావశ్చ స్థితః-అని వ్యాఖ్య.

బును గలిగించు కార్యములఁ ♦ బూన్కి నొనర్పితి నంతె కాక నా
కు నధికమిత్రభూతులయి ♦ కూర్మి నొసంగెను మేటివీరులన్. ౧౪౨ 2368

క. పలువురఁ జంపితి, దానన్, బలుశ్రమమునుం బడితి వనుచు ♦ భావించి శరం
బుల నిను మృత్యువశమ్మున, కలఘుబలం బలరనుండి ♦ యైన ననుపఁ జూ!.

సీ. విడిచితిఁ గర్బుర♦వితతవిభూ! నీవు సంగరమొనరించి ♦ చాలబడలి
యున్నాఁడ వేను ని♦న్నొప్పితిఁ బోనంగఁ బొమ్మింక లంకకుఁ ♦ బోయి నుంత
విశ్రాంతినిం బొంది ♦ విగతశ్రముండవై సరథుండవై బలు♦చాప మూని
రమ్ము నీ ఘానంగ♦రంబున నేఁ జూపుబలము చూచెదుగాక ♦ యలఘుదృష్టి

ఆ. ననుచుఁ బలికె; నిట్లు♦హతచాపహయసూతుఁ,డై శరార్దితుఁడయి ♦ హతకిరీట
దర్పహర్షుఁడగుచు ♦ ధరణీశు వాక్కుల, వినుచు లజ్జ వేగ ♦ చనియెఁ బురికి.

చ. చని యిటు లంకఁజొచ్చి బల♦శాలి *సురాసురవైరి రావణుం
డనఘుఁడు రాముఁ డంత నిట♦నయ్యనుజన్ముని జేరి సంగరం
బునఁ బడియున్న యాప్లవగ♦పుంగశరీరములంటియున్న సా
ధనములఁ దీసివైచునటు ♦ తానొనరించెఁ బ్రయత్న మేర్పడన్. ౧౪౫

చ. సురరిపువైన రావణుఁడు ♦ శూరత దక్కి పరాజితుండునై
యరుగుట కాసురాసురను♦హర్షులు దిక్కులు సర్వవర్యముల్
సరిదధిపస్థభూతతతి♦త్స్యాజలవాసి సమస్తజీవులున్
బరమముదంబునుం గనుచు ♦ భాసిలి రాసృపుశక్తి కెంతయున్. ౧౪౬

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము

---

## ౬౦ - వ సర్గము.

{ కుంభకర్ణుని మేలుకొలుపఁగా నాతండు రావణుని చూచుట దాన నాతఁడు కోపింపఁ గుంభకర్ణుండు యుద్ధమునకు నచ్చుట }

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ దాశరథిప్రహితాంబకార్దితాం
గనిచయుఁడై పురంబునకు ♦ గాసిలిపోయి విభగ్నదర్పుఁడై
మనమునఁ జంచలించె; నతి♦మానుషవిక్రముఁడైన రాముచే
తను బరిభావమందుటకుఁ ♦ దద్దయుఁ గుందె మహార్తి పైకొనన్. ౧ 2373

క. కరి సింహాము చేతం బలె, గరుడునిచే సర్పమట్లు♦గాఁ బీడితుఁడై
సురవైరి యుడలె; మఱియును, సరసిజభవదండములకు ♦ సాటియనగుచున్.

తే. చంచలలరీతి మెఱయుచు ♦ మించురాము
శరములఁ దలంచి వెతఁగుందె; ♦ శాతకుంభ

---

* మహాబలే దానవదేవశత్రౌ-అనియూ.

మయలనత్ప్రమాసన♦మండితాంగుఁ
డగుచు నాతఁడు దనుజుల ♦ నంతఁ గాంచి. ౪ 2375

క. సురపతితుల్యుఁడనగు నే, పరమాత్మునిచేత ననిని ♦ నైజబలంబుల్
నిరుపమశౌర్యముపోవం, బరినిర్జింపంగఁబడితిఁ ♦ బల్కు లిఁకేలా. ౫ 2376

క. పరమేష్ఠిగురిచి చేసిన, నిరుపమసత్తప మదెల్ల ♦ నేఁటికిఁ జూడన్
ధరణిని వ్యర్థంబే కద;, సరసిజసంభవుఁడు నాకు ♦ సాధ్వసము తగన్. ౬

క. మనుజులవలన న్నీవును, గనువాఁడవు భీతి నని ని♦కాము మెఱుఁగుమా
యని పల్కిన యాఘోరవ,చన మిపుడు ఫలించె నాకుఁ ♦ జక్కఁగ నకటా!.

ఆ. ఏటి కద్ది తప్పు ♦ నూటిగ ఫలియించుఁ, గాక; సురలవలనఁ ♦ గాని దనుజ
గణమువలనఁగాని ♦ గంధర్వయక్షరా,క్షసులవలనఁగాని ♦ సంతతంబు. ౭

క. ఉరగాళివలనఁగానీ, మరణము లేకుండ మును గ♦మలభవు భక్తిన్
వర మడిగి పొందితిని మృతి, నరులవలనఁ గల్గకుండ ♦ నాఁడడుగఁ గదా. ౮

సీ. ఇక్ష్వాకుకులమున ♦ కెల్ల నాథుండగు ననరణ్యుఁ డొకపరి ♦ నని వధింపఁ
బడియె నాచే నప్పు♦పరికించి నను నాతఁ డోరాక్షసాధమా!♦యోకులాంత
కా! దుర్మతీ! సమీ♦కంబున నినుఁ బుత్రసచివసారథిహయ♦సహితముగను
హతముచేసెడు నామ♦హాపురుషుండొక్కఁ డస్మత్కులంబున ♦ నవతరింపఁ

ఆ. గలఁడు నిశ్చయ మిద్ది♦గా నమ్ముని పల్కెఁ
గనుక నతనివంశ♦మునను దశర
థునకు రాముఁడితఁడు ♦ తనయుఁడై జన్మించె
మనుజుఁ డగుచు ననుచు ♦ మదిఁదలంతు. ౯ 2381

క. మును వేదవతియు నాచే,తను బరిభవమంది నట్టి♦తరుణంబున నా
తనుమధ్య నను శపించెను, గనుక మహాభాగురాలు♦గా నియతయుగాన్. ౧౦

క. అలరెడు నామెయె శాపము, ఫలింపఁగాఁ జేయ జనక♦పార్థివునకు ని
మ్ములఁ గూఁతురుగాఁ బుట్టెను;, ఫలియింపక యేల తప్పు♦పలుకు లవి యిలన్.

క. గిరిజయు రంభయు నందీ,శ్వరుఁ డావరుణాత్మజయుయి ♦ భాసిలుకీర్తిన్
ధర నలరుపుంజికస్థల,యు రహిఁ దపోవిభవమెల్ల ♦ నొప్పుచునుండన్. ౧౧

క. మును చెప్పినచందముగా, ననూనగతినయ్యెఁ గడుమ♦హాత్ములు ఋషు ల
య్యనఘులు పల్కినచందము, గనె సాగుంగాని మిథ్య ♦ గానేరదు సూ!. ౧౨

క. సురవైరులార! శాప, స్వరూపమును జక్క నెఱిఁగి ♦ వైరులగెలువం
దరమగువిషయంబున నె,చ్చరికను దగియుండవలయు ♦ సతతము మీరల్.

ఆ. భటులు తిరుగునట్టి ♦ భాగంబులందు గో,పురశిఖరములందుఁ ♦ బొలుచు గోపు
రములపార్శ్వముల న♦రాతుల బాధలు, గలుగకుండ నుండ్రు♦గాక సతము.

క. అసదృశగాంభీర్యుండై, యసురత్రిదశాళిదర్ప ♦ మడఁచుచు ధరనెం

దనముఁడగు కుంభకర్ణుం,డు సరసిజాక్షుఁడు మును ద◆నుక్ శపియింపక్.

క. తనశౌర్యము దూలఁగ ని,ద్రను బొందియె యున్నవాఁ డ◆తని మేల్కొలుపుం
డని యిట్లు మహాబలుఁ డా,దనుజుండు ప్రహస్తుఁడనినిఁ◆దా మృతిఁ గనుటక్.

తే. తాఁ బరాజితుఁడగుటయుఁ ◆ దలఁచి కుంభ
కర్ణుఁ డతిభీమబలుఁడయి ◆ క్రాలుచుంట
నెంచి యిట్లనిపల్కె మీ◆రేగి లోని
ద్వారములయందు యత్నంబుఁ ◆ దగునొనర్ప. ౧౪½ 2390

క. వనచరు లెక్కకయుండం, గను బ్రాకారంబు లెక్కి ◆ కా వుండంగాఁ
జను; నిద్రాపరవశుఁడౌ, దనుజవరుం గుంభకర్ణుఁ ◆ దగు బోధింపక్. ౧౫½

చ. వనటల నేనుఁ గుంది పలు◆భంగుల బాధల నొందుచుండ నా
యనుజుఁడు కాలసంహతను◆హానుతియై యెటువంటి చింతయై
నను గన కట్టె హాయిగ ది◆నంబులు నిద్రను బొందుచున్నవాఁ
డని మఱియుక్ వచించె నితఁ ◆ డన్వహ మిట్టులె చేయు నక్కటా.౧౬ 2392

తే. *ఒక్కపుడు నవమాసము ◆ లొక్కతఱిని
నాఱు నెల లొక్కసమయంబు◆నందు నేడు
నెల లదొక్కపు డెనిమిది◆ నెలలు గాఁగ
నియతిలే కెప్డు గనుచుండు ◆ నిద్ర నితఁడు. ౧౬½ 2393

సీ. ఆతఁ డీసంగర ◆ మారంభమగుటకు మును నవమదినంబు◆నను దగంగఁ
దత్పూర్వదినమందుఁ ◆ దా సభామంటపమున నె యాలోచన◆మును నొనర్చి
నిదురపోయినవాఁడు ◆ గద కాన నీతని సులువుగా మీరు మే◆ల్కొలుపవచ్చు
గురుబలశాలియా◆కుంభకర్ణునిక్షిప్రముగ మేలుకొనఁ జేయుఁ◆డు గురుభుజుఁడు

తే. దనుజముఖ్యుండునగు నాదు◆ననుజుఁ డతఁడు
సంగరంబున వే వన◆చరుల రామ
లక్ష్మణుల సంహరింపఁగ◆లఁడు నిజంబు
ధ్వజవరంబట్లు రాక్షస◆వర్యుఁ డయియు. ౧౭ 2394

ఆ. గ్రామ్యసుఖరతుండు◆గా నిద్రఁబోవుచు, నున్నవాఁడు; చూడ ◆ నుగ్రతరము
గాఁగనున్నయట్టి ◆ కలనునందును రాము, వలన నపజయంబు ◆ గలిగె నాకు.

క. కనుకనె యాతని బోధిం,చిన నించుకయైన మదికిఁ ◆ జింతగలుగ; దో
దనుజవరులార! యీతఱి, ననుజుని లేపంగఁ దగునొ ◆ యని యడుగుదు రేక్.

క. కలిగెను వ్యసనం బిట్టులు, గలనున సాయంబుసేయఁ◆గాఁ జాలండే

* నవషట్సప్తచాష్టౌచ మాసాన్ స్వపితి రాక్షసః-అనియూ. ఇటు గోవిందరాజులు పూర్వాపరకాండోక్తభంగిని విరుద్ధము గాకుండ సమాధానమును జెప్పుచు నొకపెద్దవ్యాఖ్య వ్రాసిరి. అది తెనుఁగునఁ జేర్ప ననువుగానిది కానఁ జేర్పలేదని యెఱుంగవలయు.

నిల నింద్రసమానుండై, యలరెడు నాయనుజుతోడ ♦ నగుపనియేమో.

చ. అని దనుజేంద్రుఁ డాడ విని ♦ యాపలలాశను లెట్లు మేలుకొ
ల్పను దగునీయకాలమున ♦ బాహుబలాఢ్యు నటంచు వ్యాకులం
బును గని కుంభకర్ణగృహ♦ముం గనఁబోయిరి; రాక్షసేంద్రునా
జ్ఞను గొని వారు మాంసమును ♦ జాలఁగమెక్కుచు నల్లద్రాగుచున్. ౨౪

సీ. కుంభకర్ణుఁడు మేలు♦కొన్నయప్పుడు వాని తనుదార్ఢ్యధనావంకఁ ♦ గోరి విమల
గంధమాల్యములు భ♦క్ష్యంబులు గైకొని సత్వరంబుగఁ బూన్కిఁ♦జనిరి; గొప్ప
బలములఁదగు రాక్ష♦సులు వారు గురుతరద్వారంబుగల్గి, యం♦తటను యోజ
నాయతంబయి, రమ్య♦మై కుంభకర్ణుని మేని కలందిన ♦ మేటిచంద

తే. నాదిపరిమళములు తగు♦నట్లు పొలయు
గుహావలెం బొల్చియున్న యా♦క్రూరదనుజ
సద్మమున కేగి యతని ని♦శ్వాసములును
వినుకతున్ నెట్టఁబడుచు నె♦వ్విధినొ చెతలఁ: ౨౫ 2399

క. చని యాగేహముఁ జొచ్చిరి;, దనుజులు వారట్లు బహువి♦ధంబుల శుభవ
స్తునికరభాసురమై కాంచనకుట్టిమములఁ జెలంగి ♦ చారుతరంబై. ౨౬

చ. కనఁబడుదానిఁ జొచ్చి యట ♦ గాఢసుషుప్తిని బొంది భీతికృ
త్తనుఁడగుచున్ బరుండి తగు♦దానవసింహునిఁ గాంచి; *రంత ని
ద్రను గనునట్టి వేళల ని♦తాంతమునుండఁగ నావికారముల్
గనఁబడ నిద్రఁబొందుచును ♦ క్ష్మాస్థలిఁగూలిన శైలసన్నిభున్. ౨౭ 2401

ఆ. నిద్రనుండి లేప ♦ నేరనిరీతిఁగా, నున్న యతనిఁ జేరి ♦ యొక్కరీతి
నందఱొకటఁ గూడి♦యట్టె మేల్కొలుపఁగా,సాగి;రంతనసుర♦సమితియందు.

క. తనువెల్ల నూర్ధ్వరోమా,ళిని దగఁగా నూర్పులను ల♦లిన్ విడిచెడు పా
మును బోలి మహాశ్వాసము, లను భీతిని గొలుపుచున్న ♦ లయపతితుల్యున్.

తే. పండుకొనియు భయంబుఁ బొ♦ల్పడఁగఁ జేయు
నాకృతిం దగ భయదనా♦సాంతరములు
తనరఁ బాతాళవిపులాస్య♦మునఁ జెలంగి
శయ్యఁ దాఁకంగ నవయువ♦సమితి మిగుల. ౩౦ 2404

సీ. శయనించి మున్ను దాఁ♦గి యవల నుంచిన మేదోరుధిరముల ♦ మేటివాస
నలు గుబాళింపఁ గ♦నకమయాంగదములఁ దాలిచి మకుటంబు ♦ తల ధరించి
పగతురఁ జెండు స♦ద్బలుని రాక్షససింహుఁ గుంభకర్ణునిగనుఁ♦గొనుచునుండి;
రంత భీకరసత్వు♦లగు రాక్షసులు వాని ముంగట సంతృప్తి ♦ నొందఁ జేయఁ

* తే తు తం వికృతం సుప్తం-అనిమూ, వికృతమ్ నిద్రాకాలికవికారయుక్తమ్-అనివ్యాఖ్య.

తే. జాలుమాంసములను మేరు♦శైలమంత
యెత్తుగాఁ బోసి రాతని♦యెదుట మఱియు
మృగమహిషసూకరమ్ముల ♦ వగుపలలము
లను మనోజ్ఞాన్నముల రాసు♦లనుగ నునిచి. 32½ 2405

క. సురరిపు లాతనిముందట, మరలను బహువిధమనోజ్ఞ♦మద్యము రక్తం
బరుదుగ నించినకడవల,సురారివరు ముందు నునిచి♦చొక్కఁపుఁబూన్కిన్. 33½

తే. ఆవరంతపుతనువున ♦ నమలరుచిర,చందన మలంది పరిమళ♦చారుపుష్ప
హారములు వైచి బహువిధ♦హారిగంధ,ములను నాతనిఁ గ్రే నేసి♦రెలమిమీఱ.

చ. దనుజులు శత్రుహంతయయి ♦ తద్దయు నొప్పెడువానికిన్ సుగం
ధనిచయధూపముల్ వయిచి ♦ దారతనిన్ నుతియించి, పల్మఱున్
ఘనములరీతిగా నఱచి ♦ కమ్రశశాంకుని బింబమట్టు లొ
ప్పిన గురుశంఖవారములు ♦ ప్రీతిగ నొత్తిరి పెక్కురీతులన్. 36 2408

ఆ. అంద ఱొక్కపెట్ట ♦ నార్చి రాతఁడు మేలు,కొనమి కాగ్రహించి ♦ ఘననినాద
ముల నొనర్చి రెగిరి ♦ రలఘుభుజాస్ఫాల,నములఁ జేసి; రసుర♦నాథు నతని.

క. కరములఁ బట్టి కదల్చిరి, సురారిమేల్కొలుపు వేడ్క ♦ శుంభద్ధ్వనులం
బరిపరిఁ గావించిరి; త, త్తరుణంబునఁ బక్షులెల్ల ♦ దారుణరీతిన్. 37½ 2410

క. ధర భేరీపణవమహా, త్తరనిస్వనములను గర్జ♦తధ్వనుల భుజో
త్కర మప్పళించురవముల, నురుతరసింహధ్వనులను ♦ నొక్కటి వినుచున్. 38

తే. దెసలకుం బ్రీతిఁ బాఱి సా♦ధ్వనము వదల
కుండుటన్ వ్యోమమున కేగి♦యును భయంబు
వాయమిన్ వేగ నేలపైఁ ♦ బడియె; మిగుల
శ్రమమునొంది కావించిన ♦ శబ్దములకు. 39 2412

క. అతిశయనిద్రం బొందిన, దితిజవరుం డింతు కేని ♦ తెప్పిఱిలమిఁ గాం
చి తగ మహాత్తరకాయుని, నతనిం గని యసురవర్యు ♦ లంద ఱొకటిగాన్.

తే. ఇనుపగుదియల రోఁకళ్ల ♦ నెల్లగదలఁ,గరములం బట్టుకొని; రుద♦గ్రతరరూపు
లైనవారద్రిశృంగాళి♦నట్టె ముసల,ములను గదలను భూరుహ♦ములను బూని.

సీ. ప్రహరింపసాగిరి ♦ పటుహస్తతలములముద్గరసంతతి ♦ ముష్టులను ద
గంగ భూస్థలిమీఁద ♦ గాఢసుప్తిం జెందునాతని గొట్టి రా♦యసురు లెంతొ
బలవంతులయ్యుఁ గుం♦భశ్రవునిశ్వాసవాతముచే నిల్వ ♦ వశముగామి
నతనిమోఁ౯లకుఁ దప్పి; ♦ రంత భయంకరవిక్రములగువార ♦ లీక్రమమున

తే. నెంతయత్నమొనర్చిన ♦ నంతమైన
నతఁడు మేల్కొనునూచన ♦ లగపడమిని

వగచి యందులకై మఱి ♦ తగినయత్న
ములనొనర్పఁగఁ బూని; యు♦జ్జ్వలగతులను. ౪౧ 2415

క. దనుజులు పదివేవురు చుట్టును దమకు సహాయులయి క♦దుర్వర్తిల నా
తనిచుట్టు మృదంగంబుల, ఘనభేరీపణవశంఖ♦గణముల మఱియున్ ౪౨

ఆ. ఏకకాలమందె ♦ యెల్లకుంభంబుల, మ్రోఁగఁ జేసి; రంత ♦ రాక్షసయును
లగుచుఁ గాటుకవలె ♦ నాకృతినల్లనై, యున్న యాసురాడు ♦ లోక్కరీతి. ౪౩

చ. దనుజవరేణ్యుఁ గొట్టుచు ని♦తాంతము నార్చుచు మేలుకొల్పనన్
గనుఁగవ విప్పఁడయ్యె; నిటు ♦ గట్టిప్రయత్నముచేసి కుంభక
ర్ణుని నిసుమంత లేపుటకు ♦ నోఁచక యింకను దానినట్టి మిం
చినయతిఘోరయత్నములఁ ♦ జెచ్చెఱఁ జేయఁగఁ బూని రొక్కటన్. ౪౪

క. కరిఘోటకోష్ట్రసంతతి, ఖరముల నెక్కించి త్రొక్కఁ♦గాఁ జేసిరి భీ
కరదండకశాంకుశముల,నురుగతులను వానిఁగొట్టి ♦ యొక్కటెఱఁగునన్. ౪౫

క. భేరీశంఖమృదంగము, లీరసమున మ్రోఁగఁ జేసి ♦ రెంతొ బలములన్;
వారష్టభుజ స్తంభము, లారీతి నుహేంధనమ్ము ♦ లట్టిముసలముల్. ౪౬ 2420

క. పెనుముద్గరములు గైకొని, యనూనబలము ల్చెలంగ ♦ నతని నడచి; రా
ధ్వని గురుతరమై లంకా,వనపర్వతముఖ్యవివిధ♦భాగములందున్. ౪౭ 2421

క. చెలరేఁగె నిండి నగరము, పలువిధముల మాఱుమ్రోసెఁ ♦ బరమసుషుప్తిన్
వెలసెడు నా దనుజుఁడు క,న్నులవిప్పక నిద్రఁబోయె ♦ నూతనభంగిన్. ౪౮

తే. వేయిభేరులఁ గాంచన♦విపులదండ,ములను గొట్టిరి వారెల్ల♦మొక్కలముగ
నొక్కటిగఁ జేరి చుట్టును ♦ బిక్కటిల్లి, యేకకాలంబునందు న♦హీనశక్తి. ౪౯

క. ఏకార్యము లొనరించిన, నాకర్బురవరుఁడు బ్రహ్మ♦దగుశాపముచె
నాకటికనిద్రఁ జెందుచు, నాకరణిఁ బరుండె నుంత♦యైనఁ గదలకే ౫౦ 2424

చ. కనుఁగొని వాని రాక్షసులు ♦ గాఢపరాక్రములెల్లఁ బూర్వమే
మనమునఁ గల్గుకోపమును ♦ మండుచునుండిన వారలత్తఱిన్
బెనుక్రుధఁ బూని యాతనిని ♦ భీమగతుల్ దగ లేప ముష్టులం
గొని ప్రహరించి విక్రమ మ♦కుంఠితసాహస మప్డు చూపుచున్. ౫౧ 2425

క. చెలఁగిరి కొందఱు నిస్వన,ములఁ జేసిరి మిగులశౌర్య♦మున భేరుల ని
మ్ముల వాయించిరి కేశం,బులఁ బెఱికిరి కొంద ఱసుర♦పుంగవుచెవులన్. ౫౨

తే. పంక్తబలిమిని గొఱికిరి ♦ పరఁగఁ బోసి
రతనిచెవులందునుం గుంభ♦శతజలముల
నప్పటికినైన భూరిని♦ద్రాభియుక్త
చిత్తుఁడై యుంటఁ గదలికఁ ♦ జెందఁడయ్యె. ౫౩ 2427

క. బలవంతులు దనుజులు గుది,యల సమ్మెటలన్ గ్రహించి ♦ యాతనివక్షః

స్థనాలమున నితరాంగమ్ములఁ, దలయందును మోది రతుల♦దర్పస్ఫూర్తిన్. ౫౪

సీ. త్రాళ్లచేఁ జర్మబం♦ధనములచేతను గడుదృఢంబుగఁ గట్టఁ♦బడినయట్టి
బలుశతఘ్నులచేత ♦ నలఘుకాయుండెంతఁ గొట్టఁగాఁబడినను ♦ గొంచెమేని
మేలుకొనఁడయ్యె; ♦ మేటిగజంబుల వేయింటి నతనిపై ♦ నాయసురులు
తోలిత్రొక్కంజేసి♦రోలినిట్లులుత్రొక్కనతఁడు మేల్కొనియెన♦య్యవియుఁ జిన్న

తే. పురుగు లంగంబుపయిఁ బ్రాకి ♦ పోవునట్టు
లాత్మలోపలఁ దలఁచె న♦య్యసురులు తను
మేలుకొనఁజేయువైచెడు ♦ మేటిపర్వ
తముల శృంగంబులను వృక్ష♦తతుల నెల్ల. ౫౬ 2429

క. కరముల గ్రహించి కొట్టిన, సరకుగొనక నిద్రయుడిగి ♦ సకుధికమగుతూ
త్పరిపీడితుఁడై స్వాంగో,త్కరము విఱుచుకొనుచు లేచెఁ ♦ దటుకునఁ నంత౯.

తే భుజగములయట్లు నిడుదలై ♦ భూధ్రశిఖర
ములవిధంబునఁ బలుపున ♦ వెలసి శిఖరి
శృంగసారంబులై వెల♦సెడు స్వబాహు
వులను గడుఁజాఁచి బడబను ♦ బోలుముఖము. ౫౮ 2431

తే. వివృతిఁ గనఁజేసి భయదమా ♦ విధము తోఁప
నావులించెను; దత్కాల♦మందు నాఁగ
భువనసముదగ్ర నది తల♦పోసి చూడ
నలరు సావర్ణి మేరుశృం♦గాగ్రసీమ. ౫౯ 2432

క. సరసిజ బాంధవుబింబం, బరుదుగఁ జూపట్టురీతి ♦ నలరారె; మహా
త్తరబలుఁ డాతఁడు వక్త్రము, సరిగా వివృతం బొనర్చి ♦ నరభసవృత్తి౯. ౬౦

తే. ఆవులించుచు లేచె న♦య్యదనున గిరి,నుండి వాయువువీడిన ♦ ట్లొప్పె నతని
దీర్ఘనిశ్వాసపవనుండు ♦ తీవ్రవేగ,మునను విసరెను, నిదుర లే♦చునపు డతఁడు.

క. నిరుపమకలాపభూషిత, శరీరుఁడై యుండెఁ గానఁ ♦ జంచత్తను వ
త్తరుణమున వృష్టి గురియుచుఁ, గరము బలాకావృతంబు♦గా జలదంబుల్.

క. వెలసెడుతీరునఁ జక్కఁగ, నలరారెను; మండుచున్న ♦ హవ్యవహుని య
ట్టులు క్రూరములై మెఱుపుల,వలెఁ జలియించుచును దనుజ♦వరునేత్రంబుల్.

క. శనిభూసుతు లనుపేరుల, దనరెడుమహోగ్రహములట్లు ♦ దారుణబాధల్
గనఁజేయుచు నొరులకు భీ,తిని గొల్పుచు వెలసె; నంత ♦ దితిజులు పూన్కి౯.

సీ. బహువిధములయిన ♦ భక్ష్యములను వరాహంబుల మహిషాళి ♦ నతని కర్ప
ణముసేయ దనుజాధి♦నాథుఁ డాగుంబలుఁ డవ్వాని భక్షించె; ♦ నమరనాథు
పగవాఁడుగాఁదగి ♦ పలలాశనవరుండు నగుకుంభకర్ణుఁ డ♦య్యదనునందుఁ
బలలంబు మెక్కి యాఁ♦కలి నెడఁబాపుచు దప్పిచే నెత్తురుఁ ♦ ద్రాగుచు మఱి

తే. బానలకొలంది మెదడును ♦ వారుణిఁ దమిఁ
ద్రాగె; భయమున నొకచోట ♦ దాఁగియున్న
దనుజు లప్పు డాతండును ♦ దనివినొంది
నట్టులెఱుఁగుచుఁ జెంతకు ♦ నరుగుదెంచి. ౧౪ 2438

క. శిరములను వాంచి మ్రొక్కుచుఁ, బరివేష్టించి రపు డతనిఁ; ♦ బలలాళనుఁడై
సురవైరియైన యతఁడు ని,దురమబ్బునఁ గొంతవిప్పి ♦ తోడన వానిన్. ౧౫

తే. మాయుచుండుటఁ గలఁతను ♦ బూనియున్న
నయనములఁ జూపు నిగుడించి ♦ నాల్గుదెసల
దనుజులను నెల్లవారిఁ దాఁ ♦ గనియె; దనుజ
వర్యుఁ డాకుంభకర్ణుఁ డ♦వ్వారి నెల్ల. ౧౬ 2440

క. మనమలర నూఱడించుచుఁ, దను మేల్కొల్పంగ వారు ♦ దార్కొనుటకు నే
పనియో యను నాశ్చర్యం,బును గని యిట్లనియె వారిఁ♦బొలుపుగఁ గనుచున్.

క. నను లేపందగు కారణ, మన నేదొకొ యిట్టిదా ప్ర♦యత్నంబున, రా
జునకున్ గుశలంబె కద, దనుజేశున కేభయంబు ♦ దగులదుగాదే. ౧౮ 2442

ఆ. అట్లుగాకయున్న ♦ నన్యులనుండి భ,యంబు గలిగియుండ♦నగు నిజంబు
దాని నణఁచుకొఱకె ♦ నేనింత వేగమ, నిదుర లేపఁబడితి♦ని నిటఁ బూన్కి. ౧౯

చ. దనుజవరేణ్యు సాధ్వస ము♦దారబలంబునఁ ద్రోసిపుత్తు నిం
ద్రునినయినం గరం బలిగి ♦ త్రుంచెద నగ్ని నశింపఁ జేయుదున్;
నను గురువైన యీదనుజ♦నాయకుఁ డిట్టులు స్వల్పకారణం
బున నిదురించు సోదరుని ♦ బూనిక మేల్కొలుపంగఁ బూనునే. ౨౦ 2444

క. కనుకన్ నన్నున్ మేల్కొ,ల్పిన కారణ మున్న దున్న♦విధమునఁ జెప్పం
జను; నంచు మహాబలుఁ డా,దనుజవరుం డనిన వినుచుఁ ♦ దగువినయమునన్.

తే. అసురనాథునిమంత్రి యూ♦పాక్షుఁ డనియెఁ
గరయుగంబును జోడించి; ♦ కర్బురేంద్ర!
యమరతతినుండి మాకు నే♦యదనునందు
నుంతయే భయ మబ్బదు ♦ సుమ్ము నిజము. ౨౨ 2446

క. మనుజులవలనన మాకిపు, డనూనభయ మంకురించి ♦ యయ్యది బాధిం
పను బూనియున్న; దోదను,జనికరపుంగవ! వచింతు ♦ సత్యము వినుమీ!. ౨౩

చ. మనుజులనుండి మాకిపు డ♦మానుషవిక్రమ! సంభవించి లం
కను గల సర్వదానవులఁ ♦ గాఱియపెట్టుచున్న భీతి యే
దనుజులనుండిగాని గురు♦దానవదేవగణంబునుండి గా
ని నిజ మదెప్పు డిప్పగిది ♦ నిర్భరరీతిని గల్గలేదనూ!. ౨౪ 2448

క. గిరితుల్యాకారులు వన,చరులెల్లను లంకచుట్టు ♦ శౌర్యమ్ములఁ బొ

ల్చిరి నిల్చి రడ్డముగ రఘు,వరుఁడును సీతాపహారణ♦పరితప్తుండై. ౨౮½ 2449

తే. తుములభయమును మాకిట్టు ♦ లమరవైరి
పుంగవా! కల్గఁజేసె; ము ♦ న్నంగనార్థ
మరుగుదెంచిన యొకవన♦చరునిచేతఁ
బురవరంబిద్ది దగ్ధమై ♦ పొడ వడంగె. ౨౯½ 2450

క. అనుచరబలములతో నా,తనిచే నక్షుండు తెగియె; ♦ దనుజాళికి నె
ల్లను రాజు దేవకంటకుఁ, డనిహతవిక్రముఁడు నీదు♦నన్నయు ననిలోన్. ౨౬½

క. సరసిజబాంధవతేజ, స్ఫురణంబునఁ బొల్చురామ♦భూమీశునిచే
నరయ మృతప్రాయుఁడుగా, దురమున విడువంగఁబడియెఁ ♦ దోఁపదు పలుకన్.

చ. దనుజగణాధినేతకును ♦ దానవదైత్యులు దేవతల్ దురం
బునఁ గడుశక్తి నే పనిని♦బూని యొనర్పఁగఁ జాలకుండి రా
పని నివు డారఘూత్తముఁడు ♦ బాగుగఁ జేసెను బ్రాణసంశయం
బున దశకంఠునిన్ వదలెఁ ♦ బో యనిచెప్పినఁ గుంభకర్ణుఁడున్. ౨౭ 2453

క. తనయన్న రావణాసురుఁ, డనిని బరాజయము నొందె ♦ ననియొడుయూపా
క్షునిమాటల విని కోపం,బునఁ గన్నులు త్రిప్పి పలుకఁ ♦ బూనె నియతిమై.

క. ఓయూపాక్షా! యిపుడే, యాయటవిచరాళి నెల్ల ♦ నాలక్ష్మణునిం
బాయనిశక్తిని రఘుభూ,నాయకు ననిఁ ద్రుంచి యవల ♦ నాయగ్రజునిన్.

క. కనియెదఁ; గపిశోణితమాం,సనికరమునఁ దృప్తిచేయఁ ♦ జాలుదు దనుజా
ళిని, రామలక్ష్మణుల న,ల్లను నేనే త్రాగువాఁడ ♦ లలితప్రీతిన్. ౩౧ 2456

క. *అని యిట్లు గర్వరోషము,లను దోషము వృద్ధిగాఁగ ♦ లలిఁబల్కెడు నా
తనిపల్కులవిని కరయుగ, మును మోడ్చి మహోదరుండు♦మునుకొనుప్రీతిన్.

క. దనుజతతిముఖ్యుఁడయి తా, ఘనశక్తిం దనరువాఁడు ♦ గావునఁ బలికెన్;
దనుజేంద్ర! మహాబాహూ!, చని రావణుఁ గాంచి తద్వ♦చనమును వినుచున్.

తే. గుణములను దోషముల మదిఁ ♦ గోర్కి వివిధ
విధములను జక్కఁ దర్కించి ♦ విమతులనట
మీఁదను జయింపవచ్చు స♦మీకమందు;
నను మహోదరుపల్కులఁ ♦ నపుడు వినుచు. ౩౩ 2459

క. గురుబలమున వరతేజ, స్ఫురణంబునఁ బరఁగుదనుజ♦పుంగవుఁ డంతన్
సురరిపులు తన్నుఁ గొలువఁగ, నరుగం దలపోసె నన్న♦యంతికమునకున్.

క. దనుజులు భయంకరములగు, కనులును బౌరుషము మిగులఁ♦గలుగుదనుజనా
థునిఁ గుంభకర్ణు మేల్కొ,ల్పి నితాంతజవంబు మీఱఁ♦బృథుమోదమునన్.

---

* సగర్వితం రోషవివృద్ధదోషమ్-అనివహా.

తే. ఆదశగ్రీవునింటికి ♦ నరిగి; రంత
వారలెల్లను బోయి యా♦ భర్మపీఠ
మందుఁ గూర్చుండినట్టి దే♦ వారిపతినిఁ
గాంచి యంజలిపుటము బం♦ధించి భక్తి. ౮౬ 2462

చ. పలికిరి; రాక్షసప్రవర! ♦ బాహుపరాక్రమశాలి తమ్ముఁడి
మ్ములను సుషుప్తిఁ బాసి యతి♦మోదముతో నటనున్నవాఁడు మీ
రలు నటకేగువారలొ? ప♦రప్రతిభంజనుఁడైన యాతనిన్
బిలువఁగఁబంచి చూచుటకు ♦ వేడుకఁ బూనెదవో వచింపుఁడీ. ౮౭ 2463

చ. అన ననుజుండు మేలుకొని ♦ యందుల కాత్మఁ బ్రమోదమంది వ
చ్చిన యలదానవావళులఁ ♦ జెచ్చెఱఁ గాంచి వచించె నిందు నా
తనిఁ గనఁగోరువాఁడ విధిఁ ♦ దప్పక పూజలఁ దన్పి తోడుకొం
చు నిటకు రండు నాఁగ దను♦జుల్ సరి యట్టులె యంచుఁ బల్కుచున్. ౮౮

తే. మరలి చనుదెంచి తమవిభు♦మాటరీతిఁ
గుంభకర్ణునితోడ; ర♦క్షోవిభుండు
నిన్నుఁ జూడంగఁ గోరుచు ♦ నున్నవాఁడు
కానఁ జన నిచ్చగింపు వే♦గముగ నటకు. ౯౦ 2465

క. భ్రాతకు సమ్మోదంబును, నీతఱిఁ గల్పింపు మనుచు ♦ నెల్లరు పలుకన్
భీతికరమహాబాహు వ,రాతులకు జయింపరాని ♦ రాక్షసవరుఁడున్. ౯౧ 2466

క. బలశాలియు నగునాతం, డలరావణునాజ్ఞ వినుచు ♦ నట్లే యనుచుం
బలికి శయనంబునుండియె, యలఘుగతిన్ లేచి హృష్టుఁ♦డై నియతిమెయిన్.

ఆ. ముఖము గడిగికొని ప్ర♦మోదము పొల్పాఱ
స్నానకృత్యమెల్ల ♦ జరపి పరమ
భూషణములు మిగుల ♦ భూషితుఁడై పిపా
సువయియుంట నపుడు ♦ శుభతరమయి. ౯౩ 2468

క. బలవృద్ధిని మిక్కిలిగాఁ, గలిగించెడు మద్యము వడిఁ♦గాఁ దెండని వా
రల వేగిరించె; రక్కసు, లలఘుగతిం బోయి రావ♦ణాజ్ఞారీతిన్. ౯౪ 2469

ఆ. వివిధమద్యభాండ♦వితతులఁ గొనివచ్చి, యతనిచెంత నునిచి ♦ రతఁడు రెండు
వేలకుంభములను ♦ లీలమైఁ ద్రావి రా,వణునమీపమునకుఁ ♦ బాఱఁదొడఁగె.

సీ. మత్తుఁడై యుండుట ♦ మద్యపానంబున నిఁకఁ గొంత మత్తెక్క ♦ నిద్ధతేజ
మతిబలంబును మీఱ ♦ హర్షంబు చెల్వారనాతండు లయకాల♦యమునిఁబోలి
యలరారు; దేవారు ♦ లందఱుఁ దనవెంట నరుదేరఁగా నతఁ ♦ డన్నగేహ
మునకుఁ బోవుచుఁ బాద♦ములు పెట్టునప్పుడు ధరణిని వడఁకంగఁ♦దాను జేయు

తే. చును వడింబోయె; భానుఁడ♦వనిని గిరణ
ములఁ బ్రకాశింపఁ జేయున♦ట్టులు తనురుచి

రాజమార్గంబు మిగులంగ ♦ రంజిలునటు
సేయుచుఁ బౌరు లంజలుల్ ♦ చేసి కొలువ. ౯౬ 2471

క. పురుహూతుఁడు శతధృతిమం,దిరమునకుం బోవునట్లు ♦ దితిజేంద్రుని మం
దిరమునకుఁ గుంభకర్ణుం, డరిగెన్; బురబాహ్యసీమ ♦ నలరువనచరుల్. ౯౭

క. గిరిశృంగకల్పుఁ జింతిం,పరానియాకారమునను ♦ భాసిలువానిన్
బరహంతఁ గుంభకర్ణుని, ధరణిపమార్గమునఁ బోవు♦దారుణనయనున్. ౯౨

క. ఆకస్మికముగఁ జూచుట, నాకపులందఱు బలేశు ♦ లయ్యును భీతిన్
జేకొనిరి; కొందఱందున్, భూకాంతు శరణ్య రామ♦మూర్తిం గనఁగన్.

క. చని యతని శరణుచొచ్చిరి, వనచరు లాకకొంతమంది ♦ వ్యధితులగుచు నే
లను బడి, రొకకొందఱు భీ,తిని బఱచిరి జవముమీఱ ♦ దిక్కుల కంతన్. ౯౪

క. కొందఱు నేలఁ బరుండిరి;, సుందరమకుటంబుఁ దాల్చి ♦ క్షోణీధరసుం
దరముగ వెలయుశిఖరము, చందంబునఁ దనువువెలయ ♦ సత్త్వాశ్వక్రియన్.

క. తనురుచి యలరుచునుండం,గను వృద్ధిం బొందియున్న♦కాయముతోడం
గనుపట్టు కుంభకర్ణుం, గని భీతిలి వనటఁ జనిరి ♦ కపులు దెసలకున్. ౯౯౫

అఱువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౬౧ - వ సర్గము.

రామునితో విభీషణుఁడు కుంభకర్ణుని వృత్తాంతమును జెప్పుట.

క. ఘన తేజంబున వీర్యం,బున వెలసెడు శ్రీరఘూత్త♦ముండు కిరీటం
బును దాల్చి మహాకాయం,బునఁ దగునాకుంభకర్ణుఁ ♦ బొడఁగనియె నటన్.

చ. ధరణిధరంబురీతిని ని♦తాంతము స్థూలశరీర మొప్ప నం
బరమును నొక్క పాదమున ♦ వారక యాక్రమణంబుచేయు నా
పురుషవరేణ్యు మాధవునిఁ ♦ బోలి కనంబడుచున్ జలంబుతోఁ
బరఁగెడుమేఘము ట్లసిత♦వర్ణమునం దగి భీతిఁ గొల్పుచున్. ౨ 2479

క. కనకాంగదభూషితుఁడై, దనుజలలాముండునగుచుఁ ♦ దగునాతనిఁ గాం
చెను జాపధరుండై చ,క్కనిదృష్టిని మరల నతనిఁ ♦ గని కపిబలముల్. 3

క. పరుగెత్తసాగె; నవ్వన,చరులటు పరుగెత్తుటయును ♦ జండబలుండౌ
సురవైరి వృద్ధిఁ గనుటయుఁ, బరికించి సువిస్మయంబు ♦ స్వాంతముఁ గ్రమ్మన్. ౪

తే. కని విభీషణు నీరీతి ♦ ననియె నార్య
యోప్రతాపాఢ్య! గిరియట్లు ♦ లొప్పుచు ఘన
తరకిరీటంబుఁ దలపైనఁ ♦ దాల్చి [1]హరిన
యనములొప్పారనున్న యా♦యసురుఁ డొకఁడు. ౫ 2482

---

1 కిరీటీ హరిలోచనః-అనిమూ హరిలోచనః కపిలేక్షణః-అనివ్యాఖ్య.

క. పురమున విద్యుద్ద్యుతజల, ధరమువలెం గానఁబడు ని♦తం డెవ్వఁడొ?; యు
ర్వరకెల్ల ధ్వజమువలె నొ,క్కరుఁ డీతఁడు గొప్పగాఁగఁ♦గనఁబడియెడుఁ జూ!.

చ. వనచరు లీతనిం గనుచుఁ ♦ బాఱఁదొడంగిరి చెప్పుమీ మహా
తనుధరుఁ డెవ్వఁడో యసుర♦తల్లజుఁడో దితిజుండొ యిట్టిరీ
తిని జెలువారుభూతము తి♦లిన్ దగఁ గానను మున్ను నేను దా
ని నరసి నాకుఁ జెప్పుమని ♦ నేర్పున రాముఁడు ప్రశ్న చేసినన్. ౭ 2484

తే. ఇట్టు లక్లిష్టకర్ముఁడై ♦ యెసఁగు రాముఁ
డడుగఁగాఁ బ్రాజ్ఞవరుఁడైన ♦ యావిభీష
ణుఁ డనుఁ గాకుత్స్థుతోడ నీ♦తఁడు మహాత్మ!
విశ్రవసునకుఁ బుత్త్రుఁడై ♦ వెలయుఁ జుమ్ము. ౮ 2485

చ. అనిమొన ధర్మరాజు నమ♦రాధిపు గెల్చినవాఁడు విక్రమం
బున నసమానుఁడై వెలయుఁ♦బో రఘునాయక! కుంభకర్ణుఁడం
చని పిలువంగ నొప్పు నితఁ ♦ డారయ నీతనియంతవాని నే
దనుజుని గాన మీధరణి ♦ దారుణరూపుఁడు సుమ్ము వీనిచేన్. ౯ 2486

క. దురమున సురాసురోరగ, వరయక్షులు రాక్షసులును ♦ వ్రాలిన యలకి
న్నరగంధర్వులు విద్యా, ధరులును గుమిఁగూడి వచ్చి ♦ ధరణీశవరా!. ౧౦

*ఆ. భంగమొంది చనిరి; ♦ బలశాలి యీకుంభ
కర్ణుఁ డేచి భూరి♦కరమునందు
శూలమును ధరించి ♦ పోలి విరూపాక్షుఁ
డగుచు నిలువఁ ద్రిదశు ♦ లార్తిఁ గనుచు. ౧౧ 2488

క. వీనిన్ మార్కొని కొట్టం,గా నోపక కాలుఁ డితఁడె ♦ కాఁదగు ననుచున్
మానసముల భ్రమియించిరి;, దానవుఁ డీతఁడు స్వభావ♦దర్పుఁడు రామా!.

క. వరదానమ్మున బలమిది, యరుదుగ నీతనికిఁ గల్గె ♦ నని తలఁపకు; మో
ధరణీశ! రావణాదిక, సురరిపువర్యులకు బలము ♦ చొప్పడె నజుచేన్. ౧౨

చ. దనుజుఁ డితండు పుట్టఁగనె ♦ దారుణమౌ బలమొప్ప క్షుత్తుచే
తను బరిపీడనొంది బల♦దర్పము లట్టి కనంబడంగ స
త్త్వనికర మెన్నివేలనొ జ♦వంబునఁ గైకొని మ్రింగినాఁడు; భూ
తనిచయ మిట్లు మ్రింగఁగ ని♦తాంతభయంబున నెల్లవారలున్. ౧౩ 2491

క. బలవైరిని శరణుగఁ గని, పలికిరి తద్విషయ మంతఁ ♦ బాకరిపుం డు
జ్జ్వలకోపచిత్తుఁడై యీ, పలాశనుని దీక్షవజ్ర♦బాధితుఁ జేసెన్. ౧౪ 2492

ఆ. దానఁ జంచలించి ♦ దారుణబల మొప్పు
నీతఁ డాగ్రహమున ♦ నేచి మిగుల

---

* శూలపాణిం విరూపాక్షః కుంభకర్ణం మహాబలమ్-అనియూ,

నార్చి; ధీయుతుఁడగు ♦ ననురుఁ డతం డార్వ
మునుపె భీతిఁగొన్న ♦ జనులు మఱియు. ౧౫½ 2493

క. ఈనాదము విని భీతిలి, రీనిష్ఠురదనుజుఁ డంత ♦ నెంతయుఁ గోపం
బూని మహాబలమొప్పం,గా నైరావతము నట్టె ♦ గని దంతంబుల్. ౧౬ 2494

ఆ. ఊడఁ బెఱికి దాన ♦ నొక్కట మర్దించె, నమరనాథువక్ష ♦ మంత నింద్రుఁ
డితనిదెబ్బ కోర్వ ♦ కతికోపమున మండి,పడియె; నంత సురలు ♦ బ్రహ్మమునులు.

*క. దనుజులు నష్టె విషాదం,బును బొందిరి; ప్రజలతోడఁ ♦ బోయె సురవిభుం
డును బ్రహ్మకడకు నంతట, వనజాసనుతోడ వజ్రి ♦ వారనికినుకన్. ౧౯ 2496

ఆ. ప్రజలతోడఁగూడి ♦ పలికె నీతనిదుష్ట,కార్యరీతి మఱియుఁ ♦ గడఁగి ప్రజలఁ
దినుటదివిజులఁదగ♦ధిక్కరించుటయును,మునులయాశ్రమములఁ ♦గనిచలమున.

ఆ. పాడుచేయుటయును ♦ బరకాంతలం దమి, నపహరించుటయును ♦ నాదిగాఁగఁ
గలుగుక్రూరకృత్య♦ములఁ బల్కి మఱియుని,ట్లనిరి; నిత్య మిట్టు♦లసురప్రజల.

సీ. భక్షించునేని స్వ♦ల్పంబగు కాలంబులోనె శూన్యంబగు ♦ లోకమెల్ల
నని దేవతలఁగూడి ♦ యమరేంద్రుఁడు వచింప విని చతురాస్యుండు♦దనుజవితతి
నంతయు రావించి♦యందులోఁ గుంభకర్ణుని గాంచె; నిట్టు లా♦దనుజుఁ గాంచి
వనజాసనుఁడుగూడ ♦ భయమందె నంత నా రాక్షసుఁ బిల్చి సు♦రప్రజమున

తే. జ్యేష్ఠుఁడై యున్న బ్రహ్మయుఁ ♦ జెంతఁ గూరు
చుండఁగాఁ జేసి మఱిమఱి ♦ యూఱడించి
పలికె; విశ్రవసుఁడు లోక♦ముల వినాశ
మునకుగా నిన్నుఁ బుట్టించెఁ ♦ బో నిజమ్ము. ౨౪ 2499

క. కనుకన్ నీ విదిమొదలుగ, ననయము మృతకల్పుఁడవయి ♦ యవనిని శయనిం
పనుగలవని శపియించెను;, వనజజు శాపమున నైజ♦బలము చెడంగన్. ౨౪½

క. సరభసముగఁ బ్రభువయి చెలఁగు,రావణుని యగ్రమందు♦క్షోణిఁబడియె; నా
సురవైరి తత్తఱిలి యా,సరసిజభవుఁ గాంచి పలికె ♦ సదయాత్మ! విభూ!. ౨౫

తే. చక్కఁగా వృద్ధినొందిన కాం♦చనము రీతిఁ
గనఁగ నింపగు నొక్కవృ♦క్షమును జూచి
యది ఫలించెడుకాలంబు ♦ నందుఁ ద్రుంచు
మాడ్కి నయ్యెను నీముని♦మనుమఁ డగుచు. ౨౬ 2502

క. దినదినము వృద్ధినొందెడు, ఘను నీతనినిన్ శపింపఁ♦గా న్యాయంబే!
వనజభవా! నీవాక్యం, బనృతముగాఁ జాల దట్టు♦లౌట నితండున్. ౨౬½

తే. నిద్రఁ బూనుచునే యుండు ♦ నియతి మిద్ది
యైనఁ బవళింప మేల్కొన ♦ నరసి కాల

* ప్రజాభి స్సహ శక్రశ్చ యయౌ స్థానం స్వయంభువః-అనియూ.

నియమ మేర్పఱుపందగు ♦ నీకు; ననిన
రావణునిపల్కుల్ విని ♦ బ్రహ్మ పలికె. ౨౮ 2504

సీ. అసురేంద్ర! నీతమ్ముఁ ♦ డాఱుమాసములకు నల్పంబు గాకుండ ♦ నట్టి నిద్రఁ
బొందుచునొకదినం♦బున మేలుకొనుచుండునొకనాఁడు మేల్కని♦యురుతరమగు
నాఁకలిఁగొని విప్ర♦తాన్యుఁడై ధరణిని జరియించుచుఁ గోప♦పరవశుఁడగు
నగ్నిహోత్రుఁడు వోలె ♦ నఖిలలోకంబుల భక్షింపఁగలఁడని ♦ పలికె; నసుర

ఆ. తల్లజుండు నీప్ర♦తాపాగ్నికిన్ భీతిఁ, గాంచి వ్యసనమొంది ♦ కడఁగి నిద్రఁ
గాంచియున్న కుంభ♦కర్ణుని మేల్కొల్పె, నిపుడు భీమశౌర్యుఁ ♦ డితఁడు రామ!.

క. తనగృహము వెడలి వీఁడుం, డనూనమగు కోపమూని ♦ యఖిలకపుల న్మ్రిం
గను వచ్చు వేగ; వీనిం, గని పఱిగిడుచున్నవారు♦గాఁ గపు లిపుడున్. ౩౨

క. అని మునఁ గ్రుద్ధుండై యీ,దనుజుఁడు మార్కొన్నయెడలఁ♦దారుకపులు వీ
నిని నెటువారింపంగల, రనఘా! యిది యొక్కయంత్ర♦మాఁజుఁడి యిదియున్.

ఆ. పయికి నెత్తఁబడియె ♦ భయపడవల దని
కపుల కెల్లఁ జెప్పఁ♦గాఁ జనుఁ గపి
వరులు తెలిసి దీని ♦ భయ మొందకుందు రీ
విషయమున నటంచు ♦ విమలరీతి. ౩౩ 2508

క. పలికిన యాదనుజోత్తము, పలుకులను నహేతుకముల ♦ భవ్యమ్ముల ని
మ్ముల విని శ్రీరాముఁడు కపి,బలపతియగు నీలుఁ గాంచి ♦ పలికెం బ్రీతిన్. ౩౪

చ. అనలకుమార! నీవును బ♦లావళి వ్యూహముగా నమర్చి లం
కనుగల ద్వారసంతతి న♦ఖండముఖై తగు నిల్చుతావులన్
గనుఁగొనుచుండుమా జలముఁ ♦ గట్టినతావుల నాక్రమించి; యు
ద్ధనిఖిలసాధనంబులగు ♦ దారుశిలాగిరిశృంగవారముల్. ౩౬ 2510

ఆ. చక్క సేకరించి ♦ యొక్కటఁ గూర్పుమా!, యెల్లకపులు శౌర్య ♦ ముల్లసిల్లఁ
బర్వతములఁ జేతఁ♦బట్టి ఖడ్గాదులఁ, దాల్చి యుందురుగాక ♦ దగినరీతి. ౩౬

క. హరిసేనాపతికపికుం,జరుఁడునునగు నీలుఁడు రఘు♦సత్తమునాజ్ఞం
గరమనురాగమ్మునఁ గొని, హరులకు నట్లే యొసంగె ♦ నాజ్ఞను బిదపన్. ౩౭

తే. పర్వతాకారులగు శర♦భహనుమంతు,లంగదగవాక్షు లద్రి♦శృంగాళిఁగొనుచు
లంకద్వారములకుఁ జని ♦ బింక మొప్ప,ముట్టడించిరి శ్రీరామ♦మూర్తియాజ్ఞ.

సీ. రామువాక్యము విని ♦ భీమకాయులు జయశీలురు వీరులై ♦ చెలఁగుకపులు
భూరుహంబులఁ గొని ♦ పురబాహ్యసీమలఁ దిరుగుచుఁబురమును♦దెంపుమీఱఁ
గాపాడుచుండు రా♦క్షసుల మర్దించిరి; బహువిధభూధర♦పటలమూని
యలరుచేతులు నొప్పి ♦ యాపురిసన్నిధి నున్నయాకపిబల ♦ ముగ్రరీతి

ఆ. ధరణీధరముచెంత ♦ దారుణరీతిగా, నావరించియున్న ♦ యట్టి భూరి
జలదపటల మట్లు ♦ సాంద్రంబుగా వెలిం,గెను మహోద్యమమ్ము ♦ గనఁబడంగ.

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౬౨ - వ సర్గము.

{ రావణుఁడు కుంభకర్ణునితోఁ దనవృత్తాంతమును దెల్పి యుద్ధమునకుం బురికొల్పుట. }

చ. అనితరసాధ్యవిక్రముఁ డ♦హార్యబలుండు నరాతిదుర్జయుం
డునునగు కుంభకర్ణుఁడు న♦నూనసుతృప్తిని బొందియుండి యొ
ప్పునితతి లేచుటన్ గదురఁ ♦ బాయకసోలుచు మద్యపానసం
జనితమదంబు పైకొన న♦సంఖ్యసుతారులఁ గూడి యంతటన్. ౧ 2515

క. సిరులన్ వెలసెడు నాభూ,వరమార్గము చేరి నగర♦వాసులు పుష్పో
త్కరముల సౌధంబులనుం,డి రమణ గురియంగఁ బోయె ♦ నెమ్మి తనరఁగన్.

క. కనకగవాక్షంబులతోఁ, గనఁబడుచుం గాంతు లలరఁ♦గా సూర్యునిరీ
తిని మెఱయుచును విశాలం,బును రమ్యమునైన దనుజ♦పుంగవుగృహమున్.

చ. కనుఁగొని సూర్యుఁ డంబుదని♦కాయముఁ జొచ్చిన రీతిగాఁగ నా
దనుజవరుండు చొచ్చి యట ♦ దవ్వున వేఱొక కక్ష్యలోన నా
సనమునఁ గూరుచున్న ప్రభు♦సత్తము రావణు నాసనస్థుఁడౌ
వనజజు వాసవుండు గను♦భంగిని గాంచెఁ బ్రమోద మొప్పఁగన్. ౪

క. సురవైరిగణాన్వితుఁడయి, పరఁగెడు తనయన్నసౌధ♦వరముఁ జొరఁగఁ ద
చ్చరణమ్ములతాఁకున నా, ధరణియుఁ గంపించె; నంత ♦ దనుజాగ్రణియున్.

క. తనయగ్రజన్ముసౌధం,బును జొచ్చి కవాటవర్య♦మును దాఁటి రుచిం
గను పుష్పవిమానంబున, ఘనముగఁ గూర్చున్న దుఃఖ♦కలితుని నన్నన్.

చ. కనుఁగొన రావణుం డపుడు ♦ గాదిలితమ్ముఁడు కుంభకర్ణుఁ డా
య్యనఁ జనుదేరఁ గాంచి కడు♦హర్షము నొందుచు వేగ లేచి దా
పునకును దోడుకొంచుఁ జనెఁ ♦ బొంగుచు నాసనమందుఁ గూరుచుం
డిన యలరావణాసురుని ♦ నిర్భరవిక్రముఁ జేరి భక్తితోన్. ౭ 2521

తే. కుంభకర్ణుఁడు పదముల♦కుం బ్రణామ
మాచరించి యిఁకం జేయ♦నైన పని య
దేమి యని ప్రశ్నసేసె న♦హీనహర్ష
మొంది యారావణుఁడు లేచి ♦ యుద్యమమున. ౮ 2522

క. తనసహజుం గౌఁగిటఁ జేర్చి నితాంతము మోదకలితుఁ ♦ జేయ మనోజ్ఞం

బును సుందరంబునగు నా, సనపరమును జేరె నతఁడు ♦ సంహృష్టుండై. ౯౪

చ. బలమునఁ జాలమించి సుర♦వైరివరుండగు కుంభకర్ణుఁ డ
ట్లలఘుతరాసనంబున మ♦హావిభవంబునఁ గూరుచుండి క
న్నులు గడునెఱ్ఱనై తగ వి♦నూతనకోపము మించ నన్నతోఁ
బలికెను; నిద్రపోవు నను ♦ వారనియక్కట లేపితేల నీ గతిన్. ౧౦౪ 2524

క. దనుజేంద్ర! లేపఁ బనిచితి, వనూనభయ మేనివలన ♦ నయ్యె నిపుడు నీ
కు, నెవండు మృత్యువక్త్రం, బును జొరనున్నాఁడు తెల్పు♦ము వివర మింకన్.

క. అనుచుం బ్రశ్నించి క్రుధం, గను లెఱ్ఱగ నొప్పుచుండఁ♦గా నాసనముం
దును గూరుచున్నయనుజ,న్మునిఁ గని యావంతకోప♦మున నయనంబుల్. ౧౨

క. పరివృత్తము లగుచుండఁగ, నరుడుగ వచియించె నిటు మ♦హాబల! నీవీ
వరునను నవదినములు ని,ద్దుర వోతివి కాలమిద్ది ♦ తోఁచె ఘనముగన్. ౧౮

క. కనుకనె నా కాశ్రీరా, మునివలనం గల్గిన భయ♦ము నెఱుంగ; విదే
ఘనబలుఁడు దశరథాత్మజుఁ, డనూనకపిసేనలు తను ♦ నాదృతిఁ గొలువన్.

క. అలసుగ్రీవునితోడం, గలిసి సముద్రంబు దాఁటి ♦ కడుశౌర్యమునం
బలము గనంబడుచుండ మ,నలను సమూలముగ మించి ♦ నాశ మొనరుపన్.

తే. తలఁచి యట్టులె చేయుచు ♦ దాఁ జెలంగు
చున్నవాఁడు సుమా! కంధి ♦ నొక్కరీతిఁ
దాను గట్టించి నట్టిప♦థంబు నందె
సుఖముగా వచ్చి యక్కటా! ♦ శూరతదగ. ౧౩ 2530

క. మనపురమునఁ గల యీయుప, వనములఁ దోఁటలను నొక్క ♦ వానరమయకం
ధినిగా నొనరిచినాఁ డదె, కనుమా! ముఖ్యతములైన ♦ క్రవ్యాదు లనిన్.

క. వనచరులచేతఁ జచ్చిరి, వనచరులం దొక్కఁడైన ♦ బవరమున మృతిం
గని తద్బలము క్షయింపం,గ నొకపుడేఁ జూడలేదు ♦ గాదిలియనుజా!. ౧౬౪

క. హరివీరుల నొక్కండే, దురమున నోడింపఁబడుట ♦ తోఁపదు నాకున్
గరము బలాఢ్యుఁడ వీవి, త్తరుణంబునఁ గల్గినట్టి ♦ దారుణభయమున్. ౧౭౪

క. కనుమా! నీవిత్తఱి నా, వనచరులం జంపి నగర♦వరమును దీనిం
బనిఁ బూని త్వరగఁ గావుము, విను నిను మేల్కొల్పుటకిదె♦విషయము సుమ్మా.

క. నాయైశ్వర్యంబంతయు, నీయెడ నశియించెఁ బురిని ♦ నెనఁగుదనుజు లి
ట్లీయెడరున నశియించుటఁ, జేయంగలవార లెల్లఁ ♦ జెడినట్లయ్యెన్. ౧౮౪

క. బాలురు వృద్ధులు మాత్రమె, యీలంకం గానఁబడుదు ♦ రిపుడు తలచుగా
నీలీల లంక నేనును, జాలవగం గుందు బెత్తెఁగి ♦ సమధికశక్తిన్. ౧౯ 2536

క. పరిరక్షింపుము కార్య మి,తరులకు నిది చేయరాక ♦ దారుణమగు నీ

కరణి, మహాబాహూ! యీ,తరుణమునఁ భ్రాతకొఱకుఁ ♦ దగుఁ జేయంగన్.
క. అరిసూదన మున్నెపుడి,క్కరణిని నీతోడఁ జెప్పఁ♦గాఁ బూనను గా
నిరతము నీయెడ నాకా,దరమును గౌరవము వెలయ ♦ దనుజవతంసా. ౨౦౫
క. దేవాసురయుద్ధంబుల, నీవే పలుసార్లు దివిజ♦నిచయమ్మును బెం
పావహిలఁ దాఁకి జయల,క్ష్మీవిభవముఁ గంటి గాదె ♦ చెలఁగునసురులన్. ౨౧
క. దురమున జయించితివి గా, పరాక్రమము నీది భయద♦భంగి వెలయ నీ
తరుణమున దానిఁ గైకొను, మరయన్ భూతాళులందు ♦ నవనీస్థలిలోన్. ౨౨
క. బలమున నీకు సమానము, గలదే సంగర మనంగఁ ♦ గడుహితమగు బం
ధులయందు నీకుఁ బ్రీతియు,వెలయున్ మిగులంగఁ గాన ♦ విను మీమాటన్.
ఆ. హితము ప్రియమునైన ♦ యీయుత్తమంపుఁ గృ
త్యమును నన్నుఁగుఱిచి ♦ తగునొనర్ప
రయసమీరుఁ డాశ♦రద్ఘనములరీతి
నరిబలములఁ జెండు ♦ మధికశక్తి. ౨౩ 2542

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

౬౩ - వ సర్గము.

{ కుంభకర్ణుఁ డన్నకునీతి చెప్పి ఫలంబు గానక యుద్ధముసేయఁ దీర్మానించుకొనుట. }

క. దనుజేంద్రుఁడు పరిదేవన,మును జేయుచుఁ బల్కుఁగ విని ♦ మోమున నవ్వుం
గనఁబఱచి పల్కె నిట్లని, మును పాలోచనమును మన♦ము సచివసమితిన్. ౧
తే. కలసి చేసినయప్పు డే♦క్కరణి మనము
దోషములు కల్గుననుచు ముం♦దుగనె నిర్ణ
యించితిమొ యవ్వి నీకిప్డు ♦ హితులవచన
ములు వినకపోవుటవలనఁ ♦ గలిగెఁ జుమ్ము. ౨ 2544
సీ. గురుపాతకులకును ♦ నరకమందే పాత మరయఁ దప్పక గల్గు♦నట్లు సీత
నపహరించుటచేత ♦ నతనికి నీవు గావించిన పాపైక♦విహితకార్య
ఫలము నిన్నుం బొందె ♦ నలఘుగతిం జుమ్ము సార్వభౌమా! నీవు♦సాంద్రవీర్య
దర్పంబుననె రాము♦తరుణిని దొంగిలినట్టి యీపని మున్నె ♦ యట్టిదోయని
తే. యెంచవైతివి దానిన ♦ మించుదోష
ముల విచారింపవైతివి ♦ భూమినేలు
నతఁడు మునుచేయఁదగిన కృ♦త్యముల వెనుక
వెనుకఁ జేయఁగఁ దగినట్టి ♦ పనుల ముందు. ౪౫ 2545
క. ఒనరించునో యాతఁడు నీ,తి నసీతిని నించు కేని ♦ తెలియనివాఁడౌ;

విను తగనియట్టి సమయంబున దేశంబునను బనులఁ ♦ బూని యొనరుపఁగ. ౫

తే. అవ్వి వానివై కల్యము ♦ నివ్వటిల్లు
టను నపాత్రులు వేల్చిన ♦ ఘనహవిస్సు
లట్లు విఫలంబులగు; నెవ్వఁ ♦ డాత్మసచివ
వరులతోఁ గూడి యోజించి ♦ పలువిధముల. ౬ 2547

*సీ. సిద్ధాంతమును జక్కఁ ♦ జేసికొనుచు మఱి యరిదుర్బలుండగు ♦ నట్టితఱిని
నొనరించు సంగర ♦ ముత్తమమగు, దానువైరియును సమాన ♦ బలు లగునపు
డొనరించు నాయుద్ధ ♦ మనఁబడు మధ్యమ, మరిబలాఢ్యుండయి ♦ యలరఁ దాను
బలహీనుఁడయియున్న ♦ పట్టున నొనరించునని యధమంబగు ♦ నట్టి త్రివిధ
కర్మములను వానిఁ ♦ గావించుటకుఁ దగునట్టియుపాయంబు ♦ నట్టిపనుల
కగు ద్రవ్యసంపత్తి, ♦ నవ్వానిఁ జేయంగఁ దగు దేశకాలభే ♦ దముల, వాని
కిని గల్గునంతరా ♦ యనిచయమున కగు ప్రతికార మట్టి కా ♦ ర్యములసిద్ధి
యను వీనినైదింటి ♦ యందును జాగరూకత గల్గియుండు నా ♦ త్మావిభుండె

తే. నయపథంబున వర్తించు ♦ నరపతియగు
నతఁడె నీతిఫలంబుల ♦ నందు, నెవఁడు
బుద్ధిబలమున మంత్రులఁ ♦ బూన్కిఁ గూడి
యెంచి సుహృదులతో విచా ♦ రించి మఱియు. ౭ 2548

తే. నీతిశాస్త్రంబు మీఱక ♦ ఖ్యాతి వెలయఁ, గార్యనిర్ణయ మొనరింపఁ ♦ గాఁ దలఁచు నో
యతఁడె నీతిపథంబును ♦ ననుసరించు, వాఁడు సుమ్ము; రాక్షసేశ్వర ♦ భవ్యకీర్తి.

క. దినపూర్వభాగమునఁ జక్కని ధర్మము దివిని నడుమ ♦ ఖరకరుఁ డుండం
గను నర్థము సాయంతనమునఁ గామము సేవచేయఁ ♦ బూనఁగవలయున్. ౮

తే. అట్లు లేకున్న నొకసమ ♦ యంబునందె, పూని రెండేసి జంటగాఁ ♦ బూజ్యభంగిఁ
దగును సేవింపఁగా; దినాం ♦ తమున మూఁడిటినిని సేవించున దకాల ♦ మునను దీని.

క. తెలియక సేవింపఁగ రాదిలఁ గేవలకామమునె య ♦ హీనమనుచు ని
మ్ములసేవించిన యాతఁడు, పిలువఁబడు నరాధముఁడను ♦ పేరున నెపుడున్. ౯

తే. వీనిలో శ్రేష్ఠమైనట్టి ♦ విపులధర్మ
మును వినుచు నే మహీశుఁడై ♦ నను మహీశు
నంతవాఁడైనఁ దాఁ జేయ ♦ నౌ నటంచు
నాత్మ నెఱుఁగఁడొ తచ్ఛ్రవ ♦ ణాదికంబు. ౧౦ 2553

* త్రయాణాం పంచధా యోగం కర్మణాం యః ప్రపశ్యతి, సచివైస్సమయం కృత్వా స సభ్యే వర్తతే పథి-అనిమూ. ఈశ్లోకమునకు వ్యాఖ్యానకర్తలు వ్రాసిన యర్థము సమగ్రముగాఁ దెనిఁగించుటచేత సీసమాలికయైనదని గ్రహించి మన్నింపవలయు.

క. ఫలవంతము గానేరదు;; పలలాశనవర్య! యేనృ♦పతి తనచిత్తం
బు లలితగతి స్వవశంబయి, వెలయంగాఁ జేసి యుచిత♦విధుల నెఱుఁగుచుఁగా.

సీసమాలిక:—

*శత్రువునొద్దకుఁ ♦ జని ధనమిచ్చుట యనెడుదానంబు, చ♦క్కనిపలుకులు
చెప్పుకొనుటయనఁ ♦ జెల్లు సామంబును, వారికిఁ దన్మిత్ర♦వర్గమునకు
భేదముచేయుట ♦ భేదంబు, విక్రమ మలర యుద్ధముచేయు ♦ టనెడు దండ
న,మను నీవిధములౌ ♦ నాల్గింటిలోపల నొక్కొక్కటిని గాని ♦ యొక్కరీతి
నన్నిఁటింగాని పూ♦ర్వాభిహితములైన యా నయానయముల ♦ నల్లె యరసి
ధర్మార్థకామాళిఁ ♦ దజ్ఞులౌ మంత్రులఁ గలిసి యాలోచించి ♦ కాలమునకు
నవ్వానిఁ జతఁగూర్చి ♦ యాదృతి నెవ్వఁడు సేవించునో యట్టి♦క్షితివిభుండు
వ్యసనంబు నొందక ♦ వర్ధిల్లునే; భూపుఁ డర్థతత్త్వంబుల ♦ నమలరీతి
దెలిసినయట్టి మం♦త్రులఁగూడియిఁక ముందుహితము తనకుఁగల్గు♦కృత్యమేదో
చేయరాని దదేదో ♦ చిత్తమునందెంచి నిశ్చయపరుఁడయి ♦ నెమ్మి దనరఁ
గర్తవ్యమును బూని♦కను జేయునో యాతఁడిందుసుఖముగని♦యేమనుఁజుమి;
యుర్వీశువిషయ మి♦ట్లుండ మంత్రులవిషయంబన్న నీతిశా♦స్త్రార్థములను
గురుముఖంబుననుండి ♦ పరికించి విని తెలియక వేమమునఁ బశు♦ప్రాకృతులుగ
నుండియుఁ బశువుల♦యొప్పున నాహారనిద్రాదుల నెఱుంగ ♦ నేర్చినట్టి
వారు, తమ్మును మహీ♦వరుఁడు భ్రాంతుండయి యాలోచనముచెప్పు♦నట్లు కోర
నూహలు లేక యే♦మో ధార్ష్ట్యమున జెప్పఁ దలఁతురుగాని స♦త్యము నెఱింగి
వచియింపఁ బూన; రీ♦వరుసఁగా నర్థశాస్త్రానభిజ్ఞులె యగు♦నట్టిమంత్రు
లనువదించెడునట్టి♦యహితవాక్కుల నర్థశాస్త్రాభినజ్ఞులు ♦ క్ష్మాధిపతులు
చక్కని సిరిగోరఁ ♦ జాలినవారైన గ్రహియింపరాదు శా♦స్త్రమున నెవరు
జ్ఞానవిహీనులై ♦ కడుధార్ష్ట్యమున నిజమున కహితంబె య♦య్యును బయికిని

తే. హితమువలెఁ దోఁచునర్థంబుఁ ♦ గృతకబుద్ధు
లగుచుఁ జెప్పుదురో వార ♦ లరయఁ గార్య
హంతకులు గావునఁ బరీక్ష♦లందు వారి
నెఱిఁగి వినకుండుటయె గాక ♦ యెప్పుడైన. ౧౫౪ 2555

క. వారల మంత్రస్థానముఁ, జేరంగా నీయకుంట ♦ చేయందగుఁ; జు
మ్మో రావణా! [కుమంత్రులు, చేరి హితేతరము పలికిఁ ♦ జెప్పుచు మఱియున్.

క. తగినట్టి యుపమ నెఱిఁగిన, పగఱు తముం బ్రోత్సహింపఁ♦బ్రభువుఁ జెఱుపఁగాఁ

---

* ఉపప్రదానం సాంత్వంవా- అను మొదలగుశ్లోకముల కుండిన యర్థమంతయు నీసీసమాలిక యందుఁ జేర్పఁబడినదని తెలియందగు.

దగునని పూనుచు వ్యత్యయ, ముగ ఫలముల నిచ్చుకార్య♦ములఁ జేయంగన్.

క. పురికొల్పి యట్లుచేయిం,తురు పతిచే; నట్టిరిపుత♦తులకున్ వశులై
పరికింప మిత్రులవలెం, జరియించుచుఁ గార్యములను ♦ శత్రువు లగుచున్.

క. తనపనులయందుఁ దిరిగెడు, మనుజాధములైనయట్టి ♦ మంత్రుల మంత్రం
బును నిర్ణయించునప్పుడు, గనవలయున్ బలువిధములు♦గా నూహలచేన్.

తే. [అట్టి యసమర్థులగు మంత్రు ♦ లహితులయ్యు
నేమిచేయుదు వనెదవో ♦ భూమి శత్రు
వశమునందున్న మంత్రుల♦వలనఁ బ్రోత్స
హింపఁగాఁబడి చపలుఁడై ♦ తెంపు చేసి. ౧౮౪ 2560

క. పనులను నరపతి చేసిన, మును క్రౌంచమహీధరవర♦మున షణ్ముఖుఁ డే
పునఁ గావించిన రంధ్రం,బును బక్షులు పొందురీతిఁ ♦ బొందుగ రిపులున్.

సీ. అవకాశమును గాంచి ♦ యందుఁ బ్రవేశించి యాతనిరాజ్యంబు♦నాక్రమింతు;
రేరాజు శత్రువు ♦ నెఱుఁగక దుర్మంత్రులను దొలఁగించి త♦న్నును సమాహి
తాత్ముఁడై కాపాడు♦నట్టిపద్ధతి మాని యుండునో యానృపుఁ ♦ డుదుతరంబు
లగుకష్టములఁ బొందు ♦ టంతమాత్రమె కాక స్వస్థానవిచ్యుతి♦నరగనొందు;
తే. నసురనాయక! యీవిష♦యమున మనకు
ననుజుఁడైన విభీషణుఁ ♦ డరసి యేమి
చెప్పెనో దానిఁ గావింపు ♦ చేకురు సిరి
యద్ది హితమాట న్యాయంబు ♦ నొటఁ బూన్కి. ౨౦౪ 2562

క. *నీమనమున నింకేమే, నేమాడ్కిం జేయుకాంక్ష ♦ యే మున్నయెడన్
నేమమునఁ జేయు మన విని, దామఁ గ్రుద్ధుఁడయి దితిజ♦శల్లుఁ డంతన్.

క. కనుబొమలు ముడివడంగా, ననియెను నోకుంభకర్ణ! ♦ యనుజన్ముఁడ వ
య్యును జక్కనియాచారం,బును నడపెడుపూజనీయు♦పోలిక నీవున్. ౨౨

క. గురువును మాన్యుండనునై, ధరణీశుఁడ నైన నన్నుఁ ♦ దగ శాసింపం
బరికించె దేల నీతికిఁ, దరుణము కడచనియెఁ గానఁ ♦ దగునుడువులకున్.

ఆ. వ్యర్థమైన శ్రమమొ♦యుపగతఫలమొ యా, నరసి చేయఁ దగిన♦యట్టి పనికిఁ
దగినపౌరుషంబు ♦ దప్పక చూపుమా, యవినయంబు నీతి ♦ యని భ్రమించి.

క. తెలియకయో చిత్తంబునఁ, దెలివియె కల్గమినొ బలము♦ తెంపును వీర్యం
బలవడె ననుపొగరుననో, తలఁపఁగ నెట్లయిన నేమి ♦ తగుకార్యంబున్. ౨౩౪

క. చేయక మానితి నింకం, జేయుం గాలంబు లేదు ♦ చేఁ దప్పిన య
ప్డీయనువునఁ బలికినచో, నేయర్థము గల్గు వ్యర్థ♦మే గద యనుజా!. ౨౮

క. ఇప్పటి కెయ్యది హితమో, తప్పక యద్దానిఁ జేయఁ ♦ దలఁపుము మఱి చేఁ

* యతిచ్చసి చ తక్కురు-అనిమూ.

దప్పినపనికై వగవ ర,దెప్పటికిని బుద్ధిమంతు ♦ లెల్లజగములన్. ౨౫ 2569

తే. చనినకార్యంబు చనినదే; ♦ మనమునందు
నీకు నాయందు నెయ్యంబు ♦ నెగడునేని
విక్రమము నీది నీకును ♦ విదితమేని
యని యిపుడు చేయఁదగు నను ♦ నాశయంబు. ౨౫౹ 2570

*క. నాకుం బోలెను సహజా!, నీకుం దోఁచునదియేని ♦ నీశౌర్యముచే
లోకమున నాయనీతిం, జేకూరిన యీయఘంబుఁ ♦ జేయుము సరిగన్. ౨౬౹

క. అనిపలికి యిట్టితరుణం,బున సాయము చేయకున్నఁ ♦ బోవును నెయ్యం
బని చెప్పఁ దలఁచి యిట్లని,యెను దాఁ బూనుపని యెట్టి ♦ దేనై యున్నన్.

క. దాని కపాయము గల్గుట, మానసమునఁ దోఁప దీను♦మాడ్కి వగచునా
దీనుని దగ్గఱఁ జేరుచు, దా నెవఁ డిల సాయపడునో ♦ తగు మిత్త్రుఁ డనన్.

క. నీతిం బాసి తడంబడు, నాతఱి, నాతని కెవఁడు స♦హాయము చేయుం
బ్రీతిగలయతఁడె బంధువు, భూతలమున ననియె నిట్లు ♦ పోలిచిన కినుకన్.

[1]క. ధీరంబును నత్యంతము, దారుణమును నైనయట్లు ♦ తనుఁబలికెడు దే
వారిప్రభుఁ గని క్రోధా, పూరితుఁ డితఁ డయ్యెననుచు ♦ బుద్ధినెఱుఁగుచున్.

ఆ. కుంభకర్ణుఁ డనియెఁ ♦ గోమలవచనము
లలర; నన్న క్షుభిత♦ములగు నింద్రి
యంబు లొప్పఁ గుపితుఁ♦డై యుంటఁ దాఁ గాంచి
యూఱడించుచు నిటు ♦ లొప్పమీఱ. ౨౯౹ 2576

క. దనుజేంద్రా! సంతాపం,బును నిటు పొందు టిఁకఁ జాలుఁ ♦ బోలుపగు క్రోధం
బును బాసి స్వస్థుఁడవుగాఁ, దనరుము; రాక్షససమూహ♦ధాత్రీనాథా!. ౩౦౹

[2]తే. ఏను జీవించియుండ నీ ♦ వీవిచార
మును మనంబునఁ బూనకు ♦ మనఘ! నాకు
నితఁడు సాయ మొనర్పఁడే ♦ యేలయనుచుఁ
బరితపించుచున్నావో యె♦వ్వరిని గూర్చి. ౩౧ 2578

[3]క. ఆతఁడు నశించునని నీ, వీతఱిని దలంపు; మట్టు♦లేమైన నిటన్
భీతిల కిటు పల్కితివే,లా? తెల్పు మటందువో యి♦లాతలనాథా!. ౩౧౹

ఆ. బంధుభావమునను ♦ భ్రాతృవాత్సల్యము, వలన రోమహర్ష♦ములను దేని

* మమాపనయజం దోషం విక్రమేణ సమీకురు-అనిమూ 1 త మర్తైనం బ్రువాణం తు వచనం ధీరదారుణమ్-అనిమూ. 2 త మహం నాశయిష్యామి యత్కృతే పరితప్యసే-అనిమూ. 3 అతఁ డనఁగా రాముఁడని సామాన్యార్థము. ఎవరికొఱకు ననఁగా ఏనాకొఱకుఁదపించుచున్నావో సాయము చేయలేదని యట్టి నేను నశింతునని విశేషార్థము. ఇం దిలాతలనాథా యనుట అసమంజసమని తలంపరాదు. మూలమున "పార్థివ" అనియున్నది.

నాశ్రయించియున్న ♦ నరసి నీకేను హితంబుఁ జెప్పవలయుఁ ♦ దగినరీతి.

[1]సీ. కరము స్నేహంబునఁ ♦ గ్రాలుబంధువునకు నిట్టికాలంబున ♦ నేది చేయఁ
దగునో యాశత్రుక ♦ దనమునే నీవింకఁ గనవయ్య! రోదీర్ఘ ♦ కరవిలాస!
[2]సమరాగ్రమునను ల ♦ క్ష్మణసహితంబుగా రాముని జంప న ♦ రణ్యచరుల
బలములన్నియు వేగ ♦ పరుగెత్తనుఁగూడిగను; [3]మహాబాహూ! నృ ♦ కాంతునకును

తే. నాకు సంగర మగునప్డు ♦ వీకమెఱయఁ
గా మదానీతశిరమును ♦ గాంచి నీవు
సుఖము నొందుము భూదేవి ♦ సుతయు మదిని
దుఃఖితయగును గాక యా ♦ ర్తుల మునుఁగుచు. ౩౫౪ 2581

[4]క. అని హతబాంధవులగు నీ, దనుజులు మనములకు సమ్మ ♦ దముఁ గూర్చెదు నా
మనుజేంద్రనిధనమును జక్క నిరీతిం జూత్రుగాక ♦ క్రవ్యాదవరా!. ౩౬౪ 2582

[5]క. అనిమొన శత్రువినాశన, మున బంధులు తెగినమూల ♦ మున దుఃఖితులౌ
దనుజుల నేత్రాంబువులను, దనుజేశా! తుడిచి సుఖము ♦ తనర నొనరుతుఁగ.

---

1 సదృశం యత్తు కాలేఽస్మిన్ కర్తుం స్నిగ్ధేన బంధునా, శత్రూణాం కదనం పశ్య క్రియమాణం మయారణే-అనిమూ. ప్రాతీతికార్థము స్పష్టము. శత్రుకర్తృకం కదన మిత్యర్థాంతరమ్-అని వ్యాఖ్య. శత్రువగు రాముఁడు చేయుయుద్ధమును జూడుమని విశేషార్థము. 2 అద్య పశ్య మహాబాహో! మయా సమరమూర్ధని, హతే రామే సహభ్రాత్రా ద్రవంతీం హతవాహినీమ్-అనిమూ. తమ్మునితో రాముని జంపఁబోఁగా నాపైకి రామునికి సాయముచేయఁ బరుగెత్తుకపులఁ జూడుము. అనఁగా రాముఁడు చావఁడు. లక్ష్మణుఁడును జావఁడు. నేనుయుద్ధమునకుఁ బోఁగాఁ గపిబలంబులు నాపై కడరునని యర్థాంతరము. 3 అద్య రామస్య తద్దృష్ట్వా మయా నీతం రణాచ్ఛిరః, సుఖీభవ మహాబాహో! సీతా భవతు దుఃఖితా-అనిమూ రావణా! నాఁడను శ్రీరామునకు యుద్ధముసాగుచుండఁగా మదానీతశిరమును నాచిమ్మఁబడిన శిరస్సును జూడుము సుఖమునొందుము నాశిరసుఁజూచి సుఖమునొందుము అనఁగా నేను యుద్ధమునకుఁ బోలేదే యని నాపై నీకు నిపుడుగల్గినకోప మపుడు చల్లారునని భావము. సీతాభవతు దుఃఖితా, సర్వలోకమాతృత్వా దితిభావః-అనివ్యాఖ్య. భూదేవిసుతయగు నాసీతామహాదేవి సర్వలోకజననిగాన నేనును బుత్త్రుఁడనేగాన నాచావునకుఁ జాలదుఃఖించు నని దీనివిశేషార్థము 4 అద్య రామస్య పశ్యంతు నిధనం సుమహత్ప్రియం, లంకాయాం రాక్షసా స్సర్వే యేతే నిహతబాంధవాః-అనిమూ. ఆమనుజేంద్రనిధనమును, ఆరామకర్తృకమగు నామరణమునని యర్థము. తమబంధువులు మనకొఱకై చచ్చిరే యనిదుఃఖించు రాక్షసులు నేను రామునిచే మృతి నొందింపఁబడఁగా ఆదుఃఖమునువీడి అందఱు చచ్చుచున్నారుగదా ఇఁకేటి దుఃఖమని సంతసింతురుగాక యని విశేషార్థము. 5 అద్య శోకపరీతానాం స్వబంధువధకారణాత్, శత్రోర్యుధి వినాశేన కరో మ్యస్రప్రమార్జనమ్-అనిమూ. ఇందుఁగూడఁ బైయట్లే. శత్రుకృతమగు నాచావుచేత బంధువులు నశించినందునఁ గల్గిన రాక్షసుల దుఃఖాంబువులను దుడిచెదనని గ్రహింపవలయు.

క. కనుమిప్డె; పర్వతాయత, తనువునఁ దగు వనచరేశుఁ ♦ దపనాత్మజు ర
క్తనిషిక్తగాత్రు రవికాంతిని గూడిన యంబుదంబు ♦ తెఱఁగున ననిలోన్.

క. పడియుండఁ జూడఁగలవో, *కడిఁది బలాఢ్యా! వధింపఁ ♦ గా వేడుకనె
ప్పుడు గోరుచుండు దనుజులు, తడయక నేనున్ మహోద్భు♦తంబగు కడిమిన్.

తే. కాచుచుండఁగ నారఘు♦కాంతుఁ డెట్లు
నిను వధింపఁగలండు; నా♦మనమునందు
నాత్మహానికి సంతాప ♦ మంద నేను
మృతిని బొందినపిమ్మట ♦ క్షితివరుండు. ౮౦ 2586

క. నినుఁ జంపఁగలఁడు, ముందుగ, నని సేయంగలఁడె? రాక్ష♦సాధిప! నీవో
యనుపమవిక్రముఁడవు సు,మ్ము నితాంతము పరులఁజంపు♦భుజబలుఁడవునూ!.

చ. దురమొనరింపఁగా నిపుడె ♦ తోరపు వేడుకమై ననుజ్ఞ నా
కరసి యొసంగు నన్విడిచి ♦ యన్యునిఁ బంపఁగనేల? యుండునే
పరుఁడొకఁ డర్హుఁడిందు; బల♦వద్వర! నీపగవారినెల్ల సం
గరమునఁ జంపివైచెదను; ♦ గాలశచీపతిహవ్యవాహనుల్. ౮౨ 2588

క. మరు,దర్ప,వరుణులునుం, గరము విరోధంబు బూని ♦ కడఁగి యొకటిగా
దురమొనరింపన్ వచ్చిన, సురవైరీ! యని నొనర్తు ♦ శూరత మీఱన్. ౮౩

చ ధరణిధరాంగ మొప్పఁగను ♦ దారుణదంష్ట్రలఁగూడి తీక్ష్ణమై
పరఁగెడు శూల మూని యని ♦ బాహుబలంబున నేను సింహభీ
కరరవ మొప్ప మార్కొనఁగఁ ♦ గాంచి పురందరుఁడైన భీతిలున్;
దురమున శస్త్రముల్ వదలి ♦ తోరపుబాహుబలంబు పొంగఁగన్. ౮౪

క. అరులం బ్రహరింపఁగ నీ,ధరఁ బ్రదుకం గోరువాఁడు ♦ తానెవ్వం డా
తురపడక నిల్వఁగలఁడే?, సురవైరీ! నాదుమ్రోల ♦ శుంభచ్ఛౌర్యా!. ౮౫

ఆ. శక్తి, గదలు, తీవ్ర♦శరములు ఖడ్గంబు
నేది లేకయున్న ♦ నేచి వజ్రి
నైన హస్తములనె ♦ యడరిపట్టి వధింతు
నేఁడు సంగరమున ♦ నీడఁ బోక. ౮౬ 2592

క. నరవరుఁడు నాదుముష్టిం, బరఁగెడునుద్ధతికి నోర్చి ♦ బవరంబున భీ
కరశౌర్య మూని నిల్చినఁ, దరువాతఁ దదీయబాణ♦తతు లురవడిచేన్ ౮౭

క. మేనియసృక్పూరమ్మును, బూనికఁ ద్రావంగఁగలవు ♦ హో నేనుండం
గానేల? నీవుచింతం, బూనంగా నిట్లు దితిజ♦పుంగవ! చెపుమా?. ౮౮ 2594

---

* ఈపద్యము దీనితరువాతిపద్యముల కిట్లే విశేషార్థము గ్రహింపఁదగు. నేను గాపాడుచుండురాక్షసులు బ్రదికియుండుదాఁక నిన్ను రాముఁడు చంపలేఁడు. మేము చావఁగానే నిన్నుఁ జంపునని భావము.

[1]సీ. ఇదె నేను ద్వదరిస♦ముదయముఁ జంపంగఁ బోవనున్నాఁడ! నో♦భూపతిలక!
వదలుము శ్రీరాము♦భయమును లక్ష్మణసహితుఁడౌ రాముని ♦ సాంద్రబలుని
సుగ్రీవు, లంకను ♦ శూరతఁ గాల్చిన దనుజనిహంత నా♦హనుమ నితర
కపులను భూరిసం♦గరమున నిల్చినవారి వధింతు నే ♦ బాహుబలము
[2]తే. కలిమి నను మాట మదినమ్మఁ ♦ గలవె నీకు
ధర నసాధారణము మహా♦త్రము నైన
యశము వర్ధిలఁ జేసెద ♦ నట్టివాంఛ
గలదు ఫలియింపకుండు నే ♦ తలఁపనద్ది. ౨౦౪ 2595
క. శతముఖువలనఁ భయమే,గతిఁ గల్గిన బ్రహ్మవలనఁ ♦ గాని గలిగినఁ
మతివిభవంబునఁ జెండెద;, జతనంబున నేను క్రోధ♦సహితుఁడ నైనఁ. ౨౧
క. సురవరులును సాధ్వసమున, ధరణిం బడిపోవుదురు ని♦తాంతభయదుఁడై
పరఁగుయముఁ జంపి వైశ్వా,నరుమ్రింగెదఁ ద్రుంచివైతు ♦ నక్షత్రములఁ.
క. ధరఁ బడవైచెద సూర్యుని, బురుహూతుని జంపువాఁడఁ ♦ బొలుచుసరిదధీ
శ్వరుఁ ద్రాగువాఁడఁ గొండల,నురుబలమునఁబిండిగాఁగ♦నొగినొనరుతుఁ జూ!.
క. ఇలఁబ్రద్దలు గావించెద, నలుఁగడలఁ మ్రింగఁబడుచు ♦ నానాభూతం
బులు దీర్ఘకాలసుప్తిఁ, విలసిల్లెడు కుంభకర్ణు ♦ విక్రమ మిపుడే. ౨౩ 2599
ఆ. కనునుగాక, ముజ్జ♦గంబులు నాకు నా
హారమునకుఁ జాల ♦ వన నని యిఁక
నెట్లుచేయు? [3]నేను ♦ నిదెపోయి త్వద్ధేతు
కవధమునను ముదము♦గలుగఁ గూర్తు. ౨౨ 2600
క. అనవరతసుఖము నీకా, జనపతివలనఁ జెలంగఁ ♦ జక్కఁగఁ జనువాఁ
డను; రామచంద్రలక్ష్మణు,లను జంపి యరణ్యవాసు♦లను నొక్కటిగఁ. ౨౨౪
తే. పట్టి భక్షించువాఁడ; నీ♦వెట్టులైన
నిచ్చకొలఁదిని గ్రీడింపు ♦ హితము శ్రేష్ఠ

---

1 ముంచ రామా ద్భయం రాజఁ హనిష్యా మీహా సంయుగే, రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవంచ మహాబలమ్-అనియూ. పోవనున్నాఁడనో భూపతిలక! వదలుము=అనఁగా నేను నీశత్రువులను జంపఁ బోవనున్నాఁడను. కాన నామాట వదలుకొమ్ము నేను జీవింపననుట. శ్రీరామునుండి రానున్న భయమును వదలుము. అనఁగాఁ జావక తప్పదుగాన భయంపడి లాభములేదనుట. రామలక్ష్మణసుగ్రీవాదులు యుద్ధమున నిల్చిన వారివధింతునే? చంపుదునా? చంపలేననుట. 2 అసాధారణ మిచ్ఛామి తె పదాతుం మహద్యశః-అనిమూలము. యశము వర్ధిల్లఁజేసెద-అని తెలుఁగు వర్ధిల్లఁజేసెద ననఁగా నీకీర్తిని నశింపఁజేసెదనని యంతరార్థము వర్ధన మనఁగా ఛేదించుట యను నర్థముగలదు. 3 వధేన తే దాశరథే స్సుఖావ్హం సుఖం సమాహర్తు మహం వ్రజామి-అనియూ విశేషార్థము. త్వద్ధేతుకవధమును=నీవే హేతువుగాఁ గలచావు అనఁగా నీచావుచేత రామున కానందమును గూర్తునని భావము గ్రహింపఁదగు.

మునగు మద్యముఁ ద్రాగుము ♦ మనమునందుఁ
దాపమును బూనకుండు మో♦దనుజవర్య!. ౬౪ 2602

*క. చిరకాలవశంగత్రైయై, పరఁగుమహీజాతఁగూడి ♦ భాసిలురాముం
డ్త్వరపడి యమునినికేతన,పరునిం గావింప సీత ♦ పరమసుఖదయౌ. ౬౫ 2603

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౬౪ - వ సర్గము.

మహోదరుఁడు కుంభకర్ణుని బదలుట.

క. పెనుకాయము భూరిబలం,బును దీర్ఘభుజంబులునా
య నెఱి విభాసిలు రావణు,ననుజుం డిటు

క. మనమున మోదం బందక, దనుజుండు మ
విను కుంభకర్ణ! సత్కుల,మునఁ బుట్టిన నీకు

తే. దిట్టతనమున వెలసియు♦న్నట్టి నీవు
శాస్త్రవేత్తవు గావు ని♦సర్గగర్వ
యుక్తుఁడవు కానఁ జేయంగ ♦ నొప్పుకార్య
ముల నెఱుంగవు సుంతయు ♦ నల్పబుద్ధి. ౩ 2606

సీ. దనుజేశ్వరుఁడు నయం♦బును ననయంబును శౌర్యగర్వంబున ♦ స్వాంతమందు
ముందుఁ గల్గెడు దోష♦మును బరికింపకేయున్నవాఁ డంటి వో♦యన్న! రావ
ణున కవ్వి తెలియు నీ♦వనఁ బిల్లఁదనమునగర్వించి యిటుపల్కఁ♦గాఁదలఁచెదు
గాని నయజ్ఞత ♦ గాదు; రాక్షసపతి తా వివిక్తాదిమం♦త్రముల కెల్లఁ

తే. దగిన దేశంబు కాలంబు ♦ దగని దేశ
కాలముల వేఱువేఱఁ జ♦క్కఁగ నెఱుంగు
వాఁడు తనకును రిపులకు ♦ పరునవృద్ధి
క్షయము సమతను దెలియు ని♦క్కముగఁ జుమ్ము. ౪ 2607

ఆ. కనుక రాజు దేశ♦కాలవిభాగాదు,లను నెఱుంగఁ డనుట ♦ యనువుగాద;
దాక్క విక్రమమునె ♦ నిక్కువంబుగఁ బూని,యల్పబుద్ధి మిగుల♦నాశ్రయించి.

* మయాద్యరామే గమితే యమక్షయం చిరాయ సీతా వశగా భవిష్యతి-అనిమూ. రాముని సీతయొడఁబాయునది కాదు. అట్టి రాముని నేను యమునిగృహమునకు విరోధిని గావింపఁగా సీత నీకు ముక్తిదాయిని యౌఁగాక అని విశేషార్థము పద్యతృతీయపాదమున 'త్వరపడి యమునినికేతన పరునింగావింపక్-త్వరపడియు=త్వరపడియే, మునినికేతనపరునింగానింపక్=మహర్షులయందే యాసక్తునిగా శత్రువధ మొనరించి మహర్షులతో నిష్టాగోష్ఠిప్రసంగముల నాసక్తునిగాఁ జేయఁగా నని చమత్కృతిని గ్రహింపవలయు. ఇట్లైనను పైవిశేషార్థమునకు బాధలేదు.

క. తనకంటెఁ బూజ్యులగు సజ్జనులను సేవింపనట్టి ♦ జాల్మునకు నొన
ర్పనురానికృత్యమును జక్కనిదని పండితుఁ డెవండు ♦ కావించునిలన్. ౫

సీ. మఱియు ధర్మార్థకా♦మములకు నొక్కొక్కదానికి వేఱ్వేఱఁ ♦ దగుఫలంబు
లుఁ నియతములు గల♦వనియు ధర్మాధర్మములకు సత్ఫలదుష్ట♦ఫలములు నియ
తములౌటచేత సీ♦తను జెఱఁగొన్న యధర్మమునకు నిట్టి ♦ దారుణఫల
మబ్బెనంచు వచించి ♦ తట్టి ధర్మార్థకామములకు వేఱ్వేఱ ♦ నమరుఫలము
తే. లను నెఱుంగఁ బ్రమాణమెం♦దునను గలదె?
...మరపదనారకస్వరూ♦పములయి తగు
...ంకును గర్మ♦నికరమె ధర
... ♦సమ్మతంబు. ౬ 2610

...డును మంచిఫలము ♦ గావున సత్క
నసత్కర్మముల కశుభ ♦ మొగి ఫలమనుచున్.
...ం బిద్ది; ధర్మార్థములు నధర్మ ♦ మ ట్లనర్థ
... శ్రేయసు నె కలిగించు నైన నిందు ♦ నెంచిచూడ.

క. ... ఫలము లధర్మానర్థములకుఁ ♦ బుడమి నొకపు డి
ష్టు... సత్ఫలదుష్ఫలములును గలవు ♦ పరికింపంగన్. ౮ 2613

సీ. అంతియ...ని యా♦వంతయు సత్ఫలమే కల్గ దనుమాట ♦ యిది యసంగ
తి; మది యట్లుండనీ ♦ తలపోయ నిహపరంబుల కుపయోగించు ♦ లలితవిహిత
కర్మములను జేసి ♦ కర్మాభిగతఫలంబులఁ బొందుచున్నారు ♦ పురుషు లిలను
విహితకర్మంబుల ♦ విధియుక్తముగఁ జేయ కిచ్ఛమైఁ గర్మము ♦ లెలమిఁ జేయు
తే. వారుగూడ శుభంబులై ♦ వఱలు కర్మ
ఫలములను బొందుచున్నారు ♦ తలఁప దీన
హితనిషిద్ధకర్మంబు లీ♦వితమను నియ
మము గనంబడ దెందుఁ గా♦మమున కల్లి. ౯ 2614

క. ఈమతమును బట్టియె మన, భూమీశుఁడు కామభజన♦మును జేయుచు ను
ద్దామసుఖ మొందఁ దగునని, భూమిసుతన్ బల్మిఁ దెచ్చె ♦ బుద్ధిఁ దలఁచియే.

చ. కనుకనె మేముచేయఁదగు ♦ కార్య మిదం చొగి నొప్పుకొంటి, మీ
దనుజనికాయనాయకుఁడు ♦ దస్యులయందు మదిం దలంపకే
పని నొనరించె సాహసముఁ ♦ బట్టియె దానివచింపు; మున్న చే
సినపని యొగ్గుఁగాదె యని ♦ చెప్పుటలెల్ల నటుంచ నిమ్మిఁకన్. ౧౦ 2616

క. అని ససహాయుఁడనై నేఁ, జనియెద నాకున్న భూరి♦సాహసమును గ
న్గొనుమంచుఁ జెప్పితివె, యందునుగూడ నసంగతంబు ♦ తోఁచె వచింతున్.

క. మును పెవఁడు జనస్థానంబున నతిబలులైన దనుజ♦ముఖ్యులఁ జెక్కం

్రను జంపె నట్టి యూరా, ముని నెట్లు జయింపఁగలవు? ♦ వూని కొఁడవే.

క. కనుక నయుక్తము నీనుడి; ముును పారాఘవునిచేత ♦ భుజబలతేజో
ఘనులందు జనస్థానం, బున నేయే దనుజవరులు ♦ వూని మెఱయఁగన్.

క. పొలియింపఁ బడిరొ వారల, కులజనితులు రాముఁ డన్నఁ ♦ గొంకుచు భీతిం
గలగుండువడుటఁ గన్గొన, గల విప్పురి నిప్పటికిని ♦ గ్రవ్యాదవరా!. ౧౩

తే. కాన నీమాట యహితంబ ♦ కాదె; దశర
థాత్మజని క్రోధమూను పం♦చాస్య మనుచు
నరయకే నిద్రవోవు మ♦హాహి లేపు
కరణిఁ బురికొల్పఁగోరెదు ♦ కదనమునకు. ౧౪

క. అనిశము తేజంబునఁ దగి, మనమునఁ గ్రుధఁ బూను తేఁ
ర్వను రాక మృత్యు వట్టులు, చెనకం గారాని రాముఁ

చ. అరియగు రాము కట్టెదుట ♦ నాహవభూమిని నిల్వ నిష్ట
సురరిపు లస్మదీయులు వి♦శుద్ధమనస్కులె యయ్యు సంశ
తురులగుచున్నవారు గనఁ ♦ దోఁపదు దానికి మాఱు గీ
తరుణమునందు నొక్కఁడవె ♦ దాశరథిన్ వడిమీఱ మ

క. చనుటకు నేమాత్రము నా, మన మొప్పదు హీనఁ కుఁ
ఘనమగుబలమునఁ దగునరి, నని మార్కొని చత్తునెడు♦నాశ౦

తే. కలిగి యుండియుఁ బగవాని ♦ నలఁతిగాఁగఁ
దలఁచి యెవ్వఁడు తలపడి ♦ గెలువఁగోరుఁ?
గనుకఁ జావంగఁ గోరినఁ ♦ జనుము; దనుజ
వర్య! మనుజులలోన నె♦వ్వండుగాని. ౧౭ 2625

క. తనకీడుఁగఁ గానక యా, వనజనఖశిఖనమత♦వర్ధిల్లిన రా
మునితో యుద్ధమొనర్చెద, నని పల్కెదు? నేయుటెట్టు ♦ లప్పని నింకన్.

చ. అని యిటు కుంభకర్ణునకు ♦ నాదృతిఁ జెప్పి మహోదరుండు వే
దనుజవరాంతరంబున ని♦తాంతము లోకభయంకరాకృతిం
గనఁబడు రావణాసురునిఁ ♦ గాంచి వచించెను; సీతఁ బొందియున్
మనమున నూహలొప్పఁ బలు♦మాఱు వచించెదవేల? యిట్లుగన్. ౧౯

క. ఏతరుణంబునఁ గోరుదు, వాతఱి వశ్యయగు సీత; ♦ యసురేశ్వర! యా
సీతయె నీయొద్దకుఁ దా, నేతెంచుట కొకయుపాయ ♦ మేఁ గనుఁగొంటిన్.

క. *అది నీకుం బ్రియమే నీ, మదితో వినవయ్య దాని ♦ మఱియొక్కరి నె
మ్మది నాశ్రయింపకుము; నీ, వది యేమని యడుగు దేని; ♦ యద్దివచింతున్.

* రుచిరశ్చే త్స్వయా బుద్ధ్య-అనియూ.

తే. నే, ద్విజిహ్వుఁడు, సంహ్రాది ♦ నీదుతమ్ముఁ
డైన యాకుంభకర్ణుండు ♦ నట్టి యీవి
తర్దనుఁడు నేవురము మేము ♦ దాశరథిని
జంపఁ బోఁదగునని పురిఁ ♦ జాటఁ బంపు. ౨౨ 2630

క. చని యందు శ్రమంపడి రా,మునితోఁ బోరెదము వైరి♦ముఖ్యుఁడు సీతా
జనపతి; యాతనితమ్ముఁడు, గనుకనె మే మానృపతియు♦గంబును ననిలోన్.

తే. ఓడఁ గొట్టుదుమేని వే♦ఱొండు మన కు
పాయ మక్కర లేదు ని♦బ్బరము మీఱ
గిన మనశత్రు♦వపగతాప
పు తలఁచిన ♦ చందమెల్ల. ౨౩ 2632

మా రా,మునిఁ జంపకయున్న నతఁడు ♦ మొనసి స్వబాణా
ప్రయ్యం, గను నెత్తుటఁ దోఁగి జనకు♦కన్నియ నమ్మన్.
బులో ♦ భీమసాయ
నిటకు వ♦త్తుము; రణంబు
చి యా♦యుర్వినాథ
ల్లక్ష ♦లను దగంగ. ౨౫ 2634

ంచితి మనుచున్, దనుజేంద్రా! తావకాంఘ్రి♦తామరసయుగం
నకున్ మ్రొక్కెదు మప్పుడు, పనివడి మాకోర్కెఁదీర్పు♦పరమముదమునన్.

చ. దనుజవరేణ్య నొక్కనిమ♦దంబునఁ గ్రాలెదు నేన్గుమీఁదఁ జ
య్యనఁ దమి నెక్కఁజేసి హతుఁ ♦ డయ్యె బలావళితోడఁ దమ్ముతో
జనపతి రాఘవుండనుచుఁ ♦ జాటఁగఁ బంపుము పట్టణంబునం
దు; నరనిషూదనా! యటులఁ ♦ దోరపు మోదము నీవు పూనుచున్. ౨౮

సీ. దానికి నిప్పుడు ♦ తార్కాణముగ భృత్యజనులకు భోగ్యవ♦స్తునికరంబు
దాసదాసీజన♦తతుల నింకనుగల కామితంబుల నెల్లఁ ♦ గనకచయము
నిప్పింపు; మట్లె నీ ♦ వీవీరభటులకు మంచివస్త్రమ్ముల ♦ మాల్యములను
ననులేపనంబుల ♦ నమలపేయపదార్థములను నిప్పింపు; నీ♦వెలమి మిగులఁ

తే. ద్రాగుమా! మద్యమును; మన♦దనుజులెల్ల
రాము నాతనిసుహృదుల ♦ రణమునందుఁ
దినిరి నాఁదగు కింవదం♦తి యిది యట్టె
పురమునన్ నిండి ప్రఖ్యాతిఁ ♦ బొందినతఱి. ౩౦ 2637

చ. జనకజయున్నతావునకుఁ ♦ జయ్యన నీవును బోయి రాఘవుం
డనిఁ దెగె నంచు దుఃఖపడు ♦ నామెమనోవ్యథఁ దీర్చి నన్ను భ

ర్తనుగను నేలుకొమ్మనుచుఁ ♦ దద్దయు నింపుగ నొంటిపాటునన్
మనమున కింపుగల్గునటు ♦ మాటలు పల్కి *ధనంబు ధాన్యమున్. ౩౦౪ 2638

తే. ఆమె కోరిన రత్నాది♦కాఖిలఘన
వస్తువులనిచ్చి లోభంబుఁ ♦ బడయునట్లు
సేయుమా దానవేంద్ర! యా♦సీత కిట్టి
మోసమున దుఃఖసాధ్వస♦ములు గలుగుట. ౩౧౪ 2639

చ. మును నినుఁగోరకుండియుఁ బ్ర♦మోదము గూర్చెడు భర్తలేమి నీ
కును వశురాలగున్; మదికిఁ ♦ గూర్చెడుభర్త మృతింగనంగ వా
ర్తను విని దానియాశల ని♦తాంతము మాని స్వభావసిద్ధమౌ
వనితలచాపలంబున న♦వశ్యము నీవశమౌను రావణా!. ౩౩ 2640

[1]సీ. సుఖములకే తగి ♦ సుఖముగాఁ బెరిగిన దామెయాటను వగ♦నంది కుంది
యిఁకఁదానుసుఖముందు♦ నెల్లనీవలననేయని యెఱుంగుచు నిన్నె♦యాశ్రయించు
నెల్లరీతుల నేను నీయుపాయము బుద్ధిబలముననే యెంచి ♦ భవ్యమనుచు
నిర్ణయించితి నిఁక ♦ నీవు రాముని దృష్టిపథమునఁ బడిన దు♦ష్ఫలమె కలుగు
నీయుపాయంబున ♦ నిండె నీకోర్కియు సమకూరఁగలదు యు♦ద్ధము నొనర్చు

తే. వాంఛపదలుము నీవుబ♦వరము మానఁ,గలుగుసుఖమే విశాలమై♦కానఁబడదు
భూపవర! యెవ్వఁడైనను ♦ భూవిభుండు,మామకోక్తి నొన[illegible]♦భూమియందు.

క. బలము నశింపక సంశయ,ములఁ బొందక సంగరంబుఁ ♦ బూనికఁ జెఱుం
దలఁపకయె శత్రువులన్, గెలుచునయే శాశ్వతమగు ♦ కీర్తిసుకృతముః .—

క. తను మఱిఁ గోరినవనితన్, గనుటవలని సంపదల ని♦కామమనోవాం
ఛను సంతోషంబును గను,ననుచు సుహోదరుఁడు చెప్పె ♦ ననునయమెసఁగన్.

అఱువదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - వ సర్గము.

కుంభకర్ణనియుద్ధము.

క. విని వానిఁ గుంభకర్ణుఁడు, దనుజా! యిఁకమీఁద నీవి♦ధంబునఁ బలుకన్
జనదంచు భీతి గలుగఁగ, ఘనభణితిం బలికె దనుజ♦కాంతుని సన్నన్. ౧ 2644

చ. కనుఁగొని యిట్లుపల్కె మును♦కాంచినదే గద నాదువిక్రమం;
బనితరసాధ్య మింక దురి♦తాత్ముకుఁడై తగు రాము నిప్పుడే
చని వధియించి నీకుఁగల ♦ [2]సాధ్వసమున్ భయదంబుఁ జెండెదన్
దనుజలలామ! నీవును వి♦దన్యుఁడవై సుఖముండుమా పురిన్. ౨ 2615

---

* ధనధాన్యైశ్చ కామైశ్చ రత్నైః-అనియు. 1 సా పురా సుఖసంవృద్ధా సుఖార్హా దుఃఖకర్శితా-అనియు. 2 సోஉహం తవ భయంఘోరమ్-అనియు

చ. జలరహితాభ్రసంచయము ♦ చందమున౯ మహి శూరులెల్ల దు
ర్బలులవిధంబున౯ దగని♦భంగిని బల్కరు కార్యభారముల్
గలుగకయున్న యుద్ధమునఁ ♦ గార్య మొనర్చి మదీయగర్జనం
బుల ఫలియింపఁ జేసెదను ♦ బోలఁ గనుంగొనవయ్య! రావణా!. ౩ 2646

చ. పరు లొగిఁ దమ్ముగూర్చి పలు♦భంగులఁ బల్కెడు హీనవాక్కుల౯
వరమతులైన శూరు లెద ♦ వానిసహింపరు తమ్ముఁ దామె య
క్కరణినినే నటించుకొనఁ♦గాఁ దలపోయరు పౌరుషంబునిం
కొరులకు మాటలం దెలుప ♦ నూహలు చేయరు దుష్కరంబుగాఁ
బరఁగెడు కార్యజాలముల ♦ బాగుగఁ జేయుదు రెంతొ లీలఁగ౯. ౪ 2647

సీ. వినుము మహోదరా! ♦ విక్లబులును బుద్ధిహీనులు మేమె యీ♦యిలను బండి
తుల మనుకొనుచు నీ♦వలె నున్నవారలపలుకులు విని నర♦పాలవర్యుఁ
డిట్టి [illegible]రావద నొందె♦నెప్పుడు రణమన్న భయపడుచు౯ బ్రియ♦వాదు లగుచు
రాజు వ్వె[illegible]డు కుమా♦ర్గముననే పోవుచునున్న మీరింతటి ♦ యుద్ధకార్య

తే. మును బొసం[illegible]గఁగ జేసితి ♦ రనయ మితని
మిత్రుఁడని చెప్ప[illegible]కొనుచు న♦మిత్రునిగనె
చూచుచుండుట [illegible] నిట్టి రా♦జునొగిఁ గొల్చి
యతఁడె మిగుల [illegible]౦గ బురి నొన♦ర్చితిరి సుండి!. ౫ 2648

[illegible] ధనబల [illegible]ములు నశియించె౯, గనుకనె మీవంటివారు ♦ గావించిన యిం
తనరాని దుర్నయము నిదె, యనిమొన సరిచేయఁ బరుల ♦ నందఱఁ గూల్చ౯.

క. మదిఁ దలఁచి యుద్ధభూమికి,నిదె పోవుచునున్నవాఁడ ♦ నేననుచు బలో
న్మదుఁడును మతిమంతుఁడునై, పొదలెడు కుంభశ్రవుండు♦పొంగుచుఁబలుకె౯.

క. విని రావణుండు నవ్వుచు, ననుజన్ముని కిట్టులనియె ♦ ననిలో నేర్పుం
గనినాఁడ వీవు నాయన!, మనమంత్రి మహోదరుండు ♦ క్ష్మాపతివలన౯. ౯

తే. భయము నొందినవాఁడని ♦ పలుక నింత
యైన సంశయమే లేదు ♦ గాన ననుజ!
నాకు నీవంటి సుహృదుండు ♦ ప్రాకటబలుఁ
డెవ్వఁడును లేఁడు వధియింప ♦ నేగు మరుల. ౧౦ 2652

క. అరివిజయంబును గొనుమా, యురుతరబలశాలి వగుట ♦ నూహించియె నా
కరివలనఁ గల్గు భయమును, బరిమార్పుమటంచు లేపఁ ♦ బంచితి నిన్ను౯. ౧౧

క. నను బాగు చేయఁజాలిన, దనుజులకు౯ సుహృదులకు ని♦తాంతసహాయం
బును జేయు కాలమిదె సూ, కనుకనె నీవిపుడు శూల♦కలితకరుఁడవై. ౧౨ 2654

క. పాశము కరమునఁ దాల్చిన, యాశమనుని బోలి రిపుల ♦ కనిఁ గనఁబడి వే
యాశత్రువులను గపులను, దాశరథులఁ దినుము తీక్ష్ణ♦ధామనమరుచి౯. ౧౩

శా. నీరూపంబును జూచినంతఁ బ్లవగానీకంబు భీతిన్ వెసన్
బ్రారంభంబును మాని పాఱు ననిలో రాముండు తత్సోదరుం
డీరూపం బిటులొప్పునే యనుచు నెంతే భీతి భిన్నాత్ములై
చేరంజాలక యుండువారు చనుమా! శీఘ్రంబె నీవాజికిన్. ౧౪ 2656

*క. అని యిట్లు మహారాజగు, దనుజోత్తముఁ డాదృతిఁ దగ దారుణబలుఁడై
పెనుకాయమొప్పు తమ్ముని, కనూనవిధ మూని చెప్పి యాతఁడు రిపులన్.

క. తప్పక జయించునని తా, నప్పుడ మరలన్ జనించి నట్లు తలఁచె; ని
ట్లొప్పినతమ్మునిశౌర్యం, బుప్పొంగుబలంబు నెఱిఁగి యుండుటవలనన్. ౧౫

క. మనమున సంతుష్టుండ, య్యెను నిర్మలచంద్రురీతి నెసఁగెను; దనతో
దనుజేంద్రుఁడిట్లు పల్కిన, ఘనతరబలుఁడైన కుంభకర్ణుం డంతన్. ౧౬ 2659

క. అతిహర్షంబున ననిచే, యుతలం పొప్పంగఁ బోవ నుద్యుక్తుండై
మతిశాలిరావణుఁడు త, న్నతిముదమున సాగనంపు టరసి పయనమై. ౧౭

తే. పరనిబర్హణచణుయి భయదమునగు
శూలమును వేగఁదాల్చె; నా శూలవర్య
మినుముతోఁ జేయఁబడుచు నహీనదీప్తు
లలరఁగాఁ దప్తకనకాంచితాంగమగుచు. ౧౮ 2661

మ. పురుహూతాశనితుల్యమై భయదమై పొల్పొప్పఁగా వజ్రమే
కరణిన్ మించునొ యట్టిగౌరవముఁ జక్కం గాంచి యక్షాసురా
మరగంధర్వమహాహికిన్నరతతిన్ క్రందించి యత్యంత భీ
కరతేజంబున వెల్గి మాల్యములు రక్తచ్ఛాయచే మించఁగన్. ౧౯ 2662

క. నిరతంబు నగ్నికణములఁ, గురిపించుచుఁ దాని రుచి మిగులఁ దయుండెన్;
గురుతేజుఁ డసురతల్లజుఁ, డరిరక్తవిరాజితాంగ మయి తీక్ష్ణంబై. ౨౦ 2663

క. పరమమునగు శూలమ్మును, గరమున ధరియించి దనుజకాంతునిఁ గని యే
నరిగెద నొక్కఁడనే యి, ప్పురి నాబలముండుఁ గాక పోరికిఁ జనినన్. ౨౧

క. ననుఁ గని క్షోభంబందెను, వనచరులం గోపమడర భక్షించెద; నా
ననుజోక్తుల విని రావణుఁ, డను; ముద్గరశూలపాణులగు సేనలతోన్. ౨౨

చ. అరుగుము సంగరంబునకు నవ్వనవానులు బుద్ధివై భవ
స్ఫురణమునం జెలంగుదురు పొల్పగు వేగము సాంద్రనిశ్చయం
బరుదుగ వారికిం గలుగు; నందున నొంటిగనున్న నెట్టులె
త్తరుణమునం బ్రమాదమున దస్యుఁడు నిల్చిన వార లేవునన్. ౨౩ 2666

తే. దంతములఁ జీల్చి చంపుదు; రెంతొ పూన్కి
గాన వైరి దుర్ధర్షులౌ కర్బురభటు

* ఏవ ముక్త్వా మహారాజః...రాక్షస పుంగవః-అనిమూ.

లను దగం గూడిపొమ్ము నీ♦వును దనుజుల
శత్రుపక్షములం దున్న ♦ సకల కపుల. ౨౮ 2661

క. మనుజేంద్రతనయులను నే,పున( జంపుము; వే యటంచు( ♦ బొల్చెడు తేజం
బున నొప్పినరావణు( డా,సనంబునందుండి లేచి ♦ సంప్రీతిమెయిన్. ౨౯ 2662

తే. మణికృతాంతరమయియున్న ♦ మహితకనక
మాలికను గుంభకర్ణుని ♦ మై నలంక
రించె; మఱియు మహాత్ముండై ♦ మించుకుంభ
కర్ణునకు నంగుళీయక♦గణము వరము. ౨౯ 2369

సీ. అంగదంబుల నుత్త♦మాభరణంబుల నబ్జవిరోధి య♦ట్లలరుచున్న
రమ్యమౌక్తికపుహా♦రంబును వైచెను; జారుతరామోద♦సాంద్రములగు
వరపుష్పహారాళి ♦ పరున నొసంగెను కాంతి వెల్గెడు రత్న♦కమ్రకుండ
లముల నాతనిచెవు♦లకు( బెట్టి, నంతట( బెనుచెవుల నెసంగు ♦ దనుజనాథు

తే. ననుజు( డాకుంభకర్ణుండు ♦ కనకనిర్మి
తాంగదములం గేయూరాళి ♦ నములపతక
యుక్తమగు నాభరణతతి ♦ నొప్పి సుహుత
దహనుకరణి వెలింగె ని♦తాంతకాంతి. ౨౬ 2670

క. దనుజు(డు శ్రోణీసూత్రం,బున నీలమణుల్ చెలంగ ♦ మును పమృతము( గై
కొన వాసుకిం జుట్టిన యా, ఘనమందరపర్వతంబు ♦ కరణి వెలింగెన్. ౨౬

చ. అ శిఖప్రహారముల ♦ నందియు వానికి నోర్చి భారమై
క సంబునై చెడక ♦ గాఢతటిత్ప్రభ లొప్పునట్లుగా(
గనన్ యున్న మైమఱువు( ♦ గప్పుకొనంగ నతండు సాంధ్యమే
ఘనిచయసంవృతాద్రిగణ♦కాంతుని రీతిని బొల్చె నెంతయున్. ౩౦ 2672

తే. ఎల్లతావుల సొమ్ముల ♦ నెల్ల( దాల్చి
కరవిధృతశూలు(డగు కుంభ♦కర్ణు( డాత్రి
విక్రమములకు( బూనిన ♦ విష్ణుమూర్తి
వలెం బ్రకాశించె నిరుపమ♦భాగణముల. ౩౧ 2673

క. బలశాలి కుంభకర్ణుం, డలరుచు నన్నయగు రావ♦ణాసురు( బ్రీతిం
జెల(గుచు( గౌ(గిట నిడుకొని, వలగొని తల ధరణిసోక♦భక్తిన్ మ్రొక్కెన్.

ఆ. పయనమయ్యె నంత ♦ బలశాలియును మహా,కాయు( డలఘునినద♦కలితు(డై స
కుంభకర్ణు( డనిని ♦ గోరి ప్రయాణమా, తరుణమందు దనుజ♦తల్లజుండు.

క. అలరుచు నాశీర్వాదం, బులతో నాతనిని బంపె; ♦ భూరిభయదరూ
పులు రథికులు పెక్కురు ని,స్తుల భేరీశంఖముఖ్య♦తూర్యరవంబుల్. ౩౪ 2676

చ. ఉరుతరరీతిం బర్వ వివి♦ధోత్తమతీక్ష్ణమహాయుధాళితో(
బర(గుచు సైన్యయుక్తులయి ♦ భద్రగజాశ్వగణంబుతో( బయో

ధరరవతుల్యనిస్వనయు♦తంబగు స్యందనపంక్తితోడఁ బో
యిరి రథికోత్తముం డగుచు ♦ నేపునఁ బొల్చెడు కుంభకర్ణుతోన్. ౩౫ 2677

[1]సీ. కొందఱు రక్కసుల్ ♦ క్రూరసర్పంబుల ఖరవాజిమృగనాథ♦గజమృగముల
నొంటెలఁ బక్షుల ♦ నొక్కరీతిఁగ నెక్కి గురుబలక్రూరుఁడౌ ♦ కుంభకర్ణు
వెంటఁబోయి; [2]రసుర♦విబుధవిరోధియౌ కుంభకర్ణుఁడు పూల♦గురియఁ జేయు
చును బౌరులొప్పంగ ♦ ఘనమగుఛత్రంబుఁ దాలిచి తీక్ష్ణమౌ ♦ శూలము కర
తే. మందు ధరియించి మదమున ♦ నధికుఁడయ్యె
నల్లఁ ద్రావుటఁ దద్వాస♦నలను మఱియు
మత్తుఁడై పయనంబయ్యె; ♦ మత్తులగుచు
నధికబలులయి భయదమౌ ♦ లగుచుఁ గడఁక ౩౭ 2678

క. కరముల శస్త్రము లొప్పఁగ, సురభీతిని బుట్టఁజేయ ♦ నోపునయనముల్
కర మరుణచ్ఛాయం దగ, గురుకాయము లొప్ప మిగుల ♦ గుంపులుగాఁగన్.

క. నీలాంజనచయమువలెం, గ్రాలెడు కాల్బంట్లు తీక్ష్ణ♦ఖడ్గంబులనున్
శూలపరశ్వధముల సువి,శాలమహాపరిఘములను ♦ జంచద్గదలన్. ౩౯ 2680

ఆ. చెంతఁ జేరనీక ♦ త్రైపణీయములయి
యలసతాటిబోది♦యలను ముసల
ములను బూని యాప్ప♦లోలయ నాతని వెంటఁ
జనిరి; బాహుబలము ♦ ఘనముగఁ దగ. ౪౦ 2681

చ. తనదగుభూరితేజము వి♦తానకు జనింపఁగఁ జేయునట్లు పెం
పునఁ దగ రోమహర్షణముఁ ♦ బుట్టఁగఁ జేయు మఱొక్కరూపముం
గొని యతఁడేగె యుద్ధమున♦కున్; మఱి మట్భుతకార్ముకంబుగాఁ
గనఁబడు విస్తృతిం బరఁగి ♦ కాయము భీకరమై చెలంగఁగన్. ౪౧ 2682

తే. నూఱువింష్టంత వెడలుపు♦నుం జెలంగ, శకటచక్రాక్షుఁడై మహా♦త్మాధరంబు
వలెఁ గనంబడి నగ్ధప♦ర్వతమురీతి, నీలమై పెనుదేహము ♦ గ్రాలుచుండ. ౪౨

క. తనవెంటవచ్చు దితిజులఁ, గని చేరంబోయి వక్త్ర♦గహ్వరమును జ
య్యన విప్పి నవ్వి యిట్లని,యెను: మిడుతల నగ్ని తా ద♦హించెడురీతిన్.

క. హరిపగులయూధములఁ గ్రో,ధరతిన్ నేనిపుడె చంపఁ ♦ దలఁచితి నాకా
హరివీరులడవులం దే, చరించు హారొటఁ గీడు ♦ సల్పరు నాకున్. ౪౪

సీ. మఱియు నాకోఁతులు ♦ మావంటి క్రీడాపరులకుఁబురో ద్యాన♦ములను దిరుగు
చుండుట సొగసుగా ♦ నొప్పుచుండును; గాన వారిఁ జంపఁగనేల? ♦ [3]యేకైనఁ

1 సర్పైరుష్ట్రైః ఖరైరశ్వైః-అనిమూ. 2 వినిర్యయౌ దానవదేవశత్రుః - అనిమూ.
3 పురరోధస్య మూలంతు రాఘవస్సహలక్ష్మణః, హతే తస్మిన్ హతం సర్వం తం వధిష్యామి సంయు

గవరాని మనపుర♦మును ముట్టడించెడు పనికి మూలము రాముఁ♦డునుసుమిత్ర
తనయుండును గద యె♦వ్వనిచేత సర్వము హతమయ్యెనో వాని ♦ ననివధింతు

తే. నతఁడు సమసినమీఁదట ♦ నతనిదైన
సర్వమును హతమగు; నని ♦ సరగఁ గుంభ
కర్ణుఁ డివ్విధిఁ బల్కి రా♦క్షసులు కడలి
వడఁకఁ జేయువిధంబునఁ ♦ గడఁగి తమిని. ౮౭ 2686

క. ధ్వనిఁ జేసిరి బెడిదముగా;, దనుజవరుం డతఁడు సుమతి ♦ దర్పమ్మును గై
కొని యునికి నేగుచుండం, గను భయదాకృతుల శకున♦గణములు తోఁచెన్.

క జలదములు బిడుగులను నుల్కలనుం గడుఁగూడి యట్టె ♦ గార్దభమువలెన్
వెలసెడు [1]నరుణచ్ఛాయన్, గలిగి తగెన్ సాగరవన♦కలితవసుధయున్. ౮౯

తే. వడఁకె; నక్కలు చూడఁగ ♦ భయదరూప
ములను నోటను గడఁగి మం♦టల నుమియుచు
నార్చె; నపసవ్యగతిమండ♦లాకృతులను
దిరిగి కట్టెను బక్షుల ♦ ట్లరుగుచుండ ౯౦ 2689

క. మాలిక లటు గ్రద్దలు పై, వ్రాలెను; దత్సవ్యనయన♦బాహువు లదరెన్
గ్రాలెడు నుల్క జ్వలించుచుఁ, జాలధ్వనుల్ వరఁగ నాక♦సమునుండి పడెన్.

క. ఖరకరుఁడు కాంతిహీనత, నరుదుగఁ జూపట్టె, వాయు ♦ వప్డు సుఖముగాఁ
జరియింప దయ్యెఁ గర్బుర, వరుఁడంతటఁ గాలబలవి♦వర్ధితుఁ డగుటన్. ౯౧

తే. గగురు పుట్టించుచుం దోఁచి ♦ కఠినతరము
లైన యుత్పాతములఁ గాంచి ♦ యాత్మ లెక్క
సేయ కని కేగె; నంతట ♦ శిఖరిసన్ని
భాంగుఁ డోటఁ బ్రాకారంబు ♦ నంఘ్రులఁ దగ. ౯౩ 2692

క. గురుజవమున లంఘించుచు, నరుదుగఁ బెనుమేఘవితతి♦యట్లు గనఁగనౌ
హరిసైన్యముఁ గనియెన్; వన,చరు లప్పుడు పర్వతాభుఁ ♦ జంచలనయనుల్.

చ. దనుజుని నాతనిం గని వి♦తాకున వాయువిచాలితాభ్రము
ట్లనుగతభీతులై పఱచి ♦ రంత దిశాతతి; కభ్రతుల్యుఁడౌ
దనుజుఁడు కుంభకర్ణుఁడు ని♦తాంతభయంకరకీశసైన్య మొ
య్యన జలదంబు భిన్నమగు ♦ నట్లుగ దిక్కుల కేగుచుండఁగన్. ౯౫ 2694

చ. కనుఁగొని సంతసంబునఁ ద♦గన్ ఘనముష్టులు మాటిమాటికిన్
దనగళ మట్టి యొత్తి నిన♦దంబొనరించెను; మేఘగర్జితం

---

గే-అనిమూ. ఎవ్వనిచేత సర్వము హతమయ్యెనో, ఎవనిచేత నాసమస్తము హతమయ్యెనో వానింజం
పెద. ఏలనఁగా నతఁడు హతుఁడుకాఁగా నతనిసర్వస్వము హతమగుచున్నదని యిందలిభావము.
ఇదియే మహేశ్వరతీర్థులవారి భావము. 1 అరుణచ్ఛాయన్=అనఁగా స్పష్టముగాఁ గనఁబడని యె
ఱుపుఁదనముచేత నని యర్థము.

బనఁదగి భీతినిం గొలుపు నాతనియారవ మాలకించుచున్
వనచరు లొక్కకొందఱు నివారితులయ్యు నికృత్తమూలమై
ఘనరవ మొప్పఁ సాలతరుకాండమునాఁ బడి రుర్వరాస్థలిన్. ౪౭ 2695

క. ఘనబలుఁడు కుంభకర్ణుం, డనుపమగురు నొప్పపరిఘ మాత్మకరమునన్
గొని తీవ్రసాధ్వసంబును, వనచరులకుఁ గల్గఁజేసి భటులుం గొలువన్. ౪౮

ఆ. ప్రళయమందు నేమిఁ బనిచేయఁదగుఁ జెప్ప, మనుచు దండనామకాయుధంబు
తనరనున్న యమువిధంబునభయదాంగుఁ, డగుచు రిపులఁ జంపనరిగె నంత.

అఱువదియైదవ సర్గము సంపూర్ణము.

---

౬౬ - వ సర్గము.

కుంభకర్ణుఁడు కపులతోఁ బోరుట.

చ. అనుపమకాయుఁ డత్యధికమైన బలంబున విఱ్ఱవీగు నా
దనుజుఁడు పర్వతాభుఁడయి దారుణరీతిని సాలలంఘనం
బును నొనరించి లంక జవముఖ్ బొలుపారఁగ నిర్గమించి పో
యెను సమరంబు సేయ; నతఁ డెల్లసముద్రము లట్టె మ్రోఁగఁగన్. ౧ 2698

తే. అతను లట్టె పడంగ మహామహీధ్ర
ములును బగులంగఁ బృథునాదములు చెలంగ
సింహనాదము గావించెఁ జెలఁగి యాతఁ
డింద్రయమవరుణులకు జయింపఁ జంప. ౨ 2699

చ. అలవియెగాక భీకరమహాత్ములతో నటరాఁగఁ గాంచి కోఁ
తులు భయమొంది పాఱె; రిటు తొండఱ దిక్కుల కేగుకోఁతులన్
బలమున నొప్పుమీఱె కపివర్యుఁడునై తగువాలిపుత్త్రుఁ డి
మ్ములఁ గని యాగవాక్షు నలు భూరిబలున్ గుముదాఖ్యు నీలునిన్. ౩

తే. పిలిచి యిట్లని పలికె; నిస్తులపరాక్ర
మముఁ బ్రశస్తకులంబును మిము నెఱుఁగక
క్షుద్రకపులనుబోలి మీసొంపు దక్కి
యెందుఁ బోయెదరు భయంబు నిట్లుదాల్చి. ౪ 2701

సీ. ఓసౌమ్యులార! మీపద్ధతి మాని యిట్లరుగుట బాగుగా దనికి మరలుఁ
డిట్లు ప్రాణమ్ముల నెల్లఁ గాపాడుకో నెదరేల? సంగరనియతి కీతఁ
డైనవాఁడే కాఁడు వానరులకు భీతిఁ గల్గింపఁ బుట్టు నాకారముగను
గనఁబడుబొమ్మ యో కపులార మనకు నాదనుజులు భీతిఁగూర్పను బ్రయత్న
తే. మూని యెత్తిన నెఱబొమ్మ యౌను దీని
విక్రమంబునఁ బాడగువిధము సేయుఁ

దగుమునకుఁ గాన మరలుఁడి ♦ త్తఱి ననంగ;
వారలతికష్టమున సమా♦శ్వాసితులయి. ౯ 2702

క. ఒకచోటఁ జేరి యందఱు, ప్రకటద్రుమశైలములఁ గ♦రంబులఁ గొనివే
గ కదలి రనికిన్; గ్రోధం,బు కడున్ మెఱయంగఁ గపులు ♦ పూనికతోడన్.

చ. అని నొనరించుకాంక్ష మఱి ♦ యత్యధికంబగు రోషమూని యు
త్తినమద మొప్ప నాకరుల ♦ తీఱున నాతనిఁ గొట్టిరట్టి; యా
ఘనబలశాలి యగ్రములఁ ♦ గ్రాలెడుపూఁ జెలంగు చెట్లచే
తను బెనుఱాలనెత్తయిన ♦ ధాత్రిధరంబుల వారు గొట్టఁగన్. ౧౦ 2704

తే. ఇంచుకయు వాఁడునుం జలి♦యింప కుండె;
నతని తనువు పయింబడి ♦ నట్టిశిలలఁ
పుష్పితాగ్రవృక్షంబులు ♦ భూమిఁబడియె
శకలములుగాఁగఁ బగిలి యా♦శ్చర్యరీతి. ౧౧ 2705

చ. వనములఁ గాల్చు హవ్యవహ♦భంగి మదంబున మించి దానవుం
డని మొనఁ గ్రోధయుక్తుఁడయి ♦ యద్భుతతేజములం జెలంగు నా
వనచరవాహినిం గడఁక ♦ వర్ధిలఁ జూర్ణము చేయఁ బూనె; న
వ్వనచరవర్యులందుఁ గడు♦బాహుబలాఢ్యులు కొంద ఱత్తఱిన్. ౧౨ 2706

తే. అతనిచేఁ జిమ్మఁబడుచు దే♦హములనిండ
నల్లఁ గాఱంగ ధరఁబడి ♦ యెల్లయెడల
నరుణపుష్పద్రుమంబుల ♦ యట్లుపొల్చి;
రంతఁ గొందఱు కపులు భీ♦తాత్ములగుచు. ౧౩ 2707

క. వెనుకకు జూడకయే యొక, వనచరుపై నొకఁడు దాఁట్లు ♦ వైచుచు నిట్లా
య్యనఁ బాఱిరి; బలవంతుఁడు, దనుజుం డాతండు తమ్ముఁ ♦ దార్కొని చంపన్.

సీ. వనచరుల్ కొందఱు ♦ వార్ధిలో దుమికిరి గగనంబునకుఁ గొంద♦ఱెగసి రందుఁ
గొందఱు భీతిచేఁ ♦ గుందిసముద్రంబు మును తాము దాఁటి వ♦చ్చినపథంబుఁ
బట్టిపాఱిరి; మోము ♦ లట్టె దీనతనొంద మిట్టపల్లములను ♦ బట్టిపోయి
రొకకొంద ఱంతట♦నురుభీతి భల్లూకములు గొన్నిభూరుహం♦బులకుఁ బ్రాఁకెఁ

తే. గొండలను గూర్చి పరుగెత్తెఁ ♦ గొన్ని కడలి
మునిఁగె నొకకొన్ని గుహలఁ దాఁ♦గె నొకకొన్ని;
కపులు కొందఱు భీతిచే ♦ క్షమఁబడినటు
లుండఁ గొందఱు పాఱి రం♦దుండ లేక. ౧౪ 2709

క. [హరులొకకొందఱు నేలఁబ,డిరి కొందఱు స్వాంతములఁ గ♦డింది భయమ్మున్
బరఁగన్ మూర్ఛంగనుచున్, మరణమునొందినటులొక్క♦మాడ్కి గనుండన్.]

క. కనుఁగొని భంగము నొందిన,వనచరులకుఁ బలికె నిట్లు ♦ వలదు పరుగిడన్
వనచరులారా! నిలువుం, డని చేయుద మింక మరలుఁ♦డని యంగదుఁడున్,

ఆ. భంగమొంది యిట్లు ♦ పాఱి మహీస్థలిఁ, దిరిగి చూచినను మ♦దిం దలంప
మీకు నిలువనీడ ♦ నేకరణిని జిక్క, దనియె నాకుఁ దోఁచె♦డిని నిజంబు.

క. కనుక నిఁకఁ జాలు మరలుం, డనువునఁ బ్రాణముల నెట్టు♦లైనను గావం
గను దలఁతురు కాఁబోలును;, వనచరులారా! వినుండు ♦ బాగుగ నింకన్.

చ అనుపమవిక్రమంబుగల ♦ యంగళు మీరలె యాయుధంబులం
గొనక త్యజించి పాఱఁగని ♦ కోయని భార్యలె నవ్వువారు చ
క్కనిసురియాదతో బ్రదుకఁ♦గాఁ దగువారల కద్ది చావె యౌ;
మన ఘనమానవంశముల ♦ మానవిభూషితవర్తనంబులన్. ౨౦ 2714

క. జనియించినవారము మఱి, మనజ్ఞాతిపరంపర లోగి ♦ మహివిస్తృతిఁ గాం
చినయవి కావున క్షుద్రులు, చనువిధమున భీతిఁ బాఱఁ ♦ జనునే చెపుఁడా.

తే. భీతి విక్రమమును బాసి ♦ యీ తెఱఁగునఁ
బాఱుచున్నారు గాన మీ♦పౌరుషంబుఁ
గాల్పనే మీ రనార్యులే ♦ గాదె?; మున్ను
సభలలో దంభముల్ పల్కి ♦ జనులు మెచ్చ ౨౧౪ 2716

క. మిము మీరె పొగడుకొంటిరి, సముచితము లుగ్రపౌరు♦షము దెల్పఁగఁ జా
లి మనోహరములునౌ నవి, గమనింపుఁ డెచటికి నేగెఁ ♦ గపివరులారా!. ౨౨౪

చ. అనిమొన నెవ్వఁ డోడి తన♦యంతన ప్రాణములన్ భరించియుం
డునో యతనిన్ మహాత్ములు గ♦డున్ వచియింతురు భీరువంచు స
జ్జనపరిసేవితంబయిన ♦ చారుపథంబును బూనుఁ డార్తిఁగాం
చినఫలమేమి? నాకు నిఁకఁ ♦ జెప్పుఁడు వానరులార! యుత్తరన్. ౨౩౪ 2718

చ. మన మనినుండి పాఱిచని ♦ క్ష్మాస్థలి నెందొ వసించి యుండినన్
గనము చిరాయు వల్పమగు ♦ కాలమె యుందుము, కానఁ బౌరుషం
బున నని చేసి చంపఁబడి ♦ భూస్థలిపైఁ బడిపోద; మట్టులే
యనితరగమ్యమై తనరు ♦ నట్టి పితామహలోక మందుచున్. ౨౪౪ 2719

క. జని మరలఁ గాంచకుందుము;, మన మరిఁ జంపుదుమయేని ♦ మానితకీర్తిం
గనుదుము బ్రహ్మస్థానం, బునకున్ మూల్యముగఁ బ్రాణ♦ముల విడుత మిటన్.

ఆ. మండుచున్న యగ్ని ♦ గండుమీఱిన శల
భములు గాంచి మరలఁ ♦ బ్రాణములను
బోవఁజాలనట్లు ♦ భూవిభు శ్రీరాముఁ
గనుచుఁ గుంభకర్ణుఁ♦డును ననుయుతి. ౨౬౪ 2721

క. మరలి చనంజాలఁడు; సం,గరమున మన మిందఱమును ♦ గ్రవ్యాదున కొ
క్కరునకు వెఱచి పలాయన, పరులమెయ్యె భంగమొంది ♦ పాఱినయెడలన్.

క. మనప్రాణాళిం గాచుకొ,నినయెడలన్ బూన్కిమెఱయ ♦ నియతిని నార్జిం

చిన కీర్తి యెల్ల నశియించును జుండీ!; యనుచు వాలి♦సూనుఁడు పలికెన్.

క. కనకాంగదుండు శూరుఁడు, ఘనుఁడగు నతఁ డిట్లుపలుకఁ♦గాఁ బాఱెడు న
వ్వనచరులు శూరనింద్యవ,చనములు నిట్లనిరి; దనుజ♦సత్తముఁ డితఁడున్. ౨౮

తే. మమ్ము మార్కొని భయదమా♦మాడ్కిఁ గొట్టె
నిలువఁగా దిది సమయంబు♦పలుకులేల
పాఱిపోదుము మాకెన్నఁ♦బ్రాణము లన
మధురములుగావె యని యిట్లు♦మాటలాడి. ౨౯ 2725

సీ. వనచరుల్ భయదరూ♦పుని భీమనేత్రునిఁ దముఁ జంపనరుదెంచు♦దానవేంద్రుఁ
గుంభకర్ణునిఁ గాంచి♦క్రోధంబునం జంపుననుభయంబునుబొంది♦చనిరిదిక్కు
లకు; నంత నంగదుఁ♦డకలుషచిత్తుండు భయమునఁ బాఱు న♦వ్వనచరులను
జక్కనిపల్కుల♦సాలపర్వతభేదనాదిక రామకృ♦త్యములఁ దెలుపు

తే. వాక్కులను వారి మరలించె; ♦వాలితనయుఁ
డాత్మబుద్ధిబలంబున♦హర్ష మొందు
నట్లు పల్కఁగ యూథపు♦లందఱర్క
తనయముఖ్యులయాజ్ఞల♦వినఁగ నెంచి. ౩౦ 2726

క. నిలువం బడి రనిసేయఁగఁ, దలఁచుచు; ఋషభుండు శరభ♦తార, కుముద, నీ
లులు, మైందుఁడు, ధూమ్రాఖ్యుఁడు,బలశాలిసుషేణుఁడంత♦బరవస మలరన్.

తే. ద్వివిద, రంభ, గవాక్షులు, ♦వీరుఁడైన
పనసుఁడును, దక్కఁగలవార♦లనినొనరుపఁ
జనిరి వారలతోఁ గూడి♦*హనుమచనియెఁ
గుంభకర్ణుని మార్కొను♦కుతుకమొప్ప. ౩౧ 2728

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౬౭ - వ సర్గము.

—ఈ సుగ్రీవుఁడు కుంభకర్ణుని ముక్కు, చెవులు కోయుకుట. —

క. పెనుకాయంబునఁదగు నా, వనచరు లంగదుని నుడులఁ♦బాటించి ధృతిం
గను నంత సాహసము నె, మ్మనములఁ గని యుద్ధకాంక్ష♦మరలి రనికినై. ౧

చ. హరివరు లంగదోక్తుల స♦మాగతమానసశక్తులై తగం
బరిగతవిక్రమప్రకట♦బాహుబలాఢ్యులునై మనంబులన్

---

* హనుమంతుఁడు పరుగెత్తి మరలి రాలేదు. వారితోఁ జనియె నని వ్యాఖ్యలోనున్నది. వాయుపుత్రస్తు వపలాయ్య నివృత్తః. కింతుఋషభాదిభిర్మిళిత్వా కుంభకర్ణేన సహ యుద్ధార్థం నివృత్త ఇతి జ్ఞేయమ్-అనివ్యాఖ్య. ఇది తెనిఁగింపఁదగినవిషయము కాదని విడువఁబడినదని గ్రహించి మన్నింపవలయు.

మరణము నొందు నిశ్చయము ♦ మైకొని హర్షముపొంగుచుండ సం
గరమునఁ జచ్చునూహలను ♦ గాథరణం బొనరించి రెంతయున్. ౩ 2730

చ. పెనుతనువుల్ చెలంగఁగఁ గ♦పిప్రవరుల్ పృథుసానువుల్ మహీ
జనికరముల్ కరంబులను ♦ సాధ్వసముం గలిగించుచుండ వే
దనుజలలాముమీఁదఁ బడఁ ♦ దారు ప్రయత్నముమీఱఁ బోయి; రం
త నతఁడు దీర్ఘమాతనువు ♦ దర్పము నొప్పుచు నుండఁ గ్రుద్ధుఁడై. ౪౹ 2731

క. కరమున గదఁ గైకొని సంగరరంగమునందు నాల్గు♦గడలం గపులన్
ధరఁ బడఁగూల్చెను బిండిగ;, హరు లాతని దెబ్బకొకటి ♦ సనిమొననార్తిన్.

తే. ఏడు నెనిమిదినూర్లుగా ♦ నిలను వేలు
గాఁగఁ గూలిరి పొడిపొడి♦గాఁ దనువులు
వ్రయ్య; నాకుంభకర్ణుఁ డ♦వార్యకోప
మదర గరుడుండు చెలరేఁగి ♦ యహివితతుల. ౫ 2733

సీ. తినునట్లు వనచరు♦లను నెనమండ్రను బదుగురఁ బదునాఱ్వు♦రఁ దగునట్లు
లిరువదిమందిని ♦ నేచి ముప్పదిమందిఁ గరములఁ గైకొని ♦ కరము పిండి
గాఁ జేసి భక్షించి ♦ కదనంబునన్ స్వేచ్ఛఁ దిరుగుచుండెను; హరి♦వరు లదెట్లొ
యతికష్టమునను ధై♦ర్యంబూని యొకటిగా నందఱుఁ జేరి వృ♦క్షాద్రిహస్తు

తే. లగుచు యుద్ధాగ్రమున నిల్చి ♦ రంతఁ గీశ
తల్లజుండగు ద్వివిదుండు ♦ ధరణిధరముఁ
గరములం బెకలించి త్ర్యా♦ధగశిఖరము
వలెఁ దగిన కుంభకర్ణుపైఁ ♦ బౌరుషమున. ౬ 2734

క. గిరివ్రాలిన మేఘమువలె, బరవశమున నడరె; నంతఁ ♦ బైఁబడఁ జని యా
సురవైరిమీఁద వైచెను, ధరణీధర ముట్టిపిచి ♦ తరుచరు లార్వన్;. ౧౦ 2735

చ. ధరమది వానిపైఁ బడక ♦ తద్భటసంఘముమీఁద వ్రాలె; న
క్కరణి నగేంద్ర మద్ది పడి ♦ కర్బురసేనఁ గలట్టి వాజులం
గరుల రథాళిఁ బేరుగల ♦ కర్బురనాథులఁ బిండిచేసె; నా
హరివరుఁ డంత వేఱొకమ♦హాధరణీధరకూట ముద్ధతిన్. ౧౧౹ 2736

చ. దనుజునిపైన వైవ నది ♦ దానవసైన్యమునందె వ్రాలెఁ ద
ద్ఘనశిఖరాహతిన్ మృతిని ♦ గాంచెను సారథిపంక్తివాజులున్
గనుఁగొన నాస్థలిన్ రుధిర♦కర్దమమే కనుపట్టె; నంత నా
దనుజులు స్యందనాళిపయి ♦ దారుణసింహరవంబు లొప్పఁగన్. ౧౨౹ 2737

తే. ప్రళయకాలాంతకునిఁ బోలు ♦ బాణములను
బరఁగఁజేయుచు నడరి ని♦స్వనము లొప్ప
నడరు వానరవీరశీ♦ర్షాళిఁ గూల్చి
రతి జవంబున మేటిసా♦హసము పొంగ. ౧౩౹ 2738

చ. గురుబలశాలురౌ కపులు ♦ క్రూరతరంబగుచూడ్కితో మహా
తరువులఁ బట్టి లాగి పెను♦దంతిగణంబును వాజులన్ రథో
త్కరమును పత్త్రిసంతతిని ♦ దానవులన్ దునుమాడి; రంత నం
బరగతుఁడై మరుత్సుతుఁడు ♦ పర్వతకూటములన్ జవంబునన్. ౧౪ 2739

క. నానావిధవృక్షములన్, దానవవరుపైనఁ గురిసె; ♦ దర్పబలుండా
దానవవీరుఁడు వానిన్, మానుగ శూలమునఁ జెండి ♦ మహిఁబడఁ జేసెన్.

చ. దనుజవరేణ్యుఁ డంతఁ గ్రుధ ♦ దారుణశూలముఁ గొంచు నుగ్రమా
వనచరసైన్యముం దఱుమ ♦ వాయుతనూజుఁడు పర్వతాగ్ర మె
య్యనఁ బెకలించి పట్టుకొని ♦ యాతనిముంగట నిల్చె; నంతటన్
ఘనగిరి పోల్కి భీతికర♦కాయమునం దగు కుంభకర్ణునిన్. ౧౬ 2741

క. హనుమయుఁ గని కుపితుండై, తనబల మలరంగ దాన ♦ దానవుఁ గొట్టెన్
దనుజేంద్రుఁడు తద్ఘాతం,బున మేదోరక్తసేక♦మునఁ దనువొప్పన్. ౧౭ 2742

తే. సుంత చలియించె; మెఱపునా ♦ వింతరీతిఁ
బ్రజ్వలించుచు నురుశిఖ♦రమున నొప్పు
నద్రివలెఁ దగుశూలంబు ♦ నంతఁ ద్రిప్పి
మును కుమారుండు తీవ్రశ♦క్తిని గ్రహించి. ౧౮ 2743

క. ధరణీధ్రముఁ గ్రౌంచంబును, నరుదుగ భేదించినట్టు ♦ లాహనుమభుజాం
తరమునఁ గొట్టెను; మాఱుతి, సురరిపుశూలాభిభిన్న♦శుభవక్షుండై. ౧౯

తే. నోట నెత్తురుఁ గ్రక్కుచుఁ ♦ బాటవంబు
దూల మూర్ఛిల్లుచున్ లయ♦కాలమేఘ
గర్జితోపమమై భయం♦కరమునైన
నారవ మొనర్చె; నంత న♦య్యసురసరులు. ౨౦ 2745

చ. హనుమయు బాధితుండగుట ♦ నారసి యట్టు మహాముదంబునన్
ఘనముగ నార్చె; రంతఁ గపి♦కాండము చాలమనోవ్యథన్ మహా
దనుజునిభీతిచేతఁ బ్రవి♦దారణమున్ విడనాడి పాఱె; రం
త నిఖలకీశనాయకులఁ ♦ దద్బలనాథుఁడు నీలుఁ డార్భటిన్. ౨౧ 2476

ఆ. నిలువరించి బుద్ధి♦బలమునఁ దగుకుంభ, కర్ణుమీఁద గిరిశి♦ఖరము వైచె
దాని వచ్చుదాని ♦ దారుణముష్టిని, నిల్పెఁ గుంభకర్ణుఁ ♦ డల్పమనుచు. ౨౨

క. పిడికిటిపోటున నయ్యది, మిడుగుఱు లడరంగఁ బడియె ♦ మించెడుజ్వాలల్
గడువడిఁ గ్రమ్ముచు నుండం, బొడిపొడియై యద్భుతముగ ♦ భూమీస్థలిపై.

తే. అంత ఋషభుండు, శరభ,గ♦వాక్ష,నీల, గంధమాదను లనువీరు ♦ కపివతంసు
లైదుగురు కుంభకర్ణుపై♦కడరి;భూరి,బలములొప్పమహాకాయు♦నలఘుశౌర్యు!.

క. దనుజునిఁ బర్వతములఁ జెట్లను నఱచేతులను బదము♦లను బిడికిళ్లం
గొని చుట్టుముట్టి; రంతట,వనచరులప్రహారములను ♦ వాని నతండుర్. ౨౬

క. తనువునకు హాయిగా నుం,డినవానిగ నెఱఁగెఁ గాని ♦ నిర్భరబాధం
గనఁజేయునవిగఁ దలఁపక, యనిసేయం దొడఁగె బుభుభు♦నాత్మకరములర్.

ఆ. కౌఁగిలించుకొనియెఁ; ♦ గపికాంతుఁ డతఁడు త
త్కరనిపీడితుఁడయి ♦ కడుభయంక
రుఁడయి యొప్పి నెత్తు♦రును గ్రక్కుచుర్ ధరఁ
బడియె; నింద్రవైరి ♦ కడిఁది బలుఁడు. ౨౮ 2752

క. వనచరహంతయు నగునా,దనుజేంద్రుఁడు ముష్టినిహతి ♦ దర్పంబున నొ
ప్పినశరభు, నీలుజానుహ,తిని,నఱచేతర్ గవాక్షుఁ ♦ దెంపునఁ గొట్టెర్. ౨౯

తే. మఱియుఁ గ్రుద్ధఁబూని యాగంధ♦మాదనుఁ దన
కాలఁ దన్నను వారు త♦ద్ఘాతములకు
నతిశయవ్యథనొంది ర♦క్తాభిషిక్తు
లగుచు మూర్ఛల మున్గుచు ♦ నార్తులగుచు. ౩౦ 2754

క. ధరఁబడిరి ఛిన్నకింశుక,తరువులక్రియ; నాప్లవంగ♦తల్లజులు మహా
త్తరమతులు పడుటఁ గని వే,హరివీరసహస్ర మసురు ♦ నని నొంచుటకై.౩౧

క. పరుగెత్తి రద్రితుల్యులు, నిరుపమబలులైన ప్లవగ♦నృపు లందఱు నా
సురవైరిపైకి నెగురుచు, నురవడి దంతములఁ గొఱికి ♦ రుద్ధతిమీఱర్. ౩౩

చ. వనచరు లాముహాంగు సుర♦వైరిని గోళ్లను గీఱి పండ్లచే
తను వడిమీఱఁగాఁ గొఱికి ♦ దారుణముష్టుల నొంచి జానుపీ
డనములఁ గందఁజేసిరి; గ♦డంగి ధరాధరతుల్యదేహుఁ డా
దనుజుఁడు కుంభకర్ణుఁడు ప్ర♦తాపము మీఱఁగ వేనవేలుగర్. ౩౪ 2757

ఆ. కపులు తన్నుఁ గ్రమ్మి ♦ కాఱియపెట్టంగఁ, దరువు లబ్బి పెరుగఁ ♦ దనరు గిరిని
బోలివెలిఁగె; నంత ♦ భూరిబలుండాతఁ, డందఱను గరద్వ♦యమునఁ బట్టి.

క. తినసాగె గరుడుఁ డహిగణ,మును దినుచందమున; దనుజ♦ముఖ్యుఁడు ప్రీతిర్
వనచరుల నాగలోకం,బున కీడగు వక్త్రవివర♦మున వేసికొనర్. ౩౬ 2759

ఆ. ముక్కుసెవుల రంధ్ర♦ములనుండి వారెల్ల, వచ్చుచుండి రంత; ♦ వారిరాక
నాత్మ నెఱఁగి మిగుల ♦ నాగ్రహంబున గిరి,సన్నిభాంగుఁ డతఁడు♦సాహసించి.

క. వనచరులఁ జీల్చి భక్షిం,పనుసాగెం; బ్రళయవహ్ని ♦ పగిది భయదమా
తనువలర నొడలు తెలిఁకుక, వనచరమృదుమాంసరక్త♦వాహినిచేతర్. ౩౮

క. ధరణిర్ దడుపుచుఁ బ్లవగో,త్కరములలోఁ గేళిసల్పఁ♦గాఁ దొడఁగె; మహా
త్తరబలుఁడు కుంభకర్ణం, డురువజ్రముఁ గొనిన నిర్జ♦రోత్తమురీతిర్. ౩౯

ఆ. పాశహస్తుఁడగుచు ♦ భాసిల్లుయముభంగి, శూలపాణియగుచు ♦ శోభిలెనని;

నగ్నిగ్రీష్మకాల ♦ మందు శుష్కారణ్యముల దహించురీతి♦బలము మెఱయ.

చ. వనచరువాహినిం బెలుచఁ ♦ బట్టి దహించెను గ్రోధవహ్నిచే;
దనుజవిదారితాంగులయి ♦ తారు భయంబున వేఱువేఱుగాఁ
జనుచును వాహినీపతి పా♦సంగమిఁ జాల వికారనాదముల్
వనచరు లట్టిచేసి; రనిఁ ♦ బట్టివధించెను బెక్కురీతులన్
దనుజవరుండు వారలను ♦ దర్పము గన్పడ శూలహస్తుఁడై. ౮౧౪ 2764

సీ. తమ్మిట్లు బాధింపఁ ♦ దాళఁజాలక ఖిన్నచిత్తులై శరణుఁ జొ♦చ్చిరి రఘుప్ర
వరు; నంతవారల ♦ వాసవపౌత్రుండు గని పరాజితులయి ♦ గదలుటమదిఁ
దలపోసి యొకభూరి♦ధరణీధ్రశృంగంబుఁ గరమునఁ బూని ర♦క్కసులు కుంభ
కర్ణునిపరిచరుల్ ♦ గడుభీతిఁ గలఁగంగఁ బలుమాఱు సింహర♦వంబు నిగుడఁ

ఆ. గుంభకర్ణుపైకిఁ ♦ గొంకక యుఱరి సంగరమునందు వేగ ♦ గదిసి యతని
శిరముపైన వైచె ♦ శిఖరంబు నద్దానిఁ; దచ్ఛిఖరనిహతిని ♦ దనుజుఁ డొంది.

క. పెనుకోపంబున మండెను, దనుజోత్తముఁ డిట్లు మదిని ♦ దారుణకోపం
బును గని కోఁతులు భీతిల, నినదమ్ముదరంగ నాత♦నిపయికి నడరెన్. ౮౨ 2766

ఆ. పరుగువారి యిట్టు ♦ లురుజవంబున వాలి
తనయుపైన శూల♦మును దగంగ
వైచె బలముమీఱఁ ♦ బటుకోపమున; నంత
బలముగలిగి యుద్ధ♦పథముఁ దెలిసి. ౮౩౪ 2767

చ. పరునివిధంబు లన్నియును ♦ బాగుగ నెన్నఁగఁ జాలుఁగాన నా
హరిహయపౌత్రుఁ డట్లు నిశి♦తాయుధ మట్టి తనున్ వధింపఁగా
బరువడిరాఁగ లాఘవముఁ ♦ బన్ని తటాలున దాఁటి వ్యర్థమై
ధరఁబడఁజేసి దాని కడు♦దాపున వేగమ వ్రాలి తెంపునన్. ౮౪౪ 2768

తే. కరతలమ్మున నడఁచెను ♦ బరునివక్షు;
మంతఁ బర్వతమంతటి ♦ యాకృతిగల
దనుజుఁ డాతనిదెబ్బకుఁ ♦ దత్తఱిల్లి
కోపముడరంగ మూర్ఛ ము♦న్గుచు నిలఁబడె. ౮౫౪ 2769

క. బలశాలి కొంతవడికిం, దెలివిం గని ముష్టినట్టి ♦ త్రిప్పుచు వెడచే
బలిమిని సంగదుఁ బొడిచిన, నిలవ్రాలె సతండు సోలి ♦ యేపుం జెడఁగన్. ౯౦౪

చ. హరిహయపౌత్రుఁ డిక్కరణి ♦ నచ్చట వ్రాలిన శూల మద్దియే
కరమున వెల్గ నేగె, లయ♦కాలునిరీతిని గీశనాథుపై
కురువడి వీరుఁడైన ప్లవ♦గోత్తముఁ డాబలశాలి దానవే
శ్వరుననుజుండు తన్గదియ ♦ వచ్చుటఁ గాంచి మనోముదంబునన్. ౯౧ 2771

తే. అట్టి దుమికె; మహాబలుం ♦ డక్కపీంద్రుఁ
డద్రికూటంబుఁ గరమున ♦ నవధరించి
గిరిగిరం ద్రిప్పుచుఁ వడి ♦ నరిగెఁ బ్రబలుఁ
డైన యాకుంభకర్ణుపై ♦ కతఁడు మించి. ౫౩౺ 2772

క. తనపై కడరెడు సుగ్రీ,వునిఁగని వికృతాంగుఁడగుచుఁ ♦ బొంగెడువాంఛన్
వనచరున కభిముఖుండయి, దనుజేంద్రుఁడు నిలిచెఁ బ్లవగ♦తల్లజుఁడంతన్.

క. వనచరశోణితదిగ్ధాం,గుని గపిభక్షకుని రణముఁ ♦ గోరుచు నిలుచు
న్ననిశాచరుఁ గని యిట్లని,యెను; నీవని వీరవరుల ♦ నెల్లబలమునన్. ౫౪౺

చ. ధరఁ బడఁగూల్చి దుష్కరము ♦ దారుణమున్ గలభూషణంబునై
వరఁగెడుపోరు సల్పితివి ♦ భవ్యయశంబును బొందినాఁడ వా
హరులను మ్రింగినావు ప్లవ♦గావళి మానుము ప్రాకృతుల్ గపుల్
సరియగువారె నీకు దను♦జప్రవరా! యిదె చూడు నాదెసన్. ౫౬ 2775

క. ధరణిధరం బిదె వైచెదఁ, బరమంబగు నొక్కదీని ♦ పాటు సయిపుమా
దురమున ననునావనచర, వరువాక్యము సత్యధైర్య♦పరియుతము తగన్.

క. విని రాక్షససింహుండా,తనితో నిట్లనియె నీవు♦ధాతకు మనుమం
డనఁబడువాఁడవు ఋక్షర,జునిపుత్త్రుఁడ వతులపౌరు♦షుండవు సుమ్మీ!. ౫౮

క. ఇన్నియు నీకుం గలవని, మున్నె తెలిసినవి మాకు ♦ ముందుగ నామ్రో
ల నీవు పాటపాడెద, వన్నా! యిఁకఁ జాలు ననియె; ♦ నంత రవిజుఁడున్.

క. తను గుఱిచి కుంభకర్ణుం, డనూనపరిహాస మొప్ప ♦ నాడినపలుకుల్
విని వజ్రాశనిసన్నిభ, మననొప్పెడి పర్వతంబు ♦ నతిభయకంబున్. ౬౦ 2779

క. చలియింపఁజేసి వక్షఃస్థలమ్ముల మారసి యుద్ధపగుల ♦ సరగున వైచెన్
బలమలర వైవఁ బొడవగు, నిలాధరాగ్రంబు దాన♦వేజ్యు నురమునన్.

ఆ. తగిలి చూర్ణమయ్యె ♦ దానిని గని కోఁతు, లతివిషాద మంది ♦ రసురులెల్ల
ముదమునిూఱి శబ్ద♦ముల దిక్కు లదరంగఁ, జేసి; రంత దనుజ♦సింహుఁ డిట్లు.

చ. ధరణిధరాగ్రఘాతమునఁ ♦ దారుణకోపము నొంది దానవీ
కరమగునాస్యముం దెఱచి ♦ గాఢరవంబు నిగుడ్చుచున్ మహా
త్తరచపలాభశూలము ను♦దాత్తగతిం జలియింపఁజేసి యా
హరిపతిఁ జంపవైచె వెస ♦ నాతనిపైఁ దనశక్తి యేర్పడన్. ౬౧౺ 2782

చ. అనిలకుమారుఁ డాక్షణమె ♦ యచ్చటికేగి సురారి దోర్బలం
బున నటు వైవ సూర్యసుతు ♦ పొంగడఁగింపఁగ వచ్చు శూలమున్
గనకసుహారజుష్టమును ♦ గాంచి కరంబుల దానిఁబట్టి పెం
పునఁ దునియంగఁ జేసెఁ దన♦పూర్ణబలంబు గనంబడంగఁడున్. ౬౩౺ 2783

క. హరితల్లజుఁ డతిముదమున, నరుదుగఁ గాలాయసమయ♦మయి బాహువులం
బరికింప సహస్రమునకు, నరియగు భారమున మించఁ ♦ జాలినదానిన్. ౬౪

తే. శూలమును జానువుననుంచి ♦ చూర్ణమొనరఁ
జేసెఁ; బవమానతనయుని♦చేత నిట్లు
భగ్నమా శూలమును గాంచి ♦ ప్లవగవితతి
యార్చి *నలుదెసలకు బాఱె ♦ నతిముదమున. ౬౫ 2785

చ. వనచరు లెంతొ మోదమున ♦ భగ్నమహాసురశూలవర్యముం
గొని ప్రమదంబునన్ మిగిలి ♦ గాఢమృగేంద్రరవంబు లొప్ప నా
యనిలజుఁ బూజచేసిరి; మ♦హాబలుఁ డాసురపుంగవుండు మిం
చినవరశూల మవ్విధిని ♦ జేవఁ దొఱంగి విభగ్నమౌటకున్. ౬౬ 2786

సీ. మనమునఁ గోపించి ♦ మండుచు లంకామలయపర్వతమునుండి ♦ నియతిశృంగ
మును బెకలించి యా♦వనచరపతిఁ జేరి దాని వైచె; ధరాగ్ర♦దారుణహతి
మూర్ఛిల్లి సంగర♦భూమి నాతఁడు పడె; సుగ్రీవుఁ డిట్లని♦క్షోణి మూర్ఛ
మునుఁగుచుఁబడిన నా♦దనుజులందఱు ప్రహర్షముననార్చిరి;దను♦జప్రవరుఁడు

తే. సంగరంబున ఘోర మా♦శ్చర్యమునగు
విక్రమముగలవనచర♦విభునికడకు
నరిగి యతిభీతికరమగు ♦ ననిలుఁ డబ్ద
మును వలెం బట్టుకొనిపోయె ♦ ఘనబలమున. ౬౭ 2787

చ. కనకమహీధరప్రతిమ♦కాయుఁడు దానవవీరుఁ డంత నా
వనచరు భీమమేఘనిభు ♦ బాహుబలంబున నెత్తికొంచుఁ బెం
పునఁ దగి యున్నతంబునయి ♦ పొల్చెడుశృంగముగల్గు మేరువో
యనునటు భాసిలెన్; మఱియు ♦ నాదనుజప్రవరుండు వీరుఁడై. ౬౮ 2788

తే. సూర్యసుతు నెత్తుకొని రాక్ష♦సులు నుతింప
వనచరేంద్రుఁడు పట్టువ♦డెనె యటంచు
నచ్చెరువునొంది నిర్జరు♦లపుడు చేయు
ధ్వనుల వినుచును బోయె యు♦ద్ధమును వదలి. ౬౯ 2789

చ. హరిహయతుల్యవిక్రముఁ డ♦హార్యబలుండు శచీశవైరి యా
సురరిపుసోదరుం డపుడు ♦ సూర్యసుతున్ గ్రహియించి యాత్మలో
హరిపతి వీనిఁ గైకొనిన ♦ నారఘువర్యులతోఁ జెలంగు వా
నరబలమెల్లఁ జిక్కినటె ♦ నాకనుచుం దలపోసె నెంతయున్. ౭౦ 2790

చ. వనచరసేన తల్లడిలి ♦ పాఱుటయున్ రవిసూతి కుంభక
ర్ణునికరమందుఁ జిక్కుటయు ♦ నొచ్చి వెతంగనుచుంటయుం గనుం

---

* హృష్టా ననాద బహుశ స్సర్వత శ్చాపి దుద్రువే-అనిమూ.

గొని మతిమంతుఁ డాపవను◆కూరిమిపుత్రుఁడు స్వాంతమందు ని
ట్లని తలపోసె; నీవనచ◆రాధిపుఁడే యిటు చిక్కెనే కటా. ౭౮ 2791

క. ననుఁబోటి కేమి యిఁకఁ జే,యనగును నాకెదురొనర్ప ◆ న్యాయమె నేఁడా
ని నజస్రము జేయుదుఁ జ,క్కనిరీతిఁగ నొందుసేయఁ◆గాఁ దగ దెవుడున్. ౭౯

క. గిరియంతవాఁడనై యీ,సురవైరిం జంపువాఁడ ◆ శూరత్వమునన్
దురమున నీతనిఁ బిడికిటఁ, బరువంబుగఁ బొడిచి యవయ◆వంబులు పొడిగన్.

క. అని వధియించి కపీశ్వరుఁ, డనుమోదము నొంద వీని◆దగుబంధంబున్
గనకుండఁగ విడిపించిన, ననిఁ గపులందఱు ప్రహృష్టు ◆ లౌదురు గాతన్. ౭౬౹

క. ఈరాజే సురదనుజమ,హోరగు లొక్కటిగఁ జేరి ◆ యుద్ధంబునఁ ద
న్నారూఢిగ గ్రహియించిన, నేరిమి విడిపించుకొనఁగ ◆ నేర్చును దానే. ౭౭౹

సీ. కపిపతి యితఁడు సం◆గరమున నాకుంభకర్ణుఁడు వైచిన ◆ త్ర్యాధరప్ర
హారమునం జొక్కి ◆ యందుచేఁ దనుఁదానె తెలియకున్నాఁడని◆తలఁచువాఁడ
నీముహూర్తమునందె◆యితఁడు మూర్ఛను దేరి యీమహాజన్యమం◆దెల్లకపుల
కును దనకును హిత◆మని దేనిఁ దలఁచునో దానిఁ జేయుంగాక; ◆ ధరణివిభుఁడు

తే. కష్టములఁ జిక్క భృత్యుండు ◆ కడఁగి వాని
నెట్లొ విడిపింపవచ్చునే ◆ నట్లుపతిని
నిపుడు విడుపింతునేని య◆హీనవిక్ర
మాఢ్యుఁడగు వీనియప్రీతి ◆ కంత మున్నె?. ౮౦ 2796

క. కీరితియు శాశ్వతముగా, ధారణి నశియించుఁ గానఁ; ◆ దానై శౌర్యం
బీరాజు చూపునని నే, నూరకయుండెదను వేచి ◆ యుద్ధస్థలిలోన్. ౮౧ 2797

క. పతివచ్చుదనుక నీకపి,తతిఁ బొఱెడుదాని సత్వ◆థంబును గన స
మ్మతి మాటలాడుచుండెద, నితరమ్మును మాని యనుచు ◆ నెంచిహనుమయున్.

క. వనచరసైన్యం బద్ధా,నిని దిక్కుల కేగనీక ◆ నిలిపెను ధైర్యం
బున; నంతఁ గుంభకర్ణుఁడు, వనచరనాయకుని గదలు◆వాని బలమునన్. ౮౨౹

చ. కరములఁ జిక్కఁబట్టుకొని ◆ గాఢరయంబున మేడలందు గో
పురములఁ జర్యలందుఁ దమిఁ ◆ బొంగుచు రాక్షసులెల్ల నిల్చి సుం
దరసుమవృష్టులం గురియఁ ◆ దాను బురంబును జొచ్చె; నంత ని
ర్భరబలుఁ డర్కసూనుఁడును ◆ భవ్యసుగంధజలంబు లాజలున్. ౮౩౹ 2800

క. దనుజునిపైఁ గురియఁగఁ ద,జ్జనితలసచ్ఛీతలతను ◆ జక్కఁగ మేనె
ల్లను దడియుట నృపమార్గం,బును జల్లఁగనుంట సంజ్ఞ ◆ పొలయఁగ నంతన్.

తే. మెల్లమెల్లనఁ గాంచెను ◆ మెలఁకువ; నపు
డమ్మహాత్ముఁడు శ్రమమొంది ◆ యధికకష్ట
మున నదెట్టులొ తెలివొంది ◆ ఘనబలయుతుఁ
డైన యాకుంభకర్ణభు◆జాంతరమున. ౮౯ 2802

క. తానుండియె లంకాపుర, మానవవిభుమార్గమును గ్ర♦సంబునఁ గనుచున్
దానిట్లు తలఁచెఁ దనలో, నేనిపు డిటు పట్టువడితి ♦ నీచునిచేతన్. ౭౫½ 2803

క. ప్రతికారమేమి చేయన్, హితమగు నిత్తఱిని గపుల ♦ కెల్లను నేనే
జతనము సేసిన నిష్టము, హితమునగున్ దాని నట్టు♦లే చేయఁదగున్. ౭౬

క. ఒనరింతు నిప్పుడే నే, ననియెంచి కపీంద్రుఁడైన ♦ యర్కభవుఁడు చ
క్కనివాడిగోళ్ల నమరే,శునివైరిశ్రుతిద్వయంబు ♦ శోభిలు దానిన్. ౭౬½

*ఆ. అట్టె గిల్లి పండ్ల ♦ నాతనిముక్కును, గొఱికికొనుచుఁ గాళ్లఁ♦గుంభకర్ణు
నంసగండదోర్ద్వ♦యాంతరములఁ దన్నెఁ, దనరుఁగల్గు బలము♦నను శ్రమపడి.

చ. దనుజవరేణ్యుఁ డంతఁ గపి♦తల్లడిఁ జూచెఁ దనముక్కు గర్ణముల్
పనివడిఁ ద్రుంపఁగాఁ బడిన♦భంగికి దానికిఁ దోడు ప్రక్కలా
తనిచరణాహతిం గనుటఁ ♦ దద్దయుఁ బీడితుఁడౌటకు న్మనం
బునఁ గడునాగ్రహించె మెయి ♦ బోరన రక్తము గాఱుచుండఁగన్. ౭౭

తే. వనచరునిఁ ద్రిప్పి ధరణిపై ♦ వైచి నలిపె;
భీమబలుఁడైన దనుజుండు ♦ పిండిసేయ
దనుజులందఱు బహుభంగు♦లను గఠోర
తాడనంబుల నొప్పింపఁ ♦ దాజడియక. ౭౮ 2808

క. హరిపతి యాసుగ్రీవుఁడు, త్వరగా నభ్రమున కెగసి ♦ వనచరు లార్వన్
ధరణీశుఁ జేరె మరలన్;, సురవైరిలలాముఁడు బల♦శోభితుఁడయ్యెన్. ౭౮½

క. తనముక్కు సెవులు తునియం,గను నెత్తురుగాఱ ఝురని♦కాయయుతంబౌ
ఘనగిరిపోలికఁ గన న,య్యెను; శోణితసిక్తతనుఁ డ♦హీనబలుండున్. ౮౦½

ఆ. భీమవిక్రముండు ♦ పృథుకాయుఁడు నగునా,కుంభకర్ణుఁ డంత ♦ ఘోరయుద్ధ
భూమివంకఁ దిరిగి ♦ పూన్కిని మరల యు,ద్ధంబుఁ జేయ నెంచెఁ♦దనమనమున.

క. నీలాంజనచయమువలెం, గ్రాలుచుఁ గోపంబు మించఁ♦గా రక్తం బం
గాళిని నిండఁగ సంధ్యా,కాలాంబుదమట్లతండు ♦ కడు వెలిఁగె నటన్. ౮౨½

సీ. తనచేతినుండి యా♦వనచరనాథుండు తప్పించుకొనిపోవ ♦ దనుజనాథు
తమ్ముండు క్రుద్ధుఁడై ♦దారుణాకృతి మీఱ మరల యుద్ధముసేయఁ♦బరుగులెత్తు
చును సాధనమ్ము లే♦మిని నెంచి భయదమౌ ముద్గరమునుగొనె; ♦ భూరితేజుఁ
డాకుంభకర్ణుఁ డ♦త్యంతశీఘ్రంబునఁ బురిని వెల్వడి యుగ్ర♦తరముగాఁగఁ

తే. గనఁబడుచునున్న యక్కపి♦గణము సొచ్చి
ప్రజ్వలించెడు ప్రళయాగ్ని ♦ ప్రజలఁ బోలె
యుద్ధమున ద్రింగఁ జొచ్చె ని♦ర్భరవడిఁ గపి
బలము లోపలఁ జొచ్చి యాఁ♦కలి వెఱపున. ౮౭½ 2813

---

* దధంశ పార్శ్వేషుచ కుంభకర్ణమ్-అనిమా. పాదాభ్యాం విదదా రేతి శేషః-అనివ్యాఖ్యా.

క. [1]వనచరమాంసము రక్తము, ననువుగఁ గ్రోలంగఁదగు మ♦హాశన మోహం
బునఁ దెలియక రాక్షసులను, వనచరులఁ బిశాచగణము ♦ భల్లుకగణముల్.

క. తినుచుండె; విలయకాలం, బున మృత్యువు ప్రజలఁ ద్రుంచు♦పోలికఁ గపివీ
రనికరముల భక్షించెను;, దనుజుం డతికోప మడరఁ ♦ దనపూన్కి గలిగ.

తే. వానరుల రాక్షసులఁ బట్టి ♦ వరుస నొకరి
నిద్దఱిని ముప్వురను మఱి ♦ యేఁచి పెక్కు
మంది నొకచేత గ్రహియించి ♦ డెంద మలర
వదనగహ్వరమున యందు ♦ వైచుకొనుచు. ౯౭ 2816

క. తాను మహాబలవంతుఁడు, గాన వానరులు గొప్ప♦త్ర్యాధరములచే
మేనున మోఁదుచునున్నన్, వానిన్ లెక్కింప కొక్క ♦ భంగిం దినుచున్.

తే. కపులమేదస్సు నెత్తురు ♦ కడుఁ బ్రవాహ
ములుగ దాడలనుండి యే♦ఱులుగఁ గాఱఁ
దిరుగుచుండెను; క్రూరుఁడౌ ♦ సురవిరోధి
తమ్ము భక్షింప నోర్వలే ♦ కుమ్మలించి. ౯౮ 2818

క. శరణము శ్రీరాముం డని, పరికించిరి; దనుజుఁ డంత ♦ బహుళక్రుధ వా
నరులం దినుచున్ వేగమ, పరుగెత్తెను వారివెంటఁ ♦ బడి మోహమునన్.

తే. ఏడునెనిమిదివందల ♦ నిరువదిశత
ములను ముప్పదివందలఁ ♦ గలిసి హస్త
ములను బిగియంగఁబట్టి యి♦మ్ముల నదుముచుఁ
దినుచుఁ బరుగెత్తుచుండె వా♦రిని దఱుముచు. ౧౦౦ 2820

క. [2]అత్తఱి శత్రుపురంబుల, మొత్తముగాఁ గూల్చి విజయ♦మును గాంచుగుణా
యుత్తమతి సుమిత్రాత్మజుఁ, డుత్తలపడి వారిఁ జూచి ♦ యుగ్రక్రుధచేన్.

క. అనిఁ గావించెను; వీర్యం, బునఁ బొల్చెడు లక్ష్మణుండు ♦ పూర్వామరుమే
నున నాఁటి సప్తశరముల, ఘనశరముల నట్టె తొడిగి ♦ క్రమ్మఱ నేసెన్.

క. అతిబలుఁడు కుంభకర్ణుఁడు, వితతాంబకవృష్టి దాని ♦ విరియించుచు ను
ద్ధతిలక్ష్మణు మీఱి పరా, హతిధరణియుఁ బగుల[3] రాము♦నని మార్కొనఁగన్.

క. చనియెను; దశరథతనయుఁ డ,తని గని రౌద్రాస్త్ర మొకటి♦ధనువున సంధిం
చి నిశితబాణంబుల నా,తనివక్షము గాఢ నేసెఁ ♦ దద్బాణహతిన్. ౧౦౪

తే. క్రుద్ధుఁడై సత్వరంబుగఁ ♦ గుంభకర్ణుఁ
డారఘూత్తము పైఁ బడ ♦ నరుగు వేళ

1 చఖాద రక్షాంసి హరీన్ పిశాచాన్-అనిమూ. 2 పరపురంజయః-అనిమూ. 3 రామ మేవా భిదుద్రావ-అనిమూ.

నతనివదనంబునుండి వాలు♦తాగ్నివంటి
జ్వాల లొక్కట వెలువడె ♦ భయదరీతి. ౧౦౫ 2825

చ. దనుజలలాముఁ డత్తఱిని ♦ దత్కరము క్షశితాస్త్రవిద్ధుఁ డ
య్యును బరమక్రుధం గొనుచు ♦ యుద్ధమునం గపులందఱున్ భయం
బునఁ బరుగెత్త ఘోరరవ♦మున్ జనియింపఁగ నార్చుచున్ జవం
బునఁ బరువెత్తె రాఘవునిఁ ♦ బోరున నొంచెడు వాంఛ మించఁగన్. ౧౦౬

తే. నెమిలియీఁకలుగట్టిన ♦ నిశితబాణ
ములను రాముఁడు తద్వక్ష♦మును గడంగి
యుచ్చిపోవంగనేయ నా♦యురుబలుండు
సోలెఁ జేనున్నగదయును ♦ నేలఁబడియె. ౧౦౭ 2827

క. కరగతఖడ్గాద్యాయుధ, పరికరములు భూతలమునఁ ♦ బడి చెదరె; మహా
త్తరబలుఁడైన యతం డట, నిరాయుధుం డౌట నెఱిఁగి ♦ నియతి దలిర్పన్.

క. చరణంబులఁ బిడికిళ్లను, దురమొనరించెను; శరాళి ♦ తోరంబుగ ని
ర్భరరీతి మేనఁ గ్రమ్మిన, నిరంతరాసృక్ప్రవాహ♦నిచయయుతుండై. ౧౦౯

క. సెలయేళ్లతోడఁ గూడిన, పొలుపగుభూమీధరంబు ♦ పోలిక నొప్పెన్;
గలయం దనువున నెత్తురు, పొలయంగాఁ దీవ్రకోప♦భూయిష్ఠుండై. ౧౧౦

చ. వనచరభల్లుకాసురులఁ ♦ బట్టి వడిన్ వడి మ్రింగుచున్ దురం
బునఁ జరియించుచుండె; భయ♦ముం గలిగించెడు విక్రమంబు నొ
ప్పిన దనుజోత్తముం డగుచు ♦ భీమయమోపముఁ డౌచు దోర్బలం
బునఁ దగి కుంభకర్ణుఁ డొక♦భూరిభయంకరశైలకూటమున్. ౧౧౧ 2831

చ. కరమునఁ ద్రిప్పి రామనృప♦కాంతునిపైఁ బడవైచె; నద్ది పై
కురవడి రాకమున్నె పురు♦షోత్తముఁ డారఘురాముఁ డేచి యం
తరమున భర్మచిత్రితని♦తాంతభయంకర, లక్ష్యభేదనా
తురశరసప్తకంబునను ♦ దోడన త్రుంచెఁ గపీంద్రు లార్వఁగన్. ౧౧౩౪

క. కనకాచలకూటము నాఁ, దనరుచుఁ గాంతులఁ జెలంగి ♦ దర్పమ్మున నా
*వనచరశతద్వయముపైఁ,కిని బొంగుచు నడరఁ గాంచి ♦ కినుకవెలయఁగన్.

సీ. రాఘవుం డుగ్రశ♦రంబుల నాతని ధరఁ ద్రెళ్లఁగాఁ జేసె ♦ దత్సమయము
నందు ధర్మాత్ముఁడై ♦ నట్టి లక్ష్మణుఁ డరి వధియింప నెంచి ని♦బ్బరముతోడఁ
దదుపాయముల నెల్లఁ ♦ దగుభంగిఁ దలఁచుచు నిట్లని పల్కెను; ♦నీదనుజుఁడు
శోణితవాసనఁ ♦ జొక్కి మత్తుండయి యుండుటఁ గపులని♦యును దనుజుల

తే. నియును దెలియఁడు తనవారి♦నిం బరులను
బట్టి భక్షించుచున్నాఁడు ♦ వనచరవిభు

---

* ద్వేశతే వానరేంద్రాణాం పతమాన మపాతయత్ - అనియూ.

లందఱును వీని పై నెక్కి ♦ యట్టి నిల్చి
యుండ్రు గాక భటేశ్వరు ♦ లొప్పురీతి. ౧౧౬ 2834

క. బల మలర యథార్థ్యముగా, నలు ప్రక్కల నిల్చి ప్రచల♦నము నందకయే
నిలిచెదు నటు నిల్తురుగా,క;లలి నిటు లొనర్ప దుష్ట♦కర్బురుఁ డితఁడుర్. ౧౧౭

క. గురుభారపీడితుండై, ధరఁబడు నిక్కాలమందు ♦ దాన నిచటి వా
నరులం జంపక యుండును, ధరణీశ్వర! యనిన నృపతి♦తమ్మునినుడులర్. ౧౧౮

క. విని మతిమంతుండగు నా,తనిపలుకులరీతిఁగా ము♦దంబునఁ గపులె
ల్లను గుంభకర్ణుపైఁ జ,య్యన నెక్కిరి; దనుజవర్యు ♦ డప్పునికి మదిర్.౧౧౮½

ఆ. కోప మడర దుష్ట♦కుంజర మటు రేఁగి, హ స్తిపకులఁ జెండు ♦ నట్లు వేగ
కపులు ధరణిని బడఁ♦గా విదళించెను;,విగళితమగు కీశ♦వితతిఁ గాంచి.౧౧౯½

క. తనమనమున రాముండీ, దనుజుఁడు దుష్టాత్ముఁ డనుచు ♦ దలపోసి మహా
ధనువుం గొని జవమున నా,తనిపైకిం జనియెఁ గ్రోధ♦తామ్రాక్షుండై.

క. వీరుం డారఘురాముఁడు, క్రూ,రేక్షణముల జగంబుఁ ♦ గూల్చునటుల నా
ఘోరాకారుని జూచుచు,వీరకవుల్ కుంభకర్ణు ♦ భీతి వడఁకుచుర్. ౧౨౧

తే. వెఱఁగుపడియున్న వారౌట ♦ విపులమోద
మంది తనుఁజూడఁగా రోష ♦ మడర నతనిఁ
జంపఁ బైఁబడఁబోయె; నా♦త్మావిభుండు
భుజగతుల్యంబుగాఁ గడుఁ ♦ బోలి వెలసి. ౧౨౨ 2841

క. ఘనతరగుణయుతమగుచుం, గనకవిచిత్రంబునగుచుఁ ♦ గ్రాలెడుచాపం
బును గొని యుత్తమకరవిత,తిని గలతూణీరముల న♦తిస్థిరభంగిర్. ౧౨౨½

క. ధరియించి వనచరుల ని,ర్భరమోదం బలరుచుండ ♦ భయ మడఁగంగా
గర మాశ్వాసించుచుఁ దా,నరిగెర్ దనుజుర్ వధించు ♦ నాశయమొప్పర్.

క. బలశాలి పరమదుర్జయుఁ, డలఘుపరాక్రముఁడునైన ♦ యారాముం డి
మ్ముల వానరసంయుతుఁడై, సలక్ష్మణుండగుచు వెడలె ♦ సంగరకాంక్షర్. ౧౨౪

*క. గురుతనుని మకుటధారిని, నరిందముని రక్తసంప్లు♦తావయవుని దు
ర్భరబలునిఁ గుంభకర్ణుని, హరిభీకరుఁ గాంచె; నంత ♦ నయ్యసురుండుర్.

సీ. కుపితదిగ్గజమట్లు ♦ కోఁతుల వెదకుచుఁ దఱిమికొట్టుచు ఘోర♦దనుజపరివృ
తుండయి కనకాంగ♦దుండయి వింధ్యమందరపర్వతాభుఁడై ♦ ధరణిమీఁద
ఘనములు దూరమా♦ర్గమునుండి వృష్టినిగురియించునట్లు నె♦త్తురు వదనము
నుండి క్రక్కుచు,నాల్క♦నొగిరక్తమునునాకికొనుచునుశోణితా♦క్తుఁడయికపుల

---

* స దదర్శ మహాత్మానం కిరీటిన మరిందమం, శోణితాప్లుతసర్వాంగం కుంభకర్ణం మహాబ
లమ్-అనిమూ.

తే. నట్టి మర్దించుచుం బ్రళ♦యమున నున్న
యముని పోలికఁ గనఁబడి ♦ యగ్నిరీతి
వెలుఁగు నాగాత్మసోత్తము ♦ వింతగఁ గని
చాపగుణమును సారించె ♦ భూపవరుఁడు. ౧౨౯ 2846

ఉ. దానవసత్తముం డపు డు♦దాత్తరఘూత్తము చాపఘోషముం
దాను గఠోరరీతి విని ♦ దానికి నోర్వక యాగ్రహమ్ము వే
మానసమందుఁ బూని రఘు♦మండను మీఁదికి నేగె మార్కొనం
గా, నని వాతధూతఘన♦కల్పుని, [1]వాసుకిభోగబాహునిన్. ౧౩౦ 2847

[2]చ. ధరణిధరాభు నాదనుజ♦తల్లజుఁ డన్నని మార్కొనంగ స
త్వరముగ వచ్చువానిఁ గని ♦ పల్కె రఘూత్తముఁ డిట్లు; రమ్ము క
ర్బురగణపా! విషాదమును ♦ బూనకు నన్గనుమా నినుం గొనం
గరమున విల్లుఁదాల్చి శర♦కాండము లూనియె నిల్చినాఁడఁ జూ. ౧౩౧ 2848

చ. అమరగణేశవైరి నని ♦ నాత్మను నిన్నును నీవె యెన్నఁబో
కుము, రఘురాముగాఁ గుజన♦కోటిలయాంతకుఁగా నెఱుంగుమా
క్షమ నీకఁ గొంతసేపటికె ♦ కాయముఁ బాయును నీదుప్రాణముల్;
అమరపదంబు చేరుదువు ♦ హర్షము నొందెద వింకఁ జూడుమా. ౧౩౨

చ. అనవిని కుంభకర్ణుఁ డపు ♦ డాతని రామునిగా నెఱింగి ప
క్కున వికృతస్వరంబుగను ♦ గోరిక నవ్వుచు భూరికోపముం
గని కపులెల్లఁ బాఱఁ గపి♦కాంతుల గుండియ లట్టె వ్రీలఁగాఁ
జని రఘువర్యుమార్కొనియెఁ; ♦ జక్కని తేజము గల్గునాతఁడున్. ౧౩౩

ఆ. వికృతముగను మఱియు ♦ భీమంబుగా మేఘ
గర్జనంబు పోల్కి♦గాఁ బ్రహాస
మొప్ప రాముఁ గాంచి ♦ యప్పు డిట్లని పల్కె;
వినుము రామ! భూప ♦ వినుతనామ!. ౧౩౪ 2851

క. వనిఁ గన్పడిన విరాధుం,డనుగాను గబంధనాముఁ♦డనుగాను ఖరుం
డను గా నలమారీచుం,డనుగా నయ్యింద్రసూనుఁ♦డనుగాను జుమీ!. ౧౩౫

ఉ. నేననఁ గుంభకర్ణుఁడను ♦ నిన్నని మార్కొన వచ్చినాఁడఁ బెం
పూనినవాఁడఁ జూ! యిదిగో ♦ యుగ్రము నాయసనిర్మితంబునై
గానఁగ భూరివిస్తృతిని ♦ గ్రాలెడు నీఘనముద్గరంబు, నే
దీననె మున్ను దానవుల ♦ దేవతలం గడునోర్చి గెల్చితిన్. ౧౩౬ 2853

క. వినుమా! వికర్ణనాసుఁడ, నవి చుల్కఁగఁ జూడఁబోకు ♦ మవ్వి తెగుటచే

1 భుజంగరాజోత్తమభోగబాహుమ్-అనిమూ. ఇట భుజంగరాజు-అనఁగా వాసుకి యని గ్రహింపఁదగు. పెక్కుతావుల నిట్లె చెప్పఁబడియున్నది 2 ఆగచ్ఛరక్షోధిపమావిషాద మువస్థితోఽహం ప్రగృహీతచాపః-అనిమూ. నిన్నుద్ధరింప నిలిచి యున్నాఁడ రమ్ము. అనిభావము.

తను నాకు స్వల్పపీడయుఁ, గనఁబడకున్నయది యింక ♦ క్ష్మాపతివర్యా!. ౧౩౮

సీ. ఇక్ష్వాకువంశమ♦హీపతితిలకమా! మద్దేహమున విక్ర♦మమ్ము నెల్లఁ
జులకఁగాఁ జూపుమా!♦చూచి యంతటఁ బౌరుషమునీదు విక్రమ♦మమరనాథ
నింతమాత్రంబని ♦ యెఱిఁగి భక్షించెద నిను; ననుకుంభక♦ర్ణునివచనము
లను విని రాఘవుం♦డును సుపుంఖములయి తనరుబాణాళు ల♦తనిపయిఁ గడుఁ

తే. బూన్కి మెఱయంగ వైచె; వి♦బుధవిరోధి
వజ్రసమవేగములగు నా♦బాణనిహతుఁ
డై రవంతయుఁ గలఁగక ♦ యార్తినొంద
కల్లె నిలిచెను రాముఁ డ♦త్యద్భుతపడ. ౧౩౯ 2855

క. శరముల వేసిన పూర్వము, వరసాలద్రుమము లేదు ♦ వానరపతియై
పరఁగెడు వాలియుఁ ద్రెంపఁబడిరో యాబాణములు మఱి క♦డిందితనువులన్.

తే. వజ్రసమవేగమునను బ్ర♦భావిశేష
మునను జెలఁగియుఁ గుంభక♦ర్ణునితనువును
గాసిలం జేయఁగాఁ జాల♦కయె యడంగె;
నమరపతివైరి యంతట ♦ నాశరములు. ౧౪౦ 2857

చ. తనువునఁ జొచ్చి కన్పడమిఁ ♦ దాను శరీరముచేత వానినో
య్యన జలధారలం గొనెడు ♦ నట్టులుగాఁ ననుపట్టుచున్ జవం
బునఁ దనయుగ్రవేగమగు ♦ ముద్గరముం గడుఁద్రిప్పి బాణముల్
తనను బగుల్పకుండఁగను ♦ దప్పెడునట్లు చరించుచుండఁగన్. ౧౪౧ 2858

ఆ. క్షతజలిప్తమగుచుఁ ♦ గ్రతుభోజనులబల
మునకున్ భయంబుఁ ♦ గనఁగఁజేయు
నుగ్రజవము గల్గు ♦ నుగ్రముద్గరము దాని
ద్రిప్పి కపిబలములఁ ♦ దెరలఁజేసె. ౧౪౨ 2859

క. ధనువున రాముం డంతట, సునిశితవాయవ్యనామ♦శోభితమగుచున్
దనరారునస్త్రమును భీ,తిని గొలిపెడుదానిఁగూర్చి ♦ తిగిచి బలమునన్. ౧౪౩

చ. దనుజునిపైన వైవ నది ♦ దారుణభంగి సముద్గరంబుగా
దునిమెను వానిహస్తమును; ♦ దోడనె వాఁడు మహోత్తరంబుగా
స్వనముచెలంగ నార్చెఁ గడుఁ ♦ బర్వతకూటమురీతి నొప్పునా
తనిదగుబాహు వాయుధయు♦తంబుగ రామశరాభికృత్తమై. ౧౪౪ 2861

క. హరిరాజసేనలోఁ బడి, హరిభటులను మ్రందఁజేసె; ♦ హతశేషులు వా
నరభటులు భంగమొందియుఁ, గరము విషణ్ణులయి మిగులఁ♦గష్టముదోఁపన్.

తే. చెంతకున్ జేరి యంగముల్ ♦ వింతరీతి
వడఁకఁగా రామదనుజుల♦బవర మతిభ

యదమునుం జూచి రఘువ్యసు♦రాధిపుండు
నస్త్రవిచ్ఛేదితకరుఁడై ♦ యార్తుఁ డగుచు. ౧౮౬౩ 2863

తే. అపుడు వినికృత్తశిఖరమై♦నట్టి కొండ
వలెను చూడంగఁబడి రెండ♦వకరమునను
దరువు నొకదానిఁ బెఱికి సం♦గరమొనర్ప
నడరె రామునిపైకి న♦త్యద్భుతముగ. ౧౮౬౪ 2864

క. కనకవిచిత్రితబాణం,బును నైంద్రాస్త్రవరమంత్ర♦మును గూర్చిన దా
నిని గూర్చి సర్పదేహం,బన నొప్పుచు వృక్షసహిత♦మై యుద్యతమై. ౧౮౭

క. పెనురీతిగఁ దగుహస్తం,బును రెండవదానిఁ ద్రుంచె; ♦ భూధరమట్టుల్
గనఁదగునాతని బాహువు, వినికృత్తం బగుచుఁ బడియె ♦ విశ్వంభరపై. ౧౮౭౪

క. తిరుగుచు నద్ది ధరంబడి, తరుగిరిపాషాణములను ♦ దనుజుల మఱి వా
నరులను జూర్ణమొనర్చెను; గరయుగ్మము దెగినఁ గుంభ♦కర్ణుం డంతన్.

క. ధ్వనిచేయుచుఁ దనపయికిం, జనుదేరం గాంచి యర్ధ♦చంద్రాకృతులై
సునిశితములైన బాణము,లను రెంటిని దీసికొని వి♦లాసము మెఱయన్.

క. సురవైరి పాదయుగ్మము, ధరఁబడఁగాఁ ద్రుంచెఁ దత్ప్ర♦దంబులు పడున
త్తరుణమున దిగ్విదిక్కులు, ధరములుఁ గంధరము లబ్ధి♦దనుజపురంబుల్.

క. వనచరరాక్షసబలములు, ఘనూనవిధి మాఱుమ్రోయు♦నట్లు బెడిదమై
ధ్వనిపుట్టె నొకట; వినికృ,త్తనిజాంఘ్రికరుండు దనుజ♦తిల్లజుఁ డంతన్. ౧౯౦౪

క. తనవక్త్రము బడబాముఖ,మును బోలినదాని వికృత♦ముగ విప్పి మహా
ధ్వనిచేయుచు ద్యుగతునిఁ జం,ద్రుని రాహువుపోలె రాము♦ధూర్తుండగుచున్.

తే. తునిఁగిపోవఁగ మిగిలిన ♦ తొడలతోడఁ
దలపడియె;నంత వాడిమొ♦నలు చెలంగఁ
గనకమయపుంఖములతోడఁ ♦ గ్రాలుబాణ
ములను నాకుంభకర్ణుని ♦ ముఖము నిండ. ౧౯౨ 2872

క. నినిచెను బాణాపూర్ణవ, దనుఁడగుటన్ మాటలాడఁ ♦ దాఁ జాలక కో
యని యార్చి యెంతొ కష్టం,బున మూర్ఛిలె; నంతరాఘ♦వుఁడు క్రుద్ధుండై.

సీ. భాస్కరకిరణక♦ల్పంబుగా వెలయుచు బ్రహ్మదండమునకుఁ ♦ బ్రళయకాల
యమునకు నీడయి ♦ యరివినాశనచణంబయి చారుపుంఖమై ♦ యనిలవేగ
మయి నిశితంబయి ♦ యలరు నైంద్రశరంబుఁ గైనందె; వజ్రంబు♦కరణి బెడిద
మయి, స్వర్ణమయమయి ♦ యతిసుందరంబగుపుంఖమ్ముగల్గి దీ♦ప్తుల వెలుంగు

తే. భానుమహితమహాలట్లుగాఁ ♦ బ్రజ్వరిలుచు
శక్రవజ్రాశనిసమమహా ♦ జవముగలిగి

యున్న యాబాణమును రాముఁ ♦ డుగ్రరిపుని
పైఁ బ్రయోగించెఁ దనబాహు♦బలము కలఁది. ౧౫౪½ 2874

చ. శరమది తత్కరచ్యుతిని ♦ జానుగ నొంది సధూమదీప్తిభా
సురదహనాభమై దిశల ♦ శోభిలఁ జేయుచు వజ్రివజ్రము
ల్లరుదుగ వీర్యవిక్రమము ♦ లాయతరీతిఁ జెలంగుచుండ ని
ర్జరరిపుమీఁది కేగె; నట ♦ శాతశరంబది పోయి యుద్ధతిన్. ౧౫౫ 2875

క. మును దేవేంద్రుఁడు వృత్రుని, ఘనశిరసును ద్రుంచినట్లు ♦ త్ర్యాధరశృంగం
బనఁ దగి వివృత్తదంష్ట్రలఁ, గననయి కనుఁగొనఁగఁ దగని♦కరణి వికృతమై.

క. చలచారుకుండలంబయి, విలసిలుతచ్ఛీర్షము నట ♦ వేగము ద్రుంచెన్;
ఖలదానవశీర్షము కుండలయుగశాన్వితము త్రిదశ♦నాథశరముచేన్. ౧౫౬½

*తే. కడఁగి ఛేదింపఁగాఁబడి ♦ కడుజవమున
నభ్రగతమయి రాతిరి♦యందుఁ దోఁచి
యాపునర్వసుతారల♦యంతరమున
నున్నచంద్రునిభంగిగ ♦ నొప్పెఁ గాంతి. ౧౫౭½ 2878

సీ. రామప్రయుక్తశ♦రప్రఖండితమయి పర్వతాభంబయి ♦ పరఁగుకుంభ
కర్ణునిశీర్షము ♦ త్ర్యాస్థలిపైఁబడఁ దత్పాతమునఁ బుర♦ద్వారములును
జర్యాగృహంబు లు♦చ్ఛతరంబుగాఁ దగుప్రాకారమునుధరఁ♦బడియె;మఱియు
నాకుంభకర్ణదే♦హం బిలఁ బడుచుండ దానిచుట్టును నిల్చి ♦ మానసముల

ఆ. భయము తోఁపఁ బరుగు♦వాఱుచు నున్నట్టి, పెక్కుకోట్లకపులు♦నుక్కడంగి;
రంతఁ దుహినశిఖరి ♦ యట్లు గన్పడుదను,జునిశరీర మంబు♦ధిని వడిఁ బడి.

క. పెనుచేఁపల మింటుమొ,సళ్లను భూరిభుజంగవితతు♦లను జూర్ణముగా
నొనరించుచు నిలఁ జొచ్చెను;, ఘనబలుఁడై విప్రదేవ♦గణశత్రువునై. ౧౬౧½

తే. దుర్జయుండయి తగినయా♦ధూర్తదనుజుఁ
డని హతుండయి కూలిన ♦ నవనిగిరులు
చంచలించెను దేవతల్ ♦ సంతసముల
నార్చి, రంతట దేవమ♦హర్షిగణము. ౧౬౨ 2881

క. ఉరగులు సురభూతంబులు, గరుడులు గుహ్యకులు యక్ష♦గంధర్వులు నం
బరముననిల్చి రఘుక్షితి,వరముఖ్యుని విక్రమమును ♦ బహుభంగులుగాన్.

క. వినుతించిరి ముదమందిరి, దనుజేశ్వరుబంధువులగు ♦ దానవులు తలం
పను ధీరులయ్యు నాతం, డనిఁ బడుటకు మిగుల వగల ♦ నంది మనములన్.

క. సురపీడితులగునసురులు, మురవైరిం గాంచి యార్తిఁ ♦ బూనినకరణిన్

* కుంభకర్ణశిరో భాతి కుండలాలంకృతం మహత్, ఆదిత్యేఽభ్యుదితే రాత్రౌమధ్యస్థ
ఇవ చంద్రమాః-అనిమూ.

నరవరుఁగని వ్యథితులునై, గర మార్చిరి దిక్కులేని ♦ కరణి నని మొనన్. ౧౬౩

[1]ఆ. రాహుముఖమునుండి ♦ రవి విముక్తుండయి
దేవలోకతమముఁ ♦ ద్రెంచి వెలుఁగు
నట్లు రాముఁ డవని ♦ నాకపిగణముల
యంతరమున దనుజు ♦ నని వధించి. ౧౬౪ 2885

క. ఘనతరమగు తేజము మించెను; భీమపరాక్రముఁడయి ♦ చేర నెవరికై
నను దరముగాని శత్రువు, వినిహతుఁ డగుటయును బ్లవగ♦వీరులు మిగులన్.

తే. ఆననాబ్జములు వికాస♦మందఁగాఁ బ్ర
హర్షమును బొంది జయరూప♦మైన యిష్ట
సిద్ధి నంది ప్రకాశించు ♦ శ్రీరఘుపతి
నర్చనలఁ దన్పి రాభర♦తాగ్రజుండు. ౧౬౫ 2887

చ. సురనికరంబు యుద్ధమున ♦ స్రుక్కఁగఁ జేసి మహాహవంబులన్
గరముఁ బరాజితశ్రముఁడు ♦ గాఁదగు నాతనిఁ గుంభకర్ణు సం
గరమునఁ జంపి వృత్రుఁడను ♦ గర్వ్బరవర్యుని జంపినట్టి ని
ర్జరపతిపోలె నెంతయును ♦ సంతసమొంగనె నెమ్మనంబునన్. ౧౬౬ 2888

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౬౮ - వ సర్గము.

రావణుఁడు కుంభకర్ణమృతికై దుఃఖించుట.

క. దనుజులు మహాత్ముఁడౌ రా,మునిచేఁ గుంభశ్రవుండు ♦ భూరిరణమునం
దున హతుఁడగుటం గని చని, దనుజవితతినా[2]యకుఁడయి ♦ తగు రావణునిన్.

క. కని పల్కిరిట్లు; రాజా!, వినుమా! కాలోపముఁడయి ♦ వెలయుచుఁ గపివా
హిని దఱిమి వారిఁ దినియును, ఘనవీర్యముఁ దెలిపి కుంభ♦కర్ణుం డనిలోన్.

ఆ. కాలధర్మమొందె; ♦ త్ముధరాకారుఁడౌ, కుంభకర్ణుఁ డనిని ♦ గొంతసేపు
విక్రమంబునూపి ♦ విసికృత్తకంఠోరు, బాహువగుచు నల్ల♦వఱద మునిఁగి.

చ. ధరణివిభూత్తమాంబకవి♦తానముచేఁ గడుఁ బీడితాంగుఁడై
గురుదహనార్చిఁ గాలి పడు ♦ క్షోణిరుహాంబటు లొక్కముద్దయై

1 స దేవలోకస్య తమో నిహత్య సూర్యో యథా రాహుముఖా ద్విముక్తః-అనిమూలము.

2 'య' యనునక్షరము గాయత్ర్యష్టాదశాక్షరము. ఇచట "కుంభకర్ణం హతం దృష్ట్వా రాఘవేణ మహాత్మనా, రాక్షసా రాక్షసేంద్రాయ రావణాయ న్యవేదయన్" అనుమూలమున "రాక్షసేంద్రాయ" యనుచోట నవఁగా నిరువదినాల్గవయక్షరమగు యకారము గాయత్రియని గోవిందరాజులు భిన్నాభిప్రాయమును వ్రాసిరి.

గరము వికారదర్శనము♦గాఁ దగునర్ధశరీర మాభయం
కరజలరాశిలోనఁ బడఁ♦గాఁ బయిభాగము లంకద్వారముల్. ౪ 2892

ఆ. అడ్డగింప నెట్టు ♦ లారాము తేజంబు, చే నడంగిపోయెఁ ♦ జిత్రరీతి;
ననిన భీమబలము♦నను బొంగుకుంభక,ర్ణుండు తెగినవార్త ♦ శ్రుతులఁబడఁగ.

క. ఉరుశోకంబునఁ గుందుచు, ధరణింబడె మూర్ఛ మునిఁగి ♦ తండ్రి సహాజుఁడీ
కరణిం బడులను ద్రిశిరుఁడు, నరదేవాంతకులు దితిజ♦నాథులు మఱియున్.

క. అతికాయుండును శోకా,ర్దితులై యేడ్చిరి; మహీప♦తి ప్రభుఁ డగుచున్
హితమే యొరులకుఁ జేసెడు, కృతపుణ్యుఁడు రాఘవుండు ♦ కేవలశక్తిన్.

క. సోదరునిఁ జంపు టెఱిఁగి మ,హోదరుఁ డాతనికిఁ బ్రియమ♦హోదరుఁ డరిరా
ట్సూదనుఁడు మహాపార్శ్వుఁడు, మేదినిఁ బడి యేడ్చిరిమది♦మించెడువగలన్.

చ. దనుజవరేణ్యుఁ డంతట వ్య♦థన్ స్మృతిలేకయె యుండి యెట్టులో
గని స్మృతిఁ గుంభకర్ణుమృతి ♦ కాఱియపెట్టఁగ దీనుఁడౌచు నే
డ్చెను; రిపుగర్వసంహరణ♦జృంభితవిక్రమ! హాసహోదరా!
ఘనబల! దైవయత్నమున ♦ గాదిలియన్ననునన్ను నీక్షితిన్. ౯ 2897

తే. విడిచి యమలోకమునకు ని♦ర్వృతిని గోరి
పోయితివె?; భూరిబలుఁడవై ♦ పొందునీవు
నాకు నాబంధువులకు మ♦నంబులందు
శల్యమట్టులు పీడింపఁ ♦ జాలు వగను. ౧౦ 2898

క. వెలికిం ద్రోయకయే రిపు, బలములఁ దపియింపఁ జేసి ♦ వదలి యిట నన్
బలశాలీ! పోయెదవే?, యిల నే దేనిని సమాశ్ర♦యించి యనిమొనన్.

క. సురలకు నసురులకును నె, త్తరుణమునందైన నాహ్వ♦దయమున భీతిం
జొరనీకుందునొ కుడిభుజ, మురుతర మది క్రిందఁబడియె ♦ నొక్కవిధిగతిన్.

తే. ఇంక నేలేనివాఁడ న♦యితి బ్రదికియు;
దేవదానవగర్వంబుఁ ♦ బోపఁ జేసి
మఱియుఁ గాలాగ్నిరుద్రుని ♦ మాడ్కినున్న
యమ్మహావీరుఁ డీసంగ♦రాంగణమున. ౧౩ 2901

క. *మనుజేశుఁడైన యారా,మునిచే నెటు నిహతుఁడయ్యె? ♦ మునుపే ఘనబా
హునకున్ బవినిష్పేషం,బు నొకప్పుడు శ్రమను సుంత♦పుట్టింపంగన్. ౧౪

తే. శక్తిచాలకయుండెనో ♦ సాధువర్య!
యట్టి నీవెట్లు రామసా♦యకము లార్తిఁ
గనఁగఁ జేయఁగ క్షితిఁబడి ♦ గాఢనిద్ర
నందుచున్నావు? చెప్పుమా ♦ యనుజ నాకు. ౧౫ 2903

* యస్య తే వజ్రనిష్పేషో నకుర్యా ద్వ్యసనం సదా-అనిమూ.

క. సురగణము లివిగొ మానివి,సరములతోఁ గూడి దివిని ♦ సంగరమృతునిన్
సురవైరి నిన్నుఁ గని హా,ర్షరతిన్ ధ్వనిసేయువారు ♦ రాముఁ బొగడుచున్.
క. వనచరులు ప్రహర్షంబునఁ, గని యవసర మిట్టు లిపుడె ♦ కడఁగి చొరఁగరా
ని నగరవిలసద్ద్వారము, లను నెల్లెడ నెక్కుదురు వి♦లాసము మీఱన్. ౧౬
సీ. ఇది నిశ్చయమ్ము సు; ♦ మ్మిఁక రాజ్యమేల నా కీసీతతోడ నే♦నేమి చేయఁ
గలను? దమ్ముఁడు కుంభ♦కర్ణుండు లేకున్న బ్రదుకుపై నాసక్తి♦యొదవదెపుడు
నాతమ్ము ననిఁ జంపి♦న రఘుకాంతుని రాము వధియింపనేని నా♦బ్రదుకిది యిట
శ్రేయమే గాదు నే♦జీవించి యుండుటకంటె మృతిం దగఁ ♦ గనుటె మేలు
తే. తమ్ముఁ డెచటికిఁ బోయెనో ♦ తప్ప కిపుడె
యచటికేఁ బోయెదను మత్స♦హాజుని విడిచి
క్షణమెయైనను జీవించి ♦ క్షమ నిలువఁగ
నుత్సహింపను; దేవత ♦ లౌక్య రీతి. ౧౯ 2906
క. మును తమకపకారము చేసిన నన్నుం జూచి యిపుడు ♦ సేయుదు రెలమిం
గని యుపహాసము; సహజా!, యనిఁ దెగితివె యింక నేను ♦ నసురేశ్వరునిన్.
క. కలనున నెట్లు జయింపం, గలను? మహాత్ముండు మాని♦కల్పుం డగుచుం
బొలుపొందువిభీషణుఁ, డిమ్ముల నాకున్ మేలుగోరి ♦ మును పాదృతితోన్.
ఆ. చెప్పినట్టిపల్కు ♦ చెందె సత్యమ్ముగా, నన్ను నిపుడు; దాని ♦ మున్ను నేను
సంగ్రహింపనైతి ♦ సాంద్రమై యజ్ఞాన, మావరించియుంట ♦ నరయక మది.
క. అనిఁ గుంభకర్ణునకు మఱి,యును నల్లె ప్రహస్తునకు మ♦హోత్పాతముగాఁ
గను గల్గె మృతి తదాదిగ, ననుజోక్తి గలంగుచున్న ♦ యది నామనసున్.
క. సిరివెలయ ధార్మికుండై, పరఁగువిభీషణుని నేను ♦ బట్టినపూన్కిన్
బురివెడలించితి నయ్యది, పరిపక్వంబగుచు నాకుఁ ♦ బాపఫలముగన్. ౨౪
ఆ. సంభవించినదియె ♦ సాంద్రశోకప్రద, మగుచు ననుచు నేడ్చె; ♦ నమరనాథు
వైరి కుంభకర్ణుఁ ♦ డారఘూత్తముచేత, ననినిఁ దెగుట యెఱిఁగి♦యాత్మఁగుంది.
క. పలుభంగుల నాతనికై, పలవించుచు వగల నోర్వ ♦ భారమగుట, మి
క్కిలి యార్తి సోలి యొయ్యన,నిలఁబడియెన్ గుంభకర్ణుఁ♦డిటు చనె ననుచున్.

అఱువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౯ - వ సర్గము.

మహోదర, మహాపార్శ్వ, నరాంతక, దేవాంతక, కాతికాయ, త్రిశిరుల యుద్ధము

క. దురితాత్ముఁడు రావణుఁ, డీ, కరణిన్ శోకమునఁ గుంది ♦ కడు నేడ్వంగాఁ
గరుణం ద్రిశిరుం డిట్లనె,యె; రావణా! లోకపాల! ♦ యీబవరమునన్. ౧
క. *మాతాతమధ్యముఁడు వి,ఖ్యాతపరాక్రముఁడు పొగడఁ♦గా నర్హుఁడె నూ

---

* నస్తాత మధ్యమః-అనిమూ॰

యాతరుణమున ననిం బడె, ధాతృగతిన్ సుజను లెట్టి ♦ తరుణమునందున్.

క. విలపింపరు మీవలె; నో,యిలాధిపా! ముజ్జగముల ♦ కీవొక్కఁడ వి
 మ్ములఁ జాలుదు విదినిజమాఁ, దలపోయక యట్టి నీవు ♦ తగనివిధమునన్. ౩½

తే. ప్రాకృతునిరీతి శోకంబు ♦ పాలఁబడితి, వేల?;నినుఁగూర్చి యాయజుఁ♦డిచ్చినట్టి
 శక్తియును,గవచంబును♦చాపబాణ,ములుసహస్రఖరంబులఁ ♦ జెలఁగురథము.

క. కలవా;స్యందనవర్యము, జలదస్తనితంబురీతి ♦ శబ్దించుఁగదా
 గలవిన్నియు నివిలేకయె, కలనున నొక్కపుడు త్రిదశ♦కర్బురగణమున్. ౪½

క. అనితరసాధ్యపరాక్రమ,మున నాయుధమైన లేక ♦ మునుకొని విదళిం
 చినవాఁడవు గద నీవిపు, డనూనదివ్యాస్త్రయుతుఁడ♦వై రాఘవునిన్. ౫

క. అనిఁ జెండివైవ నేర్తువు;, దనుజేంద్రా! సార్వభౌమ! ♦ తమినుండుమ నీ
 వు నగరముననే యుద్ధం,బున కేగెదఁ దార్క్ష్యుఁ డహిన♦మూహముఁ బోలెన్.

క. నీవైరులఁ బోకార్చెద;, దేవేంద్రుఁడు శంబరుఁడను ♦ దితిపునిఁ బోలెన్
 గోవిందుఁడు సింహికసుతుఁ,డై నఱలెడునరకుఁబోలె ♦ నాహవభూమిన్. ౬

క. రామునిఁ బడవైచెద ను,ద్దామబలం బొప్ప; ననిన ♦ దనుజేంద్రుండా
 భీమబలుండగు త్రిశిరుం, డామాడ్కిం బల్క విని మ♦హాహర్షమునన్. ౬½

తే. కాలచోదితుఁ డగుట రా♦ఘవుని గెల్వఁ
 దరముగాదని తెలియక ♦ తన్నుమరల
 జనన మందినవానిగఁ♦గను దలఁచుకొ
 నియెను; త్రిశిరుండు పల్కవి♦ని కడుఁబూని. ౭ 2923

క. దనుజేంద్రకుమారులు వ,జ్రనిబోలినవిక్రమములఁ ♦ జెలఁగుచు ధైర్యం
 బునవొప్పు దనుజవర్యులు, మనమున నుత్సాహ మలర ♦ మహితవిభూతిన్. ౭½

తే. అనికిఁ బోవంగ నేను నే♦ననుచు నార్చు
 చును నరాంతకుఁ డతికాయుఁ ♦ డనుపమాన
 కాంతియుక్తుఁడు మఱియు దే♦వాంతకుండు
 తండ్రి కుత్సవ మలరంగఁ ♦ దరలిరంత. ౧౦ 2925

క. వారంతరిక్షమునఁ జను,వారలు మాయలను మించు♦వారు త్రిదశులం
 బోరున గర్వమడంగం,గా రయమునఁ జేయువారు ♦ కడుదుర్జయులున్. ౧౧

క. బలసంపన్నులు విస్తృత,లలితయశఃకీర్తియుతు లి♦లాస్థలిని సురా
 వళిగంధర్వులు సర్పం,బులు కిన్నరు లెత్తివచ్చి ♦ పోరినయెడలన్. ౧౨ 2927

తే. అపజయము వీర లొందిన♦యట్లు విన్న
 యదియె లేదందఱును మహా♦హవవిశార
 దులును విద్యాధికులు శాస్త్ర♦ముల నెఱింగి
 నట్టి ప్రోడలు వరముల ♦ నలరువారు. ౧౩½ 2929

చ. సురరిపునాథుఁ డత్తఱిని ♦ సూర్యసమప్రభలొప్పఁగా రిపూ
త్కరబలమర్దనంబున ని♦కామము శక్తిఁజెలంగు పుత్రకుల్
నిరతిని జుట్టుగొల్వఁగను ♦ నిర్భరశక్తిఁ బలాశగర్వమున్
నిరతముఁ జెందు దేవతలు ♦ నెమ్మినిగూడఁగ నున్న దేవతా
వరువలె భాసిలెన్ ; మఱియు ♦ వారల నాతఁడు కౌఁగిలించుచున్. ౧౬

తే. భూషణంబులఁ గైసేసి♦పొలుపుమీఱ, నాశిషంబుల నలరించి♦యనికిఁ బంపె;
రావణుండంతఁ దనయుల ♦ రక్షణార్థ, మనుజులై యుద్ధదుర్మదు♦లై చెలంగి.

తే. తనకు నీడయి తగుమహో♦దరుని నల్లి
యమ్మహాపార్శ్వునిం బంపె; ♦ నతులకాయు
లయిన యారాక్షసులును మ♦హామతియగు
నన్నయయి రిపురావణుం♦డయి తనర్చి. ౧౮ 2931

క. ఘనుఁడగు రావణునకు వం,దన మిడి వలగొనుచుఁ జనిరి ♦ దారనిసేయం
గను, గురుబలులౌ దైత్యే,శునిసుతు లాఱుగురు కాంతి♦శోభితులగుచున్.

సీ. ఆయుధంబుల సంప్ర♦హారంబులను మాన్పునాహరిద్రాద్వయ, ♦ మమలచంద
నము,జటామాంసి,కో♦ష్ఠము నశ్వగంధియు,సంపెఁగ రాతిపు♦ష్పము లవంగ
పత్రము,ముస్త, యీ♦పదియోషధులను జక్కనిచందనమ్మును ♦ గమ్రరీతిఁ
గాఁ బూసికొని యుద్ధ♦కాంక్షచే వెడలిరి త్రిశిగోనరాంతకుల్ ♦ తెంపుగల్గు

తే. నట్టి యతికాయుఁ డట్టి దే♦వాంతకుఁడు మ
హోదరుండు మహాపార్శ్వుఁ ♦ డుగ్రశౌర్య
మడర; నంతమహోదరుఁ ♦ డసితమేఘ
సదృశ మైరావతకులసం♦జనితము నయి ౨౦ 1933

క. తనరుసుదర్శననాగం,బును నారోహించె; నతఁడు ♦ భూరిలసత్సా
ధనములు నమ్ములపొదలును,ఘన తేజము నలర వెలయ ♦ గజవర్యముపై. ౨౧

*క. ఆరోహించి వెలింగెను, సారసనఖుఁ డస్తశైల♦సమధిగతుండౌ
తీరునఁ; ద్రిశిరుఁడు రావణు,కూరిమిపుత్త్రుండు మిగులఁ ♦ గోరికమీఱన్. ౨౨

తే. ఉత్తమాశ్వసమన్విత ♦ మురుతరాయు
ధాన్వితమునగు చక్కని♦యరద మెక్కె
నాయుధంబుల కాంతులు ♦ హారితరము
గాఁ బ్రకాశింప నిస్వన♦కలితరథము. ౨౩ 2936

తే. ఎక్కి చాపంబుఁ దాల్చిన ♦ యుక్కఁ ఘోర
దనుజుఁ డప్పుడు విద్యుద్వి♦తతులు నుల్క

* సవితే వా స్తమూర్ధని-అనియూ.

గములు నింద్రచాపంబులు ♦ గలిగి కొండ
శిఖరగతమేఘమును బోలి ♦ చెన్నుమీఱె. ౨౩౪ 2937

క. వరరథమందున నాతఁడు, శిరముల మూఁడింటియందుఁ ♦ జెలఁగు మకుటముల్
గరమరుదుగ మూఁడొప్పశి,ఖరములు కనకాంచితములు♦గా మూఁడలరన్.

తే. అద్రిరాజం బనందగు ♦ నట్టి తుహిన
శైలమట్లు ప్రకాశించె; ♦ సాంద్ర తేజ
మున వెలుంగుచు విలుకాండ్ర ♦మూఁకలోన
మేటియగు నతికాయుండు ♦ మించు వేడ్క. ౨౫ 2939

క. తనతండ్రి రావణుఁడు నె,మ్మనమునఁ బొంగంగ మిగుల ♦ మంచియరద మె
క్కెను నది చక్రాక్షంబులఁ,గనమిన్నఁగనొప్పినొగయుఁ♦గడుదృఢమగుచున్.

తే. దార్వథస్థంబు చక్కఁగాఁ ♦ దనరఁ దూణ
ములును బాణాసనంబులు ♦ వెలయఁ బ్రాస
పరిఘములు కత్తులును నిండ ♦ భాసిలంగ
నంత నతికాయుఁ డాత్మలో ♦ నలరు వేడ్క. ౨౬ 2941

క. కనకాంచితమై చిత్రం, బును నగుమకుటంబు మించు♦భూషణములు చ
క్కనికాంతి వెలయఁ గాంతుల, ననరెడు మేరువన వెలిఁగె; ♦ దారుణబలుఁడై.

చ. దనుజలలామపుత్త్రకుఁడు ♦ దస్యుకులాంతకుఁడై సురాళితో
డను దగునింద్రుఁబోలుచుఁ గ♦డంగిన రాక్షసులెల్లఁ గొల్వమిం
చెను; నవుడా నరాంతకుఁడు ♦ జిష్ణుహయంబును బోలి స్వర్ణకాం
తనిఖిలభూషణాళిఁ దగి ♦ తద్దయు దీర్ఘశరీర మొప్పఁగన్. ౨౭ 2943

సీ. శ్వేతవర్ణంబునఁ ♦ జెలఁగి మనోవేగమునఁ బొల్చుహయమునె♦క్కెనతఁడుల్క
వంటి ప్రాసముఁగొని ♦ భాసురశక్తిఁ జేఁగొని తేజమున వెలిం♦గిన కుమారుఁ
డామయూరము నెక్కి ♦నట్టివిధంబునఁ జెలఁగె; దేవాంతకుఁ ♦ డలఘువజ్ర
భూషితపరిఘంబుఁ ♦ బూని మందరగిరిఁదాల్చిన యావిష్ణు♦తనువుఁ బోలి

తే. వెలసె; నంత మహాపార్శ్వుఁ ♦ డలఘుతరము
గాఁ గనంబడు గదఁదాల్చి ♦ కదనమందుఁ
గరమునన్ గదఁ దాల్చు యు♦క్షవిభురీతిఁ
దాఁ బ్రకాశించె నతులమా ♦ దర్పమొప్ప. ౩౨౪ 2944

క. సురలప్రతిమభటాళిం, బరివృతులై దివమునుండి ♦ బయలు వెడల న
ట్లురుబలయుతదనుజులు దు,ర్భరబలభటయుక్తులగుచు♦రయము మెఱయఁగన్.

ఆ. పురమునుండి వెడలి♦పోయిర కదనమ్ము, చేయు వేడ్క బలవి♦జృంభితులగు
దనుజులొక్కకొంద♦ఱనుమోదముననమ,స్త్రాయుధములఁ దాల్చి♦హస్తిగణము.

తే. హయములను మేఘనిస్వన ♦ మట్లు మొరయ
నరదముల నెక్కి వారల ♦ ననుసరించి
చనిరి; బలశాలురై సూర్య♦సమరుచులయి
నత్కిరీటములఁ దగురా♦క్షసతనయులు. ౩౫ 2947

క. నిరుపమకాంతిం దగి యం,బరమునఁ దేజరిలు ఖేట♦వారమువలెఁ బొ
ల్చిరి; వారియాయుధంబుల, వరుసలు శారదఘనాళి♦వలె సితరుచులన్. ౩౬

ఆ. అంచపిండునాఁగ ♦ నలరారె; వీరులా, దనుజవరులు శత్రు♦తతిని గెలువ
వలయు లేక మనము♦ వారిచేమృతినైనఁ, గాంచవలయు ననెడు♦ కాంక్షలొప్ప.

క. చని రని నిట్టులు చేయం, గను బూనుచు నంత వీర ♦ కర్బురులు మదం
బున మించి యని నొనర్పం,గనెంచి యుండుటను దారు♦గదలుచుఁ బేర్మిన్.

తే. సింహనాదములను మించి♦చేసి యార్చి
శరములను వైచి యా శర♦సమితి మరలఁ
బట్టుకొని రప్పు డవ్వారి ♦ పటురవముల
నప్పులింతలఁ జలియించె ♦ నవనియెల్ల. ౩౯ 2951

క. వారల సింహస్వనములఁ, దారాపథ మట్టె పగిలి ♦ ధరఁబడునట్లే
ప్రారంభంబునఁ గన్పడె;, నారాక్షసు లతిబలాఢ్యు ♦ లంత ముదమునన్. ౪౦

చ. చని యటఁ బ్రస్తరంబుల వి♦శాలతరువ్రజమున్ ధరించి చ
య్యన నని సేయ నిల్చిన మ♦హాకపులం గని; రంతవానరుల్
ఘనబలులై గజాశ్వవర♦కాండముతోఁ గుమిగూడి స్యందనా
ఘనిబిడకింకిణీశతని♦కామవరంబుల మ్రోగుచుం గదున్. ౪౧ 2953

చ. శరముల గొప్పయాయుధని♦కాయముఁ దాలిచి ముందునగ్నినాఁ
బఱఁగుచు దీప్తసూర్యువలె ♦ భాసిలురాక్షసు లెల్ల నొప్పఁగాఁ
గరము వినీలమౌ జలద♦కాండమురీతిగఁ గూడివచ్చునా
సురులను వారిసైన్యమును ♦ జూచిరి; భూరిబలాఢ్యులౌ కపుల్. ౪౨ 2954

క. చనుదెంచుచున్న యాబల,మును గని తమభూరివీర్య♦మును జూపఁగఁ జ
క్కనితఱి చిక్కె నటంచును, బెనుగొండలఁ దాల్చి యార్చి♦పృథురావములన్.

క. దనుజులఁ గని తారోర్వం,గను జాలక యార్చుచుండఁ♦గాఁ; బృథుబలులై
కన భీమరూపులగు నా, దనుజులవ్యూహంబు కపిన♦తంసార్భటులన్. 2956

క. విని వారిహర్షమును నో,ర్వను జాలక యతిభయంక♦రమ్ముగ నార్వన్
వనచరయూథపులును భీ,తిని గొల్పెడు దనుజబలముఁ ♦ దెంపుమెఱయఁగన్.

ఆ. చొచ్చి చేతులందు ♦ క్షోణీధరంబులు, గ్రాల శిఖరములను ♦ లీలఁ గూడి
యున్నకొండ లట్టు ♦ లొగి సంచరించిరి;, మఱియు వానరులట♦మహితశక్తి.

క. తరుశిల లాయుధములుగాఁ, గరముల గ్రహియించి దురము♦గావించెదుని

ర్భరశక్తియుతులు గావునఁ, దరువులఁ బెనుబోదెలెల్లఁ ♦ దనరెడువారిన్.

క. కొని పరమక్రోధంబున, దనుజుల మార్కొనుచు నభ్ర ♦ తలమున భూమిన్
గనుపట్టుచు విహరించిరి; దనుజులు వానరులు గలిసి ♦ దారుణభంగిన్. ౪౮

తే. సంగరం బొనరించిరి ♦ సాధ్వసావ
హంబయిన విక్రమంబున ♦ నలరుకపులు
దనుజసైన్యప్రయుక్తబా ♦ ణనికరమున
దారు వారింపఁ బడియు నం ♦ తట నిలువక. ౪౯ 2961

క. తరువుల శిలలం గొండలఁ, గురియించి రసమముగాఁగఁ ♦ గోఁతులు దనుజో
త్కరములు సింహాధ్వను లంబరమున నిండంగఁ జేసి ♦ బవరముచేయన్.

క. ఘోరంబయ్యెను రాక్షసు, లారభటిం బైకొనంగ ♦ నపుడు శిలలచే
వారలఁ జూర్ణము చేసిరి, వీరులు వానరులు మఱియు ♦ వీరదనుజులన్. ౫౦

సీ. కవచముల్ దొడిగి రత్నవరాభరణములఁ దాలిచి రథములఁ ♦ దమిచెలంగ
నెక్కినవారిని ♦ నేనుంగులన్ మఱి గుఱ్ఱంబులను నెక్కి ♦ కోర్కియుద్ధ
మొనరింపఁబూనిన ♦ యుగ్రులఁ గనుఁగొని కపులట్టె యెగిరి భీ ♦ కరముగాఁగఁ
జంపిరి; మేటిరా ♦ క్షసులు పర్వతశృంగములు తమమేనుల ♦ వెలసియుండ

తే. ముష్టితాడనముల నేత్ర ♦ ములు వెలువలి
కుబ్బియుండంగఁ దిరుగుచు ♦ నుర్వినిఁ బడి
యఱచి; రంతట రాక్షసు ♦ లతినిశాత
బాణములువైచి చంపి రా ♦ ప్లవగవరుల. ౫౩ 2964

క. దనుజులు కొందఱు శూలము,లను ముద్గరములను గత్తు ♦ లను శక్తిప్రా
సనిచయముల వధియించిరి;, వనచరులును దానవులను ♦ బవరమునందున్.

తే. ఒకరి నొక్కరునొంచెడు ♦ నూహలొప్ప
వైరిశోణితదిగ్ధాంగు ♦ లై రయమున
నవనిఁ బడఁ గూల్చి రొకముహూ ♦ ర్తాంతమున నె
యారణక్షితి యెల్ల ఘో ♦ రాకృతిఁ దగి. ౫౪ 2966

క. హరిదనుజు లొకరిపై నొ, క్కరువైచిన పర్వతముల ♦ ఖడ్గవితతులన్
బరివృతమై రక్తనదీ, పరికీర్ణయయ్యె; నంతఁ ♦ బ్లవగభటు లొగిన్. ౫౫

చ. అని నపుడంతటన్ గిరిస ♦ మాకృతులై పగవారిఁ జెండుచున్
ఘనసమరాభిమానమునఁ ♦ గ్రాలుచునుండిన దానవాళివా
తనువులు నిండియుండెఁ; గపి ♦ తల్లజు లప్పుడు బాహుసంగరం
బున దనుజాళినెత్తుకొని ♦ భూమిఁ బడంగను వీచి వైచుచున్. ౫౮ 2968

క. వారల శూలాయుధముల, ఘోరంబుగఁ ద్రుంచియు నిలఁ ♦ గూలం దన్నం

గా రాక్షసులును మరలుచుఁ, బోరం బూని రొగి హస్త♦ములఁ బాదములన్.

క. కనువారికి నచ్చెరువుగ, దనుజులు నీరీతిఁ బోరి ♦ తద్వానరులన్
వనచరులతోనె కొట్టఁగ, వనచరులను రాక్షసులను ♦ బట్టి బలిమిమై. ౫౯

క. దనుజులచేతనె చంపం, గను దొడఁగిరి; రాక్షసులును ♦ గపు లేపునవై
చిన శిలలఁ బట్టుకొని య, వ్వనచరులం గూల్చి రంత ♦ వానరులు వడిన్.

చ. దనుజులచేతియాయుధవి♦తానము బల్మిని లాగికొంచు వా
రినె పడఁగొట్టి; రిట్లలఘు♦రీతుల దానవవానరుల్ రణం
బున నితరేతరంబు గురు♦భూధరశూలశరాళి వైచుచున్
దనుజులఁ జంచుచుం దమి ని♦తాంతహరిధ్వను లొప్పఁ జేయుచున్. ౬౦

క. చెలరేఁగుచుండి; రంతటఁ, గలనున రాక్షసులు కపుల ♦ కరతలఘాతం
బుల భిన్నకవచులై తరు,వులనుండి పయస్సువోలె ♦ భూరితరముగన్. ౬౧

క. తనువులనుండి యసృగ్వా,హిని వెడలఁగ నొప్పి; రంత ♦ నేనుఁగుచే హ
స్తిని గుఱ్ఱముచే గుఱ్ఱం, బును రథమును రథముచేతఁ ♦ బూన్కిఁ గపివరుల్.

క. అనిఁ గొట్టిరి; మఱియు మహా, వనచరు లందఱును హర్ష♦వర్ధితు లగుచున్
గినుక మనశ్శిలలం గొని,యును బహుశాఖా త్తములగు ♦ నుర్వీజములన్.

క. కరములఁ బట్టియు దనుజో,త్కరముల వధియించి; రపుడు ♦ క్రవ్యాదకపీ
శ్వరులకును జెల్లె నతిభీ,కరసంగర; మంతఁ గ్రుధను ♦ గర్బురవరులున్. ౬౨

సీ. అర్ధచంద్రాకృతి ♦ నలరుబాణంబుల బల్లమ్ములను, క్షుర♦ప్రముల, నిశిత
శరములఁ గపులపైఁ ♦ బరఁగించుచును వారు వైచిన శిలలను ♦ బాదపముల
ఖండించి; రట్టి సం♦గరమున నాల్గుప్రక్కలఁ బడియుండిన ♦ క్ష్మాధరాగ్ర
ములు ఛిన్నభూరుహం♦బులు చచ్చిపడియున్న కపిదనుజులునుంట♦గమనమునకు

ఆ. ననువుగాక యుండె ♦ నాభూమి; తఱుగని, బలముగలుగునట్టి ♦ వనచరులొగి
గర్వహర్షములను ♦ గ్రాలుచుఁ దోఁచిన, చేష్టలెల్ల నట్టె ♦ చేయుచుఁ గడు.

క. ప్రవిదారణ మొంది భయం,బు విడిచి రాక్షసులశస్త్ర♦ములఁ గైకొని వే
డ్క విమతులతోడ యుద్ధం,బు వరుసఁ గావించి; రెంతొ♦పొంగెడుకాంక్షన్

తే. అట్లు సంకులసంగర ♦ మగుచునుండఁ
గపులు హర్షంబునన్ రేఁగఁ ♦ గర్బురు లొగిఁ
గూలుచుండుటయుం జూచి ♦ కుతుక మలర
*మునివరులు దేవతలు నార్చి ♦ రనుపమముగ. ౬౩ 2979

ఉ. అంత నరాంతకుండు పవ♦నాయతవేగముగల్గు ఘోటకం
బెంతయుఁ బ్రీతి నెక్కి నిశి♦తేష్టదశక్తిని గై ధరించి యా

* మహర్షయో దేవగణాశ్చ నేదుః-అనియూ.

వంతయు భీతిలేక విపు♦లార్ణవ మొందుఝషంబురీతిగాఁ
బంతము మీఱఁ జొచ్చెఁ గపి♦వర్యమహాబల మార్గఘటించుచున్. ౬౯ 2980

క. కనదుగ్రప్రాసంబున, వనచరుల నరాంతకుండు ♦ బలము మెఱయఁ జం
పెను నేఁడునూర్లమందిని, దననేర్పున మించి చీల్చి ♦ దనుజులు పొగడన్.

క. బలశాలి యింద్రశత్రుం, డలఘుజవం బొప్ప నొకఁడె ♦ హరిపుంగవసే
నల నొక క్షణమాత్రంబునఁ, గలగుంఁడుపడంగఁ జేసెఁ ♦ గదనంబందున్. ౭౦

*క. మునివరవిద్యాధరు లా, యనిమొన గుఱ్ఱంబునెక్కి ♦ హరిబలమున స్వే
చ్ఛను విహరించుమహాబలు,ని నరాంతకుఁ గాంచి; రంత ♦ నిర్భరశక్తిన్. ౭౧

ఆ. అతఁడు పర్వతముల ♦ యట్టికపులఁ గూల్చు,చును జెలంగి పోవ ♦ ననిదనుజుని
మార్గమందుఁ గపుల ♦ మాంసశోణితకర్ద,మమ్మునిండియుండె♦మఱియునతఁడు.

క. వనచరులు పరాక్రమమును, గనఁబఱుపఁ దలంచుచుండఁ♦గా వారలమా
ర్గాని యాక్రమించి భేదిం,చెను; మఱియు నరాంతకుండు♦చెందిన వేడ్కన్.

ఆ. ప్రజ్వలించుచున్న ♦ ప్రాసంబుఁ దాలిచి
కాననముల వహ్ని ♦ కాల్చురీతిఁ
గపిబలంబు నపుడు ♦ కాల్చె; వానరులు వృ
క్షముల గిరులఁ బెఱుకఁ♦గాఁ దలంప. ౭౪ 2986

క. వారల నంతటిలోనే, ఘోరప్రాసమునఁ గొట్టి ♦ కూల్పఁ బవిలస
ద్ధారాహతిఁ గూలెడు నా,భూరిమహీధ్రముల పోల్కిఁ ♦ బొందిరి ధాత్రిన్.

చ. బలయుతుఁ డానరాంతకుఁడు ♦ వానరసేనలఁ బిండిసేయుచున్
గలనున వానకాలమున ♦ గాలివలెన్ విహరించి స్వేచ్ఛమై
నలరుచు నెల్లతావులను; ♦ నాఘనవీరుఁడు పోవుచుండినన్
నిలిచియెయున్నఁ బైకెగురు ♦ నేర్పున నుండిన నెల్లకీశులన్. ౭౬ 2988

తే. పట్టి వధియించుచుండుటఁ ♦ బరుగిడుటకుఁ
గాని నిలుచుండుటకునైనఁ♦గాని కదలఁ
గాని శక్తులుగారైరి; ♦ కమలసఖుని
కరణి వెలుఁగుచు మృత్యువు♦కరణినిఁ దగి. ౭౭ 2989

క. పరుషమునగు ప్రాసంబున, హరిసేనలు భిన్నములయి ♦ యవనిం బడియెన్;
హరు లంతఁ బవిహతికి నె,న్నవుననను సాటియగు ప్రాస♦ధారాహతికిన్. ౭౮

క. తాళఁగఁ జాలకయే యా,భీలస్వన మడరుచుండ ♦ భీతి నఱచి; ర
య్యాలమునఁ బ్రాసహతిచేఁ, గూలెడు కపిరూపము లొగిఁ♦గుంభినియందున్.

తే. కులిశహతి శృంగములు ప్రీలఁ ♦ గూలుకొండ
లట్లు కనుపట్టెఁ; గుంభక♦ర్ణాహతులను

* విద్యాధరమహర్షయః - అనిమూ.

మున్ను మూర్ఛిల్లి యుండిన ♦ సన్నుతబలు
లైన వనచరవీరు లా♦లోనఁ దెలిసి. ౮౦౫ 2992

క. వనచరనాథుని సుగ్రీవుని గొల్చుచునుండి; రంతఁ ♦ బూషునిసుతుఁ డ
య్యని నాల్గుతట్లు చూచుచుఁ, గనియె నరాంతకుని భీతిఁ ♦ గని వెతదోఁపన్.

క. పరుగెత్తుచున్న వానర, వరులను సుదవృత్తి; నట్లు♦వా ఱెడుబలముం
బరికించి హయముమీఁదం, గర మారోహించి ప్రాస♦కలితకరుండై. ౮౨౫

క. అరుదెంచునరాంతకుఁ గని, యురుతేజుండగుచు నొప్పు ♦ నుగ్రకరసుతుం
డరసి శచీనాథునివలె, బరాక్రమమునం జెలంగు ♦ వాలితనూజున్. ౮౩౫

క. కని యిట్లు పలికె; నీవును, జని యల్లదె గుఱ్ఱమెక్కి ♦ సకలహరిబలం
బును క్షోభమందఁ జేసెడు, దనుజుని నవ్వీరుఁ జంపు ♦ తత్క్షణమ యనన్.

చ. తనవిభుఁ డిట్టుపల్క విని ♦ తా ఘనసంతతినుండి భానుఁ డా
య్యన వెలికేగుదెంచునటు ♦ లంగదుఁ డంబుదవారమట్లు చి
క్కనిదగుసేననుండి దుము♦కన్ గనుపట్టెను జిత్రరీతిఁగా;
వనచరవీరుఁ డంగదుఁడు ♦ వర్ధిలు దట్టపుఁగొండచాటునన్. ౮౬౫ 2997

క. కనకాంగదభూషితుఁడై, తనరారుట గైరికాది♦ధాతుయుతమహా
ద్రినిఁ బోలి వెలిఁగె;నింద్రుని, మనుమండగు నంగదుండు ♦ మహితరుచులచేన్.

క. వెలయుచు గురుతేజంబునఁ, బొలిచి నిరాయుధుఁడు నగుచుఁ♦బూనిక నఖదం
ష్ట్రలె యాయుధములుగాఁ గొని, పలికె నరాంతకుని కెదురు♦పడి నిర్భీతిన్.

చ. నిలునిలు వీర లల్పు లిటు ♦ నీవొనరించెద వేమి? వీరితోఁ
గులిశము రీతిఁ దాఁకి రుచి♦గుంభితమై తగు నీదుప్రాస మి
మ్ముల నిడె నాదువక్షమున ♦ ముందుగ వైవుము నాఁగ నంగదో
క్తులవిని యానరాంతకుఁడు ♦ తోడనె క్రోధరసంబు పొంగఁగన్. ౮౯౫ 3000

తే. పండ్లఁ బెదవిని గొఱుకుచు ♦ ఫణివిధమునఁ
జాలనిట్టూర్పులను బుచ్చె; ♦ సాంద్రకోప
మున నరాంతకుఁ డావాలి♦తనయుమీఁది
కిట్టు లడరి జ్వలించుచు ♦ నెసఁగుదాని. ౯౦ 3001

సీ. ప్రాసంబుఁ ద్రిప్పుచుఁ ♦ బటువేగమున వైచె; వజ్రసమానమై ♦ వఱలుచున్న
యంగదువక్షస్సు ♦ నయ్యది స్పృశియించి భగ్నమై నేలపైఁ ♦ బడియె; నంత
వాలికుమారుఁ డ♦వ్వరుసను గరుడని కృత్తాహితనువట్టు ♦ లిలనుబడిన
యాప్రాసమునుగాంచి♦యుఱచేతినెత్తి యాతనియశ్వమస్తక♦తలముమీఁద

తే. జఱచె; నాచేతిదెబ్బకు ♦ శైలసదృశ,మా నరాంతకు ఘోటక ♦ మంతభిన్న
శీర్షమై గ్రుడ్లుపెటలంగ♦జిహ్వవెలికి, జాఱఁగా *మగ్నతాలువై ♦క్షమనుగూలె.

---

* నిమగ్నతాలుస్ఫుటితాక్షితారః-అనిమూ.

చ. తనహాయ మిట్లు చచ్చి యిలఁ ♦ దక్షిణమే పడఁ గాంచి క్రోధియై
దనుజవరుండు ముష్టిఁగొని ♦ దారుణరీతిని వాలిసూను న
త్తినఁ బొడువంగ; నంగదుఁడు ♦ తీవ్రతరంబగు ముష్టిఘాతము
య్యనఁ దలవ్రక్కలింపఁగ మ♦హాత్తరమై రుధిరంబు వేఁడిగాఁ
దనతలనుండి కాఱఁగఁ గ్రు♦ధం బలుమాఱును మండి యంతలోన్. ౯౫

తే. వశము గామి విసంజ్ఞుఁడై ♦ బలముగల్గు
వాఁడు గావునఁ దెలివొంది ♦ వానిబలముఁ
దలఁచి యాశ్చర్య మొందె; ని♦తాంతబలుఁడు
వాలిప్రియపుత్త్రుఁ డంగదుం ♦ డాలమందు. ౯౬ 3004

చ. కులిశసమాన వేగమును ♦ క్షోణిధరప్రతిమానశక్తియుం
గలిగిన ముష్టినిం గొనుచుఁ ♦ గ్రమ్మఱ నాతనివక్షమందు ని
మ్ములఁ బొడువంగఁ; దా నసుర♦ముఖ్యుఁడు వక్షము పిండియాట ను
జ్జ్వలమగు జ్వాలరీతిఁ బయిఁ ♦ బర్విడు నెత్తురుధారలం గడున్. ౯౭ 3005

తే. తనువు తడియంగ వజ్రాయు♦ధప్రహార
మున నిలంబడు పర్వత♦మువలెఁ గూలె
నిట్లు వీరోత్తముఁడు దను♦జేశుఁ డనిని
వాలితనయునిచేఁ జచ్చి ♦ వసుధఁ బడఁగ. ౯౭౪ 3006

క. సురపథమున దేవోత్తము, లురుముదమున వానరులు మ♦హోద్యమమున ని
ర్భరశబ్దము గావించిరి, పరులోనరింపంగరాని ♦ ప్రధనమసురతోన్. ౯౮

చ. ఒనరిచి రాముచిత్తమున ♦ కుత్తుమమోదము గూర్పఁజాలు చ
క్కనిదగు విక్రమంబును ద♦గం బవరంబునఁ జూప రాముఁడున్
ఘనతరవీర్యవిక్రమని♦కామవిభాసురుఁడయ్యు నప్పనిం
గనుఁగొని విస్మయంబుగనెఁ ♦ గావున నంగదుఁ డూల్కొనెన్ దమిన్. ౯౯౪

అఱువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౭౦ - వ సర్గము.

—దేవాంతక మహోదర త్రిశిరోమహాపార్శ్వుల హనుమన్నీలాదులు వధించుట.—

క. అనిని నరాంతకుఁ డిటుచ,చ్చినఁ గని పౌలస్త్యులగుచుఁ ♦ జెలఁగుదనుజవీ
రనిచయనాథులు త్రిశిరుం, డును దేవాంతకసమాఖ్యుఁ♦డును వగఁ గుందన్.

తే. అమ్మహోదరుఁ డట్టులె ♦ నెమ్మనమునఁ
గుంది యేఁచె; మహోదరుఁ ♦ డెందు నెదురు
లేని వీర్యమునం బొల్చుఁ♦గాన మేఘ
సన్నిభంబగు మేటి గ♦జంబు నెక్కె. ౧౪ 3010

క. వాలిసుతుండయి వీర్యము, చాలంగాఁ గల్గు కిశ♦సత్తముపైకిం
దోలెన్ గజమును దోర్బల,శాలియు దేవాంతకుండు ♦ సహజామృతికిన్నై. ౩౫

క. మనమున శోకము గ్రమ్మం, గను బొక్కుచు భానురపరి♦ఘంబును గైఁ గై
కొని యంగదుమీఁదికిఁ బో,యెను; వీఁడు త్రిశిరుఁ డట్టు♦లే రభసమునన్.

చ. ఖరకరురీతి భాసిలుచుఁ ♦ గ్రమ్మ్రతనూరుచిఁ బొల్చు ఘోటకో
త్కరమున నొప్పుచున్ వఱలు ♦ కాంచనమా రథమెక్కి యంగదుం
దురమునఁ జంపఁబోయె; వడి♦తోఁ జనుదెంచుచు రాక్షసేంద్రులై
సురవరదర్పహంతలయి ♦ శోభిలువారలు తన్ను మార్కొనన్. ౪౫ 3013

క. గురువిటపసంయుతంబగు, తరువొక్కటి వే పెకల్చిఁ; ♦ దగ వీరుండా
హరివరుఁడు దీప్తకులిశము, హరిహయుఁ డనివైచునట్టు ♦ లార్భటిమెఱయన్.

క. అతిశయశాఖాయుతమగు, క్షితిరుహమును విసరివైచెఁ; ♦ జెచ్చెఱ బలిమిన్
దితిజేంద్రునిపైఁ; ద్రిశిరుం, డతులితమయి సత్వమట్టి ♦ యంబకవితతిన్. ౬౫

క. దేవాంతకుపై వైచిన, యావృక్షము నుగ్గునూచ ♦ మట్లానరింపం
గా వాలితనూజుఁడు గని, తా వాయుపథమ్మునకు ని♦తాంతజవమునన్. ౭

ఆ. ఎగసె నాకవీంద్రుఁ ♦ డేచినవ్వూన్కిమైఁ
దరుల గిరుల నట్టి ♦ కురిసె వానిఁ
ద్రిశిరుఁ డాగ్రహమునఁ ♦ దీవ్రశరంబుల
నడుమఁ ద్రుంచివైచెఁ ♦ గడురయమున. ౮ 3017

క. పరిఘాగ్రంబున వృక్షో,త్కరమున దేవాంతకుండు ♦ తట్టుచునుండన్
శిరముల మూఁడింటిందగు, సురరిపుఁ డంగదునిపైన ♦ సునిశితశరముల్. ౯

సీ. వైచె మహోదరుం ♦ డేచి క్రుద్ధుండయి గజమును వేగ యం♦గదునిపైకి
నడిపించి వజ్రంబు♦నాఁ దనరారెడు నట్టి తోమరముల ♦ నంగదుపృథు
వక్షంబుఁ గని మోఁదెఁ; ♦ ద్వారగల్గునట్టియా దేవాంతకుండు సం♦దీప్తకోపుఁ
డయి యంగదునిమీఁది ♦ కడరి శీఘ్రము పరిఘంబునఁ గొట్టి వె♦న్కకునుమరలె
తే. సుప్రతాపుండు తీవ్ర తే♦జుండునైన, వాలితనయుండు దానవ♦వరులు మువ్వు
రొక్కపెట్టునఁ దనపయి ♦ కురవడించి,నను రవంతయు భీతినొం♦దక చెలంగె.

క. హరివరుఁడు పరమదుర్జయుఁ, డురుతరవేగుండు నగుచు ♦ నొప్పునతఁడు స
త్వరముగఁ బైకెగసి లస, త్కరతలమున ననురుమత్త♦గజము నడంచెన్.

చ. అనిమొన నాప్రహారమున ♦ నప్లు మహోదరు మత్తహస్తివా
కను లిల వీడి రాలె నది ♦ గాఢరవంబున నార్చె; నంగదుం
డనుపమవిక్రమం బలర ♦ నాగజదంతము నట్టిలాగి దా
నిని గొని వానిపై కుఱికి ♦ నిశ్చలబుద్ధిని గొట్టె దానిచేన్. ౧౧ 3021

చ. హరిజరుప్రేటుచేతనె సు♦రారియు వాతవిధూతభూరిభూ
మిరుహమురీతి నంగములు ♦ మించెడువేదన విహ్వలింపఁగా
ధరఁబడి నోటనుండి యతి♦దారుణరీతిని లత్తుకట్టె నె
త్తురు వడిఁ గ్రక్కెఁ; నంతఁ గడు♦ధూర్తుఁడు బాహుబలుండు శూరుఁడున్.

ఆ. దనుజవరుఁడు నగుచుఁ ♦ దనరు దేవాంతకుం, డిట్లొ తెప్పిఱిల్లి ♦ యేచి ఘోర
పరిఘమట్టె ద్రిప్పి ♦ ప్లవగేంద్రునిం గొట్టె, దాన వానరేంద్ర♦నూనుఁ డిలను.

క. బోరగిలంబడి తోడనె, ధీరతఁ దెప్పిఱిలి లేచెఁ ♦ద్రిశిరుం డతనిం
దారయమునఁ గని వైచెను, ఘోరశరత్రయము నొసట♦గ్రుచ్చుకొనంగన్.

చ. వనచరనాథనందనుఁడు ♦ వారక మువ్వురు మేటిరాక్షసుల్
తను వధియింపఁబూనుటకుఁ ♦ దద్దయు నాగ్రహ మొందె నంత నా
హనుమయు నీలుతోఁగలిసి ♦ యాతనిఁగావఁగఁ బూని పోయె; నం
త ననిని నీలుఁ డాత్రిశిరు ♦ దారుణమూర్తిని గాంచి యుగ్రుఁడై. ౨౦ 3025

క. గిరిశృంగ మొండు వైవఁగ, వరమతి యాదనుజసుతుఁడు ♦ వాఁడిశరములన్
గిరికూటంబును ద్రుంచె శి,ఖరమది తద్భిన్నమగుచు ♦ గండోపలముల్. ౨౧

ఆ. పగిలి విస్ఫులింగ♦పటలితో జ్వాలల,తోడ నేలఁ బడియెఁ; ♦ గూడనున్న
తీవ్రబాహుబలుఁడు ♦ దేవాంతకుం డది,గాంచి పరిఘముఁగొని ♦ గాలితనయు.

క. అనిచేయఁగఁ దలఁపడియెన్;, హనుమయుఁ బవనాత్మజన్ముఁ♦డతఁడిటు రాఁగా
గని వాని మీఁది కెగురుచుఁ, దనముష్టిని గులిశమట్లు ♦ తగు దానివెనన్. ౨౩½

క. అమరించుకొనుచుఁ దచ్ఛి,ర్షమునం దగఁ బొడిచె; నిట్లు ♦ సమధికబలమొ
ప్ప మహితవీర్యమః కన్పడ,సమీరతనయుండు గొట్టి ♦ సకలదనుజులున్. ౨౪½

తే. వడఁకులాగున సింహని♦స్వన మొనర్చె;
నసురవరుఁడైన రావణు ♦ నాత్మజుండు
ముష్టిఘాతవికీర్ణాత్మ♦మూర్ధుఁ డగుచుఁ
బండ్లుఁ గన్నులు వెలుపలఁ ♦ బడఁగ నపుడు. ౨౫½ 3030

క. నాలుక వ్రేలాడఁగఁ బ్రా,ణాళి నెడంబాసి యవని♦యందుం బడియెం;
జాలబలాఢ్యుఁడు రాక్షస,జాలకముఖ్యుండు దేవ♦శత్రువునగుచున్. ౨౬½

క. ఘనుఁడగు దేవాంతకుఁ డా,యని నిహతుం డగుటఁ గాంచి ♦ యాత్రిశిరుం డ
త్యనుపమకోపం బడరఁగఁ, దనచెంత మెలంగునీలుఁ ♦దాఁ గని యంతన్. ౨౭

ఆ. వక్షముపయి ఘోర♦భంగిని నిశితాగ్ర,ములగు శరసమూహ♦ములను గురిసె;
నమ్మహోదరుండు ♦ నతికోపమున మంద,రాద్రి నూర్యుఁ డెక్కు♦నట్లు మరల.

క. గిరితుల్యమైన నుతిరొక, కరి నెక్కి రణంబుసేయఁ♦గా వచ్చెఁ; దటి
ద్ధరిహయచాపయుతాబ్దము, గిరిపై వర్షంబుఁ గురియు♦క్రియ భూషితుఁడై.

క. విలుదాల్చి యమ్మహోదరుఁ, డలనీలుని వక్షమందు ♦ నతితీవ్రశరం

బుల వర్షముఁ గురియించెను;, బలశాలి యతండు బాణ♦వర్షము తనపై. ౨౯

క. కురియించుచుండఁగా వన, చరబలపతి భిన్నగాత్ర♦జాలుం డగుచున్
దురమున నిట్టటు గదలం, దరంబుగామిం దగం గ♦దలక యొయ్యుండెన్. ౩౦

క. తెలివొంది యంత నీలుం, డలఘుమహీజాళియుక్త♦మై తగు గిరి ని
మ్ములఁ బెకలించి మహాజవ, మలరంగా నెగసివచ్చి ♦ యగ్గిరితోడన్. ౩౧ 3037

తే. అమ్మహోదరుతలమీఁద ♦ నట్టిమోఁదె;
నంత నాతఁ డావ్రేటున ♦ నాత్మగజము
తోడఁ దానును భగ్నుఁడై ♦ ఘోరపువ్యథ
నంది వజ్రాభిహతి గిరి♦యట్లు ధరణి. ౩౨ 3038

క. విగతాసుండై కూలెన్;, బొగడొందు పితృవ్యుఁ డిట్లు ♦ పొలిసినఁ ద్రిశిరుం
డుగదుం గ్రుద్ధుండై ధను, వుఁ గరంబునఁ బూని హనుమఁ ♦ బొడఁగని త్వరతోన్.

చ. శితశరముల్ నిగుడ్చెఁ; గ్రుధఁ ♦ జెంది సమీరకుమారుఁ డుగ్రప
ర్వతశిఖరంబు వైచె; బల♦వంతుఁ డతండును దీవ్రబాణసం
తతి నిగుడించి వే తునిమె ♦ దానిని వ్రయ్యలుగాఁగ, వ్యర్థమా
క్షితిధరకూటముం గనుచుఁ ♦ జెచ్చెఱ రావణునాత్మజన్ముపై. ౩౪ 3040

క. తరువృష్టిని గురియించెఁ; ద్రిశిరుఁడు ప్రతాపాఢ్యుఁ డంత ♦ క్షితిరుహవర్షం
బరుదుగఁ దనపైఁ బడఁగని, సురపథమునయందె దాని♦ చొప్పడఁగంగన్.

తే. వాఁడిబాణంబులను వైచి ♦ వరుసఁ జెండి
సింహనాద మొనర్చెఁ జె♦చ్చెఱ హనుమయుఁ
బైకి నెగసి క్రుద్ధుండయి ♦ భద్రగజము
సింహముద్ధతి మీఱంగఁ ♦ జీల్చునట్లు. ౩౬ 3042

క. ఖరనఖరంబులచేతఁ ద్రిశిరుని హయంబులను మించి ♦ జీలిచివైచెన్;
సురరిపురాజాత్మజుఁడు త్రిశిరుండు తా శక్తిఁ గొనుచుఁ ♦ జెందినకినుకన్. ౩౭

* తే. కాళరాత్రిని గొనినట్టి♦కాలుమాడ్కి, ననిలతనయునిపై వైచె; ♦హరివరుండు
హనుమయాకాశమునసుండి♦యట్టిపడెడు, నుల్కవలెవచ్చునాశక్తి♦యుద్ధతిఁగని.

క. తను నదిస్పృశింప కుండం, గనె దానింబట్టి విఱిచి ♦ కడఁగి మహాని
స్వనమొప్పఁ జేసె; భయదం, బును భాసురమునగుశక్తిఁ♦బూని హనుమయున్.

తే. విఱిచివేయుటఁ జూచి యా♦విక్రమమున
కుబ్బి వానరులెల్ల నో♦హో యటంచు
సంతసంబున నార్చిరి ♦ జలదములను;
నంత దనుజేజ్యుఁ డనఁదగు ♦ నాత్రిశిరుఁడు. ౪౦ 3046

* కాళరాత్రి మివాంతకః-అనియు.

క. కరమున ఖడ్గముఁ దాలిచి, యురుతరపవమానతనయు♦నురమునఁ గొట్టెన్
వరవీర్యుఁ డమ్మరుత్సుతుఁ, డురుఖడ్గహతుండు నగుచు ♦ నుగ్రతమెఱయన్.

క. దనుజునివక్షముఁ గరతలమునఁ జఱిచెను; భూరితేజ♦మునఁ బొల్చెడునా
దనుజుఁడు దద్గతిచే మూర్ఛను మున్గుచు ప్రస్తహస్త♦శయుఁడై పడియెన్.

చ. ధరణిధరాకృతిం దగిన ♦ తత్కపిపుంగవుఁ డట్లు సోలుచున్
ధరఁబడుచున్న యాదనుజ♦తల్లజుచేతఁ జెలంగుఖడ్గమున్
ద్వరపడి లాగికొంచు గురు♦దానవులెల్ల భయంబు నొందఁగా
హరి నినదంబు చేసె; దను♦జాధిపుఁ డాధ్వని కోర్వ కొయ్యనన్. ౪౬ 3049

చ. అనిలతనూజుపై కుఱికె ♦ సవ్విధి దూఁకి స్వముష్టిచేత నా
తనిబొడిచెన్; మహాకపివ♦తంసుఁడు తద్గతి కాగ్రహించి యా
దనుజుఁ గిరీటయుక్తముగఁ ♦ దా వడి బట్టుకొనెన్; మహాగ్రహం
బున మును విశ్వరూపుఁడనఁ ♦ బొల్చెడు త్వష్ట్రసుతాఖ్యు నింద్రుఁడున్. ౪౭

క. తలలను ఖండించినయటు, లలరెడు కుండలము లొప్ప ♦ నమలకిరీటో
జ్జ్వలములగు వానిశీర్షంబుల ఖడ్గముచేతఁ ద్రుంచెఁ ♦ బూనిక మెఱయన్.

[1]సీ. ప్రజ్వలజ్జ్వలనుని♦భంగి దీర్ఘాక్షులుగలిగి భూమీధ్ర ము♦నలె శరీర
మొప్ప వెలుంగు దే♦వోత్తమవైరియా త్రిశిరునిమస్తక♦త్రితయ మభ్ర
మునను౦డి సత్ఫలం♦బును జక్కఁగాఁ బొంది తరువాతజ్యోతులు♦ధరణిఁబడెడు
నట్లు నేలంబడె; ♦ నమరారిఁ ద్రిశిరసు, నమరేశవిక్రముం♦డైన హనుమ

తే. యనివధింపఁగ వనచరు ♦ లతిముదమున, సింహనాదములనొనర్చి♦ చెలఁగిరవని
యట్టి చలియించె రాక్షసు ♦ లదరిభీతి,నలుదెసలకును బాఱిర♦త్యార్తులగుచు.

క. అనిని ద్రిశీర్షమహోదరు, లనూనహరివీరనిహతు ♦ లగుటయు నక్షే
మును దుర్ధర్షులుగాఁ దగు, ఘనదేవాంతకనరాంత♦కక్రవ్యాదుల్. ౫౦ 3053

తే. అంత మొందుటఁ గని పర♦మాగ్రహుండు
మత్తుఁ డనఁబడు రాక్షస♦మండనుండు
మఱియుఁ గ్రుద్ధుఁడాయె; నాతఁడు ♦ [2]నుంగళకర
మయి విరాజిల్లి యతిఘోర ♦ మగుచు వెలసి. ౫౧ 3054

క. ఇనమునఁ జేయంబడి చక్రనిహాటకపట్టమయము♦గాఁ దగి యరదా
తనురక్తమాంసఫేనిలమును నయి యవు డరులరక్త♦మున రంజితమై. ౫౨

క. తనయంతనె మెఱయుచు మఱియును సందీప్తాగ్రమగుచు ♦ సురకాంతుల న
ఱ్ఱనిపూలహారములచేత నలంకృతమునయి భీతి♦దంబయి మిగులన్. ౫౩

1 పేతు శ్శిరాం సీంద్రరిపో ర్ధరణ్యాం జ్యోతీంషి యుక్తాని యథార్కమార్గాత్-అనిమూ. అర్కమార్గాత్ ఆకాశాత్-అనివ్యాఖ్య. 2 జగ్రాహ సృష్టితీం ఘోరాంగదాం సర్వాయసీం శుభామ్-అనిమూ.

సీ. ఐరావతంబు మ♦హాపద్మసార్వభౌమములను దిగ్ద్విర♦దములకు వెత
జనియింపఁగాఁ జేయు♦చును విరాజిల్లెడునట్టి గదం గొనె; ♦ నసురవర్యుఁ
డైన మత్తుఁడు క్రుద్ధుఁ♦డై లయకాలాగ్నివలె మండిపడుచును ♦ వనచరాళి
పై కేగె,నంతట ♦ బలశాలి ఋషభాఖ్యుఁ డా రావణానుజు♦నంతికంబుఁ

ఆ. జేరఁబోయె నొక్క♦సారియె యెగిరి; యం,తటను గొప్పసేన ♦ దనరనున్న
యతనిముందు నిలిచె ♦ నమ్మహాపార్శ్వుండు, తనదుమ్రోల నున్న♦వనచరుఁగని.

క. గిరివలెఁ దగు తద్వపువును, బరికించి మహాగ్రహమున ♦ వజ్రసమానం
బురుతరమగు గదచేఁ ద,ద్ధరివక్షమునందుఁ గొట్టెఁ ♦ దద్దయుఁ బూన్కిన్.

చ. వనచరుఁ డాగదాభిహతి ♦ వక్షము వ్రీలఁగఁ దత్తఱిల్లి చి
క్కనిరుధిరంబు గాఱఁగఁ ♦ దగన్ స్మృతి దప్పెను; వానరేంద్రుఁ డం
త నెటులొ చాలసేపటికిఁ ♦ దా స్మృతినంది మహాబలాఢ్యుఁడై
దనుజునిఁ గాంచి యాతనిగ♦దం గొనఁగాఁ బరుగెత్తె వేగమే. ౫౯ 3059

ఆ. భీమగదను దానిఁ ♦ బెఱికికొని బలుమా, ఱట్టె త్రిప్పి యని మ♦హాబలాఢ్యుఁ
డగుచు మత్తుఁడైన♦యట్టి భటులఁ గూడి,యున్న యతనిఁ గొట్టె♦నుక్కుమెఱసి.

చ. తనగదచేతఁ గొట్టఁబడి ♦ దానవవీరుఁడు భగ్నుఁడై రణం
బున దశనంబు లొక్కమొగి ♦ భూమిని రాలఁగ నేత్రయుగ్మ మొ
య్యన వెలికుబ్బ వజ్రనిహ♦తాచల మట్టులు నేలఁగూలె; నా
దనుజుఁడు నిర్గతాక్షుబల♦దర్పుఁడుగా విగతాసుఁడై జవం
బునఁ బడఁగాఁ దదీయబల♦ముల్ పరుగెత్తెను భీతిచేఁ గడున్. ౬౧ 3061

సీ. [ఉన్మత్తుఁ డనెడు మ♦హోదరుఁ డప్పుడు తనభ్రాత హతుఁ డగు♦టను గనుఁగొని
పరమకోపము నొంది ♦ ప్రళయాగ్నిసమరుచియై తేజరిల్లుచు ♦ నంత నతఁడు
వీరుఁడుగావున ♦ దారుణగదఁ గొని యుగ్రవానరసేన ♦ నుక్కుమీఱి
బెదరించుచును గడు♦భీతికరంబగుదమానున గ్లేర్పుచు ♦ దానినడుమఁ

తే. బాఱు తెంచెను; దారుణ♦బాహువిక్ర
మాఢ్యుఁడగు నాతఁ డిటుమీఁది♦కరుగు దేరఁ
గాంచి యచలాకృతిం దగు ♦ కపి గవాక్షుఁ
డద్రిఁ గొని వానిపై కేగె ♦ నతిరయమున. 3062

క. వీరుండగునున్మత్తుం, డారీతిన్ శైలవరము ♦ హస్తతలమునన్
దారుణముగ నొప్పఁగఁ దగు, వైరిం జంపంగవచ్చు ♦ వానిన్ గిరినిన్. 3063

చ. కనుఁగొని యాగిరీంద్రమును ♦ గాఢగదాహతి నూఱుప్రయ్యలై
కనఁబడునట్లు సేసెఁ; గపి♦కాంతుఁడు దీర్ఘభుజుండు పర్వతం
బును శకలీకృతంబుఁ గని ♦ బుద్ధిని నచ్చెరువంది పల్మఱున్
ధ్వనినొనరించె; నాదనుజ♦తల్లజుఁ డెంతయు నాగ్రహంబునన్. 3064

క. జ్వలియించుచున్నగదఁ గొని, యలఘుజవం బొప్ప వనచ♦రాధిపువక్షు
స్థ్సలమున మోఁదెను వీరుం, డలగదచేఁ గొట్టఁబడి మ♦హార్తిం గనుచున్.

తే. నల్ల గాఱంగ నేలపై♦నం బడియెను, సంజ్ఞ దప్పుటచే; వన♦చరవరేణ్యుఁ
డంతలో మూర్ఛఁ దేఱియ♦య్యసురశిరముఁ, గరతలంబునఁ జఱచెని♦కామశక్తి.

క. వీరుఁడు ధరణీధ్రసమా,కారుఁడు నగునాసురారి♦కాంతుఁడు దానన్
దారుణదంతాక్షులు ధరఁ, జేరంగా వేఁడినల్ల♦క్షితిఁ బడఁ జచ్చెన్.] 3067

చ. దనుజవరేణ్యసోదరుఁడు♦ తద్రణరంగమునందు నిట్లు చ
చ్చిన జలరాశిరీతిఁ దగు♦సేనయు సాధనసంక్తి వీడి చ
క్కని యశమున్ దగన్ విడిచి♦ త్స్థాస్థలి జీవములున్నఁజాలునం
చనుశమయూహా లొప్పఁగ మ♦హార్ణవ మొయ్యనఁ గట్టుదాఁటున
ట్లనిమొన నుండకే పఱచె♦ [1]నాహరివీరులు నవ్వుచుండఁగన్. ౯౨ 3068

డెబ్బదియవ సర్గము సంపూర్ణము.

---

౭౧ - వ సర్గము.

అతికాయుఁడు యుద్ధమునకువచ్చుట.

సీ. తద్వార్తవిని గురు♦తరతేజుఁడై బ్రహ్మదత్తవరుండయి♦ దనుజవిబుధ
దర్పహంతయునయి♦ ధరణీధరాకారుఁడైనట్టి యతికాయుఁ♦ డాత్మబలము
సంగరంబున వినఁ♦ జాల గగుర్పాటు గలిగించునట్లు తు♦ములముగాఁగ
వ్యధితమాటను గాంచి♦వాసవసమవిక్రమాఘ్యలౌ సోదరుల్♦హతులగుటయుఁ
దనపినతండ్రులై♦ దనుజావతంసులౌ యుత్తయుద్ధోన్మత్తు♦లత్తఱినటు

తే. నన్నదమ్ములు మృతిగను♦ టెన్ని మిగుల
నాగ్రహం బొందె; శస్త్రాది♦యైన యతఁడు
[2]భాస్కరసహస్రసంఘాత♦భాస్వరమగు
స్యందనం బెక్కి హరులపైఁ♦ జనియెఁ బూన్కి. ౪ 3069

క. తలఁదాల్చి కిరీటముఁ గుం,డలములు మెఱయంగ నతఁడు♦ నారి మొరయ ని
మ్ముల నాత్మనామ మేర్పడ, బలుకుచుఁ బంచాస్యరవముఁ♦ బటుగతిఁ జేసెన్.

[3]క. హరినాదంబునఁ దనభీ,కరనామశ్రావణమునఁ♦ గార్ముకగుణభూ
రిరవంబున నాతఁడు వన,చరులన్ భయపెట్టె; నంత♦ సకలవనచరుల్. ౬

చ. దనుజునిభూరిదేహమును♦ దారొగిఁ గాంచుచుఁ గుంభకర్ణుఁడే
యనికయి లేచివచ్చెనని♦ యాతురు లౌచుఁ బరస్పరంబు భీ

---

1 ఆహరివీరులు నవ్వమండఁగన్-అనునిది ప్రకృతార్థపోషకమని యధికముగఁ జేర్పఁబడినది గ్రహింపఁదగు. 2 స భాస్కరసహస్రస్య సంఘాత మివ భాస్వరమ్ - అనిమూ. 3 నామవిశ్రావణేనచ-అనిమూ.

తిని కడునందఁగాఁ గొనిరి; ♦ తీవ్రగతిం జనుదెంచు నాతనిన్
వనచరయూథనాయకులు ♦ వారిజనేత్రు త్రివిక్రమావతా
రనియతరూపమో యనఁగ ♦ రాజిలు రూపయుతున్ మహాబలున్. ౭½ 3072

క. కని భయపడి పరుగెత్తిరి;, వనచరు లొకకొంద ఱతని ♦ బాగుగఁ గని తోఁ
చని బుద్ధితోడ యుద్ధం,బున రక్షకుఁడౌ సుమిత్ర♦పుత్రునియన్నన్. ౮½ 3073

తే. శరణు చొచ్చిరి; తరువాత ♦ స్యందనంబు
నెక్కి పర్వత మట్లొప్పి ♦ యుక్కుమిగిలి
కార్ముకముఁ దాల్చి కాలమే♦ఘంబురీతి
గర్జిలుచునున్న యతికాయు ♦ ఘనబలాఢ్యు. ౯½ 3074

క. కనియెన్ రాముఁడు దూరం,బున; నాతనిభూరిదేహ♦మున కాశ్చర్యం
బును బొంది యాఱడిలఁగా, వనచరులను జేసి పంక్తి♦వదనానుజునిన్. ౧౦½

చ. కని యిటుపల్కె; శైలసమ♦కాయము గల్గి ధనుస్సుఁ దాల్చి లో
చనములు సింహనేత్రముల ♦ చందమునం దగ వేయిగుఱ్ఱముల్
గొనిచను సచ్ఛతాంగమునఁ ♦ గోరికమీఱఁగఁ గూరుచున్న యీ
దనుజుఁ డెవండు? భూతసము♦దాయయుతుం డగునీశుపోలికన్. ౧౨ 3076

సీ. కాంతిమంతమ్ములై ♦ కడువాఁడులై యున్నప్రాసతోమరశూల♦పటలములొగిఁ
గనుపట్టనున్నాఁడు ♦ కాలుజిహ్వలఁబోలి [1]వెలయుస్యందనశక్తి♦కలితుఁ డగుచు
విద్యుద్ద్యుతాంబుద♦వితతినా వెలుఁగుచునున్నాఁడు గద యెవ్వఁ♦డొక్కొ? వీఁడు;
వీనిచాపములెల్ల ♦ విమలకాంచనపృష్ఠములయి సజ్యములయి ♦ వెలసి యింద్ర
తే. చాప మాకసమునుబోలె ♦ స్యందనవర
మును బ్రకాశింపఁ జేసెడు; ♦ దనుజవర్యుఁ
డతిరథుండునునయి రవి♦యట్లు వెలుఁగు
వరదమునఁ గూరుచుండి ర♦ణాంగణమును. ౧౪½ 3077

క. వెలిగించుచు వచ్చెడుఁ గద;, పలుకుమ యీదనుజుఁ డెవఁడొ;? ♦ భానుకిరణం
బులఁబోని బాణముల ది,క్కులకెల్ల విశాలకాంతిఁ ♦ గూర్చుచు నెమ్మిన్.

క. [2]కేతనశృంగగరాహువు, చేతం జెలువారు; నితని ♦ చేతి ధను వదే
యాతతమయి [3]త్రిణతము జీ,మూతధ్వనితుల్యసుగుణ♦భూరిరవము నై.

క. కనకాలంకృతపృష్ఠం, బునునయి శతమఖునిచాప♦మువలెన్ మిగులం
దనరారుచున్నయది; యీ,తనిదివ్యమహారథంబు ♦ ధ్వజములతోడన్. ౧౮

---

1 అపృతో రథశక్తిభి ర్విస్ఫురద్భి రివ తోయదః-అనిమూ. 2 ధ్వజశృంగప్రతిష్ఠేన రాహుణా ఽభివిరాజితే-అనిమూ. 3 త్రిణతమ్ మేఘనిర్హ్రాదం-అనిమూ. త్రిషు ఆద్యంతయో ర్మధ్యే చ నతం-అనివ్యాఖ్య.

తే. లలితములయిన యప్పతా♦కలను గ్రింది
మ్రానుచేతను దగి చతు♦ర్దానవు లొగి
సారథులుగాఁగ నొప్పార ♦ జలదగర్జ
నమువలెఁ ధ్వనిచేయుచు♦న్నయది మిగుల. ౧౯ 3081

తే. ముప్పదెనిమిది తూణీర♦ములు రథమున
వెలయుచున్నవి భీతిద♦ములగు చాప
ములు కనకపింగళజ్యాల♦తలును మిగుల
నొప్పుచున్నవి; కనుఁగొను ♦ ముద్యమమున. ౨౦ 3082

సీ. హస్తచతుష్కమా♦నట్టి పిడుల్ గల్గి కరవశాయుతములై ♦ కాంతి గుల్క
పార్శ్వద్వయంబున ♦ భాసిల్లు ఖడ్గముల్ రెండు రథంబున ♦ రెండుప్రక్క
లను జెలంగెడు; ధీరుఁ ♦ డనఁదగు నీతఁడు రక్తప్రసూనహా♦రములఁ గంఠ
మునఁ దాల్చి గురుశైల ♦ మనఁగఁ జూపట్టుచు నసితవర్ణుండయి ♦ యమునిఁ బోలి

ఆ. పెద్దనోరుగల్గి ♦ పృథుజలదావృత, భానుఁ బోలి కాంతి♦వఱలుఁ జుమ్ము;
కాంచనాంగదాభి♦కలితభుజంబుల, నితఁడు వెలయుచుంట ♦ నెన్నిచూడ.

క. తుంగములయి తనరారెడు, శృంగంబులఁ గూడు తుహిన♦శిఖరి విధమునఁ
రంగారెడు నిర్జరరిపు, పుంగవుఁడో దీర్ఘబాహు♦భూషిత! సుగుణా!. ౨౩ 3084

చ. సురుచిరనేత్రయుగ్మమున ♦ శోభిలు నీతనివక్త్ర మద్దిరా!
వరతరకుండలంబులను ♦ భాసిలుచుంట [1]బునర్వసుస్ఫుటాం
తరగతపూర్ణచంద్రమహి♦తంబయి యొప్పెడు; వీనిఁ గాంచి యీ
హరిగణమెల్లఁ బాఱెడు భ♦యార్తిని దిక్కుల కద్దె చూచితే. ౨౪ 3085

క. దనుజుం డితఁడెవ్వఁడో, దనుజేశ! విభీషణా! ని♦తాంతము నాకుఁ
వినిపింపు మంచు నడిగిన, ఘన తేజుండైన భూప♦కాంతుని నుడులఁ. ౨౫

క. విని గురుతేజుండగు నా, దనుజేంద్రుని సోదరుండు ♦ తా నిటు పల్కెఁ
వినవయ్య! రామ! యక్షే, శునితమ్ముఁడు పంక్తివదన♦శోభితుఁడు ధరఁ. ౨౬

క. [2]గురు తేజుం డతిశయాభీ, కరకర్ముఁడు రాక్షసాళి♦కాంతుం డుత్సా
హరతుఁడు రావణుఁ డలరును, ధరనతిబలుఁ డగుచు వాని♦తనయుఁడితఁడు సూ!.

ఆ. వీర్యశాలి యితఁడు ♦ వృద్ధసేవి, సమస్తవిద్యలందు మేటి ♦ వితతశస్త్ర
వేత్తలందుఁ దలఁప ♦ వీఁడె యుత్తముఁ డనిఁ, దండ్రి యంతవాఁడు ♦ తథ్యమిద్ది.

క. కరిహయరథములమీఁదను, నరుదుగ మెలఁగంగ నేర్చి ♦ యని ఖడ్గమునుం
గరమునఁ దాల్చి పోరఁగ, శరచాపముఁ దాల్చి పోర ♦ వలఁతియితఁడు సూ!.

---

1 పునర్వస్వంతరగతమ్ పూర్ణబింబ మివైందవమ్-అనిమూ 2 ఇట రావణుని వర్ణించుట రామున కాతని చరిత్రమును జెప్పుటకుఁ గాదు. అట్టివాని కితఁడు తనయుఁడని చెప్పుటకే యని గ్రహింపఁదగు.

ఆ. సామదానభేద♦దండముల యుక్తిని, మంత్రమందు మిగుల ♦ మహితుఁ డనఁడు
పేరుఁగన్నవాఁడు ♦ భూరమణా! కృషి, విద్యయందు మేటి ♦ వీరవర్య!.

క. వీనిభుజాబలమునఁ బెం, పూనియె యీలంక భయముఁ ♦ బూనకయుండున్
సూనుండు ధాన్యమాలికి, వీనిని నతికాయుఁ డండ్రు ♦ వీరవతంసా!. ౩౦

ఆ. భావితాత్ముఁ డితఁడు ♦ బ్రహ్మను దపమునఁ
నలరఁజేసి దివ్య♦ములగు నస్త్ర
ములను బడసి శత్రు♦వులఁ బొఱఁదోలె; స్వ
యంభు, వితని కాద♦రాత్ముఁ డగుచు. ౩౧ 3093

క. సురదనుజులచే మృతియె, వ్వరుసను లేకుండునట్లు ♦ వర మిచ్చెను; భా
స్కరకాంతియుక్తరథమును, నరుదగునీదివ్యకవచ ♦ మలరుచు నొసఁగెన్.

క. శతవారము లితఁడు దేవతలను దానవులఁ జెండి ♦ బాహాబలమునన్
దితిజుల రక్షించెను; యక్షతతిన్ మాయించె శౌర్య♦సారము పొంగన్.

సీ. యుద్ధంబునన్ వీఁడు ♦ బుద్ధిమంతుం డగు నింద్రునికులిశంబు ♦ నేచుశక్తి
స్తంభింపఁగాఁ జేసె ♦ జలనాథుపాశంబుఁ బ్రతిహతంబును జేసె ♦ రామచంద్ర;
బలవంతుఁడయి రాక్ష♦సుల కెల్లనాథుఁడై ధీమంతుఁడునునయి ♦ దేవదనుజ
దర్పహంతయు నయి ♦ తనరునీయతికాయుఁ డారావణాత్మజుఁ♦డగును బురుష

తే. పుంగవా! వీఁడు కపిసేన♦భూరిశరము
లను వినాశముచేయక ♦ మునుపె వీని
జవమునం జంపుయత్నము ♦ సలుపవలయు
ననియె నంతట నతికాయుఁ ♦ డతిబలమున. ౩౭ 3096

చ. వనచరసేనఁ జొచ్చి తన♦భాసురచాపము మ్రోయఁజేసి భీ
తిని గలిగించునాదమును ♦ దెంపునఁ బల్కుఁ జేసె; భీతికృ
త్తనువును దాల్చి [1]సద్రథిక♦తల్లజుఁడై రథమందుఁ బొల్చునా
తనిఁ గని కీశముఖ్యు లతి♦దర్పబలుల్ చని రట్టె మార్కొనన్. ౩౮ 3097

క. శరభుఁడు మైందుఁడు నీలుం, డరాతిభయదుండు కుముదుఁ ♦ డాద్వివిదుండున్
దరువులు గిరిశృంగంబులు, కరముల ధరియించి యెదురు♦గాఁ జని రనికై.

చ అనుపమశస్త్రవిత్ప్రవరుఁ♦డై గురుతేజుఁడునైన యాతఁ డా
వనచరు లట్టె వైచుతరు♦వారముఁ గొండలఁ బిండిచేసెఁ గాం
చనసములంకృతాభినవ♦శాతశరంబుల వైచి; దోర్బలం
బునఁ దగి భీకరాకృతిని ♦ బూనిన యాయతికాయుఁ డంతటన్. ౪౦ 3099

క. వనచరుల కభిముఖుండై, [2]యినుమునసే చేయఁబడిన ♦ యిషువులచే నొం
చెను వారినెల్ల; వార లతనిబాణాసారమున ని♦తాంతార్దితులై. ౪౧ 3100

---

1 రథస్థం రథినాం వరమ్-అనిమూ. 2 శరై స్సర్వాయసైః ర్భృశ-అనిమూ.

క. తనువుల గాయము లొప్పం,గను నాఘోరాహవమున ♦ గాసిలి తారా
తనికిం బ్రతికృతి నేమియు,నొనరుపఁ జాలకయె పోయి♦సుద్యమ మడఁగన్.

చ. దనుజవరేణ్యుఁ డాగ్రహము ♦ దారుణమై తగ యౌవనంబుచే
తను గడుఁగ్రొవ్వియున్న హరి ♦ తా మృగవాగముఁ బోలెఁ దద్బలం
బును భయపెట్టుచుం గలఁచె; ♦ భూరితనుం డసురేజ్యుఁ డబ్బలం
బునడుమఁ దన్ను మార్కొనఁగఁ ♦ బూనినవానిని నొక్కనేని దా
దునుసుఁగఁ బూన కుద్ధతిని ♦ దూణము లూని ధనుస్సుతోడ రా
మునికడ కేగి గర్వమును ♦ బూనినవాక్కుల నిట్లుపల్కె; నవ్వం
దనమును నెక్కి చాపమును ♦ దాలిచి బాణములూని సంగరం
బునకయి నిల్చినాఁడ; రణ♦ముం బొనరింప నదెట్టివీచుకోన్. ౮౮౪ 3102

క. అనిచేయఁగ నుత్సాహం,బును గల్గినవాఁ డెవండొ ♦ పూనియిపుడె నా
కును యుద్ధమొసఁగుఁ గాకని, దనుజప్రవరుండు బలసు♦రంబునఁ బలుకన్.

చ. అరిజనహంత లక్ష్మణుఁ డ♦హార్యపరాక్రముఁ డాలకించి య
ప్పురుషతరోక్తి కోర్వక య♦పారముగాఁ దగుక్రోధమూని క
ర్బురవరుముందఱ౦ దుమికి ♦ సూక్ష్మతరోక్తుల లెక్కచేయ కా
తురమునఁ జాపముం గొనియెఁ; ♦ దూణమునంగల బాణమంతటన్. ౮౬

తే. త్వరగ గ్రహియించి దనుజావ♦తంసునెదుటఁ
గార్ముకమునారి సారించెఁ ♦ గడుఁ గ్రుధఁ గొని;
యంత లక్ష్మణుజ్యాశబ్ద ♦ మతిభయదము
గాఁ జెలంగుచు భూమిని ♦ క్ష్మాధరముల. ౮౭౪ 3105

క. సురవర్త్మమునన్ దిక్కుల, సరిత్పతుల నిండి రాక్ష♦సప్రకరము నా
తురతం బొందఁగఁ జేసెను;, గురుతేజుఁడు పంక్తికంఠు♦కొమరుం డంతన్.

క. అతిభయదంబగు లక్ష్మణు,వితతజ్యారవముఁ జక్క♦విని యచ్చెరువున్
మతిఁ బూనె బలముగల్గియు; నతికాయుండంతఁ గుపితుఁ♦డై యతఁడిట్టుల్.

క. తనపై కడగుటఁ గని తీవ్రనిశాతాంబకముఁ దాను ♦ గ్రహియించి వచిం
చెను లక్ష్మణుతో నిట్లని;, వినవయ్యా! బాలకుఁడవు ♦ *విక్రమములలోన్.

తే. ఆతఁ తేఁఅనివాఁడ వ♦ట్లాటఁ బొమ్ము,కాలసదృశుండనగు నన్నుఁ ♦ గదనమందు
మార్కొనఁగ నేలకోరెదు?♦మామకకర,ముక్తశస్త్రప్ర వేగంబు♦భూమినభము.

క. గిరిపతి యాహిమవంతుం, డరయన్ సైపంగఁ జాల ♦ రావంతయు; ని
ర్భరకాలవహ్ని సుఖమగు, సరణిన్ నిద్రింపఁ దెలియఁ♦జాలక దానిన్. ౯౨

ఆ. ఏల ప్రజ్వరిల్ల ♦ నిప్పు డొనర్చెదు ?
ధనువుఁ బెట్టి మరలు ♦ నను దురమునఁ

* విక్రమే ష్వవిచక్షణః-అనిమూ.

దాఁకి ప్రాణములను ♦ దటుకునఁ గోల్పోవ
వలదు; నాకు నెదుట ♦ నిలిచి నీవు. ౫౩ 3111

చ. మొదలి చనంగ నూల్కొనని ♦ మానసముంగలవాఁడవైన ని
ద్ధరణిని నిల్వ మిందె సుఖ ♦ ధామములై తగుప్రాణముల్ చనన్
ద్వరఁగ యమాలయంబునకుఁ ♦ దప్పక పోయెద; విన్వు నాదుభీ
కరరిపుగర్వసూదనని ♦ శాతశరంబు లొప్పెడున్. ౫౪ 3112

*క. పరశివునిత్రిశూలాకృతిఁ, గర మురుదుగ నలరి తప్త ♦ కనకాంచితమున్
దరములుగాఁ దగుఁ జూడుము;, సరీసృపాభంబుగా నె ♦ సంగు శరమిదే!. ౫౫

క. కరమాగ్రహాకలితంబగు, హరి, కరివరశోణితంబు ♦ నాసక్తిని నా
తురమునఁ ద్రావెడుగతి నీ, శరీరరక్తంబుఁ ద్రావఁ ♦ జాలుం జుమ్మీ'. ౫౬

చ. అని వచియించి తీవ్రముగు ♦ నాగ్రహముం గని చాపమందు గూ
ర్చెను భయదాంబకంబును, వి ♦ జృంభితభూరిబలుండు చాలఁగాం
తిని జెలువారులక్ష్మణుఁడు ♦ కృద్ధుఁడుగాఁ దగునాసురారి యా
దనుజమహేంద్రునాత్మజుఁడు ♦ దర్పము రోషము పొంగఁ బల్కెనన్. ౫౭

క. విని మిక్కిలి యాగ్రహమున, ఘనగంభీరార్థమొప్పఁ ♦ గాఁ దగువాక్యం
బును బల్కె నిటు; దురాత్మా!,విను వాఙ్మాత్రమున నీవు ♦ వీరుఁడ వగుచే?.

తే. కార్యమునుబట్టి శూరులు ♦ గానగుదురు
గాని యాత్మప్రశంసలఁ ♦ గారు;నే ను
జాపసంధితదారుణ ♦ సాయకుఁడను
గా నిటన్ నిల్చియున్నాఁడఁ ♦ గాన నిపుడు. ౫౮ 3117

క. కనఁబఱుపు నీదుబలమును;, దనుజా! కార్యం బొనర్చి ♦ తావకరూపం
బును జూపు మావు నిన్నె, వినుతించుకొనంగ నేల? ♦ వీరుఁడ ననుచున్. ౫౯

క. పౌరుషమెవ్వనికిఁ గలదో, శూరుం డనఁబడు నతండె ♦ స్తుతుల నగునొకో?;
భూరితరాయుధములతోఁ, జారురథం బెక్కినావు ♦ చాపధరుఁడవై. ౬౦ 3119

క. శరములచే దివ్యాస్త్ర,త్కరములచేఁ బౌరుషంబుఁ ♦ గనఁ జేయుము ని
ర్జరవైరి! పిదప వాయువు, పరిపక్వమనోజ్ఞతాళ ♦ ఫలమును గడఁకన్. ౬౧ 3120

ఆ. తొడిమనుండి రాల్చు ♦ వడువున నే నిశి
తాంబకముల నీదు ♦ హాశిరంబు
ధరణిఁ బడఁగఁ గూల్తుఁ ♦ దప్తకాంచనభూషి
తములు మామకశర ♦ తతులు వేగ. ౬౨ 3121

సీ. త్వద్గాత్రమునయందు ♦ బాణశల్యాంతరోత్థితరక్తమును జాలఁ ♦ దృప్తిమీఱఁ
ద్రావంగఁ గలవు; చి ♦ త్తంబున నను బాలుఁడని తక్కువగ నీవు ♦ గనఁగవలదు

* ఏష మే సర్పసంకాశో బాణః-అనిమూ.

నేను బాలుండనె ♦ యైన వృద్ధుఁడనైన నని మృత్యువట్టివాఁ♦డనని యెఱుఁగు
బాలుఁడొ విష్ణు వ♦ప్పట్టునం బూన్కిఁ ద్రివిక్రమాకృతిఁ దాల్చి♦విశ్వములను
తే. మూఁడిటిని దేవతలు హర్ష♦మునఁ జెలంగఁ
జరణముల మూఁడిటం ద్రొక్కఁ ♦ జాలలేదె?
యనెడు యుక్తియుక్తముఁ బర♦మార్థమునగు
నాకుమారునివచనంబు ♦ నాలకించి. ౧౭॥ 3122
క. దనుజేంద్రుం డతికాయుం, డనూనకోపమునఁ దీక్ష్ణ♦మగు సాయకముం
గొనియె; మహాత్ములు నిర్జర, దనుజులు గుహ్యకులు భూత♦తతులు మహర్షుల్.
క. ఆసంగరమును జూచెదు, నాసల విద్యాధరులును ♦ నరుదెంచిరి; వే
యేం సురవైరివతంసుం, డాసమయమునందుఁ గోప ♦ మడరఁగ వింటన్. ౧౮॥
చ. శరమును గూర్చి [1]యంతరవి♦శాలనభంబును మ్రింగఁబూనిన
ట్లురవడి లక్ష్మణుం గనుచు ♦ నుద్ధతివైచెను వానిమీఁద; న
త్తఱుణమునందు లక్ష్మణుఁడు ♦ దస్యువరాంతకుఁ డుగ్రసర్పభీ
కరమయి వచ్చు తీక్ష్ణశర♦కాండము నర్ధశశాంకసాయకం
బరుదుగ వైచి త్రుంచె; నటు ♦ లాశర మంతరమందె చయ్యనన్. ౧౯॥ 3125
తే. ఛిన్నభోగోరగంబు రీ♦తిన్నిశాత, సాయకచ్ఛిన్నమగుటను ♦ జక్కఁజూచి
యాగ్రహంబునబాణంబు♦లైదుగొనుచు, వైచెలక్ష్మణుపై;నంత♦బాణములవి.
క. తను దాఁకక మునుపే రా,ముతమ్ముఁడు వాఁడిబాణ♦ముల ఖండించెన్;
దనదీక్ష్ణాంబకముల శ,త్రునిషూదనుఁడైన [2]భరతు♦తోఁబుట్టు వనిన్. ౨౦॥
చ శరముల నిట్లు త్రుంచుచు వి♦శాలతరంబగు కాంతి మండున
ట్లరయఁగ నున్న తీక్ష్ణశర ♦ మప్పుడు గైకొని కూర్చి చాపమం
దురుతరవీర్యమొప్ప నతఁ ♦ డొయ్యన లాగి దురాత్మునాతనిం
బొరిఁగొన వైచె; సూరుఁడయి ♦ పొల్చినలక్ష్మణుఁ డిట్లు కాండమున్. ౨౧
క. నతపర్వసాయకము ను,న్నతబలమున లాగి యసుర♦నాథునిఫాలం
బు తగులఁ గొట్టెను; సాయక, మతిభయదాసురునిఫాల♦మందుఁదగులుచున్.
ఆ. అందు నాటుకొని త♦దాయతరక్తంబు, చేతఁ దడుపఁబడుచు ♦ శిఖరిమీఁది
పన్నగేంద్రురీతిఁ ♦ బరికింపఁగా నయ్యె;, నంత దనుజవర్యుఁ ♦ డరిశరమున.
[3] తే. కరము పీడితగాత్రుఁడై ♦ హరిశరార్ది
తత్రిపురముల నొప్పెడు ♦ ద్వారమట్లు
చంచలించెను; మఱి బల♦శాలి యతఁడు
తెప్పిఱిలి చేయఁదగినట్టి ♦ తీరుఁదలఁచి. ౨౨॥ 3131

1 సంక్షిప న్నివ చాంబరమ్-అనిమూ. బాణవేగే నాంతరాస్థిత మాకాశం గ్రసన్నివ-అని వ్యాఖ్య. 2 విచ్ఛేద భరతానుజః-అనిమూ. 3 రుద్రబాణహతం ఘోరం యథా త్రిపురగోపురమ్-అనిమూ. త్రిపురద్వారం-అనివ్యాఖ్య.

[1]చ. మనమున నిశ్చయించుకొని ♦ క్ష్మాపతిపుత్రక! యిట్లు బాణపా
తనమున మెచ్చుకోఁ దగిన ♦ దన్యుఁడవైతివి నాకు నీవటం
చును వచియించి యాస్యమును ♦ సొంపుగ వంచి భుజద్వయంబు చ
క్కని దిటవొందఁ జేసికొని ♦ కమ్రరథంబుననుండి యంతటన్. ౭౬౹ 3132

తే. సంచరించె విచిత్రమా ♦ సరణి; దనుజ
సత్తముండంత భీకర♦సాయకముల
నొకటి మూఁడైదు నేడు ♦ నిట్లొప్పమీఱఁ
గైకొనుచు వింట సంధించి ♦ కడఁగి గుణము ౭౭౹ 3133

క. సారించి లక్ష్మణునిపై, నేరుపునన్ వైచెఁ; గనక♦నిచయాంచితముల్
సారములు నైన పుంఖము, లారయఁగా వెలుఁగ మృత్యు ♦ వట్లొప్పి కడున్.

క. సరసిజమిత్రునికరణిన్, విరాజమానంబు లగుచు ♦ వెలయుచు దనుజే
శ్వరచాపముక్తము లగుచుఁ, బరఁగెడు నాశరము లభ్ర♦పథమునఁ దగుచున్.

తే. అంబరంబును జ్వలియించు ♦ నట్లొనర్చె;
నంత రాముని సోదరుఁ ♦ డాతురపడ
కతని బాణాళి నెల్లఁ దీ♦వ్రాంబకములఁ
బఱపి నడుమునె ఖండించెఁ ♦ బౌరుషమున. ౮౦ 3136

చ. శతమఖవైరి యానుజ♦సత్తముపుత్త్రుఁడు వాఁడిబాణముల్
జతనము మీఱ శాత్రవని♦శాతశరంబుల ఖండితంబులై
క్షితిఁ బడు టెల్ల నారసి వి♦జృంభితకోపముతోడఁ జయ్యనన్
శితశర మొండు తీసికొని ♦ శింజినిఁ గూర్చి [2]సుతేజ మొప్పఁగన్. ౮౧౹ 3137

క. అరిమీఁద వైచె; నంతట, శరమది పైఁబడఁగ వచ్చు ♦ సౌమిత్రి హృదం
తరమునఁ దగిలె; సుమిత్రా, వరతనయుం డిట్టు లసుర♦బాణార్దితుఁడై. ౮౩౹

ఆ. మత్తహస్తివరము ♦ మదనలిలంబును, గార్చునట్టిరీతిఁ ♦ గాఁగఁ దీవ్ర
రక్త మట్టె విడిచె; ♦ రయమున లక్ష్మణుఁ, డతిసమర్థుఁడౌట ♦ నతిబలమున ౮౩౹

క. తనువున నాటిన బాణం,బును నూడం బెఱికి బాధఁ ♦ బొందక భీతిన్
జనియింపఁజేయు బాణం,బును గైకొని దివ్యమంత్ర♦మునఁ గూర్చెఁ దగన్.

తే. దాని నాగ్నేయశస్త్రమం♦త్రసమయుక్త
ముగ నొనర్ప శరాసన♦మున నది యపు
డెంతొ జ్వలియించె; నను రేజ్యుఁ ♦ డెలమి సౌర
మంత్రమును బూన్కి జపియించి ♦ మహితనియతి. ౮౫౹ 3141

క. కనకమయపుంఖమయి ఫణి, యన నొప్పుచున్న శరము♦నం దభిమంత్రిం

1 శ్లాఘనీయోఽసి మే రిపుః-అనిమూ. 2 స సంధాయ మహాతేజాః-అనివ్యాఖ్య.

చెను సౌరమంత్రమును; రా,మునితమ్ముం డగ్నిమంత్ర♦మున మంత్రితమై.

క. అరుదగు నాశరమును వి,స్ఫురదగ్నిజ్వాలలట్లు ♦ పొంగారెడు భీ
కరమూర్తిఁ గాలదండం,బు రయంబున యముఁడువోలెఁ ♦ బూనికి వైచెన్.

సీ. ఆగ్నేయబాణమం♦త్రాంచితంబగు శర మరుదెంచుటను జూచి ♦ యసురవర్యుఁ
డతికాయుఁ డపుడు సౌ♦రాస్త్రమంత్రితమైన ప్రజ్వలచ్ఛరమును♦వైరిమీఁద
వైచె; నయ్యవి రెండు ♦ భాసురదీప్తాగ్రములయి క్రోధంబునఁ ♦ జెలఁగుసర్ప
ములపోల్కి నొండొంటిఁ♦గలిసిసంఘర్షణమునుబొందె; నంతరెం♦డును బరస్ప

తే. రంబు దహియించి పడియె ధ♦రణిపయి; నిటు
లవ్వి శరవర్యములె యయ్యు ♦ నతులకాంతు
లట్టి మాయభస్మంబులై ♦ యవనిఁ బడి ర
వంతయైన వెలుంగక ♦ యచటనుండె. ౯౦ 3144

క. దనుజేంద్రుం డైషీకం, బనునస్త్రము క్రోధమొప్ప ♦ నాతనిపై వై
చెను; వీర్యవంతుఁడౌ రా,మునితమ్ముం డైంద్రబాణ♦మున ఖండించెన్. ౯౧

క. రావణసూనుం డాశర, మావిధమున వ్యర్థమగుడు ♦ నాగ్రహమునఁ బెం
పానహిలన్ యామ్యాంబక, పావనమంత్రమున దివ్య♦బాణముఁ బూన్కిన్.

తే. చక్క మంత్రించి యంత ల♦క్ష్మణునిమీఁద
వైచె; లక్ష్మణుఁ డద్దాని ♦ వాయుబాణ
మునను ఖండించి యాగ్రహం♦బున జలదము
వర్షధారలఁ గురిసెడు ♦ భంగి నోఁప. ౯౩ 3147

క. దనుజునిపై శరవర్షం,బును దాఁ గురిపించె; నతని ♦ బొంది యవియుఁ జ
య్యన వజ్రాంచితకవచం,బును దాఁకుట మొనలు విఱుగ♦భూస్థలిఁ బడియెన్.

క. పరవీరహంత సుయశ, స్స్ఫురితుం డాలక్ష్మణుండు ♦ భూరిశరము లి
క్కరణిని వ్యర్థము లగుటను, బరికించి సహస్రబాణ♦వరములఁ గురిసెన్.

క. బలశాలి యసుర లక్ష్మణుఁ, డలఘుశరాళులను నాగ్ర♦హమునఁ గురిసినన్
గలనున నభేద్యకవచముఁ, గలిగినవాఁడౌట నార్తిఁ ♦ గాంచకయుండెన్.

సీ. [అతికాయుఁ డంత స♦ర్పాకారశరము ల
క్ష్మణునిపై వైవ నా♦శత్రుహంత
యది మర్మమున నాటి ♦ యార్తి నొందింప ము
హూర్తమాత్రము మూర్ఛ♦నొంది తెలిసి
ఘనబల మొప్పంగఁ ♦ గాండోత్తమచతుష్క
మున వానిఘోటక♦ములను నతని
సారథి వధియించి ♦ వైరి హంత యతండు
శరవర్షమునను ని♦ర్జరవిరోధి

ఆ. ధ్వజముఁ గూల్చి వాని ♦ బవరంబునం జంపఁ
బూని తోట్రుపాటు ♦ పొందకట్టె
యతనిమీఁద లక్ష్య ♦ మారసి బాణాళి
వైచి నింగి సురలు ♦ బళిబళియన.] 3151
క. పురుషలలాముఁడు లక్ష్మణుఁ, డరాతి నతికాయు నించు♦కంతయుఁ బెనుసం
గరమున నొప్పింపఁగ నె, క్కరణిని దాఁ జాలకుండెఁ ♦ గవచబలమునన్.
క. అనిలుం డంతట నచటికిఁ, జనుదెంచి వచించె నిట్లు ♦ సౌమిత్రీ! యీ
దనుజుఁడు పరమేష్ఠివరం, బును బొంది యభేద్యకవచ♦మును ధరియించెన్.
క. కానన్ బ్రహ్మాస్త్రముచే, వీనిం బొలియింపవయ్య! ♦ వేఱువిధమునన్
వీనిం జంప నశక్యం,బౌ నీతఁడు కవచధారి ♦ యతిబలయుతుఁడున్. ౯౯
తే. ఔట నితరాస్త్రములచేత ♦ నని వధింపఁ
దరముగాదని చెప్పె; నం♦తట మహేంద్ర
విక్రముండగు సౌమిత్రి ♦ విని తదీయ
వచన మజుమంత్రమును నప్డు ♦ స్వాంతమందు. ౧౦౦ 3155
క. అనుపమభక్తి జపించుచు, ననూనము నమోఘజవము♦నగు బాణంబున్
ధనువునఁ గూర్చెను; లక్ష్మణుఁ, డనుపమనిశితాగ్రమునగు ♦ నా బాణమునన్.
క. ఆమంత్రము గూర్పఁగనే, ధామనిధియు శీతకరుఁడు ♦ తక్కుగ్రహము లు
ద్దామభయమందె దిక్కులు, భూమియు నంబరము వడఁకె♦భూరిభయమునన్.
క. శరము సుపుంఖము వజ్రము, కరణిం జెలువారుదానిఁ ♦ గ్రవ్యాదగణే
శ్వరసూను కాలదూతఁగఁ, బరికింపఁగనైనదాని ♦ బ్రహ్మాస్త్రముగన్. ౧౦౨
తే. చక్కమంత్రించి దివ్యమా ♦ చాపమందుఁ
గూర్చి యింద్రారిపుత్రునిఁ ♦ గూల్పవైచె
సంగరంబున; లక్ష్మణ♦చాపముక్త
మును, నమోఘజవంబునఁ ♦ బొలుచుదాని. ౧౦౩ 3159
చ. అనలునిరీతి మండుచును ♦ హాటకచిత్రితవజ్రసారమై
కనదురుచిత్రపుంఖమయి ♦ క్రాలుచునున్న మహాశరంబుఁ జ
య్యనఁ దనుఁ జంపఁగా నడరు♦నట్టి మహాకృతిఁ గల్గుదాని నా
దనుజుఁడు చూచెఁ జూడఁగనె ♦ దానిని గొట్టె శితాంబకాళిచేన్. ౧౦౪
చ. గరుడునివేగముం గలుగు ♦ కాండమ దట్లు శితాస్త్రపంక్తిచే
గరము నివారితంబయియుఁ ♦ గ్రమ్మఱ కారిపుపార్శ్వ మొందెఁ; గ
ర్బురవరుఁ డంత దీప్తయము♦పోలిక నుజ్జ్వలమైన బాణమా
వరుసను రాఁగఁ గాంచి తన♦స్వాంతమునన్ వెఱపొంద కుద్ధతిన్. ౧౦౫
తే. అష్టి, శక్తి, కుఠార, గ♦దాళి, శూల
ములను హళు లనునాయుధం♦బులను గొట్టె;

నస్మహాస్త్రము జ్వలనుని ♦ యట్లు మండు
చును విచిత్రములగు నాయు ♦ ధనికరముల. ౧౦౬ 3162

క. వానిఁ లక్ష్యము చేయక, మానితమకుటాభిరామ ♦ మంజులశిరముఁ
దా నట్టె సంగ్రహించెను, దానవు లాహాయనంగ ♦ దారుణరీతిఁ. ౧౦౬½

క. శిర మది సశిరస్త్రాణం, బురులక్ష్మణబాణపీడ ♦ నొంది తుహినభూ
ధరశృంగమట్లు వేగము, ధరఁ గూలెను; సొమ్ము లటఁ జె ♦ దరి రాలంగఁ. ౧౦౭½

క. హతశేషనిశాచరు ల,య్యతికాయునిపాటుఁ గాంచి ♦ వ్యథితహృదయులై
యతిదీనవదనులై కీ,శతతుల్ తముఁ గొట్ట నోర్వఁ ♦ జాలక వగతోఁ. ౧౦౯

తే. వికృతనాదంబునం గూఁత ♦ వెట్టి, రెల్ల
వార లొకచోటఁ జేరి; య ♦ వ్వల నవ్వకీయ
భటవిభుం డనిఁ ద్రెళ్లిన ♦ భయమునొంది
యుద్ధకాంక్షను మాని వా ♦ రొప్ప దక్కి. ౧౧౦ 3166

క. పురమున కభిముఖులై న,త్వరముగఁ బరుగెత్తి; రవుడు ♦ భయకృద్బలుఁ డా
దురమున దురాసదుం డి,క్కరణిఁ హతుఁడైన హరిని ♦ కాయము తమితోఁ.

క. విరిసినతామరలనలెఁ, బరికింప ముఖంబు లట్టె ♦ భాసిలఁగా భూ
వరమాళితమ్ము నర్చిం,చిరి కోరికయైనజయముఁ ♦ జెందినవానిఁ. ౧౧౧½

చ. [ఘనబలు మేఘనల్పు నతి ♦ కాయుని యుద్ధమునందుఁ జంపి న
ప్పనమున లక్ష్మణుం డలరి ♦ మారుతిముఖ్యకపీంద్రులెల్ల నా
య్యన దనుఁబూజలం దనుప ♦ నన్నను గానఁగఁ బోయె దానవేం
ద్రునిమృతి నాలకించి తమి ♦ తోఁ జెలువారుచు రాముఁ డుండఁగఁ.] 3169

డెబ్బదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౭౨ - వ సర్గము.

రావణుఁ డతికాయునిమృతికై దుఃఖించి యంతఃపురమున కేగుట.

సీ. లక్ష్మణుం డిట్లుజ్జ్వ ♦ లత్తేజమున నొప్పి యతికాయుఁ జంపుట ♦ నాలకించి
యుద్వేగమున దను ♦ జోత్తముం డిట్లనిపలికె; శత్రువుల ని ♦ మ్ముల వధించు
నట్టి ధూమ్రాక్షుఁ డ ♦ స్త్రాళిధరించినవారిలో నుత్తముం ♦ డై రహిఁ దగి
చాపంబు దాలిచి ♦ జగముల వడఁకించునట్టి యకంపనుఁ ♦ డాప్రహస్త

తే. కుంభకర్ణులు బలయుతుల్ ♦ కోరుచుంద
రసని వీరు మహాసురు ♦ లరులబలము
లను జయించుచునుందు రే ♦ దినమునందు
నైన శత్రుతిరస్కార ♦ మన నెఱుఁగరు. ౩ 3170

క. గురుకాయులు వీరలు భీ,కరశస్త్రాస్త్రముల నెఱిఁగి ♦ కదనమ్మున ని
ర్జరులను జెండెడువారలు, పరికింపఁగ నిట్టివారి ♦ బవరమునందున్. ౩౫ 3171

[1]క. పని దేనినైనఁ జేయం,గను జాలిన రాఘవుండు ♦ కడఁగి వధించెన్
ఘనబలు లితరులు దనుజులు, చనిరి యమాలయమునకును ♦ శత్రునిహతులై.

చ. ఖరునిని దూషణున్ బోలియఁ♦గా ఘనశక్తిని జేసి కీర్తినిన్
ధరణిని గాంచి వీరులయి ♦ తద్దయు నొప్పిన రాము లక్ష్మణున్
గరము బలంబు శౌర్యమును ♦ గల్గిన నాకొడు కింద్రజిత్తు న
ద్వరమున లబ్ధమైన శర♦వర్యములం దగఁ గట్టివైచెఁగా. ౪౫ 3173

క. సురలకు బలయుతులగు క,ర్బురులకు గంధర్వయక్ష♦పుంగవులకుఁ గి
న్నరులకు నాబంధనములఁ, దరమే విడిపింప నన్న♦నమ్ము లదెట్లో. ౬౫ 3174

క. శరబంధవిముక్తిం గని, దురుతరచిత్రాత్మశక్తి♦యుతిచేతనొ ని
ర్భరమాయనొ మోసముననొ, యరయఁగ నాకెఱుకపడదె♦యాత్మఁ గటకటా.

తే. ఎవ్వ రెవ్వరు శూరులై ♦ యొసఁగుదనుజు
లస్మదాజ్ఞను బోయిరో ♦ యనికి వారి
నందఱిని గురుబలులగు♦హరులు చంపి
వైచి; రిఁకమీఁద నారఘు♦వరుఁ దదనుజ. ౮౫ 3176

చ. వనచరసేనతోడఁ గపి♦వర్యునితోడ విభీషణాఖ్యుతో
ననిని వధింపఁజాలు నతఁ ♦ డారయ నాకును గన్పడండు; రా
ముని నెదిరించి మాదనుజ♦ముఖ్యులు మృత్యువుచెంత కేగి రే
మనఁ దగు నోర! రాముని మ♦హాబల మాతఁడె సద్బలాఢ్యుఁడో. ౧౦ 3177

[2]ఆ. అతనియస్త్రవీర్య ♦ మది యెంతగొప్పది ?
వీరుఁడైన రామ♦విభుఁ డనామ
యుఁడయి శక్తిమెఱయ ♦ నొప్పునారాయణుఁ
డేయటంచుఁ దలఁతు ♦ నిపుడునేను. ౧౧ 3178

క. ఆతనిభయముననే కద, యీతీరున నగరవర్య ♦ మిది సంపిహితా
త్యాతతకవాటతోరణ,మై తాను వికాంతిమగుచు ♦ నగపడెడుఁ గటా. ౧౧౫

చ. కనుక సురారులార! మిముఁ ♦ గాచికొనుండు ప్రమాదమొంద కో
య్యన నగరంబు నెల్లెడల ♦ నారయుచుండుఁడు, సీతఁ గాచు న
వ్వనమున నెట్టిరీతిగ నె♦వండు మదాజ్ఞను బొందకుండఁ బో
వను దగదట్టులే వెలికి ♦ వచ్చుటగూడదు నిశ్చయంబుగన్. ౧౩ 3180

క. బలములు తగుతావు ల వెం,దలకునొ యుండెల్ల మీర ♦ లఖిలబలవృతిం
జెలఁగుచుఁ బలుమఱు తిరుగఁగన్,వలయును మెలఁకువనుగూడి♦పటుశౌర్యములన్.

1 రామే ణాక్లిష్టకర్మణా - అనిమూలము. 2 తం మన్యే రాఘవం వీరం నారాయణ మనా
మయమ్-అనిమూ.

తే. అసురులార! సాయంసమ♦యమునఁ గాని
యర్ధరాత్రమునంగాని ♦ యల్లి దివస
పూర్వభాగమునంగాని ♦ పూన్కి కపులు
పూనియున్నట్టి శౌర్యంబు ♦ గానపలయు ౧౫ 3182

క. వనచరులని నీచముగాఁ, గనరా దవ్వారి శత్రు♦గణబలము దురం
బున కాయితమైనదియో, మనపైఁ జనుదెంచునదియొ ♦ మనల జయింపన్.

క. ఊరకనిల్చిన యదియో, యేరీతిగ నెప్పుడుండు ♦ నెవ్విధిఁ గార్య
ప్రారంభము చేయునటం, చారయుఁడీ యనుచు వారి ♦ కాజ్ఞ యొసంగెన్.

చ. బలయుతులైన యాదనుజ♦వర్యులు రావణుఁ డట్లుపల్కిన
పలుకుల నాలకించి యటు ♦ పాయక చేసిరి కార్యమెల్ల; న
ప్పలలభుగింద్రుఁ డిట్లసుర♦పాలకులం గని యాజ్ఞచేసి చిం
తలు మది నేచ దీనుఁడయి ♦ తాఁజనియెం *దనయింటి కార్తితోన్. ౧౭

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ దారుణదర్పుఁడు కోపవహ్ని నె
మ్మనమునఁ బ్రజ్వరిల్లఁ బలు♦మాఱులు స్వాంతజదుఃఖముల్ దలం
పునకును రాఁగ నార్తుఁడయి ♦ బోరున నూర్పులు పుచ్చుచున్ గటా!
యనుచు నిఁకేమి నాకుగతి ♦ యంచును జింతిలుచుండెఁ బైపయిన్. ౧౮

డెబ్బదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 23 - వ సర్గము.

ఇంద్రజిత్తు, హోమలబ్ధబ్రహ్మాస్త్రమున రామాదుల మూర్ఛనొందఁ జేయుట.

సీ. అట నతికాయ, దే♦వాంతక, త్రిశిరులు మొదలగురాక్షస♦ముఖ్యు లనిని
హతులయి రనుచు హ♦తావశిష్టులు వేగ చని రావణునకును ♦ మనవి చేసి;
రంతట నారాక్ష♦సాధీశ్వరుఁడు వార్త నద్దాని వినుచు దుః♦ఖాశ్రుసలిల
సంపరిప్లుతనేత్ర♦జాలుఁడై మూర్ఛిల్లి యల్లనఁ దెలివొంది ♦ యతిభయంక

ఆ. రమగు పుత్రనాశ♦నము భ్రాతృవధమును
దలఁచుకొనుచు మిగులఁ ♦ గలఁగుచుండె;
నంత దుఃఖజలధి♦యందు నిమగ్నుఁడై
యున్న దీనుఁ దండ్రి ♦ మన్ననఁ గని ౨ 3187

క. అతిరథుఁడు రావణాసురు, సుతుఁడగు నాయింద్రజిత్తు ♦ శుభతరవాక్సం
తతి నిట్లుపల్కెఁ; నోదితి, సుతనాథా! యింద్రజిత్తు ♦ క్షోణీస్థలిపై. ౩ 3188

తే. బ్రదికియుండఁగ నీవిట్లు ♦ వగలఁ బొంద
వలదు సంగరమున నింద్ర♦వైరినగుచు

---

* ప్రవివేశ స్వమాలయమ్-అని మూ.

నలరు నాబాణహతుఁ డెవ్వఁ♦డైనఁ బ్రాణ
ములను నిల్పుకొనం జాలఁ ♦ గలఁడె? యెందు?. ర 3189

మ. వినుమా! యిప్పుడు రాఘవుం డనుజుతో ♦ వేవేగ మద్బాణముల్
తనులం జీలుపఁ దీక్ష్ణకాండహతు లం♦త్యంతంబు దేహంబునం
దున నెల్లన్ వడినాలఁ బ్రాణముల నిం♦దుర్ వీడి నేలంబడం
గను నేఁజేసెదఁ జూడుమా! దనుజరా♦కాశీతభానూ! తగన్. ౫ 3190

క. పౌరుషదైవబలంబుల,తో రాజిలు నీప్రతిజ్ఞఁ ♦ దోరపు వేడ్కన్
గూరిమితనయుఁడనౌ నే, నారసి కావింతు నిశ్చ♦యం బలరంగన్. ౫౪

క. విను మిప్పుడె రాముని నా,తనితమ్ము నమోఘబాణ♦తతులం బూరిం
తును, దేవేంద్రుఁడు,యముఁడా,దనుజాంతకమిత్ర,సాధ్య,♦దహనా,శ్విసురుల్.

తే. చంద్ర,సూర్యులు మును బలి♦చక్రవర్తి
యాగశాలఁ ద్రివిక్రముం♦డైన విష్ణు
పౌరుషమునా నచిరత్యమా ♦ పౌరుషము మ
దీయమును జూడఁగలరని ♦ తెలిపి యంత. ౨ 3193

క. బలమున నించుక కొఱఁతం, గలుగని యాయింద్రజిత్తు ♦ కర్బురకాంతుం
డలరఁగ నిటుపలుకుచు నుజ్జ్వలవాయుసమానమైన ♦ జవ మలరారన్. ౨౪

క. నిరుపమములునై తగియెడు, ఖరవరములఁ గట్టియున్న ♦ కన్రురథం బ
త్తరుణమున నెక్కి; ననుపమ,వరతేజం బొప్పు శత్రు♦బలహాంతయునై. ర

క. అరుణస్యందన మట్టులు, పరఁగెడు నాయరదమెక్కి ♦ బవరము చేయం
గరము జవంబునఁ బోయెను;, నిరుపముబలశాలి యతఁడు ♦ నెమ్మినరుగఁగన్.

సీ. వెంటనే గురుబల♦విబుధశత్రువులంద అత్యంతముదమున ♦ నతులధనువు
లను గరమ్ములఁ దాల్చి♦చని; రందుఁగొందఱుగజములఁగొందఱు♦ను జవనాశ్వ
ముల నెక్కి యరిగి; ర♦[త్యలఘుపరాక్రములగు రాక్షసులు కొంద♦అద్రితుల్య
ములగు వ్యాఘ్రములఁ బి♦ల్లుల వృశ్చికంబుల ఖరముల మఱివివ♦ధరవరాహ

తే. ములను నొంటెల శ్వాపద♦ములను సింహ
జంబుకంబుల హంసల ♦ శశమయూర
ముల నధిష్ఠించి] ముద్గర♦ములను బ్రాస
ఖడ్గగదల గోడ్డంద్రను ♦ గడఁగి తాల్చి. ౧౧ 3197

క. చని రతనివెంట; నాతఁడు, తనవెంటన్ వచ్చువారు ♦ దారుణశంఖ
ధ్వనులం జేయుచు భేరీ, స్వనములఁ జేయుచును దనుఁ బ్ర♦శంసింపంగన్.

క. అరిగెన్ దురమొనరింపన్, బరులన్ దురమునను జెందు♦బలరిపురిపు వం
బర మెట్లు పూర్ణశశిచేఁ, గరము విరాజిల్లునట్లు♦గా నయ్యెదనన్. ౧౨౪ 3199

ఆ. చంద్రశంఖవర్ణ♦సదృశసితచ్ఛత్ర,మున వెలింగెఁ జాప♦ముల ధరించు

నట్టివారలందు ♦ నధికుఁడై వీరుఁడై, తనరు నింద్రజిత్తుఁ ♦ దగినరీతి. ౧౩౹

క. కనకశలాకాభూషిత, మనూనతరహేమదండ ♦ మతిసుందరముఁ
ఘనమునగు చామరద్వయ,మున విసిరి రాక్షసోత్త♦ములు ప్రీతిమెయిన్.

సీ [శ్రీమంతుఁడై సుర♦సిద్ధవిరోధియా రావణుం డింద్రజి♦త్తావిధమునఁ
బెనుబలంబులను గై♦కొని వెళ్లుచుండంగఁ గాంచి యిట్లను,వైరి ♦ గలఁడె!నీకు
నతిరథశ్రేష్ఠుండ ♦ వను రేసుని జయించినట్టివాఁడవు గదా ♦ యరయ నీకు
మనుజులునా నెంత♦ మ్లాపతిని జంపఁగలవని పలికి యా♦కర్బురపతి

ఆ. యాశిషములఁ దనుప ♦ నాశీస్సులను గొని, తేజములర హస్తి♦వాజిరథప
దాతులెల్లఁ గొలువఁ ♦ దా నని శ్రీరాము, నొంచు వేడ్క మిగుల♦మించుచుండ.]

చ. ఖరకరుఁ బోలి తేజమునఁ ♦ గ్రాలి ప్రతాపమునందు లోకముం
దరయ నొకండు తుల్యుఁడను♦నట్టి మగంటిమి లేని యింద్రజి
త్తుగతిఁ బోవుచుండ రవి ♦ యుగ్రమరీచుల నంబరంబునాఁ
బురమది చక్కఁగా వెలిగె; ♦ భూరిసుతేజుఁడు శత్రుహంతయున్. ౧౫ 3203

క. దను జేంద్రునిపుత్రుఁడునగు, ఘనుఁ డాయింద్రారి శత్రు♦గణములు తగునా
యనిసేయుభూమికిం జని, యనుపమరథ మొందఁదలఁచి ♦ యాహోమవిధిన్.

క. ఒనరింపఁబూని చుట్టును, దనుజులఁ గావలిగ నునిచె; ♦ దహనసముచిం
దనరాగనకుఁడు శాస్త్రో, క్తనియతి మంత్రైకపూర్వ♦కంబుగ ననలున్. ౧౬౹

సీ. పూజించి హోమంబుఁ ♦ దాఁ జేయఁగాఁ బూనె; శౌర్యమ్మునం దగు♦సకలదనుజ
నరుఁడంతభక్తిచే ♦ సురుచిరమాల్యగంధములసంస్కృతను యి ♦ గుహావిస్సుఁ
బేలాల నగ్నిలో ♦ వేల్చెను; సురవైరి కాశపత్రములకుఁ♦గా మహాభి
చారమునకుఁ బరి♦ స్తరణమ్ములుగా మహాయుధంబుల,మతి♦ యుందుఁ దాంత్ర
సమిధలఁగొనుచు న♦స్త్రముల నెఱ్ఱవిభావిఁ గట్టి కార్ష్ణాయస♦కల్పితమగు
స్రువమును గైకొనె; ♦ క్షోణిని నచ్చటఁ దోమరసంతతి♦తోడఁ గూడు
నట్టితెల్లాకుల ♦ నగ్నిపరిస్తరణమును గావించి ప్రా♦ణములఁ గూడి
యున్న నల్లని మేఁక ♦ నుద్ధతిఁ బశువుగాఁ బట్టి కంఠముఁ ద్రుంచి♦పరఁగువహ్ని

తే. యందు వేల్చెను; నొకసారి ♦ యనలు మండఁ
జేయఁగా నగ్ని దరికొని ♦ చెలఁగి పొగయ
యనఁగ లేక మహాజ్వాల ♦ లలర విజయ
చిహ్నములుగాఁగఁ దోఁచెఁ ద♦చ్చిత్తమునకు. ౨౦ 3208

క. అనలుఁడు పూరుషరూపం,బునను బ్రదక్షిణముగాఁగఁ ♦ బొలుచుశిఖలతో
డను జుట్టివచ్చి సురుచిర,కనకవిభూషణము లొప్పఁ♦గా నాహవిసున్. ౨౧౹

క. తానే ప్రతిగ్రహించెను;, దానవుఁ డాయింద్రజిత్తు ♦ తదవసరమునన్
మానితమగు బ్రహ్మాస్త్రముఁ, దా నాహ్వానంబు చేసి ♦ ధనువురథంబున్. ౨౨౹

తే. ఇంకఁ దనకుఁ గావలసిన ♦ యెల్లవాని
నందె తానభిమంత్రించె; ♦ నట్టులతఁడు
వేల్వఁబడునగ్నినుండి యా♦నిధశరమును
జక్కనాహ్వాన మొనరుచు ♦ సమయమందు. ౨౩౪ 3209

తే. చంద్రనక్షత్రఖేచర♦సమితితోడ, నంబరం బెల్లఁ జలియించె ♦ నతిభయమున;
నంత ననలునిరీతిని ♦ గాంతివెలిఁగి, శక్రతుల్యప్రభావుఁడై ♦ సముధికుఁడయి.

క. ఎంచంగరాని మంత్రన,నుంచితశక్తిం జెలంగు ♦ నారావణివి
శ్చంచలభక్తిని నారా,ధించి మహాహ్వాఁ దాను ♦ దివ్యధనువునున్. ౨౪౪

క. శరరథసారథిఖడ్గము, లరుదగుతురగాళిఁ బడసి ♦ యాకసమున నె
వ్వరికిని గన్పడకుండఁగ, వరశక్తిని జేసికొనియె ♦ బలము లలరఁగన్. ౨౫

క. తురగరథపతాకాధ్వజ, పరిశోభితమగుచు దనుజ♦బల మప్పుడు సం
గరకాంక్షను గర్జించుచు, నరిగె; మహాసురులు వార ♦ లతిభయదముగన్. ౨౬

క. త్వరగలిగి చిత్రములునై, పరిభూషితములును నైన ♦ బాణంబులఁ దో
మరముల నంకుశముల సం,గరమునఁ బ్రహరించి రెల్ల♦కపులఁ గడఁకతోన్.

క. రావణి యంతటఁ గుపితుం,డై వారలఁ గాంచి పల్కె ♦ నఖిలకపులఁ బెం
పావహిలఁ జంపఁగోరుచు,వావిరిఁ బోరాడుఁడు దమి ♦ వర్ధిలుచుండన్. ౨౮

చ. అన విని నిర్జరారులు జ♦యంబును గోరుచు నార్చుచున్ భయం
బును గలిగించువానరుల ♦ భూరిశరంబులవృష్టి ముంచి; తా
దనుజవరాత్మజుండు నలుఁ♦దట్లను రక్షను లావరింప నా
యనిమొన మీఁదినుండి నిశి♦తాంబకముల్ ముసలంబులున్ గదల్. ౨౯ 3216

తే. మఱియు నాళీకబాణముల్ ♦ మాన్పశంగ
వైచి కపులను హింసించె; ♦ వానరులటు
లతఁడు హింసించుచుండఁగా ♦ నవనిరుహాము
లందలోకటిగఁ గొనుచు నిం♦ద్రారిపయికి ౩౦౪ 3217

క. అనిఁ గరినుండని తలఁపక, చని రొక్కట మూఁగుకొనఁగ ♦ శక్రారిబలం
బును గురుతేజము దగఁగా, వనచరులశరీరములను ♦ బాణవిశతులన్. ౩౧౪

తే. క్రోధమునఁ జించివైచె; నా♦క్రూరదనుజుఁ
డసురు లుప్పొంగునటు లాగ్ర♦హమున నొక్క
శరమునన్ బంచనవస♦ప్తసంఖ్యలైన
వనచరులఁ జంపె నుత్కంఠ ♦ వఱలుచుండ. 33 3219

క. అని నెంతయు దుర్జయుఁడగు, దనుజేంద్రసుతుండు వీర♦తల్లజుఁ డటఁ గాం
చనభూషితములు రవిసను,తను జెలఁగెడునవియునైన ♦ తతవిశిఖములన్.

క. హరులన్ మథియించెను; వా,నరు లనిఁ దద్బాణపీడ♦నముఁ బొందికతే

బరములు తునుఁగుచునుండ స,మరమున విజయాశనపుడు♦మానిభయమునన్.

క. సురమథితులైన యసురుల, కరణిన్ క్షితిఁబడిరి; మేటి♦కపులును నాసం
గరమున బాణగభస్తుల, నురుతరముగ వెలుఁగుసూర్యుఁ♦డో యనమిగులన్.

క. చెనకన్ రాకున్న మహా,దనుజునిఁ జంపంగఁ జనిరి; ♦ దారుణకోపం
బున; నంత వనచరోత్తము, లనూనశరవృష్టి భేది♦తాంగులు నగుచున్. ౩౭

తే. ధైర్యమును వీడి వ్యథితులై ♦ తత్తఱమున
నెత్తుటం దోఁగుచున్ బరు♦గెత్తి; రవలఁ
గపులు కొందఱు శ్రీరాము♦కార్యముకొఱ
కసువులను లెక్కపెట్టక ♦ యూర్చి మిగుల. ౩౮ 3224

క. తరుశిలాయుధములుగాఁ, గరముల గహియించి వెనుకఁ ♦ గాలిడక మహా
త్తరశౌర్యమునన్ మార్కొని, రరయుచు నాయింద్రజిత్తు;♦నాహవ లపుడున్.

చ. అనిమొనఁ జుట్టుముట్టి యసు♦రారిపయిన్ దరుశైలశృంగముల్
ఘనశిల లెత్తి వైచిరి, సి♦తాయుధము వేజము నన్ జవంబునన్
దనరెడు నింద్రజిత్తు కపి♦పిల్లజు లవ్విధినైనఁ బ్రాణముం
గొనుతరుశైలవర్షమును ♦ గొంకక డించెను సాయకంబులన్. ౪౦ 3226

*చ సురపతివైరి యంత రణ♦శూరుఁడు గాన హుతాశతుల్యభీ
కరఫణిసన్నిభంబులగు ♦ కాండములం బరఁగించి చించె నా
హరివరసేన; నంత నిశి♦తాశుగముల్ పదునెన్మిదొక్కటన్
బరఁగెడు గంధమాదనుని ♦ బాగుగ నాటఁగనేసి యార్చుచున్. ౪౧ 3227

తే. దూరముననున్న యానలుఁ ♦ దొమ్మిదింట, నొవ్వఁగాఁ జేసి వీర్యంబు♦నివ్వటిల్ల
సుర్గ్యమును నొంపఁజాలెడు ♦మార్గణముల, నేసెటన్ మైందు నైదింట♦ నేఁచిగజుని.

తే. జాంబవంతుని దశదివ్య♦సాయకములఁ, ద్రింశదంబకముల నీలుఁ♦దీక్ష్ణములును
భయదములు నరలబ్ధముల్♦పరిమితములును, నైవశరముల సుగ్రీవు♦నంగదునిని.

క. వనచరతల్లజు ఋషభుని, ననిమొన నొప్పించి మూర్ఛ ♦ నందఁగఁ జేసెన్;
దనుజేశ్వరుఁ డపుడు వృద్ధిం, గను కాలధనంజయుఁ డనఁ♦గాఁ గ్రుద్ధుండై. ౪౨

క. తక్కిన వనచరవీరులఁ, జెక్కింద్రను నొంచి మించెఁ ♦ బెనుశరముల; నా
రక్కసుఁ డా పెనురణమున, నుక్కున సూర్యాభములయి ♦ యురుజవములునై.

క. ఆకర్ణాంతము లాగిన, యాకార్ముకముక్తములయి ♦ యులరుశరముల్
వేకపుల బలముఁ గలఁచెను;, నాకరిణి స్వబాణవితతి ♦ హరిబల మచటన్.

తే. ఆకులంబయి మూర్ఛిల్లి ♦ యార్తిరక్త
సిక్తమయి యుంటఁ గనుఁగొని ♦ చెలఁగె హర్ష
మునను; గురుతేజమున వీర్య♦మున వరాత్త
బలమునను బొంగు రావణి ♦ యులఘుగతుల. ౪౪ 3233

* తరుశిలాయుధసంకాశై శ్చర్జై రాశీవిషోపమైః-అనిమూ.

క. శరముల ఖడ్గాద్యాయుధ, వరములఁ ద్వరితముగఁ గురిసి ♦ వానరవీరో
త్కరమును నొప్పించెను సం,గరమున స్వభటాళిమీఁద♦గా నుండకయే.

చ. వనచరసేనపై నిలిచి ♦ వారలకుం గనరాక నీలమే
ఘనిచయ మంబువుల్ గురియు♦కైవడి భీకర బాణవృష్టినం
త నిగుడఁజేసె; భూధరవి♦తానముపోలిక నొప్పునాకపుల్
దనుజశరప్రభిన్నతర♦దారుణదేహులు నొచ్చి రంతయున్. ౫౦ 3235

తే. మాయలను గొట్టఁబడుచును ♦ మానమెడల
వికృతరవమున నార్చుచు ♦ విబుధనాథ
వజ్రసంహతనగరాజ♦వారమట్లు
ధరణిఁ గూలిరి రిపువున్న♦తావెఱుఁగక. ౫౧ 3236

చ. వనచరు లాత్మసైన్యముల ♦ వాఁడిమొనల్ గలసాయకంబు లా
యనిఁ బడుచుండుటే కనఁగ♦నైరి వరంబునఁ గన్నమాయచే
తను గనరాక కప్పఁబడి ♦ తాను నభంబున నున్న యింద్రజి
త్తని నెటులుండునో గన రి♦వంతయుఁ జాలకపోయి రంతటన్. ౫౨ 3237

క. దనుజేశుండు మహాత్ముఁడు, సునిశితతీక్ష్ణాగ్రములయి ♦ సూర్యునిఁబోలెఁ జ
క్కనికాంతి వెలుఁగుశరముల, ననూనగతి వైచి దెసల ♦ నన్నిఁటిఁ గప్పెన్.

క. వనచరుల నొంచె; మఱి యతఁ, డనలునివలెఁ గ్రాలుచున్న ♦ యాశూలములన్
ఘనఖడ్గపరశ్వధములఁ, గన మిడుఁగుఱు లొప్ప కడు శి♦ఖలుపై కెగయన్.

తే. గిరగిరం ద్రిప్పి యట్టి సు♦గ్రీవుబలము, నందు జడివాన గురిసిన♦యట్లు వైచె;
నంత నక్కపియూధపు ♦ లగ్నితుల్య, దనుజవరబాణహతులయి ♦ తనువులెల్ల.

తే. భిన్నములుగాఁగ రక్తంబు ♦ వెల్లువలయి
పాఱఁగా ఫుల్లకింశుక♦పాదపముల
వలెను గనఁబడి యార్తికై ♦ యిల నొకరిప
యిని మఱొక్కరు పడుచు నా♦ర్తిని మునుఁగుచు. ౫౫ 3241

తే. వికృతరవమున నార్చుచుఁ ♦ బృథ్విఁ గూలి;
రంతఁ గొందఱు తలలెత్తి ♦ యంబరమును
గనుచు నయనంబులన్ దీవ్ర♦కాండము లొగిఁ
దగుల నొక్కరిపై నొక♦రుగఁ బడుచును. ౫౬ 3242

క. ధరణిం బడియుండిరి; కర్బురవర్యుం డింద్రజిత్తు ♦ పూనిక హనుమం
తు, రవికుమారుని, నంగదు, హరివరుఁడౌ గంధమాద♦నాహ్వయుమఱియున్.

సీ. వేగదర్శి, సుషేణు ♦ భీమబలోపేతుఁడగు జాంబవంతుని, ♦ నాగవాతు,
మైందుని, ద్వివిదుని,♦మహితుఁడౌ నీలుని,గజుని, గోముఖుని, ని♦కాముబలుని

నా కేసరిని, నల్లు ♦ హరిలోము, వనచరపాలు, విద్యుద్దంష్ట్రుఁ ♦ బ్రబలుఁడైన
యట్టిసూర్యాననుఁ ♦ నాదధిముఖునిని, బావకాక్షుని, నలుఁ ♦ బరమబలము
[1]ఆ. గల్గు జ్యోతిముఖుని, ♦ గపివరుఁ గుముదుని, బ్రాసశూలనిశిత ♦ బాణములను
బ్రహ్మమంత్రయుక్త ♦ భవ్యశరంబుల, నీకపీంద్రవితతి ♦ నెలమి నొంచె. ౬౧
చ. కనకసుపుంఖబాణముల ♦ గాఢగదాతతి వానరేంద్రులన్
గినుక వహించి నొంచి తనుఁ ♦ గేవలశూరునిగాఁ దలంచి రా
మునిపయి లక్ష్మణాఖ్యుపయి ♦ భూరిరవిప్రభ లట్టి తీవ్రకాం
డనిచయ మొక్కరీతి సుర ♦ నాయకవైరి నిగుడ్చె నిక్ష్యచేన్. ౬౨ 3245
ఆ. ఇట్టు లింద్రజిత్తు ♦ హీనసాయకవర్ష, మేచి కురియుచున్న ♦ నించుకేని
సలిలధారలట్లు ♦ క్ష్మాపతి రాముండు, తలఁచి లెక్కగొనక ♦ సనసునమున. ౬౨½
క. తనచుట్టునున్న సైన్యం,బును గని విస్మయము తోఁప ♦ బుద్ధిబలమునన్
గని లక్ష్మణు నిట్లనియెను;, ననుజా! [2]యీంరాక్షసేద్రుఁ ♦ డసురారి తెగన్. ౬౩
క ఘనమైన బ్రహ్మమంత్రం,బును మదిలో నాశ్రయించి ♦ పొంగుచు వారిసే
నను గొట్టుచు భయదంబగు,ఘనసేవల గూల్చె వారి ♦ సుధ్యగతులన్. ౬౩½
క. మనలన్ శరముల నొంచెడు;, ఘనబలుఁడై బ్రహ్మతనకుఁ ♦ గా నిల్చిన యీ
పెను వరమున నాకాశం,బునఁ దనభయదాంగకంబుఁ ♦ బూనిక మెఱయన్.
చ. కనఁబడకుండఁ జేసి యది ♦ కారణమై తగ బాణమోక్షణం
బును గడుఁ జేయు నీదనుజ ♦ పుంగవు నెట్లనిఁ జంప శక్యమా ?
విను మతిమంత! యస్త్రమిది ♦ విశ్వములన్ మహనీయ నిట్టిరీ
తిని దగుదీని పుట్టుకకు ♦ దేవరయై మఱి హేతుభూతుఁడై. ౬౪½ 3250
క. నిరుపమవిభవుండగునా, సరసిజభవు మహిమ మెన్న ♦ శక్యముగా దె
త్తెరుగమునననుచుఁ దలఁచెద, వరమతినిం గాంగ కీవు ♦ బాణపతనమున్. ౬౫
తే. ఓర్చుకొనుము నాతోఁ గూడి ♦ యుద్యమమున;
దనుజసత్తముఁ డీతఁడు ♦ ఘనశరతతి
నట్టె పరఁగించి దిక్కుల ♦ నఖిలములను
గప్పుచున్నాఁడు చూడుమా ♦ కపిబల మిది. ౬౭ 3253
[3]క. పతితాగ్ర్యశూరగణమై, క్షితి నెంతయు నలర; దితఁడు ♦ చెలఁగుచు బవరం
బు తగం జేయక మనమి,ప్డు తెలివిలేక యనిచేయుఁ ♦ బూనక యిచటన్. ౬౭½
తే. హర్షరోషంబులను మాని ♦ యవనినిఁ బడి
మూర్ఛఁ గనియుంటఁ గని రణం ♦ బునను విజయ

---

1 సూర్యాననం జ్యోతిముఖమ్-అనిమూ. ఇంతకుముందున్న కేసరిం అనుపద మార్గమని వ్రాసిన వ్యాఖ్యానకర్త జ్యోతిముఖమనునో నేమియు వ్రాయనందున నాశబ్ద మట్లేయున్నదని యూహింపఁబడినది. జ్యోతిర్ముఖుఁ డనుట సామాన్యవిదితముగదా. 2 అసౌ పునర్లక్ష్మణ రాక్షసేంద్రో బ్రహ్మాస్త్ర మాశ్రిత్య సురేంద్రశత్రుః-అనిమూ. 3 ఏతచ్చ సర్వం పతితాగ్ర్యశూరం-అనిమూ.

లక్ష్మణుని గాంచి మదమున ♦ లంకకేగఁ
గలఁడు నిశ్చయ మిదియని ♦ పలికె నంత. ౭౮ 3254

క. అనుజన్ములు తచ్ఛరములు, తనువులఁ బీడింప నల్లి ♦ ధరఁబడియుండం
గని దనుజేజ్యుఁడు హర్షం,బున నచ్చట సింహనాద♦మును గావించెన్. 3255

క. వనచరసేనను రాఘవు,లను దుఃఖము పాలుచేసి ♦ లఘుగతి దనుజేం
ద్రనియతపాలితయగులం,కను జేరెను సఫలితాత్మ♦కాంతుం డగుచున్. ౭౦

డెబ్బదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౭౪ - వ సర్గము.

హనుమంతుఁ డోషధిపర్వతముఁ దెచ్చుట. రామాదులు మూర్ఛఁ దేఱుట.

చ. హరిపతిసేనయంతయును ♦ నయ్యనిఁ గీడ్పడియున్నరాము, సో
దరుఁ గని భీతి మూర్ఛిలెను ♦ దత్సమయంబున జాంబవంతుఁ డా
సరసిజమిత్త్రపుత్త్రుఁడును ♦ శక్రునిపౌత్త్రుఁడు నీలుఁడేమి యు
త్తరుణమునందుఁ జేయుటకుఁ ♦ దారు సమర్థులుగాక యుండఁగన్. ౧ 3257

చ. కని మతిమద్వరేణ్యుఁడయి ♦ క్రాలు విభీషణుఁ డాప్లవంగసే
నను భయవిహ్వలంబుఁ గని ♦ నైజములై యతులంబులైన చ
క్కనివచనంబులం బ్లవగ♦కాంతుల నూఱడిలంగఁ జేయుచున్;
వనచరులార! సాధ్వసముఁ ♦ బాయుఁడు రాముఁడు లక్ష్మణుండనిన్. ౨ 3258

సీ. శత్రుసాయకతతి♦క్షతులయి యవశులై వెఱఁగందినారని ♦ నేతలఁ బడఁగఁ
దగినకాలము గాదు ♦ దానికి నవకాశమే లేదదెట్లన ♦ నీమహీశ
తనయులు బ్రహ్మదే♦వునివాక్కు నిమ్మెయి గౌరవింపఁగఁ బరుఁ ♦ డీరసమున
వైచినశరములఁ ♦ బరిభవింపఁగఁ బడినట్లున్నవారు వే ♦ ఆరయ లేదు;

తే. బ్రహ్మ యాయింద్రవైరికిఁ ♦ బరమకరుణ, సఫలవేగము గల్గున♦స్త్రంబు దీని
నిచ్చె నీరాజపుత్త్రకు ♦ లీమహాస్త్ర,వరమునన్ గౌరవింపఁగ ♦ ధరణిఁ బడిరి. ౪

క. కనుకం దీనికి ఖేదం,బును బొందఁగనేల? యనినిఁ ♦ బూనిక మతిమ
ద్ఘనుఁడగు వాయుతనూజుఁడు, వనజజునస్త్రమునఁ గల్గు ♦ భక్తిబలమునన్.

ఆ. ఒకముహూర్తకాల ♦ మొయ్యన బద్ధుఁడై
యుండి యవల ముక్తి ♦ నొంది, యవిభీ
షణోక్తులఁ దగ ♦ విని పత్కనతనితో;
బలముగలుగు నిక్క♦వులు రణమున. ౫ 3261

క. హతులై రింకెవరెవ్వరు, క్షితిఁబడియుం బ్రాణములను ♦ జెందినవారో
వెతకుచు నాశ్వాసింతము, దితిజాన్వయరత్నమ! యని ♦ తెలియఁ బలికినన్. ౬

క. [1]ఆరాత్రికాలంబున, వీరులు వారిద్ద ఱంతఁ♦ బెను నుల్కలఁ గొం
చారణభూమిని వెదకిరి, వారక వీరులగు కీశ♦భటులం బూన్కిన్. ౯ 3263

క. కరములు తొడలును దోఁకలు, చరణంబులు వ్రేళ్లు మెడలు♦శరములఁ దెగి న
త్తురు గాఱ [2]మూత్ర మొక్కట, వరుసన్ స్రవియింప గిరుల♦వలెనం దందున్.

సీ. పడియున్న వనచర♦పటలంబుచేతను భాసిల్లుచున్ దుస్థి♦పడితశస్త్ర
ములచేత నిండి యా♦హాలికంబును దగంగఁ గాంచి రాయిద్దఱు; ♦ కపివిభుండు
నంగదుండును, నీలుఁ ♦ డాశరభుండును గంధమాదన,గవా♦క్షు నలు లట్టి
యా వేగదర్శియు♦నాసుషేణుండు మైందుఁడు నావాలుకుఁడుద్వివి♦దుఁడును జ్యోతి

తే. ముఖుఁడు పనసుండు మఱికపి♦ముఖ్యులైన
యన్యవనచరులును జచ్చి♦నట్లె యవనిఁ
బడియుఁ గదలక యుండెన♦ప్పుడు కనుఁగొని;
రంత బ్రహ్మకుఁ బ్రియుఁడైన ♦ యాతుసుతుఁడు ౧౧ 3265

క. వనజజునస్త్రంబున నా, దినపంచమభాగమున న♦తిస్థిరబలులన్
వనచరుల నఱువదియు నేడును గోట్లను జంపె నెక్కు♦డుం గినుకమెయిన్.

చ. హనుమయు నావిభీషణుఁడు ♦ నట్లు భయంకరమై సముద్రమో
యనఁ దగు నాకపీంద్రబల ♦ మంతయు, సాయకపీడితంబునై
కనఁబడ జాంబవంతు వెద♦కంగను సాగిరి యుద్ధభూమిలో;
[3]వనచరవల్లభుండును స్వ♦భావముచేత నె వృద్ధుఁ డందునన్. ౧౩ 3267

తే జ్ఞానవృద్ధుండు సాయక♦శతనిపీడి
తాంగుఁడును నయి చల్లారి♦నట్టి యగ్ని
కరణి నుండంగ నావీరు ♦ ఘనుని జాంబ
వంతుఁ గాంచి విభీషణుఁ ♦ డెంతొ కూర్మి. ౧౪ 3268

క. పరిసరమున కేగి కపీ,శ్వర! దారుణబాణనిహతిఁ ♦ బ్రాణంబులు నీ
వరయం జెదరవుగా దే?, వరధిషణా! చెప్పవయ్య ♦ వాక్యములైనన్. ౧౫

క. అనిన విభీషణుపల్కుల, విని భల్లుకనాయకుండు ♦ విపులశ్రమముం
గని మాటలాడనూల్కొని;, దనుజేంద్రా! వీరవర్య! ♦ త్వద్గళరవమున్. ౧౬

క. విని నిన్నెఱిఁగితి భీకర, ఘనశరములఁ బీడితుండఁ ♦ గావున దృష్టిన్
నినుఁ జూడఁ జాలకున్నా;, ననఘా! యేమహితునిఁ గని♦యంజన యెలమిన్.

క. అనిలుండును సత్పుత్రునిఁ, గనినారను ఖ్యాతిఁ గనిరొ ♦ కపితిలకుం డా
హనుమంతుఁడు ప్రాణములన్, మనియుండినవాఁడె కాదె? ♦ త్వాన్తలిననియెన్.

1 ఉల్కాహస్తౌ తదారాత్రౌ-అని మూ. ఇట నుల్కలనఁగాఁ గొఱవులు అనియర్థము.
2 ప్రస్రవద్భిః క్షతజం గాత్రైః-అని మూ. ప్రస్రవద్భిః=మూత్రయద్భిః-అని వ్యాఖ్య 3 వనచరశబ్దము మూ
లరామాయణమునఁ గపిభల్లూకవాచకముగాఁ బ్రయోగింపఁబడినది

క. అనుజాంబవంతువాక్యం,బును వినుచు విభీషణుండు ♦ భూపతనయులన్
ఘనులైన రామలక్ష్మణు,లను నడుగక హనుమునేల ♦ లలి నడిగితివో?. ౧౯

తే. అనిలజునిపైనఁ జూపిన ♦ యంత సుప్రి
యము హరీశ్వరునందును ♦ నంగదునయి
రామునందును గాని యో ♦ రాక్షస! కనఁబఱుప
నైతి వేలొకో?; యనిన న ♦ య్యార్యవరుఁపలుకు. ౨౦ 3271

క. విని జాంబవంతుఁ డిట్లను;, దనుజవరుని యింక ఋంతఁ ♦ దమి వాయుతనూ
జుని నడిగినట్టి కారణ,మును దెల్పెద; హనుమ సూర ♦ ముఖ్యుం డొకఁడే.

చ. తనువునఁ బ్రాణము ల్గలిగి ♦ ధాత్రిఁ జెలంగినఁ దక్కువారలీ
యని మొనఁ జచ్చినన్ విను భ ♦ యం బొకయింతయు లేదు ప్రాణముల్
తనువున నున్నయట్టులె; యు ♦ గం బొకఁ డుజ్ఝితజీవితుండయె
మనమిటఁ బ్రాణముల్ గనియు ♦ త్రాస్థలిఁ జచ్చినవారమే సుమీ!. ౨౨

తే. దనుజపుంగవ! నాయనా! ♦ యనిలునంశ
వాఁ డగుచు వీర్యమున నగ్ని ♦ యంటివాఁడు
నయి సమీరకుమారకుం ♦ డైన హనుమ
యనువులం దాల్చియుండిన ♦ నపుడు మాకు. ౨౩ 3277

క. కలుగు నిల జీవితాశయుఁ, బలు కిది సత్యం బటన్న ♦ వాయుకుమారుం
డెలమిని వృద్ధుండగుచుం, జెలఁగెడు నాజాంబవంతుఁ ♦ జేరి నియతిచేన్.

క. చరణంబులకున్ మ్రొక్కెను;, వరభల్లూకంబు జాంబ ♦ వంతుఁడు విలస
చ్ఛరవీడితేంద్రియుఁడు న,య్యురవుణనే హనుమననుచు ♦ నొగి మ్రొక్కంగన్.

క. విని తాను మరల జననం,బును జెందిన యట్లు తలఁచె ♦ బుద్ధిని; నంతన్
ఘనతేజుఁ డతఁడు హనుమం, గని యిట్లని పల్కెఁ బ్లవగ ♦ కాంతా! రమ్మా!.

చ. వనచరులం గృపామతిని ♦ బాగుగఁ గావుము; నీకుఁదక్క నీ
వనచరపాళిఁ గానఁదగు ♦ బాహుపరాక్రమ మన్యులందు లే
దనుపమశక్తి వీవు మఱి ♦ యందఱకుం బ్రియమిత్రుఁ డన్నవే
రు నియతి నీకె చెల్లు నిల ♦ రూఢిగ నాపలు కాలకింపుమా. ౨౬ 3281

సీ. త్వత్తుల్యుఁడే యిట్టి ♦ తఱిఁ బరాక్రమమును గనఁబఱుపందగుఁ ♦ గపులయందు
శౌర్యంబుఁ జూపంగఁ ♦ జాలినవాఁడు నాకగపడ లేదు; నీ ♦ హరిభటులకు
భల్లుకసేనకుఁ ♦ బ్రమదంబు గల్గింపు శరజాలపీడిత ♦ సర్వగాత్రు
లగు రాఘవులను నీ ♦ యదనునఁ దగువిశల్యులను జేయుము; విను ♦ మొగిఁబథంబు

తే. జలధిదాపున మీఁదుగాఁ ♦ జాలదూర
మరిగి హిమవంత మనునగ ♦ వరమునకును

జనవలయు; శత్రుసూదనా! ♦ చాల యెత్తు
గలిగి ఋషభాద్రి యొకండు ♦ గనకమయము. ౨౯ 3282

కం. కనఁబడుఁ గైలాసంబును, గననగు నవ్వానిఁ గాంచఁ ♦ గల వోవీరా!
వినుమా! గిరియుగ్మాంతర,మున నతులప్రభలదీప్త ♦ మునయి చెలఁగుచున్. ౩౦

¹ తే. ఎల్ల యోషధులం గూడి ♦ యెసఁగు నోష
ధగిరి యటఁ జూడనగుఁ గపి ♦ తల్లజ! గిరి
శృంగమునఁ బుట్టి కాంతులఁ ♦ జెన్నుమీఱి
దశదిశల వెల్గఁ జేయుచు ♦ యశమునఁ దగి. ౩౧ 3284

కం. కనఁబడు దివ్యౌషధులో, యనఘా! నాల్గందు ననుచు ♦ నని యొన్ మఱియున్
విను మృతులం బ్రదికింపం, గను జేసెడుశక్తి గలిగి ♦ క్రాలును గానన్. ౩౨ 3285

²కం. మృతసంజీవిని యనఁగా, క్షితిఁ బేరుం గాంచె; మఱియు ♦ జీవించిన నె
వ్విశమునఁ దిగుగంగగు నా,వితమున శల్యములఁ దీసి ♦ వేయును గానన్.

ఆ. అది విశల్యకరణి ♦ యను పేరుఁ గాంచె; న వ్వలను జర్మ మొక్క ♦ భంగి నొకటి
గాఁగఁ గూర్చునద్ది ♦ కావున సంధాన,కరణి యనఁగఁ బేరుఁ ♦ గాంచె నొకఁడు.

తే. వ్రణజనితమైన యట్టి వై ♦ వర్ణ్య మెల్లఁ
బోవఁగాఁ జేయు నద్ది కా ♦ వున నె క్షితిని
దనరు సావర్ణ్యకరణి, యా ♦ త్తనువు నెల్లఁ
గాంతి సమతను గల్గింపఁ ♦ గలది యదియె ౩౩ 3288

కం. హనుమా! పవమానప్రియ, తనయా! యోషధుల నెల్లఁ ♦ దగ నేను వచిం
చినవానిఁ దీసికొని చ,య్యన రావలయున్ గపీంద్ర ♦ లార్తులు గానన్.

తే. వారికారటఁ గల్గింప ♦ వలయుఁ బ్రాణ
దానమును జేసి; యనెడు నా ♦ తని పలుకుల
హరిలలామము హనుమంతుఁ ♦ డాలకించి
సలిలపూరములను మహా ♦ జలధికరణి. ౩౪ 3290

కం. బలముల యాధిక్యమునన్, జెలఁగె; మహావీరుఁడును ప్ర ♦ సిద్ధిని ధరలో
విలసిల్లు హనుమ యప్పుడె, సులలితగతి నాత్రికూట ♦ శుభగిరిపైకిన్. ౩౫

³ఆ. అట్టి దుమికి పర్వ ♦ తాగ్ర్యంబుఁ బీడించు, చును ద్వితీయగిరివ ♦ లెనె కనంగఁ
బడియెఁ; బర్వతమది ♦ పావనిపదఘాత,ములకుఁ గలఁగె, మఱియు ♦ భూమిధరము.

కం. కరము నిపీడిత మౌటన్, బరిభగ్నాంగము యి నిల్వఁ ♦ బడఁ జాలక తా

1 సర్వౌషధియుతం వీర ద్రక్ష్య స్యోషధిపర్వతమ్-అనియూ. 2 మృతసంజీవినీం చైవ విశల్య
కరణీమపి, సావర్ణ్యకరణీం చైవ సంధానకరణీం తథా-అనియూ. ఈశబ్దములకు వ్యుత్పత్త్యర్థములు
వ్యాఖ్యానానుసారమే తెనుఁగునఁ జేర్పఁబడినవి 3 పీడయన్ పర్వతోత్తమమ్-అనియూ.

నరయఁగ నశక్తిమంతుని, శరణిం బరికింప నయ్యెఁ ♦ గడు దీనముగన్.

[1]క. హనుమత్పదపీడితమై, ఘనగిరిఁ గలభూరుహములు ♦ కపివరువేగం
బున నిప్పుగల్ల మండెను; ననూనశృంగములు రాలె ♦ నణువులపగిదిన్.

ఆ. అట్లు పీడితాంగ♦మయి భగ్నతరుశిలా
తలమునగుచు నడఁకు ♦ ధరణిధరము
నందు యుద్ధమప్పు ♦ డగుచుంటఁ గపులందు
నిలువఁ జాలరైరి ♦ నిశ్చలముగ. ౭౯ 3295

క. హరిపతి యురవడి లంకా,పుర మారాతిరిని జూడ ♦ భూరిద్వారం
బు రయమునం జలియింపన్, గురుగృహగోపురము లట్టి ♦ కూలిపడంగన్.

తే. తాను నృత్యముచేయుచం♦దమున నుండెఁ;
బర్వతాకృతిఁ దగియున్న ♦ పవనతనయుఁ
డద్రి నవ్విధిఁ బీడించి ♦ యబ్ధియుతము
గా ధరిత్రిని జలనంబుఁ ♦ గనఁగఁ జేసె. ౮౧ 3297

చ. అనిలజుఁ డంత నాశిఖరి ♦ నప్పుడె పీడి సుమేరుమందరా
ఖ్యనిఖిలలోకవిస్తృతిని ♦ నందిన కొండలకున్ సమానమై
వినుతిని గన్న వృక్షములు ♦ వింతలుగా బహుభంగులం దగం
గ నెసఁగు నిర్ఝరంబుల వి♦కాసిసరోరుహహల్లకంబులన్. ౮౨ 3298

తే. మఱియు లతలను రుచిరమై ♦ మహితవిభవ
యుక్తమై దేవగంధర్వ♦యుక్త మగుచు
షష్టియోజనమితనువి♦శాల మగుచు
మునులు విద్యాధరులు దేవ♦వనిత లెలమి. ౮౩ 3299

క. తను సేవింపఁగ నొప్పుచు, ననయము నానామృగవ్ర♦జాన్వితమై యొ
ప్పిన పెనుకందరములచేఁ,తను శోభిలుచున్న [2]మలయ♦ధరణీధరమున్.

తే. జలదసంకాశతనుఁడైన ♦ శ్వసనపుత్రుఁ
డందుఁ గల్గిన గంధర్వ♦యక్షకిన్న
రులను నాకులపెట్టుచు ♦ నెలమిఁ దనువుఁ
బెంచె, నంతటఁ బదములఁ ♦ బెను శిఖరిని. ౮౪ 3301

క. బలమునఁ ద్రొక్కుచు మఱి యూ,ర్జ్వలతరబడబాముఖంబు ♦ ననుత గలుగునో
రలరుచుఁ దెఱచి మహోదధి,జల భయపెట్టుటకుఁ బోలె ♦ శుంభత్స్వనమున్.

సీ. నిగుడించెలంకయం♦దుఁ గల రాక్షసులెల్ల నద్భుతంబుగ నట్టు♦లార్చుహనుమ
నినదంబువిని భయం♦బున నించు కేనియుఁ గదలంగ లేరైరి ♦ కడఁగి యంత

1 తస్య పేతు ర్నగా భూమౌ హరివేగా చ్చ జజ్వలుః-అనియూ. 2 మలయపర్వతమనఁగా లంకా మలయపర్వతమనియే వ్యాఖ్యాతలు వ్రాసిరి.

భయదవిక్రముఁడైన ♦ వైరిహంత యతండు భక్తిరాఘవునకుఁ ♦ బ్రణతులిడుచు
నతనికిఁగా నొప్పు ♦ దగుకార్యమును జేయఁగాఁ బూనెఁ; బండవే ♦ గమున నొప్పు

తే. నతఁడు ఫణికల్పమౌ వాల ♦ మంతనెత్తి
యెగురఁ బృష్ఠము వంచి, య ♦ హీనశక్తిఁ
గలుగఁ జెవులు ముడిచి వ ♦ క్త్రంబు బడబ
ముఖమువలె విస్తృతిని జేసి ♦ ముదమునఁ దగి. ౭౮ 3303

క. తనమది రాముని నిడుకొని, యనుపమబల మలర నెగిరె ♦ నంబరమున; కా
హనుమ కరసక్థివేగం,బున నూడిన తరుగణములు ♦ భూధరశిలలున్. ౭౯

క. గిరి నిరతమున్న ప్రాకృత, హరులును వాయుజునితోడ ♦ నతిజవమున ని
ర్భరరీతిఁ జిన్నఁగాఁ బడి, వనసగ వేగంబు తగ్గఁ ♦ బడిరి జలములన్. ౮౦

చ. గరుడసమానవీర్యుఁడగు ♦ గాలికుమారుఁడు భోగిభోగమ
ట్లరయఁగ నొప్పుబాహువుల ♦ నప్పుడు సాఁచి దిశాతతిం గడుం
గరముల నాక్రమించునటు ♦ గన్గొనఁగాఁ దగి మేరునామభూ
ధరవరమున్న దిక్కునను ♦ దద్దయుఁ గ్రాలు హిమాద్రికిం జనెన్. ౮౧ 3306

క. తనజవమునకుం గలఁగుచుఁ, బెనుభంగము లట్టి యెగుర ♦ వివిధసలిలజం
తునిచయము చలన మొందం, గనుఁగట్టుమహాంబురాశిఁ ♦ గనుచు నతండున్.

క. హరికరవిముక్తచక్రము, కరణిని వేగంబ చనియె; ♦ గాదిలితం డ్రిన్
గరము జనంబును బోలిన, హరివీరుఁడు భూధరముల ♦ ననసీజములన్. ౮౩

క. సరసుల నదులఁ దటాకో, త్కరమును వరనగరముల ని ♦ తాంతజనమనో
హరజనపదములఁ గాంచుచు, నరిగెను; బితృతుల్యవిక్ర ♦ మాఢ్యుఁడు మఱియున్.

తే. అభ్రపథ మాశ్రయించి వీ ♦ రావతంసుఁ
డగుట విగతశ్రముండయి ♦ యతిజవమున
నరిగె; మారుతి పవమాను ♦ నట్టి వేగ
మాశ్రయించి మహాత్ముకా ♦ ర్యంబుఁ దీర్ప. ౮౫ 3310

క. నినదంబున దిగ్వతతిని, ఘనశబ్దమయంబుగాఁగఁ ♦ గపిశార్దూలుం
డొనరించుచుఁ బోయెను; నా,యనిలజుఁ డాజాంబవంతుఁ ♦ డాడినరీతిన్. ౮౬

క. మనమున నెంచుచు లక్ష్యం,బును దాఁటకయుండ వేగ ♦ మున శ్వసనుండై
చనుచున్ దోడనె హిమగిరిఁ, గనియెన్; బ్రస్రవణనికర ♦ కలితం బగుచున్.

సీ. బహుకందరంబుల ♦ బరిఢవిల్లుచు నిర్ఝరాదుల నెసఁగుచు ♦ నమలమగుచు
శ్వేతాభ్రచయహారి ♦ శిఖరాళితోఁ దగి వివిధభూరుహముల ♦ వింతగఁ దగి,
పర్వతోత్తమమయి ♦ భాసిల్లు తుహినాద్రి నొందెను; మిక్కిలి ♦ యున్నతంబు
లై భయంకరములై ♦ యలరు నుత్తమశృంగములతోడ నొప్పుని ♦ స్తులనగంబుఁ
ఆ. జేరి యందు దివిజ ♦ సిద్ధమునీంద్రసే,వితములగుచుఁ బావ ♦ నతరములయి

యలరు నొప్పు యాశ్ర♦మావళిఁ గాంచెను;, [1] బ్రహ్మకోశపదము ♦ రజతగిరిని.

క. హరిహయతపఃపదంబును, హరుఁడు విలాసంబుకొలఁకు ♦ నాశుగమోక్షం
బరసి యొనర్చిన పదమును, సురలుహయగ్రీవుఁ గొలుచు ♦ చోటునుమఱియున్.

తే. బ్రహ్మశిరమును, విశ్రమా♦ర్థముగ నిలిచి
యున్న మాసాదులయిన సూ♦ర్యనిభటులను;
బ్రహ్మ వజ్రికి మున్నెందు ♦ వజ్రమిచ్చె
దాని, వైశ్రవణపదంబు ♦ భానుదీప్తి. ౫౯౪ 3315

క. మును ఛాయాప్రీతికినై, వనజప్రియు వేఁడి తగ్గ ♦ వరమతి నూహిం
చిన విశ్వకర్మ యాసూర్యుని సానంబట్టఁ గట్ట♦నొప్పెడుతావున్. ౬౦ 3316

క. సురలెల్ల బ్రహ్మదేవునిఁ, బరికింపఁగ నుచితరీతి ♦ భాసిల్ల మునీ
శ్వరు లేర్పఱిచిన చోటును; హరకార్ముకమందు పదము ♦ నాతఁడు గనియెన్.

[2]క. ధరనుండి యధోలోకముఁ, బరికింపఁగఁ బోవు నావి♦వరమును మఱియున్;
నిరుపమకైలాసమహీ, ధరహిమవచ్ఛిలల ఋషభ♦ధరణీధరమున్. ౬౧ 3318

తే. మేరునామకకాంచన♦ధారణీధ
రమును, రాత్రుల భాసిల్లు ♦ నమలతృణవి
తానముల వెల్గు జ్యోతులఁ ♦ దనరుచున్న
యోషధులు పెక్కులున్న యా♦యుత్తమగిరి. ౬౧౪ 3319

క. కని వాయుపుత్త్రుఁ డచ్చట, ననలప్రభలం జెలంగు ♦ నటు లోషధులన్
దనరారు తద్గిరీంద్రంబును గని యాశ్చర్య మెంతొ ♦ పొందుచుఁ బిదపన్.

క. తిరుగుచు నల్లెడల నతం, డరసె మహౌషధుల; శ్వసను♦నాత్మజుఁడు కపీ
శ్వరుఁ డెన్నో యోజనంబులు, త్వరపడి దివ్యౌషధులను ♦ భాసిలుగిరినిన్.

ఆ. కలయఁ దిరిగి వెదకె; ♦ క్ష్మాధరవర్యమ్ము, నందుఁ దనరి దివ్య♦మైన లతల
వితతి తముగ్రహింప♦వెదకంగవచ్చెనీ, హనుమయంచు నెఱిఁగి ♦ యతులమహిమ.

క. కనఁబడకయుండె నతనికి, హనుమయు నట్లవ్వియుంట ♦ కాత్మను గోపం
బును బొంది యద్ది దుర్భర, మనఁ దగుటన్ మిగుల నార్చి ♦ యనలాక్షుండై.

చ. ధరణిధరంబుతోఁ బలికెఁ ♦ దద్దయు నాదము పొల్చుచుండ; నో
ధరణిధరేంద్రమా! రఘువ♦తంసునిపైనను నీకునుం గృపా
దరములు లేకయున్నవి గ♦దా యిదె నీదగు భావమేని నా
కరబల మూని నిన్ బెఱికి ♦ క్ష్మాస్థలిఁ జల్లెదఁ జూడు మా నను౯. ౬౬౪ 3324

1 స బ్రహ్మకోశం రజతాలయం చ-అనిమూ. బ్రహ్మకోశమును నాత్రమును. 2 కైలాస మగ్ర్యం హిమవచ్ఛిలాంచ-అనిమూ. హిమవచ్ఛిలా నామ కైలాసపార్శ్వస్థశిలావిశేషః-అని వ్యాఖ్య.

చ. అని యతఁ డంత భూమిరుహా♦హస్తిగణాన్వితమై సకాంచనం
బును నయి వేలధాతువులు ♦ పొల్చుచునుండఁగ నుల్లసల్లతా
ఘనఘృణియుక్తసానువయి ♦ క్రాలుధరాధరకూటముం గరం
బున గ్రహియించి తచ్ఛిఖర♦ముల్ గను నల్పము లాకులంపడెన్. ౬౭½

తే. వేగముగఁ బెల్లగించె; నా♦వీరుఁ డమరు
లసురవరులును లోకంబు ♦ లట్టె భీతి
నందఁగాఁ బెల్లగించి యా♦యద్రి నిట్టు
లంబరంబున కెగసి బ♦లాధికుఁడయి. ౬౮ 3326

క. గరుడోగ్రవేగుఁడై యుం,బరమున వేగంబ చన న♦భస్స్థదివిజు లా
వరమునఁ దనుఁ బొగడంగా, నరిగె; మరుత్సుతుఁడు భాస్క♦రాభుండగుచున్.

ఉ. భానుసమానకాంతిగల ♦ పర్వతకూటము సంగ్రహించి పెం
పూని నభంబుపై కెగసి ♦ యుగ్రమయూఖుని సన్నిధానమున్
దాను ద్వితీయభానుఁడన ♦ నాతఁడు చక్క వెలింగె; నమ్మరు
త్సూనుఁడు క్ష్మాధరేంద్రమన ♦ శోభిలుచున్ గిరి నట్టె చేతిలోన్. ౬౯½

క. ధరియించి వేయి యంచులఁ, గరము విరాజిల్లి యనల♦కాంతులఁ దగి భీ
కరమైనచక్రమును జే, ధరియించిన విష్ణు వట్లు ♦ తద్దయు వెలిఁగెన్. ౭౦½

చ. హనుమకరంబునం జెలఁగు ♦ నాగిరినుండు మహౌషధీసువా
సనకు స్వకీయదేహములు ♦ చయ్యనఁ బ్రాణయుతంబులౌట న
వ్వనచరు లాతనిం గనుచు ♦ బాగుగ నార్చిరి వారిఁ గాంచి యా
హనుమయుఁ గార్యసిద్ధి తగ ♦ నంచును బిట్టుగ నార్చె నీవిధిన్. ౭౧ 3330

క. వారల భయదవరంబుల, నారసి లంకాపురస్థు♦లగు రక్కసులున్
ఘోరతరంబుగ నార్చిరి;, మారుతి బల మలరుచుండ ♦ క్ష్మాధరపతిపై. ౭౧½

క. వనచరసేనామధ్యమ,మున వ్రాలి యటం జెలంగు ♦ ముఖ్యకపుల కొ
య్యన వంచి యుత్తమాంగం,బును మ్రొక్కి విభీషణునిని♦మోదం బలరన్.

ఆ. కౌఁగిలించుకొనియె; ♦ క్ష్మాపతితనయు లా, రామలక్ష్మణులు వి♦రాజమాన
ములగునోషధుల ద♦గు లలితగంధంబు, ఘ్రాణరంధ్రములఁ ద♦గంగ నెక్క.

ఆ. వెస విశల్యులైరి ♦ వీరవానరు లెల్ల, వానిగంధమునకు ♦ మేను లెల్లఁ
జక్క నసుర లేచి ♦ యుక్కునఁ బొదలిరి;, యంతకుమును నిహతు♦లైన కపులు.

సీ. దివ్యౌషధులదగు ♦ భవ్యగంధము సోఁక సంజీవనికిఁ గల ♦ శక్తివలన
క్షణమున లేచి వి♦శల్యకరణివలనను విశల్యాంగులై ♦ ఘనతనొప్పు
సంధానకరణిదా ♦ శక్తిని విరుజులై సావర్ణ్యకరణి ప్ర♦శస్తమహిమ
వలన నారాతిరి ♦ లలితనిద్రను బొందువారు లేచినయట్లు ♦ వఱలుచుండి;

ఆ. రక్లై దనుజులెల్ల ♦ నపుడేల బ్రదుకక
యుండిరనిన? లంక ♦ నున్న దనుజు
లెపుడు కపులతోడ ♦ నేచి యనిం జేయఁ
బూని రదియె మొదలు♦గా నిరతము. ౭౫॥ 3335

క. అనిఁ జచ్చినవారల సం,ఖ్యను నౌరు లెఱుఁగకయె యుండ ♦ నారావణునా
జ్ఞను గపులచేతఁ జచ్చిన, దనుజులనుఁ ద్రైచి రయ్యు♦దధి నపు డపుడే.

క. అనిలజుఁ డుదగ్ర వీర్యుఁడు, ఘనజవమున నోషధిగిరి♦కడఁకం దుహినా
ద్రిని జేర్చి మరల శ్రీరా,మునితోడం గలిసికొనియె ♦ మునటిరీతిఁ. ౭౭॥

డెబ్బదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౭౫ - వ సర్గము.

కోఁతులు లంకను గాల్చుట, తుములయుద్ధము.

క. గురుతేజుఁడు సుగ్రీవుఁడు, పరికించి ప్రయోజనంబు ♦ భంగిని భూమీ
శ్వరున కది విన్నవించుచు, మరుత్సుతుంజూచి యనియె ♦ మంజులభణితిఁ.

క. విను రావణుండు కలనున, ననుజుండౌ కుంభకర్ణుఁ ♦ డాతనితనయుల్
వనచరహతులౌటను నాత్మను నుత్సాహంబుఁ దక్కి ♦ తత్తఱపడుచుఁ. ౧॥

ఆ. ఉన్నవాఁడు గనుక ♦ యుద్ధంబు నొసఁగఁడు
పురము వెడలివచ్చి; ♦ హరులయందు
గురుబలాఢ్యు లెవరొ ♦ పరమజవంబున
నరుగు వార లెవరొ ♦ యాప్లవగులు. ౨॥ 3340

క. [హారితుల్యులౌట దనుజే,శ్వరునావాసంబుఁ గాల్పు] ♦ సాలముపైకిఁ
గర మెగసి కొఱవిగములం, గరముల ధరియించి మించు♦కడఁకలఁ బురిలోఁ.

క. చొరఁబడుదురుగా కనియెఁ;, ఖరకరుఁ డస్తాద్రిఁ జేరి ♦ గాఢముఁ గడుభీ
కరమై యానిశి తోలిజా, మరయఁగఁ గన్పట్టుచుండ ♦ నాహరివీరుల్. ౩॥

క. కరములఁ గొఱవులఁ గైకొని, యరిగిరి లంకాభిముఖులు♦నై; యంతట వా
నరబలము లుల్కలను స,త్వరముగఁ గేలఁ ధరించి ♦ వచ్చి తఱుమఁగఁ.

తే. నలుదెసలనుండి ప్లవగవీ♦రులు తఱిమిన
గుల్మములనుండి నగరంబుఁ ♦ గోర్కెఁ గాచు
చున్న యారక్కసులు పాఱి ♦ రొక్కరీతి;
నంత నవ్వానరులు రాజ♦నాజ్ఞఁ దలఁచి. ౫ 3344

సీ. పురకవాటంబులఁ ♦ బురవీథులందును నట్టళ్ల వివిధచ♦ర్యలను మఱియుఁ
బ్రాసాదములయందు ♦ వహ్నిని బెట్టిరి; వేనవేలుగ నిండ్ల ♦ వీతిహోత్రు

నంటించి దహియించి; ♦ రంతటఁ గొండలవంటి సౌధంబులు ♦ వరుసఁ గాలి
యిలఁ గూలె; వానియం ♦ దెసఁగెడు నగరువు సరసమై తగుహరి ♦ చందనంబు
తే. దగ్ధమయ్యెను; మంచిము ♦ త్యములు మఱియు
నితరమణులును వజ్రంబు ♦ లతులకాంతి
నలరుపగడంబులును శుభ్ర ♦ ములగు పట్టు
వస్త్రములును గౌశేయముల్ ♦ వరుసఁగాలె. ౮౫ 3345
ఆ. గొఱ్ఱెరోమములను ♦ గోవుల మేపాది, జంతురోమములను ♦ సరసగతుల
నల్లియున్న కంబ ♦ ళాదులు కాంచన, భూషణములు శస్త్ర ♦ పుంజములును. ౮౬
క. తురగాలంకారంబులు, కరికంఠవిభూషణములు ♦ కత్యాళులు, సుం
దరరథభూషణములు భీ,కరభటకవచాళి, వాజి ♦ కరివర్మములున్. ౧౦ 3347
క. ధనువులు ఖడ్గంబులు శిం,జినులును శక్త్యంకుశములు ♦ చిత్రములయి భీ
తినిగూర్చు తోమరంబులు, ననుపమరోమాంచితంబు ♦ లగు కంబళులున్. ౧౧
క. చామరములు పులిచర్మము, లామాడ్కిం జారుతరము ♦ లై కస్తూర్యు
ద్దామసుగంధద్రవ్యము, లామంటలఁ గాల్పఁబడియె ♦ నత్తరుణమునన్. ౧౧౫
క. పురమున ముక్తామణిసుం, దరసౌధము లుజ్జ్వలాస్త్ర ♦ తతి యెల్లెడ భీ
కరరీతిఁ గాల్చె ననలుఁడు;, తరుణంబున నపుడు పురవ ♦ తంసమునందున్. ౧౨౫
సీ. స్వస్తికాదికభేద ♦ నరణులను గృహస్థు లగు రాక్షసులకుఁగా ♦ నమరుపఁబడి
నట్టి గృహంబుల ♦ నన్నిటినిం గాల్చె నగ్ని; యప్పుడు లంక ♦ యందు హేమ
చిత్రతనుత్రాణ ♦ మాత్రధారులు, పుష్పహారోత్తమాంబర ♦ ధారులల్లి
మద్యపానచలాక్ష ♦ మండితులగువారు, మదవిహ్వలచరులు, ♦ మత్తువలనఁ
ఆ. బ్రియలయంబరములఁ ♦ బ్రియమునఁ గేలధ,రించి రతినిఁగోర ♦ నెంచువారు;
వైరులందుఁ గోప ♦ భరమూనువారు గ,దాళిశూలఖడ్గ ♦ హస్తులు మఱి. ౧౩౫
క. పలలంబులఁ దినుచుఁ బయ,స్సులఁ ద్రావుచు లలితములుగ ♦ శోభిలుశయనం
బులఁ బ్రియులతోడ శయనిం,చి లలిన్ నిద్రించువారు ♦ చెచ్చెఱ భీతిన్. ౧౬
చ. తనయులఁ దీసికొంచు పగఁ ♦ దద్దయు వేగమ నాల్గుతట్లకుం
జనియెడు వారునై యిటుల ♦ సంకులరీతిగ లంకలోపలం
దనరు నిశాటలక్షలను ♦ దారుణవహ్ని దహించి వారిక్రొ
వ్వునఁ దగి మాటిమాటికిని ♦ బొల్చెను మంటల మిన్నుఁదాఁకుచున్. ౧౭౫
సీ. ధనయుతంబులు మహా ♦ ధననిర్మితంబులు గంభీరతల్పసం ♦ కలితములును
జారుతరంబులు ♦ శాతకుంభవినిర్మితములు చంద్రాకృతిఁ ♦ దనరునవియు
నర్ధచంద్రాకృతి ♦ ననురుపఁబడియున్న యవియుఁ బై మేడల ♦ నతిశయోన్న
తిని మించునవియు, ర ♦ త్ననిచయచిత్రితవాతాయనంబుల ♦ భాసమాన
శయ్యాసనంబులఁ ♦ జారుతరంబులై విలసిల్లునవియును ♦ విమలమణిఖ

ఆ. చితములును బ్రవాళ♦వితతములునునయి, చెలఁగి తీవ్రరశ్మిఁ ♦ జేరఁ బెరిగి
క్రౌంచపక్షిగణముల ♦ నంచితవీణల, భూషణాళి నినద♦ముల నెసంగి ౨౦ 3354

క. గిరివలె నొప్పెడు సౌధో,త్కరముల దహియించె నగ్ని; ♦ దహనయుతిని భీ
కరగతి నుండెడు లంకా, పురతోరణములు శిఖాభి♦భూతము లగుచున్. ౨౧

ఆ. వృష్టికాలమందు ♦ విద్యుద్యుతాంబుద, ములవిధంబు దోఁప ♦ వెలిఁగె; నంత
నగ్నిచుట్టుకొనఁగ ♦ నాగృహంబులు వజ్రి, వజ్రహతగిరులటు ♦ వసుధఁగూలె.

చ. మనముల హాయిఁ గూర్చెడు వి♦మానములందుఁ బరుండి నిద్రఁగాం
చు నెలఁతమిన్న లగ్ని యటు♦సోఁకఁ దనూలత నెల్లతావులన్
దనరువిభూషణంబులను ♦ దారు తటాలునఁ బాఱవైచి యా
ర్తనినదముల్ ఘటించిరి క♦రంబు కృపం గలిగించునట్లుగన్. ౨౩ 3357

తే. అగ్నిఁ గాలువిమానంబు ♦ లవి త్రియామ
లందు దివ్యౌషధివనంబు ♦ లట్టు వెలుఁగఁ
గానఁగాఁబడు తుహినశి♦ఖరిశిఖరము
కరణి దవ్వులకుం గడుఁ ♦ గానఁ బడియె. ౨౪ 3358

క. పురిఁ గాలెడు హర్మ్యాగ్రము, లురుదహనార్చులను గూడి♦యుండఁ బలాశో
త్కరములు పూచినరీతిగ, నరుణప్రభలలరఁ జూడ♦నయ్యె నరుదుగన్. ౨౫

క. కరితురగంబుల కట్లను, ద్వరగా గతుకులు త్రెంచి ♦ వానివిడువఁగాఁ
బరుగెత్త నవ్వి యుత్తరిఁ, బుర మయ్యది ప్రళయకాల♦మునఁ గన్గొనఁగన్.

తే. అలలయురవడిఁ దడఁబడు ♦ నట్టిగ్రాహ
ములఁ గలంగు మహాంబుధి♦వలెఁ జెలంగె;
కట్టు విడువంగఁ బడి భీతి ♦ నట్టె పాఱు
నశ్వమును గని దంతియు ♦ నటుపరుగిడె. ౨౮ 3361

క. తురగము భీతిం బాఱెడు, కరిఁ గని తానార్తినొంది ♦ కడువడిఁ బాఱెన్;
బుర మద్ది కాలుచుండఁగ, నరుణములుగ దానిఛాయ ♦ లబ్ధిఁ బడంగన్.

క. జలరాశి యప్పు డెట్టిది, జలములతోఁ గూడియున్న ♦ సాగరముక్రియం
జెలఁగె ముహూర్తం బట్లు క,పులు లంకకు నగ్నిఁ బెట్టి ♦ పొగలెగయింపన్.

తే. అమ్మహాపురి యీలోక♦మందుఁ గలుగు
ఘోరమౌ ప్రళయంబునఁ ♦ గుంభిని కడుఁ
గాలుచున్నట్లు కన్పడె; ♦ గడఁగి పొగలు
నలుదెసలయందు వ్యాపింప ♦ జ్వలనుఁ డేచి. ౩౦ 3364

క. తనశిఖలం గాల్పఁగ హా, యని యార్చెడు రాక్షసాంగ♦నార్తరవమ్ముల్
వినఁబడియె నప్డు దశయో, జనదూరమ్మునకు మిగుల ♦ సాధ్వసరీతిన్. ౩౧

చ. దనుజులు కొండ అయ్యనలు♦దారుణరోచుల దేహముల్ జవం
బున దహియింపఁగాఁ బడఁగఁ ♦ బూర్వరమం దపు దుండఁ జాల కో
య్యన వెలికేగు దేర సహ♦రాతురులౌ కపు లట్టి వారిమా
ర్కొని యదలించి; రత్తఱిని ♦ గోఁతులభీకరనాదముల్ కడున్. ౩౧౪ 3366

క. దనుజుల యార్తధ్వనులును, వననిధి దశదిక్కులను న♦వనినిం బ్రతిని
స్వనము గలుగంగ నిండెను;, జనపతిసుతులైన రామ♦సౌమిత్రు లటన్.

క ఇరువురు విశల్యులై యా,శరబాధలఁ బాసి మదుల ♦ సంభ్రాంతులు గా
క రయమున నుత్తమములగు, శరాసనము లందుకొనిరి ♦ శౌర్యము పొంగన్

ఉ. అంతట రాముఁ డుత్తమశ♦రాసనముం గొని నారి మ్రోగున
ల్లింతయు శక్తిఁ జేయ దను♦జేజ్యులకున్ భయమద్ది కల్గఁగాఁ
బంతము మీఱఁ జేయుచు న♦వార్యముగాఁ జెలరేఁగె; నంత భూ
కాంతుఁడు చాలఁ గోపమున ♦ గాఢగుణంబును మ్రోగఁ జేయుచున్. ౩౫

క. పురహరుఁడు వేదమయమౌ, శరాసనము మ్రోగఁ జేయు♦చందమునఁ దగెన్;
హరికోలాహలరవమును, గురుదనుజుల యార్తరవముఁ ♦ గుంభినిఁ బర్వెన్.

ఉ. వాని నడంచి మించి రఘు♦వర్యుని జ్యాధ్వనియే వినంబడెన్;
వానరు లేచి చేసెడు ర♦వంబును రాక్షసభీతినాదముల్
మానవనాథుజ్యారవము ♦ మానుగ మూఁడివి దిగ్విజంబునం
దూని చెలంగె; నత్తఱిని ♦ నుద్ధతి రాముఁడు శత్రుభీముఁడై. ౩౭౪ 3371

క. ధనువును మ్రోయించుచు వైచిన బాణము లట్టి రజత♦శిఖరము రీతిం
గనుపట్టు పురద్వారం,బును జూర్ణముచేసి కూల్చెఁ ♦ బుడమిం బడఁగన్.

సీ. దానవేంద్రులును వి♦మానంబులందును సద్మంబులను రాము♦శరగణంబు
పడుటయు కన్గొని ♦ పరమసంగరమున కనువగు యత్నంబు♦లను నొనర్చి;
రట్టు లారాక్షసు ♦ లనికి సన్నాహముల్ చేయుచు భీకర♦సింహనాద
ములు చేయుచుండ ని♦మ్ముల రాత్రియది కాళరాత్రిచందమ్మున ♦ రాజిలె; నపు

తే.డా మహాత్ముఁడు సుగ్రీవుఁ ♦ డాకపీంద్రు
లను గనుంగొని మీరలు ♦ దనుజవర్య
నంతిపురమున కాసన్న♦మైన మధ్య
కక్ష్యకగు ద్వారమును జేరి ♦ కడిమి మెఱయ. ౭౧౪ 3373

క. అని యొనరింపుఁడు మీలో, వనచరుఁ డెందెందునున్న♦వాఁడై నను నా
జ్ఞను దీని మీఱునో యా,తని శాసనదూమకునిగఁ ♦ దలఁచి తటుకునన్.

తే ఒక్క యెగురునఁ బట్టి మీ ♦ రుక్కడంగఁ
జంపవలయుఁ జుఁడీ! యని ♦ శాసనంబుఁ

జేసె; మండెడునుల్కలఁ ♦ జేత నూని
యాహారిశిగణంబు ద్వా♦రాంగణమున. ౪౩ 3375

క. నిలువం బడఁగాఁ గన్గొని, పలలాశనవిభుఁడు క్రోధ♦పరవశుఁడయ్యెన్;
గలఁగినమదితో నంగంబుల నాతఁడు విఱుచుకొనుచు ♦ బోరున నడరన్.

తే. దిక్కు లెల్లను గలఁగె, భీ♦తిని జనింపఁ
జేయు రుద్రుని యవయవ♦జృంభితోగ్ర
రోషమెల్లఁ జెలంగుచు ♦ రూపమొంది
నట్లు రావణుఁ డగపడె ♦ నయ్యెడనున. ౪౫ 3377

క. అనుజుఁడగు కుంభకర్ణుని, తనయులను నికుంభకుంభ♦దనుజేంద్రులఁ బె
క్కు నిశాచరులం గూరిచి, చనుఁ డని యనికంపెఁ బ్లవగ♦సమితిం బంపన్.

తే. కడఁగి యూపాక్షశోణితా♦క్షప్రజంఘ
కంపనులు వారితోఁగూడి ♦ కపులపైకి
నరిగి; రారావణుఁడు మహా♦త్తరబలులగు
వారినందఱఁ జూచుచుఁ ♦ బలికె నిట్లు. ౪౭ 3379

క. ఇటనుండి వెడలునపుడే, పటుసింహరవంబు లొప్పఁ ♦ బ్లవగము లదరం
దటుకునఁ గదలుఁడు విజయం,బటఁ దప్పక గొనుఁ డటంచు ♦ నాజ్ఞాపించెన్.

చ. అని యతఁ డాజ్ఞచేయుటయు ♦ నాదనుజుల్ జ్వలితాయుధంబులం
గొని పలుమాఱు లుద్ధతిని ♦ గోయని యార్చుచు లంకనుండి వే
చనిరి; ప్లవంగకాంతులను ♦ జక్కని యుల్కలరోచులన్ మహా
దనుజకలాపకాంతులను ♦ దద్భటమధ్యగతాంబరంబు నొ
య్యన వెలుఁగంగ నాతమసు ♦ లన్నియు జీర్ణము లయ్యె నయ్యెడన్.

తే. అప్పు డుదయించినట్టి తా♦రాధిపరుచి
యు, నుడుకాంతియు, నుభయసై♦న్యోరుభూష
ణములతేజంబు లభ్రప♦థము వెలుంగఁ
జేసె; నయ్యెడ వెలుఁగు శ♦శిరుచిగముల ౫౦ 3382

క. జ్వలియించుగేహములకాం,తుల భూషణవితతరుచుల♦నున్ వానరసే
నలు దానవసేనలు ను,జ్జ్వలకాంతుల నెల్లయెడల ♦ వఱలెను మిగులన్.

తే. పైకి జ్వాలలు వ్యాపింప ♦ భయదరీతి
మండుగృహముల కాంతు లు♦ద్దండభంగ
చలితసాగరమునను ర♦సాతలంబు
దనుక వ్యాపింప వెలసె నం♦తయు జలనిధి. ౫౨ 3384

క. చలదంబరదృశ్యపతా,కల మత్తాన్యద్యఖిలచిహ్న♦కలితధ్వజరా
జులఁ గూడి ఘోరరక్షో,బలమయ్యది ఖడ్గరూప♦పరశుతతులచేన్. ౫౩ 3385

తే. భీమహాయకరిరథభట♦స్తోమ మగుచు,నుజ్జ్వలద్భీమశూలగ♦దోరుఖడ్గ
కార్ముకప్రాసతోమర♦కలితమగుచు, భయదవిక్రమపౌరుష♦భటయుతమయి.

సీ. ప్రచలితప్రాసమై ♦ రాజితకింకిణీ,శతనాదితంబయి ♦ చక్కమెఱసె;
భటులందు నిరుపమ♦భర్మభూషణలసద్భుజులయి పరశువుల్ ♦ భూరిబలము
గనఁబడఁ ద్రిప్పుచుఁ ♦ బెనుశస్త్రముల నల్లి వడివడిఁ ద్రిప్పుచు ♦ బాణములను
గార్ముకంబుల వెను♦కం దాల్చి యనిమొన ధనువులు విఱిగిపో♦యిన మరలను

తే. వానిఁ దాల్పంగ నెంచుచు ♦ వరసుచంద
న సుమమాల్యసురావాస♦నాయుతమయి
గాలి వీవంగ నొప్పిరి; ♦ చాలశూరు
లలరి జలదాకృతి ధ్వనింప ♦ బల మదొప్పె. ౫౭ 3387

చ. దనుజుల యబ్బలంబు భయ♦దంబయి చూడఁగ నొప్పి వచ్చుటం
గని హరిసేన యత్తఱిని ♦ గట్టిగనార్చుచు వే చలించి పో
యెను దగ మార్కొనంగ; దను♦జేశ్వరు గొప్పబలంబు నంతఁ జ
య్యన నెగురంగ నాల్కొనుచు ♦ నాహరిసేనలమీఁది కగ్నిపైఁ
జనుశలభంబులట్లు చనె ♦ శౌర్యము సాయముగాఁగనంతటన్. ౫౯ 3388

తే. దనుజభటు లంత నన్యోన్య♦ఘనభుజముల
నొరపిడిని దీవ్రతరవజ్ర♦పరిఘము లొగి
సానఁబెట్టినయట్టులు ♦ చాలఁ గాంతి
వెలుగ నవ్వీర లెంతయుఁ ♦ జెలఁగి రపుడు ; ౬౦ 4389

చ. వనచరు లంత యుద్ధమున ♦ వారని కోర్కెలఁ బిచ్చియెత్తెనో
యనఁ దరుసంతతిం గొనుచు ♦ నట్టులె ముష్టుల నూనుచున్ గిరుల్
గొనుచును గొట్టుచున్ ♦ ధరణిఁ గూలఁగఁ జేయుచు దూఁకుచుండిరా
దనుజులు భీకరాకృతులఁ ♦ దాలిచి మార్కొని వారినంతటన్. ౬౧ 3390

చ. శిరములు తీక్ష్ణఖడ్గములఁ ♦ జెచ్చెఱఁ ద్రుంచుచుఁ గ్రీడసల్పి; రా
హరివరు లేచి రాక్షసుల♦వౌ చెవులొక్కటఁ బండ్లఁద్రెంచి భీ
కరతరముష్టిఘాతములఁ ♦ గ్రన్నన శీర్షములం బగుల్చి ప్ర
స్తరగణసంప్రహారమునఁ ♦ దత్తనువుల్ వడిఁద్రుంచి రంతటన్. ౬3 3391

క. వనచరులందుం గొందఱు, దనుజులలో బలము గల్గి ♦ దర్పముఁదగువా
రిని బెక్కండ్రం జంపుచు, ననూనబలవిక్రమముల ♦ నవు డలరి రనిన్. ౬౪

తే. భయదరూపులు రాక్షస♦ప్రవరు లంతఁ
గపివరేణ్యులఁ దీవ్రఖ♦డ్గములఁ ద్రుంచి
రయ్యనిని దన్నుఁగొట్టిన ♦ యతని నొక్కఁ
డట్టె కొట్టెను మఱియొక్కఁ ♦ డాగ్రహమున. ౬౫ 3393

క. తనుఁ బడఁద్రోసినవానిం, దనివిచనం ద్రిందఁద్రోసెఁ ♦ దను నొక్కఁడు తి
ట్టినవాని నొకఁడు నిందిం,చెను గొఱికినవానిఁ గొఱికె ♦ చేరి యొకఁడనిన్.

సీ. అనియొసంగుమునాకు♦నని,యొకండిచ్చుచునున్నాఁడురణమని♦యొక్కఁ డిదిగొ
యిచ్చుచునున్నాఁడ ♦ నేనని యొకఁడుఁగష్టము పెట్టుకొనదేల? ♦ చక్కనిలువు
మని యొకండునుబీర♦మునఁబల్కుకొనుచుండి; రయ్యనిదానవుల్ ♦హరిబలములు
వస్త్రముల్ ప్రేలాడ♦వర్మము ల్డొలఁగంగ నాయుధంబులు జాఱి♦యవనిఁ బడఁగ

ఆ. యష్టిశూలముల మ♦హాప్రాసముల ఖడ్గ
ముల గ్రహించి యటఁ దు♦ములముగాఁగ
బోర సంగరమది ♦ ఘోరతరంబయ్యె;
నందు రక్కసులు మ♦హాగ్రహమున. ౧౮ 3395

క. హరుల దశసప్తసంఖ్యల, వరుసగ నొకసారి బలిమిఁ♦బట్టి విసరివై
చిరి చచ్చునట్లు; దనుజుల, హరివర్యులు నట్లె చంపి ♦ రంతటఁ గడఁకన్. ౧౯

తే. వసనముల్ కేశముల్ వీడ ♦ వర్మములొగి
వసుధఁ జూర్ణంబులై పడ ♦ ధ్వజము లట్టె
విఱిగిపడ దిక్కులేకున్న ♦ వీతకృపుల
దనుజులం జుట్టుముట్టి రా♦తరుణమందు. ౨౦ 3397

డెబ్బదియొకవ సర్గము సంపూర్ణము.

---

౭౨ - వ సర్గము.

అంగదాదు లకంపనాదులఁ జంపుట.

క. వీరజనక్షయమై యతి,ఘోరంబుగ సంకులముగఁ ♦ గొనసాగెడునా
భూరిరణంబున నంగదుఁ, డారసి మార్కొనియె భీక♦రాకంపనునిన్. ౧ 3398

క. అతఁ డయ్యంగదుఁ బిల్చుచు, నతిశయకోపమునఁ బెనుగ♦దాగ్రమునన్ వి
చ్యుతినొందకుండఁ గొట్టెను, నతఁడు తదాఘాతమునకు ♦ నార్తిఁజలించెన్. ౨

తే. సోలె నంతటఁ దేదంబు ♦ చాలఁగల్గు,వాఁడు గావునఁ దెలివొంది ♦ వైశమగిరి
శిఖర మొక్కఁడు పెకలించి♦చిత్రరీతి,వక్షమునవైవ నార్తుఁడై ♦వసుధఁగూలె.

చ. అనిని నకంపనుండు హతుఁ♦డై యిలఁగూలుట శోణితాక్షుఁడుం
గనుచు విభీతుచందమున ♦ గాఢరయంబున నంగదున్ వధిం
పను రథవర్యముం బఱపి ♦ ప్రాణహరాయతకాలవహ్నితు
ల్యనిశితబాణపుంజముల ♦ నంగదు గాఁడఁగ నేసె నత్తఱిన్. ౪ 3401

తే. వాలితనయుండు విక్రమ♦వంతుఁ డట్టు
లర్ధచంద్రాకృతిం దగి ♦యతిశితాగ్ర

ములయి మంగలకత్తుల♦వలె నెసంగి
కంకపత్రోపమాగ్రముల్ ♦ గలిగి మెఱసి. ౫ 3102

ఆ. వత్సదంతములన ♦ వఱలుచు శల్యక,ములను పేరుమిగులఁ ♦ గలిగి మఱివి
పాఠములన రుచుల ♦ భాసిల్లి వెండియు, బహువిధముల నొప్పు♦బాణములను.

క. తనువెల్లఁ గ్రుచ్చఁబెట్టఁగా, దనుజుని వరకార్ముకము ర♦థంబును బాణా
ళిని జూర్ణముగాఁ జేసెను, దనుజేజ్యుం డంతఁ గ్రోధ♦తామ్రాక్షుండై. ౭

క. పలుకయు, వాలును, గొని యి,మ్ములు నేవియుఁ జూడక జవ♦మునసింగికిఁ దాఁ
కె లలిన్, వాలితనూజుఁడు, బలవంతుండగుట మఱియుఁ ♦ బటువేగమునన్.

ఆ. అంబరమున కెగరి ♦ యారక్కసునిహస్త,మునఁ జెలంగుఖడ్గ♦మును బలిమిని
సంగ్రహించి యార్చి ♦ సరభసముగ వాని, మూఁపునందు ఖడ్గ♦మునఁ గడంక.

తే. యజ్ఞసూత్రంబులాగున ♦ నతనిఁ గొట్టి
నట్లు కపికుంజరుఁడు వేయ ♦ నతఁడు చావ
కుండె నంగదుం డంత మ♦హోగ్రఖడ్గ
మును గరంబున ధరియించి ♦ ఘనరవంబు. ౧౦ 3407

క. పలుమఱు చేయుచు ననిలో,పల నితరమహాసురులను ♦ బట్టి వధింపం
జలమునఁ బోయెను; హాటక, విలసితకేయూరుఁ డగుచు ♦ వీరుండగుచున్.

క. దనుజుం డాతం డినుపగ,సను ద్రిప్పుచు వెంటనంటెఁ ♦ దగ నంగదునిన్;
గని యారీతిని వీరుం, డనుపమబల మలర నాయ♦తాక్షుం డగుచున్. ౧౨

క. యూపాక్షుండు ప్రజంఘుం, డేపునఁ దనవెంటరాఁగ ♦ నినుమడియగు నా
టోపంబునఁ గడుఁగ్రుద్ధుం, డై పఱపె రథంబు నట్టె ♦ యంగదుపైకిన్.

తే. *శోణితాక్షప్రజంఘులు ♦ శోభిలి తన, రెండుప్రక్కలఁ గలియ ను♦ద్దండరీతి
నవ్విశాఖాఖ్యతారాద్వ♦యాంతరస్థ, పూర్ణశశివలెఁ గపిపతి ♦ పొదలుచుండె.

సీ. మైందుండు ద్వివిదుఁడు♦మాతులు లౌటనంగదుని రక్షించుచుఁ♦గడఁగి తమకుఁ
బ్రతిభటుఁడగు సుర♦వైరిని గనుఁగొన నతనిచెంతనె నిల్చి, ♦ రతులవీర్యు
లతిదీర్ఘదేహులు♦నగురాక్షసులు యత్న మమరంగఁ జర్మ,గ♦దాసిధారు
లగుచు వానరులపై♦కడరి రాగ్రహమున; నంత మైందద్వివి♦దాంగదు లొగి

తే. నటఁ దలపడఁ బ్రజంఘయూ♦పాక్షశోణి,తాక్షులు గగురుపుట్టించు ♦ నట్టిరీతి
సంగరముచేసి; రంతఁ గీ♦శప్రవరులు, తరువులను బైన వైవ భీ♦కరముగాఁగ.

క. ఘనబలుఁడైన ప్రజంఘుఁడు, తనఖడ్గముచేతఁ ద్రుంచెఁ ♦ దత్తరువుల; నా
వనచరులు వారివౌస్యం, దనహయిములమీఁదఁ బర్వ♦తములఁ దరువులన్.

తే. వైప యూపాక్షుఁ డసదృశ♦బాణములను
వైచి యవ్వాని ఖండించె; ♦ నేచి మైందుఁ

* విశాఖయో ర్మధ్యగతః పూర్ణచంద్ర ఇవాభవత్ -అనిమూ.

డాద్వివిదుఁడును దనమీఁద ♦ నడరఁజేసి
నట్టి తరువుల శౌర్యవీ♦ర్యములు తనర. ౧౯ 3414

క. ఘనగదను శోణితాశ్వుఁ డవనిఁబడఁగా నడుమఁ ద్రుంచె♦వానిఁ; బ్రజంఘుం
డును బరమర్మనికృంతన, మనూనమును నైన ఖడ్గ ♦ మట్టె కరమునన్.

తే. సంగ్రహించుచు నంగదుఁ ♦ జంపనడరె
నతిజవంబున; గురుబలుఁ♦డైన యాప్ల
వంగకాంతుఁడు తనపైకి♦వచ్చు నాప్ర
జంఘుఁ గని బలముం జూప ♦ సరభసముగ. ౨౦ 3416

క. ఇనుమద్దిచెట్టుతో నా,తని మోఁదెను మఱియు నతఁడు ♦ దారుణఖడ్గం
బును గూడిన తద్భుజమును, దనముష్టిం బొడువ నసియు♦ధరణిం బడియెన్.

చ. గురుబలుఁ డాప్రజంఘుఁడును ♦ గొబ్బున నుత్పలకాంతిఖడ్గమ
త్తరుణమునందు భూమిఁబడఁ ♦ దాఁ గని వజ్రసమానముష్టి భీ
కరగతిఁబట్టి తేజము ని♦కామము గల్గినవాఁడుగాన నా
హరివరఫాలముం బొడువ ♦ నాగురువీర్యుఁడు చంచలించుచున్. ౨౪

ఆ. సోలి కొంతవడికి ♦ సుప్రతాపమునఁ దే,జమున నలరుఁ గానఁ ♦ జక్కఁ దెలివి
మరలఁ బొంది యసురు♦శిరము ఖడ్గమ్మునఁ, దనువునుండి వాపెఁ ♦ దత్క్షణంబ.

క. తనపినతండ్రి ప్రజంఘుం, డనిఁబడ యూపాక్షుఁడు గని ♦ యశ్రునయనుఁడై
తనయొద్దబాణములు ముగి,సినకతమున రథము డిగ్గి ♦ శీఘ్రము కినుకన్. ౨౭

చ. కరమున ఖడ్గమూని మదిఁ ♦ గ్రమ్మెడు నీర్ష్యను బైకిరాఁగ స
త్వరమునఁ గోపవేగమున ♦ బాహుబలం బలరార ఱొమ్మునం
గరమునఁ గొట్టె యాద్వివిద♦కమ్రకపీంద్రుఁడు వానినిం బలా
త్కరణమునన్ గ్రహించె; నిటు ♦ తమ్ముఁడు పట్టుపడంగఁ జూచుచున్. ౨౮

తే. అధికకోపంబునన్ శోణి♦తాశ్వుఁ డపుడు
గదను ద్వివిదాఖ్యకీశవ♦క్షమును గొట్టె;
గురుబలాఢ్యుఁడు ద్వివిదుండు ♦ సురవిరోధి
గదను గొట్టినదెబ్బకుఁ ♦ గళవళించి. ౨౯ 3422

క. మరలన్ దనుజుఁడు గదఁగొన, నురవడిఁ దా నొడిసిపట్టె; ♦ నురువీరుండై
పరఁగెడు మైందుఁడు కపిబల, వరుఁడా యూపాక్షుఁ గాంచి ♦ బరవసమలరన్.

క. కరతలమునఁ బ్రహరించెను;, హరివరులై పరఁగుచున్న ♦ యావీరులతో
దుర మొనరించుచు నాని,శ్చరవైరులు కొట్టి యీడ్చి ♦ రయమొప్పంగన్.

తే. తలపడం గని యాహరి♦తల్లజులును
వారి నీడ్చుచుఁ బట్టుచుఁ ♦ బోరు సలిపి;

రంత ద్వివిదుండు విక్రమ ♦ మతిశయిల్ల
నఖములఁ శోణితాక్షుని ♦ ముఖముఁ జీఱె. ౩౨౫ 3425

క. తలపడి జిఱజిఱఁద్రిప్పుచు, బలములరఁగ వాని నట్టె ♦ పడవైచి మహీ
స్థలమున దేహము పిండిగ, నలయక యొనరించెఁ బిసికి ♦ యట మైందుండున్.

క. కరయుగమున యూపాక్షుని, బరవన మలరంగఁబట్టి ♦ వాని నలుపఁగా
ధరణి హతుండై కూలెను;, నిరుపమవీరాళి యయ్యు ♦ నిని గూలంగన్. ౩౮

క. దనుజవరూథిని సాధ్వస,మునఁ గుంభశ్రవునితనయ ♦ ముఖ్యుఁ డలరు ది
క్కునకుం బాఱెను; వేగం, బునఁ బరుగిడి వచ్చుసవ్వబల ♦ మును గన్గొనుచున్.

ఆ. వారి నాఁటఁడిల్లఁ ♦ బలికె కుంభుఁడు మహా, వీర్యశాలురగుచు ♦ వెలయుకపుల
చేత దనుజముఖ్య ♦ సేన కూల్పంబడు, టపుడు గాంచి తేజ ♦ మతిశయిల్ల. ౩౯

క. ఒరులొనరుప సాధ్యముగా,నిరణంబును జేయనెంచె; ♦ నికపాత్మజులం
దరయఁ బ్రధానుఁడు ధన్వీని,కరవరుఁడైన కుంభ ♦ కర్ణతనయుఁడున్. ౩౭

చ. మనమున శ్రద్ధనూనుచు స ♦ మస్తవిధంబుల నొప్పుచాపముం
గొని గురుకృష్ణసర్పముల ♦ కున్ సరివచ్చుచు దేహభేదనం
బున కనువై చెలంగు శర ♦ ముల్ పఱపెన్; దనుజేంద్రునుల్లన
ద్ధనువది జ్యాశరావళియు ♦ తంబయి యద్యోష భీతిదంబునై. ౩౮ 3431

తే. విద్యుదైరావతాహ్వయ ♦ విపులవజ్రి, చాపమునుబోలెఁ గాంతి నె ♦ సంగి యట్టి
విద్యుదైరావతంబుల ♦ వెలయురెండ,పడగు నింద్రధనుస్సునా ♦ వఱలె నపుడు.

క. కనకమయపుంఖమై ప,త్రనిచయయుతమగుచు వస్త్ర ♦ రాజత్పత్రా
ళిని గూడియున్న యాశర, మును జెవి దగులంగ లాగి ♦ మునుకొనుకినుకన్.

క. వనచరవరుఁడౌ ద్వివిదుని, తనువున గాఢంగ నేసె ♦ ధరశృంగమునాఁ
దనరారు ద్వివిదుఁడా శర,మునఁ గొట్టంబడుచుఁ బాద ♦ ములు తడఁబడఁగన్.

ఆ. విహ్వలాంగుఁ డగుచు ♦ వెస నిలఁగూలెను;,మైందుఁడమ్మహాస ♦ మరమునందు
ననుజుఁడైన ద్వివిదుఁ ♦ డట్లు భంగమునొందఁ,గనిమహత్తరశిలఁ ♦ గొనిజవమున

క. అరిపై కేగెను; గురుబల, హరిపతి యాశిలను గుంభు ♦ నంగము పగులన్
సరిగా వైచెను గుంభుం, డురుశితపంచాశుగముల ♦ నొగి వైచి శిలన్. ౪౨

క. తునకలు చేసెను దేజం,బున నొప్పెడు కుంభుఁ డంత ♦ ముఖము సరిగ నొ
ప్పినదానిఁ గ్రూరసర్పం, బనఁగాఁ దగుదాని నొకమ ♦ హాసాయకమున్. ౪౩

చ. ధనువునఁ గూర్చి యాప్లవగ ♦ తల్లజువక్షమునందు నాటె; నే
ర్పునఁ దనలక్ష్యశుద్ధి కడు ♦ ఘాతభయంకరమై చెలంగ నా
సునిశితబాణఘాతమున ♦ సోలెను మర్మము నొచ్చుటం జవం
బునఁ ధర డొల్లె విస్మృతిని ♦ మున్గుచు; నంగదుఁ డద్దిమాచుచున్. ౪౪

చ. గురుబలులైన మాతులులు ♦ కుంభుని ప్రేతుల మూర్ఛమున్గనన్
ధరఁబడు టాగ్రహంబు మదిఁ ♦ దద్దయుఁ బెంపఁగఁ జాపధారియా
సురరిపుమీఁది కట్టె చనె ♦ క్షోణిపడంకఁగ; నంగదుండు భీ
కరగతిఁ బైకిరాఁగఁ గని ♦ కర్బురపుంగవుఁ డాగ్రహమ్మునన్. ౪౬ 3439

క. కరినంకుశమునఁ బొడిచెడు, కరణిగ నాయసములైన ♦ గాఢశరములం
బరఁగించి మొదిటన్ ని,ర్భరశితబాణత్రయమున ♦ బాధించెఁగడున్. ౪౬

తే. వీర్యవంతుండు కుంభుఁడు ♦ వివిధనిశిత, దారుణాకుంఠధారలై ♦ తనరుకనక
భూషణాంచితశరముల ♦ రోషమొప్ప, వైచి నొప్పించె నంగదు♦ వాలితనయు.

క. తనయవయవముల నాతం, పనూనబాణములఁ గ్రుచ్చి ♦ యాత్రినిఁ గనఁజే
సిన నంగదుఁ డేమాత్రం,బును జలనము నొందక సుర♦పుంగవుతలపై. ౪౭౹

క. తరువులఁ బాషాణంబులఁ, గురియించెను; గుంభకర్ణ♦కొడుకు సిరులచేఁ
బరఁగెడు నాకుంభుఁడు వన, చరతిలకుఁడు వైచిన తరు♦సంతతి శిలలన్. ౪౮౹

తే. చేరరాకుండ నడుమనె ♦ చీల్చి తుమురు
గానొనర్చెను; మఱియు న♦క్క పివరుండు
దారసించి వచ్చుటఁ గని ♦ ఘోరశరయు
గమునఁ గొఱవుల రెంటను ♦ గరిని బోలె. ౫౦౹ 3444

క. కనుబొమలందును నొప్పిం,చెను; దానన్ గాఱె నల్ల ♦ చెచ్చెఱ దానన్
గనుయుగము మూఁతపడియెను;, వనచరతిలకుండు రక్త♦వాహినిపాఱన్.

చ. కరమున నేత్రయుగ్మము ని♦కామరయంబున మూసికొంచు న
త్తరుణమునందు నించుకయుఁ ♦ దత్తఱ మందకయే ద్వితీయమా
కరమునఁ జెంతనున్న యొక♦గాఢ మహీజముఁ బట్టి; నద్దియా
కరముననే పెకల్చుటకుఁ ♦ గామిని వక్షము నూఁతచేయుచున్. ౫౨౹ 3446

ఆ. కదలునట్లుచేసి ♦ కరమునఁ బెకలించి, నుంత వంగి గజము ♦ క్షోణిరుహముఁ
బట్టి పెకలుచునటు ♦ బలమునఁ బెకలించె;, నింద్ర కేతువట్లు ♦ లెసఁగుదాని.

తే. మందరాఖ్యమహీధ్రంబు ♦ మాడ్కినున్న
తరువు నద్దాని నవ్వాలి♦తనయుఁ డేచి
వైచుచుండంగ రాక్షస♦వరులు తన్నుఁ
గాంచుచుండంగ గుంభుఁడు ♦ మించు వేడ్క. ౫౪౹ 3448

క. తనువునఁ జీల్చెడు బాణము,ల నేడిటిని గాఁడనేసెఁ ♦ బ్లవగతనూజా
తునిమేన, వ్యథితుఁడై యా,సునిశితబాణముల కతఁడు ♦ సోలిపడె నిలన్. ౫౫౹

*క. మిక్కిలియఱచుచు నాతం, డిక్కరణిని మూర్ఛ మునుఁగ ♦ నెట్టిరిపులకున్
జక్కనిప్లవగేజ్యం దతఁ, డక్కంధిని బడినయట్లు ♦ లని నొచ్చుటయున్. ౫౬

* సీదంత మిప సాగరే-అనిమూ.

క. కని కపులావృత్తాంతం,బును రాముఁన కెఱుకపఱుప ♦ భూపతియంతన్
వనచరనాథునితనయుం, డనినొచ్చినవాఁడటంచు ♦ నాలింపఁగనే. ౫౭ 3451

తే. జాంబవంతుఁడు మొదలగు♦సమధికబలు,లైన యూథాధినాథుల♦నంగదునకు
సాయపడ నాజ్ఞ చేసె; నా ♦ శాసనంబు,విని హరీంద్రులు క్రోధైక♦వివశులగుచు.

చ. చనిరి ధనుస్సుదాల్చి కపి♦సంతతిఁ జెండెడు కుంభుమీఁది; కం
త నచట నంగదావనని♦తాంతపరిశ్రము లౌచుఁ బూన్కి నా
వనచరయూథపుల్ శిలలఁ ♦ బాదపవర్యములం గరంబులం
గొని క్రుధఁ గన్నులెఱ్ఱపడఁ ♦ గొంకక కుంభునిపై జవంబునన్. ౫౯ 3453

తే. ఉరవడించిరి; క్రోధంబు ♦ లుట్టిపడఁగ, జాంబవద్వేగదన్నులు ♦ సకలకపివ
తంసుఁడైన సుషేణుండు♦దర్పమొప్ప, కుంభుపై కేగి రొక్కటఁ♦గుతలమదర.

చ. గురుబలులైన యూప్లవగ♦కూటవరేణ్యులు పైకి వచ్చుటన్
ద్వరగని చూచి భూమిరుహ♦వారమునన్ జలపూరముల్ వలెన్
శరతతి వారి నిల్పె గురు♦సత్త్వులు నయ్యును వార లప్డుహో
సురుశరజాల మాపి చను♦చొప్పు నెఱుంగక యుండి రత్తఱిన్. ౬౧ 3455

క. చెలియలికట్ట సముద్రము,వలె వానిని గడువలేక ♦ వారుండఁగ ని
మ్ములఁ గని సుగ్రీవుఁడు వా,రలు సాయకవృష్టిచేఁ గ♦రం బార్తులుగాన్. ౬౨

క. కనఁబడుటఁ దెలిసికొని జ్యే,ష్ఠుని కొడుకగు నంగదాఖ్యు♦శూరతమీఁఱన్
వెనుక నిడికొంచు వేగం,బున గిరిసానువులఁ దిరుగు ♦ భూరిగజంబున్. ౬౩

క. కని సింహము పైఁబడఁగాఁ, జనుగతి నాకుంభుపైకిఁ ♦ జనియెన్; మఱియా
ఘనబలుఁడు భూరిగిరులను, నినుమడ్డులఁ జంద్రచెట్ల ♦ నితరతరువులన్. ౬౪

క. కరములఁ బెకల్చి దైత్యునిఁ, బరిమార్చుకుతూహలమున ♦ వైవ నతనిపై
సురపథము నావరించుచుఁ, గరము దురాసదముగాఁగఁ ♦ గన్పడుదానిన్.

క. తరువృష్టిని నాకుంభుఁడు, సరిగా సితమార్గణములఁ ♦ జంచద్గతిఁ ద్రుం
చె రహిఁ; మహోగ్రుండై ని,ర్జరవైరియు గుఱిగవైచు ♦ శాతశరంబుల్. ౬౭

తే. నలుదెసలఁ జుట్టుకొన వృక్ష♦ము లవి ఘోర
ములుగఁ దనరు శతఘ్నుల♦వలె వెలింగె;
వీర్యబలముల సిరులను ♦ వెలయు నాక
పీంద్రుఁ డావృక్షసముదయ♦వృష్టి యట్లు. ౬౮ 3461

సీ. నిష్ఫలంబగుటకు ♦ నెమ్మది సుంతయు వ్యథఁ బూనఁడయ్యె; న♦వ్వనచరేంద్రుఁ
డంత బాణంబుల ♦ నతిదుస్సహంబులఁ దనుఁ జీల్చుచున్నవా♦నిని సహించు
కొనుచు నానిం జేరి♦కోపంబునన్ వజ్రధనువట్లు మెఱయు విం♦టిని గ్రహించి
విఱిచివైచెను; గపి♦వీరుఁ డంతట వేగ వానిపై దూఁకి యొ♦వ్వరుస నొగుల

తే. కెన్న సాధ్యంబుగానట్టి ♦ కృత్యమిట్లు
చేసి క్రోధంబునఁ మీఱి ♦ శృంగవిరహి
తేభమట్లున్న యాదను♦జేంద్రుఁ గాంచి
పలికెఁ; [1]నోరినికుంభాగ్ర♦భవ! దురాత్మ. ౨౦½ 3462

క. శరవేగంబునఁ దగు నీ, వరవీర్యం బద్భుతంబు ♦ వాసవరిపులం
దరయఁగఁ [2]బ్రభావవినయము, లరుదుగ రావణునకున్న ♦ యటు దగునీకుఁ

తే. బలికిఁ బ్రహ్లాదునకు దేవ♦పతికి యక్ష
పతికి వరుణునకుఁ సర్వ♦గతుల సాటి
యైనవాఁడవు సుమ్ము నీ ♦ వరయ నొకఁడ
వే బలంబునఁ దండ్రికి ♦ నీడుగాఁగ. ౨౨½ 3464

క. జనియించినవాఁడవు; బలమున శత్రులఁ జెండునట్టి♦భూరిభుజబలం
బున నొప్పువాఁడ వీవే, ధనువును ధరియించి నిల్వ ♦ దారుణరీతిఁ. ౨౩ 3465

తే. విను జితేంద్రియునాథులు ♦ గని తొలంగు
నట్టు లమరులుఁ జెనకలే; ♦ రసురనాథ!
బుద్ధిమంతుఁడ వీవు నేఁ♦బోరఁ జూచు
చుండ నీవిక్రమముఁ జూపు ♦ మొప్పునట్లు ౨౪ 3466

క. వరముల బలమున నని నిర్జరదానవసమితిఁ బెద్ద♦జనకుఁడు దశకం
ధరుఁడోర్చె; నీదుతండ్రియు, శరీరబల మూని దేవ♦సమితి ననుగుఁ. ౨౫½

ఆ. నిలువఁ జాలు నీవు ♦ బలముల నీరెంటి, వారి నిల్వఁజాలు♦వాఁడ వౌదు
వింద్రజితునికున్న ♦ యుద్ధచాపబలంబు, దనుజపతికిఁగల ప్ర♦తాపమరయ. ౨౬

క. కల వివ్వి రెండు నీకును, బలవీర్యంబులను దనుజ♦వర్యులలో మి
క్కిలియుఁ శ్రేష్ఠుఁడ; వింద్రున,కలశంకరునకును బోలె ♦ నని మన కిచటఁ.

తే. కలుగనున్నది భూతాళి♦గాంచుఁ గాక, యద్భుతంబుగ; భీతికృ♦దతులవిక్ర
ములగు వనచరవీరుల ♦ నిలను గూల్చి,తివిగదా? వీరకృత్య మ♦తిప్రకటము.

క. ఒనరించి యస్త్రకౌశల,మును జూపితి; వికట సమర♦మున బెక్కురతో
నని చేసి శ్రాంతి నొందిన, దనుజుని వధియించె నంచుఁ ♦ దగ నాడుటచేఁ.

క. ధర వ్యాపించెదునిందకుఁ, బరమభయంబూని నిన్ను ♦ వధియింపఁగ లే
దరివీర! వీరకృత్యము, సరిగా నొనరించుట నల♦సత గంటివిగా. ౨౮½ 3472

తే. కొంతయలసటనుం దీర్చు♦కొని యవతల
నాబలమ్మును జూడు మ♦నంగ; సూర్య
తనయుఁ డవమతి గర్భోక్త♦లను దనునిటు
గౌరవింప నికుంభుఁడు ♦ కడురయమున. ౨౯½ 3478

---

1 నికుంభాగ్రజ! వీర్యం తే-అనిమూ. 2 సన్నతిశ్చ ప్రభావశ్చ-అనిమూ. సన్నతిః రాక్షసేషు వినయః-అనివ్యాఖ్య.

క. ఘృతమును బోసిన యనలుని, వితమునఁ దేజమునఁ జాల♦వృద్ధిం గనియెన్;
దితిజుం డంతట బాహు, ద్వితయంబునఁ బట్టుకొనియె ♦ వీరుని నతనిన్. ౮౦౪

చ. ఇరువురు వార లంతట మ♦దేభములట్టు చెలంగుచుం బర
స్పరపరితాడనంబునను ♦ బల్మెఱు నూర్పులు పుచ్చుచున్ బర
స్పరతనువుల్ కరంబులను ♦ బట్టి పెనంగుచు నీడ్చుకొంచు సం
గరపరిఖేదముం గనుట ♦ గాఢముగా వదనంబులందు వి
స్ఫురదురు ధూమపావకరు♦చుల్ వెలిబుచ్చుచుఁ బోరుచుండఁగన్. ౮౨ 3475

క. ఇరువురపదఘాతంబుల, ధరణి వడిం గ్రుంకె నుదధి♦తరఁగలు గలఁకన్
బరికంపించెన్; దదనం, తరమున సుగ్రీవుఁ డతని ♦ దారుణరీతిన్. ౮౩ 3476

ఆ. పైకినెత్తి యడుగు♦భాగంబు గనునట్టు, లతిజవమున సంద్ర♦మందుఁ బడఁగ
విసరివైచెఁ దనదు ♦ విక్రమబలములు, తెలియఁబడఁగ; నంత ♦ జలధియందు.

క. సురవైరి పడుటచే మం, దరవింధ్యసమానముగను ♦ దజ్జలపూరం
బరుదుగఁ బైకుబ్బెను; ని, ర్జరవైరియు నెగిరివచ్చి ♦ సాంద్రక్రుధచేన్. ౮౮ 3478

చ. వనచరనాయకుం గదిసి ♦ వజ్రసమంబగు ముష్టిచేత నా
తనిగురువక్షముం బొడువ ♦ దాన సురస్థ్సలచర్మమింతఁ జ
య్యనఁ గదలంగ రక్తము మ♦హాత్తరరీతిని గాఱెఁ; గాని యా
ఘనతరముష్టిఘాత మతి♦గాఢజవాన్వితమయ్యు నొయ్యనన్. ౮౯ 3479

తే. అతని యెమ్ములపంజర ♦ మట్టితాఁకి
ప్రతిహతం బయ్యె; ఱొమ్మునఁ ♦ బటుదనుజుని
ముష్టిఘాతజవంబున ♦ మొదటఁ బుట్టి
నట్టియగ్నిసురేశ్వరుం ♦ డాగ్రహమున. ౮౭౪ 3480

సీ. కొండలతొక్కల ♦ గొట్టునప్పుడు మేరువందు వజ్రము తాకు♦నపుడు గల్గు
జ్వాలలవలె నొక్క♦భంగి జ్వలించెను గురుబలుండయి కపి♦కుంజరుండు
నైన యాసుగ్రీవుఁ ♦ డాతనిచేఁ గొట్టఁబడి యాగ్రహించుచు ♦ వజ్రసార
మగు ముష్టిఁ బట్టి వీ♦ర్యంబునఁ జెలువారు సుగ్రీవుఁ డంతట ♦ సురుచిరంబు

ఆ. లగు సహస్రకిరము ♦ లావరింపఁగ రవి, మండలంబునట్టెఁ బ్ర♦చండమైన
యట్టి పిడికిలిని ద♦దాయతవక్షంబు, నందుఁ బొడిచె; దాన ♦ నతఁడు మిగుల.

క. మనమున విహ్వలమందుచు, ననూనపీడనము నొంది ♦ యపగతరుచియై
కనఁబడుననలుని చాడ్పునఁ, దనువును ధరవైచె నపగ♦తప్రాణంబున్.

క. దనుజుం డాపిడికిలిదె, బ్బను యాదృచ్ఛికముగాఁగఁ ♦ బ్రభలవెలుఁగు మే
దినిపుత్రుఁ డిలను నభ్రం, బునుండి పడునట్లు గూలె ♦ భూమిస్థలిపై.

సీ. ముష్టిఘాతమ్ము లో ♦ మ్మును గాఁడ భగ్నుఁడై ధరఁ గూలుకుంభుని ♦ తనువు రుద్రు
చే నభిపన్నుఁడౌ ♦ *చిత్రభానునిరూప మట్లు వెలింగె; భ ♦ యంకరప్ర
తాపుఁడౌ వనచర ♦ భూపతిచే నిట్టు లని కుంభుఁ డంతంబు ♦ నంద భూమి
పర్వతకానన ♦ పటలితోఁ జలియించె నాతనిమరణంబు ♦ నపుడుచూచి

తే. దనుజసంతతు లెల్లను ♦ దారుణభయ
మంది దిక్కేక నేమని ♦ యార్తినొంది
పౌరుషము వీడి లంకకుఁ ♦ బాఱఁ దలఁచెఁ
బతివిహీనముగానుంట ♦ నతిశయార్తి. ౯౪ 3484

డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౭౭ - వ సర్గము.

హనుమంతుఁడు నికుంభుని బొలియించుట.

క. తనయన్నయైన కుంభుఁడు, వనచరపతినిహతుఁ డగుటఁ ♦ బరికించి క్రుద్ధన్
గొని కాల్చుపగిది నిర్భర, మనఁదగు చూపులను భాస్క ♦ రాత్మజు నచటన్.

క. కని వీరుఁడౌ నికుంభుం, డనూనభయదంబు నగుచు ♦ యమదండమురీ
తిని గన్పడుచున్ దనుజుల,కును భీతిని బాఁపఁజాలి ♦ క్రూరతరంబై. ౨ 3486

చ. అనయము పూలదండలను ♦ హారిసుచందనముఖ్యచర్చలన్
గని తగునై దుష్ప్రేళ్లు చెలఁ ♦ గం దగు ముద్రలనొప్పి చక్కనై
యనుపమహేమపట్టయుత ♦ మై వరవిద్రుమవజ్రచిత్రితం
బునునయి చూడనౌ పరిఘ ♦ మునంగొనె హస్తమున న్నికుంభుఁడున్. ౩ 3487

క. నిరుపమతేజుండు భయం,కరవిక్రముఁడైన యతఁడు ♦ కడుదీర్ఘముగా
నురుపక్ష్మంబు దెఱచుచుఁ, బరిఘము శక్రధ్వజంబు ♦ వలెఁ దగుదానిన్. ౪

తే. గిరగిరం ద్రిప్పి యార్చె; నా ♦ సురవిరోధి
వక్షమున రత్నపదకంబు ♦ బాహువులను
సంగదంబులు కర్ణము ♦ లందుఁ జిత్ర
కుండలసుమహారంబులు ♦ నిండియుండ. ౫ 3488

క. ఇతరములగు భూషణముల, వితతియుఁ జెలువారుచుండ ♦ విపులపరిఘ ము
ద్ధతిఁ దాల్చి సింహనాదం, బతిముదమునఁ జేయు నాసు ♦ రారియు నచటన్.

క. పురుహూతధనుర్విద్యు,త్పరియుతమై యుఱుముచున్న ♦ పటుమేఘమునాఁ
బరఁగెన్; గురుబలుఁ డాతఁడు, పరిఘాగ్రవిచాలనజన ♦ భస్వద్గతిచేన్. ౬-౭

---

* యథా రుద్రాభిపన్నస్య యథారూపం గవాంపతేః-అనిమూ. గవాంపతేః సూర్యస్య-అనివ్యాఖ్య.

తే. ఆవహాదికవాతసం♦హాతి చలించె
నది మహాధ్వని మీఱంగ ♦ నపగతముగు
ధూమమొప్పంగఁ దగునగ్ని♦తోఁ సమాన
మగుచు విలసిల్లె; నంత న♦య్యసురవరుఁడు. ౭ 3492

సీ. పరిఘంబుఁ ద్రిప్ప న♦ప్పటు వేగమునఁ గల్గు నురవడి గంధర్వ♦వరగృహాభి
యుతమైన యలకయు ♦ నురుదేవతాగ్రహాయుతముగుస్వర్గంబు ♦ నొప్పుచున్న
యట్టి యశ్విన్యాది♦కాఖిలనక్షత్రగణము, కుజాదిక♦గ్రహములు శశి
శుక్రాదిగురుతర♦సురుచిరకాంతిమద్గ్రహములు వెలయునా♦కాశమపుడు
తే. దిరిగె; బరిఘంబుఁ గాంతు లా♦భరణకాంతు
లొలయ వెలసెడు నానికుం♦భోరుదహనుఁ
డఖిలకపులకుఁ బ్రళయకా♦లాగ్నిఁ బోలి
చేరరాకుండె నుగ్రుఁడై ♦ చిత్రగతుల. ౧౦ 3493

క. వనచరరాక్షసు లంతట, మనముల సాధ్వసము తోఁప ♦ మహిని జలింపం
గనులేకయుండఁ బ్రబలుఁడు, హనుమయు నిర్భీతుఁ డగుచు♦నసురకు నెదురై
తే. ఉరము విస్తృతముగావించి ♦ యుద్ధతిఁదగ
నిలిచెఁ; బరిఘోపమములయి ♦ వెలయు బాహు
వులు తగన్ బలమొప్పంగ ♦ నలరు దనుజుఁ
డర్కబింబమువలె వెల్గు ♦ నాపరిఘము. ౧౧½ 3495

క. అనుపమబలుఁడౌ పవనుని, తనయునివక్షంబుఁ దగులఁ ♦ దా వైచె; స్థిరం
బును వెడలుపునగు వక్షం,బును దాఁకిన యంత బరిఘ♦ము శతవిధములన్.
తే. తునియలై యాకసంబునఁ ♦ గనఁబడి శత
విధమహోల్కలఁ బోలుచుఁ ♦ బృథివిఁ బడియె;
హనుమ యావిధిఁ బరిఘంబు ♦ నాత్మవక్ష
మునను దగులంగ నించుక ♦ తనువు గదల. ౧౩½ 3497

క. ధరణీకంపంబున భూ,ధరములు చలియించునట్లు ♦ తాఁ జలియించెన్;
గురుతమబలుఁడై ప్లవగో,త్కరసింహమునైన హనుమ ♦ తద్ధతి కచటన్.
తే. కోపమును బూని తనశక్తి♦కొలఁది ముష్టి
నలవరించెను దేజంబు ♦ నధికవీర్య
మలర వాయువువంటి ని♦స్తులగమనము
గలుగు హనుమయు నాముష్టి ♦ గడఁగి యెత్తి. ౧౫½ 3499

క. దానవుఱొమ్మునఁ బొడిచెను, దానతివేగమున; దాన ♦ దనుజునురంబున్
గానఁబడె విగతచర్మం,బై నెత్తురు మిగులఁ గాఱ ♦ నతిభయదముగన్. ౧౬

ఆ. అట్టిఘాతమునకు ♦ నాతనివక్షము,నందు మెఱపువంటి ♦ యతిభయంక

రమగు జ్వాల పుట్ట; ♦ రాక్షసుఁడద్దాని, కెంతో చంచలించి ♦ యంత మరల.

చ. మనమున ధైర్యమూని యొక♦మాడ్కి స్మృతింగని దోర్బలాఢ్యుఁడై
హనుమను వే గ్రహించెను; మ♦హాబలు నిట్లని నానికుంభుఁడో
య్యనఁ బయికెత్త లంక నల♦రారు నిశాచరులట్టె గాంచి భీ
తిని గలిగించునార్పులను ♦ దిక్కుల నింపిరి సంప్రహృష్టులై. ౧౯ 3502

క. తనునిట్టు లానికుంభుఁడు, గొనిపోవుచునున్న నధిక♦కోపంబున ము
ష్టిని వజ్రతుల్యమున నా,తనిబొడిచెను బూనిక ననిల♦తనయుం డచటన్.

సీ. మారుతాత్మజుఁ డిట్టు ♦ లా రాక్షసునినుండి తను నిటు విడిపించు♦కొని ధరణిని
నిలువంగఁబడి వేగ ♦ మలర నాతని నిట్లు చంపఁగాఁ బూనె; ని♦శ్శంకముగను
ఘనవీర్యమున నొప్పు♦హనుమ మహాయత్నమున వాని నిలఁబడం♦గను జవమునఁ
ద్రోసి పిండిగ వానిఁ♦జేసి పై కెగసి తద్వక్షంబునందుఁ దాఁ ♦ బడదుమికెను;

తే. *కరయుగంబున నాతని♦కంధరంబుఁ
బట్టుకొని ద్రిప్పి వాఁడార్వ ♦ భయదరీతి
వాని భైరవశీర్షంబు ♦ వరుసఁ ద్రుంచి
వైచె; నంత నికుంభుండు ♦ బవరమందు. ౨౩ 3504

క. నినదం బొనరించుచుఁ జ,చ్చిన రావణుపుత్త్రుఁ డగుచుఁ ♦ జెలఁగెడు మకరా
క్షునకున్ దాశరథికినిన్, జెనుసంగర మప్పుడయ్యె ♦ భీమాకృతిగన్. ౨౪

క. వనచరులట్లు నికుంభుం, డని నీల్గిన సంతసమున ♦ హరినాదములం
బొనరించిరి దిక్కులు ప్రతి, నినదంబుం జేసెఁ గపుల♦నినదంబులకున్. ౨౫

క. ధరణియుఁ గంపించెను; నం,బర మెల్లను బగిలినట్టి ♦ భంగిని మిగులం
బరఁగె భయావేశము క,ర్బురులకుఁ గడుఁ గల్గె దనుజ♦పుంగవుమృతిచేన్.

డెబ్బదియేడవ సర్గము సంపూర్ణము.

---

౭౮ - వ సర్గము.

మకరాక్షుని యుద్ధము.

తే. అనిని గుంభనికుంభుల ♦ ట్లంత మొంద
విని దశగ్రీవుఁ డోర్వక ♦ యనలుభంగి
మండిపడియె; శోకము క్రుధ ♦ రెండు మదిని
బెనఁగొనన్ ఖరపుత్త్రుఁడై ♦ తనయుఘనుని. ౧ 3508

క. దనుజేంద్రుఁడు మకరాక్షుని, ననుపమబలు దీర్ఘనయను ♦ నాదృతిఁ గని యి
ట్లని పురికొల్పెను సంగర,మునకున్; దనయా! మదాజ్ఞఁ ♦ బూనిబలయుతిన్.

క. చని రాముని లక్ష్మణున,వ్వనచరులం జంపిరమ్ము; ♦ వారకయని ప

* ఉత్పాటయామాస శిరసం నదతో మహత్ - అనిమూ.

ల్కిన ఖరసూనుఁడు శౌర్యం, బున నేనే యధికుఁడనని ♦ పొంగెడుఁ గానన్.
క. రావణునాజ్ఞను వినఁగా, నేవదలనిసంతసమున ♦ నే నేగెద ని
ష్ఠే వైరుల వధియించెద, నీవాక్యము రీతిననియె ♦ నిబ్బరమలరన్. ౧ 3511
క. బలవంతుఁ డతఁడు రావణు, వలగొనుచు నమస్కరించి ♦ భాస్వద్వేశ్మ
స్థలినుండి వెడలె; రావణుఁ, డలరుచుఁ దన కిడినయట్టి ♦ యాజ్ఞను గొనుచున్.
చ. ఖరతనయుండు చెంతఁ దగు ♦ గాఢబలాఢ్యుని సైన్యనాయకున్
బరమముదంబు మీఱఁ గని ♦ భద్రరథంబును దేరఁబంపు స
త్వరముగ సేనలం బిలువఁ ♦ బంపుము; నావిని యల్లి యాభటే
శ్వరుఁడు జవంబునన్ రథము ♦ సర్వబలంబును జెంతఁ జేర్చెఁ దాన్. ౭ 3513
క. తనరథమునకున్ వలగొను,చును దానిం జక్కనెక్కి ♦ శుభగతివేగం
బునఁ దోలు మనుచు సారథి, కొనరంగా నాజ్ఞ చేసె ♦ నుద్యమమలరన్. ౮
సీ. మకరాక్షుఁ డంత నా ♦ త్మబలంబులం గాంచిదనుజులారా! మీరు ♦ దారుణముగ
నాముందుల వైరిసే ♦ నలతోడఁ బోరుఁడీ; దనుజేంద్రుఁడును మతి ♦ ఘనతనొప్ప
వాఁడును నైన రా ♦ వణుఁడు నన్నని యల్ల రామలక్ష్మణులను ♦ రణమునందు
వధియింపుమని పల్కె; ♦ వచనమద్దానిని దీర్పఁగా నేను నో ♦ దితిజులార!
తే. శరవరంబుల రామల ♦ క్ష్మణుల, వనచ, రేశ్వరుని వానరుల వధి ♦ యించువాఁడ;
సమరమునశూలములవైచి ♦ సమధికకపి,బలమునంతయు నెందుక ♦ జ్జ్వలననలుఁడు.
క. వరుసఁగ దహించుచాడ్పునఁ, బరిమార్చెద; నన్న నతని ♦ వాక్కుల విని క
ర్బురులెల్ల బలము పొంగఁగ, ధరించి వివిధాయుధములఁ ♦ దదనసరమునన్.
క. అనికేగిరి; వారందఱు, ఘనదంష్ట్రల మెఱయువారు ♦ కామంబున నే
తనువును ధరింపఁ జాలుదు, రనూనపింగళనుకృష్ణ ♦ లలరెడు వారల్. ౧౩౪
తే ధ్వస్తకేశులు భీతిదుల్ ♦ దారుణాంగు
లగుచు మదగజములఁ బోలి ♦ యార్చుచు గురు
తనుఁడు గాఁదగు మకరాక్షు ♦ దనుజవరుని
బలసి తమి భూమి యద్రువంగ ♦ బవరమునకు. ౧౫ 3518
క. చని; రంత నెల్లయెడలను, దనుజులు శంఖముల భేరి ♦ తతులన్ భీతిం
గనిపింపఁ జేయ వేలుగఁ, బనివడి వాయించి; రప్డు ♦ భయదరవంబుల్. ౧౬
ఆ. భుజము లప్పళింపఁ ♦ బుట్టుశబ్దంబులు, వెలసె వీనిరవము ♦ విస్తృతముగ
నవనినిండె; నంత ♦ నతనిసారథి చేత, నున్న యా[1]ప్రతోద ♦ మురివ్వఁ బడియె.
క. మకరాక్షుని కేతన పట, వికలంబయి నేలఁబడియె ♦ వింతగ; రథవ
ర్యకలితహయములు పదముల, నకమ్రగతిఁ బెట్ట మాని ♦ సరభస మొప్పన్.

1 ప్రతోదము=మునికోల.

క. ఆకులచరణన్యాసము,లై కదలుచు దీనముఖము♦లై బాష్పములన్
వ్యాకులమతిఁ గార్చుచు నని, కై కదలెను; భీకరుండు ♦ కడుదుర్మతియున్.

తే. ఐన మకరాక్షుఁ డారీతి ♦ నరుగునపుడు
పాంసుయుక్తంబుగా గాలి ♦ పరుషముగను
భయదముగ వీచె; ఘనవీర్య♦వంతులైన
దనుజు లాయవశకునాళి ♦ తలఁప కపుడు. ౧౯౪ 3523

క. ఘనహస్తిమహిషవర్ణము, లనుదగు దేహములు మఱి యి♦లాస్థలి రణరం
గనిచయములఁ దీవ్రగదా, సినికరఘాతముల కోర్చి ♦ చెలఁగుచు నుండన్.

క. అనిచేయునేర్పుతో నే,నును నేనను గర్వమొప్ప ♦ నూతనమోదం
బున నార్చుచు రాఘవులెటఁ,గనఁబడిరో యటకుఁజనిరి♦కడుఁబూన్కిమెయిన్.

డెబ్బదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౭౯ - వ సర్గము.

శ్రీరాముఁడు మకరాక్షునిఁ జంపుట

చ. వనచరయూథనాయకులు ♦ వాఁడిటు లంకను వీడి వచ్చుటం
గని ముదమొంది పైకెగసి ♦ గర్వము మీఱఁగ సంగరంబుచే
య నిలిచియుండి; రంత నసు♦రాళికి రాక్షసపంక్తితోడ ము
న్నని యయినట్టు లాసురుల ♦ నాకపు టెల్లను మీఱి మార్కొనన్. ౧౪ 3526

తే. కదన మది రోమహర్షణ♦ము దగనయ్యె;
వనచరులు రాక్షసులు వృక్ష♦పాదశిలలఁ
బరిఘశూలములను వైచి ♦ పంతమూని
యొండొరులఁ గూల్చి; రసురు లు♦ద్దండవృత్తి. ౩ 3527

సీ. ఖడ్గశక్తులఁ గుంత♦గదలఁ దోమరములఁ బట్టసముల భిండి♦వాలములను
వజ్రముద్గరములఁ ♦ బౌశదండంబుల నట్టి నిఖాతాహ్వ♦యాయుధములఁ
గపులతో యుద్ధంబుఁ ♦ గావించి; రంతట ఖరపుత్త్రుఁ డక్లేచి ♦ శరవరముల
వరుసఁ బ్రయోగింప ♦ వానరుల్ పీడితులై మనంబుల భ్రాంతి ♦ నంది సాధ్వ

ఆ. సార్తులగుచు పాఱె;♦రా రాక్షసులు కపు, లట్లు భీతిఁ బాఱ ♦ నతిముదమున
సింహనాదములను ♦ జెలఁగించి జయముల, వెలసి; రపుడు కపులు♦నలుఁగడలకు.

క. పరుగిడుటయు రాక్షసులటు, హరినాదము లొప్పఁజేసి ♦ యలరుటయును దాఁ
బరికించి రామభద్రుఁడు, శరవృష్టిం బఱపి దనుజ♦సమితిన్ నిలిపెన్. ౮ 3529

క. దనుజులు శ్రీరామునిచే,తను వారితు లగుటఁ జూచి ♦ దర్పంబున నా
దనుజేజ్యుఁడు మకరాక్షుం, డనియెం గ్రోధాగ్ని మండి ♦ యారామునితోన్.

క. రామా! నాతో మార్కొన, నీమహిని న్నిల్వ నీకు ♦ నే ద్వంద్వరణం
బామోదంబున నొసఁగెద, నీమహితధనుర్విముక్త ♦ కేషువితతిచేఁ. ౧౦

క. నీయనుపంచకమును నిటఁ, దీయించెద; నాజనకు వ ♦ ధించితివి గదా
యాయటవి మరల నీవిటు, నాయెదుట రణంబు చేయ ♦ నైజబలమునన్.

క. నిలుచున్న నిన్నుఁ గనను,జ్జ్వలగతిఁ బైపైని క్రోధ ♦ సారము పెరుగం
దలఁచుచున్నది దుర్మతి!, యిలాధిపా! రామ! యప్పు ♦ డేఁ గ్రుధ నిన్నున్.

తే. దండకారణ్యమునయందె ♦ తవిలి కాన
కుంటి ననుచు మదంగంబు ♦ లుగ్రరీతి
మండుచున్నవి; రఘుకుల ♦ మండనా! యి
చట మదీయసుభాగ్యసం ♦ సర్గమునను ౧౩॥ 3534

క. నాకనులయెదుటఁ బడితివి, భూకాంతా! సింహ మొకఁడు ♦ భూరివిపినమం
దాఁకటఁ బీడితమై తగి, యాకాన మఱొక్క మృగము ♦ నరసెడురీతిన్.

క. నినుఁ జూడఁగోరియుంటిని;, కను మిదిగో నాదుబాణ ♦ గణవేగమునన్
గని మృతి మును నీచేఁ జ,చ్చినవీరులతోడ యముఁడు ♦ చెలఁగు నగరికిన్.

క. చనఁగలవు; పెక్కుపల్కులఁ, బనియేమిఁక రామ! నాదు ♦ పలు కొకదానిన్
విను సర్వలోకములు నీ, యనిమొనఁ గనుఁగొనునుగాక ♦ యాకృతిమనలన్.

తే. అస్త్రములచేతఁగాని గ ♦ దాయుధంబు
చేతఁగాని భుజంబుల ♦ చేతఁగాని
పెనురణము చేయ నితరసా ♦ ధనగణంబు
చేతఁగాని యభ్యాస మీ ♦ కే తెఱంగొ ౧౫॥ 3538

క. దానిం గొనియే సంగర, మోనృప! కావింపు; మనిన ♦ నుర్వీపతి యా
దానవునిపల్కులన్ విని, తానయి పైపైనఁ బ్రేలు ♦ దనుజాధమునిన్. ౧౬॥

క. కని పక్కున నవ్వుచు నో, దనుజా! నీవానరుపంగఁ ♦ దగని పలుకులన్
ఘనురీతి నేల ప్రేలెదు, పనియగు నే వానివలన ♦ బాలిశుఁడనరే. ౧౭॥ 3540

క. అనిచేసి కాని వాగ్బల,మునను జయింపఁగఁ గాదు; ♦ మును పయ్యటవిన్
దనుజవరుండై తగు నీ, జనకుఁడు త్రిశిరుండు సత్వ ♦ సారుఁడు మఱియున్.

తే. దూషణాఖ్యుఁడు మఱియుఁ జ ♦ తుర్దశముల
వేలు రాక్షసు లనిఁ దెగి ♦ రోలిని; గుల
పాంసనా! పాపమతి! తీక్ష్ణ ♦ భంగి నాసి
కానఖంబులు గలగృధ్ర ♦ కాకసమితి. ౧౮॥ 3542

క. వంచకములు నీమాంసం, బంచితముగఁ దినఁగఁగల; వ ♦ హార్యముదమునం
గాంచుము నాపౌరుష మని, మించినతమిఁ బలుక ఖరుని ♦ మేటికొమరుఁడున్.

క. మనమునఁ గుపితుండై రా,మునిమీఁద రణాంగణమున ♦ మొక్కలముగ వై

చెను బాణసమూహంబులు;, కనకసుపుంఖాత్తబాణ♦గణముల వానిన్. ౨౧౪

చ. నిరుపమబాణజాలముల ♦ నిర్భరరీతిని వైచి రాఘవుం
డురుజవ మొప్ప నత్తఱిని ♦ నుర్విపయిన్ శకలంబులై పడం
గర మరుదైన శక్తి దగఁ♦గా నొనరించె; ఖరాత్మజన్ముఁడై
పరఁగుసురారి దాశరథి♦పంతము మీఱఁగఁ దేజ మొప్పఁగన్. ౨౨౪ 3545

తే. ఒండొరులఁ దాఁకి భయదమౌ ♦ యుద్ధ మప్పు
డొనరిచిరి; చాపవరముల♦నుండి జ్యాల
తలు, కరంబున వింటిదె♦బ్బలు తగులక
యుండఁ దొడిగిన యత్తైము♦నొరయుట నట. ౨౩౪ 3546

క. జనియించిన పెనురవ మొ,య్యన నభ్రమునందు వినఁగ ♦ నయ్యె జలదగ
ర్జన మట్లుగ; గంధర్వులు, దనుజులు దేవతలు భుజగ♦తతి కిన్నరులున్. ౨౪౪

చ. కనుఁగొనఁగోరి యద్భుతము♦గాఁ దగునాకపథంబు నాకసం
బున వసియించి; రత్తఱిని ♦ బూనికమీఱఁ బరస్పరాంగముల్
ఘనశరరాజిఁ గ్రుచ్చుట ని♦కాముగ తత్సమయంబునం గనం
గను ద్విగుణంబుగాఁ బెరుగఁ♦గాఁ దొడఁగెన్ మఱి వార లిద్దఱున్. ౨౫౪

తే. ఒకరుచేసిన దానికి ♦ నిఁక నొకటిగఁ
బ్రతికృతిం జేయుచున్ సంగ♦రంబు జేసి;
రంత మకరాక్షుఁ డారాఘ♦వాంబకముల
నడుమఁ ద్రుంచెను భూపతి♦నాథుఁ డంత. ౨౬౪ 3549

చ. దనుజవిముక్తమార్గణవి♦తానము స్వీయశరాళిచేత ను
ర్విని శకలంబులై పడఁగ ♦ వేగమ ద్రుంచెను; దిగ్విదిక్కులం
గనఁబడ నంబకంబులె యఖం♦డముగా మఱి భూమి యెల్లెడన్
గనదురు బాణజాలముల ♦ గాఢసమావృతయాట నత్తఱిన్. ౨౭ 3550

తే. సుంతయును గానరాకుండె; ♦ నంతట గురు
బాహుఁడౌ రాముఁడుం గ్రుధఁ ♦ బరునిచాప
మట్టి ఖండించి యెనిమిది♦యంబకముల
నతనిసారథి ద్రుంచె న♦ట్లసురురథము. ౨౮ 3551

చ. శరముల నుగ్గొనర్చి మఱి ♦ సైంధవరాజిని ద్రుంచె; నంత నా
సురరిపుతల్లజుం డని వి♦చూర్ణరథుండయి నేలనిల్చె; న
ద్ధరణిని నిల్చి భూతసము♦దాయభయంకరమై లయాగ్నితో
సరియయి మండు శూలమును ♦ శాతతరాగ్రముఁ గేలఁ బూనెఁ దాన్. ౩౦

చ. పెనురణమందు నాశరుఁడు ♦ భీకరరీతి జ్వలించుశూలమున్
మనమునఁ గ్రోధముం బ్రబల ♦ మాటికిమాటికిఁ ద్రిప్పి రామువై

చెను; రిపుహస్తవిచ్యుతిని ♦ జెంది జ్వలించుచు వచ్చుచున్న యా
ఘనతరశూలముఁ నృపతి♦కాంతుఁడు వ్యోమమునందె లీలతోన్. ౩౨౪ 3553
చ. శరముల మూఁటఁద్రుంచె; నిటు ♦ తారుసువర్ణమనోజ్ఞశూల మా
ధరణిపుబాణవేగమునఁ ♦ దద్దయుఁ బిండిగనై మహోల్కనా
ధరఁబడె; నెంతకార్యమును ♦ దా సులభంబుగఁ జేయురాముఁ డ
క్కరణిని శూలముం దునుమఁ ♦ గాఁ గని యభ్రమునందు భూతముల్. ౩౪౪
తే. మేలు మేలనిపొగడె; నా♦శూల మట్లు
శకలమౌటను ఖరునాత్మ♦జన్ముఁడు గని
ముష్టి బంధించి పైకెత్తి ♦ మ్రోలనున్న
రాము నిలునిలు మనిపల్కి ♦ రాక్షసుండు ౩౬. 3555
క. అరియట్లు తనదుపైఁ బడ, నరుదెంచుచునుండఁ జూచి ♦ యారాముఁడు భీ
తిరహితుఁడై నవ్వుచు నా,శరాసనమునందుఁ దొడిగె ♦ జ్వలనాస్త్రంబున్.
తే. ఇట్టు లాగ్నేయశరము నెం♦తేని పూన్కిఁ
గార్ముకమునందు సంధించి ♦ కరమువైవ
నద్ది యురమును జీలిచి ♦ యవలఁ జనఁగ
ధరణిఁబడి వాఁడు మృతినొందె ♦ దనుజు లడల. ౩౮ 3557
సీ. మకరాక్షుఁ డిట్లు స♦మరమునఁ గూలుటఁ గనిరాక్షసులు భూమి♦కాంతుబాణ
సముదయార్దితులయి ♦ సరగున లంకకే పరుగువాఱిరి; దేవ♦పటల మంత
దశరథరాజనం♦దన బాణవేగమ్మునను హతుఁడై వజ్ర♦మున హతమయి
ధరను గూలిన పర్వ♦తమురీతి నిలఁగూలియున్న యాఖరపుత్రు♦నుగ్రబలుని
తే. రాక్షసేజ్యుని మకరాక్షు ♦ రమణఁ గాంచి
చనియె నేటికి భీకర♦శత్రు వీతఁ
డనుచు మిక్కిలిసంతుష్టి ♦ నంది యభ్ర
మందుఁ జెలువారుచుండె స♦మ్యక్ప్రనునందు. ౪౦ 3558
డెబ్బదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౮౦ - వ సర్గము.

{ ఇంద్రజిత్తు హోమప్రభావమున మరల రామప్రముఖుల నొప్పించుట.
రాముం డతనిఁ జంపునుపాయ మాలోచించుట. }

*చ. అని జయమందు రావణుఁ డ♦హార్యబలుండు ఖరాత్మజన్ముఁ డ
ట్లనిఁబడు టాలకించి మది♦యందు మహత్తరకోపమొప్ప దం
తనిచయ మట్టిగీటి ప్రవి♦దారణముం దిఁక నేమి చేయనౌ
నని యపుడెంచి యంతట మ♦హత్తరమై క్రుధ తన్ను ముంపఁగన్. ౧౪ 3559

---

* రావణ స్సమితింజయః-అనిమూ.

క. తనయుని శక్రజితుం బనిచెను యుద్ధము చేయఁబోవ ♦ జితరిపువీరా!
యనుపమవీర్యుల భ్రాతల, ననిలో నారామలక్ష్మ♦ణాహ్వయులఁ దగన్. ౨౪

క. పరిమాఱ్పు మీవు మాయం, బరులకు నగపడక గాని ♦ వారికి దృగ్గో
చరుఁడవయి కాని పోరిన, గురుబలుఁడవు తలఁప నెదురు♦కొనఁగలఁ డెవఁడేన్.

తే. అప్రతిమకర్ముఁడైన యా♦హరిని గెలిచి
యున్నవాఁడవు రణమందు ♦ నుర్వి మనుజు
లైన యారాఘవులఁ గాంచి ♦ యాగ్రహమునఁ
జంపకుండుదువే? యేల ♦ శంక నాకు. ౮ 3562

చ. అనివచియించు రావణుని♦యానతిఁ గైకొని యజ్ఞభూమికిం
జని విధిమీఱ నగ్నినటఁ ♦ జక్కఁగ వ్రేల్చెను నింద్రజిత్తు పా
వననియమంబు పూని శుచి ♦ బాగుగ వ్రేల్వఁగఁ బూన రాక్షసాం
గన లొగి ఋత్విగర్థమయి ♦ గాఢరయంబున రక్తవస్త్రముల్. ౫౪ 3563

క. కొనివచ్చి రట్టిహోమం, బునఁ దోమరశరదళములు ♦ పూగము శాస్త్రో
క్తని దగుపరిస్తరణములు, గను మఱియు విభీతకములఁ ♦ గ్రతుసమిధలుగన్.

సీ. అరుణవస్త్రమ్ము ల♦ధ్వరకర్తలకు స్రువ మిసుపదిగనుగూర్చి ♦ యెలమి నింద్ర
వైరిలోమరముల ♦ వరుసగ శరపత్రముల నగ్నిచుట్టును ♦ లలిఁ బరిస్త
రణము గావించియు♦గ్రముగాఁగహోమార్థమయి ప్రాణములఁగూడి♦యలరునీల
వర్ణమేషగళంబు ♦ వదలక ఛేదించె; నంతట నొకసారి ♦ యుక్టెరగులు

తే. పగనె యగ్ని విధూమమై ♦ మిగుల మంట
లెగయఁగా వెల్గె విజయమిం♦కఁ గలుగునని
తెలుపునాచిహ్నములతోడ ♦ దీప్తిమెఱసె
నగ్ని యది; తప్తజాంబూన♦దాభ మగుచు. ౯ 3565

క. అరయఁగఁ బ్రదక్షిణముగాఁ, దిరుగుచు జ్వాలాన్వితమయి ♦ తేజరిల్లెం ద
త్తరుణమునఁ బురుమయాప, స్ఫురణమ్మున నగ్ని లేచి ♦ పూతహవిసులన్. ౧౦

క. తానే పరిగ్రహించెను, దానవవరుఁ డిట్లు శుచిని ♦ తగ వేలిచి యా
దానవనిర్జరరాక్షస,మానసముల కెలమి గల్గ ♦ మాడ్కిన్ భక్తిన్. ౧౦౫

తే. తర్పణముఁ జేసి యద్దానఁ ♦ దా నెవరికిఁ
గనఁబడకయుండు శక్తిచేఁ ♦ గ్రాలురథము
దివ్యమగుదాని నెక్కె నా♦తేరు నాల్గు
తురగములఁ బూన్పఁగాఁ బడి ♦ యురుదుగఁ దగి. ౧౧౫ 3568

క. సునిశితశరనికరంబయి, తనరుచు నారోపితగురు♦ధను వొప్పంగాఁ
గనఁబడి వెలసెను; మఱియును, గనకపరిచ్ఛదము గల్గి ♦ కాంతి మిగులఁగన్.

తే. అర్ధచంద్రాకృతులును జం♦ద్రాకృతులును
మృగములం బోలు నాకృతుల్ ♦ తగువిచిత్ర
ముల నలంకృతమయి కడు♦వెలసె; నతని
ధ్వజము హాటకమయగురు ♦ వలయయుతము. ౧౩ 3570

క. సురుచిరవైడూర్యములన్, బరిభాసురమునయి మండు♦పావకురీతిన్
గరముగ్రంబుగ వెలసెన్; గురుబలుఁ డాయింద్రజిత్తు ♦ కోరికమెఱయన్.

చ. ఖరకరురీతిగా వెలసి ♦ కమ్రతరంబయి చూడ రాక భీ
కరమును నౌరథంబునను ♦ గంజజునస్త్రమున న్నితాంతమున్
నిరతము రక్షణంబుఁగని ♦ నేర్పున నేరి కసాధ్యుఁడౌచు సం
గరమున గెల్పునే గొనెడు ♦ కర్బురవీరుఁడు గాననత్తఱిన్. ౧౪ 3572

క. రాక్షసమంత్రంబులఁ బ్రత్యక్షంబుగ నగ్నివేల్చి ♦ యగపడకయె వై
రిక్షయము చేయఁబూనుచు, రాక్షసపురి వెడలి శాంత♦రహితాత్ముండై.

*క. వనమున నసత్యమునివర,తనువులు చూడంగఁ బడఁగఁ ♦ దాల్చి యిచటఁజే
రిన రామలక్ష్మణుల నిదె, యనిఁజంపి యనీకవిజయ ♦ మంది యరుదుగన్.

క. జనకుండగురావణునకుఁ, దనివి గలుగనిత్తు; నిపుడు ♦ తండ్రికిఁ బ్రమదం
బునుగల్గ రామలక్ష్మణు,లను జంపి ధరిత్రిమీఁదఁ ♦ బ్లవగుఁ డొకరుఁడున్.

ఆ. బ్రదికియుండకుండఁ ♦ బసిపూనిచేసెద; నని యదృశ్యుఁ డగుచు♦నాహవమున
నుగ్రుఁడైన యాతఁ ♦ డొగిఁ దండ్రి యానతి, నంది క్రుద్ధుఁడగుచు♦నడరి నింగి.

క. ధనువును శరములు తీక్ష్ణము, లనుపమములు నౌచు నొప్ప ♦ ననికిన్ జనియెన్
ఘనవీర్యులౌచు భుజములు, పెనుపడుచుండంగఁ గాంతి♦పెద్దగఁ దనరన్.

ఆ. తలలు మూఁడు గల్గు ♦ దారుణఫణులట్టు, లగపడుచును గపిబ♦లాంతరమున
నిలిచి తీవ్రబాణ♦ములవైచు వీరుల, రామలక్ష్మణులను ♦ రక్కసుండు. ౨౦

క. కని వీరె రామలక్ష్మణు, లని యెంచి స్వకార్ముకంబు ♦ నపు డెక్కిడి వృ
ష్టిని మేఘము వర్షించెడు, ననువున శరధారలప్పు ♦ డనివర్షించెన్. ౨౧ 3579

చ. అరదముతోడ నాకసము♦నందె వసించి యదృశ్యుఁడౌచు రా
డ్వరసుతులన్ నిశాతశర♦వారమునన్ గడునొంచె; నిట్లు ని
ర్జరరిపుబాణవేగ మని ♦ రాఘవులం దగఁ గప్ప వారు ని
ర్భరవరచాపయుగ్మమున ♦ బాణములన్ సరిగూర్చి యత్తఱిన్. ౨౨ 3580

క. అనుపమదివ్యాస్త్రబలం,బును జూపిరి; భూరిబలులు ♦ భూపతితనయుల్
ఘనశరవారంబునఁ జ,క్కనిరీతిని వ్యోమపథముఁ ♦ గప్పిన నైనన్. ౨౩ 3581

---

* మిథ్యాప్రవ్రజితౌ వనే-అనిమూ. అనీకవిజయము=యుద్ధమునజయము.

చ. ఖరకరురీతిఁ గాంతుల ని♦కామము మించెదునస్త్రజాలముల్
శరములు శక్రవైరిని వి♦శాలతరాభ్రమునందు నుంట నె
క్కరణి స్పృశింపకే యడఁగెఁ; ♦ గాంతులమించెదు నింద్రవైరి యం
బరములు గప్పు ధూమసమ♦వర్ణతమిస్రముఁ బుట్టఁజేయుచున్. ౨౬ 3582

సీ. మునుపె నీహారంబుఁ ♦ బోలుచీఁకటు లావరించియున్నట్టి♦ది♦క్సంచయములఁ
గనుఁగొనఁ గానట్లు♦గాఁ జేసె; నారీతిఁ జరియించునప్డు త♦చ్ఛరగణప్ర
యోగమ్మునంగల్గు ♦ నురుగుణధ్వనిగాని నేమినాదముగాని ♦ భీమతురగ
ఖురనిస్వనముగాని ♦ యొరులకు వినఁబడదయ్యె; నాతనిరూప ♦ మరయఁదోఁప

తే. దయ్యె; గురుబాహువగునాతఁ ♦ డట ఘనాంధ
కారతిమిరంబునందు నా♦సారవృష్టి
కరణి నద్భుతముగ బాణ♦గణసువృష్టి
గురిసె; మఱియును సురవైరి♦వరబలమున. ౨౭ 3583

క. అనిమొనఁ గ్రుద్ధుండై రా,ముని సర్వాంగముల భాను♦మూర్తి సమశరా
ళిని వైచుచు నొప్పించెను;, మనుజోత్తము లర్కవంశ♦మండను లంతన్.

తే. వర్షధారలచేతఁ బ♦ర్వతము లట్లు
బాణవృష్టుల నొచ్చుచు ♦ భర్మపుంఖ
నిశితశరముల వైచిరి ♦ సింగిఁ గూర్చి;
కంకపక్ష దళావృత♦కాండము లవి. ౨౯ 3585

క. సురపథమునందుఁ బక్షుల, కరణిన్ వేగమునఁ బాఱి ♦ కర్బురునిం దాఁ
కి రహిన్ దన్మర్మంబుల, వరుసన్ భేదించి ర క్త♦వారిఁ దడియుచున్. ౩౦ 3586

క. ధరణిం బడియెను; నిట్లా,పురుషోత్తము లరికలంబ♦పూగంబున నా
తురులగుచుం దద్బాణవి,సరమును భల్లములఁ ద్రుంప ♦ సాగిరి వెలుచన్.

చ. దనుజుఁ డదృశ్యుఁడై తను ని♦తాంతము బాణము లేయుచుండు ది
క్కును గనిపెట్టి యచ్చటికిఁ ♦ గ్రూరతరాస్త్రము లొక్కరీతి వై
వను బనిపూని రాశరుఁడు ♦ బాహువిలాసముమీఱ బాణమో
చనమును జేయఁజాలుచు నె♦సంగుమహారథుండు గావునన్. ౩౨ 3588

తే. ఒక్కచో నిల్వ కాత్మర♦థోత్తమంబు
తోడ సకలాశలకు మాయఁ♦గూడి తిరుగు
చురులబాణములకుఁ జిక్క ♦ కానృపసుతు
లను శితాంబకములను నొం♦చెను మిగులఁగ. ౩౩ 3589

క. వీరులు రాఘవు లట్లరి, వీరకనత్కనకపుంఖ♦విపులశరముల్
ఘోరంబుగ నంగంబుల, భూరిగతిన్ నల్ల గాఱ ♦ భూతభయదులై. ౩౪

తే. పుష్పితపలాశములరీతిఁ ♦ బొలిచి; రంత
రవిని సురమార్గమునను న♦భ్రములు గ్రమ్మి
నపుడు తద్గతు లెఱుఁగ రా♦క పరఁగునటు
లమరవైరియు నెటుచని♦నదియుఁ గాని ౩౮ 3591

సీ. అతనిరూపముగాని ♦ యతనిధనుర్బాణములుగాని తద్గత♦ములగు నితర
వస్తువు లెవిగాని ♦ వసుధ నెవ్వరికైనఁ దెలియరావయ్యె; ని♦మ్మల నతండు
బాణాళి పరఁగించి ♦ వానరశతములఁ బంచత్వ మొందించి ♦ ప్రధనసీమ
యందుఁ బడంజేసె; ♦ నపుడు లక్ష్మణుఁ డతికోపంబునఁ రాముఁ♦గూర్చి పలికె

తే. *నేను బ్రహ్మాస్త్రమును వైచి ♦ నిఖిలరాక్ష
సులను ద్రుంచెద; నన్న యా♦శుభతరాంగ
లక్షణుండయి తనరారు ♦ లక్ష్మణుఁగని
రాముఁ డిట్లని పల్కె శు♦భ్రతరభంగి. ౩౯ 3592

క. ఒకనినిమిత్తము ధరఁగల, సకలాసురులను వధింప ♦ స్వాంతమ్మున ని
ట్లు కడుంగోరుట తగవే, యిఁక వినుమా! యని నొసర్ప♦కే యున్నజనుల్.

ఆ. అనిసి దాఁగియున్న ♦ యాతనిఁ; బ్రాంజలిస్థయైనవాని శరణు♦నందువానిఁ
బరుగువాఱుచున్న♦వానిఁ బ్రమత్తునిఁ, జంపఁదగదు సుమ్ము♦సహజ! యెపుడు.

క. గురుబల! యీతనినే సంగరమునఁ జంపంగ మనము ♦ గావింతము దు
ర్భరఫణులఁ బోలి వేగస్ఫురణంబున మించు నస్త్ర♦పుంజ మితనిపై. ౪౦

క. పరగింతము; మాయను గొని, యరసముతోఁ గానఁబడక ♦ యభ్రమునందే
తిరిగెడు నీనీచుని దేవరిపుం గని ప్లవగసైన్య♦పాలకు లెల్లన్. ౪౧ 3596

క. బల మలరారఁగఁ జంపం, గల; రీయింద్రారిపూన్కి ♦ త్వావివరంబుం
గలయం జొచ్చిననైనను, బలిసద్మము నొందినను ది♦వమునకుఁ జనినన్.

తే. ఆకసంబున కెగసిన ♦ నట్లు యెంకఁ
జొచ్చి కనఁబడకున్నను ♦ శుంభదుగ్ర
మామకాస్త్రాగ్నిదగ్ధుఁడై ♦ మహిగతాసుఁ
డగుచుఁ బడిపోవఁ గలఁడింక ♦ ననియె నిట్లు. ౪౨ 3598

చ. గురుమతి నత్ప్రభావుఁ డరి♦కుంజరసింహము రాఘవేంద్రుఁ డి
క్కరణి వచించి భీతికర♦కర్ముఁడు భీకరుఁడైన దానవుం
దదరగ వధింపఁగాఁ దగిన ♦ దారుణకృత్యము నెట్లుచేయఁగాఁ
దరమగునంచు నెమ్మదిని ♦ దాను దలంచుచునుండె నంతయున్. ౪౩ 3599

ఎనుబదియవ సర్గము సంపూర్ణము.

---

* తతో రామో లక్ష్మణం శుభలక్షణమ్-అనిమా.

౮౧ - వ సర్గము.

ఇంద్రజిత్తు మాయాసీతను హనుమంతుఁడు చూచుచుండఁ జంపుట.

క. గురుమతి రామునియాశ*యు, నురసి గ్రహించుచును రాక్ష♦సాధీశుఁడు నం
గరమును మాని పురంబున, కరిగె నచటనుండి దూర♦మరయుచు మదిలోన్.

చ. తనురుచి మీఱ శూరుఁడగు ♦ దానవవర్యుఁ డతండు పత్తనం
బును దగఁ జొచ్చుచున్ బలము ♦ పొల్చెడు నుత్తనుకుంభకర్ణము
ఖ్యనిఖిలదానవుల్ తెగుట ♦ నాత్మఁ దలంచి యమర్షయుక్తిచేఁ
గను లరుణంబులై తనరఁ♦గాఁ బురి వెల్వడి యుద్ధభూమికిన్. ౨ 3601

తే. మరల వచ్చెను; గురువీర్య♦మండితుఁ డమ
రాళికంటకుఁడును బుల♦స్త్యాన్వవాయ
జనితుఁడు నగు నాతండు రా♦క్షసగణయుతుఁ
డగుచుఁ బడమటిద్వారంబు ♦ నపుడు దాఁటి. 3 3602

క. చని వీరులైన రాఘవు, లనికి సుహోద్యుక్తు లగుట ♦ నారసి దుఃఖం
బున వారి ముంచి యుద్ధం,బును మానఁగఁ జేయ మాయఁ♦బూని కడువడిన్.

క. పరఁగించె దాని నంతట, నరుదుగ మాయైకశక్తి♦ నవనీసుత న
త్తరుణమునఁ బుట్టఁజేయుచు, నరదంబున నుంచి బలము ♦ లార్భటిమీఱన్.

క. తనచుట్టు నిలువఁగా సీ,తను జంపం గోరె; దుర్మ♦తంబునఁ దగు నా
దనుజుం డెల్లర మోహం,బున ముంపం గోరి ప్లవగ♦ముఖ్యులు గనఁగన్.

చ. జనకజఁ జంపునుద్యమము ♦ స్వాంతమునందునఁ గోరి యెచ్చటన్
వనచరు లుండిరో యటకుఁ ♦ బర్విడె; నప్పురినుండి యింద్రజి
త్తనికిని వచ్చుటం గనిన ♦ యాకపు లెంతయుఁ గ్రుద్ధులై రణం
బును గడుఁ జేయఁగోరి కర♦ముల్ శిలలం గొని యొప్పుమీఱఁగన్. ౬

తే. మారుతాని; రంతఁ గపిగణ♦ముండనుండు
హనుమ మిగుల దురాసదం♦బైన భూరి
పర్వతాగ్రముఁ గరమునఁ ♦ బట్టి కపుల
యగ్రభాగంబునం జనె ♦ నతనిపైకి. ౭ 3607

సీ. హనుమంతుఁ డంత నిం♦ద్రునివైరిరథముపై రాఘవుప్రియురాలి ♦ రాజవదన
విహతసమ్మోదను ♦ వితతైకవేణిని నుపవాసకృశముఖి ♦ నొప్పుదక్క
యనిశముఁ గట్టిన ♦ యాయంబరముతోడఁ దీనయై యుండిన ♦ మాననీయ
దేహసంస్కార మే♦తీరున లేకుంట నవయవంబుల ధూళి ♦ యావరింప

---

* యకారము గాయత్రియందుఁ బందొమ్మిదవయక్షరము. ఇటనుండి పందొమ్మిదవ సహస్రమారంభమైనది.

తే. నున్న సీతను గాంచె; నా ♦ సన్న సీమ
నాతఁడు ముహూర్తమాత్ర మ ♦ య్యతివఁ గాంచి
జనకతనయయె యంచు ని ♦ శ్చయము చేసి
కొని విషాదంబు నొందుచు ♦ మనసునందు. ౧౦౻ 3608

క. జనకజను స్వల్పకాలం, బునకుం బూర్వంబె లంకఁ ♦ బొడఁగాంచెను గా
నవె యట్లు నిశ్చయించెను;, హనుమయు మలదిగ్ధదేహ ♦ యై దీనయునై. ౧౧

క. దనుజునిరథమందుండిన, జనకజఁ గని మోము బాష్ప ♦ జలములఁ గలఁగన్
వనటం గాంచెను; శోకా, ర్తను విహతానందఁ గృపకుఁ ♦ దగు నాసీతన్.

తే. ఇంద్రజిత్తునకుం జిక్కి ♦ యొలమి దక్కి
యతనిరథమున నుండంగ ♦ నప్పుడు చూచి
యితఁడు రథమున జనకజ ♦ నిట్టు లుంచి
తే గతం బేమి యంచు మ ♦ దిం దలంచి. ౧౩ 3611

క. వనచరులం బ్రశ్నించెను;, హనుమయు నట నున్నవాన ♦ రావళితోఁ దా
నును నింద్రజిత్తుమీఁదికిఁ, జనియెను; గపిబలము పైకిఁ ♦ జను దేరంగన్.

క. కని యింద్రజిత్తు క్రోధం, బున మూర్ఛితుఁ డగుచు ఖడ్గ ♦ మును దాఁ గోశం
బున నుండి పెఱికి జనకుని, తనయ నగు శిరంబుఁ బట్టె ♦ దారుణరీతిన్. ౧౪

క. అరదంబునఁ దనమాయా, విరచితయె రామ! రామ! ♦ విభు! మహాత్మా!
కరుణింపు మనుచు నేడ్చెడు, తరుణీమణి జనకరాజ ♦ తనయం గ్రుధచేన్. ౧౪౻

క. వనచరు లంతలు చూడం, గను గొట్టెను; బవనసుతుఁడు ♦ కాంతశిరోజా
ళిని వాఁడు పట్టుకొనుటం, గని దైన్యము నొంది బాష్ప ♦ కణములఁ గార్చెన్.

తే. చారుసర్వాంగి రాముని ♦ గారవంపుఁ
దరుణి యాసీత యట్లవ ♦ స్థను గుమవఁగఁ
గాంచి హనుమ యమర్షము ♦ గదుర నసుర
వరునిసుతు నింద్రజిత్తుని ♦ బాగుగఁ గని. ౧౬ 3616

క. పరుషాక్షరములతో ని, ర్వ్యసనం బలికెన్ దురాత్మ! ♦ బ్రహ్మర్షిమహా
త్తరకులజనితుఁడ వయ్యును, సురవైర్యన్వయమునందుఁ ♦ జొచ్చితి కానన్.

క. సతి యగు సీతశిరోజ, ప్రతతిని దాఁకితివి దీనఁ ♦ బాడగుదువు దు
ర్మతి యిట్లు పుట్టినది కద?, దితిజా! ఛీ! పాపరతమ ♦ తివి గనుక నిఁకన్. ౧౯౻

క. త్వరలోనం జెడిపోదువు, కరుణారహితా! దురాత్మ! ♦ కడునీచుండా!
నిరతదురాచారా! పా, పరతపరాక్రమ! యనార్య ♦ పథమున నిచటన్. ౨౦

తే. ఇట్టిహీనంపుఁబని చేసి ♦ తీవు, దీనిఁ
బాపియే గాని యితరుఁ డె ♦ ప్పటికిఁ జేయఁ

డో కృపాహీన! యేవలే♦దో! మదికిని;
గరుణ యపరాధియెడఁ గూడ ♦ దరయ ననదొ?. ౨౦ 3620

చ. జనకజ స్వాలయంబుఁ బరి♦చారికలన్ విడనాడి రాజ్యవ
స్తునిచయ మెల్ల వీడి తన♦తోడగు రాముని బ్రాపుఁ బాసి యే
యనువున నీకు దోష మిసు♦మంతయుఁ జేయకయుండఁగా వధిం
పను జతనంబు చేసెదవు ♦ పాపుఁడ! యే మొనరించె నేరముల్. ౨౧ 3621

తే. అట్టి మైథిలి సీతను ♦ నంత మొందఁ, జేసి యెట్లైన నీ వింకఁ♦జిరముభూమి
బ్రదుకఁ జాలవు గొప్పపా♦పంపుఁగృతిని, జేయుటం జంపఁదగు దీవు♦సిద్ధ మిద్ది.

క. కనుకన్ నాచేఁ జిక్కితి, దనుజా! కంటకుఁడ వౌటఁ ♦ దప్పక లోకం
బున వధ్యుఁడ వగుదువు కను,కను నీ వీలోకమందుఁ ♦ గడు నీచుఁడవై. ౨౩

ఆ. జీవితములఁ బాసి ♦ శీఘ్రమ ప్రేతమ, వగుచుఁ బదియు నాలు♦గైన జగము
లందు స్త్రీనిఁ జంపి♦నట్టివా రేకుత్సి,తపద మొందువారొ ♦ దాని నీవు. ౨౪

క. చని పొందఁగలుగు దంచని, హనుమంతుం డిట్లు పలికి ♦ సాయుధులగునా
వనచరులఁ గూడి క్రోధం,బున రావణిపైకిఁ బూన్కిఁ ♦ బోయెన్ ద్వరతోన్.

చ. బల మలరారఁ బైఁ బడఁగఁ ♦ బౌరుష మూనియొ వచ్చుచున్న యా
బలముల నంజనాతనయు ♦ బాహుబలాఢ్యులు భీతిదుల్ సురా
రుల భటు లప్డు దాఁకి కడు ♦ రూక్షముగా నని సేసి యంతటన్
నిలిపిరి; శక్రవైరియును ♦ నిర్భరబాణసహస్ర మొక్కటన్. ౨౬ 3626

చ. ధనువునఁ గూర్చి వైచి యతి♦దారుణరీతిని వానరౌఘముం
ఫనటను బొందఁజేసి కపి♦వర్యునిఁ బావనిఁ గాంచి పల్కె ని
ట్లని; హరినాథుఁ డారఘువ♦రాన్వయుఁ డీవును యన్నిమిత్త మీ
దనుజపురంబుఁ జేరితిరొ ♦ తన్మిథిలాత్మజ నిప్డె యిటన్. ౨౭ 3627

తే. నీవు చూచుచు నుండంగ ♦ నే వధించు
వాఁడ వనచర! యాసీతఁ ♦ బ్రథమముననె
చంపి యవ్వల రామల♦క్ష్మణుల దుర్మ
తిని విభీషణు సుగ్రీవు ♦ నిను వధింతు. ౨౮ 3628

క. వనచర! స్త్రీలవధింపం, జన దని చెప్పితివి గాదె ♦ శాస్త్రోక్తముగాఁ
గను, బదు లిడువాఁడను నే, విను మెయ్యది శత్రువులకుఁ ♦ బీడాకరమా. ౨౯

ఆ. అద్ది యెట్టిదైన ♦ నాచరింపం దగుఁ, దప్పుకుండఁ గానఁ ♦ దరుణి దీనిఁ
జంపువాఁడ ననుచు ♦ శ్వసనజునకుఁ జెప్పి, యప్డు జేదృచున్న♦ఁభువనితనయ.

తే. మాయచేఁ జేయఁబడిన య♦మ్మానిని శిత
ధారగల ఖడ్గముం గొని ♦ తనకరమున
నటికె; మిక్కిలి ప్రియదర్శ♦నయుఁ దపస్వి
నియుఁ బృథుశ్రోణియు నగునా♦నెలఁత నిట్లు. ౩౧ 3631

క. దనుజోత్తముఁ డగు రావణు,తనయుం డుపవీతమట్లు ♦ తగ నఱికిన మే
దినిఁ బడెఁ దుండములై; సీ,తను నీవిధిఁ జేతులారఁ ♦ దాఁ జంపి తమిన్.

క. దనుజుం డిట్లు వచించెను, హనుమంతునితో సమర్థ ♦ నారఘుపతిభా
ర్యను జంపినాఁడ నే నిదె, కనుమా! జానకియుఁ దెగియెఁ ♦ గాదే? యిచటన్.

ఆ. ఇంక మీప్రయత్న ♦ మిది యెల్ల విఫలంబె,యయ్యె; ననుచుఁబలికి ♦ యాతఁడాత్మ
కరయుగమున ఖడ్గ ♦ పరుషధారను సీత, నట్టినఱికి హృష్టుఁ ♦ డగుచు నంత. 33౫

క. అరదమ్మున నుండియె భీ,కరనాదము పరఁగఁ జేసెఁ; ♦ గడు దాపున సం
గర మొనరింపను నిలిచిన,హరు లెల్లను రావణుని ప్రి ♦ యాత్మజుఁ డెలమిన్.

క. తనచుట్టును దుర్గమువలె, దనుజులు గనుపట్టుచుండఁ ♦ దన్మధ్యమమం
దున నుండి నోరు పెద్దది,గను జేసి యొనర్చిన ధ్వనిఁ ♦ గడు విని రాత్రిన్.

చ. జనకజ నిట్లు త్రుంచి మది ♦ సంతస మందుచు నుబ్బుఁ గాంచె నా
దనుజవరాత్మజుండు; ప్రమ ♦ దంబునఁ గేలెడువానిఁ గాంచి యా
వనచరులన్ విషణ్ణులయి ♦ బాగుగ ముందును వెన్కఁ జూడకే
చనిరి సబాష్పనేత్రములు ♦ చాలవిలోలములై కనంబడన్. 3౬ 3637

ఎనుబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౮౨ - వ సర్గము.

{ హనుమదాదులు రామునిచెంతి కేగ నింద్రజిత్తు నికుంభిలయందు హోమము చేయుట. }

చ. వనచరు లిట్లు లయ్యశని ♦ భంగి భయంకరమై చెలంగు నా
దనుజునిసింహనాదమును ♦ దా రొగి వించు భయంబునన్ జవం
బున దెసలం గనుంగొనుచుఁ ♦ బోయిరి; వాయుతనూజుఁడున్ భయం
బునను విషణ్ణవక్త్రులయి ♦ పొల్పఱఁ దోఁచినరీతిఁ బాఱున
ట్టివనచరులన్ మహార్తులను ♦ బల్కె మనంబున ధైర్య మూనుచున్. ౧ 3638

క. వనచరులారా! మోములు, వసటం గుందంగ మీరు ♦ బవరంబున మీ
ఱిన యుబ్బు దక్కి పాఱం, జనునే? శూరత్వ మిపు డె ♦ చటి కేగెనొకో?. 3

చ. అని యొనరింప నేఁ జనుదు ♦ హాయిగ రండు మహాహవంబులన్
ఘనయశ మొందు శూరులకు ♦ గర్హ్యము యుద్ధము వీడి పాఱఁగా;
నను హనుమంతుపల్కులకు ♦ నక్కపు లాత్మల హర్ష మందుచుం
దనువులు పుల్కలం గను ను ♦ దారమహీధరశృంగవృక్షముల్. ౪ 3640

చ. కరములఁ బట్టి నిల్చిరి; త ♦ గం గపిసింహులు గర్జనంబులన్
సురరిపులన్ వధింపఁగను ♦ చొప్పడు క్రోవను బోయి; రప్పుడా

హరివరుఁ బావనిం గొలిచి ♦ యాతనివెంటనె పోయి రట్టిసం
గరము నొనర్ప; వాయుజుఁ డ♦ఖండబలంబున నాల్గుప్రక్కలన్. ౬౪ 3641

ఆ. కపులు చుట్టుముట్టి ♦ కడువడి నడువఁగా
మంట లలరు దహను ♦ మాడ్కి శత్రు
బలములను దహించె; ♦ ప్రళయకాలంబునఁ
బ్రజలఁ జంపు యముని♦భంగి హనుమ. ౭ 3643

క. వనచరబలపరివృతుఁడై, దనుజులతో సంగరంబుఁ ♦ దా సలిపె; మరు
త్తనయుఁడు క్రుద్ధయుఁ శోకం,బును బెనఁగొనవైరియరద♦మున భూరిశిలన్.

ఆ. పడఁగ వైచె; నంతఁ ♦ బైకేగుదెంచెడు,శిలను సారథియును ♦ శీఘ్రము గని
తాను జెప్పునట్లు♦గా నడచుమహాశ్వ,ములను గట్టియున్న ♦ లలితరథము. ౯౪

క. తొలఁగించెఁ గడున్ దూరము, శిల యది యాయింద్రజిత్తుఁ ♦ జెందక రథమం
దలరెడు సారథిఁ జంపక, ఫలరహితముగాఁగ వైవఁ♦బడి యట ధరణిన్. ౧౦౪

తే. పగులఁ జీలిచికొనుచును ♦ బలిని కేత
నమును జొచ్చెను; బవనత♦నయుఁడు పెనుశి
లను దగన్ వైవ రక్షోబ♦లములు వనట
నందె యాశిల ధరఁ బడు♦నపుడు మిగుల. ౧౧౪ 3616

ఆ. దానిక్రిందఁ బడుటఁ ♦ దనువులు నలఁగుట,ముద్దయైరి; ప్లవగ♦ముఖ్యులెల్ల
రవము లట్టి చెలఁగ ♦ రావణిపై కేగి, రట్టి *నూఱులుగ మ♦హాబలముల.

సీ. గురువీర్యులును భయం♦కరవిక్రములునగు నవ్వానరులు యుద్ధ♦మందు నింద్ర
వైరిపై గొప్ప మ♦హీరుహంబుల గిరిశిఖరంబులఁ గొని వై♦చిరి; మఱియును
దరుశైలవృష్టిని ♦ నరులమీఁదం గురియించుచు నార్చుచు ♦ నెన్నొ రీతు
లగురవంబుల మహా♦హవము రాక్షసులతో నొనరించి;గురువీర్య♦మునఁ జెలంగు

తే. కపులు సత్తువకొలఁది వృ♦క్షములఁ గొట్ట
భయదరూపులు రాక్షసుల్ ♦ బవరమందుఁ
బొరలి; రంతట స్వబల మా♦హరిబలార్ది
త మగుటం గాంచి క్రుద్ధుఁడై ♦ దనుజవరుఁడు. ౧౬ 3648

క. కరమున విలు దాలిచి యా, పరసేనలపైకి నడచె; ♦ బహువారము లా
సురవైరివిక్రమము సం,గరమునఁ గనఁబఱచియుండెఁ ♦ గావున నపుడున్. ౧౭

క. బలములు తనుఁ జుట్ట వెసం,గలనునరున్ రాఁగ బాణ♦కాండంబుల ను
జ్జ్వలరీతిం బరఁగించుచుఁ, బొలియించెం గపిమృగేంద్ర♦ములఁ బెక్కింటిన్.

ఆ. అతనివెంట నున్న ♦ యసురులు శూలాశ
నులను బట్టసగణ♦ములను ఖడ్గ

* త మధ్యభావం చ్ఛతశో నదంతః-అనియా.

కూటముద్గరములఁ ♦ గోఁతుల సత్వంబుఁ
బూని కొట్టి; రంతఁ ♦ బొలుచు హనుమ. ౧౮ 3651

క. తనబల మలరఁగ బోదెల, ఘనశాఖలఁ జెట్లు శిలలఁ ♦ గైకొని భీతిం
గనఁబఱచు కార్యములఁ జేసిన దనుజులతోడ ననిని ♦ జేసెం గడఁకన్.

ఆ. విక్రమమున వైరి♦వీరుల హనుమంతుఁ, డట్టు లాపి వనచ♦రాళిఁ గాంచి
సరగ నీబలంబు ♦ సాధింపఁ దగినది, మనకుఁ గాదు ఫలము ♦ గనఁగఁ బోము.

క. మన మందఱ మా శ్రీరా,ముని ప్రియ మొనరింపఁ గోరి ♦ ముదమునఁ బ్రాణా
శిని గూడ నెంచ కుర్విప,యిని బోరలుచు నెట్టులైన ♦ నెవ్వతికొఱకై. ౨౧

క. అని చేయుచు నున్నామా, జనకజ యాసాధ్వి తెగె న♦సాధుదనుజపు
త్రునిచేత; నీ కువార్థను, జని రాఘవునకును తపన♦జనికిని నిపుడే. ౨౨ 3655

క. తెలుపుద మారామాదులు, తలపోయుచు దీని కేమి ♦ తలఁతురొ చేయన్
గలనున మన మిద్దానినె, కలిసి యొనర్పంగఁ దగును ♦ గాదే యనుచున్.

చ. హనుమ వచించి యన్వనచ♦రాళిని యుద్ధమునుండి మాన్పి న
మ్మనమున భీతినే గనని ♦ మానిసి గావున మెల్లమెల్లఁగాఁ
జనియెను సేనలం గలిసి; ♦ శక్రవిరోధి దురాత్ముఁ డొట నా
హనుమయు రామచంద్రుకడ ♦ కల్లన పోవుటఁ గాంచి తానున్. ౨౪

తే. *చనియెఁ జైత్యనికుంభిల♦కును నియతిని
హోమమును జేయ; నిక్లోగి ♦ యుద్యనమున
దేవతాలయ మొంది మ♦దిన్ సుభక్తి
తనర హోమము చేసె శా♦స్త్రవిధి మీఱ. ౨౫ 3658

సీ. యజ్ఞభూమిని నగ్ని♦యం దింద్రజిత్తట్లు సవిధిహోమమును మాం♦సమునరక్త
మునను జేయఁగ నగ్ని♦యనుహవిస్సులఁగొని ప్రజ్వరిల్లెను;బృహ♦ద్భానుఁడంత
రక్తహోమవితృప్తి ♦ రాజిల్లుచున్ లేచి తీవ్రమ్ముగా మండి ♦ దెసల నంటి
సంజ రంజిల్లు భా♦స్కరుఁ బోలి కనుపట్టె; నంత నింద్రారి శా♦స్త్రానుసార

తే. పద్ధతులఁ జక్క నెఱిఁగిన ♦ పండితుండు
కనుక దనుజులకున్ మేలు ♦ గలుగ వేల్చె
నంతట నయానయజ్ఞులౌ ♦ నసురులు గను
చుండి రద్దాన లోపంబు ♦ లుండ కుండ. ౨౬ 3659

ఎనుబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

* గత శ్చైత్యనికుంభిలామ్-అనియా.

## ౮౩ - వ సర్గము.

సీతామృతిని విని రాముఁడు చింతింప లక్ష్మణుం డూరార్చుట.

చ. దనుజులు వానరుల్ మిగుల ♦ దారుణరీతిని జేయుచున్న యా
యనిని జనించినట్టి తుము♦లారవముల్ విని జాంబవంతుఁ డెం
దున కయి యో సమీపమునఁ ♦ దోఁచిన రాముఁడు పల్కె నిట్టులా
తనిఁ గని; దుష్కరాహవము ♦ తా హనుమంతుఁడు చేయునట్లుగన్. ౧౪

క. మనమునకుం దోఁచెడు నెట్లన భీకరముగ మహాయు♦ధాళిధ్వనియున్
వినఁబడుచున్నది చెవులకుఁ; గనుకన్ భల్లూకనాథ! ♦ కడు వేగముగన్.

తే. నీదు సేనలతోఁ గూడి ♦ నీవు వేగ
చనుము కపివర్యుఁడైన యా♦హనుమ యొంటి
సంగరము చేయుచుండుట ♦ సాయపడుము
నాఁగ భల్లూకసముదయ♦నాథుఁ డట్లు. ౩ 3662

క. తనకున్ శ్రీరాముఁడు చేసిన యాజ్ఞను దలను దాల్చి ♦ సేనావృతుఁడై
చనియెను బశ్చిమద్వారంబునఁ గలహనుమంతునొాలకుఁ♦బొంగెడుకాంక్షన్.

క. వనచరు లెల్లను యుద్ధంబును నొనరిచి యలసి యూధప♦పుంజము లెల్లన్
గనఁబడఁ దనుఁ బరివేష్టింపనురాఁ ద్రోవఁ గనె హనుమ ♦ భల్లుకపతియున్.

చ. హనుమయు నీలమేఘనిభ♦మౌ తను వొప్ప భయంకరంబుగా
నని నొనరింప నాయితము♦నై చనుదెంచెడు భల్లుకాళినిం
గనుఁగొని త్రోవనే మరలఁ♦గాఁ దగు వెన్కకు నంచుఁ జెప్పి రా
మునికడ కేగెఁ దాను; *యశ♦మున్ విలసిల్లఁగ నున్న యాతఁడున్. ౬

చ. హరిబలముల్ తనుం గొలిచి ♦ యార్తిని గుందుచు వెన్క రాఁగ భూ
వరుఁ గనఁ బోయి వేగముగ ♦ వంతను బొక్కుచు నిట్లు పల్కె; నో
యరిజనకాల! మేము సమ♦రాంగణమందున విక్రమించుచున్
సురరిపులన్ వధింపఁగను ♦ జూచుచు ముందట నుండు నంతలోన్. ౭౪ 3666

తే. రావణాసురుపుత్త్రుండు ♦ రమణ సీతఁ
బట్టి తెచ్చి రథంబునఁ ♦ గట్టి యామె
యేడ్చుచుండఁగఁ జంపె మా♦యెదుట; వైరి
సూదనా! తద్వధంబును ♦ జూచి నేను. ౮ 3667

చ. మనసు చలింప దుఃఖమును ♦ మాటికి మాటికిఁ బైకొనంగ నే
పనియును దోఁప కివ్విధముఁ ♦ బల్కఁగ వచ్చితి; నంచుఁ జెప్ప నా
హనుమనుడుల్ చెవిం బడఁగ ♦ నారఘురాముఁడు శోక మొంది యొ
య్యన హతమూలభూమిరుహ ♦ మట్టులు మూర్ఛిలి నేలపైఁ బడెన్. ౧౦

---

* సన్నికర్షం మహాయశాః-అనియూ.

క. సురతుల్యుఁడైన యారఘు, వరుఁ దుర్విం బడఁగఁ గాంచి ♦ వనచరముఖ్యుల్
పరుగెత్తి యచ్చటికి వచ్చిరి నాలుగు దెసలనుండి ♦ శీఘ్రమ యాత్రిన్. ౧౧

తే. ఉచ్ఛిఖంబులు మండుచు ♦ నున్న యగ్ని
కరణిఁ దేజంబునం జేరఁ♦గాఁ దరంబు
గాని యారామునిం దేర్పఁ♦గా సరోజ
కువలయసుగంధిజలములఁ ♦ గురిసి తడుప ౧౨ 3670

క. మనమును దహించుదుఃఖం, బున లక్ష్మణుఁ డారఘూత్త♦ముని నవ్వస్థన్
దన బాహువులన్ గైకొని, యనియెను; హేత్వర్థసువచ♦నాళి నతనితోన్.

సీసమాలిక:—

*తండ్రి వాక్యమును సా♦ర్థకముగఁ జేయుధర్మపథంబునన్ దృఢ♦మనసుతోడ
నిలుచువాఁడవు మహీ♦శల మెల్లఁ జేఁ జిక్క దానిఁ బోఁగొట్టిన ♦ తల్లివంటి
కైకయందును భూమి♦కాంతునియందును మనసునఁ గలుషత్వ♦ మనఁగ లేని
విజితేంద్రియుండవై ♦ వెలయువాఁడవు,ధర్మమతివియగునిన్ను♦నతులితమగు
ధర్మము తాను స♦హాయముగఁ గార్యపువేళ లేనియట్టిది యగుఁ ♦ గాన వ్యసన
ములనుండి కాపాడఁ♦గలది గాదయ్యెను; నట్లె యధర్మ మ♦ర్హానుగుసుఖముఁ
బోఁగొట్టఁ దగినదై ♦ పొలిచియు నయ్యదియును లేనిదే కావు♦ననుదురాత్ముఁ
డైన రావణుని సు♦ఖాళిని వారింపఁ జాలకున్నది; రఘు♦సత్తమ! యిఁక
ధర్మ మధర్మము ♦ ధరణి లేవనుటకుఁ గలప్రమాణము లెవ్వి? ♦ గలిగినయెడఁ
బ్రత్యక్షమా! యది ♦ బహుభంగిఁ గాఁ దగు ననుమానమా?శబ్ద♦మనఁగఁదగిన
యట్టిప్రమాణమా? ♦ యని యందువేమొ! ప్రత్యక్షమ్ము గాదెట్టు♦లన్నవినుము
స్థావరజంగమా♦త్మకపదార్థంబులు ప్రత్యక్షముగఁ గంటఁ♦బడుచు నుండు
మాడ్కి ధర్మము నధ♦ర్మంబును దెలియుట లేదు గావున నవ్వి ♦ లేని వనియు
నామనోనిశ్చయం; ♦ బో మహీపాలకా! స్థావరవస్తు వే♦సరణిఁ దెలియఁ
బడుచున్నదో యట్లు ♦ ప్రతిజంగమపదార్థ మగపడుచున్నది♦యె గద; ధర్మ
మట్టు, లధర్మము ♦ నగపడుటయె లేదు మఱి యివ్వి యుండిన♦మహిని స్థావ
రముగనో, మఱి జంగ♦మముగనో యుండంగవలయు నట్టులు లేని ♦ వౌటనవ్వి
ప్రత్యక్షములు గావు ♦ పరమధర్మంబతీంద్రియమయ్యునుండిన♦నయగుణాఢ్య!
నినుఁ బోలు ధర్మచి♦త్తునకు నాపద లేకయే యుండు దనుజున ♦ కేసుఖంబు
గలుగక యుండును; ♦ లలితగుణాకరా! ఫలము ధర్మాధర్మ♦ములకు సుఖము
వ్యసనంబు కాన న♦వ్వానిని బట్టియే యవి యున్నవని మన ♦ మరయవచ్చు
ననుమానమున నన్న ♦ దనుజేంద్రుఁడగు రావణాఖ్యుఁడధర్మయు♦క్తాంతరంగుఁ

* శుభే వర్త్మని తిష్ఠంతమ్ .. ఇత్యాదిశ్లోకాష్టకమునకు వ్యాఖ్యానకర్తలు వ్రాసిన యర్థము సమగ్రముగాఁ దెనుఁగునఁ జెప్పఁబడిన దని గ్రహింపందగు.

దగుఁ గాన వ్యసనంబు ♦ నందంగ వలయును ధర్మంబెయున్నచో ♦ ధర్మయుక్తి
నలరునీ కివ్విధి ♦ వ్యసనంబు లేకుండవలయు నియ్యవియు ని♦ట్టులుగ లేమి
ననుమానమునను ధ♦ర్మాధర్మములు గల వని చెప్ప వీలులే; ♦ దరసి చూడఁ
గా నధర్మిష్ఠుఁడౌ ♦ క్రవ్యాదపతికిని వ్యసనమే లేకుండ♦గ సుఖ మలరి
యుండుట ధర్మచి♦త్తుండవౌ నీకు దుఃఖము గల్గి యుండుటఁ ♦ గనుఁగొనంగ
నిలను ధర్మ మధర్మ♦ఫలము, నధర్మంబు ధర్మఫలంబు ని♦త్యము విరుద్ధ
ముగ నిచ్చుచున్నవి♦యె గనుక ఫలములఁ బట్టియు నివి యుండ♦వచ్చు ననుచు
ననుమానమునను సి♦ద్ధాంతమ్ము చేయంగ నలవిగా కున్నది ♦ తలఁచి చూడ
ధర్మము చేయంగ ♦ ధర్మఫలంబయి తగుసుఖ మబ్బునా? ♦ దారుణ మగు
నట్టి యధర్మము ♦ నాచరింపఁగ దాని ఫలమగు దుఃఖము ♦ గలుగునో? యని
తలఁచెద వేమొ? మి♦క్కిలి యధార్మికు లెవ్వ రగుదురో యవ్వారి♦కయ్యధర్మ
ఫలము గల్గునయేని ♦ పరమధార్మికు లెవ్వ రగుదురో వారికి ♦ నట్టి ధర్మ
ఫలమె కల్గునయేని ♦ పరమధార్మిక సుజనులకు సుఖంబును ♦ గలుగు ననియు
మఱి యధర్మము సేయు ♦ మనుజులకుఁ దుఃఖ మబ్బు నటంచను♦నరయ సిద్ధ
మగును గదా యట్టు ♦ లగపడకున్నది ధర్మహీనులకు న♦ర్థములు పెరిగి
కలుగుచున్నది సుఖం ♦ బిల ధర్మనిరతులౌ జనులకు దుఃఖమే ♦ కనఁబడియెడు
నిట్టు లీఫలము లీ♦యీరెండిటికి నియతములు గాకుండుటఁ ♦ దరము గాక
యున్నది సిద్ధాంత ♦ మొకరీతిఁ జేయంగ; రామచంద్రా! యధ♦ర్మమునఁ బాపు

తే. లార్తి నొందుదు రేని పు♦ణ్యాత్ము లెల్ల, ధర్మసుఖితు లగుదు రేని♦దలఁపఁగ వధ
కర్మరూపముగఁ దగు న♦ధర్మము సుఖ, కర్మరూపముగా నున్న♦ధర్మ మవని.

*క. జనియించి మూఁడుక్షణములె, గనఁబడునవి గానఁ బిదప♦క్షయమందు; హతిం
గనునట్టి యధర్మంబే, మనుజుని వధియించుఁ జెపుమ ♦ మానవనాథా!. ౨౧½

క. హతమగు ధర్మము మే లె,వ్వితమున నెవ్వరికిఁ గూర్చు? ♦ విశ్వాధిప! యీ
గతి సుఖదుఃఖములను నీ, క్షితి నొసఁగుటఁ గల వవనుచుఁ ♦ జిత్తములలరన్.

తే. పలుకు శబ్దప్రమాణము ♦ పాటిగాదు;
కర్మములు క్షణహతినొందుఁ ♦ గాక వాని
చేత నారాధితయగుచు ♦ జెలఁగు దేవ
తయె ఫలప్రదయగునని ♦ తలఁతు వేమొ?. ౨౨ 3675

క. జనుఁ డెవఁ డా దేవతచే,తను బాధల నందువాఁడు ♦ తాఁగానీ,యే
రిని బాధ నందఁజేయం, గను దానే శక్తుఁడగుట ♦ కలుగున యేనిన్. ౨౨½

తే. అదియె పుణ్యపాపంబుల ♦ నవనియందుఁ
దాను జేయించుచున్నదె ♦ యైన యెడలఁ

---

* ౨౧-౨౨-౨-3 శ్లోకములవ్యాఖ్యాభిప్రాయ మిట వ్యక్తము.

బాపపుణ్యఫలంబులై ♦ పరఁగు దుఃఖ
సుఖము లాదైవమునె పొందఁ ♦ జూచుఁగాని ౨౩ 3677

తే. చేయువానిని బొందవు; ♦ శ్రీరఘువర!
కర్మభవమై యపూర్వమా ♦ ధర్మమె ఫల
ముల నొసంగు నటందువా? ♦ యిల నెటు నను
మానమునఁ దేటపడక యె♦య్యాడ్కిఁ గనిన. ౨౪ 3678

క. కనులకుఁ దోఁపక శక్రుం, డనలుండను నర్థవాద ♦ మాదృతిమీఱం
గనఁబఱచు వాక్యములచే,తను గమ్యంబైన సత్తు ♦ తాఁగాక తగన్. ౨౫

తే. ఉన్నయట్టి యపూర్వమై ♦ యొప్పుధర్మ
మునను శ్రేయస్సు మిక్కిలి♦గను వహింప
శక్య మెట్లగుఁ?; జెపుము, యో♦శత్రుకాల!
సత్పురుషభూషణా! మదా♦శయము వినుము!. ౨౬ 3680

సీసమాలిక:—

*ధర్మమువం దగు ♦ నిర్మలవస్తువే యున్న ధార్మికుఁడవై ♦ యొప్పునీకు
నశుభ మెన్నటి కెట్టు♦లైనఁ గల్గదు నీవు ధర్మిష్ఠుఁడవయియుఁ ♦ దత్ఫలసుఖ
మును బొంద కీదుఃఖ♦మును బొందినాఁడవు గనుక నాధర్మ మె♦క్కరణి మదిని
దలఁచిన లేదని ♦ తగ నిశ్చయించితి; నింద్రియంబులకు న♦దెట్టులైనఁ
గనరానిదాటఁ జ♦క్కని ధర్మ మది పౌరుషమునాశ్రయించి ఫ♦లమునొసంగు
నది చేయనందున ♦ నాధర్మఫలరూప మగుసుఖమెటులబ్బు ♦ ననెన వేమొ?
యటులైన నిరపేక్ష♦మై ధర్మమే కార్యమును జేయఁజాలని ♦ దనఁగఁ దగును
గనుక నయ్యది యొట్టి♦పనినైన సాధింపఁ బౌరుష మూఁతగాఁ ♦ బట్టుకొనఁగ
వలసిన దగునట్టి ♦ భంగిని నియతిమాలినదాట నట్టిదా♦నినె ప్రధాన
మనుచు సేవింపరా ♦ దని నాదునిశ్చయంబగుఁ; గార్యసాధన♦మందుఁ బౌరు
షమునకు ధర్మము ♦ సత్త్వహీనంబగునట్టిదె యైనచో ♦ ననఘ! దాని
మాని యుత్తఱిని ధ♦ర్మమునందు వర్తించునట్టులు పౌరుష♦మందు నడువు;

తే. మరినిషూదన! సత్యవా♦క్యమునె ధర్మ
మందురు గదా మహారాజ్య♦మందు నిన్నుఁ
బట్టభద్రుని జేసెదఁ ♦ బరమముదము
న ననిచేయకపోయె జ♦నకుఁడు గాన. ౨౭ 3681

క. అనృతము పల్కినవాఁడగు, ననుపమకల్యాణగుణుని ♦ నగ్రతనూజున్
నిను వనమునకుం బంపుట, మనమునఁ గృపలేనివాఁడె ♦ మనతండ్రియగున్.

క. కనుకన్ జనకుని గట్టం, జనుఁగద; పితృవాక్య మేను ♦ జరపెద ననిచె

* యది సత్యాస్య త్వితాం ముఖ్య-అనునీశ్లోకత్రయసమగ్రార్థ మిట విదితము.

ప్పిన నీవు మొదటివాక్యం,బును బాలింపంగ రాజ్య♦మును గొని దానన్. ౨౮

క. జనకునిసత్యమ్మును ద,ప్పనివానిగ నేల కట్టు ♦ పఱుపవయితివో
వెనుకన్ జెప్పిన జనకుని, వనయాత్రావిషయమైన ♦ వాక్యము మిగులన్. ౨౮

తే. సార్థకము చేసితివి గాన ♦ నరయ నీవు
సత్యమును గొంతపాలించి ♦ సరగఁ గొంత
చక్కఁ బాలింపవైతివి; ♦ శత్రుభయద!
వినుము ధర్మ మధర్మముం♦డినవె యైన. ౨౮

*సీ. ఆచరింపందగు ♦ నది ధర్మమేయనిగాని యధర్మమే ♦ కడఁగి యాచ
రింపఁగఁ దగునను ♦ రీతిని గాని నియమము లేదప్పటి ♦ ననువగునటు
లీరెంటిలో దేని ♦ నేనాచరింపనౌనది యెట్టులన ధర్మ ♦ మాశ్రయింపఁ
దగనేని వజ్రముఁ ♦ దాల్చు శతక్రతు వింద్రుఁడు మునియయి ♦ యెసఁగువిశ్వ
తే. రూపునిం జంపి యధ్వర ♦ మాపగిదిని, జేయఁగాఁ దగ దమ్మని♦శ్రేష్ఠుఁ జంప
కయ సవంబును జేయును♦గదయధర్మ,మేయనుష్ఠింపఁ దగునది♦యేని యెప్పుడు.

క. మునిఁ జంప యధర్మముచే,యను దగ దమ్మునినె చంప♦నౌ క్షత్రియధ
ర్మనియతి నెఱిఁగిన నింద్రుం,డనఘా! యారెంటిఁ జేసె ♦ నటు గావున నే. ౨౯

క. నరపతిసమయము మదిలో, నరయుచుఁ దగినట్లు రెంటి♦ననువుగఁ జేయన్
వరమగు ధర్మాధర్మము,లరహిన్ నియమమ్ముగా ని♦లాపతి యొకటన్. ౨౯।

క. అనువర్తింపక యొకదా,నినె వేర్వేఱుగను దోఁచు ♦ నియతి ననుష్ఠిం
చినచో నవికర్తను జెఱ,చును గావున నియతిమాని ♦ క్షోణీశ్వరుఁడున్. ౨౯౪

ఆ. కాలమునకుఁ దగిన ♦ కరణిఁ గార్యమ్ముల
ధర్మమునకు మఱి య♦ధర్మమునకుఁ
దగినయట్లు చేయఁ♦దగు; నిన్నుఁ గాంచిన
నక్కటా యటంచు ♦ నాత్మఁ గలఁగు. ౩౦

క. అనుకూలమైన రీతిని, గని ధర్మాధర్మములఁ ద♦గంజేయుట చ
క్కని ధర్మమనుచు నామత, మనఘా! ధర్మము ప్రధాన ♦ మదిగాకున్నన్. ౩౦।

తే. అప్రధానముగా నైన ♦ నద్దినీకుఁ,గలుగ దాధర్మమూలము ♦ వెలయునర్థ
మట్టి రాజ్యముచేఁ జిక్కు ♦నపుడు మాని,వచ్చుటను బోవ నడచితి♦విచ్చమీఱ.

సీ. మూలము ఛేదింప ♦ నేలీల ధర్మము గలుగుఁ;గొండలనుండి ♦ గలుగునదులు
ప్రజలనుండి గ్రహించు ♦ పన్నులోనగువానివలననే వృద్ధిని ♦ వరుసఁగనిన
యర్థమువలన మూ♦లాంతము గాకుండ యజ్ఞముఖక్రియా ♦ లలరుచుండు;
నర్థహీనుండయి ♦ యల్పతేజుండయి పురుషుఁ డేకార్యముల్ ♦ పూనిచేసి

* యది ధర్మో భవే ద్భూతో అధర్మో వా పరంతప, తన్మహత్వా మునిం వజ్రీ కుర్యా దిజ్యాం శతక్రతుః-అనియూ. దీనియర్థమెల్ల నిట విస్తృతమని యెఱుంగునది.

తే. నన్ను నవన్నియు గ్రీష్మంబు ♦ ననుఁగునదుల
కరణి క్షీణించుచున్నవి; ♦ ధరణి నర్థ
లోపమున ధర్మమరయంగ ♦ లోప మగుట
గాక దోషంబు నయితము ♦ గలుగు రామ!. ౩౩ 3693

చ. ధనమును నాశ మొందునటు ♦ తానొనరించినవాఁడు పూర్వ మా
ధనము గలప్పు డన్వహము ♦ తద్దయు హాయిగ వృద్ధినొంది యా
ధనము నశింపఁగా వెతలఁ ♦ దాళఁగఁజాలకయే సుఖంబు నా
త్మను దగఁ గోరి దానికయి ♦ ద్రవ్యముఁ బాపపథంబు చొప్పునన్. ౩౪

తే. తా సమార్జింపఁ గోరును ♦ దాన దోష
ములును గల్గును; నెవరికి ♦ నలరు ద్రవ్య
మతనికే మిత్రులందఱు; ♦ నర్థయుతున
కందఱును బాంధవులు సుమీ! ♦ యవని రామ!. ౩౫ 3695

క. ధనమున్నవాఁడె పూరుషుఁ, డనఁబడు ధనమున్నయాతఁ ♦ డగుఁ బండితుఁడున్
ధనయుతుఁడె విక్రమాఢ్యుఁడు, ధనవంతుఁడె బుద్ధిశాలి ♦ ధాత్రీనాథా!.

క. ధనయుతుఁ డదృష్టముం గల, మనుజుఁడు శీలాదికముల ♦ సుహితుఁడునగుఁ జూ!
ధనమును వదలిన మిత్రా,దినిఖిలముం గానరాదు ♦ తెల్లము రామా!. ౩౬

తే. అంతయే గాక దోషంబు ♦ లబ్బుననుచు
విప్పి చెప్పితిఁగాదె? యో ♦ వీర! రాజ్య
మును విడిచితివి గద? దాన ♦ ఘనగుణనుది
యున్న దని మాన బుద్ధి నీ ♦ కొదవె నొక్కొ?. ౩౭ 3698

సీ. ధనమున్నవానికే ♦ తగినర్థకామప్రయోజనములు మఱి ♦ యు నితరంబు
లైన వన్నియుఁ జక్క ♦ నై లభియించును ధనహీనుఁడే శ్రేయ ♦ మునుమనమునఁ
బొందఁగోరిన ధనం ♦ బును బొందనెంతయత్నము చేసినను బొందఁ ♦ దరముగాదు
కామహర్షమ్ములు ♦ గర్వమ్ము ధర్మకోప,శమ,దమంబులు ♦ పరఁగు నివ్వి

తే. ద్రవ్య ముండిన; వినవయ్య ♦ ధనముగల్గ
వానిఁ బాటింప కాత్మఁ గే ♦ వలము ధర్మ
మునె సమాశ్రయముగ నమ్ము ♦ మనుజున కిహ
సుఖము సుంతయు గల్గదు ♦ సుమ్ము రామ!. ౩౯ 3699

క. విను మైహికసుఖతతి నా,ధనమును ద్రవ్యంబు వారి ♦ ధరము లొగిని గ్ర
మ్మిన యపుడు సూర్యముఖ్యులు, కనఁబడనటు నీకు నవ్వి ♦ గానఁబడవు సూ!.

చ. జనకునిపల్కు మీఱఁగను ♦ జాల కయోధ్యను వీడి కాననం
బున వసియించి తీవిధిని ♦ బూనిక ధర్మము నాశ్రయించియే

ధనమున కాశ్రయంబయిన ♦ ధారణిరాజ్యము మానుకొంటఁ బ్రా
ణనికరముఖ్యయౌ సతిని ♦ నాఁడు హరించెను రావణుం డటఁ. ౪౦ 3701

ఆ. ఐన దానికేమి ♦ గాని యిఁకం జేయఁ,దగిన దేది యనెదొ ♦ త్వత్కృతమున
నింద్రజిత్తుచేత ♦ నిపుడు ప్రాప్తించిన, యీమహావిపత్తు ♦ నిపుడు నేను. ౪౧

క. ప్రతికృతిచేఁ బోఁగొట్టెద, క్షితినాథా! లెమ్ము; పురుష ♦ సింహామ! సుదృఢ
వ్రత! దీర్ఘహస్త! లెమ్మా!, మతిమంతుని నిన్ను ధరణి ♦ మహనీయునిగన్.

తే. తెలియకున్నాఁడ వేమి? యీ ♦ తీవ్రదుఃఖ
మునకు హేతువే లేదు నీ ♦ కును బ్రియంబు
చేయుటకె పుట్టి నీచెంతఁ ♦ జేరియున్న
నేను సీతావధంబు వి ♦ ని మనమందు. ౪౩ 3704

తే. కోప మడరంగ నీయదె ♦ ఘోటకమద
హస్తిరథములతో దను ♦ జాధివిభుని
తోడ లంకను బాణాళిఁ ♦ జూడు గూల్చు
వాఁడ; సీతావధోదగ్ర ♦ వార్త వినుట. ౪౪ 3705

క. మనమునఁ దోఁచిన క్రోధం,బున ధర్మాధర్మములను ♦ బోఁద్రోసితి జ
క్కని విలఁ గాదని నీకిదె, యనఘా! ప్రియమాచరింప ♦ నని గూల్తుఁ బురిన్.

ఎనుబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౮౪ - వ సర్గము.

విభీషణుఁడు రాము నూరార్చి యింద్రజిత్తుపైకి లక్ష్మణుని బంపఁ బ్రార్థించుట

చ. అనుచు సుమిత్రకూర్మిసుతుఁ ♦ డస్నపయిం గడు ప్రీతిగల్గుటన్
బనివడి నూఱడించుచును ♦ బల్మియు ధైర్యము చెప్పుచుండఁగాఁ
గనుఁగొని యవ్విభీషణుఁడు ♦ కార్యములం జరపంగ సేనలన్
వినియతి నేర్పఱించి కడు ♦ వీరులు నల్లనికాటుకట్లు పొ
ల్చినతనువుల్ వెలుంగ బహు ♦ చిత్రమహాయుధధారులై తమిన్. ౧ 3707

క. తనుఁ గొల్చుచున్నమంత్రులు, దనుజులు నలువ్వరొగి రాఁగ ♦ దంతినివహాయు
క్తిని బొల్చి యూథపతియయి, తనరుమహాహస్తివరువి ♦ ధంబున వచ్చెన్. ౨

క. తనమనము దుఃఖపూరం,బున ముగ్గు మహాత్ముఁడయ్యు ♦ భూపతిరాముం
డును బాష్పాకులనయనులు, గను వనచరులుంట నచటఁ ♦ గాంచె నతండున్. ౩

తే. మఱియు నిక్ష్వాకువంశ్యులౌ ♦ క్ష్మావిభులకు
సంతసముఁ గూర్చు సన్మతి ♦ మంతు రాముఁ
డార్తి మోహము నొంది యా ♦ యనుజునంక
మునయి శయనించియుండ ని ♦ మ్ములఁ గనుఁగొనె. ౪ 3710

క. దనుజేజ్యుఁ డంత శోకంబునఁ బొక్కుచు సిగ్గునొంది ♦ భూపతియుంటన్
గని మదిలోనే దుఃఖంబును గనుచున్ దీనుఁడగుచుఁ ♦ బోలినరీతిన్. ౬౪

తే. ఏమి యిది యంఁద అచ్చోట ♦ నిట్లు వగచు
చున్నవారని ప్రశ్నింప ♦ నన్నచెంత
నున్న లక్ష్మణుఁ డాదను♦జోత్తము మొగ
మును గనుంగొని సుగ్రీవు♦నిని గపులను. ౭౪ 3712

క. కనుఁగొని యశ్రుజలంబులు, కనులం గప్పంగఁ బలికెఁ ♦ గార్యము నల్పా
ర్థనియతిమీఱఁగ; సౌమ్యా, జనకజ నయ్యింద్రజిత్తు ♦ చంపె నటంచున్.

క. హనుమంతుఁడు వచియింపన్, విని రాముం డిపుడు దుఃఖ♦వృతచిత్తుండై
గనియెన్ మోహంబు; నటం, చని యింకను నేమొ పల్క ♦ నాయత్తపడన్.

చ. కనుఁగొని యవ్విభీషణుఁడు ♦ కార్యము మున్నె యెఱింగియుంట నా
తనిపలు కడ్డగించి యను; ♦ ధాత్రివరా! నిజమంచు నెంచి యీ
హనుమ వచించినట్టి పలు ♦ కారయ యుక్తము గాదటంచు నా
మనమునఁ దోఁచుచున్నయది ♦ మానినిఁ జంపుట కంధి నెండఁజే
సినయటులౌ, నశక్య మది ♦ సీతను జంపిన వార్త యేమనన్. ౮౪ 3715

క. గురుబాహూ! దుర్మతియగు, సురరిపునాశయము నాకుఁ ♦ జూపట్టెడు న
త్తరుణీమణిఁ గూఱిచి కర్బురపతి వధియించుపనికిఁ ♦ బూనఁడుసుమ్మీ!. ౯౪

ఉ. ఆతనిమేలుఁ గోరి జన♦కాత్మజ రాముని కిమ్మటంచు నే
నాతఱి నెంత వేఁడిన దు♦రాత్ముఁడు నాపలు కాలకింపఁడో
భూతలనాథ! యట్టిఁ డిది ♦ పూనునె? చేయఁగ నమ్మతించునే?
యేతఱినైన సామమున ♦ నే యఱి దానముచేత నేనియున్. ౧౦౪ 3717

తే. భేదమునఁగాని చూడ నా♦బిడఁ గరంబు
గాదు దండంబుచేత నిం♦క వశ మెట్లు?
లగును?; మఱి కృత్రిమోపాయ ♦ మదియు నెట్టి
దైన శక్యముగాదు భూ♦జానితిలక!. ౧౧౪ 3718

చ. విను మిఁక నింద్రజిత్తు తగు♦వీరులు వానరసేన నిల్పలం
కను గనరాని హోమమును ♦ గమ్మఱ విఘ్నము లేకయుండఁ జే
సిన జయ మబ్బు లేని యెడఁ ♦ జేకురు వంశవినాశనంబుగా
వున నున వానరాళిఁ బని♦పూనియె మోసము పుచ్చి చయ్యనన్. ౧౨

తే. అట నికుంభిలయను భూమి ♦ కరిగి యందు
నలరు దేవాలయమున హో♦మాదికృత్య
ముల నొనర్పంగఁ బూనె; నీ♦మ్ముల నికుంభి
లాఖ్యభూమిని హోమంబు ♦ నమలవిధిని. ౧౨౪ 3720

క. ఒనరించి మరలి యరుదెం,చున యే నమరులును బూన్కి ♦ సురపతితో వ
చ్చినవాని మారుకొనఁగా, ననిఁ జాలరు; దానవేంద్రు ♦ నాత్మజుఁ డాత్మన్

తే. తాను హోమముచేయు న♦త్తఱిని గవులు
విక్రమము చూప హోమము ♦ విఘ్నమగును
గాన నటుగాకయుండు మా♦ర్గముఁ దలంచి
వారి వంచింప నిమ్మాయఁ ♦ బన్నె నిజము. ౧౮౹ 3722

సీ. అది పూర్తి నొందించు ♦ నంతకు ముందుగ నచటికి సేనాస♦మన్వితముగఁ
జనుదము; పూరుష♦శార్దూల! యిది మిథ్య దీననే గల్గిన♦ది పరితాప
మిది దీనిమానుము ♦ నృప! నీవు శోకంబునను స్రుక్కియుండఁటఁ♦గనిబలములు
సంతాపభరమున ♦ నెంతో కృశించెడు ధైర్యంబు పొదల స్వ♦స్థమతి వగుచు

తే. నిందె నీవుండు; మాతోడ ♦ నిబ్బలముల
వాహినీపాలకులఁ గూర్చి ♦ బనరమునకుఁ
బంపుమా లక్ష్మణుని; నర♦వర్యుఁ డితఁడు
శితశరమ్ముల నాయింద్ర♦జిత్తు ననిని. ౧౯౹ 3723

క. మానుకొనునట్టు లొనరిచి, యానిర్జరనాథవైరి ♦ ననికిం దెచ్చుం
గాన నతఁ డంత వధ్యుం,డౌ నజువరమునకు రాము! ♦ యరిజనభీమా!. ౧౭

ఆ. మిగులవాఁడులగుచు ♦ మేలగు పక్షియీాఁ,కలను గట్టియుంటఁ ♦ గడుజవంబు
గలిగియున్న యితని ♦ కాండముల్ క్రూరత, గ్రద్దలాదియైన ♦ ఖగము లట్లు.

క. దనుజేంద్రతనయశోణిత, మును ద్రావంగలవు; దీర్ఘ♦భుజ! మును నముచిన్
దనుజేశ్యుఁ జంప వజ్రం,బును వజ్రిధరించినట్టి ♦ పోలిక నిపుడున్. ౧౯౹

తే. ఇంద్రజిత్తును జంపంగ ♦ నీశుభతమ
లక్షణుండయి తనరారు ♦ లక్ష్మణునిని
బంపు; మనుజేంద్ర! పగవానిఁ ♦ జంపువిషయ
మందు నాలస్య మొనరింప ♦ ననువుగాదు. ౨౦౹ 3727

క. కనుకన్ వేగిరపడఁదగు, ననఘా! నీవామహేంద్రు ♦ నట్లుగ నీవై
రిని సురరిపుఁ జంపంగా, ననుజున కాజ్ఞ నిడు కూడ ♦ దాలస్య మిఁకన్. ౨౧

చ. దనుజవరుండు హోమము ని♦తాంతవిధిన్ బొనరించి పూర్తిఁజే
సినయెడఁ దా నదృశ్యుఁడగుఁ ♦ జిత్రముగా సురదానవాళికిన్;
విను మలహోమకృత్యమును ♦ వే పరిపూర్తి నొనర్చి యాతఁడే
యనికినివచ్చినన్ దివిజు ♦ లైనను బ్రాణములందు సంశయం
బును గనువారు కావుననె ♦ పూనఁదగుం ద్వర నోరఘూద్వహా!. ౨౨

ఎనుబదినాల్గవ సర్గము సంపూర్ణము.

## ౮౫ - వ సర్గము.

—రాముఁడు లక్ష్మణుని హనుమదాదులతోఁ గూడ నికుంభిలకుం బంపుట.—

క. అనవుడు విభీషణోక్తిని, విని రాముఁడు శోకభార♦వివశుం డగుటన్
మనసునఁ జక్క గ్రహింపం, గను జాలం డయ్యె దానఁ ♦ గలయర్థంబున్. ౧

క. అరిపురనిషూదనుఁడు రఘు, వరుఁ డంతం గొంతసడికి ♦ స్వాంతస్థిరతన్
గర మొంది కపులచెంగటఁ, బరఁగుచు దాపునఁ జెలంగు♦వాని సుశీలున్. ౨

చ. కని పచియించె; నోదనుజ♦కాంత! విభీషణ! యిప్డు నీవు చె
ప్పినపలు కెద్దియో మరలఁ ♦ బ్రేమను బల్కుము దానిఁ జక్కఁగా
వినవలతున్ మనంబునకు ♦ విస్తృతిమీఱఁగ నెక్కునట్లుగా
నన విని వాక్యనైపుణము ♦ నందిన యాదనుజేశుఁ డిమ్ముఁడున్. ౩ 3732

క. పలికినమాటనె మరలం, బలుకంగాఁ బూని దీర్ఘ♦బాహూ! వీరా!
బలముల నెల్లేర్పఱుపన్, నలయునటం జీవు నాకుఁ ♦ బలికినరీతిన్ ౪ 3733

క. త్వరపడి యారీతినె భూవర! నిల్పితి; గుల్మములను ♦ వగుసగ విభజిం
చి రహిన్ నిల్పితి నెల్లెడ;, హరియూథాధీశ్వరులను ♦ న్యాయమురీతిన్. ౫

క. ఆయావిభాగములయం, దేయేవారలను నిల్ప ♦ హితమో యట్లే
నాయావారల నిల్పితి;, నోయతులయశా! యభీష్ట ♦ మొకఁడు గల దికన్. ౬

ఆ. దాని విన్నవింతు ♦ నేనిప్డు వినుఁడు మీ, రూరకయె మహార్తి ♦ నొందుచుండ
మాహృదయము లెల్ల ♦ నుండుచునున్నవి, తాపదహనుచేత ♦ దగ్ధములయి. ౭

క. మీతాపమునకుఁ గారణ, మోశపనకులావతంస! ♦ యూహింపంగా
హేతువిహీనము గావున, నీతీరున వగలఁ గుంద ♦ కిపు డుండఁదగున్. ౮

క. పరితాపం బిది వైరుల, కురుమోదప్రదము గాన ♦ నోవీరా! స
త్వరముగ వదలుము మోహ, స్ఫురణము గైకొనుచు ననికిఁ ♦ బూనిజతనమున్.

క. ఒనరింపుము; శ్రీరఘునందన! సీతం బొందఁ దగును ♦ దానవులవధిం
పను వలయు ననుచు నీకున్, మనమున వాంఛ గలదేని ♦ మానుకథణితిన్.

క. విను మద్ది నీకు హితముగ, ననరాగును; లక్ష్మణుం డి♦తఁడు రావణిఁ జం
పను భూరిసైన్యములతోఁ, జనుఁగాక నికుంభిలకు వె♦సన్ యత్నమునన్.

చ. అని జయశీలుఁడై తగు మ♦హత్తరకార్ముకుఁ డీసుమిత్రనం
దనుఁడును మండలాకృతిని ♦ దాల్చినచాపమునుండి కృష్ణస
ర్పనికరమట్టి తీక్ష్ణతర♦బాణములన్ దనుజేంద్రపుత్త్రు నో
య్యన వధియించుఁగాక; యమ♦రారి తనూజుఁడు వీరుఁ డొక్కటన్. ౧౧

ఆ. తపముచేసి బ్రహ్మ♦దయనొంది వరములఁ, బడసి వేల్చి దాన♦ బ్రహ్మశిరము
నాఁగ నస్త్రవరము ♦ నేగతిఁ బోఁదగు, నరదమును హయాళి♦నందె మిగుల.

క. అతఁ డిపుడు స్వీయబలసం,యుతుఁడగుచు నికుంభిలకు మ♦హోద్యమమున బూ
ని తగం జేరెఁ గదా; త,త్కృతిఁ జక్కఁగఁ దీర్చి దాన♦వేజ్యం డెలమిన్.

ఆ. ఆస్థలంబునుండి ♦ యసురుఁ డెంచు నేని నం,గరమునందు మనము ♦ కాలుపురికి
నరుగవలయుననుచు ♦ నాత్మఁదలంపుమా, యో మహాభుజా! ర♦ఘూత్తమ! విను.

సీ. సర్వలోకేశుఁడు ♦ శతధృతి వరమిచ్చె నయ్యింద్రజిత్తున కె♦ట్లనిన, నీవు
హోమము చేయంగ ♦ నుద్యుక్తుఁడవయి దానిని బూర్తిచేయక ♦ ఘననికుంభి
లాహ్వయంబైన వ♦టావనీజమునూ లమును జేరకయును ముం♦దినతఱి యరి
నినుఁ దలఁపడి నీవ♦తని జంపఁ బూనంగ హింసించునో వాఁడె ♦ యింద్రశత్రు

ఆ. వైన నిన్ను జంపుఁ♦గాని యింకెవ్వఁడు, నిను వధింపఁజాలఁ ♦ డనుచు నిచ్చె;
నిట్టు లతనిహోమ♦కృత్యమునకు విఘ్న, మాచరించువాఁడె ♦ యవనిజేశ!.

క. మతిమంతుఁడై చెలంగెడు, శతమఖరిపుని న్వధింపఁ ♦ జాలునతని గా
శతధృతి విధించెఁ గావున, క్షితిజేంద్ర! మహాబలాఢ్య! ♦ శీఘ్రము, మాలోన్.

క. దనుజుని నాతనిఁ జంపం, గను నానతి సేయఁదగు నో♦కని; కాతండే
యనిఁ దెగ సనుహ్యాజ్ఞుఁడౌ, నను జేంద్రుఁడు దెగియెననుచుఁ♦ దలఁపుము రామా!.

చ. అనెడు విభీషణోక్తి విని ♦ యారఘురాముఁడు పల్కె నిట్టులో
దనుజవరేణ్య! సత్యగుణ♦దర్పయుతా! కడు రౌద్రుఁడైన యా
దనుజునిమాయ నాపుదికిఁ ♦ దథ్యము తెల్లము; యబ్జయోనిదై
ఘనమగు నస్త్ర మాతనికిఁ ♦ గల్గుటెఱుంగుదు వాఁడు ప్రాజ్ఞుఁడౌ. ౧౭౪

*తే. మఱి మహామాయ నెఱుఁగును ♦ మహితబలుఁడు
వరుణునింగూడి నిర్జరుల్ ♦ వచ్చి యుద్ధ
మొనరుపన్ వారి మూర్ఛ ముం♦చును నిజంబు;
ఘనయశా! వాఁడు రథ మెక్కి ♦ కడఁగి నింగి. ౧౭౫ 3749

క. తిరుగుచునుండఁగ మేఘా, త్కరములు గ్రస్మంగ సూర్య♦గతివలెనే యా
సురవైరిగతి యశక్యము, వరుస న్దెలియంగ; ననుచుఁ ♦ బలికె యతండున్.

ఆ. దుష్టమతిగ నొప్పు ♦ కష్టదానవుమాయ, వలని బలము మదిని ♦ దెలిసికొనిన
రాముఁ డురుయశోవి♦రాజమానుండగు, ననుజుఁ గాంచియిట్టు♦లనియెఁదమిని.

చ. వనచరరాజినాయకుని ♦ వాహినినంతయుఁ దోడుకొంచు నీ
యనిలజుఁ డాదిగాఁగలుగు ♦ నట్టి బలేశుల, భల్లుకేంద్రుఁడై
తనరెడు జాంబవంతుఁ గొని ♦ తద్బలముల్ నిను వెంటనంటి రాఁ
జని పలుమాయలం దెలిసి ♦ శత్రుభయంకరుఁడైన దానవేం
ద్రుని సుతు నింద్రజిత్తు నటఁ ♦ దోడనె చంపు సుమిత్రనందనా!. ౧౭౮ 3752

---

* దేవా సవరుణా నపి-అనిమా,

తే. ఇల మహాత్ముఁడు దానవుఁ ♦ డే యగుటను
మాయ లెఱుఁగు విభీషణుం ♦ డీయనఘుఁడు
మఱియు నచ్చోటు దెలిసిన ♦ నెఱమగండు
సచివయుతుఁడయి వచ్చు నీ♦సరణి వెన్క. ౨౩½ 3753

చ. అని రఘురాముఁ డాడ విని ♦ యద్భుతవిక్రముఁడైన లక్ష్మణుం
డనఘుఁడు నావిభీషణుఁడు ♦ నర్హధనుస్సుల సంగ్రహించి రా;
జనపతి సోదరుం డపుడు ♦ సంగరయత్నముచేత ఖడ్గముం
గొని కవచంబుఁ దాల్చి శర♦కూటము గైకొని హేమచాపముం. ౨౪ 3754

చ. కరమునఁ బట్టి హార్షము త♦గం దనయన్నపదాంబుజంబులం
బరమశుభప్రదంబులను ♦ భక్తిని గొల్చి నమస్కరించి యీ
కరణి వచించె; మామకము ♦ గాఁదగు నీపెనువింటినుండి స
త్వరముగఁ బోవు బాణములు ♦ వైరిశరీరము నట్టె చీల్చుచుం. ౨౬ 3755

క. సరసున హంసలు వ్రాలెడు,కరణిం లంకాపురిం ద♦గం బడఁగల; వీ
తరుణమునయుండె మామక,వరచాపజ్యావిముక్త♦బాణము లోలిం. ౨౭

తే. అతిభయంకరరూపుఁడై ♦ నట్టి వైరి
తనువుఁ బగులించి చాలరం♦ధ్రములు పడఁగఁ
జేసి వాని మృతిం గనఁ♦జేయఁ గలవు;
కను మటంచు వచించి ల♦క్ష్మణుఁడు కడఁక. ౨౮ 3757

క. తనుకాంతి వెలయఁగా రా,ముని మ్రోలను నిట్లు పల్కి ♦ మూర్ఖుని నావై
రిని వానిబలములను జం,పను గోరుచుఁ బోయె నటకుఁ ♦ బటుజవ మలరం.

తే. *ఇట్టు లన్నపాదములకు ♦ నెలమి మ్రొక్కి
వలగొనుచు నింద్రజిత్తు త♦న్నెలమిఁ గావఁ
దగు నికుంభిలయను చైత్య♦తరువుచెంత
కరిగె; విక్రమసంపద ♦ నలరు నతఁడు. ౨౯½ 3759

క. తనయన్నయాశిషంబులఁ, గొనుచు విభీషణునితోడఁ ♦ గూడి చనియెఁ జ
య్యన రాజపుత్రుఁ; డంతట, హనుమంతుఁడు వానరులు స♦హస్రంబులుగం.

క. తనుఁ గొలువంగ విభీషణుఁ, డనుపమమతిమంతులైన ♦ యాత్మసచివులం
గొని లక్ష్మణువెంబడిగాఁ, జని; రాసౌమిత్రి కీశ♦సైన్యము మిగులం. ౩౧½

క. తనుఁగొలిచి వేగముగ రాఁ, జనుచుం మార్గమునఁ దనకు ♦ సాయముచేయం
గను నిలిచియున్న భల్లుక,ఘనబలములఁ గాంచె; మదిని♦గౌతుక మలరం. ౩౨½

తే. మిత్రహర్షదుఁడైన సౌ♦మిత్రి దూర
మరిగి పిదప దూరమున వ్యూ♦హము దగంగఁ

* నికుంభిలా మభియయౌ చైత్యం రావణిపాలితమ్ - అనియు.

గూర్చి నిలిచిన రాక్షస♦కూటములను
గనియె; శత్రువులకు లయ♦కాలుఁ డగుచు ౩౩ 3763

చ. నిరుపమవిక్రమం బలరు ♦ నిశ్చలచిత్తుఁడు లక్ష్మణుండు తాఁ
గరమున విల్లు దాల్చి యల ♦ కంజజుఁ డానతి యిచ్చినట్లు క
ర్బురుఁడు నికుంభిలాస్థలికిఁ ♦ బోవకయుండఁగ నిల్పి పూన్కి సం
గర మొనరింపఁ జచ్చు నను ♦ కారణముల్ మది నూని దానికిన్. ౩౪ 3764

సీ. తగినమాయను బన్ని ♦ దనుజేంద్రతనయుని నని జయింపఁగ సిద్ధుఁ♦డై విభీష
ణునిఁ గూడి వీరుఁడౌ ♦ వనచరపతిపుత్రు, నంగదు ననిలజుం♦డైన హనుమ
నాదృతిమైఁ గూడి ♦ యటనుండెఁ; బలువిధములుగఁ గానంబడి♦యులఘునిర్మ
లానేకశస్త్రకాం♦త్యభిరామమై ధ్వజగహనమై రథగణ♦కలిత మగుచు
తే. నతిభయంకరమై యింత ♦ యనఁగరాని
జవమునం బొల్చి చీఁకటి♦చందమునను
బొలుచు నాశత్రువీరసే♦నలను జొచ్చె
లక్ష్మణుండు మహాగుణ♦లలితమూర్తి ౩౫ 3765

ఎనుబదియైదవసర్గము సంపూర్ణము.

## ౮౬ - వ సర్గము

లక్ష్మణాదులు రాక్షసవీరులం జంప నింద్రజిత్తు హోమము పూర్తిచేయకయే యుద్ధమునకు వచ్చుట.

చ. విమలగుణాభిరాముఁడు వి♦భీషణుఁ డాసమయంబునందుఁ గా
ర్యమునకు సాధకంబుగ స♦రాతులకుం గడుఁ గీడుఁ గూర్చున
ట్లమరిన వాక్యముం బలుక ♦ నాత్మఁ దలంచి సుమిత్రపుత్రుతో
మమత వచించె; నల్లయదె ♦ క్ష్మావరపుత్రక! చూడు మొయ్యనన్. ౧ 3766

క. జలదశ్యామంబుగ నా, బల మదె కనఁబడెడుఁ గాదె? ♦ పటురాక్షసవీ
రులసైన్య మదియె త్వరపడి, యులయాగము పూర్తి నొంక♦నటు పెంపలరన్.

క. వనచరులు తరుశిలాదులఁ, గొని యాసేనలను గడిమిఁ ♦ గొట్టుచుఁ జంపం
గను జూతురుగాక; జవం,బున లక్ష్మణ! దీనిఁ జంపఁ ♦ బూనుము నీవున్. ౨

ఆ. ఇద్ది భిన్నమైన♦యెడల రాక్షసరాజ,తనయుఁ డింద్రజిత్తుఁ ♦ గనఁబడు నిట
నతనిఁ జంప వచ్చి♦నట్టి నీవును వాసి,హోమకృత్య మంత ♦ మొందకుండ. ౩

క. సురనాథువజ్రసన్నిభ,శరములఁ బఱఁగించి యుచటి♦సైన్యమ్మును స
త్వరముగ భేదింపు; మహా,పరాక్రమాఢ్యా! సురారి♦పట్టిని నితనిన్. ౪ 3770

తే. కపటశీలు నధార్మికుఁ ♦ గడు దురాత్ముఁ
గ్రూరకర్ముని జగముల♦కున్ భయంబు

* అస్యానీకస్య మహతో భేదనే యత లక్ష్మణ - అనిమా.

గల్గఁ జేసెడువాని ని♦క్కముగ ధార్మి
కునివిధంబునఁ దగు పీనిఁ ♦ దునుమువయ్య!. ౫ 3771

క. తనమేలుఁగోరి పలుకువ,చనమునఁగల సారమెఱుఁగఁ ♦ జాలిన చిహ్నం
బున వెలయు లక్ష్మణుం డా,తనిమాటను విని దశాస్య♦తనయునిపైనన్. ౬

క. శరవృష్టిఁ బఱగఁ జేసెను, దరుగిరివరనఖముఖాయు♦ధముల వెలయువా
నరభల్లూకములు గూడియె, పరులను జంపంగఁ బూని ♦ పరుగిడియె వడిన్. ౭

క. వనచరబలములఁ జంపం,గను శక్తులఁ దోమరములఁ ♦ గత్తుల శితబా
ణనికరములఁ గైకొని యా,దనుజులునున్ నిల్చిరి; ప్రవి♦దారణమునకై. ౮

క. వనచరదానవులకుఁ గ,ల్గిన తుములాహవముచేఁ గ♦లిగిన పెనురవం
బున లంక యెల్లఁ బ్రతిరవ,మును జేసెను; నట్టిసమయ♦మునఁ బెంపలరన్. ౯

ఆ. వైవఁబడిన వివిధ♦భయదశస్త్రంబుల
వాఁడినాయకములఁ ♦ బాదపముల
వైవ నెత్తియున్న ♦ భయకృన్మహాచల
శిఖరములను నిండి ♦ చెలఁగె నింగి. ౧౦ 3776

క. వికృతాననబాహువులగు, సకలాసురు లాప్లవంగ♦సమితి యవయవ
ప్రకరములయందు నాయుధ,నికరములను నింపి భీతి ♦ నెగడించి రటన్. ౧౧

క. వనచరులును వివిధమహీ,జనికరగిరిశృంగములను ♦ సత్వంబునఁ గై
కొని యని దనుజోత్తమబల,మును గొట్టి వధించిరి జవ♦మునఁ గ్రోధమునన్.

క. ఘనతనుబలములఁ బొల్చెడు,వనచరభల్లూకవీర♦వారము గడిమిన్
దనుజులఁ బలుభంగులఁ జం,పను బూని చరించుచుండ♦భయము మిగులఁగన్.

క. కలిగెన్ దానవవీరుల,బలముల; కంతట మహేంద్ర♦వైరి సమరసీ
మల దుర్ధర్షుఁడు తనవగు,బలములు శత్రువులచేత ♦ బాధితములునై. ౧౪

తే. చాలదీనత నొందుట ♦ నాలకించి
హోమకృత్యము పూర్తిగా♦కుండ నియతి
మాని లేచెను; గ్రోధంబు ♦ నూని యాతఁ
డంతఁ జీఁకట్లు క్రమ్మిన ♦ యట్టిచోట. ౧౫ 3781

క. తరువులయంతరమునఁ దా, నురుతరహోమంబు చేయు♦చుండుటచే నా
ధరణీస్థలినుండి మహా,సురబలములఁగూడి శస్త్ర♦శోభితుఁడగుచున్. ౧౬ 3782

క. మునుపే ఘోటకములు పూ,న్చిన యరదం బెక్కి; సింద్ర♦శత్రు భయదమౌ
ధనువును దాలిచి నల్లని,ఘనమట్లు శరీర మొప్పఁ♦గాఁ గ్రుద్ధమెఱియున్. ౧౭

క. అరుణాననయనుండై, తరుణంబున లోకములను ♦ దత్పరమతియై
పరమవినాశనమును జే,యు రతిన్ గల మృత్యువట్టు ♦ లొప్పె నతండున్.

చ. అరదము నాతఁ డెక్కుటయు ♦ నప్పుడు కాంచి యనంతవేగులై
పరమపరాక్రమంబులను ♦ భాసిలి లక్ష్మణుతోడ నెప్డు సం

గర మొనరింతుమా? యనెడు ♦ కాంక్షలనున్న మహాసురాళి భీ
కరగతిఁ జుట్టునన్ నిలిచె; ♦ గాలిసుతుండు మహాద్రియో యనన్. ౧౭ 3785

చ. తను నమరంగ శత్రుతతి ♦ దర్పమడంచు పరాక్రమంబునన్
దనరుచుఁ జూడరానిదయి ♦ తద్దయు భీకరమైన వృక్షమొ
య్యనఁ బయికెత్తి దాన నసు♦రావళిఁ గొట్టుచు *నంతకాలమం
దునఁ దగునగ్నిరీతిగను ♦ దోరపుశక్తిని గాల్చె యంతటన్. ౧౮ 3786

క. పలువిధములైన భూరుహ,ముల నాసైన్యమును మిగుల ♦ మూర్ఛను బొందం
గలిగించేయఁగ; నంతట,బలశాలి సమీరసూతి ♦ పటువేగమునన్. ౧౯ 3787

తే. అసురసేనలఁ జెండాడ ♦ నాబలములు
గాంచి వేలకొలంది వి♦క్రమము మీఱ
నాతనిం జుట్టుముట్టి; రి ♦ ట్లసురభటులు
పవనజున్ జుట్టుముట్టి గ♦ర్వమునఁ బొలిచి. ౨౦ 3788

సీ. శూలాయుధుల్ తమ♦శూలంబులను ఖడ్గధరులు ఖడ్గంబుల ♦ నిరుపమాన
శక్తిహస్తులు తమ♦శక్తులఁ బట్టసధరులు పట్టసములఁ ♦ బరిఘ గదలఁ
గరమునఁ దాల్చిన ♦ క్రవ్యాదు లవ్వానిచేతను జక్రముల్ ♦ చేతఁ బూను
వార లాశితచక్ర♦వారంబుచేత వందలసంఖ్యగాఁగ శ♦తఘ్నుల మఱి

తే. యినుపగుదియల భీతికృ♦త్తనువులఁ దగు
నట్టి గండగొడ్డంత్రను ♦ నట్లె భిండి
వాలముల వజ్రముష్టుల ♦ నోలి నశని
సమతలంబులఁ గొట్టిరి ♦ శక్తికొలఁది. ౨౧ 3789

క. అనిలజుఁ డతిశయకోపం,బున వారలతోడ శౌర్య♦మున సంగరముం
బొనరిచె గొప్పగ; నంతట, దనుజేంద్రసుతుండు చూచె ♦ ధరనిభతనునిన్.

చ. వనచరవర్యునిన్ సమద♦వైరినిషూదను నాంజనేయునిన్
దనుజులరూపుమాపుచు ని♦తాంతము పొల్చుచునుండ; నంతఁ జ
క్కనిదగుపూన్కి సారథిని ♦ గాంచి మహేంద్రరిపుండు పల్కె నీ
తని బొలియింపకున్న మన♦దానవులం బొలియించు నీతఁడున్. ౨౩ 3791

చ. కనుక రథంబు వే నడుపు ♦ గర్వమునం దగు వీనిమీఁది; కం
చన పిని యాతఁ డారథము ♦ నప్పవనాత్మజుపైకిఁ దోలి యే
యనిని జయింపరాని యమ♦రాధిపువైరిని నందుఁ జేర్చె; న
య్యనిలజు చెంతఁ జేరి యసు♦రాధిపుఁ డెంతయు దుష్ప్రధర్షుఁడై. ౨౪ 3792

తే. బాణ,ఖడ్గ,పరశ్వధ, ♦ పట్టసముల
నతనిశిరమున వర్షించె; ♦ నాభయంక

---

* కాలాగ్ని రివ నిర్దహన్-అనిమూ.

రాయుధంబుల కోర్చి యా♦హనుమ మిగుల
మనమునఁ గోప మొప్పంగ ♦ ననియె నిట్లు. ౨౯ 3793

క. ఓరావణీ! కుబుద్ధీ!, శూరుఁడవే యైన బలము ♦ చూపు బవరమం
దేరీతి వాయుతనయునిఁ, జేరి పిదపఁ బ్రాణములను ♦ జెంది యనలికిన్. ౩౦

తే. బ్రదికి పోఁజాలవీవు; దు♦ర్మతి! యిఁక నిట
శరములన్ మాని చేతుల♦ను రణ మొనరు
పం దగున్ ద్వంద్వయుద్ధంబుఁ ♦ బంతమూని
చేయుదువయేని యప్పుడు ♦ నాయురవడి. ౩౦½ 3795

క. ఇంచుక సైపుము దానవ,సంచయమున మేటి వనఁగఁ ♦ జాలుదు వనుచుం
జంచలమతిగాకుండె; న,మంచితమతి యావిభీష♦ణాసురమణియున్. ౩౧

చ. హనుమను జంపువేడుక శ♦రాసనమెత్తి సురేంద్రవైరి యుం
టను దెలియంగఁ బల్కుచుఁ గ♦ఠంగి సుమిత్రతనూజుతోడ ని
ట్లని మఱియున్ వచించె; దను♦జాధిపుముద్దుకుమారుఁడై సురేం
ద్రుని సమరంబునన్ గెలిచి ♦ తోరపుఁగీర్తిని గాంచి యల్లదే. ౩౨½ 3797

క. అరదం బెక్కి భవద్రిపు, పురుముదమున హనుమఁ జంప ♦ నూహించెడు సం
గరమున సౌమిత్రీ! యరి,వరముద్ఘాటనములు ♦ భయదంబులునన్. ౩౩

క. పలుసన్నివేశములు ను,జ్జ్వలములునై తగినఘోర♦నాయకముల ని
మ్ముల వైచి యింద్రజిత్తును, బొలియింపు మటంచుఁబలికెఁ♦బూనికమెఱయన్.

తే. అరి విభీషణుఁ డీరీతి ♦ ననిన నప్పు
డోత్తుఁడౌ లక్ష్మణుండు మ♦హాద్రికరణి
నలరునాకృతిచేత భ♦యంకరబల
మునను హరినాదమును జేయు♦చును జెలంగి. ౩౪½ 3800

క. అనికిన్ సన్నద్ధుండై, యనుపమరథ మెక్కి హనుమ ♦ యంతికమును జే
రినవాని నింద్రజిత్తునిఁ, గనియెన్ మదిలోన రోష♦కలితుం డగుచున్. ౩౫

ఎనుబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౮౭ - వ సర్గము.

{ ఇంద్రజిద్వధోపాయంబుల లక్ష్మణునకుం దెలిపినవిభీషణుని రావణి నిందింప నందుల కాతఁడు త్తరమిచ్చుట. }

తే. అవ్విభీషణుఁ డిటులనె ♦ ననిని కేలునఁ
బలికి సంజాతహర్షుఁడై ♦ పటుశరాస
నముఁ గరంబున ధరియించి♦న రఘువరుని
యనుజుఁ డొడ్డాని సత్వర ♦ మరిగె నంత. ౧ 3802

క. దనుజవరుం డించుక యా,తనితోడం గూడి యరిగి ♦ దారుణరీతిం
గనఁబడు పెనువనమును జొ,చ్చి నచటఁ దద్ధోమభూమిఁ ♦ జేరిచి యతనిన్.

క. కనఁబఱచి దానిఁ దేజం,బున నొప్పు విభీషణుండు ♦ భూర్యసితఘనం
బన భయదంబుగ నచ్చటఁ, గనఁబడు న్యగ్రోధతరువుఁ ♦ గనఁబఱచి తగన్.

క. బలశాలియైన రావణి, బలసూదనవైరి యచట ♦ బలి భూతగణం
బుల కొసఁగి పిదప వచ్చును, గలహంబున; కంత నతఁడు♦కడు శక్తిమెయిన్.

క. భూతవ్రాతాదృశ్యుం,డై తనశత్రువులఁ జంపు ♦ నని మొన బాణ
వ్రాతమునఁ గట్టివైచును, జేతస్సునఁ దలఁచెనేని ♦ క్షితిపకుమారా!. ౫

చ. హరిహయవైరి యీవటము♦హోధరణీజముఁ జేరకుండ స
త్వరముగ దోర్బలాన్వితుని ♦ వానిని సారథిఘోటకాళితో
నరదముతోడఁ దీక్ష్ణవివి♦ధాంబకముల్ పఱగించి చంపుమా;
కరుణను వీడి యన్న రఘు♦కాంతుని తమ్ముఁ డనూనతేజుఁడున్. ౬ 3807

క. తనమిత్రుల కానందం,బును గూర్చుచువాఁడు నగుచుఁ ♦ బొలుచు సుమిత్రా
తనయుం డవ్వాక్యంబును, విని యట్లె యొనర్తు ననుచు ♦ విమతునిఁ జంపన్.

చ. ధనువును జిత్రరీతిఁ దగు♦దానిని దీటుచునుండె; నంత నా
ఘనబలశాలి రావణియుఁ ♦ గార్ముకముం గవచంబుఁ దాల్చి స్యం
దన మనలాభమై వెలసి ♦ దారుణకేతనయుక్తమై తగన్
గనఁబడె దానినెక్కి; రఘు♦కాంతునిసోదరుఁ డప్పు డుద్ధతిన్. ౮ 3809

మ. గురుతేజం బలరార సంగరమహా♦క్షోణిస్థలిన్ శాత్రవో
త్కరముల్ మార్కొనుచోఁ బరాజయము నె♦క్కాలంబునం గాంచకే
సరిగాఁ బొల్చు పులస్త్యవంశజనితున్ ♦ శక్రారినిం గాంచి సం
గరముం జేయఁగ నిన్నుఁ బిల్చెదను సం♦గ్రామంబు న్యాయ్యంబుగన్. ౯

తే. ఒసఁగుమా మాయఁ బన్నఁగ ♦ నుద్యమింప
వలదు; నా విని గురుతేజ ♦ మలర దృఢమ
నంబు గల యింద్రజిత్తు దా♦నవవరేణ్యు
నచట నున్న విభీషణు ♦ నపుడు గాంచి. ౧౦ 3811

క. పరుషోక్తుల నిట్లను; గ,ర్బుర! నీవిపురమునందె ♦ పుట్టి తగంగాఁ
బెరిగినవాఁడవు మఱియుం, బరికింపఁగ నాదుతండ్రి♦భ్రాతవు సుమ్మీ. ౧౧

క. పినతండ్రివయ్యు నీకుం, దనయుఁడనగు నన్నుఁ గూర్చి ♦ దారుణకార్యం
బును జేయు టెట్లు న్యాయము?, దనుజుఁడ వయ్యును సజాతి♦ధర్మము నెన్నన్.

తే. తలఁపకే పోయితివి దురా♦త్మా! స్వధర్మ
దూషణా! నీకు నరయ బం♦ధుత్వమయినఁ

* సాక్షాద్భ్రాతా పితు స్స్మృత-అనియూ.

గాని స్నేహాకులంబులు ♦ గాని తోడఁ
బుట్టుఁదనమైనఁ గాని చూ ♦ పట్ట దకట'. ౧౩ 3814

సీ. ధర్మమేనియు నియ ♦ తంబు కాదయ్యెను; దుర్మతీ! స్వజనబం ♦ ధువుల వదలి
పరులభృత్యుఁడవైతి ♦ బంధువులకు నీదుగతి యకటా! యని ♦ కరుణఁ గొలుపు
చున్నది సాధువు ♦ లన్న నీస్థితిఁ గన్న నిందింపకే పోరు; ♦ నీవు స్వజన
ముల యంతరంబున ♦ నిలుచుట యెక్కడ? నీచులౌ పరులను ♦ నీవె పోయి

తే. యాశ్రయించుట యెక్కడ? ♦ యంతరంబు
వీనిరెండింటి కెంతయో ♦ గానఁబడును
నీమనము క్షుద్రమౌటను ♦ నీకుఁ దెలియ
కున్నయది యింతకంతయు ♦ నెన్నిచూడ. ౧౪ 3815

క. నే నాశ్రయించియున్న మహీనాథులు పూజ్యులౌట ♦ నే నీచతయుం
గానఁబడ దందువో? పెఱమానవు లతిసుగుణయుక్త ♦ మనుజులే యైనన్. ౧౫

తే. స్వజనులున్ గుణహీనులై ♦ క్షమను గానఁ
బడిన నెట్లైనఁ దమవారె ♦ కడు శుభదులు
పరులు పరులౌదురేగాని ♦ స్వజను లెట్టు
లగుదు; రెవ్వఁడు తనవారి ♦ నవలఁ ద్రోలి. ౧౬ 3817

క. పరపక్షమునం జేగునో, పరులాత్మజనాళిఁ జంపఁ ♦ బరపసి తానే
పరపక్షనిహతుఁడగు; నిస్తరరిపురాజానుజా! ని ♦ శాచర' వినుమా!. ౧౭ 3818

ఆ. హోమకృత్య మిద్ది ♦ యామాడ్కిఁ జెడునట్లు, లిశని పుత్త్రకడకు ♦ నిట్లు చేర్చి
తివిగదా? తలంప ♦ నెవఁడైన స్వజనుఁ డీ, కరుణలేని పనిని ♦ గలఁడె చేయ.

తే. నీకు నొకనికె శక్యమౌ ♦ నీకఠినత;, యనెడు నాయన్నకొడుకు వా ♦ క్యముల విని వి
భీషణుఁడు పల్కె నీరీతి; ♦ వినుము తివి,హీన! దుష్టా' నిశాచర' ♦ యిట్లు నీవు.

క. తెలిసియు నాశీలంబును, దెలియనియటు తుచ్ఛవాక్ ♦ తినిఁ బల్కెదు? నేఁ
దలఁపోయ నీపితృవ్యుఁడఁ, గలహప్రియ! పెద్దనీకుఁ ♦ గావున నన్నున్. ౧౮

క. పరుషము లిటులాడం దగ;, పరయ న్నేఁ గ్రూరకర్ము ♦ లై పొల్చెదుక
ర్బురులకులంబునఁ బుట్టితి,ని రాక్షసులయట్లు గాక ♦ నే శీలంబున్. ౧౯ 3822

ఆ. కల్లువాఁడ నద్ది ♦ గాదు క్రూరము శీల, మనెడు నీమదీయ ♦ మగు గుణంబు
సుజనముఖ్యమగుచు ♦ శోభిల్లు; నాశీల, మెట్టిదో వచింతు ♦ నిపుడు నీకు. ౧౯

క. మనమునఁ గ్రూరంబగునె,స్పృహనైన నొనర్పఁ గాని ♦ పరహింసను జే
యను బూనుసయ్యధర్మము, నొనరింపనుగాని వేడ్క ♦ నొందను జుమ్మా. ౨౦

తే. నాదుశీలముఁ గానంగ ♦ మీఁదగు నడ,నడిక కస్యముగా నుంటి ♦ విడిచితి మిము
నిదియె దోషమటందువే ♦ యిట్టిదోష, మమను రావణునందు లే ♦ దందువేని.

క. తనశీలము వేఱగుటన్, ననుఁ దిట్టుచుఁ బొమ్మనియెను; ♦ నాభ్రాతను బా

సినదానికిఁ గలహేతువు, విను; *ధర్మవిరుద్ధశీల♦వృతమానసుఁడై. ౨౧ 3826
తే. పాపనిశ్చయుఁడైనట్టి ♦ పంచజనుని, సంగతినిఁ బాప మమరుట ♦ సజ్జనుండు
కరగతంబగు సర్పంబుఁ ♦ బరిహరించి,నట్లు వదలి సుఖంబుల ♦ నందవలయు.

క. వినుమిఁక హింసయుఁ బరధన, మనుదొంగిలుటయును బరుని ♦ ముగుదనుగవయున్
మనమునఁ గోరి యొనర్చుట,యును దుష్టాచారము లివి ♦ యుర్వీస్థలిలోన్.

క. పరికింప నివ్వి గలిగిన, పురుషుని మండెడుగృహంబుఁ ♦ బోవిడిచెడురీ
తి రయమున వదలఁ దగు నని, పురుషవరుల్ పల్కుదురిటు ♦ పూనికమెఱయన్.

క. పరధనము నపహరించుట, పరదారలఁ బొందుటయును ♦ భవ్యమతుల యం
దురుశంక గలిగి యుంటయుఁ, బరికింపఁగ నీత్రయంబు ♦ పాప మనఁబడున్.

ఆ. నాశమొందఁ జేయు ♦ నరుని నీదోషముల్
దోషములను సుజన♦దూరుఁ డగుచుఁ
ద్యాజ్యుఁడేని విద్య ♦ యన్వయముఖముల
గ్రాహ్యుఁ డేల యతఁడు ♦ కాఁడనియెదో?. ౨౬ 3831

సీ. మునిమహేంద్రుల ఘోర♦ముగ వధించుటయును, సర్వనిర్జరులతో ♦ సంగరంబు
గలిగించుకొనుటయు ♦ గర్వకోపంబులు, బద్ధవైరంబును, ♦ బరులశ్రేయ
మునయందు ద్వేషబు♦ద్ధినిఁ బొందుటయునను నీమహాదోషంబు ♦ లెన్న జీవి
తైశ్వర్యముల నాశ♦మందంగఁ జేయును; జలదముల్ పర్వత♦ములను గప్పు
తే నట్టు లెంతటిగుణములు♦నైనఁ గప్పి,వైచు నీశంత్రియును నాకు♦భ్రాతయునగు
రావణుం డిట్టి దోషవి♦రాజితుండు, గాన నాతని విడిచితి ♦ నేను జుమ్ము!. ౨౭

చ. దనుజ! సమీపకాలమున ♦ దానవవాసముగాఁ జెలంగు ప
త్తనమిది దీనియందుఁ గల ♦ దానవులందఱు నీదుతంత్రి నీ
వును హతులౌట నిక్కమిది; ♦ భూరిమనంబునఁ బొల్చి బాలిశుం
డనఁ దగి దుష్టబుద్ధివియు ♦ నై కపటంబునఁ బొల్చు నీ విటన్. ౨౮ 3833

ఆ. కాలపాశమున ని♦కామము బంధింపఁబడితి వట్టులౌట♦వలన నన్ను
నేమి యనఁగ మదిని ♦ నెంతువో యీమాట,లాడు;మృతివిపత్తి♦యాశ్రయింప

క. నను నూఱక నిందించినఁ, గననగుఫలమేది? మృతిని ♦ గాంచుట యొకటే
యనుపమఫల మద్దానికి;, దనుజాధమ! యింక నీకుఁ ♦ దరు విద్దానిన్. ౨౯

తే. చేరశక్యముగాదు ధ♦రారమణుల, ఘనులఁ గాకుత్స్థకులభవు♦లను మహామ
తులను రామలక్ష్మణుల ని♦ట్టులు భయంప,డను నొనర్చితి కాన మే♦దినిని నీవు.

క. మనియుండఁ జాలవింకను, మనుజవరుండౌచు శూర♦మండనుఁ డగు రా
మునితమ్మునితోడ యుద్ధం,బును జేయుము హతుఁడవగుచుఁ♦బోయియముపురిన్.

* ధర్మాత్ప్రచ్యుతశీలం-అనిమూ.

తే. యమునిదూతలు చెప్పు కా♦ర్యములఁ జేయు
చుండఁ గల; వింక నీబల ♦ ముద్యమమున
గనఁబఱపు మీవు నేర్చిన ♦ ఘనతరాస్త్ర
ములఁ బ్రయోగించి *కాఁ జేయు♦ము తగినట్లు. ౩౦ 3838

ఆ. ఇతనిబాణములకు ♦ నిప్పుడు చిక్కి. నీ,బలము నీవు గూడఁ ♦ బ్రాణములను
నిలుపుకొనఁగ లేరు ♦ నిశ్చయ మిదిదాన,వాధిపాత్మజన్మ! ♦ యహితబుద్ధి!.

ఎనుబదియేడవ సర్గము సంపూర్ణము.

---

౮౮ - వ సర్గము.

ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధము.

చ. అనెడు విభీషణోక్తి విని ♦ యాయసురాధిపవైరి నెమ్మనం
బునఁ బెనుకోప మొప్ప భయ♦ముం గలిగించెడు ఖడ్గముఖ్యసా
ధనములఁ దాల్చి భూషణవి♦తానమనోహర మాచు నీలవా
జినికరయుక్తమౌ రథముఁ ♦ జేరి లయాంతకురీతి నొప్పుచుౘ. ౧ 3840

క. అతిదీర్ఘమును విశాలము, నతివేగము గల్గి దృఢము♦నయి భీమమునై
సతతము జయశీలమునగు, నతులితధను వెత్తి యరుల ♦ నడఁచుశరములఁ.

తే. అపరిమితముగఁ గూర్చి య♦త్యంతవేగ
మమరగాఁ బోయి పరుషవా♦క్యములఁ బలికి
నవ్విభీషణుఁ గాంచి; య♦య్యవసరమున
నరదమును నెక్కి నములంకృ♦తాంగుఁ డగుచు. ౩ 3842

క. ఘనబలుఁడు మహేష్వాసుఁడు, దనుజేజ్యుఁడునైన యతఁడు ♦ తనతేజముచే
తనె భూషితుఁడై వైరుల,తనువులనుౘ జెండఁ జాలి ♦ దర్పము పొదలౘ. ౪

క. కనకద్యుతియుగు పవమని,తనయునిపృష్ఠమున నెక్కి తగ ♦ నుదయాద్రిౘ
గనుపట్టు రవినిఁ బోలుచుఁ, దనరెడు రామానుజన్ముఁ ♦ దాఁ గనుఁగొనియెౘ.

క. కనుఁగొని సంరంభంబునఁ, దనపినతండ్రిని సుమిత్ర♦తనయునిఁ గపివీ
రనికరము నిట్లు పల్కెను;, గనుఁ డిఁక నావిక్రమమును ♦ గాఢబలంబుౘ. ౬

క. అని నభమునుండి కురిసెడు, ఘనవృష్టిని బోలి సైఁపఁ♦గా రాక ధను
స్సుననుండి వెడలు శరవృష్టిని నిల్పెఁడు చూతుఁ గాక ♦ రీవి మెఱయఁగౘ.

తే. ఇపుడు నాఘోరబాణమ్ము ♦ లీమహాశ
రాసనమునుండి వెడలి ద♦వానలుండు
తూలరాశిని దహియించు ♦ లీల మీవ
పువులఁ గాల్పంగఁ గలవు ని♦ల్పవు మిము నిట. ౭ 3847

* కురుష్వ సర్వాయుధసాయకవ్యయమ్-అనిమూ.

క. పరుషాంబకముల శూలో,త్కరముల శక్తులను యష్టి♦కాండమ్ములఁ దో
మరముల మీగాత్రంబులఁ, ద్వరపడి భేదించి యమస♦దనమున కిపు డేఁ. ౮

క. పనిపెద మిమ్మందఱ; నిం,కను గరలాఘవము మెఱయఁ♦గా సంగరమం
దున శరవృష్టిని గురియుచు, ఘనమువలెఁ గర్జిలంగఁ ♦ గని నాయెదుటన్.

ఆ. ఎవఁడు నిల్వఁ జాలు? ♦ నింతకుమును రాత్రి
సమరమందు మీరు ♦ సహజు లిరువు
రఖిలకపులు నామ♦హాశనిసమబాణ
ములను మూర్ఛితులయి ♦ యిలఁ బడితిరి ౧౦ 3850

క. మనుజా! క్రోధరసంబునఁ, గనుపట్టెడు కాలభుజగ♦కల్పుఁడనగు న
న్నని మరలన్ మార్కొనఁగాఁ, జనుదెంచితివౌర! పొగడఁ♦జనుసాహసమున్.

తే. అరయ నారాత్రి సంగర ♦ మాత్మ మఱచి
పోతివో యమునింటికిఁ ♦ బోవఁ గాల
మిపుడు దగ్గఱఁ జేరెనో ♦ యేమొ? యనుచుఁ
దలఁచుచున్నాఁడ; ననుచు నా♦దనుజవరుఁడు. ౧౧౪ 3852

క. ఘననిస్వనమునఁ బల్కన, విని లక్ష్మణుఁ డాస్యమందు ♦ భీతివికారం
బును బొందక కోపంబున, ననియెను రావణి గుఱించి ♦ యసురా! వినుమా!.

క. త్వరగా మము యమునింటికి, నరుగునటుల్ చేయుటాది ♦ యగునట్టి సుదు
ష్కరకార్యంబుల వాక్కులఁ, గర మరుదుగఁ జేసినావు♦గాని యొకటియున్.

తే. కార్య మొనరించి చూపవు; ♦ కార్యములను
వ్యర్థముగ మాటలాడ కె♦వండు చేసి
నిర్వహించునో మతిమంతుఁ ♦ డుర్వర నతఁ
డగును నీబోఁటి వాఁడెట్టు ♦ లగు? దురాత్మ!. ౧౩౪ 3855

క. పనిదేని నిర్వహింపం,గను జాలనివాఁడ వీవు ♦ క్షమ నెవ్వరికై
నను మము జయింప శక్యమె, దనుజాధమ! యిట్టి నీవు ♦ దగనిపలుకులన్.

చ. అని నొనరించి నీవు మము ♦ నందఱ గెల్వఁగ లేనివాఁడ వ
య్యును నిదె నేజయించెద మ♦హోద్ధతి నంచు వచించుచున్ మనం
బునను గృతార్థుగాఁగ నినుఁ ♦ బోలఁ దలంచెద నక్కటా! తగన్
గనుఁగొనలేదె నాదగు ని♦కామపరాక్రమ మంచుఁ బల్కెదో?. ౧౮౪ 3857

సీ. ఆరాత్రియుద్ధంబు ♦ నందు నంతర్ధానమును బొందితి వది చో♦రనికరములు
చేయుమార్గము గాని ♦ యేయెడ వీరుల పనిగాదు; నేను నీ♦బాణములకు
లక్ష్యభూతుఁడనగు♦లాగున నీవు నిత్తగుణంబునన్ నీదు♦దర్ప మెల్లఁ
గనఁబఱపుము వికత్థనములు పలికంగ ఫలమేమి? యనియిట్లు♦పలుక; సమర

ఆ. విజయుఁడైన ప్రబల♦వీరుఁ డాయింద్రారి, యంత నాలకించి ♦ యాత్మభీమ

ధనువు నట్టి దీటి ♦ దారుణశరముల,వైచె; భీమవేగ♦బాణము లవి. ౧౭౹ 3858

క. ఉరగవిషంబుం బోలుచు, నురునిశ్వాసముల విడుచు♦చున్న భుజంగో
త్కరమట్లు పోయి శ్రీరఘు,వరసోదరుతనువు నాటి ♦ వసుధం బడియెన్. ౧౮౹

[1]చ. అనిమొన వేగవంతుఁడగు ♦ నయ్యసురేశ్వరవైరి సాధుచి
హ్నానికరయుక్తు లక్ష్మణు మ♦హాజవముంగల బాణపంక్తిచే
తను గడు నొవ్వఁ జేసెను; ని♦తాంతమహాశరవిద్ధదేహుఁడై
యనుపమలక్ష్మిచే వెలయు ♦ నారఘురామునితమ్ముఁ డత్తఱిన్. ౧౯ 3860

తే. రక్తసిక్తాంగుఁడై ధూమ♦రహితహవ్య
వహునిభంగిఁ బ్రకాశించె; ♦ వాసవారి
తాను జేసిన కార్యమ్ముఁ ♦ దనిఁ గనుఁగొని
యతఁడు నొచ్చుట మదిలోన ♦ నవధరించి ౨౦ 3861

క. పెనునాదము గలుగఁగ నా,ర్చెను సింహముఁ బోలి యంతఁ♦ జెప్పె నతనికి
ట్లని; [2]సౌమిత్రీ! ఱెక్కలు, గనుపట్టినవియ శరములు ♦ గను మివి నావౌ. ౨౧

[3]ఆ. ధనువునుండి వెడలుఁ ♦ దనుధారలయసువు
లను గొనంగ నోపుఁ ♦ గనుక నియ్య
వే గొనంగ నోపు ♦ నిచట నీప్రాణాళిఁ
గనుచునుండు సుఖము ♦ గాంతు వీవు. ౨౨౹ 3863

[4]సీ. సంగరమందు నే ♦ సమయంగ నిక్కత్తఱి నీతనువుపయిని ♦ బ్రీతిమీఱ
గ్రద్దలగుంపు న♦క్కలు డేగలును గుంపులుగఁ గూడి యరుదెంచి♦తగినయట్లు
పట్టితినంగల; ♦ విట్టి సదానార్య క్షత్రబంధునిఁ బ్రియ♦సహజు నిన్ను
బరమదుర్మతి యగు♦పార్థివుం డిపుడు నాచేతనహతునిన♦ప్రీతిమీఱఁ

---

1 శుభైలక్షణం, శుభాఢ్యో లక్ష్మణ శ్శ్రీమాన్-అనిమూ. 2 పత్త్రిణ శ్శితధారా స్తే శరా మత్కార్ముకచ్యుతాః, ఆదాస్యం తేఽద్య సౌమిత్రే జీవితం జీవితాంతగాః-అనిమూ. తేశరాః-అనుచోట తే అశరాః అని పదచ్ఛేదము. నిష్ప్రయోజకబాణములని యర్థము. లేనుఁగున ఱెక్కలు గనుపట్టినవి, యశరములు కనుక ఇవి నావౌ-అనఁగా నా యీ బాణములు నిస్సారములని వాస్తవార్థమని తీర్థులు. 3 పూర్వపుఁ బద్యమున నా బాణములు నిరర్థకములని చెప్పఁబడియెఁగదా. ఇఁకనీపద్యమున నిధనువునుండి వెడలునట్టి శరములు, ఇచటన్-నీప్రాణాళిన్ వే గొనంగ, నోపున్ అని యన్వయించవలయు. అనఁగా నీబాణములు నాప్రాణములు వేగముగాఁ దీయఁగలవని యర్థము ఇట్లునాప్రాణములు పోవుటను జూచుచుండుటయు సుఖము గనఁగలవని వాస్తవార్థమని మహేశ్వరతీర్థులు. 4 అద్య గోమాయుసంఘాశ్చ శ్యేనసంఘాశ్చ లక్ష్మణ, గృధ్రాశ్చ నిపతంతు త్వాం గతాసుం నిహతం మయా, క్షత్రబంధుం సదానార్యం రామః పరమదుర్మతిః, భక్తం భ్రాతర మద్యైవ త్వాం ద్రక్ష్యతి మయా హతమ్, విశ్రస్తకవచం భూమౌ వ్యపవిద్ధశరాసనమ్, హృతోత్తమాంగం సౌమిత్రే త్వా మద్య నిహతం మయా. అనిమూ. నా స్తనార్థము. సంగరమందున్ నేన్ సమయన్ = యుద్ధ

తే. గనఁగలఁడు; లక్ష్మణా! యుద్ధ ♦ మునవధింపఁ, గవచముం దెగఁ జాపంబు ♦ ఖండితంబు
గాఁగ గతశీర్షమై ధరఁ ♦ గానఁబడెడు, నీతనువు చూడఁ జాలు నా ♦ భూతలపతి;. ౨౭౹

చ. అని యిటు లింద్రజిత్తొగి స ♦ హాంకృతితోఁ బరుషంబుగా వచిం
చునుడుల నాలకించి నృప ♦ సూనుఁడు హేతువు లొప్ప నర్థముం
గనఁబడువాక్కులం బలుకఁ ♦ గాఁ దొడఁగెన్; కుమతీ! నిశాచరా!
ఘనమగు వాగ్బలంబును నిఁ ♦ కన్ విడనాడుము చాలు నేఁటికిన్. ౨౮ 3865

తే. భయదకృత్యంబులను జేయు ♦ వాఁడ వీవు
వానిఁ బలుకంగ నేల? నీ ♦ బాహుబలముఁ
గనఁబఱచి కార్యములఁ జేసి ♦ కడఁగి దానిఁ
జక్క సాధింపు; మోనిశా ♦ చర! దురాత్మ!. ౨౮౹ 3866

తే. కార్యములఁ జేసి చూపక ♦ కాఱులేఁ, యూరకూరక పల్కెద ♦ వాక్కురీతి
నీదుకాఱులు నిజమని ♦ నేనునమ్ము, నట్టి పనిచేయు మోవురు ♦ షాధమ! యిఁక.

క. పురుషోక్తులనేఁ బల్కక, యు రవంతయు నొరులఁ దిట్ట ♦ కూరక నను నే
ను రహిన్ స్తుతించుకొనకయె, పరిమార్చెద నిన్నుఁ జూడు ♦ పల్కు లిఁకేలా?.

క. అని పల్కి మహావేగము, లనూనభయదమ్ములునగు ♦ నైదు శరములన్
గొని యాకర్ణాంతముగా, ధనువును వే లాగి యింద్ర ♦ దస్యు నురంబున్. ౩౦

తే. తగుల నేసె; సుపత్రసం ♦ తతులు గలుగ
జవమునం బొల్చియున్న యా ♦ శరము లహుల
వలె జ్వలించుచు రావణి ♦ వక్షమందు
రవికరంబులభంగిని ♦ రాజిలెఁ గడు. ౩౦౹ 3870

క. దనుజేంద్రనందనుఁడు రా, మునితమ్మునితీక్ష్ణబాణ ♦ ములు నొప్పింపం
గను గుపితుండై బాణము, లను మూఁడిఁట లక్ష్య మొప్ప ♦ లక్ష్మణు నొంచెన్.

క. నరరాక్షససింహులుగాఁ, బరఁగెడు సౌమిత్రిశక్ర ♦ వైరు లొకరినొ
క్కరు గెల్వఁ గోరి యటసం, గర మడరుచుఁ జేయ భీమ ♦ కలహంబయ్యెన్. ౩౧౹

క. ఇరువురు బలవిక్రమయుతు, లిరువురు శౌర్యములఁ జూపు ♦ నిద్ధతనులు వా
రిరువురు వివిధాస్త్రసముత్కరకోవిదు లొరులు గెల్వఁ ♦ గా దగనివిభుల్. ౩౨౹

---

మున నీచేత నేఁ జంపఁ బడఁగా, ఇత్తిటిన్, ఈతనువుపయిని = ఈ నా దేహముమీఁద, సదానార్యన్, అనుచోట సదాన = దానశీలుఁడా లక్ష్మణా, ఆర్యన్ క్షత్రబంధునిన్ ప్రియసహాజున్ నిన్నున్ = క్షత్రియబంధువై ప్రియసోదరుఁడవగు నిన్ను, నాచేతన్ అహతు నిన = నాచేఁ జంపఁబడకయే యున్న నిన్ను ప్రీతిమీఱఁగఁ గనఁగలఁడు పరమగుర్తి యనుచోట, పరమ్ అగుర్తిః = మనుష్యులయందుఁగూడ మిక్కిలి కరుణగల శ్రీరాముఁడని యర్థము కానఁబడెడు నీతనువు అన్నచోటఁ గానఁబడెడు ఈతనువు అనివిభాగము. సుగాగమను నిత్యముగాన కానఁబడెడునీతనువని దైనది. కనఁబడుచున్న యీ నా దేహమని యర్థము. అని మహేశ్వరతీర్థులవారు

క. అనుపమబలతేజోయుతు, లనూనకోపాతిరేకు ♦ లగుటను నభ్రం
బునఁ గలగ్రహములు యుద్ధము, నొనరుచులాగునను బోరి♦రుగ్రముగాఁగన్.

చ. అనిమొన దుష్ప్రధర్షులగు ♦ నాకుహితాత్ములు భీతినొందకే
మును సమరేశవృత్రవిధ♦ముం గనుపట్ట మృగేంద్రముల్ దురం
బొనరుచు భంగిఁ బోరిరి; న♦రోత్తమదానవవర్యు లింక భీ
తిని గనకుండ నిల్చి బహు♦తీవ్రశరాళిని వైచుచుం దగన్. ౩౭ 3815

క. పెనుహర్షంబునఁ బోరిరి;, మనుజాసురవర్యు లాస♦మయమున శరముల్
ధనువులు దాలిచి యొండొరు,లను గెల్చుకుతూహలంబు♦లంబూన్కి మెయిన్.

క. జలదంబులు చక్కంగా, జలమును వర్షించురీతి ♦ స్పర్ధల బాణం
బుల నొక్క రొకరిపై ని,మ్ముల వైచిరి; మఱియుమిగులఁ♦బూనికమెఱయన్.

క. అనిఁ బండితులగు వారలు, సునిశితశరఖడ్గములను ♦ శోభిలుశస్త్రా
ళిని దాల్చి తీవ్రబలములఁ, గని వెలసెడు వార లపుడు ♦ కలహప్రియులై.

ఆ. సమరవిక్రమములు ♦ చాలఁగాఁ బెరుగంగ, శంబరాసురుండు ♦ శతముఖుండు
సంగరంబుఁ జేయు♦చందంబునం గొట్టు,చును జెలంగిపోరి ♦ రనుపమముగ.

ఎనుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౯౦ - వ సర్గము.

ఇంద్రజిల్లక్ష్మణులు మహాహవంబు చేయుట.

క. అరికర్శనుఁడౌ శ్రీరఘు,వరుతమ్ముం డంత రుష్టి♦వశుఁడై కాకో
దరము వలెన్ నిట్టూర్పులు, పరిపరివదలుచును దీవ్ర♦బాణముఁ బూన్కెన్.

చ. ధనువునఁ గూర్చి వృత్రరిపు♦దన్యునిపైఁ బఱగించె; లక్ష్మణుం
డనుపమరీతి జ్యానినద ♦ ముట్టి లొనర్పఁగ నాలకించి యా
దనుజవరాత్మజుం డతని♦దారుణయత్నముఁ జూచి మోము కాం
తిని విడనాడ లక్ష్మణుని ♦ నిశ్చలదృష్టినిఁ జూచె భీతిచేన్. ౨ 3881

ఆ. ఆవివర్ణముఖుని ♦ నారావణాత్మజుఁ, గని విభీషణుండు ♦ కలహమందుఁ
దత్పరుండు గాఁగఁ ♦ దగులక్ష్మణునితోడఁ, బలికె; రావణాత్మ♦భవుని యందు.

క. కలిగిన ముఖవైవర్ణ్యా,దులఁ గన భంగమును గనుటఁ ♦ దోఁచెడు మదిలో
పల సంశయంబు లేదిఁక, సలఘుభుజా! వీనిఁ జంప ♦ దగుఁ ద్వరలోనన్. ౪

ఉ. కావున నాప్రయత్నముఁ ద♦గం బొనరింపుము; నాఁగ లక్ష్మణుం
డావిధ మెన్ని యగ్నిశిఖ♦లట్లు మహావిషసర్పజాలముల్
గా వివిధప్రకారములఁ♦గా భయదంబులునైన తీవ్రబా
ణావళులట్టె గూర్చి త్రిద♦శారిపయిం బఱఁగించె నేర్పుతోన్. ౫ 3881

మధుమాధవీవృత్తము:—

దేవేంద్రువజ్రమటు ♦ తీక్ష్ణముగా స్పృశింపం
గా వచ్చు లక్ష్మణుని ♦ కాండము లాత్రిముంపం
గా వాసవారియును ♦ గాయములెల్ల నొవ్వం
గా వంతఁ గొంతవడిఁ ♦ గాంచుచు మూర్ఛనొందెన్. ౬ 3885

ఆ. ఒకముహూర్తమునకు ♦ సకలేంద్రియంబులు
మరల దిటవునొంద ♦ సురపతిరిపుఁ
డార్తిఁ బాసి తెల్వి ♦ నంది వీరుఁడుగాన
నెదుట నిల్చియున్న ♦ నృపకుమారు. ౬౪ 3886

క. కనుఁగొని వీరుని లక్ష్మణు, ననూనకోపమునఁ దాఁకి ♦ యరుణాక్షుండై
చని యతని దాపునకు; ని, ట్లనియెన్ మరలం గఠోర ♦ మగువాక్యతతిన్.

క. నీయన్నయు నీవును మును, పాయాదియుద్ధమందు ♦ నహిపాశములం
గాయములను బంధింపఁగ, నాయనిం బొరలుచుంటి ♦ రల నాశక్తిన్. ౯

క. మనమున నే మఱచితివా?, మునుపా తొలి దైనయుద్ధ♦మున మీరలు చి
క్కినపరివారంబును శ,క్రునివజ్రముఁ బంటి నాదు♦ఘోరశరములన్. ౯౪ 3889

తే. తెలివి దప్పి ధరిత్రిఁ బొ♦రలుచునుంటి
రిగద; యట్టిది నాశౌర్య ♦ మగణితమని
తెలిసియును నీవు నన్ను మా♦రలను మార
కొనఁగఁ గోరుటఁ దలపోయ ♦ [illegible]మునందు ౧౦౪ 3890

తే. అట్టి భంగంబు మఱచితి ♦ వనియుఁ గాని
యమగృహంబునకుం జను♦నాశఁ బూని
యున్నవాఁడవనియుఁ గాని ♦ యొక్కరీతి
స్పష్టముగఁ దోఁచుచున్నది ♦ స్వాంతమందు. ౧౧ 3891

క. విను మీవు మొదటియుద్ధం,బున నావిక్రమము మిగులు ♦ పూనికనుం జూ
డని వాఁడవేని యిప్పుడు, కనఁబఱచెద వెనుక కేగ♦కయ నిల్వు మిఁకన్.

చ. అనివచియించి సప్తనిశి♦తాశుగముల్ పఱఁగించి లక్ష్మణున్
హనుమను దీక్ష్ణధారలగు ♦ నట్టిదశాంబకముల్ శరాసనం
బునఁ దగఁ గూర్చివైచియును ♦ బొల్పుఱఁ జేసెను; బిన్నతండ్రిపై
నినుమడియైన కోపమున ♦ నెంతయు వీర్యము పొంగ నేత్రజిన్. ౧౩॥ 3893

క. తనసంరంభము ద్విగుణము,గను జేయుచు లక్ష్యశుద్ధి ♦ గన్పడఁగా నొం
చెను నూఱుబాణములు; నా,వనుజుం డొనరించినట్టి ♦ తత్కార్యంబున్.

క. పరికించి రాఘవుని సో,దరుఁ డాపురుషోత్తముండు ♦ దాని మనమునం

బరమం బని లెక్కింపక, సురుతరముగ నవ్వి *యిట్టి ♦ దొప్పదు సుమ్మీ!. ౧౪

తే. ఎంతమాత్రపుఁబనియగు ♦ నిద్దియనుచుఁ
బనికి రాదిట్టి దనుచును ♦ బలికి ఘోర
సాయకంబులఁ గొనివైచె ♦ సత్వరమున
నింద్రజిత్తునిపై రోష ♦ మేపుమీఱ. ౧౫ 3896

క. అనిమొన మఱియును లక్ష్మణుఁ, డనూనకోపమున భీతి ♦ యన నించుకమో
మునఁ దోఁపమి నారావణిఁ,గని రాక్షస! వినుము నీదు ♦ కాండము లివియున్.

ఆ. సత్వహీనములయి ♦ చాలఁ దేలికయయి, తనువునకు సుఖంబు ♦ గను జెలంగు
చున్న విపుడు సుమ్ము ♦ సన్నుతిఁ గను శూరు,లనికిఁ జొచ్చి యెప్పు ♦ డైనఁగాని.

క. ఈరీతిం బ్రహరింపరు, ఘోరాహవమందు జయముఁ ♦ గొనఁ గోరెడునే
శూరులు నీలాగునఁ బ్రవి,దారణ మొనరింప రనుచు ♦ దనుజునిఁ గనుచున్.

క. పలుకుచు సాయకజాలం,బుల నొంచెను; జాతరూప ♦ మున రంజిలుసా
పలలాశను కవచం బి,మ్ముల లక్ష్మణబాణజాల ♦ ములఁ జూర్ణితమై ౧౯ 3900

తే. అంబరమునుండి ధరఁబడు ♦ నట్టి తార,కలవిధంబున రథమున ♦ నలుఁగడలను
బడియె; నిట్లనిఁ గవచంబు ♦ చెడి శరములఁ, దనువు నుత్కృత వ్రణంబయి ♦ తత్తఱిల్ల.

క. తనువున నెల్లెడ బాణము, లనూనముగ నాటి యుండ ♦ నావీరుం డా
దనుజోత్తముండు భూమిరు,హానికరములు మిగులఁ గల్గు ♦ నద్రియటు తగెన్.

సీ. అతిభయంకరవీరుఁ ♦ డగునింద్రజిత్తు సంగరమున మిగులనా ♦ గ్రహము నొంది
శరసహస్రమున ల ♦ క్ష్మణు వీరునిన్ నొంచె నాసాయకముల ది ♦ వ్యములగు లక్ష్మ
ణునికవచంబుఁ గూ ♦ డను శకలంబులై, ధరఁబడె; నిట్టు ల ♦ య్యిరువురు దగ
నితరేతరప్రతి ♦ కృతులను జేయుచు నొండొరుల జయించు ♦ నూహలఁదల

తే. పడిరి; సర్వాంగములు బాణ ♦ పటలములను
భిన్నములుగాఁగ రక్తసం ♦ స్నృతశరీరు
లగుచు నిట్టూర్పు లొలయంగఁ ♦ దెగి తుములము
గాఁగఁ బోరిరి సమరకాం ♦ క్షులు పెనంగ. ౨౩ 3903

క. వారిద్దఱును మహాత్ములు, వీరులు సంగ్రామకర్మ ♦ వేత్తలు నగుటన్
ఘోరాంబకజాలంబులఁ, బోరాడిరి చాలసేపు ♦ బూనిక మెఱయన్. ౨౪

సీ. భీమవిక్రమములు ♦ వెలయునాయిద్దఱు నొండొరుల జయించు ♦ నుద్యమంబు
చేయుచు శరతతి ♦ చేత నొండొరుల దేహంబుల నించుచు ♦ నతులకవచ
ములు ధ్వజంబులు చూర్ణ ♦ ములయి ధరంబడఁ బ్రస్రవణంబులు ♦ ప్రబలవృష్టి
జలముల భూరిని ♦ స్వనముల వదలెడురగతి మేనులనుండి ♦ గాఢమగుచు

* నైత ల్లించి దిత బ్రువన్-అనిమూ.

తే. నుష్ణరుధిరంబు దొరుగంగ ♦ నుండి; రభ్ర
మందు లయకాలమేఘంబు ♦ లమితవృష్టి
గురియునటు భీమనినదంబు ♦ పరఁగఁ జేయు
చును భయంకర బాణవృ♦ష్టిని గురియుచు. ౨౬౪ 3905

క. అనిచేయుచుండఁగా గడ,చెను బెద్దయుఁ గాల; మట్లు ♦ చేయుచు నుండన్
వెనుదీయుటయును శ్రమమును,గనఁబడ వాయిరువురందుఁ ♦ గడుఁ బరికింపన్.

తే. అస్త్రవిద్వరులైన వా♦రంత మాటి
మాటికిని బూన్కి దివ్యాస్త్ర♦మండలంబు
వైచుచున్ బెక్కుభంగులొ ♦ బాణవితతు
లంబరము నిండ వైచి ర♦య్యవసరమున. ౨౮౪ 3907

క. నరరాక్షసులు ప్రమాదముఁ,బొరయక చక్కఁగను జిత్ర♦ముగ శరముల నొం
డొరులపయిన్ వైచుచు దు,ర్భరముగఁ దుములాహవము జ♦రపి రట్టితఱిన్.

[1]క. ఆయుద్ధజ్యానినదం, బాయెడఁగల జనులనెల్ల ♦ నదరిపడంగాఁ
జేయుచు వజ్రనిపాతం,బోయన భీకరముగ వినఁగ ♦ నొప్పెబెడిదమై. ౩౦౪

క. అని నాయిద్దఱు చేయం,గను వ్యోమమునందు మిగుల♦గర్జించుచు నొ
ప్పినదారుణమేఘద్వయ,నినదము వలె గొప్పదైన ♦ నినదము గలిగెన్. ౩౧౪

తే. జయము నొంద దృఢవ్రతు♦లయి చెలంగి
యశమునన్ వెల్గి బలవంతు♦లైన వార
లపుడు హాటకపుంఖశ♦రావళికృత
దారుణవ్రణు లయి రక్త♦ధార లొలుక. ౩౨౪ 3911

[2]క. కనఁబడిరి భయంకరముగఁ; గనకపుఁ బింజలుగలట్టి ♦ కాండములు రణం
బునఁ దత్తనువులఁ జొరఁబడి,యును నెత్తుటఁ దోఁగి చొచ్చె ♦ నుర్వీస్థలిలోన్.

సీ. వారువైచిన తీవ్ర♦బాణావళులఁ గొన్ని యంబరమునఁ బోవు♦నపుడు నిశిత
శస్త్రసంతతుల సం♦స్పర్శనంబును బొందె; మఱికొన్ని బాణముల్ ♦గుఱిగ నితర
శరసహస్రములను ♦ జయ్యన బంధించితునిమె; ఘోరాజియుఁ♦దోఁచె నపుడు
వారుప్రయోగించు♦బాణసమూహముల్ [3]సత్రంబునన్ మండు♦జ్వలనయుగ్మ

తే. కలితకుశరాశికరణిని ♦ గ్రాలె; నస్మ
హాత్ములశరీరము లొగి గా♦యములు పడుట
నరుణసుమములఁ దగి యాకు♦లనఁగ లేని
బూరుగును మోదుగు ననంగఁ ♦ బొలిచె నపుడు. ౩౬౪ 3913

క. వారిరువు రొకరి నొక్కరు, ఘోరాహవమందుఁ జంపు♦కోర్కెలు మీఱం

---

1 ప్రకంపయాన్ జనం ఘోరం-అనిమూ. ఇచట జనశబ్దము ప్రాణివాచకము. 2 అసృజ్మధ్ధాశ వినిస్సృతః వివిశు ర్ధరణీతలమ్-అనిమూ. 3 సత్రే కుశమయశ్చ యః-అనిమూ.

గా రణముఁ దుములముగ నవు, డీరసమున మాటిమాటి ♦ కేడ్తెఱఁ జేయఁగన్.

క. కనఁబడె నది చిత్రంబుగ,, మనుజేంద్రునిసోదరుం డ♦మరపతివైరిన్
దనుజేంద్రుని లక్ష్మణు న,య్యని నొక్కరి నొకరు దారు♦ణాంబకవితతిన్. ౩౮

తే. నొవ్వఁగాఁ జేయుచున్ యుద్ధ ♦ మువిధమునఁ
జేయుచుండియు శ్రమమును ♦ జెందరైరి;
విపులవీర్యజవంబుల ♦ వెలయువార
లంబకము లెల్లఁ దనువుల♦యందుఁ జొరఁగ. ౩౯ 3916

క. తరువులు నిండఁగ మొలచిన, ధరణీధ్రములట్లు తగిరి; ♦ దారుణబాణో
త్కరసంవృతములు మఱియు రు,ధిరసిక్తములైన వారి♦దేహము లెల్లన్. ౪౦

క. జ్వలియించు నగ్నిహోత్రము,వలె వెలిఁగెను; జాలసేపు ♦ వారట్లు రణం
బలయక చేయుచు నుండినఁ,జలనము శ్రమమున్ రవంత♦స్వాంతము లందున్.

తే. కలుగకే పోయె; నంతఁ జ♦క్కనిప్రకాశ
మునఁ దగిన యవ్విభీషణుఁ ♦ డనిఁ బరాజ
యమునఁగా నెప్పు డెఱుఁగని ♦ యాసుమిత్ర
తనయునకుఁ గల్గు శ్రమముఁ బా♦పను దలంచి. ౪౨ 3919

క. అతనికి నెమ్మదిఁ బ్రియమగు,హితమును గలిగింపఁ గడఁగి ♦ యెంచి నిలిచెఁ దా
నతిరయమున ననిముందట, జతనంబుగ నింద్రజిత్తుఁ ♦ జంపించుతమిన్. ౪౩

ఎనుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౯౦ - వ సర్గము.

లక్ష్మణుం డింద్రజిత్తుసారథిని గుఱ్ఱములను గూల్చుట.

సీ. బలవంతుఁడును శూరుఁ ♦ డలఘుగుణాఢ్యుండు నగువిభీషణుఁ డప్డు♦పొగరుపట్టి
నట్టిగజంబుల ♦ చుట్టు లొండొరులతో నని చేయఁ దలపడి ♦ యాత్మలందు
నొకరి నొక్కరు చంప ♦ నూహించుచుం బోరువారలఁ జూడఁగాఁ ♦ గోరితొలుత
వారిఁ జూచిన తరు♦వాతఁ దానును సంగరము చేయ నిల్చె ధ♦రణిని నందు,

తే. నిట్లు నిల్చి ధనుస్సూకఁ ♦ డెలమిఁ గొనుచు
నారి సారించి రాక్షస♦వీరులపయి
దారుణాస్త్రములగు మహా♦స్త్రశరములఁ
దాఁ బ్రయోగించె; నయ్యవి ♦ దహనుపోల్కి. ౩ 3921

క. మండుచు లక్ష్యము తప్పక, యుండఁగ రాక్షసులఁ దాఁకి ♦ యుర్వీధరరా
ణ్మండలముల *వజ్రము లు,ద్దండగతిం జీల్చినట్లు ♦ దానవవనమితిన్. ౪ 3922

తే. చెండి వైచెను; రాక్షస♦సింహులైన, యవ్విభీషణుమంత్రులు ♦ ననిశ శూల

* వజ్రాణీవ మహాగిరీన్-అనిమూల వజ్రాణి-అశనయః-అనివ్యాఖ్య.

ఖడ్గపట్టసములఁ బూన్కిఁ ♦ గైకొని యుల, దనుజవీరుల ఖండించి♦రనుపమగతి.

చ. తనసచివాసురోత్తము లు♦దారమతుల్ గొలువంగ దానవే
శుని యనుజుండు గర్వమున ♦ శోభిలు నేన్గుల మధ్యభాగమం
దనువుగఁ జూడ నొప్పు మద♦హస్తివిధంబునఁ జూడనయ్యె; నా
దనుజవరుండు కాలముల♦తత్త్వవిదుత్తముఁ డౌట నత్తఱిన్. ౬ 3924

ఆ. అసురగణముతోడ ♦ ననిచేయ వేడుక, వడెడు వానరులను ♦ గడఁగి మఱియుఁ
బ్రోత్సహింప నెంచి ♦ బుద్ధిబలంబున, నప్పటికిని దగిన♦యట్లు పలికె ౭ 3925

చ. హరివరులార! రావణున ♦ కారయ వీఁడొకఁడే నిజంబుగాఁ
బరమసహాయుఁడై చెలఁగు ♦ వానిబలంబులు పోయి వీఁడె యొ
క్కరుఁడు మహాబలుం డిచటఁ ♦ గ్రాలు నదేలొకొ మీర లూరకి
త్తరుణమునందు నుండెదరొ; ♦ దారుణపాపుఁడు వీఁడు నియ్యనిన్. ౮ 3926

క. హతుఁడైన యెడల నవ్వల, దితిజాధిపుఁ డొకఁడె తప్పఁ ♦ దెగినయదియె యౌ
నతనిబల మెల్ల; వీరుం, డతులితబలుఁడౌ ప్రహస్తుఁ ♦ డంతము నొందెన్. ౯

సీ. గురుబలుండైన ని♦కుంభుండు, కుంభకర్ణుండును మఱియుఁ గుం♦భుండు పిదప
నాజంబుమాలి,ధూ♦మ్రాక్షదానవుఁడు,మహామాలియును దాన♦వాధిపతియు
నశనిప్రభుండును,♦యజ్ఞకోపుఁడు, తీక్ష్ణవేగుండు, నిష్కుంభుఁడు, ♦ వికలుఁ డల్లె
సుప్తఘ్న,వజ్రదం♦ష్ట్రులును,సంహ్రాదియుఁ,దపన,ప్రఘాసులు,♦దముఁడుప్రఘసుఁడు,

తే. డా ప్రజంఘుఁడు, దుర్ధర్షుఁ, ♦ డగ్నికేతు
వల్లె జంఘుఁడు, వీరుఁడై ♦ యలరుచున్న
రశ్మికేతు, విద్యున్మాలి, ♦ రాక్షసులును
సూర్యశత్రు, ద్విజిహ్వులు, ♦ శూరవరులు. ౧౦ 3928

తే. చక్రమాలి, సుపార్శ్వుండు, ♦ శౌర్యఘనులు
కంపనాకంపనులు, బల♦గర్వయుక్తు
లైన దేవాంతక, నరాంత ♦ కాహ్వయులును
సమరరంగంబు నందిందుఁ ♦ జంపఁబడిరి. ౧౧ 3929

చ. గురుబలవంతులౌ దనుజ♦కుంజరులన్ దురమందుఁ జెక్కురన్
గరము పరాక్రమక్రమము ♦ గన్పడఁ జంపి మహాంబురాశినిం
గరముల నీఁది దాఁటితిరి♦గా; యిఁక రావణసూను నీతనిన్
బోరిగొను టెల్ల గోష్పదముఁ ♦ బోలుచుఁ జుల్కనగాదె? మీ కనిన్. ౧౨

చ. వనచరులార! యీపనియు ♦ స్వల్పముగావున దీనిఁ గూడఁ జ
క్కనిదగు శక్తిఁ జేయుఁడు ని♦కాముబలంబున గర్వయుక్తిచే
ఘనులగు నెల్లరాక్షసు ల♦ఖండజవంబున వచ్చి తాఁకి మీ
యనుపమశక్తిఁ జంపఁబడి ♦ రారయ నీతఁడె శేష మిత్తఱిన్. ౧౩ 3931

తే. ఇంతమాత్రమెమీరలీ♦యొడజయింప,వలయు;దయమాలినేరఘు♦వరునికొఱకు
భ్రాతృపుత్రునినైన నీ♦బవరమందుఁ, జంపివైతును గాని ని♦స్సంశయముగ.

క. పినతండ్రి నగుచు నాకుం, దనయుండగువాని నింద్ర♦దమ్యు నితని నే
నని వధియించుట తగ; దిం,కను నీతనిఁ జంపఁ గోరఁ♦గా నామదిలోన్. ౧౭

సీ. కన్నీరు చక్కఁగాఁ ♦ గ్రమ్మి నాచక్షుస్సు నావరించుచునున్న ♦ దట్టులౌట
వాని మహాబాహుఁ ♦ డైన ఖూలక్ష్మణుండే వధించును; బ్లవ♦గేంద్రులార!
కూండి మీరంద ఱీ♦క్రూరాత్మునకు సాయపడఁ జెంతనున్న యీ♦భటుల నెల్లఁ
బొలియింపుఁడనియె; ని♦స్తులకీర్తిమంతుఁడౌ నావిభీషణుఁ డిట్లు ♦ లఖిలకపులఁ

ఆ. బ్రోత్సహింప వనచ♦రులు హర్షముంబొంది, వాలములను ద్రిప్పి♦లీల మాటి
మాటి కతులరీతి♦మహితసింహధ్వనుల్, చేయుచున్ ముదంబుఁ♦జెందియపుడు.

క. ఘనములఁ గని కేకులు ని,స్వనముల నొనరించునట్లు ♦ పలుభంగుల ని
స్వనములఁ జేసిరి; భల్లూ,కనృపతి యాతరుణమందుఁ♦గడుఁబూన్కి మెయిన్.

తే. సకలసేనావృతుండయి ♦ శౌర్యములర
శిలల నఖములఁ బండ్లను ♦ జెలఁగుదనుజ
భటుల నొప్పించె; నమ్మహా♦బలులు దనుజు
లట్లు ప్రహరించుచుం జెలు♦వారు నతని. ౨౧ 3936

చ. మనమున భీతి నించుకయు ♦ మాని యనేకవిధాయుధంబులం
గొని త్వరఁ జుట్టుముట్టి; రిటు ♦ క్రూరమనస్కులు వారు పూనికన్
దనుజులఁ గొట్టుచున్న ఘన♦దర్పుని భల్లుకనాథు జాంబవం
తుని శరయష్టిసంతతులఁ ♦ దోమరతీక్ష్ణపరశ్వధంబులన్. ౨౩ 3937

తే. పట్టసంబుల నొంచిరి; ♦ ప్లవగదనుజ, తుముల సంగరమద్ది క్రు♦ద్ధులగు దేవ
దనుజసంగరమట్లున♦తాంతరవము, గలిగిభీమంబుగానయ్యెఁ ♦ జెలఁగియపుడు.

చ. ఘనబలశాలియై వెలయు ♦ గాలికుమారుఁడు విశ్రమార్థమై
తనపయినుండి లక్ష్మణుఁడు ♦ తత్సమయంబునఁ గ్రిందికేగుటన్
దనుజులపౌరుషంబుఁ గని ♦ దాని సహింపక వృక్ష మొక్కఁ డొ
య్యనఁ బెకలించి రాక్షసుల ♦ నయ్యని వేవురతోడ మార్కొనెన్. ౨౫

తే. ఇంద్రజిత్తిట్లు పినతండ్రి ♦ కెంతొతుముల
సంగర మొసంగి పరవీర♦సమితిఁ జంపు
నాసుమిత్రాత్మజుని పైకి ♦ నడరె మరల;
నంతటన్ సుప్రసిద్ధులై ♦ యరిహరులయి. ౨౬ 3940

తే. వీరులై తగు వారిద్ద♦ రీరసముల
బాణవర్షంబుఁ గురియుచుఁ ♦ బటుతరగతి

నొకరినొక్కరు నొప్పించి ♦ రుద్యమమున;
వేగవంతులు గురుబలుల్ ♦ వినుతహారులు. ౨౭ 3941

చ. అనుపమవిక్రమాఢ్యులును ♦ నా నరదానవనాథనందనుల్
ఘనములచేత వృష్టితగు ♦ కాలమునన్ రవిచంద్రు లొక్కరీ
తిని గనరాకయుండెడు గ♦తిన్ శరపంక్తిని గొంతకాలమున్
గనఁబడకుండి; రిద్దఱును ♦ గ్రమ్మఱఁ బోరుచు నుండునత్తఱిన్. ౨౮ 3942

సీ. కరలాఘవంబులు ♦ గల్గినవారౌట నమ్ములపొదినుండి ♦ యంబకములఁ
దీయుటగాని సం♦ధించుటయేగాని సవ్యాపసవ్యసం♦సరణిఁ జాప
ముల మార్చి తమకరం♦బులఁబట్టుటయుఁగాని శరమోక్షణముగాని ♦ జ్యాలతలను
జక్క లాగుటగాని ♦ స్థానవిశేషముల్ గలుగంగ నిల్చుట♦గాని ధనువుఁ

తే. బిడికిటం బట్టుటయుఁగాని ♦ కడఁగి లక్ష్య
మును రివంతయుఁ దప్పకుం♦డను శరముల
వైచుటయుఁ గాని కనుఁగొనఁ♦బడకయుండెఁ;
చాపవేగవినిర్ముక్త♦శరతతు లొగి. ౩౦ 3943

క. సురపథమును కప్పుటచే, శరములు కన్పడుచునున్న ♦ సరణి విడిచి యొ
క్కొరువుఁడు కన్పడకుండె ని,తరవస్తువుఁ దోఁపకుండెఁ ♦ దద్దయు గనినన్.

చ. దనుజుని రాఘవానుజుఁడు ♦ తార్కొనినప్పుడు గాని రాముత
మ్ముని దనుజుండు మార్కొనుచుఁ ♦ బోరెడునత్తఱిఁ గాని యాతఁడీ
తని నని నొంచు నంచు మదిఁ ♦ దట్టకయుండెను; వార లాతురం
బునను బరస్పరంబు గెలు♦వుం గొను వాంఛల వైచు బాణముల్. ౩౨ 3945

తే. ఆకసమునందు నేమాత్ర ♦ మైన నందు, గలుగకుండఁగనింపఁ జేఁ♦కట్లు గ్రమ్మి
నట్టులుండెను; వారల♦వగు నిశాత,బాణములు శతసంఖ్యలు♦పరఁగి యపుడు.

క. కలయన్ నిండెను దిగ్విది,శల; సూర్యుం డస్తమించు♦సమయమునఁ దమ
స్సులు సర్వము గప్పెడున,ట్టులు చీఁకటి గప్పె నప్పు♦డు భయదరీతిన్. ౩౪

ఆ. రక్తనదులు వేలు♦ప్రవహించెగొప్పగాఁ,బలలమును గ్రసించు♦భయదమృగము
లతిభయంకరముగ ♦ నార్చె నత్తఱి భయం,బునను వీవకుండె ♦ ననిలుఁ డట్లు.

క. అనలుఁడు మండకయుండెను;, మునివర్యులు లోకనివహ♦ములకు శుభంబుల్
దనరును గాకని పలికిరి, మును పాసంగరముఁ జూచు ♦ ముదమున నటకున్.

క. చనుదెంచిన గంధర్వులు, చని రింకొకచోటి కల్లై ♦ చారణయుతులై
యుని దానిఁ జూడనోడుచు;, దనుజుం డారీతిగఁ బ్రవి♦దారణము గడున్. ౩౮

చ. ఒనరుచుచుండ రాఘవుస♦హోదరుఁ డప్పుడు నాల్గుబాణముల్
గొనుచుఁ దదీయనీలతను♦ఘోటకరాజచతుష్కమున్ లన

త్కనకవిభూషణాంచితము ♦ గాడఁగ నేసె; ననంతరంబ చ
క్కనిరుచి మించు లక్ష్మణుఁడు ♦ కాంతిని మించుచుఁ జాలఁ దీక్ష్ణమై. ౩౯

తే. పర్వముల నొప్పి తెల్లనై ♦ పరఁగుభల్ల
మొక్కదానిని గొని దానిఁ ♦ జక్క లాగి
యింద్రవజ్రసమానమై ♦ యెసఁగుచుఁ దల
శబ్దమున మించు సాయకా♦శనిని దాని. ౪౦ 3952

క. ధనువునఁ గూరిచి లాఘవ,మున నెఱయుచుఁ జిత్రగమన♦ముల నరదం బొ
య్యన నడుపుచున్న యింద్రజి,తుని సారథితలను నట్టె ♦ త్రుంచెం గడఁకన్. ౪౧

క. ఆయసురేంద్రునితనయుం, డాయదనున సారథి యటు ♦ హతుఁడైనను దా
నే యాపనిఁ జేయుచు నని, చేయుచునే యుండె ధనువు♦చేత మెఱయఁగన్.

తే. అతులతేజంబునం బొల్చి ♦ యాతఁ డిట్లు
సంగరము చేయ నాతని ♦ శక్తిఁ గాంచి
యెల్లవా రద్భుతం పడి; ♦ రేపు మీఱ
నదరి సౌమిత్రి యసురేంద్రు♦నరిని గాంచి. ౪౩ 3955

క. ఆతనికరములు తురగ,వ్రాతంబునఁ దోలునట్టి ♦ వ్యాపారమునం
దే తగిలియుండుటం గని, యాతని నొంచెన్ మహాశి♦తాంబకవితతిన్. ౪౪

క. ధనువును గరములఁ గైకొనఁ, గని యాతనిఘోటకములఁ ♦ గాండంబులచే
తనునొంచె; లక్ష్మణుం డా,తనియుందుం గానఁబడఁడు ♦ తచ్ఛిద్రములన్. ౪౪

క. కని శరమోక్షణమునఁ జ,క్కని లాఘవ మలరువాఁడు ♦ గావుననే స్యం
దన మెక్కి తిరుగువాతని, మనమున నేభీతి లేక ♦ మహితశరములన్. ౪౫

తే. కరము బాధించె; నింద్రారి ♦ కదనమందుఁ
దనదుసారథి తెగుటయుఁ ♦ దన్నునట్లె
వైరి నొంచుటయును గాంచి ♦ బవరమందుఁ
దనకుఁ గల గర్వమును వీడి ♦ దైన్యమొందె. ౪౬ 3959

చ. వనచరయూథనాయకులు ♦ వాసవవైరి విషణ్ణవక్త్రుఁడై
కనఁబడుచుంట మిక్కిలియుఁ ♦ గ్రాలిరి హర్షమునన్ మహాత్ము రా
మునియనుజన్ము స్తోత్రములఁ ♦ బోల నుతించిరి; దానవేంద్రునిం
గనుచుఁ దదీయవిక్రమము ♦ గర్వము నోర్వక యప్పు డేవునన్. ౪౭ 3960

తే. హరివరుల్ గంధమాదనా♦హ్వయుఁడు రభసుఁ
డనఘమతియౌ ప్రమాథియు ♦ నదరి; రట్లు
భయదవిక్రమలు బలయుతుల్ ♦ వారు నలువ
రింద్రజిత్తుని యాటోప ♦ మేచ నెంచి. ౪౮ 3961

క. అరదము లాగెడు ఘోటక,వరములు నాల్గింటి పైని ♦ బడిరి జవమునన్;
గిరిసమతనులగు నవ్వన,చరవీరులు పైన దుముక ♦ సత్వ మెడలుటన్. ౪౯

ఆ. తురగము లవి యూఁగి ♦ తోరపుశక్తిని, జూపఁ జాల కెంతొ ♦ తాపమంది
తమముఖములనుండి ♦ దారుణరక్తంబు, గాఱుచుండ నుండె ♦ గర్వముడిగి.

క. తురగము లవి యవయవములు, పరమాకులతం గనంగ ♦ బడలి యసువులన్
ద్వర వీడి ధరణిఁ గూలెను;, హరివీరులు వార లిట్టు ♦ లాతురగములన్. ౫౦॥

క. హత మొనరించి రథంబున్, క్షితిఁ బడఁగాఁ గూల్చి మరలఁ ♦ జెచ్చెఱ లంఘిం
చి తగన్ నిల్చిరి రాఘవు,నితమ్ము చెంత; నిటు లశ్వ ♦ నికరము తెగినన్. ౫౧॥

తే. సారథియుఁ గూలుటయు నట్టి ♦ స్యందనమును
విడిచి ధరణికి లంఘించి ♦ విశిఖవృష్టి
నిగుడఁ జేయుచు లక్ష్మణు ♦ నిపయి కడరె;
నంత నింద్రోపముఁడు రాఘ ♦ వానుజుండు. ౫౨॥ 3966

చ. తనపయిఁ దీవ్రబాణముల ♦ దారుణరీతిని వైచుచున్ జవం
బునఁ జనుదెంచుచున్ ధరణిఁ ♦ బొందిన రావణిన్ రణాంగణం
బున నిశితాంబకంబులను ♦ భూరితరాస్త్రములన్ మహాబలం
బునఁ బరఁగించుచున్ రిపుని ♦ బొంగు నడంచెఁ గపుల్ బళీ యనన్. ౫౩॥

తొంబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౯౧ - వ సర్గము.

ఇంద్రజిత్తు హతుఁ డగుట.

చ. తురగము లిట్లు గూలుటయుఁ ♦ దోడనె భూస్థలిపైన నింద్రజి
త్తురుతరతేజ మొప్పనటు ♦ లుద్ధతిచే నిలుచుండి క్రుద్ధుఁడై
కరము జ్వలించుచుండెఁ; బటు ♦ కార్ముకముల్ ధరియించియున్న యా
యిరువురు తీవ్రబాణముల ♦ నేచి పరస్పరమున్ వధింపఁ ద
త్తరుణమునందుఁ గోరుచు ను ♦ దగ్రపరాక్రమ మొప్పుచుండఁగన్. ౧॥ 3968

క. వనగజము లట్లు విజయం,బునకై మార్కొనిరి; దనుజ ♦ పూగంబులు న
వ్వనచరబలములు నెల్లెడ, ననిఁ దిరుగుచు నొకరినొక్క ♦ రతులబలములన్.

ఆ. చంపుచుం జెలంగి ♦ సాహసములఁ దమ, యధిపు విడువకుండి; ♦ రంత నింద్ర
వైరి స్వీయదనుజ ♦ వారంబులకు నుబ్బు, గలుగ వారి స్తోత్ర ♦ ములను దన్ని. ౩॥

క. తానలరుచు నిట్లనె; నో, దానవులారా! వినుండు ♦ తమసు ఘనముగా
నానాదిక్కుల నిండెను, గాన నిటన్ స్వపరభటని ♦ కాయ మిదనుచున్. ౪॥

తే. తెలియకున్నది భేద మీ ♦ వలిముఖులను
మోసగింపంగ మీరొక్క ♦ మొగిని నిల్చి
పోరుచుండుఁడు నేనిదె ♦ పోయి యరద
మెక్కి వచ్చెద ననిచేయ ♦ నిచటి కెలమి. ౫ 3972

క. పురి కేను జన దురాత్ములు, హరు లని నాతోడఁ జేసి ♦ యటుపోవుట కం
తరము గలిగింపకుండఁగ, దుర మొనరుపవలయు మీరు ♦ దోర్బలశక్తిన్. ౮

క. అరిహంత రావణియుఁ గ్రక్కున నీరీతిఁ బలికి ♦ పోయెఁ బురికి నా
హరులను వంచించి మహా, త్తరరథ మొక్కండు తేగ ♦ ధైర్యస్ఫూర్తిన్. ౯

చ. అని విజయంబుఁగాంచెడు మ♦హాత్తరతేజుఁడు వానవారియుం
గనకవిరాజితం బగుచుఁ ♦ గాంతమునై తగి ప్రాసఖడ్గరా
జిని మఱి యుత్తమాశ్వములఁ♦చే నలరారుచునున్న స్యందనం
బును హయతత్త్వవేత్తయయి ♦ పొల్చి హితంబును జెప్పఁజాలి నే
ర్పునఁ దగునట్టి సారథియుఁ ♦ బొంకముగా నడపంగ నెక్కెఁ దాన్. ౧౦

క. తన తేజంబున నాస్యం,దనమును వెలుఁగంగఁ జేసి ♦ దానవరాజేం
ద్రునిపుత్రుఁడు కాలునిచే,తను బ్రేరితుఁడగుచు శూర♦దనుజతతులతోన్.

[1]ఆ. కలిసి లంక వెడలి ♦ కడువేగమున వచ్చె, శత్రువీరహంత ♦ శక్రవైరి
జవనవాజినికర♦సంశోభితస్యంద,నమ్ము నెక్కి యలరి ♦ నగరము విడి. ౧౧

క. చనుదెంచి యవ్విభీషణుఁ, డనూనబలశాలి రాము♦ననుజుండును నుం
డినచోటుఁ జేరె మార్గ,మునఁ గను వేగిరపడుచు; నంత ♦ క్షణమాత్రమునన్.

చ. అరదము నెక్కి వేడుక మ♦హాహవరంగమునందునుండి యె
ల్లరఁ గనుమూసి యేగి తన♦లంకను జొచ్చి మహారథంబు నె
క్కి రయముమీఱి వచ్చి తము ♦ గెల్వఁగ నున్న [2]మనీషివర్యు శ
క్రరిపుని గాంచి లక్ష్మణుఁడు ♦ కర్బురసత్తముఁ డాహరీశ్వరుల్. ౧౩ 3799

ఆ. విస్మయంబు నొంది ♦ విమతుని లాఘవ
మును నుతించి; రంత ♦ దనుజనాథ
సుతుఁడు కోప మూని ♦ శతసహస్రములుగఁ
గపులఁ గూల్చె బాణ♦గణము వైచి. ౧౪ 3980

క. సమితింజయుఁడో రావణి, యమానుషంబై యహార్య♦మగు చాపం బా
సమయమున మండలాకృతి, నమరంగాఁ జంపసాగె ♦ నవ్వానరులన్. ౧౫ 3981

చ. దనుజుఁడు క్రోధవేగమునఁ ♦ దమ్ము వధించుచునుండ నోర్వలే
క నిఖిలవానరుల్ తమయ♦ఖండపరాక్రమముల్ కలంగఁగా
వనజభవుం బ్రజాపతిని ♦ వంతఁ బ్రజల్ శరణంబు వేఁడున
ట్లనుపమవిక్రమాఢ్యుఁడగు ♦ నారఘువీరుని జేరి రార్తులై. ౧౬ 3982

ఉ. సంగరకోపవేగమునఁ ♦ జాల జ్వలించి సుమిత్రసూనుఁడుం
బొంగెడు హస్తలాఘవముఁ ♦ బూనికఁ జూపుచు నింద్రవైరిచే
తం గలకార్ముకంబు నొక♦దారుణబాణముచేతఁ ద్రుంచె; న

1 అభ్యయా జ్జవనై రక్షై ర్వః-అనిమూ. 2 లాఘవా త్తస్య ధీమతః-అనిమూ.

ట్లంగద నొంది యింద్రరిపు ♦ నప్పుడ వేఱొకచాపవర్యముల్. ౧౭౪ 3988

క. ధరియించి యెక్కు పెట్టఁగఁ, ద్వరపడి లక్ష్మణుఁడు మూఁడు♦బాణంబులఁ ద్రుం
చె రహిన్ విగతశరాసను, సురరిపుపుంగవుని గాంచి ♦ శుంభచ్ఛక్తిన్. ౧౮౪

ఆ. లక్ష్యశుద్ధి యలర ♦ లక్ష్మణుఁ డాశని,యురమునందు విమధ♦రోగ్రవిషము
వలె వెలుంగు పంచ♦బాణంబులన్ వైచి,నొంచె; నిట్లు లక్ష్మ♦ణుండు పూన్కి.

చ. గురుతరకార్ముకంబునను ♦ గూరిచి వైచిన యాశరంబు లా
శరుతనువుం బగుల్చి యట ♦ సాంద్రతరంబగు నల్ల మున్గి భీ
కరతరరక్తసర్పములు ♦ గ్రాలెడునట్లు చొరంబడెన్ గదున్
ధరణిని; రావణాత్మజుఁడు ♦ తచ్ఛరముల్ కవచంబుఁ జెండినన్. ౨౦౪ 3986

తే. వదనముననుండి రుధిరంబు ♦ వదలుచుఁ గడు
సారవంతము దృఢగుణ♦సంయుతంబు
నైన కార్ముకవర్యంబుఁ ♦ దాను బూని
హస్తలాఘవమున రాము♦ననుజుపైన. ౨౧౪ 3987

క. శరవృష్టి నిగుడఁ జేసెను, బురందరుఁడు వృష్టిఁ గురియు♦పోలిక; నటనా
యరినూదనుండు లక్ష్మణుఁ, డగాతిసుదురాసదమగు ♦ నాశరవృష్టిన్. ౨3 3998

క. మనమునఁ గలవిలపాటుం, గన కల్లన నుడిపెఁ దీవ్ర♦కాండంబుల నొ
య్యన; నత్తఱి గురు తేజుఁడు, ఘనరఘుకులనందనుండు ♦ కదలని కడఁకన్.

క. కలఁతం బొందక వైరికి, నలఘుపరాక్రమము చూపె ♦ నది యద్భుతమై
వెలసెన్ గనువారికి; ని, మ్ముల లక్ష్మణుఁ డంతఁ గ్రోధ♦మూర్ఛితుఁ డగుచున్.

చ అనిఁ దనయస్త్రమోక్షణర♦యంబును జూపుచు నందు నున్న యా
దనుజుల నెల్ల నొక్కొకని ♦ దారుణతీక్ష్ణశరత్రయంబుచే
తను వెఱగందఁ జేసి బల♦దర్పసమగ్రుని నింద్రజిత్తు నొం
చెను శరపంక్తి; నావనుజ♦జిష్ణుఁడు నయ్యెడ నద్భుతంబుగన్. ౨౬ 3991

మహాస్రగ్ధర:—

బలవంతుండై రిపుత్స్మా♦వరుల నడఁచుచున్ ♦ బౌరుషోద్దాముఁడై యి
మ్ములఁ గాంతిం గ్రాలు నారా♦మునిసహజుఁడొగిన్ ♦ భూరిబాణాళిఁ గ్రుచ్చం
గలితక్రోధాత్ముఁడై ల♦క్ష్మణునిశరతతిన్ ♦ గాడఁగా నంతరంబే
తలపోయన్ లేకయుండన్ ♦ దదవసరమునం ♦ దాఁబ్రయోగించెఁ బూన్కిన్.

సీ. సౌమిత్రియాబాణ♦జాలంబు తనునంటఁగా రాకపూర్వమే ♦ ఘోరబాణ
గణములఁ బరఁగించి ♦ ఖండించి యంతట నిలువక ధర్మైక♦నిశ్చలమతి
రథికవర్యుఁడు నయి ♦ రాజిలుచుండుట నానతపర్వమై ♦ యలరుభల్ల
మును వైచి యింద్రజి♦త్తునిసారథిశిరంబు ధరఁ బడఁ జేసె;నం♦తటహయములు

తే. తమ్ముఁ దోలెడు సారథి ♦ ధరణిఁ బడిన
శిక్ష బలిమిని గలఁతను ♦ జెంద కల్లి

మండలాకారములఁ బోయి ♦ మహితరథము
ద్రిప్పె నది గనఁ జిత్రమై ♦ యొప్పె నపుడు. ౨౯ 3993

చ. అతిదృఢవిక్రముండయిన ♦ యారఘురామునిసోదరుండు త
ద్గతిఁ గని తీవ్రకోపమునఁ ♦ గర్బురు లెల్ల భయంపడంగ ను
ద్ధతిఁ దగ వానిగుఱ్ఱముల ♦ దారుణబాణములం గలంచె; న
ట్టితతిని శక్రవైరియుఁ గ♦డింది బలంబున మించుచుండుటన్. ౩౦ 3994

క. తనరిపుఁ డొనరుచు కార్యం,బున కోర్వక తీవ్రకోప♦మును బూనిన యా
తని దశబాణంబుల నొం,చెను సర్పవిషంబుఁ బోలి ♦ చెలఁగి యురుదుగన్.

క. కులిశముతోఁ దుల్యములగు, నలఘుశరంబు లవి సుచిర♦హాటకకాంతిం
జెలఁగెడు లక్ష్మణు కవచము, లలిన్ స్పృశియించి విఱిగి ♦ భూమిం బడియెన్.

తే. రావణునియాత్మజన్మఁ డ♦రాతి మేను
నందు భేదింపఁగా రాని♦యట్టి కవచ
మును ధరించినవాఁడని ♦ మనమునందుఁ
దలఁచి యత్యంతకోపంబు ♦ గలిగి యపుడు. ౩౩ 3997

క. పరమాస్త్రవేగమును నా,యరికిం గనఁబఱచుచున్ మ♦హాపుంఖములౌ
శరముల మూఁడింటను ద,త్పరతన్ గాఁడంగ నేసెఁ ♦ దన్నిటలంబున్. ౩౪

తే. నిటలమున మూఁడుబాణముల్ ♦ నిలిచియుండ
సంగరప్రీతి గలుగు ల♦క్ష్మణుఁడు యుద్ధ
మునఁ ద్రిశృంగాద్రివడువునఁ ♦ గనఁబడియెను;
ఘోరసంగరమున నిట్లు ♦ క్రూరరిపుఁడు. ౩౫ 3999

క. శరములఁ దనుఁ బీడింపఁగ, నురవడి జ్యాలతిక లాగి ♦ యురుమణిభాసుం
దరకుండలరుచిరంబగు, నరాతివక్త్రమున నాటె ♦ నైదుశరంబుల్. ౩౬ 4000

క. శూరులు భీమపరాక్రము, లౌ రాఘవసహజవాస♦వాహులు దృఢమౌ
సారముగల విండ్లను గొని, భూరిశరంబులను వైచి ♦ పొంగెడు కాంక్షన్. ౩౭

క. నొంచిరి యొండొరులను; గడు, మించినశౌర్యమున వారు ♦ మేనులు నల్లన్
ముంచినయటు లొప్పుచుఁ బు,ష్పించిన కింశుకములట్లు ♦ చెలఁగిరి కడఁకన్.

చ. ఇరువురు చాపధారులయి ♦ యేపుమెయిన్ విజయంబుఁ గోరి యొం
డొరులను దారసించుచు మ♦హోగ్రశరంబుల సర్వగాత్రముల్
దురమున బాధనొందునటు ♦ ఘోరపుఁబూనిక గాఁడ నేసి; రా
శరపతినందనుం డపుడు ♦ సంగరకోపముచేఁ బితృవ్యునిన్. ౪౦ 4004

చ. కనుఁగొని చారువక్త్రమున ♦ గాఁడఁగ నేసెను మూఁడుబాణముల్;
దనుజలలాముఁ డింకను ని♦తాంతకఠోరశరత్రయంబు నా

తని మెయి నాటి యందుఁగల ♦ తళ్కు పివర్యల నొక్కరొక్కరిన్
ఘనశర మొక్కటొక్కటిగ ♦ గాఢగతిం బరఁగించి నొంచెఁ దాన్. ౮౧ 4004

చ. గురుతర తేజుఁడై దనుజ♦కుంజరుఁడైన విభీషణుండు శ
క్రరిపునిపైనఁ గోపము ని♦కామము పొంగఁగ దుష్టబుద్ధియై
పరఁగెడు నింద్రజిత్తురథ♦భారవహాశ్వములన్ గదాహతిన్
బొరిఁగొనియెన్; సుతేజమునఁ ♦ బొల్చెడు రావణివాజిసారథుల్. ౮౨ 4005

ఆ. కూలుటయును రథము ♦ కూడ దింకేలని, ధరణిపైకి దాఁటి ♦ యరదమందు
నున్న శక్తి వైచె ♦ బిన్నతండ్రినిఁ జంప;, నాసుమిత్రతనయుఁ ♦ డట్టితఱిని.

క. అడరెడుశక్తి విభీషణుఁ, డడఁగునటం చాత్మ నెంచి ♦ యది గని దానిన్
నడుమనె వాఁడిశరంబులఁ, గడఁగి ప్రయోగింప దశశ♦కలములె యయ్యెన్.

క. పెనుచాప మూని దశగళు,ననుజుఁడు క్రుధ, విరథుఁడైన ♦ యారావణనూ
నునివక్షమునన్ వజ్రం, బనఁ గఠినస్పర్శము లగు ♦ నైదుశరంబుల్. ౮౫

తే. తాఁ బ్రయోగించెఁ; జక్కఁగఁ ♦ దాఁకఁజాలి
కనకపుంఖములగు సాయ♦కంబు లవ్వి
తనువు భేదించుకొనుచు ర♦క్తమున మున్గి
యరుణఫణివరములరీతి ♦ నప్పుడొప్పె. ౮౬ 4009

సీ. అంత మహాబలుం♦డగు నింద్రజిత్తు సంక్రుద్ధుఁడై సమవర్తి ♦ కోరి యొసఁగి
నట్టి శరవరంబు ♦ నారాక్షసుల యంతరమునందుఁ జేనందె ♦ రాఘవుండు
నిర్భర తేజుండు ♦ నిశ్చలవిక్రముం డట్లింద్రజిత్తు బా♦ణాసనమున
నాసాయకవరంబు ♦ ననువుగఁ గూర్పంగఁగని తనకున్ స్వప్న♦మునఁ గుబేరుఁ
డిఁక ముందు రాఁగల♦సకలవృత్తాంతమ్ము లెఱిఁగి దుర్జయమునై ♦యింద్రుఁ గూడి

ఆ. సకలసురులు పూని ♦ సంగరమునకు వచ్చినను దాని తాఁకుఁ ♦ గని భరింప
రాదు గనుక దాని♦రమణ నొసంగియుం,డెను దదంబకంబుఁ♦గొనియెఁ గడఁక.

క. ఇరువురు పరిఘంబులకున్, సరియగు బాహువుల మేటి♦చాపంబుల ని
ర్భరబలముల లాగంగా, మొరసెను క్రౌంచములన్వాన♦ములవలె నవియున్.

ఆ. వీరులైనవారు ♦ వింటియందు దాదివ్య,బాణములను గూర్చి ♦ బలముకొలఁది
గుణములాగుచుండఁ ♦ గోదండములవి తే,జమునఁ బ్రజ్వలించి♦యమరెనపుడు.

చ. ధనువులనుండి యాశరవ♦తంసము లత్తఱి ముక్తిఁ గాంచి చ
య్యన వెలిఁగించుచున్ నభము ♦ నార్భటిమీఱఁగఁ బోయి మోము మో
మును గదియంగఁ దాఁకె; భయ♦మ్ముం గలిగించెడు నాకృతుల్ తగం
గనఁబడు నాశరంబులు ని♦కామము దాఁక జనించు నగ్నియున్. ౯౩ 4013

ఆ. విస్ఫులింగములను ♦ వెదజల్లుచును భయం,కరముగాఁ జెలంగెఁ;♦గాండములవి
యభ్రమందు మిగుల♦నామహాగ్రహముల, భంగిఁదాఁకినూఱు♦పఱియలగుచు.

[1]క. ధరఁ బడియె; జాతరోషులు, ధరణీశాత్మజవదనుజ♦తల్లజసుతు లా
శరము లనిఁ గొట్టుచుండుటం, బరికించి త్రపానివిష్టులయి ♦ బవరమునందున్.

క. నిలిచిరి; పదపడి లక్ష్మణుఁ, డలఘుశరంబైన వారు♦ణాస్త్రము వేగం
బలరన్ గైకొనె; నంతటఁ, గలహంబున సుస్థిరుఁడగు ♦ కర్బురపతియున్. ౧౬

క. అని రౌద్రాస్త్రము సంధిం,చెను నయ్యది పోయి మిగులఁ ♦ జిత్రంబగు నా
తనివారుణాస్త్రమును నొ,క్కనిమిషమునఁ ద్రుంచి వైచెఁ ♦ గడు తేజమునన్.

ఆ. సాంపరాయికమున ♦ జయసుందరుండున్ మహా
తేజుఁడై చెలంగు ♦ దితిజవర్యుఁ
డాగ్రహించి జగము ♦ సంతము నొందించు
వాఁడువోలె మెఱయు ♦ జ్వాలనశరము. ౧౮ 4018

క. పరఁగించె వీరుఁడగు రఘు,వరుఁడున్ సౌరాస్త్ర మేసి ♦ జ్వలనాస్త్రంబున్
ధరఁ బడఁ జేసెను; రావణి, గురుశర మది చెడుటఁ గాంచి ♦ క్రోధవివశుఁడై.

చ. తనరిపునాశనార్థుఁడయి ♦ దారుణమై తగు నాసురాస్త్రముం
గొని పరఁగించె; నాశరముఁ ♦ గోరిక నైన ధనుస్సునుండి చ
క్కని రుచులొప్పు శూలములు ♦ [2]గాఢముసుంఠులు ఖడ్గముల్ గదల్
ఘనతరకూటముద్గర♦కాంచనపరశ్వథముల్ భయాకృతుల్. ౨౦ 4020

క. జనియించి బయలు వెడలెం, గనుచు మహాతేజుఁడైన ♦ క్ష్మానాథసుతుం
డని భీమంబై సకలరి,పునాశకం బగుచు సర్వ♦భూతంబులకున్. ౨౧ 4021

క. వారింపరాని యాసుర,ఘోరశరాస్త్రంబుఁ గాంచి ♦ పొంగెడు మదిలోఁ
గోరిక మాహేశ్వరశర,మారభటిన్ వైచి దాని ♦ నడఁచెం ద్వరఁగన్.

క. ఇరువురకున్ సంగర మా,శరణంబునఁ దుముల మగుచు ♦ దారుణమయ్యెన్
సురపథగతభూతాళులు, పరివేష్టించెను నృపాత్మ♦జు నొక్కమొగిన్. ౨౩

చ. వనచరరాక్షసుల్ చటుర♦వంబులతో భయదంబుగా రణం
బొనరుచుచుండ భూతగణ ♦ మొక్కట నాకసమందుఁ గ్రమ్మి నె
మ్మనముల విస్మయంపడఁగ ♦ మానుగఁ జూచుచునుండె నొప్పె న
య్యని; పితరుల్ మహాత్ములు మ♦హోఘశిలాలము దేవవారమున్. ౨౪ 4024

క. గరుడులు గంధర్వులు న,ప్సరసంగరుఁడు ముందు నుండ ♦ భూపసుతున కె
వ్వరుసను గీడుం గలుగక, పరఁగుత మని దీవన లిడి ♦ భద్ర మొసఁగుచున్.

తే. తన్ను రక్షింప రాముని♦తమ్ముఁ డంత
నగ్నిసంస్పర్శమునమించి ♦ యరి నడంపఁ

---

1 ప్రళితా జాతరోషా చ లక్ష్మణేంద్రజితౌ రణే-అనిమూ. 2 శూలాని చ ముసుంఠ్యశ్చ-అనిమూ.

జాలునొక కాండవర్యముఁ ♦ జాపమందుఁ
బూన్కి సంధించె నలరంగ ♦ భూతతతులు. ౬౬ 4026

సీ. పత్త్రముల్ మంచివై ♦ భాసిల్ల వృత్తాంగమై సుపర్వంబయి ♦ యమలమయిన
సంస్థితి యొప్పంగ ♦ శాతకుంభవిచిత్రితంబయి యెట్టిభూ♦తంబు నైన
నంతం బొనర్పనై ♦ యతిదుర్నివారమై దుర్విషహ్యంబయి ♦ సర్వదాన
వులకు భీతిదమయి ♦ భూరిదారుణఫణివిషమట్లు తీవ్రమై ♦ వెలసి దేవ

ఆ. సంఘపూజితమయి ♦ శరమది యొప్పెను;, మున్ను దేవదనుజ♦ముఖ్యసంగ
రమున భూరితేజుఁ ♦ డమరేంద్రుఁ డాత్మవీ,ర్యమునశక్తి దనర ♦ నాశరమున.

క. దనుజుల జయించె; నసురం,బునను బరాజయము సుంత ♦ పొందనిదగు నా
ఘనబాణము నైంద్రాస్త్రం,బున నభిమంత్రించి పురుష♦పుంగవుఁడు క్రుధన్.

క. వరధనువున సంధించెను;, బరసంఘవిదారణముగు ♦ వరబాణము విం
ట రయమునఁ గూర్చి లయముగు, తరుణంబున లోకముల వి♦దారింపంగన్.

క. పనిఁబూని యున్న యమువలె, వినుతగుణం బెక్కుపెట్టి ♦ వెస దుర్ధర్షం
బనఁబడు శరాసనము వం,చి నియుతిమై లాగె; నిట్లు ♦ [1]సిరి మెఱయంగన్.

తే. వెలయు నాలక్ష్మణుం డిట్లు ♦ విశిఖము పెను
ధనువునం గూర్చి కర్ణంబు♦దాఁక లాగి
తనదు కార్యంబు సాధింపఁ ♦ దగిన వాక్య
మున వచించెను బాణంబుఁ ♦ గనుచు నిట్లు. ౭౨ 4031

[2]క. శరమా! దశరథరాజు కొ,మరుఁ డా రాముండు ధర్మ♦మతి సత్యపథ
స్థిరుఁడును బౌరుషమున నె,వ్వరునుం దనసాటిలేని ♦ వడువునఁ దగు నే ౭౪

క. ఈవాసవారి నీవిపు,డే వధియింపు; మని లక్ష్మి♦ నెసఁగుచు వీరుం
డై వఱలి వైరివీరుల,చేవ నడఁచు లక్ష్మణుండు ♦ చెప్పి నియతిమై. ౭౫ 4033

ఆ. లక్ష్యమలర నాటి, ♦ శిక్షింపఁ జాలిన, యాశరంబు లాగి ♦ యైంద్రమైన
యస్త్రమంత్రయుక్త ♦ మా గతి సంధించి, వైచె నపుడు శక్ర♦వైరిమీఁద.

చ. శర మది కాంతిమంతమయి ♦ చక్క శిరస్కముఁ దాల్చి నత్ప్రభా
కరమగు కుండలద్వయము ♦ గ్రాలఁగ నొప్పెడు వాసవారిదా
శిరమును ద్రుంచి దేహమును ♦ జెందఁగ నీయక నేలఁ ద్రోచె; బం
గరువలెఁ జెల్వమీఱు నల ♦ కర్బురుశీర్షవరంబు చయ్యనన్. ౭౬ 4035

చ. తనువును వీడి రక్తమునఁ ♦ దద్దయుఁ దోఁగుచు ధాత్రిపై ననే
కనఁబడె; రావణాత్మజుఁడు ♦ కమ్రశిరస్కము కత్తళంబునున్
ధనువును దాల్చియుండి యవి ♦ ధ్వంసము కాఁగ హతుండునై జపం

1 లక్ష్మీవాన్ లక్ష్మణో వాక్యమ్-అనిమూ. 2 ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది, పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్-అనిమూ.

బున ధరఁ బ్రాలె; న త్తఱిని ♦ బూర్వము వృత్రుఁడు చావఁగా ముదం
బున సుర లార్చినట్లు కపి♦పుంగవసంఘవిభీషణుల్ తమిన్. ౭౮౪ 4036

క. ధరఁ బగుల నార్చి; రంతట, సురలు మహాత్ములగు మౌని♦సురనాథులు న
చ్చరలున్ గంధర్వులు న, త్తరుణంబున నార్చి రెలమి ♦ తగ వ్యోమమునన్.

చ. దనుజవరుండు కూలుటయు ♦ దానవసేన లొగిన్ జయంబునే
కను కపివీరు లట్టి తమ♦కంబులఁ దమ్ము వధించుచుండఁగాఁ
జనియెను నాల్గుదిక్కులకు ♦ సాధ్వసముం గని; వానరోత్తముం
దనుజులు పాఱిపోవఁ గని ♦ తారును వెంటను బాఱి చంపఁగన్. ౮౦౪ 4038

ఆ. తాళలేక సంజ్ఞ ♦ దప్పి యాయుధములఁ, బాఱవైచి లంకఁ ♦ బట్టిపోయి;
రసురు లెల్ల భీతు♦లయి పట్టసమ్ములఁ, బరశుఖడ్గముఖ్య♦పరికరముల. ౮౧౪

క. ధర వైచి శతములుగ న, త్తరుణంబున నిల్చి దెసలె ♦ తమకుం దిక్కౌఁ
బరికింప ననుచుఁ బాఱిరి;, హరిబాధితులైన కొంద ♦ ఱసురులు భీతిన్.

తే. లంకఁ జొచ్చిరి కొందఱు ♦ లవణవార్ధిఁ
బడిరి కొందఱు దాఁగిరి ♦ పర్వతముల
నింద్రజిత్తటు హతుఁడయి ♦ యిలను గూలఁ
గనిన సురవైరు లందు నొ♦క్కండు గాని. ౮౩౪ 4041

క. కనుపట్టఁ దయ్యె వెలుగ, మునుపుండియు; భానుఁ డస్త♦మును బొందఁగ నా
తనికాంతులు నిలువక యే,గునటులు తమనాయకుండు ♦ కూలినమాత్రన్.

క. *పరుగెత్తిరి దిక్కులకున్;, గురుతేజుం డింద్రజిత్తు ♦ కొంతవడి నిలం
బరిపరిఁ బొరలాడుచు సుర,వరలోకము నందఁ బోయెఁ ♦ బ్రాణములు చనన్.

క. కిరణములు లేని భాస్కరు,కరణిని నిర్వాణపావ♦కక్రియఁ దేజం
బు రయమునఁ బోవఁ గూలెను;, సురరిపునాథాత్మజుండు ♦ క్షోణిం బడినన్.

తే. పీడ లెల్లను నశియించెఁ ♦ బృథ్వియందుఁ
బోయె నట్టు లరిష్టముల్ ♦ పూషుఁ డెండఁ
గాయఁ జొచ్చెను; బాపైక♦కర్ముఁ డింద్ర
జిత్తు తెగినంతఁ బాకారి ♦ చెలఁగె మదిని. ౮౭౪ 4045

క. మునులును సురలును హర్షం,బును బొందిరి; దుందుభిరవ♦ముల్ నభమందున్
వినఁబడియె నచ్చరల న,ర్తనముల్ గంధర్వగాన♦రమ్యధ్వనియున్. ౮౯

క. వినఁబడియెఁ; గ్రూరకర్ముఁడు, దనుజుఁడు హతుఁడైన దేవ♦తలు సుమహర్షం
బును గురియించిరి లక్ష్మణు, వినుతించిరి చిత్రరీతి ♦ వెలసె నదియునున్. ౯౦౪

* స బభూవ మహాతేజాః వ్యపాస్తగతజీవితః-అనిమూ. వ్యపాస్తో విక్షిప్తాంగో గతజీవితశ్చ-అనివ్యాఖ్య.

సీ. జలములు మిగుల ని♦ర్మలములై యొప్పెను దెలివొందె సకలది♦క్కులును దైత్య
దానవుల్ రోమాంచ ♦ మూనిరి; సర్వలోకభయావహుండగు ♦ కర్బురుండు
హతుఁడై నయంతనే ♦ యసురులు గంధర్వదానవుల్ చేరి యు♦త్తలినినుండి
శాంతసంభ్రాంతులై ♦ స్వాంతకష్టమ్ముల మాని విప్రోత్తముల్ ♦ మహినిఁ బ్రీతి
తే. మీఱ విహరింతు రాకని ♦ మించు వేడ్కఁ
బలికి; రంతట హరిసైన్య♦పతులు శక్ర
వైరి మృతినొందఁ గని రఘు♦వరుని సహజు
ననమబలుఁ గని కొనియాడి ♦ రతులనుతుల. ౯౩౪ 4048

క. దనుజేజ్యుండు విభీషణుఁ, డనిలాత్మజుఁడై తనర్చు ♦ హనుమయు భల్లూ
కనివహపతియును విజయం,బును గంటి మటంచుఁ దమిని♦బొంగుచు మదిలోన్.

క. కొనియాడిరి లక్ష్మణు నా,వనచరు లని జయమునంది ♦ వరుసగ సింహ
ధ్వనులం జేయుచు నార్చుచు, ఘనగర్జనములు చెలంగఁ♦గా లక్ష్మణునిన్.

క. పరివేష్టించుచు సేవిం,చిరి; మఱియుం గపులు సంత♦సించుచుఁ దోఁకల్
ధరణిం గొట్టుచు నార్చుచుఁ, గరములఁ దట్టుచును నెల్ల♦కపులు వినంగన్.

తే. ఉన్నవాఁడు సర్వోత్కృష్ట ♦ ముల్లసిల్ల
లక్ష్మణుండని చాటిరి; ♦ ప్లవగు లంత
హర్షచిత్తంబు లొప్ప ♦ నన్యోన్య మొక్క
మొగి సమాశ్లేషకృత్యంబుఁ ♦ దగ ఘటిల్ల ౯౭ 4052

క. పలుభంగుల లక్ష్మణుగా,థలఁ జెప్పుకొనిరి; మహేంద్ర♦నస్యుఁడు తెగుటి
మ్ములఁ జారణాదు లొక్కటఁ, బలుకన్ విని హృష్టులయి సు♦పర్వులు మరలన్.

చ. దనుజునిఁ జంప నెట్టులగు ♦ దారుణవిక్రముఁ డాతఁడొఁ కదా
యని యనుమానమొంది నమ♦రావని కేగి మహామునీశుఁడై
తనరుచు నెల్లవారలకుఁ ♦ దాను బ్రియుంబయి యొప్పు లక్ష్మణుం
డనితరసాధ్యమై ప్రజల ♦ కందఱకుం గడుఁ బ్రాణదంబునౌ
పని నొనరించుటం గనుచుఁ ♦ బర్వెరి విస్మయచిత్తులై దివిన్. ౯౮౪ 4054

తొంబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౯౨ - వ సర్గము.

విభీషణాదులు రాముని యొద్దకుఁ బోయి యింద్రజిత్తుని చావును దెలుపుట.

క. అనుపమశుభలక్షణుఁడయి, తను వెల్లన్ రక్తమందుఁ ♦ దడిసి తగఁగ నొ
ప్పిన లక్ష్మణుఁ డింద్రారిని, ననిఁ జంపి మహాముదంబు ♦ నాత్మం గనియెన్.

క. విలసిత తేజోవీర్యం,బులఁ దగు లక్ష్మణుఁడు వాయు♦పుత్రుని భ ం

బుల కీశు జాంబవంతుఁ గ,పులనితరులఁ జేర్చుకొని యఁపుడు బడలికచేఁ.

తే. అవ్విభీషణుఁ బావని ♦ హనుమ నూను
గొనుచు రణభూమినుండి శ్రాఁట్కుంజరుండు
తపనపుత్రకుఁ డున్నట్టి ♦ ధరణి కరిగె
జనము మీఱఁగ; నంత లక్ష్మణుఁడు భక్తి. 3 4057

క. శ్రీరామునకుఁ మ్రొక్కుచు, స్వారాట్సునమీపమందు ♦ వాచస్పతి నాఁ
గా రహినిఁ బారతంత్ర్యం, బారూఢిగఁ దెల్పి నిల్చె ♦ నంతికసీమన్. ४

క. వీరుండగు లక్ష్మణుఁ డా,శ్రీరామునియంతికంబుఁ ♦ జేరి నులువుగా
ఘోరారివధముఁ దెలిపెను, నేరుపునన్ భక్తిముఖ్యనియతపదములన్. ౫

క. అంతవిభీషణుఁ డారఘు,కాంతునితో లక్ష్మణుం డఖండమతి యనిన్
వింతగ రావణిమస్తక,మంతము నొందించె ననుచు ♦ నార్భటిఁ దెలిపెన్. ౬

సీ. అంత మహావీర్యుఁ ♦ డా రాఘవుండు లక్ష్మణుఁడు శక్రారిని ♦ జంపె నన్న
వార్తను విన్నంతఁ ♦ బ్రబలమౌ హర్షంబునాత్మనుబొందియిట్లనియెఁ; బ్రియస
హోదరా! బాగు నీయుద్ధకృత్యమునకు సంతస మందితి ♦ సమధికమగు
పనిచేసితివి శత్రుపగతుండు చచ్చుట నింక నెల్లరుఁ జచ్చిరే యటంచు

ఆ. నిశ్చయింపు మనుచు ♦ నెమ్మి నింకను వీర్య,వంతుఁడైన యతఁడు సంతసమున
లక్ష్మిచేత వఱలు ♦ లక్ష్మణుశిరము మూ,ర్కొనుచు సిగ్గునొందు ♦ ననుజు నతని.

క. బలవంతముగాఁ దొడపై, నెలమిని గూర్చుండఁ జేయ ♦ నెంచి గురుకరం
బుల నాకర్షించుచు ని,మ్ముగఁ గూర్చుండంగఁ జేసి ♦ మున మొప్పంగన్. ౯

క. అనుజునిఁ బలుమాఱులు చ,క్కనిచూపులఁగనియె; మనుజకాంతుఁ డతఁడుత
మ్ముని శల్యపీడితుని శ,త్రుని దెబ్బల నూర్పుగములతోఁ దగువానిన్. ౧౦౫

క. కని వగలఁ గుంది తా నా,తనినల నిట్టూర్పు లడరఁ ♦ దమ్ముశిర్షం
బును మూర్కొని తద్బాధలఁ, గని వానినడంపఁదల్చియుఁగదురఁగరములన్.

తే. అనుజు మేనెల్లఁ దడవుచు ♦ ననునయించి
యనియె నిట్లని; దుష్కరమైన కర్మ
మును నొనర్చి చక్కని శుభంబు నొనరించి
తివి గదా నాకు లక్ష్మణా! ♦ ధీరవర్య!. ౧౨౫ 4065

చ. తనయుఁడు చచ్చెఁ గాన నిఁక ♦ దానవనాథుఁడు యుద్ధమందుఁ జ
చ్చెననియె యిప్పు డెంచితిని; ♦ జెప్పెద నంత దురాత్ముఁడైన యా
దనుజవరాత్మజుండు తెగెఁ ♦ దప్పక యింక జయంబు నేనుఁ గాం
చినయటులయ్యె; వీరవర! ♦ చిత్రరణంబున నీవు రావణిన్. ౧౩౫ 4066

క. తునిమితివి గానఁ గ్రూరుం, డనఁబడు రావణునిదక్షహస్తము నాభా

గ్యనియతిని ద్రెంచినట్లే, విను మితఁడే మంచియూఁత ♦ వీర! యతనికిన్.
క. *హనుమద్విభీషణులు రణ,మున దుష్కరమైన కార్య♦మును జేసిరి నూ!
దనుజవరుఁడు వీరుండగు, ఘనవైరి త్రిరాత్రములకు ♦ మడియింపఁబడెన్.
తే. ఎట్టులో శ్రమ మొంది యీ♦యింద్రజిత్తు
చంపఁబడియెను గాన నీ♦సమయమందు
శత్రువులు లేనివానిగా ♦ సల్పితి నను
రావణుం డాత్మజుని చావుఁ ♦ దా విని వగ ౧౬ 4069
క. పెనుసేనలతో యుద్ధం,బునకున్ రాఁగలఁడు సుమ్ము; ♦ పుత్రవధను దా
విని తపియించుచు సంగర,మున నోర్వఁగ రాక మిగులు♦మూర్ఛనిఁబూన్కిన్.
క. ఘనసేనాపరివృతు నా,తని సంగరకాంక్షుఁ బొదివి ♦ తప్పక మృతినిం
గనఁజేసెద; సౌమిత్రీ!, యని సాయము గోరఁదగిన ♦ యట్టిఁడవుగదా?. ౧౮
ఆ. అట్టి నీవు వాస♦వారి వధించుట
వలన నింకమీఁద ♦ వసుమతిసుత
ధరణిఁ బొందుటయనఁ ♦ దగు సులభంబుగా
ననియె; రఘువరేణ్యుఁ ♦ డాదరమున. ౧౮½ 4072
చ. అనుజుని నిట్టు లూఱడిలు ♦ నట్టు లొనర్చుచుఁ గౌఁగిలించి స
మ్మనమున సంతసం బొదవ ♦ మాన్యు సుషేణునిఁ బిల్చి పల్కెఁ; నీ
వనఁగఁ జికిత్సలో ఘనుఁడ ♦ వౌదు సుహృజ్జనవత్సలుండు నా
యనుజుఁడు లక్ష్మణుండు రణ♦మందున దేహము నిండ శల్యముల్. ౨౦
తే. తగిలియుండుటచేత బా♦ధలను గుందు
చున్నవాఁ డీతఁ డిబ్బాధ ♦ యుడిగి యెట్లు
సుఖముగా నుండునో యట్టి ♦ చొప్పునఁ గడు
యత్నమునరఁ జికిత్స చే♦యంగవలయు ౨౦½ 4074
సీ. వేగ సౌమిత్రివి♦భీషణులకు మేనఁగలశల్యములఁ దీయ♦వలయు శూరు
లయి తరువులఁ గొని ♦ పునిచేయు భల్లూకవానరభటులకుఁ ♦ గాని యితరు
లెవరెవ రనిచేసి ♦ యిప్పు డమ్ములు గ్రుచ్చుకొన గండ్లు పడుటచేఁ♦గుందువారొ
వారికందఱికిని ♦ వరుసఁగా వేవేగ యత్నంబునన్ సుఖ ♦ మలరఁ జేయు
తే. మనియె; నీరీతి రాఘవుఁ ♦ డనువదింపఁ
గా మహాత్ముఁడు కపియూథ♦కాంతుఁ డాతఁ
డప్డు లక్ష్మణునాసిక♦యందు నుంచి
యోషధిని బెట్టి వాసన ♦ యొప్పఁ జూపె. ౨౩½ 4075
క. దానినువాసనచేతన్, మేనునమును నాటియున్న ♦ మేటిశరములున్

* అహోరాత్రై స్త్రిభి ర్వీరః కథం చి ద్వినిపాతితః-అనిమూ.

గానఁబడవయ్యె వేదన, మానెన్ గాయములు వూడి ♦ మైఁ దనరారెన్. ౨౪౫

తే. అనుషేణుఁడు శ్రీరాము♦నాజ్ఞ నంత
నవ్విభీషణుఁ డాదిగా ♦ నఖిలసఖుల
కగచరోత్తమపంక్తికి ♦ నాదరమునఁ
దాఁ జికిత్స నొనర్చె ను♦త్తమపథమున. ౨౫౫ 4077

క. హృతశల్యుండయి క్షణమున, గతదేహజ్వరుఁడునయి వి♦గతహృద్వ్యథుఁడై
యతులితముద మందెను రా,ముతమ్ముఁ డత్తరుణమందు ♦ ముందటికంటెన్. ౨౬౫

క. జనపతియును సుగ్రీవుం,డనఘుండు విభీషణుండు ♦ నఖిలర్క్షవరుం
డన నెగడు జాంబవంతుఁడు, వనచరులును లక్ష్మణునకు ♦ బాధ లడంగన్.

క. కని యాతఁడు మోదంబును, గని లేచుట కలరి; రంత ♦ గాకుత్స్థవరుం
డును దుష్కరమగు రావణు,తనయు వధంబును నొనర్చి ♦ తనరుటకు మదిన్.

ఆ. సంతసించి యతనిఁ ♦ జక్క బహూకరిం,చెను ప్లవంగబలప♦తిని కరములు
శక్రవైరిమృతికి ♦ సమధికప్రీతిని, గాంచి కేళి సల్పె ♦ నంచితముగ. ౨౮౫

తొంబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౯౩ - వ సర్గము.

ఇంద్రజిత్తు మృతికై రావణుఁడు విలపించుట.

క. అంతట దానవవరుని ని,శాంతంబున నున్న యతని♦సచివులు తొలుతన్
వింతపడఁ జాలు రావణి,యంతంబును విని కడింది ♦ వ్యథలం గనుచున్. ౧

క. దనుజేంద్రునకుం దెలుపం,గను బూని మహాసురేంద్ర! ♦ కడుఁ దేజమునం
దనసాటిలేని నీతన,యు నింద్రజిత్తుని మహాత్ము ♦ యుద్ధమునందున్. ౧౫ 4083

క. మేమెల్లఁ జూచుచుండఁగ, రామానుజుఁ డతులమహా ప♦రాక్రమము దగం
గా మన విభీషణుని యు,ద్ధామసహాయమునఁ జంపె ♦ దానవనాథా!. ౨ 4084

క. అని నపజయమన్న నెఱుం,గని శూరుం డింద్రజిత్తు ♦ కలహంబున న
ట్టి నరపతితనూజునితో, నని యొనరిచి నిహతుఁడయ్యె ♦ నాశ్చర్యముగన్. ౩

చ. సురపతినిన్ జయించి రణ♦శూరుఁ డనం బొలుపొంది మించు నీ
వరతనయుండు లక్ష్మణుని ♦ బాణములం దపియింపఁ జేసి తాఁ
బరమములైన లోకముల ♦ వాసముచేయఁగఁ బోయె; నన్న ని
ర్జరరిపునాయకుండు రణ♦రంగమునం దనపుత్త్రుఁ డిట్లయెన్. ౪ 4086

ఆ. చంపఁ బడియె నన్న ♦ సాధ్వసప్రదమయి
యక్కటా! యటంచు ♦ ననఁగఁ జాలి

దారుణమయి యున్న ♦ తనయుని మృతివార్త
వినినయంత మూర్ఛ ♦ మునిఁగె మిగుల. ౭౫ 4087

చ. దనుజవరుండు పుత్త్రుని వధంబున మున్గిన మూర్ఛనుండి చా
లనిధృతిఁ జాలసేపటికి ♦ లాస్యలి పైఁ బడియున్న దేహ మొ
య్యనఁ గదలించి లేచి తన ♦ యాత్మజుశోకము తీవ్ర వేదనం
గనునటు చేయ నింద్రియుని ♦ కాయము తత్తఱమంద నేడ్చెఁ దాన్. ౭౬ 4088

తే. అక్కటా! దానవబలము ♦ ఖ్యా! మహాత్మ!
ప్రియతనూజ! మహారథా! ♦ పెంపుగల్గు
నసురనాయకుని జయించి ♦ నట్టి నీవు
మనుజుఁడగు లక్ష్మణునిచేత ♦ మ్రందినావె?. ౭౭ 4089

[1]క. తనయా! నీవే క్రోధం,బును గాంచినయెడల విశిఖ ♦ ముల నంతకుఁ గా
లుని మందరశృంగములను, గనుమూసినయంతలోనఁ ♦ గడతేర్తుగదా?. ౭౮

క. మనుజుని లక్ష్మణుఁ జంపుదు,వని చెప్పఁగవలెనె; మఱియు ♦ నాయతబాహూ!
విను మిపుడు నీవు మృతినిం,గని యామునిం జేరినావు ♦ గావున నతఁడున్. ౭౯

క. అతిశయబంధువుఁ డయ్యెన్;, మృతి సంగరమందుఁ గనుట ♦ మించెను శూర
ప్రతతికి సమ్మతమగు పద్ధతియే [2]సురవారమునకుఁ ♦ దగినది యిదియే. ౮౦

చ. కనుక రణంబునం దెగుట ♦ క్రమపథంబగు శూరపంక్తికిన్
మనమునఁ గోరఁగాఁ దగిన ♦ మార్గము దీనికి శోకమంద; నే
జనుఁ డని స్వామికార్యమును ♦ సల్ప హతుండగు నాతఁ డొందు సు
మ్మనితరసాధ్యనాకమును ♦ నట్టిఁడవౌటను శోక మేటికిన్. ౮౧ 4093

క. మునివర్యులు సురగణములు, ఘనులౌ దిక్పాలకులును ♦ గ్రవ్యాదవరుం
డనిఁ దెగెనో యంచు విని నె,మ్మనములఁ గలభీతి నెల్ల ♦ మాని సుఖంబున్. ౮౨

క. కని సుఖముగ నిద్రింపం,గను గల; రిత్తఱుణమున జ ♦ గత్త్రయమును గా
ననసహితధరామండల,మును నాపుత్త్రకుఁ డొకండు ♦ భూమి వదలినన్. ౮౩

ఆ. శూన్యములుగఁ దోఁచు ♦ చుం గనఁబడుచున్న;
వకట! యిం దనయుఁ ♦ డంత మొంద
నంతిపురమునందు ♦ నసురాంగనలయార్త
రవము లొక్క రీతి ♦ వివిధగతుల. ౮౪ 4096

క. వినఁగలను శైలగుహాలం,వనూనయూథేశమృతికి ♦ నాఁడు గజంబుల్
పనివెను నార్తరవంబుల, మనువున నీకేనేమిచేయు ♦ నగు నా కకటా!. ౮౫

---

1 నను వ్యమిషుభిః క్రుద్ధో భింద్యాః కాలాంతకావపి-అనియు. కాలాంతకా యమస్య మూర్తిభేదా-అనిగోవిందరాజులు. కాలః సర్వసంహారకః అంతకః కాలాభిమాని పురుషః-అనిమహేశ్వరతీర్థులు. 2 సంగ్రామసగణేష్వపి-అనియు.

క. అరిసూదనా! సురాగుల, పురమును రాక్షసుల నన్నుఁ ♦ బొగిలెడుతల్లిన్
దరుణీమణియగు భార్యను, సరుదగు యువరాజపదము ♦ నఖిలధనములన్. ౧౩

క. విడనాడి యెచటి కేగితి;, కొడుకా! విక్రమధనాఢ్య! ♦ క్షోణిస్థలినిన్
విడిచి యమాలయమునకున్, వడి నే నేగంగ విధిగ ♦ భక్తి మెఱయఁగన్.

ఆ. ప్రేతకార్యములను ♦ బ్రీతిఁ జేయంగను, దగిన వాఁడవు గద ♦ తనయ! యట్లు
గాక వ్యత్యయమ్ము ♦ గా నొనరించితే, నేను జేయునట్లు ♦ నీకు నిపుడు. ౧౪

చ. తనయవతంసమా! సుసుపు ♦ తద్దయు నామదిఁగల్గు శల్యరా
జిని దొలఁగించు నీవిపుడు ♦ చిత్రముగా నలరామలక్ష్మణుల్
వనచరనాయకుంపు మది ♦ వారని శల్యములౌచునుండఁగాఁ
జనితివె వానిఁ బుచ్చకయె ♦ చయ్యన నమ్మిట పీడ యుక్కటా! ౧౫ 4101

*చ. అని యిటు పెక్కు రీతుల సు♦హార్తిని బొక్కెడు రాక్షసేంద్రు నె
మ్మనమునఁ బుత్రుచావు నగ ♦ మైకొన మిక్కిలి క్రుద్ధుఁడయ్యె; నా
వనజహితుండు నైజముగ ♦ వాఁడికరంబులు గల్గువాఁడె యా
తనిని నిదాఘమందు బహు♦దారుణమూర్తినిగాఁ గరంబులో
య్యన నొనరించునట్లు సుమ♦హంతము కోపముఁడైన రావణున్. ౧౬ 4102

తే. మఱియుఁ గుపితుని జేసె; న♦ తడిని నతని
ఫాలమునఁ గూడు బొమముడుల్ ♦ ప్రళయమందు
వననిధిని నక్రములపొందు ♦ గనినయలల
వలెఁ బ్రకాశించె నెంతయు ♦ భయదములయి. ౧౮ 4103

సీ. ఆతండు క్రుధచేత ♦ నావులింపఁగ వానివదనంబునుండి పూ♦ర్వము భయంక
రాకారుఁడౌ వృత్రు♦నాస్యమునుండి బయలు దేరినట్టు ల♦త్యంత తేజ
మున మండుచున్ ధూమ♦ముననొప్పవగ్ని వెల్వడియె; నాతఁడు పుత్ర♦వధముచేత
సంతప్తుఁడై శూరు♦సముదయువస్యఁ యయ్యును గ్రోధవశమున ♦ మనమునందు
తే. నెంచి సీతను జంపంగ ♦ నిచ్చగించెఁ;
బ్రకృతిచేతనె యెఱ్ఱనై ♦ వరఁగునతని
కన్నులత్తఱి కోపాగ్ని♦కలితములయి
మిగుల భయదంబులై నుండె ♦ మించురుచుల. ౨౦ 4104

చ. అనవరతంబు ఘోరమగు ♦ నాతని యాకృతి క్రోధవహ్నిచే
తను మఱితీవ్రమై క్రుధను ♦ దాల్చిన రుద్రునిరూపమట్లు చెం
తనయినఁ జేరరాక తగె; ♦ దైత్యవరేణ్యుఁడు క్రుద్ధుఁడౌట నా
తనినయనాళినుండి బహు♦దారుణనీటిని జూడ నొప్పుచున్. ౨౨ 4105

* పుత్రస్య పున రాధయః, దీప్తం సందీపయామాసు ఘస్తే౽ర్క మివ రశ్మయః-అనిమా.

తే. మందు దీపయుగంబున♦నుండి జ్వాల
తోడనే తైలబిందుసం♦దోహము పడు
నట్లు లనలంబుతోఁగూడ ♦ నశ్రుబిందు
వులు ధరంబడెఁ బలువిధం♦బులుగ నపుడు. ౨౩౹ 4108

*ఆ. అతఁడు పండ్లు గొఱుకు ♦ నప్పుడు కడురవ, ముద్భవించి దనుజ ♦ లురుతరఘట
యంత్ర మట్టి త్రిప్పు♦నమరునిస్వనమట్లు, వినఁగఁబడుచునుండె♦వితతముగుచు.

క. పెనుకోపంబున లయవ,హ్నినిబోలిన రావణేశుఁ ♦ డేయే దిశలం
గనునో యందందుం గల,దనుజులు భీతాత్ములగుచు ♦ దాఁచుకొని రటన్. ౨౫౹

క. పరమక్రుధఁ బ్రళయంబునఁ, జరాచరంబుల హరింపఁ ♦ జాలఁదలఁచు భీ
కరయముఁ బోలుచు దిక్కులఁ, బరికించెడునతనికడకు ♦ భయపీడితులై. ౨౬౹

చ. దనుజులు పోవరైరి; కడు ♦ దర్పసముగ్రుఁడు రాక్షసేంద్రుఁ డా
త్మను గ్రుధఁ బూని భీతులగు ♦ దానవులం బురికొల్ప నెంచి యి
ట్లనియెఁ దదంతరంబున; స♦హస్రశరత్తులు దుష్కరంబుగాఁ
గనఁబడునట్లుగాఁ దప మ♦ఖండవిభూతిని జేసి భక్తిచేన్. ౨౭ 4110

ఆ. నడుమ నడుమ నియతి ♦ నుడిగెడు తటి బ్రహ్మ, నలరఁ జేసినాఁడ;♦నాతపంబు
కలిమి బ్రహ్మ కరుణ♦వలన నాకున్ భీతి, యసురసురలవలనఁ♦బొసఁగదెపుడు.

చ. వనజభవప్రదత్తమయి ♦ వారిజమిత్రునిరీతి వెల్గు చ
క్కనికవచంబు నాకలరుఁ♦గా యది నిర్జరదానవాళితో
నని నొనరించునప్పుడు మ♦హాకులిశాయతశక్తిపంక్తిచే
తను జెడదయ్యె; నాకవచ♦శల్లజమున్ ధరియించి యుబ్బునన్. ౩౦౹ 4112

చ. అరదము నెక్కి యుద్ధమున ♦ కాయితమై యరుగంగ నన్ను నె
వ్వరు రణవాంఛ మార్కొనఁగ ♦ వత్తురు? తాను పురందరుండు సం
గరమున మార్కొనం గలఁడె; ♦ కర్బురులార సురాసురాళితో
దుర మొనరించుచుండ మును ♦ తోయజసూతియె సుప్రసన్నుఁడై. ౩౧

చ. శరములతో శరాసనముఁ ♦ జాలమహత్తరమైనదాని నా
శరవర! కొమ్మటంచుఁ గృప♦సంధిల నిచ్చెను; రాముఁ దత్సహో
దరునిని జంపుకోసమె ని♦తాంతభయంకరచాపవర్యమున్
ద్వరపడి దానిఁ దూర్యశత♦నాదము లొప్పఁగఁ దెండు పొండనెన్. ౩౩౹

ఉ. శూరుఁడు రావణుండు తన♦సూనువధంబునకై తపించుచున్
భూరితరాగ్రహంబు మదిఁ ♦ బూనుచు లోనఁ దలంచి యప్పుడా
సారసనేత్ర రాఘవుని♦సాధ్విని జేరఁ దలంచె; నంతటన్
ఘోరతరస్వభావుఁ డతి♦ఘోరతనుండగు దానవేంద్రుఁడున్. ౩౪౹ 4115

* యంత్ర స్యావేష్ట్యమానస్య-అనిమూ. యంత్రస్య ఘట యంత్రస్య దానవైరాపీడ్యమానస్య భ్రామ్యమాణస్య-అనివ్యాఖ్య.

క. కనులెఱ్ఱఁగఁ గోపంబునఁ, గనఁబడ దీనుండు నగుచుఁ ♦ గ్రవ్యాదు లొగిన్
దనయెదుట దీననిస్స్వనమునఁ బల్కఁగ వారిఁ గాంచి ♦ మూఢతఁ బలికెన్.

సీ. *నాముద్దుతనయుండు ♦ నాకేశజిత్తు వానరుల వంచింప మ♦నమున నెన్ని
మాయచే సీతను ♦ నాయెడఁ గల్పించి వధియించె యారి త్త♦వస్తువుఁ గొని
యిదియె మీసీతయం ♦ చెల్లవానరులకుఁ గనఁబఱచినవాఁడు; ♦ గాని నేను
క్షత్రబంధుండగు ♦ క్ష్మాపతి ననుసరించినదయి యున్న యా♦సీత నిపుడె
హాత మొనరించిన ♦ నదియ ప్రియంబగు నాదునాత్మకును దా♦నవులకనియె;

తే. నిట్లు సచివులతోఁ బల్కి ♦ యేపుమీఱ
ఖడ్గ మంకించె వేగంబ; ♦ కర్బురేంద్రుఁ
డాత్మజునిశోకమున మది ♦ యాకులమయి
యుండ నతిశయకోపంబు ♦ నొంది యపుడు. ౩౯ 4117

చ. అనుపమపుష్పమాలికల ♦ నందముగాఁ దగి నిర్మలాంబరం
బునఁ దనరారు ఖడ్గమును ♦ నాత్మకరంబున నెత్తికొంచు మం
త్రినికరయుక్తుఁడై తనస♦తీమణు లెల్లను దోడరాఁగ వే
చనియెను సీత యున్నెడకు ♦ సాహస మూని భయంకరాకృతిన్. ౮౦ 4118

చ. దనుజులు రావణుండు చనఁ ♦ దారును సింహరవంబు లొప్ప నా
తనిమది కోపమూనిన వి♦ధంబును గాంచి యిఁకన్ జయించు నీ
యని నని యుబ్బి యొండొరుల ♦ నాదృతిఁ గౌఁగిటఁ జేర్చుకొంచు ని
ట్లనుకొని; రీమహాత్ముని భ♦యంకరరూపముఁ గాంచి యెంతయున్. ౮౧

ఆ. భీతి నొందఁ గలరు; ♦ ఖ్యాతి నొందినయాతఁ
డఖిలలోకపతుల ♦ నని జయించి
నాఁడు గాదె? బహురణంబులఁ బెక్కుశా
త్రవులఁ జంపలేదె ♦ దర్పమలర. ౮౨ 4120

క. లోకత్రయరత్నంబులఁ, బ్రాకటతరశక్తిఁ దెచ్చి ♦ వరభోగములిం
పౌ కరణిఁ బొందుచున్నాఁ, డీకర్బురనాథుశౌర్య ♦ మీతనిబలమున్. ౮౩

క. ధర నెవ్వరికిం గల; దని, సురరిపులు పరస్పరంబు ♦ సారిదిం బలుకన్
గరము క్రుధన్ మైమె తెలియమిఁ, బరుగెత్తె నశోకవనికిఁ ♦ బడఁతిం గనఁగన్.

చ. తనకుశలంబుఁ గోరుసఖ♦తల్లజు లెంతని యూని చెప్పినన్
వినక మహోగ్రహంబుఁ గొని ♦ వేగ కుజుండు నభస్స్థలంబునన్

* త దిదం తథ్య మే వాహం కరిష్యే ప్రియ మాత్మనః, వైదేహీం నాశయిష్యామి క్షత్రబంధు మనువ్రతామ్-అనియూ. వాస్తవార్థము క్షత్రియులనుఁ బరమాప్తుఁడగు శ్రీరాము ననుసరించిన సీతను నిజముగాఁ జంపినయెడల నది నాకప్రియమే. దానవుల కది ప్రియము. కావ నట్లు కనఁబఱచెదనని రావణుభావ మని తీర్థులు. పద్యమున "అది అప్రియంబగు" నని పదవిభాగము చేసిన నాయర్థము తేటపడును. అదియప్రియంబని సామాన్యార్థమున విభజించుకొనఁ దగు.

ఘనతరకోప మూని కడుఁ ♦ గాఱియఁబెట్టెడు వేడ్క రోహిణిం
గనఁ జనునట్లు సీతకయి ♦ క్రన్నఁ బోయి మహోగ్రరూపుఁడై. ౭౫ 4123

తే. రాక్షసాంగనలుం దను ♦ రక్షణంబు
చేయ నిందింపఁ దగని యా ♦ క్షితితనూజ
క్రుద్ధుఁడై మేటిఖడ్గంబుఁ ♦ గొని జవమున
నరుగుదెంచు రావణుఁ గాంచె ♦ నార్తి గదుర. ౭౬ 4124

చ. కరమున ఖడ్గ మూని తన ♦ గాదిలిపుత్రులు పెక్కురీతులన్
దరుణి వధింపఁ గూడదని ♦ యెన్ను గుఱించి వచించుచున్న నా
దర మొకయింత లేక సుర ♦ తల్లజుఁ డెంతయుఁ బూన్కిరాఁగ నా
ధరణితనూజఁ గాంచి మదిఁ ♦ దద్దయు భీతిలి వంతఁ గుందుచున్. ౭౭ 4125

క. విలపించుచు నిక్కరణిం, బలికెన్; దుర్మతి యితండు ♦ పటుకోపమునన్
గలఁగుచుఁ బరుగిడుచున్నాఁ, డలాతమటు గాన రాక్ష ♦ సాధిపుఁ డిచటన్. ౭౮

సీ. నను సనాథను ననా ♦ థనుబోలె వధియింపనున్నాఁడు; భర్తను ♦ సన్నుతముగ
ననుసరించెడునన్నుఁ ♦ గని "నాకు భార్యవు గమ్ము రమింపుమా ♦ కరుణ" ననుచుఁ
బలువిధంబులఁ బురి ♦ కొలిపి నిరాకృతుండయ్యె నిశ్చయముగ; ♦ నట్టివీఁడు
నేను గైకొనమిచే ♦ మానసంబున నిరాశను బొంది యాగ్రహం ♦ బునువిమోహ

తే. మునుబయికొనఁగ ననుఁ జంపఁ ♦ గను ప్రయత్న
ముననె వచ్చినవాఁ డిద ♦ గును ధ్రువంబు;
కత్తి చేఁబూని వచ్చుటల్ ♦ కనఁగ వీఁడు
పురుషసింహుల నాసహో ♦ దరుల ఘనుల. ౮౦ 4127

చ. అనిమొన రామలక్ష్మణుల ♦ నారసి నాకొఱకై వధించు వే
డ్కను గొనివచ్చెనేమొ? యక ♦ టా! యలరాట్సుతు లస్మదర్థమై
గనుదురొ యేమొ మృత్యువును; ♦ గంటినె నాయటువంటిదాని సీ;
మనమునఁ బాపనిశ్చయము ♦ మానని రౌద్రుఁడు వీఁడు గావునన్. ౮౧

క. తనయునిఁ గూర్చినశోకం, బున రాము సుమిత్రతనయుఁ ♦ బొకార్పఁగ లే
క నను వధింపఁగ బూనునొ?, హనుమంతుం డపుడు చెప్పి ♦ నట్టి పలుకులన్.

క. మనమున నాలోచన చే,యను జాలని దానఁగాన ♦ నాత్మహితము లీ
తని నుడులని వినలైతిని;, నగిందితను నేను నప్పు ♦ డనిలజునుడులన్. ౮౨

క. విని యతనివీఁపు నెక్కియె, చనియుండిన నాథుఁ జేరి ♦ చక్కనియంకం
బున నుండుఁ గాన దుఃఖం,బును దుం బొందకుందుఁ ♦ బో; యదితప్పెన్.

చ. అనిమొన రాక్షసేంద్రహతుఁ ♦ డయ్యెను రాముఁ డటంచు విన్నచోఁ
దనయుఁ డొకండె యాట వని ♦ తామణి కోసలరాజపుత్రి యే

వనటఁ గృశించునో యిచటి ♦ వార్తయె గుండెఁ బగుల్చునంచు నా
మనమున నెంచెదన్; మఱియు ♦ మానితశీలుని రాముజన్మమున్. ౫౬ 4132

తే. బాల్యమును యౌవనంబును ♦ బరమధర్మ
కార్యముల కనురూపమై ♦ క్రాలుసర్వ
భావమును నాత్మఁదలఁచి యే ♦ వ్వఁగలదానె;
మఱియుఁ గౌసల్య పుత్రుని ♦ మరణము విని. ౫౭ 4133

[1]క. స్మృతితప్పినదై శ్రాద్ధం, బతనికి నొనరించి తనయు ♦ నాశ వదలి వే
హుతవహునియందో జలనం, యుతకూపమునందో చొచ్చు ♦ నూహానిజ మదా.

తే. కుబ్జమంథర! యిస్సిరో ♦ కూలిపోవు
గాక; పాపమునందె ని ♦ క్కముగ మనను
గలిగి దుర్మార్గురాలయి ♦ వెలయుదాని
వలననే యత్తగారికిఁ ♦ గలిగె వెతలు. ౫౯ 4135

చ. అని విలపించుచున్ సరసి ♦ జారిని భాసి కుజగ్రహంబుచే
తను గదుఁ జిక్కి చింతిలెడు ♦ తారను రోహిణిఁ బోలి యక్కటా
యనఁదగియున్నసీతఁ గని ♦ [2]యంతట రావణుమంత్రి చిత్తశు
ద్ధినిదగువాఁడు సంతతమ ♦ తిస్థిరతం దగువాఁడు ధీరుఁడున్. ౬౦ 4136

తే. మఱియు మేధావియును నయ ♦ మహిఁ బ్రసిద్ధుఁ
డౌ సుపార్శ్వుఁడు సచివులి ♦ య్యది యనయము
మనుచు వారించుచుండినఁ ♦ జని దశాస్యు
సంతికముఁ జేరి యతనికి ♦ ట్లనియెఁ బేర్మి. ౬౧½ 4137

క. దనుజేంద్రా! సాక్షాత్తుగ, ధనపతికిన్ సోదరుఁడవు ♦ ధర్మవిదులలో
ఘనుఁడవు నీవిటుధర్మం,బును బాడొనరించి క్రోధ ♦ మునకున్ లోనై. ౬౨

క. జనకజ నెట్లు వధింపన్, మనమునఁ గోరెదవు? ♦ వీరమండన వేదా
ళిని నేర్చి విద్యలందున్, ఘనపాండితి గలిగి మఖము ♦ ఖస్నాతుఁడవై. ౬౩ 4139

క. హితకర్మనిరతుఁడవె యై, క్షితివిస్తృతమైన ఖ్యాతిఁ ♦ జెలఁగెదు నీకీ
యతివను జంపుతలం పే,వితమునఁ గల్గినది? దనుజ ♦ వీరపతంసా!. ౬౩½ 4140

చ. జనకజ చాలరూపవతి ♦ సన్నుతశీలయుఁ గాన నీవశం
బున నిఁక నుండునట్టి విధ ♦ ముం దలపోయుము నీదుకోప మా
జనపతియందె చూపు; మిదె ♦ సర్వసురారిమహేంద్ర! నేఁడు నీ
వని నొనరింప సిద్ధమగు ♦ నట్టిప్రయత్నము చేయఁగాఁ దగున్. ౬౪½ 4141

సీ. అసితపక్షంబిది ♦ యందుఁ జతుర్దశియగుఁ గదా! నేఁడు ప్ర ♦ యత్నమునకు
మంచిది రేపేయు ♦ మావాస్యయగు నందు సకలవాహినులతోఁ ♦ జక్కఁగూడి

---

1 నిరాశే నిహతే పుత్రే దత్వా శ్రాద్ధ మచేతనా-అనిమూ. 2 అమాత్యో బుద్ధిమాన్ శుచిః, సుపార్శ్వో నామ మేధావి రాక్షసో రాక్షసేశ్వరమ్-అనిమూ.

విజయమొందుటకయి ♦ వెడలుము; [1]శూరుండవై బుద్ధిమంతుండ♦వై మహారథుఁడవయి ఖడ్గివై ♦ తేరంపురథ మెక్కి దశరథసూనువ♦ధమున నీవు

తే. జనకతనయాకృపంగనఁ ♦ జాలు దిట్టి
లిపుడు సీతను జంపిన ♦ నేమి ఫలము?
నాఁగ దుర్మతి వీర్యాఢ్యుఁ♦డై గరిష్ఠుఁ
డైన యారావణుఁడు సుపా♦ర్శ్వాఖ్యుఁ డిట్లు. ౬౬ 4144

ఆ. మిగుల ధర్మయుక్త♦ముగఁ బల్కె నమ్మాట, నాదరించి యింటి ♦ కరిగి యంత సచివయుక్తుఁ డగుచుఁ ♦ జనియె సభామండ,పమున కేమిచేయ ♦ బాగటంచు.

తొంబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౯౪ - వ సర్గము.

రాముఁడు మూలబలంబులఁ జంపుట.

క. దనుజవరుం డారావణుఁ, డనుపమసభఁ జేరి దీనుఁ♦డై కడు వగతో
డను గ్రుద్ధసింహము ట్లా,యనుపమసింహాసనమున♦యుం దాకరీతిన్. ౧ 4145

తే. కూరుచుండె నిట్టూర్పులు ♦ గూడఁ బర్వ;
సంతటి మహాబలుండగు ♦ నసురవర్యుఁ
డాత్మభవదుఃఖకర్శితుం♦డై బలాధి
పతుల నూఱడిలం జేయు ♦ మతినిబూని. ౨ 4146

[2]క. కరముల జోడించుచు ని,క్కరణిం బలికెన్; సమస్త♦గజహయములతో
సరదంబులతో వీరని,కరములతో మీర లెల్లఁ ♦ గదలుం డనికిన్. 3 4147

ఉ. మీరలు రాము నొక్కనిని ♦ మించెడుప్రానికఁ జుట్టుముట్టి గం
భీరఘనాళి వృష్టితతిఁ ♦ బెద్దగ వృష్టి నిగుడ్చునట్టు లా
సారముగాఁగ బాణములఁ ♦ జయ్యనఁ జంపుఁడు; కాకయున్న నా
భూరమణాంగముల్ సమర♦భూమిని దీక్ష్ణశరాళిఁ జీల్చెదన్. ౪ 4148

తే. హీనబలుఁడగునా రాము ♦ నెల్లి లోకు,లెల్లఁ జూచుచునుండఁగ ♦ నేవధింతు
వాఁడ; నని పల్కుచున్న రా♦వణునిమాట,లాలకించి వేచనుస్యంద♦నాళి నెక్కి.

క. పలువిధములైన తమబల,ములు వెంబడిరాఁగ యుద్ధ♦మున కేగిరి; వా
రలు దేహమ్ముల మాపెదు, బలుసాధనములను బరిఘ♦పట్టసములనున్. ౬

క. శరఖడ్గపరశ్వధముల, హరివీరుల మీఁద వైచి; ♦ రావనచరులుం
దరువులఁ గొండలఁ గొని ని,ర్జరవైరులపైన వైచి ♦ రయము మెఱయఁగన్.

---

1 హత్వా దాశరథిం రామం భవాన్ ప్రాప్స్యసి మైథిలీమ్-అనిమూ. దశరథసూనువధమున-రామకృతమరణమున ననఁగా రామునిచే నీవుచంపఁబడి రాముని మైథిలిని బొందఁగలవు. వారిసేవకుఁడవు కాఁగలవని వాస్తవార్థమని మహేశ్వరతీర్థులు. 2 రావణః ప్రాంజలి ర్వాక్యమ్-అనిమూ.

తే. ఉరవడించిరి; భాస్కరు♦నుదయ మాది
గాఁగ వనచరరాక్షస♦గణములకును
నమ్మహాయుద్ధ మధికభ♦యంకరముగ
సాగఁగాఁ జొచ్చెఁ ద్రిదశు లా♦శ్చర్య మంద. ౮। 4152

సీ. వనచరరాక్షస♦వరులు పరస్పర మతివిచిత్రములగు ♦ నట్టి గదలఁ
బ్రాసఖడ్గములఁ బ♦రశ్వథమ్ముల గిరితరువులఁ గొట్టుకొ♦ని; రిటు వార
లకుమహాయుద్ధంబు ♦ సకలభూతభయంకరముగ సాగఁగ భూరి♦రజము రేఁగ
నద్దిరక్తప్రవా♦హమ్మున శాంతించెఁ; గుంజరస్యందన♦కూలములుగ
తే. హయములే మత్స్యములుగ ధ్వ♦జాలివృక్ష
ములుగ దేహంబు లెల్లఁ దె♦ప్పలుగ రక్త
నదులు ప్రవహించె; నంతవ♦నచరు లెల్ల
శోణితాపగలం దోఁగు♦చుఁ రణమున. ౧౧। 4153

చ. ధనుజులవక్షకేతనవి♦తానములన్ రథవాజిభూరిసా
ధనముల బల్మిమై నెగరి ♦ తద్దయు దూఁకుచుఁ బైకి నేగుచున్
గనుఁగొనఁ జిత్రమౌ విధము♦గా నటఁ బాడొనరించి; రంతటం
జనక హరీశ్వరుల్ దనుజ♦సంఘశిరోరుహాకర్ణభాలముల్. ౧౩ 4154

తే. నాసికలనొగిఁ దీక్ష్ణదం♦తములఁ గొఱికి
గోళ్ల గీఱియుఁ ద్రుంచిరి; ♦ కోఁతు లొక్క-
దనుజునిన్ నూర్గు రేసి మా♦ర్కొనుచు ఫలన
హితమహీజముఁ బక్షుల♦విధము తోఁప. ౧౪। 4155

తే. మునరి పోరాడి; రంతట ♦ వెన గిరీంద్ర
సదృశదేహులు రాక్షసుల్ ♦ సాధ్వసకర
ములయి పెద్దగనున్న గ♦దలను ఖడ్గ
ములను బ్రాసపరశ్వథ♦ములను బూని. ౧౬ 4156

క. వచరులం బ్రహరించిరి;, దనుజావళి యిట్లు చంపఁ ♦ దాళఁగ లేమిన్
జని వే రక్షకుఁడగు రా,ముని మఱుగుం జొచ్చెఁ గీశ♦ముఖ్యబల మొగిన్.

క. అంత మహాతేజుఁడు నృప,కాంతుఁడు విక్రమము మెఱయఁ♦గాఁ జాపంబున్
సంతసమునఁ గొని తద్బల, మెంతయు ధైర్యమునఁ జొచ్చి ♦ యేచినకినుకన్.

క. శరవృష్టిం గురియించెను;, ద్వరఁగా రాముండు దనుజ♦బలముం గనుచుం
జొరఁబడి భయంకరుండై, శరవహ్నిం గాల్చుచుండు♦నమయమునందున్.

తే. అంబరంబున గ్రీష్మర్తు♦నందు మేఘ
ములు రవిం బోలె నారాచ♦మూర్తి నసురు
లంతికంబున కేగంగ ♦ ననువుపడక
యుండి; రంతట రాఘవుం ♦ డుద్యమమున. ౧౯ 4160

క. ఒరుల కశక్యములు భయం,కరతరములు నైనయట్టి ♦ కార్యంబుల నం
గరమున రాముఁడు చేయఁ గ,నిరి పిదపన్ ముందుఁ జూడ♦నేర రసురులున్.

చ. దనుజులు రాముకార్యములఁ ♦ దారు కనుంగొనకుండెకాక పెన్
వనమున వాయుకృత్యముల ♦ భంగి నెఱింగియు వాయురూపమున్
గనని తెఱంగునన్ నృపతి♦కాంతుఁడు సంగరహస్తలాఘవం
బునఁ జెనుసేనఁ దోలుటయు ♦ భూరిరథంబులఁ జెండుచుంటయున్
గనఁబడుచుండెఁగాని యటఁ ♦ గర్త గనంబడఁడయ్యె వారికిన్. ౨౧ 4162

సీ. ఛిన్నమై భిన్నమై ♦ శితశిలీముఖహవ్యవాహనదగ్ధమై ♦ భగ్నతరము
నయి శస్త్రపీడితం ♦ బయియున్న సేనను గాంచిరే కాని శీ♦ఘ్రమునఁ గృత్య
ములఁ జేయుచున్న రా♦ముని గనలేకుండి ర త్తఱిఁ; బంచభూ♦తాత్మకమగు
సంగంబునందలి ♦ యాపరమాత్మను బ్రజ లింద్రియవిషయ♦వారమందుఁ

*తే. బ్రేరకత్వముచే నుండు♦రీతి నెఱిఁగి
యతనిఁ బ్రత్యక్షముగఁ గన♦నట్లు రాముఁ
డంగములఁ బ్రహరింపఁగ ♦ నాశనస్థితి
నెఱిఁగిరే కాని కన్నుల ♦ నెఱుఁగరైరి. ౨౩ 4163

క. శరవేగంబున శ్రీరఘు,వరుఁ డబ్బాణములఁ జరించి ♦ వధియింపఁగ న
త్తరుణమున రాక్షసులుత,ద్ధరణిని నతఁడుండు ననుచుఁ ♦ దలఁచుచు నచటన్.

చ. కనఁబడురాక్షసున్ నృపతి♦కాంతునిగాఁగ భ్రమించి వీఁడె హ
స్తినికరమున్ వధించెడిని ♦ దెంపున వీఁడిట రాఘవుండు స్యం
దనవరరాజిఁ జూర్ణముగఁ ♦ దానొనరించెడి వీఁడుగో లస
త్సునిశితబాణసంఘములు ♦ సోఁకఁగఁ జేసి పదాతివర్గమున్. ౨౪ 4165

తే. చంపుచున్నాఁడు హయములఁ ♦ జంపుచున్న
వాఁడటం చార్భటించుచు ♦ భ్రమసి యచటఁ
గలుగుసాదృశ్యమునను యొ♦క్కరుని నొకరు
రాముఁడను కోపమునఁ బరా♦క్రమము మెఱయ. ౨౫ 4166

క. దనుజులు పరస్పరము త,మ్మును దారే చంపుకొనిరి; ♦ మూర్ఖులు దనుజుల్
ఘనతరమైనప్రభావం,బునఁ దగి గాంధర్వ మనఁగఁ ♦ బొలిచి యనమమై. ౨౬

క. తనరెడునయ్యస్త్రవరం,బున మోహితులగుచు సైన్య♦మును గాల్చెడు రా
మునిఁ జూడఁ జాలరై ; రా,దనుజులు సంగరమునందుఁ ♦ దగువిభ్రాంతిన్.

తే. కనిరి రామసహస్రము♦లను మఱలను, నన్నుహోహ నముందె యా♦యసనునందె
యొక్కనినె రామునింగని;♦రుగ్రమూర్తి,యైన రాఘవుఁడాసేన♦యందుమిగిలి.

* ఇంద్రియార్థేషు తిష్ఠంతం భూతాత్మాన మివ ప్రజాః-అనిమా.

సీ. గతివిశేషమ్ములు ♦ గన్పడఁ దిరుగంగఁ గాంచనమయమగు ♦ కార్ముకవర
కోటియుఁ దిరుగుట ♦ వాటంబుగాఁ ద్రిప్పఁబడుచున్నకొలఁ దివియు♦వలెనొకటిగఁ
గనఁబడె రాముఁడు ♦ కనఁబడకయెయుండెఁ;దనువె నాభిగనున♦త్వంబె జ్వాల
గను శరంబులె శలా♦కలుగను భ్రమియించుకార్ముకంబే చుట్టుఁ ♦ గ్రాలునేమి
గను జ్యాలతస్వన ♦ మనుపమధ్వనిగను దగుపరాక్రమ మక్ష♦ముగను దేహ

తే. కాంతి ప్రభగను దివ్యాస్త్ర♦గణమె ధార
గను జెలంగఁగఁ జక్రము♦కరణి నసుర
వధ మొనర్చెడు రాముని ♦ బ్రజలు గనిరి
కాలచక్రముగా మహో♦గ్రంబు మమర. ౩౦ 4170

సీ. శ్వసనవేగముగల ♦ స్యందనవర్యమ్ములేడుకోటులు లక్ష ♦ లిరువది పయిఁ
దొమ్మిదియును వేగ ♦ సమ్మిళితేభముల్ పదుమూఁడుకోటు లా♦పయిని లక్ష
లెన్నఁ బండ్రెండును ♦ నిరువదివేలునురౌతులతోఁ గూడి ♦ రాజిలెడు మ
హాశ్వముల్ పదికోటు ♦ లట్లిరువదిలక్ష లఱువదివేలు మ♦హాబలాఢ్య
భటులెన్న నూట న♦ల్వదియేను కోటులు నెనుబదిలక్షలు ♦ నిట్లు రామ

ఆ. తనువులైన దనుజ♦సల్లజ చతురంగ,బలము లగ్నిశిఖల♦వంటి రాము
దారుణాంబకముల ♦ దగ్ధమయ్యెఁ ద్రిపాద,కలితములగుమూఁడు♦గడియ లకట.

క. హతశేషులైన దనుజులు,హతవాజిస్యందనులయి ♦ హతకేతనులై
గతమోదులగుచు లంకకు, నతివేగము పోయి; రప్పు ♦ డాయనిస్థలియున్.

క. కరిహయసుభటులు చావఁగఁ, బరనుక్రోధమున నున్న ♦ భవుక్రీడాభూ
మి రహిన్ భయదాయకమై,పరగెన్ విక్రమము భూమి♦పతి చూపుటచేన్.

తే. సురలు గంధర్వసిద్ధులు ♦ పరమమౌను
లపుడు రామునికృత్యము ♦ లద్భుతముగ
బాగుబాగని పేర్కొనుచుఁ ♦ బలికి సన్ను
తించి; రమ్మహాత్ముఁ డా♦ధీరుఁ డంత. ౩౪ 4174

క. తనచెంత నున్న సుగ్రీ,వునిని విభీషణు ననిలభ♦వుని భల్లూకేం
ద్రుని జాంబవంతుహరివ,ర్యుని మైందున్ ద్వివిదుఁగాంచి♦యొప్పుఁగఁ బలికెన్.

తే. క్షణములో నిట్లు సేనల♦గణము రూపు
మాపు టరయంబుగఁ గాదిది ♦ మాయచేతఁ
దగినరీతి నస్త్రము వైచు♦వారుణంపు
శక్తిచేతనె యీదివ్య♦శక్తి వినుఁడు. ౩౬ 4176

క. కలదిల నాకును మఱియును, విలయంబున నీశ్వరునకు ♦ వెలయు నొరులకుం
గలుగదని పల్కి; నింద్రుని,వలె నలరుచు నస్త్రశస్త్ర♦వారమహిమచేన్. ౩౭

చ. ఘనుఁడయి సాధుచిత్తుఁడయి ♦ క్రాలు రఘూద్వహుఁ డాశరాళి న
ట్లనిఁ బడఁ గూల్చి యొప్పుటకు ♦ నయ్యను రేజ్యలు సంప్రహృష్టులై
వినుతి యొనర్చి రిప్పునిని ♦ విక్రమసంపద నిట్లు చేయ నిం
క నెటులు సాధ్యమౌ నరయఁ♦గా ధర నొండులకంచు వేడుకన్. ౩౯ 4178

తొంబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౯౫ - వ సర్గము.

రాక్షసాంగనలు విలపించుట

సీ. తురగసంఘములు కో♦తులు వేనవేలుగ హస్తిగణంబులు ♦ నట్లు కేత
నాలంకృతంబులై ♦ యగ్నివలెం గ్రాలునరదముల్ శూరులై ♦పరిఘగదలఁ
బూని యుద్ధముచేయఁ♦గా నేర్చి కాంచనధ్వజచిత్రములచేతఁ♦దగి మఱియును
గామరూపులునయి ♦ భీమబలంబుల నొప్పురాక్షస ♦ లోకము హతా ర్త
తే. మునని రాముఁడు వైచిన ♦ కనకభూషి
తాతిదారుణబాణాళి ♦ నంత మొంది;
రిట్లు రావణుఁ డంపిన ♦ యెల్లభటులు
చావ హతశేషులైన రా♦క్షసులు భీతి. ౧ 4179
క. చని లంకఁ జొచ్చి యందలి, దనుజులతోఁ జెప్ప వారు ♦ తన్మాలబలం
బనిఁ దెగుట వినుచుఁ గనుచున్,దనుజాంగన లెల్లఁగూడఁ♦దారుఁబొగులుచున్.
క. వనటన్ మున్గిరి; దనుజాంగనలంతటఁ బతులు చావఁ♦గాఁ దనుజాతుల్
చనివిలయమొంద బాంధవు,లనిఁ దెగనొకచోటఁగూడి♦యార్తిఁ బొగులుచున్.
క. విలపించి రిట్లు; రావణు,చెలియలు శూర్పణఖ వృద్ధ ♦ చెలువు దొలఁగిన
ట్టులు దగునాకృతి గలదియు, నిలఁ దాఁకం గడుపు ర్రేల ♦ నింపుగనినదా. ౪
తే. ఇట్టి దక్కానసంబున ♦ నెలమి మదను
నట్లు చక్కనివాఁడయి ♦ యధికబలుఁడు
నగుచు సుకుమారుఁడయి హిత ♦ మఖిలభూత
ములకు నొసఁగెడు రాముని♦ట్టులుగఁ గనియె. ౫ 4183
చ. అనయము లోకనింద్యయయి ♦ యట్లు కురూపిణియైన రాక్షసాం
గన యిది రాముఁ గోరెనఁట ♦ కష్టగుణం బొకటైన లేని దీ
దనుజ మనోజ్ఞసద్గుణవి♦తానుఁడు రాముఁడు వీర్యశాలి మో
మున రుచివెల్గువాఁ డిది య♦ముగ్ధతరాస్యయె యూను జూడఁగన్. ౬ 4184
క. దనుజాంగన యిది రాముఁడు, మనుజుండగునట్టివాని ♦ మదిఁ గోరె నటో
కనుఁగొనఁగా ముదుసలితన,మునఁ దెల్లనివెండ్రుకలును ♦ ముడుతలును తగన్.
చ. కనుఁగొనరాని రూపమును ♦ గల్గినశూర్పణఖాఖ్య యిద్ది యీ
దనుజులభాగ్యహీనతను ♦ దానవతల్లజులౌ ఖరాదు ల

య్యనిమొనఁ జావు నొందుటకు ♦ హాస్యముచేయఁగఁ జాలి లోకనిం
దనుగని చేయరానిదయి ♦ నాశకరంబును నైనకృత్యముల్. ౯౪ 4186

క. ఒనరిచె రామునిఁ గోరుచుఁ, దనుజాతనిమిత్త మిట్టు ♦ లసురేశుఁడు రా
మునితోడ వైరముం గొని, యెను గొప్పగ; రావణుండు ♦ హీనమతియునై.

చ. దనుజవధార్థమై నృపతి♦తల్లజుభార్యను బల్మిమీఱఁ దె
చ్చెను బలవంతుఁడా నృపతి♦సింహునితోడను దీర్పరానిదై
కన నతిదారుణంబగు ప♦గం దనయంతన సంగ్రహించినాఁ
డనుపమలక్షణాఢ్యయగు ♦ నాజనకాత్మజ యెన్నిభంగులన్. ౧౨ 4188

క. వీనిం గోరదు మనమున, నైనను; బూర్వమున సీత ♦ నాత్మహరింపం
గా నెంచి వేఁడునాతని, దానవుని విరాధు నొకఁడె ♦ ధాత్రీశుఁ డనిన్. ౧౨౪

క. తునుముట చూచిన మన కా, తనివధమే పూర్ణమగు ని♦దర్శనము గదా;
వినుఁడు జనస్థానంబున, దనుజులు పదునాల్గువేలు ♦ దారుణకృత్యుల్. ౧౩౪

చ. అలరుచునుండ వారిఁ గని ♦ యగ్నిశిఖాసదృశాంబకంబులన్
గలనునఁ జంపె; రాముఁ డటఁ ♦ గంజసఖోపమబాణపంక్తి ని
మ్ముల ఖరదూషణాసురుల ♦ మూర్ధుని నాత్రిశిరున్ వధించెఁగా
గెలుచును రాముఁడే యనఁగఁ ♦ గృత్య మదే తలఁపంగఁ జాలదే. ౧౫

సీ. మఱియు రక్తమెగ్రోలు♦మనుజాశనుండగు నాకబంధుఁడు రోజ♦నాయతభుజుఁ
డయిక్రోధమునను భ♦యంకరంబుగ నార్చుచుండంగఁ జంపె; ని♦ట్లొకఁ డట్టి
కార్యముచేయుటఁ ♦ గన రాముఁడే గెల్చుననుట కీదృష్టాంత ♦ మరయఁ జాలు;
గురుబలుండయి మేరు♦గిరిసమానుఁడు నగునింద్రనందను వాలి ♦ నేచి చంపె

తే. నిదియు రాముఁడె గెల్చు న♦హీనశక్తి
ననుటకుం జాలుదృష్టాంత; ♦ మరయదీనుఁ
డగుచు భగ్నమనోరథుం ♦ డగుచు ఋష్య
మూకముననున్న యక్కపి♦ముఖ్యు రవిజు. ౧౬౪ 4192

చ. ఘనమతియైన రాఘవుఁ డ♦ఖండకపీశ్వరరాజ్య మేలఁగా
నొనరిచె నీయుదాహరణ ♦ మొక్కటి చాలును రాముఁడే జయిం
చునని వచింపఁగా; మఱియు ♦ శుభ్రయశుండు విభీషణుం డొగిన్
దనుజహితంబు సర్థమున ♦ ధర్మమునుం గలిగింపఁ జెప్పినన్. ౧౭౪ 4193

తే. యుక్తమైనది మోహంబు ♦ నొందిరావ
ణాసురుఁడు దానిఁ గొనఁడయ్యె ♦ యక్షరాజు
ననుజుఁ డవ్విభీషణుమాట ♦ యాలకించి
చేసియుండిన నీలంక ♦ చిత్రతరము. ౧౯౪ 4194

తే. ఆర్తనాదంబులను నిండి ♦ యాత్మకాన

మట్టులుండక యుండుఁగా; ♦ నామహాత్మ్య
చేత గురుబలుఁ డనఁగ వి♦ఖ్యాతుఁడైన
కుంభకర్ణుఁడు హతుఁడయి ♦ కూలుటయును. ౨౦౪ 4195

క. అని దుర్ధర్షుని నతికా,యుని రావణుప్రియతనూజు ♦ నుద్ధతి మీఱం
గను లక్ష్మణుండు దునుముట,యును విని యును రామమహిము♦మురుతరమనుచున్.

క. దనుజేంద్రుఁ డెటుఁగకున్నాఁ, డని; రంతట నాకుమారుఁ ♦ డనిఁ దెగియెనటం
చును నాభ్రాతయు మృతిఁ గనె,ననుచున్ నాపతియుఁ జచ్చె♦ ననుచునిటువలెన్.

క. పురమునఁ గలరాక్షసమం,దిరముల నార్తులయి యేడ్చు ♦ నెలఁతలరవముల్
కరము వినంబడుచుండెను;, దరుణులు దుఃఖమున మఱియుఁ ♦ దత్తరపడుచున్.

సీ. శూరుఁడా రాముండు ♦ భూరిరథంబులఁ గరిహయంబుల భటో♦త్కరములక్షు
లుగ వధించినవాఁడు ♦ తెగి రుద్రుఁడో విష్ణువో సురాధీశుఁడై ♦యొప్పునింద్రుఁ
డో యముండోకాని ♦ యుద్ధంబునకు నిట్లు రాముహాపంబున ♦ రమణ వచ్చి
మనవారినెల్లర ♦ ముందించుచున్నాఁడు గాన మనుష్యుండు♦గాఁడు రాముఁ;
ఆ. డధికవీరులైన ♦ యట్టి మావారెల్ల
హతులై యగుటవలన ♦ నాశ జీవి
తమున వదలి యీభ♦యమునకుఁ దుదిఁ గాన
కయె యనాథలమయి ♦ కడువగలను. ౨౦౮ 4199

క. విలపించుచున్నారము,పలుభంగుల; శూరుఁడైన ♦ పలలాశవరుం
డలబ్రహ్మయిడిన వరముల,కలిమిని గర్వించి భూమి♦కాంతునివలనన్. ౨౦౯

ఆ. ఇపుడు కలిగియున్న ♦ యీఘోరభయమును
దెలియకున్నవాఁడు; ♦ దివిజరాక్ష
సులు పిశాచసంఘ♦ములును గంధర్వులు
నితని బారిఁ బడిన♦యతని ననిని. ౨౧౦ 4201

క. పరిరక్షింపంజాలరు, దురమునఁ బ్రతితరుణమందుఁ ♦ దోఁచెడు దనుజే
శ్వరునకు నుత్పాతంబులు, పరికింపఁగ నింకమీఁద ♦ భయదము లగుచున్.

ఆ. దుష్టశకునము లొగిఁ ♦ దోఁచి రావణునకు
రాముచేత మృతిని ♦ రయము మెఱయఁ
గలుగుననుచుఁ జెప్పఁ♦గలవు; బ్రహ్మయు రావ
ణుని తపస్సు మెచ్చు♦కొని యతనికి. ౨౧౨ 4203

క. దనుజసురరాక్షసులవల,నను భయమే లేదనుచు ఘ♦నంబగు కృపచే
తను వర మిచ్చెను నత్తఱి, మనుజులచేఁ జావకుండ ♦ మనరావణుఁడున్. ౨౧౩

క. వరమడుగఁ డయ్యెఁ; గావునఁ, దరుణంబున నిపుడు దనుజ♦వల్లభునకుఁ గ
ర్బురులకు మర్త్యునివలననె, పరఁగెన్ ప్రాణాంతకర మ♦భద్రము భయముల్.

క. సందియము లేదు చూడఁగ, నిందులకున్; నిర్జరాళి ♦ యీరీతి శతా
నందుం డిడిన వరంబును, బొందుగ మదిలోనఁ దలఁచి ♦ పూనినకినుకన్.

చ. దనుజవరుండు దోర్బలము ♦ తద్దయుఁ గల్గుటఁ బెక్కురీతులన్
ఘనమగు పీడగల్గునటు ♦ గా నొనరించిన నోర్వలేక యు
వ్వనజజుఁ గూర్చి తీవ్రముగ ♦ భాసిలుచున్నతపంబుచేసె; న
వ్వనజభవుం డుదారమతి ♦ వారితపంబున కెంతొ హృష్టుఁడై ౩౨ 4207

ఆ. సురలమేలుకొఱకుఁ ♦ బరికించి వారల
నర్థవంతమైన ♦ యట్టి సూక్తిఁ
బలికె; నేఁడుమొదలు ♦ ప్రబలరాక్షసులును
దానవులును శాశ్వ♦తముగ మీకు. ౩౨½ 4208

తే. పీడ గల్గింప కెంతయు ♦ భీతిగల్గి
ముజ్జగంబులఁ జరియింతు ♦ రొజ్జలఁ గని
భక్తిచేయుదు రనియును ♦ బలికె; నంత
సురలు దేవేంద్రుఁడును గూడి ♦ యరిగి భక్తి. ౩౩½ 4209

క. పరశివుని త్రిపురహారునిన్, సురపాలకు దేవదేవు ♦ శుభనిలయునిఁ గాం
చిరి భూరినుతులనాతనిఁ, గరుణాన్వితుఁ జేసికొనిరి ♦ కడుఁ బూన్కిమెయిన్.

చ. పరశివుఁ డంత వారిఁ గని ♦ పల్కెఁ బ్రసన్నత నిట్లు; రాక్షసో
త్కరముల కెల్ల నంతమును ♦ గల్గఁగఁ జేయు విధూతలామ యొ
క్కరిత జనింపఁగాఁ గలదు ♦ కల్గును మీకు శుభంబులామెఁ యి
ద్ధరణిని బుట్టినంతటనె; ♦ దానవసంతతి నాశనార్థమై. ౩౪½ 4211

సీ. సురలు పంపినయట్టి ♦ సుందరి యీసీత మును దేవతలమృత♦మును గొనంగ
నాఁకలి యెటు దాన♦వావళి మాపెనో యట్లు రావణునితో ♦ నందఱ మన
లను దినఁగలదు; దు♦ర్మనమును దుర్ణయమును గలరావణుం ♦ డొనరఁ జేసి
నట్టి దుష్కృతిచేత ♦ నతిభయంకరదుఃఖమును నాశ మందఱ♦కునిటు మనకుఁ

ఆ. బ్రాప్త మయ్యె; నింకఁ ♦ బ్రళయంబు తఱి యము
బారిఁ బడినయట్టి ♦ ప్రజలకు వలె
రాముబారిఁ బడిన ♦ రాక్షసులకు మన
కభయ మిచ్చునట్టి ♦ యమలమూర్తి. ౩౫ 4212

క. కనఁబడఁ డెవ్వఁడు లోకంబున; వనమున దావవహ్ని ♦ పుట్టి పయికొనం
గను నాఁడు గజమునకువలె, ఘనమగు నీయాపదలను ♦ గనలెదుమనకున్.

క. కనఁబడఁ డెవ్వఁడు రక్షకుఁ, డనఘుండు పులస్త్యమునివ♦రాన్వయుఁడును నై
తనరు విభీషణుఁ డారా, దనకెవ్వరినుండి భయము ♦ తగులునో యతనిన్.

ఆ. శరణుచొచ్చినాఁడు ♦ చాలంగ నుచితమా
పనిని చేసె; ననుచుఁ ♦ బలికి యెల్ల

దనుజకాంత లపుడు ♦ తగఁ బరస్పరబాహా
వులను జాఁచి యొండొ♦రులను నార్తి. ౪౫ 4215

క. పరిరంభములను జేయుచుఁ, ద్వరపడుచు భయాతిశయము♦వలన నలఁగుచున్
బరిదీనలగుచు బిగ్గఱఁ, గర మాక్రోశించి రట్టి ♦ కళవళపడుచున్. ౪౬

తొంబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౯౬ - వ సర్గము.

—❀❀ మహోదరాదిమంత్రులతో రావణుఁడు యుద్ధమునకు బయలువెడలుట. ❀❀—

క. పురమునఁ బ్రతిగేహంబులఁ, దరుణులు కరుణముగ నేడ్వఁ ♦ దన్నిస్వనమున్
సురవైరి రాజు వినియెను;, బర మార్తిని బొంది రనుచుఁ ♦ బరికించె మదిన్.

తే. అంత దీర్ఘనిశ్వాసము ♦ లడర క్షణము
ధ్యానమున నుండి పిదప న♦త్యంతకోప
మున భయంకరమూర్తియై ♦ కనఁబడియె న
తండు; దశనాళి నోష్ఠంబుఁ ♦ దాఁ గఱచుచు. ౨ 4218

తే. క్రోధసంరక్తనయనుఁడై ♦ క్రూరవిలయ
కాలదహనునిఁ బోలుచుఁ ♦ గడు వెలింగి
దనుజులకుఁ గూడఁ జూడంగఁ ♦ దరముగాక
భయముచే వ్యక్తములు గాని ♦ పలుకు లొప్ప. 3 4219

క. తనచెంత నున్నమంత్రుల, ఘనుల మహోదరుని నగ్ని♦కల్పుం డగుచున్
దనరు విరూపాక్షుని న, ల్పనుపమబలుఁడైన యమ్మ♦హాపార్శ్వునినిన్. ౪

క. కనుఁగొని చూపులఁ గాల్చెడు, ననువున నవ్వారితోడ ♦ ననియెన్ సైన్యా
ళిని వేగమ యుద్ధమునకుఁ, జనవలయు మదాజ్ఞ ననుచు ♦ సరగునఁ జెవుఁడీ!.

చ. అనవిన వారు భీతులయి ♦ యాతనియానతి నప్రమత్తులా
దనుజులఁ బ్రోత్సహించిరి; ని♦తాంతభయంకరరూపులైన యా
దనుజులు మంచిదంచుఁ బ్రవి♦దారణమందు శుభంబుగల్గ న
త్యనుపమరీతి నాశిషము ♦ లంది రణార్థము పోయి రంతటన్. ౬ 4222

తరళము దనుజులంతట న్యాయరీతిని ♦ దానవేంద్రుని గాంచి వం
దనముఖంబు లొనర్చి జేనికిఁ ♦ దద్దయున్ విజయంబు గ
ల్గను మనంబులఁ గోరుచున్ గర♦కంజముల్ ముకుళించి చెం
తను వసించిరి; రావణుండు ను♦దారకోపవశంబునన్. ౭ 4223

క. అరిబలము లక్ష్యపెట్టక, యురుదుగ నవ్వుచును నమ్మ♦హాపార్శ్వ మహో
దరుని విరూపాక్షుని గని, పరమాద్భుతభంగి మీఱఁ ♦ బలికెన్ మిగులన్.

తే. ఇపుడు నాచాపమునుండి ♦ యేగి విలయ
కాలభాస్కరసమములౌ ♦ కాండములు లోఁగి
రామలక్ష్మణులను బిత్రు♦రాజపురికిఁ
బంపు నిజమిద్ది; రణమునఁ ♦ బగఱఁ జంపి. ౧౦ 4225

క. అరినిహతులై దివంబున, కరిగిన కుంభశ్రవః ప్ర♦హస్తులకున్ ని
ర్జరనాథవైరిఖరులకుఁ, బరమముదం బేను గూర్తు ♦ వైరులకడఁకన్. ౧౧

సీ. మద్బాణనీరద♦మండలంబులు గ్రమ్మ నాకాశమును దెస ♦ లఖిలనదులు
నంద్రముల్ వెలుఁగంగఁ♦జాలకయుండెడు;నిపుడుచాపమునుండి♦యేపుమీఱఁ
బత్త్రయుక్తములగు ♦ పటుసాయకంబులఁ బరఁగించి కపిముఖ్య♦బలము నెల్ల
భాగభాగములుగ ♦ భంజించి వచ్చెద; స్యందనంబను వాయు♦జవముచేతఁ

తే. జాపవార్ధిసముద్భూత♦సాయకోర్మి,తతుల వానరసైన్యంబుఁ ♦ దగ మథించి
పంపెదను జమువీటికిఁ; ♦ దెంపుమీఱి, నాదుబాహాబలంబునఁ ♦ బ్రోదిచేసి.

క. అరవిరిదమ్ములు గలచెఱు, వరసి మదద్విపము కలఁచు ♦ నట్లుగ నేనా
యరవిరిదమ్ములవలెనే, యరుదగు నాననము లొప్పు ♦ నగపడువారిన్. ౧౪

తే. పద్మకేసరవర్చస్సు ♦ పరఁగ నొప్పు
వానరులసేనలను గూడఁ ♦ బట్టి కలఁచు
వాఁడ; నని నిప్పు వానర♦బలపతు లోఁగి
నాననంబుల బాణంబు ♦ లలముకొనఁగ. ౧౫ 4229

క. ధరఁబడి సనాళకమలో,త్కరములు వ్యాపించునట్లు ♦ ధరణిం గాంతిం
బరికింపం దులతూఁగెడు,కరణిం జేయంగఁగలరు ♦ కలహానిపుణులై. ౧౬

క. తరువులఁ గొని పోరెడు వన,చరులను నేనిప్పు డొక్క ♦ సాయకవరముం
బరఁగించి శతము శతముగఁ, బొరిగొందును; యుద్ధరంగ♦మున నిత్తఱిన్.

క. తనయులు భ్రాతలు భర్తలు, వనితల కెవ్వర్తులకును ♦ వైరినిహతులై
చనిరో యాస్త్రీలకు నేఁ, గనుజలములుఁదుడుచువాఁడఁ♦గడుఁబూన్కి మెయిన్.

చ. అనిమొన నాశరానళుల ♦ నక్కపులన్ వధియించి ప్రాణముల్
చన నెటు లెట్టులో పడిన ♦ సాధ్వసదాయకవర్ష్మయుక్తి ధా
త్రినిఁ గడుఁ గప్పి కష్టతర♦రీతిని దానిఁ గనంగఁ జేసెదన్;
గనుఁ డిఁక మాంసముం దినెడు♦కాంక్షఁ జెలంగెడు నక్కగుంపులున్. ౧౯

ఆ. గ్రద్ధ లితరజంతు♦గణములు తృప్తిగాఁ, దినఁగ నాశరాళు♦లను మదీయ
వైరి మాంసములను ♦ నడ్డించి సంతోష, మందఁజేయువాఁడ ♦ నాదరమున.

క. అరదం బలంకరింపుఁడు, త్వరగా నాధనువుఁ దెండు ♦ వైశమ దనుజో
త్కరములు మిగిలిన యవి నా,యరదముతో వచ్చుఁగాక ♦ మునిపలుకుటయున్.

క. దనుజేంద్రునివాక్యంబును, వినిన మహాపార్శ్వుఁ డచట ♦ వెలయు భటాధీ

శరనికరముఁ గాంచి వేగమ, దనుజానీకముల వెడలఁ ♦ దగు నీక ననుచున్.

క. తెలుపుఁడని యాజ్ఞనిడె; నా,పలుకులు విని ప్రబలులైన ♦ భటనాథులు సే
నలఁ బిల్వఁగఁ బ్రతిగేహం,బులకుం జని పిల్వఁ ద్వరిత♦ముగ భటులెల్లన్.

తే. బయలు వెడలమికిం గ్రోధ♦వశగతులయి
వాడవాడలకుం బోయి ♦ పరుసఁ దిరిగి;
రంతట ముహూర్తమునకు భ♦యంకరాస్యు
లయి భయంకరదర్శను♦లయి యాఱుచుచు. ౨౩౪ 4238

సీ. అసిపట్టసములు శూ♦లాయుధంబులు గదల్
ముసలాహ్వయాయుధ♦ములును *ద్విఫల
పత్త్రాగ్రములు గల్గు ♦ పటుతరాయుధములు
తీక్ష్ణధారలుగల ♦ తీవ్రశక్తు
లురుతరకూటము♦ద్గరములు యష్టులు
వరచక్రములు మఱి ♦ వాఁడియైన
వరపరశ్వథభిండి♦వాలశతఘ్నులు
మఱియితరములగు ♦ మహితసాధ

ఆ. నములు చేతులందు ♦ నమరంగ వెడలిరి;, వాహినీశుఁడధిపు♦పలుకుఁ గొనుచు
నరద మష్టఘోట♦కాన్వితమయి నూత,సహితమగుచు నొప్ప ♦ సరగఁ దెచ్చె.

క. తన తేజంబున వెలుఁగుచు, ఘనమగునరదంబు భీతి♦కరుఁ డాతఁడు చ
య్యన నెక్కె; నంత రావణుఁ, డనుపమరక్షోబలవ్ర♦జాన్వితుఁ డగుచున్. ౨౩౬

క. అతిశయబలమున నొప్పుచు, క్షితిభేదించెడు విధంబు ♦ చెచ్చెఱఁ దోఁపన్
మతిమహిమఁ బయనమయ్యెను, నతివేగము; యప్పు డమ్మ♦హాపార్శ్వుండున్.

ఆ. అమ్మహోదరుండు ♦ ననిని దుర్ధర్షుఁడై, తగువిరూపనయనుఁ♦డు గడుఁ బ్రీతి
నధిపునాజ్ఞ నొంది ♦ యరదంబు లెక్కిరి;, వారుసంతసమున ♦ వఱలుచుంట.

క. ధరభేదించెడు తెఱఁగునఁ, గరము భయంకరముగాఁగఁ ♦ గఠినరవము లం
బరమున నిండఁగ విజయా,తురులయి చని రనికి; నుద్ధ♦తుఁడు రావణుఁడున్.

చ. గురుతరతేజ మొప్పఁగను ♦ క్రూరమహాసురసంఘయుక్తుఁడై
నిరుపమచాపముం గొనుచు ♦ నిర్భరశౌర్యము పొంగ నంతకుం
డరయ లయంబునం బ్రజల ♦ నంగఱఁ జంపెడుపోల్కిఁ జూపనై
యరిగె; మహారథుండయిన ♦ యాదనుజేశ్వరుఁ డుగ్రరూపుఁడై. ౨౪౦ 4244

తే. ప్రజవనాశ్వసమాయుక్త♦రథము నెక్కి, యేస్థలంబున రాఘవు♦లెసఁగుచుండి
రట్టి యుత్తరదిక్కున ♦ ననికి వెడలె;, నగ్నుఁ గప్పుచికాంతుఁడై ♦ యులరకుండె.

క. తమసులు దిక్కులఁ గ్రమ్మెను, ఖగ ఘూర్ణిల ఘోరపక్షి♦గణ మఱచెను వే

* గదాభిర్ముసలైర్హస్తైః-అనియూ. హస్తైః ద్విఫలపత్త్రాగ్రాయుధవిశేషైః-అనివ్యాఖ్య.

తను చలియించినరీతిగ, నమరె మహారక్తవృష్టి ♦ నబ్దము గురిసెన్. ౩౭ 4246

క. తురగములు త్రోవలోపలఁ, జరియించుచుఁ గూలఁబడె ధ్వ♦జంబులతుది వ్రా
లె రయంబున గ్రద్దలు భీ,కరముగ నశుభముగ వంచ♦క వ్రజ మఱచెన్. ౩౮

సీ. దనుజేంద్రువామన♦యన పాదరేను వివర్ణంబయ్యె మోము స్వ♦రంబు తగ్గె;
నందుండి రావణుఁ ♦ డనిఁ జేయ వెడలంగ నంతంబు సూచించు♦నట్టి చిహ్న
ము లివి తోఁచెను నభం♦బుననుండి నిర్ఘాతసమనిస్వనంబయి ♦ చాల వెల్గు
నుల్క క్రిందను బడె;♦నుగ్రంబుగా నశుభమును దెల్పుచును గృ♦ధ్రములు కూసె
తే. వానితోఁ గూడి యఱచెను ♦ వాయసములు;
కాలచోదితుఁ డగుట నీ♦లీలఁ దనకుఁ
గనఁబడిన దుర్నిమిత్తము♦లను దలంప
కతఁడు మోహంబునన్ మృతి♦నంద వెడలె. ౩౯ 4248

క. బలశాలురైన యాదను,జులరథఘోషమును వినుచు ♦ సొరిదిఁ బ్లవగసే
నలు యుద్ధము చేయంగా, నిలిచెను; దనుజాఘుకీశ♦నికరము లంతన్. ౪౦

క. ఇతరేతరజయకాంక్షుల, నతికోపంబునఁ బరస్ప♦రాహ్వయముల ను
ద్ధతిఁ బిల్చుచుఁ దుములంబుగ, జతనము మీఱంగ రణము ♦ సల్పెఁ గడిమిమై.

చ. దనుజవరేణ్యుఁ డంతటఁ గ్రు♦ధం గొని వానరసేనఁ జొచ్చి కాం
చనమయబాణజాలములఁ ♦ జయ్యన వైచుచు భూరిసంగరం
బొనరిచె; రావణుండు బల♦మొప్పఁగ నప్పుడు కొంతమందిశీ
ర్షనికర మట్టె త్రుంచెఁ బటు♦శాతశరంబులు వైచుచుం గడున్. ౪౨ 4251

తే. కొంతమందిని మూర్కొన ♦ గుండె లట్టె
నదరఁ గొట్టెను గొందఱ ♦ గదిసి చెవులఁ
దెగఁగఁ గొట్టెను; రావణు♦తీక్ష్ణసాయ
కములఁ గొందఱు పనచరుల్ ♦ కదలలేక. ౪౩ 4252

సీ. ఊపిరులనైనఁ దా♦రొగిఁ బుచ్చఁజాలక హతులైరి కొంద ఱ♦య్యాహవమునఁ
బ్రక్కలు పోవంగఁ ♦ బడిరి, కొందఱు శిరల్ భిన్నంబులయ్యె నా♦విశిఖహతులఁ
గన్నులు పోయె న♦క్కపులలోఁ గొందఱ;కంత రావణుఁ డాజి ♦ నరదమెక్కి
యుండి యేదిక్కున ♦ కుదురుకోపమునఁ గనుల్ త్రిప్పుచు నేగునో ♦ తీవ్రసాయ
తే. కముల వైచుచు నందందుఁ ♦ గలుగు కపులు
తచ్ఛరావళి వేగంబుఁ ♦ దారుసైఁపఁ
జాలకయె పౌరుషము వీడి ♦ సత్వరముగఁ
బాఱిపోయిరి రాక్షసుల్ ♦ పక్కన పగ. ౪౪ 4258

తొంబదియాఱవసర్గము సంపూర్ణము.

౯౭ - వ సర్గము.

విరూపాక్షుఁడు సుగ్రీవునిచే నీల్గుట.

క. దనుజేంద్రునిచే నత్తఱిఁ, దనువులు తెగి యందు నందు ♦ ధరఁబడియుండం
గను యుద్ధభూమి యెల్లను, వనచరశవములను నిండి ♦ భయదంబయ్యెన్. ౧

క. శలభంబులు దీప్తుండగు,జ్వలనుని సైఁపంగలేని♦చందంబునఁ గోఁ
తులు తాళఁగఁ జాలని య,ప్పలలాశనుతీవ్రశరజ♦వము నోర్వకయే. ౨ 4255

క. పరుగెత్తిరి; మఱియును వన,చరు లానిశితాంబకములఁ ♦ జయ్యనఁ దనువుల్
పరిపీడితంబు లౌటను, బరుషములగు వీతిహోత్రు♦జ్వాలలగుములుల్. ౩

క. తనువులఁ గాల్పఁగఁ బఱచెడు,వనగజములరీతి సైఁప♦నలనుపడమి ని
స్వనములతోడం బాఱిరి;,ఘనమేఘంబులను దోలు ♦ గాలివడువునన్. ౪

తరల. దనుజనాథుఁడు కీశసేనల ♦ దారుణాంబకసంతతిన్
బెనురణంబునఁ జిమ్మివైచుచు ♦ వేగమే చనుచుండె; నా
దనుజవీరుఁడు వానరాళిని ♦ దానినిన్ బొలియించుచున్
జని త్వరన్ రఘురామచంద్రుని ♦ సన్నిధానముఁ జేరఁగన్. ౫ 4258

తరల. అనిమొనం బ్లవగేంద్రు లీవిధి ♦ నద్భుతంబుగ భంగముం
గనుచుఁ బాఱుచునుంట నంతటఁ ♦ గాంచి గుల్మమునన్ సుషే
ణుని దగన్ నియమించి సూర్యత♦నూజుఁ డెల్లరు నద్భుతం
బును గనన్ రణముం బొనర్పఁగఁ ♦ బూనె నెమ్మదిఁ గోరికన్. ౬ 4259

క. తనసాటి విక్రమాదులఁ, గనినసుషేణునిని బలముఁ ♦ గావఁగ గుల్మం
బున నునిచి పాదపముఁ గొని, చనియెన్ సుగ్రీవుఁ డరి యె♦సంగెడుక్షితికిన్. ౭

క. హరినాయకునిన్ యూథే,శ్వరు లంతటఁ దారె యుద్ధ♦సాధనముల నా
తరుణమున నీయఁ బెనుభూ,ధరముల వివిధద్రుమములఁ♦దగఁ గొనిత్వరఁగాన్.

ఆ. పార్శ్వపృష్ఠములను ♦ బలములతో వెంబ
డించి చనిరి; కడుఁ గ♦డింది మెఱయ
నాహరీంద్రుఁ డద్భు♦తాంగబలమ్మున
నార్చుచున్ మహాసు♦రాళి నపుడు. ౯ 4262

క. అనిమొనఁ గూల్చుచు నుత్తమ,దనుజులపయి కడరె; నంత ♦ దారుణరూపం
బునఁ దగు నాసుగ్రీవుం, డనిలుఁడు విలయమునఁ బెద్ద♦వగు వృక్షములన్. ౧౦

క. ధరఁబడఁ గూల్చెడురీతిని, సరివైరులఁ బిండిచేసె; ♦ నటవిఁ బతంగో
త్కరములపై మేఘము ప్ర,స్తరవృష్టిని గురియునట్లు♦దనుజావళిపై. ౧౧

*క. గిరివృష్టిని గురిపించెను, హరినాయకుఁ; డంతఁ గపివ♦రాధీశ్వరుఁ డ
క్కరణిఁ గురిపించువృష్టిని, ధరణీధ్రము లశనిహతిని ♦ దగఁ బగులు క్రియన్.

* శైలవర్షం వవర్ష హ - అనియూ.

క. దనుజులశీర్షంబులు తుత్తునియలుగాఁ బగిలి ధరణిఁ ♦ దోడన వ్రాలెన్;
దనుజబలంబులు చయ్యన, వనచరపతిచేత నట్లు ♦ భగ్నము లగుచున్. ౧౨౫

ఆ. హింస నొంది యటువి ♦ యేమియుఁ బ్రతిచేయఁ
జాల కెంతొ యార్తి ♦ సంక్షయంబుఁ
గాంచుచుండుటయును ♦ గాంచి విరూపాక్షుఁ
డని సహింపరాని ♦ యట్టి ధనువు. ౧౩ 4267

క. అనువునఁ గైకొని నామం,బును బల్కుచు రథమునుండి ♦ పొలుపగు వేగం
బున దుమికి గజస్కంధం,బు నెక్కె; సారథికవరుఁడు ♦ పొంగెడుకాంక్షన్.

చ. ద్విరదము నెక్కి నిస్వనము ♦ భీమముగాఁగ వినంబడంగ నా
హరులపయిం జనెం ద్వరగ; ♦ నంత నతండు చమూముఖంబునన్
బరఁగెడు వాలితమ్ముఁ గని ♦ నైజభయంకరభూరిమార్గణో
త్కరమును వైచి దిక్కులకు ♦ దర్లు సురారుల భీతిఁ బాపుచున్. ౧౬ 4269

తే. తృప్తిఁ గలిగించి నిలిపెఁ; గ♦పీంద్రుఁ డట్టు
లవ్విరూపాక్షుతీవ్రబా♦ణాళి నొచ్చి
యధికకోపంబు నొందుచు ♦ నతనిఁ జంప
మనమునఁ దలంచె; నంత న♦వ్వనచరపతి. ౧౭ 4270

క. శూరుఁడు లక్ష్యము మీఱఁగ, వైరిం బ్రహరించునట్టి♦ వాఁడొట మహా
భూరుహమును బెకలించియె, యారాక్షసుపైకి నడరి ♦ యాగజముఖమున్.

క. పరికించి దాన మోఁదెను;, గరివర మది వ్రేటువడుచుఁ ♦ గార్ముకమాత్రం
బరుగుచు వెనుకకు నచ్చుటఁ, గరమార్చుచుఁ గ్రిందఁబడియె♦గళవళపడుచున్.

ఆ. అంతవీర్యవంతుఁ ♦ డావిరూపాక్షుండు, ధరణి వ్రాలినట్టి ♦ కరిని డిగ్గి
జవమువీఱ వృషభ♦చర్మము ఖడ్గంబుఁ, గైగ్రహించి వైరి♦కడకు నిగిడి.

క. స్థిరముగ నిలువంబడు నా,హరివరుపై కరిగి యట్టె ♦ యతిభీతునిగాఁ
గరమొనరించెడులాగున, నరిగె లఘువిక్రమమున ♦ నారవిసుతుఁడున్.

చ. దనుజుఁడు పైకి వచ్చుటకుఁ ♦ దా మదిఁ గోపమునొంది భూరిమే
ఘనిభమహాశిలం గొనుచుఁ ♦ గ్రన్నన వేసెను వానిపైన; నా
దనుజవరుండు విక్రమము ♦ తప్పయుఁ గన్పడవచ్చుచున్న యా
ఘనశిలఁ గాంచి వేతొలఁగి ♦ ఖడ్గముచేఁ బ్రహరించె నాతనిన్. ౨౩ 4275

మ. బలవంతుండగు రాక్షసేంద్రుఁ డలుకం ♦ బాటించి ఖడ్గంబునుం
దలపై వైవఁగ దాని దెబ్బకు ముహూ♦ర్తం బామహావీరుఁ డా
యిలపై వ్రాలినరీతి మూర్ఛఁ గని య♦ట్లే లేచి వేగంబ దో
ర్బల మొప్పారఁగ నమ్మహాహతమునం ♦ బ్రారంభ మేపారఁగన్. ౨౪౫ 4276

ఆ. ముష్టి నలవరించి ♦ దుష్టరాక్షసువక్ష,మందుఁ బొడిచె; దాన ♦ నతఁడు కోప
మొంది తీక్ష్ణధార ♦ నొప్పు నాయసిచేత, వనచరేంద్రుకవచ♦మును రణమున.

క. తునియలుగాఁ బడవైచెను, ఘనమగునావ్రేటునకు ని♦కామం బార్తిం
గని సుగ్రీవుఁడు చరణము,లను జాఁచుకొనుచును బడె ని♦లాస్థలిమీఁదన్.

చ. ధరఁబడి వేగ లేచి కపి♦తల్లజుఁ డాకులిశంబువంటిదా
కరతలసంప్రహారమున ♦ గాఢరవంబును గల్గఁ గొట్టఁగా
సురరిపుఁ డట్టు లాకపియు ♦ శూరతఁగొట్టిన దెబ్బ నట్టులో
నిరుపమశక్తిఁ దప్పునటు ♦ నేర్పునఁ జేసికొనెన్ రయంబునన్. ౨౮ 4279

తే. ఇట్లు తప్పించుకొని యతఁ ♦ డేపుమీఱ
వనచరేంద్రునిఱొమ్మును ♦ గని పిడికిటఁ
బొడిచె; నవ్వానరేశుఁడు ♦ పిడికిటఁ బోడు
వగను దప్పించుకొని వాఁడు ♦ బదులు తన్ను. ౨౯ 4280

సీ. ప్రహరింపఁగాఁ గని ♦ పరమకోపంబున నాతఁ డేమఱియుండు ♦ టరసి యట్టి
తనపెద్దయఱచేత ♦ దనుజుభాలంబునఁ దగునస్థిపైఁ గొట్టె; ♦ దనుజుఁ డంత
వజ్రసన్నిభమగు ♦ వైరితలప్రహారమునకుఁ బ్రస్రవ♦ణముననుండి
జలము స్రవించెడు ♦ చందంబునన్ నల్ల గ్రక్కుచు రక్తసి♦క్తతనుఁ డగుచు
ఆ. ధరణిఁ గూలె; నిట్లు ♦ తనురంధ్రములనుండి
రుధిర మట్టి గాఱ ♦ రోషయుక్తిఁ
గనుల వేగ త్రిప్పు♦చును నోట నురుగులు
వెడల నల్లఁ దొగ్గి ♦ పుడమినిఁ బడి. 3౨ 4281

క. తనవికృతపుఁగన్నులు మఱి,యును వికృతంబులుగ నొప్పు♦చుండన్ భీతిం
గనఁ జేయునట్టి దనుజుని, గని రుభయబలమ్ములందుఁ ♦ గలవారెల్లన్. 33

క. అరియైన విరూపాక్షుం, డురువేదన నెగిరిపడుచు ♦ నుర్వీస్థలిపై
నిరుప్రక్కలఁ బొరలుచును రు,ధిరమున మున్గుచును విన మ♦దింగ్రుపగలుగన్.

క. ధ్వనిచేయుచుండఁ గాంచిరి, వనచరు; లారీతిఁ బ్రకట♦బలములఁ దగునా
దనుజకపిసైన్యజలనిధు, లనుపమగతి నొకటినొకటి ♦ నని మూర్కొనుచున్.

క. చెలియలకట్టల మీఱుచుఁ, జలమున మూర్కొన్న భూరి♦జలరాసు లనన్
గలగుండుపడుచు నార్పులు, చెలఁగన్ బవరంబు నట్టి ♦ చేసెఁ గడంకన్. 3౬

క. హరిపతియు విరూపాక్షుని, నురుబలునిం బొలియఁజేయ ♦ నుబ్బుచుఁ గని యా
హరిసేనలు దుఃఖంబున, సురవైరులుఁ బౌరుషములు ♦ సొరిదిఁ జెలంగన్.

ఆ. గట్టు పొరలి వచ్చి♦నట్టి గంగాప్రవా,హము విధంబుతోఁప ♦ నట్టి పొంగి
యొగిఁ బరస్పరంబు ♦ సుద్ధతి మీఱంగఁ, బోరి రాత్మవిజయ♦ములను గోరి.

తొంబదియేడవ సర్గము సంపూర్ణము.

## ౯౭ - వ సర్గము.

-- సుగ్రీవుఁడు మహోదరునిం బరిమార్చుట. --

క. పెనుసంగరమున నయ్యెడ, వనచరదనుజులభటాళి ♦ వారక యొండొం
టిని జంపుచునుండఁగ జన్యమున వేసవి సరసు విధ♦మున క్షీణించెన్. ౧

చ. తనబలముల్ క్షయింపఁ గని ♦ దానవనాథుఁడు రావణుండు నె
మ్మనమున నాభటాధిపతి♦యుండనుఁడైన విరూపనేత్రుఁ డా
వనచరనేతచేఁ బడుట ♦ వారనికోపము రెండురెట్లుగాఁ
గనఁబడ నుగ్రుఁడయ్యెఁ; గపి♦కాంతులు పౌరుష ముల్లసిల్లఁగాన్. ౨ 4289

చ. బలములనెల్లఁ జంప నవి ♦ ప్రక్షయముం గనుచుంటఁ గాంచి యా
బలుదురమందు దైవము వి♦పర్యయమై తనపట్ల నుంట ని
మ్ములఁ దలపోసి చింతిలుచు ♦ మ్రోలఁ జెలంగుచు శత్రుహంతయై
ఖలుఁడగు నమ్మహోదరుని ♦ గర్వయుతుం గని పల్కె నివ్విధిన్. ౩౫ 4290

*క. వీరా! గురుతరబాహూ', ఘోరంబగు నిట్టితఱిని ♦ గోరిక విజయం
బారూఢిఁ గాంతు నన నా,ధారము నీవనియె నమ్మఁ♦దగు నట్లగుటన్. ౪ 4291

క. అరిసేనలఁ బొలియించుచుఁ, బరాక్రమముఁ జూపవయ్య ♦ భర్తఋణము ని
ర్తరుణమునఁ దీర్చుకొనుటయె,సరియగు నొనరింపుమిపుడు♦సంగరముఁ గడున్.

చ. అన విని రాక్షసేంద్రుఁడగు♦నట్టి మహోదరుఁ డట్లయంచు న
వ్వనచరసేనలో మిడుత ♦ వహ్నిని జొచ్చెడురీతిఁ జొచ్చె; నా
ఘనబలుఁ డుగ్రతేజమునఁ ♦ గ్రాలెడువాఁడయి పొల్చుచుంట నా
తనిపలు కౌదలం గొని ని♦తాంతము స్వీయపరాక్రమంబుచే
తను బురికొల్పఁగాఁ బడుచు ♦ దారుణయుద్ధ మొనర్చె వారితోన్. ౬ 4293

చ. హరులు మహాబలాఢ్యులు భ♦యంకరరాక్షససేనఁ జొచ్చి ప్ర
స్తరముల గొప్పవానిఁ గొని ♦ దానవులన్ వధియించి; రంత సం
గరమున నమ్మహోదరుఁడు ♦ గాఢతరక్రుధఁ బూని యట్టె క
ర్బురనువిభూషితాంబకన♦మూహములం బరఁగించి పూనికన్. ౮౫ 4294

క. వనచరులపాణిపాదము,లను దొడలను నతికి యయ్యి♦లాస్థలి నించెన్;
దనుజాంబకార్దితాంగులు, వనచరు లొకకొంతమంది ♦ భయపడి పెలుచన్.

తే. దెసల కేగిరి; కొందఱు ♦ వెన నధిపతి
నాశ్రయించిరి; కపులసై♦న్యములు భంగ
మొంది పాఱుటఁ గాంచి య♦త్యుగ్రుఁ డగుచు
నర్కసుతుఁడు మహోదరు ♦ నచటఁ జూచి. ౧౧ 4296

క. గురుతేజము పొంగఁగ నా,సురిని వధింపంగఁ బూని ♦ యవనీధర మ
ట్లురుతరమగుఘోరప్ర,స్తరమును గొని దానిపై చెఁ ♦ దానవుపైనన్. ౧౨

* జయాశా త్వయి మే స్థితా - అనిమూ.

క. తనపైకి రయముమీఱఁగఁ, జనుదెంచెడు శిలను దానిఁ ♦ జక్కం గని యా
దనుజుఁ డసంభ్రాంతుండై, కననైనఁ దరంబుగాని ♦ ఘనశిలఁ గడఁకన్. ౧౨½

క. శరములఁ ద్రుంచెను; నట ప్ర,స్తరమది యాదనుజశిరహ♦తంబయి పడియెన్
ద్వరఁ దునియలు వేయిగ నటఁ, గరమరుదుగ గ్రద్దలెల్లఁ ♦ గళవళపడుచున్.

ఆ. చెదరి నేలపైనఁ ♦ జేర వ్రాలెడురీతి;
నట్లు ప్రక్కలైన ♦ యాశిలఁ గని
యర్కతనయుఁ డుగ్ర♦మగుకోపమును బొంది
యనిమొనన్ మహీరు♦హంబుఁ బూన్కె. ౧౫½ 4300

చ. కరములఁ బెళ్లగించి యుల ♦ కర్బురుపైఁ బడనేసె, శూరుఁడై
పరపురనాశకుండగుచు ♦ భాసిలునట్టి మహోదరుం డొగిన్
శరములఁ దానిఁ ద్రుంచె నిటు♦సాలము భూమిఁ బడంగఁ గాంచి యా
హరిపతి క్రుద్ధుఁడై పరిఘ ♦ మయ్యవనిం బడియుండఁగాఁ గనెన్. ౧౬ 4301

క. కని దీప్తంబగు పరిఘం,బును దానిన్ సంగ్రహించె ♦ పూనికమీఱం
దనకరలాఘవమును నా,తనికిం జూపుచును వేగ ♦ దానిచివరచేన్. ౧౬½ 4302

క. తురగవరంబులఁ గూల్చెను;, సురవైరి మహోదరుండు ♦ శూరుం డగుటన్
దురగవిహీనంబగునా, యరదము దిగ నుఱికి క్రుద్ధుఁ♦డై గదఁ గొనియెన్.

క. పరిఘగదాయుధకరు లా,యిరువురు మెఱపులను గూడి ♦ యొనఁగుఘనము ల
ట్లురుజవమునఁ ద్రిప్పుచు సం,గరమున గోవృషములట్లు♦గా గర్జిలుచున్. ౧౭

క. తలపడి; రంత మహోదరుఁ, డలుకన్ రవికాంతిఁ బోలి ♦ యలరుగదను ని
మ్ముల వైచె నర్కజునిపైఁ, బలశాలి హరీశ్వరుండు ♦ భయదంబగుచున్. ౨౦

క. తనపైఁ బడఁగన్ వచ్చెడు, దనుజమహాగదను జూచి ♦ దారుణరుషచే
గను లెఱ్ఱఁబాఱఁ బరిఘం,బు నెత్తి యాగదను దానఁ ♦ బొంగుచుఁ గొట్టెన్.

క. ఆరెండు పరస్పరమును, దారుణముగఁ దాఁకి పగిలి ♦ ధరణిం బడియెన్;
భూరితర తేజుఁ డాకపి,వీరుం డెల్లెడలఁ గనక♦వేష్టిత మగుచున్. ౨౨½ 4307

తే. ఘోరమును నైన ముసలంబు ♦ ధారణి నట
నాయసంబయి పడియుండ ♦ నపుడు గాంచి
దాని గ్రహియించె; నిట్టు లా♦తండు దాని
గొని మహోదరుపైన వై♦చెను గడంగి. ౨౩½ 4308

క. దనుజుఁడు వేరొకగద నా,వనచరపతిపైన వైచె ♦ వసుధంబడె రెం
డును బిట్టుదాఁకి యవియును, దునకలుగా నగుచు; నంత ♦ దోర్బల మలరన్.

సీ. ఆయుధావళులెల్ల ♦ నవ్విధిఁ జెడిపోవ వారలిద్దఱు మండు ♦ వహ్నియుగము
వలెఁ దేజమున నొప్పి ♦ యలఘుముష్టులఁబట్టి మార్కొని రప్డు స♦మరమునందు

నపజయ మెఱుఁగక ♦ యరిజనపరితాపకరులగు వార లి♦ద్దఱును దాఁకి
తన్నుచుఁ బలుమాఱు♦దారుణధ్వను లొప్పఁ జేయుచు మఱి యఱ♦చేతులూని
చఱచుచు నిద్దఱు ♦ త్క్ష్మాస్థలిఁ బడి వేగ పైకిలేచుచుఁ దమ♦బలముల కొలఁ
తే. దినిగఁ బ్రహరించుచుఁ మఱి♦యును భుజముల
నెత్తి విసరుచు శ్రమమొంది; ♦ రత్తఱి గురు
జవమునం బొల్చు రాక్షస♦సత్తముండు
చెంత నిల నున్నఖడ్గంబుఁ ♦ జే గ్రహించి. ౨౮ 4310
క. పలుకయును జేతఁ గొనుచుఁ, దలఁపడఁగా దనుజు మీఱఁ♦దగువేగంబుం
గల సుగ్రీవుం డచ్చటి, పలుకయు ఖడ్గంబుఁ గొనియె ♦ బరవస మలరన్. ౨౯
క. భండనశాస్త్రంబునఁ గడుఁ,బండితులౌ వార లుబ్బు♦వర్ధిలఁ గా ను
ద్దండతరాసుల నెత్తుచుఁ, జండతరక్రోధ మొప్ప ♦ స్వనములు నిగుడన్. ౩౦
క. ఇరువురు తలపడి; రవుడొం,డొరులపయిం గ్రోధమూని ♦ యొగి గెలువఁగనా
తురపడుచు శీఘ్రగతులం, బరఁగుచు సవ్యాపసవ్య♦భంగిఁ దిరుగుచుఁ.
క. తలఁపడి పోరిరి; శూరుం, డలఘుజవుండైన రాక్ష♦సాళిఘనుఁడు వాఁ
డలరుపరాక్రమఘనుఁడై, చెలఁగుచు దుర్మతియె గానఁ ♦ జిత్తవికృతిచేన్.
*తే. అప్పు డరిచేతిచర్మము♦నందుఁ జిక్కి
కొనఁగ ఖడ్గము వైచె; నా♦దనుజుఁ డంత
దనదుఖడ్గంబు డాలునఁ ♦ దగిలియుండఁ
బట్టి లాగుకొనుచునుండ ♦ వనచరపతి. ౩౩ 4315
క. కని యంతరమును ఖడ్గం,బునను శిరస్త్రాణయుక్త♦మును గుండలకాం
తిసిచయరమ్యమునగు నా,తనిశిరమును ద్రుంచెఁ జాల♦ధైర్యస్ఫూర్తిన్.
చ. తలదెగి నేలపై దనుజ♦తల్లజుఁ డిత్తఱి వ్రాలఁ గాంచి యా
బలములు నిల్వకే పరుగు♦వాఱె; మహోదరునిన్ వధించి దో
ర్బలమున నొప్పు కీశపతి ♦ భవ్యమతిన్ భటయుక్తుఁడౌచు ని
స్తులరవ మొప్పఁ జేసెఁ దమి♦తో దశకంధరుఁ డద్ది చూచుచుఁ. ౩౫ 4317
చ. మనమునఁ గ్రుద్ధుఁడయ్యె రఘు♦నందనుఁ డాత్మ ముదంబుఁ గాంచె నా
దనుజులు దీనచిత్తులయి ♦ తద్దయు మోములు తెల్లనై భయం
బున మనముల్ తపింపఁగను ♦ బోయిరి; భూరిధరైకభాగ మొ
య్యనఁ బడఁ జిమ్మినట్లుగ మ♦హాదనుజుం బడఁగూల్చి ప్రీతుఁడై. ౩౬ 4318
చ. వనచరసేనయం దపుడు ♦ భానుఁడు స్వప్రభ నప్రధృష్యుఁడై
కనఁబడురీతి మిక్కిలియుఁ ♦ గాంతియు లక్ష్మియు వెల్గ రాజిలెన్;
వనచరనాథుఁ డంత మతి♦వైభవయుక్తుఁడు సంగరాంగణం
బున విజయంబు నొంది సుర♦పూగము సిద్ధులు యక్షులాదృతిన్. ౩౭ 4319

* లగ్న ముత్కృష్య తః ఖడ్గమ్-అనిమూ.

క. ధరఁగల భూతంబులు మో,దరతిన్ సంతోష మలరఁ ♦ దనుఁ బొగడంగాఁ
గరము వెలింగెను శ్రీరఘు,వరుఁ డారా! యనుచు మోద♦వార్ధి మునుంగన్.

తొంబదియొనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౯౯ - వ సర్గము.

అంగదుఁడు మహాపార్శ్వుని జంపుట.

క. వనచరపతిచే సంగర,మునను మహోదరుఁడు మృత్యు♦ముఖగతుఁడగున
ట్లనువుగఁ జేయంబడఁగాఁ, గనుచు మహాపార్శ్వుఁ డుగ్ర♦కలుషుఁడు క్రుధచేన్.

క. తనఘనబల ముప్పొంగఁగఁ, గను లరుణంబుగను నొప్పఁ♦గా భయదంబై
కనఁబడునంగదుసైన్యం,బును క్షోభింపంగఁ జేసె ♦ భూరిశరములన్. ౧

క. అనిలుఁడు వృంతమునుండియె, యనుపమగతి పండ్లు రాల్చు♦నట్లుగ నతఁడున్
వనచర శూరుల శిరములఁ, దనువులనుండి వగలిపడఁగఁ ♦ దా శరవితతిన్. ౨

క. ఒనరించెఁ; దీవ్రకోపం,బునఁ గొందఱు వానరుల వి♦భూషితభుజపం
క్తిని మూఁపులఁ బార్శ్వములను,ననుపమబాణములఁ జెండె;♦నంతహరివరుల్.

తే. అమ్మహాపార్శ్వబాణవ♦ర్షార్తి తాంగు
లగుచు భీతివిషాదముల్ ♦ తగఁగ విముఖు
లయి ధరన్ సోలి; రంత మ♦హాభుజుండు
వాలితనయుండు రాక్షస♦బాణతతుల. ౪ 4325

తరల. తనబలంబులు బాధచేతను ♦ దారుణాహవభీతిచే
మనములందు నిరాశఁ గైకొని ♦ త్రాస్థలిం బడియుండఁగాఁ
గని సముద్రము పర్వ మప్పుడు ♦ గాఢవేగము గాంచురీ
తిని జవంబును జూపసాగెను ♦ దీవ్రశక్తి చెలంగఁగన్. ౫ 4326

చ. సరసిజమిత్రభావితతి♦చందమునం దగి యాయసంబునౌ
పరిఘము నొక్కదానిఁ గొని ♦ బాహుబలం బలరార వైచె నా
సురరిపుపైఁ బడన్; గుమతి ♦ సుక్కుచు దాన విసంజ్ఞుఁడౌచు నా
యరదమునుండి క్రిందఁబడె ♦ నాతనిసారథియున్ ధరంబడెన్. ౬ 4327

క. ఘనబలుఁడై నీలాంజన,తనుఁడై తేజస్వియునయి ♦ దారుణవీర్యం
బునఁ దగిన జాంబవంతుఁడు, ఘనములగతి నొప్పు భల్లు♦కవ్యూహంబున్. ౭

ఆ. వదలి వేగ వచ్చి ♦ వారని క్రుధచేత, భూధ్రశిఖరమట్లు ♦ పొలుచు విపుల
శిలను గైగ్రహించి ♦ చేరి మహాపార్శ్వు, నశ్వరథము లడఁగు♦నట్లు వైచె.

క. ఘనబలుఁడు మహాపార్శ్వుం, డని నందు క్షణంబులోన ♦ నాత్మజ్ఞానం
బును బొంది యంగదుని నొం,చెను బహుసాయకములేసి ♦ శీఘ్రం బలుకన్.

సీ. అనుమహాపార్శ్వుఁ డ♦య్యదనున భల్లూకపతిజాంబవంతుని ♦ బాణములను
మూఁడింట నురుశక్తి♦మును నొప్పఁగా నేసి యాగవాక్షునిఁ బెక్కు♦లమ్ము లేసి
నొప్పించె; నయ్యుగ్రు♦ రప్పుడు శరపీడితాంగు లౌటం గాంచి ♦ యంగదుండు
చాలఁ గ్రోధంబున ♦ సాధ్వసకరమగు పరిఘంబుఁ గైకొనె; ♦ బటుజవంబు
తే. గలుగునావాలికొడుకు మి♦క్కిలియుఁ గోప
మూని యాతనిఁ జంపెడు♦నూహ చెలఁగ
నతఁడు దూరంబునందుంట ♦ నర్కకిరణ
ములువలెం దగు పరిఘంబు ♦ బలముపొంగ. ౧౪ 4331

క. కరముల రెంటిం ద్రిప్పుచు, నురుగతిఁ బైఁబడఁగ వైచె; ♦ నురుబలుఁడగు నా
హరివరుఁడు త్రిప్పివైవఁగఁ, బరిఘం బది యతనిఁ దాఁకి ♦ పటురయ మలరన్.

ఆ. అతనిచేతనున్న ♦ యంబకయుతధను,స్వరముఁ దచ్ఛిరస్త్ర ♦ మునునినాద
మడర భూమిఁ బడఁగ ♦ నత్తఱిఁ జేసె; నం,తటఁ బ్రతాపశాలి♦పటుబలుండు.

క. ధీరుఁడునగు నంగదుఁ డపు, డా రాక్షసుఁ జేర నరిగి ♦ యతివేగమునన్
భూరితరక్రుధ దానవ,వీరునికుండలవిలాస♦వితతశ్రుతులన్. ౧౬ 4334

క. కని తన్నాలంబునఁ దల,మునఁ జఱచెను; దీవ్రవేగ♦మునఁ బటుతేజం
బున నొప్పుమహాపార్శ్వం, డనుపనుకోపమున మొఱసి ♦ యాతురపడుచున్.

క. కరమున నొక్కట ఘనతర,పరశ్వథము సంగ్రహించెఁ;♦ బ్రతిదినసం బా
దరమునఁ దైలముపూయుటఁ,గరముసుహాస్వచ్ఛమగుచుఁ♦గాంతిఁ జెలఁగుచున్.

క. గిరిసారమట్లు దృఢమై, పరఁగ మహాపార్శ్వుఁ డప్డు ♦ పటుకోపమునన్
హరివరుపై వైచెను నా,పరశ్వథము సవ్యబాహు♦ఫలకముఁ దగులన్. ౧౮

ఆ. వాలికొడుకు లాఘ♦వంబున నాదెబ్బ
నట్టె కోప మూని ♦ యపుడు తనకుఁ
దగులకుండునట్లు ♦ తప్పించుకొనియె; నా
యంగదుండు వీరుఁ ♦ డతులబలుఁడు. ౧౯ 4338

క. జనకునిరీతిఁ బరాక్రమ,ఘనుఁడును నై తనరుచుండుఁ ♦ గావున వజ్రం
బును బోలి కఠినమగు ము,ష్టిని గైకొని యట్టె త్రిప్పి ♦ చెచ్చెఱ దానిన్. ౨౦

ఆ. మర్మవేత్త గాన ♦ మనుజాశనునివక్షు,మునకు నంతరమున ♦ ఘనకులిశము
వంటి దానఁ బొడిచె, ♦ బవరంబునందందు, నతనిపోటుచేత ♦ నసురగుండె.

క. త్వరగాఁ బగులఁగ నాక,స్మికముగ నసువులు విడి ధరణిఁ ♦ బొరలెను; బిదపన్
బరమాకులమై యాసేని, వరూథిని యుఁ బాఱఁ జొచ్చె ♦ భయముగదురటన్.

క. అనిని మహాపార్శ్వుఁడు మృతిఁ, గన రావణుఁ డాత్మఁ గ్రోధ♦కలితుండయ్యెన్;
వనచరు లప్పుడు హర్షం,బున బురుజులతోడ ద్వార♦ములతో లంకన్. ౨౪

ఆ. పగులఁ గొట్టునట్లు ♦ పటుసింహనాదముల్, చేసి రయరులెల్ల ♦ జిష్ణుతోడ
సంతసమున నార్చు♦చందంబునం; దరు,వాత సమరనాథ♦వైరి యవుడు.
క. దనుజులు కపులును గావిం,చిన సింహరవంబును విని ♦ చెలఁగెడుకోపం
బున మరల నభిముఖుండై, యనిసేయఁగ నిలిచె ధైర్య ♦ మధికముగాఁగన్.

తొంబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౦ - వ సర్గము.

### రామరావణమహాయుద్ధము.

సీ. అమ్మహాసంగర♦మందు మహాబలుండయి వీరుఁడగు విరూ♦పాక్షుఁ డవల
నమ్మహోదరుఁడు మ♦హాపార్శ్వుఁడును హతులగుటయుఁగనిరావ♦ణాసురుండు
మిగులఁ గ్రుద్ధుండయి♦మించెడు కడఁకతో నరదంబుతోలుమా♦యనుచు సార
థిని హెచ్చరించి యి♦ట్లనిపల్కె వానితో; నారాము నతనిస♦హజుని బొంది
ఆ. నిహతులైన మంత్రి♦నికరముయొక్కయు, ముట్టడింపఁబడిన♦యట్టిపురము
యొక్కదుఃఖములను ♦ నుక్కడఁగించెద;, స్థిరపదంబు నేను ♦ జెందువాఁడ. 3
సీ. *వైదేహిపుష్పస♦త్ఫలమయి సుగ్రీవజాంబవత్కుముదులు ♦ సాధ్వసకర
విక్రమాఢ్యులు గాఁగ ♦ వెలయుమైందద్వివిదాంగద నళసుషే♦ణానిలసుత
గంధమాదను లన్య♦కపులు ప్రశాఖలు గలదియా రామవృ♦క్షంబు సుమ్ము
దాని కాధారమై ♦ తనరుశాఖాదుల ఖండించువాఁడ సం♦గరమునందు
తే. ననుచు నతిరథవర్యుఁడై ♦ యలగురావ,ణాసురుఁడు రథవరమున ♦ నఖిలదిశలఁ
బ్రతిరవంబులు పుట్ట జ♦వమునఁ బోయె, వైరియగురామచంద్రుని♦జేరనంత.
క. ఆనిస్వనమున శైవలి,నీనికరగిరీంద్రవిపిన♦నియుతగజకిటి
త్సానాథముఖమృగాన్విత,మై నిఖిలధరాతలంబు ♦ నందెఁ జపలతన్. ౫ 4347
క. దనుజేంద్రుఁ డంత భయదం, బనూనదారుణమునౌచు ♦ నరిమృత్యువునై
తనరెడుతామసనామక,ఘనాస్త్రమును వైవ నద్ది ♦ కాల్చెం గపులన్. ౬
క. నలుఁగడలం ద్రెళ్లిరి వా,రలు; బ్రహ్మయుఁ దాని మున్వ♦రమయి చెలఁగుదా
నిలలిన్ నిర్మించెను ని,స్తులమగు దానిన్ వహించు♦చొప్పు కలుగమిన్. ౭
ఆ. భంగమొంది కపులు ♦ పాఱఁగా ఘోరర
జంబు గలిగె; నిట్లు ♦ సకలకపులు
తచ్ఛరాళిచేతఁ ♦ దాగు భంగము నొంది
యుండఁ గాంచి రాఘ♦వుండు కడఁగి. ౮ 4350

---

* రామవృక్షం తతో హన్మి జీతాపుష్పఫలప్రదమ్, ప్రశాఖా యస్య సుగ్రీవో జాంబవాన్ కుముదో నళః, మైందశ్చ ద్వివిదశ్చైవ-అనిమూ. ఇచ్చట వాస్తవార్థము సుగ్రీవాదులగు ప్రశాఖలఁ బోలియుంచెదననియు రామవృక్షము ముక్తిఫలప్రదమనియు రావణునిభావమనిమహేశ్వరతీర్థులు.

క. అనికిఁ సన్నద్ధుండ,య్యెను; రాక్షససింహుఁ డంత ♦ నెల్లకపిబలం
బును బాఱఁదోలి యపజయ,మున నెఱుఁగని రాముఁగాంచె ♦ న త్తరుణమునన్.

క. అనుజుండగు లక్ష్మణుతో, మును దివిని నుపేంద్రుఁగూడి ♦ మొనయు శచీనా
థునిపోలిక మెఱయుచుఁ బెను,ధనువును గైఁదాల్చి నిఖిల ♦ దస్యుహరుండై.

తే. అంబరంబును నొఱసెడు ♦ నట్టు లొప్పి
కమలపత్త్రాయతాక్షుఁడై ♦ కడువిశాల
బాహువులతోడ రాజిల్లు ♦ వాని నచటఁ
గనియె; నంత మహాతేజ ♦ మున వెలుఁగుచు. ౧౩౪ 4353

క. గురుబలుఁడు రాముఁడు సహో,దరుఁడగు లక్ష్మణునిగూడి ♦ తత్కపు లటు సం
గరమున భంగము నొందుట,సరగున రావణుఁడు పైకిఁ ♦ జనుదెంచుటయున్.

క. కని చిరకాలమునకు నా,తనితో సంగరము గల్గె ♦ దన కనుహర్షం
బునఁ జాపమధ్యభాగం,బును గరమునఁ బట్టి వేగ ♦ మునఁ బృథుధనువున్. ౧౫

ఆ. తివిచి యాకఠోర ♦ రవమున నిలనెల్లఁ, బగులఁ జేయునట్లు ♦ పటుగుణంబు
లాగుచుండె, నద్దు ♦ జాగుసేయక దాన,వాధిపాంబకముల ♦ నర్కకులుఁడు.

క. పెనుగుణమును మ్రోయించుట, ననూనముగఁ గల్గినట్టి ♦ యారవమునకే
దనుజులు కోఁతులు నందఱు,గను మూసిరి; రాజసుతయు ♦ గశరపథమునన్. ౧౬

తే. రావణుఁడు నిల్చియుండ ద ♦ ర్శమునఁ జంద్ర
భాస్కరులచెంతనున్న స్వ ♦ ర్భానువట్టు
లలరె; లక్ష్మణుఁ డాది నా ♦ యసురవరుని
బలము తెలియఁగవలెనంచుఁ ♦ దలఁచి వేడ్క. ౧౭ 4358

క. శితశరములతోఁ బోరఁగ, మతిలో నూహించి పెక్కు ♦ మాఱులు గుణ ము
ద్ధతి లాగి యగ్నిశిఖల, ట్లతిదారుణములగు పెక్కు ♦ లమ్ములు వైచెన్. ౧౮ 4359

చ. ధనువును బూని లక్ష్మణుఁడు ♦ దారుణశాతశిలీముఖంబు లే
సినతఱి నే సుతేజమును ♦ జెందినరావణుఁ డాకసంబునం
దున మరలించెఁ దీక్ష్ణసుగు ♦ తూపుగమింబరఁగించి; యాతఁడున్
దనదగుహస్తలాఘవము ♦ తత్సమయంబునఁ జూపుచుం దమిన్. ౧౯ 4360

తే. లక్ష్మణునితీవ్ర బాణజా ♦ లమున నొక్క
శిరము నొకటను మూఁడగు ♦ సాయకములఁ
ద్రిశిరముల సంబకములఁ బ ♦ దిం బదింట
నిట్లు ఖండించె నవ్వాని ♦ నేపుమీఱ. ౨౦ 4361

క. అని జయశీలుఁడు రావణుఁ, డనుపమతీక్ష్ణాయకములు ♦ నన్నింటిని వే
తునుముచుఁ దనునొక్కటి సోఁ,కనియట్లు లొనర్చి యతనిఁ ♦ గాదనిత్వరతోన్.

క. గిరివలె నిశ్చలుఁడగురఘు,వరుమాఱ్కొనఁ బోయె; నిట్లు ♦ భాస్కరకులు మా

గ్గురఁ బొలియించెడు రాముని, పరిసరమున కేగి క్రోధ♦భారముచేతన్. ౨౧

క. అగణాత్ముండై భూవర, యనపై శరవృష్టిఁ గురిసె; ♦ వైరివనుజభీ
కరచాపద్యుతదారుణ, శరధారలు సంఖ్యలేక ♦ చను దేరంగన్. ౨౨ 4364

క. కనుఁగొని నిషంగయుగ్మం, బునుండి భల్లములఁ దీసి ♦ పూనికమెఱయం
గను నంతఁ గుపితములు భీ, తిని గల్గఁగఁ జేయునవియుఁ ♦ దీక్ష్ణతరములున్.

క. ఘనకాంతుల మెఱసెడు నవి, యును బాములఁ బోలియున్న♦యుగ్రశరములన్
దునిమెన్ భల్లంబులచేఁ, దనశక్తి చెలంగ; భూప♦తల్లజుఁ డంతన్. ౨౪ 4366

క. దనుజోత్తము, రావణుఁ డా, జనపతి; వేవేగ వివిధ♦శాతశరములన్
గనలుచు మార్గాని నొంచిరి;, జనపతిదనుజాధిపతులు ♦ శౌర్యముపొంగన్.

సీ. అప్రతిహతులయి ♦ యాశుగవేగముల్ వారించుచుం జిత్ర♦భంగిఁ జాల
పర్యంత మలసటఁ ♦ బడలక సవ్యాపసవ్యగుండలములఁ ♦ జతురిమ తగఁ
జరియించుచుం బోరి;♦రిరువురుయముఁడునాతనిగర్వ మడఁచిన♦దర్పహరుఁడు
వోలె భయంకరు♦లై లక్ష్యశుద్ధుల శరముల వదలుచు ♦ సత్వరముగఁ

తే. దలఁపడుచుఁ బోరుచుండఁగఁ ♦ దదవసరము
ననుఁ గనుంగొని భూతాళు♦లును భయంబు
నొందె; వర్షర్తువునను వి♦ద్యుత్ప్రశతులఁ
గలిసి ఘనములు గ్రమ్మిన ♦ కరణిదోఁప. ౨౭ 4368

క. సురపథమున నానావిధ, శరములు వడి నిండె; నాక♦సంబున బాణో
త్కరములు వ్యాపించుచు నం, తరములు నందందునుంటఁ ♦ దదవసరమునన్.

తే. తగ గవాక్షము లలవరిం♦పఁగఁ జెలఁగెడు
విధమునం జూడఁ దగియుండె; ♦ వేఁడివెలుఁగు
పశ్చిమాశకుఁ జేరంగఁ ♦ బదపడి గురు
జలదములు లేచి నీటిధా♦రలను గురిసి. ౨౮ 4370

చ. ఘనమగునంధకారమును ♦ గల్గఁగఁ జేసినయట్లు వారల
త్యనుపమవేగవంతము ల♦హార్యము లెంతయు దారుణాకృతుల్
చన ననుకూలమౌ పగిదిఁ ♦ జక్కనిగృధ్రపతత్రిపత్రముల్
గనఁబడుచుంటఁ బక్షములు♦గల్గినవై సిశితాగ్రముల్ తగన్. ౨౯ 4371

క. తనరుశరంబుల నైచుచు, నని గాఢతమంబునన్ భ♦యంకరసుగురీ
తిని గన్పడఁగాఁ జేసిరి;, మనుజాశనమనుజనాథ♦ముండను లంతన్. ౩౦ 4372

క. ఇతరేతరవధకాంక్షులు, మతులం బర్వంగ వృత్ర♦మఘవులు వోలెన్
జతనంబుగఁ బోరాడఁగ, నతిభయద మచింత్యమగుచు ♦ నయ్యని తనరెన్.

తే. మఱి యనాసాద్యమై యుండె; ♦ మహితచాపు
లఖిలశస్త్రాస్త్రకోవిదు ♦ లఖిలశస్త్ర

విద్విరిష్ఠులుగా వారు ♦ వెలయుచుంట
నని సమానంబుగా నుండి ♦ రంత వారు ౩౩ 4371

సీ. ఏయేపథంబున ♦ నేపున జరియించిరో యాపథమునుండి ♦ యాయపార
జలధులనుండి శ్వ♦సనజవంబునఁ దరంగములు లేచెడుభంగి ♦ కాండపంక్తు
లట్టి పర్వుచునుండె; ♦ నంతట లోకవిద్రావణుం డగునట్టి ♦ రావణుండు
కరమున బాణమో♦క్షణము చేయుచు రాఘవునిలలాటంబునఁ ♦ బూని బాణ

ఆ. పంక్తి గాఁడనేసె; ♦ భయదరావణధను
ర్గళితకువలయాభ♦కాండపంక్తి
యదియు రామశిరము♦నందు నాటిన నాతఁ
డొందఁడయ్యె వ్యథను ♦ డెంకమందు. ౩౪ 4375

చ. గురుతర తేజమున్ రిపు♦గుండెలఁ జెండెడు వీర్యమున్ నిరం
తర మలరారు రాఘవుఁడు ♦ దారుణమై తగు రౌద్రమంత్రముల్
వరుస జపించి యస్త్రమును ♦ బాగుగ రౌద్రము మంత్రిఁజేయుచున్
శరములఁ దక్షవంబులను ♦ జాపము లాగుచుఁ గోపయుక్తుఁడై. ౩౫ 4376

క. దనుజాధిపుపై వైచెను, చనియాబాణములు భూరి♦జలదము నానా
ప్పిన రావణుకవచవరం,బును వైరివిభేద్యమును స♦మూహము గాఁగన్. ౩౬

ఆ. తాఁకి తద్బలమున ♦ దానవునకు నించు,కంతయేని వ్యథను ♦ నపుడు కల్గఁ
జేయఁజాలవయ్యె; ♦ నాయనఘుఁడు సము,స్త్రాస్త్రనిపుణుఁ డౌట♦నంతఁ బోక.

క. మరలను స్యందనగతుఁ గ,న్సురపతినిం జూచి ఫాల♦మునఁ బరమాస్త్ర
స్ఫురణమునఁ జాలనొప్పెడు:, నరమంత్రముచేతఁ బొల్చు ♦ బాణమువైచెన్.

క. శరము లవి యస్త్రరూపము, లురుగతి రావణునిశరము ♦ లుర్విఁ బడఁగ న
త్తరుణమునఁ జేసి యసురే,శ్వరవారితములయి కోప♦భావమువలనన్. ౩౯

తే. ఊర్పులను బుచ్చుచున్న య♦త్యుగ్రపంచ
శీర్షసర్పము లట్లుగ ♦ క్షితిని జొచ్చె;
రావణుం డట్లు రాఘవా♦స్త్రమ్ముఁ జెండి
క్రోధమూర్ఛితుఁడయి మహా♦ఘోరుఁడగుచు. ౪౦ 4381

క. అరిభీకరమయి తగు నా,సురనామాస్త్రమును వైచె ♦ సొరిదిగ దానన్
గరివైరితరక్షుభయం,కరముఖములు గృధ్రకంక♦కాకముఖములున్. ౪౧

సీ. శ్యేనాననమ్ములు ♦ చిత్రవంచకముఖములును దోడేళ్ల మో♦ములును విస్తృత
ఫణివక్త్రములు నైదు♦పడగలసర్పము లట్టి యాకృతిగల్గి ♦ యలరుతీవ్ర
శరములుమఱియునే♦తెరబాణములు పెక్కు జనియించి వెడలెఁ; దేజ♦మున మిగుల
వెలయునా రావణుఁ♦డలరుద్రుఁ బోలుచు నాగ్రహంబును బూని♦యహివిధమున
నూర్పులు పుచ్చుచు ♦ నురుశస్త్రమహిమమునను ఖరకిటిలప♦నముల శ్వాన

తే. మకరకుక్కుటముఖముల ♦ మఱియు సర్ప
ముఖములను దగుసాయక♦ములను నన్య
శరములను దారుణాగ్రముల్ ♦ పరఁగువానిఁ
బుట్టఁగాఁ జేసి వైచె రా♦మునిపయిఁ గడు ౪౪ 4383

క. ఆరీతి నాసురాస్త్రము, దారుణగతిఁ జెంతఁ జేర ♦ దహనాభుండౌ
శ్రీరాఘవుఁ డుత్సాహము, భూరితరం బొచు వెలయఁ ♦ బూనికమీఱన్.

తే. వైచె నాగ్నేయమను నస్త్ర♦వరము; దాని
మహిమమున నగ్నిదీప్తాస్య♦మిహిరవక్త్ర
చంద్రలపనార్థచంద్రచం♦చన్ముఖములు
ధూమకేతుముఖంబులు ♦ తోఁచునవియు. ౪౬ 4385

క. తారాగ్రహవక్త్రంబులు, దారుణతీక్ష్ణోల్కలట్లు ♦ తగుముఖములు గం
భీరకటిజ్జిహ్వాగ్రా, కారములునునైన సాయ♦కంబు లితరముల్. ౪౭ 4386

క. జనియించె; నాసురాస్త్రం, బునఁ బుట్టిన భయదబాణ♦ములు నటు శ్రీరా
ముని పావకాస్త్రసంగతిఁ, గనినంతే సహస్రశకల♦కములయి యందే.

క. విలయము నొందెను; గృత్స్యం,బులఁ జులకనఁగా నొనర్చు ♦ భూపతి రాముం
డల యాసురాస్త్రమును ని,ష్ఫలముగ నడఁగింపఁ గాంచి ♦ పటురభసమునన్.

ఆ. కామరూపులైన ♦ కపినాథముఖవీరు, లామహాత్ముచుట్టు ♦ నపుడు చేరి
హర్షమునఁ జెలంగి ♦ యార్చిరి; శ్రీరాముఁ, డమ్మహాహవమున♦యందు మిగిలి.

చ. దనుజపతిప్రయుక్తమగు ♦ దారుణబాణము నిష్ఫలంబుగా
నొనరిచి సంతసంబుఁ గనె ♦ నొయ్యన వానరవీరు లందఱున్
మనుజపతిప్రయుక్తమగు ♦ మానితపావకబాణశక్తియుం
గని ముదమొంది యార్చిరి ని♦కామము శత్రుభయంకరంబుగన్. ౫౧ 4390

నూఱవ సర్గము సంపూర్ణము.

---

౧౦౧ - వ సర్గము.

లక్ష్మణ మూర్ఛ

క. అసురేశుఁడు రావణుఁ డ,ట్లసమంబగు నాసురాస్త్ర ♦ మనిఁ బ్రతిహతమై
వెస నడఁగఁ గాంచి ద్విగుణిత, మసారమును నైనక్రోధ ♦ మడరుచునుండన్.

క. ఇతరాస్త్రమ్మును వైవఁగ, మతిలో నూహించె; నంత ♦ మానితతేజం
బు తగన్ రావణుఁడు మయుని,హితకార్యాస్త్రంబు భీతి♦కృత్సారంబున్. ౧౫

క. రామునిపై వైవంగాఁ, దా నదె నూహించె; నంతఁ ♦ గన్చాపమునన్
భీమములు దీప్తములు ను,ద్దామసుమహోజ్జ్వలిత నట్లు ♦ తగునవి యగుచున్. ౩౪

ఆ. ముసలశూలగదలు ♦ వెస జనియించెను; బ్రళయకాలపవను♦భంగి వివిధ
దారుణాకృతులయి ♦ తగుకూటపాశము,ద్గరము లశను లొదవెఁ♦గడుజవమున.

చ. సిరి తగఁ గాంతి పెంపెసఁగఁ ♦ జిత్రమహాస్త్రవిదుత్తముండుగాఁ
బరఁగెడు రాఘవుం డపుడు ♦ భాసురమై పటురూప మొంది యు
ర్వరసకలాస్త్రవర్యమయి ♦ నర్ధిలు నొక్క మహాస్త్రమేసి యా
సురరిపుసాయకావళుల ♦ క్షోణిపయిం బడఁజేసె నుద్ధతిన్. ౫ 4395

తే. అద్ది గాంధర్వమనుపేర ♦ నలరు; దాన
నమ్మహాత్ముఁడు రాఘవుఁ ♦ డట్లు రౌద్ర
వరశరంబును జెందిన ♦ సురవిరోధి
క్రోధతామ్రాక్షుఁడై రాముఁ ♦ గూల్చె నుదిని. ౬॥ 4396

క. సౌరాస్త్రముఁ బరఁగించెను, భూరిజవుం డతులసూక్ష్మ♦బుద్ధియునగు నా
వీరునిచాపమునుండి సు,హారాజితచక్రములు బ♦యలు వెడలెఁ దగన్. ౭

క. అనుపమకాంతిఁ జెలంగుచు, నినచంద్రగ్రహములట్టు ♦ లెనఁగు విశిఖపం
క్తి నిఖిలదిక్కుల నిండఁగఁ,గన నినశిఖేచరములు ♦ క్షమఁ బడురీతిన్. ౮

క. వెలసెను నారాముం డి,మ్ముల సేనాముఖమునందుఁ ♦ బొలిచి దనుజును
జ్జ్వలిసాధనముల బాణం,బులచే ఖండించె శౌర్య♦ము గడు మెఱయఁగన్. ౯

చ. దనుజవరుండు రావణుఁడు ♦ తన్నహితాస్త్రముగూడ వ్యర్థమై
చనుటయు రాముమర్మముల♦సంఘమునన్ దశతీవ్రబాణముల్
జొనుపుచు నొంచె; నంత రణ♦శూరుఁడు రాముఁడు వైరిభీతికృ
ద్ధనువుననుండి వెల్వడిన ♦ దారుణబాణవశాభివిద్ధుఁడై. ౧౦॥ 4400

క. గురుతేజుఁ డౌట దానికిఁ, బరికంపింపకయె నిల్చె; ♦ బవరంబులఁ దా
నిరతము జయమందెడు రఘు,వరుఁ డతికోపమున దనుజ♦వరునంగాళిన్. ౧౧॥

క. పలువిధములైన బాణం,బుల నొప్పించెను; మహీశ♦పుంగవుఁ డిటు ల
ప్పలలాశను నొంచిన తఱి, నిలాధిపానుజుఁడు సాధు♦హితకరుఁ డంతన్. ౧౨॥

క. అరివీరుల నొంచెడు దు,ర్ధరబలమున నొప్పియుంట ♦ రయమునఁ గొనియెన్
శరసప్తకమును నంతట,గురుతేజుం డతఁడు మదిని ♦ గుతుకం బలరన్. ౧౩

తే. అధికవేగంబుగల్గిన ♦ యాశరముల
మనుజశీర్షాంకితధ్వజం♦బును దదీయ
మును శకలములుగాఁగఁ గూ♦ల్చెను; మఱియును
గురుబలాఢ్యుఁడు శ్రీమంతుఁ♦డురుతరమతి. ౧౪ 4404

క. ఐనట్టిలక్ష్మణుఁడు తన,మానసమునఁ గల్గుక్రుధను ♦ మండించుచుఁ బెం
పూనినశరమును నొక్కఁడు, జ్యానాదం బడర వింట ♦ సంధించి తగన్. ౧౫॥

తే. జ్వలితకుండలమైన రా♦క్షసవరేణ్యు,సారథిశిరంబు ఖండించె; ♦ భూరినిశిత
బాణపంచకమున ద్విప♦వరకరాభ,దానవేంద్రధనుస్సు ను♦ద్ధతిని ద్రుంచె. ౧౬

చ. ధను విటుపోవనున్న తఱిఁ ♦ దద్దయు వేగమునిూఱి దాఁటి యా
తనిగురుసైంధవాళి నసి♦తంబగు నభ్రము రీతి శైలమో
యను నటు లంగముల్ తనర ♦ స్యందనవర్యము లాగుచుండు దా
నిని గదచే విభీషణుఁడు ♦ నెట్టన మోఁది వధించె నుగ్ధతిన్. ౧౮ 4407

ఆ. వేగవంతుఁడైన ♦ విబుధవైరిసుహీశుఁ, డశ్వవిరహితనుగు ♦ నమ్మహార
థమ్మునుండి దుమికి ♦ ధరణికిఁ దమ్ముని,పయి మహోగ్రహంబు ♦ పర్వ నిలిచె. ౧౯

సీ. అంతమహాశక్తి♦నంతుండు విక్రమ,ధనుఁడునౌ రావణుం ♦ డనుపమాన
మయి వజ్రమట్లు చె♦న్నారుచు నున్నశక్తిని విభీషణునిపై♦యిని బ్రయోగ
మును జేసె; లక్ష్మణుం♦డును విభీషణునిచెంతకు నది రాకముం♦దఱనె దాని
బాణత్రయంబున ♦ భంజించె; నప్పటిరణమునఁ గపులయా♦రవము లెసఁగెఁ;

తే. గనకమాలాభిలంకృత ♦ మనుపమాన
మైన యాశక్తి ముత్తుని♦యలు నగుచును
విస్ఫులింగము లొకరీతి ♦ వెడల నుల్క
వలె జ్వలించుచు దివినుండి ♦ పడియె ధరణి. ౨౦ 4409

క. తరువాత దానవేంద్రుఁడు, సురుచిరచందనముఖాభి♦శోభిత మగుచున్
బరఁగుచు యమునకు నైనను, దురాసదం బౌచు నొప్పఁ ♦ దోరపుశక్తిన్.

క. చేకొనియె; నద్దినైజ,ప్రాకటతేజమున మిగుల ♦ భాసురమగుచున్
బాకారికులిశమటు తగి, యేకరణిం జేరరాని♦దై యయి మిగులన్. ౨౨ 4411

క. దనుజేంద్రుఁడు గిరగిరఁ ద్రి,ప్పిన మండుచు ఘోరరూప♦ప్రదులం బగుచున్
గనుపట్టె; నంతలో రా,ముని తమ్ముడు వీరుఁడార్తి ♦ మునిఁగెడువానిన్. ౨౩

క. దనుజవతంసు విభీషణు,మనమున ననుసంశయంబు ♦ మైకొన భయముం
గనియున్నవానిఁ గని యా,తని కష్టము పోయి నిల్చె ♦ ధైర్యముపొంగన్.

క. వీరుఁడు లక్ష్మణుఁ డంతట, సారంబగు ధనువు లాగి ♦ శక్తిం గేలన్
సారించుచున్న యారా,క్షోరాజుపయిం బ్రహత్క♦కూటనుసృష్టిన్. ౨౫ 4414

క. కురిసెను; మహాత్ముఁడగు రఘు,వరుతమ్ముం డతనిపైన ♦ బాణవితతులం
బరఁగించుచుండఁగ సహో,దరునిపయిన్ విక్రమంబుఁ ♦ దాఁజూపంగన్. ౨౬

తే. విలు లేకుంటచేత వి♦భీషణు నని
నొంచుయత్నంబు మాని ద♦నుజవిభుండు
తనసహోదరుఁ దప్పించి ♦ ధైర్యమూని
నిలిచియున్న లక్ష్మణుఁ జేరి ♦ పలికె నిట్లు. ౨౭ 4416

క. బలముగలవాఁడ ననుకొని, చెలఁగుచు నాతమ్ము నిట్లు ♦ జృంభచ్ఛక్తిం
గలిగినయటు తప్పించితి, పలులాశయ వీని విడిచి ♦ పటుతరశక్తిన్. ౨౮ 4417

క. దీనిన్ నీపయి వైచెద;, మానక యాశక్తి మున్ను ♦ మహి నెంతటినో

తాను బొలియించి రక్తము,లోనఁ మున్గినది నుమ్ము ♦ లోకనుతంబొ. ౨౮

చ. పరిఘము లట్టి నావయిన ♦ బాహువరంబుల వీడి యిద్ది భీ
కరముగ నీదువక్షమును ♦ గ్రన్ననఁ జీలిచి రక్తసిక్తమై
యురుగుచుఁ దావకాసువుల ♦ నావృతిమైఁ గొని యేగఁ జాలునం
చురవడిఁ బల్కి కోపమున ♦ నుగ్రతనుండయి దానవేంద్రుఁడున్. ౨౯ 4419

క. ఎనిమిదిగంటలతోఁ దగి, ఘననాదమ్ము గలిగి మయ♦కల్పితమాయా
జనితంబయి వైరితతిం, దునుముచు వ్యర్థముగ రాక ♦ తోరపుశక్తిన్. ౩౦

క. పరఁగుచు స్వతేజమున భీ,కరముగఁ గ్రాలుచును జెలఁగుఁ ♦ గడువడి దానిన్
గురుజవమున లక్ష్మణుపైఁ, గర ముగ్రుండగుచు వైవ ♦ గాఢరవమునన్. ౩౧

తే. భీమవేగంబునం బొల్చి ♦ వృత్రహరుని,వజ్రమట్లుగ మ్రోఁగుచు ♦ బవరమందు
నున్న లక్ష్మణుపైఁ జనె; ♦ నుగ్రరీతి, వచ్చునాశక్తిఁ గని రఘు♦వరుఁడు మదిని. ౩౨

క. *నాయనుజునకున్ మంగళ, మీయెడ నౌఁగాక యనుచు ♦ నెనఁగెడు శక్తిన్
వే యడఁచుదాని గూరిచి,నీయాహవనోద్యమంబు ♦ నిష్ఫలమగుతన్.33 4423

తే. వ్యర్థమగుదువుగాక నీ♦వనియె నపుడె;
యంత రావణుఁ డుగ్రుఁడై ♦ యహిసమాన
శక్తి దానిని వైవ నా♦శక్తి క్షణము
లోన నెవ్వరినైనఁ గా♦ల్చునది యెుమ్ము 33౪ 4424

క. మనమున రాముఁడు వ్యర్థము,గను జేయుట నపుడు భయశ♦కలమేని మనం
బున లేక యోరుఁడై విల్చిన లక్ష్మణునురమునందుఁ ♦ జేరి మునిఁగెన్. ౩౪

తే. మిగులజవమున గురుకాంతి ♦ మించుచున్న
యామహాశక్తి ఫణిపతి♦యైన యాది
శేషునాలుకవలెనె వి♦శేషభీతి
కరముగాఁ దేజరిల్లి ల♦క్ష్మణునురమున. ౩౫ 4426

సీ. వడిఁ బడె; నారయ♦వమునమ్ముఁ డంత రావణుహస్తజవమున ♦ వచ్చి చాల
లోఁతుగాఁ దిగఁటమ్ము ♦ నాశతి భేదించ,ధరణిపైఁ బడియెఁ; జెం♦త నె వసించి
యున్న,శ్రీరాఘవుం ♦ డుగ్రతర తేజుండు తమ్ముఁ డంతటి యవ♦స్థను గనంగఁ
గని,భ్రాతృవాత్సల్య♦మున నపణ్ణుం యైనాత్మను; నతఁడు బా♦ష్పాకులాక్షుఁ

తే. డయి మహార్తము దాను జే♦యుఁదగుపనిని
నెంచి ప్రళయాగ్ని భంగిని ♦ మించి మిగుల
నురువడించఁగఁ బూనె భూ♦వరుఁడు దుఃఖ
సమయ మిది కాదటంచుఁ దా ♦ స్వాంతమందు. ౩౬ 4427

క. తలపోసి భూమినుత దాం,గిలుటఁగాఁ దనసోదరుండు ♦ క్షితిఁ బడుటయు ని

* స్వస్త్యస్తు లక్ష్మణాయేతి మోఘో భవ హతోద్యమా-అనియు.

మ్ములఁ జూచుటఁ బట్టియు మిక్కిలి యుత్సాహమునాజి నుదిరి♦గెలుచు నపుడే.

క. దనుజుని వధించుయత్నం,బున నే దేహాతిక త్వపం♦ముగ యుద్ధమునుచే
సెను; నట్లన రాముం డా,యని మొన శక్తిప్రభిన్నుఁ♦డై సోదరుఁడున్. ౪౦

తే. రక్తసిక్తాంగుఁడగుచు స♦ర్పయుతశైల
మట్లు లక్ష్మణుఁ డుండంగ ♦ నచటఁ గాంచె;
నాకపిశ్రేష్ఠు లెల్ల బ♦లాఢ్యుఁడైన
దనుజనాథప్రహితశక్తి ♦ దానిఁ బూన్కి. ౪౧ 4430

క. ఉరమునసుండి ప్రయత్నము, పరమంబుగఁ జేసి విఱుచు ♦ బలము కలుగమిన్
విరహితఫలులై యంతటఁ, గరలాఘవ మొప్ప దనుజ♦కాంతుఁ డలుకతోన్.

క. శరములు వైచి కలంచుట, నురుశక్తిని విఱువఁజాల ♦ కుండిరి; మఱియున్
వరశక్తి యద్ది లక్ష్మణు, నురమున్ భేదించి చొచ్చె ♦ నుర్వీస్థలిలోన్. ౪౩

సీ. బలవంతుఁ డా రాముఁ ♦ డలఘుసంగరమునయందుఁ గ్రుద్ధుండయి♦యతిభయంక
రమగు నా శక్తిఁ గ♦రంబులచేఁ బట్టిలాగి వేవిఱిచె; ని♦లాధవుండు
దాని లాగుచునుండు♦తఱి మహాబలవంతుఁడగు రావణుండు స♦ర్వావయవము
లందు నాటెను సాయ♦కావళిమర్మముల్ భేదించుదాని; నా♦పెనుశరముల

తే. సరకుసేయక రాముఁడు ♦ సహజుఁ గౌఁగి
లించుకొని సూర్యతనయు గా♦లికొడుకును ని
తరహరీంద్రులఁ గాంచి నా♦తమ్ము నితని
జుట్టుకొని కపివరులార! ♦ పట్టువలను. ౪౪ 4433

క. పరిరక్షించుచు నుండుఁడు;, చిరకాలమునుండి వృష్టిఁ ♦ జిత్తమునందుం
గరముం గోరెడుచాతక,వరపక్షికి ఘర్మము చన ♦ వారిధరంబుల్. ౪౫

చ. కనఁబడినట్లు నేను జిర♦కాలముగా మదిఁ గోరుచుండుఁగా
వున నిట నాకువిక్రమముఁ ♦ బొల్పుగఁ జూపఁగఁ గాలముబ్బె ని
య్యని నిఁకఁ బాపనిశ్చయుని ♦ నా శరవర్యుని వీనిఁ జంపనా;
వనచరులార! మీ యెదుటఁ ♦ బల్కెద సత్యముగాఁ బ్రతిజ్ఞనున్. ౪౬ 4435

*తే. ఈక్షణమునందె మీరెల్ల ♦ నీజగమున
రావణాసురుఁడో లేక ♦ రాఘవుండో
యుండకుండుటఁ గనఁగల; ♦ రుర్విని గావు
రుండ రిఁక మీఁద నని యెఱుఁ♦గుండు మదుల. ౪౭ 4436

సీ. రాజ్యనాశము మహా♦రణ్యవాసంబును దండకావనపరి♦ధావనంబు
సీతయన్యులచేత♦స్పృశియింపఁబడుటయుఁ గ్రూరాసురులకుఁ జి♦క్కుటయు బంప

* అరావణ మరామం వా జగద్ద్రక్ష్యథ వానరాః - అనియూ.

పరిసరంబున నున్న ♦ గుహనంబులయందు నుగ్రతరదుఃఖాళి ♦ నొందుటయును
నరకంబువలె ఘోర♦సంకులమైన యారాలయుద్ధమునఁ బతివైనబున♦ను గలిగిన

తే. యట్టి క్లేశము సర్వలో♦కములకును గావఁ, దుష్టుని వధించి త్యజించెద; ♦ వినుఁ డేనికిఁ
గాను నేనంగరంబునఁ ♦ గపివతంసు, వాలిని వధించి సుగ్రీవుఁ ♦ బతిగఁ జేసి.

క. ఈనిఖిలకపిబలంబుల, నేనిచటికిఁ దెచ్చితినొ మఱి♦తెప్పరికినిగా
నీనీరనిధికి సేతువు, జానుగ బంధించి దాఁటి ♦ సత్వర మిటకున్. ౫౫

తే. అరుగుదెంచినవాఁడనో ♦ యట్టిపాపి
దానవుం డిప్డు నాదునే♦త్రపథమందుఁ
బడియె; విషదృష్టిగలమహో♦ఫణులదృష్టి
ప్రాణి హరియించువట్లు నా♦బారిఁ దగిలి. ౫౬ 4439

క. దనుజుం డీతఁడు ప్రాణము,లను దాలిచి యుండఁ లేఁ డి♦లాస్థలి నింకన్
వినుఁ డిదె దుర్ధర్షమహో,వనచరులారా! గిరీంద్ర♦పరశిఖరములన్. ౫౭

ఆ. కూరుచుండి నుంత ♦ కొలఁతలే కిట నాకు
రావణునకుఁ గలుగఁ ♦ బోవు యుద్ధ
మును గనుంగొనుండు; ♦ మునివరుల్ గంధర్వ
లఖలచారణులు మ♦హాహవమున. ౫౮ 4141

*సీ. ఈజగత్త్రయమున♦నెసఁగువారందఱు, రాము రామత్వంబు ♦ గాను మలరఁ
గనుఁగొందు రిగాక; లో♦కములందుఁగల చరాచరములు దేవతా♦సముదయమ్ము
లొకటిగాఁ జేరి యా♦యుద్ధము సాగిన పద్ధతి నీభూమి ♦ పరిఢవిల్లి
నంతపర్యంతమ♦హరహంబు జగమునఁ జెప్పుకొనంగను ♦ జేయఁ జాలు

తే. నట్టికృత్యము నేనె యా♦యదనునందు
జేయువాఁడ; నటంచని ♦ క్షితివిభుండు
తప్తకాంచనభూషిత♦దారుణాంబ
కముల నుసమాహితుండయి ♦ కర్బురేశు. ౫౯ 4442

క. తలపడి నొప్పించెను; ఘన,ములు జలధారలను మిగుల ♦ భూమి గురియున
ట్టులు రావణుండు రామునిఁ, దలపడి దీప్తాంబకసము♦దాయము లొకటన్.

తే. మునలముఖములఁ బరఁగించె; ♦ వెన మహీశ
దానవేశ్వరు లొకరినొఁ♦డ నొక రేఁచి
వైచుబాణంబు లొండొంటి ♦ వరుసఁ గొట్టు
కొనఁగలుగు ధ్వనితుములమై ♦ తనరె నపుడు. ౬౦ 4441

క. కనఁగఁ బ్రదీప్తాగ్రములై, తనరెడు వారలపృషత్క♦తతియొక్కటిచే
త నొకటి భిన్నంబై యు,ర్వని సింగిసినుండి పడియె ♦ వివిధవిధములన్. ౬౧

* అద్య రామస్య రామత్వం పశ్యంతు మమ సంయుగే-అనియా.

క. ఇరువురజ్యావల్లీస్వన, ముఖరతరమై భూతతతుల ♦ గ్రాఁగి భయసంబై
యురుదిదియనఁ దగి యుండెను;,ఘనకాంతుల మెఱయుచున్న♦కోదండంబున్.

చ. కరమునఁ దాల్చి యాధరణి♦కాంతుఁడు రాముఁ డుదారచిత్తుఁడై
శరతతివృష్టి సాంద్రముగఁ ♦ జక్కనిలక్ష్యము నూని పర్వఁ జే
య రయమునన్ సురారిపతి ♦ యు ట్లని రాఘవపీడితాంగుఁడై
పరుగిడె వాయుసంహతిని ♦ బాఱెడుమేఘమురీతి భీతుఁడై. ౬౩ 4447

నూటయొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౨ - వ సర్గము.

### లక్ష్మణుఁడు మూర్ఛనుండి తెప్పిఱిల్లుట.

క. బలయుతుఁడగు రావణుఁ డుజ్జ్వలశక్తిని వైవ దాన ♦ సాంద్రరుధిరధా
రలఁదోఁగి శూరుఁడై దోర్బలలలితుఁడు లక్ష్మణుండు ♦ పడియుంట నిలన్.

క. కని రాముఁడు దుర్మతియగు, దనుజేంద్రునితోడ బెట్టి♦దంబుగ యుద్ధం
బును చేసి శరవిమోచన,మును జేయుచునే సుషేణు ♦ మొ్రలఁ గని వగన్. ౨

తే. పలికె నిట్లని; యావీరుఁ ♦ డలఘుచిత్తుఁ, డసురనాయకుబలిమిచే♦నవనిఁ ద్రెళ్లి
యురగమట్టులు పొరలాడు♦చున్నవాఁడు, వగలు నాకభివృద్ధియా♦భంగినిచట.

క. ఇతఁడన నసువులకంటెను, హితుఁడగు నా కిట్టిసమ్ముఁ ♦ డిట రక్తపరి
ప్లుతుఁడయి యుంటను గననా,మతి వ్యాకులమయ్యె నిఁకన♦మరమొనరింపన్.

ఆ. కలుగు నెట్లుశక్తి? ♦ కలహంబులన్ శ్లాఘ్య
వర్తనుఁడయి సచ్ఛు♦భగుణాఢ్యుఁ
డాఢ్యుఁడైన నాన♦హాజుఁ డితఁడు మృతిని
గనునదే నసువులు ♦ తనువునందు. ౫ 4452

క. నిలిచిన ఫలమే మిఁక? సుఖ,ములు నాకేటికి?; రణాగ్ర♦మున దుర్మతియున్
ఖలుఁడగు రావణుచేఁ గడు, బలయుతుఁడగు నితఁడు నేను ♦ బరిపీడింపన్.

సీ. హతుఁడగుటం జూచి♦యతులమాను విక్రమము సిగ్గుపడినచం♦దమున నున్న
యది, శరాసనమును ♦ హస్తమునన్ నిల్వకట్టి జాఱుచునున్న; ♦ దంబకములు
సారహీనములైన, ♦ వారితిఁ గన్నులు బాష్పములం దోఁగి ♦ బడలుచున్న
వంతియె గాక స్వ♦ప్నావస్థయందు సంచారము చేయంగ ♦ జనులయందు

తే. లట్టి వెన్కకు నీడ్చెడు ♦ నట్లు నాకు, నయనములు పడిపోవుచుండు ♦ భంగినున్న
వధికముగఁ జింత పెరుఁగుచు♦న్నది పరుషము, గాఁగ నసువులపై నాశ♦కదలిపోయె.

క. అని తనకు బహిఃప్రాణం,బును బ్రియసోదరుఁడు నగుచుఁ♦బొలుచు సుమిత్రా
తనయుఁడు మర్మస్థలముల, ఘనశరములు నాట నార్తిఁ ♦ గలవల పడుచున్.

తే. ఊర్పులను బుచ్చుచుండంగ ♦ నుక్కసమునఁ
గాంచి దుఃఖాబ్ధిమగ్నుఁడై ♦ చంచలించె;
నట్టులు విషాదమును బొంది ♦ వ్యాకులేంద్రి
యుఁడయి విలపించె రాఘవుం ♦ డొప్పు దప్పి ౯॥ 4456

చ. అనుజుఁడు లక్ష్మణుం డితఁ డ♦హార్యబలుండయియున్ మహాసురుం
డని వధియింపఁ బాంసుపట♦లాంశిరమందుఁ బరుండియుండఁగాఁ
గనుఁగొనుచున్నవాఁడ గద ♦ గాన నికన్ సమరంబుచేత నే
పనిగల దీయనుప్రతతి ♦ భార్యయునుండియు నేమి లాభమా. ౧౦॥ 4457

చ. అని మొన లక్ష్మణుండు హతుఁ♦డై పడియుండఁగ రాజ్యముండినన్
గను ఫలమేమి? ప్రాణములు♦గల్గిన నేమి? రణంబొనర్చి యే
పని యొనరింతుఁ? జాలుఁ నిఁక ♦ బాహుబలంబును; * దేశదేశమం
దును మదిఁ గోరఁ జిక్కుదురు ♦ తోయరుహాస్యలు భార్య లెందఱో. ౧౧॥

క. దొరకుదురు బాంధవులు సో,దరుఁడగు తమ్ముండు దొరకు♦ధరణీరాజ్యం
బరసినఁ గనఁబడ దెందును?, దురమునఁ బడె గాదె యిట్టి♦తోఁబుట్టు విటన్.

చ. అని విలపించుచున్ బ్రబల♦మై తగు దుఃఖముచేత నంగముల్
పెనుగతి విహ్వలింపఁ గృప ♦ పెం పెసలారఁగఁ జేయునట్లు మే
దిని బొరలాడుచున్ దనము♦దింగల ధీరత పోవ నూర్పులిం
తనివచియింపరానియటు ♦ లార్తిని బల్మఱుఁ బుచ్చుచున్ వగన్. ౧౩॥ 4460

క. ధరఁ బొరలాడెడు శ్రీరఘు,వరునిం గని వీఁగుఁడగుచు ♦ భాసిల్లెడునా
హరివరుఁడు సుషేణుం డా,దరమున నూఱడిలఁ బల్కె ♦ తా నిట్లనియెన్.

తే. లక్ష్మివర్ధనుఁడైన యీ♦లక్ష్మణుండు
కాలగతి నొందలేదు దీ♦ర్ఘపృథుబాహు
విలసితా! యేల? యనినచో ♦ వికృతముగను
దగ వివర్ణముగను లేది♦తనిముఖంబు ౧౪॥ 4462

తే. కాంతి యింతయుఁ దఱుగదు ♦ గన ముఖమిది
సుప్రభంబయి తనరుచు ♦ సుప్రసన్న
మగుచు నలరారుచున్నది ♦ హస్తతలము
లరుణపద్మములవలెనే ♦ యలరెడుఁ జుము. ౧౫ 4463

క. కనుయుగము సుప్రసన్నము, గను జూపట్టెడి; మహీశ ♦ గతజీవితులా
మనుజుల కిటుతగు రూపము, గనఁబడ దాయుస్సు దక్కఁ ♦ గాఁ గలవారే.

---

* దేశేదేశే కళత్రాణి దేశేదేశే చ బాంధవాః, తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః-అనిమూ.

క. కనఁబడుదు రిట్టిరూపం,బున; లక్ష్మీవర్ధనుఁడయి ♦ పొలుచునితఁడు చా
వును బొందలేదు వీరా!, తనపగతురఁ జంపఁగలయి♦తఁడు ప్రాణయుతిన్.

తే. బ్రదికియున్నాఁడు దుఃఖింప♦వలదు వీర!
యితఁడు స్మృతిదప్పి తనువు నీ♦యిలను వైచి
యున్న హృదయంబు పలుమఱు ♦ నొగి నెగురుచు
నున్న నటుగాన జీవంబు ♦ లున్న వనుచు. ౧౯ 4466

క. తెలియుచునున్నది; యని యిటు,పలికి సుషేణుండువాక్య♦పటుత నెఱుఁగుటన్
సులలితహనువులు గల్గిన, యలహనుమను బ్రోత్సహించు ♦ చనియెనిటువలెన్.

సీ. ఇటనుండి సౌమ్య! నీ♦వేగి శీఘ్రంబుగ మును జాంబవంతుఁడు♦గనుఁగొనునటు
తెలిపినయట్టి గు♦ర్తులుగల్గి శుభమగు నోషధిగిరి కేగి ♦ యుత్తరాద్రి
యామ్యశృంగంబున ♦ నగపడుచున్ శల్యములు లేకయుండఁ జే♦యలలితతను
కలితమైన విశల్య♦కరణిని భద్రము లిచ్చుదానిని మఱి ♦ యింతెకాక
రాజిల్లు సావర్ణ్య♦కరణి సంజీవకరణిని సంధాన♦కరణి వీని

తే. వీరుఁడౌ లక్ష్మణునిని జీ♦వింపఁజేయు,పనికిఁ ద్వరితముగాఁ దెమ్ము ♦ పరతతిహర!
వానిచేత మహాత్ముఁడై ♦ భూనుతుఁడగు, నితని జీవింపఁజేసెద ♦ నేను గడఁక.

క. అనుచు సుషేణుఁడు పల్కిన, విని శ్రీమంతుండు హనుమ ♦ వేగ తదద్రిం
గనఁబోయి తదోషధి చ,క్కనియాకృతి తెలియరామిఁ ♦ గడుఁ జింతిల్లెన్.

క. గురుతేజన హనుమకు, ధరశృంగము దీని నే ని♦తాంతప్రౌఢిం
బరఁగుచుఁ గొనిపోయెద భూ,వరుతమ్మున కమితసుఖము ♦ వర్ధిలఁ జేయన్.

సీ. శక్తిగల్గిన యావి♦శల్యకరణి మదీయాంగకరణసన్ను♦దాదిచిహ్న
ములఁబట్టి తర్కింపఁ♦గల దిందెయనితోఁచుచున్నదిల్లైసుషేణుఁ♦డొగివచించెఁ
గాన నీశిఖరమే ♦ గావలయును నది; యది నాకుఁ దెలియలే ♦ దని మహౌష
ధిని దీసికొనకయే ♦ వనచరపుంగవు నడుగుటకై పోవ ♦ నంతలోన

తే. సమయ మేగును గాన ల♦క్ష్మణున కేమొ
హానిగల్గును పౌరుష♦హీనుఁ డనుచు
నను వచింతు రటన్నఁ జ♦క్కనిమతి యొకఁ
డుద్భవించెను; నంతట ♦ నుగ్రబలుఁడు. ౨౬ 4471

చ. తనమది నిట్లు లెంచి కపి♦మల్లుఁ డెంతయు వేగ మొప్పఁగాఁ
జని యలపర్వతోత్తమము ♦ సన్నిధిఁ జేరి తదీయశృంగమున్
గనుఁగొని మూఁడునాళ్లు వడిఁ♦గాఁ గదలించి ప్రఫుల్లవృక్షరా
జనిచయయుక్తమా శిఖర♦సత్తమముం బెకలించి పూన్కితోన్. ౨౯ 4472

తరల. కరములం బయికెత్తె నంతట ♦ గాఢవిక్రము మొప్ప నం
బరపథంబుననుండి యాహరి♦వర్యుఁ డున్నతశక్తిఁ బు

ష్కరసుపూర్ణవినీలభీకర♦సాంద్రవారిదమట్టు లా
ధరమహాశిఖరంబుఁ గైకొని ♦ తాను వచ్చె రయంబునన్. ౩౦౫ 4473

చ. హనుమయు నట్లు వేగమున ♦ నాగిరిశృంగము రామునొద్దకుం
గొని చని యామహీశ్వరుల♦కూటమునంతరమందు డించి యొ
క్కనిమున మూరకుండి కపి♦కాంతు సుషేణుని గాంచి పల్కె ని
ట్లని; హరిపుంగవా! యచట ♦ నాలతచిహ్నము నే నెఱుంగమిన్. ౩౧౫

క. గిరిదక్షిణశిఖరంబును, బరికించియె దీని నిటకు ♦ వడిఁ దెచ్చితినం
చురువినయంబునఁ బల్కెడు, మరుదాత్మజు హనుమ నతని ♦ మంజులభణితిన్.

క. కొనియాడి యాసుషేణుఁడు, చని శృంగము నెక్కి వెదకి ♦ చయ్యన దానిం
గని పెకలించి గ్రహించెను;, ననిమొనఁ గలవనచరేంద్రు ♦ లాశరవరులున్.

క. సురలకునైన నొనర్పను, దరంబుగా నట్టి పవన♦తనయుపనికి న
చ్చెరువొందిరంత నవ్వా,నరవరుఁడు సుషేణుఁ డద్రి♦నాథశిఖరమున్. ౩౨

క. పరికించి తదోషధినిం, ద్వరఁగా గ్రహియించి నలిపి ♦ వర తేజుండై
పరఁగెడు లక్ష్మణునాసాం,తరమునఁ బిండెను; మహాద్భు♦తంబుగ నంతన్. ౩౨౫

సీ. పరవీరహంతయై ♦ పరసుశల్యవ్రజయుక్తుఁడౌ లక్ష్మణుం ♦ డుజ్జ్వలౌష
ధిని దాని మూర్కొని ♦ తీవ్రశల్యంబులు వదలుట విరుజుఁడై ♦ వసుధనుండి
చివ్వన లేచె; నా♦క్షితినుండి లేచినయాలక్ష్మణుం గాంచి ♦ యఖిలకపులు
బాగుబాగని కపి♦వర్యు సుషేణునిఁ బూజించి; రరివీర♦పూగహరుఁడు

తే. రాముఁ డంతట లక్ష్మణు ♦ రమ్మురమ్ము
త్వరగ నని పిల్చి వడిఁ గౌఁగి♦బాష్పములను
గనులు నిండఁగ స్నేహంబు♦నను సహజుని
గౌఁగిలించుకొనెన్ గపి♦కాంతు లలర. ౩౭౫ 4479

క. కరములను బట్టుకొని సౌ,కర! వీరా! నీవు పంచ♦తను బొందియు ని
త్తరుణమున నాదుభాగ్య,స్ఫురణమునన్ మరల బ్రదుక♦చొప్పు గలిగెఁ జూ!.

క. కనుఁగొంటి నిన్నుఁ బ్రీతిగ, విను నీవే మృతిని గనినఁ ♦ బృథ్వీసుతతో
డను నసువులతో నేపని,యును నాకిఁక లేదు విజయ ♦ మొందఁగ నేమా?. ౪౦౫

క. అనియిట్లు మహాత్ముండగు,తనయన్న వచించుచుండఁ ♦ దడఁబడునుడులన్
వినిపించె ఖిన్నుఁడై రా,మునితమ్ముం డన్నకిట్లు; ♦ భూమీశవరా!. ౪౧౫ 4482

క. అవితథవిక్రముఁడవు నీ,వు విభీషణుతోడ దనుజ♦భూపతి ననిలో
జవమునఁ జంపి యొసంగెద, సువితతమగు రాజ్యమనుచు ♦ శుభతరభణితిన్.

క. వినఁ బ్రతిన చేసి తరుణం,బున నిప్పుడు బలములేక ♦ పోరలాడెడు న
ల్పునియట్టు లివ్విధంబున, ననువగునే చెప్ప? విరహి♦తాఘా! జగతిన్. ౪౨౫

తే. సజ్జనులు వ్యర్థమైనట్టి ♦ శపథమెపుడు, చేయరుగదా? ప్రతిజ్ఞను ♦ జేసి దానిఁ

జక్క నెఱవేర్చులే గదా? ♦ శౌర్యలక్షణము; మహాత్మా! మదర్థమై♦న నగచేత.
క. జనకజయందును విజయం,బునయందు నుపేక్ష నిట్లు ♦ పొందుట యిఁకఁ జా
లును రావణుఁ జంపి ప్రతిజ్ఞను దీర్పుము; దంష్ట్రిలెల్ల ♦ సాధ్వస మొనఁగన్.
తే. అఱచుచున్న పంచాస్యము ♦ నంతికమునఁ
దగిలినట్టి మహాద్విర♦దంబురీతి
నీశరపథంబునం బడి ♦ నిర్గతాసు
వితతిగాకుండ బ్రదుకునే ♦ విమతుఁడైన. ౭౫ 4487
చ. ఖరకరుఁ డాత్మకృత్యముఁ ద♦గంగ నొనర్చి ప్రశాంతి నొందఁగా
వరుణదిశం జెలంగు గిరి♦పర్యముఁ జేరెడు నంతలోన నీ
సురరిపు నీదురాత్ముఁ గడు♦శూరతమీఱ వధించు టొప్పు నే
వరుసగనైన నంచు మది♦వాంఛను నేఁ గనువాఁడ నో ప్రభూ!. ౭౬ 4488
చ. దనుజమహేంద్రుఁ జంపుటకుఁ ♦ దథ్యముగా మదిఁ గోరుదేని నీ
వొనరిచినట్టి యీప్రతిన ♦ నొప్పుగఁ దీర్పదలంతువేని నా
జనకజయందు నమ్మదము ♦ చక్కఁగ నీకును గల్గునేనిఁ జ
య్యనను మదుక్తి చేయఁదగు ♦ నంచు వచింపఁగ నాదరంబునన్. ౭౭ 4489

నూటరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౩ - వ సర్గము.

రామరావణులు మహాహవ మొనరించుట.

క. పరవీరఘ్నుండగు రఘు,వరుఁ డాలక్ష్మణుని సాధు♦వాక్యమ్ముల ని
ర్భరశక్తిమీఱునట్లుగ, శరాసనము నెక్కుపెట్టి ♦ శరములఁ గినుకన్. ౧ 4490
క. సేనాముఖమునఁ బూనిక, దానవనాయకునిమీఁదఁ ♦ దా వైచెను; నా
మానవభక్షకనేత యొ,కానొకయురదంబు నెక్కి ♦ కాకుత్స్థునిపై. ౨ 4491
తే. భాస్కరునిపైని రాహువు ♦ పౌరుషమున
నడరురీతిగఁ బోయె; న♦ట్లసురనేత
యరదముననుండి నీరద ♦ మంబుధార
లను గురియురీతి వజ్రోప♦మాంబకములు. 3 4492
క. ఘోరంబుగఁ గురియించెను;, శ్రీరాముఁడు రణమునందుఁ ♦ జేరి యవహితుం
డై రావణుపై వైచెను, దారుణశుచితుల్యకనక♦దామాంబకముల్. ౪ 4493
క. ధరరాముఁడు నిలుచుండియు, నరదముపై దానవేంద్రుఁ ♦ డలరియు నిటు సం
గర మొనరించుట సమ మె,వ్వరునను గాదనుచు దేవ♦వరగంధర్వుల్. ౫
తే. దానవులు పల్కి; రంత నెం♦తయు ముదమున
సిరులఁ జెలువొందు దేవతా♦వరురథంబు

నింద్రునానతి మాతలి ♦ హితము మెఱయ
నెక్కి దిగి వచ్చె దివినుండి ♦ యక్కజముగ. ౬ 4495

సీ. కనకచిత్రాంగమై ♦ కమనీయకింకిణీశతభూషితంబయి ♦ చారుతరము
గాఁ దగి బాలభా♦స్కరురీతి నొప్పుచు వైడూర్యకూబర♦వర్ణ్య మగుచుఁ
గాంచనాభరణసం♦కలితంబులై శ్వేతచామరాన్వితములై ♦ సరసిజాత
సఖువలె మెఱయుచుఁ ♦ జక్కనివయి యాఁకుపచ్చనిరంగున ♦ భాసిలి తగి

తే. కనకమయహారముల నొప్పు ♦ కమ్రతురగ
ములు చెలంగుచు లాగ నుజ్జ్వలసువర్ణ
దండలలితధ్వజంబయి ♦ తనరుచుండె;
నంత నింద్రునిసారథి ♦ యరద మెక్కి. ౭ 4496

క. మునికోలం గొని యరదం,బునఁ జెలఁగుచుఁ బలికె రామ♦మూర్తిం గని భ
క్తిని బ్రాంజలియై రామా!, ఘనబల! శ్రీలలిత! శత్రు♦గణభీతికరా!. ౧౦౫

తే. నీకు విజయంబు చేకూరఁ ♦ బాకవైరి
యీరథముఁ బంపె మఱియు నీ♦యింద్రచాప
మగ్నిసన్నిభకవచ మీ♦యుదయసూర్య
సదృశశరములు విమలని♦శాతశక్తి. ౧౨ 4498

క. శతముఖుఁడు నీకు నొసఁగెన్, జతనంబుగ వీని నెల్ల ♦ క్ష్మాపాలవరా!
శతముఖుఁడు మున్ను సవ్యంగన. మొయిలితగతి దీని నెక్కి ♦ యద్భుతరీతిన్.

తే. నేను సారథినై యుండ ♦ నిశితదనుజు,లను వధించెను నారీతి♦గను మహాత్మ!
నేనె సారథినై యుండ ♦ నెమ్మి నిప్పు, డీయరద మెక్కి రావణు ♦ నితనిఁ జంపు.

చ. అని యిటు పల్కు మాతలిని ♦ నాదృతమై గనియుండ నారథం
బునకుఁ బ్రదక్షిణంబుగను ♦ బోయి నమస్కృతి సల్పి దేహకాం
తిని శశికాంతిచే వలెనె ♦ తెల్లముగా జగముల్ వెలుంగఁగా
మన మలరంగ నెక్కె నృప♦నందనుఁ డంతట దానవేంద్రుఁడున్. ౧౪ 4501

మ. గురుబాహాబలుఁడగు రాముఁడున్ రణముఁ గో♦రుక్కు ల్మిఁ జేయంగ నం
గర మప్పట్టున రోమహర్షణముగాఁ♦గం దొమ్మిగాఁ జెల్లె; భూ
వరుఁ డారాముఁడు భాసురాస్త్రముల స♦ర్వస్వంబుఁ దా నెమ్మదిన్
గరమూహింపఁగఁ జాలు వాఁడగుటచేఁ ♦ గ్రవ్యాదనాథుం డనిన్. ౧౫

క. తనపై వైచినగాంధ,ర్వనామకాస్త్రమును దాన ♦ వారించెను జ
క్కని దైవాస్త్రము నయ్యస్త్రనిశాతాగ్రమునఁ జెండెఁ ♦ దా లఘులీలన్.

తే. రాక్షసేశ్వరుఁడైన యా ♦ రావణుండు
పరమకోపంబునన్ మహా♦భయదమైన
రాక్షసాస్త్రము వైచె మ♦రల నృపుపయిఁ;
గనకభూషితతద్బాణ♦గణము లపుడు. ౧౭ 4504

క. దనుజేంద్రధనుర్ముక్తిని, గని గురువిషసర్పములయి ♦ కడువడి నారా
ముని మీఁదికిఁ బాఱెను దృష్టనఖభుజగము లాననములు ♦ గడుమండంగన్.

సీ. వివృతాననంబులై ♦ వెస జ్వలద్ధుతవహకణములు గ్రక్కుచుఁ ♦ గడుభయాన
కములయి రాముపైఁ ♦ గవిసెను వాసుకి సన్నిభసర్పముల్ ♦ జ్వలదనూన
భోగముల్ గురువిష♦పుంజంబులును నగు నాభుజంగంబులు ♦ నఖిలదిశల
విదిశల వ్యాపించె; ♦ వే మీఁది కేతెంచు నమ్మహాభుజగవ♦ర్గముల రాముఁ
తే. డట్టె కనుఁగొని యనిలోన ♦ నద్భుతంబు
గనఁబడన్ ఘోరసాధ్వస♦కరమహాప్ర
భావమౌ గారుడాస్త్రంబు ♦ వైచె నద్ది
కనకపుంఖంబులై యగ్ని♦కాంతు లలర. ౨౧ 4506

క. నరపతి ధనువును విడుచుచు, నురవడి బహుశరము లగుచు ♦ నుగుఫణిరిపులై
సురపథమున హాటకమయ,గరుడపతత్త్రులయి స్వేచ్ఛ♦గాఁ జరియించెన్. ౨౨

క. గరుడాకారంబులు కా,మరూపములు నైన నృపతి♦నందను శరముల్
గురుజవములౌచు సర్పా,త్కరములుగా నొప్పు దనుజ♦కాండవితతులన్. ౨౩

క. త్వరలోన రూపుమాపెను;, సురవైరివిభుండు తనదు ♦ సునిశితశర మ
వ్వరుసం బ్రతిహతమగుటం, బరికించుచుఁ గ్రుద్ధుఁడగును ♦ భయదశరతతిన్.

క. పెనువర్ష మట్లు కురిసెను;, ఘనకార్యం బేని చుల్కఁ♦గాఁ జేసెడు రా
ముని నంత శరసహస్రం,బున రాక్షసవిభుఁడు నొంచి ♦ పూనిక మెఱయన్.

క. శరవితతి మాతలిని న,వ్వరుస నొప్పించె; మఱియు ♦ వాసవునిమహా
త్తరథకేతనపటమును, సరిగా లక్షించి యొక్క♦సాయక మేసెన్. ౨౪

ఆ. ఇట్లు సాయకమ్ము ♦ నేసి దానిం జెండి, స్యందనమున కంగ♦మైన కేతు
దండవరమునుండి ♦ తపనీయమయమగు, ధ్వజము రథము నడుమఁ♦బడఁగఁ జేసి.

క. *శరజాలంబున నింద్రుని, తురగంబుల నొవ్వనేసె; ♦ దుర్మతియగు నా
సురవైరిమహాకార్యము, సురగంధర్వులును మఱియు ♦ శుభచారణులున్.

క. దానవులును గని ఖేదముఁ, బూనిరి; మౌనీంద్రు లట్టె ♦ బుధనుతిగను నా
వానరవీరవిభీషణు, లానరపతి యార్తుఁడయ్యె ♦ నని గనిరి వ్యథన్. ౨౫

తే. రావణాహ్వయరాహుసం♦గ్రస్తుఁడైన
రామచంద్రుని గని బుధ♦గ్రహము లోక
బాధగల్గఁగఁ జేయంగ ♦ బ్రహ్మదేవ
తాకమై చంద్రుప్రియమునై ♦ తనరుదాని. ౨౬ 4515

క. వరమగు రోహిణి తారను, బరమంబుగ నాక్రమించి ♦ వదలక నిలిచెన్,
శరనిధియు ధూమసంయుత,పరివృత్తోర్మియయి మండు♦భంగిఁ జెలఁగుచున్.

---

* విషేదు ర్దేవగంధర్వా దానవా శ్చారణై సహ-అనిమా.

*క. ఖరకరుఁ గ్రుద్ధంబై తా, నరుదుగ స్పృశియించునట్టు ♦ లట్టె యెగిరె; భా
స్కరుఁడును మందకరుండై, పరుషతరుం డౌచు శస్త్ర♦వర్ణమురీతిన్. ౩౧
క. తనువలరఁ గబంధాంకం,బునునగు నొకధూమకేతు♦వునఁ గూడి కనుం
గొనవయ్యెఁ; గోసలేశుల, కనునగు నక్షత్రమగుచు ♦ నసదృశమగుచున్. ౩౨
తే. ఇంద్రుఁ డగ్ని దేవతలయి ♦ యెసఁగ నున్న
యావిశాఖను గుజుఁ డపు ♦ డాక్రమించి
యుండె; దశశీర్షములు తన♦కొప్ప వింశ
తిభుజములు పొంగ రాక్షసా♦ధిపతి యపుడు. ౩౩ 4519
క. కరగతశరాసనుండై, యరుదుగ మైనాకశైల ♦ మట్లు కనఁబడెన్;
సురవైరి యేచి యిటునం,గరమున నిరసించుచుండఁ♦గా రామునకున్. ౩౪
క. ధనువున బాణంబులఁ గూ,ర్పను గూడ నశక్యమయ్యె; ♦ బలుభంగుల నా
దనుజేంద్రుఁడు నొప్పింపఁగ, మనుజేంద్రుఁడు కోప మూని♦మండుచునంతన్.
ఆ. బొమలు ముడిచి కనుయు♦గమునయం దించుక
రక్తిమయుఁ జెలంగ ♦ రాముఁ డుగ్ర
దృష్టి వైరిఁ గాల్ప ♦ నెంచినరీతిగ
గానఁబడుచుఁ గ్రోధ♦కలితుఁ డయ్యె. ౩౬ 4522

నూటమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౪ - వ సర్గము.

రాముఁడు రావణుని యశ్వాదుల నొప్పించుట.

క. మతిమంతుఁ డిట్లు రాముం, డతికోపము నొంది యుండ ♦ నాతనివదనం
బతిభీతిదముం గని భూ,తతతుల్ భయమొందె భూమి ♦ తాఁ గంపించెన్. ౧
క. తరువులు కదలెన్ సింహో,త్కరములు శార్దూలవితతి ♦ తగ భీతిల భూ
ధర మది చలియించె సరి,ద్వరుఁడైన సముద్రుఁడట్టి ♦ భంగిఁ జలించెన్. ౨
చ. పరుషనినాదముల్ గలుగు ♦ పక్షులు దారుణమేఘజాల మం
బరమునఁ గీడుగల్గుటకు ♦ వారనిచిహ్నములైన నాదముల్
పరుషముగా నొనర్చుచు స్వ♦భావముగాని గతిం జలించె; భూ
వరుఁ డిటు క్రుద్ధుఁ డౌటఁ బలు♦భంగులదారుణరీతిఁ జిహ్నముల్. ౩ 4525
తే. కలుగుచుండుటఁ గని భూత♦గణము భయము
నొందె; రావణుఁడును భీతిఁ ♦ బొందె; శూరు
లైన యాయిర్వు రధికభ♦యంకరప్ర
హారణముల సంగరము చేయు ♦ నవసరమున. ౪ 4526

* శస్త్రవర్ణ స్సపరుషో మందరశ్మి ర్దివాకరః-అనిమూ.

క. లోకప్రళయకరంబగు, నాకలహాము దేవవితతు ♦ లాగంధర్వుల్
భీకరఫణులును గరుడులు, నాకోణపదైత్యులును మ♦హార్షులు గడఁకన్. ౫

తే. వ్యోమయానంబులందుండి ♦ యొప్పఁ గాంచు
చుండి; రంత సురాసురుల్ ♦ చండసంగ
రమును దానిని జూచుచు ♦ రామరావ
ణులపయిం గల సమ్మోద♦ముల బలిమిని. ౬ 4528

క. పరమం బగు భక్తిని ని,వ్వెరుసం జెప్పుకొని; రందుఁ ♦ బరముముదమునన్
సురవైరులు దశవదనా!, దురమునను జయింపు మనిరి ♦ తోరపునుడులన్. ౭

క. అనిమొన విజయముఁ జక్కఁగఁ, గనుమని సురలెల్ల భూమి♦కాంతుఁ బలుక; దు
ర్మనమునఁ దగు రావణుఁ డా,యనిలో నానడుమఁ గ్రోధ♦మంది రఘువరున్.

సీ. ప్రహరింపఁ గోరి గొ♦ప్పఁగఁదగు సాధన మేదని లోపల ♦ నెంచి వజ్ర
సారమై గురుతర♦శబ్దమై సకలారి నిర్మూలనచణమై ♦ నిర్భరగిరి
శృంగసన్నిభకూట♦చిత్రమై కనుఁగొన నతిభయంకరమయి ♦ యధికదారు
ణాగ్రమై ధూమయు♦క్తాగ్నినాఁ దగి మఱిప్రళయానలచయంబు♦పగిది నొప్పి
శివునిశూలమ్ము మిం♦చియు నేరికైనను జెంతకుఁ బోరాక ♦ యంతకునకు

ఆ. నైన దారసింప ♦ ననువుగాక సమస్త,భూతభయదమగుచుఁ ♦ బోలఁ జొప్ప
నఱకఁ జాలినదయి♦నెఱిఁదగుశూలంబుఁ,గొనియెఁ గాల్చునట్లు♦క్రుధను మిగిలి.

క. పరమక్రుద్ధుండై యా,శరకారులు చుట్టుఁ గొలువ ♦ సాధ్వసశూలం
బురు వీర్యంబున నడుమం, గరములఁ గైకొనియె; దీర్ఘ♦కాయుం డంతన్. ౧౩

క. అని నధికక్రోధంబునఁ, గను లరుణములగుచు నొప్పఁ♦గాఁ బెనుశూలం
బును నెత్తి స్వబలములు ముద,మును గనఁగా భీమనినద♦మును జేసెఁ గడున్.

చ. దనుజమహేంద్రుభీమనిన♦దంబునకున్ దిశలున్ విదిక్కు లు
ర్వి నభము వే వడంకె, నటు♦భీమరవుం డగుచున్ దురాత్ముఁడా
దనుజుని ఘోరవంబునకు ♦ ధాత్రిని గల్గు సమస్తభూతముల్
గనియె భయంబు క్షోభమును ♦ గాంచెను వారిధి; యంతలోపలన్. ౧౬

క. ఘనవీర్యుఁ డలఘుశూలం,బును దాని గ్రహించి భయద♦ముగఁ బొల్చురవం
బును జేసి పరుషముగ రా,మునిగని యిట్లనియె; రోష♦మున నే నిచటన్. ౧౭

ఆ. వజ్రసారమగుచు ♦ వఱలు నీశూలంబు, నెత్తినాఁడ దీని ♦ నీక్షణంబ
యిద్ది నిన్ను నీదు♦ముద్దుతమ్ముని వధిం,పంగఁ జాలు రాఘ; ♦ బవరమందు.

క. ఘనుఁడను నేనని యెంచెడు, మనుజేశా! నిన్నునిపుడె ♦ క్రుందించి రణం
బున సేనాముఖమునఁ జ,చ్చిన శూరాసురులలోనఁ ♦ జేర్తు సమముగన్. ౧౮

క. ఓరఘురామా! యించుక, యీరణమున నిలువ్వ నిన్ను ♦ నీశూలమునన్
నే రయమునఁ జంపుదు నని, యారావణుఁ డసురభర్త ♦ యతిభయదముగన్.

ఆ. పలికి రాముపైన ♦ బలమున వైచె నా,శూలమును; దగంగ ♦ శూల మదియు
దనుజకరవిముక్తిఁ ♦ గనుచు విద్యుచ్ఛిఖా,సదృశశిఖలు చెలఁగ ♦ శబ్ద మొలయ.

క. ఎనిమిదిగంటలు నిస్వన, మొనరుచుచుండంగ వెలిఁగె ♦ వ్యోమంబున; దా
నిని వీర్యవంతుఁడగు నా,జనపతి జ్వలియించుచుండఁ ♦ జక్కం గనియెన్. ౨౧

ఆ. ఘోరదర్శనమయి ♦ కొంకక వచ్చు నా,శూలవరము నట్టె ♦ చూచి పృథుల
ధనువు బలిమి లాగి ♦ దారుణాంబకముల, వైచెఁ; బ్రళయమందు ♦ భయదరీతి.

క. జ్వలియించెడు హుతవహునిన్, జలధారల వజ్రి నిలువు ♦ చందంబునఁ బై
కలరుచు వచ్చెడు శూలము, నలఘుతరాంబకము లేసి ♦ యాతఁడు నిలిపెన్.

చ. జనపతికార్ముకచ్యుతని ♦ శాతశరంబుల శూల మద్ది యా
యనిమొన నగ్ని ప్రజ్వరిలి ♦ యార్భటిచే శిలభంబులన్ హరిం
చునటులు బూదిచేసె; నృప ♦ శూరుఁడు రాముఁడు స్వీయబాణముల్
ఘనతరశూలముం దగిలి ♦ క్రన్నన చూర్ణములై నభంబునన్. ౨౪ 4543

తే. కాలిపోవుటఁ గన్గొని ♦ గాఢకోప, మందె; నంతట నారఘు ♦ నందనుండు
పరమకోపంబు నొంది యా ♦ పాకశాస,నాభినిర్మితమయి ప్రభా ♦ వాఢ్య మగుచు.

క. మాతలి తనకై తెచ్చిన,దై తగునాశక్తి నెత్తె; ♦ నలఘుబలుం డా
భూతలపతి యాశక్తిని, నాతతబల ములర నెత్తి ♦ యతిశయనియతిన్. ౨౬

క. గిరగిరఁ ద్రిప్పఁగ నమ్మది, వరఘంటాకల్పితార ♦ వంబయి లయమం
దురుభాసురోల్కవలె నం,బర మెల్ల వెలుంగ మిగుల ♦ భాసిలె నంతన్. ౨౭

ఉ. రామకరప్రయుక్తయయి ♦ రావణుశూలముఁ దాఁకె; శక్తి యు
ద్దామమహాయుధంబు తనుఁ ♦ దాఁకిన యాగురుశూల మప్పుడే
భూమిని గూలె భగ్నలయి ♦ భూరిగుచుల్ వడిఁ దగ్గిపోవ; నా
రాముఁడు తీవ్రవేగము ల ♦ రాతిభయంకరముల్ నిశాతముల్. ౨౮ 4547

తే. అశనితుల్యములును నగు ♦ నట్టి బాణ
ములఁ బ్రయోగించి జవమున ♦ వెలయ దనుజు
నశ్వముల నొంచె; నంతట ♦ నతఁడు మఱియు
హస్తలాఘవమున నసు ♦ రారి యురము ౨౯ 4548

క. శితశరగణమున నొంచెను, నతనిలలాటమున నాట ♦ నంబకములు మూఁ
డు తగన్ వైచెను; రాక్షస,పతి సర్వాంగములయందు ♦ బాణము లొకటన్.

తే. తగులఁగా రక్తధారలఁ ♦ దడిసి పుష్పి
తమయిపొల్చు నశోకవృ ♦ క్షము విధమున
ననిమొనం బొల్చె; నట్లు సు ♦ రారి రాము
సాయకావిద్ధగాత్రుఁడై ♦ కాయ మెల్ల. ౩౧ 4550

తే. రక్తమునఁ జాలఁ దడియ సం♦గ్రామమందు
ఖేదమొందియు నంత మి♦క్కిలియుఁ గ్రోధ
మంది రాముని జంపు ను♦ద్యమము తనరఁ
దనకుఁ గల్గినశక్తిఁ జూ♦ప నవుడెంచె. ౩౨ 4551

నూటనాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౫ వ - సర్గము.

రాముఁడు రావణుని నిందించి నొప్పించుట: రావణునిసారథి తేరుఁ దొలఁగించుట.

క. అని గర్వితుఁ డారావణుఁ, డనూనకోపమున రాముఁ♦ డలఘుశరతతిం
దను నొప్పింపఁగఁ గోపం,బును బొందెం దాను; వీర్య♦మునఁ బొల్చుటచేన్.

చ. దనుజవరుండు రోషమునఁ♦ దద్దయుఁ గన్నులు ప్రజ్వరిల్ల న
య్యనుపమసంగరంబున శ♦రాసనముం గడు లాగి బాణపం
క్తిని నిగుడించి నొంచె రఘు♦ధీరుని; నభ్రమునుండి మేఘ మొ
య్యన జలధారలం జెఱువు♦ నంతయు నిండఁగఁ జేయునట్లుగన్. ౨ 4553

క. వరసాయకములు వేలుగఁ, బరఁగించి నృపాలుతనువు♦ బాణమయముగాఁ
గర ముద్ధతిఁ జేసెను; భూ,వరుఁ డటు తన్ముక్తబాణ♦వర్షముచేతన్. ౩ 4554

తే. పూరితుండయి నిశ్చల♦భూధ్రమట్లు
కంపమును బొందకుండెను; ♦ ఘనపరాక్ర
ముఁడగు నారాముఁ డని నిల♦కడను బూని
బాణముల బాణముల నిల్పి ♦ పౌరుషమున. ౪ 4555

క. దనుజేంద్రుని శరములఁ గయి,కొనియెను రవికరములట్లు; ♦ క్రూరదనుజపుం
డును గ్రుద్ధిఁ గరలాఘవమును, గనఁబడఁగ మహాత్ముఁడైన ♦ త్మావిభునెదపై.

క. శితశరసహస్రములు వైచి తగన్ విక్రమము చూపె; ♦ క్షితిపతి రాముం
డు తనువు నెత్తుటఁ దడిసిన,కతమున నుత్ఫుల్లకింశు♦కద్రుమము వలెన్. ౬

క. కనఁబడియెను; ఘనతేజం,బునఁ దగు నారాముఁ డసుర♦పుంగవుశరపం
క్తిని గొట్టఁబడుచునాగ్రహ, మునలయకాలార్కుచండ♦మునఁ గొనెఁదూపుల్.

సీ. అంత నన్యోన్య మ♦త్యాగ్రహంబున మించు నారామరావణు♦లతులతీవ్ర
శరతమశ్ఛన్నమా ♦ సంగరంబున నందుఁ గనఁబడకుండి; ర♦క్కాలమందు
వీరుఁడా రఘుపతి ♦ విపులకోపముఁ బొంది దనుజేశుఁ గని నవ్వ ♦ దారుణోక్తు
లను బల్కె నిట్లని; ♦ దనుజాధమా! నేను బరిసరంబున లేని♦తరుణమందు

తే. వివశయై యున్న నాభార్యఁ♦బృథ్వితనయ,నాజనస్థానముననుండి♦యపహరించి
తివి గదా? యిట్టి నీవెట్లు ♦ ధీరుఁడవగు, దిలను విక్రమ మనఁగ లే♦దెన్ననీకు.

క. ఘోరారణ్యంబున నేఁ, జేరువ లేనట్టితఱిని ♦ జింత మునిఁగి నన్
గోరుచునుండెడు సీతను, గ్రూరా! బలవంతముగను ♦ గొని తెచ్చితివే.

తే. ఇట్టి దుష్కార్య మొనరించి ♦ యిపుడు నీవు
శూరుఁడను నేననుచు నెమ్మ♦చుం జరించు
చున్నవాఁడవుగద; పర♦యువతులందు
మనసుగల్గిన యోశూర! ♦ దనుజ! నీచ!. ౧౨ 4561

క. పెనిమిటి సన్నిధి లేనపు, డనయముగా నట్టివనిత♦లం దపకృతి దు
ర్జనులవలెం జేసియు నీ,మనమున శూరుండ ననుచు ♦ మఱి తలఁచెదవే. ౧౩

తే. నీకు మర్యాద లేదు వి♦నీతి లేదు
సిగ్గునన్ లేదు నడవడి♦చెంది యుండ
దొకవిధంబుగ గర్వంబు ♦ నొంది నీవె
మృత్యువును దెచ్చుకొని మీఁద♦మిక్కిలి యిటు. ౧౪ 4563

సీ. శూరునిగాఁ దలం♦చుచుఁ జరియించెదు; శూరుఁడవగుదు కు♦బేరుతమ్ముఁ
డవు బలసంయుక్తుఁ♦డవు నీవు నా భార్య జనకజ దొంగిలి ♦ శ్లాఘనీయ
మును మహోత్తరమును ♦ ననుపమకీర్తిదంబునగు కార్యంబు ని♦ట్లొనరిచితివి;
గర్వంబునన్ లోక♦గర్హితంబును నహితంబునౌ కార్య ము♦త్తఱి నొనరిచి

తే. తివి గదా దానికే గొప్ప♦దిగఁ గనఁబడు
ఫలము నిప్పుడు పొందుమా; ♦ కలుషబుద్ధి
నినుఁ మహాశూరుఁడనని యా♦త్మను దలంతు
గాదె నీవే మహోత్తర♦కాననమున. ౧౬ 4564

ఆ. అతివ దొంగవలెన ♦ యపహరించెదుశత్రి, నీకు సిగ్గులేదె; ♦ నీవు నాదు
పరిసరమున నట్లు ♦ ధరణీతనూజను, బలిమి నపహరింపఁ ♦ దలఁచి యున్న.

క. అనుపమమత్సాయకముల, వినిహతుఁడవు నగుచు నపుడె ♦ వేడుకమీఱం
జనియుందు నీదుతమ్ముఁడు, ఘనఁబలుఁడగు ఖరునికడకుఁ; ♦ గాపురుషవరా!.

క. వినుము మద్భాగ్యవశంబునఁ, గనఁబడితివి నాకు నెదుటఁ ♦ గాన నిపుడె నిన్
ఘనదారుణశరముల మృతిఁ, గనఁజేసి పరేతరాణ్ణ♦గరి కనిపెదఁ జూ!. ౧౯

క. దనుజా! కుండలముల నొ,ప్పిన నీతల నాదుబాణ♦భిన్నంబయి మే
దిని నిందు దుమ్ములోఁ బడి, కొనిపోఁబడుఁగాక క్రోష్టు♦కూటాదులచేన్. ౨౦

చ. ధరణిని నీవు కూలఁగను ♦ దానవ వక్షముపైని గృధ్రగుం
పు గముము మీఱ ప్రాలి శర♦పూగకృతవ్రణనిర్గళన్మహా
స్త్రరుధిరప్రవాహమును ♦ నప్రియమంగఁగఁ ద్రావుఁగాక; నా
శరములఁ జీల్పఁగాఁ బడుచు ♦ క్ష్మాస్థలిఁ బ్రాణములేగ వేగమే. ౨౧ 4569

ఆ. పడిన నిన్నుఁ గాంచి ♦ పటుతరజవమున, వచ్చి పక్షు లెల్ల ♦ వైనతేయ

పశు లహములనీడ్చు♦భంగి నీడ్చెఁగుఱ్ఱఁ, బట్టి లాగుఁగాక ♦ బలముఁ గొలఁది. ౨౨
చ. అనియిటు వైరినాశకరుఁ ♦ డా రఘువీరుఁడు పల్కుచుఁ దురా
త్ముని దనచెంతనే పొలుచు ♦ ముఖ్యుని దీక్ష్ణశరాంబకాళి వై
చెను; దనవైరిఁ జంపుటకుఁ ♦ జిత్తమునందునఁ గోరుచున్న రా
మున కపు డస్త్రశక్తిబల♦ముల్ ప్రమదంబును వీర్య మాయునిన్. ౨౩౺ 4571
తే. ద్విగుణములుగను గన్పట్టె ♦ విదితచిత్తుఁ
డైన యా రాఘవునకు ది♦వ్యాస్త్రవితతు
లన్నియును ముందుఁ దోఁచెఁ; బ్ర♦హర్షమునను
భూరి తేజుఁడు రఘుకుల♦పుంగవుండు. ౨౪౺ 4572
క. ద్విగుణితకరలాఘవమునఁ, దగియెన్; దనుజాంతకుఁడగు♦ధాత్రీపతి యా
జగదభిరాముం డతఁ డిప్పగిదిని శుభచిహ్నములను ♦ బరికించి మదిన్. ౨౫౺
చ. దనుజవరేణ్యుఁ డొంచెఁ గడు♦దర్పముఁ గన్ మఱియున్; గపీంద్రు లే
సిన పెనుఱాలచేత నృప♦శేఖరుసాయకవృష్టిచేత నొ
చ్చిన యలదానవేశ్వరుని♦చిత్తము ఘూర్ణిలఁ జొచ్చె నంత నా
తనికి లయంబు చెంతకును ♦ దారసిలంగను భ్రాంతి నొందుటన్. ౨౬ 1574
క. శరముల నరిపై వైవక, శరాసనము లాగకుండె; ♦ స్వాంత మువశమై
పరఁగుటఁ బ్రతిబాణము లేసి రాముఁ వీర్యము నడంగఁ ♦ జేయక యుండెన్.
సీ. రావణుఁ డేయుశ♦రంబులు శస్త్రముల్ బహుభంగులం గానఁ♦బడుచు నసిని
ఛేదనసంభేద♦నాదికార్యంబుల నొనగింపఁగాఁ జాల ♦ కుండె మృత్యు
వతనికిఁ జెంతనే ♦ యమరియుండుట; నంత దానవపతి యవ♦స్థ నిటు లొందు
టను గాంచి యతనిస్యం♦దనమునునడుపుసారథిసుంతయేనిసం♦భ్రాంతిఁగనక
ఆ. యుద్ధభూమినుండి ♦ యొకరీతి మెల్లఁగ, నారథంబుఁ దొలఁగు ♦ నట్లు చేసె
*నతని కింకమృత్యు ♦ వాసన్న మౌనని, తనమనంబునందుఁ ♦ దలఁచెఁ గాన.

నూటయైదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౬ - వ సర్గము.

రావణుఁడు సారథిం దిరస్కరించి మరల యుద్ధమునకు వచ్చి రాము మార్కొనుట.

చ. దనుజవరుండు కాలుఁ డొగిఁ ♦ దన్ బురికొల్పఁగ మోహ మొంది యిం
తని వచియింపరాని క్రుధ ♦ నందుటఁ గన్నులు కెంపుగాఁ గనం
గొనఁ దగియుండ సారథిని ♦ గొబ్బునఁ గాంచి వచించె; దుర్మతీ!
నను బలశక్తిహీనుగఁ గ♦నం బరివర్జితవిక్రమాఖ్యుగన్. ౧౺ 4577

---

* శనై ర్యుద్ధా దసంభ్రాంతో రథం త స్యాపవాహయత్ - అనిమూ. ఆటవెలఁది యందలి మూఁడవ నాల్గవపాదము 'లసంభ్రాంతః' అను పదస్వారస్యమును వెల్లడించుట కధికముగాఁ జెప్పఁబడిన వని యెఱుంగవలయు.

తే. అల్పునట్లుగ భీరువు ♦ నట్లు ధైర్య,హీనునిగ గతతేజుని♦గా నొకింత
మాయ తెలియనివానిగ ♦ మహితశస్త్ర,వర్జితునిగాఁ దలంచినీ♦స్వాంతమందు.

క. మనమున నలక్ష్యముగఁ జే,సి నీకుఁ దోఁచినటు లీవు ♦ స్వేచ్ఛఁ దిరిగె దే;
నను నడిగి మదీయాశయ,మును గైకొనకే యలక్ష్య♦ముగఁ గన్గొనుచున్.

క. వైరిసముక్షంబున నా, యీరథముఁ దొలంగఁదోలి ♦ యేల యిచటికిం
జేరిచితి? వనార్యా! నా, భూరియశంబుఁ జిరలబ్ధ♦మును వీర్యంబున్. ౪॥

క. ఘనతేజము రావణుఁడే, యని మొనఁ బరుగెత్తకుండు♦నను నమ్మకమున్
బనిపూని యిపుడు నీచే,తను నాశముఁ బొందెఁ జుమ్ము ♦ తగ నవినీతా. ౫

ఆ. [1]ఖ్యాతవీర్యుఁడైన ♦ యరి గాంతఁ బస్మత్ప
రాక్రమమునుఁ జూపి ♦ రంజిలఁగనటు
జేయఁదగినవాఁడ ♦ నూ! యట్టి శత్రువు
గనుచునుండ యుద్ధ♦కాంక్షు నన్ను ౫॥ 4582

క. ఒపరిచితివి కాపురుషుని,గను; దుర్బుద్ధి మదీయ♦కమ్రరథము దీ
నిని మోహంబునఁ దొలఁగిం,చినయది తలపోయ నీదు♦చిత్త మ్మరయన్. ౬॥

క. అరినీకు విత్త మొసఁగుచుఁ, బరవశునిగఁ జేసె ననుచు ♦ స్వాంతమ్మున ని
త్తరుణమునఁ దోఁచె సత్యమె, పరికింపఁగ నిద్ది యోరి♦పాపమనీషా!. ౭

చ. హితమును గోరుమిత్రు లిటు ♦ లెప్పుడు సేయఁగఁ బూన రిద్ది శ
త్రుతతికిఁ జేయనర్హమగుఁ ♦ దోఁచనె చేసితి వంతెకాని యీ
విధమునఁ జేయనోనె యని ♦ వేసఱి చిత్తములోఁ దలంచి స
ద్గతినొసరింపవైతి; చిర♦కాలము నాకడ నున్నవాఁడవే. ౮ 4585

క. నేనొసరించిన సత్కృతి, మానసమునఁ దోఁచు నేని ♦ మాటాడక యా
భూనాథుఁడు పైఁబడఁగా, దానిఁ గాకుండఁగను ర♦థంబు జనమునన్. ౮॥

క. మరలింపు; మనుచు నీవిధిఁ, బరుషముగా బుద్ధిమాలి ♦ పల్కినతనివై
ఖరి విని హితమతి సారథి, సురశత్రువు నూఱడించు♦చున్ హితభణితిన్.

తే. పలికె నిట్లని; నే భయం♦పడఁగ లేదు
మూఢతనుగాన నను రిపుల్ ♦ మోసపఱచి
విత్తమొసఁగంగ లేదు ప్ర♦మత్తుఁడ నను
సంశయమె లేదు నీదగు ♦ సత్కృతులను. ౧౦॥ 4588

క. మనమున మఱుపఁగ లే దో, దనుజాధిప! స్నేహమును ని♦తాంతము గలవాఁ
డనె; నేనీహితము యశ,స్సును గోరుచు మిత్రత మన♦మునఁ బూని తగన్.

---

1 శ్లో. ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః, పశ్యతో యుద్ధలుబ్ధోహం కృతః కాపురుషస్త్వయా-అనిమూ.

తే. నీకుహితమైన కార్యంబు ♦ నేను జేసి
నాఁడ నప్రియ మయ్యె నే♦న్నఁ డనీకు;
నో మహారాజ! *యేదియే ♦ నొక్కకులము
నందు జనియించి కుమతియై ♦ యహితుఁ డగుచు. ౧౭౺ 4590

సీ. ఉన్నవాఁడుం బోలె ♦ నొకరీతి నీహితమును గోరి రథము దె♦చ్చిన నను గని
కుమతి యీతం డని ♦ శంకక దలఁచుట యుక్తంబుగాదు; మ♦హోన్నతోర్వి
నుండి తరంగిణి ♦ యురువేగమున మరలిన తెఱంగున రణం♦బున రథంబు
నుండనీయక యిట్లు ♦ చండవేగంబున నరదంబు దెచ్చిన♦యందులకును

ఆ. వినుము కారణంబు ♦ వివరింతు; వీరా! రణాగ్రమందు గొప్ప♦దగు తెగువను
బూని నీవు సమర♦మును జేసి యలయుట, తెలియవచ్చె నాకుఁ ♦ దెల్లముగను.

క. నీనెమ్మోమున మోదము, నీనెమ్మదిఁ దెగువయున్న ♦ నియతియు నెఱుఁగం
గానైతి నీరథాశ్వము, లీ నీరథ మీడ్చి యీడ్చి♦యే దీనములై. ౧౮౺

తే. ఎండతగులుటచే సోలి ♦ యింతయేని
బలములేకయె గొప్పదౌ ♦ వర్షమునకుఁ
జిక్కినట్టి యావులరీతిఁ ♦ జేష్ట లుడిగి
యుండె; నేయేనిమిత్తంబు ♦ లొగిని మనకు. ౧౯ 4593

క. కనఁబడుచుండెనో యవి యెల్లను బ్రతికూలముగ దుష్ఫ♦లములుగ నాకుం
గనఁబడియె; మఱియు సారథి,యనఁదగువాఁ డెన్నఁదగు శు♦భాశుభములనున్.

సీ. దేశకాలంబుల♦ తెఱఁగును ముఖమునఁ గల సంతసమ్మును ♦ గలఁక లోను
గాఁగల గుఱుతులఁ ♦ గడఁగి దైన్యము ఖేదహర్షంబులను దన♦యధిపునకును
గలబలాబలముల ♦ త్స్థాస్థలి నిమ్నమో యున్నతంబో యని♦యును సమతల
విషమభాగంబుల ♦ విషతులకుం గల యట్టి ఛిద్రంబుల ♦ నరద మరిక

తే. జెంతకో ప్రక్కగనో లేక ♦ స్థిరముగ నట
నునుచుటయు వైరి కభిముఖ♦మునఁ జెలఁగుచు
వెనుక కేగుట యివియన్ని♦యును నెఱింగి
గడుపఁదగు స్యందనంబుఁ ద♦క్కనిగతి నని. ౨౦ 4595

క. విను వీరా! నీకున్ స్యం,దనతురగంబులకుఁ గొంత ♦ తడ వ్రాఱట గ
ల్గు నిమిత్తము దుర్భరమగు,నని కష్టము గల్గకుండ ♦ నరసి మనమునన్. ౨౦౺

క. అరదముఁ దొలఁగించుట యీ, తగుఁదంబునయు క్తమనుచుఁ♦దలఁచి తొలఁగున
ట్లురవడిఁ గొని తెచ్చితి నే, నరయక స్వేచ్ఛగను దోలు ♦ నంత కుమతినే.

ఆ. ప్రభువ వీవు గానఁ ♦ బటుతరస్నేహంబు, నూని చేసినాఁడఁ ♦ గాని వేఱు

---

* నాస్తి న్నర్థే మహారాజ త్వం మాం ప్రియహితే రతం, కశ్చిల్లఘు రివానార్యో దోష తో గంతు మర్హసి-అనిమూ. కశ్చిత్ యత్ర కుతో౽పి కులే జాతః లఘుః అల్పబుద్ధిః-అనివ్యాఖ్య.

గాదు; వీర! శత్రు♦గణసూదనా! యిపు, డాజ్ఞ చేయు మెట్టు♦లాజ్ఞ యిడిన.

క. నీసొమ్ము దిన్నయప్పును, నేసరణిం దీర్పఁదగునొ ♦ యెన్ని మదిని నేఁ
జేసెద నట్లే తగినటు, లీసమయముపం దలఁచి ♦ హితముగఁ జెపుమా. ౨౩

చ. దనుజలలాముఁ డీవిధి హి♦తంబుగ సారథి పల్కువాక్కులన్
విని పరిహృష్టుఁడై యతని ♦ వే పలుభంగుల సత్కరించి యు
ద్ధనిరతిఁ గొన్న చిత్తమునఁ ♦ దానిటుపల్కెను; సారథీ! రథం
బును వడిఁ దోలుమా యెచట ♦ భూపతియుండునొ యాధరిత్రికిన్. ౨౪

క. అని రావణుండు వైరి శ,సునుపురికిం బంపకుండ ♦ మరలుఁడు సుమ్మా;
యని రాక్షసేంద్రుఁ డాతనిఁ, గని పలికి మహాముదమును ♦ గాంచినకతనన్.

క. వరసూతునకున్ హస్తా,భరణము శుభరీతి మిగుల ♦ భాసిలుదానిన్
గర మర్థి నొసఁగె; సారథి,యు రావణునివాక్య మట్టు ♦ లొప్పుగ రథమున్.

ఆ. వైరి కభిముఖముగ ♦ వడిఁ దోలె; నారీతి
నధిపువాక్యచోది♦తాత్ముఁడగుచు
హయవరములఁ దోలె ♦ నాసారథియు నంత
నమ్మహారథుఁడగు ♦ నసురవిభుఁడు. ౨౭ 4603

క. మనమున సంతోషంబును, గననాస్యందనవరంబు ♦ క్షణమున యుద్ధం
బున రామున కభిముఖమై, యనుపమముగ నిల్చె నసురు ♦ లచ్చెరు వందన్.

నూటయాఱవ సర్గము సంపూర్ణము.

---

౧౦౭ - వ సర్గము.

ఆదిత్యహృదయమును రామున కగస్త్యుఁ డుపదేశించుట.

చ. అనిఁ గనువేడ్క దేవనిక♦రాన్వితుఁడై చనుదెంచియున్న చ
క్కని మహిమంబు గల్గు ముని♦కాంతుఁ డగస్త్యుఁడు ఘోరసంగరం
బునఁ గడుశ్రాంతి నొందియును ♦ బూనిక యుద్ధము చేయువేడ్క వ
చ్చిన తనవైరి రావణుని ♦ జెచ్చెఱ ముందటఁ గాంచి యాత్మలోన్. ౧ 4605

తే. ఈతని జయించు టెట్లొకో ♦ యీతఁడని నని
చింతలో మున్గియున్న యా♦క్షితిపతిఁ గని
యతని యొద్దకు వచ్చి యి♦ట్లనియె; దీర్ఘ
బాహుయుగశోభితా! *రామ♦భద్ర! రామ!. ౨ 4606

క. ఏనుతిచేతన్ వైరుల, దానవులను గెల్వఁ గలవొ ♦ దానిన్ గుహ్యం

---

* రామ రామ మహాబాహో-అనియు.

శై నగడి సనాతనమై, మానినుతంబైన నుతిని ♦ మమత వచింతున్. 3 4607

తే. అద్రి యాదిత్యహృదయాహ్వ♦యంబు దాని
భక్తిఁ బఠియింపఁ బుణ్యము ♦ వైరినికర
నాశముం గల్గి జయము సం♦తతము గల్గు
నక్షయఫలంబు చేకూరు ♦ నధిక శుభము. ౮ 4608

తే. మంగళములకు నెల్లను ♦ మంగళంబు
సర్వపూర్వాఘములను నా♦శనము చేయు
సాధులను వ్యాధులను జెండు ♦ నమితమైన
యాయు వొసఁగు జప్యంబు ♦ ననుపమంబు. ౯ 4609

క. [1]పరమాంతరంగభక్తాం, తరమున వెలుఁగొందు వానిఁ ♦ దపనీయకరో
త్కరవిలసితుని నవోదయు, పరిభాసితు దేవదనుజ♦పరమోపాస్యున్. ౧౦

క. నిరతిశయదీప్తిమంతుని, సరసిజరిపుసూర్యముఖ్య♦సకలఖచరభా
సురదీప్తిదు బ్రహ్మాండో,త్కరపాలకు నీ స్తవమునఁ ♦ దమిఁ గొల్వు మికన్.

క. సురసంఘతనుఁడు సుమ్మీ!, పరులను హీనులుగఁ జేయు ♦ పటుసామర్థ్యం
బు రహిం గలాఁడు; రశ్ములు, సిరతము భావింపఁ జేయు ♦ నేర్పరి యితఁడే.

క. దేవాసురగణములఁ ద,త్పావనలోకములఁ దనప్ర♦భాపటలముచే
భావించి రక్షణము సే,యు వేళను జేయుచుండు ♦ హితముగఁ జుమ్మీ!. ౧౩

క. ఇతఁడే తలపోయుంగాఁ, జతురాస్యస్కృతియు విష్ణు♦శంకరరూపుం
డితఁడే రిపుప్రజశోషణ, మతులితముగఁ జేయుఁగాన♦నగు స్కందుండున్. ౧౪

[2] తే. మఱి ప్రజాపతిరూపుండు ♦ మహితవిభవ
మునఁ జెలఁగుచు మహేంద్రుండు ♦ ధనదుఁ డల్లి
లయకరుఁడు గానఁ గాలుఁడౌ♦ను యముఁడగును
శిక్ష చేయుటచేతనే ♦ క్షితిప! వినుము. ౧౫ 4615

క. అమృతముఁ బుట్టించుట చే,త మహిన్ సోమాఖ్య నెగడుఁ ♦ దగ జలపతినా
మముఁ దాల్చుఁ బితరులును నగు;,సుమహితులగు వసువు లితఁడె♦చూడఁగ రామా!.

తే. సాధ్యు లశ్వులును మరుద్ర♦జంబు మనువు
భూచరుండగు వాయువు ♦ పొలుచు వహ్ని
యును బ్రజాప్రాణవాయువు ♦ దనరు ఋతుని
కరమునకుఁ గర్త యగు ప్రభా♦కరుఁడు నగును. ౧౭ 4617

1 ఇచటనుండి మహేశ్వరతీర్థులవారి యభిప్రాయ మీపద్యములలో నిమిడియుండునని గ్రహిం పవలయును. 2 ఇటఁ బ్రతిశబ్దమునకు వ్యుత్పత్త్యర్థములు తీర్థులవారి యభిప్రాయానుసారము వ్రాయఁ బడినవి.

సీసమాలిక. —

అదితికి సుతుఁడుగ ♦ నవతరించినయట్టి యాదిత్యుఁడవు, జగ♦ దాదికర్త
వగుదువు, కర్మము ♦ లాచరింపఁగ జనులను బురికొల్పుచు ♦ ననుపమానుఁ
డవగు నార్యుఁడవు, లో♦కావళి కుపకారమాచరింపఁగ నంబ♦రాంగణమునఁ
జరియించుఖగుఁడవు, ♦ జగమును సృష్టిచేఁ బోషించుచున్నట్టి ♦ పూషుఁడవు,గ
భస్తిమంతుండవు ♦ ధర్మము నాకృతిఁబడయుటచేత సు♦వర్ణసదృశుఁ
డవు, ప్రకాశించువాఁ♦డవు భానుమూర్తివి, బ్రహ్మాండసృష్టిని ♦ భాసిలుట హి
రణ్యరేతసుఁడవు, ♦ రహిమీఱఁగా దివాకరుఁడవు, మానసము ♦ గడుహరించు
నట్టియశ్వంబున ♦ నలరుట హరిదశ్వుఁడనఁబడువాఁడవు, ♦ హరిసకల
కళ్యాణగుణుఁడవై ♦ క్రాలుటచే సహస్రార్చివి, సప్తాహ్వ♦యాశ్వయుతుఁడ
వగుటచే లోకంబు♦నందు విఖ్యాతుఁడవగు సప్తసప్తివి ♦ జగ సమస్త
శత్రునాశనమును ♦ సత్వరముగఁ జేయుచక్రము గల్గుట ♦ జగమునందుఁ
దొడరి మరీచిమం♦తుఁడవు, జ్ఞానోత్పత్తికిని బంధకంబనఁ ♦ జను నఘంబు
నపనయించుటచేత ♦ ననిని దిమిరోన్మథనుఁడను నామంబు ♦ దనరువాఁడ
వగుదువు, సుఖముల ♦ సంతతంబు గల్గఁజేయుట శంభుఁ♦డనఁగఁ బడుదు,
వవనీధవులతోడ ♦ ననిని మృత్యోదునాయులు కోలఁదిగ ♦ మహితశక్తి
నొనరించుటను త్వష్ట ♦ యనఁబడుదువు,న్యాశమైన బ్రహ్మాండంబు♦ననుపమగతి
జీవింపఁజేయుట♦చేత మార్తాండుఁడె, ంతట వ్యాపించు ♦ నట్టియంశు
మంతుఁడ వగుదువు ♦ మఱి జగదుత్పాదకసమష్టిజీవని♦కరము గర్భ
మందుఁ గల్గుటచేత ♦ నలరుహిరణ్యగర్భాఖ్యుండ వగుదు, వీ♦సఖిలతాప
తప్తులవిశ్రమ♦స్థానమౌటను శిశిరాహ్వయుండవు, తన♦యాశ్రితులకుఁ
బగవారలెవ్వరో ♦ వారికిఁ దాపంబుగలుగఁ జేయుటచేత ♦ నిలఁ దపనుఁడ
వగుదువు, తేజస్సు♦లుఁ గలుగఁజేయుట భాస్కరుఁడవు, వేద♦వారములను
నుపదేశ మొసఁగుచు ♦ నుంటచే రవిగదువు, రుద్రునింగను♦ట వసుమతిని
నగ్నిగర్భుండన ♦ నలరారుచుందు, వీ వదితిపుత్రుఁడవు, హృ♦దంతరాళ
మందు సుఖంబు గ♦న్నట్టికారణమున శంఖుఁడ వగుదువు, ♦ సాంద్రతుహిన
మును, సూర్యరూపంబుఁ ♦ గొని రూపుమాపుటశిశిరనాశనుఁడనఁ♦జెలఁగు దీవు
తామసాహంకార♦తనువున నంబరమును సృజించుట నీవు ♦ గనుదు వ్యోమ
నాథాహ్వయము, తమో♦నాశకగుణభేది, వఋగ్వేదంబుల ♦ కంతమును గ
నినకారణమ్ముచే♦తను ఋగ్యజుస్సామపారగుఁడని పిల్వఁ♦బడుదు వీవు,
కర్మఫలాత్మక♦ఘనవృష్టిగలవాఁడ వగుటను ఘనవృష్టి ♦ యనఁబడుదువు
జలరాశియందున ♦ శయనించుటను నపాంమిత్రుఁడనంగను ♦ మెలఁగుదీవు,
వింధ్యమురీతిని ♦ వెలసి దుర్గమమగునట్టిసుషుమ్నాఖ్య ♦ మైనమార్గ

మందు శీఘ్రమ్ముగఁ ♦ బొందించుటను వింధ్యవీథిప్లవంగమ♦విమలనామ
ధారివి, లోకవి♦తతిని నిర్మించుసంకల్పము నాత్మను ♦ గల్గియుంట
నాతపి వగుదువు, ♦ హారిమండలి వీవు మృత్యువవగుదువు, ♦ మేళనమున
బింగళుండవు నీవు ♦ వెలయుచునుందువు,సర్వాండములఁ గూడ ♦సంహరించు
టను సర్వతాపనుం ♦ డనఁబడు చుందువు, కవివి, విశ్వుండవు, ♦ సువిమలమగు
నట్టి తేజంబున ♦ నలరుటచే మహా తేజుఁ డనంబడు ♦ దీజగమున,
రంజకుఁడవు గాన ♦ రక్తుండ వగుదు, సర్వభవోద్భవుండవు, ♦ రమ్యసకల
తారకానక్షత్ర♦తతికిని గ్రహములకధినాథుఁడవు, వాని♦యంతరమున

తే. వఱలుచుందుదు, సకలవి♦శ్వములకీవె
హేతువగుదువు? తేజస్సు ♦ లెల్ల నీదు
తేజమున డిందుపడుటను ♦ దివ్యమహిత
తేజమున నొప్పువాఁడవు ♦ దేవదేవ!. ౧౪ 4618

క. ద్వాదశమండలవర్తీ!, నీదయగల్గినను జాలు ♦ నెమ్మిఁ గరుణతో
బ్రోది వగు నీకువందన, మో దేవా! యగునుగాక; ♦ యుద్యన్మలరన్. ౧౫

సీ. పూర్వపశ్చిమదిక్స్థ♦భూధరాంతర్యామి యైనవానికి మ్రొక్కు ♦ మానితవిల
సజ్జ్యోతిరాకార♦సహితులౌ ముక్తుల కధిపతియై, దివ♦సాధినాథుఁ
డగు భాస్కరేశున ♦ కంజలి; జయునకు జయభద్రునకు నమ♦స్కారమల్లి
హార్యశ్వునకు సహ♦స్రాంశువునకుఁ బలుసారులు వందన♦సముదయములు

తే. వందనంబు లాదిత్యున♦కుం దమి మఱి
యుగ్రునకు వీరునకు మ్రొక్కు ♦ లొక్క రీతి
నంజలు లొగి సారంగున ♦ కనులకనుల
సంప్రబోధునకున్ నమ♦స్కారశతము. ౧౬ 4620

క. నతితతి మార్తాండునకున్, శతధృతిహరవిష్ణుపతికి ♦ సతతమ్ము నమ
స్తతులగు సూర్యునకంజలి, స్తుతియగు నాదిత్యవర్చ♦సునకున్ భక్తిన్. ౧౭

సీ. భాస్వంతునకు సర్వ♦భక్షునకున్ మ్రొక్కు రౌద్రవపువునకు ♦ రమణ వినతి
తమము నడంచు న♦త్తమునకు జేజేలు మఱి హిమఘ్నునకు న♦మస్సులగును
శత్రుఘ్నునకు నమ♦స్కారంబు లమితాత్మునకు జోతలు కృతఘ్న♦నాశనునకు
నంజలి దేవున ♦ కావృతి మ్రొక్కులు జ్యోతిషాంపతికిని ♦ జోతలగును

తే. దప్తచామీకరాభుఁడై ♦ యనరురవికి
వహ్నికిన్ విశ్వకర్మకు ♦ వందనమ్ము
లగుఁ దమోభినిఘ్నునకు లో♦కాళిసాక్షి
కిని రుచికి మ్రొక్కులగు మహా♦త్మునకు నతము. ౧౮ 462

క. ఇతఁడే ప్రళయంబున లో,కతతిన్ నాశనముచేయుఁ ♦ గడఁగి మరల ని
ర్మితిచేయు దానినే స,న్నుతిఁ బోషించును లయంబు ♦ మాసిన తఱిని౯. ౨౧౫

తే. కాంతి శోభిల్లఁజేయును ♦ గాయు నెండ
వాన గురియును, బ్రాణులు ♦ వరుస సుస్థి
నొందఁగా సంతరాత్ముఁడై ♦ యొక్కరీతి
మేలుకొనియుండు నీతఁడే ♦ ప్రాలుశక్తి. ౨౨౫ 4624

సీ. అగ్నిహోత్రమితండె, ♦ యగ్నిహోత్రుల ఫలముమునీతఁడేవేద♦ములును మఖము
లను యజ్ఞములఫలం♦బును నీతఁడే లోకములఁగల్గు సత్కర్మ♦ములకు నెల్లఁ
బ్రభువగునీశుఁ డీ♦రవియే నియంతయౌ, నోరాఘవా! విను ♦ మొక్కమాట
నెవ్వఁడైనను సరే ♦ యెట్టియాపదలను గష్టంబులందును ♦ గానసముల

తే. నిరతభయముల నీస్తుతి ♦ నియతిని బఠి
యించినన్ గ్రిందుపడకుండు; ♦ నెల్లసుఖము
లబ్బు, నీవును జిత్తంబు ♦ నమలరీతి
నిశ్చలంబుగఁ జేసి యీ♦నిఖిలవిభుని ౨౫౫ 4625

తే. దేవదేవునిఁ బూజింపు ♦ దీనిచేత,
దీనినే మూఁడుసారులు ♦ పూనిక జపి
యించినన్ విజయంబును ♦ గాంచువాఁడ
వని; మహాబాహువిలసితా! ♦ యారిహరణ!. ౨౬

క. ఈతరుణంబున నీ వీ,దైతేయుని రావణాఖ్యుఁ ♦ దప్పక యనిలోఁ
జేతము రంజిలఁ జంపుదు, భూతలనాథా! యటంచు ♦ మునిపతి యొలమి౯.

క. పలికి యగస్త్యుఁడు వచ్చిన,టులెఁ జనియె౯; రఘుపతీంద్రుఁ♦డు౯ గురుతేజం
బలఘుబలంబును మెఱయఁగ, నిలానుకోక్తమును నుతిని ♦ నెలమి వినంగ౯.

క. తనశోకము నశియించుట,యును మిక్కిలి హృష్టుఁడగుచు♦నొప్పుమెఱయఁ జ
క్కనిమనసున వార్చి శుచిం, గని యాదిత్యుఁ బరుఁ జూచి♦కడుభక్తిమెయి౯.

తే. దీని జపియించి హర్షంబు ♦ మానసమునఁ
బొంది వీర్యము పొంగఁగ ♦ భూరిధనువుఁ
దాల్చి నిల్చెను; రాముఁ డం♦తఁ గలహమున
వైరి యగురావణునిఁ గాంచి ♦ బలము మెఱయ. ౨౯౫ 4630

చ. మనమున హర్ష మొంది యను♦మానము మాని సమస్తరీతుల౯
దనుజవరేణ్యుఁ జంపుటకుఁ ♦ దా నచలస్థితి నిశ్చయించి వే
యని నొనరింపఁ బూనుకొనె; ♦ సంతత భానుఁడు తన్ను సన్నుతిం
దనిపెడు రాముఁ గాంచి ప్రమ♦దంబున మేను గగుర్పడంగ నా
దనుజుని చావు నాతనికి ♦ దా నవు డానతి యిచ్చి యంతట౯. ౩౦౫ 4631

తే. [1]తనదుమండలమును వీడి ♦ తగ నమర్త్య
సముదయాంతరమున నిల్చి ♦ సత్వరపడు
మింక రావణుఁ జంపంగ ♦ నినకులేశ!
యనుచు రామునకుం జెప్పె; ♦ నంత నచట. ౩౧ 4632

నూటయేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౮ - వ సర్గము.

రావణునకు దుర్నిమిత్తములు తోఁచుట.

ఉ. సారథి నంతసిల్లి దను♦జప్రభునానతిరీతి నారథం
బా రఘురాముసైన్యముఁ ♦ గాతురతం గలిగించునట్టిదై
భూరినముచ్ఛ్రితధ్వజన♦మూహముగా నలరారి యుండఁగాఁ
జారుగతుల్దగన్ నడిపె ♦ సత్వర మారఘురాముమీఁదికిన్. ౧ 4633

క. అరదం బది చిత్రాలం,కరణయుతం బౌచు నొప్పి ♦ గంధర్వమహా
పురమున వెలయుచు హాటక,వరమాలిక లొప్ప వేగ♦వర్ధయుతమై. ౧½

క. కలహోచితపరికరవిత,తులనుండి పతాక లలరఁ ♦ దోరపుధ్వజముల్
వెలయఁగఁ దనయున్నతి ని,మ్ముల నభ్రము మ్రింగ నెంచుఁ♦బో యనునట్లై.

క. ధరణిన్ మ్రోయించుచు నా, పరసేనలఁ జెండఁ జాలి ♦ భాసిలి స్వబలో
త్కరముల కుల్లాసమ్మును, బరఁగంగాఁ జేయుచును న♦భంగుర మగుచున్. ౩½

క. నిరుపమగతి నొప్పెను! భూ,వరుఁడగు శ్రీరాముఁ డసుర♦నల్లభురథ మా
కరణిన్ శబ్దించుచు భీ,కరరవమున దిక్కులొప్పఁ♦గతిఁ జేయునదై. ౪ 4637

క. తనపైకి వచ్చుచుండఁగఁ, గనియెన్; మఱియున్ నృపాల♦కాంతుఁడు రిపువా
దమజేంద్రు నమ్మహారథ,మును [2]కృష్ణతురంగయుక్త♦మును నుగ్రంబున్. ౫

తే. భయదవర్చస్సుతోఁ గూడి ♦ పడగ లెల్ల
మెఱపుఁదీఁగల రీతిగా ♦ మెఱయుచుండ
నింద్రనాయుధమట్టుల ♦ నెసఁగు ధనువు
గనఁబడన్ మేఘసంతతి ♦ గడురవముల. ౫½ 4639

క. ఘనవృష్టి గురియుచాడ్పున, సునిశితశరవృష్టి గురియు♦చుం దనపైకిం
జనుదేరఁ గాంచి తనదగు, ధనువును [3]బాలాబ్జురీతిఁ ♦ దగ వంచి క్రుధన్.

క. కులిశముతాఁకునఁ బర్వత,ములు బగిలెడునపుడు గలుగు ♦ భూరిరవము న
ట్టులు చప్పుడు గలుగఁగ నుజ్జ్వలగుణమునుదీటుచున్ స్వ♦శౌర్యముఁ బొంగన్.

---

1 సురగణమధ్యగతో వచ స్త్వరేతి-అనిమా. 2 కృష్ణవాజిసమాయుక్తమ్-అనిమా. 3 బాల చంద్రనతం ధనుః-అనిమా.

తే. నిర్జరేంద్రుని సారథి♦ని గని పల్కె
మాతలీ! శత్రురథ మదె ♦ యాహతగతి
వచ్చుచున్నది చూడుమా; ♦ వాసవరిపు
వతఁడు మరల మహాజవ ♦ మలరుచుండె. ౮॥ 4642

తే. అప్రదక్షిణ మగునట్లు ♦ లరుగుదెంచు
చున్నవాఁడొట వానికి ♦ యుద్ధమరణ
మందు మతిగల్గినట్లున్న ♦ దట్టులగుట
నరసగతి మీఱ నీవు హె♦చ్చరికఁ బూని. ౯॥ 4643

క. మనరథము వైరియరదం,బున కభిముఖముగను దోలు♦ము మరుత్తు నభం
బున లేచిన ధారాధర,మును జెండెడురీతిఁ జంపఁ ♦ బూనితి వీనిన్. ౧౦॥

తే. దైన్య మొందక భ్రాంతినొం♦దక మనంబు
కలఁక నొందక నీవు వీ♦క్షణము లించు
కంత యేనియుఁ జెదరక ♦ యులరఁ బగ్గ
ములఁ గ్రమంబునఁ ద్రిప్పుచు ♦ లలితరథము. ౧౧ 4645

క. త్వరితంబుగఁ దోలుము; వ,జ్రిరథంబును నడపి ఖ్యాతిఁ ♦ జెందిన యలనీ
కురుముదమున నీవిషయము, మరలం గఱపంగఁ దగదు ♦ మాటవరునతోన్.

క. అని సేయఁ బూనినాఁడను, గనుకన్ స్మరియింప నెంతుఁ♦గానీ బోధిం
పను బూనలేదు నేర్పుం,గను దలఁపఁగ లే దటన్న; ♦ క్ష్మాపతిపలుకుల్. ౧౩॥

క. విని సారథితిలకుం డనఁ, జను నింద్రునిసారథియును ♦ సంతసము మతిం
తను గని దోలెను నారథ,మును మాతలి యంత శక్తిఁ ♦ బొంగుచునుండన్.

తే. రావణాసురునమ్మహా♦రథము నప్ర,దక్షిణమ్ముగఁ జేయుచుఁ ♦ దనరథంబు
నవ్యగతిఁ దోలఁ దచ్చక్ర♦జనితరేణు, నష్టముగఁ బర్వె రథికుల♦యంతరమున.

క. దనుజేంద్రుఁ డంతఁ గ్రోధం,బునఁ గన్నులు రక్తవర్ణ♦ములు గాఁగ రథం
బున కభిముఖుఁడై నిల్చిన, జనపతి నొప్పించెఁ దీవ్ర♦సాయకపంక్తిన్. ౧౫॥

సీ. మహితతేజుండగు ♦ క్ష్మాపతి యంతట వైరిధర్షితుఁడయి ♦ భూరిరోష
మున ధైర్య ముప్పొంగ ♦ మున్ను మాతలి తెచ్చినట్టి మహావేగ♦మగుశక్ర
తునిశరాసనవర్య♦మును రవిరశ్ములవంటి ప్రభల్ గల్గు ♦ వాఁడి బాణ
ములను గ్రహించెను;♦ కలహంబు చేయంగనొంచొంటి కెదురయి♦యొకటినొకటిఁ

ఆ. జంపఁ గోరి బలసి ♦ పెంపున నున్నట్టి, గజరిపులకు వలెన ♦ కర్బురేంద్ర
మనుజనాయకులకు ♦ ననుపమయుద్ధంబు, చెల్లె; నంత దేవ♦సిద్ధవరులు. ౧౭

క. మునిపతులును గంధర్వులు, దనుజేంద్రునిమరణ మెదలఁ ♦ దమిఁ గోరుచు నుం
డినవార లొట యుద్ధం,బును దానిం జూడ నభ్ర♦మును జేరుటయున్. ౧౮

తే. గగురుఁ బుట్టించుచున్ భయం♦కరము లగుచు
రావణునినాశనంబును ♦ రామవిజయముఁ
గానఁ బఱచునుత్పాతముల్ ♦ గనఁబడియెను;
దనుజనాయకురథముపై ♦నను రణమున. ౨౦ 4653

క. కురిసెను పర్జన్యుఁడు నె,త్తురుఁ దీక్ష్ణశ్వసనవితతి ♦ తోరపువడితో
వరుస నపసవ్యగతితోఁ, జరియించెను గృధ్రము లోగి♦సముదయములుగాన్.

క. తిరుగుచు నభమున రావణు,నరదం బేదెసలఁ బోవు ♦ నాదిక్కులకే
పరువన్ వెంటను బోయెను;, సరిగా దివసమునఁ గూడ ♦ సాంద్రముగాఁగన్.

తే. లంక దాసానిపూవట్టు♦లన్ సురక్త,మైన సంధ్యాప్రకాశము ♦ ట్లావరింప
నాపురంబున్న ధరణి త్రి♦యామయందు, మండుచున్నట్లు కనఁబడెఁ♦జండరీతి.

క. పిడుగులతోడ మహోల్కలు, పడియె మహారవము మిగులఁ♦బ్రతికూలములై
పడునవి రావణునకు నె,క్కుడు ఖేదము గల్గఁజేసి ♦ కుందఁగఁ జేసెన్. ౨౪

క. దనుజేంద్రుఁ డున్నచోటం, గనఁబడు మేదిని చలించెఁ ♦ గ్రవ్యాదులు వై
రినికాయముఁ బ్రహరింపం,గను బూనఁగ వారిభూరి♦కరము లొరులచేన్.

క. పట్టుకొనఁబడినయటు గ,న్పట్టెన్; రవికాంతు లెల్లఁ ♦ బచ్చవిగా న
ప్పట్టున నెట్టఁగఁ దెల్లఁగ, నట్టులె నల్లఁగను దనుజ♦సంగమునందున్. ౨౫

తే. ఒక్కరీతిగ వ్యాపించి ♦ యురుగిరిపయి
ధాతువులరీతిఁ జూపట్టె; ♦ నాతఱి నట
గ్రద్దలున్ వెంట రా వంచ♦కములు నోళ్ల
నగ్నికణములఁ గ్రక్కుచు ♦ నసురపతిని. ౨౬ 4660

చ. కనుఁగొనుచున్ శుభేతరము ♦ గల్గుటఁ దెల్పుచు నార్చె; వాయు వా
యనిమొన లేచి రావణున ♦ కక్షులు గన్పడకుండ ధూళిఁ జ
క్కనిగతిఁ జల్లుచున్ జవముఁ ♦ గైకొనుచుం బ్రతికూలరీతి వీ
చెను; జలదంబు తద్ధ్వనియుఁ ♦ జేకురకుండఁగఁ దద్బలంబులన్. ౨౭ 4661

ఆ. ఓర్వనలవిగాక ♦ యుగ్రంబులును నయి, భయదరవము లొప్పఁ ♦ బడియెనచట
నొక్కరీతిగాఁగ ♦ నుల్కాశనులు; దిగ్వి,దిక్కులందుఁ దమము♦ తెఱపిలేక.

క. చీఁకటులు గ్రమ్మె; ధూళియు, నాకరణిం గురియుచుంట ♦ నవకాశంబే
యాకసము వంకఁ జూడఁగ, నేకరణిం గల్గదయ్యె ♦ నెవ్వరికైనన్. ౩౦

*చ. అనిమొన నందు శారికలు ♦ నాగ్భటిమీఱ రణంబు చేయుచున్
ఘనభయముం బొసంగునటు ♦ గాఢముగా నినదం బొనర్చుచున్

* కుర్వంత్యః కలహం ఘోరం శారికా స్తద్రథం ప్రతి, నిపేతు శ్శతశ స్తత్ర దారుణం దారుణా రుతాః-అనిమూ.

దనుజమహేంద్రుస్యందనవ♦తంసముపై శతసంఖ్య లోక్కరీ
తిని బడియెన్; మహాసురుని♦ తేరునకుం గల ఘోటకావళుల్. ౩౧ 4664

తే. జఘనములనుండి హుతవహు♦జ్వాలలను న
యనము లందుండి యశ్రువు♦లను ఘనముగ
నగ్ని నుదకంబు సంతత ♦ మపుడు విడిచె;
నచట నిటు దారుణములు భ♦యావహములు. ౩౨ 4665

క. కనదుష్టములునునై తగు, ననేకదుశ్శకునము లొగి ♦ నాతనికిం జా
వును దెల్పుచుం గనంబడియెన్;, మనుజేంద్రునకును సమస్త♦మంగళదములై.

తే. జయము దెల్పెడు నట్టివై ♦ చాలసౌమ్య
ములును నయి యొప్పుశకునరా♦సులు గనంబడె
నెల్లతావుల; జయమున ♦ నుల్లసిల్లఁ
జేయుశుభశకునముల నా♦క్షితిపతి గని. ౩౪½ 4667

క. పరమప్రమదముఁ గనుచున్, సురారి మృతినొందినట్లు ♦ శుభము తనకు న
త్తరుణమునఁ గల్గినట్టులె, పరికించెను; నంత రామ♦భద్రుం డచటన్. ౩౫

తే. లక్షణజ్ఞుఁడు కావున ♦ నక్షయముగఁ
దనకు విజయంబు గల్గుట ♦ తగఁ దెలిపెడు
శుభనిమిత్తములం గని ♦ చొక్కపుఁదమిఁ
బులకితశరీరుఁడై వైరిఁ ♦ గలహమందు. ౩౫½ 4669

క. పరిమార్ప మిగుల విక్రమ, మరుదుగఁ గనఁబఱుపఁ బూని♦యధికసుఖము నా
తరుణంబునఁ గని యింకం,బరుఁ డీల్గు నటంచుఁ దలఁచె ♦ స్వాంతమునందున్

నూటయెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౯ - వ సర్గము.

రామ రావణులు మహాహవ మొనరించుట

చ. అరదము లెక్కియున్న దను♦జాధిపరాముల కప్డు భూరిసం
గరము భయంకరం బయి జ♦గత్తతి కెంతయు నోర్వరానిదై
పరుషమునై చెలంగె; సుర♦బాధకుఁడై తగు రాక్షసేంద్రుభీ
కరబలముల్ గపీంద్రుభట♦కాండము సంగరసాధనాళిచేన్. ౧½ 4671

తే. ఒప్పియుండియు వారల♦యుద్ధదర్శ
నమునఁ గల్గెడు వేడుకఁ ♦ దమప్రయత్న
ములను విడనాడి యూరకె ♦ నిలిచి; రంత
రామరావణు లతిఘోర♦రణము చేయ. ౨ 4672

* తుల్య మగ్నిం చ వారి చ-అనిమూ.

క. ఆయతులై యుండుటఁగని, యాయిరువాఁగులఁ జెలంగు ♦ నందఱు సుభటుల్
పాయక యాయనిఁ గను తమి,నాయతనుతు లొంచు విస్మ ♦ యము గని రంతన్.

సీ. ఆవీరభటులు పె ♦ క్కాయుధంబులఁ గరంబులఁదాల్చి యనిచేయ ♦ వలయుననుచు
నుండియునాశ్చర్య ♦ మొంది యాయుద్ధంబుఁగని పరస్పరము సం ♦ గరము చేయఁ
బూనకుండిరి; మఱి ♦ దానవసేనలు తమవిభుం గపిగణ ♦ తల్లజు బల
ములు రాముఁ గనుచు ని ♦ మ్ములవిస్మితాత్ములై చిత్రప్రతిమ లట్లు ♦ క్షితి నిలిచిరి;

*తే. రాము రావణు లిద్దఱు ♦ నామహాహ
వమునఁ దోఁచు నిమిత్తము ♦ లమరఁ గాంచి
జయము నపజయమును గల్గు ♦ సరగ ననుచు
బుద్ధి నెంచియుఁ గోపంబు ♦ పొంగుచుండ. ౭౫ 4674

క. భీతిరహితులై పోరిరి;, భూతలపతి జయము గల్గుఁ ♦ బోయనియు; సురా
రాతివిభుండును మృతిఁ దన, కాతఱిని గల్గుననియు ♦ నాత్మఁ దలఁచుచున్.

తే. ధైర్య మూని విక్రమముల ♦ దారుణముగఁ
జూపి; రంతట వీర్యంబు ♦ శోభిలంగ
నసురపతిచాపమున పాయ ♦ కాళిఁగూర్చి
దాశరథిస్యందనోల్లస ♦ ద్ధ్వజముమీఁద. ౮౫ 4676

క. త్వరపడి వైచెను; నయ్యవి, పురుహూతరథైకశక్తిఁ ♦ బోలుపతి పడియెన్
ధరణిన్ ధ్వజము స్పృశింపకె;, ధరణీశుఁడు వీర్యమున ను ♦ దాత్తక్రుధచేన్.

చ. ధనువును లాగి రావణుని ♦ శత్కృతికిం బ్రతిచేయ నెంచె నె
మ్మనమున; భూరిజిహ్వగము ♦ మాడ్కి సహింపక రాక స్వీయకాం
తిని జ్వలియించుచున్ మెఱయు ♦ తీవ్రశరంబును వైచె వైరికే
తనముపయిన్; శరం బదియుఁ ♦ దద్ధ్వజమున్ వడిఁ గూల్చి భూమిలోన్. ౧౧

తే. చొచ్చె, ధ్వజ మట్లు భిన్నమై ♦ క్షోణిఁ బడియె;
గురుబలుండగు దానవ ♦ కుంజరుండు
తనధ్వజం బట్లు విఱిగినఁ ♦ గని విరోధి
పౌరుషము నోర్వఁ జాలక ♦ బలము మెఱయ. ౧౨౫ 4679

క. ఘనకోపమ్మున మిక్కలి,యును జ్వలియించెను; మహోగ్ర ♦ ధోగ్రుండగుచున్
దనరొుడలు తెలియ కుగ్రా,శనిసమశరవృష్టిఁ గ్రక్కు ♦ చందము తగఁగాన్.

క. ధరణీశునిగుఱ్ఱములను, బరుషశరంబులను నొంచెఁ ♦ బరమాశ్వము లా
శరతతిఁ బాదస్ఖలనము, సరియగు గతిభేదమును బొ ♦ నంగకయుండన్. ౧౪౫

తే. నిలిచియుండుటె కాక ని ♦ ర్మలసరోజ,నాళహాతినొందినట్లు మ ♦ నంబు చెదర
కట్టె స్వస్థములై యుండె; ♦ నంతరావ,ణాసురుం డాత్మశరములఁ ♦ గాహయములు.

---

* తౌ తు తత్ర నిమిత్తాని దృష్ట్వా రావణరాఘవౌ, కృతబుద్ధీ స్థిరామర్షా-అనిమూ.

క. ఆతురము నొందకుండుటఁ, జేతంబున నరసి విసుగు ♦ చెందక మిగులన్
భీతిం గనఁజేయురుమన్, భూతలపతిమీఁద బాణ♦ములసృష్టిఁ గదున్. ౧౬

క. కురియించె నంత గదలను, బరిఘుంబులఁ జక్రముసల♦పర్వతశృంగో
త్కరమును దరుశూలంబులఁ, బరశ్వధములన్ మహీశు♦పైఁ బరఁగించెన్.

[1]చ. ధనువుననుండి శూలముఖ♦దారుణసాధనరాజి వైచు టె
ట్లనిన విచిత్రశక్తిని భ♦యంకరమై ప్రతినాద మిచ్చురీ
తిని బహుభంగులం దనరి ♦ తీవ్రమహాంబరవృష్టి దాని నొ
య్యనఁ గురియించెఁ; బెక్కులగు ♦ నస్త్రమయంబగు వర్షమద్దియున్. ౧౮

తే. ఓర్వఁ జాలనికోపంబు ♦ నూని కురియఁ
జేయఁబడుటను జవమున ♦ శ్రీరఘుపతి
యరదమును మీఱి కపిసైన్య♦మందుఁ బడియె;
దనుజపతి యంత నుత్సాహ♦మును వదలక. ౧౯ 4686

చ. మన మొకలక్ష్యమం దునిచి ♦ క్ష్మాపతిమీఁదను వేలసంఖ్యగా
ననుపమబాణముల్ వయిచి ♦ యాకసమెల్ల నిరంతరంబుగాఁ
గను బొనరించె వేగమునఁ; ♦ గన్బ్యగనాయకుఁ డిట్లు యుద్ధమం
దునఁ బరతం జెలంగుచును ♦ దోరప్రయత్నము చేయుచుండుటన్. ౨౧ 4682

చ. జనపతి గాంచి [2]నవ్వునటు ♦ సాయకవారము వింటఁగూర్చె; నం
తనతఁడు లక్ష సంఖ్యలుగ ♦ దారుణబాణము లేయఁ గాంచి యా
దనుజవిభుండు బాణసము♦దాయము లాకసమెల్ల నింప నే
సెను; మఱి వారలిద్దఱును ♦ శీఘ్రగతుల్ మెఱయంగఁ బూన్కితోన్. ౨౨

క. శరవర్షంబులు గురియఁగఁ, బరంపరలుగాఁగ నవ్వి ♦ వ్యాపించుట నం
బర మురుశరకల్పితమగు, సురపథభంగిగఁ జెలంగి ♦ చూడం దగియెన్. ౨౩

సీ. ఒకసాయకంబైన ♦ నురులక్ష్యమే లేక వైవంగఁ బడకుండె ♦ వరుస గుఱిని
భేదింప లే దొక్క ♦ విశిఖమైనను గుఱిఁ దగిలి నిష్ఫలమైన ♦ ది గలుగ దొకఁ
డైన నీరీతి బా♦ణాళులఁ గురిపింప వారలశరములు ♦ వరుసమీఱ
నొండొంటి దాఁకుచు♦నుర్విపైఁ బడియె; సవ్యాపసవ్యంబుల♦నరుగుచు నెవు

తే. డంబకంబులు వైచుచు ♦ నంబరమున
నూర్పు పుచ్చుట కేనియు ♦ నొక్కయింత
సందు లేకుండ సాయక♦జాలములు త
గంగఁ జేసిరి భూరిసం♦గరము నపుడు. ౨౪ 7690

1 ధనుషా కథం గదాదిమోచన మిత్య త్రాహ-అనునవతారిక కీపద్యప్రథమపాదము తెనుఁగు.
2 ప్రహాస న్నివ కాకుత్స్థః-అనిమూ.

చ. దనుజవరేణ్యుఘోటకవి♦తానము రాముఁడు రామచంద్రున
శ్వనికర మాసురారిపతి ♦ బాణపరంపరఁ గొట్టుచుఁ జవం
బున నితరేతరంబు బలు♦పూనికమీఁదఁ బ్రతిక్రియం గరం
బొనరుచుచుఁ మహోగ్రముగ ♦ యుద్ధముచేయుచు నుండి రెంతయుఁ. ౨౭

ఆ. ఒకముహూర్తకాల ♦ ముగ్రంబుఁ దుములంబు, రోమహర్షణంబు♦నై మఱింత
పూన్కితోడ జరగె♦భూరియుద్ధము; మహా,బలయుతుల్ సురారి♦పతినృపతులు.

క. సునిశితశరముల యుద్ధం,బును సల్పుచునుండ నసుర♦పుంగవుఁ డాత్మ
దనధ్వజము గూల్చినందుల,కును నరపతిమీఁద మిగులఁ ♦ గోపం బొందెన్.

నూటతొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౦ - వ సర్గము.

రాముఁడు రావణుశిరంబుల నూటయొకపర్యాయములు ఖండించుట.

చ. అని నపుడా నృపాలవరుఁ ♦ డాసురభర్తయు నొక్కపూన్కిఁ జే
య నిఖలభూతముల్ మదుల♦యం దొగి విస్మయ మంకురింపఁగాఁ
గనుఁగొనుచుండఁ: వారలిటు ♦ గాంతరథంబులపైఁ జెలంగి యొ
క్కని మఱియొక్కఁ డుగ్రగతిఁ ♦ గ్రాలఁగ మార్కొనుచుఁ మహోక్రుధన్.

క. శరముల నొప్పించుచుఁ దన,పరునిం జంపంగఁ దలఁచి ♦ బలువిడి నొప్పిం
ప రహిన్ వారల సారథు, లరదంబుల రాకపోక♦లందు నిపుణతన్. ౧౫

తే. మండలంబుల వీథుల♦మహితగతివి
శేషములఁ జూపుచుండ నా♦చిత్రరథము
లతిభయంకరములుగాఁగ ♦ నగపడియెను;
రాముఁ డెంతయు నొప్పించె ♦ రావణు నని. ౩౫ 4696

క. రావణుఁ డారఘురాముని, నావిధమున నొంచె నిట్టు ♦ లన్యోన్యము పెం
పావహిలన్ శరతతులన్, వేవే వైచుచును గమన♦వేగము నచటన్. ౪ 4697

క. కనఁబఱచి రడరుటందును, వెనుకకుఁగాఁ బోవుటందు ♦ వితతంబుగ; నం
త నిరువురాగతిశరముల, ననూనముగ వైచుచుండ ♦ నావరరథముల్.౫ 4698

క. ధారాసారము గురిసెడు,వారిదములరీతిఁ గానఁ♦బడుచుండెను; నా
ఘోరాహవమున నీగతి, వా రరదముల బహుగతులఁ ♦ బఱవుచు మరలన్.౫౫

ఆ. నిలిపి రభిముఖముగ ♦ మెలఁకువ నన్యోన్య
రథములకు; ననంత♦రంబ యుద్ధ
మునను గమన మేమి♦యును లేనివారల
యరదములు తమంత ♦ నాస్థలమున. ౬౫ 4700

సీ. యుగముయుగంబుతో ♦ నొగిఘోటకంబులున్సైంధవములతో ధ్వ♦జంబుధ్వజము
తోఁ గూడియున్నట్లు♦తోఁచిపొల్చెను; రాముఁడంతఁజాపమునుండి♦యతివిభాసు

రాంబకములు నాలు ♦ గడరించి రావణు నశ్వచతుష్కంబు ♦ నవతలఁ జను
నట్లు త్రోలెను; రావ♦ణానుగుం డాత్మాశ్వములఁ దోలఁగించినం♦దులకుఁ గ్రోధ

ఆ. పరవశుఁడయి తీవ్ర♦బాణంబు లారాము, పైసవైచె; రామ♦భద్రుఁ డట్లు
బలమునఁ దగుదనుజ♦వల్లభుశరములు, మేనఁ గ్రుచ్చుకొనిన ♦ దాన నాత్మ.

క. కనఁడయ్యె వ్యథ వికారం,బును నుంతయు; దనుజవితతి♦పుంగవుఁ డమరే
శునిసారథియగు మాతలిఁ, గని కులిశాపాతరవము♦గల బాణములన్. ౧౧

క. సరిపఱపె నతనిపై; నా, శరములు గురుజవము మెఱయఁ♦జని యంగమునం
జొరఁబడియెన్ దానికి నా, వరసారథి నుంత మూర్ఛ ♦ వ్యథను గనకయే.

క. స్థిరముగనుండెను; రాముం, డరాతి తనునొంచుటకు ర♦వంతయు నాత్మన్
బరమాగ్రహ మొందఁడు కా,ని రావణుఁడు మాతలిని సు♦నిశితశరములన్.

ఆ. నొవ్వఁ జేయుటకు న♦నూనాగ్రహము నొంది
శరగణమ్ము లేసి ♦ శత్రుదనుజు
విముఖునిగ నొనర్చె; ♦ వీరుఁడౌ రాముండు
పదుల రెంటమూటఁ ♦ బదిట మఱియు. ౧౪ 4705

క. శరములను నఱువదింటను, మరల సహస్రముల దనుజ♦మాన్యురథంబున్
గరము మునుఁగంగఁ జేసెను;, నరదంబున నిశ్చలుఁడయి♦యాదనుజపుఁడున్.

మ. పరమామర్షముతో గదాముసలముల్ ♦ పైపైన వర్షించి భూ
వరు నొంచెం బ్రతిగాఁగ; న త్తఱిఁ గనన్ ♦ ఘోరంబుగాఁ జాలభీ
కరమై గగ్గురుపాటు గల్గునటుగాఁ♦గం దొమ్మియుద్ధంబు త
త్తరుణంబందుఁ గనంబడెన్; ముసలసం♦తానంబులన్ వైవఁగన్. ౧౬ 4707

తే. గదల గుప్పింపఁ బరిఘని♦కరము వైవ
గల్గు రవములకు శరపుం♦ఖముల పాత
మునకు ఘూర్ణిల్లె నాయేడు♦వననిధు లొగి;
సాగరము లట్లు ఘూర్ణిల్ల ♦ సకలఘనులు. ౧౭ 4708

క. పాతాళవసతు లౌటను, నాతెఱఁగునఁ గంప మొంది ♦ రటు దానవులున్
భీతిలిరి వేనవేలుగ;, భూతలము నరణ్యశైల♦ములతో వడఁకెన్. ౧౮

చ ఖరకరుఁ డాత్మకాంతు లడఁ♦గం గృశియించెను; వీవకుండె నా
మరుదధిపుండు సిద్ధులును ♦ మానివతంసులు దేవగాయకుల్
సురలును గిన్నరోరగులు ♦ సొంపు తొలంగఁగఁ జింతనొంది; ర
త్తరుణమునన్ సురల్ మునిన♦తంసులు చక్కనిమానసంబులన్. ౨౦ 4710

తే. గోవులకు బ్రాహ్మణులకును ♦ గుశలము తగుఁ
గాక శాశ్వతములుగ జ♦గంబులుండుఁ

గాక రాముండు రావణుఁ ♦ గదనమందుఁ
జక్కఁగ జయించుఁగాకని ♦ జప మొనర్చి. ౨౧ 4711

క. ఘోరమయి రోమహర్షణ, మా రాక్షసరాజ భూత♦లాధీశుల దు
ర్వారమహాహవముఁ బయిం, జేరి కనుంగొనిరి; చాలఁ ♦ జిత్రముగాఁగన్. ౨౨

సీ. గంధర్వులచ్చరల్♦గములుగాఁగూడి యప్పెనుసంగరముఁగాంచి♦యనుపమాన
మగుదానివైఖరి ♦ కచ్చెరుపడి యంబరమువంటిదైన ద♦భ్రంబె వనధి
వంటిది తలపోయ ♦ వనధియే యారీతి రామరావణులసం♦గ్రామ మనఁగ
రామరావణులసం♦గ్రామమువంటిదే యని పల్కుచున్ వారి♦యనిఁ గనుఁగొను

తే. చుండి; రాఘకులకీర్తి♦మండనుఁడు మ
హాభుజుండగు రాముఁ డ♦త్యంతరోష
మున వెలుంగుచుఁ గ్రూరాహి ♦ కైనయయి క్షుర
మగ్రమునఁగల బాణ మ♦య్యదనునఁ గొని. ౨౩ 4713

చ. ధనువునఁ గూర్చి కాంతుల ని♦తాంతము గ్రాలుచుఁ గుండలోన్నతిం
దనరుచునున్నయాదనుజ♦తల్లజుశీర్షముఁ ద్రుంచె నద్ది యు
ర్విని బడ మూఁడులోకములు ♦ వేడుకఁ గాంచిన వట్టిశీర్ష మొ
య్యన మఱి యొక్కఁడప్పుడు త♦దంగమునన్ మొలచెం గ్రమంబునన్. ౨౪

తే. *అట్లు మొలచిన రెండవ♦దైన యతని
శిరము నేకార్య మైనను ♦ శీఘ్రముగ నా
నర్చువాఁడౌట నన్నర♦నాథుఁడు నిజ
హస్తలాఘవమున సాయ♦కాళిఁ ద్రుంచె. ౨౫ 4715

చ. శిరమిది భూమిపైఁ బడిన ♦ శీఘ్రమ వేరొకమస్తకం బదే
వరుసఁ గనంబడెన్; నృపతి ♦ వజ్రసమానశిలీముఖంబులన్
ధరణిఁ బడంగఁ జేసె నని ♦ దానిని గూడ; నిదేవిధంబునన్
శిరములు పుట్టుచుండఁ గని ♦ శీఘ్రమ యేకశతోత్తమాంగముల్
శిరములఁ ద్రుంచినన్ దనుజ♦సత్తము జీవితసంక్షయం బటన్. ౨౬ 4716

క. కనఁబడ కుండెను రామున;, కనుపమదివ్యాస్త్రవిదుఁడు ♦ హతరిపువీరుం
డును గౌసల్యానందం,బును వృద్ధిం గాంచఁ జేయు ♦ పూతధిషణుఁడున్.

క. వీరుఁడునగు రాముఁడు మది, మారీచుని నెట్టి తీవ్ర♦మార్గణములచే
ఘోరాటవిఁ జంపితినో, క్రూరుల ఖరదూషణులను ♦ గోరికమీఱన్. ౩౦

సీ. ఏబాణముల వధి♦యించితినో మఱిదండకాటవి విరా♦ధదనుజవరుఁ
గ్రౌంచాఖ్యవనమునఁ ♦ గర్బురేంద్రుఁ గబంధు నేబాణముల వధి♦యించివైచి

* క్షిప్రహస్తేన రామేణ క్షిప్రకారిణా-అనియూ.

తినో యాశరము లెల్లఁ ♦ దీవ్ర యుద్ధంబున సఫలంబు లగునని ♦ స్వాంతమందు
నమ్మియుండెడునట్టి ♦ విస్మహితాంబకములు రావణునియందు ♦ నలఘుశక్తి
తే. మాని లఘుశక్తిగలవయి ♦ మ్రాన్పడి యిటు
లుండుటకు హేతు వేమియో ♦ యూహచేయఁ
దోఁపకున్న దటంచు నా ♦ భూపుఁ డపుడు
చింతిలుచునుండె యంతలోఁ ♦ జింతమాని. ౩౩ 4719

క. మనమునఁ బరాకునొందక, దనుజేంద్రునురంబుపైన ♦ దారుణశరవృ
ష్టిని గురిసె; రథగతుండగు, మనుజాశనపతియుఁ గుపిత ♦ మానసుఁ డగుచున్.
క. అని రామునిపై గదలను, ఘనముసలంబులను వైచి ♦ కడునొప్పించెన్
మనుజేంద్ర దనుజనాయకు, లనుపమగతిఁ దద్ధరాధ ♦ రాగ్రము మీఁదన్. ౩౪
క. *పెనుక్రోధంబున నంబరమున కెగసియు ధరణిభాగ ♦ మును జేరియుఁ బో
రను భూమినభోగిరులను, గనుఁగొనఁ దుములంబుగాఁగ ♦ గగురుజనింపన్.
క. జరగెను భయంకరంబుగ;, సురదానవయక్షరాక్ష ♦ సులును బిశాచో
త్కరములుఁ బాములు గన సంగర మది సప్తత్రియామ ♦ కంబుగఁ జెల్లెన్.
తే. రాత్రిఁ బగటను నొకముహూ ♦ ర్తంబు నొక్క
క్షణమ యైనను వారల ♦ కదన మింత
యైనను విరామ మొందక ♦ యనుపమాన
మగుచు సాగెను జూడ న ♦ త్యద్భుతముగ. ౩౫ 4724

చ. దనుజవిభుండు నాదశర ♦ థప్రియనందనుఁ డేపుమీఱ ని
ట్లని నొనరింప జేనికి జ ♦ యం బిఁకనైనను గల్గ దేమొ యం
చనుపమబుద్ధివైభవము ♦ నందిన మాతలి సంగరంబుచే
యు నృపతిఁ గాంచి యిట్లనియె ♦ నూహ చెలంగఁగ సత్వరంబుగన్. ౩౬

నూటపదియవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౧ - వ సర్గము.

శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణుని వధించుట.

క. వీరవరేణ్యా! తెలియని,వారివలెన్ దనుజవిభుని ♦ భంగిఁ బెనఁగెదే
భూరమణా! మనుజులచే, నీరాక్షసుఁ డనిని దెగుట ♦ యెంచి యమర్త్యుల్.
తే. నిశ్చయించినకాలంబు ♦ నేఁడు వచ్చెఁ
గాన వీనివధంబున ♦ కై నియతిని
నిపుడు బ్రహ్మాస్త్రమును వైవు ♦ మితనిమీఁద
ననుచు స్మృతిఁ గల్గఁజేసె నా ♦ యస్త్రమాత్మ. ౧ 4727

* అంతరిక్షే చ భూమౌ చ పున శ్చ గిరిమూర్ధని-అనిమూ.

క. మాతలి పల్కినమాటల, నాతఁడె రాముండు వీర్య ♦ మలరుచునుండన్
జేతస్సున స్మరియించుచు, భీతిల [1]బుసకొట్టు పాము♦విధమునఁ దగుచున్. ౨౪

క. అనుపమకాంతుల మెఱయుచుఁ, గన నద్భుతమైన బ్రహ్మ♦కాండమ్మును గై
కొనియెన్; భగవంతుండయి, [2]యనూనవీర్యమునఁబొల్చి♦యమలమహిముఁడై.

క. తనరారునగస్త్యుండును, దనకు విరించనుఁడు కృపను ♦ దయచేసిన దా
ని నమోఘము నగునస్త్రం,బును రామున కొసఁగె శత్రు♦పూగము నణఁపన్.

సీ. అమితతేజుండగు ♦ నబ్జజుం డద్దాని నింద్రునకై సృజి♦యించె మూఁడు
జగముల నొక్కట ♦ జయమందఁ గోరెడు శక్రునిమిత్తమై ♦ సారమైన
యస్త్రంబు నద్దాని ♦ నలరించి యొసఁగెను; మును దేనిఱెక్కల ♦ ననిలపతియు
నలుఁగున భాస్కరా♦గ్నులు నధిదేవతలై యుందురో దేని♦యంగ మంబ

తే. రాభమై మేరుమందరా♦ఖ్యావనీధ
రములవలెనె గురుత్వంబు ♦ ప్రబలఁ దగునొ
యట్టి బ్రహ్మాస్త్ర మతిభాసు♦రాంగ మగుచు
గనకభూషితమును సుపుం♦ఖంబు నగుచు. ౬౪ 4731

ఆ. వితతభూతసార ♦ మతులితంబు గ్రహించి, విరచితమయినూర్జ్య♦విధమునఁగడు
మెఱయుచుండు; ధూమ♦మిశ్రిత కాలాగ్ని,వలెను దీప్తభుజగ♦భంగిఁ దనరు.

క. పరనాగాశ్వశతంబులఁ, ద్వరగా భేదించునదియు ♦ దస్యునగరభీ
కరవిలసద్ద్వారంబులఁ, బరిఘంబుల గిరులఁ గూడఁ ♦ బ్రద్దలుచేయన్. ౮౪

క. నానాదనుజాస్త్రయుతం,బై నిజతనువొప్ప మెదడు♦నందు మునిఁగి యొం
తేనిన్ భీతికరంబై, యానిర్జరనాథువజ్ర♦మట్లు దృఢంబై. ౯ 4734

క. గురునాదముకలదై సం,గరముల నేకపట మున్నఁ♦గాని విడువ కా
తురమునఁ జెందుచు భూతో,త్కరభయదంబగుచు నశని♦కల్పంబగుచున్.

తే. ఉర్వులను బుచ్చు ఫణిరీతి ♦ నొప్పి గృధ్ర
[3]కంకవళపక్షులకు వంచ♦కముల కసుర
గణములకు యుద్ధమందు ని♦కామతృప్తి
గాఁగ నాహారమొసఁగుచుఁ ♦ గ్రాలునదియు. ౧౧ 4736

క. అనిలో యమునిం బోలుచుఁ, గన భీకరమగుచు వెలయుఁ ♦ గపులకు మోదం
బును రాక్షసులకు నాశన,మును గల్గింపంగఁ జాలి ♦ ముఖ్యతమంబై. ౧౧౪

ఆ. అందమగుచుఁ జిత్ర♦మయి పలురీతుల, వెలయు వైనతేయు♦వితతపక్ష
తతినిఁ గట్టఁబడుచు ♦ సతతంబు లోకాళి,యందు నుత్తమ మగు♦నంబకమయి.

సీ. ఇక్ష్వాకువంశ్యుల ♦ కెల్ల భయంబును బోఁగొట్టఁ జాలి రి♦పువ్రజముల
యశము హరించుచు ♦ నలరుచు రామున కత్యంతహర్షదం♦బై చెలంగు;

1 నిశ్వసంత మి వోరగమ్-అనిమూ. 2 అమోఘం యుధి వీర్యవాన్-అనిమూ. 3 కంకగృ
ధ్రబలాకానాం చ-అనిమూ.

నట్టి బ్రహ్మాస్త్రంబు ♦ నమ్మహాబలుఁడగు రాముండు గైకొని ♦ ధీమహిమము
వెలయుచు నుండఁగ ♦ వేదోక్తవిధిచేత మంత్రించి ధనువున ♦ మానితగతిఁ
తే. గూర్చి; నాగురుశరమును ♦ క్షోణివిభుఁడు
ధనువునం గూర్చుచుండ భూ♦తమ్ము లెల్ల
భయము నొందె ధరిత్రియు ♦ వడఁకె; రాముఁ
డంత సంక్రుద్ధుఁడై ధను ♦ వట్టి లాగి. ౧౫॥ 4739

క. శరవర్యమ్మును దానిని, బరమర్మచ్ఛేదకమును ♦ బరమాయత్తుం
డురుబలుఁడునైన యాతఁ డ,సురపతిపై వైచె; నంత ♦ సునిశితశరముల్. ౧౬

క. సురపతిబాహాచ్యుతిఁ గని, త్వరగాఁ జనువజ్రమట్లు ♦ దారసిలన్ రా
కురుకల్పాంతయమాకృతిఁ, గరము నివారింపరాక ♦ కడు భీషణమై. ౧౭

మహాస్రగ్ధర. చని రక్షోనాథువక్ష♦స్థలిఁ బడియె; జవ♦స్ఫారముం గల్గి పద్మా
సనునస్త్రం బద్ది యంతన్ ♦ సకలరిపుతనూ♦సంతతిన్ గూపుమాపం
గను జాలుం గాన వైవన్ ♦ గఱకుదనుజవ♦క్షస్థలిన్ దాఁకి చీల్చెన్;
ఘనమై ప్రాణాంతకంబై ♦ కఠినతరమునై ♦ క్రాలు నాయస్త్ర మంతన్. ౧౮

చ. దనుజునిఱొమ్ము నెత్తుటను ♦ దా నొగి మున్గుచు సత్వరంబ యా
తనివగు ప్రాణముల్ గొనుచుఁ ♦ దద్హృదయంబుననుండి లేచి చొ
చ్చెను ధరణిన్; శరం బదియు ♦ శీఘ్రము రావణునిన్ వధించి యా
తనిరుధిరంబునం దడిసి ♦ తచ్ఛవిఁ గ్రాలుచు భీకరాంగమై. ౧౯॥ 4743

క. తనపని యొనరిచి వినయం,బున నంబులపొదిని జొచ్చెఁ; ♦ బురుహూతరిపుం
డును హతుఁడై ప్రాణములను, దనజీవితమును ద్యజించు ♦ తరుణమునందున్.

ఆ. అతనిచేతనున్న ♦ యా పెనుచాపంబు, పట్టువదలి బాణ♦పంక్తితోడ
ధరణిఁ బడియెను; భయ♦దంబగు జవమును,నతులతేజముగల♦యాదనుజుఁడు.

క. అసువులు చన వృత్రాఖ్యుం, డసురుఁడు వజ్రమునఁ గూలు♦నట్లుగ పడితో
డ సమరధరణి రథచ్యుతి, నసురులు భయమందఁ బడియె ♦ నానమయమునన్.

క. హతశేషులైన దనుజులు, క్షితిఁబడిన సురారిఁ గాంచి ♦ స్వీయవిభుండున్
హతుఁ డగుట బెదరి దిక్కుల, కతిజవమునఁ బాఱె; రంత ♦ నాకపివరులున్.

క. తరుహస్తులగుచుఁ బంచా,స్యరవంబులు చెలఁగ రాక్ష♦సాళిని నాసం
గరభూమినుండి తోలిరి, సురవైరులు తమవిభుండు ♦ క్షోణిఁ బడుటయున్.

క. రాముఁడుజయంబునొందుటఁ, దా మొగిఁగనుఁగొనుచుఁగపివి♦తతిహర్షమునన్
భీమగతిం దము నొంపం,గా మానము దూలి ప్రావు♦గల్గమి మిగులన్. ౨౫॥

తే. ఆననంబుల బాష్పంబు ♦ లట్టిచిమ్మఁ
గరుణఁ బుట్టెడురీతి లం♦కను గనంగఁ
బాఱె రతిభీతులై; జయ♦ప్రభలవెలయు
వానరులు సంప్రమోదసు♦స్వాంతులగుచు. ౨౬॥ 4750

క. రామునిజయంబు రావణుఁ, డామెయిఁ దెగుటయును బొగడి ♦ యారవములచే
భూమివడఁకంగఁ జేసిరి, వ్యోమమునన్ శుభరవంబు ♦ లొప్పుచునుండన్. ౨౮
క. సురదుందుభి మ్రోసెను; స,త్పరిమళములఁ దాల్చి యనిల♦పతి సుఖముగ స
త్తరుణమున వీచె; రాముని,యరదముపయి దివమునుండి♦యలరులగుములున్.
ఆ. శ్రీయ రాకయుండఁ ♦ దోడ్తోనఁ గురిసెను;
ధరణిఁ గవులనుతుల♦తతులె కాక
యంబరమున సుమహి♦తాత్ములౌ దివిజుల
సాధుసాధువాక్య♦సముదయ మొగి. ౨౯ 4753
క. వినఁబడియె భూమియందును;, దనుజుఁడు రౌద్రుండు లోక♦తతిభీకరుఁ డ
య్యనిఁ దెగుట దేవచారణు, లనూనమోదంబు నొంది; ♦ రంత నృపతియున్.
చ. దనుజలలాముఁ ద్రుంచి ప్రమ♦దంబును దాఁ గని స్వీయరాజ్యముం
గొనిన దివాకరాత్మజుని ♦ గోమలగాత్రు మహాబలాఢ్యునిన్
వనచరనాథుపుత్త్రుఁడయి ♦ వ్రాలిన యంగదుఁ బ్రీతచిత్తులై
తనరెదునట్లొనర్చె; సుర♦తల్లజు లందిరి సుప్రసన్నతన్. 3౧ 4755
సీ. దిశలెల్ల నిర్మల♦దీప్తుల వెలుఁగొందె విమలరీతిని వినువీథి వెలసె
ధరణి కంపింపక ♦ తనరారె వాయువు చక్కఁగా వీచె భా♦స్కరుఁడు సుస్థి
రప్రకాశుండయి ♦ రాజిల్లె; నర్కపుత్త్రవిభీషణాదులు ♦ తగినమిత్త్రు
లగు జాంబవన్ముఖు ♦ లాలక్ష్మణుం గూడి యరిగి రాముఁడు విజ♦యంబు నొంది
తే. యుంట కెంతయు హృష్టులై ♦ యొప్పుమిగుల
నలరు రాముని నియతిఁ బూ♦జాదికముల
నలరఁ జేసిరి; గురుతేజుఁ ♦ డగుచు రఘుకు
లాధిపుల కాదృతిం గూర్చు ♦ నానృపుండు. 33 4756
చ. అని రిపులన్ వధించి తన♦దౌ శపథంబును దీర్చి చక్కఁగా
వనచరసంఘయుక్తుఁడయి ♦ వాసవుఁ డయ్యమరాళిఁ గూడి యొ
ప్పినగతి దేవతానుతులఁ ♦ బెంపువహించుచు రామచంద్రుఁ డొ
ప్పెను జగమెల్ల హాయిఁ గని ♦ ప్రీతి వహించుచు నుండ నంతటన్. 3౪

నూటపదునొకండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౨ - వ సర్గము.

రాముఁడు విభీషణు నాశ్వాసించుట.

తే. రామనిర్జితుఁడయి గత♦ప్రాణుఁ డగుచు
ధరణిఁ బడియున్న యన్నను ♦ దనుజపతిని
గాంచి వగపెల్లిదంబునఁ ♦ గదలు మది వి
భీషణుం డిట్లు శోకించెఁ ♦ బెంపు దూలి. ౧ 4758

క. వీరా! విఖ్యాతమహా,శూరా! సువినీతశా(స్త్ర)♦శుంభత్ప్రాండి
త్యా! రమ్యతరసుశయ్యన్, గారవమునఁ బవ్వళింపఁ♦గాఁ దగదు గదా?. ౧౻
క. అని నిహతుఁడవై దీర్ఘము, లనుపమములు నైన భుజము♦ లట్టిటు చలనం
బును గాంచకుండ నంగద,ఘనభూషితములను నిట్లు♦గాఁ జాఁచి కడున్. ౨
క. ధరఁబడుట సుంత గదలిన,సరసిజమిత్రాభమగుచుఁ♦ జంచద్ద్యుతిం
బరఁగెడు ముకుటముతో నీ,ధరఁ బడియున్నాఁడ వేల? ♦ దనుజవరేణ్యా!. ౩
క. మును వీరా! యెట్టిఫలం, బనూనముగఁ గల్గు ననుచు♦ ననువాదము చే
సినవాఁడనో యాపలుకులు, మనసిజమోహోన్నతమగు♦ మది నీకగుటన్. ౩౻
తే. ఎంతమాత్రమురుచియింప♦కేచనియెను,దత్ఫలము నేఁడునీకుఁబొం♦దంగవలసె;
నాప్రహస్తేంద్రజిత్తుల♦న్యదనుజాళి,కుంభకర్ణుండును నరాంత♦కుండుమఱియు.
క. అతిరథుఁడగునతికాయుఁడు, దితిజేశుఁడ వీవు నైనఁ♦ దీవ్రంబగు ను
ద్ధతిసీతాహరణమున జ,నితమగు పాపంబు నెన్న♦ నేఱరు గాదే. ౫ 4764
తే. దానికిం దగుఫల మిట్టి♦దఁటని గల్గె;, వివిధనీతివితాన సే♦తువు గతించె
ధర్మవిగ్రహ మేగె; స♦త్త్వనిధి చనియె, స్తోత్రపాత్రైకవిషయమే♦ పోలె నకట.
చ. సరసిజబాంధవుం డిపుడు♦ క్ష్మాపతిపైఁ బడునట్టులున్ నిశా
కరుఁడు తమస్సులో మునుఁగఁ♦గాఁ దగునట్టులు వీతిహోత్రుఁడున్
ద్వరపడి చల్లనైనటులు♦ భాసురశస్త్రవితానధారులం
దరయఁగ మేలుబంతియగు♦ నట్టిఁడు వీరుఁడునైన యీతఁడీ
ధరఁ బడనయ్యె; నాశ్రయమె♦ తాఁ గననేరకయే కృశించుచున్. ౭౻ 4766
తే. తనదువ్యాపార మెడల ను♦త్సాహశక్తి
యున్న దయ్యెను; దనుజగ♦ణోత్తముఁ డని
నిహతుఁడై పాంసుదిగ్ధుఁడై♦ నిద్రపోయి
నట్టులుండఁగ నిట్టి వీ♦రాధిపతిని. ౮౻ 4767
తే. కోలుపోయిన ధరనుండఁ♦ జాలు నేది
యింక; ధైర్యమె చిగురుగ♦ హితమగుప్రస
హనమె సాధుప్రసూనంబు♦గను దపంబె
బలముగా శౌర్యమే మూల♦ వరముగాఁగ. ౯౻ 4768
క. తనరెడు రావణభూరుహ,మును రాఘవమారుతము స♦మూలముగాఁ ద్రెం
చెను; దేజంబె విషాణము,గను బూర్వులగణమె వీఁపు♦గాఁ గనుపట్టన్. ౧౦
క. ఘనకోపమె తలక్రిందుగఁ, గనఁబడు దేహముగ దయయె♦ కరముగఁ దగునీ
దనుజేశమత్తగజమును, మనుజాధిపసింహ మొక్క♦మాడ్కి బలిమిమై. ౧౦౻
తే. పట్టుకొని చంపి నేలపైఁ♦ బడఁగ వైచె;
విక్రమోత్సాహములు విజృం♦భించినట్టి

జ్వాలలుగ నూర్పులే ధూమ♦సంచయముగ
న్వబలమే యుష్ణముగ సుతే♦జంబు చెలఁగ. ౧౧౪ 4771

క. వెలసెడు రావణవహ్నుని, నీలాధిపతిత్రైయైన రఘుకు♦లేశుఁ డనంగాఁ
జెలఁగెడు మేఘుఁడు చల్లా,ర్చె లలిన్; నిశ్శేషముగ వి♦రించి కృత మిదా.

*సీ. దనుజవర్యులెవాల♦మునుమూఁపురమువిషాణములుగాఁదగరిపు♦సమితిగెలువఁ
జాలివైరుల నెల్ల ♦ సమయింప వాఁతియై గంధద్విపంబునాఁ ♦ గ్రాలి విమయ
చాపల మనునదె ♦ శ్రవణచక్షుస్సులై యలరారు రక్షో గ♦ణాధిపవృష
మని రామశార్దూల♦మున హతమై పడె;నని శోకసంయుక్తుఁ ♦ డగుచు యుక్తి

తే. యుక్తవాక్యాలఁ బలుకుచు ♦ నొప్పునర్థ
మిట్టిదని తర్కమున నిశ్చ♦యింప నేర్చి
నట్టి యవ్విభీషణుఁ గని ♦ యనియె రాముఁ;
డితఁడు తనవిక్రమము చూప ♦ కితరులవలె. ౧౮ 4778

క. ధరఁ బడలే దితఁడు సం,గరమున విక్రమము భయముఁ ♦ గల్గింపంగా
సరిచూపుచు నుత్సాహము, పరఁగన్ భయమెడల నేలఁ ♦ బడియెం గంటే?

క. పరలోకవృద్ధిఁ గోరుచు, ధరణీశ్వరధర్మమందుఁ ♦ దమి నిలిచి రణా
జిరమున హతులగు పూరుష,వరులం దలపోసి యిట్లు ♦ వగవఁ దగదునూ. ౧౯

చ. శతముఖుతో జగత్త్రయము ♦ సాధ్వస మందెను యేనివిక్రమో
ద్ధతి; కల బుద్ధిమంతుఁడగు ♦ దానవనేత యనింబడంగ ని
వ్వితమున దుఃఖ మొందుదురె; ♦ వింతయె చావన దుఃఖ మొందుటం
చితరులఁ బోలి పల్కెదవో ♦ యేమొ? జయంబె రణాంగణంబునన్. ౧౭

తే. కలుగునని యెదు నియమ మి♦క్కాలమువఱ
కెప్పుడును బుట్ట లేదుసూ ♦ హితమనీష!
వీరుఁ డని శత్రువులనైన ♦ విక్రమమునఁ
జంపు రిపుహతుఁ డగు దాను ♦ సత్వమెడల. ౧౮ 4777

చ. మనమున క్షత్రధర్మ మొక♦మాటు తలంపుము సంగరాంగణం
బున హతుఁడై సురాలయముఁ ♦ బొందుట పూర్వులచేత నుక్తమై
తనరెడు; క్షత్రియావళి మ♦తంబుననౌ; బ్రథనంబునన్ మృతిం
గను ధరణీశుఁగూర్చి వగఁ ♦ గాంచఁగ రాదని శాస్త్రి మెన్నుఁజూ. ౧౯

చ. కనుకనె శాస్త్రనిశ్చయముఁ ♦ గాంచి జనించిన వార లంతముం
గనుట ధ్రువంబటంచు మతిఁ ♦ గాంచి వగం దగ మాని యింకనే
పని యొనరింపనౌనో యది ♦ బాగుగ నెంచు మటంచుఁ బల్కె; ని
ట్లనిహతవిక్రముండయిన ♦ యానరనాథుఁడు పల్క నాతఁడున్. ౨౦౪ 4779

* సింహర్క్షలాంగూలకకు వ్వషాణః పరాభిజిద్గంధగజేంధహస్తీ, రక్షోవృషశ్చాపలకర్ణచక్షుః క్షితీశ్వరవ్యాఘ్రహతోఽవసన్నః-అనియూ. సింహర్క్షః రాక్షసాః-అనివ్యాఖ్య.

తే. శోకసంతప్తుఁడగుచు న♦స్తోకవిక్ర, మాధికుండగు నన్నకు ♦ నవుడు చేయఁ
దగినహితమేదియనియెఱుం♦గఁగన్నృపాల,కునకునిట్లనిపల్కెను; ♦ వినయమలర.

చ. చెలియలికట్ట నొంది గురు♦సింధువు భంగము నొందినట్లుగాఁ
గలనున నిన్నుఁ దాఁకి తన♦గర్వము దూలి నశించె నీతఁడే
తొలుత నమర్త్యనాయకుని♦తోఁ ద్రిదశుల్ తనుమార్కొనంగ ని
స్తులజయు మందె కాని తన♦శూరత పోవఁగ నోడఁ డెప్పుడున్. ౨౨ 4781

తే. దానములు చాలఁ జేసి సం♦తతము గురువు
లను నమర్త్యులఁ బూజించి ♦ తనివి ననఁగ
భోగములఁ బొంది భృత్యులు ♦ పూర్ణసుతులు
గాఁగఁ బోషించి సంతృప్తి♦గా సఖులకు. ౨౪ 4782

చ. ధనములనిచ్చి శత్రుసము♦దాయమునం బగఁ జక్కఁదీర్చి ని
ష్ఠను జ్వలనున్ విధానమున ♦ సంతతహోమములన్ సుతృప్తిఁ గాం
చునటులు చేసి సత్తపము ♦ శోభిల జ్ఞానియు నౌచుఁ గర్మరా
శిని నొనరించి పెంపుఁగనెఁ ♦ జిత్రముగా ధర నట్లుగావునన్. ౨౫ 4783

సీ. చక్కనిసంస్కార♦సంయుతిఁ గనఁదగువాఁడైన యీసుర♦వైరిపతియుఁ
బ్రేతత్వ మిట్లొంద ♦ నీతతిఁ జేయనౌకృత్యంబునే నీదు♦కృపను బొంది
యొనరింపఁగాఁ గోరు♦చున్నాఁడ; నని యిట్లు లావిభీషణుఁడు కృ♦పావలంబ
నములగు పల్కుల ♦ నమరఁ దెల్పఁగ మహితాత్ముఁడై బలవంతుఁ♦డై నరాముఁ

తే. డాసురారికి స్వర్గీయ ♦ మైనయట్టి, సాధుసంస్కార మొనరింపఁ♦జను నటంచు
నాజ్ఞనిడఁబూనియీరీతి♦ననియె; మరణ, మెప్పుడగునప్పుడే వైర♦మెల్లఁదెగును.

*క. కనుకనె యింకం బగతోఁ, బనియేమియు లేదు; మనకు ♦ వలయుపనియు న
య్యెను నిక సంస్కారంబును, బొనరింపుము తడవదేల ♦ పూతచరిత్రా. ౨౬

ఆ. నీకు నెట్లు దనుజ♦నేత యీతఁడు తోడఁ, బుట్టు వగునొ నాకు ♦ నట్టులె యగు
సోదరుండు మఱొకఁ♦డూహింపఁ బనిలేదు, త్వరగఁగృత్య మింక♦వలయుఁ జేయ.

నూటపండ్రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౩ - వ సర్గము.

రావణుభార్యలు విలపించుట.

క. అనిపలికె; నంత నచ్చట, దనుజేంద్రుఁడు నిహతుఁడైన ♦ దశరథసుతుచే
తను హతుఁ డౌటను విని యా,తనిభార్యలు శోకకర్శి♦తలయి వగచుచున్. ౧

---

* నిర్వృత్తం నః ప్రయోజనమ్-అనియూ. ఇచట నః ప్రయోజనమ్ అనుచోట నున్న శ్లోక ద్వాదశాక్షరమగు 'న' యనువర్ణము గాయత్రియం దిరువదవదగు నక్షరమని గ్రహింపదగు. అనఁగా నిరువదవసహస్ర మారంభమయ్యెనని సారము. ఇటఁ దెనుఁగున కందపద్యద్వితీయపాదమున "మనకు" అనుచోటనున్న "న" కారము నః అనుసంస్కృతమునకుఁ బ్రతినిధియని తెలియందగు.

చ. వలదని యెంత చెప్పినను ♦ వారలు మానక భూమిఁ బొంనులన్
గొలఁదికి మీఱు నెవ్వగలఁ ♦ గుందుచుఁ దొర్లుచు ముక్తకేశులై
కలఁగుచు దూడ లంతమున ♦ గాంచఁగ నుత్తలపాటునొందు గో
వులక్రియ సౌధముల్ విడిచి♦పోయిరి నాథునిఁగాంచునాశలన్. ౨ 4788

క. ఆరాక్షసకాంత లసుర,వీరులతోఁగూడ వేగ ♦ వెడలి యుదీచ్య
ద్వారంబున భయదంబయి, చేరన్ రానట్టి యచటుఁ ♦ జేరి వగవునన్. ౩

*క. హతుఁడైన పతిని వెదకుచు, క్షితినాథకుమార! యనుచు ♦ శ్రీరాఘవునిన్
బతి రావణు నాథా!యని, యతిదుఃఖమున్మీఱఁ బిల్చి ♦ యారవ మొనఁగన్.

తే శోణితం బనుపంకంబు ♦ సొంపుఁ గూల్పఁ
గాఁ గబంధాంకమయి యున్న ♦ కలహభూమి
నంతటం బూన్కిఁ దిరిగి; రా♦యతివలు పతి
మరణశోకంబుచేఁ గుంది ♦ మ్రాన్పడి కడు. ౪ 4791

చ. కనులను నీరునిండునటు♦గా వడి నేడ్చుచు యూథనాథుఁ డో
య్యన న్మృతి నొంద నాఁడుగజ♦ముట్లులు బిగ్గఱ నార్చి; రంత నా
వనితలు వీర్యతేజములు ♦ వర్ష్మము భూరితరంబుగాఁగ న
ల్లనిదగు నంజనంపుగుమి♦లాగున నొప్పుచుఁ జచ్చి భూమిపై. ౫ 4792

క. పడియున్న భర్తఁ గని రా,క్షసఁతులు; రణపాంసువితతిఁ ♦ బడుకొనినటు క
న్పడుచున్న ప్రాణనాథుని, వడిఁ గని పరవశలునగుచు ♦ వనట మునుఁగుచున్.

క. వనలతలు త్రెంపఁబడి చ,య్యన ధరణిన్ వ్రాలునట్లు ♦ లాతనిగాత్ర
ళినిఁ బడి; రంతట నందొక, వనితామణి ప్రేమభరము ♦ వర్ధిలుచుండన్. ౬

ఉ. రావణుఁ గౌఁగిలించుకొని ♦ రామునిచేఁ దెగినాఁడవే? కటా!
యీవిధినంచు నేడ్చె, నొక♦యింతి పదంబుల వ్రాలెఁ, గంఠమున్
జేవచెలంగఁ గౌఁగిటను ♦ జేర్చి వధూమణి యొత్తుకుండె, న
ప్పావనమూర్తిచావునకు ♦ బాల యొకర్తుక చేతు లెత్తుచున్. ౭ 4795

చ. ధరఁ బొరలాడె, నొక్క వని♦తామణి చచ్చిన భర్తమోము న
త్తరుణమునం గనుంగొనుచుఁ ♦ దానట మూర్ఛిలె, భర్తశీర్ష మొ
క్కరమణి యంకభాగమునఁ ♦ గ్రన్ననఁ జేరిచికొంచు మోము నా
తురమునఁ గాంచుచున్ దుహిన♦తోయము పద్మము నట్లు నెవ్వగన్. ౮

తే. బాష్పవారిని దడుపుచుఁ ♦ బ్రబలరవము
చెలఁగ నేడ్చెను; నిట్టులా♦చేడె లెల్ల
నిహతుఁడై ధరఁబడియున్న ♦ నిజవిభుఁ గని
యార్తలై యేడ్చి యాశోక ♦ మధిక మగుట. ౧౧ 479

* రాజపుత్రేతి వాదిన్యః హా నాథేతి చ సర్వశః-అనియూ.

క. పరివశలై పతిఁ బేర్కొని, సురపతి యెన్నడికి వెఱచి ♦ చోద్యము గనెనో
పరమభయంబును గనె నె,వ్వరికిని యముఁ; డెవ్వఁడతుల ♦ బాహుబలమునన్.

చ. ధనదుని నోర్చి పుష్పకవ ♦ తంసము చేకొనెనో; యెవండు న
స్మలను దేవగాయకస ♦ మూహము నిర్జగులన్ భయంబునన్
మునుఁగఁగఁ జేసెనో రిపుస ♦ మూహభయంకరుఁ డట్టి యిమ్మహా
దనుజవిభుండు యుద్ధమునఁ ♦ దా హతుఁడై యిపు డీవిధంబునన్. ౧౩ 4799

తే. ఒంటిగాఁ బడియున్నవాఁ ♦ డుర్విమీఁద;
దనుజదేవోరగులవల ♦ సను భయం బ
దెంతమాత్రము నెఱుఁగక ♦ యెవ్వఁడలరు
నతని శోకమర్త్యవలన భ ♦ యంబు గలిగె. ౧౪ 4800

క. సురదానవరాక్షసులకుఁ, బరిమార్పఁగ రాని యట్టి ♦ బలశాలి యమ
ర్త్యరిపువిభుండు పదాతిగఁ, బరఁగెడునొక మర్త్యుచేతఁ ♦ బడియె ననిఁ గటా!.

క. సురయక్షాసురులిల సం,గరమున నెవ్వని వధింపఁ ♦ గాఁ జాలక పో
యిరో యాతఁడు బలహీనుని, కరణిన్ మృత్యువునుబొందెఁ ♦ గానొకనరుచేన్.

చ. అని బహుభంగులం బలికి ♦ యాతనిపత్నులు పొక్కి; రిట్టులా
దనుజనితంబినీమణులు ♦ తద్గుణముల్ గొనియాడి దుఃఖమిం
తని వచియింపరాక తగ ♦ నాసురభర్తను గూర్చి యింకనుం
గనుఁగవ నశ్రువుల్ దొరుఁగఁ ♦ గా మరలన్ బలవించి రీగతిన్. ౧౭ 4803

ఆ. హితము నీకుఁ గోరి ♦ యే వచియించెడు, మిత్రవాక్యములను ♦ మేలుఁ గూర్చు
వాని వినక నీవు ♦ జానకిఁ దెచ్చితి, వామె మృత్యువునకె ♦ యయ్యె నీకు.

క. దనుజులు హతులై రిప్పుడు;, దనుజులు మేయుంతఃపురమును ♦ దానవవర! నీ
వును గూల్పఁబడితి మొక్కటఁ;, దనుజన్ముఁడు నీకు హితము ♦ నరయునతండున్.

క. దనుజోత్తముఁడు విభీషణుఁ, డనయము తెల్పెను హితంబు ♦ ననువుగ నప్డై
నను మోహంబున నీచా,వును కోరి మహాత్ము నతనిఁ ♦ బొగరున సభలోన్.

క. పరుషము లాడితి; మిథిలా,వరుపుత్రిక సీత భూమి ♦ వరునకు భర్తన్
మరల నొసంగియె యుండిన, సురరిపువంశమున కెల్ల ♦ శుభమూలమవై. ౨౦

క. తనరారు నీకు మరణం, బనిఁ గల్గెయుండు దాన ♦ సంపదకును ని
ట్టి నితాంతఘోరరూపం,బునఁ దగు నాపత్తు కలుగఁ ♦ బోదుగద! యిటుల్.

క. అనుజునికోరిక చెల్లిం,చినయట్లగు మిత్రుఁడగును ♦ క్షితిపతి రాముం
డును దాన విధవలము మే,మును గాకయె యుండు మిష్ట ♦ ములు నైరులకున్.

క. ఫలియింపకుండు; నీవట్టులు చేయక ఖలుఁడవయి క ♦ ఠుడన్ మూఢుఁడవై
బలవంతంబుగఁ జెఱలో,పల సీతను బెట్టియుంటఁ ♦ బలలాశనులున్. ౨౨ 4810

సీ. నీవు మేమును నొక్క ♦ నియతకాలంబున నంతమొందితి; మను♦రాధినాథ!
యీకృత్యమెల్ల నీ♦వే స్వేచ్ఛగాఁ జేసినదిలేదు దైవమే ♦ యిది యిటులుగఁ
జేయించుచున్నది ♦ క్షితి దైవనిహతుఁడే యరిచేత హతుఁడగు♦నన్యుఁ డట్లు
కాఁడు; మహాభుజా! ♦ కపులకు దనుజులకును నీకు నిట్టు లీ♦ఘోరయుద్ధ
తే. మందు నిట్టివినాశ మొ♦య్యన ఘటిల్లు
టరయఁగా దైవవిహితమా ♦ నింతెకాని
యితరమేమియుఁ గాదు; లో♦కతతి దైవ
మొక్కపనిచేయఁ బూనంగ ♦ నుద్యమించి. ౨౪॥ 4811

క. ధనబలమునఁ గామంబున, ననుపమవిక్రముచేత ♦ నాజ్ఞను నద్దా
నిని ద్రిప్పరాదు సుంతయు;, నని పలుమాతేడ్చి; రిట్టు ♦ లాసురవనితల్. ౨౫॥

తే. దీనలయి దుఃఖమున మహా♦ర్తిని గృశించి
బాష్పపర్యాకులేక్షణ♦పటలలగుచుఁ
గ్రౌంచపక్షులవిధమునఁ ♦ గలఁత నొంది
యట్లు విలపించి రచటవా ♦ రట్టువగవ. ౨౬॥ 4813

నూటపదమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౧౧౪ - వ సర్గము.

మందోదరి విలపించుట, విభీషణుఁడు రావణున కగ్నిసంస్కారము సేయుట.

క. దనుజవరాంగన లీవిధ,మున వనటం గుంద దుఃఖ♦మున వారలలో
దనుజేశునకుం బ్రియసతి,యును బట్టపుదేవియునయి ♦ యొప్పి యనమునై. ౧॥

తే. తనరు మందోదరియును భ♦ర్తను గనియెను
దీనయై; యందుఁ జింతింప ♦ రాని కృత్య
ముల నొనర్చెడు రఘుకుల♦ముఖ్యుచేత
హతుఁడయిన ప్రాణనాయకు ♦ నామె కాంచి. ౨॥ 4815

క. వనటం గుందుచు దుఃఖం,చెను; యక్షపసోదరా! య♦చింత్యగుణాఢ్యా!
యనఘ! మహాభాగా! మన,మునఁ గోపంబందు నయన♦ములఁగనుఁగొనినన్.

క. వాసవుఁడైనను జక్కఁగ, నీసమ్ముఖమందు నిల్వ♦నేరఁడు మునుల్గ
భూసురులును*సుయశంబున, భాసిలు గంధర్వులైన ♦ వడఁకుదురు గదా. ౩॥

తే. ఇట్టి నిన్నెట్లు నరుఁడు జ♦యించె; నీకు
భయపడుచుఁ జారణులు దిశా♦వ్రజమునకును
బాఱిపోయిరి గద యటు♦వంటి నీవు
దనుజనాయక! యని నొక♦మనుజుచేత. ౪ 4818

---

* గంధర్వాశ్చ యశస్వినః-అనియు.

తే. ఎట్టు లోఁడితి వో విభూ! ♦ యేల దీన
సిగ్గునొంద విదేమిది? ♦ చిత్రరీతి
ముజ్జగంబుల లోఁగొని ♦ మొక్కలమగు
సిరిఁ బ్రకాశించుచును నదె♦వ్వరికి నైన. ౫ 4819

క. నిలువఁగ రానట్టి మహో,జ్జ్వలవిక్రమమున వెలుంగు♦వాని న్నినుఁ గే
వలమర్త్యుఁడు వనగోచరుఁ, డలఘుతరంబైన శక్తి ♦ ననిఁ జంపెనొకో?. ౬

సీ. మనుజులు చొరరాని ♦ త్వత్స్థలి వసియించి కామరూపుఁడవయి ♦ భీమవిక్ర
ముఁడవయి తగునిన్నుఁ♦గడఁగి మనుష్యుఁడౌ నా రాఘవుఁడు దుర♦మందుఁజంపె
ననునది సరిపడ♦నట్టులున్నది; సర్వయుద్ధోపకరణంబు ♦ లొప్పునిన్ను
సంగరాంగణమున ♦ స్ఫారవిక్రమమున నెదిరించి లోఁగొనె ♦ నిట్టు లనుట
ఆ. మనుజమాత్రుఁడైన ♦ త్వత్పతియే చేసె,నట్టిపనిగ నమ్మ ♦ ననువుపడక
యున్న దాత్మ నాకు; ♦ మరుజనస్థానమం, దఖిలదనుజయుక్తు ♦ నాఖరునిని.

క. నీతమ్ముని వధియించిన, యాతఁడె నే యీనృపాలుఁ ♦ డరయ నరుండే
భూతలమున నని చక్కఁగఁ, జేతస్సున నెఱిఁగితిని వి♦చిత్ర మిదె కదా. ౯

చ. సురలకుఁగూడ దుర్లభము ♦ చొచ్చుట కెన్నఁగ లంక యిద్ది యీ
పురి హనుమంతుఁ డొక్కగతిఁ ♦ బొల్చెడువీర్యముతోడఁ జొచ్చె న
త్తరుణమునందు నప్పుడె సి♦తాంతభయంబును బొందనయ్యె; భీ
కరులగు వానరోత్తములు ♦ కంధివరంబున సేతు వేర్పఱన్. ౧౦ 4823

తే. కట్టినప్పుడె రాముఁడు ♦ కాఁడు మర్త్య
మాత్రుఁడని నేఁ దలంచితి ♦ మానసమున
నట్లుకాక యముండె ని♦న్నని వధింప
నప్రతర్క్యలావణ్యము ♦ నగపడంగ. ౧౧ 4824

క. జనకజ యాకృతిఁగల మా,యను బన్నుచు రామరూపుఁ♦డై తానే వ
చ్చినవాఁడో? లేక వాసవుఁ, డనూనబలసార! యిచటి ♦ కరుదెంచి నినున్.

తే. ఇట్లొనర్చినవాఁడో? యి♦దెట్లు పొసఁగు?
నని మహేంద్రుఁడు కన్నెత్తి♦యైన నిన్నుఁ
గనఁగ శక్తుండగునె; లోక♦గణముఁ గావఁ
దగునుపాయంబుఁ గూర్చి చిం♦తి మదిఁ గాంచి. ౧౩ 4826

*క. తనయాశ్రితసంరక్షణ,మున నిరతుండగుచు భూత♦ముల చేతన వ
స్తునికర మాత్మం గల్గిన, ఘనుఁడగుచున్ శాశ్వతముగఁ♦గ్రాలుచుమఱియున్.

---

* వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః, అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్. తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః, శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః-అనియూ. దీనికి వ్యాఖ్యాతలు వ్రాసిన పరమార్థసార మిటుఁ దేటపడునని గ్రహింపఁదగు.

సీ. జన్మవృద్ధివినాశ♦సహితుండు గాక బ్రహ్మాదులకంటెఁ దా♦నధికతముఁడు
నగుచును దనుసున ♦ కవ్వలివాఁడయి జగముల నిర్మించు♦శక్తి మెఱసి
శంఖచక్రగదాఖ్య♦సాధనములఁ దాల్చి శ్రీవత్సనామక♦చిహ్నముగల
వక్షస్స్థలుండయి ♦ వరలక్ష్మి నిరతంబు భాసిల్లఁగా జయిం♦పంగరాక
తే. శాశ్వతుండయి ధ్రువుఁడయి ♦ సతతము నల
రారు పరమాత్మయే యగు ♦ శ్రీరఘువరుఁ
డిద్ది నిశ్చయ; మిట్టిప♦రేశుఁ డేల
మనుజుఁడయ్యెనొ యనెదవో ♦ విను వచింతు. ౧౫ 4828

క. పరమాత్మ సత్యవిక్రముఁ, డరయఁగ నెల్లెడల నుండు ♦ నావిష్ణువె యీ
శ్వరుఁడౌట లోకతతికిం, బరికించి జగద్ధితంబు ♦ వరతేజమునన్. ౧౬ 4829

క. వనచరరూపంబుల దే,వనికరముల్ తన్నుఁ గొలువఁ ♦ ద్వద్వరమును మా
న్నను బూని మనుజదేహం,బును దాల్చి సురారినికర♦ములఁ గూడు నిన్నున్.

చ. అని వధియించె నిశ్చయ మి♦దా; మును పింద్రియసంక్తి గెల్చి లో
కనిచయమున్ జయించితివి ♦ క్రమ్మఱ నింద్రియముల్ విరోధమున్
మును గలదానిఁ బూని నిను ♦ మూర్ఖుని నొంచెనొ యన్నయట్లు వా
నిని గెలువంగఁ జాలకయె ♦ నీ విపు డిట్టుల నైతి వక్కటా!. ౧౮ 4831

క. పగవలదు రాఘవునితోఁ, దగురీతిన్ సంధిఁ జేయఁ ♦ దగునని నేఁ జె
ప్పఁగ వినవైతివి దానికిఁ, దగుఫల మియ్యెదనునందుఁ ♦ దా నినుఁ బొందెన్.

చ. దనుజవరా! యహేతువుగ ♦ ధాత్రితనూజపయిం బ్రమోహముం
గనితివి దానఁ జేసియె య♦ఖండవిభూతియు నీవు బంధువుల్
గనితిరి నాశనం బిదియె ♦ గాదె ఫలంబు లభించె నీకు; నా
మునిసతియౌనరుంధతిని ♦ బూజ్యసతీత్వమునందు మించుచున్. ౨౦ 4833

తే. చంద్రుపత్నిని రోహిణిఁ ♦ జాలమించి
మాన్యయైయున్న సీత న♦మ్మాడ్కిఁ జెఱుపఁ
బూని యనుచితకార్య మి♦ప్పోల్కిఁ జేసి;
తామె సతియే సహింపలే ♦ దనెదొ? నిన్ను. ౨౦౪ 4834

క. విను నాప్రాణేశా! నీ, వనితామణినైన నన్న♦భవ్యముగా నీ
మనమున నెన్నితివే మని,యనుదును మఱి నీవు ధరణి♦కవనియె యగుచున్.

క. సిరికిని సిరియయి యొప్పును, సురుసంపద భూషణముగ ♦ నొప్పఁగఁ బ్రాణే
శ్వరవత్సలయై కడుసుం,దరసర్వాంగములతోడఁ ♦ దనరి సుముఖియై. ౨౨

తే. పరమకళ్యాణియైన యా♦తరుణిమణిని
జానకిని నిర్జనాటవీ♦స్థలమునఁ దగు
సమయమున నిన్ను నొల్లని♦సతిని గపట
మార్గమును బన్ని తెచ్చి యా♦మానినిఁ దమి. ౨౨౪ 4837

చ. మనమునఁ గల్గుకోర్కి ననుమానము లేకయె తీర్చుకోఁ దలం
చిన భవదీయవాంఛితము ♦ సిద్ధిని జెందకమున్నె యాసతీ
ఘననియతిప్రభావమునఁ ♦ గాలితి విద్ధి నిజంబుగా నటం
చనఁ దగుగాదె; నూత్మృతర♦మా నదు మొప్పఁగ నెల్లు నాసతిన్. ౨౫

తే. బలిమిఁ దెచ్చిన యప్పుడే ♦ భస్మమగుట
తప్పెనను నదియే యగుఁ ♦ దావకమహి
మము మఱియు దానిచే నీకు ♦ నమరపతియు
నగ్నిమొదలగు సురలు భ♦యపడి రనిని. ౨౬ 4839

సీ. పాపకర్మ మొనర్చు ♦ నేపురుషుం డిలఁ దత్పాపఫలములఁ ♦ దానుఁ బొందఁ
దగినకాలము రాఁగ ♦ దారుణతత్ఫలమును నవశ్యమ్ము పొం♦దు నినుమంత
మైన సంశయము లే; ♦ దరయఁగా శుభకర్మ మొనరించువారికి ♦ నొప్పుమేలు
పాపకర్ములకుఁ ద♦త్ఫలము పాపంబుగఁ గలుగు విభీషణుఁ ♦ డలమహాత్ము

ఆ. రాము నాశ్రయించి ♦ తా మహితసుఖంబు
నొందె నీవు పాప ♦ మొనరుచుటనె
యిట్టిపాపఫలము ♦ నిట నొందితివి; సీత
కంటె సుందరులగు ♦ కామినులిల. ౨౭ 4840

క. కలరు గదా బహుసంఖ్యలు, ఖలుఁడవు గాఁబట్టి కుసుమ♦కార్ముకునకు ని
ట్టులు చిక్కితి కావున నిమ్ములఁ దోఁచకపోయె నీకు ♦ మోహాతురతన్. ౨౮

మ. తనులావణ్యకులంబులం జదువునన్ ♦ దన్వంగి యాసీత నా
కును దుల్యంబగుఁ గాని యెక్కు డెటులౌఁ ♦ గ్రూరాత్మ! మోహంబు నొం
దినచిత్తంబున నుంటఁ దోఁప దిదియున్ ♦ నీకున్ మఱే ప్రాణికై
న నిమిత్తంబులు లేక ల్గదుగదా ♦ నాశంబు చింతింపఁగన్. ౨౯ 4842

చ. జనకజఁ దెచ్చినందుననె ♦ చయ్యన మృత్యు విదబ్బె నీకు; సీ
తను గొని తెచ్చు టన్నఁ గడు♦దవ్వనకుం జని మృత్యువుం గరం
బునఁ గొని తెచ్చుకొన్నటు వి♦భూ! యిపుడయ్యెను; రాముఁగూడి యా
జనకజ వీతశోకయయి ♦ జానుగ నింకను గ్రీడ సల్పుఁబో. 30 4843

ఆ. అల్పపుణ్య నగుట ♦ నతిఘోరదుఃఖసాగరమునందు నిట్టి♦కరణిఁ బడితి;
మేరుమందరముల ♦ మేటి కైలాసాద్రిఁ, జైత్రరథమునందు ♦ సాధుమతిని.

క. సురనర్వోద్యానములను, బరమముదం బలర వీర♦వర! నీతోడన్
సిరివెలయఁ జిత్రమాల్యాంబరముల ధరియించి నాదు♦వైభవములకున్. 3౨

క. అనురూపమౌ విమానంబు నెక్కి విహరించి దేశ♦ములనెల్లను గాం
చి నితాంతము సుఖసంపదలను గాంచుచు నుంటిగా వి♦లాసముపేర్మిన్. 33

తే. అట్టి నేనిప్పు డనినీవు ♦ హతుఁడ వగుటఁ, గామభోగవిహీననై ♦యీమహినిటు

లున్నదాన; ననంతభో♦గోన్నతిఁ గను,నట్టి నేనిట్లు సామాన్య♦నైతి నకట!.

క. [1]కనుక నిసీ! చంచలములు, మనుజేశులసంపద లవి ♦ మండి పొడవడం
గును గాక; రాజచంద్రమ!, యనుపమసుకుమారమగుచు ♦ నతిశుభదంబై.

చ. కనుబొమ లందముం గలిగి ♦ గ్రాలఁగ నీటగు చర్మమొప్పఁ జ
క్కనిదగు నాస యెంతొ దగఁ ♦ గాఁ బ్రభఁ జంద్రున కంద మందు నొ
ప్పిన విరిదమ్మికిన్ ద్యుతిని ♦ బెంపువహించెడుతీవ్రరశ్మికిన్
గనుఁగొన సాటియై యరుణ♦కమ్రతరాధర మొప్పుచుండఁగన్. ३४५ 4849

క. గిరిశృంగనిభకిరీటం, బరుదుగఁ దగఁ గుండలంబు ♦ లతిశయకాంతిం
బరఁగఁగ నొప్పెడు నీముఖ, మరయఁగ మును పానభూము♦లందుమదమునన్.

ఆ. వ్యాకులంబులైన ♦ యట్టికన్నులతోడ
నలరి వివిధమాలి♦కాభిరామ
మగుచు సుందరమయి ♦ యభిమతసుస్మిత
మొలయఁ జక్కనగుచుఁ ♦ జెలఁగుఁ గాదె?. ३६५ 4851

క. ఆమోమే నీదిప్పుడు, రామునిశరభిన్నమగుచు ♦ రక్తనదులలో
నీమాడ్కి మునిఁగి కొవ్వు మ,హామాంసముఁ జెదర రథప♦రాయతధూళిన్.

క. మునిఁగి రవంతయు నధిపా!, కనుఁగొన సుందరముగాఁగఁ ♦ గ్రాల దకట! నీ
వనిఁ దెగినన్ వైధవ్యం,బును గల్గఁగఁ జేయుదశయుఁ ♦ బొలిచె నిటులఁజా.

ఆ. ఈయవస్థవచ్చు ♦ నెప్పుడైనను నాకు, ననుచు మందబుద్ధి ♦ నొట నేను
దలఁపలేదు; నాదు♦తండ్రి నుయుండఁతఁ,డగుచుదనుజపతిమ♦హానుహిముఁడు.

క. దనుజేంద్రుఁడు నాపతి; నా,కనయుండు మహేంద్రు గెలిచి ♦ దమ్ముండనిపే
రును గన్నవాఁ డటంచును, మనమున గర్వించుచుండు ♦ మాట లిఁకేలా.

చ. నను నిరతంబుఁ గాచు పిత ♦ నాథుఁడు పుత్త్రుఁడు నింకఁగల్గు ద
క్కుకనిఖిలస్సై నికుల్ మదము ♦ మూర్ఖ్ని నొప్పెడు వైరిరాజిమ
ర్దనమునఁ బెంపుఁ గాంచి బల♦దర్పసమగ్రులు శూరులంచు ఖ్యా
తిని దగువారు వారలకుఁ ♦ దెల్లము భీతియె గల్ల దెట్టులున్. ४० 4856

చ. అని మది నమ్మియుంటిఁ గద; ♦ యాసురవర్య! ప్రసిద్ధులై యిలన్
ఘనమగు సుప్రభావమును ♦ గల్గిన మీకుఁ దలంపనైనగా
ని నియతి నీభయం బిటులు ♦ [2]నీచమనుష్యుని వంక గల్గెనే;
దనుజమహేంద్ర! నీతనువు ♦ ధాత్రిధరం బన నున్నతంబునై. ४१ 4857

1 ధి గ్రాజ్ఞాం చంచలా శ్రియః-అనిమూ 2 కథం భయ మసంబుద్ధం మానుషా దిద మాగ తమ్-అనిమూ. ఇచట నీచమనుష్యుని వంక గల్గెనే యని తెనిఁగింపఁబడుట పొరపాటు గాదు. ఈ శ్లోకముననే "ఏవం ప్రభావాణాం" అనియున్నది. కాఁబట్టి మనుష్యశబ్దమునకు ముందు నీచపదము విశేషణము సముచితమే యని గ్రహించి మన్నింపఁదగు.

క. నునుపైన యింద్రనీలం, బన నీలముగాఁ జెలంగి ♦ యంగద కేయూ
రనిచయములు వైడూర్యమ,ణినికరయుక్తములు గాఁగ ♦ నతి భాసిల్లన్.

క. ముత్తెపుహారంబులు న,త్యుత్తమనునుహారవితతు ♦ లొప్పఁగ బెడఁగై
చిత్తము నలరం జేయుచు, నుత్తమసుఖ మిచ్చు కేళు ♦ లొప్పెడు తఱిలోన్.

తే. మిగుల రమణీయమై యుద్ధ ♦ మేదినులను
దీప్తమై చంచలాసంయు ♦ తిని వెలుంగు
ఘనము లట్టు లాభరణాళి ♦ కాంతులఁ గడుఁ
దనరుచుండును గద? యట్టి ♦ తనువె యిపుడు. ౪౪ 4860

క. శితశరతతి నాటుటను గ,రతలముల స్పృశింపనైన ♦ రమ్యముగా కు
న్నతగాఢపరిష్వంగము, జతనమున నొనర్చు నటులు ♦ సరిపడదుగదే. ౪౫

సీ. తను విది ప్రాణేశ ♦ విను మేదుపంది గాత్రంబున ముండ్లు సాం ♦ ద్రముగ నుండు
నట్లుగా నెడము లే ♦ కంతట బాణముల్ పొదలుట నరములు ♦ పోయి కపిల
వర్ణమై రక్తంపు ♦ వఱదలు పాఱుట నరుణకాంతులు గల్గి ♦ ధరణిని బడి
వజ్రము దెబ్బచే ♦ వసుధను గూలిన భూధరవరమట్లు ♦ పొల్చె; నీవు

తే. బాపురే! మృత్యు వొందుట ♦ స్వప్నమె; మఱి
స్వప్నమనుటయు నిజమె నీ ♦ వంటిశూరు
నెట్లు చంపంగఁ జాలె భూ ♦ మీశుఁ డీవు
మృత్యువునకును దలపోయ ♦ మృత్యువవుగ. ౪౬ 4862

క. కాలుని బాఱికి నిపుడిట, నేలాగునఁ జిక్కినాఁడ ♦ వేమందు; జగ
జ్జాలగతవసువుఁ బొందుచు, నోలి జగత్త్రయము భీతి ♦ నొందఁ దిరుగుచున్.

*తే. లోకపాలుర నోడించి ♦ వీఁక శివుని, నెగురఁగా వైచి దృప్తుల ♦ నెల్ల నొంచి
విక్రమము నెల్ల దిక్కుల ♦ వెలయఁ జాటి, జగములకు భీతిఁ బుట్టించి ♦ తగఁ గలంచి.

క. వినదంబుల భూతావళి, మనములు పగులంగఁ జేసి ♦ మఱియును దేజం
బున రిపులు మారు గొనుతఱి, నని లక్ష్యము చేయకే ర ♦ వంతయుఁ గడఁకన్.

తే. దృప్తవాక్యము లాడుచుఁ ♦ దీవ్రకర్ము,లైన యోధుల భృత్యుల ♦ నాపదలను
బొందకుండఁ గాపాడుచు ♦ భూరిసంఖ్య, దనుజవీరుల యక్షులఁ ♦ దఱిమి చంపి.

ఆ. అని నివాతకవచు ♦ లను భీతిఁ బరిభవ, మంది దనవశంబు ♦ నొందునట్లు
చేసికొని జగత్ప్రి ♦ సిద్ధవిభుండయి, యజ్ఞవితతి విఘ్న ♦ ముంచఁ జేసి. ౫౧

క. తనవారి నాదరంబునఁ, గొని కాచుచు ధర్మనియమ ♦ కూటంబుల నా
య్యనఁ బాడుచేసి యుద్ధం,బున మాయల నెన్నొ పన్ని ♦ పొంగెడు కాంతున్.

క. సురనిర్జరరిపుకన్యో,త్కరముల నరకన్యకలను ♦ దతిబలము తగన్
హరియించి తెచ్చి స్వజనా,వగుఁడయి శోకంబు శత్రు ♦ తరుణుల కిడుచున్.

* జేతారం లోకపాలానాం క్షేప్తారం శంకరస్య చ-అనిమూ.

క. లంకాద్వీపము నేలుచుఁ, బొంకముగాఁ దనరు శీర్ష ♦ పుంగంబున ని
శ్శంకను దహానుని నిడి హా,మాంకునిఁ గావించుటాది ♦ యగు కడిఁదిపనుల్.

క. ఒనరించి కామభోగము,లను మాకుం జక్కఁ గూర్చి ♦ లలి రథికవరుం
డునునయి యేవంవిధస,ద్వినుతమహామహిముఁడగుచు ♦ వెలయుచు ఖ్యాతిన్.

చ. తనరెడు నావిభుండు నృప ♦ తల్లజుచే హతుఁడై ధరిత్రిఁ బం
డినవిధ మేను జూచి విభు ♦ నిన్ విడనాడి యనువ్రజంబు నే
మని ధరియించినానొ యిది ♦ యారయ నే శిలఁ బోలుదాననం
చును దెలియంగ నయ్యె; విను ♦ శూరవరా! దనుజేశ్వరా! విభూ!. ౫౬

క. అనుపమము లమూల్యములును, గనసుందరములును నగుచుఁ ♦ గ్రాలుపటువులం
దును బందుకొందుకద? యా,తను విపుడిచ్చటను బ్రుంగ ♦ ధరణిరజమునన్.

క. అరుణచ్ఛాయం గనుచున్, బరుండి యున్నాఁడవేల? ♦ వజ్రిని బెనుసం
గరముల నోడించిన నా, వరతనయుని లక్ష్మణుండు ♦ బాహుబలమునన్. ౫౭

తే. చంపినప్పుడె వ్యథ మదిఁ ♦ జాలఁ బొలయ
నిలువఁజాలక యుంటిని ♦ నీవు తెగుట
నిపుడు కూలితి బ్రదుకు నా ♦ కింక లేదు;
నీవు జీవించియుండిన ♦ దేవవైరి!. ౫౮ 4875

క. హతబంధుజాలనయినన్, మతి దుఃఖము నాకు లేదు ♦ మఱియుఁ గొదువలే
దతిమోద మిడెదు నీవే, హతుఁడవగుచు నన్నుఁ బాసి ♦ యరిగితి గనుకన్.

క. చిరకాల మింకఁ గామము, లురుభోగము లెల్లఁ బాయు ♦ నురుదుఃఖములన్
గర మనుభవింపఁగల నీక, ధరణీశ్వర! దుర్గమమయి ♦ తగ దూరంబై. ౫౯

క. జానగుచోటికిఁ బోయెద, వీ నను దుఃఖార్తఁ గూడ ♦ నెలమిని గొని పో
మ్మా నిన్ను నదలి బ్రదుకం,గా నేమాత్రమును జాలఁ ♦ గ్రవ్యాదపతీ!. ౬౦

క. నను దీనను విలపించెడు, వనితను దౌర్భాగ్యశాలి ♦ వంతఁ గుడుచుదా
నిని డించి యిచట నీవే, చనఁ గోరితి వేల? పలుకఁ ♦ జనదే నాతోన్. ౬౧

*సీ. కప్పువస్త్రము వీడి ♦ క్షమాపతీ! యీపురద్వారంబు వెడలి పా ♦ దముల నడచి
యిచటికి వచ్చిన ♦ యీనన్నుఁ గని క్రుధఁ గనినావు గా వేమి ♦ కారణంబొ?
దారలం దెక్కుడు ♦ దయగలవాఁడవు నీభార్యలందఱు ♦ నిక్క మిదిగొ
ముసుఁగు వస్త్రంబుల ♦ వెస విడనాడి యంతఃపురంబును విడి ♦ తత్తఱమున

---

* దృష్ట్వా న ఖ్వ్వసి క్రుద్ధో మా మిహానవకుంఠితామ్, నిర్గతా న్నగరద్వారా త్పద్భ్యామే వాగతాం ప్రభో-అనిమూ. ముసుఁగువస్త్రములేక వివాహితలగు వనితలు బయటికి రాఁగూడదను నియమ మాకాలమునఁ గూడఁ గలదని గ్రహింపఁదగినది. ముసుఁగువస్త్రము ప్రాచీనకాలమున లేద నియు, మహమ్మదీయరాజ్యకాలమునుండి యారంభింపఁబడినదనియుఁ బ్రల్లదములు పలుకుచరిత్రశా స్త్రవిద్వాంసులమాటలు పాటింపఁ దగవని తెలియలేదా.

తే. వచ్చియున్నారు చూడుమిదె! ♦ వనితలఁ గని, కోపపడ వేల? క్రీడలఁ ♦ గూర్మి నీకు
సాయముగ నుండు నీదార♦జనము లిట్లు, నాథులై చాలనేడ్చుచు♦న్నారు సుమ్ము!.

క. వీరల నాశ్వాసింపవు, గారవమున మన్ననలను ♦ గలవరము పడం
గా రమణా! యొనరింపవు, కారణమేమో యెఱుంగఁ ♦ గదరాజేంద్రా!. ౬౪

తే. ధర్మమందు నాసక్తిని ♦ దగిలి మఱి ప
తివ్రతలునయి గురుసేవఁ ♦ దివిరి చేయు
కులవధూమణులను నీవు ♦ కోరి చాల
మంది విధవలఁ జేసితి ♦ మదిఁ గలరుష. ౬౫ 4882

క. వారెల్లరు కడుఁ బొక్కుచు, ఘోరముగా నినుశపింపఁ ♦ గ్రూరారులకీ
రీతిఁ జిక్కితివి నీ, చే రమణులు పరిభవంబుఁ ♦ జెంది పోగులుచున్. ౬౫½

ఆ. పతులఁ జంపునట్టి ♦ పాపకాలంబున, నేమి శాపమిదిరొ ♦ యిపుడు దాని
ఫలము నీకు నిట్లు♦ప్రాప్తమైనది విభూ!, సతులదుఃఖసలిల♦సరణి యెపుడు. ౬౬

క. ఊరకపడ వెట్టులైనన్, ధారణి నవి పడున యేని ♦ దప్పక యొకకీ
డారయఁ గల్గక పోదని, సూరిజనుల్ జగమునందుఁ ♦ జొక్కపుభణితిన్. ౬౬½

క. పలుమాఱు వాడుచుందురు, తలఁపఁగ నీకింవదంతి ♦ ధాత్రీశ్వర! యి
మ్ముల నీవిషయంబున నిట, ఫలియించెన్ సత్యముగనె ♦ పలలాశవరా!. ౬౭

క. రాజా! ముల్లోకంబులఁ, దేజముచే నాక్రమించి ♦ తివిరి జగములన్
రాజిల్లుచు వీరాగ్రణి, నాఁ జను పేరూని యిట్లు♦నారత మెలమిన్. ౬౭½ 4887

క. అలరారు నీవు నీచం, బిల నగు స్త్రీచౌర్య మిద్ది ♦ యేలాగున ని
మ్ములఁ జేసితి? మాయామృగ, ము లలిన్ గృత్రిమపుమార్గ♦మున నత్తఱినిన్.

చ. కనఁబడఁ జేసి రాముజన♦కాంతుని నాశ్రమసీమనుండి య
వ్వనమున కేగఁ జేసి రఘు♦వర్యునిపత్నిని సీతఁ దెచ్చితే?
పని యిది గుప్తగాదె యొక♦భంగిని నీమది భీతిఁ జూప; నే
యనిమొన నైన నొక్కతఱి♦నైనను రాక్షసవర్య! నీయెడన్. ౬౮ 4889

ఆ. పిఱికితనము చూచి ♦ యెఱుఁగ నే నట్టినీ, భాగ్య మిట్లు చెడుటఁ♦బట్టి యిట్టి
దగునకృత్య మప్పు ♦ డటు చేయ నది నీవి, నాశమునకు నయ్యె♦నాథ! నిజము.

క. భూతభవిష్యద్వార్తా, వ్రాతములను వర్తమాన♦వార్త నెఱిఁగి వి
ఖ్యాతుఁడు ప్రాజ్ఞుఁడు సూనృత, మే తగఁ బచియించునట్టి ♦ హితమతియును నై.

క. ఋతవాది మహాభాగుం, డతులమనీషుండు నాకు ♦ ననుఁగు మఱఁదియున్
దితిజావతంసుఁడునునయి, క్షితి వెలయు విభీషణుండు ♦ సీతను సాధ్విన్. ౭౦½

తే. నీవు తెచ్చుట గొంత చిం♦తించి యూర్పు
గములనుం బుచ్చి నన్నును ♦ గాంచి యేమి

పలికెనో, యుల్లి నీదగు ♦ నలఘుకోప
కామములచేతఁ గల్గిన ♦ కడిఁది వెతలు. ౭౨ 4893

చ. దనుజవరేణ్యసంతతికి ♦ దారుణనాశన మిట్లుగల్గె; మూ
లనికరముల్ గడుం జెడెడు♦లాగునఁ జేయు ననర్థ మిద్ది నీ
కని జనియించె నీవలన ♦ నయ్యెను నీవె చెలంగు నీమహా
దనుజకులం బనాథమయి ♦ ధారణిఁ గూలఁగఁ జేసి తక్కటా. ౭౩ 4894

[1]క. బలపౌరుషముల ఖ్యాతిం, గలిగిన నీవంటిశూర♦కాంతుఁడు మృతినిం
గలనునఁ బొందుట కేనిటు, పలువిధముల వగవఁ దగిన ♦ పని లే దైనన్. ౭౪

ఆ. వనిత నగుటఁ జేసి ♦ వలదని దైన్యము
బుద్ధియందుఁ దగులఁ ♦ బొగులుచున్న
దాన; నీదుసుకృత♦తతిఁ బాపరాశిని
గొనుచు బాపగతిని ♦ గనితి వీవు ౭౫ 4896

చ. నిను నెడఁబాసినందులకు ♦ నే మది దుఃఖము పట్టలేకయే
నను నె గుఱించి చింతిలెద; ♦ నాయక! నీసచివుల్ భవద్ధితం
బును గడుఁ గోరి చెప్పుహిత♦బుద్ధులనున్ వినవైతి సోదరుల్
మనమునఁ గల్గు పట్టుదల ♦ మానక యూనివచించు నీతులన్. ౭౬ 4897

క. వినవైతి; వవ్విభీషణుఁ, డనుపమహేతువ్యర్థయుతము♦నయి విధివంతం
బును సాంత్వనపూర్వమునయి, తన రెడుపల్కులను బల్క ♦ దానవనాథా!. ౭౭

ఆ. జ్ఞాతి వీవు నావ్య♦సనము నే కోదుదు, ననెడు నిట్టిమాట♦లనువచించి
వానిఁ గొనఁగ నీవు ♦ మానితి; మారీచ,కుంభకర్ణు లపుడు ♦ కోరి నీకు. ౭౮

[2]క. నాతండ్రియునఁగఁ జాలిన,ఖ్యాతుం డగు మాల్యవంతుఁ ♦ డాదృతి నీకుం
జేతం బలర వచించిన, నీతులు విక్రమమదంబు ♦ నిన్నొందుటచేన్. ౭౯ 4900

క. విన్నవైతివి తత్ఫల మి, ట్లనువుగ లభియించె; నాథ! ♦ యసితాంబుదమో
యునఁ దనువు మెఱయఁగాఁ బచ్చనిపలునం గట్టి మిగులఁ ♦ జారుతరమునై.

క. కనిపించునంగదంబుల, ఘనకాంతుల మెఱయుచుండు ♦ గాదే యిపు డీ
యనిమొన రుధిరాప్లుతమై, తనువుం డెంగరపదముల ♦ ధరఁ జాఁచి విభూ!. ౮౧

తే. నిదురఁ గాంచుచు నున్నట్లు ♦ నీవు జేష్ట,లుడిగిపడియున్నవాఁడ వే♦మొవగ నేనుఁ
గలఁగుచుండఁగ మాటలే♦పలుకవయ్య, ఘనపరాక్రమశాలివై ♦ కార్యవితతి.

---

1 న హి త్వం శోచితవ్యో మే ప్రఖ్యాతబలపౌరుషః-అనిమూ. 2 మారీచకుంభకర్ణాభ్యాం వాక్యం మమ పితు స్తథా-అనిమూ. మమపితుర్మాల్యవస్య వాక్యం నశ్రుతమ్-అనిగోవిందరాజులు. మమ పితు ర్మాల్యవతః- అనిమహేశ్వరతీర్థులు ఇటమహేశ్వరతీర్థాభిప్రాయము గ్రహింపఁబడినది. మయుఁ డుపదేశించినట్లు లోపల నెందును జెప్పఁబడలేదు. మాల్యవంతుఁ డుపదేశించినట్లు చెప్పఁబడినది కాన నిట మాల్యవంతుఁ డనుట యుక్తియుక్తముగ నున్నట్లు తోఁచును మయుఁడు చెప్పినను జెప్పియుండవచ్చును

క. ఒనరింపఁజాలి యుద్ధం,బునఁ బొలిక నిలిచి గెలుచు ♦ ప్రోడయునగుచుం
దనరారుమాల్యవంతుని, తనయాతనయుఁడవు నన్ను ♦ దయఁ గనవేలా?.

చ. ధరఁబడి నీవిటుండఁ బుర♦తల్లజమౌ మనలంక భీతితే
క రవిమయూఖముల్ మిగులఁ ♦ గ్రాలుచు నిప్పుడు చొచ్చెఁ గ్రొత్తగాఁ
బంభవ మిట్లు రాఁ గనుచు ♦ బాహుబలంబుల నెల్ల మాని యి
క్కరణిఁ బరుండె దేమొకొ? యిఁ♦కన్ వడిమీఱఁగ లెమ్ము లెమ్ము; సం
గరముల శత్రుసంతతులఁ ♦ గాలునిపీటికిఁ బంప హేతువై. ౮౨ 4905

చ. ఖరకరునట్లుగా రుచులఁ ♦ గ్రాలుచు నిత్యముఁ బూజితంబునై
యరితతిఁ జెండునట్టిదయి ♦ హాటకజాలపరిష్కృతంబునై
సురపతివజ్రమో యనఁగ ♦ శోభిలుచున్ గనుపట్టుచున్న నీ
పరిఘము రామబాణముల ♦ బాగుగ వేయిగ భిన్నమై ధరన్. ౮౩ 4906

తే. ఇదియె పడియున్న దిపుడు; నీ♦వీరణోర్వి
దయితనుం బోలెఁ గౌఁగిటఁ ♦ దగినరీతి
నదుముకొని పండియున్నాఁడ ♦ వసురనాథ!
దయితగా నటు నన్నుఁ గాంచి ♦ దయఁ బలుకక. ౮౪ 4907

క. కనులను జక్కఁగఁ జూడక, దనుజేశ్వర! యుండె దేమొ;♦ధర నిట మృతినిం
గన నీవు నాదుహృదయం, బనఘా! యిది వగఁ గృశించి ♦ యతివేగమునన్.

తే. వేయితునకలుగాకున్న♦దే యి దేమొ?
యిస్సిరో; యని విలపించి ♦ యింతిమిన్న
బాష్పపర్యాకులాక్షియై ♦ భర్తయందుఁ
గలుగునెయ్యము పెంపునఁ ♦ గలఁగిన మది. ౮౬ 4909

క. ఘనదుఃఖమ్మును బట్టం, గను జాలక మూర్ఛనొందెఁ; ♦ గాంతామణి యా
దనుజేంద్రుపత్ని శోకం,బునఁ గందుచు నట్టె మూర్ఛ ♦ మునిఁగి యచటనే.

తే సంజకెంజాయ నెట్టినై ♦ సాంద్రమయిన
యసితజలదంబునందుఁ ఱె♦న్నారు నూత్న
చంచలాలతవోలె ర♦క్షఃపతియుర
మునను బడి వెల్గె; నాసుయ♦తనయ యట్లు. ౮౮ 4911

సీ. పడియుండునంత స♦పత్నులు చాలఁ దొందరపడి తారు రో♦దనము చేయు
చును దేవి నామె లే♦వనుజేసి పల్కిరి; దేవి! రాజులసిరి ♦ తెలివిఁ గనిన
నతిచంచలం బని ♦ యాత్మను జక్కఁగఁ దెలిసినయవి గాదె ♦ పలువిధమ్ము
లైన యవస్థల ♦ నంది మాఱుటచేత లోకులస్థితియును ♦ వ్యాకులంబె

ఆ. యనియు నీవెఱుంగు ♦ దైనను వగచెద,వేల? యనుచుఁ బల్క♦నింతిబాష్ప
సలిలములను నిక్కఁ♦జనులను దడుపుచు, నారవంబు చెలఁగ ♦ నప్డు డేడ్చె.

చ. వనితలు బిట్టుగా వగవఁ ♦ బార్థివసత్తముఁడైన రాముఁ డం
త నచట నవ్విభీషణునిఁ ♦ దాఁగని యాలలనాకదంబ మొ
య్యనఁ బురికేగఁ జేసి యిపు ♦ డన్నకు నుత్తరసత్క్రియల్ తగం
బొనరుపుమంచుఁ బల్కె; నయ♦పుంజవిదుండగు నాతఁ డవ్విధిన్. ౯౨ 4913

చ. జనపతి పల్కినట్టి హిత♦సాధువచస్తతి నాలకించి ధ
ర్మనియతిఁ బొల్చువాక్యమును ♦ మంచిమనీష నిదిట్టులే యటం
చును దలపోసి రాఘవుని♦చొప్పుననే పనులెల్లఁ జేయనా
నని వినయంబు ధర్మమును ♦ నొప్పలు కొప్పఁగ తేని కిట్లనున్. ౯౩ 4914

క. వ్రతధర్మములను వదలిన,యతఁ డీరావణుఁడు క్రూరుఁ♦డగు ఘాతుకుఁడా
సతతం బనృతము పల్కును, నితరసతీసంగమంబు ♦ నితఁ డొనరించెన్. ౯౪

తే. ఇట్టివానికి సంస్కార ♦ మేను జేయ, నర్హుఁడను గాను; సోదరు♦నాకృతిగల
శత్రువే కాని నాకు ర♦క్షఃపతియితఁ,డెపుడుప్రాణులకహితంబె♦యొలమిఁ జేయు.

క. గురుగౌరవమునఁ బూజకు, ధరణీశా! యీతఁడగును ♦ దా నర్హుండై
న రహితదోషుఁడు కాఁడితఁ, డరయంగా నట్లు లొట ♦ నర్హుఁ డెటులగున్.

చ. మనుజులు లోకమందుఁ బలు♦మాఱులు స్వేచ్ఛఁగఁ గ్రూరుఁ డీతఁడా
దనదుసహోదరాగ్ర్యునకుఁ ♦ దా నొనరింపఁడు కృత్యమంచు నన్
విని వచియింతు రీతులువ ♦ స్వేచ్ఛ నొనర్చిన దోషజాలమున్
వినుదురయేని మంచిదె వి♦భీషణుఁ డిప్పనిఁ జేయకుంట యం
చని మరలన్ వచింపఁగల ♦ రంచుఁ దగం బలుకంగ రాముఁడున్. ౯౬

చ. పలుకులయందు వైఖరియు ♦ భాసిల ధార్మికవర్యుఁడైన యా
యిలపతి యవ్విభీషణుఁ డ♦హీనతరోక్తుల నిట్లు పల్క మి
క్కిలియు నతుష్టి నొందుచును ♦ గేవలవాక్యవిదుండుగాఁ గడున్
జెలఁగెడు రాక్షసేజ్యుఁ గని ♦ దెచ్చెఱఁ బల్కె గుణైకభూషణా!. ౯౭

తే. నాకుఁ బ్రియమగుకార్యం బొ♦నర్ప నీవె
తగినవాఁడవు నీప్రభా♦వగతిచేత
జయము నాకిటఁ గల్గె ని♦శ్చయముగా హి
తము నే నీకు వచింపంగఁ ♦ దగుదు నేను. ౯౮ 4920

చ. దనుజవిభుం డితం డెపు డ♦ధర్మ మసత్యము గల్గువాఁడె యాఁ
గననిది నిశ్చయంబగును ♦ గాని గుణంబులు వీనియందు నొ
ప్పును బహుసంఖ్య తేజమునఁ ♦ బొల్చు బలంబునఁ గ్రాలు శూరుఁ డే
యనిమొనలం బరాజయము ♦ నారయ నీతఁ డెఱుంగకుండుఁగా. ౯౯ 4921

చ. సురపతిలోనుగాఁ గలుగు ♦ శూరసుపర్వులచేతఁ గూడ సం
గరముల నోటమిం గనని ♦ గండునుగం దని విందు; మీతఁడాఁ

గరమునుమహోత్సుఁ డాత్మబల♦గర్వసమన్వితుఁ డెప్డు లోకభీ
కరనినదంబు గల్గునటు♦గా నొనరించుట రావణాఖ్యుఁడై
పరఁగెను గాదె; యైనఁ బరి♦పంథిగదా? యని పల్కనెంతువో?. ౧౧౦౫ 4922

[1]చ. మరణముదాఁక వైరములు ♦ మానక యుండెడు దానిపైన న
క్కరణిని నుంచుకో దగవు ♦ కార్యములున్ మన వెల్లనయ్యె; ను
త్తరవిధు లింకఁ జేయుము మ♦తంబున నీ కితఁ డెట్లు బంధువో?
యరయఁగ నాకు బంధువగు! ♦ నార్య! విభీషణ! ధర్మవిద్వరా!. ౧౧౧౫ 4923

చ. కనుకన శాస్త్రపద్ధతిని ♦ గద్బరనాథున కీవు చేతులా
ర నియతకృత్యముల్ జరప ♦ రమ్యము వానికి నర్హుఁ డాతఁడాఁ
దనరఁగఁ బాపికిం గ్రియలు ♦ తా నొగిఁ జేసె నటంచు గీర్తియుం
గననగు నీకు; నన్న రఘు♦కాంతునిపల్కుల నాలకించుచున్. ౧౧౨౫ 4924

చ. వనితలఁ బంపి యంత మఖ♦వార మొనర్చినవారి కెట్లు చే
యనగునో యట్లు శ్రద్ధమెయి ♦ నన్నకు నుత్తరసత్క్రియల్ క్రమం
బున నొనరింపఁబూనెఁ గడుఁ ♦ బూనిక యాజకులెల్లఁ బద్మకం
బును దగువట్టివేళ్లు మన♦ముం గరగించెడు గంధవస్తువుల్
గొని మఱియెన్నియో యొకటఁ ♦ గూరిచి చందనదారుసంతతిన్. ౧౧౩౫

ఆ. చితిని బేర్చి పయిని ♦ జిత్తంబు నలరించు, రాంకవాస్తరణముఁ♦బొంకముగను
బఱచి వేదవిహిత♦పద్ధతి రావణు, నందుఁ జేర్చి; రంత ♦ నసురపతికి. ౧౧౪౫

సీసమాలిక:—

ఆమ్నాయవిహితమా♦నం త్యేష్టిజరపంగఁ బడియెను బిత్ృమేధ♦ముదుగకవిధిఁ
జక్కఁగా వారలు ♦ సాగించి రిట్టులు; యాజకు లాచితి♦ కగ్నిదిశను
వేదిని గల్పించి ♦ వేదికిఁ బశ్చిముభాగంబునన్ గార్హ♦పత్యవహ్ని
నట్లె ప్రాక్కునయందు ♦ నాహవనీయము నంతకు దెస దక్షి♦ణాగ్ని నిట్టు
లాయాస్థలములఁ ద్రే♦తాగ్నుల స్థాపించి; రంతట దధియుక్త ♦ మైనఘృతము
నిండినస్రువమన ♦ నెగడునాయజ్ఞపాత్రముఁ బ్రతిపత్తికై ♦ రావణుచితి
యందువైచిరి; మఱి ♦ యాజకప్రవరులు సోమరాజముఁదెచ్చు ♦ నామహితశ
కటమును దానవ♦కాంతుపాదములందు యజ్ఞంబుకొఱకు ధా♦న్యమునుదంచు
నట్టియులూఖల ♦ మఱిని యూర్వంతరమందును దారుమ♦యములు గాఁగ
నలరుపాత్రంబుల ♦ నన్నింటి నరణిని నుత్తరారణి మఱి♦యును మునలము
నితరపాత్రంబుల ♦ నెల్ల నాయాస్థలంబులనుంచి [2]వేదము♦నులు వచించి
నట్టి విధానంబు ♦ నాశ్రయించుచుఁ జితియంటికంబునఁ బవి♦త్రాంగమైన

1 మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్-అనియూ. 2 శాస్త్రదృష్టేన విధినా మహర్షి విహితేనచ-అనియూ.

*రాజగవిని జంపి ♦ రయమున హోమంబుచేసి తచ్చర్మము♦చేతఁ బూని
ఘృతమునఁ దడిపి యా♦దితిజేంద్రుపై వైచి; రప్పుడా రాక్షసు ♦ లవ్విభీష
ణసహాయులగుచు మ♦పంబులుచింతలోమునిఁగియుండనుగంధ♦ములనుమాల్య
ములచేతఁ బలువిధం♦బులగు వస్త్రాళిచేఁ గైసేసి మోముల ♦ గళితబాష్ప

తే. వారిఁ దమువుచుఁ బేలాలు ♦ వరుసఁ జల్లి;
రంతట విభీషణుండు శా♦స్త్రానుసార
ముగ ధనంజయు నిచ్చెను; ♦ దగ నతండు
స్నాతుఁడై యార్ద్రములగు వ♦స్త్రములతోడ. ౧౧౧॥ 4927

క. ఇలపయి దూర్వలఁ దిలలను, సలిలంబుల నునిచి యందుఁ ♦ జక్కని శ్రద్ధం
దలఁచుచుఁ బ్రేతావాహన, మలయక యొనరించి యుదక♦మతనికి నిడియెన్.

తే. శిరము సోఁక నమస్కృతిఁ ♦ జేసి యన్న
భార్యలను నెల్లఁ బలుమాఱు ♦ పట్టణమున
కనుగుఁడని సాంత్వనోక్తుల ♦ నలరఁ బలికి
వారలను గొనిపోయెఁ బూ♦ర్వరముచేర. ౧౧౩॥ 4929

చ. వనితలు లంకఁ జొచ్చి; రిటు ♦ వారు చనంగ విభీషణుండు రా
మునికడఁ జేరుచున్ వినయ♦ముం దళుకొత్తఁగ, నిల్చియుండె; నా
జనపతి లక్ష్మణార్కసుత♦సైన్యయుతుండయి వైరిఁ జంపి వృ
త్రుని వధియించి తేజమునఁ ♦ దోఁచుపురందరురీతి హర్షమున్
గని యలరారుచుండెఁ ద్రిజ♦గంబుల బాధలు మానెనం చెదన్. ౧౧౪

నూటపదునాల్గవ సర్గము సంపూర్ణము.

---

౧౧౫ - వ సర్గము.

విభీషణపట్టాభిషేకము : రాముఁడు హనుమంతుని సీతయొద్దకుఁ బంపుట.

క. సమరంబుఁ జూడవచ్చిన, యమరులు గంధర్వదాన♦వాదులు దనుజేం
ద్రు మరణమొందించినరా, మమూర్తిఁ గని ప్రీతి స్వీయ♦మందిరములకున్. ౧

క. చని రాత్మవిమానములపయి నెక్కి శుభగాథ లెల్ల ♦ నెలమి నొకరితో
డను నొకరు చెప్పుకొనుచును;, ఘనభాగ్యముచేత మిగులఁ♦ గ్రాలెడువారల్.

ఆ. హర్షయుక్తులగుచు ♦ నతిభయంకరమగు, దనుజనాథువధము ♦ మనుజనాథు
నతులవిక్రమంబు ♦ హరివరుల్ చేసిన, భూరిసంగరంబు ♦ ఘోరతరము. ౨

సీ. సుగ్రీవుమంత్రంబు ♦ చొప్పు లక్ష్మణునకు రామునిపై నను♦రాగ మెంత
యుండినయదియున♦త్యుగ్రతద్విక్రమంబునుసుమిత్రాభాగ్య♦మునుముదమునఁ

---

* తత్ర మేధ్యం పశుం హత్వా రాక్షసేంద్రస్య రాక్షసాః, అనుస్తరణికాం-అనిమా. అనుస్తరణికాం రాజగవీం రాజగవీ మాలభ్య తచ్చర్మణా యజమాన మాస్తృతవంత ఇత్యర్థః-అనివ్యాఖ్య.

చెప్పుకొనుచుఁ బోయి; ♦ రప్పుడుమహనీయుఁడగురామచంద్రుండు ♦ హర్ష మొంది
యింద్రుసారథిఁ గని ♦ యెంతయుఁ బూజించి శక్రదత్తము ధనం ♦ జయనిభంబు

ఆ. నైన దివ్యరథము ♦ మానసీయముఁ గొని
పొమ్మటంచు నాజ్ఞఁ ♦ బూన్కిఁ జేసె;
శక్రసారథియయి ♦ చతురుఁడౌ మాతలి
రాముసాజ్ఞ దివ్య ♦ రథము నెక్కి. ౮౫ 4934

క. సురలోకమునకుఁ దమితో, నరిగెను; సురసారథివరుఁ ♦ డగు మాతలియున్
సురపురి కరిగిన నారఘు,వరుఁడు మహోహర్ష మాత్మ ♦ వర్ధిలుచుండన్. ౯౫

క. తనకున్ సాయము నెంతయు, నొనరించిన యర్కతనయు ♦ నురుపరిరంభం
బునఁ దేల్చె; నిట్టు లొనరిచి, ఘనుజుఁడు పురికొలుప వాన ♦ రావళి గొలువన్.

క. చనియెను శిబిరంబునకున్;, మనుజేశుం డంతఁ జెంత ♦ మసలుచుఁ దేజం
బునఁ గ్రాలు సత్యసంప,న్నుని లక్ష్మణుఁ గాంచి పల్కె ♦ నూత్నమహామునన్.

క. అనురక్తుని నుపకారం,బును జేసినవాని భక్త ♦ ముఖ్యుని సౌమ్యా!
మనయీవిభీషణునిఁ జ,క్కనిదానవరాజ్యమునకుఁ ♦ గనుసంప్రీతిన్. ౯

తే. లంకకుం బోయి యభిషేక ♦ మింకఁ జేయు
మనఘ! యీరావణానుజుఁ ♦ డును బురమునఁ
బట్టభద్రుఁడగుటను నేఁ ♦ బ్రమద మలరఁ
గాంచుదునయేని నాకోర్కి ♦ మించుఁ జుమ్ము!. ౧౦ 4939

చ. అని యిటు లామహాత్ముఁ డెద ♦ హర్షము పొంగఁగఁ జెప్ప లక్ష్మణుం
డనుమతుఁడై మహాముదము ♦ నంది సువర్ణఘటాళిఁ దెచ్చున
ట్లొనరిచె; నంతఁ దానిఁ గొని ♦ యుత్తమకీశవళంబుఁ జేసి చ
క్కనిజలరాశినీరముఁ గ ♦ గం గొనిరాఁగ మనోజవంబునన్. ౧౧౫ 4940

క. బలశాలులైన కపివ,గ్యులకానతి యిచ్చె; నంత ♦ నురుబలవేగం
బులనొప్పు వానరులు ని,స్తులవిక్రముఁడౌ సుమిత్ర ♦ సుతునానతిచేన్. ౧౨౫

తే. వేగముగఁ బోయి ప్రీతిచే ♦ విమలనీర
మును గ్రహించి చెలంగుచు ♦ ననువుమీఱ
వారు రా లక్ష్మణుండు రా ♦ వణునితమ్ము
నలరుసింహాసనమ్మున ♦ నెలమిఁ జేర్చి. ౧౩౫ 4942

క. కలశము నొకదానిం గొని, వెలయుము రాజ్యమున ననుచు ♦ విమలజలధిస
జ్జలముల నభిషేకించె; న,కలధర్మవిదుండు భూమి ♦ కాంతునియాజ్ఞన్. ౧౪

క. తనమిత్రవారపరివృతు, ననుపసుతుస్ గాత్ము రావ ♦ ణానుజు లంకన్
దనుజాలమధ్యమభాగం,బున వేదోక్తాభిషేక ♦ మును జేసెఁ దమిన్. ౧౪౫

తే. అవ్విభీషణుఁ డాలంక ♦ యందుఁ బట్ట
భద్రుఁడై రాక్షసేంద్రుఁడై ♦ ప్రభువయి తగఁ

గాంచి యాతనిమంత్రులు ♦ కడువినయము
గల్గు నారాక్షసులు చాలఁ ♦ గనిరి ముదము. ౧౬ 4945

చ. దనుజవిభుం డతండు రఘు♦తల్లజదత్తసురాజ్య మొంది భృ
త్యనిచయముల్ మనోజ్ఞవచ♦నావళిచే నలరించి యంత రా
మునికడఁజేరె; నట్టితఱి ♦ మోదుకలాజమహాక్షతల్ మనో
జ్ఞనిఖిలపుష్పముల్ గొనుచు ♦ నంతన మొప్పఁగఁ బౌరరాక్షసుల్. ౧౭

తే. తృప్తి నొందుచు నారాక్ష♦సేశ్వరునకు,నర్పణము చేసిరభివృద్ధి♦కనుగుణముగ
వీర్యశాలిదుర్ధర్షుఁడై ♦ వెలయునతఁడు,వానిగ్రహియించిరఘువంశ♦వరునకెలమి.

సీ. అతనితమ్మునకు శు♦భావహమ్ములగు నా మంగళవస్తువుల్ ♦ మమత నొసఁగెఁ;
గృతకార్యుఁడగుచు స♦మృద్ధార్థుఁడై వచ్చియున్న విభీషణు♦నొప్పుగఁ గని
యతనిప్రియంబున♦కనియె యావస్తువుల్ కొనియె; నంతట రఘు♦కుంజరుండు
తనపార్శ్వమున నంజ♦లిని బట్టి నిలిచి యహార్యరూపుండయి ♦ యలరి వీరుఁ

ఆ. డై చెలంగుచున్న ♦ యాహనుమంతుని, గాంచి పలికె; సౌమ్య♦కర్బురేశ్వ
రుఁడగు నితనియాజ్ఞఁ♦గడఁగిలంకకుఁ బొమ్ము,చని యథావిధిగని♦తనిగృహంబు.

క. అనుమతిఁ జొచ్చి మహీజకు, మనవిజయముఁ జెప్పి యెలమి♦మానస మొందం
గను జేయుచు వైదేహికి, వనచరపతి నే సుమిత్ర♦వరనందనుఁడున్. ౨౦ 4949

తే. కుశలముగ నున్నవార్తలఁ ♦ గూర్చిరదనుజుఁ
డని రయొనర్చి నాచేతనె ♦ హతుఁడగుటయుఁ
దెలియఁబలుకుము; జయశీల! ♦ దివ్యకీశ!
వార్త నిద్దాని సీతకు ♦ వరుసఁ జెప్పి. ౨౧ 4950

క. మనమానందరసంబున, మునుఁగంగాఁ జేసి జనక♦భూపతిసుత యే
మని చెప్పనో యావార్తను, గొనిరమ్మా మరలి చెంత♦కుం ద్వర యలరన్.

నూటపదునేనవ సర్గము సంపూర్ణము.

---

౧౧౬ - వ సర్గము.

{ హనుమంతుఁడు రామునివిజయము సీత కెఱింగించి యామె చెప్పినవార్తల రామునకుఁ జెప్పుట. }

చ. అని యిటు రాముఁ డాజ్ఞ యిడ ♦ నామరుదాత్మజుఁ డాంజనేయుఁ డా
దనుజవరార్చితుం డగుచుఁ ♦ దానట లంకను జొచ్చెఁ; దేజమున్
ఘనముగ నొప్పనాహనుమ ♦ కర్బురనాథునిగేహ మొంది యం
దు నొకమహీజమూలమున ♦ ధూర్తసురారివధూవృతాంగియై. ౧ 4952

*క. ఆనందము లేకయె తను, వానెలవునఁ బోషణమున ♦ కగుకృత్యమ్ముల్
లేనిదయి కృశతనుం గనఁ,గా నొక ఖలఖచరపీడఁ♦గను రోహిణి నాన్. ౨

---

* సాతంకా మివ రోహిణీమ్-అనిమూ. సాతంకాం సగ్రహపీడామ్-అనివ్యాఖ్య.

తే. కూరుచున్నట్టి సీతను ♦ జేరఁ బోయి
కనియె; నంతటఁ దననామ♦మును వచించి
వందనము చేసి యచలుఁడై ♦ యందు వినయ
సంకుచితగాత్రుఁడై నిల్చె ♦ సంతసమున. ౩ 4954

చ. తనుఁ గనవచ్చినట్టి బల♦దర్పసమగ్రుని వాయుపుత్రునిం
గనుఁగొని సీత మున్నతనిఁ ♦ గాంచిన గుర్తును బట్టఁ జాలకుం
డెను మఱి యాతనిన్ మిగుల ♦ నిశ్చలదృష్టిని గాంచి మున్ను వ
చ్చిన మహాకపియుఁడే యనుచుఁ ♦ జిత్తమునన్ స్మరియించె హృష్టయై. ౪

చ. హరివరుఁడైన యాహనుమ ♦ యామెముఖంబు విలాస యుక్తమై
యరుదుగనుంటఁ గాంచి తన♦ కారఘువర్యుఁడు చెప్పినట్టియా
నిరుపమవార్తఁ జెప్పె నిటు ♦ నెమ్మిని; జానకి! లక్ష్మణుండు భూ
వరతిలకుండు భానుజుఁడు ♦ వానరసేనలు పెంపుమీఱఁగన్. ౫ 4956

క. దనుజేంద్రుఁ డావిభీషణుఁ, డనూనమోదంబు గనుచు ♦ నటఁ గుశలముగాఁ
దనరారు చున్నవారలు, మనుజేంద్రుఁడు శత్రునిచయ♦మారకుఁడు తగన్. ౬

చ. తనపగవానిఁ జంపి ఫలి♦తప్రియకృత్యుఁడునై వచింపుమం
చనెఁ గుశలంబు నీకు; జన♦కాత్మభవా! దనుజేంద్రుతమ్ముఁడై
ఘనుఁడగు నావిభీషణుని♦ కామనహాయముచేతఁ *దమ్మునీ
తిని హరిసైన్యపాలకుల♦ధీరత రాముఁడు చంపె రావణున్. ౭ 4958

సీ. వీరుఁడా రఘుకుల♦విభుఁడు శత్రువధంబు నొనరించినాఁడు గా♦వున నపార
సంతోషమును బొంది ♦ శాంతమై కృతకృత్యమైన మనంబున ♦ నాదిఁ గుశల
మడిగి నీతోఁ జెప్పు♦మనె నిట్లు లోదేవి! ప్రియవార్త నీకుఁ జె♦ప్పెదను నిన్నుఁ
గూరిచి ప్రీతితోఁ ♦ గూడియున్నాఁడను ధర్మముల్ తెలిసిన♦దాన వీవు

తే. భాగ్యవశమున నీవిటు ♦ బ్రదికియున్న
దాన వటు లేనియెడల వ్య♦ర్థమగు నాదు
జయ మిదెల్లను; జనకజా! ♦ సంగరమున
మనకు విజయంబు గల్గెను ♦ గనుక నింక. ౯ 4959

చ. మనమునఁ జింత బాసి యను♦మానముఁ బూనక స్వస్థవై జయం
బును దలపోయుచుండు మతి♦మూర్ఖుఁడు రావణుఁ డంతమొందెఁజూ
మనపశ మందె లంక యిది ♦ మైథిలి! యున్నది వైరినుండి ని
న్నని విడిపింపఁ బూని యది♦యాదనుకం దగునిద్ర లేమిచేన్. ౧౧ 4960

క. మనమునఁ దాపం బందుచు, వననిధివరమందు సేతు♦బంధన మొనరిం
చి నిశాటపతిం జంపెద, ననునాశపథంబు దీర్ప♦నయ్యె వరుసగన్. ౧౧

* లక్ష్మణస్య నయేన చ-అనిమూ.

తే. రావణునివాసమౌ నగ♦రంబునందు
నున్నదాన నటంచని ♦ సన్నుతాంగి!
సంభ్రమముఁ బొందవలదు రా♦క్షసవిభుండు
చచ్చె లంకావిభూతి యీ♦సమయమందు. ౧౨ 4962

తే. మనవిభీషణువశమును ♦ గనియెఁ గాన
స్వగృహమునయందు నున్నట్టి ♦ భయము గలుగఁ
జాలదని నమ్మి మదిని నా♦శ్వాసమొందు
మీవిభీషణుఁడు నిను నో♦యింతి! చూడ. ౧౩ 4963

క. కోరుచునున్నాఁడట కిది, గోరాఁగలఁడనుచుఁ జెప్పఁ ♦ గోరె ననుచు సా
మీరి వచించిన శశినిభ,చారుముఖం బలర నొప్పు ♦ జానకి యంతన్. ౧౪

*క. సంతసము వెల్లి గొనఁగా,నెంతయు వడి లేచి హర్ష ♦ మెక్కువయియి త
న్నెంతయును నిర్వరింపఁగ, వింతగ నేపనియుఁ జేయ ♦ వీలుపడమిచేన్. ౧౪౫

ఆ. ఊరకుండె; నంత ♦ మారుతి పలుకని, సీతఁ గాంచి యిట్లు♦చెప్పె దేవి!
చింతసేయు దేమి? ♦ చెప్పుము నాతోడ, బదులుమాటయేల? ♦ పలుక వబల!.

చ. అనిలతనూజుఁ డిట్లుడుగ ♦ నావనితామణి సాధ్వి ధర్మనుం
దునియతి నొందియుండుటను ♦ దోఁడనె పల్కఁగరాని యంత ప్రీ
తిని దడబాటుపల్కులను ♦ దిన్నఁగ నిట్లని పల్కెఁ; బ్రాణనా
థునివిజయంపువార్త వినఁ ♦ దోరపుసంతస ముబ్బి రేఁగుటన్. ౧౭ 4962

తే. ఏపనియుఁ జేయరాకుండ ♦ నిప్పుడయ్యెఁ
గాన క్షణమాత్రము వచింపఁ♦గా నశక్తు
రాలనైతి మహాత్మ! యీ♦లీల భర్తృ
విజయశుభవార్త నెంతయుఁ ♦ బ్రియము మీఱ. ౧౮ 4968

చ. పలికిన నీకు నే బదులు ♦ పల్కఁగ నొప్పెడు మాట నెన్నిభం
గులఁ దలపోసి చూచినను ♦ గోరినఁ దోఁపదు లోకమందు; నెం
తలలితవాక్కు చెప్పినను ♦ దచ్ఛుభవాక్కున కెంతొ తక్కువై
వెలసెడుఁ గాని తుల్యమును ♦ వేయివిధంబులఁ గాదు మారుతీ!. ౧౯౫ 4969

తే. పలుకు లేకుండుటే గాక ♦ పవనతనయ!, సాధువర్తన! నీవిట్టి ♦ సరసవాక్కుఁ
బలికినందులకయి తగు♦పలుకు లేక,పోవుటయె కాదు నీకీయఁ♦బోలు కాన్క.

క. కనఁబడకున్నది భూమిని, ఘనపాతాళమున దేవ♦కాంతునిధామం
బున బంగరు వెండిని ర,త్ననికరమును రాజ్యమును గ♦నంబడ దెన్నన్. ౨౦౫

చ. అని వచియింప సీతఁ గని ♦ యాహనుమంతుఁడు పల్కె దోసిలొ
గ్గి నిలిచి యామెమ్రోలఁ; బతి♦కిం బ్రియముల్ హితముం బొసంగఁజే

* ప్రహర్షే ణావరుద్ధా సా వ్యాజహార న కించన-అనిమా.

యు నెలఁత నీవు భర్తకు మ♦హోన్నతిఁ గాంచుజయంబు గల్గు గా
కని యెదఁ గోరుచుండు వటు♦లొటను స్నిగ్ధనువాక్య మివ్విధిన్. ౨౩

క. పలుకఁగ నీకె తగు నొం,డులకిటు పల్కంగఁ గాదు; ♦ నూత్నముగా నిం
పులు గూర్చు నిట్టిబదులుఁగ, బలుకఁ దగినమాట యొకఁడె♦ భవ్యము సుభ్రూ!.

సీ. సారమై స్నిగ్ధమై ♦ భూరిమోదంబును గలిగించునట్టి నీ♦పలుకు వివిధ
రత్నవితతికంటె ♦ రమ్యదేవేంద్రపదమునకంటెను విశే♦షమయి తనరు;
నిట్టిమాటను విను♦టే దేవరాజ్యాది సకలవస్తువులు నా ♦ కిఁక లభించి
నట్టు లయ్యెను, నిహ♦తారినై విజయంబుఁ గని సుస్థిరుండైన♦ఘునని రాముఁ

తే. గాంచఁగల్గుటె చాలును! ♦ నంచుఁ బలుకు
నతనిమాటను విని జన♦కాత్మజాత
యానమీరకుమారుతో ♦ నతిశుభమగు
వాక్యమును బల్కె నిట్టు; లో♦ వాయుతనయ!. ౨౪ 4974

సీ. *ఆకాంక్షయోగ్యత ♦ యల్లె సన్నిధియను వాక్యలక్షణముల ♦ వరుస నెఱిఁగి
గ్రహణధారణములఁ ♦ బ్రతిపాదనస్మరణముల నూహించుట♦యు మఱి శ్రోత్ర
విషయ మూహించుట♦విపులార్థమెఱుఁగుటతత్త్వము నాత్మను♦దగ నెఱుఁగుట
యను బుద్ధిలక్షణా♦ళిని దెలిసియు నతిమాధుర్యగుణయుక్తి ♦ మహితమైన

తే. పలుకు చెప్పంగ నీవె నూ♦వలఁతి; వమల
పరమధర్మగుణుండవు ♦ మరుదధిపతి
కెన్న వరపుత్త్రుఁడవు నీవు ♦ సన్నుతింపఁ
దగినవాఁడవు శ్రమ మోర్వఁ ♦ దగినబలము ౨౬ 4975

క. తనుదార్ఢ్యము శౌర్యమునం, దనుభవము పరాక్రమంబు ♦ నతిశక్తియు వై
రినికరము నొంచు తేజం,బును సపరాధముల నోర్వఁ ♦ జాలెడు క్షమయున్.

తే. వినయసంపన్నతయు ధైర్య♦మును మొదలగు
సకలకల్యాణగుణములు ♦ సంఘములుగ
నిన్నె తగనాశ్రయించుచు ♦ నన్నివెలిగి
యున్నయవి సంశయమ్ము లే♦దన్న! హనుమ!. ౨౮ 4977

క. వినుతియె గా దిది సుభ్రూ!, యన నాహనుమంతుఁ డధిక♦హర్షంబున భ్రాం
తిని బొందక ప్రాంజలియై, వినయంబున నిలిచి జనక♦విభుసుత మ్రోలన్. ౨౯

ఆ. పలికె; నీవు పతియె ♦ పరమదైవంబుగఁ, దలఁచుదాన వట్టి ♦ ధవునిఁ బాసి
పగలఁ బొగిలి చిక్కి ♦ వందురి నీయశో,కమునునుండు నిన్నుఁ ♦ గరుణ మాని.

* అతిలక్షణసంపన్నం మాధుర్యగుణభూషితమ్, బుద్ధ్యా హ్యష్టాంగయా యుక్తం త్వ మే వార్హసి భాషితుమ్-అనిమూ వ్యాఖ్యార్థ మిట గుంభితము.

చ. తనువులు భీతిదంబులయి ♦ దారుణరీతిగ నుండ వృత్తి చ
క్కని తెఱఁగొందకుండ దయ ♦ గల్గనిచిత్తము లొప్పఁ జూపు లొ
య్యన భయదంబులై వెలయ ♦ నాదృతియే తలపోయనట్టి యీ
దనుజవరూధినుల్ మునుపు ♦ దారుణవాక్కులు పల్కినారు సూ!. ౩౧½

చ. కనకన నీదునాజ్ఞఁ గొని ♦ కాలునివీటికి వీరిఁ బంపఁగా
మనమునఁ గోరువాఁడ నిటు ♦ మానితవాక్యము నేను నీకుఁ జె
ప్పినపనికై వరంబుఁగను ♦ ప్రీతిగ నిప్పుని కొప్పుకొమ్ము; శో
భనతనురాజితా! భయము ♦ వాసి త్వదప్రియ మిట్లుచేయుచున్. ౩౨ 4981

సీ. దారుణాకారలా ♦ దనుజాంగనలఁ గ్రిందఁ బడఁదోసి ముష్టుల ♦ బాహువులను
బ్రహరించి కాలిదె♦బ్బల నొంచి జానుప్రహారంబులఁ గలంచి ♦ యన్నిపండ్లు
రాల నాసికలు క♦ర్ణంబులు ధరఁబడ వెండ్రుక లూడంగ ♦ విపులనఖము
లను మోము లెల్లఁ జీ♦ల్పంబడఁ బీడించి యొగిరి మీఁదను బడి♦యిట్లు చంపఁ

తే. గోరుచున్నాఁడఁ; గీర్తిని ♦ గోరుదాన, వవనిజా! నీకు నివ్విధి ♦ నపకృతులను
జేసి దుష్టాత్మలైన యీ♦స్త్రీల నెల్ల, నిట్లు పీడించి నే ♦ వధియింప నెంతు.

చ. అని వచియింపఁ గీర్తిగల♦యాజనకాత్మజ సీత యాంజనే
యునివచనంబులన్ వినుచు ♦ నుత్తమధర్మము నూని పల్కె; నో
వనచరవర్య! భూవిభుఁడు ♦ పల్కినరీతిఁ బనుల్ పొనర్చి జీ
వనమును జేసి శిక్షకును ♦ బాలయి కష్టము లొంది యోర్చుచున్. ౩౩½ 4983

తే. నీచకృత్యములను జేయ ♦ నేర్చియున్న
దాసిజనములయెడ నెవ్వఁ ♦ డీసుఁ బూను;
యుక్త మిదిగాదు నాభాగ్య ♦ మొప్పు దప్పి
చెడుటఁ బ్రాక్కృతదుష్కృతి♦చేత నాకు. ౩౪½ 4984

క. ఈతర్జనభర్జనములు, చేతఃపీడాకరములు ♦ చెందెఁ దొలిజనిన్
బ్రీతిగఁ జేసినకృత్యము, నీతిరున ననుభవింప ♦ కెటు మాన్పనగున్. ౩౬

తే. దానవేంద్రునిదాసీక♦దంబమువల
న నిటు లార్తిని బొందుట ♦ కనువగుతఱి
గలిగెఁ గావునఁ బొందంగ ♦ వలయుననుచు
నిశ్చయించితి వీరిదం♦డింపఁ దగదు. ౩౬½ 4986

చ. కరుణ చెలంగ వీరలను ♦ గావఁ దలంచితి వీరితప్పు ని
క్కరణి క్షమింపఁగాఁ దగును; ♦ గాలిసుతా! కపివర్య! దానవే
శ్వరుఁ డవు డాజ్ఞసేయ బహు♦భంగులఁ బీడ లొనర్చి వాఁడు ప్రే
తరమణుపాలికిం జనినఁ ♦ దప్పని మానినవారుసూ! యిటుల్. ౪౧ 4987

క. తమయిచ్ఛకొలఁది నపరాధము చేసినయట్టులైనఁ ♦ దగు మన్నింపన్,
సుమహితధిషణా! యీవిమ,యమునఁ బురాణోక్తి వినఁగ♦నో నెటు లనినన్.

చంపకమాలిక:—

*వనమున వేఁటకాఁ డొకఁడు ♦ వ్యాఘ్రము తఱ్ఱ దఱుమంగఁ జెట్టుపై
కిని వెస నెక్కె నందొకఁ డ♦కృత్రిమభల్లుకముండె; వ్యాఘ్రమా
ఘనతరభల్లుకంబుఁ గని ♦ కాననజంతుయుముండు వీఁడు గా
వునఁ బడఁద్రోయు వీని నన ♦ బోలఁ దలంచి వచించె నిట్టు; లీ
యనయును నాస్థలంబునకు ♦ నాతురుఁడై చనుదెంచెఁ గాన నీ
తని విడువంగ నెట్టులగు ♦ ధర్మము పోవదె యెట్టులైన నం
చని నిదురించె; నంతటను ♦ వ్యాఘ్రము వ్యాధునితోడ నిట్లనుఱ్ఱ
విను నిను జంపకే విడుతు ♦ వృక్షమునుండియె దీనిఁ ద్రోయుమా
యన నతఁ డట్లుచేసె; నది ♦ యంతట నేర్పుమెయిఱ్ఱ దరూత్తమం
బునఁ గల కొమ్మ నూఁతఁ గొని ♦ భూమిపయిం బడ కందె నిల్చె నం
త నతని నీకు ద్రోహము సి♦తాంతముఁ జేసినవానిఁ ద్రోయుమా!
యని పలుమాఱు వేఁడినను ♦ వ్యాఘ్రముతో ననెఁ బెక్కుసారు లీ
యన ననుఁ ద్రోసినఱ్ఱ విడువ ♦ న్యాయముగా దని శ్లోకమొండు చె
ప్పెను; నిలఁ బ్రాజ్ఞుఁడెన్నఁడును ♦ బ్రీతిని మాని మహోపకారముం
బొనరిచినట్టివానికిని ♦ బూనఁడు ప్రత్యపకారముం బొన
ర్పను బదు లిద్ది దాని కని ♦ పాప మొనర్పకయుండుటే తగుఱ్ఱ. ౮౨౹ 4989

తే. ఇట్టు లుండుట యాచార ♦ మెట్టులేని
దానిఁ గాపాడఁదగుఁ జరి♦త్రంబె సాధు
భూషణము సజ్జనాళికిఁ; ♦ బూతచరిత!
పాపులైనను సుజనులై ♦ పరఁగుచున్న. ౮౩ 4990

క. మరణార్హులైన సజ్జనుఁ, డురుకరుణం జూపవలయు ♦ నొక్క మొగిని నీ
వరుసం జేసిన దోషుల, నరయుచు దండింపవలయు ♦ ననునది వృథయా.

క. అనుదుపయేమో? లోకం,బునఁ దప్పును జేయనట్టి ♦ పురుషుఁ డొకఁడు లేఁ
డనఘా! శాస్త్రముచొప్పునఁ, గనినఱ్ఱ దండనము లేదు ♦ గద? వీరియెడఱ్ఱ.

చ. దనుజులు కామరూపులయి ♦ దారుణరీతిని లోకహింసయే
కని కని చేసి క్రీడగను ♦ గాలముఁ బుచ్చుచుఁ బాపముల్ ముదం
బున నొనరించుచుందు రది ♦ పోలును దక్కులవృత్తి గాన దం
డనమును జేయ రాదనుచు ♦ నాతి వచించిన నాలకించుచుఱ్ఱ. ౮౪ 4993

ఆ. వాక్యనిపుణుఁడైన ♦ వాయుకుమారుఁ డిట్లనియెఁ గీర్తిమతియు♦నారఘూత్త
మునకుఁ బత్నియునయి ♦ తనరునాసీతతోఁ;, నాశ్రితావనమె మ♦హావ్రతముగ.

* వ్యాఖ్యలోనిగాథ యిటఁ జేర్పఁబడకతప్పనిసరి యని చేర్పఁబడిన దని గ్రహింపఁదగు. 'న పరః పాప మాదత్తే' యనుమూలమున కీకథను దెనిఁగింపకున్నఁ జక్కఁగా నర్థము కాదు కాఁబట్టి ఈపద్యమునఁ జేర్పఁబడినది.

క. నిరతముఁ గ్రాలెడు నీ వల, ధరణీపతిమౌళి యనఁగఁ ♦ దగురామునకున్
గరమొప్పు ధర్మపత్నివి, సరియగు దాంపత్య మిద్ది ♦ శ్లాఘ్యస్థలి సాధ్వీ!. ౪౭

ఆ. సకలసుగుణముల య♦శంబును గన్నావు
దేవి! నాకు బదులు ♦ దేనిఁ జెపుదొ
పలికి సాగనంపు ♦ మల రాముచెంతకు
నరుగ వలయు నన్న ♦ హనుమను గని. ౪౮ 4996

చ. జనకజ యిట్లు పల్కెఁ గపి♦సత్తమ! నావిభుఁ గన్నులారఁగాఁ
గనుఁగొనఁ గోరుదాన; ననఁ♦గాఁ బవనాత్మజుఁ డామెవాక్యముల్
విని ముద మొందఁజేయుచును ♦ విస్తృతతేజము పొంగ నిట్లనున్;
జనకసుతా! సతీ! శచియు ♦ శత్రువులం దునుమాడి వచ్చియు
న్ననిఖిలదేవతావిభుని ♦ నాయకునిం గనినట్లు నీవునున్. ౪౯ 4997

చ. అరులను రూపుమాపి తగు♦నట్టి సుమిత్రులతోడఁ గూడి సో
దరుఁడగు లక్ష్మణుండు ప్రము♦దంబునఁ గొల్వఁగ నున్న రామభూ
వరుఁ బరిపూర్ణశీతకర♦భాసురవక్త్రుని జూడఁ బోదు: వం
చురుకళ లొప్పు లక్ష్మివలె ♦ నున్నమహీసుతతోడఁ బల్కుచున్. ౫౦ 4998

ఆ. ఆజ్ఞ నంది యంత ♦ హనుమంతుఁ డారాము,విభుఁడు వెలయుచున్న♦విమలధరణి
కతిజవంబు మీఱ ♦ నరుదెంచె జానకి, పలికినట్టిపలుకు ♦ పల్కెఁ బూని. ౫౧

నూటపదునాఱవ సర్గము సంపూర్ణము.

---

౧౧౭ - వ సర్గము.

{ రామాజ్ఞను విభీషణుఁడు సీత నలంకరించి రామునొద్దకుం గొనితెచ్చుట
ఆనందమున సీత రామచంద్రునిం జూచుట. }

క. అరయ మహాప్రాజ్ఞుఁడు గురు, తరకార్యజ్ఞుండు గాన ♦ ధనువుఁ గరములన్
ధరియించినవారలలో, వరుఁడగు రాముకడఁ జేరి ♦ పలికె హనుమయున్. ౧

క. ఏ నెలఁతమిన్నకొఱకై, యీనిఖిలారంభములను ♦ నిట్లొనరుపనై
దానవపతివిజయఫలం, బీ నెలవునఁ గలిగెనో యు♦హీనవిభూతిన్. ౨ 5001

క. ఆనారీమణి సీతను, గానంగా నౌను శోక♦కలిత యగుచు నెం
తేని తపియించుచున్నది, నూ!; నిర్జరనాథతుల్య! ♦ శూరవరేణ్యా!. ౩ 5002

తే. శోకసంతప్త యగుచు బా♦ష్పాకులేక
ణయు నగుచు నుండియున్ నీదు♦జయము విని
యంత సంతోష మొందె; ము♦న్నామె నన్ను
నెఱిఁగియుండుట నను నమ్మి ♦ యినకులేంద్ర!. 3 5003

క. కృతకృత్యుఁడై ఫలించిన, హితకార్యుండైన యమ్మ♦హీశతిలకు నా
పతిని సుమిత్రాపుత్త్రస,హితముగఁ గనఁగోరుదాన ♦ నిపు డని యనియెన్. ౪

చ. హనుమ వచింప నిట్లు జన♦కాత్మజ నాథుఁడు ధార్మికోత్తముం
డును నగు రాముఁ డెంచుక క♦నుల్ జలసిక్తములై వెలుంగ నా
దనుజునియింటనున్న సతి♦తన్ గ్రహియించిన నిందగల్గుఁ బా
వనమతిఁ బాపహీనయగు ♦ భామిని మానిన దోష మబ్బెడున్. ౫ 5005

ఆ. ఏమి చేయవచ్చు ♦ నిపు డని చింతను
బూనియుండె; నంత ♦ భూపవరుఁడు
వేఁడి యూర్పు లట్టె ♦ వెలయించి చాలఁగ
ధరణిఁ గనుచుఁ దనదు ♦ దాపునందు. ౬ 5006

చ. *ఘననిభుఁడౌ విభీషణుని ♦ గాంచి వచించెను; స్నాతయై సువా
సనగలగంధచర్చలను ♦ జారువిభూషణరాజిచేఁ దగం
గ నలరున ట్లొనర్చి వడిఁ♦గా నిటకుం గొనిరమ్ము జాగుచే
యను వల; దంచు శ్రీరఘువ♦రాగ్రణి పల్కఁగ రాక్షసేంద్రుఁడున్. ౭ 5007

క. త్వర లంకకుఁ జని యంతః,పురమునకుం బోయి తనదు♦పూఁబోఁడులచే
ధరణిజకుం జెప్పించెను;, దరుణీరత్నంబ! జనక♦తనయా! నీవున్. ౮ 5008

తే. స్నాతవై యంగరాగంబు ♦ చక్క నలఁది
భవ్యభూషణములఁ దాల్చి ♦ వాహనంబు
నెక్కుమా! నీకు శుభములు ♦ పెక్కు లగును
గాక రాముండు నినుఁ జూడఁ♦గాఁ దలఁచెడు. ౯ 5009

క. అని చెప్పించిన విని యా, జనకజయు విభీషణుఁ గని ♦ సాధుగుణాఢ్యా!
దనుజేంద్ర! యిట్టులే భ,ర్తను గనఁ గోరెదఁ గలాప♦రహితనె యగుచున్.

చ. అన విని యవ్విభీషణుఁడు ♦ నట్లనరాదు రఘుప్రవీరుఁ డో
జనకసుతా! భవత్పతియు ♦ త్వత్పరిపాలకుఁ డౌను గాన నే
మని వచియించె నాయధిపుఁ ♦ డట్టులె చేయఁగ నర్హమౌను నీ
కని వనితాముఖంబున నె ♦ యర్హగతిం బ్రతిచెప్పె నంతటన్. ౧౧ 5011

చ. విని జనకాత్మజాత పతి ♦ వేలుపుగాఁ దలపోసి నాథునం
దె నియతమైన భక్తియె మ♦తింతి విభూషణమై చెలంగ నొ
ప్పిన సతి గాన నట్లె యని ♦ ప్రీతిని బల్కె; ననంతరంబె యా
దనుజవిభుండు సంతసము ♦ తద్దయుఁ బొంగఁగ నామె కంతటన్. ౧౨ 5012

సీ. తలయంటఁగాఁ బంచి ♦ తరుణులచే స్నానకృత్యము సలిపి యు♦త్కృష్టచంద
నాదిలేపనముల ♦ ననులసుమంబుల నలరింపఁ జేసి మూ♦ల్యంబె లేని

* ఉవాచ మేఘసంకాశం విభీషణ ముపస్థితమ్-అనిమా.

భూషణంబులు చాలఁ ♦ బొందుగాఁ బెట్టించి యతులవస్త్రముగట్టు♦నట్లొనర్చి
మంచివస్త్రము పఱ♦పించి వెలిఁగెడు శిబికపై నెక్కించి ♦ చేరి పెక్కు

తే. దనుజు లిరువంకలను గొల్చు♦చును జనంగ
రామునొద్దకుఁ దోడ్తెచ్చె; ♦ భూమితనయ
తోడ నావిభీషణుఁడు సం♦తోషమెసఁగ
వచ్చుటల్ దివ్యమతి రఘు♦వరుఁ డెఱిఁగియు. ౧౩½ 5018

క. మనమున ధ్యానించుచునుం, డెను; దానవభర్త రామ♦నృపతి కెరఁగి శ్రీ
తిని దేవిఁ దోడితెచ్చితి, జనకజ నతి నంచు మనవి♦సలిపె నడఁకువన్. ౧౪

క. చిరకాలము దనుజాంతః, పురమున నివసించియున్న ♦ భూసుత యట క
ట్లరుదెంచుట విన్నంతనె, సురవైరిపతిన్ వధించి ♦ క్షోణీతనయన్. ౧౪½

క. *కొనివచ్చుటకుఁ బ్రమోదం, బును రావణునింట దివస♦ములు పెక్కులు తా
వనిత వసించెను గాదే?, యనుదైన్యము నిట్టిదాని ♦ నగునె గ్రహింపన్. ౧౫

క. అనునట్టి రోసమును బై, కొనుచి త్రముతోడ నుండె; ♦ క్షోణీపతి నె
మ్మనమున సాధకబాధక, ఘనచర్చం జేసి ప్రీతి♦గానని మదిలోన్. ౧౫½

క. తనపార్శ్వంబున నిల్చిన, దనుజేంద్రునిఁ గాంచి పల్కె; ♦ దానవనాథా!
విను సౌమ్యా! నావిజయం, బునందె యాసక్తి నీకుఁ ♦ బొదలెడు నెపుడున్.

క. త్వరగా సీతను నాపరి, సరమునకుం దెమ్ము; నాఁగ ♦ క్ష్మాపతిపలుకుల్
సురవైరిరాజు విని స, త్వరముగ నటనున్నవారిఁ ♦ బాఱిందోలెన్. ౧౬½

తే. తగినవారి నియోగించె; ♦ సొగసుమీఱఁ
గంచుకోష్ణీషములఁ దాల్చి ♦ కఠినములగు
వేత్రములఁ బూనుటను గడు♦భీతిదములు
గాఁ గనంబడు కరములు ♦ గలపురుషులు. ౧౭½ 5020

క. అందుఁ గలవారిఁ బెక్కం, డ్రం దోలుచుఁ దిరిగి; రంత♦టను గుంపులుగా
నందుండు వారలం దొలఁ, గం దఱుముచు నుండఁ గీశ♦కాండము లెల్లన్.

తే. భల్లుకంబులు దానవుల్ ♦ పటురయమునఁ
గుంపులుగఁ గూడి దవ్వున♦కుం జని; రిటు
వారుచనునట్లు దఱుమంగ ♦ స్వన మొకండు
పవనసంస్పర్శనజనితా♦ర్ణవరవమటు. ౧౯ 5022

క. వినఁబడియె నిట్లు నలుఁగడ, లను దోలుంబడుచు నటు తొ♦లంగుచు సంభ్రాం

---

* హర్షో దైన్యం చ రోషశ్చ త్రయం రాఘవ మావిశత్-అనిమూ రావణవధపూర్వక సీతాసమాగమేన హర్షః, రావణభవనోషితత్వ మేవ దైన్యరోషయో ర్హేతుః-అనివ్యాఖ్య. ఈ భావమే యిటఁ గనఁబడును.

తిని బొందు వారలం గ,న్గాని దాక్షిణ్యమున నోర్చు♦కొనఁ జాలమిచేత.

క. వలదని వారించెను రఘు,కులపతి నుతి సత్వరమును ♦ గూడినమదిఁ గ
న్నులచే దహించుపోలిక, నలదనుజేశ్వరుని బ్రాజ్ఞు ♦ నటఁ గన్గొనుచున్.

క. మనమును దూఱెడుమాటల, ననియెన్; నను లెక్కచేయ ♦ కవ్వలికిని నీ
జనములఁ దోలుచుఁ గ్లేశం,బును బొందఁగ జేసె దేల? ♦ పూనిక దీనిన్. ౨౪

ఆ. చాలు నింక నిలుపఁ♦జను పేరు నాజను, లంతె కాని యితరు ♦ లగుదు రెట్లు?
తరుణి కావరణము ♦ ధామమ్ములును గాదు, వస్త్రములును గాదు ♦ వరణ మట్లు

సీ. ప్రాకారములు గాదు ♦ ప్రతిసీరలును గాదు జనులను దోలు రా♦జనికరార్హ
మర్యాదలును గాదు ♦ మంచివృత్తమె వారి కావరణ మ్మగు ♦ నాత్మజనవి
యోగము లోనగు ♦ నురుతరవ్యసనంబులందు రాజ్యక్షోభ♦మాదియైన
కష్టంబులందును ♦ గలహాభూములయందు నట్లె స్వయంవర♦మందు యజ్ఞ

తే. మందుఁ బెండ్లిండ్లయందును ♦ సతివ పరుల
కనులకుం దోఁచుటయు దోష ♦ మనఁగ రాదు;
సీత యిప్పుడు రణభూమిఁ ♦ జేరె నుతి ప
హాత్తరమగు కష్టంబునం ♦ దమరిన దగు. ౨౬ 5027

క. కనుకనె యీబిడనుం జూ,చిన దోషములేదు మఱి వి♦శేషించియుఁ జెం
తను నే నుండఁగ దోషం, బనుమాటయె లేదు; సాధు♦సాధుప! కానన్. ౨౭

క. ఈనారిని గొనితెమ్మా, నానికటంబునకు వేగ ♦ నన్ను సుహృత్సం
తానయుతుఁ గాంచుఁ గా కనఁ,గా నృపతిల్లజునిమాటఁ ♦ గతినార్థంబున్.

క. విని కృచ్ఛ్రంబున నున్నది, యనుదానికి సంశయంబు ♦ నందుచు వినయం
బున సీతాదేవిని రా,మునిచెంతకుఁ దోడి తెచ్చె ♦ ముందరయు మదిన్. ౩౦

తే. అంత లక్ష్మణసుగ్రీవు ♦ లనిలజుండు
రామవాక్యంబునం దను♦రాగ మామె
పయిని లేకుండుటయుఁ దోఁచు♦టయును మిగుల
వగలఁ బొగిలిరి; మఱియు భూ♦వరున కాత్మ. ౩౧ 5031

క. తనదారయం దపేక్షయుఁ, గన నుంతయు లేమి మిగులఁ ♦ గఠినత్వమ్ముం
గనఁజేయు నింగితంబులఁ, గని యూహించిరి ప్రియంబు ♦ గలుగమి సతిపై.

చ. జనకజయున్ విభీషణుఁడు ♦ సన్నిధి రాఁగఁ బ్రపావకంబునం
దనవగునంగకంబుల ని♦తాంతము తాను ముడుంగుకొంచు భ
ర్తను గనఁబోయె సన్నిధికిఁ; ♦ దన్వియుఁ బ్రాణవిభున్ గనంగఁ బో
యి నికటమందుఁ జేరి జను ♦ లెల్లను జుట్టును నిల్చియుండుటన్. ౩౩ 5033

తే. సిగ్గుచే మోము గనకుండఁ ♦ జేసి యంబ
రమున నోయార్యపుత్ర! శ్రీ♦రఘుకులేంద్ర!

యనుచుఁ బలుకుచు విలపించె; ♦ నాత్మవిభుఁడె
వేలుపుగ నెన్నుచుండు నా ♦ వెలఁది యోచట. ౩౪ 5034

క. పెనిమిటిని జూచినంతనె, తనమోమునఁ దెల్వి పొలయఁ ♦ దమి నొందినసనా
థుని నెమ్మోమును గని యిటు, లనూనకష్టములనుండి ♦ యైనను మరలన్. ౩౫

క. కనుఁగొంటి నన్న విస్మయ,మునఁ జిరకాలముగఁ గనిన ♦ మోహనరూపుం
గనుచున్నదానఁ గద యను, ననూనహర్షంబు మనము ♦ నం దలరారన్. ౩౬

తే. సహజముగనున్న మైత్రిని ♦ స్వామిమోముఁ
గనియె; సంపూర్ణహిమకర ♦ కాంతలపన
మైన యాసీత యుదితచం ♦ ద్రాభవిభుము
ఖమును జిరకాలముగఁ దాను ♦ గనకయుండి ౩౭ 5037

క. తరుణమున నందుఁ గన్గొని, కర మనురాగంబు నొంది ♦ కడఁగి మనములో
నురుసంశయములఁ బాసెను, *బరమేశ్వరుఁ గాంచినట్టి ♦ భక్తుని పోల్కిన్.

నూటపదునేడవ సర్గము సంపూర్ణము.

---

౧౧౮ వ - సర్గము.

రామచంద్రుఁడు జానకిని బరుషోక్తు లాడుట.

చ. ధరణిపుఁ డంతఁ బార్శ్వమునఁ ♦ దద్దయు సిగ్గున వంగి నిల్చి యు
న్నరమణిఁ గాంచి నెమ్మనము ♦ నం గలకోపము ప్రజ్వరిల్లఁగాఁ
బరుషతరోక్తు లొప్ప నిటు ♦ పల్కె; మనోహరమంగళాంగి! నం
గరమున వైరిఁ జంపి యిదె ♦ కాంతను నిన్ను జయించినాఁడఁజూ!. ౧

ఉ. పౌరుష మూని యీపనులఁ ♦ బాగని చేసితి నంతె కాని నీ
గోరి యొనర్పలే దిటులు ♦ కోపఫలంబును బొందినాఁడ; నా
వైరి యొనర్చినట్టి యతి ♦ భారతిరస్కరణంబుఁ గూర్చి యే
నారసి దానికిం బ్రతిగ ♦ నాహవమును బొనరించి తీర్చితిన్. ౨ 5040

మ. అవమానమ్మును దానిఁ జేసిన రిపుల్ ♦ హర్షంబుతో దేవతా
నివహంబుల్ గన నొక్కనారి కతనన్ ♦ నిర్మూలముం జేసితిన్;

---

* ఈనాలవపాద మధికముగాఁ జేర్పఁబడినది. అర్థస్వారస్యమును బోషించు ననియే దీని హేతువు. ఈవాక్యముచేతఁ జిరకాలమునుండి భగవద్దర్శనము కాలేదే యని యువ్విళ్లూరుభక్తుఁడు భగవద్దర్శనముకాఁగా నెట్లు పరమానందము నొందునో యట్లే చిరకాలము కష్టములకుఁ బాలైనదయి దుర్వారగర్వమున విఱ్ఱవీఁగురావణుం జంపి నాథుఁడు నాకష్టములఁ దీర్చునా యని తలంచుచుఁ దహతహపడుచున్న సీత కృతకృత్యయైన ప్రాణనాయకుం గన్నులారఁ గాంచెను. అను భావ మిట ముఖ్యము గాన నిది యెక్కువగాఁ జేర్పఁబడినదని పెద్ద లూహించి నా యీచాపల్యమును మన్నింతురు గాక.

యువతీ! నాదగుపౌరుషంబు ధర నెం♦తో స్పష్ట మయ్యెన్ శ్రమం
బవలం బోయెఁ; బ్రతిజ్ఞఁ దీర్చితని స♦ల్లాటన్ *స్వతంత్రుండఁజూ!. ౪ 5041
ఉ. నే నట లేక యుండుతఱి ♦ నిన్నును జంచలచిత్తుఁడైన యా
దానవుఁ డేగుదెంచి వివి♦క్తంబగు కృత్రిమబుద్ధిఁ బూనుచుం
దా నిజపత్తనంబునకు ♦ దస్యువురీతిని గొంచుఁ బోయె ని
న్నానియె నాకు దైవగతి ♦ నొందినయీయవమాన మిత్తఱిన్. ౫ 5042
చ. పురుషుఁడు చేయఁగాఁ దగిన ♦ భూరితరంబగు యత్నయుక్తి నీ
సరణిని దీర్చుకొంటి; ధరఁ ♦ జానరొ! దోషమువచ్చియుండ నే
పురుషుఁడు తేజమున్ వెలయఁ ♦ బోవఁగఁ జేసికొనండొ దాని నా
పురుషున కల్పతేజునకుఁ ♦ బోలఁగ నేపురుషార్థ మయ్యెడిన్. ౬ 5043
మ. వనరాశిం దరియించి లంకను లస♦ద్బాహాబలం బొప్ప మ
ర్దనముం జేసి మరుత్సుతుం డితఁడు సం♦రంభించి శ్లాఘ్యంబులౌ
పను లేయేవి మహత్తరంబులు ఫలిం♦పంజేసెనో యవ్వి నా
కును బ్రాప్తించిన యీమహావమతినిం ♦ గుందించె నద్దానిచేన్. ౭ 5044
చ. ఫలమును గాంచె నాపనులు ♦ బాగుగ; సూర్యసుతుండు యుద్ధమం
దలఘుపరాక్రమంబు వెల♦యం గనఁ జేయుచు నాహితంబు ని
మ్ములఁ బరికించుచున్ భటస♦మూహముతోఁ దనపడ్డయా శ్రమం
బులు ఫలియించె నత్తఱిని; ♦ బుద్ధిగుణంబులు లేని యన్నరున్. ౮ 5045
చ. సరగున వీడి తా నె కడు♦సత్వర మొప్పఁగ నాదుచెంత క
త్తరుణమునందు వచ్చి తన♦దైన్యము చెప్పుచు నన్నుఁ గూడి భ
క్తిరతిని నొప్పునీఘనుఁ డ♦కృత్రిమమూర్తి విభీషణుండు దు
ర్భరముగఁ జేసి నట్టి శ్రమ♦పంక్తి ఫలించె నడంచె నావగన్. ౯ 5046
చ. అని యిటు రామభద్రుఁడు ని♦రాశను దీవ్రముగా వచింపఁగా
విని కటుభాషణంబులను ♦ బృథ్వితనూజ మృగీవిధంబునం
గనుయుగముల్ బ్రఫుల్లమయి ♦ క్రాలఁగ బాష్పము లట్టె నిండ నుం
డెను; జ్వలియించునగ్నిపయి ♦ నేయియుఁ బోయఁగ మండురీతిగన్. ౧౦
చ. అనుగతకోపుఁడైన మను♦జాధిపవర్యున కట్టు లేడ్చు సీ
తను గనినంతఁ గోపము ని♦తాంతము వృద్ధిని బొందె; నాగ్రహం
బునఁ గడు నొప్పి కన్బొమలు ♦ మోమునఁ బెన్మడిరీతి నొప్పఁ జెం
తను నిలుచున్న భూమిజను ♦ దాఁ గన నోర్వక చూడ్కిఁ ద్రిప్పుచున్. ౧౧
కవిరాజవిరాజితము:—
వనచరరాక్షస♦వారముమధ్యను♦భాగమునం దగు భూసుతతో
ననియె రఘూద్వహుఁ ♦ డారసి తీక్ష్ణము ♦ నౌ వచనావళి నోసుదతీ!

* ప్రభవా మిహా చాత్మనః-అనిమూ. ప్రభవామి స్వతంత్రో భవామి-అనివ్యాఖ్య.

తనకు లభించిన ♦ దారుణనిందను ♦ ధాత్రిని ద్రోయఁగఁ జూచెడునా
మనుజుఁడు చేయక ♦ మానని కృత్యము ♦ మైకొని చేసితి నేఁ గడిమిన్. ౧౩½

సీ. మునుపు దక్షిణదిక్కు ♦ దనుజులు బలయుతు లిల్వలవాతాపు ♦ లేపు మీఱ
నాక్రమించుటచేత ♦ నఖిలజంతువులకుఁ జరియింపరాకుండ ♦ నరణిఁ గాంచి
ధ్యానగరిష్ఠుఁడై ♦ తనరునగస్త్యుండు తనతపోబలమున ♦ దనుజవరుల
నడఁచి సాధించిన ♦ ట్లసురరాజును నేను నిను దొంగలించెనే ♦ యనెడు నాగ్ర
తే. హమున వధియించి సాధింప♦నయ్యె; శుభద
గాత్రి! నేనింతవఱకు ని♦క్కపుసఖులగు
వారివిక్రమమువలనఁ ♦ బ్రధనమందుఁ
జేసినట్టి శ్రమంబెల్ల ♦ క్షితి ఫలించె. ౧౪½ 5050

క. విను మది యంతయు నీకొఱ, కని చేయఁగఁ బడదటంచు ♦ నాత్మఁ దెలియ నీ;
ఘనకార్య మిద్ది యేటికొ, యనియెదవో తెలుపువాఁడ ♦ నాచారంబున్.
తే. కాచుకొనుటకు నెల్లెడఁ ♦ గలుగునట్టి
నిందను ఖ్యాతిఁ గాంచిన ♦ సుందరాన్వ
యమునకుం గల్గు నయ్యప♦ఖ్యాతిఁ దొలఁగఁ
ద్రోయుటకు నిట్లుచేసితి ♦ రోష మూని ౧౬ 5052

క. పరగృహవాసంబున నీ,చరితమునుగుఱించి నాకు ♦ సందియము మహా
త్తరముగఁ గల్గుట నాపరి,సరాగ్రమున నున్న నీవు ♦ చానరో! తలఁపన్.
తే. నేత్రరోగము గల్గువా♦నికిని దీప
మట్లు మిగులఁగఁ బ్రతికూల♦వై చెలఁగెదు;
వినుము కళ్యాణి! జనకనం♦దిని! కనుక నె
చను మనుజ్ఞ నొసంగితి ♦ సత్వరముగ. ౧౭½ 5054

*క. పదిదిక్కుల నిం దెచ్చట, మది నిల్వఁగఁ గోరునో న♦మ స్తవిధములన్
గదలుమ యచ్చటి కిచ్చఁగ, సుదతీ! పనిలేదు నాకు ♦ నింతయు నీతోన్. ౧౮

చ. నిరుపమవంశమందున జ♦నించి వరంబగు తేజమొప్ప నే
పురుషుఁడు చాలనాళ్లు పర♦పూరుషు నింట వసించియున్న యా
త్మరమణినిన్ మనంబున సి♦తాంతము మోహము చిందులాడఁగా
మరల గ్రహించు? నీవసుర♦నుంకనుసంకతలంబు నందునన్. ౧౯ 5056

తే. చాలకాలము నివసించి ♦ యోలి నిపుడె
జాఱి వచ్చితి కామదు♦ష్టునకు చూడ్కి
గలుగు నాతనిదృష్టిఁ ద♦గిలితి విట్టి
నిన్ను సద్వంశభవుఁడనౌ ♦ నే నదెట్లు. ౧౯½ 5057

* భద్రే కార్య మస్తి న మే త్వయా-అనిమూ.

క. పరికింపక గ్రహియింతును?, పరతస్వాంశప్రతిష్ఠ ♦ వాంఛించియె నీ
దరుణి! సాధించితి నుర్వరఁ బోయినకీర్తి నే మ♦రలఁ జేకొంటిన్. ౨౦౪

సీ. నీపయి నాసక్తి ♦ చూపట్ట దేమియు నాకు, నిచ్చటనుండి ♦ నీకుఁ దోఁచి
నట్టిచోటికిఁ బోవ ♦ నౌను; కళ్యాణిరో! బుద్ధిఁ జక్కఁగ నెంచి ♦ పోలు నిదని
పలికితినే గాని ♦ యలుకఁ జెప్పిన యది, గాదు సీతా! *నీసు♦ఖం బదెట్లొ
యట్లు లక్ష్మణునియం♦దైనను భరతునియందైన సంరక్ష♦ణార్థ మాత్మ

తే. మతిని నిలువుము వనచర♦మహాపతియగు
నట్టి సుగ్రీవునందైన ♦ నసురభర్త
యగు విభీషణునందైన ♦ నట్లె నీకు
సుఖముగాఁ దోఁచు నెట్లు లా♦చోట నిలువ. ౨౩ 5059

క. మన ముంపుము; జనకసుతా!, యనుపమరూపంబు గల్గి ♦ యాత్మకు హితమై
తనరెడు నీ వట దనుజేశునిగృహమున దిక్కు లేక ♦ సోలి వసింపన్. ౨౩౪

చ. కనుఁగొని యింతకాలముగఁ ♦ గాముపశాత్ముఁడు గాక సైఁచి యుం
డునె? యని దారుణోక్తులఁ గ♦డుం బలికెన్; బ్రియవాక్యముల్ వినం
గను దగియున్న సీత యిటు ♦ కాంతునినుండియె యప్రియోక్తులన్
విని మును పెన్నఁ డిట్లు పృథి♦వీపతి పల్కఁ డెఱుంగ కుండుటన్. ౨౮౪ 5061

క. కరిపతికరాభిహతమై, పరికంపము నొంది మిగులఁ ♦ బాలు స్రవింపం
బరమార్తినొందు నల్లకి, కరణిన్ వడఁకుచును బాష్ప♦కణముల విడిచెన్.

నూటపదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౯ - వ సర్గము.

సీత రాముని విశ్వాసముగల్గుట కగ్నిప్రవేశము చేయుట.

చ. మనమునఁ బొంగుకోపమున ♦ మండుచు గగ్గురుపాటు నొందఁగా
నొనరుచుచున్ గఠోరముగ ♦ నొప్పెడుమాటల నిట్లుపల్కఁగా
విని జనకాత్మజాత తన♦వేడుకలెల్ల నశింపఁ జింతలో
మునిఁగెను; బూర్వ మెన్నఁడును ♦ మోమున నివ్విధిఁ గోప ముబ్బఁగన్. ౧

క. తనపతి పల్కఁగ నంతయు, విని యెఱుఁగని యాలతాంగి ♦ విపులసభను వే
విని లజ్జావ్రీడితమై, తన మోమును మిగుల వంచెఁ ♦ దదవసరమునన్. ౨

సీ. జనకకుమారియుఁ ♦ దనయవయవములయందె ముడుంగుకొం ♦ చలుఁగులట్టి
పలుకులు మదిఁ జొరఁ♦బడ బాణవిద్ధయౌగతి బాధ సైఁపక ♦ కంటినీరు

---

* లక్ష్మణే భరతే వా త్వం కురు బుద్ధిం యథాసుఖమ్, సుగ్రీవే వానరేంద్రే వా రాక్షసేంద్రే, విభీషణే-అనియూ. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యనుస్మృతి ననుసరించి యీచెప్పినవారి యధీనమున నుండి బ్రదుకుమూ యని రామునిభావముగాని వేఱుగాదని వ్యాఖ్యాతలు వ్రాసిరి.

మిగులంగ విడిచెను; ♦ మేదినీపుత్త్రిక బాష్పపరిక్లిష్ట♦వక్త్ర మట్టి
కైc దుడుచుకొనుచుc♦గాంతుని గన్గొని గద్గదవాక్కులc ♦ గడువినయము

తే. నలర మెల్లcగc బల్కె;వీ♦రాగ్రగణ్య!,యిట్టిమాటలcబల్కెదే♦యివ్విశ్రోత్ర
దారుణంబులుగద?యెట్లు♦తగు వినంగc, బరుషతరములుగావినc♦బడెదుcజుమ్ము.

క. విను ప్రాకృతుండు ప్రాకృత,వనితను గని పల్కునట్టి♦భంగిc బలుకcగాc
జను నె? మహాబాహూ! నీ, మనమున నెటు తలcచెదవొకొ?♦మానిని నన్నున్.

ఆ. అట్టిదానను గాను నా♦డైన సాధు
చరితముపయిని నీకుc గా ♦ శపథ మేను
జేయుచున్నాను నమ్ముమా! ♦ చిత్తమందు;
*జగతిc గొందఱు వనితలు ♦ పొగరుపట్టి. ౬ 5067

క. ఒనరించు దురాచారముc, గని వనితాజాతియెల్లc ♦ గన నట్టిదె యా
నని శంకించుచు నున్నా, వనఘా! నాశీలమును మ♦హామతి మిగులన్. ౬౧

క. పరికించి తెలియుదువయేc, గర మీసంశయముc బాయc♦గాc దగు; నాథా!
సురవైరితనుస్పర్శము, జరగుట దోషంబు గానc ♦ జయ్యన విడుతున్. ౭

చ. అనదవొ యెమొ; యాశరణ♦నుందును నే వివశాత్మ నాట నా
దనుజుని దేహ మొక్కగతిc ♦ దాcకుట గల్గెను నిచ్చతోడc జే
సినయపరాధ మాన యది? ♦ చేకురcగల్గెనె తప్పు దాన? దై
వనియతిc గల్గె దోష మది ♦ వచ్చునె నాపయి కెట్లు చూచినన్. ౮ 5070

తే. ఇతరులకుc జిక్కనట్టి గ్ర♦హింప నలవి
గాని యట్టి మదాత్మ స్వా♦ధీనమయియె
యుండు నత్తఱి నీయందె ♦ యుండె నద్ది
యవయవంబులు నితరుల ♦ కగు గ్రహింప. ౮౧ 5071

క. వానిన్ వదలించుకొనం, గానైతి స్వతంత్త్రురాలc ♦ గాన నతనినే
మేని యొనరింపc గలనే;, మానద మన మిరువురము న♦మాన ప్రీతిన్. ౯

సీ. చాలరీతుల వృద్ధిc♦గ్రాలెడువాంఛలc గలసియుంటిమి బహు♦కాల మెలమి
నిట్టి నాశీలము ♦ గట్టిగాc దెలిసియేయుండు నట్టులె లేక♦యుండు నేని
నీకమీcదc దెలియంగ ♦ నెల్లగుc? గావునc గలకాల మేను ని♦మ్ముల హతనయి
తిని; వీరవర! నన్నుc ♦ గనుcగొన వీరుcడౌ హనుమ నంపితి గాదె♦యట్టితఱి నె

తే. నేను లంకనె యుండంగ ♦ నీవదేల?
విడువవైతివి నను; నల్లు ♦ విడిచియున్న
వార్త నే విన్నవెంటనే ♦ వాయుతనయు
నెదుటనే మానియుందునే ♦ యీయసువుల. ౧౨ 5073

* పృథక్ స్త్రీణాం ప్రచారేణ జాతిం తాం పరిశంకసే, పరిత్యజే మాం శంకాం తు యది
తేఽహం పరీక్షితా-అనఘా.

క. చిరకాల మిట్టివ్యర్థ దు,స్తరరీతిని బొందకుండు♦దానఁగదా యి
క్కరణి నొనరించి యుండినఁ, బరమప్రాణముల నిట్లు ♦ బహుసంశయముల్.
తే. పీడ నొందింప నిట్టు లీ♦భీతిదమగు
నంగరముచేసి నిష్ఫల♦స్ఫారయత్న
మిట్టు లొనరింప నవసర♦మే కలుగదు
గాదె; మిత్రులకును నిట్లు ♦ కష్టపడఁగ. ౧౩ 5075
[1]క. అనవసరము గాదే? యో,మనుజోత్తమ! యల్పుఁడైన ♦ మనుజునివలె నీ
వును గోపమె యూని మనం,బున నాస్త్రీత్వంబె చక్క ♦ ముందిడుకొనుచున్.
క. పలికితివిగాని శీలము, దలఁచి పరీక్షింపవైతి; ♦ ధర్మాచారం
బుల నెఱుఁగువాఁడ వౌదువు, లలితగుణా! జనకభూత♦లప్రభుమణికిన్. ౧౪
క. తనయ నను వ్యాజ మొకటియె, గననగు సత్యమున కేను ♦ త్మాసుతను జుమా!
జననము దీనిని బరికిం,చిన నావృత్తమును గూడఁ ♦ జేర్పవుగ మదిన్?. ౧౫
[2]క. చిన్నతనంబున నుండియు, నన్నును జిన్నతనమందె ♦ నాఁడు హుతవహుం
డెన్నఁగ సాక్షిగఁ గరపీడ నీవొనరించితివి క♦డంగినప్రేమన్. ౧౫½ 5079
ఆ. అద్దియును బ్రమాణ ♦ మాట కనర్హమె, పోనె; నాదుభక్తి ♦ పూతశీల
మవియుఁద్రోయఁబడియె♦నార్య! నీచేతన,వెనుక కేమి యనుచు ♦ ననుదునిన్ను.
చ. అని పతితోడ నాడుచు మ♦హారవమొప్పఁగ నేడ్చుచుం దనం
తన వెలికేగు బాష్పములఁ ♦ దద్దయు గద్గదకంఠయౌచు ని
ట్లనియెను దీనుఁడై మఱియు ♦ ధ్యానపరుండయి చింతనొందు రా
మునిసహజన్ములక్ష్మణుని♦మో మఱ నెత్తుచుఁ జూచి దీనయై. ౧౬ 5081
క. అనఘా! లక్ష్మణ! నాకుఁ జి,తిని బేర్పుమ యదియె నాము♦దిం దగువగకుం
గనఁదగిన మందు వేఱొం, డన రా దర్హమని దాని♦యం దేఁ జొత్తున్. ౧౬½
తే. చొచ్చి ప్రాణమ్ములను వెలిఁ ♦ బుచ్చుదాన
పట్టి యపవాదమున నేను ♦ గొట్టువడుచు
బ్రదుక నొల్ల; నాసద్గుణ♦వారమునకుఁ
బ్రమద మొందక గొప్పన♦భాస్థలమున. ౧౭ 5083
క. ననుఁ బ్రాణేశుండు త్యజిం,చినయప్పు డతనికిఁ బ్రీతి ♦ చేకురఁ జేయం
గను భవ్యమైనగతి యీ,యనలుం జొచ్చుటయె గాన ♦ న ట్లొనరింతున్.
చ. అని జనకాత్మజాత విన♦యంబునఁ బల్కఁగ శత్రుసూదనుం
డనఘుఁడు నా సుమిత్రతన♦యాగ్రణి దైన్యము తన్నుఁ గ్రమ్మ రా

---

1 లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతమ్-అనిమా. 2 న ప్రమాణీకృతః పాణి ర్బాల్యే బాలేన పీడితః-అనిమా. చిన్ననాటనే ననుఁ బాలుఁడవగు నీవు పెండ్లాడితివే. ఎట్లిపు డనుమానపడెదవు? చిరకాలము జరిగిన పిదప వివాహమాడిన ననుమానింప నవకాశమూ కలుగవచ్చు. అది లేదే యని సీతభావము.

మునివదనంబుఁ గాంచె; బల♦మును బృథువీర్యము గల్గు లక్ష్మణుం
డు నృపతిమోమునంజ్ఞలఁ గ♦డున్ మది నారసి దానిమీఁదటన్. ౨౦ 5085

ఆ. అతని కద్ది యిష్ట ♦ మని యెఱుంగుచు రాము
ననుమతిని బొనర్చె ♦ నచటఁ జితిని;
నంతరాముఁ డద్ది ♦ యర్హము గాదని
వక్త్రపంకజమును ♦ వంచియుండ. ౨౧ 5086

క. జనకజయు రాముననుభవమున మెల్లఁగ జుట్టుఁదిరిగి ♦ మ్రొక్కి వెలుఁగుచుం
డినయగ్నిహోత్రుచెంతకుఁ, జనుదెంచెను దనదుశీల♦సత్యము లలరన్. ౨౨

[1]చ. సురలకు బ్రాహ్మణావళికి ♦ క్షోణితనూజ నమస్కరించి వే
కరయుగ మొగ్గి యిట్లనియెఁ ♦ గ్రాలెడుభక్తిని నగ్నిచెంత; భూ
వరతిలకంబునుండి యొక♦భంగిగ నైనను నామనం బదే
పురుషునియందుఁ గాని తల♦పోయఁ జలింపక యుండెనేనియున్. ౨౩౹ 5088

ఆ. లోకసాక్షియైన ♦ యీకృశానుఁడు నన్నుఁ, గాచుఁ గాక యెల్ల♦కడల; నేను
బూతమైన శీల♦మునఁ బొల్చుదాననైన, రఘూత్తముండు ♦ న్యాయ మెడలి

క. నను దుష్టబుద్ధిగా నాత్మను దలఁచిన లోకసాక్షి ♦ దహనుఁడు రక్షిం
చునుగాక యెల్లవిధముల;, మనమున వాక్కర్మముల స♦మస్తవిధములన్. ౨౪౹

క. ఘనధర్మకదంబమ్ముల, యనూనపద్ధతుల నేర్చి ♦ యలరెడు శ్రీరా
ముని మాని ప్రవర్తింపక, యనుదిన ముండుదునయేని ♦ యనలుఁడు నన్నున్.

క. పరికించి సర్వవిధముల, నిరతముఁ గాపాడుఁగాక; ♦ నిర్మలదీప్త్యు
త్కరుఁడైన రవియుఁ జంద్రుఁడు, మరుదధినాథుండు దిశలు ♦ త్ర్యాదేవతయున్.

సీ. పగలునురాత్రియుఁ♦బ్రాక్సంధ్యయునునుతిియపరసంధ్యయునన్ను♦నమలచరితఁ
గా నెఱింగినమాట ♦ కను సత్యమేయైనఁ గృష్ణవర్త్మయును ర♦క్షించుఁగాక
సర్వవిధంబుల ♦ సతతం బటంచును; బలికి యాజానకి ♦ పావకునకు
వలగొని మదిఁ దన♦వపువుపై నాసక్తి యింతయు లేనిదై ♦ యెంతొ భీతి

తే. పుట్టునట్లుగ మండుచుఁ ♦ బొలుచునగ్ని
యందుఁ జొచ్చెను; నటనున్న ♦ యఖిలజనులు
బాలవృద్ధులునుంగూడ ♦ భయము మిగుల
నగ్నిఁ జొచ్చెడునాసీత ♦ నార్తిఁ గనిరి. ౨౮౹ 5093

[2]చ. లలితవితప్తకాంచనక♦లాపవిభూషితయై నవీనయై
సులలితమై చెలంగి రుచి ♦ శోభిలు బంగరుచాయ నొప్పని

---

1 సత్యపూతయగు సీత యిటఁ జేసినప్రతిజ్ఞ యామె ధైర్యమును దెలియఁజేయునని తెలియఁ దగిన ముఖ్యవిషయ మిట నిదియే. 2 సా తప్తనవహేమాభా తప్తకాంచనభూషణా, పపాత జ్వలనం దీప్తం సర్వలోకస్య సన్నిధౌ-అనియూ.

స్తులతనువల్లితో నపుడు ♦ చూచుచునుండ సమస్తలోకముల్
జ్వలనునిదీప్తమూర్తి నట ♦ జానకి చొచ్చెను రాము నెంచుచున్. ౩౦౻
చ. అనలునియందుఁ జొచ్చెడును♦హీపతిభక్తిపరాయణన్ ధరా
తనయను మూఁడులోకములు ♦ దారుణశోకము నొంది కాంచెఁ; జ
క్కనివిమలాజ్యహవ్యమును ♦ గ్రన్నన వేల్చెడునట్టిరీతి నా
జనకజ యగ్నిలోఁబడియె; ♦ జన్నమునం దొగి మంత్రపూతమై. ౩౧౻ 5095
తే. అనిశమును వేల్వఁబడునట్టి ♦ యాజ్యధార
చందమున హవ్యవాహను♦నందు సీత
పడఁగ స్త్రీలందఱుం గని ♦ పరమశోక
ముల విలాపముచేసిరి ♦ కలఁగుమదుల. ౩౨౻ 5096
సీ. *స్వర్గమందున్న ని♦ర్జరులు భూమిందగు గంధర్వులు ఫణిజ♦గమునఁ బొలుచు
దానవులును స్వర్గ♦తలముననుండి శాపమునొంది నరకకూ♦పమునఁ బడెడు
దేవతనుంబోలెఁ ♦ బావకునందును బడుచున్న యాభూమి♦పట్టిఁ గనిరి;
జనకజ యగ్నిహో♦త్రునియందుఁ బడునప్డు వనచరరాక్షసుల్ ♦ వనటఁ దూలి
తే. యద్భుతము గానఁబడునట్టు ♦ లతిరవంబు
చెలఁగ హాహాకృతుల్ గడుఁ ♦ జేసి రిట్లు
సకలరాక్షసదానవ♦సత్తములును
దుఃఖపూరితచిత్తులై ♦ తొంచి రంత. ౩౮౻ 5097

నూటపందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౦ - వ సర్గము.

బ్రహ్మాదులు విమానారూఢులై రామునికేరి స్తుతియించుట.

చ. జను లపుడాడుపల్కులను ♦ క్ష్మాపతిచంద్రుఁడు ధర్మచిత్తుఁడై
వినుచు మనంబు దుఃఖమున ♦ వేఁగఁగ బాష్పసమాకులాక్షుఁడై
మనమునఁ జింత చేయుచును ♦ మ్రాన్పడియుండెను గొంతసేపు; య
క్షనికరనాయకుం డగుచుఁ ♦ గ్రాలుకుబేరుఁడు పూన్కిమీఱఁగన్. ౧౻
క. అరికర్శనుఁ డాయముఁడును, సురపతియు సహస్రనేత్ర♦శోభితుఁడగు నా
పురుహూతుండును రిపుభీకరుఁడగు వరుణుఁడు త్రినేత్ర♦కలితుండగుచున్.
క. సిరివెలయ వృషభకేతనుఁ, డురుబలుఁడును నైన శివుఁడు ♦ నాగిలోకతతిన్
నిరుపమశక్తి సృజించుచుఁ, బరఁగుమహాజ్ఞానినివహ♦వరుఁడగు నజుఁడున్.
తే. వీరలందఱు భాస్కరు♦విధమునఁ దగు
వ్యోమయానంబు లెక్కి యు♦ద్దామభంగి

---

* దదృశు స్తాం త్రయో లోకా దేవగంధర్వదానవాః-అనిమూ. దేవా స్స్వర్గవాసినః గంధర్వాః భూలోకవాసినః దానవాః పాతాళవాసినః-అనివ్యాఖ్య.

దనుజపురిఁ జేరి రామభూ♦ధవునికడకు
వచ్చి; రంతటఁ దముఁ గాంచి ♦ భక్తియులర. ౪ 5101

క. కరయుగము దోసిలించుచు, ధరణిఁ గిలుచున్న రామ♦ధరణీశుని నా
దరమునఁ గనుచున్ హస్తా,భరణాళిఁ జెలంగుదీర్ఘ♦బాహువు లెలమిన్. ౫

ఆ. పయికి నెత్తి యిట్లు ♦ పలికిరి; [1]శ్రీరామ,భద్ర! నీవు లోక♦వారములకుఁ
గర్తవుత్తముఁడవు ♦ కడుజ్ఞానవిద్వరిష్ఠుఁడవు సీత యగ్నిఁ ♦ బడుచునుండ.

క. ఊరకె యున్నాఁడవు కృప, నీరమణిని గావవలదె ♦ యీవే గాదే
నీరజభవముఖనిర్జర, వారమునఁ శ్రేష్ఠుఁడవయి ♦ వఱలుట రామా!. ౬

ఆ. ఇద్ది నీకె తెలియ ♦ కెట్లుపోయెనో? యష్ట,వసువులందు నీవు ♦ బ్రహ్మవగుచు
నలరుచున్నయట్టి ♦ యాఋతుధాముఁడవు, వసువుగాఁగ నున్న♦వాఁడ వార్య!.

సీ. త్రిజగంబులకును నా♦దిని కర్త వీవెకా? నీయంతవాఁడవు ♦ నీవె కావె?
యష్టరుద్రులలో మ♦హాదేవనామంబు గలయష్టముఁడవు సా♦ధ్యులను దలఁప
నైదవవాఁడయి ♦ యుబరేడు నావీర్యవంతుఁడ వగుదువు; ♦ వైరిహరణ!
యశ్వులు కర్ణంబు ♦ లగుదురు నీకు సూర్యాబ్జులు నేత్రంబు ♦ లఖిలలోక

తే. ములను సృజియించుటకు ముందుఁ ♦ బ్రళయమందు
జనిమృతులు లేక నీవెగాఁ ♦ గనఁబడుదువు
సర్వవిదుఁడవు నయియుండి ♦ నుర్వి నేమి
తెలియనట్టిమనుష్యుని♦వలె నిపు డిట. ౯౪ 5106

క. జనకజ యగ్నిం బడఁగాఁ, గనుచును పేక్షింప నేల? ♦ కలదే యీలా
టినియతి యంచని బ్రహ్మా,దినిఖిలలోకేశు లడుగఁ ♦ దేఁకువ మీఱన్. ౧౦

తే. ధర్మభృద్వరుఁడై తగి ♦ ధాత్రిపతియు
నైన యారాఘవుఁడు త్రిద♦శావతంస
ములను గన్గొని యిట్లని ♦ పలికె నేను;
[2]దశరథాత్మజుఁడననియు ♦ ధాత్రియందు. ౧౦౪ 5108

సీ. మనుజుండ ననియు న♦న్నును నేను నీరీతిఁ దలపోయుచున్నాఁడ ♦ ధన్యులార
యెవ్వఁడనో? నే న♦దెవ్వరివాఁడనో! యెందుల కిచటికి ♦ నేను వచ్చి
యున్నాఁడనో? యంత♦యును వివరంబుగా భగవంతుఁడైన యా♦బ్రహ్మచెప్పు
వలయునంచుఁ గకుత్స్థ♦కులమునఁ బుట్టిన యారాముఁడడుగ బ్ర♦హ్మాదులందు

తే. నుత్తముండగు బ్రహ్మయు ♦ నత్తఱి రఘు
వరుని గన్గొని పల్కెఁ; భూ♦వరవతంస!

---

1 ఇచ్చట విశేషార్థములు పద్యములయం దిమిడియున్నవని గ్రహింపవలయు. 2 ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్, యోఽహం యస్య యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే- అనియు. దీనివిశేషార్థ మీపద్యమునఁ గలదు.

సత్యవిక్రమ! వినవయ్య! ♦ సత్యమేను
బలుకువాఁడను వినుతులు ♦ గలుగవిందు. ౧౨౪ 5109

సీసమాలిక:—

*నారంబు లీ వయ♦నంబుగాఁ గల్గి నారాయణుండను ఖ్యాతి♦నంది, లబ్ధ
సకలకాముండవై ♦ ప్రకటకేళీప్రవృత్తుఁడవు గావున జగ♦త్తును సృజించు
టాదియౌ వృత్తుల ♦ నాటఁగాఁ జేయుచు నిత్యలక్ష్మీయుక్తి ♦ నెఱి తగంగఁ
జక్రాయుధుండవై ♦ సర్వత్రవ్యాపించువాఁడవై సంద్ర మ♦హాళ్యరీతిఁ
బ్రళయంబునం బొంగి♦వచ్చుచుండఁగ భూమి నుద్ధరింపంబూని♦యొక్కకొమ్ము
గలవరాహంబవై ♦ ఖలులయి భూతభవ్యులగు వైరుల నెల్ల ♦ గెలుచువాఁడ;
వోరాఘవా! మహా♦కారుణ్యవారాశి! నీవక్షరుండవు, ♦ నీవె బ్రహ్మ
వగుదు, విపర్యాస ♦ మందనివాఁడవు తొలుతను నడుమను ♦ దుదను నీవు
వర్తించునట్టి శా♦శ్వతుఁడవు, సర్వలోకముల శ్రేయస్సుల ♦ నమలధర్మ
రూపమునఁ నీవె ♦ యోపరమేశ్వరా! సాధించువాఁడవు, ♦ సర్వవిభుఁడ,
వరయ నాలుగుపురు♦షార్థంబులను నాల్గుభుజములుగాఁ దగ ♦ బొల్చి శత్రు
వులఁ ద్రుంచువాఁడవు, ♦ లలితకాలస్వరూపమయిన శార్ఙ్గచా♦పమును దాల్చు
వాఁడవు, నీవు స♦ర్వములగునింద్రియములకీశుఁడవు, హృత్క♦మలశయనుఁడ,
వక్షరక్షరముల ♦ కరయ నుత్తముఁడవు, గుణవిభవంబుల ♦ నణువుమాత్ర
మైన జయింపరా♦నట్టివాఁడవు, నందకాఖ్యఖడ్గవరంబు ♦ హస్తమందుఁ
దాల్చువాఁడవు, నెల్ల♦తావుల నుందువు, భూభారమును దీర్చు♦ ప్రోడ వీవు,
దుష్టుల సమయించి ♦ శిష్టులఁ బ్రోచుచు ధారణశక్తిచేఁ ♦ దనరుదీవు,
దేవసేనాళిప♦తివి, దివ్యజనపదాదులను బాలింతువు, ♦ జ్జ్వలతరైక
బుద్ధివి, సత్యరూ♦పుండవు, క్షమవును, దమమువు, జగముల♦తతికిఁ బుట్టు
తావవు, విలయసం♦స్థానమవగుదువు, వజ్రసోదరుఁడవై ♦ వఱలుదీవు
మధువను దనుజుని ♦ మథియించి శ్రుతులను గాపాడినట్టి వి♦క్రముఁడ వీవు,
శత్రునికృత్యముల్ ♦ సరగఁ జేయుదు వీవు, నిరతిశయవిభూతి ♦ నెగడువాఁడ,
వీనాకు జనకుఁడ♦వేయగుపద్మనాభుండవు, సంగరం♦బున రిపుతతి
నంత మొందఁగఁ జేయు ♦ నట్టివాఁడవు, శరణార్థకృపాదుల ♦ కాకరుఁడవు,
రక్షణోపాయమై ♦ రంజిల్లువాఁడవే యని దివ్యులైన మ♦హాము లాగిఁ
బలుకుచుందురు; వేయి♦పరమశాఖారూపశృంగముల్ గలిగి యొ♦న్నెనివిధుల
బోధించు జిహ్వలు ♦ పూర్ణంబులై యుండఁ గర్మపద్ధతుల నీ♦కరణిఁ గనఁగ
నెంచు మహర్షభ♦మే యగు వేదంబ వగుదువు, లోకత్ర♦యంబునకును

* భవా న్నారాయణో దేవః......ఇత్యాదిశ్లోకములకు వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థసార
మిందు సమగ్రముగాఁ జేర్పఁబడినదనియు నాసొంతము లేదనియు గ్రహింపందగు.

నాదికర్తవును, స్వ♦యంప్రభువును నగుదీవు, ముక్తులకును ♦ నెల్ల నిత్యు
లకు నాశ్రయుండవు,♦సకలంబునకుఁ బూర్వజుండవై మహిమచే♦సొంపుగనుచు
నుందువు; యజ్ఞమ♦నందగ నీవె; వషట్కారమన నీవె ♦ సంతతంబు
నోంకారమన నీవె ♦ యొగి వేదవేదవిద్వరులు నీజననంబు♦మరణము నెఱుఁ
గరు, మఱి నీవనఁ♦గా నెవ్వఁడో యని తెలియరు; నిన్ను యో♦గులు సమస్త
భూతంబులందును ♦ బోలవిశేషించి భూసురులందు గో♦వులకదంబ
మందును దెసలను ♦ నంబరంబునఁ గొండలందు వనంబుల♦యందుఁ గాంతు;
రరయఁగా నీవు స♦హస్రపాదుండవు, శ్రీభూపుఁడవు, శత♦శీర్షుఁడవగు
దీవనంగ సహస్ర♦దృగ్వరాజితుఁడవు, పర్వతయుక్తమై ♦ పరఁగు వసుధ
నితరమహాభూత♦వితతిని ధరియించుచున్నావు రాఘవా! ♦ యుగ్రమైన
దివసప్రళయమున ♦ భువి నాశ మొందంగ సంకర్షణుఁడవయి ♦ జలములందు
సురలు, గంధర్వ ల♦సురులును నివసించు స్వర్మర్త్యముల బలి♦సద్మకమును
గుక్షిని ధరియించి ♦ కోరి మార్కండేయమునిముఖ్యులకు నెప్డు♦కనఁబడుదువు
వక్షస్స్థలము నేను ♦ వసుమతీశ్వర! నీకు జిహ్వ, సరస్వతి ♦ చెలఁగు సురలు
పరమాత్మవైన నీ♦భవ్యరూపంబునయందు రోమములయి♦యుందు రెపుడు;
కనుఱెప్ప మాయుట♦యనఁబడు రాత్రి నేత్రములనుదెఱచుట♦యమరుఁబగలు
నీయూర్పులే వేద♦నికరముల్ పలుమాట లేల? నీవే లేని ♦ దేమి లేదు;
జగమెల్ల నీతను♦వుగ నుండు వసుధాతలము స్థైర్యమును నీదె ♦ యమరవంద్య!
యగ్నితాపమె కోప♦మగును జంద్రప్రసాదమె రామ! నీప్రసా♦దమగు మఱియు
శ్రీవత్సమే నీకుఁ ♦ జెందిన గుఱుతగు; మూఁడడుగులచేత ♦ ముజ్జగముల
నీవు త్రివిక్రము♦పావనమూర్తివై కొలిచి చేకొంటివి ♦ బలియధీన
మునను౦డి; మఱియు నా♦తనిని బంధించి దేవేంద్రునిలోకత్ర♦యేశ్వరునిగ
నొనరించితివి; మఱి ♦ *యుర్వీతనూజ యీసీత లక్ష్మియె యగు ♦ శ్రీవిభుఁడవు
నీవె, దేవుఁడవును, ♦ భావికాలంబున జనియించు కృష్ణుండ♦వును బ్రజాధి
పతియును నగుదువు ♦ పాపాత్ముఁడౌ రావణాసురువధియించు ♦ నాసఁ బూని
మనుజదేహంబుఁజొ♦చ్చినవాఁడవిందునో ధర్మభృద్వర! రామ!♦దయను మాకు
నయి యిది నీపూని♦నట్టి యీపని కృతంబయ్యె రావణుఁ డంత ♦ మందె నింక
సంతుష్టుఁడవయి నీ♦స్వస్థలమున కుద్గమింపుము రామ! య♦మేయబలము

తే. నీకుఁ దగు, నీదువిక్రమ ♦ మాకరణి న
మోఘ మగు నీపరాక్రమ♦మును నమోఘ

---

* సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః-అనిమూ. కృష్ణః భవిష్య త్కృష్ణావతారశ్చ త్వ మేవేత్యర్థః-అనివ్యాఖ్య.

మిట్టి నీదర్శనము వ్యర్థ ♦ మెట్టు లగును
నిను నుతించుట సార్థక♦మునఁగఁ దగును. ౩౦ 5110

క. గురుఫలవంతము లే యుగుఁ, బరికింపఁగ నీపదాబ్జ♦భక్తులగు మహా
పురుషులు సత్ఫలముల న,త్వరముగ నొందుదురు భూప♦వర! గుణధామా!.

క. పురుషోత్తమునిఁ బురాణుని, నిరుపమతేజస్సును గ్రు ♦ నిను నిశ్చలమై
పరఁగెడు భక్తిఁ దలంచిన, స్థిరభోగము లిందు నందుఁ ♦ జెందుదురు గదా.

క. శ్రుతిసిద్ధమై పురాతన, మితిహాసాత్మకమునైన ♦ దిది గావున నీ
నుతిఁ దలఁతు రెవరు వారలు, క్షితిఁ బుట్టనిపదమునందుఁ ♦ జేరుదు రధిపా.

నూటయిరువదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౧ - వ సర్గము.

{ అగ్నిపురుషుఁడు సీతను దెచ్చి రామునకు సమర్పింప సంతోషమున రాముఁడు పరిగ్రహించుట. }

చ. అని యిటు బ్రహ్మ యారఘువ♦రాన్వయమాళినిఁ గాంచి పల్కుచ
క్కనిశుభవాక్యముల్ వినుచు ♦ నాజ్వలనుండు విదేహరాజక
న్యను దనయంకభాగమున ♦ నాదృతిమై నిడుకొంచు లేచి వ
చ్చెను జితినుండి; యాచితిని ♦ జెచ్చెఱ నట్టిటు ద్రోయుచుల్ దమిన్ ౧

చ. మనుజశరీర మొప్ప సతి ♦ ద్యూతనయల్ జనకాత్మజాత సీ
తను గ్రహియించి వేగ కపి♦తల్లజు లచ్చెరు వంద నుద్గమిం
చెను; దరుణార్కచందమునఁ ♦ జెల్వు వహించుచుఁ జారుతప్తకాం
చనమయభూషణావళులఁ ♦ జక్కఁగఁ దాల్చి మహారుణాంబరం
బును ధరియించి వంకరగఁ ♦ బొల్చెడునీలశిరోజముల్ తగన్. ౩ 5115

క. ధరియించినమాల్యము లా,భరణంబులు వాడి వేఱు♦భంగిం గాకే
సురుచిం గాంచుచు ముందటి,కరణిం దగ నిమ్మళంక♦గ్రుహ్యాదయమై. ౪

క. తనరెడుజానకి నొడి నిడు,కొని హవ్యవహుండు గాజ♦కుంజరున కొసం
గెను; లోకసాక్షియగునా, ధనంజయుం డిట్లు పల్కె ♦ ధరణీశునితోన్. ౫

*చ. మును ననుఁ జొచ్చియున్న నృప♦ముఖ్యకుమారిక నీకళత్ర, మీ
వనిత యిదో కనుంగొనఁగఁ ♦ బాపము సుంతయు లేనిదాఁ జుమీ!
కనుక గ్రహింపుమీ జనక♦కన్యకయం దఘు మించుకేని లే
దనుచు నెఱింగియుల్ గొఱఁత ♦ యారయ శీలము నొందకుంటకై. ౬

సీ. నాయందుఁ జొచ్చుచం♦దము నొనరించితి వెంతయాచారర♦తాంతరంగుఁ
డవు సీత యీమె వా♦గవయువంబునఁ గాని మనసుచే సంకల్ప♦మునను నేత్ర

---

* ఏషా తే రామ వైదేహీ పాప మస్యా నవిద్యతే- అనియూ దీని వాస్తవార్థ మిట సువ్యక్తమని గ్రహింపందగు.

మున నిన్ను మాని యొం♦డునరునియందు వర్తించిన యదిగాదు ♦ దివ్యశీల
యగుఁ జుమీ; సమ్మతి♦నందక యతఁడెట్లు కొనిపోయెనందువా? ♦వనమునందు

ఆ. నీవు లేనితఱిని ♦ నీవనితామణి, దీనయగుచు వివశ♦యై నితాంత
భయమునొందియుండఁ♦బాపిరావణుఁడాత్మ,విక్రమమునమిగులు♦వెడఁగుగాన.

క. జనశూన్యవనమునుండియె, కొనిపోయెన్ బలిమి; నిట్లు ♦ కొని చని సౌధం
బునఁ బదిలముగా నునిచి స్వ,దనుజాంగనలన్ వికార♦దారుణతనులన్. ౭

తే. చుట్టు కావలియుంచి య♦ట్టిట్టు బాధ
పఱచినను నీమె నీయందె ♦ భావముంచి
త్వత్పరాయణయై యుండె; ♦ దానవుఁ డతఁ
డెంత యాశను గొలిపిన♦నటు లనినను. ౮ 5121

క. నిను ధ్యానించుచునుండెను, గన దేపాపంబు నిట్టి ♦ క్రమము శుద్ధం
బునునైన భావముంగల, వనితామణినిన్ గ్రహింపు♦బదులనకు మిఁకన్. ౯

క. నే నీకాజ్ఞాపించెద;, నానరపతి మాటనేర్పు ♦ నయధర్మములన్
జానుగ నెఱిఁగినవాఁడగుఁ, గాన ధనంజయుఁడు చెప్పు ♦ గాదిలిపలుకుల్. ౧౦

చ. విని తనకాంత సాధ్వియని ♦ వేల్పులముందటఁ బల్కుయుంట కా
త్మను ముదమొంది యట్టివని♦తామణి నిట్లు కలంచితింగదా
యని వెత బాష్పవారినిభృ♦తాయతలోచనుఁ డౌచు నూరకే
జనకజ వీడినాఁడ నని ♦ చాలఁ దపించె ముహూర్త మాత్రలోన్. ౧౧

ఆ. అగ్ని యిట్లు పలుక ♦ నమితతేజుఁడు గాంతి
యుతుఁడు దృఢపరాక్ర♦మోగ్రుఁడగుచుఁ
బరమధార్మికుఁడయి ♦ భాసిలు రాముఁ డి
ట్లనియె; నమరవర్య ♦ నతనిఁగాంచి. ౧౨ 5125

చ. జనకజ ముజ్జగంబులను ♦ జక్కవచింపఁగ నర్హయౌ నుతిం
గనఁదగు దోషశూన్య యనఁ ♦ గాదననేల నిజంబె యైన యీ
వనిత శుభాత్మురా లసుర♦వర్యునియంతిపురంబునందు నుం
డినయదిగా చిరంబు ధర♦నిందయుఁ గల్గఁగవచ్చుఁ గావునన్. ౧౩ 5126

తే. నేను సీతఁ బరీక్షింపఁ ♦ బూనకయె ప
రిగ్రహముచేసి యుండిన♦రీతిఁ గాంచి
జనులు దశరథుకొడుకు కా♦మనిరతుండు
బాలిశుండును నగునని ♦ పలుకఁ గలరు. ౧౪ 5127

చ. జనకతనూజకుం బలుకఁ♦జాలు నెవండిటు లుండఁజెల్లు నం
చనవరతంబు నాపయినె ♦ యాత్మ చెలంగఁగ నానునంబురీ
తిని జరియించుచున్ జనను♦తిం గనునంతటి భక్తురాలెయై
తనరు నటం చెఱుంగుదును ♦ దథ్యముగా సుగుణైకభూషణా!. ౧౫ 5128

తే. సత్యసంశ్రయుఁడను గాన ♦ జగములందు
మూఁట విశ్వాసము చెలంగ ♦ ముగ్ధ యగ్ని
బడుచునుండ నుపేక్షను ♦ స్వాంతమందుఁ
జెందినాఁడను నాయతా♦క్షియగు సీత. ౧౬ 5129

క. తన తేజంబున రక్షణ,మును గనుచుండునది యిట్టి♦ముగ్ధను మీఱం
గను జాలునె యాదనుజుఁడు, వననిధికిన్ వేల దాఁట ♦ వశమే యెవుడున్.

క. ధరణీసుత నించుకయు న,మరవైరికిఁ జెనకరామి ♦ మహితగుణాధి నీ
తరుణిని మనమునయందును, బరికించి యతండు పరిభ♦వముఁ గనఁజేయన్.

తే. ఇంచుకంతయుఁ జాలఁ డ♦హీనములగు
జ్వాలలన్ మించు నగ్నినే♦వండు తాఁకఁ
గలఁడు? రావణుసౌధంబు ♦ గాంచి యందు
వెలయు నైశ్వర్యముల నెట్లు ♦ విడుచు ననిన. ౧౮ 5132

క. దనుజాంతఃపురమునఁ గల, యనూనభాగ్యంబు సీత ♦ కర్హ మెటులగున్
ఘనమగునాభాగ్యమె యె,ట్లన సూర్యునికంటె ఛాయ ♦ యన్య మెటులగున్.

క. ఆలాగుననే నాసతి, యీలలనామణియు నన్ను ♦ నెవుడు విడువఁగాఁ
జాలదు ముల్లోకంబుల,లో లలిఁ బరిశుద్ధురాలు ♦ లోలాక్షి యిదా. ౧౯

క. కనుకనె యీజనకాత్మజ, ఘనబుద్ధికిఁ గీర్తి విడువఁ ♦ గానియటులు నా
కును విడువరానిదా నీ,వనితామణి; మీరు పూజ్య♦వర్తనులు గదా?. ౨౦

క. హిత ముపదేశించుచు నీ,గతి నెయ్యముఁ జూపువారు ♦ గావున మీవా
క్యతతులు శుభకరములు నే, నతిశయమోదమునఁ జేయ ♦ నగుఁ దప్పకయే.

చ. అని యిటులారఘూత్తముఁ డ♦జాదులతో వచియించి సద్బలం
బునఁ జెలువాగు వారు తన♦పొంకపుఁగృత్యములన్ నుతింపుచుం
డ నిరతమున్ సుఖార్హము మ♦నంబు ముదంబునఁ బొంగఁ బ్రేయసిన్
జనకతనూజఁ దీసికొని ♦ సన్నిధికిన్ సుఖమొందుచుండెఁ దాన్. ౨౧ 5137

నూటయిరువదియొకండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౨ - వ సర్గము.

శివుఁడు దివ్యరూపధరుండగు దశరథుని రామునకుంజూపుట.

చ. జనపతి మంగళాస్పదము ♦ చాగుతరంబును నైనరీతిఁ జె
ప్పినవచనంబులన్ విని గ♦భీరమనస్కుఁడు శంకరుండు రా
మునివచనంబుకంటె శుభ♦ముం గలిగించెడురీతిఁ బల్కె ని
ట్లని రఘురామునితోడ; నసి♦తాంబుజనేత్ర! మహాభుజా! విభూ!. ౧౪ 5138

క. గురుతరవక్షా! శత్రుని,కరశిక్షా! రామచంద్ర! ♦ కార్ముకధరవ

ర్య! రమానాయక! మావి,స్ఫురభాగ్యమునన్ దురాత్ము ♦ సురరిపువిభునిన్. ౨

క. అని వధియించితివి గదా, విను లోకంబులకు దనుజ♦వీరునివలనం
గనుపట్టివృద్ధిపొందిన, పెనుభయ మనుధ్వాంత మిపుడు ♦ పృథుబల! యనిలోన్.

చ. దనుజుని నీవు చంపుటను ♦ దద్దయుఁ బాసె; మహాబలా! యయో
ధ్యను గనఁబోయి దీనుఁడగు ♦ నాభరతుం దమి నూఱడించి నీ
జననిని నిమ్మహాకృతికి ♦ సాంద్రతరంబగుమూలమై యశం
బును గనినట్టికైకను స్వ♦పుత్త్రుని నీకిటు లొప్పగించి నె
మ్మనమునఁ గుందుచున్న యల ♦ మానినిఁ బ్రీతి సుమిత్ర నీ వటన్. ౪ 5141

చ. కనుఁగొని భూరిరాజ్యము న♦ఖండపరాక్రమ మొప్పఁగా గ్రహిం
చి నిఖిలమిత్త్రసంతతికిఁ ♦ జెల్వగు మోదముఁ గూర్చి పుత్త్ర రా
జిని గని యాత్మవంశమును ♦ జేరినకోరిక శాశ్వతంబుగా
గను వెలయించి వాజిమఖ♦కార్యముఁ దృప్తిగఁ జేసి భూమిలోన్. ౫ 5142

*క. అనుపమయశమును గని విప్రనికరమునకున్ ధనంబుఁ ♦ బరమప్రమదం
బున నిచ్చి స్వీయలోకం,బునకున్ రాఁదగును జుమ్ము! ♦ భూమిపతీంద్రా!. ౬

క. జననాథ! మనుజలోకం,బున నీకున్ గురువు సుయశ♦మునఁ బొల్చుచు నుం
డిననీజనకుఁడు దశరథ,జనపతి యిదె వ్యోమయాన♦సంగతి నిటకున్. ౭ 5144

క. అరుదెంచియున్నవాఁ డీ,తరుణంబునఁ జూడు; సిరులఁ ♦ దళుకొత్తెడునీ
ధరణీశుఁడు తనయుఁడవై, యురుగుణములఁ గీర్తిచేత ♦ నొప్పిననీచేన్. ౮

క. తరియింపఁ జేయఁగాఁబడి, సురలోకము నొందె; నీవు ♦ చొక్కపుఁబ్రేమన్
బరఁగెడు లక్ష్మణుఁడు నమ,స్కరణము గావింపుఁ డనిన ♦ శంకరుపలుకుల్. ౯

చ. విని రఘురామలక్ష్మణులు ♦ వేడ్క విమానముశృంగమందు నొ
ప్పినపితకుం బ్రణామములఁ ♦ బ్రీతి నొనర్చిరి; భూధవుండు త
మ్ముని సుగుణాఢ్యుఁ గూడి ముద♦ముం జెలువారఁగ స్వీయకాంతిచే
తను దగి నిర్మలాంబరముఁ ♦ దాల్చిన తండ్రినిఁ గాంచె నంతటన్. ౧౦ 5147

సీ. వ్యోమయానంబునం ♦ దుత్తమాసనమున నారుమహాబాహు ♦ వాదశరథుఁ
డాత్మజు రాఘవు ♦ నాత్మజీవితములకంటెను బ్రియతరుఁ ♦ గాంచి మిగుల
హర్షంబు నొందుచు ♦ నంకమ్మునం జేర్చికరముల సాఁచి వే ♦ కౌఁగిలించు
కొని యంత నతని కి♦ట్లనియెను; రాఘవా! నిను నెడఁబాసినం♦దునను నాకు

తే. స్వర్గమును దేవమునికృత♦సత్కృతులును, మెచ్చఁదగినవిగా లేవు ♦ పొచ్చె మిద్ది
కాదు సత్యంబుపై నేను ♦ గడఁక నొట్టు,పెట్టిచెప్పెద; శాత్రవ♦బృంద మీవు.

* బ్రాహ్మణేభ్యో ధనం దత్వా త్రిదివం గంతు మర్హసి-అనిమూ. ఇటఁ ద్రిదివమనఁగా వైకుంఠమని యర్థము చెప్పక తప్పదు. బ్రహ్మాదిస్తుతియే యీయర్థము తోఁపఁ జేయును.

చ. అని వధియించి యావనమునందు వసించెడు కాలమెల్లఁ జ
క్కనివిధిఁ దోఁచి నిండుమదిఁ ♦ గ్రాలెడు మోదముతోడ నుండ నీ
గనుఁగొనఁ బ్రీతి మిక్కిలియుఁ ♦ గల్గెను; *మాటలయందు నేర్పునం
దనరు ప్రియాత్మజా! పురముఁ ♦ దాఁటఁగ నిన్నును బంపు నత్తఱిన్. ౧౪
తే. కైక యేమేమిమాట ల♦క్కఱను బల్కె
నవ్వి యన్నియు విస్మృతి ♦ నందకున్న
వాత్మ బాధించుచునె యున్న ♦ వన్న; నీవు
లక్ష్మణుండును దమిఁ గుశ♦లముగ నుంట. ౧౫ 5150
క. కనుఁగొని కౌఁగిట నిడుకొని, తనివారఁగఁ గంటిఁ గానఁ ♦ దద్దుఃఖంబుల్
గనకున్నవాఁడఁ దుహినం,బునుండి భానుండు విడిన♦పోలిక నేనుల్. ౧౬.
తే. దుఃఖము త్తుఁదనైతిని; ♦ ధూతపాప!
తనయవర్య! యష్టావక్రుఁ♦డను మునివరుఁ
డౌకమహాసభయందుఁ గ♦హోళకుఁడను
బాడబుని నుద్ధరించిన ♦ వడువునఁ దమి. ౧౭ 5152
తే. సుహితచిత్తుఁడవగుచు నా♦త్మజవరుఁడవు, నయిన నీవును సత్యపా♦శాభిబద్ధుఁ
డయిన నన్ను నసత్యదో♦షాబ్ధినుండి, దాఁటఁ జేసితివి; పురుష♦తల్లజమణి!.
క. సురనరులే రావణుసం,గరమున వధియింపనట్టి ♦ కార్యంబుల న
త్తరుణమున నొనర్చిరె యని, యరసి కనుంగొంటి నిపుడె ♦ యార్యవతంసా!.
క. పరమర్దన! కౌసల్యయు, నరణ్యమునునుండి యింటి ♦ కరుదెంచిన ని
న్నురుముదమునఁ గనఁగల ది, త్తరుణమునఁ గృతార్థురాలు♦తథ్యము సుమ్మా!.
చ. పురమున కేగి రాజ్యమును ♦ బూనఁగ నీవభిషేకమున్ మహ
త్తరసుహానుందుఁ బొల్చి వసు♦ధాపతివై యలరారుచుండ నె
వ్వరు గనువారో వేడుకల ♦ వారె కృతార్థులు సుమ్ము; నీపయిం
గర మనురాగముం గలిగి ♦ గాఢబలుండయి శుద్ధవృత్తియై ౨౦ 5156
తే. ధర్మవర్తనుఁడయి ధాత్రిఁ ♦ దగుభరతుని
నీవు కలియుఁగఁ జూడంగ ♦ నేనుగోరు
వాఁడ నప్పుని నొనరింప♦వలయు; సౌమ్య!
బుద్ధిశాలి లక్ష్మణుఁడును ♦ బూతసీత. ౨౧ 5157
క. నీవును వనమున వాసము, బావనమతిఁ జేయుచుం గ♦పట మింతయు లే
కీవిధిఁ జతుర్దశాబ్దము, లోవీరా! పుచ్చితిరి మ♦హోద్యమ మలరన్. ౨౨
క ఒనరించిన ప్రతినయు ఫల,మును గాంచెను దితిజవితతి♦ముఖ్యుని యుద్ధం
బునఁ జంపి సురల సంతస,మును గనఁ జేసితివి; రిపుస♦మూహార్తికరా!. ౨౩

* వాక్యాని వదతాం వర-అనిమూ.

క. కృతమయ్యెఁ గార్య మెల్లను, వితతంబగు శ్లాఘ్యయశము ♦ వెలయించితి వీ
క్షితినింక రాజవై సహ,జతతియుతిని నాయు వీవు ♦ చాలం గనుచున్. ౨౪

క. ధర నేలుము యంచన రఘు,వరుఁ డామాటలను వినుచు ♦ బద్ధాంజలియై
కరమనురాగంబున ని,వ్విరుసన్ పచియించెఁ; దండ్రి! ♦ వరధర్మజ్ఞా!. ౨౪½

చ. వనమున కీవు రాఘవునిఁ ♦ బంపుదువేని నిన్ను భవత్తనూ
జుని విడనాడువాఁడ ననుచున్ ♦ శపథంబును గైకొఁ గూర్చిచే
సినతరుణంబునన్ వినితి ♦ శ్రీజనకా! యలకైకయందుఁ ద
త్తనయునియందునుం గరుణ ♦ తప్పక యుంచుము రాజచంద్రమా!. ౨౫½

తే. ఘోరమగుశాప మది కైక♦కున్ భరతున
కంటకుండెడునట్లు ద♦యమెయిఁ గానఁ
బలుపుఁ; డని కేలుమోడ్చి ని♦ల్వఁబడియున్న
తనయునిం గని దశరథ♦ధరణిపతియు. ౨౬½ 5163

క. కాని మ్మట్లనుచు సుమి,త్రానందను గౌఁగిలించి; ♦ తాఁ బలికెఁ; గుమా
రా! నీవు రామునకు నా,జానకికిన్ సేవచేసి ♦ సాధుమనీషన్. ౨౭½ 5164

తే. నామనస్సున కెంతో సం♦తసము గల్గఁ
జేసితివి ధర్మఫలము నిన్ ♦ జెందెఁ జుమ్ము;
రాముఁ డలరిన నీకు ధ♦ర్మంబు ధర వి
శాలయశము సుఖంబును ♦ జాలఁ గల్గు. ౨౮½ 5165

తే. గొప్పతనమును నీకుఁ గ♦ల్గును; సుమిత్ర
కెలమిఁ గూర్చుకుమార ! నీ ♦ వెపుడు రాఘ
వుని నె సేవించుచుండుము ♦ గనుదు శుభము
సర్వలోకములకును గు♦శలముఁ గూర్పు. ౨౯½ 5166

క. *నిరతంబుఁ దలఁచు నీరఘు,వరుఁ డీయింద్రాదిదివిజ♦వరులును లోకో
త్కరవాసులు సిద్ధులు మఱి, పరమర్షులు మహితచిత్తుఁ ♦ బరమపురుషునిన్.

క. వరదుని రామునిఁ గొల్చుచు, నిరతము పూజింతు; రతుల♦నియతా! దేవో
త్కరముల కంతర్యామియు, నిరుపమ మవ్యక్తమునయి ♦ నెగడుచు మిగులన్.

సీ. షడ్భావరహిత మ♦క్షరమును నయి తగు నాబ్రహ్మమే రాము♦నాకృతిఁ గొని
యవతరించినదని ♦ యజముఖుల్ చెప్పుదు; రీవు రామునకు నా♦యిలసుతకును
భక్తితో శుశ్రూష ♦ పరమప్రియంబునఁ జేయుటవలనను ♦ న్యాయధర్మ
ముల నాచరించిన ♦ యలఘుకీర్తిని గాంచితి వని ధర్మాత్ముఁడై ♦ దీర్ఘబాహుఁ

ఆ. డైన దశరథుండు ♦ మానియై తనమ్రోలఁ, జేతు లొగ్గి నిల్చి ♦ ప్రీతినున్న
లక్ష్మణునకుఁ జెప్పి ♦ లలనామణికిన్ సీతఁ, గని శుభోక్తి నిట్టు ♦ లనుచుఁ బలికె.

---

* అభిగమ్య మహాత్మాన మర్చంతి పురుషోత్తమమ్-అనియూ.

క. నిను వదలితి నంచను రా,ముని మాటల కల్లరాదు ♦ ముగ్ధా! చరితం
బును శుద్ధంబుగ జగముల,కును గనఁబఱపంగ మేలు ♦ గోరి విభుఁ డిటుల్.

క. ఒనరించెను సుభ్రూ! సే,వను బతి కొనరించు నీదు ♦ భక్తిఁ గుఱిచి యే
మనియును జెప్పం బనిలే,దు నీకు నట్లైన నేను ♦ దోయజనేత్రా!. ౩౭౪ 5171

ఆ. పెద్దవాఁడ నగుటఁ ♦ బ్రియము వచింపనౌఁ, గానఁ బలుకువాఁడ ♦ నీన్నృపుండె
పరమదైవ మనుచు ♦ భావింపుమనియిట్లు, దశరథుండు తనదు ♦ తనయులకును.

ఆ. కోడలకును జెప్పి ♦ కోర్కి విమానంబు,నందుఁ దేజరిలుచు ♦ నమరవిభుని
లోకమునకుఁ బోయెఁ ♦ బ్రాకటయశ మొప్ప,నందఱార! యనఁగ ♦ నతిముదమున.

నూటయిరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౩ - వ సర్గము.

దేవేంద్రుఁడు మృతులగు కపుల బ్రతికించి స్వర్గమునకుఁ బోవుట.

చ. సురపతిలోకభోగములఁ ♦ జూడఁగఁ బంక్తిరథుండు పోవ ని
ర్జరపతి చాలఁ బ్రీతుఁడయి ♦ రామునిఁ బ్రాంజలియై యడంకువం
బరఁగినవానిఁ గాంచి యిటు ♦ పల్కెఁ బరంతప! రామ! యప్పుడ
ధ్వరమున మేము నిన్గనుట ♦ ధన్యము సార్థకమయ్యె నింతకున్. ౧౪ 5174

చ. మనమున సంతసించితి మ ♦ మర్త్యుల మెల్లను గాన నీమనం
బున నెది గోరఁబూనెదవొ ♦ పొంకముగా వచియింపుమన్న నా
తని నుడు లాలకించి తన ♦ తమ్ముఁడు లక్ష్మణుఁడున్ ధరిత్రినం
దనయును దాను గేల్మోలిచి ♦ తత్పరతన్ వచియించె నీగతిన్. ౩ 5175

క. సురవర! వాజ్ఞ్మపుఁ జేమను, బరఁగెడు నీవలరు దేని ♦ వారక నాపై
సురుచిరమామకవాంఛను, గరుణాకర! పల్కువాఁడ ♦ గర మనురక్తిన్. ౬

తే. దాని సత్యముగాఁ జేయఁ ♦ దలఁపవయ్య;
నానిమిత్తము విక్రమ ♦ మూని యుద్ధ
మందు మృతులయి *యమపురి ♦ కరిగినట్టి
హరిగణంబెల్లఁ బ్రాణము ♦ లలర లేచి. ౭ 5177

క. తిరుగ నొనర్పుము; కపు లె,వ్వరు నాకుం బ్రియములైన ♦ వానిం జేయం
గర మనురక్తులునై యని, మరణమును గణింపకయె య ♦ మానుషశక్తిన్. ౭౪

చ. తనయుల భార్యలన్ వదలి ♦ దారుణసంగరమందుఁ జచ్చిరో
వనచరు లట్టివారలు భ ♦ వత్కృపచేతను లబ్ధసంజ్ఞులై

---

* యే గతా యమసాదనమ్-అనియూ. యుద్ధమృతులకు యమలోకమా యని ప్రశ్నింప రాదు. ఇచట యమలోకమనఁగాఁ బరలోకమని యర్థ మూహింపఁదగు.

తనయుల భార్యలం గలసి ♦ తద్దయు వేడుక నుండఁ జేయుమీ
నిను నిదె వేఁడువాఁడ నిదె ♦ నెమ్మిని గోర్కెవరంబు నా కిలన్. ౬౪ 5179

తే. మానదా! కపిభల్లూక♦మండలములు, సుంతయును బీడ లేక యా♦వంతయేని
వ్రణకృతార్తిని బొందక♦బలపరాక్రమముల సంపన్నులై యుండ♦మమత నేను.

క. కనుఁగొన గోరెద; మఱియును, వనచరు లెందుండు రందు ♦ వాసవ! కాలం
బునుగాని తఱిని ముఖ్యము, లనఁబడు ఫలమూలములు వ♦నావళులందున్. ౭

క. కలుగన్ వలయున్ నదులు వి,మలజలముల నుండవలయు; ♦ మానక యని యి
ట్టులు మహితాత్ముఁడు శ్రీరఘు,కులమణి వచియించు నుడులఁ♦గోర్కెన్ వినుచున్.

క. సురపతి ప్రీతిం దగునా, వరవాక్కులఁ బల్కె నిట్లు; ♦ వసుమతినాథా!
కరచరణాదులు పూర్వము, వరుసం జెలువొందునట్టి ♦ భంగి నొనర్పన్. ౯౪

క. మృతులయి పరలోకము సం,గతిఁ గాంచినవారి నెల్లఁ ♦ గడఁగి పునర్జీ
వితులుగఁ జేయఁగవలయును, క్షితిపా! వర మిద్ది నీవు ♦ చిత్తమలరఁగన్.

తే. అడిగితివిగాన నిది గొప్ప♦దగువరంబు
సుమ్ము నేఁ దొల్త నొకమాట ♦ నెమ్మిఁ బలికె
మఱొకపద్ధతిగా నింత♦వఱకుఁ బల్కి
నదియె లే దట్టులౌట ని♦య్యది ఫలించు. ౧౦౪ 5185

సీ. దనుజులచేత యు♦ద్ధంబున భేదితకరచరణానన♦కాండులైన
భల్లూకగోపుచ్ఛ♦వనచరుల్ మరల జీవించి లేవంగల ♦ రంచితముగ;
వారలెల్ల నేబాధ ♦ నందక నిర్వ్రణులయి బలపౌరుషా♦ఢ్యతను లగుచు
నిదురించి లేచున♦ట్లు దగ లేవంగల రందఱు మిగుల నా♦నంద మొంది

తే. తమసఖులతోడ బంధుసం♦తతులతోడ, జ్ఞాతినిజజననికరసం♦సర్గ మొంది
యుండఁగలరు సుఖంబుగ; ♦ నోధనుర్ధరవర! వీరు వసించు ధ♦రాతలముల.

క. తరువు లకాలంబునను న్, వరసుమచిత్రితము లౌచు ♦ స్వాదుఫలములం
బరఁగుచు వెలయును నదులును, నిరతము నిర్మలజలముల ♦ నిండి చెలంగున్.

క. వనచరులు గాయముల నుం,డినయంగము లొప్పువారు ♦ నిర్వ్రణములుగాఁ
దనరారుతనువు లొప్పం,గను బొల్తు రటంచు దివిజ♦కాంతుఁడు పలికెన్.

క. అంతట మృతులగు కపివర,సంతతు లాయుద్ధభూమి ♦ సంగతి విడి సు
ప్త్యంతమున లేచినట్లుగ, వింతగ లేవంగఁ బ్లవగ♦వీరులు వారిన్. ౧౫౪

తే. తారు మృతినొందకుంట నెం♦తయును వేడ్కఁ
గాంచి యారీతి లేచుట ♦ గలిగె నెట్లు?
వింత యిది యేమి యని చాల ♦ విస్మయంబుఁ
గనిరి శక్రునిదయ బ్రది♦కిన కపు లొగి. ౧౬ 5190

క. చను దెంచి రామునకు వం,దనముల నర్పించి; రయ్యు♦దనున సురవరుల్
జనవిభుఁ డిష్టార్థంబులఁ, గని ముదమును బొందుచుంటఁ ♦ గాంచి వినీతిన్.

క. నుతికర్తుఁడైన యారఘు,పతినిం దొలుదొల్తఁ బొగడి ♦ పలికి రవుడు భూ
పతితమ్ముఁడు వినుచుండఁగఁ;, గృతకృత్యుఁడ వైతి వింక ♦ క్షితిపతిచంద్రా!

క. చనవయ్య యయోధ్యకు నీ,వనచరుల నివాసములకుఁ ♦ బంపుము నీయం
దనురక్తయయి తపస్విని,యును నగునీసీత మదిని ♦ నూఱడిలంగన్. ౧౮

తే. అనునయింపు పరంతపా! ♦ యనుజుఁడు మహి
తాత్ముఁడునగు శత్రుఘ్నుని ♦ నంబలను దవ
దీయశోకంబు నొందుచు ♦ న్యాయవృత్తి
వ్రతముఁ బూనిన నీతమ్ము ♦ భరతుఁ గనుము ౧౯ 5194

క. విను మీ వభిషిక్తుఁడవై, జనులను బౌరులను మిగుల ♦ సంతసమును బొం
దను జేయు మనుచు సుర లా,జనపతి నాత్మజుల యొద్ద ♦ సన్నుతిఁ గొనుచున్. ౨౦

చ. ఖరకరునట్లు కాంతులను ♦ గ్రాలువిమానములందు నెక్కి వే
యరిగిరి స్వర్గసీమ; కట ♦ నారఘురాముఁడు ముద్దుతమ్మతో
సురలకు మ్రొక్కి వానరుల ♦ శుభ్రయశస్కుల విశ్రమింప న
త్తరుణమునందె యాజ్ఞ యిడె; ♦ దారుణసంగరమందుఁ బూనికన్. ౨౨

చ. అరుల జయించి కీర్తిఁ గని♦నట్టి మహాకపిసైన్య మెల్ల న
త్తరుణమునన్ ముదంబుఁగని ♦ తద్రఘువర్యులపాలనంబునన్
గరమును గాంతివెల్లుచును ♦ గంజవిరోధిని గూడి రాత్రియె
వ్వరున వెలుంగు నట్టులుగ ♦ భాసిలుచుండెను గౌరవంబునన్. ౨౩ 5197

నూటయిరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౪ - వ సర్గము.

రాముఁడు విభీషణునిప్రార్థనకు బదులు చెప్పి పుష్పకమును దెమ్మని యాజ్ఞాపించుట.

చ. వనజభవాదిదేవతలు ♦ వచ్చి గృహంబుల కేగ నాఁటిరా
త్రిని బరనూదనుం డహీను♦దీధితితేజుఁడు నిద్రవోయి చ
క్కనిమది మేలుకొన్నతఱిఁ ♦ గాంచి విభీషణుఁ డంజలిం దగం
బొనరుచుచున్ జయం బడిగి ♦ పూతవచస్సులఁ బల్కె; రాఘవా!. ౧ 5198

సీ. స్నానంబునకుఁ దగు♦జలములఁ గుంకుమాద్యంగరాగమ్ముల ♦ నంబరముల
నాభరణముల ది♦వ్యములగు చందనంబులబహుసుమహార♦ములను సిద్ధ
పఱచియున్నాఁడను ♦ బద్మనిభేక్షణలయి చక్కఁగ సేయ ♦ నర్హలైన
కాంతలు చనుదెంచి ♦ కాచియున్నారు నిన్ విధివంతముగ కన్న ♦విమలజలము

తే. లను దనర్ స్నానమొనరింతు ♦ రనఘ! యిద్ది
నను గృపంజూచుటకె కావు♦నను మదీయ
వాంఛఁ దీర్పంగ గ్రహియింపు ♦ వానినెల్ల;
నను విభీషణుఁ గని పల్కె ♦ మనుజవిభుఁడు. ౮ 5199

క. దనుజేంద్రా! సుగ్రీవా,దినిఖిలకపివరుల సమ్మ♦తిం బిల్వుము మ
జ్జనమొనరింపంగ నేలన, వినుమా! గురుబాహుఁడగుచు♦వెలయుభరతుఁడున్.

చ. మనమునఁ దోఁచుచుండు సుకు♦మారుఁ డతండగుఁ గుఱ్ఱవాఁడు నా
కు నిఖిలరాజ్యసంపదలఁ ♦ గూర్పు సుఖోచితుఁడయ్యు సద్వ్రతం
బును గొనియున్నవాఁడు గుణ♦ముఖ్యుఁడు ధర్మమనస్కుఁ డెంతయున్
వినయగుణైకభూషితుఁడు ♦ విశ్రుతకీర్తియుతుండు శాంతుఁడున్. ౯ 5201

తే. మఱియుఁ బదునాల్గువర్షముల్ ♦ నెఱి జరగఁగ
నేను బోనియెడన్ వగఁ ♦ బూని యగ్నిఁ
బడుదునని శపథంబును ♦ బల్కినాఁడు
మాటఁ దప్పనివాఁడు నా♦మాడ్కి నతఁడు. ౯౹ 5202

క. విను మతఁడు లేక స్నానం,బును జేయం జనునె కైక♦పుత్త్రుఁ డతఁడు న
న్నును బాసి ధర్మములనే, యనయము చేయుచును వఱల ♦ నాతనిఁ జూడన్.

క. చనుట తగుఁగాని స్నానం,బును వస్త్రాభరణములను ♦ బూనుట తగునే
మన మలర కున్న దిండులఁ, కనఘా! యిదెగా యయోధ్య♦కరుగుపథము నూ.

క. మనమున్నతావు తలఁపం,గ నయోధ్యకు దూరముగనె ♦ గన్పడుఁ గాననన్
జనుటకు మిక్కిలి కష్టమె, యనఁ దగు నీత్రోవఁబట్టి ♦ యరిగెదఁ బురికిన్. ౭౹

చ. అనిన విభీషణుం డనిరొ ♦ నాతనితో మరలన్; మహాప్రభూ!
విను మతులప్రతాప! రఘు♦వీరవరా! యొకనాఁటిలోన ని
న్గొనుచు నయోధ్యఁ జేర్చెదను ♦ గోర్కి శుభంబగుఁగాక నీకు నూ
ర్యునివలెఁ జక్కగా మెఱయు♦చుండెడు పుష్పక మున్న దీయెడన్. ౮౹ 5206

సీ. అదినాకు నన్నయై ♦ నట్టికుబేరుని దగు దాని బలవంత♦ముగనె రావ
ణాసురుండు గ్రహించె ♦ ననిమొన; నాకుబేరుని నోర్చి దీనిఁ దె♦చ్చెను బ్రతాప
మున నిది యుత్తమం♦బును దివ్యమునునగు నలసినచోటికిఁ ♦ బరుగిడు దన
మహిమచే దానిని ♦ మాయున్నవచ్చిన నీయుక నీకయి♦యే పదిలము

తే. గాఁగ నిటనుంచుకొన్నాఁడ; ♦ ఘనమువోలె
నంబరమ్మున వోవు ది♦వ్యమగునద్ది
యిదియె యిచ్చటనేయున్న ♦ దీవిమాన
మెక్కియే బాధలేక నీ ♦ వేగఁగలవు. ౧౧౹ 5207

క. పురిఁ జేరఁగలవు; ధాత్రీ,శ్వర! స్నానాదులను మాన♦వచ్చుఁ దవ్వదిచ్ఛన్

బరిపరిఁ బ్రార్థింపను; నీ,వరయం బ్రాజ్ఞుఁడవు తెలియ ♦ నది నీకున్నే?. ౧౨

తే. కరుణ నీకును నాపైనిఁ ♦ గల్గునేని
మద్గుణంబులు భవదీయ♦మనమునందు
ననుమతంబులయేని నా♦యందు నెయ్య
మలరుచుండునయేని నీ♦యనుజుఁ గూడి. ౧౩ 5209

క. జనకతనూజను గూడియు, వనచరులంగూడి నీవు ♦ వసియింపు విభూ!
మనమారఁ గొలఁదిదినములు, తని వొంద మదర్చనలను ♦ దగువస్తువులన్.

ఆ. సమ్మతిని గ్రహించి ♦ చనుదు వయోధ్యకు, నవల; నీకు వలయు♦నట్టి పూజ
సిద్ధపఱుపఁ బడియెఁ ♦ జేయ నాలస్యంబు కనుక నాయొనర్చు ♦ కమ్రపూజ.

క. మనమునఁ బూనిక బలములు, వనచరపుంగవులు మిత్ర♦వర్యులు నీవున్
గొనవలయుఁ బ్రీతిగా ని, న్ననఘా! నిర్బంధపఱతు ♦ ననుఁగొనకు మదిన్. ౧౪౫

సీ. నామాట విను దను♦నమ్మకమున నన్ను నుపలాలనమును జే♦యుటవలనను
నీయందు నాకున్న ♦ పాయనిభక్తిని భృత్యుండనైన నే♦నిట్లు నిన్నుఁ
బ్రార్థించుచున్నాఁడ ♦ నంతియకాని నీ కాజ్ఞచేసెడువాఁడ♦నయ్య! నాఁగ
నవ్విభీషణువల్కు ♦ లాలించి రాముండు ప్రత్యుత్తరం బిట్లు ♦ పల్కె; దనుజ

ఆ. వనచరాళు లెల్ల ♦ వినుచుండ నోసౌమ్య!, యరినిషూదనా! మ♦హాత్మ! నీవు
చేసియున్న యలవి♦చిత్రసాహాయ్యమ్ము, వలనఁ బౌరుషమ్ము♦వలన మఱియు.

క. అనుపమసౌహృదమున నే, ననయము పూజితుఁడనైతి ♦ ననురాధిప! నీ
వనియెదు నీమాటను నే, వినకయుఁ జేయకయు నెట్లు ♦ విడువం దగుఁజూ!.

చ. వనమున నుండనీక మతి♦వైభవ మొప్ప మరల్చి పత్తనం
బునకును గొంచుఁ బోవుటకుఁ ♦ బూనిక నెవ్వఁడు చిత్రకూటముం
గననరుదెంచెనో మిగులు♦కాంక్షను రాజ్యము గొమ్మటంచు నే
యనఘుఁడు మ్రొక్కి వేఁడ నట ♦ నట్లొనరింపఁగఁ బూననైతినో. ౧౬

తే. అట్టి నాప్రియసోదరుం♦డైన భరతుఁ,గనఁగఁ ద్వరపెట్టుచున్నది♦మనసునన్ను;
వినుము కౌసల్యను సుమిత్ర♦ననుపమాన, యశముగల్గినకైకేయి♦నాదరమున.

క. గురువుల వసిష్ఠముఖులను, బరమసఖులఁ బౌరవితతి ♦ వారితనయులన్
బరికించి చూడవలెనని, త్వరపడుచున్నయది నాదు ♦ స్వాంతము మిగులన్.

క. దనుజేంద్ర! నానిమిత్తం, బనూనపుష్పకవిమాన ♦ మతిజవమునఁ దే
రను బంపు కొలఁది దినములు, మన మలరఁగ నుండమన్న ♦ మానితధిషణా!.

క. వనవాసము నొనరిచి జవ,మున రాకున్నయెడఁ జొత్తుఁ ♦ బూని యనలునం
చని శపథము పల్కిన నా,యనుజుని మది నెఱిఁగియు నిట♦నగు నెటునిల్వన్.

క మన సొప్పున యటుచేయుఁగ, దనుజేంద్ర! విభీషణా! ము♦దంబున నాకి
మ్మనుమతి నీ వీవుపుష్పక,మును నొసఁగుటఁ బూజితుఁడనె ♦ ముదితాత్ముఁడనే.

క. అనఘా! కోపము చేయకు, పనుపుము వేగమున నన్నుఁ ♦ బరమాద్భుతి ని
ష్ఠనుమతి; నంచు రఘూత్తముఁ, డనుమాటల రాక్షసేంద్రుఁ ♦ డాలించి తగన్.

చ. త్వరపడి పోయి పుష్పకము ♦ భాసురమై తగుదానిఁ గొంచు భూ
వరుకడఁ జేరె; నయ్యదియు ♦ భర్మమయంబులు చిత్రరీతులం
బరఁగెడు నవ్వియై తనరు ♦ భాసురరూపము లొప్పఁగా మనో
హరములుగాఁ దనర్చురుచి ♦ రాంతరమండపముల్ చెలంగఁగన్. ౨౪ 5222

సీ. వైడూర్యవేదికల్ ♦ భాసిల్ల రజతప్రకాశంబు వెలయఁ జ ♦ క్కనివి శ్వేత
వర్ణంబులును నైన ♦ ధ్వజములు గ్రాలఁ బతాకలు వెలయంగ ♦ దప్తకనక
మయహర్మ్యములు తగ; ♦ మానితకనకపద్మములు ప్రేలాడుచు ♦ నమరియుండ
ముత్తెపుజాలక ♦ ములు నొప్పఁ జిఱుగంట లెల్లెడలను నొక్క ♦ యెడఁబృథుతర
తే. ఘంటలును రాజిలంగ ని ♦ కామరమ్య
రవము సర్వత్ర వ్యాపింప ♦ సువిమలమయి
తనరుచుండెను; సురశిల్పి ♦ యనుపమాన
ముగను నిర్మించె స్వర్ణాద్రి ♦ మూర్ధమువలె. ౨౫ 5223

తే. రజతముక్తామణిప్రభా ♦ రంజితములు
గాఁగ బహుహర్మ్యములు లోనఁ ♦ గలుగ నద్ది
స్ఫటికచిత్రాంగములుగల ♦ భాగములను
నమరి వైడూర్యవర్యాస ♦ నములఁ దనరి. ౨౬ 5224

క. వెలలేని మహాస్తరణం,బుల నలరారుచును శత్రు ♦ వుల కేరికినిం
గలవిలపా టొందింపఁగ, నలవియెఁ గాకే మనోజ ♦ వాధికజవమై. ౨౭ 5225

క. తనరారునావిమానం,బును దెచ్చి విభీషణుండు ♦ భూమీశలలా
మునకున్ భక్తి సమర్పణ,మును జేసి యటం జెలంగు ♦ ముదమున నిలిచెన్.

నూటయిరువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౫ - వ సర్గము.

రాముఁడు సుగ్రీవాదులతో నయోధ్యకుఁ బ్రయాణమగుట.

క. అంత విభీషణుఁ డాభూ,కాంతునకుం బుష్పమాలి ♦ కాభూషితమై
వింతగఁ దగు పుష్పక మా,చెంతఁ దగుటఁ జూపి యిట్లు ♦ చెప్పె నడఁకువన్.

క. కరముల మోడిచి వంగిన,కరణిన్ నిలుచుండి త్వరయుఁ ♦ గదురఁగ నీ కిం
కరుఁ డేమి చేయఁదగు నన, గురుతేజుఁడు రాముఁడు నృప ♦ కుంజరుఁ డెలమిన్.

క. తనచెంతనున్న తమ్ముఁడు, వినుచుండఁగఁ బలికె స్నేహ ♦ విస్తృతిఁ గనువా
క్కునఁ జక్కవిమర్శించుచు, దనుజేంద్రా! పూన్కిమీఱ ♦ దర్పము మెఱయన్.

మ. పనిసాధించినవారు వానరులు చె♦ప్పఁగ బ్రీతి వర్ధిల్లెడుఁ
గనుకన్ రత్నమహార్ఘభూషణములన్ ♦ గ్రవ్యాదవర్యా! ముదం
బునఁ బూజింపుము వారి; నిర్జరగణం♦బుల్ గెల్వలేనట్టి లం
కను యుద్ధంబుల వెన్కదీయక యవ♦క్రస్ఫారశక్త్యున్నతిన్. ౫ 5233

ఆ. వీరు తోడుపడుటఁ ♦ జేరి జయించితి, మంతె గాని మఱొకఁ ♦ డరయ లేదు
నీకు లంకయబ్బ ♦ టికపిసాహాయ్య,మునసె; యిట్లు కార్య♦మును దృఢముగ.

క. కొఱఁతయె లేకుండంగా, నెఱవేర్చిన వీరినెల్ల ♦ నెమ్మి ధనములన్
గుఱుతుపడన్ రత్నంబుల, మఱియు నితరభూషణముల ♦ మన్నన మీఱన్.

ఆ. కోరి యొసఁగి వీరి♦భూరిప్రయాసంబు, సార్థకముగఁ జేయ♦వయ్య! నీవు
మానదుఁడవు కృతము ♦ మానుగ నెఱుఁగుదు, గానగౌరవార్హ♦లైనకపుల.

క. అలరింతు వేని వీరును, ఫలితమనోవాంఛులగుచుఁ ♦ బ్రమదసుఖములం
జెలఁగుదురు; మఱియుఁదాృగము,గలవాఁడవటంచుదాన♦కలన సుహృదులన్.

క. ఒసఁగూర్చుకొనుచు వంచుఁ గృ,పను జెలఁగుదు వనుచు యశము♦భాసిల్లఁగనొ
ప్పినవాఁడ వంచుఁ దలఁతురు, జనులెల్లను గాన నీకు ♦ నమధికహితముగన్.

క. దీనిం దెల్పితి నంతియె,కాని తగన్ శాసనంబు ♦ గావింపఁగ లే
దోనిఖిలరాక్షసేశ్వర!, త్వానేతయొనైనఁ బ్రీతి ♦ సంధిల్లంగన్. ౮ 5236

చ. మనమున కింపుఁ బెంపఁదగు ♦ మంచిగుణంబులు లేక క్రోధమే
యనవరతంబుఁ బూనుచు ర♦వంతయుఁ దాలిమి లేక హింసచే
యునొ యతనిన్ భటోత్కరము ♦ లొయ్యనఁ బ్రీతిని మాని సంగరం
బున విడనాడుఁ గాన భట♦పుంగవులం దనుపంగ నొఁ జుమీ!. ౯ 5237

క. అని రామచంద్రుఁ డాడిన, విని కపులకు నెల్ల రత్న♦వితతార్థములన్
దనవిభవమునకుఁ దగినటు, లనూనభాగములు చేసి ♦ యాదృతి నొసఁగెన్.

చ. హరివరు లెల్ల రత్నవివి♦ధాంబరభూషణరాజిఁ దృప్తులై
పరమమునంబునుం గనుట ♦ బాగుగఁజూచి రఘూద్వహుండు సుం
దరమగు పుష్పకంబున ని♦తాంతయశంబున మించి లజ్జచే
శిరమును వంచి చెల్వమరు ♦ సీతను నంకమునందుఁ జేర్చుచున్. ౧౧ 5239

క. నిరుపమవిక్రమసంపదఁ, బరఁగెడు లక్ష్మణుఁడు చాప♦వరముం గొని తో
నరుదేర నెక్కె; నిటు భూ,వరుఁ డాపుష్పకము నెక్కి ♦ వానరగణమున్. ౧౨

సీ. అతులవీర్యుండగు ♦ నట్టి సుగ్రీవుని నవ్విభీషణుఁ గని ♦ యాదరమునఁ
బలికె నిట్లని; మహా♦వనచరులార! మీ కనుఁగుమిత్రుఁడ నగు♦నట్టి నాదు
కార్య మిద్దానిని ♦ గావించితిరి మీకు ననుమతినొసఁగితిఁ ♦ గనుక మీరం
దిచ్ఛానురీతిఁగా ♦ నేగంగఁ దగును మీవాసస్థలములకు; ♦ వైరిహరణ!

తే. మిత్రవర్య! సుగ్రీవాఖ్య! ♦ మించు నేస్క,నలరుమిత్రుండు చేయంగ♦నైనపని న

ధర్మభీరువ వౌట నెం♦తయును జక్కఁ, జేసితివి గానఁ గపివర♦సేనఁ గూడి.

*క. అనుపమగతిఁ గిష్కింధకుఁ, జని సుఖ ముండుము, సురారి♦సత్తమ! నేనీ
కు నొసంగ స్వీయమగు లం, కను నేలుచుఁ బం క్తికంఠు♦కరణి నొరులకున్.

తే. అపకృతులఁ జేసి రాజ్యంబు ♦ లపహరింప
కిందె వసియింపు; మింక దే♦వేంద్రుఁ డాది
యైన సుర లెత్తివచ్చిన ♦ నలవిగాదు
నిన్నుఁ జెనకంగ; నీకమీఁద ♦ నేను వేగ. ౧౬౪ 5248

క. అరిగెద నాజనకుఁడు నే, పురమున వసియించె నటకుఁ ♦ బోవఁగ మీరల్
గరుణ ననుజ్ఞను నాకి, త్తరుణమున నొసంగుఁడు రని ♦ తమిఁ గాంక్షింతున్.

క. మిమ్మెల్ల వీడుకొనియెద;, నెమ్మదిగా నుండుఁ డనుచు ♦ నృపతి పలుకఁగా
నమ్మద మలర విభీషణుఁ, డమ్మిహిరాత్మజుఁడు దోర్బ♦లాఢ్యులు కపులున్. ౧౮

క. కరములు జోడించి మహీ, వర! మేమెల్లర మయోధ్య♦వైభవమును గాం
చురతిం గలవారల మా, దరమునఁ గొని పొమ్ము నీవు ♦ తండ్రీ! యచటన్. ౧౯

క. జనపదముల కేమియు బా, ధను జేయక వనములందు ♦ స్థానీయములం
దును నెచ్చరికం దిరిగెద;, మనఘా! రాజేంద్రతనయ! ♦ యతివిభవమునన్.

సీ. పట్టాభిషేకస♦త్ప్రయనులఁ దడిసిన నినుఁ జూచి కౌసల్య♦కును నమస్క.
రించి వేగంబ యే♦తెంచువారము మానివాసంబులకు నని ♦ పల్కి రిట్టు
లావిభీషణభాస్క♦రాత్మజు లఖిలవానరులును వేఁడ నా♦నరపతియును
ధర్మాత్ముఁడున్ సిరిఁ ♦ దనరినవాఁడును నౌట వారలఁగాంచి ♦ యనియె; నేను

ఆ. భరతముఖ్యులైన ♦ బంధువులను మిమ్ముఁ
గలిసి యాయయోధ్య ♦ నెలమిఁ జొచ్చి
ప్రియము నొందఁగంటిఁ ♦ బ్రియమున కంటెను
బ్రియతరంబునయి ల♦భించె నిపుడు. ౨౪ 5248

క. వనచరులను గూడి జవం, బున సుగ్రీవా! విమాన♦మును నెక్కుము మం
త్రినికరయుతుఁడవుగా నో, దనుజేంద్రా! యెక్కవయ్య ♦ తమిఁ బుష్పకమున్.

చ. అన విని సత్వరంబుగనె ♦ యారవిసూనుఁడు వ్యోమయానమున్
ఘనతరమున్ గపీంద్రబల♦కాండముతోడ విభీషణుండు మం
త్రినికరసంయుతిన్ వెలయు ♦ దీప్తుల నెక్కిరి; యక్షరాజవా
హనవరమా విమాన మది ♦ యుందఱు నెక్కఁగ రామునాజ్ఞచేన్. ౨౬ 5250

ఆ. ఎగసె నాకసమున; ♦ కినవంశతిలకుండు, హంసయుక్త మగుచు♦నమలకాంతి
వెలయు నావిమాన♦నిలయమ్మునన్ రాముఁ, డతిశయముగ హర్ష♦మలరుచుండ.

---

* స్వరాజ్యే వస లంకాయాం మయాదత్తే విభీషణ - అనిమూ. దీనిచే విభీషణుని రాజ్యము విస్తరింపఁజేయు నాసఁ బూనకుమా యని రాముఁ డాజ్ఞ యిచ్చెనని గ్రహింపఁదగు.

క. సురలు నుతింపఁ గుబేరుని, కరణిం జనియెన్; సుపర్వ♦కల్పితమగు నా
వరయానంబునఁ గూర్చుం,డిరి సుఖముగ దనుజకీశ♦నికరతదధిపుల్. ౨౭

నూటయిరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౬ - వ సర్గము.

{ రాముఁడు సీత కందందలి విశేషములు చెప్పుచు సీతకోరినందున సుగ్రీవపత్నులఁ బుష్పక మెక్కించుకొని భరద్వాజాశ్రమముఁ జేరుట. }

చ. అనుమతి రాఘవుం డొసఁగ ♦ నాపరమోత్తమదివ్యయాన మొ
య్యనఁ బవనాభిధూతమగు ♦ నట్టిఘనంబువలెన్ వియత్తలం
బున కపు డుద్గమించి జవ♦మ్ముం దగఁ బోయెను; రాఘవుండు పో
వునపుడు నాల్గుదిక్కులకుఁ ♦ బొంకముగాఁ దనదృష్టిఁ ద్రిప్పుచున్. ౧ 5253

ఉ. చందురునెమ్మొగంబుగల ♦ త్మానుతఁ గాంచి వచించె; జానకీ!
సుందరమై త్రికూటమన ♦ క్షోణిఁ బ్రసిద్ధిని గాంచి శంకరుం
డందముమీఱ నున్నరజ♦తాచలమో యన నొప్పునీనగం
బందును గూటభాగమున ♦ నద్దియె లంకఁ జెలంగుఁ జూడుమా!. ౨ 5254

క. ఇది విశ్వకర్మనిర్మిత!, మిదిగో జనకాత్మజా! యహీనపలలమున్
మది భీతిఁగొలుపు నల్ల బు,రదవలెఁ దగియున్నసంగ♦రక్షితి సుమ్మా!. ౩

చ. వనచరరాక్షసుల్ గలిసి ♦ బాహుబలంబులఁ బోరి చాలమం
ది నిహతులైరినూ! యిచట; ♦ దివ్యవిలోచనరాజితా! యిటన్
వనజభవప్రసాదమున ♦ వాంఛలు గూర్చువరంబు లొంది లో
కనిచయబాధకుం డయిన ♦ కర్బురనాథుఁడు రావణుం డనిన్. ౪ 5256

తే. నీనిమిత్తమె తెగియె నా♦చే నితాంత
బాణదగ్ధాంగుఁడై యదె ♦ పండుకొన్న
యట్టు లున్నాఁడు; కుంభక♦ర్ణాఖ్యుఁ డిచటఁ
దెగియె నిందె ప్రహస్తుండు ♦ దివిజతఁ గనె. ౫ 5257

క. హనుమంతుఁడు ధూమ్రాక్షుని, నని నిందె వధించి పుచ్చె; ♦ నల్లె సుషేణుం
డును వీర్యబుద్ధు లొప్పఁగ, ఘనవిద్యున్మాలిఁ జంపెఁ ♦ గను మాక్షితినిన్. ౬

క. మనలక్ష్మణుండు రావణ,తనయుండగు నింద్రజిత్తు ♦ దర్పంబునఁ ద్రుం
చెను నిందు; వికటుఁ డనఁబడు, దనుజుని సంగదుఁడు చంపె ♦ దారుణరీతిన్.

సీ. అవనిజా! దుర్ధర్షుఁ ♦ డగువిరూపాక్షుండు నల్లె మహోదరుఁ ♦ డలఘుబలుఁడు
దర్పసమగ్రుఁడై ♦ తనరుమహాపార్శ్వుఁ డాయకంపనుఁడు నిం♦దందు బలయు
తాసురుల్ కొందఱు ♦ హతులైరి; రావణుభార్య మందోదరి ♦ పరమదుఃఖ
మున వేయిమందిగాఁ♦దనసవతులు సాశ్రుజలముఖంబులఁ జుట్టు♦నిలిచియుండఁ

తే. బెనిమిటిం గూర్చి యేడ్చిన ♦ పృథ్వి యిదియె;
యోవరానన! యిచట నీ♦యుదధితీర్థ
మును గనుము మేము సాగర♦మును దరించి
తన్నిశాభాగ మిట నుంటి ♦ మెన్నికొనుచు. ౧౦౪ 5260

క. మును సగరపుత్రు లేచిన, కినుకం ద్రవ్వంగ నబ్ధి♦ కేవలము మహా
త్తును గాంచె నట్టిదగు నీ,వననిధిపయి నిన్నుఁ బడయు ♦ వాంఛ దగంగన్.

తే. నలునిచే నేను గట్టింప ♦ నలఘురీతిఁ
గనఁబడెడు సేతు వదె చూడు ♦ వనజనేత్ర!
మిగులదుష్కరమగుచును ♦ దగును జుమ్ము;
జనకతనయా! యపాంపతి♦స్థాన మగుచు. ౧౦౪ 5262

క. తలఁపఁగ నక్షోభ్యంబగు, జలనిధి యిదె చూడు నిలువ♦స్థలములు నడుమన్
గలుగవు భంగమ్ముల గ,ర్జిలుచున్ జెలువారుఁ జుమ్ము ♦ సీతా! యిందున్.౧౨

తే. ముత్తియపుఁజిప్పలున్ శంఖ♦ములును వెలయు;
హనుమ దీనిని దరియించు ♦ నపుడు విశ్ర
మార్థమై దీని భేదించి ♦ యట్టె లేచి
నట్టి మైనాకమును హాట♦కాంగముగను. ౧౩ 5264

సీ. జలధిమధ్యమమున ♦ నలఘుసేతువుమీఁద నిటవానరబలంబు ♦ లెల్ల విడిసి
యుండెను జూ!; మహా♦త్ముండగు జలనిధియందు సేతువునాఁగ ♦ నమరు నిద్ది
ముల్లోకములచేత ♦ నెల్లప్డు పూజింపఁ దగినది మఱి పవి♦త్రతర మగుచు
ఘోరపాపంబులఁ ♦ గూల్పఁగఁ జాలెడు; *నంబ్వధిష్ఠాతయై ♦ యలరుచున్న

తే. యట్టివాఁడౌ సముద్రుఁ డ♦య్యవసరమున
నిందుఁ దనునొంపఁ గోపంబు ♦ నొంది యున్న
నాకు నట్టె ప్రసన్నుఁడై ♦ ప్రాకటతను
వొప్ప నగపడె; జానకీ! ♦ యుర్వి నిందు. ౧౬ 5265

క. దనుజవిభుండు విభీషణుఁ, డనఘుం డీతండు నన్ను ♦ ననువుగఁ గనియెన్;
జనకతనూజా! యిదిగో, యనువనములు చిత్రములును ♦ నగు వను లొప్పన్.

తే. రమ్యముగ సూర్యపుత్రపు♦రంబు గానఁ
బడెడుఁ గిష్కింధ కను మిందు ♦ వాలి నేను
జంపినాఁడను; నా విని ♦ సాధ్వి మున్ను
వాలిపాలితమగుపుర♦వరము దాని. ౧౭౪ 5267

* అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ ప్రభుః - అనియు. ఇట మహాదేవశబ్దము సముద్రపరమని వ్యాఖ్యాత లందఱు నర్థము చెప్పిరి. కథాసంవిధానము ననుసరించియు నది సమంజసమే. కావున నిట 'నంబ్వధిష్ఠాతయై యలరుచున్న యట్టివాఁడౌ సముద్రుఁడు' అని తెనిఁగింపఁబడినదని గ్రహింపఁదగు.

క. ప్రణయయుక్తసాధ్వసకని,మున రామునిఁగూర్చి వినయ♦మున నిట్లని ప
ల్కెను; రాజోత్తమ! యనఘా!, వినుమా! తారాదికీశ♦విభుపత్నులతోన్.

తే. ఇతరకీశేంద్రసతులతో ♦ నెలమిఁ గూడి
నీవు నేనును రాజధా♦నియయి యలరు
నాయయోధ్యకుఁ బోవంగ ♦ నాత్మఁ గోరు
చున్నదానను; నా భావ♦కోత్తముండు. ౨౦ 5269

చ. జనకజప్రార్థనంబు విని ♦ సమ్మతి మీఱఁగ నట్లె యౌను గా
కని బదులొత్తిచెప్పి ప్లవ♦గాధిపుపత్తనసీమఁ జేరి చ
క్కనియొకచోటఁ బుష్పకముఁ ♦ గ్రమ్మఱంబును నిల్పి వానరేం
ద్రుని గని యిట్లు పల్కె; నిటఁ ♦ దోఁచుప్లవంగమరాజ కాద్భుతిన్. ౨౧½

చ. జనకజకై కళత్రముల♦సంగతి రాఁదగు నయ్యయోధ్య కం
చును వచియింపు; మీవు బల♦శోభిత! వానరనాథ! భార్యలం
గొని చనుదెమ్ము సత్వరము; ♦ కోరిక సీతకు నిద్దె సుమ్ము పోఁ
జను నిఁక నంచుఁ దేజమున ♦ శాశ్వతసంపద నొప్పు రాముఁడున్. ౨౨ 5271

క. వనచరపతితోఁ దత్పురి,జనములతోఁ బల్కె; నంత ♦ సరభసముగ సూ
ర్యునినూనుఁ డంతిపురమున,కనుమతుఁడై పోయి తార ♦ నటఁ గని పలికెన్.

క. చనుదెమ్ము నీవు విక్రము,మునఁ దగుమనకీశసంఘ♦ముఖ్యులసతులం
గొనుచు నయోధ్యకు రాఁదగు, నని సీతాదేవి కోర ♦ నామె ప్రియమ్మున్. ౨౩½

ఆ. తీర్ప నెంచి రఘుప♦తియు నాజ్ఞ యిడె నాకు
జాగొనర్పవలదు ♦ సకలవాన
రాంగనలను గూడి ♦ యరుగుద మాయయో
ధ్యకును; బురము దాని ♦ నరసియందు. ౨౪ 5274

క. జనపతివిభుఁడౌ దశరథు,ననుంగుఁబత్నులను గాంచి ♦ యరుదెంతము; నా
వనచరపతివాక్యంబును, విని సర్వాభరణములను ♦ వెసఁ దాల్చి తమిన్. ౨౫½

క. తారయు వానరకాంతలఁ, జేరి వచించెన్ రయంబ ♦ శ్రీకలితవిభూ
షారమ్య లగుచు భర్తల,తో రాఁదగు మీరలెల్లఁ ♦ దోయ్యలులారా!. ౨౬½

క. ననుఁ గూడి యయోధ్యకుఁ జ,క్కనిరీతిన్ వచ్చి యందుఁ ♦ గలచిత్రములం
గనుఁగొని నాకు మనఃప్రియ,మును జేయఁగవలయుఁ బౌర♦ముఖ్యులతోడన్.

ఆ. జానపదులతోడ ♦ జానకీనాథుండు, పురముఁ జొచ్చుటను బ్ర♦భుమణియైన
దశరథేంద్రుసతులఁ ♦ దనసంతభాగ్యంబుఁ, గాంచి వత్తనుఁగ ♦ గపిలలనలు.

సీ. తారవచించు న♦త్తమవాక్యముల విని తను కాజ్ఞగా నెంచి ♦ త్వరను బూని
మంగళస్నానాది♦మహితవిధానంబులను నలంకృతలయి ♦ జనకతనయఁ
గనుకోరికలఁ బుష్ప♦కమునకు నెలమిఁ బ్రదక్షిణంబుగఁ బోయి ♦ తారఁగూడి
యెక్కిరి తారెల్ల; ♦ నిటు వార లెక్కంగఁ బైకి వేగము లేచి ♦ పరమగతిని

ఆ. నద్ది ఋశ్యమూక ♦ మనుగిరిచెంతకు, నరుగ సీతఁ గాంచి ♦ మరల రాముఁ
డనియె; భూధరేంద్ర ♦ మగు నిది కాంచన, ధాతునికరభూషి ♦ తంబ యగుట.

క. కన విద్యుద్వల్లిజయుతమా, ఘనసముదయ మట్లు మనకుఁ ♦ గన్పడియెడు దీ
నిని జూడుము; సీతా! యిట, వనచరపతితోడఁ గలియు ♦ భాగ్యము గలిగెన్.

ఆ. వాలిఁ జంప నిచటఁ ♦ బ్రతిన పూనితిఁ; జిత్ర, కాననముల నొప్పు ♦ మాననీయ
పంప యనెడు సరసు ♦ సొంపుగఁ గన్పట్టుఁ, జూడు మిదిగొ నేను ♦ శుభతరాంగి!.

క. నినుఁ బాసి మిగులదుఃఖం, బునఁ బలవించితిని నిచటఁ; ♦ బొలఁతీ! శబరిం
గనినాఁడ ధర్మచారిణి, ననుపమయోగప్రవీణ ♦ నాతటమునసే. ౩౬ 5282

తే. యోజనాయతబాహులై ♦ యొప్పుచున్న
యాకబంధుఁడు నాచేత ♦ నంతమందె
నిట; జనస్థానమునను బ♦క్షీంద్రుఁడైన
యాజటాయువు నివసించు ♦ నలరుబోఁడి!. ౩౬౹ 5283

చ. కనుకనె శ్రీసమగ్రమయి ♦ క్రాలువనస్పతి మఱ్ఱిచె ట్టిదే
కనఁబడుచుండెడున్ గను మ♦ఖండవనస్పతిచెంత నందె యో
వనితరో! క్రూరుఁడైన దశ♦వక్త్రునితోడ జటాయు వుద్ధతిన్
బెనఁగెను నీనిమిత్తమయి ♦ పెంపున ఘోరతరంబుగా నతీ!. ౩౭ 5284

క. వరవర్ణినీ! బలంబున, ఖరదూషణరాక్షసులను ♦ గడువీర్యమునన్
బరఁగెడు త్రిశిరుని*లక్ష్యము, సరిగా భేదించుబాణ♦జాలంబులతోన్. ౩౮

తే. నేను జంపితినో యెందు ♦ నూనగాత్రి!, యామునినివాసమైనట్టి♦యాశ్రమమిదె
కనుమ!; శుభదర్శనంబునై ♦ కడువిచిత్ర, మైనమునపర్ణశాలయిం♦పలరుఁజుమ్ము!.

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ దా నిను మోసమునన్ హరించె నో
వనరుహనేత్ర! యిచ్చటనె; ♦ వర్ణ్యవినిర్మలవారిపూరమై
కనఁబడుగౌతమీనది ని♦కామశుభప్రద మాచుఁ జూడుమా!
కను మదిగో యగస్త్యముని♦కాంతుని యాశ్రమ మోతలోదరీ!. ౪౧౹ 5287

ఆ. అదె మహాత్ముఁడైన ♦ యాసుతీక్ష్ణమునీంద్రు
నాశ్రమంబు రుచుల ♦ నలరుఁ జూడు;
మోమనోజ్ఞగాత్రి! ♦ యుద్ధతరిపుదర్ప
నాశకుఁడు సహస్ర♦నయనుఁ డెలమి. ౪౨౹ 5288

క. చనుదెంచెనో యెచటికి నా, మునిపతి శరభంగుఁడున్న♦భూమి యిదియె, యా
తనియాశ్రమమదె యాపద, మున నెమహాంగుండుదనుజ♦ముఖ్యుఁడు నగుచున్.

క. తనరు విరాధుఁడు నాచే, వినిహతుఁడై చనియె యక్ష♦విభులోకమ్ముం
గన; [2]సింహమధ్యమా! యివె, మునమున్నమహర్షి సంఘ♦మహితాశ్రమముల్.

---

1 మయా బాణై రజిహ్మాగైః-అనిమూ. 2 దృశ్యంతే తనుమధ్యమే-అనిమూ.

సీ. ఇట మానికులపతి ♦ యనవహ్నిసమతేజుఁడై నయత్రిమునీంద్రుఁ♦డలరువాఁడు;
ధర్మచారిణియగు ♦ తాపసి ననసూయ దర్శించితి విట సుం♦దరతరాంగి
యదె పర్వతశ్రేష్ఠ ♦ మగుచిత్రకూటంబు భాసిల్లుచున్నది ♦ పద్మనయన!
కైకకుమారుండు ♦ కాంతుతో నను సుప్రసన్నునిఁ జేయ నె♦చ్చటికి వచ్చె

తే. నాస్థలం బిదె; యల్లదె ♦ యతివిచిత్ర
కాననంబులదవ్వునఁ ♦ గనఁబడియెడు
యమున, శ్రీమంతమగుచు ము♦ను మన మున్న
యాభరద్వాజునాశ్రమం ♦ బంతికమున. ౮౭ 5291

క. విలసిల్లుచుఁ గనఁబడియెడు;, విలాసినీ! త్రిపథగయయి ♦ విష్ణుపదజయై
చెలఁగెడు గంగానది యిదె, పలువిధముల పక్షులు తట♦భాగము లందున్.

తే. చెలఁగుచుండఁ బ్రపుష్పిత♦ములగు విపిన
ములను నలరారుచున్నది; ♦ లలన ! యిదియె
శృంగిబేరపురోత్తమ ♦ మిందె గుహుఁడు
వచ్చె మనయంతికమునకు ♦ సచ్చరితుఁడు. ౮౮½ 5293

చ. జనకసుతా! కనంబడెడుఁ ♦ జక్కనియూపము లెన్నొ చాలుగాఁ
గను సరయూసమాఖ్య నది ♦ క్రమ్రవిచిత్రతరువ్రజంబుఁ బూ
చిన విపినంబు లీనదికిఁ ♦ జెల్వుగ నొప్పుఁ దటంబులందు, మా
జనకునిరాజధానియగు ♦ చక్కని పత్తన మద్దె చూడనొ. ౮౯½ 5294

తే. మనము మరల నయోధ్యను ♦ గనెడుభాగ్య
మలర వచ్చితి మక్లాట ♦ నమలభక్తి
నందనము చేయుమా! యన ♦ వనచరపతి
దనుజపతియగా విభీషణుఁ♦డును నితరులు. ౯౦ 5295

చ. త్వరపడి లేచి మంగళద♦దర్శనమై బెడఁగై యయోధ్య నాఁ
బరఁగుపురంబు గాంచి; రది ♦ పాండురహర్మ్యకదంబయుక్తమై
సురుచిరభూరికక్ష్యలను ♦ సొంపులఁ గాంచుచు మేటియేనుఁగుల్
తురగములున్ నితాంతమును ♦ దోఁప మహేంద్రపురంబునాఁ దగెన్. ౯౧½

క. వనచరులు సాంద్రసౌధము,లను వన్నెలు గులుకుచున్ వి♦లాసము మీఱం
గనఁబడుచున్న యయోధ్యను, గని రెంతయు లేచి లేచి ♦ కడుఁ బూనికలన్.

నూటఇరువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౭ - వ సర్గము.

రాముఁడు భరద్వాజాశ్రమమున నొకదివసము వసించి వరముఁ బొందుట.

తే. *అంతఁ బదునాలుగై నహో♦యనము లట్లు
నిండఁగా లక్ష్మణునియగ్ర♦జుండు చైత్ర
శుక్లపక్షమియందు ని♦స్తులతపోవి
భూతిగల్గు భరద్వాజు ♦ ఖ్యాతయశుని. ౧ 5298

ఆ. చేరఁ బోయి నియతుఁ♦డై రాముఁ డతనికి, వందనంబు చేసె; ♦ భక్తి నిట్టు
లాతపోధనునకు♦నభివాదనము చేసి, యోమహాత్మ! యాయ♦యోధ్యయందు.

క. వినుచుందువా? సుభిక్షం,బు ననామయము భరతుండు ♦ పూని ప్రజాపా
లనమున నెచ్చరికను బొం,దునుగాదే? తల్లులుం బ్ర♦దుకుఁ గనువారే?.

క. అని యడుగ మహాత్ముండగు, మునిపతి శ్రీరాముతోడ ♦ మోదంబున ని
ట్లనియెను స్మితపూర్వముగా;, ననుజుఁడు భరతుండు ధూళి♦యందు మునుఁగుచున్

తే. జడలు దాలిచి పాదుకల్ ♦ పుడమిఱేఁడు
గాఁ దలంచుచుఁ బ్రజలను ♦ గాచుచు; భవ
దాగమనమును గోరుచు ♦ నందె యున్న
వాఁడు గృహమున క్షేమమె ♦ వసుమతీశ!. ౪ 5302

సీ. అరినిషూదన! తండ్రి♦యానతి నొనరించు కోరిక ధర్మమే ♦ కోరి నార
చీరలు దాలిచి ♦ సీతయు సౌమిత్రి వెనువెంట రా రాజ్య♦మును విడుచుచు
గహనంబునుం బొంది♦క్రమ్రభోగంబుల విడనాడి మఱియుఁగా♦ల్నడకలఁ ద్రిది
వమును బాసిన సుర♦వర్యునిఁ బోలుచు సర్వస్వమును మాని ♦ సాంద్రనియతిఁ

ఆ. బూని వచ్చినపుడు ♦ పొగిలె నా చిత్తంబు
మూలఫలములఁ దినఁ ♦ జాలు నెట్టు
లనుచు; నిపుడు రిపుల ♦ నడఁచి కార్యంబులఁ
బండఁ జేసికొనుచుఁ ♦ బ్రాభవమున. ౬ 5308

క. వరమిత్రబంధువులతో, నరుదెంచిన నిన్నుఁ గాంచి ♦ యతిశయమోదం
బరుదుగ మదాత్మ పొందెను;, ధరణీశా! నీకు నచటఁ ♦ దగినసుఖంబుల్. ౭

క. పంచవటియందుఁ గల్గుట, మించిన దుఃఖము లధర్మ♦మిత్రువలనఁ బ్రా
పించుట నెఱిఁగితి మదిలో;, నెంచఁగ ధర్మమునఁ బ్రీతి ♦ నెసఁగెదు నీకున్.

క. వినుము జనస్థానంబున, దనుజులతో మిగులఁ బగయు ♦ దగులువడుటనీ
వును ఘోరమూర్తులగు నా,దనుజుల ఖరముఖుల బాహు♦దర్పస్ఫూర్తిన్.

క. అనిఁ జంపుటయును, ఘనులగు, మునులను ధర్మమును గావఁ♦బూని చరింపం
గను సాధ్విని నీజానకి, దనుజేంద్రుఁడు రావణుండు ♦ తా మోసమునన్.

---

* పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః,=పంచమ్యాం చైత్రశుక్లపంచమ్యామ్-
అనియూ.

ఆ. అపహరింపఁ దలఁచు ♦ టల్లి మారీచుండు
మాయఁ బూని మృగము♦మాడ్కి వచ్చు
టయును, సీతయపహృ♦తయు నగుటయు, వన
మందు నా కబంధుఁ ♦ డగపడుటయు. ౧౧ 5308

క. అంతటఁ బంపాఖ్యసరః,ప్రాంతంబున కేగుటయును ♦ భాస్కరసుతుతో
నెంతయు సఖ్యముగల్గుట, యంతట నవ్వాలి నొక్కయమ్మున నీవున్. ౧౨

క. పొలియించుటయును సీతం, గలయన్ వెదకుటయు, హనుమ♦కడఁగి జవమునన్
జలనిధి దాఁటియె లంకను, నలఘుపరాక్రమముతోడ ♦ ననలునినోటన్.౧౨౫

క. పడవేయుటయును; నీయీ,పడఁతియునికి తెలిసినంతఁ ♦ బటుశక్తిని మిం
చెడు నలుచే సేతువు నా, జడనిధిఁ గట్టించుటయును ♦ శక్తిమెఱయఁగన్.౧౩

చ. వనచరయూథపుల్ మునను ♦ వర్ధిల లంకను గాల్చినట్టిరీ
తిని, సురకంటకుం డగుచుఁ ♦ దేఁకువ మించినరావణుండు చ
య్యన సుతమంత్రిబాంధవను♦హాబలవాహనపంక్తితో దురం
బున వధియింపఁగాఁ బడిన ♦ పోల్కియు బ్రహ్మముఖామరోత్తముల్. ౧౪౫

క. నినుఁ గానవచ్చుటయు నా,యనిమిషపతి వరము లొసఁగి♦యరుగుటయును*నే
*ననుపమతపోబలంబునఁ, గనినాఁడం జుమ్ము!; దివ్య♦కార్ముకధారీ!. ౧౫౫ 5813

క. వరశస్త్రధరణ! నేనును, వర మొసఁగెద నడుగు మేను ♦ వాంఛించినయీ
సురుచిరపూజంగొనుమా, యరుగం దగు దే పయోధ్య ♦ కతిమోదమునన్.

చ. అన విని ధీవిలాసుఁడు నృ♦పాత్మజుఁ డమ్మునివాక్యముల్ శిరం
బున గ్రహియించి తమ్మునకు ♦ ముందుగ దూతను బంప నెంచి మీ
యనుమతినే యొనర్తునని ♦ హర్షమునన్ వచియించి తా వరం
బును నడుగంగఁ బూని ముని♦పుంగవుతో నిటు పల్కె వేడుకన్. ౧౭౫ 5815

క. మునివర్య! యయోధ్యకు నేఁ, జనుమార్గమునందు వృక్ష♦షండ మసమయం
బునఁ గూడ ఫలములను మధు,వున నొప్పుచునుండవలయుఁ♦బూతఫలంబుల్.

తే. అమృతకల్పంబులయి రుచు ♦ లలర బహువి
ధములుగా నుండవలయు వ♦రమును దీని
నిమ్ము నా కనియడుగ న♦ట్లే చెలంగుఁ
గాకయని పల్కె నంత న♦నోకహములు. ౧౯౫ 5817

క. సురపురిఁ గలపాదపముల, కరణి సమృద్ధంబు లగుచుఁ ♦ గానంబడియెన్
హరు లయ్యయోధ్యఁ గానఁగ, నరిగెడునామార్గమందు ♦ హరితరములై.

తే. యోజనత్రయపర్యంత ♦ మొక్కరీతి
నెట్లుచూచిన నిమ్నల♦వృక్షతతులు

* సర్వం మమైత ద్విదితం తపసా-అనియూ.

ఫలయుతము లయ్యె సుమహీన♦ములు సురుచిర
పుష్పసంయుక్తము లగుచుఁ ♦ బొలిచె మిగుల. ౨౦౪ 5319

క. తరువులు శుష్కము లొప్పెను, సురుచిరపత్రములతోడ ♦ సోనలుగ మధూ
త్కరములు గురిసెను నావన,చరపుంగవు లంత హర్ష♦సాంద్రహృదయులై.

క. తనువులఁ బులకాంకురములు, గనఁబడ దివ్యంబులైన ♦ కమ్రఫలంబుల్
మనసార వేలకొలఁదిగఁ, దినుచున్ స్వర్గమునుబొందు ♦ తీరునఁ బొదలన్.

నూటయిరువదియేడవ సర్గము సంపూర్ణము

---

౧౨౮ - వ సర్గము.

{ హనుమంతుఁడు రామాజ్ఞచే గుహునకు భరతునకు శ్రీరామాగమనము దెల్పుట. }

క. జనపతియు నయోధ్యాపుర,మును మదిలోఁదలఁచుకొనుచు ♦ ముందిఁకఁ జేయం
గను దగినపని యదేమో?, యనియాలోచించె; నిట్టు ♦ లాత్మఁ దలఁచుచున్.

*చ. వనచరపుంగవుండయిన ♦ వాయుకుమారునిఁ జేరఁ బిల్చి యి
ట్లనియె; నయోధ్యలో నృపగృ♦హంబున నందఱు క్షేమమే కదా?
యని తెలియందగున్; మఱియు ♦ నట్టులె పోవుచు శృంగిబేరప
త్తనమును జేరి యందలరు ♦ ధర్మవిదుత్తమునిన్ నిషాదపున్. ౧॥ 5323

క. వనగోచరు గుహుఁ బ్రీతిని, గని నేనే చెప్పినట్లు♦గాఁ గుశలంబున్
వినిపింపు; మతఁ డరోగం,బునఁ గుశలముగాఁగ నేనుఁ ♦ బురికిన్ మరలన్. ౨॥

క. చనుదెంచుచున్నవార్తను, వినినంతనె నన్నుఁ బాసి ♦ వెతఁ గుడిచెడుఁ గాఁ
పుననాచింతనువిడుచుచు,మనమునఁగనఁగలఁడుముదము♦మాన్యుఁడతఁడునూ!.

తే. అతఁ డాత్మసమానుఁడై ♦ నట్టి సఖుఁడు;
మారుతీ! యాగుహుండు స♦న్ముదము నొంది
చక్కఁగా నీవయోధ్యకుఁ ♦ జనుపథంబు
భరతుకుశలంబు నీకుఁ దె♦ల్పఁగలఁ డతఁడు. ౪॥ 5326

సీ. నావచనంబుగ ♦ నాతమ్మునకు నాదుకుశలంబు వినిపింపు ♦ కోర్కి నీవు
వనవాసమును దీర్చి ♦ జనకుని సత్యంబు నెఱవేర్చి లక్ష్మణు♦ని సతియైన
జనకజనుం గూడి♦చనుదెంచితిని క్షేమముగ యంచువచియింపు♦ముమఱియడవి
బలవంతుఁడైన రా♦వణుఁడు సీతను గొనిపోవుట సుగ్రీవు♦పొందు నేను

ఆ. జేయుటయును నతని♦జ్యేష్ఠుఁడౌ వాలిని, సంగరమున నేను ♦ జంపుటయును
సీత వెదకుటయును ♦ జేరరాక యపార,మైన జలధిదాఁటి ♦ యవలి కేగి. ౭

* జానీహి కచ్చి త్కుశలీ జనో నృపతిమందిరే-అనిమూ.

చ. జనకజ నీవు గాంచుటయు ♦ సత్వరమే యరుదెంచి యీసువా
ర్తను వినిపింప నందఱము ♦ తద్వనరాశిసమీపభూమికిం
జనుటయు నబ్ధిదర్శనము ♦ సాగరుం దాఁగి సేతుబంధనం
బును మఱి నేను రావణుని ♦ ఘోర వధించుటయుం గ్రమంబుగన్. ౮౹

క. వినిపింపు మఱియు వరుణుఁడు, వనజభవుండో ననంగ ♦ వాసవుఁ డటని
చ్చినవరముల తెఱఁగును శం,భునికరుణం దండ్రితోడఁ ♦ బొత్తమురుటయున్.

క. భరతునకుం జెప్పుము; ని,ర్జరపతిరిపుతోడ వాలి♦సహజునితో నే
నరుదెంచితిఁ జెంతకునని, మరుదాత్మజ! సౌమ్య! తెలుపు♦మందమృదూక్తిన్.

తే. ఇట్టివార్తను విని నప్పు ♦ డెట్టి యాకృ
తిని ధరించునో నన్నుఁ గూ♦ర్చినవిషయము
లందు నింగితచేష్టాదు ♦ లతని యందు
నెట్లు గనఁబడునో వాని♦నెల్ల నీవు. ౧౦౹ 5331

క. పరికించి తెలిసికొనఁదగు;, భరతునితో రాఘవుండు ♦ పరులగణములం
బొరివుచ్చి సాధుయశమును, నిరుపమమును బొంది కోర్కి♦నెఱి ఫలియింపన్.

క. బలవంతులైన మిత్రులఁ, గలిసి సమీపించి యిదిగో ♦ కదలి యిటకు ను
జ్జ్వలరీతి వచ్చుచున్నాఁ, డలఘుగుణా! యంచుఁ బలికి ♦ యవ్వల నీవున్. ౧౨౹

సీ. భరతునియానన♦వర్ణంబు చేతను దృష్టిభాషణముల ♦ నీవు భరతు
వృత్తాంతముల మఱి ♦ యింగితంబుల నెల్ల నున్నవి యున్నట్టు♦లొగి నెఱుంగ
వలయును నీయందు ♦ భక్తిఁ జెలంగెడు భరతునిరీతుల ♦ నరయు నేల
యందువో? యెల్లప్పు ♦ డఖిలకామసమృద్ధమయి కరిహయముల♦స్యందనముల

తే. గ్రాలి వంశపరంపరా♦గతమునయిన
రాజ్యమును నేరిచిత్తం బ♦పూజ్య మేల
యని త్యజింపఁగఁ గోరు? నా♦యనుజు మాట
పలుకఁగా నేల? గుణమణి♦కలితుఁ డతఁడు. ౧౪౹ 5334

క. *మనమున రాజ్యముఁ బాలిం,పను గాంక్ష యొసంగ నేమి♦పనియొనరుచు నా
తనిచేష్ట లెఱిఁగి నే నే,పనిచేయఁగవలయుననుచుఁ ♦ బలికెదో హనుమా!.

క. ననుఁ జిరకాలమ్మునకుం, గని నాయం దెప్పు ప్రీతిఁ ♦ గను భరతుఁడు తా
ననుపమరాజ్యం బేలం,గను గోరునయేని సర్వ♦కామభరితమై. ౧౫౹ 5336

క. తనరారు నెల్ల భూతల,మును నేలుంగాక తండ్రి ♦ మును పభిషేకం
బును నాకుఁ జేసి ముదమును, గనఁ జాలకపోయె నేను ♦ గనుదును దానిన్.

తే. బుద్ధిమంతుఁడు గావున ♦ భూమి నెల్లఁ
బాలనము చేయఁగలఁడు; పా♦వని! మదీయ

---

* ఇది యువతారికముఁ దెలుఁగని గ్రహింపవలయు.

సన్నిధిని రాజ్య మాతండు ♦ సంగ్రహింప
నున్న బుద్ధినిశ్చయముల ♦ నొగి నెఱింగి. ౧౬ 5338

చ. మనమున రాజ్యముం గొనెడు ♦ మాడ్కిగఁ దోఁచిన నిందునుండి మే
ముని బురిచెంతఁ జేరుటకు ♦ ముందె జవంబున మమ్ముఁ జూడ రాఁ
జను; నటు లేని పక్షమున ♦ స్పర్శనపుత్రక! యందె నిల్వుమా
యని ప్రతికూలభంగిఁ దన ♦ కానతి నారఘురాముఁ డీయఁగన్. ౧౭ 5339

చ. [1]అనిలతనూజుఁ డంత మను♦జాకృతిఁ దాలిచి వే యయోధ్యకుం
జనుటకు నుత్సహించె; నిటు ♦ స్వాంతమునం దలపోసి యమ్మరు
త్తనయుఁడు [2]సర్పవర్యమును ♦ దా గ్రహియింపఁగఁ గోరి దానిపై
కనుపమ వేగ మొప్ప విన♦తాత్మజుఁ డేగెడునట్టు లొక్కటన్. ౧౮ 5340

ఆ. అంబరమున కెగసి ♦ యతివేగమునఁ బోయె;
వీర్యములరుచుండఁ ♦ బిత చరించు
పథమునందు నరిగి ♦ [3]ఫణివరస్థానమై
శుభకరంబునగుచు ♦ సొబగుమీఱె. ౧౯ 5341

క. గంగాయమునాతటినీ,సంగమ మనఁ బరఁగుచున్న ♦ స్థలము గడచి యు
ప్పొంగుతమి శృంగిబేరము,నం గడుఁ జెల్వమరు పత్త♦నంబును జేరెన్. ౨౦

తే. అందు గుహుఁ గని హర్షంబు ♦ నంది శుభము
గాఁ దగిన వాక్యముల నిట్లు♦గా వచించె;
సత్యవిక్రముఁడును గకు♦త్స్థకులభవుఁడు
నీకు సఖుఁడును నగు రామ♦నృపతి యిపుడు. ౨౧ 5343

క. అనుజుండగు లక్ష్మణుతో, వనితామణితోడఁ గూడి ♦ పలుకుము క్షేమం
బని చెప్పె; భరద్వాజుని, పనుపున నీపంచమినిశఁ ♦ బరమముదమునన్. ౨౨

ఆ. అందె గడపి యెల్లి ♦ యరుదేరఁ గలఁడు సు
మ్మతనిఁ జూడగలవు ♦ హర్ష మొదవ
సత్వరంబ; యనుచు ♦ శ్వసనపుత్త్రుఁడు మహా
తేజుఁ డధికవేగ♦దీపితుండు. ౨౩ 5345

క. పలికె జగన్మోదదమయి, విలసిలు రామాగమనము ♦ వినిపింపంగా
వలసిన భాగ్యము నాకుం, గలిగెఁ గదా యనుచును [4]బుల♦కయుతకచుండై.

క. గిరివిపిననదులమహిమలఁ, బరిపాటింపకయె యభ్ర♦పథముల కెగసెన్;
బరశుధరుండగు రాముని, వరతీర్థము మార్గమందు ♦ వాలుకిని నదిన్. ౨౪

1 మానుషం ధారయన్ రూప మయోధ్యాం త్వరితో యయౌ-అనిమూ. 2 గరుత్మా నివ వేగేన జిఘృక్షన్ భుజగోత్తమమ్-అనిమూ. 3 భుజగేంద్రాలయం శుభమ్-అనిమూ. 4 సంప్రహృష్టతనూరుహః-అనిమూ.

తే. ఖ్యాతిఁగన్నట్టిగోమతి♦యనెడునదిని,భయదమౌభీమసాలాఖ్య♦వనము,బహువి
ధములనొప్పారు సస్యమ్ము♦లమరనున్న, కోసలాఖ్యదేశంబులఁ ♦ గోర్కె నందు.
క. కనఁబడు ప్రజలను గనియెను;, వనచరకుంజరుఁ డతండు ♦ బహుదూరము చ
య్యనఁ జని నందిగ్రామం,బునకు సమీపమునఁ బుష్ప♦ములఁ దగుతరులన్.
చ. కనఁగొనె; నాద్రుమంబులు ని♦కామము ప్రీతిని నెల్లవారలుం
గనునటులుండుఁ గానఁ దమ♦గాదిలిపుత్రులతోడ స్త్రీలు వృ
ద్ధనికరమందుఁ గ్రీడల స♦తంబును సల్పుచునుందు; రావనం
బునఁ గలవృక్షముల్ సురవి♦భుప్రియనందనవృక్షసంతతిన్. ౨౯ 5350
తే. అర్థపతిచైత్రరథవన♦మందు నలరు
తరువరంబులఁ బోలి యెం♦తయును వెలయు;
*నాయయోధ్యకు ఘటికాద్వ♦యప్రయాణ
మునకుఁ దగినంత దవ్వునఁ ♦ దనువుసందు ౨౭ 5351
తే. నారచీరలు కృష్ణాజి♦నకృతవస్త్రములు చెలంగఁగ నాశ్రమ♦మున వసించి
చిక్కి రామునిరామికి ♦ మిక్కిలి వగ,పొంది దీనుండునై జడల్♦పూని నియతి.
సీ. భ్రాతృవ్యసనమున ♦ వపువు కృశింపఁగఁ బంకదిగ్ధాంగుఁడై ♦ఫలము లల్లి
కందమూలంబులు♦నుం దనకశనంబులుగ దాంతుఁడై దృఢం♦బుగఁ జెలంగు
తాపసవృత్తిని ♦ ధర్మముల్ సలుపుచుఁ బొడువుగా జడలగుం♦పులు తగంగ
వల్కలాజినములఁ ♦ బైన నెట్టులో కప్పుకొని వాఙ్నియమమును ♦ దనర భావి
తాత్ముఁడై బ్రహ్మర్షి ♦ కిమకు తేజంబున నలరుచు శ్రీరాముఁ ♦ డాదరమున
తే. నిచ్చి పోయినపాదుక ♦ లెదుట నునిచి
వసుధఁ బాలించుచున్ జతు♦ర్వర్ణముల ప్ర
జలను సుంతయు భీతిలే ♦ కెలమి నొందఁ
గాచుచుండెడుభరతుని ♦ గనియె నచట. ౩౧ 5353
చ. అతనిని జాగరూకులయి ♦ యాత్మవిశుద్ధిని గాంచియున్న మం
త్రితతులునుం బురోహితులు ♦ తెంపునమించెడు వాహినీశులున్
జతనముమీఱఁ గొల్చుచును ♦ సర్వవిధంబుల భూమి నేలు స
న్మతివిభవంబునన్ విభుని ♦ మానితు రాముని లోఁ దలంచుచున్. ౩౧౪ 5354
తే. కావిరంగులవస్త్రముల్ ♦ గట్టి యుండి;,రట్లు గట్టంగఁ గారణ ♦ మరయ వారు
రాజపుత్రుం డతండు చీ♦రవసనములఁ,దాల్చి యుండఁగఁదారు నా♦ధర్మరతుని.
తే. వదలి మంచివస్త్రంబుల ♦ వరుసఁ గట్టి
సకలభోగంబులను బొందఁ ♦ జనదటంచు

---

* క్రోశమాత్రే త్వయోధ్యాయాః-అనిమూ. క్రోశమాత్రే ఘటికాద్వయమాత్రే-అనివ్యా
ఖ్య. అనఁగా రెండుగడియలు నడుచుదగినంత దూరము అనిభావము.

నాళలను మాని యతనినే ♦ యాశ్రయించి
కాచియుండిరి రాముదా♦కను ముదమున. ౩౩ 5356

చ. అనిలజుఁ డంత ధర్మవిదుఁ ♦ డౌచు మఱొక్కశరీరముం ధరిం
చిన యలధర్మమట్లుగ శు♦చిం దరిగొల్పి శరీరముం ద్యజిం
పను దలపోయునాభరతుఁ ♦ బావను గాంచి కరంబు లొగ్గి యి
ట్లనియెను; దండకాఖ్యవన♦మందునఁ జీరజటాధరుండుగాఁ
దనరెడు నెవ్వనిన్ గుఱించి ♦ తద్దయు నీవిటుఁ జింతనొందెదో?. ౩౪ 5357

క. ఆరాముఁడు తనకుశలము, గారవమున నీకుఁ జెప్పఁ♦గా ననుఁ బనిచెన్;
శ్రీరాముని ప్రియవార్తా,సారము వచియింతు దాని! సంగతివలనన్. ౩౫

తే. దారుణంబైన యిట్టిచిం♦తను ద్యజింపఁ
గలవు వినుమీ ముహూర్త మం♦దెలమి నన్న
యైన రాముని గూడుదు ♦ వాఘునుండు
రావణుని జంపి తనదుభా♦ర్యయగు సీత. ౩౬ 5359

క. మరలం బడసి ఫలించిన, వరకాంక్షలతోడ బాహు♦బలవిక్రములై
పరఁగెడు మిత్రులతో నిదె,తురుదెంచుచు నున్నవాఁ డ♦హార్యశ్రీతిన్. ౩౭

క. గురుతేజుఁడు సౌమిత్రియు, నరుదెంచుచునున్నవాఁడు ♦ యశమున మిగులం
బరఁగెడు సీతయుఁ గోరిక, లరుదుగ ఫలియింపఁగాఁ బ్ర♦హర్షము మిగులన్.

తే. అమరపతిఁ గూడుశచివలె♦నాత్మవిభునిఁ,గలిసివచ్చుచునున్నదో♦యలఘుచిత్త!
యనుచుఁ బావనిపలుకంగ♦నన్నయందు,వత్సలుండగుభరతుఁడ♦వార్త కాత్మ.

తే. హర్షమును బట్టఁగా లేక ♦ యట్టె నేలఁ
బడెను మిక్కిలిహర్షంబు ♦ వఱలు మూర్ఛ
మునిఁగె నీవార్తకే యిట్లు ♦ మూర్ఛవోయె
నింక రాముఁడె కనఁబడ ♦ నేమి యగునొ. ౩౮ 5363

క. భరతుఁడు సిరివెలయఁగ న,త్తరుణంబున క్షణములోనఁ ♦ దా లేచి మహా
త్తరముదము నొనఁగువార్తను, వరునం బల్కెడు మహాత్ము♦వాయుతనూజున్.

తే. తెప్పిఱిలి కౌఁగిటం జేర్చి ♦ యప్పుటివగ
నవలఁ దోఁగియుచుఁ బ్రీతిమ♦యంబులైన
బాష్పములచేతఁ బావని ♦ వపువుఁ దడిపె;
నంత హనుమంతుఁ గని యిట్టు ♦ లనియె నతఁడు. ౪౦ 5365

చ. మనమున నీతఁడౌనె యొక♦మర్త్యుఁ డటంచును సంశయించుచున్
వినుతగుణా! కృపానిలయ! ♦ విస్తృతిఁ గాంచిన ప్రీతి నిట్లు వ
చ్చిన దివిజుండవో? యిటకుఁ ♦ జెల్వమరంగ నరుండవో? యెఱుం
గను బ్రియవార్త లాడెదవు ♦ కన్నుతరంబుగ నోమహామతీ!. ౪౧ 5366

తే. ఇట్టిప్రియతమవార్తల ♦ కేను గాన్క
గాఁగ గోలక్షలను నూఱు ♦ గ్రామములను
జారుకుండలములఁ దాల్చి ♦ సాధువినుత
శీలముల మించి ముఖము శ ♦ శివలె మెఱయ. ౪౭ 5367

క. కనకచ్ఛాయయు నాసిక,యు నూరువులు సుందరతను ♦ నొప్పఁగ వెలయం
గను సర్వాభరణంబులఁ, దనువులు సొంపుగ రహింపఁ ♦ దగినకులంబుల్. ౪౮

క. జాతియుఁ గల్గి చెలంగెడు, నాతులఁ బదియాఱ్వురను మ ♦ నం బలరన్ వి
ఖ్యాతిని బెండ్లాడఁగ సం,ప్రీతిని నేనిత్తు ననుచుఁ ♦ బృథ్వీశజుఁడున్. 5369

చ. వనచరవీరునిన్ గుఱిచి ♦ వర్ణ్యముగా వచియించి యద్భుతం
బనఁదగు రాముసాగమన ♦ మాతనినుండి యెఱింగి యన్ననుం
గనుఁగొను వేడ్క యుబ్బఁ గపి ♦ కాంతుని గన్గొని హర్ష మబ్బె న
మ్మనమునఁ బట్టఁ కుబ్బఁ బవ ♦ మానతనూజునితోడ నిట్లనెన్. ౫౦ 5370

నూటయిరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨౯ - వ సర్గము.

భరతునకు హనుమంతుఁడు రామునిసకలవృత్తాంతమును దెల్పి సంతుష్టుఁ జేయుట.

చ గురుతరకాననంబునను ♦ గొంకక పెక్కుశరత్తు లుండి భూ
వరుఁడయి నాకు నాథుఁడయి ♦ భాసిలురాఘవునిన్ గుఱించి యి
త్తరుణమునందు వింటిఁ గద ♦ *ధాత్రి మనుష్యుఁడు నూఱువర్షముల్
వరుసగఁ బ్రాణయుక్తుఁడయి ♦ వర్ధిలెనేఁ గను మోదముల్ గడున్. ౧ 5371

క. అను నీనానుడి సత్యమె, యని నాకుం దోఁచుచున్న ♦ దని పవనజుఁడున్
మును సంగ్రహముగఁ దెల్పిన, వనచరరాఘవులమైత్రి ♦ వరుసం దెలియన్.

చ. మనమున నెంచి యిట్లనియె ♦ మానధనా! కపిరాజుతోడ రా
మున కెటు మైత్రిగల్గెఁ గత ♦ ముల్ వినఁగోరెద నేప్రదేశమం
దున నది దేనికై గలిగెఁ? ♦ దోరపువేడుకఁ బ్రశ్నచేయునా
కనఘ! యథార్థరీతి ముద ♦ మంద వచింపుము మైత్రిపేర్మిచేన్. 3 5373

చ. అని వచియించి మానితతి ♦ కర్హముగాఁ దగు నాసనంబు నా
తని కిడ రామమూర్తిచరి ♦ తంబు వనంబున నైనఁ దానిఁ జె
ప్పను దలపోసి యాభరతుఁ ♦ బావనుఁ గాంచి మరుత్తనూజుఁ డి
ట్లనియె; విభూ! భవజ్జనని ♦ కాదృతి మీజనకుండు ప్రీతిచేన్. ౪ 5374

సీ. వరము లొసంగుట ♦ వానికై యడవికిఁ బంపఁగాఁ బడుటయుఁ ♦ బార్థివుండు
రాముఁ బాపిన వగ ♦ రయమునఁ జచ్చుట రాజగేహమునుండి ♦ రాజదూత

---

* ఏతి జీవంత మానందో నరం వర్షశతా దపి-అనియూ.

లీయయోధ్యకునిన్ను ♦ నీయనుజునితోడఁ గొనివచ్చుటయు రాజ్య ♦ మును గ్రహిం
దలఁపక నీవును ♦ దన్యుహంతవు సజ్జనాదృతధర్మంబు ♦ నాశ్రయించి [పఁ

తే. చిత్రకూటంబునకుఁ బోయి ♦ శ్రీరఘుపతి
రాజ్యమును గైకొనంగఁ బ్రా ♦ ర్థనము సల్పు
టయును రాముండు తండ్రిమా ♦ టనె గ్రహించి
దాని నొల్లక వదలంగఁ ♦ బూనుటయును. ౭౫ 5375

తే. అన్నవగుపూజ్యపాదుక ♦ లంది నీవు, మరలివచ్చుటయు నను నీ ♦ చరిత మెల్లఁ
దత్వముగ నీకుఁ దెల్లంబ ♦ తరలినీవు, పాదుకలు గొంచు నరిగినఁ ♦ బార్థివనుత!.

క. తరువాతివార్త నంతయు, వరునగ వచియింతు; మరలఁ ♦ బత్తనమునకీ
వరుగఁగ నపూర్వపురుషులఁ, బరికించుట నచటి పక్షి ♦ వారమృగతతుల్. ౯౫

క. కలయం బరుగిడఁగా ని,మ్ములఁ బరితాపంబుఁ దరుణ ♦ మున నిటఁ గనిన
ట్లు లలిం దోఁచెను; నంతట, నిలాధవుండును మహావ ♦ నేభయుతుండై. ౧౧

తే. పులులు సింగంబులును మృగం ♦ బులు వెలయఁగ
భయదమై నిర్జనంబునౌ ♦ వనము మిగుల
విస్తృతంబును నగుదాని ♦ వేగ చేరె;
రాఘవులు సీతతో మహా ♦ రణ్యమందు. ౧౧౹ 5379

క. చనుచుండ విరాధుండను, ఘనబలుఁడౌ రాక్షసుండు ♦ క్రందుగ శబ్దం
బును జేయుచు నడ్డముగాఁ, గనఁబడియెను వారిముందు ♦ గా; నీరీతిన్ ౧౨

క. ఘననాదం బొనరించుచుఁ, దన బాహువు లెత్తి రాఁగఁ ♦ దలక్రిందుగ నా
తనిఁ బట్టియెత్తి గర్తం,బున నార్చెదు మదగజంబుఁ ♦ బోలెను వారల్. ౧౩

తే. పడఁగవైచి స్థాపించి ర ♦ ప్పుడు సహజులు
రామలక్ష్మణు లటు దుష్క ♦ రమగు కార్య
మును సమాప్తము నొందించి ♦ చని తదీయ
నిశన కమనీయశరభంగు ♦ ని పదమునకు ౧౪ 5382

క. చని రంతట; శరభంగుఁడు, మునిపతి దేవతలలోక ♦ మున కేగంగాఁ
గని సత్యపరాక్రముఁడగు, జనపతి యటనున్న మౌని ♦ శత్రుల కెలమిన్. ౧౪౫

తే. వందనం బిడి యటనుండి ♦ సుందరమగు
నాజనస్థానమును జేరె; ♦ నంతఁ గొంత
కాలమున కచ్చటికి వచ్చెఁ ♦ గఠినచిత్త
మైన శూర్పణఖాహ్వయ ♦ యంతలోన. ౧౬౹ 5384

క. రామునియానతిఁ గైకొని, భీమబలుండౌ సుమిత్ర ♦ ప్రియపుత్రుం డు
ద్దామంబగు ఖడ్గము గొని, యామానిని ముక్కుఁ జెవుల ♦ నట్టి యడంచెన్.

ఆ. అంత భయదకర్ము ♦ లగు రాక్షసులఁ జతుర్దశసహస్రములను ♦ దా నొకండె

మానితాత్ముఁడైన ♦ క్ష్మాపతి రాముండు, యమునికడకుఁ బంచె ♦ నాస్థలమున.

క. దనుజులు వారందఱు చ,య్యన నొక్కటిగాఁ జెలంగి ♦ యారామునిపైఁ
జనుదేర నర్ధయామం,బున నిశ్శేషముగ వారి♦పొం గడఁగించెన్.౧౮౪ 5387

చ. అనిశము దండకావసతు♦లై తపముల్ గనుఁబాడొనర్చుచున్
ఘనబలవీర్యముల్ వెలయఁ♦ గ్రాలెడు నాపదునాల్గువేలమం
దిని రఘురాముఁ డేపున వ♦ధించెను సంగరరంగమందు; వా
రని నొకముద్దయైరి దను♦జాధిపుఁడౌ ఖరుఁ డీల్గె నచ్చటన్. ౨౦ 5388

క. దనుజాంగన శూర్పణఖ య,తనిచే వికృతాంగి యగుచుఁ ♦ దద్దయు మూర్ఖం
బునఁ నొప్పుఁ గానఁ దనవా,రనిఁ బడినం బోయి రావ♦ణానుజుకడకున్. ౨౦౪

సీ. దానివార్తను విని ♦ దానవనాథుండు పనుపఁగా నాతని♦యనుచరుఁడగు
మారీచుఁడనువాఁడు ♦ ఘోరరాక్షసుఁ డట్టి రత్నమయాంగమ్ము♦గ్రాల నొక్క
మృగరూపుఁడై వచ్చి ♦ మేదినీతనయకుఁ దనయాట చేలోభ♦మునుగలుగఁగఁ
జేసె; నంతట రాముఁ♦జేరి సీతయు నీమృగంబును బట్టుము ♦ కమ్రరూప

తే. మిద్ది యుండిన మనస్థలం ♦ బిదియు నొర
యెంతరమణీయమై మది♦కింపుఁ బెంపఁ
జాలునో; యన రాముండు ♦ చాపమాని
పరుగువాఱెడు దానితో ♦ నరిగె వనిని. ౨౩ 5390

క. పరుగిడుదానిం బట్టఁగఁ, బరముం గా దింక ననుచు ♦ దానిస్థితిని దా
నరయుచు నానతపర్వము, గురుతరమును నైన యొక్క♦కోలం గూల్చెన్.

క. వినుమో సౌమ్యా! రాముఁడు, వనమున కాజింకవెంటఁ ♦ బరుగిడుటయు నా
తనిఁ జూడ లక్ష్మణుండును, జనుటయు రావణుఁడు తగిన♦సమయ మిదనుచున్.

ఆ. ఆశ్రమంబుఁ జొచ్చి ♦ నంగారకగ్రహ, మడరి రోహిణినిని♦వడి గ్రహించు
నట్లు బలిమిమీఱ ♦ నవనిజనుం బట్టు,కొనియె; నామెకష్ట♦మును గని యట.

క. రక్షింపఁ బూని వచ్చిన, పక్షిజటాయువును జూచి ♦ బవరంబున వాఁ
డాక్షణమ చంపె రావణుఁ, డాక్షితిసుత బలిమిఁ బట్టి ♦ యతివేగమునన్.

క. చనియెను; బర్వతములు నాఁ, దనువులు తగ ఋశ్యమూక♦ధాత్రీధ్రము మీఁ
దను వసియించిన కపివరు, లనూనగతి సీతఁ గొనుచు ♦ నగు దనుజవరున్.

క. కని రచ్చోగు పంచాయు నా, దనుజుం డు [illegible] ♦ తత వేగమునం
జని లంకఁ జొచ్చె; నంతటఁ, గనకమయాత్యంతశుభద♦కమ్రగృహామునన్.

సీ. ఉనిచి యాశ్వాసించె ♦ మనమున కింపైన పలుకుల; సీత యా♦పలుకుల మఱి
యారాక్షసునిఁ దృణ♦మట్టులుగా నెంచి యాతఁ డశోకవ♦నాంతరమున
నునుపఁగా నుండె; నా♦వనమందు శ్రీరాముఁ డామాయలేడిని♦హతమొనర్చి
యాశ్రమమును జేరి♦యందు సీతను జటాయువును గానక వ్యథ♦నొందె; మిగుల

తే. నంత సౌమిత్రితోడ గా♦మావనీశుఁ
డరిగి పితృసఖుఁడైన గృ♦ధ్రాధిపుండు
హతుఁడయినరీతిఁ గనఁబడ ♦ నతనికగ్ని
నిడి మనోదుఃఖమునఁ దన♦పడఁతి వెదకి. ౩౭ 5397

క. గోదావరితటమునకున్, మోదము నొడఁగూర్పఁ బువ్వు♦ముల నలరుచు నా
మేదినిఁగల వనములకును, నాదరమున వచ్చెనేమొ ♦ యానతి యనుచున్.

ఆ. తిరిగి తిరిగి వెదకె ♦ మరల నాసోదరు, లమ్మహావనంబు ♦ నందుఁ జనుచు
నొక్కయెడఁ గబంధు♦నుగ్రరాక్షసుఁ జేరి;, రంత సత్యశౌర్యుఁ♦డగుజనపతి.

తే. ఆకబంధునిమాటల ♦ నాలకించి
ఋశ్యమూకగిరిం జేరి ♦ యినసుతుఁడగు
నట్టిసుగ్రీవునిం గాంచె ♦ నంతవార
లిద్దఱును జేరకయె ముందె ♦ యెలమి యొదవె. ౩౮ 5400

క. మునుపే సుగ్రీవుని నా,తనియగ్రజుఁడైన వాలి ♦ తనరాజ్యమునుం
డి నితాంతబలము మీఱం,గను వెడలం గొట్టి యుండెఁ ♦ గడుఁగ్రూరుండై.

క. వనచరపతి రఘువీరులు, మనములఁ గల భావములను ♦ మఱి చెప్పుకొనం
గను వారిమైత్రి దృఢతం, గన రాముని బాహుశక్తిఁ ♦ గపివరుఁ డనిలోన్. ౩౯॥

క. గురుబలుని మహాకాయుని, హరినాథుని వాలిఁ జంపి ♦ యారాజ్యంబున్
బరమమును సంగ్రహించెను, హరివర్యులు పట్టమునకు ♦ నాతనిఁ బతిఁగన్.

క. ఒనరించి యతనిఁ గొల్చిరి;, జనకజ వెదకింతు ననుచు ♦ శపథము పలికెన్
వనచరపతి రామునితో;, వినుతాత్ముఁడు ప్లవగసంఘ♦వీరుం డంతన్. ౩౨॥

తే. ఆజ్ఞ చేయంగ సీతయు♦న్నట్టి నెలవు
గనుఁగొనంగను బదికోట్లు ♦ కపులు వెడలి
రెల్ల దిక్కులకున్; సీత ♦ నెఱుఁగఁ బంపఁ
బడినకపులందు మేము ప♦ర్వతవరమయి. ౩౮॥ 5105

క. అలరారు వింధ్యయందే, పలువిధముల వెతల గుహాను ♦ బడియుండఁగ నో
జలజాప్తవంశభూషణ!, సలలితగుణ! కాల మెంతొ ♦ జరగెన్ మాకున్.

తే. ఆజటాయువునగ్రజుం ♦ డధికవీర్య
ఘనుఁడు సంపాతి రావణుం ♦ డను సురరిపు
నింటియందున్న దాసీత ♦ యిప్పు డనుచుఁ
బలికె; నేనంత నాబంధు♦వులు కలంగి. ౪౦॥ 5401

క. హత నొందుచుంటి మంతట, మతిధైర్యంబునను నే న♦మానుషశక్త్యు
ద్ధతి నూఱుయోజనము లా,యతిగలసంద్రమును దాఁటి♦యసురుగృహమునన్

తే. ఆయశోకవనంబున♦యందు నొంటి
నుండి కౌశేయపరిధాన ♦ మొప్ప మలిన
యగుచు నానందమును బాసి ♦ యాత్మవిభుని
యందు దృఢమగుభక్తిచే ♦ నలరి యుండ. ౪౩½ 5409

క. కనుఁగొంటి సీత; నేనా, వనితామణి శాస్త్రరీతిఁ ♦ బ్రశ్నించితి నిం
దను బొందని యాసుందరి, తనవృత్తాంతమును దెల్పఁ ♦ దమిఁగని యాత్మన్.

తే. ఆమెకున్ గుర్తుగా రాము♦నంగుళీయ
కము నొసంగితి; నామెయు ♦ నమలరత్న
మును నభిజ్ఞానముగ నిచ్చి ♦ చన ననుజ్ఞ
నియ్య నేవనమున్ బల ♦ మెనఁగుచుండ. ౪౪ 5411

సీ. పాడొనరించి త♦త్పాలకులను జంపి యింద్రజిత్తును బోర ♦ నట్టులితని
జిక్కించుకొననగు♦నక్కటా యనుసంశయముఁబొందఁ జేసియు♦య్యసురనేతఁ
గనువేడ్క బ్రహ్మాస్త్ర♦మునకు వశుండనై పోయి రావణునకు ♦ బుద్ధిచెప్పి
లంకను గాలిచి ♦ బింకముమీఱఁగాఁ జనుదెంచితిని శ్రమ ♦ మనఁగ లేక
యెట్టికార్యముఁ జేయు♦నట్టిరామునిఁ గని యతులకాంతిని బొల్చు♦నమ్మణివర

తే. మిచ్చినాఁడను రోగార్తుఁ ♦ డింక బ్రదుకఁ
జాల ననునంత కష్టమా ♦ కాలమందు
నమృతపానంబునన్ బ్రదు ♦ కందునట్లు
భార్యకుశలంబు విని హర్ష♦పరవశుఁడయి. ౪౬ 5412

క. ధర జీవింపం దలఁచెను; సురరిపునగరమున కేగఁ ♦ జూచి ప్రయత్నం
బురుతరముగ నొనరిచి లయ,తరుణంబున లోకవితతిఁ ♦ దగఁ గాల్పంగన్.

క. చెలరేఁగు నగ్నిహోత్రుని,వలె రావణుఁ జంపఁ బూని; ♦ వార్ధి దరికి సే
నలఁ గూడి పోయి యబ్ధిని, నలునిన్ సేతువును బంధ♦నం బొనరింపన్. ౪౭

క. ఆనతి యిడి దాసిపయిన్, వానరబలములను గూడి ♦ వార్ధిఁ దరించెన్;
వానరవరుఁ డానీలుఁడు, దానవబలపతిఁ బ్రహస్తుఁ ♦ దా వధియించెన్. ౪౮½

తే. కుంభకర్ణుని రఘువంశ్య♦కుంజరుండు, రామభద్రుండె చంపె నిం♦ద్రరిపుఁడైన
తత్తనూజుని సౌమిత్రి ♦ తా వధించె, రావణునిఁ గూల్చె నాజిలో♦రాఘవుండె.

సీ. సురపతియములును ♦ వరుణశివుల్ బ్రహ్మయును స్వర్గవాసియై ♦ యొప్పుదశర
థావనీశ్వరుఁడు నొ♦య్యన వచ్చి శ్రీమంతుఁడై నరామునకు నె♦య్యమునవరము
లొసఁగి యారిపుభీక♦రోగ్రమూర్తిని నుతియించిరి దేవర్షు♦ లెల్లమునులు
వరము లిచ్చిరి వారి♦వరములఁ గైకొని సర్వకపీశ్వర♦సమితిఁ గూడి

తే. మృతులు బ్రదుకుట సంతోష ♦ మతిశయమ్ము
గాఁగఁ బొందుచుఁ దగఁ బుష్ప♦కంబు నెక్కి

వచ్చెఁ గిష్కింధ కతఁడిట్లు ♦ వచ్చి గంగ
పరిసరమున భరద్వాజు♦పదమునందు. ౫౨౪ 5417

తే. ఉన్నవాఁ డిప్డు పుష్యర్క్ష♦యోగముగల
యెల్లి యేవిఘ్నములు లేక♦యే యతనిని
గానఁ గల వీవు నా, సత్య♦మై నితాంత
భావబోధకమగు కపి♦పల్కు వినుచు. ౫౩ 5418

క. అనుపమముదమునఁ గరయుగ,ము నొగ్గి నాకాంక్షితార్థ♦ములు చిరకాలం
బునకుం ఫలించె నని ముద,మును గూర్చెడురీతి వాక్య♦మును వినిపించెన్.

నూటయిరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౩౦ - వ సర్గము.

{ భరతుఁడు రాముని కెదురేగి యందఱను బిలుచుకొని నందిగ్రామమును బ్రవేశించుట. }

క. పరవీరహంతయై తగు, భరతుఁడు బుతవిక్రముండు ♦ పరమానందం
బు రహిం గూర్పుమగుత్సుతు,నిరుపమవాక్కులకు మిగుల♦నెమ్మిం గనుచున్.

క. తనయనుజుని శత్రుఘ్నునిఁ, గని యిట్లని యాజ్ఞ చేసెఁ; ♦ గడువడి నరులె
ల్లను శుచులై కులదైవము,లను నగరచతుష్పథంబు♦లను మోదమునన్.

క. వరచందనసుమమాల్యో,త్కరముల వాద్యములఁ జక్కఁ♦గా విధిఁ బూజిం
తురుగాక [1]స్తోత్రవితతులఁ, బురాణములఁ గోవిదులయి ♦ పొలిచెడుసూతుల్.

[2]క. పురిఁగలవై తాళికులు న,గరమున వాదిత్రపటుతఁ ♦ గాంచిన వారున్
నిరుపమన ర్తనగీతము,ల రహిం దగుగణికలున్ వి♦లాసము మీఱన్. ౩ 5428

తే. చంద్రనిభమైన రామునా♦స్యంబుఁ గనఁగ
నిపుడె చనుదెంత్రుగా; కని ♦ యెంతొ ప్రీతి
నాజ్ఞ చేయఁగఁ బరవీర♦హంతయైన
యతనితమ్ముఁడు శత్రుఘ్నుఁ ♦ డాదరమున. ౪ 5424

క. భృతిజీవులఁ బెక్కండ్రను, శతశతములుగాఁగఁ బిల్చి ♦ సత్వరముగ భూ
పతిరాకఁ దెల్పి మీ రిఁక, జతనము మీఱంగఁ జేయ♦జను నీరీతిన్. ౫ 5425

క. నందిగ్రామమునుండియె, సుందరమగుపురముదనుక ♦ శుభపథములఁ గే
యం దగుఁ జక్కఁగఁ బల్లము,లందున్ మృత్తికను ద్రోసి ♦ యనువగురీతిన్.

సీ. విషమస్థలమ్ముల ♦ వేగమ సరిచేయఁదగు, మిట్టభూములఁ ♦ ద్రవ్వి పాఱ
వైచి సమంబుగా ♦ నఱలునట్లుగఁ జేయుఁ; డవ్వల హిమశీత♦లాంబువులను

---

1 సూతా స్తుతిపురాణజ్ఞాః - అనిమూ. 2 సర్వే వాదిత్రకుశలా గణికా శ్చాపి సంఘశః - అనిమూ.

దడిపి యామీఁద నం♦తటఁ బువ్వులాజలు చల్లుఁడు, మఱికొంద ♦ ఱుల్లసిల్లు
ధ్వజములఁ బురవరో♦త్తమమగు మనరాజధానియందు మహాప♦థములయందు

తే. నెత్తుదురుగాక, రవియుద♦యించువఱకు
ధామములనెల్ల వరపుష్ప♦దామములను
గప్రములుగ నొనర్తురు♦గాక రాజ
[1]మార్గములయందు శతసంఖ్య♦మనుజు లెలమి. ౮ 5427

చ. అరుదుగఁ బంచవర్ణకము ♦ లై తగుముగ్గులు పెట్టి చాలనుం
దరములుగా నొనర్పుఁ డని ♦ తానవు డాజ్ఞ యొసంగె; నంత భూ
వరవనితల్ మహాసచివ♦వారము సేనలు వారిభార్యలుఁ
ధరణిసురుల్ మహీపతివి♦తానము సంఘములోనిముఖ్యులుఁ. ౯ 5428

తే. గుంపులుగఁగూడి రామునిఁ ♦ గోర్కి గనఁగ
వెడలుదురుగాక యని భర♦తుఁడు నసుజ్ఞ
చేయ నందఱు వెడలిరి; ♦ క్షితిపుమంత్రు
లైన ధృష్టిజయంతులు ♦ నవ్విజయుఁడు ౧౦ 5422

తే. అర్థసాధకసిద్ధార్థ ♦ లయ్యశోక,మంత్రపాలసుమంత్రులు ♦ మదపుఁటేనుఁ
గులు సువర్ణవిభూషిత♦మ్ములుగనెనఁగ, వానిపై నెక్కి వెడలిరి ♦ వైభవమున.

సీ. భూపాంతరంగులై ♦ పొలుచుకొందఱు, నడుములకు బంగారుమో♦కులనుగట్ట
నలరుచు[2]మగయేనుఁ♦గులను గూడినయాఁడుగజములపై నెక్కి ♦ కదలి;రంత
మఱియు మహారథుల్♦మనుజులు కొందఱు వాజిసంక్రాంతముల్♦భానురములు
నగు రథంబుల నెక్కి ♦ యరిగిరి; ప్రాసశక్త్యష్టులఁ గరముల ♦ నంది భటులు

తే. ధ్వజపతాకలఁ గరములఁ ♦ బట్టితురగ,దశశతంబులపై నొప్పుఁ ♦ దగుపురుషులఁ
గలిసియున్నపదాతులు ♦ నెలమి వేలు,గాఁ జెలంగుచు రా వీర♦కాండ మేగె.

క. నరపతిదారలు యానో,త్కరములతో రామజననిఁ ♦ గౌసల్యను నా
దరమున సుమిత్ర ముందుగ, నరుగంగాఁ బంచి తారు ♦ నరిగిరి వెనుకఁ.౧౪

క. కైకేయీసహితంబుగ, భూకాంతునిభార్యలెల్లఁ ♦ బొంగెడుకాంతిఁ
వే కదలి పోయి చేరిరి, శ్రీకలితుని రామచంద్రుఁ ♦ జిత్తము లలరఁ. ౧౫

1 ఎనిమిదవశ్లోకము మొదలు తొమ్మిదిన్నరశ్లోకమువఱకు నున్నవి, మూఁడవశ్లోకము తర్వాత నుండవలయుననియు, నిటనుండుట ప్రమాదమనియు గోవిందరాజులు వ్రాసిరి. ఏలయనఁగా నాల్గవ శ్లోకమున శత్రుఘ్నుఁ డాజ్ఞాపించిన ట్లున్నది ఇచట వెడలుదురుగాక యని భరతునాజ్ఞగాఁ గానంబడుట యసందర్భమని వారిభావము. మక్కికిమక్కిగాన నున్నసై తెనిఁగించితిని. వారు వ్యాఖ్యయు నట్లే వ్రాసిరి గాని యట్లుండుట మేలనిమాత్ర ముపపాదించిరి. "స్థితస్య గతి శ్చింతనీయా" యన్నవాఁడను గాన మార్పక నాంధ్రీకరించితి నను నాభావమును గ్రహించి మన్నింతురుగాక.
2 మగజాభిః కరేణుభిః-అనితూ.

క. కనుఁగొన నందిగ్రామం,బునకు నయోధ్యాపురంబు ♦ పొందువదలి వే
జను లెల్ల భరతుచెంతకుఁ, జని; రాచతురంగములగు ♦ సైన్యము లెల్లన్. ౧౭

క. అరిగెడుతఱి నుత్తమహయ,ఖురశబ్దములు రథనేమి♦ఘోటులధ్వనులున్
వరశంఖదుందుభిధ్వను, లురవడి భూమిం గదల్చి ♦ యొప్పెన్ మిగులన్. ౧౮

సీ. ధర్మాత్ముఁడై ప్రాజ్ఞ♦తల్లజుండయి యుపవాసాళిఁ గృశియించి ♦ భ్రాతపాదుక
నశిరంబు వగచుచు ♦ నతిదీనుఁడై నారచీరలు నజినముల్ ♦ గారవమున
ధరియించి భరతుండు ♦ హారివరుమాటలఁహర్షంబునుంగాంచి♦యలరుచుండెఁ
గాన నుత్తమవిప్ర♦కలితుఁడై వైశ్యులనాయకసంఘంబు♦లందు ముఖ్య
తే. లును దనుం జుట్టుకొనిరాఁగ ♦ ఘనులయితగు
నావసిష్ఠాదిమంత్రులు ♦ నమల*మాల్య
మోదకంబులఁ గైకొని ♦ ముదమువీఱ
వెంబడిం జనుదేరంగ ♦ విమలరీతి. ౧౯ 5436

క. భేరీశంఖరవమ్ములు, బోరుకొనన్ వందిజనులు ♦ పొంగుచుఁ దగు కై
వారములు చేయుచుండఁగ, శ్రీరాముని పాదుకలను ♦ శిరసున భక్తిన్. ౨౦

క. ధరియించి శ్వేతమాల్యో,త్కరమునఁ దగు తెల్లగొడుగు ♦ త్కాపార్హములై
వరహేమదండములు భా,సురములు నగుచామరముల ♦ సొరిదిం గొనుచున్.

క. తనహితులు సుమంత్రాదులు,చనుదేరఁగ రాముఁగూర్చి ♦ చనియెను;నటఁ బా
వనిఁ గని భరతుం డూరక,యె నిలిచి యిట్లనియె; నీకు ♦ నెన్నఁగ హనుమా!.

క. వనచరులకు సహజంబుగఁ, గనఁబడుచలచిత్తత యిటఁ ♦ గలుగదు గద యా
ర్యుని వైరినూదనుని రా,మునిఁ గాకుత్స్థునిఁ గనంగఁ ♦ బోలదు నాకున్.

క వనచరులు కామరూపులు, మునుముందుగ వచ్చుచిహ్న♦ములు గూడన్ నా
కును గానరాకయున్నవి, హనుమంతా! హేతువేమొ? ♦ యడిగెద నిన్నున్.

చ. అనిభరతుండు తన్నడిగి ♦ యాడిన నాహనుమంతుఁ డప్పుడి
ట్లనియెను సత్యవిక్రమమ♦హాత్వములందగు నానరేంద్రుతో;
వనచరరాఘవేశ్వరులు ♦ వచ్చుటకుం దడవౌట యేలొ చ
క్కనిగతి విన్నవించుటకుఁ♦గాఁ దలపోయుచు నీతియుక్తుఁడై. ౨౫ 5442

తే. ఆభరద్వాజమౌనిద♦యం దరుప్ర,జములు నిరతము సుఫలపు♦ష్పముల నెసఁగి
షట్పదంబులు మత్తిల్లి ♦ సాంద్రనాద,ములరఁ జేయఁగఁ దేనియ♦లవనిఁ దొరఁగ. ౨౬

క. తనరుచు నున్నవి గావున, వనచరు లవ్వానిఁ బొంది ♦ వరమోదంబున్
గనుచున్నా, రరిసూదన!, జనపతి కావాసవుండు ♦ సంతత మవనిన్. ౨౭

చ. వనచరు లుండుతావులను ♦ బాదపముల్ ఫలియించియుండునం
చును వరమిచ్చినాఁడు రుచి♦శోభితమూర్తి మునీంద్రుఁ డాదృతిన్

* మాల్యమోదుకహస్తైశ్చ-అనిమూ.

జనపతికిన్ భటావళికిఁ ♦ జారుతరంబుగ నృత్యరాజిచ
క్కనిమధు వొప్ప సద్గుణము ♦ గ్రాలెడువిం దొనరించినాఁడునూ!. ౨౯ 5445

చ. కనుకని వానరుల్ తనివి ♦ గల్గఁగఁ దేనియ లాని పండ్లనుం
దినుచుఁ బ్రహర్ష మొప్పఁగ స♦తిస్థిరసత్వము మీఱ నార్చుటల్
వినఁబడుచున్న వి త్తతిని ♦ వీరకపుల్ తగుగోమతీనదిన్
జనవర! దాఁటుచుండు రని ♦ స్వాంతమునం దలపోసెదన్ విభూ!. ౨౭ 5446

ఆ. అదిగొ పైకిఁజిమ్ము ♦ నాపెనుధూళివ,స్త్ర మును గనుము దీన ♦ నర్వకపులు
*వాలుకిని దరింప ♦ వచ్చుచున్నారని, తెలిసికొంటి; నాక♦వు లివు డెలమి.

క. రమణీయసాలవనవృ,క్షములం గదలించు నారు♦గా నుండు రటం
చు మదికిఁ దోఁచెడు జాగిటు, లమరెను జూ!; యల్లయదిగొ♦యతివిమలంబై.

తే. శశధరునితోడఁ దుల్యమై ♦ సముధికరుచు
లలరుపుష్పకమను వ్యోమ♦యాన మచట
దవ్వునం గనఁబడియెడు ♦ ధాత దీని
మనసుచేతనె గల్పించె ♦ ననుచు వింటి. ౨౯ 5449

క. అనఘుఁడు రాముఁడు రావణు, నని బంధుయుతంబుగాఁగ ♦ హతమొనరిచి దీ
నిని బొందినాఁడు; తరుణా,ర్కునివలెఁ గాంతులను మిగులఁ♦గొమరారునదై.

క. మనరామువాహనంబై, తనరారెడు దీని బ్రహ్మ♦దయను గుబేరుం
డును బొందె మనోవేగం,బునఁ బోవం జాలుఁ జుమ్ము ♦ భూపకుమారా!. ౩౦౺

క. దీనిపయి వీరులకు రఘు,సూనులు విక్రమగుణైక♦శోభితులు తమిన్
జానకియు భూరితేజుం,డై నగడుకపీశ్వరుండు ♦ నసురవిభుండై. ౩౧౺ 5452

తే. వినయగుణభూషణుఁడగు వి♦భీషణుండు
గూరుచుండిన వా రదిగో యయోధ్య
కరుగుదెంచు చున్నారని ♦ యనఁ దరుణులు
స్త్రీలు బాలురు వృద్ధులు ♦ చెలఁగి యచట. ౩౨ 5453

క. మనరాముం డిదె చనుదెం,చె నటంచుం బలుక నపుడు ♦ చెలఁగురవము నిం
గిని ముట్టె; వార లందఱు, ఘనకరిహయరథముల దిగి ♦ క్ష్మాస్థలియందున్.౩౩

క. నిలుచుండి యాకసంబున, విలసిల్లెడు చంద్రుఁ జూచు♦విధమునఁ గాంతిం
జెలఁగెడు విమానగతు ను,జ్జ్వలమూర్తిని గనిరి రామ♦భద్రుని నంతన్.౩౩౺

చ. భరతుఁడు సంప్రహర్షమున ♦ భ్రాత నెదుర్కొని ముందు భక్తితోఁ
గరములు మోడ్చి నిల్చి సరి♦గాఁ జనుదెంచితి వన్నమాట రీ
తి రఘువరేణ్య! యంచు రఘు♦ధీరునిఁ జక్క నుతించె; నంతటన్
భరతుని యగ్రజుండు రుచి♦భాసురదీర్ఘమనోజ్ఞనేత్రుఁడై. ౩౪౺ 5456

* వాలుకి=ఒకనది.

క. మనమున శతధృతినిర్మిం,చినపుష్పకమున వసించి ♦ చెలఁగె ద్వితీయుం
డనఁబడు నింద్రునిరీతిఁగ;, ననంతరము మేరువందు ♦ నలరెడు రవికిన్. ౩౫

తే. వందనము చేయురీతి నా♦భరతుఁ డెలమిఁ
బుష్పకంబుపయిం దగి ♦ పూజనీయుఁ
డైన రామునకున్ నియ♦తాత్ముఁ డగుచు
మ్రొక్కె; నంత మరాళాంగ♦ములఁ జెలంగి ౩౬ 5458

క. నిరుపమములైన ప్రతిమల, నరుదుగ నొప్పారి వేగ ♦ నతిశయ మగుచున్
సురుచిరమై తగ నలరెడు, వరపుష్పక మద్ది రామ♦భద్రునియాజ్ఞన్. ౩౭

చ. ధరణికి వ్రాలె; నంత రఘు♦తిల్లజుఁ డాభరతున్ ముదంబునం
గరముల నెత్తి పుష్పకము♦ఖంబున నెల్లరు చూడ నున్పఁగా
భరతుఁడు సత్యవిక్రముఁడు ♦ భ్రాతృసమీపము నొంది ప్రీతితో
మరల నమస్కరించె; రఘు♦మండనుఁ డంతటఁ బిన్నసోదరున్. ౩౮ 5460

క. చిరకాలదృక్పథగతున్, భరతుని దమి నెత్తి యంక♦భాగమ్మున ని
ల్పి రమణఁ గౌఁగిటఁ జేర్చెను;, భరతుం డంతట సుమిత్ర♦పట్టిని భక్తున్.

క. తన కనురక్తిని వందన,మును సల్పినవాని మోద♦మునఁ గౌఁగిటఁ జే
ర్చి నితాంతభక్తి [1]జనకజఁ, గని మ్రొక్కి స్వనామ మొప్పఁ♦గా వచియించెన్.

సీ. భరతుఁడు సుగ్రీవు ♦ భల్లూకపతి జాంబవంతు నంగదుని న♦త్యంతతేజు
మైందద్వివిదులను ♦ మాననీయుని నీలు నాఋషభుని నలు ♦ నలరుచున్న
గంధమాదన గవా♦క్ష శరభ పనసుల ఘనుసుషేణుని బిగ్గఁ ♦ గౌఁగిలించు
కొని గారవించె; నా♦వనచరుల్ కామరూపులుగాన మనుజాకృ♦తుల ధరించి

తే. యుండినందున భరతుని ♦ నొప్పుమీఱఁ
గాంచి పరిహృష్టులై క్షేమ ♦ మంచితముగ
నడిగి; రంత మహాతేజుఁ ♦ డగుచు ధార్మి
కోత్తముఁడునైన భరతుండు ♦ నురుముదమున. ౪౦ 5463

చ. వనచరనాథుఁ గాంచి యిటు ♦ పల్కెను గౌఁగిటఁ జేర్చుకొంచు నో
యనుపమచిత్త! మా నలువు♦రౌ సహజన్ముల కెల్ల నీవు చ
క్కనిసహజుండవై తివి [2]జ♦గంబున మంచిమనస్సుతోడ నే
జనుఁ డుపకారియౌ నతఁడె ♦ చాలు సఖుండని చెప్పఁగాఁ జుమీ!. ౪౧ 5464

క. అరియగు నపకృతి చేసిన, నరుఁ, డపకారంబె లక్ష♦ణం బరికగుఁ జూ;
ధరణిని నంచున్ మఱియును, భరతుండు విభీషణుఁగని ♦ పలికె హితముగన్.

1 అభివాద్య తతః ప్రీతో భరతో నామ చాబ్రవీత్-అనిమూ. 2 సౌహృదా జ్జాయతే మిత్ర మపకారోఽరిలక్షణమ్-అనిమూ.

తే. మాయదృష్టముచే నీవు ♦ మారఘుపతి
కెంతొ దుష్కరకృత్యంబు ♦ లెన్నొ చేసి
సాయపడితివిగా యని ♦ సంతసమునఁ
బల్కె; శత్రుఘ్నుఁ డారఘు♦పతికి మ్రొక్కె. ౪౭ 5466

క. తనయగ్రజుఁ డగులక్ష్మణుఁ, గని వందన మాచరించి ♦ త్వాపుత్రికరుఁ
వినయమున మ్రొక్కె; నంతం, బెనువగఁ గృశియించిదీన♦వృత్తిఁ గుడుచుచుఁ.

క. తనరాకఁ గోరుచుండెడు, జననిం గౌసల్యఁ జూడఁ♦గాఁ జని నీవుఁ
వనమున కరుగం జనదని, ననుఁ బల్కిన వినక పోయి♦నాఁడం దల్లీ!. ౪౮

తే. దాని క్షమియింపుమా యని ♦ మానసంబు
కలఁకఁ దీరెడునట్లుగా ♦ గారవమునఁ
బలికి తత్పాదముల కొగి ♦ వందనంబు
సలిపి యంత సుమిత్రకు ♦ నెలమి మ్రొక్కె. ౪౯ 5469

క. *దనుజవధహేతువుగ ధా, త్రినిగీర్తిం గన్న కైకఁ ♦ దివిరి గనుచు మ్రొ
క్కెను; నంత నితరజననుల,కును వందనమాచరించి ♦ కోరిక మీరఁ. ౪౯½

క. గురువయి పురోహితుఁడునై, పరమాత్ముఁడునౌ వసిష్ఠు♦పాలికిఁ జని యా
దరమున మ్రొక్కెను; నంతటఁ, బురజను లారాముఁ బ్రీతి♦పొంగంగనుచుఁ.

సీ. నీకు స్వాగతమగుఁ ♦ గాక యాయతభుజా! కౌసల్య మదిఁ దమిఁ♦గల్గఁ జేయు
సాధుమతీ! రామ♦చంద్రా! యని కరంబు లొగ్గి పల్కిరి; పౌరు ♦ లురుకరాంజ
లులను సరోజకు♦ట్మలములవలెఁ బెక్కు వేలఁ బట్టిన రఘు♦వీరుఁ డలరి
కనియె; ధర్మాత్ముఁడై ♦ తనరునాభరతుండు మునురామభద్రుఁడి♦చ్చినసుపాదు

తే. కలను జేకొని నరపతి♦కాంతుఁడైన
రాముపదములఁ దొడిఁగెఁ దా ♦ నేమమొప్ప;
నంతఁ బ్రాంజలియై యిట్టు ♦ లనియె నన్నఁ
గని మహీపాల! నీరాజ్య♦మును గడంగి. ౫౩ 5472

క. నాయొద్ద దాఁచినందున, న్యాయంబుగఁ గాచుచుండి ♦ నయమున నిదిగో
యీయెడల నప్పగించితి, నోయధిపా! యీయయోధ్య ♦ కొప్పుగ మరలఁ.

క. అరుదెంచి భూమిపతివై, యురుతరసంపదలఁ బొంది ♦ యుండుటఁ గంటిఁ
నరవర! నాయీజన్మము, సరిగాఁ గృతకృత్య మయ్యెఁ; ♦ జక్కనికొల్క్.

తే. ఇపుడు ఫలియించెఁ; గోశంబు ♦ నెల్లధాన్య
శాలలను బత్తనంబును ♦ సైన్యములను
గనుము నీదుప్రభావంబు♦నను పదిగుణ
ములుగ నిప్పుడు పెంపొంది ♦ వెలసె నివియు. ౫౫½ 5475

* అభివాద్య సుమిత్రాం చ కైకేయీం చ యశస్వినీమ్-అనిమూ. యశస్వినీం. రామానుజయస్య తిస్మాలత్వాత్-అనివ్యాఖ్యా.

క. అనిపలుకుచున్నభరతుని, యనుపమగుణు భ్రాతృభక్తు ♦ నచ్చటఁ గని యి
ట్లనుజునిగుణములఁ గనమికి, వనచరులు విభీషణుండు♦బాష్పములు గడుక్.

తే. విడిచి పొగడిరి; శ్రీరాఘు♦వుఁడు ముదమున
భరతుఁ దొడమీఁద నిడుకొని ♦ బలయుతుఁడయి
యవ్విమానంబుతో భర♦తాశ్రమమున
కరిగె; నిట్లు నందిగ్రామ ♦ మవుడు చేరి. ౫౭ 5477

చ. జనపతి దాను సైన్యయుతిఁ ♦ జక్కఁగఁ బుష్పకముక్ మనోహరం
బును దిగి భూమిపై నిలిచి; ♦ పూజ్యవిమానము గాంచి యిట్లనుక్
ధనపతివాహనంబవయి ♦ తద్వహనాదృతినుండు మే నను
జ్ఞ నొసఁగితిక్ యథేచ్ఛముగఁ ♦ జక్కఁగఁ బొమ్మనె; నంత నద్దియుక్. ౫౯

తే ఉత్తమోత్తమ మాటచే ♦ నుర్వినాథు
నానతిం బొంది ధనదాల♦యమును జేరె
నుత్తరపుదిక్కుఁగాఁ బోయి; ♦ యుత్తటి రఘు
వరుఁడు వజ్రి బృహస్పతి♦చరణములకు. ౬౦ 5479

ఆ. వందనంబుచేయు ♦ భంగిగ ననుగూపుఁ,డగు వసిష్ఠమునికిఁ ♦ దగ నతి యిది
యతఁడు దాను మిగుల ♦ సత్సానసంబుల, నధివసించి రెలమి♦యలరుచుండ.

నూటముప్పదియవ సర్గము సంపూర్ణము

---

## ౧౩౧ - వ సర్గము.

{ రాముఁడు ప్రతముమాని మంగళస్నానమొనరించి సుగ్రీవాదులతో నయోధ్యను ప్రవేశించుట. }

క. భరతుం డంజలిఁ బ్రీతిక్, శిరమునఁ గీలించి కైక ♦ చెలఁగుచు నుండక్
నిరతంబు సత్యవిక్రమ,పరికీర్తితుఁడైన రాము♦భద్రునకనియెక్. ౧ 5481

క. జననికిఁ గైకకు మోదం,బును గల్పించితివి రాజ్య♦మును నాపయిఁ బె
ట్టినకారణమున, నేవిధ,మున నాకిచ్చితివో యట్లె ♦ ముదమున నేనుక్. ౧౪

ఆ. దీని మరల నిచ్చి ♦ తీరుచుకొనుచున్న,వాఁడఁ గృత్య; మీవు ♦ నలదనఁ దగ
దే నయోధ్యనుండి ♦ యెల్లభోగంబులఁ, బడయ నేలు మీవు♦వసుధ నదో?.

సీ. అడిగి నప్పుడె రాజ్య ♦ మర్పింపు మందువో బలమునఁ దగువృష♦భంబుతాను
మోయఁగాఁ దగుభార♦మును లేఁతదూడపైవై చిననదిగొప్ప♦బరువు మోయఁ
జాలనిరీతి నీ♦నేల నేలందగు బలశాలి వగునీవు ♦ బరువు దీని
నాపైననే పెట్టి♦నక్ మోయఁజాలఁ జూ; యింతపర్యంత మెట్లీవు మోయఁ

తే. జాలినాఁడ వటందువో? ♦ సమధికజల,పూరసంభిన్నమగుకట్ట ♦ నీరువదల
గడ్డిమొదలుగానాని నా♦కట్ట నిలుప,శక్యనే కాని యట్లు రా♦జ్య మిది రామ!.

క. పలువిధములైన ఛిద్రం,బులఁ దగు; మంత్రావనప్ర♦ముఖరాజగుణం
బులచే ఛిద్రములను ని,మ్ములఁ గప్పనియెడల నిల్పఁ ♦ బోలదు సుమ్మీ!. ౪

క. వినుమా నావలెనే నీ,వును గుణముల లోకములను ♦ బోలువుగఁ దగ లోఁ
గొనఁగల వందువొ యేమో?, వినుతాశ్వముపోలె ఖరము ♦ వే చనఁగలదే?.

ఆ. హంసవలెన కాకి ♦ యభ్రపథంబున, కెగురఁ జాలనట్లు ♦ లేను వైరి
హారణ! నిన్నుఁ బోలి ♦ యవనిభారము మోయఁ, జాలఁ జుమ్ము; భార♦వహనమునకు.

క. నీవసమర్థుఁడవైనన్, నావలనన్ జేవఁ గల్గి ♦ యవనీభరణం
బీవే చేయుచునుండుము!, యీవిధమున నందువేమొ? ♦ యినకులతిలకా!.

సీ. అంతర్నివేశన♦మందు వృక్షము నాట నది పెద్దదయి యెక్కు ♦ నలవిగాక [ము
గురుతరస్కంధముల్ ♦ పరఁగఁ గొమ్మలు పెద్దవై యొప్పఁగాఁ జూచి ♦ యనుఁగు ఫల
లను బొందకే నశిం♦చునయేని యదినాటినట్టి ఫలంబు నా♦యకున కమర
నట్టుగా దశరథుం ♦ డధ్వర మొనరించి నినుఁ గాంచె నీవు భూ♦మిని జగంగఁ

తే. బాలనము చేయకున్నఁ ద♦త్ఫలము నతఁడు
పొందకుండును గద యిట్టి ♦ పోల్కి నోము
హాభుజా! త్వన్నిమిత్తమే ♦ యని తెలియుము;
గనుక నరపతివై భక్తు♦లను బ్రకృతుల. ౮౺ 5189

క. మము నేలుము; నీవభిషే,కమునం బొలుపొందుచుం బ♦గట దీప్తరుచుల్
విమలగతిం గన్పడ నొ,ప్పు మిహిరుగతిఁ దేజమెంతో ♦ పొలుచుచు నుండన్.

క. కనుఁగాక నిన్ను లోకము, మనుజేంద్రా! వివిధములగు ♦ మంగళరవముల్
తనరన్ నృత్యము సల్పెడు, వనితల కాంచీలసద్ర♦వంబులు మఱియున్. ౯౺

తే. నూపురంబులవైన ధ్వ♦నుల్ మనోజ్ఞ
గీతశబ్దంబులను రఘు♦క్షితిప! మేలు
కొనుము; నక్షత్రచక్ర మే♦దనుకఁ దిరుగు
చుండునో భూమి యెందాఁక ♦ నుండఁగలదొ. ౧౦౺ 5492

తే. అంతకాలము నీవు రా♦జ్యాధిపత్య, మొంది యుండుము రాజ్యేచ్ఛ♦నొంద నేను;
నాఁగఁ బరపురజేత భూ♦నాథుఁ డతఁడు, పలికినదివిని కొనుదున♦ట్టులె యటంచు.

క. పరమాసనంబుఁ జేకొన, భరతుండును గూరుచుండెఁ; ♦ బరపడి శత్రు
త్కరహంత లక్ష్మణానుజుఁ, డరసి త్వరం బిల్వఁబంచి ♦ యానతి చేయన్. ౧౩౺

తే. క్షౌరకులు లాఘవమున సు♦ఖముగఁ గృత్య, మొనరుపంగల్గు వారు త♦ఱిని నెఱింగి
శ్మశ్రువర్ధనులును రఘు♦సత్తములకుఁ, గృత్యములు సల్పిరంతట ♦ నెలమి మిగుల.

క. తొలుతన్ భరతుం డవ్వల, బలశాలి సుమిత్రపెద్ద♦పట్టి పిదప నా
జలజాప్తసుతుఁడు కపిపతి, యలఘుగుణుండౌ విభీష♦ణాసురపతియున్. ౧౪

క. స్నానము చేసిరి; రాముఁడు, జానుగ శోధితజటుండు ♦ స్నాతుండు విచి

త్రానూనమాల్యధరుఁడును, నై నెతీఁ జందనమలంది ♦ యమలతనుండై .౧౮౪

క. మేలైనవస్త్రములనుం, దాలిచి తేజస్సుచే ని♦తాంత మలరుచుౘ
గ్రాలెడుసింహాసనమున, బాళిం గూర్చుండె జనులు ♦ ప్రమదము నొందౘ.

తే. వీర్యవంతుఁడు నిక్ష్వాకు♦విమలవంశ,వర్ధనుండు శ్రీమంతుండు ♦ భానురుఁడును
నైన శత్రుఘ్నుఁడును మహీ♦జానిదైన,రామునకులక్ష్మణునకు భ♦రతునకునొగి.

క. సకలాలంకారంబులు, ప్రకటంబగు వైభవమున ♦ భవ్యములుగ సే
వకతతిచేఁ జేయించెను;, సకలనృపస్త్రీలు మంచి♦సాన్వంతములు తగౘ. ౧౮౫

క. జనకజకుఁ దారె మది కిం,పును గూర్చెడు భూషణములు ♦ పొదిగి రుచిరరీ
తిని గై సేసిరి; నంతటఁ, దనయునిపైఁ బ్రేమ మధిక♦తమమై పొలయౘ. ౧౮౬

తే. అలరుకౌసల్య హృష్టయై ♦ యాత్మజునకు
సఖులుగా నున్న యవ్వన♦చరుల భార్య
లకును నందఱకును సువి♦లాసరీతి
సాధ్వలంకారముల నిచ్చె ♦ సరసమతిని. ౧౮౭ 5502

తే. అంతశత్రుఘ్ననానతి ♦ నంది యాసు
మంత్రుఁడను సారథియును స♦మస్తములగు
నవయవంబులు చక్కఁగ ♦ నమరియున్న
స్యందనం బాయితము చేసి ♦ యచటఁ జేర్చె. ౧౮౮ 5503

క. గురుబాహుఁడు బుతవిక్రమ,విరాజితుఁడు రాముఁ డంత♦విమలం బగుచుౘ
సరసిజసఖమండలమటు,సురుచిరమగుస్యందనమును ♦ జూచి శుభగతిౘ. ౨౦

క. ఆరోహించెను; బ్లవగమ,హీరమణుఁడు హనుమ స్నాన♦కృత్యము మిగులం
గోరికతో నొనరిచి శృం,గారములై *దివిజలోక♦గవసనములునాౘ. ౨౦౫

క. తనరారు నంబరంబుల, మనమలరం గట్టి చెవుల ♦ మంజుళములుగాఁ
గనుపట్టఁ గుండలంబులు, తనువులు వెలయంగఁ ద్రిదశ♦తల్లజురీతిౘ. ౨౧ 5506

చ. కననయి తారయోధ్యకును ♦ గ్రన్ననఁ బోయిరి; సూర్యపుత్రుచ
క్కనివనితల్ వరాభరణ♦కాంతులతోఁ దగి కుండలంబులుౘ
గనదురుకాంతిఁ బెంపెసఁగి ♦ కర్ణములం దులకింపఁగా నయో
ధ్యను గనుకౌతుకంబునను ♦ దారొగిఁ బోయిరి; రాజమంత్రులుౘ. ౨౨

క. మునిపతిఁ బురోహితు వసిష్ఠుని గూడి మహోత్సవమును ♦ శుభగతిఁ జేయం
గను దగు మంగళవస్తువు,లను సనుకట్టఁ దగునని వి♦లాసము పొంగౘ. ౨౨౫

తే. ఒకటఁ దలపోసి; రట విజ♦యుఁడు నశోకుఁ
డాసుమంత్రుఁడు తలపోసి ♦ యధిపునకును

* స్నాత్వా దివ్యనిభై ర్వస్త్రైః-అనియా.

బురికి వృద్ధికరంబుగఁ ♦ బరఁగునట్టి
కృత్యములు నల్పఁగా నవు ♦ డెంచి మునిని. ౨౮ 5509

సీ. కనుఁగొని యిట్లని ♦ రనఘ! మహాత్ముఁడౌ జనపతికిని జయా♦ర్హునకు రాఘ
వున కభిషేకార్థ ♦ మనుపమశుభవస్తువుల సమకట్ట న♦ర్హులరు మీరె;
యని మంత్రు లందఱ ♦ట్లతనికిఁ జెప్పి రామునిఁ జూచు మనములఁ♦జనిరి మరలఁ
బురము వెల్వడి; యంత ♦ సురపతియాసహస్రాక్షుఁడు హరియు క్త♦మగురథంబు

ఆ. నెక్కి పోవురీతి ♦ నేపాపమెఱుఁగని, యారఘూద్వహుండు ♦ స్యందనోత్త
మమును నెక్కి పత్త♦నమునకుఁ జనియె; రా,మునకు భరతుఁడెలమి♦మునమునఁ దగ.

క. అరదముఁ బగ్గములం గొని, త్వరగా నడిపించె; రుచిసి♦తచ్ఛత్రముఁ దాఁ
గరమునఁ శత్రుఘ్నుఁడు గొని, శిరముపయిం బట్టె నంతఁ ♦ జెలఁగెడు వేడ్కన్.

తే. మ్రోల నిలుచుండి లక్ష్మణుఁ ♦ డోలి రామ
చంద్రుశిరమున వ్యజనంబుఁ ♦ జక్క విసరు
చును గ్రహించెను, సితరుచి♦శుభ్రమగుచుఁ
దనరు వాలవ్యజనమును ♦ ఘనత మీఱ. ౨౯ 5512

క. దనుజేశుండు విభీషణుఁ, డనుపమమగు మఱొకదాని ♦ నాచామరముం
గొనియెన్; వ్యోమతలంబున, మునులు మరుద్గణము లమర♦ముఖ్యులు ప్రీతిన్.

క. రామునివరకృత్యంబుల, వేమాఱు దలంచుచుండ ♦ విపులమృదురవం
బామోదప్రదమై తగి, భూమిన్ వ్యాపించెఁ; బ్లవగ♦ముఖ్యం డగుచున్. ౩౦

క. గురుతేజుఁడునగు రవిజుఁడు, ధరణీధరతుల్యమైన ♦ తనువునఁ దగుకుం
జరమును *శత్రుంజయమును, గర నునురాగమున నెక్కి♦కడువడిఁ జనియెన్.

క. వనచరులు నరాకృతులం, గొని సర్వాభరణములను ♦ గోరికమెఱయం
గను దాల్చి నవసహస్రము, లనుపమములునైన కరుల ♦ నవు డెక్కి తమిన్.

క. చని; రంతఁ బురుషతల్లజుఁ, డనఘుఁడునగు రామచంద్రుఁ ♦ డతులమహాశం
ఖనినదములు జనులు ముదం,బునఁ జేయుమహానినాద♦ములు చెలఁగంగన్.

క. భేరీనాదంబులు గడు, బోఁకొనన్ సౌధరాజ♦పూగముచేఁ జె
న్నారు నయోధ్యకుఁ బోయెను;, శ్రీరామునిఁ బట్టభద్రుఁ♦జేయుముదమునన్.

చ. మును పురి కేగి వస్తువులు ♦ మున్నగువానిని గూర్చి రామచం
ద్రుని కెదురేగు దెంచిన గు♦రుప్రముఖుల్ సచివుల్ రథంబునం
దనపరివారముం గలిసి ♦ తద్దయు రాజిలు సుందరాంగ మొ
ప్పును జనుదెంచు రాఘవుని ♦ భాసురవక్త్రుని సత్కృపాకరున్. ౩౩ 5519

క. అతిరథవర్యునిఁ గాంచిరి;, మతిమంతులు వారలంత ♦ మైకొను ప్రీతిన్
క్షితినాథున్ జయజయశ,బ్దతతుల నలరింప బదులు ♦ పల్కి యతండున్. ౩౪

* తత శ్శత్రుంజయం నామ కుంజరం-అనిమా.

ఆ. తమ్ము గారవింపఁ ♦ దద్భ్రాతృయుక్తుని, వెంటఁ జనిరి; వృద్ధ♦విప్రతతులు
సచివవరులు ప్రకృతి ♦ సమితియుఁ దనుఁ గొల్వఁ, దారకాన్వితాభ్ర♦తకరుఁ బోలి.

క. వెలుఁగొందె రాముఁ; డంతట, సులలితతూర్యములఁ బూని ♦ సొంపుగ నాదం
బులఁ జేయువారు తాళం,బులఁ గొట్టెడువారు భద్ర♦ములఁ దగుపాటల్.

సీ. పలుకువారును మఱి ♦ సులలితస్వస్తికవాద్యముల్ పూనిన♦వారు ముందు
చనఁగఁ దానుం బోయెఁ; ♦ గనకాక్షతలు దాల్చుపురుషులు గోవులు ♦ నిరుపమాన
సౌందర్యగర్వైక♦సాంద్రలౌ కన్యలు మోదకహస్తులౌ ♦ మేదినీసు
రులును రామునిముందుఁ ♦ జెలఁగుచుఁ బోయిరి; సుగ్రీవునకుఁ గల ♦ శుభతరమగు

తే సఖ్యమును వాయుపుత్రుని♦సత్ప్రభావ,మును గపీంద్రులు సంగర♦మునునొనర్చి
నట్టికృత్యంబు దనుజబ♦లాతిశయము, నవ్విభీషణుసంబంధ ♦ మారఘుపతి.

క. తనమంత్రులకుం జెప్పెను, విని యావృత్తాంత మెల్ల ♦ విస్మయమును నె
మ్మనముల నయోధ్యలోఁ గల, జను లెల్లరు గాంచి; రంత ♦ క్ష్మాపతిమణియున్.

తే. తనదువృత్తాంతమును జెప్పు♦చును మనమునఁ
*దుష్టియుం బుష్టియుంగల ♦ శిష్టజనులు
నిండియున్న యయోధ్యను ♦ నెమ్మిఁ జొచ్చె;
నంతఁ బురజను లాత్మగే♦హములయందు. ౮౧ 5525

తే. పొడవుగా నెత్తి నిల్పిరి ♦ కడఁగి ధ్వజము
లిట్టు లిక్ష్వాకువంశమ♦హీశు లెల్ల
వాస మొనరింప రమ్యమై ♦ వఱలు తండ్రి
గృహముచెంతకుఁ జేరె నా♦నృపతిమణియు. ౮౨ 5526

క. తరువాతన్ రఘునందనుఁ, డురుమతి శ్రీరామచంద్రుఁ ♦ డొప్పమెఱసి సుం
దరమగుపితృసౌధము స,త్వరముగ దరియంగఁ జొచ్చి ♦ తద్దయు భక్తిన్. ౮౩

సీ. తనతల్లికిని సుమి♦త్రకును గైకేయికి వందనములు సల్పి ♦ భరతుధార్మి
కోత్తముఁగని మహా♦ర్థోపబృంహితములౌ పలుకుల మృదువుగఁ ♦ బలికె నిట్లు;
ముత్తెముల్ వైడూర్య♦ములు చెక్క రాజిల్లి యుద్యానవనమున♦నొప్పియున్న
సౌధరత్నముఁ గపి♦క్ష్మాపతికిం జూపు ముందు వసింపనౌ ♦ నతఁడు; నాఁగ

ఆ. సత్యవిక్రముండు ♦ సరసచిత్తుఁడు భర,తుండు దానిని విని ♦ తోరపుఁదమి
వనచరేశుహస్త♦మును బట్టుకొని యట్టి, సౌధమునకుఁ జేర్చె ♦ సంభ్రమమున.

క. పరిచరు లాశత్రుఘ్నుని, కరసంజ్ఞం దైలదీప♦గణముల శయనా
స్తరణంబులఁ గైకొని స,త్వరముగ నటఁ జేరి; రిట్లు ♦ వనచరపతియున్. ౮౪

తే. సౌధమునఁ జొచ్చినంతఁ దే♦జమున మించు
రాముప్రియసోదరుండు భ♦రతుఁడు సూర్య

---

* హృష్టపుష్టజనాకీర్ణామ్-అనిమూ.

తనయునిం గాంచి యిట్లని♦యెను నృపాల
రాము నభిషేకమునకుఁ దవ్వ♦రపడి నీవు. ౪౮ 5530

క. పనుపుము దూతల; ననఁగా, విని సుగ్రీవుండు రత్న♦వితతిఖచితముల్
కనకఘటంబులు నాలుగు, వనచరులకు నల్వురకును ♦ వరుస నొసఁగుచున్.

తే. పలికె వానరవరులార!♦ యెలమి రేపు, తెల్లవాఱక మునుపె మీ♦రెల్ల నాల్గు
సంద్రముల నీరు పావన♦శైవలినుల,జలములనునించుకొనివచ్చి♦సంభ్రమమున.

తే. ఎదురుచూచుచునుండుఁడీ♦యిచటననుచు, నాజ్ఞనిడ వారణోపము♦లై మహాత్ము
లైన వనచరవర్యులు ♦ వైనతేయు,కరణి జవమొప్పువారలు ♦ గాన వేగ. ౫౧

క. చని రంబరమార్గంబున;, హనుమంతుఁడు జాంబవంతుఁ ♦ డాఋషభాఖ్యుం
డును వేగదర్శియను నీ, వనచరు లంభఃప్రపూర్ణ♦భర్మఘటములన్. ౫౨

ఆ. తెచ్చి రంత వారు ♦ దివ్యనదీపంచ,శతజలములఁ బట్టి ♦ సంతసమున
సరగు దెంచి; రంత ♦ సలఘుబలోపేతుఁ,డౌసుషేణుఁ డెంతొ♦యాదరమున.

క. తూరుపుసంద్రమునుండి మ,హారత్నసుసన్నఘటము ♦ సంభఃపూర్ణం
బౌరామునకయి తెచ్చెను;, సారబలుండైన యాఋ♦షభవనచరుఁడున్. ౫౩

ఆ. దక్షిణాబ్ధినుండి ♦ తపనీయకలశంబు,నిండ జలము నించి ♦ దండి రక్త
చందనవిటపాళి♦సంయుతముగఁ జేసి, నశ్వరముగఁ దెచ్చె ♦ సంతసమున. ౫౪

క. గవయుఁడు మారుతవిక్రముఁ, డవుటం బడమటఁ జెలంగు ♦ నంబుధిభవశీ
తవిమలజలముల మణికుం,భవరమునన్ నించి తెచ్చెఁ ♦ బటువేగమునన్. ౫౫

క. గరుడానిలవిక్రముఁడును, వరధర్మమనస్కుఁ డఖిల♦వరగుణఖనియుం
బరహంతయునగు నలుఁ డు,త్తరజలధిజలంబుఁ దెచ్చెఁ ♦ దాఁగలశమునన్.

క. వనచరు లిటు తెచ్చిన పా,వనజలముల నిఖిలమంత్రి♦వరులు సుమిత్రా
తనయుండగు శత్రుఘ్నుఁడు, కని రామునిఁ బట్టభద్ర♦కలితునిఁ జేయన్. ౫౭

క. తరుణం బిదియని తలఁచుచుఁ, బురోహితుం డసమశక్తి♦పూజ్యుఁడు నగుచుం
బరఁగు వసిష్ఠునకును బం,ధురాజికినిఁ దెల్పి; రంతఁ ♦ దోరపువేడ్కన్. ౫౮

శ్రీరామచంద్రపట్టాభిషేకమహోత్సవము.

చ. మునిపతియై మహాత్ముఁడయి ♦ భూసురసంయుతుఁడై చెలంగునా
యనఘుఁ డరుంధతీపతియు ♦ హర్షమునన్ జనకాత్మజాతతో
ఘను రఘురామచంద్రు మణి♦కల్పితపీఠమునందుఁ గూరుచుం
డు నటు లొనర్చె విప్రులు క♦డుం గడు దీవన లిచ్చుచుండఁగన్. ౫౯

ఆ. అంతటన్ వసిష్ఠుఁ ♦ డావామదేవ,కా,శ్యప, సుయజ్ఞ, గౌత♦మాఖ్యు, లెలమి
గ్రాలువిజయమునియుఁ,♦గాత్యాయనుండు,జా,బాలియుననుమాను♦లోలిఁగూడి.

క. మును పష్టవసువు లమరేశును కభిషేకంబు చేయు♦చొప్పున విమలం
బును జారుపరిమళాన్విత,మునగు పయస్సునను బురుష♦ముఖ్యు రఘుపతిన్.

క. అగుడుగ నభిషేకించిరి;, తరువాతన్ బుత్విజులును ♦ ధాత్రీసుర లా
దరమునఁ గన్యలు మంత్రులు, పురజనులును యోధవరులు♦పొంగెడు వేడ్కన్.
సీ. అభిషేక మొనరించి ♦ రంత వసిష్ఠాదు లాకృతిమ్మెఁ గోర ♦ నరుగుదెంచి
నట్టి నలువ్వరగు లో♦కాధిపు లన్య దేవత లొకటిగఁ గూడి ♦ వైభవమున
నంబరంబున నిల్చి ♦ యతినిర్మలములగు సర్వౌషధీరస♦సారములను
నభిషేక మొనరించి; ♦ [రాదికాలంబున బ్రహ్మనిర్మితమయి ♦ పరఁగు నేదొ
ఆ. మనువు దేనిచేత ♦ మును పభిషిక్తుఁ డయ్యెనో తదీయవంశ♦మునను గలుగు
క్షితిపు లెల్ల దేని♦చే నభిషిక్తులై, యుండిరో మహార్హ ♦ ముజ్జ్వలంబు. ౬౩
క. వితతమణిమనోజ్ఞంబును, నతిశయశుభదంబునైన ♦ యట్టి కిరీటం
బు తగన్ బంగరుతో నున్నతము నమూల్యంబు నగుచు ♦ నైజస్ఫూర్తిన్.
క. తనరుచు నానావిధవస్తునికరములు వెలసి మిగుల ♦ సుందరరత్నా
ళిని జిత్రితమై తగు సభ, ననూనమణిపీఠవర్య♦మం దుంచి తగన్. 5548
తే. క్రమము తప్పక పూజించి♦యమలచిత్తుఁ, డగు వసిష్ఠుండు బుత్విజు♦లఖిలమునులు
నక్కిరీటంబుతో రాము♦నాదరమున, నప్పు డభిషేక మొనరించి] ♦ రట్టితఱిని.
క. మంగళసితాతపత్రం,బుం గరమునఁ గొనుచు రామ♦మూర్తికిఁ బట్టెం
బొంగుచు శత్రుఘ్నుఁడు కపిపుంగవుఁడగు సరసిజాప్త♦పుత్త్రుం డంతన్.
క. తెల్లని వింజామరచే, మెల్లఁగ వీచెను ముదంబు ♦ మించ దనుజరా
డ్వల్లభుఁడైన విభీషణుఁ, డల్లన శశిసన్నిభముగ ♦ నలరెడు దానిన్. ౬౪
తే. [1]వేఱు వింజామరను బూని ♦ విసరె; నింద్రు
పనుపునన్ వాయుదేవుండు ♦ తనరుచులను
వెలసి శతపుష్కరంబగు ♦ విమలకనక
హారమును రామచంద్రున ♦ కప్పు డొసఁగె. ౬౫ 5552
చ. అనిలుఁడు తన్ను నిర్జరగ♦ణాధిపుఁ డింకను హెచ్చరింప ర
త్ననికరసంయుతం బగుచు ♦ నాయకరత్నవిభూషితంబునై
తనరుచు ముత్తెముల్ వెలయఁ ♦ దద్దయు నొప్పెడు హార మిచ్చె; న
మ్మనుజవిభుండు తత్కృతిని ♦ మండితుఁడై యలరారు చుండఁగన్. ౬౬
తే. సురలు గంధర్వులెంతయు♦శుభముగలుగఁ, బాడిరప్సరసలాడి; రత్తఱి ♦ నవనియందు — 

క. అలరారెం బుష్పంబులు, సులలితవాసనల మించె ♦ క్షోణీపతి శ్రీ
లలితుఁడు [2]రాముం డత్తఱి, నిలాసురేశులకు లక్ష ♦ నిచ్చెఁ దురగముల్.

1 మాలాం జ్వలంతీం వపుషా కాంచనీం శతపుష్కరామ్, రాఘవాయ దదౌ వాయు ర్వాసవేన ప్రచోదితః-అనిమూ. 2 సహస్రశత మశ్వానాం ధేనూనాంచ గవాం తథా-అనిమూ. ఇట లక్షగుఱ్ఱములను భూసురుల కిచ్చెననుచో నొకనాణెములని కొంద ఱర్థము చెప్పుదురు. అది యుక్తి యుక్తమే కావచ్చును.

తే. అపుడె ప్రసవించియున్నట్టి ♦ యాల లక్ష
వృషభములు నూఱు భూసుర♦వితతి కొసఁగె
మరల ముప్పదికోట్ల హే♦మమయనిష్క
ముల నమూల్యాంబరముల సొ♦మ్ముల నొసంగె. ౭౦౪ 5556

చ. సరసిజమిత్రరశ్ముల నె♦సంగుచు రత్నవినిర్మితంబునై
నిరుపమమై మనోజ్ఞమయి ♦ నిర్మలమై తగుభర్మహార మా
హరిపతి కిచ్చె భాస్కరకు♦లాభరణంబగు రామమూర్తి; యా
దరమున వాలిపుత్త్రునకు ♦ ధైర్యసమగ్రున కెంతొ వేడుకన్. ౭౦౪ 5557

తే. వజ్రవైడూర్యమణిగణ♦భాసురంబులైన కేయూరముల నిచ్చె;♦నవనిజాత [చు.
కపుడు రాముండుహృష్టుఁడై ♦యమలరత్న,ఖచితమయిచంద్రకిరణసం♦కాశమగు

*క. ఉత్తమతమమయి కాంతుల, నత్తఱి సభనెల్లఁ గ్రమ్ము ♦ నట్టి యనుపమా
ముత్తెపుహారము నిచ్చెను,రుత్తమయున కిచ్చునను ని♦రూఢమునీషన్. ౭౩౪ 5559

చ. జనకజ భర్తయాజ్ఞ కయి ♦ స్వాంతమునం దవ్వరఁ బూని యంత నా
తనిననుజ్ఞ నొంది ప్రమ♦దంబున దివ్యములౌచు నెప్పనం
బునకు ముదంబు నెంతయును ♦ బొందుగఁ గూర్చెడు రెండువస్త్రముల్
ఘనమణినిర్మితాభరణ♦కాండముఁ బావని కిచ్చె వేడుకన్. ౭౮౪ 5560

చ. తనకుఁ బ్రియుండు నిర్భరము♦దంబున నిచ్చినహార మట్టె యా
జనకజ కంఠమందు రుచి♦జాలము మించఁగ నుండఁ దీసి య
వ్వనచరవారముం గనుచు ♦ భర్త్రభీష్ట మెఱుంగఁ గోరి యా
తనిఁ బలుమాఱు చూచె; రఘు♦తల్లజుఁ డింగితవేత్త గావునన్. ౭౯౪ 5561

క. ధరణిసుమానిక భావముఁ, బరిపరిఁ బరికించి యిట్లు ♦ పలికెన్ సుదతీ!
నిరుపమబలవిక్రమములు, స్థిరమతిముఖశుభగుణములు ♦ చెందు నెవనికో.

తే ఎవఁడు నీకాత్మసంతృప్తి ♦ నిచ్చినాఁడొ, యట్టివానికి నీహార ♦ మాదరమున
నొసఁగుమా;యనిపల్కినా♦యుత్పలాక్షి,హారముహనుమదానినిచ్చెనా♦యనిలజునకు.

క. సితజలదయుక్తమౌ పర్వత మట్టులు చంద్రకిరణ♦వారమువలెనే
సితరుచులమిగులు హారము, మతిమంతుఁడుహనుమతాల్చి♦మఱియువెలింగెన్.

సీ. అంతఁ బరంతపుఁ♦డగు రామచంద్రుండు మైందద, ద్వివిద, నీల ♦ బృందనాయ
కులకు వారలు మదిఁ ♦ గోరినయట్టులు గుణవిశేషములను ♦ గూడియున్న
వస్తువుల నొసంగె; ♦ వనచరవృద్ధులు మఱియు వానరపతుల్ ♦ మహితరీతిఁ
దగినట్లు భూషణ♦తతుల వస్త్రంబుల నలరింపఁబడి; రంత ♦ నశ్రమమున

ఆ. నెట్టికార్యమైన ♦ నేపున నొనరించు, రాముఁ డసురసంఘ♦రాజునకును

* సీతాయై ప్రదదౌ రామః-అనిమా హనుమతే దాతవ్య మిత్యాశయేన దదౌ-అనివ్యాఖ్య.

వనచరేంద్రునకును ♦ హనుమకు జాంబవంతునకు నితరులైన ♦ వనచరులకు.

క. పరువులకుం దగినట్టులు, వరరత్నము లాదియైన ♦ వస్తువితతు లే
వరునర్ గోరిన నటు లాదరమున నొసంగంగ వారు ♦ తమిచెలంగంగన్. ౮౩

క. తమతమ నెలవులకుం జని; రమలాత్ములు వనచరేంద్రు ♦ లందఱు మహనీ
యమతియగు రాముసభిషేకమహమ్మును జూచి మ్రొక్కి ♦ కడువినయమునన్.

క. అనుమతులై కిష్కింధకుఁ, జని; రాకపితల్లజుఁడగు ♦ సప్తాశ్వసుతుం
డును రాముని యభిషేకంబును గని బహుమతుల నొంది ♦ పోయెం బురికిన్.

సీ. [సర్వకామంబు లొ♦సంగి శ్రీరాముండు పూజింప] *రాక్షస♦పుంగవుఁడగు
నావిభీషణుఁడు త♦దాజ్ఞను గైకొని కులధనంబును దాను ♦ గొనుచు లంక
కరిగె; రాముండిట్టు♦లఖిలవైరులఁ జంపి గురుయశంబును బొంది♦పరముఁడగుచు
దుష్టుల శిక్షించి ♦ శిష్టుల నలరించి రాజ్యంబు నెల్లను ♦ బ్రమదమలరఁ

తే. జక్కఁ బాలించె; ధర్మవ♦త్సలుఁడు రాముఁ, డఖిలధర్మవిదుం డయి♦యనుజుఁడైన
యానుమిత్రాత్మజుని గాంచి♦యనియె; నీవు, ధర్మవిదుఁడవు మనాది♦ధరణిపతులు.

క. మునుపటివారలు దోర్బలమున నేలుచునుండినట్టి ♦ భూమిని దీనిన్
ననుఁ గూడి యేలు మీవును, మనజనకపితామహాది♦మాన్యులు పూర్వల్.

క. ధరణీశులు ధరియించిన, ధరణీభారంబు దీనిఁ ♦ దమి నీవును సు
స్థిరయౌవరాజ్యమును గొని, పరిపాలింపంగఁ దగును ♦ భవ్యమనీషన్. ౮౭

క. నే నెట్లో నీవు నట్లే, పూనం దగు ననియె; భూప♦పుంగవుఁ డిటు త
న్నానిన ముదమున నీవికఁ, బూనఁ దగుఁ యౌవరాజ్య♦మున నిమ్ముదూక్తిన్.

---

* లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయా ద్విభీషణః-అనియూ. ఇచట కులధనమనుపదమునకు శ్రీరంగవిమానమని గోవిందరాజులు సంప్రదాయార్థమును జెప్పిరి. కులధనమనఁగా లంకారాజ్యమే యర్థమనియు, నుత్తరకాండమున రామావతారసమాప్తికాలమున రామమూర్తి విభీషణునకు శ్రీరంగవిమాన మిచ్చినట్లు చెప్పఁబడియున్నదనియుఁ బద్మపురాణమున నిట్లే చెప్పఁబడియున్నదనియు మహేశ్వరతీర్థులు వ్రాసిరి. ఈభేదమును సరిచేయుట శక్యమగు పనికాదు. బుద్ధిమంతు లాలోచించుకొని యెవరికి సరిపడినది వారు గ్రహించుటయే యుక్తము. గోవిందరాజులే తనవ్యాఖ్యలో "విభీషణ కులక్రమాగతం లంకారాజ్య మితి కేచిత్" అని వ్రాసియున్నారు. ఇందుఁ గొన్నిప్రక్షిప్తశ్లోకము లున్నవనియుఁ గాఁబట్టి యవి తొలగింపవైచి పద్మపురాణమునకు యథాంతరవ్యవస్థయని యర్థముచెప్పిన గోవిందరాజీయమతము నిలుచునని మతికొందఱు. సత్యమునకు తీర్థులవారి యర్థమే సరియైనదని తోఁపకపోదు. ఈచిక్కులు నాకేల యని యాపదమే పద్యమునసుంచితి. బుద్ధిమంతులు ఎవరికెట్లు సరిగానున్న నాయర్థమును గ్రహింపవచ్చును. ఈరెండింటివలనను శ్రీరాముని రామత్వమునకు విభీషణునిభక్తత్వమునకు హానిలేదు. కుమ్ము కుద్దులతో లాభములేదని గ్రహింతురుగాక.

[1]తే. అనతిచ్చిననుఁ బ్రియ ♦ మార నెంత,యనునయించిన లక్ష్మణుం ♦ డల్లి యనక
యుండెనంతమహాత్ముఁడా ♦ యుర్విభుఁడు,భరతు నభిషిక్తుఁ జేసెనా ♦ పదమునందు.
ఆ. అంతఁ బౌండరీక ♦ మశ్వమేధము వాజ,పేయ మితరములగు ♦ పృథుమఖములు
ధరణినాథమౌళి ♦ తాఁ బలుమాఱులు, చేసె మానులలర ♦ భాసురముగ. ౯౦
క. ధరణీశుఁడు పదివేలగు, శరత్తు లారాజ్యమేలి ♦ చక్కనియశో
త్కరముల గురుదక్షిణలను, బరములగు నశ్వమేధ ♦ భవ్యక్రతువుల్. [భుఁడు
తే. [2]శతమునొనరించెనిట్టులా ♦ జానుబాహు,వులును బలుమూఁపులునుగల ♦ భూమివి
లక్ష్మణానుచరుండయి ♦ లలితరీతి, విక్రమంబునఁ బాలించెఁ ♦ బృథ్వి నెల్ల. ౯౧
సీ. ధర్మాత్ముఁడగు రఘు ♦ తల్లజుఁ డత్యుత్తమునుగు రాజ్యముఁబొంది ♦ సమతమిత్ర
బాంధవులను జ్ఞాతి ♦ పటలంబునుం గూడి బహువిధాధ్వరముల ♦ గరుసఁ జేసె;
రాముండు చక్కఁగా ♦ రాజ్యంబుఁ బాలింపవైధవ్యదుఃఖము ♦ భామినులకుఁ [త;
గలుగదయ్యెను,వ్యాళ ♦ ములభయంబును,రోగభయమునుబొందరా ♦ ప్రజలొకిం
తే. యపుడులోకంబునన్ దొంగ ♦ లనఁగఁగఁబుగ,రైరదెట్టి యనర్థమే ♦ యైననెవనిఁ
దాఁకకుండెను,సుంతయుఁ ♦ దారువృద్ధు,లుండి యర్భకులు మృతినొ ♦ నొందఁగనరు.
చ. [3]కనుకనె ప్రేతకార్యములఁ ♦ గానరు చేయఁగ; సర్వమున్ ముదం
బును గనుచుండు, మానవులు ♦ భూస్థలి ధర్మరతిన్ జెలంగి యొ
క్కనిపయి వైరముం గనఁగఁ ♦ గారణ మొక్కనికుండ రాము మో
మును గని దాన వాఁడు రఘు ♦ భూషణు మోమును మాని దాని నె
మ్మనములఁ బ్రీతిఁ గాంతురు స ♦ మస్తవిధంబులఁ దృప్తులై యిలన్. ౯౨ 5578
చ. జనపతి రాజ్య మేలుతఱి ♦ సర్వజనుల్ పదినూర్లవర్షముల్
మనుగడఁ గాంచి రోగ మను ♦ మాటయె లేక [4]సహస్రపుత్రులన్
గని గతశోకులై సుఖముఁ ♦ గాంచిరి; రాముఁడు రాజ్యమేలఁగా
జనులు నిరంతరంబు తమ ♦ స్వాంతములం గడుఁ బ్రీతిమీఱఁగన్. ౯౩
క. రాముఁడు రాముఁడు శ్రీరఘు,రాముండని రామచంద్ర ♦ రమ్యకథలనే
వేమాఱు చెప్పుచుండం,గా మహి శ్రీరామమయము ♦ గాఁ దగియుండెన్. ౯౪
చ. తరువులు స్కంధముల్ విపుల ♦ తన్ దగ నెప్పుడు పూయుచున్ ఫలో
త్కరముల నొప్పుచుండె; జల ♦ దంబులు కాలము తప్పకుండఁగా
ధరణిని వృష్టిదానమునఁ ♦ దద్దయుఁ దన్పుచునుండె; వాయువుల్

1 సర్వాత్మనా పర్యనునీయమానో యదా న సౌమిత్రి రుపైతి యోగమ్-అనియూ. ఇట లక్ష్మణుఁడు రామువాక్యము నంగీకరింపకుండుట మూర్ఖత్వమునఁ గాదనియు, అన్నను సేవించుట తప్పఁ దక్కిన యధికారములు తనకుసలదనియు నిరంతర్థ కాంతిసెపరే యాతనిభావమనియు గ్రహింపఁదగు. 2 ఆజానులంబబాహు స్స మహాస్కంధః ప్రతాపవాన్-అనియూ 3 రామ మేవానుపశ్యంతో నాభ్యహింసన్ పరస్పరమ్-అనియూ అన్యోన్యనిమ్మాలనవైరే సత్యపి రామముఖం మ్లానం భవిష్య తీతిమత్వా పరస్పరం నాభ్యహింసన్-అనివ్యాఖ్య. 4 ఇచట సహస్రశబ్దము బహుత్వపరమని గ్రహించుట యుక్తము.

నిరతసుఖాస్పదంబుగను ♦ నిచ్చలు వీసుచునుండె; బ్రాహ్మణుల్. ౯౯౪ 5581

చ. ధరణిప, వైశ్య, శూద్రులు, స్వ♦ధర్మము దప్పక లోభయుక్తి నే
వగనను బొందకే మదిని ♦ వారనితృప్తిని గాంచుచుండి; రా
దరమున రాముఁ డేలుతటి ♦ ధర్మరతుల్ వరధర్మనిష్ఠులుఙ్
నిరతము సత్యవాదులు స♦నిందితసుంగళలక్షణాఢ్యులుఙ్
బరహితులుఙ్ సుశాంతు లతి♦భవ్యమనీషులునై నరుల్ కడుఙ్. ౯౯౪ 5582

తే. వెలసి యుండిరి; సోదరు♦లెలమిఁగొలువఁ,బదునొకండుసహస్రసం♦వత్సరములు
శ్రీయుతుండయి రాముండు♦చేసె ధరణి,పాలనంబును ధర్మత♦త్పరమతియయి.

సీ. ఆదికావ్యంబు ధ♦న్యము యశస్కరమును రాజులకుఙ్ జయ♦ప్రదమునాయు
రారోగ్యదంబు వే♦దార్థసంయుతమును నగు దీని రామాయ♦ణాఖ్యకృతిని
వాల్మీకి రచియించె ♦ భవ్యంబుగా మును; దీనినిఁ జదువునో ♦ వీనులలర
నెవ్వండు వినునో యా♦హితమతిపాపాళిముక్తుఁ డౌ శ్రీరామ♦మూర్తిదయిన

తే. యతులపట్టాభిషేకంబు ♦ నాదరమున,విన్నయెడఁ బుత్రకాముఁడ♦కెన్నరాని
సత్సుతుల్ గల్గుదురు,విత్త♦సంచయమును,గోరువారికి ద్రవ్యంబు♦కూడు నిజము.

క. ధరణివిభుండును వినునే, నరివీరుల నోడించి భూమి ♦ నంతయుఁ బొందుఙ్;
దరుణులు విందురయే రఘు,వరుఁ కౌసల్యయును, గైక ♦ భరతాహ్వయునిఙ్.

ఆ. లక్ష్మణుని సుమిత్ర ♦ లలిమీఱఁ గన్నట్టు, లాయువెక్కుఁడు గల♦యట్టి సుతులఁ
బడయుదురు ప్రమోద♦పరమసుఖంబులఁ,గనుచునుండ్రుమిగులఁ♦గాంతివెలయ

క. శ్రమముం బొందకయే కా,ర్యములఙ్ సాధించు రాము♦రమ్యవిజయ మె
ల్ల మహిం బ్రతిపాదించెడు, సుమహితరామాయణంబు ♦ శుభమతివినినఙ్.

క. అమితాయు వొందు; వాల్మీ,కిమహర్షికృతంబు మాని♦కీర్త్యము వేదా
ర్థముఁ దెలిపెడు నీ తొలికా,వ్యము నెవ్వఁడు శ్రద్ధ గలిగి♦ యాంద్రుతిమీఱఙ్.

క. జితకామక్రోధుండయి, యతిశయమోదమున వినిన ♦ యాతం డాప
ద్వితతిని దాఁటును జక్కఁగ,క్షితి నెవఁడు విదేశమందుఁ ♦ జేరియె యున్నఙ్.

తే. మరల బంధువులనుగూడు ♦ మహిని నిందె
రాఘవానుగ్రహమ్మున ♦ రమ్యవాంఛ
లన్నియును బొందు; దీని రా♦మాయణమును
జక్కఁగా విన్న సురలుహ♦ర్షముఁ గనుదురు. ౧౦౯౪ 5590

సీ. ఇంతమాత్రమెకాక♦గృహమునవసియించికార్యంబులకును♦విఘ్నములఁగూర్చు
దేవతాగణములు ♦ తీవ్రభూతంబులుశాంతంబులగు; రాము♦చంద్రుగాథ
విన్నమాత్రమ్మునఁ ♦ బృథ్వీశుఁ డెల్లభూమండలంబు జయించు, ♦ మఱి విదేశ
గతుఁడు క్షేమంబుగఁ ♦ గ్రమ్మఱ స్వస్థానమును జేరు; నార్తవ♦మును గనుయువ

తే. తులొగివిన్నసద్గుణులఁబు♦త్రులనుగనుదు;,రతిపురాతనమీయితి♦హాసమాట[వు.
దీనిఁబూజింపఁజదువంగ♦మానవులకుఁ, బాపసంఘంబునశియించు♦భద్రమొద

క. ఆయువు చాలఁ దగుఁ రా,మాయణమును తు త్రియు లొగి♦నాదలలుధరన్
రాయఁగ మ్రొక్కి వినందగుఁ,జూ!యపనీసునునివలన ♦ శుంభగ్భక్తిన్.౧౧౧½

క. తనయప్రాప్తియు భాగ్యం,బును దప్పక కల్గు శంక ♦ పూనవలదు; దీ
నిని బూర్ణముగా నిత్యం,బును వినిసం జదువ రాఘ♦వుఁడు వానిపయిన్.

క. అనిశము ప్రీతుండయి యుం,డును; రాముఁడె యాది దేవుఁ♦డు సనాతనుఁడున్
ఘనభుజుఁడు ప్రభుఁడు నారా,యణుఁడున్ హరియైన విష్ణు♦నగు నట్లగుటన్.

క. కరుణించిన నఖిలార్థము, లరుదుగ నిచ్చును; మహార్థ♦మగు కార్యము శ్రీ
వరుచరితము మంగళదముఁ,; బరమంబగుభక్తి వినెడు♦వాఁడు ధరిత్రిన్.౧౧౪

చ. తనదుకుటుంబవృద్ధి ధన♦ధాన్యవివృద్ధిని గాంచు మోదమున్
మనమున కిచ్చు స్త్రీల నస♦మానవిలాసినులన్ వివాహమా
ననుపమమౌ సుఖంబుగను ♦ నాత్మను గోరిన కోర్కులొందు మే
దినిఁగల సర్వకామములఁ ♦ దృప్తిగఁ బొందును రామునత్కృపన్. ౧౧౪½

తే. ఆయురారోగ్యయశముల ♦ నందఁ జేయు
మంచిసోదరలాభంబు ♦ మించఁ గూర్చు
బుద్ధి సుఖముల నభివృద్ధిఁ ♦ బొందఁ జేయుఁ
దేజమును గల్గఁ జేయు నీ ♦ దివ్యగాథ!. ౧౧౫ 5597

క. కనుకని యభ్యుదయంబును, గనఁగోరెడు సాధుజనులు ♦ కడు నియమముతో
డను దీనిన్ వినవలయును;, వినుఁడీ నరులార! పూర్వ♦వృత్తం బిదియౌ.

తే. భద్ర మిదుఁ గాక మీకెప్డు ♦ భక్తితోడ
నమ్మకముగల్గి పారాయ♦ణమును జేయుఁ
డీశుఁడగు విష్ణుమహిమంబు ♦ వృద్ధిఁ గాంచుఁ
గాక జగమున ససద్భశ♦ఖ్యాతి మించి. ౧౧౬ 5599

క. దీనిన్ భక్తిని విన్నను, దీనిమహార్థమును నన్న♦తిని గైకొనినన్
మానసములఁ బ్రమదంబును, బూనుదురు సుపర్వ లనయ♦మునునరులయెడన్.

క. రామాయణమును వినినన్, నేమంబునఁ బితరులెల్ల ♦ నెమ్మిం గనువా;
రామహితభక్తి నీశ్రీ, రాముని గాథను మహర్షి ♦రమ్యకృతిఁ దమిన్. ౧౧౭½

తే. ఎవరు వ్రాయుదురో వార ♦ లెల్లఁ గామ
ములను బొందుచుఁ బరలోక♦మునకు నరిగి
స్వర్గమున సర్వకాలంబు ♦ వాస మొప్పఁ
జేయుదురు నిశ్చయం బిది ♦ శ్రీహరికృప. ౧౧౮½ 5602

నూటముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

క. మానీతమర్త్యరూపా, మానితకరుణాభిపూత♦మంజులాలాపా
మానియతసుకృతసురపా, మానీతిప్రహితవినుత♦మానిమహీపా.

చ. సరసిజనూతి దేవపతి♦సన్మునిసంతతిసాధుసన్నుతి
స్ఫురదభిరామ! వేదతతి♦పూజిత మోక్షదదివ్యనామ! సుం
దరరుచిధామ! దీనజన♦తాపరిపాలన కామ! సత్కృపా
కరగుణదామ! యోగిజన♦కమ్రహృదంబుజధామ! నిత్యమా!.

మాలిని. నిరుపమగుణహారా ♦ నిర్జితానేకశూరా
శరధికృతనివాసా ♦ సంతతానందహాసా
దురితతిమిరమిత్రా ♦ ధూతదైతేయగోత్రా
సురుచిరకమలాక్షా ♦ సూరిరక్షైకదీక్షా.

సీ. ఇది మహీసురకుల♦విదితకాశ్యపమానిగోత్రజాపస్తంబ♦సూత్ర, శ్రీత్రి
పురసుందరీవర♦కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ, ♦ ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధి♦చంద్రసుబ్రహ్మణ్యవిబుధవర్యసుపుత్ర, ♦ వినుతిపాత్ర
పండితగురుభక్త♦తాండవకృష్ణాపరాభిధేయార్యజ♦నాళిభజన
తే. నిరతశేషాద్రిశర్మప్ర♦ణీతమైన
యాంధ్రరామాయణంబున ♦ నఖిలసుఖము
లొసఁగి విజయంబు నమకూర్చు♦యుద్ధకాండ
మవని నాచంద్రరవితార♦మై చెలంగు.

యుద్ధకాండము సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ ర స్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము

## ఉత్తరకాండము - ౧-వ సర్గము.

క. శ్రీరమ్యానుగుణశోభా,పారావారా! మునీంద్ర♦వారార్చితప
త్సారసయుగళా! సీతా,శ్రీరమణీకృతవిహార! ♦ శ్రీరఘువీరా!.

### మహామునులు రాముని జూడవచ్చుట.

క. విను మవ్వలివృత్తాంతం,బును సకలసురారినాశ♦మును జేసి యశం
బునఁ [1]ప్రాప్తరాజ్యుఁడగు రా,మునిచెంతకు వచ్చి రెలమి ♦ మునివరులెల్లన్.

చ. మనముల రామచంద్రుమహి♦మంబు నెఱింగినవారు గాన నా
తని నుతియింప లక్ష్మణుని ♦ దద్దయు సూక్తుల సంస్తుతింపఁ జ
య్యన నమరేంద్ర దిగ్వసతు ♦ లైన మహాత్ములు కౌశికుండు స
ర్వనుతుఁడు గాలవుండు ముని♦వర్యుఁడు గార్గ్యుఁడు రైభ్యనాముఁడున్. ౧౪

ఆ. వఱలుకీర్తి యాయ♦వక్రీతుఁ డర్వి మే
ధాతిథికి సుతుండు ♦ తత్త్వవిదుఁడు
కణ్వుఁ డతులయశముఁ ♦ గ్రాల వర్ధిలు చున్న
చ్యవనుఁ డనఁగఁ బరఁగు ♦ నట్టిమునులు. ౨ 3

సీ. దక్షిణదిశనున్న ♦ తపసులు భాసురుల్ నముచిస్వస్త్యాత్రేయ♦నాము లవలఁ; [చి
ప్రముచియునత్రియు♦సుముఖుండువిముఖుండునయ్యగస్త్యునిగూడి♦యరుగుదెం
రట్టులె పశ్చిమ♦మందున్న [2]కవషి వృషద్గు ధౌమ్యులు ముని♦సత్తముఁడగు
రాధేయుఁడును శిష్య♦రాజితో నచ్చిరి; గౌతముండు వసిష్ఠ ♦ కశ్య పాత్రి
మునులు విశ్వామిత్రుఁ♦డును జమదగ్ని భరద్వాజులను ముని♦రాజు లేడు

తే. గురు మహాత్ములు వచ్చి రు♦త్తరమునందు
సతతవాసంబు చేయుచు ♦ సమధికమగు
మహిమ నొప్పారుదురు; సర్వ♦మహాను లిట్లు
జ్వలనసమ తేజు లఖిలశా♦స్త్రజ్ఞవరులు. ౬౪ 4

క. శ్రుతులను సాంగములుగ స్మృతి నెఱిఁగినవారు ప్రీత♦మానసులును నై

---

1 ప్రాప్తరాజ్యుఁడగు-అనుచోఁ దొలియక్షరమగు "ప్ర" యనునది గాయత్రియం దేకవిం
శత్యక్షర మని తెలియందగు. 2 మృకండు కవషీ ధౌమ్యః-అనిమహేశ్వరతీర్థులపాఠము.

ప్రతిహారిమూలముగఁ దమ,జతనము దెలుపంగఁ దలఁచి♦శాంతము చెలఁగన్.

ఆ. కూరుచుండి; రంతఁ ♦ గోరి యగస్త్యుండు, ద్వారమునందునున్న♦వానిఁ గాంచి
మునులమైన మేము ♦ చనుదెంచి యుండుట, దాశరథికిఁ దెల్పఁ ♦ దగుదు వీవు.

చ. అన విని ద్వారపాలకుఁ డ♦హార్యతపోధనుఁ డౌనగస్త్యస
న్మునివచనంబు రీతిఁ దగఁ ♦ బూని మహామతియైన రామునిం
గనఁ జని యింగితజ్ఞుఁడయి ♦ కృతనయజ్ఞుఁడు దక్షుఁడున్ జిరం
తనగురుశీలయుక్తుఁడును ♦ ధైర్యయుతుండును నౌట నేర్పునన్. ౯ 7

ఉ. పున్నమనాఁటిచంద్రుఁ డనఁ ♦ బొల్చు ముఖద్యుతి నొప్పు రాము సం
పన్నునిఁ గాంచి మీఁకడకు ♦ భవ్యమహాతుల్ మును లెల్ల రాఁగ న
భ్యున్నతుఁడౌ నగస్త్యముని ♦ యుదయము మొప్పఁగ వచ్చియున్నవాఁ
డన్న వచస్సు శ్రోత్రముల♦యందుఁ బడన్ రఘురాముఁ డాదృతిన్. ౧౦

తే. బాలసూర్యసమప్రభుల్ ♦ పరమమాను
లరుగుదెంచుట కానంద ♦ మతిశయిల్ల
ద్వారపాలకుఁ గని యిట్లు ♦ పలికె; మునులఁ
బనుపు మిచటికి మర్యాద ♦ గనఁబఱచుచు. ౧౧ 9

చ. అన విని ద్వారపాలుఁ డపు ♦ డాదృతి వారల లోని కేగుఁడీ
మునివరులార! యన్న ముని♦ముఖ్యులు లోనికి నేగి; రంత నా
జనపతి వారిరాకఁ గని ♦ సత్వరమే యెదురేగి దోసి లొ
గ్గి నిలిచి పాద్యమర్ఘ్యము నొ♦సఁగెన్ దమిమీఱఁగ నిచ్చి యంతటన్. ౧౨ 10

ఉ. ధేనువు నిచ్చి సాదరమ♦తిం బ్రణమిల్లి పరాసనంబులన్
దా నపు డేర్పఱం దెలిపెఁ; ♦ దన్మునివర్యులు స్వర్ణచిత్రితం
బై నెఱి విస్తృతిం జెలఁగి ♦ యర్హముగాఁ దగి *దర్భ లోపలన్
బైన మహాజినంబు గడు ♦ నందముగాఁ దగునాసనావళిన్. ౧౩ 11

క. కనుఁగొని యథార్హవిధిచే, ననుపమసంప్రీతి రాము ♦ నాదృతిఁ గనుచున్
మును లెల్లఁ గూరుచుండిరి;, మనువంశవిభూషణుండు ♦ మానుల నెల్లన్. ౧౪

చ. వరుసఁగ వారివౌ కుశల♦వార్తలఁ జక్కఁగఁ బ్రశ్నచేసి యా
దరమున శిష్యసంఘములఁ ♦ దత్పరిచారకులన్ మహావర
స్ఫురణము మీఱ క్షేమమును ♦ సుస్మితవాక్కులఁ బ్రశ్నచేయు భూ
సురమును లెల్ల వేదములఁ ♦ బొక్కపుఁబాండితిఁ గల్గి యుండుటన్. ౧౫

తే. రాము నీక్షించి సూనృత♦రమ్యవాక్కు
లొప్పఁ బల్కిరి దీర్ఘబా♦హూ! రఘూద్వ

* కుశాంతర్ధానదత్తేషు మృగచర్మయుతేషు చ-అనిమూ.

హా! మహాత్మక! కుశలంబె ♦ యలరె మాకు
మాయదృష్టవశంబున ♦ నీయయోధ్య. ౧౭  14

చ. అరుల నడంచి క్షేమమున ♦ నంతటఁ బ్రోచుచు నున్న నిన్ను ని
త్తరుణమునందుఁ గంటిమి; ని♦తాంతపురాకృతభాగ్యరేఖ నా
సురరిపు [1]లోకరావణుని ♦ శూరుని రావణుఁ జంపి తీవు; నీ
కరయఁగఁ బుత్రపౌత్రయుతుఁ♦డై తగు నాజగదేకవీరునిన్. ౧౮  15

చ. అనిఁ బొలియించుటన్న నొక ♦ యబ్బురమే యని తోఁచుఁ; జాపముం
గొని త్రిజగంబులం గలఁపఁ ♦ గోరుదువేని జయింపనోవు; దీ
వనుపమశక్తి నీవిషయ♦మందొక సంశయ మింత లేదునూ;
దనుజులఁ జంపి జానకిని ♦ ధర్మనునీషు సుమిత్రనందనున్. ౧౯  16

ఆ. నీకు హితమె కోరు ♦ నిర్మలాత్ముని లక్ష్మణుని వినీతుఁ గూడి ♦ యనుపమాన
విజయలక్ష్మిఁ గూడి ♦ విలసిల్లు నినుఁ గంటి,మిచట మాయదృష్ట♦మెన్నఁదరమె.

క. జనములకు సోదరులకున్, మనములు వికసిల్ల వంశ♦మండనుఁడవు గాఁ
దనరారు నిన్నుఁ గనుటే, యనుపమమోదంబు మాకు ♦ ననవరతంబున్. ౨౦

సీ. దుర్ధర్షుఁడౌ ప్రహ♦స్తుండును వికటుండు నలమహోదరవిరూ♦పాక్షు లాయ
కంపనుఁ డనఁబడు♦క్రవ్యాదు లనిమొనఁ దెగిరి నీదైన య♦దృష్టమహిమ;
దేహప్రమాణంబు ♦ దేనికన్నను జగంబున నెక్కువే లేదొ ♦ యనుపమాన
భీకరముగునట్లు ♦ వెలయునట్టి శరీరమలరు నాకుంభక♦ర్ణాహ్వయుండు

తే. తెగియె నీచేత నిద్ది య♦దృష్టమె యగుఁ;
ద్రిశిరుఁ డతికాయుఁ డట్టులె ♦ తెగిరి, మఱి న
రాంతకుం డనువాఁడు దే♦వాంతకుండు
బలపరాక్రము లనిఁ దెగి♦పడిరి గాదె ౨౩  19

క. ఘనబలులు భీమదర్పను, లనుపమశౌర్యమున నొప్పు♦నట్టి నికుంభుం
డును గుంభుఁడు కుంభశ్రవ,సునితనయులు తెగిరి కాదె ♦ క్షోణీశ! యనిన్.

క. సమరంబున నీదు నదృష్టమునన్ [2]గాలాంతకయమ♦సంకాశులుగా
ఘమఁ దగు యుద్ధోన్మత్తుం,డు మత్తుఁడును యజ్ఞకోపుఁ♦డును నీచేతన్. ౨౫

తే. మఱియు ధూమ్రాక్షుఁడును లస♦న్మహితసాయ
కాగ్నిఁ బడఁజేయఁ బడిరి గా; ♦ యసురవీరు
లైన వీరెల్ల శస్త్రాస్త్ర♦హాస్తులగుచుఁ
గదనమును ఘోరముగఁ జేయఁ♦గాఁ జెలంగి. ౨౬  22

క. పితృపతితుల్యాంబకసం,తతిచేఁ జంపంగఁ బడుట ♦ తగినయదృష్టం
బె తలంపఁగ శ్రీరామా;, దితిజేంద్రునితోడ నీకుఁ ♦ దీవ్రతరముగన్. ౨౭  23

1 రావణలో లోకరావణు-అని మూ. 2 కాలాంతకయమోపమా-అని మూ.

తే. ద్వంద్వయుద్ధంబు చెల్లంగ ♦ దానవారు
లకు నవధ్యుఁడుగాఁగ బ♦లంబుచేత
నలరు రావణుఁ జంపి జ♦యంబు గంటి
వది యదృష్టంబు గాదె? మ♦హాత్మ! రామ!. ౨౮౪ 24

చ. (విను దశకంఠుఁ డీల్గుటన ♦ విస్మయ మంతగఁ గాక యుండు నా
తనితనయుండు చచ్చుటయొ ♦ తద్దయు విస్మయదాయకంబు మా
మనముల నెన్నఁ గాలమె స♦మస్తవిధంబుల ధిక్కరించె నా
తని ననిఁ దోఁచుచున్నయది ♦ దారుణరూపుఁడు వాఁడు రాఘవా!.) 25

తే. అని బరాభవ మింతయు ♦ నాదశాస్యునకు రణంబునఁ గల్గె న♦నంగ విని న
దెప్పుడును లేదు కాలంబు♦తప్పెనతని,కందులకె ద్వంద్వయుద్ధమ♦ట్లమరె రామ!.

సీ. రావణియును సమ♦రంబునఁ బోరెను; జచ్చి రిద్దఱు నదృ♦ష్టమున నట్లు
కాలంబు పరుగిడు♦కరణిఁ బైఁబడనచ్చు నాయింద్రజిత్తునా♦యకముఖమునఁ
బడక లక్ష్మణుఁ డుండె ♦ భగవదాశయమునట్లు విజయంబునీ మ్రోల♦వెలసె రామ;
యింద్రజిద్వధము మే ♦ మెల్లర మాలించి సంతసించితిమి ని♦శ్చయము సర్వ

తే. భూతములకు నవధ్యుఁడై ♦ పోలిచి భూరి
మాయ ధరియించి యున్న య♦మర్త్యనాథ
జిత్తు నాతనిఁ జంపుట♦చేత విస్మ
యంబు మిక్కిలి గల్గె మా♦యుంగ ఱకును. ౩౧ 27

క. ఈకర్బురశూరవరుల్, గాక యిఁకం గానుగూప♦కలితులు పెక్కం
డ్రో కాకుత్థా! నీదగు, ప్రాకటభాగ్యమునఁ దెగిరి ♦ ప్రధనమునందుల్. ౩౨

క. వీరా! పుణ్యము సౌఖ్యము, నై గాజిలు నభయదాన ♦ మునురావళికిన్
శ్రీరంజిల భాగ్యంబున, ధారణి వస్తిలుదు వీవు ♦ దస్యుహరుఁడవై. ౩౩ 29

ఆ. జయము నీకుఁ గల్గె ♦ సంతోష మయ్యె మా, కనుచుఁబల్కు భావి♦తాత్ములైన
మునులవాక్యములను ♦ విని సువిస్మయమునఁ, జేతు లొగ్గి పలికె ♦ శ్రీరఘుపతి.

చ. పరమపవిత్రులార! గురు♦పౌరుష మొప్పెడు కుంభకర్ణు భీ
కరతనుఁడైన రావణునిఁ ♦ గాదని రావణి నెన్న నేల? యు
ర్వరఁ గడు వీర్య మొప్ప భట♦పాలకుఁడైన ప్రహస్తు నమ్మహో
దరుని విరూపనేత్రుఁడను ♦ దానవవీరుని మత్తనామునిన్. ౩౫ 31

తే. మఱియు నున్మత్తుఁడను దైత్య♦ముండను దుర
మందు నొప్పు దేవాంతకు ♦ నట్టి యాన
రాంతకుని గురువీర్యులై ♦ యలరువీరి
వగలి రావణి నుతియించి ♦ పలుక నేల?. ౩౬ 32

సీ. అతికాయుఁ ద్రిశిరను ♦ నాధూమ్రలోచను వీర్యాధికుల వీరి ♦ విడిచి రావ
ణిని నుతింపఁగ నేల? ♦ మునులార! యాతనిగగు ప్రభావం బెట్టి ♦ దతనిబలము
విక్రమ మెట్టిది? ♦ విమయ మెద్దానిని గొని రావణునికంటెఁ ♦ గొడుకుఁ బెద్ద
యని పల్కుచున్నార; ♦ లది నేను వినఁదగునట్టిదె యైనచో ♦ *నాజ్ఞగాఁగ
తే. మదిని దలఁపక విజ్ఞప్తి ♦ మాడ్కిఁ దలఁచి
యది రహస్యముగాకున్న ♦ ననువదింపుఁ
డేను వినఁగోరినాఁడ, దే♦వేంద్రు నెట్టు
లాతఁడు జయించె వరముల ♦ నందె నెట్లు. ౮౦౪ 33

క. జనకుని మించిన బలమును, దసయుం డేలాగుఁ బొందె ♦ దశకంఠుం డా
తనికంటె నల్పబలుఁడో, నని చెప్పఁగ హేతు వెద్ది ♦ యారసి చెపుఁడీ ౮౧

చ. జనకుని మించి పుత్త్రుఁ డెటు ♦ సంగరమందు జయించె నింద్రు. నా
దనుజుఁడు సద్వరంబులను ♦ దా నెటు లెవ్వరినుండి పొందెనో
మునివర! యంచు మానిగణ♦ముఖ్యు నగస్త్యుని జూచి [1]ప్రశ్నచే
సినను నాదృతిం గనుచుఁ ♦ జెప్పును సర్వము వానివృత్తముల్. ౮౨ 35

ఒకటవ సర్గము సంపూర్ణము.

---

## ౨ - వ సర్గము.

అగస్త్యుఁడు రామునకుఁ బులస్త్యవంశమును విస్తరించి చెప్పుట.

చ. అనిన మహాత్ముఁడై తనగు ♦ నట్టి రఘూత్తమువాక్య మాదృతిన్
విని గురుతేజుఁడైన ముని♦వృద్ధుఁడు కుంభభవుం డగస్త్యుఁ డి
ట్లనియె; రఘూద్వహా! వినుము ♦ [2]యాతునకుండగు రావణుండు భూ
వినుతబలాధికుండయిన ♦ వృత్తము నాతని భూరితేజముల్. ౧౪ 36

చ. అరుల వధించినట్టి విధ ♦ మాతఁ డసధ్యుఁడు శత్త్రురాజి కె
క్కరణిగ నయ్యెనో విప్రుతిఁ♦గా వచియించెద; వానియన్వయ
స్ఫురణము జన్మరీతియును ♦ బూన్కివరంబుల నెట్లు గాంచెనో
వరముల నెవ్వ రిచ్చిరో వి♦భాసుర తేజ! వచింతుఁ జక్కఁగన్. ౩ 37

చ. మునుపు కృతాఖ్యమైన యుగ♦ముఖ్యమునన్ రఘురామ! బ్రహ్మకుం
దనయుఁడు తాఁ బ్రజాపతి పి♦తామహతుల్యుఁడు బ్రహ్మమానియై
తనరుఁ బులస్త్యనాముకుఁడు; ♦ ధర్మసుశీలతలందుఁ దద్గుణా
ళిని నుతియింపఁగాఁ దరమె ♦ లీలయె నూ! తప మట్టిమానికిన్. ౮౪ 38

---

* న ఖ ల్వాజ్ఞాపయామి వః-అనిమూ. 1 తత్ప్రచ్ఛత శ్చాస్య మునీంద్ర సర్వమ్-అనిమూ.

2 యాతునగుండు=రాక్షస శ్రేష్ఠుఁడు. యాతురక్షసీ-అని అమరము.

ఉ. ఆతనివైభవంబు గల♦యట్టి వినుతించు టదెట్టు లన్న వి
ఖ్యాతపితామహాత్మజని ♦ యం చని చెప్పుటె చాలుఁ గాని యిం
తే తగు వైభవం బనఁగ ♦ నెట్లగు; నాతఁడు బ్రహ్మపుత్త్రతన్
బ్రీతిదుఁడై సురావళికి ♦ విశ్వహితుండును నై మహాత్ముఁడై. ౯ 39

చ. సురుచిరసద్గుణాఢ్యుఁడయి ♦ క్షోణిని సద్గిరియంచు విస్తృతిం
బరఁగెడు మేరుభూమిధర♦పార్శ్వమునన్ దపమాచరించుని
ర్భరకుతుకంబునన్ జనియెఁ; ♦ బావనమాతృణబిందునాశ్రమం
బరుదుగ నొప్పు నందుఁ దన♦యాత్మ ముదంబును బొంద నాతఁడున్. ౭ 40

సీ. ధర్మాత్ముఁడగుచు స్వా♦ధ్యాయనియతి నింద్రియంబులుతగఁ దపం♦బచటఁ జేయు
చుండంగ నయ్యాశ్ర♦మోర్వికిఁ జని సురకన్యలు పన్నగ♦కన్య లలరి
రాజర్షికన్యకా♦రాజియు నచ్చరల్ విఘ్న మొనర్చిరి ♦ విపులనియతి;
కెట్లన నాకన్య ♦ లెల్లఁ గ్రీడింపఁగ నాప్రదేశముఁ జేర ♦ నరిగి రద్ది
తే. తలఁప సర్వర్తుసుఖముల ♦ వెలసి రమ్య,కాననంబయి తనరును ♦ గాన నిత్య
మందు విహరించువేడుక♦నరుగుచుండి;, రాప్రదేశమురమణీయ♦మై వెలయుట.

క. మునిపతిపుల స్త్యుఁ డచ్చట, ననుపమనియమంబుఁ బూని ♦ యాపరమేశున్
మనమున నిడి తప మొనరుపఁ, గని వారలు కొంతమంది ♦ కలనాదములన్.

క. పాడుచు నాడుచు వీణెలఁ, బోడిమి మీటుచుఁ దపంబుఁ ♦ బూనినమునికిన్
గూడని విఘ్నము నవ్విరి,బోఁడు లనిందితలు చేయఁ♦బూనిరి మిగులన్. ౧౧౪

క. తననియమంబును జెఱుపల,గను బూనినవా రటంచుఁ ♦ గడుఁ గ్రుద్ధుండై
ఘనతేజుఁ డామహామునిి, యనియె; న దేకన్య మామ♦కాంతికమునకున్. ౧౨

క. నను గాంచ వచ్చునో యా,వన జేక్షణ తాల్చు గర్భ♦భారంబును; నా
విని యామహాత్ము వాక్యం,బును నాకన్యకలు బ్రహ్మ♦మునిశాపమునన్. ౧౩

క. కలుగును దప్పక గర్భము, పలు కిది సత్యం బటంచు ♦ భయపడి యాను
స్థలముం జేరుట మానిరి;, పలు కది తృణబిందురాజ♦పతిమునిసుతయున్.

క. వినదయ్యెఁ; గాన నిర్భయ,మున నయ్యాశ్రమపదంబు ♦ ముదిత ప్రవేశిం
చి నిరతి విహరించుచు నటఁ, దనచేడియ లోకతుకయును ♦ దన కగపడమిన్.

తే. ఒంటినుండియె విహరించు♦చుండె; నట్టి
కాలమున గురుతేజుఁడై ♦ క్రాలు నాపి
తామహాత్మజుఁ డాపుల♦స్త్యసురమాని
వరుఁడు సత్తపమునఁ దాన ♦ భావితుఁడయి. ౧౫ 48

క. ఒనరిచె స్వాధ్యాయంబును;, వనజేక్షణ యంత వేద♦వరనిస్వనమున్
వినుచుఁ దపోనిధి నమ్మునిఁ,గని యప్పుడె పాండుదేహ♦కలితయు నగుచున్.

ఆ. వ్యక్తగర్భభార ♦ నుఁగుచు నుండంగ, నిద్ది యేమటంచు ♦ నింతి తనదు

గర్భదోష మెఱిఁగి ♦ కలవిలపా టొంది,దానివిధ మెఱుంగఁ ♦ దలఁచి తరలి.

క. తనతండ్రియాశ్రమమునకుఁ, జని నిలిచెన్; సిగ్గుతోడఁ ♦ [జూన యువనతా
నన యూచు నుండ] నావిధిఁ,గనఁబడు తనతనయ నచటఁ♦ గని తండ్రియనెన్.

క.[నిను నెవ్వఁడు శపియించెను?, గను లెఱుఁగక విప్రియంబుఁ♦గావించితి వె
వ్వని కెవనిచెంత కేటికిఁ,జనితి వచట నేమి ఫలము ♦ జరగెఁ గుమారీ! ] 52

క. తరుణుల కవివాహితలకుఁ,గర మర్హముగానిది గద ♦ గర్భం బిది యె
వ్వరునం దాల్చితి వమ్మా, సరిగా నెఱిఁగింపు; మునినఁ ♦ జానయు వగతోన్. 53

క. జనకుఁ దపోధనునిం గ,న్గొని దైన్యము దోఁపఁ బలికెఁ ♦ గొంకు మనమునన్
గన కంజలిబంధంబున;, జనకా! కారణ మెఱుంగఁ ♦ జాల నిజముగన్. ౨౧

క. తను విది యేవిధి గర్భం,బును దాల్చెనొ; తొలుత నేను ♦ మునివర్యుఁడనం
గను జాలి భావితాత్ముం, డనఘుఁడు నగు నప్పులస్త్యు♦నాశ్రమవరమున్. ౨౨

క. కన నేగితి నట స్వసఖి,జనమును వెదుకంగ; నచట ♦ నఖి యొక్కతెయుం
గనఁబడకపోయె నిధ్విధిఁ, గనఁబడియెను గర్భ మేమి♦కతమొ యెఱుఁగన్.

క. రూపవిపర్యాసం బిది, యీపగిదిగఁ గానఁబడఁగ ♦ నెంతయు భీతిన్
నీపరిసరమును జేరఁగ, నీపగిదిన్ వచ్చితి నని ♦ యింతి పలికినన్. ౨౩౪ 57

చ. ధరణిపమానినత్తముఁ డు♦దాత్తతపఃప్రతిభావిశేషనుం
దరతనుఁ డంత నెమ్మదిని ♦ ధ్యానయుతంబగున ట్లొనర్చి మా
నిరమణికృత్య మెల్లఁ దన♦నిర్భగశక్తి నెఱింగి; మానిభూ
వరమణి భావితాత్ముఁడు వి♦భాసుర తేజుఁడు తద్వనంబునన్. ౨౮౪ 58

క. ముని పొసఁగినట్టి శాపం,బును జక్క నెఱింగి తనదు♦పుత్రికనుం దో
డ్కొనిపోయి పులస్త్యునితో,ననియె; మహాత్మా! మహాగు♦ణాన్విత యిదిసూ!.

ఆ. నాకు నాత్మజాత ♦ నారీశిరోమణి, తా[illegible] కోరి వచ్చెఁ ♦ దమిని గాన
భిక్ష దీనిఁ గొనుము ♦ వేవేగ సత్తపో,నిరుతి నింద్రియములు ♦ నెఱి కృశింప

క. అనవరతనియమముల నొ,ప్ప నీకు శుశ్రూషణంబుఁ ♦ బూని యెపుడు చే
యును నిస్సంశయ మని యిటు, తనమ్రోల వచించు రాజ♦తపసిపలుకులన్.

క. అనుపమధర్మహితంబుల, విని యాకన్యను గ్రహింప ♦ వేడుకపడి యి
ట్లనియెను; గాని మ్మట్టులె, మునివర్య! యనంగ మోద♦మున నాతండున్. ౨౯

క. తనపుత్త్రి యథావిధిగా, మునిపతికిఁ బులస్త్యునకును ♦ బొంగి యొసఁగి య
ల్లనఁ జనియె స్వాశ్రమంబున;,కనుపమసుగుణముల నామె ♦ నాత్మేశ్వరునిన్.

క. నిరతము రంజిలఁజేయుచుఁ, బరితోషమునన్ వసించెఁ ♦ బతిచెంత; ననం
తర మాపులస్త్యమునిపతి, తరుణీమణిశీలవృత్త♦తకు ముద మందెన్. ౩౦ 64

క. ఈరీతి హర్ష మొందుచుఁ, జారుమహాతేజుఁడైన ♦ సంయమి ప్రీతుం
డై రమణిఁ గాంచి పలికెన్;, నారీమణి! నీదునద్గు♦ణశ్రీ కాత్మన్. ౩౧ 65

క. పరితుష్టుఁడనై తిని ని, త్తరుణంబున నన్నుఁ బోలు ♦ తనయు నొసఁగెదన్;
దరుణీ! యాపుత్త్రుఁడు మన, యిరువురవంశములకీర్తి ♦ నెంతయుఁ బెంచున్.

తే. వంశకర్తయునగుఁ జుమ్ము ♦ వరతనూజుఁ
డతఁడు పౌలస్త్యనాముకుం♦డౌ; *నదెందు
చేత వేదంబు నేఁ దగఁ ♦ జెప్ప వినియె
నందున నతండు విశ్రవుం ♦ డనఁగఁ బరఁగు. ౩౨౫ 67

క. సుంతయు సందియ ముండదు, కాంతా! యన నామె మదిని♦గడు హర్షంబున్
గాంతునిపైఁ బెనుభక్తియు, నింతయునన్ రాక తనర ♦ నేగె గృహంబున్.

ఆ. అచిరకాలమునకు ♦ నంత నాతన్వియుఁ
గనియె విశ్రవసునిఁ ♦ దనయుఁ; నతఁడు
మూఁడులోకములను ♦ గూర్చి విశ్రుతకీర్తి
ధర్మములు చెలంగ ♦ నిర్మలమతి. ౩౮ 69

చ. శ్రుతులను నేర్చి జంతుతతిఁ ♦ జూచినఁ బ్రీతి చెలంగు చుండ సం
తతసమదర్శియై నియమ♦తత్పరుఁడై కడుశీలవంతుఁడై
పితృసముఁడై తపంబునను ♦ బెంపు వహించుచు విశ్రవుండు మా
నితతిని బూజ్యుఁడై యలరె ♦ నిర్మలమౌ యశ మావరింపఁగన్. ౩౯౫ 70

రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - వ సర్గము.

-- విశ్రవసునకుఁ గుబేరుఁడు జన్మించుట. --

క. తరువాతఁ బులస్త్యమునీ,శ్వరసుతుఁడౌ విశ్రవసుఁడు ♦ సన్మునియుఁ దప
శ్చరణంబున కుద్యతుఁడై, పరమంబగు నియతిఁ దంద్రి♦భంగిం గొనియెన్. ౧

క. సూనృతమె పలుకుచున్ శాం,తానూనాచారములును ♦ స్వాధ్యాయంబున్
మానసశుద్ధియు నొప్పఁగఁ, దా నేభోగములయందుఁ ♦ దగులక మఱియున్.

క. నిరతము ధర్మపరాయణుఁ, డుగుతరమతివిభవుఁడునయి ♦ యొప్పఁగ జగతిం
బరమంబగు తద్వృత్తముఁ, బరికించి మనోముదంబు ♦ భాసిల్లంగన్. ౨ 73

క. మునివరుఁడు భరద్వాజుఁడు, తనపుత్త్రిక భార్యగాఁగఁ ♦ దా నిచ్చె మహా
మునికిన్ విశ్రవసునకున్, వనితామణి శీలసుగుణ♦వర్ణిత యగుచున్. ౩౪ 74

తే. దేవవర్ణిని యనఁగ నిం♦తియును దనరె;
నాభరద్వాజసుత నిట్టు ♦ లర్థిఁ గొనుచు
విశ్రవసుఁడు సంతానంబు ♦ వేగ పడయు
కోరికను బూని యద్ది చే♦కూరు నట్లు. ౩౫ 75

---

*యస్మాత్తు విశ్రుతో వేద స్త్వయైష ఽధ్యయతో మమ - అనియు.

చ. మనమున నెంచి శ్రీయ మన♦మానము గల్గఁగ లోఁ దలంచి యిం
తని వచియింపరాని ముద ♦ మందుచు మానివిభుండు విశ్రవుం
డనుపమ తత్కళత్రమున♦యందు సువీర్యసమన్వితున్ సుతున్
గనియె మహాద్భుతాకృతిని ♦ గల్గినవాని శమాదిసద్గుణున్. ౭౬ 76

క. మనుమండు కల్గ నాతని, జననసమయఖేచరాళి♦సంప్రీతిని గ
న్గొని సంప్రహృష్టుఁడై యాతనిభాగ్యం బనదృశముగఁ♦దనరెడు ననుచున్.

తే. మదిఁ దలంచెఁ బులస్త్యుండు; ♦ మఱియు నతఁడు
శ్రేయము నొసంగు సద్బుద్ధిఁ ♦ జింతచేసి
ధనవిభుండు కాఁగలఁడు న♦త్తనయుఁ డీతఁ
డనుచు దేవర్షులను గూడి ♦ యాత్మ నెంచి. ౭౮ 78

సీ. *విశ్రవస్తుల్యుఁడై ♦ వెలయుట విశ్రవసున కాత్మజుం డౌటఁ♦దనయుఁ డితఁడు
వైశ్రవణుండనఁ ♦ బరఁగు విశ్రుతుఁడగు ననియె; నంతట నాతఁ♦డనుదినంబు
వృద్ధినిఁ గాంచుచు ♦ వెలసి తపోవనంబున కేగి నేయి పో♦సిన హుతవహు
కరణిఁ దేజంబు ని♦కామము వెలయఁగ వృద్ధి నొందెను; మతి♦విభవుఁడైన

తే. యాతఁ డయ్యాశ్రమపదంబు♦నందె యుండి
యొక్కనాఁ డిట్లు మది నెంచె; ♦ నురుతరనియ
తిని దగఁ ధర్మమునె చేయు♦దు నిఁక నదియె
పరమగతి దానిమించిన ♦ దరయ లేదు. ౭౯ 79

చ. అని తలపోసి వేయి యగు ♦ హాయనముల్ తప మూని చేసె నా
వనమున; నిట్లుగా నియతి ♦ వారనిపూన్కి భయంకరంబుగాఁ
గనఁబడునట్లు న త్తపము ♦ గాఢముగా నొనరించె; నంత హా
యనములు వేయియున్ గడువ ♦ నవ్వల నయ్యయి వృత్తులం దమిన్. ౮౦

తే. తాన కల్పించుకొనియె; న♦త్తనుమగు విధి
జలము కొన్నాళ్లు త్రాగుచు ♦ శ్వసనముఁ గొంత
కాల మాహారముగఁ గొంత♦కాల మేమి
తినక యొకయబ్ద మట్లు చిం♦తింప కెలమి. ౮౧ 81

సీ. వేయి వర్షంబు లీ♦విధమునఁ బుచ్చెను; దప మిట్లు చూడంగ ♦ దారుణముగఁ
జేయువైశ్రవణుని ♦ చెంతకు శక్రాదిసురగణంబులఁ గూడి ♦ పరమహర్ష
మునధాతయరుదెంచి♦వినుతిచేయఁగఁదగునయ్యాశ్రమపదంబు♦నందుఁజొచ్చి
యిట్లని పల్కె; నో♦హితమతీ! సువ్రతా! వత్సా! భవత్కృత్య♦వైభవమున

తే. కెంతయును దృప్తినొందితి ♦ నింక వరము
నడుగు మేలగు నీకు వ♦రార్హుఁడవుగఁ

* యస్మా ద్విశ్రవసోఽపత్యం సాదృశ్యా ద్విశ్రవా ఇవ, తస్మా ద్వైశ్రవణో నామ-అనిమా.

దోఁచ మామది మాకు హి♦తుఁడవు నీవు;
నాఁగ వైశ్రవణుఁడు శతా♦నందుఁ బరము. ౧౫ 82

క. తనయాశ్రమమునకున్ వచ్చిన వానిం గాంచి మ్రొక్కి ♦ చిత్తము హర్షం
బునఁ దేలఁగ భగవంతా!, వినుమా! లోకేశ! వరము ♦ వేఁడుక నీయన్. ౧౬

క. మనమునఁ గోరుదు నేనిన్, ధనరక్షకుఁ డుండు నాకుఁ ♦ దగు నిచ్చ కృపం
గొని ఫలియింపఁగఁ జేయుము; యనఁ బరితుష్టాత్ముఁ డగుచు ♦ నబ్జజుఁ డంతన్.

క. సురగణములతో నల్లే, కరుణించితి ననుచు హర్ష♦కలితుం డగుచున్
బరికించి యతని కిట్లనె, మరలన్ దిక్పాలు సుగుణ♦మండను నొకనిన్. ౧౭

తే. నాలుగవవాని సృజియింప ♦ నామనంబు
నందు నెంచితి నింద్రయ♦మాప్పతులకుఁ
దగినపద మిచ్చితిని నీకు ♦ దానివంటి
పద మొసంగెద నీప్సితం ♦ బొదవు దాన. ౧౮ 86

చ. కనుకనె నీవు దానిఁ గొనఁ♦గాఁ జనవయ్య నిధీశతన్ మనం
బునఁ దలపోరన ట్లొదవు♦పో; వరుణేంద్రప్రేతరాజుల
ట్లనుపమలోకపాలకుఁడ♦వై యిఁక నాల్గవ లోకపాలకుం
డను యశ మొందు దీవు; మఱి ♦ యర్కసమానముఁ బుష్పకాఖ్యమున్. ౧౯

తే. ఈవిమానము యానార్థ ♦ మిత్తు నీకుఁ
గొనుము త్రిదశులతోఁ దుల్య♦తను గను మిఁక
నీకు శుభమగు మేమెల్ల ♦ వే కదలెద
మాత్మవసతులకున్ వచ్చి♦నట్లు వత్స!. ౨౦ 88

క. వరయుగళము నీకొసఁగుట, నరయం గృతకృత్యులమయి ♦ నల్లే యనుచున్
సురగణముతోడ శతధృతి, యరిగెన్ స్వస్థానమునకు ♦ నవ్వని నంతన్. ౨౧

చ. వనజభవాదు లిట్లుగ న♦భస్థలమార్గమునందుఁ బోవ నా
ధనపతి దోసిలొగ్గి ప్రయ♦తంబగు నాత్మ చెలంగఁ దండ్రినిం
గనుఁగొని పల్కె నివ్విధి; న♦ఖండపితామహుసత్కృపన్ వరం
బును మదిఁ గోరినట్లుగను ♦ బూజ్యపదాంబుజ! పొందినాఁడఁ జూ. ౨౩ 90

ఉ. ఉండెడుతావు నాకు నము♦త్తముఁడైన హిరణ్యగర్భుఁ డా
ఖండలపూజ్యుఁ డాజ్ఞ నొసఁ♦గం డది యేలొకో? కాన నీవు నే
నుండఁగ నర్హమా వసతి ♦ నొప్పుగ నెంచి యనుగ్రహింపు నే
నుండెడుతావు జంతువున ♦ కొక్కవుడే నిసుమంతపీడనున్. ౨౪ 91

ఆ. కల్గఁ జేయకుండఁ♦గా నుండఁ దగు ననఁ, దనయుమాటలు విని♦మునివరుండు
విశ్రవసుఁడు ధర్మ♦విదుఁ డిట్లు పల్కె నో, సాధుధిషణ! విను వ♦చనము దీని.

చ. కలదు త్రికూటపర్వత మ♦ఖండతరాయతకూటజాల ము
జ్జ్వలశరయాన్యసింధుతట♦సన్నిధిఁ దద్గిరిమీఁద దేవవ
ర్యలలితపత్తనం బన మ♦హాద్భుతరీతి విశాలగోపుర
స్థలమయి లంకనాఁ బరఁగుఁ ♦ జారుతరంబుగ నో కుమారకా!. ౨౬౫ 93

క. మును విశ్వకర్మనిర్మిం,చెను రాక్షసు లుండఁదగిన♦క్షితిపయిఁ బొగడం
గను దగు నమరావతివలెఁ, గనకప్రాకారసుపరి♦ఖాయంత్రములన్. ౨౮ 94

క. అలరు నది శస్త్రములను,జ్జ్వలకాంతిని గాన నందు ♦ సంవాసము నీ
కలఘుముదం బిడు వత్సా', కలుగదు సంశయము నీసు♦ఖములకు నందున్.

సీ. పుర మది కనునీయ♦తరమయి విలసిల్లుఁ దోరంపుఁ గనకవై♦డూర్యతోర
ణాలంకృతం బగు ♦ నది విష్ణుమూర్తిభయార్దితులగు దను♦జాళు లెల్ల
వర్జింప శూన్యమై ♦ పరఁగుచు నున్నది; దనుజు లందఱు రసా♦తలము నొంది
నందున జనశూన్య♦మయి నాయకుఁడు లేక భాసిల్ల కున్నది ♦ పరమసుఖము

తే. గలుగఁజేయును గావునఁ ♦ గదలి యచటి
కరుగుమా! పుత్ర! దోష మే ♦ మందు లేక
బాధ యేమియు లేక ని♦వాసయోగ్య
మనుచు ధర్మాత్ముఁడగు తండ్రి ♦ యనువదింప. ౩౧ 96

క. అనుపమమును ధర్మిష్ఠం,బును నగు వాక్యంబును విని ♦ భూధరమూర్ధం
బున నున్న లంక రాక్షసు, లనుపమమోదమ్మునన్ స♦హస్రము గొలువన్. ౩౨

తే. అచిరకాలంబునకె భవ♦నములశోభ,నమున రాక్షసనికరపూ♦ర్ణమయి తనరు
నన్నపితృవాక్యమున సుప్ర♦హర్ష మొంది,ధర్మమతియయి రాక్షస♦తతులఁగూడి.

క. ధనపతి సుఖముగ వాసం,బును జేసెన్ సాగరంబె ♦ భూరిపరిఖగాఁ
దనరారు లంకలో; నం,త నతం డపు డప్పు తనదు♦ధర్మమతి దగన్. ౩౪ 99

క. వనజాసనుఁ డొసఁగిన యా,య్యనుపమపుష్పకవిమాన ♦ మాధారముగాఁ
జని తల్లిదండ్రి నడఁకువ, యనురాగము నొప్పఁ గనుచు ♦ నరుగుచు నుండెన్.

క. సురగంధర్వనుతుండయి, సురనారీనృత్తములను ♦ శోభిలు నన్మం
దిర మొప్పఁ గాంతి రవివలెఁ, గర మలరుచుఁ జనియెఁదండ్రి♦కడ కర్థపుఁడున్.

మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪ - వ సర్గము.

రాక్షసులపూర్వవృత్తాంతమును రాముని కగస్త్యుండు చెప్పుట.

చ. అని యిటు పల్కు కుంభభవు♦నప్పలుకుల్ విని విస్మయంబు నె
మ్మనమునఁ దోఁప నార్యకుల♦మున్ కనుఁగొని రఘురాముఁ డప్పు డి

ట్లనియెను, లంకలో దనుజు ♦ లంతకు మున్ను వసించి రెట్టు లం
చనితలయూఁచి సుస్మితము ♦ హారితరంబుగ మోమునం దగన్. ౧ 102

[1]సీ. త్రేతాగ్నితుల్యమౌ ♦ దేహమ్మునన్ మించునయ్యగస్త్యమునీంద్రు♦నంతఁ దృప్తి
మెఱయంగఁ బలుమఱు ♦ మించువేడుకఁ గాంచిపలికె;నో భగవంత♦పరమవిస్మ
యావహంబగు వాక్య ♦ మీవిధమున వింటి మును లంక రాక్షసు♦లనుదినంబు
పాలింప నుండెడి నన్ ♦ పలుకు విన్నప్పుడు కలుగకయున్నె ని♦కామసంశ

తే. యమ్ము; రాక్షసు లప్పుల♦స్త్యాన్వయమునఁ
గలిగినట్లుగ వింటిని ♦ గాదె? యిపుడు
వేఱొకరినుండి రాక్షసుల్ ♦ వెలసి రనుచుఁ
దెలుపఁబడియెను మీచేత ♦ నెలమిమీఱ. ౪ 103

తే. రావణునికంటెఁ గుంభక♦ర్ణప్రహస్త, వికటనామాసురులకంటె♦వినుతహరణ
పటువులైన దశాస్యసం♦భవులకంటె, వారుబలవత్తరులుగాఁగ♦వఱలువారొ.

క. వారలపూర్వుం డెవఁడో?, పేరెద్దియొ! వానిదైన ♦ పృథుబల మనఁగా
నేరీతి నలరునో? దను,జారియు నేతప్పుచేత ♦ నసురుల నెల్లన్. ౫ 105

చ. పురి నట నుండఁగూడదని ♦ పూని రసాతలసీమ కేగున
ట్లురుతరశక్తితోఁ దఱిమె♦నో? వివరించి సమస్తవార్తలన్
గరుణను దెల్పు మోయనఘ! ♦ కౌతుక మయ్యె వినంగ నాకు ని
త్తరుణమునందు సంశయవి♦తానము నామదిఁ దోఁచుదానినిన్. ౬ 106

[2]ఆ. భానుఁ డంధకార♦పటలంబుమాయించు,నట్లుతొలఁగఁ జేయు♦మయ్య! యనుచు
నర్థవాక్యపదజమైన సంస్కారాభి,మండితమయి యలరు♦మాట పలుక. ౭

[3]క. విని యాశుభవాక్యంబును, మునిపతి మదిలోన సర్వ♦ము నెఱింగియు నుం
త నెఱుంగనివానివలెన్, ననునడిగెడు నని రవంత ♦ నవ్వ జనింపన్. ౮ 108

తే రామునిం గాంచి పల్కెఁ; బూ♦ర్వము విరించి
పద్మసంభవుఁ డంబర♦ప్రముఖములను
వరుసమీఱ సృజించి యం♦భస్సుల నటు
పుట్టఁగాఁ జేసి కాపాడఁ ♦ బూని యవల. ౯ 109

ఆ. జంతువుల సృజించె; ♦ సరగున నయ్యవి, యేమి చేయువలయు ♦ నింక ననుచుఁ
బలుకుచును బిపాస ♦ పటుతరక్షుత్తును, బీడచేయ వాని♦భీతిఁ గనలి. ౧౦ 110

క. తమజనికిహేతు వగునా, కమలాననునిన్ వినీతి ♦ కన్పడఁ జేరెన్
మమతన్ నవ్వుచు నంతటఁ, గనులజుఁ డాభూతములను ♦ గాంచి మృదూక్తిన్.

1 త్రేతాగ్నిసమవిగ్రహమ్-అనిమూ. 2 సంస్కారాలంకృతం శుభమ్-అనిమూ. సంస్కారాలంకృతం పదవాక్యార్థసంస్కారయుతమ్-అనివ్యాఖ్య. 3 ఈషద్విస్మయమానస్తమ్-అనిమూ. ఈషద్విస్మయమానః=సర్వజ్ఞో౽ప్యజానన్నివ పృచ్ఛతీతి విస్మితమ్-అనివ్యాఖ్య.

క. వినుఁ డో భూతములారా!, వనముల యత్నమ్మునీఁ ♦ జాలింపుఁ డటం
చని బహుమానము తోఁ బం,గను బలికెను; [భూతములును ♦ గమలజుపలుకుల్.

క. వినియు క్షుధావిష్టములై, వనముల నవ్వానిఁ గొనఁగ ♦ వాంఛించెను గొ
న్ని, నియతి వదలక జలముల, ననయము రక్షింతు మనుచు ♦ నబ్జజునాజ్ఞన్. ౧౩

ఆ. పలికెఁ గొన్ని భూత ♦ ములు బ్రహ్మయును వాని
యాశయం బెఱింగి ♦ యపుడు వానిఁ
దత్పరతను గాంచి ♦ ధాత్వర్థసంయుత
ముగ వచించె నేరు ♦ పు గడు మీఱ. ౧౪ 114

*ఆ. యక్షధాతు వలరు ♦ భక్షణార్థంబునఁ, బాలనార్థ మొనఁగఁ ♦ జాలు రక్ష
ధాతు వట్టు లగుటఁ ♦ దర్కింప యక్షణ, మునను యక్షనామ ♦ మునఁ జెలంగు.

క. పరఁగును రక్షశ్శబ్దము, పరిపాలన మొప్పఁ జేయ ♦ బాగనుటను] మీ
రరయఁగఁ గొందఱు జలములఁ, బరిరక్షింతుము తగంగ ♦ భవదాజ్ఞ మెయిన్.

క. అని కొందఱు, భక్షించెద, మని కొందఱు పల్కితి రిట ♦ నాఁకలిగొనియున్
గన నాఁకలి పల్కిన భూ, తనికరములు నాదుపల్కుఁ ♦ దమిఁ గొనఁగఁదగున్.

సీ. జలముల మేము ర ♦ క్షణము చేయుదు మని యే భూతములు పల్కె ♦ నిచట నవ్వి
రాక్షసు లనెడు పే ♦ రం దగి యుండనౌ, భక్షింతు మే మని ♦ పల్కె నవ్వి
యవి పిల్వఁగాఁబడు ♦ యక్షులన్ పేరున, నని యాజ్ఞ చేసె; నా ♦ యబ్జభవుఁడు
పల్కి యీవిధి తన ♦ పద్ధతిఁ దా నేగె; నంతట సోదరు ♦ లైన హేతి

తే. యును బ్రహేతియు రాక్షసు ♦ లోకరీతిఁ
బ్రభువు లారాక్షసుల కైరి ♦ పరసిమూద
నులును మధుకైటభ ప్రతీ ♦ పులును గాఁగఁ
దనరి వారిద్దఱును మహా ♦ త్తరులు నైరి. ౧౬ 118

క. వనమున కేగెఁ బ్రహేతియు, ఘనతపముం జేయుకొఱకుఁ ♦ గా ధర్మమతిన్
వినుతచరిత్రుఁడు హేతియుఁ, దనమది యత్నంబు చేసె ♦ దారక్రియకై. ౧౮

ఆ. అతఁడు కాలభగిని ♦ యయి భయావహ యయి
యాహ్వయమ్మునను భ ♦ యయను దానిఁ
బెండ్లియాడెఁ దా నె ♦ పృథుతరమతి; యంత
దనుజవిభుఁడు హేతి ♦ తన్వియందు. ౧౯ 120

క. కనియెను విద్యుత్కేశుం, డను తనయునిఁ బుత్రవంతు ♦ లగు వారలలో
ఘనుఁ డీతండను విఖ్యా, తిని గనియెం దాను; నట్టి ♦ ధీరునిసుతుఁడున్. ౨౦ 121

క. అతిశయదీప్తార్కనిభుం, డతులిత తేజుండు సలిల ♦ మంతరమున నుం
డి తగం గన్పడునబ్జము, వితమున నర్ధిల్లె శౌర్య ♦ విస్తృతి మెఱయన్. ౨౧

---

* యక్షేతి భక్షణే ధాతు స్తథా రక్షస్తు పాలనే-అనిమూ.

చ. తనయుఁడు భద్రయౌవనముఁ ♦ దాఁ గని రాక్షసవర్యుఁడై తనం
తన గురుశౌర్య మొప్పఁగ ని♦తాంతము రాజిలఁ గాంచి హేతి యా
తనికిని బత్నిఁ గూర్పఁ బ్రము♦దంబును బొందె; ననంతరంబ యా
దనుజవరుండు హేతి సుతు ♦ దారయుతుం బొనరించుకోరికన్. ౨౧ 123

క. తనురుచి సంధ్యాతుల్యను, వనితామణి సంధ్యతనయ ♦ వరలక్షణయు
క్తను సాలకటంకట యనఁ, గను బరఁగెడుదాని సుతుని♦కయి వరియించెన్. ౨౩

క. రామా! విద్యుత్కేశున, కామహిళామణి నొసంగ♦నగు వరుఁడు మహా
ధీమంతుఁ డనుచు సంధ్యయుఁ, దా మదిఁ దలపోసి యొసఁగెఁ♦దనపుత్త్రికనున్.

సీ. అంతవిద్యుత్కేశుఁ♦డసు రేంద్రుఁడాసంధ్యతనయామణింగళ♦త్రముగ్రహించి
పౌలోమితో దేవ♦పతివిహరించెడుగతిని గ్రీడించె; రా♦ఘువ! యిటువలెఁ
గొంతకాలం బేగఁ ♦ గోమలి యాసాధ్విసాలకటంకట ♦ జలధివలన
ఘనరాజిగర్భంబు ♦ గనునట్టు లప్పతివలన గర్భముఁ దాల్చె; ♦ వగుసదాని

తే. గర్భ మయ్యది జలధర♦గర్భతుల్య, కాంతి యలరార వెలసె నా♦ కాంత మంద
రాద్రికిం బోయి యగ్నిజం♦బైన యైశ, గర్భమును గంగ వదలిన♦కరణిఁ బ్రీతి.

క. కనియెను దనయుని; నందే, తనగర్భమునుండి పడిన♦తనయు మఱచి యా
వనితయు సురతప్రియయై, పెనిమిటితోఁ గ్రీడ సలిపెఁ ♦ బెంపెసలారన్. ౨౮

క. వనితావిసృష్టగర్భము, ఘనశబ్దసమస్వరుఁ డయి ♦ కన్రుతరంబై
తనరారె నందుఁ బుట్టిన, తనయుఁడు *శరదర్కరుచిర♦తన్ గన్పడియెన్. ౨౯

క. పిడికిలి తనవదనంబున, నిడుకొని మెలమెల్ల బాలుఁ ♦ డేడ్చెను నపు డీ
శుఁడు సర్వమంగళాంబయు, తోఁడ వృషభాగ్రాన్ఁ జగుచుఁ ♦ దోయదవీథిన్.

క. అఱుగుచు శిశు వేడ్చెడునా, స్వరము వినంబడఁగ గిరిజ♦సహితుండై క
ర్బురసూనుఁ డేడ్చు చుండుటఁ, బరికించెను; వానిఁ జూచి ♦ పార్వతి కరుణన్.

చ. పరశివు వేఁడె నంతఁ దన♦భార్య వచించినమాట నెంచి యా
దరమున నాపురాంతకుఁడు ♦ తద్దనుజాత్మజుఁ దల్లితో వయ
స్ఫురణమునన్ సమానునిగఁ ♦ జూడఁగ నొప్పెడునట్లు చేసి ని
ర్జరత నొసంగె నవ్యయుఁ డ♦రాతినిషూదనుఁ డక్షరుం డటన్. ౩౨ 131

చ. పురము నొసంగె నభ్రమునఁ ♦ బొల్పుగ నొప్పెడునట్టిదాని భూ
ధరతనయాప్రియంబుఁ బరి♦తః పరిపూర్ణము చేయువేడ్క నీ
శ్వరియును రాక్షసావళికిఁ ♦ జక్కనిదా వర మిచ్చె నెట్లనన్
ధర నిఁకమీఁద రాక్షసని♦తంబిను లెల్ల సదుక్తిరీతిగన్. 33 132

క. కనుదురు సద్యోగర్భం, బును బ్రసవము తత్క్షణమునఁ ♦ బొలుచు జననితో
డను దుల్యమౌ వయస్సును, దనయునకుం గల్గియుండుఁ ♦ దథ్య మ్మిది యా.

* స తు శిశు శ్శరదర్క సమద్యుతిః - అనియు.

తే. అనియె; నంత సుకేశుఁ డ♦యయ్యంబవరము
చేత గర్వించి యద్భుత♦శ్రీసమృద్ధిఁ
గాంచి ప్రభువగు హరుని ప్ర♦సన్న సుబుద్ధి
యాతఁ డనియెన్నఁ దగినట్టు ♦ లెసఁగి మాటి కను. ౩౪ 134

క. నిరతము భక్తిపరుండై, పురహర సాంగత్య కతంబుఁ ♦ బొంది తమిఁ బురం
దరుఁబోలి సంచరించెను, హరకరుణాప్రాప్తి విభవుఁ♦డై సుస్థిరుఁడై. ౩౫ 135

నాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౫ - వ సర్గము.

సుకేశునకు మాల్యవంతుఁడు, సుమాలి, మాలి యనుకొడుకులు పుట్టుట.

క. వరలబ్ధు సుకేశుని భా,గ్యరతుం గని గ్రామణియను ♦ గంధర్వుఁడు భా
స్కరతుల్య దేహరుచియై, వరఁగు నతని కొక్కపుత్రి ♦ భాసిలు రామా!. ౧

క. దేవవతి యనఁగ రెండవ, శ్రీవలె విఖ్యాతయగుచుఁ ♦ జిత్తజుశరమే
గావలె ననఁదగు రూపము, యౌవనమును వెలయ నొప్పు ♦ నట్టి తనూజన్.

క. దనుజ శ్రీవలె ధర్మం,బున నిచ్చె సుకేశునకుఁ బ్ర♦మోదంబున; నా
వనితయు వరలబ్ధమహా,ధనునిం బ్రియుఁ బతిని బొంది ♦ తద్దయు వేడ్కన్.

చ. ధనమును గాంచి నిర్ధనుఁడు ♦ తా మదిఁ బొంగెడునట్లు తుష్టినిం
గనియె; సుకేశుఁ డాతరుణిఁ ♦ గామునిశస్త్రముఁ బోలుదాని నే
యనిశముఁ గూడి యంజనసు♦హాగజసంభవ మొందియున్న హ
స్తినిచయనాయకుండు సుసు♦తిం దనచేడియఁ గూడి వేడుకన్. ౪ 139

తే. అలరు నట్లు ముదంబును ♦ నందినుండె;
నంత నా దేవవతియందు ♦ నాసుకేశుఁ
డాత్మజుల మాల్యవంతుని ♦ ననురవరు సు
మాలి బలశాలియయినట్టి ♦ మాలి దనుజు. ౫ 140

సీ. త్రేతాగ్నిసంకాశ♦దేహులఁ ద్రిణయనసముల ముగ్వురను రా♦క్షసవరులను
గనియె; నాసుతులు లో♦కత్రయమట్టు లవ్యగ్రులై త్రేతాగ్ను♦లట్టు లుండి
యుత్సాహ మనుశక్తి♦యును బ్రభుశక్తియు మంత్రశక్తియునను♦సుహితమంత్ర
ములు మూఁడు సుహిని నుజ్జ్వలరీతిఁ బొల్చెడుపడువున నుగ్రులై ♦వాతపిత్త

తే. ములను శ్లేష్మము ననెడు వ్యా♦ధులను దనరు
నామయంబులరీతి భ♦యంకరులయి
యలరి రిట్లు సుకేశుని♦యాత్మభవులు
ముగురు త్రేతాగ్నిసమతేజ♦ములఁ దనర్చి. ౬ 141

క. దినదినము వృద్ధినొందిరి, కనుఁగొనియు నుపేక్షచేయఁ♦గా రోగము లె
ట్లనయము వృద్ధిని మిగులం, గనునో యటు లసమములగు♦కాంతిస్ఫూర్తిన్.

క. జనకుండు తపోబలమునఁ, గనియె వరప్రాప్తిలబ్ధ♦కమైశ్వర్యం
బని యెఱిఁగి మేరుభూధర,మునకుం గృతనిశ్చయులయి ♦ భూరితపంబున్. ౯½

చ. ఒనరుపఁ బోయి; రగ్గిరి మ♦హోగ్రములౌ నియమంబులన్ మహా
దనుజులు వారు గైకొనుచు ♦ దారుణమై తగి భూతసంఘభీ
తిని గలిగింపఁ జాలి నియ♦తిన్ గడు రాజిలు నత్తపంబుఁ జే
యను నవు డూని; రంత దను♦జాధిపు లెంతయుఁ బూన్కి మీఱఁగన్. ౧౦

తే. సత్య మార్జవ మములన్ ♦ సమధికగుణ
ములను గూడుచు దుష్కర♦ములును నగుచు
వెలయుతపములచే లోక♦ములను మూఁడిఁ
టిని దపింపఁగఁ జేయుచు ♦ మనుజవితతి. ౧౧ 145

క. సురలను నసురుల నెల్లన్, బరమార్తిని బొందఁ జేసి ♦ బహుదుష్కరమై
పరఁగఁ దపం బొనరించిరి;, తరువాతన్ లోకవిభుఁడు ♦ ధాతయుఁ బ్రీతిన్.

చ. అనుపమమౌ విమానమున♦యందు వసించి సుకేశపుత్రులన్
గనికర మొప్పఁగాఁ బిలిచి ♦ కాంతమృదూక్తిని బల్కె నిట్లు; మీ
కును వరదుండ నైతి మదిఁ ♦ గోరిక యేమొ? యనంగ నింద్రము
ఖ్యనిఖిలదేవతాయుతుని ♦ నబ్జజు వారలు గాంచి భక్తితోన్. ౧౨½ 147

చ. వరదునిగా నెఱింగి తమ♦వర్ష్మము లెల్ల వడంకు భూరుహో
త్కరములు నాఁ జెలంగఁ బలు♦కంగఁ దొడంగిరి చేతు లొగ్గి; యో
పరమకృపామహార్ణవ! త♦పంబునఁ దృప్తిని బొంది మాకు న
ద్వరము లొసంగఁగాఁ దమిని ♦ వచ్చితివేని మదీయవాంఛలన్. ౧౩½ 148

సీ. విను మజేయులమయి ♦ విమతులను జయించి చిరజీవులమయి యే♦చింత లేక
యొకరి నొకరుగూడి ♦ నొందుచు నభివృద్ధి నుండఁగా వరముల♦నొసఁగవలయు;
ననెడు సుకేశుని♦తనయులఁ గని యట్లె యగుఁ గాక యని; విభుం♦డాత్మలోక
మున కేగె; బ్రహ్మ వి♦ప్రనికరవత్సలుం డరుగంగ రాత్రించ♦రాధిపతులు

తే. వారలంతట విధిద త్త♦వరముల గత
భయులుగా నొప్పి త్రిదశుల♦నరుసఁ బూర్వ
సురుల బాధింపఁ దొడఁగి; ర♦మరులచేతఁ
జంపఁ బడుచు మౌనీంద్రుల♦సమితి మఱియు. ౧౬ 149

క. సురలును జారణులును ద, స్పురయుచుఁ గాపాడునట్టి ♦ యధిపుఁడు లేమిన్
నిరయస్థులైన మనుజుల,కరణిగ నుండంగ; దనుజ♦కాంతులు దీప్తిన్. ౧౭½

క. అలరుచు శిల్పివరుం డనఁ, బొలుపారెడు విశ్వకర్మ ♦ బుధనుతుఁ గృత్యం

బుల నవ్యయుఁడగు సుకృతిం, గలుషహరుం గాంచి తృప్తి♦వదలుకొనంగన్.

చ. పలికిరి రాఘవా! యిటులు; ♦ భవ్యతరోజనుఁ దేజమున్ మహా
బలమును గల్గి యాత్మగుణ♦పౌరుషముం గలవారలందు మి
క్కిలి యశ మొంది దిక్కులను ♦ గెల్చి చెలంగెడు దేవతాళికిన్
గల హృదయేప్సితంబు లొసఁ♦గంగల దివ్యులసద్గృహంబులన్. ౧౯ 152

ఆ. కట్టి యిచ్చునట్టి ♦ ఘనుఁడ వీవే కావె, గాన గురుమనీష! ♦ కడు జవమున
మాకుఁ గట్టి యిమ్ము ♦ మహితసౌధములను;, శీతశైలమేరు♦శిఖరులందు. ౨౦

క. మందరమును భూధరవర,మందును నీయిచ్చ దేని♦యందుం గలదో
యందు మహేశ్వరగేహ మ,సం దగు సౌధంబు సన్మ♦నంబున నిపుడే. ౨౦

క. ఒనరించి యొసఁగుమా! చ,క్కనిరీతి ననంగఁ జిత్ర♦కౌశల మలరం
గను దగిన విశ్వకర్మయుఁ, దనభుజసారంబు మెఱయ ♦ దనుజేశ్వరులన్. ౨౧

క. కని పలికె మీరు వసియిం,పను దగు తావుల వినుండు; ♦ పర్వత మొకఁ డుం
డును దక్షిణవార్ధితటం,బునయందుఁ ద్రికూట మనఁగఁ ♦ బొల్చెడురుచులన్.

ఆ. మఱి సువేల మనఁగ ♦ మహి నొప్పు భూధర
మొండు గలదు దాని♦యందు నింద్రుఁ
డలరి యుండునట్టి ♦ యమరావతిని బోలి
యుండు మీకు వాస ♦ మొప్పు నందు. ౨౩ 157

సీ. ఈపర్వతములందు ♦ నెందైన నుండినా దనుజులారా! భూమి♦ధరమునడుమ
నలరుకూటంబున ♦ నంబుదం బనఁదగి యలరారుదానియం; ♦ దరయఁ బక్షు
లకునైనఁ బోవఁద♦గక *టంకవిచ్ఛిన్నదిక్చతుష్కంబయి ♦ తేజరిల్లు
నచ్చోట ముప్పది ♦ యామడ లంతటి వి స్తీర్ణమారీతి ♦ విమల మగుచు

తే. యోజనశతాయతంబునై ♦ యొప్పునట్లు
కనకవరణావృతంబయి ♦ కనకతోర
ణావృతంబయి లంకాహ్వ♦యమునఁ బరఁగు
పురము శక్రాజ్ఞచే నేను ♦ బూర్వ మొకట ౨౪ 158

క. కరకౌశలము గనంబడ, వరమణిఖచితంబు నగుచు ♦ భాసిల్లుగృహో
త్కరముల నలరఁగఁ గట్టితి, సురరిపువరులార! యందు ♦ శుభతమరీతిన్. ౨౬

ఆ. ఎవరిబాధ లేక♦యే యుండఁ దగుఁ గాన
నట వసింపుఁ డింద్రుఁ ♦ డాదియైన
యమరు లాదరమున ♦ నమరావతిని బొంది
నటు దురూహమైన ♦ యట్టి లంక. ౨౬ 160

క. దనుజసమూహావృతులై, మనమున నేశంక లేక ♦ మహితోత్సాహం

* టంకచ్ఛిన్నచతుర్దిశ-అనియూ.

బున నుండుఁ దగుల నొంచుచుఁ, గనకుండఁగ శత్రువీడఁ ♦ గలకాలంబున్.

క. సిరు లలరఁగ నివసింపుఁడు;, పరమాద్భుతరీతి నంచుఁ ♦ బలుకు నతనివా
క్పరిపాటిని విని రాక్షస,వరు లంతట లంక కేగి ♦ వైభవ మలరన్. ౨౭ 162

క. దనుజనహస్రావృతులై, గన దుష్ప్రసహులును నగుచుఁ ♦ గ్రాలుచు మోదం
బున నివసించిరి;, రామా, వినుతంబై హేమగేహ♦వితతం బగుచున్. ౨౭౹

క. కదలింప నశక్యంబై, పొదలెడు ప్రాకారపంక్తి ♦ భూరిపరిఖయున్
మదికిఁ బ్రమోదం బొసఁగం,గఁ దగన్ రాజిల్లు లంకఁ ♦ గర్బురవర్యుల్. ౨౯

క. సుర లమరావతి నొందిన,కరణిన్ గురువైభవములఁ ♦ గ్రాలుచు నివసిం
చిరి; స్వేచ్ఛరీతి నీవిధి, సురవైరులు కాపురంబు ♦ సొంపుగఁ జేయన్. 30

సీ. ఆసమయమ్మున♦యందు నర్మదయను గంధర్వి బహుధర్మ♦కలితచిత్త
యలరారుచుండె; నా♦యశివ హ్రీశ్రీకీర్తిసన్నిభద్యుతిగల ♦ సాధుపుత్రి
కాత్రయంబును బ్రీతిఁ♦గాంచె; రాక్షసజాతి గానిదయ్యును నామె♦కన్యకలను
జ్యేష్ఠక్రమంబునఁ ♦ జెలఁగి యాకర్బురవరులకు సంపూర్ణ♦వైభవమున

తే. మించు చంద్రునివలె నొప్పు♦మృదుముఖముల
నలరు నారీమణుల నిచ్చె ♦ నసురవరులు
ముగురు గంధర్వకన్యకల్ ♦ ముగురు ప్రీతిఁ
గాంచుచుండిరి; నర్మద♦కన్యకలను. 33 166

క. *దనుజేంద్రులకున్ హర్షం,బున నుత్తరనామధేయ♦మునఁ బొల్చెడు తా
రను బెండ్లియాడ నిచ్చెను, దనుజాధిపు లాసుకేశ♦తనయులు రామా!. 33౹

ఆ. పెండ్లియాడి వారిఁ ♦ బ్రేమమీఱఁగఁ గూడి
యచ్చరలను గూడి ♦ యమరు లెట్లు
విహరణంబు చేసి ♦ రహరహంబును నట్లె
క్రీడ సల్పి; రంత ♦ క్షితిపతేంద్ర!. 3౪ 168

క. తనుజితరతియై సుందరి, యనఁ బరఁగెడు మాల్యవంతు♦నంగన, యతఁ డా
వనితామణియందుం గని,యెను దనయులఁ దద్విధంబు ♦ నెఱిఁగింతు విభూ!.

తే. యజ్ఞకోపాఖ్యుఁడును విరూ♦పాక్షదుర్ము
ఖాహ్వయులు వజ్రముష్టియు ♦ నట్లె మత్తుఁ
డనెడువాఁడు సున్మత్తుండు ♦ నతిబలాఖ్యుఁ
డైన సుప్తఘ్నుఁ డనువార ♦ లైరి సుతులు. ౩౬ 170

క. అనలాహ్వయమునఁ బరఁగెడు, తనయయు సుందరికిఁ బుట్టె ♦ ధరణీనాథా!
దనుజేంద్రుఁ డాసుమాలికి, వనితామణి కేతుమతియు ♦ భార్య యగుఁ గదా.

క. పరిపూర్ణశశినిభానన, తరుణులలో మేటి యగుచుఁ ♦ దనపతిప్రాణో

* దైవత్యే భగదైవతే-అనియూ.

త్కారమున కంటెను మిక్కిలి,యు రాగమునఁ దన్నుఁ జూడ♦నొప్పునురామా!.

క దనుజేంద్రుఁ డానుమాలియుఁ, గని యెఁ గుమారులను బుత్రి♦కలదీర్ఘభుజా!
విను మెఱిఁగించెదఁ గ్రమముగఁ, దననతియందంత నతఁడు♦దారగుణులనున్.

సీ. ఆత్మజన్ములఁ బ్రహ♦స్తాకంపనాఖ్యుల వికటాఖ్యుఁ గాలకా♦ర్ముకుని దండుఁ
డనువాని ధూమ్రాక్షు;♦నతిబలశాలియై యలరుసుపార్శ్వ,సం♦హ్రాదిఁబ్రఘను;
భాసకర్ణుండనఁ ♦ బరఁగువారల ఘుఱి పుష్పోత్కటాఖ్య చేఁ ♦ బొలుచుదాని
నమలశుచిస్మిత♦యుగు కైకసిని నల్లు కుంభీనసిని గనెఁ ♦ గూఁతులఁ దమి;

తే. మాలియును రాక్షసునిభార్య ♦ మహితరూప;
వసుధయన నొప్పు గంధర్వి ♦ వారిజాక్షి
యక్షసుతతోడ నుద్దియై ♦ యలరుఁ జారు
నయనశోభను గనుచు బ♦ళియని మెచ్చ. ౪౨॥ 174

క. విను మానుమాలిదనుజుం, డనురాగము మీఱ భార్య♦యందుఁ బడసె స
త్తనయుల నెఱిఁగించెద నో,మనుజాధిప! వినుతసకల♦మంగళసుగుణా!. ౪౩॥

క. అనిలానలసంపాతులు, ఘనుఁడై తగు హరుఁడు వీగ ♦ కడు సుగుణయుతుల్
మనయువిభీషణునకున్, మననునకున్ బ్రీతిఁ గూర్చు♦మంత్రులు రామా!.

క. మాలేయులైన వీరలు, చాలబలాఢ్యులు మహోరి♦శమనులు నగుచుం
గ్రాలిరి; మాలిప్రముఖులు, పాలితదనుజాళు లగుచు ♦ బహుపుత్రకులై. ౪౪॥

చ దనుజులఁ గూడి శక్రముఖ♦దర్పసమగ్రనిశాచరారులన్
మునులను నాగదానవులఁ ♦ బూనిక మీఱఁగఁ గష్టపెట్టుచున్
ఘనగతి గాలి మించి త్రిజ♦గంబుల నష్టములేక స్వేచ్ఛఁగాఁ
జనుచును మృత్యువట్లు పృథు♦సంగరసీమలఁ దేజ మొప్పఁగన్. ౪౫ 178

క. వరదానగర్వితులుగాఁ, బరఁగుచుఁ గ్రతుకార్యములకు ♦ భంగము తారే
యరయుచుఁ జేయుచుఁ బొల్చిరి, ధరణీశా! వారిఁ జెనకఁ♦దలఁపరు సురలున్.

ఐదవ సర్గము సంపూర్ణము.

---

౬-వ సర్గము.

దేవతలు శంకరునకు దగి దానవబాధలఁ జెప్పుట.

చ. దనుజులు తమ్ముఁ జంపుటకు ♦ దారుణభంగిని బూన నొచ్చి యా
మునులను సత్తపోధనుల ♦ ముం దిడుకొంచు సుపర్వులెల్ల భీ
తిని గని యామహేశ్వరుని ♦ దేవవిభున్ శరణంబుఁ గోరఁగాఁ
జని; రట వెండికొండపయి ♦ సర్వసుపర్వసుపూజితాంఘ్రియై. ౧ 180

సీ. జగములఁ బుట్టింప ♦ సమయింపఁగాఁ బెంపఁ గర్తయై, పుట్టువు ♦ గనక పొల్చి
యవ్యక్తరూపుఁడై ♦ యఖిలలోకాధారుఁడయి పరమ్బుఁడయి ♦ యాఖిలమ్మానకుఁ

దానె గురుండయి ♦ దర్పకాంతకుండయి త్రిపురహరుండయి ♦ త్రిణయనుండయి
పొల్చెడునట్టి యా ♦ భూతనాథుం గాంచి యంజలిం బట్టి యి ♦ ట్లనిరి భీతి

తే. గదదోక్తుల; భగవంత! ♦ కామహరణ!
యాసుకేశునితనుజాతు ♦ లజానివరము
లంది గర్వించి యెల్లర ♦ ననిశ మేచి
బాధ చేయుచునున్నారు ♦ పరమపురుష!. ౮ 181

చ. సురరిపు లీవిధిం గడఁగి ♦ స్రుక్కఁగఁ జేయఁగ మానివాసముల్
కర మశరణ్యరీతిఁ గని ♦ కాంతము లయ్యెను దిక్కులేనివై
పరఁగెను; స్వర్గపత్తనము ♦ బాగుగఁ బ్రోచెడు సర్వదేవతే
శ్వరుఁడు పదచ్యుతిం గనియె ♦ వారలు కంఠముఁ బట్టి త్రోయుటన్. ౯ 182

క. సురపురిఁ గ్రీడించెద రా,శరవీరులు మఱియు నేనె ♦ చక్రిని దేవే
శ్వరుఁడైన హరుఁడ నేనే, పరమేష్ఠియు నేనె దేవ ♦ పతియును నేనే. ౧౦ 183

ఆ. యముఁడ నేనె వరుణుఁ ♦ డనువాఁడు నేనె నే, నబ్జవైరి నర్కుఁ ♦ డనఁగ నేనె
యనుచు నొక్కఁ డొక్కఁ ♦ డజనరదానవ,ర్పితులు గానదనుజ ♦ పతులు సతము.

చ. అనిమొన దుష్ప్రధర్షులయి ♦ యూడుముఁ బాడుచు నున్నవార లా
దనుజులసేవకుల్ మఱియు ♦ దారుణరీతులఁ బల్కుచుందు రా
దనుజభయార్తులైన మముఁ ♦ దప్పక ప్రీతి గ్రహించి కావవే
[1]తను వశివంబుఁ దాల్చి సుర ♦ దస్యుల వారలఁ జంపు మోవిభూ!. ౧౨ 185

ఆ. అభయ మిమ్ము మాకు; ♦ నని దేవతలు వేఁడ
నీలలోహితుండు ♦ నిఖిలసురులఁ
గాంచి [2]యాసుకేశ ♦ కన్యరతనయులు
తనకు భక్తు లగుటఁ ♦ దలఁచి మదిని. ౧౩ 186

చ. తనయులవంటివార లనిఁ ♦ దన్మృతినిం గలిగించు టెట్టులం
చును దలపోసి యిట్లనియె ♦ సూనృతవాక్కుల; భక్తులార! నే
నని నలదానవోత్తముల ♦ నర్హము గాదు వధించు టెన్ని మీ
కును దగునట్టి మంత్రమును ♦ గొంకక చెప్పెద నాలకింపుఁడీ!. ౧౪ 187

క. దనుజుల వారలఁ జంపెడు,ఘనుఁ డెవఁడో యొఱుకపడఁగఁ ♦ గల దద్దానన్;
జనుఁ డిట్టి సముద్యోగం,బును గైకొని దివిజులార! ♦ మునివరయుతులై. ౧౫

క. శరణని విష్ణువుఁ బరమే,శ్వరునిన్ దర్శించి వెతలు ♦ వాపుఁ డనుచు శ్రీ
పరుఁ గోరుఁ డావిభుండును, బరిమార్చును వారి నెల్లఁ ♦ బౌరుష మలరన్.౧౬

1 అశివం వపు రాస్థాయ జహి దైవతకంటకాన్-అనిమూ. 2 సుకేశం ప్రతి సాపేక్షః- అని
యు. కేశస్య స్వాశ్రితత్వాత్ తత్పుత్రవధానౌచిత్య ఇత్యాశంక్యే త్యాహ-అనివ్యాఖ్య.

చ. అని పరశంకరుండు పర♦మాద్భుతరీతి వచింప నీశునిం
గని జయశబ్దపూర్వకము♦గా నుతియించి నిశాచరేంద్రభీ
తిని వెత లొందువారగుటఁ ♦ దెప్పున విష్ణుసమీపభూమికిన్
జని దరచక్రశోభితుని ♦ శార్ఙ్గధరుం గని భక్తిమీఱఁగన్. ౧౨ 190

చ వలగొని మ్రొక్కి స్తోత్రముల ♦ వాసవముఖ్యులు సన్నుతించి దో
ర్బలముల విఱ్ఱవీఁగు సుర♦వైరుల మాలి సుమాలిముఖ్యులన్
గలవిలపాటుచేతఁ బలు♦కంగఁ దొడంగిరి; దేవదేవ! శ్రీ
విలసితవక్ష! మా వెతల ♦ విందువు గాక సుకేశపుత్రకుల్. ౧౩ 191

క. వరదానగర్వితులు ముగ్గురు త్రేతాగ్నులను బోలి ♦ క్షోణి వెలయుని
ర్భర తేజంబులఁ గ్రాలుచుఁ, ద్వరపడి మాస్థానములను ♦ దయమాలి విభూ!.

క. బలవంతంబుగఁ గొని యుజ్జ్వలలంకానగరమందు ♦ వసియించిరి వా
రలు; లంక త్రికూటాఖ్యాచలమున దుర్గమముగాఁగ ♦ సాంద్రవిభూతిన్.

తే. వెలయుచున్నది రాక్షస♦వీరు లెపుడు
మమ్ము బాధించు టే తమ♦సమ్మదంబు
గాఁగ నెంచుచునున్నారు; ♦ గాన వారి
మాహితము గోరి వధియింపు ♦ మధువిరోధి. ౧౫ 194

క. శరణముగ నిన్నుఁ గంటిమి, సురనాథా! దిక్కు నీవె ♦ చూ! మాకెల్లన్;
నిరుపమచక్రంబున నిర్జరవైరి ముఖాబ్జములను ♦ ఖండింపఁ బడఁగన్. ౧౬

చ ఒనరుతునంచు మాకు వర♦మో మధుసూదన! యిమ్ము, గేహముల్
గనఁ జనువార మార్తిని ని♦కాయము పొందిన మాకు దిక్కు నీ
వనుచును నమ్మినార మిఁక ♦ నన్యుఁడు లేఁడు సుమీ! దురాత్ములన్
వనజభవప్రదత్తవర♦వారమదోద్ధతులన్ సబంధులన్. ౧౭ 196

క. దనుజుల వారిని భాస్కరుఁ, డనూననీహారరాశి ♦ నాత్మకరములన్
బనివూని చెండుగతిఁ జక్రనితాంతస్ఫూర్తి మాయఁ♦గాఁ జేయఁదగున్.౧౮

కవిరాజవిరాజితము:—

అని యిటు దేవత ♦ లందఱు పల్క జ♦నార్దనుఁ డాదృతి ♦ న్యాయముగా
దనుజుల కెంతయు ♦ దారుణభీతిని ♦ దానె యొనంగఁగ ♦ దక్షణమే
మనమున నెన్నుచు ♦ మానుఁడు భీతుల ♦ మ్రందఁగఁ జేసెద ♦ మార్తుర నే
నని మఱి పల్కెను ♦ సాహసనత్కృప ♦ నాయతభూతుల ♦ నంది తగన్.

తే. దర్పమున మించి యున్న యా♦దనుజవర్యు
నాసుకేశుని నెఱుఁగుదు ♦ నతనిసుతుల
నాత్మ నెఱుఁగుదు వారల♦యందు జ్యేష్ఠుఁ
డగుఁ గదా మాల్యవంతుఁ డో♦యమరులార!. ౨౦ 199

క. దనుజాధములను మర్యా,దను మిక్కిలి మీఱి యున్న ♦ దర్పయుతుల నే
నని( జంపెదఁ గ్రుద్ధుఁడనై, మనములసురలార! భయము♦మానుఁడుమీరల్.

క. అనియిటు ప్రభవిష్ణుం డా,జనార్దనుఁడు విష్ణుమూర్తి ♦ సాంద్రకరుణఁ బ
ల్కిన నిర్జరు లా దేవుని, వినుతించుచు నేగి రెంతొ ♦ వేడ్క ననతికిన్. ౨౨

క. తరువాత మాల్యవంతుఁడు, సురవర్యులయుద్యమంపుఁ♦జొప్పును విని సో
దరులను వీరుల నిర్వురఁ, బరికించి వచించె నిట్లు ♦ ప్రౌఢిమ మెఱయన్. ౨౩

—మాల్యవంతుఁడు తనతమ్ములతో దేవతలప్రయత్నముఁ దెల్పుట.—

ఉ. సోదరులార! దేవమును ♦ లోక్కటఁ గూడి మహేశుఁ జేరఁగాఁ
బోఁదగునంచుఁ బల్కికొని ♦ పోయి క్రుధన్ మనలన్ వధింప నెం
తే దగువాఁడు శంకరుఁ డ♦హీనధరుం డని శంభుఁ గాంచి స
న్మానము మీఱఁ ద్ర్యంబకుని♦మ్రోలను నిల్చి వచించి రివ్విధిన్. ౨౪ 203

క. వరదానబలోద్ధతులై, పురహరణ! సుకేశదనుజ♦పుత్త్రులు ముగు రు
ర్వర భీతిలేక తిరుగుచుఁ, బరభీకరతనువు లొప్పఁ ♦ బరిపరి మమ్మున్. ౨౫

ఆ. కరుణ యింత లేక ♦ గాఱియుపెట్టుచు, నున్నవారు దేవ! ♦ యుగ్రభీతి
గలుగఁ జేయుచున్న ♦ కఠినరాక్షసతిర,స్కృతుల మగుటచేత ♦ నిండ్లయందు.

క. మేము వసింపఁగఁ జాలక, యీమెయి నిట వచ్చినార ♦ మిఁక మాహితమున్
గామహరా! మది నెంచుచు, వే మర్దింపుము మహాత్మ! ♦ విషధర! యీశా!.

క. అరులను హుంకారమ్మునఁ, బరిమార్చెడువాఁడ వీవె ♦ పటుహుంకృతి నీ
సురవైరుల దహియింపుము, కరుణాకర! యంచు వేఁడఁ♦గా నప్పలుకుల్. ౨౬

*క. విని యంధకసూదనుఁ డా,త్మను సంతసపడక కరము ♦ మస్తకమును నే
వను బూని విదల్చుచు ని,ట్లనియెను; సురలార! రాక్ష♦సాధిపు లనిలోన్. ౨౭

తే. నా కవధ్యులు కాన మం♦త్రంబు మీకుఁ
జెప్పువాఁడను వారలఁ ♦ జెందువానిఁ
దెలియనగు దానఁ; జక్రగ♦దలను దాల్చి
కరము లొప్పంగ రిపుజన♦కాలుఁ డగుచు. ౨౮ 209

క. పీతాంబరంబుఁ దాలిచి, శ్రీతరుణీప్రియుఁడు నగుచుఁ ♦ జెలఁగు హరిని సం
ప్రీతిని శరణముఁ గనుఁడీ, యీతరుణమునం దనంగ ♦ నీశ్వరుపలుకుల్. ౩౦

చ. విని సుర లాహరోక్తమగు ♦ విస్తృతమంత్రము మంచి దంచు నా
యనఘుని దర్పకారిని మ♦హాత్ముని మ్రొక్కుల సంతసంబునుం
గన నొనరించి యంత ముర♦ఘస్మరుసద్మముఁ జేరి చెప్పి రా
తనికి సమస్తమున్; హరియుఁ ♦ దద్దయు నార్తిని గన్నవారలన్. ౩౧ 211

---

* శిరః కరం చ ధున్వాన ఇదం వచన మబ్రవీత్-అనిమూ. ధున్వాన ఇతి సురోక్తస్యా గ్రాహ్యతాద్యోతనమ్-అనివ్యాఖ్య.

క. శతమఖముఖ్యులఁ గని యా, దితిజుల నెల్లను నే వ♦ధించెద మీరల్
గతతాపు లగుచు నుండుం, డతిశయ మోదమున నంచు ♦ నాదృతిఁ బలుకన్.

క. సుర లరిగిరి, భయభీతులఁ, బరిరక్షించెదను దేవ♦వైరుల నెల్లం
బరిమార్తు నంచుఁ బ్రతిసను, హరి యొనరిచెఁ గాన దాన♦వాధిపులారా!.

క. మనమున దీనిఁ దలంపుఁడు, వనజాక్షునిబాధ గనక ♦ వర్తిలు టెట్లో
మును పాహిరణ్యకశిపుం, డనుపమబలులైన దేవ♦తారులు కలనన్. ౩౩

సీ. హరిచేతఁ దెగిరి; మ♦హాభుజుండై తగు నక్కాలనేమి సం♦హ్రాద నముచు
లును రాధేయను ఖ్యాతిఁ♦దనరిన రాక్షసాంగనకుఁ గుమారుఁడై ♦ఘనబలాఢ్యుఁ
డై నరాధేయుండు ♦ నారీతి బహుమాయి యనువాఁడు ధార్మికుం♦డైన లోక
పాలుఁడన్ కర్బుర♦పతి యమళార్జునుల్ హార్దిక్యుఁడును శంభుఁ♦డను దనుజుఁడు

తే. మఱి నికుంభకుఁడను నిట్టి ♦ మహితసత్వ
బలసమగ్రనిశాచర♦పతులు దాన
వులును రణమున హరిఁ దాఁకి ♦ గెలువఁ గొనుట
వినఁగఁ బడ లేదు; తలపోయ ♦ వీర లెల్ల. ౩౬ 215

క. క్రతుశతముల నొనరించియు, హితఫలములఁ బొందిమాయ♦లెల్లఁ దెలియఁగాఁ
గృతసర్వశస్త్రశిక్షకు, లతిభయదులు శత్రువులకు♦నై ఘనమతులై. ౩౭

చ. అనిమొన వేనవేలుగ సు♦రాధిపుఁ డో హరిఁ దాఁకి యంతకుం
గనఁ జని రీచరిత్రమును ♦ గాఢముగాఁ దలపోసి యేవిధం
బునఁ బనిచేయ శ్రేయమును ♦ బొందుదుమో యటు చేయఁ బూనుఁడీ
మనల వధింపఁ బూను హరి ♦ మ్రందఁగఁ జేయ నశక్య మెట్టులున్. ౩౮

చ. అనిన సుమాలి మాలియును ♦ నవ్వచనంబుల మాల్యవంతుఁ డి
ట్లని వెత నూని పల్క విని ♦ యన్నను గాంచి వచించి రిట్లు; [1]లిం
ద్రుని భగుఁ డర్యముండు గని ♦ తోరపు వేడుకఁ బల్కునట్లు; లో
ఘనధిషణా! యభీష్టములఁ ♦ గాంచితి మిచ్చితి మెల్లయర్థముల్. ౩౯ 218

క. చక్కఁ బఠించితి మాదృతి, మిక్కిలి భాగ్యములఁ గూర్చి ♦ మేలని పొగడన్
దిక్కుల నేలితి మాయువు, నిక్కముగ నపారము గద! ♦ నిర్మలకీర్తీ!. 219

తే. ఆమయంబులు తగులని♦యట్టు లొప్ప
కాయములఁ బొందితిమి, సరి♦గా స్వధర్మ
మెల్ల జరపితి; [2]మక్షోభ్య♦మే యనఁ దగి
శస్త్రవీచికమగు దేవ♦సాగరమును ౪౦ 220

---

[1] ఊచతు ర్భ్రాతరం జ్యేష్ఠ మశ్వినా విన వాసవమ్-అని పాఠాంతరము గలదు. భగంశా వివ వాసవౌ-అను పాఠము తలచుగాఁ గానఁబడు. భగంశౌ=అనఁగా భగుఁ డర్యముఁడు నను సూర్య మూర్తిభేదదేవతలు. 2 దేవసాగర మక్షోభ్యం శస్త్రోర్మిం ప్రవిగాహ్య చ-అనిమూ.

క. లీలఁ బ్రవేశించితి మరి,జాలంబులఁ బాఱఁదోలి ♦ సరి యెవ రనుచుం
గ్రాలితిమి గదా? మృత్యువు, గ్రోలఁ గలదె ప్రాణవాయు♦కూటము దేవా!.

క. హరిహరసురపతిశమనులు, దురమున మనశక్తిచేతఁ ♦ దొలఁగక నిల్వం
దరమని తలఁతురె; భీతిన్, బఱగెత్తుదు రట్టి మనకు ♦ భయ మెట్టు లగున్.

క. మనకును హరికిని ద్వేషం, బనఁ గలుగదు హేతు వేమి? ♦ యందులకున్, శ్రీ
శున కపకారము నుంతయు, మనవంకం గల్గ దెపుడు ♦ మాట లిఁకేలా?. ౨౩

చ. మనపగవారిదోషమున ♦ మాధవుచిత్తము చంచలించెఁ గా
వున మన కెల్లసైన్యములఁ ♦ బ్రోగు నొనర్చి సురారివీరులం
గొని కడునైకమత్యమునఁ ♦ గొంకక దేవతలన్ వధింత మా
యనిమిషులే కదా మనల ♦ నంతము నొందఁగఁ జేయఁ బూనుటల్. ౨౪½

చ. అని యిటు హెచ్చరించి ముగు ♦ రాయుతసత్త్వులు సైన్యయుక్తులై
యని యొనరింపఁగాఁ దగిన♦యట్టి తెఱంగు వొసంగె నంచుఁ జ
క్కనిగతిఁ జాటఁ బంచి బల♦కాంతుల నెల్ల బహూకరించి చ
య్యన నలజంభవృత్రదను♦జాధిపసేనలు వోలెఁ బూన్కితోన్. ౨౬ 225

క. సురపురి కేగిరి పెనుసం,గరమొనరింపంగ; భూప♦కాంతా! రామా!
సురవైరు లిట్లు నిశ్చయ,పరులై యుద్యోగ మలరఁ ♦ బటుసత్త్వములన్. ౨౬½

తే. తనువు లప్పుడు వెలుఁగొందఁ ♦ దరలి చనిరి;
రథములను నెక్కి వారణేం♦ద్రములఁ గూడి
*గిరిసమానంబులగు సాధు♦తురగములను
ఖరవృషభరాజి; నుష్ట్రాళిఁ ♦ గడఁగి యెక్కి. ౨౭½ 227

సీ. శింశుమారముల నా♦శీవిషంబులఁ గచ్ఛపంబుల మకరమీ♦నంబుల గరు
డోపమంబులు గాఁగ ♦ నొప్పు పక్షుల సింహములను వ్యాఘ్రంబుల♦భూరిరోష
ముల నొప్పు పందిగ♦ముల సృమరంబులఁ జమరీమృగంబుల ♦ సరభసముగ
నెక్కి లంకాపురం ♦ బొక్కటఁ బాసి రాక్షసులు నిర్భరబల♦గర్వ మెల్ల

ఆ. సురలతోడఁ బోర ♦ సురపురి కేగిరి;, భూతము లెవి లంక♦పురమునందుఁ
గాపురంబుచేయుఁ ♦ గడుభయసూచకం,బులగు చిహ్నములను♦బోలఁ గాంచి.

క. పుర మిద్ది వినాశముఁ గను,కరణిని గన్పట్టె ననుచుఁ ♦ గనలి హృదయముల్
పరిచలనము నొందఁగ నె,వ్వరుసం జూచినను గుందు ♦ వదలక యుండెన్.

చ. అరదము లెక్కి యిట్టు లసు♦రాధిపు లెల్లరు వేనవేలుగాఁ
బరుగిడుచుండి రాదివిజ♦వారముఁ గూల్చుతలంపుచేత; ని
ష్కరణిఁ బ్రయత్నపూర్వకము♦గాఁ జను వారికి మార్గమందె దు
ర్భరములుగాఁగ దుశ్శకున♦వారము లప్పుడు తోఁచె ముందటన్. ౩౧½ 230

* హయైశ్చ గిరిసన్నిభైః-అనిమూ.

తే. తమ్ముఁ గాలము పురికొల్ప ♦ దారుణభయ
మును గనంబడఁ జేయుచు ♦ భూతము లొగి
విషమసంస్థానములనుండి ♦ వికృతరూప
ములను బొల్చుచుఁ దోఁచెను ♦ విలయ మనఁగ. ౫౩ 231

క. భూమిని నాకాశంబున, నామెయిఁ గన్పడుచు రాక్ష♦సానీకము లు
ద్దామాహవమునఁ దప్పక, యే మృతిఁ గను నంచుఁ దెలుపు♦చీగతిఁ దోఁచెన్.

సీ. అంబుదంబులు పర్వి ♦ యస్థుల నుష్ణరక్తంబును వర్షించెఁ; ♦ గంధి హద్దుఁ
దాఁటెను భూరిభూ♦ధరములు చలియించె నట్టహాసమ్ముల ♦ నాచరించు
చును మేఘనిస్వనం♦బును బోలు ధ్వని గల్గ నాడుచు భూతస♦హస్రములొగిఁ
బైపయిఁబడుచుండె ♦ భయదదర్శనముల నక్కలునున్ దారు♦ణముగఁగూయ

తే. సాగె; గ్రద్దలపిండు వి♦శాలభాగ, మాక్రమించి ముఖంబుల ♦ నగ్నికణము
లట్టె పడుచుండ నంబర♦మందు వారి, పై నలాతచక్రంబునఁ ♦ బర్వి తిరిగె.

క. అరుణచరణయుక్తములై, పరఁగి కపోతములు భీతిఁ ♦ బరుగిడఁ దొడఁగెన్
ద్వరపడి శారిక లట్లే, పరుగిడెఁ గాకములు నభ్ర♦పథమునఁ జనుచున్. ౫౭

తే. *అఱచుచుండెను బిల్లులు ♦ నట్లె ద్విపము
ఖములు ఘోషించుచుండె ర♦క్కసులు చాల
బలమదంబులు గల్గిన♦వార లౌట
నమ్మహోత్పాతములను ల♦క్ష్యంబు గొనక. ౫౮ 235

తే. పాశములఁ గూర్చి మృత్యువు ♦ పట్టి తమ్ము
నీడ్చుచుండుటఁ జనుచుండి ♦ రిది యసమయ
మని తలంపక; యప్పుడు ♦ దనుజవరుల
కందఱకు ముందు నుత్సాహ ♦ మతిశయిల్ల. ౫౯ 236

క. ఘనబలులు మాల్యవంతుం, డనఁగ సుమాలియును మాలి♦యనఁగ నలరు నా
దనుజేంద్రులు క్రతువులకున్, ధనంజయులరీతి నుగ్ర♦తం జని రంతన్. ౬౦

చ. దనుజులు మాల్యవచ్ఛిఖరి♦తల్లజమున్ సతతంబు నాశ్రయిం
చినగతి మాల్యవంతు సర♦సీరుహసంభవు నిర్జరుల్ వలెన్
ధన మిడు దాత యాచకుల♦తండమురీతి సమాశ్రయించి; రా
దనుజవరేణ్యవాహినులు ♦ దారుణమేఘరవంబుచాడ్పునన్. ౬౧ 238

క. ధ్వని చేయుచు విజయేచ్ఛలఁ, జనియెన్ మాలియును భూరి♦సైన్యముదానిన్
దనశక్తి నడుపుచుండెను; వనజాక్షుఁడు దనుజవరులు ♦ వాసవుపురినిన్. ౬౨

తే. పట్టుకొన నెంచి వచ్చుట ♦ పాడి తప్పి
యుద్ధతిని బూని యుండుట ♦ యొక్క దేవ

* బిడాలా వై ద్విపాదయః - అనుపాఠము వ్యాఖ్యానకర్త లంగీకరించినది. మార్జాలా వై ద్విపాదికాః - అనుపాఠముకూడఁ గలదు.

దూతవలనను విని మదిఁ ♦ బ్రీతిఁ గొనియె
యుద్ధమును జేయఁ దగుననుఁ♦నూహ నపుడు;. ౬౩ 240

చ. మనమున యుద్ధనిశ్చయము ♦ మాధవుఁ డివ్విధిఁ జేసి దివ్యమై
తనరి సహస్రసూర్యరుచి♦ధామములగాఁ గనుపట్టుచుండ్ జయం
బును గలిగించు సత్కవచ♦ముఁ ధరియించి క్షయంబులేని బా
ణనికరపూర్ణతూణముల ♦ నైజవిలాసము మీఱుచుండఁగన్. ౬౪ 241

సీ. మూఁపుల బంధించి ♦ భూరిఖడ్గముఁ దాల్చి శ్రోణిసూత్రముగట్టి♦సొంపుమీఱ
శంఖగదాచక్ర♦శార్ఙ్గముఖాయుధవరములఁ గరములఁ ♦ బట్టి శైల
సంకాశుఁడై పక్షి♦సత్త్వంబునన్ మించు వైనతేయుని నెక్కి ♦ వాసవాది
సురలను గావ నా♦శరులను ద్రుంపంగఁ జనియె వేగంబునఁ ♦ జక్రపాణి;

తే. యిట్లు తార్క్ష్యునిమూఁపుపై ♦ నెక్కి శ్యామ
వర్ణమున దేహ మొప్పంగఁ ♦ బచ్చనిరుచి
నలరు నంబరమును దాల్చి ♦ హరి మెఱుపులఁ
గూడి మేఘము స్వర్ణాద్రి♦కూటముపయి. ౬౬ 242

క. విలసిల్లెడుచాడ్పున నుజ్జ్వలశోచిస్ఫూర్తి వెలింగె; ♦ సకలమునిసుప
ర్వులచేత సిద్ధగంధర్వులచే ఫణివర్యయక్ష♦రుద్రులచేతన్. ౬౭ 243

క. వినుతింపఁబడుచుఁ జక్రాసినిశాతమహాయుధములు ♦ జృంభచ్చాపం
బును శంఖముఁ గరములఁ దాల్చి నిశాచరసైన్యములను ♦ జేరెం బ్రీతిన్.

చ. గరుడునిపక్షయుగ్మమునఁ ♦ గల్గినవాయువుచే బలంబు లా
తురపడఁ గేతనంబులును ♦ దూల మహాస్త్రము లిందు నందు సం
గరధరణిం బడంగ సుర♦కాంతవిరోధులసేన లద్భుత* ప్ర
స్తరములు దూల నీలమను♦శైలమువోలెఁ జలించె నెంతయున్. ౬౯ 245

ఆ. పలలరక్తపంక♦పరిభూషితములు యుగాంతవహ్నిసన్ని♦భాంగములును
నుగ్రములును నైన ♦ యురుతరాయుధముల, హరినినొంచిరరిస♦హస్రములని.

ఆఱవ సర్గము సంపూర్ణము.

---

౭ - వ సర్గము.

విష్ణుమూర్తి మాలిం బొలియించుట.

క. హరిగిరి నారాక్షసజలధరములు శరవృష్టినిన్ ని♦తాంతధ్వను లం
బరమున మ్రోయఁగ ముంచిరి, గురుమేఘము లమితవృష్టిఁ♦గురిసి గిరివలెన్.

---

* చచాల తద్రాక్షసరాజసైన్యం చలోపలో నీల ఇవాచలేంద్రః-అనియూ.

క. శ్యామచ్ఛాయను నిర్మలుఁ, డా మాధవుఁ డప్పు డల్ల♦నగు తనురుచి ను
ద్దాములగు రక్కసులచే, నా మెయి నావృతుఁడు నగుచు ♦ నతిఘోరముగన్.
క. అతివృష్టిగురియు మేఘవి,తతి చుట్టుకొనంగఁ జూడఁ♦దగు నంజనమన్
క్షితిధరమువోలె నొప్పెను; దితిజులచాపచ్యుతములు ♦ తీక్ష్ణాశుగముల్. ౨
[1]క. శలభంబులు కేదారము,వలె మశకము లద్రివరము♦వలె నమృతఘటం
బుల వనమక్షికములు, వలె, జలనిధి మకరంబు లట్లు ♦ సాంద్రతరములై. ౩
తే. [2]అనిలవజ్రమనస్సుల♦యట్టి గతుల
హరిని జొచ్చెను విలయంబు♦నందు లోక
ములు హరిం జొచ్చునట్టులె; ♦ భూరిరథము
లందు నున్నట్టి వీరు లా♦యురదములను. ౪ 251
క. కరియూథపతులు కరులను, దురగారోహకులు సాధు♦తురగంబుల [3]నం
బరచరులగుచుఁ బదాతులు, ధరణీధ్రము లనఁగఁ బొల్చి ♦ దారుణభంగిన్. ౫
క. శరశక్తియష్టితోమర,పరికరములఁ గొంచు వైచి ♦ పద్మదళాక్షున్
దురమున నూపిరి పుచ్చఁగఁ, దరుణము లేకుండఁ జేర్చి♦తా రొగిఁ గృధచేన్.
క. విసుతప్రాణాయామ మ,వనీసురుని యూర్పు లావు♦ భంగిఁగ నొనరిం
ప నిశాచరశరహతుఁడై, యనూనమీనాళి నబ్ధి♦యనువున ననిలోన్. ౬
ఆ. సుంత నొచ్చి శార్ఙ్గ ♦ సుంతటఁ గొనుచు దు
ర్ధర్షుఁ డగుచుఁ జేర్చి ♦ దానవులను
నొంచె బాణవితతి; ♦ మించి విష్ణువు మఱి
చాప మట్టు వంచి ♦ సరభసగతి. ౭ 255
చ. కరములశక్తి నారిఁ గడఁ♦కం జెవిదొమ్మకు లాగి లక్ష్య మే
వరుసను దప్పకుండఁగనె ♦ వజ్రముఖాంబులు శాతపుంఖభీ
కరములు చిత్తవేగములు ♦ గాఢపరీచులున్న బాణముల్
పరఁగఁగఁ జేసి దానవులఁ ♦ బంపె సురాలయ మొండ నత్తఱిన్. ౮ 256
క. శతములు సహస్రములుఁగా, దితిసుత దేహములు భూమిఁ ♦ ద్రెళ్లెఁ; సిటులు దై
త్యతతుల శరవర్షంబున, నతివృష్టి నిగుడ్చుజలధ♦రావళిఁ గడఁకన్. ౯ 257
ఆ. వాయు వేచి వేగ ♦ మాయించుగతిఁ జేసి,పాంచజన్య మనఁగఁ♦బరఁగు శంఖ
ము త్తె శౌరి పూరు♦షో త్తముఁ; డుదధిసం,జనితమైన పాంచ♦జన్య మట్లు. ౧౦
ఆ. బలముకొలఁది నొత్తఁ♦బడి భీమనిర్హ్రాదిద, మట్టె నిగుడఁ జేసె ♦ నఖిలలోక
ములఁ గలంపఁ దాను ♦ బూనినయట్లుగ, నిట్లు పాంచజన్య ♦ మెసఁగుధ్వనిని.
క. దనుజుల భీతులఁ జేసెను, వనమున మృగరాజు సమద♦వారణముల భీ

1 శలభా ఇవ కేదారం మశకా ఇవ పర్వతమ్-అనియూ. 2 వజ్రానిలమనోజవాః - అనియూ.
3 పాదాతా శ్చాంబరచరాః-అనియూ.

తిని బొందఁ జేయులాగున;, ధ్వని నద్దానిని వినంగ ♦ దానవసేనల్. ౧౧ 260

చ. తురగసమూహముల్ నిలువఁ ♦ ద్రోఁపమిఁ బాఱెను, గర్వమేది కుం
జరములు నిల్చె, వీరు లొగి ♦ స్యందనవిచ్యుతి నొంది త్రెళ్లి రు
ర్వరపయి; నంతఁ దీవ్రశర♦బాణము లావరచాపవిచ్యుతిం
ద్వరితములై సుపుంఖములు ♦ వజ్రనిభాస్యము లొప్పుచుండఁగల్. ౧౨ 261

చ. దనుజులఁ ద్రుంచి చొచ్చె క్షితి; ♦ దారుణశార్ఙ్గధనుశ్చ్యుతంబులౌ
సునిశితసాయకంబు లనిఁ ♦ జోద్యముగా దనుజాళిఁ ద్రుంప వ
జ్రనిహతపర్వతాళివలె ♦ రాక్షసు లారణభూమిఁ గూలి; రం
త నచట విష్ణుచక్రనిహ♦తంబులు రాక్షసభూరిగాత్రముల్. ౧౩ 262

తే. క్రొత్తనెత్తురు ప్రవహింప ♦ నత్తఱి వ్రణ
ములు గనంబడఁ బర్వత♦ము లొగి స్వర్ణ
ధాతువుల నొప్పుగతిఁ గనఁ♦దగి చెలంగె;
శంఖరాజరవంబును ♦ శార్ఙ్గరవము. ౧౪ 263

క. హరి యొనరించెడు పెనుహుం, కరణనినాదంబు దనుజ♦కాంతులరవముల్
ధర వినఁబడకుండఁగ మ్రిం, గె రయంబున; నంతలోనఁ ♦ గేశవుఁ డాజిన్. ౧౫

చ. దనుజులకంఠనాళములఁ ♦ దచ్ఛరపంక్తిని, జంచలంబులౌ
ధనువుల నట్టిదా ధ్వజవి♦తానము, స్యందనపంక్తిఁ, దూణరా
జిని, దగు కేతనావళులఁ ♦ జెచ్చెఱ శాతశరాళి వైచి భూ
మిని బడునట్లు చేసె; మఱి ♦ మిత్త్రునినుండి మహోష్ణగోచులున్. ౧౬ 265

తే. జలధినుండి తరంగముల్, ♦ శైలవరము
నుండి నాగేంద్రములు, మహో♦ద్దండజలధ
రంబునుండియు సలిలధా♦రలును వెడలు
భంగి హరిచాపనిర్ముక్త♦బాణతతులు ౧౭ 266

క. త్వర వెడలె శతసహస్రము, లరుదుగ, శరభములచేత ♦ హరివర్యములున్
హరిచేతన్ ద్విరదంబులు, [1]ద్విరదతతిన్ వ్యాఘ్రములును ♦ బెద్దపులులచేన్.

తే. చిఱుతపులులును నవ్వాని♦చే శునకము, లట్లె శునకాళిచేఁ బిల్లు ♦ [2]లట్టిపిల్లి
గములచేసర్పములును, నా♦గములచేత, నెలుకలును బాఱఁ జేయున♦ట్లేచియనిని.

ఆ విజయకాంక్షనున్న ♦ విష్ణువుచే దితి,తనయవరులు పూన్కిఁ ♦ దఱుమఁబడిరి
కూడ ముట్టఁబడిరి♦కొందఱు, మఱికొంద,ఱందె చంపఁబడిరి; ♦ హరియు నవల.

చ. దనుజుల నిట్లు చంపి మధు♦దానవసూదనుఁ డెంతొ హృష్టుఁడై
తనదగుపాంచజన్యము ను♦దారరవంబును నొత్తెఁ [3]దోయదం

---

1 ద్విరదేన యథా వ్యాఘ్రాః - అనిమూ. 2 మార్జారేణ యథా సర్పాః-అనిమూ. 3 తోయ
దం సురాం పిప-అనిమూ.

బును సురరాజు గర్జనము ♦ భూరితరంబుగఁ జేయ నాజ్ఞయి
చ్చు నటులఁ నంత రాక్షసని♦షూదనసాయకభీతి నొందుచున్. ౨౩ 270

చ. సునిశితశంఖనాదమున ♦ సోలుచు భగ్నమనోరథంబునై
దనుజబలంబు లంకకు ని♦తాంతజవంబునఁ బోవఁజొచ్చెఁ; ని
ట్లని మొన నాత్మసైన్యముల ♦ నాహరి సాయకశక్తి నొంప న
మ్మనుజుల భీతిఁ గాంచుచు న♦మానుషపౌరుష మెల్లఁ బోవఁగన్. ౨౪ 271

క. పరుగెత్తుచుండఁ గన్గొని, శరవర్షమునన్ సుమాలి ♦ చక్రధరుని నం
గరమున నిల్పెను సేనలఁ, బరిమార్పక యుండునట్లు ♦ పౌరుష మలరన్. ౨౫

చ. అనిమొనఁ జక్రపాణి నతఁ ♦ డంబకపంక్తి హిమంబు తీవ్రభా
నునిబలెఁ గప్పె, రాక్షసులు ♦ నాత్మబలంబులఁ బెంపుమీఱి యా
దనుజవరేణ్యుఁ గాంచి పటు♦ధైర్యము నొందిరి; రోష మూని తే
జును బలముం జెలంగ దను♦జుల్ మరలన్ బ్రతుకం దలంపఁగన్. ౨౬

తే. అనుమాలియుఁ బటునాద ♦ మడర హరిని
మార్కొనియె; నిట్లు పూన్కొని ♦ మధుసూదనుని
పైకిఁ జని *లంబమానమై ♦ భవ్యమైన
భూషణము దీసి వైచి పెం♦పునఁ గరంబు. ౨౭ 274

క. చలియింపఁ జేయుచుం గరి,వలె నప్పుడు ప్రీతి నార్చెఁ ♦ బటువిద్యుత్తుల్
గలమేఘముపోలిక; నా,జలజాక్షుం డంతఁ గ్రోధ♦సాంద్రుం డగుచున్. ౨౮

చ. కనదురురత్నకుండలముఁ♦గాఁ దనరారుచుఁ దచ్ఛిరంబు, ని
స్వనమును జేయుచుండఁ దన♦సత్త్వముఁ జైపయిఁ బొంగుచుండ నా
తనిరథచోదకుండయిన ♦ దానవుశీర్షముఁ ద్రెంచె నశ్వముల్
పనివడి యీడ్చె భ్రాంతిఁ గని ♦ పాలకహీనము తోట నంతటన్. ౨౯ 276

సీ. భ్రాంతంబులౌ తద♦శ్వము లిట్లు చెలరేఁగి రథముఁ ద్రిప్పఁగ మహా♦రాక్షసుండు
స్యందనంబున నుండి♦సంచరించుచునుండె నతిశయభ్రాంతేంద్రి♦యాశ్వవితతి
చెలరేఁగ ధృతిమంత♦గలుగనిసగువలె; నాయశ్వములఁ ద్రుంచె♦హరియు; నంత
నమ్మహాబాహుని ♦ హరిని సుమాలిదౌ తద్రథంబును ద్రుంచి ♦ దారుణాంబ

ఆ. కముల నలరువానిఁ ♦ గని మాలియును సాయ
కాంచితమయి యొప్పు♦నట్టి చాప
మూని పౌరుషంబు ♦ మూర్తీభవించిన
ట్లడరె మార్కొనంగ ♦ నతులగతిని. ౩౦ 277

చ. హరి నిటు దాఁకి చాపవర ♦ మంతట సజ్యము చేసి చారుక
ర్బురపరిభూషితాంబకస♦మూహము వైచిన నద్ది క్రౌంచభూ

* ఉత్క్షిప్య లంబాభరణం ఘూర్ణన్ కర మివ ద్విపః-అనియూ.

ధరమును జొచ్చుపక్షుల వి♦ధంబున నాహరిఁ జొచ్చె; మాలి యి
క్కరణిని వైచు సాయకని♦కాయముచేఁ బరిపీడితాంగుఁడై. ౩౨ 278

క. మురవైరి చలింపక సం,గరమున నిలువంగఁబడియెఁ ♦ గడుధీరత; సు
స్థిరమతి యింద్రియగణముల, నిరతమ్ము జయించినట్టి ♦ నిర్మలు మనుజుల్.

తే. ఆధు లేమియు బాధింప♦నట్లు దనుజ
శరము లేమియుఁ జేయంగఁ ♦ జాలవయ్యె;
నంతటన్ భూతభావనుం♦డైన హరియు
జ్యాస్వనంబు నిగుడ్చె యా♦యసురపైన. ౩౩ 280

క. అరిసూదనుండు గావున, శరనికరము మాలి నొంపఁ ♦ జాలినదానిన్
బరఁగించె; నంబకము లవి, వరవజ్రతటిత్సమాన♦భాసురములుగన్. ౩౪ 281

తే. మాలి దేహంబు నొంది క♦మ్మనిరుధిరముఁ
ద్రావెఁ బాములు క్షీరంబుఁ ♦ ద్రాగునట్లు;
చక్రి యీరీతి నమ్మాలి ♦ జన్యవిముఖుఁ
జేసి దేవత లెల్లను ♦ జెలఁగుచుండ. ౩౫ 282

ఉ. కరముల శంఖచక్రములు ♦ కార్ముకవర్యగదల్ వెలుంగ నా
యురిమకుటధ్వజంబుల మ♦హాధనువున్ దురగంబులన్ లస
చ్ఛరములచేత భూమిఁ బడు♦చందముగా నని చేసె; నంతటన్
విరథుఁడు మాలి శౌర్యమునఁ ♦ బేర్చి గదాయుధహస్తుఁడై తగన్. ౩౬

చ. అరవము డిగ్గి భూధరము♦నగ్రమునుండి మృగేంద్రమట్లుగాఁ
బరుగిడి పక్షినాయకుని♦ఫాలము నాగదచేత నొంచె [1]నీ
శ్వరు యమునట్లు వజ్రమున ♦ శైలము నింద్రునిరీతి; నంతఁ గ
ర్బురవరు నాయుధాభిహతిఁ ♦ బొంకము దూలి ఖగేశ్వరుం డనిన్. ౩౭ 284

చ. అతిశయవేదనాతురత ♦ నంగము క్రుంగఁ జలించి చక్రియు
ద్ధతి యుడుగంటఁ జేసె; నిటు ♦ దానవనాథుఁడు మాలి సూరతం
బతగివరేణ్యు నొంచుటయుఁ ♦ బక్షదళాక్షుఁడు నూరకుంటయున్
దితిజులు చూచి యార్చుటయు ♦ దిక్కుల నిండెను దన్నినాదముల్. ౪౦ 285

ఉ. దానవు లెల్ల హర్షమున ♦ దారుణరావము లట్లు చేయఁగా
దానవవైరి వాసవుని♦తమ్ముఁడు చక్కఁగ నాలకించి పెం
పూని పరాఙ్ముఖుండగుచు ♦ నొప్పు తొలంగిన పక్షినాయకుం
దా నపు డాదరించి కను♦దమ్ముల క్రోధశిఖల్ వెలుంగఁగన్. ౪౧ 286

చ. గరుడునిసాధ్వసం బుడిపి ♦ క్రమ్మఱ నాతఁడు చక్కనుండఁగా
గురుతరశక్తిఁ జేసి [2]యనిఁ ♦ గొంకియు మాలిని జంపు నిచ్ఛచేఁ

1 స తయా గరుడేశాన మీశాన మివ చాంతకః-అనిమూ. 2 పరాఙ్ముఖో ప్యుత్సస్జ మాలే
శ్చక్రం జిఘాంసయా-అనిమూ.

బరఁగఁగఁ జేసెఁ జక్రమును; ♦ భార్గవసత్తమ! రామచంద్ర! యా
నిరుపమచక్ర మత్తఱిని ♦ నిర్భరభాస్కరమండలాభమై. ౮౩ 287

ఉ. కాంతుల నాకసంబు వెలుఁ♦గంగను జేయుచు భీషణాంగమై
యంతటఁ గాలచక్ర మిదె ♦ యంచుఁ దనుం గనుఁగొంచు రాక్షసుల్
చింతిల మాలిమస్తకముఁ ♦ జేర్చె క్షితిస్థలి నొక్కవ్రేటునన్;
వింతగఁ జక్రకృత్తమయి ♦ భీషణమై దనుజేశుశీర్షమున్. ౮౪ 288

ఉ. నెత్తురువాహినుల్ వెడల ♦ నింగి సురల్ తమిఁ బొందఁ బూర్వమ
త్యుత్తమమౌ సుధారసము ♦ నొక్కటఁ ద్రాగెడు రాహుమస్తకం
బెత్తిన వేడ్కఁ ద్రుంప నది ♦ యెట్లు క్షితిం బడె నట్టిభంగిఁగా
నత్తఱి ధూళిఁ బ్రుంగె; నవు ♦ డయ్యమరేజ్యులు సంప్రహృష్టులై. ౮౫ 289

తే. కలిగియున్నబలంబుల♦కొలఁది సాధు
సాధు వంచను శబ్దముల్ ♦ సకలదిశలఁ
బర్వఁ జేయుచు నార్చిరి; ♦ పటుసుదర్శ
నమున మాలి యడంగుట ♦ సమరసీమ. ౮౬ 290

క. కని మాల్యవత్సుమాలులు, దనుజానీకములతోడఁ ♦ దద్దయు శోకం
బున లంక కేగఁ జొచ్చిరి;, వినతాతనయుండు కరుణ ♦ విష్ణువు చేతన్. ౮౭

తే. తాఁకిడింపంగఁబడి పూర్వ ♦ మొప్పునట్లు
తనరి తనగురుపక్షవా♦తమున దనుజ
వితతిఁ బాఱఁగఁ దోలె వి♦వృద్ధకోప
చిత్తుఁడయి; యంత దనుజులఁ ♦ జెలఁగి హరియు. ౮౮ 292

సీ. మాఱొక్కని యుద్వృత్తి♦నుహితచక్రంబున నాననంబులఁ ద్రెంచి♦యూర్భటించి
గదచేత వక్షముల్ ♦ గడఁగి పిండిగఁ జేసి యస్త్రలాంగలములు♦నాయుధమునఁ
గంఠముల్ ఛేదించి ♦ త్స్వాతలంబున నించి ముసలంబునన్ శీర్ష♦ములఁ బగుల్చి
ఖడ్గంబునుం బూని ♦ గాత్రంబులం జెండి బాణజాలంబులఁ ♦ బడలు పఱచి

తే. యందఱికి నన్నిరూపులై ♦ యాహవంబు
చేయరాక్షసబలములు ♦ చేయునట్టి
దేమియును లేక రాక్షసు ♦ లెల్ల నింగి
నుండి పడి రబ్ధిజలముల ♦ నొక్కమాఱు. ౮౯ 293

చ. హరియు ధనుర్విముక్తచటు♦లాంబకవజ్రతతిన్ మహాసురో
త్కరముఁ గలంచె దానవులు ♦ గాసిలి ధూతవిముక్తకేశులై
దురమునఁ జంచలాలతలు ♦ తోరముగాఁ గనుపట్టు మేఘముల్
నిరుపమవజ్రసంహతిని ♦ నిల్వక యిట్టటు పాఱుకైవడిన్. ౯౦ 294

క. చని; రిట్లు బాణతతు లొ,య్యన వేషంబులను బాప ♦ నాత్మాస్త్రము లె

ల్లను నేలఁ గూల ఛత్త్రము, లనూనగతి భిన్నములయి ♦ యవనిం బడఁగన్.

తే. ప్రేగు లెల్లను వెలికి రా ♦ భీతి లోల
నేత్రములు గానఁబడుచుండ ♦ నిఖిలదనుజ
బలము లున్మత్తనిభములై ♦ పాఱఁదొడఁగె;
నంతసింహార్దితద్విప♦సంతతివలె. ౫౧ 296

చ. శరులును రాక్షసుల్ కలఁగి ♦ గాఢగతిం బరువెత్త నార్వఁగా
హరియును వెంటఁ దాఁకుచుఁ ద♦నంతన పిల్చుచు బాణజాలముల్
త్వరపడి వైవ నవ్వితము ♦ బాధల నొందఁగఁ జేయ నాత్మభీ
కరశరజాలముల్ వదల ♦ ఖస్థలి నయ్యవి నిండి యుండఁగన్. ౫౨ 297

క. దనుజాళికాలమేఘము, లనిలాహతకాలఘనము♦లట్లుగఁ జలియిం
చెను; జక్రప్రహారణములఁ, దనువులు తెగ శీర్షములును ♦ ధరణిని రాలన్.

క. పెనుగదవ్రేటుల మర్మము, లనూనరక్తముస బ్రుంగ ♦ నసివ్రేటులచే
తను రెండుగఁ జీల్పంబడి, తనువులు కన్పడఁగఁ బర్వ♦తంబులపోల్కిన్. ౫౩-౪

క. వరమణికుండలహారము, లురుతరగతి వ్రేలుచుండ ♦ నొక్కమొగిన్ నీ
లరుచుల్ గలమేఘము లనఁ, బరఁగు మహాసురులు నేల♦పైఁ బైపైనన్.

ఆ. పడుచునుండ నీల♦పర్వతంబులు నేలఁ, బడెడుచందమయ్యెఁ ♦ బార్థివేంద్ర!
రామచంద్ర! యిట్లు ♦ లామధుసూదనుఁ, డరుల నెల్లఁ గలఁచె ♦ నాహవమున.

ఏడవ సర్గము సంపూర్ణము.

---

౮ - వ సర్గము.

మాల్యవంతుఁడు మొదలగు రాక్షసులు పరాజయ మొందుట.

చ. వెనుకొని పద్మనాభుఁ డిటు ♦ వీరవరౌఘముఁ ద్రుంప నెల్లచోఁ
గనుఁగొని మాల్యవంతుఁడు వ♦గన్ హతశిష్టులఁ గూడి సంగరం
బును విడనాడి యింటికిని ♦ బోవఁ దలంచెను వేల దాఁటి యం
బునిధియుఁ బోవుచందమునఁ ♦ బొంగెడు మాధవు నంతఁ జూచుచున్. ౧

మ. అరుణాక్షుండయి కోప మూని మకుటం ♦ బల్లల్లనం ద్రిప్పుచున్
బురుషశ్రేష్ఠుని బద్మనాభుని రణం♦బున్ జేయుచున్నట్టి భీ
కరరూపుం గని యిట్లు పల్కెఁ; దగునే ♦ *కంజాక్ష! నారాయణా!
నిరతంబై తగు క్షత్త్రధర్మ మనుచున్ ♦ నీ వేల యూహింపవో?. ౨-౪ 308

చ. తెలియవు యుద్ధధర్మముల♦తీరు రణంబును మాని పోవుదు
ర్బలులను మమ్ముఁ బ్రాకృతుని♦భంగి వధించెదు వెంటనంటి; యే

---

* నారాయణ న జానీషే క్షత్త్రధర్మం సనాతనమ్-అనిమూ.

ఖులుఁడు పరాఙ్ముఖుండయి వ♦గం బరుగెత్తెడు వైరిఁ జంపునో
తలఁప నతండె హంత యన ♦ ధాత్రిని బిల్వఁబడుఁ జనార్దనా!. ౩౪ 304

చ. అతఁడు సమస్తపుణ్యముల ♦ నారసి చేసెడువార లొందు స
ద్గతియన నొప్పు స్వర్గమును ♦ గాంచఁగ లేఁడు; దరంబు చక్రమున్
వితతగదన్ గరంబులను ♦ వేడుకఁ దాల్చిన నీకు సంగరే
చ్ఛ తనరినన్ ద్వదీయమగు ♦ శౌర్యము దోర్బలమున్ సమస్తమున్. ౪౪ 305

చ కలిగినయంతవట్టిదిగొ ♦ కాలు గదల్పక నిల్చువాఁడ ని
మ్ముల ననిఁ జూపవయ్య! యని ♦ ముందుగ నిల్చిన మాల్యవంతు ని
శ్చలగురుమాల్యవచ్ఛిఖరి♦చాడ్పునఁ గాంచి వచించె నిట్టు; లా
బలరిపుసోదరుండయిన ♦ పంకజనాభుఁడు విక్రమంబునన్. ౬ 306

చ. సురలను మీరు మార్కొనుచు ♦ స్రుక్కఁగఁ జేయఁగ భీతి నొంది యె
క్కరణిని దిక్కులేక ననుఁ ♦ గావు మటంచును వేఁడ వారి కా
దరమునఁ గొంకకే నభయ♦దాన మొసంగితి రాక్షసాళి సం
గరమునఁ జంపువాఁడ నని ♦ కర్బురవర్య! వరం బొసంగితిన్. ౭ 307

ఉ. దానినె కాచువాఁడఁ; బ్రసు♦దం బిదుకార్యము దేవతాళి కె
ద్దో నిజ మద్ది నాకును మ♦హోత్తమమై యసురాజికంటె నిం
పై నెగడున్ ద్వగం జనుచు ♦ నల్ల రసాతలసీమ నిల్చినన్
దానవులైన మిమ్ము రణ♦దర్పము పొంగ వధించి తీరెదన్. ౮ 308

[1]చ. అని యిటు లాపరాఙ్ముఖుల ♦ నంపఁ జంపినపాపముల్ ప్రతి
జ్ఞను నెఱపం దలంచుటను ♦ సద్గతిభంగకరంబు లెట్టునొ
ననియెడు భావ ముట్టిపడు♦నట్టులుగా వచియించు పద్మనా
భుని సురపాలకుం గ్రుధను ♦ బొల్చెడు రక్తసరోజనేత్రునిన్. ౮౪ 309

క. కని మాల్యవంతుఁ డాతని, ఘనబాహాంతరము నొంచె ♦ గాఢతరంబై
తనరారుశక్తిచే; నా,దనుజేంద్రుం డిట్లు బాహు♦దర్పం బలరన్. ౯ 310

క. పరఁగించిన యాశక్తియు, నిరుపమఘంటాస్వనంబు ♦ నిర్భరమై యొ
ప్పు రమేశువక్షమున జల,ధరమున మెఱపట్లు పొల్చెఁ ♦ దదవసరమునన్. ౧౦

[2]క. హరి శక్తిధరప్రియుఁ డం,బురుహేక్షణుఁ డనురుశక్తి ♦ భూరితరంబున్

---

1 అథ పరాఙ్ముఖవధదోష స్స్వప్రతిజ్ఞాపాలనప్రవృత్తస్య నాస్తీత్యాహ-అనునవతారికయర్థ మిందుఁ జేర్పఁబడిన దని గ్రహింపఁదగు. 2 తత స్తామేవ చోత్క్రుష్య శక్తిం శక్తిధరప్రియః- అనియూ. శక్తిధర శ్శివః స ప్రియో యస్య-అని తీర్థులు. శక్తిధరప్రియః - సుబ్రహ్మణ్యప్రియః మాహేశ్వరార్చనం చిత్యం-అని గోవిందరాజులు భేదాభిప్రాయముల నొందిరి. రాముఁడు కుమారస్వామిచెలికాఁ డనుట సమంజసము గాదు. బహుపురాణసమ్మతమగు ఈశ్వరప్రియత్వమే సరిగా నున్నట్లు తోఁచెడు.

గర మాత్మశక్తి దానిన, నురుతరగతిఁ బైకి లాగి ♦ యుగ్రాసురుపై. ౧౦౪
ఆ. విసరివైచె; స్కంద♦విత్సృష్టశక్తి నా, నదియు హరికరచ్యు♦తాంగి యగుచు
దనుజునల్ల నట్టె ♦ త్రాకఁగాఁ గోరుచు, నతులగతుల నిగిడె ♦ నంబరమున.
ఆ. అంజనాఖ్యమైన ♦ యచలంబు మాహేంద్రి, కోరినట్లు నిగిడి ♦ హారరత్న
భానమానమైన♦పటుదనుజేంద్రవక్షమున నశని గిరిశి♦ఖరమున వలె. ౧౨౪
క. అతిజవమున వ్రాలెను; నా,దితిజుఁడు తచ్ఛక్తిభిన్న♦దివ్యకవచుఁడై
క్షితిఁబడియెమూర్ఛ గ్రమ్మఁగ, మతివిభవముతోఁ బనవుడె♦మరలస్మృతిఁగనెన్.
చ. దనుజవరేణ్యుఁ డంతఁ గడు♦ధైర్యము మీఱ మహాచలంబు నాఁ
గనఁబడి కంటకప్రతతిఁ ♦ గ్రాలుచు నాయసమై వినీలమా
ఘనతరశూల ముద్ధతిని ♦ గైకొని మాధవువక్షమందు వై
చెను; సమరప్రియుం డగుచుఁ ♦ జెచ్చెఱ నింద్రసహోదరుం గ్రుధన్. ౧౪౪
తే. పిడికిటన్ నొవ్వఁజేసి యా♦వెడఁగుదనుజుఁ
డొక్కధనువంతదవ్వు తా ♦ నొదిగె వెనుక;
కంత నంబరముననుండి ♦ యద్భుతముగ
మేలు మే లను శబ్దంబు ♦ మించె మిగులఁ. ౧౬౪ 317
చ. హరి నిటు నొంచి యంత విన♦తాత్మజు నొవ్వఁగఁ జేసెఁ; దార్క్ష్యుఁ డ
క్కరణిని నొంచుదానవునిఁ ♦ గన్గొని క్రోధము నొంది పక్షవా
తరయమునం బ్రభంజనుఁడు ♦ తద్దయు నెండినపత్రరాజి ని
ర్భరముగఁ దూలఁ జేయుగతిఁ ♦ బాఱఁగఁ జేసె; సుమాలి యంతటన్. ౧౮
ఆ. వైనతేయపక్ష♦వాతవిద్రావితు, నన్న మాల్యవంతు ♦ నచటఁ గాంచి
స్వబలములను గూడి ♦ చనియె లంకాపురి, కభిముఖుండు నగుచు♦నవమతిఁగని.
చ. గరుడునిపక్షవాతమున ♦ గర్వము నీడి తొలంగితిం గటా
దుర యిఁకఁ జాలు నంచుఁ దన♦తో వెనుకంజల వేయు రాక్షసో
త్కరములతోడ లంకకును ♦ గ్రమ్మఱి సిగ్గునఁ బోయె; నోమహీ
వర! రఘునందనా! దనుజ♦వర్యులు శ్రీహరిచేత నివ్విధిన్. ౨౦ 320
సీ. పెక్కుసారులు హత♦వీరులై చేష్పడి సంగరంబున నప♦జయము గల్గఁ
జేయఁగాఁబడి; రిట్లు ♦ శ్రీహరితోఁ బోరఁజాలక వారెల్ల ♦ సాధ్వసార్ది
తులునయి లంకలో ♦ నిలువంగ నొల్లక భార్యలతోఁ గూడ ♦ పటురయమునఁ
బాతాళమునయందు ♦ వసియింపఁ బోయిరి; ప్రఖ్యాతవీరులై ♦ పరఁగునట్టి
తే. వార లెల్ల సుమాలిని ♦ ప్రభువుగాఁగఁ
గొలిచి సాలకటంకటా♦ఖ్యలలితతర
వంశమును బొంగఁజేయుచు ♦ వఱలుచుండి;
రాహవంబున నీచేత ♦ నసురవరులు. ౨౩ 321

క. హాతులై రో యొవ రెవ్వరు, క్షితిపై౯ బౌలస్త్యు లనఁగ ♦ స్థిరకీర్తిని ను
న్నతముగఁ బొందిన యాయా, దితిజేంద్రులు వారెవారె ♦ స్థిరవిభవాఢ్యా!.
ఆ. మాలిమాల్యవత్సు♦మాలులు పౌలస్త్య,కులజులకును దలఁపఁ♦గూటపురుషు
లగుచుఁ బ్రబలులగుచు ♦ నారావణునికంటె, సకలవిధములం బ్ర♦శస్తతరులు.
చ. *దనుజుల వారలం ద్రిదశ♦దస్యులఁ జంపఁగ శంఖచక్రముల్
ఘనగదయుం గరంబులఁ ద♦గ౯ వెలుఁగొందు మురారి తప్ప నిం
క నెవఁడు చాలు?; నీవనఁగఁ ♦ గంజదళాక్షుఁడు దేవనాయకుం
డనఁదగు నాననాతనుఁడ ♦ వౌదువు రాఘవ! మాట లేటికి౯. ౨౬ 324
క. మాయాగృహీత దేహుఁడ, వీయసురులఁ జంపఁబూని ♦ యిట్లు ప్రభుఁడవై
యేయెడల నజేయుఁడవై, పాయక గతధర్మములను ♦ బాదుకొలుపఁగ౯. ౨౬౻
క. అనుకూలమైన కాలం,బున నాలస్యంబు చేయఁ ♦ బూనక జన్మం
బును గనుచు ధర్మరక్షణ,మును జేయుచు శాత్రవవధ♦మునఁ దగు పూన్కి౯.
క. ఒనరించుచు శరణాగత,జనవత్సలుఁడవుగ నొప్పి ♦ శుభుఁ బొల్తువు రా
మ! నినుం బొగడం దరమే;, దనుజులయుత్పత్తి దీనిఁ ♦ దథ్యముగాఁగ౯. ౨౭౻
తే. ఆనుపూర్విగఁ దెల్పితి ♦ నవనినాథ
సత్తమా! రావణాసురు♦జన్మము నిఁక
వానితనయులయుత్పత్తి ♦ వానిమహిమ
మెల్లఁ దెలిపెద వినవయ్య! ♦ యినకులేశ!. ౨౮ 328
క. చిరకాలంబు సుమాలియుఁ, జరియించె రసాతలమునఁ ♦ జక్రిభయమునం
గరమార్తినొందుచు౯ గ,ర్వ్వరులెల్లనుదన్నుఁ గొలువఁ♦బొగులుచు నెదలో౯.
క. తనయులు వారలతనయులు, తనతో నుండంగఁ జక్రి ♦ తాతిమినకతన౯
మనుజేంద్ర! యపుడు లంకను, ధనపతి సేవించి యుండెఁ ♦ దగినవిధమున౯.

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౯ - వ సర్గము.

సుమాలి తనపుత్రికయగు కైకసిని విశ్రవసునియొద్దకుం బంపుట.

చ. జరగెను గొంతకాల మిటు ♦ చక్రిభయంబును సుంత వాసిక
ర్బురపతియైన సుమాలియును ♦ బొంగెడువేడ్క రసాతలంబు వా
సి రమణ మర్త్యలోకమును ♦ జేరి చరించె సమస్తదిక్కుల౯;
నిరుపమనీలవారిదవి♦నిర్మలదేహము చెన్నుమీఱఁగ౯. ౧ 331
తే. తప్తకాంచనకుండల♦దీప్తు లొలయ
బద్మమును బాసి యొప్పు శ్రీ♦వలెఁ జెలంగు

---

* భవాన్నారాయణో దేవ శ్చతుర్బాహుః సనాతనః-అనియు.

పుత్రికను గైకసిని గూడి ♦ భూమి నెల్లఁ
దిరుగుచు నొకానొకప్పుడు ♦ ధరణి నొకట ౨॥ 332

చ. తనజనకుం బులస్త్యసుత♦తల్లజు విశ్రవసుఁ బ్రహీనుఁ బ్ర
గనుఁగొను కాంతిమీఱఁగ ని♦శాంబవిభూతిఁ జెలంగుపుష్పకం
బును దమి నెక్కిపోవు సుర♦పుంగవు నంతటివాని యక్షపుఁ
ధనదుని దాఁ గనుంగొనియె ♦ దారుణపావకసూర్యతేజునిఁ. ౩॥ 333

తే. స్వేచ్ఛఁ జనువానిఁ గనుఁగొని ♦ యెంతొ విస్మ
యమునఁ బాతాళమున కేగి ♦ యసురహితముఁ
గోరి మతిమంతుఁ డౌటచే ♦ సారతరఫ
లంబు గలుగంగఁ జింతించె ♦ లలితరీతి. ౪ 334

క. దనుజులు విపులశ్రేయముఁ, గనఁజాలు నుపాయ మెద్ది? ♦ కార్యం బెది చే
సిన వృద్ధినొందువారమొ, యని మదిఁ దలపోసి యాతఁ ♦ డాత్మతనూజన్. ౫॥

తే. [1]కైకసిని బిల్చి యిట్లని♦కర్బురపతి,యా సుమాలి వచించె; నో♦యాత్మజాత!
తగినవరునకు నిన్నియ్యఁ ♦ దగినసమయ, మిద్ది యలరారెయావన♦మిపుడునీకు.

సీ. పాణిసంగ్రహణంబు ♦ ప్రార్థించినం దిరస్కార మొనర్తువో ♦ వారికోర్కి
నీ వని భీతిల్లి ♦ నిన్నెవ్వ రడుగరు; మే మెల్ల నీచేయు♦మేలున నిలఁ
బ్రఖ్యాతి నొందఁగా ♦ వాంఛించువారము ధర్మబుద్ధులమాటఁ♦దనయ! నీవు
భార్గవివలె సర్వ♦పావనగుణయుక్త వింక నొక్కటి గల ♦ దేమి యనినఁ

తే. [2]కన్యకుం దండ్రియౌట ని♦క్కముగ దుఃఖ
కరము; మర్యాదఁ గాంక్షించు ♦ పురుషులకును
నందఱకు నెవరుండు క♦న్యనువరించు
ననుట తెలియంగఁ బడమి నో♦యనుఁగుఁదనయ!. ౮ 337

క. జననీవంశముఁ దన ప్రియ,జనకునివంశంబుఁ దాను ♦ జక్కనివరునిం
గొని కాపురమ్ము చేసెడు, ఘనవంశముఁ గోరుచుండుఁ ♦ గన్య సుపుత్రిన్.

తే. ఎట్లు చారిత్రభంగ మీ♦యింతి కిలను
గలుగకుండునొ యనుచు నీ♦కులము లోగిని
సంశయము నొందుచుండు; నో♦సాధుశీల!
యట్టి నీ విప్పు మునివర్యుఁ♦డై యొసంగి. ౧౦ 339

చ. అనుపముఁడై ప్రజాపతికు♦లాభరణంబుగఁ బుట్టి విశ్రవో
వినుతమహాహ్వయుంబుఁ గని ♦ వృత్తిని ఖ్యాతిని గన్న మేటినిఁ
గనఁ జను మీవె యన్నుహితుఁ ♦ గాంతులు పొంగ వరింపు మోసుతా!
ధనపతి యెట్టివాఁడొ యటు ♦ తా రలరారును సూర్యతేజులై. ౧౧॥ 340

---

1 పుత్రి! ప్రదానకాలోఽయం యౌవనం తే ఽతివర్తతే-అనిమూ. 2 కన్యాపితృత్వం దుఃఖం హి సర్వేషాం మానకాంక్షిణామ్-అనిమూ.

తే. చెలఁగుతనయులు నీకును ♦ గలుగువారు
సంశయం బింతయును లేదు ♦ సాధుశీల!;
యనిన నాకన్య తండ్రివా♦క్యమున నూను
గౌరవంబునఁ గైకొని ♦ కదలి యపుడె. ౧౨½ 341

క. మునినియతిని విశ్రవసుం, డనూనతపమాచరించు ♦ నావనమునకుం
జనియెను; దదవసరంబున, మనుజేంద్రా! యప్పులస్త్య♦మౌనితనయుఁడున్. ౧౩

తే. అగ్నిఁ బ్రణయించి హోమకా♦ర్యంబు జరపు
చుండె నాయింతి తనతండ్రి ♦ చండవిక్ర
మాదులన్ ఖ్యాతుఁడౌనుగా ♦ యతనితనయ
నౌట నే గౌరవార్హనై ♦ యగుదు ననుచు. ౧౪ 343

క. జనకునియందలి గౌరవ,మును నమ్మి చతుర్థశుచిని♦బోలి వెలుఁగునా
ముని *దారుణమగు నత్తఱిఁ, గనఁబోయి తదీయపదయు♦గనికటమందున్.

ఆ. ఆననమును వంచి ♦ యునని నంగుష్ఠాగ్ర,మునను మరల మరల ♦ నొనర రాచు
చుండెఁ; బూర్ణచంద్రు♦నొప్పునఁ దగుమోము, గల్గి సుకటియైన♦కాంతఁ జూచి.

క. పరమోదారుండై ముని,వరుఁ డిట్లను నీవియదీప్తి♦భాసురుఁ డగుచున్
సరసిజలోచన! యెవ్వని,వరపుత్రివి నీవు కార్య♦భారము దేనిన్. ౧౬ 346

చ. మనమునఁ బూని నన్ను బహు♦మానము మీఱఁగఁ గాంచవచ్చితో;
పని యిది హేతు విద్ది యని ♦ పల్కు యథార్థము భద్రమౌను నీ
కని వచియించు మౌనికిఁ గృ♦తాంజలియై యిటు పల్కె; నోమునీ
శనికరపూజితా! తెలుపఁ♦జాల మదాగమనప్రవృత్తులన్. ౧౭ 347

క. అనుపమమగు మీమహిమం,బున నే నాయభిమతంబుఁ♦బోలు నెఱుఁగఁ జా
లినవారు మీరు యొక్కట, వినిపించెద బ్రహ్మమౌని! ♦ విశ్వసుతయశా!. ౧౭½

చ. జనకునిశాసనంబున నె ♦ చయ్యన వచ్చితి మిమ్ముఁ జూడ, నన్
జనములు కైకసీ యనుచుఁ ♦ జక్కఁగఁ బిల్తురు, నేను జెప్పనొ
ప్పినవిషయంబు లివ్వె యిఁకఁ ♦ బ్రీతిని దక్కిననాయుదంతమున్
మునివర! నీవె యారయఁగఁ ♦ బోలు మహాత్ముఁడ వౌట నం చనన్. ౧౯½

మ. తరుణీవాక్యము నాలకించి మదిలో ♦ ధ్యానించి తద్వార్త నా
దరణం బొప్ప నెఱింగి యిట్లనియె నో♦తన్వీ మదాత్తేభసుం
దరగంభీరగతీ! యెఱుంగఁబడియెం ♦ ద్వచ్చిత్తవీథిలస
త్పరమాహ్లాదకరప్రవృత్తి యిదె చె♦ప్పం బూనితిం బ్రీతిచేన్. ౨౦½ 350

క. నావలనం బుత్రులఁ గనఁ,గా వలచినదాన వీవు ♦ కాని మ్మటులే
భావజకేళిని దేలం,గా వచ్చు నటంచుఁ బెండ్లి♦కార్యము జరపెన్. ౨౧ 351

* సా ఋ తాం దారుణాం వేళా మచింత్య పితృగౌరవాత్ - అని మూ.

తే. పరిణయంబాడి శాస్త్రోక్త♦పద్ధతి నిటు
లామెతోఁ గ్రీడనల్పుచు ♦ నమలధర్మ
మతియయిన విశ్రవసుఁ డిట్లు ♦ మరలఁ బలికె
భార్యఁ గైకసినిం గాంచి ♦ ప్రమద మలర;. ౨౨ 352

ఉ. దారుణమైన కాలమునఁ ♦ దన్వి! ననుం గనవచ్చి తీవు త
త్కారణ మారయం గలుగఁ♦గాఁ దగినట్టి ఫలంబుఁ దెల్పెదన్
సారసనేత్ర! పుత్రులను ♦ జాలఁగ దారుణకృత్యులన్ మహా
దారుణరూపులన్ సతత♦దారుణచిత్తజనప్రియాత్ములన్. ౨౩॥ 353

ఆ. క్రూరకర్ములైన ♦ ఘోరరాక్షసులను, గనుదు వీవు చారు♦కటివిలాసి
నీ! యనంగ నామె ♦ యాయుత్తమస్వాంతు, భర్తఁ గాంచి మ్రొక్కి ♦పలికెనిట్లు.

సీ. బ్రహ్మవాదివి నీవు ♦ భగవంతుఁడవు గాన నిట్టి నీవలననే ♦ యిట్టి క్రూర
కర్ములౌ తనయులఁ ♦ గన నొల్ల నాపయి దయఁ జూపఁ దగునని ♦ దార యిట్లు
ప్రార్థింప నమ్ముని♦పతియును మరల నిట్లనియెను రోహిణి ♦ నాత్మదారఁ
గని పూర్ణశశి పల్కు♦కరణి; నో శుభవక్త్రజలరుహా! కడపటఁ ♦ గలుగఁబోవు

తే. తనయుఁ డస్మత్కులాచార♦మునకుఁ దగిన
వాఁడు ధర్మాత్ముఁడునునయి ♦ వర్ధిలంగఁ
గలఁడు; నా విని యాముని♦కాంత సుంత
యూఱడిలి యుండెఁ; గాల మ♦ట్లొక్కరీతి. ౨౫॥ 355

క. ఒకకొంత గడచె నంతట, సకలజగత్క్షోభకరు ద♦శగ్రీవుని భీ
తికరాకారుని రక్కసు, వికటమహాదంష్ట్రుఁ దనయు ♦ వింశతిభుజునిన్. ౨౬

క. అరుణోష్ఠు దీప్తమూర్ధజు, నురుతరముఖు నంజనాద్రి♦యొప్పున నలుపై
పరఁగుకళేబరమునఁ దగు, గురుమూర్తిని గాంచె నట్టి ♦ కొడుకు జనింపన్.

తే. పలలభక్షకములుగాఁగఁ♦బరఁగు నక్క, లగ్నిమంటలుకబళంబు♦లట్టులుమిసెఁ
దిరిగె నపసవ్యగతులను♦దీనవక్త్రములను వలయంబులుగ భయా♦ముగలుగంగ.

*చ. ఘనములు రక్తముం గురిసి ♦ గాఢరవంబు భయంకరంబుగా
వినఁబడఁగా ఖరధ్వనులఁ ♦ బెల్లుగఁ జేసెను; వ్యోమమందు న
వ్వనరుహబాంధవుండు రుచి♦భాసురుఁడై యలరారకుండె, మే
దిని బడియెన్ మహోల్క లొగి ♦ దిర్థిర భూమి చలించె నంతయున్. ౨౯॥

చ. అతిభయదంబుగా విసరె ♦ నత్తఱి వాతము, లెట్టివారియు
ద్ధతికిని క్షోభముం గనక ♦ తాను జెలంగు సముద్రుఁ డార్తుఁడై
మతివిభవంబు దూలఁ బలు♦మాఱును క్షోభము నొందె; నంత నా
సుతునకు బ్రహ్మతుల్యుఁడయి ♦ శోభిలు విశ్రవసుండు నెమ్మదిన్. ౩౦ 360

* ఘోరాశ్చ ఖరనిస్వనాః-అనిమూ.

తే. పదిశిరంబులతోడ నుద్భవము నొందెఁ,గాన నీతఁడు భూస్థలిఁ ♦ గాంచుఁ గాక
తా దశగ్రీవుఁ డనుపేరుఁ ♦ దగినరీతి;,ననియె నవ్వేళఁ గైకసి ♦ యాత్మజాతు.
క. ఘనబలునిఁ గుంభకర్ణునిఁ, గనియెను నవ్వానిమేను ♦ గాంచు ప్రమాణం
బును మించినతనుమానము,గనువాఁడు జగంబులందుఁ ♦ గలుఁగఁడురామా!.
తే. వారితర్వాతఁ గైకసి ♦ పేర శూర్ప
ణఖయనం జను వికృతాన♦నం గుమారి
కను గనియె; నంతఁ గైకసి♦గర్భమందుఁ
గడపటితనూజుఁ డొక్కఁడు ♦ గలిగె రామ!. ౩౫ 363
క. తనయుం డాతఁడు ధర్మఁపుబున నొప్పెడు స్వాంత మలరఁ ♦ బొలిచి మహాకీ
ర్తిని మించె విభీషణుఁ డనఁ,గ నాతఁ డుదయింప దేవ♦గణములు ప్రీతిన్.
క. కురియించిరి సుమవృష్టిని;, సురదుందుభు లట్టె మ్రోసె ♦ సురపథమున ని
ర్జరులకుఁ బ్రాణప్రదమై, పరమంబగు సాధుసాధు ♦ పదయుతమగుచున్. ౩౬
ఆ. వాక్య మొండు దివిని ♦ బరఁగె వినంబడు,నట్టు లాకుమారు ♦ లమ్మహాట
విని మహాజనులను ♦ వృద్ధిని బొందిరి, దశవదనుఁడు వెలసి ♦ తనయులందు.
క. క్రూరుఁడు జగదార్తికర,ప్రారంభుఁడు నగుచు బాహు♦బలమున నొప్పెన్
సారబలుండు ప్రమత్తుం,డై రాజద్ధర్మకృత్యు♦లైన మునివరుల్. ౩౭ 367
తే. త్రాస మొందఁగఁ జేయుచు ♦ నానఁ ద్రిజగ
ములను భీతిలఁ జేయుచుఁ ♦ జెలఁగి నిత్య
తుష్టుఁడై స్వేచ్ఛఁ జరియించె ♦ దుష్టుఁ డగుచు;
నతనియనుజన్ముఁడై ధర్మ♦మతియు నగుచు. ౩౮ 368
క. అనయము ధర్మమునందే, తనవృత్తి వెలుంగఁగా స♦తం బధ్యయనం
బును నియతాహారమ్మును, దనకుండ విభీషణుండు ♦ తా నలరారెన్. ౩౯
చ. చనియెను గొంతకాల మిటు ♦ సాధుచరిత్రుఁడు విత్తనాయకుం
డనుపమకీర్తిశాలియగు♦నట్టి కుబేరుఁడు పుష్పకంబుపై
జనకుని జూడవచ్చె; రుచి♦సాంద్రుఁడు విత్తవుఁ డిట్లు రాఁగ నా
తనిఁ గని రాక్షసోచితని♦తాంతకుబుద్ధిని బొంది యంతటన్. ౪౧ 370
క. తనపుత్రు దశగ్రీవునిఁ, గని కైకసి యిట్టు లనియెఁ; ♦ గదుఁ దేజమునన్
గనఁబడు వైశ్రవణుని నన్నను జూడుము భ్రాతృతన్ మ♦నంబునఁ గనినన్.
తే. సమముగా నుండుఁ గద మీకు, ♦ సతతతేజు
నతని నిట్లున్న నిన్ను ని♦య్యదనునఁ గనుఁ
గొనుము తెలియును భేదంబు; ♦ తనయ! యమిత
విక్రమా! యెట్టి యత్నమ్ము ♦ విస్తృతముగ. ౪౩ 372
క. ఒనరించిన ధనపతివలెఁ, గనఁబడుదువో యత్న మట్లు♦గాఁ జేయుము వే;

యను తల్లిమాటఁ జక్కఁగ, విని శూరుండైన యతఁడు ♦ వేడుకమీఱన్. ౭౭

క. కనియెను నతులానుష్ఠం,బును నంతఁ బ్రతిజ్ఞ చేసెఁ ♦ బూని ధనపున
ట్లనుపమతేజముఁ గాంచం,గ నిట్లు వచియించెఁ దల్లిఁ ♦ గైకసిఁ గనుచున్.

తే. అంబ! సత్యము వచియింతు♦నన్నతోడ,సముఁడనో యధికుండనో♦నరగనగుదు
నతులతేజంబునం గాన♦నాత్మఁ గల్గు,తాపమునుమానవమ్మ! యి♦త్తరుణమందు.

చ. అని యిటు లూఱడించి మది ♦ నందినకోపముచేత నప్పుడే
యనుజులఁ గూడి దుష్కర మి♦దా ననఁ జాలు తపంబు చేయ నె
మ్మనమున నిశ్చయించుకొని ♦ మామకవాంఛను నత్తపంబుచే
తను యిట నొందువాఁడ నని ♦ తద్దయు యత్నము చేసి యంతటన్. ౭౯

క. తనకోరిక ఫలియింపం,గను జేయు తపంబుఁ జేయఁ♦గా గోకర్ణం
బను నాశ్రమమున కేగెను;, దనుజేంద్రుం డంత నచటఁ ♦ దమ్ములతోడన్.

ఆ. ఉగ్రవిక్రముఁడయి ♦ యుచితతపం బొనరించి, దానిచేత నప్పి♦తామహుండు
మోద మందఁ జేసె ♦ నాదయానిధి జయా,వహావరముల నిచ్చి♦వఱలఁ జేసె.

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౧౦-వ సర్గము.

బ్రహ్మ రావణకుంభకర్ణవిభీషణులకు వరముల నిచ్చుట

చ. అన విని రామచంద్రుఁడు మ♦హామునితో నను నన్నదమ్ము లా
వనమున నుండిరో యెటులు ♦ భద్రదమా తపమాచరించిరో
వినవలతున్ మునీంద్ర! యన ♦ వేడుక మీఱ నగస్త్యమౌని యి
ట్లనియెను బ్రీతమానసుని ♦ నారఘురామునిఁ గాంచి యోవిభూ!. ౧౫ 379

చ. గుణబలులై మహావ్రతముఁ ♦ గోరి యొనర్పఁగఁ బూని యానహో
దరులు మహోగ్రధర్మములఁ ♦ దా రొనరించెదు వేడ్కఁ జొచ్చి రా
ధరణిని; గుంభకర్ణుఁ డట ♦ ధర్మపథస్థితుఁడై మహామతిన్
నిరతము నిల్పి గ్రీష్మమున ♦ నిశ్చలభక్తిఁ దపంబు చేయుచున్. ౨౫ 380

క. పంచాగ్నిమధ్యమంబున, నంచితగతి నిల్చి వృష్టి ♦ యవనిఁ గురియఁగాఁ
గాంచి తదీయజలంబున, ముంచుచుఁ దనమేను సంప్ర♦మోదము మెఱయన్.

క. వీరాసనంబు గైకొని, యారీతిన్ శిశిరకాల♦మందు నియతిమైఁ
గోరి జలాంతరమే యా,ధారంబుగ నయుతసంఖ్యఁ ♦ దగువత్సరముల్. ౪౫

తే. తపమొనర్చెను ధర్మత♦త్పరత నియుత
మానసుండయి నత్కథ ♦ మౌని యిట్లు
కుంభకర్ణుం డొనర్చ; నె♦క్కొనుముదమున
నవ్విభీషణుఁ డతిశుద్ధుఁ ♦ డగుచు నియతి. ౫౫ 383

సీ. ధర్మచిత్తుండయి ♦ ధర్మపరుండయి తనపాద మొక్కండు ♦ ధరణి నిల్పి
యైదువేలేండ్లు ని♦యమము తప్పకయుండఁ దపమొనర్చెనుదాని♦కపరిమితము
దము నొందినయచ్చరల్ ♦ తగ నాట్యమాడిరి *క్షోభిల్లియును దేవ♦కూటమతని
పయిఁ బుష్పవృష్టిని ♦ బరఁగంగఁ జేసిరి; తరువాతఁ బంచవ♦త్సరసహస్ర
తే. ములు దినేశ్వరుఁ గనుచు ని♦ర్మలహృదయము
వెలయ స్వాధ్యాయధృతచిత్త♦విమయుఁ డగుచు
నూర్ధ్వముస్తకబాహుఁడై ♦ యొక్కపాద
మవని నిల్పియె తపము చే♦యంగఁ దొడఁగె ౪ 384
క. సురలకు నందనమున నొ,క్కరణిని గాలంబు జరగఁ ♦ గ్రవ్యాదవరుం
డురుమతియునౌ విభీషణుఁ, డరాతిహరుఁ డిట్లు నియతుఁ♦డై తపమూనన్.
తే. జరగెఁ బదివేల యేండ్లంత;♦సహజు లట్లు,దశగళుండు గ్రమైనట్టి♦తపము చేయఁ
బూని యాహారమేమియు ♦ మాని వేయి,వత్సరములుండి వేయవ♦వర్షముతుది.
క. తనశిర మగ్నికి నాహుతిఁ,గను జేయుచు నిట్లు నియతి ♦ గడలుకొనఁగ వాం
ఛను బూని తపము చేయం,గను దొమ్మిదివేలయేండ్లు ♦ గడచె శిరములున్.
క. అనలునకుఁ దొమ్మి దాహుతి,గను జేయంబడియె; నంతఁ♦గడుఁబూన్కిఁదపం
బును జేయఁ బదవవేయియుఁ, జనుదెంచెను బదవశిరము ♦ జ్వలనున కెలమిన్.
తే. ఆహుతిగ నీయ ఛేదింప ♦ నాత్మఁ దలఁచు నవసరంబునఁ గిన్నర♦దివిజమాని
వరులతోఁ గూడి పరమేష్ఠి♦యరుగుదెంచి తత్తపంబునకుం బ్రీత♦చిత్తుఁడగుచు.
క. మనమున మెచ్చితి నీతప,మునకు దశగ్రీవ! వత్స! ♦ భూరినియతిచే
ఘనమగు నీతప మనుచున్, దనకరుణం దెలియపఱచె ♦ దశవదనునకున్. ౧౩
క. వర మడుగుము ధర్మజ్ఞా!, త్వరపడి నీమదిని గల్గు♦వాంఛ యెదియొ నేఁ
గరుణ నొసంగెద నీదగు, పరిశ్రమం బిద్ది కాదు ♦ ఫలరహితముగన్. ౧౪
చ. అనిన దశాస్యుఁ డెంతయును ♦ హర్షము పొంగెడునాత్మతోడ నా
వనరుహసంభవాంఘ్రివర♦వారిరుహంబులు శోక మస్తకం
బును దగ వంచి మ్రొక్కి పరి♦పూర్ణమనోరథ మబ్బు నాకు నం
చనుపమహర్షగద్గదన♦మన్వితవాక్కునఁ బల్కె నివ్విధిన్. ౧౫ 392
చ. వనరుహసంభవా! జగతి ♦ వర్ధిలు ప్రాణుల కెల్ల సంతతం
బును మృతినుండి తప్ప నొక ♦ పోలిక వేఱుభయంబు గల్గ దే
మన నిలమృత్యుతుల్యుఁడగు ♦ నట్టి విరోధియు లేఁడు గాన నే
మనమున నిర్జరత్వమును ♦ మంచి దటంచుఁ దలంచి కోరెదన్. ౧౬ 393
చ. సరసిజసూతి రావణుఁడు ♦ స్వాంతమునం గల కోర్కిఁ దెల్ప ని
క్కరణి వచించె; వత్స! దశ♦కంధర! సర్వవిధంబులందు ని

* పపాత పుష్పవర్షం చ క్షుభితా శ్చాపి దేవతాః-అనిమా.

ర్జరతయు నీకుఁ గల్గదు వ♦రం బటు లియ్యఁగఁ గాదు నాకునున్
వరము మఱొక్కఁ డారసియె ♦ వాతక కోరుము దాని నిచ్చెదన్. ౧౮ 394

క. అని లోకకర్త యీవిధ,మునఁ జెప్పిన చారువాక్య♦మును విని పరమే
ష్ఠిని గాంచి ముందు నిలువం,గను బడి దోసిలి యొసంగఁ♦గా నతఁ డనియెన్.

సీ. గరుడోరగులచేత ♦ గంధర్వదైత్యరాక్షసులచే యక్షని♦ర్జరులచేతఁ
జావకుండఁగ నాకు ♦ శాశ్వతా! లోకేశ! వర మిమ్ము వీరి క♦వధ్యుఁడనయి
సంచరించెద; నింక ♦ క్షుమగల్గు నితరజంతువులందు నుంతయేఁ♦దోఁచకుండుఁ
జింత నా కెభ్భంగిఁ ♦ జెలఁగి నేమానుపాదినిఖిలప్రాణులఁ ♦ దృణము లట్లు

ఆ. తలఁచువాఁడ దేవ♦తతిపూజితా! భయం
బనఁగ లేదు నాకు; ♦ ననుచు నిట్లు
దశవదనుఁడు పల్కు ♦ దాశరథీ! ధర్మ
మతి పితామహుం డ♦మర్త్యయుతుఁడు. ౨౦ 396

చ. విని దనుజేంద్ర! నీవు నను ♦ వేడుకఁ గోరినయట్లె యాను నీ
మనమున మోద మందు మని ♦ మన్ననతో మఱియున్ వచించె; నిం
కను గల దొక్క పల్కు విన♦గాఁ దగు నీ కది మేలుఁ గూర్చు నో
దనుజనరేణ్య! పావకహు♦తంబులు నీతల లెల్లఁ జక్కగన్. ౨౧ 397

క. అనఘా! పూర్వవిధంబునఁ, గనఁబడి యులరారు; మఱియుఁ ♦ గ్రవ్యాదవరా!
*విను మొక్క వరము నిచ్చెదఁ, గన నద్ది దురాసదంబు♦గాఁ జెల్వారన్. ౨౨

చ. మనమున నెట్లు కోరుదువొ ♦ మామకవాక్యముచేత నట్ల నీ
తను విది యొప్పుచుండుఁ జుము ♦ దానవనాయక! యంచుఁ బల్క న
వ్వనజవిభుండు చెప్పినటు ♦ పంక్తిగళాస్యము లెల్లఁ బూర్వరీ
తిని నలరారె మొల్చి కడు ♦ దీప్తుల మించుచుఁ జిత్రరీతులన్. ౨౩ 399

తే. ఇట్లు దశకంఠునకు వర ♦ మిచ్చి బ్రహ్మ
యంతట విభీషణునిఁ గాంచి ♦ యమలవాక్కు
లలర నిట్లని పల్కె; నా♦యన! నితాంత
ధర్మబుద్ధివి సువ్రత♦తత్పరుఁడవు. ౨౪ 400

క. వర మడుగుమ యనిన న్విని, నిరతము ధర్మాత్ముఁ డగుచు ♦ నెగడును గాన
సురపాలకునకు నతు లిడి, సురుచిరగుణరశ్మివిధుని♦చొప్పునఁ దగుచున్. ౨౫

చ. అలరి వచించె నిట్టులు కృ♦తార్థుఁడ నో భగవంత! నాకు ని
మ్ముల వర మీయ వచ్చితివి ♦ మూలము లోకుల కెల్ల నీవెఁగా
తలఁప జగద్గురుండవు ని♦తాంతదయన్ ననుఁ జూతువేని కో
ర్కుల నొసఁగంగఁ జిత్తమునఁ ♦ గోరుదువేని వరంబుఁ గోరెదన్. ౩౦ 402

---

* వితరామి చ తే సౌమ్య! వరం చాన్యం దురాసదమ్-అనియూ,

క. పరమాపదలం బొందిన,తరుణంబుననైన ధర్మ♦తత్పరమగుచుం
బరఁగెడునటు నాచిత్తముఁ, గరుణింపుము ధార్మికుండు♦కడు ఘనుఁడు గదా.
*క. విను శిక్షితంబు గాకయె, వనజభవా! నాదుచిత్త♦వర్తనమునకుం
గన నర్హంబైనవిధం,బున బ్రహ్మాస్త్రంబుఁ బ్రమద♦మున నా కిమ్మా. ౩౧ 404
సీ. బ్రహ్మచర్యాదికా♦శ్రమముల నెల్లెల్లు నాబుద్ధి వానిఁ బొం♦దంగఁ గోరు
చుండునో యందందు ♦ నురుతరధర్మిష్ఠ యగునట్లు వరమీయ♦వయ్య, తత్త
దర్హధర్మంబుల ♦ నరసి పాలించెద; భగవంత! వర మిదె ♦ తగఁ బరమ ము
దారము సత్యాంత♦ధర్మయుక్తంబునం చని గోరితిని హిత♦మాట; జగతి
తే. ధర్మమం దనురక్తులౌ ♦ నిర్మలులకు
నుంత దుర్లభ ముండదు ♦ శుభగుణాఢ్య!;
యనిన సుప్రీతుఁడయి బ్రహ్మ ♦ యవ్విభీష
ణునకు నిట్లని చెప్పె నో♦యనఘ! వినుము. ౩౩ 405
క. మన మీవిధమున ధర్మం,బున నలరుచు నీకుఁ గల్గె ♦ బుధనుత మగుచుం
గనుక వరం బిటు గోరితి, ననూనగతి నల్గె నీకు ♦ నగు సాధుమతీ!. ౩౪ 406
క. అరిసూదనా! విభీషణ!, సురరిపుకులమందు జనియుఁ ♦ జొప్పడియును ధ
ర్మరతిం నీచిత్తం బి,క్కరణిం బొలుపొందె దానఁ ♦ గడు నలరితిఁ జూ!. ౩౪
క. ఒనఁగితి నమరత్వము నీ, కసమానవరంబుగాఁగ; ♦ నంచని మది నిం
పెసలారు వేడ్క వీడ్కొని, బిసరుహజని కుంభకర్ణు♦విషయముఁ గనఁగం. ౩౫
చ. మనమున నెంచి యాతనికి ♦ మానసవాంఛయుఁ దీరునట్లు తాఁ
జని వర మీయ నెంచు వన♦జప్రభవుం గని నిర్జరుల్ భయం
బునఁ గరముల్ మొడించి సుర♦పూజితపాదసరోరుహా! మహా
దనుజుఁడు వీఁడు దుష్టమతి ♦ దర్పసమగ్రుఁడునై చెలంగుటం. ౩౬ 409
చ. వరముల నీయ నెంచకుము ♦ వానిభయంబున లోకజాల మె
క్కరణి భయంబులం గనునొ ♦ కావుము దేవ! యటంచు నిర్జరే
శ్వరులను వేఁడుచుండునొ భ♦వన్మతి కెంతయుఁ గ్రొత్తగాదుగా;
పరమకృపాకరా! యితఁడు ♦ పాపమనీషుఁడు నందనంబునం. ౩౭ 410
తే. సంచరించెడు నప్సర♦స్సప్తకంబు
నింద్రుననుచరదశకంబు ♦ నెంతమంది
యో మహర్షులు మానవు ♦ లొక్కరీతి
నేడ్చుచుండఁగ మ్రింగె నిం♦కేమి గతియొ. ౩౮ 411
క. వరములఁ బొందనితఱి ని,క్కరణిం గావించె నితఁడు ♦ క్రౌర్యంబుమెయిం
వరములనే పొందినచో, నరసి జగత్త్రయము మ్రింగు ♦ ననురుఁడు వేడ్కం.౩౯

* అశిక్షితం చ బ్రహ్మాస్త్రం భగవన్ ప్రతిభాతు మే-అనిమూ.

క. వరదంభంబున వీనికి, గురుతరమోహంబు నీవు ♦ కూర్పుము దేవా!
నిరతోపకృతియు లోకో,త్కరములకొ దీన నమ్మ♦తం బితనికి నా. ౪౦ 413

తే. ఇదియె వీనికి శిక్షయై ♦ యెసఁగుఁ జుమ్ము
*చారురుచిసాంద్ర! యనుచు ని♦ర్జరులు తెలుపఁ;
బద్మసంభవుఁ డగుబ్రహ్మ ♦ పద్మనయనఁ
బద్మమాలిని శారదఁ ♦ బత్నిఁ దలఁచె. ౪౧ 414

చ. మనమున నివ్విధిం దలఁప ♦ మానిని శారద పార్శ్వసీమఁ దోఁ
చెను; బతిప్రక్కనన్ నిలిచి ♦ చేతుల నొగ్గి వచించె నిట్టు లో
వనరుహసంభవా! యిదిగొ ♦ వచ్చితి నేపనిఁ జేయు నాజ్ఞయో
యనినఁ బ్రజావిభుండు తన♦యంగనఁ గన్గొని యప్పు డిట్లనున్. ౪౨ 415

క. దనుజేంద్రునివదనంబున, వనజాక్షి! వాణి! దేవ♦వాంఛ యెటులొ య
ట్లు నిలువుమా! యన వాణియుఁ,జని నిల్చెను వదనమందు;♦సరసిజభవుఁడున్.

క. కోరు మహాబాహూ! మది, నారసి నీకిష్ట మెదియొ ♦ యన బ్రహ్మావచ
స్సారము విని యద్దనుజుం, డీరీతి వచించె దేవ♦తేశ్వర! నాకున్. ౪౪ 417

తే. పెక్కుసంవత్సరములు సం♦ప్రీతి నిద్ర
పోవ నాకిష్ట మనిన; నా♦దేవవర్యుఁ
డట్లె యగునని వరమిచ్చె ♦ నమరు లజుఁడు
సంతసించిరి వదలెను ♦ శారదయును. ౪౫ 418

చ. శతధృతిఁ గూడి దేవతలు ♦ చయ్యన నంబరవీథి కేగ భా
రతి తను వీడిపోవ రఘు♦రామ! దశాస్యసహోదరుండు స్వ
స్థితిఁ గనెఁ దెల్వియందుఁ; గుము♦లిందగు నాతఁడు చింతనొందె దుః
ఖితుఁడయి యిట్టి మాట నను ♦ గీడ్పఱుపం దగునట్టు లక్కటా. ౪౬ 419

ఆ. మోహమునుండి యెట్టు ♦ లీమెయి వెడలెనో, మోసపుచ్చఁబడితి ♦ నే సురవర
వితతిచేత, బ్రహ్మ♦వెంబడి వచ్చిన, వారుగారె త్రిదశ♦వర్యు లిటకు. ౪౭ 420

ఆ. ఏమి చేయువాఁడ ♦ నింకఁ గార్యము తప్పె
ననుచు వగలఁ బొగిలె ♦ నంత నిట్లు
వరము లొంది మిగుల ♦ భాసిల్లుచున్ సహో
దరులు ముగురు నొకవి♦ధమునఁ గూడి. ౪౮ 421

క. అరిగిరి శ్లేష్మాతకవన, మురుసుఖసంబంచు నందు ♦ నొక్కవిధమునం
గరము విహారము సల్పిరి, వరములచేఁ గలుగు శక్తి♦వైభవ మలరన్. ౫౦

పదియవ సర్గము సంపూర్ణము.

---

* దీయతా మమితప్రభ-అనిమూ.

## ౧౧ - వ సర్గము.

{ రావణుఁడు లంకనుండి కుబేరుని వెడలఁగొట్టి నతఁడు పౌరులతోఁ గైలాసమున కేగుట }

చ. వరముల నొంది పౌత్త్రు లిటు ♦ వర్ధిలుచుండుట తా నెఱింగి స
త్వరముగ నాగలోకమును ♦ బాసి సుమాలి భయంబు వీడి క
ర్బురులను గూడి వచ్చెఁ దన♦పుత్త్రియు నామెకుమారు లుండు నా
ధరణికి; వానివెంటనె ని♦తాంతపరాక్రమయుత్నముల్ తగన్. ౧ 423

ఆ. అతనిమంత్రులైన♦యట్టి మారీచప్ర, హస్తులును మహోద♦రాహ్వయుండు
వితతబలముచేత ♦ వెలయు విరూపాక్షుఁ, డట్టి వెడలి రమరు ♦ లడలునట్లు. ౨

క. తనమంత్రులైన బలవ,ద్దనుజులతోఁ గూడి ప్రీతిఁ ♦ దరలి దశాస్యుం
గని కౌఁగిలించి యీవిధి, ననియె సుమాలియును; నోద♦శాస్యా! వత్సా!. 3

క. చిరకాలచింతితార్థము, నిరుపమమా నీయదృష్ట♦నియతి లభించెన్
సురలందు మేటి, త్రిభువన, పరిపాలకపూజ్యుఁడు నగు ♦ పరమేష్ఠిదయన్. ౪

తే. ఇట్టివరమును బొందితి ♦ వింతె చాలుఁ;
బృథులబాహూ! కలంగి మే♦మెల్ల నెవని
భయమునన్ లంక వే విడి ♦ పఱచి నాగ
భువనమును జొచ్చినారమో ♦ పొంక మెసల. ౫ 427

క. దనుజారియైన మాధవు, ఘనభయమది తొలఁగిపోయెఁ♦గా, పలుమరు నా
తనిచేఁ బరాజితులమై, వినుతగుణా! స్వాలయముల ♦ విడిచి భయమునన్.

ఉ. అందఱ మొక్కచోఁ గలిసి ♦ యూర్త్రి రసాతల మాశ్రయంబు గాఁ
గం దగు నంచుఁ బాఱితిమి; ♦ కర్బురవాసముగాఁ జెలంగుచున్
సుందరసౌధహర్మ్యముల ♦ శోభిలు లంకయు నస్మదీయమై
యెందును సాటిలే కలరు ♦ నిప్పుడు బుద్ధిబలంబు పెంపునన్. ౬ 429

చ. ధనపతి నీకు నన్న తన♦తండ్రియనుజ్ఞను దానియందు న
త్యనుపమభోగము ల్గనుచు ♦ హర్షముతో నివసించియున్న వాఁ
డనఘ! మహాభుజా! యెటుల♦నైనను దానిని బూన్కి మాన కీ
య్యన మన మాక్రమింపఁ దగు ♦ నయ్యది యెట్టు లటన్నఁ జెప్పెదన్. ౭

తే. సామదానమ్ములను గాని, ♦ శౌర్యమునను,గాని, మన మాధనేశునిఁ♦గదలఁజేసి
కైకొనుట లెన్న; నీవు లం♦కకు విభుండ, వగుదు వేసంశయమ్ము లే♦దంతె కాక.

సీ. మాకెల్లఁ బ్రభుఁడవై ♦ ప్రాకటబలదర్పముల నొప్పుచుం గ్రాలఁ♦గలవు; వత్స!
యడుగునఁ బడిన యీరా♦యసురులవంశంబుఁ బైకెత్తఁగాఁదగు; ♦ వంశ మిద్ది
నీయందె యాశతో ♦ నిలిచియున్నది ప్రతిష్ఠను గాంచు వేడుక;♦స్వామి వనినఁ
బ్రభువవె యున్నను మాకుఁ♦బరగతి యన్నను నీవె కావే యెందు♦నిలుపు తావు

తే. కలుగ దించుక యని యిట్లు ♦ పలుకుతల్లి
దండ్రిమాటల నాలించి ♦ దశవదనుఁడు
ధనదుఁడగు మాకు గురుఁ డిట్లు ♦ తగదు నీకుఁ
బలుక నని తాతయాశయ♦ములను మాన్చె. ౧౧౹ 432

క. దనుజేంద్రుఁడు బలశాలియు, ఘనకీర్తియునైన యతఁడు ♦ కడఁక నిటులు ప
ల్కినమాటచేఁ దిరస్కృతిఁ, గనియంతసుమాలియించు♦కయుఁబలుకఁడునూ!.

క. మనుమనియాశయ మిది యని, దనమదిఁ జక్కఁగ నెఱిఁగి ♦ తగ దిఁకఁ బలుకం
గను నంచు నూరకుండెను; వనమున నటఁ బంక్తిగళుఁడు ♦ వసియింపంగన్.

చ. జరగెను గొంతకాల మిటు ♦ శాస్త్రహితంబుగ నిట్లు పల్కు క
ర్బురవరు నాదశాననుని ♦ బొందుగఁ గాంచి నకారణంబుగా
నరసి ప్రహస్తుఁ డొక్కతఱి ♦ నల్లన నిట్లని పల్కె రాణ్ణయ
స్ఫురణము మీఱ; దీర్ఘభుజ♦శోభిత! యోదశకంఠ! యోవిభూ!. ౧౪ 435

క. మును తాత వినఁగ నీచె,ప్పినమాట యసంగతంబు ♦ పృథ్విని నెందున్
గనిన సౌభ్రాత్రము శూ,రనికరమున కెన్న లేదు ♦ రాక్షసనాథా!. ౧౫

సీ. వినవయ్య! యీపల్కు ♦ మునిపతియగుకశ్యపునకుభార్యలుగల♦రనఘమతులు
భగినులు పరమరూ♦పంబులఁ దగువార లదితియు దితియును♦నాహ్వయముల
నలరువారలు; వార♦లందు నయ్యదితియుఁ ద్రిభువనేశ్వరులయి ♦ తేజరిల్లు
తనయుల దివిజులఁ ♦ గనియెను, దితియును గశ్యపాత్మజులను ♦ గాంచె సుతుల

తే. దైత్యులగు నాసుతులకు ని♦త్యంబు నిలువ
నగర మీలంక సాధువ♦నములతోడ
జలధితోడను బర్వత♦సమితితోడ
నిశ్చయింపంగఁబడియెఁ జూ ♦ నిఖిలసుగుణ!. ౧౬౹ 437

చ. ధరణిని నిందు నిల్చి వర♦ధర్మవిదగ్ర్య! మహామతీ! నిరం
తర మురు తేజముల్ వెలయ ♦ దానవు లొప్పిరి; విష్ణు వంత సం
గరమున శౌర్య మొప్పునటు ♦ కర్బురవర్యులఁ జంపి యెందునన్
నరి యన లేని లోకములఁ ♦ జక్కఁగ శోభిలువాని మూఁటినిన్. ౧౭౹ 438

క సురలకు నిచ్చెను; నీ వొ,క్కరుఁడవె చేయంగ లేదు ♦ గద ద్రోహము సో
దరునకు నిర్జరదానవ,వరాచరితమార్గ మిద్ది ♦ వఱలుం జుమ్మీ!. ౧౮౹ 439

క. కనుక న్నాపలు కియ్యది, మనమున యుక్తం బటంచు ♦ మైకొని చేయం
జనుఁ గార్య మిట్టు లని చె,ప్పినయాతనిమాట లెల్ల ♦ విని మోదమునన్. ౨౦

క. తనమది నెంచి ముహూర్తము, దనుజేంద్రుం డతఁడు చేయఁ♦దగు నట్లే యం
చని పల్కె; నంతవీర్యం,బున నొప్పు దశాననుండు ♦ పొంగెడుతమితోన్.

తే. ఆప్రహస్తుఁడు తనకు నే♦యుపాయమునందుఁ
దెలిపెనో మార్గమును దాని ♦ నెలమి నపుడె
దానవుల నెల్లరం గూడి ♦ తద్వనంబుఁ
జేరె; నంతఁ ద్రికూటసం♦స్థితిని గాంచి. ౨౨ 442

క. ధనపతిచెంతకు దూత్యం,బునకుఁ బ్రహస్తునిని వాక్య♦ములు పల్కెడు నే
ర్పున నొప్పువానిఁ బంపుచు, దనుజేంద్రుం డతనితోడఁ ♦ దా నిట్లనియెన్.

క. చనుము ప్రహస్తా; వేగమె, దనుజేజ్యుని విత్తనాథుఁ ♦ దగఁ గని నీవి
ట్లనవయ్య నాదుమాటగ, ననూనసామాదిగాఁగ ♦ నలరు తెఱఁగునన్. ౨౪

క. మంతిమంతులైన దానవ,వితతికి నీలంక మున్నె ♦ విధి యేర్పఱిచెన్
హితమతికి నీకు నద్ది వ,నతియయ్యెం గాదె తగదు ♦ సౌమ్యా! నిలువన్. ౨౫

తే. అతులవిక్రమ! యిద్దాని ♦ నరసి నాకు, నీ వొసంగిన నాకును ♦ నెమ్మి తనరు
ధర్మమును గాచినట్లుగఁ♦దగుదువీవు,ధర్మపాలనమునుజేయు ♦ ధనద! యనుము.

చ. అనినఁ బ్రహస్తుఁ డట్లె చని ♦ యర్థవిభూత్తనుపాలితంబుగాఁ
దనరెడు లంకఁ జేరి సత♦తంబు ధనంబున యాచకాళి న
మ్మనములు తృప్తిచే నలగు♦మాడ్కి నొనర్చు కుబేరుఁ గాంచి యి
ట్లనియెను; సువ్రతా! సుమహి♦తాయతబాహువిలాస! యోవిభూ!. ౨౭ 447

తే. సర్వశాస్త్రవిచక్షణా! ♦ సాధుశీల!, త్వత్సహోదరుఁడగు దశ♦వదనుఁ డనుప
వచ్చినాఁడను దూతను ♦ నిచ్చటికిని;, శాస్త్రసారంబు లెఱిఁగిన ♦ నరసమతివి.

చ. కనుకని నాదువాక్కు వినఁ♦గాఁ దగుఁ బ్రాజ్ఞవరా! ధనేశ! మీ
యనుజుఁడు పంక్తికంఠుఁ డిటు ♦ లాడుమ యంచు వచించె నట్టు లే
మనవి యొనర్తు; రమ్యము, సు♦మాలిముఖాఖిలవిక్రమోల్లస
ద్దనుజవరేణ్యపాలితము ♦ తా మును లంక యి దెన్న మాదె యౌ. ౨౯

చ. మనవి యొనర్తు నట్లగుట ♦ మామకమైతగు నీపురంబు లం
కను దయచేయుమంచు నిను ♦ గాదిలిసోదరు విశ్రవస్సుతున్
ఘనమతి వేఁడువాఁడ నిదె ♦ కామము నాయది దీనిఁ దీర్పఁగాఁ
జను పలు కిద్ది సామమయి ♦ సజ్జనపూజ్యమునౌఁ దలంపఁగన్. ౩౦ 450

చ. అని యిటు రావణోక్తిగఁ బ్ర♦హస్తుఁడు పూన్కి వచింప విశ్రవ
స్తనయుఁడు చక్కఁగా విని ని♦తాంతము వాక్కులఁ బండితుండు గా
వున నిటు పల్కె నాతనిని ♦ బొల్పుగఁ గాంచి; పురంబు దీని మ
జ్జనకుఁడు నా కొసంగె దను♦జవ్రజశూన్యముగాఁగ నొప్పుచున్. ౩౧ 451

తే. దానమానాదిసద్గుణ♦తతులచేత
యక్షులెల్లరు ననుఁ గూడి ♦ యరుగుదెంచి
యున్నవా రిందు; దశకంఠుఁ ♦ డున్న యెడకుఁ
బోయి పల్కుము దానవా! ♦ నాయనుమతి. 33 452

సీ. నాదగు రాజ్యంబు ♦ నగరంబు దీని నోపృథులబాహూ! నీవు ♦ నెలమి ననుభ
వింపుము శాత్రవ♦విరహితంబుగ, మఱి యవిభక్తముగ నె రా♦జ్యమును నాదు
వసుజాలమును గాంక్ష♦వర్ధిల్లననుఁ గూడియనుభవించుట లెస్స♦యనుచుఁ బల్కు
మని దూత నటు పుచ్చి ♦ ధనపతి జనకునియంతికంబున కేగి ♦ యతులభక్తి

తే వందనం బిడి రావణు♦వాంఛ నెల్ల
గురువునకుఁ దెల్పెఁ బూని యో♦గురువరేణ్య!
దశవదనుఁ డంపె దూతను ♦ దానవాళి
భుక్తపూర్వము నా కిమ్ము ♦ పురము ననుచు. 3౬౪ 453

క. ఎది యాచరింపఁదగు నీ,యదనున నే ధర్మరీతి ♦ నానతి యిమ్మా
సదమలహృదయా! యన భూ,మిదివిజముని విశ్రవసుఁడు ♦ మిక్కిలినీతిన్. 3౭౪

క. తను వేఁడుచుఁ బ్రాంజలియై, మనమున నేచింత లేక ♦ మహితవిచారుం
డును నయితగుతనయుని నా,ధనదునిఁ గని యిట్టులనియె ♦ దయ యొప్పారన్.

క. వినవయ్య నాదువాక్యముఁ,దనయా! గురుబాహుబలుఁడు ♦ దశవదనుం డా
య్యన నాచెంత వచించెను, బని యిటు గాదంచు నేను ♦ బలుభంగులుగన్.

క. భీతిల్లునట్లు పల్కితి, నాతఁడు దుర్మతియొ యనుచు ♦ నరసియొ ధర్మం
బాతతమర్యాదను నీ, వీతఱిఁ జెడఁ జూచితి వని ♦ యెనఁగెడుక్రుధచేన్. 3౯

క. పలుమరుఁ బల్కితి; శ్రేయం, బలఘుతరంబైన ధర్మ ♦ మలరెడురీతిన్
బలికెద వినుమా!; *దుర్మతి, ఖలుండునౌ నాతఁ డబ్జ♦గర్భువరములన్. ౪౦

క. ఒడ లెఱుఁగక గురుమాన్యులఁ, గడుఁ దలఁపఁ డెఱుంగఁ డేమి♦కారణ మన న
య్యెడ నే నిచ్చినశాపము, కడు దారుణమైన ప్రకృతి♦గల్గ నొనర్చెన్. ౪౧

క. కనుక మహాబాహూ! చ,క్కనిరీతి గిరీంద్రమైన ♦ కైలాసమునుం
గనఁ బొమ్మందు నివాసం,బును జేయు, సహానుచరస♦మూహుఁడ వగుచున్.

క. పురమును లంకఁ ద్యజింపుము, పరమగిరీంద్రంబునందుఁ ♦ బావనగతులన్
నిరుపమయై మందాకిని,తరంగిణీప్రవరయగుచుఁ ♦ శనరుచునుండున్. ౪౩౪ 461

సీ. సవితృసంకాశకాం♦చనపంకజంబులఁ గుముదోత్పలంబులఁ ♦ గొమరుమిగులు
నితరసుగంధిపు♦ష్పతతిఁ బొల్పెసఁగు నుత్తమవారితో నది ♦ యమరియుండు;
నందు నిర్జరవరు, ♦ లచ్చరల్, గంధర్వు లురగులు, కిన్నరు ♦ లురుముదముల
విహారణవాంఛల ♦ నెలయుచు నిరత మాయంభస్సులం గ్రీడ♦లాడుచుంద్రు

తే. గాన నందుండఁ దగు నీకుఁ ♦ గడుఁ గఠోర
దనుజుఁ డగుదశకంఠుతోఁ ♦ దగదు వైర
మద్ది చేకొన లాభంబు ♦ నందు టరిది
యతఁ డలభ్యవరంబుల ♦ నజునివలన. ౪౫౪ 462

* వరప్రదానసమ్మూఢో మాన్యామాన్యాన్ స దుర్మతిః-అనిమా.

క. కర మరుదైనతపంబున, నొరులకు నందంగరాని ♦ యొప్పునఁ గనుటల్
వరతనయా! యెఱుఁగుదు గద;, త్వరగాఁ జనుమనఁగఁ దండ్రి ♦ వచనముభక్తిన్.

క. విని తండ్రియొశలఁ గల్గిన, ఘనగౌరవమున నతండు ♦ కదలి యమాత్యుల్
తనదారపుత్రులున్ బుర,మునఁ గల యెల్లరును తాఁగఁ ♦ బూనికమెఱయన్.

క. ధనవాహనములఁ గైకొని, చనియెఁ; బురం బద్ది విగత ♦ జనమై మునుపుం
డిన పొల్పు దూల శూన్యము,గ నయ్యె నోరామచంద్ర! ♦ కడువేగమునన్.

తే. యోజనంబులు ముప్పదై ♦ యొప్పు నాయ
తమున నలరారు పుర మది ♦ త్వరగ నిర్జ
నమును నిర్భయమును నైనఁ ♦ బ్రమద మొప్ప
నా ప్రహస్తుఁడు వేగంబ ♦ యరిగి యచట. ౪౭ 466

క. తనమంత్రులు తమ్ములు గొ,ల్వ నితాంతప్రీతి నొప్పు ♦ వాని దశముఖున్
గని మహితాత్మా! వినుమా!, యని యిట్లని పల్కెఁ; ధనదుఁ ♦ డతిభీతుండై.

క. చనియెను లంకాపత్తన,మును విడిచి పురంబు శూన్య ♦ ముగ నున్నది; మ
మ్ముఁ గూడి ప్రవేశింపుము, దనుజులధర్మంబు నెఱపఁ ♦ దగు నని పలుకన్.

క. అనుజన్ములతో బలవా,హనములతో లంకఁ జొచ్చె ♦ నలరి ప్రహస్తుం
డును వెంట రాఁగ; లంకయు, ధనదుఁడు విడనాడి పోవఁ ♦ దా శూన్యముగన్.

తే. కానఁబడుచును సువిభక్త ♦ ఘనపథముల
నలరుచుండె; నద్దాని దే ♦ వారి చేరె
స్వర్గమును జేరు దేవేంద్రు ♦ భంగి; నంత
దనుజులభిషేక మొనరింప ♦ దశవదనుఁడు. ౫౧ 470

చ. పురమునఁ దా వసించెఁ గడుఁ ♦ బొంగుచు నంతట నీలవారిదో
త్కరరుచిఁ గ్రాలు రాక్షసు ల ♦ ఖండపరాక్రము లెల్ల నిండ నా
పుర మలరారెఁ; విశ్రవసు ♦ పూజ్యనువాక్కులఁ గల్గు గౌరవ
స్ఫురణమునన్ గుబేరుఁడును ♦ సొంపయి చంద్రవినిర్మలంబునై. ౫౨ 471

ఆ. అరుదుగాఁ జెలంగు ♦ నట్టి కైలాసంబు,నందు సౌధరాజి ♦ నలరునట్లు
పురముఁ గట్టఁబంచి ♦ సురపురి శక్రుండు, వోలెఁ దా వసించె ♦ లీల మెఱయు.

పదునొకొండవ సర్గము సంపూర్ణము.

---

౧౨ - వ సర్గము.

రావణుఁడు మందోదరిని వివాహమాడుట.

క. అనుజాతాన్వితుఁడై యా,దనుజేంద్రుఁడు పట్టభద్ర ♦ తం బొంగుచు యో
జన చేసె భగిని శూర్పణ,ఖ నెవ్వరికి నిత్తు ననుచుఁ ♦ గాంక్ష చెలంగన్. ౧

ఆ. కాలకేయుఁడైన ♦ క్రవ్యాదవర్యున, కాత్మభగిని ప్రీతి ♦ నలరి యొసఁగ
దానిభర్త పేరఁ ♦ దనరు విద్యుజ్జిహ్వుఁ, డనఁగ; నంత నాద♦శాననుండు.

చ. అనుజ నొసంగి యిట్లు మృగ♦యార్థము కానల సంచరించుచున్
గనియె మయాఖ్యదానవుని ♦ క్ష్మాపతినాయక! కన్యకాసహా
యుని; నతనిం గనంగ మది ♦ నొప్పెడుప్రీతిని బల్కె నిట్టు; లో
యనఘ! మనుష్యులున్ మృగము ♦ లారయ లేని మహావనంబునన్. ౩౫ 475

తే. హరిణశాబకనయన నీ♦యంగనామ
ణిని సహాయంబుగాఁ గొని ♦ నిలిచి యున్న
వాఁడ వెవ్వఁడ వీవు? దు♦ర్భరము కాన
నిందు వసియింపఁ గారణం ♦ బేమొ యనిన. ౪ 476

చ. తను నిటు ప్రశ్నచేయు సుర♦దస్యునిఁ గాంచి మయుండు పల్కె; నో
దనుజవరా! మదన్వయక♦థావిధ మంతయు నీకుఁ దెల్పెదన్
వినఁదగు; హేమనాఁ బరఁగు ♦ విశ్రుతరూప యొసంగునే కదా
వనితను దాని నచ్చరను ♦ బంకజనేత్రను బూర్వ మీవునన్. ౬ 477

క. వినియే యుందువు దానికి, నను భర్తను జేసి రెల్ల ♦ నాకులు దివిజే
శునిఁ బౌలోమికివలెనే;, వనితామణి దానియందు ♦ వాంఛలు మిగులన్.

సీ. పంచశతాబ్దముల్ ♦ పరమసుఖంబులఁ బడసితి నవల నా♦భామినియును
దివిజకార్యమును బూ♦ర్తింజేయఁ బదుమూఁడు వర్షంబు లేగె న♦వ్వలఁ జతుర్ద
శాబ్దంబు దాఁటిన ♦ నాహేమకొఱకుఁగా హేమమయంబయి♦యొసఁగు వజ్ర
వైదూర్యచిత్రితం♦బై దగు పురమును గట్టినాఁడను మాయఁ ♦ గైకొని తమి;

ఆ. నందు హేమ లేమి ♦ నతిదుఃఖితుండనై, దీనుఁడనయి యుంటిఁ ♦ దెలివరాక
యున్న నాసుపుత్రి ♦ నున్నన మీఱఁగాఁ, దీనిఁ గొని పురంబు ♦ దాని వదలి.

క. [1]వనమున నిందున్నాఁడను;, దనయామణి యిద్ది నాదు♦తన్వికడుపునన్
గనికరమునఁ బెంపంబడె, దనుజేంద్రా! దీని కెవఁడు ♦ తగువరుఁ డనుచున్.

చ. [2]తనయను గూడియే వెదుక ♦ ధర్మ మటంచుఁ దలంచి దానికై
చనియెదఁ గన్యఁ గన్న పిత ♦ చాలఁగ దుఃఖము లొందు మానకాం
క్షను దగు నేని లోకమునఁ ♦ గల్గినదే కద యిద్ది; కన్యయే
జనకుని వంశమున్ జనని♦సంతతి సంశయ మొందఁజేయుఁ జూ. ౧౧౫ 481

క. తనయులఁ బడసితి నిర్వుర, వనితామణివలన నేను, ♦ ప్రథముఁడు పేరం
దనరెను మాయావి యనన్, విను మవ్వల దుందుభియును♦విశ్రుతుఁడయ్యెన్.

---

1 ఇయం మహాత్మజా రాజన్ తస్యాః కుక్షౌ వివర్ధితా-అనిమూ. 2 కన్యాపితృత్వం దుఃఖం హి సర్వేషాం మానకాంక్షిణామ్, కన్యా హి ద్వే కులే నిత్యం సంశయే స్థాప్య తిష్ఠతి-అనిమూ.

చ. తెలిపితి నింతవట్టును మ♦దిన్ దలపోసి యథార్థ మెల్ల నేఁ
దెలియఁగఁ గోరినాఁడను సు♦ధీవర! యెవ్వఁడ వీవటంచు ని
న్నెలమి; నటంచుఁ బల్కెడు న♦హీనమతిన్ మయుఁ గాంచి యీవిధిం
బలికె దశాననుండు తగు♦భంగిని, దానవవర్య! నే ననన్. ౧౪ 483

క. తనయుఁడఁ బౌలస్త్యునకున్, జననుత! నాపేరు విను ద♦శగ్రీవుఁడు నా
జను లందురు విశ్రవసుం, డనుపేరి మదీయజనకుఁ ♦ డగుఁ జు మ్మతఁడే.

తే. వనజభవునకు మూఁడవ♦వాఁడు నాఁగ
వానివార్తల నాలించి ♦ బ్రహ్మమాని
తనయునింగా నెఱింగి యా♦త్మను బ్రమోద
మందె మయదానవుం; డంత ♦ నాత్మజాత. ౧౬ 485

క. మనమునఁ దలఁచెను నాతని,కి నిచ్చుటయె చాల మేలు ♦ కీర్తియుఁ దగు నం
చని; యప్పు డాత్మహస్తం,బున నాదశకంఠహస్త♦మును గొనుచుఁ దమిన్.

క. మోమునఁ బ్రహసన మొప్పఁగ,నీమాడ్కిం బలికె రాక్ష♦సేంద్రుఁడు మయుఁ; డీ
మామకతనయను రాజా!, హేమకుఁ దనుజాతఁ గాఁగ ♦ నెఱుఁగం దగుఁ జూ.

తే. కన్య మందోదరి యనంగఁ ♦ గ్రాలు దీని
భార్య గాఁగ గ్రహింపు మో♦యార్య! యనిన
నట్ల యగుఁగాక యనుచు ద♦శాస్యుఁ డనియె;
నంత శ్రీరామచంద్ర! యా♦యాడవియందె. ౧౯ 488

క. అనలుని మండెడు నట్టుగ, నొనరించి కరగ్రహణము ♦ నొగి విధిగాఁ జే
సెను; రామా! మయుఁ డాతని,జనకుం డిడినట్టి ఘోర♦శాప మెఱిఁగియున్.

తే. కులము పైతామహం బిద్ది ♦ యలరుఁ గీర్తి
నంతె చాలు నటంచుఁ గ♦న్యక నొసంగి
చాల యద్భుతశక్తిచేఁ ♦ గ్రాలు శక్తి
నిచ్చె నద్ది యమోఘమై ♦ యెసఁగు నెందు ౨౦ 491

క. నిరుపమతపమున మయుఁ డా,వరశక్తిని బడసె దాని ♦ వైచియె నీసో
దరు లక్ష్మణు మూర్ఛితుఁ జే,సె రామ! నీవెఱుఁగుదు వది♦చెప్పన మీఁదన్.

క. ఈరీతిన్ లంకేశుఁడు, దారపరిగ్రహము చేసి ♦ తనపురవరముం
జేరి సహోదరులకునున్, దారలఁ గూర్పంగ మదిని ♦ దలఁచి ముదమునన్.

సీ. వైరోచనునిపుత్త్రి♦కారత్నమునకుఁ దాఁ బుత్త్రియై సద్గుణ♦భూషితయయి
తనరి వజ్రజ్వాల ♦ యను పేర రాజిల్లు కన్యక నాకుంభ♦కర్ణునకును
భార్యగా నొనరిచెఁ ♦ బరమకృపాచిత్తుఁ డగుచు గంధర్వనా♦యకుఁడు నగుచు
నలరారు శైలూషు♦నాత్మజ ధర్మజ్ఞ సరమను నావిభీ♦షణున కింతి

తే. గాఁగ నొనరించె; నాపేరు ♦ గలిగె నట్లొ
తెలియఁ బలికెద నాకన్య ♦ కలుగునపుడు
తల్లి మానసకాసార♦తటమునందు
నుండె మేఘోదయం బప్పు ♦ డొప్పెఁ గాన. ౨౮౫ 493

క. సర నది కన్యకయుండిన, ధరణీపర్యంత మట్టి ♦ తాఁ బొంగెను సుం
దరరీతి నలరుకన్యయుఁ, బరిదేవన మట్టి చేసె ♦ భయము గదురుటన్. ౨౯

తే. తనయ యేడ్పుట నాలించి ♦ తల్లి స్నేహ
మున వెసం జనుదెంచి యిం♦కను సరోవ
రంబ! పొంగకు మనెడు స♦ర్థంబు గలుగ
నింక 'మా వర్ధయన్వ' యం♦చెన్ని యింతి. ౨౬ 495

*క. పలికినకతమున నామం, బలరెను జా నరమ యనఁగ ♦ నవ్వల సహజ
న్మలు రావణాదు లెంతయుఁ, జెలఁగిరి క్రీడావిశేష♦సిద్ధులఁ గనుచున్. ౨౭

క. దారాన్వితులై మువ్వురు, చారుత గను నందనమున ♦ సాంద్రక్రీడన్
గోరెదు గంధర్వులగతి,గా రమ్యక్రీడ సల్పఁ♦గాఁ దొడఁగిరి నూ!. ౨౮౫ 497

క. కనియెను మందోదరి మే,ఘనాదుఁ డన నొప్పు పుత్రు ♦ గాఢబలాఢ్యున్
జననాథ! యింద్రజిత్తని, యనుదురు మీ రెల్ల; నతని ♦ నాహవభీమున్. ౨౯

చ. జననము నొందునప్పుడె యె♦సంగెడు శక్తిని రావణాత్మజుం
డనుపమభూరినాదమున ♦ నబ్దసమూహముఁ బోలి నించె లో
కనిచయ మాధ్వనిన్ జడతఁ ♦ గాంచెను లంకయు, దాన రావణుం
డొనరిచె మేఘనాదుఁ డన ♦ నొప్పు నితండని నామధేయమున్. ౩౦౫ 499

తే. అతఁడు రావణుభవ్యమా ♦ నంతిపురము
నందు వరయువతులు తన్ను ♦ నరసి ప్రోవ
దారుసంఛన్నవహ్నివి♦ధమున వృద్ధి
నొందెఁ దలిదండ్రు లామోద ♦ మొందునట్లు. ౩౨ 500

పంద్రెండవ సర్గము సంపూర్ణము.

---

౧౩ - వ సర్గము.

రావణుఁడు కుబేరుఁడు పంపిన దూతను జంపుట.

చ. సరసిజనూతివా క్కోటులు ♦ సంభవ మొందెనొ దానియాజ్ఞచే
గురుతరరూపముం గొనుచుఁ ♦ గోరి తనంతన కుంభకర్ణుఁ గ
ర్బురవరుఁ బొందె నిద్ర భయ♦మును గలిగించెడునట్లు లంక నా
తరుణమునందు; నన్నను ని♦తాంత బలాఢ్యునిఁ గాంచి యొక్కటన్. ౧ 501

---

* సరో మా వర్ధయస్వేతి తత స్సా సరమాభవత్ - అనియు.

ఆ. కుంభకర్ణుఁ డనియెఁ ♦ గుదియించెడిని నిద్ర
నన్ను దానవేంద్ర! ♦ నాకు నిద్రఁ
బొంద నాలయంబు ♦ నిం దమర్పఁగఁ బంపు;
మనిన నాదశాస్యుఁ ♦ డాదరమున. ౨ 502

క. పనియందు నేర్పుగల శి,ల్పినికరములఁ బిలువఁ బంపి ♦ వే నిర్మింపుం
డు నిశాంతము నిద్రకు; నా, విని వారలు విశ్వకర్మ♦విధమున సంతన్. ౩

క. [కైలాససన్నిభంబౌ, నాలయముం గట్టి రందు] ♦ నది వెడలుపునం
గ్రాలెను యోజన మంతది,యై లలిఁ దద్విగుణమైన ♦ యాయత మలరన్.

క. కనఁదగి బాధావిరహిత, మనూనసుఖదాయకంబు ♦ నయి గృహ మొప్పెన్;
గనకస్ఫటికమయంబులు, ఘనములు చిత్రమ్ములగుచుఁ♦గడుఁ గన్రములై. ౪౫

క. అలరారెడు స్తంభోత్క,ర,ములచే వైడూర్యరత్న♦ములఁ గట్టిన మె
ట్లులచేఁ జిరుగంటలచేఁ, బొలుపొందెను దద్గృహంబు ♦ పూజ్యతమముగన్.

తే. దంతనిర్మితతోరణ♦తతులచేత, స్ఫటికవజ్రసువేదికా♦పటలిచేతఁ
జెలఁగి సర్వసుఖంబులు ♦ గలుగఁ జేయఁ, జాలునట్లు గట్టించె ద♦శవదనుండు.

క. [1]అనిశము సుఖదంబై యెం,దును గాంచిన నాథుపుగ నె ♦ తోఁచుచుఁ బుణ్యం
బును బొందఁ జేయు స్వర్ణా,ద్రిని గల గుహయట్లు మిగుల♦దివ్యంబగుచున్.

క. తనరారునాగృహోత్తమ,మును జొచ్చి పరుండి నిద్రఁ♦బొందెను దితిజేం
ద్రునితమ్ముఁడు తత్కాలము, చనియెను వేలకును వేల♦సంవత్సరముల్. ౭

క. ఆనిద్రనుండి లేవక,యే నెమ్మిం గన్నరీతి ♦ నెసఁగెను; నిటు లా
దానవుఁడు నిద్రపోవం,గా నిజవిక్రమము తీవ్ర♦గతి మెఱయంగన్. ౮ 510

క. మునిదివిజుల గంధర్వుల, ననిమొన మార్కొనుచు నల్లి ♦ యక్షుల నెల్లన్
బనిపూని దశగ్రీవుఁడు, తనకున్ దాసులుగ నుండఁ ♦ దాఁ జేసెఁ గ్రుధన్.

క. విను మింకను రామా! నం,దనముఖముల నుపవనములఁ ♦ దద్దయు హర్షం
బును గల్గఁజేసి చిత్రము,గ నొప్పు వానిన్ హరించెఁ ♦ గ్రౌర్యము మెఱయన్.

చ. కరులు తరంగిణీవ్రజముఁ ♦ గాఱియ పెట్టెడునట్లు వాయువుల్
తరువుల నూఁచుచందమున ♦ దారుణవజ్రము భూరిపర్వతో
త్కరములఁ ద్రెంచుచాడ్పునను ♦ ధ్వంసముచేసెను గ్రీడవోలెఁ గ్రో
ధరతిని నిష్కుటంబులను ♦ దానవనేత సురల్ తపింపఁగన్. ౧౦౫ 513

చ. ధనపతి ధర్మవేత్తయయి ♦ తాను జెలంగి కులానురూపమౌ
తనదుసువృత్తముం దలఁచి ♦ తమ్మునివృత్తము నట్టు లుంటయున్

1 సర్వత్ర సుఖదం నిత్యమ్-అనివ్యాఖ్యానకర్త ఽంగీకరించినపాఠము. సర్వర్తుసుఖదం నిత్యం అనునొకపాఠముకూడ గలదు.

మనమున నెంచి భ్రాతృతను ♦ మానితరీతిని జూపఁ గోరి దూ
తను దశకంఠుచెంతకు హి♦తంబును దెల్పఁగఁ బంపె లంకకున్. ౧౨౪ 514

తే. అతఁడు లంకాపురిం జొచ్చి ♦ యవ్విభీష
ణుని గనుంగొన ధర్మంబు ♦ ననుసరించి
యతని సత్కారములఁ దన్పి ♦ యాగమనము
దెలుపుమా యని ప్రశ్నించి ♦ లలితభణితి. ౧౩౫ 515

క. ధనపతియు జ్ఞాతులయు శివ,మును జక్కఁగఁ బ్రశ్నచేసి ♦ ముదమున నతనిం
గొని సభయం దాసీనుని, దనుజేంద్రునిఁ జేరఁబోయి ♦ తా నాతనికిన్. ౧౪౫

క. కనఁబఱచెఁ బంక్తికంఠుని;, ధనపతిదూతయును స్వీయ♦దారుణతేజం
బున వెల్గుచున్న దనుజే,శుని గాంచి జయాశిషముల ♦ సొరిదిఁ బొగడుచున్.

ఆ. *ఒకముహూర్త మూర♦కుండి పరార్థ్యాస్త
రణము వెలయఁ గాంతి ♦ రాజిలంగ
నలరు నాసనమున ♦ నధివసించిన దశ
కంఠుతోడఁ బలికెఁ ♦ గన్రుభణితి. ౧౬౫ 518

సీ. దానవేంద్రా! నాకు ♦ ధనపతి దెల్పిన వార్త సర్వంబు నే ♦ బలుకువాఁడ
నద్ది మీ యన్నయే ♦ యనువదించిన దంచుఁ దలపోయఁగాఁదగుఁ;♦బలుక దేమి
యనిన, నిద్దఱకు సౌ♦మ్యా! వృత్తకులములు సదృశంబు లగుఁజుమ్ము♦సాధురీతి
నింతదాఁకను సాగె ♦ నిద్ధచారిత్రసంగ్రహము చేయంబడెఁ ♦ గాన నింక

తే. సాధుధర్మవ్యవస్థితి ♦ శక్యమేని
చేయఁదగు, నన్న నౌట నేఁ ♦ జెప్పువాఁడ
ధర్మములఁ గొన్ని నాపల్కుఁ ♦ దమి గ్రహింపు
నందనోద్యానమును నీవు ♦ డెంద మలర. ౧౭ 519

క. సుర లెల్లన్ వాపోవఁగఁ, బరిభగ్నముఁ జేసియుంటఁ ♦ బరికించితి నే
వరమునులను జంపుటయున్, బరమార్తిని బొందివింటిఁ ♦ దవ్తత్కృత్యములున్.

క. సురలకు నుద్వేగం బన,వరతము గల్గించె వింటి ♦ వరుసగ నేనున్
సురవైరినాథ! నీచే, నిరాకృతుఁడ నైతిఁ గాదె ♦ నిర్హేతువుగన్. ౨౦ 521

క. దానంబున మర్యాదల, మానితులగు బాంధవులు వి♦మానార్హులుగా
దానవవృత్తిని గొను నీ,చే నిరతము బాధితులయి ♦ చేడ్పడి రకటా!. ౨౧౫

తే. నేను హిమగిరిపృష్ఠంబుఁ ♦ గానవచ్చి,తిని గదా రౌద్రమగు వ్రత♦మునుదగంగ
నాశ్రయించి ధర్మంబుల♦నాచరింప, నియతచిత్తుండనై జితేం♦ద్రియుఁడనగుచు.

క. పరశివుఁడు పార్వతియుతుఁ, డురుకరుణామూర్తి యందు ♦ నొప్పుగ నా చే
వశభక్తిఁ జూడఁగాఁబడె;, సురవిభుఁడు త్ర్యయీమయుండు♦శుభ దుండొకటన్;.

---

* సతిత్రోత్తమపర్యంకే పరార్థ్యాస్తరణాన్వితే-అనియూ.

తే. అతని దర్శించుతటి దేవి♦యందు నాదు, సవ్యనేత్రంబు వ్యాపించె♦సాధ్వినకల
మంగళాలయ యెవతెయొ ♦ పొంగు వేడ్క,నిట్టులున్నదటంచు నే♦నెలమి మీఱ.
క. ఇతరంబగు కారణ మే,వితమునఁ బరికింపలేదు ♦ విశ్వేశ్వరుసం
గతి పార్వతి యనుపమమై, చ్యుతియన లేనట్టి రూప♦శోభితయగుచున్. ౨౩
ఆ. అలరుచుండె నీశు♦నంతికంబున; నంత, దేవి దివ్యసుహితు♦చే విదగ్ధ
మయ్యె నాదుసవ్య♦మగు నక్షి రేణువి,ధవ్యస్తమైన జ్యోతి♦వలెన యచట
ఆ పింగళత్వ మొందెఁ ♦ బిదప నే నటనుండి, కదలి విస్తృతమయి ♦ క్రాలు శిఖరి
యన్యతటమునందు ♦ నబ్దమ్ము లష్టోత్త,రశతములు నిరంత♦రవ్రతమ్ము. ౨౪
క. ఒనరించితి నియమం బిది, యనూనవిధిఁ బూర్ణమైన ♦ నందు మహేశుం
డనఘుఁడు దేవుఁడు ప్రీతిం, గను మనమున హృష్టుఁడగుచుఁ♦గనినన్ఁబలికెన్.
క. పరదేవినిరీక్షణమున, నురుపింగళతం జెలంగె♦నో నయనం బీ
కరణిని గావున సువ్రత!, పరమకృపాచిత్తుఁడనయి ♦ పరఁగితి నీపై. ౨౭ 530
క. అనుపమధర్మజ్ఞ! నీ, వొనరించిన యీతపంబు ♦ నోహో మేలం
చును మెచ్చితి మదిఁ బ్రీతిం, గనినాఁడను వ్రతము దీనిఁ ♦ గడఁకన్ నేనున్.
*క. ఒనరించితి నీవును జే,సినవాఁడవు విత్తనాథ! ♦ క్షితి నీరీతిన్
ఘననియమంబున నిటు దీ,నిని జేసినవాఁడు లేఁడు ♦ నిజ మిది సుమ్మీ!. ౨౮
క. ఇరువురమే తప్ప మత్తే, పురుషుండును జేయలేదు; ♦ పూర్వము నేనే
నిరుపమమగు నీవ్రతమును, ధరణిం బుట్టించినాఁడఁ ♦ దగునియమమునన్.
క. ధననాయక! యట్టివ్రతం,బును జేసినవాఁడ వౌటఁ ♦ బూనుము నాతో
డను మైత్రి నెఱప, సౌమ్యా!, ఘననియమం బొప్పఁ దపముఁ♦గావించితినూ!.
క. గెలిచితి వింద్రియవారం,బుల ననఘా! సఖుఁడ వైతి ♦ పో నా కింకన్
గులపాలక! నాదేవియుఁ, గలఁగి భవత్సవ్యనేత్ర♦కమలము మహిమన్. ౨౯
క. తనరూపము గాంచినకత,మునఁ గాల్చెను గాదె యింక ♦ ముందిది ధాత్రిం
దనగారుఁ గీర్తనీయం,బును రహస్యము నగుచు సుంత ♦ పొగులకు మాత్రన్.
సీ. పెంపొందు నేకాక్షి♦పింగళాహ్వయమును శాశ్వతంబుగ నీదు♦సవ్యనేత్ర
మనియె; నిట్లాశంక♦రునిసఖిత్వముఁ గాంచి తదనుజ్ఞ నొంది స్వ♦స్థానమునకు
వచ్చితి నే నిందు ♦ వరునఁగ నీపాపనిశ్చయంబును వింటి ♦ నీవు పూను
కార్యం బధర్మమై ♦ కన్పట్టుచున్నది, కులదూషణంబునై ♦ వెలసెఁ గాన
తే. దాని మానుము చిత్తంబు ♦ ధర్మయుక్త
ముగ నొనర్పుము, దేవతల్ ♦ మునివరులును
దవ్వధోపాయమును గూర్చి ♦ తలఁచుచున్న
వారు గావున మానఁగా♦వలయు నీవు. ౩౧ 531

* మయా చైత ద్వ్రతం చీర్ణం త్వయా చైవ ధనాధిప, తృతీయః పురుషో నాస్తి యశ్చరే ద్వ్రత మీదృశమ్-అనిమా.

క. అని ధనపతిమాటలుగా, వినిపించెను దూత! వాని ♦ విని దశముఖుఁడుఁ
గనియెం దీవ్రక్రోధం,బును వెంటనె దానిచిహ్న♦ములు పై నొప్పెన్. 33

*చ. పటపట పండ్లు గీటి గురు♦బాహువు లుద్ధతి నప్పళించి య
ప్పటికి సురక్తకాంతిఁ గను♦పట్టెడునక్షులతోడ నిట్లనున్
బటుతరరోష మొప్ప నిటు♦వంటి దురుక్తుల నీప్రభుండు చె
ప్పుటయును నీవుపల్కుటయుఁ ♦ బొందుగ వింటిని మాట లేటికిన్. 38 539

క. మాయన్న నిన్నుఁ బంపఁగ, నీయొడకున్ వచ్చినాఁడ ♦ వీవు తగదురా
రోయధమా! యిట్లాడఁగ, నాయన చెప్పినది హిత మ ♦ దగునే? నాకున్.

క. ధనరక్షకుఁ డగు నాతఁడు, నను నీతిసమన్వితుని నొ♦నర్పం బూనెన్
గన నిద్ది నాకు హితమనఁ, జనునే? యీనెపముచేత ♦ శంకరుచెలిమిన్. 3౫

తే. యక్షపతి చేయుచుండుట ♦ యాదరమునఁ
దెలిపినాఁడవు మూర్ఖ! యీ♦పలుకు లెల్ల
విని క్షమింపను మన సొప్ప ♦ దనుచు మఱియుఁ
బలికె; నోదూత! భ్రాతయం ♦ చలుక గొనక. 3౫౪ 542

సీ. క్షమియించినాఁడఁజూ♦చాలకాలముగురువతఁడు జ్యేష్ఠుఁడు నాకు♦ననుచుఁగరుణ
నిప్పుడు నీవన్న ♦ యీపల్కు విన నది పోయెఁ గ్రొత్తగ బుద్ధి ♦ పొలిచె నాకు
బాహువీర్యంబె నా ♦ కూహింప సాయమై యుండ ముజ్జగముల ♦ నుక్కడంతు
నీమహార్థమునందె ♦ యేను నీరాజునిమిత్తంబుగాఁ బూన్కి ♦ మించి లోక

తే. పాలకుల నల్వురను యమ♦పట్టణమున
కనిపెదను జూడు నాశక్తి ♦ యనుచుఁ బలికి
ఖడ్గమును జేతఁ బూని యి♦క్కడకు వచ్చి
హితము బోధించెదవె యంచు ♦ నేపుమీఱ. 3౯ 543

చ కరమున ఖడ్గ మూని యిది♦కార్యము కాదని యెంచ కట్టిదు
స్తరతరఖడ్గపాతమున ♦ త్క్ష్మాస్థలిపైఁ బొరలాడుచుండ భీ
కరుఁడగు రావణుండు వడి♦గా నొనరించెను దూత; నంతటన్
దురితమయాత్ములై చెలఁగు ♦ ధూర్తుల రక్కసులం బ్రియంబునన్. ౪౦ 544

తే. పిలిచి తినుఁడని యాతని ♦ వీన్ల నొసఁగె;
నంత స్వస్త్యయనాహ్వయం♦బైన కార్య
మొనరిచి రథంబు నెక్కి లో♦కనిచయజయ
మాత్మఁ గాంక్షించి పోయె నా♦యన్నపురికి. ౪౧ 545

పదమూఁడవ సర్గము సంపూర్ణము.

---

* హస్తౌ దంతాంశ్చ సంపీడ్య వాక్య మేత దువాచ హ-అనిమా.

## ౧౪ - వ సర్గము.

### రావణుఁడు కుబేరునిపై దండెత్తిపోవుట

క. దనుజేంద్రుండు మహోదరుఁ, డనఁగఁ బ్రహస్తుండు సార♦ణాఖ్యుండు శుకుం
డును మారీచుండు ననం,గను ధూమ్రాక్షుం డనంగఁ ♦ గ్రాలు సచివులన్. ౧

చ. అని నొనరింపఁ గోరుచు న♦హార్యబలోత్కటులైన వారలన్
దనుజులఁ గూడి *శ్రీయలర ♦ దారుణకోపమునన్ జగంబు లో
య్యన దహియింపఁ బోవునటు ♦ లాధననాయకుఁ డున్నచోటికిం
జనియె; ముహూర్తమాత్రమున ♦ సర్వవనోపవనాద్రివారమున్. ౨౫ 547

క. పురములను దాఁటుచున్ స,త్వరముగఁ గైలాసశిఖరి♦తల్లజమును జే
రె రహిన్ దద్గిరినుండిన, సురయోనులు యక్షు లపుడు♦శూరవతంసున్. ౩

క. దనుజేంద్రు ధనదసోదరు, ననిచేయఁగ మిగులఁ గోరు ♦ నాతని గిరికిం
జనుదెంచిన దశవదనుని, విని మంత్రులఁ గూడి వచ్చి ♦ వేడుక ననుచున్. ౩౫

క. అని యెఱిఁగి యక్షవరు లా,తనిమ్రోలన్ నిల్వలేక ♦ ధనపతి వసియిం
చినచోటికిఁ జని యాతని, కనుజునియాశయము లెల్ల ♦ నభివర్ణింపన్. ౪ 550

చ. ధనపతి యుద్ధమున్ సలుపఁ ♦ దద్భటసంతతి కాజ్ఞ యిచ్చె, నం
త నచటఁ బొంగి యాభటులు ♦ తద్దయుఁ బూనికఁ బోయి; రంత నా
ధనపసురారిసేనలకుఁ ♦ దద్దయు నబ్ధిఁ జెలంగు క్షోభమ
ట్లనుపమసంగరమ్ము తగె ♦ నద్రిఁ జలింపఁగఁజేయుపోలికన్. ౭ 551

తే. యక్షరాక్షససంకులం♦బైన యుద్ధ, మపుడు చెల్లెను దశకంఠు♦ననుఁగుమంత్రు
లెల్ల క్షోభించి; రట్టి యు♦ద్వృత్తిమీఱు,యక్షులం దాఁకి నిల్వలే♦నట్టివారి.

క. తనమంత్రుల వాహినులను, గని హర్షము మీఱ ధ్వనులఁ♦గావించుచుఁ దాఁ
జనియెను గ్రోధము పొంగన్, దనుజేంద్రుఁడు రావణుండు ♦ దర్పము వెలయన్.

చ. దనుజవరేణ్యమంత్రు లతి♦దారుణవిక్రము లంతఁ బోక యీ
సునఁ బెనఁగంగఁ బూనుటయు ♦ శూరులు యక్షులు వేయిమంది యొ
క్కని ననురేంద్రమంత్రిని ని♦కామరణోత్సుకుఁ దాఁకి పోరి; ర
య్యని దశకంధరుండు ముస♦లాసిగదాపరిఘాయుధంబులన్. ౧౦౫ 554

ఆ. శక్తితోమరముల ♦ శత్రుసేనల నొచ్చ
నట్లుచేయుచును మ♦హాగ్రహమున
సేన లందుఁ జొచ్చె; ♦ మానక యాతఁ డు
చ్చావసములను బుచ్చ ♦ కీనుఁ బూని. ౧౧౫ 555

క. పరసేనల వధియించుచు, గురుధారలఁ గురియుచున్న ♦ ఘోరపయోదో
త్కరముంబోలుచు శరభీ,కరవృష్టిని ముంచె యక్ష♦గణముల నెల్లన్. ౧౨

* శ్రీమాన్ క్రోధా ల్లోకాన్ దహ న్నివ-అనిమూ.

క. పైనడరి యక్షవీరు ల,సూనాంబకవృష్టిఁ గురియ ♦ నూత్సోత్సాహం
బూని వ్యథం బొందకయే, దానవపతి నిల్చె వీర్య♦దర్పము లలరన్. ౧౪ 557

చ. జలదము లొక్కరీతి గురు♦శైలముపైఁ బెనువృష్టి నించినం
దలఁగక కొండయుండుగతిఁ♦గా నతఁ డొప్పుచు దుష్టబుద్ధియై
చెలఁగుటఁ గాలదండమని ♦ చెప్పఁగఁ జాలు గదాయుధంబు ని
మ్ముల ధరియించి యక్షులన♦మూహముఁ జొచ్చి పరాక్రమంబునన్. ౧౫

చ. యమునిగృహంబుచేరనటు ♦ లంపుచు; శుష్కతృణంబుఁ జొచ్చి యు
ద్యమమున విస్తరిల్లుచు మ♦హాశనుఁ డొప్పెడురీతి నెండుని
ధ్మములను గాల్చు నగ్నివలె ♦ దారుణవాతయుతాగ్నిపోల్కి బా
ణములను గాల్చె యక్షులగ♦ణంబుల రావణుఁ డాహవంబునన్. ౧౬ 559

ఉ. దానవనాథుమంత్రులును ♦ దర్పము లొప్ప మహోదరాదు లె
ల్లని వధింప నా ననుచు ♦ నెంచి కుబేరభటాళి [1]సుంతయే
కానఁ బడంగఁ జేయఁగను ♦ గాఢమహద్గతి నంబుదావళుల్
కానఁగ రాక క్షీణతను ♦ గాంచువిధంబున యక్షు లయ్యెడన్. ౧౭ 560

సీ. కొంద ఱాయుధహతిఁ ♦ గూలిరి, భగ్నాంగులై కొంద ఱయ్యని♦యందుఁ బడిరి
మృతులయి, కొంద ఱు♦ద్ధతబాణహతులయి యతితీక్ష్ణదంతాళి ♦ నట్టె యోష్ఠ
ములను గీటుచు భూమి♦తలమున శయనించి; రతిభీతిఁ గొంద ఱ♦న్యోన్యదేహ
ములనుసమాశ్లేష♦ముల నొక్కటిగఁ జేర్చియాయుధములభూమి♦యందువదలి
తే. కూలములు నీటితాఁకునఁ ♦ గూలునట్లు
సంగరంబునఁ బడిరి య♦క్షప్రవరులు;
[2]ధరణి యుద్ధంబు చేయుచు ♦ దారుణాంబ
కములఁ బ్రాణము లొగిఁ బోవఁ♦గాఁ ద్వరపడి. ౧౮ 561

క. సురలోకమునకు గుంపుగ, నరుగుచు యక్షుల్ చెలంగు ♦ నవసరమున సం
గరమును జూచెడు మౌనీ,శ్వరులకు నంతరము కానఁ♦బడదయ్యె దివిన్. ౧౯

చ. తనమొన లిట్లు భంగమతి♦దారుణరీతిగఁ బొందియుంట నా
ధనపతి గాంచి బాహుబల♦దర్పము లొప్పఁగ నక్కటా! బలం
బున నసమానులౌ భటులు ♦ పోరున నిట్లయిరే యటంచు య
క్షనిచయవీరులన్ బనిచె ♦ సంగరకౌతుక ముల్లసిల్లఁగన్. ౨౦ 563

చ. శరణము గమ్ము వీరవర! ♦ శత్రువరార్దితులై రణంబునన్
బరిభవ మొందుచున్న భట♦వారవరేణ్యుల కంచు నొక్కనిన్

---

1 అల్పావశేషాస్తే యక్షాః కృతా వాతై రివాంబుదాః-అనిమూ. 2 యుధ్యతాం పృథివీతలే-అనిమూ.

నిరుపమవిక్రమక్రముని ♦ నిర్జరవీగుని బోనివాని స
త్వరముగ నాథనేశ్వరుఁడు ♦ తా ననికిం బనిపెం గడుం గ్రుధన్. ౨౧ 564

మ. అనిలోఁ జేడ్పడి యక్షనాయకులు శౌ♦ర్యం బేది తా రేగనుం
డిన యక్కాలమునందు యక్షతతిని♦ర్ణితస్థలిం జేరి రా
ధనప్రేషితయక్షసైన్యవిభుఁ, డు♦ద్యత్కౌతుకం బొప్ప వ
చ్చెను యుద్ధంబున కాతనిం గనుచు నా♦సేనల్ ముదం బొందఁగన్. ౨౨

తే. అతఁడు సంయోధకంటకుం ♦ డనఁగఁ బరఁగు
ననిమొనం జొచ్చి యాతం డ♦హార్యశక్తి
స్వబలముల నేఁచు *మారీచుఁ ♦ జక్రనిహతి
నొంచె విష్ణువు మును వాని♦నొంచినట్లు ౨౩ 566

క. గిరినుండి పడియె నాతఁడు, ధరణిని బుణ్యంబు తఱుగఁ ♦ దత్సురపురినుం
డి రయంబునఁ బడు మర్త్యుని,కరణిన్ మారీచుఁ డాత్మ♦గర్వము దూలన్.

తే. ధరణినుండి ముహూర్తమా♦త్రమున స్మృతిని
గలిగి తా లేచి మారీచుఁ ♦ డరిగి తీవ్ర
సంగరముచేసె నాతని♦శక్తిఁ దూలి
యక్షపతి భీతిఁ బరుఁగిడె ♦ నంతలోన. ౨౪ 568

క. కనకవిచిత్రాంగంబుగఁ, గనఁబడి వైదూర్యరజత♦కలితం బగుచున్
జను లెవ్వ రాజ్ఞ లేకయె, చనరాక భయంకరభట♦సముదయయుతమై. ౨౫

ఆ. అలరుచున్న తోర♦ణాంతర మాదశ
వదనుఁ డట్టె చొచ్చె; ♦ వారిరాకఁ
గాంచి రామచంద్ర! ♦ యంచితగతి సూర్య
భాను వనెడు ద్వార♦పాలకుండు. ౨౬ 570

క. ఘనశక్తి నడ్డగించెను;, జనరా దిందనుచుఁ బల్కి ♦ నరభసగమనం
బును వారింపఁగ నింతయు, దనుజేంద్రుఁడు సరకుఁ గొనక ♦ దర్పం బలరన్,

క. నిలువకయె పోవుచుండఁగ, ఖలుఁ డీతం డనుచు యక్ష♦కాంతుఁడు గ్రుధచేఁ
బెలుచం దోరణ మపుడు పెకలించి యాదనుజవర్యుఁ ♦ గడు నొప్పించెన్.

క. తోరణసంతాడితుఁడై, ధారలుగా రక్త మొలుక ♦ ధాతుద్యుతు ల
వ్వారిగ స్రవింప నొప్పెడు, భూరితరంబైన శిఖరి♦పోల్కిఁ గనఁబడెన్. ౨౭

సీ. శైలకూటాభమై ♦ గ్రాలెడు తోరణంబునఁ గొట్టఁబడి సుంత♦యును జలింపఁ
డయ్యెను; శ్రీరామ! ♦ యబ్జజుం డిచ్చిన వరములమహిమచేఁ♦స్వరఁగ నతఁడు
తత్తోరణంబుచే♦తనె యక్షవర్యుని ద్వారపాలకు మోఁదె ♦ దాన యక్షుఁ
డటఁ బడియెను జూర్ణ♦మై యంగములురాలఁ;, నంతటయక్షులా♦యసురవర్య

* తేన చక్రేణ మారీచో విష్ణు నేవ సమాహతః-అనియు.

ఆ. విక్రమంబుఁ గాంచి ♦ వెస భయపీడితు
లగుచు నదుల గుహల ♦ నాయుధాళి
వదలి శాంతులయి వి♦వర్ణాస్యులై చొచ్చి
రింకఁ జంపు మమ్ము ♦ నీతఁ డనుచు. ౩౧॥ 574

పదునాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౧౫ - వ సర్గము.

{ రావణుఁడు మాణిభద్రాదుల నోడించి కుబేరుని మూర్ఛితుం జేసి పుష్పకంబుం గొని మరలుట. }

చ. అనిమొన భీతులై పఱచు ♦ యక్షుల వీఁగుల వేనవేల నా
ధనపతి గాంచి యక్షగణ♦తల్లజుఁడై తగు *మాణిచారునిం
గని యిటుపల్కె; యక్షవర! ♦ కానిపథంబున సంచరించు పా
పనిలయు నీదశాస్యుఁ దగు♦భంగిని జెండుము నేర్పుమీఱఁగన్. ౧॥ 575
క. శరణము కమ్మా త్వర సం,గరరంగమునందు యక్ష♦కాంతులె యయ్యున్
సురవైరిభీతులయి యి,క్కరణిం బరుగిడెదు నాదు♦గణపాలురకున్. ౨ 576
క. అని యాన తిచ్చినం గ్ర,న్నన దానిన్ భుక్తిశిరము♦నం దాల్చి దురం
బున దుర్జయుఁడను నామం,బును గాంచిన గురుభుజుండు♦పొంగెడుకాంక్షన్.
తే. మాణిభద్రుండు ధనపతి♦మంత్రి నాల్గు
వేలయక్షులతోఁ గూడి ♦ విక్రమించి
సంగరము చేసె; నాభట♦సముదయములు
గదలు, ముసలంబులును, ప్రాస♦గణము మఱియు. ౩॥ 578
తే. శక్తి,తోమర,ముద్గర,♦సముదయములు
కరములం గ్రాలుచుండ ర♦క్కసులఁ దాఁకి
పటుతరంబగు బలమున ♦ బడలువడఁగఁ
జేయుచున్ జొచ్చి రనిఁ జేయు♦సేనలందు. ౪ 579
చ. కరశరలాఘవంబు లొగిఁ ♦ గన్పడఁగాఁ దుములాహవంబు భీ
కరగతిఁ జేయుచుండఁగ ని♦శాచబలంబున నొక్కయక్షుఁ డా
శరుఁ గని యుద్ధ మిమ్ము బల♦శాలివయే నన రక్కసుండు సం
గరమను భిక్ష యిచ్చితిని ♦ గైకొను రమ్మిఁకఁ జూత మం చనన్
బరవస మొప్ప శ్యేనముల♦భంగిగ లాఘవ మొప్పమీఱఁగన్. ౫॥ 580
ఆ. తుములయుద్ధమందు♦ధూర్తుఁడొక్కఁడుపిల్వ,నిచ్చయింపయుద్ధ♦మిప్పు డనుచు
నొక్కరుండు పల్కుఁ♦జక్కనై నిల్వుమం,చొక్కరుండుపల్కు♦నుక్కు మిగుల.

---

* ధనాధ్యక్షో మహాయక్షం మాణిచార మథాబ్రవీత్ - అనిమూ. మాణిచారః మాణిభద్రః - అనివ్యాఖ్య. మాణిభద్రునకు మాణిచారుఁడనియు నామము గలదు.

క. అని తుములంబుగ జరగం,గను వేడుక నిర్జరులును ♦ గంధర్వులు చ
క్కనిజ్ఞాననిధులు నాఁ జను, మునులును జనుదెంచి వ్యోమ♦మున నిల్చి తగన్.

సీ. కనుఁగొని విస్మయం♦బును బొంది రెంతయు; నంతఁ బ్రహస్తుండు♦యక్షవరుల
వేయి మందిని జంపె♦ వేయిమందిని మహోదరుఁడు వధించె దు♦ర్దాంతబలుఁల;
నతికోపమును బొంది♦యతిదురాత్ముండగు మారీచుఁ డొకక్షణ♦మాత్రమునన
యక్షసహస్రద్వ♦యంబును వధియించె న్యాయంబు వదలక ♦ యక్షు లెల్లఁ

*ఆ. జేయు యుద్ధమేడ? ♦ మాయాబలాశ్రయం,బై నిశాచరకృత♦మైన యుద్ధ
మేడ? రామచంద్ర! ♦ యినకులదీపక!, యట్టు లోట దనుజు ♦ లధికు లనిని. ౯

క. దనుజేజ్యుఁడు ధూమ్రాక్షుఁడు, చని తగ నమ్మాణిభద్రు ♦ సమధికబలుఁ దాఁ
కి నిశితముసలంబున నా,తనివక్షముఁ గాంచి మోఁదె ♦ దాన నతండున్. ౯॥

క. చలియింపక గదఁ గైకొని, యలఘుతరంబైనశక్తి ♦ నాధూమ్రాక్షుం
జలమున నొప్పించిన ని,మ్ములఁ దల పగులంగ దనుజ♦ముఖ్యులు వగవన్. ౧౦॥

ఆ. విహ్వలించి యతఁడు ♦ వే ధరఁ బడియెను; రణమునందు నోట♦రక్తములుక
నట్టి యొరిగియున్న♦యాధూమ్రనయనునిఁ, గాంచి మాణిభద్రుఁ♦గడఁగిచంప.

క. పరుగిడెను దశగ్రీవుఁడు, త్వరపడి చనుదెంచుదనుజ♦వరు, లయపై శ్వా
నరుఁ బోలువానిఁ గ్రుద్ధునిఁ, బరికించి కుబేరమంత్రి♦వర్యుఁడు పూన్కిన్.

క. చనుదెమ్మా ఫల మబ్బెదు, ననిశక్తిత్రయము వైచి ♦ యాతని నొంచెన్;
దనుజేంద్రుం డత్తఱి నా,తనిముకుటస్థలము సద్గ♦దాహతి నొంచెన్. ౧౩॥

సీ. తద్గదానిహతి నా♦తనిదైన ముకుటంబు ప్రక్కకు నొరిగెను; ♦ ప్రథన మిట్లు
చేయుచు దనుజేంద్రుఁ♦డా యెడఁ దన్ను నామాణిభద్రుఁడుతీవ్ర♦మార్గణముల
నొవ్వఁగాఁ జేసిన ♦ నొచ్చినయట్లుండ కలరారె నదిమొద ♦ లాకుబేర
మంత్రివర్యుఁడు పార్శ్వ♦మౌళి యనంబడె; బవరంబునన్ మాణి♦భద్రుఁడిట్లు

ఆ. మతిమహత్వ మేగఁ ♦ జ్యుతిఁ గని విముఖుఁ డై
యుండ దనుజవర్యు ♦ లొక్క పెట్టు
నార్వఁ దద్రవం బ♦హోర్యంబునన్ నిండె;
నంత మాణిభద్రు♦నపజయంబు. ౧౬ 589

క. విని ధనపతి రావణుచే, ననిఁ బడుయక్షులసహస్ర ♦ మందుం గని య
క్షనికరము లెల్ల వెంటం, జను దేరఁ బురంబు వెడలి ♦ చనుదెంచెఁ గ్రుధన్.

క. ధనపతి గదఁ దాలిచి చెం,తను శంఖము పద్మ మనఁగఁ ♦ దగు నిధులకు నే
ఘను లధిదేవతలో వా, రనునయమునఁ గొల్చి రాఁగ ♦ నాహవకాంక్షన్.

తే. ప్రోష్ఠపదశుక్రు లనఁబడు ♦ భూరిశక్తి
యుక్తసచివులు వెంటరా ♦ నొప్పుమీఱి

* క్వచ యక్షార్జనం యుద్ధం క్వచ మాయాబలాశ్రయమ్-అనిమూ.

దూరమున నున్న రావణుఁ ♦ జేరఁబోయి
తండ్రి, యిచ్చినశాపము ♦ తగిలియుంట. ౧౮½ 592

క. తనయందు జ్యేష్ఠగౌరవ, మునుపని సోదరునిఁ గాంచి ♦ యొప్పమననుతో
ననిరోఁ; బైతామహకుల,మునకుం దగినట్లు దుష్ట♦బుద్ధీ! దనుజా!. ౧౯½

క. నే నెంతో యుక్తి చెప్పితిఁ, గాని మదుక్తంబు గొనవు♦గా పాపాత్మా!
దీనికి ఫలంబు వెనుకన్, గానంబడుఁ జుమ్ము నీకె ♦ కడుఁ గ్రూరంబై. ౨౦

తే. పూజ్యపూజావ్యతిక్రమ♦భూరిదోష
మునకుఁ బరిపాకమును జక్కఁ ♦ బొంది నిరయ
మొందినప్పుడు నీమది ♦ కొప్పుఁ దెలియఁ
గలదు; మోహంబుచేత నో♦క్కండు భువిని. ౨౦½ 595

క. అన్నము లేనికతంబున, నెన్నక విష మట్టి ద్రావు ♦ నెఱుఁగం డడియుం
దన్నుం జంపెడు నని విష, మన్నమువలెఁ గాక పక్వ♦మాతరుణమునన్. ౨౧

తే పలువికారంబులను బెట్టఁ ♦ గలఁగి యపుడు
తాను జేసినకార్యంబు ♦ త ప్పటంచు
దానిఫలమును గంటి ని♦ త్తఱి నటంచుఁ
దెలిసికొను వాఁడు; దానిచే ♦ ఫలము గలదె. ౨౧½ 597

సీ. ధర్మయుక్తంబుగఁ ♦ దనరునే యొకదైన కర్తృకంబున నీకుఁ ♦ గలిగె నిట్టి
క్రూరత్వ మిందుల♦కన్ దేవతలు నిన్నుఁ గొని యాడరనుటమై♦నను దెలియవు
మహిని నెవ్వఁడు పితృ♦మాతృభ్రాతృప్రభృతులను దేశికులను ♦ దూలనాడి
యవమతి నొందించు ♦ నతఁడు ధర్మనివశంగతుఁడయి తత్ఫల♦మతిశయముగ

తే. నందుఁ గాంచు; నశాశ్వత♦మైన తనువు
నందు నమ్మిక గలిగి య♦త్యంతశుద్ధ
మైన తపము నార్జింపని♦యతఁడు వెనుక
మూఢుఁడై చచ్చి తనకర్మ♦మునకు గతిని. ౨౨ 598

క. కనుఁగొని తపియించును జూ;, విను ధర్మమువలన రాజ్య♦వితతధనములం
గను సుఖము, న ట్లధర్మం,బున దుఃఖము గల్గుఁ; గానఁ ♦ బొరిసుఖములకై.

క. ఒనరింపవలయు ధర్మం,బును బాపము విడువవలయు ♦ భువిఁ బాపఫలం
బును బొందందగు నీయాత్మను దుఃఖముగాదె ఫలము ♦ దానికిఁ గుమతీ!. ౨౩

తే. కాన నాత్మాపఘాతార్థ♦మై నరుండు
మూఢుఁడై చేయు బహుపాప♦ములను; సాధు
బుద్ధిరహితున కెవని కే ♦ నిద్ధరణిని
జనకముఖసేవ లేక స్వే♦చ్ఛగను సుమతి. ౨౩½ 601

క. కలుగదుపో; దైవంబే, యిలఁ జర్యలఁ గలుగఁజేయు ♦ నెపఁడైన విధిన్

దొలఁగక దాన హతుండగుఁ, జెలఁగుచు నేకర్మములను ♦ జేయునొ తాన్నై.

తే. అట్టిఫలము నపొందు; ని♦య్యవనియందు, బుద్ధిబలరూపముల, విత్త♦మునుదనయుల
శౌర్యధీరత్వములమహా♦శక్తిసుహిమములస్వకృతపూర్వకర్మ్మరా♦సులవలన నె.

క. ఫలములఁ బొందుదురు మనుష్యులు; నీమతి యిట్టిరీతి ♦ నొదవుటచేతన్
గలుగును నరకము తప్పక, కులపాంసన! నిర్ణయ మిది ♦ కుమతులకె గదా? ౨౯

ఆ. ఖలుఁడ వౌట నిన్నుఁ ♦ గని మాటలాడఁగాఁ, జన; దటంచుఁ బలికి ♦ ధనదుఁ డసుర
వర్యుచెంతనున్న ♦ బలదర్పులగు మంత్రివరుల నొంచెఁ దీవ్ర ♦ బాణతతుల. 30

క. ధనపతిఁ గనుఁగొని రామా!, యనుపమబలయుక్తులయ్యు ♦ నామారీచా
దినిఖిలమంత్రులు దీనతఁ, గను మోములఁ దొలఁగి చనిరి ♦ కడు వేగమునన్.

మ. ధనదుం డంత గదాభిఘాతమున నా♦దైత్యేంద్రుమూర్ధంబుఁ జ
క్కనిలక్ష్యంబుగఁ గాంచి మోఁదుటయుఁ ద♦ద్ఘాతంబుచే నొవ్వక
దనుజగ్రామణి సుంతయేనియును ద♦త్స్థానంబునే వీడ కుం
డెను; వారంతఁ బరస్పరంబు యశముల్ ♦ నిల్పంగ లో నెంచుచున్. 3౧

క. ఇతరేతరంబు శస్త్రప్రతతుల నొప్పించుచున్ వి♦రామము గనకే
చ్యుతి నొందక విహ్వలులై, యతితరమగుబడలికలను ♦ నందక యుచటన్. 3౨

తే. ఒకరి నొకరు జయింప ను♦ద్యుక్తు లగుచు
నని నమర్షమునుం జేసి ♦ రపుడు ధనదుఁ
డార్చి యాగ్నేయ మనెడు ది♦వ్యాస్త్ర మట్టి
మార్వి సంధించి దశవక్త్ర♦గర్వ మడఁప. 33 609

క. అడరించె నంత దశవదనుఁడు వారుణదైవశంబు♦నన్ దీవ్రమునొ
గడిఁది మహాస్త్రముచేఁ దా, నుడిపెను దచ్ఛక్తి బలము ♦ లోహో యనఁగన్.

చ. దనుజవిభుండు తత్ప్రహిత♦దారుణమంత్రయుతాస్త్ర మిట్లుగాఁ
జనునటు చేసి కృత్రిమపు♦జన్యము చేయఁగ *రాక్షసార్హమై
తనరెడుమాయఁ గైకొని శ♦తంబులు వేలును గాఁగ రూపముల్
కనఁబడఁ జేసి యార్చె; దశ♦కంఠుఁ డొకప్పుడు వ్యాఘ్రరూపమున్. 3౪

తే. గిరివరాహజీమూతసా♦గరమహీరుహాదిరూపంబులను దైత్య♦యక్షరూప
ములనుగొని కానఁబడియెను♦బలువిధమ్ములైనరూపంబులను జేసె♦నద్భుతముగ.

క. కనఁబడ కుండె నొకప్పుడు, కనఁబడుచునె పొగడుచుండెఁ ♦ గడుఁ గ్రూరముగా
నని యిట్లు సాగ నంతటఁ, దనకు మహాస్త్రం బనంగఁ ♦ దగునొక్క గదన్. 3౫

చ. కరములఁ ద్రిప్పి యక్షగణ♦కాంతునిమూర్ధముపైన మోఁదె; న
క్కరణి గదాభిఘాతమునఁ ♦ గాయము నొవ్వఁగ విహ్వలించి భీ

* తతో మాయాం ప్రవిష్ట స్స రాక్షసీం రాక్షసేశ్వరః-అనిమా.

కరముగ నల్ల గాలిఁగను ♦ గంపము నొంది నికృత్తమూలమై
తరువరమా నశోకమువి♦ధంబునఁ ద్రెళ్ళె ధనేశుఁ డుర్విపై. ౩౮ 614

చ. ధనపతి యిట్లు మూర్ఛిలి ని♦తాంతము విస్మృతిఁ గాంచఁ బద్మము
ఖ్యనిధిసుకుల్ వగం బొగిలి ♦ యాతని వేగమ నందనాఖ్యమా
వనమును జేర్చి యాశ్రమముఁ ♦ బాపిరి శీతలనక్రియాదులన్;
దనుజవిభుండు యక్షపతిఁ ♦ దా నని గెల్చి ప్రహృష్టచిత్తుఁడై. ౩౯ 615

ఆ. అతనిపుష్పకము జ♦యాంకముఁ గైకొనె, నావిమానవర్య ♦ మమలమౌక్తి
కవ్రజాభినిబిడ♦కమనీయహారాభి,శోభితంబు మిగుల♦సుందరంబు. ౪౦ 616

సీ. సర్వకాలంబును ♦ సమధికవాంఛల నొసఁగఁ జాలినఫల♦విసరములను
రాజిల్లు భూరుహ♦రాజంబులొప్పంగఁ గాంచనస్తంభసం♦కలిత మగుచు
వైడూర్యతోరణ♦భాసమానంబయి కామగమంబుగాఁ ♦ గ్రాలి కామ
రూపంబునై గురు♦పాపహారంబునై తగు మనోజవమునఁ ♦ బొగడఁబడుచు

తే. నాకసంబునఁ బోనేర్చి ♦ యమలరత్న కనకసోపానములఁ జెన్నుఁ♦గాంచి తప్త
భర్మమయ వేదికలుగల్గి♦బహువిచిత్రశిల్పముల నక్షయంబయి♦చెలఁగిమఱియు.

క. సురలను మోయంగాఁ దగి, నిరతము దృక్చిత్తములకు ♦ నిశ్చలసుఖమున్
బరమంబు నిచ్చుచున్ విధి,పరినిర్మితమై యొసంగి ♦ భక్తివిధములన్. ౪౩

ఆ. అతివిచిత్ర మగుచు ♦ నఖిలకామప్రద,మగుచుఁ గాంతమయి మ♦హార్హ మగుచు
నాతిశీతమగుచు ♦ నాత్యుష్ణమగుచు శు,భంబు సర్వకాల♦భవసుఖదము. ౪౪

క. దనుజేంద్రుఁ డవ్విమానం,బును వీర్యవినిర్జితంబుఁ ♦ బొంగెడుకాంక్షన్
గని యెక్కి త్రిభువనంబులు,తనవశములె యయ్యె ననుచుఁ♦దలఁచెఁగుమతివై.

క. ఘనతరదర్పంబున నా,ధనపతి నిట్లనిజయించి ♦ తాఁ గైలాసం
బుననుండి దిగియె దానవు, లనూనరీతులు నుతింప ♦ నాత్మ నలరుచున్. ౪౬

క. తన తేజంబున విజయం,బు నీవిధిం గాంచి శౌర్య♦మున నొప్పుచుఁ జ
క్కనిహారకిరీటంబులు, తనకున్ హర్షంబు నీయఁ ♦ దద్యానంబున్. ౪౭ 622

తే. హర్షమున నెక్కి సభయందు♦నలఘుహూతవ,హునివిధంబున రాజిల్లి♦తనవిభవము
దేవతలు చూచి మెచ్చున ♦ ట్లావిధమున,నద్రిదిగియేగెయక్షులు♦వ్యసనమంద.

పదునేనవ సర్గము సంపూర్ణము.

---

## ౧౬ - వ సర్గము.

{ రావణుని నందికేశ్వరుఁడు శపింపఁ గోపంబునఁ గైలాసంబు నెత్తి యవమానింపఁబడి శంకరు నుతియించుట. }

క. తనయన్నఁ గుబేరుని ని, ట్లనిమొన నోడించి రాక్ష♦సాధీశుఁడు చ
య్యన స్కందుం డుదయించిన,వనమును శరవణ మనంగ ♦ భాసిలుదానిన్. ౧

క. కనఁజనియె; నంతటం ద,ద్దనుజాధీశ్వరుఁడు రుద్ర♦దైవత మగుచున్
వనరుహామిత్రమరీచులఁ, గనదురురూపంబు నొంటఁ ♦ గమ్రతరంబై. ౧౪
క. రెండవసూర్యునిరీతిగ, మండెడునటు తోఁచుచున్ స♦మస్తశరణము
ద్దండమునై శరవణ మనఁ, గొండాడం బడుచునున్న ♦ కొండను గనియెన్.
క. శరవణమను నామంబునఁ, బరఁగెడు నాకొండ నెక్కి ♦ భవ్యతరవనాం
తరమును గాంచెను; నచ్చట, నరపుష్పక మరుగకే న♦భంబున నిలిచెన్. ౩
సీ. పుష్పకం బచ్చటఁ ♦ బోవకుండుటఁ గాంచి కామగం బిద్ది యి♦క్కరణి నగతి
తను బొందె నేమొకో ♦ యని దశగ్రీవుండు సచివులతో నెంచి ♦ సమధికమగు
నాత్మేచ్ఛరీతిగా ♦ నరుగ నీపుష్పక మేలొకో నిలిచిన ♦ దీగిరిపయి
నివసించి నట్టి యే♦నిశ్చలమతి యిట్టి కార్య మొనర్చెనో ♦ గాక వేఱు
ఆ. గలదె యనుచు నంత ♦ లలితబుద్ధిస్ఫూర్తి
వెలయుచుండు మంత్రి♦వితతి నిపుణుఁ
డై చెలంగుచున్న♦యట్టి మారీచుండు
దశవదనునిఁ గాంచి ♦ తా వచించె ౪ 628

ఉ. దానవనాథపుష్పకము ♦ తా నిఁక మీఁదటఁ బోవకుండఁగా
నానుట కేదొ కారణము? ♦ మంచిది యుండక బో దదెట్లనం
గా నిపు డీగిరీంద్రమునఁ ♦ బ్రాలెడుశృంగమునందు నున్న యీ
మానవవాహనుండు స్వవి♦మానము సాగకయుండఁ జేసెడిన్. ౬ 629

తే. ఇట్టి యద్భుతమాకర్మ ♦ మొన్న నతని
దే యటంచుఁ దలంచెద; ♦ నిట్లుగాక
యున్న ధనదుని దక్క నిం♦కొకని నొరుని
నీవిమానము గొనిపోవ ♦ నెంచ దేమొ?. ౭ 630

క. కనుకనె ధనపతి లేమిని, జనకున్నది గిరిని దాఁటి ♦ సహజగతి నటం
చనుచుండఁ గృష్ణపింగళ,తనుఁడై వామనుఁడు నగుచుఁ ♦ దా ముండియునై.
తే. వికటుఁ డౌచుఁ గరాళుఁడై ♦ వితతబలుఁడుఁ
హ్రస్వభుజుఁడును నగు నంది ♦ రాక్షసేంద్రు
పార్శ్వమునఁ దోఁచి యిట్లని ♦ పలికె భవుని
యనుచరుండొట శంకలే ♦ కతనిఁ గాంచి,. ౯ 632

క. దనుజేంద్రా! దశవదనా!, వెనుకకుఁ జను మింక నిందు ♦ విషమాక్షుఁడు గౌ
రిని గూడి క్రీడ సల్పెడు, *దనుజులకున్ రాక్షసులకు ♦ దానవులకునున్. ౧౦
క. గరుడులకు భుజంగములకు, గురుబలులౌ యక్షవీర♦కూటమునకు ని
ర్ధరఁ గల్గు భూతతతికి శిఖరి యిద్ది యగమ్యముగను ♦ గావింపఁబడెన్. ౧౦౪

* దైత్యదానవరక్షసామ్-అనిమూ.

క. మరలుము దుర్బుద్ధీ! యీ, ధరణీధరమందుఁ జాల♦తడవొనరిచినన్
మరణంబు తప్ప; దిప్పుడె, యరిగిన నదిలేకయుండు ♦ నని పల్కుటయున్.

క. ఆనందిమాటలన్ విని, దానవనాథుండు మదిని ♦ దారుణకోపం
బూని [1]కడుఁగుండలములం, గానంబడు కంపమునను ♦ గ్రాలుచు మఱియున్.

క. అరుదుగఁ గన్పడుకోప,స్ఫురణంబున రక్తనేత్ర♦పూగముఖుండై
సరగునఁ బుష్పకమును దిగి; హాగఁ డెవ్వఁ డటంచుఁ గడున♦హంకారమునన్.

క. గిరిమూలముఁ జేరెను; శం,కరునకు దూరమునుండి ♦ కడుఁ దీవ్రంబై
పరఁగెడుశూలాయుధమును, ధరియించి ద్వితీయహరుఁడె♦తలఁప నితఁ డనన్.

క. అలరారునంది నట ని,ర్మలబుద్ధిఁ జెలంగువాని ♦ రాజధరుని శ్రీ
లలితపదసేవకుని ని,మ్ములఁ గాంచి దశాననుండు ♦ మోదము తనరన్. ౧౪

క. వానరముఖమున నాతఁడు, కానంబడు టెన్ని మౌర్ఖ్య♦కలితమతియునై
తానపుడు నవ్వఁ బక్కునఁ, [2]బానీయయుతాభ్రమట్లు ♦ పరిహాసమునన్.

క. హరురెండవతను వనఁగాఁ, బరికీర్తితుఁడై చెలంగి ♦ భగవంతుండై
ధర నొప్పు నంది కోప,స్ఫురణంబున వచ్చియున్న ♦ సురరిపు నతనిన్. ౧౫

చ. కనుఁగొని పల్కె నిట్లు; దశ♦కంఠ! దురాత్మక! వానరాకృతిం
గని తగు నన్నుఁ గాంచి మది ♦ గర్వము నొందినవాఁడ వౌటఁ జ
క్కనివిధిఁ జూడ కెంమలకుఁ♦గా నిటు నవ్వి పరాభవించితో
[3]ఘనపవిపాతమట్లు ననుఁ ♦ గాంచి ప్రహాసము చేసినాఁడవో. ౧౬ 642

తే. కనుక మద్వీర్యసంపన్ను ♦ లనుపమాన
మత్సమాన తేజస్కులు ♦ మహితశక్తు
లునగు వానరు లిద్ధర♦ణిని ద్వదన్వ
యమును నశియింపఁ జేయ నా♦యభిమతమున. ౧౭ 643

క. జనియింతురు; నఖదంష్ట్రా,శిని నాయుధములుగఁ గొనుచు ♦ లీలమెయిన్ జ
క్కని పోల్కిఁ బోరుసల్పం,గను జాలి పరాక్రమమున ♦ గాఢబలములన్. ౧౮

సీ. మనసుపోలిక వేగ♦మునను శైలములట్లుచరియింపఁగనువారు♦చాలియుంద్రు;
వార లొక్కటిగను ♦ జేరి [4]సహామాత్యతనయుండవౌ నీదు♦దర్పబలము
లను,మహోత్సేధంబుఁ♦బనివడివిభజించివిలయమొందఁగఁ జేయఁ♦గలరు;దనుజ!
నిన్ను నిప్పుడె చంప ♦ నేనె చాలుదుఁగాని వధియింపఁగా రాదు♦భగవదాజ్ఞఁ

తే. బూర్వజని స్వీయకర్మస♦మూహమున నె
హతుఁడవైతివి నీవె యం♦చామహాత్ముఁ

1 ఇతి నందివచ శ్శ్రుత్వా క్రోధా త్కంపితకుండలః-అనిమూ. 2 సతోయ ఇవ తోయదః-అనిమూ పానీయ మనఁగా జలము 3 అశనీపాతసంకాశ ముపహాసం ప్రముక్తవాన్-అనిమూ. 4 లే తవ ప్రబలం దర్ప ముత్సేధం చ పృథగ్విధమ్-అనిమూ.

డైన నంది వచించిన ♦ నవుడె దేవ
దుందుభులు మ్రోసె సుమవృష్టి ♦ తోఁచె నవుడు. ౨౧ 645

చ. వరబలుఁ డా దశాననుఁడు ♦ వర్షము పుష్పమయంబుగాఁగ నం
బరముననుండి యుప్పతిల ♦ వారక దుందుభు లెల్ల మ్రోఁగ శం
కరపదభక్తువాక్యము త♦గం గుదియింపఁగ వాని నెల్లఁ గా
వరమున లెక్కచేయకయె ♦ పర్వతముం బడిఁ జేరి యిట్లనున్. ౨౨ 646

తే. గోపతీ! పుష్పకవిమాన ♦ మీపగిదిగఁ, బోవకుండఁగఁ జేసె నీ♦భూధరంబు
కారణం బేమొ దానికై ♦ గడఁగి దీనిఁ, బెల్లగించెదఁ జూడుమ♦ద్వీర్యమిచట.

క. అనుదినము శంకరుం డీ,ఘనగిరిపయి నేప్రభావ♦కలితుండయి కే
ళిని సల్పునో రాజువలెన్, గనఁ డిదె సాధ్వసము చెంతఁ ♦ గలదనియాత్మన్.

క. కనుఁగాక దాని నిఁకమీఁ,ద ననుచు నీరీతిఁ బల్కి ♦ దశకంఠుండున్
దనబాహువులం ద్రిప్పుచుఁ, జొనిపెన్ భూధరముక్రింద ♦ శూరత పొంగన్.

చ. కరముల నిట్లు చొప్పఱిచి ♦ క్ష్మాధరవర్యముఁ దూఁగునట్లు ని
ర్భరతరశక్తిఁ జేసె; గురు♦పర్వత మయ్యది యట్టె లేచి య
త్తఱుణమునన్ వడంకె నిటు ♦ ధాత్రిధరంబు వడంక నద్ది మం
దిరముగనుండుశంకరుని ♦ దేవవిభున్ భజియించునిర్జరుల్. ౨౬ 650

క. పరికంపించిరి; శివునుం,దరి పార్వతి పర్వతంబు ♦ తత్తఱ[1]పడుచోఁ
గరము భయంపడి వడఁకుచు, హరుఁగౌఁగిటఁ జేర్చెఁ దానె♦యాతురమొప్పన్.

చ. తనసతి సత్వరంబుగను ♦ దన్నిటు గౌఁగిటఁ జేర్ప శంకరుం
డనఘుఁడు దానికారణము ♦ నాత్మ నెఱింగెను సర్వవేత్త కా
వునఁ గడు నవ్వుచున్ దనుజు♦భూరిపరాక్రమ మెల్లఁ గాంచి చ
క్కనిదొకయాటరీతిగ ము♦ఖంబున సుస్మిత మంకురింపఁగన్. ౨౭ 652

మ. చరణాంగుష్ఠముచే విలాసముగ నా♦క్ష్మాభృద్వతంసంబు ను
ర్వరఁ జేరన్ వడి నొత్తఁ బీడితములై ♦ రక్షోభుజంబుల్ ధరా
ధరవర్యంబు పయిం బడంగ ధరణీ♦ధాత్రీధ్రమధ్యస్థలిన్
బరమార్తిం గనె; దానవేంద్రసచివ♦వ్రాతంబు లల్లాటకున్. ౨౮ 653

చ. మనముల విస్మయంబుఁ గని ♦ మాటు వచింపఁగ నోడియుండి; రా
దనుజవరుండు రోషమునఁ ♦ దత్కృతదోఃపరిపీడనంబునన్
గనలి మహావిరావమును ♦ గ్రన్ననఁ జేసెఁ ద్రిలోకముల్ చలిం
చెను దదుదీరితధ్వనికిఁ; ♦ జేడ్పడి మానవు లెల్ల నత్తఱిన్. ౨౯ 654

క. ధ్వనియిది యెటు గల్గెనో యని, మనముల భీతిల్లి లోక♦మండలివిలయం
బని తలఁచిరి దేవత లా,ధ్వనిచే సంక్షుబ్ధు లగుచుఁ ♦ దమమార్గములన్. ౩౦

1 'పదుచో' అనుపదమునందుఁగల 'చో' అనునక్షరము గాయత్రియిరువదిరెండవ యక్షరము.

క. చని రప్పుడె పయనంబై;, [¹ఘనపర్వతరాజి పగిలెఁ ♦ గరులా ర్తిని గ
ర్జనము లొనర్చెను బలుమరు, వనూనసత్త్వములు గల్గు♦నట్టి ప్రముఖులున్.

తే. పెక్కుపర్యాయములు ధ్వనుల్ ♦ పిక్కటిల్ల
నార్చి రిది యేమి ప్రళయమో ♦ యంచు జలధు
లట్టె కలఁగె వసుంధర ♦ యతిశయముగ
వడఁకె; నాగగంధర్వులు ♦ భయము మిగుల ౩౨ 657

క. చనువార లట్టె నిలిచిరి;,] ²దనుజేంద్రామాత్యు లెల్ల ♦ దారుణకులిశం
బునఁ బిండిచేయు విలయం, బని తలఁచిరి త్రోవలందు ♦ నరుగుచు భీతిన్. ౩౩

క. సురనాథప్రభృతులు మో,దరహితులై నిల్చి; రంతఁ ♦ దద్ధ్వని విద్యా
ధరులును సిద్ధులు యక్షో,త్కరపూజ్యులు వినుచు నేమి♦ధ్వనియిదియనుచున్.

తే. వెఱఁగుపడి; రంత దానవ♦వీరుమంత్రు, లార్చుచున్నవిభుం గాంచి♦యభవునీల
కంఠునిం బార్వతీపతిఁ ♦ గరము తృప్తి, నందఁ జేయుమహాదేవుఁ♦ డతఁడెదిక్కు.

క. శరణం బతఁడే యొరుఁ డొ,క్కరుఁ డీయిల లేఁడు నతులఁ ♦ గరుణారాశిన్
బురహరు నలరింపుము స్తుతి,వరములఁ దిక్కివె యనుచుఁ ♦ బలుకుము రాజా!.

క. కరుణానీరధి కావునఁ, బరితుష్టుండగుచు నిన్నుఁ ♦ బాలించు నవన్;
బరికించి వారిపలుకులఁ, బరిపూర్ణ వృషధ్వజున్ స్వ♦భావమహితునిన్. ౩౭

సీ. సామమంత్రంబుల ♦ సాధునుతిప్రతతులను నుతించుచుఁ ♦ బలుకుల నెస [లొగి
మస్కరించుచుఁ గృపా♦మహితాత్మ! కావవే యనుచునార్చుచునున్న♦³యబ్దము
వేయి గతించె; నీ♦విధమున నలరింప సంప్రహృష్టుండయి ♦ శంకరుండు
శైలాగ్రముననుండి ♦ చరణపద్మాంగుష్ఠమును లేవనెత్తి యా♦దనుజుబాహు

ఆ. వులకుఁ బీడమాన్పి ♦ పలికె; శ్రీరాఘవా!, దశవదనుని గాంచి♦తమిని బొంది
నాఁడ నీవిషయము♦నన్ ⁴నీదువీర్యశౌం,డీర్యములకు మదిని ♦ నేను మెచ్చి.

క. కరుణన్ నినుఁ గాపాడితి, ధరణీధర మాక్రమింపఁ ♦ దల్పీడ నిరం
తరమున్ ధ్వనిచేసితి భీ,కరముగ; లోకత్రయంబు ♦ కలగుండుపడన్. ౩౯

క. ధ్వనియొనరించితి వీలో,కనిచయముల్ మాఱు మ్రోయఁ♦గా భీతిల్లం
గను జేసితి వక్కారణ,మున వీరా! రావణాహ్వ♦మున నిఁకమీఁదన్. ౪౦

క. ధర వర్ధిల్లుము; దేవా,సురయక్షులు మఱియు జగతి ♦ శోభిలు నితరుల్
పరికీర్తింతురు రాక్షస,వర! నిను రావణుఁడునాఁగ ♦ వర్ధిలుపేరన్. ౪౧ 666

---

1 ఇందధికపాఠశ్లోకములకు సంఖ్యవేయఁబడియున్నదని యెఱుంగవలయు. వ్యాఖ్యలేకుంటయే అధికపాఠమనియెఱింగించును. 2 మేనిరే వజ్రనిష్పేషం తస్యామాత్యా యుగక్షయే-అనిమూ. 3 సంవత్సరసహస్రం తు రుదతో రక్షసో గతమ్-అనిమూ. 4 ప్రీతోఽస్మి తవ వీర్యాచ్చ శౌండీర్యాచ్చ దశానన.అనిమూ. శౌండీర్యాత్ ధైర్యాత్-అనివ్యాఖ్య.

తే. లోకరావణుఁడవు నీవు ♦ నీకరణిని, శబ్దమొనరించువార లి♦జ్జగతి లేరు;
నాయనుజ్ఞను బొంది దా♦నవవరేణ్య!, కోరినట్టులు చనవయ్య ♦ భూరిగతిని.
చ. అని యిటు శంకరుండు ప్రియ♦మారఁగఁ బల్కఁగ నాలకించి యి
ట్లనియెను దేవదేవ! కరు♦ణాకర! ప్రీతుఁడ వైతివేని నా
కును వరమిమ్ము నిన్నిపుడు ♦ కోరెద నిర్జరరాక్షసాళిచే
దనుజులచేత గుహ్యకవి♦తానముచే నురగాళిచేతనున్. ౪౩౹ 668
తే. [1]మఱియు గంధర్వవితతిచే ♦ మహితబలులు
నెవరొ యవ్వారిచే నని ♦ [2]నిటు వధింపఁ
బడక యుండఁగవలయు నా♦పల్కు దీని
సార్థకము చేయవయ్య మ♦హాత్మ! దేవ!. ౪౪ 669
చ. మనుజుల లెక్కచేయ నొక♦మాడ్కిని నాకును భక్ష్యులౌట వా
రని మొన నిల్వలేరు విబ♦లాంగులు వారలు; బ్రహ్మ నాకు ని
చ్చెను జిరకాలమున్ బ్రదుక ♦ శ్రీగళ! కొంత గతించె దాన నిం
కను జిరకాలమున్ బ్రదుకఁ♦గాఁ దగుఁ గాన గతంబు నాయువున్. ౪౬౹
తే. మరల దయచేయవయ్య! యు♦మాధవా! త్వ
దీయశస్త్రమునా విని ♦ యాయుమేశుఁ
డాత్మఖడ్గముఁ జంద్రహా♦సాహ్వయము నొ
సంగె గతమైన యాయు వొ♦సంగె మఱియు. ౪౭ 671
చ. హరుఁడు వచించె నిట్టులు మ♦హాస్త్రము దీని నవజ్ఞ చేయకే
నిరతము చూడవయ్య! మది ♦ నిల్వక దీని నవజ్ఞ చేయ మా
పరిసరసీమఁ జేరు నిది ♦ పర్వని సంశయ మింత లేదు; నా
సురరిపునాయకుండు రిపు♦సూదనుఁ డాహరుఁ డిట్లు తానుగన్. ౪౮ 672
తే. ఆహ్వయము రావణుం డని ♦ యాదరమునఁ
బెట్ట సంతోష మింపొంద ♦ నట్టె లేచి
శంకరునకు నమస్కా ర♦సమితిఁ జేసి
పుష్పకం బెక్కి చనియెను ♦ భూమిఁ దిరుగ. ౪౯ 673
చ. ధరణిఁ జరించుచున్ గడఁగి ♦ దానవనాథుఁడు రావణుండు భూ
వరులకు విక్రమాఢ్యులకు ♦ బాహుబలంబున బాధఁ గూర్చుచున్
దిరిగెను స్వేచ్ఛ దిక్కుల వి♦దిక్కుల; సంతత యుద్ధదుర్మదుల్
నిరుపమతేజులైన ధర♦ణీపులు కొందఱు శౌర్యమొప్పఁగన్. ౫౦౹ 674
ఉ. ఆతనియాజ్ఞ మీఱి సుభ♦టాదులతో నశియించి రంతటన్
భూతలనాథు లింగితము ♦ పోల నెఱింగినవారు కొంద ఱా

1 రాక్షసైర్గుహ్యకైర్నాగైర్యే చాన్యే బలవత్తరాః-అనిమూ. 2 ఇటు వధింపఁబడక యుండఁగవలయు=అనఁగా నిట్లు కొట్టఁబడకుండునట్లుగా ననిభావము.

ధాతృవరైకగర్వితుని ♦ దానవు దుర్జయుగా నెఱింగి *స
చ్చేతము గల్గు వృద్ధులు వ♦చించినచొప్పున న్యాయరీతిగన్. ౫౧ 675

తే. ఓడితిమి నీకు మేమని ♦ యొప్పఁ బలికి
దర్పబలయుక్తు గర్వితు ♦ దనుజపతిని
సాగనంపించి రానున్న♦చావు నెట్లొ
యుక్తిఁ దప్పించుకొని మని ♦ రో రఘువర!. ౫౨ 676

పదునాఱవ సర్గము సంపూర్ణము.

---

౧౭ - వ సర్గము.

వేదవతిచరిత్రము.

క. విను మవల రామచంద్రా!, ఘనభుజుఁ డాదనుజవరుఁడు ♦ క్ష్మాతలమున నెం
దును స్వేచ్ఛగాఁ జరించుచు, వన మాహిమగిరికిఁ జెంత ♦ భాసిలుచుండన్. ౧

క. వనసుమనోజ్ఞతఁ గన్గొనఁ,గ నిచ్చలుం గోరుచుండెఁ ♦ గావున విహరిం
చెను; రావణుం డవ్వన,మునఁ గృష్ణాజినము జడలఁ ♦ బొంకముమీఱన్.

క. ధరియించి మౌనివృత్తిని, గరము విరాజిల్లుచుం బ్ర♦కాశించెడు ని
ర్జరనారివోలెఁ దేజ,స్స్ఫురణంబున మెఱయుచున్న ♦ శుభతమఁ గన్యన్. ౨

క. కనుఁగొనియె; రూపవిభవం,బున నొప్పుచు సువ్రతంబుఁ ♦ బూనిన యాక
న్యను జూచి చక్క నవ్వుచు, మనసిజశరవిద్ధుఁ డగుచు♦మఱి మోహమునన్.

తే. చిత్త మెంతయుఁ గలఁగినఁ ♦ జేరి యిట్లు
పలికె; నోమంగళాలయా! ♦ భవదనూన
యౌవనమున కనర్హమౌ♦నట్టు లిట్లు
వనిఁ బ్రవర్తించుచున్నావు ♦ వనిత! తగునె. ౩౪ 681

చ. కనుఁగొన నద్భుతం బగుచుఁ ♦ గ్రాలును దావకరూప మిట్టిదా
తనువున కీతపోనియతి ♦ దారుణమై తగుయుక్త మెవ్విధం
బునఁ దలపోసినం దగదు♦పో; లలనామణి! నీదురూపముం
గన నుపమానశూన్యమయి ♦ కాంతముగాఁ దనరారుఁ జుమ్మిలన్. ౮౪ 682

క. కామోన్మాదకరంబుగ, నీమానితరూపవిభవ ♦ మెల్ల నరులకున్
గామిని! గన్పడియెడుఁ గద, యీమాడ్కిఁ దపంబుచేయు♦టెట్లు తగునొకో.

తే. వయసు చెల్లినవారి కి♦వ్విధమునఁ దప
మానుపద్ధతి నియతంబె ♦ యౌను గాని

---

* ఆపరే బ్రుర్జయం రక్షో జానంతః ప్రాజ్ఞసమ్మతాః-అనిమూ.

నిన్నుఁ బోలినతరుణుల ♦ కెన్నఁదగదు;
తండ్రి యెవ్వఁడు నినుఁ బిల్చుఁ ♦ దనయ యనుచు. ౫ 684

చ. అనుపమమంగళాంగి! యఘ ♦ మంటదు నీమదియందుఁ జక్కనై
కనఁబడు నీమొగంబు, నినుఁ ♦ గాంతనుగా విధిఁ బొంది యెవ్వఁ డీ
తనువిభవంబుఁ గొల్లగొనుఁ ♦ దత్పురుషుండె ధరిత్రిఁ బుణ్యభా
క్కని వచియింప సందియము ♦ లారయఁ గన్పడకున్న విత్తతిన్. ౬ 685

క. నినుఁ గూర్చి ప్రశ్న మివ్విధ,మునఁ జేసెడునాకు సర్వ♦మును దెల్పు శ్రమం
బనయం బిది యేమిటికో, వినవేడుక యయ్యె ననుచు ♦ వివరింపంగన్. ౬½

చ. దనుజవరేణ్యప్రశ్నమును ♦ దత్తరుణీమణి సద్యశంబునుం
గనినమహాత్మురాలు విని ♦ కన్యకగావున సాధుశీలయై
వినుతతపంబె చారుతర♦విత్తముగాఁ గల యామె యాతనిం
గని విధి నాతిథేయమును ♦ గ్రక్కునఁ దా నొనరించి యిట్లనున్. ౭½ 687

సీ. బ్రహ్మర్షియై మహా♦ప్రభగల్గి శ్రీమంతుఁడై బృహస్పతికిఁ బ్రి♦యాత్మజుఁడయి
మతివిభూతిని బృహ♦స్పతితో సమానుఁడై తగుకుశధ్వజునకుఁ ♦ దనయ నేను
మహితాత్ముఁడై వేద♦మంత్రముల్ సంతతంబు జపించునాకుశ♦ధ్వజున కొకట
వాఙ్మయకన్యనై ♦ ప్రభవిల్లితిని గాన నను వేదవతి యని ♦ ఘనుఁ డతండు

తే. పిలిచె; నంతట దేవవ♦ర్యులును యక్ష
గరుడ, గంధర్వ, రాక్షసు ♦ లురగపతులు
వచ్చి నాతండ్రిఁ గాంచి యీ♦వారిజాక్షి
గోరి వచ్చితి మిమ్ము మా♦కుం దరుణిగ. ౧౦½ 688

చ. అని వచియింప నాజనకుఁ ♦ డాసురనాయక! నన్ను నీయకే
పనిచెను, దానికారణముఁ ♦ బల్కెదఁ జక్కఁగ నాలకింపు; నా
జనకున కాయమర్త్యపతి ♦ చక్రియె యల్లుఁడు కాఁదగున్ మఱొ
క్కనికి నొసంగఁ జాల నిఁకఁ ♦ గన్యక నన్నతలంపు రాజిలున్. ౧౨ 689

క. కనుకన లోకత్రయపతి, వనజాక్షుండైన చక్రి ♦ వరియించును నా
తనయామణి నను నాశయ,మును బూనియెయొరునకీయఁ♦బూనకయతఁడున్.

తే. ధర్మమతిగాన విష్ణునిఁ ♦ దలఁచుచుండె;
నద్ది విని బలదర్పితుం♦డై సురారి
పతియునగు దంభుఁడనువాఁడు ♦ పరమకోప
పరవశుండయ్యెఁ; గానఁ బా♦పమతి యతఁడు. ౧౩½ 691

క. జనకుఁడు నిద్రింపఁగ నా,దనుజుఁడు నడిరేయి వచ్చి ♦ దారుణపాపం
బునకుం బాల్పడి చంపెను;, దనపతి మృతినొంద నాదు ♦ తల్లివగచుచున్. ౧౪

చ తనవిభు నార్తనాదములు ♦ తద్దయు మ్రోయఁగఁ గౌఁగిలించుకొం
చనుపమపుణ్యరాశియయి ♦ యగ్నిని జొచ్చి త్యజించె దేహ; మా

జనకునివాంఛ యల్లునిగఁ ♦ జక్రిని గాంచుటయే గదా యటం
చును మదిలోఁ దలంచి యది♦నూనృతమై తగునట్లుచేయఁగన్. ౧౫ 693

క. దనుజవిభూ! మది నెంచితి, జనకుఁడు మృతిఁ జెందఁ గాంచి ♦ స్వాంతాభీష్టం
బును దీర్పఁ జాల కివ్విధ,మునఁ జచ్చె, గదా యటంచుఁ ♦ బొగులుచు నేనున్.

క. [మృతిచెందిన నేమాయెను, బితృకాంక్షను దీర్పఁ జనును ♦ బ్రియమున ననుచున్]
హితశపథం బొనరించుచుఁ, జ్యుతిలేనితపం బొనర్పఁ ♦ జొచ్చితి నిందున్. ౧౭

క. పలికితి నావృత్తాంతముఁ, గలిగిన యంతయును నీకుఁ ♦ గ్రవ్యాదవిభూ!
తలఁపఁగ నారాయణుఁడే, చెలఁగం దగు భర్తయగుచు ♦ క్షితిపయి నాకున్.

క. పురుషోత్తమునకు నే సతి, వరయఁగ నింకొకఁడు భర్త ♦ యగువాఁడు మనో
హరుఁడు జగంబున లేఁ డిది,స్థిరమగు; నారాయణుని బ♦తిం బడయంగన్. ౧౯

క. ఘోరంబగు నియమంబును, నీరీతిం బూనియుందు ♦ నిచటఁ బులస్త్య
శ్రీరాజదన్వయోద్భవ!, యోరాజా! నేను నిన్ను ♦ నొగి నెఱుఁగుదుఁ జూ.

క. జగముల మూఁడింటను జక్కఁగ సాగెడువార్త లెల్లఁ ♦ గాంతు మదిని నేఁ
బొగడొందుతపోబలమున, ఖగవాహనుదివ్యపాద♦కమలనుభక్తిన్. ౧౫ 699

చ. అన విని పంక్తికంఠుఁడు మ♦హావ్రత మూనిన కన్య నామెనుం
గనుఁగొని పుష్పకంబు డిగి ♦ కామశరవ్రజపీడితాత్ముఁడై
యనియె; మృగాక్షి! చారుకటి♦హారిణి! నీకిపు డిట్టిబుద్ధి క
ల్గను గతమేమి యం చెనఁ ద♦లంపఁగ గర్వితవంచుఁ దోఁచెడిన్. ౨౧ 700

తే. వయసుచెల్లినవారికే ♦ వఱలుఁ బుణ్య,సంచయము ప్రౌఢవయసున♦మించువారి
కర్భకులకుఁ బ్రకాశింప ♦ దమలనుగుణ,సంయుతవు నీవుపల్కఁగాఁ♦జను నెయిట్లు.

క. భువనత్రయసుందరివం,చు నినుతిచేయంగ రుచుల ♦ శోభిలుభీరూ!
ప్రవిమలయానన మిత్తటే,ని వఱలు నీకెంతొ కాంతి♦నిం గూర్చునదై. ౨౫

క. నే నన లంకాపతినై, దానవులకు విభుఁడ నగుచు ♦ దశవదనుఁ డనం
గా నొప్పువాఁడ యశముల,చే నిత్యము వెలయువాఁడ ♦ శ్రీనిలయాంగీ!. ౨౩

చ. కనుకనె నాకు భార్యవయి ♦ కాంక్షలు తీఱఁగ సర్వభోగముల్
మనమున కెక్కఁ బొందుము; స♦మస్తజగత్పతి విష్ణువంచు నీ
వనితవి గాదె యేని నిపు ♦ డాతఁడు వీర్యమునం దపంబునన్
ఘనబలభోగజాలములఁ ♦ గాఁడు సమానుఁడు నాకు సుందరీ!. ౨౪ 704

క. కోరితి వాతని నేలొకో;, భీరూ! నా నాలకించి ♦ వేదవతి మహా
తీరాజిత, యిట్లనకును, యోరాక్షసరాజ! యనుచు ♦ నొప్పుగఁ బలికెన్. ౨౫

సీ. ఎల్లెడ వ్యాపించి ♦ యెల్లలోకములకు నధిపతియయి వినుతార్చితాంఘ్రి
పంకజుండయి, యొప్పు♦పద్మాక్షునిన్ నీవు దక్కఁగా మతిమంతుఁ ♦ డొక్కఁడైన

నవమానపఱచు నే;♦యని వేదవతి పల్కఁ నాగ్రహంబున దశా♦స్యాసురేంద్రుఁ
డాత్మకరంబున ♦ నాకన్యభవ్యమూర్ధజములఁ బట్టె; న♦ద్దనుజుఁ డిట్లు

ఆ. తనదుమూర్ధజములఁ ♦ దాఁకిన నోర్వక
వేదవతియుఁ గ్రోధ♦వివశ యగుచు
నంతదాఁకఁ ద్రెంచె ♦ నాత్మకరంబున
[1]నామె హస్త ముజ్జ్వ♦లాసియట్లు. ౨౮½ 706

క. మెఱయుచుఁ గేశంబుల నా,తఱి రెండుగఁ జేసె; నంత ♦ దారుణరోషం
బఱిమిఱి వృద్ధిం బొందఁగఁ, గఱకునిశాచరుని వానిఁ ♦ గాల్చువిధమునన్.

తే. అగ్నిఁ బ్రణయించి దేహంబు ♦ నందు వేల్వ
నిశ్చయము చేసికొని మ్రోల ♦ నిల్చియున్న
యతని కిట్లని పల్కె; నో♦యసుర! మూర్ఖ!
యోయనార్య! మనంబున ♦ నొప్పు మాని. ౩౦½ 708

క. ననునవమానించితి నిం,కను నే బ్రదుకంగ నెంచఁ ♦ గనుక నిచట నీ
వును జూచుచుండఁ జొచ్చెద, ననలునిఁ; బాపాత్ముఁ డవగు ♦ నసురా! నీచేన్.

క. ఏకారణమున నవమతి, నీకరణిం బొందితినొ మ♦హీస్థలి నిచటన్
నీకంతలుంతనార్థం,బై కడువడిఁ బుట్టుదాన ♦ నసురా! మరలన్. ౩౨ 710

ఆ. నెలఁతచేతఁ బాప♦నిశ్చయుండై తగు,నట్టి పురుషుఁ డంత♦మందునట్లు
చేయఁబడుట శక్య♦మే యెడలను గాదు, శాప మిచ్చి నిన్నుఁ ♦ జంపఁ జనును

[2]క. ఘనతప మెల్ల నశించును;, విను మూర్ఖా! నేను మిగుల ♦ విధిఁ జేయుతపం
బును, దత్తము హుతమునునయి,తన రెడుపుణ్యంబునుంత♦తగియుండినచోన్.

క. దానిబలంబున ధర్మం, బూనినమహనీయునకు మ♦హోత్తమునకు నే
మానితవృత్తి నెసంగెడు, మానసమున నలరుసుగుణ♦మండితసుతనై. ౩౪

క. జనియింతు నయోనిజనై, యని శపథం బొప్పఁ జేసి ♦ యతిశయముగ మం
డినజ్వలనుఁ జొచ్చె దేవత, లనూనసుమరాశివృష్టి ♦ నాసాధ్విపయిన్. ౩౪½

క. కురిపించిరి ముదమున నం,బరతలమునునుండి; [యంత ♦ భామామణియున్
మరలం బుట్టెను లంకా,పరిసరమునఁ బంకజమునఁ ♦ బద్మసమభయై. ౩౫½

చ. దనుజవిభుండు దాఁ గొనియెఁ ♦ దత్కమలంబును బూర్వరీతి నం
దనుపమరీతి నొప్పు హరి♦ణాక్షిని గాంచి సరోజగర్భమో
యనఁదగు కాంతిచే నలరు ♦ నౌర! యిదంచు గ్రహించి యింటికిం
జని సచివోత్తమా! యిదిగొ ♦ చక్కనిలేమ యటంచుఁ జూపినన్. ౩౭ 716

క. తరుణీలక్షణములయం,తరములఁ జక్కఁగ నెఱుంగు ♦ దనుజవరుం డా

---

1 అసిర్భూత్వా కరస్తస్యాః-అనిమూ. 2 శాపేత్త్వయి మయోత్సృష్టే తపశ్చ వ్యయో భవేత్-అనిమూ.

తరుణిం గని దశవదనునిఁ, బరికించి వచించె; దనుజ♦వర్యా! వినుమా!. ౩౭½

తే. ఇట్టి సుశ్రోణియే నీదు ♦ నింట నున్న
మృతిని గల్పించు; నన విని ♦ యింతినవుడె
యర్ణవంబున వైచె నా♦యన్నుమిన్న
ధరణినిం బొంది జనకుఁ డ♦ధ్వర మొనర్ప ౩౮½ 718

క. హాలముఖమున దున్నఁగ నా,యిలనుండియె పైకి లేచె ♦ నీసుదతియె భూ
పలలాముండగు జనకున, కిలాధిపా! పుత్రి యనఁగ ♦ నెసఁగెం జుమ్మీ!. ౪౦

క. వనితామణి యామెయె నీ, కనువగు భార్యగఁ జెలంగె ♦ నామె కమల, నీ
వును విష్ణుమూర్తి వగుదువు, సనాతనుఁడ వీవు రామ♦చంద్రా! వినుమా!.

మ. మును తా వాని వధింతునన్నశపథం♦బుం దీర్పఁగా నెంచి యా
వనితారత్న మమానుషం బగుచు దే♦వస్తుత్యమా త్వద్బలం
బును న్యాయంబుగ నాశ్రయించి క్షితిభృ♦ద్బాహాభు నారావణున్
మును క్రోధంబునఁ జంపియున్న యతనిన్ ♦ బోకార్చెఁ జూ! రాఘవా!.

ఆ. ఇట్లు మరల మరల ♦ నీమహాభాగ వే,దవతి మర్త్యలోక♦ధామమందు
జనిని గాంచఁగలదు ♦ సాధుహాలాననో,త్కృష్టభూమియందు ♦ నిద్ధరీతి. ౪౨

క. అనలశిఖోపమయై మే,దినిఁ బుట్టంగలదు సుమ్ము; ♦ దేవనుతా! యా
వనితయె కృతయుగమున నొ,ప్పెను జక్కనియాహ్వయమున♦వేదవతియనన్.

క. దనుజుని వానిం జంపం,గను త్రేతాయుగమునందుఁ ♦ గలిగె మహాత్ముం
డన నొప్పు జనకునన్వయ,మున సీత యనంగ భూప♦ముఖ్యా! రామా!. ౪౩½

క. సీతాముఖమునఁ బుట్టుట, సీత యనం బిల్చి రెల్ల ♦ క్షితిజనులు జగ
ద్విఖ్యాతచరిత్రగ, సీతయుఁ జెలువొందెఁ జుమ్ము ♦ శ్రీరఘురామా!. ౪౪

పదునేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౮ - వ సర్గము.

రావణుఁడు మరుత్తుయజ్ఞమును బాడుచేయుట.

చ. అనలునియందు వేదవతి ♦ యవ్విధిఁ జొచ్చిన రావణుండు చ
య్యనఁ జనియెన్ విమానవర ♦ మాద్భృతి నెక్కి యనంతఁ గ్రుమ్మరన్;
*జనుచు నుశీరబీజ మన ♦ త్క్ష్మాలలనాతిలకంబు నాఁగ నొ
ప్పిన యొకదేశమందు సుర♦బృందము గూడి యజించుభూపతిన్. ౧½ 726

క. కనియె మరుత్తనువానిని, దనుజేంద్రుం; డంత నచట ♦ ధరణీసురదే
వనిచయములతో ధర్మము,ల నెఱింగిన బ్రహ్మమాని ♦ లలితపథమునన్. ౨

---

* ఉశీరబీజ మాసాద్య-అనియూ. ఉశీరబీజమితి దేశనామ-అనివ్యాఖ్య.

క. సురగురుపుసకుఁడ దమ్ముం, డురునియమసమన్వితుండు ♦ హుతవహతేజ
స్స్ఫురితుఁడు సంవర్తుం డ,ధ్వరమును జేయించుచుండెఁ ♦ దా నధిపతియై. 3

చ. దనుజునిరాకఁ గాంచి వర♦దానముచే నని దుర్జయుండు గా
వున సమరంబు గూడదని ♦ భూరిభయంబున వానిఁ గాంచకొ
య్యనఁ దమ కిచ్చువచ్చినటు ♦ లత్తఱిఁ దాల్చిరి రూపముల్, తముం
గనుఁగొనరానియట్లు; సుర♦కాంతుఁడు తాల్చె మయూరరూపముల్. ౪ 729

క. సమవర్తియు వాయసరూ,పముఁ దాల్చెను దొండయట్లు ♦ పరఁగెఁ గుబేరుం
డు మహితహంసాకృతిఁ బా,శముఁ దాల్చిన దిగ్విభుండు ♦ సరగునఁ బూనెన్.

సీ. తక్కిన దేవత ♦ లొక్కొక్క రూపంబుఁ దాల్చి; రంతట మహా♦దనుజుఁ డాతఁ
డశుచియౌ సారమే♦యంబుఁ జొచ్చినయట్లుయజ్ఞవాటముఁజొచ్చె♦నరనివహాద
నా! రాఘవా! దేవ♦తారివిభుం డట్లు చొరఁబడి యటనున్న ♦ క్షోణివిభునిఁ
గనుఁగొని నాకు సం♦గరభిక్ష నిమ్ము లేకున్న నోడితి నని ♦ యొప్పుఁ దప్పి

తే. చెప్పుమా; యన్న నమ్మరు ♦ త్తప్పు డతనిఁ
గాంచి నీ వెవ్వఁడ వని ప్ర♦శ్నించె నవల
సపరిహాసంబుగాఁ బల్కె ♦ జంభభేది
వైరి; భూపాలకా! నీవు ♦ భయములేక. ౬ 731

క. ఆదర మింతయు లేకయొ, నాదర్పము తెలియ కే ధ♦నపతి కరయఁగా
సోదరుఁడనైన రావణుఁ,గాఁ దెలియక నన్నుఁ బల్కు ♦ గర్వితు నిన్నున్. ౭

క. కనుఁగొని ప్రీతుఁడ నైతిని;, వినుమీ ముజ్జగములందు ♦ విక్రమమున న
న్నను మార్కొని యపజయముం, గనఁ జేసి విమాన మిద్ది ♦ గైకొను నన్నున్.

క. తెలియనివాఁ డెవ్వండేఁ, గలఁడే నీ వొక్కరుఁడవు ♦ గాక మఱియు నా
బల మెఱుఁగనివాఁ డుండునె;, పలికితి వెటు లనఘదనుజ♦పాలకు నతనిన్.

క. కనుఁగొని మునుత్తు పవు డిట్లనియెను; నీకంటెఁ బెద్ద♦యగు వి త్తవిభుం
డని నోడె నీవు మార్కొనఁ, గను ధన్యుఁడ వీవె కావె ♦ క్రవ్యాదవరా!. ౧౧

క. కలఁడే నీకుం దుల్యుఁడు, గలఁడే శ్లాఘ్యుండు ముజ్జ♦గంబుల [విను మి
మ్ములధర్మము చెడ నడపిన, యలఘుక్రియ శ్లాఘ్య మెట్టు ♦ లగు దనుజేంద్రా!.

క. జనములు మెత్తురె దానిన్, గన లోభముతోఁ జెలంగు♦కార్యమ్ము జగం
బున శ్లాఘ్య మెట్లు లగు, దు,ర్జను లొనరుచు నట్లు జ్యేష్ఠు♦సహజునినసిలోన్.

ఆ. పాఱఁదోలి జయము ♦ పాటించి శ్లాఘించు,కొనెద వేల?] పూర్వ♦జనిని నీవు
దోషరహిత మగుచుఁ ♦ దోఁచెడు ధర్మముల్, చేసి సద్వరములఁ♦జెందితి వని.

క. వినియుంటిని, నీ విప్పుడు, ధనదుని సోదరుని నోర్చి ♦ తత్పుష్పకమున్
గొనినాఁడ వంచుఁ బల్కితి, వనయము గవ యశ్రుతంబె ♦ యగునిది నాచేన్.

చ. నిలువుము కొంతసేపిచట ♦ నేఁ జనుదెంచెద నన్నుఁ దాఁకి దో
ర్బలమునఁ బోరి యోకుమతి! ♦ ప్రాణయుతిన్ మరలన్ గృహంబునం
గలపరివారముం గనఁగ ♦ గాఢగతిం జనలేవు, సాయకం
బుల శితభర్మపుంఖముల ♦ భూరిగతిం బరఁగించి నిన్ననిన్. ౧౪ 740
క. పనిపెన యమ్ముప్రోలికి నం,చనుపమకోపంబు నొంది ♦ యంతటఁ జాపం
బును దాల్చి సాయకంబుల, ధనువున సంధించి రణము ♦ దానవుతోడన్. ౧౫
క. ఒనరించుకౌతుకంబునఁ, జనుచుండం గాంచి యప్డు ♦ సంవర్తుం డా
తని నడ్డగించి స్నేహం,బునఁ దగు పల్కులను బల్కఁ ♦ బూని నియతిచేన్.
క. మునిపతి యాటను నెమ్మన, మున నధ్వరధర్మ మెంచి ♦ భూపతి నతనిం
గని నావాక్యము వినఁదగు, నని యొంచితివేని యుద్ధ ♦ మర్హం బెటులా. ౧౬
క. సంగర మిత్తఱి నీకు నొ,సంగదు శుభ; మొకటి వినుము ♦ సత్రం బిదియా
నంగజహరదైవత మీ, సంగరదంభమునఁ జక్క ♦ సాగకయున్నన్. ౧౭ 744
క. కులమును దహించుచును; జ, మ్మలఘుమఖవ్రతము చేయు ♦ నతనిమనమునం
గలుగం దగునే క్రోధము, సలుపందగు నయ్య వ్రతియు ♦ సంగర మవనిన్.
చ. అని యొనరించుచో జయము ♦ నందుట సంశయ మెల్లకాలమున్
దనుజుఁ డితండు దుర్జయుఁడు ♦ ధాతృవరంబులఁ గాంచినాఁడు; నా
విని గురు వాక్యమున్ నృపతి♦వీరవరుండగు నమ్మరుత్తు చ
య్యన సశరంబుగాఁ దగు శ♦రాసనవర్యము డించి గ్రక్కునన్. ౧౮ 746
ఆ. వెనుక మరలి వచ్చి ♦ మనము సాస్థ్యంబున
నలరఁ గ్రతువు చేయ ♦ నపుడు కడఁగె;
*నంత నాతఁ డోడె ♦ నంచు శుకుండను
దానవుండు దిశలఁ ♦ దారసిల్ల. ౧౯ 747
క. అజితుండగు మారాజే, విజయంబును గాంచె ననుచు ♦ విపులముదమునన్
గజిబిజిగ నార్చె; నంతట, విజయప్రమదంబు చెలఁగ ♦ వేడుక పడుచున్. ౨౦
సీ. యజ్ఞవాటముఁ జొచ్చి♦యందధ్వరముఁ జూడవచ్చియుండినముని♦వరులఁగసిని
భక్షించి వారల ♦ వర్ష్మరక్తంబున సంతృప్తుఁడై పరి♦చరులఁ గూడి
రావణుం డేగె ధ♦రాస్థలిఁ గ్రమ్మర; నంతట వాఁ డేగు ♦ టరసి యింద్ర
ముఖులైన నిర్జర♦ముఖ్యులు తా రూనియున్న రూపంబుల ♦ నొగి వదలుచు
తే. స్వస్వరూపంబులం దాల్చి ♦ వారు తమకుఁ
బ్రాణదానంబు చేసిన♦భంగి నలరు
జంతువులఁ గాంచి యిట్లని; ♦ రంత నింద్రుఁ
డలరి నీలబర్హంబునఁ ♦ జెలఁగు నెమలి. ౨౧ 749

---

* తత స్తం నిర్జితం మత్వా ఘోషయామాస వై శుకః-అనివ్యాఖ్యాత లంగీకరించినపాఠము.
వైదిః-అనియొకపాఠము కలదు.

చ. కనుఁగొని యిట్లు పల్కె మదిఁ ♦ గ్రాలెడుహర్షమునన్ మయూరమా!
వినుము పకార మీవు కడు ♦ వేడుక ధర్మవిదుండ వౌటఁ జ
క్కనివిధిఁ జేసి తిప్పుడు ఖ ♦ గప్రముఖుండవు గాన నీకు నె
మ్మనమునఁ బ్రీతి నొందితిని ♦ మామకనేత్రసహస్ర మెంతయున్. ౨౩౹ 750
క. తనరారఁగలదు బర్హం,బున నీకున్ నేను వర్ష ♦ మును గురిపింపం
గను బూనఁ బ్రీతిలక్షణ, మనూనమగు సమ్మదంబు ♦ నందఁగలవు నూ!. ౨౪
క. అని నెమిలికి వర మిచ్చెను, గనికరమున దేవనికర ♦ కాంతుఁడు; రామా!
మును నీల బర్హమే యుం,డెను బర్హికి నిర్జరౌఘ ♦ నేతవరమునన్. ౨౫ 752
తే. చిత్రరీతిగ నపుడు పో ♦ ల్చెను; యముండు
తనరు ప్రాగ్వంశమున నిలి ♦ చిన బలిభుజ
మును గనుంగొని కాకమా! ♦ మనము ప్రీతి
నందె ప్రీతుఁడనైన నే ♦ నాదరమున. ౨౬౹ 753
క. వినిపింతుఁ బ్రాణు లీజగ,మున నాచే వివిధరోగ ♦ ములఁ బీడింపం
గనుబడుచునుండు నితరము,లను బోలి విపత్తుఁ గన క ♦ లరుదువు నీవున్. ౨౭
తే. నేనుఁ బ్రీతుండనైతిని ♦ గాన నీకుఁ,గలుగకుండును రోగముల్ ♦ వలదు శంక
నావరంబున మృతిని గ ♦ న విఁక నీవు, నరులు చంపినచో మర ♦ ణంబు గనుదు.
తే. ఇతరరోగాళిచే నీకు ♦ మృత్యు వంట
దింక నాలోకముననున్న ♦ యెల్ల నరులు
క్షుద్భయార్దితులగువారు ♦ క్షోణి నీవు
చక్క భుజియింపఁ గనుదురు ♦ చాలఁ దృప్తి. ౨౯ 756
తే. కనుక నాలోకమున నున్న ♦ మనుజులకొఱ
కవని నెవ్వారు పిండంబు ♦ లర్థి నిడుదు
రవ్వి నీవు భుజింపంగ ♦ నలరుఁ దృప్తి
యిందుఁ గలవారి కెల్ల న ♦ హీనరీతి;. ౨౯౹ 757
క. వరుణుం డంతట గంగా,తరంగిణీతోయములను ♦ దమిఁ గేళుల నా
తురతం గను హంసంబును, బరికించి ఖగేంద్ర! నాదు ♦ పలుకులు వినుమా!.
ఆ. ప్రీతితోడఁ జెప్ప ♦ నీతఱిఁ బూనితి;, సౌమ్య! నీదు దేహ ♦ చారువర్ణ
మబ్జమండలాభ ♦ మగుఁ జుమ్ము నీతను,చ్ఛాయ శుద్ధఫేన ♦ సమతఁ గాంచు.
చ. అనయము నాశరీరమగు ♦ నంబువులం దమి నొంది కాంతమౌ
తనువు చెలంగ నొప్పుదువు ♦ తద్దయుఁ బ్రీతిని బొందుచుండు వీ
యనువున నాదుప్రీతిఁ గను ♦ మంచు వచించెను; [1]రామచంద్ర! హం
సనికర మంతకున్ మునుపు ♦ చక్కని నీలవుఁజాయ మించఁగన్. ౩౨౹ 760

---

1 హంసానాం హి పురా రామ నీలవర్ణ స్సపాండురః-అనియూ.

సీ. పాండురవర్ణంబు ♦ పరఁగుచుండఁగ నుండె నమలపక్షములు నీ♦లాగ్రసంయు
తములు, భుజాంతర ♦ మమరును శైవాలతృణాగ్రవర్ణంబుగ; ♦ నంత ధనదుఁ
[1]డద్రిపై నున్నట్టి ♦ యాతొండఁ గనుఁగొని, కనకవర్ణముపోల్కిఁ ♦ గ్రాలువర్ణ
మిచ్చెద నీకు నే ♦ నెలమి నీశీర్షంబు కనకకాంతిని బొల్చు ♦ ననవరతము
తే. నక్షయంబయి; యీహేమ ♦ మట్టివర్ణ, మలరునీకును నాప్రీతి♦గలిగియున్న
కారణంబున; నని వర♦గణము వాని, కిచ్చి యజ్ఞోత్సవమునుసం♦తృప్తిమీఱ.
క. వరమునికరుణ నదెట్లో, పరిపూర్తిం గనఁగ రాజు♦పరమాదృతి నా
సురవరులఁ బంప గృహముల, కరిగిరి వారెల్ల వచ్చి♦నట్లు విభూతిన్. ౩౬

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౧౯ - వ సర్గము.

అనరణ్యరాజు రావణునితోఁ బోరి మడియుట.

చ. దనుజవరేణ్యుఁ డంతట మ♦హాత్ము మరుత్తు జయించినాఁడ నం
చని నొనరించు కోర్కిని ధ♦రాధిపు లేలుమహాపురంబులం
గనుఁగొనఁ గోరి పోయె; నడి♦గా నిటు పోయి మహీశవర్యులన్
ఘనబలులన్ జలేశసుర♦కాంతసమానులఁ బిల్చి యుద్ధతిన్. ౧ 763
ఆ. యుద్ధభిక్ష నొసఁగుఁ ♦ డోడితి మనియైనఁ
బలుకు డిద్ది నాకుఁ ♦ గలుగు నిశ్చ
యంబు లేకయున్న ♦ నరుగఁడు రావణుఁ
డనుచు, విడువఁ డిట్టు ♦ లనుచుఁ దలఁచి. ౨ 764
క. [2]మనమున నిశ్చయ మెట్టులో, గనుఁడని పలుకంగ; భీతిఁ ♦ గనకుండియుఁ జ
క్కనిబుద్ధి విరాజిల్లియు, ననుపమధర్మంబుఁ దెలియు ♦ నట్లొప్పియునున్. ౩
క. గురుబలము గల్గి యుండియు, ధరణీశ్వరు లెల్లఁ గూడి ♦ తగ నెంచి మహా
పరబలగర్వితుఁ డగుటను, బరికించి పరాజితులమ ♦ బవరమునందున్. ౪ 766
క. అని పలికిరి; [3]దుష్యంతుం, డనురాజును సురథభూపుఁ ♦ డాగాధిగయుల్
ఘనకీర్తి పురూరవసుఁడు, దనుజేంద్రా! యోడితిమని ♦ దగఁ బల్కిరి ౫.
క. వారల మాని యయోధ్యను, జేరి మహాసురుఁడు శక్రు♦చే రక్షితమా
భూరిసురాలయమట్లు మహీరమణను హేంద్రుచేత ♦ నెసఁగువిభూతిన్. ౬
క. పరిపాలితమై తనరెడు, పురము నయోధ్యాహ్వయంబుఁ ♦ బొడఁ గని దేవే

---

1 కృకలాసం గిరౌ స్థితమ్-అనిమూ. 2 తత స్త్వభీరవః ప్రాజ్ఞాః పార్థివా ధర్మనిశ్చయాః, రాజాన స్సుమహాబలాః-అనిమూ 3 దుష్యంత స్సురథో గాధి ర్గయో రాజా పురూరవాః-భిన్న భిన్నకాలవర్తినోపి దుష్యంతాదయః స్వస్వకాలే రావణం ప్రతి జితత్వవాదం వదదానా దుక్తవంతః-అనిమూ. దుష్యంతాదినామములుగలరాజులు రావణునికాలమందు గూడ నుండిరని తెలియందగు.

శ్వరనమజలు ననరణ్యునిఁ, బరికించి దురంబు నొసఁగు ♦ పార్థివ! యనియెన్.
క. అనిఁ జేయుశక్తి లేదే, ననరణ్యా! యోడినాఁడ ♦ నని పల్కుము; నా
పను పిది యనియు వచించిన, విని పాపాత్ముని సురారి♦వీరునిపలుకుల్. ౭
క. అవమతిఁ గల్గించుటచే,త వడిన్ సంక్రుద్ధుఁ డగుచు ♦ దానవుతో ని
ట్లు వచించెను దనుజేంద్రా!, ప్రవిదారణకాంక్ష నీకుఁ ♦ బరఁగునయేనిన్.
తే. ద్వంద్వయుద్ధం బొసంగితి ♦ త్వరగ నీవు, సపరికరుఁడవు గానిల్వఁ♦జనునుజుమ్ము
సర్వసంసిద్ధుఁడనయి నే ♦ జన్యమునకు, వత్తు నంచని పల్కె నా♦వసుధనేత.
సీ. మునుపె రావణుశౌర్య♦మును వినియుండుట బలవిక్రముంబులఁ♦బ్రబలియున్న
యానరేంద్రునిభటు ♦ లారావణునిఁ జంపువాంఛలఁ బరికర♦వారములను
గైకొని వెడలిరి; ♦ కరు లొక్క పదివేలు తురగముల్ లక్ష స♦త్వరముగాఁగఁ
జను రథంబులు పెక్కు ♦ సంఖ్యభటేంద్రులు పెక్కువేలుగనొప్పి♦యొక్కరీతి
ఆ. బయలువెడలె; నిట్లు ♦ బలములు భూస్థల, మావరించి యప్పు ♦ డనికి రాఁగ
సరథభటము గాఁగఁ ♦ జనుదెంచునరపతి, బలములకును దనుజ♦బలములకును.
క. జరగెను సంకులసంగర, ముగు భీతిని గల్గఁజేయ ♦ నొప్పి యపుడు త
ద్ధరణీంద్రరాక్షసేంద్రులు, పరమాద్భుత మొంది చూడఁ ♦ బౌరుష మలరన్.
చ. ధరణిపతీంద్రుసైన్యములు ♦ దానవనాథుబలంబుతోడ సం
గర మొనరించి వేగమ ని♦కామహుతంబగు ద్రవ్య మగ్నిలోఁ
ద్వరగ నశించునట్లు చెడె ♦ దారుణసంగర మిట్లు చేసి ని
ర్భరబలవిక్రముల్ మెఱయ ♦ రాజిలియున్ ధరణీశసద్భటుల్. ౧౪ 775
ఆ. మండుచున్నయగ్ని♦కుండంబునం జొచ్చు, శలభగణముపోల్కి ♦ శత్రువీర
వరుల నోర్వలేక ♦ ననుమతి శయనించి;, రంత సుహుతహవ్య♦మగ్నియందు.
క. త్వరగ నశించెడులాగునఁ, గరమాశ్చర్యంబుగాఁగ ♦ గండడఁగె; మహీ
వరుఁ డిట్లుగ నశియించెడు, పరబాధితభటులఁ గాంచి ♦ పరిఖిన్నుండై. ౧౫
క. *జలనిధిలోఁ బడి యెట్టులు, సలిలౌఘవిరాజితములు ♦ శైవలినులు తా
రలరక యడంగులాగున, బలములు నశియించె ననుచుఁ ♦ బటుకోపమునన్.
చ సురపతి చాపవర్య మన ♦ శోభిలుకార్ముక మంది జ్యాలతన్
బరిపరి లాగుచున్ నృపతి♦వర్యుఁడు తీవ్రరుడావిలాత్ముఁడై
సురరిపునాథు మార్కొనఁగ ♦ శూరతఁ బోవఁగ నద్దమె మహా
త్తరముగఁ బోరి రాయసుర♦తల్లజుమంత్రులు విక్రమంబునన్;. ౧౭ 779
సీ. సారణశుకులును ♦ మారీచుఁడును బ్రహస్తాదులు ననరణ్యు♦నధికతీవ్ర
బాణజాలములచే ♦ భగ్నాంగులై పాఱె; రాతురంబునఁ బాఱు♦నట్టిమృగము

* మహార్ణవం సమాసాద్య వనాపగశతం యథా-అనిమా. వనం జలం తత్పూర్ణనదీశతం
ఆర్షో హ్రస్వః-అనివ్యాఖ్య.

లను బోలి; యంతట ♦ మనుజేంద్రుఁ డిక్ష్వాకుకులనందనుఁడు మదిఁ ♦ గోపమూని
రావణుమార్కొని ♦ చేవ బాణాష్టశతంబుల నొప్పించెఁ ♦ దచ్ఛరములు

తే. జలదములనుండి వారిధా ♦ రలు గిరీంద్ర
శృంగమునఁ బడి యేమియుఁ ♦ జేయఁ జాల
నట్టు లా బాణములు దను ♦ జాధిపతిని
గుందుఁ బొందంగఁ జేయక ♦ కూలె నిలను. ౧౨ 780

చ. దనుజవరేణ్యుఁ డంతటను ♦ దారుణకోపము నొంది యానృపుం
గని యసిచేత మస్తకము ♦ గాఢరయంబున నొంచె దానిచే
తనె కడు నొచ్చి యాతఁడు ర ♦ థంబుననుండి మహిం బడెం దర్రఁగ్
దనువు చలింపఁగా వివశ ♦ తన్ మృతి చెందిన రీతి నంతటన్. ౧౩ 781

తే. పిడుగుపాటునఁ గాలుచు ♦ వృక్షరాజ
మడవిఁ బడునట్లు లిలఁబడు ♦ నతనిఁ గాంచి
రావణుఁడు నవ్వి యిక్ష్వాకు ♦ రాజ! యనుచుఁ
బిలిచి పచియించె నాపైన ♦ నలుకఁ బూని. ౧౪ 782

క. తలపడితివి దానికి నిటఁ, గలిగెనొకో ఫల మదెట్లు ♦ గా మనుజేంద్రా!
కలుగఁడు ముజ్జగముల నిమ్ముల ద్వంద్వాహవము చేయఁ ♦ బూనునతఁడునూ!.

చ. అనుపమభోగజాలముల ♦ నందుచు నాదగుదోర్బలంబునన్
వినవొకొ యంచుఁ బల్కు రణ ♦ వీరుని రావణుఁ గాంచి ప్రాణముల్
చనునటులున్న యానృపతి ♦ సత్తముఁ డిట్లని పల్కె మెల్లఁగా;
దనుజ! యిఁకేమి చేయఁదగు ♦ దర్పము చెల్లుట నీరణావనిన్. ౧౬ 784

క. [1]దురతిక్రమమౌఁ గాలము, పరికింపఁగ నే జయింపఁ ♦ బడలేదు సుమీ
దురమునఁ దనుఁ దా వినుతులఁ, బరితృప్తిం జెందునట్టి ♦ పాపాత్మునిచేన్. ౧౭

ఉ. కాలము మోసపుచ్చె ననుఁ ♦ గారణ మైతివి నీవు నే నిఁకం
బోలఁగ నేమి చేయఁదగుఁ ♦ బోవఁగ నున్నవి ప్రాణముల్ దురం
బోలి నొనర్చుచోఁ బఱచి ♦ యోడినవాఁడను గాను దుర్మతీ!
బాలిశ! పోరుచుండియె భ ♦ వచ్ఛరసంగతి నిట్టులైతిఁ జూ!. ౧౮ 786

సీ. ఇక్ష్వాకుకులమున ♦ కెల్ల నీవాక్యంబు లవమతి నిచ్చుట ♦ నరసి నేను
బల్కెద నొకమాట ♦ [2]భక్తి నిచ్చితినేని హోమంబు చేసితి ♦ నే మఱియును
దపము సల్పితినేని ♦ దగురీతిఁ బ్రజలను బాలించితినయేని ♦ పల్కునాది
సత్యంబె యగుఁగాక; ♦ నిత్యంబుమహితంబె యైనయీయిక్ష్వాకు ♦ మానితాన్వ

1 కిం శక్య మిహ కర్తుం వై కాలో హి దురతిక్రమః, న హ్యహం నిర్జితో శత్రుః! త్వయా చాత్మ ప్రశంసినా-అనియూ. 2 యది దత్తం యది హుతం యది మే సుకృతం తపః, యది గుప్తాః ప్రజా స్సమ్య క్తదా సత్యం వచోఽస్తు తే-అనియూ.

తే. యమున దశరథభూపతి ♦ కాత్మజన్ముఁ
డగుచు రాముం డనంగఁ బుట్టఁ గలఁ డింక
నతఁడె నీప్రాణములఁ దీయు ♦ నట్టివాఁడు
నాఁగ జలధరభూరిస్వ ♦ నంబురీతి. ౩౧ 787

క. సురదుందుభి మ్రోఁగెను నం,బరతలమున నుండి పుష్ప ♦ వర్షము గురిసెన్
నరపతి శాపం బిడున, త్తరుణంబున; నంతలోన ♦ ధాత్రీపతియున్. ౩౨ 788

క. తనువును వదలి త్రివిష్టప,మున కేగె నరేంద్రుఁ డిట్లు ♦ భూమిఁ బడిన నా
తనిఁ గాంచి విక్రమంబున, దనుజేంద్రుం డచటు వాసి ♦ తా స్వేచ్ఛఁ జనెన్.

పందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౦-వ సర్గము.

నారదుఁడు రావణుని యమునితోఁ బోరుటకుఁ బురికొల్పుట.

చ. తిరుగుచు భూమిపాలకత ♦ తిన్ బెగ డొందఁగఁ జేయుచున్ నరో
త్కరములఁ జంపుచున్ మునివ ♦ తంసుని *నారదు మేఘసన్నిధిన్
బరఁగెడువానిఁ గాంచె సుర ♦ వైరివిభుం డొకనాఁడు; భక్తి నా
దరమున నంత నిట్లనియె ♦ దానవనాథుఁడు, రావణుండఁ జూ!. ౧ 790

క. మునివర్యా! మ్రొక్కెద మీ,కును గుశలమె, దర్శనంబు ♦ కోరిక నీయం
జనుదెంచు టదృష్టమె నా, కనఘా! యాగమన హేతు ♦ వరయఁ దలఁచితిన్. ౨

చ. గురుతర తేజుఁడౌచు ముని ♦ కుంజరుఁడై తగు నారదుండు వి
స్ఫురదమితప్రభుండు దను ♦ జుం గని మేఘముచెంతనుండి యి
క్కరణి వచించెఁ; బుష్పకము ♦ గ్రాల మహావిభవంబుతోడ సుం
దరగతిఁ బోవనున్న సుర ♦ దస్యువిభూ! క్షణ మాగుమా యిటన్. ౩ 792

క. దనుజేశ్వరుఁడవు విశ్రవ,సునిసుతుఁడవు వంశమునను ♦ జొప్పడుమర్యా
దను బొందిన ఘనుఁడవు గా,వునఁ బ్రీతుఁడ నైతి మెచ్చఁ ♦ బోలును నిన్నున్.

క. దనుజుల గెల్వఁగ విష్ణువు, మును పొనరిచినట్టి కృత్య ♦ ములకు సమముగా
దనుజేంద్రా! గంధర్వా,దినిఖిలశత్రువుల నీవు ♦ తెం పొప్పంగన్. ౫ 794

తే. ఇపుడు బాధించుచుండుట ♦ కేనపార,తృప్తినొందితి; నే నీకు ♦ నించుకంత
చెప్పఁబూనితి వినఁగ నీ ♦ చిత్తమందు, వాంఛగలదేని వినవయ్య ♦ వైరిహరణ!.

చ. విని తరువాతఁ జేయఁదగు ♦ విక్రమకృత్యము నాకుఁ దెల్పు చ
క్కనిదగు శ్రద్ధ పూని వినఁ ♦ గాఁ దగు ముందఱ; దేవతాళికే
నని మొనఁ జంపఁగాఁ దగ క ♦ హార్యబలంబున నొప్పువాఁడ వీ
వనఁగ నిదేటికో నరుల ♦ నందఱఁ జంపెద వాహవార్థివై. ౭ 796

---

* అససాద ఘనేతస్మిన్-అనిమూ.

తే. ఎపుడు మృత్యువశంగత ♦ మీమనుష్య
వితతి యయ్యెనో యప్పుడె ♦ హతమె సుమ్ము
దాని మరల వధించుట ♦ దగదు గాదె;
దనుజసురవరయక్షగం♦ధర్వులకును. ౮ 797

క. సురలకు శాత్రులకు నె,క్కరణిని జంపంగఁ దరము ♦ గాక వెలయు నీ
వరయక మనుజుల నొంచుట, పరికింప ననర్హ మనుచు ♦ భావింతు నెదన్. ౮½

సీ. శ్రేయస్సులొనఁగూడఁ ♦ జేయు కార్యంబుల నొనరింపఁగా బుద్ధిఁ ♦ గనక గొప్ప
వ్యసనంబులం గూడి ♦ వ్యాధిశతంబులచేతను జరచేతఁ ♦ జెడ్పడుచును
గలవిలపాటొంది ♦ యిలఁ గల్గు మనుజుల నెవ్వఁడు హింసించు ♦ నెఱుక లేక;
నిరతం బనిష్టముల్ ♦ పొరిపొరి రాఁ గుందుమనుజుల నోడించి ♦ యనిని గీర్తిఁ

తే. బొందఁగోరును సన్మతి ♦ నొందువాఁడు;,[1]క్షుత్పిపాసాజరాదుల ♦ సోలియున్న
దగుటచే క్షీయమాణం బె♦యగు నిరతము, దుఃఖశోకసమ్మూఢమై♦తోఁచుఁ గాన.

క. మనుజౌఘము బాధింపం, జన దిఁక నాజోలిమానఁ ♦ జను; గురుబాహూ!
దనుజేంద్రా! మనుజుల నిఁకఁ,గనవయ్యా! కరుణ;మఱియుఁ♦గడుదుఃఖములన్.

చ. అనయముఁ బొందుచున్ సుఖము ♦ లందెడుకాల మెఱుంగలేక యే
కనుఁగొనఁ జోద్యమౌ గతిని ♦ గార్యములం బొనరించుచున్ ధరం
గనఁబడువారి కేది గతి ♦ గన్పడకుండును; మర్త్యలోకమున్
గను మొకచోట వాద్యముల ♦ కమ్రరవంబును నృత్యరీతులున్. ౧౨½ 801

క. వినఁబడు ఘనతరమోదం,బున మర్త్యులు పొంగుచుంట ♦ బోలఁ గనఁబడున్
దనుజేంద్రా! యింకొక తా,వునఁ గన్నులనుండి నీటి♦బొట్టులు వరునన్. ౧౩

తే. ధారలుగ నొచుఁ గాఱఁగా ♦ దారుణమగు
వ్యసనమునఁ గుందియున్నవా ♦ రగపడుదురు;
జనకమాతృసుతస్నేహ♦మునను దార
బంధువులపయిఁ గల మైత్రిఁ ♦ బడలువడుచు. ౧౩½ 803

తే. మోహితంబయి ధ్వస్తమై♦ మొక్కలమగు,క్లేశజాలంబునం జిక్కి ♦ క్రిందుపడెడు.
మర్త్యలోకం బటంచు నీ♦మది నెఱుఁగవు;,చాలుఁజాలును నీదువి♦జయములింక

క. విను మోహానిరాకృత మీ,జను లుండెడు లోక మిద్ది ♦ చంచచ్ఛౌర్యం
బున నొంపఁబడఁగ నయ్యో,చనునే గెల్చితివి దీని ♦ సౌమ్యా! దనుజా!. ౧౫

క. అనుమాన మింతయును లే;, దనూనబలసార! మనుజు ♦ లందఱు [2]యమసా
దనమునకుఁ దప్పకుండఁగఁ, జనువారె; పులస్త్యవంశ♦సరిదధిపశశీ!. ౧౬ 806

తే. పరపురంజయ! యప్పితృ♦పతిని లోక,భీకరుని యమనాముని ♦ బృథుపరాక్ర
మమునఁ జెందుము,ధర్మ్యఁడు♦ సమరమందు,నోడిపోయిన జగమెల్ల ♦ నోడి నట్లె.

---

1 క్షుత్పిపాసాజరాదిభిః-అనిమూ. 2 గంతవ్యం యమసాదనమ్-అనిమూ.

క. కనఁబడ దించుక సంశయ, మని పల్కిన రాక్షసేంద్రుఁ ♦ డనుపమతేజం
బున వెల్గుచున్న నారదుఁ, గని వందన మాచరించి ♦ కడుమోదమునన్. ౧౭౪
*క. పలికెను బక్కన నవ్వుచుఁ, గలహప్రియ! దేవమౌని♦గణనాథ! సురా
వళికిని గంధర్వుల కి,మ్ముల మేలును గోరు దీవు ♦ ముద మొందితిఁ జూ!. ౧౮
క. చననున్నవాఁడ విజయం,బును గోరి రసాతలంబుఁ ♦ బొంగుచు నద్దా
నిని గెల్చిన భువనత్రయ,మును గెల్చినయట్లె యగును ♦ బో భుజశక్తిన్.
క. సురలను ఫణులను నే సం,గరమునయం దొప్పమీఱఁ♦గా గెల్చి మమున్
గరుణింపు మనుచు వేఁడెదు,కరణిగ నొనరించి యువలఁ ♦ గంధివరంబున్.
క. అమృతముకొఱకు మథించెద, నమధికయత్నంబుమీఱ ♦ సాధుమునీంద్రా!
కమనీయగానలోలా!, తమయానతి యే మటన్న ♦ దశకంఠునితోన్. ౨౦౪
క. మునివరుఁడై భగవంతుం, డనఁబడు నారదుఁడు పల్కె ♦ ననురేంద్ర! జయం
బును గోరి రసాతలమున,కును బోయెద ననుచుఁ బల్కి ♦ కోర్కి చెలంగన్. ౨౧
క. అరిగెదవు వేఱుత్రోవను, బరికింపఁగ హేతు వేమొ ♦ పల్కుము; విను క
ర్బురనాథ! శత్రుకర్శన!, దురూహముగ నొప్పుఁ జుమ్ము ♦ త్రోవ యిది యిటన్.
క. చను ధర్మరాజపత్తన,మున కీమార్గంబు యుద్ధ♦మున దుర్ధర్షుం
డన నొప్పు యముఁడు నా విని, దనుజేంద్రుఁడు పక్కున నగి ♦ దర్పముపొంగన్.
క. శారదఘనవర్ణుని నా,నారదుఁ గని యిట్లు పల్కె ♦ నా కార్యము చే
కూరెను యము గెల్చితి నని, మీరెంచుఁడటంచుఁ బల్కె ♦ మించెదు వేడ్కన్.
చ. మునివర! మర్త్యలోకమును ♦ బూనికఁ బ్రోవఁగ నాత్మ నెంచి చ
క్కనికృప చూపినార లటు♦గావున దిక్పతులన్ జయింతు నే
ననుచుఁ బ్రతిజ్ఞ చేసితి న♦హార్యబలోద్ధతి దాన నింక నేఁ
జనియెద ధర్మరాజు ననిఁ ♦ జంపఁగ దిక్కులఁ గీర్తి నింపఁగన్. ౨౪ 817
ఆ. ఎందు సూర్యపుత్రుఁ ♦ డేపున నివసించు, నట్టి దక్షిణాశ ♦ కరుగువాఁడ
నో మహాత్మ! క్రోధ ♦ మూనిన నేఁ జతుర్దిగధిపతుల ననిని ♦ దెంపుమీఱ.
క. మారుకొని విజయు మందెద, శూరత నని శపథ మట్టె ♦ సురలు వినంగాఁ
గోరియె యొసరిచినాఁడను;, నారదమౌనీంద్ర! కావు♦నన్ యమపురికిన్.
క. అరిగెద యము మార్కొనియెద, దురమునవిజయంబుఁ బొంది♦తోఁచెదమీదా
పరిసరమునఁ బ్రాణిసము,త్కరమునకుం గ్లేశ మిడెడు ♦ కాలుని కింకన్. ౨౬
తే. మృత్యువును బొందఁ జేసి నే ♦ మించువాఁడ
ననుచు వలగొని మ్రొక్కి ద♦శాననుండు
హర్షమున మంత్రులం గూడి ♦ యరిగె దక్షి
ణాశనుం గూర్చి; యంతట ♦ నంబరమున. ౨౭౪ 821

---

* సంప్రహ స్యాభివాద్య చ, మహర్షే దేవగంధర్వవిహారసమరప్రియ-అనిమా.

క. గురుతేజుఁడు నారదముని,వరుఁ డొక్కక్షణంబు ధ్యాన♦వైభవమున ని
ల్చి రహిన్ విధూమపావక,కరణిన్ దీపించి యిట్లు♦గాఁ జింతించెన్. ౨౮

*సీ. ఆయుస్సు క్షీణింప ♦ నఖిలజగంబులు నింద్రాదులగు సుర♦లెల్లఁ గ్లేశ
మొందింపఁబడుదురో ♦ యొగి నేయమునిచేత; నట్టి కాలుండెట్టు♦లపజయంబు
నొందును? బ్రాణుల ♦ కొనర స్వకృతస్వకృతములకున్ సాక్షి♦యే యగుచును
రెండవహవ్యవా♦హుండన నలరునో, యెవనిచే లోకంబు♦లెల్ల లబ్ధ

ఆ. సంజ్ఞములయి కదలఁ ♦ జాలునో, యెవ్వని
భీతి ముజ్జగములు ♦ భ్రాంతి వదలి
పరుగులిడునో యట్టి ♦ భానుతనూజుని
యమునిఁ గూర్చి కర్బు♦రాధిపతియు. ౩౧౪ 823

క. చనుచున్నవాఁడు తానుగ, ననిచేయ విధాత, ధాత ♦ యఘము సుకృత మె
ల్లనుదానె యగుచుఁ ద్రిజగము,లనుగెల్చిన యమునిదోర్బ♦లవిలాసుఁ గృతిన్.

క. గెలువం బూనె నదెట్టులొ, పలాశనాయకుఁడు; సర్వ♦భంగుల యముఁడే
యిలఁ గార్యసాధకుండగుఁ, దులువ యితం డెట్టి కోర్కి♦తో యత్నంబున్.

క. ఒనరించునో యము గెల్వఁగ;, మనము మహోహర్ష పూర♦మగ్నంబుగ నొ
ప్పను యమలోకమునకు నేఁ, జనియెద, యముదాన వేంద్ర♦సంగర మెల్లన్.

క. కనుఁగొనియెద నేయత్నం,బున రావణుఁ డబ్జమిత్ర♦పుత్రుని గెలువం
గను బూనునొ వరగర్వం,బున నీతఁడు పోవఁ బూనెఁ ♦ బో యమపురికిన్.

ఇరువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౨౧ - వ సర్గము.

రావణుఁడు నారకుల విడిపించి యమభటులఁ బాశుపతాస్త్రమునఁ జంపి యార్చుట

చ. అని మది నెంచి నారదమ♦హాముని తీవ్రగతిన్ నభంబునన్
దనుజుఁడు పల్కినట్టి నుడి ♦ తాఁ జని సౌరికిఁ జెప్పకోర్కితోఁ
జనియె యమాలయంబునకుఁ; ♦ జక్కనిధర్మముఁ బూని సాక్షిగా
ననలుని ముందు నిల్పుకొని ♦ యాదృతిఁ బ్రాణు లదెట్టికృత్యముల్. ౧౪ 828

క. ఒనరించినారొ వారల, కనువగు ఫల మనుభవించు ♦ నట్లుగఁ గూర్పం
గను చూచువాని శమనునిఁ, గనియెన్; నారదుని మౌని♦కాంతుని ఘనునిన్.

క. కనుఁగొని యముఁ డర్ఘ్యాసన,ము నిచ్చి యర్ఘ్యంబు ధర్మ♦ముగ నిడి యారీ
తిని బల్కె; దేవగంధ,ర్వనికర సంసేవితాంఘ్రి♦రాజీవయుగా. ౩ 830

---

* యేన లోకా స్త్రయ స్సేంద్రాః క్లిశ్యంతే సచరాచరాః, క్షీణే చాయుషి ధర్మేణ స కాలో జేష్యతే కథమ్-అనిమూ.

సీ. మునినాయకా! క్షేమ♦ము గద, లోకంబున ధర్మము చెడదుగ♦ద,మహనీయ!
మీరు వచ్చుటకు నే♦మి గలదో హేతువు, నా విని మహితుఁడో ♦ దేవమౌని
పలికె నిట్లని ధర్మ♦పాలకా! వివరింతు వినవయ్య కారణం♦బును మఱియును
దానికిని బ్రతివి♦ధాన మెయ్యదియొ చేయంగఁ దలంపుమా ♦ యర్కతనయ!
తే. వీఁడె పేర దశగ్రీవుఁ ♦ డోడిపోవ, నిన్ను సమరంబునం జేసి ♦ నీవు దుర్జ
యుఁడ వటంచుఁ దలంపక ♦ యుగ్రశక్తిఁ, దనకు వశ్యునిగాఁ జేసి♦కొనఁ దలంచి.
క. చనుదెంచెడు నీవిక్రమ,మును దెలియం; డిదియె బీజ♦ముగ నేను జవం
బున వచ్చినాఁడ రాజా!, విను నిన్నుం గాలదండ♦వితతాయుధునిన్. ౭౪ 832
క. దనుజుఁడు కాఁ డెవ్వండై,న నేమిచేయంగలండు; ♦ నానాధర్మ
ప్రనియతమనసా! శమనా!, యని యిటు మాటాడుచున్న ♦ యవసరమందున్.
క. దూరంబునఁ బుష్పకమవు, డారయ నుదయించు సూర్యు♦నట్లొప్పి కడున్
భారాజితమై కన్పడె, నారావణుఁ డెక్కి యుజ్జ్వ♦లాంగం బగుచున్. ౮ 834
తే. ఆప్రదేశము పుష్పకా♦యతరుచులను
వితిమిరముగాఁ జెలంగె న♦వ్వేళ నదియు
నంతికము చేర వచ్చె; నా♦యసురవర్యుఁ
డచ్చ టచ్చటఁ గనియె భూ♦తాళి నెల్ల. ౯ 835
చ. ఒనరిచియున్న పుణ్యముల ♦ కున్నతపాపమహాంబురాశికిన్
గనఁదగునట్టి తుల్యఫల♦కాండముఁ బొందుచునున్నవారి; నిం
కను దనుజేంద్రుఁ డొక్కయెడఁ ♦ గాంచెను ధర్ముని సైన్యపంక్తులన్
దనుజులతోడ; నంత నొక♦తట్టున భీకరరూపయుక్తులై. ౧౦౪ 836
తే. ఉగ్రులై గాఢరవముల ♦ నొప్పఁజేయు
యమునిదూతలు ప్రాణుల ♦ నటవధించు
చున్ మహార్తులఁ బొందించు♦చున్ జెలంగఁ
దాళఁజాలక ప్రాణివి♦తాన మార్తి. ౧౧ 837
సీ. ఆక్రోశ మొనరించి ♦ యయ్యయో యనుచుండఁ
గొందఱు వినరాని ♦ క్రూరశబ్ద
ముల నేడ్చుచుండఁ; బు♦ర్వులు దేహములఁ జొచ్చి
యంగము ల్వ్రదళింప ♦ నార్చుచుండ
దారుణాకృతు లొప్పు ♦ సారమేయంబులు
కఱవంగ బాధకు ♦ గాఢరవము
లొక్కకొందఱు చేయు♦చుండంగ, నొకకొంద
ఱందందు శ్రుతులకు ♦ నహితములయి
తే. భయమునుం గల్గఁ జేసెడు ♦ పల్కు లొప్పఁ
జేయుచుండంగఁ గనుఁగొనెఁ; ♦ జెప్పరాని

రీతిగా శోణితోదకంబై తనర్చు
వైతరణి యను క్రూరశై ♦ వలినియందు. ౧౩   838

క. దూతలు సంతోషంబునఁ, బ్రేతములం ద్రోలి మరల ♦ వెలికిఁ దివియుచున్
జేతస్సులు దుఃఖింపఁగ, నాతతిఁ జేయుటయుఁ జూచె ♦ నద్దశముఖుఁడున్. ౧౪

సీ. పెనములలోనఁ గా ♦ ల్చిన వేఁడియినుకపైఁ బొరలింపఁగొందఱు ♦ బోరుమనఁగ,
నసిపత్రవనమున ♦ యందుఁ జొప్పింపంగ సంగముల్ తెగఁగొంద ♦ ఱకటయనఁగ
రౌరవం బనెడు నా ♦ రకమందుఁ బడఁద్రోయఁ దాళఁజాలకకొంద ♦ ఱోలియేడ్వ
ఘోరశైవలినిలో ♦ బోరన ముంపంగఁ గొంద ఱాబాధకుఁ ♦ గుంది వగవఁ

తే. దీవ్రమౌ క్షురధారలఁ ♦ ద్రెంపఁబడిన
యవయవంబులు బాధల ♦ నార్తి నొంప
నేడ్వఁ గొందఱు, మఱికొంద ♦ ఱెంతొ దప్పి
జలము వేఁడఁగ దొరకమి ♦ సందడింప. ౧౫   840

క. ఆఁకలి కన్నము దొరకమి, నేకతమునఁ గళవళించి ♦ యేమి యనుటకున్
గాక శవాకృతిఁ గృశులై, యాఁకలికిన్ దీనులైన ♦ యట్టిమనుజులన్. ౧౫

తే. వర్ణముల్ చెడి కేశముల్ ♦ వదలఁబాఱి,యున్నవారల,*మలముల ♦ నుగ్రపంక
ములను దాల్చిన యట్టివా ♦ రల వివస్త్రు, లైనవారలఁ బరుగెత్తు ♦ నట్టివారి. ౧౬

క. కనియెను రావణుఁ డాపథ,మున వేలకు వేలుగాఁగఁ ♦ బొగిలెడువారిన్
గనుచుం బోవుచు నొకచో, మనుజులఁ బుణ్యాత్మకులను ♦ మహితవిభవులన్.

సీ. చారువిమానముల్ ♦ సంతసంబున నెక్కి వాద్యనిస్వనములు ♦ భవ్యగీత
ములును జెలంగఁగా ♦ మోదంబునం బొంగుపుణ్యాత్ములను గాంచె ♦ భూమి నొకట;
గోదానములు చేసి ♦ గోవులపాల్ ద్రావియలరువారలఁ జూచె ♦ నందు నొకట,
నన్నదాతలుగాఁగ ♦ నవనిమించిన వారలన్నముల్ దినుచుంట ♦ నచటఁ గనియె

తే. గృహములన్ దానములు చేసి ♦ గృహములందుఁ
జక్కనిసుఖంబు లొందుచు ♦ సంతసమున
నలరువారలఁ గనియె, నం ♦ దందు రావ
ణాసురేశ్వరుఁడు యమపురి ♦ యందు నెలమి. ౧౭   844

క. కనకము ముక్తామణులను, దనివారఁగ దానమిడిన ♦ ధన్యులు వారిన్
ఘనభూషలుగాఁ దాల్చుచు, మనములఁ బొంగంగఁ జూచె ♦ మఱియొకచోటన్.

క. గురుబాహుఁడైన కర్బుర,వరుఁ డొక్కెడ ధార్మికప్ర ♦ వరులను దేజ
స్స్ఫురణమున నొప్పుచుండఁగఁ, బరమముదం బొప్పనొక్క ♦ పట్టునఁ గనియెన్.

ఆ. స్వీయదుష్కృతములఁ ♦ జేత వధింపఁగాఁ,బడుచు ముందు కంటఁ ♦ బడినవారిఁ
బ్రబలుఁడైన దనుజ ♦ వర్యుండు విడిపించె, విక్రమమున నిట్టి ♦ విధి తగదని. ౨౧

---

* మలపంకధరాన్ ప్రాంతలోన్ - అసమూ.

క. దనుజేంద్రుఁ డిట్లు వారల, ననూనదయమీఱ ముక్తి ♦ నందఁగఁ జేయన్
గనిరి మహార్తసుఖంబును, మనమున నెంచని దిదంచు♦ మంచిదెయనుచున్.

క. బలవద్దనుజేంద్రునిచే, ఖలులగు నాపాపు లిట్లు♦గా మోక్షంబున్
జెలువారఁ గాంచఁగా వా,రలఁ గాంచుచునున్న ధర్మ♦రాజానుచరుల్. ౨౩

చ. అతిశయకోప మూని దను♦జాధిపు మార్గ్కొనఁ బర్వి లెత్తి; రు
ద్ధతి నిటు లేగి దిక్కుల ను♦దారముగా ధ్వని బర్వినట్లు లా
ర్చి తగనిరీతి నిచ్చటను ♦ జేసితివే పనియంచుఁ బల్కుచున్
జతనముమీఱ మార్కొనిరి ♦ శౌర్యము పొంగఁగ సాహసంబునన్. ౨౪

చ. పరుగునఁ బోయి పుష్పకముఁ ♦ బ్రాసములం బరిఘాళి భూరిము
ద్గరముల శూలతోమరవి♦తానములన్ వరశక్తులన్ మహా
త్తరగతి ముంచి రొక్కమెయిఁ ♦ దారు శతంబులు వేలుగాఁగ సం
గర మొనరింపఁ జుట్టుకొని ♦ గాఢబలంబులు చూపువేడుకన్. ౨౫ 851

తే. యమునిభటు లంత లెక్కింప ♦ ననువుగాని
భంగిఁ బటువీర్యముల సంగ♦రాంగణమున
వెనుకకుం బోవకుండెడు ♦ విక్రమమున
మారుకొని రావణుం గెల్చు♦నీరసమున. ౨౬ 852

చ. తరువుల వైచి శైలముల ♦ దారుణభంగిని నింపి ప్రాస ము
ద్గరముఖభీకరాయుధవి♦తానములం బడఁ గ్రుమ్మి; రంత భీ
కరబలులైన యాభటులు ♦ గాఢరయంబునఁ బుష్పకంబు న
త్తరుణమునందు భగ్నముగఁ ♦ దా నొనరించిరి పౌరుషంబునన్. ౨౭ 853

క. కనకమయంబగు శృంగం,బున మేఘము లావరించు♦పోలికగా ధ
ర్మునివీరభటులు పుష్పక,మునకున్ నలుదెసల నిల్చి ♦ భూరిక్రుధచేన్. ౨౮

సీ. పుష్పకాసనములఁ ♦ బొలుచు తత్ప్రాసాదముల వేదికాంగణ♦ములను దోర
ణావళిఁ బాడుగా ♦ నపుడు చేసిరి మధువ్రతములు పుష్పసం♦తతిని క్రోధ
మొప్పినఁ బాడుగ ♦ నొనరించునట్లుగ; నాదిత్యవాసార్హ♦మైన యవ్వి
మాన మానుభటవి♦తాన మారణమున భంజింపఁగాఁ *బటు ♦ బ్రహ్మతేజ

తే. మునఁ దనర్చుట నక్షయ ♦ మనఁగ నలరె;
నంతరావణుమంత్రు లి♦చ్ఛానుసార
ముగను బలమున్నదాఁకను ♦ దెగి రణంబు
చేయుచుండిరి రావణుం ♦ డేయుచుండె. ౩౦ 855

క. దనుజేంద్రుమంత్రు లాయో,ధనమున రక్తాబ్ధిమగ్న♦తనువులతో శ
త్రునికరహతులగు చుండియుఁ, దనివొందక పోరి రట్టి♦తరుణమునందున్.

---

* భజ్యమానం తథై వాసీ దక్షయ్యం బ్రహ్మతేజసా-అనిమా.

తే. ఇరుదెగలవారు సంగర ♦ మేపుమీఱి
చేయుచుండంగఁ జూడంగఁ ♦ జిత్రమగుచుఁ
దోఁచె, యమదానవేంద్రమం♦త్రులు చెలంగి
పోరుచుండిరి; యమభటు ♦ లీరనముల. 33 857

చ. [1]దనుజగణేంద్రుమంత్రిసము♦దాయముతో ననిసేయ మాని క్రో
ధనిరతి రావణాసురుని ♦ దార్కొని శూలము లట్టె వైచి వృ
ష్టిని నిగుడంగఁ జేయుచును ♦ జేరిన మేఘము లట్లు చుట్టునుం
గనికర మింత లేక పటు♦కాండము లేయుచుఁ బోరి రంతటన్. ౩౪ 858

ఉ. వీరభటప్రహారముల ♦ వింతగ రక్తనదీప్రవాహముల్
భూరిభయంకరంబుగను ♦ బొంగుచు దేహము ముంప నంగముల్
సారములేనిచందమున ♦ జర్ఝరితంబులుగాఁగఁ బుష్పసం
భారముతో నశోకతరు♦వర్యము తోఁచెడురీతి నొప్పుచున్. ౩౬ 859

చ. దనుజవరుండు క్రోధమున ♦ దారుణశూలగదాసిసంఘమున్
ఘనతరశక్తితో మరని♦కాయముఁ బ్రాసశరాళిఁ బ్రాణముల్
గొనుముసలంబులన్ శిలల ♦ గొప్పమహీజములన్ భటాళిపైఁ
దనభుజశక్తి యస్త్రసము♦దాయబలంబును మీఱ వైచుచున్. ౩౭ 860

క. అనిఁ జేసెను దరుశిలలను, గనదస్త్రము లొక్కపెట్టఁ ♦ గాలునిసైన్యం
బున వృష్టిపోల్కిఁ బడియెన్, గనుఁగొనఁగా దారుణమయి♦కడువేగమునన్.

క. సురవైరి ప్రయోగించిన, శరసంతతిఁ జెండి యస్త్ర♦సంతానంబున్
బరిమార్చి ఘోరరాక్షసవరు రావణు వేనవేల ♦ బాణంబులచేన్. ౩౮ 862

తే. వరుస నొంచిరి కాలుని♦భటులు చెలఁగి;
యాతనిం జుట్టుముట్టి మే♦ఘాళి పర్వ
తమువలెన్ భిండివాలసం♦తతిని శూల
ముల నిరుచ్ఛ్వాసునిగఁ జేసి ♦ రలుకఁ బూని;. ౩౯ 863

క. దనుజేశ్వరుండు కవచం,బును శోణితపంకదిగ్ధ♦మూర్తి యగుటఁ జ
య్యనఁ దీసి వైచి [2]పుష్పక,మున నుండక నిల్చెఁ గ్రుధను♦భూస్థలిమీఁదన్.

చ. ధనువులఁ గేలఁ బట్టుకొని ♦ దారుణబాణము లట్టె కూర్చి మే
దినిపయి నిల్చి విస్మృతిని ♦ దెప్పునఁ బాసి యిదేమి వీర లీ
యని నను నొంచువారె యను ♦ నర్థము దోఁప ముహూర్తమాత్రమున్
దనమది నెంచి క్రుద్ధుఁడయి ♦ దారుణరీతి యముండునాఁ దగెన్. ౪౧ 865

చ. సురరిపునాయకుం డపుడు ♦ శూలియొ దైవముగాఁ జెలంగ ని
ర్భరతరశక్తిచే నెసఁగు ♦ పాశుపతాస్త్రమె యిప్డు వైవ నా

---

1 అమాత్యాం స్తాంస్తు సంత్యజ్య-అనిమూ. 2 స పుష్పకం పరిత్యజ్య పృథివ్యా మవతిష్ఠత, తత స్స కార్ముకీ బాణీ పృథివ్యాం రాక్షసాధిపః-అనిమూ.

సరిజనకాలమృత్యు వది ♦ యం చొగిఁ గార్ముకమందుఁ గూర్చి కా
వరమున జ్యానినాదమును ♦ బర్వఁగఁ జేయుచుఁ బండ్లు గీటుచున్. ౪౨ 866

చ. నిలువుఁడు నిల్వుఁ డంచుఁ గడు ♦ నిర్భరనాదము గల్గఁ బల్కి య
ప్పలలభుగీశ్వరుండు గురు♦బాహువు లట్టె విదిర్చి జ్యాలతన్
బెలుచ ధ్వనింపఁ జేసి తన♦విక్రమ మేర్పడ నట్టె దీటి య
బ్బలువిలుకాఁడు కార్ముకర♦వంబున దిక్కులు పిక్కటిల్లఁగన్. ౪౩ 867

సీ. ఆదివ్యశరము న♦య్యంతకాంతకుఁ డుగ్రుఁడై త్రిపురంబుల ♦ నడఁగఁ జేయ
వైచినగతి నట్టె ♦ వైచె నారలిపయిఁ; బొగలేని హుతవహు♦మూర్తిఁ బోలి
యున్న యారావణు♦నుగ్రరూపముఁ గని యాశరమప్డె తాలిచి ♦ చంచదుగ్ర
రశ్ములఁ జెలఁగి ఘు♦ర్మమునఁ గాననమును దహియించునగ్నిచం♦దమున మెఱసి

తే. జ్వాలలం గ్రుమ్మరించుచు ♦ సత్వరముగ
*దానవానుగతంబయి ♦ తత్థ్సలమునఁ
గలుగు పొదలను దరువుల♦గముల నీఱు
చేయుచుం బరుగెత్తె నో♦హో యనంగ. ౪౫ 868

చ. అనుపమతచ్ఛరార్చులకు ♦ నాయమసైన్యము లెల్ల భస్మమై
యనిఁ బడె, దావదగ్ధవిత♦తావనిజాకృతి; నంత మంత్రులున్
దనుజులు తన్నుఁ గొల్వ భయ♦దంబగు విక్రమ మొప్ప గొప్పదా
నినదము వెల్వరించె ధర♦ణిన్ నడఁకించెడునట్టు లుగ్రుఁడై. ౪౭ 869

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౨౨ - వ సర్గము.

యమునితో రావణుఁడు సంగరము చేయుట.

ఉ. ఆనినదంబు కర్ణముల♦యందుఁ బడన్ రవిసూనుఁడౌ యముం
డౌ నిది మోదనాదము జ♦యంబును గాంచెను దానవుండు నా
సేన నశించె నంచెఱిఁగెఁ ♦ జిత్తమునం; దిటు లెంచి క్రోధమున్
బూని సురక్తనేత్రుఁడయి ♦ పోల్చి రణం బొనరించు వేడుకన్. ౧౫ 870

చ. అరదము తెమ్ము వేగముగ ♦ నాయితముం దగఁ జేసి సూత! సం
గరమున కన్న, సూతుఁడు ని♦కామజవంబున ఘంటికారవం
బరుదుగ నొప్పనున్న రథ ♦ మద్భుతరీతిని బొల్చుదాని భీ
కరగతి నొప్పుదానిఁ గడఁ♦కన్ గొనితెచ్చి వచించె తేనితోన్. ౨౫ 871

మ. గురుతేజంబునఁ బొల్చునాయముఁడు సం♦కోచంబు లేకంత న
య్యరదం బెక్కెను; బాశముద్గరములన్ ♦ హస్తంబులం దాల్చి భీ

---

* క్రవ్యాదానుగతం రణే- అనిమూ.

కరరూపంబున మృత్యునట్టి నిలిచెన్ ♦ గాఢప్రమోదంబునన్
సరసీజాప్తునిపుత్రుమిత్రుల; నదియే ♦ సర్వప్రపంచంబులన్. ౩౫ 872

క. విలయం బందఁగఁ జేయును, గలఁగక యవ్యయమునౌచుఁ ♦ గ్రాలుం జుమ్మీ
యలమృత్యు; వంతఁ బార్శ్వస్థలి రూపముఁ దాల్చి కాల ♦ దండము నిలిచెన్.

తే. అదియె యమునకు సాధనం ♦ బై స్వతేజ
మున ధనంజయురీతిగఁ ♦ దనరి దివ్య
మగుచు నొప్పును స్యందన ♦ మందు నదియు
నిరుపమానంబుగాఁ దగి ♦ నిలిచె నంత. ౭ 874

సీ. యమునిపార్శ్వంబున ♦ నలఘోరేఁ గాలపాశంబులు భయదరూ ♦ పంబు లగుచు
జాతవేదునిసం ♦ స్పర్శమువలె నొప్పి తనుధారియైన ము ♦ ద్గరము నిలిచె;
నంతట లోకత్ర ♦ యం బాకులంబయ్యె, నమరులు వడఁకిరి ♦ యమునిఁ దీవ్ర
కోపమొందినవాని ♦ నాపగిదిం బోవ నున్నవానిం గాంచి ♦ యన్నిలోక

తే. ములు తపించెను; సూతుఁ డ ♦ మ్ములరథంబు
పయిని గూర్చుండి రుధిరప్ర ♦ భల వెలుంగు
నశ్వములఁ దోలె నార్చుచు ♦ ననురవర్యుఁ
డున్నచోటికి నతిజవ ♦ మొప్పునట్లు. ౮ 875

క. హరిహయసంకాశములౌ, తురగము లవి మనసుకంటెఁ ♦ దోరపుజవమున్
బరఁగంగ యమునిఁ జేర్చె న,మర మపుడగుచుండునట్టి ♦ త్మాస్థలమునకున్. ౯

*చ. అరదము మృత్యుసంయుత మ ♦ హోర్యము లోకభయప్రదంబునై
పరఁగి వికారరూపమున ♦ భాసిలుటం గని దానవేంద్రుపా
ర్శ్వరతిఁ జెలంగుమంత్రులు హ ♦ నన్ భయమందుచుఁ బాఱి రట్టి భీ
కరబలులయ్యుఁ గ్రోధమును ♦ గాంచియుఁ జేయఁగలేక యార్తులై. ౧౦

ఆ. అల్పసత్త్వ లగుట ♦ నతిభయ మాత్మల
డిందుపడఁగఁ జేయు ♦ టం దదీయ
దర్శనమున స్మృతియుఁ ♦ దప్పటఁ బాఱి రా
యోధనంబు చేయ ♦ నోప మనుచు. ౧౧ 878

క. తనమంత్రు లఖిలదిశలకుఁ, జనుచుండుటఁ జూచి యాద ♦ శగ్రీవుఁడు లో
కనికరభయదంబగు నా,వనజాప్తకుమారురూప ♦ వైఖరిఁ గనుచున్. ౧౨

క. అరదము లోకభయప్రద, మురుతరమగు టరసి క్షోభ ♦ మొందక నిలిచెన్
సురవైరి మదిని భయ మే,వగునన్ జోరరామిఁ బోయె ♦ వచ్చినక్రోధన్.

శా. అంతన్ దండధరుండు తీవ్రగతి న ♦ య్యాదిత్యవిద్వేషి న
త్యంతక్రోధము మీఱఁ జూచి యిఁక నీ ♦ ధాత్రిన్ మనన్ వచ్చు దు

* దృష్ట్వా తు తే తం వికృతం రథం మృత్యుసమన్వితమ్-అనిమూ.

ర్దాంతుం డీయముఁ డంచు నెంచకయె సం♦గ్రామంబు చేయంగ ని
శ్చింతన్ వచ్చితివే యటంచు మదిలోఁ ♦ జింతించి యుత్సాహియై. ౧౩

ఆ. శక్తితోమరముల ♦ సరగున వైచెను, దనుజవర్యుమర్మ♦తతులు వాని
తాఁకునం జలించెఁ; ♦ దద్ధతికిన్ మర్మములు గలంగి నల్ల ♦ మునుఁగ నతఁడు.

క. ఘోరంబౌ తద్బాధకు, నోరుచుకొని నిలిచె వజ్ర ♦ మొగి బాధింపన్
భూరిమహీధర ముండెడు, తీరున] నిటు రావణుండు ♦ స్థితిఁ గని యంతన్.

చ. శరములపిండు నాయముని♦స్యందనవర్యము పైని వృష్టి ని
ర్భరగతిమీఱఁగా జలధ♦రంబులు భూస్థలి నించుమాడ్కిఁ గాఁ
గురిసె; [శరంబు లయ్యవియు ♦ ఘోరతరంబగు వజ్రమట్లు భీ
కరములుగాఁ జెలంగి యటఁ ♦ గాలునిఁ గన్పడకుండ నిండినన్. ౧౬ 884

చ. ధరణిధరంబు మేఘములు ♦ దారుణరీతిని బెక్కువర్ణముల్
పరఁగఁగఁ గప్పుచందమున ♦ భాసిలె నయ్యముఁ డాశరాళిలోఁ;
ద్వరపడి ధర్ముఁ డాశరవి♦తానము నప్పుడు లీలవోలె భీ
కరశరసంహతిన్ మరలఁ♦గా నొనరించి మహోగ్రమూర్తియై. ౧౭ 885

ఉ. ఘోరశరంబులన్ రిపుల♦కూటము నొంచు నతండు నొంచె నా
వైరిని;] నంతఁ బోక రిపు♦వక్షమునన్ గురుశక్తి సాయకా
సారము నించె దానికిని ♦ జయ్యన మాఱొనరింపఁ బూనియున్
భూరితదీయబాణహతిఁ ♦ బొందుటఁ జేడ్పడియుండె నుంత తాన్. ౧౮

క. అరిజనకాలుఁడు కాలుఁడు, శరముల నొప్పించె నిట్లు ♦ జరగెను బెనుసం
గర మేడురాత్రు; లాసుర,వరుఁ డోషక మూర్ఛఁ గనక ♦ బవరము సలిపెన్.

సీ. యమరాక్షసుల కంత ♦ నయ్యెను దుములయుద్ధము,వారలిర్వురు♦ద్ధతులునౌట
విజయకాంక్షులు నౌట ♦ విపులాహవమునందు వెనుకంజ వేయని ♦ వీరు లౌట
నొక్కరీతిగఁ బోరి; ♦ దుగ్రంబుగాఁ బోరువారలవిక్రమం ♦ బారయంగ
దేవగంధర్వులు ♦ పావనమతులైన మునులును సిద్ధులు ♦ వనజసూతి

తే. ముందు నిడుకొని వచ్చి తా ♦ రందు నిల్చి
చూచుచుండిరి; యమరాక్ష♦సులు కడంగి
సంగరము నిట్లు చేయంగ ♦ జగముల కది
ప్రళయముగఁ దోఁచుచుండె; నా♦రావణుండు. ౨౨ 888

క. సురనాథాశనినిభమౌ, వరచాపము మ్రోయఁజేసి ♦ బాణమ్ముల నం
బరము నిరంతరమగున, ట్లురవడి నాయమునిమీఁద ♦ నుద్ధతిఁ బఱపెన్. ౨౩

సీ. శరచతుష్కంబుచే ♦ శమనునిమృత్యువు, దారుణబాణస♦ప్తకముచేత
నతని, సారథి బాణ♦శతసహస్రంబున యమునిమర్మంబుల ♦ నడలఁ జేసె;
దానికిఁ గోపించు ♦ తపనసూనునివదనమునుండి క్రోధధ♦నంజయుండు
వెలువడె నిశ్వాసముల♦తోడ జ్వాలాళి మెఱయంగ జవమున ♦ మెఱపురీతి;

తే నట్టి చిత్రంబు చూచి రా♦యమరదనుజ
రాక్షసులు క్రోధవహ్నిచే ♦ నీక్షణంబ
వైరిబలముల దహియింపఁ ♦ గోరె నీతఁ
డనుచుఁ దలపోయుచుండ న♦య్యవసరమున. ౨౬౹ 890

తే. కాలమృత్యువు లిద్దరు ♦ గాఢకోప,యుక్తులై నత్వరోద్యమ ♦ మొప్పఁజేయ
సిద్ధముగనుండి;రంతటఁ♦జెలఁగిమృత్యు,వట్టికోపంబుదీపింప ♦ యమునిఁ జూచి.

చ. ననుఁ ద్వరఁబూని పంపు మరి♦నాయకుఁడీఁదికి సంగరంబునన్
దునిమెద నీమహారిపుని ♦ దోడనె; నేఁ జనఁ గాచువారు లే
రనుట యెఱుంగు దీవు నిది ♦ యాను స్వభావము నాకు వైరులం
దునుముట పూర్వ మొందఱినొ ♦ దున్మితిఁ గాదె పరేతనాయకా!. ౨౮౹

సీ. సిరిచేత నెంతయు ♦ గరువంబుఁ గన్నట్టి యాహిరణ్యకశిపు ♦ వానముచియు
శంబరాసురుఁడును ♦ సంహ్రాదియును, ధూమ కేతు*విసంధులు♦ ఖ్యాతబలియు
దంభనాముండగు♦దైత్యుండునను జేంద్రుఁడగువృత్రుఁడును బాణుఁ♦డనెడుదను
డల్లి కార్తకవీరుం ♦ డనువాఁడు నరకాఖ్యుఁడామధుకైటభు ♦ లఖిలశాస్త్రజ్ఞుఁ

తే. వేత్తలైన రాజర్షులు ♦ వితతపన్న,గములు గంధర్వులాయుర♦గములు, దైత్య
యక్షులుఁ మానిరాజన్య♦ లచ్చరలును,నాబలంబున జీవితాం♦తంబు గనుట.

క. కనుఁగొనుచుందువుశమనా!,వినుము యుగాంతంబునందుఁ♦బృథ్వియు జలధుల్
గను క్షయము నాకతంబున, ఘనపర్వతనదులు తరుని♦కాయము లెల్లన్.

తే. పేరుకొంటిని గొందఱ♦వీరు గాక, బలయుతులు దుష్ప్రధర్షులు ♦ పలువు రట్టి
నాదుశక్తి నంతంబుఁ గ♦న్నార లీని,శాచరుం డెంత వీనిని ♦ జంపు టెంత.౩౩౹

చ పనుపుము సాధువర్య! దితి♦పట్టిని వీని వధించి వచ్చెదన్
ననుఁ గని యెట్టివాఁడె యయి♦నన్ బ్రదుకం గలవాఁడె? ధర్మవి
ద్ఘనుఁడవు నీ వెఱుంగనిది ♦ కల్లునె; నేఁ గనఁగా ముహూర్తమై
నను బ్రదుకం డెవం డిదియు ♦ నాదుబలస్తుతి గాదు దేవరా!. ౩౪ 896

ఆ. ఇది యనాదిసృష్టి♦యే యని తలపోయఁ
జనును నాస్వభావ ♦ మనఁగ నిదియె;
యనిన సుప్రతాపుఁ ♦ డగు యముం డమ్మాట
విని వచించె నిట్టు ♦ లనుచుఁ గడఁక. ౩౬ 897

చ నిలువుము మృత్యువా! యితని ♦ నేనె వధించెద నీక్షణంబునం
గలుషమయాత్ముఁడౌ నితనిఁ ♦ గాంచిన నాగ్రహ ముబ్బి పొర్లెడున్
విలయము నొందునట్టి దశ ♦ వీనికిఁ గల్గె నటంచు నేత్రముల్
జ్వలననిరీతి క్రోధమునఁ ♦ జాఁగ నెఱ్ఱఁబడన్ మహోగ్రుఁడై. ౩౬౹ 898

---

* విసంధి ధూమకేతుశ్చ-అనిముఖ్యపాఠము సంహ్రాది ధూమకేతుశ్చ-అనిపాఠాంతరము ఈ రెండుపేరులు నిటఁ జేర్పఁబడినవి.

క. భానుతనూజుఁడు యముఁ డా,దానవుఁ జంపంగఁ బూని ♦ తనకరమున నెం
తేని గ్రుథఁ గాలదండము, దా నందె నమోఘ మగుచుఁ ♦ దగునదిరామా!.

ఆ. దానిపార్శ్వమందె ♦ దారుణరీతిని, బొల్చు కాలపాశ♦ములు బృహత్వ
సంఖ్య నిల్పఁబడియె ♦ జ్వలనసంస్పర్శసం,కాశముద్గరంబు ♦ గ్రాలు నచట.

చ. తనువు ధరించి ముద్గరము ♦ దర్శనమాత్రముచేతఁ బ్రాణిజీ
వనముల లాగుచుండు నది ♦ వాంఛను దాఁకినఁ జెప్ప నేల? దా
నిని గడుఁ బూన్కి వైచినను ♦ నిర్గతజీవునిఁ జేయుచుండు; నం
త నతఁడు కాలదండమును ♦ దాఁకిన నయ్యది యట్టి మండుచున్. ౩౯½ 901

క. దనుజుని గాల్చెడురీతిని, గనఁబడియెన్; యముఁడు తాఁకఁ♦గా భూరిబలం
బున నమ్మహనీయశరం,బు నితాంతము విస్ఫులింగ♦ముల నెగఁజిమ్మెన్. ౪౦½

చ. దురమున నున్న యెల్లరును ♦ దోడనె యుజ్జ్వలకాలదండమున్
సురరిపుఁ జంపఁగా యముఁడు ♦ శూరతఁ గైకొన భీతినొంది ని
ర్భరగతిఁ బాఱి; రంత సుర♦వారము లెంతయు క్షోభ మందె ని
ష్కరుణుని సూర్యసూతి దశ♦కంఠుని జంపెడుకాంక్ష పొంగఁగన్. ౪౨ 903

చ. కరమునఁ గాలదండమును ♦ గ్రక్కునఁ గైకొన నాత్మరూప మా
సరసిజసూతి కన్పఱచి ♦ సాధువచస్థితి నిట్లు పల్కె; భా
స్కరతనయా! మహాభుజ! య♦ఖండతరానమవిక్రమా! నిశా
చరు నితనిం గఠోరతర♦సాధన మియ్యది వైచి యుత్తతిన్. ౪౩ 904

క. చంపకు చంపకు మీాతని, కింపారఁగ నేను వరము ♦ లిచ్చితిఁ ద్రిదశుల్
చంపఁగఁ జాలరు ని న్నని;, తెంపున నో త్రిదశవర్య! ♦ తీవ్రక్రుధచేన్. ౪౪

క. దనుజుని నీవిటుఁ జంపినఁ, జను నానుడి వ్యర్థమగుచుఁ ♦ జండాంశుసుతా!
విను నీచే నావచనం, బనృతముగాఁ జేయఁబడఁగ ♦ నర్హామె చెపుమా?. ౪౪½

తే. ఎవఁడు నావచనంబు న♦నృతము చేయు
నతఁడు మనుజుండె యైనను ♦ నమరుఁడైన
ద్రిజగముల ననృతములుగఁ ♦ దెంపు మెఱయఁ
జేసినట్లాను శంక లే ♦ దేసరణిని. ౪౫½ 907

సీ. మత్ప్రియాప్రియజంతు♦మండలవిషయమై యాగ్రహంబొందిన ♦ యట్టి నీవు
కాలదండము వైవఁ ♦ గడు రౌద్రమై జగత్త్రయభయావహమయి♦దారుణగతి
స్వవిషయభూతులౌ ♦ సకలప్రజలఁ దనవాఁతఁ బెట్టుకొనుచు ♦ భాస్కరసుత!;
యిద్ది యమోఘమై ♦ యెనఁగి మహాభీతికరమయి వైవ నెల్లర వధించు

తే. దీని మృత్యుపురస్కృతం ♦ బైనదాని, మున్ను నేను సృజించితి ♦ నన్నుతాత్మ!
దనుజుతలపైన వైవఁగాఁ♦దగదు దీని, శాంతమూర్తివి నాదువ♦చనమువినుము.

క. దీనిని వైవఁగ నెవ్వం,డైన ముహూర్తంబు బ్రదుకఁ ♦ డట్టి శరము నో

ధానుసుతా! యిదివైచిన, దానవుఁ డీతండు మృతిని ♦ దాఁ గనకున్నన్. ౪౯
క. మృతిఁ గాంచిన నట్లైన న,నృతమగు నాపలుకు గాన ♦ నీహేతువుచే
దితిజునిఁ జంపఁగఁ బూనిన, యతులితసాధనము దీని ♦ యమ! ధర్మపతీ!. ౪౯
క. ఉపసంహారింపు వైవకు, మిపు డీతనిపైన; సత్య♦మే యెప్పుడు ధా
త పలుకు ననియెడి కీర్తిని, దపనాత్మజ! నిలుపవయ్య! ♦ ధాత్రీస్థలిలోన్. ౫౦
తే లోకములమేలు కోరుదే ♦ నీకరణిని
జేయుమా! యంచుఁ బల్కిన ♦ నాయుదార
ధర్మచిత్తుఁడు యముఁడు వి♦ధాతఁ గాంచి
భక్తిమీఱఁగ నివ్విధిఁ ♦ బల్కె నపుడు. ౫౧ 912
తే. ఇదిగో నీకాలదండంబు ♦ నిపుడె నేను, వైవ మానితి స్వామివి ♦ నీవె నాకుఁ
గాదె నీయాజ్ఞ విడువంగఁ ♦ గలనెయిప్పు,డేమిచేయంగవలయునే♦నింకమీఁద.
చ. వరములఁ గన్నదర్పమున ♦ వర్ధిలు నీదశకంఠు నేను సం
గరమునఁ జంపకున్న నిటఁ ♦ గాఁదగు కార్యము లేదు నాకు నో
సరసిజజన్మ! యీదనుజ♦జాల్ముఁడు న న్గనకుండునట్లు నే
నరిగెదనంచుఁ బల్కుచు ర♦థాశ్వయుతంబుగఁ దా నదృశ్యుఁడై. ౫౩ 914
క. పరమేష్ఠిసెలవుఁ గైకొని, యరిగెన్; దశకంఠుఁ డంత ♦ యము గెల్చిన సు
స్థిరకీర్తిఁ జెందినటులే, పరమానందమున నాత్మఁ ♦ బరికించి తగన్. ౫౪ 915
ఆ. పుష్పకంబు నెక్కి ♦ పోయె యమాలయ
మపుడె వదలి; యముఁడు ♦ హర్ష మొందె
బ్రహ్మమొదలు దివిజ♦వారయుతుండయి
చనియె నారదుండు ♦ స్వర్గమునకు. ౫౫ 916

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౨౩ - వ సర్గము.

రావణాసురుఁడు రసాతలమునకుం బోవుట.

చ. దనుజవరేణ్యుఁ డిట్లమర♦శల్లజు ధర్ము ననిన్ జయించి తా
నని నొనరించినట్టి విజ♦యావహ కార్యము నెన్నుకొంచు మి
త్రనికరముం దమిం గనియె; ♦ దారుణరక్తపరీతగాత్రు సా
ధనవరజర్ఝరీకృతుని ♦ దానవనేతను గాంచి రాక్షసుల్. ౧ 917
క. చనుదెంచి చేరువను నిం, తనరాని మహోద్భుతమున ♦ నలరారుచు నా
తని జయమున వర్ధిల్లం,గను జేయుచుఁ జారుపుష్ప♦కంబునఁ గడఁకన్. ౨
క. మారీచుఁడు లోనగుసుర,వైరులు రావణునితోడ ♦ వైభవమలరం
గా రంజిల్లుచు నెక్కిరి, వారల సాంత్వితులఁ జేసె ♦ బల్కుల నతఁడున్. ౩

ఉ. అంత రసాతలంబుఁ జొర ♦ నాదనుజేశ్వరుఁ డెంచి దైత్యసం
క్రాంతము సర్పసంఘపరి♦రాజితముౕ వరుణాభిరక్షితా
నంతమునౌ పయోనిధి న♦నంతవిభూతిని జొచ్చి దైత్యుల
త్యంతము మోదమంద; నిటు ♦ లబ్ధిని జొచ్చి యనంతరంబునౕ. ౪ 920

క. వాసుకిపరిపాలితమై, యేసరణి నెదుర్పరాక ♦ యెసఁగునగరముౕ
శ్రీసంతతజుష్టమును స,రీసృపయుగ్భోగవతిపు♦రీతిలకంబుౕ. ౪౫ 921

క. కనుఁగొని యందలిఫణులౕ, దనవశమున మెలఁగఁజేసి ♦ తరలి ప్రమోదం
బున [1]మణిమతియను పురికిం, జనియెౕ; దనుజేంద్రులందు♦సాంద్రవిభూతిౕ.

సీ. బ్రహ్మ యిచ్చినవద్వ♦రంబులచేఁ గ్రాలి కీర్తియశంబు ల♦కృత్రిమములు
గాఁ దగ రాజిల్లి ♦ క్రవ్యాదవీరులై తగునివాతకవచ♦దర్పవీర్యు
లప్పురంబున నుందు ♦ రవ్వారిఁ బిల్చెను సమరంబుచేయ ద♦శవదనుండు;
వారు బలాఢ్యులై ♦ బహువిధసాధనయుక్తులై యుద్ధమం ♦ దొప్పునట్టి

ఆ. మదము గల్గి వెడలి; ♦ రిదె వచ్చితి మటంచు
బలికి; రంత శూల♦ములఁ ద్రిశూల
ములను బట్ట సాసి♦కులిశ పరశ్వథ
ములను గ్రుమ్మఁ బూని ♦ రొలయు వేడ్క. ౭౫ 923

క. దనుజులు రాక్షసులును దా,ర్కొని యన్యోన్యంబు గెల్చు♦కోర్కుల యుద్ధం
బును జేయుచుండఁగాఁ గడ,చెను [2]వర్షం బొండు నుంత♦చెందక కొఱఁతౕ.

క. ఇరువీడులందుఁ గన నొ,క్కరికైనను గెలుపుగాని ♦ గరువ మెడలి సం
గరమునఁ బాఱుటగానీ, జరగక యని యొక్కరీతి ♦ సాగుచు నుండెౕ.

సీ. ముజ్జగంబులయందుఁ ♦ బోవ సమర్థుఁడై దేవదేవుండయి ♦ పావనుఁడయి
తనరు విధాత యా♦తరుణంబునౕ హంసవర్యోథమగు యాన♦వరము నెక్కి
యవ్యయుండగుటఁ దా ♦ నచటికి వచ్చెను జవ మొప్ప; నయ్యెడ♦సాగుచున్న
రణకర్మమును నిల్పి ♦ రాక్షసవరుల నివాతకవచులను ♦ బరమహర్ష

ఆ. మునఁ జెలంగి పిల్చి ♦ యనియె వృద్ధుఁడు పితా
మహుఁడు జ్ఞానవిదుఁడు; ♦ మాన్యులార!
దశవదనుఁడు వీఁడు ♦ దనుజామరులకు న
జేయుఁ డగును జుండి ♦ యేయెడలను. ౧౧౫ 926

క. సురదానవు లొక్కటియై, పరాక్రమించినను మీరు ♦ బవరంబునఁ జా
వరు మీకు నేను బూర్వము, వరముల నిచ్చితిని గాదె ♦ వరమతులారా!.

ఆ. కనుక మీసఖిత్వ ♦ మనుకూల మితనికి
వనుచుఁ దోఁచె నాకు ♦ ననుఁగుమిత్రు

---

1 యయౌ మణిమతీం పురీమ్-అనిమూ. 2 సాగ్ర స్సంవత్సరో గతః-అనిమూ.

లోకరీతిఁ గూడి ♦ యుండ నర్వార్థముల్
కలుగు సంశయంబు ♦ గలుగ దిందు. ౧౩ 928

క. అనినంత నగ్నిసాక్షిగ, దనుజేంద్రుఁడు రావణుండు ♦ ధాతృననుజ్ఞం
గొని వారలతో సఖ్యం,బును జేకొనెఁ బ్రీతి మిగులఁ ♦ బొందెన్ మదిలోన్.

క. పరమేష్ఠి చనియెఁ; దదనం,తరము దశాస్యుండు దనుజ♦తల్లజులగుత
త్పురపాలకు లర్చింపం, గర మామోదమున నందుఁ ♦ గడపె శరత్తుల్. ౧౮౫

క. తనపురికంటె విశేషిం,చిన సుఖముల నందుఁ బొంది ♦ చిత్తముపొంగన్
దనుజు లొకొక్కరు వేఱొ,క్కనికిన్ బోధించుచిత్ర♦గతు లగుమాయల్.

క. వినుచున్ గ్రహియించెను జ,క్కనిరీతిని నొకటి కొదువఁ♦గా శతమాయల్
మనమున ధరించి యవ్వలఁ, జనియెన్ జలనాథుపురము♦నరణిం గనుచున్.

క. చనుచుండి యశ్మనామం,బునఁ గడుబెడఁగైన నగర♦మును గని నందున్
ఘనబలముల మెఱయుచుఁ ద,క్కినవారిని లెక్కఁగొనక ♦ కృత్రిమయుతులై.

క. తనరారుకాలకేయులు, కనదున్నతవిభవయుక్తిఁ ♦ గ్రాలఁగ వారిన్
గని యుద్ధమునకు రమ్మన, దనుజులు వారెల్ల రాఁగఁ ♦ దా బలమొప్పన్.

తే. వారి వధియించి శూర్పణ♦ఖారమణుని
భూరిబలుని విద్యుజ్జిహ్వుఁ ♦ గోరి వైరి
బలము నాల్కను జాపి యి♦మ్ముల గ్రహించి
తినుచునుండఁగఁ గన్గొని ♦ తెంపుచేసి. ౧౭ 935

సీ. సోదరిపతి వీఁడు ♦ గాదె యం చెన్నక ఖడ్గముచేతఁ ద♦త్కంఠ మట్టి
తెగవేసె; క్షణమున ♦ నగణితబలశాలి వాని వధించి దో♦ర్బలము మెఱయ
నాల్గువందల దైత్య♦నాథుల ననిఁ జంపి యవ్వలఁ జని సితా♦భ్రాభమగుచుఁ
గైలాసమును బోలి♦క్రాలుచు దివ్యమౌ వరుణాలయముఁ గాంచె;♦వరుననందుఁ

తే. బాలు చక్క స్రవింపఁగా ♦ భాసురముగ
నలరుచుండిన సురభిని ♦ హర్ష మలరఁ
గనియె నద్దాని పాలచే♦తనె జనించి
ధరణి క్షీరోద మనెడు సా♦గరము వెలయ. ౨౦౫ 936

ఆ. *ఎలమి నందు గోవృ♦షేంద్ర వరారణిఁ
గనియె శీతరశ్మి♦గణము మెఱయ
నట్టి రాత్రినాథుఁ ♦ డగుచంద్రుఁ డందుండి
యుద్భవించెఁ గీర్తి ♦ యొప్పుచుండ. ౨౨ 937

క. పరమర్షులు తత్ఫేనం, బరుదుగ నిత్యంబుఁ ద్రావి ♦ యాగోవు మహా

---

*.దదర్శ రావణ స్తత్ర గోవృషేంద్రవరారణిమ్-అనియూ. గోవృషేంద్రస్య మహావృషభస్య వరారణిం సాక్షాన్మాతరమ్-అనివ్యాఖ్య.

దరమునఁ గొల్చుచు జీవింతురు పీయూషంబు దానఁ ♦ దోఁచెం గాదే. ౨౩

ఆ. స్వధయె భుక్తిగాఁగఁ ♦ జను పితరుల కగు,స్వధ జనించె దాన ♦ జనులు దేని
సురభియనుచుఁ బ్రీతి ♦ శోభిల్లఁ బిల్తురో, యట్టి కామధేను ♦ వచట నుండ.

చ. దనుజవరుండు దానికిఁ బ్ర♦దక్షిణ మొప్పఁగ వందనంబుఁ జ
క్క నివిధ నద్భుతాహవము♦గా నొనరించి భయంకరంబుగాఁ
గనఁబడుచుం బలావళులు ♦ గావఁగ జీవనధార లెన్నియో
యనిశము పొల్చుచుండఁ దగు♦నట్టివిధంబునఁ జెన్నుమీఱుచుం. ౨౬ 940

క. శరదభ్రనిభంబగుచుం, వరుణాలయ మచట వెలయుఁ ♦ బరమముదమునం
బరిపరి మెచ్చుచు నెంతయుఁ, బరికించి దశాననుండు ♦ బరవస మొప్పన్.

సీ. కావలియున్న బ♦లావళి మార్కొని కొందఱ వధియించి ♦ కొంక కట్టి
నాగు తన్ మార్కొని ♦ బాణజాలంబుల నొప్పింపఁ జొచ్చి ద♦నుజవరుండు
వారిఁ గన్గొని యిట్లు ♦ పలికె మీరాజుతో నారాకఁ దెలుపుఁడీ♦భూరిబలుఁడు
రావణుం డిపుడు సం♦గ్రామకాంక్షను వచ్చె యుద్ధంబుచేయుమా♦యుద్ధమునకుఁ

తే. జాల వే యోడినాఁడ నిం ♦ కేల యనుచు
నైనను జెప్పుమనుడు భ♦యంబు గల్గ
దతని కంజలి చేసిన ♦ ననుచుఁ, బలుకు
నంతలో నాగ్రహ మ్మూని ♦ యతులబలులు. ౨౮ 942

క వరుణునితనయులు తత్సుతు, లురుబలనాయకులతోడ ♦ నొక్క మొగిని వ
చ్చిరి గౌ,పుష్కరులను ని,ర్వీరు సేనాపతులు భీక♦రులు దురమందున్. ౨౯

చ. ఘనబలముల్ తముం గొలువఁ♦గా నుదయించు సరోజమిత్త్రుఁడో
యన వెలుఁగొంది కామగతు ♦ లద్భుతరీతిఁ జెలంగ నున్న స్యం
దనగణ మొప్పఁగా దనుజ♦నాథుని మార్కొని; రంత దారుణం
బనుపమరోమహర్షణము♦నౌ సమరంబు పొసంగె నత్తఱిన్. ౩౦ 944

చ. వరుణునిపుత్త్రు లెల్ల సుర♦వైరివిభుం దగురీతిఁ దాఁకి ర
త్తరుణమునందుఁ దత్సచివ♦తల్లజు లెల్లను దానవేంద్రు భీ
కరసచివాళితో దుర మ♦ఖండముగా నొనరించి; రంత నా
వరుణునిసేన లెల్ల క్షణ♦భంగము నొంది నశించె నంతటన్. ౩౧ 945

చ బలములు క్షీణతం గనుట ♦ వారలు గాంచి మహాసురాంబకం
బులఁ గమఁ బీడ నొంది రణ♦ముం బొనరించుట మాని వేగమే
యిలపయి కేగుదెంచి దను♦జేశునిఁ బుష్పకమందుఁ గాంచి భూ
తలముఁ ద్యజించి సత్వరర♦థంబుల నంబర మొంది యంతటన్. ౩౩ 946

తే. తుల్యమా స్థాన మొందుటఁ ♦ దముల యుద్ధ
మయ్యె నన్యోన్య మత్తఱి ♦ నమరదనుజ

సంగరముఁ బోలి యానభ♦స్థలమునందు
వరుణతనయులు పిదప సం♦భ్రమముమీఱ. ౩౮ 947

చ. అనలునిఁబోలు బాణముల ♦ నాదనుజేంద్రుని నొంచి సంగరం
బున కిఁకఁ బూనకుండువిధ♦ముం బచరించి ప్రమోదచిత్తులై
ధ్వనుల నొనర్చి రద్ది బహు♦ధా దెసలందుఁ జెలంగె; నంత నా
దనుజవరుండు నొచ్చుటను ♦ దాను మహోదరుఁ డాత్మ నెంచుచున్. ౩౯

ఉ. దారుణకోప మొంది రణ♦ధర్మము నూని యిఁకేటి లోకమం
చారసి మృత్యుభీతిఁ గన ♦ కద్దు దురం బొనరింపఁ బూనె; న
వ్వీరుఁడు వారి మార్గాన వి♦భీతిని గాయగతుల్ చెలంగఁగా
మారుత మట్లు పోవుహయ♦మండలముల్ వధియించె నేర్పునన్. ౪౦ 949

క. గదచేత నిట్లు పితృపతి,సదనమునకు వానిఁ బనిపి ♦ శౌర్యంబున ను
న్మదుఁడై వారల యోధుల, నదయత నూర్వురను జంపి ♦ యత్యుద్ధతిచేన్.

క. విరథుల సంగరతలమున, వరుణాత్మజులఁ గని యార్చెఁ ♦ బటుతరముగ; ని
ట్లురవడిమీఱ మహోదరుఁ, డరిహయసారథుల స్యంద♦నావళిఁ గూల్చెన్.

క. ధరణిం బడియెను; బిదపన్, వరుణాత్మజు లెల్ల నని వి♦భగ్నరథములన్
బరికించి వదలి యవు డం,బరమున నిలుచుండి వ్యథల ♦ బడలక పూన్కిన్.

ఆ. ఆత్మశక్తి నిట్లు ♦ లలరి మహోదరుఁ, దాఁకి చాపములకు ♦ వీఁక గుణము
లట్టె కూర్చి భీక♦రాంబకములు వైచి, యతని నొంచి విడిచి ♦ యాతురమున.

ఉ. రావణుపైకిఁ బోయిరి దు♦రంబున నాతని నొంచువేడ్కచే
నావరుణాత్మజన్ములు మ♦హాత్తరరోషము పొంగ గుంపుగాఁ
జేవ; ధనుశ్చ్యుతంబులగు ♦ చిత్రశరావళి వజ్రమో యనం
గా వరపుంఖయుక్తము ని♦కామరణోత్సుక ముప్పతిల్లఁగన్. ౪౩ 954

చ. ఘనములు భూధరేంద్రమును ♦ గ్రమ్ముగతిన్ గురియింప నొచ్చి యా
దనుజవిభుండు క్రోధమున ♦ దారుణనేత్రము లొప్పఁగా లయం
బున ననలుండువోలె శర♦ముల్ గురియించుచు వారిమర్మముల్
పనివడి నొవ్వఁజేసె; భట♦పంక్తిని గూల్చెఁ దదుగ్రతన్ వడిన్. ౪౪ 955

సీ. అంతట మాన క♦య్యసురనాథుఁడు విచిత్రంబులౌ ముసలము♦ద్గరసమితుల
భల్లశతంబులఁ ♦ బట్టసంబుల శక్తితతుల శతఘ్నుల ♦ దారుణములు
గాఁ దగు తోమర♦గణముల దుర్ధర్షుఁడై వైచె వారిపై ♦ నంత భటులు
వారును దురమున ♦* వరకుంజరంబులు షష్టిహాయనములు ♦ జరపియున్న

తే. యవ్వి పంకంబునం జిక్కి ♦ యడలురీతిఁ
గుంది; రవ్వార లార్తిని ♦ బొందు టెఱిఁగి

* మహాపంక మివాసాద్య కుంజరా షష్టిహాయనాః. అనియు.

పటుపరాక్రమశాలి రా♦వణుఁడు జలద
మార్చునటు లార్చి గొప్పగా ♦ హర్ష మొదవ. ౮౭½ 956

ఉ. అంతట మాన కయ్యసురుఁ ♦ డానరుణాత్మజులన్ గలంపన
త్యంతరవంబుమీఱ బహు♦శాయతసాధనరాజి వైచె; సం
క్రాంతశరాంగులై జలద♦రాజి నిరంతరధార లొప్ప దు
ర్దాంతపువృష్టి నించెడువి♦ధంబునఁ బైపయి బాణజాలముల్. ౮౮½ 957

క. పరఁగించు రావణుని దో,స్స్ఫురణంబున కాగలేక ♦ క్షోణిని మూర్ఛా
పరవశులై పడి రెల్లరు;, దురమునఁ బడియుండఁ గాంచి ♦ తోడన వారిన్.

ఆ. రణమునుండి మంది♦రమ్మును జేర్చిరి
సేవకులు; బలంబు ♦ చెలఁగ రావ
ణాసురుండు భటుల ♦ నటఁ గాంచి వరుణున
కెఱుకపఱుపుఁ డిప్డు ♦ డేగి మీరు ౯౦ 959

చ. అనఁ బ్రహాసాఖ్యమంత్రి యసు♦రాధిపతిం గని యిట్లు పల్కె నో
దనుజవరేణ్య! ముందుగఁ బి♦తామహులోకమునందు గానముల్
విన వరుణుండు పోయెఁగద ♦ వేడుకఁ బిల్చెద వీవు సంగరం
బునకయి, రాజు లేనియెడఁ ♦ బోలునె యీవిధిఁ బిల్చు టారయన్. ౯౧½

క. పనిలేక నీవు పిల్చితి, వనఁదగు నీశ్రమము నిష్ఫ♦లారంభంబే
విను మతని వీరపుత్రకు, లని యొనరిచి యోడిపాఱి ♦ రనియు నెఱుఁగవో.

చ. వరుణునిమంత్రి యిట్లనఁగఁ ♦ బట్టఁగరాని ముదంబునన్ మహా
సురుఁడు స్వనామకీర్తులను ♦ క్షోణిని దిక్కుల నెల్లతావులన్
విరివిగఁ జాటఁబంచి కడు ♦ వింతగ నాద మొనర్చుచుం జనెన్
వరుణుని యిల్లు దాఁటి తన♦వచ్చినత్రోవను బట్టి యేపునన్. ౯౪ 962

క. తనపురిఁ గన్గొను వేడుకఁ, జనియె నభోమార్గముననె ♦ సకలదనుజులున్
దనుఁ గొల్వ విజయఘోషం,బును జేయుచుఁ జారులేగఁ♦బొంగెడుకాంక్షన్.

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

* అధికపాఠసర్గములు.

౧ - వ సర్గము.

రావణుండు శివుని జయింపఁ బోవుట.

చ. మనమునఁ దోఁచుహర్షమున ♦ మాముకక్త్రిసి పింటె పే యటం
చును దశకంఠుఁ డార్చుచును ♦ జోద్యముఁ గాంచుచుఁ బోవుచుండ నా

---

* ఇటనుండి యైదుసర్గములు వ్యాఖ్యాతలు అధికపాఠములని వ్యాఖ్య వ్రాయక వదలిరి. గ్రంథమున ముద్రింపఁబడినవని వదలఁజాలక రామాయణమున నింకొక్క శ్లోకమున్నను దెనిఁగించి కృతార్థుఁడను గాఁ దలంచుకొన్నవాఁడను గానఁ దెనిఁగించితిని.

తనసచివుండు పార్శ్వమునఁ ♦ దాఁ బలుకంగనెలేక వెంట రాఁ
జనుచు మహాసురుల్ గొలువఁ ♦ జయ్యన నశ్మపురంబుఁ జూడఁగన్. ౧ 964

ఆ. మరలఁ జనియె యుద్ధ♦మదమునఁ బూర్వ మె
చ్చటను జూచియుండఁ ♦ జారుతరము
భాస్వరంబునైన ♦ పరమసౌధంబును
ముత్తియంపుహార♦ములఁ జెలంగి. ౨ 965

సీ. చారువైడూర్యర♦త్నోరుతోరణరాజి బెడఁగయి యెల్లెడ ♦ వేదికలను
దనరారి హాటక♦స్తంభంబు లొప్పార స్ఫటికవజ్రంబుల ♦ భాసురముగఁ
జేయంగఁ బడినట్టి ♦ చిత్రసోపానముల్ వెలయంగఁ గింకిణీ♦వితతు లొప్ప
భవ్యాసనంబుల ♦ భాసురంబై దేవపతిభవనంబు నాఁ ♦ బరఁగి యాగృ

తే. హంబు కనుపట్టఁగాఁ బ్రతా♦పాధికుండు
దశవదనుఁ డట్టి చూచి యు♦త్తమగృహం బి
దెవ్వరిదొ చూడ సౌమ్యమై ♦ యివ్విధమునఁ
గానఁబడియెడుఁ గనులకుఁ ♦ గమ్రమగుచు. ౩ 966

క. మేరువొ మందరనగమో, నా రాజిల్లుచును నొప్పె ♦ నాదునుదికి నీ
భూరిగృహంబు గనుంగొను, కోరిక జనియించెఁ గానఁ ♦ గొంకక యిపుడే ౪

క. చనుమా! ప్రహస్త! నీవటఁ, గనుఁగొనుమా! యెవరిదొక్కొ ♦ కాంతగృహం బి
ట్లనుపమమై కనఁబడియెడు, నన విని యాతండు చిత్త♦మని యాగృహమున్.

చ. కనుఁగొని యందుఁ జొచ్చి యటఁ ♦ గానక యెవ్వరి; దీనిహేతు వే
మని తలపోసి ద్వారముఁ బ్ర♦హస్తుఁడు దాఁటి మఱొండు కక్ష్యనుం
గని యటఁ జొచ్చి యాకరణిఁ ♦ గక్ష్యల నేడిఁటి దాఁటి మీఁదటన్
గనియెను జ్వాల నుజ్జ్వలము♦గా నలరారెడుదాని నంతటన్. ౬ 969

క. దానికురంగటఁ బురుషుని, దానవవరుఁ డట్టి చూచెఁ ♦ దత్పురుషుం డా
మానవభక్షకుఁ గని ముద, మూని ప్రహాసంబు చేసె ♦ నొక్కవిధమునన్. ౭

తే. ఆమహాహాసము విని ప్ర♦హస్తుఁ డప్పు
డూర్ధ్వరోమాళియగుచు మ♦హోగ్రరీతి
మండు నాజ్వాలనడుమ హే♦మమయ మాలి
కాభిమండితుఁడై యున్న♦యట్టిపురుషు. ౮ 971

క. కనియెను; బురుషుం డాతఁడు, వనజాప్తునిరీతిఁ గాంతి♦భాసురుఁ డగుచున్
గనరాకయె ప్రత్యక్షుఁడు,మునివలె నందుండె; దనుజ♦ముఖ్యుం డంతన్. ౯

క. ఆవార్తను దెల్పినచో, రావణుఁ డేకార్యమును ద్వా♦రం జేయునో యం
చావృత్తాంతముఁ దెల్పెడు,భావంబున మరలి చేరెఁ ♦ బ్రభుసంతికమున్. ౧౦

క. చేరి దశాననునకుఁ బ్రియ, మారఁగ నవ్వార్త నెల్ల ♦ నాతఁడు తెలుపం
గా రావణుండు కన్గొను, గోరికఁ బుష్పకము డిగ్గి ♦ గొంకక మదిలోన్. ౧౧
తే. లోనఁ జొర నెంచెఁ జందురు ♦ నూని తలను
గాటుకను బోలి తనుకాంతి ♦ కానఁబడఁగ
భయదరీతి నప్పురుషుండు ♦ వానియెదుట
నిలిచె; ద్వారంబు నిండ సు♦జ్జ్వలతనువున. ౧౨ 975
సీ. అతఁడు జ్వాలాజిహ్వుఁ♦డై భయానకుఁడయి
యరుణాక్షుఁడగుచు శ్వే♦తాస్యుఁ డగుచు
బింబోష్ఠ సులరారఁ ♦ బ్రియమున నున్నట్టు
లూర్ధ్వరోముండయి ♦ యురుభయంబు
గలుగఁజేసెడు నాసి♦కయు గ్రాలఁ గంఠంబు
కంబుతుల్యంబుగఁ ♦ గానఁబడఁగ
గురుహనుండయి శ్మశ్రు♦కూటంబు గూఢమై
యలర నిగూఢాస్థి♦కలితుఁ డగుచు
తే. దంష్ట్రి లట్టె ప్రకాశింప ♦ దారుణాకృ
తిని వెలుంగు నప్పురుషుని ♦ దనుజవిభుఁడు
కనియె; నాతండు ముసల మొ♦క్కండు లోహ
మయమునుం గొని ద్వారంబు ♦ మునుతఁ జేరి ౧౩ 976
ఉ. కావలికాచుచుండె; సుర♦కాండవిరోధియు నమ్మహాత్మునిన్
జేవఁ జెలంగువానిఁ గనఁ ♦ జిత్తము వేగ వడంకె రోమముల్
వావిరి నిక్కయుండెఁ దను♦వైభవ మెల్లఁ దొలంగి భీతిచే
భావ మడంగఁ గంపమున ♦ వర్ణము మాఱినయట్టు కన్పడెన్. ౧౪ 977
చ. తనమది దుర్నిమిత్తములు ♦ తద్దయుఁ దోఁచిన రామచంద్ర! యా
దనుజవిభుండు చిత్తమున ♦ దాఁ దలపోయుచునుండె; నంత నా
తనిఁ గని యమ్మహాపురుష♦తల్లజుఁడే యిటు పల్కె; నేమి నీ
మనమున నెంచువాఁడ వను♦మానము లేక వచింపు మిష్టముల్. ౧౫ 978
క. ఆలస్యం బొనరింపకు, మేల యిటం జొచ్చినావొ ♦ యెఱిఁగింపుము నీ
కాలము నాతిథ్యంబుగ, నోలి మహావీర! నేనె ♦ యొసఁగుదుఁ జుమ్మీ. ౧౬
క. అని మరలఁ బలికె నోహో,దనుజేశ్వర! చక్క వినుము ♦ ధర్మాత్ము బలిన్
గని యాతనితో యుద్ధం,బును జేయుదొ లేక నన్నుఁ ♦ బొంగెదు కాంక్షన్.
క. మారుకొని వీర్యమొప్పఁగ, బోరుదువో తెలుపు మనినఁ ♦ బూరుషవర్యుం
డారీతిఁ బల్క మరలను, నా రావణు దేహమందు ♦ నానయమునన్. ౧౭
తే. గగురుపాటు జనించె; ని♦క్కరణి నుండ
ధైర్యమూని యాశరపతి ♦ తగ వచించె

నీగృహంబున నున్నవా ♦ రెవరొ తెలుప
వయ్య వాగ్విద్వరేణ్య ! నెయ్యమున నీవు. ౨౦॥ 982

క. అని నొనరించెద నే నా,తనితో నీ వెంచి నట్లు ♦ ధైర్యముతో నా
విని యాపురుషుఁడు మరలన్, దనుజేంద్రునితోడఁ బలికె ♦ దారుణభంగిన్.

చ. దనుజవిభుండు కాపుర ము♦దారవిభూతిని జేయుచుండు నిం
దనుపమసత్యవిక్రముఁ డ♦హార్యబలుండు వదాన్యశేఖరుం
డనఘుఁడు సద్గుణాకరుఁడు ♦ హస్తమునం దలరారు పాశముల్
గనఁబడ నొప్పు నాయముని♦కైవడి దుర్జయుఁ డెట్టివారికిన్. ౨౨॥ 984

క. బాలార్కునివలెఁ దేజము, గ్రాలఁగ యుద్ధంబులం బ♦రాజయ మన నే
కాలముననైనఁ బొందక, పాలితదీనుండు నగుచుఁ ♦ బటుబలయుతుఁడై. ౨౩

సీ. దుర్జయుండయి సుంత ♦ ధూర్తుండుగాకయె ప్రియములుపల్కుచుఁ ♦ బ్రీతిమీఱ
*గురువిప్రహితుఁడయి ♦ నరగునఁ గృత్యముల్ విభజించి చేయుచు♦విపులసత్వ
మలరఁ గాలంబు ని♦మ్ములఁ గార్యములఁ జేయఁ గోరుచుసత్యవా♦క్కుల నెపల్కి
శుభదర్శనుండయి ♦ శూరుఁడై దక్షుఁడై తనరిస్వాధ్యాయత♦త్పరుఁడు నగుచు

తే. సకలగుణరత్నజలధియై ♦ ప్రకటశక్తి
వెలయు బలిచక్రవర్తి యి♦లలితసౌధ
మందు నివసించుచున్నవాఁ ♦ డమర భుజగ
భూతమునిసంఘములు తన్నుఁ ♦ బొగడుచుండ. ౨౪ 986

క. సురభూతభుజగతతిచే, నిరతము భయమునఁగ నెఱుఁగ♦నేరఁడు బలి యా
పురుషవరేణ్యునితో సం,గర మెట్లొనగుతువో తెలియఁ♦గా నేరఁ జుమీ.

మ. బలితో యుద్ధముఁ జేయుకోర్కి మదిలో ♦ భావింప నీకున్నచో
బలిసిం జూడఁగఁ బొమ్ము లోపలికి నీ♦ప్రాగల్భ్యముం జూపి ని
స్తులసత్త్వా! యనిఁ జేయవయ్య ! బలముల్ ♦ తోడ్తోడ నేతేర దో
ర్బల ముప్పొంగఁగ నాలసింప కను న♦ప్పల్కుల్ చెవిం జొచ్చినన్. ౨౬॥

తే. పదితలల్ గల దానవ♦పతియు లోనఁ
జొచ్చె నాతని సెలవొంది ♦ శూరవర్యుఁ
డైన బలియున్నచోటికి ♦ నాబలియును
దశవదనురాకఁ గని ప్రము♦దంబు పొంగ. ౨౭॥ 989

చ. ఒనరిచె నట్టహాసమును ♦ హోయని నవ్వెను సూర్యరీతిగాఁ
గనఁగొనరాని తేజమునఁ ♦ గ్రాలుచు నా దనుజేంద్రుఁ డుండి యం
త నిఖిలవిశ్వరూపుఁడయి ♦ తా నలరారుటఁ బంక్తికంఠు నా
య్యనఁ గర మెట్టి చాఁచి తన♦యంకతలంబును జేర్చి యంతటన్. ౩౦ 990

---

* గురువిప్రప్రియ స్సదా-అనిమూ.

చ. పలికె దశాస్య! దీర్ఘభుజ! ♦ భావమునం దలరారు నట్టికో
ర్కులు చెపుమా ఫలించునటు ♦ కొంకక చేసెద, నేల వచ్చితో
తెలుపుము దాఁపకుండ నని ♦ ధీరవరేణ్యుఁడు తన్నుఁ గూర్చి య
బ్బలి యిటు పల్క రావణుఁడు ♦ పల్కెను; వాగ్విభవంబు పొంగఁగన్. ౩౧

క. వినియున్నవాఁడఁ బూర్వం,బున నిను నారాయణుండు ♦ పూనిక బంధిం
చె నటంచు మహాభాగా!, విను మే నాబంధములను ♦ విడిపింతుఁ దగన్. ౩౨

క. ఆపనికి నేను జాలుదు, నీపల్కిన సంశయం బ ♦ దెన్నఁగ లే దో
పాపహరా! ద్వారంబున, నేపురుషుని గంటినో య♦హీనబలయుతున్. ౩౩

ఆ. అతనిఁ దెలియ నేను ♦ నాత్మఁ గోరెద నన, బలియు నవ్వి యిట్లు♦పలికె; రావ
ణాసురేంద్ర! యెవని ♦ నడిగితివో విను,మతనిరీతి నెల్ల ♦ ననువదింతు. ౩౪

సీ. శ్యామాంగుఁడై ద్వార♦ముందున్నపురుషుండె నారాయణుఁడులోక♦నాయకుండు
వినవయ్య యతనిచే♦తనె దానవేంద్రులు బలవత్తరులగు శూ♦రులు నితరులు
వధియింపఁబడిరి, దో♦ర్బలశాలియైన యాతనిచేతఁ బూర్వు లం♦తకును బూర్వ
లెందఱో లోఁబడి ♦ యేవేళ నుండంగఁ జేయంగఁబడిరి; న♦న్నాయనఘుఁడె

తే. మున్ను బంధించె శమనుఁడే ♦ యెన్న నతఁడు
దాఁటరాదు తదాజ్ఞ నె♦త్తటిని నైన;
ధాత్రి నాతని నెవ్వాఁడు ♦ ధైర్యమూని
తలఁచు వంచింప రావణా! ♦ తెలుపవయ్య!. ౩౫ 995

క. భూతతతిన్ హరియించెడు, నాతఁడు ద్వారప్రదేశ♦మందు వసించున్
ధాతయు భువనేశ్వరుఁడును, ఖ్యాతిగ నాతండె కర్త ♦ కారయితయుఁ జూ!.

క. పరమాత్మ నతని నెఱుఁగవు, సురవైరివ! నీవు నేను ♦ నూనృతముగఁ ద
ద్వరరూప మెఱుఁగఁ జాలము, పరముం డతఁ డెన్నభూత♦భవ్యభవుండున్. ౩౬

ఆ. ప్రభువు కలియు నతఁడె ♦ పాటింపఁ గాలంబు
తత్స్వరూప మగును ♦ ధరణిఁ గల్గు
భూతతతులఁ జంపు ♦ భువనత్రయమునకుఁ
గర్త యతఁడె సుమ్ము ♦ భర్త యతఁడె. ౩౭ 998

క. స్థిరచరభూతంబుల నా, పురుషుఁడె చంపంగఁ జాలుఁ ♦ బోకార్చి తుదిన్
ధరఁ బుట్టించును మరలన్, బరిపూర్ణుఁడు తుదయు మొదలు ♦ పరఁగ నతనికిన్.

క. కరణము కారణమునునై, పరఁగుచుఁ గర్తయును నగుచు ♦ భాసిల్లుఁ జుమీ
పురుషుం డాతఁడె దనుజే,శ్వర! యిష్టము నొసఁగు నతఁడె ♦ భక్తుల కెల్లన్.

క. హితమైనపదార్థము నా,మతిమంతుఁడె కుడుచుచుండు ♦ మహితవిభూతిన్
క్షితి కతఁడె నాయకుండగు, నతఁడె సుమీ ధాత గోప్త♦యన నొప్పారున్.

ఆ. ఇట్టి గొప్పభూత ♦ మీజగత్త్రియమున, వెదకి చూడ లేదు ♦ వినుము నీవు

నేను మనకుఁ బూర్వులైన వారెవ్వరో, వారి కెల్ల నతఁడె ప్రభువు సుమ్ము.
*క. రశనను గైకొని యెవ్విధిఁ, బశువును బంధించి నిలువఁబడఁ జేయుదురో
పశుతుల్యులైన మనలం, బశుపతి యాతండె కాచు బలము మెఱయఁగన్.
సీ. దనువృత్రశుకశుంభు లనువారు, మఱి నిశుం
భాఖ్యుండు దంభుండు నల్లికాల
నేమియుఁ బ్రహ్లాదుఁ డామాడ్కి వైరోచ
నుఁడు బలి కాలకేయుఁడును దార
కాఖ్యుండు ముచుకుందుఁ డనుదానవుఁడు వివ
ర్ధనుఁడు హిరణ్యాక్షుఁ డనుఘనుండు
మధుకైటభులును ధూమ్రసురవైరియు శంబ
రాహ్వయుండును యమశార్జునులును
తే. గంసకైటభమృదువు లఖండవిక్రమాఢ్యులింకెందఱో మహాత్ములుగుతపము
చేసి రట్టె ప్రకాశించి రీసుమీఱ, విక్రమంబును జూపిరి [1]వృష్టి నిడిరి. ౪౬
చ. క్రతుశతముల్ విధిన్ సలిపి కాంక్షలఁ బొందిరి భూరిభక్తిచే
నతులితమాతపంబుఁ గడు నద్భుతరీతిని జేసి యోగమం
దతిశయనిష్ఠయుం గలిగి యాత్మ విశుద్ధముగాఁ జెలంగ సం
తతగురుభాగ్య మొప్ప క్షితిఁ దారు సుఖంబులఁ బొంది యొంతయున్. ౪౭
క. అతిథుల కిచ్చుచు విద్యా,మతులను దనరారి సుతులమాడ్కిం బ్రజలన్
హితముగఁ బోషించుచు నే,త్క్షితిపతు లాత్మానురక్తిఁ జెందుదురో తగన్.
క. వారలఁ గాపాడుచు రిపు,భూరమణుల యుద్ధమందుఁ బొంక మడఁచుచున్
శూరులుగా నొప్పుచు నని, నారయ లోకముల సమత నంద కలరుచున్. ౪౮
తే. అభిజనోపేతులై వార లస్త్రశస్త్ర,విద్యలం దాఱి తేఱుచు విగ్రహంబు
లందు వెనుకంజ వేయక యమరరాజ్య, మేలఁగాఁ గోరి దేవతాజాలము నని.
క. వేలకువేలుగఁ దఱుముచు, శ్రీలలనం బ్రీతిమీఱఁ జెంది వెలయుచున్
గ్రాలిరి గద! సురవిప్రియ, మోలిం గాంక్షించి తమకు నొప్పెడివారిన్. ౪౯
క. పరిపాలించుచు భోగో,త్కరముల నాసక్తి మిగులఁగా మత్తులునై
ఖరకరుఁ డుదయించెడు నా,తరుణంబున వెలయురీతిఁ దారు వెలుఁగుచున్.
క. సురలకు భీతి జనించెడు,సరణిన్ వర్తించి రనుట సత్యమె గద; యా
సురవైరుల నారాయణుఁ, డరసి యుపాయంబు పన్ని యణఁచెం గడఁకన్.
క. హరి యందఱఁ బుట్టించును, హరియే మృతి నొందఁజేయు నవ్వలఁ దానే
పురుషోత్తముండు తనలోఁ, గర మురుదుగ మోదమందుఁ గాలముఁ గనుచున్.

* పశుం రశనయా యథా-అనిమా. ఈపద్యోత్తరార్థము దీనివివరణమే యని తెలియందగు.
1 వాంతి వర్షంతి చైవహి-అనిమా.

చ. దనుజవరేణ్య! మత్కథిత♦దానవు లందఱుఁ గామరూపియూ
వనజదళాక్షుదోఃపటిమఁ ♦ బౌరుషముల్ చెడఁ గూలి రట్టి, యే
దనుజులు దుష్ప్రధర్షు లన ♦ ధాత్రిఁ జెలంగిరో యట్టి వారలే
యనిమొన విష్ణుశక్తిఁ గని♦నంతనె చెప్పక పాఱి రార్తులై. ౫౫ 1013
క. నిలువంబడి రణమొనరుపఁ, దలఁచినవా రెల్లఁ జనిరి ♦ ధర్మపురికి శ్రీ
లలనాపతిచక్రాయుధ, మలరుచుఁ ద మ్మావరించి ♦ యుండఁ ద్రుంపన్. ౫౬
చ. [1]అని యిటు పల్కి యబ్బలియు ♦ నాదశకంఠునిఁ జూచి యింక ని
ట్లనియె; నదే కనంబడెడు ♦ నాస్థలమందుఁ బ్రదీప్తపావకుం
డనఁదగి చక్ర మొక్కఁడు, మ♦హాబలశాలివి నీవు దానిఁ జే
కొని త్వరనాదుపార్శ్వమున♦కుం జనుదెమ్ము ప్రియంబు గూర్పఁగన్. ౫౭
క. తరువాత నావిముక్తికి, సురనాయకునిన్ జయించు ♦ చొప్పరసి వచిం
తు రయంబున గురుబాహూ!, సురవైరీ! చేయువయ్య! ♦ శుభకృత్యంబుల్.
చ. అన విని రావణుండును మ♦హాబలశాలియె గాన హాసముం
బొనరిచి యాస్థలంబునకుఁ ♦ బోయె నదెచ్చట [2]దివ్యకుండలం
బనుపమకాంతి నొప్పుచు మ♦హాత్తరమై యలరారుచుండెనో
కనుఁగొని లీలచేఁ దనయ♦ఖండబలంబును గానుపింపఁగన్. ౬౦ 1017
చ. కరములఁ బట్టి యూఁచె నది ♦ క్ష్మాధర మట్లు చలింపకుండె న
వ్వరుసఁ గదల్పఁ జాలక య♦వార్యబలంబునఁ బూన్కి నింకనున్
బరమముఁ జక్రముల్ గదలు♦పం దలపోసెను లజ్జచేత న
త్తరుణమునందు నొక్కయెడఁ ♦ దత్పరమాభరణాంశ మొయ్యనన్. ౬౧
తే. పైకి లేచినయంతనె ♦ పడియె నేల
రావణుండు శరీరంబు ♦ రక్తవారిఁ
దొప్ప దోఁగంగ మూలంబు ♦ ధూర్తపరశు
ధార నఱుకంగఁ ద్రెళ్లెడు ♦ తరువుకీతి. ౬౨ 1019
చ. దనుజవరుండు భూమిఁ బడఁ ♦ దత్సచివుల్ సభమందు నయ్యయో
యని పెనుశబ్ద మొప్ప వెత ♦ నంది యొనర్చిరి; రావణుండు చే
తనను ముహూర్తమాత్రమునఁ ♦ దాఁ గని లేచి వడంకుమేనితో
మనమున సిగ్గు దోఁపఁగను ♦ మై వినయంబున వంగియుండఁగన్. ౬౩ 1020
క. కనుఁగొని బలి యిట్లను; నో, దనుజేశా! రమ్ము చాలు ♦ దర్పం బిఁక నే
వినిపించెద సర్వము నీ, కనుపమబల నూని యెత్త ♦ నది లేచెఁ గదా!. ౬౪
తే. మణివిభూషితకుండల♦మండన మిది
నాకుఁ బూర్వము పుట్టిన♦నాకవైరి

1 ఏత ద్గృహీత్వా గచ్ఛ త్వం మమ పార్శ్వం మహాబల-అనియూ. 2 యత్ర స్థితం మహ
ద్దివ్యకుండలం రఘునందన-అనియూ.

కర్ణభూషణ మగునది ♦ క్షయము లేక
యలరు నిచ్చోటఁ బడియె నీ♦యది మహాత్మ!. ౧౬॥ 1022

సీ. మణియొక రత్నాభి♦మండితభూషణ మొక్కపర్వతమున ♦ నొప్పుసాను
తటమునఁ బడియె మ♦కుటమును జేదిసామీప్యంబునం బడె ♦ మేదినిపయి
సంగరంబును జేయు♦సమయంబునన్; హిరణ్యకశిపునిదియౌ న♦హార్యవీర్యుఁ
డాతఁడు నాతాత ♦ కగును బూర్వుఁడు వానిఁ జంపంగ నెవ్వరు ♦ చాలరనిని

తే. వ్యాధిమృత్యుద్వయంబున ♦ భయము లేక
యతఁడు వర్ధిల్లుఁ బగలందు ♦ నట్లె రాత్రి
యందు సంధ్యాద్వయంబున♦యందుఁ జావు
పొందకుండ వరంబును ♦ బొందె నతఁడు. ౧౮॥ 1023

తే. ఆర్ద్రమగువస్తువునఁ గాని ♦ యట్లె శుష్క
వస్తువునఁ గాని యేశస్త్ర♦వరముచేతఁ
గాని యేయస్త్రమునఁగాని ♦ వాని కంత
మొందకుండఁగ విధివర ♦ మొకఁడు గలదు. ౧౯॥ 1024

క. తనపుత్రుఁడైన ప్రహ్లాదునితో వాదంబు గల్గెఁ ♦ దుది నద్ది భయం
బును గల్గఁ జేయునదియై, కొనసాగెను; వాద మిట్లు ♦ కొంకక చేయన్. ౨౦

తే. సకలలోకభయంకర♦ప్రకటశక్తి
ధీరుఁడైనట్టి విష్ణుమూ♦ర్తియును సర్వ
దృశ్యుఁడైన ప్రహ్లాదుని ♦ ధీరుఁ గావఁ
బూని నరసింహరూపంబుఁ ♦ దాను గొనియె. ౨౦॥ 1026

క. కనులను జూచినదంతయు, విను రావణ! కలఁత నొందె ♦ వీరుని దనుజేం
ద్రుని నాహిరణ్యకశిపుని, దనకరములఁ బట్టి తిగిచి ♦ తనయంకమునన్. ౨౧

తే. జక్క నిడుకొని నఖముల ♦ నుక్కు చెడఁగఁ
జించి చెండాడె నాతఁడే ♦ చిత్రరీతి
ద్వారమందున్నవాఁడు నూ ♦ వాను దేవుఁ
డాతఁడె నిరంజనుండునై ♦ యలరువాఁడు. ౨౩ 1028

చ. సురతతి నాదిదేవుఁడయి ♦ శోభిలు నాభగవంతుతత్త్వమున్
వరుసగఁ జెప్పువాఁడ విను♦వాంఛ యొసంగునయేని పల్కెదన్
బరమమనోజ్ఞభావమున ♦ వార్తను దానిని నీమనంబునన్
నిరతము నిల్పఁగాఁ దగును; ♦ నిర్జరనాథుల వేలసంఖ్యలన్. ౨౮ 1029

క. సురలను బదివేవుర నం,బరగతమునిసప్తకమ్ము ♦ బహుసంఖ్యల నా
పరమేశుఁడు వశగతులుగ, నురుశక్తి నొనర్చె లీల ♦ నొప్పెడు పోల్కిన్.

క. తొలుతన్ ద్వారస్థలమున, నిలిచిన యాతండె యట్టి ♦ నిర్భరశక్తిం
జెలువారువాఁడు; నా విని, పలికెన్ బలితోడఁ ద్రిదశ♦వైరియుఁ గడఁకన్,

సీ. మృత్యువుతోడఁ బ్రే ♦ తేశ్వరుండుఁ గృతాంతుఁ డొకఁ డుండఁ జూచితి ♦ నుదగ్రమము
భయము గల్పించురూ ♦ పమునఁ జెలువారుచునుజ్జ్వలజ్వాలుఁడై ♦ యొప్పిపాశ[న
హస్తుఁడై యూర్ధ్వరో ♦ మావళియై తగువరుణుని గాంచితిఁ; ♦ బటుతరముగ
దంష్ట్రలు వెలయుంగఁ ♦ దగినవిద్యుజ్జిహ్వ సర్పవృశ్చికరోమ ♦ సంజ్ఞుల, మఱి
ఆ. భీమవేగుఁ డగుచు ♦ వెలయు రక్తాక్షుని
సర్వసత్త్వభయదు ♦ గర్వయుతుని
గాంచినాఁడ నతఁడు ♦ కమలమిత్రునిబోలి
దుర్నిరీక్ష్యుఁ డగుచు ♦ దురములందు. ౭౯ 1032

క. మరలింపరాక పావుల, ధరణీశులఁ జెండి మెఱయు; ♦ దర్పంబున నా
సురవైరిని మార్కొని సంగరమున జయమందినాఁడఁ ♦ గప్రగుణాఢ్యా!.

ఉ. వారిని గాంచినప్పుడును ♦ బాహుబలంబున భీకరంబుగాఁ
బో రొనరించునప్పుడును ♦ బుట్టదు భీతియుఁ జింతయున్ మదిన్;
గారణ మేమొ యీపురుష ♦ కాంతుని నేఁ దెలియంగఁ జాల కి
ట్లారయుచున్నవాఁడఁ దెలి ♦ యన్ వినిపింపుము దానవేశ్వరా!. ౮౦ 1034

చ. అన విని యవ్విరోచనుని ♦ యాత్మజుఁడౌ బలి రావణాసురుం
గనుఁగొని యిట్లు పల్కెఁ; విను ♦ గాఁ దగు నీతఁడు లోకనాయకుం
డనఁగను ధాతనాఁగ హరి ♦ యవ్యయుఁ డంచుఁ బ్రభుండటంచు న
ద్వినుతిని గాంచు నోదనుజ ♦ వీర! యితండె యనంతుఁడౌఁ జుమీ. ౮౧ 1035

సీ. నారాయణుండును ♦ నరసింహమూర్తియుఁ గపిలుండు విష్ణువు ♦ కద్రుదీప్తి
ఋతుధాముఁడు సుధాముఁ ♦ డతిభయంకరరూపుఁ డపాశహస్తుండు ♦ హతరిపుండు
ద్వాదశాదిత్యని ♦ భస్ఫూర్తి, యవ్యయుం డసితజీమూతతు ♦ ల్యాంగుఁ డమర
నాయకుండును, బురా ♦ ణపురుషోత్తముఁడును నిర్గోత్తముఁడును ♦ నిర్మలుండు
ఆ. భక్తజనహితుండు ♦ భవుఁడు జ్వాలామాలి
గురుభుజుండు యోగి ♦ క్రూరహరుఁడు
జగములను ధరింపఁ ♦ జాలునీతఁడె సృజి
యించువాఁ డితండె ♦ యెలమి మీఱ. ౮౨ 1036

క. కాలుండై లోకమ్ముల, నోలిన్ హరియించుచుండు ♦ సురుబలుఁ డితఁడే
పాలకుఁడు యజ్వ యజ్ఞము, జ్వాలలనుం గ్రక్కుచున్న ♦ చక్రము సతమున్.

చ. కరమునఁ దాల్చువాఁడు హరి ♦ కంజవిలోచనుఁ డీను దేవతో
త్కరమయుఁ డట్లె భూతసము ♦ దాయమయుండు జగన్మయుండు వి
స్ఫురతరరూపధారియయి ♦ శోభిలు జ్ఞానమయుండునౌ మహా
త్తరతనుధారి దీర్ఘభుజ ♦ ధారియగున్ బలదేవుఁడై తగున్. ౮౩ 1033

ఆ. వీరహంత యితఁడె ♦ వీరచక్షుష్మంతుఁ
డవ్యయుండు జగము ♦ లందు గురువు

పరమపురుషుఁ డంచు ♦ వరమునుల్ మోక్షార్థు
లితనిఁ బొగడుచుందు ♦ రెల్లకడల. ౮౭॥ 1039

క. పురుషుం డెవఁ డీతనినే, పరమునిగా నెఱుఁగు నతఁడు ♦ పాపావళిలోఁ
జొరఁబడక యవల నిల్చును;, హరి నీతని సంస్మరించి ♦ యాదర మొప్పన్.

క. వినుతించి హోమకృత్యం,బున నలరం జేసి కామ♦ములఁ బొందుదు రీ
తనినుండి భక్తు లెల్లను;,దనుజేంద్రా! యనుచుబలియుఁ♦దమిఁదెల్పుటయున్.

చ. విని యలరావణాసురుఁడు ♦ వేగమె యచ్చటనుండి క్రోధపూ
ర్ణనయనుఁడై మహాస్త్రము క♦రంబునఁ దాలిచి పోయి దోర్బలం
బున హరినొంప; నిట్లు తను ♦ బోరున నొంపఁగఁ బూని వచ్చు నా
దనుజునిఁ గాంచి హస్తమున ♦ దారుణమౌ ముసలంబు గ్రాలఁగన్. ౯౦

చ. మనమున నిట్టు లెంచెఁ బ్రభు♦మండనుఁడౌ హరి వీని నిత్తఱిన్
దునుమను, బాపమున్ నతముఁ ♦ దోఁచినరీతి నొనర్చువాని నం
చును దలపోసి విశ్వతను♦శోభితుఁడౌ హరి బ్రహ్మకుం బ్రియం
బనుచు నదృశ్యుఁడయ్యె మను♦జాధిప! యోరఘువంశభూషణా!. ౯౧ 1043

క. హరియున్నద్వారసీమకు, నరగునఁ జని రావణుండు ♦ సరసిజనేత్రుం
బరికింపఁడయ్యె నచ్చటఁ, బరమామోదమున నార్చె ♦ బలముమెఱయఁగన్.

ఆ. ఆర్చి యంత వరుణు♦నాలయమ్ముననుండి, వెడలె మున్ను దాను♦విశ్వజయముఁ
గోరి వచ్చినట్టి ♦ భూరిమార్గంబును, బట్టి జయము నొంది ♦ నట్టు లంత. ౯౨॥

అధికపాఠము ప్రథమసర్గము సంపూర్ణము.

---

౨ - వ సర్గము.

రావణుండు సూర్యునిపైకి యుద్ధమును జేయఁబోవుట.

మ. బలిసద్మంబును దాఁటి సూర్యుని జయిం♦పన్ బూని లో నెంచి యి
మ్ముల నారాతిరి మేరుశృంగమున స♦మ్మోదంబునం బుచ్చి వే
తెలివిం బొంది యహర్ముఖోచితము న్నై ♦ దీపించుకృత్యోత్కరం
బులఁ జక్కం బొనరించి సూర్యతురగం♦బుం బోలుసద్యానమున్. ౧॥ 1046

తే. తా నధిష్ఠించె నావ్యోమ♦యానవరము
పవనుగమనమనోగతుల్ ♦ భాసిలంగ
విహరణక్షేత్రములఁ జాల ♦ వెలసి యరిగె;
నంతఁ దేజోమయుండయి ♦ యలరువాని. ౨॥ 1047

తే. స్వప్రకాశుని శుభదుని ♦ భాసమాన, కనకకేయూరభూషితుఁ ♦ గనకవస్త్ర
ధరుని శుభకుండలోజ్జ్వలుఁ ♦ *బరమవక్త్ర,వికసనుని రక్తమాల్యసం♦వీతవపుః.

---

* భ్రాజన్ముఖవికాసితం-అనిమూ.

క. నిరుపమకేయూరయుగాం,తరభాసురపతకహారుఁ ♦ దతరక్తమునో
హారచందనదిగ్ధాంగునిఁ, గరముల వేయింటఁ దగఁ బ్ర♦కాశించువిభున్. ౪౫
తే. ఆదిదేవు నాదిత్యు స♦ప్తాశ్వవాహ,ముని ననాద్యంతమధ్యు లో♦కనిచయముల
కెల్ల సాక్షిగ నున్నట్టి ♦ యీశ్వరునిని, నిర్జరప్రభు భాస్కరు ♦ నీరజాప్తు. ౫౫
క. కనుఁగొని దానవనాథుం, డనూనరవితేజమున మ♦హోగ్రుం గని యు
న్ననిఖిలభటనాథుఁ బ్రహ,స్తుని గని యిట్లనియె నోయి ♦ శూరవరేణ్యా!. ౬౫
చ. చని రవిఁ గాంచి నాదయిన♦శాసనముల్ వినిపింపు మిట్టు లా
వనరుహమిత్రుఁడైన గ్రహ♦వర్యునితో దనుజేశ్వరుండు వ
చ్చెను సమరంబుఁ గోరి యిదె ♦ చేయుము సంగర మీవు చేయవే
ననిని జయింపఁగాఁబడితి ♦ నంచు వచింపుము సత్వరంబుగన్. ౭౫ 1052
తే. ఒక్కపక్షంబు వీనిలోఁ ♦ జక్క నెంచి
కైకొను మటంచుఁ బల్కుమా ♦ కదలు మింక;
నననఁ దద్వాక్యమును శిరం♦బున ధరించి
భాస్కరునియంతికమునకుఁ ♦ బటురయమున. ౯ 1053
క. చని పింగళునిన్ దండిని, గనియెన్ ద్వారమ్మునందుఁ ♦ గ్రాలెడివారిన్
వినిపించె రావణుని యా,జ్ఞను సర్వము వారి కంత ♦ సైన్యవిభుండున్. ౧౦
క. నిలిచె మతేమియుఁ బల్కక, జలజాప్తమరీచిజాల♦సంతప్తుండై
పలుకుల వానిం గైకొని, చెలఁగెడుమోదమున దండి ♦ చేరెన్ రవినిన్. ౧౦౫
ఆ. భక్తిమీఱ మ్రొక్కి ♦ ప్రల్లదుండగు రావ,ణుని ప్రతిజ్ఞఁ దెలిపె ♦ దనుజవిభుని
పలుకులెల్ల దండి♦వలనఁ జక్కఁగ విని, శ్రీసరోజమిత్ర♦శేఖరుండు. ౧౧౫
*క. తనబుద్ధి నెంచి యాతనిఁ, గని యిట్లని పల్కె; దండి ♦ కడు రయమొప్పన్
జని గెల్వ మతని లేదే, నని నోడితి నంచుఁ బల్క♦వయ్య నియతిచేన్. ౧౨౫
క. మనమున నీకెటు తోఁచునొ, యనఘా! యభ్భంగిఁ జేయ♦నగు; నేఁ గాలం
బును బుచ్చఁ జాలవృథగా, నను మాన్యునిపల్కులఁ గొని♦చురిగి దనుజుతోన్,
తే. పలికెనార్యోక్తినెల్లనె♦భ్భంగితనకు, నర్కుఁడొగిఁ దెల్పె నట్టులే♦యప్పలుకుల
దండివలన నెఱింగి యు♦ద్దండరీతి, విజయఘోషంబుచాటించి♦వెడలె నతఁడు.
అధికపాఠము రెండవ సర్గము సంపూర్ణము.

3 - వ సర్గము.

రావణుఁడు మాంధాతతోఁ బోరుసల్పుట.

చ. వనజహితుం దృజించి చని ♦ స్వర్ణమహీధరదివ్యశృంగమం
దనుపమవిక్రమం బలరు♦నట్లుగ నానిశిఁ బుచ్చి చంద్రుతో

* బుద్ధిపూర్వం దివాకరః, గచ్ఛ దండిన్ జయ సైన్యేనం నిర్జితోఽస్మీతి వా వద-అనియూ.

నని నొనరింపఁ బోయి కమ♦లారియొసంగెడు లోకముం గనుం
గొనియె; నటఁ రథంబుపయిఁ ♦ గోమలదివ్యసుమాభిమండితుఁ. ౧౪ 1060

తే. దివ్యచందనలిప్తాంగు ♦ దేవకన్య,కాభిసేవితుఁ జంద్రుని ♦ నంబరమున
నరుగువానినిగనియె;నా♦యమృతకిరణుఁ,డచ్చరలతోడరతిసుఖం♦బనుభవించి.

సీ. చుంబనసుఖములఁ ♦ జొక్కి మేల్కొనుచున్న చంద్రునిదేవవై♦రీంద్రుఁ డట్టె
కనుఁగొని సంతోష♦కలితుఁడై యచ్చోట నిల్చి పర్వతు ముని♦నికరనాథుఁ
గనియె; దశగ్రీవుఁ ♦ డనఘు మహాత్ముని నాతనిఁ గాంచి యి♦ట్లనియె దేవ
మౌనీంద్ర! స్వాగతం ♦ బే నిదె ప్రశ్నించెదను నాయదృష్టంబు♦నను నిచటికి

తే. వచ్చితిరి మీరు, రథ మెక్కి ♦ వఱలు నీతఁ
డెవ్వఁడో యప్సరస్త్రతు ♦ లెల్లఁ గొలువ
[1]విగతమందాక్షుఁడై యిట్లు ♦ వెడలినాఁడు
భయము సుంతయు నెఱుఁగని♦పాటుపడుచు. ౬౪ 1062

చ అన విని పర్వతుం డనియె ♦ నర్హ్యమతీ! వినవయ్య! [2]వత్స! యీ
తనిచరితంబు సర్వమును ♦ దథ్యముగా వివరింతు; నీతఁ డ
త్యనుపమమౌ తపోనియతి ♦ నన్నిజగంబుల గెల్చి, బ్రహ్మనుఁ
దనమహిమాతిరేకమునఁ ♦ దద్దయు మోదము నందఁజేసెఁ జూ!. ౭ 1063

తే. ఎద్ది సుఖములఁ గూర్పంగ♦నెసఁగుచుండు,స్థానమైయట్టిమోక్షప♦దంబుఁ జేరఁ
జనుచునున్నాఁడు లోకముల్ ♦ శౌర్య మొప్ప, నీవు గెల్చినరీతి నీ♦పావనమతి.

క. అనుపమతపమున లోకము,లను గెల్చెను; బుణ్యయుగ్వి♦లాసంబున సో
ముని ద్రావి పోవుచుండుగు, ఘనమతు లేశంక మదిని ♦ గాంచక స్వేచ్ఛఁ. ౯

క. శూరుండవు సత్యవ్రత,ధీరుండవు గాన నొక్క ♦ తెఱఁగు వచింతుఁ
గోరిక వినఁదగు నియమవ్రా,దారులు వీరెల్ల సాధు♦తత్త్వజ్ఞవరుల్. ౯౪ 1066

తే. కాన వీరలవిషయమై ♦ క్రౌర్య మూన
రెట్టివారైన నని పల్కి ♦ నింతలోన
నరద మొక్కండు పెనుకాయ ♦ మలర దీప్త
మగుచు జాజ్వల్యమానమౌ ♦ నంగ మొప్ప. ౧౦ 1067

క. గీతంబుల వాదిత్ర,వ్రాతంబుల నలరుచుఁ జ♦వంబునఁ జనఁగాఁ
బ్రీతిం గని రావణుఁ డో,తాతా! యీరథము నెక్కి ♦ తగువిభవమునన్. ౧౧

క. చనువాఁ డెవ్వఁడో విలస,త్తనువున నలరారుచుఁ స♦తంబును మ్రోలన్
మన మలరఁ గిన్నరులు చ,క్కనిగానముచేయఁ ద్రిదశ♦కాంతలు పేర్మిన్.

తే. ఆడుచుండమనోహరం♦బైనకలిమి,నరుగుచున్నాఁడువీఁ డెవ్వఁ♦డయ్య యనిన
మునివరుండైనపర్వతుం♦డనియె;నితఁడు,శూరుఁడుగ్రాహవములను♦గోరు మదిని.

---

1 నిర్లజ్జ ఇవ సంయాతి భయస్థానం నవిందతి-అనిమూ. 2శృణువత్స యథాతత్త్వమ్-అనిమూ.

చ. అనిని మరల్పరా దితని ♦ నాహవరంగములందు సాయకా
లిని దనువెళ్లఁ జీల్పఁబడ ♦ లీలయవోలెఁ బెనంగెఁ; బుణ్యమూ
ర్తి నితని సాధుకీర్తిని న♦తిస్థిరచిత్తుని [1]స్వామిమేలునే చే
యను దవయంగముల్ వదలి♦నట్టి మహాత్మునిగా నెఱుంగుమా!. ౧౩౪ 1071

క. ఇతఁడే సంగరముల నుద్ధతులగుపరవీరవరుల ♦ దారుణబాణ
ప్రతతుల సేనలతోఁ జంపి తగన్ జిష్ణ్వతిథియగుచుఁ ♦ బ్రియ మలరారన్.

క. చనుచున్నవాఁడు తనమనమునఁ దోఁచినచోటికేగు ♦ పుణ్యుం డితఁడౌ;
వనితలు నర్తనగీతములను జక్కఁగఁ గొల్వ నితఁ డ♦లరు దనుజేంద్రా!. ౧౫

చ. అన విని రావణుం డనియె ♦ నమ్మునిఁ గ్రమ్మఱ; నీతఁ డెవ్వఁడో
చనియెడు సూర్యతేజమునఁ ♦ జక్కఁగ దివ్యరథంబుతోడ నా
విని యలపర్వతుం డనియె ♦ వీరవరా! వినవయ్య! యల్లదే
కనకవిమానమందుఁ దమిఁ ♦ గ్రాలు మహాత్ముఁడు కాననయ్యెదున్. ౧౬౪

క. సురవనితాయుక్తుండై, పరిపూర్ణసుధాంశునిభల♦పనుఁడై తగువాఁ
డురుతరకాంచన మర్ధుల, కరుదుగ నిచ్చినమహాత్ముఁ ♦ డనుచు నెఱుఁగుమా!.

క. అతిచిత్రాభరణాంబరుఁ, డతులితతేజస్వి దివ్య♦మహా యానమునన్
గతివై ఖరిసజ్జనసంగతిచేఁ జనుచున్నవాఁడు ♦ క్రవ్యాదవరా!. ౧౭ 1076

క. అనుపల్కు పర్వతోక్తిని, విని రావణుఁ డిట్టు లనియె ♦ విశ్వనుతా! యీ
చనుచున్నరాజులందున్, ననుమారొ్కని సంగరం బ♦నం దగుపూజన్. ౧౯

ఆ. నాకు నొసఁగునట్టి ♦ నరనాథవర్యుండు, భూరితేజుఁ డొకఁడు ♦ వీరవరుఁడు
కలఁడె వేగ పల్కఁ♦గాఁ దగుధర్మజ్ఞ!, [2]తండ్రి వనఁగ నీవె ♦ తలఁప నాకు.

చ. అని పలుకంగ రావణున♦హంకృతి నాత్మఁ దలంచి యిట్లనున్
మునిపతి పర్వతుం; డసుర♦ముఖ్య! మహీంధరవర్య! స్వర్గసీ
మను వసియింపఁ గోరుదురు ♦ మాన్యులు వీరలు సంగరంబు చే
యను దలపోయ రీనృపతు ♦ లాహవకాంక్షయె నీకుఁ గల్గినన్. ౨౧ 1079

మ. వినవయ్యా! దశకంధరా! జగతిలో ♦ విఖ్యాతుఁడై చిత్రమా
ల్యనిబద్ధాంగుఁడు చిత్రభూషణసువ♦స్త్రాలంకృతుం డున్నతుం
డనఘుం డేడగుద్వీపముల్ మనిచి యు♦ద్యద్దీప్తిచే నొప్పుచున్
మనుజేంద్రేంద్రుఁడునాఁగ నొప్పు నిలలో ♦ మాంధాతృనామంబునన్. ౨౨

ఉ. సంగరభిక్ష యిచ్చు దను♦జప్రవరా! యని పర్వతుం డనం
బొంగుచు రావణుం డనియె; ♦ భూపతి యెందు వసించు మానిరా
ట్పుంగవ! నాకుఁ జెప్పు వెసఁ ♦ బోయెద నానృపుఁ డున్నచోటి కిం
కం గలదయ్య! దీని కధి♦కంబగు పండువు నాకు నెత్తఱిన్. ౨౪ 1081

1 స్వామ్యర్థే త్యక్తజీవితః-అనిమూ. 2 ధర్మజ్ఞ పితా మే త్వం హి పర్వత-అనిమూ.

చ. అన విని పర్వతుండు దను♦జాధిపుఁ జక్కఁగఁ గాంచి యిట్లనున్
వినుము యువనాశ్వపుత్త్రుఁ డతి♦వీరుఁడు రాజవరేణ్యుఁ డాతఁ డా
య్యన నిల నేడుదీవుల మ♦హాబ్ధియె సీమగఁ గల్గువాని నే
ర్పునను జయించి యిత్తఱిని ♦ బోయెదు స్వర్గమునున్ జయింపఁగన్. ౨౭

సీ. అనునంతలోన మ♦హాబాహుఁ డా రావణాసురేంద్రుఁడు బ్రహ్మ♦యాదరమున
నొసఁగినవరముల ♦ నురుగర్వ మడరంగఁ గాంచె నయోధ్యాధి♦కాంతు వీరు
మాంధాతృనాముని ♦ క్ష్మాపతివర్యుని నేడుదీవుల స్వేచ్ఛ♦నేలుఘనుని
స్యందనంబును నెక్కి ♦చనువానిఁ దేజంబునను జెలంగెడువానిఁ♦గనకమయము

తే. చిత్రము సమూల్యమునయి సం♦సిద్ధదంబు
నైన భాసురహారంబుఁ ♦ బూని దివ్య
తనువునం బొల్చువాని న♦త్యంతరమ్య
హారగంధాభిరాముని ♦ నమలమతిని. ౨౮ 1083

క. కనినంతనె దశవదనుం, డనియెను; సంగరము నాకు ♦ నాతిథ్యముగాఁ
గ నొసంగు మో నృపాలా!, యను రావణుఁ గాంచి నవ్వి♦యాతఁడు పలికెన్.

చ. తనువునఁ బ్రాణముల్ నిలుప ♦ దానవనాయక! యెంచవేని న
న్ననిమొన మార్కొనంగఁ జను♦నంచు వచించెడు రాజుపల్కులన్
విని దశకంఠుఁ డిట్లనుఁ; గు♦బేరుని నప్పతి ధర్మునిన్ జయిం
చినతఱి భీతినొంద నిఁక ♦ క్షిత్యధిపున్ నరు నిన్ను మార్కొనన్. ౩౦ 1085

తే. కలుగఁబోవునొ భయ మోరి! ♦ ఖలవిదారి
యనుదశగ్రీవునకు, నంచు ♦ నాగ్రహమున
నతని దహియింపఁబూని న ♦ ట్లాజ్ఞ చేసె
సమరదుర్మదులయి పొల్చు ♦ సచివులకును. ౩౧ 1086

క. దనుజేంద్రునాజ్ఞఁ గైకొని, మనుజేంద్రునిపైన దుష్ట♦మతులగుమంత్రుల్
సునిశితశరతతివర్షం,బును గురిసిరి క్రూరు లగుటఁ ♦ బొంగెడుకాంక్షన్. ౩౨

చ. శరములు మేను సోఁకఁగనె ♦ చండబలంబున నొప్పుభూధవుం
డురుతరకంకపత్త్రముల ♦ నొక్కక్షణంబునఁ బ్రాణపంచకం
బరయక తీయువానిఁ గొని ♦ యారజనీచరముఖ్యులన్ మహో
దరశుకసారణాహ్వయుల ♦ దర్పసమగ్రుని నా ప్రహస్తునిన్. ౩౩ 1088

క. మారీచు నయ్యకంపనుఁ, గోరి విరూపాక్షు నొంచె; ♦ క్షోణీశవరున్
మాఁగుకొని యాప్రహస్తుఁడు, ఘోరాంబకపంక్తివృష్టిఁ♦గురిసెన్ మిగులన్.

తే. శరము లవ్వి శరీరసం♦స్పర్శనంబు, చేయకుండఁగ నతికె వి♦చిత్రరీతి
శాతశరముల; మాంధాతృ♦చక్రవర్తి, యంత విడువక వారిపై ♦ నదరి కడఁక.

సీ. భల్లంబులును భిండి♦వాలభుసుండికల్ తోమరంబులు వైచి ♦ భీమపావ
కుఁడు శలభంబులఁ ♦ బొడవడఁచినయట్లు నొవ్వఁజేసెను; గృధ ♦ నివ్వటిల్ల;
నంతట మానక ♦ యాప్రహస్తునిఁ బంచతోమరంబుల నొంచి♦తోడనె నృపుఁ
డద్రుల భేదించు ♦ నవ్వజ్రమో యనునట్టి ముద్గరమను ♦ నాయుధమును
తే. గిరగిరం ద్రిప్పి క్రౌంచభూ♦ధరము స్కందుఁ
డట్టి పగులించువిధమున ♦ నతిజవమున
వైచె రావణురథముపైఁ ♦ బడఁగ వజ్ర
పాతమట్లు రథంబుపైఁ ♦ బడియె నదియు. ౩౯ 1091
క. దానం జలియించి మహా,దానవుఁ డటఁ బడియెఁ దేవ♦తల్లజుధ్వజమో
నా నిర్గతతేజుండై;, మానవపతి ప్రీతుఁ డగుచు ♦ మహిమము వెలయన్. ౪౦
క. బలమున నుప్పొంగెను, జం,ద్రలసత్కాంతులను సాగ♦రంబునఁ గలనీ
రలరారెడు క్రియ రక్షో,బలములు హాహారవముల ♦ బఱలి యసువులన్. ౪౧
ఆ. విడిచినట్లె యుండి ♦ వెన రావణుం జుట్టు, ముట్టి నిలిచె; నంత ♦ నెట్టకేల
కతఁడు తెల్వి నొందె ♦ నంత లోకవిరావ,ణుండు రావణుండు ♦ గండు మిగిలి.
క. నరపతిదేహము సునిశిత,శరములఁ బీడించి యతని♦స్యందనమును ద
త్తురగముల నొంచె దోర్బల, ముదుతరముగఁ గన్పడంగ ♦ నుద్యమ మలరన్.
చ. అరదము పోయినన్ మఱొక♦స్యందన మెక్కి నృపుండు ఘంటికా
పరమరవంబునం బ్రబలు ♦ భాసురశక్తిని వైచె రావణా
సురుపయి దోర్బలంబు తగ, ♦ శోభిలుశక్తియు సూర్యకాంతియో
నిరుపమదావపావకుని ♦ నిర్భరమై తగు మంటయో యనన్. ౪౪ 1096
క. కరము వెలుంగుచు నరపతి,కరవిచ్యుతిఁ గాంచి నిగుడఁ♦గా నాశక్తిన్
సురవైరి శూలమున ని,ర్భరవిక్రమ మలర *మిడుతఁ ♦ బావకురీతిన్. ౪౫
తే. భస్మముగఁ జేసి యమదత్త♦బాణ మట్టి
చాపమునఁ గూర్చి గుణరావ♦సంకులముగ
వైచెఁ; దద్బాణఘాతంబు ♦ వపువు నొంప
మూర్ఛితుం డయ్యె మాంధాతృ♦భూవిభుండు. ౪౬ 1098
చ. కనుఁగొని యాప్రహస్తముఖ♦కర్బురవర్యులు సంతసంబునన్
ధ్వనులను దిక్కుల న్నెఱపి ♦ దారుణరీతిగ నార్వసాగి; రా
మనుజవరేణ్యుఁ డొక్కక్షణ♦మాత్రమునన్ మును పొప్పురీతిఁ దె
ల్విని గని దుష్టమంత్రు లట ♦ వేడ్క నుతింపఁగఁ బొంగుశత్రువున్. ౪౭
క. కనుఁగొని యాతనిపరిచరు, లనూన ముదమంది యుండు ♦ టారసి మది బొం
గునితాంతకోపమున శ,త్రునికరదుర్ధర్షుఁ డగుచుఁ ♦ దోఁచి కడంకన్. ౪౮

---

* పతంగ మివ పావకః-అనియూ.

తే. *పుష్పవత్తుల్యతనుకాంతి ♦ పొంగఁ జాప, మంది భీకరశరవృష్టి ♦ నానిశాచ
రేంద్రుబలములఁ బీడించె; ♦ నృపునిచాప,రవముచేతను సాయక ♦ రవముచేత.

క. కలఁతం గను పాథోనిధి, వలె రాక్షససేన లెల్ల ♦ భయమున మిగులం
జలియించె; నంత నిర్జర,బలములు మార్కొనఁగననియు ♦ భయదంబయ్యెన్.

చ. చెలఁగెడుక్రోధ మొప్ప గురు ♦ చిత్తము లత్తఱి నందడింప ని
స్తులజయకాంక్ష లుప్పతిల ♦ క్షోణివిభుం డసురేంద్రుఁ డప్పు డు
జ్జ్వలశరచాపఖడ్గములు ♦ భాసురరీతి వెలుంగ వీరులై
తలపడి పోరి; రంత నృప ♦ తల్లజుఁ డాసురవీరుఁ బూన్కితోన్. ౫౩ 1103

క. నరపతిని రావణుండును, శరవృష్టిని ముంచి; రట్టె ♦ సముధికకోపం
బిసువుర వ్యాపించెను నా,తరుణంబున సాంద్రమగుచు ♦ దారుణమగుచున్.

క. ఇతరేతరవిజయేచ్ఛల, నితరేతరతీవ్రబాణ ♦ వృష్టిఁ దనువు లు
ద్గతరక్తధారలను దే,వతతుల్ గనఁ జీల్పఁబడెడు ♦ భంగిగ నుండెన్. ౫౪

చ. ధనువునఁ గూర్చి రౌద్ర మను ♦ దారుణమంత్రపురస్కృతాస్త్రమున్
దనుజవరేణ్యుఁ డుద్ధతిని ♦ ధాత్రివిభూత్తముపైని వైచె; నా
జనపతి యగ్నిబాణమును ♦ జాపమునన్ వడిఁ గూర్చి దానిచే
తన మరలించె రౌద్రశర ♦ తల్లజమున్ సురలెల్ల మేలనన్. ౫౫ 1106

సీ. దశవదనుండు గాం ♦ ధర్వమహాస్త్రంబుఁ బరఁగించె, మాంధాతృ ♦ ధరణివిభుఁడు
వారుణాస్త్రంబున ♦ వడి దాని మరలించె; నంత ధాత్రీపతి ♦ యసురవరునిఁ
జంపువేడుక భూత ♦ చయభయావహమగు బ్రహ్మాస్త్రమును జేతఁ ♦ బట్టుకొనియె;
రావణుండును శంక ♦ రప్రసాదంబునఁ బడసినఘోరరూ ♦ పమగు పాశు

తే. పతమహాస్త్రంబు త్రైలోక్య ♦ భయద మట్టె
కరమునం బట్టె; వారిట్లు ♦ కరములఁ గొని
నట్టి యస్త్రంబులం గాంచి ♦ యఖిలభూత
ములును జలియించె; శంకరుం ♦ డెలమి మీఱ. ౫౬ 1107

క. వర మిచ్చె రావణున క,ప్పరమాస్త్రము వశగతమయి ♦ భాసిలునంచున్
నిరుపమసాధన మయ్యది, కరమునఁ గ్రాలంగ ముజ్జ ♦ గంబులు మిగులన్. ౫౭

తే. వడఁకె స్థావరజంగమ ♦ ప్రాణితతులు
కలఁత నొందెను; సుర లెల్లఁ ♦ గళవళించి
రిదియె ప్రళయం బటంచు నా ♦ గేంద్రు లెల్ల
తలఁచి; రత్తరుణంబున ♦ ధ్యాననియతి. ౫౮ 1109

క. కని యావృత్తాంతంబును, మునివర్యులు గాలవాహ్వ ♦ మునఁ దగునతఁడున్
ఘనుఁడు పులస్త్యుఁడు వేగము, చనుదెంచిరి వారికడకు ♦ సంగరమాపన్.

---

* చంద్రార్క-సదృశద్యుతిః-అనియూ.

క. చనుదెంచి నరపతిం గ,న్గొని తగునే యిట్టు లీవు ♦ ఘోరాస్త్రంబుల్
గొనఁ జాలు నింక నం చా,తని మాన్పి యనంతరంబ ♦ దనుజేశ్వరునిన్. ౩౦

క. పరిహాసోక్తుల నిపు డీ,ధరణీశుని గెల్వఁగలవె? ♦ తా నపజయ మే
వరుసను గనఁ డీతఁడు నీ,పరాక్రమము చాలు నింక ♦ బవర ముడుగుమీ.

క. అని పల్కి వారి కిర్వుర,కును సఖ్యముఁ గూర్చి చాలఁ ♦ గుతుకంబున వే
చనిరి యథాగతపథమున, మనముల హర్షంబు పొంగ ♦ మహితగతులచేన్.

అధికపాఠము మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪ - వ సర్గము

### చంద్రునితోఁ బోరఁ బ్రయత్నించు రావణుని బ్రహ్మ వారించుట.

క. ధరణీసురమానులు చన, సురవైరివిభుండు తన్ను ♦ శూరునిగా న
త్తఱుణమున నెంచి తనపరి, చరులెల్లను దోడరాఁగఁ ♦ జనియె నవలికిన్. ౫

సీ. పదివేలయోజనములఁ ♦ బరఁగుమరుత్పథంబును దాల్తఁ బుష్పకం♦బునఁ జెలంగి
దాఁటి యవ్వల బల♦దర్పముల్ మెఱయంగ సర్వసద్గుణములఁ ♦ జాలఁ గ్రాలు
హంస లేస్థలమున ♦ నగుదార నుండునో యలమరుత్పథము, న♦వ్వలను మెఱయ
దానిని వేగంబ ♦ దాఁటెను దశయోజనాయతంబగు నద్ది ♦ యంచు లెక్క

తే. పెట్టఁబడుచుండు నటనుండుఁ ♦ బెనురవముల
నలరు సితవారిధరవర్య♦ములు త్రివిధము
లగుచు *నాగ్నేయములు పక్ష♦జాహ్వయములు
బ్రాహ్మములు నాఁగఁ బేరులు ♦ వఱలుచుండ. ౪ 1115

క. తరువాత వాయుమార్గము, గురుజవమున దాఁటె నద్ది ♦ కొసురారు నను
త్తరమై మూఁడవదగుచును, నిరతము చారణులు సిద్ధ♦నిచయము లందున్.

క. మన మలరఁగ నివసింతురు, గన నది పైదాని యట్లె ♦ గ్రాలుఁ బ్రమాణం
బున; నంతఁ జతుర్థంబగు, ననిలపథం బుత్తరించె ♦ నారావణుఁడున్. ౧౫

చ. అనవరతంబు భూతతతు ♦ లందు వినాయకుఁ గూడి క్రీడ స
ల్పును, దదనంతరంబ గురు♦పుష్పక మెక్కియె పంచమంబుగాఁ
దనరెడువాయుమార్గమును ♦ దాఁటె సహస్రదశప్రమాణయో
జనముల నొప్పు నద్దియును ♦ సర్వసరిద్వర గంగ యచ్చటన్. ౨౫ 1118

తే. అలరుచుండును కుముదాదు ♦ లైన నాగ
ము లటఁ గుంజరతతు లెన్నొ ♦ చెలఁగుచుండు
శీకరంబులఁ జల్లుచుఁ ♦ జెన్నుమీఱ
నవ్వి గంగాజలంబుల♦యందు సతము. ౩౫ 1119

---

* ఆగ్నేయాః పక్షజాః బ్రాహ్మః స్త్రివిధా ఇతి సంస్కృతాః - అనివా.

క. మునుఁగుచుఁ దేలుచుఁ బుణ్యం,బును జక్కఁగ సేకరించు♦పోలిక నుండున్;
విను రామచంద్ర! యాకరు, లనవరతము తొండములను ♦ నవలికిఁ జిమ్మున్.

[1]క. అనిలుం డాజలమును దట,మునకుం బడునట్లు వీవ ♦ ముగ్ధతరములై
గనఁబడుకుంజంబులఁ బడఁ,గ నదియె హిమరూప మగును♦గా శ్రీరామా!.

సీ. అవ్వల నాఱవ♦దగు వాయుమార్గంబు వేయియోజనముల ♦ వెలయు దానిఁ
జొచ్చి నాదానవ♦శూరుండు గురుతరదివ్యతేజా! రామ! ♦ తేజరిల్లు
పుష్పకారూఢుఁడై ♦ పొదలు నచ్చోటనే గరుడుండు సతతంబు ♦ క్రాలు శక్తి
జ్ఞాతిబాంధవగణ♦సత్కృతుండై; యంత వేయియోజనముల ♦ విస్తరిల్లు
తే. సప్తమంబగు పవమాన♦సత్పథంబు
నొందె; నచ్చట ఋషులెల్ల ♦ నుందు రెలమి
నవలఁ బదివేలయోజనా♦యతమరుత్ప
థమ్ము నష్టమసంఖ్యాక ♦ మమ్మహీతుఁడు. ౧౩ 1122

క. కనఁబోయె; నందు గంగయు, ననిశము స్థితిఁ గాంచుచుండు ♦ నాకాశసరి
త్తనుఖ్యాతి దేవపథమున, [2]ననిలుఁడు ధరియింపఁగా మ♦హావేగంబున్. ౧౪

చ. గురుతరనిస్వనంబునఁ ద♦గుం బృథివీవర! రామచంద్ర! యం
బరమున నవ్వలన్ రుచుల ♦ భాసిలుచంద్రునివాసలోక మా
దరమునఁ దెల్పువాఁడఁ బ్రమ♦దంబు నొసంగెడువార్త యద్ది, త
త్పరమున లోకమొందు సుఖ♦భావుకముల్ దగఁ బొల్చుచుండుఁ జూ!. ౧౫
తే. అద్ది యెనుబదివే లగు♦నామడలను
విస్తృతిం గాంచు నందుండు ♦ విధుఁడు ఖేచ
రాళి తారాగణావృతుం ♦ డగుచు నతని
[3]శతశతసహస్రరశ్ములు ♦ వితతములుగ. ౧౬ 1125

తే. అతనిమండలముననుండి ♦ యఖిలలోక
ములను భాసిల్లఁజేయు, స♦కలసుఖముల
సత్త్వముల కెల్ల నిచ్చుచు ♦ జగతి మించు;
నంతఁ జంద్రుండు దశకంఠు ♦ నచటఁ గాంచి. ౧౭ 1126

క. శీతాగ్నిని దహియింపఁగఁ, జేతస్సున నెంచి నట్లు ♦ చిత్రగతుల నా
దైతేయవిభుని ముంచెను, ఖ్యాతహిమప్రభల నొక్క ♦ క్షణమాత్రమునన్.

---

1 తతః కరికరా ద్భ్రష్టం వాయునా లోలితం భృశమ్, జలం కుంజేషు పతితం హిమం భవతి రాఘవ-అనిమా. 2 వాయునా ధార్యమాణా సా మహావేగా మహాస్వనా-అనిమా. 3 శతంశత సహస్రాణి రశ్మయ శ్చంద్రమండలాత్-అనిమా. ఈచంద్రలోకము మర్త్యలోకమునకుఁ బ్రకాశము నిచ్చునట్టి చంద్రలోకము గాదని యెఱుంగునది

చ. దనుజవరేణ్యమంత్రులు [1]నిశాంతహిమాగ్నికిఁ దాళలేక భీ
తిని బరివీడితాంగులయి దిక్కుఁగ రావణుఁ డంచు నెంచి; రం
త నచట దండనాయకుఁడుదారమనీషుఁడు నౌప్రహస్తుఁ డా
ర్తిని జయశబ్దపూర్వముగ దేనరిపూత్తముఁ గాంచి యిట్లనున్. ౧౯ 1128

క. దనుజేంద్ర! శీతరశ్మలఁ, దనువులు కంపించెఁ బోవఁ దగ దిఁక మరలం
జను నిటనుండియె చంద్రుని,ఘనహిమరశ్ములను దనుజగణముల కెల్లన్. ౨౦

తే. సాధ్వసం బావహించెను స్వాంతములను;
పేఁడు రాజేంద్ర! తనకాంతివితతి శీత
కరుఁడు నాఁబడు దహనునికరణి నితని
యంతరంగంబు వర్తిల్లు నంచుఁ దలఁతు. ౨౧ 1130

చ. అనెడు ప్రహస్తవాక్యముల నాదనుజేశ్వరుఁ డాలకించి యిం
తని వచియింపరానిదగు నాగ్రహ మూని శరాసనంబుఁ జ
య్యనఁ జలియింపఁ జేసి కఠినాయతరావముతోడ దానఁ జ
క్కనిగుణ మెక్కు కూర్చి [2]శరకాండములం బరఁగించి నొంపఁగన్. ౨౨

చ. శతధృతి యీవిధంబుఁ దన చక్కనిమాననమందుఁ గాంచి యు
ద్ధతుఁ డితఁ డంచు నెంచి త్వరఁ దా నటఁ జేరి దశాస్య! విశ్రవ
స్సుత! గురుబాహురాజిత! విశుద్ధమనస్సునఁ బొల్చుచంద్రుఁ డీ
హితమతి నొంపరాదు చను మిచ్చటనుండక వచ్చినట్లుగన్. ౨౩ 1132

చ. శరముల నొంపరా దితని సర్వజగత్ప్రియవర్తనుండు స
త్కరుఁడు ద్విజేంద్రుఁ డిట్టిఘనుఁ గాఱియపెట్టఁగ నేల! మంత్ర మా
దరమున నిచ్చువాఁడ నది తప్పక ప్రాణము దీయు భీతినిన్
గరము తొలంగఁ జేయు నది కన్రుమతిన్ స్మరియించువానికిన్. ౨౪ 1133

తే. మృత్యుభయమును దొలఁగించు మేలుఁ గూర్చు
ననిన నంజలి యిడి రావణాసురుండు
పలికె; సంతృప్తి నాపయి నలరునేని
నే ననుగ్రాహ్యుఁడ నగుదునేని తండ్రి!. ౨౫ 1134

సీ. ఈఁదగునేని మంత్రేశ్వరు నా కిప్డె ధార్మికోత్తమ! సుమంత్రంబు దాని
జపియించి సకలనిర్జరులందు నిర్భయుండనయి వర్తించెద వనజగర్భ!
దానవులందుఁ ద్రిదశులందుఁ బక్షులయందు నామదిని భయంబు లేక
యుండఁగా వలెనంచు నొగిఁగోరుచుందును;గాననిమ్మా మంత్ర మోనితాంత

తే. ధర్మబుద్ధి! మహాత్మ! మీదయను నాకు
భయము గల్గదు నా విని బ్రహ్మ పలికె

1 స తు శీతాగ్నినా శీఘ్రం-అనిమూ. ఇట శీతాగ్ని యనఁగా శీతబాధ యని యర్థము చేసి
కొనవలెను. 2 నారాచైస్తం హ్యపీడయత్-అనిమూ.

మంత్ర మొసఁగెద నీకు నీ♦మంత్రవరముఁ
బ్రాణములు వోవునట్టివి♦పత్తునందు. ౨౮ 1135

క. ఉపయోగింపం దగు నం, చిపుడే వచియించువాఁడ ♦ నెప్పుడు దానిన్
జప మూని చేయకుము దై, త్యపతీ! శుభదంబు మంత్ర ♦ మది యగుఁగానన్.

తే. అక్షసూత్రము గొని దాని♦నమలభక్తి, జపము చేయుము నీ కప♦జయము లేదు
జపము మానిన సిద్ధింప♦దపరిమితను, ఫలదమయ్యును; వినుమింకఁ♦బరమనియతి.

క. ఆమంత్రము వచియించెద, నోమాన్యా! దాని నొక్క♦మొగిఁ గీర్తింపన్
భీమాహవముల విజయం, బేమియు సందియము లేక♦యే గల్గుఁ జుమీ. ౩౦

సీసమాలిక:—

దేవదేవేశ! యో♦దివిజాసురనమస్కృతా! మహాదేవ! వం♦దనము నీకు
భూతభవ్యా! హర! ♦ భూరిపింగళనేత్ర! బాలుండ వగుదు రూ♦పమున వృద్ధ
వలె నుండుదువు, నీవు♦వైయాఘ్రవసనచ్ఛదుఁడవ, ల్లి యారుణే♦యుఁడవు, త్రిజగ
ముల కీశ్వరుఁడవు, వి♦భుండవు, హరుఁడవు, హరితనేమివియుగాం♦తాగ్ని వనలుఁ
డవు, లోకపాలకుఁ♦డవు, లోకశంభుండ, వల్లి మహాభుజుఁ ♦ డనఁగ నీవె
యోమహాదేవేశ! ♦ యోమహాశూలి! మహాదంష్ట్రి! కాలంబు ♦ నగుదు వీవు,
కాలరూపివి, నీల♦కంఠుండవు, మహోదరుఁడ వీవు, దేవాంత♦కుఁడవు, వేద
మయుఁడవు, మఱి యున♦వ్యయుఁడవు, పశుపతివగుదువు, శూలంబు♦హస్తమందు
బట్టియుందువు, నేత, ♦ వట్టివిధంబున గోప్తవు, శివుఁడ వ♦గుదువు, హరివి [వి
జటి, ముండియు, శిఖండి, ♦పటుయశుండు, లగుడి యననొప్పుదువు, నీవె♦యఖిలగణ
భుఁడవు, సర్వాత్మవు, ♦ భూతేశ్వరుండవు, సర్వభావనుఁడవు, ♦ సర్వదుఁడవు
సర్వహారివి, మఱి ♦ స్రష్టవు, గురుఁడ, వవ్యయుఁడవు, ధూర్జటి♦వియుఁ, బినాకి
యనఁబడువాఁడ, వో♦యఖిలేశ్వరా! దేవుఁడవు, కమండలుధరుం♦డవు, మహాత్మ!
మాననీయుండవు, ♦ గానప్రియుండవు. ప్రణవస్వరూపివి, ♦ పార్వతీశ!
యర్హణీయుండ వే ♦ యగుదువు, సామవేదగుఁడవు, మృత్యువ♦వగుదు, మృత్యు
దూతవు, పారియా♦త్రుఁడవు, సువ్రతుఁడవు, బ్రహ్మచారి వనంగఁ ♦ బరఁగు దీవు
యోగివి, గృహి వన ♦ నొప్పుదు, వీణాపణవతూణవంతుఁడ ♦ వవుదు వీశ!
యమరుఁడ వీవె, యో♦యఖిలేశ! దర్శనీయుఁడ వీవె, బాలసూ♦ర్యనివిధమున
భాసిల్లువాఁడవు ♦ భగవంతుఁడవు శ్మశానములఁ జరించెద ♦ వుమకుఁ బతివి,
శత్రుంజయుండవు ♦ జ్వరహర్త వగుదువు పాశహస్తుండవు, ♦ భానుదంత
పాతనుండవు మఱి ♦ భగనేత్రహర్తవు ప్రళయకాలస్వరూ♦పంబు నీవె
యుల్కాముఖుండవై ♦ యొప్పువాఁడవు నీవెయగ్నికేతుఁడవీవె♦యనులమునివి,
దీప్తుండ వగుదువు ♦ దివ్యరూపుఁడవు విశాంపతి వన నీవె ♦ సర్వభంగు
లను సమర్థుఁడ వీవె ♦ యనఘాత్మ! యున్మాదమోహాసకరుఁడవు ♦ భూరిగివిజ

పతివి వామనుఁడవు ♦ వాసుదేవుఁడవు ప్రాగ్దక్షిణ్యుఁడను పేరఁ ♦ దగుదు వీవె
చక్రహస్తుండవు ♦ సకలచమూ స్తంభనుఁడవు ప్రతిష్ఠంభ ♦ నుఁడవు సర్వ
కాలరూపివి ఋతు ♦ కర్తవు మఱి ఋతునవు మధుకాత్ముండ ♦ వవుదు వీవు
మధునవు శ్రీకర ♦ మహనీయమూర్తివి శ్రీశజనాననుఁ డనఁ ♦ జెలఁగు దీవు
జగముల సృజియించు ♦ సరసిజయోనివి కర్త వజుఁడ వీవె ♦ కరుణ మెఱయు
పురుషుండ వగుదువు ♦ పో శాశ్వతుం డీతఁ డనఁగ వానస్పత్యుఁ ♦ డనఁబడుదువు
వర్ణత్రయుఁడు భూత ♦ భావనుండు త్రినేత్రుఁ డఖిలధర్మాధ్యక్షుఁ ♦ డనఁగ నీవె
పరికీర్తితుఁడవు శ్రీ ♦ పాలకా! యోవిరూపాక్ష! భాన్వయుతతు ♦ ల్యప్రభా! మ
హాత్మకా! బహునేత్ర! ♦ యఖిలదేవేశ్వరా! యభిదేవ! తుహినప్ర ♦ భాంకితజట!
పూర్ణేందుతుల్యాస్య! ♦ పూర్ణకృపాఢ్య! నర్తక! లాసక! శరణ్య! ♦ రమ్యరూప
సర్వదేవాత్మకా! ♦ సాధుసుబ్రహ్మణ్య! సర్వభూతనివాస! ♦ సర్వబంధ!
మోచకా! వంచక! ♦ మోహన! సర్వైకధారీ! వరోత్తమ ♦ ధాతృరూప!
భక్తసంఘాభీష్ట ♦ వరప్రదా! హరిశ్మశ్రురాజిత! ధను ♦ ర్మహిత యనఁగఁ
బరమాత్మ! లోకాధి ♦ పతి! సనాతన! యని పిలువంగఁ బడుదువు ♦ ఖలజనహర!
యనెదునీనామాష్ట ♦ కాధికశతసంఖ్య నేను వచించిన ♦ దీని నుత్త
మమును బాపహరము ♦ నమలఫలప్రదంబును శరణార్థుల ♦ కును శరణ్య
మును దశగ్రీవ! నీ ♦ వును భక్తి జపియింపు మరివినాశక మిద్ది ♦ యగునటంచుఁ
దన్మంత్రమును బ్రీతి ♦ దనుజేంద్రునకొసంగి కమలోద్భవుఁడు శాశ్వ ♦ తమగునాత్మ

తే. లోకమున కేగె; దానవ ♦ లోకభర్త
బ్రహ్మచే నిట్లు వరములఁ ♦ బడసి మరలఁ
దిరుగఁ బూనుచు హర్షంబు ♦ దీటుకొనఁగ
దుష్టమతి మాన కాత్మకుఁ ♦ దోఁచినట్లు. ౫-౨౪ 1139

క. చరియించుచు మార్గంబున, ధరణీశమహర్షి దివిజ ♦ తల్లజకన్యో
త్కరమును గంధర్వులనూ,త్నరుచిరయౌవనముగల్గు ♦ తరుణులఁ బట్టెన్.

అధికపాఠము నాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౫ - వ సర్గము.

రావణుఁడు కపిలమహర్షిని గాంచి యుద్ధముచేయఁ బూని యవమానము నొందుట.

చ. [సరసిజసూతి యీపగిది ♦ సద్వరముల్ దశకంఠనామక
ర్బురపతి కిచ్చి వే స్వపద ♦ ముం గనఁ బోఁగ రావణుండు స
ద్వరములఁ బొంది పూర్వగతి ♦ వైభవ మొప్పఁ జరించుచుండె] ని
క్కరణిని గొంతకాలము ని ♦ కామముదంబున లోకజాలముల్. ౧ 1141

క. కనుచుం బౌరుషమును తీవిని జూపుచు లంక కరిగి ♦ వేడుక మరలన్

జని జయ మందెడుకాంక్షను, దనపురమును వెడలి సచివ♦తతి గొలువంగన్.

క. పడమరదిక్కున రాజిలు, కడలికిఁ జనె; దానినడుమఁ ♦ గలద్వీపమునన్
బడబానలనిభదీప్తులు, గడు మెఱయ మహాత్ముఁ డొకఁడు ♦ కనఁబడెనంతన్.

క. నిరుపమకనకచ్ఛాయలఁ, బరఁగెడుదేహంబుతోడ ♦ బ్రహ్మర్షి యొకం
డురుతరతప మొనరుచుచున్, బరికింపఁగ నయ్యె నొకఁడె ♦ పంక్తిగళునిచేన్.

ఆ. ప్రళయకాలమందు ♦ భాసిల్లు ననలుండు
పైకి లేచినట్లు ♦ భయదరూపుఁ
డగుచుఁ గానఁబడియె ♦ నతఁడు దేవతలందు
దేవవిభుని మాడ్కిఁ ♦ దేజరిలుచు. ౨౫ 1145

సీ. గ్రహములలోన భా♦స్కరునిచందంబున మృగములఁ బంచాస్య♦ముగతి నేనుఁ
గులలోన దేవేంద్ర♦కుంజరోత్తమమట్లు పర్వతంబుల మేరు♦పర్వతంబు
భంగి వృక్షమ్ములఁ ♦ బారిజాతమురీతిఁ గ్రాలునాపురుషునిఁ ♦ గర్బురపతి
కుండంబు నడుమ ను♦ద్దండంబుగా వెల్గు ననలునిరీతిగా ♦ నమరువానిఁ

తే. [1]గమ్రబహువిధరవముల ♦ గర్జనంబు
చేయువానిని లంబబా♦హాయతభయ
దుని మహాజాను భూరిసం♦ష్టుని వికటుని
గంబుకంఠుని బింగాక్ష♦కలితు ఘనుని. ౩౫ 1146

తే. మఱియుఁ గైలాసశిఖరంబు ♦ మాడ్కి నున్న
తాంగు మండూకకుక్షి ర♦క్తాంబుజాస్యుఁ
[2]బద్మపదతలు భీమరూ♦పంబు గల్గు
వాని గురుకాయు గురుతర♦స్వనుని మునిని. ౬౫ 1147

క. అనిలుని మనమును వేగం,బున నోడించిన మహాత్ము ♦ భూరిభయదమూ
ర్తిని నాబద్ధనిషంగుని, గనదుద్యచ్ఛాపరౌఘ♦కలితుని నమలున్. ౭౫ 1148

క. జ్వాలాళిపరిక్షిప్తుని, నోలిం జిఱుగంటగుంపు ♦ లొక్కుమొగి ధ్వనుల్
చాలఁగఁ జేయఁగ నొప్పెడు, శ్రీలలితుని [3]గర్బురసర♦సిజమాలికలున్. ౮

క. తనవక్షంబున రాజిలఁ,గను ఋగ్వేదంబు భంగిఁ♦గాఁ జూడఁగనై
కనకసరోరుహమాలిక, లనూనరుచి మించఁ దాల్చు♦నట్టి మహేశున్. ౯

క. కనకాచలసన్నిభు నా,మునివర్యుని నంజనాఖ్య♦భూమీధ్రమునాఁ
దనరారు పంక్తికంఠుఁడు, కని యుద్ధముఁ జేయఁబూనఁ♦గాఁ దగు ననుచున్.

చ. తనసచివాళితోడను ని♦తాంతబలంబున శూలశక్తులన్
ఘనతరయష్టిపట్టసని♦కాయములన్ ధరియించి రావణుం

1 గర్జంతం వివిధై ర్నాదైః-అనిమూ. 2 పద్మపాదతలం భీమమ్-అనిమూ. 3 కర్బురము = స్వర్ణము.

దనితరనాద మొప్ప మది♦యందు భయం బొకయింతలేక నా
ర్చెను; ముని, వ్యాఘ్రముం గనిన ♦ సింహముపోలికఁ బెంపుమీఱఁగన్. ౧౧

క. శలభమునఁ గనుదంతీంద్రము,వలె భాగము గాంచు మేరు♦పర్వతము క్రియన్
జెలఁగెడు నదివేగముగను, జలనిధిగతి నప్రకంప్య♦సత్త్వం దగుచున్. ౧౨

క. పురుషుం డాతఁడు దితిజే,శ్వరుఁ గని యిట్లనియె; నీకు ♦ శ్రద్ధయు మది సం
గరమునఁ గలదే నిప్పుడె, పరిమార్చెద, దుష్టమతివి ♦ పరికింపంగన్. ౧౩

ఆ. అనియె; [1]నంత రావ♦ణుని వేగమునకంటె
వేయిమడుఁగు లెక్క♦వే యగు జవ
ములు సహస్రములు స♦కలలోకభయదముల్
గానఁబడియె మౌని♦కాంతునందు. ౧౪ 1155

సీ. గ్రహములపంక్తినాఁ ♦ గ్రాలె నాతనిదృష్టి యద్భుతంబుగ నట్టి♦యవసరమున
దంతముల్ గొఱుక నుద్భవమగుచప్పుడు యంత్రశబ్దమువలె ♦ నతిభయంక
రముగ నత్తఱిఁ బర్వె; ♦ నములధర్మము తపం బఖిలజగత్సిద్ధి ♦ కాశ్రయములు
గానుండునవి ముని♦కాంతు నూరుద్వయమున నొప్పుగ గుఱిఁ♦గనఁబడియెను

తే. బంచశరుఁ, డట్టులే కటి♦భాగమందుఁ, జెలఁగి రంత విశ్వేదేవ♦తలు మరుత్తు
లతనిశిరస్స్థలంబున♦యందుఁ దగిరి, వసువు లెనమంద్రు మధ్యమ♦భాగమందు.

క. కనఁబడి రాతనికుక్షిన్, వననిధు లొప్పారె, దెనలు ♦ పార్శ్వస్థములై
తనరారె, సర్వసంధులఁ, గనఁబడియెన్ మారుతములు ♦ కడుఁ జిత్రముగన్.

తే. పృష్ఠభాగమునందును ♦ బితరు లలరి
రతనిహృద్భాగమున బ్రహ్మ ♦ యపుడు తోఁచెఁ
బావనములగు గోభూసు♦వర్ణదాన
ములు తదీయలోమాశ్రితం♦బులుగ నొప్పె. ౧౯ 1158

క. హిమగిరియు హేమకూటం,బు మందరము మేరుభూధ్ర♦మును [2]నరుఁడా బ్ర
హ్మమునీంద్రునస్థిసంభూ,తములుగఁ జూపట్టె నట్టి♦తరుణమునందున్. ౨౦

క. ధరణియు వక్షస్స్థలమై, పరఁగె శరీరంబునను న♦భము వ్యాపించెన్
వరమునిశరీరసంధుల, నరుదుగ సంధ్యాద్వయంబు ♦ నగపడి వెలసెన్. ౨౧

సీ. జలదమ్ము మేహన♦జనితమ్మై యలరారె బాహువులందును ♦ బరఁగి రపుడు
ధాతృవిధాతలు, ♦ తద్ధస్తములభగపూషాహ్వయులు పుట్టి ♦ పొలిచి; రంత
నాభితాళంబగు♦నైరావతము, శేషవాసుకికంబళా♦శ్వతరు లల్లి
కర్కోటకుఁడు ఫణి♦కాంతుఁడై తగుధనంజయుఁడు తక్షకుఁడనఁ♦జాలునతఁడు

తే. మఱియు నుపతక్షకుండును ♦ మానికరజ
ములను దగ నాశ్రయించి యి♦మ్ములను ఘోర

1 తథా వేగసహస్రాణి సంశ్రితాని త మేనహి-అనియూ 2 నరం తు తం సమాశ్రిత్య-అనియూ.

విషము వెడలంగఁ గ్రక్కుచు ♦ వెలసి, రగ్ని
వదనమున, రుద్రులుఁ గ్కంధ♦భవులు నైరి ౨౪ 1161

తే. పక్షమాసర్తువులు నగు ♦ భవ్యదంష్ట్ర
లందుఁ; గుహ్యవనఁబడుచున్న ♦ యమవనయును
నాసయందును, దానిరం♦ధ్రములయందు
వాయువులు తోఁచె గళమున ♦ వాణిదేవి. ౨౫ 1162

క. కనఁబడియె సరస్వతియనఁ, జను నామెయె; నశ్విదేవ♦సంజ్ఞులు చెవులం
దునఁ దోఁచిరి, శశిభాస్కరు, లనూనతన్నేత్రభూతు ♦ లైరి, రఘువరా!. ౨౬

తే. వెలసె వేదాంగములు బహు♦విధములైన
యజ్ఞములును సువృత్తవా♦క్యములు దేజ
మఖిలసిద్ధులు తపము ల♦య్యవసరమునఁ
దన్నరాకృతిమునివరు♦తనువునందె. ౨౭ 1164

చ. కనఁబడఁ గాంచి రావణుఁడు ♦ కార్ముకము న్శిలీముఖంబులన్
మునివరు నొవ్వ నేయ జవ♦ముం గనరాఁగ నతండు లేచి యో
దనుజశిశూ! క్షణంబు నిలు ♦ దర్పము చూపుదుగాని యంచు నా
తనిఁ *దనముష్టిఘాతమునఁ ♦ దద్దయు నొంపక సుంత నొంచినన్. ౨౮ 1165

క. మునివర్యముష్టిఘాతం,బున వక్షము నొవ్వఁ బం క్తి♦ముఖుఁ డిల వ్రాలెన్
దనుజునిపాటున కోర్వక, తనపైఁ బడవచ్చుదనుజ♦తతి నిజశక్తిన్. ౨౯ 1166

చ. పరుగిడఁ జేసి యమ్మునియు ♦ భాసురపంకజమాలికామనో
హారగురువక్షుఁడై కదలు♦నద్రివిధంబున బుక్తయిూగతిన్
బరఁగి సమీపదేశమున ♦ వైరిభయంకరరూపమౌ గుహాం
తరమును జొచ్చె; మేలుకొని ♦ దానవనాయకుఁ డాత్మమంత్రులన్. ౩౦ 1167

ఆ. తానె పిలిచి యిచటి ♦ మౌని యెచ్చటి కేగె
నో ప్రహస్త! చెపుమ ♦ యో శుకాఖ్య!
చనియె నెట కతండు ♦ సారణా! చూచితే
యతనిజాడ ననిన ♦ ననిరి వారు. ౩౧ 1168

క. ఆనరుఁ డీయెడ నిర్జర,దానవదర్శైకహారుఁడు ♦ తగ గుహఁ జొచ్చెన్
నా నతఁడు వేగ ఖడ్గముఁ, జేనందె సువర్ణుఁ డహీని ♦ జేకొనుభంగిన్. ౩౨

చ. కరమున ఖడ్గ మొప్ప భయ♦కంపితదేహుఁడు గాక శీఘ్రమే
యరుదగు దానిద్వారమున ♦ నల్లనఁ జొచ్చె దురాత్ముఁ డౌట; న
త్తరుణమునందుఁ దద్బిలముఁ ♦ దానటు చొచ్చి తదంతరంబునన్
బురుషుల నంజనాచలముఁ ♦ బోలు వినీలతరాంగులన్ గనెన్. ౩౩ 1170

* తేన ముష్టిప్రహారేణ స్వల్పమాత్రేణ లీలయా-అనిమా.

సీ. కేయూరములఁ దాల్చి ♦ యాయుధపాణులై శూరులై యరుణంపు ♦ హారములను
రక్తచందనమును ♦ రమణీయముగ నొప్పసంగుళీయకనుహా ♦ రాదిభూష
ణాభిమండితదేహు ♦ లై యుండఁగాఁ గాంచె; నందు సంప్రీతిచే ♦ నాడుచున్న
మూఁడుకోటులమహా ♦ త్ములఁ గాంచె; వారలు నిత్యోత్సవంబుల ♦ నెగడి శాంత
తే. సాధ్వసులునయి విమలులై ♦ జ్వలనతేజు
లగుచు విహరించుచుండి ర ♦ ట్లలరువారి
భీమవిక్రముఁ డాసుర ♦ వీరుఁ డచట
ద్వారముననుండియే కాంచె ♦ భయముమాని. ౩౬-౭ 1171

[1]క. నరులాత్రికోటిసంఖ్యలు, పరభయమే లేక స్వేచ్ఛఁ ♦ బాడుచునుండం
బరికించె మునియుఁ దొలి యొక్కరణిం గన్పడియె నట్లు ♦ గా వారెల్లన్. ౩౮

క. మునితుల్యదేహములఁ జక్కనికాంతుల మెఱసి రూప ♦ కలన బలమునన్
గన నేకంబుగఁ గన్పడు,చును విక్రమ మేకరీతి ♦ శోభిలు చుండన్. ౩౯ 1173

సీ. నాల్గుభుజంబుల ♦ నరుల మహోత్సాహులను గాంచె రావణుఁ ♦ డు నిటు వారిఁ
గాంచి గగుర్పాటుఁ ♦ గని బ్రహ్మవరమును గాంచినందున వేగ ♦ క్రమ్మఱంగఁ
గలిగె; నంతట నటఁ ♦ గమ్రభుజంగశయ్యను శయనించిన ♦ యట్టిఘనుని
బాండురంబు నమూల్య ♦ వస్త్రమై తగుకౌస్తుభంబున భాసిలు ♦ వానిఁ గనియెఁ;
తే. బురుషుఁ డాతండు శయనించి ♦ భుజగరాజు
తన్ను నంతటఁ జుట్టి యు ♦ ద్దండరీతి
నలర దివ్యాంగరాగముల్ ♦ హారములును
నాభరణజాలములు మెఱ ♦ యంగ నొప్పి. ౪౦-౪ 1174

చ. సురుచిరవస్త్రధారిణియు ♦ శుభ్రతరాంగియు నై త్రిలోకసుం
దరతరభూషణంబునయి ♦ తద్దయు మించెడు సాధ్వి చారుచా
మరమును దాల్చి హస్తమున ♦ మానితల్పు నందు నుండె; నా
తరుణియె లక్ష్మి పద్మయనఁ ♦ దద్దయు లోకవిమోహనాకృతిన్. ౪౩ 1175

ఆ. అలరుచుండె; నంత ♦ నాచారుహాసినిఁ, గాంచి హర్ష మొంది ♦ కర్బురేంద్రుఁ
డాత్మ నాసుసాధ్వి ♦ నతులసింహాసనస్థను గ్రహింప నెంచి ♦ దర్ప మొప్ప.

క. తనసచివు లెవ్వరేనియుఁ, దనచెంతను లేకయున్నఁ ♦ దా దుర్మతి కా
వున [2]గరములఁ బట్టఁ దలం,చెను మన్మథపరవశైక ♦ చిత్తమ లరుటన్. ౪౫

క. నిదురించుసర్పరాజముఁ, బొదలుచు గ్రహియింప నెంచు ♦ పోలికఁ గాలం
బదయతఁ బురికొల్పఁగ జక్రిదయితఁ జేకొనఁగఁ జాఁచెఁ ♦ గే లాతురుఁడై.

తే. అందు శయనించియున్న మ ♦ హాభుజుండు
[3]పావకావకుంఠితుఁ డయి ♦ పరఁగుచక్రి

1 త్రిస్రః కోట్యో మహాత్మనః-అనిమూ. 2 హస్తైర్గ్రహీతుం తా మైచ్ఛత్-అనిమూ. 3 పావకేనావకుంఠితః-అనిమూ.

యామె గ్రహియింపఁ బూనుట ♦ నాత్మ నెఱిఁగి
కప్పుకొనియున్నవస్త్రంబు ♦ కడకుఁ ద్రోసి. ౭౭ 1179

క. దనుజేంద్రుని గన్గొని చ,క్కనిరీతిగ నవ్వె; నతని ♦ గాటపుఁ దేజం
బున నందీప్తుండయి లో,కనిచయరావణుఁడు చాలఁ ♦ గలఁతం గనుచున్. ౭౮

క. మునిఘోరణదీర్ఘవాతం,బున మూలముఁ ద్రెంప భూజ♦ము పడెడునటు వ్రా
లెను భూమిపైన నాతనిఁ, గని యిట్లని పల్కె మాని♦కాంతుఁడు ప్రీతిన్. ౭౯

క. దనుజశ్రేష్ఠా! లెమ్మా, గన ని త్తఱి! మృత్యుముఖముఁ ♦ గమలజువర ముం
డిన కతన బ్రదికినాఁడవు, చను రావణ! యిపుడు లేదు ♦ చావిట నీకున్. ౮౦

చ. అన క్షణలబ్ధసంజ్ఞుఁడయి ♦ యారజనీచరవీరుఁ డద్భుతం
బును గలిగించు విక్రమము ♦ సొంగఁగ నామహాత్ముఁ గాంచి నం
తన మది భీతి చేరుటయుఁ ♦ దా నిలనుండి యదెట్లొ లేచి యి
ట్లనియెను రోమహర్షణము ♦ నందిన మేను చెమర్చుచుండఁగన్. ౮౧ 1183

సీ. ప్రళయానలునిఁబోల్కి ♦ భాసిల్లి శౌర్యసంపన్నుండ వగు నీ వె♦వండవో చెపుమ
సకలదేహాంతర♦స్థాయివై తగుదేవదేవుఁడవో నేను ♦ దెలియఁ జాల
నని దేవకంటకుం ♦ డయి దుర్మతియునైన రావణుం డాశిన♦బ్రహ్మాననంబు
మోమునం దోఁప, జీ♦మూతగంభీరవాక్కుల నిట్లు పల్కె నో♦క్రూరదనుజ!

తే. యచిరకాలంబునందె శౌ♦ర్యమున నేను
నిను వధించెద నాచేతఁ ♦ గనుదువు మృతి
ననిన దశకంఠుఁ డతిభక్తి ♦ నంజలి యిడి
పల్కె నిట్లని చతురాస్యు♦పల్కువలన. ౮౨ 1184

*క. నే నిల మృతిగనువాఁడను,గా నోమహాత్మ! మునుపు ♦ కల్గినవాఁడే
మానుగఁ బుట్టుకఁ గనువాఁ,డే సఁక మత్తుల్యశూరుఁ♦డే లేఁ డెందున్. ౮౩

క. సురలందుఁ గూడ లేఁ డో,పరమాత్మా! బ్రహ్మవరముఁ ♦ బాటింపనివాఁ
డరయంగ నెట్టివీరుఁడు, ధరణిన్ లేఁ డింతవట్టు ♦ తథ్యము స్వామీ!. ౮౪

క. పరిహారము లేదా యజు,వరమునకుఁ బ్రయత్న మెట్టి ♦ భంగి నొనరుపం
దరమే గాదు జగత్త్రయి, సరసిజభవువరముఁ ద్రిప్పఁ ♦ జాలు మహాత్మున్. ౮౫

క. కనఁ జాలకున్నవాఁడను, వినవయ్య! సురాధినాథ♦విబుధుండైనన్
గన మది సాధ్వసమునటులైె,నను నీచే మృతియె గల్గి♦నన్ మేలుగదా?. ౮౬

క. ఇతరునివలనన్ నాకున్, మృతి గల్గక యుండుఁగాక ♦ యెపుడైనను మ
న్మృతి నీచే నైన నదా, క్షితి శ్లాఘ్యతరంబు సుమ్ము ♦ కీర్తికరము నా. ౮౭

* ప్రజాపతేస్తు వచనాన్నాహం మృత్యువశంగతః, నహి జాతో జనిష్యో వా మత్తుల్యో వా సురేష్వపి-అనిమా.

సీ. అని భీమవిక్రముం ♦ డై నయారావణుం డాదేవదేవుని ♦ యంగమందు
నచరాచరంబగు ♦ జగములు మూఁడింటిఁ గనియె వసావ్వాదిత్యు♦లును మరుత్తు
లారుద్రగణములు ♦ నశ్వి దేవతలు సిద్ధావళి పితరులు ♦ యమధనదులు
నర్ణవగిరినదు ♦ లఖిలవిద్యాధరుల్ శ్రుతులు త్రేతాగ్నులు ♦ వితతతార
తే. లెల్ల గ్రహములు గంధర్వ ♦ లుల్లసిలెడు
నంబరము సాధ్యచారణు ♦ లఖిలవేద
విదులు మునివర్య లాఫణి♦వితతి గరుడు
లింకనుం గల దానవు ♦ లెల్లసురలు. ౬౩ 1190

తే. మఱియు రాక్షసులును దైత్య♦మండలంబు
నూత్మరూపంబులం గొని ♦ శోభిలి రల
శయనసంస్థుని యఖిలవ♦ర్ణ్యముల; ననిన
ధర్మచిత్తు నగస్త్యుని ♦ దాశరథియు. ౬౪ 1191

క. కనుఁగొని యిట్లని పల్కెను;, మునివర! ద్వీపస్థుఁడగుచుఁ♦బొలుచుపురుషుఁడా
తనిచెంత మూఁడుకోటులు, కనఁబడు నవ్వార లెవరొ ♦ కరుణం జెపుమా.

క. పురుషుం డట శయనించిన, నిరుపమదేహాన్వితుండు ♦ నిర్జరదైత్యో
త్కరదర్పహరుం డెవ్వఁడొ, వరమునిచంద్రా! వినంగ ♦ వాంఛ యలరెఁ జూ.

చ. అనుటయు రామువాక్యమును ♦ హర్షమునన్ విని యాయగస్త్యుఁ డి
ట్లనియె; వచించెదన్ రఘువ♦రాన్వయభూషణ! యాలకింపుమా
వినవలతేని ద్వీపమున ♦ వేడ్క వసించిన యాసనాతనుం
డనఘుఁడు దేవదేవుఁడు మ♦హాత్ముఁడునౌ కపిలుండునాఁ జనున్. ౬౭ 1194

తే అతఁడె నారాయణుండగు ♦ నాదిదేవుఁ
డలరు శంఖగదాచక్ర♦ములు ధరించి
భూతతతికి విధాతయై ♦ పాలించి హర్ష
మగుచు నాద్యంతహీనుఁడై ♦ యవ్యయుఁడయి. ౬౮ 1195

సీ. అచ్యుతుండై విష్ణు♦వై శాశ్వతుండయి తనరారు నతనిముం♦దటను నృత్య
మును సల్పువారలు ♦ఘనులు దేవతలు నూ! తేజః ప్రతాపముల్ ♦దివ్యరూప
మలవడునవ్వార ♦ లానరరూపుఁడౌ కపిలతుల్యులు గాఁగఁ ♦ గ్రాలువార
లనతికోపుండగు ♦ నతఁడు చూచినమాత్ర పాపనిశ్చయుఁడయి♦పరఁగుదనుజుఁ
తే. డచట బూదిగఁ బడఁడయ్యె ♦ నధిప! రామ!
భిన్నగాత్రుండునై యట ♦ వితతగిరివి
ధమున భూమిని బడియెను ♦ దారుణవచ
నాంబకంబుల నాదైత్యు ♦ నమ్మహితుఁడు. ౭౦ 1196

క త్వరపడి ఛేదించెను; భూ,వర! రామా! ఘాతుకుఁడగు♦వాఁడు రహస్యం

బరయుమి వెలిఁ బుచ్చెడుగతిఁ;, జిరకాలమ్మునకు స్మృతినిఁ♦జెందెదనుజుఁడున్.

చ. దనుజులతోడ మంత్రిసము♦దాయము లుండెడుచోటి కేగి చ
య్యన సచివాళిఁ గూడుచు ద♦శాననుఁ డప్పుడె లంక కేగె; నం
చని మునిపల్కు దాశరథి ♦ యాస్యమునన్ స్మిత మంకురింపఁగా
ననియె మహాద్భుతం బి దని ♦ యచ్చటనున్న మహాత్ము లందఱున్. ౨౩

క. కన విన నాశ్చర్య మిదం, బని రచ్చటి కీశగణము ♦ లసురులతో ని
ప్పని యాశ్చర్యం బని బ,య్యనఁ బల్కిరి పిదప రాఘు♦వాంతికసీమన్. ౨౪

తే. చెలఁగుచున్నవిభీషణుఁ ♦ డలరి పలికె
నద్భుతము వచ్చె స్మృతికి ని♦దాఁ బురాత
నము మహాగాథ యనఁగ బ్ర♦హ్మాముని రామ!
వింటివి గదా? మదీరిత♦వృత్త మిట్లు. ౨౫ 1200

క. వినిపించితి మనుహర్షం,బును నీపూజయును జి త్త♦మును బొంగింపం
గను జనియెదమన నమ్మునిఁ, గని యెల్లరచి త్తములను ♦ గరఁగించునటుల్.

తే. పలికె రాముండు; మునిసంఘ♦పతి! మహాత్మ!
యింకనున్ రావణునిచేత ♦ లెల్లఁ జెపుము
వినఁగ వేడుక యయ్యె నా♦కనుచుఁ బలుక
మునివరుం డాదరమున ని♦ట్లనియె మరల. ౨౬ 1202

అధికపాఠము ఐదవ సర్గము సంపూర్ణము.

---

౨౪ - వ సర్గము.

రావణుఁడు బలపంతముగా స్త్రీలను గొనివచ్చుట.

క. తనకుం దోఁచినయట్టులు, చనుచున్ దిక్కుల జయించి ♦ చారుతరయశం
బును సంపాదించుచు ముద,మున నింటికిఁ బోవునపుడు♦మున నొక్కతఱిన్.

క. నరపతిగంధర్వమునీ,శ్వరనిర్జరకన్యకలను ♦ సమధికగర్వ
స్ఫురణమునఁ బట్టుచున్ ద,త్పరిరక్షకతం జెలంగు ♦ పదఁతిని బురుషున్. ౧

క. కనినంతనె వధియించుచుఁ, దనపుష్పకమందు నేడ్చు ♦ తత్కన్యకలన్
మనమున నిర్దయతోఁ జే,ర్చి నిశాటుఁడు పోవుచుండెఁ ♦ జిత్రగతులచేన్. ౨

ఆ. యక్షభుజగమనుజ♦యాతుధానులకన్య,కలను దైత్యదాన♦వులతరుణులఁ
దా గ్రహించె; వారు ♦ తద్దయు వగలచే, బాష్పజలమువిడిచి♦బయలుపడుచు.

సీ. శోకాగ్నిసంభవా♦స్తోకజలంబుల ముంచిరి పుష్పకం♦బును నితాంత
సుప్రశస్తైన యా♦సుందరీమణు లెల్ల నదులు కంధిని భువ♦నముల నింపి
నట్లు శోకపువారి ♦ యాపుష్పకము నిండు నట్లొనర్చిరి; భుజం♦గాంగనలును
గంధర్వకాంతలు ♦ క్ష్మాపతిమునిపుత్రి కలును దానవకన్య♦కలును దైత్య

ఆ. కన్యకలును బుష్పకంబున వందల,కొలఁది గూడి వగలఁ గుంది; రంత
దీర్ఘకేశనిచయ దేదీప్యమానలై, కమ్రదేహములను గ్రాలు నతులు. ౬

క. పరిపూర్ణచంద్రవక్త్రలు, స్ఫురదుద్యత్పీనకుచలు పొలుపగు [1]వజ్రో
త్కరవేదికాంతరప్రభ, లరుదుగఁ దగు నట్టిలలన లయ్యసురునిచేన్. ౬½

ఆ. బలిమిఁ బట్టుకొనఁగఁ బడిరి; స్యందనకూబ
రాభములగు శ్రోణు లమరు వారు
నిర్జరాంగన లన నీటుగుల్కెడువారు
తప్తకనకరుచులఁ దనరువారు. ౭ 1209

క. మనములఁ బొంగెడువగలన్, ధనంజయార్చిస్సమాన దారుణశోకస్రం
జనితమహాతాపంబులఁ, దనువల్లిక లట్టె వాడఁ దారేడ్చి రొగిన్. ౮

తే. వారినిశ్వాసవాయువుచే రయమునఁ
బుష్పకం బెల్లతావులఁ బొక్కుచుండి
యగ్నిహోత్రంబునాఁ దగె నావిమాన
మగ్నిహోత్రనిరుద్ధమై నట్లు వెలసె. ౯ 1211

క. దనుజేంద్రువశమునం జిక్కి నితాంతము శోకములను గ్రిందువడుచుఁ జ
క్కనిమోములు దీనత్వముఁ, గనఁ జూపులు నట్లు కాఁగఁ గాంతామణులున్.

తే. షోడశాబ్దవయస్సుచే శోభిలుచును
సింహవశగతమృగములచేష్ట లొప్ప
నేడ్చుచుండి; రందొకనారి యెంతొ యార్తిఁ
దనను దనుజుండు తినునేమొ యనుచు వగచె. ౧౧ 1213

క. ఒకయంగన దుఃఖంబున, వికలమనం బొప్ప దనుజవీరుఁడు ననుఁ జం
పక మానఁడంచుఁ దలఁచెను, సకలనితంబినులు శోకజలధి మునుఁగుచున్.

క. తలిదండ్రుల భర్తల భ్రాతలఁ దనయులఁ జిత్తములను దలఁచుకొనుచు ని
ష్ఠులఁ బొరలాడెడు విధమున, నిలఁ బొరలిరి చాలవగల నేడ్చుచు మఱియున్.

[2]చ. తనయుఁడు నన్నుఁ గానక నితాంతము చింతలఁ జిక్కి యెవ్విధిన్
మనఁగలఁడో, ననుం గనిన మాతయు భ్రాతయు శోకసాగరం
బుననె మునింగి పోవుదురు పో యకటా నిజదైవతంబు భ
ర్తను నెడఁబాసి యెట్లు మను దాన దురాత్మునిచెంత, నేనిఁకన్. ౧౪ 1216

క. అని విలపించుచు మృత్యువు, మనమున ధ్యానించి తల్లి! మానుగ నీచెం
తను జేరునట్లు నన్నుం, గొనిపొమ్మా యముగృహమునకున్ గడుదయతోన్.

1 తథా వజ్రవేదీమధ్యసమప్రభాః-అనిమూ. 2 ౧౪-వ శ్లోకమునుండి యొకస్త్రీ దుఃఖించి నట్లు "హాకథన్నుకరిష్యామి" అనిచెప్పి ౧౭-వ శ్లోకమునుండి బహువచనమునఁ జెప్పఁబడినది, అనఁగా నందఱు కలిసి దుఃఖించు నట్లనిభావము.

క. తొలిజన్మమ్మున నెట్టులొ, యలఘుతరాఘం బొనర్చ ♦ నయ్యెనొ లేదే
నిల నిట్టి క్రూరమతిచేఁ, తులఁ బడి దుఃఖాబ్ధియందుఁ ♦ ద్రోయఁబడుదునే.

క. కనఁ జాల నింక దుఃఖం,బున కిద్దానికిని నంత ♦ మును మదిలోనన్;
జని యిది సీ! నీచంబగుఁ, గనఁగల దే సారమిందుఁ ♦ గలయ వెదకినన్. ౧౬౪

క. జని యిది బుద్బుదతుల్యం, బనఁ దగినది మనుజలోక ♦ మన్నిఁటికంటెన్
జను నధమాధమ మనఁగా, మనుజుఁడు ధర్మాత్ముఁ డిందు ♦ మన కగపడునే.

ఆ. జగము లెల్లఁ బాడు ♦ తగ మన కిందొక్క
బంధు వైన లేఁడు ♦ బలయుతుఁడగు
నీదురాత్ముచేత ♦ నెల్లదుర్బలబంధు
జనులు తెగిరి కాచు ♦ జనుఁడు లేఁడు. ౧౭ 1221

క. తారక లాయుధితార్క్ష్యని,చే రయమునఁ బొదుగఁబడి వి ♦ చిత్రంబుగఁ దే
జోరహితములగుకైవడి, నీరావణుఁ డట్టు త్రుంచె ♦ నీసున మగలన్. ౧౮౪

క. బలవంతుఁ డీతఁ డౌటం, బొలియించు తెఱంగు లేమ ♦ పో దుర్వృత్తిం
దలపోసి తన్నుఁ దానే, ఖలుగాఁ దలఁపం డిదేమి ♦ కాలమహిమమో. ౧౯౪

తే. దుష్టబుద్ధికి వీనికి ♦ దోఃపరాక్ర
మం బనూనము పరులని ♦ తంబినులను
బలిమిఁ బట్టుట దుష్కర్మ ♦ మిల మహాఘ
మితఁడు పరకాంతలను గూడ ♦ నెంచుకుమతి. ౨౦౪ 1224

క. కనుక వధూకృతమరణం,బును బొందఁ గలం డటంచుఁ ♦ బూనికమీఱన్
వనితారత్నము లార్తుల, మనములు గలఁగంగఁ బలుక ♦ మంచి దిటు లగున్.

క. అని తెల్పునట్లు దుందుభి,నినదమ్ములు పర్వె నట్టె ♦ నింగిని మోదం
బున నిల్చి పుష్పవర్షం,బును గురియఁగఁ జేసి రావి ♦ బుధు లత్తఱినిన్. ౨౧౪

ఆ. లలన లిట్లు వనిత ♦ లవలన మృతిఁ గల్గ, శాప మిడిన దనుజ ♦ సత్తముండు
నిష్ప్రభుండుగాఁగ ♦ నిల్చెఁ బతివ్రత, లవుడు పొగులునట్టు ♦ లసురవిభుఁడు.

క. మనమున నిర్గతమోదుం, డనూన తేజోవిహీనుఁ ♦ డయ్యె; నవల నా
వనితామణు లిటు లేడ్వఁగఁ, జని లంకాపురముఁ జొచ్చె ♦ శౌర్యముపొంగన్.

చ. దనుజులు తన్ను స్తోత్రములఁ ♦ దన్పఁగఁ బూర్వర మిట్లు చొచ్చి చ
క్కనిసుఖమబ్బు నింక నను ♦ కాంతఁ జెలంగఁగ నుండునంత; నా
తనినహజన్మయై మిగుల ♦ దారుణరూపము గల్గి స్వేచ్ఛగాఁ
దనకు లభించురూపమున ♦ ధాత్రిఁ జరించెడు నింతి పొక్కుచున్. ౨౨ 1229

క. చనుదెంచి యన్నపదముల,కును మ్రొక్కి మఱింత వెతలఁ ♦ గుందెడునాశూ
ర్పణఖను లేవఁగ నెత్తి ద,యను బూని మృదూక్తులొప్ప ♦ నతిశాంతముతోన్.

తే. ఊఱడించుచుఁ బలికె; *నే♦మో వచింపఁ
బూని యేడ్చెదు సోదరీ! ♦ ముందు నేమి
వగలకుం గారణము యిట్లు ♦ వచ్చి నాదు
పాదములపయిఁ బడనేల? ♦ పలుకు మింక. ౨౬ 1231

చ. అన విని శూర్పణఖ కన్నులనుండి యశ్రువులు రాల దనుజేంద్రు చెల్లెలి
ట్లనియె; మహాబలుండవయి ♦ యున్నవునైతగు దీవు నాపతిం
దునిమితి, వందుచే మదికిఁ ♦ దోఁచ దదేమియు భర్తలేమి స
న్ననుదురు భర్తృహీనయని ♦ యార్తి మునింగితి దాన నే నిటన్. ౨౭ 1232

సీ. కాలకేయులు వీర♦కాంతులు బలవిక్రమాఢ్యులు పదియు నా♦ల్గైనవేలు
తెగిరి నీచేత నా♦తీవ్రాహవంబునఁ బ్రాణాధికుండగు ♦ భర్త తెగియె
బలశాలి యాతఁడు ♦ భ్రాతవు నీవు నా కరికల్పుఁడవయి యి♦ట్లతనిఁ దునిమి
నాఁడవు సహజాత ♦ నాకున్న దొక్కతె యనియైనఁ దలపోయ ♦ వక్కటకట!
తే. కాన నీచేత నేను ని♦క్కముగఁ దెగిన,దాన నే నైతి బంధువై ♦ తనరు నీదు
కుమతిచేత వైధవ్యదుః♦ఖమును బొంది,తిని మహార్తిని దాని నే♦ననుభవింతు.

క. దనుజేంద్ర! సోదరీపతి, యనువుగ రక్షించు సమర♦మందు నతనినిన్
దునిమియు సిగ్గును బొందవు, మనమునని టు చేయుటెల్ల♦మంచియొ తెలియన్?.

చ. అని యిటు లేడ్చుశూర్పణఖ ♦ యాడినపల్కుల నాలకించి సాం
త్వనవచనంబులం దనిపి ♦ తా నిటుపల్కెను సామపూర్వకం
బనఁదగురీతిఁ; జాలు నిఁక ♦ నార్తిని బొందఁగ లాభ మేమియుం
గనఁబడ దొక్కమాట వినఁ♦గాఁ దగు నిన్నిఁక సర్వకాలమున్. ౩౩ 1235

క. దానంబున మిక్కిలి బహు,మానంబునఁ దన్పువాఁడ ♦ మహిళామణిరో!
నే నన జయకాంక్షలు మది, నూనఁ బ్రమత్తుండ నగుచు ♦ నొక్కవిధమునన్.

చ. శరముల వైచుచున్ రిపులఁ ♦ జంపుచు నుండుదుఁగాని యుద్ధమం
దొరులను స్వీయులం దెలియ ♦ నోసహజాతరో! యుద్ధదుర్మదున్
శరతతివైచువానిఁ గని ♦ నైఁపక చంపితి నీదుభర్తగా
నరయఁగఁ జాల నైతి నటు ♦ లొట విచారము నొంద నేటికిన్?. ౩౬ 1237

క. ఇక్కాలంబున కనువగు, నెక్కార్యము చేయువలయు ♦ నెఱిఁగింపుము నే
నక్కఱగా నొనరించెద, నక్కార్యము నీహితంబు ♦ నాత్మఁ దలఁచుచున్.

తే. అనుపమైశ్వర్యయుతుఁడయి ♦ యలరు ఖరుని
నాశ్రయించి తత్సన్నిధి ♦ నలరు మింక
నతఁడు నీకన్నయగుఁ గాదె, ♦ యతివ ఖరుఁడు
పదియు నాల్గువేలగు సుర♦వైరులకును. ౩౮ 1239

* భద్రే వక్తుమర్హాసి మే ద్రుతమ్-అనియూ.

క. పతియై వారల నడుపఁగ, మతి నీవేమైనఁ గోరు ♦ మంచి దొనరుతుఁ గ
కృతకృత్యవు గమ్మని యన, నతఁ డర్హుఁడు విక్రమాఢ్యుఁ ♦ డగునతఁ డిలలోఁ.

క. పినతల్లికిఁ బుత్రుఁడు ఖరుఁ, డనుమానం బేల? నీదు ♦ నాదేశంబుఁ
గొనసాగించును సోదరి!, యనూనబలయుక్తుఁడగుచు ♦ నాతఁడు త్వరగఁ.

క. చను నా దండకమనఁబడు,వనమును బాలింప నతని ♦ బలముల కెల్లఁ
దనుజేంద్రుఁడు దూషణుఁడే, చను నధిపతిగాఁగ వీరు ♦ సాంద్రబలులునూ!.

*క. మును క్రుద్ధుండగు భార్గవుఁ, డనయం బీతావు రాక్ష ♦ సావాసము కాఁ
జనునంచు శాప మిడియెఁ,గనుకనె మనవార లుండఁ ♦ గలరు ధృవముగఁ.

తే. దండకారణ్యమునఁ బిన ♦ తల్లికొడుకు
ఖరుఁడు దితిజాధిపతియయి ♦ నిరత మీావు
చెప్పినట్టులె నెమ్మదిఁ ♦ జేయఁగలఁడు
నాతిరో! యని పల్కి సై ♦ న్యములఁ బంపె. ౨౧ 1244

సీ. పదునాల్గు వేలస ♦ ద్భటులను దోడ్కొని ఖరుఁ డప్పుడే దండ ♦ కావనంబు
నకుఁ బోయె, నా సేన ♦ లోకభంగిఘోరమౌ నాకారములుగల్గి ♦ యరిగెఁ బెలుచ
ఖరుఁ డెందు భీతిలే ♦ కయె గ్రాలుచుండుట నా సైన్యములతోడ ♦ నరిగి యందు
నిష్కంటకంబయి ♦ నెగడురాజ్యంబును బాలించె, నంత రా ♦ వణుని చెల్లె

తే. లైన శూర్పణఖయు నందు ♦ నధివసించెఁ
బ్రీతయై; తనమాటకు ♦ నేతెఱి ఖరుఁ
డడ్డు చెప్పక చేయంగ ♦ ననురు లెల్లఁ
దనపలుకు చేయుచుండ ను ♦ ద్దామభంగి. ౨౨ 1245

ఇరువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౨౫ - సర్గము.

రావణుఁడు మధుపురముపై దండెత్తుట.

ఉ. రావణుఁ డిట్లు ఘోరవన ♦ రాజి నొసంగి ఖరుఁ స్వసోదరిఁ
దా వెనఁ బంపి హృష్టుఁడయి ♦ దారుణ మౌచు నికుంభిలాఖ్యచే
భూవినుతంబునై పరఁగు ♦ భూరితరోపవనంబుఁ జొచ్చెఁ బెం
పావహిలంగఁ దమ్ములును ♦ నాతనితోఁ జని రెంతొ వేడుకఁ. ౧౫ 1246

తే. లంకచెంగట నది యుక ♦ లంకమగుచు
నలరు; నట యూపశతముల ♦ వెలసి చైత్య

---

* స హి శప్తో వనోద్దేశః క్రుద్ధేనోశనసా పురా, రాక్షసానా మయం వాసో భవిష్యతి నసంశయః-అనియు. ఈశ్లోకము వ్యాఖ్యగలపుస్తకమున లేదు. కథానుబంధముగా నున్నందున బుస్తకాంతమం దున్నదానిని దెనిఁగించితిని.

ములవిరాజిల్లుచుఁ సంప♦దలఁ జెలంగు
నట్లు చేయంగఁబడు మఖం♦బరసి యతఁడు. ౩ 1247

క. కనె నందు మేఘనాదునిఁ, దనయు గ్రతనూజు శత్రు♦తరుదావాగ్నిన్
ఘనతరకృష్ణాజినధరు,నిని గుశయుఁ గమండలువును♦ నియతిం గొనుచున్. ౪

క. తనరారువానిఁ గన్గొని, చని బాహువు లట్టె చాఁపి♦ చక్కనియాలిం
గన మొనరిచి తృప్తుండై, తనయా! యిట్లుండనేల? ♦ తత్త్వము నాకున్. ౫

క. ఎఱిఁగింపవలయు ననఁగాఁ, దఱి యెఱిఁగి వచింపనేర్చు♦ధన్యుఁడు ఘనుఁడున్
మఱియుఁ దపోవిభ్రాజితుఁ, డెఱిఁగింపఁగ నర్హుఁ డగుచు♦ నెసఁగెడుకవియున్.

క. దనుజేంద్రుని నారావణుఁ, గని యజ్ఞసమృద్ధికొఱకుఁ♦గా నిట్లనియెన్;
వినవయ్య! దానవేంద్రా!, పని యిద్ది యుపక్రమింపఁ♦ బడువిధ మెల్లన్. ౭

ఆ. తెలుపువాఁడ నీకుఁ ♦ దేటతెల్లంబుగ, నీతనూజుఁ డితఁడు ♦ నియతి సప్త
యజ్ఞములను జేసె ♦ నవివిస్తృతములయి, యలరె వానిపేరు ♦ లనువదింతు. ౮

సీ. ఆది నగ్నిష్టోమ ♦ మశ్వమేధంబు నవ్వల భూరికాంచన♦లలితదక్షి
ణలనొప్పుయజ్ఞ మ♦వ్వల రాజసూయంబు వఱలు గోమేధంబు ♦ వైష్ణవంబు
నొనరించె; నిత్తఱి ♦ నురుతరనియమముల్ తగ మహేశ్వరదేవ♦తాకమైన
యజ్ఞంబు చేయంగ ♦ నాసక్తిఁ గని పూనె నది దుర్లభంబునూ♦యందు వరము

తే. లీశ్వరుం డిచ్చెఁ దాని యు♦హీనకరుణ
నిత్తరుణమందె నంపము ల♦వెవ్వియనినఁ
గామగంబగు రథ మొండు ♦ కదలుచుండు
నంతరిక్షంబునం దది ♦ యడ్డులేక. ౯ 1253

క. దేనం జీఁకటి పుట్టునొ, దానవవర! [1]తామసియనఁ♦దగు మాయను, బెం
పూని వరంబులఁ బడసెన్, దీనిం గొన సంగరంబు ♦ తీవ్రముగాఁగన్. ౧౦

ఆ. సాగుచుండునపుడు ♦ శత్రువుల్ సురలైన
నసురులైనఁ జూడ ♦ నలవిగాక
యుండు, నెచట నీతఁ ♦ డుండునో యాగతి
తెలియఁ బడదు గాన ♦ వెలయు నిద్ది. ౧౧ 1255

క. శరములచే నక్షయమయి, పరఁగెడు తూణీరయుగము ♦ బవరంబుల నె
త్తరుణమునన్నైన దుర్జయ, మరిభీకరమైన పటుశ♦రాసన మితఁడున్. ౧౨

క. కొనియెన్ శంకరువలనన్, విను శత్రుధ్వంసకముగ ♦ వెలసెడునస్త్రం
బును బొందె నిట్టివరముల, దనుజేంద్రా! వడసె నీదు♦తనయుం డిచటన్. ౧౩

తే. యజ్ఞమిద్ది సమాప్తిని ♦ నందు నిపుడునిన్నుఁ జూడ నిరీక్షించి ♦ యున్నవాఁడు

---

1 మాయాం చ తామసీం నామ-అనియు.

నీతనూజుఁడు నావిని ♦ నెమ్మిఁ గనక పలికె దశవదనుం; [1]డశో♦భన మిది యగు.

తే. దీన శత్రువు లింద్రాదు ♦ లూను నియతి
ద్రవ్యముల నర్చితులు గాదె ♦ రమ్ము చాలఁ
జేయఁదగ దిది యోపుత్ర! ♦ చేసినంతె
చాలు, నాతోడ రమ్ము వి♦శ్వనుతసుగుణ!. ౧౮౹ 1259

తే. అనుచు నింటికిఁ గొనిపోయె ♦ నాత్మజన్ము;
ననుజు లెల్లను వెంబడి ♦ నరిగి రంతఁ
బుష్పకమునుండి వేగమ ♦ పూఁవుబోఁడు
లను దమిఁ దింపె వారెల్ల ♦ వనటఁబొంది. ౧౯ 1260

క. అనయము బాష్పసమాకుల,తను నేత్రమ్ములను సొంపు ♦ దప్పఁగ రక్షో
దనుజామరులకు రత్నము, లనఁ దగి లక్షణసమన్వి♦తాంగలతికలై. ౧౯౹

క. పలువిధములైన భూషణ,ముల స్త్రీయానులను తేజ♦ముల వెల్గుచు ని
ష్పుల బ్రుంగినట్టు లార్తిని, బొగులుచు నందుండి రట్టి ♦ పొలఁతుల నెల్లన్.

సీ. కన్నీరుసతతంబు ♦ మున్నీరుగా నొప్ప నేడ్చెడువారల ♦ నెట్లొ యొకటఁ
గాంచి విభీషణుం ♦ డెంచి ధర్మునీష నిట్లని పల్కె; న♦హీనధర్మ
మలరువాక్యంబుల ♦ నన్నను గని యశం బర్థంబు కులము మ♦హాత్మ! యిపుడె
నశియింపఁ జేసి దు♦ర్యశమును గల్పించునిట్టి యాచారంబు ♦ నేల చేయఁ

తే. బూనినాఁడవొ జ్ఞాతుల ♦ కైన నిద్ది, మంచి దెల్లగు నీబుద్ధి ♦ నెంచి యిట్లు
తిరుగుచున్నాఁడ విట్టి య♦తివల నెల్ల, వారిబంధుల బెదరించి ♦ బలముకలిమి.

క. పరవనిత లనుచుఁ దలఁపక, స్మరబాధితచిత్తుఁడవయి ♦ చంచద్గతి నీ
తరుణులఁ దెచ్చితి రావణ!, పరికింపుము! యిద్ది తగిన♦పనియో కాదో. ౨౦

క. నిను మీఱి మధుసమాహ్వయు,దనుజుఁడు కుంభీనసిని ని♦తాంతబలమునన్
గొనిపోయె ననఁగ రావణుఁ, డనియె; విభీషణ! యిదేమి ♦ యన్యాయంబో.

తే. మధువనం బను దోర్బల♦మండితుండు
తెలుపుమా! యెవ్వఁడో మదిఁ ♦ దెలియఁబడదు
నాఁగ సంక్రుద్ధుఁడై రావ♦ణవిభుఁ జూచి
యిట్టులనియె విభీషణుం ♦ డిద్ధరీతి. ౨౧౹ 1266

క. పరదారలఁ జెఱఁబట్టిన, పరమాఘుదకర్మమునకు ♦ ఫల మిటఁ గలిగెన్
సురవైరినాథ! వినుమా, పరికింపుము మది నిదెట్టి ♦ పాపకృతియొకో. ౨౨

సీ. మన కెన్న నెవ్వండు ♦ మాతామహుండగు నాతని కన్నయై ♦ యసురవర్యుఁ
డగుసుమాలికిఁ బెద్ద♦రైయు మాల్యవంతుఁ డన్ విఖ్యాతినొందుచు♦వృద్ధుఁ బ్రాజ్ఞుఁ
డును నగుఁ గద? మన♦జననికి జ్యేష్ఠయై పుష్పోత్కటాహ్వయం♦బునఁ దనరుట
యెఱుఁగుదు కాదె నీ♦వింతియె కాక యస్మన్మాత కెన్న జ్యే♦ష్ఠపితయైన

---

1 నవో్ధన మిదం కృతమ్-అనిమూ.

తే. యట్టి యార్యఁడు మాతామ♦హోగ్రుఁడగును
గాదె, తత్పుత్రి కాపుత్రి♦కయగుఁ జుమ్ము
సాధ్వి కుంభీనసి యనంగఁ ♦ జను నుకన్య
మనకుఁ గలపినతల్లి కా♦త్మజయుఁ గలదు. ౨౪ 1268

క. అనలోద్భవయగు నామెయు, ననలయనం బరఁగు; మనకు ♦ నారయ ధర్మం
బున స్వసయగు నామెను మధు,దనుజుఁడు చెఱఁబట్టెఁదనదు♦దర్పముపొంగన్.

క. తనయుండు మేఘనాదుఁడు, ఘనయజ్ఞం బొకటి చేయఁ♦గాఁ బూనెను నే
నును వారిమధ్యభాగం,బున నిష్ఠను భక్తి మెఱయఁ ♦ బూనినతఱిన్. ౨౬

క. అనుజుండు కుంభకర్ణుఁడు, తననిద్రాగృహమునందుఁ ♦ దత్పరమతియై
దనుజేంద్రా! శయనించెను, దనుజేశ్యుఁడు మధువు తనదు♦దర్పమ్మూర్తిన్. ౨౭

ఆ. మంత్రివరుల నెల్ల ♦ జంత్రపుబొమ్మల,కరణి నుండఁ జేసి ♦ సురరిపులను
బింక మణఁగఁదన్ని♦ప్రియతమసౌధాంత,రమున నున్నయింతి♦మనుతఁగొనియె.

క. విని యీవార్తను నావల,నను నీవిఁక శాంతినే గొ♦నంగవలెఁ, జంపం
గను దగఁ డాతఁడు రావణ;, యనుజను నొకవరున కీయ♦నగు భ్రాతలచేన్.

తే. ఐన నీదుష్టకర్మమి ♦ ట్లీనితాంత,పాపఫలము నొసంగెని ♦ ట్లీవగిదిగ
నిప్పుడే దుష్టఫలముల ♦ నిచ్చె నిద్ది, విదితము య్యెఁగదా పృథి♦వీతలమున. ౩౦

క. అనిన విభీషణుపల్కుల,విని యాత్మకృతాఘకృత్య♦వితతిని నొంపం
గనుబడి తప్తాంభస్సులఁ,గనుపట్టెడు సాగరంబు♦గతి నుగ్రుండై. ౩౧ 1275

తే. అనుపమానకోపంబున ♦ నతఁడు తెల్ల
నరుణములుగాఁ గనంబడ ♦ నఘుడు పలికె
నరదమును సిద్ధపఱుపుఁ డీ♦యాహవమున
కెల్ల శూరులఁ బిలిపింపుఁ ♦ డీయదనున ౩౨ 1276

చ. అనుజుఁడు కుంభకర్ణుఁడు మ♦హారణశూరులు రాక్షసోత్తముల్
ఘనతరసాయకాదులను ♦ గైకొని వాహనరాజి నెక్కి యుం
డను జను, రావణుం డనుచు ♦ నన్ను నెఱింగియు భీతిలేక క
న్యను గొనిపోయినట్టి మధు ♦ నానురు నీచుని నిష్ఠిఁ జంపెదన్. ౩౩ 1277

చ. దనుజుని బీఁచమార్చి సుర♦తల్లజునిన్ రణమందు నోర్వఁగాఁ
జనియెద మిత్రసంయుతిని ♦ స్వర్గపురంబును ముట్టడింపఁగా
ననిమొన నింద్రు నోర్చి త్రిద♦శాలయ మొయ్యన నావశంబునం
దును మెలఁగంగఁ జేసి కృప♦తో శతమన్యునినందునిల్పెదన్. ౩౪ 1278

చ. సురలి పురంబుఁ జేరెదను ♦ మామకశక్తి త్రిలోకవిస్తృతిం
బరఁగ జగద్విశాలమగు ♦ భాగ్యము గల్గఁగ స్వేచ్ఛమీఱఁగాఁ
దిరుగుచునుండువాఁడ నని ♦ తెల్లముగాఁ బలుకంగ దానవే
శ్వరునిమహాజ్ఞఁ బూని బహు♦సాధనము ల్గొని యుద్ధకాంక్షచేన్. ౩౫

తే. నాల్గువేలయక్షౌహిణుల్ ♦ నాకవిజయ
మందుఁ గల్గుపేరాళచే ♦ నపుడె తరలె;
వారి కెల్లను దానవే♦శ్వరునియగ్ర
తనయుఁడౌ మేఘనాదుఁ డు♦ద్దామశక్తి. ౩౮ 1280

క. పరిపాలకుఁడై ముందుగ, నరిగెన్ ; దశవదనుఁ డబ్బ♦లాళినడుమ ని
ష్ఠురసాధనములఁ గైకొని, యరిగెన్ దనయన్నవెనుక ♦ నద్భుతశక్తిన్. ౩౯

తే. కుంభకర్ణుండు నడచెను ♦ క్రూరకర్మ,విరహితస్వాంతుఁడైన వి♦భీషణుండు
ధర్మమతిలంకయందుండి♦ధర్మముల నె,యూచరించుచుఁబురినిదా♦నరయుచుండె.

సీ. అమ్మహాభాగులా ♦ నసురులు మధుపురం బునుగూర్చి వేగమ ♦ పోయి; రరద
ములతోడ దంతీంద్ర♦ములతోడ, ఖరసంతతులతోడ హయముల♦తోడనుష్ట్రి
ములతోడ నతితీవ్ర♦ములగు సర్పంబులతోడ నంబరము సం♦దు గన లేక
యుండఁగఁ జేయుచు ♦ నొక్కమొగిం బోయి; రసురులతో వైర♦మవధరించి

తే. వేనవేలుగ రావణు ♦ వెంబడించి
వెనుకనే పోయి; రంత నా♦వీరవరుఁడు
దశగళుం డేగి మధునిష♦త్తనముఁ జొచ్చి
యతనిఁ గానక తోఁబుట్టు ♦ వచటనుండ. ౪౧ 1283

క. కనుఁగొనియెను; గుంభీనసి,యును సాధ్వస మూని వడఁకి ♦ యొయ్యన దనుజేం
ద్రునిపాదంబులపైఁ బడి,యెను దోసిలిఁ బట్టి యూతఁ ♦ డేమను ననుచున్.

ఆ. ఆమె లేవ నెత్తి ♦ యేమియు భయ మూన,వల దటంచు దనుజ♦వర్యుఁడైన
రావణుండు పల్కె ♦ రాజీవనేత్ర! యే, నేమి సాయ మిడఁగ ♦ నిపుడు వలయు.

చ. అన విని యామె యిట్లను మ♦హాబల! దానవనాథ! నాయెడన్
మనము ప్రసన్నమేని బహు♦మానము మీఱఁగ నాపతిన్ మధుం
డనఁబడు దానవేజ్యుని మ♦హాహవమందు వధింపకుండఁ గా
చిన ననుఁ గాచినట్లె యిల ♦ స్త్రీలకుఁ గల్గెడు దుఃఖరాశిలోన్. ౪౪ 1286

తే. తలఁప వైధవ్యదుఃఖంబె ♦ దారుణంబు
దానికే భీతి నొందెద ♦ దానవేంద్ర!
వినుము కులకాంతలకు నిట్టి ♦ భీతిఁ బోలు
భయము వేఱొండు గానంగఁ♦బడదు నిజము. ౪౫ 1287

చ. ననుఁ గని భీతి నొందకుము ♦ నాప్రియసోదరి యంచు నీవె మ
న్ననఁ దగ మాటలాడితివి, ♦ నాథుని నాకు ననుగ్రహింపు మం
చని యిటు వేఁడ నాపలుకు ♦ నాదృతిఁ గైకొని నీదువాక్యమున్
త్యనియతి నొందఁజేయుమన ♦ హర్షము నొంది దశాస్యుఁ డాత్మలోన్. ౪౬

తే. సంతసం బంది నిలుచున్న ♦ సహజఁ జూచి
యెందు నీభర్త మెలఁగెడు ♦ నిపుడె చెపుము!
యతనితోఁ గూడి స్వర్గజ♦యంబుకొఱకు
నరుగఁ దలఁచితి నీపయి ♦ నలరుకరుణ. ౪౭ 1289

క. దనుజునిఁ జంపక విడిచితి, మనమున భయ మూనవలదు; ♦ మానిని! యనఁగాఁ
జని యామె నిద్రవోయెడు, తనపతి బోధించి మది ని♦తాంతముదమునన్.

క. పలికెను బ్రాణేశునితో, బలదర్పసముగ్రుఁ డౌచు ♦ భాసిలుదశవ
క్త్రలలితుఁడు రావణుం డిదె, బలువిడిఁ జనుదెంచె మదిని ♦ భయ మూనకుమీ.

క. సురలోకమును జయించెడు, పరమప్రముదంబు మీఱ ♦ భవదన్వితుఁడై
యరుగంగఁ దలఁచె సాయం, బురునుతి నొనఁగంగఁ దగుదు ♦ వో ప్రాణేశా!.

చ. కనుక స్వబంధుయుక్తముగఁ ♦ గ్రన్నన సాయ మొనర్పఁ బొమ్ము మి
త్రునకు సహాయకాంక్షికిని ♦ రూఢి తగం దనచేతనైన య
ట్లనువుగ సాయమీయఁదగు ♦ నన్నఁ దలోదరివాక్యరీతులన్
విని మధు వల్లె సాయపడు♦వేడ్కను దాఁ జని న్యాయరీతిగన్. ౫౧ 1293

క. దనుజేంద్రుని రావణునిం, గని ధర్మము తప్పకుండఁ♦గాఁ బూజించెన్
మనములరఁ బూజలం గొని, తనచెల్లెలిగేహమున ని♦తాంతము ప్రీతిన్. ౫౨

ఆ. పగలు జరపి తీక్ష్ణ♦భానుఁ డస్తంగతుఁ, డగుడు సుఖనస్పృద్ధి ♦ నలరి రేయిఁ
జక్కఁ బుచ్చి యవలఁ♦జనఁ బూనె, మధువను, జేజ్యఁ దతనితోడ♦నేగె నంత.

క. చని దశకంఠుఁడు దేవేంద్రునితో సరిచచ్చు మహిమ♦తోఁ గైలాసం
బును జొచ్చి ధనదువాసం,బునైన యగ్గిరిని విడిసె ♦ భూరిబలయుతిన్. ౫౫

ఇరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

౨౬ - వ సర్గము.

రావణుఁడు రంభను గాంచి మోహించుట

క. ఆగిరిపై దశకంఠుఁడు, తీఁగెల గొంపములనడుము ♦ తెమ్మెర పొలయం
గాఁ గదునలరుచు బలముల, వేగము విడియించి పృథుల♦వీర్యము పొంగన్. ౧

క. దినకరుఁ డస్తమహీధ్రముఁ, దనకాశ్రయముగఁ జనంగఁ ♦ దా విడిసె ముదం
బును గూర్చు చంద్రుఁ డుదయిం,చెను శైలసమానకాంతి ♦ చెల్వారంగన్.

క. నానాప్రహరణసాధన,మై నిఖిలబలంబు సంద్ర ♦ మట్లు విపులతన్
గానరయి సుప్తిఁ జెందెను, దానవపతి విపులబాహు♦దర్పము పొంగన్. ౨౫

సీ. శైలమూర్ధంబున ♦ శయనించి యంతట విధునిపాదోపశో♦భితములైన
భోగార్హితమధర్మ♦ములఁ గాంచె; నచ్చటి కర్ణికారాపూర్ణ♦గహనములను

దివ్యకదంబవనం♦దీప్తకాననముల వికసితసరసిజ♦వితతి మిగుల
గంగానదీజల♦కణములఁ జంపకాశోకపున్నాగాభి♦శోభితవన
తే. ములను మందారతరువుల ♦ లలితచూత
పాటలంబుల లోధ్రాఖ్య♦పాదపముల
నర్జునములఁ బ్రియంగువృ♦క్షాళిఁ గేత
కములఁ దగరంబులన్ దగు♦కాననముల. ౫ 1300

తే. నారికేళప్రియాళుప♦నసమహీజ
ములను దక్కినతరువులఁ ♦ బొలుపు గాంచు
వనములందు మనోహర♦వైభవముల
నలరుతావుల మదనార్తు ♦ లగుచు మిగుల. ౬ 1301

క. అనుపమమధురస్వరములఁ, గన మోదము నింపునట్టి ♦ కంఠంబులతో
ననురాగము తగఁ గిన్నరు, లనూన చిత్తప్రమోద ♦ మలరువిధమునన్. ౭

తే. చక్కఁగాఁ బాడి రెలుగెత్తి; ♦ సారమద్య
మదనురక్తాత్ములై సాధు♦మద్యపాన
మత్తులౌచు విద్యాధరుల్ ♦ మానినులను
గూడి క్రీడించి రెంతయుఁ ♦ గుతుక మలర. ౮ 1303

క. వినఁబడియెను మధురస్వర,మున నచ్చరపిండుగాన♦మును యక్షగణే
శునిమందిరమునఁ జేయఁగ, ననుపమఘంటాస్వనంబు ♦ నట్లు హితముగన్. ౯

సీ. మధుమాధవసుగంధ♦మహిమము లెల్లయంగఁ దరువులు పవనసం♦తాడితంబు
లయి యాగిరీంద్రంబు ♦ నభినవవాసనాభూయిష్ఠముగఁ జేయు♦పోల్కిఁ బుష్ప
ములఁ గురిపించెను; ♦ సులలితమకరందమునఁ బుష్పరజమున ♦ మునిఁగి చారు
గంధంబుఁ దమితీఱఁ ♦ గైకొని రావణు కామంబు నభివృద్ధిఁ♦గాంచఁ జేయు
తే. చును నితాంతము వీచెఁ బ♦వనుఁడు; నపుడు
స్పర్శసుఖమును గల్గింపఁ ♦ జాలి; యంతఁ
బాట వినుటను, రుచిరపు♦ష్పతతికలిమి,
వాయుశైత్యంబునన్ శైల♦వరగుణముల. ౧౦ 1305

క. రేయియు నత్తఱి వఱలుట, నాయబ్జవిరోధి యుదయ ♦ మందుట సుమహా
కాయబలదర్పయుతుఁ డగు, నాయసురేంద్రుఁడు స్మరాంబ♦కాభిహతుండై.

క. స్మరదేవవశంగతుఁడై, పరమార్తిని నూర్పు లలరఁ ♦ బలుమాఱులు సం
దరయఁగ లేకుండఁగఁ బుచ్చి రమాసోదరునిఁ జంద్రుఁ ♦ జెచ్చెఱఁ గనియెన్.

చ. దనుజవిభుండు మన్మథుని♦దారుణబాణనికృత్తదేహుఁడై
వనజవిరోధిఁ గాంచి పలు♦భంగుల బాధల నొందుచుండఁగా
ననుపమవస్త్రభూషణము ♦ లంగమనోరమతన్ మఱింత హె
చ్చు నటు లొనర్పఁ, బూర్ణశశి♦శోభితబింబసమానవక్త్రయై. ౧౩ 1308

తే. అచ్చరలమిన్నయై తగు ♦ నట్టిరంభ
దివ్యచందనము నలంది ♦ దివ్యపుష్ప
హారములఁ దాల్చి రుచిరమం♦దారపుష్ప
భూషితానీలకేశియై ♦ పొలుపుమిగుల. ౧౭½ 1309

సీ. సురతోత్సవమునకై ♦ త్వరపడుమనను, నయనాభిరామంబయి ♦ యతిపృథుత్వ
మును గాంచి యొప్పారు♦మునుజక్కఁ దాల్చుటనలరారుజఘనము♦య్యతను కేళి
వర్ధకమగుచుండ, ♦ భవ్యషడ్తుపుష్పావళికృతిమనో♦హరకలాప
భూషితదేహయై ♦ పోలఁ దలంచినననయువసంపద ♦ నమలభూష

తే. ణముల చారుత నైజసౌం♦దర్యమునను, వఱలు వేఱొకశ్రీదేవి♦భంగి నలరె
మఱియుఁదోయదతాభ్రము♦మాడ్కినల్ల,నైనవస్త్రంబుఁబైఁగప్పు♦గాననంగ.

*చ. వనజవిరోధిబింబనిభ♦వక్త్రము చెన్ను వహింపఁ గార్ముకం
బునకును గన్బొమల్ సమతఁ ♦ బూని శుభంబులుగాఁ జెలంగ, నూ
తనతరపల్లవంబులనఁ ♦ దద్దయు హస్తయుగంబు మార్దవం
బునఁ దగ హస్తిహస్తములఁ ♦ బోలినయూరువు లొప్ప మీఱఁగన్. ౧౮

క. తనదునొయారము చూచెడు,జనులకు నబ్బురము నీయఁ ♦ జంచద్దను జేం
ద్రునిసేనామధ్యంబునఁ, జనుచుండెను రంభ; దనుజ♦సత్తముఁ డంతన్. ౧౯

చ. కనుఁగొని యావధూమణిని ♦ గామమహాంబకబాధితాత్ముఁడై
తనమదిఁ గల్గుకోరికను ♦ దత్తఱపాటున నేగురంభ నో
య్యనఁ గయిఁబట్టి సిగ్గుపడు ♦ నాయబలామణిఁ గాంచి పల్కె మో
మున స్మితమంకురింప; విరి♦బోఁడిరో! యెచ్చటి కేగఁ బూనితో ౨౦ 1312

క. ఫలసిద్ధి దేనిఁ బొందం, దలంచి యిటుపోవుచున్న♦దానవొ, తరుణీ!
యిల నెవ్వనికి నదృష్టము, ఫలియించునొ? నిన్నుఁ బొందు♦భాగ్య మెవనికో.

క. సరసిజకువలయవిలస,త్పరిమళ మొప్పారుచుండ ♦ భాసిల్లు త్వదా
స్యరసంబు నమృతరస మా,దరము తగం ద్రాగునట్లు ♦ త్రాగుచుఁ దృప్తిన్.

క. కనునట్టి మహాదృష్టం,బును గాంచెడువాఁ డెవండొ? [♦పొలఁతీ! పూర్ణేం
దునిబోలి చారుకువలయ,సునయనములు గల్గి మిగుల ♦ సుందర మగుచున్.

క. తనరారు నీముఖంబున, ననుపమరీతిం జెలంగు ♦ నమృతంబును శ
క్రునిబోలి త్రాగు పుణ్యం,బును జేసినవాఁ డెవండొ ♦ పొలఁతీ! చెపుమా ]

తే. కనకకుంభనిభంబులై ♦ యనుపమాన
మంగళము నీయఁ జాలి క♦నంగ నందు
గానరాకుండఁ బెరిగి ని♦క్కముగ బలిసి
యున్న నీచన్నుఁగవయు నో♦యన్నుమిన్న!. ౨౩½ 1318

* యస్యా వక్త్రం శశినిభమ్-అనియూ. ఈయర్థముగలపదమే పదునాల్గవశ్లోకమునయున్నది.

తే. ఎవ్వని యురస్స్థలంబును ♦ బువ్వులుతుఁడు
మెచ్చుకొనఁ గ్రుమ్మి యాతని♦సచ్చరితము
ఫలము నొందఁగఁ జేయునో, ♦ బాల! [1]కనక
చక్రసన్నిభమై తగి ♦ చాల బలిసి. ౨౬ 1319

క. కనకమయదామయుక్తిం, గని రుచులన్ మించు నీజ♦ఘనరూపంబై
తనరారు స్వర్గము నదే,ఘనుఁ డెక్కంగలఁడొ చెవుమ! ♦ కమ్రేందుముఖీ!.

క. నను మించుపురుషుఁ డీక్షితిఁ, గనఁ గలఁడే? యశ్వి దేవ♦కాంతులు విష్ణుం
డును బోలుదురే నను నో,కనకాంగీ! యిట్టినన్నుఁ ♦ గాదని యిచ్చన్. ౨౮

చ. అరిగెద వేలొకో? తెలియ, ♦ నయ్యది మంచిది గాదు; చాలనుం
దరమయి యాశిలాతలము ♦ నాతిరొ! యిప్పుడు విశ్రమింపుమా
వరమతి నెన్న నన్నిగులు♦వాఁడు ప్రభుండన ముజ్జగంబులన్
దరమె కలండనంగ నను ♦ ధన్యుని జేయుము మాట లేటికిన్. ౨౯ 1322

ఉ. చానరొ యంజలిం గొని వి♦శాలయశంబున మించునీమహా
దానవభర్త వేఁడెడు, ని♦తాంత ముదంబున మీఱి నిన్ను నన్
మానసమందు [2]రాజులకు ♦ క్ష్మాపతి యంచు జగద్విధాతయం
చూనినప్రీతిఁ గైకొనుము ♦ యోకమలాయతనేత్ర! యిత్తఱిన్. ౩౦ 1323

చ. అన విని రంభ యిట్లనుఁ గృ♦తాంజలియై తనువల్లి కంపముం
గనఁ గరుణింపు మిట్లు పలు♦కం దగునే? దశకంఠ! నాకు నీ
వనఁగ గురుండవౌదు; విటు ♦ లార్తిని బొందెడు నాతిమిన్నలన్
గని కరుణించి వారలను ♦ గావఁగ నర్హుఁడ వీవు శూరతన్. ౩౧ 1324

సీ. ధర్మంబునన్ నేను ♦ దానవేశ్వర! నీకుఁ గోడల సత్యంబుఁ ♦ గూర్చిపలుకు
చున్నాను; నా విని ♦ యొప్పుగఁ దనపాదములనె గాంచుచునధో♦ముఖిగ నున్న
రంభను గన్గొని ♦ రమణ నిట్లని పల్కెఁ; దనకరస్పర్శంబు♦నను నితాంత
రోమహర్షము గన్న ♦ యామహిళామణిఁ గనుఁగొని నాతనూ♦జునకు నీవు

తే. భార్యవే యైన స్నుషవయినఁ ♦ బడుదు వీవు;
తరుణిరో! యన్న రంభ త♦థ్యంబటంచు
నుత్తరం బిచ్చి మఱి పల్కె; ♦ నోసురారి
పుంగవా! ధర్మమున నీదు♦పుత్త్రునకును. ౩౨ 1325

క. మనమలరించెడుపత్నిని, విను నీకున్ భ్రాతయగుచు ♦ వెలసెడు యక్షే
శునకుం బ్రాణప్రియతరుఁ, డనఁబడు తనయుండు గలఁ డ♦హార్యబలుండున్.

తే. ముజ్జగంబుల సత్కీర్తిఁ ♦ బొదలఁ జేసి
యలరు నలకూబరుండు నా ♦ వెలయుచుండు

1 సువర్ణచక్రప్రతిమమ్-అనిమూ. 2 భర్తు ర్భర్తా విధాతా చ-అనిమూ.

నతఁడు, ధర్మంబునఁ బ్రవుఁ ♦ డగును వీర్య
మునను క్షత్రియుఁడగుఁ గ్రోధ♦మున దహనుఁడు. ౩౪ 1327

సీ. కౌంతిని వసుధకు ♦ సముఁడగుఁ జుమ్ము; నే నతనికోరికఁ దీర్ప ♦ నాత్మఁ దలఁచి
సంకేతరీతిగాఁ ♦ జనుచున్నదాన నాదిక్పాలతనయుండు ♦ దివ్యకీర్తి
యతని నుద్దేశించి ♦ యతులితభూషణజాల మిద్దాని నేఁ ♦ దాలిచితిని
బరునిపై నుంత నా♦భావంబు వ్యాపింప దతనిపైఁ బొలసిన♦యట్లు నిజము
తే. గాన స్నుషయను సద్బుద్ధి ♦ నూని సత్య
మాత్మఁ జింతించి విడువంగ ♦ నర్హ మిపుడు;
శత్రుసూదన! యాతఁడ♦స్మద్రతికయి
యుత్సుకుండయి యిత్తఱి ♦ నుండుఁ దమిని. ౩౫ 1328

క. మన మాఘునునకు ధర్మం,బున నిశ్చలరీతిఁ బొల్చుఁ ♦ బుత్రుఁ డతఁడు నీ
కును గాన నతనికార్యం,బునకున్ విఘ్నంబుచేయఁ ♦ బోలదు నీకున్. ౩౫½

క. నను వదలుము సజ్జనహిత, మనఁదగుమార్గమునఁ బొమ్ము ♦ ఖ్యాతి తనర నో
దనుజేంద్ర! మాననీయుఁడ, వనుపమగతిఁ బూజ్యుఁడవు మ♦హాత్మా! నాకున్.

క. నే నల్లె లాలనీయను, మానుగ నీ కనిన వినయ♦మంజులతరమై
వీనుల కింపగు నట్లుగ, దానవపతి పల్కెఁ ద్రిదశ♦తరుణీమణితోన్. ౩౬ 1331

[1] తే. నీకుఁ గోడల నౌదును♦నేనటంచుఁ, బల్కితివి గాదె, యిది యేక♦పత్నులైన
పురుషులందుఁ గ్రమంబగు ♦ సురల కిద్ధి, శాశ్వతాచార మిద్దియే♦స్వర్గమునను;.

క. పతి యప్సరలకు లేఁ డీ,క్షితి వారొక్కరుని బతిగఁ ♦ జేకొనుటయు లే
దతివా! చాలును రమ్మని, రతిపైఁ గలతత్తఱమున ♦ రావణుఁ డంతన్. ౪౦½

చ. కరములఁ బట్టి యాయతివ ♦ కాదనుచుండ శిలాతలంబునుం
ద్వరపడి చేర్చి కాముఁడు ని♦తాంతము తన్ను రతిక్రియార్థమై
పురికొలుపంగఁ గేళికిని ♦ బూని మనోరథ మెల్లఁ దీరఁగాఁ
దరుణిని బొమ్మనెన్; సురని♦తంబినియున్ దనుజేంద్రముక్తయై. ౪౧ 1334

తే. భ్రష్టమాల్యవిభూషణ♦రాజి యగుచు, [2]మత్తదంతావళాక్రీడ♦మథితయైన
శైవలిని బోలి యాకుల♦భావ మూని,యలకలును శీర్షజంబులుఁ♦గలఁగిచెదఱ.

క. వేపితకరపల్లవయై, యాపడఁతియు నోర గాలి ♦ యట్లై విసర సం
తాపము గను సుమలతవలె, నాపట్టున నలఁగి కలఁగి ♦ యట్లై వడఁకుచున్.

ఆ. సిగ్గుపడుచు భీతి♦చే మోము వాడంగ, దోసి లొగ్గి బ్రదుకు ♦ నాస మాని
నాతిమిన్న యట్లె ♦ నలకూబరునిపాలి, కరిగి పడియె నతని♦యంఘ్రులపయి.

1 స్నుషాస్మి యదవోచ స్త్వ మేకపత్నీ ష్వయం క్రమః, దేవలోకస్థితి రియం సురాణాం శాశ్వతీ స్థితా-అనిమూ. 2 గజేంద్రాక్రీడమథితా అనిమూ

ఉ. కోమలి దీనావస్థ నల♦కూబరుఁ డయ్యెడఁ గాంచి సన్మతిన్
ప్రేమముతోఁప నిట్లనియెఁ; ♦ ప్రేయసి! యిట్టి యవస్థ నీకు రా
నేమి కతంబొ నాపదము ♦ లివ్విధిఁ బట్టుకొనంగ హేతు వే
మో మదిఁ దోఁప దంచనఁ ద♦నూగరి యార్పులపిండు పుచ్చుచున్. ౪౫

క. తనువల్లి కంప మొందం,గను దోసిలి యొగ్గి నాథుఁ ♦ గాంచి గిరీంద్రం
బున సాగినవృత్తాంతం,బును సర్వము నిట్లు చెప్పఁ ♦ బూనె వగచుచున్.

సీ. ప్రాణేశ! విను మల్ల♦పం క్తికంఠుఁడు స్వర్గపురి కేగుచున్ భట♦పరివృతుఁడయి
యిట్టి యవస్థ నా ♦ కిప్పుడె కల్గించె; నినుఁ గూడు వేడుక ♦ నేను వచ్చు
చుండితిఁ బాపాత్ముఁ ♦ డొక్కెడ నునుఁగాంచె,నరినిషూదన! యాతఁ♦ డట్టెనన్నుఁ
గరముల బిగఁబట్టి ♦ తరుణి! యెవ్వతెవని ప్రశ్నించె, నేనున్న♦వార్త నిజము

తే. గా వచించితి దనుజుండు ♦ కామమోహ
ములకుఁ దనయాత్మ చిక్కుటఁ ♦ బలుకు లేన
దెంత హితముగ నాడిన ♦ నించుకయును
వినకపోవుట మది నెంచి ♦ వినయమలర. ౪౯ 1340

క. దనుజేంద్ర! నన్నుఁ గోడలి,గ నెఱుంగఁగఁ దగునటంచు ♦ గాటపుభక్తిం
గనఁబఱచి వేఁడితిని నా,మనవిని గడఁద్రోచి బలము ♦ మహిమము వెలయన్.

ఆ. ననుఁ దిరస్కరించెఁ ♦ గనుక నీవిషయమై
మదపరాధములను ♦ మాన్యశీల!
సైఁపఁ దగుదు వీవె ♦ సౌమ్య! కాంతలకును
బురుషులకును బలముఁ ♦ బోలు శక్తి. ౫౧ 1342

క. కనఁబడ దింకెద్దియు; నన, విని వైశ్రవణాత్మజుండు ♦ వితతక్రోధం
బున రంభకు రావణుఁ డటు, లొనరించిన యపకృతుల మ♦హోద్ధతి మదిలోన్.

*క. తలపోసి ధ్యానగురుని,స్థలనుండి తదీయకర్మ♦సంతతి నాత్మన్
గలయంగ నెఱిఁగి క్షణమునఁ, గలవిలపాటొంది వగచు♦కామినిఁ గనుచున్.

క. ఘనరోషతామ్రదృష్టుల, దనుజేంద్రునికృత్య మెదుటఁ ♦ దాఁ గనినవిధం
బునఁ జూచి తీసికొనియెం, దనకరముల జలము ధనద♦తనయుఁడు త్వరగన్.

చ. కరముల వారిఁబట్టి తమ♦కంబునఁ జేసిన రాక్షసేంద్రుదు
స్తరకృతి లోఁ దలంచుచు య♦థావిధిఁ గార్యముఁ దీర్చి రావణా
సురునకు శాపమిచ్చుచును ♦ క్షోణిని జల్లె జలంబు నట్టి భీ
కరగతి మీఱ; నోతరుణి! ♦ కామము నొందని నిన్ను బల్మిమై. ౫౫ 1346

ఆ. చేయరానిపనికిఁ ♦ జేసంటి యీడ్చెను, గాదె యందువలనఁ ♦ గాంతఁ గామ
మూనకున్నదాని ♦ దానవుఁ డాతండు, పొందఁజాలఁ డింకఁ ♦ బొలఁతిమిన్న!

* గర్షణాం తాం పరాం శ్రుత్వా ధ్యానం సంప్రవివేశ హ-అనిమూ.

[1]ఉ. ఎత్తఱిఁ గాముబాణముల ♦ కింతయు నోర్వక కాముఁడైన యా
బిత్తఱులన్ బలోద్ధతిఁ గు♦వృత్తిని బట్టునొ రావణాసురుం
డత్తఱిఁ దచ్ఛిరంబులు స♦హస్రముగా శకలంబులౌచు వి
చ్ఛిత్తిని గాంచి భూస్థలిని ♦ జేరునుగా కని శాపమిచ్చిరన్. ౫౯ 1348

సీ. ఆశాపమును జ్వలి♦తాగ్నిసన్నిభమును వినినంత దుందుభి♦స్వనము లొప్ప
నట్లు చేసి, రమర్త్య ♦ లంబరంబున నుండి సుమవృష్టి గురిసెను ♦ కమలజాదు
లైన దేవత లెల్ల ♦ హర్షించి రెంతయు [2]విశ్వగతుల్ దను♦జేశ్వరుమృతి
యును లోఁదలంచుచు ♦ మునులును బితరులు సంతోష మందిరి ♦ శక్రవైరి
తే. [3]రోమహర్షణ మిడఁ జాలు ♦ నామహోగ్ర
శాపమును జక్కఁగా విని ♦ చాన లెవరు
తన్నుఁ గోరరొ వారిని ♦ దాఁకఁ గూడ
దనుచుఁ దలపోసి చింతించె ♦ నయ్యెడనున. ౬౦ 1349

తే. అతఁడు చెఱఁగొన్నవనిత ల♦త్యంతహర్ష
మును గనం జాలి ప్రియభర్త ♦ లను దలంచు
చుండి రానలకూబరుఁ ♦ డుగ్రశాప
మిచ్చె ననువార్త చెవులను ♦ జొచ్చుచుండ. ౬౧ 1350

ఇరువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౨౭ - వ సర్గము.

రావణుఁ డమరావతిని ముట్టడించుట.

క. తరువాతఁ బంక్తికంధరుఁ, డురుతరకైలాసనామ ♦ కోర్వీధరముం
ద్వరితగతి దాఁటి సేనా,పరికరుఁడై విక్రమంబు ♦ వ్యాపింపంగన్. ౧ 1351

క. సురలోకముఁ జేరంజని,యె; రయంబున వచ్చుదాన♦వేశుని సైన్యో
త్కరజనితశబ్ద మప్పురిఁ, బరఁగెన్ గడు మథ్యమాన♦వార్ధిరవము నాన్. ౨

చ. విని దశకంఠురాక మది ♦ వృత్రహరుండు భయంబు నొంది యా
సనముననుండియే వడఁకి ♦ చయ్యనఁ బిల్వఁగఁ బంచి యప్డు వ
చ్చినసురసంతతిం గనుచుఁ ♦ జేరఁగ వచ్చినద్వాదశార్కరు
ద్రనికరవిశ్వసాధ్యవసు♦రాజిమరుత్తులఁ జూచి యిట్లనున్. ౩ 1353

శా. వచ్చెం బంక్తిగళుండు యుద్ధము నొన♦ర్పన్ స్వర్గముం బట్టఁగా
నిచ్చో మీరలు దుష్టరాక్షసుని యు♦ద్వృత్తి న్నివారింపఁ జం

---

1 తస్మాత్స యువతీ మన్యాం నాకామా ముపయాస్యతి-అనియూ. 2 జ్ఞాత్వా లోకగతిం సర్వాం తస్య మృత్యుం చ రక్షసః-అనియూ. 3 తం శాపం రోమహర్షణమ్-అనియూ.

చచ్చండాశుగముఖ్యసాధనములన్ ♦ శౌర్యంబు గాన్పింపఁ బెం
పెచ్చం గూర్పుఁడు నాఁగ యుద్ధమును దే♦వేంద్రోపముల్ నిర్జరుల్. ౮౪

చ. అని నొనరించు శ్రద్ధఁ గొని ♦ యాయతసత్వము లొప్ప యుద్ధసా
ధనములఁ గూర్చి; రంత సుర♦ధాముముఁ బట్టెదు వేడ్క వచ్చు నా
దనుజవరేణ్యునుద్ధతికిఁ ♦ దా భయమంది మహేంద్రుఁ డప్పుడే
వనజదళాక్షుఁ జేరఁ జని ♦ వాక్కుల దీనత దోఁప నిట్లనున్ ౬ 1355

ఉ. దానవకాలరుద్ర! గురు♦దర్పపరాక్రమశాలి రావణుం
డానతవైరి నాపురము ♦ నాత్మవశంబుగ నిల్పఁ గోరుచున్
దానవసైన్యయుక్తుఁడయి ♦ తాఁ జనుదెంచెను యుద్ధకాంక్షియై
నే నొనరింప నొపనిని ♦ నీవె వచింపు దయాపయోనిధీ!. ౭ 1356

చ. వరములఁ బొందినాఁడనని ♦ వాఁడు మహోద్ధతి విఱ్ఱవీఁగెడున్
వరములె లేకయున్న బల♦వంతుఁ డదెట్లగుఁ బద్మయోనియే
వరముల నిచ్చె వానిఁ దగు♦భంగి యథార్థములై చెలంగున
ట్లురుమతిఁ జేయఁగాఁ దగు సు♦రోత్తమ! యెంచి వచింపు కృత్యమున్. ౮

సీ. నముచివృత్రబలులు ♦ నరకశంబరులును బ్రహ్మావరంబులఁ ♦ బడసియున్న
నాచేతఁ బడిరొ యే♦నయమున, నట్టులే యొనరింపు మిప్పు డో♦హో యనంగ;
దేవదేవేశ్వరా! ♦ దివ్యపరాక్రమా! మధుసూదనా! నిన్ను ♦ మాన నొరుని
చేత నాతఁడు మృతిం ♦ జెందఁడు సచరాచరంబగు నీప్రపం♦చంబునందు

ఆ. గతి పరాయణంబు ♦ గనఁబడఁ డిప్పుడు, నీవు దక్క లోక♦నికరనాథ!
పద్మనాభ! లోక♦పాల! నారాయణా!, శాశ్వతా! రమేశ! ♦ చక్రధారి!. ౧౦౪

క. జగముల స్థాపించితి వీ,జగములఁ బాలింప నన్ను ♦ శక్రుని సురనా
థుగఁ జేసితి సృష్టించితి, జగముల సచరాచరములఁ ♦ జక్రి! మహాత్మా!. ౧౧౪

క. విలయము ప్రాపించెదు తుదిఁ, గలుషహరా! నిన్నె పొందఁ ♦ గల విభూతం
బులు గానఁ దత్త్వమెఱుఁగం,బలుకుము దేవేశ! నాకు♦నవ్యయముగఁ గృపతోన్.

చ. కరమునఁ జక్ర మూని సుర♦కాండపతీ! యల రావణాసురున్
దురమున మార్కొనం దలఁతొ ♦ తొరవు వేడుక నీ వటన్నని
ర్జరపతివాక్కులన్ విని సు♦రప్రభుఁ డామధుదానవారి యి
క్కరణి వచించె సాధ్వసముఁ ♦ గాంచితినం చివు డెన్నఁ బోకుమా!. ౧౮

చ. వినుము వచింతుఁ గార్యమును ♦ వృత్రహరా! యలరావణుండు సం
జనితవరప్రభావగురు♦శక్తియుతుండయి గ్రాలుచుంట దే
వనికరకర్బురాళికిని ♦ బాహుబలంబున సంగరంబుఁ జే
సినను జయింపఁ జంప నిటఁ ♦ జెల్ల దదృష్టము లేమి నుంతయున్. ౧౯ 1362

తే. అతఁడు దుర్వృత్తుఁడును సమ♦రాంగణమున
దుర్జయుండును నగుఁ గానఁ ♦ దోఁచి నట్లు

బలముకలిమిని సర్వథా ♦ పాపకృత్య
ములను జేయుచు నున్నాఁడు ♦ పలుకు లేల?. ౧౫ 1363

క. తనయాన్వితుఁడై యాతం, డొనరుచు దుష్కృత్యవితతి ♦ నొప్పుగ నాత్మ౯
గనుఁగొంటి; దేవతాధిప!, యని చేయుము చక్రమూని ♦ యంటివి గాదే?.

చ. పలు కది వింటి; నిత్తఱిని ♦ బాపమనస్కుని రావణాసురు౯
బలము చెలంగ మార్కొని యధ ♦ భంగరణంబును జేయఁ బూనఁ జూ;
కలహమునందు శత్రువును ♦ గాలునివీటికిఁ బుచ్చి చెప్పుడు౯
జలరుహనేత్రుఁ డింటికిని ♦ జాలఁడు దా మరల౯ సురేశ్వరా!. ౧౭ 1365

చ. అని వధియించుకోర్కి ఫల ♦ మందుట దుర్లభ, మబ్జయోని యి
చ్చిన వరపంజరం బసురుఁ ♦ జేరఁగ నీయ దదేరినైనఁ గా
చును జుము; దేవనాథ! రణ♦శూరుని నాతని నేను జంప నె
ట్లనువుపడు౯ మహామహిమ ♦ నవ్విధ మిప్పుడె నీదుసన్నిధి౯. ౧౮ 1366

క. తలపోసినాఁడ నే రాఁ,గలకాలమునందు మృతిని ♦ గల్పించెద నీ
పలలాశనునకు నెట్లనఁ, దెలిపెద నొక్కింత సమర♦ధీరుని వీని౯ ౧౯ 1367

క. తనయులతో సేనలతో, నని౯ జంపెద దేవతలను ♦ హర్షముఁ గనఁగా
నొనరుతు దానికిఁ గాలం, బనుకూలం బగుచు వచ్చు ♦ నప్పుడు కడఁక౯. ౨౦

చ సురపరిపాలకా! వినుము ♦ చొక్కపునవ్వ మెఱుంగఁ బల్కితిం
దర్వరపడి నీవు పోయి మదిఁ ♦ ద్రాసము నొందక దేవతాళితో
దురమొనరింపు మిప్పటికిఁ ♦ దోఁప్పడ రాదు మహాబలుండవై
పరఁగుట నీవె మార్కొనుము ♦ భావి నడంచెద నేను రావణు౯. ౨౧ 1369

చ. అని వచియింప మాధవుని ♦ యానతిఁ గైకొని యింద్రుఁ డేమి తోఁ
పని మదిఁ బత్తనంబునకు ♦ నచ్చి సురావళి కాజ్ఞచేయ నా
తని పనుపూని రుద్రవసు♦తల్లజు లశ్విమరుత్తులు౯ మనం
బునఁ జెలరేఁగుక్రోధములఁ ♦ బోయిరి యుద్ధము చేయువేడ్కల౯. ౨౨ 1370

సీ. ఆదిత్యు లట్టి యు♦ద్ధాభిలాషలఁ గొని పురినుండి వెడలి క♦ర్బురుల నెల్ల
మార్కొని; రట్టి స♦మయమున రాత్రియుఁ గడచుట రాక్షస♦గణము లెల్ల
సంగరం బొనరింప ♦ శబ్దమొక్కటి పుట్టె నది తెల్పె భయదమౌ ♦ నాహవంబు
జరగుచుండుట; నంత ♦ సురవైరిపాలకుభటు లెల్ల వీర్యముల్ ♦ ప్రబలునట్టు

తే. లొకరొకని౯ జూచుచు ♦ యుద్ధభూమిఁ
గనుచుఁ బరుగెత్తి రెలమి స♦క్కజముగాఁగ;
నంత నిర్జరసేనల♦యందు క్షోభ
మడరెఁ గర్బురసైన్యంబు ♦ లుఱుగ కడర. ౨౪ 1371

క. దనుజానీకము దుర్జయ, మని తోఁచుట, నభయంబు ♦ నని యేర్పడుట౯

మనముల దేవతలకు నిం,తన రాని వితాకు గలిగె ♦ నంతఁ దమములమై. ౨౫

క. సురకర్బురులకుఁ బెనుసం,గర మప్పుడు జరగె, భీతి♦కరమై మేఘో
త్కరరవ మట్టులు బహురణ,పరికరఘాతోత్థరవము ♦ బహురీతులుగన్. ౨౬

చ. అని యిటు సాగుచుండ దను♦జాధిపునానతి మంత్రు లుగ్రరీ
తిని దనువుల్ చెలంగఁ గడుఁ ♦ దృప్తులు భీకరు లౌచు సంగరం
బును నొనరింప నూల్కొనిరి; ♦ పొంగి ప్రహస్తనికుంభు లయ్యకం
పనశుకసారణుల్ మఱియు ♦ బాహుబలాఢ్యుఁడు ధూమ్రకేతువున్. ౨౯

సీ. మారీచుఁడును జంబు♦మాలి మహాపార్శ్వ లస్మహోదరుఁడు సం♦హ్లాదుఁ డల్ల
దారుణాకృతి మహా♦దంష్ట్రఘటోదరు లస్మహోన్మాదవిరూ♦పాక్షయజ్ఞ
కోపను ప్తఘ్నులు ♦ క్రూరదూషణదుర్ముఖ ఖరులుత్రిశిరుండు ♦ క్రాలుసూర్య
శత్రుమహాకాయ♦సంజ్ఞులు నతికాయుఁ డాకరవీరాక్షుఁ ♦ డానరాంత

తే. కుఁడును దేవాంతకాహ్వయుఁ ♦ డడరి పోరి;
రిమ్మహాబలదర్పుల ♦ నెల్లఁ గూడి
గురుతరంబగు వీర్యంబు ♦ నురుబలంబు
నొప్ప రావణు మాతామ♦హుఁడు సుమాలి. ౩౦ 1875

చ. అనిమొనఁ జొచ్చి దేవతల ♦ నంపఱఁ దీవ్రతరాహవోగ్రసా
ధనతతి నొంచి గాలి జల♦దంబులఁ దోలెడునట్లు తోలె న
య్యనమునఁ గల్గుక్రోధమున; ♦ *మచ్చర మూని సుమాలియివ్విధం
బునఁ దము నేఁచ భీతిఁ గొని ♦ పోయిరి దిక్కులకెల్ల దేవతల్;.] ౩౩ 1876

శా. పంచాస్యంబు భయంకరార్భటి దగం ♦ బైఁబడ్డ నల్పంబులై
యొంచన్ సత్త్వములేని జంతుతతు లె♦ల్లెగుందవ్వరం బూని, య
ట్లంచద్బాణము లేయుచుం దఱుమ న♦య్యాదిత్యు లత్యార్తులై
పంచత్వంబు గసంగ నౌనొ యనుచుం ♦ బ్రాణాళిపై నానచేన్. ౩౪ 1877

క పగుగిడ సాగిన నయ్యవ,సరమున వస్వష్టకమున ♦ సాంద్రబలుండై
యరుదుగఁ దగుసావిత్రుఁడు, దురమునకుం జొచ్చె మిగుల ♦ దోర్దర్పమునన్.

స్రగ్ధర. స్ఫారక్రూరాహవోద్య♦త్స్ఫురికరయుతులై ♦ బాహుసారంబు పొంగన్
వీరుల్ దన్ గొల్చి రాఁగన్ ♦ నిమతుల నడఁపన్ ♦ విశ్వవిఖ్యాతరీతిన్
జేరెన్ యుద్ధాంగణంబున్ ♦ శితశరవితతిం ♦ జెండి దైత్యాళిఁ గూల్చెన్
ఘోరంబౌ నాకృతిం గై♦కొని మృగతతులం ♦ గూల్చుసింహంబునాఁగన్.

ఆ. అల్లి భూరివీర్య♦లై నయాదిత్యులు, త్వష్ట పూషయనఁగ ♦ వఱలువారు
భయము సుంతలేక ♦బలములతోఁ గూడి, యుద్ధసీమఁ జేరి♦రొక్కమొగిని. ౩౮

* సుమాలిభయసంత్రస్తా స్సురా స్తే సర్వతో దిశః-ఇది వ్యాఖ్యాతలపాఠమున లేదు.

చ. దనుజులకీర్తినాశనముఁ ♦ దద్దయు గోరుచు యుద్ధమందు నె
వ్వనికిని లొంగకున్న సుర♦వర్యులకున్ దనుజాళికిన్ దురం
బనితరసాధ్యమౌ నటు భ♦యంకరమై యటఁ జెల్లె; రాక్షసుల్
పనివడి ఘోరభంగిఁ దగు♦బాణముఖంబులఁ గ్రుచ్చి యెంతయున్. ౩౭

క. సురలను సంగరభూమిని, వరవిక్రమ మొప్ప నున్న ♦ వారలఁ బూన్కిన్
గరువంబు పొంగ నొప్పిం,చిరి శతము సహస్రములుగఁ ♦ జేరి యఱచుచున్.

క. జరలేనివార లౌటన్, బరమక్రోధమున వచ్చి ♦ పైఁబడి దితిజే
శ్వరుసేనలబలదర్పము, లరుదుగఁ దగువాని నొంచి ♦ రతితేజమునన్. ౩౯

తే. ఉఱుక కంతట వివిధమ♦హోగ్రశస్త్ర
ములను జెండుచు యమపుర♦మునకుఁ బంపి
రసురభటులను గొందఱ; ♦ నట్టినమయ
మందు రామా! సుమాలి య♦త్యాగ్రహమున. ౪౦ 1384

క. పలువిధములైన సాధన,ములఁ గైకొని యఱరి దివిజ♦ముఖ్యునిసైన్యం
బుల నెల్లఁ దీవ్రసాధన,ములచే నొప్పించి జలద♦ముల నుద్ధతిచేన్. ౪౧

క. విదళించువాయు వట్లుగ, గుది గ్రుచ్చినయట్లు ప్రాస♦కుంతంబులఁ గ్రు
చ్చి దగం జెల్లాచెదరై, విదిక్కులకుఁ బాఱఁజేసె ♦ విక్రమ మడరన్. ౪౨

చ. సురలును బాణవర్షమున ♦ శూలహతిన్ బడిపీడితాంగులై
త్వరపడి యొక్కచోట సిలు♦వంగను జాలక పాఱఁజొచ్చి; రి
క్కరణి సుమాలిచేత సుర♦కాండము నొచ్చియుఁ బాఱియున్ మహా
త్తరముగ బాధితం బగుటఁ ♦ దా మదినెంచి యుపారకోవ్యుఁడై. ౪౩ 1387

తే. అష్టముండగు వసు వవా♦ర్యప్రతాప, మొప్ప సావిత్రనామకుం ♦ డుగ్రవీర
భటరథాన్వితుఁడయి సుర♦వారములను, నొంచునట్టిసుమాలిని♦మించు వేడ్క.

క. ఘన తేజ మలర వారిం,చెను యుద్ధమునందు; నంతఁ ♦ జిత్రతరముగా
నని సాగె గగుర్పాటును, గనువారలు గాంచునట్లు♦గా ఘోరముగన్. ౪౫

క. సమరంబున వెనుదీయని, సుమాలిసావిత్రు లట్టి ♦ స్ఫురదుగ్రమహో
త్తమబాణభిన్నతనులై, యమర్త్యరాక్షసులు విస్మ♦యం బొందంగన్. ౪౬

చ. అని యొనరించుచుండఁగ మ♦హామతి యవ్వసు వట్టి పొంగుచున్
సునిశితబాణజాలముల ♦ స్రుక్కఁగఁ జేసి సుమాలి నంతటం
దనియక *పన్నగాకృతిర♦థంబు మహాస్త్రములోనఁ ద్రుంచె; నా
తనిశితసాయకప్రహతిఁ ♦ దద్రథపఙ్క్తము చూర్ణమై పడెన్. ౪౭ 1391

చ. అరదముఁ ద్రుంచి తృప్తిఁ గన ♦ కావసు వంతటఁ దద్వధార్థమై
కరమున సంగ్రహించె గదఁ ♦ గాంతిని మించెడుదాని నుగ్రమై

* నిహతః పన్నగరథః అనిమా.

పరఁగుచుఁ గాలదండమనఁ ♦ బైఁబడ నుండెడుదాని నంతటన్
సురరిపుమస్తకంబు సరి ♦ చూచి జవంబున మోఁదె నుద్ధతిన్. ౫౮॥ 1392

క. అనుపమగద యది యుల్కయొ,యన నొప్పి సుమాలిశీర్ష ♦ మందుఁ బడియె నిం
ద్రునిచేత విముక్తంబై, స్వనమలర మహాశనియు న ♦ చలమునఁ బోలెన్. ౫౯॥

చ. పెనుగద పైఁ బడంగఁ దల ♦ పెల్లునఁ జీల సుమాలి భూమిఁ జ
య్యనఁబడె నొక్క యెమ్ముకయు ♦ నందలిమాంసము మస్తకంబునుం
గనఁబడదయ్యె నంతయును ♦ గన్పడె భస్మము రాశినాఁగ నా
దనుజుఁడు తీవ్రమా నశని ♦ తాఁకున భూరుహ మట్లుగాఁ బడెన్. ౬౦ 1394

చ. దనుజునిపాటు గాంచి యట ♦ దారుణయుద్ధ మొనర్చు రాక్షసుల్
మనముల భీతినొంది వగ ♦ మైకొన నార్చుచుఁ బాఱిపోయి రొ
క్కనిగతి నొక్కఁ డారయక ♦ గాఢరయంబున యుద్ధభూమియం
దున నిలువంగఁ జాలకయె; ♦ తోడనె యాతఁడు వచ్చునం చొగిన్. ౬౧॥

ఇరువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౨౮ - వ సర్గము.

{ జయంతుఁడు మేఘనాదునితోఁ బోరి మూర్ఛిల్ల నింద్రుఁడు సంగరంబుచేయఁ బూన రావణుఁడు మార్కొనుట. }

క. సమరంబున సావిత్రుఁడు, సుమాలినిం జంపి నూత్న ♦ చూర్ణంబుగఁ జే
సి మఱియు బలముల నెల్లను, నమోఘబాణముల నొంప ♦ నాసైన్యంబుల్.

క. పరుగెత్తుచుంటఁ గన్గొని, సురరిపుపతినందనుండు ♦ శూరుఁడు నట సం
గరమున నిలువంబడి భట,వరులన్ మరలించె బాహు ♦ బల మొప్పంగన్. ౨

ఆ. మేఘనాదుఁ డిట్లు ♦ మిక్కిలి భీతిల్లు, బలములను దగంగ ♦ నిలిపి కామ
గంబు నగ్నివర్ణ ♦ కలితమ్ము నౌరథ, మెక్కె యతిరథుం డ ♦ హీనశక్తి. ౩॥ 1398

క. సురసేనలఁ జొచ్చెను స,త్వరముగఁ గాఱడవి హవ్య ♦ వహుఁ డుద్ధతుఁడై
చోరఁబడులాగున మండుచు;, శరశతులం దాల్చి శౌర్య ♦ సారము పొంగన్.

క. అనిచేయఁ జొచ్చునాతనిఁ, గనినంత సుపర్వభటని ♦ కాయము దెసలం
గనుచుం బాఱెను; సాధ్వస,మున నొక్కండైన నతని ♦ మ్రోల నిలువకే. ౫॥

చ. దురమున రావణాత్మజుని ♦ తోరపుశక్తినిఁ దాళఁజాలమిన్
సురలు భయార్తులై పఱచు ♦ చొప్పుఁ దలంచి యమర్త్యసేనలన్
సురపతి గాంచి యిట్లనియె ♦ శూరత; భీతిని బొంద నేల స
త్వరముగఁ బాఱనేల? యిదె ♦ వచ్చెదు నాతనయుండు నిల్వుఁడీ!. ౬॥ 1401

తే. *సంగరంబుల వైరుల ♦ పొంగడంచు, నాకుమారకుఁ డీమేఘ ♦ నాదు మారు

* ఏష గచ్ఛతి మే పుత్రః యుద్ధార్థ మపరాజితః-అనిమా.

కొనుచటంచు నంతశ♦క్రునితనూజుఁ డగుజయంతుఁడు లోకవి♦ఖ్యాతయశుఁడు.

చ. మనమున నద్భుతంబొసఁగు ♦ మాడ్కిఁ జెలంగు రథంబుతోడఁ దా
నని మొన నిల్చె; నయ్యమరు ♦ లాతనిఁ గొల్చుచు మేఘనాదుమా
ర్కొని భయ మేది నిల్చి; రటు♦కూడిన నిర్జరదానవాళికిన్
గనుఁగొనఁ [1]దుల్యమైన యని ♦ గ్రమ్మఱ సాగె మహోత్తరమ్ముగన్. ౯ 1403

చ. సురదనుజాళినాయకుల ♦ సూనుల కద్భుతరీతి సాగు సం
గరమున గోముఖుం డనఁగఁ ♦ గ్రాలెడు మాతలిపుత్రుఁ డేచి యా
యరదముఁ జిత్రరీతులుగ ♦ నప్పుడు తోలుచునుండ వానిపై
శరములఁ గాంచనాంకములఁ ♦ జయ్యన వైచెను మేఘనాదుఁడున్. ౧౦

సీ. అంత శచీసుతుం♦డౌ జయంతుఁడు రావణాత్మజుసారథి ♦ నతనిఁగూడఁ
బెనుక్రోధమున శర♦వృష్టిని నొప్పించె; దానికిఁ గోపించి ♦ దర్పతేజ
ముల నొప్పు రావణి ♦ కలుషీకృతాత్ముఁడై శక్రకుమారుని ♦ శరసమూహ
వృష్టిని నొప్పించి ♦ యేచి సారతరంబులగు భూరిశస్త్రాళి ♦ నంది దేవ

ఆ. బలములందు వైచె ♦ నలుక నంతట మాన,కుగ్రతోమరముల ♦ నొగిశతఘ్ను
లను బరశ్వధముల ♦ ఘనగదలను బ్రాస,ఖడ్గములను శైల♦ఖండములను. ౧౪

క. జడివాన గురిసినట్లుగఁ, బడవైచె నమర్త్యవీర♦బలములయందున్
గడుఁ దత్తతిల్లె లోకము, లుడుగనితమ ముద్ధతోఁచె ♦ నుగ్రతరంబై. ౧౫

క. దనుజేంద్రకుమారుఁడు శ,త్రునికరముల సంగరమునఁ ♦ దోలుచు శరవృ
ష్టిని బర్వఁ జేయుచుండఁగ,ననిమిషు లెల్లను జయంతు ♦ నంతటఁ గడఁకన్.౧౬

ఆ. చుట్టు నిలిచి కాచు♦చున్ శరపీడితాం,గముల స్వాస్థ్య మెడలఁ♦గా నిలిచిరి;
కర్బురాళియందుఁ♦గాని దేవతలందుఁ,గాని యొకని నొకఁడు ♦ గానఁడయ్యె.

సీ. అందందు విడివడి ♦ యార్తిఁ బాఱఁదొడంగి రత్తఱి సురలనే♦ యమరు లేచి
కొట్టఁగాఁ దొడఁగిరి; ♦ క్రూరరాక్షసు లట్టి దనుజుల బాధింపఁ♦గనె దొడఁగిరి
గాఢాంధకారముల్ ♦ కడువడి వ్యాపింప నేమియుఁ దోఁపక ♦ యేగి రెటకొ
యొకకొంద; ఱిట్టులా♦యుద్ధము సాగుచునుండఁ బులోమాహ్వ♦యుండు దనుజ

తే. సత్తముఁడు శూరుఁ డట వచ్చి ♦ శక్రసుతునిఁ
బౌత్రుఁ గొనిపోయి చొచ్చెను ♦ వార్ధి నెవరి
కేని కనఁబడకుండ; [2]నా♦దానవుండె
శచికి జనకుండు తాతయౌ ♦ శచిసుతునకు. ౨౦ 1409

చ. సురలు జయంతశూరవరు♦చొప్పెఱుఁగంగఁ దరంబుగామి న
త్తరుణమునందుఁ గష్టమని ♦ తా రొగి నెంచి కలంగి హర్షమున్
దవ్వరగఁ ద్యజించి తోఁచినటు ♦ పాఱిరి; రావణి యంత హృష్టుఁడై

1 సదృశం దేవరక్షసామ్-అని మూ. 2 ఆర్యక స్సహిత స్యానీ త్పులోమా యేన సా శచీ-అని మూ

పరిజనులుఁ బలావళులు ♦ పంతముమీఱఁగఁ గొల్చుచుండఁగన్. ౨౧ 1410

ఆ. సురలపైకిఁ బోయె ♦ గురునాద మడరంగ;నంత నింద్రుఁ డాజి♦యంతుఁ డెటకొ
పోవు టెఱుఁగ కార్తిఁ♦బొంది పాఱెడుసుర,లను దగంగఁ గాంచి♦ఘనబలమున.

క. తనసారథియగు మాతలిఁ, గని యరదము [1]సత్వరంబు♦గాఁ గొని రమ్మా
యని యాజ్ఞచేసె మాతలి,యును దివ్యము శత్రుభయద ♦ మురునినదంబున్.

క. అనుపమమును నగుస్యందన,మును సిద్ధము చేసి వేగ♦ముగఁ దెచ్చినఁ దా
ని నధిష్ఠించెను, సారథి,యు నెక్కఁగా స్వాంతవేగ ♦ మొప్పెడుదానిన్. ౨౪

చ. [2]అరదముచుట్టు నిల్చి భయ♦దార్భటు లొప్పఁగఁ జంచలాద్యుతుల్
పరఁగఁగ ముందు వాయువులు ♦ పాఱఁగఁ జేయఁగ మేఘముల్ మహా
త్తరముగ నార్చుచుం జనియెఁ; ♦ దత్తరుణంబున దేవతాధిపుం
డరుగఁగ నాడి రచ్చరలు ♦ హర్షముమీఱ జయంబుఁ గోరుచున్. ౨౫

క. నానావాద్యధ్వనులును, గానుగ గంధర్వవరుల♦జయశబ్దంబుల్
వానిముఖంబుల వెడలం,గా నప్పుడు మ్రోఁగఁజేయఁ♦గా నాదిత్యుల్. ౨౬

తే. సాధ్యవసురుద్రవాయువుల్ ♦ సకలయుద్ధ
సాధనంబులతోఁ గూడఁ ♦ జనిరి దేవ
తాధిపునివెంటఁ; బవమానుఁ ♦ డతిపరుషము
గాఁగ వీచెను భానుండు ♦ కాంతిఁ బాసె. ౨౭ 1416

క. ధరఁబడియె మహోల్కలు త,త్తరుణంబున వీరుఁడైన ♦ దశకంఠుఁడు భీ
కరమూర్తి దివ్యతరమా,నరదముఁ దా నెక్కెఁ బూర్వ ♦ మాస్యందనమున్.

క. తనదుచమత్కృతిమీఱం,గను శిల్పివరుండు విశ్వ♦కర్మ యొనరిచెన్;
గన రోమహర్షణము నిదు,పెనుసర్పము లొక్కమొగిని ♦ భీకరఫణముల్. ౨౮

ఆ. పైకిఁ గానఁబడఁగ ♦ భాసిల్లె;నయ్యర,దమున వానియూర్పు♦గములు వెలుచ
నగ్నిరీతి మండ ♦ నని భయదంబుగాఁ, దనగు నారథంబు ♦ దనుజు లెల్ల. 30

క. శూరనిశాచరు లారథ, మేరీతిన్ బాధనొంద ♦ కెసఁగఁగఁ జుట్టుం
జేరి నిలుచుండి రాప్రవి,దారణమున కేగి రట్లు ♦ దశముఖుఁ డలుకన్. 3౧

చ. సురపతిఁ జేరఁబోయెఁ దన♦సూనుని యుద్ధము చేయ మాన్పి తా
నరదముఁ దోలఁ బంచి త్రిద♦శాధిపు మార్కొనఁ బోయెఁ; దండ్రి సం
గరమున కేగ రావణియుఁ ♦ గ్రమ్మఱి యారక నిల్చియుండె, న
త్తరుణమునందు సాగె సుర♦దానవరాజికిఁ బోరు ఘోరమై. 3౨ 1421

క. ఘనములు వృష్టినిగుడ్చెడు,ననువున శస్త్రములవృష్టి ♦ నమరదనుజు లొ
క్కనియతిఁ గురిపించిరి పూ,న్కి నిదగుకుంభశ్రవుండు ♦ కినుక చెలంగన్. 33

క. పలువిధసంకరసాధన,ములతో దుష్టాత్ముఁ డగుటఁ ♦ బో రెవ్వరితో

---

1 రథ స్సముపనీయతామ్-అనిమూ. 2 తతో మేఘా రథే తస్మిం స్తటిత్వంతో మహాస్వనాః-అనిమూ.

నలుపం దగునో తెలియక, నిలుచుండెన్; మఱియు నతఁడు ♦ నిర్భరశక్తిన్.

తే. దంతములచేత బాహుపా♦దములచేత, శక్తితో సురసాయక♦సమితిచేతఁ
దోఁచినట్టులు సురతతి ♦ నేఁచుచుండె, నెచ్చటెచ్చట దివిజాళి♦యేపు చూపు.

సీ. అంత రుద్రులు భయ♦దాకృతు లైయుండ నొక్కటిగాఁ జేరి♦యుగ్రదనుజ
నాతని మార్కొని ♦ యస్త్రశస్త్రంబులఁ దనువెల్లఁ జించిరి ♦ కనఁగఁ గుంభ
కర్ణుండు వ్రణగణ♦కలితదేహుండయి రక్తధారలు మహో♦గ్రముగఁ బాఱఁ
జంచలాస్తనితఘో♦షములతో వర్షించు జలదమట్టులు తగి ♦ యులరె; నంతఁ

తే. బవనగణములతో సుర♦వరులు పోర
దనుజబలములు తీవ్రసా♦ధననికాయ
బాధితాంగులునై యట్టి ♦ పాఱఁ దొడఁగి
రందుఁ గొందఱు భిన్నాంగు♦లై పొదలిరి. ౩౯

క. తనువుల శరములు చొర వా,హనములపై నట్టె పడిరి ♦ స్యందననాగా
ళిని నుష్ట్రంబుల ఖరముల, ఘనఫణిహయశింశుమార♦గణములఁ గిటులన్.

ఆ. మఱి పిశాచవదన♦మండితమృగముల, నెక్కియున్న యోధు ♦ లొక్కరీతి
నమరు లేచి నొంప ♦ నట్టె కొందఱు వానిఁ, [1]గౌఁగిలించుకొనిరి♦కరవరముల.

క. సురశరతాడితతనువుల, సురవైరులు చచ్చి యుండె ♦ క్షోణిఁ బడిరి; త
త్తరుణమునఁ జిత్రకర్మము, కరణిని రణసంప్లవంబు ♦ కర మలరారెన్. ౪౦

క. ధరణీస్థలి హతులయి క,ర్బురు లెల్లను బడుచునుండ ♦ భూరితరంబై
పరికింప భయదమై యా,తరుణంబున రక్తవారి♦ధారలు పర్వెన్. ౪౧

ఆ. వానియందుఁ గంక♦పక్షులు గృధ్రముల్
వరుసఁ దిరుగుచుండ ♦ బాణములను
మొసళ్లు లొప్ప యుద్ధ♦ముఖమున నది యొండు
పాఱఁ జొచ్చె ఘోర♦భంగిగాఁగ. ౪౨

క. తరుణమ్మున నందుఁ గ్రుధా,తురుఁడయి దశకంధరుండు ♦ తోరపుశక్తిన్
సురలెల్లఁ జెలఁగి దనుజులఁ, బరిమార్పఁగ స్వీయబలము ♦ బలువిడి మ్రుందన్.

చ. కనుఁగొని దేవసంఘములఁ ♦ గాలునివీటికిఁ బుచ్చుకోర్కెఁ దెం
పున బలసాగరాంతరము ♦ భూరిబలోద్ధతిఁ జొచ్చి బాణముల్
ధనువులఁ గూర్చి నిర్జరవి♦తానము నొంచుచు నింద్రుఁ జేరె; నా
దనుజవరేణ్యుఁ గాంచి మది ♦ ధైర్యము పొంగ సురేంద్రుఁ డత్తఱిన్. ౪౩

క. ధ్వను లెల్లదిశలఁ బర్వఁగ, ధనుర్గుణము లాగి మాఱు ♦ ధ్వనిచేయఁగఁ జే
సెను దిక్కుల; నంత శరా,సన మిటు కయిఁ దాల్చి [2]దనుజ♦సత్తములపై.

---

1 తా॥ సమాలింగ్య బాహుభ్యామ్.-అనియు. 2 ఇం గ్లో. రాణమూర్ధని-అనియు.

మ. అనలాదిత్యసమానతేజము మహో♦దగ్ర తీవ్ర బాణాళిఁ జ
క్కనిలక్ష్యంబున వైవ; రావణుఁడు ను♦గ్రస్ఫూర్తిఁ జాపంబులం
గొని క్రోధించి శరాళివృష్టి రిపునిం♦ గ్రోధంబునన్ ముంచె నిం
తనరానట్టి భుజాబలం బలర న♦య్యార్యే యనం బూన్కితోన్;. ౪౮

ఆ. ఒకరి మించుకోర్కి ♦ నొక్కరు పోరంగ, బాణవర్ష మట్టి ♦ పర్వ నించు
కయును దెలియకుండె ♦ ద్యోనభంబులఁ గల,వస్తువితతిఁ దమము♦పర్వినపుడు.

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౨౯ - వ సర్గము.

మేఘనాదుఁ డింద్రుని మాయాయుద్ధంబున నోడించి లంకకుం గొనిపోవుట.

క. తమ మంతఁ బర్వ రాక్షసు, లమర్త్యు లాయోధమందు ♦ నతిబలములఁ గ్రౌ
ర్యము మీఱఁ బరస్పరము జ,యముఁ గోరుచుఁ జేసి రెల్ల♦రౌర! యనంగన్.

*చ. అనిమొన నిట్లు దేవబల ♦ మాసురభూరిబలంబు నొంపనం
దున దశమాంశమే మిగిలెఁ ♦ దోడన తొమ్మిదిపాళ్లసేన పో
యెను యమపత్తనంబునకు; ♦ నిట్లు తమోమయయుద్ధమందు నా
దనుజసుపర్వ లొక్కమొగిఁ ♦ దాఁకి పరస్పరదర్శనంబునుం
గనక యె పోరి; రింద్రుఁడును ♦ గర్బురనాథుఁడు వానిపుత్త్రుఁడున్. ౩ 1437

తే. ఆతమస్సున మోహంబు ♦ నందకుండి
రితరు లేమియుఁ గానక ♦ యేపు చూపు
చుండి; రివ్విధిఁ దనబల ♦ ముగ్ర దేవ
తతులచేఁ జంపఁబడుట కా♦దనుజపతియు. ౪ 1438

చ. మనమునఁ గ్రోధ మొంది యొక♦మాడ్కి మహత్తరరీతి నార్చి సైం
దనమున దుష్ప్రధర్షుఁడయి ♦ తాఁ జెలువొందెడు సూతుఁగాంచి యి
ట్లనియెను; వైరిసైన్యముల ♦ కంతముఁ గూర్చ రథంబుఁ దోలు; మొ
య్యన బలమధ్యభాగమున ♦ కార్తిని గూర్చెడు నీసురావళిన్. ౫ 1439

చ. కరము చెలంగువిక్రమము ♦ కన్పడఁగా బహుభీకరంబులై
పరఁగెడు సాధనంబులను ♦ బంపెద నిప్డు యమాలయంబు కాఁ
పురముగ నుండ; నేనె సుర♦పుంగవు యక్షవిభున్ బరేతరా
డ్వరుణులఁ జంపువాఁడ సుర♦వర్గములం బొలియించి యంతటన్, ౬ 1440

తే. వారిపై నధికారంబు ♦ వఱలఁ జేయు
వాఁడ; నాత్మవిషాదంబు ♦ వలదు చేయఁ

---

*దశాంశం స్థాపితం యుద్ధే శేషం నీతం యమక్షయమ్-అనిమా.

ద్వారగ నీస్యందనంబును ♦ బఱపు మచటి
[1]కిప్పలుకు రెండుమాఱులె ♦ యేను నీకు. ౮౪ 1441

క. తెలిపెద సుపర్వవరబల,ముల మధ్యస్థలము రథముఁ ♦ బొందఁగ నీవి
ష్ణులఁ దోలుము; మన ముండెడు, స్థలమిది నందనవనంబు♦సన్నిధియగుఁజూ.

ఆ. ఉదయపర్వతంబు ♦ మొదలు దాఁకఁగ నున్న, దీబలంబుగాన ♦ నీవు దాని
వఱకు నన్నుఁ జేర్పు ♦ వారక యన విని, హయములనుమనోజ♦వాంకితముల.

క. త్వరగాఁ జన సంజ్ఞను న,త్తఱిణంబునఁ జేసె వైరి♦దారుణసేనాం
తరమునఁ బాఱఁగ సారథి;, సురపతి యవు డసురనాథు♦చొప్పెఱిఁగి మదిన్.

చ. అరదమునందె యుండి రణ♦మందుఁ బరాక్రమ మట్టి చూపుని
ర్జరులను గాంచి యిట్లనియెఁ; ♦ జక్క వినుండు సుపర్వులార! యి
త్తఱిణమునందు నామదికిఁ ♦ దట్టినదాని వచింతు [2]రావణా
సురునసువుల్ చెలంగునటు ♦ నూరతఁ బట్టుకొనంగ యుక్తమా. ౧౩ 1445

ఆ. ఇదిగొ వీఁడు వాయు ♦ వేగున స్లోగెడు, స్యందనమ్ము నెక్కి ♦ స్వబలయుక్తుఁ
డయి ప్రవృద్ధవీచి♦మయి పర్వముల నొప్పు, వార్ధివోలె వచ్చు♦వాఁడుకడఁక.

చ. అనిమొనఁ జంపరా దితని ♦ నబ్జభవా త్తవరంబు లొంది జం
కనునది లేక యొప్పెడిని ♦ నట్లగుటన్ భుజసార మేర్పడం
గ నితనిఁ బట్టఁగా వలయుఁ ♦ గావున యత్నముమీఱ నుండుఁ డీ
తని బలశాలిఁ బట్టుటయె ♦ ధర్మము ముజ్జగముల్ నుతించెదుర్. ౧౫౪ 1447

చ. బలియను దానవేంద్రుని జ♦వంబున లోఁగొని నందునన్ జగం
బులు ననుఁ గొల్చుచున్నయవి ♦ భూరితరాఘుని వీని నడ్డగిం
చి లలిఁ జెలంగ విక్రమము ♦ సిద్ధిని బొందఁగఁ జేయనెంచితిన్
గలఁగక విక్రమింపుఁడని ♦ క్రమ్మఱి రావణుఁ డున్నభూమినిన్. ౧౬ 1448

ఆ. వదలి యొండుదెసకుఁ ♦ గదలి యచ్చటనున్న
దనుజవరుల భీతిఁ ♦ గనఁగఁ జేయు
చును రణంబు చేయు♦చును బొల్చె; సురశర
వృష్టి వేగ మాను♦రేంద్రుఁ డోర్చి. ౧౭౪ 1449

క. సురవిభుసుత్తరభాగముఁ, బరికించి యువార్యశక్తి ♦ వర్ధిలఁ జొచ్చెన్;
సురపతియు దక్షిణంబునఁ, బరాక్రమింపఁగఁ జొచ్చెఁ ♦ బట్టుదల దగన్. ౧౮౪

సీ. శతయోజనంబులు ♦ చాలుగా సురసేన లొప్పఁగా దనుజేంద్రుఁ♦డుద్యమమున
జొరఁబడి యచ్చటి ♦ సురవీరవితతిని శరవర్షమున ముంచె; ♦ శతముఖుండు

---

1 ద్విః ఖలు త్వాం బ్రవీ మ్యద్య-అనిమా 2 జీవ న్నేవ దశగ్రీవ స్సాధు రక్షో నిగృహ్యతామ్-అనిమా.

దనుజేంద్రబాణవి◆దారితస్వబలంబుఁ గని మరలించి స్యం◆దనము నంత
సంభ్రాంతి నొందక ◆ శక్తి పొంగఁగఁ దాఁకె; నాసమయంబున◆నసురదాన
తే. వులు శతక్రతుఁ డట్టు లే◆వున దశాస్య
మారుకొని నొంచుటం జూచి ◆ *మ్రందితి మిదె
యనుచు నార్చిరి; రావణి ◆ యంతఁ గ్రోధ
మూర్ఛితుండయి స్యందన◆మును జవమున. ౨౧ 1451
క. ఉరుశక్తి మెఱయ నెక్కి యు,సురసైన్యమునందుఁ జొచ్చి ◆ సురల నతిభయం
కరరీతి నొప్పె బల మది, పరికింపఁగ దుర్జయముగ ◆ భాసిల్లుటచేన్. ౨౨
క. గిరిశుఁడు మున్ను తపంబునఁ, గరుణాత్ముం డగుచు నియ్యఁ◆గా నొప్పిన శాం
బరినామకపటవిద్యను, నరగున ధరియించి భూత◆జాలంబునకున్. ౨౩ 1453
క. కనఁబడక బాణవర్షం,బున ముంచెను దేవసైన్య◆మును బిదప నతం
డనుమాన ముడిగి తజ్జన,ము నాపి దేవేంద్రుపైకిఁ ◆ బోయెం గడఁకన్.
చ. సురపతి యంతరిక్షమున ◆ శోభిలువైరికుమారుఁ గాన కా
తురపడి దివ్యతేజమునఁ ◆ దోఁచినపాకసురారి గెల్చి వి
స్ఫురతరసద్యశంబు గను ◆ ప్రోడయె గావున వీనిచేత ని
త్తరుణమునందు నేమియగు ◆ దానవనాథునిఁ బట్టు టొప్పగున్. ౨౫ 1455
చ. అని తలపోసి రుద్రతతి ◆ నర్కులనున్ వసురాజిఁ గూడి వే
చని యలదిక్పతుల్ తనకు ◆ సాంద్రబలంబులతో సహాయులై
తనరఁగ రావణాసురుని ◆ దారుణరూపునిఁ గాంచి బాణవృ
ష్టిని నిగుడించి నొంచి వెసఁ ◆ జెంతకుఁ జేరి తురంగమంబులన్. ౨౬ 1456
క. సారథిని జంపి రథగతు, నారావణుఁ జక్కనొంచి ◆ యట్టి బలమునన్
జేరి రథనాళి బద్ధుం,గా రయమునఁ జేసి దేవ◆కాంతుఁడు ప్రీతిన్. ౨౭
తే. సింహనాదం బొనర్చెఁ ద◆త్సేన లెల్ల
రావణుఁడు పట్టువడుటకు ◆ రంజిలుమది
చెలఁగి యార్చిరి తద్ధ్వని ◆ చేరె దెసల;
నిట్టు లారావణాసురు ◆ నెలమిఁ గొనుచు. ౨౮ 1458
క. సురపురి కేగఁగఁ దలఁచిన, తరుణంబున నసురసేన ◆ తల్లడపడుచున్
బరుగిడఁ జొచ్చెను; రావణి, యురుశక్తి చెలంగ నార్చి ◆ యుద్ధతిమీఱన్.
క. త్వరపడి యెచ్చట సురపతి, దుర మొనరుచుచుండె నచటఁ ◆ దోఁచి శతమఖున్
బరికించి బాహువీర్య,స్ఫురణంబునఁ బొల్చుచున్న◆సురలను గనియెన్. ౩౦
ఆ. కని విముక్తకవచుఁ◆డునయియు హా రేమి, తన్నుఁ జేయలేమి ◆ నెన్ని యింద్రు
సారథిని హయాళి ◆ భూరినాయకముల, నొంచి బాణవృష్టి ◆ ముంచె నింద్రు.

---

* హా హతాస్మ ఇతి గ్రస్తమ్-అనిమా.

క. అరదముఁ ద్యజించి మాతలిఁ, ద్వరపడి విడనాడి దేవ♦తాపతి నిజకుం
జరవరము నెక్కి రావణిఁ, బరికింపఁగఁ జొచ్చె నెందు ♦ వర్తిలు ననుచున్.

చ. దనుజవరాత్మజుండును ని♦తాంతము మాయను బన్ని వారికిన్
గనఁబడకుండఁగా నభము♦నన్ వసియించి శతక్రతున్ మహా
సునిశితబాణజాలముల ♦ స్రుక్కఁగఁ జేసి యితండు శ్రాంతినిం
గనియె నటంచు నెంచి కడఁ♦కన్ నిజశాంబరిచేతఁ జక్కఁగన్. ౩౫ 1463

తే. అతని బంధించి స్వీయసై♦న్యములఁ జేర్చి
రావణాసురు బంధన♦రాజి విడిచి
పుచ్చి యింద్రుని గ్రహియించి ♦ పోవఁ జొచ్చె;
నంత రణబద్ధుఁడగు నింద్రు ♦ నచటఁ గాంచి. ౩౬ 1464

క. బలమునఁ గొనిపోయెను నా,తులువను గన నేమిచేయఁ ♦ దోఁపకయె యమ
ర్త్యులు చింతించిరి చేయం, గలకార్య మిఁ కేమి యనుచుఁ ♦ గలవిలపడుచున్.

ఆ. అమరపతి జయించి♦నట్టి యీనమితిం జ,యుండు కానరాక ♦ యున్నవాఁడు
విద్య గలిగియున్న ♦ వృద్ధశ్రవుండును, మాయచేతఁ జిక్కె♦నే యటంచు. ౩౭

క. మనముల నెంచుచు నుండఁగ, ఘనకోపము నొంది దేవ♦గణములు శరవృ
ష్టిని ముంచి రావణుని మా,ర్కొని రాఁడు వసువితతి మ♦రుత్తుల సురలన్.

క. తను మార్కొనువారల నొ,య్యనఁ గాంచియు నేమిచేయ ♦ నప్పుడు తాఁ జా
లనివాఁ డొటను యుద్ధం,బున నిల్వఁగ లేకయుండె ♦ భూరిశరహతిన్. ౪౦

చ. జనకుని బాణఘాతగత♦సత్త్వుని శ్రాంతుని యుద్ధభూమిలోఁ
గనుఁగొని మేఘనాదుఁడు ని♦కామపరాక్రమ మొప్పఁ బల్కె నా
యన! యిఁక రమ్ము సంగరజ♦యంబును గాంచితి మేల యీహవం
బనితరవిక్రమంబు వెల♦యం జనుటొప్పును లంక కిత్తఱిన్. ౪౧ 1469

తే. ఇంచుకేని విచారంబు ♦ నీవు పొంద
నేల? నీకీర్తి జగములఁ ♦ జాల వెలసె
స్వస్థుఁడవు గమ్ము దేవతా♦సైన్యములకు
మూఁడు లోకములకును బ్ర♦భుం డెవండొ. ౪౨ 1470

క. ఆయింద్రుఁడు దర్పము చెడి, నాయస్త్రమహత్త్వమున ర♦ణంబునఁ జిక్కెన్
బాయక దివిజులు దర్పము, మాయఁగఁ జనుచున్నవారు♦సురలిభయమునన్.

చ. మనమునఁ దోఁచుమాడ్కి రిపు♦సంతతి రాజ్యములైన లోకముల్
గొని సుఖరీతి నేలుచును ♦ గోరికలెల్ల ను బొందుమిూ! విరో
ధికరముల్ బరాక్రమవి♦ధిన్ వశవర్తులు గాఁగఁ జేసితిన్
గనుక రణంబు వ్యర్థమగుఁ ♦ గాదె శ్రమింపఁడ నేల? యిత్తఱిన్. ౪౪ 1472

క. అనురావణివాక్యంబుల, విని దశకంఠుండు రణము ♦ విడిచి సురబలం
బునుండి పురలిస్వాస్థ్యముఁ, గనితనయుని మెచ్చుకొని యెఁ ♦ గడుఘనుఁడనుచున్.

సీ. రణవిముఖుండయి ♦ రావణుం డుత్తమ తేజుఁ డారాక్షస ♦ ధీరుఁ డాత్మ
జునిమాట లాదృతి ♦ విని చాలఁ బ్రియమంది యిట్లని పల్కె; న ♦ హీనబలము
గలవారు చేయువి ♦ క్రమకృత్యములఁ బోలు త్వత్పరాక్రమమున ♦ ధన్యమయ్యె
మత్కులం బన్వయ ♦ మానవివర్ధనకృత్య మియ్యది; బల ♦ మెసఁగ దేవ

ఆ. పతియు దేవతలును ♦ బరిభవ మందంగఁ
జేసి తీవు కీర్తి ♦ భాసిలునటు;
స్యందనంబునందు ♦ నమరేశు నునుపుము
దనుజవరులు గొల్వ ♦ తనయ! యింక. ౨౮ 1474

క. చనవయ్య! పత్తనంబున, కనుచరమంత్రులను గూడి ♦ యరుదెంచెద నే
నును హర్షంబునఁ బొదలుచు, ననూనసారంబు పొంగు ♦ నట్లు వెనుకనే. ౨౯

చ. అన విని సైన్యముల్ గొలువ ♦ నాదశకంఠునినందనుండు చ
య్యన దివిజేశుఁ గైకొని ప్ర ♦ హర్షము మీఱఁగ నాత్మసౌధ మొం
ది నిఖలకర్బురేంద్రుల న ♦ తిప్రియ మొప్పఁగఁ బుచ్చి వీర్యముం
గనఁబడ నింద్రుఁ గట్టి కడఁ ♦ కన్ విడియించె ననర్హరీతిగన్. ౩౦ 1476

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

బ్రహ్మ యింద్రుని విడిపించి యింద్రజిత్తునకు వరము లొసంగి చనుట.

క. సురపతి రావణుతనయుని, పరాక్రమంబునకుఁ జిక్కి ♦ పట్టుపడుటచే
సుర లెల్ల బ్రహ్మచెంతకు, నరిగిరి దుఃఖంబు ముంప ♦ నత్యార్తులునై. ౧ 1477

చ. వనజభవా! మహేంద్రుఁడు జ ♦ వంబున రావణుపుత్త్రుచేతఁ జి
క్కెను వర మిచ్చి నీవు ఖల ♦ కృత్యుని రావణు నేరిచేతఁ జా
వును గనకుండఁ జేసితివి ♦ భూతవిభుండగు శంకరుండు నా
తనితనుజాతుఁడై ప్రబల ♦ దర్పమునం దగువాని కాదృతిన్. ౨ 1478

ఆ. మాయ నొసఁగె, వాని ♦ మఘవుఁ డేరీతిని
సంగరంబునందు ♦ జయము నొంద
కుండఁ జేయఁ గలుగుఁ ♦ జండమాయాబలుం
డతఁడు గాదె; దేవ! ♦ యఖిలనాథ!. ౩ 1479

క. సురలును మీవరముల నెక్కరణి జయింపంగఁ గలరు ♦ గావున నీవే
పురుహూతుని విడిపింపుము, పరమాత్మ! ప్రజాపతీ! య ♦ వార్యమహిమచేన్.

ఆ. ఇదియె మొదలుగాఁగఁ ♦ బొదలు లంకేశుండు
విక్రమమున లోక♦వినుతుఁ డగుచు
నెట్టులైన మాకు ♦ నేమి నీభక్తుని
దేవనాథు ముక్తు ♦ నీవె యుక్తి. ౫ 1481

చ ఒనరుపవయ్య! నా విని సు♦రోత్తము నార్తి నెఱింగి వారలం
గొని వడి లంకఁ జేరి సుర♦కుంజరుఁ డుండినచో టెఱింగి యా
దనుజమహేంద్రు నాత్మజవి♦తానయుతుఁ సహజాళిమండితుం
గని గగనంబునన్ నిలిచి ♦ కమ్రవచస్తతి నూఱడించుచున్. ౬ 1482

చ. సరసిజసంభవుం డనియెఁ ♦ జాలును రావణ! వత్స! నెమ్మదిం
బరమముదంబుఁ గంటిని భ♦వత్సుతుఁ డాహవరంగమందు నె
క్కురణిని జూపె విక్రమము ♦ గాఢతరంబగు తృప్తి దానిచేఁ
బరఁగె మదీయచిత్తమున ♦ బాపురె యాతనిశౌర్య మిట్టిదే?. ౭ 1483

తే. నీసమానుఁడో లేకున్న ♦ నిన్ను మిగులఁ
జాలువాఁడో కుమారుండు ♦ సకలజగము
లను స్వతేజంబునన్ వశం♦బున మెలంగఁ
జేసి కొంటివి ప్రతినయు ♦ సిద్ధి నొందె. ౮ 1484

క. మనమున నీశౌర్యమునకుఁ, దనయా! ప్రీతుండ నైతిఁ ♦ దనయుఁడు నీకం
టెను ఘనుఁడు బాహుబలమున, ననుపముఁ డీతండు దాన♦వాధిప!వినుమా!.

ఆ. ఇంకమీఁద నీతఁ ♦ డింద్రజిత్తను పేర, జగములందుఁ బరఁగఁ ♦ జాలుఁ జుమ్ము
దుర్జయుండు బలయు♦తుండును రిపుహంత,యునగు నింకనీదు♦తనయవరుఁడు;.

చ. తనయుని నాశ్రయించియె ము♦దంబున దేవతలన్ వశంబునం
దునుపఁగఁ జాలి తీవు త్రిద♦శోత్తముఁ బాకరిపున్ మహేంద్రుఁ జ
య్యన విడిపింపవయ్య! తగు ♦ నయ్యది దీర్ఘభుజా! సుపర్వ లా
తనిపరిముక్తిఁ గాంచి ప్రము♦దంబునఁ బొందుదుగాక యుండ్లకున్. ౧౧ 1487

చ. శతధృతి యిట్లు పల్క సుర♦సత్తమవైరి మహాపరాక్రమో
ద్ధతుఁ డిటు పల్కె యుద్ధములఁ ♦ దాను జయంబునె గాంచువాఁడుగా
సతతము నుండు వేడ్క సుర♦సత్తమ! నాకమరత్వ మిమ్ము దై
వతపతి ముక్తిఁ గోరిన సు♦భవ్యవరం బిది గోరెదన్ విభూ!. ౧౨ 1488

క. జలజాననుఁ డాతనితోఁ, బలికెను సర్వామరత్వ♦వాంఛ వరమయేఁ
గలుగ దది యెట్టిప్రాణికి, నిలపయి నెక్కాలమందు ♦ నెంచిన నైనన్. ౧౩

తే. బలముగల్గిన యాచతు♦ష్పదము లభ్ర
గతులు గల్గినపక్షులు ♦ నితరజంతు
వులును దరుగుల్మతృణలతో♦పలమహీధ్ర
ములును దక్కినజంతురా♦సులును ధరణి. ౧౪ 1490

క. విను మొక్కదాని కొక్కటి, యనయము భయమందుచుండు ♦ నట్లాట నదె
వ్వనికిని భయంబు లేదని, యనరా దండజకి నది స ♦ హజమై తగుటన్.

క. పతగములు పశువు లభ్యు,న్నత తేజముగల్గు భూత ♦ నాయకులును బ్రా
ణితతియును సాధ్వసంబును, సతతము గనుచుండు రిద్ది ♦ సాజము జగతిన్.

క. ఎండినభూరుహమునకున్, బండినపర్ణంబునకును ♦ బతనభయము లే
కుండున స్థావరచరముల, కుండదొకో భయము సతత ♦ మోరిపుహరణా!.

క, మరణాంతము లీజగమునఁ, జరములు స్థావరము లెల్ల; ♦ శాశ్వతములు లే
నరయు మన బ్రహ్మావాక్యముఁ, బరికించి మహేంద్రజిత్తు ♦ భక్తి యలరఁగన్.

క. సురపథమున నున్నవిభుం, బరమేష్ఠిని గాంచి బాహు ♦ బలరాజితుఁడా
సురవైరి యిట్లు పల్కెను, బురుహూతుని మోక్షణంబు ♦ పోలునయేనిన్. ౧౮

మ. వినవయ్యా! చతురాస్య! నాదగుననో ♦ వృత్తిన్ లసత్సిద్ధినా
కనుకూలంబయియుండ నొప్పు నిపుడే ♦ హవ్యంబులన్ నిత్యపా
వనమంత్రంబులఁ బూజచేసి యనలున్ ♦ వైరిప్రతానంబు గె
ల్వను నేఁ బోవఁగ నశ్వయుక్తరథ ము ♦ ల్లాసంబునన్ రాఁదగున్. ౧౯ 1496

ఆ. అనలునుండివెడలు ♦ నాదివ్య రథ మెక్క, నమరభావ మొప్పు ♦ నగును నాకు
నిదియె వరము చాల ♦ యిష్టంబు తప్పక, యొసఁగవలయు దీని ♦ నోమహాత్మ!.

చ. అనలునియందు వేల్వఁబడు ♦ నట్టి మదుజ్జ్వలహోమకృత్య మొ
ప్పునివిధి నంతరాయములఁ ♦ బాడగునేని రణంబునందు నా
శనము ఘటించు నాకు నిల ♦ సర్వవరంబులనుం దపంబు చే
తన గద పొందఁగోరుదురు ♦ ధాతరో! నిర్జరభావ మట్టులే. ౨౨ 1498

ఆ. నేను విక్రమమున ♦ నీనిర్జరత్వంబుఁ, బడయఁ గోరినాఁడఁ ♦ బరమకరుణ
నీయఁ దగునటన్న ♦ నాయబ్జజుం డట్లె, యగునటంచుఁ బలుక ♦ నమరపతిని.

క. ఒనరించె బంధముక్తుని, గను దేవత లేగి రట్టి ♦ కాలంబున నో
జనవర! రామా! యింద్రుం, డనుపమదివ్యప్రకాశ ♦ మపుడు నశింపన్. ౨౪

క. దీనుండై చింతాయుత,మానసుఁడై తేజ ముడుగ ♦ మాటాడకయే
ధ్యానపరుండై యుండెను, దా నబ్జజుఁ డతనిఁ జింతఁ ♦ దాల్చినవానిన్. ౨౫

క. కని పల్కె బ్రహ్మదేవుం, డనఘా! యిది యేమి దుఃఖ ♦ మందెదు మున్నీ
వొనరిచితివి దుష్కర్మం,బును దుష్కర మద్ది హేతు ♦ వును విను మింకన్.

సీ. అమరేంద్ర! నాచేత ♦ నాదికాలంబున నెందఱో ప్రజ లొగి ♦ సృష్టిచేయఁ
బడిరి వారికి నేక ♦ వర్ణంబు భాషయు నేకరూపము చూడ ♦ నెనఁగియుండెఁ
గానివిశేషంబు ♦ గానరా దించుకయును లక్షణమునందు ♦ వినుము పిదప
నేకాగ్రమానసమున ♦ నేను వారలఁ గూర్చి చక్క నెంచితి నాప్ర ♦ జలవితతిని

తే. గొంతయేని విశేషంబుఁ ♦ గూర్పఁ దలఁచి
వనిత నొకతుక నిర్మించి♦తిని బ్రజలకుఁ
గలుగు నవయువములయందు ♦ లలిత మెద్ది
యగునొ యద్దానిఁ గైకొంటిఁ ♦ దగిన దనుచు. ౨౯ 1503

*క. అనుపమరూపగుణంబుల, నొనరిచితి నహల్య యనెడు♦నువిద; హాలమునాఁ
జను వైరూపము తద్భవ, మనఁ జనుగా హాల్య మనఁగ ♦ నతినింద్యమునూ!.

క. వనితకు దేనికి హాల్యం, బనఁబడు నింద్యంబు లేదొ ♦ యందువనే యా
ఘనవేణి యహల్యయనం,గను గ్రాలెన్ నామమునను ♦ ఖ్యాతిన్ మిగులన్.

క. మనమున నీయది యెంచియొ, చను నీమె యహల్య యనఁగ♦జనుయం దని పే
రును బెట్టినాఁడ నిట్లా,వనితామణి సృష్టి చేసి ♦ వచ్చఁ డెవఁ డనుచున్. ౩౧

క. సురనాథా! చింతించితి, వరుసగ నత్తఱిని నీవు ♦ వనిత నెఱుఁగు; దా
తరుణిని స్థానబలంబున, పురందరా! భార్యగాఁగఁ ♦ బోలు నటంచున్. ౩౨

సీ. తలపోసితివి నీవు ♦ తరుణి నామెను నే మహాత్ముఁడౌ గౌతమా♦హ్వయమహర్షి
కిల్లడఁగా నుండ ♦ నేర్పఱచితిఁగాని బహువర్షములకు నా♦సుహితచిత్తుఁ
డామె నాకర్పించె ♦ నాతనితపమును జక్క నెఱింగియే ♦ స్థైర్యమునను
నాయింట నుంచితిఁ ♦ బాయనినియతిచేఁ దపము నొనర్చి య♦త్తపమునకును

తే. ఫలము గాంచెను గౌతముఁ ♦ డలరి యుప్పు
డే నొసంగితిఁ గొనుముని ♦ యా నెలంత;
నంత నమ్మౌని యామెతో ♦ నర్హరీతిఁ
గ్రీడ సల్పుచునుండె నా♦రీమణి నిటు. ౩౩ 1508

చ. మునికిని భార్యగా నొసఁగ ♦ మోములు వెల్వెలఁ బోవఁగా నిరా
శను సుర లేగి; రంతఁ గ్రుధ ♦ స్వాంతమునం గని నీవు కామబా
ణనికరపీడితుండవయి ♦ నారిని బొందఁగఁ గోరి యమ్మునీ
శునియుటజంబుఁ జేరితివి ♦ చూచితి వాతరుణీలలామమున్. ౩౪ 1509

ఆ. చెలఁగునగ్నిహోత్ర♦శిఖవోలె నాతన్వి, యులరుచుండె; నంత ♦ నామె నీవు
మన్మథార్తిఁ గాంచి ♦ మన్యువు నొంది సా,ధ్వసమునొందునట్లు♦పల్కితవుడు.

క. మునిపతియు నిన్ను నాశ్రమ,మునఁ గనియెన్ దేవసంఘ♦ముఖ్యా! యంతన్
మనమునఁ దీవ్రక్రోధం,బును బొంది నితాంత తేజ♦మునఁ బొల్చుటచేన్. ౩౫

సీ. శపియించె నిన్ను నో♦శక్ర! దశాభాగవిపరీతభావంబు ♦ వెలయునిన్ను
గని; యేల నాదుప♦త్నిని బెదరించితో భయ మింతయును లేక ♦ పాకవైరి

* హాలం నామేహ వైరూపం హాల్యం తత్ప్రభవం భవేత్, యస్మాన్నవిద్యతే హాల్యం తే నాహాల్యేతి విశ్రుతా-అనిమా.

యకార్యకరణంబున ♦ నరులకుఁ జిక్కఁడు వీభావమే నీవు ♦ నిచటఁ జూపి
నది, సర్వమనుజులయందుఁ బ్రవర్తిల్లఁ గలదు సందేహంబు ♦ గలుగ దిందు

తే. రాజదోషంబుచేతనె ♦ ప్రజలు చెడుదు
రింతె కాక యధర్మమా ♦ నిది ధరిత్రి
వృద్ధిఁ బొందును దలఁచూపి ♦ యిట్టి పాప
మునకు నెవ్వఁడు కర్తయొ ♦ జనుఁ డతండు. ౪౧ 1512

క. కను నర్థఫలంబును దక్కినయర్థము నిన్నుఁ బొందుఁ ♦ గేవలపాపం
బనఁ జను నిది; స్థావరమై, తనరారుపదంబు నీకుఁ ♦ దక్కఁదు శక్రా!. ౪౨

క. మును నీవే యొనరించిన, ఘనమైన యధర్మయుక్తిఁ ♦ గలిగిన దిట్టి
పని; యేదే నొనరించినఁ, దనరారును దానిఫలము ♦ తప్పక శక్రా!. ౪౩ 1514

తే. నీకు శాపం బొసంగితి ♦ నేను నిట్టు
లనుచు గౌతముఁ డప్పుడే ♦ యమరనాథ!
నీకుఁ దెలిపెను; దరువాత ♦ నాకళత్ర
మును గనుంగొని నిందించు♦మను మునిపతి. ౪౪ 1515

క. తనతపము బల్మి నిట్లని, యెను దుర్ణయురాల జనుల ♦ కెలమిని బుట్టం
గను జేయుచారురూపంబునఁ బ్రాయంబునను నీవు ♦ పొల్చుచు మిగులన్.

క. పురుషుల నాకర్షించుచుఁ, బరమవిలాసమున నాదు♦పావనగహనాం
తరమున నాశ్రమసన్నిధిఁ, బరఁగితి వట్లాట నీవు ♦ పాపమతివై. ౪౬ 1517

క. ఈపని నొనరించితి వో, హాపడఁతీ! చేతనత్వ ♦ మొయ్యనఁ జనఁగా
నేపగిదిఁ గదలకుండఁగఁ, జూపట్టనిరీతి నుండు ♦ క్షోణిన్ శిలగన్. ౪౭ 1518

ఆ. ఒంటరిగనె యుండు ♦ మోసి నీవు మనోజ్ఞ,రూపవతివి గాక ♦ రూప మిద్ది
యఖిలప్రజలు పొంది ♦ యలరారుదురు గాక, సంశయంబు లేక♦చాన! యింక.

క. అనుపమరూపము దీనిం, గని విభ్రమ మొందనయ్యెఁ ♦ గాదే యటుగా
వున నిట్టులుండు మనఁగా, విని యాతన్వంగి సాధు♦వృత్తయె గానన్. ౪౯

చ. మునిపతి సాంత్వనోక్తితతి ♦ మోదము నొందఁగఁ జేసి మూర్ఖతన్
మునివర! యింద్రుఁ డిట్లు నను ♦ బూనిక ధర్షిత చేసెఁగాని నె
మ్మనమునఁ గామ మూని యిది ♦ మంచి దటంచును గాదు కాన నో
యనుపమతేజ! నీవు కృప♦నందుట యుక్తముగాదె యంచనన్. ౫౦ 1521

చ. విని మునినాయకుండు పది♦వేలవిధంబుల నాత్మ నెంచి యి
ట్లనియె; మహోగ్రతేజుఁడు మ♦హారథుఁ డారవివంశమౌక్తికం
బనఁగఁ జెలంగి రాముఁడను ♦ నాహ్వయ మొప్పఁగ నొక్కరా జిలన్
జనిఁ గనుఁ గాననంబునకుఁ ♦ జానరొ! యాతఁడు రాఁగలండునూ!. ౫౧

తే. బ్రాహ్మణప్రియమును జేయ ♦ వనజనయనుఁ
డై మహాబాహువై తగు♦నట్టి విష్ణు
వొందు మనుజాకృతిని నెప్పు ♦ డువిద! నీవు
కనఁగలవొ యమ్మహాత్ముని ♦ ననుపమాను. ౨౦½ 1523

క. పావనమనీవ వగుదువు, నీ వొనరిచి నట్టి పాప ♦ మీయది మాపం
గా వలఁతి యమ్మహాత్ముఁడె, యావిబుధార్చితుని బూజ ♦ నలరించి సతీ!. ౨౧

క. ననుఁ జేరఁగ రాఁగలవని, మునిపతియును మరలఁ బలికెఁ ♦ బూజ్యమతివై యై
ననుఁ గూడియుండఁ గల వని,యును బల్కి మునీంద్రుఁ డేగె♦నుటజంబునకున్.

సీ ఆయహల్యయు మునీం♦ద్రాంగనయాట చేఁ గఠినతపంబును ♦ గానమున
నట్లు వసించియే ♦ యనువున నొనరించె; నీదుసంగతిచేత ♦ నెలకొను గురు
పాపయుక్తిని శిలా♦రూపంబుఁ దా నొంది యట్లు సద్వ్రతమున♦నామెయుండె;
నదియాదిగాఁ బ్రజ ♦ లనుపమలావణ్యమున నుల్లసిల్లిరి ♦ మునిపతి గురు

తే. శాప మొనఁగిన తర్వాత ♦ సర్వవార్త
లవని వ్యాపించె నీచేసి♦నట్టి యఘము
సంస్మరింపుము సురనాథ! ♦ స్వాంతమందు
దాన శత్రువు గ్రహియించెఁ ♦ బూని యిట్లు. ౨౨½ 1526

క. ఇతరంబగు హేతువ దె,వ్వితమునఁ గా దిద్ది నిజము ♦ వృత్రారీ! నీ
వు తగన్ వైష్ణవసుఖమును, మతివిభవము పేర్మిఁ జేయు ♦ మహితనియతిచేన్.

క. పరిశుద్ధమనస్కుఁడవై, మరలన్ ద్రిదివంబుఁ జేరి ♦ మహితవిభూతిం
బరఁగంగ లావు పెనునం,గరమున నీపుత్త్రకుండు ♦ గనఁడు మరణమున్. ౨౪

చ. మనుమని గొంచు నార్యకుఁడు ♦ మాట్పుఱచెన్ జలరాశిలోన నా
విని సురనాయకుం డపుడు ♦ విష్ణుని బ్రీతిలఁ జేయు నధ్వరం
బును విధి నాచరించి సుర♦పుంగవధామము నొంది పూర్వరీ
తిని దివిజావళిన్ మనిచెఁ ♦ దేజము వెల్గుచునుండ నేపునన్. ౨౫½ 1529

ఆ. ఇద్ది యింద్రజిత్తు ♦ నేపుఁ దెల్పెడుగాథ
చక్కఁ దెల్పినాఁడ ♦ క్ష్మాపతీంద్ర!
కారణమున దీనఁ ♦ గ్రతుభుగ్విభుం డని
నోడఁ జేయఁ బడియె ♦ చూడు రామ!. ౨౬ 1530

క. ఒరులను బల్కఁగ నేటికి, సురపతిగతి యిట్టులయ్యెఁ ♦ జుము నా విని య
చ్చెరు విది యని రాఘవు లి,ర్వురు పల్కిరి; దనుజవాన♦గులు మునిపల్కున్.

సీ. విని యద్భుతం బిది ♦ యని రంత నవ్విభీషణుఁడు శ్రీరాముపా♦ర్శ్వముననుండి
యిట్లని పల్కె; భూ♦మీశ! యాశ్చర్యము గల్గింపఁ జాలిన ♦ గాథ యతిపు
రాతన మిది యిప్డు♦ చేతస్సునం గడుఁ బొదలునట్లుగ నయ్యె ♦ బుధవినుతుఁడు
మునియగస్త్యుఁడు చక్క ♦ వినిపించె నే నిది కనులారఁ జూచితి ♦ వినితి నిప్డు

తే. రామ! యీరీతి నాయన్న ♦ రావణుండు
లోకకంటకుఁడుగఁ బుట్టి ♦ వీఁకమెఱయ
నతని కోడు కట్టిఁడయ్యె దే♦వాధిపతిని
గెలిచె నన [1]మానిపతియును ♦ బలుక మానె. ౬౩ 1532

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౩౧ - వ సర్గము.

రావణుఁడు కార్తవీర్యుని జయింప మాహిష్మతీనగరంబున కరుగుట.

చ. గురుతరతేజుఁడై క్షితిప♦కుంజరుఁడై తగు రాఘవేంద్రుఁ డ
బ్బురపడి యాయగస్త్యముని♦భూపతికిం బ్రణమిల్లి యిట్లనున్
మరల; మహాత్మ! క్రూరుఁడయి ♦ మానుషభక్షకవర్యుఁడై నిరం
తరపరహింసకుండు నయి ♦ ధాత్రిఁ జెలంగిన రావణుం డొగిన్. ౧౪ 1533

చ. ధరణిఁ జరింప నత్తఱిని ♦ ధాత్రిసురోత్తము! లోకజాలముల్
విరహితశూరసంఘములు ♦ విచ్యుతధర్మములై యుఁడంగనో
[2]ధరణిపుఁడేని క్షత్రియవ♦తంసకుఁడేని సెబాసు రావణా
సుర నని దాఁకి నిల్వఁ గల♦శూరుఁడు కల్గఁ డొకో వచింపుమా. ౩౪ 1534

ఆ. అట్లు లేకయున్న ♦ హతవీర్యులై రాజు,లెల్ల నడఁగినారొ ♦ యెంతొ మించు
నట్టి యస్త్రవితతు ♦ లా రాజులను విడి, యరిగె నొక్కొ యెచటి♦కైన మౌని!.

క. ఏటికి ధరణీశులు తద్ధాటికి నిల్వంగ లేక ♦ తా రపజయమే
మాటికి మాటికిఁ బొందిరొ, తేటగ నెఱిఁగింపు మౌని♦తిలకా! యనినన్. ౪

చ. విని రఘువర్యవాక్యమును ♦ విప్రమునీంద్రుఁడు సుస్మితంబు మో
మునఁ దొలకాడ బ్రహ్మ మును ♦ భూతవిభుం గని పల్కినట్టు లి
ట్లనియెను: రాజసత్తమ! మ♦హాత్మ! ధరేంద్రుల నిట్టు లేచుచున్
దనుజవిభుండు రావణుఁడు ♦ తాఁ జరియించె ధరాతలంబునన్. ౬ 1537

క. తిరుగుచు నివ్విధి నొకతఱి, సురపురతుల్యప్రభావ♦శోభిత యగుచున్
బరఁగెడు మాహిష్మతియను, పురిఁ జేరెన్ దానిచుట్టు♦పొలుపుమెఱయఁగన్.

క. హుతవహుఁడే ప్రాకారా,కృతిగా నలరారు నెపుడ♦హీనరుచులతో;
క్షితిపతి ప్రతాపగరిమన్, హుతభుక్తుల్యుండు గాఁగ ♦ నొప్పుచునుండున్.

సీ. [3]ఆపురంబున సాయ♦కానలకుండంబునందు నెప్పుడును వి♦హార మొప్పఁ
గాఁ జేయునర్జున♦ఖ్యాతాగ్ని యలరారు;నతఁడు హైహయులవం♦శాభరణము

---

1 ఇక్ష్వాక్వో విరరా మాసా వగస్త్యః కుంభసంభవః-అనిమూ. 2 రాజా వా రాజమాత్రో వా కిం తదా నాత్ర కశ్చన-అనిమూ. రాజా వా రాజమాత్రో వా అక్షత్రియోపి ప్రభుర్వా కశ్చన నాసీత్-అనివ్యాఖ్య. 3 అర్జునో నామ యత్రాగ్నిశ్శరకుండేశయ స్సదా-అనిమూ.

బలశాలియు నగుచు ♦ భాసిల్లు నేదివసంబున దానవ♦స్వామి యుద్ధ
కాంక్షతోఁ బురి నరి♦కట్టఁగాఁ బోయెనో యాదివసంబున♦యందె రాజు

తే. నర్మదామలజలకేళి ♦ నారిమణులఁ
గూడి చేయంగ నరిగె నై♦క్ష్వాకుకుతూహ
లమున; రావణుఁ డంతట ♦ నమరుయుద్ధ
కాంక్షతో రాజు లేఁడు ని♦క్కముగ ననుచు. ౧౦॥ 1540

క. విని యాతనిమంత్రులనుం, గని యిట్లని ప్రశ్నచేసె ♦ క్ష్మాపతియగు న
ర్జునుఁ డిచ్చట నున్నాఁ డా,తనికిన్ వేగముగఁ జెప్పఁ ♦ దగు నానుడులన్.

చ. దనుజవిభుండ రావణుఁడ ♦ త్వద్ధరణీశునితోడ సంగరం
బును గడుఁ జేయుకాంక్ష బల♦ముల్ గొలువంగను వచ్చినాఁడ నా
మనమునఁ గల్గుకోరికను ♦ క్ష్మాపతి కున్నది యున్నయట్లె మీ
రనుమతిఁ జెప్పుఁ డన్న విహి♦తాత్ములు పండితులైన వారొగిన్. ౧౨ 1512

చ. సురరిపునాథ! యిత్తఱిని ♦ క్షోణివిభుం డగునర్జునుండు పూ
ర్వగమున లేఁడు; నాఁగ నిటు ♦ పౌరులవాక్యము నాలకించి భూ
వరుఁడు స్థలాంతరమ్మునకుఁ ♦ బాఱె నటం చెద నిశ్చయించి య
ప్పురమును బాసి యాతుహిన♦భూధ్రసమానము వింధ్యశైలమున్. ౧౩॥

సీ. కాంచె నయ్యది మహా♦ఘనములు వ్యాపించి భూమి బ్రద్దలుచేసి ♦ పోల వెలికి
వెడలివచ్చినయట్లు ♦ విలసిల్లి యంబరంబును దాఁకుచున్నట్టి ♦ పోల్కి బెరిఁగి
యుండఁగా నారావ♦ణుండు కన్గొనియె; నయ్యద్రివరంబు స♦హస్రశిఖర
సంయుతంబయి హరి♦సంభ్రాంతకందరం బగుచుఁ బైనుండి య♦హర్యగతిని

తే. గ్రిందఁ బడు శీతలాంభస్సు♦లం దగంగ, నట్టహాసం బొనర్చెడు ♦ నట్టు లొప్ప
నమరదానవగంధర్వ ♦ లచ్చరలును, గిన్నరులు స్వేచ్ఛమీఱంగఁ ♦ గేళి సల్ప.

క. సురపురమో యన నొప్పుచు, నరుదగు నత్యుచ్ఛ్రియమున ♦ నలరారుచు ని
ర్భరరీతిఁ బాఱునదులన్, బరఁగెడు *స్ఫాటికజలంబు ♦ భాసిల్లంగన్. ౧౫ 15 5

క. చలియించునాలుకల ను,జ్జ్వలరీతిఁ జెలంగు భోగ♦వారంబులతో
నలరారు ననంతుఁడు నా, విలసిల్లుచు నగ్గిరియును ♦ వేడుక నించెన్. ౧౬॥

తే. అంబరమ్మును దాఁకంగ ♦ నట్టె పెరిఁగి
దరులపిండులు వెలయంగ ♦ గిరివరేణ్య
మచట హిమగిరితుల్యమై ♦ యక్షివితతిఁ
జల్లఁగాఁ జేయఁ జూచుచు ♦ నుల్లమలర. ౧౭ 1547

క. దానికిఁ జెంగట నర్మద, నా నలరుచుఁ బశ్చిమాబ్ధి♦నాథునిఁ గలయం
దా నరుగు నేటిఁ గనియెన్, దానవనాథుండు మది ము♦దంబునఁ బొదలన్.

* స్ఫాటికప్రతిమం జలమ్-అనిమూ.

క. చలదుత్పలదళముల ని,ర్మలజలముల, మహిషతతి[1] చ♦మరమృగములు భీ
తిలఁ జేయుసింహసముదయ,ములుపులులుమహా స్తిపూగ♦ములు ఋక్షములున్.

తే. దప్పిగొని యెండ వేఁడికిఁ ♦ దాళలేక
యట్టి మడుగులలోఁ బడి ♦ యటునిటు పొర
లాడ జలములు వెలికేగఁ ♦ జూడఁబడుచు
నురుగుగములఁ గోపించిన ♦ కరణిఁ బొలిచి. ౨౦ 1550

తే. చక్రవాకకారండహం♦సముల మఱియు
వారికుక్కుటముల మత్త♦సారసముల
నెల్లెడల నావృతంబయి ♦ యెసఁగు దాని
వికచతరుకృతశేఖర♦వితతిఁ దాల్చి. ౨౧ 1551

సీ. చక్రవాకద్వయ♦ స్తనములఁ జెలువొంది పులినసుశ్రోణియై ♦ పొలుపు గాంచి
హంసాళిమేఖల♦యై తనరారుచు సుమరేణులిప్తాంగ ♦ యమర నెసఁగి
యనుపమఫేనమ♦యాంశుక మొప్పార సలిలావగాహన♦స్పర్శ మొప్పు
నుత్పలరుచిరేఖ♦నోజ్జ్వలవక్త్రయై యలరారునర్మదా♦ఖ్యను సరిల్ల
తే లామఁ గన్గొని చారువి♦లాస మొప్పఁ
బుష్పకము డిగ్గి మదికెక్కు ♦ పూవుఁబోఁడిఁ
జేరువిధమునఁ జెంతకుఁ ♦ జేరి దాని
భూరిసుమశోభితంబగు ♦ పులినమందు. ౨౪ 1552

చ. దనుజవిభుం డమాత్యులును ♦ దానును జల్లఁగఁ గూరుచుండి ప్రా
దిని యిది గంగయే యనుచు ♦ దివ్యతరంబుగ సంస్తుతించి దా
ని నెలమిఁ గాంచినందులకు ♦ నిత్యముదంబును బొందె; నంత మో
మునను బ్రహాసమొప్ప నను♦మోదము నొందెడుమంత్రిముఖ్యులన్. ౨౬

క. మారీచాహ్వయు శుకునిన్, సారణుఁ గని యిట్లు పలికెఁ ♦ జంచద్రశ్మి
స్ఫారమునఁ గాంచనంబుగ, ధారణీతల మొల్లఁ జేసి ♦ తా నసదృశుఁడై.

తే. తీక్ష్ణతాపకరుండయి ♦ తిగ్మరశ్మి
యంబరంబున నడిమిదా♦నంత యుండె;
[2]నేను నిటఁ గూరుచుండుట ♦ దా నెఱింగి
చంద్రువలెఁ జల్లనైనాఁడు ♦ సచివులార!. ౨౮ 1555

క. వినుఁ డీనర్మదఁ గలజీ,వనముల శీతలము పుష్ప♦హారసుగంధం
బును గల్గి శ్రమము వాపుచు, ననిలుఁడు నాభీతిచేత ♦ నల్లనవీచున్. ౨౯

1 మహిషైశ్చమరైస్సింహైః-అనిమూ. 2 మామాసీనం విదిత్వేహ చంద్రాయతి దివాకరః-అనిమూ.

క. ఈనర్మద తటినీమణి, జానగు ప్రీత్యతిశయంబు ♦ నమకూర్చుచు నం
లీనఝషపత్రివీచుల,చే నాత్మభయంబుగన్న ♦ స్త్రీవలె నలరెన్. ౩౦ 1556

*చ. అనిమొన నింద్రతుల్యసక ♦ లావనినాథుల శస్త్రసంతతిన్
దనువులు సవ్రణంబులయి ♦ తాపము నొందఁగ దివ్యచారుచం
దనరసయుక్తి భంగిఁ గడు ♦ నల్లను దోఁగితి రట్టులొట మీ
రనుపమనర్మదాజలము ♦ లందు సుఖంబుగ స్నాన మాడుఁడీ!. ౩౧ 1557

క. శర్మద నిరతమ్ముగునీ, నర్మద పారంబులేని ♦ నానావిధ దు
ష్కర్మధ్వంసిని గావున, నిర్మలమతి స్నాన మిందు ♦ నిశ్చలభక్తిన్.౩౨ 1558

క. ఒనరింపుఁడు గురుతరపద్మనికరములు మోములందుఁ ♦ దనరఁగ మదముం
గని యొప్పునాగములు గం,గను గాంచినయంత దిగెడు ♦ కరణిని మీరున్ ౩౩ 

ఆ. దీనఁ గ్రుంకులిడుచుఁ ♦ దీవ్రపాపంబులఁ, బాపుకొనుఁడు; నేను ♦ భవ్యపులిన
మందు నిచ్చట శర ♦ దిందుసమంబుగ, నలరుతావునందు ♦ నర్హరీతి. ౩౪ 1560

క. సురుచిరపుష్పోత్కరములఁ, బరమేశుఁ గపర్ది నకల ♦ భావవిదుని శం
కరుఁ బూజించెద మెల్లఁగ;, వరభక్తి నటన్న దనుజ ♦ వల్లభుపలుకుల్.౩౫ 1561

తే. వినినయప్పుడె సారణుం ♦ డును శుకుండు
వాహినీనాయకుండును ♦ వరుసమీఱ
నామహోదరధూమ్రాక్షు ♦ లధికభక్తి
నర్మదానది మున్గిరి ♦ శర్మద యని. ౩౬ 1562

చ. దనుజగజేంద్రసంక్షుభిత ♦ దారుణరూపము గల్గు నాలస
ద్ఘననది వామనాంజనము ♦ ఖంబులు దిగ్గజముల్ సురాపగం
గని యవలీలఁ జొచ్చునటు ♦ గాఢరయంబున మున్గి; రంతటన్
దనుజులు నందుఁ గ్రుంకి బల ♦ దర్పము లుల్లసిలంగ నయ్యెడన్. ౩౭ 1563

ఆ. వెడలి వచ్చి దనుజ ♦ విభుని బూజకును గా,వలసినట్టి పుష్ప ♦ ములను దెచ్చి;
రంత హృద్యమగుచు ♦ నతినిర్మలమ్మగు, నభ్రకాంతి నలరు ♦ నట్టిచోట. ౩౮

క. వరసుమములు క్షణమున నే, ధరాధరమురీతి నిల్వఁ ♦ దగియెను బుష్పో
త్కరమయగిరి యిది యనఁ గ,ర్బురు లివ్విధిఁ బుష్పములను ♦ బ్రోగుగ నెఱపన్.

చ. అమరవిరోధినాయకుఁ డ ♦ హార్యబలోద్ధతుఁ డంత నర్మదా
ఖ్యమహితసన్నదీమణిని ♦ గాఢతరంబగు ప్రీతిఁ గ్రుంకె నా
యమరతరంగిణిం జెలఁగు ♦ నగ్గజరాజము నట్టు, లంత స
క్రమయిన భక్తి లేచి విధి ♦ గా జపియింపఁగ నొప్పుమంత్రముల్. ౩౯

తే. వరుస జపియించి దరిఁజేర ♦ వచ్చి నిల్చి
యార్ద్రవస్త్రంబు విడిచి ధౌ ♦ తామలాంబ

---

* దంసనస్య రనీనేవ దధికేణ సముక్షితా.-అనమా.

రమును ధరియించియున్న యా♦రాక్షసపతిఁ
గాంచి దోసిలు లొగ్గి రా♦క్షసులు నిల్చి. ౪౧ 1567

క. కొలిచిరి తద్గతమానస,ములఁ దనువును దాల్చినట్టి ♦ భూధరములు నా
లలిఁ బాడుచు నాడుచు దో,ర్బలములు గనఁబడఁగ నిల్వఁ♦బడి రత్తఱిని.

ఉ. [దానవనాయకుం డపుడు ♦ దర్పకశాత్రవలింగవర్యమున్
మానస మొంద ముప్పతిల ♦ మాటికి మాటికి సన్నుతించుచున్
దాను సుగంధపుష్పసము♦దాయములన్ బలిధూపదీపసం
తానములన్ సువాద్యనిన♦దంబుల నెంతయుఁ బూజచేయుచున్. ౪౩½ 1569

తే. వలసినపుడు ఘృతక్షీర♦ములఁ బెరుఁగున
సిద్ధజలములఁ దగ నభి♦షేక మొప్పఁ
జేసి కౌశేయము లిడి సం♦సిద్ధనామ
శతకమున సంస్తుతించి వి♦శాలభక్తి. ౪౪ 1570

సీ. పూజించె నప్పు డా♦భూతేశలింగంబు బహురత్నభూషణ♦భవ్యమగుచు
నలరారె; నాలింగ ♦ మనుపమప్రీతిచేఁ బూజించి కార్యంబుఁ ♦ బూను భక్తు
నకుఁ గార్యసిద్ధిఁ ద♦ప్పక యిచ్చుచుండును; విధిగఁ బూజింపక♦స్వేచ్ఛఁ బూన్కిఁ
బూజింపఁగా మృత్యు♦వును దెచ్చి పెట్టును దుర్మతియయి యొప్పు♦తోఁచినట్లు
తే. రావణుఁడు పూజచేయునో ♦ పావనమతు
లగు మహర్షులు దేవత ♦ లాక్షణంబ
యతనిమృతిఁ గోరుదురు రావ♦ణాసురుండు
మత్తుఁడై విధి నెడఁబాసి ♦ యుత్తఱి నట. ౪౬½ 1571

క. తనకుం దోఁచినయట్టులు, ఘనమూర్తిని బూజచేసెఁ;] ♦ గదలు నెచటి కా
దనుజుఁడు వెంటనె వరకాం,చనలింగము భక్తిఁ గొనుచుఁ ♦ జను నటుగాన్.

ఆ. ఇసుకనడుమను శ్రీపార్వ♦తీశులింగ
మొప్పునట్లుగ స్థాపించి ♦ యప్పు డమల
చందనంబునఁ బరిమళ♦సాంద్రకుసుమ
ముల సమర్పించె నప్పు ని♦స్తులసుభక్తి. ౫౦ 1573

ఉ. అంతట సజ్జనార్తిహరు ♦ నయ్యభవున్ హరు శంకరున్ సురా
క్రాంతపదాబ్జు బద్మరిపు♦ఖండకృతాభరణాభిరాము దు
ర్దాంతసురారిగర్వహరు ♦ రమ్యగిరీంద్రనివాసు సర్వలో
కాంతకుఁ బూజచేసి తన♦హస్తములం దమిఁ జాఁపి మ్రొక్కెడిన్. ౫౧

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

## ౩౨ - వ సర్గము.

కార్తవీర్యుఁడు రావణుని జయించి పురంబునకుం గొనిపోవుట.

చ. సురరిపునాథుఁ డెచ్చటను ♦ శుభ్రమరీచివిభూషణుల్ మహే
శ్వరుఁ గొనియాడుచున్ మిగులు ♦ భక్తిని బూజలఁ దన్పుచున్ దమిన్
హర! హర! పార్వతీరమణ! ♦ యంచు స్మరించుచునుండె, నంత నా
ధరణికి దూరమందుఁ బ్రభు♦తల్లజుఁడై జయశాలివర్యుఁడై. ౧ 1575

సీ. మాహిష్మతీపుర♦మండనవాసియై యర్జునుం డనఁబడు ♦ నాహ్వయమునఁ
దనరుచుండెడి రాజు♦తరుణీమణులఁ గూడి నర్మదాజలముల ♦ నలినవిలసి
తంబులఁ గేళిని♦తాంతమోదంబునఁ జేయుచుఁ జుట్టును ♦ స్త్రీలు నడుమఁ
దానును నిలిచి ని♦స్తంద్రవిహారంబు సలుపఁగ రేణుకా♦సమితినడుమ

తే. నలరుకుంజరపతియట్లు ♦ వెలయుచుండి
తనదు వేయికరంబుల ♦ తత్త్వబలము
నెఱుఁగఁగాఁ గోరి యడ్డంబు ♦ చఱచి దాని
నడ్డగించెను నర్మద ♦ యతిరయంబు. ౨ 1576

తే. కార్తవీర్యునిదోస్సమా♦క్రాంత యగుచుఁ
బడమరకు నేగఁ జాలక ♦ పావనజల
మప్పు డొడ్డుల ముంచుచుఁ ♦ జప్పుడులను
గలుగఁజేయుచుఁ దూర్పుగాఁ ♦ గలఁగి పాఱె. ౩ 1577

చ. చెలఁగెడుమీననక్రముల♦చేతను దర్భలచే సుమాళిచే
వెలయుచు నానదీసలిల♦వేగము వృష్టినిగుప్పుకాలను
ట్లలరె; నదీరయంబదియు ♦ నర్జునుఁ డేపున వెన్కకంపి న
ట్టులు దనుజేంద్రుపూజకుఁ గ♦మ్మంగడుఁ గూర్చినపుష్పసంతతిన్. ౪ 1578

ఆ. ఒక్కసారి ముంచె; ♦ నుద్ధతుఁడగు రావణాసురుండు పూజ♦యర్ధమాత్ర
మాటయును దలంప ♦ కానియమంబును, వదలి యిద్ది యేల? ♦ వచ్చె నిటకు.

క. అని కాంతయైన నర్మదఁ, గని యెంబ్రతికూలయగుచుఁ ♦ గన్పడుప్రియనుం
గనినట్లు; పిదపఁ బశ్చిమ,మును గనఁగన్ జలధిపూర♦ముగఁ గన్పడుచున్. ౫

క. వరుసన్ వృద్ధిం గాంచుచుఁ, దరంగిణీవేగ మద్ది ♦ తాఁ దూర్పునకున్
బరుగిడుచుండఁగఁ గనె; నా, తరుణంబున దెసలకుం బ♦త్త్రులు పరువన్.

ఆ. ఒగి స్వభావమైన ♦ యుపరమమును బొంది, నిర్వికారయైన ♦ నెలఁత పోల్కి
నలరు నదిని గాంచె ♦ నారావణుం; డంత, శుకుని సారణునిని ♦ బ్రకటదృష్టి.

క. *కని దక్షకరాంగుళిచే,తను శబ్దము కలుగునట్లు ♦ తాఁ బిల్చి రయం
బున నిట్లు తూర్పుదెసకుం, జనుకారణ మేమొ తెలియఁ♦జను ననునూహాల్.

---

* సవ్యేతరకరాంగుళ్యా-అనియూ.

క. కనఁబడఁగ నాజ్ఞఁ జేసెను;, దనుజులు సోదరులు వారు ♦ దర్పసమగ్రుల్
ఘనపథమునఁ జరియింపం,గను జాలినవారు మిగుల ♦ గర్వగ్రంథుల్. ౧౧½
క. పరుగెత్తిరి పడమరదెసఁ, బరికింపఁగ యోజనార్ధ ♦ పర్యంతము ని
ర్భర తేజంబునఁ జని యటఁ, దరుణీసంయుతుని గేళిఁ ♦ దనరెడువానిన్. ౧౨
క. నరపతివర్యుని విభుఁ గాం,చిరి; సాలమహీరుహంబు ♦ చెన్నునఁ దగి యా
ధరణీపతిపాథస్సులఁ, బరికీర్ణశిరోజుఁ డగుచు ♦ భామాయుతుఁడై. ౧౩½
సీ. మదనునాకారంబు ♦ మాడ్కి దేహంబొప్పఁగా మదరక్తాంత ♦ కమ్రనయనుఁ
డగుచుఁ దరంగిణి ♦ నాయతబాహుసహస్రంబునం బూని ♦ యడ్డగించి
యరిమర్దనత్వంబు ♦ నగపడఁ బాదసహస్రంబునన్ క్షోణి ♦ నావరించు
శైలంబుపోలికఁ ♦ జానలు నూత్నయౌవనముల రాజిల్లు ♦ వారు వేయి
తే. మంది తనచుట్టునుండంగ ♦ మదసమగ్ర
మగుకరేణుసహస్రంబు ♦ తగఁ జెలంగు
హస్తినాయకుఁ బోలి చె ♦ ల్వమరుచుండ
వారివిహారణలోలుఁడై ♦ వఱలుచుండ. ౧౬ 1587
క. మనమున కత్యాశ్చర్యం,బును గల్గఁగఁ జేయు నతని ♦ బొడఁగని దనుజేం
ద్రునిచారులు శుకసారణు,లనూనగతిమీఱి వచ్చి ♦ యావృత్తంబున్. ౧౭
క. తెలుపఁగఁ బూనిరి విభునకుఁ;, గలఁ డొక్కఁడు భూరిసాల ♦ కాయుండు నదీ
జలములఁ బోనీయక తా, నిలిపెను దోశ్శక్తిఁ గేళి ♦ నెలఁతలఁ దేల్పన్. ౧౮
తే. అతనిబాహుసహస్రరు ♦ ద్ధాంబువగుచు
నదియుఁ గడలియుద్గారసం ♦ శతిసమాన
భూరిఫేనంబులన్ దాను ♦ బుట్టునట్టు
చేయుచున్నది దానవ ♦ శేఖర! యని. ౧౯ 1590
క. పలికెడుశుకసారణులన్, బలాశనేశుండు గార ♦ వమ్మునఁ గని భూ
పలలాముఁ డర్జునుండే, తలఁపఁగ నీతం డటంచుఁ ♦ దలపోసి మదిన్. ౧౯½
ఆ. శివునియర్చనంబు ♦ చేయుట చాలించి, యుద్ధలాలసుఁడయి ♦ యురుజవమున
నరుగు నతని కెదుట ♦ నతిచండవాయువు, విసరె ధూళిగ్రమ్మ ♦ వెస నఱచుచు.
క. జలదంబులు రక్తాంభ,స్సులతోడం గూడి యప్డు ♦ సురవైరిని భీ
తిలఁజేయ నార్చె నొక్కట;, బలాశనేంద్రుండు యుద్ధ ♦ వాంఛ మిగులఁగన్.
తే. తనకుఁ బ్రియమంత్రులగుమహో ♦ దరుఁడు శుకుఁడు
సారణుండు మహాపార్శ్వ ♦ సంజ్ఞుఁ డల్లె
ధూమ్రనయనుండు వెంట రాఁ ♦ దోయపూర
మెచటఁ బుట్టెనో యచ్చటి ♦ కేగెఁ గడఁక. ౨౨½ 1594
క. త్వరగన బలవంతుండగు, సురవైరివిభుండు పోయి ♦ శుంభద్ధ్రిదమున్
బరికీర్ణజలముఁ గాంచెను, శరీర మంబనమురీతి ♦ సాంద్రద్యుతులన్. ౨౩½

క. తనరారుచుండ నయ్యెడ, వనితాసంయుతు గరేణు♦వారయుతంబౌ
ఘనగజమనఁదగువానిని, మనుజేంద్రుని గార్తవీర్యు ♦ మహితవిలాసున్. ౨౪

చ. కనుఁగొని రాక్షసప్రభువు ♦ గాఢరుడుగ్రతరాక్షిజాలుఁడై
తనబలగర్వదర్పముల ♦ దన్యమహీపతి యెట్టివాఁడొ క
న్గొనకయె రాజమంత్రులను ♦ గూర్చి వచించె గభీరవాక్కులన్;
చనుఁ డిదె మంత్రులార! నృప♦సత్తమునిం గని చెప్పుఁ డివ్విధిన్. ౨౬ 1597

చ సమరముఁ గోరి రావణుఁడు ♦ చయ్యన వచ్చె నటంచు, నన్న నా
యమరవిరోధివాక్కు విని ♦ యర్జును మంత్రులు సంగరార్హబా
ణములను దాల్చి యోదనుజ♦నాయక! రావణ! మేలు మేలు యు
ద్ధమునకు నర్హకాలము ని♦తాంతము లెక్కిడి వచ్చినావు సూ!. ౨౭ 1598

సీ. ఎవ్వఁడు మత్తు స్త్రీ♦వృతు యుద్ధమునకు రమ్మని పిల్చునో యట్టి♦యధము నుర్వి
సత్పురుషులు గాంచి ♦ సతతంబు భ్రూణహత్యను జేసినట్లుగాఁ♦దలఁచుచుంద్రు
వనితాయుతుండయి ♦ వారి కేళిం దేలువాని నర్జును నెట్లు ♦ బవరమునకుఁ
బిలిచెద వీవు సు♦త్తిలి యాఁడు నేన్గుల నడుమ రాజిలుహాస్తి♦నాథుఁ బెద్ద

ఆ. పులి రణంబు చేయఁ ♦ బిలిచెకురీతిగా;, నోదశాస్య! సైఁప ♦ నొప్పు నిపుడు
రాత్రి యెట్లొ గడవు ♦ రణసముల్లాసంబు, గలుగునేని రేవు♦క్ష్మాపతీంద్రు

క. అనిచేయం బిలువ్వము; నెమ్మనమున యుద్ధాతురంబు ♦ మైకొను నేనిన్
దనుజేంద్ర! మమ్ముఁ జంపియె, చనఁగల వాయర్జునాఖ్య♦సన్నిధి కనినన్.

క. దనుజేంద్రునిమంత్రులు చయ్యన నర్జునుమంత్రివరుల ♦ నయ్యదనున మూ
ర్కొని కొండలఁ గొట్టిరి నెక్కొను నాఁకలిఁ బూన్కిఁ దినిరి♦కొండలఁ బెలుచన్.

*తే. హాలహాలాశబ్ద ముదయించె ♦ నంతలోనఁ
దత్తటంబున నర్జున♦ధరణివిభుని
యనుచరులు రావణునిమంత్రు♦లను గడిచిని
దాఁకి రంతటఁ దుములయు♦ద్ధంబు చెల్లె. ౩౪ 1602

క. శరతోమరత్రిశూలో,త్కరముల శూలముల వజ్ర♦కాండంబులఁ గ
ర్బురపతిమంత్రులఁ జెండుచుఁ, దర్వరపడి పై దుమికె రయ్య♦వసరమునందున్.

క. మనుజేంద్రయోధవేగం, బనూనరీతిం జెలంగె ♦ నతిభయదంబై
కన నక్రమీనమకరం, బనుపమమునునైన యబ్ధి♦యాఘోషము నాన్. ౩౬

ఆ. అసురవర్యమంత్రు♦లగు ప్రహస్తుఁడు శుక
సారణు లొగి రాజ♦సైన్యములను
దేజములను గాల్చి ♦ దీపించి; రీవిధి
నసురపతి యమాత్యు ♦ లార్భటించి. ౩౭ 1605

* తతో హాలహాలాశబ్దః-అనిమూ.

క. బలములఁ దునుముట విక్రమ, ములఁ బొల్చుట ద్వారమందుఁ ♦ బొలుచు భటు లొగిన్
నలిలక్రీడాతురుఁడౌ, నిలేశునకుఁ దెల్పి, రంత ♦ నీ రణవార్తల్. ౩౯ 1606

క. విని భయపడకుఁడు మీ రని, వనితలకుం జెప్పి తటిని ♦ వారి వెడలి కం
గను గ్రుంకి వెడలు నంజన, మను హస్తివిధంబు తోఁప ♦ నానమయమునన్.

చ. కనఁగ భయంకరంబయిన ♦ క్రౌర్యము తోఁ గను లెంతొ యెఱ్ఱనై
తనరఁగ నగ్నినానలుఁడు ♦ దారుణలోకలయాగ్నిరీతి నా
య్యన భయదార్చులన్ వెలసె; ♦ నప్పుడె హైమనుయాంగదుండు స
జ్జననుతుఁ డర్జునుండు గదఁ ♦ జండకరంబునఁ బట్టి యేడ్తెఱన్. ౪౧౫ 1608

క. పరుగిడె దనుజులఁ జెండఁగ, నరుణాంశుం డంధకార ♦ మడఁపఁ గవియు న
ట్లురవడిఁ; *కరవిక్షేపమె, కరణంబుగ నలరు తీవ్ర ♦ గద మెఱయంగన్. ౪౩౫

క. గారుడవేగం బొప్పఁగ, నారవమతి భీకరముగ ♦ నఖిలదిశలనుం
బారావారరవంబన, జోరన వ్యాపింప దుమికెఁ ♦ బొంగుచు నంతన్. ౪౩

క. నరపతి చనుమార్గంబును, నరికట్టి సరోజమిత్రు ♦ నధ్వము వింధ్యా
ఖ్య రహిం బొల్చెడు గిరివలెఁ, గరమున ముసలంబు గ్రాలఁ ♦ గా భీకరుఁడై.

క. అనిమొన నకంప్యుఁడై యొ,ప్పిన యా భటనాయకుండు ♦ పృథుతరబలుఁ డం
చు నుతులఁ గన్న ప్రహస్తుఁడు, మనుజేంద్రుని యెదుట నిల్చె ♦ మండుచు నలుకన్.

సీ. మదమున నిక్కుచు ♦ మార్తురు బెదరంగ నొప్పు ప్రహస్తుఁ డ ♦ త్యుగ్రుఁ డగుచు
లోహనిబద్ధమై ♦ యూహింపఁగాఁ గాలదండాకృతిని బొల్చి ♦ బెండు పడని
శక్తిని దగిన ము ♦ సలమును ద్రిప్పుచు గార్తవీర్యనిసువ ♦ క్షుంబుఁ జక్క
గుఱితించి వైచెను ♦ గ్రోధ ముట్టిపడంగ; నంతఁ బోవక యార్చె ♦ నతిభయంక

తే. రముగ మేఘంబు కరణి న ♦ య్యమలసాధ
నాగ్రమందు నశోకపు ♦ ష్పావళి యట్టు
లగ్ని యుదయించె సురరిపుఁ ♦ డద్ది విసరు
తఱిని వైరిని దహియింపఁ ♦ దలఁచె ననఁగ. ౪౬ 1613

ఉ. అత్తఱిఁ గార్తవీర్యమను ♦ జాధిపుఁ డాముసలంబు రాఁగ న
త్యుత్తమబుద్ధినైపుణము ♦ నొప్పఁగఁ గన్పడ దానిఁ జెండెఁ జే
నత్తిన భీతికృద్గద న ♦ హార్యపరాక్రమశాలి గాన; ని
ట్లత్తఱి దానిఁ బోనడఁచి ♦ హైహయవీరుఁడు సత్వరంబుగన్. ౪౭౫ 1614

క. పెనుగద గిరగిరఁ ద్రిప్పుచుఁ, దనవేయికరంబులందుఁ ♦ దగున ట్లది యొ
క్కని మేషమునం దిరుగఁగ, దనుజేంద్రుని పైకి దుమికె ♦ దారుణభంగిన్. ౪౮

చ. చని జనమొప్ప నాగదను ♦ శత్రువు నొంపఁగ వజ్రివజ్రతా
డనమున శబ్దమొప్పఁగ వ ♦ డంకుచుఁ గూలు మహీధరంబు నా

* బాహువిక్షేపకరణాత్-అనిమూ.

దనుజవరూథినీపతియుఁ ♦ దద్గదతాఁకున నేలఁ ద్రెళ్లె; నా
తనిగతిఁ గాంచి భీతిఁ బ్రవి♦దారణరంగము వీడి యుత్తరిౕ. ౪౯౹ 1616

క. మారీచుండును శుకుఁడును, సారణుఁడు మహోదరుండు ♦ చంచద్బలగం
భీరుఁడు ధూమ్రాక్షుండును, దూరమునకుఁ బోయి రేమి♦తోఁచక యంతౕ.

చ. తనసచివుల్ తొలంగుటయు ♦ ధాత్రిఁ బ్రహస్తుఁడు ద్రెళ్లి యుంటయుం
గనుఁగొని రావణుండు నృప♦కాంతుని నర్జును దాఁకె నుద్ధతిౕ;
గనఁదగియుండె నయ్యని య♦ఖండ*సహస్రకరుండు విక్రమిం
చినతఱిఁ జేతు లిర్వదియుఁ ♦ జెల్వమరందగువాఁడు మాఱ్కొనౕ. ౫౧౹ 1618

ఆ. అతిభయంకరముగ ♦ నవుడని చూపట్టె, గగురుపాటు చాలఁ ♦ గల్గునట్లు;
కలఁగి సాగరములు ♦ క్రన్నన మాఱ్కొన్న, కరణి నట్టె లేచి ♦ క్ష్మాధరములు.

సీ. అని చేయఁ బూనిన ♦ యనువునఁ, దేజంబు గ్రాలునాదిత్యుల ♦ లీల, లోక
ములఁ గాల్చునగ్నుల♦వలె, మదమెత్తినగజములునొకయొఁడు♦గజముతోఁ ఢుకుఁ
బోరాడురీతిని ♦ బొంగి మాఱ్కొనెడువృషభములరీతి ని♦స్స్వనము లొప్ప
మాఱ్కొను మొగుళుల♦మాడ్కి,బలోత్కటపంచాస్యములుపోరు♦భంగిఁగోప

తే. మడరఁదాఁకొన్న యారుద్ర♦యములరీతినర్జునుండును రావణుం♦డాత్మగదల
సాయమునఁ బొండొరులమించు♦సంతసమునఁనొకరినొక్కరునొంచిర♦త్యుగ్రభంగి.

చ. శతమఖువజ్రఘాతముల ♦ సాంద్రభయంకరరీతులౕ మహా
క్షితిధరముల్ సహించుగతిఁ ♦ జిత్రగదాప్రహతుల్ సహించి రా
క్షితిపతి రావణాసురులు; ♦ జిష్ణుపవిధ్వనులం బ్రతిశ్రుతుల్
జతనము మీఱఁ గల్గుగతి ♦ శాతగదాద్వయఘట్టనంబులౕ. ౫౬౹ 1621

క. కలిగెఁ బ్రతిశ్రుతు లెల్లెడ, నిలేశుగద యట్టె దాన♦వేంద్రునివక్ష
స్థలమునఁ బడి మిడుఁగురులం,గలిగించుచు మెఱపుఁదీఁగ♦గమినభమువలెౕ.

క. కనకచ్ఛాయను గూర్చెను;, దనుజేంద్రునిగదయు నట్టె ♦ ధరణీశునిఱొ
మ్మును దాఁకి భూరిపర్వత,మునఁబడు నుల్కవలె నయ్యెఁ ♦ బోరున నంతౕ.

తే. అర్జునుండును ఖేదంబు ♦ నందఁడయ్యె
దానవేంద్రుఁడు నాత్మభే♦దమును బొందఁ
డయ్యె, నవ్వారిసమరంబు ♦ నబ్బలి సుర
నాయకుల యుద్ధమట్లు ద♦నరె సమముగ. ౬౦ 1624

క. శృంగంబులచే వృషములు, పొంగుచు, దంతములచేత ♦ భూరిగజము లు
త్తుంగక్రోధంబునఁ దాఁ,కం గల్గినరీతి దనుజ♦కాంతనరపతుల్. ౬౧౹ 1625

ఆ. ఒకరి నొకరు నొంచి ♦ రుగ్రగదాహతి;, నంత నర్జునుండు ♦ నుంతయేని
బెండుపడకయున్న ♦ భీకరదనుజేంద్రు, నట్టె చూచి మిగుల ♦ నాగ్రహించి.

* సహస్రబాహో స్తద్యుద్ధం వింశద్బాహో శ్చ దారుణమ్-అనిమూ.

చ. తన యనుపంక్తి నొక్కగతిఁ ♦ దాల్ప గదన్ వెనఁ ద్రిప్పి వైరినిం
గని స్తనమధ్యభాగమునఁ ♦ గ్రన్నన మోఁదిన నాగదాయుధం
బును వరదానసంజనిత♦భూరిబలుండగు రాక్షసేశుఁడా
మ్మునఁ బడి దుర్బలాకృతిని ♦ బొంది ద్విధాప్రవిభక్తమై పడెన్ ౬౩ 1627

క. ధరఁబడియె గదాహతిచే, సురరిపు వొక విల్లుపట్టు ♦ క్షోణి వెనుకకుం
ద్వరగాఁ బోయెను నాడెడు, కరణిన్ బెండువడె; నంత ♦ క్ష్మాపతివరుఁడున్.

ఆ. అతఁడు చంచలించు ♦ టారసి జవమున
గరుడుఁ డేచి పన్న♦గంబుఁ బట్టు
కరణి నగిరి పట్టి ♦ గాఢబలంబున
వేయిబాహువులను ♦ విప్పి యపుడు. ౬౫ 1629

క. బల మట్టి కనఁబడఁగ నుజ్జ్వలతేజము మెఱయ దనుజ♦వర్యుని మును పా
బలి నారాయణుఁ డలమిన, చెలువున బంధించె సురలు ♦ సిద్ధులు పొగడన్.

క. దనుజుఁడు బంధింపంబడఁ, గనె చారణముఖ్యు లెల్లఁ ♦ గడుమోదంబుం
గని మేలుమే లటంచున్, మనుజేంద్రుని శీర్షమున సు♦మమ్ములు చల్లన్. ౬౭

సీ. వ్యాఘ్రంబు మృగమును ♦ బట్టినకైవడిఁ బంచాస్య మొకదంతిఁ ♦ బట్టునట్లు
దనుజేంద్రు బంధించి ♦ ధాత్రీశ్వరుం డార్చె హర్షంబుమీఱఁగ ♦ నంబుదంబు
కరణిని బలుమఱు ♦ కర్బురేంద్రుఁడు పట్టుపడుటను గని తన♦బలము లెల్ల
వెంబడి రాసుంత ♦ విహ్వలంబును మాని యాగ్రహంబునఁ బాఱె♦నవనివిభుని

తే. పైకి వేగ ప్రహస్తుండు; ♦ బలము లిట్లు
పైనఁ బడుచుండ నత్తఱి ♦ వర్షముతఱి
నబ్ధిపైఁ బడు మేఘంబు ♦ లట్లు గానఁ
బడియె; నంతట దనుజులు ♦ పటురవముల. ౭౦ 1632

చ. నిలు నిలు మెందుఁ బోఁగలవు ♦ నిర్జరవైరిని బట్ట శక్యమే
బల మిఁకఁ జాలు వే విడువు ♦ పార్థివ! యం చొగిఁ బల్కుచున్ సము
జ్జ్వలముసలాళిశూలముల ♦ సాహస మొప్పఁగ మొత్తి; రంత దో
ర్బలమున శత్రుహంతయయి ♦ భాసిలునర్జునుఁ డట్టి నవ్వుచున్. ౭౧ 1633

క. తనపైనఁ బడకముందే, దనుజులయాయుధము లెల్లఁ ♦ దా గ్రహియించెన్;
మనమునఁ దొందరలేకయె, ఘననిశితశరాయుధములఁ ♦ గైకొనియె వెసన్.

క. సురవైరుల మోఁది త్వరం, బఱుగెత్తఁగఁ జేసె భూరి♦వాయువు మేఘో
త్కరమును వలె దనుజుల నిక్కరణిన్ భయపెట్టి భూప♦కాంతుం డంతన్.

క. రావణునిం గైకొని మిత్రావృతుఁడై పురముఁ జేరె; ♦ నవనీసురులున్
బావనమతులగు పౌరులు, వావిరి కుసుమాక్షతలను ♦ బైఁ జల్లంగన్. ౭౪

*క. పురుహూతసన్నిభుం డా,ధరణీశ్వరమౌళి, దేవ♦తల్లజుఁడు బలిన్
బరిపంథి గెల్చి దేవన,గరమును జొచ్చెడువిధంబు♦గాఁ జొచ్చెఁ దమిన్. ౭౫

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 33 - వ సర్గము.

{ పులస్త్యబ్రహ్మ కార్తవీర్యునియొద్దకుం బోయి రావణాసురుని బంధవిముక్తుని జేయుట. }

చ. అనిలుని గైగ్రహించునటు ♦ లాదశకంఠునిఁ గార్తవీర్యుఁడన్
జనపతి పట్టి కట్టెనని ♦ స్వర్గపురంబున నిర్జరుల్ తమం
తన వచియింపఁగా వినియెఁ ♦ దాను బులస్త్యమునీంద్రుఁ; డంతఁ బౌ
త్రునిపయిఁ గల్గుస్నేహమునఁ ♦ దొరపుధైర్యము గల్గియుండియున్. ౧ 1638
క. కంపించి పంక్తిగళు విడు,పింపంగాఁ గార్తవీర్య♦పృథ్వీపతి పా
లింపం దగు మాహిష్మతిఁ, బెంపునఁ దగుదానిఁ జొచ్చు♦ప్రియ మలరారన్.
ఉ. అంబరవీథిఁ జొచ్చి మహి♦మాధికుఁ డమ్మునియుం బ్రభంజనా
భంబగు సద్గతు లొప్పదలఁ ♦ బట్టణవర్యముఁ జేరఁబోయె శ్రే
ష్ఠంబగు చిత్తవిక్రమము ♦ సాధుతమంబయి యొప్పుచుండ; నం
తం బరిశుద్ధవర్తనుఁడు ♦ తన్ముని గాంచెను సంతసంబునన్. ౩ 1640
క. అమరావతితో నీడయి, విమలమనోహృష్టపుష్ట♦వితతమనుజమై
యమరెడుమాహిష్మతినగ,రముఁ జొచ్చెను స్వర్గపురము ♦ బ్రహ్మయుఁబోలెన్.
చ. కమలసఖుండు కాల్నడక ♦ క్ష్మాస్థలిపైఁ జరియించుమాడ్కి న
భస్సము విడి క్రిందికిం దిగిన ♦ బ్రహ్మమునీంద్రునిఁ జూడరాని తే
జమున వెలుంగువానిఁ గని ♦ చక్కనెఱింగియె ద్వారపాలకుల్
గమనవిశేషముల్ మెఱయఁ♦గాఁ జని తెల్పిరి భూమిభర్తకున్. ౫ 1642
క. మునిపతియైన పులస్త్యుఁడు, చనుదెంచె నటంచు రాజ♦సత్తముఁడు వినం
గనె దోసి లొగ్గి మునివ,ర్యున కెదురుగఁ బోయె భక్తి♦యొప్పుచునుండన్. ౬
తే. అర్ఘ్యమధుపర్కములఁ గొని ♦ యతనివెంటఁ
బోయెను బురోహితుఁడు వాస♦వునకు వెనుక
నరుగు గీష్పతిచాడ్పున; ♦ నంత రాజు
నుద్యదర్కునిచందాన ♦ నొప్పువాని. ౭ 1644
చ. తను గన వచ్చుచున్న ముని♦తల్లజుఁ గాంచుచు సంభ్రమించి యీ
శునిఁ గని మ్రొక్కి దేవవిభు♦చొప్పున వందన మొప్పఁ జేసె; నా
మనుజవిభుండు భక్తిమెయి ♦ మానికిఁ బాద్యము నర్ఘ్య మట్లె చ
క్కనిమధుపర్క మిచ్చి తమి ♦ గద్గురుపాటు చెలంగుపల్కులన్. ౮ 1645

---

* ప్రవివేశ తాం పురీం పరం సన్నాహ్య హృష్టః సహస్రలోచనః-అనియూ.

తే. పలికె నిట్లని; యి త్తఱి ♦ భద్రదాన
దక్ష! మౌనీంద్ర! యమరప♦ త్తనముగాఁగఁ
జేయఁబడెను మాహిష్మతి ♦ చెలఁగి నిన్నుఁ
జూడరాని తేజంబును ♦ గూడు మునిని. ౯౪ 1646

క. కనుటను ధన్యుఁడనైతిని, మును నేఁ జేసిన వ్రతంబుఁ ♦ బొందెను ఫలముల్
జననము సఫలంబయ్యెను, ఘనతపము ఫలించె మౌని♦గణదేవేంద్రా!. ౧౧

క. సురగణవంద్యములౌ త్వచ్చరణంబుల కేను మ్రొక్కఁ ♦ జాలితిఁ గానన్
బరిపూర్ణకాంక్షుఁడనె యి,త్తఱుణంబున; రాజ్య మిద్ది ♦ తావక మయ్యెన్.౧౨

తే. వీరె పుత్రులు భార్యలు ♦ వీరె మేము
నెల్ల నీవారమే చేయ ♦ నేమి గలదొ
తెలుపుమా యాజ్ఞ చేయఁగాఁ ♦ గలరు మాకు
బ్రహ్మమౌనీంద్ర! మీరని ♦ పల్కుటయును. ౧౨౪ 1649

చ. అనలునికృత్యముల్ జరగు ♦ నయ్య! యథావిధి ధర్మ మాదరం
బునఁ గనుచుందువే, తనయుఁ ♦ బోలిక సేవకరాజి మన్ననం
దనుపుదువే కదా, యనుచు ♦ ధారణిపాలకు హైహయాధిపా
గ్రజునుఁ గని ప్రశ్నచేసి ముని♦సోముఁడు నాతఁడు పల్కె నివ్విధిన్. ౧౩౪ 1650

చ. సరసిజపత్రలోచన! వి♦శాలశరచ్ఛశితుల్యవక్త్ర! యో
నరవర! నీభుజాబల మ♦నంతము రావణునిన్ జయించు ట
బ్బురమగుఁ గాదె?; యేదనుజ♦భూరిబలంబున కెంతొ భీతిసా
గరమున వాయువున్ గదలఁ♦గా వెఱచుం గద యెల్లవేళలన్. ౧౫ 1651

సీ. అట్టిదుర్జయుఁడు ద♦శాననుం డనిమొన బంధింపఁబడియె నీ♦బలముకలిమి
నతఁడు నాకుం బౌత్రుఁ♦డగు వానియశ మెల్లఁ ద్రాగితి వీవును ♦ రావణునిని
బట్టి నంచను పేరు ♦ భాసిల్లఁ జేసితి వెల్లలోకములందు; ♦ నివుడు నీవు
నా మాట లాలించి ♦ నా పౌత్రు దశకంఠు నాయనా! విడిపింపు ♦ న్యాయబుద్ధి

ఆ. నను పులస్త్యుపల్కు ♦ లాలించి యించుక
బదులు పల్కకపుడె ♦ పార్థివేంద్రుఁ
డసురనాథు విడిచె ♦ హర్షంబు గనినట్లు;
పంక్తికంఠు నిట్లు ♦ వదలి యంత. ౧౬౪ 1652

క. అనుపమదివ్యాంబరముల, ననూనభూషణవితతిని ♦ నమలినహారా
ళిని రావణుఁ బూజించుచు, *ననలునికడ హింసమాను♦నట్టివిధమునన్. ౧౮

ఆ. సఖ్యమాచరించి ♦ త్ర్యాసురమౌనికి, వందనంబు లిడుచుఁ ♦ బార్థివుండు

* అహింసకం సఖ్య ముపేత్య సాగ్నికమ్-అనియూ.

మరలిపోయె; బ్రహ్మ♦మానియు విడిపింప, *విక్రమంబు గలుగు ♦ విబుధవైరి.

ఆ. అతిథిపూజ లంది ♦ యధిపుండు గొంకటం, జేర్చ నోటమికి నవ్వి♦చిత్తమందు
సిగ్గుపడుచుం బోయె; ♦ శీఘ్రంబ పౌత్రుని, బంధముక్తుం జేసి♦బ్రహ్మసుతుండు.

క. మునిపతియు నో పులస్త్యుండు, చనియెం బితామహునిలోక♦సత్తమమునకున్
విను రామా! రావణుం డి, ట్లని నర్జునుచేత భంగ♦మందెన్ జుమ్మా. ౨౦౫

తే. అప్పులస్త్యునివాక్కుచే ♦ నతఁడు మరల
బంధముక్తిని గాంచెను ♦ బలయుతులకు
బలముగలవారివలననే ♦ బంధనంబు
గలుగుచుండును శ్రీరామ! ♦ లలితసుగుణ!. ౨౧౫ 1657

క. తనశ్రేయంబును గోరెడు, జనుం డెవ్వఁడు గాని పరులఁ ♦ జంపం జన దో
జనవర! యవమానింపంగను జనదు స్వహాని దానఁ ♦ గలుగుం జుమ్మా. ౨౨

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ తాను సహస్రకరావమానముం
గనియును మైత్రిఁ గాంచి కడు♦గర్వమునన్ నృపరాజిఁ జంప మే
దినిఁ జరియింపఁ జొచ్చెఁ దన♦తీవ్రపరాక్రమ ముల్లసిల్లఁగా
మనుజపతుల్ తనుం గదియ ♦ మ్రుందఁగఁ జేయుచు దోర్బలంబునన్. ౨౩

ముప్పదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౪ - వ సర్గము.

రావణుఁడు వాలిచే భంగపడుట.

మ. కృతవీర్యాత్మజుచేత నివ్విధి విము♦క్తిం గాంచి రక్షోవిభుం
డతివీర్యంబునఁ బొల్చినట్లు మదిలో ♦ హర్షంబు మీఱంగ ను
ద్ధతుఁడై ఖేదము మాని భూమిఁ దిరిగెన్; ♦ దర్పాకులంబుం దుర్విలో
దితిజుండేని మనుష్యుఁడేని బలసం♦దీప్తుండు రాజిల్లఁగన్. ౧౫ 1660

మ. వినినంతన్ దనుజాధిపుం డరిగి వే♦వే యుద్ధముం జేయ ర
మ్మని పిల్చున్ బటుదర్పమొప్ప; నిటు లం♦త్యంతప్రతాపంబుఁ గై
కొని యుద్వృత్తిఁ జరించుచుండి యొకటన్ ♦ గొంకింతయున్ లేకయే
చని కిష్కింధను వాలిపాలితరుచి♦స్ఫారన్ బురిన్ గాంచుచున్. ౨౫ 1661

చ ఘనతరహేమమాలికను ♦ గ్రాలెడు వాలిని యుద్ధ మొప్పఁ జే
యను వడిఁ బిల్చె రమ్మనుచు; ♦ నంతట వానరరాజమంత్రి తా
రను గని పెంచినట్టి జల♦రాజితుఁ డీడ్యుఁడు తారనాముఁ డా
దనుజవరేణ్యు సంగరము♦దంబున వచ్చినవాని నత్తఱిన్. ౪ 1662

---

* రాక్షసేంద్రః ప్రతాపవాన్-అనియూ.

చ. కనుఁగొని యిట్లు పల్కె సుర♦కాండవిరోధిపతీ! ప్లవంగరా
జనుపమధైర్యశాలి సమ♦రాంగణమందు నినుం దగంగ మా
ర్కొని నిలువంగ నోపెడు, న♦కుంఠితసాహసుఁడై చెలంగు, నా
యనిమిషరాజనందనుఁ డ♦హార్యబలాఢ్యుఁడు వాలి యుత్తఱిన్. ౫ 1663

చ. పురమున లేఁడు నీయెదుటఁ ♦ బూనిక నిల్చెడుశక్తిగల్గువాఁ
డరయఁగ నెవ్వఁ డింకఁ ద్రిద♦శాధిపసూనుఁడు తక్క; నట్టిదు
ర్భరబలశాలి వాలియును ♦ వార్ధిచతుష్కమునందుఁ గ్రుంకి భా
స్కరునకు నర్ఘ్యమిచ్చి తగ ♦ సంధ్య నుపాసనమొప్పఁ జేయఁగన్. ౬

మ. అరిగెం గాన ముహూర్తమాత్ర మిట నీ ♦ వత్యంతమోదంబునన్
ద్వర వర్జించియె నిల్వుమా యతఁడునున్ ♦ వచ్చున్ రణం బిచ్చుఁ; గ
ర్బురనాథా! యివె యస్థిపంజరము లీ♦పూగంబు శంఖౌఘపాం
డురవర్ణంబయి మించు సంగరమునన్ ♦ నూత్నోత్సవం బొప్పఁగన్. ౭

శా. [1]వాలిన్ మార్కొనవచ్చురాజు లని దు♦ర్వారప్రతాపంబునుం
గ్రాలం బొల్చెడు వాలిచేఁ బడి రివే ♦ క్ష్మానాథశల్యంబు లిం
కేలా మాటలు రావణా! సుధను నీ♦వే త్రాగినట్లైన న
వ్వాలిన్ మార్కొనఁ బూనిన ట్లయినచోఁ ♦ ద్వజ్జీవితం బత్తఱిన్. ౮ 1666

శా. అంతంబుం గను విశ్రవస్సుత! జగ♦ద్వ్యాపార మత్యద్భుతం
బింతంతే యని చెప్పరాదు కనుమా ♦ యీలాటివ్యాపారమే
వింతై యొప్పఁగ నీవు వాలిఁ దొడరన్ ♦ వేగంబ యేతెంచితే
యంతంబుం గనువాఁడ వొక్కక్షణమే ♦ యవ్వాలినిం జూడఁగన్. ౯

చ. [2]నిలువుము దుర్భరంబగును ♦ నీదగుజీవిత మంతమాత్రచే
నిలువఁగ నొల్లకే యిపుడె ♦ నీవు మృతిం గనఁగోరెదేని య
బ్బలయుతుఁ డున్నదక్షిణపు♦భాగమునందగు సంద్రముం గనన్
జలమునఁ బొమ్ము నీవయిన ♦ సర్వమనోరథముల్ ఫలించెడున్. ౧౦ 1668

చ. ధరణికి వచ్చియున్న రుచి♦ధాముని మాడ్కిని బావకాకృతిం
బరమరుచిన్ వెలుంగు కపి♦వల్లభుఁ జూడఁగలాఁడ వచ్చటన్
సురరిపునాథ! యంచు ఘృణి♦శోభితుఁడై తగుతారుఁడన్న నా
శరపతి చప్పరించుచును ♦ శంక యొకింతయు లేక యాత్మలోన్. ౧౧ 1669

చ. తనవిభుని న్నుతించెఁ గద ♦ తారుఁడు వీఁడు భయంబు నామనం
బునఁ గలుగంగ, నట్లయినఁ ♦ బోయెద దక్షిణవార్ధి కందు నో

1 యదా మృతరసః పీత స్త్వయా రావణ రాక్షస, తదా వాలిన మాసాద్య తదంతం తవ జీవితమ్-అనిమూ. 2 అథవా త్వరసే మర్తుం గచ్ఛ దక్షిణసాగరమ్-అనిమూ.

క్కనిఁ గనవచ్చు సాయమును ♦ గల్గదు వాలికి నందు నోర్వ నా
తని సుకరంబు నాకగును ♦ దప్పక పోయెద నంచు నెంచుచున్. ౧౧ 1670

చ. బలములఁ గూడి దక్షిణపు♦వార్ధికిఁ బుష్పక మెక్కి పోయె; నా
యిలఁ గనకాద్రిరీతిగ న♦హీనతనుద్యుతిఁ బొల్చి బాలపూ
షలలితవక్త్ర మొప్పఁగను ♦ సంధ్య జపింపఁగ దత్పరుండుగాఁ
జెలఁగెడువాలినిం గనియెఁ ♦ జిత్రమరీచుల నొప్పుచుండఁగన్. ౧౨ 1671

చ. కనుఁగొని యంజనాద్రిగతిఁ ♦ గ్రాలుసురారివరుండు పుష్పకం
బును డిగి యొంటినున్న కపి♦పుంగవు వేగమె పట్టనెంచి మే
దిని బదశబ్ద మించుకయుఁ ♦ దేటపడంగను జాలకుండురీ
తిని జనియెన్; గపీంద్రుఁడు య♦దృచ్ఛగఁ గన్నులవిప్పి యత్తఱిన్. ౧౩

క. పాపాభిప్రాయంబున, నాపగిదిం దన్నుఁ బట్ట ♦ నరుదెంచెడు న
ప్పాపాత్ము రావణుం గని, యేపున నించుకయుఁ దర న♦దెవ్విధి మదిలోన్.

క. పొందక నియమోల్లంఘన,ముం దగఁ జేయకయె శకశ♦మున్ గ్రహియింపన్
డెందమునఁ గోరుసింగము, చందంబునఁ బాముఁ బట్టు♦చక్రిరథగతిన్. ౧౪

క. తనుఁ బట్టవచ్చురావణు, మనమున నిర్లక్ష్యముగ న♦మానుషశౌర్యం
బునఁ దలఁచుచు రారా ర,మ్మనియే జపియించుచుండె ♦ నాతఁడు మఱియున్.

క. పాపమతిం దను వంచనఁ, బ్రాపించి గ్రహింపవచ్చు♦వాఁడు గదా, యి
క్లేవున వచ్చెడు దుష్టుని, శ్రీపతివైరిని మదంబు♦చెడునట్టి విధిన్. ౧౬ 1673

[1]క. చంకలఁ జేతులఁ జొన్పియె, బింకంబున నన్నుఁ బట్టు♦ప్రీతిని జేరం
జంకించి యదిమి కరముల, పొంకముఁ జెడ నట్టె లేచి ♦ పొంగెడుకాంక్షన్.

క. అరిగెదఁ దక్కినరత్నా,కరముల మూఁడింట స్నాన♦కార్యము జరపం
బరమాశ్చర్యము కల్గెడు,కరణిన్; నాచంకలందుఁ ♦ గసుదీనుండై. ౧౭ 1678

[2]క. ఊరుకరాంబరములు నే, భూరిగతిం బోవుచుండఁ ♦ బొలుపు విడువఁగా
ధారణిఁ బడ నుంకించెడు, తీరున వ్రేలాడ వైరి ♦ దితిజేశ్వరునిన్. ౧౮ 1679

చ. గరుడుఁడు పన్నగంబుఁ గొని ♦ గాఢగతిం బరుగెత్తుచుండు న
త్తరుణమునన్ బలం బెడల ♦ ధైర్యము దూలఁగ వ్రేలుపాము నాఁ
గరములఁ జిక్కియున్న దశ♦కంఠునిఁ జూతురుగాక యెల్ల వా
రరుదుగ నంచు నివ్విధిని ♦ నాత్మఁ దలంచుచు మౌనముద్రుఁడై. ౧౯ 1680

క. చరణధ్వని వినఁబడు నా,కరణిం జెవియొగ్గి వినుచుఁ ♦ గడు నియతిని భీ
కరమూర్తి గ్రాల వేదో,త్కరమంత్రంబులు జపింపఁ♦గా సాగె మదిన్. ౨౦

1 కక్షావలంబినం కృత్వా గమిష్యే త్రీన్ మహార్ణవాన్-అనిమూ. 2 స్రంసమానకరాంబరమ్-అనిమూ.

తే. భ్రాంతి నొందక పర్వతేం♦ద్రంబువోలెఁ
గనులయఱమోద్పు సొగసుఁగాఁ ♦ గానఁబడఁగ
నుండె; నొక్కరి నొక్కరు ♦ చండబలము
వెలయ గ్రహియింప నెంచెదు ♦ వేడ్కమీఱ. ౧౯ 1682

క. హరిరాక్షసపార్థివు లా,తరుణంబున యత్నములను ♦ దర్పబలములన్
బరిపూర్ణు లౌట నుండిరి; సురవైరియుఁ జెంతఁ జేరి ♦ శుంభద్గతిచేన్. ౧౯॥

చ. చరణనినాద మించుకగ ♦ శత్రు వెఱుంగఁగఁ బట్టఁ జాఁపె భీ
కరకరపంక్తి; రావణుని ♦ గాంచక ప్రాఙ్ముఖుఁడయ్యు నక్కపీ
శ్వరుఁడు పదధ్వని న్నికట♦శత్రువుఁ జక్కఁ దలంచి పట్టఁగాఁ
గరములఁ జాఁచె నంచెఱిఁగి ♦ గాఢబలంబు చెలంగుచుండఁగన్. ౨౦ 1684

క. గ్రహియించెఁ బక్షినాయకుఁ, డహిఁ బట్టెడురీతి; నంత ♦ నారాక్షసు దు
ర్వహునిన్ దనుఁబట్టు ప్రియా,వహునిన్ గ్రహియించిప్లవగ♦వర్యుఁడుపూన్కిన్.

క. కరాంతరమున వ్రేలెడు, రక్షఃపతితోడ నెగిరె ♦ రయమున దివికిన్
వీక్షించువార లెల్లను, సాక్షాద్విహగావనుతుండె ♦ చనెడు నురుగతిన్. ౨౧॥

చ. అని తలపోయుచుండ నవు ♦ డక్కపినాథుఁడు చంకలందుఁ జి
క్కి నఖములన్ దనున్ మిగుల ♦ గీఱెడు రావణు నాత్మహస్తముల్
ఘనబల మొప్పఁగా నదిమి ♦ గాఱియపెట్టుచు గాలి తోయదం
బును గొనిపోవులాగునఁ గు♦బుద్ధిని గైకొనిపోయె నొక్కటన్. ౨౨॥ 1687

ఉ. దేవవిరోధి సిగ్గుపడి ♦ తేఁకువ పోవఁగఁ బోవుచుండుటల్
వావిరిఁ గాంచి హానినచి♦వప్రవరుల్ విడిపించుకాంక్షలం
గావర మొప్ప నార్చుచు న♦ఖండరయంబున వెంటఁ బాఱె; రా
దేవపతిప్రియాత్మజుఁడు ♦ దృప్తనిశాచరు లొక్కపెట్టునన్. ౨౩॥ 1688

మ. తనవెంటం దగులంగ వాయుపథమ♦ధ్యస్థానగుండై తగన్
వనజాప్తుండు పయోదమాలికల న♦భ్రవ్యాప్తుఁడై వెల్గురీ
తిని; నంతం దనుజేంద్రమంత్రులు సము♦త్తేజంబునం బోవు నా
తనిఁ జేరం జనఁజాల కంబరమునం ♦ దద్వాలి యొందో చనన్. ౨౪ 1689

చ. అతనికరోరువేగమున ♦ శాగక దీనతనొంది నిల్చి; రు
న్నతగిరులైనఁ దజ్జవము♦నం గడు వెన్కకు నెట్టఁగాఁబడున్
గృతపలలాసృగంగులగు ♦ కేవలదానవమానవాదులే
గతిఁ జనఁజాలువారు ప్రదు♦కం దలపోసినవారె యైనచోన్;. ౨౬॥ 1690

ఆ. పక్షిగణములట్లు ♦ పఱవంగఁ జాలక, వెనుక కొదుగునట్లు ♦ చనియె; నంతఁ
బశ్చిమోత్తరేంద్ర♦భాగసముద్రము, లందు వరుసఁ గాల ♦ మరుగకుండ. ౨౭

క. అనుపమవిధి సంధ్యావం,దన మొనరిచి భూతవితతి ♦ తనుఁ బూజింపం

గను ఖేచరాళి పొగడం,గను మెఱసె నచెట్టులన్న ♦ క్ష్మాపతి! వినుమా. ౨౭౹
చ. దనుజుని: గక్షులం దదిమి ♦ తత్పరుఁడై వరుణాశఁ గల్గునా
వననిధిలో మునింగి యట ♦ వారిచి చక్క జపించి యుత్తరం
బునఁ దగునబ్ధి కేగె నల♦పూర్వనుపర్వనిఁ గూడి పెక్కు రౌ
జనములు చిత్తవాయువుల ♦ సాంద్రజవంబును మీఱ సద్గతుల్. ౩౦ 1693
చ. చని చని యుత్తరాబ్ధిఁ గని ♦ చంకను శత్రువు వ్రేలుచుండ సం
ధ్యను జపియించి రావణుమ♦హాంగము లీలయ వోలె మోయుచుం
జని మఘవద్దిశన్ వెలయు ♦ సాగరముం గని క్రుంగి వార్చి యిం
ద్రునితనయుండు వాలి యరి♦తోడ నె యంబరవీథి నొయ్యనన్. ౩౧ 1694
తే. పఱచి కిష్కింధ కేతెంచెఁ ♦ బరమనియతి
సాగరచతుష్కమం దిట్లు ♦ సంధ్య వార్చి
రావణోద్వహనశ్రాంతుఁ♦డై వరకపి,
స్వనగగోపవనంబున ♦ వ్రాలె నపుడు. ౩౩౹ 1695
క. బిగఁబట్టిన తనదాకర,యుగమును సడలించి దాన♦వోత్తముని విము
క్తుఁగఁ జేసి ప్రహాసము చ,క్కఁగ మోమునఁ జిందులాడఁ♦గాఁగ,మొ,క్కిన్.
ఉ. ఎచ్చటినుండి వచ్చితివొ ♦ యిచ్చటి కిత్తఱి దానవేంద్ర! యే
ముచ్చట దీర్ప నెంచియొ ప్ర♦మోదము నామది నుబ్బఁ జెప్పుమా
యిచ్చటఁ గల్గుకార్యము న♦దెట్టిదియో నొనరింపఁ జూతు నాఁ
గ్రచ్చఱ రావణాసురుఁ డ♦ఖండతరంబగు విస్మయంబునన్. ౩౪౹ 1697
క. శ్రమలోలనిరీక్షణుఁడై, యమరేంద్రారాతి యిట్టు ♦ లనియెను గీశో
త్తము! జిష్ణుతుల్య! దనుజో,త్తముఁడను రావణుఁడ నే మృ♦ధంబును జేయన్.
క. మనమునఁ గోరియె వచ్చితిఁ, గనుకనె నీచేతఁ జిక్కి ♦ కరములదా సం
దున నల్గితి నీదోర్బల, మన మహావీర్యమునఁగ ♦ నబ్బా యనఘా.౩౬౹ 1699
తే. నీదుగాంభీర్య మట్టిదే ♦ నిశ్చయంబు
నేను నీచేతఁ బఱువట్లు ♦ నిఖిలజలధు
లకును ద్రిప్పంగఁ బడితి ని♦ట్లు కడువేగ
మేమియున్ శ్రాంతిపొందని ♦ యేవు మీఱ. ౩౭ 1700
క. ననుమోయుచు నాల్గె తగు, వననిధులకుఁ బోవుశక్తి♦నఱలు నెనని? కొ
క్కనికిన్ నీకుం దక్కను;, జను నిద్ది యసమానుమమగు ♦ శౌర్యము సుమ్మీ.
క. [సురదైత్యదనుజరాక్షస,వరులందును ఫణులయందు ♦ బలమున నీవే
పరికింపఁగ నధికుండవు, తరమే నినుఁ బోల నొకఁడు ♦ ధాత్రీస్థలిలోన్.] 1702
క. నినుఁ బోలుగతివిశేషం, బనిలునకున్ మనసునకు ఖ♦గాధిపునకుఁ గ
ల్గును గాని యొరులకును లే,దనఘా! త్వద్గతియె వాని ♦ నన్నిఁటి మించున్.౪౦

ఉ. కంటిని నేను నీదగు న♦ఖండబలంబును గీశపుంగవా!
వింటిని మున్ను దానికిని ♦ వృద్ధిగఁ గన్పడుచున్న దివ్య ఢో
కంటకనాశకా! శుచిము♦ఖంబున నీదగు సఖ్యముం జిరం
బుంటకుఁ గోరువాఁడ నిది ♦ యొప్పదె నాకుఁ బవిత్రరీతిగన్ ౮౧ 1704

ఉ. *దారలు పుత్రులుం బురము ♦ ద్రవ్యము రాష్ట్రము భోగభోజనా
గారముఖంబు లెల్లఁ బ్లవ♦గప్రవరా! యవిభక్తముల్ నిజం
బారయ నీకు నాకు నన ♦ నప్పుడె యగ్నిని మండఁజేసి దు
ర్వారబలాఢ్యు లిర్వురును ♦ భ్రాతృత నొందిరి ప్రీతిమీఱఁగన్. ౮౨ 1705

సీ. ఇతరేతరాలింగ♦నతతుల నలరుచు నన్యోన్యలంభిత♦హస్తులగుచు
హరిరాక్షసేశ్వరు ♦ లప్పుడె కిష్కింధఁ జేరిరి హర్షంబు ♦ చిత్తములను
నిండఁగా సింహముల్ ♦ కొండగుహం జొచ్చుకరణి; నంతట దశ♦కంఠుఁడందు
సుగ్రీవుఁ డుండెడు♦చొప్పున నొకమాస మావృతిఁ గడపి య♦త్యంతతృప్తి
తే: నలరి యత్తఱిఁ దనచెంత ♦ కరుగుదెంచి
నట్టి లోకత్రయోత్పాద♦నార్థులైన
యాత్మసచివులతోఁ గూడి ♦ యరిగె; నిద్ది
రావణునిపూర్వవృత్త మో♦రామభద్ర!. ౮౩ 1706

చ తొలుతనె వాలి రావణుని♦తోరపుగర్వ మడంచి మించి య
వ్వల శుచిమ్రోల భ్రాతృతను ♦ బావనరీతిని బొందెఁ జుమ్ము భూ
పలలిత! రామచంద్ర! కపి♦పాలకుదోర్బల మింతయంచు నే
ర్పలర వచింపరాదు తగ ♦ నయ్యది యప్రతిమానమై యిలన్. ౮౪ 1707

క. విను మట్టివాలి నీచే,తను దెగియెన్ శలభ మెట్లు ♦ దహనునిచేఁ జా
వును గూర్పఁబడెడుతీరున, నినకులపాథోధిచంద్ర! ♦ హితగుణసాంద్రా! ౮౫

ముప్పదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

35 - వ సర్గము.

హనుమంతునిజననము.

చ. అని వచియించుమౌనిపతి ♦ నంతకదిగ్వసతిన్ మహాత్మునిం
గని రఘురాముఁ డాత్మఁ దము♦కంబున నంజలిఁబట్టి యర్థముం
గనఁబడఁగా నడంకువ త♦గన్ వచియించెను; వానిదాబలం
బనఘుఁ దశాస్యకంటెఁ దెలి♦యంబడె నత్యధికంబె యం చొగిన్. ౧ 1709

క. వీరలకంటెను వాయుకు,మారునిదోర్బలము చూడ ♦ నుహితంబని నే
నారసి నిశ్చయపడమును, జేరితి; శౌర్యంబు బలము ♦ శీఘ్రగమనముల్. ౨

* దా యనునక్షరము గాయత్రి యిరువదిమూఁడవయక్షరము.

ఆ. ప్రాజ్ఞతయును ధైర్య♦పాటవంబులు నీతి, కృత్యసాధనంబు ♦ నిత్యవిక్ర
మప్రభావములును ♦ మారుతి యందె ని,వాస మొప్పఁజేయు ♦ వరుసమీఱ.

చ. జలనిధిఁ గాంచి కార్య మిఁక ♦ నల్పవిధం బెటులంచుఁ జింతచేఁ
గలవిలపాటుఁ గాంచు ప్లవ♦గప్రకరంబుల నూఱడించి దో
ర్బలము చెలంగుమారుతియె ♦ వారిధియోజనముల్ శతంబు ని
స్తులజవ మొప్ప దాఁటెఁ గద; ♦ శూరగణంబులు కాచులంకనున్. ౪

తే. లెక్కసెట్టక తాఁ జొచ్చి ♦ యొక్కపెట్ట
రావణాంతఃపురమ్మును ♦ రాత్రి వెదకి
యవల సీతను జూచి యా♦శ్వాస మలరఁ
బలికి యూఱడిలం జేసె ♦ లలితరీతి. ౫ 1713

క. సేనాపతులును మంత్రుల, నూనులుఁ గింకరులు రక్క♦సులపతికి సుతుం
డౌ నక్షుఁడు నొకమారుతి,చే నని వధియింపఁబడిరి; ♦ చిత్రముగాఁగన్. ౬

తే. ఒకట బంధింపఁబడి యంత ♦ నుగ్రదనుజ
సత్తమునితోడ భాషించి ♦ సరగ బంధ
ముక్తుఁడై పావకుం డోగి ♦ భూమిఁ గాల్చు
కరణి లంకను భస్మము♦గా నొనర్చె. ౭ 1715

క. సురపతికాలకుబేరులు, హరియును యుద్ధంబునందు ♦ హనుమంతుఁడు ని
ర్భరబలమునఁ జేసిన పని, సరియగుకృత్యమును జేయఁ ♦ జాలరు సుమ్మీ. ౮

ఉ. ఈతనిబాహువీర్యమున♦నే యలలంకను జేరఁగల్గితిన్
సీతను లక్ష్మణున్ మరలఁ ♦ జెందెనుభాగ్యముఁ గంటి బాంధవ
వ్రాతము మిత్రులన్ జయము ♦ రాజ్యముఁ గాంగితి, నేయునేల యీ
వాతసుతుండె సాయపడు♦భంగియె నాకట లేకయున్నచోన్. ౯ 1717

ఉ. జానకియున్నతా వెఱుఁగఁ ♦ జాలినవాఁడెవఁ డింక భానుమ
త్సూనుసఖుండె యిన్నిఁటికి ♦ నూనృతహేతువు; మానిచంద్ర! పెం
పూని యితండు సూర్యజున ♦ కొప్పెడుకార్యమె చేయుకాంక్షనే
పూని విరోధ మిర్వురకుఁ ♦ బుట్టినయప్పుడె యాత్మశక్తిచేన్. ౧౦ 1718

చ. అనలుఁడు వృక్షరాజము మ♦హోర్చులఁ గాల్చెడునట్లు లేటికో
వనచరనాథుఁడై పరఁగు♦వాలినిఁ జంపకపోయె; దీనిచే
తనె హనుమంతుఁ డాత్మబల♦ధైర్యము లింతవటం బెఱుంగఁడం
చని తలపోయుచుండెడు ప్లవ♦గాధిపుఁడౌ రవిపుత్రుఁ డమ్మెయిన్. ౧౧ 1719

ఆ. కష్టపడుచునుండఁ♦గా నూరకుండెనో, దానఁ దెలియనయ్యె ♦ నైన నాకు
నమరపూజితా! మ♦హాత్మ! మానినగేణ్య!, హనుమఁ గుఱిచినట్టి ♦ యన్నికథల.

ఉ. ఉన్నది యున్నయట్లు పురు♦హూతనుతా! వివరింపవయ్య!; నా
కెన్నిదినాలనుండియొ మ♦హేప్టము చిత్తమునందుఁ గల్గె నం
చున్నతిమీఱ నాడుమను♦జోత్తము హేతుయుతోక్తు లెల్ల వి
ద్వన్నుతుఁడైన మౌని విని ♦ వాయుకుమారుని మ్రోల నివ్విధిన్. ౧౪॥

తే. పలికె రఘురాముతోడ ని♦వ్వరున; రామ
చంద్ర! నీవన్నయీనుడి ♦ సత్య మౌను
బలగతులఁ జిత్తమునఁ దలఁ♦పంగ హనుమ
వంటివాఁ డిల లేఁడ దె♦వ్వఁడును దలఁప. ౧౫॥ 1722

చ. అరిజనకాలుఁ డీయనిలు♦నాత్మజుఁ డాత్మబలం బి దిట్టిదం
చరసినన్నైనఁ దేటపడ♦నట్టులు గాఁగ నమోఘవాక్కులౌ
వరమును లెల్ల శాపమును ♦ బల్కిరి పూర్వము కానఁ దా బల
స్ఫురణము నొందియున్ బలము♦చొప్పు నెఱుంగఁడు శ్రీరఘూత్తమా !.

చ. వినుతమహాబలా! నృపతి♦వీర! రఘూత్తమ! రామచంద్ర! పా
వని యితఁ డాత్మబాల్యమున ♦ వారక చేసినకృత్యజాల మిం
తని వివరింప శక్య మెటు♦లౌ నది చిన్నతనంబుచేతనే
యొనరిచె నంచు నెంచఁదగు ♦ నొప్పుగ దాని వినంగ నీమదిన్. ౧౭ 1724

ఉ. కోరిక గల్గినట్లయినఁ ♦ గొంకొక యింతయు లేక తెల్పెదన్
భూరమణా! మనమ్ము నొక♦పోలిక శ్రద్ధఁ గనంగఁ జేయుమా
సారతదీయకృత్యతతిఁ ♦ జక్కఁగ నే వివరింపఁ బూనితిన్;
మేరుమహీధరం బిలను ♦ మించును సూర్యవరాత్తశక్తిచేన్. ౧౮॥ 1725

తే. అందుఁ గేసరి యలరి రా♦జ్యంబుచేయు
నతఁడె యీతనితండ్రియౌ ♦ నతనిపత్ని
యంజనాహ్వయఁ దగుఁ బతి ♦ కఖిలవాంఛ
లను నొసంగుచుఁ గీర్తిచే♦ ఘనతఁ గాంచి. ౧౯॥ 1726

చ అనిలుఁడు గాంచె నావని♦తయం దొకపుత్రుని నుత్తమున్ దనం
తన లభియించు సద్గుణవి♦తానముచే నలరారువాని; నం
జనయును శాలిశూకసమ♦సన్నుతపింగళకాలయుక్తునిం
దనయునిఁ గాంచి యాశిశువుఁ ♦ దన్వఁగఁ బండ్లను దెచ్చుకోరికన్. ౨౦॥

చ. వనములు కేగె; నీసుతుఁడు ♦ పర్వతసీమను దల్లిఁ గాన కిం
తనఁ దగనట్టి యాఁకలిని ♦ నాపఁగఁజాలక బాధనొంది రో
దనమును జేసె రెల్లుపొద ♦ దారుణరావము చేయుచుండఁడో
యనఁ నపుడే జపాసుమస♦మాంగుఁడు భానుఁడు తూర్పుకొండపై. ౨౧॥

క. ఉదయించుచుండె నాతని, మదిఁ దోఁచెఁడుఃఖుత్తువలన ♦ మంచిఫలం బీ

యదనున నాకుం గన్పడెఁ, గద యని ఫలలోభమున ని♦కామజవమునన్. ౨౩

చ. అరుణగభస్తిపై నెగసె; ♦ నత్తఱి బాలదివాకరుం డనం
బరఁగెడుమూర్తిఁ గాంచి కడు♦బాలుఁడుగాఁ దగునంజనాత్మజుం
డరయక బాలభాస్కరుని ♦ నాదృతిమై గ్రహియింపఁ గోరి యం
బరపథమధ్యభాగమునఁ ♦ బర్వులుపెట్టుచునుండె నంతయున్;. ౨౪ 1730

సీ. బాలత్వమున గాలి♦పట్టి యీరీతిగాఁ బరుగెత్తుచుండ దే♦వతలు దాన
వులుయక్షులెల్ల నా♦త్మలవిస్మయము నొందిరెంతయుమఱియువా♦రిట్లుతలఁచి;
రీతనివలె వాయు ♦ వేగంగఁజాలఁడు వినతాత్మజునకును ♦ మనసునకును
గతి యిట్టిరీతిగాఁ ♦ గల్గదు పావని యుత్తమాభ్రంబున ♦ నుగ్రవేగ
తే. మునను బరుగెత్తుచున్నాఁ డి♦తనికి నిట్టి
విక్రమజవంబు లిప్పుడె ♦ వెలయుచున్న
వింక యౌవనబలమొంద ♦ నెట్టు లొప్పు
నొక్కొ; వేగం బటంచు నా ♦ రొగిఁ దలంప. ౨౫ 1731

చ. తనయుఁడు వ్యోమమార్గమునఁ ♦ దద్దయుఁ బర్విడ వాయుదేవుఁ డా
తనివెనుకం దమిం బఱచె ♦ దారుణభానుమరీచిదాహభీ
తిని గనకుండఁ గాచుచును ♦ దృప్తిగ మంచును బోలి చల్లనై
దనయునిపైన వీచుచు ని♦తాంతజవం బలరార నంతటన్. ౨౬ 1732

తే. అంజనాత్మజుఁ డెన్నొ స♦హస్రయోజ
నములు వ్యోమమ్మునందు జ♦నకబలంబు
నను శిశుత్వంబునం బోయి ♦ వనజమిత్రు
చెంతఁ జేరెను ఫలమను ♦ చింతచేత. ౨౭ 1733

చ. దినపతి యంత నీతనికిఁ ♦ దెల్లముగాదు మదీయసన్నిధిం
గనుఁగొన వచ్చినం దనువు ♦ కాలు నటంచును బాలుఁడౌటచే
నని తలపోసి కార్య మిట ♦ నొఁగద యీతని కంచు నెంచి యా
తని నిజరశ్మిదగ్ధునిగఁ ♦ దా నటఁ జేయకయుండెఁ బ్రీతితోన్. ౩౦ 1734

తే. ఏదినంబున సూర్యు గ్ర♦హింపఁ బవను
నాత్మజని యేగ నభ్రంబు♦నందు నాది
వనమునన్ రాహు వర్కునిఁ ♦ బట్ట వచ్చె;
నంత నర్కరథంబుపై ♦ నడరు నసుర. ౩౧ 1735

క. కరములఁ దాఁకెను శ్వసనుసి, వరతనయుం డంతమాత్ర ♦ భయపడి శశిభా
స్కరమర్దనుఁడౌ రాహువు, త్వరపడి పరుగెత్తె నింద్రు♦భవనంబునకున్. ౩౨

చ. పరుగిడి రోషమొప్ప సుర♦పాలమునన్ భ్రుకుటిక్రియల్ దగన్
సు రగణసంయుతుం డగుచు ♦ శోభిలునింద్రుని సింహాసనుతుం

డురుభయదాత్ములం గనుచు ♦ నుద్ధతిఁ బల్కె; బలాంతకా! సురో
త్కరవర! వృత్రదానవవి♦దారక! యాఁకలి నాకుఁ దీరఁగన్. ౩౩ 1737
తే. చంద్రు నర్కుఁ బ్రసాదించి ♦ సరగ వారి
నన్యునకు నిచ్చినాఁడవే♦మయ్య!; నేను
బర్వ మీఁదిన మాటను ♦ భాస్కరుని గ్ర
హింపఁగా వచ్చితిని నిర్జ♦రేశ! యపుడె. ౩౪ 1738
క. అరుదెంచి యన్యరాహువు, సరసిజమిత్రుని గ్రహించెఁ ♦ జయ్యన నా ని
ర్జరనాయకుఁ డారాహువుఁ, బరికించి తదుక్తుల విని ♦ త్వరపడి యంతన్. ౩౫
క. తనయాసనమును విడి లేచెను, గాంచనమాల యెదను ♦ జిత్రతరంబై
తనరారఁగ నైరావతము నెక్కె; నాదంతివర్య♦ము మదము పొలయన్. ౩౬
సీ. కైలాసకూటంబు♦కరణి నొప్పారుచు దంతచతుష్కంబు ♦ వింత గ్రాల
బహువిధాలంకార♦భాసురంబయి మహోన్నతముగా నలరి క♦నత్సువర్ణ
ఘంటాట్టహాసంబు ♦ కడు మించుచుండఁగఁ జెలువారె; నట్టిదా♦లలితగజము
నెక్కి ముందుగ రాహు ♦ వేగుచునుండఁగఁ బావనితోఁ గూడి ♦ భానుఁడున్న
ఆ. యచటి కేగె నింద్రుఁ ♦ డంత రాహువు శత
క్రతుని బాసి జవము♦కలిమి సూర్యుఁ
బట్ట నేగె; నిట్లు ♦ పర్వతకూటంబు
కరణి వచ్చు నతనిఁ ♦ గనియెఁ గపియు. ౩౭ 1741
చ. కనుఁగొని భాస్కరున్ విడిచి ♦ గాలికుమారుఁడు మంచిపండిదే
యని తలపోసి సింహికప్రి♦యాత్మజు రాహువుఁ బట్టుకోర్కె మై
కొన మరలన్ నభంబునకుఁ ♦ గొంకక వే యెగసెన్; రఘూత్తమా!
వనరుహబాంధవున్ వదలి ♦ వచ్చెడుమర్కటడింభకోత్తమున్. ౪౦ 1742
క. కని రాహు వాత్మలపనంబును బ్రక్కకుఁ ద్రిప్పి వాయు♦పుత్రుని గన కిం
ద్రుని గావుము నాకున్ దిక్కన నీవే యనుచుఁ బొగడె ♦ నాతుర మొప్పన్.
క. రక్షింద్ర! యింద్ర! యనుచు భయమ్మునఁ బలుమాఱులఱచె;♦నంతకుముందే
యమ్మఘవుఁ డతనియాక్రోశమ్మును బరికించి తెలిసి ♦ స్వరమున్ మరలన్.
క. విని యిట్టు లనియె భయముం, గనకుము నేనితని దైన ♦ గర్వ మడంపం
గను బూనెద ననియెను; నంత నచట నైరావతంబు ♦ తనకుఁ గనఁబడెన్.
క. మనుదాత్మజుఁ డాత్మ మహాత్తరఫల మిది నాకు దొరకెఁ ♦ దప్పక దీనిం
ద్వరగా భక్షించెద నంచరయుచుఁ బరుగెత్తె నాద్వి♦పాధిపుఁ బట్టన్. ౪౪
సీ. ఐరావతముఁ జంపు♦నాశతోఁ బరుగిడు నాతనిఁ జూప మ♦య్యదనునందు
శక్రాగ్నులంబోలి♦చాలఁ బ్రకాశించె నొకముహూర్తము; పురు♦హూతుఁడంత
నివ్విధిఁ బరుగెత్తు ♦ నవ్వాయుపుత్రునిఁ గని మహాకోపంబు ♦ గ్రమ్మ నాత్మ
హస్తాంతముత్తమా♦నట్టి వజ్రంబునఁ గొట్టె; నంతట నింద్రు♦క్రూరవజ్ర

తే. తాడితుండయి పావని ♦ తద్గిరీంద్ర
మందుఁ బడియెను బడునప్పు ♦ డతనివామ
హనువు నొచ్చెను; బాలుఁడౌ ♦ తనకుమారుఁ
డట్లు పవిఘాతవిహ్వలుం ♦ డగుచుఁ బడిన. ౪౭ 1747

చ. అనిలుఁడు దేవనాథుపయి ♦ నాగ్రహ మొందెను; లోకముల్ శివం
బును గనఁజాలకుండునటు ♦ పూనికఁ బ్రాణులలోన వెల్గు నా
యనిలుఁడు స్వప్రచారము నె ♦ యంతట మాని గుహాప్రవేశ మొ
య్యన నొనరించె నాత్మతన♦యాన్వితుఁడై వగ పెల్లు ముంపఁగన్. ౪౮

తే. ప్రజలవిణ్మూత్రపథమును ♦ బరమపీడ, గల్గునట్లుగ బంధించి ♦ గాలిదేవుఁ
డఖిలభూతాళి నరికట్టె ♦ నసురనాథుఁ, డెట్లు వృష్టిని బంధించు ♦ నేపుమీఱ.

ఆ. అనిలుఁ డాగ్రహింప ♦ నఖిలభూతంబు లు,చ్ఛ్వాసవిరహితంబు♦లై సమస్త
సంధిబంధనముల ♦ జడభూతులై దారు,వు లనఁ గదలకుండి ♦ రిలను దిశల.

సీ. నిష్క్రియంబయి ధర్మ♦నిచయవర్జితమయి వేదపాఠము హోమ♦విధియు లేక
త్రైలోక్య మావాయు♦దారుణాహవమున నిరయస్థమైనట్లు ♦ నిశ్చలముగ
నుండె; నంతట మహో♦ద్వేగంబునం బ్రజల్ గంధర్వదేవతా♦కాండములును
దనుజులు మనుజులు ♦ ధాతను జూడంగ సుఖియించుకోర్కెలు♦సోరిది నడఁగ

తే. వగలఁ బొగులుచుఁ బోయిరి ♦ వరుసఁ జేతు
లొగ్గి యాధాతను గని మ♦హోదరనిభ
ములగునుదరంబు లొప్ప ని♦ట్టులు పలికిరి;
షడ్గుణైశ్వర్యసంపన్న! ♦ సకలనాథ!. ౫౩ 1751

క. నాలుగువిధములఁ బ్రజలను, హేలాగతిఁ బుట్టునట్టు ♦ లీ వొనరిచి తిం
కేలా మాయాయువులకుఁ, గాలజ్ఞా! పవను విభునిఁ♦గాఁ జేసితివో. ౫౪

చ. అనిలుఁ డతండు ప్రాణముల ♦ కారయ నాయకుఁ డయ్యెఁ గాని యో
వనరుహసంభవా! యిపుడు ♦ వాస మదెచ్చటఁ జేయువాఁడొకో
కనఁబడకున్నవాఁడు *కల♦కంఠుల నంతిపురంబునందు నం
చినగతి బందిచేసె మముఁ ♦ జిత్రమిదాఁ గద? యట్లు కావునన్. ౫౫ 1753

చ. శరణము నీవె మా కనుచుఁ ♦ జక్కఁగ వాయువు పీడచేయ నీ
పరిసర మిట్లు చేరితిమి ♦ పాపఁగలాఁడవు దుఃఖ మీవు, సు
మ్మరసి సదాగతిప్రభవ♦మా కడు దుఃఖము దీనిఁ బాపవే
పరమకృపార్ద్రచిత్త! యని ♦ ప్రార్థన మొప్పఁగఁ జేయ ధాతయున్. ౫౬

క. సురపతి తా నొటను ని,ర్జరముఖ్యులభాషణములఁ ♦ జక్కఁగ విని యి
క్కరణి మిము నొంచుటకు నో, సురలారా! కారణంబు♦చెప్పుడు ననుచున్.

* అంతఃపుర ఇవ స్త్రియః-అనిమా.

చ. మరల వచించె నిట్లు విధి; ♦ మారుతుఁ డాగ్రహ మిట్టు లూనఁగా
సురముఖులార మిముం గలఁచి ♦ చోద్యముగా నిటు లడ్డగింపఁగా
సరియగు కారణంబుఁ గనఁ♦జాలితి, దాని తెఱంగుఁ దెల్పెదన్
[1]పరమతులందు శాంతమును ♦ బాగుగ నిల్పి వినుండు దానినిన్. ౫౮

ఉ. ఆతనియాత్మసంభవమ♦హాత్ముని నింద్రుఁడు పర్వతంబునన్
ఘాతము నొందుచున్ బడఁగ ♦ గాఢపవిం గవియించి నొంచె దు
శ్చేతముగల్గు రాహువు వ♦చించినమాటల నాలకించి యి
ట్లీతఱిఁ గార్యముల్ జరప ♦ నేడ్తెఱ నాశ్వసనుండు శక్రుపై. ౫౯ 1757

చ. ఘనతరకోప మూనె వినఁ♦గాఁ దగు; దేహము లేక వాయువిం
తన దగనట్టి శక్తి చెలు♦వార శరీరములందుఁ జొచ్చి చ
క్కనిగతిఁ బ్రోచుచుండుఁ దను♦కాండము వాయువు లేక యుండినం
గనఁబడు దారురీతి; నిఁకఁ ♦ గాలియె ప్రాణము శర్మ మద్దియే. ౬౦ 1758

క. వాయువె ప్రాణాధారము, వాయువె సర్వంబు సతఁడు ♦ వదలిన సుఖమే
యే యెడలం గన్పడ దిఁక, నీయెడ జగములకు వాయు♦వే యనఁదగుచున్.

తే. సకలమునకు నాధారుఁడై ♦ ప్రకటశక్తి, యైనవాయువు వదలె మి♦మ్మందుచేత
నూర్పులనుబుచ్చనేరక♦యుద్యమముల,మానికాష్ఠకుడ్యంబుల♦మాడ్కి మీరు.

క. నిలిచితిరి గాన మన మిఁక, నలవాయువు తనరుచోటి ♦ కరుగుద మతఁడే
పలువిధముల మీకున్ బా,ధలఁ బుట్టఁగఁ జేసెఁ గాదె ♦ తథ్యం బరయన్.

క. కనుకన్ బవనుఁ బ్రసన్నుని, గను జేయకయున్నఁ జెడుట ♦ గల్గును సురవ
ర్యుని నతని సంతసంబును, గనఁ జేసిన సుఖము గల్గుఁ♦గా సురలారా!. ౬౩

క. అని పల్కి ప్రజలతో నా,వనరుహజని దేవభుజగ♦వర్యులనుం దో
డ్కొని గంధర్వులు గుహ్యకు, లనుచరులై రాఁగఁ జనియె ♦ నాగిరిగుహకున్.

చ. అనిలుఁడు వజ్రతాడితుని ♦ నాత్మజుఁ గైకొని యెందుఁ బోయెనో
ఘనగిరికందరంబునకుఁ ♦ గ్రన్ననఁ బోయిరి వారలెల్ల; నం
తన [2]నలసూర్యహేమసమ♦తం గను దేహరుచిన్ జెలంగి చ
క్కనిముఖ మొప్పఁ దప్పఁ దన ♦ గాదిలితండ్రితొడం బరున్న యా
తనయునిఁ గాంచె బ్రహ్మయును ♦ దద్దయు వేడుక యుల్లసిల్లఁగన్. ౬౪

తే. యక్షగంధర్వదేవర్షి♦యాతుధాన, సహితుఁడై యాకుమారుపైఁ♦జక్కనికృపఁ
బొలయఁగాఁ జేయుచూడ్కులఁ♦బోలఁజూచె, దేవనెల్లరబాధలు♦మానిపోవ.

ముప్పదియైదవ సర్గము సంపూర్ణము.

---

1 శ్రోతవ్యం చాత్మనః క్షమమ్-అనియూ. 2 తతోర్క వైశ్వానరకాంచనప్రభమ్-అనియూ.

## ౩౬ - వ సర్గము.

—బ్రహ్మాదులు హనుమంతునకు వరము లిచ్చి వాయుదేవు నలరించుట.—

చ. వనరుహసూతిరాకఁ గని ♦ వాయువు పుత్త్రవధార్దితుండు న
య్యనువు బహువేగయుక్తుఁడయి ♦ యొప్పెడుభక్తిని లేచెఁ జేతులం
దనయుని గొంచుఁ; గుండలవ♦తంసము లొక్క మొగిం జనింప *న
త్తినఁ గలహారము ల్గదల ♦ దివ్యవిభూషణరాజి యూఁగఁగాఁ. ౧ 1766

తే. మూఁడుపర్యాయములు గోత్ర♦మును వచించి
చక్కఁగఁ బ్రదక్షిణంబుగ ♦ సాగిలఁబడి
మ్రొక్కె ముమ్మాఱు తత్పాద♦ములకుఁ; [ద్రిగుణ
రూపునకుఁ ద్రియుగునకుఁ జి♦ద్రూపునకును. ౨ 1767

క. శ్రుతిరూపునకుఁ శక్తి, త్రితయునకుఁ ద్రిలోకపతికిఁ ♦ ద్రినయునకు ను
న్నతధామత్రితయునకుఁ, హితదాతకు మ్రొక్కువాఁడ ♦ నే నిట భక్తిఁ.

క. అని మ్రొక్కి యతులశక్తిని, వనరుహసంభవునిఁ గాంచు ♦ భక్తిప్రీతుల్
తనరఁగ శిశువుం గైకొని, చనియెఁ బరమేష్ఠి యలరు ♦ చక్కటి కంతఁ.] ౪

క. పరమేష్ఠి యాదరంబునఁ, గరయుగమున నిమిరె శిశువు ♦ గాలియొడయనిం
బరమాదరమున లంబా,భరణప్రతిభాసమాన♦భవ్యకరములఁ. ౫ 1770

క. శ్రుతివేత్తయైన పరమే,ష్ఠి తగఁ స్పృశియించె; నంతఁ ♦ జిత్రంబుగ వా
కృతి హస్తస్పర్శనమున, హితజలసేకమున సస్య ♦ మేవిధి నలరుఁ. ౬ 1771

క. అనిలజుఁ డాకరణిని మూ,ర్ఛను బాసి యనుప్రకాంశ♦రమ్యతనుం డ
య్యెను; వాయు వంత జీవిత,మును గాంచినకొడుకుఁ గాంచి♦ముదమలరారఁ.

సీ. సర్వభూతావళి♦సన్నిరుద్ధంబగు నాత్మశక్తిని స్వేచ్ఛ ♦ నలరఁ జేసె;
వాయునిరోధంబు ♦ వాసినయంతనే ప్రజ లెల్ల మునుపటి ♦ భంగిఁ జెలఁగి
శీతవాతాదిబా♦ధాతతి లేకయే కమలంబు లెల్లెడఁ ♦ గ్రాల నొప్పు
పద్మినులం బోలి ♦ పరమముదం బొంది; రైశ్వర్యవీర్యముల్ ♦ యశము శ్రీయు
జ్ఞానవైరాగ్యముల్ ♦ మానుగ నీయాఱు యుగ్మత్రయంబున ♦ నొప్పుచుండు

ఆ. నివ్వి యాఱు గల్గి ♦ మువ్విధమూర్తుల
లోఁ బ్రధానుఁడగుచు ♦ లోకములె గృ
హంబుగాఁ జెలంగు ♦ నాశతానందుండు
సురలఁ గాంచి వాయు♦శుభముఁ గోరి. ౮ 1773

క. సురరాజా! జలనాథా!, పురహరణా! విత్తనాథ! ♦ పొందుగ మీరే
పరికించి విషయ మెఱిఁగెదు, వరమతు లట్లైనఁ బెద్ద♦వాఁడను గానఁ. ౧౦

క. హిత ముపదేశించెద నా,మతిఁ గలయూహలను మీరు ♦ మన్నించి వినుం

* మాలిస్రక్తపనీయవిభూషణః-అనిమూ.

డితఁడర్భకుఁ డైనను నీ,మతిమంతుఁడు ముందు మీకు♦మంచిగలుగఁగన్. ౧౦౹

క. ఒనరించుఁ గార్యములఁ గా,వున నీతని కిందు మీకు ♦ బుద్ధికి హితమం
చును దోఁచిన వరముల, నీ,యనిలుఁడు సంతుష్టి నొందు ♦ నట్టులుగాఁగన్.

చ. అన విని వేయిగన్నుల మ♦హావిభుఁ డెంతయుఁ బ్రీతినొంది చ
క్కనిముఖకాంతి యొప్ప రుచిఁ ♦ గ్రాలుకుశేశయహార మిచ్చి యి
ట్లని వచియించె; నాకరము♦నం దలరారెడు వజ్రమేను వై
చిన నొకచెంప వక్రతను ♦ జెందెను గావున లోకమం దిఁకన్. ౧౩ 1777

క. హరివరుఁ డీతఁడు హనుమ,ద్వరనామముఁ గాంచఁగలఁడు♦వరము మఱియు నేఁ
బరమాదరమున నిచ్చెదఁ, బరమంబగు నద్ది వినుఁడు ♦ వరమతులారా!. ౧౪

తే. ఇద్దిమొదలుగ నావజ్ర ♦ మితనిఁ జంపఁ
జాలకుండెడుఁ గా కన; ♦ నరసిజాప్తుఁ
డమలరుచి ధ్వాంతనాశకుం ♦ డనియె నాదు
తేజమునను శతాంశంబుఁ ♦ దృప్తిమీఱ. ౧౫ 1779

క. ఇతనికి నొసఁగెద శాస్త్రము,ప్రతతిని బఠియించు శక్తి ♦ పరఁగు నితని కు
న్నతమోద మూని యత్తఱి, హితబోధ మొనర్తు విద్య♦లెల్లం దెలియన్.

ఆ. దేన వాగ్మియగునొ ♦ దాని బోధించెద, నితనితో సమానుఁ ♦ డీజగముల
శాస్త్రదర్శనమున ♦ నత్యంబు గల్గక, యుండుఁగాక యనుచు ♦ నుగ్గడింప ౧౬

క. వరుణుం డంతటఁ బల్కెను, వర మిచ్చెద నయుతములగు ♦ వర్షశతము లీ
ధరణిని మను నీపావని, మరణము నాపాశమునను ♦ మఱియు జలములన్. ౧౭

క. కనఁడంచుఁ బల్కె; యముఁ డి,ట్లనియెను నాదండఘాత♦మందిన మృతినిం
గనకుండఁగలఁడు రోగము,లను బొందకయుండఁగాఁ గ♦లఁడు నిత్యంబున్.

క. అనిమొన నవిషాదం బీ,తనికిం గల్గెడునటంచుఁ ♦ దమి వర మిచ్చెన్;
ధనపతి మద్గద యీతని, తనువునకు నపాయ మిడదు ♦ తథ్య మ్మనుచున్. ౧౮౹

క. వరమిచ్చె నంతఁ గృప శం,కరుఁ డెల్లరఁ గాంచి మామ♦కంబగునస్త్రో
త్కరమునసే నానుండియు, మరణం బీతనికి లేదు ♦ మహి నెప్పటికిన్. ౨౧

చ. అన విని పద్మయోని యవు♦ డర్మిలి నిట్లను బ్రహ్మదండరా
జని గడు నొచ్చియున్ మృతిని ♦ జెందకయుండెడుఁ గాక యాయువుం
గని చిరకాలమున్ బ్రదుకుఁ ♦ గా కని పల్కెను; విశ్వకర్మయున్
ఘనమతి శిల్పివర్యుఁ డల♦గాలికుమారుని ధీరచిత్తునిన్. ౨౨౹ 1786

క. బాలార్కతుల్యు నన్నుత,శీలుని గని మత్కృతములు ♦ చిత్రమ్ములునై
గ్రాలెడు దివ్యాస్త్రనుశ,స్త్రాళియు మృతి నీయఁజాల ♦ వని నీతనికిన్. ౨౩౹ 1787

క. చిరకాలజీవియగు నీ, పురుషలలాముం డటంచుఁ ♦ బొంగుచుఁ బలికెన్;
దరువాత జగద్గురువౌ, పరమేష్ఠియు దేవవర్య♦పరిభూషితునిన్. ౨౪౹ 1788

చ. అనిలజుఁ గాంచి నెమ్మదిని ♦ హర్షముఁ బొంది సమీరుతోడ ని
ట్లనియెను; వాయుదేవ! భవ♦దాత్మజుఁ డింక నమిత్రకోటి కా
ర్తిని గలిగించి సాధ్వసముఁ ♦ దీవ్రముగాఁ గలిగింపఁ, జాల మి
త్రనికరమోదదుండగుచు ♦ రాజిలుఁగాఁ గలఁ డెంతొ ఖ్యాతిచేఁ. ౨౬ 1789
క. అనిమొన నజేయుఁడగు నిం,కను విను మాతండు కామ♦గమనుఁడు రూపం
బును గోరినట్లు పొందం,గను శక్తిఁ జెలంగువాఁడు ♦ కాఁగలఁ డిలలోఁ. ౨౬౻
తే. కామగుండగు, వ్యాహత♦గతియుఁ గాక
యలరి కీర్తిమంతుండగు ♦ ననుచు మఱియుఁ
బలికె; రావణు ననిని జం♦పంగఁ దగిన
వగుచు రామునిప్రీతిక♦ర్హంబు లగుచు. ౨౮౻ 1791
క. తనువులఁ బులకాంకురములు, గనఁ జేయను జాలియున్న♦కార్యంబులనే
యొనరుచు యుద్ధంబున నీ,తనయుం డని పల్కి సన్ని♦ధానంబునకుఁ. ౨౯౻
క. మరుదధిపుఁ బిల్చి త్రిదశో,త్కరయుతుఁడై గౌరవించి ♦ క్రమ్మఱి చనియెం
బరమేష్ఠి యథాగతముగ;, మరుత్తు తనపుత్త్రుఁ జేర్చి ♦ మందిరమునకుఁ. ౩౦౻
క. వరములఁ బొందినవిమయముఁ, బరమాదృతి నంజనకును ♦ బల్కి యథేచ్ఛన్
మరుదధిపుఁ డేగె రామా!, వరముల నీలాగుఁ బొంది ♦ పవనజుఁ డాత్మన్.
క. బలమున మిక్కిలి పొంగుచు, జలనిధివలె నొప్పె; నంత ♦ శ్వసనసుతుం డ
త్యలఘుబలుండై మునివ,ర్యులయాశ్రమరాజియందు ♦ నూహ చెలంగన్.
సీ. తాఁ బ్రవేశించిసా♦ధ్వసమింతయును లేకజ్వలనత్రయంబు*స్రు♦గ్భాండములను
వల్కలాజినతతి ♦ వరుస విచ్ఛిన్నంబు భగ్నంబు మఱియు వి♦ధ్వస్తముగను
జేయుచు శాంతాత్ము♦లై యమోఘతపంబు నొనరించువారల ♦ కొక్కరీతి
నపకారమును జేసె; ♦ నం దిట్టి బహువిధకర్మములను జేయఁ ♦ గడఁగె బలిమి
తే. కలిమి నంతట మునివరుల్ ♦ కపివరునకు
బ్రహ్మదండతతిన్ మృతి ♦ రాకయుండ
బ్రహ్మ వర మిచ్చె నంచుఁ ద♦పఃప్రభావ
ముల నెఱింగి శాంతంబును ♦ బూని రోకట. ౩౪౻ 1796
క. తనతండ్రియైన కేసరి,యును వాయువు కార్య మిట్టు ♦ లొప్పదు చేయం
గ నటంచు నిరోధించిన, ననిలజుఁ డవ్వారిపల్కు ♦ లాత్మఁ గొనకయే. ౩౫౻
క. తనయిచ్ఛకొలఁది చేయుచు, మునులకు శ్రమమొప్పఁ జేసె; ♦ మూర్ఖుండితఁ డే
పున నిట్లు చేయుఁగాగున్?, యని భృగ్వాఙ్గిరసవ్వయభవు♦లైన మహాత్ముల్. ౩౬
క. అతిశయితక్రోధంబున, మతి నిల్చిసమన్యుయుక్తి ♦ మంచి దితని యు
న్నతి మాన్ప శాప మిడుటయె,హితమిప్పుడటంచుఁజక్క♦నెంచుచుఁ బూనిన్.
ఆ. దేని నాశ్రయించి ♦ మానుల నుమ్మిట్లు, బాధ లొందఁ జేయు♦వాఁడవో, ప్ల

* స్రుగ్భాండా న్యగ్నిహోత్రాగ్నీ-లనియూ.

వంగమా! త్వదీయ♦బల మిద్ది మాశాప,బలముచేతఁ దెలియఁ♦బడక యుండు.

క. చిరకాల మెఱుఁగఁబడకయె, పరఁగెడు నద్దాని నొకరు♦ భావం బలరన్
బరినుతిఁ జేయుచుఁ దెల్పిన, వరుసన్ వర్ధిల్లుఁ జుమ్ము♦ బహుభంగులుగన్.

క. అని శాపమిడిన వాయువు,తన,యుం డీతండు మౌని♦తపముబలిమి న
ద్వినుతాత్మబలము శౌర్యం,బును దగ్గిన వారియుటజ♦ములయందె తగన్.

తే. మృదులభావంబు నూనియె♦ మెలఁగఁ జొచ్చె;
నంత ఋక్షరజోనాముఁ♦డైన కపియు
వాలిసుగ్రీవులకుఁ దండ్రి♦ భాస్కరాభుఁ
డఖిలవానరపతి యయ్యె♦ నమలకీర్తి. ౮౦ 1803

చ. హరిగణనాయకుం డతఁ డ♦హార్యబలుండయి కీశరాజ్యముం
జిరతరకాల మేలి మృతిఁ♦ జెందెను శ్రీరఘురామ! మంత్రవి
ద్వరులగు మంత్రు లెల్ల క్షితి♦వల్లభుఁ డుర్వరఁ బాసి యేగినన్
హరిపతిసత్పదంబునఁ ద♦దాత్మజు వాలిని జ్యేష్ఠు నిల్పుచున్. ౮౧ 1804

తే. అతనియువరాజ్యపదమున♦ననుజుఁడైన, యట్టి సుగ్రీవు నిల్పిరి;♦హనుమ కర్క
తనయుతో *భేదమే లేక♦యనుపమాన, మగుచుఁగృత్రిమమొందని♦యట్టిమైత్రి.

క. అనిలునకున్ జ్వలనునితోఁ, గనఁబడుసఖ్యంబుకరణిఁ♦గా బాల్యమునుం
డి నియతముగ నేర్పడె; నీ,హనుమయు మునిశాపమునని♦ యాత్మబలంబున్.

ఆ. ఇంత యనుచు నెఱుఁగఁ;♦ డంతట వాలిసు
గ్రీవులకు విరోధ♦ మావహిల్లెఁ
దనకు మిత్త్రుఁడైన♦ యనిలజుబల మింత
యంచు నర్కతనయుఁ♦ డాత్మయందు. ౮౪ 1807

క. తెలియనికతమునఁ దను ని,మ్ముల వాలియుఁ బాఱఁదోల♦ భూమిఁ దిరుగుచున్
దోలఁగుచు నుండెను మారుతి, యలఘుతరంబైనయట్టి♦ యాత్మబలంబున్.

క. మనమునఁ దెలియఁడు రామా!, యనిలాత్మజుఁ డితఁడు మునిగ♦ణాయతశాపం
బున బలము తెలియకుండుట, నని సింహము దంతివర్య♦ మరికట్టంగన్. ౮౫

ఆ. నిలిచియుండఁ జూడ♦ నేర్పు గన్పడునట్టు
లుండు; విక్రమమున♦ నురుతరము
యొప్పుశౌర్యమున మ♦హోత్సాహమునఁ బ్రతా
పమున శీలమున న♦యమున మఱియు. ౮౭ 1810

క. అనయమ్మున మాధుర్యం,బున గాంభీర్యమున ధైర్య♦మున లోకమునన్
హనుమత్సమానుఁడుండునె?, గనఁబడు నెటు? లధికుఁడింక♦త్స్థలియందున్.

* అద్వైధం ఛిద్రవర్జితమ్-అనిమూ.

సీ. [1]పూర్వమ్ము పవనుని♦పుత్త్రుఁ డీతండు వ్యా
కరణంబు గ్రహియించు ♦ కాంక్షచేత
నర్కాభిముఖుఁడయి ♦ యనుసరించుచు వెన్కఁ
జనుచుఁ బఠించుచు ♦ సమధికార్థ
మును గ్రహించుచు మనం♦బున దాని బదిలంబు
గను నిల్పుకొనుచుఁ దూ♦ర్పునఁ జెలంగు
నద్రివర్యమునుండి ♦ యస్తాద్రివఱ కేగు
చుండెను; మఱియు ను♦ద్దండమగుచు
తే. నలరుచుండ; నష్టాధ్యాయి ♦ యనఁ బరఁగెడు
సూత్రరాజిఁ దదర్థంబు♦చొప్పుఁ దెలుపు
గ్రంథమును వార్తికంబును ♦ గమ్రభాష్య
మును సమగ్రప్రకరణంబు♦గను గ్రహించె. ౪౬ 1812
క. విను రామా! వ్యాకరణం,బున నీతనితోడ సమతఁ ♦ బూనునతఁడు లేఁ
డని చెప్ప నొప్పు ఛంద,స్సున నితరములైన విధుల♦చొప్పెఱుఁగుటలోన్.
క. అనుపముఁ డీతఁడు రామా!, వినుమా లోకములఁ గల్గు♦విద్యలను దపం
బున దేవగురున్ నవ్వును, ఘనుఁ డీపవనాత్మజుండు ♦ కడు దక్షుండౌ. ౪౮
క. [2]వ్యాకృతినవకంబున నె, న్నే కళలను బండితుఁడగు ♦ నీతఁడు నిఁక నో
భూకాంతా! విధి కాఁగలఁ, డీకరణిన్ మించు నీదు♦కృప పొలయుటచేన్.
క. ప్రళయంబున వీచీవిత,తుల భూమిని ముంచఁదలఁచు ♦ తోయధియెదుటన్
విలయంబున సర్వజగం,బులఁ గాల్పం దలఁచునగ్ని♦ముందఱ మఱియున్.
ఆ. విలయకాలమందుఁ ♦ బితృపతిసన్నిధి
నిలువఁగూడ నట్టు ♦ లీ సమీర
తనయునెదుట నిలువఁ ♦ దగువాఁడు గలఁ డెవ్వఁ
డరయ రామచంద్ర! ♦ హతపరేంద్ర!. ౫౧ 1817
చ. అనిలజుఁ డింకనుం గలుగు♦నట్టి కవీంద్రులు మైందనీలు ల
ర్కనితనయుండు తారుఁడును ♦ గూఢబలద్వివిదుండు రంభుఁడున్
వనచరవర్యుఁడై బలము ♦ భాసిల నొప్పెడు నానలుండు నిం
కను మనయంగదుండు సుర♦కాండముచే భవదిష్టసిద్ధికై. ౫౨ 1818

1 ససూత్రవృత్త్యర్థపదం మహార్థం ససంగ్రహం సాధ్యతి వై కపీంద్రః-అనియు. దీనింబట్టి రామాయణము వ్యాకరణము పతంజలిభాష్యము తర్వాత రచింపఁబడినట్లు కొందఱూహింతురు. పతంజలిభాష్యమునకుఁ బూర్వము భాష్యమే లేదని వీరికి స్వప్నమున దయ్యముచెప్పినదియా. శాస్త్రము పురాతనము గాన నాకాలపు భాష్యమని గ్రహించిన నీలాటి యసందర్భప్రసంగమున కవకాశ ముండకపోవునుగదా. 2 సోఽయం నవవ్యాకరణార్థవేత్తా బ్రహ్మా భవిష్యత్యపి తే ప్రసాదాత్-అనియు.

తే. సృష్టి చేయఁగఁబడిరి నూ! ♦ పృథ్వినాథ!
గజగవాక్షులు గవయుఁడర్ ♦ కపియు ఋషభుఁ
డస్టి జ్యోతిర్ముఖుండు ఋ♦క్షాధిపుండు
భల్లుకంబులతోడ నీ♦పనిని దీర్ప. ౧౩ 1819

క. ధరఁ బుట్టింపంబడి; రో, [ధరణీశా! దేవవితతి ♦ దర్పంబున దే
వరిపుండగు రావణు సంగరమునఁ ద్రుంపంగ భూమి♦గతులై రిట్టుల్. ౧౩½

ఆ. విషయ మిద్ది నేను ♦ వివరించినాఁడ నీ,కపులు భూమిఁ దిరుగఁ♦గలుగ హేతు
వింతవట్టు] నన్ను ♦ నిట్లు ప్రశ్నించితి, వేను దెల్పినాఁడ ♦ నెఱిఁగి నంత. ౧౪

క. అనిలజుని బాలభావంబున జరగినవార్త నెల్లఁ ♦ బొందుగ నాచే
తను గీర్తింపంబడె; నంచును మౌని వచింప వినుచు ♦ క్షోణీశ్వరుఁడున్.

తే. అతనితమ్ముఁడు వానరు ♦ లసురవరులు
పరమవిస్మయమును బొంది ♦ పరమకరుణ
బావనిం జూచి; రంతట ♦ బ్రహ్మమౌని
వర్యుఁడైన యగస్త్యుండు ♦ ప్రభు మహేంద్రు. ౧౪½ 1823

క. రాముని గని యిట్లనియెన్, భూమీశా! మిమ్ముఁ గంటిఁ ♦ బూజ్యతరముగా
నీమాడ్కిని భాషించితి, స్వామీ! సెలవిమ్ము పోవు♦వాఁడ వసతికిన్. ౧౫

చ. అనుటయు నుగ్రతేజుఁడగు ♦ నమ్మునివాక్కుల నాలకించి స
ద్వినయము దోఁప నంజలి వి♦ధిన్ గరయుగ్మము రాజిలంగ ని
ట్లనియె; మహాత్మ! మీదయిన ♦ యాగమనంబున దర్శనంబునన్
జని ఫలియించె దేవతలు ♦ సంతస మందిరి తండ్రితాతలున్. ౧౫½ 1825

ఆ. సకలబంధువులును ♦ సంతుష్టులైరి; నా
మనివి దీనిఁ గొనుచు ♦ మదినిఁ దోఁచు
స్పృహను నేను బల్కఁ♦జేయఁగఁ దగినకా
ర్యంబు నానిమిత్త ♦ మాదరమున. ౧౬ 1826

క. ఒనరింపఁ దగును; పౌరుల, జనపదవాసులను బ్రీతి ♦ సంధిల్లఁగఁ జ
క్కనిరీతి స్వకార్యమ్ముల, నునిచి యిటన్ జేరినాఁడ ♦ నుద్యమ మలరన్. ౧౭

క. క్రతువుల నొనరించెద నున్నతయుష్మన్మహిమ మద్ది ♦ నన్ను సకలబం
ధుతతుల నలరింపఁగ; నా, క్రతువులను సదస్యులుగను ♦ గండు కరుణామై.

క. గురుతరతపఃప్రభావము, లరుదుగ మీయందుఁ దోఁచు ♦ నట్లాట మహా
దరమున నను రక్షింపఁగఁ, బరిగ్రహింపుఁడు సదస్య♦వరు లగుటకుఁగాన్.

ఉ. నేనును సత్తపోనియతి ♦ నిర్గతకల్మషజాలురై మహా
మానులునైన మిమ్ము దృఢ♦మానితభక్తి సమాశ్రయించి పెం
పూనఁగఁ జేయు మీకరుణ ♦ నొప్పి మనస్సుఖి మొందువాఁడ; నో
మానివరేణ్యులార! క్రతు♦మండలపూర్తిని జేయునంతకున్. ౫.౨ 1830

క. మీరెల్ల నొక్కచోటను, జేరి వసింపంగ వలయు ♦ క్షితి నిట ననఁగా
సారతరవ్రతనియతులు, నై రాజిలు నాయగస్త్యుఁ ♦ డాదియగుమునుల్. ౬౩
ఉ. రామునిసాధువాక్యతతి ♦ రంజిలుచిత్తము లొప్ప వించు న
ట్లేమి వసించువార మిట ♦ నెప్పుడు యాగమొనర్తురో రఘు
స్వామివరా! సువార్త యది ♦ వచ్చినతోడనె, యంచుఁ బల్కి యా
భూమిసుపర్వమానులును ♦ బోయిరి వచ్చినరీతి; నంతటన్. ౬౪ 1832
చ. జనపతి యామహాత్ములకు ♦ సాధుపథంబున మ్రొక్కి సాగనం
పెను; మును లేగ రామపృథి♦వీపతి విస్మితుఁడై తదర్థమే
మనమున నెంచుచుండె నొక♦మాడ్కిని; భాస్కరుఁ డస్తభూధరం
బును గన నేగ రాఘవుఁడు ♦ భూపతులం గవులన్ యథాదృతిన్. ౬౫ 1833
ఆ. పనిపి శాస్త్రవిహిత♦పద్ధతిగా సంధ్య,వార్చి భూమిపాల♦వర్యుఁ డంత
రాత్రి నంతిపురికి ♦ రంజిల్లుమదితోడఁ, జనియె సుఖసుషుప్తిఁ ♦ గనెడునూహ.

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౩౭ - వ సర్గము.

-◆◆ రాముఁడు భరతాదులతో సభ నలంకరించుట ◆◆-

క. జనపతి విదితాత్ముఁడు ధ, ర్మనియతి నభిషేకరూప♦మహ మొందెనొ యే
దినమున నానిశ పౌరుల, కనూనహర్షంబు నిడుచు ♦ నల్లన గడపెన్. ౧ 1835
క. తొలిరాత్రి సాగనంపెడు, నలనాల్గవ జామునందు ♦ నవనీపతి ని
ద్ముల నిద్రలేపు వందులు, నలలితమతు లవుడు రాజ♦సౌధమునందున్. ౨
ఆ. నిలిచి మధురకంఠ♦ములఁ దగు కిన్నరు, లనఁగ సాధుబోధ ♦ లందియుంట
నియతిమీఱ హర్ష♦నిర్భరచిత్తము,లను సుషుప్తిఁ గన్న ♦ మనుజవిభుని. ౩
క. వినుతించిరి సౌమ్యా! వీ,రనికరవినుతా! మహాత్మ! ♦ రామశశాంకా!
జననీప్రీతివివర్ధన!, జననాథా! మేలుకొమ్ము ♦ సనుయము కానన్. ౩౫ 1838
తే. నీవు నిద్రింప జగ మెల్ల ♦ నిద్రవోవుఁ;
గాన మేల్కొమ్ము నీదువి♦క్రమము విష్ణు
విక్రమసమానమగు భవ♦ద్విమలరూప
మశ్విరూపాధికంబుగా ♦ నమరుఁ జుమ్ము. ౪౫ 1839
*క. మతివిభవంబునను బృహ,స్పతితుల్యుఁడ వీవు బ్రహ్మ♦సముఁడ వటంచున్
హితముగ వర్ణింపం దగు, క్షితితో క్షమయందు సమతఁ ♦ జెందుదు రామా!.
చ. సరసిజమిత్రుఁ దేజమున ♦ సాధుజవంబున వాయుదేవునిన్
బరమగభీరభావమున ♦ వారిధి మించినవాఁడ వీవు శం

---

* బుద్ధ్యా బృహస్పతే స్తుల్యః ప్రజాపతిసమో హ్యసి-అనియూ.

కరువలె నప్రకంప్యుఁడవు ♦ కంజవిరోధిని సౌమ్యతన్ నిరం
తరము జయింపఁ జాలుదువు ♦ ధాత్రి భవాదృశమేదినీపతుల్. 1841

క. మును లేరు పుట్టఁబోవరు; నిను నోంప నదెవ్వఁడేని ♦ నేరఁడు ధర్మం
బున నిశ్చలమతివై తగు, దనయమ్ము ప్రజాహితుఁడవె ♦ యగుదువు గానన్.

క. నినుఁ గీర్తియు లక్ష్మియు నో, జననాథా! విడువకుండు; ♦ శాశ్వతవానం
బును జేయును నీయందా, వినుతశ్రీధర్మము లొగి ♦ విశ్వాసమునన్;. ౮౪

చ. అని యిటు వందు లానృపతి ♦ నాదృతిమై వినుతింప సూతు లా
య్యన మధుర స్తవంబులను ♦ హారిపదంబుల సన్నుతించి; రా
జనపతి స్తోత్రనాదములఁ ♦ జక్కఁగ మేల్కని యూర్ధ్వభాగమం
దనుపమశుభ్రవస్త్రయుతి ♦ నందినశయ్యను బాసి యంతటన్. ౧౦ 1844

చ. హరి ఫణిశయ్యనున్ వదలి ♦ యల్లన లేచెడునట్లు లేచె; నా
ధరణిపుఁ డట్లు లేవఁగ ము♦దంబున సేవకు లర్థి నీరునుం
బరికరరాజినిం గొనుచు ♦ వచ్చిరి వేలకు వేలుగాఁగ; భూ
వరమణి యెల్లకృత్యముల ♦ వైళమ తీర్చి కృశాను వేల్చుచున్. ౧౩౪ 1845

క. పరమం బిక్ష్వాకుమహీ, వరసేవితమునగు దేవ♦భవనంబును జే
రి రయంబున నట దేవో,త్కరపితృభూసురులఁ బూజఁ ♦ దన్పుచు విధిగన్.

సీ. పరిజనుల్ వెంట రా ♦ బాహ్యకక్ష్యాంతరంబును నిర్గమించె నా♦భూపవర్యు
సపురోహితులగు నా♦సచివులు మహితాత్ము లనుసరించిరి వసి♦ష్ఠాదు లర్థ
దీప్యమానాగ్నుల♦తీరున; మహితాత్ములగు బహుజననాథు ♦ లారఘూత్త
మునిపార్శ్వసీమను ♦ బొల్చిరి శక్రుని సురులు సేవించు♦నట్లు; భరత

తే. లక్ష్మణులును శత్రుఘ్నుండు ♦ లలితయశులు
వేదములు మూఁడు సవమున ♦ వెలసినట్లు
శ్రీరఘూత్తముప్రక్క ని♦ల్చిరి సుభక్తిఁ
గొలుచుకోరిక లాత్మలఁ ♦ బొలయుచుండ. ౧౨ 1847

చ. జనపతి కొల్వుకూటమును ♦ జయ్యనఁ జేరఁగఁ బోవఁ గింకరుల్
చని రఘురాముపార్శ్వమున ♦ సాంద్రముదంబున మోము లొప్పఁ జ
క్కనిగతి నంజలుల్ తనరఁ♦గా బహురీతులఁ గొల్చియుండి; రా
వనచరనాయకుల్ బలము ♦ వర్ధిలుచుండఁగ వేడ్కమీఱఁగన్. ౧౮ 1848

*తే. కామగమనులు నర్కజాం♦గదముఖు లవు
డిరవదియొ సంఖ్యగలవా ర♦హీనవిభవు
లుగ్రతేజంబులం బొల్చి ♦ యుర్వినాథుఁ
గొల్చి; రంత విభీషణా♦ఖ్యుండు ఘనుఁడు. ౧౯ 1849

* వింశతిః కామరూపిణః-అనిమూ.

క. తనమంత్రులు నల్వురు త,న్ననురక్తిం గొల్వ గుహ్యా♦కాధిపుని ధనే
శుని గుహ్యకరాజివలెఁ, జననాథు మహాత్ముఁ గొల్చె ♦ సంతస మొప్పన్. ౨౦

తే. వేదవృద్ధులు సత్కులుల్ ♦ విమలచిత్తు
లైన పౌరులు నేర్పరు ♦ లౌటఁ దలలు
వంచి రామునకున్ మ్రొక్కి ♦ వరుసఁ గొల్చి
రట్లు సచివాదిసంయుక్తుఁ ♦ డగుచు నృపుఁడు. ౨౧ 1851

క. ఘనులగు మునినాయకులున్, జనపతు లతివీర్యు లటవి♦చరులును దనుజుల్
తనుఁ బరివేష్టింపఁగ మా,సినికరసంయుక్తుఁడైన ♦ నిర్జరపతి నాన్. ౨౨ 1852

క. అలరారుచు దేవేంద్రునిఁ, గలవిలపా టొందఁజేయు ♦ కమ్రాకృతిచేఁ
జెలఁగుచు నెల్లరు చక్కఁగఁ, గొలువునఁగూర్చుండియుండఁ♦గుతుకంబలరన్.

ఆ. మధురకథలు సాధు♦మానులు ధర్మసం,యుక్తిఁ దెలుపుచుండ♦ నొగిఁ బురాణ
గాథ లెల్ల వినుచుఁ ♦ గమనీయరూపుండు, నిండు కొలువుచేసె ♦ నేర్పుచెలఁగ.

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

---

## అధికపాఠము ౧ - వ సర్గము.

### వాలిసుగ్రీవులజననము.

చ. మునివరు నయ్యగస్త్యుఁ గని ♦ భూపతి యిట్లని పల్కె నంజనా
తనయునిగాథ వింటి ముని♦తల్లజ! ఋక్షరజుండు వాలి కా
తని యనుజన్ముఁడై రిపుక♦దంబము నేఁచెడు నర్కసూతికిన్
జనకుఁ డటంచుఁ బల్కితిరి ♦ సంతసమయ్యె మదిన్ నితాంతమున్. ౧ 1855

క. జనని యదెవ్వరొ నాకున్, మునివర! తెలుపంగ లేదు ♦ ముదమొప్పెడుఁ ద
జ్జననీనామము వినఁ జ,క్కనిరీతిం దెల్పవయ్య! ♦ కుంభజసురవర్యా!. ౨౫ 1856

చ. అనురఘురాము వాక్కు విని ♦ యమ్మునినాథుఁడు పల్కె నిట్లుగా;
విను రఘురామ! యిక్కథను ♦ వింతలఁ గొల్పెడుదాని నంతయున్
మునిపతి నారదుండు మదిఁ ♦ బొల్చెడు వేడుక మామకాశ్రమం
బున కరుదెంచి చెప్పె నిది ♦ పొల్చును వీనుల కింపుఁ గూర్చుచున్. ౪ 1857

ఉ. నారదుఁ డొక్కనాఁడు జత♦నంబున నాయుటజంబుఁ జేరె నే
గారవమొప్ప నాయనఘుఁ ♦ గాంచి యథావిధిఁ బూజఁజేసి గం
భీరవచస్తతిన్ వినెడు♦వేడుక నాసన మిచ్చి యిచ్చటం
జేరుట నాదుపుణ్యఫలము ♦ సిద్ధిని బొందెను నేఁటి కోమునీ!. ౫ 1858

క. అని పల్కి నీవు ప్రశ్నిం,చిన యీగాథను దగంగఁ ♦ జెప్పవె నాకం
చును బ్రశ్నించితి, ధర్మం,బునఁ బొల్చు మనంబుగల్గు ♦ పూజ్యుం డౌటన్. ౬

చ. ననుఁ గని యిట్లు పల్కె మునినాయక! చెప్పెద నాలకింపుమా
ఘనగిరి మేరునామమునఁ ♦ గాంచనరూపము నొంది లక్ష్మికిన్
జనకగృహంబు నా నలరుఁ ♦ జక్కనిశృంగము దానియంతరం
బున సకలామరార్చనముఁ ♦ బొంది వెలుంగుచునుండు నెప్పుడున్. ౯ 1860

సీ. అందు సూజామడ♦లంత విస్తీర్ణంబు గల్గి దివ్యంబయి ♦ కాంతమగుచు
నలరుచు బ్రాహ్మియా ♦ నట్టియుత్తమసభ యొప్పుచుండును బద్మ♦యోనినాల్గు
మోములవేలుపు ♦ మూర్తులలో నాదియనఁ దగు బ్రహ్మ యం♦దలరుచుండు
యోగంబు సేవించు♦చుండ నాతనినేత్రములనుండి రసమొండు ♦ గలిగిజాఱెఁ
తే. గరములన్ బ్రహ్మ గైకొని ♦ కలిగె నిద్ది
యేలొకో యని చర్చించి ♦ యిలను వదలె
సృష్టికర్త యారీతిని ♦ క్షితిని విడున
నశ్రుకణమున నద్దాన ♦ నలరెఁ గపియు. ౧౦ 1861

చ. జనిఁ గనినంతనే కపిని ♦ సారససంభవుఁ డాదరించి ప్రీ
తిని గలిగించు వాక్యవిత♦తిన్ మహితాత్ముఁడు బ్రహ్మ పల్కె; నో
వనచర! యావిశాలగిరి♦వర్యము చూడుము దేవవర్యు లిం
దనవరతంబు నుండుదురు ♦ హారిగిరీంద్రమునందు నియ్యెడన్. ౧౧ 1862

క. పలువిధములై నమూలంబుల ఫలములఁ దినుచు నిరత♦మును నాచెంతన్
జెలఁగుచు నుండుము; నీవిమ్ముల నీస్థలమందు వాస♦మును నాచెంతన్. ౧౨

ఆ. కొంతకాల ముండఁ ♦ గొదువ లేనట్టి శ్రే
యంబు నొందఁజాలు ♦ దనుచు బ్రహ్మ
పలుకఁ గీశపతియు ♦ జలజోద్భవునిపల్కు
లాలకించి దేవ♦తాధిపతిని. ౧౩ 1864

క. కనుఁగొని భక్తిని దత్పద,వనజంబులు శిరము సోఁక ♦ వందనములు చే
సి నియతిని లోకకర్తను, ఘనునిం దొలిదేవుఁ గాంచి ♦ కడువడిఁ బలికెన్.

క. దేవర యాజ్ఞాపించిన, యావిధమున మెలఁగువాఁడ ♦ నన్నచ్ఛ్రేయః
పావనఫలదంబగుఁ గద, భావింపఁగ శాసన మిది ♦ పంకజసూతీ!. ౧౫ 1866

చ. అని వినయంబునన్ బలికి ♦ హర్షముతిన్ బరమేష్ఠిశాసనం
బునఁ జని సాధుపుష్పఫల♦పూగము లెప్పుడు గల్గు భూజరా
జిని దగు మేరుపర్వతముఁ ♦ జేరి పితామహాలబ్ధదోర్బలం
బున వనసీమ నందు ఫల♦మూలకృతాశనుఁడై యథేచ్ఛఁగన్. ౧౬ 1867

సీ. ఒకచోటఁ దేనెలఁ నొకచోట♦బహుపుష్పముల గ్రహియించుచుఁ♦జెలఁగి ప్రతిది
నమునందు సాయంత♦నమునఁ బితామహుసన్నిధి కేగుచు ♦ సంగ్రహించి
నట్టిసుమంబుల ♦ నమలఫలంబుల దేవతాధీశ్వరు♦దివ్యపాద
ములకు నర్పించుచుఁ ♦ బోవుచు వచ్చుచు గిరి బహురీతులఁ ♦ దిరుగునతని

ఆ. కాల మొక్క కొంత ♦ గడచె నివ్విధిఁ గొంత, కాలమేగఁగీశ♦కాంతుఁ డొక్క
తటిని దప్పిచేతఁ ♦ దద్దయుఁ బీడింపఁ, బడియె రామచంద్ర! ♦ పార్థివేంద్ర!.

చ. చని చని యుత్తరంబున వి♦శాలముగాఁ దగు మేరుశృంగమం
దు నిఖలపక్షిసంఘములు ♦ తోరపు వేడుక నుండఁ దేటఁగాఁ
గనఁబడువారి చల్లఁగను ♦ గ్రాల మనోహరమౌ సరస్సునుం
గనియెను; దత్తటంబున స్వ♦కంబగు *కేసరజాల మెంతయుఁన్. ౨౧ 1869

తే. గాలితాఁకునఁ జలియింపఁ♦గా నిలిచెను;
దత్సరస్సున నాత్మవ♦క్త్రంపుఛాయఁ
గనియె; నంతర్జలంబునఁ ♦ గానఁబడు ని
తం డెవండొకో యితఁడు నా♦దస్యువె యగు. ౨౨౪ 1870

క. రూపము కడుఁ గొప్పదిగా, నీపట్టునఁ దోఁచుచున్న♦దే యని కడఁకన్
గోపముమీఱఁగఁ జూచెను;, రూపం బది తన్నుఁ బోలి ♦ క్రోధమునొందన్.

చ. ఇతఁడు మదీయశత్రువగు ♦ నిట్టిమహోగ్రహ మూనియున్నవాఁ
డితనిని దుష్టభావమున ♦ నీగతి మించెడువానిఁ జంప కే
గతి విడువంగనౌ; ననుచు ♦ గాఢరుడావిలమానసంబునన్
జతనముమీఱ నెంచి సహ♦జం బగువానరచాపలంబునన్. ౨౪౪ 1872

ఆ. పైకి నెగిరి దుమికెఁ ♦ బ్లవగేంద్రుఁ డావ్రాన, యందు దానిఁ జంపు♦నాశయమున
జలములందు మునిఁగి ♦ చయ్యన నాతఁడు, పైకి లేచెఁ గానఁ♦బడమి వైరి. ౨౫౪

క. ఆతరుణమునందే యా, పాతనువున నాతఁ డొప్పె ♦ క్ష్మాపతినాథా!
చేతోహారియనంగగు, నాతనువు విలాసయుక్తి ♦ నలరెన్ మిగులన్. ౨౬

సీ. అతిశయలావణ్య ♦ మలరార విస్తీర్ణజఘనయై భ్రూవిలా♦సమునఁ జెలఁగి
నీలకుంచితకేశ♦జాలముల్ మెఱయుంగ నస్మితవక్త్రంబు ♦ చారుతరము
గాఁ గనంబడుచుండఁ ♦ గమనీయతరపీనకుచయుగళంబును ♦ గొమరుమిగుల
బుజుయష్టిలతక్రమ♦రీతి నొప్పెడుగతి మంగళప్రదయన ♦ మహిళ యద్ది

తే. ప్రాదతటంబున వెలసె; నా♦రమణి యప్డు
కాంత త్రైలోక్యసుందరి ♦ కమలరహిత
యైన లక్ష్మివిధంబున ♦ నంబుజారి
చంద్రికయుఁ బోలి విమలయై ♦ సరసగతిని. ౨౮ 1875

క. కనువారిచిత్తముల కా, ర్తిని గల్గఁగఁ జేయ జాలి ♦ దివ్యతనువునన్
వనజాలయఁ బార్వతి వాణిని బోలుచు దివ్యకాంతి♦నిచయము చేతన్. ౨౮౪

క. నలుదెసల వెలయఁ జేయుచు, నిలిచె నటన్; దేవవిభుఁడు ♦ నిఖలజగత్సృ
ష్టిలలితుఁడై తగు శతధృతి, కలువహ్రాదంఘ్రిద్వయంబుఁ ♦ గడుభక్తి తగన్.

* చలత్కేసర మాత్మానం కృత్వా తస్య తటే స్థితః-అనిమూ.

తే. చక్కఁగాఁ గొల్చి మరలి యా♦నరణి స్వర్గ
పురికిఁ బోవంగ వచ్చె నా♦తరుణమందె;
యప్పుడే భాస్కరుండు వి♦యత్తలమునఁ
దిరుగుచున్ వచ్చె నెందు నిం♦తియుఁ జెలంగు. ౩౧ 1878

చ. వనమున దేవనారివలె ♦ వర్ధిలు నాతనుమధ్య వెల్గ దే
వనికరనాథభాస్కరులు ♦ వచ్చి కనుంగొని రేక కాలమం
దనితరదృష్టరూపమున ♦ నందుఁ జెలంగెడు నాతలోదరిన్
మనసిజతాపముం గనిరి ♦ మానినిఁ గాంచిన యంత నిర్వురున్. ౩౩ 1879

తే. క్షుభితసర్వాంగులై శత♦కోటిహస్తుఁ
డబ్జమిత్త్రుండు చిత్రమా ♦ నౌర! యిట్టి
తన్విరూపంబటంచును ♦ దలఁచి త్యక్త
ధైర్యులై; రంత నింద్రుచి♦త్తంబు కలఁగి ౩౪ 1880

క. చ్యుతిఁ గాంచెను రేత స్సా,నితంబినీశీర్షమందు ♦ నిల్చె నదియు నీ
గతి నా లేమను బొందక, శతమఖుఁ డపగతమదుండు ♦ చయ్యన నయ్యెన్.

చ. వనితయు నింద్రుకాంతిమెయి ♦ వానరనాథు మహాబలాన్వితున్
గనియె నమోఘవీర్య మది ♦ గావునఁ బుత్త్రుఁడు నట్టివాఁడుగాఁ
దనరెను *వాలరాశిఁ బడెఁ ♦ దద్ఘనబీజము గాన వాలి నాఁ
దనయునిపేరు లోకమునఁ ♦ దద్దయు విస్తృతి నొందె రాఘవా!. ౩౬ 1882

క. సరసిజమిత్త్రుండును రతి,వరువశమున వర్తిలుటను ♦ వనితగళమునన్
బరమాద్భుతి బీజమునుం,చె రమణినిం గూర్చి శుభము♦చెందువచనమున్.

ఆ. ఒక్కదానినైన ♦ నక్కడఁ బల్కక, యూరకుండె రవియుఁ; ♦ నుడిగె మోహ
మతని కంత బీజ ♦ మానని తాగళ,ముందుఁ బడినఁ దనయుఁ ♦ డప్పు డొదవె.

క. ధరణిని సుగ్రీవుం డనఁ, బరఁగెఁ దనూజుం డతండు ♦ పటువీర్యమునన్
గర మద్భుతరీతిని ని,ర్వురుతనయులు చెలఁగి రగచ♦రులు బలయుక్తుల్. ౩౯

చ. సురపతి యంత నాత్మజుని ♦ శూరునిగాఁ దలపోసి యా కపీ
శ్వరునకు స్వర్ణమాలికను ♦ సాధుగుణోన్నతి నొప్పుదాని న
క్షరముగ నుండుదాని నిడి ♦ స్వర్గము చేరఁగఁ బోయె; నంత భా
స్కరుఁడును స్వాత్మజన్మునకు ♦ సర్వవిధంబులఁ దోడ్పడన్ నృపా!. ౪౧ 1886

క. హనుమంతుని మతిమంతుని, గనఁబఱచి సఖుంబుఁ జేరఁ♦గాఁ జనియె; నిశా
వనితామణి మెలమెల్లనఁ, జనఁగా నుదయించెఁ బద్మ♦సఖుఁ డట్టితఱిన్. ౪౨

చ. వనితగ మాఱియున్న కపి♦వర్యుఁడు పూర్వమురీతిఁ గీశతం
గనియె; యథాప్రకారమగు ♦ కమ్రకపిత్వము నొంది యంతలో

* వాలేషు పతితం బీజం వాలీనామ బభూవ హ-అనియు.

గనియెను గామరూపులయి ♦ గాఢబలోన్నతులై చెలంగు నా
తనయులఁ బింగళేక్షణుల ♦ దస్యుభయంకరులన్ ముదంబునన్. ౪౩ 1888

ఆ. అమృతకల్పములగు♦నట్టి తేనెలఁ దెచ్చి
తనయులకు నొసంగెఁ ♦ దదవసరము
నందు ఋక్షరజుఁడు; ♦ డంతఁ దత్తనయులఁ
గొనుచు బ్రహ్మకడకుఁ ♦ జనియెఁ బ్రీతి. ౪౪ 1889

చ. శతధృతి పుత్త్రయుగ్మయుతు ♦ సంతసమున్ మది లజ్జయున్ దగన్
హితమును గోరి వచ్చిన య♦హీనబలాఢ్యుని వానరేంద్రు ను
న్నతి మెఱయంగ నూఱడిల ♦ నైజమతి ప్రతిభావిశేషసం
గతి నొనరించి పల్కుఱును ♦ గ్రన్నన నిర్జరదూత నొక్కనిన్. ౪౬ 1890

క. పిలిచి మదీయాజ్ఞను మం,గళకరకిష్కింధనామ♦కంబగు పురి కి
మ్ములఁ జని గురుతరమగుచుం, బొలుపొంది యనేకగుణవి♦భూతులఁదగుచున్.

ఆ. అలరు నందుఁ బెక్కు♦హరియూథములు తగుఁ;
గామరూపులగుచుఁ ♦ గపివరేణ్య
లందు నుంద్రు రత్న♦సందోహ మలరారు
దానిఁ గనుము వేగ ♦ తరలిపోయి. ౪౯ 1892

సీ. పుణ్యాపణంబులఁ ♦ బొలుపొంది యతివిశాలంబయి దుర్గము♦లను జెలఁగుచు
నాలుగుజాతుల ♦ నోలి నొప్పుచు విశ్వకర్మనిర్మితమయి ♦ కమ్రతరము
నైతగు కిష్కింధ ♦ యనుపుర మయ్యది; మన్నియోగంబునఁ ♦ గ్రన్ననఁ జని
హరిపతి నీతని ♦ నాత్మజయుక్తుని నభిషేక మొనరింపు ♦ మందు యూథ

ఆ. పాలకులను మఱి యుఁ ♦ బ్రాకృతకపులను, బిలువనంపి దేవ♦తలను జేర్చి
యాయతాసనంబు♦నందుఁ గూర్చుండఁగాఁ, జేసి కపివరేణ్యుఁ♦జేయు మితని.

క. కనినంతనె మతిమంతు ని,తని వారలు సేవకులయి ♦ తమ కధిపతిగాఁ
గను దలఁతు రెల్లవేళల;, నని విధి యానతియొసంగ ♦ నాకపి యలరన్. ౫౨

ఆ. అమరదూత ముందు ♦ హరిపతిచనుచుండ
శుభపురంబు దానిఁ ♦ జొచ్చి గుహను
బోలి యున్నదానిఁ ♦ బొలుపొందు పవనవే
గమునఁ జేరి కీశ♦కాంతు నందు. ౫౩ 1895

క. వనజజునానతి సింహా,సనమున నలరంగఁ జేసి ♦ క్ష్మాపాలకు లే
యనువున నభిషిక్తులుగాఁ, దనరుదురో యావిధమునఁ ♦ దగువిభవమునన్.

తే. మంగళస్నాన మొనరించి ♦ మహితపూజ
లందఁగాఁ జేసి నృపుఁ జేసె; ♦ నంత నతఁడు

బద్ధముకుటుండు శ్రీపరి♦భాసమానుఁ
డఖిలమణిగణభూషితుం ♦ డగుట నపుడు. ౫౫ 1897

క. హరిగణముల కధిపుండై, పరిపాలన మొప్పఁ జేసెఁ ♦ బ్లవగవితతి యీ
ధరణిని వార్ధిద్వీపో,త్కరమున వసియించు నద్ది ♦ దానికిఁ బ్రభువై. ౫౬

తే. *వాలిసుగ్రీవుజనకుఁడై ♦ వఱలు ఋక్ష
రజసుఁడని చాటఁ బంచె నిం♦ద్రప్రభాక
రులకుఁ దల్లియుఁ దండ్రియుఁ ♦ దలఁప నితఁడె
యని స్మరించిన శుభమగు ♦ నవనినాథ !. ౫౭ 1899

క. వినిపించినఁ దా వినినను, మనమునఁ గలవాంఛితములు ♦ మానితరీతిఁ
గను సిద్ధి దీనిమహిమను, నని నారదుఁ డప్డు చెప్పె ♦ నవనీనాథా !. ౫౮

ఆ తెలిపినాఁడ నీకుఁ ♦ దెల్లంబుగాఁగ నీ,కథను దత్త్వముగను ♦ గవుల జనన
మును హరీశ్వరులయి ♦ భూమిపై ఖ్యాతిని, బడసినట్టి విధము ♦ పార్థివేంద్ర !.

అధికపాఠము, ఒకటవ సర్గము సంపూర్ణము.

---

## ౨ - వ సర్గము.

రావణుఁడు సనత్కుమారునితో సంభాషించి విష్ణుమహిమను నెఱుంగుట.

క. అని యిటు పౌరాణికగా,థను బావనతరము మౌని♦తల్లజుఁడు వచిం
చిన విని సోదరయుతుఁడై, జనపతి పేరుండు రామ♦చంద్రుఁడు మిగులన్. ౧

ఆ విస్మయంబు నొంది ♦ విబుధమునీంద్రునిఁ
గాంచి యిట్లు పలికె; ♦ గాథ యిద్ది
పుణ్యతరము వింటిఁ ♦ బొలుపొందు మీకృపఁ
బరమకౌతుకంబు ♦ భాసిలె మది. ౨ 1903

క. జననము కపిసోదరులది, విన వినఁ జిత్రంబుగాఁగ ♦ వెలసెడు సురరా
ట్టును భాస్కరుండు తేజం,బున మెఱయుచుఁ గపివరులుగఁ ♦ బుట్టిరి గాదే.

క. కనుకన్ వీరలు వెలయుట, యనఁ జిత్రం బేమి యుండ ♦ దారయ ననఁగా
విని బ్రహ్మముని యగస్త్యుఁడు, ఘనబాహూ! వృత్తము చిర♦కాలజమిదియౌ.

చ. కలదొక వేఱుగాథ యది ♦ గ్రాలు పురాతనమై మనోజ్ఞమై;
ఖలుఁడని పిల్వఁగాఁబడెడు ♦ కర్బురనాథుఁడు రావణుండు మీ
లలన నదేల దొంగిలెనొ ♦ లక్ష్మణపూర్వజ! యావిధంబు నేఁ
దెలిపెద శ్రద్ధయుంచి వినఁ ♦ దృప్తియు మోదముఁ గల్గు దానిచేన్. ౬ 1906

* ఇంద్రప్రభాకరులకుఁ దల్లియుఁ దండ్రియు-అనఁగా నింద్రసూర్యులే ఋక్షరజసునికిఁ దనయులై పుట్టిరని భావము. ఈవిషయము ద్వితీయసర్గమునందు శ్రీరాముని ప్రశ్నమునఁ దేటపడఁ గలదు.

క. మును కృతయుగమున బ్రహ్మకుఁ, దనయుండు సుతేజసుండు♦ధన్యుఁడునగుచుఁ
వనజాపుత్రీతిఁ గ్రాలుచుఁ, దనరారు నసత్కుమారుఁ ♦ దా నొకచోటన్. ౮

చ. కనియెను రావణుండు సుర♦కాండనమస్కృతుఁ జూచినంతనే
వినయముతోడ మ్రొక్కి మది♦వేడుక దోసిలి యొగ్గి సత్యవా
క్కునఁ జెలువొందు మౌనిగణ♦కుంజరు నాతనిఁ జూచి యిట్లనున్;
మునివర! దేవతావితతి♦ముఖ్యుఁడు లోకములందు శ్రేష్ఠుఁడున్. ౯ 1908

క. బలవత్తరుండు నెవ్వఁడు, గలఁ డెవ్వని నాశ్రయించి ♦ కర్బురులను వై
రుల దేవతలు జయింతురొ, యిల నిత్యము జనులు భక్తి♦నెవనిఁ గొలుతురో.

క. ఎవ్వనిఁ గూర్చి యజింతురొ, యెవ్వని ధ్యానింతురొక్కొ♦యెలమిని యోగుల్
అవ్విభునిఁ జక్కఁ దెల్పుము, యెవ్వని వినఁ బాపజాల ♦ మేగునొ వెలికిన్.

క. మునివర్య! తపోరాశీ!, యన రావణువాగ్గతంబు ♦ ధ్యానని యతదృ
ష్టిని జూచి మహాయశుఁడౌ, మునిపతి ప్రేమమున దనుజ♦ముఖ్యా! వినుమా.

చ. అని యిటు పల్కె; లోకముల ♦ నద్భుతశక్తి నెవండు తాల్చునో
జననవిధం బదెవ్వనిది ♦ చక్క నెఱుంగఁగఁ జాలకుండు మో
వనజదళాక్షుఁ డవ్యయుఁడు ♦ వాసవముఖ్యసురాళిచేత నా
దనుజులచే నమస్కృతుఁడు ♦ తథ్యము విష్ణువె దానవాధిపా!. ౧౩ 1912

సీ. జగముల సృజియించు ♦ శతధృతి యెవ్వని నాభిపంకజజన♦నంబుఁ గనెనొ
యతనిలోకముల ను♦హాశక్తి నెవ్వండు పుట్టించెనో లోక♦పుంజ మెల్ల
స్థావరజంగమా♦త్మక మేనిశక్తిచే నిలిచియున్నదొ దేవ♦తలు సతంబు
విధిగ నధ్వరముల ♦ వేల్తురో యెవ్వనిప్రీతికై, యెవని సం♦ప్రీతిమెఱయ

తే. నాశ్రయింతురొ, యెవ్వని♦యాదరమున
నమృతపానము చేసిరో, ♦ యఖిలసుర్యు
లెవని ధ్యానింతురో, యోగు ♦ లెవని వేద
పాంచరాత్రపురాణాళిఁ ♦ బరమనియతి. ౧౪ 1913

క. మనముల ధ్యానింతురొ; యజ్ఞనిచయముల వేల్తురో; వి♦శాలయశుఁడు పా
వనకీర్తి యెవఁడు దితిజుల, దనుజుల రాక్షసుల నింకఁ ♦ దగు సురరిపులన్.

చ. అనిమొనఁ దా జయించునొ మ♦హాత్ముఁడు శ్రీపతి సర్వదేవతా
వినుతుఁ డతండె యొప్ప నను♦విప్రమునీంద్రుని వాక్యవర్యమున్
విని దనుజేశ్వరుండు మది ♦ వేడుక లూరఁగ మ్రొక్కి మౌనివ
ర్యుని భజియించుచుం బలికె; ♦ నోమహితాత్మక! యోగిపుంగవా!. ౧౫

సీ. దైత్యరాక్షసులును ♦ దనుజు లింకను గల్గు సురవైరు లామహా♦శూరుచేత
హతులయి యేగతి♦నందువారలొ తెల్పు, మెవ్వరు తెగిరొ యా♦యీశుచేత;

నన మానినాథుఁ డిట్లనియె రావణుఁ జూచి దనుజు లెవ్వరు దేవ♦తాహతులగు
దురో, వారలేచేసి♦దురు స్వర్గమును, బరిభ్రష్టులై యందుండి ♦ వసుధఁబుట్టు
తే. చుందు; రాత్మీయపూర్వార్జి♦తోరుపుణ్య
పాపసుఖదుఃఖములచేత ♦ భవముఁ గనుచు
మృతిని బొందుచు నుందు; రే♦యో సురారు
లాజనార్దనుచేత మ♦హాత్ముచేత. ౧౧ 1916

తే. చక్రధారలఁ బూనికఁ ♦ జంపఁబడుదు
రో మహాపుణ్యతనులయి ♦ యొప్పువార
లెల్ల వైకుంఠమును బొంది ♦ యీశు లగుచు
వెలయుచుందురు రావణా! ♦ విమలు లగుచు. ౧౨ 1917

*క హరికగు క్రోధము చూడఁగ, నరతుల్యమె యగు నటంచు ♦ వరముని పలుకన్
సురవైరినాయకుఁడు విని, పరమప్రమదంబు నొంది ♦ భక్తి వెలయఁగన్.

క. హరియున్న లోకమును నేఁ, గర మరుదుగఁ బొందు టెట్లు ♦ కదనము నాకున్
సిరిపతితోఁ గల్గు నదే, కరణి నటం చాత్మలోనఁ ♦ గడుఁ దలపోసెన్. ౧౩

అధికపాఠము, రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - వ సర్గము.

సనత్కుమారుఁడు విష్ణువు రాముఁడై యవతరింపఁగలఁడని వచియించుట.

క. మనమున నిట్లు దురాత్ముఁడు, దనుజేంద్రుఁడు రావణుండు ♦ తలపోయుట న
మ్మునిపతి యెఱింగి యీగతి, ననియె మహాబాహురాజ♦తాంగా! నీకున్. ౧౪

క. దుర మొనఁగూడును గోరిక, లరుదగురీతిన్ ఫలించు ♦ నక్లాట నిఁకన్
బరిపరిఁ దలఁపక సుఖివై, చరియింపుము నీవు కొంత♦సమయం బిలలోన్. ౨

చ అన విని యామహాభుజుఁడు ♦ హర్షము పొంగ మహాత్ము నామునిం
గనుఁగొని యీవిధిం బలికెఁ ♦ గ్రమ్మఱ; నాతని కెన్న లక్షణం
బన నది యెట్టి దా తెఱఁగు ♦ నంతయుఁ జెప్పుము; మానిపుంగవా!
యన దనుజేంద్రువాక్కు విని ♦ యమ్ముని సర్వము నీకుఁ దెల్పెదన్. ౩౪ 1922

చ. వినుమని యిట్లు పల్కె; సుర♦వీరరిపూ! పరమాత్ముఁ డానినా
తనుఁడు జగత్ప్రభుండు సుర♦తల్లజుఁ డెల్లెడ నుండువాఁడు; వ్య
క్తిని గనకున్నవాఁడు నగుఁ ♦ గేశవుఁడే యని నమ్ము మాతఁడే
యొనరిచె నీచరాచరసు♦యోర్విని మూఁడుగ నాత్మశక్తిచేన్. ౫ 1923

సీ. ఆదినారాయణుం ♦ డాతఁడే భూమిని, నంతరిక్షమున స♦ర్వాలయమునఁ
బర్వతంబులయందు ♦ వనముల స్థావరములను గ్రామవ్యూహ♦ములను నగర

---

* క్రోధోపి దేవస్య వరేణ తుల్యః-అనియూ.

ములనిండియుండును ♦ మూర్తి యోంకారంబునత్యంబుసావిత్రి ♦ క్షమయునతండె
యగు ధరాధరధరుం ♦ డయి దేవుండాతం డనంతనామంబున ♦ సంతతంబు

తే. విశ్రుతుండగు; సూర్యుండు ♦ విధుండు యముండు
కాల మనలుండు వాయువు ♦ బాలుం డబ్జ
భవుండు పరమేశ్వరుండును ♦ బగలు రేయి
యుభయసంధ్యలు నాతండె ♦ యొప్పం జూప్త. ౮ 1924

చ. వెలుంగంగం జేయుం దానె కడు ♦ వేడుక వెల్గును నిండియుండు ని
మ్ముల గ్రహియించు లోకములం ♦ బుట్టంగం జేయును జంపు నేలు శ్రీ
లలితుండు దండనంబును వి♦లాసముగా నొనరించుం గ్రీడలన్
సలుపును లోకనాథుండయి ♦ శాశ్వతుండై భవనాశహేతువై. ౯ 1925

తే. విష్ణు వగుచుం బురాణుండై ♦ వెలయు నితండె;
పెక్కుమాటల నింకేల ♦ నొక్కండైన
హరియె త్రైలోక్యమగు చరా♦చరము నెల్లం
గలయ వ్యాపించి యుండును ♦ గర్బరేంద్ర!. ౧౦ 1926

సీ. కువలయదళములా♦గున శ్యామవర్ణాంగుం డగుచుం గింజల్క మ♦ట్లగుణామైన
యంబరం బలరార ♦ నభ్రంబునందుం బ్రావృట్కాలమునం దటి♦ద్విలసితమగు
జలదంబురీతిగా ♦ వెలయుచు; శ్రీకాంతుండై వరదాంగుండై ♦ యంబుజారు
ణాక్షుండై శ్రీవత్స ♦ మాయతోరస్సునం గ్రాల శీతాంశులక్షణము గల్గి

తే. *మెఱపు లంబుదములనుండి ♦ మించునట్లు
సమరరూపిణి లక్ష్మియు ♦ సంతతంబు
తచ్ఛరీరంబుననె యుండు ♦ దలంప నతండు
గనంగ సురల కశక్యుండౌ ♦ దనుజనాథ!. ౧౩ 1927

క. సురవైరులు పన్నగులును, బరికింపం జాల రతనిం ♦ బరమేశుం డదె
వ్వరిని గృపం జూచునో యా, పురుషుండె యాతనిగనంగం ♦ బోలునుజూడ్మా!.

తే. యజ్ఞఫలములం దపముల ♦ నఖిలదాన
ములను యోగంబులను సిరి♦వెలయు నతండు
గన నశక్యుండు; విను మింకం ♦ గర్బురేంద్ర!
తద్గతప్రాణచిత్తులై ♦ తగినభక్తి. ౧౫ 1929

క. వనజాక్షపరాయణులై, యనిశము వర్తించువారి ♦ కాతండు ప్రీతిం
గనంబడు జ్ఞానాగ్నిని బాపసంచయమును గాల్చువారిం ♦ బాలించుం జుమీ.

క. వారికె కన్పడు గానం, వారిజనళనేత్రు శ్రీశు ♦ వైకుంఠుని నీ
వారసి కనందలంచితివే, నారీతి వచింతు వినుమ ♦ యది యొప్పినచోన్. ౧౭

* సంగ్రామరూపిణీ లక్ష్మీః-అనిమూ.

తే. కృతయుగం బేగఁ ద్రేత నా ♦ నెనఁగు యుగము
రాఁగఁ దన్ముఖమందు సు♦రలకు మర్త్య
లకును హితమొనఁ గూర్ప ని♦లావతిస్వ
రూపమునఁ బుట్టఁగలఁడు సం♦తాపహరుఁడు. ౧౮ 1932

సీ. ఇక్ష్వాకునృపులకు ♦ నెల్ల నెవ్వఁడు విభుం డగుఁ జుమ్ము దశరథుం♦ డనెడు రాజు
తత్సూనుఁడై మహా♦ త్తరతేజుఁడై రాముఁ డనుపేరు దాల్చిత♦గును బులస్త్య
వంశవర్ధన! బుద్ధి♦బలములఁ దేజంబునను బరాక్రమమున ♦ వినుతుఁ డగుచు
గురుతరబాహుఁడై ♦ వరసత్త్వవిభవుఁడై యొప్పున భూమినా ♦ నొప్పఁ జుమ్ము

తే. భానురీతి దుష్ప్రేక్ష్యుఁడై ♦ బవరములను
శత్రువులఁ జెండఁగలఁడు శ్రీ♦సరసిజాక్షుఁ
డాదినారాయణుండె రా♦మాహ్వయమునఁ
బుట్టఁగలఁడు ప్రభుత్వంబు ♦ పొదలునట్లు. ౨౧ 1933

చ. జనకునిచేత నాతఁడును ♦ సాధుమనస్కుని భ్రాతఁ గూడి ధ
ర్మనిరతచిత్తుఁడై గురుత♦రంబగు దండకకాననంబునన్
దనసతిఁ గూడియే తిరుగుఁ ♦ దత్సతి సీత యనంగ నొప్పు నో
దనుజవిభూ! యదృష్టవతి ♦ తత్సతి లక్ష్మియె సీతనాఁబడున్. ౨౩ 1934

క. జనకున కామెయె పుత్త్రిక, యనఁబడు ధరనుండి యొదవె ♦ నాసుదతి జగం
బున నసమానసురూపం,బున వెలసెడు లక్షణములఁ ♦ బొలుచు ననమ్మై.

తే. ఛాయ యెడఁబాయకే వెంటఁ ♦ జనెడురీతి
జంద్రికయు శశి వీడని ♦ చందమునను
రామునెడఁ బాయ దామహా♦రణ్యమందు
శీలమందు నాచారమం ♦ దాలతాంగి. ౨౪ 1936

క. వినుతింపంబడుగుణముల, ననుపమయే యగును ధైర్య ♦ మలర సుదతి కో
దనుజేంద్ర! రవికి రశ్మిగ,తిని నేకత్వమునఁ దగువి♦ధిం గనుపట్టున్. ౨౫ 1937

క. వినిపించితి నీవార్తను, దనుజేశా! విడువకుండఁ ♦ దగుభంగి సనా
తనుఁడై యవ్యయుఁడై దే,వనికరపతియైన చక్రి♦వార్తల నిచటన్. ౨౬

చ. అని యిటు లామునిప్రవరుఁ ♦ డాడిన విక్రమసంపదంధుఁ డా
దనుజవిభుండు రామనృప♦తల్లజ! నీయొకఁ దాఁ బగం గొనం
గను దలపోసి యెంచె నిటు; ♦ తక్ష్మాసురమౌని వచించె నీవిధం
బున నిది చక్కనున్నయది ♦ భూమిఁ జరించెద స్వేచ్ఛమీఱఁగన్. ౨౭

క. హరితోఁ బగఁ గొనియెద నం,గర మొప్పును నాకు నట్టి♦గతియైన నటం
చురుతరముగ నెంచుచు హ,ర్షరతిం జెలువారె మదిని ♦ రావణుఁ డనుచున్,

క. మునిపతి చెప్పినకథ విని, జనపతినేత్రద్వయంబు ♦ సంతసమునఁ బొం
గను శీఘ్రచాలనంబును, గనఁబడ నాయర్థ మాత్మఁ ♦ గడుఁ జింతించెన్. ౨౯

ఆ. కథను వినినకొలఁది ♦ గాథపార్థ మువిస్మ,యమునుబొదలఁగా న♦యనయుగంబు
వెలయ జ్ఞానివర్య! ♦ వివరింపుమా పూర్వ,తరచరిత్రములను ♦ మరల నాకు.

అధికపాఠము, మూఁడవ సర్గము సంపూర్ణము.

---

౪ - వ సర్గము.

అగస్త్యుఁడు రామునకు రావణుని నిశ్చయ మెఱింగించుట.

క. అన విని కుంభప్రభవుఁడు, ఘనతేజుఁడు పృథుయశుండు ♦ క్ష్మాపతిఁ బ్రణతుం
గని బ్రహ్మ యీశునకుఁ జె,ప్పినరీతిని బల్కె సత్య♦విక్రమ! రామా!. ౧ 1943

క. తరువాతికథం జెప్పెదఁ, బరమప్రమదంబు మీఱఁ ♦ బల్కులవానిన్
ద్వరపడ కాలింపుముటం, *చురుముదమున హెచ్చరించి ♦ యొకపరి నేర్మిన్. ౨

క. వినినాఁడ గాథ దానిని, వినినట్లుగ జరిగినట్లు ♦ వివరించెద నం
చనుపమమోదంబున రా,మున కిట్లని తెల్పెఁ బూజ్య♦బుద్ధి యలరఁగన్. 3

క. గురుబాహూ! దర్మతి యా, సురరిపునాథుం డతండు ♦ క్షోణీసుత ని
ష్కరుణన్ దొంగిలె నిందుల, కురుమతియోజించియిదియె♦యుక్తమటంచున్.

క. మును పాగిరివర మని ఖ్యా,తిని గాంచిన మేరువున న♦తిస్థిరయశుఁడౌ
మునిపతి నారదుఁ డీగా,థను దెల్పెను నాకు బాహు♦దర్పవిభూషా!. ౫ 1947

క. సురగంధర్వులు సిద్ధో,త్కరమును మునివర్యులు విన♦గా శిష్టకథన్
ధరణీశా! నారదుఁ డా,వరతేజుఁడు స్మితము తోఁప ♦ బల్కెం జుమ్మీ. ౬

క. మానాభిభూషితా! భూ,జానీ! శ్రీరామచంద్ర! ♦ చారుతరంబై
గానంబడు తేజముగల, యానారదుఁ డనువదింప ♦ నట్టికథ యిలన్. ౭ 1949

క. పాపౌఘముల నడంచుచు, నేపారును దాని వినుము ♦ నృపవర! దేనిన్
శ్రీపతి హితమును విని ముని,భూపులు సురతల్లజులును ♦ మునిపతి నతనిన్. ౭౹

తే. హర్షపర్యాకులేక్షణు♦లై నచించి
రిట్లు మీ రిప్డు చెప్పిన ♦ యీసుగాథ
నెవరు విందురొ చెపుదురొ ♦ యెలమిఁ బుత్ర
పౌత్రయుతులయి సురభూమిఁ ♦ బడయఁగలరు. ౯ 1951

అధికపాఠము, నాల్గవ సర్గము సంపూర్ణము.

---

* ప్రసాతా మితి పాఠాంతర్యై - అనిమూ.

## ౫౹ - వ సర్గము.

### రావణుఁడు శ్వేతద్వీపమున కరుగుట.

క. విను మవ్వలివార్తల నో,జనవర! రావణుఁ డతండు ♦ త్ర్యాస్థలి నెల్లన్
దనివారన్ దిరుగుచు జయ,మును గోరుచు శూరదనుజ♦ముఖ్యులతోడన్. ౧

తే. దైత్యదానవరక్షోవి♦తతి నెవండు, బలయుతుండని తనచెవిఁ ♦ బడునొ వాని
సంగరార్థియు బలదర్ప♦శాలిదనుజ,సత్తముఁడుపిల్చుఁ జేయుమా♦జగడమనుచు.

క. తిరుగుచు నీగతి స్వేచ్ఛఁగ, ధరణీస్థలి నెల్ల రామ♦ధరణీశా! యా
పరమేష్ఠిచెంతనుండియొ, యరుదెంచెడు నారదముని ♦ నభ్రమునందున్. ౩

చ. ఘనముల వెన్కనున్న ముని♦కాంతుని రెండవ యంశుమంతుఁడే
యనఁదగువానిఁ గాంచి యతి♦హర్షము పొంగఁగఁ జెంత కేగి వం
దనము నొనర్చి కేల్మోగిచి ♦ తా నవు డిట్లనె రావణుండు; న
న్మునివర! పెక్కుసార్లు మదిఁ♦బోలినయట్లుగ శక్తిమీఱఁగన్. ౪ 1955

తే. బ్రహ్మలోకంబు మొదలుగఁ ♦ బరఁగులోక
జాలములఁ జూచియున్నారు ♦ సకలలోక
ములను బలవంతులగువారి ♦ మునిగణేంద్ర!
తెల్పుమా! వార లెవ్వరో ♦ తేటపడఁగ. ౫ 1956

క. వారలతో మార్కొనఁగాఁ, గోరెద నాయిచ్ఛదీరలేఁది, ♦ క్షోణిం దగు న
వ్వారలఁ దెల్పుము మఱి య,వ్వారలు లోకాంతరముల ♦ వఱలిననైనన్. ౬

చ. అనుటయు నారదుండును దు♦రాత్మునిమాటలు లోఁ దలంచి యొ
క్కనిముస మల్లి ధ్యానమును ♦ గ్రన్నన సల్పి వచించె నిట్లు; లో
దనుజగణేంద్ర! పాల్కడలి♦దాపున ద్వీప మదొండు రాజిలున్
ఘనతరమౌచు నచ్చటను ♦ గన్పడుమానవు లుగ్రతేజులై. ౭ 1958

సీ. చంద్రసంకాశులై ♦ సాంద్రబలోపేతులై మహాకాయులై ♦ యతులవీర్య
మొప్పార మేఘగ♦ర్జోరునినిస్వనములు గలిగి తోడ్పడుశక్తి ♦ నలరి ధైర్య
మొప్పఁగాఁ బరిఘబా♦హువులు చెన్నలరార నుందురు తద్ద్వీప♦మందు దనుజ
పుంగవా! నేఁ గంటి ♦ పొలుపుగ వారలబలవీర్యయుక్తుల ♦ భాసమాన

తే. తనువు లలరారు వారి ని♦త్తఱిని నీవ,దెవ్వరిని గోరితివొ వార ♦ లెల్ల నందు
వాసమును జేయుచున్నారు ♦ వైభవమున, ననెడునారదుపల్కుల ♦ నాలకించి.

చ. పలికెను రావణుండు ముని♦పార్థివ! యచ్చటిద్వీపమందు దో
ర్బలమున నిట్టివారలుగ ♦ భాసిలువార లదెట్లు పుట్టిరో
యలఘుమతుల్ చెలంగఁ దగు ♦ నమ్మనుజోత్తము లెల్లఁ దెల్లనై
వెలసెడు ద్వీపమం దచట ♦ వేడుక లూరఁగ నుండు టెట్లొకో?. ౧౧ 1960

తే. ఈమహోత్తరవృత్తాంత ♦ మెల్లఁ బ్రీతి, నారదా! మౌనిపుంగవ! ♦ నాకుఁ దెల్పు
మీజగం బెల్లఁ జూచితి ♦ విద్ది నీకుఁ, గరతలామలకంబుగఁ ♦ గానఁబడును. ౧౨౫

క. అనినన్ రావణునకు నా, ముని యిట్లను; వార లెల్ల ♦ మురహరుభక్తిన్
దనరి యనన్యమనంబుల, ననిశ మ్మొప్పుదురు విప్రు ♦ లందును భక్తుల్. ౧౩౫

ఆ. భూసురార్చనలను ♦ బొంగుచు నొనరింతు, రేకమూర్తియందె ♦ హృదయభావ
ములు తగంగ వారు ♦ పొలుతురు దనుజేంద్ర!, చక్రియందె మాన ♦ సములుదగులు.

క. హరిసక్తప్రాణులునై, హరినే సతతంబు గొల్చి ♦ యాద్వీపమునన్
నిరతము వసియించెదు భా, గ్యరతిం దొలిపుణ్యకర్మ ♦ గణమున వారల్. ౧౪౫

తే. కాంచఁగల్గిరి నూ! శార్ఙ్గ ♦ కార్ముకమును, వంచి శ్రీహరి సంగర ♦ వసుధ నెవరిఁ
ద్రుంచెనో చక్రయుక్తిసం ♦ దుఁ వసించు, భాగ్యమును గల్గియుందురు ♦ వారలెపుడు.

చ. క్రతుతతి సత్ఫలంబులను ♦ గాఢతపంబుల సంయమంబులన్
వితతములైన దానముల ♦ వేడుకఁ జేసిన యాఫలాళిసం
గతిని దదీయలోకమును ♦ గాంచి యటన్ సుఖియింపలేరు నూ;
దితిసుతవర్య! యుం చనెడు ♦ దివ్యమునీంద్రునివల్కు లత్తఱిన్. ౧౬౫ 1966

చ. విని దశకంఠుఁ డెంతయును ♦ విస్మయ మంది హృదంతరాళమం
దునఁ జిరకాల మెంచి ముని ♦ తో వచియించెను నేను బోయి యా
మనుజులతోడ సంగర మ ♦ మానుషశక్తి నొనర్చువాఁడ నా
కనుమతి యిమ్మటంచుఁ బ్రియ ♦ మారఁగఁ బల్కె తదీయసమ్మతిన్. ౧౭౫ 1967

క. శ్వేతద్వీపమునకు సం, ప్రీతిని రావణుఁడు చనియెఁ ♦ బ్రియమున మునియున్
జేత స్సొప్పుఁగ నద్భుత, మై తగు నారణము చూడ ♦ నచటికె యరిగెన్. ౨౦

క. ముని యాతఁడు రణకేళిం, గన నిత్యము నెంచుచుండుఁ ♦ గదనము చూడం
గనె ప్రీతి యతని కెక్కుడు, గనుక నె ముం దరిగె; నంతఁ ♦ గ్రవ్యాదుండున్.

చ. దనుజులఁ గూడి భూరితర ♦ దారుణసింహనినాదముల్ ప్రతి
ధ్వని లఖిలాశలన్ వెడలు ♦ భంగి నొనర్చుచుఁ బోయెఁ; బూర్వమే
మునిపతి యేగియున్నపద ♦ ముం గనుఁ గోర్కి మహాయశుండు గా
వున బలముల్ తనుం గొలువ ♦ భూరిబలంబు తగంగఁ బొంగుచున్. ౨౧౫

తే. ఎద్ది సురలకు దుర్లభ ♦ మే యయితగు, నట్టి శ్వేతమహాద్వీప ♦ మంతఁ జేరె;
దానిదివ్య తేజంబున ♦ దానవపతి, పుష్పకంబందు పడఁకంగఁ ♦ బూనె మిగుల.

సీ. అనిలవేగమున స ♦ మాహతంబయి వాతహత మేఘసముదాయ ♦ మట్లు నిల్వఁ
జాలక యుండెఁ; ద ♦ త్సచివులు రాక్షసుల్ జాతసాధ్వసులయి ♦ చక్కఁ గనఁగ
శక్యమే గాక వి ♦ శాల తేజంబున నలరునాద్వీపవ ♦ ర్యంబుఁ గాంచి
ప్రభువులై రావణుఁ ♦ బరికించి పల్కిరి; దనుజేంద్ర! జడులపో ♦ ల్కిని గనంగ

తే. నగుచు గతసంజ్ఞులును యా♦శ్చర్యంతహీన,మైనవిజ్ఞానమొప్ప నీ♦యవని నిల్వఁ
జాలకున్నార మింకెట్లు ♦ సంగరంబు, చేయఁజాలుదుమో మేము♦ చెప్పఁగలమె.

*చ. అని వచియించి యాదనుజు ♦ లందఱు పాఱిరి; రావణుండునుం
గనకవిభూషితం బగుచుఁ ♦ గ్రాలెడు పుష్పకయానవర్య మె
య్యన విడనాఁడె నాదనుజ ♦ లార్తిని బాఱినయంతఁ; బుష్పకం
బును బరుగెత్తె నాయసుర♦పుంగవుఁ డొక్కఁడె భీమరూపుఁడై. ౨౮ 1973

క. శ్వేతద్వీపముఁ జొచ్చెను, నాతఁడె, సయ్యెడకుఁ జేరి♦నంతన నొకచో
భీతప్రగేక్షణ లుద్ధతను, నాతనిఁ గనుఁగొనిరి; యొక్క♦యతివయు నందున్.

ఉ. మోమున సుస్మితం బొలయ ♦ ముందుగ నాతనిఁ గైగ్రహించి యిం
దేమి కనంగ వచ్చితివొ ♦ యేర్పడఁ జెప్పు మెవండ వీవు? నీ
ప్రేమను గన్నవాఁ డెవఁడు ? ♦ వింతగ నిన్నవఁ డంపె నంచు నా
భామిని పల్కఁ గ్రుద్ధుఁడయి ♦ పంతమునన్ దనుజేంద్రుఁ డిట్లనున్. ౩౧ 1975

క. దనుజేంద్రుఁడ విశ్రవసుని, తనయుఁడ రావణుఁడనంగ ♦ ధరణిఁ బరఁగుదున్
జనుదెంచితి నీస్థలమున, కని చేయుం గోరి యెవ్వఁ ♦ డగపడఁ డిందున్. ౩౨

చ. అని యిటు పల్కు రావణు దు♦రాత్ముని నాతనిఁ జూచి నవ్వుచున్
వనితలు పల్కిరి ట్లలరి ♦ ధ్యానము లొప్పఁగ; నంత నందులో
వనిత యొకర్తు క్రోధమున ♦ వానిని గైకొని లీలచేతఁ జ
య్యన నిటు త్రిప్పుచున్ జెలుల♦యంతరమందుఁ బడంగఁ జిమ్మెఁ దాన్. ౩౪

ఆ. క్రిందఁబడఁగఁ జిమ్మి ♦ కేరడమున నొక్క
చెలిని బిలిచి యిట్లు ♦ పలికె నీవు
కీటకమును దీనిఁ ♦ బాటింపు మిది పుర్వ
ధుగ్రివము సంశయంబు ♦ తోఁప దిందు. ౩౫ 1978

క అని పల్కిన వింశతిభుజ,దనుజుని నీలాంజనసమ♦తను దశకంఠున్
వనితలు కైనుండి కరం,బునకున్ నడిపించి కష్ట♦ములపాల్సేయన్. ౩౬ 1979

చ. బలముల విఱ్ఱవీఁగు సుర♦వైరివిభుండును బండితుండునై
వెలసెడు రావణుండు తను ♦ వింతగ నింతులు త్రిప్పుచుండ నొ
క్కలలనహస్తముం గఱచెఁ ♦ గాంతయు రోషపరీతచిత్తయై
వెలిఁబడఁ జిమ్మి గాఢముగు ♦ వేదనఁ గై విదలించు చుండఁగన్. ౩౮ 1980

చ. పురు గిది యక్కటా! కఱచెఁ ♦ బో నిను నంచనియొక్కయింతి ని
ష్ఠురముగు కీట మియ్యదని ♦ చోద్యము నొందుచు దానిఁ జిమ్మె నం
బరమున కప్పుడే బరికె ♦ వాఁడు నఖంబులఁ దత్కరంబుఁ గో
పరతిని బొంది యాయువిద ♦ బాపురె యీయది క్రూరకీటమా. ౩౯ 1981

* ఏవ ముక్త్వా దుద్రువు స్తే సర్వ ఏవ నిశాచరాః-అనిమూ.

క. అనుచుఁ విదలించె జవం,బున హస్తము దాన దానవుఁడు భీతుండై
వననిధిజలములయంతర,మునఁ బవినిర్భిన్నభూధ్ర◆ముపలెం బడియెన్. ౪౦

క. వననిధిజలములలోఁ బడి, మునిఁగియుఁ బైకెట్లొ చేరి◆ మూర్ఛుఁడు గానన్
వనటం జెందక యుండెను;, జననాథా! యాతఁ డిట్టి◆చందమున నటన్.

క. ప్రమదలచే శ్వేతద్వీ,పమునందున్ నిగ్రహింపఁ◆బడి యిట్టులు హ
స్తములం ద్రిప్పంబడియెను, సుమహితతేజుండు మాని◆సురపతి యంతన్.

క. అసురేంద్రుని ధర్షితుఁ గని, యసమానాద్భుతము నొంది◆యాడుచుఁ దమిచే
హాననపరుం డయ్యెను; నో,యసురాంతక! రామచంద్ర!◆యవ్వల వినుమా!.

చ. జలనిధినీరమందుఁ బడి ◆ చారుశిరోజము లార్తి నొందఁగాఁ
గలఁగుచు యామ్యతీరమును ◆ గర్బురనాథుఁ డదెట్లొ చేరి య
గ్గలమగు శక్తి తోఁపఁగ జ◆గంబుల నెల్ల జయించితిం గదా
గలుగదు వానియం దిటులు ◆ గాఢభయం బిసుమంతయేనియున్. ౪౪ 1986

తే. అబల లౌట స్వభావమే ◆ యల్పవీర్య, మలరుచుండుట నట్టివా◆రలకుఁ జూడ
నిది విరుద్ధము లోకమం◆దిందుఁ గల్గు,మానవుల్ ప్రభవిష్ణువుల్◆మదిఁదలంప

సీ. వనితాస్వరూపంబు ◆ వఱలనుండెడు వీర లద్భుతశక్తిచే ◆ నలరుచుందు
రివ్వారలనె యమ్ము◆నీశ్వరుఁ డప్పుడు చెప్పెను నేబల ◆ మొప్పువారిఁ
గాంచి యుద్ధము చేయఁ◆గావలెననినిశ్చయించెఁ గాఁబోలునం◆చెంచి యాత్మ;
నవ్వనంబున వారి◆యాచారములఁ గాంచఁ దిరుగుచునుండి యా◆ధరణి నొకట

తే. బ్రహ్మతనయు మహాత్ముని ◆ బ్రభువు యోగి
వర్యు జాజ్వల్యమానత◆పఃప్రభావ
మున వెలుంగుచు సమిధల ◆ ననలుపోల్కి
నలరెడుసనత్కుమారు ని◆ర్మలమనీషు. ౪౭ 1988

క. కనియెను బీరంబునఁ జక్కనిరీతిగఁ గూరుచున్న ◆ కమ్రతనుని నా
వననిధిదక్షిణతీరం,బున గుహలో నున్నవాని ◆ బుధనుతచరితున్. ౪౮

చ. కని కరము ల్మోగిడ్చి తమ◆కంబున వందనరాజిఁ గూర్చి స
త్యనిరతిఁ గాంచి బ్రహ్మముని◆యై తగు నాతనిఁ బ్రశ్నచేసె ని
ట్లని; భగవంత! లోక మిది ◆ యాది నదేసుమానీయుచేత ని
ట్లనువుగ సృష్టిచేయఁబడె ◆ నస్మ లిటన్ వసియింతు రెవ్వరో!. ౫౦ 1990

క. జ్ఞానివరా! మానివరా!, ధ్యానింతువు బ్రహ్మ మీవు ◆ తగురీతి నిటం
గానంబడువిషయంబును, మానుగ నెఱిఁగింపు నాకు ◆ మదిఁ గల్గుకృపన్ ౫౧

తే. సర్వవేత్తవు నీవౌటఁ ◆ జక్క నాకు, వార్త నిద్దానిఁ దెల్పుమా◆బ్రహ్మమాని
వరుఁడ వని వింటి నా విని◆భాసమాన,తేజుఁడగునామునీంద్రుండు◆దివ్యదృష్టి.

చ. దనుజవరేణ్యుహృద్గతముఁ ♦ దా నపు డారసి చాల నవ్వి యి
ట్లనియెను; బుత్రకా! విను చ♦రాచరమై తగులోకజాలమున్
దనదగుదివ్యశక్తిని స♦తంబు ధరించునొ యెవ్వఁ డట్టి యా
వనజదళాక్షునిం దెలియు♦వారెవ రీధర దానవోత్తమా!. ౫౩ 1993

తే. ఎవనియుత్పత్తి నెవ్వరే ♦ నెఱుఁగఁజాల
కున్నవారము యెవ్వని ♦ నొప్పుమీఱ
వేదవేత్తలు పురుషుని ♦ విమలరూపుఁ
దమునునకుఁ బైన నున్నట్లు ♦ తలఁచువారొ. ౫౪ 1994

సీ. ఆదిత్యరూపుని ♦ నజరుని బరమాత్ము నీశ్వరుఁగా వచి♦యింతురొ మును
లెవ్వని, బ్రహ్మయు ♦ నెవ్వనినాభిని బుట్టె నా బ్రహ్మ వి♦బుధవరుండు
జనకుండు నాకగు ♦ శంకరుండు భవుండు కైలాసనిలయుండు ♦ కాలకంఠుఁ
డెవనిక్రోధమున సం♦భవ మొందునో దేవతలు యజ్ఞమున విధి♦యులర నెవని
ఆ. నాశ్రయించి హృష్టు♦లై యమృతంబును, ద్రాగువారొ దనుజ♦తతులఁ జెంది
యెవనిశాసనా యు♦భవ మొందు వనితలు, నిన్నువిజయుఁబట్టి♦సన్నుతముగ.

క. వనధిజలంబుల వైచిరొ;, దనుజులు దైత్యులును నిర్మృతి♦శిల్లజులు నదె
వ్వనిశక్తి వీర్యయుతు ల,య్యును జంపంబడిరొ దనుజ♦లుద్ధతు లగుచున్.

తే. కామరూపులు భుజబల♦గర్వయుతులు
నయ్యు నెవ్వని మార్గాన ♦ నపు డశక్తు
లో, జగత్పతియగు నాతఁ ♦ డొప్పుమీఱ
జగము నిద్రానఁ గల్పించె ♦ సాధురీతి. ౫౭ 1997

క. జగ మిది సజ్జను లుండఁగఁ, దగినట్లుగ సృష్టిసేయఁ ♦ దన్మహితునిచే
జగదధిపుని నారాయణు, నగభేదిప్రముఖవినుతు ♦ నాతని సతమున్. ౬౦

క. జను లెల్లఁ బరాయణులై, యనూనభక్తిం జెలంగి ♦ యర్చింతురు; భూ
తనికరమందున్ ద్వేషం, బనునదియే లేక యోగ ♦ మాధారముగన్. ౬౧

ఆ. పంచయజ్ఞములను ♦ బద్మదళాక్షుని, భక్తిఁ దన్పుచుండ్రు ♦ పరమనియతి
నిందునుండువార♦లేకాంతులయి మహా, సత్త్వులగుచు మిగుల♦శ్రద్ధగలిగి.

క. వసియించుచున్నవారో, యసురేంద్రా! మఱియు వేద♦నుందు గురుతరా
ర్థసహితపురాణసంతతి,ని సమంజసపాంచరాత్ర♦నిచయమునందున్. ౬౨

క. వినుతింపఁబడునొ యెవ్వం, డనుపమునుగు సాంఖ్యయోగ♦మందు మునులచే
తను నెవ్వఁడు ధ్యానింపం,గనుబడు నెవ్వానిఁ గూర్చి ♦ క్రతువులయందున్.

తే. హోమ మొనరింతురో యను♦ర్త్యులును మునులు
హరిని భగవంతు నెవ్వని ♦ నాదరమున

మనములఁ నిల్పి కొలుతురో ♦ మధునిఁగైట
భాఖ్యు నెవ్వఁడు చంపెనో ♦ యతని జనులు. ౬౩ 2003

క. పరికింపం దలఁతురు నూ!, సురవైరీ! శతధృతియును ♦ శుభగుణరత్నా
కరు నతని నెఱుఁగఁ జాలఁడు, ధరనెవ్వం డెఱుఁగు మరి న♦తని లోకవిభుఁ.

క. నారాయణు జగదవన,ప్రారంభుని దైవ మనుచు ♦ నతఁడే ముక్తిం
జేరం జను, సంశయమే, యారసినఁ లేదు దాన♦వాధిప! వింటే. ౬౫ 2005

చ. అనెడు మహర్షి వాక్యములను ♦ హర్షయుతాత్మ గ్రహించి దేవమా
నిని గని రావణుం డనియె ♦ నెమ్మిని; దేవుఁ డదెట్లు కన్పడుఁ?
వినఁబడు భూమి నెట్లు? కడు ♦ వేడుక నెట్టులు క్రీడ చేయు? నా
తనిఁ గనులారఁ జూచెడువి♦ధం బది యెయ్యది? నాకుఁ జెప్పుమా. ౬౬ 2006

ఆ. ఎంతకాలమునకు ♦ నెట్టితపంబున, నీజగత్తు నోము♦నీంద్ర! నేను
జేరఁగలనొ దానిఁ♦జెప్పుమా మీ కెల్లఁ, దెలిసియుండుఁ గాదె♦ తెల్లముగను.

*చ. అనుటయు సస్పృహంబయిన ♦ యాతనివాక్యను వాగ్విశారదుం
డనఘుఁడునైన మౌని విని ♦ యాత్మబలంబున వెల్గువాఁడు గా
వున వచియించె నత్తెఱఁగుఁ ♦ బొందుగ నిట్లు; సనాతనుండు వ్య
క్తిని గనినట్టివాఁడు తన♦ తేజమునఁ వెలుఁగొందువాఁడునై. ౬౮ 2008

సీ. సచరాచరంబగు ♦ సకలప్రపంచ మెవ్వనిచేత వ్యాప్తమై ♦ వఱలుచుండు
నట్టిమహాత్ముఁడై ♦ యలరారు నాతండు, ధర నభ్రమునను బా♦తాళమునను
బర్వతవనముల ♦ వార్ధుల నదులను వెలుఁగొందు, రాత్రిప♦గలు నతండె
యుభయసంధ్యలునాఁగ♦నొప్పు నా దేవుండె,నరసిజాప్తుఁడుయమ♦చంద్రవరుణ

తే. కాల విధి రుద్ర శుచి శత♦క్రతుముఖులును
భూర్భువస్స్వర్గణంబులు ♦ పొలుచు నోంకృ
తియును గాయత్రి యట్లె సం♦ధ్యయు నతండె
పర్వతంబును దాల్చిన♦ప్రభు వతండె. ౭౨ 2009

క. విను మాతండె యనంతుం, డనఁబరఁగుచు వెలయుచుండు ♦ నవ్విధి ముందుఁ
ఘనవృష్టి నిచ్చు పీచు భు,వనములనుం బ్రాగు నార్చు ♦ వైభవ మలరఁ.

ఆ. పొందు దేనినైనఁ ♦ బొడవడంచు దహించు
జగములను సృజించుఁ ♦ జక్కఁ బ్రోచుఁ
జంపు నతఁడె దైత్య♦సంతతిఁ గాఱ్చును
నిలువకుండఁ జేయు ♦ నియతిమీఱ ౭౪ 2011

క. సురలును దైత్యులు పన్నగ,వరులును గనఁజాల రతని ♦ భక్తి నలరి యె
వ్వరి నతఁడు కరుణఁ గాంచునొ, పురుషుం డాతండె కాంచుఁ♦బో పరమేశుఁ.

* ఆకర్ణ్య సస్పృహం తస్య వాక్యం వాక్యవిశారదః-అనిమా

తే. తద్గతప్రాణులై మఱి ♦ తత్పరాయ,ణులును బరిశుద్ధులును దద్గ ♦ తులునునగుచు
జ్ఞాననిర్ధూతకల్మష ♦ జాలు రగుచు, నలరువారలు చేర శ ♦ క్య మిది సుమ్ము. ౭౬
క. పురుషోత్తము లే తాదృశ,నిరుపమసద్గుణులు సతము ♦ నిల్వం డగు నీ
ధరణిని నకామకృత్యులు, పరిదగ్ధానుర్ష పాప ♦ పటలులు మఱియున్. ౭౭ 2014
ఆ. తానసమును జెంది ♦ ధన్యులై యెవ రుందు, రట్టివార లుండ ♦ నర్హమిద్ది
యిందుఁ జొచ్చువార ♦ లెన్నఁడు మరలని,యట్టు లీపురంబు ♦ హరికరుణను.
తే. వెలయుచుండు వివస్వతుఁ ♦ డలఘుకీర్తి
మనువుతగు వానిపాలన ♦ మునను నిర్వ
దెనిమిదవదగు యుగమున ♦ దనుజవర్య!
వైష్ణవాకృతితో నీవు ♦ వసుధ దీని. ౭౯ 2016
క. చేరంగల వీమాత్రమె, యారసి చెప్పంగ నాకు ♦ నగు వినుటకు నీ
కో రావణ! యర్హంబగుఁ, గోరిక లీడేరు లెమ్ము ♦ కొంకకు మింకన్. ౮౦
క. నే నీకుం జెప్పినగతి, మానుగ నీవాంఛితంబు ♦ మహి నీడేరున్
దానవనాథా! యని యిటు, మానినచింపంగ మ్రొక్కి ♦ మానసమందున్.
సీ. ఇట్టులే కాఁగగు ♦ నిఁకమీఁద నా కని బలములఁ గూడి శం ♦ కలను గనక
లంకకుఁ జనియె; నీ ♦ లాగు నారదముని జరగినకృత్యంబు ♦ సర్వ మెలమి
నీక్షించి వే చని ♦ యత్యీణముగ వెల్గు మేరుపర్వతమున ♦ మించు సభను
జొచ్చి కూర్చున్నట్టి ♦ శుభమూర్తి బ్రహ్మను గని మ్రొక్కి దేవత ♦ లునువినంగఁ
తే. బంకజాసను మ్రోల నీ ♦ వార్తఁ జెప్పెఁ;
బావనంబైన యీగాథఁ ♦ బద్మసూతి
విని మునిం గౌఁగిటం జేర్చి ♦ యనియె భూత
భావివర్తమానంబుల ♦ వార్త లెఱిఁగి. ౮౨ 2019
క. వినుతంబగు మహిమను గాం,చిన బ్రహ్మ వచించె నిట్లు ♦ చెప్పెద వినుమా
మునుపే హిరణ్యకశిపుం, డనఁబడు దనుజుండు కల్గె ♦ నాతం డితఁడే. ౮౩
క. వరదానముల నవధ్యతఁ, బరమప్రమదమునఁ బొంది ♦ బహుయోగములన్
బరినుతుఁడై చెలఁగెను; గ,గ్వరపతి యాతండు మహిమఁ ♦ బొల్చెడువానిన్.
క. సరసిజనాభు నధోక్షజు, హరినిన్ నరసింహరూపు ♦ నానభయందున్
గరువంబునఁ దిట్టె నసం,తరమున నా దేవపతియు ♦ దర్పము పొంగన్. ౮౫
చ. కరములఁ బట్టి యాదనుజ ♦ కాంతు నఖంబులఁ జీఱి చంపె నా
తరుణమునందు రక్త మొగిఁ ♦ దాఁకుట దానవు నేత్ర మెఱ్ఱనై
పరఁగె; నృసింహమూర్తియును ♦ భావిజనిన్ మనుజుండుగాఁ దగున్
మరణము దాన నొందునని ♦ మాటికి మాటికి నెంచె నాత్మలోన్. ౮౬
ఆ. దివ్యచక్షు వగుట ♦ దేవదేవుం డిట్టు, లాత్మ నిశ్చయించె ♦ న్యాయరీతి;
నప్పు డానృసింహు ♦ నంకస్థలంబున, నున్న దనుజనాథుఁ ♦ డొప్పు దప్పి ౮౭

క. మొలమొల్లనఁ బల్కె నఖం,బుల జీలించబడుటఁ జిత్త♦ము విభిన్నంబై
కలవిలపాటును గూర్పఁగ, విలయము గనఁబోవుచుండి ♦ విహ్వలుఁ డగుచున్.

క. దీనుండై కరయుగ్మము, శ్రీనాథునివంకఁ ద్రిప్పి ♦ చింతఁ బలికె; జాం
బూనదకేశాంతా! వై,శ్వానరసములోచనా! నృ♦శంసవిరోధీ!. ౮౯ 2026

క. కులిశనఖస్పర్శా! యు,జ్జ్వలసింహాసువక్త్ర! నీకు ♦ వందన మిదిగో
ఖలహారణా! మధుకైటభ,విలయకరా! విపులతీవ్ర♦విక్రమ! శౌరీ!. ౯౦

క. ననుఁ గావు త్రికాలపతీ!, నినుఁ గావుమటంచు నిపుడు ♦ నిశ్చలమతితో
మనవి యొనర్చెద ననుఁ జం,పిన దనుజత మనుజతయును♦విలయమునొందున్.

క. చేరెద నీరూపంబున, శ్రీరమ్యముగాఁ జెలంగి ♦ సిద్ధనికరముల్
చేరంగ వెలయు లోకము, శ్రీరమణా! కరుణ నన్నుఁ ♦ జేర్పుము దానిన్. ౯౨

చ. అని యిటు వేఁడు దైత్యవిభు ♦ నాకృతిఁ గాంచి త్వదీయవాంఛితం
బును నెఱవేర్తు నంచుఁ బ్రియ♦మున్ గనుపట్టఁగఁ దా వచించి హం
సనికరయుక్తమై విమల♦సాంద్రరుచిం దగి చారుకింకిణీ
ధ్వనియుతమౌ విమానమునఁ ♦ దాఁ జనియెం బరమేశుఁ డంతటన్. ౯౩

సీ. ఆతఁడే రావణుం ♦ డనుమహాసురుఁ డయ్యెఁ దద్భావభావిత♦తనుఁడు గాన
రాక్షసవిధిచేత ♦ నీక్షితిఁ దిరుగుచు సకలకృత్యముల న♦సాధుపథముఁ
గైకొని యొనరింపఁ♦గా సాగె; లోకములను బాధుచేయఁగ ♦ మానము వాని
కుద్యమించుచునుండు ♦ నొగిఁ దృతీయాకృతిమనుజలోకంబున♦మరలఁదాల్పఁ

తే. జక్రి వధియించు నంతట ♦ సాధుసేవి
తమగు నాద్వీపవరముఁ బొం♦దంగ నర్హుఁ
డగును మాని వచించిన♦యట్లు వైష్ణ
వమగు తేజంబు నొంది భూ♦వరమహేంద్ర! ౯౫ 2031

క. కనుఁగొంటి దివ్యదృష్టిని, జననాథా! యిందె యుండి ♦ సర్వ మెఱుఁగఁ జా
లినశక్తి నాకు నున్నది, గనినది సర్వంబు చక్కఁ♦గాఁ దెల్పితిఁ జూ!. ౯౬

క. పరమేశ్వరుఁడవు నీవే, నిరతము నినుఁ గొల్చువారు ♦ నెమ్మిఁ గనుదు రీ
చరితము పవిత్రతర మెవ్వరు దీనిం బ్రతిదినంబు ♦ భక్తిఁ జెలంగన్. ౯౭ 2033

ఆ. నారదోక్త మనుచుఁ ♦ గోరి పఠింతురో, వారు పరమగతిని ♦ జేరువారు;
వైష్ణవమగు నీప్ర♦బంధమ్ము సర్వపా,పములఁ దూలఁగొట్టుఁ ♦ బరమసుఖము.

క. ఒనఁగూర్చు దీని ననిశం,బును వినుదురొ వారు పాప♦ముక్తిని మిగులం
గనుదురు; జ్ఞాతిస్మరతయు, ఘనకులజని, విప్రతయును ♦ గలుగున్ రామా!.

క. వినుమింకను సర్వజ్ఞత,యును గల్గును సంశయంబు ♦ లూహించిన లే
వనఘా! యోగతి శతధృతి, వనజాసనుఁ బొగడి నాదిని ♦ వైష్ణవభక్తిన్. ౧౦౦

తే. తన్మయుండయి యాదేవ♦తలను బనిపి
తనదు లోకంబుఁ జేరె నా♦మునిపతియగు
నారదుఁడు మేరుపృష్ఠంబుఁ ♦ గోరి తిరిగి
నానివాసంబుఁ జేరె భూ♦జానితిలక!. ౧౦౧ 2037

క. నను ద్వాదశాత్మకుని గాం,చను వచ్చినమౌనిపతిని ♦ సంతసమున న
ర్చనముల వందనముఖముల, ననువొందఁగఁ బూజసేయ♦నలరుచుమునియున్.

క. ననుఁ గరుణఁ బెంపునొందిం,పను గోరియు తెలిపె దీనిఁ ♦ బార్థివవర! నే
నును నీయజ్ఞంబునఁ బా,వనతమ మని తెల్పినాఁడ ♦ భక్తి చెలంగన్. ౧౦౩

ఆ. అమృత మిద్ది యోమ♦హాబాహుభాసురా!, మీరువినఁగ నిందుఁ♦జేరియనువ
దించినాఁడ దుర్మ♦తియనఁగఁ దగు రావ,ణాసురేశుఁ డీమ♦హాశఁ బూని.౧౦౪

చ జనకజ దొంగిలించె మది ♦ జ్ఞానము గల్గియొ నీకరంబుచే
తనె మృతినొందఁ గోరి మధు♦దానవసూదనుఁడై సుదర్శనం
బును గద శంఖముం గొనుచుఁ ♦ బొందుగ నొప్పు పరాత్పరుండు నీ
వనియె యెఱుంగుదుర్ సురవ♦రార్చితపాదుఁడ వీవె రాఘవా!. ౧౦౫ 2041

ఆ. శార్ఙ్గి చక్రి ఖడ్గి ♦ సర్వవేదాత్మకుం, డప్రమేయుఁ డంబు♦జాక్షుఁ డగుచు
సిరుల వెలయుచుండు ♦ శ్రీవత్సలాంఛనుం, డఖిలయోగివర్యుఁ♦డనఁగ నొప్పి.

క. తనభక్తుల కభయంబును, ననయముఁ గృపచేయునట్టి ♦ యావిష్ణువె నీ
వనినన్; రావణుఁ జంపం,గను మనుజతఁ బొంది తీవు ♦ కల్మషహారణా!.

క. నారాయణుండ నే నని, యారయకున్నాఁడ వేల? ♦ యాశ్రితరక్షా
కార! మహాభాగా! సుర,వారార్చిత! మాయఁ దాల్చి ♦ వసుమతి నిన్నున్.

క. వనజాక్షునిగా నెన్నక, కనులన్ మూసికొనియున్న ♦ కారణమేమో
వనజాసనుండు గుహ్యుల,కును గుహ్యుఁడ వీవటంచుఁ ♦ గోరి వచించెన్.

సీ. త్రిగుణుండవన నీవె, ♦ త్రిపదాత్మకుండనఁగను, ద్రివేది,త్రిధాముఁ,♦డనఁగనీవె
త్రైవిద్యుఁడవు, క్రూర♦దనుజమర్దనుఁడవు, కాలత్రయాత్మక!♦కర్మరూపుఁ
డవు, త్రిలోకములు మూఁ♦డవు, విక్రమంబులనాక్రమింపంబడె♦నమరహితము
గోరిన నీచేత; ♦ నారీతి బలిబంధనము చేసితివి గాన ♦ నమరపతికి

తే. ననుజుఁడ వటన్న యాహ్వయం♦బును గనితివి
నదితిగర్భంబునం బుట్టి♦నట్టి విష్ణు
వానవాతనుఁడవునైన ♦ హరివి నీవె
జగములను గావఁ గంటివి ♦ తగ మనుజత. ౧౧౦ 2046

చ. జననము నొందు టెందులకొ ♦ చక్కఁగ నాపని దీర్పఁగాఁబడెన్
జనవర! దేవకార్యము ప్ర♦సంగెను; బాపమనీషుఁడైన యా
దనుజవిభుండు రావణుఁడు ♦ దారుణకర్ముఁడు బాంధవాళితోఁ
దనయులతోడ యుద్ధమునఁ ♦ దానకశక్తిని జచ్చె రాఘవా!. ౧౧౧ 2047

చ. సురలు ముదంబు గాంచి రిదె ♦ క్షోణిసురుల్ మును లాత్మలందు ని
ర్భరముగు సంతసంబు గని ♦ రంజిలుచుం జరియించుచున్నవా;
ధరుడుగ శాంతి నొంచె జగ♦మంతయు, దీనికిఁ గారణంబు నీ
కరుణయె గాదె దేవవర! ♦ కస్రుగుణా! రఘువంశభూషణా!. ౧౧౩౫ 2048

తే. సీత లక్ష్మియె గద వసు♦ధాతలంబు
నుండి యుదయించె నీకొఱ ♦ కొప్పమీఱ
జనకునింట వసించె వి♦శ్వంభ రేశ!
దనుజపతి లంకఁ జేర్చి మా♦తగను బెంచె. ౧౧౫ 2049

క. శ్రీరామా! పృథుకీర్తి!, సారతరంబైన గాథఁ ♦ జక్కఁగ దీనిన్
నారదముని *చిరకాలము, ధారణి జీవింపఁజాలు ♦ ధన్యుఁడు నాకున్. ౧౧౬

క. మును చెప్పె రావణున కా,సనత్కుమారుండు పల్కు♦చందంబున నీ
కును దెల్పితి సర్వంబును, జనుఁ డెవ్వఁడు గాథ దీని ♦ శ్రాద్ధములందున్. ౧౧౭

క. ధరణీసురసన్నిధి జ్ఞా,నరతిన్ వినిపించు నోద♦న మది యమృతమై
పరిపూతమునై పితరుల, కరుదగు సంతృప్తి నిచ్చు ♦ వసనీశవిభూ!. ౧౧౮ 2052

చ. అనుచు నగస్త్యమౌని యిటు ♦ లాడిన రాముఁడు పుండరీకలో
చనుఁడు సహోదరాన్వితుఁడు ♦ సాంద్రముగాఁ గనుపట్టు విస్మయం
బును గనె సూర్యపుత్రముఖ♦భూరిబలాధికవానరోత్తముల్
దనుజవరుల్ విభీషణయు♦తంబుగ నచ్చెరువొంది రెంతయున్. ౧౨౦ 2053

సీ. బ్రాహ్మణక్షత్రియ♦వైశ్యులు శూద్రులు ధర్మయుక్తులుగాఁగ ♦ దనరి హర్ష
సంఫుల్లనయనులై ♦ సాంద్రభక్తిని రాము సంతృప్తిమీఱంగ ♦ సాధుదృష్టిఁ
గాంచుచుండిరి ముని♦కాంతుఁడై నయగస్త్యుఁడా రాముఁ జూచి యా♦యమలగాథ
సంతయుం దెల్పితి ♦ నాదృతి నినుఁ గంటి బూజలఁ గైకొంటిఁ ♦ బోయెదనిఁక

తే. మునులతోఁ గూడి యని రామ♦జనపతీంద్రు
నాజ్ఞఁ గైకొని పోయె మ♦హర్షియుక్తి;
ననుజులం గూడి జనకుని♦తనయతోడ
సంతసం బందె రాముండు ♦ స్వాంతమందు. ౧౨౫ 2054

అధికపాఠము, అయిదవ సర్గము సంపూర్ణము.

---

౩౭ - వ సర్గము.

రాముఁడు బంధుసామంతరాజులను బహూకరించి వారిపురమ్ముల కనుపుట.

క. గురుబాహుఁడు రాఘవుఁ డి,క్కరణిం బ్రతిదినము పౌర♦గణము జనపద
స్థిరవసతులఁ గార్యము లె,వ్వరునను జేయంగ నగునొ ♦ సద్గతి దానిన్. ౧

* ఋషీణాం దీర్ఘజీవినా-అనియూ.

క. అనుమతి యొసఁగుచుఁ బ్రోచెను:, దినములు నొకకొన్నిచన మిథిలకధిపతియై
జనపతివర్యుండై తగు, జనకుని గని ప్రాంజలియయి ♦ చక్కఁగఁ బలికెన్. ౨

[1]ఆ. నీవె నాకు సుగతి ♦ నీచేతఁ బాలింపఁ,బడితి మేము తీవ్ర♦భంగిఁ జెలఁగు
యుష్మదీయ తేజ ♦ మొప్పంట దానిసా,యమునఁ జంపఁ గంటి ♦ నసురవర్యు.

తే. మఱియు నిక్ష్వాకు మైథిల♦క్ష్మాపతులకు
వియ్యమందుట మొదలగు ♦ విషయములను
బ్రీతు లసదృశము లని వి♦ఖ్యాతి నొందెఁ
గాన మీరిక నాయిచ్చు ♦ కమ్రపూజ.! ౮ 2058

క. కరుణం గైకొని మీపుర,వరమునకుం బోవు టొప్పు ♦ భరతుఁడు మీకున్
బరిచరుఁడై వచ్చును మీ,పరిసరమును బాయకుండ ♦ బలములతోడన్. ౫

చ. అన విని యట్లయౌననుచు ♦ నాజనకుండు వచించె నిట్లు; పీ
తిని గనినాఁడ నిన్నుఁ గని ♦ తృప్తిగ నీ వొనరించు పూజలం
గొని నయపద్ధతిం గనుచుఁ ♦ గోరిక మీఱఁగ నీ వొనర్చుచ
క్కనిమరియాదచే, మఱియు ♦ క్ష్మాపతివర్య! మదర్థమై తగన్. ౬౪ 2060

[2]తే. కూర్చియున్నట్టి రత్నముల్ ♦ కుతుక మలర
నన్నిఁటిని నాకుమారికి ♦ నాదరమున
నిచ్చువాఁడ నటంచని ♦ యొలమి నొసఁగి
హర్షమతి రాముసెలవొంది ♦ యతని నిలిపి. ౭౪ 2061

క. సిరు లలరఁగ జనకుఁడు స,త్వరముగఁ బురి కరిగె; నిట్లు ♦ తనమామను బం
పి రహిన్ గైకేయుని నా,భరతునిమాతులునిఁ గాంచి ♦ భక్తివినయముల్.

చ. కనఁబడఁ జేతు లొగ్గి రఘు♦కాంతుఁడు పల్కెను రాజ్య మిద్దియే
నును భరతుండు లక్ష్మణుఁడు ♦ నూతనమోదము నందడింప నీ
కును బరిచర్యచేయుదుము ♦ క్షోణివిభూ! గతి మాకు నీవె యా
దనయము వృద్ధరాజు పుర♦మందుఁ దదర్థముగాఁ దపించెదున్. ౧౦౪ 2063

చ. పురమున కేగు టొప్పు నిఁక ♦ భూధవ! లక్ష్మణుఁ డేపుమీఱఁగా
వరభటయుక్తి మీవెనుక ♦ వచ్చును విత్తము రత్నరాసులున్
వరుసగఁ గొంచు నంచుఁ దమి ♦ వర్ధిలఁగాఁ బలుకన్ యుధాజితుం
డురుతరహర్షమొంది యిటు ♦ లొప్పును జేయఁగ నంచుఁ బల్కుచున్. ౧౨౪

క. ధనమును రత్నంబులు మా,కు నిచ్చునవి నీవె యుంచు♦కొమ్మా యపి ని

1 భవతా పాలితా వయమ్, భవత స్తేజ సోగ్రేణ రావణో నిహతో మయా-అనిమూ. రెండవపాదమున మేమని బహువచంబునకు లక్ష్మణాదులతోఁ దాననియు, చతుర్థపాదమునఁ జంపఁ గంటి నని యేకవచనక్రియకుఁ గర్త దా ననియు నెఱుంగఁదగు. 2 యాన్యాహృతాని రత్నాని మదర్థం సంచితాని వై అనిమూ.

న్ననువుగ సేవింపం దగు, నని రాముఁడు భక్తి వంద♦నాదులఁ దనుపన్.

ఆ. కేకయాధిపుండు ♦ కాకుత్థ్సు వలగొని, లక్ష్మణుండు వెంట ♦ లలితవిభవ
మొప్పుచుండ రాఁగ ♦ నురుగతిఁ జనెఁ బురి; కంతశత్రుఘ్నుఁడనుజుఁ♦డంత మొంద.

క. సురపతి విష్ణువుఁ బంపిన, కరణిన్ గేకయమహీశుఁ ♦ గదల ననిపి భూ
వరమణి యకుతోభయుఁడై, యరిహరుఁడై మిత్రుఁడైన ♦ యాకాశిపతిన్.

సీ. ధన్యాత్మ నా ప్రత♦ర్దన నాముఁ గౌఁగిటఁ జేర్చి యిట్లని పల్కెఁ ♦ జిత్తములరఁ;
బ్రీతి మాపట్ల మీ ♦ రీతఱిఁ గనఁబఱిచితిరి సౌహార్దంబు ♦ నతిశయముగఁ
గనఁబడె మీయందుఁ;♦గడఁగి కార్యముపట్ల భరతునితోఁ గూడి ♦ పాటుపడితి
రిత్తఱి రమ్యమై ♦ యెసఁగు కాంతుల మించి సంతతాలంకృతి♦సాంద్రమగుచు

తే. నలరు వారాణసీపురి ♦ కరుగఁదగును
మిమ్ముఁ గనఁగోరుఁ బౌరలో♦కమ్ము గాన
ననుచు నాసనముననుండి ♦ యుబ్బి లేచి
యాదరంబునఁ గౌఁగిట ♦ నదిమికొనుచు. ౧౮ 2068

క. జనపతి నాతనిఁ బంపెను;, వినుతప్రియవర్తనుండు ♦ విమతహరుఁడు నా
జనపతి కౌసల్యానం,దనుఁ డంతట రాము నాజ్ఞఁ ♦ దాఁ గైకొనుచున్. ౧౯

క. పురి కేగెను గాశీపతి, యరిభయమే కనని శూరుఁ ♦ డాదృతి కెంతో
పరిహృష్టుండై; యంతటఁ, బరమాప్తుని గాశిపతిని ♦ బంపి ముదమునన్.

క. ధరణీశులఁ ద్రిశతము నా,దరణము చెలాఁగఁ గాంచి ♦ ధన్యము మధురా
క్షరమునగు వాక్యమును భూ,వరమౌళి వచించె నిట్లు ♦ పార్థివులారా!. ౨౦

క. కనఁబడె నవ్యగ్రప్రీ,తిని నాయెడ మీర లునుచు ♦ తెఱఁగిట మీచే
తను రక్షింపంబడె నా, ఘనయాగము మీకు ధర్మ♦కరుణాదరముల్. ౨౨

క. ఋతమును నియతములై తగు, హితమగు మీసాయమున న♦హీనతరముగా
క్షితిఁ దెల్లమైన తేజము, గతి నాకృత్యంబు చక్కఁ♦గా నెఱవేఱెన్. ౨౩

తే. దుర్మతియు దుష్టబుద్ధియు ♦ దుష్టబలుఁడు
నైన రావణుఁ డను నల్ప♦దానవుండు
తెగియె హేతువె నేను, మీ♦తేజ మొకఁడు
సాయ మద్దాన నాతండు ♦ సమసె నిజము. ౨౪ 2074

చ. జనకునిపుత్రికన్ మదిని ♦ సాధ్వస మింతయు లేక దొంగిలిం
చెను దనుజాధముండు క్షితిఁ ♦ జెందినవార్తను దీని మీరలున్
విని యనిచేయ నెంచుటయు ♦ వింటిని మాభరతుండు తెల్పఁగాఁ
గనఁబడె మీకృపారస మ♦ఖండము నాపయి నుంచుటల్ తగన్. ౨౫

క. భరతుండు మీకుఁ జక్కని, కరణిన్ మర్యాదచేయఁ♦గా నుంటిరి మా

పురిఁ జాలకాల మిఁక మీ, రరుగం దగు రాజ్యపాల ♦ నాదృతులు గదా!.
చ. అన విని హర్షచిత్తముల ♦ నందఱు పల్కి రదృష్టవంతులే
యనఁదగువారు మీరు విజ ♦ యంబు చెలంగెను దేవుసత్కృపన్
గనితిరి రాజ్యమున్ మరల ♦ త్మాతనయున్ భగవంతుఁడే యొసం
గెను మరలన్ విరోధి యడ ♦ గెన్ రఘునందన! వైరిఖండనా!. ౨౮ 2077
సీ. ఇదిమాకువాంఛితం ♦ బిదియెమాకుం బ్రీతి యత్యుత్తమం బంచు ♦ ననఁగవలయు
విజయ మొందిన నిన్ను ♦ వేడుకఁ గంటిమి వైరి జంపితివి నీ ♦ బాహుశక్తిఁ
గార్య మియ్యది చక్కఁ ♦ గా సాగె సమునీవు వినుతించెదవు గుణ ♦ విమలచిత్తుఁ
డవు గావునం బొగ ♦ డంగ నర్హుఁడ వీవె వినుతి కర్హులమె? మే ♦ మనఁగ రామ!
ఆ. సెలవుపొంది నగర ♦ ములకుఁ బోయెద మేము
మనసునందు నునుపు ♦ మమ్ము నెల్ల
మిమ్మెఁ దలఁచుచుందు ♦ మిమ్మహి నున్నంత
కాల మింకఁ దావ ♦ కమగుకరుణ. ౩౦॥ 2078
క. ధరణిన్ వర్తింతుము గురు,తరబాహూ! మాపయిన్ స ♦ తతం బునుపుఁడు స
త్కరుణన్ నా విని యట్టులె, ధరణీశ్వరులార! యనుచు ♦ దాశరథి యనన్.
ఆ. హర్ష మొంది వార ♦ లంజలి బంధించి, పయనమునకు సెలవు ♦ పడసి పూజ
లర్హరీతి నొంది ♦ యాత్మదేశంబుల, కరిగి రెలమి రాముఁ ♦ డనుపఁ గదలి.

ముప్పదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౯ - వ సర్గము.

సుగ్రీవవిభీషణాదులు సంతోషముతో నయోధ్యలో నొక్క సంవత్సర ముండుట.

క. ధరణీశు లొక్క మొగిఁ దా, రరుగుచుఁ బృథివీతలంబు ♦ నదురఁగ రామా
దరమున హర్షమ్ములరఁగఁ, బురములకుం బోయి రమల ♦ బుద్ధులు వెలయన్.
క. భరతునియానతి శ్రీరఘు,వరుకొఱ కక్షౌహిణులు స ♦ వాహనములు గాఁ
బురమున నునుపంబడె సం,గరపరికరయుతము లగుచుఁ ♦ గడుఁ బూనికతోన్.
చ. కనుఁగొనఁ జాలమైతిమి ని ♦ శాచరణోద్ధతు రామచంద్రు నా
దనుజుని సంగరాతురుని ♦ దారుణయుద్ధము చేయ రండు మీ
రని భరతుండు పిల్వఁగ మ ♦ హాత్తరవాహనశస్త్రముఖ్యముల్
కొని యిట వచ్చినార మొక ♦ కొంకును బొందక సంతసంబునన్. ౩॥ 2083
క. చనుదెంచినపని నిష్ఫల, మనఁ జను రాక్షసులఁ జంపె ♦ నని రాముం డా
దనుజులఁ బార్థివు లంతం,బును జేసి రటన్న కీర్తి ♦ పొదలెన్ ధరణిన్. ౪
ఉ. రాముని బాహువీర్యమున ♦ రాక్షసబాధల నొందకుండ ను
ద్దామత లక్ష్మణుం డడరి ♦ దస్యులఁ జంపఁగ నాల్గుసంద్రముల్

సీమలుగాఁగ నేభయముఁ ♦ జెందక యుందు మిఁకంచు భూరినం
గ్రామపుఁబూన్కిమాని తమ♦కంబున గాథల నిట్లు పల్కుచున్. ౫ 2085

చ. చని చని పత్తనంబులను ♦ సాంద్రవిభూతిని జొచ్చి రామహా
జనపతుఁ; లంత హర్షమున ♦ సర్వధనంబుల ధాన్యరాజి ర
త్ననిచయయుక్తి నొప్పి వినుతంబులు గాఁదగు పత్తనంబులన్
గని ముదమారఁ జొచ్చి రఘు♦కాంతునికై బహురత్నసంతతిన్. ౭ 2086

తే. కూర్చి కాన్కలుగాఁ దమ♦కుం జెలంగు
వాంఛలను బంపి; రొక్కద్ర♦వ్యంబె కాక
యశ్వవాహనమదగజ♦స్యందనముల
భవ్యచందనముల మహా♦భరణములను. ౯ 2087

సీ ముక్తాప్రవాళాది♦ముఖ్యరత్నంబుల దానదాసీజన♦తతుల, మఱియు
బహువిధాజావిక♦పటలంబు నొసఁగిరి; వాని సుమిత్రసం♦భవు లిరువురు
భరతుండు గైకొని ♦ వచ్చి యయోధ్యను జేరి రీగతి బహు♦ధారణీశ
దత్తంబులగు కాన్క ♦ లత్తఱిఁ గొనివచ్చి రాముస కెలమి స♦ర్పణముచేయ

తే. వానిని గ్రహించి సంప్రీతి ♦ వర్ధిలంగ
మిగులసాయ మొనర్చిన ♦ మిహిరతనయు
నకు విభీషణునకుఁ దక్క♦న కపివరుల
కాయుపాయనముల నిచ్చె ♦ నధిపుఁ డపుడు. ౧౩౪ 2088

క. అని చేయఁ దోడుపడి యే,వనచరు లాత్మీయబాహు♦బలముల నెల్లం
దనకై యర్పించిరొ యా,ఘనులకుఁ దద్రత్నవితతిఁ ♦ గాన్కఁగ నొసఁగెన్.

చ. జనపతి యిచ్చినట్టి రుచి♦జాలమహార్హవిభూషణాదులం
గొని కపిరాక్షసుల్ తలలఁ ♦ గూర్చిరి కొందఱు చేతులందుఁ జ
క్కనిగతిగా ధరించిరి ని♦కామముదంబునఁ గొంద, ఱంత నా
యనిలజు నంగదుం బిలిచి ♦ యంకతలంబునఁ జేర్చి ప్రీతితోన్. ౧౬ 2090

తే. అమ్మహారథుఁ డతులవీ♦ర్యాన్వితుండు
కమలపత్రాక్షుఁ డారాముఁ ♦ డమలవాక్య
ములను సుగ్రీవుతో నిట్లు ♦ పలికె నీతఁ
డంగదుఁడు నీకుమాగుఁ డీ♦యనిలసుతుఁడు. ౧౬౪ 2091

తే. నీకు సచివుండు హితకారి ♦ నాకుఁ గాన
మన్ననల కర్హులే గద ♦ మామకమగు
కాన్క యిది నీ వొసంగిన♦కరణియె యగు
ననుచుఁ దాను ధరించిన ♦ హారములను. ౧౭౪ 2092

క. బలిచి మహాయశుఁ డాయు,జ్జ్వలభూషణరాజిఁ గూర్చె ♦ శ్వసనజయువరా
జులకు మహార్హము లివి పీ,రలు తగుదురు వీనికనుచు ♦ రాముఁడు సభలోన్.

సీ. అంతట గురువీరు♦లైన యూథేశుల నలనీలకుముదాహ్వ♦యులను, గేస
రిని గంధమాదను♦బనస, సుషేణుల వీరులౌ మైందద్వి♦విదుల, జాంబ [నిని
వంతుని,వినతు,గ♦వయు,గవాక్షుని,ధూమ్రు, నావలీముఖుఁ,బ్రజం♦ఘాహ్వయు
నన్నాదు, నాయింద్ర♦జాను, దరీముఖు దధిముఖుఁ, గరుణ నే♦త్రముల వారిఁ
ఆ. ద్రాగునట్లు కాంచి ♦ తగుభంగి మధురమై
కరుణ వెలయుపల్కు♦గమిని బలికె;
సఖులు మీరు నాకు ♦ సహజులు మీ దేహ
మెన్న నాశరీర♦మే యనఁదగు. ౨౪ 2094
క. నను నుద్ధరించితిరిగా, వనచరులారా! పయోధి♦వలెన దురంతం
బనఁదగు కష్టమునుండియొ, యని మఱియుం బలికె; భాస్క♦రాత్మజుఁ డెన్నన్.
ఆ. మిమ్ముఁ బోలు సాధు♦మిత్రులు గల్గుట,ధన్యుఁడయ్యె నను చుఁ♦దమి చెలంగఁ
దగినరీతి వారి ♦ కగణితమూల్యాభరణములను సురత్న♦రాజి నిచ్చి ౨౫
చ. అలరుచుఁ గౌఁగిలించె; మఱి♦యాతను మిక్కిలి పొంది యిట్టులా
కులగిరిసన్నిభాంగులగు ♦ కోఁతులు తత్పురమందు మంచితే
నెలఁ బలలాళి మూలముల ♦ నిర్మలసాధుఫలంబులన్ గడున్
వెలసెడు కోర్కెతో ననుభ♦వించుచు హాయిగ నుండ నంతటన్. ౨౬ 2097
తే. గడచె నొకనెల కొదువలే♦కయె ముహూర్త
మట్లు వారలు శ్రీరాము♦నందు భక్తి
యలరఁ దలఁచిరి క్షణమని ♦ యంతఁ గామ
రూపులగువారితో రామ♦భూపవరుఁడు. ౨౭ 2098
చ. దినములు పుచ్చె సంతసముఁ ♦ దృప్తియు మించఁగ; నంత రాక్షసుల్
ఘనతరవిక్రమాఢ్యులయి ♦ క్రాలెడు భల్లుకముల్ నృపేంద్రుఁడై
తనరెడు రాముఁ గూడి ప్రమ♦దంబున నుండ ద్వితీయమాస మొ
య్యనఁ గడచెన్ ద్వితీయమను ♦ నాయదియే శిశిరర్తువై తగున్. ౨౮ 2099
సీ. అభిషేకమగుసమ♦యంబు మొదలుగాఁగ గణియింప శిశిరాఖ్యఁ ♦ గాంచినట్టి
కాలమయ్యదిచక్క♦గా రెండవదియయ్యె; హర్షంబుమీఱంగ♦నగచరులును
దనుజులు నిక్ష్వాకు♦ఘనునగరంబున సంతోష ములరంగ ♦ సకలసుఖము
లనుభవించుచు నుండ ♦ జనపతియును వారి నాదృతిఁ గాంచుచు♦హర్షకరము
తే. లైన తత్కృత్యములఁ గని ♦ యాత్మమోద
మందుచుఁ గొఱంతయే లేని♦యట్లు వారి
నరసి పోషించుచుండె వా♦రాపురమున
నెలమిఁ గాలంబుఁ బుచ్చి ర♦హీనభూతి. ౨౯ 2100

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

## ౪౦ - వ సర్గము.

రాముఁడు సుగ్రీవవిభీషణాదుల గౌరవించి వారిపురములకుం బంపుట.

చ. వనచరభల్లుకేంద్రులును ♦ వారలసేవకులావిభీషణా
దినిఖలరాక్షసుల్ పురిని ♦ దృష్టిగ నుండఁగ వర్ష మేగె; నా
జనపతి యర్కపుత్త్రుఁ గని ♦ సాధుతరంబుగ నిట్లు పల్కె; నో
వనచరనాథ! సాధుగుణ♦భాసుర! నీపురి కింక నేగుమా!. ౧ 2101

క. సుర లసురులు నీపురమును, దురమున సాధింప రనుచుఁ ♦ దోఁచెడి సచివో
త్కరయుతుఁడ వగుచు రాజ్యము, నరిహీనముఁ బ్రోవవయ్య! ♦ యాహవభీమా!.

సీ. అంగదుపైఁ బ్రేమ ♦ మధికతరంబుగా నునుపుము, పవనుని♦తనయు నలుని
గురుతరదోర్బలుఁ ♦ గుతుకంబునం జూడుమా సుషేణుని నీదు♦ననుఁగుమామ
వీరుఁడౌ తారుని ♦ ఘోరారిభీముఁడౌ కుముదు, దుర్ధర్షుఁడై ♦ కొమరుమిగులు
నట్టినీలుని శూరుఁ♦డై నట్టి శతవలి మైందుని ద్వివిదుని ♦ మహితవిక్ర

తే. మాఢ్యు గవయుని గజుని గ♦వాక్షు శరభు
గంధమాదను ఋషభు వి♦క్రముము పేర్మి
వినతుఁడగు జాంబవంతుని ♦ గనుము ప్రీతి
యలర గురుబాహుభూషణా! ♦ యర్కతనయ!. ౩ 2103

క. ఘనమతులగు నీవీరులె, యనిమొన నాకొఱకుఁ గాఁగ ♦ నర్పించిరి ప్రా
ణనికరముగానఁ గరుణం, గనుచుండుము విప్రియంబుఁ ♦ గనఁబఱపకుమా. ౪

చ. అని పలుమాఱు కౌఁగిట మ♦హాప్రమదంబునఁ జేర్చి సత్కృపం
గనుఁగొని యవ్విభీషణుని ♦ గమ్రవచస్సులఁ బల్కె; ధర్మమే
యనిశముఁ గొల్చువాఁడ వని ♦ యాత్మనెఱుంగుదు నిన్ విభీషణా!
చని యసురాలయంబయిన ♦ సత్పురి లంకను గావుమా! యిఁకన్. ౫ 2105

చ. పుర మది యాకుబేరునకుఁ ♦ బూర్వము వాసముగాఁ జెలంగె నా
పురమున రావణుండును గు♦బుద్ధిని గైకొని యేలె నద్ది యి
త్తరుణమునందు నీదయిన ♦ ధర్మయుతంబగు పాలనంబునం
బరఁగెడుఁ గాక ధర్మమును ♦ బాయకుమా శ్రమముల్ పొసంగినన్. ౬

క. మతిమంతులైన రాజులు, చ్యుతియన లేనట్టిభంగి ♦ నుర్వి మనుతు రు
న్నతిమీఱ నిశ్చయం బిది, మతి నీవును నర్కసుతుఁడు ♦ మన్ననమీఱన్.

క. అనుదినము నన్ను స్మరియిం,పను దనుఁ బరమప్రమోద♦భంగి యనఁగ ని
ట్లనువర్తించినఁ గద మే,దిని సార్థకమౌను సన్మ♦తిం గని చనుమా. ౮

చ. మనమున నేవిచారమును ♦ మానుము నా రఘురామువాక్యముల్
విని దనుజర్షభాగ్రగులు ♦ వీరుని భూపతి నేలు నే లటం

చును బలుమాఱు ప్రీతిమెయి ♦ స్తోత్రమొనర్చుచుఁ బల్కె రిట్టు; లో
ఘునభుజభూషణా! సుమతి♦గా యిది చక్కఁగ నెన్ని చూచినన్. ౧౨ 2109

తే. వీర్య మియ్యది యద్భుతం ♦ బార్యవినుత
మిట్టి పల్కులమాధుర్య ♦ మెట్టు లితరు
లందుఁ గనఁబడుఁ బరమేష్ఠి♦యందుఁ దక్క
ననుచు దనుజర్ష వానరు ♦ లనువదింప ౧౩౪ 2110

చ. హనుమ నయంబు దోఁప విన♦యానతకంధరుఁడై రఘూద్వహుం
గని యను, నాదుస్నేహము ని♦కామము నీయెడ శాశ్వతంబుగాఁ
దనరెడుఁ గాక, భక్తి నియ♦తంబయి యెప్పుడుఁగాక నామనం
బనయము నీపదాబ్జముల♦యందె యచంచలమై పొసంగుతన్. ౧౫ 2111

చ. ధరణిని నీకథామృతము ♦ ధాత్రివిభూత్తమ! యెంతకాల మె
ల్లరకును హృద్యమై తగఁ జె♦లంగునొ ప్రాణము లంతదాఁక న
న్వరునను గష్టము ల్గనక ♦ వర్తిలుచుండెడునట్లు నాకు నీ
వరము నొసంగఁగా వలయు; ♦ భవ్యతరంబగు త్వచ్చరిత్రమున్. ౧౬ 2112

[1] తే. నిరతిఁ బఠియించి చివర నో♦ధరణినాథ!, మచ్చరిత్రము నప్సరో♦మండలంబు
పాడుదురుగాక యిట్టిదా♦వరము గూడఁ, గరుణదయ చేయ వేత్రిజ♦గత్పవిభుమణి!.

సీ. దానిఁ జక్కఁగ విని ♦ నేను మహోత్కంఠ నీసుచర్యామృత ♦ మానదీరఁ
గైకొనియెదను మే♦ఘపులేఖ ననిలుండువలె; నంచుఁబలికెడు♦వాయుతనయుఁ
గని యాదరమున నా♦ననసీమనుండి చయ్యన లేచి కౌఁగిట ♦ నదిమి యట్లు
పలికె; నట్లగుఁ గాక ♦ పరమకపీ! సుంత సంశయ మ్మన లేదు ♦ క్ష్మాతలమున

తే. మచ్చరిత్రము వర్తిలు♦మాడ్కి నంత
కాలమును నీయశంబు ని♦క్కముగ వెలయుఁ
దనువు దీనిని గైకొని ♦ ధాత్రి మనుము
మఱియు నొకమాట వినవయ్య! ♦ మాన్యచరిత!. ౨౦౪ 2114

[2] ఆ. ఎంతదాఁక జగము ♦ లివి యుండునో నాదు,కథయు నెంతదాఁకఁ♦గ్రాలుచుండఁ
గలదొ యంతదాఁక ♦ కపివర! వర్తిల్లు, మీావు నానిమిత్త ♦ మేపుమీాఱ.

క. ఒనరించిన యొకొ్కక పని, కనఘా! నీ కిచ్చువాఁడ ♦ నసువులు పోకుం
డను వరము, నరుఁడు తాఁ జేసిన యుపకృతి యాపదలను ♦ జెందున యేనిన్.

ఆ. పాత్రుఁ డనఁగ నతఁడె ♦ పరఁగు; నంచనియంతఁ,గంఠసీమయందుఁ♦గ్రాలిచంద్ర
సన్నిభముగ వెలసి ♦ చక్కని వైడూర్య, తరళమైన హార♦వరముఁ దీసి. ౨౩

---

1 యచ్చైతచ్చరితం దివ్యం కథాం తే రఘునందన, తన్మమాప్సరసో నామ శ్రావయేయు
ర్నరర్షభ-అనియూ. 2 లోకా హి యావత్స్థాస్యంతి తావత్స్థాస్యతి మే కథా, ఏకైక స్యోపకార
స్య ప్రాణాన్ దాస్యాని తే కపే-అనియూ.

చ. అనిలజుకంఠసీమ నిడె; ♦ నంతట దివ్యతరైకహారముల్
హనుమయుఁ దాల్చి శీతరుచి ♦ యల్లన శృంగమునన్ వెలుంగఁగాఁ
గనఁబడు శీతశైల మనఁ♦గా నలరారెను; రాముఁ డిట్లు చె
ప్పిన నుడి నాలకించుచుఁ గ♦పిప్రవరుల్ ముద మావహిల్లఁగన్. ౨౮౪

క. శిరముల రాఘవు శ్రీకర,చరణంబులఁ బట్టుకొని యొ♦సంగెడు వేడ్కం
గరము చెలంగిరి; భానుజుఁ, డురముననమున రామచంద్రు♦నురమునురమునన్.

ఆ. పీడచేయునట్లు ♦ వేడుక నాలింగ,నంబు చేసికొనియె ♦ నయవిదుండు
దనుజనాథుఁ డట్లు ♦ తమిఁ గౌఁగిటం జేర్చు,కొనియె, రామునంత♦టనుగపితతి.

క. కను లొగి హర్షజలంబుల, మునుఁగన్ దుఃఖించి విడువ ♦ బుద్ధి పొడమకుం
టను నిల్చె నపుడు వారల,కను లశ్రువు లట్టె క్రమ్మఁ♦గా మూఢులు నాన్.

తే. చేతనంబులు లేనట్లు ♦ చేష్ట వెడల,నిలిచి యమ్మాన్యసెలవొంది ♦ లలితభణితి
నతఁడు గౌరవ మొనఁగంగ♦నావ్లయముల,కరిగి యంగమువీడున♦ట్లరిగిరా త్రిః.

చ. దనుజులు కీశభల్లుకవ♦తంసులు శ్రీరఘువంశవర్ధనున్
మనుజలలాము రాముని న♦మస్కరణంబులఁ దృప్తుఁ జేసి యా
తనివిరహంబు నేత్రజల♦ధారలతోఁ దులదూఁగ నెట్టులో
చనిరి పురంబు వీడి యొక♦చక్కటికిం జనునట్టు లేడ్పుతోన్. ౨౯ 2123

నలువదియవ సర్గము సంపూర్ణము

---

౪౧ - వ సర్గము.

కుబేరుడు రామునిఁ బుష్పకంబు పరిగ్రహింపఁ బ్రార్థించుట.

చ. జనపతి దీర్ఘబాహుఁ డిటు ♦ సర్వకపీశ్వరభల్లుకేశులన్
దనుజులఁ బంపి తమ్ములును ♦ దాను సుఖంబుగ నుండి; రంతటన్
నవ్వన మొకఁ డంతరిక్షమున ♦ జన్మముఁ గాంచి మనోజ్ఞమై కడున్
వినఁబడెఁ బ్రొద్దు వ్రాలుతఱి ♦ వీరుఁడు తమ్ములతోడ నుండఁగన్. ౧ 2124

తే. సౌమ్య! శ్రీరామ! నన్నును ♦ సౌమ్యదృష్టి
గాంచుమా ద్రవ్యనాథువా♦క్యంబురీతి
నరుగుదెంచితిఁ బుష్పకం ♦ బనఁగ బరఁగు
దాన మీయాజ్ఞ గైకొని ♦ నేను బోయి. 3 2125

చ. ధనపతి చెంతనుండ ననుఁ ♦ దాను గుబేరుఁడు చక్కఁ జూచి యి
ట్లనియె, మహాత్ముఁడౌ రఘుకు♦లాధిపుఁ డాయసురేంద్రు రావణున్
మనుజనికాయభక్షకు న♦మానుషవిక్రముఁ జంపి నిన్ జయిం
చెను దురితాత్ముఁ డాయసుర♦శేఖరుఁ డీల్గుటచేత నామదిన్. ४ 2126

క. పరమప్రీతి జనించెను, సురరిపు వాతండు మిత్ర♦సుతబాంధవసో

దరయుక్తుఁడై యడంగెన్, బురవరమగు లంకయందు ♦ భూపతివరుచేన్. ౬

ఆ. నిర్దయింపఁబడితి ♦ నీ వింక నాసౌమ్య
మోయుచుండు మదియె ♦ ముదము నాకు
నాజ్ఞ యిచ్చువాఁడ ♦ నతిశయకామ మీ
యదియె నాకుఁ గాన ♦ నగుగు మిపుడె. ౨౪ 2128

క. జనపతి రఘునందను లోకనిచయరక్షకుని మోయఁ ♦ గల్గితి వదియే
యనుపమకార్యము మదిఁ జింతను బూనక యచటి కరుగఁ ♦ దగునని పలికెన్.

మ. వినుతస్వాంతుఁడు యక్షనాయకుఁడు నన్ ♦ వీక్షించి యిట్లాజ్ఞ చే
సిన మీచెంతకు నేగుదెంచితిఁ బ్రతీ♦క్షింపం దగుం బ్రీతిచే
ధనదాజ్ఞం గొని సర్వభూతముల కు♦ద్దామప్రభావంబునం
గనరాకుండఁ జరింతు నీదయిన యా♦జ్ఞం బూని భూమీశ్వరా!. ౯ 2130

మ అనినం బుష్పకవాక్యముల్ వినుచు ను♦ద్యద్బాహుశౌర్యంబునన్
గననై మించెడు మేదినీశ్వరుఁడు శృం♦గారంపుదృష్టిం గనుం
గొని యీరీతిని వచ్చినందులకు సం♦కోచంబునుం బొంద కి
ట్లనియెం బుష్పకవర్య! స్వాగతము నీ♦కౌ సంతసం బందితిన్. ౧౧ 2131

క. ధనపతి యానతి యిచ్చుట,నను సాధ్వాచారభంగ♦నామకదోషం
బనునది పొంద; దటంచున్, జనపతి వచియించి పుష్ప♦సముదయములచేన్.

తే. లాజలను మంచి ధూపము♦లను బ్రియమునఁ
బుష్పకంబును బూజించి ♦ భూరిబాహుఁ
డవనిపతి పోయి రమ్ము నా♦యాత్మఁ దలఁచి
నప్పు డరుదేరఁ దగునని ♦ యాడి మఱియు. ౧౩౪ 2133

క. చనునపుడు సిద్ధులను జన,మునఁ దాఁకు మెట్టిచంద♦మున నీవలనన్
గనఁ గూడదు వారలు బాధను స్వేచ్ఛఁగ నరుగుమింకఁ♦దలఁచిన యెడకున్.

చ. అని వచియించి యర్చనల ♦ నాదృతిఁ దన్పినఁ బుష్పకంబు రా
మునివచనంబురీతి మన♦ముం దనివొందగఁ జేయు దిక్కునం
జనియెను; బుష్పకంబు మది♦సంతసమందుచుఁ బోప రాముని
గని భరతుండు భక్తియుఁ ♦ గై యుగళంబును మోడ్చి యిట్లనున్. ౧౬

సీ. విబుధాత్మ గల నీవు ♦ విశ్వంబు పాలింపఁగా నమానుషసత్వ♦గణము గానఁ
బడియెడు నెట్లనఁ ♦ బలికెద నో మూస మయ్యెనే దానికే ♦ నామయంబు
గలుగదు జీర్ణమై ♦ యలరని సత్వములకుఁ గూడ మృతియె గ♦ల్గదు మహాత్మ!
రోగమే లేక నా♦రులు ప్రసవింతురు పురుషులు సంతోష♦పూర్ణతనువు

తే. లను జరింతురు పురవాసు ♦ లనుదినంబు
హర్షమునె పొందుచున్నారు ♦ వర్ష మేది

మంచితరుణమొ యపుడె స♦సంచితముగఁ
గురియుచున్నది సుధవోలెఁ ♦ గుతలమందు. ౨౦ 2136

చ. అనిలుఁడు స్పర్శమందు సుఖ ♦ మబ్బెడులాగున మంగళంబు గ
ల్గను నిరతంబు వీచెడిని; ♦ గల్గవలె న్నిరతంబి విట్లుగా
నని ప్రజ లెల్లపౌరులును ♦ హర్షమునం బలుకంగ వింటి నం
చని భరతుండు సాధువచ♦నావళిఁ బల్కిన నాలకించుచున్. ౨౧ 2137

క. ధరణీశుఁడు రాముం డీ,క్కరణి సదా గల్గవలయుఁ♦గా కని మోద
స్ఫురణము గని సత్పాలన, మరుదుగఁ గావించుచుండె ♦ నార్యులు మెచ్చన్.

నలుబదియొకటవ సర్గము సంపూర్ణము

---

౪౨ - వ సర్గము

రాముఁడు సీతతో నుద్యానవనమున విహరించుట.

చ. జనపతి హేమభూషితముఁ ♦ జారుతరంబును నైన పుష్పకం
బును మరియాడఁ బంపి క్షితి♦పుత్రికతోడ నశోకనామకం
బునఁదగు నిష్కుటంబునకుఁ ♦ బోయె; వనం బది చూతవృక్షచం
దనముల రక్తచందనవ♦నంబుల నెంతయు జానుమీఱుచున్. ౧౪ 2139

సీ. అగరువృక్షము లిప్ప ♦ లా దేవదారువుల్ చంపకాశోకవృ♦క్షములు చారు
పున్నాగతరువులు ♦ పొలుచు వేగిసచెట్లు పొగలేని యగ్నియ♦నఁగఁ జెలంగు
పారిజాతములు నీ♦పములు లొద్దుగచెట్లు సప్తపర్ణములు నా♦సంతములును
నాగకేసరము ల♦నఁటులు మందారంబు లమలలతాసమూ♦హములు తనర

తే. భాసిలుచుఁ గర్ణికారాఖ్య♦వనము లచ్ఛ
కనకకాంతుల నీనుచుఁ ♦ గ్రాలఁ గురవ
కప్రియంగుకదంబముల్ ♦ క్రమ్మియుండఁ
గోవిదారంబు లెల్లెడఁ ♦ గోమరుమిగుల. ౫ 2140

క. ఫలములఁ దగు నేరేడులు, విలసితపాటలము లెంతొ ♦ వేడుకగాఁ గ
న్నులపండువుగాఁ గ్రాలఁగ, ఫలములుకుసుమములు నిండఁ♦బరఁగుతరువులన్.

చ సురుచిరదివ్యగంధరస♦శోభితపల్లవరాజి నట్టి యం
కురముల మించి వృక్షముల♦కూటము నాటఁగ నేర్చినట్టివా
రరుదుగ దేవతావనము♦లందువలెన్ వెలయింప నొప్పు న
త్తరువులచేత శోభిలెను ♦ తద్వన మెంతయుఁ జూడ రాజిలెన్. ౮ 2142

సీ చారుపల్లవపుష్ప♦సమితిచే నలరారి [1]మత్తషట్పదతతి♦మంజులముయి
పరభృతషట్పద♦బహువర్ణపక్షిసంకులమయి పెక్కువం♦దలుగ నొప్పు

[1] మత్తభ్రమరసంఘైః, కోకిలై ర్భృంగరాజై శ్చ నానావర్ణై శ్చ పక్షిభిః-అనిమూ.

చిత్రచూతద్రుమ♦శేఖరంబుల మించి, యున్నవనం బలరారె; ♦ నందుఁ గొన్ని
తరువులు హాటక♦తరువులవలెఁ గొన్ని యగ్నిశిఖాకృతి ♦ నట్లు గొన్ని

తే. యంజనాకారముగ నొప్పు ♦ నమలమాల్య
ములకుఁ దగి కొన్ని పుష్పముల్ ♦ లలితపరిమ
ళములఁ దమతావుఁ దెల్పుచు ♦ నమరె; నందు
బహువిధాకారములఁ దీర్పఁ♦బడి చెలంగి. ౧౦ 2143

చ. నిరుపమవారిపూర్ణములు ♦ నిర్మలరత్నవిచిత్రభంగులున్
సురుచిరకాంతులన్ వెలయు ♦ చొక్కపుస్ఫాటికకుట్టిమంబులున్
గురుతరపంకజోత్పలసు♦గుంభితముల్ వరచక్రవాకర
మ్యరవవిరాజితంబులును ♦ హర్షదహంసనినాదితంబులున్. ౧౧ 2144

ఆ. అలగువానకోయి♦లలు చక్కఁగాఁ గూయ
వెలయుచుండునవియు ♦ లలితతరువి
తతులు తీరములను ♦ నతతపుష్పాఢ్యంబు
లయి చెలంగ మించు♦నవియు మఱియు. ౧౨ 2145

క. పలువిధములైన సాలం,బులు శీతగ్రావనివహ♦ముల నొప్పెడు తా
వులనున్ మించెడుసరసులు, వెలయఁగ నాయుపవనంబు ♦ వేడ్క నొసంగెన్.

క. వనమున నందొకచోటన్, ఘనతర వైడూర్యమణిని♦కాయమురీతిం
గనఁబడుపచ్చికబయలులు, మనమునకుం బ్రీతి నీయ ♦ మఱియు నెసంగెన్.

చ. తరువులు పూచియుండఁగ స♦దాగతి పైఁ బ్రసరింపఁగా సుమో
త్కరములు రాలి మూలముల♦దావున శయ్యకుఁగాఁ జెలంగుప్ర
స్తరములపైని నిండ నవి ♦ తారలతోఁ గనుపట్టుచున్నయం
బరమువలెం గనంగనయి ♦ భాసిలుచుండె విచిత్రరీతిగన్. ౧౫ 2148

క. సురపతి నందనము వలెన్, బరమేష్ఠినిర్మితము ♦ భాసిలు నాచై
త్రరథమురీతిన్ శ్రీరఘు,వరునుద్యానంబు వెలసె ♦ భవ్యతరంబై. ౧౬ 2149

క. పలువిధములైన యాసన,ములఁ దీఁగెల జొంపములన♦మూహములను మి
క్కిలి మించునశోకంబును, లలితగతిం జొచ్చి నాయి♦లాపతిసతితోన్. ౧౭

క. కుసుమస్తబకయుతంబై, యసమానవిభూతి నలరు ♦ నాసనముపయిన్
వనసంబుఁ బఱుపరాజిలఁ,గ సముంచితరీతి రాజ♦కాంతుఁడు సతియున్. ౧౮

ఆ. కూరుచుండి; రంతఁ ♦ గోమలికయిఁ బట్టి
చెంతఁ గూరుచుండఁ ♦ జేసి శుద్ధ
మానసమును గూర్చు ♦ మైరేయసుధు విచ్చె
శచియు సుధను బతి కొ♦సంగునట్లు. ౧౯ 2152

సీ. వివిధమాంసంబుల ♦ వివులచిత్రఫలంబులను గింకరులు చక్క ♦ మనుజపతికి
నాహారమున కిచ్చి ♦ రప్పుడె; నృత్తగీతముల నేర్పఱులయి ♦ ధన్యరూప
మున నొప్పుబాలికల్ ♦ జనపతిముందటఁ బానమదంబునఁ ♦ బరఁగి యాడి;
రంతఁ రంజిలఁ జేయు ♦ నట్టి శ్రీరాఘవుఁ డమలధర్మాత్మకుం ♦ డతులభూమి

ఆ. తాంగుఁ డట్టులాడు ♦ నామనోహరరూపముులఁ జెలంగు నంగ♦నలను బ్రీతి
నందఁ జేసె యుక్త♦ముగు దానములచేత;, నచట సీతతోడ ♦ నలరునృపతి.

క. పరమాస్తరణంబునఁ దగి, యరుంధతీయుక్తి నలరు♦నట్టి వసిష్ఠుం
బురుడించుచుఁ దేజంబున, నరుదుగ రాజిల్లె నమరు ♦ లౌరా యనఁగన్. ౨౩

చ. జనపతి సంతసం బలర ♦ జానకి నచ్చరమిన్నవంటి చ
క్కనితనుసంపదన్ వెలయు♦కాంతను రంజిలఁ జేసెఁ జక్కఁగా
ననుదిన మాయమర్త్యు లటు; ♦ లందుఁ దమిన్ విహరించు జానకీ
జనపతి దేవదేవులకు ♦ సాంద్రసుఖావహమై యజస్రమున్. ౨౪ 2155

ఆ. మంగళంబు నిడు స♦మయ మిది శిశిరంబు, చాల గడచె; నిట్లు ♦ సరసకేళిఁ
దేలు వారి కట్టి♦కాలంబునకుఁ బది, వేలయేండ్లు వయను ♦ వేగ చెల్లె. ౨౫

ఆ. శిశిర మదియుఁ జక్కఁ♦జెల్లె భోగదమయి;, జనపతీంద్రుఁడు దివ♦సమున మొదటి
భాగమందు ధర్మ♦భంగుల నెఱిఁగిన, వాఁడు గాన దాని♦వరుసఁ దీర్చి. ౨౬

క. మిగిలిన దినభాగము తా, నగణితభూతిం జెలంగు♦నంతఃపురమం
దు గడిపె జానకియుం దన, మగనివిధంబునను ధర్మ♦మహితపథమునన్. ౨౭

క. సురకార్యంబుల నొనరిచి, పరమప్రమదమున సాధు♦భక్తి శ్వశురులన్
నిరతము పూజించెడు న,వ్వరుసం బూర్వాహ్ణమందు ♦ వదలనికడఁకన్. ౨౮

తే. పూజలం దన్పుచుండె; నా♦పూవుఁబోఁడి
యంతట విచిత్రసువిభూష♦ణాంబరములఁ
దాల్చి రాముని సేవింపఁ ♦ దా నరుగును
శచి మహేంద్రుని సేవింపఁ ♦ జనువిధమున. ౨౯ 2160

చ. కనకవిభూషణావళులఁ ♦ గ్రాలుచు మంగళమూర్తిమీఱ వ
చ్చిన జనకాత్మజాతఁ గని ♦ చిత్తమునం బ్రమదంబు నొంది చ
క్కనివిధి నున్న దా నవని♦కాంతుఁడు రాముఁడు పల్కుచుండు; నం
త నొకట శ్రోణిభారమునఁ ♦ దద్దయు మించుచు వచ్చుపత్నినిన్. ౩౦ 2161

చ. సురసుతఁ బోలుదానిఁ గని ♦ చొక్కపుఁ బ్రీతిని జానకీ! సునో
హరతనుభాసురా! యలరె ♦ నొర యపత్యము నాకు నేటి కి
వరున; ని కేమి గావలయు ♦ నారక తెల్పుము తెచ్చి యిత్తు సుం
దరి! యను సుస్మితం బలర ♦ ధాత్రికుమారి వచించె భర్తతోన్. ౩౧ 2162

* శ్వశ్రూణా మకరోత్పూజామ్-అనిమా.

సీ. ప్రాణేశ! జాహ్నవీ♦పరిసరంబున నున్న యుగ్ర తేజంబుల ♦ నొప్పుమునుల
వౌ తపోవనముల ♦ ననువొందఁ జూడఁగఁదలఁతు నయ్యవి పవి♦త్రంబు లౌట;
నందలిమౌను ల♦హారహంబు ఫలమూలభక్షకులై యుండు♦వారు గాన
వారల సత్పాద♦వారిజంబులఁ గొల్చి యుండనౌ ననెడి యీ♦యొక్క వాంఛ

తే. మనమునం దున్నయది యొక్క ♦దినమె యైన
నందు నివసింపఁ గోరెద ♦ నమరవంద్య!
యందు ఫలమూలములఁ దిన ♦ నభిలషింతు
ననిన నక్లిష్టకర్ముఁ డ♦య్యవనిపతియు. ౩౫ 2163

క. కానిమ్ము యొనరించెద, నే నిల్లే యని ప్రతిజ్ఞ ♦ నృపతి యొనరుపం
గా నెలఁత తమిఁ జెలంగెను;, జానకితో మరలఁ బల్కె ♦ క్ష్మాపతి ప్రీతిన్. ౩౬

క. మనమున సంతస మందుము, చనవచ్చున్ రేపె నుంత ♦ సంశయము నెదన్
గనకుండు మనుచు మైథిలి, మన మూఱడిలంగఁ బలికి ♦ మానము గనుచున్.

తే. ఒకముహూర్తము ధ్యానించి ♦ యువిద యిట్టి
వాంఛఁ దెల్పిన యేమని ♦ వరుసఁ దలఁచి
చింతచే వ్యాకులంబగు ♦ చిత్త మొప్ప
మధ్యకక్ష్యాంతరం బొందె ♦ మానవధనుఁడు. ౩౭ 2166

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

౪౩ - వ సర్గము.

చారుఁడు రామునితో లోకాపవాదముఁ దెల్పుట.

చ. తనసఖు లెల్లఁ గొల్వఁ బ్రమ♦దంబున హాస్యకథావిచక్షణుల్
మన మలరంగఁ జేయునటు ♦ మాటలఁ బల్కెడు పండితుల్ తనుం
గనఁ జనుదెంచి కొల్వ నట ♦ క్ష్మాపతివర్యుఁడు కూరుచుండె నా
ఘనసుతులందునన్ విజయు, ♦ కాశ్యప,పింగళ, కాళియాహ్వయుల్. ౧ 2167

సీ. మధుమత్తకుటిలును♦మాగధ భద్రులు దంతవక్త్రుఁ డను రాజు ♦ లెంతొ ప్రీతి
నలరంగ బహువిధ♦ములగు కథల్ పరిహాసయుక్తంబు లౌ♦నట్లు పల్కి
రాఘవు చిత్తంబు ♦ రంజిల్లఁ జేసిరి; సమ్మోదమున రాము♦చంద్రుఁ డట్టి
గాథల వినుచు నొ♦క్కకథ వచించెడునాటి నిట్టు లనియె భ♦ద్ర! పురమందు

తే. జనపదంబుల నాదువి♦షయము నెట్లు
పలుకుచుందురు జానప♦దులును బౌరు
లవనిజాతను గూర్చియు ♦ నాసుమిత్ర
పట్టి యగులక్ష్మణుం గూర్చి ♦ భరతుగూర్చి. ౨ 2168

క. అనుజుండగు నాశత్రు,ఘ్నుని గూరిచి కైకఁ గూర్చి ♦ నూతనముగరీ
తిని బల్కుచుందురో యే,యని వానిన్ దాఁపకుండ ♦ ననువుగఁ జెపుమా. ౭

క. నూతనరాజ్యము నొందిన, భూతలపతి కెఱుకపడఁగఁ ♦ బోలును వార్తా
వ్రాతం బన విని భద్రుఁడు, చేతస్సంశయము నొంది ♦ చేమోడ్చు తగన్.

క. పలికె మహాత్మా! నగరం,బుల మిమ్ముం గూర్చి పౌర♦పూగము శుభగా
థలఁ బల్కుచుండు మఱి దశ,గళవధసంప్రాప్తవిజయ♦గాథను మిగులన్. ౮½

క. మనపౌరులు నిత్యం బో,జననాథా! పలుకుచుంద్రు ♦ చక్కఁగ ననఁగా
విని భద్రుతోడ నిట్లని,యెను; రాముం డోయి భద్ర!♦యీవిషయమునన్.

క. వినిపింపు మున్నదున్న, ట్లనవద్యముగా సమగ్ర ♦ మని మఱియు ననున్
మనవారు శుభాశుభరీ,తిని బల్కెడుమాట లెల్లఁ ♦ దేటపఱిచినన్. ౯ 2173

తే. మంచికార్యములను జేసి ♦ మానివేయఁ
దగినపనులను మానంగఁ ♦ దగును గాన
నిర్భయంబుగ నేచింత ♦ నీవు గనక
పల్కుమా పౌరులును జాన♦పదులు చెలఁగి. ౧౦½ 2174

క. పలుకుదు రేమని పాపో,క్తులు వానిని వినఁగ నాకుఁ ♦ గోర్కి కలదు నం
చలరారు సురుచిరోక్తులఁ, బలికిన భద్రుండు వానిఁ ♦ బాటించి మదిన్. ౧౧½

క. కరముల నొగ్గి నుతించెన్, గురుబాహుని రాముఁ గాంచి ♦ క్షోణీశవరా!
పురజనులు పల్కుచుండెదు,కరణి శుభాశుభములైన ♦ కథల వచింతురన్. ౧౨½

ఆ. చత్వరముల విపణి♦శాలల బాటల, వనములందును నుప♦వనములందుఁ
బలుకుచుండు రిట్లు ♦ వార్ధి బంధించెను, మున్ను చూడలే ద♦దెన్నఁడైన. ౧౩½

క. సురలకుఁ గూడ దురాసద, మరయుఁగ నీకార్య మాసు♦రారివరుఁడు దు
స్తరబలుఁడు దురాధర్షుఁడు, పరికింపఁగ రావణుండు ♦ బలయుతుఁ డగుచున్.

క. అనిఁ బడియె భల్లుకేంద్రులు, వనచరులును రాక్షసులును ♦ వశవర్తులునై
తనమాటయుండె మెలఁగిరి, దనుజేంద్రుని రావణుని ని♦తాంత మడంపన్.

చ. ధరణికుమారికన్ విగతి ♦ దారుణదుఃఖను రావణుండు సం
గరమున నీల్గినం గొనుచుఁ ♦ గాఱియపెట్టునమర్షఁ బాసి యీ
పురమున కేగుదెంచె; రఘు♦పుంగవుచిత్తము హెత్తనౌఁ గదా
తరుణిని గూడువాహుఖముఁ ♦ దా నదె వెచ్చిద్ధిగాఁ దలంచెని. ౧౬ 2180

చ. దనుజవరుండు పూర్వము ని♦తాంతబలం బలరార జానకిం
దనతొడమీఁద నుంచుకొని ♦ దక్షిణభాగమునందు వెల్గుప
త్తనమున కేగి యందొకట ♦ దస్యుఁడు నాఁగ నశోకనామకం
బునఁ దగువృక్షవాటికను ♦ బొంగెడువేడుక నుంచి రాక్షసీ
జనవశయై మెలంగునటు ♦ చక్కఁగఁ జేయఁడె దుష్టతంబునన్. ౧౭½ 2181

మ. పరునింటన్ నివసించియున్న తరుణిన్ ♦ బాగంచుఁ దా నెంచె భూ
వరుఁ డేమాత్ర మయుక్తమంచును దలం♦పం డింక నింటింట నుం
దరు లేతప్పు లొనర్చినం గ్రుధ దగన్ ♦ దండింప నౌనే మహీ
వరుఁ డేరీతిని గార్యముల్ నడుపు నా♦థంగిన్ బ్రజల్ చేయనౌ. ౧౯ 2182

చ. అని యిటు పెక్కురీతుల మ♦హాత్మ! వచింతురు నాగరుల్ తమం
తన మతి పల్లెలందును జ♦నంబు లిదే పలుకంగఁ జొచ్చి; రం
చను పలుకుల్ చెవిం బడఁగ ♦ నానరదేవుఁడు చాల నార్తిఁ బొం
దినయటు లుండి మిత్రులగు ♦ ధీరుల వారలఁ గాంచి చింతతోన్. ౨౦౪

తే. పలుకు లియ్యవి రీతిఁగఁ ♦ బ్రబలె ధరణి
నింక నెట్లుగ నడువనౌ ♦ నెఱుఁగఁ జెప్పుఁ
డన్న వారెల్లఁ బృథ్విపై ♦ నట్టె శిరసు
లలరఁ బడి వందనంబులు ♦ సలిపి యనిరి. ౨౧౪ 2184

చ. పలు కిది యెల్లెడన్ బ్రబలెఁ ♦ బౌరులు లాడుదు రిట్లు సుంతయేఁ
దలఁపరు మంచిచెడ్డలవి♦ధం బిది యంచును సంశయంబు లే
కలయక పల్కుచుందు రని ♦ యాసఖు లాడినరీతి నెమ్మదిం
దలఁచి రఘూద్వహుండు సఖి♦తల్లజు లేగ ననుజ్ఞ నిచ్చుచున్. ౨౩ 2185

నలువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౪ - సర్గము.

రాముఁడు జనాపవాదముం దెలుపఁ దమ్ముల నేకాంతమునఁ బిలిపించుట.

చ. తనచెలికాండ్రఁ బంపి గుణ♦ధాముఁడు కార్యముచేయువైఖరిన్
మనమున నిశ్చయించుకొని ♦ మాట యిదిట్లు జనించెనే యహో
యని పరమార్తి ద్వారమున♦యందు వసించెడు సేవకుం గనుం
గొని యిటు పల్కె; సాధుగుణ♦గుంభితు లక్ష్మణుఁ బ్రీతిపాత్రునిన్. ౧౪ 2186

క. ఘనభాగ్యుని భరతుని నా,యనుజుం డపరాజితుండు♦నయి తగు శత్రు
ఘ్నుని దోడితెమ్ము వేగము, యన రాముని వాక్యజాల ♦ మాదృతిమీఱన్. ౨

చ. విని శిరసావహించి భట♦వీరుఁడు దోసిలి యొగ్గి చిత్తమం
చని చని యాసుమిత్రతన♦యాగ్రజు లక్ష్మణుఁ గాంచఁబోయి యా
తనిసదనంబు చొచ్చి నృప♦తల్లజుఁ డిప్పుడు మిమ్ముఁ జూడఁగో
రె ననుచు దోసిలొగ్గి మృదు♦రీతి మహాత్మునితోం వచించుచున్. ౩౪ 2188

క. త్వరగా దర్శనమున కో,ధరణీశకుమార! పోవఁ♦దగు నన నట్లే
యరిగెద నని రామాజ్ఞను, శిరసునం దాల్చి రథము ♦ చెచ్చెఱ నెక్కెన్. ౪౪

చ. అరదము నెక్కి రామునిగృ♦హంబున కేగె; రథంబుమీఁద న
ట్లరిగెడు లక్ష్మణుం గనుచు ♦ నాభటవీరుఁడు వేగ పోయి యా

భరతుగృహంబుఁ జేరి యతి♦భక్తిఁ గృతాంజలియై యడంకువన్
ధరణివిభుండు మిమ్ముఁ గనఁ ♦ దాఁ దలపోసెడు నంచుఁ దెల్పినన్ ౯ 2190

చ. భరతుఁడు రాఘవానుమతిఁ ♦ బల్కెడు ద్వాస్థునిపల్కు లెన్ని యా
దరమునఁ గాల్నడం జనియెఁ ♦ దత్క్షణమే; బలశాలి యాతఁ డి
ట్లరుగుటఁ గాంచి లక్ష్మణుప్రి♦యానుజుఁ డున్నెడ కేగి భక్తితోఁ
గరముల మోడ్చి రాఘవుని♦కాంక్షను దెల్పె వినీతుఁడై తగన్. ౧౦ 2191

క. చనుదెమ్మా! రాముఁడు నిన్, గన నెంచెడు లక్ష్మణుండు ♦ కడువడి మీతోన్
జనియెన్ భరతుం డేగెను, ఘనకీర్తి! నీవు రమ్ము ♦ కడువడి ననఁగన్. ౧౧

ఆ. ఆసనంబునుండి ♦ యట్టె లేచి ధరిత్రిఁ, బడి నమస్తతులను ♦ భక్తి సల్పి
రాముకడకుఁ బోయె; ♦ రయమున ద్వారస్థ,భటుఁడు వేగ పోయి♦పలికె నిట్లు.

చ. అనుజులు వచ్చి వాకిట మ♦హావినయంబున నున్నవారు నా
విని రఘునందనుండు మది ♦ వేఁచెడు చింతను గ్రుంగి మోము వా
ల్చి నిలిచియున్న యాభటుని ♦ శీఘ్రమ తమ్ములఁ దోడితెమ్మటం
చనునయ మొప్పఁ బల్కె సహ♦జావళి నాకును జీవితంబు నూ!. ౧౩ 2194

తే. నాబహిఃప్రాణములు వారె ♦ నాకుఁ బ్రియులు
వారె కావునఁ దోడ్తెమ్ము ♦ వైళమ యన
నతఁడు చని చెప్ప రాజాజ్ఞ ♦ నంది శుక్ల
వస్త్రధారులు వినయత♦త్పరులు నగుచు. ౧౪ 2195

క. భరతాదులు మువ్వురు చొచ్చిరి రాముని చారుసౌధ♦సీమ; నచట భూ
వరుమోము రాహు వేఁచం,గర మార్తిం బొందు చంద్రు♦కరణిఁ గనఁబడెన్.

క. ద్యుతిబాసిన సంధ్యాసమ,యతపనురీతిం గనంగ♦నైన రఘువిభున్
జ్యోతిలేని బాష్పపూర్ణా,యతనయనుని ధీబలాఢ్యు ♦ నన్నను ధీరుల్. ౧౬

క. విరహితరుచియగు పద్మము,కరణిం దగుమోముతోడఁ ♦ గలవిలపడుభూ
వరుఁ గాంచి సత్వరంబుగఁ, జరణంబులు తలల సోఁకు ♦ చందమ్మలరన్. ౧౭

ఆ. వందనములు చేసి ♦ యంద యచ్చట నిల్వఁ
బడిరి; రాముఁ డంత ♦ బాష్పములను
విడిచి యూరకుండి, ♦ విభుఁ డంతలో వారిఁ
గౌఁగిలించుకొనుచుఁ ♦ గళవళించె ౧౮ 2199

క. ఆసనములఁ గూర్చుండుం, డోసమధికశూరులార! ♦ యొప్పుగ మీరే
నాసర్వస్వము జీవిత, మేసరణిం గనిన నన్య ♦ మింకం గలదే. ౧౯ 2200

క. మీ రార్జించిన రాజ్యం, బీరీతిగ నేలువాఁడ ♦ నెల్లవిధములన్
మీరలు శాస్త్రవిచక్షణు, లాగయుఁగా బుద్ధిమంతు ♦ లగుదురు గాదే. ౨౦

క. నను( గూర్చి సకలవిధముల(, గనుయుక్తము దెలిచి వెదుక(♦గా(జనుననుచుఁ
జనపతి తనదువిచారం,బును దెల్పిన రాముపాక్య♦మును జక్కంగన్. ౨౧

తే. తెలియఁ జాలక యాసోద♦రులు కలంగి
మనను లుద్విగ్నము లగుచు ♦ జనపతివగు
నాశయం బిది యని తెలి♦యంగ రాని
బదులు చెప్పక యుండి రం♦చప్పటునందు. ౨౨ 2203

నలువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౪౫ - వ సర్గము.

రాముఁడు లోకాపవాదమును దెల్పి లక్ష్మణునితో సీత నడవుల విడిచి రమ్మని చెప్పుట

సీ. ఆసనమ్ములయందు ♦ నారీతిఁ గూర్చుండి దీనచేతస్కులై ♦ తెల్లవోయి
యున్నతమ్ములఁజూచి♦ యున్నయిట్లనిపల్కె మోమెండఁగా; భ్రాతృ♦ముఖ్యులార!
మీకు శుభంబగుఁ ♦ గాక నామాటల నాలకింపుఁడు చి త్త♦మందు వేఱు
గాఁ దలంపక శ్రద్ధ♦గా వినుం డిత్తఱి నాభార్యయైన జా♦నకివిషయము

తే. నందుఁ బౌరులచిత్త మెం♦ట్లలరెనొక్కొ
తెలిసికొనుఁ డింకనైనఁ బౌ♦రులును జాన
పదులు పల్కెడు నపవాద♦వాక్కులు విన
మనను గలఁగెడుఁ ద్రుంగెడు ♦ మర్మములును. ౧ 2204

క. [జనపదముల నగరంబుల, జనకజచారిత్రమందుఁ ♦ జక్కనియంకం
బును గల్పించిరి కుమతులు, చనునే యాలించి వాని ♦ సైఁపఁ నాకున్.]

క. జననం బిక్ష్వాకుకులం,బున నాకుం గల్గె నాదు♦పూర్వులు పూజ్యుల్
జనకునినద్వంశంబున, జనియించెను సీత సుగుణ♦సముదయ మొప్పన్. ౫

క. తెలియుదురు గదా కానన,ముల మే ముండంగ దనుజ♦ముఖ్యుఁడు సీతన్
బలవంతమ్ముగఁ గొని చన, నలఘుబలం బొప్ప నేను ♦ ననిఁ జంపుటయున్. ౬

చ. దనుజు వధించి యచ్చటనె ♦ ధాత్రికుమారిక లోఁ దలంచి యి
ట్లని తలపోసినాఁడ నను♦రాలయమందు వసించియున్న యీ
జనకజ నెట్లయోధ్యకు నె♦సంగెదు వేడుకఁ గూడి పోవనా
నని యటమీఁద నాతరుణి ♦ యగ్నిని జొచ్చెను బ్రత్యయార్థమై ౭౫ 2205

క. వినియే యుందురు మీరలు, జనకజ శుచిఁ జొచ్చె ననుచు ♦ సౌమిత్రీ! నీ
కనులారఁ జూచితివి గద, దనుజులు నిర్జరులు చూచి ♦ తగుఁ దగు ననుటల్.

ఉ. వింటివి గాదె యగ్నియును ♦ విశ్వ మెఱుంగఁగఁ బావనాంగి వా
ల్గంటి యిదా సుసాధ్వియనెఁ ♦ గాదె నభంబుననుండి వాయు వి

ట్లంటయుఁ జంద్రసూర్యులు మ♦హాముని నిర్జరసన్నిధిన్ మనః
కంటకమాఱఁ బాపమనఁ ♦ గొంత యెఱుంగదు నా వచించుటల్. ౯౹

క. వినియుందువు గద గంధ,ర్వనిర్జరుల చెంత నిట్టి♦భంగి జరగుటల్
కనకాంగి సాధుశీలయె, గనుకనె యాలంకయందుఁ ♦ గడు మోదమునన్.

క. సురనాథుఁడు జానకి నా,కరమున నర్పించె నేనుఁ ♦ గామిని మదిలోఁ
బరిశుద్ధఁగా నెఱుంగుదు, నిరుపమకీర్తిం జెలంగు ♦ నెలఁతయు సతమున్.

ఆ. ఇన్నివిషయములను ♦ మున్ను పరీక్షించి, నాతి నిటకుఁ దెచ్చి♦నాఁడ నిపుడు
కలిగినట్టి దూఱు ♦ కళవళింపఁగఁ జేసె, నకట! హృదయశల్య♦మగుచునన్ను.

ఉ. పౌరులదూఱు గొప్పదయి ♦ పర్వెడుఁ బల్లెలయందుఁ గూడ నీ
పౌరులపాటయే వెలసె ♦ బాగుగ నెవ్వని దుర్యశంబు లీ
ధారణిఁ బాడఁగాఁబడునొ ♦ తన్నినదంబు చెలంగుదాఁక నా
పూరుషుఁ డేగు నీచమగు ♦ భూమికి నిశ్చయ మిద్దియాఁ గదా. ౧౩౹ 2214

ఆ. అమరవరులు దుర్య♦శమును నిందింతురు
కీర్తి లోకవినుతి♦కిం దగియెడు;
నెల్లపనులు మహిమ ♦ నెసఁగు పెద్దలు చేయఁ
బూనుదురు యశంబుఁ ♦ బొందఁ గోరి. ౧౪౹ 2215

క. నే నపవాదభయంబున, మానుదు నాజీవితంబు ♦ మఱియున్ మిమ్మున్
మానవసింహులఁ బాయుదు, జానకి నిఁకఁ జెప్ప నేల ♦ సాధువులారా! ౧౫౹

క. కనుఁగొనుఁడు శోకసాగర,మునఁ బడి తపియించువాని ♦ ముం దిట్టివిధం
బున దుఃఖము నే నన్నఁడు, గనినదియే లేదు దీని♦కంటెఁ బెనువగల్. ౧౬౹

క. ధరణిం గల్గవు; లక్ష్మణ!, త్వరపడి యుదయమున రేపె ♦ దరలుము రథమా
ధరణిజతో నెక్కుము వే, తరలి సుమంత్రుండు రథముఁ ♦ దగువడిఁ దోలన్.

క. మన దేశము నవ్వలఁ గం,గను దాఁటు మనంతరమునఁ ♦ గ్రాలుతటమునన్
మునిపతియగు వాల్మీకిము,నినివాసము చెన్నుమీఱు ♦ నిర్మల మగుచున్. ౧౮

క. సురవాసం బట్లది యె, వ్వగునను గన నసదృశముగఁ ♦ బరఁగుఁ దమస నా
నిరుపమవీచీసంయుత,తరంగిణీతీరమందుఁ ♦ దగు నదియందున్. ౧౯౹ 2220

మ. జనశూన్యంబగు భాగమందు ధరణీ♦జాతన్ దగన్ డించి వే
చనుదెమ్మా! శుభ మొప్ప నీకు మదిలో ♦ సందేహముం బొందఁగాఁ
జన దిప్పట్టున మాఱు చెప్పఁ దగ దే♦చందంబునన్ సీతఁ గూ
ర్చినపల్కుం బలుకంగరాదు చనుమా ♦ శీఘ్రంబుగా లక్ష్మణా!. ౨౦ 2221

క. ఇది తగు నిది తగదని యీ, యదనునఁ బల్కంగ నీకు ♦ నర్హము గాదీ
యది చేయరాని దని ప,ల్కెదవే నప్రీతి కల్గుఁ ♦ గినుకయుఁ బొడమున్.

**తే.** ప్రీతి నాపయి నుండునే ♦ సీతటే నిది
మంచి దిది చెడ్డదని చెప్ప ♦ నెంచవలదు
నాదు పాదములాన ప్రా♦ణములయాన
బదులు పలుకకు మనుచు నొ ♦ ట్టిదియె యిడితి. ౨౬½ 2223

**సీ.** ఎవ్వారైనను నన్ను ♦ నీవిషయంబున ననునయింపఁగఁ బూను♦కొనెద రట్టి
వారు నాకహితులే ♦ యేరీతిఁ దలఁచిన మదభీష్టఘాతుకుల్ ♦ మాట లేల?
నను గౌరవింతురే ♦ ననుఁ జెప్పినది చేసి ప్రేమింతురేని మా♦టేమి పలుక
కుండ సీతను గొని ♦ యుగ్రకాననముల విడిచి రాఁదగు నాజ్ఞ ♦ విడువకుండ

**తే.** మునుపె నాతోడఁ బల్కె నీ♦జనకతనయ
జాహ్నవీతీరమునఁ గల్గు ♦ సన్మునియుట
జముల విహరింపవలయుఁ గా♦మ మిది నాకు
ననుచుఁ గావునఁ దీర్పంగ ♦ నగును దాని. ౨౭½ 2224

**క.** అని పల్కుచుఁ గాకుత్స్థుం, డనవరతాశ్రుప్రపిహిత♦మగు నక్షియుగం
బున ధర్మమతిని శోకం,బున హృదయముకలఁగ నొక్క♦మొగి వెతఁబడుచున్.

**తే.** అనుజులం గూడి నిట్టూర్పు ♦ లట్టె భూరి
భుజగ మట్లుగఁ బుచ్చుచుఁ ♦ బోయె లోని
కట్టె సోదరు లత్యార్తి ♦ నలజడిఁ గని
యాత్రియామను బుచ్చి రే♦మనక యెట్లొ. ౨౮ 2226

నలువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౮ - వ సర్గము.

లక్ష్మణుఁడు సీత నరణ్యములకుఁ బిలుచుకొని పోవుట.

**క.** చనియెఁ ద్రియామ యదెట్లో, జనవిభుసోదరుఁడు వగల♦స్వాంతము దూలం
గను మోమెండఁగ సారథిఁ, గని పల్కె మహీశునాజ్ఞఁ ♦ గళవళపడుచున్.

**క.** అరదము సుందరముగ హాయ,వరములతోఁ గూర్చి చక్క ♦ భాసిల్లెడు సుం
దరరత్నమయాసనమును, ధరణిజకై యేర్పఱుపుము ♦ ధరణిపునాజ్ఞన్. ౨

**చ.** జనకజ పుణ్యకర్మముల♦సంగతిఁ బాయనిమౌనివర్యులం
గనుఁగొన నాశ్రమంబులకుఁ ♦ గ్రన్ననఁ బోవఁ దలంచె నేను న
మ్మునియుటజంబులన్ విడువఁ ♦ బోలును వేగ రథంబు గట్టు; మం
చనిన సుమంత్రుఁ డట్లె యని ♦ యర్వహయంబులఁ బూన్చి చక్కఁగన్. ౩½

**క.** సురుచిరమై సుఖశయ్యా, పరియుతమై రమ్య మగుచు ♦ భాసిల్లెడు నా
స్తరణంబున నొప్పుచు సుం,దరముగ శోభిల్లఁగా ర♦థంబు నొనర్చెన్. ౪

చ. అరదము దెచ్చి మిత్రగణ♦హర్షద! స్యందన మిద్ది సిద్ధమై
పరఁగె ననంతరక్రియను ♦ బాయక చేయుము నాఁగ లక్ష్మణుం
డురుతరదుఃఖవేదనల ♦ నొందుచు నుండియు భూపతీంద్రమం
దిరమును జొచ్చి సీతఁ గని ♦ దీనత నిట్లని పల్కె మెల్లఁగన్. ౫౧ 2231

క. కోరితి వఁట యోతల్లీ!, భూరమణుని వర మొకండు ♦ మునిపల్లెలకుం
జేరుపుమా జానకి నని, శ్రీరాముం డాజ్ఞ నాకుఁ ♦ జేసెను గానన్. ౭ 2232

సీ. గంగచెంతను జక్కఁ♦గా నొప్పునాశ్రమముల నిన్ను రామాజ్ఞఁ♦దలఁచి విడిచి
వచ్చెద నే మౌని♦వరులుండు రచ్చోట నయ్యాశ్రమములు పు♦ణ్యంబొసంగఁ
జాలియుండును నిన్నుఁ ♦ జయ్యనఁ గొనిపోయి విడిచి రాఁదగు నని ♦ విన్నవింప
మహితాత్ముఁడైన ల♦క్ష్మణుపల్కు లాలించి యధికసంతోషంబు♦నంది గమన

ఆ. మునకు నుత్సహించె ♦ ననుపమరత్నముల్
వస్త్రములును మునుల♦పత్నులకు నొ
సంగఁ గొనుచు సీత ♦ చయ్యనఁ బోసంగఁ
బయనమయ్యె నామె ♦ స్వాంతమందు. ౧౦౧ 2233

క. మునిపత్నుల కీవస్తువు,లను భక్తి నొసంగుదాన ♦ లలితము లీర
త్ననికరములువస్త్రంబులు, మునిసతులు గ్రహించి మోద♦మునుగనుదురొగిన్.

చ. అన విని లక్ష్మణుండు విన♦యంబున నట్ల యొసంగవచ్చు నం
చని రథ మెక్కఁజేసి జన♦కాత్మజతోడఁ బ్రయాణమయ్యె; స్యం
దన మది వేగ పోయె హయ♦తల్లజముల్ పరువెత్తుచుండ రా
మునిదగునాజ్ఞ స్వాంతమును ♦ ముంపఁగ దానిని సంస్మరించుచున్. ౧౨౧

మ. చనుచుండన్ సిరిఁ బెంచు లక్ష్మణునితో ♦ స్వాంతంబు దూలంగ ని
ట్లనియెన్ జానకి; పెక్కురీతులను జ♦హ్నంబుల్ మహాదుష్ఫలం
బును నీయందగు నట్టివే కనఁబడం ♦ బూనెన్ మదంగంబు కం
పనముం బొందెడు దక్షిణాక్షి యిదె కం♦పంబుం గనం జొచ్చె నా
మన మస్వస్థతఁ దూలుచున్నయది యో♦త్మ్యాపాలపుత్రోత్తమా!. ౧౪౧ 2236

సీ. ఒకప్రక్క నొత్సుక్య♦మొకవంకనధృతియు నతిశయంబులుగాఁగ♦నమరెమదిని
బుణ్యాశ్రమంబులఁ ♦ బొడఁగను నాకాంక్ష యంతకంతకుఁ దగ్గు♦నట్టు లున్న
దొప్పృథులోచనా! ♦ యుర్వి శూన్యంబుగాఁ గన్పట్టుచున్న ది♦క్కాలమందు
భ్రాతృవత్సలుఁడవు ♦ పరమచిత్తుండవు కుశలమే? మీయన్న♦కును వచింపు

తే. ను త్తలకు నింకనుం గల్గు♦నుత్తములకు
క్షేమమే గద? చక్కఁగా ♦ నేమి దాఁప
కుండ వీరవరా! తెల్పు ♦ మొగిఁ బురమున
జనపదంబున నెల్లర♦కును శుభంబె?. ౧౭ 2237

చ. అని యిటు పల్కి దేవతల ♦ నంజలినిం గొని వేఁడె; లక్ష్మణుం
డును జనకేంద్రపుత్రిక క♦డుఁ బచియించిన యర్థ మెన్ని యా
జనకజ కట్టె మ్రొక్కి తన♦స్వాంతము దూలుచునుండినన్ ముదం
బును గనినట్టు లెల్లరును ♦ మోదముతోఁ జెలువారువారలే. ౧౯ 2238

చ. అని వచియించి గోమతి మ♦హానదితీరముఁ జేరి యాశ్రమం
బున నివసించి యాదినముఁ ♦ బుచ్చి ప్రభాతమునందు లేచి సూ
తుని గని లక్ష్మణుం డనియెఁ ♦ దోడనె వాజులఁ గట్టి స్యందనం
బు నడుపు జాహ్నవీసలిల♦ముం దలఁ దాల్పఁగ నొప్పు నా కిఁకన్. ౨౦ 2239

క. గిరివరమగు హిమగిరిపైఁ, బరమేశుఁడు త్ర్యంబకుండు ♦ పావనగంగన్
శిరమున ధరించుచాడ్పునఁ, బరమప్రమదమునఁ దాల్తు ♦ భవహార మనుచున్.

క. అన విని సుమంత్రుఁ డతిజవ,మున మనమును మించు వాజి♦ముఖ్యంబులఁ గ
ట్టెను నాల్గింటిని నవ్వల, జనకజఁ గని దోసి లొగ్గి ♦ సాధ్వీమణిరో!. ౨౧

క. అరదము నారోహింపుము, పరమప్రసుఖంబు నిచ్చు ♦ పావనగంగం
ద్వరఁ జేరుద మన నామెయు, నరదము నతఁ డన్నయట్టు ♦ లారోహించెన్.

క. జనకకుమారిక లక్ష్మణుఁ, డనఘుండు సుమంత్రుఁ డట్టె ♦ యరదము నెక్కం
జనియె రథం బది; యాయత,సునయనయగు జనకరాజ♦సుతయునరుగుచున్.

క. ఏనోనాశిని గంగం, గానం ద్వాగపడెను చిత్త♦కంజముతోడం
దా నాదినార్ధ మేగిన, మానితభాగీరథియు న♦మానుషశక్తిన్. ౨౪ 2244

క. అలరారుచుండఁగను గాం,చె లక్ష్మణుఁడు జహ్నుతనయఁ ♦ జెచ్చెఱఁ గని భీ
తిలఁ జేయఁజాలు రవమున, విలాపమును జేసె సీత ♦ వింతగ నతనిన్. ౨౫

క. పరమాతురునిం గాంచుచుఁ, ద్వరపడి ధర్మజ్ఞ! యేప్పఁ♦డగు కారణముం
బరికింపఁ జాలఁ జెప్పుము, చిరాభిలషితంబు దేవ♦సిద్ధవినుతమున్. ౨౬ 2246

క. భాగీరథీజలంబగు, నీగంగాతీర మొంది ♦ యిటు లేడ్వంగా
నోగుణరత్నాకర! చెవు,మా! గల దేఁ గారణంబ ♦ టంచున్ మఱియున్. ౨౭

ఆ. నంతసంబుగల్గు ♦ సమయంబునన్ విషా
దమును గూర్చి దేల? ♦ త్వరగఁ జెవుమ
లక్ష్మణా! యటంచు ♦ లలన వచించుచు
మఱియుఁ బలికెఁ దనదు♦మఱఁదిఁ గూర్చి. ౨౮ 2248

క. అనయము రాముని పార్శ్వం,బున వర్తిలువాఁడ వీవు ♦ పురుషర్షభ! ని
న్ననఘుం డామహితాత్ముం, డనియెనొ యేమేని పలుకు ♦ మవ్విధ మెల్లన్.

తే. రెండుదినములనుండి యీ♦రీతిశోక
మందుచున్నాఁడ వేటికో ♦ యారఘుపతి

నాకుఁ బ్రాణాళికంటె నెం♦తయు నధికుఁడు
నేన వగనొందలేదుగా ♦ నీవు నిట్లు. ౨౮ 2250

క. బాలికుఁడవుగా నిటఁ గా, నేలా! గంగాతటంబు ♦ నిద్దాని సము
ల్లీలన్ దాఁటింపుము ముని,జాలంబులఁ జూపవయ్య ♦ చయ్యన నాకున్.

చ. మునులకు దివ్యవస్త్రముల ♦ ముఖ్యతరాభరణంబులన్ ముదం
బునను సుభక్తి నిచ్చి పద♦ముల్ తల సోఁకఁగ మ్రొక్కి మ్రొక్కి రే
యి నట వసించి పోవుద, మ♦హీనజవంబున నాయయోధ్యకున్
వినుము గుణాఢ్య! నామనము ♦ వేడుక నొందెడుఁ జూడ రామునిన్. ౩౦

చ. సరసిజపత్రనేత్రు, ఘనుఁ ♦ జారుతరాంగుని సింహవక్షు భీ
కరరిపుకాలు మానిజన♦కమ్రహృదబ్జనివాసునిం గృశో
దరు నభిరాము రాము జన♦తాప్రియు వేగము చూడ నామనం
బురుతరమోదముం గనెడు ♦ నో రఘునందన! యంచుఁ బల్కినన్. ౩౧ 2253

చ. విని నయనంబులం గలిగి ♦ వింతలు గూర్చెడు నశ్రుబిందువుల్
గనఁబడకుండఁ జేసికొని ♦ క్రన్ననఁ బిల్చెను నావికాళి రా
మునిప్రియసోదరుండు రిపు♦మూర్తిలయాంతకుఁ; డంత నావికుల్
జనపతిపుత్ర! నౌక యిదె ♦ సర్వసుఖాకర మంచు నొప్పెదున్. ౩౨ 2254

క. అని దాశులు భయభక్తుల, వినిపించిరి చేతు లొగ్గి ♦ విమలతరతరం
గనిచయదుస్తరయౌ గం,గను దాఁటఁగ నౌక నెక్కి ♦ కడువడి దాఁటెన్.

నలువదియాఱవ సర్గము సంపూర్ణము.

## ౪౭ - వ సర్గము.

లక్ష్మణుఁడు దుఃఖించుచు సీతతో రామాజ్ఞను దెలుపుట.

సీ. అంతట విస్తీర్ణ♦మైన యానౌకను బోయవాండ్రెంతయుఁ ♦ బూన్కి దెచ్చి
చూపిన ముదమంది ♦ క్షోణీకుమారిక ముందుగ నెక్కించి ♦ యందుఁ దాను
సారథియును జక్కఁ ♦ గూరుచుండెను; శోకసంతప్తుఁ డౌచుల♦క్ష్మణుఁడు నడుపుఁ
డింక నౌక నటంచు ♦ నెల్లా యాజ్ఞాపించె; నవలియొడ్డునఁ జేర్చి;♦రంతవారు

తే. గంగ నివ్విధి దాఁటి య♦భంగశోక, మంత కంతకు నుప్పొంగ ♦ నవలియొడ్డు
నందుఁ దిగి చేతులొగ్గి బా♦ష్పావిలస్వ,రమున నిట్లని పల్కె రా♦మమహిషిఁ గని.

చ. మనమున భూరిశల్యమను ♦ మాడ్కిని నానతి యార్యుఁ డిచ్చె నో
జనకకుమారి! యయ్యదియు ♦ సంతత మేఁచెడు, నీనిమిత్తమై
జను లికఁ నన్నుఁ జెప్పకొనఁ ♦ జాలువిధంబు ధరిత్రిఁ గ్రమ్ము నే
మనఁగల నింతకంటె మృతి ♦ యన్నివిధంబుల శ్రేయమే యగున్. ౨ 2257

చ. మరణము దీనికంటెఁ గడు ♦ మంచి దటంచుఁ దలంతు నిట్టిదా
పరుషపుఁగృత్యమందు నర♦పాలుఁడు నన్ను నియుక్తుఁ జేసె న
వ్వరుసను లోకనిందితము ♦ భారము చెప్పఁగఁ గార్య మిద్ది యో
ధరణికుమారి! నాపయిని ♦ దప్పక సత్కృప నుంచుమా యిఁకన్. ౫ 225౯

క. మనమునఁ గోపముఁ బూనకు, మని యేడ్చుచు దోసిలొగ్గి♦యవనిం బడియెన్;
జనకజ సువ్రత యెంతయుఁ, గనుఁగవ బాష్పములు గ్రమ్మఁ♦గాఁ బ్రాంజలియై.

క. తనకున్ మరణముఁ గోరుచు, వినయమునన్ వేడువాని ♦ విహ్వలమతియై
కనుఁగొని యిట్లని పల్కెను;, మనమునకుం దెలియలేదు ♦ మాటయదేమో?.

క. తెలుపుము లక్ష్మణ! దాఁపక, గలవిలపాటొందు నిన్నుఁ ♦ గాంచిన నీకుం
గలుగదు స్వాస్థ్య మ్మని యిమ్ములఁ దోఁచెడు, క్షేమ మెట్లు ♦ భూపతి కలరున్.

క. అనియుం దోఁచెడు భూపతి, నిను నేమే శాప మిచ్చి ♦ నిందించెనె? యీ
వనటం గుందఁగ నేలా?, వినిపింపుము దాఁపకుండ ♦ వినుతౌఘహరా!. ౯

ఆ. ఆజ్ఞ చేయుదాన ♦ నన విని వైదేహిఁ, గాంచి దీనుఁడగుచుఁ ♦ గళవళించి
మోము వాంచి బాష్ప♦ముల భూమిఁ దడుపుచు, నిట్లుపలికెనో♦మహీశపత్ని!.

చ. జనకమహీశపుత్రి! పరి♦షత్ప్రతిభాషితమైన దుర్యశం
బును నతిదారుణంబు విని ♦ భూపతి నిన్ను గుఱించియే పురం
బున మఱి పల్లెలందు నది ♦ బోరన నిండెను; దాన నెమ్మనం
బునఁ బరితాప మంది ననుఁ ♦ బొమ్మని యానతి యిచ్చె నివ్విధిన్. ౧౧౪

*ఉ. ఆవచనంబు లన్నియు మ♦హాత్తరభేదము నీయఁ జాలెడుం
గావున నీదుసన్నిధిని ♦ గ్రమ్మఱఁ జెప్పఁగఁ జాల; వానినే
భూవిభుఁ డాత్మ నుంచుకొని ♦ పొంగునమర్షను బృత్తసీమనున్
దేవిరో! నిల్పెఁ; గాన నృప♦తిప్రవరుండును నిన్ దృజించెఁ జూ!. ౧౨౪ 2265

ఉ. ఇంచుకయేని దోష మెద ♦ నెంచిన నీయెడఁ గానరాదు ప్ర
పంచికనింద యిద్ది యిటు ♦ పర్వెను నంచు గ్రహింపు వేఱుగా
నెంచకు మాశ్రమాంతముల ♦ నీయెడ నిన్విడనాడి పోవనౌ
నంచితరాజశాసన మి♦దాఁగద దీనిని మాన నెట్టులౌ. ౧౮ 2266

తే. గర్భవతివిగఁ జూపట్టు ♦ క్ష్మాతనూజ
నిన్ను నిట డించి పోవంగ ♦ నేరకున్న
వాఁడ నైనను జాహ్నవీ♦వరతటమున
బ్రహ్మమానులదౌ తపో♦వనము చెలఁగు. ౧౫ 2267

చ. పరమపవిత్రమై మిగుల ♦ భవ్యములై తనరారు నద్ది శ్రీ
కరముగఁ జూడనౌను గను♦కన్ గ్రుధఁ బూనకు మాత్మలోన; నిం

---

* యాని రాజ్ఞా హృది న్యస్తా న్యమర్షః పృష్ఠతః కృతః-అనిమూ.

దరయఁగ మౌనివర్యుఁడు మ♦హాత్ముఁడు మత్పితృమిత్రుఁడుం జిరం
తరమహితాత్మకుండు గుణ♦ధన్యుఁడు కీర్తియుతుండు యోగియున్. ౧౬

క. కరుణానీరధియునునగు, తరుణీ! వాల్మీకి; దత్ప♦దచ్ఛాయను నీ
వురుసుఖము లొంది యుపవా,సరతిం గని నిశ్చలముగు♦స్వాంతము వెలయన్.

తే. ఇందు నివసింపు జానకీ! ♦ యేమిచింత
యును మనస్సునఁ బొందక ♦ మనుజపతిని
సతివి గావున మది నిల్పి ♦ సతము నిల్వ
మలరఁగలవు శ్రేయస్సు లో♦యంబ! నీకు. ౧౭ 2270

నలువదియేడవ సర్గము సంపూర్ణము

---

౪౮ - వ సర్గము.

లక్ష్మణుఁడు సీత నడవుల డించి దుఃఖించుచు మరల గంగానది దాఁటుట.

చ. అని యిటు లక్ష్మణుండు పరు♦షాకృతి నొప్పెడుపల్కు చెప్పఁగా
విని జనకాత్మజాత కడు ♦ విహ్వలచిత్తముతోడ నట్టి మే
దిని బడియెన్; ముహూర్త మిటు ♦ దీనత మైకొన నుండి మెల్లఁగా
మనమున సంజ్ఞ దోఁపఁగను ♦ మానిని బాష్పసమాకులాక్షియై. ౧ 2271

క. దీనయునయి లక్ష్మణుతో, జానకి యిట్లనియె; దుఃఖ♦సంతతి పొందం
గా నాతనువు సృజించె శ,తానందుం డోసుమిత్ర♦యనుఁగుఁగుమారా!. ౨

చ. కనుకనె నాకు దుఃఖములు ♦ గల్గుచు నున్నవి మీఁదమీఁద మే
దిని నిటువంటిపాపము మ♦దిం దలపోయ నొనర్చినట్టి యా
మనుజుని వింటిమే తనదు♦మానినిఁ బాసినవారు గల్గిరే;
వనితలలోన సాధ్వియును ♦ భవ్యయశంబును బొందు నేనునున్. ౩ 2273

ఆ. విడువఁబడితి నిపుడు ♦ విభుచేత నక్కటా!
మున్ను రాముపాద♦ములఁ గొలుచుచు
నాశ్రమమున నుంటి ♦ నైనను దుఃఖముల్
గలఁప వంత నొంది ♦ యలసితిఁ గద. ౪ 2274

క. జనవినుత! యట్టినే నీ, జనరహితస్థలి నదెట్లు ♦ చరియింతును? నా
మనమునఁ గల్గెడు దుఃఖం,బు నెవ్వరికిఁ జెప్పుకొనుదుఁ ♦ బోగు లడఁగంగన్.

క. మునులకు నేమని చెప్పుదు, ఘనపాపం బిద్ది యిట్లు♦గాఁ జెందె నటం
చును, నేపాప మొనర్చితి, జనపతి యేకారణమునఁ ♦ జయ్యన విడిచెన్. ౬

క. ధరణీశుఁ డతఁడు మహితుఁడు, నరగున నన్నేల విడువఁ ♦ జాలెనొ నే నీ
పరమనదీజలములు ని,త్తరుణంబున వదలిపెట్టు♦గానం దనువున్. ౭ 2277

తే. రాజవంశంబు చెడిపోవు; ♦ రామునకును
జాలదుష్కీర్తి గల్గు ల♦క్ష్మణ! వచింపు
మేమి చేయుదు నీయాజ్ఞ♦యే శరణము
*దుఃఖభాగిని నను వీడి ♦ దూర మరుగు. ౮౹ 2278

చ. జనపతియాజ్ఞపై నిలుపు ♦ స్వాంతము, నావచనంబుగాఁగ ని
ట్లనుము వినీత నత్తలకుఁ ♦ బ్రాంజలివై తలవంచి వందనం
బును బలుమాఱు చేసినటు ♦ పోయిన తోడనె పల్కు; క్షేమమున్
జనపతితోడఁ జెప్పుము వి♦శాలయశశ్శరదబ్జభానుగా!. ౧౦ 2279

తే. ఎల్లవారికి వందన ♦ మేను జేసి, నట్లు వచియింపు; ధర్మమం♦దభిరతుండు
పార్థివేంద్రుండు గాన నీ♦పలుకులెల్ల, నతనితోఁ జెప్పఁదగు; నిట్టు♦లనుమునీవు

క. పరిశుద్ధ యనుచు జానకి, నరయుము తత్త్వంబుఁ బరమ♦మా భక్తి నిరం
తరము భవద్ధిత మెన్నుచుఁ, జరణాబ్జము లాశ్రయించు♦చందము మదిలోన్.

క. తలపోయవయ్య! యయశం,బులకున్ భీతిల్లి నరుల♦పొందుఁ గనని యీ
యలఘువనంబులఁ ద్రోచితి, విలాధిపా! లోకనింద ♦ యిట్లు గలుగుటన్.

చ. వనములనుండఁ బంపు టిది ♦ స్వాంతమునం దలపోయ మంచిదే
యనఁదగు నీవు పల్కినది ♦ యంతయుఁ బథ్యమె, దుర్యశంబుఁ ద్రో
యను జనునంచు నేఁ దెలియు♦నట్లుగఁ జెప్పెదఁ గాని నాకు నీ
వె నిరతముం దలంపఁదగు ♦ దెల్లవిధంబుల దిక్కటం చొగిన్. ౧౩౹ 2283

తే. ధర్మమార్గంబుఁ దప్పని ♦ ధరణివిభుఁడు
చెప్పఁదగునట్లు నీవును ♦ జెప్పితి విభు
డన్న సోదరులందు నీ ♦ వున్నరీతి
పౌరులం దున్నఁదగు ధర్మ♦పరుఁడ వగుట. ౧౪౹ 2284

క. పరమం బగు నీధర్మ,స్థిరచిత్తం బిట్టి దగుటఁ ♦ జెందితివి మహీ
వర! సాధుయశంబును ను,ర్వరఁ బౌరుల ధర్మయుక్తిఁ ♦ బాలింపంగన్. ౧౫

క. జనపతికిం దగునట్లే, యొనరిచితివి దీని కేను ♦ నొందను వగ నా
తనువును లెక్కింపను నీ, జనాపవాదంబుఁ బెక్కు♦సారులు తలఁతున్. ౧౬

క. పతియే దైవము తలఁపఁగ, సతులకు గురుబంధువులనఁ ♦ జాలు నతండే
పతియే ప్రాణప్రియుఁడౌ, నతివలకుఁ దదాజ్ఞ చేయ♦నౌఁ దొలుతొలుతన్.

సీ. అని నాదునుడులుగా ♦ నాడుము విభుతోడ ననిపల్కి సతియుని♦ట్లనియెఁ నన్ను
గర్భిణి లక్ష్మణా! ♦ గనుఁగొన కీవు పో మ్మింటికి; నని యిట్టు ♦ లేడ్చి పల్క
జానకినిం గాంచి ♦ దీనచేతనుఁడయి తలయిల సోఁకంగఁ ♦ దాను మ్రొక్కి
లక్ష్మణుం డేమిప♦ల్కను జాలకుండి యింకొకసారి భక్తిమై ♦ నుర్వీతనయ

* త్యజ మాం దుఃఖభాగినీమ్-అనిమూ.

తే. కును బ్రదక్షిణవందన♦మును వగచుచు
నాచరించి మహాధ్వని ♦ యట్టి పర్వ
నేడ్చుచు ముహూర్త మట్లుండి ♦ యిట్టు లనియెఁ
బరమకళ్యాణి! యేమేనిఁ ♦ బల్కులున్న. ౨౦౫ 2288

క. పలుకుము నీరూపము నో,యలఘుగుణాఢ్యా! *యదెప్పు♦డైనను గనఁగాఁ
దలఁపంగ లేదు యుష్మ,ద్విలసితతనువల్లి నీదు♦విశాలపదములన్. ౨౧ 2289

క. కనినాఁడ; రాము వీడిన, నిను వనమున నుంచ నెట్లు ♦ నేఁ జూతు సతీ!
యని పల్కి వందనం బిడి, చన నుద్దేశించి సీత♦చరణాబ్జములన్. ౨౨ 2290

క. మనమున నెన్నుచు నావను, దనసారథితోడ నెక్కెఁ; ♦ దర్వర నావికుఁ డా
తనిఁ జేర్చె నవలియొడ్డును, జనకజ యున్నట్టిచోటుఁ ♦ జక్కఁగఁ గనుమన్. ౨౩

ఆ. మదిని శోకభార ♦ మదయతఁ దనునొంప, మూర్ఛపోల్కి దుఃఖ♦మున రథంబు
నెట్లొ యెక్కి వేగ ♦ యేగుచుఁ బలుమాఱు లట్టె మరలిమరలి♦యూ మెఁగనుచు.

క. జనకజ యిట్టు లనాథగ, వనములలోనుండఁ దగునె? ♦ వనటం గనుచున్
అని పలవించుచు నవ్వల, వనటం బడి పొరలుచున్న ♦ వసుమతికన్యన్. ౨౪౫

క. కని పరతీరంబున రా,మునితమ్ముం డేడ్పుతోడఁ ♦ బోయె, నచట స్యం
దన మిటు దూరముగాఁ బో,యినఁ గనుచు సుమిత్రతనయు♦హితగుణనిలయున్.

సీ. పలుమాఱు స్యందన♦పద్ధతిఁ జూడంగ నుద్విగ్నయైన యా♦యుర్వితనయ
మనమున శోకంబు ♦ మైకొనె; నంతట వ్యథ యెంతొ భారమై ♦ యట్టి పర్వ
నేడ్చుచు నాసాధ్వి ♦ హాకయశోరాజిత తనభర్తఁ గనక యిం♦తటఁ ద్యజింప
నౌను బ్రాణాళి సం♦చని లోఁ దలంచుచు సాధుమయూరని♦స్వనము లెవుడు

తే. వినఁగఁబడుచున్న కానలో ♦ జను లెవరును
గానరామిని దుఃఖంబు ♦ క్రమ్ముకొనఁగ
నింక నాగతి యేమని ♦ యెలుఁగుమిగుల
నార్తియై నేడ్చె జానకి ♦ యాతురమున. ౨౬ 2295

నలువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౪౯ - సర్గము.

వాల్మీకిముని సీతను దనయాశ్రమమునకుం దోడ్కొని చని యాదరించుట.

చ. జనకజ యేడ్చుచుండ విని ♦ సంయమిపుత్రకు లాతురంబునం
జని భగవంతు వాల్మికిని ♦ సాధుమనస్కుని నత్తపోరతిం
గనిన మహాత్ముఁ గాంచి తమ♦కంబున వందన మాచరించి యా
వనమునఁ దారు చూచినది ♦ వారక తెల్పిరి దీనచిత్తులై. ౧౫ 2296

* దృష్టపూర్వం న తే రూపం పాదౌ దృష్టౌ మయా నఘే-అనిమూ.

క. మునివర్యా! రోదనని,స్వన మొక్కఁడు వినఁగవచ్చెఁ ♦ జయ్యన మేముం
జని కంటి మామెఁ బూర్వం,బునఁజూచియువినియు నెఱుఁగ ♦ మునిజంబదియా.

తే. ఏమహాత్ముని భార్యయో ♦ యింతిమిన్న
భార్గవిం బోలియున్నది ♦ భాసురాంగి
యయ్యొ వికృతాస్యయై భీతి ♦ నందినట్లు
లేడ్చుచున్నది భగవంత! ♦ యేమొకాని. ౩ 2298

క. వనితామణి నామెను జ,క్కనికరుణం గావవయ్య ♦ కాంతామణి భూ
మిని బడియె దివమునుండియె, యని తలఁచెద మేము గంగ ♦ యంతికసీమన్.

క. వరనారి యార్త దుఃఖా,తురయై యున్నయది; మేము ♦ తొయ్యలియేడ్పుం
బరికించి పోయి చూచితి, ముగుశోకసంతాపయయి ♦ యొక్కతె యచటన్.

*సీ. దుఃఖశోకములఁ ♦ దోయజాక్షి యవస్థ యయ్యెనుదీనయై ♦ యటవి నొకతె
దిక్కులేనట్టిదా ♦ తెఱఁగున నేడ్చెను; నామెమర్త్యాంగన ♦ యానని మదిఁ
దోఁపకున్నది కానఁ ♦ దోడనె సత్కారమునఁ దన్పఁదగు మాని♦వినుత! యామె
మనయాశ్రమమ్ముచెం♦తనె మిమ్ము దిక్కని నమ్మియున్నది రక్ష♦ణంబుచేయు

తే. వారిఁ గోరెడు నాసాధ్వి ♦ నైళను చని
కావఁదగు నన్న శిష్యుల♦పావనోక్తు
లాలకించి స్వబుద్ధి న♦ట్లరసి ధర్మ
విద్వరుఁడు జ్ఞానచక్షుస్సు ♦ విమలమతియు. ౬ 2301

క. కరుణావార్ధియునగు నా,వరముని యాతుణను పరుగు♦వారెఁ దరుణి యే
ధరణి వసించెనో యచటికిఁ, బరుగిడి రామాని వెంట ♦ వటువులు కడఁకన్. ౭

క. ఘనమతి వాల్మీకి యాస్థల,మునకుం జని నియతిఁ బాద♦ములు గడుగుకొనం
గను దగిన యర్ఘ్యమును గై,కొని జాహ్నవిస్తటమున♦కుం జని యచటన్.

చ. కనుఁగొనె నచ్చటన్ జనక♦కన్యను రామునిసత్కళత్రమున్
మునిపతి దీనయై వగచు ♦ ముగ్ధ యనాథయునైన సాధ్వి సీ
తను వగపెల్లిదంబున ని♦తాంతము చిక్కినదాని, నంత ని
ట్లనియె మనోజ్ఞవాక్కులను ♦ నాహరిణాక్షిని గాంచి మెల్లఁగన్. ౧౦ 2304

క. తనతేజంబున మోదం,బును గనఁజేసెదు ప్రయత్న♦మున; నోసాధ్వీ!
జలనాథుఁడైన దశరథు,ననుంగుఁగోడలవు గాదె ♦ యారఘుపతికిన్. ౧౧

ఆ. నీవు ధర్మపత్ని ♦ వావరజ్ఞానియా,జనకధరణిపతికిఁ ♦ దనయవు గద?
స్వాగతంబు నీకు ♦ నోగజగామినీ!, సాధ్వి! యోగదృష్టి♦శక్తిచేత. ౧౨ 2306

క. నీవిటకు వచ్చువిధమును, బావనమతి నీ వటంచు ♦ భావించితి ని
న్నీవనికిఁ బంపు టెందుల, కోవారిజనేత్ర! తెలిసె ♦ నొగి మన్మతికిన్. ౧౩

---

* అనర్హా దుఃఖశోకాభ్యామ్-అనియూ.

క. తెలిసెను దత్త్వం బెల్లను, జలజాక్షీ! ముజ్జగముల ♦ జరగువిధము నేఁ
దెలియుదు జ్ఞానంబున నేఁ, బలికెద నొకవాక్య మిపుడు ♦ పావనశీలా! ౧౩½

తే. సత్తపోలబ్ధచక్షున్న♦శక్తిచేత
నిన్ను ననఘాత్మగా మది ♦ నెన్నినాఁడ
నమ్ము నా మాట మైథిలీ! ♦ నాదుచెంతఁ
జక్క నివసింపుమా మన♦శ్శాంతి వెలయ. ౧౪½ 2309

సీ. నాయాశ్రమమున క♦నతిదూరమున మునిపత్నులు దపమును ♦ బరమనియతిఁ
జేయుచునున్నారు ♦ సీతా! నినుఁ వారు తమపుత్రికను బోలె ♦ మమతమీఱఁ
బోషించుచుందురు ♦ పోవిడు చింతల నిదె యర్ఘ్య మిచ్చెద ♦ నిపుడు గొనుమ
విస్రబ్ధవై మది ♦ విగతజ్వరవునయి నీయిల్లుగాఁ దల♦పోయుచు నిట

తే. నిర్విషాదంబున న్నివు ♦ నిల్వు మించు
కంతయైనను గొపంబు ♦ నందవలదు
నాఁగ వాల్మీకిమునివచ♦నములను విని
పరమసంతోషమును బొంది ♦ ధరణిపుత్రి. ౧౬ 2310

క. చరణంబులు భక్తిని దన, శిరసుసోఁకంగ మ్రొక్కి ♦ చేతులు జోడిం
చి రయంబునఁ బల్కెను మీ,పరిసరమున నుందు ననుచు ♦ భావము పొంగన్.

క. విని మౌని ముందు నరుగఁగ, జనకజ వెనువెంటఁ దాను♦జనియె; మునివరున్
జనకసుతాయుతు నెంతయుఁ, గని మునిపత్నులును మోద♦కలితాత్మలతోన్.

ఉ. చెంతకు వచ్చి యిట్లనిరి ♦ చేరితి రెంతయొ కాలమాయె మీ
రింతకు వచ్చుటే శుభము ♦ లెంతయు నబ్బెను స్వాగతంబు, మీ
కెంతయు భక్తి నిచ్చెద మ♦హీనతపోనియుతా! మునీంద్ర! మే
మింతటఁ జేయనైన పని ♦ యేమొ యెఱుంగఁగఁ జెప్పుఁడీ యనన్. ౨౦

చ. విని ముదమంది వాల్మికియు ♦ వింతగ నిట్లని పల్కె; సీత యీ
జనవిభుఁడైన రాఘవుని♦సాధ్వి యటం జనుదెంచె నీమెయే
యనుపమ తేజుఁడౌ దశర♦థావనిపాలునికోడలౌ విదే
హనృపతిపుత్రికామణియు ♦ నౌ నియతవ్రత పుణ్యశీలయున్. ౨౧ 2314

క. ఏపాపం బెఱుఁగదు సతి, యీపడఁతిం బతి త్యజించె ♦ నిఁక నీయడవిన్
గాపాడవలయుఁ గాదే, యేపగిదిగనైనఁ గాన ♦ నీపనిఁ గొంటిన్. ౨౨ 2315

క. నినుఁడీ యీమెను స్నేహం,బున మీరెల్లగను నేనుఁ ♦ బూనితి నని యీ
పని సాగవలయు నని ప్రే,మను సాయ మొనర్పవలయు ♦ మానిని గావన్.

క. మీరెల్ల నాకు మిక్కిలి, గౌరవమును నలరఁజేయఁ♦గాఁ దగుదురటం
చీరీతిఁ బల్కి పలుమఱు, శ్రీరామునిపత్ని నిల్పి ♦ చెందినవేడ్కన్. ౨౩ 2317

క. అతులయశుఁడైన యమ్మునిపతి తనయాశ్రమముఁ జేరె ♦ వటువులతోడన్
క్షితితనయ యాతపస్వినులతిశయమోదమునఁ జూడ ♦ నందుండెఁ దమిన్.

నలుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౫౦ - వ సర్గము.

—సీతకై వగచులక్ష్మణుని సుమంత్రుఁ డూఱడించి పూర్వవృత్తాంతమును చెప్పుట.—

చ. సురనది దాఁటి లక్ష్మణుఁడు ♦ క్షోణికుమారిక యాశ్రయంబు నా
తురయయి చొచ్చు టారసి వి♦ధుంతుదదుఃఖముచేత స్వాంత మె
వ్వరునను జూచినన్ వ్యథను ♦ బర్వి కృశించుటఁ జంచలించె; న
త్తరుణమునందు సారథి ను♦దారమునన్ సుమంత్రు ధీరునిన్. ౧౪ 2319

*చ. కనుఁగొని యిట్లు పల్కె జన♦కక్షితినాథకన్యకవంకఁ గల్గుచిం
తను రఘురాముఁ డెట్లడలి ♦ తాఁ జలియించెనొ చూడు సారథీ!
విను మిఁక దీనికంటె మది ♦ వేఁచెడు దుఃఖ మొకండు రామచం
ద్రునకును గల్గఁబోదు గద ♦ తోయరుహానన సత్యశీలయున్. ౨౪ 2320

తే. జ్ఞానవిదుఁడైన జనకుఁడన్ ♦ క్ష్మాపతీంద్రు
తనయ సద్గుణమణియయి ♦ తనరు సీత;
యామె విడనాడె నీచింత ♦ కధికమైన
చింత యొక్కటి గల్గునే ♦ క్షితిపమణికి. 3 2321

సీ. జానకి నెడఁబాయుఁ ♦ జాలఁ డెన్నఁటికైన నాయన్న యని మది ♦ నమ్మియుంటి
నెడఁబాపె నీనాఁటి ♦ కెన్నఁడుఁ గూడని పగిది దైవము; దీని ♦ బాగుగ మదిఁ
దలపోయఁగా దైవ♦తంత్రమే బలవత్తర మటంచుఁ దోఁచె సా♦రథివరేణ్య!
సురలను గంధర్వ♦వరులను రక్కసులను దానవుల నెవ్వఁ ♦ డనిని మించి
తే. పోలియఁ జేయంగఁ జాలునో ♦ భూవుఁ డతఁడు
దైవమును మించఁ జాలక ♦ యీవిధమునఁ
గార్య మొనరించె; మును దండ♦కావనంబు
నందుఁ బదునాలు గబ్దంబు ♦ లార్తుఁ డగుచు. ౫౪ 2322

క. జనకాజ్ఞ నిలిచె దారుణవన మది విజనంబు సుమ్ము ♦ వసుమతితనయన్
వని నుండఁ బంపె నేఁ డిటు, జనపతి కిదె దీర్ఘరాని ♦ సంతాప మగున్. ౬౪

క. దానిని మించిన దిదియౌ, జానపదులు పౌరు లిట్టి♦చందంబున నే
మేని పలుకంగ నమ్ముట, యౌ నిద్ధి నృశంస మీవె ♦ యరయుము మదిలోన్. ౭

---

* దృష్ట్వా తు మైథిలీం సీతా మాశ్రమం స ప్రవేశితామ్-అనియూ. దీనిచేత లక్ష్మణుఁడు కొంతదూరముపోయి యట నిలిచి సీత యాచోటు వాసి ఋషితోఁగూడి పోవుచుండఁగాఁ జూచె నని గ్రహింపఁదగు.

చ అనిశము హీనమై తనరు♦నర్థముఁ బల్కెడు పౌరు లెట్లు చె
ప్పిన నటు చేసె భూవిభుఁడు ♦ పృథ్వి యశోహర మిద్ది సారథీ!
వనమున నుంచెఁ గాదె సతి ♦ వాసవుపత్నిని బోలు సీత నే
జనుఁ డిఁక ధర్మమార్గమును ♦ జానుగఁ బూనిక నాశ్రయించెదుర్. ౮ 2825

క. జనపతి కిదియే ధర్మం, బని తోఁచెనొ; యనుచుఁ బల్కు ♦ నాలక్ష్మణుఁ గాం
చి నియతి నాతనినుడులర్, విని ప్రాజ్ఞుఁడు సారథియును ♦ విమలమననుఁడుర్.

తే. పూర్వవృత్తాంతవిదుఁడునై ♦ పొలుచు నాసు
మంత్రుఁ డిట్లని పల్కె ల♦క్ష్మణ! జనకజఁ
గూర్చి సంతాపమును బొంద♦కుము తెలిపెద
వినుము కారణ మిద్దాని ♦ కని తగంగ. ౧౦ 2827

క. మీతండ్రి మ్రోల నొకపరి, ధాతకు సరిపోలు విప్ర♦తల్లజు లని రో
ఖ్యాతయశోరాజిత! యీ,సీతాపతి రామమూర్తి ♦ క్షితి ననముండై. ౧౦౪

క. తనరారియు దుఃఖములనె, యనిశము పొందంగఁ గల్గు ♦ నల్పవిభవ మీ
తనికిం గల్గును ధ్రువ మిది, విను గురుబాహూ! గుణైక♦విఖ్యాతుఁ డగుర్.

క. తనమిత్రుల నెడఁబాయును, జనకజనుం బాయు భరత♦శత్రుఘ్నులఁ బా
యును లక్ష్మణు నెడఁబాయును, ఘనుఁడగు రాముండు చాల♦కాలంబునకుర్.

తే. ఇట్టి కృత్యంబులను జేయు ♦ నిద్ధయశముఁ
గాంచునని పల్కె; రిట్టివా♦క్యమును వినిన
దశరథావనిపాలుండు ♦ తాను వినియు
ననుఁ గనుంగొని యిట్లని♦యెను, మహాత్మ!. ౧౨ 2331

క. పలుకకుమా! యీవిప్రుల, పలుకులు లక్ష్మణునితోడ ♦ భరతునితో ని
మ్ముల శత్రుఘ్నునితో నని, పలికెర్, దుర్వాసువాక్య♦పద్ధతిఁ గొనుచుర్.

క. నే నొకఁడఁ గాదు పౌరులు, మౌనీంద్రుండౌ వసిష్ఠ♦మంత్రివరుండుర్
భూనాథుఁడు నుండెడుతఱి, భూనిర్జరమౌని పల్కె ♦ బుధనుతచరితా!.

చ. జనపతి మౌనివాక్యమును ♦ జక్కఁగఁ దా విని నన్నుఁ జూచి యి
ట్లనియెను సూత! యీవచన♦మం దొకయింతయునైనఁ బల్కఁగాఁ
జనదు మఱెచ్చటర్, బలుకఁ ♦ జాలుదువే నపకారమౌను జు
మ్మనియెను; భూమిపాలకుని♦యాజ్ఞ శిరంబునఁ దాల్చి నేనుర్. ౧౫ 2334

ఆ. ఎవరితోడఁ గాని ♦ యీమాట పల్కక, యుంటి నామనమున ♦ నుర్విసురుల
పలుకు వ్యర్థమౌనె ♦ పరికింప ననియెంచి, యూరకుండినాఁడ ♦ నోగుణాఢ్య!.

సీ. సౌమ్య! లక్ష్మణ! వాక్య♦జాలమియ్యదినీకుఁ దెలుపంగఁ దగదైనఁ♦దెల్పినాఁడ
వినుటకు శ్రద్ధ నీ♦మనమునఁ గలదేని వినవయ్య తెల్పెద ♦ విభుఁడు నాకు
నొకరహస్యముఁ జెప్పెఁ ♦ బ్రకటింపరాదని నియమంబు బొనర్చెను♦నేను దానిఁ
దెల్పెద; విధి దుర♦తిక్రమం బౌఁగద యీదుఃఖ మీశోక ♦ మిట్లు గల్గఁ

ఆ. దగినకారణంబు ♦ దాత్పర్య మేపారఁ, దెలుపువాఁడ సోద♦రులకు దానిఁ
జెప్పకుండవలయు ♦ నెప్పగిది నటన్న, నతనిపల్కు విని త♦దర్థ మెన్ని. ౧౯
క. పలుకు మదెవ్వరితో నేఁ, బలుకను జుము నమ్ము మనఁగఁ ♦ బరిపంథిగణం
బులకుం గాలుండగు నుజ్జ్వలతేజుని కతని కిట్లు ♦ పలికె నయమునన్. ౨౦

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౫౧ - వ సర్గము.

{ సుమంత్రుఁడు లక్ష్మణుని భృగుశాపంబున రాముఁడు సీతను వదలె నని పల్కి యూఱడించుట. }

క. సూతుఁడును సుమిత్రాతనూ,జాతుం డిటు పల్కి నతని♦స్వాంతము సత్య
ఖ్యాతంబని యెన్ని ముని,వ్రాతేరితవాక్య మిట్లు ♦ పల్కెఁ దెలియఁగన్. ౧
క. మును దుర్వాసుం డనఁగా, మునిపతి యొకఁ డలరు నత్రి♦మునిపుత్రుఁ డతం
డనుపమతేజుండు వసి,ష్ఠుని పుణ్యాశ్రమమునందుఁ ♦ జొక్కపునియతిన్. ౧½
తే. వానకాలంబునందు నె♦వ్వరుననైన
యతులు దిరుగఁగరా దట్టు ♦ లౌట నట్టి
వ్రతము వార్షిక్యమును దాని ♦ జతన మొప్పఁ
జేయఁగాఁ బూని యందు వ♦సించె నియతి. ౨ 2340
క. ఘనయశుఁడు నీదుజనకుం, డనుపమతేజుఁడు మహాత్ముఁ♦డైన వసిష్ఠుం
గనఁ గోరి తానె యచటికిఁ, జనియె; నటన్ బద్మమిత్ర♦సంకాశుండై. ౩
క. అనలుఁడు మండెడుచాడ్పునఁ, దనతేజము ప్రజ్వరిల్లఁ ♦ దగువాని వసి
ష్ఠుని నుపవిష్టుని నాతని,కిని వార్శ్వమునందు నట్టి♦క్షితిసురమానిన్. ౪ 2342
క. కని యామానియుగంబున,కును వందన మొప్పఁ జేసి ♦ కోరిక ఫలియిం
చినమాడ్కి నుండె వారును, జనపతిఁ బూజించి యతుల♦సంతోషమునన్. ౫
ఆ. స్వాగతంబు పల్కి ♦ యాసన మర్పించి
పాద్య మొసఁగి మూల♦ఫలములుఖములు
నలరఁ జేసి; రంత ♦ నమ్మానివరులతో
నిష్టకథలఁ గడపె ♦ నింతసేపు ౬ 2344
క. సరసిజమిత్రుం డభ్రాం,తరమునకుం జనినదనుకఁ ♦ దత్కథ లెల్లన్
జరగె నొకగాథ చెప్పెదు, తరుణంబున నీదుతండ్రి ♦ తగువినయమునన్. ౭
క. కరములు మోడిచి యలభూ,సురమానివతంసు నత్రి♦సుతు దుర్వాసున్
వరమతిఁ గని యిట్లనియెన్, బరమతపోరాశి వీవు ♦ పరికింపంగన్. ౭½ 2346
ఆ. ఎంతవఱకు సాగు ♦ నీమత్కులం బింక, నాయు వెంతనాదు♦నగ్రజునకు
మిగిలినట్టిసుతుల♦మితియాయువును నెంత, రామునకుఁ దనూజ♦రత్నములును.

క. కలుగుదురే యాయువు వా,రల కెంత? కృపన్ వచింపు ♦ రానున్న దదె
ట్టులొ నావంశపుగాథల, నిల నెందాఁకను వసించు ♦ నీకుల మనఘా!. ౯

క. అనిపల్కు నృపతివర్యునిఁ, గని యాతనిప్రశ్న మెన్ని ♦ కమనీయరుచిన్
దనరారెడుదుర్వాసుం, డనునయ మొప్పార నిట్టు ♦ లనియె క్షితిపుతోన్. ౧౦

మ. విను రాజేంద్ర! వచింతుఁ బూర్వయుగస ♦ ద్వృత్తాంత మొక్కప్పు డా
దనుజామర్త్యుల కయ్యె సంగరము దు ♦ ర్దాంతంబుగా నందు నా
దనుజుల్ దేవత లేచి దోర్బలమునన్ ♦ దమ్మున్ వధింపంగఁ జ
య్యన నార్తిన్ భృగుపత్నిఁ జేరఁ జని పు ♦ త్రాళిన్ దయన్ గావుమా. ౧౧

చ. అని యభయంబు వేఁడ భయ ♦ మందకుఁ డంచు సురారిభీతి మా
న్పిన నట నిర్భయుంబుగను ♦ నిల్చిరి వారలు, మౌనిపత్ని యా
దనుజులఁ గావఁ బూనుటను ♦ దా సురవర్యులచే నెఱింగి యా
వనరుహలోచనుండు సుర ♦ వర్యవిభుండు మహోగ్రహంబునన్. ౧౨ 2351

క. సునిశితచక్రంబున నా, మునిపత్నిశిరంబుఁ ద్రుంచె ♦ భూరిక్రుధ నా
మునిపతి పత్నివధంబును, గని భృగుకులసద్యశంబుఁ ♦ గాచెడుకడఁకన్. ౧౩

క. త్వరపడి రిపువంశార్దను, హరినిన్ శపియించె; నోజ ♦ నార్దన! నానుం
దరిఁ జంపఁదగని దానిని, ఖరతరచక్రైకధార ♦ గర్వము పొంగన్. ౧౪ 2353

తే. క్రోధమూర్ఛితుఁడ వగుచుఁ ♦ గూల్చినావు
గాదె? యాకారణంబున ♦ క్ష్మాస్థలమున
జనన మందుము; మఱియు నీ ♦ వు నట భార్య
విడిచి తద్దుఃఖమును జాలఁ ♦ గుడువఁ గలవు. ౧౫ 2354

క. చిరకాల మట్టులుండుము, మురహర! యని శాపమిచ్చి ♦ ముని యంతట శ్రీ
వరు శక్తి నెన్ని శాపముఁ, బరుషంబుగ నిచ్చితినని ♦ భావించి మదిన్. ౧౬

చ. మునిపతి దేవదేవుని వి ♦ భున్ బరమేశ్వరు భక్తిమీఱఁ జ
క్కనివిధి నర్చనాభిరతిఁ ♦ గమ్రమనస్కునిఁ జేసెఁ; జక్రి యా
తనిదగుపూజకున్ మది ము ♦ దంబును బొంది వచించె, నిట్టు లో
మునివర! లోకరక్షణముఁ ♦ బూని యొసంగితి వీవు శాపమున్. ౧౭ 2356

ఆ. నే గ్రహించినాఁడ ♦ నీ విచ్చినట్టి యా,శాపము; నన మౌని ♦ చక్రి కిడితిఁ
గాదె శాపమనుచుఁ ♦ గడు మూఢతను గాంచి, కదలకుండె సంజ్ఞఁ ♦ గానసట్లు.

క. [హరి కిచ్చినశాపము ని,ర్భరమగు చీఁకటిగఁ దోఁప ♦ బరమర్షి యు నా
కరణిన యుండెను, మౌనీ,శ్వరు లేడ్వగ భృగుని గాంచి ♦ సాంద్రకరుణచేన్.

క. అతని విసంజ్ఞన్ బాపిరి, గతశాపార్తుండు మౌని ♦ శాంతుం డంతన్
క్షితిసురమౌనుల వారల, నతిభక్తిని బూజచేసి ♦ యనియెం గడఁకన్. ౨౦

క. ననుఁ గావుఁడు శాపానల,మున ముంచితి విష్ణుమూర్తి ♦ బుధనుతుఁ దద్బా
ధను గంటి దానిఁ బాపుం, డన నాతనివాక్యము విని ♦ యమ్మునివర్యుల్. ౨౩

చ. హరుఁడు విరించి శక్రముఖు ♦ లా మహనీయుని సన్నుతింతు రా
మురహరు నాదిపూరుషుని ♦ మోదమనస్కుని సన్నుతింపు మో
వరముని! యన్నఁ దద్వచన♦భంగిని జక్రి నుతించె నమ్మునీ
శ్వరనుతుఁడై రమాధిపతి ♦ వచ్చెను వేగమ మౌనిచెంతకున్. ౨౪ 2361

[1]చ. వనరుహనేత్రుశాపమున ♦ బాధితుఁడై మునిపూజ చేసె నా
మునిఁ గని ప్రీతిమీఱ భయ♦ముం గనఁ బోకు మునీంద్ర! శాపముం
గొనియెద సూనృతం బిది య♦గున్ ద్విజవాక్యము గాన నంచు నా
తనికిని శాపసంగతిని ♦ దాపము పొందకయుండఁ జేయుచున్. ౨౫ 2362

తే. మునిపుశాపంబు గ్రహియించె ♦ ముజ్జగముల
శార్తిఁ బాపెడునది యని;] ♦ యవనినాథ!
యిట్లు హరి భృగుశాపంబు ♦ నిద్ధతేజుఁ
డయ్యుఁ బ్రాగ్జన్మమున నొందె ♦ నందుచేత. ౨౬ 2363

క. తనయుండై నీయింటన్, జనియించెన్ రాముఁ డనఁగ ♦ జగముల మూఁటన్
గనియెన్ బ్రతిష్ఠ శాపము,నను గనఁదగుఫలము నీత♦నయుఁడుగను నృపా!.

తే. పాలకుండయి రాముండు ♦ చాలకాల
మేలుఁ జూ యీయయోధ్యను ♦ నింతిఁ బాసి
చాలకాలంబు గడపును ♦ సకలసుఖస
మృద్ధులం గాంచి సోదరు ♦ లెల్ల నలర. ౨౮ 2365

క. పదివేల యేండ్లు నాపైఁ, బదినూఱులు రాజ్య మేలి ♦ పరముంబగు స
త్పదమున్ వైకుంఠంబును, సదయుఁడు చేరంగఁ గలఁడు ♦ క్ష్మాపతివర్యా!. 30

క. జననాథ! రామచంద్రుం, డనుపమదక్షిణలతోడ ♦ హయమేధములం
బొనరుచు రాజకులంబుల, ననువొందఁగ నిల్పు ధరణి♦యందుఁ గడంకన్.

[2]క. తనయుల నిర్వురఁ గాంచును, జనకజయగు సీతయందు ♦ సంతతి యదియున్
జనియించు వేఱుతావున, నని సమ్మ మయోధ్యయందు ♦ నది గల్గదు సూ!

క. జనకజతనయుల రాఘవుఁ, డనూనసంపదలతోడ ♦ నలరున యోధ్యం
దనివొంది పట్టభద్రుల, నొనరించు నటంచు; నిట్లు ♦ లోసౌమిత్రీ!. 33 2369

క. నిరుపమతేజుండు మునీశ్వరుఁ డాదుర్వాసుఁ డిట్లు ♦ వంశచరిత మా
దరమున గతాగతంబును, ధరణీశున కట్లు పల్కెఁ; ♦ దగుపద్ధతిచేన్. 34

1 వనరుహనేత్రుశాపమున=అనఁగా విష్ణువున కిచ్చినశాపముచేత నని యర్థము గ్రహింపవలయు. 2 ద్వౌ తు పుత్రౌ భవిష్యేతే సీతాయాం రాఘవస్య తు, అన్యత్ర న త్వయోధ్యాయాం సత్య మేత న్నసంశయః-అనిమూ.

చ. మునిపతి యిట్లు చెప్పి ముని♦ముఖ్యు వసిష్ఠుని గూడి యుండె; నీ
జనకుఁడు మౌనినాయకుల ♦ సంతస మొప్పఁగఁ బూజఁ జేసి వం
దనము లొనర్చి దీవనలఁ ♦ దాఁ గొని వేగ నయోధ్యఁ జేరె; గా
థను మునినాయకేరితముఁ ♦ దత్పరతన్ విని నాఁడ నప్పుడే. ౩౫౧ 2371

ఆ. వార్త యిద్ది మౌని♦వర్యసంప్రోక్తంబు, తప్పకుండ సాగు; ♦ దాని మదిని
నిలిపి యున్నవాఁడ ♦ నే నింతవనుక; ని,ల్లాటఁ దాప మంద ♦ నౌనె? నీకు

క. జనకజను రాఘవుని గూ,ర్చిన చింతను మదిని నీవు ♦ చేర్పక ధృతరీ
తిని వెలయవయ్య రాఘవ!, యనుచు సుమంత్రుండు పలుకు♦నవాక్యములన్.

క. విని పరమాద్భుత మిదియౌ, నని సంతోషంబు నొంది ♦ యగు మేత్తెలం
చు నతఁడు వచింప రథ మొ,య్యన సాగఁగ నస్తమించె ♦ నర్కుం డంతన్.

తే. అంత నానూతలక్ష్మణు ♦ లందు నున్న
కేశిని యనంగఁ దగు నేటి♦కెలన నిలిచి
యెట్లొ యారేయినిం బుచ్చి ♦ రెదనఁ బొదలు
నధికచింతల వేఁగుచు ♦ నార్తిఁ గనిరి. ౪౦ 2375

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౫౨ - వ సర్గము.

లక్ష్మణుఁడు సీతను వాల్మీకిమునిపర్ణశాలయందు విడిచినవార్త రామునకుం జెప్పుట.

సీ. ఆ కేశినీతీర♦మందు రాత్రిని బుచ్చి తెల్లవాఱఁగ వార ♦ లల్లనల్లఁ
బయనమై పోయి; రా♦పగిదిఁ బోవఁగ నర్ధదివసంబు గడువ నా♦ధీరవరుఁడు
రత్నసంపూర్ణమై ♦ రాజిల్లెడు నయోధ్య నలరుజనాళి ను♦జ్జ్వలమునైన
దానిఁ బ్రవేశించె; ♦ దీనుఁడై సౌమిత్రి మతిమంతుఁడయ్యు రా♦ముజనవిభుని

తే. పాదపద్మములకు మ్రొక్కి ♦ పలుకువాఁడఁ
బోయివచ్చినవార్తల ♦ భూమితనయ
చింత లిట్టివటంచు నేఁ ♦ జెప్పవాఁడ
ననుచు నీరీతిఁ దలఁచుచు ♦ నరిగి యతఁడు. ౩ 2376

క. అనుపమశశిబింబమె యిది, యన నొప్పెడు రామసౌధ ♦ మంతట నెదుటం
గనఁబడ ద్వారముకడ స్యం,దనమును దిగి దీనుఁడయి మ♦నంబు గలంగన్.

క. *ధరణిం జూచుచుఁ జొచ్చెను;, బరిజను లెవ్వార లతని ♦ వలదనక మహో
త్తరమును బొందిరి వగచేఁ, ద్వరగా లక్ష్మణుఁడు రామ♦ధరణీకాంతున్. ౫

క. కనియె నతండును దీనుఁడు, జనకసుతారతుఁడు నగుచు♦స్వాంతము దూలం
గను దెలివొందక యుండెను, దనయాసనమందు నశ్రు♦ధారలు జాఱన్.

---

* అవాఙ్ముఖో దీనమనాః ప్రవివేశానివారితః-అనిమూ.

చ. కని యిటు లక్ష్మణుండు పద♦కంజము లాత్మశిరంబు సోఁక వం
దన మొనరించి తొట్రిలుచు ♦ దైన్యము తోఁపఁగఁ జేతు లొగ్గి యి
ట్లనియె సమాహితుండగుచు; ♦ నార్యవరా! తమయాజ్ఞ మస్తకం
బున ధరియించి నట్టడవి ♦ భూమిజ డించితి గంగసన్నిధిన్. ౭౹ 2380

తే. అందు వాల్మీకియాశ్రమ♦మందుఁ జాల
శుద్ధమగు భూస్థలంబున ♦ శుభతమమగు
నట్టి యాచారమును గని ♦ యశము వెలయ
నలరు జానకి విడిచితి ♦ నమలు సతిని. ౮౹ 2381

క. చనుదెంచితిఁ బదతలములఁ, గని సేవ యొనర్ప; నింకఁ ♦ గలదె వగచినన్
జననాథ! దైవగతి యి, ట్లని దెలిపినవారు గలరె? ♦ యారయ నెందున్. ౯౹

తే. మిమ్ముఁ బోలిన మహితాత్ము ♦ లెమ్మెయి నిటు
వంటి విషయంబులందును ♦ వగవ రెప్పు
డెల్ల [1]సృష్టి క్షయాంతమై ♦ యెసఁగు నుచ్ఛ్రి
యంబు పతనాంతమయి యుండు ♦ నవనియందు ౧౦౹ 2383

సీ. అవనీశ! సంయోగ ♦ మనునది విప్రయోగాంతమై తగు మర♦ణాంత మగును
జీవితం బనునది ♦ కావునఁ బుత్రులయందు భార్యలయందు ♦ ననుఁగుమిత్రు
లందు ధనంబుల♦యందు నెక్కువ తమి యనుపరా దెన్నఁడే ♦ నొక్కమాటు
విప్రయోగము సంభ♦వించును నిశ్చయం; [2]బాత్మచే నీ వింక ♦ నాత్మఁ జక్కఁ

ఆ. గను వశంబు చేసి♦కొను మనమున నది, నట్లు చేయఁదగును ♦ నన్నిలోక
ములను గెల్వవచ్చు♦భూమీశ! యట్లైన, నాత్మశోక మునున ♦ దరయ నెంత.

క. విను మిట్టివిషయములలో, నినుఁ బోలు మహాత్ము లెల్ల ♦ నియతి విడిచి మో
హానిరతిఁ బొందరు పొందిన, జనాపవాదంబు మరలఁ ♦ జనుదెంచుఁ జుమీ!.

చ. ధరణిజ యేనిమిత్తమయి ♦ దారుణకాననసీమయందు దు
స్తరమగుచోట నుంపఁబడెఁ ♦ దప్పక యాయపవాదమే పురిన్
మరలను గల్గు దీన నను♦మానము సుంతయు లేదు రాఘవా!
స్థిరమగుధైర్య మూని మదిఁ ♦ జెందిన శ్రద్ధను జింత దీసినన్. ౧౫౹ 2386

ఆ. వదలు మిద్ది బుద్ధి♦వైభవంబును బాడు
చేయుఁగానఁ దాప ♦ మీయెడ నిఁకఁ
బూనవలదు; పురుష♦పుంగవా! యని మహా
మతి సుమిత్రసుతుఁడు ♦ హితము వెలయ. ౧౬ 2387

---

1 సర్వే క్షయాంతా నిచయాః పతనాంతా స్సముచ్ఛ్రియాః, సంయోగ విప్రయోగాంతాః మరణాంతం చ జీవితమ్-అనిమూ. 2 శక్త స్త్వ మాత్మనా ఉత్మానం వినేతుం మనసా మనః-అనిమూ.

క. పలికినఁ గాకుత్థ్సుఁడు మిత్రులపయి వత్సలతఁ బూను ♦ తోఁబుట్టువు ని
స్తులచిత్తుఁ గాంచి యిట్లని, పలికెం బరమాదరమునఁ ♦ భవ్యమనీషా!. ౧౭ 2387
క. నీవన్నయట్టులే మది, నావహిలుఁ హర్షతృప్తు ♦ లన్యన్మతి నీ
వీవిధి నన్నాశ్వాసన, మేవరునను గొదువలేక ♦ యే సాగంగఁ. ౧౮ 2389
క. ఒనరించితి గద నిర్వృతిఁ, గనియె న్నాచిత్త మింకఁ ♦ గళ్యాణమతీ!
మనమున సంతాపము నిల్వను జాలదు మంచినుడులఁ ♦ బల్కితి వీవుఁ. ౧౯
ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

౫౩ - సర్గము.

రాముఁడు లక్ష్మణునకు నృగమహారాజచరిత్రమును దెల్పి హితమును జెప్పుట.

చ. అనుపమలక్ష్మణోక్తుల మ♦హాద్భుత మందుచు నాలకించి యిం
తని వచియింపరానిదగు ♦ హర్షము నొందుచు నిట్లు పల్కె; నో
యనుజవరేణ్య! తాదృశమ♦హాత్ముఁడు బంధువు దుర్లభుండె యా
నసఁ జను నీవిపత్తునమ♦యంబున లేఁ డనియే వచింపనా. ౧౪ 2?91
ఉ. నామది నున్నపద్ధతి నొ♦నర్చెడువాఁడవు నీవె సన్మతీ!
నీమహనీయలక్షణము ♦ నేన యెఱుంగుదు సౌమ్య! యిత్తఱిఁ
నామన మెవ్విధంబున జ♦నంబులఁ గావఁగ నెంచెనో వినం
గా మది నుత్సహించెదవొ ♦ కస్రగుణాకర! యోనహోదరా!. ౨౪ 2392
క. వినిపించెద నాభావము, విను నట్టులె చేయు మెట్టి♦విధమున నాల్గే
దినములు పౌరులకార్యము, నొనరింపక వెతల నిట్టు ♦ లున్నాఁడఁ జుమీ'. ౩౪
క. కనుక న్నామర్మంబుల, జనకృత్యము చేయునట్టి♦చందము భేదిం
పనుదొడఁగెఁ బిల్వఁబంపుము,.జనులఁ బురోహితుని మంత్రి♦సత్తములఁ దర్వరఁ.
క. ఏయేకార్యములకుఁగా, నేయే మానవులు వచ్చి ♦ యెటు లున్నారో
యేయింతులు నాకొఱకై, యేయే వాక్కులను జెప్ప ♦ నెంచెడువారో. ౫
క. వారలఁ దోడ్కొని రాఁదగుఁ, బౌరులకార్యముల నెట్టి ♦ పాలకుఁడు దినం
బారసి చేయక యుండునొ, ఘోరంబగు నిరయమందుఁ ♦ గూలు నతండుఁ.
క. అనుమాన మింతయును లే, దనఘా! యీవిషయమందు ♦ నని మఱియు ననుఁ;
మును కీర్తిధురంధరుఁడౌ, జనపతి నృగనాముకుండు ♦ సత్యవచనుఁడుఁ. ౭
చ. కలఁ డొకరాజశేఖరుఁడు ♦ క్ష్మాస్థలి నేలుచు; నాతఁ డొక్కనాఁ
డలఘుభుజాబలుండు ప్రియ ♦ నుందుచు వత్సలతోడఁ గోటి గో
వుల బహుచిత్రరత్నపరి♦భూషితకాయములఁ ద్విజాళి కి
మ్ములఁ గొనుమంచు నిచ్చెఁ గడు♦మోదమునఁ గ్రహియించి రెల్లరుఁ. ౮

---

* నిశమ్య పరమాద్భుతం, సుప్రీత శ్చాభవ ద్రామో వాక్యం చేద ముహాచ హ-అనిమా.

తే. పుష్కరములందు భక్తిచే భూరిదక్షి
ణల నొసంగెను; రాజేంద్రుఁ ♦ డలయ కిట్టు
లిచ్చుచుండఁగ నొక్కనాఁ ♦ డెట్లొ గోవ
మూహముననుండి యొకగోవు ♦ మోసపుచ్చి. ౧౦ 2399

సీ. ఉంఛవృత్తిని గాల ♦ మొకరీతి గడపుచు నాహితాగ్నియునయి ♦ యతిదరిద్రుఁ
డగు భూసురేజ్యున ♦ కది యీయఁబడియునచ్చెను; భూసురుండును ♦ జిత్తమందు
గలవిలపాటొంది ♦ కడునాఁకటఁ గ్రుక్కి యావు నాయావోట్ల ♦ నరయుచు నది
యెందుఁ గన్పడమికి ♦ నెంతయు వగచుచుఁ [1]గొన్నియేండ్లరీతి ♦ క్షోణి వెదకి

తే. కనఖలగ్రామమున కేగి ♦ క్ష్మాదివిజుని
యింటిలో [2]జీర్ణవత్సయై ♦ యెట్టిరోగ
ములకుఁ జిక్కకయున్న యా ♦ లలితధేను
వును స్వకీయముఁ గాంచె నా ♦ భూసురుండు. ౧౧ 2400

చ. కని తననామధేయమును ♦ గాదిలిప్రేమను దెల్పి వేగ పి
ల్చెను శబలా! యటంచు నిఁకఁ ♦ జెచ్చెర రమ్మని యంచు; ధేను వా
తనిగళనాదముల్ వినఁగ ♦ ధాత్రిసురుం డతఁడే ముదంబునం
జెనిచెను మున్ను తన్ననుచు ♦ వింతగఁ దాఁ దలపోసి యంతటన్. ౧౨ 2401

క. ధరణీసురుని క్షుధార్తుని, బరిపూర్ణదయానమేతుఁ ♦ బావకతేజున్
బరికించి వెంటఁ జనె, నా, ధరణీదేవుండు ముందు ♦ త్వరఁ జనుచుండన్. ౧౩

చ. కనఖలవాసియా ద్విజుఁడు ♦ క్రన్నన నాశబలాఖ్యగోవు వెం
టను జనెఁ బాలకుండె యగు ♦ టం దనధేను వదెవ్వఁడో జవం
బునఁ గొనిపోయె నంచుఁ దన ♦ బుద్ధిఁ దలంచుచు, నంత నిట్టు లా
తనివెనువెంటనే యరిగి ♦ తద్ద్విజుఁ గాంచి వచించె నీవిధిన్. ౧౪ 2403

తే. ధేను విది నాది నృగమహీ ♦ జాని దాన,మిచ్చె నాకొక్కనాఁడు, ♦ నాకిచ్చెనతఁడె
దీని నంచని యీరీతి ♦ మాన కిద్ద్వి, ఱుద్ధతిని బండితులు నయ్యి ♦ ను గ్రరుమను.

క. కలహించి రంత నావా, క్కలహము పెనుపొందె; నవల ♦ క్ష్మాదివిజులు వా
రలు రాజుచెంత కేగిరి, పలువిధములఁ గ్రోధవాక్య ♦ పటలము లొప్పన్. ౧౫

సీ. ధరణీశునాజ్ఞ నొం ♦ దంగ లేకయె ద్వారసీమయందే నిల్చి ♦ చెప్పఁ జాల
నంత రోషము నొంది ♦ యాద్విజుల్ మహితాత్ములతితాపతప్తు ల ♦ త్యంతఘోర
వాక్కలహాలు నొచుఁ ♦ బల్కి రిట్లని నృపా! యర్థికార్యంబుల ♦ నాదరించి
తీర్పంగఁ బూనక ♦ ద్విజులకు దర్శనం బీయక యున్నాఁడ ♦ విట్టు లౌట

ఆ. భూతములకు నెల్ల ♦ నేతటిఁ గనఁబడ, నట్టివాఁడ వగుచు ♦ నవని నింక

1 సంవత్సరగణాన్ బహూన్-అనిమూ. 2 జీర్ణవత్సాం నిరామయామ్-అనిమూ.

నూనరిల్లి వగుమ♦యొగిఁ [1]బెక్కువేలేండ్లు, పెక్కుశతములుండు♦మక్కరణిని.

క. ధరణీరంధ్రంబున నూ, నరిల్లివయి యుండఁగలవు ♦ క్ష్మానాథ! నిరం
తర మంత వాసుదేవుం, డురుకీర్తియుతుండు పుట్టు ♦ నొకకులమందున్.

తే. యదుకులం బది యొప్పారు ♦ నవని నతఁడె
విష్ణువౌ నాదిపురుషుండు ♦ విశ్వనాథుఁ
డతఁడె నిన్నుద్ధరించువాఁ ♦ డన్నృగీయ
శాపమున నుండి, శాపమో♦క్షంబు నపుడె. ౨౦ 2408

క. కలుగంగఁ గలదు పరమే, శులలితకృప విష్ణు వతఁడు ♦ క్షోణీభారం
బు లయము నొందింపఁగ ని, మ్ముల నరుతోఁ గూడి యిలను♦బుట్టఁగలఁడు నూ.

[2]చ. కలియుగ మేగుదెంచు ననఁ♦గా గురువీర్యులు వార లిద్ద ఱీ
యిల జనియింపఁగాఁ గల ర♦హీనరుచుల్ తగ నంచు నివ్విధిన్
బలికి మనోజ్వరంబు చన ♦ బ్రాహ్మణు లొక్కనిఁ బిల్చి చాలదు
ర్బలయగు వృద్ధధేనువును ♦ బాయనిభక్తి నొసంగి రంతటన్. ౨౩౫ 2410

క. జనపతి బ్రాహ్మణశాపం, బును వారలు చెప్పినట్టి♦పోలిక నొందెన్
గన విన భయదంబగు నో, యనుజా! కార్యార్థు లెల్ల ♦ నార్తిం గనినన్. ౨౮

క. నరపతి కాపదఁ బొందును, బరికింపఁగ నేను దోష♦పటలము నోసో
దర! పొందఁజాలఁ గావునఁ, ద్వరగా దర్శన మొసంగఁ ♦ దగు నర్థులకున్.

క. సరిగాఁ బాలించినచో, ధరణీపతిసుకృత మొందు ♦ ద్వారము కడ నీ
వరయుము కార్యార్థి జనున్, ద్వరఁ బంపుము దెవ్వఁడున్న♦బహుమానముగన్.

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౫౪ - వ సర్గము.

{ నృగమహారాజు బ్రాహ్మణశాపము ననుభవించుపద్ధతి లక్ష్మణునకు రాముండు తెల్పుట. }

చ. అని యిటు రామచంద్రుఁ డన ♦ నాకథనున్ వినఁగోరి లక్ష్మణుం
డనియెను దోసి లొగ్గి ఘన♦మై తగు తేజముగల్గు రామునితో
జనవర! కొద్ది తప్పునకు ♦ శాపము విప్రులు కాలదండమే
యనఁదగుదాని నానృగమ♦హావనిజానికి నిచ్చినంతటన్. ౧ 2414

---

1 బహువర్షసహస్రాణి బహువర్షశతానిచ-అనిమూ. 2 ఉత్పత్స్యేతే మహావీర్యౌ కస్తా యుగ ఉపస్థితే-అనిమూ. ఇట శ్రీరాముఁడు కలియుగమున జరగనున్న వార్తను దెల్పుట యసంద ర్భముగఁ దోఁచు. కాన నంతకుమున్న జరిగిన కలియుగవార్తను దెలిపెనన్న నీశంక నిస్తరించును. రామావతారము భిన్నభిన్నకాలములయందుఁ బెక్కులు గలవని పురాణములు ఘోషించుచున్నవి.

క. జనపతి దానిఁ విని యేమని తలఁచెనొ తన్నుఁ గూర్చి ♦ యవనీసురులన్
ఘనకోపయుతుల నేమని, వినయమునన్ వేఁడుకొనెనొ ♦ వివరింపఁదగున్. ౩

క. అని లక్ష్మణుండు వినయంబునఁ బ్రశ్నింపంగ రాఘ♦వుఁడు పల్కె ముదం
బున సౌమ్య! యథాతత్త్వంబును దచ్చరితంబు రాజ♦ముఖ్యుం డంతన్. ౪

తే. శాపవిక్షతుఁడయి ద్విజుల్ ♦ చనుట చక్క
నెఱిఁగి పరితాపమును బొంది ♦ హితముఁ గోరు
పౌరులను మంత్రులన్ బిల్వఁ♦బనిచి తనపు
రోహితుని బిల్చి యిట్లనె ♦ నూహ చెలఁగ. ౫ 2417

చ. కనులను బాష్పధార లొగిఁ ♦ గ్రమ్మఁగ నో మహితాత్ములార! చిం
తను గనినాఁడ నా తెఱఁగు ♦ దాఁపక నే వచియింతుఁ జక్కఁగా
వినుఁ డిఁక నారదుండు ముని♦వృత్రహరుండగు పర్వతుండు నిం
తనివచియింప సాధ్యపడ♦నట్టి భయంబును నాకొసంగుచున్. ౬ 2418

క. సురపురికిం బోయిరి వా, గురుతరయోగంబుఁ బూని ♦ యొప్పుటఁ గనరా
కరిగిరి వాయువువలె; నీ,తరుణంబున రాజ్యమునకుఁ ♦ దగినకుమారున్. ౭

క. కనియున్నవాఁడ వసుఁడనఁ, జనుఁ గాదే యాతఁ డితఁడె ♦ చయ్యన రాజ్యం
బును దాల్పఁగ నభిషేకం,బును జేయుఁడు నాకుఁ గాఁగ ♦ భూవివరంబున్.

ఆ. త్రవ్వఁ బంపుఁ డద్ది ♦ తగురీతి సుఖముగా, నుండవలయు శిల్పు ♦ లొప్పమీఱ
నందునుండి నేను ♦ నవనీసురోక్తశా,పంబు ననుభవింప♦వలయుఁ జుండి.

సీ. వర్షబాధలు లేక ♦ వసియింపఁగాఁ దగి యొకటియు హిమబాధ♦నొందకుండ
నుండఁగాఁ దగినట్టు♦లొకటియు గ్రీష్మతాపంబునొందకయుండ♦వసతిఁ గూర్ప
నొకటియు నీరీతి ♦ నుండనా రంధ్రముల్ శిల్పివర్యులు చక్కఁ♦జేయవలయు
ఫలవృక్షములు పుష్ప♦పటలంబునం దగునట్టి తీఁగెలు చుట్టు ♦ సమరుపఁదగు

ఆ. ఛాయమిగుల నొసఁగఁ ♦ జాలు గుల్మములును
పొదలుచుండవలయు ♦ ముదముఁ గూర్పఁ
జాలినట్లు చుట్టు ♦ గ్రాలఁగావలయు నం
దే వసించియుందు ♦ నింపుమీఱ. ౧౧ 2422

క. కాలము పరిపక్వంబై, చాలసుఖం బిచ్చుదనుక ♦ శ్వభ్రంబులయం
దే లలి నుండెద వాసన, లోలిం గ్రమ్మంగఁ జాలు ♦ సురపుష్పములన్. ౧౨

క. నిరతము గ్రై చేయందగు, ధరణీవివరముల వానిఁ; ♦ దరువులు లతలున్
వరుస నొకయోజనార్ధము, సరిగా నిల్పంగఁదగును ♦ సజ్జనులారా!. ౧౩

చ. అని తనకెట్లుగా సుఖము ♦ లబ్బునొ యవ్విధిఁ జేయఁబంచి స
త్తనయుని జూచి నిత్యమును ♦ ధర్మముగాఁ బ్రజ నేలవయ్య! తు

త్రనియతధర్మముల్ వదల ♦ రాదుగదా ద్విజు లెట్టి శాపవ
హ్నిని గురిపించిరో యెఱుఁగు ♦ దీవును తద్విధ మాత్మ నెంచుచున్. ౧౪

క. జను లెట్టి కోపమును బొం,దిన నీవున్ క్రోధమును మ♦దిం గూర్పక పా
లన మొనరింపంగాఁ దగు, ననుఁ గూరిచి చింతిలకు మ♦నంబున నెపుడున్.

క. నే నిట్లు వ్యసనమును గనఁ,గా నొనరిచె నేర్పు కాఁడు ♦ కాలుఁడు వినుమా
మానవుఁడు పొందఁగాఁ దగు, వానిం దప్పకయె పొందు ♦ వసుమతిలోనన్.

ఆ. పోవఁదగినయెడకుఁ ♦ బోవును లభియింపఁ
దగినవానిఁ బొందుఁ ♦ దనకు వచ్చు
వగను గాని మంచి♦దగు సుఖమును గాని
విను మతొక్కమాటఁ ♦ దనయవర్య!. ౧౭ 2428

క. మును జన్మాంతరముల నే, నొనరించితి ఘోరపాప ♦ మొక్కమొగిని నీ
జనిఁ బొందుచున్నవాఁడను, గనుక విషాదంబుఁ బూనఁ♦గాఁ దగ దింకన్.

చ. అని వచియించి యానృగధ♦రాధిపుఁ డాత్మసుఖంబుఁ గూర్పఁ ద్ర
వ్వినవివరంబులందుఁ దను ♦ వింతగ నందఱుఁ జూడఁ జొచ్చెఁ; నం
త నతఁడు రత్నసంతతిని♦కాంతవిభూషితభూమిరంధ్రమున్
దనుపమరీతి శర్మముల ♦ కాలయమై తగునట్టు లొప్పుటన్. ౧౯ 2430

ఆ. అందునుండి తనకు ♦ నమ్మహీసురు లిడి, నట్టి శాపఫలము ♦ ననుభవింప
వారిక్రోధ మిస్సి ♦ యీరీతిఁ జేసితిఁ, గాదె యనుచు మదిని ♦ గలఁతపడుచు.

ఏఁబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౫౫ - వ సర్గము.

రాముఁడు లక్ష్మణునకు నిమివసిష్ఠసంవాదమును దెల్పి వారివిరోధమును దెలుపుట.

చ. అని వచియించి శ్రీరఘుకు♦లాగ్రణి రాముఁడు తమ్ముతోడ ని
ట్లనియె నృగక్షితీశ్వరుని♦దా పెనుశాపము విస్తరించి చె
ప్పిన వినినాఁడ వింక విను ♦ వేడుకఁ గల్గిన నొండుగాథఁ జ
క్కనివిధిఁ జెప్పువాఁడ ననఁ♦గా వచియించెను లక్ష్మణుం డొగిన్. ౧ 2432

చ. ధరణివరేంద్ర! చిత్తము ము♦దంబు నొసంగెడునట్టి గాథలన్
బరఁగదు నాకుఁ దృప్తి వినఁ ♦ బట్టుదలం గొనుచుండు నన్న సో
దరుపలుకుల్ చెవిం బడఁగ ♦ ధర్మవరేణ్యముగాఁ జెలంగి య
చ్చెరువగుగాథ నాతనికిఁ ♦ జెప్పఁదొడంగె రఘూద్వహుండునున్. 3 2433

మ. విను మిక్ష్వాకుకులంబునందు మహిమన్ ♦ విఖ్యాతిఁ బెంపొంది మే
దినిఁ బండ్రెండవపుత్రుఁడై నిమియనన్ ♦ దేజంబునం బొల్చి కా

చెను; వీర్యంబున ధర్మమందు యశముం ♦ జెందన్ మహీపాలుఁ డ
య్యనఘుం డింద్రపురోపమంబు బహుర♦త్నాఢ్యంబుఁ బూర్వర్యమున్. ౪౫

తే. గౌతమునియాశ్రమముచెంతఁ ♦ గట్టఁ బంచి
వైజయంతాహ్వయముఁ బెట్టి ♦ వాన మొప్పఁ
జేసె స్వకృతపురంబునఁ ♦ జెందె; నతఁడు
యశము రాజర్షి యనఁ గాంచె ♦ నంత నొకట. ౫౫ 2485

చ. మనమున నెంచె నాజనకు♦మానస మట్టి ముదంబు నొంద నే
ననిశము యజ్ఞదీక్షఁ గొన ♦ నా నది దీర్ఘమఖంబునాఁగఁ జ
క్కనివిధిఁ గీర్తిఁ గాంచఁదగుఁ♦గా యని యమ్మనుపుత్త్రుఁడైన యా
జనకునిఁ బిల్వఁబంచి ముని♦సత్తముఁడైన వసిష్ఠమానినిన్. ౬౫ 2486

తే. పిలువఁబంచి వరించెను ♦ భృగుయశుండు
పూర్వపుఁబురోహితుండని ♦ భూసురర్షి
యనుచు, నంతట నిక్ష్వాకు♦ఘనుఁ డతండు
నత్రిభృగుమౌనివర్యుల ♦ నంగిరసుని. ౯ 2487

క. క్రతురక్షకుఁ బిలిపించెను, క్షితిపతి యంతన్ వసిష్ఠుఁ ♦ జేర నతం డు
న్నతిమించు నృపున కిట్లను, క్షితిపా! వరియించె మొదట ♦ జిష్ణుఁడు నన్నున్.

తే. అధ్వరము చేయఁగాఁదగు♦నందునీవు, హోతగానుండఁదగునంచు♦నొప్పఁబలికె
నొప్పుకొంటిని గావున ♦ నుర్వినాథ!, యంతదాఁకఁ బ్రతీక్షింప ♦ నౌను నీకు.

క. అని పల్కుచనియె నమ్ముని, యనంతరముఁ గౌతమాఖ్యుఁ ♦ డగుమౌనివరుం
డును బూర్తిచేసె నావని, మునిపతియగు నావసిష్ఠ♦భూసురుఁ డంతన్. ౧౧

సీ. తన తేజ ముప్పొంగ♦ననిమిషపతి మఖంబును బూర్తిచేసె; నం♦తనిమినృపుఁడు
తద్విప్రవరుల ము♦దంబున బహుమానమునఁ దృప్తిపఱచి స్వీ♦యనగరమున
కంతికభాగమం ♦ దధ్వరంబును జేయ నైదువేలేండ్లు ని♦యతిని బూని
యుండె; వసిష్ఠుండు ♦ దండితాంతశ్శత్రు వమరేంద్రుఁ డొనరుచు♦యజ్ఞమెల్లఁ

తే. బూర్తి నొందించి హౌత్రంబుఁ ♦ బూన రాజు
కడకు నేతెంచె; నేనిండఁ ♦ గాంచని ముని
వచ్చి గౌతమపూరితా♦ధ్వరము దానిఁ
గనియె నంతటఁ బెనుకోప♦మునఁ జెలంగె. ౧౪ 2441

క. సరసిజయోనితనూజుఁడు, వరమౌని వసిష్ఠుఁ డంత ♦ వసుధేశ్వరుఁ జూ
చురతిన్ ముహూర్తకాలము, ధరణీశుగృహాంగణమునఁ ♦ దా వసియించెన్.

తే ఆదినంబున నిమియు ని♦ద్రాదరిద్ర
దేవతాపహృతుండయి ♦ తెల్వి లేక
యుండె మునికి మహాకోప ♦ మొప్పె దాన
దర్శనం బీయఁ డీరాజు ♦ తనకు ననుచు. ౧౫ 2448

సీ. పలికె నిట్లని మహీ♦పాలకా! యేహేతువున నన్ను వరియించి♦ముని మహాలకని
మరల వరించితో ♦ మరియాద లేకుండ నవమానమును జేసి ♦ తనఘు నన్నుఁ;
నకారణమున నీ ♦ కగును జేతనహీనమైన యంగము నని ♦ యపుడు శాప
మిచ్చె, నంతట నమ్మ♦హీజాని తెలివొంది మునిశాపమును దాను ♦ విని వచించె

ఆ. బ్రహ్మపుత్త్రుఁ గూర్చి ♦ పరమకోపంబున, నాతురంబు నొంది ♦ యవనిదేవ!
నీదురాక నెఱుఁగ ♦ కీదినంబున శయనించి యున్న నన్ను ♦ మించుక్రుధను.

క. కరుణను బూనక శాపము, కురిపించితి విప్ర దేను ♦ గుండెదునటు ని
ర్భరయమదండమువలెనే, ధరణీదివిజేంద్ర! యట్టి ♦ తనువున నీవుఁ. ౨౦ 2145

క. ధరియింపఁగలవు కాంతులఁ, బరఁగెడు నీతనువు నాదు♦వర్ష్మముపోలెఁ
ధర నొప్పఁ గాక యని యిరువ్వురు రోషస్ఫూర్తి మనుజ♦భూసురవర్యుల్.

ఆ. తిట్టుకొనిరి పిదప ♦ దేహంబు లట్టివి, వారి కొదవెఁ దత్ప్ర♦భావ మట్టి
తనువులకును'గల్గఁ ♦ దగినవి యలరారె, వానిఁ బొంది రనుచుఁ ♦ బలికె విభుఁడు.

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౭ - వ సర్గము.

వసిష్ఠముని దేహప్రాప్తికై బ్రహ్మను బ్రార్థింప నతఁడు ప్రత్యక్షమగుట.

చ. అనుటయు రామువాక్యముల ♦ నాపరవీరలయాంతకుండు చ
క్కనివిధి నాలకించి కర♦కంజములన్ ముకుళించి దీప్తతే
జుని రఘురాముఁ గాంచి మది ♦ శోభిలు సంతస మట్టె యుబ్బ ని
ట్లనియె; శరీరముల్ వదలి ♦ యామునిపార్థివవర్యు లంతటన్. ౧౫ 2148

మ. మరలన్ దేహము లొంది రోక్షితిప! యే♦మార్గం బగం జెప్ప మా
దర మొప్పంగ నటంచుఁ బల్క రఘుమూ♦ర్ధన్యుండు రాముండు వి
స్ఫురతేజుండు పురాణపూరుషుఁడు సొం♦పుల్ గుల్క వాక్యంబులం
బరమాప్తుండగు లక్ష్మణుం గని యనున్ ♦ వాత్సల్య మేపారఁగన్. ౩ 2149

క. ఇతరేతరశాపంబుల, క్షితిపాలమునీంద్రరాజ♦శేఖరు లొగి వి
చ్యుతిరహితధర్మతత్పరు, లతివేగ శరీరయుక్త ♦ మట విడిచి తగన్. ౩౫ 2150

ఆ. వాయుభూతు లగుచు ♦ వరుసఁ దపోధను, లగుచు నుండి; రంత ♦ నావసిష్ఠు
వాత్మకాయ మెడల ♦ నతిశయ తేజంబు,పొదలఁ దత్తనువునఁ ♦ బోయి కడఁక.

చ. తనజనకుం బితామహుని ♦ ధన్యమతిం గని దేవదేవుఁడై
వనరుహసంభవుం డగుచు ♦ భాసిలు నాతనిపాదపద్మముల్
తనరెడు భక్తిఁ గొల్చుచు స♦దాగతిభూతుఁడై యయ్యె భక్తి ని
ట్లనియె; మహాత్మ! దేవనివ♦హాధిప! లోకగురూ! దయానిధీ!. ౬౫ 2152

క. నిమిశాపంబున నా దేహము పోవఁగ వాయురూప ♦ మందితి గద దే
హము పోవ నెల్లప్రాణుల, కమరును బహుదుఃఖరాసు ♦ లంబుజజన్మా!. ౯

సీ. సకలకార్యంబులు ♦ సమయు నద్దానిచేఁ గావున నాకింకఁ ♦ గాయ మొందు
దయచేయవయ్య నా ♦ ధాత స్వయంభువు బ్రహ్మ న త్తేజుండు ♦ పలికె నిట్టు
లోసుకీర్తి! యింక ♦ నుద్దామమైన మిత్రావరుణజముగాఁ ♦ దనరు తేజ
మును బొందవయ్య నీ♦వన నయోనిజుఁడవు గాన నిప్పుడుఁగూడఁ♦ గాయ మట్టి

తే. దగును ద్విజసత్తమా! ధర్మ ♦ మగణితముగఁ
బొందఁగల్గుదు వంతటఁ ♦ బూర్వరీతి
నాదుచెంతకు రాఁగలు ♦ వోదయాత్మ!
యనఁ బ్రదక్షిణవందన ♦ మాచరించి. ౧౧ 2454

క. సరసిజసంభవు నానతి, వరుణాలయమునకుఁ బోయె ♦ *వరుణపదవి భా
స్కరమూర్తిధేయమిత్త్రుం, డురుతేజం బొంది వెలయు♦చుండెం గడఁకన్. ౧౨

తే. వార లిర్వురు చేరియే ♦ భూరిరాజ్య
మొక్కరుం బోలె నేలుచు ♦ నుండి; రంతఁ
బాలకడలియు వారిదై ♦ వఱలె దేవ
వినుతులం బొందుచుం గీర్తి ♦ వెలసి రపుడు. ౧౩ 2456

చ. ఇరువురు వారు రాజ్యము స♦హింపవిభూతిని బ్రోచుచుండ నా
తరుణమునందు నూర్వశి ని♦తాంతసుగాత్రి సఖీజనంబుతోఁ
బరమతనూవిలాసమున ♦ భాసిలుచున్ వరుణున్ సరిత్పతీ
శ్వరుఁ గనవచ్చె; రూపమునఁ ♦ బ్రౌఢత మించినదాని నచ్చరన్. ౧౪ 2457

చ. కని వరుణుండు క్రీడల ని♦కామముఁ దేలుచునుండు నూర్వశిన్
మనమున హర్షమంది బహు♦మానమునన్ వరియించె; నిండుచం
ద్రునిని హసించు మోము వర♦తోయజపత్త్రసమాననేత్త్రముల్
తనులతసొంపు స్వాంతము ని♦తాంతము లొంగఁగఁ జేయ వేడుకన్. ౧౫

క. సురతక్రీడలఁ దేలఁగ, వరుణుం డాశించె నంత ♦ వనితామణియుం
గరములు జోడించి మహా,దరమున నీరీతిఁ బల్కెఁ ♦ దగువినయమునన్. ౧౬

క. ననుఁ దొల్త మిత్త్రుఁ డాదృతిఁ, గనఁజేసి వరించెఁ దాన ♦ గాదన వశమే
యనఁ గందర్పశరార్దిత,మనస్కుఁడై వరుణుఁ డిట్లు ♦ మానినిఁ బల్కెన్. ౧౭

సీ. ననుఁ గూడి క్రీడింపఁ♦గనఁ నొల్లకున్నచో సుశ్రోణి సత్కాంతి♦శోభితాంగి
నిన్నుఁ గాంచుచు నాదు♦నెమ్మి తీరంగ నాయీ తేజ మిచ్చట ♦ నెసఁగు దేవ
నిర్మితకుంభమం ♦ దర్మిలి నెఱవేఱ వదలెద దాన నా♦వాంఛితంబు
కొనసాగు ననుటయుఁ ♦ గోమలి యాలోకపాలునివాక్యంబు ♦ లాలకించి

* త మేవ కాలం మిత్రోఽపి వరుణత్వ మకారయత్.

తే. పరమమోదంబుతో నిట్లు ♦ పల్కె నీదు
కామ మిట్లగునేని యు♦ద్దామమోహ
కాంతరంగంబు నీయందు ♦ నలరుఁ జుమ్ము
భావమును గూడ నీయందె♦ పరఁగియుండు. ౨౦ 2461

క. తను విది మిత్రునిదే యగు, నను నూర్వశి పల్కు లెన్ని ♦ యవ్వరుణుండుఙ్
ఘనమై యద్భుతమై తగు, ననుపమవీర్యంబు నందు♦నగ్నిశిఖవలెన్. ౨౧

క. తనరార దానిఁ గుంభం,బున వదలెను నూర్వశియును ♦ బోయెను మిత్రుం
గనువాంఛ నంత నాతఁడు, వనితామణి దానిఁ గాంచి ♦ పలికెన్ క్రుధచేన్.

చ. తొలుత నే వరించితిని ♦ దొయ్యలి! యట్టి ననుం ద్యజించి యి
మ్ముల మఱియొక్కనిన్ మదిని ♦ బొందితి వెంతయు దుష్టవృత్తివై
కలుషము నాదుక్రోధమునఁ ♦ గల్గఁగఁ జేయఁగ నయ్యె దీన మ
ర్త్యులభువనంబునన్ గడపు ♦ టొప్పును నీ కిఁకఁ గొంతకాలమున్. ౨౩

సీ. బుధునకుఁ బుత్రుఁడై ♦ భూపాలమానియై కాశీపురంబున ♦ కీశుఁ డగుచుఁ
దనరుపురూరవ♦సునకు భార్యవు గమ్ము దుర్మతీ! నీ విట్టి ♦ దోష మిచట
నొనరించితివి కావు♦న నటంచువచియించియాకుంభమునయందె♦యాత్మవీర్య
మును విసర్జించె; నా♦వనితయు నాదోషమున శాపమొంది చ♦య్యనఁ బురూర

తే. వునికడకు నేగి యాలోక♦మునఁ బురోత్త
మమయి తనరుప్రతిష్ఠాన ♦ మమరనగర
సన్నిభంబయి యొప్పంగ ♦ సాధువిభవుఁ
డైన బుధపుత్రునిం గాంచె ♦ నందు నింతి. ౨౪ 2465

*క. కని యాతని వరియించెను, మనుజేంద్రుం డతఁడు ప్రీతి ♦ మహిళామణి దా
నిని బత్నిగఁ గైకొని స,త్తనయుని నాయువును గాంచె ♦ దర్పనమగ్రున్. ౨౫

తే. అతనితనయుండె నహుషుఁ డ♦హార్యబలుఁడు
శతమఖద్యుతి; మున్ను ని♦ర్జరవిభుండు
వజ్రమున వృత్రునిం జంపి ♦ భ్రాంతుఁ డగుచు
శతసహస్రాబ్దములు పిశా♦చంబుగరణి. ౨౬ 2467

క. చరియించె నప్డు నహుషుఁడె, సురపురిఁ బాలించె శక్తి♦శోభితుఁ డగుచుం
దరుణీమణి యూర్వశి యీ,కరణిన్ శాపమునఁ దాను ♦ గళవళపడుచున్. ౨౭

ఆ. కమలలోచనములు ♦ కమ్రదంతంబులు, వెలయుఁ జాలవర్ష♦ములు ధరిత్రి
నుభుక్తివై చెలంగి ♦ క్షోణి శాపాంతంబు, నంది యింద్రపురికి ♦ నరిగె నవల.

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

* తస్య జజ్ఞే తత శ్శ్రీమా నాయుః పుత్రో మహాబలః-అనిమూ.

౫౭ - వ సర్గము.

వసిష్ఠమిథిలరాజుల జననము.

చ. అనుటయు దేవగాథవలె ♦ హర్షము నించుచు నద్భుతంబుగాఁ
దనరెడు నాకథన్ విని ము♦దంబున నెంతయు నోలలాడి రా
ముని గని లక్ష్మణుం డనియె; ♦ భూపవరా! తనువుల్ త్యజించి యా
మునిపృథివీశ్వరుల్ మరలఁ ♦ బూనిరి దేహము లెవ్విధంబునన్. ౧ 2470

ఆ. దేవసమ్మతులగు ♦ దివ్యమునిక్షితి,పాలకులచరిత్ర ♦ మోలి వినఁగ
నంతసంబు గల్గెఁ ♦ జక్కఁగఁ జెప్పుమా, యనఁగ సత్యశౌర్యుఁ♦డైన నృపుఁడు.

క. విని సహజన్మునిప్రశ్నం,బును దానికి నుత్తరంబుఁ ♦ బోల వచించెన్
వినుమా! మహనీయ వసి,ష్ఠునిచరితముఁ గుంభమందు ♦ సొంపు దలిర్పన్. 3

సీ. ఆమహాత్ములవీర్య ♦ మట్టులు విడువంగఁ బడినయంతనె ఋషి♦వర్యు లున్న
తాయతప్రభ లొప్ప ♦ నందుండియిరువురుజనియించిరందాద్యుఁ♦డనఁగ స్తుత్యుఁ
డొప్పారె నాతఁడ♦ట్లుద్భవం బొంది మిత్రుని గాంచి నే నీకుఁ♦దనయుఁడ నటు
లగుదు నంచని పల్కి ♦ యటు పాసిపోయె; నా తేజ మూర్వశిని ను♦దిందలంచి
విడిచెఁ గుంభమున మి♦త్రుఁడు పూర్వ మంత నద్దాన జనించెనా♦మానియందె

తే. వరుణతేజంబు విడువఁగాఁ ♦ బడియె దాని
కంటె ముందుగ నొకకొంత ♦ కాల మరుగఁ
బుట్టె మిత్రావరుణసంభ♦వుండు మాని
యావసిష్ఠుండు తేజంబు ♦ లావరింప. ౬ 2473

క. విను మిక్ష్వాకుకులంబున, జనియించినవారి కెల్ల ♦ నవ్వైనత మా
యనఘుండే; యిక్ష్వాకువు, ఘనతేజం బవ్విధమునఁ ♦ గల్గినవానిన్. ౭

క. మునివర్యు ననిందితకీ,ర్తిని గాంచి పురోహితునిగఁ ♦ దివిరి వరించెన్
మనపుట్టుక కాతఁడె యౌ, యనుజా! కారణము యజ్ఞ ♦ మాదృతిఁ జెప్పెన్.

తే. సౌమ్య! లక్ష్మణ! యామహా♦సత్త్వశాలి
యగు వసిష్ఠుని వృత్తాంత ♦ మాను విద్ది
యింక నిమి దేహ మొందెనో ♦ యెట్లు దానిఁ
జక్క వివరింతు; నంత నా♦క్ష్మాపతి నిమి. ౯ 2476

క. కని మును లందఱు యజ్ఞం,బును జేయం దొడఁగి దేహ♦మును దానిని జ
క్కనిరీతిని గాపాడిరి, యనుపమగంధప్రసూన♦హారాదులచేన్. ౧౦ 2477

క. నిరతము పూజించుచు నా,పురజనభృత్యులను గూడి ♦ పొల్పుగ వాయు
ధ్వరమును బూర్తి నొనర్చిరి, పరమప్రమదంబు నొంది ♦ భాసిలుభృగువుల్.

తే. పలికె నిట్లని పార్థివా! ♦ పరమతృప్తి
నందినాఁడను బ్రాణంబు ♦ లంగమునకుఁ

గూర్తు నంచన దేవతల్ ♦ కుతుక మంది
ప్రాణముల నొందు నిమితోడఁ ♦ బల్కి రిట్లు. ౧౨ 2479

క. వర మడుగుము రాజర్షి!, నిరతము నీ ప్రాణవితతి ♦ నిల్వం దగు నెం
దు రహిఁ జెప్పుము యనునా, సురవాక్యం బాలకించి ♦ చోద్యము తనరన్.

తే. అతని ప్రాణంబు లీరీతి ♦ ననియె దేవ, వర్యులార! వినుండు నా ♦ వాంఛితంబు
సర్వభూతనయనముల ♦ సంచరింతు, నిదియె నా వాంఛితం బనఁ ♦ ద్రిదశు లెల్ల.

క. సరిసరి యట్లే యుండుము, చరింపఁగాఁ గల్గు దీవు ♦ సతతము జంతూ
త్కరనయనంబుల వాయువు, కరణిన్ రూపంబు తనరఁ ♦ గా నిఁకమీఁదన్.

సీ. నీనిమిత్తంబయి ♦ నేత్రంబులు నిమేషధర్మంబుఁ దారు నొం ♦ దంగఁ గలవు
వాయురూపంబున ♦ వసుధఁ జరింపంగ విశ్రమార్థముగ న ♦ విగ్రహముగ నవి
యుండు నిమేషంబు ♦ లోకరీతిఁ జెలువార; నని పల్కి దేవత ♦ లరిగి రెట్లు
వచ్చిరో యాదారిఁ ♦ బట్టి, యంతట మౌను లాతని దేహంబు ♦ నందు నరణి

తే. నొక్కదానిని స్థాపించి ♦ యుడుగ కట్టె
మథనమును జేయఁ జొచ్చి ర ♦ మ్మాడ్కిఁ జేసి
మంత్రహోమంబులం జేసి ♦ మహిమ వెలయు
తనయు నానిమిపతికయి ♦ జనన మొంద. ౧౮ 2483

క. అరణిని మథించుచుండఁగ, వరమతియు మహాతపుండు ♦ వఱలె నతఁడె పో
ధరణిన్ మిథియను ఖ్యాతిని, బరమంబును గాంచె మథన ♦ భవుఁ డగుకతనన్.

ఆ. మిథి యనంగ నొప్పు ♦ మేదిని జనసమ్ము, నందుటన్ జనకమ ♦ హాఖ్య గాంచెఁ
దా విదేహ జనని ♦ దగ్ధయుఁ గనుట నై, దేహుఁ డనఁగ నామ ♦ ధేయ మందె.

క. వినుమా విదేహరాజే, జనకునకుం బూర్వుఁ డగును ♦ సత్తేజస్స్ఫూ
ర్తిని మిథి యలరెను మైథిలుఁ, డనఁబడె నాతండె నద్గు ♦ ణాలంకారా!. ౨౦౪

క. [మునిధరణీశులసంభవ, మును జక్కఁగఁ జెప్పినాఁడ ♦ మునివరశాపం
బును భూపశాపమును జయ, మును బొందినజాడ యిదియె ♦ భూపకుమారా!.]

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము.

---

౫౮ - వ సర్గము.

యయాతిచరిత్రకీర్తనము.

చ. అని యిటు పల్కు రాఘవు న ♦ హాత్ముని దేజముచే జ్వలించువా
నిని బరవీరహంతయయి ♦ నిర్భరవిక్రము మొప్ప వెల్గునా
యనఘుఁడు లక్ష్మణుండు గని ♦ యల్లన నిట్లనియెన్ నృపోత్తమా!
కన విన నద్భుతం బగును ♦ గాదె విదేహునిగాథ యెంతయున్. ౧౫ 2488

తే. ఇది పురాతనమేయగు ♦ నెన్న నిమి వ
సిష్ఠసంవాదరూపమై ♦ చెలఁగుగాథ
చాల వినుతింపఁ దగినది ♦ క్షత్త్రియుండు
నిమి మహాశూరుఁ డధ్వర♦నియతి మించు. ౭ 2489

తే. అట్టివాఁడయ్యు మహనీయుఁ ♦ డగువసిష్ఠ
మునివిషయమందు శాంతిని ♦ బూనఁడయ్యె
ననఁగ లక్ష్మణుతో నిట్లు ♦ లనియె *సర్వ
రంజకుండయి తనరు శ్రీ♦రామమూర్తి. ౮ 2490

క. తనతమ్ముఁడు సత్తేజుం, డనుపమవిజ్ఞాని యనెడు ♦ నాదరమున నో
ననుజేంద్రకుమారా! యిఁక, వినుమా! క్షమ యెల్లరకును♦వెలయదు సుమ్మీ.

సీ. ఆరయ దుస్సహం♦బగును రోషం బిల నాయయాతియు తొంతుఁ♦డగుచు నెట్లు
సత్త్వానుగుండయి ♦ చక్కఁగ ధర నేలె నావిధం బెఱిఁగింతు ♦ నవధరింపు;
నహుషభూపతికి నం♦దనుఁడు యయాతి నాఁ బౌరవర్ధనుఁడు పా♦వనయశుండు;
కల రాతనికి భార్య♦లల రెడు రూపంబు గలయిరువ్వరందు నొ♦క్కత సుపూజ్య

తే. దనుజవరుఁడైన వృషపర్వ♦తనయ యగును
పేరు శర్మిష్ఠ యింకొక్క ♦ ప్రేయసి మహి
తాత్ముఁడౌ శుక్రునకుఁ బుత్త్రి ♦ యామె చారు
తనువిలాసిని సింహమ♦ధ్యమయు నగును. ౯ 2492

క. వనితామణు లాయిరువ్వరు, గని రాత్మజులను సురూప♦కలితుల నందున్
దనయుఁడు పూరుఁడు వృషప,ర్వనిమనుమఁడు; దేవయాని♦పుత్త్రునిఁ గనియెన్.

తే. అతఁడు యదువన నొప్పె య♦యాతి కఖిల
సుగుణములఁ బూరుఁ డెంతయు ♦ సుభగుఁ డనుఁగుఁ
బుత్త్రుఁడును నయ్యెఁ దండ్రిని ♦ బోలురూప
మలరుచుండుట విషయాదు ♦ లమరి యుంట. ౧౦ 2494

చ. జనకుని ప్రీతిపాత్త్రుఁడయి ♦ సత్త్వయుతుండయి పూరుఁ డొప్పుటం
గని యదు వాత్మఁ గుంది కడఁ♦కం జని తల్లిని గాంచి యిట్లనెన్;
జననిరో! భార్గవాన్వయవి♦శాలసముద్రమునందు లక్ష్మి నా
జననము నొందినావు ముని♦సత్తముఁ డాతఁడు వంశకర్తయున్. ౧౧ 2495

తే. ఎవరికైనను గష్టంబు ♦ సిడనికర్మ
ముల నొనర్చునవాని స♦త్కులమునందు
జనిని గాంచియు నవమాన♦మును సుదుస్స
హమును హృద్గతశోకంబు ♦ నణఁచి నీవు. ౧౨ 2496

* రామో రమయతాం శ్రేష్ఠో భ్రాతరం దీప్తతేజసమ్-అనియూ.

క. చరియించుచున్న దానవు, ధరణీశుఁడు రాక్షసేంద్ర♦తనయాసక్తిన్
జరియించుఁ గాక స్వేచ్ఛగఁ, *జిరకాలము మనము నిఁక శు♦చింజొత్తమిటన్

క. ఈయవమానము నోర్వఁగ, నోయంబా నీకు నిష్ట♦మున్న యెడల ని
మ్మా యనుమతి నేఁ జొచ్చెద, వే యగ్ని సహింపఁ జాల ♦ విషమం బగుటన్.

క. మరణము నొందెద సంశయ, మరయఁగ లేదింక ననెడు ♦ నాత్మజపలుకుల్
పరమార్తి వినుచు నేడ్చెడు, వరతనయునిఁ గాంచి బుద్ధి♦వైభవము చెడన్.

చ. జనకుఁ దలంచె నాత్మ ముని♦సత్తముఁ డింగితవేత్తయైన యా
వినుతయశుండు భార్గవుఁడు ♦ వేగ సుతామణి తన్ స్మరించుటల్
మనమున నెన్ని వచ్చె బహు♦మానముమీఱఁగ దేవయాని నిన్
గనుఁగొనఁ గోరి; యంతఁ దమ♦కంబును బాసి శనంబురీతిగన్. ౧౮ 2500

తే. చూడఁదగియున్న పుత్త్రిక♦సొబగుఁ జూచి, కారణం బేమొ యిట్లుండఁ♦గా నటంచుఁ
బలుక నందీప్తతేజుఁడౌ♦ భార్గవమునిఁ, దండ్రిఁ గని దేవయాని క్రు♦ధన్ వచించె.

చ. అనలుని నొందెఁ దీవ్రమగు♦నట్టి మహావిష మొండెఁ జొత్తు నిం
గను దలపోయుదున్ జలముఁ ♦ గ్రన్ననఁ జొత్తును బ్రాణపంచకం
బును నిలుపంగఁ జాల నను ♦ బొందినదుఃఖ మెఱింగియున్ మదిన్
జనక! తలంపకుంటి విది ♦ సాధుపథంబు యెటుంగ నక్కటా!. ౧౯ 2502

తే. తనయయవమానమును దుఃఖ♦మును దలంపు
వృషదోషంబునం జేసి ♦ వృషజీవు
లెల్లఁ గష్టంబు నొందుట ♦ యిలను గలదు
ధరణిపతి నిన్ను లెక్కింపఁ ♦ దలఁపఁ డకట. ౨౦ 2503

క. నను నవమానించెను నా, జనకుని నినుఁ జూచి యైన ♦ జక్కనిమర్యా
దను జూపఁ డక్కటా! యనఁ, దనయావాక్యమ్ములు విని ♦ దారుణభంగిన్. ౨౧

సీ. క్రోధమహాతాశన♦బాధితాత్ముండయి నహుషనందనుఁ గాంచి ♦ నయముమీఱఁ
బలికె నిట్లని, హేతు♦వులు లేకయుండఁగ దుర్బుద్ధినిం బూని ♦ ధూర్తరీతి
నవమతి సల్పితి ♦ వౌర నాయెడఁ గాన నతిశయజరచేత ♦ నంగ మెల్ల
జీర్ణింపనుందువు ♦ చెచ్చెఱ నని పల్కి తనయ నాశ్వాసించి ♦ మునివరేణ్యుఁ

తే. డాత్మభవనంబుఁ జేరె; మ♦హాయశంబు
వెలయ, భార్గవుఁ డినతేజుఁ ♦ డలుక నవని
పతిని నీరీతి శపియించి ♦ పట్టి నూఱ
డించి యిలు చేరె శుక్రుండు ♦ మించుశక్తి. ౨౨ 2505

ఏఁబదియొనిమిదవ సర్గము సంపూర్ణము.

---

* దేవి ప్రవిశామి హుతాశనమ్-అనియు.

## ౫౯ - వ సర్గము.

### యయాతి పూరువలన వయస్సు నొందుట.

చ. ధరణిసురర్షి కోపమునఁ ♦ దన్ శపియించు టెఱింగి యార్తుఁడై
జరఁ గని యాతురుం డగుచుఁ ♦ జయ్యనఁ బుత్రు యదున్ వయస్సునం
బరఁగెడువానిఁ గాంచి యిటు ♦ పల్కెను; ధర్మ మెఱుంగు దీవు శ్రీ
కరయశ మొందినావు కను♦కన్ జర నాది గ్రహించు టొప్పుగన్. ౧½ 2506

క. మనమున భోగేచ్ఛయు విర,తిని బొందదు మరల వయసుఁ ♦ దృప్తిఁగ నాకుం
డినగాని విషయగతవాం,ఛను దీర్చుకొనంగ లేను ♦ సత్యం బిదిసూ!. ౩½

తే. అనుభవించెద స్వేచ్ఛగా♦నఖిలకామ,ములనుదనువాతఁబొందెద♦ముసలితనము
ననఁగనమ్మాట లాలించి ♦ యతనికాతఁ,డిట్టులని చెప్పెను త్తర ♦ మెన్ని మదిని.

క. తనయులలో నీకుం బ్రియుఁ, డనఁగాఁ జనుపూరుఁ డిప్పు ♦ డాదరమునఁ గై
కొనుఁగాక నీదుజర నో,జనపాలక! నేను గార్య♦సంతతివలనన్. ౫ 2509

*క. సన్నిధి నుండియు వెలువల,కున్నడపంబడితి నెవఁడు ♦ కోరిక నీతో
నన్నిపనులందు నిల్చునొ, సన్నిధిభోజనమునందు ♦ సైతము కడఁకన్. ౬½ 2510

తే. అంతమాత్రమె గాక భ♦క్తియంబుఁ జేయ
మెవనికిన్ స్నేహమునను నీ ♦ విచ్చువాఁడ
వట్టి పూరుండె కొనుఁగాక ♦ యిట్టి జరను
నాఁగ విని పూరుఁ గాంచి భూ♦నాథుఁ డనియె. ౭ 2511

క. జర నస్మదీయమును నో,గురుబాహూ! నాకుసుఖముఁ ♦ గూర్పం గొను మా
దరమున; నను పితృవాక్యము, బరికించి కరంబు లొగ్గి ♦ పలికె నతండున్. ౮

క. జనకా! ధన్యుఁడ నీశా,సనము నొనర్పంగ నేను ♦ జాలినకతనన్
ఘనతావకకరుణకు నే, ననఘా! పాత్రుండ ననిన ♦ నంతృజుపలుకుల్. ౮½

చ. విని ముదమంది యాజరను ♦ వేగమె పూరునియందు నిల్పిహ
ర్షనిరతుఁడై యయాతి కడు ♦ రాజిలి తాఁ దరుణుండై యాచు యా
గనికరముల్ పొనర్చి చిర♦కాలము భూమినిఁ జక్క నేలి యే
పనిని గొఱంత లేక జన♦వర్ణితుఁడై సుఖముండి యంతటన్. ౯½ 2514

క. చిరకాల మేగఁగా నొక,తరుణంబునఁ బూరుఁ గాంచి ♦ ధరణీపతి యీ
కరణి వచించెన్; బుత్రక!, పరమాదృతి నీవయస్సు ♦ బహుభంగులుగాన్. ౧౦

సీ. ధర్మకృత్యంబులఁ ♦ దగినసుఖంబుల నుపయోగపఱచితి ♦ నుర్విఁ గల్గు
సుఖములఁ బొందితి ♦ సుతవర్య! నాజర నీయందు నుంచితి ♦ నేను మరల
దానిఁ గైకొనియెదఁ ♦ దనిసితి నినునంత కొఱఁతయే నిఁక లేదు ♦ కోపలేశ
మైనను లేదుసూ! ♦ హర్షంబు నొందితి నాయాజ్ఞ దాఁటక♦యే యొనర్చి

* బహిష్కృతో ఽహ మర్థేషు సన్నికర్షాచ్చ పార్థివ-అనిమూ.

తే తట్లు గావున నభిషేక ♦ మాచరింతు
ననుచు నహుషాత్మజుండు య♦యాతి తనయుఁ
బూరునిం బ్రీతునిం జేసి ♦ పొంగుక్రుధను
దేవయానీసుతుం జూచి ♦ తీవ్రభంగి. ౧౩౹ 2516

చ. పలికెను; రాక్షసుండ విటఁ ♦ బట్టివిగా జనియించినాఁడ వో
కలుషమయాత్మ! న న్వదలఁ♦గాఁ దనట్టి యఘుంబు నీవుగా
నిలఁ దగియోర్ మదాజ్ఞఁ దృణ ♦ మెట్లుగఁ జూతురొ లోకు లట్లుగాఁ
దలఁచి తిరస్కరించితివి ♦ దాన నృపత్వము నీకు లే దిలన్. ౧౪౹ 2517

క. గురుభూతుని జండ్రిని నన్, బరమాదృతిఁ గనక తృణము♦భంగిఁ దలఁచి నీ
వరయక తిరస్కరించితి,వి రాక్షసులు యాతుధాన♦వీరులు నీకున్. ౧౫౹ 2518

క. తనయులుగా జనియింతురు, విను దుష్టమతీ! కులంబు ♦ వింశగ నిది చం
ద్రునివంకనుండ దిఁక నీ,వనూనపాపాత్మఁ కవుగ ♦ నలరుటకతనన్. ౧౬ 2519

తే. నీకుఁ దుల్యంబుగా నుండుఁ ♦ గాక; యనుచుఁ
బలికి వంశవివర్ధను ♦ భవ్యయశునిఁ
బూరు నరపాలునిగఁ జేసి ♦ భూపతి ముని
యాశ్రమముఁ జేరెఁ దప మందు ♦ నాచరింప. ౧౭౹ 2520

క. చిరకాలమందుఁ దపమును, బరమంబగు భక్తిఁ జేసి ♦ పరమపదము ను
స్థిరమును జేరెను నాహుషుఁ, డుగుకీర్తి యయాతి; కీర్తు ♦ లొప్పెడురీతిన్.

తే. ధరణిఁ బాలించెఁ బూరుండు ♦ ధర్మనిరతుఁ
డతులయశమునఁ గాశిరా♦జ్యంబునందుఁ
దాఁ బ్రతిష్ఠానపురమునఁ ♦ దమి వసించి
ప్రజలు జనరంజకుండని ♦ ప్రస్తుతింప. ౧౯౹ 2522

సీ. యదు వంతటన్ వేల ♦ యాతుధానులఁ దనయులఁబుట్టఁగాఁ జేసె♦లలితవిభవ
మంతరింపఁగ దుర్గ♦మాకృతిఁ దగు క్రౌంచవనమున క్ష్మాపాల♦వంశమునకుఁ
దాను జెందకయుండె ♦ మానిశాపము నిమిమార్పఁ జాలనియట్లు♦మానివర్యుఁ
డగుశుక్రశాపంబు ♦ నాయయాతియుఁబొందె(సర్వధాజగమున♦క్షమయెదుర్ల

తే. భము యశోవర్ధనంబు క్రో♦ధము సుదారు
ణము తలంపఁగఁ గీర్తి య♦శమును గూల్చుఁ
గాన శాంతియుతుండగు ♦ మానవుండు
కోపమును జిత్తమునఁ బూనఁ♦గూడ దెపుడు.) ౨౦ 2523

క. వినిపించితి లక్ష్మణ! నీ, కనూనమహితాత్ములైన ♦ యార్యులచరితం
బును సర్వకార్యపరులగు, మనుజుల కాదర్శనమును ♦ మానుగ నిచటన్. ౨౧౹

తే. అనుసరింతుముదోషంబు♦లందకుండ,నృగునివలెఁ గాకమసమని♦నృపుఁడు రామ
చంద్రుఁ డభినవలావణ్య♦శాలి పలుకఁ, దారకలు మెల్లమెల్ల నం♦తట నడంగె.
ఆ. అరుణకిరణరక్త♦యయి పూర్వదిక్సతి, కుసుమరసవిముక్త♦కోమలాంబ
రమును గప్పుకొన్న ♦ రమణ విరాజిల్లె, నంతఁ దెల్లవారె ♦ వింతరీతి. ౧౬

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## అధికపాఠము. ౧ - వ సర్గము.

### శ్రీరామచంద్రుఁడు వసిష్ఠాగులతోఁ గొలువుకూటమును బ్రవేశించుట.

చ. తెలతెలవేఁగినన్ నృపతి♦ధీరుఁడు రాముఁడు పుండరీకనే
త్రలలితుఁ డర్హకృత్యములఁ ♦ దప్పక తీరిచి ధర్మరక్షణం
బలరుచుఁ జేయ వచ్చె సభ ♦ కంత వసిష్ఠుఁడు కాశ్యపుండు వి
ప్రులు మఱికొంతమంది సచి♦వుల్ పురవాసులు వచ్చి రొక్కటన్. ౨ 2527
క. వ్యవహారంబులు దీర్పఁగ, నవిధానము లొప్ప మంత్రి♦సత్తములును ధ
ర్మవితానవేత్తలగు భూ,దివిజులు చనుదెంచి రాత్మ♦తిప్రభుఁ గనఁగన్. ౩
క. నీతిజ్ఞులైన పెద్దలు, భూతలపతికొలువు చూడఁ ♦ బోయిరి సభయున్
సీతేంద్రవరుణసభలన్, ఖ్యాతిం దామించి వెలసె ♦ ననుపమ మగుటన్. ౪
క. జనులకు నేవిధి బాధిం,పనికృత్యము లొప్పఁ జేయు ♦ పార్థివతిలకుం
డనఘుఁడు రాముఁడు కొలువున, నెనుజుని లక్ష్మణునిఁ జూచి♦యాదృతిఁబలికెన్.
తే. వినుతశుభలక్షణా! రఘు♦వీర! దీర్ఘ
బాహాభూషిత! సోదరా! ♦ బయలనెవ్వ
రెట్టి కార్యములను గోరి ♦ యేగుదెంచి
యున్నవారో కనుంగొను ♦ ముగుతరకృప ౬ 2531
చ. అనిశుభలక్షణుండయిన ♦ యాసహజన్ముఁడు ద్వారసీనుకుం
జని నరపాలుతో మనవి ♦ నల్పఁగ నచ్చినవారలెవ్వరై
న నిచట నున్నవారె జన♦నాథుఁడు రమ్మనె నంచుఁ బల్కె నే
జనుఁడును బల్కఁ డత్తఱిని ♦ జక్కఁగ రాముఁడు రాజ్య మేలుటన్. ౭
తే. ఆధులే వ్యాధులేని యా♦యదనున నిలఁ
గానరాకుండుటం, బని ♦ గలదు నాకు
నిట్టిదని చెప్పుకొనఁగ రా ♦ రెవ్వరేని
రాముఁ డభిరతిఁ బూనిక ♦ రాజ్య మేల ౮ 2533
క. పరిపక్వసస్యయై భూ,తరుణీమణి యోషధులవి♦తానము చెలఁగన్
బరఁగెంజక్కఁగ; బాలుం,డరయఁగ మృతిఁ గనఁడు తరుణుఁ♦డటుమధ్యముఁడున్.
క. మృతిఁ గనరు ధర్మమును వి,చ్యుతిఁ బొందకయుండ రాముఁ♦డొప్పుగ నేలన్

క్షితిఁ గలుగ దెట్టిబాధయు;, మతిమంతుఁడు నృపతిసంఘ♦మండనుఁడెలమిన్.

తే. కొలువుకూటంబుఁ జేరంగఁ ♦ గోదువ యిద్ది
కలదు నా కని పలుకంగఁ ♦ గల నరుండు
కానరాఁ ద్వాఃస్థుఁడైన ల♦క్ష్మణుఁడు మరలి
కరము లొగ్గి మహీపతిఁ ♦ గాంచి పలికె. ౧౦ 2536

క. ద్వారమ్మున లేఁ ద్వాఃస్థుఁడు, పౌరుఁడునుం గరుణ తోఁపఁ ♦ బార్థివమణియౌ
శ్రీరాముఁడు లక్ష్మణుతో, నీరీతిం బలికె మరలి ♦ యేగుము శ్రద్ధన్. ౧౦౪

క. పరికింపుము కార్యార్థుల, సరిగా నీతిం దలంచి ♦ స్త్యార్థలి నేలన్
బరికింపరా దధర్మము, ధర నెందే రాజభీతిఁ ♦ దత్పరిజనముల్. ౧౧౪ 2538

క. పరిపాలింతురు చక్కఁగ, శరములనే విడువ నవ్వ ♦ శత్రునికరముల్
మరణము నొందించి ప్రజో,త్కరమును గాపాడునట్లు♦గా గురుబాహూ!.

క. మనుజులఁ గావఁగఁ బూనుము, చని మరలం గాంచి రమ్ము ♦ చక్కఁగ ననఁగా
విని సౌమిత్రియు మరలన్, జని ద్వారప్రాంతమందు ♦ శ్వానముఁ గనియెన్.

క. కని యద్ది మరల మరలం, దనుఁ గొట్టినరీతి నేడ్వ ♦ దయమెయిఁ జేరం
జని వీర్యవంతుఁ డాతం, డనియెను శ్వానంబ! యేల? ♦ యాక్రోశింపన్. ౧౫

క. నను నమ్మి చెప్పుమా నీ, మనమునఁ గలదుఃఖ మనిన ♦ మానితవృత్తిం
దనరారు లక్ష్మణుం గని, శునకం బిట్లనియె నుడులు ♦ చోద్యం బిడఁగన్. ౧౬

తే. [1]సర్వభూతశరణ్యుఁడై ♦ సాధ్వసంబు
సెడఁడుకార్యంబుఁ జేయక ♦ కడఁగి యభయ
దాతయగు రామచంద్రుని♦దాపునందె
తెలుపుకొన నుత్సహించెదఁ ♦ దేటపడఁగ. ౧౭ 2543

చ. అనుటయు రాఘవుం గనఁగ ♦ నాతఁడు లోపలఁ జొచ్చి మంగళం
బునఁ దగు కొల్వుకూటమునఁ ♦ బొల్చెడు భూపతి కద్ది చెప్పిన
ట్లనువుగఁ జెప్పి రామవిభు♦నానతి ద్వారముచెంతఁ జేరి యి
ట్లనియెను, శ్వానమా! నృపతి♦యాజ్ఞను రమ్మిఁక లోనికిన్ వడిన్. ౧౮౪

క. తెలుపందగు విషయంబును, దెలుపుకొనన్ వచ్చు భూప♦తిప్రవరునితోఁ
గొలువున నా విని లక్ష్మణు,పలుకుల నిట్లనియెఁ గుక్క ♦ భవ్యపథమునన్.

తే. [2]దేవభవనంబు నృపతిమం♦దిరము విప్రు
నిల్లు నివ్వానియందు వ♦హ్నియు మహేంద్రుఁ

---

1 భయే ష్వభయదాత్రే చ తస్మై వక్తుం సముత్సహే-అనిమూ. 2 దేవాగారే నృపాగారే ద్విజవేశ్మసు వై తథా, వహ్ని శ్శతక్రతు శ్చైవ సూర్యో వాయుశ్చ తిష్ఠతి, నాత్ర యోగ్యా స్తు సౌమిత్రే యోనీనా మధమా వయమ్-అనిమూ.

దర్కవాయువు లుండు ర♦క్షాట నీచ
జాతినగు నేను లక్ష్మణా! ♦ చనదు చొరఁగ. ౨౫ 2546

క. నరపతియనఁగా ధర్మస్వరూపుఁడే యగును గాదె? ♦ సత్యవచనుఁడై
దురమున సమర్థుఁడై భూ, భరతుండై నీతివిదుఁడు ♦ దాంతుఁడు నగుచున్.

సీ. షాడ్గుణ్యపదమును ♦ జక్కఁగా నెఱుఁగుచు సర్వజ్ఞుఁడై మఱి ♦ సర్వదర్శి యగుచు
యగుచు రంజిలఁజేయు♦నవ్వారలందాద్యుఁడగుచు రాముఁడు పొల్చు♦నతఁడె సో
డాతఁడె మృత్యువౌ ♦ నతఁడెకుబేరుఁడౌ నంతం డెయముఁడు నిం♦ద్రాగ్ను లతఁడె
వరుణార్కు లాతఁడే ♦ భాసుర తేజుఁడౌ గావున లక్ష్మణా! ♦ నీవె పోయి

ఆ. విన్నవింపు మతఁడు ♦ విభుఁ డౌట నాతని, యాజ్ఞ లేక చొరఁగ♦నసువుపడదు
దీనజనులఁ బ్రోచు♦ తెఱఁగాతఁ డెఱుఁగును, గానఁ దెలుపవయ్య!♦కమ్రతేజ!.

చ. అన విని లక్ష్మణుండును మ♦హాద్యుతి గావునఁ గొల్వుకూటముం
గనఁ జని విన్నవించె నిటు ♦ క్ష్మాపరిపాలక! మాతృచిత్తమో
దనియుతవర్ధనా! భవదు♦దారతరాజ్ఞను నేను దెల్ప నా
శునకము ద్వారమందె మిముఁ ♦ జూడఁగ నున్నది కార్యసిద్ధికై. ౨౮ 2549

క. అన విని శ్రీరాముం డి, ట్లనియెం గార్యంబు దెలుప ♦ నరుదెంచిన యా
శునకము శీఘ్రంబుగ ర, మ్మనుమా! నాచెంత కిప్పు ♦ డతిహర్షమునన్. ౨౯

అధికపాఠము, ఒకటవ సర్గము సంపూర్ణము.

---

౨ - వ సర్గము.

శునకము శ్రీరామునితోఁ దనవృత్తాంతమును జెప్పుకొనుట.

క. ధరణీశునియానతి విని, త్వరగాఁ జని లక్ష్మణుండు ♦ శ్వానముఁ బిలువం
బరుగిడుచు వచ్చె నది శ్రీ,వరునకు సద్దానిఁ జూపె ♦ వచ్చె నటంచున్. ౧

చ కనుఁగొని శ్వాన మాద్యుతిని ♦ గ్రన్ననఁ బల్కె వివక్షితార్థమున్
మనమున భీతిలేక యొక♦మాటయుఁ దాఁపక చెప్పుకొ మ్మటం
చన విని రామభూపతికి ♦ నాత్మశిరంబును భిన్నమైనదా
నిని వడిఁ జూపి యిట్లనియె ♦ నీవు ప్రభుండవు కర్త వన్నిటన్. ౩ 2552

క. భూతములం బాలింపఁగ, నేతఱి నేఁ దప్పుచేయ ♦ నెఱిఁగి విధిహితం
బై తగు శిక్ష నొనర్పఁగ, భూతలపతి వీవ తగుదు♦వో సత్యముగన్. ౪

క. జనములు నిద్రించుతఱిన్, జనపతి మేల్కొనియె వారి ♦ సంరక్షించున్
వినుతంబగు నీతిని గాచును ధర్మము చెడకయుండ ♦ క్షోణీశ్వరుఁడే. ౫

చ. నరపతి ప్రోవకుండిన జ♦నంబులు చత్తురు వేగ కావునన్
ధరణివిభుండె కర్త నత♦త ప్రియపాలకుఁడైన తండ్రియా

నరయఁగఁ గాలమూ యుగము ♦ నాతఁడెయా జగ మెల్ల నాతఁడే
నరిగ ధరింప ధర్మమునఁ ♦ జాలును దానన యెల్లమానవుల్. ౬ 2555

క. పరివృద్ధి నొందుదురు నూ!, చరాచరంబైన యిట్టి ♦ జగ మెల్లను దా
ధరియించుఁ గాన ధర్మమె, పరమంబగు శత్రురాజి ♦ పరుగిడు దానన్. ౭

క. మనుజుల రంజిలఁ జేయుచు, జనపతి ధర్మంబు గావఁ ♦ జను నందుననే
తనరును ధర్మంబని సజ్జను లాడిరి గాన నితఁడె ♦ సకలాధిపుఁడౌ. ౮ 2557

తే. పరమధర్మం బితండె స♦త్ఫలముఁ గంటి
ధర్మమునఁ బొందరానిది ♦ తలఁప లేదు
ధరణినంచుఁ దలంచెద ♦ దానదయలు
సజ్జనుల పూజ వ్యవహార♦సరణి యందు. ౯ 2558

క. అకుటిలభావము నొందుట, సకలక్షత్రియుల కెన్న ♦ శాశ్వతధర్మం
బిఁక రాముఁడె గురుధర్మముఁ, బ్రకటగతిం గాచుచుంటఁ ♦ బరికించితిఁగా.

సీ. రామచంద్రా! పర♦రాజభయంకరా! సువ్రతా! నీవె యీ♦క్షోణిఁ గల్గు
నట్టిప్రమాణంబు♦లందుఁ బ్రమాణభూతుఁడవు నీధర్మంబు ♦ తోఁచె నాకు
సజ్జనాచరితమై ♦ సతతంబు వెలయుట; ధర్మములకు నీవె ♦ ధామ మరయ
సద్గుణమ్ముల కీవు ♦ సాగరోపముఁడవు తెలివియే లేని నేఁ ♦ దెలిసినట్లు
తే. పలుకఁ జొచ్చితి నేమేమొ ♦ పరమభక్తి
శిరసు వంచి నమస్కరిం♦చెదను నీకుఁ
గోప మొందకు మీలాగు ♦ కుక్క పల్కె
నంచుఁ బలికెడు దానివా♦క్యముల వినుచు. ౧౩ 2560

చ. క్షితిపతి పల్కె నేమిపని ♦ చేయఁగనౌ వడిఁ బల్కు సమ్మకం
బు తగును నీకు నాఁగ విని ♦ భూపతితో నిటు పల్కెఁ గుక్క; భూ
పతివర! ధర్మయుక్తిగనె ♦ పాలన మొప్పఁగఁ జేయు దీవు సం
తతమును ధర్మముం దెలియఁ ♦ దద్దయుమోదము నొందు దర్మిలిన్. ౧౪

క. శరణమె ధర్మంబని నీ, వరయుదు వద్దాన భయము ♦ లన్నియుఁ దొలఁగున్
ధరణీశ! మనవిచేసెద, జరగినకృత్యంబు వినుము ♦ చక్కఁగ నింకన్. ౧౫

చ. కలఁ డొకభిక్షు వాఘునుఁడు ♦ ద్విజాసురగేహమునన్ వసించు ని
మ్ముల సకలార్థసిద్ధులను ♦ బొందిన యాయతి యొక్కఁడేని త
ప్పొలయుని నన్నుఁ గొట్టె నిదె ♦ యుత్తమపుస్తకమందు; హేతువే
కలుగదు దాని కారయఁగ ♦ గాఢతరంబుగ నేఁచె న న్నిటన్. ౧౬ 2563

చ. అన విని ద్వారపాలకుని ♦ నప్పుడె పంపి రఘూద్వహుండు భి
క్షుని సకలార్థకోవిదుని ♦ క్షోణిసురేజ్యుని బిల్వఁ బంచె; సం

తనతఁడు తీవ్రతేజుఁడు ఘ♦నద్యుతి రామునిఁ గాంచి భూపతీ!
యనఘ! ననుఁ నభాస్థలికి ♦ నాద్యుతిఁ బిల్వఁగఁబంచినారుగా. ౧౮ 2564
క. పని యేమొ తెల్పుఁ డన విని, జనపతి యాభిక్షువుఁ గని ♦ చక్కని ప్రీతిం
గనఁబఱచి పల్కె; భూసుర!, శునకముఁ బ్రహరించి తేల?♦చోద్యము గాదే!
తే. ఏమి యపకృతి నీకు నీ♦యిది యొనర్చె
దండమునఁ గొట్టఁ దగినట్లు; ♦ దారుణమగు
క్రోధమే ప్రాణహారమగుఁ ♦ గ్రోధ మెన్న
మిత్రముగఁ గానఁబడెడు న♦మిత్ర మగును ౨౦ 2566
సీ. అతితీక్ష్ణమగు ఖడ్గ ♦ మనఁ గ్రోధమే సుమీ సకలంబు ముచ్చిలఁ♦జాలుఁ గ్రోధ
మరయఁ దపంబులు ♦ యజ్ఞదానంబులు భక్తిఁ జేసిన నవ్వి ♦ భస్మములగుఁ
గ్రోధంబునం గానఁ ♦ గ్రోధంబు విడనాడఁగాఁదగు నింద్రియ♦గణము చాల
దుష్టమౌ నదియును ♦ దొందఱగాఁ బోఱు నశ్వమ్ములట్లు ధై♦ర్యమున నరుఁడు
తే. తాను సారథికృత్యంబుఁ ♦ దగును జేయ,నింద్రియములకుఁ గన్పడు♦నట్టివస్తు
వద్దికని పెట్టి మెలఁకువ ♦ నవనిదేవ!,మనసుచే వాక్కునం గర్మ♦మునను దృష్టి.
క. కనిపెట్టి చక్క నడుపం, జనునతనికి శ్రేయ ముబ్బు ♦ శత్రువు కనరాఁ
డనుమానింపందగు దా,నినిఁ గాంచఁగ లేఁడు ధరణి ♦ నిర్జరవర్యా!. ౨౨ 2568
తే. క్రోధదారుణఖడ్గంబుఁ ♦ గొనఁగ రాదు
కరమునం దాల్ప వధియించు ♦ గనఁబడినది
యెల్ల దురనుష్ఠితంబగు ♦ నెవనిచిత్త
మంతకంటె విరోధి యీ♦యవని లేఁడు. ౨౩ 2569
క. మనుజుఁడు వినీతవినయుం, డనఁబరఁగినఁ బ్రకృతి యతని ♦ నాకర్షించుఁ
విను మాచ్ఛాదించినఁ బ్రకృతిని నది కార్యంబులందుఁ ♦ దేఁకువ నొందుఁ.
తే. మార్పు నొందదు దాఁచిన♦మాత్రమునను
యని రఘూద్వహుఁ డాడిన ♦ మనుజులకును
గష్టమిడు కర్మములఁ జేయఁ ♦ గడఁగని పతి
పలుకు లాలించి యాద్విజ♦ప్రవరుఁ డంచి. ౨౫ 2571
క. రామునితో నిట్లనియెఁ, భూమీశా! కోపకలిత♦బుద్ధిని నేనే
యీమాడ్కిఁ గొట్టితిని విను, మోమాన్యా! కారణంబు♦నొగి నెఱిఁగింతుఁ.
సీ. భిక్షార్థ మిప్పొట ♦ వీథులఁ దిరుగుచు నుంటినే నత్తఱి ♦ నొక్క భిక్ష
మేని నా కొదవద♦యెంను వీథినిలుచున్న యీశ్వానమునుగాంచి♦యేగుమవల
నంటిని స్వేచ్ఛగా ♦ నరుగుచు నీకుక్క దారి కడ్డంబుగాఁ ♦ దాను నిలిచి
యుండె నాఁకలిగొని ♦ యుండినవాఁడను గానఁ గ్రోధంబున ♦ నేను దీని
తే. గొట్టినాఁడను రాజేంద్ర! ♦ క్రూరకర్మ
మిద్ది యపరాధి నేఁ గాన ♦ నెంచి శిక్ష

నాకు విధియింపుమా దండ♦నమును బొంది
నరకభయముక్తిఁ గందు భూ♦నాథచంద్ర!. ౩౦ 2573

చ. అన విని యానభం గలుగు♦నట్టి మహాత్ముల నేమి పాచితం
బని రఘురాముఁ డాదృతిని ♦ నందఱుఁ బ్రశ్న మొనర్చి యెట్టిదం
డన మిపు డీయఁగాఁ దగు మ♦నంబున నెన్నుఁడి యర్హశిక్ష చే
సినఁ బ్రజ లెల్ల రక్షితులు ♦ చెచ్చెఱఁ బల్కుఁడటన్న నాసభల్. ౩౧ 2574

ఆ. అంగిరసుఁడు, కుత్సుఁ, ♦ డాభృగుకాశ్యపు, లవ్వసిష్ఠుఁ డింక ♦ సర్వధర్మ
పారకులగు మంత్రి♦వర్యులు పౌరులు, నింకఁ గలుగు పండి♦తేంద్రు లెల్ల.

చ. మనమున నెంచి యెంచి పలు♦మాఱులు చక్కఁగ నిశ్చయించి యి
ట్లనిరి వధింపఁగాఁ దగఁ డి♦లానురుఁ డంచు మహాత్ము లెల్లఁ జె
ప్పిన వినియుందు మేము పృథి♦వీవర! క్షత్రియధర్మ మిట్టులే
తనరును నాఁగ రాముఁ డిది ♦ తథ్యము గావున నెంచి పల్కుఁడీ!. ౩౪ 2576

క. అనినన్ మును లారసి యి,ట్లనిరి మహీపాలకుండె ♦ యుష్టుఁడు దండిం
పను నీవు విశేషించియు, ఘనబుద్ధివి త్రిజగములకుఁ ♦ గర్తవు నీవే. ౩౫

క. అనువుగ దండింపను నీ, వనూనశక్తిం జెలంగు ♦ నరయంగ సనా
తనుఁడవు విష్ణువు నీవే, యని పలుకుచు నుండ శ్వాన ♦ మపు డిట్లనియెన్.

చ. ధరణిప! తృప్తి నొంది సత♦తంబును నాయెడఁ బ్రీతి నొందుదే!
వర మొకఁ డీయఁగా దగు ధ్రు♦వంబుగ నాకుఁ బ్రతిజ్ఞ చేసి తీ
వురుకరుణాఢ్య! యేమి వల♦యుం బని చెప్పుము దానిఁ దీర్తు నే
నరసి యటంచు దానికను ♦ యాదృతి వేఁడఁగ నెంచితిం జుమీ!. ౩౭

*క. దేవాగారపతిత్వం, బీవిప్రున కిమ్ము చాలు ♦ నిదియే వరమా
భూవల్లభ! నాకు ననం,గా విని శ్రీరాఘవుండు ♦ తద్ద్విజునకున్. ౩౮

సీ. కాలాధిపత్యంబు ♦ కఠినశిక్షగఁ గోరి శునకంబు చెప్పిన♦చొప్పున నవు
డభిషేక మొనరించి ♦ యావిప్రు గజమూర్ధమున నెక్కఁ జేసి చ♦క్కనివిధులను
బూజింపఁగా మంత్రి♦పుంగవు లాశ్చర్యకలితులై యిట్లని ♦ పలికి రవుడు
పర మిద్ది కుక్క కో♦ధరణీశ! యిచ్చితి రిది శాప మెల్లా న♦హీనతేజ!

తే. యనఁగ విని రామచంద్రుఁ డి♦ట్లనియె మనము
దీనికారణ మెఱుఁగము ♦ శ్వాన మెఱుఁగు
దాని నడిగెద నంచని ♦ తాను ప్రశ్న
మొప్పఁగాఁ జేయ, నిట్లని ♦ చెప్పె నదియు. ౪౧ 2581

క. నరవర! నేఁ గులపతినై, చిరకాలం బుంటి నచట ♦ శిష్టాన్నం బా
దరమునఁ దినుచున్ సురభూ,సురపూజలయందుఁ జాల ♦ శుభచిత్తుఁడనై. ౪౩

---

* ప్రయచ్ఛ బ్రాహ్మణ స్యాస్య కాలపత్యం నరాధిప-అనిమా.

తే. ద్రవ్యమును బంచి పెట్టుచుఁ ♦ దగినరీతి, దేవతా ద్రవ్యరక్షణం ♦ బావిధమునఁ
గాచుచుఁ శీలవినయముల్ ♦ గ్రాలుచుండ, సర్వసత్వహితుండనై ♦ సంచరించి.

క. చిరకాలము గడపితి భూ,వర! యధమాధమ మటంచుఁ ♦ బలుకం దగుదు
స్తరమైనయీాయవస్థను, గరము విచారమునఁ బొందఁ ♦ గల్గితి నిచటన్. ౪౪

సీ. నావలెనే ద్విజ♦నాథుఁ డీతఁడు క్రోధసంయుతుం డచ్చటఁ ♦ జనఁగవలయు
నెవఁడు క్రోధం బూని ♦ యెపుడు నృశంసుఁడై యపగతధర్ముఁడై ♦ యనుపలబ్ధ
విద్యుఁడై యుండు నా♦విప్రుండు పదునాల్గు జన్మంబులందు దు♦స్తరతరాఖ్య
కూపంబునం బడి ♦ కుందును గావునఁ గొలపత్యం బ దే♦కాలమందు

తే నిష్టపడకుండుసుజనుల ♦ కెల్ల నెవఁడు
నరకమునను సపుత్ర బాం♦ధవయుతముగ
నరుగఁ గోరునో దేవతా♦యతనపతిగఁ
జేయఁదగు వానిఁ గరుణాఢ్య! ♦ శ్రీరఘువర. ౪౭ 2585

క. ధేనువ్రాతంబులవయి, భూనిర్జరవితతిపైనఁ ♦ బూనుపఁదగుఁ జు
మ్మా నేఁ జెప్పినయధికృతి;, భూనాథా! క్షితిసురస్వ♦మున్ సురధనమున్. ౪౮

క. వనితా బాలద్రవ్యం,బు నెవ్వఁడేఁ దొంగిలింపఁ ♦ బూను నతఁడు మి
త్రనిచయయుతుఁడై నాశం,బును గను, సురభూసురస్వ♦మున్ రఘునాథా!

క. పరికింపక కైకొను నా,నరుఁ డొందును వీచి యనెడు ♦ నరకంబును దు
స్తరమైనదాని; మది నే,సురభూసురవిత్తరాశి ♦ నులువని కొనఁగన్. ౪౯

క. తలఁచునో యాతఁడు ఘోరం, బలఘుతరంబైన నరక♦ముందుం బడు; భూ
పలలామా! యనుశునకపుఁ,బలుకులు విని విస్మయమునఁ ♦ బార్థివపతియున్.

తే. నేత్రయుగ్మము వికసింప ♦ నెమ్మిఁ బొదలె
శ్వాన మారామచంద్రునా♦జ్ఞను శిరంబు
నందుఁ దాలిచి తేజంబు ♦ నలరఁ జనియె
వచ్చినట్టులె; కుక్కయు ♦ పరమతి దగ. ౫౧ 2590

క. తనజాతిని స్మరియించుచు, జననము మాత్రమున నపయ♦శంబుఁ గనుచుఁ గా
శిని నివసించెను బ్రాక్కృత,మున కెంతయు నాత్మయందుఁ♦బొగులొదవంగన్.

అధికపాఠము, రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - సర్గము.

గృధ్రోలూకోపాఖ్యానము.

క. తరువాత నొకవనంబున, నిరతసుఖం బబ్బుచోట ♦ నివసించె మనో
హరగృధ్రోలూకంబులు, ధరణీధరనికటమందుఁ ♦ దద్వన మలరన్. ౧ 2592

చ. తరునికరంబు రమ్యముగఁ ♦ దద్వనసీమ వెలుంగుచుండు దు
స్తరనది యొండు సంతతము ♦ చక్కఁగఁ బాఱుచునుండు సింహముల్
గురుతరభల్లుకంబులును ♦ గుంపులుగాఁ దగు వ్యాఘ్రసంతతుల్
కరము భయంకరంబులయి ♦ క్రాలుచునుండుఁ జెలంగుఁ బక్షులున్. ౨ 2593

చ. పికములు కూయఁ దుమ్మెదలు ♦ పెంపు దలిర్పఁగ ఝంకృతుల్ మనో
జ్ఞకముగ నల్ప కూబయును ♦ జక్కనిగృధ్రము చాలవర్షముల్
సకలసుఖంబు లిచ్చుటకుఁ ♦ జాలిన యావనమందు నుండఁగా
నొకదినమందుఁ బాపమతి ♦ నొప్పెడు గృధ్ర ములూకసద్మమున్. ౫ 2594

చ. తనదని వాదులాడుటకుఁ ♦ దార్కొనె; నయ్యది పుండరీకలో
చనుఁ డఖిలేశ్వరుండు రఘుసత్తముఁ డయ్యెడనుండు నచ్చటం
జని యిది దేనిదో యనుచుఁ ♦ జక్కఁగఁ జెప్పుకొనంగ నాతఁ డొ
ప్పినగతిఁ దీర్చు నీతగవు ♦ వేగమ పోవుద మంచు నత్తఱిన్. ౮ 2595

చ. మనముల నిశ్చయించుకొని ♦ మండెడు కోపము నీర్ష్యయుం దగన్
జని రఘురామచంద్రుఁ గని ♦ స్వాంతము లాకులతం గనంగ నా
తనిచరణారవిందములఁ ♦ దాఁకి నమస్కృతి సల్పి యొర్వలే
మిని నితరేతరంబు మది ♦ మించెడుక్రోధరసంబు పొంగఁగన్. ౬ 2596

క. నిలుచుండె; నంత గృధ్రము, పలికెన్ దేవాసురులకుఁ ♦ బతి వీవె ఖగం
బులమగు మాకుం జెప్పఁగ,వలెనే ప్రభు వీవె యనుచు ♦ వసుధానాథా!. ౭

క. గురుశుక్రులకంటె మతి,స్ఫురణంబున శ్రేష్ఠుఁడవుగ ♦ శోభిలుదువు నీ
వరయఁగ నెల్లరపగు నం,తరముల నెఱుఁగంగఁ జాలు ♦ దక్షుఁడవు సుమీ.

సీ. కాంతిచే శశిమించఁ♦గాఁ జాలుదువు నీవు సూర్యచందంబునఁ ♦ జూడరాని
యట్టి తేజంబున ♦ నలరుచునుందువు గౌరవంబున హిమ♦త్క్ష్మాధరమున
కెనయగుదువు సంద్ర♦మును బోలుగాంభీర్యగులగులో కేశుల♦యందు యముని
చందంబునం జండ♦శాసనుండవు నీవు శమమున నిలతోడ ♦ సముఁడ వరయ

ఆ. ననిలుసాటిచేయ ♦ నర్హుఁడ వతిజవ
మునను సత్వయోగ♦మున గురుఁడవు
యశముగల్గువాఁడ ♦ వతిదుర్జయుఁడ వీవె
విజయశాలి వగుచు ♦ వెలయు దీవు. ౧౦ 2599

క. అనుపమశాస్త్రాభిజ్ఞుఁడ, వనూనబలశాలి వీవ ♦ యగుదువు రామా!
మనవి యొనర్చెద దీనిన్, వినవలయు మహామహేంద్ర! ♦ వినుతగుణాఢ్యా!.

చ. నిలయము నేను గట్టుకొన ♦ నిర్భయరీతి నులూక మిద్ది యి
మ్ముల గురుబాహువీర్యమున ♦ భూపవరా! హరియించె దాని నా

కలవియె పోర నీవె యిపు ♦ డాలయహర్తను శిక్ష చేయుమా
చెలఁగెడు సత్కృపాఢ్యుఁడవు ♦ చెప్పఁగ నేర నిఁకేమి యంచనన్. ౧౨ 2601

క. విని యిట్లనియె నులూకం, బనఘా! శశిసూర్యవజ్రి♦యమధనదులనుం
డి నరేశుఁడు పుట్టునుగా, మనుజత యినునంతె దేవ♦మయుఁడ వగుదువూ!.

క. నారాయణుఁడవు నీవనఁ,గా రాజిల్లుదువు చాలఁ♦గా సౌమ్యత నీ
చారుముఖంబునఁ గన్పడు, నారయ సోమాంశభవుఁడ ♦ వౌటఁ దెలుపుచున్.

తే. కోప మొందఁగ దండింపఁ ♦ గూర్మి నీయఁ
బాపభయముల మాన్పంగఁ ♦ బ్రభుఁడ వీవె
దాతవయి హర్తవగుచు ను♦ద్దామగోప్త
వగుచు నింద్రుఁడవయి నీవె ♦ యలరు దెవుడు. ౧౬ 2604

క. భూతవ్రాతంబు లవే, యేతఱినైనం గలంప ♦ నెంచిన నిల నే
రీతిన్ శక్యముగాకయె, భూతలవర! తేజమునను ♦ బొలుతు శుచి యనన్.

క. లోకము వెలుఁగం జేయుట, నాకసులాప్తునివిధంబు ♦ నారయఁ గను దో
భూకాంత! ధనదతుల్యుఁడ, వో కడు నధికుండవో మ♦హోన్నతిఁ గనఁగన్.

క. ధనపతిచెంతనె పద్మయుఁ, దనరున్ నీయందు సిరిస♦తంబును వెలయున్
ధనదుఁడు కోపంబున నొ,ప్పును గోపము లేక నీవు ♦ పొల్తు ధనదతన్. ౧౯౫

తే. సర్వభూతసముండవు ♦ స్థావరములు
చరములగుభూతముల్ నిన్ను ♦ సముఁడ వనుచుఁ
దలఁచు శత్రువునందు మి♦త్రులపయి నొక
విధముగా నీదుదృష్టియు ♦ వెలయుఁ జుమ్ము. ౧౯౫ 2608

సీ. ధర్మంబుచేత ని♦త్యంబు శాసింతువు వ్యవహారమందుఁ ద♦ప్పదు గద విధి
యెవనిపైఁ గోపింతు ♦ మృత్యు వాతనివంకఁబనుగిడుచుండును♦ బార్థివేంద్ర!
కావున యముఁ డనఁ♦గాఁ గీర్తి నొందుదు వమితవిక్రముఁడవే ♦ యౌదు వీవు
మనుజత్వ మనునది ♦ మనుజేశ! నీయందుఁ గరుణారసముఁ జూపఁ♦గాఁ దగె నని

ఆ. పలుకవచ్చు; భూత♦ములయందు క్షమగల్గి
యలరు దీవు శరణ ♦ మనఁగ లేక
దుర్బలుండు నగుచుఁ ♦ దోఁచుమానవునకు
బలము ప్రభువె కాఁడె ♦ లలితశీల!. ౨౨౫ 2609

క. నయనవిహీనున కీవే, నయనము గతి లేనియట్టి ♦ నరునకు గతినీ
వె యగుదు మా కెల్లను మతి,నియతా! నాథుండ వీవె ♦ నృపతివరేణ్యా!. ౨౩

చ. విను మిఁక నీవు నాదయిన ♦ విన్నప మో జనపాల! గృధ్ర మొ
ప్పునివిధి నాదుగేహమును ♦ బల్మిని జొచ్చిన దంతెకాక నా
కనిశము బాధఁ గూర్చెడి, మ♦హాగుణ! దేవమనుష్యులందు నీ
వె నియతశాస్త వౌదు వని ♦ యేమియుఁ బల్కకయున్న రాముఁడున్. ౨౪౫

క. విని దానివాక్యములు చ,య్యన మంత్రులఁ బిల్వఁబంచె ♦ నంత జయంతుం
డును ధృష్టియు సిద్ధార్థుం, డనుమంత్రియు విజయనాముఁ♦డగు సచివుండున్.

తే. ధర్మపాలుఁడు రాష్ట్రివ♦ర్ధనుఁ డశోకుఁ
డాసుమంత్రుండు ననువార ♦ లర్కవంశ
సత్తముం డగు రాముని ♦ సచివు లతని
జనకునకుఁ గూడ వారలే ♦ సచివు లెపుడు. ౨౭ 2613

తే. నీతియుక్తులు గురుమతుల్ ♦ నిఖలశాస్త్ర
కోవిదులు ప్రీతియుక్తులు ♦ కులఘును లిల
మంత్రనయకోవిదులు గాన ♦ త్క్ష్మావరుండు
వారలను బిల్వఁబంచి పు♦ష్పకము నాత్మ. ౨౮ 2614

క. తలఁపఁగ నది రాఁగా వా,రలతో నద్దాని నెక్కి ♦ రయమునఁ జని కా
నలనున్న యానివాసము, సులువుగఁ గని వాని నడిగె ♦ సుస్మిత మొప్పన్. ౨౯

తే. గృధ్రమా! యీగృహంబు నీ ♦ వెన్నియేండ్ల
క్రిందటం గట్టితివి శంక ♦ డెందమందుఁ
గల్గకుండ వచింపుమా ♦ కారణంబు
నెఱుఁగుదేఁ దత్త్వముగ నంచు ♦ నృపుఁడు పలుక. 30 2616

క. విని గ్రద్ద యిట్లు పలికెన్, జననాథా! ధరణి మనుజ♦సంతతిజననం
బును గాంచి యాక్రమించిన, దినంబునుండియె గృహంబి♦దియిచటనలరున్.

చ. అనిన నులూక మిట్లను గృ♦హం బిది పాదపసంఘశోభితా
వని తగ నద్ది యాదిగను ♦ భవ్యముగా నలరారు రాఘవా!
యన విని రాముఁ డానభను ♦ నంతటఁ గాంచి నిజంబు గన్గొనన్
మనమున నెంచి యిట్లనియె ♦ మంజులవాఙ్మహిమంబు గన్పడన్. 33 2618

చ. *అనిశము వృద్ధు లుండని స♦దా సభ యెట్టులు? ధర్మమున్ వచిం
పనియెడ వృద్ధు లౌదు రెటు? ♦ పావనసత్యవిహీనమైనచో
ననఁబడు నెట్లు ధర్మమని? ♦ యద్దియు వ్యాజము గల్గునట్లు చె
ప్పిన నది సత్య మెట్లగును? ♦ బృథ్విని గీర్తిని గాంచు నెవ్విధిన్?. 3౪ 2619

తే. సభ్యు లెవ్వరు విషయంబుఁ ♦ జక్క నెఱిఁగి
యూరకుందురో తెలిసిన ♦ దొక్కయింత
యైనఁ బల్కక వారెల్ల ♦ ననృతవాదు
లనఁగఁ బరఁగుదు రని పెద్ద♦లనఁగ వినమె?. 3౫ 2620

తే. విషయ మెఱుఁగఁగఁ బ్రశ్నించు♦విధ మెఱింగి
పల్కకుండునో క్రుధచేత ♦ భయముచేతఁ

* న సా సభా యత్ర న సంతి వృద్ధాః వృద్ధా న తే యే న వదంతి ధర్మమ్, నాఽసౌ ధర్మోయత్ర న సత్య మస్తి న త త్సత్యం యచ్ఛలే నానువిద్ధమ్-అనిమా.

గామనం యుక్తిచేతనే ♦ గాని వరుణ
పాశబద్ధాత్ముఁడౌను దప్పక యతండు. ౩౬ 2621

కం. ఒకవర్షము గడువంగా, నొకపాశము వదలఁ బూనుచుండును గానన్
ప్రకటింపవలయు సత్యము, వికలమతిన్ దాని నెప్డు ♦ వీడం జనునే. ౩౭

చ. అన విని రామచంద్రునకు ♦ నానచివుల్ బదులిచ్చి రిట్టులో
జనవర! యీయులూకము నిజంబు వచించెను గృధ్రవాక్యముం
గొనఁ దగ దంచుఁ దోఁచెడిని ♦ క్షోణివిభుండవు గాన నీవె తీ
ర్పునకుఁ బ్రమాణభూతుఁడవు ♦ భూపతియే గతియండ్రు పండితుల్. ౩౮

కం. రాజాశ్రయులే ప్రజలయి, యీజగతిన్ వెలయుచుండ్రు ♦ నృపుఁడె స్థిరతర
భ్రాజితధర్మము నరపతి, యేజనులకు దండనంబు ♦ నిడునో వారల్. ౩౯

కం. యమపాశముక్తులై పురు,షమండనులె యూచు నీచ♦నరణికిఁ జనకే
ప్రమదము నొందుదురనియెడు, నమాత్యసూక్తులనువినుచు♦నారాముఁడనున్.

చ. వినుఁడు పురాణసంతతిని ♦ విస్తృతమై తగు సర్గమేను జ
క్కనిగతిఁ దెల్పువాఁడ; హిమ♦కాంతుఁడు సూర్యుఁడు తారకోత్కరం
బును ధరణీధరంబులును ♦ బొల్పుగునట్టి వనంబులున్ గడుం
గనఁబడ నొప్పునంబరము ♦ గంధిమహాజలపూర్ణమౌ తతిన్. ౪౧ 2626

కం. చర మన నచరం బనఁగాఁ, బరఁగెడు త్రైలోక్య మబ్ధి♦పయమున మునుఁగన్
గిరివరమగు మేరువునాఁ, బురుషుం డొకఁ డొప్పె నప్డు ♦ పొలుచురుచులచేన్.

కం. తొలుదొలుత లక్ష్మితో నీ, యిల విష్ణువుజఠరమందె ♦ యింపుగ నడఁగెన్
సలిలరుహాక్షుం డాధర, విలాసమున సంగ్రహించి ♦ విపులాంబుధినిన్. ౪౩

తే. చొచ్చినిద్రించెఁజిరకాల♦మిచ్చవచ్చి,నట్లుభూతాత్ముఁడగు దేవుఁ ♦ డతఁడెయిట్లు
విష్ణుమూర్తిని ద్రింపంగ♦వేధ యతని, జఠరమునుజొచ్చినంత నా♦సంశయుఁడగె.

సీ. మార్గంబు లేకుంట ♦ మది నెఱింగియె బ్రహ్మ యోగపరుండగా♦నొప్పి యంత
విష్ణునాభిని హేమ♦విమలాబ్జ ముదయింపఁ దన్మార్గమున విధి ♦ తా వెలువడి
యోగియై ప్రభువయి♦యురు తేజమునఁ బొల్చి సృష్టిచేయఁగ మది♦నిచ్చయించి
పృథ్విని వాయువు ♦ వెలయించి భూరుహవ్రాతంబుతోఁ గూడఁ ♦ బర్వతముల

తే. ధరణిఁ బుట్టించి వానియం♦తరములందుఁ
బ్రజల సర్వంబులను జరా♦యుజముల మఱి
యండజంబుల సృజియించె ♦ నతులతపము
కలిమిచేతఁ జమత్కృతి ♦ వెలయు రీతి ౪౫ 2630

కం. అతనికర్ణమలంబుల, నాతఱి మధుకైటభు లను♦నట్టి దనుతనూ
జాతులు గురువీర్యులు ఘోరాతతదేహులును గల్గి ♦ రరిదుర్జయులై. ౪౬

క. దనుజులు వారు ప్రజేశునిఁ, గని క్రోధావిష్టులై రి ♦ కడుజవ మొప్పం
గను వారు బ్రహ్మమార్గ్యునఁ, గను బరుగిడి; రంతనార్చెఁ♦గమలభవుండున్.

క. అరవ మది వికృతంబై, ఘోరంబై పరఁగె నట్టి ♦ కూయి వినుచునే
వా రిరువురు హరియొద్దకుఁ, జేరిరి మర్దింప బాహు♦చేష్టలు వెలయన్. ౫౦

క. హరి చక్రప్రహరణమున, మరణము నొందించె నప్డు ♦ మధుకైటభులన్
దరువాత వారిమేద, స్స్ఫురణంబున వెలయఁజేసె ♦ క్షోణిని నెల్లన్. ౫౧

తే. సుగల శ్రీహరి లోకైక♦ధరణుఁ డంతఁ, జక్క శోధించి మేదినీ♦స్థలము నెల్ల
వృక్షసంపూర్ణమగునట్లు ♦ వెలయఁ జేసె, నోషధులుసర్వసస్యంబు♦లొక్క రీతి.

క. ధరణిని వేర్వేఱుగ నా,తరుణంబున నుద్భవించె ♦ దానవమేద
స్స్ఫురణంబున జనియించుటఁ, బరఁగెన్ మేదిని యనంగఁ♦బ్రథితయశమునన్.

క. కనుక నులూకగృహంబే, యని తోఁచెడు నాదుమదికి ♦ నరయుఁగ గృధ్రో
క్తినిఁ బట్టి తలఁచినన్ గృ,ధ్రని కేతన మిద్ది కాదు ♦ తథ్య మ్మిదియా. ౫౨

క. కావున గ్రద్ధకు దండన,మే వలయున్ బాపబుద్ధి ♦ నిది పరగృహమున్
జేవం గైకొనియెను నొరు, జీవనహానిగను బీడఁ ♦ జేయు సతంబున్. ౫౩

ఆ. దుర్వినీతసుగుచుఁ ♦ దోఁచినరీతిగా, సంచరించు ననెడు ♦ సమయమందు
నంతరిక్షసీను ♦ నావిర్భవించెఁ జ,క్కఁగను వార్త యొకటి ♦ కడుజవమున.

క. ధరణీశా! వధియింపకు, పరనుతపోబలముచేత ♦ భాసిల్లు మునీ
శ్వరుశాపయుక్తిఁ గ్రాలెను, నరవరుఁ డీతండు తొలిజ♦ననమునఁ జుమ్మా!.

క. గౌతమముని శాపంబున, నీతం డొగి దగ్ధుఁడయ్యె ♦ హితకాంక్షి యగున్
సీతానాథా! శూరుఁ, డీతఁడు సత్యైకవాది♦యే యగుఁ జుమ్మా. ౫౬

ఆ. బ్రహ్మదత్తుఁ డనఁగఁ ♦ బరఁగును బరిశుద్ధ
వర్తనుండు రాము ♦ బ్రాహ్మణుండు
మునుపు త్రోవఁ బోవు♦చును భోజనముఁ గోరి
యితనియిల్లు చేరి ♦ యిట్లు పలికె. ౫౮ 2642

క. శతవర్షంబులు చక్కఁగ, హితభుక్తిం గూర్పవలయు ♦ నృపసత్తమ! నా
క్షితిపతి పాద్యం బర్ఘ్యం, బతనికి భక్తిని నొసంగి ♦ యాదర మొప్పన్. ౫౯

చ. మనమున కింపుఁ గూర్పఁదగు ♦ మాంసము నాదినభుక్తికై ముదం
బును గలిగించునంచు ముని♦ముఖ్యునకున్ సమకూర్చె; నంత నా
మునిపతి క్రుద్ధుఁడై యపుడె ♦ భూపతి కార్తిదశాప మిచ్చె; నం
త నతఁడు బ్రాహ్మణోత్తముని ♦ దారుణచిత్తునిఁ గాంచి యిట్లనున్. ౬౦

తే. వలదు వల దిట్టి శాపంబు ♦ బ్రహ్మహాని
ధర్మవేత్తవు తెలియక ♦ తప్పు చేసి

నాఁడ దయయుంచి సద్వ్రతా! ♦ నాకు శాప
మెపుడు తీరునొ చెప్పుమా ♦ యింతె చాలు ౬౧ 2645

క. అనఘా! దారుణశాపం, బని చెప్పం దగును దీని ♦ నారసి మోక్షం
బును జెప్పుమా! మహాత్మా!, యన నజ్ఞానమునఁ జేసె ♦ నట్లని మునియున్.

చ. మనమున నెంచి రాజుఁ గని ♦ క్ష్మాపతివర్యకులంబునందుఁ దా
జననము నొందు రాముఁ డను ♦ సద్యశ మొప్పు మహాత్ముఁ దర్కవం
శనిధిని బ్రోవఁగాఁ దగిన ♦ శౌర్యఘనుండును బుండరీకలో
చనుఁడు మనోజ్ఞరూపగుణ♦శాలి యతండు స్పృశించు నెత్తఱిన్. ౬౩

తే. అపుడు నీపాపములు పాయు ♦ నట్టిసమయ
మింక మీఁదట రాఁగల ♦ దెలమిఁ గనుదు
వంచు నాకాశవాణి యి♦ట్లులరఁ బలుక
రాముఁ డాగృధ్రము స్పృశించె ♦ రమ్యపాణి ౬౪ 2648

సీ. గృధ్రరూపము మాని ♦ క్షితిపతిరూపుఁడై భవ్యగంధానులే♦పనము లలర
దివ్యరూపంబునఁ ♦ దేజరిల్లుచుఁ గనకాంబరాభరణంబు ♦ లధికరుచుల
నొసఁగుచు నుండఁగా ♦ ననదృశమూర్తియై శ్రీరామచంద్రుని ♦ జేరి పలికె
రామచంద్రా! సుధ♦ర్మజ్ఞ! సాధుస్వాంత! నీప్రసాదంబున ♦ నెమ్మి నాకుఁ

తే. గలిగె ఘోరాకృతిం దగి♦విలయకారి, నరకమై తోఁచు నీజన♦నమును బాయఁ
గల్గితిని శాపమోక్షంబు♦గల్గఁ జేసి, తీవు సుఖమును గంటి నో♦యినకులేశ!.

అధికపాఠము, మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - సర్గము.

శ్రీరామునికడకు మహర్షులు చనుదెంచుట.

క. జనపతియు లక్ష్మణుండును, మనమునఁ గల చింతతోడ ♦ మాటలఁ గాలం
బును బుచ్చఁగ వాసంతికిఁ, జనుదెంచెను రాత్రి యట్టి ♦ చాలసుఖదమై. ౧

క. శీతోష్ణము లధికముగా, నాతఱిఁ గల్గకయె యుండె ♦ నంతఁ బ్రభాతం
బాతతకర్మారంభము, ఖ్యాతము చనుదెంచె స్వచ్ఛ♦మై పావనమై. ౧½ 2651

క. తొలిపగటికృత్యముల నిమ్ములఁ దీరిచి యారఘూత్త♦ముండు సభకుఁ బౌ
రుల కెల్ల దర్శనం బిడి, యలరింపన్ వచ్చె నట్టి♦యవసరమందున్. ౨ 2652

క. చనుదెంచి సుమిత్రుం డి, ట్లని పల్కెన్ ద్వారమందు ♦ నధిపఋష ని
ల్చినవారు భార్గవచ్యవనుని ముందిడుకొనుచు సన్ము♦నులు రాజేంద్రా!. ౩½

మ. నిను దర్శింపఁగఁ గోరి యాతురమునన్ ♦ నీచెంతకున్ బుచ్చి రీ
నను మౌనుల్ యమునాతరంగిణికిఁ జెం♦తం గాపురంబుండు వా
రని తోఁచెన్ ద్వరఁ బూనినా రనెడువా♦క్యంబుల్ చెవిన్ సోఁక ధ
ర్మనిశాంతస్థిరుఁడైన రాముఁ డనియెన్ ♦ మౌనుల్ త్వరన్ రాఁదగున్. ౫

తే. భార్గవప్రముఖద్విజ♦వరులఁ ద్వరగఁ
బిలుచుకొని రమ్ము నా నతం♦డలరుచుఁ జని
ద్వారపాలుని కాజ్ఞను♦ బలుక నతఁడు
శిరమునం దాల్చి యపుడు దో♦సిలిని బట్టి ౯ 2655

సీ. ధర్మమూర్తులఁ దపో♦ధనులను మానుల రాముచెంతకును జే♦ర్పంగ వారు
స్వీయతేజంబునఁ♦ జెలువారుచును శతసంఖ్యగా శ్రీరాము♦సభకుఁ బోయి
రామహాత్ములు సుతీ♦ర్థాంబుసత్కృతపూర్ణకలశముల్ రాజిల్లు♦ కరము లొప్ప
ఫలముల వరమూల♦ములఁ గానుకగాఁ బెట్టి యాశీర్వదింపఁగా♦ నారఘుపతి
తే. వాని గ్రహియించి ప్రీతిచే♦ వఱలి వారి
కిట్లు వచియించె నోమహా♦ర్షి శులార!
యాసనము లివె మీకర్హ♦మై తనరెడుఁ
గూరుచుండుఁడు నాదగు♦కోర్కి దీర్ప. ౧౦ 2656

చ. అను రఘురామువాక్కుల మ♦హాద్భుతి మీఱఁగ నాలకించి యా
మునివరు లెల్ల హేమమణి♦భూషితమానితకార్హపీఠరా
జిని దమిఁ గూరుచుండ రఘు♦శేఖరుఁ డట్లుపవిష్టులైన యా
మునులను గాంచి హస్తములు♦ మోడ్చి సుభక్తిని బల్కె నీవిధిన్. ౧౧

ఉ. మీ రరుదెంచినట్టి పని♦ మేలుగఁ దెల్పుఁడు శంకలేక నేఁ
గోరికఁ జేయువాఁడఁ దమ♦కుం గల కార్యము లేను జేయువాం
ఛారతిఁ బూనియుందుఁ గద♦ సంతత శర్మము మీకుఁ గూర్ప నే
నారయుచుందు రాజ్య మిది♦ యంతయు నాదగు జీవితంబునున్. ౧౨ 2658
తే. మీకుఁగా వినియోగింతు♦ మేదినీసు
రార్థమే గద? యీరాజ్య♦ మరయ నృపుల
కలరు సత్యముగా దీని♦ ననుమతింపుఁ
డనఁగ విని మంచి దిది మంచి♦ యనుచుఁ బలికి. ౧౩ 2659

సీ. యమునాతటంబున♦ నలరు నామునివరు లమితమోదంబున♦ నాత్మవశ్యు
లగుట నిట్లని పల్కి; ♦ రవనీశ! సర్వంబు మాకుఁ గల్గెను మఱి♦ యేకడ నిటు
లుండదు రాజ్య మి♦ట్లాదవవు సుఖసంపదలు; బలశాలురౌ♦ ధరణిపతులు
చాలమంది గతించి♦ రోలిఁ గార్యపుగౌరవముఁ బట్టి యిట్టిశ♦పథము వారు
తే. చేసియున్నట్లువినలేదు♦ భూసురర్షి, గౌరవము పేర్మిఁ గారణం♦ బౌరయకయె
ప్రతిన నీకీతిఁ జేసితి♦ వతిశయమగు, శక్తిగలవాఁడ వగుట నో♦క్ష్మాపతీంద్ర!.
క. ఒనరింతు వెట్టికార్యం,బు నైన నేనంశయుంబు♦ బూనక పెనుభీ
తిని బొంది యున్న మముఁ జక్కనిరీతిం బ్రోవఁదగుదు♦గా శ్రీరామా!. ౧౪
తొంబదవ సర్గము సంపూర్ణము.

## ౬౧ - వ సర్గము.

-ఀఀ చ్యవనుఁడు రామునకు లవణాసురునివృత్తాంతమును దెల్పుట. ఀఀ-

చ. అని మునులాడ నారఘుకు♦లాగ్రణి మీకిటు భీతిఁ గల్గఁజే
సిన పని యేదొ తెల్పుఁడన ♦ శ్రీపతితుల్యుఁడు రామమూర్తి చె
ప్పిన విని భార్గవుం డనియెఁ ♦ బ్రీతి దగన్; వినుఁ డింతభీతి పు
ట్టినయులకారణంబును గ♦డింది విచారము దేశ మొందఁ జే
సినదగు హేతువుం దెలియఁ ♦ జెప్పెదఁ జక్కఁగ శ్రీరఘూత్తమా. ౨ 2662

చ. కృతయుగమందు మున్ను పృథి♦వీశ్వర! దోర్బలశాలి లోలకున్
సుతుఁడయి జ్యేష్ఠుఁడై వెలసె ♦ శూరశిఖామణియైన మధుండు ను
న్నతుఁడును జ్ఞానియై సుమతి♦యై పరిరక్షకుఁడై చెలంగి దే
వతలు మహాత్ములం చతఁడు ♦ భక్తిని బ్రీతిని నిల్పె వారిపై. ౪ 2663

చ. అనుపమవీర్యసంపదల ♦ నాతఁడు పొల్చియు ధర్మతత్పరుం
డను యశమొంది యీశ్వరుని ♦ నాత్మను నిల్పి శరత్తు లెన్నియో
చనునటు సాంద్రభక్తి దగ ♦ సాధుతపం బొనరించె; నాతపం
బునకును బ్రీతుఁడై పరశి♦వుండును వచ్చె వరంబు లీయఁగన్. ౫ 2664

క. దనుజునిపైఁ గలమోదం,బున నద్భుతమౌ వరంబు ♦ భూతేశుఁ డొసం
గెను విను మది యెట్లనఁగాఁ, దనశూలమునుండియొక యు♦దాత్తాయుధమున్.

క. జనియింపఁ జేసె శూలం, బన నదియున్ ఖ్యాతి నొందె ♦ నద్భుతవీర్యం
బును సాంద్రతేజముం దగఁ,గ నద్ది చెలువారె మహిమ♦గల్గు హరుండున్.

తే. అతని కద్దాని నిచ్చి యి♦ట్లనియెఁ బ్రీతి
యలర, మత్ప్రీతికరమగు ♦ నట్టిధర్మ
మిద్ది యొనరించితివి ధాత్రి ♦ నెసఁగె నతుల
మగుచు దీనికిఁ బ్రముదంబు ♦ నందినాఁడ. ౭ 2667

క. కనుకన్ శూల మొసంగెద, ననుత్తమంబౌచు నిద్ది ♦ యలరారెడు నో
దనుజవరా! త్రిదశుల వి,ప్రనికరముం గాంచి నీవు ♦ పగఁ బూనకుమీ. ౮

ఆ. ఎంతదాఁక నుందు ♦ వీరీతి నందాఁక, నీవశముననుండు ♦ నీవరాయు
ధంబు తప్పుదేని ♦ దానవ! యారీతి, నాశ మొందఁగలవు ♦ నామహాజ్ఞ. ౯

క. పరుఁ డెవఁడు గాని విగత,జ్వరుఁడై యుద్ధంబు చేయ ♦ వచ్చునొ వానిం
బరిమార్చి శూల మిది నీ,కరమున భాసిల్లఁగలదు ♦ క్రమ్మఱ దనుజా!. ౧౦

చ. అని యిటు లాపురాంతకుఁ డ♦హార్యకృపన్ వర మీయ దానిఁ బొం
దినమధుదానవేశ్వరుఁడు ♦ దేవపతిం గని మ్రొక్కి భక్తిని
ట్లనియెను శూల మిద్దియె మ♦దన్వయజాతుల కెల్ల వశ్యమై
తనర ననుగ్రహింపుఁడు స♦తంబును దేవవిభుండ వీవెకా?. ౧౨ 2671

చ. అనుటయు భూతనాయకుఁడు ♦ హారిరుచిం దగుశంకరుండు లో
కనికరనాయకుం డనియెఁ ♦ గా దిటు మామకసత్కృపైకపా
త్రుని నినుఁ జిన్నవుచ్చుటయుఁ ♦ దోఁపదు యుక్తమటంచుఁ గాన నీ
వనుకొనునట్లు గాక ఫల♦మందగఁ జేసెద నీదుకోరికల్. ౧౩½ 2672

క. విను నీతనయున కొకనికె, యనూనశూల మిది వశ్య♦మగు నని వైవం
గను జాలు; నీతనూజా,తునికరమున శూల మిద్ది ♦ తోఁచునొ పెలుచన్.౧౪½

ఆ. అంతదనుక నాతఁ ♦ డఖిలభూతావధ్యుఁ,డై చరింపఁగల్గు ♦ ననిన మధుఁడు
వరము నిట్లు శంభు♦కరుణ నత్యద్భుత,మును గ్రహించి గేహ♦మునకు వచ్చి.

క. తనుకాంతి వెల్గఁజేయుచు, ననిశము సంతోషపరవ♦శాత్ముం డగుచుం
డెను గుంభీనసి తత్పతి, యనూనసౌభాగ్యయుక్త ♦ యగు రఘుభూపా! ౧౬½

సీ. మాల్యవంతుండను♦మహితాత్మపుత్రియౌ ననలయన్ భామిని♦యలరు నామె
విశ్వావసునిసతి ♦ విశ్వమంగళరూపఁ గుంభీనసిని గాంచెఁ ♦ గూఁతు నామె
రావణునకుఁ జెల్లె♦లై వన్నె కెక్కె నాఁననిత నె మధువను♦వాఁడు లంక
నుండి రావణుఁ డింట ♦ నుండనితఁడెఁ గొనిపోయె నాతరుణికిఁ ♦ బుట్టె దారు

తే. ణాకృతిం దాల్చి వీర్యశౌ♦ర్యములు తనరఁ
బొల్చె లవణాహ్వయంబుతో ♦ భువనగర్హి
తాచరణమున దుర్బుద్ధి♦యై సతంబు
పాపకృత్యములను జేయఁ ♦ బాలుపడియె. ౧౭ 2676

చ. తనయుఁడు దుర్వినీతుఁడయి ♦ దారుణకృత్యము లొప్పఁ జేయఁగాఁ
గని పటుకోప మొందియు ని♦కాముము శోకమునం దపించియుం
దనయుని నేమియుం బలుకఁ ♦ దా మది నెంచక యూరకుండె; సం
త నతఁడు రాజ్యముల్ వదలి ♦ వర్షకనాశకశూలహా ర్తులన్. ౧౮ 2677

తే. సుతునకున్ దెల్పి కరమున♦శూలముండు, దనుక నేశత్రు బాధలు♦దాఁకవనుచు
వరము గలదని తెల్పి తా♦వరుణలోక,మున వసించెను;లవణుఁ డం♦త నిజశక్తి.

క. హరుశూలాయుధమహిమన్, గురుతరబలశాలి యయ్యుఁ ♦ గొంకక దుర్బు
ద్ధిరతుండై త్రిజగంబులఁ, బరితాపము నొందఁజేయుఁ ♦ బల్కు లిఁకేలా?.

క. తరుణులను విశేషించియె, పరితాపం బందఁజేయు ♦ బ్రహ్మమునుల నా
తురమొందఁ జేయునాతని, గరువము శూలంపుశక్తి ♦ గ్రాలు నిటువలెన్.౨౧½

క. అని తెల్పి వింటివి గదా?, మనుజోత్తమ! లవణదనుజ♦మాట యిఁకన్ మా
కును దిక్కు నీవె పూర్వము, మునివరు లత్యార్తు లగుచు ♦ భూపాలకులన్.

క. శరణము వేఁడిరి వీరా!, ధరణీశుం డొక్కఁడైన ♦ దర్పంబున నా
సురవైరి బాధ మాన్పడు, వరుసం బల్కనదిలేదు ♦ వరగుణసాంద్రా!. ౨౩

ఛ. సురరిపునాయకుం డగుచు ♦ శూరుఁడునై తగు రావణుండు సో

దరసుతబంధువాహనయు♦తంబుగ నీదగు శక్తిఁ గాంచలే
క రయమునన్ మృతిం గనియెఁ ♦ గాదె, మహాపురుషా! త్వదన్య నీ
ధరణిని రక్షకుల్ భయద♦దానవహంతఁ గనంగ శక్యమే. ౨౮ 2683

తే. దనుజబాధల నోర్వంగఁ ♦ దరము గామి
వచ్చినారము మీఁచెంత ♦ కిచ్చ దనరఁ
మమ్ముఁ గాపాడవయ్య భ♦యమ్ము బాపి
యనుచు మఱియును బల్కి రి♦ట్లనుచు మునులు. ౨౯ 2684

క. తెలిపితిమి సాధ్వసమ్మును, గలిగించిన కారణములఁ ♦ గావున నీ వి
ఘ్నులఁ గావఁదగును మానులఁ, బొలియింపుము లవణదనుజ♦ముఖ్యుని దుష్టున్.

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము

---

## ౬౨ - వ సర్గము.

—రాముఁడు శత్రుఘ్నుని లవణాసురుం జంపి యారాజ్యమును బాలింపుమని చెప్పుట.—

చ. అన విని యామునీశ్వరుల ♦ నాదృతిఁ గాంచి రఘుప్రవీరుఁ డి
ట్లనియెను దోసిలొగ్గి *లవ♦ణాసురుఁ డేమి భుజించుఁ జర్య యె
ట్లనువుగ నిశ్చయింప నగు ♦ నాయసురుం డెటు సంచరించు నా
విని మును లెల్ల నిట్లనిరి ♦ వృద్ధిని బొందినవానివార్తలున్. ౧౫ 2686

క. తెలుపం దలఁచుచు రామా!, పలుగాకి యతండు స్వేచ్ఛఁ♦బరఁగుచు సత్త్వం
బుల నెల్లఁ దినుచుఁ బ్రీతి మ,నులఁదినుసుంతయునుశంక♦నుం బొందఁడెదన్.

క. విను మాచారము రౌద్ర, మ్మనిశము మధువనమునందు ♦ నాతం డుండున్
జననాథ! పులులఁ బంచా,స్యనికరముల నేనుఁగుల స♦హస్రంబులుగన్. ౩౫

సీ. మనుజులఁ జంపి చ♦క్కనిపాక మొనరించి భక్షించుచుండును ♦ బగలు రేయి
యప్పు డప్పుడు తృప్తు ♦ నలుమటఁ బొందింప సత్త్వంబులం దిను ♦ సకలవిలయ
కాలంబునన్ భయం♦కరకాలుఁ డాస్యంబుఁ దెఱచినరీతి సం♦తృప్తిమీఱ
వదనంబుఁ దెఱచి యే♦వస్తువున్నను మ్రింగుచు నుండును ♦ మేదినీశ!

తే. యనఁగ విని ప్రీతియుక్తుఁడై ♦ యారఘుక్షి
తీశుఁ డిట్లను వధియింతు ♦ నెన్న సులువు
గాఁగ, భయ మొందకుఁడు ముని♦కాంతులార!
యని ప్రతిజ్ఞను జేసి య♦మ్మునుల ఘనుల. ౬౫ 2689

క. అనునయవాక్యంబులచే,తను దృప్తిం బొందఁ జేసి ♦ తనసోదరులన్
జనులను గని రఘునందనుఁ, డనియె సదెవ్వండు లవణు♦నని వధియించున్. ౭

తే. ఆతఁ డెవ్వనిపాలగు ♦ నతులదీర్ఘ,బాహువా భరతుండు దో♦ర్బలము పొదల

---

* లవణో వృద్ధే యథా-అనిమా.

నలరుశత్రుఘ్నుఁ డీయిరువ్వ ♦ రందు నెవ్వఁ
డతనిఁ బోలియుంచు ననవిని ♦ యాభరతుఁడు.

మ. దనుజుం జంపుదు నే మదంశ మతఁడా ♦ ధాత్రీశ్వరా! యంచుఁ జ
క్కనిధైర్యంబును శౌర్యముం బొదల ని♦క్కంబైనరీతిన్ వచిం
చిన శత్రుఘ్నుఁడు హేమపీఠగతుఁడై ♦ చేమోడ్పుతో లేచి యి
ట్లను ధీరుండయి పొల్చు నీతఁడు నయో♦ధర్యన్ ధర్మచిత్తంబునన్. ౧౦౪

క. వనములకు మీరు పోయిన, జనముల నలరించునట్టి♦చందంబున నే
లెనుగాన నీదుసేవను, మనమునఁ గలతాప మడఁచి ♦ మనుధర్మమునన్. ౧౧౪

క. పరిపాలించెను గావున, భరతుఁడు కృతకృత్యుఁడయ్యె ♦ బహుదుఃఖములన్
ధరణీశ! నిన్నుఁ దలఁచుచు, ధరణిన్ శయనించి మిగులఁ ♦ దాపం బందెన్.

క. నందిగ్రామమ్మున మును, కందములను మూలములను ♦ గాదిలిమోదం
బందినగతి భక్షించుచుఁ, గుందుచు నీరాక సతముఁ ♦ గోరి జటియునై.

తే. నారచీరలు ధరియించి ♦ కోరి నీదు
సేవ యొనరించె భరతుండు; ♦ సేవకుఁడను
నేను నుండఁగ మరల నీ♦మానితాత్ముఁ
బంపఁ గష్టములం బొందుఁ ♦ బార్థివేంద్ర! ౧౪౪ 2696

చ. అన విని రాఘవుం డనియె ♦ నట్లగు నో ప్రియసోదరా! మదా
జ్ఞను గొని కార్యసిద్ధిఁ గను ♦ చయ్యన నామధుదానవేంద్రుప
త్తనమున రాజ్యమేలు, మిదె ♦ దానికి నిన్నభిషిక్తుఁ జేసెదం
జను; భరతుండు నిచ్చటనె ♦ చక్కనిశర్మము లొందుచుండెడిన్. ౧౬౪

సీ. శూరుఁడ వౌదువు ♦ సారెది విద్యావంతుఁడవు సమర్థుఁడవు క♦డంగి పోర
వలఁతివి; రాజ దే♦వ్వఁడు శత్రుఁ బోలియుంచి మఱొక రాజునునిల్పు♦మదినిగొనక
యుండునో నరకంబు♦నొందునాతఁడు; గానఁ బాపనిశ్చయుఁడయి♦పరఁగులవణుఁ
జంపి యారాజ్యము ♦ నింపుగా ధర్మంబుఁ దప్పక పాలింపు ♦ ధైర్యమూని

ఆ. యుత్తరంబు దీని ♦ కొకరీతిఁ బల్కకు, *చిన్నవారు పెద్ద ♦ లన్నమాట
తప్పకుండవలయు ♦ నెప్పటి కని వసిష్ఠాదియుక్తిఁ జేసె ♦ నధిపు నతని. ౨౧

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

లవణాసురుం జంపు నుపాయము రాముఁడు శత్రుఘ్నునకుం దెల్పుట.

చ. అని యిటు రాఘవుండు ప్రియ♦మారఁగ రాజును దన్నుఁ జేయ నె
మ్మనమున సిగ్గు నొంది యను♦మానము నొందుచు వీర్యమొప్పు నా

---

* బాలేన పూర్వజస్యాజ్ఞా కర్తవ్యా నాత్ర సంశయః-అనియూ.

యనఘుఁడు లక్ష్మణానుజుఁ డ♦హార్యబలుం డిటు పల్కె మెల్లఁగా
జనవర యిం దధర్మము పొ♦సంగు నటంచును దోఁచె నిత్తఱిన్. ౧౫ 2699

తే. జ్యేష్ఠు లుండఁగ ధరణిఁ గ♦నిష్ఠులకును
రాజ్య మొప్పున తెలియంగ ♦ రాకయున్న;
దోషహేతుక ! మీయది ♦ యుగ్రశాస
నముగదా? చేయఁదగియె యుం♦డనగు నెపుడు. ౨౫ 2700

క. దురతిక్రమమై తగు నో, ధరణీశ్వర! శాసనంబు ♦ తావకముగదా?
పరవీరదర్పహరణా!, వరుసన్ నీవలన వేద♦వారమువలనన్. ౩౫ 2701

క. వినియుంటి ధర్మపద్ధతి, జనవర! మధ్యముఁ డెఱుంగుఁ ♦ జక్కఁగ లవణున్
జనదూషకుఁ జంపుదు నే, నని ననియెన్ గాదె దాని ♦ నగు నే? త్రోయన్.

సీ. బదులు పల్కితినేని ♦ పరమదుర్గతి గల్గు జ్యేష్ఠుండు నీవెంతఁ ♦ జెప్పియుండ
దానికి బదులుగ ♦ నేనేమి పల్కుదుఁ బల్కినచో నాకుఁ ♦ బరమలోక
సంప్రాప్తి లేకుండుఁ ♦ జక్కనిధర్మంబు గాకయె యుండు ని♦క్కముగ రామ!;
భరతుఁ డుండఁగ నేను ♦ బదు లోకరీతిగాఁ బలుకంగఁజాల మీ♦పరిసరమునఁ

తే. బెద్దవాఁ డుండఁగా నేను ♦ బిన్నవాఁడ
నాట రాజ్యంబుఁ గొనఁజాల ♦ నఘము నొంది
శిక్షదానికిఁ దగినది ♦ చెందఁజాల
మానదా! రామచంద్ర! యో♦త్మాపతీంద్ర!. ౭౫ 2703

చ. అనవరతంబు నీదయిన ♦ యానతిఁ దప్పక చేయువాఁడ నో
జనవర! మన్నిమిత్తమయి ♦ చక్కనిధర్మము వీడఁ బోకుమం
చని మహితాత్ముఁడై తగు ప్రి♦యానుజుఁ డుద్ధతవైరిసూదనుం
డన విని రామచంద్రుఁ డతి♦హర్షము పొంగుచు నుండ నత్తఱిన్. ౯ 2704

క. భరతున్ లక్ష్మణుఁ గన్గొని, ధరణిన్ బూన్పంగవలయుఁ ♦ దమ్ముని నభిషే
కరమామహోత్సవమునకుఁ, బరికరముల నిపుడె కూర్ప♦వలయుం బ్రీతిన్. ౧౦

క. పురుషవరేణ్యుని సోదరుఁ, బరదుర్జయు లవణరాజ్య♦పాలకుఁగా ని
త్తరుణంబునఁ జేసెద మనఁ, బురోహితుని పౌరజనులఁ♦బూజ్యులమటియున్.

సీ ఋత్విజులను విచా♦రించి కార్యము చేయ నేర్పరులైన మం♦త్రిప్రముఖులఁ
బిలుపింపుమా నేను ♦ బలికినరీతిగా నన రాజశాసన ♦ మాదలలను
ధరియించి లక్ష్మణ♦భరతులు తద్రీతిఁ జేసిరి పట్టాభి♦షేకవస్తు
వులతోఁ బురోధను ♦ నెలమి ముందిడుకొని రాజగేహంబును ♦ బ్రాహ్మణవరు

తే. లవుడు చొచ్చిరి భూపతు ♦ లాదరమున
వచ్చి రంత మహోత్సవం ♦ బచ్చటఁ గొన
సాగె శత్రుఘ్నునకు శాంత♦సాధుచిత్తు
నకును రాముండు పౌరగ♦ణంబు లలర. ౧౮ 2707

క. అంతట నభిషిక్తుండై, యెంతయు శత్రుఘ్నుఁ డలరె ♦ నినుచందమునన్
వింతగ సేంద్రక్రతుభు,క్సంతతిలో రాజ్య మొందు ♦ స్కందునిరీతిన్. ౧౪

క. పరహితకార్యరతుండౌ, ధరణీశుఁడు పిన్నతమ్ము ♦ దానవవిలస
ద్ధరకున్ బతిగాఁ జేయఁగఁ, బురజనులున్ వేదవిదులు ♦ భూసురవరులున్.

క. అలరిరి కౌసల్యసుమి,త్రలు కైకయు నింకఁ గల్గు ♦ ధరణీశుని దా
రలు మంగళకరకృత్యం,బులఁ జేసిరి సౌధమందుఁ ♦ బొంగెడుకాంక్షన్. ౧౭

క. మును లాయమునాతీర,స్థని కేతను లున్నతమతి♦శాలురు లవణుం
డని నీల్గె ననుచుఁ బొగడిరి, జనపతి శత్రుఘ్నుఁ బతిగ ♦ శాసించుటచేన్.౧౮

ఆ. పట్టభద్రుఁ డైన ♦ పరమాంత శత్రుఘ్ను, నంకసీమఁ జేర్చి ♦ యవనివిభుఁడు
తేజ మతనియందుఁ ♦ దృప్తిగ నించుచుఁ, బలికె నిట్లు మధుర♦భాషణముల.

క. పరపురనిబర్హణా! యీ,శర మతిదివ్యంబు నీ కొ♦సంగెద లవణున్
దురమున దీనం జంపుదు, వురుకీర్తినిఁ బొందఁజాలు ♦ దొరఘుపుత్రా!. ౨౦

చ. సురలును దానవుల్ మఱియు ♦ ఘోరశిఖామణులైన రాక్షసో
త్కరములుఁ విష్ణుమూర్తిఁ గనఁ♦గాఁ దగుశక్తిని గాంచలేదొ యా
పరుఁడు స్వయంభువుండు మును ♦ పార్థివసత్తమ! క్షీరవార్ధివి
స్ఫురతరయోగనిద్రఁ గొని ♦ పొల్పుగఁ దా శయనించె నత్తఱిన్. ౨౧ 2714

క. భూతము లెవ్వియు విష్ణుని, నాతనిఁ గనఁజాలకుండె ♦ నతఁడు రిపుజన
వ్రాతభయంకరమూర్తిని, నాతఱి సృజియించె నీము♦హాశర మనఘా!. ౨౧౻

క. దుష్టాత్ముల శిక్షింపఁగ, శిష్టులఁ బాలింప నెంచి ♦ శ్రీహరి కోపా
విష్టుండయి యీశరమును, సృష్టిచమత్కార మొప్ప ♦ సృజియించెఁ జుమీ!.

క. దనుజులు మధుకైటభు లో,జననాథకుమార! దనుజ♦సత్తములు తమం
తన *పెరుఁగ లోకములఁ జే,యను బూనినహరియు వారి ♦ నాగ్రహమొప్పన్.

క. శరమున దీనం జంపెను, సురవైరుల మధువునాఁగ ♦ శోభిల్లెడు భీ
కరమూర్తిని గైటభునిన్, మరణము నొందించి దీన ♦ మహితవిభూతిన్. ౨౩౻

క. లోకంబుల నిర్మించెను, శ్రీకాంతుఁడు దీని, నేను ♦ సీతకొఱకుఁగా
నాకర్బురేంద్రు రావణు, భీకరబలశాలిఁ జంపు♦వేడుక ననిలోన్. ౨౪౻ 2719

చ. శరమును దీని వైవఁగను ♦ స్వాంతమునం దలపోయలేదు; భీ
కరశర మిద్ది వైవఁగ జ♦గంబులు భీతిలు హానిఁ జెందునం
చరసియె మానినాఁడ, విన♦వయ్య! సహోదర! యీశ్వరుండు భూ
తరమునుఁ దంబికాఢితి యు♦దారతరంబగు శూలవర్యమున్. ౨౫౻ 2720

క. కర మర్థి నిచ్చెఁ గాదే, యరినాశకమంచుఁ బూర్వ ♦ మామధువునకున్
సురవైరి యతఁడు దానిని, గరువంబున నింట నునిచి♦కడుస్వేచ్ఛమెయిన్. ౨౭

* వశిష్టుకామేన లోకాం స్త్రీన్-అనియూ.

తే. తిరుగుచుండును దానిని ♦ బరమభక్తిఁ
బూజచేయుచునుండును ♦ బొలుచుశక్తి
దానిఁ బూనక యే దిగ్వి♦తాన మెల్లఁ
దిరుగు నాహారకాంక్షియై ♦ దితిసుతుండు. ౨౭ 2722

చ. అని యొనరింపఁ బూని యెవఁ ♦ డైనను బిల్చినమాత్ర శూలముం
గొని మధుదానవుండు కడుఁ ♦ గ్రూరత వైరిని బూదిచేయుఁ; గా
వున నిట నీవు శూలమును ♦ బూనక యాతఁడు పోయియున్న చో
ప్పును మది నెంచి ద్వారమునఁ ♦ బూనిక నిల్చి ధృతాయుధుండవై. ౨౮

క. దనుజుని బురిఁ జొరనీయక, యనిచేయుము గేహమునకు ♦ నాతఁడు చొరకుం
డని నిల్చి పిల్వ యుద్ధం,బును జేయఁగ రమ్మటంచుఁ ♦ బురుషవరేణ్యా!. ౨౯

క. అని చేయ నతఁడు వచ్చును, గనుక లవణాఖ్యుఁ జంపఁ♦గాఁ గల వనఘా!
వినుమా! వేఱొకరీతిని, దనుజుని జంపంగరా ద♦తఁ డవధ్యుఁ డగుట. ౩౦

తే. నేను జెప్పినయట్లుగా ♦ నీవు చేసి, తేని లవణాసురుండు దు♦ర్మాని చచ్చు;
శూలమున వచ్చు బాధల♦చొప్పు దెల్పి, నాఁడ లవణునిదగు నాశ♦నమును నరిగ.

క. తెలిపితి [1]శ్రీమచ్ఛంకరుఁ, డలఘుతరంబైన శక్తి ♦ నలరును గాన
విలయకరంబగు నాతని,పలు కది చెల్లింపవలయుఁ ♦ బల్కులిఁ కేలా?. ౩౨

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౪ - వ సర్గము.

శత్రుఘ్నుఁడు రామాజ్ఞచే మునులం గూడి లవణాసురునిపట్టణమునకుఁ బోవుట.

క. అని పల్కి పిన్నతమ్ముని, ననూనరీతులను బొల్చు ♦ నాశిషముల చేఁ
దనుపుచు మఱియుం బల్కెను,ననుజా! కనుఁగొనుము ముందు♦హరిరథములను.

సీ. అవి నాల్గువేలు నీ ♦ కనుగు నాయంబుగ హస్తివర్యములు స♦హస్రయుగము
పైనశతంబును ♦ బలసి వచ్చును వెంట నిలిచినతావుల ♦ నిఖలవస్తు
వులతోడ సంగళ్లు ♦ వెలయుచునుండును, నట నర్తకులు వెంట ♦ నడచువారు
తప్తకాంచననియు♦తంబును వస్త్రముల్ వాహనంబులు ధన♦వ్రజముఁ గొనుచు

తే. నరుగుమా హృష్టపుష్టమై ♦ యతులబలము
వెంట నరుదెంచుఁ జక్కని ♦ విమలభాష
ణముల వారల నలరింపు ♦ నరపతివర!
[2]వనములందును ద్రవ్యముల్ ♦ గనఁగ నగునె? ౫ 2729

క. పనితలు బాంధవు లుండరు, వనములలో నుండుతఱిని ♦ పరమిత్రులు భృ
త్యనికరములు నుండరు చెం,తనె కావున వారిఁ దగువి♦ధంబునఁ గనుమీ.

1 శ్రీమత శ్శితికంఠస్య కృత్యం హి దురతిక్రమమ్-అనిమూ. 2 నహ్యర్థా స్తత్ర తిష్ఠంతి వచ దారా న బాంధవాః-అనిమూ.

తే. హృష్టజనసంభృతంబయి ♦ యొసఁగు గొప్ప
బలముఁ గొనిపొమ్ము లవణుని♦వనము చొచ్చు
తరుణమున నీవె చాపంబు ♦ కరమునందుఁ
గ్రాలఁ జొరవయ్య! నిన్నటుఁ ♦ గాంచువారు. ౭ 2731

క. అని చేయ వచ్చునని తమ,మనములఁ దలపోయకుండు ♦ మాడ్కి నరుగుమా
దనుజుఁడు నినుఁ గని సంశయ,మును బొందకయుండవలయుఁ♦బూజ్యప్రతిభా!. ౮

క. అనుమానింపక యాతఁడు, వనమున నుండంగఁ దాఁక ♦ వచ్చిన రిపుచే
తను దప్ప వేఱుమృత్యువు, గన రా దాతనికి శత్రు♦గణకాలయమా!. ౯

క. ఆతనిదర్శనమునకే, భూతలపతి పోవు నతఁడె ♦ పో లవణునిచే
నాతఁడుఁ జంపంబడు; నీ, వో తమ్ముఁడ! గ్రీష్మసమయ ♦ మొకవిధి నేగఁగ. ౧౦

తే. వార్షికంబగు కాలంబు ♦ వచ్చుతఱిని, వానిఁ జంపుము తగినది ♦ యాను వాని
కద్ది; మానివ రేణ్యుల ♦ సందడిఁ గొని,నీదు సేనలు ముందుగాఁ♦బోఁదగు నిఁక.

సీ. గ్రీష్మకాలము భూరి♦రిపునాశకా! సుంత మిగిలి యుండంగ నీ ♦ వగణితబల
యుతుఁడవై మిగులఁబు♦ణ్యోదకంబులనొప్పు గంగను దాఁటింపఁ♦గాఁదగుఁజుము;
బలముల జాహ్నవీ♦వరతటంబున నిల్పి జాగరూకుఁడవయి ♦ చాప మూని
నులభగతిం జని ♦ శూరత చెలువార నాతనిఁ బొలియింపు ♦ మనుచు రాముఁ
తే. డాజ్ఞ చేయంగ శత్రుఘ్నుఁ ♦ డాత్మబలము
లను దదీశులఁ బిలిపించి ♦ యనియె; ముందు
నిలువఁ దగునట్టి తావుల ♦ నెమకి యందు
బాధ యేరికి లేకుండ ♦ వలయు నిలువ. ౧౨ 2736

చ. అని యిటు లాజ్ఞచేసి తన♦దా గురుసైన్యముఁ బోవఁ బంచి చ
క్కని విధి మీఱఁ దల్లులకు ♦ గాఢతరంబగు భక్తి మ్రొక్కి రా
మునకుఁ బ్రదక్షిణం బిడుచు ♦ మ్రొక్కి తదంఘ్రులు నెత్తి సోఁకఁ జే
యనుపమభాగ్యమం చరసి ♦ యాజ్ఞను బొంది యరీంద్రకాలుఁడై. ౧౩

ఆ. భరతలక్ష్మణులకుఁ ♦ బ్రణమిల్లి దోసిలి, పట్టి యావసిష్ఠుఁ ♦ బరమమునిని
వేడ్కఁ జుట్టుఁ దిరిగి ♦ విధిహితవందన,ములు పొనర్చి వెడలె♦బలయుతుఁడయి.

చ. కరితురగాఢ్యమా బల మ♦ఖండతరంబగుదాని ముందుగా
నరుగ ననుజ్ఞ యిచ్చి తన♦యన్నపదంబులఁ గొల్చిపొంచె నా
దరమున మాసముం గడపి ♦ తత్ప్రహితాశిషముల్ గ్రహించి స
త్వరగతిఁ బొమ్మటంచు గుణ♦ధాముఁడు పల్కఁగఁ బోవ నెంచెఁ దాఁ. 2739

అఱువదినాల్గవ సర్గము సంపూర్ణము.

## ౬౫ - సర్గము.

శత్రుఘ్నుఁడు వాల్మీకిమౌనిం గాంచుట.

చ. బలముల నిట్లు ముందుగనె ♦ పంపి పురంబున మానముండి దో
ర్బల మలరంగ నొక్కరుఁడె ♦ పార్థివచంద్రునియాజ్ఞఁ బోయె; ని
ట్లలఘుగతిన్ ద్విరాత్రముల ♦ నంతరభాగమునన్ వసించి ని
ర్మలమయి పుణ్యదంబునయి ♦ రాజిలు వాల్మికియాశ్రమంబునన్. ౨
క. కనుఁగొని యుత్తముఁ బుణ్యా,త్ముని నావాల్మీకిఁ గాంచి ♦ తోరపుభక్తిన్
బ్రణతుల్ సల్పుచు ముదమున, ననియెన్ భగవంత! మీామ♦హాశ్రమసీమన్.
క. నివసింపఁగోరెదను మా,నిన రేణ్యులకార్యమునకె ♦ నేఁ జనియెద; రే
పు వరుణపాలితదిక్కున, కవితథజవ మొప్పఁ బోదు ♦ ననుపల్కులకున్. ౪
క మునివర్యుఁడు వాల్మీకియు, మనమున ముద మంది నవ్వి ♦ మహిమాఘ్యుండై
ఘనకీర్తి యలర వెలసెడు, జనపతికిన్ స్వాగతంబు ♦ సరగునఁ జెప్పెన్. ౫
సీ. రఘువంశజనితులౌ ♦ రాజుల కిది స్వీయమైన యాశ్రమమగు ♦ మానసీయ!
యాసనం బిదె పాద్య♦మర్ఘ్యంబునిదిగొ సంశయమొందకే కొను♦శత్రుహరణ!
యన వాని గ్రహియించి♦యమల మూలంబులఫలముల భక్షించి♦పరమతృప్తి
నందె శత్రుఘ్నుఁ; డి ♦ ట్లామునిపూజకు నలరి యిట్లని పల్కు; ♦ నార్యవర్య!
ఆ. యాశ్రమంబుచెంత ♦ యజ్ఞసమృద్ధిచి
హ్నములు తోఁచుచున్న ♦ వవి యెవరివి?
తెలుపుమన్న నతని♦పలుకుల నాలించి
యిట్లు పలికె, వినుము ♦ హితమనీష!. ౯ 2744
క. మును పిది యెవ రౌనరుపఁ జ,క్కనిరీతిం జెలఁగెనొక్క ♦ కన్రగుణా! మీా
కును బూర్వుండు సుదాసుం, డనుభూపతి యలరు, నతని ♦ కాత్మజుఁడొదవెన్.
ఆ. వీరసహుఁ డనంగ ♦ విఖ్యాతనామంబు, వాని కయ్యె; ధర్మ♦వర్తనుండు
వీర్యయుక్తుఁ డతఁడు ♦ వితతగతిన్ వేఁట, సలుపు నాసఁ బూనె ♦ క్ష్మాపతినుత!.
చ. వనమున నొక్కచో నెలమిఁ ♦ బర్వులు వెట్టుచు మాటిమాటికిన్
దనుజయుగంబు స్వేచ్ఛమెయి ♦ దారుణరీతిఁ జరింపఁ గాంచె; నా
దనుజులు వ్యాఘ్రరూపులయి ♦ తద్వనసంస్థమృగవ్రజంబులన్
దినుచును దృప్తినిం గనక ♦ త్రిమ్మరుచుండిరి భక్షణేచ్ఛచేన్. ౧౨ 2747
చ. ధరణిపుఁ డాసురాకులను ♦ దారుణరూపులఁ గాంచి యీామృగో
త్కరముల నెల్ల మ్రింగి మృగ♦శాంతవిహీనముగా వనంబుఁ జే
సిరి గద? యంచుఁ గ్రోధరతిఁ ♦ జెంది మహేషువు నారిఁ గూర్చి యొ
క్కరుని వధించి *క్రోధమును ♦ గ్రన్నన వీడి విహీనఖేదుఁడై. ౧౩ 2748
క. దనుజశవంబును జూడఁగ, మనుజేంద్రుని సతిని దనుజ♦మర్దను గని యా

* విజ్వరో విగతామర్షః-అనిమూ.

దనుజునిమిత్త్రుఁడు తాపం,బును మిక్కిలి పొంది పలికె ♦ భూపతితోడన్. ౧౫

క. వినవయ్య! యనపరాధుని, దనుజుని నామిత్త్రు నీవు ♦ దారుణబాణం
బున నేల చంపితివొ యఘ,మును జేసితివేల? దాన ♦ భూపా! నీకున్. ౧౬

తే. చేయువాఁడఁ బ్రతిక్రియ ♦ నీయెడ నని
యుండె కనఁబడకుండె; నా♦యవనినాథుఁ
డాత్మపురి కేగెఁ జిరకాల ♦ మట్లు గడువ
తనయునకు రాజ్య మిచ్చి యు♦త్తమపదమును. ౧౭ 2751

క. కనఁగోరి యుండె; నీచెం,తనె యజ్ఞము చేయునానఁ ♦ దాల్చె వసిష్ఠుం
డును నశ్వమేధమును క్రతు,వును దానిం గావ బుద్ధిఁ ♦ బూనెం బ్రీతిన్. ౧౮

క. చిరకాలము సాగెను న,ధ్వర మయ్యది పరమలక్ష్మి♦భాసుర మగుచున్
సురయజ్ఞతుల్యమై భూ,వరతనయా! యజ్ఞ మిట్లు ♦ వరుసఁ జెలంగెన్. ౧౯

సీ. అధ్వరాంతమున నా♦యసురుఁడు తొలివైరమునుదలంచుచు వసి♦ష్ఠునితనువునఁ
బొడనూపి యిట్లని ♦ నుడివె నీయజ్ఞంబు పూర్ణమా తరుణంబు ♦ నిర్ణయింప
నిదె వచ్చె మాంసయు♦క్తేష్టభోజన మిప్డు నాకుఁ గావలయు భూ♦నాథ! దాని
నిప్పింపు మెంతయు ♦ నెన్నకు మది నన బ్రహ్మరూపంబునఁ ♦ బరఁగుదనుజు

ఆ. వచన మాలకించి ♦ పలికె సంస్కారకు,శలము గొనుము విప్ర♦సత్తమ! యని
వంటచేయువానిఁ ♦ బరికించి సామిషం, బగు హవిష్య మితని ♦ కభిమతముగ.

క. మన మతితృప్తిం బొందం,గను వే సమకూర్పవలయు ♦ త్వాసురుఁడు మనం
బునఁ దృప్తి నొందఁ జాలదె, యన విని రాజేంద్రునాజ్ఞ ♦ నలజడి గనుచున్.

క. విని సూదుఁడు చిత్తమురీ,తిని చేసెద నంచు రాజు ♦ తెల్పినరీతిన్
జని వంట చేసె నంతట, దనుజుఁడు సూదాకృతిని ని♦తాంతము పొల్చెన్.

క. మనుజునిపలలము వంటక,మునఁ గూరిచి రాజుతోడ ♦ భూప! హవిష్యం
బును సామిషముగ స్వాదువు,గను జేసితిఁ దెచ్చినాఁడ ♦ త్వాసురుకొఱకై.

చ. అనుటయు భూధవుండు మద♦యంతియనంజను భార్యఁగూడి యా
మునిపతికిన్ వసిష్ఠునకు ♦ మూర్ఖుఁడు రక్కసుఁ డిట్లు చేసె నం
చును దలపోయఁ జాలమిని ♦ సొంపుగ దానిని నుంచె నందు నా
మనుజపలంబుఁ గాంచి ముని♦మండనుఁ డాగ్రహపూరితాత్ముఁడై. ౨౭ 2758

క. పలికెన్ రాజా! యీనర,పలలము నాకిడితి విట్టి ♦ పలలమె నీకుం
గలుగం గల దికఁ సంశయ,ములఁ బొందక దానిఁ దినఁగఁ ♦ బోలును నీకున్.

చ. అని శపియింప వీరసహుఁ ♦ డాగ్రహ మూని మునిన్ శపింప జ
య్యన నుదకంబులన్ గొనియె ♦ హ స్తమునం దది చూచి భార్య యా
తని వలదంచు నిల్పి ప్రభు♦తల్లజ! యియ్యది యొప్పునయ్య! యీ
జనపతినత్కులంబునకు ♦ సన్ముని యీతఁడె తోఁడు చూడఁగన్. ౩౦ 2760

క. సురతుల్య తేజ సీతని, గురువును శపియింపఁ జన్న ♦ క్రోధ ముడుగు మీ
తరుణమున నంచుఁ బల్కెనఁ, దరుణీమణిమాటల విని ♦ త్యక్తాగ్రహుఁడై. ౩౧

క. అనుపమకోపసమయంబయి, ఘన తేజోబలయుతమయి ♦ క్రాలెడుతోయం
బును దాని ధర్మమతిన్మై, తనపాదములంద విడిచెఁ ♦ దజ్జలయుక్తిన్. ౩౨

క. చరణము లవి కల్మషతం, బరఁగెను దత్ప్రభృతి రాజ♦వర్యుఁ డతఁడు సు
స్థిరకీర్తి క్రొత్తనామం, బరయం గల్మాషపాదుఁ ♦ డన వహియించెన్. ౩౩

క. ఏ రిదియె విస్మృతంబయి, ధారణిఁ జెలువారె నంత ♦ దారయుతుండై
కోరికఁ బలుమఱు నతు లిడి, ధారణీసురమౌనిఁ గాంచి ♦ తా వచియించెన్.

చ. మునిపతి వేద మౌని యొక♦మూర్ఖుఁడు మాయను బన్ని చెప్పినన్
వినితిని గాని నేఁ దెలిసి ♦ విశ్రుతయోగరతా! మహాత్మ! త
ప్పొనరుపలేదు నా నృపతి ♦ యొప్పుగఁ జెప్పెడుమాట నన్ని యా
దనుజునిదౌ వికారమును ♦ దానవు డెంచి నచించె నీగతిన్. ౩౫ 2765

చ. పురుషవరేణ్య! రోషమును ♦ బూని వచించిన నాదువాక్కదే
వరుసను వ్యర్థమై చనదు ♦ ద్వాదశవర్షము లేగినంత నీ
పరుషతరైకశాపఫల♦పద్ధతి తా నశమించు నీకు నీ
వరము నొసంగినాఁడ గత♦వార్తల నాత్మఁ దలంపకుండుమా. ౩౬ 2766

చ. అన విని శత్రుకాలుఁడగు ♦ నానరపాలుఁడు మౌనిశాపమున్
బనివడి యట్లు పొంది తరు♦వాత స్వరాజ్యము పూర్వరీతిఁ జ
క్కనివిధిఁ బొంది తాఁ బ్రజల ♦ గాఢముదంబునఁ బ్రోచె; నాతఁ డ
ట్లొనరిచినట్టి యజ్ఞమహి♦మోజ్జ్వలభూతల మద్ది రాఘవా!. ౩౭ 2767

ఆ. ఆశ్రమంబు చెంత ♦ నలరారుచున్నది;, నీదు ప్రశ్నమునకు ♦ నే నదుత్త
రము నొసంగినాఁడ ♦ రఘుకులభూషణా!, యనిన మౌనివర్యు ♦ ననుపమోక్తి.

క. విని పార్థివవర్యుని చక్కనిగాథ నెఱింగి మౌని♦కాంతునితోడం
జని పర్ణశాలఁ జొచ్చెను, మనుకులభూషణుఁడు మ్రొక్కి ♦ మౌనీశునకున్.

అఱువదియయిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౬ - సర్గము.

సీత కుశలవులను కుమారులం గనినవార్త విని శత్రుఘ్నుఁ డానందించి పయనమగుట.

క. ఏరాత్రి రాముతమ్ముఁడు, చేరెఁ దదాశ్రమముఁ బ్రీతి ♦ సీతయు వంశో
ద్ధారకపుత్రద్వయమును, నారాత్రియె కనియె మౌని ♦ హర్షము నొందన్. ౧

ఆ. అర్ధరాత్రసమయ♦మందు వాల్మీకికి, మౌనిబాలకు లొగి ♦ మంచివార్తఁ
జెప్పఁగోర్కె వచ్చి ♦ సీత పుత్త్రులఁ గాంచె, ననియెఱుంగఁ జెప్పి;♦రంత మునియు.

సీ. శ్రీరామునత్పత్ని ♦ సీత సుత[1]ద్వయమును గాంచె ఘనతేజ! ♦ తనయులకును
భూతనాశకముగఁ ♦ బొల్చురక్షను జేయు మునువారిపల్కుల ♦ నాదరించి
యతులసమ్మోదంబు ♦ నంది కుమారులఁ గనుఁగొనిరొగిన్; వారు ♦ కమ్రతేజ
ములఁ బొల్చి బాలచం♦ద్రులె యన నలరారి దేవపుత్రకు లనఁ ♦ దేజరిల్లి
తే. రంత రాక్షసబాధ ర♦హంతమైన, లేక భూతైకబాధయు ♦ లేకయుండఁ
జాలు రక్షను బలికెఁ గు♦శను గ్రహించి, ముష్టినలరించి వాల్మీకి♦మునివరుండు.

క. భూతవినాశిని రక్షను, నాతీగునఁ బలికి యందు ♦ నగ్రజుఁ డెవఁడో
భూతలపతికిన్ రాముని, కేతీరునఁ జెప్పఁదగునొ ♦ యే నని మునియున్. ౭

సీ. తొలిజని గనిన సు♦తుఁడె మంత్రసంస్కృతకుశలచే మార్జన♦గూఢకర్మ
మును జేయ నర్హుఁడౌ♦టనునట్లియొనరించికుశుఁడనునామంబు♦గోర్కినిడియె
నపరభాగంబగు ♦ నట్టిలవంబున మార్జనమును జేసి ♦ మౌని లవుఁడు
నాఁగ నితఁడు ఖ్యాతి ♦ నాయాశిషంబులఁ బొందునంచనిపల్కె♦డెంద మలరఁ
తే. గుశలవంబుల గ్రహియించి ♦ కుతుక మొప్ప
నిట్టి రక్షను జేయుట ♦ నిలను వారు
కుశలవులను విఖ్యాతిని ♦ గొనిరి వీరు
కవలు మత్కృతనామంబుఁ ♦ గాంచి యింక. ౮ 2774

క. అనుపమకీర్తిం బొందుదు, రని పల్కెను; మౌనిపత్ని ♦ లాసీతకు భూ
తనివయబాధలు పొందని, యనూనమగురక్షఁ బలుకు♦నది యని యపుడే.

క. పలికెను వాల్మీకి మునిభార్యలు నారక్షను గ్రహించి ♦ యువధానమునన్
లలిఁ దల్లికిఁ బిల్లల కెన, యలరంగాఁ గట్టి; రంత ♦ నవనిసురమునుల్. ౧౧

తే. పత్నులం గూడి రామభూ♦పవరుగోత్ర
మును వచించుచుఁ గుశలవు ♦ లనెడు పేరు
లుచ్చరించిరి భూపుత్రి ♦ యొప్పఁ గనిన
తనయులకు నాయు వభివృద్ధిఁ ♦ గనెడువేడ్క;. ౧౨ 2777

క. వినియెను శత్రుఘ్నుఁడు నె, మ్మనమునకుం బ్రీతిఁ గూర్చు ♦ మానితవార్తన్
జనకజతనయుల నిరువురఁ, గనె నని యానడికి రేయిఁ ♦ గడువడి నంతన్.

ఆ. పర్ణశాలఁ జొచ్చి ♦ పలికె నాతల్లికిఁ, గుశలమె గద? యనుచుఁ ♦ గోర్కినిట్టు
లాతఁ డందునుండ ♦ [2]నావార్షికత్రియా,మయును శ్రావణియన♦మమతగడచె.

క. తెలతెలవాఱక ముందే, యలరెను తేజంబు గలుగు ♦ నాశత్రుఘ్నుం
డు లలితచిత్తుఁడు మేల్కని, కలుషహరక్రియలఁ దీర్చి ♦ త్మానుగమునికిన్.

ఆ. వందనంబు సలిపి ♦ వరమునిసెల వంది, పడమటికిని దాను ♦ బయనమయ్యె;

1 ద్వయమును అనుచో నుండు 'య' అను నక్షరము గాయత్రి యిరువదినాలుగవ యక్షరము. 2 వ్యతీతా వార్షికీ రాత్రి శ్శ్రావణీ లఘువిక్రమా-అనిమూ.

యమునతీరమందె ♦ యాతఁ డేడుదినంబు, లరిగి మౌనివరుల ♦ యాశ్రమముల.

క. నివసించెఁ బుణ్యకీర్తులు, సువిమలమానసులు వారు ♦ శుభతేజులు భా ర్గవముఖ్యు లతని మోదం, బవితథముగఁ బొందఁ బూజ ♦ లమరించి తమిన్.

ఆ. లలితకథలఁ జెప్పి ♦ యలరింపఁ *గాంచనుఁ, డనెడుపేర నెగడు ♦ నా చ్యవనుఁడు మొదలుగాఁ జెలంగు ♦ మునులతో నారాత్రి, బహువినోదకథల ♦ వఱలిపుచ్చె.

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౬౭ - వ సర్గము.

లవణాసురుఁడు మాంధాతను జంపినకథను చ్యవనుఁడు శత్రుఘ్నునకుం దెలుపుట.

సీ. పలురీతులగు సత్కథలఁ జెప్పఁగా రాత్రి గడచుచుండఁగ శత్రు ♦ ఘ్నుండు దైన
రఘుకాంతు ననుజుం డ ♦ రాతియౌ లవణుని బలముఁ దచ్ఛూలప్ర ♦ భావము వినఁ
గాంక్షించి చ్యవనునిఁ ♦ గాంచి ప్రశ్నించె; నా యాయుధంబున నెవ్వ ♦ రంత మొంది
రెవ్వ రీశూలంబు ♦ నెఱుఁగక ద్వంద్వయుద్ధంబును జేసిరి ♦ దనుజుతోడ;

తే. ననఁగ మహితాత్ము శత్రుఘ్నుఁ ♦ గని మహర్షి
భూరితేజుఁడు పలికె ని ♦ ప్పొల్కి లవణు
చరితముల లెక్కపెట్టఁగాఁ ♦ జాల నైన
వినుము! యిక్ష్వాకువంశైక ♦ వీరుఁ డొకఁడు. ౩ 2784

క. దనుజుని మార్గని పోలిసెను, గన విన నది చింతఁగూర్చుఁ ♦ గ న్ర్తరా యో ధ్యను బలవంతుఁడు యువనాశ్వనిజసుతుఁడు మున్ను ప్రోచె ♦ శుభతరరీతిన్.

ఆ. మూఁడు లోకములను ♦ భూరియశంబున, మించుననతఁడు వీర్య ♦ మంచితమ్ముఁ
మహితకీర్తి యట్లి ♦ మాంధాతృనకుఁ దగు, నతనిఁ బొగడఁదరమె ♦ యజునకైన.

చ. ధరణి సమస్తభాగములఁ ♦ దాఁ బరిపాలనశక్తి మీఱ నా
నరవరుఁ డేలె; నంత నొక ♦ నాఁడు దివంబు జయింపఁ గోరి నే
యరుగ నొనర్చె యత్నముల ♦ నక్కథ లెల్లను నాలకించి ని
ర్జరులు తదీశుఁ డొంది రతి ♦ సాధ్వసముల్ మనముల్ చలింపఁగన్. ౭ 2787

క. సురలోకమ్ము జయింపఁగ, నరిగెద సురసంఘునాథు ♦ నర్ధాసనముల్ నిరుపమరాజ్యార్ధంబును, వరశక్తిం గొనుదు ననుచుఁ ♦ బ్రతిన యొనర్చెన్.

చ. అని యిటులాడి స్వర్గమున ♦ కప్పుడె తా విజయేచ్ఛఁ బోవఁగాఁ
దనమదిఁ బాకశాసనుఁడు ♦ ధాత్రితలేంద్రుని పాపనిశ్చయం
బు నెఱిఁగి సాంత్వపూర్వముగఁ ♦ బూజ్యతరోక్తులఁ బల్కె నిట్టు; లో
జనవర! మర్త్యలోకమును ♦ జక్కఁగ నేలెడువాఁడ వీ వనన్. ౯ 2789

---

* సకాంచనాద్యై ర్మునిభి స్సమేతః-అనియు. కాంచనేతి చ్యవనస్య నామాంతరం, సభార్గవాద్యై రితి పాఠాంతరం-అనివ్యాఖ్య.

చ. పురుషవరేణ్య! యాధరణిఁ ♦ బోల వశంబున మెల్గఁ జేయ కి
త్తరుణమునందె నిర్జరప♦దంబును గోరితి వేలఁగా నిదే
ధరణి యదెల్ల సర్వమును ♦ దద్విద్వశవర్తినిగాఁ జెలంగునో
ధరణిప! *దేవరాజ్యమును ♦ త్వద్బలవాహనభృత్యయుక్తితోన్. ౧౦౺ 2790

ఆ. వశముచేసికొనఁగ ♦ నచ్చునంచని యింద్రుఁ, డిట్లు పలుకభూత♦లేంద్రుఁడనియె;
నింద్ర! భూతలమున ♦ నెందు మచ్చాపన, మునకు నడ్డుగలదొ♦వినఁగవలయు.

చ. అన విని వేయిగన్నుల మ♦హాప్రభు విట్లను భూపచంద్రమా!
విను లవణాసురుండు మధు♦వీరతనూజుఁడు పొల్చుచుండువాఁ
డన మధునామకాటవిని ♦ నన్వహ ముండును వాఁడు నీదు శా
సనమును మీఱినాఁడుగద ♦ చక్కఁగ నెన్నుము నీమనంబునన్. ౧౩ 2792

క. అని యిటు విప్రియవాక్యం,బును వేగన్నులవిభుండు ♦ పొందుగఁ బలుకన్
విని సిగ్గునొంది తనమో,మును వంచి వచింపకుండె; ♦ భూపతి యంతన్. ౧౪

క. అనురేంద్రుననుమతిం గొని, యనుండనుండాఖ్యమునని ♦ యాస్యం బెత్తం
గ మాదిఁ దలంపక యాలో,కమునకుఁ జనుదెంచె మరల ♦ క్ష్మాపతితిలకా! ౧౫

క. చనుదెంచి యమర్షను నె,మ్మనమున ధరియించి భృత్య♦మండలిసేనా
జనములు వాహనములు తోఁ, జనుదేరన్ మధుతనూజు♦శౌర్య మడంపన్.

చ. మనమున నెంచి ఘోరరిపు♦మండలకాలుఁడు రాజు విక్రమం
బున లవణాసురున్ గనఁగఁ ♦ బోయెను సంగరకాంక్షఁ బొంగఁగాఁ
దనపరిచారకుం బనిచె ♦ దానవుచెంతకు వాఁడు పోయి యా
దనుజునిఁ గాంచి విప్రియము ♦ తన్మనసుం గనఁ బల్కె; నంతటన్. ౧౭౺ 2796

క. సురవైరి లవణుఁ డాభూ,వరుదూతను దినియె; దూత ♦ వైశమ రామిన్
బరికించి క్రోధమతియై, ధరణీశుఁడు బాణవృష్టి ♦ దానవు ముంచెన్. ౧౮

చ. దనుజుఁడు నవ్వి భూమిపతి♦తల్లజు నిప్పులు రాలఁ జూచి యా
శునికృపఁ గన్నశూలమును ♦ శూరత పొంగఁగఁ గై గ్రహించి భూ
పుని బొలియింప వైచె నిదె ♦ పోయి బలాన్వితు శత్రుఁ జంపుమా
యనుపమశూలమా! యనుచు; ♦ నంతట నయ్యది జ్వాల లొప్పఁగన్. ౨౦

క. బలవాహనములతో భూ,పలలాముని క్షణములోన ♦ భస్మముచేసెన్;
అలదనుజుచెంత నెప్పటి, వలె శివశూలంబు నిల్చె ♦ వరసుహిమమునన్. ౨౧

సీ. జనపతి యారీతి ♦ సబలవాహనుఁడయి విలయ మొందెను; శూల♦బలమిటువలె
ననుపమానంబుగ ♦ నప్రమేయంబుగ నలరారు; దేవుల♦యముము నీవు
లవణుని జంపంగ♦లవు సంశయంబులే దగృహీతశూలుని ♦ నతని మారు
కొన జయంబొదవు ని♦క్కువ మిద్ది, లోకంబులకు మేలు నీకృత్య♦మకలుషంబు

* దేవరాజ్యం వరుష్వేహ సభృత్యబలవాహనః - అనిమూ.

తే. దెలియఁ జెప్పితి నీకల ♦ దృప్తలవణు
వీర్యమును శూలమునకున్న ♦ వితతశక్తిఁ
దెలియఁదగునని మాంధాతృ♦విలయ మట్టి
యశుభ ఫలములు నీవ్రోల ♦ నంతమొందు. ౨౪ 2800

క. వినవయ్య! శ్వఃప్రభాతం,బున లవణుం జంపు దీవు ♦ బుద్ధిని శంకం
గనకుము నాకుం జూడఁగ, జనవర! పొడనూప దిపుడు ♦ నంశయులవముల్.

క. శూలంబుచేతఁ బట్టక, యాలవణుం డామిషార్థి♦యై వచ్చును నీ
వాలోన నతనిఁ జంపుము, గ్రాలెదు నీయశము దిశలఁ ♦ గలకాలంబుల్. ౨౬

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౬౮ - సర్గము.

శత్రుఘ్నుఁడు లవణాసురుని నగరములోనికిం బోకుండ నిరోధించుట

చ. అని యిటు లామహర్షులు జ♦యంబును గోరుచు మంగళాశిషం
బు నిడుచుఁ జెప్పు గాథలను ♦ భూపతిపుత్రకుఁ డాలకింపఁగాఁ
జనిరొను రాత్రి; యంత రవి ♦ చారుతరంబగు తూర్పుకొండ న
క్కను దమిఁ బూను కాలమున ♦ గాఢపరాక్రముదానవేశుఁడుల్. ౧౨ 2803

చ. పురముననుండి తా వెడలె ♦ భుక్తికినై; యపు డర్కవంశ్యభూ
వరుఁ డరికాలుఁ డాయమున ♦ వాహనసైన్యయుతిం దరించి యా
శరవరుఁ డేలునాపురిని ♦ జక్కఁగఁ గాంచి ధనుర్వరంబు భీ
కరతరహస్తమందు వెలుఁ♦గం బురివాకిట నిల్చె వీరుఁడై. ౩ 2804

తే. ఇట్లుగా దినపూర్వార్ధ ♦ మేగఁ గ్రూర
కర్ముఁడౌ దానవేజ్యుండు ♦ కడఁగి పెక్కు
వేల ప్రాణిభరంబుఁ దా ♦ విపులశక్తి
మోచికొని వచ్చె క్షుద్బాధ ♦ యేఁచుచుండ. ౪ 2805

సీ. చనుదెంచి ధృతభూరి♦చాపహస్తుండయి దారుణాయుధములఁ ♦ దాల్చి ద్వార
సంస్థితుండయియున్న ♦ శత్రుఘ్నుఁ గనుఁగొని యీయాయుధముననీ♦ వేమిచేయ
గల విట్టి యాయుధం♦బులఁ బెక్కు వేలను బూనిన మనుజాధ♦ములను నేను
భక్షించినాఁడను ♦ బళిరె రోషంబున నీకుఁ గాలము వచ్చెఁ ♦ గాక, నాకుఁ

తే. బూర్ణమయ్యె నాహారంబు ♦ పూరుషాధ
మా! యిటం గల నీతోడ; ♦ నాయుపాం
వక్త్రబిలమును జొచ్చిన♦వాఁడ వీవె
వెడలఁ గలవెట్లు? పలుకుమా! ♦ వెడఁగుమనుజ!. ౫ 2806

---

* పురుషాధమ, దుర్మతే-అనునీ రెండు విశేషణములు మూలమున నున్నవి.

చ. అని యిటు పల్కుచున్ నగుచు ♦ హర్షము మీఱఁగ మాటిమాటికిన్
దనుఁ గనుచున్న యాలవణు ♦ దర్పసమగ్రుఁడు రాము తమ్ముఁడుం
గనుఁగొని రోషతామ్రముఖ♦కంజుఁడుగాఁ దనరారి యస్త్రవా
రిని విడిచెన్; మహోగ్రమగు♦రీతిని గ్రోధము వెల్వరింపఁగన్. ౮॥ 2807

ఆ. అమ్మహాత్ము దేహ♦మందుఁ దేజోమయ,ములగు కాంతు లట్టి ♦ వెలికి నరిగె
దాన మఱియుఁ గ్రోధ♦తామ్రాక్షుఁడయియిట్లు,పలికెనతనితోడఁ♦బంత మాని.

క. దనుజా! దుష్టమతీ! మా,ర్కొని ద్వంద్వాహవము చేయఁ ♦ గోరితి శ్రీరా
మునకున్ ధీమంతున కే, ననుజుఁడ దశరథునిసుతుఁడ ♦ నర్కకులజుఁడన్.

క. విను మే శత్రుఘ్నాహ్వయ,మును గాంచినవాఁడ నిత్య♦మును వైరులఁ గా
లుని వీటికిఁ బంపుదు ని, న్ననిఁ జంపఁగ వచ్చినాఁడ ♦ నట్లగుట నిటన్. ౧౧

సీ. ద్వంద్వయుద్ధముఁ బ్రవి♦దారణకాంక్షినై నాతోనంగుము నీ వ♦నంగ సర్వ
జీవవైరివి గానఁ ♦ జేరితి నినుఁ జంప జీవించి పురి కింకఁ ♦ జేరలేవు;
నా విని దనుజుండు ♦ నవ్వుచు [1]శత్రుఘ్నుఁ గనుఁగొని దుర్మతీ! ♦ కాలవశము
చేత నిచ్చోటికిఁ ♦ జేరితి నాతల్లి తోడఁబుట్టువునకుఁ ♦ దోడఁబుట్టు

ఆ. వగును రావణుండు ♦ హతమతీ! నీచాత్మ!, యాఁడుదానిమిషను♦ నంత మొందె
నతఁడు రాముచేత ♦ నావిధమే విని, యుతనివంశనాశ ♦ మాత్మ సైఁచి. ౧౨

క. ఊరక యుంటి; నవజ్ఞను, నీరీతిం జేసె మా కు ♦ నెంచక రాముం
డోరిదురాత్మా! నే నను,గా రాజులఁ జంపినాఁడఁ ♦ గ్రాలెడుశక్తిన్. ౧౩

క. అవమానించితిఁ గొందఱ, ననుదీశులఁ దృణము లట్టి ♦ యరయఁగ భూత
ప్రవిమలకీర్తులు రాజులు,ను వర్తమానులును ముందు ♦ నుతిఁ గనునృపులున్.

తే. తెగినయట్టి సంభావింపు ♦ దృష్టరాజ
తనయ! యుద్ధంబె కోరు నీ♦కును నొసంగి
నాఁడ సంగ్రామ మింక క్ష♦ణము నిలువుము
యాయుధము తెచ్చునందాఁక ♦ యాత్రపడక. ౧౫ 2814

క. నాయాయుధమును దెచ్చెద, నీయాప్సిత మెల్లఁ దీర్తు ♦ నింక నిలువుమా
[2]నాయన! శత్రుఘ్నా! యన, నాయువనీశ్వరకుమారుఁ ♦ డాతనితోడన్. ౧౬

తే. నాయెదుట బ్రతుంక కెట్లు చ♦నంగవచ్చు
శత్రు వొక్కండు స్వేచ్ఛగఁ ♦ జనఁగ నతని
యుద్ధమర్మ మెఱింగిన ♦ యిద్ధతేజుఁ
డూరకే పోవనీయంగ ♦ నొప్పుకొనునె?. ౧౭॥ 2816

---

1 శత్రుఘ్నో వీర్యసంపన్నో రోషా దశ్రూణ్యవర్తయత్-అనియూ. 2 నాయన-ఈవిశేషణము సాభిప్రాయమని తెలియఁదగు.

క. తెలివియొ లేకయొ యెవ్వఁడు, ఖలుఁడగు తనదాయకు నవ♦కాశమిడునో యా
యిలనాథుఁడు కాపురుషుని,వలెఁ దా హతుఁడగును బుద్ధి♦పాటవ మెడలన్.

చ. కనుకనె చూడఁగాఁ దగిన ♦ కర్బురవర్యులఁ జూడు మిప్పుడే
నునిశితబాణజాలము ల♦సుప్రకరంబులఁ బీల్చి నిన్నుఁ బం
పును యమగేహముం గనఁగ ♦ *భూతభయంకర! వైరి నీవు పా
పనిచయమూర్తి వర్కకుల♦పావనువైరివి గానఁ జంపెదన్. ౨౦౫ 2818

అఱువదియొనిమిదవ సర్గము సంపూర్ణము

---

౬౯ - వ సర్గము.

శత్రుఘ్నుఁడు లవణాసురునిం జంపుట.

క. అని యిట్లు మహాత్ముఁడు రా,మునిసోదరుఁ డాగ్రహమును♦బూని యనునుడుల్
విని క్రోధమూని నిలునిలు, మని లవణుఁడు పల్కి కరము♦నందుఁ గరంబున్.

క. పెనుచుచుఁ గటకటశబ్దం,బును దంతములందు మిగులఁ ♦ బుట్టఁగ గర్వం
బునఁ జేయుచు శత్రుఘ్నుని, నని చేయఁగ రమ్మటంచు ♦ నాతురపడుచున్. ౨

క. పిలిచెం బలుమాఱులు; ని,ట్లలరుచుఁ దను బిల్చుచున్న ♦ యాదనుజునిదో
ర్బలశాలి రాక్షసాంతకుఁ, డలఘుమనీషుండు లక్ష్మ♦ణానుజుఁ డలుకన్. ౩

క. కని ఘోరదర్శనుండా, నని మనమునఁ దలఁచి యిట్టు ♦ లనియెన్; శ్రీరా
మునితమ్ముఁడు శత్రుఘ్నుఁడు, దనుజాధమ! నీవు మున్ను ♦దర్పము మెఱయన్.

ఆ. చంపినట్టి యితర ♦ జనులట్లు చావఁడు, నిన్నుఁ జంప వచ్చి ♦ నిల్చినాఁడు
గాన నాదుతీవ్ర♦కాండములం జచ్చి,యరుగు మీవు యముగృ♦హమున కింక.

చ. అని నిను నేను జంపఁగ మ♦హామును లుర్వసురుల్ సుధీజనుల్
కనుదురుగాక రావణు న♦ఖండబలంబునఁ జంప దేవతల్
కనుఁగొనినట్లు; మచ్ఛరము♦ఖంబులతాఁకున నీవు మృత్యువుం
గని ధరణిం బడంగఁ బురిఁ ♦ గల్గును క్షేమము పల్లెలందునున్. ౬ 2824

సీ. మద్బాహునిష్క్రాంత♦మహితవజ్రాననసా యకం బిప్డు యు♦ష్మద్ధృదయముఁ
జొరఁబడు భాస్కరాం♦శువులు పద్మంబును జేరినయట్టులు ♦ చిత్రభంగి;
నన విని లవణుఁ డ♦త్యాగ్రహంబునఁబొల్చిగురుతరతరువొండు♦త్వరగఁ బెఱికి
శత్రుఘ్నుభూరివ♦క్షంబును నొప్పింప వైవఁగా నడుమనె ♦ బాణములను

తే. శతశకలములుగాఁ జెండె ♦ శత్రుకర్ష
మును గనుంగొని తనకృత్య♦ము చెడిపోవ
మరల బహుపాదపంబులఁ ♦ గురియఁ జేసె
బలము మెఱయంగ శత్రుఘ్ను♦పై గడంక. ౭ 2825

---

* యమస్య గేహాభిముఖం హి పాపం రిపుం త్రిలోకస్య చ రాఘవస్య-అనిమూ.

చ. తనపయి కేగుదెంచు బహు♦దారుణపాదపరాజి మూఁడు తీ
వ్రనిశితబాణపుంఖముల; ♦ వానిని గొన్నిఁటి నాల్గుబాణముల్
గొని యొకకొన్నిఁటిన్; క్షితిని ♦ గూలఁగఁ జేసి శరైకవృష్టి నా
దనుజునివక్షముం దడిపె ♦ దర్పము పొంగఁగ దానవైరియున్. ౧౧ 2826

క. చలియింప కట్టహాసం, బొలయ విలాసమున వృక్ష♦మొండు పెఱికి వే
తలపగుల మోఁదె దానం, జలితాంగుం డగుచు మూర్ఛ ♦ సౌమిత్రి కనన్.

తే. ఇట్లు శత్రుఘ్నుఁ డిలఁ బడ ♦ నెనఁగె మాని
దివిజగంధర్వముఖులదా ♦ దీనరవము
వైరి ధరణిని బడియుంట ♦ వాని మృతుఁగఁ
దలఁచి యవకాశముండియు ♦ దాసవుండు. ౧౩౹ 2828

క. తనయింటికిఁ బోఁడయ్యెను;, ఘనతరాలము తెచ్చుకొనఁగఁ ♦ గాని, తలఁపఁడ
య్యెను జచ్చె వైరి యంచని, యనుమానము లేక యాతఁ ♦ డలగుటకతనన్.

చ. తనమది లక్ష్మణానుజుఁడు ♦ దప్పక చచ్చె నటంచు నెన్ని యా
దనుజుఁడు భక్షణార్థ్యములు ♦ దారుణజంతువులన్ జవంబునం
గొని చన నెంచుచుంతటనె ♦ క్షోణివరుం డొగిఁ దెల్వి నొంది బా
ణనికరహస్తుఁడై నిలిచె ♦ నాకవిరోధికి నడ్డమై తగన్. ౧౬ 2830

క. ద్వారమునకు నడ్డముగా, నారీతి న్నిలిచి దివ్య♦మగుచు సమోఘం
బై రాజిలు నుత్తమశర, మారసి తేజమున నుండు♦నట్టి తనువునన్. ౧౬౹

క. ఘోరంబగుదానిని దు, ర్వారసురేంద్రులను దెసల ♦ భాసిలఁ జేయం
గా రామునితమ్ముఁడు గొని, సారము వజ్రసనంబు ♦ చంచద్గతియున్. ౧౭౹

తే. మేరుమందరతుల్యమై ♦ మించుపర్వ,ములను దనరి యజయ్యమై ♦ వెలసి రక్త
గంధదిగ్ధాంగమై పత్త్ర♦కలితమగుచు,దనుజపర్వతకులిశమై ♦ తనరుచుండ.౧౮౹

క. అరుదుగ నట్టిశరంబును, బరికించి గ్రహించె; నట్లు ♦ భాసురతేజ
స్స్ఫురణమున మండునాశర,వాము గని భూతవితతి ♦ భయము గనియెన్.

క. సురలును గంధర్వులు ని,ర్జరవైరులు నచ్చరలును ♦ సాధుమునీంద్రుల్
గరము భయం బందిరి సం,గరదర్శనకాంక్ష మున్న ♦ కంజజు నమగుల్. ౨౧

క. కని దేవేశా! వరదా!, యనుపమకరుణాలవాల! ♦ యఖిలజగంబుల్
కనునే ప్రళయంబును లేక, నిఖిలయుగంబులు గల్గఁ ♦ గలదే? చెపుమా. ౨౨

చ. మును పిటు తోఁచు భీతి జగ♦ముల్ కనియుండఁగ లేదు దేవతల్
వనజభవా! భయంబు గను♦భంగి జగత్త్రయ మబ్బురీతి క
ల్గినవిపరీతమున్ వినఁగ♦ లేదు కదా? వివరించి చెప్పుమా
యన విని దేవవాక్యముల ♦ నాపరమేష్ఠియు నిర్జరాళితోన్. ౨౩౹ 2837

క. అప్పుడు కల్గిన క్షోభము, తప్పక వివరించి చెప్పఁ ♦ దగునని దయతో

నప్పరమేష్ఠియు నిట్లని, చెప్పెన్ మధురోక్తివాక్య♦సిద్ధి చెలంగన్. ౨౪½

క. అనురవగుండౌ లవణుని, వెసఁ జంపఁగ రామసహజ♦వీరుఁడు జ్యావ
ల్లి నమర్చించిన సాయక, మనన్యశతేజమున వెలసె ♦ నాశరకాంతిన్. ౨౭

సీ. మీరెల్ల మూఁధత ♦ నీరీతిఁ గంటిరి శర మిద్ది లోకైక♦సాక్షియగుచుఁ
బూర్వతముండయి ♦ పొలుచు నాతనిదగుఁ దేజోమయంబయి ♦ దివ్యమగుచు
నలరు నద్దాన భ♦యం బిట్లు గల్గెను మధుకైటభాఖ్యుల ♦ మ్రుందఁ జేయఁ
బుట్టించె నమ్మహా♦పురుషుండు దీనిని దేజోమయుంబు నా♦దివ్యమూర్తి

ఆ. యెఱుఁగు నొకఁడుమాత్ర ♦ మిది మహోత్కృండగు
నతనిపూర్వతనువె ♦ యగును దీన
రాముసోదరుండ♦రాతిని జంపెడుఁ
గనుఁడు దాని మీరు ♦ చనుఁ డచటికి. ౨౯ 2840

క. వీరుం డీశత్రుఘ్నుఁడు, భూరిపరాక్రముని దాన♦వుని లవణాఖ్యున్
ఘోరాహవమునఁ జంపెడుఁ, జేరుం డచ్చోటి కనుచుఁ ♦ జెప్పెశతధృతిన్. ౩౦

క. కని యాతనిపలుకులనున్, విని దేవత లెల్ల నచట ♦ వీరులు ఘోరం
బనఁ దగుగతి నిల్చిరో మే,దిని దానిం జూడఁ జనిరి ♦ తేజము లలరన్. ౩౦½

చ. శర మది దివ్యమై మిగుల ♦ శాతముఖంబయి రామచంద్రసో
దరకరధారితంబగుచు ♦ దారుణరీతిని బొల్చియుండఁ జూ
చిరి దివిజోత్తముల్ సకల♦సిద్ధులు భూతములున్ లయానలుం
డురుగతి వేచెనోయనెడు ♦ నూహాంభో మదిఁ దోఁచుభీతితోన్. ౩౧½ 2843

క. సుర లాకాశంబున నిం,డిర శత్రుఘ్నుండు వీర్చు ♦ నియుతిం గడుభీ
కరసింహనాద మడరఁగ, సురరిపున్ మరలఁ దేటి ♦ చూచి యమర్షన్. ౩౨½

క. రా రమ్మని పిల్చుచు నతి,ఘోరమ్ముగ నడరఁ గాంచి ♦ క్రోధము పొంగన్
జేరెం జెంతకు లవణుఁడు, వీరుఁడు సౌమిత్రి యంత ♦ వితతధనువునన్. ౩౩½

క. ఆకర్ణాంతము లాగుచు, నాకర్బురునురము గుఱిగ ♦ నప్పుడె విడిచెన్
భీకరశరమును దానిని, వీఁకన్ జని యద్ది దనుజ♦వీరునురంబున్. ౩౪½ 2846

ఆ. పగులఁ జీల్చి చొచ్చెఁ ♦ బాతాళలోకంబు, విబుధపూజితమయి ♦ వెలయునట్టి
యాశరంబు మరల ♦ నాతనిచెంతకు, నరుగుదెంచి చొచ్చె ♦ నమ్ములపొది ౩౬

క. గురుతేజుఁడు లవణుఁడు త,చ్ఛరనిర్భిన్నాంగుఁ డగుచు ♦ శక్రాయుధభీ
కరధారాహతభూధ్రము,కరణిన్ ధరఁ గూలె దేవ♦గణములు పొంగన్. ౩౭

సీ. దివ్యశూలం బది ♦ దివిజారి లవణుండు ధరఁ గూల సర్వభూ♦తములు చూచు
చుండంగఁ జనియె నా♦ఖండపరశువుని యంతికంబున కప్డు; ♦ డంత దేవ
మునులు గంధర్వసి♦ద్ధనికర మచ్చరల్ గుమిఁగూడి రఘుకుల♦కుంజరుఁ గని
యిది యదృష్టంబు మా♦కిది యదృష్టంబని వినుతించి రార్పులు♦వెలయునట్టు

తే. లేక శరపాతమున లోక♦భీకరు వధి
యించి జగముల భీతి మా♦యించి దివ్య
చాపశరధారి శత్రుఘ్నుఁ ♦ డేపుమీఱఁ
దమములం బాపు భానుచం♦ద్రమున వెలసె. ౪౦ 2849

క. సురమునిపన్నగు లర్చిం,చిరి యచ్చరలాడి యిట్లు ♦ చెప్పి రదృష్ట
స్ఫురణమున జయం బబ్బెను, *సురగము గతభీతి నలరు ♦ నొప్పం గనుమీ.

అఱువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౭౦ - వ సర్గము.

{ శత్రుఘ్నుఁడు మధుపురమునఁ బండ్రెండేం డ్లుండి రామునిఁ జూడ నయోధ్య కరుదెంచుట. }

క. అని పల్కి రంత నిర్జరు, లనలపుగోగములు లవణుఁ ♦ డనిహతుఁడై నన్
గని శత్రుతాపనుని రా,మునితమ్ముని మధురవాక్స♦ము నయము లొప్పన్. ౧

క. పలికిరి వత్సా! జయ మి,మ్ముల నీకు నదృష్టయోగ♦మునఁ గల్గెఁ జుమీ
పలలాశనుఁ డీలవణుఁడు, ఖలుఁడు హతుం డయ్యె దైవ♦గతిఁ బురుషవరా!.

క. వరమును గోరుము రాఘవ!, వరదులమగు మేము దీర్ఘ♦బాహూ! యిదెయిం
దరుదెంచితి మిట విజయుం, బరుదుగ నీ కగును గాక ♦ యనుకోర్కెలతోన్.

తే. దర్శనం బస్మదీయము ♦ తలఁపఁగా న
మోఘ మగు నను దేవతా♦ముఖ్య భాషి
తముల విని శూరశత్రుఘ్నుఁ ♦ డమలభక్తి
శిరమునం దంజలిని జేర్చి ♦ గురుభుజుండు. ౫ 2854

సీ. ప్రయతాత్ముఁడై యిట్లు♦పల్కెను, మధుదానవునిపురం బిది త్రిద♦శనికరంబు
చేత నిర్మితమును ♦ చెలఁగెడు మధురాఖ్య నిందుఁ బ్రవేశంబు ♦ నిపుడె నేను
బొందునట్లుగ వర♦ముం గరుణింపుఁడీ; యనెడు శత్రుఘ్నుని ♦ సమురవరులు
గని ప్రీతి నట్లయా ♦ నని పల్కి యాపురి శూరసేనాఖ్య చే ♦ క్షోణి నెసఁగుఁ

ఆ. గాక యింక మీఁద; ♦ గలుగదు సంశయ,మనుచుఁ బల్కి యమరు ♦ లామహాత్ము
లపుడె దివికిఁ జనిరి; ♦ యామహాతేజుండు, తనదు సైన్యములను ♦ దరలఁ బంచె.

క. నరవరుశాసనమును విని, త్వరగా దద్బలము లపుడు ♦ తరలి యచటికి శ్రీ
కరమూర్తిఁ జూడవచ్చెను, బురికి నభోమాసమందె ♦ పొదలెను వేడ్కన్. ౭

క. బలములతోఁ జొచ్చెను దో,ర్బలశాలి; పురీవర మది ♦ ద్వాదశవర్షం
బులలోన శూరసేనా,ఖ్యల విషయం బయ్యె భీతి ♦ నొందక యలరెన్. ౮

---

* త్యక్త్వా భయం సర్ప ఇవ ప్రశాంతః-అనిమూ.

క. సురపురసంకాశంబై, పరఁగెన్; క్షేత్రములు సస్య♦బహుళము లగుచున్
బరమామోదము నిడుచుం, గరము విరాజిల్లె వృష్టి ♦ గల్గెన్ సరిగన్. ౯

ఆ. విగతరోగ మగుచు ♦ వీరభటాకీర్ణ,మగుచు రాముతమ్ముఁ ♦ డలరి ప్రోవ
నర్ధచంద్రసమత ♦ నందుచు యమునతీ,రమున సౌధముఖ్య♦రాజితమయి.

క. తనరుచుఁ జత్వరములచే,తను విపణులచేత నృపప♦థవితతిచేతన్
ఘనమై వర్ణచతుష్టయ,మున వ్యాపారముల మిగులఁ ♦ బొల్చుచు నలరెన్.

క. దనుజుఁడు మునుపాలింపం,గను శోభిలకున్న తన్న♦గరమును శ్రీరా
మునిసోదరుండు నిర్మల,ఘనసౌధవిరాజితంబు♦గా నొనరించెన్. ౧౨ 2261

క. పలువిధములైన సౌధం,బుల నానావర్ణజనులు ♦ పొలుపుగ నుండన్
బలశాలి చేసి యేలెన్, లలితారామములఁ జెలువు♦లన్ జెన్నసఁగన్. ౧౩

క. సురుచిరపదార్థములచేఁ, గరము విరాజిల్లి సురని♦కాయమనుష్యో
త్కరనిబిడంబై సురపురి,కరణిన్ జెలువారి విపణి♦కాంతం బగుచున్. ౧౪

క. పలుదేశంబుల నుండియుఁ, జెలువారెడువేడ్క వచ్చి ♦ స్థితిఁ గాంచి ధనం
బుల సేకరించి వణిజులు, విలాసముల నొప్పుచుండ ♦ వేడుకఁ గనుచున్.

క. ధనసంపన్నంబై యొ, ప్పిన పత్తన మెల్లఁ జొచ్చి ♦ పృథుకీర్తి యనం
దనరినశత్రుఘ్నుం డ,త్యనుపమహర్షంబు నొందె ♦ నాత్మన్ మిగులన్. ౧౬

చ. పురమునఁ గొంతకాలము వి♦భూతి నెసంగుచు నుండి రాఘవే
శ్వరుచరణాబ్జముల్ గనఁగ ♦ స్వాంతమునం దలపోసి నేఁటిన
త్సర మిది ద్వాదశం బగుచుఁ ♦ జక్కనిరీతి నెసంగె నింక నే
నరుగుట యొప్పనంచు నమ♦రాధిపపత్తన మట్లు లొప్పుచున్. ౧౭ 2266

క. జనవితతి రమ్యమా ప,త్తనమును బాలింపఁ జాలు ♦ ధన్యుల నియమిం
చి నృపతి యన్నను జూడఁగ, మనమునఁ దలపోసె సంభ్ర♦మదముపొంగన్.

డెబ్బదియవ సర్గము సంపూర్ణము.

---

౭౧ - సర్గము.

శత్రుఘ్నుండయోధ్యకు మరలి వచ్చుట.

క. తరువాతం బండ్రెండవ, శరత్తునన్ లక్ష్మణానుజన్ముఁ డయోధ్యా
పురమునకుభృత్యసుభటో,త్కరయుతుఁడై వెడలె రాముఁ♦గనుఁగొనుతమితోన్.

క. అనుమోదంబునఁ దోడను, జనుదెంచెడు మంత్రిముఖుల ♦ సకలబలములన్
జన దిఁక దూరము చనుదేర నని శతాశ్వములఁ గూడి ♦ రథ మెక్కి చనెన్

క. మును చనుదెంచినచందం,బును లెక్కిడుకొనుచు మాస♦ములు నేడు పథం
బునఁ బుచ్చి యెనిమిదవ నెల, చనుచుండ మహారథుండు ♦ శత్రుఘ్నుండున్,

సీ. వాల్మీకిమౌనిభూ♦వరుని యాశ్రమమున కరుదెంచి యందుండ ♦ నగునటంచు
నమ్మునిపదముల ♦ కభివాదమును జేసి యతఁ డొసంగినపాద్య♦మర్ఘ్యముఁగొని
బహువిధమధురో క్తి♦భరితగాథాసహ స్రముల నాతఁడు చెప్ప ♦ సమధికమతి
యలరఁగావినియె;నా♦యమలమునీంద్రుండుపలికెనిట్లని;మహా♦పరమహ్లాదయుఁ

తే. డైన లవణాసురుం జంపి ♦ తది సుదుష్క
రమగుకృత్యంబు వెయ్యేల ? ♦ రఘుకుమార !
యతనిచేతను సబలవా♦హనులు కొంద
ఱవనినేతలు నిహతులై ♦ రనిని మున్ను. ౬ 2871

క. గురుతరబాహూ! యాతఁడు, దురాత్మకుం డట్టియసుర ♦ ద్రుంపంబడెఁ బా
పరతుం డాలవణుం డో, పురుషర్షభ! లోకభయము ♦ పోయెన్ దర్వరగన్. ౭

క. భూరిభవత్తేజంబున, ధారణి బాధయు నడంగెఁ ♦ దవ్వజ్జ్యేష్ఠునిచే
నారావణుండు గూలెన్, ఘోరాకారుం డతండు ♦ క్రూరుండు గదా? ౮

క. దనుజేంద్రుఁడు లవణుం డా,తనికంటెం గ్రూరతముఁడు ♦ తద్వధఁ గావిం
చినవాఁడ విద్ది గొప్పది, యనఁ దగుకృత్యంబు పుణ్య ♦ మలరెన్ నీకున్.

క. సురలకు దీసం గల్గెను, బరమప్రమదంబు భూత♦పటలమ్మునకున్
ధరణికిఁ బ్రీతి యొనర్చితి;, సురపతిసభనున్న నేను ♦ శుభతమదృష్టిన్. ౧౦

క. మీయుద్ధంబును గాంచితి, నాయెడనే యుండి ప్రీతి ♦ యలరెన్; శత్రు
ఘ్నా! *యసుర మృత్యు వొందుట, నీయెడలన్ ముద్దుగొనుదు♦నే శీర్షంబున్.

చ. అని వచియించి ప్రీతి యల♦రారఁగ నాతనిమస్తకంబు నా
మునిపతి ముద్దు వెట్టుకొని ♦ మోదము చూపుచు మార్గ మిద్దియే
యని యతిథిప్రియంబయిన ♦ యర్ఘ్యము చేసి తదీయసేనకున్
మన మలరంగఁ దృప్తియగు♦మాడ్కిని విందొనరించె నేర్పునన్. ౧౩ 2877

సీ. శత్రుఘ్నుఁ డర్హాభో♦జనమునఁ బ్రీతుఁడై యాశ్రమాంతరమున♦యందు గీత
మాధుర్యమునఁ దగు ♦ మానితశ్రీరామ చరితంబుఁ దా విను ♦ సక్రమముగఁ
దంత్రీలయాదియు♦తంబయి త్రిస్థానకరణాన్వితంబయి ♦ పరఁగి సంస్కృ
తమయి లక్షణసంయు♦తంబయి సమతాళవిలసితంబయి ముని♦తిలకరచిత

తే. మైన శ్రీరాముచరితమ్ము ♦ నాదరమున
వినుచు నాయక్షరమ్ములు ♦ మునుపు జరగి
నట్టి కథ నెల్ల నిజములై ♦ యలరఁ జేయ
విగతసంజ్ఞుఁడై యశ్రువుల్ ♦ విడుచుచుండె. ౧౬ 2878

క. తను వెఱుఁగ శోకముహూర్తంబును మూర్ఛం గాంచి యొక్క♦పోలిక నిట్టూ
ర్పును బుచ్చి యట్టి యుండెను;, మన మొప్పఁగ నంతవినియె♦మరలనతండున్.

* ఉపాఘ్రాస్యామి తే మూర్ధ్ని స్నేహ స్యైషా పరా గతిః-అనియు.

క. గీతంబునఁ బ్రాగ్వృత్తం, బేతెఱఁగునఁ జెప్పఁబడియె ♦ నిపుడు జరగున
ట్లే తోఁచె నంత సుభట,వ్రాతము నాగీతసరణి ♦ బాగుగ వినియెన్. ౧౮

క. మోముల వంచి మహార్తిని, దా మొందుచు నతని శూర♦తల్లజు లిది యే
మేమో యాశ్చర్యంబని, తా మొండొరులకును జెప్పు♦తద్రవ మలరెన్. ౧౯

క. ఇదియేమి యెందు నుండితి, మిది స్వప్నమునందుఁ దోఁచె♦నేమో? నిజమా!
యిది మున్ను చూచినారము, గద యట్లే వింటి మిపుడు ♦ కడుఁ జిత్రముగన్.

క. గానము స్వప్నంబున మన, కీనెలవునఁ దోఁచె నోర ♦ యిది యచ్చెరువే
యౌనని శత్రుఘ్నునితో, మానక యిట్లనిరి; దేవ♦మానీశ్వరునిన్. ౨౧ 2883

తే. ప్రశ్న చేయుము చక్క న♦ర్థంబు దీనిఁ
దెలియఁగాఁ దగు నన విని ♦ యలరి కుతుక
మ్మట్టి కాంచినవారల ♦ నరసి పలికె
నిట్టి ప్రశ్నము చేయంగ ♦ నెట్లు తగును?. ౨౨ 2884

చ. మునివరుఁ బ్రశ్న చేయువిధ♦ముం గనరాదు మదిం దలంచి చూ
చినఁ గడు నద్భుతంబు లిటఁ ♦ జెప్పఁగ శక్యముగాని యట్టులే
తనరెడుఁ గౌతుకంబున ని♦తాంతము పొల్చెడు నిమ్మహామునీ
శుని నడుగంగ రా దనిన ♦ క్షోణివిభుం గని వార లట్లయా. 2885

క. అని పలికిరి శత్రుఘ్నుఁడు, తనబలముల నిద్రపోవఁ ♦ దాఁ బంచి మునీ
శునకున్ వందన మిడి తాఁ, జనియె నివాసమున కాత్మ ♦ శంకం గనుచున్.

డెబ్బదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౭౨ - వ సర్గము.

{ శత్రుఘ్నుఁడు శ్రీరాముని జూచుట. అన్నయాజ్ఞ నొంది మరల మధురాపురికిం బోవుట. }

క. పురుషలలాముం డాతఁడు, పరుండఁ దచ్చిత్త మొక్క♦భంగిఁ గనక యా
తురపడు చుండుట నిద్రయుఁ, బరమాణువుపాటియైనఁ ♦ బట్టకయుండెన్. ౪

క. అనుపమరామచరిత్రం,బును బలుమఱు చింతచేయఁ ♦ బూనెను; గానం
బునఁ దగుశబ్దము మధురం,బును దంత్రీలయయుతమును♦ బూజ్యతమమునై.

క. అలరారె దాని వినఁగా, మెలమెల్లన రాత్రి గడచె; ♦ మేల్కొని యంతన్
గలఁగినమదితోఁ గృత్యం,బుల నౌదయికములఁ దీర్చి ♦ మునిపతిచెంతన్. ౨౪

క. నిలువఁబడి దోసిలొగ్గుచుఁ, బలికెన్ భగవంత! రామ♦భద్రునిఁ గన ని
మ్ములఁ గోరెడుమది యనుమతిఁ, బలికిన సేవకులఁ గూడి ♦ పయనమొనర్తున్.

చ. అన విని శత్రుతాపనుని ♦ నారఘురామునిసోదరుం గనుం
గొని ముని కౌఁగిలించి రఘు♦కుంజరుఁ జూడఁగఁ బొమ్ము నావుడున్

మునికి నమస్కరించి రథ♦మున్ ముద మొప్పఁగ నెక్కి చారుకాం
తిని దగి యాయయోధ్యకు న♦తిత్వరగాఁ జన శేష్ఠుఁ జూడఁగన్. ౬ 2891
క. చని యిక్ష్వాకుకులోద్భవుఁ, డనఘుఁడు శ్రీమంతుఁ డిట్టు ♦ లతిరమ్యంబై
కననగు పురిఁ జొచ్చెను*గాం,తిని మించెడురాముఁ గాంచఁ♦దివురుచు నంతన్.
క. అనుచరమంత్రిగణావృతుఁ, గనె రాముని మంత్రివర్య♦కలితు శచీనా
థుని గాంచినట్లు వినయం,బునఁ బ్రాంజలియాచు భక్తి ♦ మ్రొక్కి రఘువతిన్.
క. జ్వలితాంగుని మహితాత్ముని, సులలితనేత్రాబ్జు నిత్య♦శూరుని గనుచుం
బలికెన్ రాజేంద్రా! మీ,పలికినగతిఁ గృత్య మెల్లఁ ♦ బంతం బలరన్. ౯౪
క. ఒనరించినాఁడ లవణుని, బనిపితి యమపురికిఁ బురముఁ ♦ బాలించితి సం
దును బంద్రెండేఁడులు మిమ్మును వదలి వసించినాఁడఁ ♦ బోలని మదితోన్.
సీ. వసియింపఁ జాల భూ♦వర! మిమ్ము విడనాడి కాకుత్థ్స! పటుశౌర్య♦కలిత! యాజ్ఞ
దయచేయు మిందుండఁ ♦ దగునని తల్లిని విడిచినవత్సంబు ♦ విధమున నట
నుండితి; నా విని ♦ యుర్వీశుఁ డాతనిఁ గౌఁగిటం జేర్చి యీ♦కరణిఁ బలికెఁ;
బొందకుము విషాద♦మును వీర! యయ్యది క్షత్రియచరితంబు ♦ కాదు గాన
ఆ. విప్రవాసమందు ♦ విహ్వలింపరు రాజు, లఖిలమనుజు లెలమి ♦ ననిశ మొక్క
గతిని గష్టము లొగిఁ ♦ గలుగకుండఁగఁ బ్రోవఁ,దగినవారు క్షత్ర♦ధర్మ మిద్ది.
క. తలఁచినయప్పుడు నన్గన, నెలమిన్ రావచ్చు నిటకు ♦ నిందుండి దినం
బులు కొన్ని పుచ్చి మధురకుఁ, గలఁగని మదిఁ బోవవచ్చుఁ ♦ గమ్రగుణాఢ్యా!.
తే. ప్రాణములకంటె నెక్కుఁడై ♦ పరఁగు దీవు
సంశయం బించుకయు లేదు ♦ సమధికముగ
రాజ్యమును బ్రోవఁగాఁ దగు ♦ రాజులకును
ధర్మ మిది యూట నీ విట ♦ నిర్మలగుణ!. ౧౬ 2898
క. నివసింపు మేడుదినములు, జవమున నవ్వలఁ జనంగఁ ♦ జను మధురకు నో
సువిమలధిషణా! భృత్యులు, జవనాశ్వము లెల్లఁ దోడఁ ♦ జను దేరంగన్. ౧౭
చ. అనుటయు రామచంద్రువచ♦నావళి ధర్మయుతంబు నోట నె
మ్మనమున కింపుఁ బెంప విని ♦ క్ష్మాపతితో నతిదీనుఁ డౌచు నేఁ
జనియెద యుష్మదాజ్ఞ శిర♦సా వహియించుచు నంచుఁ బల్కి రా
మునినికటంబునందుఁ దమిఁ ♦ బుచ్చెను నేడు నిశల్ క్షణంబుగన్. ౧౮
క. తరువాత రామునాజ్ఞతిఁ, దరలం దలపోసి సత్య♦ధర్ముని మహితా
త్ము రఘుకులోద్ధారకు భూ,వగు వేఁడుచు లక్ష్మణునిని ♦ భరతుని భక్తిన్. ౧౯
ఆ. పయనమునకు వేఁడి ♦ భవ్యరథం బెక్కి
వారుతోడ నెలమి ♦ దూరమునకు

---

* యత్ర రామో మహాద్యుతిః - అనియూ.

రాఁగ వారి నిల్పి ♦ యేగెఁ దా సుధురకు
సమ్మదంబు లేని ♦ చందమునను. ౨౧ 2902

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 23 - వ సర్గము.

మృతపుత్రునిం దెచ్చి బ్రాహ్మణుఁడు రాజద్వారమున నాక్రోశించుట

క. భరతుఁడు లక్ష్మణుఁడును దో, నరుదేర సుమిత్రపుత్రు ♦ నాశత్రుఘ్నుఁ
బురికంపి ధర్మరక్షణ,పరుఁడై సుఖ ములర జనులఁ ♦ బరిపాలించెన్. ౧ 2903

క. చనియెను గొన్నిదినంబులు, జనపదసంవాసి వృద్ధ ♦ శ్యానురుఁ డొకటం
జనుదెంచి మృతుండగు తన,తనయుని ద్వారమునఁ బెట్టి ♦ తాఁ బలవించెన్.

క. పలువిధములఁ దనపుత్రునిఁ, దలఁచుచు స్నేహంబు వగయుఁ ♦ దనకుం దోఁపం
గలవిలపడుచుం దనయా!, కులమును బోషింపఁ జాలు ♦ కొడుకా! యనుచున్.

క. వనటం గుందుచు నేడ్చుచు, ననియెన్; దొలిజనిని బాప ♦ మది యెట్టిది నే
నొనరించినాఁడనో చ,చ్చినపుత్రుని నిన్నుఁ గనఁగ ♦ జీవించితిఁగా. ౪ 2906

సీ. వయసు రాలే దింకఁ ♦ బంచహాయనములు మాత్రమే గడచెను ♦ మరణమీతఁ
డొందెనింతటిలోన ♦ నురుదుఃఖవార్ధిలోననుముంచియనుచునో ♦ తనయ! యనుచు
బలవించి నే నింకఁ ♦ గొలఁదికాలంబున నిధనముం బొందెద ♦ నిజము పుత్ర!
నేను నీతల్లియు ♦ నీవగఁ గనఁజాల మే నెన్నఁడైన స ♦ త్యేతరంబు

తే. బలుకఁదలపోయ,హింసయుఁ ♦ దలఁపనెపుడు, పాపమెట్టిది చేయంగఁ ♦ బాలుపడిన
వాఁడనోగాని నాపుత్ర ♦ వర్యుఁడిట్టు,లంతమొందెను దేననో ♦ యరయఁజాల. ౫

క. స్మరియింప నొరులపాపము, వరతనయుఁడు పోయె యముని ♦ భవనంబునకున్
దరుణమ్మునఁ బితృకార్యము, సరిగా నొనరింప కిట్లు ♦ చచ్చెం గాదే!. ౬

క. మును పిది చూచి యెఱుంగను, వినినదియును లేదు ఘోర ♦ విషయం బిది రా
మునిరాజ్యమందుఁ దటి త,ప్పినరీతిం జచ్చు టొకటి ♦ పెంపువహించెన్. ౭

క. జనపతి సుంతయు లేకు,న్నను బెద్దదియో యఘంబు ♦ నానాజనులన్
వనటం గుందఁగ నొనరిచె, ననుమానం బింతయైన ♦ నగపడ దిందున్. ౮

తే. ఇతరరాజుల దేశాళి ♦ నెందునైన, బాలుఁ డంతంబు నొందు టే ♦ వరుస లేదు
రామ! నీ వీకుమారుధ ♦ ర్మగృహావాసు, బ్రదుకఁ జేయుము నా ప్రియ ♦ బాలకునిని.

తే. ద్వారమున నిందు నే నిప్డు ♦ భార్యఁ గూడి,
యనదచందంబునన్ మృతి ♦ నందువాఁడ;
బ్రహ్మహత్యను బొంది భూ ♦ వర సుఖంపు
మనుజులం గూడి దీర్ఘాయు ♦ వందవయ్య!. ౧౦ 2912

చ. బలమున నొప్పియున్న జన ♦ పాలక! నీ నగురాజ్యమందు నీ
కొలఁదిదినంబు లుండితిమి ♦ కోరిక లూరఁగ నిప్పు డిట్టిపా

టూలసెఁ ద్వదీయపాలనము ♦ నోర్వక పోయెద మింక మృత్యువే
చలమున మమ్ముఁ బొందెఁ గద? ♦ చాలు సుఖం బిఁక నీదురాజ్యమున్. ౧౩॥
తే. బాలు నంతంబు నొందింపఁ ♦ జాలు రాము
నధిపునిగఁ బొందితిమి నిశ్చ♦యముగ [1]రాజ
పాపములఁ జిక్కి చత్తురు ♦ ప్రజ లవిధిగ
రా జసద్వృత్తి మెలఁగినఁ ♦ బ్రజలు ధరణి. ౧౪॥ 2914
క. అంతము నొందుదు రిది య,త్యంతము దుఃఖ మ్మొసంగు♦నది యతరుణమం
దంతముఁ గూర్చుట పాలన, మెంతయు నన్యాయమనుచు ♦ నెన్నఁగవలయున్.
క. అనుచితకృత్యంబుల నే, జనపదములఁ బురములందు ♦ జను లొనరుతురో
జనులందు మరణ మొందుదు;, రనూన విధి రక్షణంబు♦నరయునొ యొచటన్.
తే. కాలకృతమృత్యువే కల్గుఁ ♦ గాని యి ట్లు,కాలమరణంబు గల్గ దే♦కరణిఁగాని
స్పష్ట మిది భూపవర్యదో♦షంబు సంశ,యంబు లే దింతయైనస♦త్యం బిదాను.
క. పురమున జనపదమున నీ,వరుసను శిశుమరణవిషయ♦వార్త కలిగెనం
చురునాదంబునఁ బలుమఱు, నరపతినిం గూర్చి నిజత♦నయుఁ దెల్పె నగన్.

డెబ్బదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౭౪ - వ సర్గము.

నారదుండు రామునకు బాలునిమృతికి హేతువుం దెలుపుట

[2]క. కరుణమ్ము దుఃఖశోక,స్ఫురణమ్మును నైన విప్ర♦పుంగవునేడ్పున్
నరపతిచూడామణి రఘు,వరుఁ డెంతయు నాలకించె ♦ నంత గదురఁగన్. ౧
చ. విని రఘురాముఁ డాత్మ వగ♦పెల్లిన నూపఁగలేక మంత్రులై
ఘనమతులౌ వసిష్ఠముని♦కాంతుని యోగిని వామదేవుఁ ద
క్షినమునిమంత్రిపౌరులను ♦ గేవలతత్త్వము తెల్పువారిఁ జ
య్యనఁ బిలువంగఁ బంచెను, మ♦హాత్ము వసిష్ఠునిఁ గూడి వార లా
జనపతిఁ జేర వచ్చిరి ప్ర♦శస్తమతుల్ చెలువారుచుండఁగన్. ౨॥ 2920
తే. వచ్చి రఘురామ! వర్ధిల్లు ♦ వరయశంబుఁ
గాంచి యంచొగి పల్కిరి ♦ కాశ్యపముని
వామదేవమార్కండేయ♦నామమునులు
గౌతముండు జాబాలిమౌ♦ద్గల్యమునులు ౩॥ 2921

---

1 రాజదోషై ర్విపద్యంతే ప్రజా హ్యవిధిపాలితాః, అసద్వృత్తే తు నృపతా వకాలే మ్రియతే జనః-అనిమూ. 2 తథా తు కరుణం తస్య ద్విజస్య పరిదేవితం, శుశ్రావ రాఘవ స్సర్వం దుఃఖశోకసమన్వితమ్-అనిమూ.

క. నారదుఁడును బీఠంబులఁ, జేరిరి రాఘవుఁడు లేచి ♦ చేరం జని యిం
పారఁగ వందన మిడి కర, సారసముల నంజలిగను ♦ సంధించి తమిన్. ౭

సీ. పౌరులు మంత్రులు ♦ పరమాదరంబునఁ దగినట్లు గూర్చుండఁ ♦ దాను బీఠ
మందు నాసీనుఁడై ♦ యతులదీప్తిం బొల్చువారలఁ గాంచియా ♦ బ్రాహ్మణవగఁ
దెలుప వారెల్లను ♦ దీనుఁడౌ రాముని పలుకు లాలించిరి; ♦ పరమబుద్ధి
రాజితుండయిన నా ♦ రదుఁ డిట్లు వచియించె మునులసన్నిధి శుభం ♦ బును హితంబు
తే. నైన భంగిని రాజేంద్ర! ♦ యనమయమున
బాలుఁ డీల్గెను దద్వార్త ♦ నాలకించి
బదులు చేయంగఁ బూనుము ♦ విదితయశుఁడ
వై చెలంగుట శ్రీరామ! ♦ యతులనామ!. ౮ 2928

క. విను మొకవార్తం దెల్పెద, మును కృతయుగమందు విప్ర ♦ ముఖ్యులె తపమున్
మనుశాస్త్రరీతి నల్పెదు, రనఘా! విప్రేతరుఁడు ను ♦ పార్జితపంబున్. ౯

క. ఒనరింపఁ డొక్కఁడైనను, విను మోరాజేంద్ర! జ్ఞాన ♦ విస్తృతిగల యా
ఘనయుగమున నజ్ఞానం, బను నావరణంబె లేక ♦ యలరుఁ దపంబున్. ౧౦

చ. కలుగ వకాలమృత్యువులు ♦ కల్గవు రోగము లాయుగంబునన్
జెలఁగుచు మర్త్యలోకగతి ♦ సిద్ధులఁ గాంచుచు దీర్ఘజీవితం
బులఁ గనుచుందు; రంత నొక ♦ పోలికఁ ద్రేతయు వచ్చె నత్తఱిన్
గలిగిన మర్త్యు లుజ్జ్వలవి ♦ కాసయుతాత్ములు నుమ్ము రాఘవా!. ౧౧ 2926

క. తొలిజన్మమున నొనర్చిన, యలఘుతపశ్శక్తి క్షత్రి ♦ య వ్రాతములున్
గలిగెను వీర్యతపంబుల, దొలిజని నవ్వారు పూజి ♦ తులు రాజేంద్రా!. ౧౨

క. విను మీత్రేతాయుగమున, మనుజులు ధర్మాత్ములెరి ♦ క్ష్మాసురులు ధరా
వనదక్షరాజచంద్రులు, గని రెంతయుఁ బ్రాగ్యగీయ ♦ కాంతితపములన్. ౧౩

తే. రెండుయుగములఁ దుల్యమై ♦ యుండు వీరి
కతులవీర్యము తప మొక్కఁ ♦ డధిక మిందు
వీర లిర్వురకును నొక్క ♦ విషయ మిపుడు
కలదు తెల్పెద వినవయ్య! ♦ క్ష్మాపతీంద్ర!. ౧౪ 2929

సీ. వర్ణచతుష్టయ ♦ వాంఛాభిపూరకధర్మముల్ చక్కఁగా ♦ స్థాపితంబు
లయ్యెఁ గృతంబున ♦ నమలధర్మం బొందు వెలసె నజ్ఞానంబు ♦ పొలిసె నొక్క
పాద మధర్మంబు ♦ పరఁగె నెందో పృథ్వియందు; నధర్మంబు ♦ నాశ్రయింపఁ
దేజమ్ము మందమా; ♦ రాజ! పూర్వుల కెల్ల జీవనోపాయంబుఁ ♦ జింతసేయ
తే. మలయుతం బనృతంబును ♦ గలుగుఁ బాద
మాత్రమే తక్కినదియెల్ల ♦ మానితంబె
పాదమాత్ర మధర్మంబుఁ ♦ బాయఁద్రోచి
యనృతమును వీడి నిర్మలు ♦ లైరి వారు. ౧౫ 2930

క. అనృతము నధర్మమును మేదిని లేకుండంగఁ జేసి ♦ దీర్ఘాయువు న
మ్మనుజులు పొందిరి సత్యం,బు నధర్మము సుంతయేని ♦ పూనక మనుజుల్.

తే. మంచికర్మంబు లొనరించి ♦ యంచితముగు
సత్యధర్మానురక్తిచేఁ ♦ జాలఁ గ్రాలి
యశముఁ గాంచిరి; త్రేతాహ్వ♦యమునఁ బరఁగు
నీయుగంబున బ్రాహ్మణు ♦ లెల్ల నృపులు. ౧౯౹ 2932

*క. అనుపమతపముం జేయం,గను దొడఁగిరి సేవచేయఁ♦గాఁ బూనిరి త
క్కినవారు వైశ్యశూద్రుల, కనువగు శుశ్రూషయనెడు♦వది ధర్మముగన్.

క. చరణజులు విశేషించియుఁ, బరిచర్యలు చేయుచుండు♦వారు మిగతభూ
సురముఖ్యవర్ణములకున్, దరువాతన్ నరుల కనృత♦ధర్మేతరముల్. ౨౨౹

ఆ. వృద్ధి నొందఁ జొచ్చె ♦ నెట్టులో పాదమా,త్రముగనున్నయదియుఁ♦దనరెరాము
తా ద్వితీయపాద♦ధర్మేతరముఁ గూడి, యట్లసత్య ములరె ♦ నంతలోన. ౨౩

సీ. ద్వాపరయుగమునఁ ♦ దత్కాల ములరాదు నీత్రేత గడచిన ♦ నెసఁగు నదియె
నం దధర్మ మనత్య ♦ ముభివృద్ధి నొందును దత్కాలమున వైశ్య♦తతిఁ దపంబు
పొందును; శ్రీరామ♦భూపాల! యీరీతిగా యుగత్రయమున ♦ బ్రాహ్మసురాది
వర్ణత్రయుంబుఁ ద♦పం బొందు ధర్మంబు నారీతినే పొల్చు ♦ నందు ధర్మ

ఆ. మంఘ్రిజులను బొంద ♦ దాకుల మనిపై, నాల్గవదయి యుంట ♦ నరవరేణ్య!
శూద్రులందుఁ దపము ♦ శోభిల్లుఁ గలియుందు,నం దధర్మమధిక ♦ మాఁ దలంప.

క. ద్వాపరమందున ధర్మం, బాపాదజులందె యధిక♦మై యుండును నో
భూపాల! యీయుగంబున, నీపాలనమందునున్న ♦ యిల నికటమునన్. ౨౭

చ. చరణభవుండు నత్తపము ♦ సల్పెడు దుర్మతియై తదీయమా
పరమతపోబలంబుననె ♦ బాలుఁ డితండు మృతిం గనెన్ మహీ
వరువిషయంబునం దెవఁడు ♦ వారక కార్యము చేయుచుండుఁ ద
త్పురమునఁ గాని యత్తపము ♦ పొల్చు దరిద్రత కాలవాలమై. ౨౯౹ 2938

క. నరపతి యాతఁడు వేగమ, నరకంబున కేగుఁ బాల♦నముఁ జక్కఁగ శా
స్త్రరతిం జేయనికతమునఁ, బురుషవరా! రామచంద్ర! ♦ పొలుపుగవినుమా!.

క. మనుజులు పఠించినం జక్కని నియతిం దప మొనర్పఁ♦గా సత్కర్మం
బును జేసిన షష్ఠాంశం,బును సత్పాలనముచేయు ♦ భూపతి పొందున్. ౩౧

క. కృతకర్మంబున భూతల,పతి యాఱవయంశ మొందు ♦ భాగ్యము గని యు
న్నతధర్మంబునఁ బ్రజలన్, హితముగ నెటు ప్రోవకుండ ♦ నిల వర్ధిల్లున్. ౩౧౹

ఆ. అట్లు ప్రోవకుండు ♦ నాతండు నాల్గవ, యంశ మొందుఁ బాప♦మందుఁ జుమ్ము;
పురుషవర్య! నీదు ♦ ధరణిని వెదకుమా, దుష్కృతంబు చేయు ♦ దుష్టనరుని.

* తపోఽతప్యంత తే సర్వే శుశ్రూషా మపరే జనాః-అనిమా.

క. దానికి యత్న మొనర్పుము, గానం బగుఁ బర్మవృద్ధి ♦ త్త్వాస్థలి యాయు
ష్మానుని జంపుగ బ్రాహ్మణ,సూనుని జీవితము పొల్చు ♦ క్షోణీశేంద్రా!. ౩౮

డెబ్బదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౭౫ - సర్గము.

—రాముఁడు దక్షిణదిక్కునఁ దపస్సుచేయు శూద్రునిం గాంచుట—

క. నారదువాక్యంబును గం,భీరార్థం బమృతసమము ♦ విని హర్షంబున్
భూరముగఁ బొంది లక్ష్మణు, గారవ మలరారఁ బలికెఁ ♦ గరుణ యలరఁగన్

క. అనుజా! సౌమ్యా! వేగము, చని బ్రాహ్మణు నూఱడింపు ♦ సద్వ్రతుఁ డాతం
డనఘుఁడు వగ నొందంగాఁ, జన దాశిశుతనువు నూనెఁ ♦ జక్క నునువుమా.

ఆ. పాత్రమునకు నూనె ♦ భద్రంబుగా నింపి
దానియందు శిశువు♦తనువు నునిచి
పరిమళములఁ దైల♦పాత్రమ్మునం జేర్చి
తనువు చెడకయుండఁ ♦ దగు నొనర్పు ౩ 2946

చ. తను వది యెవ్విధంబునను ♦ దారుణరీతిఁ గనంగ రాక యుం
డను జను భేద మింతయుఁ గ♦సంబడ కుండఁగఁ జేయు మెట్లొ యా
పని నొనరింపు; మంచును నృ♦పాలకుఁ డానతి యిచ్చి లక్ష్మణుం
గనదురుసాధులక్షణని♦కాయుని బంపి మనస్సునందునన్. ౪ 2947

క. తలఁచెను బుష్పకమును జవ, మలరఁగ రమ్మనుచుఁ గీర్తి♦యశముల దగు భూ
పలలాముఁ; డంత నయ్యది, విలాసగతి మీఱ వచ్చె ♦ విభునాజ్ఞ మెయిన్. ౫

చ. కనకవిభూషితంబగుచుఁ ♦ గ్రాలెడు పుష్పక మింగితజ్ఞమై
తనరుటచే ముహూర్తమునఁ ♦ దా రఘురామునిచెంతఁ జేరి యి
ట్లనియె; నమస్కరించి వసు♦ధాధిప! నీదగు నాజ్ఞ వచ్చితిన్
బని యెదియేని పంచిన న♦వశ్యము చేయుదుఁ గింకరుండ నాన్. ౬ 2949

చ. సురుచిరపుష్పకోక్తులను ♦ క్షోణివిభుం డొగి నాలకించి భూ
సురమునివర్యసంతతికి ♦ శోభిలు భక్తిని మ్రొక్కి యెక్కె నా
దరమునఁ బుష్పకంబు; రఘు♦తల్లజుఁ డాయతచాపతూణముల్
వరకరవాలముం గొనుచుఁ ♦ బాదజుఁ జంపఁగఁ బోవుచుండగన్. ౭ 2950

క. పురరక్షణం బొనర్పఁగ, భరతుని లక్ష్మణుని వీర♦వర్యుల నునిచెన్
బరమాద్భుతగతిఁ జనెఁ బడ,మరదిక్కున వెదకె నొక్క♦మూడ్కిఁ గడంకన్.

క. హిమవత్సంవృతమై పొ,ల్చు మహీశదిక్కునను వాని♦చొప్పు వెదకి పా
పము సుంతయేని కానక, యమరేంద్రునిదిశకుఁ బోయి ♦ యందెల్లెడలన్. ౯

చ. కనుఁగొని పావనాచరణ♦కాంతమునై ముకురంబురీతిఁ జ
క్కనిదయి యొప్పు నాదెసను ♦ గానక శూద్రమునిన్ యమాశనుం

గనుఁగొన నందుఁ బోయె రఘు♦కాంతుఁడు పుష్పకయుక్తి వింధ్యనా
మనియతభూధ్రపార్శ్వమున ♦ మానితమైన సరస్సు నొక్కెడన్. ౧౩ 2953

ఆ. కనియె దానిచెంత ♦ ఘనతరతప మూని, యున్నవాని మునిని♦నూర్ధ్వముఖుని
నందుఁ గాంచె సిరుల ♦ నలరారు శ్రీరాముఁ, డంత నతనిఁ జేర♦నరిగి యచట.

క. ఉత్తమతపోవ్రతాదరు, నత్తపసిని గాంచి యిట్టు ♦ లనియె; మహాత్మా!
యిత్తఱి ధన్యుఁడవే యివు, డుత్తర మీవలయు నేకు♦లోద్భవుఁడ వొకో.

సీ. దృఢవిక్రమా! వ్రతా♦ధీనచిత్తా! నేను గౌతూహలంబున ♦ నీతఱి నినుఁ
బ్రశ్నచేసితి దశ♦రథభూమిపాలకు తనయుండ శ్రీరాముఁ ♦ డనెడువాఁడ
నే ప్రయోజనము నీ♦విపు డొందఁగోరితో స్వర్గలాభమొ వేఱు♦వాంఛితంబొ
దుష్కరంబని నాకుఁ ♦ దోఁచెడు నీతపం బేవరంబును బొంద ♦ నెంచి యిట్లు

తే. తపము సల్పుచునున్నావొ ♦ దాని వినఁగఁ
గోరి యడిగెద నెవ్వనిఁ ♦ గూర్చి యిట్టి
వ్రతముఁ బూనితొ తెల్పుమా ♦ బ్రాహ్మణుఁడవొ?
క్షత్రియుఁడవొ? తృతీయవం♦శభవుఁడవొకొ?. ౧౬ 2956

క. చరణభవుండవొ? సత్యా, దరమున వచియింపు శుభము ♦ జగు నీకు మహా
త్తర మౌను నూనృతము సుస్థిరతపమునకంటె సమ్మత♦సిద్ధిప్రదమా. ౧౭

చ. అని యిటు రాఘవుం డడుగ ♦ నామునివర్యుఁ డవాక్శిరుండు రా
మునకు స్వజాతియుం దపముఁ ♦ బూనఁగ నేటికొ యావిధంబుఁ జ
క్కనిగతి నిట్లు చెప్పెఁ, దన♦గాదిలిపూనిక వీడ కట్టులే
జనపతివర్య! యంచు మది ♦ సంతస మెంతయు నొప్పుచుండఁగన్. ౧౮ 2958

డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

౭౬ - వ సర్గము.

రాముఁడు శంబుకుని జంపి బ్రాహ్మణశిశువు బ్రదికించుట.

చ. ఒరులకు బాధచేయని మ♦హోత్తమకర్మము లాచరించు భూ
వరుఁ డిటు ప్రశ్నచేయుటయు ♦ వంచినశీర్షము నట్లె యుంచి యా
చరణజమౌని యిట్టులనె; ♦ శంబుకనాముఁడ శూద్రజుండ నో
గురుతరకీర్తిరాజిత! ర♦ఘుప్రవరా! తనుయోగ మొప్పఁగన్. ౧ 2959

తే. కోరినాఁడ దేవత్వంబుఁ ♦ గొంకి మిథ్య, పల్కనాఁడను గాను దే♦వతలలోక
మేజయింపఁగఁ గోరితి♦నేను శూద్ర,వంశజుఁడ ఘోరతపము స♦ల్పంగ నిచట.

క. వరనియతి నున్నవాఁడను, దరుణం బింకయును రాదు ♦ దానికి నను నా
చరణజుని గాంచి ఖడ్గము, నిరుపమకాంత్యుజ్జ్వలంబు♦నృపతియుఁ గొనుచున్.

క. శిరమును ఖండించెను నా,తరుణంబున; నిట్లు శూద్ర♦తపసి తెగిన ని
ర్జరపతి దహనప్రముఖా,మరవర్యులు మేలు మేలు ♦ క్ష్మాపతివర్యా!. ౮౫

క. అని వినుతించిరి పలుమా, ఱనూనసుమవృష్టి గురిసె ♦ నతిపరిమళయు
క్తిని వాయుప్రోద్బలమునఁ, గనఁబడియెన్ నాల్గుదెసలఁ ♦ గడువడిఁ బడఁగన్.

చ. సుర లెద హర్ష మంది రణ♦శూరుని సత్యపరాక్రమున్ క్షితీ
శ్వరపతి రామచంద్రుఁ గని ♦ సౌమ్య! యొనర్చితి దేవకార్య మి
త్తరుణమునందుఁ జక్కఁగ; ని♦తాంతముదంబున మే మొసంగు నీ
వరము నరిందమా! గొనుము ♦ వాంఛను దెల్పుము తీర్తు మిత్తఱిన్. ౭౫

క. చరణజుని స్వర్గభాక్కుఁగఁ, బరికించియె కాకయుండఁ ♦ బార్థివవర! నీ
వరుదుగఁ జేసితి వను ని,ర్జరవాక్కుల నాలకించి ♦ రాముఁడు భక్తిన్. ౮

క. కరయుగము మోడ్చి శ్రద్ధా,దరములు చెలువార వృత్ర♦దనుజహరుఁ బురం
దరునిన్ సహస్రలోచనుఁ, బరికించి వచించె దేవ♦వర! నీవు సురల్. ౯ 2966

క. నాయెడఁ గరుణామతులే, నాయవనీసురకుమారుఁ ♦ డపగతజీవుం
డీయెడఁ బ్రాణయుతుండై, పాయక తండ్రికిని బ్రీతి♦పాత్రుం డగుతన్. ౯

క. వర మిది మదీప్సితము న,త్కరుణన్ నా కొసఁగుఁ డిదియె ♦ గాదే నా కో
సురలార! మదపచారము, పరఁగుట నావిప్రసుతుఁడు ♦ బాలుం డయ్యెన్.

సీ. మరణించె నేకకు♦మారుఁ డావిప్రున కాతఁ డకాలాంత ♦ మందెఁ గాన
నాతనిఁ బ్రదికింపుఁ ♦ డదియె*మీకుశుభంబువాక్కుసత్యంబయి♦భాసిలునటు
చేయుఁడీ నేఁ బురి ♦ క్షితిసురవగుతోడ బ్రదికింతువాఁడ నీ ♦ పట్టినంటి
దానిని జెల్లింపుఁ ♦ డోనిర్జరేశ్వరులార! నా రఘు రాము ♦ గారవమునఁ

తే. గాంచి హర్షంబు వృద్ధిని ♦ గాంచునట్లు
బదులు పల్కిరి దేవతా♦వరులు కూడి
వగవు మానుము కాకుత్స్థ! ♦ బాలుఁ డాతఁ
డీదినమె జీవములఁ బొందె ♦ నెలమి మిగుల. ౧౩౫ 2969

క. తనబంధువులం గూడియె, మన మలరం దిరుగువాఁడు ♦ క్ష్మాపాల! యిటం
దునిమితి వెప్పుడు శూద్రుని, గనియెం బ్రాణముల నచట ♦ క్షణమాత్రమునన్.

తే. శుభము నీ కగుఁ గార్యము ♦ సారిది మేము
నీకు సమకూర్చుచుందుము ♦ భూకళత్ర!
సద్యశోరాజితా! యగ♦స్త్యమునిచెంత
కరుగవలయును బ్రహ్మర్షి ♦ యతఁడు నియతి. ౧౬ 2971

క. వ్రత మొనరింపం బూనెను, క్షితి నొంటక యద్ది ద్వాద♦శశరత్తులు సు

* తం జీవయత భద్రం వో నానృతం కర్తు మర్హథ-అనిమూ.

స్థితి సాగె నింతకాలం, బతఁ డొగి *జలశయ్య నుండె ♦ నధికశ్రద్ధన్. ౧౭
క. కనుకని యామానీంద్రుని, గనఁబోయెద మతని మోద♦కలితుం జేయన్
జననాథ! నీవు నమ్మునిఁ, గని మ్రొక్కుట మే లటన్న ♦ గారవ మలరన్ ౧౮
క. చనుదెంచెద నిప్పుడె యం,చని వారలతోడఁ బలికి ♦ హాటకమయమై
తనరారుపుష్పకం బె,క్కెను; దేవత లంత విమల♦కీర్తులు చెలఁగన్. ౧౯
తే. వ్యోమయానంబులను నెక్కి ♦ రాముఁ డపుడు
వెంట రాఁ బోయి, రాముని♦వీరునాశ్ర
మమున; కంతఁ దపోధనుం ♦ డమలకీర్తి
యాయగస్త్యుఁడు వారల ♦ యాగమనము. ౨౦ 2375
క. కని వారి యథావిధిఁ బూ,జనముల నలరించె దేవ♦సత్తము లాపూ
జను గొని యాతనిఁ దగున,ర్చనముల ముదమొందఁ జేసి ♦ చనిరి యథేచ్ఛన్.
క. సురవరు లీవిధిఁ దమయను,చరు లెల్లను వెంట రాఁగ ♦ స్వర్గమునకు స
త్వరగతిఁ బోయిరి; రఘుభూ,వరతిలకుఁడు పుష్పకంబు ♦ వసుధం దిగఁగన్.
ఆ. అవతరించి మునికి ♦ నాయగస్త్యునకు వం,దనము లాచరించి ♦ యనలతేజుఁ
డాతఁ డిచ్చునట్టి ♦ యాతిథ్యములఁ గొని, యధివసించె నందు ♦ నాదరమున.
క. అనుపమతపోధనుం డా,మునిపతి యత్యుగ్రతేజ♦మునఁ బొల్చుచు నా
జనపతి కిట్లను; స్వాగత, మనూనగుణసాంద్ర! యోమ♦హాత్మా! యిటకున్.
క. చనుదెంచితి సౌభాగ్యం, బనఁదగు నిద్దాని సద్గు♦ణావళి నీయం
దు నెగడుఁ గావున బహుమతిఁ, గనుచుందును నిన్ను నేని♦కామం బాత్మన్.
ఆ. అతిథి పూజనీయుఁ ♦ డనుదిన మాత్మ యం,దలరుచుండు నతఁడె♦యమరులెల్లఁ
జరణభవుని జంపి ♦ సద్యశంబున వెల్గు, నీదురాక పలికి ♦ రాదరమున. ౨౬
క. ధరణీసురపుత్రుని మృతుఁ, బరిగతజీవితుని జేసి ♦ భాసిల్లితి వో
ధరణీశపుంగవా! రా,తిరి యిది యిటఁ బుచ్చఁదగును ♦ దృప్తి మెఱయఁగన్.
క. పురికిఁ బ్రభాతంబున నీ, వరుగంగా వచ్చు స్వేచ్ఛ ♦ నరిగెదు యానం
బరుదుగ నొప్పుట రామా!, పరమాత్ముఁడ వీవు లక్ష్మి♦పతి వరయంగన్. ౨౮
క. నారాయణుఁడవు నీయం,దే రాజ్యం బెల్ల నుండు ♦ నెల్లర కీవే
యారయఁ బ్రభువవు ప్రాక్తన,పూరుషుఁడవు సౌమ్య! వినుము♦పూర్వమ్మొకటన్.
సీ. ఆభరణం బిది ♦ యావిశ్వకర్మచే నిర్మితంబయి కాంతి♦నిచయదివ్య
మయి దివ్యతనువుచే♦నరుదగు తనకాంతి వెలయుచుండును; గాన ♦విశ్వనాథ!
గ్రహియింపుమా నాకుఁ♦గల్పింపు ప్రియమును దత్తవస్తువు ప్రీతి♦తనర మరల
దానము చేసినఁ ♦ దత్ఫలమనుపమ మిద్దాని ధరియింప ♦ నీవె తగుదు

* జలశయ్యాం సమాసతః-అనిమూ.

తే. వధికఫల మొందఁ జాలుదు; ♦ నమరనాథ
ముఖులఁ దరియింపఁ జాలుదు ♦ భూమిపాల!
గాన నీ కిచ్చువాఁడను ♦ దీనిఁ గొనుము
చిత్ర మాభరణ మ్మిది ♦ చెలఁగు వేడ్క. ౩౩ 2985

క. జ్వలియించుసూర్యుఁడో? యన, వెలసెడు న మ్మిద్ది యనిన ♦ విని శ్రీరాముం
డలఘురథశ్రేష్ఠుఁడు రాజులధర్మము లోఁ దలంచి ♦ సొంపగుభణితిన్. ౩౪

క. దానము ప్రతిగ్రహంబును, భూనిర్జరులకును దగును ♦ భూపతిని గదా?
నే నెట్లు సంగ్రహింతును, భూనిర్జరుసొమ్ము పాప♦ము గదా? కొనినన్. ౩౫

చ. అన విని యాయగస్త్యముని ♦ యాదృతి రామునిఁ గాంచి యిట్లనున్;
జనవర! బ్రహ్మభూతమయి ♦ సాధుతరంబగు నాకృతంబునన్
జనులకు రాజు లేఁడు సుర♦సంతతి కింద్రుఁడు లేఁడు గాన నా
జను లధిపాలునిం బడయ♦స్వాంతములం బరు నిన్ను వేఁడినన్. ౩౮ 2988

చ. శతముఖు దేవకోటికిని ♦ సత్ప్రభువుం దమిఁ జేసి తీవు; మ
ర్త్యతతికిఁ బాలకుండుగ వి♦రాజిలువానిని జూపవే యటం
చతిశయభక్తి వేఁడి పర♦మాత్మ! నృపాలుని బూజ సేసి పా
పతతులఁ బాయువార మని ♦ వారలు కోరి వచించి రీగతిన్. ౩౯ 2989

చ. ధరణివిభుండు లేకయె ము♦దంబును గాంచఁగఁ జాల మేము భూ
వరుఁడె సుపూజ్యుఁ డన్న నర♦వారవచస్తతు లాలకించి యా
దరమున నుత్తమార్థము నెం♦దం దలపోసి శ్వదాజ్ఞ చేత నా
సరసిజసూతి యింద్రముఖ♦సర్వదిగీశులఁ బిల్చి యిట్లనెన్. ౪౦ 2990

సీ. కరుణించి మీయందుఁ ♦ గల్గిన తేజంబు నందు భాగం బొసం♦గం దగు నన
వారు తేజస్సుల ♦ భాగ మిచ్చిరి బ్రహ్మ తుమ్మె నద్దానిన ♦ తోఁచె నొకఁడు
క్షువుఁడన; నతనికిఁ ♦ గూర్చె నింద్రాదుల యంశంబులను సును♦జాళి కిచ్చె
విభుగాఁగ, నంతట♦విబుధేంద్రు భాగంబుతోడ భూమిం గూర్చెఁ♦దోయవిభుని

తే. భాగమును గూర్చి దేహంబు ♦ పరఁగునట్లు
చేసెఁ గౌబేరభాగంబు♦చే వసువును
బ్రజల కిచ్చెను యమునిదౌ ♦ భాగమునను
బ్రజల శాసించు నరపతి ♦ రమ్యరీతి. ౪౧ 2991

క. సురపతిభాగంబుననే, వరభూషణ మలఁగుదానిఁ ♦ బరమాదృతి ని
ర్జరపతి యజ్ఞాంశమ్మును, బరిగ్రహముచేయురీతిఁ ♦ బార్థివముఖ్యా!. ౪౨ 2992

తే. కైకొనుము దీని నీకు మేల్ ♦ గలుగు నన్ను
నుద్ధరింపుము నా, ముని♦సూక్తుల విని
పరమధార్మిక మిది యని ♦ నిరుపమాన
మైన యాభరణము దాని ♦ మానవపతి. ౪౩ 2993

క. నిరుపమభూషణ మని తాఁ, బరిగ్రహించెను; నృపుండు ♦ నరభూషణ మా
దరమునఁ జేకొని తద్విధ, మరయంగాఁ గోరి యిట్లు ♦ లనియెన్ మునితోన్.

సీ. అద్భుతాకృతితోడ ♦ నలరారు నీయది యేరీతి వచ్చె మీ ♦ కెవ్వఁ డిచ్చెఁ
గౌతూహలంబయ్యె ♦ బ్రాహ్మణసురమాసీంద్ర! యతుల కీర్తి' మిమ్ము ♦ నడుగువాఁడ
నాశ్చర్యములకు నీ ♦ వన్నన నిధి వౌదు వనుచుఁ గాకుత్స్థుఁడి♦ట్లడుగ మౌని
యిట్లని చెప్పె; రా♦జేంద్ర! యీవిషయంబు విను విన్నవించెద;♦మునుపు త్రేత

తే. యనఁబడు యుగంబు గడచెడు♦నదనునందు
నీవనంబున రమణీయ♦మై వఱలెడు
భాగమం దిందు దానవపూ♦ర్వముగఁ గంటి
నచ్చెరు వౌనంగ దానినే ♦ ననువదింతు. ౫౨ 2995

డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౭౭ - వ సర్గము.

అగస్త్యుఁడు రామునకు శ్వేతరాజోపాఖ్యానముఁ జెప్పుట.

క. మును త్రేతాయుగమున నో, జనవర! వన మొండు బహువి♦శాలంబయి యో
జనశతపరిమితమై పక్షినికరమ్మృగవర్జితమయి ♦ చెలఁగుచు నుండెన్. ౧ 2996

క. వన మది నిర్మానుషమై, కనఁబడ ను త్తమతపంబు ♦ గావింపఁగ నే
వన మద్దానిం జేరితి, ననఘా' *నాదనుచు మోద ♦ మలరారంగన్. ౨ 2997

క. ఫలమూలంబుల వృక్షంబుల సుస్వాదంబులగుచుఁ ♦ బొలుచు మధువులన్
జెలఁగెడునవ్వనరూపముఁ, బలుకంగా రాకయుండెఁ ♦ బార్థివముఖ్యా!. 3

సీ. దానియంతరమందు ♦ మానితసర సొండు యోజనాయతమయి♦యొప్పియుండె
హంసకారండవా♦ద్యఖిలపక్షులు స్వేచ్ఛ విహరించుచుండెను ♦ విమలపద్మ
ములు నుత్పలంబులు ♦ చెలువారుచుండెను శైవలంబులు మహా♦శ్చర్యరీతిఁ
గనఁబడుచుండె సు♦ఖంబుగా నివసింపఁ దగియుండె విమలమై ♦ సొగసుమీఱ

తే. క్షోభ మింతయు లేక పక్షులు వెలయఁగ
నలరుచుండెను; నద్దాని ♦ యంతికమున
నాశ్రమం బొందు చిత్రమై ♦ యతిపురాణ
మగుచుఁ బుణ్యతమంబయి ♦ యుండదమర. ౬ 2999

చ. మునిజనహీనమై యదియుఁ ♦ బొల్పుగ నొప్పుచునుండె, రామ! యం
దును నివసించినాఁడఁ దమి♦నొక రాతిరి గ్రీష్మమందు, నం
త నినుఁడు తూర్పుకొండపయిఁ ♦ దా నుదయింపఁగఁ బూన లేచి చే
యను దగినట్టి కృత్యముల ♦ నాదృతి సల్పఁగఁ బూని శ్రద్ధతోన్. ౭౪ 3000

---

* అహ మాశ్రమితుం సౌమ్య-అనిమూ.

క. నరమునకు నేగ నందు; న,జరమై ధూమ్రంబు నగుచు ♦ శవ మొండు మహా
త్తరరీతిఁ గానఁబడియెన్;, ధరణీశ్వర! యాశవంబు ♦ తనవసరమునన్. ౮

సీ. పంక్తిభేదమ్మున ♦ బలవంతమయి సరోవరమునయాశ్రయముగఁ ♦ బరఁగుచుండెఁ
దనుకాంతి యెంతయుఁ ♦ గననగుచుండెను; జింతించితిని దీని♦సిద్ధి యెట్టు
లనుచు ముహూర్తంబు ♦ మనమున నారీతిఁ దలఁచుచు దానిన♦త్తటమునందు
నుంటి నీచిత్రమె♦ట్లో యని; యంతలో నద్భుతదర్శనం♦బై నిరుపమ

తే. మగుచు నత్యున్నతంబయి ♦ యంబరమునఁ
గానఁబడియె విమానంబు ♦ కమ్రహంస
సంయుతంబయి చిత్తైక♦జవముగలిగి
యందు నతిరూపవంతుఁడై ♦ యలరె నొకఁడు ౧౧ 3002

క. సురపురి వసింప నవ్వర, పురుషుం డద్దాన సురల♦పూఁబోఁడులు సుం
దరగతులఁ దన్నుఁ గొల్వఁగ, వరభూషణరుచిరుఁ డగుచు ♦ భాసిల్లె నృపా!.

ఆ. తనువిలాసములను ♦ దగునంగనలు కొంద, ఱమలగేయములను♦నద్భుతముగఁ
బాడి; రంతఁ గొంద ♦ ఱాడిరి వీణాది, వాద్యములను నేర్పు ♦ వఱలుచుండ.

క. కొందఱు వాయించిరి గతి, కొందఱు సంతోషమునలరఁ ♦ గోయని ధ్వని యిం
పొందఁగఁ జేసిరి నృత్యము, కొందఱు స్వేచ్ఛగను జేయఁ ♦ గోరిరి రామా!.

క. తరుణులు కొందఱు సుందర, హిరణ్యదండకములఁ గాంతి ♦ నెనఁగుచుఁజంద్రుం
బురుడించు చామరంబులఁ, గరములఁ గైకొనుచు విసరఁ♦గా మొదలిడఁగన్.

తే. పుండరీకేక్షణంబులఁ ♦ బొలుపుమీఱు
నతనిమోము మట్టె వీక్షించె; ♦ నంత నతఁడు
సింహపీఠిక విడిచి య♦చ్చెరువు తోఁప
నావిమానంబు దిగి వచ్చి ♦ యాశవమును. ౧౫ 3007

క. తినియెను శ్రీరామా! నేఁ, గనుచుంటి ననంతరంబ ♦ కడఁగి యతఁడు క్రొ
వ్విననమాంస మెల్ల స్వేచ్ఛగఁ, దిని నరసుం జేరి యచటి ♦ దివ్యసలిలమున్.

తే. విధియుతంబుగ స్పృశియించి ♦ వే విమాన
మెక్కఁ బోవుచునుండ నే ♦ నెన్ని యతని
దేవసంకాశు స్వర్గిని ♦ భావ మలరఁ
గాంచి యిట్లంటి; నోభూమి♦కాంత! రామ!. ౧౮ 3009

క. సురసంకాశా! యెవ్వఁడ, వరయఁగ నాహార మిద్ది ♦ యతిగర్హితమై
పరఁగెడుదానిం దింటివి, కరుణించి వచింపు దీని♦కారణ మెల్లన్. ౨౦ 3010

క. ఎవనికి నీయాహారము, చవిగా నుండంగఁ గలదు? ♦ [1]స్వర్గాలయతు

[1] స్వర్గాలయతుల్యవరాంగ=దేవతాసమానమై శ్రేష్ఠమగు దేహము కలవాఁడా అని యర్థము. దేవసమ్మత-అనియు.

ల్యవరాంగ! చిత్ర మయ్యెడి, జనమున వినిపింపు దీని♦సత్యంబెల్లన్ ౨౦ 3011

క. వినఁగోరెద నాహారం, బనఘా! యోగ్యంబు గాది ♦ దంచున్ దోఁచెన్
గనఁగ శవం బిది యెట్లీ, వనానమునదమారఁ గొంటి ♦ వరుదయ్యెఁ జుమీ.

చ. అన విని స్వర్గగామియగు ♦ నాతఁడు స్వాంతమునం గుతూహలం
బును గని సత్యవాక్యములఁ ♦ బొందుగఁ దద్విధ మెల్లఁ జెప్పె; నో
జనవర! యావిధంబు వినఁ ♦ జాలఁగ నచ్చెరువై కనంబడున్
విను వచియింతు నాతని సు♦వృత్తము సర్వము విన్నగితిగన్. ౨౨ 3013

డెబ్బదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౭౮ సర్గము.

—అగస్త్యుఁడు రామునకు నాభరణము దొరకినవిధముఁ దెలుపుట.—

చ. అనుటయు నాదువాక్కు విని ♦ యాదివిజాలయగామి ప్రీతి న
న్గని శుభవాక్కు లివ్వియని ♦ కైయుగమున్ ముకుళించి రాము! యి
ట్లనియెను; బ్రాహ్మణోత్తమ! *సు♦ఖాసుఖవృత్తము నాది దాఁటఁగా
ననువుపడంగ రాని దిది♦యా వచియించెద నాలకింపుమా. ౨ 3014

క. అడిగితివిగానఁ దప్పక, నుడివెద; వైదర్భనామ♦నుతభూవిభుఁ డొ
క్కఁడు కీర్తిశాలి గలఁ డా,తఁడె నాజనకుండు మున్ను ♦ తనరు విభూతిన్.

తే. అతనిపేరు సుదేవుఁడా♦యనఘుఁ డేఁబ,గత్రయంబున వీర్యైక♦ఘనుఁడు; భార్య
లిరువురాతని కొప్పుదు♦రెలమి నొక్క,పత్నికొకఁడుగ నాత్మజ♦ద్వయముగలిగె.

క. వారలలో జ్యేష్ఠుఁడ నో,ధారణిసుర! శ్వేతుఁడనఁగఁ ♦ దగుదు సురథుఁడున్
భూరిపరాక్రముఁ డనుజుఁడు, సారయశోరాజితుండు ♦ శాంతియుతుండున్. ౪

క. జనకుఁడు సురపురి కేగఁగ, జను లెల్లరు నన్ను నృపుని ♦ నరగునఁ జేయన్
మనిచితి ధర్మపథంబున, జనులను శ్రద్ధాదరముల ♦ క్షమ చెలువారన్. ౫

చ. మనుజులు ధర్మమార్గ మణు♦మాత్రము తప్పక యుండఁ బ్రోచుచుం
డ నొకసహస్రవర్షములు ♦ నాపరిపాలనమందుఁ జెల్లెఁ బా
వననియమా! ద్విజప్రవర! ♦ వారక యట్టిల నేలు నేను నొ
య్యన నొకహేతువుం దలఁచి ♦ యాయువు గన్గొని మృత్యు వెన్నుచున్. ౬

ఆ. చాలు నింక రాజ్య♦లీల లంచుఁ దలంచి, యావనంబుఁ జేరి ♦ మృగపతత్త్రి
వర్జితముగఁ జొరఁగఁ ♦ బడనిదిగను గను,పట్టఁ గాంచినాఁడ ♦ బ్రహ్మమాని!.

క. సర సిది శుభతమమ్మై నా, కరుదుగఁ గన్పట్టఁ దపము ♦ నతినియమమునన్
జరపం జొచ్చితి రాజ్యము, పరిపాలింపంగ సురథు ♦ భ్రాతను నృపుఁగన్. ౮

---

* మ మైతత్సుఖదుఃఖయోః, దురతిక్రమణీయం హి-అనిమూ.

క. ఒనరిచి యభిషిక్తుని భూ,జనులకు నర్పించి యిందు ♦ సరసతటమునన్
మనమున నియతిం దగఁ దప,మును జేసితిఁ జాలకాల♦ము మనీషివరా!. ౯

సీ. మూఁడువేలేం డ్లిట ♦ మునివర్య! తపము నీగురుతరవనమునఁ ♦ గోర్కిమీఱ
నన్యదుష్కరముగ ♦ నాచరించితి; నంత నసుపమవిధి లోక♦మునకుఁ జనితి;
స్వర్గభూతుండనై ♦ సాధుతపశ్శక్తి నలరిన క్షుత్పిపా♦సలు సతంబు
బాధింపఁగాఁ జొచ్చెఁ ♦ బరమమునీ! దాన వ్యథితేంద్రియుండనై ♦ యాజగత్త్ర
తే. యాధిపుని బ్రహ్మఁ గాంచి యి♦ట్లంటి దేవ!,క్షుత్పిపాసావివర్జిత♦క్షోణి యిద్ది
బ్రహ్మలోకంబునాఁ బడుఁ ♦ బ్రాగ్జనికృత,కర్మ మెట్టిదో నాకిందుఁ♦గలిగెక్షుత్తు.

క. అనవరతంబు పిపాసయు, జనియించెను గాన నాకుఁ ♦ జక్కనిభోజ్యం
బును జెప్పుమా పితామహ!, యన బ్రహ్మ వచించె నిట్టు ♦ లారసి నాతోన్.

తే. స్వాదులై తగు నీదు మాం♦సమును నీవె
యనుదినంబును భక్షింపు ♦ మవనినాథ!
యదియె యాహారమగు నీకు ♦ నాత్మతనువుఁ
జక్కఁ బోషించుచుం దపం ♦ బక్కజముగ. ౧౪౹ 3025

క. ఒవరించితి కాదే యో,జనవర! నాట నిది బీజ♦సత్తమ మయ్యున్
గనునే యంకురతను గా,వున దానిన తినుము మున్ను ♦ పొందవు తృప్తిన్.

క. వన మది సత్వనిషేవిత, మనుపమఫలమూలనికర♦మగు నందు వసిం
చిన నీవును భిక్షార్థిగఁ, జనుదెంచిన యతికిఁ జిత్త♦సమ్మద మలరన్.౧౬ 3027

ఆ. భిక్ష మిడక యుంటి ♦ వక్షయమగునది, యనితలంపవైతి ♦ వతులతపము
సల్పినాఁడ వట్టి ♦ చందమ్ముగావున, స్వర్గవాసమైన ♦ సంతతంబు ౧౭౹ 3028

క. నిను క్షుత్పిపాస లేఁచెడుఁ, గనుకను పోషించినట్టి ♦ కాయంబును జ
క్కనిరుచిగల్గినదానిని, గొను మాహారముగ సుధను ♦ గ్రోలినరీతిన్. ౧౮౹

తే. తృప్తిఁ బొందుచు నుండుము♦దివ్యతేజుఁ, డౌనగస్త్యమహాముని♦యరిజనులకు
దుష్ప్రధర్షుఁడు వచ్చు వి♦ధూతకష్ట,జాలుఁడవగుదు వీవు త♦త్సమయమందె.

క. ముని యతఁడు దేవసముదయ,మును దరియింపంగఁ జేయఁ ♦ బోలు సుశక్తిం
దన రారుక్షుత్పిపాసల,వనటం బడు నిన్నుఁ గూర్చి ♦ పలుకన్ వలెనే. ౨౧

క. గురుబాహూ! నిన్నాతఁడు, తరియింపం జేయఁ జాలు ♦ ధన్యుఁడనియెో; నా
సురతల్లజువాక్కుల విని, పరమవిగర్హితము నాదు ♦ వపువుం దినుచున్. ౨౧౹

క. అనుదిన మీరీతిని నే, వనికిన్ వచ్చుచును మరల ♦ స్వర్గంబునకున్
జనుచున్నవాఁడ వర్షము, లనేకములు చెల్లె నిట్టు ♦ లంగము దినఁగన్. ౨౨౹

చ. తను విది క్షీణ మొందదు ము♦దంబును బొందదు చిత్త మోమహా
మునివర! యిట్టికష్టములఁ♦బొందెదు నన్గరుణించి కష్టరా

శిని దొలఁగించి కావు మిటఁ ♦ జేర నగస్త్యుఁ డొకండు శక్తుఁ డ
న్యునకు నగమ్య మియ్యది ద్విజోత్తమ! నన్నుఁ దరింపఁ జేయఁగన్. ౨౮ 3034

[1]క. కొను మీయాభరణంబును, మునివర! కరుణింపు స్వర్ణ ♦ముసు ద్రవ్యము వ
స్త్రనిచయము భక్ష్యభోజ్యము,లను నీయది యాభరణము♦లను దగ నిచ్చున్.

తే. బ్రహ్మమానీంద్ర! కోరిన ♦ వాంఛితముల, నొసఁగువాఁడను భోగాళి ♦ నొసఁగువాఁడ
నుద్ధరింపుము కరుణింపు ♦ మో మహాత్మ!, యనిన నాస్వర్గివగుపల్కు ♦ లాలకించి.

క. తరియింపఁ జేయఁగా నా, భరణం బిద్దాని మిగుల ♦ భాసురము మహో
దరమున గ్రహియించితి నేఁ, బరిగ్రహింపఁగ నె యతని ♦ ప్రాక్తనువచన్. ౨౯

క. వెన నశియించెను రాజ, ర్షిసత్తముం డట్లు తనువు ♦ చెచ్చెలఁ నశియిం
ప సురపదంబునకుం జని, యె సంతసం బొప్పుచుండఁ ♦ దృప్తుం డగుచున్. 30

క. ఆతనిచే నొక్క దీనిని, భూతలనాథా! గ్రహించి ♦ పొలుపుగ దానిన్
జేతం బొప్పక యుండిన, నీతటుణము దాఁక నేను ♦ నిందుంచితిఁ జూ!. ౩౧

ఆ. దాని నీకు నొసఁగఁ ♦ దగునని యెంచితి
నిదియుఁ జూడఁ జిత్ర ♦ మొదవు రామ!
యతఁడు ఘాతపాపుఁ ♦ డై సుఖంబుగఁ దన
పదముఁ జేరఁబో యెఁ ♦ బార్థివేంద్ర!. ౩౨ 3040

డెబ్బదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

౭౯ - వ సర్గము.

దండమునివృత్తాంతము రామునకు నగస్త్యమహాముని చెప్పుట.

క. ఆయద్భుతతమవాక్యము, నాయుపనీసురమునీంద్రుఁ ♦ డట్లు పలుకఁగా
నాయవనీశుఁడు విస్మయ, మాయెడఁ దోఁపంగ మరల ♦ సమ్మునివరుతోన్. ౧

క. గౌరవ మలరఁగ నిట్లను, [2]ఘోరంబగు తద్వనమున ♦ క్షోణీశుఁడు దు
ర్వారతపం బొనరుపఁగా, నేరీతి మృగద్విజాళి ♦ యెసఁగక యుండెన్?. ౨

క. మనుజవిహీనంబయి త,ద్వన మలరక యుండఁ దపము ♦ వైదర్భుఁడు చే
యను బోయె నెట్టు? లయ్యది, వినవలతుం దత్త్వ మెల్ల ♦ వివరింపు మునీ!. 3

సీ. అనుచుఁ గౌతూహల ♦ మలరంగ రాముంపు, ప్రశ్న చేసినముని ♦ ప్రవరుఁ డగుచు
బరమ తేజస్వి యా ♦ భంగిని వచియించె; మును కృతయుగమున ♦ మనుజనాథ!
దండధరుండు శా ♦ స్త్రయు మనుసంజ్ఞుండు నయి యుండె నాతని ♦ కాత్మజన్ముఁ
డిక్ష్వాకువన నొప్పె ♦ హితమతి కులవర్ధనుఁడు కీర్తిశాలి యా ♦ తఁడు మహాత్మ!

1 ఇదం తావ త్సువర్ణంచ ధనం వస్త్రాణి చ ద్విజ, భక్ష్యం భోజ్యంచ బ్రహ్మర్షేదదా త్యాభరణానిచ-అనిమూ. 2 భగవం స్తద్వనం ఘోరం తప స్తప్యతి యత్ర సః-అనిమూ.

తే. యతని జ్యేష్ఠుని దుర్జయు ♦ నధిపుఁ జేసి
రాజ్య మేలుము ధరఁ గల ♦ రాజవంశ
ములకుఁ గర్తవు నీవు కా♦వలయు ననుచు
ననిన నట్టులె చేసెద ♦ ననుచు నతఁడు. ౬ 3044

క. ప్రతిన యొనర్చెను రామా!, పితృ దానికి మోద మంది ♦ పెంపు మిగుల నీ
గతిఁ బల్కె మరలఁ దనయా!, యతిశయమోదంబుఁ గంటి♦నట్టిఁడవగుమా.

ఆ. సంశయంబు లేదు ♦ సకలవంశములకుఁ, గర్తవగుదు దండ♦కలనఁ బ్రజలఁ
గావు హేతు వుండ♦కయ దండ మిడకుము, తప్పుచేయు మనుజ♦తతులయందు.

క. మనుజేంద్రుఁ డెవఁడు దండన,మును జక్కఁగ నునుచు నవ్వర్గ♦మును బొందు నతం
డని పెద్దలు చెప్పిరి; కా,వునఁ బుత్రక! యత్నపరుఁడ♦వుగ నుండఁదగున్. ౯౪

క. పరమము ధర్మంబు గదా, ధరణిం జెలువారు దానిఁ ♦ దలఁపుము మది నం
చురుమతి మను వాత్మజునకుఁ, బరమగతిం జెప్పి హర్ష♦పరిపూర్ణుండై. ౧౦౪

తే. శాశ్వతంబగు నాపద్మ♦సంభవుపద
మొందెఁ; ద్రిదివంబు మను విట్టు ♦ లొంద నంత
నాత్మజుండగు నిక్ష్వాకు ♦ వమిత తేజ
మలరఁ దనయులఁ గాంచు కొ♦ట్లనుచు మదిని. ౧౧౪ 3049

క. ఆలోచించెను; పిదపన్, జాలుగ బహుకర్మతతుఁ ♦ జక్కని శ్రద్ధా
లోలుండై యొనరిచి సుర,బాలకతుల్యులను బుత్ర♦వరులం గనియెన్. ౧౨౪

తే. ధర్మమతియైన యిక్ష్వాకు♦ధరణివిభుఁడు
తనయులం గాంచె వారిలో ♦ మనుజనాథ!
కట్టకడపటితనయుండు ♦ కడువిమూఢుఁ
డకృతవిద్యాపరిశ్రముం ♦ డౌట సతము. ౧౩౪ 3051

క. తనయగ్రజులం గొల్చుచుఁ, దనివొందుచు నుండె వాని♦తండ్రియె దండుం
డని పేరు పెట్టె నతనికి, మనమునఁ దలపోసి యల్ప♦మతియను నూహన్.

తే. తప్పు కితనికి దండప♦తనము దేహ,మందుఁ గలుగంగఁ గలదని ♦ యట్టిపేరు
పెట్టి యతిఘోరదేశం బ♦దెట్టి దిశని,కుండఁ జాలినదని యాత్మ ♦ నూహచేసి.

*క. కనఁజాలక రిపుకాలుఁడు, జనపతి యాతండు వింధ్య♦శైవలమధ్యా
వని గాంచి యందు నాతని, నునిచెం దద్రాజ్యమందు ♦ నొడయం డనుచున్.

సీ. పర్వతరమ్యత♦ద్వాగ్రంబునన్ దండు నరపతిగాఁ జేసి ♦ పుర ముత్త
మమును నిర్మించె; నా♦క్ష్మాపతి తన్నామమును మధుమంతమై ♦ భూరికీర్తి
నందు, నియ్యదియంచు♦ననువదించెను; దరువాతదండుఁడు భృగు♦ప్రవరుఁడైన
శుక్రు నాచార్యుఁగా ♦ సువ్రతు వరియించె, నిట్టు లాదండుఁ డ♦హీనతేజుఁ

* వింధ్యశైవలయో ర్మధ్యే రాజ్యం ప్రాదా దరిందమ-అనియు.

తే. డైన శుక్రుని గూడి రా♦జ్యంబు చేసె
వ్యాప్తమనుజవికీర్ణమై ♦ యింద్రురాజ్య
మట్లు చెలువారె; దండుఁ డ♦య్యవని నింద్రు
కరణిగాఁ బాలనము చేసె ♦ ఘనయశమున. ౧౯ 3055

క. మనుతనయుండౌ దండుం, డనూనశక్తిం జెలంగు ♦ నయ్యుశనసుతో
డను గమ్రరీతి రాజ్యం,బు నేలె ధర్మైకమార్గ♦మునఁ బ్రజ లొప్పన్. ౧౯½

తే. రాజ్య మయ్యది విస్తృతిఁ ♦ బూజ్య మగుచు
నలర గురునాశయమురీతి ♦ నమరవిభుఁడు
స్వర్గ మేలినయట్లు రా♦జ్యంబు దానిఁ
బాలనము చేసె ధర్మత♦త్పరుఁడు నగుచు. ౨౦ 3057

ఎబ్బదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౮౦ - వ సర్గము.

దండుఁ డరజను బలాత్కరించుట

చ. అని వచియించి కుంభభవుఁ ♦ డారఘురామునిఁ గాంచి వెండి యి
ట్లనియెఁ; గథాప్రపంచ మొకఁ ♦ డాదృతి నే వినిపింతు భూధవా!
వినఁదగు; దండుఁ డాతఁ డట ♦ వీరవిరోధివిహీనరీతి నె
మ్మనమున శాంత మూని బహు♦మానము మీఱఁగఁ బెక్కువర్షముల్. ౧½

క. ధరణిం బాలించెను; నొక, తరుణంబున నతఁడు శుక్ర♦ధామమ్ము మనో
హారమును బొందెను జైత్రం, బరుదేరఁగ మనమునందు ♦ హర్షము పొదలన్.

చ. కనుఁగొనె దండుఁ డందు ముని♦కన్య ననుత్తమరూపఁ గాననం
బున విహరించుదానిఁ గనఁ ♦ బొంకముగా నలరారుదాని; నం
త నతఁడు మన్మథాంబకని♦తాంతతరార్దితుఁడై కుబుద్ధియై
తనదగుధైర్య మెల్లఁ జెడ ♦ దగ్గఱ కేగి వచించె నీగతిన్. ౨ 3060

క. ఎందుండి వచ్చితివి నీ,విందుల కోసైకతాభ♦హితసుశ్రోణీ!
పొందుగఁ జెప్పు మదెవ్వరి,కిం దనయవు మన్మథాస్త్ర♦కృతతాఁపుడనై. ౨½

క. నినుఁ బ్రశ్నించితిఁ దరుణీ!, యని పల్కెడు మోహమత్తు ♦ నాతని మదనా
స్తుని గాంచి భార్గవునిస, త్తనయయు ననునయము దోఁపఁ ♦ దా నిట్లనియెన్.

సీ. భార్గవుతనయను ♦ వరముని యాతండు పరులకు నెవ్విధి ♦ బాధకల్గ
కుండు కర్మంబుల ♦ నొగిఁ జేయువాఁడు నృపా! యరజ నా పేరు జ్యే♦ష్ఠాత్మజాత
నగుదు నే నతనికి ♦ నాశ్రమ మందిందు వసియించుదానను ♦ వసుమతీశ!
బలవంతముగ నన్నుఁ ♦ బట్టఁ జూడకు, పితృవశనౌటఁ దండ్రియే ♦ పరఁగునీకు

ఆ. గురువుగాఁగ, నీవు ♦ క్షోణీసురర్షికి, శిష్యుఁడవు గదా? వి♦శిష్టచరితుఁ

డతఁడు క్రుద్ధుఁడైన ♦ వ్యసనం బనంతంబు, గల్గఁ జేయుశక్తిఁ ♦ గలఁడుసుమ్ము.

క. గురుతరతపఃప్రభావ,స్ఫురణంబున వెలయు నతఁడు ♦ సుమ్ము; వసుమతీ
శ్వర! నన్నుఁ బొందఁ గోరిక, పరఁగునయే నీదు మదిని ♦ భార్గవు ననముల్.

క. నాతండ్రి మహాద్యుతి సం,ప్రీతుని నొనరించి నీవు ♦ వేఁడుము మార్గం
బీతఱి నింకొక్కటి కల,దే? తలఁపఁగ ధర్మవిహిత ♦ మెద్దియు రాజా!. ౧౦½

తే. అట్లుగాక యధర్మంబు ♦ నాశ్రయించి
నట్టులైన ఘోరాఘ మొ♦య్యనఁ బొసంగు;
భార్గవుం డాగ్రహించిన ♦ భస్మములగు
లోకములు మూఁడు వేఱుప♦లుకు లిఁకేల?. ౧౧½ 3066

క. జనకుని నీవె యాచిం,చిన నిష్కలుషాత్మ! నీకుఁ ♦ జెచ్చెఱ నన్ని
చ్చు నటంచుఁ బల్కు నరజను, జనపతికామాస్త్రములకు♦స్వాంతముతూలన్.

క. శిరమును దగులఁగ నంజలి, పరఁగించి పదంబు తను న♦వశ్యము దుష్కృ
త్యరతికిఁ జొన్పఁగఁ బలికెన్; దరుణీ! దయ చూపి నన్నుఁ ♦ దగుఁగావంగన్.

క. కాలక్షేపము చేయకు, మోలలనా! నీనిమిత్త ♦ మొగి నసుతతి నీ
వేళ నశియించుఁ గావునఁ, జాలం గృపయుంచి ప్రోవు ♦ చంద్రనిభాస్యా!. ౧౨

క. నినుఁ గూడినంత మృతి యు,బ్బిన నబ్బుం గాక యొక్క♦వేళ దురంతం
బనఁదగు శాపము గల్గిన, వనితా! నా కగును గాక ♦ వైళమ నన్నున్. ౧౨½

క. తరుణీ! పొందుము నిను నన,వరతము సేవించువానిఁ ♦ బ్రద్యుమ్నాస్త్రో
త్కరవిహ్వలు నన్నని యా,తురపడి యాకన్నమిన్న ♦ దోఃపటుత తగన్.

క. పల దిది తగదని చెప్పిన, బలయుతుఁ డాటన్ మహీశు♦పట్టి యతఁడు నా
లలనం బట్టి రతిక్రీ,డలఁ దేలం దొడఁగె స్మరుఁ డ♦డంపఁగఁ బెలుచన్. ౧౩

క. ఈరీతి నట్లు దండుఁడు, ఘోరాపర్థంబు చేయఁ♦గూడని రీతిన్
గోరి యొనరించి చయ్యనఁ, జేరెన్ మధుమంతపురముఁ ♦ జెలఁగెడువేడ్కన్.

క. అరజాలలనయు నాశ్రమ, పరిసరమున నేడ్చుచుండె; ♦ బ్రాహ్మణవరుఁడై
పరమతపస్వియునయి ని,ర్జరతుల్యుఁడునైన తండ్రి♦జాడం గనఁగన్. ౧౪ 3074

ఎనుబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౮౧-వ సర్గము.

శుక్రుఁడు దండునకు శాప మొసంగుట.

చ. సురముని తీవ్రతేజుఁడగు ♦ శుక్రుఁడు కూఁతుచరిత్ర మెల్ల నా
తురపడి శిష్యుఁ డొక్కరుఁడు ♦ తోడనె తెల్పఁగ వానితోడ స
త్వరముగ నాశ్రమంబునకు ♦ వచ్చి క్షుధార్తిని జాలఁ దూలుచున్
ధరణిరజంబు దేహమునఁ ♦ దద్దయుఁ గన్పడు పుత్రికామణిన్. ౧½ 3075

క. అరజను దీనను గాంచెను;, వరుణగుచుల్ తన్నుఁ గ్రమ్మ ♦ నలరక తేజో
విరతిం బ్రత్యూషంబున, నురుతరముగఁ గాంచుచున్న ♦ జ్యోత్స్నవిధమునన్.
క. తనతనయ బెండుపడి యే,మనఁ జాలక యుండఁ గాంచె ♦ నాతండు క్షుధా
ర్తిని బొందియుంటచే మిం,చెను రోషము ద్విగుణముగుచుఁ♦జిత్రగతులచేన్.
సీ. మూఁడులోకంబులఁ ♦ గూడ నొక్కత్తున దహియించునట్టిచం♦డమున నద్ది
యడరఁగా శిష్యుల ♦ కనియె నీరీతిగా; నవిజితాత్ముండయి ♦ యనఘపతిత
నంది గర్వించుచు ♦ నతిశయాధర్మంబు గావించె, దండుఁ డి♦క్ష్వాకునమున;
నయ్యది ఘోరమై ♦ యాగ్రహించిన యగ్ని శిఖవోలెఁ జూడంగఁ♦జెప్పఁ దగని
తే. యట్టి యాపత్స్వరూపమై ♦ యమరె; దుష్ట
బుద్ధియగు నీతనికి మృత్యు♦వు పరిసరము
నకు వెసం జేరెఁ, గాన నీ♦నరపతి కడు
మందునగ్నిశిఖం దాఁక ♦ మదిఁ దలంచె. ౬ 3078
చ. కన విన రాని పాపమును ♦ గాదన కీతఁ డొనర్చె నిట్టిరీ
తిని జెడుబుద్ధి యందులకుఁ ♦ దృప్తిగఁ బొందఁదగున్ ఫలంబు పా
పనిచయకర్మముల్ ఫలము ♦ బాగుగ నీయక పోవునే ధరన్;
గనుకనె యేడురాత్రముల♦కాలమునందు సభృత్యబంధుఁడై ౭॥ 3079
క. తనపాపకర్మముల నా,త్మను దలఁచుచు సంతమొందు ♦ దండుఁడు శతయో
జనపరిమితతద్దేశం,బును, శుక్రుఁడు చేయుఁ గాక ♦ బూదిగఁ బెలుచన్. ౮
ఆ. సర్వసత్వములును ♦ స్థావరంబులు చరం,బులును పాంసువర్ష♦మున నశించుఁ
గాక దండువిషయ ♦ మేకడ నెందాఁక, నమరు నంతదాఁక ♦ నస్మదాజ్ఞ. ౯॥
తే. పాంసువర్ష పరీతమై ♦ పరఁగుచుండఁ
గలదు సప్తదినంబుల ♦ కాల మింక;
ననుచుఁ గ్రోధాగ్నితప్తుఁడై ♦ యాస్థలమున
నున్న జనములఁ గాంచి యి♦ట్లొప్పఁ బలికె. ౧౦॥ 3082
క. స్థల మిది వాసార్హము కా, దలఘుజవం బొప్పఁగా స్థ♦లాంతరమునకున్
వెలలుఁడు చింతిల్లక యని, పలికెను శుక్రోక్తుల విని ♦ బ్రాహ్మణు లెల్లన్. ౧౧
క. ఆయాశ్రమంబు వదలి త,దీయాటవి కంతికమున ♦ దివ్యస్థలమున్
రోయుచు సుస్థలమును గని, యావసిం గట్టుకొనిరి ♦ యాశ్రమపంక్తుల్.
చ. మునిపతి యెల్లమానులకు ♦ ముక్తిని నచ్చట నిచ్చి యెుండు తా
వున నరు లెల్ల నుండుటయుఁ ♦ బొందుగఁ గూఁతును గాంచి యిట్లనెన్;
వనితరొ! యీపదంబునన ♦ వాన మొనర్పు సమాహితాత్మవై
వన మిది యోజనంబు లొక ♦ వందకు నూటిగనా నరస్సుగన్. ౧౩॥ 3085

క. సురుచిరకాంతిం బొల్చెదు, నరజా! యిటఁ గాల మొక్క♦యనువునఁబుచ్చన్;
దరుణీ! యెప్పుడు కాలం, బరుదెంచును నీదుసుగతి♦కాధారముగన్. ౧౪

క. నినుఁ గూడి నీదుపరిసరమున నుండెడు భూతముల స♦మూహంబులకున్
గనరాకుండెడు మృత్యువు, కనకాంగీ! యాత్రియామ♦కాలమునందున్. ౧౫

ఆ. పాంసువర్ష మెంత♦పఱఁగిన నద్దాన, బాధ నొందకుండ♦వఱలు నతము;
నాఁగఁ దండ్రిపలుకు♦నాతి చక్కఁగ విని, బ్రహ్మమానిపలుకు♦భద్రద మని.

క. మనమున దుఃఖించుచు నట్లనె యుండెదనంచుఁ బలికె♦నాశుక్రునితో;
మునిపతి యాతఁడు వేఱొక, వనమున నాశ్రమము గట్టఁ♦బనిచి వసించెన్.

క. అంతట దండునిరాజ్యం, బంతయు బలభృత్యవాహ♦నాన్వితముగ నం
క్రాంతంబయ్యెను శుచిదుర్దాంతజ్వాలలను సప్త♦రాత్రములందున్. ౧౬

క. మునిపతి చెప్పినచొప్పున, జనపద మది యెల్ల భస్మ♦సాత్కృతమైనన్
గనుపట్టె రాజ్య మది నిర్మనుజంబయి శూన్యమైన♦మాడ్కిన్ రామా!. ౧౭

తే. వింధ్యశైవలగిరిమధ్య♦విలసితముగు
దేశ మయ్యది శ్రీరామ! ♦ దివ్యమాని
శాపవశమున వికృతిసం♦సక్తమయ్యె
నదిమొదలు దండకారణ్య♦ మనఁగ నెగడె. ౧౮ 3092

క. మునులు వసించినతా వది, జననాథా! యదియె మొదలు♦ జ్ఞానస్థలమున నొ
ప్పెను జుమ్ము జనస్థానం, బనఁగా; వృత్తాంత మిద్ది♦ యంతయు నీకున్. ౧౯

క. వినిపింపఁబడియె నాచే;, మనమున వినఁగోరి భూప♦మండన! ప్రశ్నిం
చినవాఁడవు దానికి నొ,య్యనఁ జెప్పినవాఁడ బదులు♦హర్షము గనుమా

తే. ఇంక సంధ్య నుపాసింప♦హితము సుమ్ము
సమయ మిది యందులకుఁ దగి♦ యమరె వీరె
మానివరు లెల్ల జలపూర్ణ♦సహిత కుంభ
హస్తులై యర్ఘ్యముల చేత♦ నరుణకిరణు ౨౦ 3095

క. పరితృప్తి నొందఁ జేయుచు, నిరుపమభక్తిన్ జపించు♦ నియతిం గని, రా
దరమున వారలతో భాస్కరుఁ గొల్చుట యుక్తమనుచు♦ జ్ఞానురమునియున్.

తే. రామ! రఘుకులవారిధి♦సోమ! సూర్యుఁ
డస్తమింపంగఁ బోయెడు♦ నట్టి లోట
జలము లుండెడుచోటికిఁ♦ జనుము జలము
లను స్పృశింపుము సూర్యుఁ గొ♦ల్వంగ భక్తి. ౨౧ 3097

ఎనుబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౮౨ - సర్గము.

రాముఁడు మరల నయోధ్యకు వచ్చుట.

చ. అన విని మౌనివాక్యముల ♦ హర్షము నొంది రఘూద్వహుండు సం
ధ్యను గొలువంగ, నచ్చర ల♦హర్నిశముం గొలువంగఁ బుణ్యమై
తనరుసరోవరంబునకుఁ ♦ దానవు డేగి జపం బొనర్చి; న
ట్లన జలముల్ స్పృశించి యప♦రాద్రికిఁ బోయెదునూర్యు భక్తిచేన్. ౧౪
తే. కొలిచి పశ్చిమసంధ్యను ♦ గోర్కి దనరఁ
దా నుపాసించి మహితాత్ముఁ♦డైన కుంభ
భవుని యాశ్రమమును జేర♦వచ్చె; నంత
నమ్మునీంద్రుఁడు కందమూ♦లాదు లవుడు. ౨ 3099
క. పలువిధములైన లతలను, సులలితశాల్యన్నములను ♦ శుభగుణునకు భూ
పలలాముసకున్ భుక్తికి, నలఘుతరప్రీతిఁ గూర్చె ♦ నంత నతండున్. ౩ 3100
క. అమృతోపమమగు నాయు,న్నముఁ జక్కఁగ ననుభవించి ♦ నరపతిసంతో
షముఁ దృప్తినొందియూ రే,యి మునీంద్రునిచెంతఁగడపె ♦ నెలమి మిగులఁగన్.
సీ. అరినిషూదనుఁడైన ♦ యారాఘవుఁడు తెల్లవాఱఁగా లేచి స♦త్కృక్తిఁ గాల్య
కృత్యంబులం దీర్చి ♦ హితమతి నాహ్నికకృత్యంబు జరపి ము♦నీంద్రుతోడ
గమనంబునకు నాజ్ఞఁ ♦ గరుణింపుఁడని వేఁడ నూహించివందన♦మ్మొగినొనర్చి
కుంభసంభవ! ముని♦క్షోణీశ! పురి కేగ నానతి వేఁడెద ♦ ననుమతింపుఁ
తే. డేను ధన్యుఁడ మీకృప ♦ నిందుఁ గంటి
గానఁ గృతకృత్యుఁడను మహా♦మౌని చరణ
దర్శనముచేయఁ గంటి నా♦త్మను బవిత్ర
ముగ నొనర్పుకొనన్ వత్తుఁ ♦ దగినయపుడు. ౫ 3102
చ. అని యిటు లాకకుత్స్థకులుఁ ♦ డాదృతిఁ బల్క నుహాద్భుతంబుగాఁ
గనఁబడువాక్య మద్ది విని ♦ కన్నులతిం బరితుష్టుఁ డౌచు నా
మునిపతి యాతపోధనుఁడు ♦ మోదమున నుస్మిత మూడ నిట్లనున్
జనవర! యద్భుతం బగుచుఁ ♦ జాల ముదం బిడు నీసువాక్కులన్. ౬ 3103
క. విని నాఁడ ముదముఁ గంటిని, మనుకులవారిధిశశాంక! ♦ క్ష్మాపతివర! భూ
తనిచయముల నీవే పా,వనమూర్తివి క్షణము నిన్ను ♦ వరుసం బ్రీతిన్. ౭
క. కనఁజాలుదురో వారలె, యనఘులు పావనమనస్కు ♦ లగుదురు స్వర్గం
బున కేగఁ జాలుదురు పూ,జను బొందం దగినవారు ♦ సత్యము సుమ్మీ!. ౧౦
క. ఘోరంబగుదృష్టిని ని,న్నేరైనం జూతు రేని ♦ యేపున యముఁ డ
వ్వారిన్ దండించి మహా,రౌరవమునఁ ద్రోయుఁ జుమ్ము ♦ రాఘవరామా!.
క. పరిశుద్ధుండవు శ్రీరఘు,వర! భూతగణంబులందుఁ ♦ బరికింపఁగ నీ

ధర నిన్నుఁ దలఁచినంతనె, పరమం బగుసిద్ధి నొందు ♦ భవములయందున్.

క. చనవయ్య! త్రోవ దోషం,బును బొందక భీతిలేక ♦ పూజ్యతరంబై
కనఁబడు నవ్యగ్రుఁడవై, జనులను బాలింపవయ్య! ♦ చక్కనిరీతిన్. ౧౩

క. గతి నీవె యెల్లవారికి, నతిమానుషుఁడవు మహాత్మ! ♦ యన విని వినయో
న్నతి దోసి లొగ్గి వలగొని, క్షితిసురముని నయ్యగస్త్యు ♦ సేవించి తమిన్. ౧౪

తే. ప్రాజ్ఞుఁడా రాఘవుఁడు మౌని♦పతిని భక్తిఁ
గొలిచి పుణ్యాత్మువలన ని♦మ్ముల మహాశి
షములఁ గైకొని యందున్న ♦ సాధువరులఁ
గొలిచి యవ్యగ్రుఁడై ముదం ♦ బలరుచుండ. ౧౫ 3110

క. కనకాలంకృతపుష్పక,ము నెక్కి; నక్లేగుచున్న ♦ భూపతివరు రా
ముని నాశీర్వచనంబులఁ, దనిపిరి మును లెల్ల రట ని♦తాంతప్రీతిన్. ౧౬

సీ. అమరులు దేవేంద్రు ♦ నర్చించువిధమున నంబరతలమున ♦ నమలపుష్ప
కమునందు నున్న భూ♦కాంతుని గాంచిరి మును లెల్లఁ; గనకవి♦భూషితమగు
పుష్పకవరమందుఁ ♦ బొలుచునా రాముండు జలధరాగమమున♦సలిలదముల
చెంతనున్నట్టి శ♦శివిధంబునం బొల్చె నర్ధదినంబున ♦ నానృపుండు

తే. పురమునకుఁ బోయి తనసౌధ♦వరమునందు
మధ్యకక్ష్యను దిగియె నా♦మాడ్కిఁ బుష్ప
కంబు దిగి కామగంబయి ♦ కాంతతరము
నైన దానిని బొమ్మని ♦ యాజ్ఞ చేసి. ౧౭ 3112

క. చను నీకు శుభంబగు నం,చన నయ్యది స్వేచ్ఛ నరుగ ♦ నచ్చట ద్వారం
బుననున్న భటునితో ని,ట్లను లక్ష్మణు భరతుఁ బిల్వ ♦ మతివిక్రములన్. ౧౮

క. నాతాకఁ దెలుపు, వారలు, భూరిగయుం బొప్ప రాఁగఁ ♦ బూనుదుగని గం
భీరోక్తుల నానతి యిడ, ద్వారస్థుఁడు పోయె నాజ్ఞఁ ♦ దలఁగొని యంతన్.

ఎనుబదిరెండవ సర్గము సంపూర్ణము

---

౮౩ - వ సర్గము.

రాముఁడు రాజసూయము చేయఁబూన భరతుఁడు వలదని చెప్పఁగా నంగీకరించుట.

క. చని యతఁడు భరతలక్ష్మణు,లను గని రామోక్తులను నె♦లమిఁ దెలుపంగా
విని వారు రాఁగ నవ్వా,ర్తను దెలిపెను భూమిపాల♦తంనున కంతన్. ౧

క. కని ప్రియుల భరతు లక్ష్మణు, నను రాగముతోడ వారి ♦ నల్లన నాలిం
గనమున రంజిలఁ జేయుచు, జనపతి యీరీతిఁ బలికె ♦ సహజన్ములతోన్. ౨

చ. ఒనరిచినాఁడఁ జక్కఁగ మ♦హోత్తమభూసురకార్య మేను నిం
కను వరధర్మసేతువును ♦ గ్రమ్మగతిం బరిరక్షణంబు చే

యను దలఁపోయువాఁడ; నది ♦ యుక్తియు నవ్వయమంచు నామనం
బునఁ దలపోయువాఁడ నిదె ♦ పో యఘమోచనమార్గ మారయన్. ౩౫

తే. ధర్మమునె సంస్మరించుట ♦ తగినపనియొ
యింక నాయాత్మభూతులై ♦ యొసఁగు మిమ్ము
ననుజులం గూడి రాజసూ♦యంబు చేయఁ
దలఁతు నయ్యది శాశ్వత♦ధర్మము గద. ౬ 3118

సీ. శత్రుసూదనుఁడైన ♦ మిత్రుఁడన్ భూపతి రాజసూయమున ని♦ర్మలుని నగ్ని
సంతృప్తి నొందించి ♦ సత్వరంబుగ మిత్రత యనఁగఁ బడు సత్వ♦దంబునొందె;
రాజసూయము మొనర్చి♦రాజన్యుఁడౌ పాశధరుఁడు పొందెను బ్రీతి♦వరుణపదముఁ
జంద్రుండు ధర్మశా♦స్త్రంబుల నెఱిఁగినవాఁడౌట ధర్మైక♦పథముచేత

తే. రాజసూయంబుచేసి స♦ర్వజగములకుఁ
గీర్తిపదమైనలోకంబు ♦ నార్తిహరము
శాశ్వతంబును బొందెను; ♦ సహజులార!
యీదినమునందె ననుఁ గూడి ♦ యొసఁగు వేడ్క. ౮౫ 3119

క. పరికించి ధర్మమున్ మది, నిరుపమమాశ్రేయమెట్లు ♦ నిల్చునొ మనకం
చరసి నయుక్తికముగ మీ, రుచితరధర్మంబు చెప్పు ♦ టొప్పుం జుండీ!. ౯

చ. అనుటయు వాగ్విశారదుఁడు ♦ ప్రాంజలియై భరతుండు పల్కె ని
ట్లని; పరమాత్మ! ధర్మము♦నయ్యది నిల్చును నీదుచిత్తసీ
మను సకలోర్వి నీదయిన ♦ మానితశాసనమందె నిల్చు నిం
తని వచియింపరానిబల ♦ మట్టిదె విక్రమ మెన్న నీదెయా. ౧౦ 3121

క. గురుబాహూ! నిన్నున్ భూవరు లెల్లను దేవత లొగి ♦ బ్రహ్మను బోలెన్
ధరణీపతిశేఖరునిగఁ, బరమాత్మునిగాఁ దలంచు♦వారు సతంబున్. ౧౨ 3122

క. నిను మేముఁ దలఁచురీతిగఁ, జను లెల్లను దండ్రిగాఁగ ♦ స్వాంతంబులయం
దనవరత మెంచుచుందురు, ఘనబలశాలీ! ధరిత్రి ♦ గతి నీవె కదా?. ౧౨౫

తే. ప్రాణులకు నీవె సతతసం♦త్రాణరూపుఁ
డవు గదా?; యట్టి నీవె భూ♦మివరనాశ
కరమయిన యజ్ఞ మిది చేయఁ♦గాఁ దొడంగు
టెట్లొ? నృపవంశములు నశి♦యించుఁ జుమ్ము. ౧౮ 3124

సీ. [శశి రాజసూయాఖ్య♦సవ మొనరించిన తరువాతఁ దారకా♦సురుని యుద్ధ
మందు దెప్పరమగు ♦ నని చేయ నయ్యె; హరిశ్చంద్రుఁ డీయజ్ఞ♦రీతిచేత
క్షత్రియవంశనా♦శనభూతయుద్ధంబు చేయఁగా వలసె; ని♦శ్చింతనున్న
వరుణుఁడే యీమహా♦ధ్వర మొనరించి యద్దాని యంతమ్మున ♦ దారుణమగు

ఆ. సంగరంబు చేయ ♦ జలచరసంతతి, మ్రందెఁ జుమ్ము; పరుల ♦ డెందమలరఁ

జేయునట్టిపనులఁ♦జేయుశత్రుం డిద్ది, చేయ ఘోరయుద్ధ ♦ మాయెసఁ దగ.
క. దానఁ భూతాళి చెడెఁ;, భూనాయక! రాజసూయ♦మును జేయంగా
నానాభూతంబులకును, మానక నాశనము గల్గు♦మాట నిజంబౌ]. ౧౯ 3126
క. క్రతు విది చేసిన రాజ, ప్రతతులకుం బౌరుషంబు ♦ భాసిల్లును వి
చ్యుతి గల్గు దాన భూతవి,తతికిం గోపంబు చాల ♦ దారుణము గదా ?. ౨౦
చ. సరసగుణాఢ్య! శత్రుగణ♦సంతతభీకరవిక్రమా! మహా
పురుష! నృపాలశేఖర! వి♦భూతి నెసంగుచు నిన్నుఁ గొల్చి వి
స్తరయశమొందియున్న నృప♦సంతతిఁ జంపఁగరాదు; బుద్ధిమ
ద్వరుఁడవు చక్క నెంచి రఘు♦వంశచరిత్రముఁ గాంచి యుత్తతిఁ. ౨౧
క. భూతవ్రాతములకు హిత, మేతీరున నగునొ దాని ♦ నెంచుము నీవే
భూతములకు నెల్లను గతి, యీతతి నద్దానిఁ ద్రుంప ♦ నేలా! చెవుమా?.
చ. భరతుఁడు సాధురీతి సుధ♦వర్షము పర్వినయట్లు పల్కఁగా
నిరుపమసత్యవిక్రముఁడు ♦ నీరజమిత్రకులోద్వహుండు భూ
వరపతి యాలకించి మది ♦ వర్ధిలు హర్షరసంబు ముంపఁగాఁ
గరము వెలింగె; నంత రఘు♦కాంతుఁడు కైకకుమారు సద్గుణుఁ. ౨౩ 3130
చ. కనుఁగొని యిట్లు పల్కె మది ♦ గాఢముదంబును బొందినాఁడఁ దృ
ప్తిని గనినాఁడ నీదుసుప♦దేశము మేలని తోఁచె ధర్మయు
క్తిని గని యీనుడుల్ వెలసె ♦ దివ్యములై హితదాయకంబులై
జనపతిపుత్ర! యీధరణిఁ ♦ జక్కఁగఁ బ్రోచుటఁ దెల్పుచుఁ గదుఁ. ౨౪
సీ. ధర్మజ్ఞ! నీవచ♦స్థితి నూఁతఁగాఁ గొని క్రతువరంబయి మామ♦కప్రియకర
మయి యొప్పు రాజసూ♦యంబును మానితి; లోకపీడాకర ♦ మేకరణిని
నగుకార్యమును దెల్వ ♦ నలరువారలు మాననగు లక్ష్మణాగ్రజా!♦తగశుభంబు
హితమును నగువాక్య♦మే బాలకుఁడు చెప్పగ్రహియింపఁదగునని♦కలదు నీతి
తే. బుద్ధిమద్వర్య ! నీవాక్య♦ము విహితంబు
శుభము హితదాయకంబునై ♦ శోభిలుటను
నే గ్రహించితిఁ దత్కృతిను ♦ వింకఁ జేయు
యత్నమును మానెదఁ విల♦యద మగుటను. ౨౫ 3132

ఎనుబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౮౪ - వ సర్గము.

లక్ష్మణుఁడు రామునకు వృత్రాసురునిచరిత్రంబును దెలుపుట.

చ. అని యిటు కైకయాత్మజుఁడు ♦ నారఘురాముఁడుఁ బల్క లక్ష్మణుం
డను నిటు రామునిం గని మ♦హామతిభూషణ ! యశ్వమేధమం

చను క్రతు వొందు పాపముల ♦ నన్నిఁటిఁ గూల్చును పావనంబుగాఁ
దనరును దానిఁ జేయఁదగు ♦ దావకచిత్తము సమ్మతించినన్. ౨ 3133

తే. దుస్తరం బది సర్వక్ర♦తువరమగును
బూర్వవృత్తము వినఁబడు ♦ భూమిపాల!
మహితచిత్తుఁడు వాసవుం ♦ డహితసూద
నుఁడు మహాబ్రహ్మహత్యచేఁ ♦ దడవు డస్సె. ౩ 3134

క. తరువాతన్ హయమేధా,ధ్వరమునఁ దత్పాపము త్రిఁ ♦ దా నొందెఁ గదా?
గురుబాహూ! విను దేవా,సురసంయోగంబు చెడిన ♦ సురరిపులందున్. ౩౫

క. దితిజుఁడు వృత్రాఖ్యుఁడు స,న్మతుఁడై రాజ్యమ్ము చేసె ♦ త్స్మాపాలక! వి
స్తృతి నూఱుయోజనమ్ముల, మితిఁ దత్రిగుణోచ్ఛ్రితంబు ♦ మే నతనికగున్.

క. అనురాగంబున మూఁడుభు,వనముల స్నేహమునఁ జూచు♦వాఁడౌట నతం
డనురంజకుఁ డన నెగడెను, విను మతఁడు కృతజ్ఞుఁ డఖిల♦విషయములందున్.

తే. ధర్మవేత్తయు సద్బుద్ధిఁ ♦ దనరువాఁడు
నగును గానని శ్రద్ధయు ♦ నమర ధర్మ
పాలనంబునఁ బృథ్విఁ గా♦పాడె నట్టి
వృత్రుఁ డఖిలవసుంధర ♦ వెలయఁ జేయ. ౬ 3138

క. ధర కామంబులఁ బిదుకుచుఁ, బరమాద్భుతరీతిఁ బొల్చెఁ; ♦ బ్రసవఫలములన్
వరమూలంబులు రసయుతి, ధరణిన్ విలసిల్లె నట్టి ♦ తరుణంబందున్. ౭ 3139

తే. ధరణి దున్నకయే పండు ♦ ధనము చాల, గల్గియుండును నాతని♦కాలమందు
నద్భుతంబుగఁ గన్పడు♦నవనితలము,భాగ్యయుతమయివృత్రాసు♦భవితమగుచు.

క. ఒకనాఁ డాతండు తపం, బకలుషమతిఁ జేయుగోర్కి ♦ నంది యనుపమం
బు కదా యంచును జగతిన్, సకలశ్రేయఃప్రదాన♦చణమంచుఁ దగన్. ౮౫

తే. ఇతరసుఖ మెల్ల మోహంబు ♦ నిచ్చు నంచుఁ
దలఁచి పెద్దకుమారుని ♦ నిలిపి రాజ్య
పాలనంబునఁ బౌరుల ♦ నోలి నడిగి
మధుర కీశ్వరుఁ డితఁడను ♦ మాట దెలిపి. ౯౫ 3142

క. సురలకుఁ దాపం బిడు ని,ర్భరతపముం జేయఁ బూనె; ♦ వాసవుఁ డాక
ప్పురనాగు నియతి నెమ్మదిఁ, బరికించి సరోజనేత్రుఁ ♦ బరమాత్ము హరిన్. ౧౦౫

క. కన వైకుంఠమునకు వేఁచని మ్రొక్కి పచించె నిట్లు; ♦ చక్రధరా! యో
దనుజవిరోధీ! వృత్తుం, డనుదనుజుఁడు తపము చేయ ♦ నాత్మనియతిచేన్. ౧౧౫

తే. జగము లన్నింటినిం దాను ♦ చక్క నాక్ర
మింపఁగాఁ బూనె బలమున ♦ మించు నతఁడు

ధర్మమతి గాన నేవానిఁ ♦ దాఁకి విజయ
మందఁగాఁ జాల నింక నా♦యసుర ప్రకరల. ౧౨ 3144

క. వ్రతములాని తపము చేయఁగ, దితిజేంద్రుని వశ్యములగుఁ ♦ ద్రిజగంబులు నీ
పతిని మహోదారుని సుర,తతివైరి నుపేక్షచేయ ♦ ధర్మమె చెపుమా?. ౧౩॥

క. మనమున నీవే క్రోధం,బును గాంచిన వృత్రుఁ డుండఁ ♦ బోఁడు ధరిత్రిన్
వనజాక్ష! జగంబులపై, ననురాగము పొదలఁ జేయ ♦ నగు నీకనైనన్. ౧౪॥

క. నిను విభునిఁ బొంది లోకము, లనూనసుఖసంపదలకు ♦ నాకరములుగాఁ
దనరెడుఁ గాక; మహాత్మా!, యనుగ్రహం బీయమర్త్య♦లం దున్పఁదగున్.

క. నీ వాదరంబు చూపిన, నీవిశ్వము శాంతనుగుచు ♦ నెసఁగు నరుజమై
యోవిశ్వనాథ! నిన్నే, దేవత లిదె వేఁడువారు ♦ తీవ్రత్వరతోన్. ౧౬॥ 3148

తే. వృత్రు వధియించి సాహ్య మీ♦విబుధులకును
జేయుమా సంతతంబు నీ♦చేయుసాయ
మునసె మే మున్నవార మీ♦పని యొరులకు
శక్యమే గాదు వేగంబ ♦ సాయపడుము. ౧౭ 3149

ఎనుబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౮౫ - వ సర్గము.

ఇంద్రుఁడు వృత్రాసురుం జంపి బ్రహ్మహత్యను బొందుట.

చ. అనవిని లక్ష్మణోక్తులకు ♦ నారఘురాముఁడు మోదమంది యి
ట్లనియెను; వృత్రుఁ జంపినమ♦హాకథ యంతయు నాకుఁ జెప్పుమా
ఘనతరచిత్త! యంచు రిపు♦కాలుఁడు రాముఁడు పల్క లక్ష్మణుం
డనుపమగాథ దాని నిటు ♦ లారసి చెప్పఁగఁ బూనె శ్రద్ధతోన్. ౨ 3150

చ. వినుము నరేంద్ర! యింద్రుఁ డిటు ♦ వేఁడినఁ దద్వచనంబు నిర్జరుల్
వనట వచించువాక్కులను ♦ వారిజనాభుఁడు శ్రద్ధమీఱఁగా
విని శతమన్యుముఖ్యులను ♦ విచ్యుతసమ్మదులన్ దగంగఁ గ
న్గొని యిటు పల్కె; వృత్రుఁడు వి♦కోపనుఁడౌ నని యెంచినాఁడఁజూ!. ౩॥

క. కనుకన్ వృత్రునిపై నా,మన మనుకంపాంతరంగ♦మండల మగుచున్
దనరెడుఁ గావున నిత్తతిఁ, గసలి భవత్ప్రీతికొఱకుఁ ♦ గాదు వధింపన్. ౪

తే. మీకు సుఖసంపదలు గల్గు ♦ మేలుచేయు, టది యవశ్యము నాకగు♦నట్లుగాన
వృత్రుఁ జంపునుపాయంబు ♦ నేను జెప్పు,వాఁడ నద్దాని వినిచేయ♦వలయునట్లు.

సీ. నా తేజమును జగ♦న్నాయకత్వము దాల్చు నద్దానిఁ ద్రివిధమై♦యలరఁ జేయు
వాఁడ నద్దానిచే ♦ వాసవుం డావృత్రుఁ జంపంగఁ గలుగునం♦శం బొకండు

దానవునిం బొందు♦ ద్వితీయమే వజ్రమునుబొందు మూఁడవ♦దనఁగ నొప్పు
నంశంబు భూమిని ♦ నాశ్రయించును దానవ్పత్రునిఁ జంపు దే♦వేశుఁ డనుచుఁ

తే. బలుకు నావిష్ణుమూర్తి భా♦షలను వినుచు
నమరు లట్లనె యగు నంశ♦యంబు వలదు
దానవాంతక! నీకు ము♦దంబు గలుగు
నసురవధమును గోరుచు ♦ నరుగుదు మిఁక. ౮౪ 3154

క. పరమోదారా! నీదగు, వరతేజముచేత నింద్రు ♦ భజియింపుము స
త్వరముగ ననుచున్ శతమఖ,పురోగములు నొచు దేవ♦పుంగవు లెల్లన్. ౯౪

క. చనియెందు వృత్రనామక, దనుజుఁడు నివసించు నట్టి ♦ దారుణవనమున్
గని చొచ్చి యావరించిరి, వనమున నట స్వీయకాంతి♦భాసురు ఘనునిన్.

చ. దనుజగణేంద్రు వృత్రుని ని♦తాంతము మండెడు నగ్నిరీతి లో
కనిచయమున్ దహించు గురు♦కాంతిసముగ్రుని నంబరంబు నొ
య్యనఁ దపియింపఁ జేసెడు మ♦హత్తరతేజునిఁ జూచినంత భీ
తిని గని రాయమర్త్యు లెద ♦ ధీరత యెచ్చటికో వెనన్ జనన్. ౧౧౪ 3157

చ. ఇతని వధించు టెట్లు? లితఁ ♦ డెట్లు పరాజితుఁడౌనొ యంచు నీ
గతిఁ దలపోయుచుండ సుర♦కాంతుఁడు వజ్రము కేలఁ బట్టి యా
దితిజునిశీర్షముం దెగఁగ ♦ ధీరత వైచెను; దాన మస్తకం
బతులము ఘోరరీతిఁ దగు♦నట్టి మహోష్ణ్చలఁ గాల వహ్నియున్. ౧౩ 3158

క. తలఁ జెండురీతి వజ్రం, బలఘుగతిం బైనఁ బడిన ♦ యంత శిరంబు
జ్జ్వలతేజము పడె భూమీ,స్థలమున లోకములు సాధ్వ♦సంబును బొందన్.

ఆ. తగినరీతి విబుధ♦తల్లజుఁ డావృత్రుఁ, జంపి ఘనయశుండు ♦ సకలలోక
ములకుఁ బైననున్న ♦ యులఘుతేజున్నును, జేరఁ బోయె మదిని♦జింతఁగలుగ.

క. సురనాథుఁ డిట్లు చనఁగా, గురుతరమగు బ్రహ్మహత్య ♦ కూడం జనె నా
తురముగఁ బైకొని యది యా, పురుహూతుని కుందఁ జేయఁ♦బూనసతండున్.

క. అనయము దుఃఖించుచు నుం,డెను; శత్రువు తెగిన దేవ♦నిచయము పురుహూ
తుని గానక యనలునితోఁ, జని లోకత్రయము హేశుఁ ♦ జక్రిని భక్తిన్. ౧౭

క. కని పలుమఱు పూజించుచు, వనజాక్షా! నీవె గతి భు♦వనముల కెల్లన్
జనకుండవు భూతగణా,వనమునకై విష్ణు వనఁగఁ ♦ బరఁగితి నుర్విన్ ౧౮

చ. దనుజుని జంపె నీదగు ని♦తాంతను తేజము బ్రహ్మహత్య యిం
ద్రుని గడు నేఁచుచున్నయది ♦ తోఁప దుపాయము మాకు మోక్షమిం
కను గరుణింపవే త్రిదశ♦కాంతపతీ! యుని వేఁడ వారివా
క్కును విని యిట్లు పల్కె హరి ♦ కోమలవాక్కుల మోద మబ్బఁగన్.

క. నను నింద్రుఁడు పూజించెదుఁ, గనుకన్ బురుహూతుబాధ♦గాటింపక యుం
డను జేయువాఁడ నీకుఁ బా,వనహయమేధంబుఁ జేయ♦వలయు నతండున్.

క. మరల మహేంద్రత్వము ని,ర్జరనాథునిఁ బొందు సాధ్వ♦సం బించుకయున్
బరికింప లేక యుండును, సురలార' యటంచుఁ జక్రి ♦ శుభతరభణితిన్.

తే. అమృతధారలు గురిసెడు♦నట్లు పలికి
వారి సంతృప్తి నొందించి ♦ వాసుదేవుఁ
డమరవినుతులఁ బొందుచు ♦ నాత్మలోక
మును దగం జొచ్చె దేవతల్ ♦ చనిరి తమిని. ౨౨ 3167

ఎనుబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౮౨-వ సర్గము.

ఇంద్రుఁ డశ్వమేధమున బ్రహ్మహత్యను బాయుట.

చ. అని యిటు వృత్రువజ్రమున ♦ నాయమరేంద్రుఁడు త్రుంచుటల్ వచిం
చిన రఘురామసోదరుఁడు ♦ శ్రీయుత తేజుఁడు లక్ష్మణుండు గా
థను బరిశిష్టభాగమును ♦ దా వచియింపఁగ నెంచి యిట్లనున్;
జనవర! దేవభీకరుఁడు ♦ చాలఁ బరాక్రమశాలి వృత్రుఁడున్. ౧ 3168

క. దురమునఁ దెగుటయు దివిజే,శ్వరుఁ బొందెను బ్రహ్మహత్య♦శక్రుండు మహా
సురుఁ జంపినపాపంబునఁ, గరము వికారంబు నొంది ♦ కలవలపడుచున్. ౨

క. స్మృతిఁ బొందఁడయ్యె నెప్పటి, వితమున; నల్లాట నతఁడు ♦ విశ్వాతీత
స్థితి నొంది విసంజ్ఞుండై, మతిపాటవమింత లేక ♦ మ్రాన్పడియుండెన్. ౩

క. ఈరీతిఁ గొంతకాల మ,సారత సంకుచితదేహ ♦ సర్పము గతి నా
భూరితరపాపపీడితుఁ,డై రాజ్యము తొలఁగ నుండె ♦ నట నెచ్చటనో. ౪

చ. సురపతి నష్టసత్త్వుఁడయి ♦ చోటు గనంబడకుండ దాఁగఁగా
ధరణియు నష్టతుల్యయయి ♦ తద్దయు నెండిన కాననంబులన్
గరము వికాసముం జెడఁగఁ ♦ గ్రాలకయుండె; జగంబు లన్ని యా
తురమును బొందుచుండెను న♦దుల్ జలపూర మడంగఁ గన్పడెన్. ౫ 3172

సీ. జలదముల్ లఘుకాయ♦ములఁ బొల్చె హ్రదములునట్లకన్పడియెన♦త్యాళిశోభ
మును బొందె వృష్టియే ♦ గనఁబడకుండెను; క్షీణించుచున్న ని♦శ్రీకలోక
ములఁగాంచి సురలువి♦హ్వలమానసంబులమునువిష్ణుమూర్తిచె♦ప్పినవిధమున
హయమేధమును జేయ♦నగుననిపూనిరి మును లుపాధ్యాయులు♦ముందునడువ

తే. నింద్రుఁ డతిసాధ్వసంబున ♦ నెందునుండె
నచటికిం బోయి మోహితు ♦ నమరనాథు

బ్రహ్మహత్యాపరీతాత్ము ♦ బలవిహీనుఁ
గాంచి యాతనితోఁ గూడి ♦ క్రతు వొనర్చ. ౮ 3173

క. పూనిరి మహితాత్ముండగు, నానిర్జరనాథు బ్రహ్మ♦హత్య యడఁగఁగా
నానిర్మలహయమేధము, గానంబడె శ్రుతిహితముగఁ ♦ గడుఁ జిత్రముగన్. ౯

తే. అధ్వరంబు సమాప్తి ని♦ట్లందె బ్రహ్మహత్య యాయమలాత్ముని ♦ నమరవిభుని
బాసి చెంతనె నిలువంగఁ♦బడివచింపు, నాకు నుండంగఁ దగినస్థా♦నంబు నింక.

క. అన విని సంతుష్టులు ప్రీతిని గాంచిన దేవతలు న♦తిస్థిరబుద్ధుల్
తనరఁగ నిట్లని పల్కిరి, వినుమా యోబ్రహ్మహత్య! ♦ వివరింతు మిఁకన్.

తే. నీదుతనువు చతుర్భాగ♦నియతిఁ గనఁగఁ
జేయుమా ముందు నీబాధ ♦ చెప్పరాని
దగును నా దేవవాక్కుల ♦ నాలకించి
మహితులౌ వారిపల్కులు ♦ మంచి వనుచు. ౧౨ 3177

క. తనమది నెంచుచు నింద్రుని, తనువున నివసింపరామిఁ ♦ దలఁచి పలికె ని
ట్లని వారితోడ; నాల్గుగ, నొనరించెద నాదుతనువు ♦ నోసురలారా!. ౧౩

సీ. ఒక్కయంశంబున ♦ నురుజలసంపూర్ణనదులందుఁ బతుముల్ ♦ నాల్గువార్షి
కములనఁబడువానిఁ ♦ గడపెదఁ బుణ్యాత్ము లగువారలం గాక ♦ యుపగతసుకృ
తాత్ములదర్పంబు ♦ హరియించుదానవై స్నానార్థమరుదెంచు♦జనులయందుఁ
గామచారిణినయి ♦ క్రాలుచు నుండెద; ధర నొకయంశంబుఁ ♦ దాల్చి సర్వ

తే. కాల ముండెద నింద్రుని♦కాయమందు, వసతి లేదింకఁ గావునఁ ♦ బలుకుదాన
సత్యవాక్యమతోక్కయం♦శమునవనిత, లందు వాసంబుఁ గల్పించు♦కొందు నేను.

క. వనితలు ప్రాయంబునఁ జక్కనిరీతిని బొల్చువారు♦గా నుందురు వా
రిని గాంచి వసించెద నే, నవవరతము గాక నియత ♦ మగుకాలమునన్. ౧౫

తే. నే వసించెద మూఁడగు ♦ నిశలు మాత్ర
మవుడు తద్దర్పమును నేను ♦ నపహరించి
పురుషసంయుక్తి లేకుండఁ ♦ బూన్కిఁ జేయు
దాన మీ రొప్పవలయు ను♦ద్యమము దీని. ౧౬ 3181

క. ధరణీసురహంతకులై, నిరతము సత్యేతరముగ ♦ నియతిగ దూషిం
తురొ వారిఁ దురీయాంశత, సురలారా! పొందుదాన ♦ ఘోరత మెఱయన్.

చ. అన విని నిర్జరుల్ పలికి ♦ రాత్మఁ దలంచినయట్లె చేయు మీ
వనుపమశక్తిఁ గార్యముల ♦ నన్నిఁటిఁ దీర్తువు గాక స్వేచ్ఛగా
నని వచియించి దాని విడి ♦ యాదృతిఁ బ్రీతియుఁ దోఁప నింద్రు వం
దనములఁ దన్పి రాతఁడు గ♦తజ్వరుఁడై యలరారె నెంతయున్. ౧౮ 3183

తే. వేయిగన్నులనాథుండు ♦ విశ్వపాల, నమును బూనంగ లోకంబు ♦ లమలరీతిఁ

బొదలె నద్భుతసంకాశ♦ముగఁ దదీయ,యజ్ఞములరారెనయ్యింద్రుఁ♦డాచరింప.

తే. తురగమేధప్రభావంబు ♦ తోఁచు నిట్లు
రఘుకులార్ణవచంద్ర! శ్రీ♦రామచంద్ర!
యోమహాభాగ! యొనరింపు ♦ మురుతరముగ
నశ్వమేధంబు బహుదక్షి♦ణాధ్వరంబు. ౨౦ 3185

చ. అని యిటు లక్ష్మణుండు విన ♦ నందముగాఁ దగి యుత్తమంబుగాఁ
గనఁబడు వాక్యముం బలుకఁ♦గా మహితాత్ముఁడు శక్రతుల్యమై
యనుపమమైన విక్రమము ♦ నద్భుతతేజము గల్గు రాఘవుం
డనుజుని బుద్ధి కెంతయును ♦ హర్షము నొందుచుఁ దృప్తి నొందెఁ దాన్. ౨౧

ఎనుబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౮౭ - వ సర్గము.

శ్రీరాముఁడు లక్ష్మణునకు నిలోపాఖ్యానము చెప్పుట

చ. గురుతరతేజుఁడై నృపతి♦కుంజరుఁడై రఘువంశదీపమై
పరఁగెడు వాగ్విశారదుఁడు ♦ భానుకులాభరణంబు ప్రీతి సో
దరుహిత మెన్ని యోపురుష♦తల్లజ! నీవచనంబు సూనృత
స్ఫురణము *వృత్రఘాతమును ♦ భూరితరక్రతుసత్ఫలంబునున్. ౧౪ 3187

క. విని నాఁడ మఖం బట్టిదె, యనఁ జను; వినఁబడును గాదె♦ యార్య! మునుపు చ
క్కని తేజుఁడైన కర్దముఁ,డను బ్రహ్మయుఁ బొలిచె నతని ♦ యాత్మజుఁ డుర్విన్.

సీ. బాహ్లీశ్వరుండును ♦ బరమధార్మికుఁడును శ్రీయుతుండునునయి♦చెలఁగు నిలుఁడు
సదృశం బలరార ♦ సర్వావనియుఁ దన వశమున నుండ న♦వార్యవిక్ర
మమునఁ జేసికొని న♦మ్మదిఁ బ్రజలను బుత్రసములుగా భావించి ♦ చక్కనివిధి
రాజ్యంబుఁ బాలించె; ♦ రాజేంద్ర నాతని నిరుపమోదారులౌ ♦ నిర్జరులును

తే. గురుబలాఢ్యులు దైతేయ♦కుంజరులును
నాగరాక్షసయక్షగం♦ధర్వులు సత
తంబుఁ బూజించుచుండు ర♦త్యంతబాధఁ
దొలఁగఁ జేసెడు భూపతి ♦ యిలుఁ డటంచు. ౩౪ 3189

క. ఆతఁడు కోపించినచో, భీతిల్లుఁ ద్రిలోకములును ♦ వీర్యంబున న
త్యాయతధర్మంబున నా,భూతలపతి యసముఁడగుచుఁ ♦ బొలిచె సుమతియై

క. మతిఁ బరమోదారుండై, వితతయశం బంది భూమి ♦ వెలసె; మహీశుం
డతఁ డొకపర్యాయము రుచి,రతఁ దగు నొకకాన వేఁట♦రతి మదిఁ బొలయన్.

---

* వృత్రఘాత మశేషేణ వాజిమేధఫలం చ యత్-అనిమూ,

చ. అనుపమచైత్రమాసమున♦యందు బలంబులు సేవకాళి వా
హనములు తోడ రా శతస♦హస్రముగా మృగసంతతిన్ బలం
బునఁ బొలియించె; వేఁటతమి ♦ పొందక యుండెను దృప్తి యెంతకున్
జనపతి యమ్మహాత్ముఁడు య♦శంబున మించఁగ నెంచి యాత్మలోన్. ౯
చ. చనిచని యామహాత్ముఁడు ని♦శాతశరంబులచే మృగాళులం
దునుముచు నేయరణ్యమున ♦ ధూర్తవిరోధి యముండు స్కందుఁ డ
త్యనుపమశక్తి యుద్భవము ♦ నందెనొ యాస్థలిఁ జేరఁబోయె; నా
వనమునఁ బార్వతిన్ సుదతి ♦ భద్రుఁడౌ శివుఁ డెంతొ వేడుకన్. ౧౦
క. సంతోషపఱచుచుండెను, వింతగ ననుచరులు వేన♦వేలుగఁ గొలువన్
గ్రాంతరిపుం డాతఁడు తన, కాంతను సంతోషపఱుపఁ♦గా స్త్రీతనువున్.
తే. తాను గ్రహియించి గోపతి♦ధ్వజుఁడు చెంత
నలరుపర్వతనిర్ఝర ♦ మందు వేడ్క
నుండె; నావనభూమి స♦త్త్వ్యగ్ర పురుష
సత్త్వములును బుంలింగవృ♦క్షములుగూడ. ౧౩ 3195
క. వనితలవలె నయ్యెను; నా, వనినున్న మృగాళు లెల్ల ♦ వనితాసంజ్ఞం
దనరారె; నట్టియవసరమునఁ గర్దమపుత్రుఁడైన ♦ భూపతి యిలుఁడున్. ౧౪
క. శరముల మృగములఁ జంపుచు, నరిగెను దద్వనముఁ జేర ♦ నంత నతఁడు త
ద్ధర వ్యాళమృగపతత్రిని,కరములు స్త్రీరూపములను ♦ గ్రాలుచునుండన్. ౧౫
క. కనుఁగొనె నంతటఁ దానును, ననుచరులును వనితలైరి ♦ యట్లగుటను నె
మ్మనమునఁ దలంచి శోకం,బును మిగులం బొంది కృత్య♦మును దద్విధమున్.
క. హరకృతమని యెఱిఁగి మహా,త్తరభయమును బొందె; నంత♦దైవంబు మహే
శ్వరు శితికంఠుఁ గపర్దిని, శరణ్యుఁగాఁ గోరి భృత్య♦సముదయయుతుఁడై. ౧౭
క. చని భవుని మఱుఁగు జొచ్చెను, జనపతి నాయిలుని గాంచి ♦ శంకరుఁడు వరం
బును గరుణించెడు దైవము, తనమోమున నుస్మితంబు ♦ తగ సతితోడన్.
తే. కర్దమప్రియనందనా! ♦ క్షత్రియముని
వర్య! ఘనబలరాజితా! ♦ వరనియమవి
భాసురా! సౌమ్య! లేలెమ్ము ♦ వరముఁ బురుష
తను వదలి వేఱు వరముఁ బొం♦దఁగను గోరు. ౧౯ 3201
క. అన విని శోకార్తుండై, తనకోరిక శంకరుండు ♦ నగదని పలుకన్
విని భవునివలన వేఱొక, టనఁదగు వరమును వరింప ♦ నాత్మఁ దలఁపమిన్.
ఆ. వగలఁ బొగిలి నృపతి♦వర్యుఁడు పార్వతి, కెరఁగి హృదయపూర్వ♦కేష్టభక్తి
నిట్లు వినుతి చేసె ♦ నీశాని! వరదాన,దక్ష! లోకజనని! ♦ ధన్యచిత్త!. ౨౨
క. నిను దర్శించుట సఫలం, బనఁ జనుఁగాక యట్లుగాన ♦ నాదృతి నన్నుం

గనుఁగొని కావుమ యన నా,తనిహృద్గతవాంఛ నెఱిఁగి ♦ ధరణివిభు మునిన్.
క. కరుణాదృష్టిం గన్గొని, హరుసన్నిధి నిట్లు పలికె ♦ నతిశుభదోక్తిన్
గిరిశునిసమ్మతిచే నో, ధరణీశా! యీశుఁ డర్ధ♦తనుఁడౌను గదా?. ౨౮ 3206
క. నగ మేను గాన నన్నొక, నగమే యాచింపు వనిత♦చంద మ్మొకకొం
తగఁ బురుషాకృతిఁ గొంతగఁ, దగుకాలము గోరుకొనుము ♦ తలఁచినరీతిన్.
క. అని యమృతమురీతిం దగి, యనుత్తమంబైనవాక్య ♦ మంబ పలుకఁగా
విని సంతుష్టస్వాంతం,బున రాజేంద్రుండు పలికెఁ ♦ బొంగెడువేడ్కన్.
సీ. దేవి! ప్రసన్నవై ♦శివయేని నే రూపవిభవంబునన్ సాటి ♦ విశ్వమందు
లేక మాసం బొందు♦లీలాకురంగాక్షినై యొక్కమాసంబు ♦ నందుఁ బురుష
తను గని యుండెద ♦ ననుమతింపుము యిట్టులన రాజువాంఛితం♦బును నెఱింగి
పార్వతి రుచిరాస్య♦పద్మయై యిట్లను; నీవు కోరినయట్లు♦గా వరంబు
తే. నిచ్చితిని రాజవర్య! నీ ♦ వెపుడు పురుష
తను గనంజాలుదువో యప్డు ♦ తన్విభావ
మును స్మరింపఁగఁ జాలవు ♦ వనితవైన
యప్డు పురుషతయును దెలి♦యంగ లేవు. ౨౯ 3208
క. అని పలికె నంత నాతఁడె, జనవరుఁడై మాస ముండె ♦ జగములలోఁ జ
క్కనిదనఁదగు వనితయునై, తనరె నిళాదేవియనఁగఁ ♦ దా నొక నెలలోన్.

ఎనుబదియేడవ సర్గము సంపూర్ణము.

---

౮౮ - సర్గము.

-ఇలుఁడు స్త్రీరూపము నొంది వనమున విహరింప బుధుఁడు కామించుట.-

క. అని యిట్టు లిళునివిషయం, బును దెల్పెడు గాథ రామ♦మూర్తి తెలుపఁగా
విని భరతలక్ష్మణులు మన,మున విస్మితులగుచు హ స్త♦ముల నొగ్గి తమిన్.
క. రామునితో నిట్లని రా, భూమీశుని మహితచిత్తు ♦ బుధనుతుని విసం
గా మది త్వరపడియెడు నో, రామా! వినవలతు మేము ♦ రాజచరితమున్.
క. నరపతి దుర్గతి యనఁదగు, తరుణీరూపంబు నొంది ♦ ధర వర్తించెన్
బురుషుండై యేవృత్తిని, బరిగ్రహించెన్ మహీశ♦వర! తెల్పఁగదే?. 3
చ. అనుటయు సంతసంబు గని ♦ యాయనుజన్ములు తన్ను వేడఁగా
విని రఘురాముఁ డెంతయును ♦ విస్తృతమౌ కథ దానిఁ జెప్పెదన్
జనపతి యెట్లుగాఁ దిరిగె ♦ క్ష్మాస్థలి నావిధ మెల్లఁ జెప్పెదన్
వినుఁ డిటు లామహేశ్వరుఁడు ♦ వింతగ సుందరనారియై యటన్. ౪ 3213
క. అనుచరులును వనితలునై, తనుఁ గొల్వఁగఁ దద్వనమును ♦ దాఁ జొచ్చి విహా

రనిరతిఁ జరియించెను నా,వన మున్నతతరులతాని♦బద్ధం బగుచుఁ. ౫౻ 3214
ఆ. అలరుచున్న నందు ♦ నాగపుష్పవకుళ,శాఖిద్యోత ములయు ♦ సంప్రిగతిని
దిరిగె వాహనాళిఁ ♦ దేకువ విశనాడి,శిరిని శాఖతరుని♦వరములందు ౭ 3215
సీ. ఆకాశనంబున ♦ నద్రికిఁ జెంతనె బహువిధఖగకుల♦పటలి మొలయ
నురుచిరప్రఖ్యమై ♦ శోభిల్లు సరసొండు వెలయుచుండెనుదాని♦నిలయుఁ గాంచి
యందుఁ జంద్రాత్మజుం♦డై నట్టి బుధుని దేహచ్ఛాయ నలరారు♦నతని నుదిత
సంపూర్ణచంద్రుని♦చందంబునం దగువానిఁ దపస్స్ఫూర్తి ♦ వఱలువాని
తే. జలములకు మధ్యమంబగు ♦ స్థలమునందు
దుష్కరంబగు నియతిచేఁ ♦ దోఁచువాని
యశమునందగువాని వ♦యస్స్ఫురితునిఁ
*గామకరుఁ గాంచె మది యెల్లఁ ♦ గళవళింప. ౧౦ 3216
చ. సరసును జొచ్చి కాంతలయు ♦ చారుజనుద్యుతు లొప్పుచున్న య
ప్పురుషులఁ గూడి యాకొలను ♦ బొంక మడంగఁ గలంచె విస్మయా
తురమున; నంతటన్ బుధుఁడు ♦ తోయ్యలి నయ్యెడఁ గాంచి యెంతయున్
స్మరశరపీడితుండగుచు ♦ స్వాంతము నూలఁ దపించె నామెయున్. ౧౧౻ 3217
చ. జలములలోన మున్గుచును ♦ జక్కని చేడెలఁ గూడి తేలుచున్
బొలసెడుకోర్కి నుండ; శశి♦పుత్త్రుఁడు రూపమునన్ త్రిలోకకాం
తలను జయించి యొప్పునల ♦ తన్విశుభాకృతిఁ గాంచి చిత్తమం
దలఘువిచారముం గనియె ♦ నంగనవార్త నెఱుంగఁ గోరుచున్. ౧౩ 3218
క. సురకాంతల మించెడు నీ,తరుణీమణి యెవతెయొక్కొ ♦ ధాత్రిం గన ని
ర్జరనారులందుఁ బన్నగ,తరుణులయం దసురవరని♦తంబినులందున్. ౧౩౻ 3219
తే. అప్సరలయందు నిట్టిదా ♦ నాకృతిఁ దగు
నింతి మును పెన్నఁడును జూచి ♦ యే నెఱుంగ
నెవతయో యామె యితరుఁ డీ♦యింతిఁ గొనక
యున్న నా కుద్దియా నిఁక ♦ నెన్న నేల?. ౧౪౻ 3220
క. అని చింతించుచు జలముల,కు నడుమఁ జలియించి యట్టి ♦ కోరిక పొంగన్.
జనుదెంచెఁ గూలమునకా,ఘనుఁడాశ్రమమునకుఁ బోయెఁ♦గాంతామణులున్.
చ. జలకము లాడి యాడి కడు♦సంతస మించెనలార నాశ్రమ
స్థలమున కేగుదెంచుటయుఁ ♦ జక్కని ధర్మ మొసర్చు నాబుధుం
డలతరుణీగణంబు కన ♦ నాతని వారలు గాంచి రంతటం
గలిగెఁ బరస్పరంబు తమి; ♦ కాంతల నందఱఁ గాంచి యాదృతిన్. ౧౬౻
తే. పలికె నిట్లని ధర్మాత్ముఁ ♦ డలఘుమతియు
నగు బుధుఁడు కాంతలార! యా♦యంగనాతి

* యశస్కరం కామకరం తారుణ్యే పర్యవస్థితం-అనియూ.

లకము లోకత్రయంబున ♦ లలనలందు
మేటి యెవ్వతె? యిట వచ్చె ♦ నేటి కిపుడు? ౧౮ 3223

సీ. ఎఱిఁగింపుఁడీ నాకు ♦ నెల్లవార్తల నించుకంతయుఁ దడవుచే♦యక యనుటయు
శుభవాక్య మాలించి ♦ సొంపు గుల్కెడునట్టి యుత్తరంబులుగల ♦ యాపలుకుల
కెంతయు నలరి వా♦రెల్ల మృదూక్తులఁ బలికి రిట్లని, మునీ! ♦ లలన యీమె
ప్రభుత మీయందు ను♦జ్జ్వలరీతిఁ బొందెడు ననిశంబు భర్త లే♦కటవియందు
ఆ. మమ్ముఁ గూడి తిరుగుఁ ♦ జుమ్ము నా నవ్యక్త,పదము లలరుచున్న ♦ పలుకులవిని
యాత్మశక్తిచేత ♦ [1]నావర్తనియను వి,ద్యను గ్రహించి దాని ♦ యతులశక్తి.

క. ధరణివిభువార్త నెల్లను, బరమాద్భుతముగ నెఱింగి ♦ వనితల వారిం
గర మర్థిఁ బలికె; నామునివరుఁ డోవామాక్షులార! ♦ వాసం బిచటన్. ౨౦

క. ఒనరింపుఁడు కింపురుషాం,గనలయి యీగిరితటమునఁ ♦ గడు రయమున మూ
లనిచయములఁ బత్రంబుల, ననూనఫలరాజిఁ దినుచు ♦ ననుదిన మెలమిన్.

ఆ. మీరు కింపురుషులఁ ♦ జారురూపుల భర్త
లనుగఁ బడయఁగలరు ♦ వినుఁ డటన్న
శశికుమారుపలుకు ♦ చందంబునన్ మాఱి
యధివసించి రద్రి♦యందుఁ దృప్తి ౨౨ 3227

ఎనుబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౮౯ - వ సర్గము.

బుధునివలన స్త్రీత్వ మొందిన యిలుఁడు పురూరవసుండను కొడుకును గనుట.

క. భరతుఁడు లక్ష్మణుఁడును గిం,పురుషోత్పత్తిని నెఱింగి ♦ భూరితరంబౌ
పరమాద్భుత మియ్యది యని, ధరణీశునితోడ ననిరి ♦ తగువినయమునన్. ౧

క. వినవలయు ననంతరగా,థను నా శ్రీరామమూర్తి ♦ ధన్యయశుండి
ట్లనియెను [2]ధర్మమె మనమున, ఘనమని తలపోయుఁ గాన ♦ గాథను దానిన్.

తే. వినుఁడు తెల్పెద నారీతి ♦ వనిత లెల్లఁ, గిన్నరీరూపములఁ దాల్చి ♦ యున్నగేంద్ర
మునను గామవికారంబు ♦ గనుచు నుండఁ, గామినీమణి లావణ్య♦ఖనిని నిలను.

క. కని నవ్వుచు నిట్లనియెన్, వినుమో సుచిరంపు మోము ♦ వెలసెను లేమా!
వనజారి చంద్రుఁ డనఁగా, వినియుందువు గాదె యెఱుఁగు ♦ విధునకతనికిన్.

క. తనయుండ నేను భక్తిం, గను చూపున నన్నుఁ జూచి ♦ కాంతునిగాఁ గై
కొనుము వరారోహా! యన, విని నిర్జరవనమునందు ♦ విగతసఖియునై. ౫

---

1 విద్యా మావర్తనీం పుణ్యా మావర్తయత స ద్విజః-అనిమూ. 2 కథయామాస ధర్మాత్మా అనిమూ.

తే. ఒంటి నుండుట నాయిళ ♦ యురుతరాంగి
కాంతిఁ జెలువారు చంద్రుని♦కమ్రసుతుని
గాంచి యిట్లని పల్కె; నేఁ ♦ గామచరిని
నీకువశవర్తినిగ నైతి ♦ నెమ్మి నిపుడు. ౫ 3233

క. మనమున నను గోరితి వే, ననూనసువిలాస మసుర ♦ సర్వాసుఖములన్
గను కోర్కి రీతి ననుఁ గొని, యను నద్భుతపద్ధతిఁ దగు ♦ నావచనంబున్. ౬

చ. విని మది హర్ష మంది ముని♦వృత్రహరుండగు సోమనందనుం
డనుపమ కేళిలోలుఁడయి ♦ యాయిళఁ గూడి సుఖించె; మాధవా
ఖ్యనుదగు మాస మొండు తమి ♦ నాననితానుఖయుక్తి నున్న యా
తనికి క్షణంబుగాఁ గడచెఁ ♦ దద్దయుఁ గాముకుఁడై చెలంగుటన్. ౮ 3235

సీ. అంత మాసం బొక్కఁ ♦ డారీతిఁ గడచిన నాయిళుండును బూర్ణుఁ♦డైనచంద్రు
ననుకరించెడు నాస్య ♦ మలరారఁ బురుషుఁడై శయనంబునుండియు♦ చక్క లేచి
శశినందనుని జలా♦శయమందుఁ దపమును సలుపుచుఁ బైకి హ♦స్తంబు లెత్తి
యాలంబనము లేక♦యలరారఁ దాఁ గాంచియిలుఁ డిట్లు గాఁ బల్కె ♦ నెలమితోఁప;

తే. మునివరా! దుర్గమంబగు ♦ భూధరంబుఁ
జొచ్చితిని సేవకులతోడఁ ♦ జూడఁ బడరు
నాదుసేవకు లెం దేగి♦నారొ? చెపుము
యనఁగ నష్టసంజ్ఞుండగు ♦ నతనిపలుకు. ౧౧ 3236

క. విని చంద్రనందనుఁడు చక్కని వాక్కున నూఱడిలెడు♦గతి శుభరీతిన్
వినిపించె నిట్లు లోనృప!, యనుచరుల న్ఱాలవాన ♦ యంతముఁ గూర్చెన్.

తే. ఆశ్రమంబున నిందు నీ ♦ వతులవాత
సాధ్వసార్తుఁడవై యుండి ♦ శయనమందు
తివి గదా; యూఱడిల్లుము ♦ "తేఽస్తు భద్ర
మన్వహ" మ్మంచుఁ బల్కె యి♦ట్లనియె మరల. ౧౩ 3238

క. మనమున భీతిం బొందకు, మనఘా! విగతజ్వరుండ♦వై ఫలమూలా
శనమున యథాసుఖంబుగ, వనమున నిట నుండవయ్య ♦ వసుధాధిపతీ!. ౧౪

చ. అన విని యామహీపతి స♦మాశ్వసితుండయి సేవకుల్ మృతిం
గనుటను దీనుఁడై యతనిఁ ♦ గాంచి వచించెఁ; దృజింతు రాజ్య మే
ననుచరు లెల్లఁ జావ క్షణ ♦ మైన వసింపను రాజనామముం
గని భగవంత! యాజ్ఞ యిడఁ♦గాఁ దగు నర్హుఁడ నేను దానికిన్. ౧౬ 3240

క. తనయుఁడు జ్యేష్ఠుఁడు మానీ!, యనఘుఁడు సుయశుండు నాకు♦నలరునతం డే
పున నాదురాజ్య మేలును, ఘనుఁడై శశిబిందు వనఁగఁ ♦ గ్రాలెడుఁ జువ్మీ.

* అహం కామచరీ సౌమ్య-అనిమా.

తే. నాదు రాజ్యమ్మునన్ వగ ♦ వేది భృత్య, దార లెల్లను జెలువార ♦ భూరితేజ!
వారి విడనాడి యిందుండఁ ♦ గోరవలవ, దంచుఁ బల్కుకుమయ్యమ ♦ హాత్మ! నీవు.

చ. అని యిటు రామచంద్రుఁ డన ♦ నాశశిపుత్త్రకుఁ డద్భుతోక్తులా
య్యన విని సాంత్వపూర్వముగ ♦ నాతని కిట్లను; నిందు వాసమున్
జను నివసింప నూల్కొనుము ♦ క్ష్మాపరిపాలక! శార్దమేయ! నీ
మనమునఁ దాపముం గనకు ♦ మానధనుండవు గాన నొప్పనా. ౧౯ 3243

తే. ఒక్కసంవత్సరంబె యిం ♦ దుండు మంత
హితము నీ కొనరింతు నా ♦ నృపుఁడు బుధుని
నొరులకుం గష్టములఁ గూర్చు ♦ చున్న కర్మ
ముల నొనర్పనివానిగాఁ ♦ దెలిసి యాత్మ. ౨౦ 3244

తే. అతనిపలుకుల నాలించి ♦ యాతపస్వి
పల్కినట్టులె యావని ♦ వాసమొప్పఁ
జేయఁగా నూలుకొనియెను ♦ స్త్రీత్వ మొంది
నట్టిమాసంబు సుఖయించు ♦ నతనిఁ గూడి. ౨౧ 3245

క. పురుషత నొందినమాసము, ధరణీశుఁడు ధర్మమార్గ ♦ తత్పరుఁ డగుచున్
జరపున్ గాలము నిటు లా, ధరణిన్ నివసించి చంద్ర ♦ తనయునివలనన్. ౨౨

తే. నవమమాసంబునందుఁ ద ♦ నయునిఁ గనియెఁ
జారుసుశ్రోణి యాయిలా ♦ జని యతండు
పొల్చెను బురూరవసుఁడనఁ ♦ బుట్టినంత
నిళయు భర్తృహస్తంబున ♦ నెలమి నతని. ౨౩ 3247

క. *ఉనిచెను బుధసమవర్ణుఁడు, ఘనబలుఁ డాతనయుఁ డలరె ♦ గాంతినిబుధుఁడా
తనయుని గాంచుచుఁ దృప్తిం, గని పురుషీభూతుఁడైన ♦ క్ష్మాపతి నిలునిన్.

ఆ. వత్సరాంతరమయి ♦ భాసిల్లు నాశిష్ట, మాసమతుల ధర్మ ♦ సహితకథల
నాత్మవేత్తగాన ♦ నలరించుచుండెను, జింతలెల్లఁ బాయఁ ♦ జిత్తమలర. ౨౫

ఎనుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౯౦ - వ సర్గము.

ఇలుఁ డశ్వమేధము చేసి యీశ్వరానుగ్రహమున శాపమోక్షము నొందుట.

చ. అని రఘురాముఁ డద్భుతర ♦ సావహమై తగు గాథఁ దెల్పినన్
విని గురుకీర్తిఁ గన్న రఘు ♦ వీరుఁడు కేకయరాజపుత్త్రికా
తనయుఁడు లక్ష్మణుండు ప్రమ ♦ దంబున నిట్లని పల్కె; రాశశాం
కుని సుతుఁ డిట్టులాయిళను ♦ గోరిక వర్ష మొకండు మెల్లఁగన్. ౧ 3250

* బుధ స్తు పురుషీభూతం స వై సంవత్సరాంతరం-అనిమూ.

క. జరపిన యనంతరం బే,కరణిం గథ చెల్లెఁ జెప్పఁ♦గాఁ దగుఁ దత్త్వం
బరసి యనఘ మధురోక్తులఁ, బరమోదం బలరఁ దన్నుఁ♦బ్రశ్నింపంగన్. ౨౫

క. విని యలరి వారి కిట్లని, వినిపించెం గర్దమాఖ్య♦విమలాత్మునిపు
త్రునిగాథ; నిట్లు పురుషతఁ, గనినట్టి యిలాఖ్యు శూర♦గణనుతుఁ గనుచున్.

చ. నిరుపమబుద్ధిసంపదయు ♦ నిర్భరశక్తియుఁ గల్గు నాబుధుం
డురుతరకీర్తిశాలియయి ♦ యొప్పుట నానృపుశాపముక్తి నే
కరణి నొనర్పనౌ ననుచుఁ ♦ గ్రమ్మఱ నెంచి మహాత్ములౌ మునీ
శ్వరులను రాఁగఁ బంచె వర♦శక్తియుతాత్ముల యోగశాలురన్. ౮ 3253

సీ. సంవర్తనామకుఁ ♦ జ్యవనుని భృగుపుత్త్రు నవఘు నరిష్టనే♦మినిఁ బ్రమోద
నాహ్వయు దుర్వాసు ♦ నఖిలవేత్తల నారిఁ బిలిపించి వాక్యరీ♦తుల నెఱుంగు
బుధుఁడు మిత్త్రుల ముని♦పుంగవులం గాంచి వచియించె నీరీతి; ♦ వసుమతీశు
డీగురుబాహు వీ♦యిళుఁడు కర్దమసుతుం డని మీరెఱుంగుడు ♦ రట్టి లౌట

తే. నితని కే పరితాపం బ♦హీనతరము, కలిగె నద్దానిఁ దొలఁగించి ♦ కన్ప్రయశము
కలుగునట్టులు గావింపఁ♦గాఁ దగు నన, వార లేమియొపల్కు న♦వసరమందు.

క. అరుదెంచెఁ గర్దమమునీ,శ్వరుఁ డచటికిఁ దేజములర ♦ సమహావిప్రో
త్కరుఁడై యాతని వెన్కని, యరుదెంచినవారిని వినుఁ ♦ డతిశుభమలరన్.

తే. క్రతువుల స్త్ర్యవషట్కారు ♦ లతుల తేజుఁ
డైన యోంకారమానియు ♦ నరుగుదెంచి;
రంత వారెల్ల నిత రేత♦రాభిదర్శ
నమున సంహృష్టులై మహీ♦నాథుఁ గూర్చి. ౯౫ 3256

క. హితకాములు గావున నే, వితమున నీశాపముక్తి ♦ వెలయు ననుచుఁ బ
ల్కుతఱిని గర్దమమునిపతి, సుతునకు శ్రేయస్సు గోరి ♦ శుంభద్భణితిన్. ౧౦౫

క. మునివరులారా! నానుడి, వినుఁడీ! యీపార్థివునకు ♦ విశతశ్రేయ
స్సును గూర్చి పలుకువాఁడను, ఘనభైషజ్యంబు వేఱు ♦ గనఁబడ దెదియున్

చ. పరముఁడు శంకరుండు సుర♦పాలకుఁ డావృషభధ్వజుండె భూ
వరునకు మందుగాఁ దగిన♦వాఁడు తురంగమమేధ మొక్కఁ డీ
తరుణమునందుఁ జక్కనిది ♦ దానిని వీడిన నన్యమైన య
ధ్వరము ప్రియంబుగాదు వృష♦భధ్వజు నాతనిఁ దృప్తుఁ జేయఁగన్. ౧౨

సీ. మనమందఱముఁ గూడి ♦ మఖవరం బద్దాని దుస్తరవ్రతముఁ బ్ర♦శస్తతరముఁ
బార్థివుహితముఁ గూ♦ర్పంగ యజింతము; నా విని యెల్లభూ♦దేవమాను
లతని కిట్లని పల్కి ♦ రశ్వమేధంబున నీశు నారాధింత ♦ మిది తగినది
సంవర్తుఁడను మునీ♦శ్వరుశిష్యుఁ డరిపురంజయుఁడు మరుత్తనఁ ♦ జను మునిపతి

తే. యశ్వమేధాధ్వరంబున ♦ నభవుఁ దృప్తి
నొందునట్లుగఁ జేయించె ♦ నుద్యమమున
నధ్వరం బది బుధునిదౌ ♦ నాశ్రమంబు
చెంతఁ జక్కఁగ సాగె వి♦చిత్రరీతి. ౧౫ 3260

క. హరుఁ డాయధ్వరవరమునఁ, బరమప్రమదంబు నొంది ♦ భవ్యయశంబుల్
ధరణిన్ వెలయింపఁగ న,ధ్వర మది సంపూర్ణమైనఁ ♦ దా హృష్టుండై. ౧౬

క. చనుదెంచి యిలునిసన్నిధి, మునిపతులం గాంచి యజ్ఞ♦మున దీసం దృ
ప్తిని బొందినాఁడ మీభ, క్తిని మెచ్చితి బ్రహ్మమునిత♦తి ప్రియ మింకన్. ౧౭

క. ఒసరింపఁ దగును నిత్తఁజే, జనవిభునకు శుభముఁ బ్రియముఁ♦జనఁగద చేయం
గను గోరుఁ డనఁగ నామునిఘను, లెల్ల మహేశునూక్తి♦గణముల్ వినుచున్.

తే. పలికి రెంతయు శ్రద్ధచే ♦ నిలుఁ డితండు
పురుషుఁడయియే ప్రవర్తిల్ల ♦ భూతనాథ
కరుణనీయంగఁ దగు నిదె ♦ వర మటన్నఁ
బ్రీతి నద్దాని నొసఁగె నా ♦ పృథ్వీపతికి. ౧౯ 3264

క. వర మిట్టు లొసఁగి యాశం,కరుఁ డంతర్ధాన మొందె ♦ గాఢరుచుల్ భూ
సురులకుఁ గన్పడకుండఁగ, హరుఁ డేగఁగ నధ్వరంబు ♦ సాంతంబైనన్. ౨౦

క. వరయోగదృష్టిగల యా, వరవిప్రులు వచ్చినట్టి ♦ భంగిం దగఁ బో
యిరి రాజు బాహ్లికంబును, నరగున విడనాడి మధ్య♦జనపదమందున్.  ౨౧

క. అనుపమసుఖదం బని యెం,చి నివాసము చేసెఁ గీర్తి ♦ చెలువారఁగఁ బ
త్తనముఁ బ్రతిష్ఠానాహ్వయ,మును గట్టఁగఁ బంచి మంత్రి♦ముఖ్యులతోడన్.

ఉ. తాను వసించె బాహ్లిపుర♦తల్లజమందు మహారినూదనుం
డైన ధరిత్రినాయకుఁ డ♦హార్యుఁడునౌ శశిబిందునాముకుం
డానతభూపతిప్రకరుఁ ♦ డాదృతిమై నివసించె; నాప్రతి
ష్ఠానమునం దిలుండను ప్ర♦జాపతిపుత్త్రుఁడు దోర్బలంబునన్. ౨౨ 3268

ఉ. ధారణిపాలనంబుఁ గుల♦ధర్మము లేవియుఁ దప్పకుండఁగాఁ
జారుతరంబుగా జరపె ♦ సంతతధర్మరతుండు గాన నా
భూరమణుండు కాలమునఁ ♦ బూజ్యతరంబు నను త్తమంబునౌ
సారససంభవామలవి♦శాలపదంబును బొందె నంతటన్;. ౨౩ 3269

తే. ఇలునిసుతుఁడౌ పురూరవ ♦ సెలమి మిగుల
నాప్రతిష్ఠానపత్తనం ♦ బట్లె యేలెఁ;
బురుషసత్తములార! యా♦తురగమేధ
మహిమ మిట్టిది యనుచు మా♦మది నెఱుఁగుఁడు. ౨౪ 3270

క. తరుణీభూతుండగు భూ,వరుఁడయ్యెను బురుషుఁడుగను ♦ వసుధాస్థలి న
ధ్వర మిద్ది యాచరింపఁగఁ, బరమార్థము గల్గునంచు ♦ వర్ణించు శ్రుతుల్.

తొంబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౯౧ - వ సర్గము.

అశ్వమునకు వలయుపరికరముల నిర్మింప లక్ష్మణునకు రాముఁ డాజ్ఞయిచ్చుట.

చ. అని యిటు రామచంద్రుఁడు సు♦హృత్తరతేజుఁడు పల్కి లక్ష్మణుం
గని వచియించె ధర్మయుతిఁ ♦ గాంచినపల్కుల; నవ్వసిష్ఠవా
మని ఘను వామదేవుని స♦నిందచరిత్రుని గాశ్యపాఖ్యుఁ దో
డ్కొని యిట కేగుదెమ్ము మఱి ♦ క్షోణిసురర్షిని దివ్యతేజునిన్. ౧౪ 3272

సీ. జాబాలినిన్ ద్విజ♦సత్తములన్ హయమేధంబుఁ జేయింప ♦ మిగులశక్తి
గలవారిఁ దోడ్కొని ♦ కడువడి రమ్ము; వారలతోడఁ దలపోసి ♦ రమ్యలక్ష
ణాభిరామము యజ్ఞ♦హయమును శ్రద్ధతో విడిచెద నంచన్న ♦ వినుచునలఘు
విక్రముండగు రఘు♦వీరుని తమ్ముఁడు లక్ష్మణుం డరిగి యి♦లాదివిజులఁ.

తే. దోడుకొని వచ్చి రాఘవు♦తోడఁ దెల్పె;
భూసురుల్ దేవసన్నిభుఁ ♦ బూంతమతిని
బాదవందనధన్యుఁడై ♦ పరఁగువాని
వైరిదుస్సాధ్యవిక్రము ♦ శ్రీరఘువరు. ౫ 3273

క. దీవించిరి; ప్రాంజలియై, భూవిభుఁ డాద్విజులఁ జూచి ♦ పొంగుచు మదిలోఁ
బావనహయమేధముఁ దాఁ, గావించుకుతూహలమును ♦ గాంచి వచించెన్. ౬

శా. శ్రీరామోక్తుల నాలకించి గిరిశున్ ♦ శ్రీకంఠునిన్ వేడి యిం
పారన్ దత్క్రతువర్యముం బొగడి చే♦యన్ శ్రేయముల్ గల్గు నా
గారీశుండు ప్రసన్నుఁ డౌనను చు ని♦శ్చ౦బున్ వచింపంగ గం
భీరార్థంబగు వారివాక్కు విని యా♦పృథ్వీశుఁ డత్యాదృతిన్. ౭౪ 3275

తే. తురగమేధంబు చేయంగఁ ♦ దోఁచు శుభము
లనుట కెంతయు నానంద ♦ మంది వారి
యనుమతిం బొంది సౌమిత్రి ♦ కనియె; నీవు
త్వరగ సాధుసుగ్రీవు ను♦దాత్తమతిని. ౮౪ 3276

క. క్రతుకార్యము చేయింపఁగ, జతనంబుగ రమ్మటంచు ♦ జంఘాలుర వే
గ తగం బంపుము వానర,వితతులతోఁ గూడి మఖము♦వేడుకఁ జూడన్. ౯౪

క. కృతనిశ్చయులై కపులను, హితులను జతగూడి రమ్ము ♦ తృప్తిగ దీనిన్
గ్రతువర్యము చూడం దగు, వితతసహాయంబు నాకు ♦ వెలయున్ నీతోన్.

సీ. భద్రంబు నీకగుఁ ♦ బరమముదంబున [నంగదు గంధవ♦హాత్మజన్ము
నలుని నీలునిని శా♦టలుని గవాక్షుని గజుఁ బనసుని నింకఁ ♦ గలుగుహరులఁ

బిలువుము నే వారిఁ ♦ బిలిచినయట్లుగాఁ గొండముచ్చులలోన ♦ దండిమగఁడు
సాహసంబునుగల్గి ♦ చతురుఁడై నగవాతఁడు భల్లుకేశునిధూమ్రు♦బలముతోడఁ

తే. బిలువుమా జాంబవంతుని ♦ విక్రమాఢ్యుఁ
బిలువు మాద్వివిద యూథేంద్రు ♦ వినతుఁ గేస
రిని గవయు దధివక్త్రుని ♦ వినయమహితుఁ
నరయ మనకార్యములయందె ♦ నమరువాని. ౧౩ 3279

తే. వీరు శతబలి మైందద్వి♦విదుల గంధ
మాదనుని వీరబాహుఁడై ♦ మాన్యుఁడునగు
నాసుబాహుని నింకను ♦ నచటఁ గలుగు
కపులఁ బిల్వుము హయమేధ♦కంబుఁ జూడ.] ౧౪ 3280

క. దనుజులను గామచరులను, గొనుచు విభీషణుఁడు రాఁగఁ ♦ గోరితి యజ్ఞం
బును జూచి విక్రమంబున, ననుపమరీతిఁ సహాయ ♦ మాద్రుతిఁ జేయన్. ౧౫

క. ధరణీశులు మహితులు న,ధ్వర కాంక్షులు సానుచరవి♦తానులు నగుచున్
వరనవమును జూడఁగ వత్తురు గాక ముదిచ్చుఁ దీర్చుఁ ♦ దోడన ప్రీతిన్. ౧౬

తే. ధర్మమున శ్రద్ధ గలిగిన ♦ ధరణిదివిజ
వరుల దేశాంతరస్థితి ♦ వఱలువారి
నశ్వమేధము చూడంగ ♦ నాదరమునఁ
బిలువుమా లక్ష్మణా! నాకుఁ ♦ బ్రియముఁ గోరి. ౧౭ 3283

క. మునుల మహాత్ముల సుతపో,ధనులను బిల్వంగఁ దగును ♦ [ధాతృపదమునం
దును స్వర్గమందు నివసిం,చిన మానులఁ గశ్యపాది ♦ సిద్ధర్షులతోన్. ౧౮

క. దారలతో శిష్యులతోఁ, గోరికఁ దీర్పంగ రాఁగఁ ♦ గోరితి నని య
వ్వారిం బిలుపింపుము యే,ధారణి నుండినను రాఁగఁ ♦ దగు మానివరుల్. ౧౯

చ. శ్రుతులఁ బఠించి శాస్త్రముల♦చొప్పు నెఱింగినవారి శిష్టన
మ్మతిగను బల్కువారి సుమహా♦మం దనరారినవారిఁ బిల్వుమా
హితవిధి సిద్ధసాధ్యుల న♦హీనతపస్స్థిగులైనవారి నీ
క్రతుపరదర్శనార్థము ని♦కామముదంబునఁ బిల్వు లక్ష్మణా!. ౨౦ 3286

తే. న్యాయమీమాంసవేత్తల ♦ వ్యాకరణవి
దులను బిల్వుము]; సూత్రధా♦రుల నటులను
నర్తకులఁ బగిహాసక♦నాయకులను
బిలువుమా యజ్ఞమునయందుఁ ♦ బ్రీతి నింప. ౨౧ 3287

సీ. గోమతీనగనదీ♦కూలంబునందున్న నైమిశమునందు వ♦నంబునందు
యజ్ఞవాటముఁ గట్టి ♦ నగు లక్ష్మణా! యద్ది పరమపావనతపో♦వనము సుమ్ము
శాంతికర్మంబులు ♦ చక్కఁగా నొనరింపఁ దగు నెల్లెడల నంచు ♦ ధరణిదివిజ
వరులకుఁ దెలువుమా ♦ నిరతంబు వందలకొలఁది ధర్మజ్ఞులై ♦ చెలఁగుమునులు

తే. పరమపావనమైన య♦ధ్వరము నీని, ననుభవింతురు గాక యా♦వవమునందుఁ
దుష్టిఁ బుష్టిని బొంది య♦థేష్టముగను,గారవం బంది వచ్చిన♦వార లెల్ల. ౨౪
క. చనుదురు గాక పురంబుల;, కననూయులు నగుచు ధర్మ ♦ మాస్మృతిని నెఱిం
గినవాఁడ వౌట జనముల, మన సులరం జేయునట్టి ♦ మాడ్కిఁ బిలువుమా
ఆ. బలిసినట్టి లక్ష♦వరవృషభంబులు, తండులములు మోయఁ ♦ దగి వెలువడ
వలయుఁ దిలలు ముద్గ♦ములు మోసికొనిపది, వేలవృషభములును♦లీలమెఱయ.
క. చనవలయు ముందు నులవలు, మినుములు చణకములు నుప్పు♦మించినగతిఁ గై
కొని గోనెలెద్దు లేగం, జనవలయుఁ ముందు ముందు ♦ శత్రుబలహరా!.
క. కనకంపునాణెములు వెండి నాణెములు చక్కఁ జూచి ♦ నేర్పున నొకకో
టిని నూఱుకోటులను గొని, చనవలయుఁ భరతుఁ డచటి ♦ సవనస్థలికిన్.
తే. త్రోవ నడుమను బణ్యవీ♦థుల ననుర్వఁ
దగును నటన ర్తకులు నుండఁ ♦ దగును వంట
చేయువారును బ్రౌఢలౌ ♦ స్త్రీలు మెఱఁగ
వలయు నల్లేర్పఱింపుమా ♦ సులలితముగ. ౨౯ 3293
చ. భరతునితోడ సైన్యములు ♦ పౌరులు పల్లియందు నున్న స
త్పురుషులు బ్రాహ్మణోత్తములు ♦ పోవలయుఁ భయభక్తులొప్ప కిం
కరులును గోశపాలకులు ♦ కమ్మరి కొయ్యలు చెక్కువాఁడు న
త్వరగతి గుంపుగా మునుపె ♦ ధర్మముతప్పక పోవఁగాఁ దగున్. ౩౦ 3294
క. జననులు నాదుసహోదర, వనితలు *హాటకతనుత్వ♦భానురయగు నా
వనితయు దీక్షానిరతిం, గనుపండితు లరుగఁ దగును♦గా భరతునితోన్. ౩౧
ఆ. వీరి నెల్ల ముందుఁ♦ జేగుప భరతుండు, పృథుయశుండు నాకుఁ ♦ బ్రీతిదుండు
చనును గాక రాజ♦సమితికిఁ దగుగేహ,ములు నొసర్పఁ దగుచు ♦ వలసినట్లు.
క. జనపతులసేవకులకున్, జనుఁ దగు గేహాళిఁ గట్టఁ ♦ జక్కఁగ నని యా
జనకకుమారీనాథుఁడు, పనిచెన్ సోదరుల కెల్లఁ ♦ బరమప్రీతిన్. ౩౩ 3297

తొంబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౯౨ - వ సర్గము.

శ్రీరాముఁ డశ్వమేధము చేయఁ బూనుట.

క. భరతాగ్రజుఁ డీరీతిగఁ, బరికరముల నెల్ల సిద్ధ♦పఱుపఁ బనిచి న
త్తురగమును గృష్ణవర్ణము, పరఁగఁగ సల్లక్షణముల ♦ భాసిలుదానిన్. ౧
క. ధరణిఁ బ్రదక్షిణ మొనరుప, ధరణీశుఁడు విడిచి యశ్వ♦తంత్రంబున సో

* కాంచనీం మమ పత్నీం చ-అనిమూ.

దగు లక్ష్మణు బుత్విగ్గణ,పరివృతునిం బంపి యజ్ఞ♦వాటంబునకున్. ౨ 3299

చ. చని గురుబాహు వానృపుఁడు ♦ చాలఁగ నచ్చెరువైన దానినిం
గనుఁగొని హర్షముం గనియెఁ ♦ గమ్రగుణాఢ్యుఁడు ధర్మరక్షకుం
డనఘుఁడు రామచంద్రుఁ డల ♦ యధ్వరకృత్యము నందు నైమిశం
బున వసియింపఁగాఁ దమిని ♦ భూపతు లెల్లను వచ్చి యచ్చటన్. ౩౫ 3300

తే. కానికల నిచ్చి కొల్వంగ ♦ మానినుతుఁడు
చక్కఁగా వారిఁ బూజించి ♦ సకలవిధము
లైన పరికరములతోడ ♦ నలరుపటగృ
హముల వారల నివసింప ♦ ననువు పఱచె. ౪౫ 3301

క. అనుచరులతోడ భూపతు, లనూనపటవేశ్మములను ♦ హాయిగ నుండన్
జనపతి వారల కన్నం,బును వస్త్రము లఖిలవస్తు♦వులఁ బానములన్. ౫౫

క. భరతుఁడు శత్రుఘ్నుండును, బరమాదృతి వారి కీయఁ ♦ బంచిన నటుచే
సిరి వారు భక్తి ప్రీతియుఁ, గరము విరాజిల్లు నట్లు♦గా సత్కృతులన్. ౬ 3303

చ. ఘనమతులైన కీశులు వి♦కర్తనపుత్రునితోడఁ గూడి రా
మునిదగు శాసనంబుఁ గొని ♦ భూసురవర్యులకున్ నమస్కృతుల్
పొనరిచి వారిరక్షణముఁ ♦ బూనఁగ; నంత విభీషణుండునున్
దనుజనికాయయుక్తుఁడయి ♦ దారుణ తేజులుగాఁ జెలంగుచున్. ౭౫ 3304

క. గురుతపములఁ జేసిన భూ,సురమానుల కెల్లఁ దాఁ గు♦సుమహారములన్
నిరతముఁ బూజించుచు న,ధ్వరవాటమునందు నుండెఁ ♦ దత్సుయమునన్.

సీ. ఈరీతి నాయజ్ఞ ♦ మేకవిధంబున విహితచర్యలఁ గూడి ♦ వెలయుచుండె;
హాయచర్య సౌమిత్రి ♦ యభిరక్షణంబున నభ్యంతరము లేక ♦ యనుదినంబు
జరగుచుండెను; రాజ♦సత్తముఁడౌ గాము నత్యుత్తమంబగు ♦ నధ్వరంబు
నపగతవిఘ్నమై ♦ యతిశయిల్లుచునుండ నన్యశబ్దంబె యా ♦ హాయమఖమున
తే. వినఁగఁబడకుండె; స్వేచ్ఛగా ♦ జనులు మాకు
నిమ్ము మిమ్మని వేఁడ వా ♦ రెట్లు తృప్తిఁ
గనుదురో యట్లె యిచ్చుచుఁ ♦ గరుణమీఱ
వారి నరయుచునుండి రా♦భరతముఖులు. ౧౦౫ 3306

క. *బెల్లముతోఁ జేయంబడి, యుల్లంబున కింపుఁ గూర్చు♦చున్న వివిధరీ
తుల్యల్లసితభక్ష్యములనే, కొల్లలుగా నిచ్చుచుండ ♦ క్షోణీదివిజుల్. ౧౧ 3307

క. పరమానందముఁగనుచుం, డిరి; యాచకు లెట్టితఱిని ♦ నెమ్మి తనర నీ
వరవస్తువు కావలె నని, పరమాదృతి నడుగువారో ♦ పలు కది వెడలన్. ౧౧౫

తే. క్షణముగాని యాలస్యంబు ♦ జరగకుండ
వనచరులు దానవులు కోర్కి ♦ వస్తువులును

* వివిధానిచ భక్ష్యాణి గౌడాని మధురాణిచ-అనిమూ.

వాని నొసఁగుచు నుండి ర♦ధ్వరమునందు
నందు మలినుండు దీనుండు ♦ నాతురుండు. ౧౨౻ 3309

క. ధనహీనుండును వెదకినఁ, గనరాకయె యుండె; హర్ష♦కలితజనులు గ
ల్గిన రామునియాయజ్ఞం, బనూనవిధి సాగె ననసు♦మై యాతతిని౯. ౧౩ 3310

సీ. స్థిరజీవులై మహా♦త్తరబుద్ధిమంతులై చెలఁగుమహాత్ములు ♦ చిత్రరీతి
సాగునాయజ్ఞంబు ♦ చక్కఁగఁ గన్గొని మున్నెప్డు డీయజ్ఞ♦మునకు సాటి
యగునశ్వమేధంబు ♦ నవని సాగఁగలేదు నిశ్చయం బని పల్కి ♦ నెమ్మి నందె
యుండిరి; కనకంబు ♦ నొందఁగాఁ గోరిన నది యబ్బు, విత్తార్థి♦యైన ధనము

తే. దొరకు, రత్నార్థియైనచో ♦ వరమణులను
బొందు, రజతంబు గోరిన ♦ నొందు దాని,
నద్మములు వేఁడ నయ్యె వా♦క్షణమునందె
పొందు, వస్త్రమ్ము లడిగినఁ ♦ జెందు వాని. ౧౪౻ 3311

క. అనిశం బిచ్చుటకై పో,సినవస్తుప్రతతి గొప్ప ♦ శిఖరివలెం గా
ననగు౯; సురనాథాంతక,ధనదాపోనాథయజ్ఞ♦తతుల౯ గనమే?. ౧౬౻ 3312

తే. దీని కవ్వి సమాన మే♦తీఱున నగు?,నంచు మానులుదలఁచిరి;♦హరులు దనుజు
లర్థులకు వస్త్రధనముల ♦ నన్నమును న,గంగసంపూర్ణహస్తులై ♦పొంగు వేడ్క.

క. మన మలర నొసఁగుచుండిరి;, జనపాలకసింహుఁ డగుచు ♦ శత్రుభయదుఁడై
వినుతగుణాకరుఁడగు రా,మునియజ్ఞ మ్మొక్కవర్ష♦ముగఁ గొనసాగె౯. ౧౯

తొంబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౯౩ - వ సర్గము.

{ కుశలవులతో వాల్మీకి యశ్వమేధముఁ జూడఁ బోయి వారిచే రామాయణమును బాడించుట. }

చ. జనపతిపుంగవుండు రఘు♦సత్తముఁ డీకరణి౯ మహాద్భుతం
బనుపమ ముత్తమంబునగు ♦ నధ్వర మాదృతిఁ జేయుచుండ శి
ష్యనికరసేవితుండు ముని♦సత్తముఁ డాదికవీంద్రుఁ డద్ది చూ
చు నెలమి వచ్చె; దివ్యమయి ♦ చూపఁగ నద్భుతమైనదానిని౯. ౧౻ 3315

క. కనుఁగొని వాల్మీకియు నె,మ్మనమున నానంద మంది ♦ మఖవాటముచెం
తను బర్ణశాల నిర్మిం,చెను శిష్యులతోడ నటవ♦సించెను వేడ్క౯. ౨ 3316

చ. పరమమునీంద్రుఁ డచ్చటనె ♦ బ్రాహ్మణమానిగణావృతుండనై
ధరణిపపూజితుండునయి ♦ తా వసియింపఁగ రాజపుత్రకుల్
త్వరపడి యన్నమూలఫల♦వైభవయుక్తములైన బండ్ల ని
ల్పిరి మునివాసమందు; ముని♦పేరుఁడు మంజులతేజుఁ డాదృతి౯. ౩౻ 3317

ఆ. ఆత్మవేత్త యాట ♦ నలరారు మనమున, నట వసించి తనదు ♦ నంతికమున
నున్న శిష్యయుగము ♦ నెన్ని మాఱులు పోయి, శ్రద్ధ వెలయ మౌని ♦ సభలయందు.

క. శ్రీరామాయణ మెల్లను, జారుతరంబైన ఫక్కిఁ ♦ జక్కఁగఁ బాడుం
డా రూఢమోదమున నని, వారిరువురఁ గాంచి మౌని ♦ వర్యుఁడు మఱియున్.

క. పరిశుద్ధభూమి దివిజో, త్కరవాసములందు నృపప ♦ థములందు మహీ
శ్వరవసతుల రథ్యల రఘు, వరభవనద్వారమందుఁ ♦ బాడఁగవలయున్. ౬

సీ. యజ్ఞక్రియల్ దగు ♦ నట్టితావులయందు ఋత్విజుల్ తగ విచా ♦ రించుపట్ల
గేయ మియ్యది చాల ♦ గేయమై తగునట్లు పాడుఁడీ చక్కని ♦ భంగి మెఱయ;
వత్సలారా! గిరి ♦ వరమందు జనియించి స్వాదుతరంబులై ♦ బహుళములయి
వెలయు నీపరిపక్వ ♦ ఫలముల భక్షించి గాన మొనర్పుఁ డే ♦ కరణినైన

తే. [1]శ్రమముఁ బొందకుఁడీ; మూల ♦ సమితి ఫలము
లను గడుం దిని బాహ్యస్థ ♦ లంబునఁ దగు
మన యుటజముననే యుండి ♦ చని పఠింపు
చుండుఁడీ భూమిపాలకుఁ ♦ డొప్పమీఱ. ౯ 3321

క. వినఁగోరి కూరుచుండిన, మునులుం గూర్చుండి వినఁగ ♦ ముదముం గనినన్
వినిపింపుఁ డీకథామృత, మును నిరువది సంఖ్యసర్గ ♦ ములు దినమందున్. ౧౦

తే. మధురవాక్కులతోడఁ బ్ర ♦ మాణబహుళ, సన్నిబద్ధంబుగా నేను ♦ మున్ను చెప్పి
నట్లుగాఁ బాడుఁడీ [2]సుంత ♦ యైన నర్థ, కాంక్షమదిఁ జొన్పకుండుఁ డే ♦ కరణినైన.

క. ఫలముల మూలంబుల ని, మ్ములఁ గాలముఁ గడపునట్టి ♦ మునులకు ద్రవ్యం
బుల నేమి ఫలము? రాముం, డెలమిని మీ రెవరిపుత్రు ♦ లేర్పడఁ జెపుఁడీ.

క. అని యడిగినచోఁ దెల్పుఁడు, ముని కీకృతికర్త కేము ♦ ముఖ్యాంతేవా
సినియుతపదవాచ్యుల మని; జనపతి దైవంబు చుండి ♦ సకలజనులకున్. ౧౩

సీ. ఇవియె మనోజ్ఞంబు ♦ లవు తంత్రు లివ్వాని మున్నెన్నఁడున్ విన ♦ కున్నయట్లు
చక్కని స్థాయిని ♦ సమకూర్చి మృదులమౌ, నాదసంవ్యాప్తి నొం ♦ దంగఁ జేసి
సాధ్వసలజ్జ లే ♦ చందంబునం బొంద కలరి సంక్షేపరా ♦ మాయణాది
గా సమగ్రంబగు ♦ గ్రంథంబుఁ బాడుఁడీ యితరస్థలంబుల ♦ నెట్టులుందు

తే. రట్టు లుండక జనపతి ♦ యంతికమునఁ
జాలమర్యాదగాఁ బాడఁ ♦ జను నతండు
తండ్రి భూతాళి కెల్లను ♦ ధర్మగీతి
నరయ నక్లాట మీ రిర్వు ♦ రాదరమున. ౧౪ 3326

---

1 న యాస్యథ శ్రమం వత్సౌ భక్షయిత్వా ఫలాని వై-అనిమూ. 2 లోభ శ్చాపి న కర్తవ్య స్స్వల్పోఽపి ధనకాంక్షయా-అనిమూ.

క. రేవటిప్రభాత మాదిగ, నేపట్టుననేని శ్రద్ధ♦యే యాంతగ నా
భూపాలునికథఁ బాడుం, డేపద్ధతి నే వచింప ♦ నెలమి వినితిరో. ౧౭ 3327

తే. అట్లు తంత్రీలయాన్వితం♦బై మనోజ్ఞ
మైన రామాయణంబు నె♦య్యమునఁ బాడుఁ
డనుచు బహుభంగులం బల్కి ♦ యామునీంద్రుఁ
డమలచిత్తుండు మౌనంబు ♦ నాశ్రయించె. ౧౮ 3328

క. జనకసుతాతనయుల నా, ముని యుపదేశించినట్లు ♦ భూపతి యజ్ఞం
బొనరించెడు చోటికిఁ జ,య్యనఁ బోయిరి; *శత్రుహరణు♦లా నాసహజుల్.

చ. చని యిటు లాసహోదరులు ♦ సన్ముని చెప్పిన కాంతమంగళం
బును నొడఁ గూర్చుభాషలను ♦ బొంకముగా వచియించి రశ్వినుల్
ఘనుఁడగు భార్గవుం డెలమి♦గాఁ దెలుపన్ గ్రహియించినట్టు లా
మునిపతివాస మందె సుఖ♦ముల్ దగ నిద్దురఁ బొందుచున్ నిశన్. ౧౯

తొంబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౯౪ - వ సర్గము.

కుశలవులు గానము చేయు రామాయణమును శ్రీరాముఁ డాకర్ణించుట.

క. తెలతెలవేగినఁ గృత్యం,బులఁ దీర్చి కుశుండు లవుఁడు ♦ పూజితసువహుతో
జ్జ్వలవహ్నియట్లు వెలుఁగుచు, నెలమిన్ మునిపంచినట్టు♦లే తద్గాథన్. ౧

క. సురుచిరగతిఁ బాడిరి; భూ,వరమౌళియుఁ బూర్వమౌని♦వరనిర్మితమై
సరసంబై పరనార్హ,స్వరసంయుతమై మనోజ్ఞ♦సరణి నెలయుచున్. ౨

ఉ. గానము చేయఁగాఁ దగి ని♦కామముదం బొనఁగూర్పఁ జాలి తం
త్రీనియతిం దనర్చి లయ♦రీతిని బొల్చి ప్రమాణబద్ధమై
మానసపద్మముం జెలఁగు♦మాడ్కి నొనర్చెదుగాథ దాని నా
మౌనిమహేంద్రుశిష్యు లను♦మానము లేకయె పాడుచుండఁగన్. ౩ 3333

క. వినియెన్ రాముఁడు చక్కఁగ, మన మానందాంబురాశి♦మగ్నం బగుటన్
జనపతి యజ్ఞాంతంబున, మునివరులం బౌరవరుల ♦ భూపతివరులన్. ౩౪ 3334

క. సరసమతులైన నూర్య,త్కరమును బౌరాణికులను ♦ జ్ఞానురవృద్ధో
త్కరమును వ్యాకరణజ్ఞుల, స్వరలక్షణవేత్తలయిన ♦ సాధుద్విజులన్. ౫

సీ. లక్షణవేత్తలై ♦ లక్షవిదుల్ గా నొప్పు గాంధర్వులం బౌర♦గణమునందుఁ
బెద్దలౌ వారలఁ ♦ దద్దయు నేర్పుచేఁ బాదాక్షరసమాస♦పద్ధతులను
జక్క నెఱింగిన ♦ చతురుల సిద్ధాంతులను క్రియాకల్పంబు♦లను దెలిసిన
వారల సాధుకా♦వ్యములందుఁ బాండితిఁ దగినవారలభాష♦తత్త్వమెఱుఁగు

* నిర్జగత్తు శరిందమా-అనియూ.

తే. వారి నింగితవేత్తలో♦వారి హేతువాదులో వారి నాచార♦పరతఁ గనిన
వారి వచనంబులందు నే♦ర్పఱులుగాఁగఁ, దనరువారిని ఛందస్సు♦తత్త్వవిదుల.

క. *పలువిధములో పురాణం, బుల నెఱిఁగినవారి వేద♦ములఁ బఠియింపఁ
గలవారిఁ జిత్రకర్మం, బుల నెఱిఁగినవారి వృత్త♦ముల సూత్రములన్. ౮

తే. చక్క నెఱిఁగిన ప్రౌఢుల ♦ శాస్త్రవిదుల, నీతివేత్తల వేదాంత♦రీతి నెఱుఁగు
పండితులఁ దత్ప్రబోధన♦పరులు నైన, జ్ఞానులన్ బిల్వఁగాఁ బంచి♦సభను జేర్చి.

క. బాలుర గాయకవరుల ను, శీలురఁ బిల్వంగఁ బంచె ♦ సిద్ధమునులు భూ
పాలురు వారలపాటల, నాలించి తదీయరూప ♦ మాదృతిఁ గనుచున్. ౧౦

క. కనులం ద్రావెడుపోలిక, జనపతినిన్ బాలకులను ♦ జక్కఁగ మఱియున్
గని యిట్లు చెప్పుకొని రొ, క్కని కొక్కరు తత్సభన్ ద♦గన్ మధురోక్తిన్.

చ. ఇరువురు వీర లీక్షితిమ♦హేంద్రుని రామునిఁ జూచినట్టులే
వరిగఁ గనుంగొనంబడుచుఁ ♦ జక్కనిరూపున నున్నవార లీ
యిరువురు సోదరుల్ జటల♦నే ధరియింపక చారువల్కలాం
బరములఁ గట్టకున్న రఘు♦వర్యుఁడు పాడిన యట్టిరీతిగన్. ౧౨ 3341

క. కనఁబడుదురు భేదం బే, మని చెప్పఁగ వచ్చు? వీరి ♦ నరయఁగ బింబం
బుననుండి బింబ ముదయిం, చినరీతిగ రామునుండి ♦ చెలఁగినరీతిన్. ౧౩

క. పరికింప నానటం చీ, వరుసను శ్రుతిహితముగాఁగఁ ♦ బల్కుచునుండన్
ఇరువురు మునిశిష్యులు రఘు, వరుగాథను దివ్యభణితిఁ ♦ బాడఁగఁ బూనన్.

క. అతిమానుషగాంధర్వం, బతిమధురం బగుచు నప్పు ♦ డలరె; నచట సం
స్థితిఁ గన్న శ్రోత లెవ్వా, రతిమానుషగానమును స♦మాదృతి వినుచున్.

క. పొందరు సంతృప్తి నదే, చందంబున; నంత మొదటి♦సర్గము మునిరా
డ్బృందారకుఁడౌ నారదుఁ, డందంబుగఁ జెప్పెఁ బూర్వ ♦ మద్దిమొదలుగన్.

తే. పాడఁ జొచ్చిరి వాల్మీకి ♦ పల్కినట్టు
లిరువదియౌ సర్గ లాదిన ♦ మెలమిఁ బూర్తి
యైన నపరాహ్ణమున రాముఁ ♦ డాదరమునఁ
బల్కె వింశతిసర్గసం♦భవముదమున. ౧౭ 3346

క. కొనుఁడీ పదునెనిమిదివే, లని లెక్కింపంగఁ బడిన ♦ హాటకముల నో
మునిశిష్యులార! యింకే, మనమునఁ గలదేని వాంఛ ♦ మానక చెపుఁడీ!.

క. అని యడిగి వీరి కిమ్మని, యనుజన్మునితోడఁ బలుక ♦ నాలక్ష్మణుఁ డా

---

* ఛందోవిదః పురాణజ్ఞాన్-అనియూ. ఇంకనుముందైదవ శ్లోకమునందు పౌరాణికాంశ్ఛబ్దవిదః-అనియున్నది. పౌరాణికు లనఁగాఁ బురాణమునందలి యర్థమును జెప్పువారనియు, పురాణజ్ఞాన్-అనఁగాఁ బురాణముల నెఱింగినవారనియు గ్రహించునది.

కనకముల వేఱువేఱుగ, ఘనమోదం బంది యీయుఁ♦గా నాసహజుల్. ౧౯

చ. కనుఁగొని యీసువర్ణముల ♦ గాఢతరంబగు విస్మయంబునుం
గని గ్రహియింప కిట్లనిరి; ♦ కాననవాసుల మేము మూలముల్
వనమునను న్న పండ్లు దిను♦వారము హాటక మిద్ది యేల? యే
పనికి వ్యయించువార మని ♦ పల్కినమాటల నాసభాసదుల్. ౨౦ 3349

సీ. కౌతూహలమునఁ జ♦క్కఁగ నాలకించుచు విస్మయం బొందిరి ♦ విభుఁడు నట్లె
యాశ్చర్యరసమగ్నుఁ ♦ డయ్యె; నంతట రాముఁ డానహజన్ములు♦నాదృతిఁ గని
కావ్యసంశ్రవణని♦కామమోదంబున వారియాగమనంబు ♦ భూరితేజ
మలరఁగాఁ బ్రశ్నించె; ♦ నర్భకులార! యీకావ్యప్రమాణసం♦ఖ్యయది యెంత

తే. యెంతవఱ కిందునం గథ ♦ యెఱుఁగనగును?
గర్త యెవ్వండొ యీభూరి♦కావ్యమునకు
నమ్మహాముని యెందుండు? ♦ ననిన రాము
పలుకు లాలించి వారలు ♦ పలికి రిట్లు. ౨౩ 3350

క. మునిపతి వాల్మీకియె యీ, ఘనకావ్యంబునకుఁ గర్త ♦ క్రమ్మచరిత మె
ల్లను దీని మీకుఁ దెల్పం, జనునని మాకాజ్ఞఁ జేసె ♦ నమ్ముని యతఁడే. ౨౪

క. క్రతుశాలచెంత నున్నాఁ, డతులితతేజం డతండె ♦ యాదృతి నెందుం
బ్రతిలేని యిట్టికావ్యము, మతివిభవ మ్మలరఁ జేసె ♦ క్ష్మాపాలవరా!. ౨౫

క. ఇరువదినాలుగు వే లని, పరిగణితము శ్లోకసంఖ్య ♦ [1]భార్గవుఁడు మునీ
శ్వరుఁడగు వాల్మీకియె భూ,వర! సర్గంబులను [2]నైదు♦వందలు గాఁగన్. ౨౬

ఆ. [3]పరమనియతిఁ జేసెఁ ♦ బరఁగు నుపాఖ్యాన,శతము కాండములిట♦షట్కసంఖ్య
వెలయు నేడవదిగ ♦ వితతమౌ నుత్తర,కాండ మిలునిచరిత ♦ కడపటి దగు.

క. ఒనరిచె నీరీతిగ నా, మునిపతి మాగురువు చరిత♦ము భవత్కథ ను
మ్మనఘా! యీకావ్యేశ్వరు, ఘనచరిత మ్మిందుఁ జక్కఁ♦గా నలరారున్. ౨౮

ఆ. జీవితంబునందుఁ ♦ జెలఁగుశుభాశుభ, మిందు వర్ణితంబు ♦ సుందరముగ;
నోమహారథా! మ♦హోజ్జ్వలవిక్రమా!, దీని వినఁగఁ గోర్కిఁ ♦ బూనుదేని.

క. మనుజేంద్ర! యశ్వమేధం,బు ననంతరమందు సుఖముఁ ♦ బొందునసమయమం
దునఁ దమ్ములతోఁ జక్కఁగ, వినఁ దగు నన రాఘవుండు ♦ విని యానుదులన్.

క. వినినట్లె చేయుఁ దగునం, చని వారలఁ బోవఁ బంచె ♦ ననుజులు మోదం
బున వాల్మీకి మహాముని, గనఁబోయిరి; రాముఁ డంత ♦ క్ష్మాసురయుతుఁడై.

క. గురుబుద్ధులైన క్షత్రియ,వరులం దాఁ గూడి యజ్ఞ♦వాటంబున కా
దరమునఁ దద్గానమనో,హారతకు సంతోషపడుచు ♦ నరిగె సుముఖుఁడై. ౩౦

1 భార్గవేణ తపస్వినా-అనిమూ. 2 పంచసర్గశతానిచ-అనిమూ. 3 ఉపాఖ్యానశతంచైవ-అనిమూ. ఉపాఖ్యానశత మిలోపాఖ్యానాంతమ్-అనివ్యాఖ్య.

ఆ. తాళలయల మిగులఁ ♦ దనరి సస్వరశబ్ద,యుక్తమగుచు సర్గ♦యుక్తి నొప్పి
తంత్రిలయలఁ జక్కఁ ♦ దగి వ్యంజనాన్విత,మైన దాని వినియె♦నవనివిభుఁడు.

తొంబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౯౫ - వ సర్గము.

{ రాముఁడు రామాయణమును విని కుశలవులఁ దనకొడుకులనుగా నెఱిఁగి సీత సభలో శపథముచేయునట్లు చేయుమని వాల్మీకిం బ్రార్థించుట. }

మ. జననాథుం డిటు లద్భుతంబయిన యా♦సంగీత మత్యాదృతిన్
వినుచున్ జాలదినంబులం గడపెఁ బృ♦థ్వీనాథుఁతోఁ గూడి యా
తనిసామంతులు వానరుల్ విని ప్రమో♦దం బొంది; రారాముఁ డా
తనయద్వంద్వముతల్లి సీత యని గీ♦తం బందె యోంచెన్ మదిన్. ౧౫ 3361
మ పరిమన్మధ్యమమందు సీతసుతులే ♦ వా రంచుఁ దా నెంచి యీ
కరణిన్ బల్కెను; [భిన్నతమ్ము రిపుసం♦ఘాతాంతకున్ బావనిన్
వరధర్మజ్ఞు విభీషణున్ బరులఁ జం♦పం జాలి విఖ్యాతుఁడై
ధరణిం బొల్చు సుషేణుఁ గాంచు] మది విం♦తం బొంది యాలింపఁగన్. ౩
క. పరిశుద్ధవర్తనుల భూ,వరభక్తుల దూతలన్ జ♦వంబునఁ బిల్వం
బరిజనులఁ బంపి వారలు, త్వరపడి రా నిట్టులనియె ♦ వాంఛ చెలంగన్. ౩౫
చ. నిరుపమబుద్ధియై తగి ము♦నిప్రవరుండయి కావ్యకర్తయై
పరఁగెడు వాల్మికిం గనుచుఁ ♦ బల్కుతి నే నని నాదుపల్కుగాఁ
బరహితతత్పరా! దివిజ♦వారము మెచ్చఁగఁ జాలు సీత నా
తరుణిని బిల్వఁబంపుఁ డని ♦ తద్దయు భక్తిని బల్కఁగాఁ దగున్. ౪ 3364
క. పరిశుద్ధవర్తనంబున, విరహితపాపమున దాను ♦ వెలయునయేనిన్
బరిమత్తున నిట మానీ,శ్వరునానతి సీత తనదు ♦ స్వాంతవిశుద్ధిన్. ౪౫ 3365
ఆ. పలుకుఁ గాక; మౌని♦పరమేశుఁ డీమాట, కేమిపలుకు సీత ♦ యింగితం బ
దెట్టులుండు దాని ♦ నెఱిఁగి వేగమ తెల్పుఁ, డెల్లి జనకపుత్త్రి ♦ యెల్లరు విన.
సీ. పరిమత్తునడుమ శ♦పథముఁ బల్కంగాక తనయాత్మశుద్ధి నం♦దఱు నెఱుంగ
నాయాశయముఁ దీర్ప ♦ నన రామునానతి దెలుపునవాక్యంబు ♦ తేటపడఁగ
నాలించి యద్భుతం ♦ బంది యాదూతలు చని రెందు వాల్మీకి♦ముని వసించు
నాపర్ణశాలకు ♦ నరిగి మహాత్మునిఁ బ్రజ్వలద్భాస్కరు♦భాతి నొప్పు
తే. నామునిం గని ప్రణమిల్లి ♦ యతిమృదుతను
మధురతను గాంచు రాముని♦మాట లెల్ల
భక్తి విజ్ఞప్తిఁ జేసి; రా♦బ్రహ్మమౌని
భూరితేజోవిరాజిత♦మూర్తి వినుచు. ౧౦౫ 3367

క. *రామునిమనోగతంబును, దా మది నూహించి సువిహి♦తంబుగఁ బలికెన్;
భూమీశునాజ్ఞ రీతిగ, నామె వచించును శుభంబు ♦ నగు మీకెల్లన్. ౧౪

క. వనితలకుఁ బతియె దైవం, బనుటయె తథ్యంబు గాన ♦ నట్లె జరగు నీ
పనియన వేగముగల యా, జననాయకుదూత లరిగి ♦ సభ శ్రీరామున్.

క. కని మనవి చేసి రాఘున,మునివాక్యము లెల్ల నంత ♦ మోదంబున నా
జనపతి కాకుత్థ్సుఁడు విని, మునివర్యుని నెన్ని యచటి ♦ మునుల నృపతులన్.

క. పరికించి పలికె రేపే, ధరణీసుత శపథ మిందుఁ ♦ దాఁ జేయు మునీ
శ్వరు లెల్ల శిష్యయుతులై, నరపతు లనుచరులఁ గూడి ♦ నాతిప్రతిజ్ఞన్.

క. వినుదురు గాక నుఱెవ్వరు, జనకాత్మజ చేయఁబోవు ♦ శపథంబు వినం
గను గోరువారొ వారలు, చనుదెంతురు గాక విగత♦సంశయు లగుచున్.

చ. అని యిటు లామహాత్ముఁడు ధ♦రాధిపుఁ డాడిన నెల్లమానులున్
విని యది మేలుమే లనుచు ♦ విశ్రుతనాదముతోడఁ బల్కి; రా
జనపతు లారఘూత్తముని ♦ సన్నుతిఁ జేసిరి సద్గుణంబు లి
ట్లనఘము లెల్ల నీకునను♦నందె యొసంగె నటంచు మెచ్చుచున్. ౧౬ 3373

క. పలికిరి; తరువాత మహీ,శులలాముఁడు రాఘువుండు ♦ జానకి రేపే
తొలిజామున శపథంబును, బలికెడు నని వారి నెల్లఁ ♦ బంపె వసతికిన్. ౧౮

చ. అని యిటు లారఘూత్తముఁ డ♦హార్యశరక్రతుకర్త రాడ్విభుం
డనుపమబుద్ధిశాలి జన♦కాత్మజ చేయు ప్రతిజ్ఞ రేపె యా
నని తెలియంగఁ బల్కి సుమ♦హాత్ముల మానుల రాజముఖ్యులన్
బనిచె నివాసశాలలకు ♦ స్వాంతమునం గల కోర్కి పొంగఁగన్. ౧౯ 3375

తొంబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౯౬ - వ సర్గము.

{ వాల్మీకి సీతతోఁ గూడి సభకు వచ్చి కుశలవులు సీతసుతులగుటం దెలిపి శపథము చేయ ననుజ్ఞ యిమ్మని ప్రార్థించుట. }

క. ఆరాత్రి గడువ నుదితుం,డై రవి యలరార రఘువ♦రాన్వయతిలకుం
డా రాముఁడు క్రతువాటము, చేరం జని తేజ మలర ♦ సిద్ధమునితతిన్. ౧

క. పిలువంగఁ బంచె నంతట, నలఘుతరఖ్యాతిసలరు ♦ నట్టి వసిష్ఠుం
డలకాశ్యపజాబాలులు, ఖలహనులగు వాసుదేవ♦కౌశికమునులున్. ౪ 3377

తే. దీర్ఘతపుఁడు దుర్వాసుండు ♦ దివ్యతేజుఁ
డగుపులస్త్యుఁడు భార్గవుఁ ♦ డతులకీర్తి

---

* ఏవం భవతు భద్రం వో యథా వదతి రాఘవః-అనిమూ.

శాలి మార్గల్యుఁ డట్టులె ♦ శక్తి వాను
నాహ్వయులును మార్కండేయుఁ ♦ డఖిలవేత్త. ౭ 3878

సీ. గర్గుఁడు చ్యవనుండు ♦ ఘనుఁడు శతానందుఁ డాభరద్వాజుండు ♦ నగ్నిపుత్త్రుఁ
డగు సుప్రభుండు మ♦హాత్ములా నారద పర్వతుల్ గౌతమ♦పరమహాని
కాత్యాయనుండు న♦గస్త్యసుయజ్ఞులు నింకను మహితులై ♦ యెసఁగుహాను
లత్యంతహర్షాత్ము ♦ లరుదెంచి రెంతయు బలపరాక్రమములఁ ♦ బ్రబలులైన
తే. వనచరాసురు లావార్త ♦ వినెదుతమిని, వచ్చి; రెల్లరుక్షత్త్రియ♦వైశ్యశూద్రు
లట్లె వేలకు వేలుగా ♦ నఖిలదేశ,వాసు లరుదెంచి రాసీత ♦ వచ్చుననుచు.

క. ధరణీసురు లాదృతిమై, నరుదెంచిరి జ్ఞాననిష్ఠు♦లై కర్మరతిం
బరఁగిన కోవిదు లెల్లను, ధరణీసుతశపథము విను♦తమి పైకొనఁగన్. ౯

క. చనుదెంచి పర్వతము నిల్చినగతి నిశ్చలముగాఁగఁ ♦ జేరి సభను జ
క్కనిరీతిఁ గూరుచుండుట, విని యావార్తను మహర్షి♦వీరుఁడు కడఁకన్. ౧౦

ఉ. జానకితోడ వచ్చె; ముని♦సత్తము వెంబడి మోము వంచి యా
మానిని దోసిలొగ్గి రఘు♦మండను రాముని బ్రాణనాయకున్
మానసమందు నెంచుచు న♦మానుషశక్తిఁ జెలంగియున్ గళ
స్వానము బాష్పరుద్ధమయి ♦ చాలఁ గృశత్వము నొంద వచ్చెఁ దాన్. ౧౧

క. వనజానను వెంబడిగాఁ, జనుదెంచెడు శ్రుతివిధమున ♦ సన్ముని వాల్మీ
కిని వెన్కని వచ్చిన యా, జనకజఁ గని యెల్లవారు ♦ సంతోషమునన్.

తే. మేలు మేలని పొగడిరి; ♦ చాలదుఃఖ
వివశమతులౌచు జను లెల్ల ♦ విహ్వలించి
యక్కటా యని యార్వంగ ♦ నారవంబు
దెసల వ్యాపించె; నంత జ♦నసమితి నట. ౧౩ 3884

క. రాముని గొందఱు మెచ్చిరి, భూమిజ నుతియించి రందుఁ ♦ బొక్కుజనులలో
ధీమంతులు కొందఱు మఱి, యామూడ్కిన్ రాము సీత ♦ నఖిలస్తుతులన్.

క. తనిపిరి కొందఱు శోకం,బునఁ గుందిరి కొంద ఱందు; ♦ బుధనుతుఁడు సభా
జనముల నడుమన్ జానకి, వెనువెంటన్ రాఁగఁ జొచ్చి ♦ వీరుని రామున్.

క. కని యిట్లనియె గభీర,ధ్వని యలరఁగ రామచంద్ర! ♦ ధరణీసుత సా
ఘనుతచరిత్ర త్వదంగన, జనాపవాదమున నీవు ♦ శంకితమతివై. ౧౬ 2387

చ. వనముల నుండఁ బంప ముని♦వర్ణితశీలయు నాదునాశ్రమం
బునకు సమీపభాగమున ♦ భూరిలతావృతకాననాంతరం
బున విడనాడి లక్ష్మణుఁడు ♦ పోయిన నయ్యెడ నుండె; నుల్లస
ద్ఘనయశ! రామచంద్ర! త్రిజ♦గత్ప్రియకృత్యమహోదరా! విభూ!. ౧౭

క. లోకాపవాదసాధ్వస, మీాకరణిం బొందినాఁడ ♦ విట్టి యనఘు ని
   న్నీకాంతామణి సంశయ, మేకరణిని బొందకుండ ♦ నిత్తురణమునన్. ౧౫

క. శపథ మొనర్చెదుఁ గావున, నృపవర్య! యనుజ్ఞ యి మ్మ♦హీనబలమునన్
   రిపుకులనాశనశక్తిని, వ్యపగతపాపమున మిగుల ♦ వఱలెడుతనయుల్. ౧౬

[1] తే. వీర లిర్వురు కవలు దు♦ర్వారవైరి,గర్వనిర్వాపణాంచద♦ఖండశక్తి
   రాజితులు జానకీదేవి♦రమ్యగర్భ,భవులు నీపుత్రకులు సుమ్ము ♦ పార్థివేంద్ర!.

చ. ఋత మిది నీదుమ్రోల వివ♦రించితి; నేను ప్రచేతసుం డనన్
   క్షితిని ప్రసిద్ధుఁడైన ముని♦జిష్ణునకుం దశమాత్మజుండ నూ
   నృతము వచింతుఁ గాని మది ♦ నెప్పుడు నే ననృతంబు నెన్న నీ
   సుతులు భవత్తనూజులు వి♦శుద్ధమతుల్ సుగుణాఢ్యు లుత్తముల్. ౧౯ 3392

[2] తే. పెక్కు వర్షసహస్రముల్ ♦ పృథుతపంబుఁ
   జేసినాఁడను గాన నీ♦సీతయందు
   దోస మిసుమంత యున్నచో ♦ నానమస్త
   సత్తపఃఫల మెల్ల ని♦ష్ఫలమె యగును. ౨౦ 3393

ఉ. జానకి శూన్యపాపయయి ♦ సాధుచరిత్రయె యయ్యెనేని నే
   మానితరీతి వాక్కునను ♦ మానసకాయయుతిన్ ప్రశస్తినిం
   గాఁగఁ జేసియున్న యన♦ఘంబగు సాధుతపఃఫలంబు న
   న్నానును గాక జానకియె ♦ యొప్పునిదైన గడంగెడుం జుమీ. ౨౧ 3394

క. విను మనసు షష్ఠమంబుగఁ, దనరిన పంచేంద్రియములఁ ♦ దగ నెంచియె సీ
   తను వననిర్ఝరసీమను, గనఁబడఁగ విశుద్ధ యనియె ♦ గ్రహియించితిఁజూ. ౨౨

క. పరిశుద్ధ సాధువర్తన, విరహితపాపయును శుద్ధ♦వితతమతియు నౌ
   ధరణీశ! భర్తృదైవత, ధరణీసుత యీామె సూనృ♦తం బిదియైనన్. ౨౪

క. జనుల యపవాదభీతిం, గనినట్టి భవత్సమీాప♦గతభూమిని సీ
   మనమునకుఁ బ్రత్యయంబును, గనుపట్టఁగఁ జేయఁ బల్కుఁ♦గలదు శపథమున్.

తే. తా మహాభాగ యయ్యు ను♦త్తమయు నయ్యు
   భర్తృవ్రతము ననుష్ఠింపఁ ♦ బరముముదముఁ
   బొందినది గాన నీ వన్న ♦ పోల్కి శపథ
   మొనరుచున్ రాఘవా! సత్య♦మునె దలంచి. ౨౫ 3398

[3] చ. ధరణిప! శుద్ధభావమునఁ ♦ దాను జెలంగియు దివ్యదృష్టిచేఁ
   బరఁగిన నేను జెప్ప జన♦వాదభయంబున నాకులాత్మయై

---

1 ఇమౌ తు జానకీపుత్రౌ ఉభౌ చ యమజాతకౌ, సుతౌ తవైవ దుర్ధర్షౌ సత్య మేత ద్బ్రవీమి తే-అనిమూ. 2 బహువర్షసహస్రాణి తపశ్చర్యా మయా కృతా, నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ-అనిమూ. 3 తస్మా దియం నరవరాత్మజ శుద్ధభావా దివ్యేన దృష్టివిషయేణ

బరమపతివ్రతాత్వమున ♦ భాసిలు నంచు నెఱింగి నీవు భీ
కరవనసీమకుం బనుపఁ ♦ గా నట నున్నది నాదుచెంగటన్. ౨౭౫ 3399

తొంబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౯౭ - వ సర్గము.

{ శ్రీరాముఁడు లోకాపవాదమునకై శపథము సీతచేఁ జేయింపఁబలయునని వాల్మీకిని బ్రార్థించుట. }

క. అని యిటు వాల్మీకి వచించిన రాముఁడు దోసిలొగ్గి ♦ సీతను గీర్తిం
గని వెలయుదాని సభలోఁ, గని యిట్లని పలికె సాధు ♦ గంభీరోక్తిన్. ౧ 3400

చ. నిరతము ధర్మపద్ధతుల ♦ నేర్పుచు బ్రహ్మవిదుత్తముండు నా
ధరణిఁ బ్రసిద్ధిఁ గాంచి మహి ♦ తంబగు యోగరతిం జెలంగు నో
పరమమునీంద్ర! నీవగు న ♦ పాపవుఁ బల్కులఁ బ్రత్యయంబు సు
స్థిరముగ నామదిం దనరు; ♦ సీతయు మున్నమరాళిసన్నిధిన్. ౨ 3401

క. మనమున నాకుం బ్రత్యయ,మును గల్గఁ బ్రతిజ్ఞ చేసె ♦ మునివర! యటు గా
వున నింటికిఁ గొనివచ్చితి, జనాపవాదంబు మిగుల ♦ క్షమఁ బ్రబలుటచేన్.

క. జానకి విడనాడితి; నో,మౌనివరా! లోకభీతి ♦ మైఁ గలుషంబున్
లేనిదె యని మది నెఱిఁగియుఁ, గానలకుం బంచినాఁడఁ ♦ గావున మీరల్.

క. సైరింపవలయు నేనీ,సారి మనఃపూర్వకముగ ♦ జానకియెడలన్
భూరితరంబుగఁ జేసిన, గారవహీనంపు నింద ♦ త్యాగసురమౌనీ!. ౫ 3404

క. కవలగు సీతనయులఁ గుశ,లవులను నాతనయు లనుచు ♦ బలి నెఱుఁగుదు;మౌ
నివరా! యీసభనడుమను, బ్రవిమలహృదయాబ్జ సీత ♦ ప్రతిన యొనరుపన్.

క. మనమున నాకుం బ్రత్యయ,ము నెగడున ట్లొనరుపంగ ♦ మునివర! తలఁపం
జను; నన రామునియాశయ,ము నెఱిఁగినురసత్తములు ప్ర ♦ మోదహృదయులై.

క. వనజాసను ముం దిడుకొని, చనుదెంచిరి తేజ మలర ♦ శక్రాదులు త
జ్జనకజ శపథము చేయన్, విను వేడుక యలర వారి ♦ వెంటన్ వసువుల్. ౭

సీ. ఆదిత్యులును రుద్రు ♦ లశ్వి దేవతలును గంధర్వులును మరు ♦ ద్గణము లచ్చ
రలు సాధ్యు లనెడుని ♦ ర్జరులు విశ్వేదేవతలు దేవమౌనులు ♦ లలితనాగు
లట్టులె గరుడులు ♦ ననుపమయశమున నలరుసిద్ధులు హర్ష ♦ మొలయ సీత
శపథంబు వినఁగోరి ♦ చనుదెంచి రందఱు; వారల రాకను ♦ వరుసఁ గాంచి

తే. సురలు మౌనులు వచ్చుటఁ ♦ జోద్య మంది
మరలఁ బల్కెను శ్రీరఘు ♦ మండనుండు;

---

మయా ప్రవిష్టా, లోకాపవాదకలుషీకృతచేతసా యా త్యక్తా త్వయా, ప్రియతమా విదితాఽపి శుద్ధా-అనిమా.

దేవవరులార! మునులార! ♦ దివ్యమౌని
పావనోక్తులచేఁ గల్గెఁ ♦ బ్రత్యయంబు. ౧౦౪ 3408

క. ఐనను హయమేధంబున, మౌనిముఖుల్ గూడియున్న ♦ మహితసభను సీ
జానకి శుద్ధయె యని నా,మానసమునఁ దోఁచుఁ గాక ♦ మరల పృథముగన్.

చ. అని రఘునాయకుం డనఁగ ♦ నల్లన మంగళదివ్యభూరివా
సనలు చెలంగఁగాఁ ద్రిదశ♦సత్తముఁడౌ పవనుండు నెల్లెడన్
జనములు మోద మొందునటు ♦ సంచరణం బొనరించె నందు; నా
యనిలునితాఁకు నొంది జను ♦ లద్భుత మిద్ది యచింత్యమం చొగిన్. ౧౨౪

క. తలఁచిరి బహువిధరాష్ట్రం,బులనుండి జనవ్రజంబు ♦ మును కృతయుగమం
దలఘుగతిన్ వచ్చెడునటు, వెలసిరి వారెల్ల నట్లు ♦ వింతగఁ గూడన్. ౧౩

క. కని సభ నొకపర్యాయము, జనకజయుఁ దపస్వినులకు ♦ శాస్త్రోక్తముగా
వినుతింపఁబడిన వస్త్రం,బును గాషాయంబుఁ దాల్చి ♦ భూమిని దల్లిన్. ౧౩౪

ఆ. వివర మొసఁగునట్లు ♦ వేఁడ నధోదృష్టి,పాలయఁ జేయుచును వి♦మలముఖంబు
వంచి దోసి లొగ్గి ♦ యంచితభణితి ని, ట్లనియె నెల్ల మనుజు ♦ లాలకింప. ౧౪

సీత సభలో శపథము పలుకుట.

చ *మనమున నెప్పుడేని రఘు♦నుండను రాముని దప్ప నన్య నొ
క్కని నయినన్ దలంపకయ ♦ త్కొస్థలి నుండినమాట సత్యమే
జననిరో! భూమిదేవి! పతి♦సంగతి వీడిన కష్టముల్ తొలం
గను వివరంబు నాపయిని ♦ గల్గిన ప్రీతిని నిమ్ము వేగమే. ౧౫ 3414

శా. శ్రీరామున్ రఘువర్యు నవ్వహము నా♦చిత్తంబునన్ వాక్కులన్
గారాబంబులఁ జేయుకర్మముల ని♦క్కంబ బీశుఁగా నెంచి నే
నారాధించుట సత్యమేని జను ల♦త్యాశ్చర్య మందంగ నా
శ్రీరాజీవదళాక్షుపత్ని యిమతన్ ♦ జేయూఁత శ్వభ్రాకృతిన్. ౧౬ 3415

ఉ. రామునికంటె వేఱగు న♦రప్రవరున్ మది నే నెఱుంగ నం
చీమహితస్థలిన్ నిలిచి ♦ యే నిటు పల్కినమాట సత్యమే
భూమి మదీయవాంఛితము ♦ పొల్లుగఁ జేయక తా బిలంబు నెం
తో మమతం జెలంగి యిడు ♦ దొప్పగ నిచ్చెడుఁ గాక యీయెడన్. ౧౭

చ. అని యిటు మూఁడుమాఱులు సు♦హానియతిన్ శపథంబు పల్క యా
జనకజ యూరకుండ నొక♦చందమునన్ గన నద్భుతంబుగా
ననుపమమై యనుత్తమము♦నై కడుదివ్యమునై చెలంగు నా
సన మొకఁ డుద్భవించె జన♦సంఘము లొక్కటఁ జోద్య మందఁగన్. ౧౮

* యథాహం రాఘవా దన్యం మనసాపి న చింతయే, తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి-అని మూ.

ఆ. అమితవిక్రమమున ♦ నలరారు నాగముల్, ఫణములన్ ధరింపఁ♦బడుచు దివ్య
మైన యాకృతిని మ♦హారత్నభూషిత,మై చెలంగెఁ బీఠ ♦ మద్ది యంత. ౧౯

చ. ధరణియు దివ్యరూపమునఁ ♦ దా నటఁ దోఁచి మహాసనంబుపై
వరగుణసాంద్ర జానకిని ♦ వర్ణితచిత్తను స్వాగతోక్తులం
బరిగతఖేదయై తనరు♦భంగి నొనర్చుచు స్వీయబాహులన్
గర మనురాగ ముట్టిపడఁ ♦ గాఁగిటఁ జేరిచి యంకమునం గనన్. ౨౦ 3419

ఆ. కూరుచుండఁ బెట్టెఁ ♦ గూరిమి సింహాస,నమున నిట్లు చేర్చి ♦ నాతిమిన్న
నరసగతిని గొని ర♦సాతలంబును జొచ్చె, నట్లు లోని కరుగు ♦ నవసరమున.

క. సుర లెల్లఁ బుష్పవృష్టిం, గురిపించిరి సీతపైనఁ ♦ గొదువపడనియ;
ట్లురుసాధువాక్యముల నం,బర మెల్ల ధ్వనింప నేక♦భంగి నొనరుపన్. ౨౧

చ. ధ్వని యది యెక్కుపెట్టున ది♦వంబును భూమిని నిండె; మేలు మే
లనుచును జానకీ! మహిత♦మౌఁ గద నీదగు శీల మిద్ది యం
చును బహురీతులం బొగడు♦చున్ నభమందున నున్న దేవతల్
స్వనములఁ జేసి రాజసక♦జాత రసాతలసీమ కేగఁగన్. ౨౨ 3422

క. సుర లీగతి హర్షంబునఁ, బరమాద్భుత మంది ధ్వనులఁ ♦ బర్వఁగఁ జేయన్
ధర యజ్ఞవాటగతముని,వరు లెల్లను మనుజపాల♦వర్యులు నరుల్. ౨౩

క. మనములఁ దోఁచెడు విస్మయ,మున నేమియుఁ బల్కలేక ♦ మూర్ధములు చలిం
పను బొలిచిరి బొమ్మలవడు,వున; నంతట నంతరిక్ష♦భూస్థప్రాణుల్. ౨౪ 3424

తే. స్థావరంబులు మఱియును ♦ జంగమములు
దానవులు దీర్ఘతనువులఁ ♦ దగురసాత
లాలయంబులు భుజగమ్ము ♦ లద్భుతంబు
నందె; కొందఱు హర్షించి ♦ రద్ది చూచి. ౨౫ 3425

క. ధ్యానపరాయణులై యట, మానవవరులందుఁ గొంత♦మంది నిలిచి రా
మానవపతి శ్రీరాముని, మానసములు పొగులఁ గనిరి ♦ మఱికొంద ఱటన్.

క. జనకజఁ గాంచి యచేతను, లనఁదగి చిత్రంపుబొమ్మ ♦ లట్లుండిరి; భూ
మిని సీత చొరఁగ నొయ్యనఁ, గని యాసభ నున్న మనుజ♦గణములు వగలన్.

ఆ. కలఁగినట్టి చిత్త♦ములను ముహూర్తమా,త్రంబు నిలిచి రట్టి ♦ *తన్ముహూర్త
మఖిలజగము లార్తి ♦ నంది మూర్ఛం బొంది,నట్టు లుండెఁ గదల♦నట్టులంత.

తొంబదియేడవ సర్గము సంపూర్ణము.

---

* తన్ముహూర్త మివాత్యర్థం సముం సమ్మోహితం జగత్ -అనియూ.

## ౯౮ - వ సర్గము.

{ శ్రీరాముఁడు జానకికై శోకించి భూదేవిని భస్మముచేయఁ బూని బ్రహ్మచే నివారింపఁబడుట. }

క. జనకజ యట్లు రసాతల,మును జొచ్చుటఁ గాంచి కపులు ♦ మునులును శ్రీరా
మునిసన్నిధి మైత్రేలని,యును, గటకటయంచుఁ బల్కి ♦ రుద్విగ్నులునై. ౧

క. నరపతి యంతట నౌదుం,బరదండం బూఁతగాఁగఁ ♦ బట్టుకొని నిరం
తరబాష్పధార నీక్షణ,సరసిజములు కలఁకఁబాఱ ♦ నన్ననిధ్వనితోన్. ౧½

క. మోమును వంచి వ్యథాకుల,మా మదితో నింత యనఁగ ♦ ననువుపడని చిం
తామాధ్యంబునఁ దోఁచక, యేమియు సన లేకయుండె ♦ నేడ్పు గదురఁగన్.

మ. చిరకాలం బిటు చింతచేఁ గలఁగుచున్ ♦ జిత్తంబు నిశ్చేష్టతం
బొరయన్ బాష్పము లేకధార లగుచున్ ♦ భూమిం బ్రవేశింప ని
ర్భరశోకంబును క్రోధముం బెనఁగొనం ♦ బల్కెన్ మహాదీనుఁడై;
భరమై యుప్పుడపూర్వశోక మిది నా♦స్వాంతంబుఁ గుందించెడున్. ౩½

ఉ. నే నిటు చూచుచుండ ధర♦ణీసుత నాదగు భాగ్యలక్ష్మి నా
జానకి భూమిలో నడఁగెఁ ♦ సాగరవర్యముఁ దాఁటి మున్ను లం
కానగరంబునన్ దనుజ♦కాంతుని జంపి మహార్తి మున్గు నా
మానినిఁ గంటిఁ బ్రీతిమెయి ♦ మామకదోర్బలశక్తితోడుగన్. ౪½ 3433

చ. సురలును మానివర్యులును ♦ జూచుచు నుండఁగ నగ్నిశుద్ధయా
తరుణిని నేనయోధ్యకు ని♦తాంతముదంబునఁ దెచ్చుకొంటి నీ
తరుణమునందు నిచ్చటనె ♦ తా నడఁగెం గద సభ్యులార! మీ
రరయుఁడు నాదుశక్తి నిట ♦ నట్టులు పూర్వము నేను బూనికన్. ౫ 3434

ఉ. దానవనేతఁ జంపి వని♦తామణిఁ దెచ్చిన నా కశక్యమే
పూనిక భూమి తోడుకొని♦పోయిన సీత మరల్చుటల్ కనం
గా నిఁక నోధరారమణి ♦ క్రమ్మఱ నాదయితామణిన్ వగం
బూనిన నాదుచిత్తమున ♦ భూరితరక్రుధ పుట్టకుండఁగన్. ౫½ 3435

మ. మరలం దెచ్చి యొసంగు మిట్టిపనికిన్ ♦ మా అొడ్డి నీవున్న వి
స్ఫురరోషంబుఁ గనంగఁ జేసెదఁ జుమీ ♦ పూర్వంబె నారోషముం
బరమాశ్చర్యము నొంది చూచితివిగా ♦ పంతంబు నీకేల? యో
ధరణీ! యత్తవు నాకు నేమనక క్రో♦ధం బింత వారించితిన్. ౬ 3436

చ. జనకుఁడు నాకు మామ మును ♦ సత్క్రతుకార్యమునన్ హలంబు చేఁ
గొని నిను దున్నుచున్ బడసెఁ ♦ గోమలి సీతను; గాన మేదినీ!
*జనకజ నాకుఁ జూపు మది ♦ శక్యముగాదని తోఁచెనేని న
న్ననువుగఁ ద్రోవఁ జూపి దయ♦తాంతికమున్ వడిఁ జేర్పు మిత్తఱిన్. ౭½

* తస్మాన్నిర్యాత్యతాం సీతా వివరం వా ప్రయచ్ఛ మే-అనిమూ.

మ. బలిసద్మంబున నాకపృష్ఠమున నే ♦ వాసంబు గావింతు నా
జలజాతేక్షణఁ గూడి; విష్ణుదయితా! ♦ చాలింక నాలస్య మ
ర్త్యలి సీతం గొనిరమ్ము జానకినె యీ♦రీతిన్ మదిం గోరుచున్
గలఁతం బొందితి మోహవారినిధి ని♦క్కం బే నొగిన్ మున్గితిన్. ౮౪ 3438

మ. ధరణీ! యున్నది యున్నయట్లు విలస♦ద్ధమ్మిల్ల నాప్రేయసిన్
ద్వరగాఁ దోడ్కొని వచ్చి నా కొసఁగు మిం♦తం జేయవే నిన్ను భూ
ధరసంఘంబులతో వనావళులతో ♦ దర్పంబు పొంగంగ ని
ర్భరబాణంబుల నీఱుచేసెదను [1] నే ♦ రాముండనే యైనచోన్. ౮౫ 3439

క. ధరణీ! నీయీరూపము, ద్వర నే విదళింప నెల్ల♦తావుల జలమే
పరికింప వెలయుఁ జుమ్మీ, పరమాద్భుతశక్తిఁ జూపఁ♦బడుఁ గాక యిఁకన్.

చ. [జనకజకోసమై ధరణి♦సత్త్వము దూలఁగఁ జేసి దీని నా
వననిధిలోపలం గలిపి♦వైచెద లక్ష్మణ! చాపవర్యమున్
ఘనతరసాయకంబుఁ ద్వర♦గాఁ గొనిరమ్ము; భయంబు లేక మే
దిని యిటులున్న దీక్షణమె ♦ దీనిమదంబును జెండి వైచెదన్.] ౧౧ 3441

చ. అని యిటు లోకకృత్స్నమహి♦తాన్వయవార్ధినిశాకరుం డెదం
బెనఁగొను క్రోధశోకముల ♦ భీమతరంబుగఁ బల్కి; నాతనిన్
మనమున సమ్మదంబు నణు♦మాత్రము లేకయె దుఃఖవార్ధిలో
మునిఁగినవానిగా నెఱిఁగి ♦ మోహమున డనత దోఁప బ్రహ్మయున్. ౧౨ 3442

చ. సురగణయుక్తుఁడై పలికె ♦ సువ్రత! శ్రీరఘురామ! నీవె యి
క్కరణిని దీనుభంగిని ని♦కామగురువ్యథఁ బొందవచ్చునే?
సురలకు మున్ను చెప్పినది ♦ చొక్కముగా మదిలో స్మరింపు నీ
నిరుపమపూర్వభావమును ♦ నేర్పుమెయిన్ స్మరియింపు మిత్తఱిన్. ౧౩

సీ. శత్రుకర్శన! మహా♦సత్త్వవిభాసురబాహూ! మహాత్మ! నీ♦పరమరూప
మును స్మరింపఁగఁ జేయఁ ♦ బూన నత్యుత్తమమగుచు దుర్ధర్షమై♦యలరు నీదు
ముందటిదగు జన్మ♦మున నున్న వైష్ణవ తనువుఁ దలంపు మి♦త్తరుణమందె;
జానకి యీసీత ♦ సాధ్వి యభిన్నత్వమునఁ దగు శ్రీదేవి ♦ యనుపమాన

తే. పరమపావని నీ కన♦పాయిని యగు;, నీవె నీయాశ్రమంబను ♦ నిట్టితపము
బలిమి వైష్ణవపదసుఖ♦వార్ధి మున్గె, నందు మరల నీసంగతి ♦ నొందఁగలదు.

క. వినుమా సంశయలేశం,బును బొందకు విష్ణులోక♦మునయందే క

1 సపర్వతవనాం కృత్స్నాం విధమిష్యామి తే స్థితిమ్, నాశయిష్యామ్యహం భూమిం సర్వ మాపోభవం త్విహ-అనిమూ. నే రాముండనే యైనచోన్-అన్నది మూలార్థమును సార్థకము చేయునది కావున నధికముగాఁ జేర్పఁబడినదని యెఱుఁగఁదగు.

ల్గును గాని యీసభాంతర, మునఁ గల్గదు సంగమంబు ♦ మునినుతచరితా!.
క. నాపలుకుజాడ లెఱుఁగుము, యీపరిపన్మధ్యమునని ♦ యీకావ్యమె చూ
నీపావనచరితామృత, మేపారం గ్రోలఁ జేయ ♦ నెసఁగు ససమ్మై. ౧౭ 3446
క. కావ్యములలోన నుత్తమ, కావ్యంబై వేదసార♦కలితం బగుచుఙ
భవ్యంబై సాంగముగా, దివ్యకథారసము నెల్లఁ ♦ దెల్పుం జుమ్మీ ౧౮
తే. సంశయం బింతయును లేదు ♦ జన్మము మొద
లఖిలసుఖదుఃఖసేవన ♦ మంతముగను
దెలుపుఁ గాఁగల కృత్యముల్ ♦ తెలుపఁదగిన
యుత్తరాహ్వయకాండ మా♦యోగివరుఁడు. ౧౯ 3418
క. ఒనరించె నాదికావ్యం, బనఘా! యీకావ్యమా స♦ముంచితగాథల్
నినుఁ గూర్చియె యలరారెడు, ననుపమతావకయశంబు ♦ నవనిం జాటుఙ.
తే. కావ్యములలోన నెల్ల రా♦ఘవుఁడు తప్ప
సద్యశంబును బొందఁగాఁ ♦ జాలఁ డెవఁడు
మున్ను తెలిపితి దేవత ♦ లున్నతజని
నీకు నీవార్త లెల్లను ♦ నేను రామ'. ౨౦ 3456
క. ఇది దివ్య మద్భుతాకృతి, యిది సూనృతవాక్యసంఘ ♦ మిది యజ్ఞానా
స్పదరహితమంచు నెఱుఁగుము, విదితం బీకావ్య మెల్ల ♦ విబుధవినుతమై.
క. పురుషవరేణ్యా! నీవన, నిరుపమధర్మాభినిరతి♦నిం దగు దేవే
శ్వరుఁడవు భవిష్యగాథను, బరమాదృతి మీఱ వినుము ♦ ప్రముదముగల్గుఙ.
క. అనుపమకీర్తీ! రామా, యణమునఁ దగు శిష్టగాథ ♦ హారితరంబై
తనరెడు నుత్తరకాండం, బను పేరున; మునులఁ గూడి ♦ యుద్యానిఁ దగఙ. ౨౨
క. వినవయ్య! భూరితేజా', యనుత్తమంబైన కథను ♦ నన్యులు దీనిఙ
వినఁ దగరు రాజమునివై, తనరారెడు నీవె వినఁగఁ ♦ దగుదువు వీరా!. ౨౩
చ. అని యిటు లాదృతిం బలికి ♦ యంబుజసంభవుఁ డెల్లలోకసం
జనితసుకీర్తి దేవముని♦సత్తములం గుమిఁగూడి రాఁగ నా
త్మనియుతవాసభూమికి న♦మానుషమూర్తిని రాము నెంచుచుం
జనియెను; యజ్ఞవాటగత♦సాధుసుతుల్ మహనీయకీర్తులుఙ. ౨౪ 3455
తే. బ్రహ్మలోకార్హులును నగు ♦ పరమమానుషులావిరించిని సెలవీయ ♦ నడిగిమరలి
రాభవిష్యమహాగాథ ♦ నాలకింప, రాముఁ డున్నట్టి యాయధ్వ♦రమున కెలమి.
క. [నిరుపమకీర్తిని జక్కఁగ, ధరణిని నింపంగ నిల్వఁ ♦ దా రొప్పఁగ వ
చ్చిరి; వారివెనుక వసుధాం, తరమున వెలువడియె నొక్క ♦ ధ్వని యసదృశమై.
క. రామా సంతాపంబును, నీమెయిఁ బొందంగ నేల? ♦ యిట్టిపనికిఁగా
*నామార్తాండతనూజుఁడె, యామానినికారణంబె ♦ యంచుఁ దలఁపుమా.

* కృతాంతో వ్యాత్రికారణమ్-అనిమా.

చ. జనకజఁ గోరుదేని ధర ♦ సల్పిన యత్న మిదెల్ల వ్యర్థమై
చను; మరలన్ ధరిత్రిసుత ♦ త్వత్స్థలిఁ గాంచుట దుర్లభంబు నీ
వనితయు విష్ణులోకమున ♦ వాసముచేయుచు నీదురాక నె
మ్మనమునఁ గోరుచున్నయది; ♦ మర్త్యమునన్ సుఖ మెల్ల నెప్పుడున్. ౩౦౻

క. మనుజులఁ బొందఁగఁ జేయును, వినుము స్వధాలోకమందుఁ♦బితరు లమితభో
జనులును దృప్తిం బొందం,గను జేయుచునున్న దామె ♦ గాదే? రామా!. ౩౯

సీ. విష్ణువై తగునీదు ♦ విమలవక్షంబున నిరతంబు లక్ష్మియై ♦ నెమ్మి నుండు
స్వర్గవాసంబునఁ ♦ బరఁగుసిద్ధులతల వసియించుచుండు నా♦వారిజాక్షి
కావున వైదేహిఁ ♦ గాంచునాకాంక్షను వదలుమా! శ్రీరామ! ♦ వసుమతీశ!
జానకీసుతులఁ గు♦శలవులఁ జూడుమా వాల్మీకికృతము శు♦భంబు సత్య

తే. మనఘకావ్యంబుఁ జక్కఁగా ♦ వినఁగఁ దగును
గాఁదగినకార్యముల నెల్లఁ ♦ గనఁబఱచెడు
నుత్తరాహ్వయకాండంబు ♦ నొగి వినంగఁ
దగు ననుచు బ్రహ్మ వచియించె ♦ దాని వినుము.] ౩౭౻ 3461

చ. అని యిటు భూమి పద్మజని ♦ యాడినపల్కుల నాలకించి చ
క్కనివి శుభావహంబులును ♦ గాఁదగునంచుఁ దలంచి తేజముం
దనరఁగ వాల్మికిం గని యు♦దారతరంబగు పూన్కి నిట్లనున్;
మునివర! బ్రహ్మలోకమునఁ ♦ బొల్చు మహర్షులు వేడ్క మీఱఁగన్. ౩౮

క. వినఁ దలఁచినారు శిష్టం, బనఁదగు భాగంబు నుత్త♦రాహ్వయకాండం
బును గాన నెల్లినుండియె, వినిపింపం దగును దాని ♦ విస్తృతి మీఱన్. ౩౮౻

క. అని శ్రీరాముఁడు పల్కిన, విని యట్లే చేయువాఁడ ♦ విశ్వనుతా! యం
చును బల్కి కవలఁ దోడ్కొని, చనియెను వాల్మీకి పర్ణ♦శాలకు నంతన్. ౩౯

ఆ. అచటిజనుల వదలి ♦ యామాని యరుగంగ
జానకిన్ గుఱించి ♦ సాంద్రశోక
మునఁ దపించి లోక♦మునఁ గల్గు నపవాద
భయము నొందఁ గడచెఁ ♦ బతికి రేయి. ౩౯౻ 3465

తొంబదియొనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౯౯ - సర్గము.

శ్రీరాముఁ డశ్వమేధమును బూర్తిచేసి కొడుకులతో నయోధ్యను బ్రవేశించుట.

క. అనుగతసంతాపభరం,బున రాత్రిని గడపి భాను♦మూర్తి తొలినగం
బునఁ దోఁప మునులఁ బిలువం, బనిచి కుమారులను బిల్వఁ♦బంచి కొలువునన్.

క. అనుమానపడక చక్కఁగ, వినిపింపుఁడు గానభణితి ♦ వేడుక నని చె
ప్పిన నంత మహిమచేఁ దగు, మునివర్యులు కూరుచుండ ♦ మోదముపొంగన్.

క. ఉత్తరకాండము కుశలవు, లత్తఱిఁ జక్కఁగఁ బాడి; ♦ రంతట రాముం
డుత్తలపాటున జానకి, చిత్తమ్మునఁ దోఁచువగల ♦ క్షితిఁ జొచ్చుటచేన్. ౨౫

క. నూన్నృతవైభవమునఁ దన, మానస మొప్పంగ సీత ♦ మానక చనె నం
చానృపుఁడు తలఁచి దుఃఖము,చే నెంతయుఁ గలఁగిపూర్తిఁ ♦ జేసెం గ్రతువున్.

క. క్రతుపూర్తిచేసి శ్రీరఘు,పతి సీతను గానలేక ♦ పాడఱినగతిన్
క్షితి యెల్లఁ దోఁపఁగా న,న్మతి శాంతిం బొందక వగ ♦ మానకయుండెన్.

క. నరపతుల నందఱిం గపి,వరులను భల్లూకదనుజ ♦ వరులను మనుజో
త్కరముల మర్యాద తగన్, ధరణీపతి పంపె వినయ ♦ ధనుఁడై ప్రీతిన్. ౪

తే. ధరణిదివిజుల కెల్ల వి ♦ త్తంబు లొసఁగి
పనిపె; నీరీతి హయమేధ ♦ మును నొనర్చి
విధిని బరిపూర్తి నొందించి ♦ విభుఁడు సర్వ
రాష్ట్రవాసులఁ బంపి వి ♦ శ్రాంతి లేక. ౪౫ 3472

చ. తరుణిని జిత్తసీమ నిడి ♦ తద్గతభావుఁడునై యయోధ్యకుం
దర్లపడిపోయె వెంబడి సు ♦ తప్వయ మొయ్యన రాఁగ; నిశ్చితా
ధ్వరుఁడయి నెమ్మనంబునను ♦ దారను వేఱొకదానిఁ గోర కా
పరమపతివ్రతామణిని ♦ ధ్యానమునందు సతంబు నెంచుచున్. ౭౫ 3473

క. ప్రతినవమున భార్యార్థము, హితకారిణి జనకతనయ ♦ యెప్పగిదిఁ దగున్
బ్రతికృతిఁ గాంచనమున ను,న్నతిమీఱ నొనర్చుకొనుచు ♦ నైజమహిమచేన్.

క. దశవర్ష సహస్రంబులు, దశరథతనయుండు భక్తి ♦ తాత్పర్యములన్
యశ మొప్ప నింప హయమే,ధశతములను జేసె బహుళ ♦ దక్షిణ లిడుచున్.

సీ. అశ్వమేధముల సం ♦ ఖ్యకుఁ బదిరెట్లుగా బహుదక్షిణాన్విత ♦ వాజపేయ
ముల నొనరించె; ని ♦ మ్ముల గోశతంబుల బహుధనంబులభక్తి ♦ వ్యయ మొనర్చి
కీర్తిని గోరి య ♦ గ్నిష్టోమముల నతిరాత్రంబులం దక్కు ♦ క్రతువరముల
నొనరించె; సిరిచేత ♦ నొప్పునారాఘవుం డిట్టులు మహిమచే ♦ నెసఁగి ధర్మ

తే. తత్పరుండయి క్షత్త్రియ ♦ తల్లజుఁడయి
ధరణిఁ బాలించుచుండంగ ♦ జరగెఁ గాల
మెల్ల కపిరాక్షసులు మహా ♦ భల్లుకములు
రామశాసనమును స్వశి ♦ రములఁ దాల్చి. ౧౧౫ 3476

క. పరిపాలించిరి రాజ్యము, ధరణీశులు ప్రతిదినంబు ♦ ధర్మంబున శ్రీ
కరు రాము మోదమందెడు, కరణిం జేయుచును భూరి ♦ కరుణాత్మకులై. ౧౨

ఉ. కాలము తప్పకుండ జన♦కాండము మెచ్చఁగ వృష్టి నిచ్చుచుం
గ్రాలుచు ఖ్యాతి మేఘుఁ డిలఁ ♦ గాంచె సుభిక్షముగాఁ దనర్చె నా
కాలము; దిక్కు లెల్లను ని♦కామము స్వచ్ఛముగాఁ గనంబడెం
మేలగు; వార్షపుష్టులను ♦ మించి పురంబులు గ్రామముల్ తగెం. ౧౩

చ. ధరణి నకాలమృత్యువులు ♦ తప్పెను వ్యాధులు ప్రాణికోటు లా
తురమును బొందఁ జేయుచును ♦ దోఁపక యుండెను; రామచంద్రుఁ డా
ధరణిని బ్రోచుకాలమున ♦ దారుణకృత్య మదేది గాని యే
వరునను దోఁపకుండె; జన♦వర్ణితమై తగె రాముసంపదల్. ౧౪ 3479

ఆ. వాలకాల మిట్లు ♦ సాగిన రఘురాము, తల్లి కీర్తిధుర్య ♦ తనయపౌత్ర
సహితయై నను స్త♦సన్మానములఁ బొంది, యుండి ధరణి వదలె ♦ నొక్కనాఁడు.

తే. ఆమె వెంట సుమిత్రయు ♦ నామె వెంట, భరతుతల్లి కైకేయియు ♦ ధరణి వదలి
కీర్తి నిల నిల్పి పోయి ర♦కృత్రిమవిధి, ధర్మములఁ జేసి స్వర్గైక♦ధామమునకు.

క. సురపురి దశరథుఁ గలసుటఁ, దరుణులు మువ్వురును భర్త♦దాపున నెంతో
సిరు లలర మోదముం గని, వరుతరధర్మైకసిద్ధి ♦ నొందిరి మనుచుం. ౧౭

క. వారల గుఱించి రఘుభూ,దారకులాగ్రణి యనంత♦దానంబులఁ దా
నోరిమి నొనర్చె భూసుర,వారంబులకుం దపస్వి♦వరులకు భక్తిం. ౧౮ 3483

చ. పితరులఁ గూర్చి సత్క్రియులఁ ♦ బెంపు వహించుచుఁ జేసె నందు స
త్కృతిసురదానయోగ్యములఁ ♦ జిత్రశరంబుల రత్నరాసులం
బితరులు దేవవర్యులును ♦ బ్రీతిని బొందఁగఁ గోరి యిచ్చె; నీ
గతి నిలఁ బెక్కువర్షములు ♦ క్రమసుఖంబులు వృద్ధిఁ బొందఁగం. ౧౯

తే. అఖిలయజ్ఞంబులను జేసి ♦ యఖిలధర్మ
ముల నొనర్పుచు ధర్మముల్ ♦ మూర్తి నొంది
ధరణి నలరారునట్లుగా ♦ ధాత్రి నేలె
రాజచంద్రుండు శ్రీరఘు♦రామమూర్తి. ౨౦ 3486

తొంబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౧౦౦ - వ సర్గము.

రామాజ్ఞచే గంధర్వరాజ్యముమీఁదికి భరతుండు సేనతో బయలుదేరుట.

చ. గడచెను సర్వమోదకర♦కాలము కొంత, యనంతరంబ యా
పుడమివిభుండు రాఘవుఁడు ♦ పుత్రయుతుండయి కొల్వు సేయున
ప్పుడు చనుదెంచెఁ గేకయనృ♦పుం డనుపంగను దత్పురోహితుం
డుడుపతినాఁగఁ జల్లఁగ మ♦హోన్నతిమించెడు రాముపాలికిం. ౧ 3486

తే. కేకయుండు యుధాజిత్తు ♦ శ్రీకలితుని
నంగిరఃపుత్త్రు, గార్గ్యము♦హర్షి సమిత
తేజునిం బంపుచో రఘు♦ధీరునకు స
యుతతురంగంబులం బ్రీతి ♦ నొప్పుచుండ. ౨ 3487

క. వరరత్నకంబళంబుల, సురుచిరచిత్త్రాంబరముల ♦ శుభతమరత్నా
భరణంబుల నొగిఁ బంపం, గర మనురాగమున వానిఁ ♦ గైకొని మునియుఁ.

క. అరుదెంచి తనదురాకను, నరపతికిం దెలుపఁగ ముని♦నాథునిరాకఁ
బరమాదృతి విని కేకయ,ధరణీశుఁడు మాతులుండు ♦ దయ చెలువారఁ. ౩

చ. పనిపిన యామహాధనము ♦ భవ్యతురంగముముఖ్యవస్తువుల్
విని యనురాగ మొంది రఘు♦వీరుఁడు తమ్ములఁ గూడి క్రోశముం
జని ముని నాతిథేయముల ♦ శక్రుఁడు గీష్పతిఁ బూజచేసిన
ట్లనువుగఁ బూజచేసి యతఁ ♦ డాదృతిఁ జూపినవస్తుసంతతిఁ. ౫ 3490

క. కని భక్తిని గైకొని యు,మ్మునిపతితోఁ గుశలపూర్వ♦ముగ మాతులుఁ గూ
ర్చినవార్త లడిగి యుపవి,ష్టుని ముని గురుతేజు గార్గ్యుఁ ♦ జూచి నృపతియుఁ.

చ. మునివర! మాతులుండు ప్రియ♦ముఁ జెలువారఁగ నేనిమిత్తమై
పనిపెనొ మిమ్ము, దేవగురు♦భంగిని బొల్చెదు మీరు నాగృహం
బున కరుదెంచినంతఁ బరి♦పూతమె యయ్యెను జన్మమన్న; రా
మునిపలు కాలకించి తమి ♦ పొంగఁగ గార్గ్యమునీంద్రుఁ డిట్లనుఁ. ౮ 3492

సీ. వాగ్విదుత్తమ! రఘు♦వర్య! కార్యమురీతి వినిపింతు మీమామ ♦ విన్నవించి
నట్లుగ; గురుబాహు♦వగు నాయుధాజిత్తు పలికె నీరీతి, న♦ప్పలుకులు విని
యట్లు చేయుము మది ♦ కదిసరిపడినచో; గంధర్వరాజ్య మొ♦క్కండు గలదు
ఫలమూలబహుళమై ♦ పరమశోభనమయి సింధునదీపార్శ్వ♦సీమలందు

తే. వెలయుచుండును యుద్ధకో♦విదులు సాయు
ధులును నగు భూరిగంధర్వ ♦ లెలమి దాని
నేలుచున్నారు వారల ♦ కెల్ల రాజు
తనరు శైలూషుఁ డనువాఁ డు♦దారబలుఁడు. ౧౧ 3493

*చ. తనయులు వానికిం గలరు ♦ దారుణసత్త్వులు మూఁడుకోట్లు భూ
వినుతచరిత్ర! వారలను ♦ విక్రమ మొప్ప జయించి తత్పురం
బును గొని యేలవయ్య! శుభ♦ముల్ దగు దాన మఱొండురీతి నా
జనపద మేలరాదు గురు♦సత్త్వులు వారయి పొల్చుచుండుటఁ. ౧౨ 3494

క. గురుబాహూ! యీవిషయము, సరియనియే తోఁచెనేని ♦ సాధింపుము నే
నరయ నహితంబు పల్కను, ధరణీశా! యనియె, నన్నఁ ♦ దద్భణితులకుఁ. ౧౩

* శైలూషస్య సుతా వీరాస్త్రిస్రః కోట్యో మహాబలాః-అనిమా.

చ. మనమున హర్ష మొంది రఘుమండనుఁ డట్టులె చేయు వాఁడనం
చని భరతుం గనుంగొనుచు నాదృతి దోసిలి పట్టి మానితో
ననియె; మహాత్మ! యీసహజు లాభరతాత్మజు లిర్వురాదు రీ
తనయులు స్వేచ్ఛఁ దజ్జనపదంబున నుందురు విక్రమాఢ్యులై. ౧౫౪ 3496

[1]తే. తక్షపుష్కలులను పేర్లఁ దనరువారు
భరతుమాతులుఁ డివ్విరిఁ బరమమోద
మలర రక్షింప ధర్మాత్ము లగుచు భరతు
ముందు నిడుకొని సద్భటముఖ్యులఁ గొని. ౧౨ 3497

క. ఆగంధర్వకుమారుల, నేగతి నట నుండనీయ కేచినబలిమిన్
బాగొప్ప దేశ మేలుదు,రేగతి ధర్మంబు ధరణి నెనఁగు నసమమై. ౧౭౪

క. పురములు రెండుగ నిర్మిం,తురు దేశవిభాగ మలరఁ దోడనె వారిన్
భరతుఁ డట నిల్పి నాకడ, కరుదెంచును ధర్మబుద్ధి యలరుచు నుండన్.

చ. అని యిటు పల్కి యాభరతునాత్మజవాహిను లెల్ల వెన్కొనన్
జనఁదగునంచు నాజ్ఞ యిడి చక్కని వేళ యిదంచు నప్పుడే
తనసహజాత్మజన్ములకు దర్పసమగ్రుల కెంతొ పేర్మిఁ ద
జ్జనపదనాయకత్వ మిఁక శాశ్వతమానని శాస్త్రరీతిగన్. ౧౯౪ 3500

క. ఒనరిచె నభిషేకముఁ జ,క్కని తారాబలము గల్గఁగాఁ దగువేళన్
మునిపతి గార్గ్యుని ముందిడు,కొని భరతుఁడుపూన్కి నవుడె కొడుకులుబంధుముల్.

క. తనవెంట రాఁగఁ జనియెన్; ఘనబల మది యింద్రుతోడఁ గదలుదివిజసే
నను బోలి నగరమును విడి, చనియెన్ భరతుండు ముందు చనుచుండ నడిన్.

క. సురలకును దురాధర్షము, గర ముద్దామంబు నగుచుఁ గదలి చనఁగ నా
యురుబలము వెంట మాంసా,దరమునఁ దగుభూతములును దరలెం బూన్కిన్.

తే. సకలరక్షస్సులున్ రాముసహజుతోడ
నరిగె [2]రక్తంబుఁ గ్రోలెదు నాసఁ బూని
భూతవితతులు మాంసంబు పొత్తుఁ గోరి
దారుణాకారములతోడఁ దరలిపోయె. ౯౩ 3504

సీ. గంధర్వపుత్రులకమ్రమాంసంబును దినఁగోరి సింహముల్ దృప్తములును
వ్యాఘ్రవరాహాదులంబరంబునఁ బోవు పక్షులు వేలుగాఁ బరువు లిడియె;
బలములకున్ ముందు భయదాకృతులతోడ నీకీతి జంతువు లేగుచుండఁ
బక్షిదినంబు లాబలము లేబాధలఁ గనకుండ మార్గంబు గడచి చనియె;

1 భరతస్య సుతౌ వీరౌ తక్షః పుష్కల ఏవచ-అనిమా. 2 అనుజగ్ముర్హి భరతం రుధిరస్య పిపాసవః, భూతగ్రామాశ్చ బహవో మాంసభక్షా స్సుదారుణాః-అనిమా.

తే. హృష్టపుష్టజనావళు ♦ లెసఁగ నున్న
కేకయాహ్వయరాజ్యమ్ము ♦ వీఁకఁ జొచ్చి
యందుఁ దనరారు సంతుష్టి ♦ కాత్మ నలరె
నంత భరతుండు సేనల ♦ కధిపుఁ డగుచు. ౨౫ 3505

నూఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౧ - వ సర్గము.

{ భరతుఁడు గంధర్వుల జయించి కొడుకులకు రాజ్యము పంచి యిచ్చి రాముని కడకు వచ్చుట. }

క. విని గార్గ్యసహితుఁడై వచ్చిన వార్తల కాత్మ నలరి ♦ సిరుల వెలయు నా
జనపతి కేకయనాథుఁడు, మనమున సంతోష మంది ♦ మంత్రియుతుండై. ౧

క. పరివారముతోఁ దర్వరపడి, యరిగెన్ మేనల్లుఁ గూడి ♦ యఖిలబలము ల
చ్చెరువుగఁ దోడనె రాఁగా, నురుతరమాయాబలమున ♦ నొప్పెడురిపులన్.

తే. కామరూపులగంధర్వ♦కాంతులను జ
యించువేడుక నంతట ♦ నేపుమీఱ
నాయుధాజిత్తుతోఁ గూడి ♦ యభ్భరతుఁడు
విక్రమంబున గంధర్వ♦విషయములకు. ౩ 3508

క. చని బలములతో నగరంబున కల్లంతననె నిల్వఁ ♦ బొంగి మహౌజో
ధనకాంతులు గంధర్వులు, విని భరతునిరాక భూరి♦వీర్యం బలరన్. ౩౫

క. హుంకారంబులను ధనుష్టంకారంబులను దిశల ♦ శబ్దము గలుగన్
బింకములతోడ మార్కొని, ఱింకం బోవచ్చు నెచటి ♦ కీతతి ననుచున్. ౪

క. జరగెను దుములంబగు సంగర మప్పుడు గగురుపాటు ♦ గల్పించును భీ
కరరీతిఁ గానఁబడుచున్, బరస్పరజయంబు లేక ♦ బళి యనఁదగుచున్. ౪౫

తే. సప్తరాత్రము లీరీతి ♦ జయము లేక
సంగరము చేయుచుండంగ ♦ శక్తిఖడ్గ
చాపములు గ్రాహములు గాఁగ ♦ సతతరక్త
ధార లంబుప్రవాహసం♦తతులు గాఁగ. ౫౫ 3512

క. మనుజాంగకములు నదిలోఁ, గనుపట్టెడు వస్తువులుగఁ ♦ గ్రాలునదులు పా
ఱెను సర్వదిశల; నంతట, ఘనబలుఁ డాభరతుఁ డప్డు ♦ కడుఁ గ్రోధమునన్.

చ. ధనువున నంత్యకాలమున ♦ దారుణరీతి జ్వలించు నగ్నియే
తనకధిదైవతంబుగను ♦ దార్కొను నస్త్రముఁ గూర్చి శత్రురా
జిని వధియించు నూహఁ గొని ♦ చెచ్చెఱ మంత్రపురస్సరంబుగాఁ
దనరెడుదాని వైచె నది ♦ తద్రిపుజాతము నాక్షణంబునన్. ౭ 3514

క. తనకాలపాశముల నయ్యని బంధింపంగ వార ♦ లాసంవర్తా
ప్రనియతధారల కోర్వక, చని రంతకుపురముఁ జేర ♦ సబలయుతముగన్. ౮

తే. క్షణములో మూఁడుకోట్ల భీ♦కరవిరోధి
వరులఁ ద్రుంపఁగ నద్దాని ♦ సురలు గాంచి
విస్మయము నొంది రీలాటి ♦ వీరు లిట్టు
లైరిగా యంచు నస్త్రమా♦హాత్మ్యమునకు. ౯ 3516

చ. పరు లిటు లంత మొందఁ బరి♦పంథియె లేమిని గేకయానుతుం
డురుబలశాలి యాభరతుఁ ♦ డొప్పుగ రెండుపురంబు లందు భూ
వరమణియాజ్ఞ నేర్పఱచి ♦ భాగ్యయుతంబుగ నొప్పునందు నుం
చె, రమణ స్వీయపుత్త్రులను ♦ జిత్తమునం గలపేర్మి పొంగఁగన్. ౧౦ 3517

తే. తక్షశిలయను పురమునఁ ♦ దక్షుఁ డనెడు
తనయునిం బుష్కలావతి ♦ యనుపురమునఁ
బుష్కలుని నుంచె గంధర్వ♦భూమి రెండు
గా విభాగించి రత్నసం♦కలితములుగ. ౧౧ 3518

క. ధనపూర్ణములుగ ఫలయుత, వనపూర్ణంబులుగ నొప్పి ♦ వరపురములు రెం
డును స్పర్ధఁ బూని గుణవిత,తిని మించుచు రుచిరములయి ♦ దివ్యంబులునై.

తే. కృత్రిమవ్యవహారంబు ♦ లెన్న లేక, యుపవనంబుల మానాళి ♦ నొప్పె; విపణి
వీథులను బాగుమీఱెను♦విస్తృతిఁగని, సౌధహర్మ్యగృహంబుల♦సమతమీఱె.

క. ప్రాసాదవిమానంబుల, భాసిలి దేవాలయముల ♦ వరుసను రుచిరం
బై సకలవస్తుసంయుతి,చే సమధిక మగుచుఁ జూడఁ ♦ జిత్రంబగుచున్. ౧౪

తే. తాళవంజులతిలకత♦మాలముఖ్య
తరునికరశోభితంబయి ♦ తగు పురద్వ
యమునఁ దనయుల నుంచి పం♦చాబ్దము లట
నుండి రామానుజుండు శౌ♦ర్యోన్నతుండు. ౧౫ 3522

క. చనుదెంచె నయోధ్యకు రా,మునిఁ జూచెడువేడ్క మిగులఁ♦బొంగఁగ సౌధం
బున నున్నరామచంద్రునిఁ, గనుఁగొని సాష్టాంగమెఱఁగి ♦ కడు భక్తిమెయిన్.

క. తను పొందినధర్మంబునఁ, గనుపట్టెడు రాముఁ జూచి ♦ కంజభవుండే
యని మ్రొక్కె వాసవునివలెఁ, దనవృత్తం బెల్ల నడుగఁ♦దా వినిపించెన్.

క. తనయులఁ బురయుగ్మంబున, నునుచుటయును వైరివితతి ♦ నోర్చుటయును జె
ప్పిన రాఘవుండు నెమ్మన,మునఁ బ్రీతిం బొంది మెచ్చె ♦ బుధనుతుఁ డంతన్.

నూటయొకటవ సర్గము సంపూర్ణము.

## ౧౦౨ - వ సర్గము.

{ లక్ష్మణతనయులను గారుపథదేశమున నిల్పి రాముఁడు భరతలక్ష్మణులను బ్రయాణము సేయుట. }

క. తనయత్నము ఫలియించిన, దని తమ్ములతోడఁ గూడి ♦ యామోదంబుం
గని యద్భుతమై పొల్చెడు, ననూనవాగమృత మొప్ప ♦ నని లక్ష్మణుతోన్.

సీ. నీకుమారులు వీరు ♦ నిఖలధర్మవిదుత్తములు చంద్రకేత్వంగ♦దులు పటిష్ఠ
విక్రమాఢ్యులు గాఁగ ♦ వెలయుచు నున్నారలటుగాన నభిషేక ♦ మాచరింతు
రాజ్యంబుఁ బాలింప ♦ రమ్యదేశం బొండు నిర్ణయింపుం డది ♦ నెమ్మి నిడఁగఁ
జాలి యసంబాధ♦మై లలి నొప్పనొ మనబాలకులనుండి ♦ మనుజపతుల

తే. కేని మున్యాశ్రమంబుల♦కేని బాధ
కలుగకుండంగవలయు న♦ట్లలరు దేశ
మొకటి తెల్పుండన న్వినిఁ ♦ యురుతరంపు
భక్తి భరతుండు నన్నతోఁ ♦ బలికె నిట్లు. ౭౪ 3527

క. నిరుపద్రవంబు రమ్యము, సరసజనాకీర్ణమునయి ♦ శుభుఁ గ్రాలు మనో
హరవస్తునిబిడమై సా,ధురతిం దగు కారుపథము♦తో యనమృద్ధిన్. ౫ 3528

క. పుర మాదేశంబున నో,ధరణీశ్వర! యంగదునకుఁ ♦ దగు నిర్మింపన్
సురుచిరశశికాంతమనో,హరనగరము చంద్రకేతు ♦ వను తనయునకున్. ౬

క. ఒనరించి యందు వారల, ననుపం దగునంచు భరతుఁ ♦ డొప్పుగఁ బల్కన్
విని రాముఁ డద్ది తగినదె, యని తాను గ్రహించి దేశ ♦ మది చారుమతిన్.

తే. చక్క విభజించి యంగదు♦సాధుమతిని,నందునుంచెను,నంగదీ♦యాఖ్యపురము
తన్నివాసమునం బొల్చె ♦ దాశరథియుఁ, బరహితంబగుకృత్యత♦త్పరుఁడుగాన.

ఆ. చంద్రకేతువునకు ♦ శౌర్యధుర్యునకు ని,తాంతధర్మమతికిఁ ♦ దగిన దనుచు
మల్లదేశమందు ♦ మహిమచేఁ దగుపుర, మొక్కఁ డూహచేసి♦యునిచె నందు.

క. అది చంద్రకాంతపురమన, విదితంబయి స్వర్గపురికి ♦ వేయిమడుఁగు లొ
ప్పిదమున నధికంబై తగెఁ;, దదనంతర మల్లములను ♦ దాశరథు లొగిన్. ౯

క. పరమప్రీతిం గాంచిరి, వరదుర్ధయు లగుట వారు ♦ పరికించి యనం
తర మభిషేక మొనర్చిరి, వరతనయుల కిరువురకు న్స♦ భావహితులకున్. ౧౦

క. ఈరీతి నాకుమారుల, కారాముఁడు రాజ్య మొసఁగి ♦ యరుగుం దని పెం
పారం బల్కుచు నంగదు, మారాభునిఁ బళ్ళిసుంపు♦మహి కరుగంగన్. ౧౦౫

తే. చంద్రకేతువు తద్భాగ♦జనపదమున
కరుగఁ దగునంచుఁ బల్కె; నా♦యంగదునకుఁ
దోడుగా లక్ష్మణుఁడు భర♦తుండు చంద్ర
కేతువునకు సాయముగ నే♦గిరి ముదమున. ౧౨ 3536

క. చని యంగదీయపత్తనమున సంవత్సరము నిల్చి ♦ భూరిబలుండై
తనయుఁడు రాజ్యం బేలఁగఁ, గని మరలి యయోధ్యఁ జేరె ♦ క్ష్మాపతిఁగనఁగన్.

చ. భరతుఁడు వత్సరంబు నటఁ ♦ బౌరుష మూని తనూజుఁ డేలఁగాఁ
బరమముదంబునం గని వి ♦ భాసుర తేజుఁడు వీఁడు గాన నేఁ
బురమున కేగవచ్చునని ♦ బుద్ధిఁ దలంచి యయోధ్య కేగి భూ
వరమణిపాద కంజముల ♦ భక్తిని గొల్చుచునుండెఁ బ్రీతితోన్. ౧౪ 3538

చ. భరతుఁడు లక్ష్మణుండు రఘు ♦ వర్యునిపాదము లాశ్రయించుచే
నిరుపమమౌ వ్రతం బనుచు ♦ నెమ్మదులందుఁ దలంచి ధర్మత
త్పరులయి కాలమేగినవి ♦ ధంబు నెఱుంగక యుండి; రంత నీ
వరుసఁ బదౌ సహస్రములు ♦ వర్షము లేగె ముహూర్తమట్లుగన్. ౧౫

క. పురజనులకార్యములఁ దత్పరమతిఁ గనుఁగొనుచుఁ బూర్ణ ♦ ధన్యమనస్కులై
సిరిఁ దగి తేజము లొప్పఁగఁ, బరఁగిరి శౌర్యముల నిలను ♦ బ్రథితులునగుచున్.

తే. అధ్వరంబుల నాహుతు ♦ లలర వేల్వ
వెలయు త్రేతాగ్నులట్టు లు ♦ జ్జ్వలతనుద్యు
తులను వెలుఁగొందుచున్ సోద ♦ రులు నలుగురు
పొలిచి రాకాలమున జను ♦ లలరునట్లు. ౧౭ 3541

నూటరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౩ - వ సర్గము.

మునిరూపమున నీశ్వరుఁడు వచ్చి శ్రీరామునితో రహస్యముగ భాషించుట.

క. చిరకాలము ధర్మపథస్థిరులగు నవ్వారలకును ♦ జెల్లె నవల నీ
శ్వరుఁ డొకమునివేషంబును, ధరియించి యయోధ్యఁ జేరి ♦ ద్వారస్థలినిన్. ౧

క. నిలుచుండి ధైర్యమునఁ దగి, విలసద్యశ మొప్ప నున్న ♦ వీరు సుమిత్రా
లలనాతనయుని లక్ష్మణు, సులలితమతి నచట నుండఁ ♦ జూచి మహాత్మా!. ౨

ఆ. కార్యగౌరవమున ♦ క్ష్మాపాలుతో మాటలాడ వచ్చినాఁడ ♦ నధిపతికిని
దెలుపు నాదురాక ♦ తెల్లంబుగాఁ బురాతనమునీంద్రు నాన ♦ తిని గ్రహించి.

క. చనుదెంచితి దూతనుగా, నను జెప్పుము రామదర్శ ♦ నము చేయంగాఁ
బనిపూని వచ్చితిని జుమి', యన నమ్మాటలకు నాత్మ ♦ నలరి యతండున్. 3

క. త్వరపడి శ్రీరామున కవ్వరమునికార్యంబుఁ దెలియఁ ♦ బలికె; నృపవరా!
పరమప్రమోదకరధర్మరతా! లోకత్రయైక ♦ రాజత్కీర్తీ!. ౪ 3546

చ. సరసిజమిత్రతుల్యరుచి ♦ శాలి తపోధనుఁ డొక్కదూత నీ
పరిసరసీమఁ జెప్పఁదగు ♦ భాషణముల్ గలవంచు వచ్చె; నా

ధరణీవిభుండు లక్ష్మణుని ♦ తద్వచనంబుల నాలకించి స
త్వరముగ నమ్మహామహుని ♦ ధన్యమునీశ్వరుఁ దోడి తెమ్మనన్. ౭ 3547

చ. విని రఘురాముసోదరుఁడు ♦ వేగమ పోయి స్వదేహకాంతులన్
గనుఁగొనఁ బ్రజ్వలజ్జ్వలన♦కల్పుఁడుగాఁ దగి లోక మెల్ల నొ
క్కనిమిషమాత్రఁ గాల్చునటు ♦ క్రాలుమహర్షిని తోడి తెచ్చె నా
మునియును రామచంద్రు ద్యుతి♦మూర్తిని గాంచి మనోజ్ఞవాక్కులన్. ౮

క. నరవర! వర్ధిల్లుము! యని, పరమాదృతిఁ బల్కె; రామ♦భద్రుఁడు తేజ
స్స్ఫురితుఁడు పాద్యం బర్ఘ్యం, బురుభక్తి నొసంగి కుశల♦మొప్పనె?మీకున్.

క. అని ప్రశ్నచేసి కనకా,సనమునఁ గూర్చుండఁ జేయ ♦ సమధికయశుఁడై
తనరారి వాగ్విదుత్తముఁ, డనఘుఁడునగు నమ్మునీంద్రుఁ ♦ డట గూర్చుండన్.

తే. స్వాగతంబె మునీశ్వరా! ♦ యాదరమునఁ
బల్కుమా దూతకృత్యంబు ♦ వైళమ యని;
రాజసింహుఁడు పల్క వి♦భ్రాజమాన
తేజుఁ డామునివర్యుఁ డా♦ధీరుఁ గాంచి. ౧౧ 3551

క. ఇరువురమే యుండఁగ ని, త్తరుణంబున నాదురాక ♦ తగుఁ జెప్పంగా
*ధరణీశ! యస్మదుక్తుల, నరుఁ డెవ్వఁడు గాని వినఁగ♦నన్ వధ్యుండౌ. ౧౨

ఆ. ఇట్లు చేయఁ బ్రతిన ♦ నిపుడు చేయుదువేని, నే వచించువాఁడ ♦ నీకు నాదు
రాక యనిన నట్లె ♦ రాముఁడు శపథంబు, చేసి లక్ష్మణునకుఁ ♦ జెప్పె నిట్లు

క. ద్వారముకడ నీ వుండుము, యేరిని రానీయఁ గూడ ♦ దిరువుర మిచటం
జేరుదుము సుమ్ము మా నుడు, లేరైనన్ వినఁగ రా ద♦హీనగుణాఢ్యా!. ౧౪

క. వినినన్ మముఁ జూడంగాఁ, జనుదెంచినఁ జంపు నట్లు ♦ శపథము నేఁ జే
సినవాఁడ ద్వారమం దే,మనుజుని నుంపకుము నీవె ♦ మరియాద తగన్. ౧౫

ఆ. నిలువు మంచుఁ బలికి ♦ నెమ్మి నాతం డుండ, నింకఁ జెప్పవయ్య ♦ శంక లేక
యోమునీంద్ర! మదిని ♦ నొప్పినదానిని, జంకుపడక నాదు ♦ స్వాంత మలర.

నూటమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౪ - వ సర్గము.

కాలుఁడు విష్ణుమూర్తివని రామునకుం జెప్పి వైకుంఠమునకు రమ్మనుట.

చ. అన విని యామునీంద్రుఁ డపు ♦ డారఘురామునితోడ నివ్విధం
బునఁ బలికెన్; మహాత్మ! నృప♦పుంగవ! యెందుల కేను వచ్చినాఁ
డనొ వినవయ్య! తెల్పెదఁ గ♦డంగి పితామహుఁ డంపె నన్ను నో
జనవర! పూర్వభావమునఁ ♦ జక్కఁగ నెన్నుమ యాత్మజుండఁ జూ!. ౧ 3557

---

* య శ్శృణోతి నిరీక్షేద్వా స వధ్యో భవితా తవ-అనిమూ.

సీ. నీమాయచేతనే ♦ నిర్మింపఁబడితిని సర్వహరుండను ♦ శమునుఁ డనఁగ
నలరువాఁడను బంక♦జాకరుం డఖిలేశుఁ డిట్లని పల్కె; న♦హీనతేజ!
జగములఁ బాలింప ♦ సమయుం బొనర్చితి పూర్వము నీమాయఁ ♦ బూని లోక
ములఁ బుట్టఁ జేసితి ♦ వలజలరాశిలోఁ బవళించి పుట్టించి♦తివి తొలి నను;
తే. నవల నుదకాళిఁ బవళించి♦నట్టి నాగు, నయ్యనంతుని బుట్టించి♦తాత్మమాయ
నవలగురుబలముల నొప్పు♦నట్టి యిరువు,రను మహాదానవుల జలం♦బునను నీవు
క. జనియింపఁ జేసితివి వా, రనుపమదోర్బలము మీఱ ♦ నమరి మధువనం
గను గైటభుఁ డనఁగాఁ దగి, రనఘా! యువ్వారియస్థు ♦ లంతటఁ బర్వెన్ ౬౪
క. గిరినికరాంచితమగు నీ,ధరణియు నవ్వారి పేరఁ ♦ దగి మేదినినాఁ
బరఁగెను; రవివలెఁ బొల్చెడు, వరనాభిసరోరుహమునఁ ♦ బరమకరుణచేన్.
క. నను బుట్టించితి వంతట, వనజాక్షా! సృష్టిచేయు ♦ పని యెల్లను నా
పనిగా నిడఁబడియెను నే, ననూనతద్భార మూని ♦ యంతట నిన్నున్. ౭౪

తే. జగములకు నెల్లఁ బతివని ♦ సంతతంబుఁ
గొల్చుచుంటిని; భూతాళి♦కోర్కు లొనఁగు
నాకుఁ దేజస్సు నిమ్ము శ్రీ♦నాథ! యనుచు
వేఁడుచుంటిని; నవ్వల ♦ విశ్వరూప! ౮ 3562

సీ. ఆసనాతనభావ♦మందు దుర్ధర్షుఁడవయి నీవు భూతాళి ♦ కభయ మిడుచు
విష్ణుత్వ మొందితి ♦ విశ్వనాథా! యంత నదితిగర్భంబున ♦ నమలతేజ
మలరఁ బుట్టిన యింద్రుఁ ♦ డఖిలజగంబులఁ బాలింప నతనికిఁ ♦ బటుసహాయ
మొనరింప నెంచితి ♦ వుగ్రదైత్యులబాధ నంది తపించెడు ♦ నఖిలభూత
తే. ములను గాపాడ రావణుఁ ♦ గలనఁ జంప
మనుజతను గంటి వీకృత్య♦మున గతించెఁ
బదునొకొండు సహస్రముల్ ♦ వత్సరములు
కాఱతలేకుండఁ జాలదే? ♦ క్షోణివసతి. ౧౧౪ 3563

క. వనజాక్షుండవు నీవే, మనోమయాత్మజుఁడ విష్ణు ♦ మనుజతకు గతిం
చెను బూర్ణాయువు దీనన్, గనుమా కాలంబు దీఱెఁ ♦ గద యని యింకన్.
తే. ఇంకఁ గొంతకాలంబు నీ ♦ విల వసించి
ప్రజలఁ బాలింపఁదలఁచినఁ ♦ బరముదము
నంది వసియింప నచ్చునం ♦ చని యొ బ్రహ్మ;
యెంచుమా యిందుఁ జేయంగ ♦ నేది హితమొ. ౧౮ 2565
క. సురలోకజిగీషయె యి, త్తరుణంబునఁ గోరుదేని ♦ ధన్యులు గద? ని
ర్జరులు సుఖింతురు విగత,జ్వరులై విష్ణువగు నీదు♦సన్నిధి మిగులన్. ౧౫ 3566
క. అని యిట్లు బ్రహ్మవాక్యం,బును గాలుఁడు తెల్ప హాస♦మున సోము చెలం

గను సర్వహారణమును నెమ్మనమునఁ గాంక్షించి నృపతి♦మండనుఁ డనియెన్.
క. సురపూజ్యుని వాక్యంబును, బరమార్థము వింటి దానఁ ♦ బరమామోదం
బు రహిం జేకూరె మహా, త్తరమోదము నీదురాకఁ ♦ దనరె మహాత్మా!. ౧౬
తే. ముజ్జగంబులకుం గార్య♦ములు ఫలింప
జనన మొందితి మేలగు ♦ ననఘ! నీవు
వచ్చెదను మర్త్యభూమికి ♦ వచ్చినట్లు
మరల నిజధామమునకు బ్ర♦హ్మనుడిరీతి. ౧౭ 3569
క. మనమున నున్నదియే నీవున దెల్పితి నీదురాకఁ ♦ బొంగె మనము రో
జన లేదు నుంతయున్ నా, కనఘా! సురకార్య మిట్లు ♦ సార్థక మయ్యెన్. ౧౮
క. వనజాసనుండు చెప్పిన,యనువునఁ గార్యంబు చెల్లు ♦ నఖిలము శమనా!
చనవయ్య! శంకయించుక,యును మనమునఁ బొందకుండ ♦ నుచ్యమ మలరన్.
నూటనాల్గవ సర్గము సంపూర్ణము.

---

౧౦౫ - వ సర్గము.

—రాముఁడు కాలునితో సంభాషించుతఱి దుర్వాసుండు వచ్చెనని లక్ష్మణుఁడు చెప్పుట—

క. అని యిట్లు రామచంద్రులు, మనమునఁ గలభావములను ♦ మన్ననతో నా
వనజాసనోక్తి గానం,గను బల్కుచునున్నయట్టి ♦ కాలమునందున్. ౧ 3572
క. మునిపతి దుర్వాసుఁడు వచ్చెను రామునిదర్శనంబు ♦ చేయఁగ ద్వారం
బున; కంత లక్ష్మణుఁడు వందనములు సల్పెను భయంబు ♦ తా నొందివిధిన్.
క. రామానుజుఁ గని యిట్లను, నామౌనివరుండు వేగ ♦ యవనీశుని శ్రీ
రాముని జూపుము కోరిక, నామదిఁ గల దద్ది తీర్చు ♦ నాథుఁ డతండే. ౩
చ. అన విని లక్ష్మణుండు పర♦మాంత మునీంద్రుని వందనంబులం
దనిపి వచించె నీగతిని ♦ ధాత్రిసురోత్తమ! కార్య మెద్దియో
వినవలతుం బనేదయిన ♦ వే యొనరింపఁగఁ జాలువాఁడ నా
మనుజవిభుండు కార్యభర♦మగ్నుఁడు గాన క్షణంబు నిల్వుమా. ౪ 3575
చ. విని యిటు పల్కు నానృపతి♦వీరకుమారునిభాషితంబు నా
మునివృషభుండు క్రోధరస♦మున్ వెలివుచ్చుచు నేత్రవహ్నిచే
తను దహియించువానివలె ♦ దారుణవాక్కుల నిట్లు పల్కె; నా
పనువున రామభద్రునకు ♦ వైశమ తెల్పుము నాదురాకనున్. ౫ 3576
తే. ఈక్షణంబున నారాక ♦ నెఱుకపఱుప
నిష్టపడవేని రాజ్యంబు ♦ నీపురంబు
రామునిం గూడ శపియింతు ♦ రాముసంత
తిని నిన్ను భరతుని సంత♦తిని విడువక. ౬ 3577

క. మనమునఁ గల్గినక్రోధం,బును నిల్పఁగఁ జాల ననుచు ♦ మునిపతి ఘోరం
బు నిశాతవజ్రకల్పం,బును నగు వాక్యమును బల్కు ♦ మోముకలంగన్. ౯

సీ. మనమున నిట్లు ల♦క్ష్మణుఁడు చింతించె; నీముని నిశ్చయంబి ద♦మోఘ మరయ
నాకు నొక్కనికె యా♦నరపతి మాటను దాఁటినందులకు నం♦తంబు గలుగుఁ
గాని యందఱ కది ♦ కల్గక యుండెడు; నని చక్కఁగా నెంచి ♦ యమునిపతికి
విన్నవించెను ముని♦వృషభునాగమనంబు విని తమ్ముమాట నా♦విభుఁడు కాలు

ఆ. సాగనంపి భక్తి♦సాంద్రుఁడై యెదురేగి
యత్రితనయుఁ గాంచి ♦ యగ్నివోలెఁ
దనదు తేజమునను ♦ దగ వెల్గు నమ్ముని
కెరఁగి దోసిలొగ్గి ♦ హితము మెఱయ. ౧౧ 3579

క. తెలుపుము మునినాయక! యిమ్ముల వచ్చిన కార్య మేమొ ♦ ముందుగ నన స
ప్పలు కాలకించి మునిపతి, యలరుచు నిట్లనియె సూనృ♦తాదృతమనసా!. ౧౨

తే. ధర్మవత్సల! వినవయ్య! ♦ తపము చేయ
వేయి వర్షము లయ్యె నే ♦ వితతదీక్ష
మొదలుపెట్టి, యీదినమున ♦ కది ఫలించె
వలతు నిష్టభోజనము నీ♦వలన నేను. ౧౩ 35౬1

చ. అన విని రాఘవుండు కడు ♦ హర్షము మీఱఁగ భోజనంబు న
మ్మునివరుకోర్కిరీతిగను ♦ ముందుగ సిద్ధము చేయఁబంచి యా
తని కెఱఁగించె; నంత నమృ♦తం బనఁగాఁ దగు నిష్టభోజనం
బునఁ గడుఁ దృప్తిఁ బొందిఁ రఘు♦పుంగవు మెచ్చుచు నాతఁ డేగఁగన్. ౧౪

క. తనయాశ్రమంబునకు నా,ముని చన లక్ష్మణుని యన్న ♦ మును కాలునితోఁ
దనచేసిన శపథంబును, మనమున యోజించి దుఃఖ♦మగ్నుండయ్యెన్. ౧౫

సీ. కాలువాక్యంబులఁ ♦ జాల లోఁ జింతించి దుఃఖాబ్ధిమగ్నుఁడై ♦ తోఁప కూర
కుండి యాపద్ధతి ♦ యురుభయంకరరీతిఁ గన్పడ స్మరియించి ♦ కడుఁ దపించి
దీనాననుండయి ♦ మానసం బుత్తలపాటొందఁ బలుకక ♦ పార్థివేంద్రుఁ
డొకకొంతసే పూర♦కుండి కాలునివాక్యపద్ధతి మరల సు♦స్వాంతమందు

తే. నెంచి కార్యంబు లేదని ♦ మించువగలఁ
బొగిలి లక్ష్మణుకూర్మిని ♦ బొగడి యేమి
చేయఁ దోఁపమిఁ దల వాంచి ♦ యాయనూన
యశుఁడు చింతాసముద్రమ♦గ్నాత్ముఁ డయ్యె. ౧౬ 3581

నూటమ్యైదవ సర్గము సంపూర్ణము.

---

* సాధు రామేతి సంభాష్య స్వమాశ్రమ ముపాగమత్, తస్మిన్గతే మునివరే-అనిమూ.

## ౧౦౬ - వ సర్గము.

రాముఁడు లక్ష్మణుఁ ద్యజింప నతఁడు వైకుంఠమున కరుగుట

[క. మనమునఁ గలవిలపాటును, గనుచుండె మూకత్వ మొంది ♦ కడు నిట్టూర్పుల్
గనఁబడ నశ్రువు లొప్పఁగఁ, *పనుఁ దానే తిట్టుకొనుచుఁ ♦ దహతహపడుచున్].

తే. మోము వాంచి దీనుండయి ♦ సోమురీతి
జలకణము లొక్క మొగిఁ బడ ♦ జాలినొందు
రామునిం గాంచి లక్ష్మణుం ♦ డీమెయిఁ దగఁ
బలికె మధురతరంబగు ♦ భంగి మెఱయ. ౨ 3586

క. గురుబాహూ! నాకొఱకై, పరమంబగు తాప మొందఁ ♦ బనిలేదు మహీ
శ్వర! కాలగతులు పూర్వమె, నరులను బంధించి యుంచు ♦ నా విందుముగా.

క. నను విడువుము శపథంబును, జననాయక! చెడక యుండు ♦ చందంబునఁ గా
వను జను శపథము దీర్పని, మనుజులకున్ నరక మబ్బు ♦ మాట లిఁకేలా?.

క. కలదే నాపైఁ బ్రేమము, పలుకక నన్నుం ద్యజింపు ♦ పరమకరుణగాఁ
దలఁచెద సందియ మందకు, మిల ధర్మము నిల్పుటొకఁడె ♦ హితము మహాత్మా!.

చ. అని యిటు లక్ష్మణుండు పర ♦ మాద్భుతరీతి వచింప మంత్రులన్
ఘనమతులౌ పురోహితులఁ ♦ గ్రన్ననఁ బిల్వఁగఁ బంచి రాముఁ డా
ర్తిని దనయంగముల్ కలఁగఁ ♦ దేకువమాలి వచించె వారితోఁ;
దనకును రుద్రమూర్తికి య ♦ థావిధి సాగినవృత్త మాస్థుఁడై. ౬ 3590

తే. నడుమ దుర్వాసురాకయుఁ ♦ గడఁగి యతఁడు
శపథమును జేయుటయుఁ దెల్ప ♦ సచివవర్యు
లును బురోహితపుంగవు ♦ లును వినియును
బలుక కుండ నసిష్ఠుఁ డు ♦ జ్జ్వలతనుండు. ౭ 3591

క. మనమునఁ జింతించి వచించెను; గాంచితి శాస్త్రరీతి ♦ చే గద్గురుపా
టును బొందఁజేయు వార్తను, వినిపించెద మీకు సాగు ♦ విరహం బింకన్. ౮

క. అనుజుని కూటమి వదలం, జను నీకు మహాయశంబు ♦ శుభ గల్గిన యో
జననాథ! వదలుమా నీ, యనుజుని కాలంబు ప్రబల ♦ మై తోఁచెడుఁ జూ!. ౯

క. పరిపాలింపుము శపథము, ధరణిని సద్దానినిన్ వృ ♦ థా చేసిన ను
ర్వర ధర్మము విలయంబగుఁ, జరాచరం బెల్ల ధర్మ ♦ సంతతి నలరున్. ౧౦

ఆ. అద్ది చెడిన నదియు ♦ సంతంబు గను దేవ
మునులు చెడుదు, రమల ♦ ము గద ధర్మ
పథము దానిఁ గాంచు ♦ పద్ధతియే మేలు
శంక యేల? విడువఁ ♦ జను ననుజుని. ౧౧ 3595

* సాస్త్రం నిందమానం ప్రియాప్రియే-అనిమూ.

క. పురుషవరా! ముజ్జగములఁ, బరిపాలన మొప్పఁ జేయు♦పద్ధతిఁ గొను సో
దరులక్ష్మణు విడనాడుము, సురమనుజుల నవ్విషమతుల ♦ సొరిది నొనర్పన్. ౧౨
క. [మనమున నెంచుము సద్గుణ,ఖనియగు సౌమిత్రిఁ బాయఁ ♦ గాదని తలపో
యను జన్ని దేవకార్యం, బునకయి త్వరపడుట లెస్స ♦ భూపాలమణీ!.] ౧౩
చ. అనుజునిపైనఁ గల్గు ఘన♦హార్దమునన్ శపథంబు మానఁగాఁ
జనునె? కకుత్స్థవంశఘన♦సాగరచంద్ర! ప్రతిజ్ఞ నీవె మా
నిన నృపధర్మ మెల్లఁ జెడు ♦ నిష్ఫలమౌఁ గద రాజ్యపాలనం
బనఘ! ప్రతిజ్ఞకై నిను మ♦హాటవి కంపఁడె తండ్రి యాతఁడున్. ౧౪ 3598
క. ఇది ప్రత్యక్షమె కాదే, ముదిమిని గనియున్ మహత్త్వ♦మునఁ బొల్చిన యా
త్రిదివేశసముఁడు దశరథుఁ,డు దగన్ సత్యంబు నూనఁ♦డు గదా? రామా!.
క. నిను విడనాడినశోకం,బునఁ గద? స్వర్గంబుఁ జేరె ♦ భూపతి నీ వా
తనిరీతి సత్యశపథుం, డనుపేరును గాంచవలదె? ♦ యార్యగణమణీ!. ౧౬ 3600
తే. మేరుమందరభూధర♦పార మంటె, నీదుసద్యశ మల్లాట ♦ నిఖిలజగము
లలరఁగా లక్ష్మణుని బాయ♦వయ్య! సత్య,పాలనంబున వృద్ధిని♦బడయువయ్య!.
చ. అని యిటు లానభాభవన♦మందు సదస్యులు మెచ్చ ధర్మమున్
గనఁబడఁగా వసిష్ఠముని♦కాంతుఁడు పల్కిన నాలకించి యా
యనుజుని గాంచి రాముఁ డిటు ♦ లార్తి వచించెఁ; ద్యజించినాఁడని
న్ననుపమధర్మహానియగు ♦ నన్న భయంబున లక్ష్మణా! యిఁకన్. ౧౮ 3602
క. చనుమా తోఁచినరీతిగ;, విను వదలుట చంపుటయును ♦ విజ్ఞు లొగి సమం
బని తలఁతురు నా విని రా,ముని వాక్యము బాష్పపూర♦మునఁ గనులొప్పన్.
క. అన్నకు వందన మొనరిచి, యిన్నాళుల కిట్టు లాయె♦నే యని మదిలో
నెన్నుచు నింటికిఁ బోవక, క్రన్ననసరయూతటంబుఁ ♦ గానం జనియెన్. ౨౦
చ. చని సరయూనదిం గనుచు ♦ సాధుమతిం గరము ల్జొగిడ్చి నె
మ్మనమున రాముని గనుచు ♦ మాటలు పల్కక యింద్రియంబులన్
దనవశమందు నుండెడు వి♦ధంబున యోగము పూని యూర్పులై
సను వెలిబుచ్చ కందు నవి♦నాశన మాపద మాత్మ నెంచుచున్. ౨౧ 3605
తే. [అక్షరంబు సనాతన ♦ మమలతరము
బ్రహ్మ మవ్యక్తతత్త్వంబు ♦ వాసుదేవ
నామకమునగు తనరూప ♦ మామహాత్ముఁ
డాత్మఁ జింతించెఁ బూనిక ♦ యలరుచుండ. ౨౨ 3606
క. అనుపమయోగసమాహిత,మనసున నిశ్శ్వాసయుక్తు ♦ మహనీయుని నా
తని నచ్చరులును శక్రా,దినిఖిలనిర్జరులు మౌని♦ధీరులు గనుచున్. ౨౩ 3607
క. కురియించిరి సుమవృష్టిని, బరముం డాతండు మనుజ♦పరుల కదృశ్యం

దురసత్త్వుండయి తనతను, వరుదుగ గ్రహియించె శత్రుఁ ♦ డాతనిఁ బ్రీతిన్.

క. కొని చనియె స్వర్గమున; కా, వనజాక్షుచతుర్థభాగ♦వరము సురపసం
బున కేతెంచుటఁ గని సుర, లనూనహర్షంబు పొంది ♦ యర్చించి రొగిన్.

నూటయాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౭ - వ సర్గము.

రాముఁడు భరతప్రార్థనమురీతిఁ గుశలవులకుఁ బట్టాభిషేకము చేయుట.

క. అనుజుని లక్ష్మణు నీరీతిని ద్యాగము చేసి నెమ్మ♦దిని *వగ శోకం
బును గదురఁ బురోహితు మం, త్రినికరమును బౌరవరుల ♦ ధీరుం డంతన్. ౧

క. పిలిపించి వారితో నిటు, పలికెన్; ధర్మాత్ముఁడైన ♦ భరతుని నీకో
సలదేశంబుల నేలఁగ, సలఘుతరప్రీతిఁ జేయఁ♦సగుఁ బతి గాఁగన్. ౨ 3611

తే. ఇప్పు డభిషేక మొనరుప ♦ నిచ్చగింతు
నీయయోధ్యకుఁ బతిఁ జేసి♦యే వనంబుఁ
జేర నరిగెద; వస్తువుల్ ♦ సిద్ధపఱుపుఁ
డింకఁ గాలంబుఁ బుచ్చరా ♦ దిపుడె నేను. ౩ 3612

చ. వనమున కేగువాఁడ గురు♦భావుఁడు లక్ష్మణుఁ డేగె నట్టు, లా
తనిగతి నొందువాఁడ నని ♦ ధారణిభర్త వచింపఁ బౌరు లా
ర్తిని దలలొగ్గి మ్రొక్కి యతి♦దీనత సత్త్వము దూలినట్లు లుం
డ నపుడు రామువాక్కులక♦డంకకు మూర్ఛిలి యాసభాస్థలిన్. ౪ 3613

క. భరతుఁ డొకకొంతసేపటి, కరుదుఃఖము మిగులఁ దెలిసి ♦ యుర్విని గొను నా
దరమును బూనక యిట్లను, ధరణీశా! పల్కువాఁడఁ ♦ దథ్య మ్మిచటన్. ౫

తే. సత్యమును సాక్షిగా నేను ♦ శపథ మిపుడు
చేయుచున్నాఁడ స్వర్గంబు ♦ సిద్ధ మిదిగొ
యనిన నే నొల్ల నిను వీడి♦నట్టులైన
రాజ్య మేఁ గోరుదునె రఘు♦రాము! యింక. ౬ 3615

క. వీరే కుశలవు లిపు డీ, ధారణిఁ బాలింపఁ గట్టఁ ♦ దగుఁ బట్టంబుల్
భూరమణ! కోసలమునకుఁ, దా రాజగుఁ గుశుఁడు నాదు♦తాత్పర్య మిదా.

తే. ఉత్తరంబగుకోసల ♦ మొప్పు లవుఁడు
పాలనము చేయఁగాఁ దగుఁ ♦ దవ్వరగఁ బోవు
దూత లేగి శత్రుఘ్నుని ♦ దోడితేర
గాఁ దగున్, దూత లీరీతి♦గా ననఁదగు. ౮ 3617

---

* దుఃఖశోకసమన్వితః-అనిమూ.

క. మనపయనము స్వర్గంబున, కని యాలస్యంబు చేయ ♦ కచటు వదలి ర
మ్మని పల్కెఁ జనుల నాభర,తుని పల్కుల నాలకించి ♦ తోరపువగలన్. ౮౫

క. పౌరులు మోముల వంచుచు, భూరితరంబైన చింతఁ ♦ బూన వసిష్ఠుం
డీరీతిఁ బల్కెఁ; వత్సా!, భూరమణా! రామచంద్ర! ♦ పురజను లెల్లన్. ౯

చ. ధరణిని దూలినారు జన♦తాహృదయేప్సిత మాత్మ నెంచి యా
దరమున దానిఁ దీర్పఁదగుఁ ♦ దప్పక వారల కప్రియంబు లే
వరునను జేయఁగాఁ దగదు ♦ వారలకోరిక యెట్లొ దాని భూ
వర! వినుమన్న నమ్మునిని ♦ భక్తిఁ గనుంగొని లేచి రాముఁడున్. ౧౧ 3620

ఉ. పౌరులఁ గాంచి యిట్లనియెఁ; ♦ బల్కుఁడు నే నొనరింప నర్హమై
ధారణి శాస్త్రరీతికిని ♦ దా నెటులే నవిరుద్ధమైన య
ట్లారసి తెల్పుఁడీ! యనిన ♦ నాపురవాసులు పల్కి రిట్టు లో
ధారణినాథ! నీ వరుగు ♦ ధాత్రికి వత్తుము తప్ప కే మొగిన్. ౧౨ 3621

చ. పురజనులందుఁ బ్రీతియును ♦ బొల్పగు స్నేహము మీకుఁ గల్గినన్
ధరణిఁ ద్యజించి పుత్త్రులను ♦ దారలఁ గూడి భవత్పదంబు నా
దరమునఁ బొందఁ గోరుదుము ♦ దాని గ్రహింపఁగ నౌను రామ! నీ
వరుగుపథంబు సత్తపము♦నందు వనంబయినన్ మనోజ్ఞమా. ౧౩ 3622

సీ. దుర్గమంబైనను ♦ స్వర్గతుల్యంబగునదిగాని జలధియో ♦ యైనఁ దలఁప
మాకు నిష్టంబగు ♦ నేకడ నేగిన వత్తుము మము వీడ ♦ వలనుగాదు
ప్రభువు నీవే కాదె ♦ పరమగతియు నీవె సంప్రీతియును నీవె ♦ సాధుదైవ
తము నీవె మాహృద్గ♦తంబగు కాంక్షయు నీవె మే మెల్లను ♦ నీపరిసర

తే. మున వసింపఁగఁ దలఁతుము; ♦ చనదు మమ్ము
వలదనుచుఁ బల్క నని యిట్లు ♦ పలుకుచున్న
పురజనులదృఢభక్తికిఁ ♦ బొంగి యట్లె
చేయవచ్చు నటంచని ♦ క్షితిపుఁ డనియె. ౧౪ 3623

క. అని యిట్లు పలికి తనదు గ,మన మాదిన మందె యనుచు ♦ మది నెంచి తనూ
జుని గుశుని గోసలంబున,కు నుత్తరపుఁగోసలమున♦కును లవు నునుపన్. ౧౫

క. తనమదిని నిశ్చయించుచు, దినమున నందే కుమార♦ధీరుల కభిషే
కనితాంతమహము గల్గఁగ, నొనరిచె నాపురమునందె♦యొప్పు మెఱయఁగన్.

చ తనయుల నంకమందు నిడి ♦ తాను దృఢంబుగఁ గౌఁగిలించికొం
చును శిరముల్ మహాదృతిని ♦ సొంపు దగన్ స్పృశియించి యంత స్యం
దనములు వేయి యేన్గు లయు♦తంబును లక్షహయంబులన్ ధనం
బును దమిఁ దుల్యరీతిగను ♦ భూవరుఁ డిచ్చెను బూన్కిమీఱఁగన్. ౧౭

క. ధనముల రత్నంబుల నొ,ప్పినపురముల వారి కొనఁగఁ ♦ బృథుమోదరసం
బున నొప్పుజనము లలరఁగ, ధనపతినగరంబునాఁగఁ ♦ దనరెడువానిన్. ౧౯

క. తనయుల నిరువురఁ బంపెను, జననాథుఁడు నృపులఁ జేసి ♦ చయ్యనఁ బ్రీతిన్
జనములఁ బాలింపఁగ వీ,రనిచయపూజ్యులను ధర్మ♦రంజితతనులన్. ౨౦

తే. ఇట్టు లిరువురఁ దనయుల ♦ నిలకుఁ బాల
కుల నొనర్చి శత్రుఘ్నునిఁ ♦ బిలువ దూత
లను మహావేగవంతులఁ ♦ బనిచె భరతు
వాంఛితమురీతి సొనర♦వర్యుఁ డంత. ౨౧ 3629

నూటయేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౮ - సర్గము.

{ రాముఁడు శత్రుఘ్నసుగ్రీవులు తనతో రా ననుజ్ఞ యొసఁగి హనుమ
ద్విభీషణజాంబవదాదుల భూమి నిల్వ ననుజ్ఞ యొసఁగుట. }

ఉ. రామునియాజ్ఞఁ బూని రఘు♦రామునితమ్ముని గాంచు వేడ్కను
ద్దామబలాతివేగముల ♦ ధాత్రిఁ బ్రసిద్ధిని గన్న దూత లా
భూమిపతీంద్రుఁ డున్నెడకుఁ ♦ బోయిరి త్రోవను జాగుసేయకే
యామధురాపురంబును ద్రి♦యామల మూటను బొంది యచ్చటన్ ౧ 3630

తే. అరినిషూదను శత్రుఘ్ను♦నందుఁ గాంచి, వృత్త మెల్లను దెల్పి; ర♦వ్వీరవరుఁడు
లక్ష్మణత్యాగమును నృప♦లలితు ప్రతిన, కుశలవాభిషేకంబును ♦ గోరి ప్రజలు.

చ. అనుగమనంబు వేఁడ నృపుఁ ♦ డట్టులె చేయఁగ సమ్మతించుటల్
తనయులలోన జ్యేష్ఠుఁడయి ♦ దర్పయుతుండును నౌ కుశాఖ్యు విం
ధ్యనికటమందు భాగ్యములఁ ♦ దద్దయు నొప్పు కుశావతీపురం
బున కధినాథుఁ జేయుట ల♦వుండను చిన్నకుమారు వీరునిన్. ౩ 3632

క. శ్రావస్తి యనుపురంబున, కావిధమున రాజుఁ జేసి ♦ యభిషేకము నా
భూవిభుఁడు చేయుటయు విని, యావిధముననయ్యయోధ్య♦యందలి ప్రజలన్.

క. తనతోడ రాఁగ ననుమతి, జనపతి యిడి నిర్మనుష్య♦సంకీర్ణగఁ జే
యను దలఁచుట భరతుండును, దనతో రా స్వర్గమునకుఁ♦బరలఁ దలఁచుటల్.

తే. వినియె సర్వము దూతలు ♦ విస్తరించి
తెలుప నాదూత లివ్విధిఁ ♦ దెల్పి యూర
కుండ మహితుండు శత్రుఘ్నుఁ ♦ డుగుజవమున
రమ్మనిన వారిపల్కుల ♦ నెమ్మదిఁ గొని. ౬ 3635

సీ. ఘోరాతిఘోరమై ♦ కులసంక్షయంబగు వార్తకు నెంతయు ♦ వనట నొంది
ప్రజలను రావించి ♦ పరమమునీంద్రుఁడై కాంచనాహ్వయమునఁ ♦ గ్రాలు నట్టి

తనపురోహితుఁ బిల్చి ♦ తద్వార్తలను యథావిధిగ నెఱింగించి ♦ విమలమతుల
నన్నలఁ గూడి తా ♦ నరుగం దలంచుట తెలిపి వారల సమ్మ♦తిని గుమార
తే. యుగళమున కభిషేకంబు ♦ నొప్పఁ జేసి
మధురను సుబాహువునకుఁ గు♦మారులందు
నగ్ర్యునకు శత్రుఘాతి నా ♦ నలరు చిన్ని
తనయునకు వైదిశం బనఁ♦నగు పురంబు. ౯ 3636
క. పరిపాలింపఁగ నిచ్చి మ,ధురఁ గల వాహినులఁ బంచి ♦ తోడనె వారి
ర్వుర కిచ్చి ధనము నట్టులె, యిరువురకు నొసంగి వారి ♦ కెల్ల తెఱఁగులన్.
తే. ధర్మములఁ దెల్పి మధురయం♦దర్మిలిఁదన, జ్యేష్ఠపుత్త్రు సుబాహుని♦జిన్నతనయు
వైదిశంబను పురమునఁ ♦ బాలకులుగ,నుండనియమించి తాఁబోవ♦నుద్యమించి.
క. అరదం బొకండు తనతో,నరుదేరఁగఁ బంచి రాము♦నంతికమున కా
తురుఁడయి చని కనుఁగొనియెన్,బరమేష్ఠిముఖార్చితాంఘ్రి♦పంకజు రామున్.
క. జ్వలియించుచున్న పావకు,వలెఁ దేజస్స్ఫూర్తి నొప్పు♦వానిని ధర్మం
బులఁ దెల్పు మునులతోడం, గలిసి మహాసూక్ష్మమైన ♦ క్షౌమాంబరమున్.
క. ధరియించి యలరువానిన్, బరమాద్భుతిఁ గాంచి భక్తి ♦ వందన మిడుచున్
గరములు ముకుళించి నరే,శ్వరుతో నిట్లనియె ధర్మ♦వత్సలతఁదగన్. ౧౩
క. తనయుల నభిషేకించితి, ననఘా! నియతేంద్రియుండ ♦ నైతిని నీతోఁ
జనుదేర నిశ్చయించితి, నని యెఱుఁగుము వేఱురీతి ♦ ననఁ బూనకుమీ!.
క. ఆనతిఁగూడ నొసంగకు, మానినకృప నన్నుఁ జూడు ♦ మోరఘునాథా!
నా ననిని యవికృతస్థిర,మానసచింతం దలంచి ♦ మహిపుఁ డతనితోన్. ౧౬
క. చనుదెమ్ము నన్నుఁ గూడియె, యనుజా! చింతిపవలవ ♦ దనియె; నపుడె రా
మునివాక్కు ముగియకుండం,గనె స్వేచ్ఛారూపులైన ♦ కపివరు లెల్లన్. ౧౭
తే. భల్లుకంబులు రాక్షస♦వశ్యు లర్క,తనయు ముందిడుకొని వచ్చి ♦ రనఘు లెల్ల
వేనవేలుగ శ్రీరామ♦విభునిఁ జూడ,స్వర్గమున కాతనిం గూడి♦చనఁగఁ బూని.
క. చనుదెంచి స్వీయలోకం,బునకుం జన నుద్యమించు ♦ భూపాలమణిం
గని; రంత దేవతనయులు, మునిగంధర్వాత్మజులును ♦ భూపతి దివికిన్. ౧౯
క. అరుగం దలఁచుట తెలిసియె, యరుదెంచిరి వార లెల్ల ♦ నభివాదనముల్
పరమప్రీతి నొనర్చిరి, కర మార్తిం బల్కి రిట్లు ♦ కపిరాక్షసులున్. ౨౦ 3647
కనిరుపమకీర్తీ! రామా!, సురపురినిన్ నిన్నుఁ గూడి ♦ చొత్తుము మము నీ
ధర విడిచి మీర లేగినఁ, బరుషాంతకదండముననె ♦ పటుకోపమునన్. ౨౧
తే మమ్ము దండించినట్లు నె♦మ్మదులఁ దలఁచి
యిట వసింతుము నా విని ♦ యెలమి నవ్వి
యట్లె కానిం డటంచు నా♦యధిపుఁ డనియె;
నంత సుగ్రీవుఁ డాభూప♦కాంతు వీరు. ౨౨ 3649

చ. కనుఁగొని వందనంబు లిడి ♦ కమ్రవచస్సుల హృద్గతార్థముల్
మనవి యొనర్చె నిట్లు; రఘు♦మండన! వీరుని సంగరుల్ బుకం
బున కభిషిక్తుఁ జేసి నినుఁ ♦ బూనికఁ గొల్వఁగ వచ్చినాఁడ నీ
యనుగమనంబె కోరితి దృ♦ఢాత్మ నటంచును లోఁ దలంపుమా. ౨౪ 3550

చ. అన విని యన్యచిత్తముల ♦ నారసి రంజిలఁ జేయు రాముఁ డి
ట్లనియెను వానరేంద్రుఁ గని ♦ యాతని నెయ్యము లోఁ దలంచి; యో
వనచరనాథ! మిత్రుఁడవు ♦ బంధులకన్నను నీవె యెక్కుఁడం
చును మది నెంచినాఁడ, నినుఁ ♦ జూచిన సంతస మబ్బె నామదిన్. ౨౫

క. నినుఁ గూడక సురలోకం,బును సంతకు మించు స్థాన♦మును బొందఁ దలం
పను జుమ్మటంచు నంతట, వనచరభల్లూకదనుజ♦వారమునుదులన్. ౨౬

క. వినుచు విభీషణు నాదృతిఁ, గని మధురము మృదువునైన ♦ కమ్రవచనముల్
వినిపించె నిట్లు; ధరణిన్, మనుజులు చెలువారుదనుక ♦ మహిని వెలయఁగన్.

క. తనువును దాల్తువు నీవును, దనుజేంద్రా! భూరివీర్య! ♦ ధరణి వెలయుదాఁ
కను లంకనుండి రాజ్యం,బును పాలన మొప్పఁ జేయఁ ♦ బూనుముసౌమ్యా!.

క. దినకరశశధరు లుర్వియుఁ, గను స్థితి నెందాఁక నాదు♦కథ యిల నెందాఁ
కను బొల్చునో నీరాజ్యం, బనఘాత్మా! యంతదనుక ♦ నలరున్ స్థిరమై. ౨౯

చ. అనుపమమిత్రభావమున ♦ నాజ్ఞ యొనర్చితి, నాదుశాసనం
బును గొని యీవిధిన్ నడువఁ ♦ బూనుట లెస్స నిరంతరంబు ధ
ర్మనిరతి నీప్రజాతతిని ♦ మన్ననమీఱఁగఁ బ్రోచుచుండు మే
మనకుము నాదువాక్కునకు ♦ నన్యవిధంబగురీతి నోసఖా!. 30 3555

సీ. మఱియు వేఱొక్కండు ♦ మాటను జెప్పెద సన్మతీ! [1]యిక్ష్వాకు♦జనపతులకుఁ
గులదైవతంబయి ♦ విలసిల్లు నాజగన్నాథు వాసవముఖ్య♦నాకివితతి
పూజ్యు నారాధింపఁ ♦ బూనుము సర్వదా; యన విని రామువా♦క్యంబు నట్లె
యొనరింతు నని శిరం♦బునఁ దాల్చె నాజ్ఞను; రాక్షసముఖ్యుఁడై ♦రమ్యగుణవి

తే. భూషితుండయి పొల్చు వి♦భీషణునకు,నివ్విధిం దెల్పి హనుమంతు ♦ నిద్ధతేజుఁ
గాంచి యీవిధిఁ బల్కెనో♦గాలితనయ!, [2]బ్రదికియుండఁబ్రతిజ్ఞను♦బల్కితీవు.

క. దానిని వృథచేయకుమా, నానిర్మలగాథ జగము♦నను నెందాఁకన్
మానితరీతిఁ జెలంగునొ, వానరవర! యంతదనుక ♦ వర్ధిలవయ్యా!. 3౪ 3558

క. మనమున నిరంతరప్రీ,తిని బొందుచు నాదునుడిని ♦ దవిరి ప్రపంచం
బున విస్తరిల్లఁ జేయుచు, మనవయ్యా! సాధుమనుజ♦మండలనుతులన్. 3౫

చ. అని రఘురాముఁ డెంతయును ♦ నాదృతి సన్మతి నెంచి పల్కినన్
విని సుమహాప్రమోదమున ♦ విన్నప మివ్విధిఁ జేసెఁ జాలఁ బా

1 ఆరాధయ జగన్నాథ మిక్ష్వాకుకులదైవతం, ఆరాధనీయ మనిశం సర్వ దేవైః సవాసవైః-అనిమూ. ౹ విభీషణము యుద్ధకాండమున వ్రాయఁబడినది కాన నిటవ్రాయఁబూనలేదని గ్రహింపనది. 2 జీవితే కృతబుద్ధి స్త్వం మా ప్రతిజ్ఞాం వృథా కృథాః-అనిమూ.

వనఘుగు నీచరిత్రము సు♦వర్ణితమై ధర నెంతదాఁక స
జ్జనుల మదిం జెలంగెడునొ ♦ సాధుతమంబగు యుష్మదాజ్ఞ చేఁ. ౩౫ 3660

ఆ. అంతదాఁక నుండు ♦ నవనీస్థలంబున, నని వచింప; రాముఁ ♦ డంత బ్రహ్మ
తనయు జాంబవంతు ♦ వినుతుని వృద్ధుని, గాంచి యిట్లు పల్కె ♦ గారవమున.

క. సుందరరూపంబునఁ దగు, మైందద్వివిదులను బ్రహ్మ♦మానసజుఁ డనం
గం దగు జాంబవదాదుల, బృందముగా నొప్పుపంచ♦వీరుల కెలమిన్. ౩౬

[1]క. కలియుగము వచ్చునందాఁక లలిన్ జీవించియుండఁ♦గాఁ దగునని సొం
పలర వచియించి మిగిలిన,యలకపిభల్లూకవితతి ♦ నాదృతి మీఱన్. ౩౭

క. కనుఁగొని నను గూడి యొగిం, జనుదెండిక మీకు వలదు♦సంశయము మనం
బునఁ గోరినకోరిక యిది, యని తోఁచెడునంచు వారి ♦ నందఱఁ బనిపెన్.

నూటయెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౧౦౯ - వ సర్గము.

{ శ్రీరాముఁడు వైకుంఠమునకు సకలభల్లూకవానరులతోడను స్త్రీబాలవృద్ధులతోడను బయనమగుట. }

క. తెలతెల వేగిన నారఘు, కులపతి ఘనయశుఁడు విపుల♦కోమలవక్షః
స్థలరాజితుండు ఫుల్లక,మలపత్త్రాక్షుండు రాజ♦మండనుఁ డెలమిన్. ౧ 3665

క. పరమపవిత్రు వసిష్ఠుని, బురోహితుని గాంచి పలికె ♦ భూదివిజులతో
సురుచిరదీప్తివిరాజితుఁ, బరముని ద్రేతాగ్నినాముఁ ♦ బావకుఁ గొనుచున్. ౨

క. చనవయ్య! ముందుగా మఱి, యనుపమసద్వాజపేయ♦యజ్ఞచ్ఛత్త్రం
బును దీప్యమానమును గొని, చనఁదగును మహాపథమున ♦ సరభస మొప్పన్.

సీ. అనినఁ దేజస్వియౌ ♦ నవ్వసిష్ఠమునీంద్రుఁ డా రాము నానతి ♦ ననవశేష
ముగ విధిపూర్వక♦ముగ మహాప్రస్థానికంబగు ధర్మంబుఁ ♦ గడఁగి చేసె;
నంత సూక్ష్మంబగు ♦ నంబరమును దాల్చి తా బ్రహ్మ నెంతయు♦ధ్యానయుక్తి
నలరించి రెండు చే♦తుల చేతఁ గుశలను గ్రహియించి శ్రీరఘు♦కాంతుఁ డట్టె

తే. చనియె సరయూనదీతీర♦మును గుఱించి;,సుంత యేనుచ్చరింపక♦సుఖములందు
మనసుఁ జొన్పకనిశ్చేష్టుఁ♦డనఁగఁ బొల్చి,గృహము వెలువడెఁ బ్రజ్వల♦దినునికర

చ. [2]జనపతిదక్షపార్శ్వమున ♦ సారససంయుతహస్తయై రమా [ణి.
వనిత చెలంగె సవ్యమగు ♦ పార్శ్వమునం దనురాగ మొప్ప హ్రీ
యనుతరుణీవతంసము వి♦హారము చేసెడునట్లు గొల్చుచుం
జనియె; ననేకరీతుల నె♦సంగుశరంబులు శస్త్రసంతతుల్. ౫ 3669

క. అనుపమ మాయతమును నగు, ధనువును బురుషాకృతులను ♦ దాల్చి చనియెరా

---

1 యావత్కలిశ్చ సంప్రాప్తస్తావజ్జీవత సర్వదా-అనియూ. 2 రామస్య దక్షిణే పార్శ్వే సపద్మా శ్రీరుపాసితా-అనియూ.

మునిఁ గొల్చుచు వేదంబు ల,వనిసురరూపములఁ దాల్చి ♦ వైభవ మెసఁగన్.

తే. అఖిలరక్షిణియైన గా♦యత్రి యట్లె, యోంకృతియును వషట్కార♦మురివఁబతిని
ననుసరించి వెనంజనె;♦సంతతబుధులు,భూసురులుచిత్తములయందుఁ♦బొంగు కాంత.

క. చనిరి మహాత్ముని శ్రీరా,ముని గూడి సురేంద్రుస్థాన♦మునఁ దగుద్వారం
బును భేదించి ప్రవేశిం,పను గోరుచు, నంతఁ బ్రీతి♦వనితామణులున్. ౯ 3672

తే. అంతిపురమును విడనాడి ♦ యాత్మవృద్ధ, బాలదాసీజనంబుల ♦ నోలిఁ గూడి
సేవకులు మందు లెల్లను ♦ శ్రీపదంబుఁ,గోరవారలఁ దోడ్కొని ♦ శ్రీరఘువరు.

క. మనమున నెన్నుచుఁ బోయిరి, [1]తనయంతఃపురముతోడఁ ♦ దమ్మునితోడన్
జనియెను భరతుం డగ్నులఁ, గొని నియమం బొప్ప భూప♦కుంజరుతోడన్. ౧౧

సీ. అంత మహాత్ములై ♦నట్టి బ్రాహ్మణు లెల్ల నగ్నిహోత్రములతో ♦ నాత్మదార
తనయబంధువులతోఁ ♦ దన్మహీపతిఁ గూడి చని; రంతమంత్రులు♦ సకలభృత్య
తనయ బాంధవ,పశు♦తతులతో సేవకవితతితో సంతోష ♦ మతిశయముగఁ
బొంగుచుండఁగ రాము♦భూపతివరుఁ గూడి చని;రంతఁ బ్రజ లెల్ల♦సాధుహృదయు

తే. లగుచుఁ దృష్టజనావృతు ♦ లగుచు రాము,సద్గుణారంజితులు గాన♦సరసగతుల
నతనిఁ గొల్చుచుఁబోయిరి; ♦యట్లువనిత,లెల్లఁబురుషులుపశుపక్షు♦లెల్లరాఁగ.

క. గతకల్మషులై శ్రీరఘు,పతితోడం బోయి; రంత ♦ వానరవరు ల
ప్రతిమప్రమదంబున స,న్మతమునఁ బుష్టియును దుష్టి ♦ మానుగ నొలయన్.

క. కిలకిల యనఁబడు శబ్దం,బులతో శ్రీరాముఁ గొల్చి ♦ బుద్ధులతోడం
జెలఁగుచుఁ జని; రాయందఱుఁ, గలయంగా వెదుక దుఃఖ♦కలితుండొకఁడున్.

క. దీనుఁడు వ్రీడాకలితుఁడు, గానంబడఁ డొక్కఁడైనఁ ♦ గాని తలంపం
గా నందఱు హర్షంబున, మానసములు పొంగఁ జిత్ర♦మంజులభణితిన్. ౧౭

తే. పెండ్లి కరిగినచందానఁ ♦ బ్రియవదనము,లొక్కరీతిగఁబల్కుచు ♦ నోలిఁజనిరి;
జానపదులందు శ్రీరామ♦చంద్రుఁడిట్లు,బయలువెడలుటఁ గనుగొను♦వాంఛ మీఱ

క. చనుదెంచి కాంచిరో యా,జను లెల్లను రాముఁ గూడి ♦ స్వర్గంబునకుం
జని రానందంబున, నా,జనులును బౌరులును గీశ♦సమితియు నెలుఁగుల్. ౧౮

క. పరమప్రమదము భక్తియు, సరిగా మది నొప్ప రామ ♦ చంద్రు వెనుకఁ బో
యిరి, శ్రద్ధమీఱ! భూతో,త్కర మెయ్యదదృశ్య మగుచు♦గ్రాలునొపురిలోన్.

క. ఆయా భూతము లెల్లను, నాయధిపుఁడు స్వర్గమునకు ♦ నరుగ వెడలఁగాఁ
బాయక వెంబడి భక్తిం, బోయెను; శ్రీసద్గుణాభి♦పూరితు రామున్. ౨౦

ఆ. కనిన స్థావరములు ♦ ఘనచరజంతువుల్,స్వర్గమునకుఁ జనియె ♦ నంతనమున;
నాయయోధ్యయందు ♦ నరసిన నతిసూక్ష్మ,జంతు వొకటియైనఁ♦జక్కఁ గనిన

1 సాంతఃపురశ్చ భరతః శత్రుఘ్నసహితో యయౌ-అనియూ.

క. ఆపురి నూర్వురఁ బుచ్చుఁగ, నేపగిదిని లేకయుండఁ ♦ నెలమి నరిగె నా
భూపతితోఁ దిర్యక్కులు, శ్రీపతి యని మది నెఱింగి ♦ చెచ్చెరఁ జనియెన్.

నూటతొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౦ - వ సర్గము.

రాముఁడు సరయువులో మునిఁగి వైకుంఠమునకుఁ బరివారముతోఁ జనుట.

క. తనదగుపరివారముతో, జనపతి రాఘవుఁడు సంత♦సంబున నొకయో
జనమును సార్ధము వేగమ, చని పశ్చిమముఖముగా నె♦సంగెడు నాలన్. ౪

క. తనచే నాశ్రితయయి పా,వనజలముల నొప్పమీఱు ♦ భవ్యశమనదిం
గనియెను సరయు వనంగా, వినిర్మలఖ్యాతిఁ దగిన ♦ విశ్వపవిత్రన్. ౧ ౩౬౯౬

సీ. ఆకులావర్తయై ♦ యలరునదిం గాంచి ప్రజలతో భూతనా♦రంబుతోడ
నచటికేగెను; నంత ♦ నంబుజసూతియా పరమేష్ఠి దేవతా♦వారయుక్తుఁ
డయి యామహూర్తంబు♦నందె దేవశ్రేణుల మహితచిత్తంబుల ♦ త్పాపతింద్రుఁ
గను వేడ్క రా రఘు♦కాంతుఁడు చెలువారు స్థలమున కేతెంచె♦స్వర్గమునకు

తే. రాముఁ డరుగవిమానవ♦ర్యములు నూఱు,కోటులో ప్పార దేవతా♦కుంజరులొగి
వచ్చి రా బ్రహ్మ వెనుకొని; భవ్య తేజ,ముంబరంబున వ్యాపించె ♦ ననుపమముగ.

క. తమ తేజస్సులతోడం, గుమిగూడిన పుణ్యకర్మ♦కూటంబులతో
నమరు దివౌకసు లభ్రప,థమునన్ నిలువంగ నద్ది ♦ తగఁ జెలువారెన్. ౫

క. పరిమళగంధమ్ముల భా,సురములుగా నొప్పి పుణ్య♦శోభితములుగాఁ
బరఁగెడు వాయువు లోలసెన్;, సురతతిసిర్ముక్తపుణ్య♦సుమవృష్టి తగెన్. ౬

తే. తూర్యశతనిస్వనంబులు♦తుంబురుముఖ,సంస్తవములును గంధర్వ♦సమితినుతులు
నప్సరలగానములు చెలు♦వారుచుండ,సరయువుజలంబు శ్రీరామ♦చంద్రుఁడపుడు.

క. చరణంబుల స్పృశియించెను, సరసిజభవుఁ డంత గగన♦సంస్థుఁ డగుచున్
బరమాప్యాయితుఁ డిట్లనియెను, బరమేశా! రామచంద్ర! ♦ భవాత్మ! హరీ!!. ౭౪

ఆ. శుభము గల్గుఁగాక ♦ చ్యుతినాశనా! యదృ,ష్టమునఁ గంటిమెలమి♦యమరరమ్ము
సురలఁ బోలుచున్న ♦ శూరసోదరులతో, స్వయతనువుఁ గొనుము♦శ్రీనివాస!

క. మనమున దేనిని గోరుదొ, తను వాత్మీయమును దానిఁ ♦ దమిఁ గొనవయ్యా!
వినుతంబు వైష్ణవమునగు, తను వదియే కాదె? శాశ్వ♦తంబయి యలరున్. ౯౪

క. పరమాకాశం బనఁగా, నిరతము శ్రుత్యుక్త మగుచు ♦ నెగడునది కదా?
పరమాత్మ! లోకగతివై, పరఁగుదు నిను నెఱుఁగ రెట్టి ♦ ప్రజలును దేవా!.

సీ. ప్రాక్పరిగ్రహ మాయ ♦ పరమవిశాలాక్షి తవరుఁ గాదే? నీవు ♦ దాని మాన
జంతింపరాక య♦త్యంతమహాభూతమున నొప్పి యుతుయుం♦డనఁ జెలంగి
యజరుండవై యుందు; ♦ వందుచే నీమదిఁ గోరిన యత్యంత♦కోమలాంగ
మును దానిఁబొందుమా♦భూరి తేజా! యంచువచియింపఁగా బ్రహ్మ♦వాక్కులవిని

తే. యట్లు చేయంగ నెంచిమ♦హామతియగు, రాముఁడాత్మవైష్ణవశరీ♦రంబుఁజొచ్చె
ననుజయుతుఁడయి; యంతను♦హాత్ముఁవిష్ణు,ను యునినతనినర్చించిర♦మర్త్యులెలమి

క. మరుదధిపసాధ్యశతముఖ,పురోగమాదిత్యవహ్ని♦పూజ్యమునులు న
చ్చరలును గంధర్వులు ఫణి,గరుడులు యక్షులునుదనుజ♦కాంతులుదైత్యుల్.

ఆ. సకలరాక్షసుల ను ♦ సాధుసాధ్వనువాద,ములను బూర్ణకామ♦ములను హర్ష
ములను జెలఁగి స్వచ్ఛ♦ముగఁ బాపదూరము, గను నెసంగుదివికిఁ ♦ జనిరిపిదప

క. గురుతేజుఁ డంత విష్ణువు, సరసిజభవుఁ జూచి పలికె ♦ జను లిద నాతో
నరుదెంచిరి వీరికి భా,సురలోకం బొందు వేగ ♦ మావు వసింపఁగ. ౧౬॥ 3। 98

క. ననుఁ గూడి మైత్రిఁ బాయక, చనుదెంచిరి సాధుసుతులు ♦ జను ఁతిభక్తుల్
నను నమ్మి వదలి రాత్మలఁ, గనుఁగొం గాపాడవలయుఁ ♦ గాదే వీరిఁ. ౧౭॥

చ. అనుటయు విష్ణువాక్యము మ♦హామతియౌ పరమేష్ఠి చక్కఁగా
విని జగదాకరుం డగుట ♦ విష్ణువుఁ గూర్చి వచించె నిట్టులీ
జనులు భవత్కృపాలనము ♦ శాశ్వతభక్తిని బొందినారు గా
వునవె సుఖాలయంబగుచుఁ ♦ బూజ్యతరంబగు లోక మొందఁగఁ. ౧౮॥

ఆ. తగినవారు వీరు ♦ ధన్యులు సాంతాన,కాఖ్యలోక మొప్పు ♦ నట వసించు
వారు; పశుపతత్రి♦వారమైనను నినుఁ, దలఁచి ప్రాణముల వ♦దలునయేని. ౧౯

క. అవికూడను సాంతానిక, సువిమలలోకంబునందుఁ ♦ జొచ్చి వసించుఁ
భవనాశక! యను నంతటఁ, బ్రవిమలరూపముల నెల్ల♦ప్రజలు మహిమలఁ.

తే. బ్రహ్మలోకంబు మీఁదట ♦ బ్రహ్మగుణము,లొప్పు నాలోకమున కేగి♦రప్పు డఖిల
కపులుతమతమ దేవాంశ♦కములఁబొంది,రట్లుభల్లూకములు నొందె♦నభవునాజ్ఞ.

క. వనచరపతి సుగ్రీవుఁడు, వనరుహసఖులోక మొందె ♦ వారక దివిజుల్
కనుచుండఁ దనకు జనకుం, డనఁదగు రవియందుఁ జేరె; ♦ నంతట నితరుల్.

ఆ. గోప్రతారమనెడు ♦ గొప్పతీర్థంబున, మునిఁగి రామముఖులు ♦ ఘనతరమగు
సంతసమునఁ బొదలి ♦ చని రందు మునిఁగిన, వార లంగములను ♦ వదలియపుడె.

సీ. వ్యోమయానంబులఁ ♦ దామెల్ల నలరుచుఁ జనిరి తిర్యక్కులు ♦ శతము సరయు
వున మునింగినయంత♦టనె భాసురాంగము లలరార స్వర్గంబు♦నందె; నంత
స్థావరంబులుమఱి ♦ చరములు చూడ దివ్యాదివ్యవపువుల ♦ నమరులవలె
వెలుఁగుచు సరయువు♦జలముల మునిఁగిన యంతనే దేవత్వ ♦ మలవడంగ

తే. నాతఱిని వచ్చి యున్నట్టి ♦ యఖిలకపులు, భల్లుకంబులు రాక్షసుల్♦పావనజల
మందుఁ దమతమతనువుల ♦ నట్టె వదలి, స్వర్గమున కేగి;రంతటఁ♦బద్మభవుఁడు.

తే. రామునే యాశ్రయించి యు♦ద్దామభక్తి,యుఁగ వచ్చినవారల ♦ నర్హపదము
లందు నిల్పినమ్మోదంబు♦పొందిసురలఁ,గూడిస్వపదంబునకుఁబోయె♦వేడుకలర.

నూటపదియవ సర్గము సంపూర్ణము.

## ౧౧౧ - వ సర్గము.

—ఫలస్తుతి.—

క. అని యిటు లుత్తరకాండం,బును గూడిన యీను కావ్య♦మును బ్రహ్మాది
ప్రణుతమునౌ రామాయణ,మును వాల్మీకియె రచించె ♦ మోదం బలరన్. ౧

క. తరువాత విష్ణుమూర్తియు, సురపూజితలోకమందు ♦ శుభతమరీతిన్
గరము ప్రతిష్ఠితుఁడై యా,దరమునఁ బాలించె లోక♦తతులం గడఁకన్. ౨

తే. భువనములమూఁటవ్యాపించి♦పొలుచు నవ్వఁ,డామహావిష్ణు వేవచ్చె♦నౌరయింత
కాలమునకంచు దేవని♦కాయములును,సిద్ధగంధర్వులును మోద♦సిద్ధి గనుచు.

చ. అనవరతంబు రామకథ ♦ నాయతభక్తిని వించుఁ బాడుచున్
ఘనతమహార్ఘముం గనిరి ♦ గావున నీకథ యాయు విచ్చుఁ బా
పనిచయతూలవహ్ని యన ♦ భాసిలు, భాగ్య మొసంగు వేదరా
శిని సరిపోలు నట్లగుటఁ ♦ జిత్తమురంజిలఁగా వినం దగున్. ౩ 3711

తే. శ్రాద్ధములయందుభక్తిని♦జదువునట్లు,చేయుఁగాఁదగుఁబుత్రుల♦సిద్ధిఁగోరి[త్వరగ.
చదువఁబుత్రుఁడులభియించు♦నమదికథన,మునుమదింగోరఁగాఁబొందు♦ధనము

క. దీనిం బాదము చదివిన, చో నిఖిలాఘమును బోలఁగు ♦ క్షోణి నెవఁడు పెం
పూనిన గర్వంబుమెయిన్, మానక యనుదినము పాప♦మండలి చేయున్. ౪

తే. రామకథయందు శ్లోకమా♦త్రంబు చదువఁ
బాపరాసులు తొలఁగు; నె♦వండు చదువు
నాతనికి వస్త్ర కనకమ్ము ♦ లమర నిచ్చి
తృప్తి చేయంగఁ దగు, వాఁడు ♦ తృప్తిఁ గనిన. ౫ 3114

క. సుర లెల్లఁ దృప్తిఁగాంతురు,పరమాయుష్యంబు నొసఁగు♦భవ్యము నగుచున్.
బరినుతమౌ రామాయణ, మురుభక్తిఁ బఠించునాతఁ ♦ డున్నతి మెఱయున్.

క. తనయులతోఁ బౌత్రులతోఁ, దనివారఁగ నిందుమీఁదఁ ♦ దద్దయుఁ బొలుచున్
మనుజేంద్రవాసరమ్యం,బును గొప్పదియౌ నయోధ్య♦పుర మది జగతిన్. ౬

తే. పెక్కువేలవర్షంబులు ♦ దిక్కులేక,యుండిబుమభుని బ్రభువుగా♦నొందివెలసె;
నిద్ది యాఖ్యానమాయుష్య♦మిచ్చుదీని,భావిఫలములతోఁగూడ♦బ్రహ్మమౌని.

తే. ఉత్తరంబగు కాండంబు ♦ నొప్పమీఱ,గాఁ బ్రచేతసుపుత్రుండు♦క్రమ్రభణితి
నొనరిచెన్ బ్రహ్మయునుదాని♦నొప్పుకొనియె;నశ్వమేధసహస్రంబు♦లాచరింప.

క ఘనవాజపేయములు ప్రీతిని నయుతము చేయ నెట్టి ♦ దివ్యఫలము గ
ల్గునొ యిందొక సర్గము నే,మనుజుఁడు పఠియించు దాని ♦ మానకపొందున్.

సీ. పుణ్యతమంబులై ♦ పొల్చుప్రయాగాది సత్తీర్థములు మఱి ♦ జహ్నుకన్య
మొదలుగాఁ గల సరి♦న్ముఖ్యంబులును నైమిశాదివనంబును ♦ నల్లి ధరణి
నలరు కురుక్షేత్ర♦మాదియౌ క్షేత్రలను భక్తి సేవింపఁ ♦ గనెడు పుణ్య
మీపుణ్యతమగాథ ♦ నెలమితోఁ బఠియింపఁ వినఁగను,హాటక♦మును నెవండు

తే. భాస్కరగ్రహణంబున ♦ భక్తిమీఱఁ
గాఁ గురుక్షేత్రమున నిచ్చి ♦ కనుఫలంబు
దాని రామాయణంబును ♦ బూని చదువఁ
గాంచు సత్యము తెలఁపంగఁ ♦ గా దనృతము ౧౩ 3720

క. ఫల మట్టిది రామాయణ, మెలమిం జదువంగఁ గలుగు ♦ నీయిరువురు తు
ల్యులు శ్రద్ధమీఱ రాముని, సులలితగాథల్ వినంగఁ ♦ జొప్పడు నతఁడున్.

క. చనుఁ బాపవిముక్తుండై, వనజాక్షుని లోకమునకుఁ, ♦ బ్రాక్కావ్య మిదా
మునిభాషితంబు పూర్వం,బున వాల్మీకి బ్రహ్మయాజ్ఞఁ ♦ బూని రచించెన్.

చ. అనవరతంబు భక్తిమెయి ♦ నాదృతి శ్రీరఘురాముగాథనున్
వినిన మనోజ్ఞవైష్ణవము ♦ వీతమలంబును నైన దేహమున్
గను; దనయుల్ కళత్రమును ♦ గాఢతరంబగు భాగ్యముం దనం
తన యభివృద్ధి నొందు; నియ♦తంబగు చిత్తసమాధి నొందుచున్. ౧౬ 3723

క. వినఁదగుఁ బఠింపఁగాఁ దగు;, ఘనమగు నీకావ్య మెన్న ♦ గాయత్రియె యా
ననుపమమగు దీనిని జది,వినచో ననపత్యుఁ డొందుఁ ♦ బృథునుతుల నిలన్. ౧౭

క. ధనహీనుఁడు ధనముం బొం,దును బాపవిముక్తుఁడౌను ♦ దోడనె పాపం
బొనరించు మర్త్యుఁ డొకపద,మును జదివిన యంతమాత్ర;♦భూమిస్థలిలోన్.

సీ. ఎవఁడు నిత్యము భక్తి ♦ నీరాము కథవినుఁజదువునాతఁడుకల్మ♦షములఁ బాసి
దీర్ఘాయువును బొంది ♦ దీపించు;శ్రేయంబు నొందనెవ్వఁడు కోరు♦డెందమందు
నాతఁడు విమలకా♦వ్యంబును దీనిని బఠియించి శ్రీరాముఁ ♦ బరముఁ దలఁపఁ
గాఁ జను; నిత్యంబు ♦ బ్రాహ్మణులచేతఁ జదివింపఁదగు దాని ♦ శ్రద్ధ వినఁగఁ

తే. జను నదెవ్వఁడు శ్రీరఘు♦స్వామిసకల,చరితమునుజక్కఁబఠియింపఁ ♦ జక్రిలోక
మునకు నిస్సంశయంబుగఁ ♦ జను నతండె,కాక యాతని తండ్రికిఁ♦ గల్గు నద్ది.

క. ఆతనిజనకుఁడు తాతయు, నాతనిజనకుండు నిట్లు ♦ నుందఱు వనజా
క్షాతతలోకము నొందుదు, రీతెఱఁగున కేమిశంక♦యే లేదు ధరన్. ౨౨

క. పురుషార్థచతుష్టయమును, బురుషోత్తముఁడైన రాఘు♦వుని శాశ్వతస
చ్చరితం బొసంగుఁ గావునఁ, బరమంబగు దీని యత్న♦పరుఁడై సతమున్. ౨౩

క. మనుజుండు వినం దగు; రా,ముని గాథను భక్తి నెవఁడు ♦ భూరిముదమునన్
వినునో పదమును బొదం, బును నాతఁడు పద్మయోని♦ముఖ్యపదంబున్. ౨౪

చ. కనఁ జను నంతె కాక యటఁ ♦ గంజజుతో సరిగాఁగఁ బూజలం
గొను నిరతంబు; నివ్విధిని ♦ గోరిఁ బూర్వచరిత్ర మిద్ది మీ
కనుపమసాధుమంగళము ♦ లన్ని యొసంగును గాన విష్ణువై
తనరెడు రాముభక్తి సత♦తంబు నెనంగుచు నుండుఁ గావుతన్. 5730

నూటపదునొకండవ సర్గము సంపూర్ణము.

చ. వనజభవాది దేవపతి♦వారదురూహనిజప్రభావ! పా
వనిపరిపూతమస్తకవి♦భాసురదివ్యపదాబ్జ! సజ్జనా
వనపరతంత్ర! యోగిజన♦వర్ణితసుందరనామ! పార్వతీ
పనియతమిత్ర! భక్తజన♦బాంధవ! శ్రీరఘువంశభూషణా!.

సీ. ఇదిమహీసురకుల♦విదితకాశ్యపమాని గోత్రజాపస్తంబ♦సూత్ర, శ్రీత్రి
పురసుందరీవర♦కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ♦ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధి♦చంద్రసుబ్రహ్మణ్యవిబుధవర్యసుపుత్ర♦వినుతిపాత్ర
పండితగురుభక్త♦తాంబకృష్ణాపరాభిధేయార్యజ♦నాళిభజన

తే. నిరతశేషాద్రిశర్మ ప్రణీతమైన
యాంధ్రరామాయణమున నా♦ధ్యాత్మికాది
శాంతులు ఘటింపఁజేయుచు ♦ సౌఖ్యదాయి
యైనయుత్తరకాండ మిం♦పార వెలయు.

---

ఉత్తరకాండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---